# విశాలాంధ్ర

# తెలుగు కథ

**1910-2000**


ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి, ప్రధాన సంపాదకుడు.
సింగమనేని నారాయణ, సంపాదకుడు.
పెనుగొండ లక్ష్మీనారాయణ, సంపాదకుడు.
సదానంద్ శారద, సంపాదకుడు.





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

VISALAANDHRA TELUGU KATHA - (1910-2000)
*Prof. Kethu Viswanatha Reddy,* Chief Editor,
*Singamaneni Narayana,* Editor,
*Penugonda Laxminarayana,* Editor, *Sadanand Sarada,* Editor.

ప్రచురణ నెం. : 2339

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : అక్టోబరు, 2002



టైటిల్ డిజైన్ : డా॥ బాపు

వెల: రూ.400/-

విదేశాల్లో వెల: $ 50

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.

ముద్రణ: శ్రీకళాంజలి గ్రాఫిక్స్. నారాయణగూడ, హైదరాబాద్.

# సమాజ పరివర్తన సూచిక

తెలుగులో కథా సంకలనాలు కనీసం నూటికిపైగా వెలువడ్డాయి. అవి ప్రధానంగా సంపాదకుల సాహిత్యాభిరుచికీ, కథకులు పొందిన సాహిత్య గౌరవానికీ కేంద్రకంగా ఏర్చికూర్చినవి. గడచిన రెండు దశాబ్దాల్లో ఈ పద్ధతికి భిన్నంగా కొన్ని సంకలనాలు వచ్చాయి. అవి నాలుగు రకాలు. మొదటి రకం, ప్రాదేశిక ముద్రగలవి. సీమకథలు, నాగావళికథలు, వంశధారకథలు వంటివి. రెండోరకం సమస్య ప్రధానమైనవి. తెలంగాణా పోరాట కథలు, నల్ల కలువలు లాంటివి. మూడోరకం మత, కుల వృత్తుల గుర్తింపు చైతన్యాన్ని ప్రతిఫలించేవి. దళితకథలు వంటివి. నాలుగోరకం మహిళల చైతన్యానికి ప్రత్యేకంగా ప్రాతినిధ్యం వహించేవి. స్త్రీవాదకథలు, నూరేళ్ల పంట, కదంబం లాంటివి. విడివిడిగా వేటి సామాజికాంశాల ప్రయోజనం వాటికుంది. అయితే గత శతాబ్దిలో దాదాపు నాలుగువేలమందికిపైగా రాసిన లక్షకుమించిన కథల్లో, ఏదైనా ఒక అంతస్సూత్రం కన్పిస్తుందా అని ఆలోచించాం – ఆ ఆలోచన ఫలితమే ఈ సంకలనం.

కాలం, స్థలం అనేవాటిని తెలుగుకథ ఆరంభం నుంచీ అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తూనే ఉంది. కాలంచరిత్ర చలనబద్ధమైనది. పరిణామకారకమైనది. స్థలం భౌగోళిక నిబద్ధమైనది. సాహిత్యం స్థల కులాలకు అతీతంగా ఉంటుంది, ఉండాలి అనుకోవడం కంటె, వాటి చైతన్యాన్ని ప్రతిఫలిస్తూ నాలుగు కాలాలపాటు సాహిత్యం ఉండాలి, ఉంటుంది అనుకుంటే చిక్కువుండదు. గురజాడ రాసిన మీపేరేమిటి? (1910)లో, సమస్య మతవైషమ్య చిత్రణ ద్వారా మతమౌఢ్య నిరసన – ఆ కథాకాలంలోని ఆ కథాస్థలంలోని శైవులూ, వైష్ణవులూ ఇప్పుడు లేరు – కాని అప్పటి మౌఢ్యం ఇప్పటికీ ఉంది. ఆ కథలోని సమాజవిమర్శ ఇప్పటి మౌఢ్యవిమర్శగా కూడా కన్పించడం వల్ల, మానవ సంబంధాల్లోని లోపాల్ని ఎత్తిచూపడం వల్ల అది సజీవ సాహిత్య రచనగా ఇప్పటికీ కొత్తగా కనిపిస్తుంది. ఆ కథలో గురువుగారు "శివుడన్నా, విష్ణువన్నా, పీరన్నా, బుద్ధుడన్నా, ఆ పరమాత్మ మట్టుకు ఒక్కడే కదా!" అని అంటాడు. – ఆ కథలోని వెంకయ్య "అందరు దేవుళ్లూ వక్కరే అయితే, ఆ పీనుగుల్ని అందరినీ ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజ తగలెట్టరాదా?" అని అంటాడు. ఇది సైతం 'అజ్ఞుల మూఢభక్తి'కి సంకేతమేనని ఈ కథ ద్వారా గ్రహించవచ్చు. – మీ పేరేమిటి ఎంపికలోనే మాకు తెలుగు కథా సాహిత్యంలోని అంతస్సూత్రం దొరికినట్లయింది – సమాజ జీవితంలోని లోపాల్ని విమర్శకు పెట్టడమే ఆ అంతస్సూత్రం – ఆ సూత్రం ఆధారంగా తొంభై ఏళ్ల తెలుగుకథను మళ్లీ ఒకసారి పరిశీలిస్తే ఉపయోగకరంగా ఉంటుంది అని భావించాము.

గత తొంబై ఏళ్ల కాలంలో తెలుగుకథ, వివిధ కాలాలలోని అనేకానేక ఘటనలకు స్పందించింది. ఎన్నెన్నో ప్రాదేశిక సమస్యలనూ, కదలికలనూ చిత్రించింది – దేశీయ, జాతీయ, అంతర్జాతీయ ప్రభావాలకు గురి అయింది. ఒక్కమాటలో చెప్పాలంటే తెలుగుకథ చరిత్రగతిని ప్రతిఫలించింది. సమాజ పరివర్తనను సూచించింది. – ఈ ప్రతిఫలనానికీ, పరివర్తనకూ అనుకూలమైన తాత్విక భూమికను, కథన వైఖరులనూ ఏర్పరచుకుంటూ వచ్చింది. ఆధునిక వచన శైలుల ప్రయోగాన్ని విస్తరించుకుంటూ వచ్చింది.

ఇతివృత్త కల్పనలో సమకాలిక సామాజికానుభవం, సంఘ నేపథ్యం, విస్తారమైన ప్రజాసముదాయాలనుంచీ తీసుకున్న పాత్రల చిత్రణ, మానవచర్యల భౌతికపరమైన చిత్రణ, మాట్లాడే భాషకు, భాషలోని మాండలికాలకు సన్నిహితమైన శైలులు – ఈ వాస్తవిక వాద లక్షణాలను తెలుగుకథ పరిపుష్టం చేస్తూ వచ్చింది. వాస్తవికవాద ఛాయలు అనేకం వున్నా, సంస్కరణ వాస్తవికత, సవిమర్శక వాస్తవికత ప్రధానంగా తెలుగుకథలో కనిపిస్తాయి – అడపాదడపా కాల్పనికావేశ లక్షణాలు చోటుచేసుకున్నాకూడా (సాంఘిక రాజకీయోద్యమ వ్యూహ తీవ్రతలు కథకున్ని ఊపినప్పుడల్లా) ఈ అంశాలన్నిటినీ దృష్టిలో వుంచుకొని ఈ సంకలనాన్ని కూర్చటానికి ప్రయత్నించాము.

ఈ సంకలనంలోని కథల్లో ప్రస్తావించిన కాలఘటనలు అనేకం – సమస్యలు భిన్నం. వైరుధ్యాలూ, ఘర్షణ చిత్రణ వేర్వేరు. ఈ కథల్లో రాజకీయాలూ రాజ్య వ్యవస్థ, న్యాయ వ్యవస్థ, సాంఘిక వ్యవస్థ స్వరూప స్వభావాలు శతాధిక రూపాల్లో కన్పిస్తాయి. సంఘ సంస్కరణోద్యమాలు, జాతీయోద్యమం, ఆర్థిక మాంద్యం, వలస విముక్తి పోరాటాలు, తెలంగాణా సాయుధ పోరాటం, నక్సలైట్ ఉద్యమం, ఎమర్జెన్సీ లాంటి ఎన్నో పరిణామాలు ఈ కథల్లో కన్పిస్తాయి. ఆకలి, నిరుద్యోగం, వైవాహిక సమస్యలూ, భూమి సమస్యా, కరువు కాటకాలు, పర్యావరణ సమస్య, దోపిడీ, దళారీ వ్యవస్థ, ఎన్నికల అక్రమాలు, రాజకీయ కాలుష్యం, రాజ్యహింస, మతమౌఢ్యం, దళిత సమస్యలూ, స్త్రీల సమస్యలూ, వృద్ధాప్య సమస్యలూ, విద్యా విధానంలోని మార్పులూ, వైద్య రంగంలోని దగాలూ, అభివృద్ధిగతమైన ప్రాంతీయ అసమానతలూ, ఫాక్షన్ రాజకీయాలూ, పారిశ్రామిక కాలుష్యం, వాణిజ్యీకరణం అయిన వ్యవసాయంలో వచ్చిన మార్పులూ, వలసలూ, రాజకీయ రిజర్వేషన్లూ–ఇలాంటివాటి నెన్నింటినో ఈ సంకలనం ప్రతిఫలించింది. – తెలుగు సాహిత్యంలో ఇతర ప్రక్రియలు సాధించలేని జీవిత వైవిధ్య చిత్రణను ఒక శతాబ్దిలోని తెలుగుకథ సాధించగలిగింది అని ఈ సంకలనం నిరూపిస్తుందని మా విశ్వాసం.

తొంబై ఏళ్ల తెలుగుకథాచరిత్రలో దాదాపు 1980 వరకూ వచ్చిన కథలకంటే, 1980–2000 మధ్య వచ్చిన కథలే ఇందులో ఎక్కువ చోటు చేసుకున్నాయి. ఇందుకు కారణాలు ఇవి: ఒకటి – వివిధ ప్రాంతాల నుంచీ, వర్గాల నుంచీ కథకులు ఈ కాలంలోనే ఎక్కువ పుట్టుకు రావటం; రెండు – ప్రాదేశిక

అనుభవ చిత్రణకు ప్రాధాన్యత ఈ కాలంలోనే పెరగటం; మూడు – స్త్రీవాద దళిత వాద ధోరణులకు సంబంధించిన స్పృహ, తాత్వికత ఈ కాలంలోనే ఎక్కువగా పెరగటం; నాలుగు – ప్రపంచీకరణ, సరళీకృత ఆర్థిక విధానాలు, సోవియట్ పతనం, అమెరికా ఆధిపత్య వైఖరుల్లాంటి, జాతీయ అంతర్జాతీయ అంశాలెన్నో ఈ కాలంలోనే కథకుల్ని ఎక్కువగా ప్రభావితం చెయ్యటం; గత రెండు దశాబ్దాలలో తెలుగుదేశంలో తీవ్రమైన సామాజిక, రాజకీయ, ఆర్థిక, వ్యావసాయిక సంక్షోభాలు ఏర్పడటం – ఇలాంటి కారణాల వల్ల గత రెండు దశాబ్దాలలో తెలుగు కథ విస్తృతి పెరిగింది. ఆంధ్రదేశంలోని నాలుగు ప్రాంతాల మాండలికాలకు ఈ దశాబ్దాలలోనే సాహిత్య గౌరవం లభించింది. వీటివల్ల ఇంతకుమునుపు ఎప్పుడూ లేని ప్రజాస్వామిక దృష్టి భాషాశైలుల ప్రయోగ విషయంలో ఏర్పడింది.

మధ్యతరగతి జీవితచిత్రణకే దాదాపు ఏభైఏళ్లపాటు, ప్రధానంగా పరిమితమై పోయిన తెలుగుకథ, 1980 తర్వాత కింది స్థాయి వరకూ విస్తరించింది. గిరిజన ప్రాంతాలు మొదలుకొని మైదాన ప్రాంతాల్లోని గ్రామ జీవితాలను, పట్టణ నగర జీవితాల వరకూ వ్యాపితమై, ఆ జీవితాల్లో వస్తున్న పరివర్తనను వాస్తవికంగా మన కళ్ల ఎదుట ఉంచగలిగింది. అందుకే ఈ రెండు దశాబ్దాల్లో వచ్చిన కథలకు ఈ సంకలనంలో ఎక్కువ ప్రాధాన్యత లభించింది.

ఈ సంకలనంలోని కథల ఎంపికలో సమాజకేంద్రక దృష్టిని ప్రధానంగా వుంచుకోవటం వల్ల, వైయక్తికమైన మానసిక ప్రపంచ చిత్రణ వున్న కథల్ని ఇందులో చేర్చలేకపోయినాము. అలాగే కేవల ప్రయోగశీలతగల కథల్ని కూడా మేము ఈ సంకలనంలో చేర్చలేదు – ఈ కారణాల వల్ల ప్రసిద్ధులైన కొందరు కథకులకు ఇందులో స్థానం కల్పించలేకపోయినాము. అంతేగాని వారిపట్ల మాకు సాహిత్య గౌరవం లేకపోవడంవల్లమాత్రం కాదు. ఫలానా ప్రసిద్ధ కథకుడి కథ లేకపోతే సంకలనం అసమగ్రంగా ఉంటుందనే అభిప్రాయం మాకు లేదు. సాహిత్యంలో, సాహిత్య రాజకీయాల్లో వీరపూజలు జరపటం వల్ల జరిగిన నష్టం ఎంతో గుర్తించటం వల్లనే ఈ మాట అనటం! గతంలో వివిధ కథా సంకలనాల్లో చేరిన కథల్ని కూడా ఇందులో మేము సాధ్యమైనంతవరకూ చేర్చకుండా ఉండటానికే ప్రయత్నించాము. ఒకే ఒక కథ రాసిన కథకులూ ఇందులో ఉన్నారు. ఇంతవరకూ తెలుగు పాఠకుల దృష్టికి రాని కొందరు కథకులు కూడా ఇందులో ఉన్నారు – ఇందుకు కారణం మాకు కథా జీవితమే ముఖ్యంగాని, కథా రచయిత కాదు కాబట్టి. ఒక రచన చూపే ప్రభావం కంటే ఒక రచన నెరపే ప్రత్యక్ష ప్రభావం ఎప్పుడూ తక్కువగానే ఉంటుంది. రచనలోని జీవితం ప్రమాణం కాని, రచయిత కీర్తి ప్రతిష్ఠలు కాదు. ఇది రచనల ప్రాతినిధ్య సంకలనమేగాని, కథకుల ప్రాతినిధ్య సంకలనంకాదు.

పరమాదర్శవంతమైన సంకలనం అంటూ ఏదీ ఉండదు. ప్రామాణిక సంకలనాలు మాత్రమే ఉంటాయి. ఈ సంకలనాన్ని ఒక ప్రామాణిక సంకలనంగా

దిద్ది తీర్చటానికి ప్రయత్నించాము. దాదాపు మూడు వందల కథల్ని తొలి దశలో ఏరి, రెండు వడబోతల తర్వాత ఒక అంతస్సూత్ర ప్రణాళికాబద్ధంగా, 108 కథల్ని మాత్రమే ఈ సంకలనం ద్వారా అందించగలుగుతున్నాము. ఈ సంకలనం చదవటం ద్వారా తెలుగు సమాజంలో వచ్చిన అనేక పరిణామాల్ని పాఠకుడు అవగాహన చేసుకోగలుగుతాడనీ, సాహిత్య చింతనకు అవసరమైన సామాజిక తాత్విక భూమికను అలవరుచుకోగలడనీ మా నమ్మకం. ఈ సంపుటి చదివి ముగించాక, తెలుగు సమాజ చరిత్ర, పరివర్తన, సంశ్లిష్టత, తెలుగు కథా సాహిత్య చాలనం ఎంతో కొంత పాఠకులకు అవగతమైనా మా కృషి ఫలించినట్లే.

ఈ బృహత్ ప్రణాళికను ఆమోదించి, మాకు ఈ బాధ్యతను అప్పగించినందుకు విశాలాంధ్ర ప్రచురణాలయానికీ, యాజమాన్యానికీ, సంపాదకవర్గానికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు.

కేతు విశ్వనాథరెడ్డి
ప్రధాన సంపాదకుడు

సింగమనేని నారాయణ
సంపాదకుడు

పెనుగొండ లక్ష్మీనారాయణ
సంపాదకుడు

సదానంద్ శారద
సంపాదకుడు

★ ★ ★

# తెలుగింటి కథాతోరణం

ఆధునిక తెలుగు సాహిత్య ప్రక్రియల్లో కథ ఉన్నత శిఖరాల నధిరోహించింది. గత శతాబ్దపు సంక్లిష్ట, సామాజిక పరిస్థితులను కథ ప్రతిబింబించినంత స్పష్టంగా, సూటిగా మరేప్రక్రియా ప్రతిబింబించలేదు. 1910 నుండి తనకున్న పరిమితులను గమనిస్తూనే; వచ్చిన అవకాశాల మేరకు కథ బాగా ఎదిగింది. పరిణత దశకు చేరుకుంది.

కథకు క్లుప్తత ప్రాణం. పరిమిత పాత్రలతో ఆత్మసంయమన స్వభావ లక్షణం కల్గి ఉంటే వస్తువు దెబ్బతినదు. సంఘటనల ఉల్బణం లేకపోవటం మంచి లక్షణం. వస్తువుకుతగ్గ, పాత్రల స్వభావాలకుతగ్గ, కథాప్రదేశాలకుతగ్గ భాష ఉండటం పాఠకుల నాకర్షించడానికి మార్గం. అలాగే, పరిమితుల మధ్యలోనైనా – కథకులు తమ సొంత మాండలికంలో రాసిన కథలు, ప్రాంతీయ పరిమళాలు గుబాళించే అవకాశం ఉంది. గత శతాబ్దంలో పాఠకుల దృష్టికెక్కిన మంచి కథకులందరూ ఈ అంశాలను గుర్తించినట్టు కనిపిస్తోంది.

సామాజిక సమస్యలనన్నిటినీ కథకులు స్పృశించారు. ఇంత విశాలమూ వైవిధ్యమూ ఉన్న కథాసముద్రంలో మునిగి మంచిముత్యాల నేర్చికూర్చటం సామాన్యమైన విషయం కాదు. కవులకు దీటుగా తెలుగులో కథకులూ ఉన్నారు. కథకుల నెన్నుకోవటంలోనూ, వారి కథా కదంబం నుంచి ఆ కథకుణ్ణి పట్టివ్వగల కథను ఏర్పరచటంలోనూ ఈ సంకలన సంపాదకులు కొన్ని సూత్రాలను ఏర్పాటు చేసుకున్నారు. కొన్ని వందల కథలను చూశారు. అందులో ఎన్నో కథలను పరిశీలించారు. కథకుల సంకలనాలనూ, కథాసంకలనాలనూ చదివారు. పత్రికల్లోనే ఉండి సంకలనాలకెక్కని కథలనూ దృష్టిలో ఉంచుకున్నారు. గత శతాబ్దంలోని విభిన్న ధోరణులకు ప్రతినిధులనదగ్గ కథలను ఎన్నుకొన్నారు.

దొరికినంతలో కథకుల అంగీకారాలను సంపాదించటం జరిగింది. కొందరి అడ్రస్‌లు లభించని కారణంగా అనుమతి పత్రాలను పొందలేకపోయాం. ఈ సంకలనంలో చేర్చిన కథల రచయితలు గానీ, వారి వారసులు గానీ మమ్మల్ని సంప్రదిస్తే సగౌరవంగా ఈ కథా సంకలనాన్ని అందచేసుకోగలం.

విశాలాంధ్ర ప్రచురణాలయం వ్యాపార దృష్టిలేకుండా చేపట్టిన బృహత్పథకం ఇది. ఈ సంకలన సంపాదకులు – విశాలాంధ్ర ప్రచురణాలయ సంపాదకవర్గం సూచించిన మార్గదర్శక సూత్రాల ఆధారంగా – శ్రమించి దీన్ని రూపొందించారు. వారికి ప్రచురణాలయం పక్షాన కృతజ్ఞతలు. అలాగే, కథకుల సహకారం లేకపోతే ఈ సంకలనం ఇలా రూపుదిద్దుకొనేది కాదు. అందుకు వారికీ ధన్యవాదాలు.

తెలుగుసంస్కృతి ఉట్టిపడేలా అందమైన ముఖచిత్రం గీసి ఇచ్చిన ప్రముఖ చిత్రకారుడు డా. బాపుగారికి కృతజ్ఞతలు.

ఇలాటి సంకలనాలు కొన్ని వచ్చి ఉండవచ్చు. అయినా – అర్ధశతాబ్దంగా తెలుగు సాహితీ సేవలక్ష్యంగా అనేక వినూత్న పథకాలతో ముందడుగేస్తూ ప్రచురణ రంగంలో అగ్రగామిగా ఉన్న మీ విశాలాంధ్ర ప్రచురణ ఇది. మా అన్ని ప్రచురణలలాగే ఈ "విశాలాంధ్ర తెలుగు కథ" సంకలనాన్ని కూడా మీరు ఆదరిస్తారన్న ఆశతో దీన్ని సాహితీ లోకానికంకితం చేస్తున్నాం.

ఏటుకూరి ప్రసాద్,
సంపాదకుడు,
విశాలాంధ్ర ప్రచురణాలయం.

అక్టోబరు, 2002.
హైదరాబాద్.

★ ★ ★

# ఇదీ వరస...


| కథలు/కథకులు | సం॥ | పేజి |
|---|---|---|
| 1. మీ పేరేమిటి? – గురజాడ అప్పారావు | 1910 | 1 |
| 2. కుటీరలక్ష్మి – కనుపర్తి వరలక్ష్మమ్మ | 1924 | 14 |
| 3. భార్య – గుడిపాటి వెంకటచలం | 1924 | 26 |
| 4. నీలవేణి – రాయసం వెంకటశివుడు | 1934 | 42 |
| 5. అరికాళ్ళ కింద మంటలు – శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | 1935 | 52 |
| 6. పోలయ్య – కరుణకుమార | 1937 | 72 |
| 7. న్యాయం – పొటపల్లి రామారావు | 1945 | 87 |
| 8. "ఎందుకు పారేస్తాను నాన్నా?" – చాగంటి సోమయాజులు | 1945 | 93 |
| 9. వకీలు యెంకయ్య – సురవరం ప్రతాపరెడ్డి | – | 99 |
| 10. మన వూళ్లో కూడానా...?! – కాంచనపల్లి చినవెంకట రామారావు | 1945 | 105 |
| 11. నరసన్న పాపాయి – అడివి బాపిరాజు | 1946 | 112 |
| 12. నిద్రలేని రాత్రి – వుప్పల లక్ష్మణరావు | – | 118 |
| 13. హిందూ–ముస్లిం – సెట్టి ఈశ్వరరావు | – | 125 |
| 14. గోడమీది మూడోవాడు – గోపీచంద్ | – | 131 |
| 15. కదలే నీడలు – దేవరకొండ బాలగంగాధర తిలక్ | 1948 | 136 |
| 16. గెరిల్లా గోవిందు – శారద | 1948 | 145 |
| 17. అప్రజ్ఞాతం – కాళీపట్నం రామారావు | 1951 | 150 |
| 18. "మాకంటె మీరేం తక్కువ!" – వట్టికోట ఆళ్వారుస్వామి | 1952 | 165 |
| 19. గంజి కోసరం – జి. రామకృష్ణ | 1953 | 169 |
| 20. పైకి వచ్చినవాడు – కొడవటిగంటి కుటుంబరావు | 1954 | 174 |
| 21. ఎండమావుల్లో తిమింగిలాల వేట – కె. సభా | – | 183 |
| 22. సర్కారు కిస్తు – మంద రామారెడ్డి | 1956 | 189 |
| 23. శిల్పి – అందే నారాయణస్వామి | 1956 | 196 |
| 24. ముక్కోటి బలగమోయి – జి. సురమౌళి | 1956 | 200 |
| 25. కేవలం మనుషులం – నెల్లూరి కేశవస్వామి | – | 206 |
| 26. ధర్మవ్యాధుడు – మంజీర | 1959 | 216 |

| | | |
|---|---|---|
| 27. మార్పు – మా.గోఖలే | – | 226 |
| 28. న్యాయం – రాచకొండ విశ్వనాథశాస్త్రి | 1961 | 234 |
| 29. శాసన క్రీడాభిరామం – ముళ్లపూడి వెంకటరమణ | 1961 | 242 |
| 30. నెత్తురుకన్నా, చిక్కనిది – మునిపల్లె రాజు | 1965 | 252 |
| 31. అలజడి – పెద్దిభొట్ల సుబ్బరామయ్య | – | 257 |
| 32. కుంకుమ – శ్రీపతి | 1967 | 267 |
| 33. మూగజీవులు – ఇల్లిందల సరస్వతీదేవి | 1969 | 277 |
| 34. పిండీకృతశాటి – కొలకలూరి ఇనాక్ | 1969 | 285 |
| 35. తరాలు – అంతరాలు – వాసిరెడ్డి సీతాదేవి | 1969 | 305 |
| 36. సంఘర్షణ – కొనకళ్ల వెంకటరత్నం | 1970 | 312 |
| 37. తాతదిగిపోయిన బండి – కలువకొలను సదానంద | 1970 | 331 |
| 38. నీడ – శీలా వీర్రాజు | – | 345 |
| 39. ఎ మేట రాఫ్ నో ఇంపార్టెన్స్ – బీనాదేవి | 1971 | 356 |
| 40. పులుసు – భూషణం | 1973 | 367 |
| 41. కర్త, కర్మ, క్రియ – అబ్బూరి ఛాయాదేవి | 1975 | 378 |
| 42. జూదం – సింగమనేని నారాయణ | 1978 | 386 |
| 43. సమిధలు – చిలుకూరి దేవపుత్ర | 1979 | 395 |
| 44. ఎవరు వాళ్లు? ఎవరి వాళ్లు? – జుగాష్ విలి | 1979 | 403 |
| 45. పీర్ల సావిడి – కేతు విశ్వనాథరెడ్డి | 1980 | 415 |
| 46. వలయం – చాగంటి తులసి | – | 424 |
| 47. తొక్కుడుబండ – సదానంద్ శారద | 1981 | 433 |
| 48. శిథిల శిల్పాలు – అల్లం శేషగిరిరావు | 1981 | 442 |
| 49. తిరగబడ్డ భూమి – ఉప్పల నరసింహం | 1981 | 446 |
| 50. శత్రువు నేర్పిన పాఠం – అల్లం రాజయ్య | 1982 | 455 |
| 51. జీవంలేని మొక్క – వారాల కృష్ణమూర్తి | – | 462 |
| 52. శివకాంత – పురాణం సుబ్రహ్మణ్యశర్మ | – | 472 |
| 53. పరిష్కారం – వల్లంపాటి వెంకట సుబ్బయ్య | 1984 | 484 |
| 54. నలుగురు కలిసి నవ్వే వేళ – రాధిక | 1986 | 496 |
| 55. పాడి ఆవు – మధురాంతకం మహేంద్ర | 1987 | 510 |
| 56. పునాది – పి. సత్యవతి | 1988 | 517 |
| 57. అల – దాసరి శిరీష | 1988 | 524 |
| 58. కడియాలు – లంకిపల్లి | 1988 | 529 |
| 59. యంత్రం – సత్యాగ్ని | 1988 | 541 |

| | | |
|---|---|---|
| 60. రథయాత్ర – పోలవరపు కోటేశ్వరరావు | 1989 | 548 |
| 61. నేకెడ్ ఫకీర్ – కె. సదాశివరావు | 1989 | 559 |
| 62. పద్మ – జి. కళ్యాణరావు | 1989 | 574 |
| 63. సుజాత – వాడ్రేవు చినవీరభద్రుడు | 1990 | 587 |
| 64. స్మైల్స్ ఫర్ సేల్ – సి. సుజాత | 1990 | 601 |
| 65. బంద్ – ఆడెపు లక్ష్మీపతి | 1990 | 607 |
| 66. విడాకులు – కవనశర్మ | 1991 | 616 |
| 67. అవశేషం – బండి నారాయణస్వామి | 1991 | 629 |
| 68. ముసుగు నాగమ్మ మహిడీ – మధురాంతకం రాజారాం | 1991 | 642 |
| 69. పయనం–పలాయనం – వివిన మూర్తి | 1992 | 652 |
| 70. అందలం – ఆర్వియార్ | 1992 | 673 |
| 71. సంధ్యాసమస్యలు – కె. వరలక్ష్మి | 1992 | 687 |
| 72. నిత్యమూ... నిరంతరమూ... మధురాంతకం నరేంద్ర | 1993 | 691 |
| 73. జాడ – తుమ్మేటి రఘోత్తమరెడ్డి | 1993 | 704 |
| 74. లా అండ్ ఆర్డర్ – పులుగు శ్రీనివాస్ | 1993 | 721 |
| 75. విత్తనాలు – పినాకపాణి | 1994 | 731 |
| 76. పాముకాటు – ఎ. వి. రెడ్డిశాస్త్రి | 1994 | 739 |
| 77. రెక్కమాను – ఎమ్.వి. రమణారెడ్డి | 1994 | 757 |
| 78. అమూల్యం – ఓల్గా | 1994 | 770 |
| 79. వలసపక్షులు – గొరుసు జగదీశ్వరరెడ్డి | 1994 | 783 |
| 80. నన్ను క్షమించు కన్నా! – జి. ఆర్. మహర్షి | 1994 | 797 |
| 81. పనివాడితనం – అక్కినేని కుటుంబరావు | 1995 | 802 |
| 82. విడ్డూరపు మనిషి – జి. రేణుకాదేవి | 1995 | 810 |
| 83. ఎల్లువ – దాదా హయాత్ | 1995 | 820 |
| 84. నాగేటిచాలు – వల్లూరు శివప్రసాద్ | 1995 | 831 |
| 85. జీవనస్రవంతి – ఎ. అప్పల్నాయుడు | 1996 | 841 |
| 86. ఉక్కుపాదం – శాంతి నారాయణ | 1996 | 852 |
| 87. పాడె – సొదుం జయరాం | 1996 | 866 |
| 88. అంటు – సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి | 1996 | 873 |
| 89. ఆలౌట్ – బమ్మిడి జగదీశ్వరరావు | 1997 | 886 |
| 90. దక్షయజ్ఞం – బి.ఎస్. రాములు | 1997 | 897 |
| 91. హైకూ – వి. చంద్రశేఖర రావు | 1997 | 917 |
| 92. భద్రత – కాలువ మల్లయ్య | 1997 | 921 |

| | | |
|---|---|---|
| 93. జోరేసావు కత – నాగప్పగారి సుందరరాజు | 1997 | 932 |
| 94. మనిషీ–పశువూ – పి. రామకృష్ణారెడ్డి | 1998 | 940 |
| 95. రంగురాళ్లు – తల్లావజ్ఝుల పతంజలిశాస్త్రి | 1998 | 959 |
| 96. తుపాకులు – బోయ జంగయ్య | 1998 | 965 |
| 97. చుక్క పొడిచింది – పాలగిరి విశ్వప్రసాద్ | 1998 | 974 |
| 98. పగం తెరిచిన తలుపు – పాపినేని శివశంకర్ | 1998 | 984 |
| 99. శిశిరం – కాట్రగడ్డ దయానంద్ | 1998 | 995 |
| 100. హెచ్ – నవీన్ | 1998 | 1003 |
| 101. గాలిచెట్టు – వి.ఆర్. రాసాని | 1998 | 1012 |
| 102. జవాబులేని ప్రశ్నలు – ముదిగంటి సుజాతారెడ్డి | 1998 | 1022 |
| 103. అమ్మీజాన్ – రహమతుల్లా | 1999 | 1028 |
| 104. హత్య – పి. చంద్ | 2000 | 1037 |
| 105. కాలాన్ని వెనక్కు తిప్పకు – డి. కామేశ్వరి | 2000 | 1049 |
| 106. ఇన్‌స్టెంట్ లైఫ్ – కుప్పిలి పద్మ | 2000 | 1057 |
| 107. గంగ జాతర – వి. ప్రతిమ | 2000 | 1068 |
| 108. వలస – ఇనయతుల్లా | 2000? | 1081 |
| ★ రచయితల సంక్షిప్త పరిచయాలు | ... | 1091 |


★ ★ ★

1

గురజాడ అప్పారావు

# మీ పేరేమిటి?

దేవుఁడు చేసిన మనుషుల్లారా!
మనుషులు చేసిన దేవుఁళ్ళారా!
మీ పేరేమిటి?

పురాణ కథలను గురించి మేం శంకలు వేస్తే, మా గురువుగారు "వెధవ చదువు! మీకు మతులుపోతున్నాయి, మీరు వొట్టి బౌద్ధులు" అనేవారు.

"బౌద్ధులు యెటువంటివారు, శాస్త్రుల్లుగారూ" అని రామ్మూర్తి వొకనాడడిగాడు.

"రేపు ఆదివారం రాజుగారి పువ్వులతోటలో యీ విషయం ఉపన్యసిస్తాను. అంతా రండి" అని శాస్త్రుల్లుగారు శలవిచ్చారు.

ఆదివారం మధ్యాన్నం నాలుగు గంటలప్పుడు పువ్వులతోటలో ఒక పరుపు మామిడిచెట్టు క్రింద యిసకలో మేవంతా పాతికమంది కూర్చున్నాం. గొంగళి పరచుకుని మాకు అభిముఖంగా శాస్త్రుల్లుగారు కూర్చున్నారు. నేను బల్లచెక్క తెచ్చి వెయ్యబోతే "వొద్దురా, మీరంతా కింద కూచుంటే, నేను బల్ల మీద కూచుంటా్రా?" అన్నారు. రెండు లేత కొబ్బరికాయల నీళ్లు తాగి తాంబూలం వేస్తూ, శాస్త్రుల్లుగారు బౌద్ధమతం విషయమై ఉపన్యసించారు. పది నిమిషాలు అయేసరికి రామ్మూర్తి పుస్తకం వొహటి తనలో తను చదువుకుంటూ, "శాస్త్రుల్లుగారూ, తాము శలవిచ్చేదంతా సర్వదర్శనసంగ్రహంలోంచి కాదండీ?" అని అడిగాడు, ఆశ్చర్యపడి – శాస్త్రులు "ఔరా! ఏకెలా తెలిసిందిరా! అదేం తర్జుమా కాదుగద?" అన్నారు.

"ఔనండి."

"ఈ యింగ్లీషువాడు ఉద్దండ పిండంరా! ఆ రెండో పుస్తకం?"

"అది బుద్ధ చరిత్రండి."

"ఎక్కడ సంపాదిస్తార్రా యీ అపూర్వ గ్రంథాలు? యేది" శాస్త్రుల్లుగారు పుస్తకం అందుకుని, అతి మధురమైన కంఠంతో, శ్లోకాలు చదివి అర్థం చెప్పడం ఆరంభించారు. వారు చెప్పే కథల్లా కళ్ళగట్టినట్టుంటుంది. అలా సంతోషంగా వెళ్ళిపోయింది. యింటికొచ్చేటప్పుడు శాస్త్రుల్లుగారు శలవిచ్చారు. "యీ సంస్కృత విద్యయందు ఎలా కుదిరిందిరా అభిమానం తెల్లవాడికి? యెక్కడలేని గ్రంథాలు పైకిలాగుతున్నారు. వాళ్ళయందు తప్పకుండా భగవంతుడు వున్నాడు."

నాలుగు రోజులు పోయిన తరువాత, శాస్త్రుల్లుగారు వొకనాడు క్లాసులో యిలా శలవిచ్చారు. "ఒరేయ్! నిజం చెప్పాలికదూ, యీ పుస్తకం చదివిందాకా, బుద్ధుడి మహిమ నాకు తెలియలేదురా, తప్పకుండా యీ మహానుభావుడు శ్రీమహావిష్ణు అవతారవేఁన్రా."

ఆనాటి నుంచి శాస్త్రుల్లుగారు మమ్మల్ని బౌద్ధులని దూషించడం మానేశారు. కిరస్తానులవఁని మట్టుకు అంటూ వొచ్చేవారు. క్రీస్తును, శ్రీమహావిష్ణుయొక్క పదకొండో అవతారంగా చెయ్యడానికి సాధ్యం కాక, వొడబడి వూరుకున్నాం.

మా గురువుగారివంటి గురువులు లోకంలో లేరు. చిరకాలం కాశీవాసంచేసి, తర్కశాస్త్రము చదువుకున్నారు. మన దేశంలో అంత తార్కికుడు లేడని ప్రతీతి. శాస్త్రం మాటకేంగాని, కావ్యాల్లో మంచి రసగ్రాహి. మరి సుగుణ సంపత్తికో అంటే సత్యకాలపు మనిషి అన్నప్పుడు–అయనే సత్యకాలపు మనిషి. అంత పాండిత్యం యింత సత్యకాలం ఒక బుఱ్ఱలో యెలా యిమిడివున్నాయో, ఆశ్చర్యం!

ఈ జరిగినది పది సంవత్సరముల కిందటి మాట. ఇప్పుడు శాస్త్రులుగారు పింఛను పుచ్చుకున్నారు. మాలాటి శిష్యులు శుశ్రూష పొందుతూ, మాకు సంస్కృత గ్రంథాలు చెబుతూ సంతోషిస్తూ, సంతోషపెడుతూ కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

నేను వర్తకం చేస్తున్నాను. రామ్మూర్తికి భూములు లావుగా వున్నాయి. కొత్త కొత్త మోస్తర్లను వ్యవసాయం చేస్తున్నాడు. వూరు గెడ్డదరిని సీతారామ కోరుకున్న ఒక బ్రహ్మాండమయిన తోట వేశాడు. అవి పువ్వులుకావు. తొలిఫలాలు గురువుగారు అరగించనిదీ రామ్మూర్తి చెట్టు ముట్టడు. ఆ తోటలో విహరించడం గురువుగారికి అత్యానందం. అక్కడనే మేం తరచు మీటింగులు చేస్తూ వుంటాం. వెంకయ్య స్కూలులో మేష్టరు. ఖాయిదా లావుచేసి, తిట్లుతింటూ ఉంటాడు. మా స్కూలు జట్టులో ఆరేడుగురం యిక్కడనే వున్నాం. గురువుగారూ మేమూ కలిసినప్పుడల్లా స్వర్గఖండం ఒకటి అక్కడికి దిగినట్లు వుంటుంది.

ఇక ప్రస్తుత కథా.

మా పట్నానికి యెనిమిది మైళ్ళ దూరంలో రామగిరి అని ఒక విష్ణుక్షేత్రం గలదు. దాని వర్ణన మరి ఒకమాటు చేస్తాను. ఇప్పటిమట్టుకు మీకు తెలియవలసినదేమంటే; అక్కడి విష్ణుక్షేత్రం ఆధునికం. ఆ వూరి నల్లకొండల వంతటను శిథిలమైన బౌద్ధ కట్టడములు కలవు. అక్కడివారు వాటిని పాండవుల పంచలంటారు. ఈ దేశంలో పాండవులు వుండని గుహలూ, సీతమ్మవారు స్నానమాడని గుంటలూ లేవు.

ఒక పెద్ద గుహలోనున్న బౌద్ధ విగ్రహమును శివుడని, దాని ప్రక్కనున్న దేవీ విగ్రహమును గౌరి అని భావించి జంగాలు పూజ చేస్తున్నారు.

ఉండగా, ఉండగా, కొన్నాళ్ళకి ఒక దొర, గుమాస్తాలతోను, బిళ్ళ బంట్రోతులతోనూ వచ్చి, మెట్టల పడమటనున్న ముదగ మామిడితోటలో కాంపు ఖాయించాడు. మరిన్నీ వందల కొలది కూలీలను కూర్చి ఆ కొండల మధ్యనున్న దిబ్బలు తవ్వించడం ఆరంభించాడు. ధనం కోసం తవ్వుతున్నాడని అక్కడి వాళ్ళంతా అనుకొన్నారు. కాని, విరిగిన ప్రతిమలూ, జిలుగు చెక్కిన రాళ్ళూ, పాతుకుపోయిన పాతకుండలూ,

మండలూ బళ్ళమీద పెరికి, ధనంకంటెనూ యెక్కువ భద్రంగా యేర్చి పేర్చాడు. ఇవి చూచుటకే మేం వెళ్ళాం.

మేం ఆ వూరు వెళ్ళేసరికి జంగాలు పూజచేసే పాలరాతి బుద్ధప్రతిమనుగూర్చి వూరంతా కోలాహలంగా వుండెను. ఆ బొమ్మ మేం చూశాం. బహు సొగసైనది. ఇంత తీరైన చిత్రము గాంధారదేశంవైపు తప్ప మరెక్కడా చూడలేదని దొర మాతో చెప్పారు. దాని పీఠం మీద "యే ధర్మా హేతు ప్రభవా" ఇత్యాది బౌద్ధ సిద్ధాంతము సొంపుగా వ్రాయబడి వున్నది. దొరగారు దానిమీద కన్నువేసి 'ఇస్తారా?' అని అడగగా, శైవ్యులలో పెద్దలు "ప్రాణములనయినా యిత్తుముగాని, దానినీ యివ్వజాలము" అనిరి. దొరగారు నలుగురితో సాయిలాపాయిలాగా తిరిగేవారు గనుక మర్యాదగా జవాబు చెప్పారు. మరివకరైతే, కథ చాలా దూరం వెళ్ళి వుండును. దొరగారు అంతటితో ఆ ప్రయత్నం మానుకున్నారు.

ఇలా వుండగా ఒకనాటి రాత్రి పూజచేసే జంగం శరభయ్య ఆ ప్రతిమను పెగిల్చికొనిపోయి దొరగారికి రెండు వందలికి అమ్మజూపాడు. దొంగతనంగా తెస్తివి పుచ్చుకోజాలను అని, దొర తనకు మాటరాకుండా వుండగలందులకు వూరి పెద్దలకు కబురు పెట్టాడు. యేమిటి, యీ దొర బుద్ధితక్కువ అని శరభయ్య కొంత ఆశ్చర్యపడి దొర కొంచెం కనుజాటుకాగానె, మెట్టల వైపు పరుగుచ్చుకున్నాడు, నాటికీ నేటికీ మరి ఫికరులేదు.

శాయన్న భుక్తగారి యింట బసచేసి ఆ వూళ్ళో మేం మూడ్రోజులు వున్నాం. శాయన్న భుక్త మా గురువుగారి దగ్గర కొన్నాళ్ళు తర్కం చదువుకున్నాడు. మంచి సాహిత్యం కద్దు–కొంచం కవిత్వం కూడా అల్లుతాడు.

మూడోనాడు రాత్రి భోజనం చేసుకొని, డాబామీద నలుగురమూ కూచున్నాం. చిన్న గాలిరేగి తోటలో కొబ్బరిమట్టలు అల్లాడడం ఆరంభించాయి. యెదట దేవుడి కొండ బ్రహ్మాండమైన మహాలింగమువలె చీకటిని చీల్చుకొని మిన్నుముట్టి మనిషియొక్క అత్యల్పతను సూచించుచు, యేదో చెప్పరాని చింతను, భీతిని మనస్సులకు కలుగజేయుచుండెను. దేవతలు పూజ చేసిన దివ్య కుసుమములవలె చుక్కలు శిఖరము చుట్టు చెదరి వెలిగెను. మా మనస్సులు గతకాలమునాటి స్థితిగతులను గూర్చిన ఊహాలతో నిండియుండెను. తలపోసి తలపోసి ఆనాడు యీ స్థలం యెలా ఉండెనో, బౌద్ధులు యేమి చేసేవారో అని నేనంటిని.

"ఆ పీనుగులు మనలాగే యేడుస్తూ వుండేవారు. మనకంటె అద్ధానంగా వుండేవారు" అని సున్నితమైన తలంపులు బెదరి చెదరే పెళుసు గొంతుకతో వెంకయ్య అరిచాడు. నాకు కళ్ళుమొయ్యా కోపం వచ్చి, "నీ అమూల్యమైన వూహాలతో నువ్వు ఆనందించరాదా? నా తలలో నే కల్పించుకున్న బౌద్ధ ప్రపంచమును పెటుకుమాటలాడి యేల కలత పరచెదవు?" అని అడిగాను.

"సాని" శాస్త్రులుగారు అన్నారు: "బుద్ధుడు విష్ణ్వవతారంగదా, ఈ జంగాలు శివుడని యేల పూజ చేస్తున్నార్రా?" అని శంక వేశారు.

శాయన్నభుక్త పొడుం డబ్బీ తీసి, పెద్ద పట్టు పీల్చి, గావంచాతో ముక్కు తుడుచుకొని "ఒక కథ వుంది" అన్నాడు. కథంటే శాస్త్రులుగారికి సరదా. "అయితే చెప్పు" అన్నారు. చెవినొగ్గి విన్నాం. యిదీ కథ:

"ఈ గ్రామంలో శైవ వైష్ణవ మతాలకు వైరం చిరకాలం నుంచి కద్దు. శివమతానికి మొనగాడు జంగం. శరభయ్య అనగా యిప్పుడు పారిపోయిన పూజారే. మొన్న ప్రతిమను పెరికి పలాయనం అయిందాకా అతగాడు సాక్షాత్తూ నందికేశ్వరుడి అవతారమని, రాత్రులు గుహయెదుట వృషభరూపమై మేస్తూవుంటాడని యిక్కడి జంగాలకూ దేవాంగులకూ నమ్మకం. ఇప్పుడైనా ఆ దొర కిందటి జన్మలో పరమ మహేశ్వరుడౌటచేత ఆ విగ్రహమును కోరినాడనీ, భక్తవాత్సల్యంచేత శివుడిచ్చిన శెలవును అనుసరించే శరభయ్య విగ్రహాన్ని పెరుక్కు వెళ్ళాడని దేరానుంచి పారిపోవడంలో వృషభరూపం ధరించి రంకెవేసి మరీ దాటేశాడనీ ఒక వార్త అప్పుడే అతని శిష్యులు పుట్టించారు. రేపో నేడో వీరాసనం వేసుకుని ఒకధ్యానం చేస్తూ కొండమీదనో, గోపురము మీదనో ఆవిర్భవిస్తాడు. బాజాబజంత్రీలతో వెళ్ళి ఉల్లభంబట్టి తోడుకువస్తారు. ఆపైని కంసాలి వీరయ్య (వీరణాచారి అని పిలిస్తేనేగాని కోపగిస్తాడు. చిలువలూ పలవలూ కల్పించి ద్విపదకావ్యం రచించి అచ్చు వేస్తాడు. ఆ ఉభయులకీర్తి దిగంతాలకు వెల్లవేస్తుంది.)

వాళ్ళ మూఢభక్తి, ఈ ప్రపత్తి పండితులకు వుండదురా, వీళ్ళది ఏమి అదృష్టం అని గురువుగారు అన్నారు. ఆ పైని వెంకయ్య యేమో అనబోతే చేతితో నోరు అడ్డాను. ఎవరి అభిప్రాయం వారు చెప్పకుండా నీ శాసనం యేమిటి అని అడిగాడు. మాటాడవద్దని చేత సంజ్ఞ చేశాను. శాయన్న భుక్త తిరిగీ యెత్తుబడి చేశాడు.

"అవును. తాము శెలవిచ్చినట్టు పామరులకువుండే గాఢభక్తి పండితులకు వుండదు గాని యీ మూఢభక్తి ఒకప్పుడు ప్రాణాంతరం తెస్తుంది; అదే చెప్పబోవుచున్నాను వినండి."

"నేనూ ఆ మాటే చెప్పబోతే చెప్పనిచ్చాడు కాదు" అని వెంకయ్య అన్నాడు. "అవును, నీకంటూ తెలియని సంగతిలేదు, మరి వూరుకో" అన్నాను.

"శివస్థలం యొక్క ఉత్పత్తి మీకు తెలియనే తెలుసును. పూజారి శరభయ్య చాలా కథకుడౌట చేతను వీడి రోజుల్లో శివస్థలానికి మిక్కిలిగా వైభవం కలిగింది. చుట్టుపట్ల గ్రామాలవాళ్ళందరూ మొక్కుబళ్ళు చెల్లిస్తారు. ఉత్సవపు రోజులలో పెద్ద జాతర్లు సాగుతాయి. మరిన్నీ యిక్కడి దేవాంగులు కలిగినవాళ్ళు. జంగంపాడు యావత్తున్నూ, దేవ పేటానున్నూ శరభయ్యమాట మీద నడుస్తారు. ఈ గ్రామములో వుండే విష్ణుస్థలం రెండువందల యేళ్ళకిందట యీ దేశం యేలే ఒక మహారాజు కట్టించిన రాగభోగాలకు వొక గ్రామం స్వామికి సమర్పణ చేశారు. అప్పటినుంచి రంగాచార్యులుగారి కుటుంబస్థులే యీ స్థలానికి ధర్మకర్తలై వుంటూ వచ్చారు. ఈయన యిద్దరి ముగ్గురు వైష్ణవులను జీతమిచ్చి వుంచి వాళ్ళచేత మిక్కిలి భక్తిశ్రద్ధలతో స్వామివారి కైంకర్యం జరిపిస్తూన్నారు. రంగాచార్యులుగారు బహుయోగ్యులు. ఆయన యొక్క సంస్కృత సాహిత్యం మీరు చూడనే చూశారు. ద్రావిడ వేదములలో కూడా గట్టివారని ప్రతీతి కద్దు. ఆయన కొమాళ్లు కృష్ణమాచార్యులు కూడా సంస్కారేగాని విశేష ప్రయోజకుడు కాడు. ఆ యింటికి వెలుగు తెచ్చినది యీ కృష్ణమాచార్యులు భార్య నాంచారమ్మ. ఆమె తల్లీ తండ్రీ కూడా పండితులౌటచేత ఆంధ్రగీర్వాణముల యందు మంచి జ్ఞానం సంపాదించిరి. పురాణం ఆ యిల్లాలు చదివినంత శ్రావ్యంగానూ రసంతోనూ యెవరూ చదవజాలరు. రూపమూ, రూపానికి

సదృశ్యమైన గుణసంపత్తీ కలదు. ఆమెకు ఒక కొమార్తె, ఒక కొమారుడున్ను. యిల్లూ దేవాలయం కూడా ఆమే చక్కబెట్టుకుంటారు."

"ఇది కవిత్వమా, నిజమా?" అని వెంకయ్య అడిగాడు.

"మాకూ వాళ్ళకూ రాకపోకలు గలవు. నా భార్యా చెప్పిన మాటలు నే చెబుతున్నాను. ఆమె పురాణం చదవడం చెవులారా విన్నాను. మీకు వినడవు అభిలాష వుంటే రేపటి దాకా వుండిపొండి. విష్ణుస్థలం యొక్క స్థితి ఇది. గానీ, అయ్యవార్లంగారు మతసంబంధమైన జట్టీలలో యెన్నడూ జోక్యం కలుగచేసుకోవడంలేదు. వైష్ణవపక్షానికి కెప్తాను సాతాని మనవాళ్ళయ్య. అనగా రోజా పొద్దున్న ఉపాదానానకు వచ్చి స్తోత్రపాఠాలతో పెణక యెగరగొట్టేస్తాడే, అతగాడే. ఒకనాడు తెల్లవారగట్ల కలక్టరుగారు గుఱ్ఱమెక్కి వస్తూవుండగా గ్రామ పొలిమేరను మనవాళ్ళయ్య యెదురై, పెళపెళమని శ్లోకం యెత్తుబడిచేసేసరికి, ఇతని స్థూలకాయం, బట్టెనామాలు, రాగిధ్వజం, కోలాహలమూ చూసి గుఱ్ఱం బెదిరింది. కోపంవచ్చి కలక్టరు అయిదు రూపాయలు జుల్మానా వేశారట. ఈ కథ శుద్ధాబద్ధం అనీ, తనచేత శ్లోకాలు చదివించి దొరగారు అయిదు రూపాయలు ప్రెజంటిచ్చారని అవి పెట్టి కొత్త వ్యాయపారపాత్ర కొన్నానని మనవాళ్ళయ్య చెబుతాడు.

## 2

శైవులలోవున్న ఐకమత్యం వైష్ణవుల్లో లేదు. సాతాన్లు చాలమంది మనవాళ్ళయ్య శిష్యులే. అయినప్పటికీ కొందరుమట్టుకు అతను అవతార పురుషుడని చెప్తారు. అతనంటాడు–"శరభయ్యే వృషభావతారమైనప్పుడు నేను గరుడాళ్వారి పూర్ణావతారం కాకపోతే కాకపోవచ్చునుగాని వారియొక్క అత్యల్పాంశవల్లనైనా జన్మించి వుండకూడదా? గరుడాళ్వారి నఖములయొక్క తేజస్సు నాయందు ఆవిర్భవించి వున్నది, కాబట్టే శరభయ్యను యిలా చీల్చి పేల్చుచున్నాను."

అయ్యవార్లంగారికి ఒకమాటు యీ మాట చెవిసోకి గట్టి చీవాట్లు పెట్టారు. ఆ చీవాట్లు తిని పైకివచ్చి "యీ బ్రాహ్మలదీ, జ్ఞానము కాదు, అజ్ఞానమూ కాదు. కడజాతిమనుష్యులే భక్తి ప్రభావంచేత ఆళ్వార్లు అయి వుండిరి గదా! ఇంత కాలవాఁయి రాముడి ధ్వజమును జయప్రదంగా మోస్తూ, శైవ సంహారం చేసిన నేను శ్రీమద్గరుడాళ్వారి నఖాగ్రాగ్రం యొక్క అవతారం యేలకాను? గరుడాళ్వారి నఖములు పెరిగి, ఖండన ఐనప్పుడూ ఆ ముక్కలు నావంటి భక్తులుగా ఆవిర్భవించి పరమత సంహారం చేస్తవిగాని, వృధాగా పోనేర్చునా? వట్టిమాట!" అన్నాడు.

"ఔర! యేమి మూర్ఖత; యేమి అహంభావము? యీ అజ్ఞులా అవతార పురుషులు? ఇలా అన్నందుకు వీళ్ళతలలు పగిలిపోవురా?" అని గురువుగారు అన్నారు.

"శాస్త్రుర్లుగారూ, పాతరోజులైతే, వీళ్ళే అవతారాలయిపోదురు. వీళ్ళపేరిట బొమ్మలు నిలిపి, దేవాలయాలు కట్టి, మనవేఁపూజ్జేతుం. మరి బుద్ధుడూ యిలాంటి మనిషే గదండి" అన్నాడు వెంకయ్య.

"చాకిబట్టెకీ సముద్రానికి సాపత్యం తెస్తివి" అన్నారు గురువుగారు.

"అన్నమాటకల్లా వ్యాఖ్యానం చేస్తేగాని వూసుపోదురా!" అని నే అన్నాను.

"ఈ వూరి నాయలు స్తోమం కలవాళ్ళు. అందులో సారధి నాయుడు లక్షాధికారి. అతని బావమరిది రామినాయుడు గ్రామమునసబు. కొంచెం ధూర్తు, నిష్టాబాజీన్నీ-భోజనప్రియుడు. ఈ తాలూకాలోకల్లా పెద్ద సారాదుకాణం యీ వూళ్ళోనే వుంది. దాన్నిబట్టి యీ వూరి యోగ్యత మీరు వూహించుకోవచ్చును.

నాలుగు సంవత్సరముల కిందట యిక్కడికి దక్షిణదేశం నుంచి ఒక అయ్యవార్లం గారువచ్చి, సారధి నాయుడికి ఇంకా మరికొందరు నాయకులకూ చక్రాంకితం చేసి, వైష్ణవ మిచ్చారు. ఆనాడు మునసబు రామినాయుడు రామస్వామివారి ఆలయంలో తూంపట్టు పులిహోరా, వైష్ణవమూ యేకకాలమందే గ్రహించాడు. నాటికీ నేటికీ రెంటియందూ ప్రపత్తి యేకరీతిగానే వుంది. అప్పటినుంచీ సారధి నాయుడు ద్వాదశి ద్వాదశికి స్వామివారికి విరివిగా రాగభోగాలు నడిపిస్తున్నాడు. ద్వాదశి అంటే రామినాయడికి పెద్ద పండుగ.

నాయళ్ళంతా వైష్ణవం పుచ్చుకొని, శివకోవిలవైపు తిరిగి చూడకపోవడం, శరభయ్యకు కంట్లో మిరపకాయలు రాసుకున్నట్టు వుండెను. ఆలోచించి ఒక యెత్తు యెత్తాడు.

ఆ రోజుల్లో హైదరాబాదు రాజ్యం నుంచి శివాచార్లు కొందరు దేశసంచారార్థం యీ ప్రాంతానికి వచ్చారు. మరి రెణ్ణెల్లనాటికి పీఠంతోనూ, ప్రభలతోనూ, రుంజలతోనూ పెను ప్రళయంగా వచ్చి యిక్కడికి దిగబడ్డారు. రోజా అర్ధరాత్రివేళ శివార్చన చేసేవారు. ఆ సమయంలో శంఖాలు, జయఘంటలు, ఢమామీలు, వీటి ధ్వని పామరుల మనస్సులో భయోత్పాతం పుట్టించేది. ఈ నల్లరాతి కొండలో ఆ ధ్వనులకు ప్రతిధ్వనులు కలిగి, కోలాహలంగా వుండేది. ఈ అట్టహాసంలో వైష్ణవం పుచ్చుకున్న ఒక్కొక్క నాయుడే నామాలకి నామంబెట్టి విభూది రుద్రాక్షధారణం చెయ్యడం ఆరంభించాడు. వచ్చిన పదో రోజున శివాచార్లు గుండం దొక్కటానికి పెద్ద ప్రయత్నాలు చేశారు. సారధి నాయుడికి శివమతంవేపు తూగు లావాయెను. గుండం తొక్కడం చూసిన తరవాత సారధి నాయుడు సిద్ధాంతంగా శైవం పుచ్చుకుంటాడని అంతా నమ్మారు. అందుచేతనే, శైవుల్లో మొనగాళ్ళంతా రుంజలతో యింటికివెళ్లి చాలా కైవారంచేసి, వుత్సవం చూచుటకు రాకతీరదని పిలిచారు.

ఈ మాట చెప్పగా, అయ్యవార్లంగారు యేమన్నారంటే "రాముడి ఆజ్ఞ యెలా వుంటే అలా జరుగుగాక! వైష్ణవుడు శైవుడు కావాలని కోరితే అడ్డి యేమికార్యం? కాక కాశీలో మృతి పొందినవారికి శివుడేగదా తారకమంత్రోపదేశం చేస్తాడు గనక ఈ జన్మంలో పరమశైవుడైన వాడికి, వచ్చే జన్మలో తారకమంత్రోపదేశం చేసి, ముక్తి యివ్వకపోతాడా? యే మతమైనా ప్రపత్తి వున్నవాడికి త్రోవవుంది. అది లేకుంటే వైష్ణవుడైనా కార్యం లేదు." సాతాన్లకి అయ్యవార్లంగారి ఉదాసీనత చెయి విరుచుకున్నట్లు వుండెను.

"ఈ బ్రాహ్మడికి వైష్ణవాభిమానం తక్కువ; గనక మనం విజృంభిస్తేనేకాని వైష్ణవమత ప్రభావానికి అగౌరవం వస్తుం"దని మనవాళ్ళయ్య ప్రగల్భించి, శివాచార్లు గుండం దొక్కేనాటి రాత్రి రెండు ఝాములప్పుడు, కోవిలయెదటి రావిచెట్టుకింద

పెద్ద మీటింగు చేశాడు. సాతాన్లూ నాయలూ వొందలకి జమ అయినారు. అందులో యోధులు దుకాణంలో రహస్య శేవశేవించి, ఒక్కొక్కరే దిగబడ్డారు. అంతట మనవాళ్ళయ్య చెట్టు మొదటి రచ్చరాతిమీద వంగి నిలిచి, గెడ్డముకింద వక కఱ్ఱ అనుకుని, యేమని పలికెను? "పరమ భాగవతోత్తముల్లారా; వింటిరా? ఈ శైవుల యొక్క రాక్షసమాయలో పడి, అప్పుడే చాలా మంది నాయలు వైకుంఠానికి పోయే రాజమార్గమైన వైష్ణవమతం విడచి, అంధకార బంధురమైన శైవమతంలో కూలిపోయినారు. ఒక మన పరమ మిత్రుడున్నూ భక్తాగ్రేసరుడున్నూ అయిన సారధి నాయుణ్ణి మాయగమ్మి తమలో పడవేసుకొనుటకు, యిప్పుడు విపుల ప్రయత్నం చేస్తున్నారు. యీ రాత్రి అతడు వెళ్ళి శైవుల ఘోరకృత్యములు చూసెనా, మరి మనవాడు కాడు. గనక అతన్ని కాపాడి శ్రీమహావిష్ణు యొక్క మహిమ ప్రజ్వలింపచేసే సాధనం యేమిటో తాము అంతా ఆలోచించండి. సారధి నాయుడు యీ రాత్రి అక్కడకు వెళ్ళకుండా ఉపాయము కల్పించడము మన కర్తవ్యమని నా అభిప్రాయము."

యెలాగంటే యెలాగని నలుగురూ తలపోయుచుండగా, రామానుజయ్య లేచి నిలిచి అన్నాడు; "దీనికింత ఆలోచనేలా? యేమి? వాళ్ళు చేసేపని మనవేఁల చేయరాదూ? రామభక్తుడైన శివుడికే అంతమహిమ వున్నప్పుడు సర్వేశ్వరుడైన ఆ రాముడికి అంతకన్న వెయ్యిరెట్లు మహిమ ఉండక పోయెనా? గనక నా సలహా యేమిటంటే, శ్రీమద్గరుడాళ్వారి అవతారమైన మనవాళ్ళయ్య, రాగిధ్వజం చేతపట్టుకొని నాలాయిరం పఠిస్తూ గుండం తొక్కితేసరి. శివవైష్ణవ మతాల తారతమ్యం లోకానికి వ్యక్తం కాగలందులకు శివాచార్ల గుండంకంటే మరిబారెడు ఆస్తి లావుచేసి, యీ చెట్టుకిందే యీక్షణమందు బ్రహ్మాండమైఁన గుండం తయారుచేస్తాను: యిందుకు అభ్యంతరం చెప్పేవాణ్ణి వైష్ణవుడని భావించను."

చీకట్లో యెవరికీ కానరాలేదుగాని, మనవాళ్ళయ్య నోరు వెళ్ళబెట్టాడు. నలుగురూ "బాగుంది, బాగుంది" అనేసరికి అతని ప్రాణాలు యెగిరిపోయినాయి. ఒక్క నిమిషం ఆలోచించి అన్నాడు: "అన్నలారా! తమ్ములారా! పరమభాగవతోత్తముల్లారా! రామానుజయ్య నన్ను ఆక్షేపణ చేస్తున్నాడు. నేను పడవలసిందే. యీ శరభయ్యే వచ్చి తాను వృషభావతారవఁని నిక్కి నీలుగుతున్నాడుగదా, మనం దెబ్బకిదెబ్బ తీర్దాం. అని కేవల వైష్ణవాభిమానంచేత, నేను గరుడ వేషం వేశానేగాని, ఇంత భారమైన శరీరంతో నేను గరుడాళ్వారిని యెన్నడూ కానేరనే! ఆ మాట నాకు తెలియదా? ప్రాజ్ఞులైన మీకు తెలియదా? రామానుజయ్య అయితే, చులాగ్గా డేగలా వున్నాడు గనక, అవశ్యం అతగాడే గరుడాళ్వారి అవతారం. అతణ్ణే గుండం తొక్కమనండి. నేనుగాని నిప్పుల్లో కాలుబెట్టానంటే గజం లోతుక్కూరుకుపోయి చస్తాను. రామానుజయ్య తేలిగ్గా వున్నాడు; అంటీ అంటనట్టు చప చప అడుగేసుకు పోతాడు. అన్నల్లారా! న్యాయం ఆలోచించండీ" అనేటప్పటికిని రామానుజయ్య సన్న సన్నగా జారాడు.

రామినాయుడు జల్దుకొని అన్నాడు— 'రావఁస్వోవిఁకి మయిమంవుందా, లేదా? వుందా, యీ యేషాలు మాని తిన్నగా గుండం దొక్కు.' ఆ మాట విని, మనవాళ్ళయ్య మొహం జమాల్మంది, రామానుజయ్యలాగ మందలోంజొచ్చి మాయవౌఁదాఁవంటే,

చీమా దోమా కాదు; పది యిరవై మణుగుల పట్టు. "హో దైవమూ! నేను ఒక్క అరగడియ గరుడాళ్వారినే అయితే, యెక్కడకైనా యెగిరి ప్రాణం దాచుకుందునుగదా" అని అనుకున్నాడు.

"యేం, పల్లకుంటావేం?" రామినాయుడు పాడవడం అరంభించాడు; "అల్లాండం బెల్లాండం అని తెల్లారకుండగా వొచ్చి, తెగ అరుస్తావుగదా. ఆ ముక్కలన్నీ మావంటోళ్ళని బెదిరించి కూరా నారా లాగడానికేనా, అట్టి మయమం యేకాసింతైనా కద్దా?"

మనవాళ్ళయ్య నిట్టూర్పు విడిచి రామానుజులను స్మరించి యిట్లా అన్నాడు: "రామి నాయడన్నా! నువ్వూ నేను చిరకాలమునాటి నేస్తులం. నువ్వు గవునరు మెంటువారి తరపున మునసబీ అధికారం చాలా కాలవాఁయి చలాయిస్తున్నావు. యుక్తాయుక్తం యెరిగిన మనిషివి. అవునుగాని, వైష్ణవమతం యొక్క అధిక్యత అగుపర్చాలంటే, ఆ శరభయ్య చేసే తక్కువ పనా, నన్ను చెయ్యమంటావు? 'పృధివ్యాపస్తేజోవాయురాకాశాత్' అన్నాడు. విష్ణుభక్తుడైన వాడికి కర్తవ్యం ఉత్తమోత్తమం పృథివీ అనగా భూమి మీద నడవడవేఁ. పంచభూతములలో మరి వక భూతం మీద వైష్ణవుడన్నవాడు అడుగేసి నడవనేకూడదు. అంతకు ఒక వీసం తక్కువ ఆపః అన్నాడు; అనగా నీట్లో ఉరకడం ఒకపాటి కర్తవ్యం కావచ్చు. అధమాధమం అగ్గి తొక్కడం గనక మీరు యీవన్మందిన్ని యిప్పుడే నా వెంట రండి. ఈ నిశీధ సమయంలో శ్రీమహావిష్ణు నామస్మరణచేసి అమాంతంగా సీతాగుండంలో వురుకుతాను, అప్పట్లో నా మహిమ మీకు మీకు తెలియగల్దు."

రామినాయుడు దగ్గరకువచ్చి, మనవాళ్ళయ్య చేయి పట్టుకుని గట్టిగా నొక్కుతూ అన్నాడు: "యిన్నావా వైష్ణపోడా, మా ఇయ్యంకుడు సారధి నాయుడు జంగపాళ్ళలో కలిసిపోతే, దోదసి పులియోరి శక్కర పొంగళం పోతాయి, ఆ మాట నీకూ యెరిక. నీవు సీతమ్మ గుండంలో అనపకాయ తుంబలాగ తేలి, యీతలాడితే, నీ మయిమం అడొప్పతాడా? యెర్రి కుట్టె కబుర్లు మానేసి, మావాడు రెండు కళ్ళతో సూస్తుండగా, అల్లాండం బెల్లాండం అంటూ అగ్గిదొక్కు!"

"సరే, నేస్తం! నీ అభిప్రాయం ఆ ప్రకారం వున్నట్టయితే అలాగే కానియ్యండి. శ్రీమహావిష్ణువు యొక్క మహిమ నిలబెట్టడానికి అగ్గి తొక్కుతానా, తొక్కిచూస్తానా! యిప్పుడు చాలా రాత్రైంది. యిళ్ళకి పోయి పరుందాం. రేపు యీవేళప్పుడు యీ స్థలంలోనే బ్రహ్మాండమైన గుండం చేసి, దందహ్యమానమైన ఆ గుండం తొక్కి, వైష్ణవ మత ప్రభావం కనపరుస్తాను. అప్పట్లో ఆ గరుడాళ్వారే, నన్ను అవహించి, అంత గుండమునూ చెంగున ఒక్కదాటున దాటేస్తారు."

"ఆ పప్పు వుడకదు; యీ రాత్రి మావాడు జంగపాళ్ళలో కలిసిపోతే, రేపు నువ్వు దాటేం, దాటకేం, ఆ దాటేదేదో యీయాళ అళ్ళ గుండంలోనే దాటు. లెండోస్సి యీ వైష్ణపోణ్ణి మోసుగెళ్ళి గుండం తొక్కిద్దాం" అని రామినాయుడు అనేసరికి నలుగురు నాయలు మనవాళ్ళయ్య రెక్కలు పట్టుకుని రచ్చరాతిమీదనుంచి కిందికి దించారు. మీరి వచ్చిందని మనవాళ్ళయ్య ఒక యెత్తు పన్నాడు. "అగండి. గుండం తొక్కవలసి వచ్చినప్పుడు, అందుకు కావలసిన పరికరమంతా కూర్చుకోవడవాఁ లేకుంటే కట్టుగుడ్డలతో, గుండంలో పడేసి, వొళ్లు తెగ్గాలుస్తారా? ఆ శివాచార్లు

వీరభద్ర విగ్రహం చేతబట్టి మంత్రాలు పఠిస్తూ శంఖధ్వనికి వీరావేశం పుట్టి గుండం తొక్కుతారు. అలాగే శ్రీరామస్వామివారి తాలూకు ఉత్సవ విగ్రహం వొకటి నా నెత్తినకొడితేగాని యెలా చస్తాను? గరుడాళ్వారు అయినా ఎప్పుడూ పెరుమాళ్వారిని వీపున మోసుకునే బయల్దేరుతారుగాని ఒట్టినే రెక్క కదపరు. మీరెరగరా?" అనేటప్పటికీ, సారధి నాయుడు ఆ మాట నిజవఁర్రా యిగ్గరవిస్తాడు; అయ్యవోర్ని తెలుపుకురండోస్సి అన్నారు. నల్గురు నాయలు పక్కనున్న అయ్యవార్లంగారి ఇంటికివెళ్లి పైమీద గుడ్డ అయినా లేకుండా ఆయనను మోసుకువచ్చి రావిచెట్టు క్రింద రచ్చరాతి మీద కూచోబెట్టారు. యీ గడబిడ కనిపెట్టి కృష్ణమాచార్లు అటకెక్కి దాగున్నాడు.

అతి వినయమును నటిస్తూ మనవాళ్ళయ్య రంగాచార్యులుగారికి ప్రస్తుతాంశము విన్నవించి, ఉత్సవ విగ్రహమును యిమ్మని వేడాడు. రంగాచార్యులుగారు అన్నారు– "ఒరి మూర్ఖుల్లారా! మీకు మతులు శుభ్రంగా పోయినాయిరా? ఈ గుండం తొక్కడమనేది గర్హ్యమైన తామస వ్యాపారము. వైష్ణవమత నిషిద్ధము. మన గ్రంథాల్లో యెక్కడా యీ ప్రక్రియ లేదు. గుండం తొక్కడానికి ఒక విధీ, మంత్రం యేడిస్తేనా?"

"శక్కరంతోటి వొళ్ళల్లా తెగ్గాల్చడానికి మంతరం కద్దా! అట్టే మాటలు శెలవియ్యక, ఆ యిగ్గరవేందో సాతానోడికియ్యండి" అని రామినాయుడు అడిగాడు.

"ఛీ పొండి! మూర్ఖుల్లారా! నేను యిచ్చేదిలేదు. ఉత్సవ విగ్రహములు శూద్రులు ముట్టుకోవలసినవి కావు. కళ్ళు పేలిపోతాయి." అని రంగాచార్యులు అనేసరికి, మనవాళ్ళయ్య "బతికానురా దేవుడా!" అనుకొని, సారధి నాయుడితో "చూశావా నేస్తం! ఆ మాట నిజమే! నేను ఉత్సవ విగ్రహములు ముట్టుకోకూడదు. అందుచేత యిప్పుడు కర్తవ్యం యేమిటంటే, ఆ విగ్రహం పట్టుకొని అయ్యవార్లంగారే గుండం దొక్కవలసివుంటుందీ. ఆ అధికృత అనేది వారికే వుండవలసినది." అన్నాడు.

మునసబు "ముసలాయన యిగ్గరాలట్టుకుని గుండం తొక్కేరేటి? సిన్నసోఁవిని లెగదీసుకెళదాం. రండి" అన్నాడు.

"వాడిజోలికి వెళ్ళకండి. మాబాగే; వుత్సవ విగ్రహాలు పట్టుకొని, నేనే గుండం తొక్కుతాను. మావాడు పట్నం వెళ్ళాడు. వూళ్లోలేడు" అని రంగాచార్యులుగారు అన్నాడు.

"అయితే లెండోయి!" అని మనవాళ్ళయ్యే బొబ్బలేశాడు.

అంతట ఆ రావిచెట్టు మాను్చాటున గప్పున ఒక వెలుతురు పుట్టింది. అందరూ భీతిల్లారు; నిమిషాలు దిగజారి వొచ్చాయి. వెంటనే మాను వెనకనించి ఒకచేత కరదీపము, రెండవ చేత సూరకత్తి పట్టుకుని వుంగరాల జుత్తు గాలికి తూగులాడుతుండగా, నిబ్బరంగా అడుగు వేసుకుంటూ వచ్చి, నాంచారమ్మ మామగారి పక్కన నిలిచి, ఆయన రెక్కలు పట్టుకొనివున్న నాయలవంక బాకరుమొనజూపి "దుష్టుల్లారా! యీ పరమ పవిత్రమైన బ్రాహ్మణ్ణి హొదుల్తారా, బాకుకు బలియిచ్చేదా?" అని అడిగినది.

హఠాత్తుగా వచ్చిన యీ రూపమును చూచి, అందరి ధైర్యాలూ అడుగంటాయి. అయ్యవార్లంగారిని పట్టి నిలిచిన నాయలు బెదిరి దూరం సాగారు. అంతట ఆమె

చేతిదీపం రచ్చరాతి మీద వుంచి, "నీకేం కావా"లని మనవాళ్ళయ్యను అడిగింది. మనవాళ్ళయ్య రెండడుగులు వెనక్కివేసి తనకేమీ అక్కరలేదన్నాడు.

"నీకు ఉత్సవమూర్తులు కావలెనంటివే?"

"నాకెందుకు తల్లీ, అపవిత్రుడను ! వాటియెత్తు బంగారం కరిగించియిస్తే నాకు అక్కర్లేదు. రామినాయుడు యేమో కొంచెం–"

ఆమె అటునించి యిటుతిరిగి, రామినాయడని నిస్సాకారంగా చూస్తూ, "నీకేం గావాలి, మునసబునాయడా?" అని అడిగింది.

మొహం వొంచి, రామినాయుడు, తనకేం అక్కర్లేదని పైకిచెప్పి 'ఆడదాయితో యవడు మాటాడగల్డు' అని గొణుగుకున్నాడు. రామినాయుడి పెళ్లాం గయ్యాళి.

నాంచారమ్మ : "యెవరికీ యేమీ అక్కరలేకుంటే, యీ ముసలి బ్రాహ్మణ్ణి వొంటిమీద బట్టయినా లేకుండా నిద్దర మంచంమీంచి యెందుకు యీడుచుకువస్తిరి? ఎవరూ మాటాడ్రేవిఁ?"

రామినాయుడు కొంచెం ధైర్యం తెచ్చుకొని "ఆడదాయితో మాటల కంటే సావ్లేం గాని, యీ రాత్రికడ ఆ జంగపోళ్ళు శివుఁడు పేరుజెప్పి గుండం తొక్కుతారుగాదా. మన రామస్వోంవోరి పేరుజెప్పి మనం కూడా గుండం దొక్కకుంటే మన పెండెం యిరిగిపోదా?" అన్నాడు.

నాంచా: నువ్వే తొక్కరాదూ?

మున : నాకు మంతరం, మాయా యెరికినేదే ! అందకనే తొక్కమన్నాను.

నాంచా : (మనవాళ్ళయ్యతో) నువ్వెందుకు తొక్కకూడదూ?

మనవాళ్ళయ్య : అమ్మా, యీవేళ యేదో నా ప్రారబ్ధం చాలక యీ మీటింగు తలపెట్టాను. బుద్ధి గడ్డితిన్నది; యిదిగో లెంపలు పడపడ వాయించుకుంటున్నాను. తల్లీ, నన్ను యీ కాడికి వొదిలివేస్తే శ్రీరంగం వెళ్ళిపోతాను. యీ నాలుగు వూళ్ళ పొలిమేరనూ, నేనంటూ తిరిగీ కనబడితే, నా నెత్తిమీద పెద్ద పిడుగు పడిపోవాలి.

నాంచా : నీకు కొండంత గుండెవుంది. (రామినాయుడుతో) మునసబు నాయడా! నీ వియ్యంకుడు సారధినాయడు విరిగిపోతే, ద్వాదశి ద్వాదశికి 'శక్కరపొంగళం', 'పులియోరే' లేకపోతాయనికదా నీ దుఃఖం?

మునసబు : (తలగోక్కుంటూ) నాకొక్కడికే అన్నమాటేటమ్మా, ఆ రామస్వోంవోరికి మాత్రం పులియోరం కరువైపోదా?

మనవా : అమ్మా ! శక్కరపొంగలి, దధ్యోదనమూ అనేవి ముఖ్యములు కావు. వైష్ణవమతోత్కర్ష మహిమ కనపర్చి, ఉద్ధరించాలి– అదీ కర్తవ్యం.

నాంచా : ఆ వుద్ధరించడం యేదో నువ్వే చెయ్యరాదు? నీకు ఉత్సవ విగ్రహమంటూ యేలా? ఆకాశమంత రాగిధ్వజం మోసుకు తిరుగుతావుగదా, దానిలో అరకాసంతైనా మహత్తులేదా?

మనవాళ్ళయ్య "మళ్ళీ మొదటికొచ్చింద" ని సణుక్కుంటూ, కష్టంమీద మందలో దూరి అంతర్ధానం అయిపోయాడు.

నాంచా : "రాముడే కాడు, యే దేవుడు మీదనయినా నిజమైన నమ్మకమన్నది యేడిస్తే ఒక్క గుండమేకాదు, అన్ని కష్టాలూ తరించవచ్చును. మా మామగారి పేరు స్మరిస్తూ గుండం దొక్కుతాను. నా వెంట రాగలిగిన వైష్ణవు లెవరైనా వుంటే యెదటికి రండి.

యెవడూ కదలలేదు.

నాంచారమ్మ నిరసన నవ్వు నవ్వి "ముసలాయనను అగ్గిలో తోసి పైనుంచి చూడడానికి మీరంతా వీరులా?" అన్నది.

ఎవడూ ఉలకలేదు, పలకలేదు.

నాంచారమ్మ అందరినీ కలయజూసి "పీరుసాయీబు యిక్కడ లేడా?" అని అడిగింది. పీరుసాయీబు వెంటనే యెదటికి వచ్చి 'అమ్మా, యిదిగో దాసుడ'నని చెయి జోడించి నిలుచున్నాడు.

పీరుసాయీబు దూదేకుల సాయీబు అయినప్పటికీ, రామభక్తుడు, కీర్తనలు చెప్తాడు, హటయోగం అభ్యసిస్తాడు. రోడ్డుపక్క యేటివొడ్డు తోటలో మఠం యితనిదే. యితనికి శిష్యబలగం లావు.

"సాయీబూ, నువ్వు గుండం తొక్కగలవా?" అని నాంచారమ్మ అడిగారు.

"మీ శెలవైతే అవలీలగా తొక్కుతాను తల్లీ" అని అన్నాడు.

నాంచారమ్మ : యేడీ మనవాళ్ళయ్య? గరుడుడి అవతారం అంతర్ధానమై పోయింది! రామినాయడా! పరమ భాగవతోత్తములై యుండిన్ని, మీరు యెవరూ గుండం తొక్కజాలినారు కారుగదా? అట్టి స్థితిలో ఈ పచ్చితురకకి గుండం తొక్కడానికి భగవంతుడు సాహసధైర్యాలు యిచ్చాడు గనక మీ వైష్ణవమతం గొప్పా అతగాడి తురక మతం గొప్పా? రామినాయడా, మీ దేవులాటంతా, యీ రాత్రి వైష్ణవులు, శైవులికి పరాభవం చెయ్యాలని గదా? అందుకు వుపాయం చెబుతాను వినండి. మతాలు సాత్వికాలూ తామసాలూ అని రెండు విధాలు. ఈ రెండు విధాల మనుష్యులూ శైవుల్లోనూ, వైష్ణవుల్లోనూ కూడా వున్నారు. గుండాలు దొక్కడం మొదలైన తామస కృత్యాలు చేసేవాళ్ళని శైవుల్లో శివాచార్లు అంటారు. మన వైష్ణవుల్లో అట్టి కృత్యాలు చేసే తెగకూడా వున్నారు. యెవరో మీకు తెలుసునా?

మనవాళ్ళయ్య గుంపులో మరివక పక్కనించి తన బుఱ్ఱ పైకిపెట్టి "యెవళ్ళమ్మా వాళ్ళు" అని అత్యాతురతతో అడిగాడు.

మునసబునాయుడు "మరెవళ్ళు? సాతానోళ్ళు" అనేటప్పటికీ, మనవాళ్ళయ్యి బుఱ్ఱ మళ్ళీ మందలో మాయమైపోయింది.

నాంచారమ్మ : "ఆ వైష్ణవులు యెవరా? మరెవరు? తురకలు! పీరు అనేది యేమిటనుకున్నారు. శ్రీ స్వామివారి తిరునామమే, పట్టణంలో మాయింటి పక్కనే ఒక సాతాని పీర్లని నిలిపి గుండం తొక్కేవాడు. పట్టణంలో యెంతో మంది హిందువులే పీర్లపంజాలు వుంచి గుండాలు తొక్కుతారు. గనక శ్రీ రామస్వామివారి నామం తెచ్చి పీర్లు కట్టియిస్తాను. ఆ పీరు పట్టుకుని, పీరుసాయీబు గుండం తొక్కుతాడు. పీరుసాయీబు యోగ్యత మీరెరిగినదే. అతగాడు కబీరు దాసంత

భక్తుడు గనక భయాలు విడిచి అతని వెంటవెళ్ళి జయించుకు రండి. వేళకి భక్తి నిలుస్తుందో నిలవదో, చేతి కట్లులు మాత్రం మరువకండి."

ఆమె విరమించేసరికి పెళపెళమని ఆ మూకలోనుండి మనవాళ్ళయ్య శ్లోక పఠనం ఉపక్రమించి యిటూ అటూ మనుష్యులను తోసుకుంటూ యెదటికి వచ్చి సాష్టాంగం చేసి 'అమ్మా! మీరు సాక్షాత్తూ శ్రీ మహాలక్ష్మి అవతారం. వైష్ణవమతం నిలబెట్టారు. మతమే అన్న మాలు యేమిటి? మా ప్రాణాలు కూడా నిలబెట్టారు. యిహ నా విజృంభణం చూడండి" అన్నాడు.

మనవాళ్ళయ్య పెద్ద హికమద్దారుడు; ఆ రాత్రి వైష్ణవ తంత్రం తరవాయి కథ అంతా అతనే నడిపించాడు.

అంతా చల్లారగానే అటకమీద నుంచి కృష్ణమాచార్యులు దిగాడు. కష్టసాధ్యమును సాధించిన సంతోషముతో నాంచారమ్మ కరదీపం తిరిగి చేతపూని, యింటికి సవిలాసముగా నడిచిపోవుచుండగా, పెనిమిటి యెదురైనప్పుడు ఆమె పరిహాసములు పెనగొను దృష్టితో చూసెను. ఆ దృష్టి తనకు దేవత్వమిచ్చి తన్ను అవతార పురుషుణ్ణి చేసిందని కృష్ణమాచారి మన్నాడు నాతో చెప్పి ఆ అర్థంతో శ్లోకం రచించాడు. తమ రహస్య శృంగార చేష్టలు మిత్రులతో చెప్పితేనేగాని కొందరికి తనివితీరదు.

ఆ రాత్రి శివాచార్లు గుండం తొక్కడం చూడ్డానికి వెళ్ళి వుంటిని, తెల్లవారగట్ల నాలుగు గంటలవేళ, చిరిచీకటిలో గుండంలో నిప్పులు కణకణలాడుతుండెను. ప్రాతః కాలపు శీతగాలి సాగింది. ఒక్కపట్టున గర్భనిర్భేదమయ్యేటట్టు శంఖాదివాద్యములు రేగాయి. ఇంగ్లీషు చదువుకున్న నాస్తికాగ్రేసరులకు కూడా ఆ కాలమందు బితుకు కలిగిందని వారే వొప్పుకున్నారు.

పందిటిలోంచి వీరగంధాలు పూసుకున్న నలుగురు శివాచార్లు గుండం దగ్గరకు వచ్చి నిలుచున్నారు. ఒకడు నెత్తిమీద భీకరమైన రాగిప్రతిమ పెట్టుకున్నాడు. యెదురుగా నిలిచి మరివకడు కత్తి ఝళిపించుచూ వీరవాక్యాలు కొలిపాడు. ఒకడు గుండంలో నెయ్యి పోసి గుమ్మడికాయ తుండలు గుండంలోకి విసిరాడు. వెంటనే శివాచార్లు గుండంజొచ్చి నడుచుకుపోయినారు. అవతలవొడ్డుచేరి తిరిగి తొక్కుటకు వారు యిటు అభిముఖులై యుండగా "అల్లా – రామ్" అని కెవ్వుమని ప్రళయమైన కేక ఒకటి వేసి, తక్షణం శివాచార్లు గుండం దిగినవేపునుంచి, మూకను చీల్చుకుని ఒక మనుష్య ప్రవాహము గుండము దాటుకుని పోయింది. వారిలో అందరున్ను ముఖములమీద ముసుగులు వేసుకున్నారు. ఆ మనుష్య ప్రవాహమునకు అగ్రమందు వెండి పీరు వకటి రెండుచేతులాపట్టి ఒక వీరుడు భీమునివలె నడుచుకు పోయినాడు. ఇది అంతా అరనిమిషం పట్టలేదు.

మూక కకావికలై చెదిరిపోయినది. కొందరు సాతాన్లకీ, శివాచార్లకీ కూడా యెత్కించిత్ కాళ్ళు కాలాయి. అది భక్తిలోపం కింద కట్టారు. తరువాత శరభయ్యకీ, మనవాళ్ళయ్యకీ రాజీ అయినదని అనుకుంటారు. పైకిమట్టుకు దెబ్బలాడుతున్నట్టే వుంటారు.

అదిగో, మా యింటికి యెదురుగా ఆ రచ్చసావిట్లో నిలిపిన పీరు ఆ పీరే. నాటి నుంచీ, ప్రతి సంవత్సరం ఆ పీరుకు పండుగ చేస్తారు. వూరు అబాలగోపాలం శైవ వైష్ణవ భేదం లేకుండా పీరు దేవరకు మొక్కులు చెల్లిస్తారు. త్రిశూలాకారం గనక ఆ పీరు శివపీరే అని శరభయ్య అంటాడు. ఆ వ్యవస్థేదో వెంకయ్య పంతులు గారే చెయ్య సమర్థులు.

"శివుడూ, విష్ణూ పీర్లే అయినప్పుడు బుద్ధుడు శివుడు కారాదా?" అని శాయన్న భుక్త కత పరిసమాప్తి చేశాడు.

మా గురువుగారు యీ చరిత్రకు చాలా ఆశ్చర్యపడి అన్నారు : "ఔరా! కలికాలంలో మనుష్యులేకాదు దేవుళ్ళుగూడా సంకరం అవుతున్నారు. అయినా తప్పేమి? శివుడన్నా, విష్ణన్నా, పీరన్నా, బుద్ధుడన్నా ఆ పరమాత్మ మట్టుకు ఒక్కడేగదా!"

వెంకయ్య వూరుకుంటాడా? "అందరు దేవుళ్ళూ వక్కరే అయితే ఆ పీనుగుల్ని అందరినీ ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజ తగలెట్టరాదా?" అన్నాడు.

అంత గురువుగారు "ఓరి! దేవుళ్ళని పీనుగులంటావురా? నువ్వు హొట్టికిరస్తానువి. యింకా కిరస్తానుకైనా దేవుడంటూ వున్నాడు; నువ్వు కిరాతుడివి. పీరో, బిత్రో, దెయ్యమో, దేవరో యీ అజ్ఞులకు మూఢభక్తి అయినా వుంది. నువ్వు అందరు దేవుళ్ళకీ ఒక పెద్దనామం పెట్టావు." అన్నారు.

వెం: "ఒక్క మీకు తప్ప శాస్తుల్లుగారూ!"

"నీ జన్మానికల్లా విలవైనమాట అంటివిరా" అని నే అన్నాను.

● *ఆంధ్రభారతి, 1910* ●

* * *

కనుపర్తి వరలక్ష్మమ్మ

2

# కుటీరలక్ష్మి

## 1

కార్తీకమాసము ప్రారంభమై పదునాల్గుదినములైనది. సుధాకరుఁడు దిన దినము కళాభివృద్ధి నందుచుఁ దనసాంద్రశీతల కిరణములచే జగజ్జనుల గడగడ వణకింపుచున్నాఁడు.

దివ్యసౌధములలో గాలి చొరకుండ గవాక్షములను తలుపులను ఓగించుకొని యున్నిచొక్కాయులు తొడిగికొని పచ్చడములఁగప్పుకొని తనువును విశ్వమును మఱచి గుజ్జులువెట్టి నిద్రవోవు ధనాఢ్యులకు శీతకాలమంత సౌఖ్యమైన కాలము లేదు. కాని మిక్కుటంపు చలిలో నొడలు నిండ బట్టలేక దట్టమైన కొంపలేక నల్లాడు బీదజనులస్థితి మాత్రము హృదయవిదారకముగ నుండును.

పేదలు సాధులు పథికులు నలమటించెడు నా శీతరాత్రివేళ రామలక్ష్మి కప్పు కొంతవోయిన చుట్టుగుడిసెయందుఁ దనయిరువురుబిడ్డల నొక తాటియాకుల చాపపై నిరుప్రక్కలఁ బరుండపెట్టుకొని "అమ్మా చలే" యని బిడ్డలరచినప్పుడెల్ల "నా చిన్నియన్నలారా! నన్నుఁగట్టిగా గౌఁగిలించుకొనుడు. ఈ ప్రపంచములో మీ కున్నధనమెల్ల నీ నిర్భాగ్యపుతల్లి యొక్కతయే గదా?" యని కన్నీరోడ్చుచు డగ్గుత్తికతో భల్కుచు నవ్వారిగా వెడలుచున్న కన్నీటిధారల పైట పేలికల నద్దుకొనుచు నా గభీరశీతరాత్రిని వేగించుచుండెను. రాత్రి మూఁడుగంట లతిక్రమించినది. హోరుమని యీదరగాలి యెక్కువైనది. గోడ కొత్తగిలి పరుండిన రామలక్ష్మికిని యీమెబిడ్డలకును చంద్రు డభిముఖుఁడైనాఁడు. చల్లని యీచంద్రకిరణములు రామలక్ష్మిమీఁదను నామె యిద్దరుబిడ్డలమీఁదను సోకినవి. ఆ యీదరగాలి కా చంద్ర కిరణప్రసారమునకు చలి మిక్కుటమైనది. చలిబాధకు తాళలేక రామలక్ష్మి చిన్న కుమారుఁడగు రంగఁడు "అమ్మా! చలే" యని పెద్ద కేక పెట్టెను, "కేక వేయకు నాయనా!" యని రామలక్ష్మి యీబిడ్డను దగ్గరకు లాగఁబోయినది. బిడ్డయొడలు కొయ్యవలె గట్టిగాఁ జేతికిఁ దగిలినది. అంత రామలక్ష్మి "అయ్యో! బిడ్డ కొయ్యలాగున్నాఁడే" యని యాతురతతో "రంగా, రంగా" యని రెండుమూఁడుసార్లు గట్టిగా పిలిచినది. రంగడు పలుకలేదు. రామలక్ష్మి గుండె లవిసిపోయినవి. "అయ్యో! నాయనా! పలుకవేమిరా?" యని రామలక్ష్మి పెద్దగ నేడ్వసాగినది. తల్లి రోదనమునకుఁ బెద్దకుమారుఁడుగూడ

మేల్కొని "అమ్మా! యెందు కేడ్చుచున్నా?" వనెను. "నాయనా! తమ్ముఁడు బిగిసికొనిపోయినాఁడు. మాటలేదు. ప్రాణమున్నట్లు లేదురా"యని రామలక్ష్మి యేడ్చుచు జెప్పినది. ఇఁక నేమున్నది? తల్లి బిడ్డ లిద్దరు "రంగా రంగా!" యని గొల్లున గోలెత్తినారు.

వీరి రోదనమునకు నిరుగుపొరుగుల నున్నవారి కెల్లరకు మెలఁకువ వచ్చినది. పాపము! రామలక్ష్మి యెందుకో యేడ్చుచున్నదని యందఱు పరుగెత్తుకొనుచువచ్చి "రామలక్ష్మి! యెందు కేడ్చుచున్నా?" వనిరి. "నాయనలారా! సంస్థానమువంటి సంసారము చితికిపోయి కడుపుకూటికిఁగూడ కష్టపడుచున్నను, వేనకు వేలు సంపాదించు మగఁడు పోయి యల్లాడుచున్నను, యిద్దరనలుసులను బెట్టుకొని బ్రతుకవలయుననుకొంటిని. వీరే నాభాగ్య మనుకొంటిని. ఆ యదృష్టము లేకుండ దేవుడు కన్నులఁ గంపకొట్టినాఁడు. కడుపునఁజిచ్చు పెట్టినాఁ"డని రామలక్ష్మి రంగనిఁజూపి రోదనము చేయుచు చెప్పినది. "అయ్యో పాప"మని యందఱు రంగనియొద్దకుఁ బోయి పట్టి చూచిరి. ఏమున్నది? కొయ్య! "చిన్న బిడ్డగుణమేమొ! రక్ష చేసిన తెలివి వచ్చు"నని కొందఱనిరి. "ఏడేండ్ల బిడ్డకుఁ జిన్న బిడ్డగుణమేమి"యని కొందఱామాట నాక్షేపించిరి. "అఁ! రావచ్చును. పదిరెండేండ్లవఱకు చిన్న బిడ్డగుణము వచ్చుట కల"దని కొందఱు సమాధానము చెప్పిరి. "అట్లయిన జుట్టుతో రక్షచేయుద"మని యొకరు మోమునఁ జుట్టు నంటించఁబోవుచుండ నింతలో నొకముసలివాఁడు వచ్చి "యీబిడ్డకు రక్షచేయుచున్నా రెందులకు? మీకు మతి పోయినదా? ఒక వంక హోరుమను యీఁదరగాలి; ఒక చెంప జిల్లుమని శీతకట్టు; పున్నమవెన్నెల; చల్లనిచాప; అడుగున పక్కబట్ట లేదు; పైన కప్పుకొను బట్టలేదు; ఈ రాత్రి చలి యత్యధికముగానున్నది; పాపము శీతగాలికి బిడ్డ బిగిసికొనిపోయినాఁడు. రక్షవలదు. శిక్షవలదు. రెండు తాటాకులు మంటవేసి బిడ్డ శరీరము కాపు చేయుఁడు, తెలవి వచ్చు" నని చెప్పెను. ముసలివాఁడు చెప్పినమాట నిజమని యందఱు నిశ్చయించిరి. వెంటనే నిప్పుచేసి యఱచేతులతో బిడ్డ యొడలు కాఁచిరి. అట్లొక పదినిముసములు కాపుచేయ పిల్లవాని శరీరము మెత్తపడెను. మఱి పదినిముసము లట్లే చేయ పిల్లవాఁడు కొంచెము కదలెను. అంద ఱానందముతో "రామలక్ష్మి! నీ బిడ్డ బ్రతికినాఁడేదువవల"దని యూఱడించిరి. ఇంకఁ గొంచెము సేపునకు "అమ్మా! వేడిగా నున్నదేమే" యనుచు రంగఁడు కనులు తెఱచెను. "నా చిట్టితండ్రీ! బ్రతికితివా?" యని రామలక్ష్మి పట్టరానియానందముతో గుమారు నాలింగన మొనర్చుకొనెను.

## 2

వేంకటస్వామి పితృపితామహుల కాలమునుండియు రంగులద్దకమే వృత్తిగా గలవాఁడు. వేంకటస్వామి తండ్రియగు రామస్వామియు నాతనితండ్రి యగు వీరాస్వామియు జీవితులై యున్న కాలము నందు వారివ్యాపారము చాలకొద్దిపాటిదైయుండెను. వారెప్పుడూ కోస్తాబేరము చేసి యుండలేదు. తమ గ్రామము నందలి వర్తకులిచ్చిన మాలునకును వస్త్రములకును రంగులద్ది మరల నా వర్తకులకే యొసంగు నేర్పాటుతో

వారు వ్యాపారము చేసిరి. రంగులను గూడ వారు తమ గ్రామవర్తకులయొద్దనే కొనుచుండిరి. వారి వ్యాపారమింత సౌమ్యముగా నుండుటనుబట్టి కొంచెమో గొప్పయో లాభము వచ్చుటయేగాని యపారములగు వ్యాపారనష్టములు వారికి తగులకుండెను. పాడిపంటలతో నొప్పి కలిగినకాఁపురమను ప్రతిష్ఠతో వారికాఁపుర ముండెను.

తండ్రి మరణించు నప్పటికి వేంకటస్వామి యిరువదేండ్లయువకుఁడు. తమ గ్రామమందలి వైశ్య యువకులతో గూడ సమీపపురము నందుఁ బ్రవేశతరగతి చదువుచున్నాఁడు. తండ్రి మరణింపగనె యేక పుత్రుఁడగు వేంకటస్వామి చదు వాఁగిపోయినది. తండ్రివ్యాపార భార మాతనిపైఁబడినది. వైశ్యయువకుల సాంగత్యము వలన గలిగిన వాణిజ్య ప్రియత్వముతోడను నాంగ్లభాషాభ్యాసనము వలన గలిగిన స్వాంతత్ర్య భావములతోడను వేంకటస్వామి కులవృత్తి నారంభించెను. వేంకటస్వామి వ్యాపారములో చేయిపెట్టగనె గ్రామవర్తకులయొద్ద రంగులుకొని వస్త్రములు పుచ్చుకొని రంగులద్ది మరల వర్తకులకొసంగి వారిచ్చెడుడబ్బు గైకొనెడి కూలిపాటుపద్ధతి వేంకటస్వామికి రుచింపలేదు. బొంబాయినుండి తానే స్వయముగ రంగులను బట్టలను తెప్పించి వేరువేరు రంగులనద్దించి యింపుగొల్పెడి తీరైనచుక్కలను తీగలను నంచులను వేయించి తెలుఁగుసీమయందలి నలుదిక్కులకేకాక బొంబాయి హైదరాబాదు రంగూను సింహళము మున్నగు పర రాష్ట్రములకు గూడ నెగుమతిచేసి లాభము గడించవలె నని వేంకటస్వామికి బుద్ధిపుట్టెను. వెంటనే వేంకటస్వామి కొన్నివేలు ఋణము తెచ్చి చేటుపాటు నెఱుఁగని యౌవనంపుటుత్సాహముతో బొంబాయికి వెళ్లి రంగులు బట్టలు వచ్చు నేర్పాటు చేయ సమకట్టెను. "నీవు చిన్నవాఁడవు; వర్తకములో నియమ మర్మము లెఱుఁగవు. ఇట్టి ఘనవ్యాపారములు వర్తక జీవులగు నా వైశ్యులకే తగును గాని మనకుఁదగ"వని బంధుమిత్రులెన్ని విధములఁ జెప్పినను వేంకటస్వామి కప్పుడున్న వ్యాపారకాంక్షలోఁ జెవి దూరలేదు. బొంబాయికి వెళ్ళి వేంకటస్వామి బట్టలదిండ్లును రంగులును వచ్చునేర్పాటు జేసి యందుకొఱకు కాయాపార్తకులకుఁ గొంతసొమ్ము ధరావతు నిచ్చి వచ్చెను. బొంబాయి వెళ్ళివచ్చిన తరువాత వేంకటస్వామి వ్యాపారకాంక్ష మఱింత ప్రబలమైనది. అచ్చటి వర్తకులకు బేరసంపద యాతని మఱింత మోహమున ముంచినది. ఐశ్వర్యవంతుఁడను కావలెనన్నచో విరివియైన వ్యాపారము సేయుటకన్న వేఱు మార్గము లేదని యాతఁడు నిశ్చయించెను.

వేంకటస్వామి బొంబాయినుండి రాగానే గ్రామము వెలుపలనున్న తమ కాలీదొడ్లలో పెద్దపాకలు వేయించి బందరు, నెల్లూరు, కాకినాడ, మధుర మున్నగు పట్టణములనుండి చక్కనిరంగుల నద్దుటయందును, చుక్కలు కట్టుటయందును, సొగసైన యంచులను కమ్ములను వేయుటయందును నిపుణులైన పనివారల రప్పించి బొంబాయి నుండి వచ్చినరంగులతో వస్త్రములతో వ్యాపారము సాగించెను.

ఒక్కసంవత్సర మగునప్పటికి వేంకటస్వామిగారి రంగుబట్టలు దేశమంతట ప్రసిద్ధికెక్కినవి. "చిఱిఁగి ముక్కలైనను చెన్నుమాయని వన్నె తగ్గని పక్కారంగులు, సన్ననిబట్టలు, సరసమైన ధరలు" అను పత్త్రికలలోని పెద్దపెద్ద ప్రకటన లాతని పేరును మఱింత వ్యాప్తిపఱచినవి. అనేక వస్తువులు పత్త్రికలయందుఁ బ్రకటించినయోగ్యతకుఁ దగియుండవు. కావున పత్త్రికాప్రకటనములన్న లోకులకు విశ్వాసము లేదు. కాని

వేంకటస్వామి గారి రంగుబట్టలు పత్రికలయం దెంతదృఢముగఁ బ్రకటింపఁబడెనో యంతమంచివిగనేయుండెను. మాయరంగులు, విపరీతపుధరలు యిత్యాదికుటిలక్రియలు లేకుండనుండెను. అందువలననే ప్రజలకును వర్తకులకును గూడ యాతనియందు విశ్వాసము కుదిరినది.

అతని ఋజువర్తనమే యాతనికి లాభము చేకూర్చినది, వేంకటస్వామి తెచ్చిన ఋణము తీఱిపోయినది. తొలుదొల్త వేంకటస్వామి వ్యాపారారంభమునుజూచి వెక్కిరించినవారు ముక్కుపై వ్రేలిడికొని యక్కజపడునట్లాతని వ్యాపారము శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిని గాంచినది.

## 3

పది సంవత్సరము లీరీతి నేకపక్కితో వ్యాపారము సాగినది. వేంకటస్వామి అందు సన్ను, వారి రంగుబట్టలు జగత్ప్రఖ్యాత మైనవి. అయిదువేల ఋణపురూకలతో "నష్టము సిద్ధము, నష్టము సిద్ధము" అను ప్రజాశీర్వాదముతో నారంభించిన వేంకటస్వామి వ్యాపారము, ప్రాంత ప్రాంతమునందలి పల్లె పట్టణముల బ్రాకిపోయినది. ప్రతిసుందరాంగి తనువునను, ప్రతివిలాసపురుషుని శరీరమునను వేంకటస్వామి గారి రంగుబట్టలే రాణించినవి.

వ్యాపారము కూడివచ్చిన విత్తమున కేమి కొదువ? వేంకటస్వామి సకలైశ్వర్య శోభితుఁడైనాఁడు అతని పురాతనపు పెంకుటిల్లు మూడంతస్థుల దివ్యసౌధమైనది. పట్టుసోఫాలు, నిలువుటద్దములు, పట్టెమంచములు, తూగుటయ్యేలలు, బల్లలు, కుర్చీలు, వెండిపాత్రలు, బొంబాయి చెన్నపురి మున్నగు పట్టణములనుండి తెచ్చిన వింతవింతలైన విలాసవస్తువులు మున్నగు సంపద్విలాస నాగరికపు పరికరములతో వేంకటస్వామి మేడ నిండిపోయినది. గృహశోభయే యింతయైశ్వర్యవిరాజితమై యుండ నిఁక భార్యాబిడ్డల యలంకారములను గూర్చి వేఱు నుడువ నేల?

వేంకటస్వామి ఇప్పుడు పెద్దషాహుకారు. అతని విశాలమైన కచ్చేరిసావడిలో యిద్దరు గుమాస్తాలు యెప్పుడూ పెట్టెలను ముందు పెట్టుకొని కూర్చుండి వ్యాపారసంబంధములగు వ్రాఁతకోఁతల నిర్వహించుచుందురు. వేంకటస్వామి వ్రాతబల్ల యొద్ద కుర్చీలో గూర్చుండి గుమాస్తాలడిగిన వ్యవహారవిషయములకుఁ దగిన యుత్తరములఁ నిచ్చుచు తన్ను జూడ వచ్చిన పెద్దమనుష్యుల నుచితరీతి సత్కరించి సంభాషింపుచు తన్ను సందర్శింపవచ్చిన యాచకబృందముల యథోచిత దక్షిణలఁదనుపుచుఁ గాలమును గడుపుచుండును. పలుకుబడిని బట్టియు భాగ్యమును బట్టియు నిటీవల కొన్ని స్థానికాధికారములు వేంకటస్వామికి లభించినవి. అయాచితముగాఁ దనకు లభ్యమైన యధికారపదవులను మిక్కిలి ప్రజాసమ్మతముగ నిర్వహింపుచు వేంకటస్వామి ప్రజాగౌరవమును బడయుచుండెను.

రామలక్ష్మి వేంకటస్వామికిఁ దగినపత్ని. వారిద్దరు మేనత్త మేనమామబిడ్డలగుటబట్టి కాబోలు వారిద్దరకు స్వాభావమునందుగూడ సామ్యమున్నది. వేంకటస్వామి యెంతఋజువర్తనుడో, రామలక్ష్మి యంతఋజువర్తన గలది. వేంకటస్వామి యెంతసరళవర్తనుఁడో

రామలక్ష్మి యంతసరళప్రవర్తనము గలది. వేంకటస్వామి యెంత దయాధర్మశీలుఁడో రామలక్ష్మి యంత దయాధర్మశీల.

అన్నాతురుల కేయింట నన్నము దొరకకున్నను, రామలక్ష్మి యింట దొరకును. శిశువుల కేయింట– పాలలభ్యమైనను రామలక్ష్మి యింట బొజ్జనిండును. రామలక్ష్మి యింట బానలతో పాడి. వచ్చిన వారికెల్ల రామలక్ష్మి లేదనకుండ మజ్జిగ పోయించును. అన్ని వర్ణముల వారు, ఒక మజ్జిగయే గాదు, ఉదయము లేచినది మొద లెన్నియో విధముల సహాయమును రామలక్ష్మి వలనఁ బడయుచుందురు. ఈరీతి నాలేఁబ్రాయపు దంపతులు లేని సిరిసంపదలచేతను, ఇంతటి సంపదయున్నను గర్వముచే ప్రలోభముచే మొక్కవోని సుగుణసంపదల చేతను పౌరుల కత్యంతప్రేమాస్పదులై విరాజిల్లుచుండిరి.

## 4

మఱి రెండుసంవత్సరములు గడచినవి. ......సంవత్సరము వచ్చినది. ఐరోపాలో ఘోరమైన సంగ్రామ మారంభమైనది. సూఁది గుండీ మొదలైన ప్రతిచిన్న వస్తువునకుఁ గూడ పరదేశములపై నాధారపడియున్న హిందూదేశములోఁ ప్రతివస్తువునకు ధర పెరిగి పోయినది. ముఖ్యముగా జర్మనీలోఁ దయారగు రంగులకును మాంచెస్టరు, లాంకషైరు పట్టణములలో తయారగు వస్త్రములకును విపరీతముగా ధరలు పెరిగినవి. రూపాయి కాఱుగజము లమ్మిన మల్లుగుడ్డ యొక్క గజమైనది. ముప్పదిరూపాయ లమ్మిన రంగుపీపా మూఁడు వందల రూపాయలైనది.

పెద్దపెద్దవ్యాపారములలో వివిధాంతరములు లేవు. వచ్చిన భోగి, పోయిన రోగి. రెండేపద్ధతులు. ఈ రెంటికిని తాళుకొని తట్టుకొని నిలువబడే సమర్థతను గలిగియుండ వలెను. వేంకటస్వామి యాకస్మికముగా సంభవించిన ఈ ధరలప్రమాదమువిని నిశ్చేష్టుఁడైనాఁడు. మూఁడు సంవత్సరముల వరకు నొకే ధరలకు రంగుబట్టలను నందిచ్చునట్లు బొంబాయి వర్తకులకు వేంకటస్వామి పూచీపడియున్నాడు.

వర్తకులందునిమిత్తము వేంకటస్వామికి ధరావతుసొమ్మునుగూడ చెల్లించియున్నారు. కాన రంగు ఎంత ప్రియపుధరలకుఁ గొన్నను వేంకటస్వామి వెనుకటిధరలప్రకారమే రంగువస్త్రములను వర్తకులకుఁ జెల్లించి తీరవలెను. ఈ స్థితిఁ దలఁచినప్పుడు వేంకటస్వామి గుండె గుభేలు మన్నది. కాని యిట్టి ఒప్పుదలలె బట్టల వర్తకులవల్ల తానుగూడ పొందియుండుటచే రంగు లెక్కువధరలకు గొన్నను బట్టలు పూర్వపుధరలకే వచ్చునుగదా! లాభము లేకపోయినను నష్టము లేకుండ వ్యాపారము సాగవచ్చునని వేంకటస్వామి కొంతధైర్యము పొందెను. ఎప్పటియట్లు వ్యాపారము సాగుచుండెను.

కాలము ప్రతికూలముగా నున్నప్పుడు అనుకొనిన విషయము లనుకొనినట్లు జరుగవు. వేంకటస్వామి రంగులొక్కటియేగదా నేను ప్రియముగఁ గొనవలసినది, బట్టలు పూర్వపుధరలకే వచ్చును కదా యనుకొనెను గాని రంగులధర యనుకొనిన దానికంటె యనేకరెట్లధికమైనప్పుడు అతని వ్యాపారము నష్టము లేకుండ నేరీతి సాగును? మహాద్రవ్య ప్రవాహమునందు యథేచ్ఛముగా విహరింపుచున్న వేంకటస్వామి వర్తకపుటోడకు క్రమక్రమముగా నవరోధ మారంభమయ్యెను. సంగ్రామతీక్ష్ణాతపము

నానాటికి మిక్కుటంబగుచుండ ధనవాహిని యింక కెట్లుండును? జలము కొంచెమైన పడవ యేరీతి నడుచును? కొన్ని మాసములనుండి వేంకటస్వామి మనసున మనసు లేదు. ఒకటేవిధముగ దీర్ఘాలోచనము చేయుచున్నాఁడు.

ఈ దెబ్బతో వేంకటస్వామి యథఃపాతాళమునకుఁ ద్రొక్కఁబడినట్లే యని యాతని యౌన్నత్యముజూచి సహింపలేని ప్రతిపక్షు లానందించుచున్నారు.

పాపము! వేంకటస్వామి కెంతకష్టము వచ్చినదని యాతని శ్రేయోభిలాషులగు మిత్రులు విచారించుచున్నారు.

శివుఁడు తనవాఁడైన చిల్లర దేవుళ్లతో నేమి పని? కాని శివుఁడే ప్రతికూలుఁడైనాఁడిప్పుడు వేంకటస్వామికి.

వేంకటస్వామి తెలివి తేటలుగల మనిషి. వ్యాపారమర్మము లాతఁడెఱిఁగినట్లు కోమటియైన యెఱుఁ యెఱుఁగఁడో యని భావింపవలసినంతవాఁడు.

విదేశరంగులవ్యాపకముచే నశించిపోయిన నీలిమందు ఉత్పత్తిని రంగులు లేక సంకటపడుచున్న యీ తరుణమునందు పునరుద్ధరించుటచేత కొంచెము లాభ ముండునేమోయని వేంకటస్వామి కొకయూహ దోఁచినది. ఈ రంగుమూలమున దనయద్దకపు వ్యాపారము నిరంతరాయముగ సాగించవచ్చునేమోయని వేంకటస్వామి యాలోచించినాఁడు, సరేననుకొనినాఁడు. పూనుకొనినాఁడు. కాని యెన్నియెత్తు లెత్తినను యెన్ని పాట్లు పడినను వేంకటస్వామి వ్యాపారమునకుఁ బూర్వపు పోఁడిమి రాలేదు.

## 5

వైశాఖమాసము సగము చెల్లినది. ఎండలు బహుతీక్ష్ణముగా నున్నవి. నాలుగు గంటలైనను బయట మొగమును బెట్టనీయుట లేదు. మంటలఁగ్రక్కుచున్నది నాఁటియెండ. నిప్పులఁ జెరుగుచున్నది నాఁటిగాడ్పు. ఇట్టి భయంకరపు టెండలతో వేగుచున్న యొక్కనాఁటి పగలు మూడు గంటలవేళ సుందరమైన తనసౌధమునందు తన పడకటిగదియందలి ద్వారములకును గవాక్షములకును వట్టివేళ్ల తడికలమ గట్టించి యెడతెగకుండ చల్లనినీళ్లచేఁ దడిపింపుచు శీతలసమీరములకు హాయిహోయియనుచు కూజానీళ్లతో గ్రుక్కదడుపుకొనుచు తాళవృంతముతో స్వేదనివారణము చేసికొనుచు వేంకటస్వామి తన పట్టెమంచముపైఁ బరుండి యెద్దియో యాలోచింపుచుండెను. రామలక్ష్మి తత్సమీపముననే చిటిచాపపై, నైదేండ్లవాఁడగు పెద్దకొమరుని నిద్రపుచ్చి రెండేండ్లవాఁడగు చిన్నకుమారుఁడు నిద్రపోకుండుటచే నెండలోనికి పోకుండ నొడిలో కూర్చుండబెట్టుకొని ముద్దులాడుచుండెను.

ఇంతలో. నెవరో గబగబ మేడ మెట్లెక్కి లోనికి వచ్చుచున్నట్లు చప్పుడయ్యెను. ఎవరువచ్చుచున్నది చూచుటకై రామలక్ష్మి బిడ్డను చంకనిడుకొని లేచి నిలువబడెను. ఆలోచనాధీనచేతస్కుఁడైయున్న వేంకటస్వామికూడ యాసడికి లేచి మంచముపైఁ గూర్చుండెను.

ఇంతలో ఆ మనిషి రానేవచ్చినాఁడు. భోరుభోరున నేడ్చుచు "అయ్యా, మనయద్దకపుగొట్లకు నిప్పు ముట్టుకొన్నది. భయంకరముగా మండుచున్న" దన్నాఁడు.

"అఁ–అ–అ–గోరుచుట్టుపై రోకటిపోటా?"యని వేంకటస్వామి పఱుపుమీఁద నొఱగినాఁడు. అయ్యో! యని రామలక్ష్మి నేలఁ గూలినది.

ఉచితశైత్యోపచారములచే నిర్భాగ్యురాలగు రామలక్ష్మి యసువులు నిలిచినవి! భాగ్యశీలుఁడుగు వేంకటస్వామి యసువు లెగిరిపోయినవి!

నడికప్పు నంటఁబెట్టిన మల్లుతానులదిండ్లు నూలు రంగుబట్టలదిండ్లు దొంతరలు తీర్చిపెట్టిన రంగుపీపాయీల సహితముగా భగభగమని మిన్నునంటెడుమంటలెగసి యద్దకపుగొట్లు భస్మావశేషమైనవి. ఎంతటి విషాదసంఘటనము!

"అయ్యో! అర్థము ప్రాణము ఒక్కమారే పోయినవే" యని రామలక్ష్మి యొక్కతయే గాదు – గ్రామమందలి యాబాలగోపాల మొక్కవిధము విలపించినారు. మానవుని భోగభాగ్యములును బ్రాణముఁగూడ యెంతక్షణభంగురమొ వేంకటస్వామి జీవితము వెల్లడించినది, ఐహికైశ్వర్యములను గాంచి గర్వించెడి మందమతు లీవృత్తాంతమును జూచి కన్నులు తెఱచెదరుగాక!

## 6

రావలసిన బాకీలున్నవి. ఇయ్యవలసిన బాకీలున్నవి. చేబదులుగా యిచ్చినవి యున్నవి. వ్రాఁతమూలకముగాఁ దెచ్చినవి యున్నవి. చెల్లించిన ధరావతులున్నవి. చెల్లించుకోవలసినవి ధరావతులున్నవి, దేశమంతట నీవిధముగా వ్యాపారమును వలను పఱచినట్లుపఱచి వేంకటస్వామి జీవము వదిలినాఁడు.

అనాథ, అబల, భర్తృవిహీన దుఃఖముతో భాగ్యవినాశ దుఃఖముతో నల్లాడుచున్నది. పాపము! రామలక్ష్మి యేమిచేయగలదు? తనయులఁ జూడబోయినఁ గన్నులు తెఱవని పసిపాపలు. వేంకటస్వామి యాస్తికి రక్షకు లెవరు?

బొంబాయివర్తకు లతితెగువ గలవారు. వేంకటస్వామి చచ్చిన వారముదినములకే వచ్చి తట్టఁబుట్ట బయటవేసినారు. అసూర్యంపశ్యయగు రామలక్ష్మిని యామె ముద్దుబిడ్డలతో గూడ ముంగిలి కీడ్చినారు. తోఁటలమీఁదను, దొడ్లమేడలమీఁదను, మిద్దెలమీఁదను దండయాత్ర సాగించినారు.

ఈ బీభత్సప్రదర్శనములో రామలక్ష్మికి "నా" యన్నవారు లేకపోయినారు. అదియేమి పాపమో? వేంకటస్వామికి రామలక్ష్మికిఁగూడ తల్లిదండ్రులుగాని తోడ బుట్టినవారుగాని లేరు. రామలక్ష్మికి సవతియన్న యొకఁడున్నాఁడుగాని యాతఁడు కర్షకుఁడు, వ్యాపారవ్యవహారము లెఱిఁగినవాఁడుకాఁడు.

ఇరుగునఁ బొరుగున దాఁచినసామాను లక్కడేయంతర్ధానమైనవి. బంధువుల యింట దాఁచిన నగలు నాణ్యము లక్కడే యంతరించినవి. ఆ యాచకబృందము, ఆ మిత్రవర్గము, ఆ బంధుబలగము యేమయిరో? ఒకరు వాకిలిలోనికి వచ్చి పలుకరించువారు లేరు. ఈ విపత్సమయములో మొదటినుండి వేంకటస్వామి యొద్ద నుండిన బాపనగుమాస్తాలు చేఁజిక్కినసొమ్మును కబళించుటయే గాక వేంకటస్వామి యాస్తిపాస్తులజాడలుచెప్పి ఋణదాతల వలనఁ బారితోషికములనందిరి. స్వామి ద్రోహమన్న నిట్టిదియే గదా?

పర్యవసాన మేమి యన- రామలక్ష్మి యామెయిద్దరుబిడ్డలు తప్ప వేంకట స్వామికి సంబంధించిన దేమియు మిగులలేదనియే చెప్పవచ్చును. అతనిభాగ్యమెంత త్వరితముగ నభివృద్ధి నందెనో యంతకు లక్షరెట్లు త్వరితముగ నశించిపోయినది.

ఇట్లు సర్వము నమ్మిపోవ, చేత రాగిడబ్బు లేక రామలక్ష్మి యల్లాడుచుండ నొక్కసత్యసంధుఁడు రూపాయిలు మూటగట్టుకొని వచ్చి "యమ్మా! నీ పెనిమిటి నా కుమారుని వివాహము నిమిత్తము డబ్బులేక కటకటంబడుచుండ నైదువందలప్పానిచ్చెను. ఆ మహనీయుఁడు నావల్ల ఋణపత్రమునైన వ్రాయించుకొనలేదు గాని నేను మాత్రము దానిని ఋణముగానే పరిగ్రహించితిని. ఆయన యుండఁగానే యీ పైకమిచ్చుప్రాప్తము నాకు లేకపోయినది. కాని నీ కాఁపురమిప్పుడు చితికిపోయినది. కాని యీ యవసరకాలమున నా రూక లెవ్విధముననైన సాయపడినచో ఆయన చేసిన యుపకారమునకు నా కృతజ్ఞతను గొంతయైనఁ జూపినవాఁడనగుదును" అని వడ్డీతోఁ గూడ నైన యెనిమిది వందలు రామలక్ష్మి చేతఁ బెట్టెను. రామలక్ష్మికి రావలసిన యనేక బాకీలలో వచ్చినసొమ్ము యీ యెనిమిదివందలే. రామలక్ష్మి యాసొమ్మును దనకు రావలసిన ఋణపుసొమ్ముగా గాక మహాదానముగాఁ బరిగ్రహించెను.

తనచేఁజిక్కిన యీ యెనిమిదివందలలో రామలక్ష్మి యొకనూరు రూప్యములకొక చిన్నస్థలమునుగొని మఱియొక నూరు రూప్యముల కొకపూరిగుడిసెను, యింటికి గావలసిన చెంబు, తప్పెల, పప్పు, బియ్యము కొనుక్కొని యీ కుటీరములోఁ బ్రవేశించెను. మిగిలినరూక లొకసజ్జనుని నమ్ముకొని యాతనిచేతఁ బెట్టెను.

## 7

ఐరోపా మహాసంగ్రామ కారణమున హిందూదేశమున నన్న వస్త్రాదుల కేర్పడిన మహాక్షామమువలన బీదలు పడ్డ యలజడి యింతయంత కాదు. రూపాయకు మూఁడుసేర్ల గింజలతోఁ బొట్టగడుపుకొనుటయే కష్టమైన జనులకు బట్టగూడ కొనుట మహా దుర్భరమైనది. పేలికలు కట్టినవారు, చాపలు చుట్టినవారు, పట్టాలు కట్టుకొన్నవారు నై బీదజనులు మహాయాతన ననుభవించిరి.

ఈ దుర్భరస్థితిలో మహాభోగము లనుభవించిన రామలక్ష్మియు నామె బిడ్డలును అనుభవించిన కష్టములు గణనాతీతములు. ఇద్దరు బిడ్డలును తల్లియు తినవలసినప్పుడు మహాకరువు దినములలో నాల్గురూకలున్నను యెన్నాళ్ళు వచ్చును? అతిగారాబముగాఁ బెరిగిన పిల్లలు అవ్యక్తులు. అదికావలెనని ఇదికావలెనని తల్లిని పీడింతురు. పాపము రామలక్ష్మి కన్నీళ్లతో "నాయనా, మన కవిలే" వని బతిమాలి చెప్పును.

రామలక్ష్మి సుకుమారి; యభిమానవతి; ఇతరులచే జేయించుకొనుటయే గాని తాఁజేసి యెఱుఁగదు. ఇతరులకుఁ దాఁబెట్టుటయే గాని తా నితరుల నడిగి యెఱుఁగదు. అట్టి మానవతి యితరులను యాచించుట యెంతకష్టము? అయినను కానికాలము వచ్చినది. కడుపు ఘన మెఱుఁగదు. లేమి సిగ్గెఱుఁగదు. ఏపాటయినపడి తన్ను తన బిడ్డలను కాపాడుకొని తీరవలెను. రామలక్ష్మికడనున్న నారువందల రూప్యములతో నొకటిన్నర సంవత్సరము గడిచినది. అప్పుడా రామలక్ష్మి పూవు లమ్మిన యూర కట్టెలమ్మెనన్న సామ్యమున నేదో యొక పాటుపడవలసి వచ్చినది. రామలక్ష్మి

యిప్పుడు గత్యంతరము లేక సంజచీకటిలో యిద్దరు ముగ్గురు గృహిణులయిండ్ల కేఁగి "యమ్మా, మీకు పిండి విసిరిపెట్టెదను. రెవికలు కుట్టిపెట్టెదను. నాచేత నేదైన నీలాటిపని చేయించుకొని నన్నును నా బిడ్డలను కాపాడు"డని ప్రార్థించెను. పాపము, రామలక్ష్మి యైశ్వర్యమును గండ్లారఁ జూచిన యాగృహిణులకు రామలక్ష్మి వేఁడికోలు జాలిఁగలిగించెను. అట్లే యని వారు సమ్మతించి తమపనులను రామలక్ష్మి కిచ్చి చేయించుకొనుచుఁ దగుమూల్య మిచ్చుచుండిరి.

రామలక్ష్మియు నామెబిడ్డలయు గుడ్డలుగూడ చిఱిగి పేలికలై పోయినవి. గుడ్డలు కొనుటకు రామలక్ష్మియొద్ద డబ్బేది? భుక్తిగడచుటయే దుస్తరముగ నుండ వస్త్రములెట్లువచ్చును? పైపెట్టు కార్తీకమాసారంభమునఁ గురిసిన విపరీతపు వాన గాడ్పులకు రామలక్ష్మి గుడిసెమీఁది యాకులు కొన్ని యెగిరిపోయినవి. కప్పించుటకు రామలక్ష్మికి సామర్థ్యమున్నదా? పాపము, అందువల్లనేగదా రామలక్ష్మి బిడ్డ యట్లు బిగుసుకొనిపోయెను. పాఠకులారా! ప్రథమ ప్రకరణవృత్తాంతము జ్ఞాపకము లేదా?

## 8

రామలక్ష్మి తనయుఁడట్లు బిగుసుకొనిపోయిన మరునాఁటి యుదయము రామలక్ష్మి పెందలకడనేలేచి బిడ్డలిద్దరకింతయన్నము వండి పెట్టి రాత్రి జరిగినవృత్తాంతమును బిడ్డలు కప్పుకొనుట కొక్క గుడ్డముక్కయైన లేని తమ దురవస్థను దలపోయుచు "బిడ్డల కొక్కదుప్పటిని కొనవలెనన్న నాకడ యెట్టిని యేగాని లేదు. కొనకపోయిన నీమాయ చలికి బిడ్డలయసువులు దక్కునట్లు లే"దని దుఃఖింపుచు లేని సత్తువతో కూలిపిండి విసరుచుండెను.

కూలికి నాలికిఁబోవ యభిమానించి చేయుపనియే కాని పిండి విసరుట యెంత కష్టమైనపని? మఱియు దానివలన వచ్చుకూలిగూడ యత్యల్పమే! బలహీనురాలగు రామలక్ష్మి యుదయమును మొదలు సాయంత్రము వరకు రెండుశేర్లగింజలకన్న నెక్కువ విసరలేదు. రెండు శేర్లకు కూలి యొక అణా. రెవికకుట్టినఁగూడ నంతయే కూలి; సాదారెవిక కర్ధణా; గుండీరెవిక కణా; చిన్న చొక్కాయ కణా. అహోరాత్రములు పనిచేసినను దినమునకు రెండణాలకన్న నెక్కువరాదు. మూఁడు అణాలరాబడియైన లేదు. మూడుకడుపులు నిండవలెను చూడుఁడు, ఎంత దుఃఖస్థితియో?

రామలక్ష్మి యట్లు తలపోయుచుఁ బిండివిసరుచుండ వీధి నేదియో డప్పు గొట్టినట్లు సడియయ్యెను. రామలక్ష్మి తనదుఃఖములో నాడప్పువాని హెచ్చరిక యెట్టిదో గమనింపలేదు. అంత వాకిటి నాడుకొనుచున్న రామలక్ష్మి బిడ్డ లిరువురు "అమ్మా–కాగితం–కాగితం–నేను దెచ్చుకొన్నాను. నేను దెచ్చుకొన్నా" ననుచుఁ జెరియొక కాగితమును చేతఁ బట్టుకొని గంతులు వేయుచుఁ దల్లియొద్దకు వచ్చిరి. ఎట్టి దుస్థితిలోనైనను బిడ్డలముఖసందర్శనము తల్లులకు సంతాప నివారకమేగదా! సంతోషముతో వచ్చినబిడ్డల జూచి రామలక్ష్మి యొకింత యానందముతో "రంగా! "నీ కాగితము నాకుఁ జూపవా? నేను నీకు అమ్మను గాదూ?" యని లాలనతోఁ బలికెను. "అన్నయ్య యివ్వరాదేమి?" అని రంగఁడు బుంగమూతి పెట్టుకొని కాగితమును గుండెలకదుముకొని ముద్దుగాఁ బలికెను. "ఇదిగో అమ్మా! నా

కాగితము ముందుగా చదువు"మని రాముఁడు తల్లిచేతిలో తనకాగితమును పెట్టెను. అయితే నా కాగితమును ముందుగాఁ జదువుమని యలిగిన రంగఁ డన్న కాగితమున కడ్డుపడెను. రంగని రమణీయపు చెయిదములకు సంతోషితస్వాంతయై రామలక్ష్మి రంగని నక్కునఁ జేర్చి "రంగా! యెంత కొంటెవురా" యని తనవిదీర ముద్దాడెను.

రామలక్ష్మికి చక్కగాఁ జదువువచ్చును. కొడుకులు తెచ్చిన ప్రకటన కాగితములను జదివి ఈ గృహలక్ష్మి నాదారిద్ర్యనివారణకేమయిన తరణోపాయమగునేమో యనుకొనెను.

## 9

అది..... సంవత్సరము. ఆంధ్రదేశమున సహాయనిరాకరణోద్యమము మహా విజృంభణస్థితిలో నున్నది. ఎక్కడచూచిన ఖద్దరు సంఘములు! ఎక్కడ చూచిన నేతపరిశ్రమాలయములు! ఎక్కడచూచిన మధుపాననిషేధక ప్రయత్నములు! ఎక్కడచూచిన జాతీయపాఠశాలలు! ఎక్కడచూచిన స్వదేశీసంతలు, సభలు! ఏ యింట చూచిన రాటములు, కదుళ్లు, చెపులు, యేకులు, ప్రత్తి! ఎక్కడవిన్న నిదే ముచ్చట.

దేశవ్యాప్తమైన యీ యుద్యమము రామలక్ష్మి గ్రామములో మాత్రము ఎందుకుఁ బ్రవేశింపదు? ఆ గ్రామమములోఁగూడ నొక జాతీయోద్యమసంఘము స్థాపింపఁబడినది. ఒక జాతీయ పాఠశాల పెట్టఁబడినది. ఒక్క ఖద్దరుపరిశ్రమాలయము నెలకొల్పఁబడినది. ఆ పరిశ్రమాలయమువారే రాటమును గూలికి వడుకువా రెల్ల మాకుఁ దెలియఁబఱచిన రాటమును యేకులను ఇంటికి మేమే తెచ్చియిచ్చి వడికిననూలునకు వీసెకు రూపాయి పావలాకూలి నిచ్చి తీసికొని పోవుదుమనియు, ఆసుగూడ బోసి యిచ్చినవారికి మఱియొకపావలా యెక్కువకూలి నిచ్చెద మనియు, నూలుసన్నమునుబట్టికూడఁ గూలి హెచ్చుయివ్వఁబడుననియు, నూతనముగా నూలువడుకుటను నభ్యసించువారికి మా స్వంతమనిషిని బంపి నేర్పించెదమనియు, మానుషముగా గృహములందే యుండి జీవనము చేయఁదలఁచు పేద సతీమణుల కీ రాటము కొంగుబంగారమనియు, పెరటి కల్పక మనియు నూరంతటఁ చాటించిరి. ఆ విషయములనే చిన్నకాగితపుముక్కలపై నచ్చొత్తించి యూరంతట పంచిరి. మన రామలక్ష్మి బిడ్డలు తెచ్చినది యాప్రకటనకాగితములనే. రామలక్ష్మి యాకాగితములను జూచి పగలెల్ల పాటుపడినను నాకు బేడడబ్బులకన్న నెక్కువ వచ్చుట లేదు. ఈ రాటము వడుకుటవల్ల నామాత్రము రాకపోదు. మఱియు నీరాటమును వడుకుట మొదలుపెట్టితినేని యింటింటికిఁ బోయి గింజలు తెచ్చి పిండివిసరి మళ్లీ వారికిచ్చి వచ్చు శ్రమకూడ తీరిపోవును. అంతియేకాక యేరాత్రియో శ్రమపడి మఱోవీసెఁడు యేకులు వడుకుదునేని రెండుబట్టలు గూడ నేయించుకొనవచ్చును. కాన ప్రయత్నించిచూచెదను గాక! అని రామలక్ష్మి యారీతి యోచించి యొక కాగితపు ముక్కపై తాను రాటమును వడుకుటను నేర్చుకొన సిద్ధముగా నుంటిని గాన నేర్పుమనిషిని రాటమును యేకులను పంపఁ బ్రార్థించెదనని వ్రాసి రామునిచేతఁ బరిశ్రమాలయమున కంపెను.

మఱునాటియుదయము రాటమును ఏకులను తీసికొని రెడ్డి కోటమ్మ రామలక్ష్మి కుటీరమున కేతెంచెను. రామలక్ష్మి యా స్త్రీయొద్ద పదిదినములు రాటమువడుకుటను నేర్చుకొనెను. రాటముపై చేయివేసిననాఁడె రామలక్ష్మికి దారముతీయుట వచ్చెను. పది దినముల యభ్యాసముతో రామలక్ష్మికి వడుకుటలో మంచి కౌశల మేర్పడినది. పరిశ్రమాలయమువారు రామలక్ష్మి వడికిన సన్నినూలును చూచి సంతసించి "అహమ్మదాబాదులో దేశీయమహాసభా సందర్భమున జరుగు ఖద్దరు ప్రదర్శనమున మీ నూలును ప్రదర్శించెదము గాన ఈ రెండుమాసములును చక్కనినూలును తీయుటకుఁ గృషి సల్పు" డని కబురంపిరి. రామలక్ష్మి యుత్సాహముతో రాటమును వడుకుటను సాగించెను. పరిశ్రమాలయమువారు రామలక్ష్మినూలున కెక్కువ మూల్యమిచ్చి తీసికొనుచుండిరి. బిడ్డల నిద్దరను జాతీయపాఠశాలలలో చదువుకొనుటకంపి ఆ యింట నా యింట గింజలు తెచ్చి పిండివిసరుశ్రమ తీరిపోవుటచే రామలక్ష్మి నిరంతర మింట గూర్చుండి విధివిరామము లేక నూలు తీయుచుండెను.

## 10

నాఁడు పండువులలో కెల్లఁ గడపండువగు సంక్రాంతిపండుగ. మన తెలుఁగు సీమలో సంక్రాంతి పండుగ చాల సంతోషప్రదమైనది. సంవత్సర మెల్ల పాటుపడిన కృషీవలుఁడు పంట నింటికిఁ జేరిచి తన పాటుఫలమును కన్నులార జూచి యానందించునది యీ పండుగ సమయముననే, అన్ని పండువులలో యన్నమునకే మనసుపడెడు పేదజనులు కడుపు నిండ భుజించునది. యీ పండుగకే వేలు గల వాఁడు మొదలు కూలివానివఱకు సంతుష్టితో నుండునది. సంక్రాంతి పండుగ దినముననే సున్నపుపూఁతలతో పసుపుకుంకుమలతోఁ బచ్చనితోరణములతో నతిరమణీయరంగవల్లులతో ప్రతి గృహము నిత్యకళ్యాణముగ నుండునట్లు చేయునది సంక్రాంతిపండుగ; భాగ్యవంతునిమొదలు బడుగువానివఱకు సంతుష్ట హృదయముతో సముదితోత్సాహముతో నాచరించునది సంక్రాంతిపండుగ. ప్రకృతి లక్ష్మియొక్క యనూనసౌభాగ్యము నసమాన సౌందర్యమును గనులారఁ జూచి యానందించు శుభదినము సంక్రాంతిపండుగ; ఈ పండుగ సౌభాగ్యము బస్తీలలోకన్న పల్లెటూరులలో నెక్కువగఁ గాన్పించును. గృహములన్నియు కళకళలాడుచున్నవి. ప్రజలెల్ల రుత్సాహముతో నున్నారు. ఏదెసఁజూచినఁ బండుగసొంపు గానవచ్చుచున్నది. కాని మన రామలక్ష్మి కుటీరముమాత్ర మెప్పటివలెనే యున్నది. ఆ కప్పుపోయిన గుడిసెయే! ఆ జీర్ణచేలములే! ఎట్టి మార్పులేదు.

ఉదయము తొమ్మిదిగంటలైనది. రామలక్ష్మి రాటమును త్రిప్పుకొనుచున్నది. చిన్నవాఁడగు రంగఁడు తల్లివీఁపు వానుకొని "అమ్మా, నాకుఁ గ్రొత్తచొక్కా కుట్టించవటే? మనయింట్లో పండుగచేయవటే,"యని మారాము చేయుచున్నాఁడు. "రంగ నాన్నా! రాటమున కడ్డురాకు" మని రామలక్ష్మి వానిని బతిమాలుచున్నది. కుఱ్ఱఁడు వినఁడు. "ఏ పండుగకు అప్పచ్చులు చేయవు. క్రొత్తచొక్కాలు కుట్టించవు. అందఱు కుట్టించుకొన్నా"రని రంగఁడు పెద్దపెట్టున యేడువ సాగినాఁడు.

పాపము! రామలక్ష్మికి దుఃఖ మాగలేదు. పూర్వపుస్థితి యొక్కమారు జ్ఞప్తికి వచ్చినది. పెనుగాలికి మహాసముద్రమువోలె యామె హృదయము యొక్కమారు సంక్షోభించినది. సాగరతరంగములవలెఁ బొరలిపొరలివచ్చు దుఃఖమును ఆవేదనను ఆఁపుకొనలేకపోయినది. కన్నీరు కాల్వలు గట్ట రామలక్ష్మి యొక్కమాఱు కుమారు నాలింగనమొనర్చుకొని "నాయనా, నే నేమిచేయుదును? మీరడుగవచ్చునప్పటికి నా చేతు లిట్లు తలక్రిందైనవి. అయ్యో? మీ తండ్రి జీవించియుండఁ బిత్రుదినమని తల్లిదండ్రులపేర్వెట్టి ఈ పండుగనాఁ డెంతమంది బ్రాహ్మణులకు దక్షిణలు! ఎంతమంది బ్రాహ్మణులకు వస్త్రదానము! ఎంతమంది బీదల కన్నసంతర్పణ! ఎంతమంది బీదలకు వస్త్రబహుమానము! పొరుగూళ్లనుండి గూడ మీతండ్రి యిచ్చు సంభావన కాశపడి బ్రాహ్మణులు గుంపులుగ వచ్చెడివారు. ఆ బ్రాహ్మణాశీర్వాదఫల మేమయ్యెనో? ఆ వస్త్రదానఫల మేమయ్యెనో? ఆ యన్నదానఫల మేమయ్యెనో? ఆ ధనదానఫలమేమయ్యెనో? ఆ నెఱదాత బిడ్డలకు నేఁడొక్క చొక్కాగుడ్డలేదు; ఒక్క అప్పచ్చిముక్క లేదు; ఆ మహారాజు పుట్టుభోగి; కావుననే యాయన కట్లు జరిగిపోయినది. దారిద్ర్యమాయన యనుభవించునేమో యనియే భగవంతుఁడాయనను చిటికెలోఁ దీసికొనిపోయినాఁడు. మంచివానిచావు మరణకాలమందుఁ దెలియు నన్నట్లు మరణమే యా యుత్తమపురుషుని యోగ్యతను వెల్లడింపుచున్నది. ఆ బంగారుగని నిర్భాగ్యులమగు మనకు దక్కునా? నాయనా! పూఁటకు గంజిలేని మనకుఁ బిండి వంటలు క్రొత్తవస్త్రములు యేరీతి వచ్చు"నని రామలక్ష్మి పెద్ద పెట్టున విలపించెను. తల్లితోపాటు రంగఁడుగూడ విలపించెను. పాప మాతల్లి బిడ్డల నూరడించువా రెవ్వరు?

● *ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, 1924* ●

* * *

గుడిపాటి వెంకటచలం

3

# భార్య

రుక్మిణికీ, నాకూ చిన్నప్పటినించీ స్నేహం. యిద్దరం ఒక బళ్ళోనే చదువుకున్నాము. మా యిళ్ళు దగ్గిరే. మాలో అంత అల్లరిపిల్ల యింకెవరూ లేరు. రుక్మిణి వస్తోందంటే, మొగపిల్లలుకూడా భయపడేవాళ్ళు. మా ఆడపిల్లలం రుక్మిణి అంటే ప్రాణమిచ్చేసే వాళ్ళం. ఆ అమ్మాయి లేకుండా ఇక ఆట, పాట, నోము, పండగ యేమీ జరగదు. అసలు జరిగినట్టే వుండేదికాదు. యెన్ని కొత్త ఆటలు కల్పించేది! యెన్ని కొత్త పాటలు పాడేది! అట్లతద్ది వచ్చిందంటే మమ్మల్ని రెండింటికే లేపేది. ఇంక మా గోలతో వూరంతా లేచేది. వుయ్యాల శివంపట్టినట్టు ఒకటే వూగడం. చెట్టుకొమ్మల్లో మాయమై రివ్వున కిందకి దిగేది, రుక్మిణి వుయ్యాల. ఇంకా-చంటిపిల్లలు రుక్మిణి పేరు వింటే, తల్లులచేతుల్లో నిలవకుండా దూకేవారు. సముద్రం పొంగినట్టు పొంగేవారు. ఆ అమ్మాయి మొహం చూడ్డంతోటే గలగలమని నవ్వులే. రుక్మిణి వాళ్ళనొక్కసారి యెగరేసి పట్టుకుందంటే వాళ్ళవాళ్ళు పరవశమయ్యేది. "నన్ను! నన్ను, నన్ను" అంటూ ఇరవై మంది కాళ్ళచుట్టూ మూగేవారు. "రుక్మిణి వచ్చి యెత్తుకుంటుందిలే. రేపు పొద్దున్నే" అని వోదార్చేవాళ్ళు తల్లులు, రాత్రి యేడ్చేపిల్లల్ని. పువ్వులూ, రంగుపీలికలూ కట్టి ఆ పిల్లల్ని తయారుచేసేది. యెంతో అందంగా వుండేవాళ్ళు. తలంటిపోసిన తరువాత ఎంత పెంకిపిల్లలయినా రుక్మిణి తలచిక్కు తీస్తూంటే ఒక్కసారన్నా ఏడవరు. పెద్దవాళ్ళకీ, చిన్నవాళ్ళకీ, ముసలివాళ్ళకీ, అందరికీ రుక్మిణి అంటే అమితమైన ప్రేమ. "రుక్మిణీ, ఒక్కసారి యిట్లా కూచో" అని వాళ్ళ చిన్నతనం కబుర్లన్నీ ఆ అమ్మాయికి చెప్పేవాళ్ళు ముసలమ్మలు. సృష్టిలో దయా, మృదుత్వమూ, సంతోషమూ, నవ్వూ కలిపి ఆ పిల్ల అయిందేమో అనిపించేది.

ఇంక తెలివో! ఏ పుస్తకమన్నా చదివి జ్ఞాపకముంచుకుంటుంది. మళ్ళీ తను మూడోక్లాసు చదివేదా? వాళ్ళింట్లో ఫస్టుఫారం చదివే వారం కుర్రవాడికి లెక్కలు చేసిపెట్టేది. ఒకవారం ఆ కుర్రవాడిదగ్గిర ఇంగ్లీషు అక్షరాలు నేర్చుకుంది. వెంటనే పేర్లు చదివేసింది. పాటలు, మంగళహారతులు, హాయిహోయి ఎట్లా పాడేది! ఆ అమ్మాయి గొంతుకలో ఏ ముండేదో! ఏ పిచ్చిపాట పాడినా, గొప్ప సంగీతంలా వుండేది. తోవనపోయేవాళ్ళు సహితం ఆశ్చర్యంతో ఆగి వినేవాళ్ళు. కుట్లు మాత్రము రుక్మిణి కిష్టంలేదు. ఎన్నిసార్లో తంటాలుపడ్డది కాని, ఆ వ్రేళ్ళకి ఒక్క మెలిక

తిప్పడమన్నా చాతకాలేదు. రుక్మిణికి భయమన్న మాట లేదు. అర్ధరాత్రయినా ఎక్కడికంటే అక్కడికెడుతుంది. ఎవరిని చూచినా భయంలేదు. ఒకసారి రుక్మిణి మేనత్త కొడుకు పోలీసు ఇనస్పెక్టరు అతన్ని లెంపకాయ కొట్టింది ఏదో కోపమొచ్చి. ఎవరి సంగతన్నా సరిగా లేదని తోచిందంటే వారూ వీరని లేదు: ఎంతమాటంటే అంతమాట అనేస్తుంటుంది. మొహమాటం ఏమీలేదు. "ఏమండీ! మీ కోడల్ని అట్లా బాధపెడతారేం? మీకేం జాలిలేదా? మనుషులేనా?" అంటుంది, ఒకర్ని. "ఈ డబ్బంతా కట్టికెడతారా? ఒక్క పైసా ఖర్చుచెయ్యరేం?" అంటుంది ఇంకొకర్ని. ఒకరింటో మొగుడు పెట్టే బాధ పడలేక భార్య బావిలోపడి చచ్చిపోయింది. రుక్మిణి ఆయన దగ్గిరికి వెళ్ళి "ఆమెని చంపింది మీరే! భార్య గనక యెవరూ ఏమీ అనరు. ఇంకొకర్నయితే ఈపాటికి మిమ్మల్ని వురితీసేవారే" అంది. ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకోవాలని చూశాడు. రుక్మిణి ఆ ఊరంతా చెప్పింది, ఆయనకి పిల్ల నివ్వవద్దని. బయట ఊరునించి ఏదో సంబంధంమొస్తే, వాళ్ళతోగూడ పనిబట్టి "మీ పిల్లని చంపుతాడు ఇవ్వకండి" అని బతిమాలి వచ్చింది. అట్లాంటిది రుక్మిణి.

రుక్మిణి అందమయినపిల్ల. కొంచెం పొట్టీ, లావూ, నాకంటే రెండేళ్ళు చిన్నది. కాని నాకంటే పెద్దది లాగుండేది. అందరికీ ఆ అమ్మాయి మొహం చూస్తే ముద్దు. కాని మొగాళ్లు ముట్టుకుంటే వూరుకునేది కాదు. ఆ అమ్మాయికి శరీరం మీద ఎంతో అభిమానం. ఎప్పుడూ స్నానం చేసి శుభ్రంగా వుండేది. ఒక్కరవ్వ మురికికూడా పనికిరాదు. చంటిపిల్లలయినా సరే, బాగా తుడవంది యెత్తుకోదు. మా యిద్దరికీ పెళ్ళిళ్ళయినాయి. రుక్మిణిని రెండో పెళ్ళి ఆయన కిచ్చారు. కాని అట్టే పెద్దవాడు కాదు. ముప్ఫై యేళ్ళుంటాయి. అత్తవారు చాలా నగలు పెట్టారు. పెళ్ళవగానే ఆ పిల్లని బడి మానిపించారు. రుక్మిణి యెప్పటివలెనే ఆడుకుంటోంది.

రుక్మిణి పెద్దయినకొద్దీ అందమయిన పిల్ల అయింది. అందరూ ఆ అమ్మాయివంకే చూసేవారు. ఒకరోజు పొద్దున్న రుక్మిణి మా వాకిట్లో నించునివుంది. మా బడిపంతులు వొకాయన (ఆయనకి పూర్వం బళ్ళో రుక్మిణంటే చాలా ఇష్టం) మా అన్నయ్యతో మాట్లాడి బయటికి వెడుతూ రుక్మిణిని చూసి దగ్గిరికి వొచ్చాడు. "రుక్మిణీ! ఎంత పెరిగింది!" అని భుజంమీద చెయ్యివేశాడు చనువుగా. "నన్ను ముట్టుకోకండి. నాకు బాగుండదు" అంది. కోపంతో విదుల్చుకుంది. నేను పెద్దదాన్నా, నేనన్నా అట్లా అనను. ఆయన నవ్వి బుగ్గపట్టుకున్నాడు. ఏం చేసిందో తెలుసునా! వీపు మీద చఱ్ఱున అయిదువేళ్ళు తేలేట్టు కొట్టింది. అతను తెల్లబోయి చూసి, "పిచ్చా!" అని వీపు తడుముకుంటో వెళ్ళిపోయినాడు. రుక్మిణికి అంత అభిమానమూ, పౌరుషమూను.

నేనింక రెండు నెల్లకి అత్తవారింటికి వెడతాననగా ఏదో జరిగింది. అప్పుడు రుక్మిణికి పదకొండేళ్ళు. ఆ అమ్మాయి పెనిమిటి దీపావళికి వచ్చి రెండురోజులు వుండి వెళ్ళాడు. ఆ రెండు రోజులూ రుక్మిణి మాక్కనపడలేదు. ఆయన వెళ్ళినరోజు మధ్యాహ్నమే వచ్చింది. అక్కయ్యా, అన్నయ్యా, నేనూ ఒకటే హాస్యాలు చేశాము ఆ అమ్మాయిని. రుక్మిణిని హాస్యం చేయడమంటే చాలు కులాసా మాకు. ఎన్నడూ వుడుక్కోదు. మాటకిమాట చమత్కారంగా బదులు చెప్పుతుంది. ఆ అమ్మాయి

మమ్మల్ని అనే మాటలు వినడంకోసమే మేమూ ఆ అమ్మాయిని అనేవాళ్ళము. కాని ఆవాళ ఏమీ మాట్లాడలేదు. తల తిప్పేసింది. గుడ్లల్లో నీళ్ళు తిరిగి కాటికలోంచి కారి, నల్లగా కిందపడ్డాయి. చివాలున లేచి....మేము పడుకునే గది పక్కన వుంది....దాంట్లోకి వెళ్ళి తలుపు వేసుకుంది. ఒకళ్ళ మొహాలు ఒకళ్ళం చూసుకున్నాం. రుక్మిణి ఎన్నడూ అట్లా చెయ్యలేదు. ఆ మొహంలో నవ్వే గాని, ఎన్నడన్నా ఏడుపు చూశామా! భయం వేసింది. ఏదో గొప్ప బాధ తటస్థించి ఉండాలి.

కొంతసేపుండి, తలుపుతీసి, నేనొక్కదాన్నీ గదిలోకి వెళ్ళాను. చుట్టిపెట్టిన మా పరుపులమీద బోర్లపడి వెక్కి వెక్కి ఏడుస్తోంది. నేను దగ్గిర కూచుంటే, "నన్ను ముట్టుకోకు, పో, పో" అని చాలా తీవ్రంగా తోసేసింది. ఎంత బతిమాలుకున్నా ఏమీ చెప్పలేదు. వూరికే ఇటూ అటూ కొట్టుకుంటుంది. జుట్టు పీక్కుంటుంది. ఊపిరి బిగబట్టి, చచ్చిపోయే దానివలె అవుతుంది. నాకు భయమేసి ఎవరినన్నా పిలువబోతే, పోనియ్యదు. చాలాసేపటి తరవాత చివరికి, సర్దుకొని మొహం కదుక్కుని తల దువ్వుకుని వెళ్ళిపోయింది. అంతే— అప్పాళ్ళనించి, రుక్మిణి నవ్వలేదు. ఆడలేదు. యెవరింటికి వెళ్ళలేదు. చంటిపిల్లలనన్నా పలకరించదు. వూరంతా చిన్నపోయింది. యెవరికి ఏమీ తోచలేదు. పిల్లలు ఆటలే మరిచిపోయినారు. కాని ఎవరికీ కారణం తెలీదు.

రెండు నెలలయింది. నేను అత్తవారింటికి వెళ్ళాను. వెళ్ళిన ఆరు నెలలకే రుక్మిణిని గురించి విచిత్రమయిన సంగతులు వినడం మొదలుపెట్టాను. మొదట నేను నమ్మలేదు. తరువాత రుక్మిణిని బాగా యెరిగినవారూ, ప్రేమించినవారూ, బంధువులూ అందరూ ఒకటేమాట చెపితే నమ్మక ఏం చెయ్యను? చాలా ఆశ్చర్యం వేసింది. రుక్మిణి అట్లాంటిది అవుతుందని నేనెన్నడూ అనుకోలేదు. ఎక్కువ విచారమయింది మొదట్లో, తరువాత ఆ పనులు నేనే చేసినట్లు సిగ్గేసింది. తరవాత తరవాత తక్కిన విషయాలు వినేటప్పటికి అసహ్యం వేసింది. ద్వేషం మొదలుపెట్టింది.

ఒకసారి మా పుట్టింటికి వెళ్ళినప్పుడు రుక్మిణి కనబడ్డది. అప్పుడే భర్త ఇంటిదగ్గరనించి వచ్చేసింది. వూరంతా గలాభాగా వుంది. గుంపులు గుంపులు కూడి ఆడవాళ్ళు ఆ అమ్మాయి సంగతే చెప్పుకుంటున్నారు. ఒకనాటి మధ్యాహ్నం హఠాత్తుగా నేను వాకిట్లో నుంచుని వుంటే నా వేపు వచ్చింది. యెవరిది? రుక్మిణే! ఎంత మారిపోయింది! అంత దృఢమైన పిల్లా సన్నగా వుంది. కళ్ళు గుంటలుపడ్డాయి. బతుకుమీదే ఆశపోయినదానివలె కనబడ్డది. ముసలిదాని మొహంవలె, మొహం ముడుచుకుపోయింది. వెంట్రుకలు అక్కడక్కడ తెల్లబడ్డాయి. నా దగ్గరకొచ్చి చెయ్యి పట్టుకుంది. చప్పున లోపలికెళ్ళి తలుపేసుకున్నాను. తరవాత ఆ అమ్మాయి చూపు తలుచుకుంటే జాలేసింది. విచారపడ్డాను. పాపం, గుండెపగిలినదానివలె కనపడ్డది. నా దగ్గరకెందుకొచ్చిందో? స్నేహంవల్లనా? కాని ఆ అమ్మాయికి అట్లా కావలసిందే! తను చేసిన పనులకు! ఛీ! దానితోనా మాట్లాడేది! అయినా మాట్లాడివుంటే నేం?......ఆఖరుసారి రుక్మిణిని అదే చూడడం.

రుక్మిణి గురించి నేను విన్న సంగతులివి. నేను విన్నవేకాదు. లోకమంతా అనుకున్నవే. ఇవి నిజం కాదేమోనని ఎవరికీ సందేహం కలగలేదు. ఇవి

నిజమని మీ కెట్లా తెలుసునని అడగవలసిన అవసరం లేకపోయింది. రుక్మిణిని ప్రేమించినవాళ్ళూ, నమ్మినవాళ్లూ, అందరూ ఇదే మాట. ఆ వూళ్ళో కళ్ళారా చూశామని చెప్పినవాళ్ళున్నారు.

ఆ అమ్మాయి భర్త కార్యం చేసుకోడానికి వస్తే, "నాకు కార్యం అక్కరలేదు. నాకు ఒక మొగుడు పనికిరాడు. ఈ వూళ్ళో మణి, నా స్నేహితురాలు దానివలె నాకూ భోగందాన్ని కావాలని వుంది" అందిట. తనకి ఎక్కువగా డబ్బిస్తేగాని, ఆ రాత్రి తనని ముట్టుకోవద్దంది మొగుణ్ణి. అప్రతిష్ట అని దాని పెనిమిటి వాళ్ళు వూరు తీసుకెళ్ళాలంటే రానందిట. ఆఖరికి బలవంతంమీద తీసుకెళ్ళారు. అక్కడ ఆ అత్తగారూ ఇట్లాంటిదేట. ఆ పెనిమిటెంత మంచివాడో! దాన్ని మధ్యతోవలో పట్టుకుని వెనక్కు తీసుకెళ్ళాడు. చివరికి విసుగెత్తి, ఎట్లాగో తప్పించుకుని వాళ్ళవూరు వొంటరిగా లేచివచ్చింది. తాతా, తల్లీ తిట్టారు. వాళ్ళనే తిట్టి భోగం మణి ఇంటికి లేచిపోయి, దానితో కాపురముంది. మహాత్ముడు ఎంత దయో, ఆ పెనిమిటి మళ్ళీ వొచ్చి: దాన్ని రమ్మంటే, ఆ వూరి రౌడీలను పోగుచేసి, తనూ అదీ కలిసి ఆ పెనిమిటిని తన్నడానికి సిద్ధమైనవారు. అప్పుడు "అయ్యో! వృథాగా ఇట్లా పాడవుతూందే" అని విధిలేక పోలీసుకి రిపోర్టు చేశారు. వాళ్ళూ, నయానా భయానా చెప్పి చూశారు. ఇంక పెనిమిటి దగ్గరికి పొమ్మని బలవంతం చెయ్యపోతూంటే కాలవలో పడి చచ్చింది.

రుక్మిణి ఇదంతా చేసింది అని పెద్ద వాడుక. ఎంత అక్రమం! ఆ పిల్లకి ఏదో గ్రహబాధ తటస్థించి వుంటుంది. వీళ్ళు పాపం ఆ పిల్ల స్వబుద్ధితోటే చేసిందనుకున్నారు. ఆ అమ్మాయి చచ్చిపోయిందని విన్నా నాకేమీ దిగులెయ్యలేదు.

ఇదంతా అయిన నెల్లాళ్ళకి ఆ వూరు వెళ్లాను. మా వదినకి సుస్తీగా వుంటే కాలవకి నీళ్ళకి నేనే వెళ్ళాను. ఒకరోజు సాయంత్రం, చీకట్లో ఎవరో అడమనిషి నా చేతిలో ఒక కాగితాలకట్ట పెట్టి తొరగా వెళ్ళిపోయింది. ఇంటికొచ్చి చదవడం మొదలుపెట్టాను. చదువుతో వుంటే నా మనసెట్లా అయిందో, దీన్ని చదివితే మీకే తెలుస్తుంది. అవి చచ్చిపోయిన రుక్మిణి రాసింది.

"సీతారామమ్మకి: నామీద నీకు అమితమైన కోపమని తెలుసు. నా పేరు చెపితే ఉమ్మేస్తావు. మీ బోటివాళ్ళ పవిత్రమయిన ఉమ్మి నా వొంటి మీద పడటానికి కూడా వీలులేదు. నా చేత్తో తాకిన యీ కాగితాలు చదువుతావో, లేదో! చదవకపోయినా నష్టమేమీ లేదులే. అయినా నీకు రాయాలని మనసు పీకుతోంది. చిన్నప్పటి మన స్నేహం నీవు మరిచిపోయినా నేను ఎందుకో మరిచిపోలేదు. పతివ్రతలు మీరు. మలినమైన నా పేరుని తుడిచేశారు, నిర్మలమయిన మీ మనస్సులోంచి. కానీ మీ ప్రతిష్ఠగల జీవితాల జ్ఞాపకం మాత్రం నా పరిశుభ్రమయిన మనస్సులో వుండిపోయింది. మీ ముఖాలూ, మాటలూ, దయా, నానించి తప్పించేశారు గాని మీ జ్ఞాపకం మాత్రం తీసుకోలేకపోయినారు.

నన్ను గురించి లోకమెట్లా మాట్లాడుతోందో కొంతవరకు తెలుసు నాకు. ఎటువంటి దుర్మార్గులైనా సరే, మర్యాదగా పైకి తిరిగితే సరి, వారి ముందు మనుష్యులు

మొహమాటం విడిచి, తోచిందల్లా మాట్లాడరు. కాని పేరూ, ప్రతిష్టా, సిగ్గూ, బిడియమూ, పుణ్యమూ, పాపమూ, ప్రాతివ్రత్యమూ నీతి వొదిలేసిన నాముందు నోటికొచ్చినట్టల్లా మాట్లాడ్డానికి జంకెవరికి? వడ్డీల కిచ్చి కొంపలు కూల్చే పెద్దలూ, లంచాలు పుచ్చుకునే పోలీసులూ, కోడళ్ళని ఆత్మహత్య చేసుకునేటట్లు చేసిన ముత్తయిదువులూ, మొగుళ్ళని మోసపుచ్చే పతివ్రతలూ, అందరూ నా మొహాన తిట్టేవారే! నిజం ఒకరికన్నా తెలియాలని నాకు వుంది. తలుచుకుంటే ఇప్పుడు ఆశ్చర్యం వేస్తుంది. రెండేళ్ళ కిందట ఎంత మంది స్నేహితులు, బంధువులు నాకు! అందరూ నన్ను పలకరించేవారే, నా స్నేహం కోరేవారే! ఈవేళ నన్ను కన్నెత్తి చూసేవారులేరు, ఒక్కరు– ఒక్కరూ లేరు; ఈ బోగంది సంఘానికి, నీతికీ, చెడిపోయిన ఈ బోగంది తప్పు. ఇందరిలో ఒకరయినా, "నిజమేమిటి? నువ్వెందుకిట్లా అయినావని" అడిగినవారు లేరు. ఇదీ స్నేహం! జరిగినదాంట్లో కొంతమట్టుకు నిజం నా భర్తకి తెలుసు. అంతకంటె తెలుసుకోడానికి ఆయన చేతకాదు పాపం. ఆయన్ని చూస్తే దిగులేస్తుంది.

ఆయన వంటివారు నర పశువులు వేలకు వేలుండగా ఆయనకి మాత్రమే వొచ్చింది .యీ కష్టమంతా. నా వంటిదాన్ని నావంటి సిగ్గుమాలిన కొరివిని పెళ్ళిచేసుకోవడంవల్ల, ఆయనకి తెలిసిన సంగతులు కూడా నిజం దాచకుండా బయట పెట్టటంత ధైర్యం ఆయనకిలేదు. ఆయన మర్యాదస్తుడు. అట్లాంటి సంగతులు ఇంకొకరితో మాట్లాడతాడా? అందులో నిజం! మర్యాదస్తులు ఎప్పుడూ ఇట్లాంటివి నిజం చెప్పరు. చెపితే సిగ్గుమాలినవారని, మర్యాదస్తులు బహిష్కారం చేస్తారు.

ఈ కాయితాలు, నా ఆప్తబంధుపురాలు, ఈ వూళ్ళో ప్రసిద్ధి కెక్కిన బోగంది మణికి ఇస్తున్నాను. ఆమె నీకిస్తుంది. ఆమె ఇయ్యకుండా వుండదు. మర్యాదస్తురాలయితేగా, పైకి ఒకమాట చెప్పి, లోపల ఇంకొకటి చెయ్యడం! నీతి సమర్థనకోసం ఉత్తరాలు దాచెయ్యడం!

ఈ కాగితాలు ఏ మర్యాదస్తులకైనా దొరకనీ! యెక్కడ సంఘం పేరు చెడిపోతుందో, ఎక్కడ బయటకి రాకూడని సంగతులు వస్తాయో అని నాతో భద్రంగా వుంచుతామని చెప్పి, వెనకాలే తగలపెడతారు. చచ్చిపోయే నేను వొచ్చి అడగనుగా! అన్నట్లు యీ మర్యాదస్తులకి స్వర్గంలో నమ్మకంలేదు. మళ్ళీ కలుసుకోమని వారి నమ్మకం! అయినా నేను నరకానికి వెడతానయ్యేను! వారిది స్వర్గమయ్యేను! వారినడగడానికి వొస్తే నేను "యీ పాడుముండ వొచ్చిందని" నాలుగు గెంట్లు గెంటిస్తారు. ఈ కాగితాలు చదివికూడా నీకు నా మీద కోపం పోకపోతే పోకపోవచ్చు అయినా చదివి చూడు.

ఈ రాత్రి మీ లోకంలోనించి వెళ్ళిపోతున్నాను నాకు పదహారేళ్ళు రాలేదు యింకా. కాని నూరేళ్ళు అనుభవం అయిపోయింది. ఇంకచాలు యీ లోకం. ఇట్లాంటి దుష్టాత్మురాల్ని ఇంక యీ భూమి మొయ్యలేదు. ఈ రాత్రి నీళ్ళైనా నన్ను స్వీకరిస్తాయో లేదో! నేను చచ్చిపోయినానని తెలియగానే యెందరో సంతోషిస్తారు. ముఖ్యంగా నా భర్తగారు. వారం రోజుల్లో ఇంకొక చెప్పినమాటవినే చక్కని భార్యని తెచ్చుకుంటారు. సందేహం లేదు. నావంటి నీతిబాహ్యురాలు పోతే ఇంకోదాన్ని నా

భర్తగారు పెళ్ళాడడంలో వింతలేదు. ఎందరు పతివ్రతలనుకున్న పెళ్ళాలు చచ్చిపోతే పురుషులు వెంటనే ఇంకోదాన్ని పెళ్ళాడడంలేదూ!

ఇదివరకే నాతో ఆయనకి పడటంలేదని, వేరే సంబంధాలు వొచ్చాయి. తరవాత మా తాతయ్యా, అమ్మా. పాపం, నా మూలంగా ఆ మర్యాదస్తుల కుటుంబానికి యెంత అవస్థవచ్చింది! ఎట్లానన్నా నేను వాళ్ళ బిడ్డని కాననిపించుకోవాలని యత్నించారుగాని, వీలులేకపోయింది. లోకమంతా వారికి వొచ్చిన ఆపదకి వాళ్ళని వోదార్చింది. కాని లోపల వాళ్ళకి అనుమానమే, ఇట్లాంటి పిల్లని ఎట్లా కన్నారా అని ఆశ్చర్యంతో వాళ్ళని కూడా నాతో జత చేస్తున్నారని. మర్యాదస్తులం కాదూ? మర్యాదస్తులకే అనుమానం. మొహం ముందర స్తుతి వీపు వెనక నవ్వులూ ఇదేగా మర్యాదంటే! "మహాలక్ష్మమ్మగారి కూతురు లేచిపోయింది" అనడం తప్పులేదుగా! పాపం. మా అమ్మకి ఎంతకష్టం వొచ్చింది? ఎందుకున్నానా అనుకుంటోంది. చిన్నప్పుడు ఇటువంటి బిడ్డ ఎవరికీ లేదని గర్వపడ్డ రోజులు. నా ఆటలూ పాటలూ చూసి ఆనందబాష్పాలు రాల్చిన దినాలు. నన్ను వొళ్ళో కూచో పెట్టుకుని మా నాన్నని తలచుకుని ముద్దుపెట్టుకున్న సమయాలు మరిచిపోయింది. ఇంకా నా స్నేహితులందరూ సంతోషిస్తారు నేను పోతే. నా సంగతి ఏమిటని ఎవరన్నా అడిగితే చెప్పలేక. వారి స్నేహితురాల్ని కానని నిరాకరించలేక విసుగెత్తిపోతుంది పాపం వాళ్ళకి!

"మాకు తెలియదు. మునుపుగూడా అట్టే స్నేహంలేదు, ఆ అమ్మాయికీ నాకూ."

"ఈ పొగరుబోతుతనం చిన్నప్పుడూ వుండేదమ్మా!"

"ఇన్నాళ్ళూ దాన్ని తిరగనిచ్చాము మనలో."

"అప్పుడుమాత్రం దానికట్లాంటి గుణాలు లేవనా?"

"మన పిల్లలు నేర్చుకోకముందే పోయిందిలే? అదోనయం."

"పోయింది! మంచిపని అయింది. వుంటే మనం తలెత్తుకు తిరగడానికి వీలుందా!"

"ఆ హృదయంలో అంత భారం పెట్టుకుని ఎన్నాళ్ళు బ్రతుకుతుంది?"

ఈ మాటలన్నీ నాకు అప్పుడే వినబడుతున్నాయి.

నువ్వు మీ అత్తగారింటికి వెడతావనగా ముందు నేనొకరోజు మీ ఇంట్లో యేడ్చాను చూశావా! అంతకు రెండురోజులు ముందు నా భర్త మనవూరు వచ్చాడు. అప్పటినించి మొదలు నా విచారము, నా నరకము, నా బాధ, నా మరణము నమ్ము. నిజంగా నమ్ము. అంతుకుముందు పెళ్ళి అంటే ఏమిటో తెలీదు నాకు. కాని మొగాళ్ళు ముట్టుకుంటే నాకు కోపం. చాలా కోపం, అవాళ మనపంతులేకాదు. ఇంకా చాలామంది ఆడుకునేవాళ్ళు, వాళ్ళందరినీ కొట్టేదాన్ని. నన్ను వూరికే ముట్టుకోడానికీ, ఆ విధంగా ముట్టుకోడానికి ఎట్లానో భేదం తెలిసేది. నన్నూ, నా శరీరాన్ని అవమానం చేసినట్లుండేది. మా తాతయ్య బావమరిది నన్ను మొహం ఎంగిలి చేసేటట్టు ముద్దు పెట్టుకుంటే, ఆయన్ని మొహమంతా రక్కాను! నా

అసహ్యం చూసికూడా మా అమ్మ ఏమీ అనేదికాదు. కొంచెం పెద్దదాన్ని అయింతరవాత కూడా నన్ను వొక్కదాన్నీ చేసి రొమ్ముమీద చెయ్యివేసేవాడు. నా వొళ్ళు కాలేది. ఎవరితోనూ చెప్పేదాన్ని కాదు. ఎంత కష్టంగావున్నా సిగ్గు చాలావుండేది. రక్కేదాన్ని, కరిచేదాన్ని. వుమ్మేశాను. అయినా ఆయనకి సిగ్గువుండేది కాదు. ఆఖరికి కష్టపడి అమ్మతో చెప్పాను. కష్టంమీద నవ్వి వూరుకుంది. నాకెంత యేడుపొచ్చింది? పారిపోదామనుకున్నా. ఒకసారి రాత్రి అతన్ని చంపేద్దామనుకున్నా. ముట్టుకున్నచోటల్లా పదిసార్లు కడిగేదాన్ని. తరవాత అతను అట్టే బాధించడం మానివేశాడు. అయినా పూర్తిగా వొదలలేదు.

అన్నిట్లోకీ మా అమ్మ నవ్వి వూరుకోవడం మాత్రం నన్ను చంపుకున్నట్టుండేది. ఏమి కష్టం కలిగినా అమ్మ తీరుస్తుందని నమ్మకముండేది. మా అమ్మ యెందుకట్లా వూరుకుందో తెలీదు. మొహమాటమో, లేకపోతే నా బాధ అర్థంకాలేదో! అవును, మా అమ్మకి నన్ను అట్లా చేస్తే సంతోషమేమో! నామీద యీర్ష్యయేమో? నన్ను కన్న దయగల తల్లి నేను బాధపడుతున్నానని తెలిసి ఊరుకుంటుందా? యిట్లాంటివి ఇంకా కొన్ని జరిగాయి. కాని పెళ్ళి అంటేమాత్రం అవాళ మధ్యాహ్నందాకా నాకు తెలియదు.

మధ్యాహ్నం రెండు గంటలయింది. మామూలు ప్రకారం అమ్మ కాఫీ తీసుకెళ్ళి నా భర్తకియ్యమన్నది. ఎప్పటివలెనే గదిలోకి తీసికెళ్ళాను. తలుపెయ్యమన్నాడు. నేను కదల్లేదు. తనే లేచి తలుపేసి వచ్చి నన్ను గట్టిగా పట్టుకుని మంచంమీద తోశాడు. నాతో మాట్లాడలేదు. లాలించలేదు. చనువు చేయలేదు. నాకు యెందుకో యేమిటో అప్పుడు తెలీదు. పిల్లి పట్టుకుంటే పిట్ట అంత భయపడదు. గిల గిల కొట్టుకున్నాను. నొప్పి, నొప్పి, నొప్పి– తలుచుకుంటే ఇప్పుడు వొణుకు వొస్తోంది. నా వళ్ళు నాది కాదనిపించింది. యేడ్చాను. అరిచాను. బిగ్గరిగా ఊరంతా వినపడేటట్టు అరిచాను. మా అమ్మావాళ్ళు తలుపుకొట్టి, ఆయన్ని యింటోనించి తరిమేస్తారనుకున్నాను. ఒక్కరూ రాలేదు. ఆ అరుపులు విని చచ్చిపోతున్నాననుకోవచ్చు. వాళ్ళకి ముందే తెలుసు. నోర్మూర్చుకుంటో నా అరుపులు విని సంతోషిస్తున్నారనుకుంటా. ఇప్పుడు ఆలోచించి నన్ను చంపతలచుకున్నాడు. చంపడానికి ఇదోవిధం అనుకున్నాను. ఏడ్చాను. చేతులు పట్టుకుని బతిమాలుకున్నాను, అతిదీనంగా! చాలా భయమేసింది. ఏం లాభం? కటికవాడికన్నా అరిచే గొర్రెమీద దయ కలగవొచ్చు. అంతకంటే నా ప్రాణంకోసం పోట్లాడినట్లు పోట్లాడాను. ఆయనకి చిక్కలేదు. విసుగుతో వొదిలేసి తటాలున లేచి కోపంతో "పో" అని ఒక తన్ను తన్నాడు. బయటికి వచ్చిపడ్డాను. మళ్ళీ యెప్పటి ఇల్లు చూసేటప్పటికి ప్రాణం లేచివచ్చింది. మనుష్యుల్లో పడ్డానుకదా అని ధైర్యం వచ్చింది. పెద్దగా ఏడుస్తోవెళ్ళి అమ్మని కావలించుకున్నాను. చిన్నప్పుడుకూడా యే బాధ వచ్చినా బిగ్గరిగా ఏడ్చేదాన్నికాదని అమ్మ అనేది. అవాళ యేడ్చాను. అది వొక్కసారే గొంతెత్తి యేడ్చింది. అప్పట్నించి యేడవలేదు. యేడుపు వొస్తే బావుండును. రాదు. విచారం గడ్డకట్టింది. ఇంక యేడవను కదా! ఇదే ఆఖరుసారి యేడుపు యీ కాయితాల ద్వారా నీతో.

ఎప్పుడు యే బాధ వచ్చినా, యెవరు నన్నేమన్నా, అమ్మతో చెప్పితే వాళ్ళని శిక్షించి, నన్ను బుజ్జగిస్తుందని నా నమ్మకం. అత్తా, అమ్మా నన్నూ నా ఏడుపునీ

చూసి బిగ్గరగా నవ్వారు. వాళ్ళకి నా బాధ, విచారం అర్థమే కాలేదు. నా మీద చెయ్యేసి, "ఏం చేశాడు? కరిచాడా? యెక్కడ?" అంది అత్త. వాళ్ళిద్దరికీ యిమాజినేషన్ చచ్చిపోయింది. నాకు ముందే అంతా తెలుసుననుకున్నారా? వాళ్ళు చెప్పందే యెన్నడూ? అన్నం తినడంతోపాటు, నిద్రపోవడంతో పాటు, వాళ్ళకి మామూలయింది గావును ఇట్లాంటిది? కాని అత్తకో! యెంత సంతోషం, యీర్ష్య, నోరూరడం కనపడ్డదని ఆమె కళ్ళల్లో! ఆమె తులసికోటని మైల చేస్తే, రాక్షసిలాగు మీదపడి చక్కని తిట్లు, ఆ తులసిమంత్రాల నోట్లోంచి తెప్పించేవి. కాని ఆయన నామీద అట్లా పడితే ఒక్క తిట్టూ రాలేదు. అందమైన వెకిలి నవ్వొకటొచ్చింది. తనకేదో ఆయన వుపకారం చేసినట్టుంది ఆమెకి.

పరుగెత్తుకుపోయి గదిలో పడ్డాను. నా వొంటివంక నేను చూసుకోలేదు. ఆ రోత, ఆ అసహ్యం, ఆ మురికి తలుచుకుంటే ఇప్పుడు కండలు పీక్కుంటాను. ఇంకోడెవడన్నా తాకితే, వాణ్ణి రక్కి కొట్టేదాన్నే! వీడు వొంటరిదాన్నిచేసి. అమాంతం నన్నాట్లాపడేసి..... అమ్మో! తలుచుకోలేను, ఇంకా యెట్లా బతికివున్నానో!

అప్పుడు నాకు మీ ఇంటో అంత ఏడుపు వొచ్చింది అందుకనే. ఎవరితో చెప్పకోను! బతుకుమీద విరక్తి పుట్టింది. ఇంకొకళ్ళ మొహం చూడ్డమంటే సిగ్గేసింది. రాత్రింబవళ్ళు అదే తలపు నన్నట్లా వొంటరిగా, బలవంతంగా చేసినవాణ్ణి ఏం చెయ్యాలి? నా హృదయంలో సంతోషం, లోకమంటే ఆనందం, మనుష్యులంటే నమ్మకం అన్నీ పోయినాయి.

ఆయన వెళ్ళిపోయినాడు. వెళ్ళినప్పటినించీ మా అమ్మకీ, తాతయ్యకీ వుత్తరాలు "ఎన్నాళ్ళు ఆగాలి? ఇంకా మీ పిల్ల యెందుకు పెద్దమనిషి కాలేదు? అప్పుడే పరకొండేళ్ళన్నారే? ఇంతకాలం పెద్దమనిషి కాదని తెలిస్తే, వేరే సంబంధం అప్పుడే కుదుర్చుకునేవాళ్ళమే?" అని. ఈ ప్రకారం వారానికన్నా ఒక వుత్తరం వొచ్చేది. మూడు నాలుగు నెలలయినా తరవాత "పెద్దమనిషి కాకపోయినా అవుపోసనం చేసి పంపవలసింది. వచ్చే నెలలో ముహూర్తాలున్నాయి" అని వుత్తరం వొచ్చింది. మా తాతయ్య వొప్పుకోలేదు. దానితో వాళ్ళకి చాలా కోపంవచ్చింది. "మీ పిల్ల మాకక్కర లేదు. వేరు సంబంధం విచారించుకుంటున్నా"మని రాశారు. ఆ వుత్తరంమీద మా ఇంట్లో తాతయ్యకీ, అత్తయ్యకీ, అమ్మకీ తగాదాలూ, యేడుపుల వరకొచ్చింది. అత్తయ్య నన్ను వెంటనే వాళ్ళ దగ్గిరకి పంపెయ్యమంటుంది. అత్తకి పెనిమిటి యెనిమిదో యేట పోయినాడు. అందుకనేయేమో, నన్నూ, నా పెనిమిటినీ వొకచోట వొదలడమన్నా, నన్నత్తవారింటికి పంపడమన్నా చాలా ఇష్టం. కాని తాతయ్య ఒప్పుకోలేదు. అమ్మా, అత్తా పోట్లాడి ఏడ్చారుకూడాను! వాళ్ళు వేరే పెళ్ళి చేసుకుంటే చేసేదేమిటి? నా భారం వీళ్ళమీద వుండిపోతే! మా అత్త భారం, అమ్మ భారం ఆ ఇంటిమీద వుండగా లేనిది నాది వుంటుందనా ఇంత భయం? ఇంక యేం చాతకాక మా అత్త నన్ను తిట్టటం మొదలుపెట్టింది. నేనేం చేశాను? నాకు తలంటి పోసేటప్పుడు వినరాని మాటలు అనేది. కాని అతను ఇంకో పెళ్ళి చేసుకుని నన్ను వొదిలేస్తాడని తెలిసి నా సంతోషానికి మేరలేదు. ఎన్ని తిట్టినా మా వాళ్లు ఆనందం ఆగేది కాదు. సంగీతం పాడుతూ తిరిగేదాన్ని. ఇంకా

ఎప్పటికీ చిన్నదాన్నిగా వుంటేనే బాగుంటుందనుకున్నాను. కాని ఏమనుకున్నాడో ఏమో మా తాతయ్య నేను పెద్దమనిషినైనానని వుత్తరం రాశేశాడు. వారంలో ముహూర్తం పెట్టి కార్యానికి వొస్తున్నామని రాశారు వాళ్లు. అప్పుడు ముహూర్తం లేదే అని మావాళ్ళాశ్చర్య పడ్డారు. కాని వాళ్ళేమంటారో అని వూరుకున్నారు. మా తాతయ్యకి కూడా ఈ గోల అంతా చాలా విసుగనిపించింది, అదిగాక ఎవరో మధ్యవర్తులొచ్చి మా తాతయ్యని బెదిరించి ఒప్పించారంట.

ఎట్లానన్నా ఈ గోలంతా వొదిలిపోతే చాలుననిపించింది ఆయనకి. ఆయనకి వొదిలింది గాని నాకు మొదలుపెట్టే గోల సంగతి యెవరాలోచించారు? నాకు వొళ్లు వొణకడం మొదలుపెట్టింది. పెళ్ళంటే ఏమిటో తెలిసిపోయిందిగా! రాత్రులు నిద్రపట్టదు. అదే భయం, అన్నం సరిగా తినలేదు. వాళ్ళకేం? నాకు ఆ బాధంతా చిన్నపిల్లని నాకూ! యెన్నాళ్ళో? ఆయనో నేనో చచ్చిపోయిందాకా తప్పదుగావును! అందరూ ఇట్లాంటి బాధ సహించే కాపరం చేస్తున్నారా? వాళ్ళు యేడుస్తున్నట్లు కనపడదే! మా అమ్మ దగ్గిర యేడ్చాను. “వొద్దు. నీ దగ్గిరే వుంటాను. ఆయన్ని చూస్తే భయము”ని. మొదట నవ్వింది. తరువాత తిట్టింది. చాలా కోపంగా తిట్టింది. చెట్టు మొలవటం, పెద్దది కావడం, కాయడం ఎట్లానో ఆడపిల్ల పుట్టడం, పెరగడం, పెళ్ళికావడం, పెద్దదవడం, కార్యం చేయడం మామూలయింది. యేమన్నా ఈ పనుల కాటంకం వచ్చినట్లయితే సృష్టికాటంకం వచ్చినట్టే వుంటుంది వాళ్ళకి. అందులో ఆడపిల్లని చిన్నపిల్లని నేను కాపరం వొద్దనడమే! ఇంకేముంది! ఇదివరకిల్లా వద్దన్నవారున్నారా? వుంటే! అట్లాంటి వాళ్ళని లోకం మెచ్చుకుందా? చెట్టు పువ్వు పూయకపోతే ఆగుతారు. గొడ్డు చూలు కాకపోతే ‘యేం చెయ్యలేరు. నన్నో.....నోరుమూసి బలవంతంచేసి తన్ని జ్ఞానమూ, మాటలూ, బాధా, సిగ్గూ, అభిమానము, ముందే భయమూ వున్న నన్ను స్వతంత్రజీవిని, వీళ్ళెవరు నన్నిట్లా నిర్బంధించడానికి? నన్ను కన్నారు. తిండి పెట్టారు. అందుకని వాళ్ళ వస్తువునైనాను వాళ్ళ మృగాన్ని. నన్ను వీడికి అమ్మారు. వాళ్ళని నేను కనమన్నానా? కన్నందుకు తిండి పెట్టారు. పోనీ పెట్టకుండా చంపకపోయినారా? ఇంతకంటె బాగా వుండిపోయేది! తిండిపెడితే మాత్రం, పశువుకి గడ్డి వెయ్యలేదూ? నేనూ అంతేనా, మా అత్తని తీసికెళ్ళి బలవంతంగా యెవరికన్నా ముడిపెడితే? చిన్నదాన్ని, నోరులేనిదాన్ని గనక కాదూ వాళ్ళు నన్నిలా చేసింది?

పోనీ తల్లి! తల్లిగా చిన్నప్పటినించి నా మీద అంత అధికారం. అప్పటికయినా పెళ్ళి అంటే ఏమిటో, స్త్రీ ధర్మం ముందుముందు ఎట్లా కష్టంగా వుంటుందో, అన్నీ చెప్పిందా దగ్గిర కూచోపెట్టుకుని? అది తప్పు. అట్లాంటి మాటలు చిన్నపిల్లలతో అనకూడదు. చిన్నపిల్లల్ని హఠాత్తుగా గదులలోకి పంపవచ్చు. ఆ అమ్మ నిర్మలమైన నోట్లోనించి అన్ని తిట్లు వొచ్చాయే ఈ మాటలు రాకూడదూ?

ముహూర్తానికి సరిగా వొచ్చారు. నన్ను సాయంత్రం ముస్తాబు చేస్తోవుంటే, బలికి తయారుచేస్తున్న మృగాన్ని లాగుంది. నేను మా ఆయనకొక యంత్రంగా వున్నాను. పురుషుల దృష్టికి స్త్రీ అంతే కాబోలు! ఇన్నాళ్ళూ నేను పెరిగిందీ, భోజనం చేసిందీ, ఆడుకున్నదీ, చదువుకున్నదీ అంతా ఈయనకిప్పుడు బలి కావడానికే. సృష్టిలో

వున్న మానవులలో సగంమంది తక్కిన సగంమందికి యెందుకిల్లా బానిసలు కావాలో! అందముంటే మొగవాడిని భరించేటందుకు, బలముంటే మొగవాడికి చాకిరీ చేసేటందుకు: చదువుకుంటే మొగవాడికి పద్దులు రాసేటందుకు, సంగీతమొస్తే మొగవాణ్ణి సంతోషపెట్టేందుకు. ఇంత అన్యాయం లోకమెట్లా భరిస్తోందో! ఆచారమనే బురదలో కుళ్ళిపోయి నశించాయి మనవాళ్ళ హృదయాలు. ఈ మొగ రాక్షసుణ్ణి సంహరించి ఈ అనాథలను కాపాడడానికి ఏ రాముడూ అవతారమెత్తడూ!

ఆ సాయంత్రం నేనెంతో ఏడ్చాను: ఎంతో బతిమాలుకున్నాను. కాని లక్ష్యమెవరికి? మా తాతయ్యకి కాదుగా ఆ రాత్రి బాధ. కప్పని పట్టపొయ్యే పాములాగు పీటలమీద కూచున్న ఆయన కళ్ళు మెరుస్తున్నాయి. "ఇంకెంతసేపులే!" అని వెక్కిరిస్తున్నాయి. ఈ దుర్గతినుంచి తప్పించుకోడానికి వీల్లేదు. నేనేం నేరం చేశాను! ఈ కఠిన శిక్షకి? వురిశిక్ష పడ్డవాడికన్నా కొంచెం ఆశ వుంటుంది ఎట్లాగో వొకలాగు తప్పించుకోవచ్చునని ఎవరో తనమీద కనికరించవొచ్చని. నాకో! నన్ను నా శరీరాన్ని, నా హృదయాన్నీ, మానాన్నీ, నా కోర్కెల్నీ ఆ విధంగా ఒక్కరాత్రిలో తను ఇష్టం వొచ్చినవాడిముందు ఆటంకం లేకుండా బట్టబయలుగా ఒలిసి పడెయ్యడానికి యెవరిచ్చారు ఆ అధికారం? గొల్లుమని కళ్ళవెంబడి రక్తం కార్చే యీ అనాథ తలిదండ్రులే బలియిచ్చే యీ నరపశువు రోదన ధ్వనులు యెవరి చెవికెక్కుతాయి! నిమిషాలు జరిగినకొద్దీ అసహ్యమైన కొండబల్లి అందమైన రెక్కలపురుగు దగ్గిరకి వెనకాలే జరుగుతున్నట్టుంది.

రాత్రయింది. రమ్మన్నారు. ఏడ్చాను. నా ప్రాణంకోసం నా మానంకోసం పోట్లాడాను. లాక్కువెళ్ళి గదిలో తోసి తలుపేశారు. మేక కోసం కాచుకుని వుండి, ఆకలితో బోనులో అటూ ఇటూ తిరిగే పెద్దపులిలాగ పచారు చేస్తున్నాడు ఆ గదిలో. వొణుకుతో తలుపుమూల దాక్కున్నా. చెయ్యిపట్టుకుని తీసికెళ్ళి మంచంమీద కూలేసి, దగ్గిర కూచ్చుని అసహ్యంగా సరసాలు మొదలుపెట్టాడు. ఒకటే ముక్కుపొడుం కంపు. వేళ్ళతోటి ముక్కు తుడుచుకుని, మంచం పట్టెకి రాస్తాడు. ఆ చెయ్యే నా మెడ మీద వేస్తాడు. ఆ వేళ్ళతోటే అక్కడ బల్లమీద వున్న జిలేబీ ముక్క తుంచి నా నోట్లో పెడతాడు. పైగా "నన్ను చూస్తే నీ కెందుకు అసయ్య"మని అడుగుతాడు. అయిదు నిమిషాలు చూసి పాతకథ మొదలుపెట్టాడు. ఆ కళ్ళకి నేను బాధా, ఇష్టం, మనసూ వున్న మనిషిగా లేను. కామం తీర్చుకునే యంత్రమైనాను.

రాత్రి అరిచినందుకు తాతయ్య నన్ను కొట్టడానికి సిద్ధమైనాడు. యెంత బాధ కలిగినా అరవకూడదట. మంగలి తనకి క్షవరం చేసేటప్పుడు నెప్పి పుట్టిందని బిగ్గిరిగా అరిచి, వాణ్ణి తన్నడానికి సిద్ధమైనాడు. పోనీ నన్ను తిట్టినవాడు ఆయన్ని కూడా ఆ బండతనానికి తిడతాడేమోనని ఆశపడ్డాను. కాని భోజనం దగ్గిర ఆయనతో అంటున్నాడు– "మొదట అందరూ అంతేనండి. అదే అలవాటవుతుంది. ఏం ఫరవాలేదు. సంశయించకండి." నా గుండె గుభేలుమంది. తాతమీద, అమ్మమీద వొళ్ళు మండింది. వాళ్ళందరినీ చంపాలనిపించింది.

మర్నాడు రాత్రి ఆయన నాకు వుపన్యాసం ఇవ్వడం ప్రారంభించాడు. ముందు కొంతసేపు పాతివ్రత్యమూ, స్త్రీ ధర్మమూ బోధించాడు. కొన్ని తెలుగు పద్యాలూ,

సంస్కృత శ్లోకాలూ చదివాడు. సీతా, మండోదరి, అరుంధతి వీరి వుపమానాలు చెప్పాడు. తరవాత తన మొదటి భార్యతో పోల్చాడు!

"ఇప్పుడు నువ్వు ఈ కాస్తకే గోల పెడుతున్నావు. అప్పుడు నేను నడి యవ్వనంలో వున్నాను. సన్నగా, బలహీనంగా వుండేది. కళ్ళు జబ్బు చేశాయి, ఎప్పుడూ తలనెప్పి అనేది. అట్లావున్నా వొప్పుకునేది. ఇంక భార్య అయినాక తప్పుతుందా?"

పాపం, అట్లానే చచ్చిపోయింది గావును. నా గతీ అంతే!అని కొత్త భయం పట్టుకుంది.

"అది కారణం లేకుండానే చిక్కిపోయి జబ్బుపడ్డది. జబ్బులోవున్నా యెన్నడూ పెంకితనం చేసేదికాదు. చాలా బుద్ధిమంతురాలు. పతివ్రత. తరవాత పెళ్ళి వొద్దనుకున్నాను. ఏ రాత్రికి ఆ రాత్రి డబ్బుపారేస్తే ఇష్ట మొచ్చినవాళ్ళు దొరికేవారు. పదిహేనేళ్లు సుఖంగా జరిగింది. కాని అమ్మ వూరుకోలేదు. నా ముసలితనంలో నన్ను చూసేవారు వుండరని పెళ్ళి చేసుకోమని పట్టు పట్టింది. నిజమే. ఈ ముండలందరూ ముసలితనంలో నా మొహం చూస్తారా? చేసుకున్న పెళ్ళామంటో వుండాలిగాని! నేను ముసలివాణ్ణవుతున్నాను. వాళ్ళయిళ్లు పట్టుకుతిరగడానికి వోపికలేదు. ఇంక స్థిరపడే కాలమొచ్చిందని నాకూ తోచింది."

మూడురాత్రిళ్లూ అయినాయి. నన్ను వెంటనే తీసుకెడతామన్నారు. మా అమ్మదగ్గిరా, తాతయ్యదగ్గిరా, కళ్ళుకాయలు కాసేటట్టు ఏడ్చాను వెళ్లనని. కాని కొంచెమన్నా కనికరం రాలేదు వాళ్ళకి. నాకు ముల్లుగుచ్చుకుంటే గిలగిలలాడేవాళ్ళు ఇప్పుడు నామీద యెందుకు జాలిపడరు? వొళ్ళంతా జ్వెరులుపాకినకంటె బాధ, అసహ్యమే! నామీద దయరాదేం? చిన్నప్పట్నించీ నేను పెరిగిన యిల్లూ, దొడ్లో నేను పెంచిన గన్నేరుమొక్కా, దానిమ్మచెట్టూ వొదలిపోవడమంటే యెంతో దిగులువేసింది. కాని యెవరితో చెప్పుకోను? అమ్మ శివగంగ వెళ్ళినప్పుడు మూడు రోజులు పిల్లిని ఇంట్లో వదిలేసి వుండలేకపోయింది. నాకెంత కష్టంగా వుంటుందో ఆలోచించినవాళ్ళేలేరు.

అత్తవారింటికి వెళ్ళాను. పెద్ద యిల్లు వాళ్ళది. ఆ ఇంట్లో మా అత్తగారు మాత్రముంది. ఇంకెవరూ లేరు. ఆమె నన్నెంతో ఆదరించి ప్రేమగా చూసింది. ఇంట్లో పని అంతా ఆమే చేసుకునేది, వంటకూడా. ఆమె నేనేమన్నా పని ముట్టుకుంటే కేకలేసేది. ఆయన చూశారంటే ఆమెమీదపడి కేకలేసేవారు. ఆయన అభిప్రాయం నా శక్తి ఇంకదేనికీ వుపయోగించకూడదని లాగుండేది. పొద్దున్నించి సాయంత్రందాకా మళ్లీ సాయంత్రంనించి ప్రొద్దునదాకా సిద్ధంగా పడుకుని వుండడం తప్ప పనిలేదు. ఇంతే నా బతుకంతా. భారతం, రామాయణం, భాగవతం పడేశాడు చదువుకోమని. సాధారణంగా యెప్పుడూ ఇంట్లోనే వుండేవాడు. కాని నాతో అట్టే మాట్లాడేవాడు కాదు. ఆయనకి ఇంకేమీ తోచేదికాదు, ఆ ఇంట్లో ఏమి జరుగుతున్నా నాకు పట్టదు. నేను కృతజ్ఞతా, సంతోషం, ప్రేమా చూపనందుకు ఆయనకి కోపం విసుగూ వొచ్చేవి. ఆయనమీద ప్రేమ ఎట్లా చూపాలో, యెందుకు చూపాలో తెలిసేది కాదు. నా స్నేహితులమీద చూపటం తెలుసు. కాని ఆయనమీద ప్రేమ

యెట్లా చూపడం? తిట్టేవాడు. "మొదటిది యెంత కష్టంగా వున్నా, యెట్లా చెబితే, అట్లా వినేది. దొంగసంతోషమన్నా కనపరిచేది. ఇది మొండికదా?" అనేవారు. ఆయన్ని చూస్తే దిగులేసేది. నా భర్తే కాకపోతే ఆయనమీద ఇష్టమూ, గౌరవముండే దనుకుంటాను. ఆయన స్నేహితులందరూ ఆయన్ని చాలా ప్రేమతో చూసేవారు. వారిమీద ఆయనకి చాలా ప్రేమ. దయగలవాడు, ధర్మాత్ముడు. ఇంటికి వచ్చిన బిచ్చగాళ్ళందరూ ఆయన్ని దీవిస్తూ వెళ్ళేవారు. ఆయనకి ఆ వూళ్ళో చాలా మంచిపేరుంది. నాకేం లాభం? అంత మంచితనాన్ని అనుభవించారు. నేను మాత్రం ఆయన అర్ధాంగినీ ప్రాణనాయకినీ కదూ! నేను మాత్రం ఆయన దుర్గుణాలనే అనుభవించవలసి వచ్చింది.

ఒకనాడు నాతో మా అత్తగారు "అమ్మాయీ! పోనీ, మీ తాతయ్యని వొచ్చి నిన్ను నాలుగురోజులు తీసుకెళ్ళమని రాయి" అని కార్డు యిచ్చింది. రాశాను. మా తాతయ్య వొచ్చాడు. ఆయన నన్ను పంపనన్నాడు. అయినా కాని నన్ను తీసుకెళ్ళమని మా తాతయ్యని బతిమాలుకున్నా వినిపించుకోలేదు. "తాతయ్యా! నువ్వే ఇట్లా నామీద కనికరం చూపకపోతే నాకు దిక్కేమిటి?" అని ఏడ్చాను. ఆయన కళ్ళంబడి నీళ్ళుకారాయి.

"ఒకరి చేతుల్లో పెట్టిన తరవాత యింక మా పెత్తనమేమిటి? ఆయన్ని వొప్పించు" అన్నాడు.

నా కోసం మా తాతయ్య ఆయనతో విరోధం పెట్టుకుంటాడా? భోజనంలో మామిడిపళ్ళూ, మధ్యాహ్నం ఆవడలు, ఫలహారం, వచ్చినప్పుడల్లా పట్టించు పంచలచాపూ నా కోసం పోగొట్టుకుంటాడా? నాకు తెలీకుండా వెళ్ళిపోయినాడు.

నాకూ పెనిమిటికీ పోట్లాటలు ఎక్కువైనాయి. ఆయనమీద దొంగ ప్రేమ చూపాను కొన్నాళ్ళు, ఎట్లానన్నా ఆయన్ని సంతోషపెట్టి సుఖపడదామని. అందరు పతివ్రతలూ ఎట్లావుంటారో, అట్లా వుండాలని అనుకరించాను, నా స్వభావాన్ని చంపుకుని. ఆయని ఛాయని కావాలని చూశాను. దొంగపనులు, నీచమయిన పనులు చేశాను. కాని నన్ను చూస్తే నాకు పరమ అసహ్యం అయింది. దొంగతనం నా స్వభావంలో లేదు. నన్నూ, నా శరీరాన్ని, నా స్వభావాన్నీ రోతచేసినట్లుంది. అంతా వోర్చుకుని నా శరీరం యిచ్చేస్తే చాలదట. సంతోషంగా కనపడి తనమీద మోహం చూపి.....ఛా! తలుచుకుంటే యీ శరీరాన్ని తగలపెట్టాలని బుద్ధిపుడుతోంది. నీళ్ళల్లో పడితే చాలదు. నిప్పుతో సుద్ధి చెయ్యాలి..... అలాంటి పనులు చెయ్యమనేవాడు.

వారంరోజుల తరవాత యేదో బాధ మొదలుపెట్టింది. డాక్టరుని పిలువలేదు. చాలా జబ్బుచేసింది. మంచం వదలలేదు. ఆఖరికి డాక్టరు వచ్చి చూశాడు. "నాకు తెలీదు, ఆడ డాక్టరుని పిలవ"మన్నాడు. ఆ వూళ్ళో మిషనరీ లేడీ డాక్టరుని పిలిచారు. ఆమె, ఆ మొగ డాక్టరు కలిసి మాట్లాడుకుని, నా పెనిమిటితో ఇంగ్లీషులో కఠినంగా మాట్లాడారు. ఆయన మీకెందు కన్నట్లుగా జవాబు చెప్పాడు. "మై వైఫ్! మై వైఫ్!" చాలాసార్లు అన్నాడు. నా కెన్నేళ్ళు అని అడిగారు. "పోలీసు, మేజిస్ట్రేట్" అని కూడా అన్నారు. నా భర్త వాళ్ళని బయటికి నడవమన్నాడు. అటు తరవాత ఆ డాక్టరుని పిలవలేదు. తెలుగు మందులు మొదట వాడారు. మూర్ఛలు

మొదలుపెట్టాయి. చాలా బాధపడ్డాను. మూర్ఛవంకపెట్టి భరించలేక, తన్ని, రక్కి, గంతులు వేసేదాన్ని. మళ్ళీ మా తాతయ్య వొచ్చాదు. అయినా పంపలా. ఆయన వెళ్ళిపోయినాడు.

ఇంక ఆ ఇంట్లో వుండకూడదని నిశ్చయించుకున్నాను. ఒక్క నిమిషం సౌఖ్య మనుభవించలేదు. బాధా, అసహ్యమూ, భరించనలవికావటంలేదు. ధైర్యంచేసి ఒకరోజు రాత్రి ఆయనతో మాట్లాడాను. ఆయనతో కాపరం నాకిష్టంలేదనీ, చాలా కష్టంగా వుందనీ, మా యింటికి వెడతాననీ, ఇంక రానని, ఆయన యింకోపెళ్ళి చేసుకోవచ్చనీ, ఆయన ఇచ్చిన నగలూ, చీరెలూ, అన్నీ యిచ్చేస్తాననీ, యీ కాస్త వుపకారంచేస్తే అజన్మాంతమూ నేను కృతజ్ఞురాలనై వుంటాననీ అన్నాను. ఆయన వొప్పుకోలేదు, నాకు వొచ్చే నష్టాలసంగతి చెప్పాడు. ఇప్పుడు ఇలా వున్నా, తరవాత భర్తలేకుండా బతకడం కష్టమనీ, నాకు నలుగురిలో మర్యాద ఏమీ వుండదనీ, మొగుడు వదిలేసిన ఆడదంటారనీ, మావాళ్లు కూడా సరిగా చూడరనీ అన్నాడు. అన్నీ భరిస్తానన్నాను. నేను పెద్దదాన్నె నీతి చెడిపోతానన్నాడు. పోనీ అన్నాను. అప్పుడు తన కపరిదిష్ట, వేరే పెళ్లి కావాలి. మళ్ళీ ఖర్చు అన్నాడు. అయితే నాకేమున్నాను. వీల్లేదన్నాడు. వీల్లేదట! నా వొళ్లు మండింది. ఏం నేరం చేశానని యీ కయిదు! ఇది సంసారంకాదూ! కయిదా! యెట్లాంటి నేరంచేసినా, ఎప్పటికో అప్పటికి విడుదలవుతుంది. యీ వివాహ నేరం మా తాతయ్య, వాళ్లూ నాకు చేసినందుకు అజన్మాంతమూ విడుదలలేదు. నేను పారిపోతానన్నాను. నేను నిజంగా పారిపోవాలని చూస్తున్నాననీ, తాను అడ్డుపెట్టలేడనీ, వేలాకోళం కాదనీ నచ్చచెప్పాను. మళ్ళీ నన్ను పట్టి తీసుకొస్తానన్నాడు. సరే. ముందు పారిపోతానన్నాను. తలకెక్కింది. వెంటనే యేడ్చాడు. యేడ్చి అప్పుడు నిజం చెప్పాడు.

"నువ్వు పారిపోతే నా ప్రతిష్ట ఏమవుతుంది? మొదటిదావి చావును గురించే అనుమానాలున్నాయి. నువ్విలా పారిపోతే ఇంక ఏమని తలెత్తుకు తిరగను? పెళ్ళాం లేచిపోయిన మొగాణ్ణి చూస్తే గౌరవం ఎవరికుంటుంది? ఆ పని చెయ్యకు. నీకేం తక్కువ చేస్తున్నాను నేను? పెడుతున్న బాధ ఏముంది?" అన్నాడు. నాకసహ్యమేసి వూరుకున్నాను.

ఆ ఇంట్లో ఒక ముసలి చాకలి వున్నాడు. వాడు ఎన్నో ఏళ్ళనించి వాళ్ళింటోనే వున్నాడుట. వాడంతకు ముందు నాతో ఒక మాట మాటాడలేదు. ఒకరోజు మధ్యాహ్నం నేను ఒంటరిగా వున్నప్పుడు తనే నాతో మాటాడాడు. నన్ను పుట్టింటికి వెళ్ళమనీ, ఆ ఇంటో వుంటే చచ్చిపోతాననీ, మొదటి ఆమెకూడా యిలానే పోయిందనీ అన్నాడు. తాను సహాయం చేస్తానన్నాడు. అంతా రహస్యంగా జరిగింది. మర్నాడు మధ్యాహ్నానికి మా వూరు చేరుకున్నాను. మా వాళ్ళు నన్ను చూసి చాలా సంతోషించారు. మా తాతయ్య కావలించుకున్నాడు. మా అమ్మ ఏడ్చింది. మళ్ళీ ఆ ఇల్లూ, వాళ్ళ మొహాలు చూసేటప్పటికి నా ప్రాణం లేచివచ్చింది. నా కష్టాలు మరచిపోయినాను. లోకంలో సౌఖ్యముందికదా నాకు ఇంకా అనిపించింది. ఎందుకు వీళ్ళని వదిలివెళ్ళానా అని ఆశ్చర్యం వేసింది. దొడ్లో నా గన్నేరుమొక్క పూలు పూస్తోంది. దూడ పాలిస్తోంది. అన్నీ నావి అలానే వున్నాయి. పాపం, మా అమ్మమీద అత్తమీద వృధాగా ఎంత క్రోధంగా వుండేదాన్ని అనుకున్నాను.

అన్ని ఆశలూ బూడిదయినాయి మర్నాడు ఆయన పరుగెత్తుకొచ్చాడు. నేను చెప్పకుండా వచ్చినట్లు వాళ్ళకీ తెలిసింది. మా తాతయ్య మొహం తిప్పేశాడు. అత్త యింక తిట్లు చెప్పనక్కరలేదు. అమ్మ "నా కడుపున చెడపుట్టావే. చిన్నప్పుడా విషజ్వరంలో చావనన్నా చచ్చావు కా"వంది. ఆయన రమ్మన్నాడు. ముందు చచ్చిపోతాగాని, రానన్నాను, చాలా తగాదా జరిగింది. వూరంతా గోలయింది. ఏమైనా వెళ్ళకూడదని నిశ్చయించుకున్నా. రాత్రులు యింక ఆయనతో ఏం చెప్పను? ఆ కోపం, ఆ కసీ, ఆ దౌర్జన్యమూ! మా తాతయ్య నన్ను తన్నడానికి సిద్ధమైనాడు. తాతయ్యా, నీకెందుకు అంతకోపం నామీద? నేనేం చేశా నిన్ను? నీకేం కష్టమొచ్చింది. నీ కప్రదిష్టా? కచేరీలో లంచాలు తెచ్చేవాడివే, ఆ రాత్రి దొర కాళ్లమీద పడ్డావే, ఆ దొర తిట్టిన తిట్లు భరించావే, నేను నీయింటికి రావడం నీకు నామోషీ అయిందా? దేవతార్చన చెయ్యకండా భోజనం చెయ్యవే. ఆ దేవుడు ఏమనుకుంటాడో అని ఆలోచించావా? నీ పొరుగున వున్న సుబ్రహ్మణ్యంగారేమంటారో అనుకున్నావు గాని! పతివ్రత తనంట? భార్యకు భర్త తప్ప గతిలేదుట! పుస్తకాల్లో రాసిన ఆ నీతులు తప్ప నీ బుద్ధితో ఆలోచించవా? దొర కాళ్ళమీద పడడం మంచిదని ఏ భారతంలో రాసివుంది? తాతయ్యా! అది హిందూ పురుషధర్మమేనా? నేను పోతున్నాను. నా అపకీర్తి యింక నీకుండదు. యిప్పుడన్నా నా కోసం ఒక్క కన్నీరుబొట్టు వొస్తుందా! యిప్పటికీ నాకు కావలసిన శాస్తే అయింది అనుకుంటావా! నీదేమన్నా తప్పుందేమోనని యిప్పుడన్నా తోస్తుందా?

ఇంక అక్కడ నిలవడం అశక్యమయింది నాకు. తిండికూడా సరిగా పెట్టడం మానేశారు. చాలా అవమానం వేసింది. చచ్చిపోదామనుకున్నాను. ఇంక గతిలేని ఆడదానికి దిక్కేముంది? ఆ రాత్రి బయలుదేరాను. కాలవ దగ్గిరికి వెళ్ళేటప్పటికి భయమేసింది. నల్లగా, చల్లగా నీళ్ళు కనపడ్డాయి. వెచ్చని ప్రాణాన్ని దాంట్లో పోగొట్టుకో బుద్దెయ్య లేదు. ఇంటి కెళ్ళడానికి యిష్టంలేదు. కాలవలో చావడానికి ధైర్యంలేదు. ఏడుస్తోకూచున్నా, అట్లా ఏడుస్తోనే వూళ్ళోకి వచ్చాను. మన వూళ్ళో భోగంది నాగమణి అట్లా వెడుతూ నాతో మాట్లాడింది. నా సంగతి ఆమె ఇదివరకే వూహించింది. నా మీద ఏమీ కోపంలేకుండా మాట్లాడింది. దేవుడు పంపిన దూతవలె కనపడ్డది. తనతో వొచ్చి వుండమంది. వెళ్ళాను. నాలుగురోజులు ఎంతో సంతోషంగా గడిపాను. అంత దయ నా కెవరూ చూపించలేదు. ఆమె పాదాలమీదపడి కళ్ళకద్దుకోవాలనిపించింది. ఆఖరికి నన్ను వెతికి కనుక్కున్నారు. వొచ్చారు– నా పెనిమిటీ తాతయ్యా! మణి నన్ను కనపరచలేదు. మణి స్నేహితులు మొగవాళ్ళెవరో వున్నారు. వాళ్ళందరూ దూకుడుచేసి, తాతయ్యా వాళ్ళనీ లోపలికన్నా రానీలేదు. మళ్ళీ సౌఖ్యంగా వున్నాను ఆ యింట్లోనే. వారం రోజులయిన తరవాత నలుగురు పోలీసువాళ్లు వచ్చారు నన్ను తీసుకెళ్లడానికి. మణి పాపం ఏడ్చింది. నన్ను చూసి "మా కులంలోనన్నా యెందుకు పుట్టావుకావమ్మా! యీ బానిసత్వం వుండేదికా"దంది! నా పెనిమిటినే వెళ్ళి, ఆ మణిని నన్ను వుపయోగించినట్లు వుపయోగించమను వూరుకుంటుందేమో! వాళ్ళని మనం హీనంగా చూసి మన యిళ్ళకి రానీము. వాళ్ళా మనని హీనంగా చూడవలసింది మనము వాళ్ళనా? నన్ను

పోలీసు యిన్‌స్పెక్టరు గారింటికి తీసికెళ్ళారు. పాపం మణికూడా వెంటవొచ్చింది. అక్కడ తాతయ్యా, పెనిమిటీ వున్నారు. అందరూ కలిసి మణిని చెడతిట్టారు. మణి బాగా బుద్ధిచెప్పింది. కాని వాళ్ళ చెవులు కెక్కుతాయా ఆ మాటలు? ఆ యిన్‌స్పెక్టర్ నన్ను నా భర్తతో వెళ్ళమన్నాడు. ఆయన నన్ను తాకనని వాగ్దానం చేస్తే వెడతానన్నాను. లేకపోతే ఏమైనా వెళ్ళనన్నాను.

"అయితే నువ్వెందుకు పెళ్ళి చేసుకున్నా"వన్నాడు ఆ యిన్‌స్పెక్టర్. "నేనుకాదు. వాళ్ళు చేశారు! అదిగాక అప్పుడు పెళ్ళంటే యీ ఘోరమని నాకు తెలీదు. నా కెవరూ చెప్పలేదు" అన్నాను.

"అదంతా మాకు తెలీదు. ఆయన భార్య అయిన తరవాత నువ్వు ఆయన దగ్గిర వుండాలి. ఆయన ఏం చేసినా సరే" అన్నాడు.

నాకు పెద్ద ఏడుపు వొచ్చింది. ఆయనకి తెలిసిందల్లా నన్ను ఆడదాన్ని, వొంటరిదాన్ని భర్తచేతికి వొప్పచెప్పడమే. నా వొళ్ళు నాదికదూ? నన్ను ముట్టుకోకూడదని యింకొకరిని నే ననకూడదూ? భోగంది అంటుందే స్వేచ్ఛగా ఆ మాట! పవిత్రంగా అగ్నిసాక్షిగా పెళ్ళిచేసుకున్న నే ననకూడదూ? పూర్వం బానిసలుగా అమ్మేవాళ్ళే, అప్పుడుకూడా వాళ్ళ శరీరాలమీద యింత అధికారం వుండేదా యజమానులకి? పుండుపడ్డ యెద్దులని బళ్ళకు కట్టి బాధపెడితే పోలీసులు పట్టుకుంటారు. కాని భార్య భర్తవద్ద యిట్లా నరకబాధ పడకపోతే కాళ్ళూ, చేతులూ కట్టి భర్త ముందు "నీ యిష్టం వొచ్చినట్లు చేసుకో"మని పారేస్తారు. నాగరికత గల దేశంట!

ఆయనతో పంపారు మళ్లీ. ఆ యింట్లో తయారు మేము. మా అత్తగారేమీ అనలేదు. అంత ప్రేమగానూ వుంది. కాని పూర్వంకంటె బాధలెక్కువ అయినాయి నాకు. పూర్వం ఆయనకి దయ లేకపోయినా అందరూ అనుకునే ప్రేమగావును వుండేది. ఇప్పుడదేమీ లేదు. వెక్కిరింపులూ, తిట్లూ మామూలయినాయి. నేను బతకవలసిన అవసరం కనబడలేదు. ఆయన బతికివున్నన్నాళ్ళూ నే నొక్కరోజు సౌఖ్యపడను. పాపం, ఆయన పోవడంమెందుకు? నేనే పోతాను. మళ్ళీ పెళ్లి చేసుకుంటారు. అపరిదిష్ట వుండదు. అన్నీ తీరిపోతాయి. మా అమ్మకీ, తాతయ్యకీ నామూలాన పేరు చెడిపోదు. ఇంక అందరూ తలలెత్తుకు తిరగవొచ్చు. ఈ రాత్రి నీళ్ళుచూసి భయపడను. ఈ కాగితాల్లో నా సంగతి అంతా రాసిపెట్టాను.

మన స్థితి యిదీ. నీ భర్తతో నువ్వు సుఖంగా వున్నావనుకుంటా కాని నాకు లోకంమీద నమ్మకం పోయింది. నామీద మనవూళ్లో అందరూ ప్రేమగా వుండేవాళ్ళే. ఇప్పుడు ఒక్కరు నాతో మంచిమాట మాట్లాడినవారు లేరు. విదమేమిటని అడిగినవాళ్ళు లేరు. ముందే నిశ్చయం వాళ్ళకి ఏ సంసారంలో తప్పులున్నా ఆడదానివేనని. నువ్వన్నా నాతో మాట్లాడతావనుకున్నా, ఆ మధ్యాహ్నంతో ఆ ఆశకూడా పోయింది. నీ తప్పేముంది? ఇట్లాంటి అపవిత్రురాలితో మీ పవిత్రమయిన జీవనాన్ని మలినం చేసుకుంటారా? తరవాత యెంత కష్టం? భర్త ఏమంటాడో? నా పేరు వుచ్చరించి యెందుకు పాడుచేసుకోవాలి? మీ పుణ్యాహక్కులవి? సంఘమంతా కలిసి భర్త నిచ్చిన తరవాత ఆ భర్త చెడ్డవాడంటే సంఘం వూరుకుంటుందా?

నువ్వే చెడ్డదానవంటుంది. యెంత గొప్ప స్త్రీ! ఎంత వోపిక గలది భార్య! ఏ బాధ పడ్డా ఓర్చుకోవాలి భరించే భార్య. అట్లాంటిది సిగ్గులేక యిలా చెప్పుకుంటుందా వీధిలోకొచ్చి!

నా కెవరిమీదా ప్రేమలేదు మణిమీద తప్ప. ఆ మాట అంటే నా నాలిక కాలుస్తారు. భర్తమీద ప్రేమలేదుట. ఆ మాట అనడమే! పెళ్లి కావడంతోటే అకస్మాత్తుగా, అవ్యాజంగా వొచ్చెయ్యాలి ప్రేమ. రాకపోతే, రాకపోయినా, వొచ్చినట్లు నటించకపోతే సంఘం వొప్పుకోదు. చచ్చిపోయిన నా దేహాన్ని ఆయనకి వొప్పజెప్పరుగదా? నా శరీరం నాదికాదుగా! దేవుడిదన్నా ఒప్పుకుంటారో లేదో! వన్నెక్కడ పట్టుకుంటాడో, స్వర్గంలోనా మళ్ళీ? నాకు స్వర్గమేమిటి? ఆయనకి స్వర్గమే–నరకంలోకి పోతే ఈయన్ని తప్పించుకుంటాను. తరవాత ఏమున్నాకానీ యీ నరకం కంటే ఘోరమైంది యిక వుండదు. ఆ శుభ్రమైన నీళ్ళు నా వొంటినంతా కడిగేస్తాయేమో! నా వొంటికి అంటిన అసహ్యం, నేను చేసిన దొంగపనులు, నీచమైన పనులు, ఆయన్ని సంతోషపెట్టాలని చేసిన పాడుపనులు కడిగేస్తాయేమో! గోదావరి నీళ్ళు పాపాల్నికూడా కడిగేస్తాయంటారు. అట్లా అయితే స్వర్గమొస్తుంది గావును. వొద్దు వొద్దు ఎన్నటికీ స్వర్గమొద్దు. ఆయన పాలిటికి పడతాను మళ్ళీ. ఎన్నటికీ, ఏ జన్మానికీ, నాకు భర్తవద్దు. జన్మ జన్మలకీ బ్రహ్మచారిణినయ్యేటట్లు కటాక్షించు యీశ్వరా! యిదే ప్రార్ధన.

ఈ కాగితాలు చాకలి కిస్తున్నాను–అతను మణికిస్తాడు– ఆమె నీకిస్తుంది. శలవు.

● *"రుక్మిణి, 1924"* ●

★ ★ ★

4

రాయసం వెంకటశివుడు

# నీలవేణి

సముద్రతీరమందలి యిసుకయెడారి జనులకేమంత వాసయోగ్యముగ నుండును? వేసవిని జాముప్రొద్దెక్కినది మొదలు సాయంకాలము వఱకును సూర్యుని ప్రచండ కిరణములకు కాలికాలిన ఇసుకబయలునుండి వేడిమి పైకెగయుచుండును. అచ్చటచ్చట గానవచ్చెడి యుడిగిపోయిన మొలకలు మొదలును ఎండనుండి తలదాచుకొనుటకు జనుల కుపకరింపవు. జిహ్వకు రుచిగ ద్రావుటకు దగినంత మంచినీరు దొరకదు. సూర్యాస్తమయ సమయమునకు చల్లగాలి తిరుగుట నిజమే. కాని, నిరతము, ఆ పల్లభూమి నివాసముగ జేసికొనినవారికి, ఏదో సమయమున విహారార్థ మచటి కేతెంచువారలకు వెల, అందరిజీవిత మంతగా సుఖప్రదముగ నుండదు. స్వానుభవమున వారికి స్పష్టముగ గానబడునవి కాలుచుండెడి యిసుక యెడారియు, చెవులు చిల్లులు పడునట్లుగ నిరతము తీరమును మోదెడి యలల చప్పుడును. సముద్రతరంగముల నుండి వీతెంచు శీతలవాయువులు సంసార సౌఖ్యసంపదల వలెనే వారికి క్షణభంగురమగుచుండును.

ఐనను, రాతిలోని కప్పకు రాతిలోనె జీవితము గడచిపోవుచుండును. నీలమ్మకు నీలివాడగ నివాసము అనుకూలముగనే యున్నది. నావవేసికొని తండ్రియు, వన్నయు సముద్రముమీదబోయి, చేపజెల్లలు పట్టుకుని, సంసారము గడుపుకొనుటకు పడు కష్టముల లాబాలకేమి తెలియును? నీలమ్మయు, తమ్ముడును ఇంటి పనులు నెరవేర్చు తల్లికి గాని, దోనె పనిమీద నుండు అన్నయ్యలకు గాని చేయుసాయ మంతగలేదు. అక్కతమ్ములు, ఒకరినొకరు చెట్టపట్టుకుని, సాయంకాలము సముద్రపుటొడ్డునకేగి, అచ్చటి తేనె గవ్వలు, గంగాళువ చిప్పలు నేరికొనుచును, తామిసుకలో దీర్చి కట్టిన బొమ్మరిండ్లను పెద్ద కెరటము లూడ్చివేయగా కేకలు వేయుచు గ్రొత్త యిండ్లు మరల మరల గట్టుచును కాలము గడుపుచుండురు. గోలీల యాట, గాలిపడగ లెగురవేయుట– ఇవియె వారికిని, ఆ పల్లెయందలి యితర పిల్లలకును ముఖ్య కాలక్షేపములు.

☆ ☆ ☆

'ఓడలు బండ్లగును, బండ్లోడలగును.' కాలవైపరీత్యమునను, గాంధీ మహాత్ముని కార్య శూరత్వమహిమమునకు పల్లెలు పట్టణములుగను, పట్టణములు పల్లెలుగను బరిణమించినవి. ఈ మధ్య నొకనాటి సాయంకాలము నీలమ్మ తమ్మునితో

బంతమువైచి, తీరమును తాకెడి పెద్దయలలలో నుండి దుముకుచు నొడ్డున చాలా దూరము పరుగిడిపోయెను. అప్పుడు వారి కన్నుల కొక వింతదృశ్యమగపడెను. వయస్సు వచ్చిన మనుష్యులు కొందఱు, చిన్న పిల్లలవలె, ఒకరిచేత నున్న వస్తువుల నొకరు పెఱుకుకొన బెనగులాడుచుండిరి. కొందరు తెల్లని టోపీలు పెట్టుకుని, రంగు జెండాలు చేతబట్టుకుని నిలుచుండిరి. సమాచారము కనుగొనెదమని యా పిల్ల లిరువురును ఆ గుంపుదగ్గరకు బరుగెత్తిపోయిరి. సముద్ర పక్షుల బండు కాఱుప్పును బిడికెండ్లతో బట్టుకొని యైదాఱుగురు యువకులు నిలుచుండిరి. వారదివఱకు ప్రోగుచేసి గుడ్డలలో మూటగట్టిన యుప్పును వారిని ముట్టడించిన సర్కారుభటులు స్వాధీనపఱుచుకొని, అంతటితో దనివినొందక, టోపీల పిన్నవారల చేతుల నుండి యుప్పుకణములనుగూడ గైకొన బ్రయత్నించుచుండిరి. చిన్న యుప్పురాలకై పెద్దవా రిట్లు పెనుగులాడుటయందలి సరసత ఆ పిల్లలకు బోధపడలేదు. ఎట్టకేలకు, రక్షక భటులు జెండాల యువకుల చేతుల నుండి యుప్పునంతటిని వశపరుచుకొనిరి కాని, వారిలో నొకడు మాత్రము తన పిడికిలిని వదలకుండెను. రక్షక భటులు వేర్వేరుగను, కలసియును, ఆ యువకుని గుప్పిలి సడలింప నెన్నియో యుపాయములు చేసిరి కాని, అన్నియు నిష్ఫలమయ్యెను! అంత జెండాల వారు తమ మార్గమున దాము పోయిరి. రక్షక భటులు, అచ్చట ప్రోగుపడియుండిన యుప్పురాసులను మంటిలో గలిపివైచి, మఱివెడలిపోయిరి.

☆ ☆ ☆

పిల్లలో ననుకరణ శక్తిమెండు. దారిపొడుగునను నీలమ్మయు, తమ్ముడును రక్షకభటులు, లవణ సత్యాగ్రహులును జేసినచొప్పున, ఇసుకతో నింపిన యొకరిగుప్పిలి నొకరు విడిపింప బ్రయత్నించి వినోదించుచుండిరి. వారు పల్లెవాడచేరుటయె తడవుగా, ఇసుకబట్టిన పిడికిలిని సడలించుట ఆ ప్రాంతముల పిల్లలకు వేడుకయాట యయ్యెను. రాత్రి కూడు తిను సమయమున నీలమ్మ తన తల్లిదండ్రులకు తామానాడు చూచిన సంగతి వర్ణించి చెప్పెను. తోడనె యా వార్త పల్లెయంతయు వ్యాపించెను. ఇట్లు పండ్రెండువందల మైళ్ల దూరమున పశ్చిమ సముద్ర తీరమున గాంధీ మహాత్ముడు పన్నిన లవణ వ్యూహారహస్యము, తూర్పున తెలుగు దేశమందలి కుగ్రామమగు నీలివాడకు బ్రాకి ప్రకటితమయ్యెను.

☆ ☆ ☆

దళాధిపతి ప్రసాదరావు చౌదరి తన యిరువదిమంది శాంతి సైనికులను వెంటనిడుకొని వచ్చి, కొన్ని దినముల క్రిందటనే నీలివాడకు క్రోసుదూరమున నున్న సైకతస్థలమున దన శిబిరమేర్పఱుచుకొనెను. సముద్రతీరమున నచ్చటచ్చట లభ్యమైన యుప్పును తన సహచరులచే నాతడు ప్రోగుచేయించి, సంచులతో దానిని మండల మందలి యితర సత్యాగ్రహ దళము లుండెడి తావులకు బంపుచుండెను. అంత నది దేశములో నమ్ముడుపోవుచుండెను. లవణశాఖవారు రక్షక భటుల సాయము గొని, ఈ శాంతి దళము ప్రోగుచేసిన యుప్పును అదాత్తుగ నప్పుడప్పుడు పట్టుకుని, అట్టి ప్రదేశములందుత్పన్నమైన యుప్పురాసులను బాడుచేయుచుండిరి. కాని, వారలనుకొనునంత సులభముగ శాంతి సైనికులు తమ చేతికి జిక్కిన

యుప్పు నిచ్చివేయువారుకారు. ప్రసాదరావు చేతిది గట్టిపట్టు! చేతనున్న యుప్పును శత్రువశము చేయుటకన్న, తన ప్రాణమునైన గోల్పోవ సిద్ధముగనుండునట్లాతడు గానబడెను. ప్రభుత్వోద్యోగులొకచోట నుప్పురాసిని బాడు చేసినచో, వెంటనే పదితావులందరి మేలిరాసులాతని కనులకు గానవచ్చుచుండును. కావున నిట్టిపగతుని ధారాళముగ జయింపవలనుపడక రక్షకభటులు వీనిని మాయోపాయమున భంగపఱుప బ్రయత్నించుచుండిరి.

ఒకనాడు వేకువనే ప్రసాదరావు పడక విడిచి తానెచ్చటికి బోవునదియు శిబిరములోని సహవాసులకు జెప్పక, ఒంటరిగ బయనమయ్యెను. తూర్పురేక లింకను ఆకసము నలంకరింపలేదు. తానొకడే యా యెడారినిబడి పోవుచుంటినని యాయువకుడు తలంచినను, ఇరువురు పురుషులు వాని జాడలు కనిపెట్టుచు, మెల్లమెల్లగ వానిని వెంబడించిరి. వీరు రక్షకోద్యోగులు, సమయము చూచి రహస్యముగ వీనికి శాస్తి చేసినచో, వాని యనుచరులు నిరుత్సాహులై యచ్చటినుండి శిబిరమెత్తి వేయుదురని వారి యాలోచన.

ఈ కనుచీకటి సమయమున నెడారినిబడి తా నాత్రమున నొంటరిగ బయనము చేయుచుండుట తలపోయగా, ప్రసాదరావు చౌదరి మనసున నాశ్చర్యము పొరలిపొరలి వచ్చెను. నెలదినముల క్రిందనే కదా యాతడింకను కళాశాలలో జదువుసాములు సాగించుకొనుచుండెను! ఇంత శీఘ్రముగ పుస్తకములు మూలవైచి జెండా చేతబట్టుదునని కలనైన నాతడనుకొనలేదు. పెద్ద సుడిగాలి వీచునప్పుడు, చిన్న మొలకలు మొదలుకొని మహావృక్షముల వఱకును, చెట్లన్నియు నూగాడదొచ్చును. సబర్మతీతీర కుటీర నివాసియగు నొక మానవ మాత్రుని చేసైగనెకదా; భారతదేశమంతటి నొక్క పెట్టున గలచివైచిన యీ మహావాయు వుద్భవమయ్యెను! చిన్ననాటి నుండియు నాయువకుని కుత్సాహజనకములైన యాశలు, నాశయములు నిపుడేమైపోయినవి? పుడమియందలి నదులన్నియు తుదకు సముద్రగత మగునట్లు, ప్రజలందరి కోరికలును గాంధీ మహాత్ముని మహోద్యమమున గలసిపోయెనే! భరతదేశమందలి ప్రతిభావంతులు గాంధీ మహాత్ముని మహాశయములె తమ యాశయములని తలపోయుచు, నోరుమెదపక, ఆ వీరుని పాదచ్ఛాయల నడుగులు నెట్టుచున్నారే! ఇదియె కదా మహాపురుషుని వ్యక్తిత్వమునకును, సామాన్య మానవ ప్రకృతికిని గల తారతమ్యము!

☆ ☆ ☆

ఇట్టి యూహాపరంపరలో నిమగ్నుడై నడచుచుండెడి యాయువకుడంత తనకాలికి నేలలో గొంత భేదమగపడగా, ఆదాత్తుగ నిలచి, చేత గొంతయిసుక తీసి, ఒకటి రెండు కణములు నోట వేసికొని రుచిచూచి యుప్పని గ్రహించి, అచ్చట తన జెండా పాతెను. ఉప్పునేల యెంతమేఱ వ్యాపించెనో చూతమని యపుడాతడు వంగి చేతితో భూమి నచ్చటచ్చట తడివి పరిశీలించు చుండెను. ఇంతలో వెనుకనుండి యథాత్తుగా వాని శిరస్సుననను, వీపుమీదను లాఠీకఱ్ఱ పట్లు శరవేగముగ గురిసెను. "హరిహరీ! గాంధీకి జై!" అనుచు- ఆ యువకుడు స్పృహతప్పి నిలువున బడిపోయెను. తాము దిగ్విజయము చేసినట్టుగ ముదమందియు, దొంగతనము చేసినట్టుగ దొట్రుపడి, పగతురంత పలాయితులయిరి.

☆ ☆ ☆

ఆనాడు సూర్యోదయ సమయమున నీలమ్మ సముద్ర తీరమున సోదరులతో గలసి యాటలాడుచుండెను. ఈమాఱు అన్నయు వారలతో గూడియుండెను. చెల్లెలికంటే అన్న రెండు మూడేండ్లు మాత్రమే పెద్ద. వాడిపుడు తండ్రి చేతికంది యింటిపనులలో నాతనికి దోడుపడుచుండెను. ఐన నపుడుపుడు మాత్రము, మొన్న మొన్ననె కడచిపోయిన వాని బాల్యక్రీడాదినములు వాని మనస్సున మెరమెరలాడుట చేత పని నుండి వాడొకటి రెండు రోజులు ఆటవిడుపుగైకొని, తోబుట్టువులతో దిరుగాడుచుండును. ఈనాడా ముప్పురు పిల్లలును, అలలను దప్పించుకొని దుముకు లాడుచు, తమలో దాము పంతములువైచుకొని నీటి యొడ్డున చాల దూరము పరువులెత్తిరి, ఒడ్డున కనతిదూరమున నంతనొక రంగు జెండా కనబడి వారు నిలిచిరి. అప్పుడు నీలమ్మ, “అన్నయ్యా! నేను, తమ్ముడును మొన్న చూచిన జెండా లిటువంటివె సుమీ! అక్కడ యింకా కొన్ని జండాలుండును. పోయి చూదాము రండి!” ‘అని పలికి, తానచటికి దారి తీసెను. సోదరి వెంటనే యన్నదమ్ములాత్రోవను నడచిపోయిరి.

అక్కడ మఱి యేజెండాలు గాని, మనుష్యుల జాడ గాని గానరాకుండుట చేత, తిరిగిపోవుదమని అన్నయు దమ్ముడును చెప్పినను, తన కంటికి నిసుకమీద నల్లగ నేదో దూరముగ గనబడుచున్నదని నీలమ్మ పలికి, తానచ్చటికి బరుగెత్తిపోయి, “అన్నయ్యా, ఇటు రండి. ఇక్కడెవడో మనుష్యుడు పడిపోయినాడు!” అని కేకవేసెను. వారట్లు చూచినది నాడు వేకువనె రక్షకభటుల క్రూరప్రహారణములబారి పడిన శాంతి దళాధిపుడు ప్రసాదరావే!

☆ ☆ ☆

నాడు పోలీసుల నెవరిని గాని తన పిడికిలి నుండి యుప్పుగైకొననీయని మేటి బలవంతుడె నేడు నేలబడియుంటుటకు నీలమణి మిగులవగచెను. శరీరచలనము లేని యీతడు మృతుడయ్యెనని యా బాలిక భావించెను. ఆ బాలాధికుని మీద నీర్ష్యచేతన వైరులాతనికిట్లు చేసిరని యాచిన్నది తలంచెను. తామింటికి జని పెద్దవారితో నీ సంగతి చెప్పుదమని యన్నదమ్ములనిరి. శవమునొద్ద నిలువరాదని యన్న చెల్లెలిని వారించెను. కాని, యా శాంతి సైనికుని కింకను కొనయూపిరి యుండవచ్చునని నీలమ్మ నమ్మకము. కావున నా ముప్పురు పిల్లలును పడిపోయిన యువకుని ప్రయాసమున వెలికిల బరుండపెట్టిరి. అంత, చెల్లెలియాలోచన చొప్పున రోగికి గొంతుక తడుపుటకెచ్చట నైన మంచినీరు తెచ్చుటకై అన్న బయలుదేరెను. ఊపిరి సరిగా విడుచుట కిపుడనుకూలముగా నుండుటచేత, ఏ కోశముననో ప్రాణలేశమంటిపెట్టుకుని యుండిన యాశాంతిసైనికుడు, అంత మెల్ల మెల్లగ శ్వాసము విడువజొచ్చెను. ఒక తాటియాకుదొప్పతో నిపుడు అన్న తెచ్చిన నీటితో, చెల్లెలు రోగిమొగము గడిగి, ఒక కొన్ని నీటి బిందువులు వాని నోట మెల్లగ బోసెను. అవి గుటకపడినవి! ఇట్లు శీతలోపచారములు చేసి, మృత్యుముఖము నుండి యా యువకుని యసువులు దక్కించితిమని యా పసివారు మిగుల ముదమందిరి. వాని కింకను స్పృహ రాకుండినను, ప్రాణములు నిలిచె ననుట స్పష్టమయ్యెను. ప్రచండ భానుని కెదురుగ మండుచుండెడి యిసుకనేలలో వాడు పండుకుని యుండుట ప్రాణోపద్రవకరమని

వారెంచి ఎటులైన వానిని తమ గ్రామము చేర్చుట కాలోచించిరి. అక్కయును దమ్ముడును రోగిమీదికెండ రాకుండ జూచి వాని కుపచారములు సలుపుచుండునట్లును ఈలోపుగ అన్న వేగముగ బోయి తమయూరి వారికీ వార్త చెప్పి వారిని గొని వచ్చుటకును వారేర్పఱచుకొనిరి. ఒక గంటలోనే నీలివాడ గ్రామస్థులు సవారిలో ప్రసాదరావును తమయూరికి గొనివచ్చిరి. నీలమ్మ కుటీరము ప్రక్కనుండు గుడిసెయె రోగికి విడిది. అతని దేహమునందలి దెబ్బలకు, గాయములకు నపుడు మందులు పట్టించిరి. రోగి నోట మెల్లమెల్లగ పలుచని జావ పోయుచూ నీలమ్మయు, ఆమె తల్లియు వాని మంచము నొద్ద గనిపెట్టుకొని యుండిరి.

☆ ☆ ☆

రాత్రికి ప్రసాదరావు కొంత తెప్పతిల్లెను స్పృహవచ్చి యాత డిటునటు తేఱిపాఱచూచెను. తానొక గుడిసెలో మంచముమీద బండుకొని యుండుటయు, పల్లెవారు తన కుపచారములు సలుపుచుండుటయు గనిపెట్టి, ఇది వట్టికలయని యాతడు మొదట తలంచెను. తన యొడలిమీది గాయములు తడివిచూచుకొని, రోగి నిట్టూర్పు విడిచెను. బాధచేతను, నీరసము చేతను ప్రసాదరావు మూలుగుచు, హీనస్వరమున దనజెండా యేమయ్యెననియు, తానెచట వుంటిననియు వారలను ప్రశ్నించెను. సత్తువచేరుటకింక కొంత జావపోసి, అతని జెండా సురక్షితముగ నచటనే యుండెననియు, వాని సమాచారము క్రమముగ నెఱిగింతుమనియు, వాడేమియు నలజడిపడనక్కఱలేదనియు, తల్లియు, గూతురును వాని నూరార్చిరి. పతాకము సురక్షితమని వినునపుడు సైనికుని ముఖకమలము సంతసమున వికసనమందెను.

క్రమక్రమముగ ప్రసాదరావునకు దెలివి వచ్చెను. పల్లెకన్నియవలన దన ప్రస్తుత సమాచారము విని యాతడాశ్చర్యమందెను. గ్రామస్థులును, ముఖ్యముగ నింటివారును, తనకు జేసిన సహాయసపర్యల కాతడు కృతజ్ఞత కలిగియుండెను. దైవసంఘటనము లెంత విచిత్రము! అందఱికంటెను నీలమ్మ యాతని కిపుడాప్తురాలయ్యెను. అత్యధిక బాధాపీడితుడై, కాలుసేతులు గదుపుకొనుటకైన శక్తిలేని యాయసహాయస్థితిలో, తనకీ యబలను రక్షకురాలినిగ జూపినందు కాయోధుడు దేవుని బొగడెను. నీలమ్మయె వాని కిపుడు తల్లియు, నేడుగడయు!

☆ ☆ ☆

మఱునాటి యుదయమునకు శాంతి సైనికులు వెదకికొనుచు వచ్చి, నీలివాడలో నీకుటీరమున బడియుండిన తమ నాయకుని గలసికొనిరి. శత్రువుల దౌర్జన్యమున కాహుతిగావలసిన తమ చెలికాని యసువులు, ఈ యూరివారి సాయమునను, ఈ పల్లెపిల్లల సౌజన్యముననను నిలిచియుండుటకు వారెంతయు సంతసించిరి. అనుంగుమిత్రుని దమబుజములపై నుంచుకొని శిబిరమునకు గొనిపోవలెనని వారు మొదట సంకల్పించిరి. గ్రామవాసులు వారించిరి. రోగియభిప్రాయము నదియె. ఎట్టి యుద్రేకమునకు నవకాశమీయని యానిశ్శబ్ద ప్రదేశముననే యుండినచో, కొలది దినములలోనే తమ నాయకుడు స్వస్థుడగునని సైనికులును దలంచిరి. కావున ప్రసాదరావున కాపల్లెవాడ మఱికొన్ని రోజులవఱకును నివాసస్థలమయ్యెను.

నానాట ప్రసాదరావునకు శరీరము నెమ్మది నొందెను. గాయములు మానజొచ్చెను. జ్వరము నివారణమయ్యెను. నీరస మొకటితప్ప వాని దేహమున నిపుడేలోపము గానిపించదు. తక్షణమె తన శిబిరము జేరి, తన కార్యము లేలతాను చక్కపెట్టుకొనరాదని యాయువకుడు విసువునొందెను. ప్రపంచ రంగమంతయు కార్యమయమై యుండగా, తానీమారుమూల పల్లెలో హాయిగ పాన్పుమీద బవళించి, తన ప్రజ్ఞాపౌరుషముల నన్నిటిని జోకొట్టి నిద్రపుచ్చుచుంటినని యాశూరుడు తన్నుదాను నిందించుకొనెను. ఆ వీరుని మనస్తీవ్రత ఏదేని కార్యసాధనమునగాని యుపశమింపదని యాలోచించి, నీలమ్మయు దల్లియు వానిని జూచి, "అయ్యా, మీరు తెలిసినవారు. ఇక్కడెవరికిని చదువురాదు. గాంధీమహాత్ముని ప్రభ దేశమంతా మోగిపోతున్నది. ఆ సంగతులేమైనా మా వాళ్లకు మెల్లగ చెప్పగలరా?" అని యందించిరి. తన రొట్టె నేతిని బడెగదాయని యా యువకుడు సంతసించి, అట్లే చేతుననెను. ఇటు లాపల్లెవాడ యందు దేశపరిస్థితులు, లవణసత్యాగ్రహము, స్వరాజ్యసంపాదనము మొదలగు విషయములను గుఱించి సత్యాగ్రహుల యభిప్రాయములు వ్యాప్తములయ్యెను.

ఒకనాడు ప్రసాదరావుతో నీలమ్మతల్లి, "మా పల్లెవాళ్లకు కూటికి లేకున్నను, కల్లుకర్చు తప్పదు నాయనా!" అని మాటల సందర్భమున ననెను. ఇది నిమిత్తముగా ప్రసాదరావు మద్యపాన నిషేధమును గుఱించి యచటి జనులలో కొంత ప్రబోధము గలిగించెను. అచ్చటివారు కల్లు సారాయిలు వర్జించునట్లు కృషిసల్పెను. నీలమ్మ యింటినుండి యారంభమైన యీ సంస్కరణము కొలదిదినములలోనే గ్రామమంతయు వ్యాపించెను.

☆ ☆ ☆

ఇపుడు ప్రసాదరావునకు బరిపూర్ణారోగ్యము గలిగెను. దళనాయకుడు లేని శిబిరము జీవములేని కళేబరమువలె నుండెనని సైనికులు చెప్పిరి. తాను బోయి వచ్చెదనని యింటివారి యొద్దను, గ్రామస్థులయొద్దను ఆ యువకుడు సెలవుగైకొనునపుడు, ఉభయపక్షములవారును విశేష భావోద్రేకపూరితులైరి. ఆ సజ్జనుని హితబోధనము ననుసరించి తమ దినచర్య నడపుకొందుమని గ్రామవాస్తవ్యులు వాగ్దానము చేసిరి. తామును శాంతిసైన్యమున జేరుదుమని పలువురు యువకులు గుడ్డజెండాలతో వానివెంట బయలుదేఱిరి. పల్లెవాడలో ప్రసాదరావు ప్రవాసదినములు వ్యర్థముగాకుండెననుటకివియె ప్రబల నిదర్శనములు.

ప్రసాదరావు చేపట్టిన యుద్యమ మాప్రాంతములందిపుడు బాగుగ జరుగుచుండెను. నాయకుడు మరల తమ్ము గలసికొనినప్పటినుండియు సైనికులత్యుత్సాహమున దమపనులు నెరవేర్చుచుండిరి. పల్లెపటాలవు పిల్లలాప్రాంతపువారలె కావున, వారు గుట్టలు గుట్టలుగ నుప్పురాసులు దెచ్చి పేర్చుచుండిరి. మద్యపాన నిషేధ ప్రచారము పల్లెనుండి పల్లెకు బ్రాకిపోయెను. అంత చుట్టుపట్టుల గ్రామములనుండి ప్రజలు గుంపులుగుంపులుగ వారి శిబిరమును జూడవచ్చుచు, కానుకలు, చందాలును గ్రుమ్మరించిరి. నిరుపేదలు ఉప్పునేఱి తెచ్చి యిచ్చుచుండిరి. ఇట్లు అర్థబలము, అంగబలమును సమృద్ధముగ గల యాశాంతి సైనికులు; తా మింక దుర్జేయులమనియె భావింపదొడంగిరి.

ప్రసాదరావు మాత్ర మట్లెన్నడును దలంచువాడు కాడు. ప్రథమమునుండియు నియమానుసార జీవితమున కభ్యాసపడి, పలుమాఱాత డాత్మపరీక్ష చేసికొనుచుండు వాడు. తన చదువుసాములును, ప్రజ్ఞా ప్రతిభలును జూచుకొని విఱ్ఱవీగువాడు కాడు. కలిమియం దణకువయు, లేమియం దోరిమియు నియమములుగ జేకొనినవాడు. పరిస్థితులు తమ కిపుడెంత ప్రోత్సాహకరముగ నుండినను, భవిష్యత్తునందవి తాఱుమాఱగునపుడు తామెట్లు తెప్పఱిల్లగలమాయని యాతడాలోచించుచుండును. అతనికి సత్యమె నిదానము, ధర్మమె కర్తవ్యము, సత్యదీక్షగల గాంధీమహాత్ముని యుద్యమమున నుల్లంఘించుచుండుట కాతడు వగచుచుండును. నిత్యబ్రహ్మచర్య దీక్షతో నుండవలసిన సత్యాగ్రహులలో ననేకులు సుఖలాలసులగుట యాతనికి దుఃఖావహముగా నుండెను. పగతురనైన ప్రేమింపవలెను సుమీ యని సతత గురూత్తముడుపదేశించుచుండినను, అచటి శాంతి సైనికులు రెండు మూడు మాఱులు ప్రభుత్వోద్యోగులను బరిహాసించి, వారియెడ దౌర్జన్యము చూప సిద్ధము కాలేదా?

చుట్టుపట్టుల పల్లెలవారు శిబిరమునకు వచ్చి, తనకువేసెడి తెంపులేని ప్రశ్నములకు ప్రసాదరావు ప్రశాంతముగ సమాధానము లిచ్చుచుండుట వృథాప్రయాసమని సైనికులలో పలువురి తలంపు. ప్రేమ, దయ, సత్యసంధతయును సత్యాగ్రహుల ముఖ్యసాధన కలాపమని దళాధిపతి వారల కొత్తిచెప్ప మాటాడుటకు సందేహించుచు, ప్రసాదరావు ప్రోత్సహింపగ నిట్లుపలికెను: "అయ్యా, కల్లుతాగవద్దని కదా మీరు బోధిస్తున్నారు. చిన్ననాటి అభ్యాసాలు వక్కసారిగా కట్టిపెట్టడము సులభమా? 'పాడుకల్లు మానివేయండిరా!' అని నేను మా పల్లె పిల్లలతో నొక్కిచెప్పితే, 'చదువుకున్నవాళ్లు, సత్యాగ్రహులు, కాఫీవుపమాలు కట్టిపెట్టినమరునాడు, మేము మా కల్లుముంతలు పగలగొట్టుతాము లే!' అన్నారు."

దీనికి ప్రసాదరావు తానేమియు సమాధానమీయక, చుట్టునుండు సోదరసైనిక సమితిని జవాబు చెప్పుమనెను. కాఫీ నాగరికతకు చిహ్నమని కొందఱును, కల్లువలెకాఫీ కయిపుచేయదని కొందఱును, మద్యమునవలె దుర్వాసనలు కాఫీనుండి వెడలవని మఱికొందఱును సమాధానము లిచ్చిరి. దళాధిపతి యపుడందుకొని, కల్లు కాఫీలు రెండును దేహమునకు బలమేమియు నీయక తాత్కాలికోద్రేకమును మాత్రము గలిగించెడి విషపదార్థములె యనియును, శరీరమునకు రెండును సమానముగ చెఱుపు చేసెడివె యనియును, తమ టీ కాఫీల యలవాటు త్యజింపలేనివారికి మద్యము వర్జింపుమని పామరులకు బోధింప నధికారము లేదనియును తీరుపు చెప్పెను.

ఇట్లు అ శిబిరమున కాఫీనీళ్లకొఱకు సైనికులు కొందఱు తెల్లవాఱనీయకుండెడి దురభ్యాసము తొలగిపోయెను. పల్లెలోనివారు మద్యపానము వర్జించుటకు తగినంత ప్రోత్సాహమపుడు గలిగెను.

☆ ☆ ☆

ముఖ్యపట్టణమందలి నాయకులొక్కరొకరె బంధితులై కారాగృహమునకు బోవుట వలన, వెంటనే తన దళమును దీసికొని వచ్చి, తానొక యున్నతపదవిని స్వీకరింపుమని ప్రసాదరావునకిపు డాహ్వానము వచ్చెను. ఈ ప్రాంతములందిన్నాళ్లును సత్కార్యములు జరిగించిన శాంతి సైన్యమిపుడు తమ్ము వదలిపోవుట చుట్టుపట్టుల వారికి

విషాదకరముగ నుండెను. తాను పోయివచ్చెదనని ప్రసాదరావు నీలివాడవారికి జెప్పినప్పుడు నీలమ్మకంట నీరు పెట్టుకొనెను. ఎంతసేపటికిని ఆ బాల యూరకుండినది కాదు. ఒడలెఱుగక యెడారిలో బడియుండిన తనను దమ యింటికి జేర్చి లేక్కలేని యుపచారములు సలిపి, తన ప్రాణములు గాపాడిన నీలమ్మ ప్రసాదరావునకు బ్రాణసమానముగదా! అట్టి సుగుణమణిని సంతృప్తిపఱచుట యా శూరుని ముఖ్యనిధి. కావున నెటులో యాకన్య నొడంబఱిచి, స్వస్థచిత్తమున దానాగ్రామము విడువవలెనని యా యువకుని కోరిక. ఎట్టకేల కాబాలకు హృదయగతమగు వాంఛ పోకడ లాతనికి దెలియవచ్చెను. ఆ సుందరి కా యువకునిమీద జెప్పనలవిగాని ప్రేమ మేర్పడెను. ఇట్టి ధీర దాక్షిణ్యశీలుని దాను వరించి వివాహమాడకున్న దన జీవితము వ్యర్థమని యామెలత తలంచెను. కులవిద్యాసంపదలందధికుడైన యాశూరుడు తన కందని ద్రాని పండని యాబాల యావంతయు దలంపదయ్యెను.

ఇంక, ప్రసాదరావును గుఱించి యేమి చెప్పము? మనసార వలచిన చేడియనెగాని తాను జెట్టపట్టనని చిన్ననాటనుండియు బ్రతినవట్టిన ఛాందసుడాతడు. ఆ పల్లెపడతి కులవిద్యా సౌభాగ్యము లాతడారయలేదు. దైవసంఘటనములెంతటి విచిత్రములో కాని, ఆ ముద్దియమోము గాంచిన నిమేషమునుండియె యా యువకుని డెందమాలతాంగియందె యవలగ్నమై యుండెను. అంతటి సదయ హృదయనెన్న డాసరసుడు గాంచియుండలేదు. తానెపుడైన బరిణయమైనచో, ఆ చెలువనే స్వీకరింతునని యాచతురుడు తన హృదయమునుసమాధానపఱచుకొనెను. మనమున నమ్మిన సత్యమును వలసినపుడు వెలిపుచ్చుట కాధీరుడు వెఱచెడివాడు కాడు. ఐనను దేశమంతయు సంక్షోభించెడి యీ యసమయమున పెండ్లిమాటలు తలపెట్టుట యనుచితముగదా! నీలమ్మయైనను అవసరమని తన నాతరుణముననె పరిణయముకమ్మని పట్టుపట్టునంతటి వెట్టిదికాదు. దేశపరిస్థితులు చక్కపడిన పిదపనైనను, తన వాంఛాసాఫల్యమున కావంతయైన నవకాశమగునాయనియె యా సుందరసంప్రశ్నము. ఈ చిన్ని ప్రశ్నమునకు గల సమాధానమునందె యాసుదతి యాశాప్రపంచమంతయు కేంద్రీకృతమై యుండెను.

ఎట్టకేలకు మనసు దిట్టపఱచుకొని, ప్రసాదరావు చౌదరి ఆ పల్లెకన్నియ ముద్దువ్రేలికొక ముద్దుటుంగరము పెట్టి ముద్దుపెట్టుకొనినపుడే ఆ కలికి ముఖకమలము కలగదేఱెను. ఇపుడచటికి వచ్చి బారులుతీరి నిలిచిన శాంతిసైనికుల నయనముల కాబాల పల్లెవాడ యాడబడుచువలెగాక, ఏ వీరపత్నివలెనో కానబడెను. శీలముతో గూడిన సౌందర్యవిభవమెపుడు నిట్టిదియె. ఇపుడు నీలివాడకు వీడుకోలు చెప్పెడి శాంతిసైనికులు గాంధీ మహాత్మునకును, ప్రేయసి నీలవేణితో గూడిన తమ ప్రియసేనానిమీదను అమితోత్సాహపూరితమగు జయధ్వానములు గురిపించిరి.

☆ ☆ ☆

ఇది జరిగి ప్రసాదరావు ముఖ్యపట్టణమునకు వచ్చిన కొలది దినములకు యొక నాడాతనిని రక్షకభటులు బంధించి, మాఱుమూల గ్రామమున మకాముచేసియున్న న్యాయాధిపతియొద్దకు గొనిపోయిరి. నిందితుని ప్రతివాదనయేలేని యిట్టి యభియోగము లతో న్యాయనిర్ధారణమున కెంతకాలము కావలెను! దండనాధిపుడు విచారణ ముగించి, తన గదిలో కూర్చుండి తీర్పువ్రాసి బైటి వసారాలోని రోదనశబ్దమువిని, గవాక్షమునుండి

వెలుపల కట్టుచూచెను. ఒక యువకుడు దూరమున నిలిచి, తన ప్రేయసి వీడుకోలుకొఱకు ప్రతీక్షించుచుండెను. అతడె నిందితుడగు ప్రసాదరావు. ప్రియుడు కోమలిముంగురులు సరిచేయుచు, విలపింపవలదని యామెను వేడుచు, తన చేతి రుమాలతో ఆ దీనవదన కన్నీరొత్తుచుండెను. ఏడాది తిరుగకయె తానింటి కేతెంచెదనని యాకాంత నతడెంత యూరార్పజూచినను, ఆ యతివకనుదోయినుండి యశ్రుకణము లొలుకుచునేయుండెను. రాజరత్నమొదలియారు "రాతిగుండె న్యాయాధిపతి" యని పేరు మ్రోగినవాడు. పేరుపెంపులు, బిరుదుకితాబులును గుఱిపించెడి రాజానుగ్రహసంపాదనమునకు దగిన యవకాశము లివియెకదా! ఐన నీ దృశ్యమునకు, శ్రావణ వర్షమునకు నల్లరాలకొండ చెమ్మగిలునట్టుగ, ఆ యుద్యోగి హృదయమించుక మెత్తగిల్లెను. పరులకు మార్గప్రదర్శకుడు గావలసిన విద్యాధికుడగు ప్రసాదరావువంటి యపరాధికి తగిన శిక్ష వేయవలెనని యపుడె వ్రాసిన తీర్పుకాకితము నా న్యాయమూర్తి పట్టున చింపివైచి, వేరొక కాగితముగైగొని, ముద్దాయి సత్యాగ్రహదీక్షను తీవ్రముగ నెఱపజూచెడి సాహసికుడైనను, కోమల హృదయుడగు నీ తరుణ వయస్కునికి కొంతక్షమ చూపినచో త్వరలో నీతడె ప్రభుభక్తిపరాయణులలో మిన్నగ పరిణమింపగలడను విశ్వాసమున నాతనికి స్వల్పశిక్ష నొసంగుచున్నానని తీర్పువ్రాసి, తన డెందమందలి యుమ్మలిక మొకింత యుపనయించుకొనెను.

☆ ☆ ☆

ఇదివఱకు జెప్పిన యుదంతములు జరిగి యిప్పటికి సుమారు సంవత్సరమైనది. ఏడాది గిఱ్ఱున దిరిగి రాగా, మల్లెమొగ్గలతోను, మందవాయువులతోను గలసి మరల వసంతము నీలివాడ గ్రామమున బ్రత్యక్షమయ్యెను. ఇపుడు నీలవేణి యెచటనున్నది? ఏమిచేయుచున్నది? కడచిపోయినది యొక వత్సరమెయని లోకము లెక్క వేసికొనుచున్నదికాని, నీలవేణియంతరంగమున కీలోపుగ సమకూరిన యనుభవ సంచయము పదిసంవత్సరములకు సరిపడియుండెను. ఇపుడు నీలవేణి సముద్రపు టొడ్డున నాలువచిప్పలేరుచుండెడి పల్లెబాలిక కాదు. ఆ సుదతి పేరు, ఆమె యూహలు, ఆమె యాదర్శములును పల్లెలు, పట్టణములును వ్యాపించియున్నవి. దేశహితైక బుద్ధితో ప్రియుడు కారాగారమున గాసిల్లుచుండగా, తాను స్వగ్రామమున విహరింప నిచ్చగింపక, ఆ సుగుణవతి స్త్రీలు సలుపు విదేశవస్త్ర బహిష్కరణోద్యమమున బాల్గొనియెను. పగలంతయు నెండలో బజారులయందు నిలుచుండి, విదేశవస్త్రముల నెగబడువారి నవి కొనవలదని దైన్యమున వేడుచు, వారల చీవాట్లును రక్షక భటుల కఠిన చర్యలను లెక్కచేయక విధుల నెరవేర్చునెలతలలో నీలవేణి మిన్నయయ్యెను. చెన్నపురినుండి యాహ్వానమురాగా నీలవేణి యంత నానగరమున కేగి, యచిరకాలముననే యచటి నారీమణులకు నాయికయై, ఆంధ్రభామినులు ధైర్యస్థైర్యమందు బట్టుకొమ్మలని తమిళసుందరులు శ్లాఘించునట్టుగ మెలంగెను. నీలవేణి నంతట రక్షకభటులు బంధించుట, అచటికిపుడు న్యాయాధిపతిగా నేర్పడిన రాజరత్న మొదలియారు ఆఱునెల లా ధైర్యవతికి కారాగృహశిక్ష విధించుట మున్నగునవి వార్తాపత్రికల కెక్కిన చారిత్రకవిషయములె.

☆ ☆ ☆

భారత దేశోద్ధారకుడగు గాంధీమహాత్ముడును, భారత జనశ్రేయోభిలాషియగు ఇర్విను ప్రభువును దేశమున శాంతినెలకొల్పుటకు జేసికొనిన సమాధానము ననుసరించి కారాగారబంధితులైన సత్యాగ్రహు లొక్కరొక్కరె చెరసాలనుండి విముక్తులగుచుండిరి. వేలూరు కారాగృహమునుండి వెలువడిననీలవేణిని సమ్మానించుటకేగిన దేశభక్తులలో ప్రసాదరావు చౌదరి యొకడు. అదివఱకే శ్రీకృష్ణజన్మస్థానమునుండి విముక్తుడై వచ్చిన చౌదరి యిపుడు తన ప్రేయసిని గలిసికొనునపు డానందపరవశుడయ్యెను.

తనకు సుస్వాగతమిచ్చుటకు దనవారు చెన్నపురి వచ్చి వేచియుండిరని వేలూరి కారాగృహ ముఖద్వారమున ప్రియునివలన వినిన నీలవేణి యంతట వారినిగాంచ నువ్విళులూరుచుండెను. చెన్నపురి రెయిలుస్టేషనులో నడుగిడునప్పటికి సత్యాగ్రహ ప్రముఖులును, నీలివాడ బందుగులును ఆమెను పూలమాలలతో ముంచివేసిరి. ఊరేగింపుటుత్సవము జరిగిన వెనుక నిశ్శబ్దమగు నేచిన్నయింటనో తనకేర్పఱిచిన బసకు దనను వారు కొనిపోవుదురని యాతరుణి యనుకొనెనేకాని, అలంకృతమై జనావళిచే బరివేష్టితమైన యొకసుందర భవనమునకు దానపుడేతెంచి, అచట గల్యాణమంటపమున వివాహవేదిక నధిష్టింతునని యా కలికి కలలోనైన దలంపలేదు. ఇంత యాకస్మికముగ, నింత సంపూర్ణముగ దన భాగ్యము ఫలించునని యా పడతి యెన్నడును భావింపలేదు. ఆ సుందరి యిపుడు తన యదృష్టమును దలపోయుటకును, తన నెచ్చెలులను బలుకరించుటకును వ్యవధానము గాంచకుండెను. ఇపుడిచట గూడిన ప్రేక్షకుల వదనములు, పురోహితుని పలుకులు, ప్రాణేశుని పాణిగ్రహణము, సభాసదుల యాశీర్వాదములు, బంధుజనుల కానుకలు, మిత్రుల యభినందనములు – ఇవి యన్నియు నీలివేణికి గలలో గనిన విషయములవలె దోచెను.

ఆనాడు వధూవరులను, వారి యాంతరంగిక మిత్రులను ఆశ్చర్యవాహినిని ముంచివేసిన యొక యుదంతమును గూర్చి యిచట బ్రస్తావింపక తీఱదు. సదస్యులు చందనతాంబూలాదులు స్వీకరించి తమ నెలవులకు వెడలిపోవుసందడిలో, అపుడు వీధిలో నిలిచిన మోటారుబండిలో నుండి వచ్చి యొక భాగ్యవతి వివాహవేదికనుండి దిగుచుండెడి వధువుమెడలో నొక హారమువైచి, పెండ్లివారు సపర్యలు పూర్తిగ గైకొనకయె వేవేగమె బండియెక్కి వెడలిపోయెను. విలువగల యా యాభరణము సమర్పించిన పుణ్యవతి ఎవ్వరో తెలిసికొని, ఆమెకు తమ కృతజ్ఞతజూప బెండ్లివారికి వలను పడకుండెను. అంత వరుడు ప్రసాదరావు చౌదరి మిగుల ప్రయాసమునచేసిన విచారణ పర్యవసాన మేమన, పెండ్లికూతురిమెడలో హారమువైచిన సుదతీమణి న్యాయమూర్తి రాజరత్నమొదలియారిగారి ధర్మపత్ని యనియె.

● *'భారతి' మాసపత్రిక డిసెంబరు, 1934* ●

★ ★ ★

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# 5 అరికాళ్ళ కింద మంటలు

"దిమ్మచెక్కలాగ అలా కూచోకపోతే కాస్త గంధం తియ్యరాదుషే? రోజా పురమాయించాలా?"

"పెద్దబావ నిన్ననే వెళ్ళిపోయాడు కదా–"

"గంధం పూసుకోతగ్గవాళ్ళే కనపడ్డంలేదూ నీకు?"

"పోనీ, పురమాయించినట్టే చెబితే యేం?"

"మీ అమ్మా మీ నాన్న–నోటితో చెప్పాలిషే?"

"లేకపోతే యెలా తెలుస్తుందీ నావంటిదానికీ?"

"నిజంగా నీకీమాత్రం వూహా తోచనేలేదూ? ముసలాళ్ళా ముక్కాళ్ళా వాళ్ళకేమే? నిక్షేపంలాగ గంధంపూసుకోకా?"

"............"

"ఈ జన్మలో నీకెలాగా ఆ యోగం లేదు. ముందుజన్మలోనయినా సుఖపడాలంటే యెప్పుడిలాగ ముత్తయిదువులికి గంధంతీసి యివ్వడమూ, మల్లెమొగ్గలు దండలుగుచ్చి వెయ్యడమూ – అందులోనూ కన్నవాళ్ళకి. ఇంతకంటే పుణ్యం యేమిషే?"

"చూశా, అనుభవించా, గంధం పూసుకుంటే యెలాంటి సుఖం కలుగుతుందో వాళ్ళకలాంటి సుఖం కలిగిస్తే యెంత పుణ్యం వస్తుందో తెలవడానికి? ఇంతకీ ఈ జన్మలో యింతయింది, ముందు జన్మలో సుఖపడనేమో అని బెంగ. ఏదో చేతులారా ప్రాణాలు తీసుకోలేక బతకడం. కాకపోయినా ముందుజన్మలో మనిషినే అయి పుడతానన్న మాటేమిటి?"

"నిజమే. ఇలాంటి బుద్ధులుండే వాజమ్మకి మనిషిజన్మ రమ్మంటే మాత్రం యెలావస్తుందీ?"

"వచ్చేం వారగదీసిందీ? ఇంతకంటే పశువు జన్మో, పిట్ట జన్మో వస్తే నయం, యీ రాతా యీ కోతా –"

"వెనకటి జన్మలో యెవళ్ళని చూసి యేడ్చావో? ఎవళ్ళ సుఖం పడగొట్టావో? ఎవళ్ళకి యెడబంధాలు కల్పించావో? లేకపోతే నీకిప్పుడీరాత యెందుకు వస్తుందీ? కనక ముందు జన్మకోసం జాగ్రత్తపడవే అంచే – నీకోసమే గాని నా కోసమా యేమిషి?"

"నీకోసమని యెవరన్నారేమిటి? అసలెవరికోసం అయితే మాత్రం నాకు తప్పేతుందేమిటి? నువ్వు ప్రేమ వున్నదానవు కనక నీ కూతురికోసం గంధం తియ్యమన్నావు, తప్పని యెవరన్నా రేమిటి? నాకా వూహే కలగలేదు గాని, నేనేం తియ్యనన్నానా, తియ్యనా? నువ్వు స్పష్టంగానూ, కచ్చితంగానూ చెప్పావు కనక యివాళ మొదలుకుని యేరోజునయినా తియ్యకపోతే అడుగు తిని కూచోవాలంటే సాగుతుందా యేమిటి నాకు? రెక్కల్లో సత్తువ వుందికదా?"

"వోసి నీ మొగం యీడ్చా, కాస్తమాట అనేటప్పటి కెంత దండకం విడేశావే!"

"........."

"పెద్దబావ వుండిన వారందినాలూ యేడుస్తూనో, మొగం మాడ్చుకునో కాస్త గంధం తీశావే! స్నానానికి కసిన్ని వేన్నీళ్ళు కాచావే! ఇంతేనా నువ్వు చేసింది అతగాడికి? వేదం అంతా చదువుకున్న బ్రాహ్మడు, అతగాడికి చెయ్యడం దేవుడికి చెయ్యడం కాదుషే!"

"ఆ వివరాలన్నీ పెట్టిపుట్టినవాళ్ళకిగాని నాకు గాదు. నా బతుక్కి దేవుడయినా వొకటే, మనిషయినా వొకటే – తుదకి దెయ్యం అయినా వొకటే. ఎవరికయినా చెప్పిందల్లా – తోచింది కూడా – చేతనయినంతా చేశాను. నేనేమీ వొళ్ళు దాచుకోలేదు."

"దాచుకుందామనుకుంటే సాగనిస్తారా యేమిషి?"

"సాగనిస్తున్నారా యేమిటి? సాగనివ్వమని నే నేడ్చానా యేమిటి? దొడ్లో గేదీ వుంది, యింట్లో నేనూ వున్నాను, ఇంటిల్లిపాదికీ –"

"వోసి నీ సిగ్గు చిమడా, కనిపెంచే గేదికీ నీకు సాపత్యంషే? కనాలని – యెంత వూహావుందే దిక్కుమాలినపీనుగా?"

"........."

"దరిద్రం వోడుకుంటూ పుట్టుకువచ్చావు. నీకే అంత అదృష్టం?"

"..........."

"నువ్వే మూహూర్తాన కడుపున పడ్డావో అప్పుడు చచ్చిబతికింది మా అమ్మ. నువ్విలా చేటలో పడ్డావు, మీ నాన్న వుద్యోగం అలా పోయింది."

"నాకు పుస్తికట్టాడు, ఆ పిల్లాడు చచ్చాడు. ఏం, యీ మాటకూడా అన్నావుకాదేం?"

"వోసి నీ యిల్లు – అనలేదేమని యింకా ముద్దలకించడం కూడానా? నిజంగా నిన్ను పెళ్ళాడి వుండకపోతే బతికే వుండును ఆ వెర్రితండ్రి. పదహారేళ్ళకే 'దరుడుపారం' – అతనెంత వుద్యోగస్థుడయిపోయివుండునో నీకేం తెలుసూ? పైగా 'చచ్చాడు చచ్చా'డని యీసడింపు కూడానా?"

"......."

"నీకు పుస్తి కట్టడమే అతనికి ముప్పయిపోయింది."

"......."

"నువ్వు కాలుపెట్టావు, వొక్క కొడుకు – ఆ తల్లి కడుపు కాలిపోయింది."

"..........."

"నిజంగా చచ్చే సుఖపడ్డాడా అబ్బాయి. అతను బదికే వుంచే నువ్వు కాపరం చేస్తువా? కాపరమే చేస్తే అన్నం పెడుదువా? అన్నం పెడితే నిద్రపోనిస్తువా?"

"నిద్రపోనిస్తే ఆ నిద్రలో, పీక పిసికి –"

"ఆ, ఆ! ఏమని పేలావూ? ఎంత పొగరెక్కావూ?"

".........."

"నువ్వెంతపనీ చేసేదానవు మాత్రం అవుదువు. విన్నావా? నువ్వెంతకేనా సాహసురాలవు."

".........."

"చేసుకున్నవాణ్ణే, చచ్చి స్వర్గానున్న మొగుణ్ణే –"

"నన్ను చేసుకున్నాడుగదా మరి, ఆ పిల్లాడికి స్వర్గం వస్తుందా?"

"నిజమే. అదీ నిజమేనే. ఎంత జాణవయినావూ? కొంప చెడపుట్టి మనోవర్తికయినా గతిలేకుండా –"

"మనోవర్తా? నాకెందుకూ మనోవర్తీ? నాకు డబ్బెందుకూ? చాకిరీ చెయ్యడంకోసం పుట్టాను, ఎవళ్ళు చేయించుకున్నా చేస్తాను. చేయించుకున్నవాళ్ళు గంజినీళ్లు పొయ్యక పోతారా?"

"కనక చెయ్యి, పుచ్చినట్టు చెయ్యి."

"పుచ్చినట్టేం, చచ్చినట్టు చేస్తాను. చేస్తూనూ వున్నాను కనపడ్డంలేదూ?"

"కనపడకేం, నిక్షేపంలా కనబడుతోంది, నాకేం కనపడకా? మీ నాయనమ్మకిలాగ నాకూ కళ్ళు పోవాలనుకుంటున్నావు కాబోలు, వొక్కనాటికీ పోవు. నన్నన్నవాళ్ళ కళ్ళు పోతాయి. దించుకు పోతాయి... నా చేతుల్లో పుట్టి, నా చేతుల్లో పెరిగి నన్నెదిరిస్తావా? నన్నెదిరిస్తావా అంత! నన్నెదిరించి నువ్వు బతగ్గలవుషే?"

"నాకు బతకాలని వుంటేనా నీతో పంతం వేసుకోడానికి? కనక, ఆ వుపాయంమాత్రం కాస్త తొందరగా చూడు; చాలా పుణ్యం వస్తుంది నీకు."

"ఏమన్నావూ? ఏం పేలుతున్నావూ? నేనేం మందులు పెడతానా, మాకులు పెడతానే? ఎంతలేసి మాటల లంచున్నావే, చలితేలులాగ, కుంకపీనుగా!"

".........."

"ఎంత వొళ్ళు కరుచుకొని తిరుగుతున్నావే పింజారీ!"

".........."

".....చద్దువుగాని, చద్దువుగాని – నేను కాస్త నిద్రపోయి లేచాటప్పటికి, అవిగో, బాగుచెయ్యకపో మహామ్మాయి వండించేస్తానో లేదో చూసుకుందువుగాని."

".........."

"నేలబెట్టి రాసేస్తాను కాని, నిన్ను చావనిస్తానుషే!"

".........."

# 2

"ఏమే చెల్లీ, వొక్కపని చెబుతాను చేసిపెట్టవూ?"

"అడగడం యెందుకే?"

"అయితే చేస్తానను."

"చెయ్యకపోవడం యెలా వస్తుందీ? చేస్తానని చెప్పే చేస్తున్నానా చేసేవన్నీనీ?"

"......ఈ గుడ్డ రైక కుట్టిపెట్టాలి. అంతే."

"అలాగే......"

"దీపాలు పెట్టాటప్పటికి – తెలిసిందా?"

"ఇవాళ నావల్లకాదు సుమా! రేపు –"

"ఇవాళేం చేస్తావమ్మా?"

"పెద్దక్క తన కూతురికి జుబ్బా కుట్టమని భోజనం కాగానే యిచ్చింది గుడ్డ. ఈ పని తెమలగానే ముందది–"

"పోనీలే....."

"....అదేమే అలా వుళాక్కుంటావూ?"

".....అక్కర్లేదులే....."

"నేను కుట్ట ననలేదు, అపైని నీ యిష్టం."

"కుట్టనని నోటితో అనాలా యేమిటి? పైగా నీ యిష్టం కాని, నా యిష్టమా యేమిటి? నా యిష్టమే అయితే నువ్వు వాయిదా వెయ్యగలవా యేమిటి?"

"ముందు పుచ్చుకున్న పని వెనక్కి పెడితే అదేమంటుందో యేమయినా ఆలోచించావా?"

"కొడుతుందా యేమిటి?"

"........"

"దాని కూతురికి లగ్గం మించిపోతుందా యేమిటి?"

"........"

"అసలు పెద్దదంటే నీ కభిమానం. అది నే నెరగననుకున్నావా? స్పష్టంగా చెప్పెయ్యక యీ ముసుగులో గుద్దులాట లెందుకూ?"

"దుడుగూ దుడుగూ మాట లనెయ్యడమేనా, కాస్తేనా నా సంగతి చూడ్డంవుందా?"

"నీ సంగతి కేమమ్మా? వండాలా, వార్చాలా?"

"అదే నయం, మడికట్టుకుంటే చాలా పనులు తప్పించుకోవచ్చు."

"ఇప్పుడయితే మాత్రం, యీ కసిన్ని కందులూ బాగు చెయ్యడమేనా?"

".....కసిన్నిటే యివీ?"

"కసిన్ని కాదు, నాలుగు కుంచాలు, అంతేనా?"

"ఇప్పుడెన్ని గంటలయిందో యెరుగుదువా?"

"రెండే కాదూ? మూడు కొట్టాటప్పటికి యిదయిపోతుంది. తరవాత?"

"ఒక్క గంటలోనా?"

"పోనీ నాలుగింటికి. తరవాత యేం చేస్తావమ్మా?"

"గంధం యెవరు తీస్తారూ?"

"అదెవరికే? బావ నిన్ననే వెళ్ళిపోయాడు కాదూ?"

"అమ్మకీ నాన్నకీని."

"అమ్మ తియ్యమందా?"

"అమ్మకాదు, అమ్మమ్మ."

"అదేమిటే?"

"అదేమిటే అంటే?"

"అమ్మమ్మ చెప్పడానికి–"

"తప్పేం? ప్రేమగల తల్లులు, ముద్దుల కూతుళ్ళకోసం పురమాయించుకుంటారు. చెప్పకుండానే యెందుకు తీశావు కాదని–"

"శాబాస్, పోనీ అరగంటలో అదయిపోతుంది."

"అరగంటకా?"

"వొక్క గంటకే అను. అప్పుడు?"

"మరోపని తగలకపోతే అక్క కూతురి జుబ్బా–"

"ఎంత చెప్పినా చివరి కదేమాట, కాస్తేనా సరసం తెలిస్తేనా? ఇవాళో రేపో వస్తారు మీ బావ. నెల్లాళ్ళ కిందట వచ్చినప్పుడు తెచ్చి యిచ్చారిది. మళ్ళీ వచ్చాటప్పటికే–"

"ఇన్నాళ్ళు చెప్పావుకావేం మరీ?"

"ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. కాకపోయినా, గంట పని, ఎన్నాళ్ళు చెప్పాలే మిటి యీమాత్రం మహాభాగ్యానికి? నువ్వు గట్టిగా తలుచుకుంటే అరగంటకే అయిపోతుంది....కుట్టి పెట్టవే – ఏమే చెల్లీ?"

"కుడతానన్నాను కదూ?"

"ముందు కుట్టాలి ....ఏం?"

"ఏది ముందయినా నా కొక్కటే. అయితే పెద్దక్కకి కోపం రాకుండా చూస్తావా?"

".....నీ యిష్టం వచ్చినట్లు తగలడు. నే నేపని చెప్పినా యింతే నువ్వు. పెద్దదంటే పడిచచ్చిపోతావు. అదీ నువ్వూ కట్టకట్టుకుని గోదావరిలో దిగండి. కాస్త రైక భాగ్యానికి – నేను కుట్టుకోలేక నమకుంటున్నావు కాబోలు పాపం. నువ్వీ మాత్రం సాయం చెయ్యకపోతావా అని ఆసపడ్డందుకు – పోనీ, రేపు సాయంత్రానికి తప్పకుండా కుట్టేస్తావా?"

".....ఆ"

"వీలయితే రేపు పొద్దున్నే కుట్టెయ్యి. కొత్తచీర కట్టుకుని పాప సోదెమ్మ అత్తగారి యింటికి వెడదామని – దానిమీది కిదెంతో బావుంటుంది. కదుటే చెల్లీ?"

"చెల్లాయికి తల అంటడమూ, తమ్ముడికి తల దువ్వడమూ, అక్క కూతురి పక్కగుడ్డలు –"

"అవెంతసేపే?"

"మరి దూడల సాల?"

"బాగుచేస్తా వనుకో!"

"పాలు?"

"పితికేస్తావు. దానిమీద పడేస్తావు. చల్లకూడా అయిందనిపించేస్తావు. నాన్న పంచె వుతికి ఆరేస్తావు. ఇంతేనా? ఇంకేమిటమ్మా?"

"అవన్నీ నీకెందుకు, నేను చూస్తాను కాదూ?"

"చూస్తానేమిటి, చేస్తానను."

"అంటే చేసినట్టూ, అనకపోతే మానేసినట్టూనా?"

"సరే, యేం నంగనాచివే మమ్మా?"

"......"

"ఎంత కటికతనమే మా తల్లీ?"

"......"

"ఎంత బతిమాలినా గిజా అనే – అయితే రేపు సాయంత్రానికి తప్పకుండా కుడతావా?"

"కుడతాను."

"మరిచిపోకు సుమా! అసలు, మధ్యాహ్నం భోజనాలు కాగానే నీదగ్గిరే పడుకుంటానులే నేను. దిక్కుమాలిన యెండలు ముదిరిపోవడంవల్ల తిండి తినగానే కసింతసేపు నిద్రపోతేగాని – మళ్ళీ లేచాటప్పటికి కుట్టేస్తావు, కాదుటే?

"......"

"మీ బావ యెంతో మెచ్చుకుంచారు నిన్ను. మాకు వుద్యోగం అయ్యాక నువ్వు వచ్చి మాదగ్గిర వుందువుగాని. ఏం, వుంటావా?"

"......"

"మాట్టాడవేమే?"

"మాట్టాడ్డం యెందుకూ? ఎవరిదగ్గిరా వుండకపోతే రోజు లెలా వెడతాయీ నా బతుక్కి?"

"ఎంత మాటన్నావే దిక్కుమాలినదానా? నీకంత నీరసంగా వుందా నే నంటేనూ? నువ్వు రాకపోతే నేను చేసుకోలే ననుకుంటున్నావా? అసలు వంటలక్కనే పెట్టేసుకుంటాము మేము, ఒకళ్ళ అవసరమే మాకు లేదు."

"......"

"తోడబుట్టినదానవు కదా – గతిలేనిదానవు కూడా కదా అని – రేపు కుట్టకపోతే అమ్మమ్మతో చెబుతా నేమనుకున్నావో మరి?"

"......"

"వోస్! మాట్టాడితే కంటనీళ్ళు. ఎవరికీ భయం లేదు."

"......"

# 3

"జుబ్బా యెంతవరకూ – ఇంకెందుకే గంధం?"

"పూసుకోడానికి."

"ను – ఎవరూ?"

"అమ్మా, నా –"

"మళ్ళీ యెప్పణ్ణుంచే?"

"ఎప్పణ్ణుంచో, యెందాకానో నాకు తెలియనూ తెలియదు. తెలియనూ అక్కర్లేదు. నీకు కావలిస్తే అమ్మమ్మని –"

"ఆవిడ పురమాయించిందా?"

"అవును."

"....సరే, అదంతా నాకెందుకుగానీ – సగమేనా కుట్టావా జుబ్బా?"

"కత్తిరింపు లయినాయి."

"సెబాస్! పదకొండున్నర కనగా యిస్తే యిప్పటికి కత్తిరింపులా అయినాయి?"

"అవయినా అయినందుకు–"

"సంతోషించమంటావా? నా పనంటే నీకంత వేళాకోళమూ, వెక్కిరింతగానూ వుందా?"

"....."

"ఎందుకమ్మా అలా చూస్తావూ? ఈ కాస్తకే యింత రోషం వచ్చేదానవు, మరి, సగంసగమే చేసి యెందుకు మానేశావూ?"

"అయ్యో, నా బతుక్కి రోషం కూడానూ. ఎవళ్ళేపని చెబితే అది పుచ్చుకోవాలిగాని, లేకపోతే–"

"ఇంకా యెవరెవ రేమేం పనులు చెప్పారూ?"

"నువ్వా అలా వెళ్ళావు, నాలుగు కుంచాల కందులతట్టా వచ్చి నా నెత్తికెక్కింది."

"అయితే?"

"అయితేనా?.....చచ్చి దోరి అది దింపేసుకుని యిదిగో సానదగ్గిర కూచున్నాను."

"ఇదయ్యాకా?"

"......"

"నాలుగు తిప్పులు తిప్పుతావు గిన్ని, గి–గ్రున నిండి చక్కాపోతుంది. తరవాత యేం చేస్తావమ్మా?"

"....ఇప్పటికి నీ కూతురి జుబ్బా మాత్రమే కనపడుతోంది, మరో పనేదీ తగలకపోతే అదే చేస్తాను"

"తప్పకుండా చేసిపెట్టు. ఇదెంతసేపులే? తరవాత యెవరికీ తెలియకుండా జుబ్బా పుచ్చుకుని డాబామీద కూచో, యించక్కటి గోదావరి గాలి వస్తుందక్కడికి."

"గాలికోసం డాబామీదికే వెళ్ళనక్కర్లేదు. నే నెక్కడుంటే అక్కడే కావలసినంత తానూ."

"ఇక నీయిష్టం. ఊరికే నీ సుఖంకోసం చెప్పాను గాని; నాకు కావలసింది జుబ్బా కుట్టెయ్యడమే. అయితేనూ, చిన్నక్క యేమిటీ యిచ్చి వెళ్ళిందిటా?"

"దానికి రైక కుట్టి పెట్టాలిట!"

"తనకి చేతకాదటనా?"

"......."

"దొరగారు దయచేస్తారటనా?"

"......."

"నే నిచ్చినప్పుడే యివ్వాలి కామోసునటనా?"

"......."

"అయితే దానిక్కూడా చింపు లయినాయటనా?"

".........."

"వులిక్కిపడి చూడనక్కర్లేదు. అబ్బో, నీ గుణం నాకు తెలియదనుకున్నావేం? అదంటే నీకు దిక్కుమాలిన అభిమానం. అంచేత నేను ముందిచ్చిన పని మానేసి అది మొదలుపెట్టావు."

"చూసీ చూడని మాటలు–"

"చూడనే అక్కర్లేదు. లక్షమాట్లు చూశానుకూడా. దాని మొగుడు ఇంగ్లీషు చదువుతున్నాడని – ఇంకా నాలుగేళ్ళక్కాని బి.య్యే కాడుట. అదయినా యీమధ్య ఫేలయిపోకుండా వుంటేట. మీ బావ చెప్పారు చాలా మాట్లు. బి.యే. అయితేగాని – అయినా యీ రోజుల్లో లాభం లేదుట."

"చెప్పేదేమయినా వినిపించుకోడం....."

"ఇంకా చెప్పడం యెందుకూ, యీమాత్రమూ తెలియదనుకున్నావా? నువ్వెప్పుడూ దానికోసం దొర్లిపోతావు. నాకంటే నీకదేమీ వొరగబెట్టదు."

".........."

"చంటిపిల్లే యెక్కువో, తాడిచెట్టులాగ కాపరం చేసేదే యెక్కువో కనిపెట్టలేక పోయావు."

"........."

"తండ్రి తెచ్చిన గుడ్డ, పింతల్లివి నువ్వు కుట్టిపెడతావని – చూడవే నీ కేసి యెంత ఆశగా చూస్తోందో నా రత్నాల మూట?"

"దిక్కుమాలిన పిన్ని, చచ్చిపోయిన పిన్ని, నాకేసి చూస్తే యేం వుంది తల్లీ......మామ్మే, మా తల్లే! నామీద వాల్తావు, మీ అమ్మదగ్గిర నే నెంతటిదాన్ని కన్నా? జుబ్బా కుట్టిపెడతానమ్మా! రాత్రి తిండేనా మానేసి కుట్టిపెడతాను. ఏం, సరా?"

"చేరదీసినవాళ్ళని పట్టుకుని పాకులాడుతారు పిల్లలు. నీకు తెలిసింది కాదు గాని, నా పిల్ల నీ పిల్లే అనుకుంటే యెంత బాగుంటుందీ? ఇలా అయినవాళ్ళు లోకంలో అక్కల పిల్లల్ని పెంచుతూ యెందరు సుఖపడ్డంలేదూ?"

"........"

"చిన్నక్కలాగ మాయమాటలు చెప్పడం నాకు చేతకాదు. నువ్వంటే నేనెంత అభిమానపడి ఛస్తానో – యెందుకూ చెప్పుకోడం? నువ్వు నాతో మా యింటికి వచ్చావంటే నిమిషంలో లేవగొట్టెయ్యనూ మా అడబడుచునీ? నా యింటి పెత్తనంకూడా నీ కిచ్చెయ్యనూ?"

"........."

"నువ్వు చేసే చాకిరీచూస్తే – నువ్వు పిల్లని చూసుకుంటూ వుంటే నీకొక్క పని చెబుతానా నేను?"

"........."

"ఇంచక్క మాధవస్వామి గుడి మా యింటి కెంతో దగ్గిర. రోజూ వెళ్ళి పురాణం – అంతకంటే నీకు మరేంకావాలీ? గుప్పెడన్నమూ, చారెడు బట్టా – నీకు లోటు చేస్తానా నేను? తాళాలు నీ చేతికి యిచ్చేస్తారు మీ బావ. నెల్లాళ్ళు తిరిగారంటే దోసెడేసి రూపాయలు. నోములూ, వ్రతాలూ కాశీరామేశ్వరాలూ – వో! నీ కడ్డేమిటీ నా యింటోనూ?"

"........"

"చిన్నక్కతో వెడదామని వుబలాటపడుతున్నావేమో, అది నిన్ను తీసుకువెళ్ళదు. వొంటెత్తు పీనుగు అది, నీకు అన్నంకూడా పెడుతుందా? కాకపోయినా పెట్టడానికి దానికేం వుందీ? పాస్ పీస్ మంటూ యింగ్లీషేగాని భూమేదీ? రెండెకరాలేనా? అదేనా మెరక. మాది పదెకరాల చెరువు కింది పల్లం. ఇంతకీ దాని మొగుడు – అలాంటిచోట నువ్వుండగూడదు."

"........."

"నువ్వేనా వూహా తెలిసినదానవుగాని చంటిపిల్లవుకావు, బాగా ఆలోచించుకో."

"........"

"ఈ మాటలు చిన్నక్కతో అన్నావు సుమీ! వో–ర్థి కజ్జాగోరు పీనుగు. నన్నేం చెయ్యగలదు గానీ – అయినా యెందుకూ?"

"........."

"చెప్పవేం?"

"అలాగే."

"నే నొక్కమాటు వాళ్ళ సుందరమ్మగారి యింటికి వెళ్ళివస్తాను, యిదయిపోగానే జబ్బా కుట్టేస్తావు కాదూ?"

"..........."

"మాట్లాడవేమే?"

"వెళ్ళిరా."

"మనం మళ్ళీ వచ్చాటప్పటికి పిన్ని నీకు జుబ్బా కుట్టేస్తుంది, వెంటనే నీకు తొడిగేస్తానది, ఇవాళ రాత్రి దాని పక్కలో పడుకుందువుగాని నువ్వు ఇంచక్క ......ఏం తల్లీ..."

"........."

# 4

"నువ్విక్క డున్నావూ? మహా బాగా దొరికావులే."

"గంధంపు గిన్ని పడిపోతుంది, దూరం దూరం."

"పడిపోదే...... పోనీ, దూరంగానే ......ఏం?"

"ఊఁ."

"నేను సాయం పట్టనా?"

"అక్కర్లే దయేపోయింది. ఈ వాయి వొక్కటీ తీస్తే గిర్రున నిండిపోతుంది గిన్ని."

"అయితే వొక్కమాటు లేవే. ఏమే అక్కా?"

"ఎందుకూ?"

"పనుందే."

"ఏమిటమ్మా ఆ పనీ?"

"ఇంచ–క్కట్టి పని, మాం–ఛిపని, చేసిపెట్టవూ?"

"ఏమిటో చెప్పు."

"చేస్తాననూ."

"ముందు చెప్పమన్నాను కాదూ?"

"చెబితే చేస్తావా?"

"నేను చెయ్యగలదయితే చేస్తాను."

"చూా–శావా? ...... నో రూరిపోతోందే."

"ఏమయినా కొనుక్కున్నావా?"

"డబ్బేదీ?"

"అమ్మ నడగలేకపోయావా?"

"అడిగాను. ఇస్తానంది. ఇవ్వబోయిందికూడాను. ఇంతలో అమ్మమ్మ ముండ–"

"తప్పుతప్పు, ఏమిటా తిట్లు?"

"మరి – మరి – ఇచ్చేవాళ్ళని చెడగొట్టడమేం? ఆ డబ్బుంటే మా బువ్వాలాట యెంత బాగుండునూ?"

"ఎవరెవ రాడుకుంటున్నారూ?"

"వాళ్ళ వెంకట సుబ్బులూ, వాళ్ళ బుచ్చెమ్మా, వాళ్ళ లక్ష్మీరాజ్యమూ, వాళ్ళ గవిరిముండా –"

"ఛీ! ఛీ! ఏమిటలా అయిపోతున్నావు చివరికి?"

"మరి వొట్టి చేతులతో రావడమేం?"

"తక్కినవాళ్ళేమి తెచ్చారూ?"

"సుబ్బులు డబ్బు కారపు సెనగపప్పు తెచ్చింది. బుచ్చెమ్మ డబ్బు వేరుసెనక్కాయలు తెచ్చింది. రాజ్యం పే-ద్ద కొబ్బరిపెచ్చు తెచ్చింది."

"ఉహూ."

"నన్ను డబ్బు బెల్లంముక్క తెమ్మన్నారు."

"కొనడం యెందుకూ, అమ్మ నడుగు యిస్తుంది."

"నువ్వియ్యి."

"నే నివ్వకూడదమ్మా!"

"చూ-శావా? .......ఇవ్వవుటే అక్కా?"

"చెప్పినమాట విను. ముందు దూరంగా వెళ్ళు."

"అయితే, యేడుస్తా నేమనుకున్నావో."

"........."

"లేకపోతే తిట్టేస్తాను."

"నువ్వేం చేసినా నేనివ్వను, ఇవ్వకూడదు."

"వంటింటో యెవరూలేరే, అంతా వాకిట్లో వున్నారే, నాకు గొళ్ళెం అందిందికాదు, నేనే తీసుకుందునే!"

"........"

"ఇవ్వవ్?"

"ఇవ్వను."

"ముచ్చెం మూడు మాట్లా అడుగుతాను."

"......."

"అడిగేస్తా."

"......."

"ఇవ్వవ్? ఇవ్వవ్? ఇ-వ్వవ్?"

"......."

"ఇంకొక్క మాటడుగుతాను, ఇస్తావా యివ్వవా?"

"......."

"సరే, మాట్లాడకు. ఇలా వుందా నీ పనీ......"

"......అయ్యో! అయ్యో! గంధపుగిన్ని పట్టుకుపోతావుటే? అమ్మమ్మతో చెప్పనా?"

"చెప్పకో...చెప్పకో...చెబుతావేం?...ఏం?"

"...రామా! రామా! గిన్నెడు గంధమూ నేలపాలు చేసిందోయ్ తండ్రీ! ఇప్పటికే నా రెక్కలు పడిపోయాయోయ్ నాయనా! ఒక్కచుక్కయినా పనికిరాదోయ్ బాబూ! వోయి దేవుడా –"

"అలా యేడు. అలా కూలబడు. ఏం, నన్నేడిపిస్తే వూరకుంటాననుకున్నావేం?"

"........."

## 5

"ఏం చేస్తున్నావు రుక్కూ?"

"ఇప్పుడే గంధం యింటో పెట్టేసి వచ్చి కూచున్నాను, పెద్దక్క కూతురు జుబ్బా కుడదామని."

"దాని కిప్పుడేం తొందరా?"

"ఎవళ్ళపని వాళ్ళకి తొందరే. ఇంకా పూర్తి చెయ్యలేదా అని క్షణం కిందటే సాగతీసుకు వెళ్ళిందది."

"తేరగా చేసేవాళ్ళు దొరికితే సరి, తనేం చేస్తుందిట?"

"అడగలేదు."

"అడగనేవద్దు. అది యింటో పడేసి చక్కారా."

"ఎందుకూ?"

"చెబుతా, ముందు పడేసిరా."

"పడేస్తాను చెప్పు."

"కందులు వేయించాటప్పటికి అమ్మమ్మకి వొళ్ళు హూనం అయిపోయింది."

"ఊఁహూ."

"నన్ను మీ నాన్న తలంట మంటున్నారు. నేనే కాని పనికిరాదుట."

"ఊఁహూ."

"అమ్మమ్మ తనకి వుప్పుపిండి చేసుకుంటుందిట."

"......."

"నువ్వు వంట చెయ్యాలి."

"......."

"ఏం, అలా తెల్లపోతావేం?"

"......."

"ఇవాళకే, రేపు నేనే మడి కట్టుకుంటానులే."

"కందులు బాగుచేశాటప్పటికీ, రెండుమాట్లు గంధం తీశాటప్పటికీ నాకు రెక్కలు పడిపోయాయే అమ్మా!"

"రెండు మాట్లా మూడు మాట్లానూ. ఏం, అంత రెచ్చగొట్టడమేం దాన్నీ?"

"......."

"ఇంతకీ పొయిదగ్గిర కూచోడమే కాదూ, రుబ్బాలా, పోటు వెయ్యాలా?"

"......."

"అరటికాయ పప్పులో వేసి, వంగవరుగూ మునక్కాడలూ పనసపెచ్చూ బెండకాయా వేసి పులుసు చెయ్యి."

"పెద్దక్కనైనా చిన్నక్కనైనా చెయ్యమనరాదుటే?"

"వాళ్ళెందుకు చేస్తారమ్మా మనకి? ఇక్కడ మనం చెడితే అక్కడ వాళ్ళ మొగుళ్ళ కేం కోపం వస్తుందో? అత్తగార్లేం దెప్పుతారో"

".........."

"వాళ్ళంతటివాళ్ళు వాళ్ళూ, మనంతటివాళ్ళం మనమూనూ, మనకి వోపిక వుంటే పెట్టాలి, లేకపోతే పంపెయ్యాలిగాని పని చెప్పగూడదు."

"........"

"అప్పుడే అరయిపోయింది. లే, కూచోకు. మీ నాన్న పెందరాళే వంట కావాలంటున్నారు. ఆ గుడ్డ అవతల పడేసి – ఇంకా చూస్తావేం?"

".........."

"చద్దాన్నాల్లోకి వుండాల, మామిడికాయల పచ్చడి మాత్రం – తెలిసిందా? అమ్మమ్మ నడుగు, ఎన్ని కాయలు చెయ్యాలో చెబుతుంది."

"..........."

"అన్నట్టు పొక్క చెక్కపేడైనా లేదుకింద. చీకటి పడకుండా తొరగా చిట్టటకయెక్కి, నాలుగు పూటలకి సరిపడేవి తీసి, చూరులో పెట్టాలి. మరిచిపోకు."

"........."

"అమ్మమ్మ కొయ్యరొట్టె చేసుకుంటానంటే కొబ్బరికాయ కొట్టి ముక్కలు తరిగి ఇయ్యి. పచ్చట్లోకూడా – వినపడుతోందా యేమయినా?"

"........."

"లేవా లేవాలి, కూచుంటేకాదు......"

".......స్స్, రామయ్యతండ్రీ, నా బతుకిలా వెళ్ళిపోవాలసిందేనా మహాప్రభూ?"

## 6

"ఏయ్, ఎవరు వంటింటో?"

"నేనురా తమ్ముడూ!"

"నిమిషంలో అన్నం పెట్టెయ్యాలి నాకు."

".........."

"మాట్లాడవేం? సినీమాకి వేళ అయిపోతుంది, తొరగా వడ్డించెయ్యాలి."

"అంత తొందరయితే –"

"తొందరన్న తొందర కాదు, కంచం పెట్టుకోనా, ఆకు వేస్తావా?"

"ఇంతసేపటిదాకా యేం చేస్తున్నావురా?"

"డబ్బులు చూసుకోవాలా మరీ?"

"ఇప్పుడా డబ్బులు చూసుకోవడం?"

"తెల్లవారింది మొదలు అడుగుతున్నాను. మూడు గంటలికి వొప్పుకుంది అమ్మ కాని; వెధవ అమ్మమ్మ–"

"ఆ,ఆ."

"నా సినిమా డబ్బు అడ్డుకొడితే వూరుకుంటానేం?"

"........"

"అలా నుంచుంటావేం వడ్డించక?"

"ఎసట్లో బియ్యం పొయ్యలేదురా మరీ."

"ఇప్పటిదాకా యేం చేస్తున్నావూ? వెధవది – రెండో ఆటకి వెడితే రేపు చదువు పాడయిపోతుంది. ఇప్పుడేనా బియ్యం పోసెయ్యవేం?"

"ఎసరు కాగందే?"

"నీ మొఘంలాగే వుంది, మరెలాగా యేడవడం?"

"పొడి అన్నం వుంది, తింటావా?"

"అఘోరించినట్టుంది నీ మాట. పోనీ అదే –"

"చిన్నక్కనైనా, పెద్దక్కనైనా పెట్టమను."

"వాళ్లు రారట. వాళ్ళకి తీరుబడి లేదుట."

"ఏం చేస్తున్నారూ?"

"చిన్నక్క మల్లెమొగ్గల దండ గుచ్చుకుంటోంది. పెద్దక్క యెదటింటి శ్యామాలాంబగారితో గవ్వలాడుకుంటోంది – నువ్వే పెట్టాలి."

"నేను ముట్టుకోగూడదురా!"

"అయితే తగలడు, వెధవ ఆచారమూ నువ్వూనూ."

".........."

"లేకపోతే పదిన్నరదాకా మేలుకొని వుండు."

"స్నానం యెలాగా చేస్తుంది కనక, అమ్మమ్మ పెడుతుందేమో వెళ్ళి అడిగిరా."

"నా కక్కర్లేదు?"

"ఏం?"

"ఆవిడ కళ్ళుపడితే అన్నం జీర్ణంకాదు."

"........"

"పనసపెచ్చు ముక్కలూ, మునక్కాడ ముక్కలూ నాకు చాలా అట్టే పెట్టాలి సుమా! లేకపోతే చితక్కొట్టేస్తా – నేమనుకున్నావో?"

## 7

"ఇవాళ నువ్వు మడికట్టుకున్నా వేమమ్మా?"

"అమ్మ కట్టుకోమంది నాన్నారూ!"

"పెద్దక్క యేం చేస్తోంది?"

"ఏమోనండీ!"

"చిన్నక్కో?"

"ఏమోనండీ!"

"మీ అమ్మమ్మో?"

"చివరికదీ మాట. అందరికళ్ళూ తిరిగి తిరిగి నామీద పడతాయి. పనిదగ్గిరికి వచ్చాటప్పటి కొక్కళ్ళూ నన్ను మరచిపోరు. నే నలాంటి పుణ్యం చేసుకున్నాను కామోసు! అయితేనూ, యేమోయ్? నాలుగు కుంచాల కందులు వేయించి, నడుం లాక్కుపోయి, ముద్దయి పోయి, వోమూల కూలబడ్డాను కదా, నేనింకా వండి వడ్డించగలననే అనుకున్నావుషోయ్?"

"ఆ సంగతి నాకేం తెలుసునండీ?"

"ఇదేకాదు, యింటిసంగతులే యేమీ తెలవడంలేదు నీకు. భోజనం చేస్తావు, వూళ్ళో తిరిగి తిరిగి మళ్ళీ వంట అయ్యాటప్పటి కింటికి చేరుకుంటావు. లేకపోతే ముసుగు తన్ని – చెయ్యలేక నేను చచ్చిపోతున్నాను –"

"మీ అమ్మాయి యేం చేస్తోందీ?"

"అది వూరికే కూచుంఛోందనా నీ వూహా?"

"........."

"వంటలోకి రాదు కాని, పై పనంతా యెవరు చేస్తున్నారో నీకేమయినా తెలుసూ?"

"........"

"అయినా, నా శక్తి సన్నగిల్లిపోయింది. నా రెక్కలు మూలపడ్డాయి. మునుపటిలాగ నేనిక చెయ్యలేను. దీనికి నువ్వేమయినా వుపాయం చూడాలి."

"రేపు డాక్టరు బ్రహ్మానందంగారికి కబురు చేస్తాను –"

"శాస్త్రం చెప్పిన తరవాయిగా వుంది నీ మాట. కాటికి కాళ్ళు చాచుక్కూచున్న దానికి నాకు వైద్యాలేమిషోయ్ యిప్పుడూ?"

"పనిమాట దేవు డెరుగును, మీరు సుఖంగా తిని కూచోడానికయినా శక్తి వుండాలా?"

"పని చెయ్యడం కష్టంగా వుందిగాని నాకేం తెగులా? పైపని కేమీ బాధ లేదు. వంట దగ్గిరే వస్తోంది."

"మీ అమ్మాయి వంటే చెయ్యరాదూ, పైపని రుక్కమ్మకప్పగించి?"

"చెప్పాను కాదూ? అది తెముల్చుకోడం మాత్రం మాటలా? కాకపోయినా, తలచెడ్డవాళ్ళిద్దరింటో వుండగా పునిస్త్రీపడుచు మడికట్టుకోవడం యేమిషోయ్?"

"........."

"లోకంలో ఎక్కడైనా వుందిషోయ్ యీ సటటూ?"

"........"

"పైగా, పదిహేను రోజులమంచి మా అమ్మకి అన్న హితవు లేదు కూడానూ?"

"అయితే, అప్పుడప్పుడు వండిస్తూ వుండండి రుక్కమ్మచేత, రోజూ మాత్రం వద్దు."

"అయితే నా మాట?"

"అంటే?"

"నీకింత తెలియకుండా వుందేమిషోయ్? అది చేసిన వంట నన్ను తినమంఛావా యేమిషోయ్? అయ్యో, నా గ్రహచారామా?"

"........."

"నేను పొయ్యిదగ్గిర పడి దేవుళ్ళాడడం యెలాగా తప్పనప్పు డిక అదిన్నీ మడికట్టుకున్న అందం యేమిషోయ్?"

"........."

"దానివల్ల నాకు వొరిగింది మాత్ర యేమిషోయ్?"

"అయితే, నన్నేం చెయ్యమంటారూ?"

"నా నోటితో చెప్పించుకోవాలని వుందా?"

"........"

"నిజంగా నీకు ఆలోచనే తోచలేదంటావా?"

"తోచలేదు."

"అయ్యో?"

"........"

"ఎప్పే చదివావు కదా–"

"మీరు చెబితే యేం?"

"అయితే విను చెబుతా. దాని బతు కంతా తెల్లారేపోయింది, ఇంకేమున్నా లేనట్టే."

"కనక?"

"ఎప్పుడో వొకప్పు డెలాగా తప్పదు. రోజులు గడవడమేకాని లాభం యేమీలేదు."

"అయితే .......ఏమిటి చివరికి?"

"తల అంటుకోనా? దువ్వుకోనా? జడ వేసుకోనా? యింకెందుకోయ్ దానికా దిక్కుమాలిన జుట్టు?"

"–అదేమమ్మా పులుసు కింద పోసేస్తున్నావూ?"

".....గరిటె వేడిగా వుండడంవల్ల చెయ్యి వొణుకుతోంది నాన్నారూ!"

"ఇందాకా రామదీక్షితులుగారి నడగ్గా యెల్లుండి దశమినాడు మంచి దన్నారు. కోటిలింగాలికి వెడితే వొక్కనిమిషం పనీ."

"......."

"నువ్వు కాస్తదూరం ఆలోచిస్తేకాని వీలులేదు. మొగుడు చచ్చిన పడుచుపిల్లలికి మంచిరోజులు కావివి. మొన్ననే వీరేశలింగం తోటలో వొక వెధవపెళ్ళి అయిందిట. ఇంక నలుగురు వెధవకొడుకులకోసం వెతుకుతున్నారట ముండల్ని తోటలోవాళ్ళు.

ఒక ముహూర్తం లేకుండా, వొక సమయాసమయాలు చూడకుండా, యే క్షణంలో దొరికితే ఆ క్షణంలో చేసేస్తున్నారట పెళ్ళిళ్ళు. తరవాత యేమనుకున్నా యిక కలసిరాదు సుమా?"

"పదిహేడేళ్ళయినా యింకా నిండలేదుకదా –"

"అయితే? ఎన్నేళ్ళు నిండితే యేమిటి? కాకపోయినా, పదిహేడేళ్ళు నిండలేదు కనకనే పాడు బుద్ధులేమీ పుట్టకుండా జాగ్రత్తపడాలి వెనకాలవాళ్ళు."

"........"

"అమ్మ పేరు కదా అని, గారాం చూపిద్దా మనుకుంటున్నావేమో, యిది కొరివితో తల గోక్కోవడం కాని మరోటి కాదు."

"మీ అమ్మాయి యేమంటుంది?"

"దానిమా టెందుకూ నీకూ?"

"అయినా –"

"ఎంత అవసరం వచ్చినా తల్లిపీనుగు నోటితో చెప్పగలదుషోయ్ ఆ మాట."

"నేను మాత్రం?"

"మొగరాజువు నీకేం? కాకపోయినా, యెవరికీ బాధ లేకుండా నేనున్నాను కాదూ, మూడోకంటివాడికి తెలియకుండా తెల్లవారాలప్పటికి చేయించెయ్యడానికీ!"

"......అదేమమ్మా, నీళ్ళలా వొలకబోశావూ?"

"......నేతిజిడ్డు మూలాన చేతిలో చెంబు జారిపోయింది నాన్నారూ!"

"చూశావా?......విన్నావా? ఇదీ వరస. ఒక్కపని చేతకాదు. చేసినంత మట్టుకయినా వొబ్బిడీ, నిదానమూ లేదు. తేరగా తిని కూచ్చున్నట్టే వుంటుందా వండి వడ్డించడం అంటేనూ?"

"......."

"మాట్టాడవేమోయ్?"

"ఏమనమంటారండీ?"

"ఏమనమంఛానా?.....నువ్వూరుకుంచే నేనూరుకుంఛా ననుకున్నావా?"

"........"

"వీధికి వెడితే పెద్దలందరూ నా గుడ్లు పీకేస్తున్నారు. తెలుసా నీకేమయినా?"

"........"

"దేనికీ మాట్టాడవు కనక దానికీ మాట్టాడకుండానే వూరుకో నువ్వు. చేస్తేగాని ఆగిపోయేదేమీలేదు"

"........"

"రేపు లేదెల్లుండి దశమీ బుధవారం తప్పదు. నీకిదే చెప్పడం, ఏమనుకున్నావో."

"......."

"వినపడిందిషోయ్?"

"చెవుల్లో వోరు పుట్టుకు వస్తూవుంటే వినపడకపోవడం యేమిటండీ?"

"నువ్వు మహా పేపరు చదివి ఏడిశావు!"

"నే నాంధ్రపత్రిక రోజూ చదువుతాను. మా యింటిదగ్గరవాళ్ళకొస్తుంది."

రెండోబెల్లు ఖంగు ఖంగుమని ప్రారంభమైంది.

నరశింహానికి శకుంతల మొహం చూడ్డానికి లజ్జవేసింది. వాడు చదువూ సంధ్యారాని దద్దమ్మ. వాళ్ళతోపాటు సంభాషించడానికి తాహతులేక తల వాల్చుకుని మౌనవ్రతం పట్టేడు. తన హనావా పంట్లాము ధగధగలాడుతున్నా, కృష్ణుడి కుళ్ళు నిక్కరు కనబడుతున్నా వాడికి తక్కువతనం పట్టుకుంది. రెండోబెల్లు కాగానే చల్లగా బడిలోకి జారిపోయాడు.

"బెల్లయింది, బళ్ళోకిరా!" అన్నాది శకుంతల.

"నేను సోమవారంనుంచి వస్తాను" అన్నాడు కృష్ణుడు.

"ఫోర్తుఫారమ్‌లో నీ పని చెపుతాను. ఒక్క ఫస్టుమార్కు రానివ్వను."

"ఇహనన్ని ఫస్టుమార్కులూ నీవేలే!"

"ఏం?"

"ఏమీలేదు."

"నువ్వు మా ఇంటికి రావడం మానేశావేంరా? మా అమ్మా, నాన్నా 'కృష్ణుడు రాలేదేమా' అని రోజూ అంటారు."

"ఏమీ లేదు."

"నేను బళ్ళోకి పోవాలి బాబూ!" అని పరిగెట్టింది.

"శకుంతలా?" అని పిలిచాడు.

"ఏం!" అని ఆగింది.

ఎందుకు పిలిచాడు? ఆమెతో నిజం చెప్పేసి దుఃఖోపశమనం చేసుకుందుకా? ఎందుకు పిలిచాడో వాడికే తెలియలేదు.

"ఏమీలేదు" అన్నాడు.

శకుంతల వెళ్ళిపోయింది. ఇద్దరూ ఒక్క ఈడువాళ్ళు. క్లాసుకి వాళ్ళిద్దరే అందరికన్నా తెలివైనవాళ్ళు. ఒకరి నోట్సు ఒకరు పుచ్చుకుంటూ స్నేహంగా వుండేవాళ్ళు. పంతంతో చదివేవాళ్ళు. శకుంతలతో పోటీ కృష్ణుడికి వికాసవంతంగా ఉండేది. శకుంతల దస్తూరీ కృష్ణుడికి జ్ఞాపకమొచ్చింది. ఆమె దస్తూరీ మంచిదికాదు. కొక్కిరిబిక్కిరిగా రాస్తుంది. అతనిది ముత్యాలకోవ.

శకుంతల బడిలోకి పరిగెడుతుంటే కృష్ణుడు స్తంభించిపోయి చూస్తూ నిలబడిపోయాడు. పిల్లల గోలంతా క్రమేణా అణిగిపోయింది. వరండాలన్నీ ఖాళీ అయిపోయాయి. మేష్టర్ల మాటలు ఉండుండి వినబడుతున్నాయి. వేలకొద్దీ విద్యార్థులు డెస్కులుమీదవాలి కూచుని పాఠాలు వింటున్నారు. బడిదగ్గరనుంచి కృష్ణుడు కదలలేకపోయాడు. తన చదువుపోయింది కదా అని కుమిలిపోతున్నాడు స్కూలు వరండాలో కెళ్ళాడు.

"నే నిక్కణ్ణుంచి కదలను" అనుకొని స్తంభానికి జేరబడ్డాడు.

"నే నింటికే వెళ్ళను" అని నిశ్చయించుకొన్నాడు.

నాలుగోక్లాసు దగ్గరనుంచి బడిలో తను చదివిన ఐదేళ్ళ సంగతులూ ఒక్కొక్కటే జ్ఞప్తికి వొచ్చాయి.

ఐదవక్లాసు చదువుతుండగా ఒక పిల్లడు కృష్ణుడు మీద మేష్టరుతో చాడీలు చెప్పేడు. మేష్టరు నమ్మక, అబద్ధాలు చెప్పేడని వాణ్ణే చితకతన్నేడు.

మూడవఫారంలో తెలుగు మాష్టరు "గాంధారపతి" అంటే అర్థం చెప్పమన్నాడు. అంతా నేలచూసి, ఇంటికప్పుచూసి, ధృతరాష్ట్రుడని చెప్పేరు. తనొక్కడే "గాంధార దేశపు రాజు" అని చెప్పేడు.

రెండవఫారం చదువుతుండగా దసరా తరువాత ఒక కుర్రవాడు బడికి రావడం మానేశాడు. వాడి పేరు రోజూ పిలిచి మేష్టరు ఆబ్సెంటు వేస్తూ ఉండేవాడు. ఆఖరికి వాడు చదువు మానేశాడని తెలిసింది. ఆవేళ అటెండెన్సు రిజిష్టరులో వాడి పేరు కొట్టేసి, మేష్టరు "డిస్కంటిన్యూడ్" అని రాసి, ఇంగ్లీషు మాటకి అర్థం క్లాసులో చెప్పాడు. ఆనాటి నుండి కృష్ణుడు "డిస్కంటిన్యూ" అన్నమాటకు అర్థం మరచిపోలేదు. ఆ పదం జ్ఞాపకం రాగానే అతనికి దుఃఖం పొర్లుకుంటూ వొచ్చింది.

"నే నింటికే వెళ్ళను" అని పునఃనిశ్చయించుకొన్నాడు.

"నేను భోజనానికే వెళ్ళను" అనుకొన్నాడు.

అతని మొహం గాలికొట్టిన కొత్త ఫుట్‌బాలులాగ దుఃఖంలో పొంగి కందగడ్డ అయిపోయింది. ముక్కు నీటితో బరువెక్కి దిబ్బడేసిపోయింది. ముక్కు ఎగబీల్చు కుంటూ పొంగుకొస్తున్న దుఃఖానికి ఆనకట్టలు కట్టి దిగమింగుతూ స్తంభానికి జేరబడి పోయాడు.

మొదటి పీరీడైపోయింది. కృష్ణుడు కదలలేదు. వాళ్ళ నాన్న బజారుకి బయలుదేరేడు. వరండాలో కొడుకుని చూశాడు.

"ఒరి వెధవా! చుట్టలు తెమ్మంటే ఇక్కడ దిగమారేవేం?" అన్నాడు.

"చూడు!" అన్నాడు కృష్ణుడు.

"ఏమిట్రా చూడ్డం?" అన్నాడు తండ్రి.

"పాపం, కనబడదు!"

"ఏమిటిరా నీ శ్రాద్ధం?"

"నా శ్రాద్ధమే!"

"ఏమిటిరా!?"

"వాళ్ళంతా బడికెళ్ళారు!"

అప్పుడు తండ్రికి కొడుకు మొహంలో విచారరేఖలన్నీ కనబడ్డాయి.

"వెర్రి నాగమ్మా. అదిరా!" అన్నాడు. కృష్ణుడికి ఆనకట్టలు తెగ్గొట్టుకొని దుఃఖం కొట్టుకొచ్చింది. వెక్కివెక్కి చుట్టుకుపోతూ ఏడుపు మొదలెట్టేడు. కొడుకు బాధంతా తండ్రికి బోధపడ్డాది. కొడుకు బాధంతా తండ్రి పడ్డాడు.

"చదువు మానిపించానని అంత బాధపడుతున్నావా? బడివరండాలు పట్టుకుని దేవుళ్ళాడుతున్నావా నాయనా? పద ఇంటికి!" అన్నాడు.

"నే న్రానూ!" అని భూమి బద్దలైపోయినంత గట్టిగా అరిచేడు.

"ఏం చేస్తావురా?"

"గోడకేసి బుర్ర బద్దలుకొట్టుకొంటాను!" అని ఇంకా గట్టిగా అరిచేడు. అంతపనీ చేస్తాడేమోనని వెళ్ళి తండ్రి కౌగలించుకొన్నాడు.

"పద నాయనా, ఇంటికి!" అన్నాడు.

"బడె నాది!" అని గట్టిగా కేకేశాడు.

"నీదేనురా బాబూ!"

"బడిలోకి తీసికెళ్ళు మరి."

"తల తాకట్టు పెట్టుకునేనా బళ్ళో వేస్తాను, ఇంటికి పద."

"ఇప్పుడే వెయ్యి!"

"డబ్బు చూసి వేస్తాను."

"ఇంటికివెళ్ళి లేదంటావు."

"అన్ను రా!"

"ఐతే పుస్తకాలు ముందు కొను!"

"వెర్రి నాయనా! వాటికి మాత్రం డబ్బొద్దూ!"

"ఒక్క పుస్తకం కొను."

"ఏ పుస్తకం కొనమన్నావు?"

"ఇంగ్లీషు పుస్తకం కొను."

"కొందాం, పద. విడవకు నాయనా, నే చచ్చిపోయాను, విడవకు!" అన్నాడు తండ్రి. తండ్రి చెయ్యిని చంకలో పెట్టుకొని గిలగిల కొట్టుకొని విడుస్తూ బడిలో స్టోర్సుకి తోవతీశాడు.

తండ్రి దీర్ఘంగా ఆలోచించాడు. చుట్టలు మానేద్దా మనుకొన్నాడు. ఎంత మానుదా మనుకొన్నా మానలేక పోతున్నాడు. చుట్టలు మానేస్తే కృష్ణుడి జీతానికి సరిపోతుంది! ఇంకోవిధంగా పాలుపోలేదు.

"ఇందాకా చుట్టలకిచ్చిన డబ్బులున్నయా, పారేశావా?" అనడిగేడు కొడుకుని.

"ప...ప్ప...ప్పారేలేదు. జేబులో ఉన్నాయి....ఎందుకు పారేస్తాను నాన్నా?" అన్నాడు కృష్ణుడు.

● *భారతి, 1945* ●

* * *

9

సురవరం ప్రతాపరెడ్డి

# వకీలు యెంకయ్య

సుమారు 40 ఏండ్ల కిందటి విషయం. ఆ కాలములో వకీళ్ళంటే గొప్ప అధికారు లన్నమాట. చాలా గ్రంథాలు కూడా చదువవలసినవి లేకుండేది. ఏవో రెండు ఉర్దూ మాటలు మాట్లాడి రెండు లావు పుస్తకాలు చంక పెట్టుకొని బడారులో తిరిగినవాడంతా వకీలు అనుకునేది. మన యెంకయ్య అస్సలు పేరు వెంకటరెడ్డిదొర. అతడు సన్ 1277 ఫసలీలో పాలమూరు జిల్లాలోని (ఇప్పుడు దాన్ని మహబూబునగర మంటారు.) సింగారము అనే గ్రామములో జన్మించినాడు. తల్లిదండ్రులు బీదవారు. రెండుకాండ్ల సేద్యము. మామూలి జీవనము. అప్పుసప్పు లేకుండా బ్రతికినవాళ్లు. నంబి రంగయ్యబళ్ళో భారతము, భాగవతము చదువడము, వ్రాయడము, చిక్కు ఉత్తరాలలో చిక్కులు విడదీయడము, వడ్డీ లెక్కలు సరిగా వేయడము, అప్పు పత్రాలు వ్రాయడం, ఇవి 15 ఏండ్ల వయసు వచ్చేవరకు నేర్చుకున్నాడు.

ఇట్లా వుంటే వకనాడు ఇంట్లో వెంకటరెడ్డికి అతని తండ్రికి మాటలు జరిగినవి. తండ్రి చాలా కోపగాడు. నా ఇంట్లోనుండి తక్షణం వెళ్ళిపో అన్నాడు. వెంకటరెడ్డి మర్నాడు తెల్లవారేవరకు ఇంట్లో లేడు. తండ్రి యేమిన్నీ చింత చేయలేదు. తల్లిమాత్రం చాటుకు కన్నీరు రాల్చింది.

☆ ☆ ☆

ఆ కాలంలో హైద్రాబాదులో వకాలతు చేసేవాళ్లు పల్లకీలలో పొయ్యేవారు. ఖాజా కమాలుద్దీన్ దెహెలవీ అనే అయనకు జేనడుగడ్డం, రంగు వేసినందున అది మొక్కజొన్న పీచువలె వుండేది. పెద్ద పగిడి. మర్యాదకు తగినంత పెద్ద పొట్ట. ఇంచుమించు భూమికి తగిలే అంత పొడవైన షేర్వాని. ఎఱ్ఱని మనిషి, ఎత్తైనవాడు, పిల్లి కండ్లు. ఇతనికి నెలకు 2000 రూ. ఆదాయము. ఫౌజ్దారీలో (Criminal cases) పేరు పొందినవాడు. ఎటువంటి నేరము చేసినవాడుకానీ బరీ (విడుదల) చేయిస్తాడనే పుకారు. న్యాయాధికారికీ ఇతనికీ చాలా స్నేహం. ఎక్కువ వాదించేవాడుకాడు. కాని, ఈయన లేచి నిలిచినాడంటే కేసు జయమైందన్నమాటే. ఒకనాడు సాయంత్రకాలములో వెంకటరెడ్డి వచ్చి ఎట్లో ఈయన కాళ్ళమీద పడ్డాడు. ఇంటినుండి పారివచ్చినాడు. తనవూరికి పట్నమునకు 60 మైళ్ళ దూరము. కాని సాహసించి వచ్చినాడు. మౌల్వీసాబ్ అతణ్ణి చూచి ఏం కావలె అన్నాడు. "మీసేవ."

"అచ్చా" అన్నాడు మౌల్వీ. దినమూ వెంకటరెడ్డి వకీలుసాబుగారి పుస్తకములు మోసుకొని కచ్చేరికి పోవడము, ఇంటిలో కాయిదాలు సర్దడం. బజారుకు పోయి కూరగాయలు, మాంసము కొనితెచ్చి ఇయ్యడము– ఇవి అతనికి ముఖ్యమైన పనులు. ఐదేండ్లు గడిచినవి. వెంకటరెడ్డికి ఉర్దూ బాగా మాట్లాడే నేర్పు కలిగింది. ఇంతో అంతో వ్రాస్తాడు, చదువుతాడు. 5–6 పెద్ద పెద్ద ఖానును పుస్తకాలు కొన్నాడు. ఒకనాడు పాలమూరికి వ్యాపారస్తులబండ్లు పోతూవుంటే ఒక బండిలో పడి ప్రయాణమైనాడు.

వెంకటరెడ్డి మళ్ళీ వచ్చినాడంటే వూరంతా తలక్రిందు అయింది. కొందరు అతడు సన్యాసులలో కలసినాడని, తాము రామేశ్వరము పొయ్యే బైరాగులలో అతన్ని చూచి బాగా గుర్తుపట్టినా మనీన్నీ, కొందరు అతడు పెద్ద జానంపేటలో (ఇప్పుడు ఫర్రుఖునగరు అంటారు) తురకలలో కలిసినా డనీన్నీ, వక మాదిగదాన్ని పెండ్లిచేసుకున్నాడనిన్నీ, కొందరు అతడు కృష్ణలోపడి చచ్చినాడనిన్నీ – యిట్లెన్నెన్నో పుకారులు పట్టించి వుండిరి. తల్లి తండ్రులు దినాలు లెక్కపెట్టి యెదురుచూచి యెదురుచూచి యింక చచ్చినాడనే నిర్ణయించి చాలా వ్యాకులములో కుంగిపోయిరి. ఇప్పుడు వెంకటరెడ్డి మళ్ళీ 5 పెద్ద పుస్తకాలు ఏమేమో తురక కాయిదాలమూట, షేర్వానీ, తుర్కీటోపీ, బట్టలు, బూట్లు తెచ్చినాడని వూరంతా సంభ్రమము. మనిషి చాలా మారిపోయినాడు. నెత్తిన క్రాపు, సన్నగా మీసము లేర్పడినాయి. షేర్వానీ లాగు తొడుగుతాడు. నెత్తిన తురక టోపీ మూరెడెది ఎక్కించినాడు. తురకంలో మాట్లాడుతాడు. పట్నములో వకీలు అయి వచ్చినాడంట అనబొచ్చినారు. ఊరివారంతా గౌరవించినారు. తల్లితండ్రులకు అనపట్టరాని సంతోషమైంది. గ్రామమంతా వకీలు యెంకయ్య, వకీలు యెంకయ్య అని పిలువ మొదలుబెట్టినారు. సర్కారు వారు సనదియ్యకున్నా పల్లెటూరువారు వెంకటరెడ్డిని వకీలు చేసినారు.

☆ ☆ ☆

రెండేండ్లు గడిచినవి. ఇప్పుడు వకీలు యెంకయ్యకు 23 ఏండ్లు. దిన దినము ఊరివారిని బెదరించుతాడు. మాటకు కచ్చేరికి పోతానంటాడు. మాటకు ఫౌజ్దారీ మొకద్దమా పెట్టి బేడీ హత్కడీ వేయిస్తానంటాడు. తురకములో గుక్క తిప్పకుండా నలభై మాటలు ఏకధాటిగా వాగుతాడు. ఆ వూరి పోలీసు పటేలు వీనిదెబ్బ కాగలేక యెంకయ్యకే ముక్తారునామా (Power of attorney) యిచ్చి పటేలుగిరీ చేయమన్నాడు. కాని పట్వారీ, మాలీ పటేలు ఇద్దరు వకటయినారు. గ్రామములో రెండు పార్టీ లేర్పడ్డవి. ఇప్పటికేమో సమానముగా వున్నవి. ఇట్లుండగా ఆ వూరిలో ఒక ఖూనీ జరిగింది. పది ఏండ్ల పిల్లవాన్ని ఒకన్ని చంపి బావిలో వేసినారు. రాత్రి జరిగిన పని. యెవరు చేసినారో తెలియదు. వెంటనే వకీలు యెంకయ్య అమీన్ సాహెబుకు రిపోర్టు పంపినాడు. సాయంత్రానికంతా అమీన్ హాజరైనాడు. అమీన్‌సాబ్ వస్తాడని యెంకయ్య వకీలు 12 మంది యెట్టివారిని సిద్ధముగా ఎదురుకోలుకు వుంచినాడు. బండెడు కట్టెలు, 50 కోడిగుడ్లు, 5 కోళ్ళు, రెండు మేకపిల్లలు, 10 సేర్లు వాసన బియ్యము (పొలావుకు), 1 డబ్బా కాచిన నెయ్యి, చిల్లర మసాలా సామానులు, అదే మోతాదుమీద సిద్ధము చేయించినాడు.

మాలీ పటేలు పార్టీలో పొగరు పట్టిన 10 మందిని వూరి ముందర కట్టేసి వుంచినాడు. అమీన్‌సాబు, ఇద్దరు జవాన్లు, ఒక వంటవాడు, జనానాబండిలో తన భార్య, ఒక దాసి వీరితో కూడా వచ్చినారు. చావడిలో పర్దాలు కట్టినారు. జనానాకు విడిది చేయించినారు. పరుపుల దిండ్లు, మెత్తలు, వీటికేమీ కొదువలేదు. బావర్చీ (వంటవాడు) వంటకెక్కినాడు. ధూముదాముగా ధూమము లేస్తూవున్నది.

అమీన్‌సాబు పీనుగను ఎత్తించినాడు. పంచనామా చేసుకున్నాడు. పిల్లవాని తల్లిని ఎవరి మీద అనుమానం అని విచారించినాడు. ఆమె యిట్లన్నది: "అయ్యా, ఏమి చెప్పాలె? నెల్లాళ్ళనుండి మాలీపటేలు ఆబోతులాగా నా వెంట బడినాడు. నేను వప్పుకోలేదు. నిన్న రాత్రి ఈ పదిమందితో నా ఇంటిమీదికి వచ్చినాడు. నేను తలుపు వేసుకుంటిని. నా పిల్లవాడు బయటనే వుండిపోయినాడు. నీవు బైటికి వస్తావా, పిల్లవాన్ని చంపనా అన్నాడు. నేను పోలేదు. పిల్లవాన్ని ఏడుస్తున్నా లాగుకొని పోయినాడు. తెల్లవారేవరకు బాయిలో పడవేసినారని నాకు తెలిసింది. ఇది వున్న సంగతి" అని యేడ్చి యేడ్చి చెప్పుకున్నది. అమీన్‌సాబు యెంకయ్య ముఖము చూచినాడు. ఇద్దరూ దాపుకు పోయినారు. తురకములో మాట్లాడుకున్నారు. ఏదో బరువు సంచి అమీన్‌సాబ్ చేతికి తగిలింది. "ఠిక్ ఠిక్" అనుకుంటూ ఇద్దరివతలికి వచ్చినారు. "మాలీ పటేల్‌కు పకడ్కేలావ్" అని అమీన్ గర్జించినాడు. పంచనామావద్ద మాలీ పటేలు పేరు వచ్చినప్పుడే వకడు పోయి అతనితో చెప్పినాడు. 'ఒరే ఇదంతా వకీలు యెంకయ్యగాని పనిరా' అనుకొని యిప్పుడు యెదుటికి పోతిమా అవమానము అవుతుంది అని మాలీ పటేలు దాగుకున్నాడు. మాలీ పటేలు పారిపోయినాడనేవరకు నేరము యింకా గట్టిపడ్డది.

☆ ☆ ☆

మూడేండ్లు హోరాహోరిగా కేసు జరిగింది. అస్సలు ఖూనీ చేసినవాడెవడో కాని మాలీ పటేలుకు 2 ఏండ్ల శిక్ష, 10 మందికి 2 ఏండ్లు మొదలుకొని 7 ఏండ్ల వరకు శిక్ష, ఉభయ పార్టీలకు మొత్తము 20 వేలు ఖర్చు. మాలీ పటేలు పని అయిపోయింది. జేలుకు పోయినాడు.

☆ ☆ ☆

కాలం గడిచింది. మాలీ పటేలు, ఇంకా ముగ్గురు ఆయన పార్టీవారు జైలునుండి వచ్చినారు. వకీలు యెంకయ్య అంటే ఆ వూరికే కాదు, చుట్టుముట్టు గ్రామాదులకంతా భయము కలిగిపోయింది. అతడు పట్టుకున్న కేసులన్నీ జయం. ఇట్లా వుండగా ఆ వూర్లో వుండే బాలయ్య అనే బోయవాడు 30 ఏండ్లవాడు పెండ్లి చేసుకున్నాడు. పెండ్లాము పేరు యెల్లి. 15 ఏండ్లది. ఎఱ్ఱనిది, మంచి అందకత్తె. ఆ జాతిలో ఇట్లాంటి పిల్లలేదు అని పేరుపొందినది. పెద్దకండ్లు, చేతికి వెండి కడియాలు, నడుములో వెండి డావు, ముక్కెర, ముత్యాల పోగులు, మెళ్ళో పగడాల దండ. మట్టెలు గల్లు గల్లు మంటవి. వెండి కడియాలు కాళ్ళలో కాపురం వచ్చిన నెల్లాళ్ళకు వకీలు యెంకయ్య యెల్లిని బావినుండి నీళ్ళు తెస్తూంటే చూచినాడు. ఆనాడే తన యింట్లో బియ్యము చేయటానికని పిలిచినాడు. దానితో సరసాలు

మొదలుపెట్టినాడు. యెల్లి కిది నచ్చలేదు. ముఖము చిట్లించుకున్నది. కసరుకున్నది. యెంకయ్య చేయిపట్టుకున్నాడు. ఝాడించి వదలించుకున్నది. చెంప గిల్లినాడు. యెల్లికి పట్టరాని కోపము వచ్చినది. చేట పారవేసింది. యింటి దోవ పట్టింది, "చూడు నేనెవరనుకున్నావు? నేను వకీలు యెంకయ్యను" అని మీసాలు (ఇప్పుడు బాగా పెరిగినవి) పురి పెట్టినాడు. యెల్లి కొంచెము బెదిరింది. కాని వెనక్కి చూస్తూచూస్తూ ఇంటికి పోయింది. మొగనికి జరిగిందంతా చెప్పుకున్నది బాలయ్య మంచి కసరతు చేసిన జెట్టీ. గిరిదాలు పెంచినాడు. చిల్లాడం తొడుగుతాడు. వానికి పట్టరాని కోపము వచ్చింది. మండిపడ్డాడు. పక్కింటి కూర్మన్న వచ్చినాడు. సంగతి కనుక్కున్నాడు. "ఒరే! నీ బలం, నీ కోపం, వకీలు యెంకయ్య వకాల్తా ముందర యేమి పనికి వస్తాయిరా? అయన ఖూనీ కేసులో పాపం అన్యాయంగా మాలీపటేలంతటివాన్నే జేలుకు పంపియ్యలేదా? కావున, ఉపాయంగా పని సవరించుకోవాలె" అని హుషారు చేసినాడు. వారేదో రహస్యంగా మాట్లాడుకున్నారు.

☆ ☆ ☆

మర్నాడు మళ్ళీ యెల్లిని పిలిపించినాడు యెంకయ్య. యెల్లి వెళ్ళింది. మళ్ళీ సరసాలు. "ఏమే, ఈ వూర్లో ఇంతమంది ఆడవాళ్లు నేను పిలువకున్నా వస్తారు నీ వొక్కదానవే నాకు నచ్చినదానవు. నీకు ఏం కావలెనో తెచ్చియిస్తా చెప్పు. నీవు దొరసానిలాగా వుండవచ్చు. నీకీ యెండి సొమ్ము లేంటి? బంగారు సొమ్ములు మళ్ళీ శనివారమువరకు చేయించి పెట్టా చూడు" అని యేమేమో అన్నాడు. యెల్లి ముసిముసి నవ్వులు నవ్వింది. యెంకయ్యకు ధైర్యము వచ్చింది. రాత్రికి వస్తావా అని వెంటనే అన్నాడు. మళ్ళీ యెల్లి వోరచూపులతో నవ్వింది. యెంకయ్య ఆ చూపులు చూసేవరకు ప్రపంచమే మరిచిపోయినాడు. యెల్లి మెల్లగా ఇట్లా అంది: "అయ్యా, నా కిట్లాంటి పనులు అలవాటు లేవు, రాత్రి రావాలంటే భయమౌతుంది, మా అయన ఈ వేళ సంతకు పోయిండు. రేపు వస్తాడు. మా ఇంట్లో ఇంకెవ్వరులేరు, నీవే రాత్రిపూట మా ఇంటికి రాకూడదేమి! లీదవాళ్ళ ఇంటికి వస్తే యేమాయె?" యెంకయ్య ఇప్పుడు యెల్లికి దాసానుదాసు. సరే అన్నాడు.

రాత్రి యెంకయ్య గంజితో చలువచేసిన బట్టలు వేసుకున్నాడు. జల్తారు రుమాలు తీర్చి కట్టినాడు. తాంబూలము వేసుకున్నాడు. ఇంత అత్తరు బట్టలకు పూసుకున్నాడు. చుట్ట చేతబట్టుకున్నాడు. మెల్లగా యెల్లి ఇంటికి పోయినాడు. తలుపు తిన్నగా తట్టినాడు. యెల్లి తలుపు తెరిచింది. నులకమంచముమీద గొంగడివేసి కూర్చోపెట్టింది, దిండు వేసింది. తాను వోరగా నిలుచున్నది. "ఏమే, కొత్త పెండ్లికూతురులాగ సిగ్గుపడతావేమి? తలుపు మూసి గడె వేసిరా" అన్నాడు. యెల్లి తలుపు మూసింది. దూరంగా నిలుచోనుంది. "దగ్గరకు రా" అంటున్నాడు యెంకయ్య. యెల్లి ఆ మాట ఈ మాట చెప్పి కాలయాపన చేస్తూవుంది. తుదకు యెంకయ్యనే లేచి దాన్ని చేయిపట్టి మంచముమీదికి లాగినాడు. ఇంతట్లో తలుపు దడాదడా కొట్టినారు. "ఏమే యెల్లీ! తలుపు తీయవే" అని ధ్వని వచ్చింది. యెల్లి గడగడ వణకింది. "ఎవరెవరు, నీ మొగుడా? రేపు వస్తాడంటివే. ఇప్పుడే ఎందుకు కాలబడివచ్చినాడు ముండాకొడుకు!" అన్నాడు యెంకయ్య. "అయ్యా, నీ కాళ్ళు మొక్కుతా.

నా మొగుడు చూచెనా ఇద్దరిని చంపేస్తాడు. ఆ గరిసెకొట్టిట్లో దాగుకో" అని యెంకయ్యను గరిసెకొట్టిడిలో మూసింది. తలుపు తెరిచింది. బాలయ్య వచ్చినాడు. "ఏమే మంచి మంచి వాసన వస్తుంది. ఏమి! యెవరన్నా మిండగాడు వచ్చిండా?" అన్నాడు. "చాలులే, ఎప్పుడిదే తమాషాలు నీకు" అంది యెల్లి. "లేదులే, ఇంతకే కోపము వచ్చిందే. యెల్లీ! ఈవ్యాళ సంతకు పోతుంటే–ఇక్కడెవ్వరు లేరుకదా–బాటలో వక డబ్బీ దొరికింది దాంట్లో మంచిమంచి పచ్చలు, రత్నాలు వున్నవే యెవరో గొప్పదొరలు పోగొట్టుకున్నారు– దీన్ని దాపెట్టు" అని డబ్బీ చేతికిచ్చినాడు. యెల్లి మెల్లగా గరిసెకొట్టడలోకి పోయి గూట్లో పెట్టింది. యెంకయ్య ఆ మాటలు విన్నాడు. డబ్బీ పెట్టింది చూచినాడు. మెల్లగా దాన్ని అందుకుని తెరచి లోపల వేళ్లు పెట్టి తడివినాడు. చెట్‌మని నూరుసూదులు కుట్టినట్లు రెండుమార్లు రెండువేళ్ళకు తేలు కుట్టింది. డబ్బీ క్రింద పారవేసినాడు. అబ్బా అని కూతవేసినాడు. బాలయ్య "యేమే, దొంగలు వచ్చినట్లుంది. అరే కూర్మా! దొంగలు" అన్నాడు. కూర్మడూ వానికొడుకూ వచ్చినారు. ముగ్గురు కట్టెలు తీసుకొని గరిసెలోకి చెప్పలతో పోయినారు. వెంకయ్యను పట్టుకున్నారు. తెలియనట్లుగా మెత్తగా పడగొట్టినారు. "వరే, నేను యెంకయ్యనురా, వకీలు యెంకయ్యను" అన్నాడు. అనినావినకుండా కొట్టి బయటి కీడ్చినారు. మళ్ళీ కొట్టినారు. యెంకయ్య మూర్ఛపోయినాడు. చచ్చినాడేమో అని వీధిలో పారవేసినారు. అప్పుడే పోయి పటేలు పట్వారీలతో చేసినపని చెప్పుకున్నారు. మీ ప్రాణానికి మా ప్రాణము అన్నారు వారు. ఆనాడు పటేలు పట్వారీలకు నిద్రలేదు. బోయవాండ్లందరి ఇండ్లకు తిరిగినారు. తమ పార్టీవాళ్ళందరికి హెచ్చరిక చేసినారు.

☆ ☆ ☆

పదిదినాలవరుకు యెంకయ్య మంచము పట్టినాడు. చస్తాడని అందరనుకున్నారు. ఊరంత వకీలు యెంకయ్యకు జరిగిన పరాభవము చెప్పుకున్నారు. బాలయ్య పెద్దశూరు డైనాడు. యెల్లి వీరపతివ్రత అయింది. 10–15 దినాలకు యెంకయ్య బయట తిరుగబట్టినాడు. నిలిచిన చోట నిలవడు.

ఆ వూర్లో సర్కారీ ఈతచెట్లు చాలా సమృద్ధి. సుమారు 2000 వుండవచ్చును. ఈ పది దినాలలో వక చెట్టు లేకుండా కొట్టివేసినారు. మాలీ పటేలు యెంకయ్య వకీలుమీద రిపోర్టు చేసినాడు. అమీన్‌సాబును అంతకుముందే కలసివచ్చినాడు. 2000 రూపాయిలు వూర్లో అందరూ చందాలు వేసుకొని జమాచేసినారు. 1500 రూ. అమీన్‌సాబుకు కట్నం కింద వసూలైనవి. అమీన్‌సాబు వస్తూనే యెంకయ్యకు బేడీలు వేసినాడు. యెంకయ్య 1000–1500 –2000 వరకు సవాలు చేసినాడు. మాలీ పటేలు మళ్ళీ అమీన్‌సాబును దాపుకు పిలిచి 500 యిచ్చుకున్నాడు. యెంకయ్య వద్ద నగదు లేదు. ఇంకేమి చేస్తాడు? వూర్లో 100 మంది సాక్ష్యము చెప్పినారు. యెంకయ్యకు బేడీలు వేస్తూనే యెంకయ్యపార్టీవారు భయపడ్డారు. యేమి చిత్రమో వక్కడుకూడా సాక్ష్యానికి రాలేదు యెంకయ్యకు 4 ఏండ్లు శిక్ష వేసినారు.

☆ ☆ ☆

యెంకయ్య ఇంతవరకు 40 కాండ్ల సేద్యము, పెద్దబంగ్లా, పాడీ పంట సమృద్ధి, ఇద్దరు కొడుకులు, భార్య పక్కవూరి దేశముఖు బిడ్డ, అన్నీ బాగానే వుండింది. పిడుగువలె ఈ శిక్ష పడినప్పుడే యెంకయ్య దశ అయిపోయిందని అందరూ అనుకున్నారు. లోకకంటకుడు నూర్లకొలది కొంపలు గూల్చె, స్త్రీలను చెరిచె, డాకాలు చెయించే, ఖూనీలు చేయించె, వీనికింకా తక్కువే శిక్ష అయింది. అన్నారు అందరు. యెంకయ్య జేలుకు పోతూనే ఒకనాడు వానియెద్దులు 10 మాయమైనవి. ఆనాడు మాదిగ గేదిలో జల్సా! నెల్లాళ్ళ తర్వాత కల్లములో మాలంత మాయము. బోయ గేరిలో జాతర ఆనాడు. ధాన్యము కోరాలు అంటుకొన్నవి. ఎవరూ ఆర్పే దిక్కు లేదు. ఇల్లు దోచుకున్నారు. సాక్ష్యము లేదు. ఇట్లు దినమొక గండము యెంకయ్య యింటివారికి. యెంకయ్య జైలునుండి వచ్చేవరకు బంగ్లా పోయింది. చిన్న పాత కొంపలో తనవాండ్లు సంసారము చేస్తున్నారు. ఒకే కాడి. దానికి తగిన భూమి. తక్కినదంతా పోయింది. భార్య ముతుక బట్టలు కట్టుకున్నది. తల్లితండ్రులు చచ్చినారు. వకీలు యెంకయ్యకు క్రొత్త దృశ్యము చూచేవరకు పట్టరాని శోకము వచ్చింది. "హా!" అని మూర్ఛపోయినాడు. మూర్ఛ తెలిసినతర్వాత – 'అరే! వకాలతు ఎంత పని చేసిందిరా?' అన్నాడు. మళ్ళీ మూర్ఛపోయినాడు.

● ప్రచురణ కాలం ? ●

★ ★ ★

కాంచనపల్లి చినవెంకట రామారావు

# 10 మన వూళ్లో కూడానా...?!

మధ్యాహ్నం ఎండ మిటమిట లాడిపోతున్నది. వడ్లగింజవేస్తే పేలగింజ అయేంత వేడి. వేడిలోకి వేడి నల్లగొండజిల్లా వేడి. చాలా పేరు మోసిన వేడి. అందరినీ హడలుగొట్టేంత వేడి.

లోకల్ ఫండు చెల్లిస్తున్నా నోసటిరాత మారని పల్లెటూరి బాట ఎండకు తళాతళా మెరుస్తున్నది ఇసుకతో నిండిన బాట. క్రింద భూమి, పైన ఆకాశం భగ్గున మండిపోయే వైశాఖమాసం.

కనీసం గంటకు పదిమైళ్ళ వేగాన్నయినా అందుకోవాలన్న తాపత్రయంతో కచ్చడం బండీ పరుగెడుతున్నది. మెళ్ళో మువ్వలు ఘల్లు ఘల్లున మోగుతూ కోడెల అడుగులకు తాళం వేస్తున్నాయి. కచ్చడం వెనుక లేచిన దుమ్ము చిన్న చిన్న మేఘాలను సృష్టిస్తున్నది.

రేగిన దుమ్ము కండ్లలోకి, ముక్కులోకి పోతున్నా మాదిగ పాపయ్య మాత్రం ఆగటానికి వీల్లేదన్నట్లుగా తననేదో రాక్షసశక్తి తరుముకొస్తున్నట్లుగా కచ్చడం బండీ ముందు పరుగుదీస్తున్నాడు. భుజానికి కర్ర, దానికి తగిలించిన లాంతరు పాపయ్య అడుగులకు మడుగులొత్తుతున్నట్లు వూగుతున్నది.

నెత్తిన ధొరోరి బట్టల సందూకాతో కచ్చడం బండి వెనుక చాకలి సర్వయ్య సాగిపోతున్నాడు. చెమటలు కక్కే శరీరంతో శ్వాస నిగ్గదీసుకొని పరుగుదీస్తున్నాడు.

మెత్తని బూరుగుదూది పరుపుమీద కూరుకుపాట్లు పడుతున్నాడు పాపారావు ధొరగారు. పెద్ద దిండుకు అనుకొన్న శరీరం, కుదుపులకు ఏమీ బాధపడకుండా అన్నిదిక్కులా తలగడాలు అమర్చివున్నాయి.

కచ్చడంలో ఒరిగిన ఆజానుబాహు విగ్రహం, ఉబ్బు చెంపలు, నిమ్మకాయలు నిలబెట్టగల నల్లని మీసాలు, శరీరఛాయకూడ నల్లనిదై, ఎప్పుడూ నీడన వున్నందున నిగనిగ లాడ్తున్నది.

"చిన్నగ పోనిస్తావేంరా? నడవనీ బండీ."

ఈ మాత్రం హెచ్చరికకే యెద్దుల వీపు "చడేల్ చడేల్"మని మోగాయి, సేవకుడి వెంకయ్య చేతిలోని కాంచకర్ర వార్లు.

బండి వేగం మరింత హెచ్చింది. బండి ముందున్న పాపయ్య, సర్వయ్య పరుగు వేగంకూడ తదనుగుణంగానే హెచ్చింది.

దొరవారు కునుకుపాట్లుపడే సమయంలో పాపయ్య, సర్వయ్యా ఇద్దరూ ధారోరి వెంకన్నతో (వెంకన్నలాంటి వాళ్ళకు యింటిపేర్లుండవు లెండి) ఒక ఒప్పందాని కొచ్చారు. ఆ ఒప్పందానికి ఫలితంగా వెంకన్న కడుపునిండా కల్లు దక్కుతుంది.

వెంకన్న జేయాల్సిన పని బండి వేగాన్ని తగ్గించడమే. తద్వారా చెమటలు కక్కే, సర్వయ్య, పాపయ్య శరీరాలకు కొంతైనా విశ్రాంతి దొరుకుతుంది.

బండివెంట సరిగ్గా రానందున దొరగారు వడ్డించే తిట్లకన్నా, భయంకరమైన కొచ కర్రదెబ్బలైనా తప్పుతాయి.

కాని ఎవరు బాధ్యులైతేనేం? ఒప్పందం భగ్నమైపోయింది. ముందు ఒండలో కచ్చడంబండీ మహా జోరు లకించుకొంది. వగిరిస్తూ ముందు పాపయ్య, వెనక సర్వయ్య ఉరుకుతున్నారు. అదుప్పా, అదుపూ లేని అధికారం గల దొరవారి ఉగ్రనారసింహావతారం, దాన్ని కాపాడేందుకు కాపలాగావుండే దొరోరి వెంకన్న, చేతిలోని కొచకర్ర ఈ రెండూ మహా భయంకరంగా కళ్ళకు కట్టినట్లు సర్వయ్య, పాపయ్యలపైన తమ నీడలను దృశ్యా దృశ్యంగా ప్రసరింపజేస్తున్నాయి.

బ్రతకలేక బడిపంతులుగా దొరవారి వూళ్ళోవున్న స్నేహితుని కలవాలని నా తాపత్రయం. పాతరోగాలు బయటపడ్డట్లుగా యెండకు పాత పంచర్లు వూడిపోయే పాత సైకిలుతో ప్రయాణమయ్యాను.

పట్నవాసానికి పది ఆమడల దూరం ప్రయాణానికి బండైనా కావాలి, లేక కాలికైనా బుద్ధిచెప్పాలి. బుద్ధివచ్చేటంత బలమైన కాళ్ళుగావు కనుక పాత సైకిలే శరణ్యమైపోయింది. పాడుబాటలో బండితో కూడ సరిగ్గా నడిపించలేకపోయాను. బట్టలన్నీ తడిసి ముద్దయిపోయినాయి. బండికంటే వెనుకపడ్తే పరువెక్కడ పోతుందోనన్న రోషంతో వగిరిస్తూ సైకిలు తొక్కుతున్నాను.

"ఏయ్! దొరగారు కచ్చడంలో వున్నారు. కోడెలు బెదుర్తై – దూరంగా పో!" భయంకరమైన తన మిడిగుడ్లను వెళ్ళబెట్టి బెదిరించాడు ధారోరి వెంకన్న. బండి యెద్దు కనబడకుండా వెనకనే వుంటుంది నాకు ప్రాణ సమానమైన పదేండ్లనాటి పాతపురాణం సైకిల్.... సైకిళ్ళయినా, మోటార్లయినా తొలిగి బండ్లకు దారివ్వవలసిందే, ఈ కచ్చడంబండ్ల రాజ్యంలో – అసలు సంగతి తర్వాత తెలిసింది. దొరవారి కచ్చడం కనపడ్డాక సైకిలు దిగి నడవాల్సిందేనట. ఎక్కి పోవటానికి వీల్లేదట.

ఎడారి యెండలో ఒయాసిస్‌లాగ దొరవారి వూరు "కడపురం" వచ్చింది. కచ్చడం బండి వెనుకా, ముందూ వున్న మా అందరి కష్టాలూ గట్టెక్కినట్లయింది.

చాకలి, మంగలి వాడలకు దగ్గరలో మకాం పెట్టిన మా స్నేహితుని ఇంటికి చేరుకున్నాను.

నా వెనుకనే బెత్తెడు కడుపు జానెడు లోతుకు గుంజుకుపోయిన పాపయ్యా, నర్సయ్యా అర్ధశేరు జొన్నలేమో మూటగట్టుకోని యిళ్ళు చేరుకున్నారు.

ఎండనబడి వచ్చినందుకు మూడుపాళ్ళ నీళ్ళు, ఒక పాలు అన్నంతో చిన్నప్పుడు చదివి మరచిన ఆరోగ్య శాస్త్ర ప్రకారం భోజనం చేయడమనే వాలాయితీ ముగిసింది. ఎండకు వ్రాడిపోయిన పంచర్లను అతికిస్తూ మా స్నేహితుని యింటిముందు వరండాలో వున్నాను.

బల్లెం చెక్కిన చేతికర్రలో బీటలుబారిన బిళ్ళ బెల్టు నడుముకున్న నడియీడు మనిషి సర్వయ్యను పిలుస్తున్నాడు–

"అరే సర్వా!" అని.

"యేం కాశీమయ్యా?" అంటూ సర్వయ్య ఇవతలకు వచ్చాడు.

"పట్వారీ సాబు జమాబందీకి నల్లగొండకు బోతున్నడు– దఫ్తరం ఒరుపొంత నీదైంది – పదూ."

"నీ యిల్లు బంగారంకాను. యిప్పుడే కాదయ్యా – దొరోరి సందూక ఒరుపొంతుక పోయివస్తని. బువ్వకూడ తినలేదు– నర్శిగాడు లేడూ? అదే నా తర్వాత వంతోడు."

"గొల్లోళ్ళకాడ వసూలైన మామూలు యాటలిచ్చి రావటానికి అమీన్ కచ్చేరికె పోయిండు."

"అయితే చిన సర్వడు సీతిగాడూ, నారిగాడూ, తక్కిననోళ్ళు ఎవరూ లేరా?"

"కొంతమంది మేనా మోసేటందుకు, తక్కినోళ్ళు చినదొర కార్యానికి పిండ్లు విసరటం, ఇండ్లలికి ముగ్గు లేస్తున్నారు. ఇప్పటి వంతు నీదే."

"కాశీమయ్యా! నిన్న యియ్యాళ్ళకే అందరి వంతులు గిర్రున తిరిగి నాకాడె కొచ్చినట్లున్నది."

"అరే! యేం చేయమంటావు భై! పొద్దటి నుంచి కాలి బొబ్బె కట్టకుండ తిరుగుతున్నా, ఈ పని ఎప్పటికీ తెగేదికాదు – దొరకాకుంటే చిన్న దొర, వీళ్ళిద్దరు దప్పితే పటేలు పట్వారీలు, సంచులు నింపుకోడానికొచ్చే పోలీసు ఇన్‌స్పెక్టర్లు, గిర్దావర్లు ప్రతివాడూ సెక్‌సెండ్‌కు బులావ్! కోసిన వరి మొత్తలకు మా బూబమ్మ కావలికే పోయింది. ఫుర్సత్ ఎక్కడభై."

ఈ సంభాషణలు వింటూ నా పని నేను చేసుకొంటున్నాను. పంచరు మీద పంచరైంది. దాన్మీద దీయనా? లేక ఆ అతుకుమీదే ఇంకో అతుకు వేతునా అని ఆలోచనా సముద్రంలో మునకలు వేస్తున్నాను.

ఇంతలోనే "వామ్మో వాయ్యో" అని సర్వయ్య ఇంట్లో నుండి చప్పుడు వినవచ్చింది. నేనూ, మా వాడూ చూడ్డానికి పరిగెత్తివెళ్ళాం– ఇంకా నాకు పల్లెటూరు అలవాటు పోలేదట. మనకేమన్నట్లు పట్టించుకోకుండాపోయే పట్నవాసపు లక్షణాలు నాలో లేవంటున్నాడు మావాడు.

మేమొకళ్ళ నొకళ్ళం విమర్శ, ప్రతివిమర్శ చేసుకొనే అవకాశమెక్కడున్నది?

ఎదురుగా వరహావతారం మూర్తి వ్యక్తి 'ఇంత ఆలస్యం చేస్తావురా? ........జ కొడకా' అంటూ అమ్మ నాలిని జోకుతున్నాడు. దభీ దభీమని ఎక్కడ ఏ

అయిపట్టున దెబ్బ తగుల్తుందో నన్న విచక్షణ లేకుండా సర్వయ్యను బాదుతున్నాడు.

మింగుడు బోవటానికి నీళ్ళుపోసుకొని, కారంగలిపిన జొన్న గటక ఎక్కడ నేల పాలవుతుందోనని కొట్టే దెబ్బలు తప్పించుకొంటూ కంచుతట్టతో తన చుట్టు గుడిసెలో కిందా, మీదా పడుతున్నాడు సర్వయ్య.

"నేనైతేనా? నెత్తిన కంచు తట్టని ఎత్తేసి కంట్లో కారం, వంటి నిండా గటక పడి ఈ వరహావతారం తన్నుక లాడుతుంటే లేవంగో తన్ను, పడంగో తన్ను తన్నే వాడ్ని! వీడి ఓర్పు తల్లి ముండమొయ్యా! ఈ సర్వయ్య నోరెత్తడేమిటి?" అని మావాడితో అన్నాను.

"ఇది 'కడపురం' – మీ బస్తీకాదు. నారికిపోయే కంప మనకెందుకు? నోరుమూసుకో. ఇదెప్పుడూ జరిగే కథే!" అన్నాడు మావాడు.

చుట్టుపక్కలవాళ్ళు యల్లయ్య, మల్లయ్యలు గుమిగూడారు.

"కొట్టకు పంతులూ! పెద్దముండాకొడుకు. నీ కాళ్ళు మొక్కుతాం! వదులు." అని బ్రతిమిలాడుతున్నారు. కానీ ఈ మంత్రాలకు చింతకాయలేం రాలడంలేదు. సర్వయ్య వంటిమీద కర్ర దెబ్బలు పడుతూనే వున్నాయి. అక్కడ ఎవళ్ళకూ విడిపించే ధైర్యం లేదు.

కాశిం – సాయిబు మాత్రం వీరావేశంతో మధ్యలోకి దూకాడు. కర్రకు కర్ర అడ్డంపెట్టి "ఏం! వాన్ని చంపుతావ్ మహారాజ్!" అన్నాడు.

మాకు కూడ ధైర్యం వచ్చినంత పనైంది. పంతులుగార్ని గుడిశెబివతలకి యీడుచుకొచ్చాం. పంతులుగారికి వళ్ళంతా చెమటపట్టింది. కోపావేశంతో వళ్ళంతా వణుకుతున్నది. కట్టుపంచె గోచీ వూడింది–చెంగులు దోపుకుంటున్నాడు. మాటలు తొణ్కిపోతున్నవి. కూలబడ్డాడు.

"ఇంత పిచ్చి కోపమైతే ఎట్లా పంతులూ!" అంటున్నారు అక్కడ గుమిగూడిన పెద్ద రైతులు.

కాశిం వైపు కండ్లెర్రజేసి "ఈ జమా బందీలో నీ యినాం జప్తు చేయించపోతే నేను మా నాయన కొడుకును గాదురా! తురకోడా!" అంటూ పంతులుగారు తన యింటివైపు పోయాడు.

"పోవయ్యా మహారాజ్! ఈ ఇనా భూంతోటే బతుకున్నానా యేమిటి? రెక్కలు చల్లగుంటే ఒంటెద్దు బండితో నల్లగొండలో బతుకుతా!" అన్నాడు కాశిం.

గటక తట్ట కిందబెట్టి సర్వయ్య దెబ్బలకు వళ్ళు చిట్లి, నెత్తురు గారుతుంటే ప్రాథమిక చికిత్సకై కాలోలు గాయాలమీద మన్ను బోసుకుంటున్నాడు. తలమీద పెద్ద గాయమైంది.

"ఏడుపు తప్ప కనీసం వీడికి తిట్టడమన్నా రానట్లుంది ఫూల్ కి!" అని సర్వయ్యమీద ఫిర్యాదు చేశాను మావాడితో.

"వాళ్ళు కనుక ఈ మాత్రం తట్టుకొని నెట్టుకొస్తున్నారు. నీ వంటి వాడైతే ఎప్పుడో జారిపోయేవాడు. తాచుపాముంత వడి, జెరుగొడ్డంత పిరికి, మీ పట్నవాసం బాపతు–" యెదురు దాడి చేశాడు మావాడు.

ఈలోగా కొంతమంది యువకులు, యువతులు అక్కడికి చేరారు. బాగా కండలు తేలిన శరీరాలు, గ్రీకు విగ్రహాల్లా వున్న వీళ్ళకు స్వేచ్ఛ అనేది వుంటే ఎంతో బాగా రాణించేవాళ్ళనిపించింది. శరీరానుగుణ్యంగా మేధకూడా వృద్ధి అయేది. ఆడవాళ్ళకు, మొగవాళ్ళందరికీ శరీరాల మీద దెబ్బలు అగుపడుతున్నాయి. అట్లు పొంగినట్లుగా దద్దులుకూడా తేలాయి.

"ఇదేమిటి! సర్వన్నా?" అని అడిగారు వాళ్ళంతా. "మరి మీ వంటి మీద దెబ్బలేమిటి?" అన్నాడు తిరిగి సర్వయ్య.

"సున్నాలేస్తుంటే అద్దంమీద చినుకులు పడ్డయని దొర చేతి బెత్తంతో కొట్టేండు చూడు."

"కారం మెత్తంగ మెదగలేదని కంట్లో జల్లింది దొరసాని."

"బట్టలు వేళకు తేలేదని రూలు కర్రతో కొట్టేండు పటేలు."

"పెండి బిరుసుపడ్డదని చిన్నదొర తండ్రి చెప్పు విసిరితే రొమ్ముకు తగిలింది. పోరగానికి యెట్లా పాలియ్యను తాతా!" అని భోరున యేడ్చింది.

సర్వయ్య తల గిర్రున తిరిగినట్లయి "మనం చేసుకున్న పాపం కట్టి కుడుపుతున్నది" అన్నాడు.

"మనలను తన్ని చంపటానికి ఈ దొరలు చేసిన పుణ్యం ఏమిటి? మనం ఈలా పడ్తూ వుంటే అలుసైపోయింది" అన్నాడొక యువకుడు.

"చిన్నా పెద్దా యెవరితోనూ చెప్పుకునే దిక్కులేదు. అంతా ఇటువంటోళ్ళే. మనం ఏంచేయగలం?" నిరాశగా అన్నాడు సర్వయ్య.

"ఇట్లూరుకుంటే లాభంలేదు తాతా! యేమైనా చేయాల్సిందే! అన్న ఆవేశం అందరిలో పొంగుతున్నది.

"అక్కడెక్కడో పనిబాటలోళ్లు యెట్టి బందుచేసినారట–ఊరంతా ఒక కట్టుకడ్తే పెద్ద పెద్ద దొరలుకూడ పడిగె నేలకు కొట్టుకొని వూరుకున్నారట!" అన్నాడొకడు.

"అరె! యింకా మీది వుడుకు నెత్తురు. అవేవో సంగాలంట. తాతలు తండ్రులనాడు లేని ఈ 'కొరివి' మన కెందుకురా?" అన్నాడు సర్వయ్య.

"యేమన్నా గాని ఆ 'కొరివిని' మనం తెచ్చుకోవలసిందే!" అన్నారంతా.

"పోలీసులు, కేసులు, ఖైదులు. ఈ సర్కారంత మనమీద విరుచుకపడ్తది. యేదో ఇంత కల్లో, గంజో తాగి బ్రతుకుదాం రా!" అన్నాడు సర్వయ్య. దొరలు, దొరల వెనుకనున్న యంత్రాంగమంతా కండ్లకు కట్టేనట్లయిందేమో, సర్వయ్యకు.

"తాతా, వయసులో వున్నప్పుడు కర్రతో పులిని జంపిన మొనగాడివట! యేందీ పిరికి మందు? ఇంతకన్న చెడ్డగేం వుండదు ఖైదుఖానా" అన్నారంతా.

"మొగోనాతే మూడు దినాలు బ్రతకటం మేలు అన్న సామెత నాకు జ్ఞాపకం వచ్చిందిరా! అమ్మా! యేమో అనుకున్నాను గాని అగ్నిపర్వతాలు వున్నాయిరా ఒక్కొక్కళ్ళ గుండెల్లో" అన్నాను మా వాడితో.

"ఇప్పుడు పూలు కావటం నీ వంతు" అని మా వాడు మాట విసిరాడు. నాకు చెంప చెళ్ళుమన్నంత పనైంది.

ఆలోచనలతో తల పట్టుకున్న సర్వయ్య గాయాలకున్న మన్ను కిందరాలుతున్నది. తక్కిన పనిబాటల వాళ్ళు పెద్దలంతా గుమికూడారు, యేం చేయాలని.

"కుల పెద్దలు గదాయని అడిగినం – ఈ ఆలోచనలు యిప్పటితో తెగవు–యిన్ని దినాలు మీరు చెప్పింది సాగింది. ఇప్పుడు మేమన్నది సాగవలసిందే" అన్నారు యువకులు, యువతులంతా.

'ఈ వెట్టిపీడ విరగడై పోవాలి, యేమైనా చేయాలి. ఇక వూరుకో కూడదు' అన్న భావం వాతావరణ మంతా వ్యాపించింది.

"పనిబాటలోళ్ళతోబాటు మేముంటాం" అన్నాడు పెద్ద రైతు రంగయ్య. తక్కిన రైతులంతా మేము మా రంగయ్య తాతతోబాటు వుంటామన్నారు.

వెనుక దొరవారి సేరీదారు తరుముతుంటే మాదిగ పాపయ్య వగిరిస్తూ వురికొస్తున్నాడు.

"గుర్రాన్ని దోమి అరక పట్టక రమ్మంటే నఖరాలు చేస్తున్నాడు గాడిద".... అని తిడ్తున్నాడు సేరిదారు.

వచ్చి గుంపులో కలిశాడు పాపయ్య. యిక్కడి కట్టుగట్టాలన్న మాటలు వినేసరికే పాపయ్యకు యేనుగంత బలం వచ్చింది.

"అరక గట్టటానికి నీ అయ్య జీతగాణ్ణా?" అన్నాడు పాపయ్య.

"యేమిరా కూస్తున్నావు!"

"మాటలు మీరకు. వీళ్ళంతా మావాళ్ళే. మర్యాద దక్కదు. జాగర్త. పో యిక్కణ్ణుంచి" అని ఈగను, దోమను తోలినట్లుగా సేరిదారునం అంటున్నాడు.

మాటలు ముందు "నీ బాంచను" అనే పాపయ్య స్వరంలోని దృఢత్వం నాకే ఏదో కొత్త స్ఫూర్తి నిచ్చింది.

"శభాష్" అన్న మాట నానోటినుంచి అప్రయత్నంగా వచ్చింది. ఊక్క మొగంతో వచ్చిన దారిబట్టి పోయాడు సేరిదారు.

ఒకవంక తహసీలు చప్రాసీ, ఇంకొక వంక పోలీసు బీటు జవానూ తరుముకొస్తుంటే పెద్దకుమ్మరి నరసయ్య, సేక్సిందీ కాశీం నురుగులు గక్కుతూ వచ్చి గుంపులో కలిశారు.

నర్సయ్య చావడిలో నీళ్ళు బెట్టలేదట. కాశీం కోళ్ళు తీసుకరాలేదు. అదీ వాళ్ళ తప్పు.

"ఏయ్! చెప్పేది మీకే. కాశీం సాయిబును, మా నర్సయ్యను ఏమన్నా అన్నావంటే మేం వూరుకోం" అన్నారు, గుంపులో వాళ్ళు.

"అచ్చా బేటా! విలాయతు (ఇంగ్లండు) నుంచి ఇయ్యాలనే దిగినట్లున్నారు. నడూ దొరకాడికి. పటేలు పట్వారీలాడనే వున్నారు. బొక్కలిరగతంతారు."

"అంతపని యిక్కడనే జరుగుతది!" గుంపులోంచి జవాబు వచ్చింది.

చెప్రాసీ, పోలీసు జవానూ బింకం చెలాయించబోయారు. ఇక్కడ ప్రపంచం మారిపోయిందని వాళ్ళకింకా తెలియలేదు. ఏనుగులా వచ్చినోళ్ళు పీనుగుల్లా వెళ్లిపోయారు.

"మేం ఈ చాకిరి చెయ్యం. యేం, తలగోసి మొలేస్తరా! అడుగుదాం పదండిరా, ఈ దొరలను" అని సర్వయ్య, పాపయ్య, నర్సయ్య, రంగయ్య, కాశీం వగైరాలు కదిలారు.

వాళ్ళ వెనుక ఆడ, మగ, ఊరు ఊరంతా ముందుకు కదిలింది.

"వెట్టి నశించాలి!" అన్న కేకలు మారుమ్రోగాయి – సముద్రంలా జనం సాగింది.

నిమ్మకాయల మీసం వాలి, గాలికి తూలిపోతుంటే దొరవారు – పటేలు, పట్వారీలతో అన్నారు: "ఈ చిచ్చు మన వూళ్ళో కూడానా....?!" అని.

● *ప్రచురణ, 1945* ●

★ ★ ★

అడివి బాపిరాజు

11

# నరసన్న పాపాయి

రుద్రేశ్వరం గుడియెదుట శివరాత్రి ఉత్సవంలో, గుడిలోకి రాబోయాడని మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు. మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు!! మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు!!!

నిజమే. ఆ బాలుడు హరిజనుడే! అంతమాత్రాన మా అన్నయ్య వాడిని చావగొట్టడమే! ఆ కుఱ్ఱవాడు చేసినతప్పు? శివరాత్రినాడు రుద్రేశ్వర స్వామిగుడిలోకి మా అందరితోటే రావాలని ప్రయత్నించాడు.

మేము కోనేటిలో స్నానాలుచేసి, పట్టుబట్టలు కట్టుకొని, పళ్ళూ కొబ్బరికాయలూ పువ్వులూ అరతికర్పూరం ఊదువత్తులు మొదలయినవి పట్టుకు బయలుదేరాం. మా ఊరుకు రుద్రేశ్వరం ఎనిమిదిమైళ్లు ఉంటుంది. రాత్రి బళ్ళు కట్టుకు బయలుదేరాం. తెల్లవారగట్లకు రుద్రేశ్వరం వచ్చాం. మా రెండెడ్లబండే మాకు డేరా అయింది. దానిచుట్టూ తెరలు కట్టుకున్నాం. చాపలు కట్టాం. వంటలకు అన్ని సరంజాములు మా అమ్మ చేసింది. ఆతర్వాతనే తెలతెల్లవారేసరికి కోనేరులో దిగాం.

ఆ బాలుడు మా వూరు పెద్ద మాలపల్లిలో వుండే అబ్బాయి. వాళ్ళ అయ్య మావూళ్ళోఉన్న కరణంగారి పాలేరు.

మా అన్నయ్య వాడిని చావకొడుతూ వుంటే వాడు పెట్టిన గోల రాతినైనా కరిగిస్తుంది. నేను వెక్కి వెక్కి ఏడ్చాను. ఆ అబ్బాయి సొమ్మసిల్లి మూర్ఛపోయాడు. నేను ముందుకు పరుగెత్తి వాడిమీద నా చెంబులో వున్న నీళ్లుచల్లాను. వాడికి మెలుకువ వచ్చి లేచి గుండెలు కరిగిపోయేటట్లు ఏడుస్తూ తూలుతూ నడచిపోయాడు.

నాకు నరసన్న ఏడుపు వినిపిస్తున్నది. స్వామికి అర్చన చేయించే పూజారి మంత్రాలు వాడి ఏడుపులా ఉన్నవి. గుడిలో మ్రోగించే గంటలు వాడు యెక్కి యెక్కి రోదించినట్లే వున్నవి. నేను అప్పుడు చిన్నబిడ్డనే అయినా నాకు నరసన్నను మా అన్నయ్య కొట్టడం నన్నే కొట్టినట్లయింది. నన్ను కూడా మా అన్నయ్య కొడ్తాడేమో అనిపించిది. నేనూ వెక్కి వెక్కి ఏడ్చాను. నాకు ఎనిమిది సంవత్సరాలు ఈడుఉంటుంది.

"ఒసే రవణా! ఎందుకే యింకా ఏడుస్తున్నావు?" అని మా అమ్మ కొంచెం ఘాటుగా అడిగింది.

"దానిని రెండువేస్తే వూరుకుంటుంది" అని మా అన్నయ్య. ఎంత కోపం? మా అన్నయ్యకు నేను వూరికే భయపడ్డానా? వచ్చిన వేలకొలది జనంలో తొక్కిసలాడుతూ బయటకు వచ్చాం.

నరసన్న ఏడుపు, జనకోలాహలం, డప్పులు, బూరాలు, 'శివ శివ శివోహం' అనే భక్తుల కేకలు నా నిశ్శబ్దబాష్పాలు, మా అన్నయ్య నన్ను తిట్టడం, మా అమ్మ నన్ను కేకలు వెయ్యడం, నరసన్న ఏడుపు, ఏడుపు! మా అన్నయ్య వాణ్ణి గుళ్లోకి వస్తున్నాడని చావకొట్టాడు.

నరసన్న పెద్దవాడయ్యాడు. నేనూ పెద్దదాన్నయ్యాను. నాకు పెళ్ళయింది. నరసన్నకూ పెళ్ళయింది.

రుద్రేశ్వరం గుడియెదట మా అన్నయ్య శివరాత్రి ఉత్సవంలో వాడు గుడిలోకి రాబోయాడని అతన్ని చావగొట్టాడు. అది నా పెళ్ళిలోనూ నాకు జ్ఞాపకమే! వాడికి పెళ్ళి అవుతోందంటేనూ నాకు జ్ఞాపకమే!

నరసన్న మా అత్తవారికి పెద్దపాలేరయ్యాడు. ఆ వూరికి పెద్దమాల అయ్యాడు. కాని గుడియెదట వాణ్ణి మా అన్నయ్య కొట్టితే వాడు ఏడ్చిన ఎడుపే నాకు స్నేహితురాలయింది. అదే నాకూ నరసన్నకూ మధ్య ఏదో విచిత్రమైన పవిత్రమైన సంబంధం ఏర్పాటు చేసింది.

మా అన్నయ్య అతన్ని కొట్టిన సంగతి నేను మరిచిపోలేదు. మా అన్నయ్యే మరిచిపోయాడు. ఆ కొట్టడం చూస్తూవున్నా మా అమ్మా వాళ్ళూ మరిచిపోయారు. అఖరుకు నరసన్న మరిచిపోయాడు.

"ఏమయ్యా నరసన్నా! నీ భార్య కడుపుతో వుందట!"

"అవునండి ఖామందుగారూ!" అన్న అతని మొగం పూవులా వికసించింది.

నరసన్న ఒడ్డూ పొడుగూ అయ్యాడు. నరసన్న నల్లని రాయిచెక్కిన విగ్రహంలా మూర్తితాల్చాడు.

నరసన్నకు చదువులేదు. కాని వాడు చెప్పిన సలహో తిమ్మరుసు సలహా!

నరసన్న మా పాలేరు అవడానికి నేనే కారకురాలిని. అతడు మా పాలేరయినందుకు మాకు కోటివిధాల లాభమే అయింది. ఆ వూళ్లో (మా వూరు 'పాడు') మా పొలంలా పండే భూమేది?

నరసన్న రుద్రేశ్వరం శివరాత్రి వుత్సవంలో గుడిలోకి వెళ్ళబోతోవుంటే మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు!

మాలలూ మాదిగలూ యెన్నిసారులు పెద్దకులాల వారిచే దెబ్బలు తినలేదు!

మాలలూ మాదిగలూ యెంతమంది క్రిష్టియన్ మతంలో చేరలేదు!

మాలలూ మాదిగలూ మాకు దూరంగా వుండాలి! మేము అంటు అవుతాము. నరసన్న భార్యను యెవరూ చూడకుండా నా దగ్గరకు రమ్మనేదాన్ని. నా తల దువ్వమనేదాన్ని. రత్తాలు మొదట నవ్వేసింది. తర్వాత నా బ్రతిమాలాడాలు, నా కోపపడడాలవల్లా భయపడుతూ ఒప్పుకొని నాకు తల దువ్వింది. నా ఒళ్లు ఝల్లుమంది. నరసన్న రుద్రేశ్వరం గుడిలోకి వెళ్ళినట్లయింది. గుడిలోకి వెళ్ళినా

వెళ్ళని నేను! గుడిలోకి వెళ్ళబోయే మా అన్నయ్యచేత దెబ్బలుతిన్న నరసన్న! నరసన్న భార్య నాకు తల దువ్వింది. నేను నరసన్న భార్య రత్తాలు తల దువ్వాను.

ఓట్ల రోజులు. కాంగ్రెసువారికీ, కమ్యూనిష్టులకూ పోటీ.

మాల మాదిగలలో – వాళ్ళని హరిజనులంటారు – కాంగ్రెసువాళ్లనీ కమ్యూనిష్టులనీ ఏదో ఫెడరేషననీ యీ ముగ్గురికీ పోటీ!

మా ఆయన నరసన్నను పోటీ చేయమన్నారు. ఆయన కాంగ్రెసువారు. నరసన్న చిన్నతనంలో చదవలేదు. కాని మా వారే రోజూ నరసన్నకు చదువు చెప్పారు. అతనికి వచ్చిన చదువు యెంతో పెద్దది. రుద్రేశ్వరుని గుడియెదుట మా అన్నయ్య కొట్టిన దెబ్బలు అతనికి ఓనమాలు.

ఎంతమంది హరిజనులు గుళ్ళయెదుట, బజారులలో, అంగళ్ళవీధిలో, పొలాలలో దెబ్బలు తినటంలేదు?

వాళ్ళు ఏ దేవుణ్ణి చూడగలరు? వెంకటేశ్వరుడు, చిదంబరస్వామి, రామలింగేశ్వరుడు, శ్రీరంగశాయి వాళ్ళకు కనబడతారా? మా రుద్రేశ్వరుడే నరసన్నకు కనబడలేదు.

నరసన్న భార్య కడుపుతో వుంది! నరసన్నకు కొడుకు పుడ్తాడా, కూతురా? ఆ పాపాయికి రుద్రేశ్వరుడు కనబడడు.

"రత్తాలూ, చదువుచెప్తా చదువుకోవూ?" అన్నాను.

"నాకు చదువెందుకండీ కామందుగోరూ!" అన్నది రత్తాలు పకపక నవ్వుతూ. నరసన్న మాకు పాలేరయిన కొద్ది రోజులకు రత్తాలుతో అలా అన్నాను. అంతటితో వదిలానా? రత్తాలుచేత 'వీరవల్లడు' చదివించాను.

నాకు బాగా చదువు చెప్పించారు మావాళ్లు. ఇంటి దగ్గిరే ఇంగ్లీషు చదివా! మావారు ఏమో బందరువెళ్ళి ఇంటరుమీడియేట్ ఫేలయివచ్చి వ్యవసాయం పెట్టారు.

ఆయన "మన నరసన్న హరిజనుడు రవణా! ఎన్ని శతాబ్దాలనుంచి వాళ్లు అలా బాధపడుతున్నారూ? వాళ్లు మనుష్యులు కాదనా మనవాళ్ళు రవణా!" అని నన్ను దగ్గిరకు చేర్చి ఏదో తనలో అనుకున్నట్లుగా అన్నారు.

"నరసన్నను మా అన్నయ్య కొట్టాడండీ!"

"ఎప్పుడూ?" ఆయన ఆదుర్దా యెంతో మూర్తితాల్చింది.

"చిన్నతనంలోనండీ! రుద్రేశ్వరస్వామి గుళ్లోకి రాబోయాడు. మా అన్నయ్య వాణ్ణెరుగును. మా అన్నయ్య చావగొట్టాడు!" చిన్ననాటి ఆ దృశ్యం అంతా జ్ఞాపకంవచ్చి నాకూ కళ్లనీళ్లు తిరిగాయి.

మావారు నన్ను తమ హృదయానికి పొదివికొని, "నీ హృదయం నవనీతం రవణా!" అన్నారు. ఆయన ముద్దులు నాకు గాఢమైన ఆనందమూ, యెంతో సిగ్గూ కలిగిస్తాయి.

"నరసన్న భార్యకు తలదువ్వాను!" నా కళ్ళల్లో భయమూ, ఏమంటారు యిక అన్న అల్లరితనమూ రెండూ నర్తించాయి.

ఇక నన్ను మావారు తన కౌగిలిలో నలిపివేశారు. నా రవికముడి వీడిపోయినా, నాకు సిగ్గు పొంగుకువచ్చినా ఆయనకేమీ! అల్లరి అబ్బాయి.

"రత్తాలు పాపాయి నెత్తుకుంటుంది!" ఆయన కళ్లు నా కళ్లల్లోకి అతి గాఢంగా చూచాయి.

నా కంటిరెప్పలు అరమూతలుగా వాలినవి.

"ఆ పాపాయి రుద్రేశ్వర గుడిలోకి వెళ్తాడా అండీ?"

"రుద్రేశ్వరమే? కాశీ విశ్వేశ్వరమే!"

"ఆ పాపాయిని మా అన్నయ్యవంటివారు ఎవ్వరూ కొట్టరు కదాండీ?" నా గుండె దడదడలాడింది.

రత్తాలు పురిటికి కష్టం అయింది. అంత బండలాంటి నరసన్న ఒకటే గోల!

మా వారు పెద్ద డాక్టర్ని తీసుకువచ్చారు.

రత్తాల్ని వాళ్లగూడెంలో గుడిసెనుండి మా ఇంటికి తీసుకువచ్చారు. మా దంపుళ్ళగది పురిటిగది అయింది.

డాక్టరుగారు మూడుగంటలు కష్టపడ్డారు. నరసన్న కూతురు ప్రపంచ రంగంలో ప్రవేశించి 'కేరు' మంది.

నేను లోపలికి పరుగెత్తాను. సిద్దిలా చేతులు కాళ్లూ ఆడిస్తూ అల్లరి చేస్తూంది ఆ పాపాయి.

ఇంకో హరిజన పాపాయి ప్రపంచంలోకి వచ్చింది. అదీ విసిరేసినట్లు ఊరిబయట! దానికీ చింపిబట్టలు. దానికీ తలదువ్వుకోటానికి నూనె వుండదు! దానికీ చదువు వుండదు! దానికీ కడుపునిండా తినడానికి తిండి వుండదు! అదీ రుద్రేశ్వరం గుడియెదుట గుళ్లోకి వెళ్ళబోయి ఏ మా అన్నయ్యవల్లనో తన్నులు తినాలి.

నాకు దడదడయెత్తి ముచ్చెమ్మటలు పోశాయి. నరసన్నను మా అన్నయ్య రుద్రేశ్వరం దేవాలయం ఎదుట శివరాత్రినాడు చావగొట్టాడు కాదూ!

ఆ హరిజన పాపాయీ వాళ్లమ్మా నీళ్లు పోసుకొని వాళ్ళ గూడెం వెళ్ళిపోయారు. చిట్టికృష్ణునిలా తయారయింది ఆ చిట్టిపాప. పదిహేను రోజులలో వుంగరాల జుట్టు, అల్లనేరేడు పండులాంటి ముక్కు, నల్లదొండపళ్లు దాని పెదవులు. గవ్వలలాంటి వేళ్ళు, ఆ బొజ్జ, ఆ చిన్నకాళ్ళు, ఆ చిన్నారి చేతులు అందాలు ఒలకపోసుకుంటూ, నులక మంచంమీద దొర్లడమే! నేనూ మా ఆయనా రాత్రిళ్ళప్పుడు నరసన్న ఇంటికిపోయి, రత్తాలునీ, పాపాయినీ చూసి వచ్చేవాళ్లం!

నా చీరలూ, దుప్పట్లూ, దోళ్ళ దోపిడీ ఇచ్చాను. ఆ చిన్న పాపాయికి చిట్టిచొక్కాలు ఎన్నో కుట్టి ఇచ్చాను. ఆ ముద్దుపాపను చూచినపుడల్లా మా ఆయన చిన్నపాపడై కన్పించేవారు. నా రవిక జేబులు పిక్కటిల్లేవి.

ఊళ్ళోవాళ్ళు మేము కులం నాశనం చేశామని తిట్టుకుంటున్నారట. రాములవారిలా అజానుబాహువులు కలవారూ, అందమైనవారూ, బంగారంచాయ కలవారూ, సాధుమూర్తి అయిన మా వారంటే అందరికీ భయమూ, భక్తీ! అయినా మమ్మల్ని అందరూ తిట్టేవారు.

వాళ్ళంతా రుద్రేశ్వరదేవాలయంలోకి నరసన్నవంటి హరిజన బాలకులు వస్తే చావగొట్టే జాతివాళ్ళు! మా అన్నయ్య నరసన్నను ఒక శివరాత్రినాడు చావకొట్టాడు. మా అన్నయ్య మా ఇంటికి మేం నరసన్న భార్యను పురిటికి తీసుకు వచ్చినప్పటినుండీ రావడం మానివేశాడు. నరసన్నే నాకు అన్న! 'అవును రవణా! రుద్రేశం తల్లి కడుపున బుట్టిన అతడే నీకు అన్న! అతడే మనకింత తిండి పెడుతున్నాడు!' అని వెన్నెలలాంటి చిరునవ్వునవ్వుతూ మా ఆయన అన్నారు.

మావారు భగవంతులే!

నరసన్న ఎన్నికలలో నెగ్గాడు. చెన్నపట్టణం శాసనసభకు సభ్యుడట.

ఆరోజు మావారు కాంగ్రెసు నాయకులకూ ఊళ్ళవారందరికీ విందు చేశారు. నరసన్న మావారిపక్కనే కూర్చున్నాడు విందులో.

మా నరసన్న, నరసన్నగారు శాసనసభ్యుడు. ఇప్పుడూ మా అన్నయ్య నరసన్నను కొడతాడా రుద్రేశ్వరం గుడి ఎదుట! ఏమో, మా అన్నయ్య ఎంతకైనా తగును!

నరసన్నకు మా దంపుళ్ళసావిడి అయిదు వందల రూపాయలు పెట్టి చక్కని ఇల్లులా సిద్ధంచేసి మావారు అందులో ప్రవేశించబెట్టారు. ఇంక మాస్థితి? నాకు నరసన్న పాపాయి ఆప్తురాలు.

నేనూ, నరసన్నభార్య రత్తాలూ – రత్నమ్మా, ఖద్దరూ వడకడం ప్రారంభించాము. మావారు ఎప్పటినుంచో ఖద్దరు కడుతున్నారు. ఇప్పుడు నరసయ్య అన్నా, రత్నం మరదలూ, మేనకోడలు భరతాంబా అందరూ ఖద్దరు కడుతున్నాం.

నరసన్న అన్నా, అతని కుటుంబమూ శుభ్రంగా తిండి తింటున్నారు. శుభ్రంగా బట్టలు కట్టుకుంటున్నారు. రుద్రేశ్వర దేవాలయం ఎదుట మా అన్నయ్య కొట్టిన దెబ్బలూ, అతని ఏడుపూ నరసన్నకు ఆశీర్వచనాలు!

భరతదేశంలోని హరిజను లందరూ రుద్రేశ్వర దేవాలయం యెదుట మా అన్నయ్యచేత దెబ్బలు తినాలా?

భరతదేశంలోని హరిజనులందరూ ఇంత తిండీ, ఇంత బట్టా సంపాదించుకోవాలంటే శాసనసభ్యులవ్వాలా?

ఇంతకూ మా నరసయ్యన్న పాపాయిని నేనే పెంచడం, పిల్లలు లేనివాళ్ళు ఇంకోళ్ళ పాపని తెచ్చుకు పెంచుకుంటే పిల్లలు కలుగుతారంటారు. భరతాంబ నాదగ్గిరే. నన్ను "అత్తా" అంటుంది. నా దగ్గిర పండుకునే నిద్రపోతే ఓ రాత్రివేళ వాళ్ళమ్మ వచ్చి తీసుకుపోయేది.

ఓరోజున ఆ పెంకెభరతం అల్లరిచేసింది. నాదగ్గిర పడుకొని నిద్రపోయి రవిక పిన్ను ఊడిపోయి నా బంగారునిధులు, పొడిబంగారు కలశాలు, కర్కశపు ఉబుకులు, చిన్నబుడ్డ పుణుకులు ఎరగని, పనికిరాని వట్టి అందాలు, భరతాంబ నోటితో అందిపుచ్చుకుని, పట్టి మొనలు పుణకడం ప్రారంభించింది. నాకూ నిద్రపట్టింది కాబోలు, వళ్ళు ఝల్లుమని, మేనెల్లా తీపులు ప్రవహించి, ఆనందం ముంచెత్తి, ఎవరో బంగారు పాపాయి నా గర్భం పండించి నా పాలు పుణుకుతున్నట్లయి మెలుకువ వచ్చింది. భరతం కొంటెపాప నిద్రలో పుణుకుమని వట్టి వట్టి పాలు తాగుతున్నది.

ఆసి అల్లరిదాన అని సిగ్గుపడి, మా ఆయన నిద్రపోతూ ఉండటం చూచి, నెమ్మదించుకొని, దిబ్బెసలాంటి భరతాంబ పిరుదలపై రెండు చిన్న దెబ్బలు తగిలించి వాళ్ళఅమ్మని పిలిచి భరతాన్ని అందిచ్చాను.

అక్కడనుంచి రోజూ కలలు! రెండునెలలకు నాకు నెల తప్పింది. నా కన్న, నా భరతం నాకు వరమిచ్చింది.

ఇంకా మా రత్తాలు – రత్నం – సంతోషం ఇంతా అంతా! మా ఆయన నన్ను పూజించారంటే, వారు పదహారుకళల చంద్రులయ్యారు.

తొమ్మిదినెలలలో వెన్నెల ముద్దకట్టే నాకు ఓ పాపాయి ప్రత్యక్షమైంది.

"ఆసి బంగారుతల్లీ, అచ్చంగా తండ్రిపోలిక వదినగారూ!" అన్నది రత్నం పాపాయికి నీరుపోస్తూ.

ఈ నా కన్నతల్లి భరతాంబ మరదలు. మావారి ప్రేమ మూర్తికట్టిన వరలక్ష్మి. నరసన్న మా అన్నయ్యచేత దెబ్బలు తిన్నప్పుడు ఏడ్చిన ఏడుపులో ఉన్న కరుణరసం నిండిన కలశం వచ్చింది. ఆమెను మేము "పూర్ణ స్వరాజ్యలక్ష్మి" అని పేరు పెట్టుకున్నాం.

● *ప్రచురణ: ప్రగతి మాసపత్రిక, 1946* ●

★ ★ ★

12

వుప్పల లక్ష్మణరావు

# నిద్రలేని రాత్రి

## తొలిమాటలు

అవి దేశంలో గడ్డుదినాలు.

కాటూరు–ఎర్రవీరులకి పెట్టనికోట. పెట్టని కోటని కుప్పకూల్చాలని ప్రభుత్వపు తహతహ.

కాటూరిని చుట్టుముట్టాయి ప్రభుత్వపు బలగాలు. చేజిక్కినమొగవాళ్ళని పట్టుకుని చేతులు విరిచి కట్టారు. చింతబరికెలతో వీపులు చిట్లెక్కబాదారు. వలయాకారంలో నిలబెట్టి గుడ్డలూడబెరికి కాళ్ళు పంగజాపించారు.

భార్యలని ఈడ్చుకొచ్చారు.

దిగంబరులైన వాళ్ళ మొగుళ్ళ కాళ్ళ మధ్య నుండి దూరి వెళ్లేట్టుచేశారు, నెహ్రూ ప్రభుత్వపు పోలీసు శూరులు.

ఈ స్వతంత్ర భారతంలో యీ పాశవిక కాండ జరిగి యింకా నూరురోజులు తిరగలేదు– యీ కథ జరిగింది.

ఎందరివో భరించరాని బ్రతుకులు.

ఎందరికో నిద్రలేని రాత్రులు – జాగారాలు – వరుస తరబడి నిద్రలేని రాత్రులూ జాగారాలూను.

☆ ☆ ☆

రాత్రి రెండోజాంవు, హోరున వర్షం. వర్షానికి నా మనసు పరవశం. ఆ హోరు నాకు హర్షదాయకం. నా పెనిమిటికి జడివానంటే తగని జడుపు. వాన తడికి అతని వొళ్ళు ఝల్లుమంటుంది. ఉరుములంటే వల్లమాలిన వెర్రి వెరపు. మెరుపులు అతని కంటికి మెరమెర కలకలు. పిడుగు చప్పుడు గుండెకి ఏకదడ. మేడమీద కిటికీలు బిడాయించి మంచమ్మీద ముసుగుదన్ని మునగదీసుకు పడుకున్నాడు. నేను కిందగదిలో చాపేసుకు తలకింద మోచేతి తలగడ పెట్టుకు పడుకున్నా. జైలు జీవితపు కటకటాల్లో యిది నా కబ్బిన ఓ మంచి అలవాటు. అనాడు మేమిద్దరం చేసుకున్న అన్యోన్య ఖరారు ప్రకారం. ఎవరి పడకపై వారం మేనువాల్చాం. మేం జీవితకాలం నాలుగోపాదంలో కాలు పెట్టాం. పిడుగు నినాదాలు నా చెవుల్లో

రణభేరీల పిలుపులై వినిపించాయి. మెరుపుల వెలుగులకి నా కళ్ళు చిల్లులు పడినా మదిలో దీపకళికల వెలుగుకి ఆనందించాను. వానచినుకులు చీకటి చుక్క చీకట్ల పోగులై మెరవగా, ఆ వొయ్యారాన్ని కిటికీలోంచి చూస్తూన్నాను, నా కాళ్ళదరి మా ఆల్సేషన్ "శేషు" పడుకుంది. నాకు మాగన్నుగా నిద్రపట్టింది.

"ఊహిష్! ఊహిష్! ఊహిష్!" కిటికీ దగ్గర లీలగా మూడు తడవలు ఈల, శేషు గుర్రుతో సన్నగా మొరిగి లేచి, వొళ్ళువిదిల్చి చెవులు రిక్కించింది. "హుష్ శేషూ!" అన్నా. ఆ యీల నాకు తెలిసిన పిలుపు. తలుపు తీశా. కటికచీకట్లు ముసురుకున్న ముసురులో తడి ముద్దైన మనిషి "బ్రహ్మనాయుడూ!" అని పలకరించా. "బాలనాగమ్మా," అని బదులుపలుకు. సంకేతం సత్యం. "ఏవిటి కబురు?" "అమ్మగారు ఉన్నపాటున రమ్మన్నారు. మరొస్తారా నాతో? ఓగిరాల్లో నాకు తొందర పనుంది. నే వెడుతున్నా" అని జవాబు. మెరుపుల చినుకుల్లో ఆకృతి కరిగిపోయింది.

మా కారు రథ సారధి పార్థుడూ, కమ్ వలలుడూ, కమ్ తంత్రీపాలుడూ పండక్కి మూడ్రోజుల సెలవుమీద పట్నం వెళ్ళాడు. నేను వసారా గదిలోకెళ్ళి దుస్తులు మార్చుకుని, శేషుకి హుషారు చెప్పి, యింటి తలుపు మెల్లిగా చేరేసి, కారు షెడ్డులో అడుగిడా. కారు స్టార్టు చేసి, షెడ్డు బయటికి తీసుకొచ్చి, నేను కొన్నాళ్లక్రిందట కలకత్తాలో చోర్ బజారులో కొన్న దొంగనెంబరు ప్లేట్లు తగిలించి. 'సి' సర్టిఫికెటు, కారు లైసెన్సు మార్చేసి. ఇంకా ఇతర డాక్యుమెంట్లు ఫోర్జు చేసిన సెట్టూ, అంతా సిద్ధంగా వుంచుకుని, తరువాత షెడ్డు తలుపులు మూశా. వాన జోరు రవంతైనా తగ్గలేదు సరికదా మరింత ఉధృతమైంది. ఇంతటి ప్రళయ వృష్టికి పిరికి గుండె మరింత డిల్ల పడుతుందని ఎరుగుదును. పిడుగు ఫెళఫెళకి చెవుల్లో దూది కుక్కుకున్న వ్యక్తికి కారు చప్పుడు వినబడదులే, ఫరవాలేదని, మనస్సు కుదుట పరచుకున్నా, వానకొట్టి కురుస్తున్నా కెనాలు గట్టుమీద గతుకులు రోడ్డు వెయ్యిసార్లు మెట్టిందే కనుక, గుంటల్లో కారు దిగబడకుండా త్వరగానే వెళ్లగలిగా.

డాక్టరమ్మగారి గుమ్మంలో కారాపా. కారు తలుపు తెరిచా. గుమ్మంలో నుంచున్న డాక్టరు, "స్వాతి వాన చినుకు కోసం ముత్యపు చిప్పలా నీ కోసం కాచుకున్నా" అంది.

"చినుకు రానేవచ్చింది. ముత్యపు చిప్ప మూసుకోవాలి!" అన్నా. కారులో తన రెండు తోలుసంచులు పెట్టి, ఆఁవె కారెక్కి నాపక్క కూచుంది.

"ఇంత వానలో ఎవరికమ్మా కానుపు!" అనడిగా.

"చలికి చావులూ, చినుకుకి కాన్పులూ అగుతాయిటోయ్?" అంది డాక్టరు.

"ఐతే, రెండూనా" అనడిగా.

"ఎవరు చెప్పగల్రూ" అంది.

"నర్సు ఏదీ?" అన్నా.

"ఈ కేసుకి నువ్వే అప్పల నరసమ్మవి. విషయం చెబుతాన్లే – బందరు రోడ్డంట పోనీ." అందాఁవె.

కన్ను పొడుచుకున్నా కానని చీకటి. కారు దీపాలు అగ్గిబరాటాల్లా చీకటిని పటాపంచలు చేస్తున్నాయి. పడమట దాటేం, నరకచతుర్దశి అంధకారం. అంధకారానికి

స్లైదోడు – మాలకాకులమందలా, చీకటిచెట్ల అడవులు కప్పిన కాటుకకొండలా – కారుమబ్బుల ఆకాశం.

"పునాదిపాడు నీకు తెలుసుగా?" అంది.

"నే నక్కడేకదా కవాతు నేర్చినది" అన్నా.

"అక్కడున్నాడు కమ్యూనిస్టు అగస్త్యుడు. మునిజన సంహారార్థం పోలీసు మృగయావిహారం. మనంవా ముని ప్రాణాన్ని రక్షించాలి. పోలీసు అక్షౌహిణులు మరి నాల్గైదురోజుల్లో ఆ వూరిమీద మెరుపుదాడికి సిద్ధంవౌతున్నాయని డిప్టీ పోలీసు కమీషనరు తైనాతీ బంట్రోతు చేరదీసిన ఆవెడ కాన్పుకని ఉదయం కబురు చేరేసింది. మునిపల్లెలో దాగున్న పక్కింట్లో నిండు చూలాలికి నొప్పులొచ్చాయని ఆ వూరినుంచి కబురు తెచ్చిన పిలుపు. సాయంకాలానికల్లా వస్తానని చెప్పి, ఆ మనిషిని పంపివేశా. ఇంతలో కుంభవృష్టి. ఈ విపరీత వర్షం మూలాన అద్దెకారు దొరకలేదు. చావు బతుకులు అప్పుడు నీ మాట గ్యాపకం వొచ్చి కొరియర్‌ని నీ దగ్గరకి పంపించా. మనం వెళ్ళి చూలాలిని చూద్దాం. ఆ అమ్మాయి వొంటి తత్వం నాకు తెలుసులే. అవి పెద్ద నొప్పులు కాకపోవచ్చు. ఐనా, మనం చూలాల్ని పరీక్షచేసి, కొంత కోలాహలం లేవదియ్యాలి. యోగనిద్రలో వున్న మునిపుంగవునికి వ్యవధియ్యాలి. ఈ లోపల కాగలపనులు గంధర్వులే తీరుస్తారు. ధన్వంతరులం, గంధర్వులం మనమే!" అందామె నవ్వుతూ.

జడివాన కారు విండోస్క్రీను మీద వానపాదరసపు బొట్లు చల్లుతూంది. కళ్ళు చెదురుతున్నాయి. తుళ్ళిన తుంపిళ్ళు మిణుగురుల్లా మెరిశాయి. పామర్రు పోలీసు స్టేషను దాటిన నూరు గజాలకి ట్రంకురోడ్డు వదలి ఎడంవకిమళ్ళి మూడు కోసులు వెళ్తే పునాదిపాడు. చెదురు మదురుగా మెరుపుతీగలా మెరుగుచూసిన కాకరపువ్వులు పిడుగు చప్పుళ్లలో లీనంమైపోయిన టపాసుల అట్టహాసాలు...

పురిటింటి ముందున్న పాకలో కారాపా. అదృష్టవశాత్తు ఆ యింటి నిండా జనం. వూళ్ళు యేళ్ళూ యేకంవై నీరుపారుతున్నా పెద్దింటి అడపడుచు తొలిచూలు నీళ్లాడుతుంటే, ఆ బాధకి ఆ వీధి అడంగులందరికీ సానుభూతే మరి. ఘరానా కమ్మోరింటి కూతురు గనుక వానలో తడిసిన మొగాళ్ళు కొందరు ముందు సావిట్లో కుర్చీల్లో కూర్చుని గుంటూరు పొగాకు చుట్టలపొగలు గుప్పుగుప్పున వదల్తూ యింటి యజమానిపై ఉచిత సలహాల చినుకులు కురిపిస్తున్నారు.

గర్భిణి కొచ్చినవి పెద్ద నొప్పులు కావుకదా, కల్లనొప్పులు కూడా కావనీ, చలినొప్పులూ, పులినొప్పులే అనీ డాక్టరుగారు వెంటనే పసికట్టేసినా, పరీక్ష సరంజామా, పరిచర్యలూ సిద్ధం చేయవలసిందని ఆంవె నాతో చెబుతూనే, రహస్యం కూడా గుసగుసమన్నారు. వేసుకున్న వ్యూహం ప్రకారం రబ్బరు గౌన్లు తొడుక్కుని, పొత్తికడుపు పరీక్షలేంవిటి, రక్తపుపోటు కొలతేంవిటి, స్టెతస్కోపుతో శిశువు గుండె చప్పుళ్ళు వినడ వేంవిటి – కొంత గడబిడ హంగామా చేశాం. మొహాలు మూరెడు సాగదీసుకున్నాం. నవరసాలూ వొలికించాం. మరేం ప్రమాదంలేదని ధైర్యం చెప్పాం. మిన్నులు విరిగిపడినా మూడో నాటికి తప్పకుండా వచ్చి చూస్తానని డాక్టరుగారు

మాటిచ్చారు. అవసరమైన టానిక్కులు నాలుగు ఖరీదైనవి రాసిచ్చారు. చూలాలికి ఇష్టమైన పథ్యం చెప్పారు.

మేం తిరుగు ప్రయాణానికి సిద్ధం అయాం. ఐరావతి పుండరీకాదులు తొండాలనుండి వర్షధారలు జలపాతాల్లా పడుతూనే వున్నాయి మొగాళ్ళందరూ మోతుబరిరైతులు గనుక ఒకరితో ఒహారు పోటీలు పడి అంధకారాకాశంలోకి చూసి మీనమేషాలు లెక్కకట్టి, చవితి వెళ్లే వరకూ వాన వెలియదని జ్యోతిషం చెప్పారు. పెద్దషావుకారూ, వెయ్యెకరాల భూస్వామీ, యింటి యజమానీ, కమ్మోరి కులపెద్ద అయిన పెద్దమనిషి నల్లని మబ్బులాంటి గొడుగుపట్టగా, ఆ గొడుగు క్రింద డాక్టరమ్మగారూ, యింటి నౌఖరూ, పెద్దపాలేరూ అయిన కమతగాడు దవళఛత్రం లాంటి తాటాకుగొడుగుపట్టగా, ఆ గొడుగుకింద నేనూ యెదటి పాకకిందున్న నా ఆస్టిన్ సెడాన్ చేరుకున్నాం. జమ్ముగూడ వేసుకున్న జీతగాడు డాక్టరుగారి రెండు తోలు సంచులూ తెచ్చి కారు దగ్గిరుంచాడు. డాగులుపడి, నిక్కరుమడత కుట్టుదగ్గర అడ్డంగా చిరిగిన కాకీ నిక్కరూ, పొట్టిచేతుల కుళ్ళు కాకీ షర్టూ, భుజమ్మీద మాసికలేసిన తువాలూ, నాలుగు రోజులనాటి మాసిన గెడ్డమూ – మోటారు కులంలో నాల్గోజాతి శాల్తీ వొహడు కుళ్ళోడుతూన్న గుడ్డతో విండ్స్క్రీను తుడుస్తున్నాడు.

'ఎవడీ వ్యక్తి?' అని నేను డాక్టరుగారి నడిగేలోపునే యింటి యజమాని అన్నాడు:

"అయ్యో! మీ క్లీనరుకి టీ యేనా యివ్వలేదండి పాపం! గుమ్మంలోకేనా వచ్చాడు కాడే!" అని కనికరం వెలిబుచ్చి ఆ మనిషిచేతిలో వో రూపాయి పెట్టాడు. "పర్వాలేదు లెండి. ఈ వర్షంలో కారుని కనిపెట్టుకు వుండడానికే కదండీ, క్లీనరు" అని డాక్టరుగారు, ఆ పెద్ద మనిషి పెద్దమనసుని వోదార్చారు. నా కర్థమైంది. జేబులోంచి తాళాలు తీసి క్లీనరు చేతికిచ్చా, కారు తలుపులు తెరిచాడు. కమతగాడు రెండు తోలు సంచులూ వెనక సీట్లో పెట్టాడు. క్లీనరు 'లగేజి బూటు' తలుపుతీసి, తనచేత జిడ్డు వోడుతూన్న 'మోబిలాయిలు' టిన్ను అందులో వుంచి, బూటు తలుపు మూసి, తాళాలు నాచేతికిచ్చాడు. కారు స్టార్టు చేశాను. క్లీనరు కారు దగ్గర నుంచుని, "రైట్, రైట్, కుడిసేతియేపు కొయ్యండి! బాక్, బాక్! స్టాప్! రైట్రైట్!" అని చెప్పి, వెనుక సీట్లోకి ఉరికి కూచుని, తలుపు వేసుకున్నాడు.

పోరంకి దాటాం. బెజవాడ పొలిమేరలోనే ఏలూరురోడ్డువేపు ట్రంకురోడ్డుకి కారు మళ్ళించా. నూజివీడు బస్సుస్టాండు దగ్గర బంకులో పెట్రోలు కొట్టించా. కారులో బంకునుండి జానెడు వెడల్పు పలుచని గోనెగుడ్డచుట్టిన కారుటైరు అందుకున్న క్లీనరు, తను తెచ్చిన 'మోబిలాయిల్' టిన్ను బంకు కుర్రాడికిచ్చి, పొద్దున్న బస్సులో కొవ్వూరు నుండి వచ్చిన ఆయిల్టిన్ను తనకివ్వమన్నాడు. ఆ కొత్త టిన్నుకి దొంగడుగుందనీ, అందునిండా కరపత్రాలున్నాయనీ గ్రహించాను. నూజివీటి నుంచి కారుపోనిచ్చి సరాసరి పవరుపేట స్టేషను దగ్గర కారు ఆపాను. స్టేషన్లో రాజమహేంద్రవరం కోచి సిద్ధంగా వుంది.

"కామ్రేడ్, గండయ్యగారూ! బండి అందుకోండి. టిన్ను జాగ్రత్త!" అంది డాక్టరమ్మ...

కారుని బెడవాడరోడ్డుకి మళ్ళించాను. ఎడతెరిపి ఎరగని కుండపోత... కారు దీపాల తెల్ల వెలుగులో కొల్లేరు, బుడమేర్లు కలిసి మున్నీరై కృష్ణవేణమ్మనే కలుసుకుందికి

ఉరకలతో నురగలతో పురుగులు తీస్తున్నాయా – అనిపించింది. సిమెంటురోడ్డు మీద ప్రవాహం పోత వెండి ప్రవాహంలా, మెరుస్తూ కృష్ణ స్రవంతిలా కానవచ్చింది. వర్షధారలు ఆకాశంనుండి జీరాడుతూన్న అణిముత్తెపు సరాల్లా, తళ్కులొత్తాయి. కారు అక్కడికక్కడే ఆపి, కారులోంచి దిగి, అనంతం నుండి వేలాడుతూన్న ఆ వెండి తీగలు పట్టుకుని యొగబాకి అంబరాన్నందుకుంటాం అని ఆశయె మదిలో వెలిసింది... జడివాన తగ్గనేలేదు...

డాక్టరుగార్ని ఇంటిదగ్గర దింపేశాను. నేను యిల్లు చేరుకుని, కారు షెడ్డులో పెట్టి నా గదిలో కాలు పెట్టాను. శేషు తోకాడించింది. దాని వొళ్ళుతట్టి, తల నిమిరాను. కాళ్ళు చేతులు కడుక్కుని బట్టలు మార్చుకుని మేడెక్కా. పెనిమిటికి నిద్రా భంగమవలేదు. కోళందరెడ్డిగారింటి వెనకున్న యెరుకల గూడెంలో తొలికోడి కంటే ముందే కూసింది ఫాక్టరీ సైరను. తెల్లవారి నాలుగైందని లోకానికి చాటింది.

నూటపాతికమైళ్ళు చుట్టబెట్టాయి కారు చక్రాలు.

కొత్తరోజు మొదలైంది.

నిద్రలేని రాత్రి వ్యర్థం కాలేదు.

☆ ☆ ☆

## మలిమాటలు

మరి వారంరోజుల తరువాత పత్రికల్లో వార్త! "దేశవిద్రోహుల్ని నిర్మూలించే కార్యక్రమంలో మలబారు పోలీసులు గుడివాడ తాలూకా అంతా గాలించారు. ప్రజాద్రోహులు కొందరు పట్టుబడినట్టూ, బండెడు కరపత్రాలు వశమైనట్టూ పోలీసుల కథనం తాలూకా విద్రోహుల నాయకుడు బండమూడి దండయ్య పోలీసులనుండి తప్పించుకుని పరారీలో వున్నట్టు పుకార్లు వ్యాపించాయి..."

పత్రికల్లో యీ వార్త వచ్చినరోజే ఓ పోస్టుకార్డు బెజవాడ చేరింది. పై విలాసం యిలా వుంది: చిరంజీవులు మా కుమారులు

**వేముగంటి వెంకట నాగభూషణరావు, బి.యస్‌సి.**
మెడికల్ రిప్రజెంటేటివు,
సేన్ అండ్ సేన్ కంపెనీ,
పూలబజారు, బెజవాడ.

కార్డులో విశేషాలు:

"నంబరు – 8,
డ్రైడాక్ లేన్, కిద్దర్‌పూర్"
కలకత్తా.

19 అక్టోబరు, 1948.

**చి॥ భూషణానికి,**

చిరాయువులుగా మీ అమ్మ దీవించి వ్రాయునది. శ్రీ మీ దొడ్డమ్మగారు పవరు పేటనుంచి ఇక్కడకు క్షేమంగా చేరినారు. శ్రీ మీ దొడ్డమ్మగారివల్ల మీ యోగక్షేమం

తెలిసి సంతోషించినాను. నువ్వు పంపించిన నక్కదోసావకాయటెన్ను అందింది. ముక్కలు మెత్తగా వున్నాయి. నిడదవోలుకాయ కాబోలు. జగ్గయ్యపేట కాయే ప్రశస్తము. ముక్క గట్టిగా వుంటుంది. కారం తక్కువగా వుంది. ఇంకా ఘాటుగా వుండాలి. గొల్లప్రోలు మిరపగుండ వాడాలి. చి॥సౌ॥ కోడలికి పాళ్ళు సరిగ్గా తెలిసినట్టులేదు. చి॥ చిన్న గోదావరి స్టేషనుకువచ్చి శ్రీ మీ దొడ్డమ్మగారికి ఆవకాయటెన్ను అందచేశాడట. అందులో కొంత తను తీసుకుని మిగిలినది శ్రీ దొడ్డమ్మగారికి యిచ్చినాడు. నీకు తెలియగలందులకు వ్రాయిస్తున్నాను. శ్రీ దొడ్డమ్మగారిని అక్కడ రెండు మూడు నెలలుండమనీ, రైల్వే పాసులు దొరకగానే కాశీయాత్ర చేయిస్తాననీ చి॥ పెద్దవాడూ చి॥సౌ॥ పెద్దకోడలూ అంటున్నారు మనవాళ్ళందరూ కూడా శ్రీ మీ దొడ్డమ్మగారిని రెండు మూడునెలలు కాశీవాసం చేయమని బలవంత పెడుతున్నారు. చి॥సౌ॥ కోడలికి ఎనిమిదో మాసం వెళ్ళినట్టు నీ దగ్గరనుంచి వుత్తరం అందగానే నేనో శ్రీ మీ దొడ్డమ్మగారో నీ దగ్గరికి వస్తాము. మీ క్షేమం కానీ కార్డుమీద రాసి తెలియచేస్తూ వుండవలెను. అశ్రద్ధ చేయవద్దు గాన గ్రహించవలెను.

ఇట్లు
వేముగంటి వెంకాయమ్మ
వే.వెం. అనుమతిని
వే. వెంకట్రావు.

☆ ☆ ☆

బెజవాడ పూలబజారు మార్కెట్టులో వున్నతనికి వచ్చిన కార్డు చదువుకుని నాగభూషణం ఈ కింది విధంగా అర్థం చేసుకున్నాడు.

పవరుపేటనుండి మీరు పంపిన కొరియర్ (విప్లవకాలంలో విప్లవకారులు తోటి విప్లవకారులకి సానుభూతిపరులకి పంపిన రహస్యవార్తాహరుడు) దండయ్యద్వారా పంపిన కరపత్రాలు అందేయి వాటిని యిక్కడ మన ఆంధ్రులందరకూ రాత్రిపూట పంచిపెట్టేం. వసూళ్ళు బాగానే జరుగుతున్నాయి. కాని కరపత్రాలభాష ఉత్తేజకరంగా లేదని శైలి గ్రాంధికంగా ఉందని అభిప్రాయపడ్డారు. కరపత్రాల భాష ఇంతకంటే ఉత్తేజకరంగా వుండాలి. మనిషికి కోపం తెప్పించి ద్వేషం రగిల్చి, రక్తం మరిగించి తుపాకి పట్టుకుని నైజాంని కూలదోయడానికి తగినంత ప్రోత్సాహకరంగా ఉండాలి. మీరు పంపిన కరపత్రాల్లో భాష శైలి చాలా మృదువుగా వుంది. పాతపడిపోయిన నానుడులూ, చిరకాలంగా నోట నానిన నినాదాలూ హెచ్చుగా వున్నాయి. పరిస్థితికి తగిన ఉద్రేకపూరిత భాష కావాలి. కరపత్రాలు రాసిన వాళ్ళు పూర్వకాలపు రచయితల్లా కనిపిస్తుంది. యువత ఉడుకురక్తం చిందించడానికి కొత్తభాష అవసరం అవసరమని తోస్తే (పోలీసు నిఘావల్ల) దండయ్యని కాశీయాత్రకి పంపిస్తాము. ఇక్కడ కిదర్‌పూర్‌లో వసూళ్ళ రిక్రూట్‌మెంటు పూర్తికాగానే కానీ కార్డు రాసి టపాలో పంపు. అది చూసుకుని నువ్వెప్పుడు రావలసినదీ తెలియచేస్తాం.

ఇట్లు
మీ అమ్మ అనుమతిని
వేముగంటి వెంకాయమ్మ
వేముగంటి వెంకటరావు

☆ ☆ ☆

కథ కంచికి వెళ్ళింది. మేం యింటికి వెళ్ళిపోయాం. కా|మేడు దండయ్యగారిని పోలీసు కబంధహస్తాలనుండి ఎలాగైనా రక్షించవలసిందని పార్టీ మా కిచ్చిన ఆజ్ఞను మేం జయప్రదంగానే నిర్వహించాం. కిదర్‌పూర్‌నుంచి వచ్చిన కార్డును బట్టి ప్రవాసాంధ్రలోకానికి ఆంధ్రలో యేమి జరుగుతున్నదీ బొత్తిగా తెలియనట్టు తెలుస్తుంది.

పార్టీ పెద్దలతో చెప్పి, కరపత్రాల ద్వారా ప్రవాసాంధ్రులకు ఆంధ్రలో నిజంగా యేం జరుగుతోందో తెలియచెయ్యడం మన కనీస ధర్మం. కా|మేడు దండయ్య కొన్నాళ్ళ పాటు కిదర్‌పూరు డాక్సులో పనిచేసి, తరువాత అజ్ఞాతంగా ఆరు నెలలపాటు కాశీ నివాసం యేర్పరచుకోవడం మంచి సలహా. కాశీలో వేలసంఖ్యలో వున్న బైరాగుల్లో ఇతడుకూడా కలిసిపోతాడు. మూరెడు గెడ్డం పెంచి, కాషాయబట్ట, భుజానికి జోలి, చేత కమండలం, రెండవచేత రాగిజారీ, వొంటినిండా విభూది పూసుకుని మెడలోనూ, చేతికీ రుద్రాక్షమాలలూ ధరిస్తే, ఏ సి.ఐ.డి. కూడా కా|మేడు దండయ్యను పోల్చుకోలేడు. ఆంధ్రలో సద్దుమణిగింతరువాత అతడు మళ్ళీ విజయవాడ చేరుకోవచ్చు.

● ప్రచురణ కాలం ? ●

★ ★ ★

13

సెట్టి ఈశ్వరరావు

# హిందూ-ముస్లిం

పళ్ళదుకాణం ముందుకి రెండురోజుల పస్తుకడుపుతో వచ్చేడు రాందాసు. రాందాసు కళ్ళల్లోకి బుగ్గల్లోకి కొలత తీసుకుంటున్నట్టు అబ్బాస్ చూస్తున్నాడు. పొడయిపోయిన నూతుల్లాగున్నాయి. రెండు సంవత్సరాల కిందటి తన స్వరూపానికి ప్రతిబింబంలా వున్నాడు. ఆ దుర్దినాలు అబ్బాస్ ముందు నుంచున్నాయి.

"కూలి దొరుకుతుందా?" అన్నాడు రాందాసు. నూతిలోంచి తోడుతున్నట్టున్నాయి మాటలు. అబ్బాస్ మొహంవేపుకి కళ్ళు తిప్పి వుంచేడన్న మాటేగాని యేం చూస్తున్నాడో తనకే తెలీదు దాసుకి. కాలే కడుపు శరీరాన్నే కాకుండా బుద్ధిని కూడా నీరసపర్చింది.

అబ్బాస్ మేలుకున్నాడు... "కూలి దొరుకుతుందా?"... తన బ్రతుక్కి యింకోణ్ణి కూలికి పెట్టుకోవడం కూడానా అనిపించింది. బిగించుకపోతున్న పెదాలు బలవంతంగా విప్పి "లేదు – అక్కర్లేదు" అన్నాడు నెత్తిమీంచి పళ్ళగంప దించుతున్నంత కష్టంతో.

ఊతగా పట్టుకున్న దుకాణపు రాటనుంచి చెయ్యిజార్చి వొళ్ళు యీడ్చుకుంటూ వెళ్ళిపోతున్నాడు దాసు.

కిందనుంచీ మీదవరకూ రెప్పవెయ్యకుండా చూస్తున్నాడు అబ్బాస్. దాసు ప్రతి దుకాణందగ్గిరా నిలబడి కూలి వెతుక్కుంటున్నాడు. పాదాలనుంచి పిక్కలవరకూ దిట్టంగా ఆశ్రయించుకున్న ధూళి – ఆ ధూళిలోకి యింకుతూన్న చెమట – పెచ్చులు పెచ్చులుగా వుంది. ఆ జుట్టులో నలుపుదనంకన్నా రోడ్ల ధూళి రంగే చాలా ఎక్కువ. చూస్తుండగానే మలుపు తిరిగిపోయేడు దాసు. ఇక చూడ్డం అనవసరమని తెలియక అబ్బాస్ ఇంకా అటే చూస్తున్నాడు. "ఈ పళ్లు ఎంతకమ్ముతున్నావ్?" అన్న పలకరింపు వినిపించింది. బరువుగా పీల్చిన గాలిని వొదిలిపెట్టి వ్యాపార వ్యూహాలోకొచ్చేడు.

"భాయీ! మనం మనం ముసల్మానులంగాబట్టి నిజమైన ధర, తక్కువధర కివ్వాలి నాకు?" అన్నాడు అభిమానం చూపెడుతూ.

ముసల్మానుగదా అని మొదటే సాధ్యమైనంత తక్కువ ధర చెప్పేడు.

ఇక చిల్లిగవ్వ తగ్గించినా తనకి గిట్టుబాటవదు. సగానికి సగం ధరకి బేరమాడి కారెక్కి వెళ్ళిపోయేడు బేరగాడు. కారు ధూళి రేపుకుంటూ వెళ్ళిపోయింది. ధూళి గాలిలో కలసిపోయేవరకు కూడా అదేపనిగా చూస్తున్నాడు అబ్బాస్. వెనకనే పోతున్న

దొరగారి కారు ధూళీ, మార్వాడీ కారు ధూళీ. ముసల్మాను సోదరుడి కారు ధూళిలాగే వున్నాయి. యే మాత్రం భేదంలేదు.

☆ ☆ ☆

ఎక్కడా లాభించలేదు. రాందాసు మలుపు తిరిగి వస్తున్నాడు. రెండు సంవత్సరాల క్రిందటి తన స్థితిని కంఠోపాఠం చేసి రాందాసు ఒప్పచెపుతున్నట్లు కనిపించింది అబ్బాస్‌కి.

అబ్బాస్ దుకాణం ముందునుంచి వస్తున్నాడు రాందాసు.

"ఏమయ్యోయ్ – ఇటురా" అని పిల్చేడు అబ్బాస్ అనుకోకుండా తోటకూర కాడలాగా వొంగిపోయి, దుకాణం ముందు నిలబడ్డాడు రాందాసు.

"ఏం, ఎక్కడా పని దొరకలేదా?"

"లేదు" – మూలిగేడు దాసు.

"ఇంత నీర్సంగా వున్న మనిషివి యేం పనిచేస్తావు?"

"రేండు రోజులబట్టీ తిండిలేదు." అడిగినదానికి సగానికే జవాబిచ్చేడు దాసు.

అబ్బాస్‌కి కడుపుతరుక్కుపోయింది. "రా యిబల్లమీద కూర్చో అని బల్ల చూపించేడు. తన ఆకలి రోజులు, పుస్తకం విప్పి కళ్ళయెదుట పెట్టినట్టు కనిపిస్తున్నాయి. గొంతుక బర్దలయినట్లు మసీదు దగ్గర అరచినా వొక దమ్మిడీ ధర్మం చేసిన పాపాన్నెవడూ పోలేదు. ఎంగిలిప్లేటు కడుక్కొని గడిపేడు కొన్నాళ్ళు. గడ్డితవ్వి అమ్ముకొని బ్రతికేడు కొన్నిరోజులు. తన చిన్నప్పటి స్నేహితుడు సింగు మదుపు యిచ్చి కొట్టుపెట్టడానికి సాయం చెయ్యబట్టి యిప్పుడు యింత అన్నంతిని బట్టకడుతున్నాడు. ఆ రోజులన్నీ మనసులోకొచ్చేసరికి అబ్బాస్‌కి కళ్ళనిండా నీళ్ళుకమ్మాయి. ఆ రోజులకి యిప్పటి రాందాసు స్థితి అనువాదంలాగ కనిపిస్తూంది.

"నా దగ్గిరే వుందుగానిలే – నా దగ్గిరే వుందుగానిలే" అని గొణుక్కుంటూ లేచి బయటికెళ్ళాడు అబ్బాస్. ఈ వాలకం యేమిటో దాసుకి బోధపళ్లేదు.

రెండు చపాతీలు, యింత దాల్ పట్టుకొని అబ్బాస్ తిరిగివొచ్చేడు. రాందాసు ముందు వుంచేడు. దాసు ఆశ్చర్యపోయి అబ్బాసును చూస్తున్నాడు– పెద్దపెద్ద షావుకార్లకు లేని యీవి యీ సాయిబుకెలా వచ్చిందిరా అని. అబ్బాస్ ప్లేటు చూపించి కానిమ్మని తలవూపేడు. కలియబడ్డట్టు దాసు తినడం ప్రారంభించేడు. పస్తులు పడిపడి ఏదైనా ఎప్పుడైనా దొరికినప్పుడు తను ఎంత ఆతృతగా తినేవాడో జ్ఞాపకం తెచ్చుకుంటూ అబ్బాస్ కుండలోని నీళ్ళు తెచ్చి దాసుముందు పెట్టేడు.

రెండు చపాతీలు తినేసి గ్లాసులోని నీళ్ళు సగం తాగేసరికి – పిడుగులాంటి సంగతొకటి స్ఫురించింది.

ముస్లిం–పానీ, తను తిన్న చపాతీలు తురకాడు ముట్టుకొన్నవీ! మిగిలిన నీళ్ళు తాగకుండా ఆగేడు ఒక క్షణం. మరోక్షణంలో తక్కిన నీళ్ళన్నీ ఒక్క గుక్కలో తాగేసేడు. దాసును కన్నజాతీ మతమూ వెలివేసినట్టు వెక్కిరించేయి. అతని ఆకలి రూపపు రౌద్రాకారం చూసి భయపడి పారిపోయేయి.

☆ ☆ ☆

తన చర్మం చెప్పులుకుట్టి యిచ్చినా అతని రుణం తీర్చలేననుకున్నాడు దాసు. అంతనమ్మకంగా వున్న దాసుని తన తమ్ముణ్ణి చూసినట్టు చూస్తున్నాడు అబ్బాస్. దాసువొళ్ళు దాచుకోకుండా కష్టపడుతున్నాడు. అబ్బాస్ వ్యాపారం పుష్టికొస్తూంది.

కాఫిర్‌ని దగ్గరపెట్టుకుని పోషిస్తున్నావెందుకని ముసల్మానులు అబ్బాస్‌ని మందలించారు. తురకాడికి అరవచాకిరీచేసి, వాడి చేతికూడు తిని భ్రష్టుడయ్యేడన్నారు; తమకి తలవంపులుగా వుందని తమ మతస్తులు నిష్కరమాడేరు దాసుని. ఈ చెవిని విని ఆ చెవిని విడిచి పెట్టేసేరు ఇద్దరూ. పై మతాల్లో కూడా మంచివారున్నారని అబ్బాస్ బోధపర్చుకున్నాడు. తన కష్టదినాల్లో అడ్డుపడినవాడు తురకైతేనే, మరెవరైతేనేం అని దాసు చలించలేదు. క్రమేపీ మతాలు జ్ఞాపకం రావడం మానేసేయి.

వర్తకం లాభంగా సాగుతూంది. అబ్బాసుని ఎప్పుడో వొకప్పుడు దగా చేస్తాడు కాఫిర్ అని అంచనా వేసుకుంటున్నారు ముసల్మానులు. "లాభాల్లో మూడో వంతు నీది" అని దాసుకి చెప్పాడు అబ్బాస్. ఆ డబ్బు తన దగ్గిరే దాచమన్నాడు దాసు. తురకాడు ఆ డబ్బు యెగవెయ్యకతప్పదన్నారు దాసు మతస్తులు, హిందువులు.

☆ ☆ ☆

శ్రీరామనవమి, మొహరం పండుగ లొచ్చేయి. ఈ రెండు పండగలకీ పోటీ వున్నట్టు హిందువులూ, ముసల్మానులు సన్నాహాలు చేస్తున్నారు. మతదీక్ష ప్రతి ఒక్కడికీ పూర్తిగా పూనింది. అబ్బాస్ పేదలకి దానధర్మాలు చేస్తున్నాడు. ఆ పేదల్లో చాలా మంది హిందూ బైరాగులూ, ముష్టివాళ్ళూ వున్నారు. వాళ్ళకి కూడా అబ్బాస్ తన శక్త్యానుసారం దానాలు చేశాడు. ఇది చూసి ముసల్మానులు ముక్కు మీద వేలు పెట్టుకున్నారు. కొందరు వుద్రేకులయ్యేరు. రాందాసుకి కొంత డబ్బు యిచ్చి నవమి పండుగకి ఖర్చు పెట్టుకోమన్నాడు అబ్బాస్. దాసు దేవాలయాల్లో అభిషేకాలు చెయ్యించేడు. ఈ చేష్టలు ఉభయమతస్తులలోను గందరగోళం లేవదీసేయి.

ఈలోగా హిందువులు మేళతాళాలతో దేవుణ్ణి మసీదు ముందునుంచి వూరేగింపు తీసుకెళ్ళడానికి ప్రభుత్వాన్ని అనుజ్ఞకోరారు. ముసల్మానులు సభ చేసి, అలాంటి అనుజ్ఞ యేదన్నా యిస్తే ఇస్లాంని అవమానం చేసినట్టవుతుంది – జాగ్రత్త అన్నారు. ఇటూకాక అటూకాక ప్రభుత్వం యీ విషయమై ఆలోచిస్తున్నామన్నారు. హిందువులు తమ హిందుత్వాన్ని రక్షించుకోవడానికి ఉత్సవంతో వూరేగింపులు జరిపారు. ముసల్మానులు తమ ధర్మాన్ని సంరక్షించుకోవడానికి రాళ్ళూ యిటికెలూ పుష్కలంగా ప్రయోగించారు. పోలీసులు యిరుకక్షల్నీ నిష్పక్షపాతంగా లాఠీ ప్రయోగంచేసి తమ పూచీ వొదిలించుకొని వెళ్ళిపొయ్యారు.

"ముస్లింలను యిద్దరిని వూరవతల బలమైన కత్తిపోట్లు పొడిచారు. యెవరో తెలీదు."

"నిన్న రాత్రి హిందువుల వీధొకటి తగలబెట్టబడింది."

"హిందూ స్త్రీని బలవంతంగా చెరచి చంపేశేరు."

"ఒక ముసల్మాను యింట్లో యెవరో జొరపడి సకుటుంబంగా అర్ధరాత్రప్పుడు చంపేశారు. వాళ్ళని పట్టుకోవడానికి పోలీసులు చాలా ప్రయత్నం చేస్తున్నారు."

ఈ శైలిలో వార్తలొస్తున్నాయి. పత్రికలకి స్థలం భర్తీ చేసుకోవడానికి చాలా అవకాశాలేర్పడ్డాయి.

పోలీసుల లాఠీలకీ, తుపాకులకీ కావలసినంత పని దొరికింది.

లాభాలు బాగా దోచుకుంటున్నా జీతాలు తగ్గించేరు షావుకార్లని కూలీలు సమ్మె చేస్తున్నారు. వర్గచైతన్యంకన్నా మత చైతన్యమే యిహపరసుఖదాయకమని షావుకార్ల ఏజెంట్లు కూలీలకు లోపాయికారిగా చెప్పి వుద్రేకపరిచేరు. ఒకరిని వొకరు పనికి స్వస్తిచెప్పిద్దామని, తక్కువ జీతానికే తృప్తిపడి, కూలీలు పనిలో ప్రవేశించేరు. సమ్మె చేసినందుకు ప్రతి ఒక్కడి దగ్గరా క్షమాపణ తీసుకుని యజమానులు ప్రవేశపెట్టుకున్నారు. మతాలు కాపాడుకోవడంకోసం ఆపాటి త్యాగం అవసరంగానే కనుపించింది కూలీలకి.

☆ ☆ ☆

విద్యార్థులు మత సఖ్యతకోసం ప్రచారం చేస్తున్నారు. వివిధ మతాల విద్యార్థులు వూరంతా సభలు జరిపి కొట్లాటలు మానివెయ్యవల్సిందని ప్రార్థిస్తున్నారు. నినాదాలు చెపుతూ వూరేగింపుతో విద్యార్థులు అబ్బాస్ దుకాణం వేపే పోతున్నారు.

"మతాలున్నంతకాలం కుక్కజట్టీలు తప్పవు. నేను ఎక్కువనీ, నువ్వు తక్కువనీ, నాది వొప్పనీ, నీది తప్పనీ జట్టీలు లేకపోవడం మతాలు లేకపోయినప్పుడే" అన్నాడు వూరేగింపుచూస్తూ ఒక బేరగాడు.

"మతాలు లేకుండా వుండడం ఎలాగండీ?" అన్నాడు దాసు.

"ఉండగలిగేది ప్రాణాలతోనూ, తిండితోనూ- మతాలతోకాదు. ఆ రెండింటినీ మతాలు మనకి క్షణక్షణ గండం చేస్తున్నాయి. మన అధోగతికి ముఖ్యకారణం మతమౌఢ్యం."

"మత సఖ్యం కలిగివుండి అందరూ సోదరుల్లాగ మెసులుకుపోతే అందరూ సుఖంగా వుండొచ్చునండి" అన్నాడు అబ్బాస్.

"మతాలు చెప్పిన మంచిని మనం చెయ్యక చెడిపోతున్నాం."

"మంచిని కనిపెట్టేస్థితిలోవుంటేనా, దాన్ని చెయ్యడానికి? దానిక్కారణం. మతం బ్రతుకులో చొచ్చుకుపోవడానికి బదులు, దానికతీతమై వెళ్ళడం. కావలిస్తే వొకటితో వొకటి పోట్లాడుకుంటాయికాని, యీ మతాలు మనుషుల బాగుకోసం ఆలోచించవు. ప్రయత్నించవు. ప్రస్తుతం మతాలు బాగుకన్నా చెడ్డే ఎక్కువ చేస్తున్నాయి. ఇంతకీ ఈ మతవైరాల వల్ల బాధపడేది సామాన్య ప్రజలు. ఇప్పటి కొట్లాటల్లోలాగ కార్లలో తిరిగేవారికి యే బాధా వుండదు. వారు మాత్రం యీ కక్షలకు నాయకులై పలుకుబడీ పదవులూ డబ్బూ సంపాదించుకుంటారు. ఇదే మతం చేస్తున్న ముఖ్యమైన సేవ"

"నిజమేనండి, న్యాయంగా వెళ్ళేవాడికి మతమెందుకండి?" అన్నాడు అబ్బాస్.

☆ ☆ ☆

విద్యార్థులు సఖ్యతా ప్రచారం కోసం చేస్తున్న వూరేగింపును పోలీసులు లాఠీలతో చెదరగొడుతున్నారు. దాసు దుకాణం మూసేడు. ఊరేగింపు అపరాధంగా తోచి కొందరిని జైల్లో పెట్టేరు.

హిందువులు తమ దగ్గిర పనిచేస్తున్న ముస్లిం నౌకర్లని తొలగించేరు దమ్మిడీ వస్తువైనాసరే ముస్లిం దుకాణంమీద కొనడం మానేసేరు. వెంటనే ముస్లింలు కూడా ఈ బహిష్కారాన్ని అమలులో పెట్టుకున్నారు. హిందూ ముస్లింలు యిద్దరూ వుండడంవల్ల అబ్బాస్ కొట్టుకు బేరం పడిపోయింది.

☆ ☆ ☆

పై వూళ్ళు కెళ్ళిన రాందాసు కూరలూ, పళ్ళూకొని పట్టించుకు వస్తున్నాడు. మిట్టమధ్యాహ్నం అయింది. దాసుకి చాలా దాహం వేసింది. ఎదురుగుండా వున్న దుకాణం దగ్గిరకెళ్ళి చా అడిగేడు. డబ్బులిస్తూ. దుకాణాదారు యివ్వనని కసిరేడు. తురకల్లో కలిసిపోయినవాడికి యివ్వనన్నాడు. నాలుగడుగులు ప్రక్కగావున్న ముస్లిం దుకాణానికెళ్ళేడు, ముసల్మానైనా అమ్ముతాడుగదా అని. "పోరా కాఫిర్" అని అరిచేడు దుకాణదారు. దాసు అడుగుపెట్టకముందే రెండిళ్ల చుట్టమై మొహంమీద వేలేసుకుని నడిచేడు డబ్బులు మొలను పెట్టుకుంటూ.

దాసు బీడీ కాల్చుకుందామని తోవలో అగుపించిన మనిషిని అగ్గి అడిగేడు. అతను కాలుస్తున్న బీడీ నోట్లోంచి తీసి ఇచ్చేడు. గుంపు గుంపులుగా కేకలేసుకుంటూ ఆ వేపే మనుషులొస్తున్నారు. దాసు బీడీ ముట్టించుకుంటున్నాడు. కొట్టు, చంపు అని కేకలు వినిపిస్తున్నాయి. అతనూ దాసూ ఆ వైపు చూస్తున్నారు. అతను దాసు మొహంలోకి చూసేడు. మరబొమ్మలాగ చేతిలో వున్న యినపపెనం దాసు నెత్తిమీద వేసేడు. నెత్తురు చిమ్ముకుంటూ దాసు కూలిపోయాడు.

☆ ☆ ☆

ఊరంతా అల్లకల్లోలం అయిపోతూవుంది. హిందువులు పృథ్వీరాజు, రాణా ప్రతాప్, శివాజీలను స్మరించి పౌరుషవంతులయ్యేరు. ముసల్మానులు గజనీ, బాబరు. ఔరంగజేబ్ మొదలైన వాళ్ళని జ్ఞాపకానికి తెచ్చుకుని ఉద్రిక్తులయ్యేరు. ఈసారి విడివిడిగా దొంగచాటున గాకుండా బహిరంగంగా గుంపు గుంపులుగా నరుక్కుంటున్నారు. ఫేక్టరీలోకి కూడా యీ వార్త దూరింది. ఖురాన్ పేజీలన్నీ సానపట్టిన కత్తుల్లాగ మెరిసేయి. హిందుధర్మం శంఖు చక్ర గదాశార్ఙాలతో గిరిగిరా తిరిగింది. ఫేక్టరీ అంతా రణరంగం అయిపోయింది. దొర ఫోనులో చెప్పి మిలటరీని పిలిపించేడు. మిలటరీ అందర్నీ చితకబొడిచి బయటికి గెంటేరు. దొర ఫ్యాక్టరీలోని రక్తపాతమంతా కడిగించి పరిశుభ్రపరిచేడు.

☆ ☆ ☆

దాసుకోసం బయట నిలబడి అబ్బాస్ చూస్తున్నాడు. ఇంకా వుండడం ప్రమాదకరమని కొట్టు కట్టెయ్యడానికి సామాను సర్దుతున్నాడు. మూక యాభై, అరవైమంది అబ్బాస్ దుకాణంలోకి తోసుకు వచ్చేరు. నిర్జీవాలైన కాయల్నీ పళ్ళనీ కూడా బాదుతున్నారు. అబ్బాస్ మొదలునరికిన చెట్టులాగ పడిపోయాడు. ఇంకో

రెండు కొట్టి అబ్బాస్‌ను కాళ్ళతో మట్టుకుంటూ దిగ్విజయంగా బయటికి పోయేరు. కొద్దిదూరంలోనే వున్న ముసల్మాను దండు యిది చూడలేకపోలేదు. మత ధర్మాన్ని ధిక్కరించినవాడికదే శాస్తని వాళ్ళు అడ్డుపడడానికి ప్రయత్నించలేదు.

మనుషులు పులుల్లాగ భయంకరంగా కనిపిస్తున్నారు. దొరికినవాళ్ళనందర్ని చావబాది బేడీలు వేసి వూళ్లో శాంతి నెలకొల్పింది మిలటరీ. చాలామంది చచ్చిపోయేరు. వందల కొద్దీ దెబ్బలతో చావు బ్రతుకులమధ్య పోట్లాడుతున్నారు. ఆసుపత్రి నిండిపోయింది. అబ్బాస్ స్మారకం లేకుండా వున్నాడు గడ్డం తలలోని రక్తాన్ని పీలుస్తూంది. శరీరం ప్రాణాన్ని యిముడ్చుకోలేకపోయింది. శవాన్ని బయటికి తీసెయ్యమ్మన్నారు డాక్టర్లు. ఒక తురకాడు పోయినా కొంత పీడ పోయిందే అని నిటూర్పు విడిచేడు ప్రక్కనే వున్న హిందూ రోగి.

దాసు యాతనపడుతున్నాడు. డాక్టరు పరీక్షచేసి "వాళ్ళ వాళ్ళు ఎవరైనా వుంటే చూసుకోమను. స్థితి ప్రమాదకరంగా వుంది" అనేసి వైద్యులకుండే నిస్సంగత్వంతో వెళ్ళిపోయేడు.

నర్సుకి స్త్రీ సహజమైన కరుణ కలిగింది. దాసు మొహందగ్గిర మొహంపెట్టి "మీ వాళ్లు ఎవరైనా వుంటే చెప్పు, కబురు పంపుతాను, వాళ్ళని చూద్దువుగాని" అంది.

చావు బ్రతుకుల మధ్య వున్న దాసు కళ్ళు విప్పేడు. చావన్నది వొకటి వుందనీ, అది తనకి వొస్తున్నదనీ, దానికి తాను భయపడాలనీ స్ఫురించలేదు దాసుకి.

"ఏం, ఎవరన్నా వున్నారా మీ వాళ్ళు? వాళ్ళ నిక్కడికి రమ్మని కబురుపంపుతాను."

"అబ్బాస్ సాహెబుని రమ్మని కబురంపండి."

అదిరిపడింది – ముసల్మానుని పిలుస్తాడేమా అని నర్సు.

"ఎక్కడుంటాతను?"

"పెద్దబజార్లో దేవిడీ దగ్గర పళ్ళదుకాణం" అన్నాడు ములిగిపోతున్న ప్రాణాలతో.

"సరేలే, యిప్పుడే వస్తాడు. నువ్వు నిద్రపో" అని నర్సు కబురు పంపడానికి వెళ్ళింది.

● 'అభ్యుదయ' సంచిక నుంచి పునర్ముద్రితం ●

★ ★ ★

గోపీచంద్

# 14 గోడమీది మూడోవాడు

ఖాసింఖాను, సీతారామయ్యా బాల్య స్నేహితులు. వాళ్ళ యిల్లు ఒక దాని ప్రక్కన ఒకటియున్నా, ఆ యిళ్ళ మధ్య గోడ వుంది. రాకపోకలు వీలుగా వుంటుందనే ఉద్దేశంతో ఆ గోడ బద్దలుగొట్టించి. దారి పెట్టించుకున్నారు. ఈ పని వాళ్ళ భార్యల వొత్తిడివల్ల జరిగింది.

పని పాటలు త్వరగా పూర్తి చేసుకొని వాళ్ళిద్దరి భార్యలూ ఆ దారిలో కూర్చొని కబుర్లు చెప్పుకుంటూ వుండేవారు. వాళ్ళిద్దరికీ చాలా స్నేహం. ఒకరి కష్టసుఖాలు ఒకరు చెప్పుకుంటూ, రెండోవారివల్ల ఉపశాంతి పొందుతూ వుండేవాళ్ళు. కూరలు వండటం, పిండివంటలు చెయ్యడం దగ్గర్నుంచీ ఒకరి సలహా ఒకరు తీసుకుంటూ వుండేవారు.

ఖాసింఖానుకి ఒక కొడుకూ, సీతారామయ్యకు ఒక కూతురు వుంది. వాళ్ళిద్దరూ ఎప్పుడూ ఆ దారిలో కూర్చొని ఆడుకుంటూ వుండేవారు.

ఖాసింఖాను భార్యకి సీతారామయ్య కూతురంటే చాలా ముద్దు. ఎప్పుడూ తన యింట్లోనే ఉంచుకొనేది. ఆ పిల్ల ఒక్కక్షణం కనిపించకపోతే "నా కోడలేదీ" అంటూ వెతుక్కుంటూ సీతారామయ్య యింటికి వచ్చేది.

"నీ అత్త వచ్చిందే" అని పిలిచేది కూతుర్ని సీతారామయ్య భార్య.

ఆ పిల్ల ఎక్కడున్నా, అత్తపేరు వినేటప్పటికి విప్పారిన మొహంతో రెక్కలు కట్టుకొచ్చి వాలేది. ఆ పిల్లకి ఖాసింఖాన్ యింట్లో వుండే రొట్టెలూ, కేకులూ అంటే యిష్టం. ఖాసింఖాన్ కొడుక్కి సీతారామయ్య ఇంట్లో దొరికే మీగడ పెరుగంటే యిష్టం. ఒక్క పిల్లలకేకాదు, పెద్ద వాళ్ళకుకూడా అంతే. అందుకని మధ్యదారి గుండా వీళ్ళ రొట్టెలూ, కేకులూ వాళ్ళయింటికీ, వాళ్ళ మీగడ పెరుగు వీళ్ళ యింటికీ ఎప్పుడూ రాకపోకలయ్యేవి. ఆ రెండు కుటుంబాలూ యింత అన్యోన్యంగా వుండటం వల్ల, ఒకరు మహమ్మదీయులూ, ఒకరు హిందువులూ అయినా ఆచార వ్యవహారాల్లో చాలా సామ్యత ఏర్పడింది. ఒకరి సాంప్రదాయాలు ఒకరు సానుభూతితో చూట్టం అలవడింది.

కాని రోజులు ఎప్పుడూ ఒక విధంగా గడవ్వు. భారతదేశంలో, ఇతరత్రా జరుగుతున్న మతకలహాలు నెమ్మదిగా ఆ గ్రామానిక్కూడా ప్రాకినై. అంతకుముందు

సోదరులకు మల్లే కలిసి మెలిసి వుంటున్న హిందువులూ, మహమ్మదీయులూ వొకరినొకరు అనుమానించుకోవటం, అసహ్యించుకోవడం మొదలుపెట్టారు. ప్రజలు భయోత్పాతులై మతిభ్రమించినట్లు ప్రవర్తిస్తున్నారు.

మొదట్లో ఖాసింఖానూ, సీతారామయ్యా మతకలహం తమ గ్రామం ప్రవేశించకుండా చెయ్యడానికి ప్రయత్నించారు. గాని, వాళ్ళ వల్ల అవలేదు. కన్నుమూసి కన్ను తెరిచేటప్పటికి మానవ స్వభావం వాళ్ళ కళ్ళముందే విచిత్రంగా మారిపోయింది. మానవుల్లో పశులక్షణాలు అగ్రస్థానం వహించినై. అంతకుముందు తమ మాటను అజ్ఞగా శిరసావహించే వాళ్ళు ఇప్పుడు తృణప్రాయంగా తోసివేస్తున్నారు. చెల్లాచెదురుగా హత్యలు జరుగుతున్నె. పొలంలో పని చేసుకుంటున్న వొక హిందువుని మహమ్మదీయులు పొడిచారు. కూలికి వెడుతున్న వొక బీద మహ్మాదీయుని హిందువులు నరికారు. ఈ హత్యలతో ఊరంతా అట్టుడుకినట్లు ఉడికిపోయింది. ఈ సాకు తీసుకుని "శాంతి నెలకొల్పడం" అనే మిషతో, ఇంగ్లీషువాడు సైన్యసమేతంగా వచ్చి, ఆ గ్రామంలో తిష్టవేశాడు. తమలో తాము కలహించుకోవడం వల్ల, మూడో వాడొకడు ఆ గ్రామంలో అడుగుపెట్టడానికి వీలయింది.

వచ్చీరాగానే ఇంగ్లీషువాడు, గ్రామంలో వున్న హిందువుల్నీ, మహమ్మదీయుల్ని పిలిపించి మాట్లాడాడు. మహమ్మదీయుల్తో ఏం మాట్లాడాడో హిందువులకు తెలియదు. హిందువులతో ఏం మాట్లాడాడో మహమ్మదీయులకు తెలియదు. కాని అతను మాట్లాడిన తర్వాత హిందువులూ, మహమ్మదీయులూ కూడా ఎవరికివారు "ఇంగ్లీషువాడు మనపక్కే" అనే ధీమాతో విజృంభించారు.

ఈ విజృంభణ అప్పటివరకూ హిందూ, మహమ్మదీయ సఖ్యత కోసం ప్రయత్నిస్తున్న ఖాసింఖాన్నీ, సీతారామయ్యనీ కూడా విడదీసింది మహమ్మదీయులు విజృంభించడానికి ఖాసింఖాన్ సహాయం వుందని సీతారామయ్యా, హిందువులు విజృంభించడానికి సీతారామయ్య దోహదం లేకపోలేదని ఖాసింఖానూ ఊహించుకొని మనస్పర్థలు పెంచుకొన్నారు.

ఇంగ్లీషువాడు ఇది కనిపెట్టి ఖాసింఖాన్నీ, సీతారామయ్యని వేరువేరుగా పిలిపించి మాట్లాడాడు. సీతారామయ్యతో "ఖాసింకాన్ని నీవు నమ్ముతున్నావు. అతను నీకు ద్రోహం చెయ్యాలని చూస్తున్నాడు. ఊరు మాటు మణిగింతర్వాత మీ ఇంటిమీదకు వచ్చిపడదాం అని చూస్తున్నాడు - జాగ్రత్త!" అని సీతారామయ్యని హెచ్చరించాడు.

ఈ మాట వినేటప్పటికి సీతారామయ్యకు చాలా కోపం వచ్చింది. హృదయం ఉడికిపోయింది. ఖాసింఖాన్ చర్యలు ఇటీవల అనుమానాస్పదంగా వున్నా తనకే ద్రోహం చెయ్యటానికి పూనుకుంటాడని అతడెప్పుడూ అనుకోలేదు. నిజంగా మహమ్మదీయుల్ని నమ్మకూడదు అనుకున్నాడు. తగు మాత్రం జాగ్రత్తలో వుండాలని నిశ్చయించుకున్నాడు. ఇంటికి వెళ్ళీవెళ్ళడంతోనే తాపీవాళ్ళని పిలిపించి ఖాసింఖాన్ ఇంటికీ తన ఇంటికీ మధ్య వున్న దారి పూడ్పించివేశాడు. ఈ సంగతి ఇంగ్లీషువాడు తెలుసుకొని ఖాసింఖాన్ని పిలిపించి "నువ్వు వొట్టి అమాయకుడివి. కాకపోతే సీతారామయ్యతో నీకు ఎట్లా పొత్తు కుదురుతుంది? నీ వాసనే తగలకూడదని మీ ఇళ్ళ మధ్య గోడ కట్టించాడటగా?" అన్నాడు.

ఈ మాటకు ఖాసింఖాన్ ఉగ్రుడైపోయాడు. తను ఎంతో సోదరభావంతో ఉంటున్నాడే, దానికి ప్రతిఫలం ఇదా! ఈ హిందువులను నమ్మకూడదు. తన జాగ్రత్తలో తానుండాలి అనుకున్నాడు. ఇంటికి వెళ్ళీవెళ్ళడంతోనే తాపీ పనివాళ్ళను పిలిపించి సీతారామయ్య కట్టించిన గోడకు సిమెంటు పూత వేయించాడు.

అప్పటినుంచీ ఈ ఇంటిలో కేకులు ఆ ఇంటిలోకీ, ఆ యింటిలో మీగడ పెరుగు ఈ యింటిలోకీ వెళ్ళడం లేదు. వాళ్ళ కేకులు వాళ్ళే తినేవారు. వీళ్ల మీగడ పెరుగు వీళ్ళే తినేవారు. "ప్రాణానికి హాయిగా వుంది. ఏ చీకూ చింతా లేకుండా ఎవరి బ్రతుకు వాళ్ళమే బ్రతుకుతున్నాం" అనుకున్నారు ఇద్దరూ. కాని కొన్ని రోజులు గడిచేటప్పటికి ఈ బ్రతుకు దుర్భరం అనిపించింది. ఇద్దరి భార్యలూ ఏ పనిచెయ్యకుండా ఏదో పోగొట్టుకున్నవాళ్ళకుమల్లే అస్తమానం దిగులుగా కూర్చునేవాళ్ళు. పిల్లలకు ఒకచోట కాలు నిలిచేది కాదు. దేనికోసమో వెతుక్కుంటున్నట్లు ఇల్లంతా తిరుగుతుండేవాళ్ళు బిక్కమొహాలు పెట్టుకుని.

వీటన్నిటికంటే మరొక్కటి పెద్ద బాధ అయిపోయింది. అవతల ఏం జరుగుతూ వుందో ఇవతల వాళ్ళకు తెలియదు. ఇవతల ఏం జరుగుతూవుందీ అవతల వాళ్ళకి తెలియదు. అవతలవాళ్ళు తన మీద ఏవో కుట్రలు పన్నుతూ వుంటారని ఎవరికి వాళ్ళు అనుమానపడటం మొదలుపెట్టారు ఏ క్షణంలో వచ్చి అవతలవాళ్ళు మీదపడతారో అని ఎవరికి వాళ్ళు కళ్ళల్లో వొత్తులు పెట్టుకొని కాపలా కూర్చునేవారు. ఈ అనుమానం కలిగినప్పటినుంచీ ఖాసింఖాన్‌కిగానీ, సీతారామయ్యకుగానీ శాంతిలేదు.

ఈ బాధ భరించలేక వొకరికి తెలియకుండా వొకరు వెళ్ళి ఇంగ్లీషువాడి సహాయం కోరారు.

"ఖాసింఖాన్ సంగతి తమకు తెలుసు. తమరి సహాయం లేకపోతే మేం బ్రతకలేం" అన్నాడు సీతారామయ్య.

"నేను ఉండగా నీకేం పరవాలేదు" అన్నాడు ఇంగ్లీషువాడు.

సీతారామయ్య వెళ్ళిపోగానే ఖాసింఖాన్ వచ్చాడు.

"సీతారామయ్య సంగతి మీకు తెలుసు ఈ సందర్భంలో మీ రక్షణ అవసరం" అన్నాడు ఖాసింఖాన్.

"నా కన్నీ తెలుసు. నేను వుండగా నీకేమీ పరవాలేదు" అన్నాడు ఇంగ్లీషువాడు.

తెల్లవారేటప్పటికి తుపాకీ భుజాన పెట్టుకొని సీతారామయ్య, ఖాసింఖాన్‌ల ఇళ్ళమధ్య వున్న గోడమీద నిలబడి కాపలా కాస్తున్నాడు ఇంగ్లీషువాడు.

ఆ ఇంగ్లీషువాణ్ణి చూచి, "ఖాసింఖాన్ రోగం కుదిర్చాను" అనుకున్నాడు సీతారామయ్య. "సీతారామయ్య రోగం కుదిర్చాను" అనుకున్నాడు ఖాసింఖాన్. ఎవరికివాళ్ళు ఇంగ్లీషువాడు తన రక్షణార్థమే వొచ్చాడనుకున్నారు. సంతోషించారు.

ఇంగ్లీషువాడు అస్తమానం ఆ గోడమీదే తుపాకీ భుజాన పెట్టుకొని నుంచొని కాపలా కాస్తుండేవాడు. ఒకప్పుడు తుపాకి ఖాసింఖాన్ ఇంటివైపు గురిపెట్టేవాడు. అప్పుడు సీతారామయ్య సంతోషించేవాడు. ఒకప్పుడు సీతారామయ్య ఇంటిమీదకు తుపాకీ గురి పెట్టేవాడు. అప్పుడు ఖాసింఖాన్ సంతోషించేవాడు.

తన కర్తవ్యం ఈ విధంగా నిర్వర్తిస్తూ ఒక రోజు అతడు "నేను ఇరవై నాలుగు గంటలూ మీ పనిలోన చేరి వుంటున్నాను. నాకు ఎండ తగలకుండా నా నెత్తిమీద గొడుగు కట్టించవలసిన బాధ్యత మీమీద వుంది" అని చెప్పాడు. ఈ కోర్కె ఖాసింఖాన్‌కీ సీతారామయ్యకీ న్యాయంగానే తోచింది. నేను కట్టిస్తానంటే నేను కట్టిస్తానని పోటీపడి క్షణం మీద ఇంగ్లీషు వాడికి ఎండ తగలకుండా గొడుకు కట్టించారు.

"నేను మీ పనిలో వుంటున్నాను గనుక నాకు భోజన సదుపాయాలు మీరే చెయ్యాలి" అన్నాడు గోడమీద ఇంగ్లీషువాడు. ఈ కోర్కె కూడా వాళ్ళకి న్యాయంగానే కనిపించింది. ఆ రోజు మొదలు ఖాసింఖాను ఇంటిలోవున్న కేకులూ, సీతారామయ్య ఇంటిలోవున్న మీగడ పెరుగూ గోడమీదవున్న ఇంగ్లీషువాడే తినేసేవాడు.

అంతటితో తృప్తిపడితే అదొకరకంగా వుండేదేమో కాని, ఇంగ్లీషువాడికి తృప్తి అనేది లేదు. వాళ్ళ కుటుంబం వ్యవహారాల్లో కూడా దోక్యం కలుగజేసుకోవడం మొదలు పెట్టాడు. "మీ భార్యలు వెనకపక్కనే వుండాలి", "నాకు గాలి రావడానికి ఈ గోడలు పడగొట్టాలి", "మీరు దొడ్డి దారినే నడవాలి", "మీరు నాకు యిష్టమైన కూరలే తినాలి", "నాకు ఇష్టమైన దుస్తులే ధరించాలి."

ఇవన్నీ భరించారు ఖాసింఖాను, సీతారామయ్య. అతను తమకు రక్షణ యిస్తున్నాడు. అహోరాత్రులు తమకోసం కష్టపడుతున్నాడు. ఏవో కొన్ని ఇబ్బందులు సహించకపోతే ఎట్లా? అనుకున్నారు.

కాని ఒక విషయం మాత్రం వాళ్ళు భరించలేకపోయారు. గోడమీద వున్న ఇంగ్లీషువాడి మెప్పు పొందాలని, మంచి మంచి భోజన పదార్థాలన్నీ అతనికి పెడుతున్నారు. కేకులూ, మీగడ పెరుగూ అతనికే పెడుతున్నారు. పిల్లలు ఆశాపాత్రంగా చూస్తూవున్నా వాళ్ళని కూడా లెక్కచేయకుండా తాము అర్ధాకలితో వుంటూ అంతా ఇంగ్లీషువాడికి ముట్టచెబుతున్నారు. అతను కేకుముక్క పెట్టీ మీగడ రుచి చూపించీ మాయజేసి తమ పిల్లలను తమకు కాకుండా చెయ్యటానికి ప్రయత్నిస్తున్నాడు.

పిల్లలను దగ్గరకు తీసి యిలా చెప్పేవాడు:

"మీ తండ్రులు అసమర్థులు."

"మీకు చిరుతిండి పెట్టరు."

"మమ్మల్ని నమ్ముకుంటే..."

ఖాసింఖాను ఎన్నయినా ఓర్చాడుగాని తన పిల్లవాని మనస్సులోకి విషం ఎక్కుతుంటే ఓర్చలేకపోయాడు. ఈ బ్రతుకు బ్రతికిందానికంటే మరణించటమే మేలు అనుకున్నాడు. తను ఏమైనా ఇబ్బందిలేదు. కాని తన కొడుకు పాడవటం మాత్రం సహించగూడదు అనుకున్నాడు. ఈ ఇంగ్లీషువాడిచ్చే రక్షణకంటే మరణమే మేలు.

ఆ రాత్రి అందరినీ పడుకోనిచ్చి తాను లేచాడు. గడ్డపలుగు తీసుకొని గోడదగ్గరకు వెళ్ళాడు. ఇంగ్లీషువాడు తుపాకి భుజాన పెట్టుకొని గోడమీద నుంచొని వున్నాడు. కాని ఖాసింఖాన్ని చూడలేదు. ఖాసింఖాన్ కళ్ళుమూసుకొని ఆ గోడని పలుగుతో

ముక్కలు ముక్కలుగా బ్రద్దలుకొట్టాడు. గోడమీద వున్న ఇంగ్లీషువాడు గోడతోపాటు గభాలున కూలబడ్డాడు.

గోడకు మామూలు దారి ఏర్పడింది. అవతలప్రక్క మరొక పలుగు చేత్తోపట్టుకొని నిలబడివున్నాడు సీతారామయ్య. అతనూ గోడ పగలగొట్టే ప్రయత్నంలోనే వున్నాడని గ్రహించాడు ఖాసింఖాన్.

ఇద్దరూ అప్రయత్నంగా ఒకరికొకరు కౌగిలించుకొని ఆనందాశ్రువులు రాల్చారు. కాళ్ళ దగ్గర ఇంగ్లీషువాడు పడివున్నాడు. లేచే స్థితిలో లేడు. అప్పుడు వాళ్ళకి తెలిసింది... తామిద్దరూ కలిస్తే ఇంగ్లీషువాడిదేమీ లేదనీ, కలవనంతకాలం అంతా ఇంగ్లీషువాడిదేననీ!

● 'ధర్మవడ్డీ' కథల సంపుటి నుండి సేకరణ ●

★ ★ ★

దేవరకొండ బాలగంగాధర తిలక్

15

# కదలే నీడలు

"చీకటి" అన్నాడతను.

"అవును" అంది ఆమె.

ఇద్దరూ రోడ్డు మలుపు తిరిగారు. ఇప్పుడు వచ్చిన రోడ్డు మరీ పెద్దదిగా వుంది. ఇరువైపులా ఉన్న మేడల వరుసలు ఆ నిశ్శబ్దంలో చీకటిలో ఆలోచనలులేని స్తబ్దమనస్సుల్లా ఉన్నాయి. మధ్య మధ్య వలయంగా నీడలు కల్పిస్తూ, బ్లాకౌట్ చేయబడిన విద్యుద్దీపాలు నగరపు మెల్లకన్నులులా వున్నాయి. అక్కడక్కడ షెల్టర్లూ, సగం సగం తియ్యబడిన గోతులూ, కంకర గుట్టలూ ఉన్నాయి. ఏదో ప్రమాదాన్ని పసికట్టినట్టు గాలి స్తంభించిపోయింది.

"ఇలా ఎక్కడికి?" అంది ఆమె. తలపైకి ఎత్తినపుడు చెవిలోలకు మెరిసింది.

"ఎక్కడికేఁవిటీ?" అన్నాడతను. అతను తన చేతిని జేబులోనికి పోనిచ్చి తిరిగి తీసివేశాడు.

"ఒక్కొక్కసారి చీకటి కూడా బావుంటుంది" అన్నాడు.

"అవును" అందామె.

"చీకట్లో ఏమీ కనపడవు." అతనన్నాడు ఏదో తృప్తిగా.

"ఊహూ–మరీ స్పష్టంగా కనపడతాయి. భయపెడతాయి" అందామె ఆలోచనగా.

"ఏమిటి?"

"మన ఊహలు... మన బాధలు..."

అతను దగ్గాడు ఈ మాటలు యిష్టంలేదన్నట్టు చటుక్కున ప్రసంగం మార్చాడు.

"కలకత్తా చాలా పెద్ద పట్టణం" అన్నాడు. జేబులోకి చేతిని పోనిచ్చి తీసివేశాడు. ఆమె ఏం మాట్లాడలేదు.

"మీరు చదువుకున్నారా? అంటే కాలేజీలో."

"ఆఁ!"

"మీ అయన ఏం చదివాడు?"

"నాలాగే బి.యే."

"మిమ్మల్ని వదిలి ఎలా వెళ్ళిపోయాడు?" అతను మరొకవైపు చూస్తూ అడిగాడు.

"లేకపోతే ఏం చెయ్యమంటారు?"

"మీకు బాధగా లేదూ?"

ఆమె నీరసంగా నవ్వి "ఎందుకుండాలీ?" అంది.

"అంతే అంతే" అన్నాడతను. దేనికోసమో జేబులో చెయ్యి పెట్టి తీసివేశాడు.

"ఈ రోడ్డు చాలా పొడుగు." ఏం తోచక అన్నాడతను.

"అవును."

పెద్ద లైట్లతో ఒక కారు వచ్చి వాళ్ళని దూసుకుపోయింది.

ఆమె తప్పుకుంటూ అతనికి తగిలింది. మళ్ళీ చటుక్కున దూరంగా తప్పుకుంది.

"పొగరు" అంది ఆమె.

"లారీ మిలిటరీవాళ్ళది."

"యుద్ధం వస్తుందా?"

అతను నవ్వాడు. "రావడమేమిటి? ప్రచండంగా జరుగుతూంటే!"

"కాదు. మన దేశానికి కూడా?" అంది ఆమె.

"ఏమో!"

ఒక మిణుగురు ఆమె ముంగురులకి తగిలి వెళ్ళిపోయింది.

రైలుగేటు దగ్గర ఎవరూ లేరు. రెండు కుక్కలుమాత్రం పట్టాలకి కాస్త దూరంగా పడుకున్నాయి.

"మీరేం ఆలోచిస్తున్నారు?" అని అడిగాడతను, గేటుదాటి కొంచెం దూరం వెళ్ళాక.

"ఏమీలేదు." స్వప్నంలోంచి మాట్లాడుతున్నట్టుంది ఆమె.

"ఏం లేదూ?"

"ఏమీలేదు" – స్ఫుటంగా కోపంగా అంది ఆమె.

అతనికి ఆశ్చర్యం వేసింది. ఏమీ లేకపోవడం అంటే? లారీలూ, షెల్టర్లూ, విమానాలూ, పత్రికలూ, హిట్లరూ, ఎ.ఆర్.పీ., ఆమె, తానూ – అన్నీ ఉండగా, అందరూ ఉండగా, ఏమీ లేకపోవడమేమిటి? తెలివిగా తనంతట తనే కనురెప్పల మధ్య నవ్వుకున్నాడు. ఒకసారి జేబులోకి చెయ్యిపోనిచ్చి తీసివేశాడు.

"మీ ఆయన ఎక్కడున్నాడు?" అన్నాడతను.

"ఈజిప్టులో."

"పాపం!" అన్నాడతను.

"ఏం?" అంది ఆమె.

"సైన్యంలో ఎందుకు చేరాడు?"

"ఎందుకా? –" ఆమె అతనికేసి ఓ నిముషం చూసి మెల్లగా "మీ రెందుకు చేరారూ?" అంది.

"నే నీ దేశంలోనే వున్నానుగా?"

"అయితేనేం?"

"ఎందుకు చేరానా?" అతను ఆలోచిస్తూ ట్రాము బద్దీలకేసి చూశాడు. అవి సాగిసాగి ఎక్కడో చీకట్లో కలసిపోయాయి. దారిపక్క ఓ పెద్ద గోతిలోంచి రెండు పందికొక్కులు ఉత్సాహంగా యువతలకు వచ్చి పరిసరాల్ని పర్యవేక్షించాయి.

"ఎందుకేవిటీ? అతను కారణాలు వెతుక్కుంటూ స్వగతంలా మాట్లాడుతున్నాడు: "ఉద్యోగమూ లేదు. డబ్బూలేదు. నా భార్య చనిపోయింది. ఏం తోచలేదు. సైన్యంలో చేరేశాను." ఇలాగ అని ఆలోచిస్తూ అతను అక్కడే నుంచునిపోయాడు.

నాలుగడుగులు ముందుకు వెళ్ళిన ఆమె వెనక్కి తిరిగి "ఆగిపోయారేం?" అంది.

"మర్చిపోయాను" క్రాఫు సవరించుకుని అతను ముందుకు సాగాడు.

"మీ భార్య ఎందుకు పోయిందీ?" ఆమె అడిగింది.

"నన్ను ప్రేమించి."

ఆమె వింతగా అతనికేసి చూసింది. అతను కంగారుగా తల పక్కకి తిప్పుకున్నాడు.

"ఎప్పుడయింది మీ పెళ్ళి?" అంది ఆమె.

"మేం పెళ్ళి చేసుకోలేదు."

"అంటే?"

"పెళ్ళికి పెద్దవాళ్ళు ఒప్పుకోలేదు. మా కులాలు వేరు. ఆమె నాతో వచ్చేసింది."

"తర్వాత?"

"రిజిష్టరు మారేజీ చేసుకుందామని అనుకున్నాం. కాని ఉద్యోగం కోసం ఊరూరా తిరుగుతూ నాగపూర్ వెళ్ళాం. అక్కడ సత్యాగ్రహంలో చేరాం. మమ్మల్ని జైలులో పెట్టారు. మాకు మలేరియా వచ్చింది. మమ్మల్ని వదిలిపెట్టారు. నాకు మలేరియా దానంతట అదే కుదిరింది. ఆమెకు కుదరలేదు, సరియైన మందులేక...." అతను గుండెల మీద చెయ్యి పెట్టి రాసుకున్నాడు. ఆమె అవ్యక్తంగా వచ్చే ఒక ఆలోచనను తల్చుకుని భయపడి "అబ్బా!" అంది.

"ఏం?" అన్నాడతను.

"ఏమీలేదు" అందామె.

అతనికి తిరిగి ఆశ్చర్యం వేసింది. తెలీని బాధ, ఒంటరితనమూ, యుద్ధమూ – ఈజిప్టు, మలేరియా – యిన్నీ వుంటే లేకపోవడం ఏమిటి? ఆకాశంమీద ఆర్ద్రి నక్షత్రం మీద ఒక తెలమబ్బు కప్పుకొని వుంది. పక్కసందులో ఒక ఆంగ్లో – ఇండియన్ యువతీ, యువకుడు ఒకరిమీద ఒకరు తూలుతూ నడుస్తున్నారు.

"మీరు వెల్సు రాసిన Things to Come చదివారా?"

"నాకు వెల్సు అంటే అయిష్టం" అందామె.

"అందులో Walking disease వచ్చిందట యుద్ధంమూలాన్ని. మనకీ ఆ జబ్బు వచ్చిందేమో?" అతను నవ్వుదామని ప్రయత్నించి దానికి బదులుగా దగ్గాడు.

"మా మేనమామ క్షయమూలాన్ని చనిపోయాడు" అందామె.

"మంచిపని చేశాడు." అతను తిరిగి యిలా అన్నాడు:

"మీ రెందుకు నర్సుగా చేరారూ?"

"ఆయన యుద్ధంలోకి వెళ్ళిపోయారు. మరి నేనేం చెయ్యను? ఏదో దిగులుగా వుండేది. ట్యూషన్లు చెప్పమన్నారు."

"బాగానే వుంది."

"కాని చెప్పలేదు."

"ఏం?"

"నా కసహ్యం."

"తర్వాత?"

"నర్సుగా చేరాను ఒక హాస్పిటల్లో."

"మరి?"

"ఒక రోగి వచ్చాడు."

"ఎవరూ?"

"ఒకరు. ఎంతో గంభీరంగా వుండేవాడు. ఎప్పుడూ జాలిగా నాకేసి చూసేవాడు. నేను లేకపోతే మందైనా తాగేవాడు కాదు."

"ఊఁ."

"అతనంటే ఏదో యిష్టం కలిగింది. పరిచర్యతో, అనురాగంతో అతని బాధను తగ్గించాలనుకునేదాన్ని. అతనిలాగా నా భర్త ఎక్కడేనా పడి ఉన్నాడేమో..."

ఆమె గొంతు రుద్ధమయినట్టనిపించింది. అతను జేబులోకి చేతిని పోనిచ్చి తీసేశాడు.

"తర్వాత?" అన్నాడతను భయంగా.

"నర్సు పని మానేశాను."

"ఏం?"

"ఆ రోగి పోయాడు."

అతను నిట్టూర్చాడు. ఒక షెల్టరు దగ్గిర ఎవడో ముష్టివాడు నిద్రలో కలవరిస్తున్నాడు. అతను మళ్ళీ అన్నాడు:

"ఇలా ఎక్కడికి నడుస్తున్నాం?"

"అగమ్యం" అంది ఆమె.

"మీకు తెలుగు బాగా వచ్చునే."

"పరీక్షల్లో పోయేది ఎప్పుడూ."

అతను నవ్వాడు, ఏదో గౌరవార్థంగదా అన్నట్టు.

"మరి ..." సందేహిస్తూ ఆగాడు.

ఏంవిటి అన్నట్టుగా ఆమె అతని కేసి చూసింది.

"మరి సైన్యంలో నర్సుగా ఎందుకు చేరారు?" అన్నాడతను.

"కొన్నాళ్ళు ఈజిప్టునుండి ఉత్తరం రాలేదు. కంగారుపడ్డాను."

"అహాc."

"అతని భుజంలోంచి గుండు దూసుకుపోయిందని వార్త వచ్చింది."

"అరె!" – అప్రయత్నంగా ఆమె భుజంమీద చెయ్యివేశాడు.

"మళ్ళీ నేటివరకూ ఏ వార్తా రాలేదు. బతికి వున్నాడో లేదో కూడా తెలియదు."

ఆమె నుదుటిమీద పడే ముంగురుల్ని వణికే చేత్తో సవరించుకుంది. మళ్ళీ యిలా అంది:

"అప్పట్నుండి సంక్షోభంగా ఉండేది మనస్సు. సైన్యంలో నర్సుగా చేరాను."

"ఇక్కడ శాంతిగా వుందా?" అడిగాడతను.

"లోని కంగారుని అణచివేస్తోంది యీ యుద్ధ సంక్షోభం. అందరి వెనకాలా అన్ని చోట్లా మృత్యువు పొంచి ఉన్నట్టనిపిస్తుంది. ఈ సోల్జర్ల మధ్య అప్పుడు నా బాధ ఒక్కటే విడిగా కనపడదు."

"నిజమే."

"ఒక్కొక్కసారి ఈ సోల్జర్లలో ఎక్కడో మా ఆయన ఉన్నాడేమో అనిపిస్తుంది."

బ్లాకౌట్ చేయబడిన వెలుతురులో ఆమె కళ్ళ చివర కన్నీటి బిందువుని చూశానా అని అనిపించింది అతనికి. ఏమనాలో తోచలేదు. "చీకటి బావుంటుంది" అన్నాడు. జేబులో చెయ్యిపెట్టి తీసివేశాడు.

రోడ్డు క్రమంగా ఒక మైదానంలో కలసిపోయినచోట అస్పష్టంగా విశాలంగా అయిపోయింది. మైదానంలో డేరాలూ, డేరాలలోంచి చిన్న చిన్న లైట్లూ కనబడుతున్నాయి. మైదానానికి ఇంకా దూరంగా నడుస్తూన్న అతనికీ ఆమెకీ సన్నని గొంతుక పాడుతూన్నట్టు వినిపిస్తున్నది. పాట కొత్తగా విజాతీయంగా వుంది. ఎవరో తనలో తాను ఏడుస్తూ నవ్వుతూ కిందపడి దొర్లుతున్నట్టుగా ఉంది.

"ఏమిటదీ?" అంది ఆమె.

"బర్మా శరణార్థుల క్యాంపు."

"వెళదామా?"

"ఊc."

ఇద్దరూ ఆ డేరాలవైపు నడవసాగారు. అంత రాత్రివేళ కూడా కొందరు నిద్రలేకుండా డేరాలకి దూరంగా కూర్చుని ఉన్నారు. కొన్నిచోట్ల ఒక స్త్రీ, పురుషుడూన్నూ ఉన్నారు. మెల్లగా భయంగా వీచే గాలిలోంచి వాళ్ళ గుస గుసలు వినబడుతున్నాయి. డేరా సందుల్లోంచి వెలుగు సన్నగా పాకి యిసుకమీదపడి మెరుస్తూంది.

"ఈ జంటలు భార్య భర్తాలా?" అడిగిందామె.

"అవొచ్చును, ఏం చెప్పగలం?" అన్నాడతను.

"ఇంతమంది యిళ్ళూ వాకిళ్ళూ వదిలి వచ్చేశారు. పాపం, వాళ్ళకి ఎలా వుంటుందో!"

"యుద్ధం–" పళ్ళు నొక్కిపెట్టి అన్నాడతను.

డేరాలు సమీపించినకొలదీ ఆ ప్రదేశమంతా కంగాళీగా వుంది. డేరాలకి కొద్దిదూరంలో షెల్టర్లూ గోతులూ వున్నాయి. డేరాలలో పెట్టెలూ సామాన్లూ ముసలివాళ్ళూ పేర్చబడి వున్నారు. చాపలమీద స్త్రీలూ, శిశువులూ పరున్నారు.

"ఎంతమందో!" అందామె.

అతను మాట్లడలేదు. జేబులో చెయ్యిపెట్టి తీసేశాడు.

ఒక చంటిపిల్ల 'కార్' మంది – ఏడుస్తూ పక్కకి మరొకడి పక్కలోకి దొర్లింది. వాడు లేచి విసుక్కుంటూ పెద్ద కేకలు వేస్తున్నాడు. ఒక వృద్ధుడు లేచి పిల్ల నెత్తుకుని లాలిస్తూ ఈవలికి వచ్చాడు.

"తల్లి కివ్వరాదూ పిల్లని" – అందామె యింగ్లీషులో.

వృద్ధుడు ఆమెకేసి కొంతసేపు శూన్యంగా చూశాడు. అతికష్టం మీద మాటలను పోగుచేసుకుంటూ ఇలా అన్నాడు: ఆ పిల్ల తన మనమరాలనీ, తన కూతురు అస్సాము సరిహద్దు దగ్గర ప్రసవించి చనిపోయిందనీ–తిరిగీ యిలా అన్నాడు: "దీనికి పాలులేవు. ఇదికూడా చచ్చిపోతే బాగుండును."

ఆమె జాలిగా చూసింది. ఇద్దరూ అక్కడనుండి కదిలారు.

"పాపం!" అందామె

"ఏం?"

"జాలేసింది. కాని ఆ పిల్ల నాడులూ అవీ పైకొచ్చి అసహ్యంగా వుంది."

అతను యిసుకలో మౌనంగా నడుస్తున్నాడు. భారంగా అడుగులు వేస్తూ కొంచం వంగి నడుస్తున్నాడు. ఆమెకి ఏమయ్యాడో తెలియని తన భర్త ఏ అరేబియా యెడారిలోనో యిలాగే నడుస్తున్నాడా అనిపించింది. కంగారుగా పైట చేత్తో సవరించుకుంది.

ఎదురుగా ఒక యిరవై యేళ్ళ యువకుడూ యిరవై నాలుగేళ్ళ యువతీ వస్తున్నారు, మసక నిదరలో నడుస్తూన్నట్టు. ఆ యువతి వీళ్ళని నిదానించి చూసి "బామా!" అని పిలిచి ఒక్క పరుగున వచ్చి హఠాత్తుగా ఆగి పకపకా నవ్వడం ప్రారంభించింది. ఆమె వెనుకాలే యువకుడు కంగారుగా వచ్చాడు. ఇద్దరూ బర్మా దేశీయులు.

అతను యువకుణ్ణి ఉద్దేశించి "ఎందుకు నవ్వుతుంది?" అని అడిగాడు ఇంగ్లీషులో.

"మిమ్మల్ని 'బామా' అనుకుంది. కాని మీరు బామా కారు" అన్నాడా యువకుడు.

"మీరెవరు – మీ పేరు?" అన్నాడతను.

" నా పేరు యూబా. ఈమె పేరు అమా. శరణార్థులం" అన్నాడా యువకుడు. లావుపాటి కింద పెదవి నొక్కిపట్టి తిరిగి ఇలా అన్నాడు: "మీరు ఎందుకిలాగ వచ్చారు. ఈ క్యాంపులో ఉంటారా?"

"కాదు, మిలటరీలో పనిచేస్తున్నాను" అన్నాడతను.

బర్మా యువతి ఏదో అంది. యూబా అనువదించి ఇలా అడిగాడు:

"ఈమె మీ కేమౌతుంది?"

"ఏమీకాదు" అన్నాడతను.

ఆమా నిద్రలేనా బరువు కళ్ళతో నవ్వి ఏదో అంది. యూబా "మాకు ఏమీ తోచడంలేదు; కాస్సేపు కూర్చుని మాట్లాడుకుందామా?" అన్నాడు.

నలుగురూ కొంచెందూరం నడిచి ఒకచోట కూర్చున్నారు. ఆమా ఏదో మాట్లాడుతూ పకాలున నవ్వుతోంది. ఈసారి యింతవరకూ మౌనంగా ఉన్న ఆమె అడిగింది: "ఆమా మీకన్న పెద్దదిలా వుంది. ఈమె మీకేమౌతుంది?"

యూబా కళ్ళు కుంచించాడు. అతని చిన్న నొసలు ముడతలుపడి ఏవేవో స్మృతుల్ని దాస్తున్నట్టుగా వుంది. "బామా యీమె అన్నగారు. 'దేశద్రోహి,' జపాన్ వాళ్ళ గూఢచారి అనే పేరుతో అతన్ని ప్రభుత్వం చంపివేసింది. కాని యీమెకింకా పాపం తెలియదు. ఎక్కడో బతికి ఉన్నాడనుకుంటోంది. తర్వాత జపాన్ విమానాలు దాడిచేశాయి. ఆ దాడిలో యీమె గృహమూ, ముసలితల్లీ నాశనమైపోయారు. మా అందరితోనూ యీమె పారిపోయి వచ్చింది. ఇప్పుడు..." యూబా ఒకసారి దగ్గి ఇలా అన్నాడు: "ఇప్పుడు మేం భార్య భర్తలలాగా వున్నాం."

"మీరు బర్మాలో ఏం చేసేవారు?" అన్నాడతను

యూబా మళ్ళీ ఆలోచించాడు. మళ్ళీ నొసలు కుంచించాడు. జవాబు చెప్పడమే పెద్ద పరిశ్రమలాగ ఉంది అతనికి. "కలప వర్తకం చేసేవాళ్ళం–నేనూ మా అన్నలూ."

ఆమె ఏదో అడగబోయింది. కాని అతను కళ్ళతో వారించాడు.

ఆమా అక్కడనుంచి లేచి అల్లరిగా గాలిలో ఎగిరే మిణుగురుల్ని పట్టుకునేందుకు ప్రయత్నిస్తోంది. అతను చేతిలోకి యిసుక తీసుకుని కొంచెం కొంచెం కిందపోస్తూ యిలా అన్నాడు.

"ఏదైనా ఉద్యోగం చెయ్యరాదూ?"

యూబా అన్నాడు: "అవును, నేను మిలటరీలో చేరదామనుకుంటున్నాను."

అతను ఆమెకేసి చూచాడు. ఆమె కూర్చునే కునుకుపాట్లు పడుతోంది. అతనామెను తట్టిలేపాడు. ఆమె ఉలిక్కిపడి "ఆరె! నిద్రవచ్చింది–చిత్రంగా" అంది.

యూబా అన్నాడు మళ్ళీ నిశ్చయంతో: "అవును. మిలటరీలోనే చేరుతాను."

"మరి ఆమా ఏమవుతుంది?" అంది ఆమె.

"ఏమౌతుందీ?" యూబా కాస్తదూరంలో ఉన్న ఆమాని ప్రేమగా చూశాడు. "ఏడుస్తుంది, నిజమే. కాని డేరాలలో ఏ సౌకర్యమూ తిండీ లేక ఎన్నాళ్ళు వుండడం? ఊరికే ఉన్నకొలది మా వ్యాపారమూ, మా అన్నలూ, మా వూరూ జ్ఞాపకం వస్తారు. నేను సైన్యంలో చేరితే ఆమా యింకొక మంచివాణ్ణి స్నేహం చేసుకుంటుంది. యుద్ధం వచ్చినప్పుడు స్నేహాలెంత త్వరగా చేసుకుంటామో అంత త్వరగా తెంపుకోవాలి. అంతేనంటారా?" అన్నాడు యూబా ఇంగ్లీషులో. తన

ఆలోచనల నొక్కొక్కటే మెల్లగా ఎప్పుడూ, అతని గొంతులో కందిరీగ దూరినట్లు సర్వం విషాదంగా పలికింది.

మిణుగురులతో ఆడుతూ అమా దూరంగా వెళ్ళిపోయింది. అక్కడనుండి యూహాను పిలిచింది. యూబా లేచి "ఆమె పిలుస్తోంది. నేను వెళతాను" అని గబగబా వెళ్ళిపోయాడు. అతడు లేచాడు. ఆమె లేచింది.

నిశ్శబ్దంగా ఇద్దరూ ముందుకు వెళుతున్నారు. పోలీసు ఈల దూరంగా వినపడింది. తూర్పున నక్షత్రం మీద కప్పుకున్న మబ్బు పింజె పింజెలుగా విడిపోయింది. ఇద్దరూ వెనక్కి తిరిగి చూశారు. యూబా, అమా–ఇరువురూ గాఢమైన కౌగిలిలో ఉన్నారు. ఇద్దరూ యిసక ప్రదేశందాటి ఎత్తుగావున్న ఒక దిబ్బదగ్గరకు వచ్చారు. అక్కడ కొన్ని తాడిచెట్లు మాత్రం ఉన్నాయి. చక్రాలూ, టాపూ లేని ఒక పాత జీపుకారు తుప్పుపట్టి బోర్లాపడివుంది.

"ఇలా కుర్చుందాం" అన్నాడతను.

"ఊ."

దిబ్బమీద ఇద్దరూ కూర్చున్నారు. అకాశంమీద చంద్రుడు వడిలిన పువ్వురేకులా ఉన్నాడు. ఇద్దరి నీడలూ వెనక్కి పొడుగ్గా సాచుకుని ఉన్నాయి.

"యూబా చిత్రమైనవాడు" అన్నాడతను.

"ఔను."

"మరి..."

ఆమె కనులు పైకెత్తి "ఏమిటి?" అంది.

"ఏదో చెప్పబోయి మరిచిపోయాను" అన్నాడతను, జేబులోనికి చెయ్యి పోనిచ్చి తీసివేసి.

ఆమె వింతగా చూసింది. అతను నిశ్చలంగా శూన్యంలోకి చూస్తున్నాడు. తాటిచెట్టు పక్కనుండి ఒక ముంగిస పరిగెత్తుకు వెళ్ళింది. గుడ్డి వెన్నెలలో పట్టణపు మేడల కొసలు మెరుస్తున్నాయి. దూరంగా డేరా నీడలు యిసుకలో మెత్తగా పరుచుతున్నాయి. అంతా విచిత్రమైన నిశ్శబ్దం.

అతను చటుక్కున నవ్వాడు. ఆమె కంగారుగా ముంగురుల పైకి తోసుకొని "ఏం?" అంది.

"ఏముందీ–ఎందుకో వచ్చింది ఏడుపులాంటి నవ్వు" అన్నాడు అతను. జేబులో చెయ్యి పెట్టి తీసివేశాడు. పళ్ళు పటపటా కొరుకుతూ "యుద్ధం!" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. అతను ఆమెకేసి చూశాడు. ఆమె కళ్ళమ్మట నీటిచుక్కలు రాలుతున్నాయి. అతను తెల్లబోయాడు. జాలి అతని మొహంలో ప్రసరించింది.

'ఎందుకు ఏడుస్తున్నావు?' అన్నాడు విసుగ్గా, జాలిగా.

ఆమె జవాబు యివ్వలేదు. అతడు ఆమె దగ్గరగా జరిగి ఆమె తలనీ, చెక్కిళ్ళనీ నిమిరాడు. ఆమె వొరిగి అతని వక్షంమీద తలని అన్చింది. అతనామె పెదవుల్ని

మెల్లగా మెత్తగా ముద్దు పెట్టుకున్నాడు. ఇద్దరూ ఒకరి పక్కగా ఒకరు ఒరిగి పండుకున్నారు.

'రేపు ఆఫీసరు వస్తాడు పరీక్ష చేసేందుకు' అన్నాడతను.

'ఊహూఁ' అందామె.

ఇక్కడ బావుంది కదూ – పీడకలలు వచ్చే నిద్రకన్నా? అన్నాడతను. అతను తిరిగి జేబులోనికి చెయ్యిపోనిచ్చి తీసివేశాడు.

'ఎందుకు ఇందాకట్నుంచి జేబు తడుముకుంటున్నారు?' అంది ఆమె అతని జుట్టులోనికి వేళ్ళని పోనిస్తూ.

అతను నవ్వాడు. 'సిగరెట్లకోసం – లేవన్నమాట మరిచిపోతున్నాను.'

మధ్య మధ్య ఏవో అస్పష్ట రవాలు దూరంగా డేరాలనించి వినిపిస్తున్నాయి. కృష్ణపక్షపు గుడ్డివెన్నెలలో ఆ నగరం తనలో తానొదిగిన పెద్ద తాబేలులా వుంది.

● *ప్రచురణ, 1948* ●

★ ★ ★

శారద

# 16 గెరిల్లా గోవిందు

అవాళ 22 మార్చి 48 తారీకుని సూచిస్తూ కాలెండర్, గోడమీద వ్రూగు లాడుతోంది. నిజాం సరిహద్దు దగ్గిర కొత్తగా మకాం వేసిన రజాకార్లు సిగరెట్లు తగలేస్తూ, మధ్య మధ్య సారా సేవిస్తూ, గది మధ్య బల్లచుట్టూ కూర్చున్నారు. గది నాల్గుగోడలకీ బ్రెన్ గన్నులూ, తుపాకులూ వేళ్లాడుతూ వాతావరణాన్ని భయపెడ్తున్నె! అప్పుడే చీకటి పడుతూంది. గది వాకిలి గుండా బావురుమనే విశాలమైదానమూ, దూరంగా నల్లగుట్టల్లాగు కన్పించే పూరిళ్ళూ మసక మసకగా అవుపిస్తున్నై. ఆ ప్రాంతమంతా, రజాకార్ల దుష్కృత్యాల భయంతో ఎగశ్వాస పీల్చి వొదులుతున్నట్లు గాలి వెచ్చగా విసుగుగా వీస్తోంది. బల్లచుట్టూ కూర్చున్న ఎనిమిది మందిలోనూ భయానకమైన మొరటుగొంతుతో, ఎర్రబడ్డ కళ్ళు మిటకరిస్తో ఒకడు ప్రారంభించాడు సంభాషణ. వాడి విగ్రహమే చెబుతోంది వాడు నరమాంసాహారి అని. అతను బల్లమీది సారాగ్లాసు చేతిలోకితీసుకుంటూ "ఆ కాఫిర్ బేవకూఫ్ దొరికితేనా, నిలువునా చంపేస్తాను..." అన్నాడు గోండ్రించి.

పొట్టిగా, కుదేసిన బస్తాలా, మంచి రక్తవర్ణం తేలిన మరొకడు, "నేనే వాణ్ణిచూస్తే!" అని సిగిరెట్ అంటించడంలో లీనమైనాడు.

మొదట గోండ్రించినవాడిపేరు రహమాన్. అతను తనలోపలే ఏదో ఆలోచిస్తో పైకె చిరునవ్వు నవ్వి మిగతావాళ్ళవంక ధీరంగా చూస్తూ "వాడు ఈ చుట్టుపక్కలే తిరుగుతున్నాడు భాయీ, దొరికిపోతాడులే. రెండు రోజులకిందట నారాయ్‌పాలెంలో కన్పించాడని ఎవడో కాఫిర్ అన్నాడు." అంటూ ఒక గుక్క సారాయి తాగాడు తాపీగా.

మిగతా ఏడుగురు హంతకులూ, రహమాన్‌వంక భయంతోనూ, సందేహంగానూ చూసారు. వాళ్ళకి ఎంత సారా తాగినా, భయం వదలడం లేదు, నిషా ఎక్కడం లేదు.

పొట్టివాడి పేరు అబ్దుల్. అతను రహమాన్‌ని కళ్ళార్పకుండా ఒక నిముషం చూసి, "అయితే వాడు ఇక్కడే వున్నాడని అర్థం? ఏం భాయి చెప్పు! వాడి పేరేమిటి? మరిచిపోయినానులే...." అని అడిగాడు. అతడు భయపడుతున్నాడో, లేక ఆసక్తే కనపరుస్తున్నాడో, అతని స్వరం వల్ల బోధపడటం లేదు.

రహమాన్ భీకరంగా నవ్వాడు. గదిలో కాలెండర్ వూగులాడింది. చీకటి వొణికింది. 'మీరు భయపడుతున్నారా?' అన్నట్టు చూశాడు అందర్నీ. తర్వాత బల్లమీద మోచెయ్యి ఆన్చి, అరచేతిలో గడ్డం పెట్టుకుని, మెల్లగా రహస్యం చెప్పేవాడిలా, ఇలా అన్నాడు. "వాడిపేరు గోవిందు. చాలా అల్లరిరకం అంట వాణ్ణి పట్టుకోకపోతే భలే నామర్దా మనకి!" అతని ముఖంలో నిశ్చితాభిప్రాయాన్ని వెలిబుచ్చే ముడతలు కలిగినాయి.

అతని సహచరుల మొహాలు ఎందుకోగాని ఎర్రబారినై. వాళ్ళిదివరకె ఆ పేరు విన్నట్టు కనిపించారు. ఒకరి మొహాలు ఒకరు తీవ్రంగా పది నిముషాలు చూసుకున్నారు, మౌనంగా! గాలికూడా వాళ్ళ మౌనాన్ని భంగం చేయడమెందుకా అన్నట్లు ఒక నిముషం ఆగింది. రహమాన్ చేతిలో సారాగ్లాసు జారి బల్లమీదపడి మౌనం భంగమైంది.

ఆ మసక చీకటి ఉలిక్కిపడ్డది. అబ్దుల్ గూడా ఉలిక్కిపడ్డట్టే అగుపించాడు. "అరేభాయీ, దీపం వెలిగించనా?" అని మిగతావాళ్ళని ప్రశ్నించి, వాళ్ళ జవాబు రాకముందే అతను ఆ పనిలో నిమగ్నమైనాడు.

రహమాన్ అబ్దుల్‌వైపు తూలేకళ్ళతో వురిమిచూస్తూ, "అరే, మన కొత్త సర్దార్ ఈ పాటికే వస్తూవుండాలిగా?" అని అడిగాడు. అక్కడి వాతావరణాన్ని ఆవరించిన భయాన్ని పోగొట్టాలనే ప్రయత్నం అతని గొంతులో స్ఫురిస్తున్నది. అబ్దుల్ వెలిగించిన లాంతర్ కొంత భయాన్ని, చీకటిని పారద్రోలగలిగింది. అబ్దుల్ లాంతరును బల్లమధ్యపెట్టి తన కుర్చీలో కూలబడుతూ "నిజమే, ఈ పాటికే రావల్సింది" అని సమాధానమిచ్చాడు. అబ్దుల్‌కి ఎడంవైపున కూర్చున్న ముప్పై ఏళ్ళ మరొకడు తన ముఖం మీద ముడతల్ని ఎక్కువచేస్తూ అబ్దుల్‌వైపు అప్రయత్నంగా తిరిగి, "సర్దార్ రావటంతో మనం గోవిందుకోసం పోవాలా?" అని ప్రశ్నించినట్టు ఆశ్చర్యపడ్డాడు. అబ్దాల్ సారాగ్లాసులోనికె కూజాలోంచి సారాని పోసుకుంటూ "అవును హుస్సేన్ భాయీ! అదే మన ప్లాను!" అని రహమాన్‌వైపు తిరిగి "క్యాజీ! అంతేనా?" అని ప్రశ్నించాడు. రహమాన్ మాట్లాడకుండా ఆమోద సూచకంగా తలూపాడు.

హుస్సేన్ ఒక్క గుక్కన తనచేతిలో సారాగ్లాసు సగంపైచిల్లర ఖాళీచేసి, "వాడెట్టా వుంటాడు? మనం గుర్తుపట్టక్కరలేదూ?" అని రహమాన్‌వైపు చూస్తూ ప్రశ్నించాడు. మిగతా హంతకులుగూడా, ఈ ప్రశ్నకు రాబొయ్యే సమాధానాన్ని ఆకాంక్షిస్తున్నట్టు, రహమాన్‌వైపు హుషారుగా చూడసాగారు.

రహమాన్ వాకిలివైపు, రాబొయ్యే కొత్త సర్దారు కోసం గావును ఆదుర్దాగా చూస్తున్నాడు. హుస్సేను ప్రశ్నతో చూపును గదిలోకే మరల్చి "ఎట్లా ఉంటాడో నాకూ బాగా తెలవదు. అయితే కొద్దిగా తెలుసు. నిన్ననే వాడి 'ఐడెంటీఫై' నోటీసు వచ్చిందన్నారు" అంటూ తన జేబులోంచి ఓ కాగితాన్ని బైటకిలాగి, లాంతర్ దగ్గరగా బల్లమీద పరచాడు. దానిమీద తలవైపున నైజాం మొహరు వేసి వుంది. దాన్ని రహమాన్ ఇట్లా చదవసాగాడు:

పేరు: గోవిందు. గ్రామం నల్గొండజిల్లాలో ఒక గ్రామం. సామాన్యరైతు. వయసు 22సంllలు. ఎర్రగా 6 అడుగుల యెత్తు వుంటాడు. ఎడం వైపుగా, గడ్డం మీద

ఇటీవలనే తగిలిన తుపాకీ గాయం ఉంటుంది. మీసాలు కొసలు తిరిగి వుంటాయి. ఉంగరాలజ్రాపు. కోలముఖం. ఇతని మూలంగా, హిజ్ఎక్జాల్టెడ్ హైనెస్ సైన్యానికి చాలాసార్లు గొప్పనష్టాలు కలిగినాయి అని తెలుస్తున్నది. ఇతను కాఫిర్ల పరమైన మన రాజ్యంలోని గెరిల్లా దొంగలగుంపు నాయకుడు. ఇతన్ని పట్టుకున్నవారికి ఐదువేల హాలీలు బహుమతి ఇవ్వడమేకాకుండా, దొరతనంలో పెద్ద ఉద్యోగంకూడా యివ్వబడుతుంది."

చదవటం పూర్తిచేసి రహమాన్ తన సహచరుల ముఖాలవైపు చూశాడు. వాళ్ళందరికీ గోవిందు విగ్రహం కళ్ళకుకట్టినట్టు కన్పిస్తున్నది. అబ్దుల్ ఈ పరిస్థితి నుంచి ఐదు నిముషాలకి తేరుకుని బల్లమీదకి ఆవేశంతో వంగి, "వాణ్ణి నేను గుర్తుపట్టగలను. ఐదువేల హాలీలు!పెద్ద ఉద్యోగం బాబూ! మనం ఆ పైసానీ పంచుకుందాం!" అని ఆనందంగా అరిచాడు.

అతని అరుపు గోడలకి వేళ్ళాడే తుపాకీలకి తగిలి ప్రతిధ్వనించింది. ఆ శబ్దం గదినుండి నిర్గమించకముందే, చప్పున లేచి నుంచున్నారు. నిమిషం గడిచిన తర్వాత, టక టక బూట్లు చప్పుడు చేసుకుంటూ ఒక నూతన వ్యక్తి మిలటరీ యూనిఫారంలో వున్నవాడు లోపలికి వచ్చాడు. అతని వెనుక ఇంకో హిందూ సేవకుడూ డ్రైవరూ వొచ్చారు.

రహమాన్ సర్దార్వైపు వొంగి "సలాంజీ, సర్దార్"! అన్నాడు. మిగతా అందరూ "సలాం" అన్నారు. సర్దార్ గదిలోకి ఒకసారి కలియజూసి, వాళ్ళ సలాము లందుకొని మళ్ళీ 'సలాం!' అన్నాడు.

సర్దార్తో ఇంకెవ్వరూ రాకపోవడం రహమాన్కి తగని ఆశ్చర్యం కలుగజేసింది. దాదాపు ఏభైవంది రజ్వీ అనుచరులన్నా రావల్సిందని అతని అంచనా. సర్దార్ని కూర్చోమనాలన్న తలంపు అతన్ని ఆశ్చర్యం నుంచి మేల్కొల్పింది. "సర్దార్జీ! ఇక్కడ కూర్చోండి!" అన్నాడతను మర్యాదగా తన కుర్చీ చూపుతూ....

సర్దార్, బల్లముందు కుర్చీలో కూర్చుంటూ, తన చేతిలోని రివాల్వర్ నంచి బల్లమీద పడేసి ముంజేతి మీద చొక్కా కప్పు వెనక్కిలాగి టైం చూసుకున్నాడు. 7.30 గంటలవుతున్నది. సర్దార్ మొహం మీద ఆదుర్దా కనిపించింది. అతను రహమాన్వైపు తీక్షణంగాచూసి "ఇక్కడ ఎంతమంది వున్నారు?" అని అడిగాడు ఆజ్ఞాపూర్వకంగా. రహమాన్ నమ్రతగా "ఇరవైమంది ఉన్నాం" అని ఒక నిముషం ఆగి, "అయితే సర్దార్జీ, మీతో ఎవరూ రాలేదే?" అని అన్నాడు.

సర్దార్ గంభీరాకృతిలో ఇంకా గంభీరం వచ్చింది. "వీళ్ళుచాలు...టైం అవుతోంది. మనం ఈ పూటే గోవిందుని పట్టెయ్యాలి. జరూర్హుకుం వచ్చింది, వాడు దగ్గిరలో నారాయ్పాలెంలోనే వున్నట్టు" అన్నాడు.

ఈ జవాబు రహమాన్కి సబబుగా తోచకపోయినా, గతిలేక వొప్పుకున్నట్టు చిరునవ్వు నవ్వాడు. నవ్వాగిన తర్వాత అతను అబ్దుల్వైపు తిరిగి "భాయీ! మిగతావాళ్ళు ఆ గెడ్డ దగ్గర వుంటారేమో,పిల్చుకురా!" అని ఆజ్ఞాపించాడు.

అబ్దుల్ వెంటనే గదినుండి నిష్క్రమించాడు. అబ్దుల్ వెళ్ళగానే రహమాన్ మిగిలిన వాళ్ళవైపు తిరిగి, "లేవండి. తుపాకులూ, బ్రెన్గన్స్ రెడీ చేసుకోండి. అన్నీ లారీలోవేసి

అందరూ లారీలోనే ఎక్కండి" అన్నాడు. మిగతా వాళ్ళందరూ, వెంటనే గబగబా లేచి తమ పనులలో నిమగ్నమైనారు.

సర్దార్‌జీ తన నిడుపాటి గడ్డాన్ని నిలువుగా కుడిచేత్తో దూస్తూ, రహమాన్ వైపు తిరిగి ఇలా అన్నాడు: "మీరు చాలా చురుగ్గా పనిచేయాలి!" రహమాన్ ఆమోదసూచకంగా తలవొంచి తనూ తన తుపాకీ సర్దుకో ప్రారంభించాడు.

ఎనిమిదింటికి పది నిముషాలుందనగా రజాకార్ల లారీ నారాయ్‌పాలెంవైపు బయల్దేరింది. ముందు ఇరవై మందిని మోసుకుని లారీ, దాని వెనక జీప్ కారులో సర్దార్, రహమాన్‌తో వచ్చిన సేవకుడూ ప్రయాణం చేస్తున్నారు. రోడ్డు ఎన్నో ఏండ్లనుండి రిపేరు లేకపోవడం వల్ల చాలా గతుకులుగా వుంది. నక్షత్రాల కాంతి తప్ప ఇంకెల్లాంటి వెల్తురూలేదు. కార్లతాలూకు దీపాలు సర్దార్ వెలిగించవద్దని ఆజ్ఞాపించివుండటం వల్ల అవీలేవు. గాఢాంధకారం సంయిమంటోంది. జీప్ ముందుసీట్‌లో కూర్చుని వున్న రహమాన్ రోడ్డువంక నిరాశగా చూస్తూ సర్దార్‌ని ఉద్దేశించి ఇలా అన్నాడు: "సర్దార్‌జీ! వాడి కోసం ఇంత పట్టుదల ఏమిటి? హుకుంలో చాలా గందరగోళంగా వ్రాసివుంది. నిజంగా అంత అపాయకరమైన మనిషా వాడు?..."

సర్దార్‌జీ సిగిరెట్ వెలిగించుతూ, రహమాన్ చెప్పింది అలక్ష్యంగా ఆలకించి, "వాడు...అంటే? ...ఓ! గోవిందు సంగతా, నువ్వడిగింది? వాడొక అపాయకరమైన మనిషే; సందేహం లేకుండా వాడొక బందిపోటు దొంగ!...వాడు ఇప్పటివరకూ, కనీసం వందమంది మన 'భాయీ'ల్ని చంపివుంటాడు" అని సిగరెట్ తాగడంలో నిమగ్నమైనాడు.

రహమాన్ కారు కుదుపులకి తూలుతూ, "ఇన్నాళ్ళ బట్టి వాణ్ణెందుకు పట్టుకోలేక పోయినారో మనవాళ్ళు? ఆ కాఫిర్ వెధవే నా చేతుల్లోపడితే వాడిక పోయేది అల్లా దగ్గరకే!" అన్నాడు ఖరారుగా.

సర్దార్‌జీ కళ్ళు ఆ కారు చీకట్లో నక్షత్రాల కాంతికి తళ తళ మెరిశాయి. అతను చేతిలో సిగరెట్టు అసహ్యంగానూ, కసితోనూ రోడ్డుమీదికి విసిరికొట్టి "వాడంత తేలికగా దొరకడనుకుంటాను – కానీ దొరికితేనా?" అన్నాడు.

రహమాన్ వెంటనే సంభాషణ అందుకొని "వీడెంత! నా చేతిలో మహా మహా వాళ్లు ఐపోయినారు" అన్నాడు, తనలోంచి తలనూపుతున్న భయాన్ని వెనకటి తన క్రౌర్యంలో దాచిపెట్టి.

సర్దార్ నవ్వాడు. రహమాన్‌కూడా నవ్వాడు పెద్దగా. డ్రైవరుకూడా నవ్వాలని ప్రయత్నించాడు గానీ, అకస్మాత్తుగా అతని చెయ్యి బ్రేక్‌మీద పడ్డది. కారు కీచుమని ఆగిపోయింది. ఈ శబ్దంతోపాటే రహమాన్ వెనక్కి తూలాడు సర్దార్ అప్రయత్నంగా రోడ్డుమీదికి చూసేడు. ముందుపోతున్న లారీ కన్పించలేదు. ఎక్కణ్ణుంచో మనుషులు అవసానదశలో మూలుగుతున్న ధ్వని మాత్రం గాఢంగానూ, విషాదంగానూ వినిపించసాగింది.

రహమాన్ చప్పున కారులోంచి దూకాడు. వాడివెనకాలే సర్దారూ, అతని బంటూ, డ్రైవరూ దిగారు కంగారుగా! జీపు కారుముందు లైట్ వెలిగింది. ఆ వెలుగులో రోడ్డుమీద, గెరిల్లాలు తవ్విన గొయ్యిలో రజాకార్ల లారీ తలకిందులుగా

పడిపోయిందని వాళ్ళూహించుకున్నారు. ఈ సంగతి తెలిసిన ఐదునిమిషాలకల్లా, వాళ్ళేదో చెయ్యాలనే ఆలోచనలో వుండగానే; నలుగురినీ గెరిల్లా సైనికులు వందమంది, సాయుధులు – చుట్టుకున్నారు. వాళ్ళెవరూ తొందరపడలేదు. వాళ్ళలో ముఖ్యుడూ వున్నాడు. బాగా కండలు తిరిగిన శరీరంపై పట్టీ బనీనూ, తువ్వాలూ వేసుకున్నాడు. చేతిలో రివాల్వర్ పుచ్చుకొని, రహమాన్ దగ్గరికి వచ్చాడు. రహమాన్‌కి అప్పటికి అర్థమైంది అక్కడ ఏంజరుగుతున్నదో. అతను తన పరిస్థితిని అర్థం చేసుకొని ఏ నిశ్చయానికి రాకముందే, అతన్ని గెరిల్లా వీరుడు లాక్కుపోయి రోడ్డుప్రక్కన చెట్టుకి కట్టేశాడు.

డ్రైవరూ, సర్దార్‌తో వచ్చిన సేవకుడూ, గెరిల్లాలవైపు చూస్తూ నిలుచున్నారు.

సర్దారు మాత్రం ఏమీ ఆశ్చర్యపడకుండా ఇట్లాంటిదేదో జరుగుతుందని నమ్మిన వాడల్లే రహమాన్‌వైపు చూస్తున్నాడు. గెరిల్లా వీరుడు సర్దార్ చెయ్యి గట్టిగా పుచ్చుకుని రహమాన్ దగ్గరికి తీసుకెళ్ళాడు.

కాగడాల వెలుగులో, రహమాన్ పిచ్చివాడిలా, సర్దార్ వైపు చూశాడు. సర్దార్‌కింకా తన గతి పట్టలేదేమో అన్నట్టుంది: అతని చూపు.

సర్దార్‌జీ రహమాన్‌వైపు హేళనగా చూసి, "రహమాన్! నిన్నేమీ చెయ్యం. నీ క్రౌర్యాలకి నీకు ఈ రోజున శిక్షలేదు ఎందుకనంటావా? నువ్వెళ్ళి నిజాంకి తెలియజెయ్యాలి, గోవిందంటే ఎట్లాంటివాడో! గోవిందు రజాకార్లకి రజాకార్, నైజాంకి నైజాం అని మీ రాజుని హెచ్చరించాలి నువ్వు. నీ కొత్త సర్దార్ ఆ గొయ్యిలో, అల్లాని చేరబోతున్నాడు. కావాలంటే వెళ్ళి పరామర్శించు" అంటూ తన పొడుగాటి దొంగగడ్డాన్ని ఊడదీసి రోడ్డుమీద పారేశాడు.

రహమాన్ ఆశ్చర్యంతో కొయ్యబారిపోయినాడు. తన ఎదురువున్నది ఎవరు? గెరిల్లా గోవిందు!

● *ఆగస్ట్, 1948 విశాలాంధ్ర (మాసపత్రిక)* ●

★ ★ ★

కాళీపట్నం రామారావు

17

# అప్రజ్ఞాతం

ముందు ముందు ఎందరి దృష్టినో ఆకర్షించే సంఘటనైనా జరిగేటప్పుడు దాని ప్రాధాన్యతను గ్రహించలేము. అతి సామాన్యంగా జరిగిపోతుంది. ఆనాడు జగన్నాథస్వామి ఆలయంలో జరిగిన సంఘటన కూడా అలాంటి వాటిలో ఒకటి.

సుదర్శనం యువకుడు. పట్నంలో బి.ఎ. పరీక్షకు కూర్చున్నాడు. ఫలితాలకోసం ఎదురు చూస్తూ స్వగ్రామంలో ఉన్నాడు. వయసు మిగిలాక చదువులో ప్రవేశించడం వల్ల విద్యార్థే అయినా విద్యార్థిలా కనిపించడు.

ఆ ఉదయం కాలక్షేపం కోసమే అతడు ఆలయానికి వెళ్ళాడు. అప్పటికే కొందరక్కడ చేరి కబుర్లు చెప్పుకుంటున్నారు. కొంత సేపటికవి రాజకీయాల మీదకీ నడిచాయి.

రాజకీయాలు చర్చించటమంటే పార్టీలనూ ప్రభుత్వాలనూ తత్సంబంధీకులనూ దుమ్మెత్తి పోయటమే. పట్టణాల్లో అయినా పల్లెల్లో అయినా రాజకీయ చర్చలు రాజకీయ చర్చలే.

ఆసరికి కాంగ్రెసును తూర్పార బట్టడం జరిగిపోయింది. కాంగ్రెస్ ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోసేశారు. నెహ్రూ చేతకానితనం గూర్చి వాపోవడం ముగిసింది. కథ కమ్యూనిష్టుల మీదికి మళ్ళింది. కమ్యూనిజం యొక్క అమానుషత్వం గురించి చర్చ సాగుతోంది.

పట్టణాల్లో చదువుకున్న వాళ్ళల్లోనే యిలాంటి తెలిసీ తెలియనివాళ్ళు చాలా మందుంటారు. అలాంటివాళ్ళను చూస్తే సుదర్శనానికి ఒళ్ళుమంట. అయితే – మరీ భరించలేనప్పుడుతప్ప వాళ్ళను ప్రతిఘటించడు.

పార్టీలో మెంబరుషిప్పు లేకపోయినా సుదర్శనానికి ఆ పార్టీపట్ల సానుభూతి ఉంది. కమ్యూనిస్టులను విమర్శించినా అతడు సంహించగలడు గాని వాళ్ళ సిద్ధాంతం తప్పుడు సిద్ధాంతమంటే అతడు తట్టుకోలేడు.

ఆ రోజు అక్కడ చేరిన వాళ్ళలో ఎవరు ఏం వాగినా అతడు ఖాతరు చేయకపోను. బుచ్చిలింగం కూడా వాళ్ళతో గొంతు కలుపుతుంటే అతడు ఓర్చుకోలేకపోయాడు.

బుచ్చిలింగం పరిస్థితులు ఒకప్పుడు బాగానే ఉండేవి. ఆపదలకూ ఆడపిల్లల పెళ్ళిళ్ళకూ అప్పులుచేసి వడ్డీలతోనూ వడ్డీలకు వడ్డీలతోనూ కోర్టు ఖర్చులతోనూ అవి

పెరిగిపోగా భూమీ పుట్రా సమస్తం పోయి ఇప్పుడు తిండికి కూడా కష్టపడుతున్నాడు.

అందుకని -

"నీకు కమ్యూనిజాన్ని గురించి ఏం తెలుసని దానిని విమర్శిస్తావయ్యా?" అన్నాడు వీర్రైనంత సౌమ్యంగానే.

బుచ్చిలింగం వయసున చాలా పెద్దవాడైనా పల్లెటూరి సాంప్రదాయాల ననుసరించి ఏకవచన ప్రయోగం సభ్యతా దూరం కాదు.

సుదర్శనం సవాలు అందరి దృష్టిని ఆకర్షించింది.

కొంత గొడవ తరువాత కమ్యూనిజం గురించి అతడు చెప్పడానికీ తక్కిన వాళ్ళు వినడానికీ అంగీకారం కుదిరింది.

పార్టీ రాజకీయాల మీద చర్చ వెనక్కి వాయిదా వేసి సిద్ధాంతం ఎందుకు పుట్టిందో అదేమంటుందో ముందు చెబుతానన్నాడు సుదర్శనం. అతడేం చెప్పినా దానిని ఖండించడమే వాళ్ల లక్ష్యం కాబట్టి - సరే! అదే చెప్పు - అన్నారు.

ఈ దేశంలోనే కాక దాదాపు అన్ని దేశాల్లోనూ తినడానికి ఉన్నవాళ్ళు తక్కువా తిండి లేనివాళ్ళే చాలా చాలా ఎక్కువ! ఈ పరిస్థితి ఎలా వచ్చిందో చెప్పి - పెట్టుబడి, పెట్టుబడిదారీ ఉత్పత్తి, మిగులుశ్రమ వంటి పారిభాషిక పదాలను వివరిస్తూ పట్టణాల్లో పెద్దపెట్టున సాగే పారిశ్రామిక దోపిడి గురించి క్లుప్తంగా చెప్పి పల్లెల్లో సాగే భూస్వామ్య దోపిడి గురించి చెపుతున్నాడు. ఇంతలో అక్కడకు సూరప్పడు వచ్చాడు.

అతడు రాగానే అక్కడున్న వాళ్ళంతా - ఏం అన్నా! ఏం బావా! ఏం దర్జీ! ఏవండీ! అంటూ వరసగా పలకరింపుల్లో పడ్డారు. అతడు అందరికీ అన్ని వరసల్లోనూ జవాబిచ్చి 'మీరేదో మాటాడుకుంటున్నారు కావాల! మాటాడుకోండి. మాటాడుకోండి.' అంటూ ఆలయం లోపలికి వెళ్ళిపోయాడు. సుదర్శనం ఆపినచోట ఎత్తుకొని ముందుకు పోతున్నాడు.

ఆ ఊళ్ళో సంపన్నులందర్లోకీ సంపన్నుడు సూరప్పడు. మనిషి మాత్రం అలా కనిపించడు.

ముతక ఖద్దరు గావంచా ఒకటి కట్టుకొని పైమీద ఒక తువాలుతో అప్పుడప్పుడే పైబడుతున్న ముసలి రూపుతో తల వంచుకొని తన పనుల మీద తిరుగుతుంటాడు. మనిషెంత నిరాడంబరుడో మాటంత మృదువు. పని పడేతేతప్ప పలకరింపులకు మించి మాటాడడు.

అతడు భగవంతుణ్ణి నమ్ముతాడు. పాపమంటే భయం, పుణ్యకార్యాలపట్ల ఆసక్తి ఉన్నవాడు. ఆవాళ శనివారమని కాబోలు - పాత్తిగావంచా కట్టుకొని, చేతిలో పూజాద్రవ్యాల పళ్ళెం పట్టుకొని, భుజాన తడి అంగవస్త్రంతో, నుదుట తిరునామాలతో దేవాలయం కొచ్చాడు. ఆలయంలో అర్చకులు కనిపించకపోగా ప్రాకారంలోనే ఉన్న ఆయన యింటికే వెళ్ళాడు. అక్కడ నుంచి వచ్చాక సావిడిలో సాగుతున్న గోష్ఠి వింటున్నాడు.

సుదర్శనం అసరికి భూస్వామ్యంలో జరిగే దోపిడి గురించి చెప్పటం దాదాపు పూర్తయ్యింది. ఒకటి రెండు విషయాలు మిగిలిపోతే అడ్డు ప్రశ్నలు వేసే వాళ్ళతో 'అగండి అగండి' అంటూ పూర్తిచేస్తున్నాడు.

అక్కడున్న వాళ్ళలో ఎవ్వరూ సుదర్శనం పాటి చదువుకున్న వాళ్ళుకారు. అయినా, అమాటకొస్తే అందుచేతే, సుదర్శనాన్ని ఓడగొట్టాలని వాళ్ళకు గట్టి పట్టుదలగా ఉంది.

సుదర్శనం చెప్పేది పారిభాషిక పదాలకూ పారిశ్రామిక దోపిడికీ పరిమితమై సాగినంతసేపూ వాళ్ళకు లంగరు అందలేదు. ఎంత శ్రద్ధగా విన్నా ప్రత్యుక్తులు దొరకలేదు. పల్లెలో సాగే దోపిడి గురించి చెపుతుంటే మాటమాటకీ వాళ్ళకి ప్రత్యుక్తులు కనిపిస్తున్నాయి. చాలాసార్లు అతన్ని అడ్డుతగల బోయారు. మధ్యలో మాటాడటానికి సుదర్శనం అవకాశం ఇవ్వకపోవడంతో వాళ్ళెలాగో ఓపిక పట్టారు. సుదర్శనం ఆఖరు విషయం కూడా చెప్పేసి ఆగిపోయాక బుచ్చిలింగమే ముందుకు వస్తూ అడిగాడు.

"అయ్యిందా? ఇప్పుడు నే అడగొచ్చా?" అన్నాడు తల తాటెస్తూ.

అడగొచ్చన్నాడు సుదర్శనం.

"ఇప్పుడు మీ నాన్నగారే ఉన్నారు. అయనా వ్యవసాయం చేయిస్తున్నారు. చేయించింది మరీ పెద్ద వ్యవసాయం కాకపోవచ్చు. కాని ఇందాకా నువ్వన్నావే పెద్ద పెద్ద భూస్వాములని. ఆళ్ళలాగే యీయనా పొలంలోకి దిగడు కాళ్ళకీ చేతులకీ బురదవదు పాలేళ్ళూ కూలేళ్ళూ కంబార్లూ కూలీలే పంటలు పండించి గింజలు ఇంట్లో పోస్తారు. అయితే ఆయనా వాళ్ళ శ్రమను దోచుకుంటున్నట్టేనా?"

సుదర్శనం శాంతంగా జవాబిచ్చాడు—

"అవును. అయనా ఓ తరహా భూస్వామే, ఆయన చేసేదీ దోపిడీయే. సరిపోయిందా?" అని –

"నేను చెపుతున్నది – నేనూ మా నాన్నగారూ కష్టార్జితంతో బతుకుతున్నామనీ తక్కిన వాళ్ళంతా దోపిడీ చేసి బతుకుతున్నారనీ కాదు. పెట్టుబడిదారీ విధానంలో దోపిడి ఉంది. ఆ దోపిడి వల్ల రెక్కలు ముక్కలు చేసుకునే వాళ్ళకు దక్కేది తక్కువనీ దాదాపు సంపదంతా దోచుకునేవాళ్లకే దక్కుతోందనీ చెపుతున్నాను. తెలిసిందా?" అన్నాడు సుదర్శనం.

సుదర్శనం మాట శాంతంగానే వున్నా అతని మొహంలో ఆవేశం కనిపిస్తోంది. వాళ్ళందరూ అతడికన్నా వయసులో పెద్దవాళ్ళు; కుర్రవాడి మొహాలో ఆవేశం చూసేసరికి ఒకళ్ళిద్దర్లో చిలిపితనం కూడా తలెత్తినట్టుంది. ఒక్కొక్కరే అడ్డు సవాళ్ళు విసురుతున్నారు.

"అదికాదయ్యా! పాలేర్లచేతా కూలీలచేతా పని చేయించుకుంటే వాళ్ళకు జీతమో కూలో ఇస్తున్నాం కదా! అందులో దోపిడీ ఎక్కడుందీ?" నారాయణయ్య అడిగాడు.

"తగిన జీతం, తగిన కూలి యియ్యటం లేదు. వాళ్ళకు రెండు రూపాయలు ముట్టవలసిన చోట రూపాయి ముడుతోంది."

"రెండు రూపాయ లివ్వవలసిన చోట రూపాయి యిస్తే వాళ్ళెందుకొస్తారూ?"

సుదర్శనం క్షణకాలం నిరుత్తరుడై పోయాడు. ఉత్తరం లేక కాదు. తోచక కాదు. ఇంత సేపూ చెప్పింది వాళ్ళకు బోధపడలేదా? లేక వాదనే వాళ్ళకు ముఖ్యమా! – అని ఆలోచిస్తున్నాడు. ఈ రెండిటిలో ఏదైనా అతడు కొనసాగించి ప్రయోజనం లేదు.

"చెప్పు. రెండు రూపాయలు ముట్టవలసిన చోట రూపాయే ముడితే వాళ్ళెందుకొస్తారు?" నారాయణయ్య రైతు. అతనడుగుతున్నాడు.

"అంటే కథ మళ్ళా మొదటికొచ్చిందన్నమాట!" అన్నాడు సుదర్శనం.

దానిమీద – అంతవరకూ గుంభనంగా ఉండిపోయిన బైరాగి జోక్యం చేసుకున్నాడు.

బైరాగి ముప్పై నలభై ఎకరాల పెద్దరైతు. తర తరాలుగా వాళ్లది రైతు కుటుంబం. పంతులు రైతులేదో అంటున్నాడనే కాదు – అసలిలాటి ఊహాలు మనుష్యులకి పుట్టడమే తప్పు. దానికి సాయం పదిమంది మధ్యా పెట్టి ప్రచారమొకటా? అంచేత అతడు అడ్డు తగులుకున్నాడు.

"కథ మొదటి కొచ్చిందో చివరి కొచ్చిందో నాకైతే తెలీదుగానీ – నీకు తెలివి ఎక్కువై పోయింది" అన్నాడు మొదటగా.

"అంటే?"

"అతి తెలివైపోయింది."

సుదర్శనం అప్పటికేనా ఆగొచ్చు – కాని ఆగలేదు.

"ఎవరికి?" అన్నాడు కొంచెం తీవ్రంగా.

"నీకే –" అంటూ చప్పన లేచి నించొని గొంతు పెంచేస్తూ మాట మాటకీ అభినయం చేస్తూ అందుకున్నాడు.

"– కాకపోతే యేటండీ! మిల్లుల్లో పనిచేసే వాళ్ళకి ఇళ్లిస్తారంటావు. రేషన్లిస్తారంటావు. మందూ మాకూ చూస్తారంటావు. పిల్లలకు బళ్ళు పెడతారంటావు. ఇన్నీ ఇచ్చి జీతాలు కూడా ఇస్తుంటే మిల్లు యజమానులది దోపిడీ అంటావు. కూడెట్టి, గుడ్డలెట్టి, పైగా జీతమిచ్చి పాలేళ్ళను పెట్టుకుంటే దోపిడీ అంటావు?"

"దోపిడి యేటయ్యా దోపిడి! నోటికి సుద్ది బద్ది ఉండాల!"

అంటూ చప్పున కూర్చుండి పోయి గొంతు తగ్గించేస్తూ –

"ఇదుగో! ఎవరి సొమ్మైనా రాత్రికి రాత్రి కొట్టేసుకొస్తే అది దోపిడీ" అని, స్వరం మళ్ళా పైకొదిలేస్తూ మనిషి కూడా లేచిపోయి–

"తాగడానికి గంజి లేకపోయినా పిల్లల్ని మాత్రం కనేసి అడుక్కు తినండిరా కొడకల్లారా అని అమ్మా బాబూ ఒదిలేస్తే చేరదీసి గంజిపోసి బతుకు పెడితే పెట్టినోడిది పాపమా? అడు దోపిడీదారా?" అని యీసడిస్తూ సుదర్శనాన్ని చూసి – ఆ తరవాత తక్కిన వాళ్ళవంక తిరిగిపోతూ–

"ఆడెవడో ఎక్కడోడో - ఎప్పుడో ఏదో రాసినాట్ట. అది తీసుకొచ్చి యీ పంతులిక్కడ అప్పగిస్తున్నాడు!" అని మళ్ళా చప్పున కూర్చుండిపోయి సుదర్శనం మీదకి ఒంగిపోతూ -

"అయితే, నువ్వన్నదీ మాటే! ఇక్కడా దోపిడి జరుగుతున్నది. నిజమే. కూలోళ్ళని భూములున్నోల్ళు దోచుకోవడం కాదు. భూమున్నోణ్ణే కూలోడు దోచుకుంటున్నాడు. ఎలా గంటావా? ఇప్పుడొక కంబారున్నాడు. ఎవడిదాకో ఎందుకు - మా అశిరయ్యే ఉన్నాడు. లోకమందరితోపాటు ఏడాదికిన్ని పుట్లని నేనూ ఆడికి గింజలు కొలుస్తాను. పంట పంటకీ పొల్లాయిలు పట్టుకుపోతాడు. ఏటా జత పంచలు పెడతాను. పాత బనీన్లనీ చొక్కాలనీ తువ్వాళ్ళనీ దుప్పటి గుడ్డలనీ ఆడికేం అవుసరమైతే అది అడిగి పట్టుకు పోతాడు. ఇంతచేసినా ఆడికి విశ్వాసముందా? కాస్త కను మలిగితే చాలు కోసిన చేల్లోంచి ఓవుకి పిడికిడేసి పోగేసి మోపో, రెండు మోపులో రాత్రికి రాత్రి తర్లించేస్తాడు. అలాగ చేసినందుకు ఆడిని ఎన్నిసార్లు తన్నానో యీ నారాయణయ్య నడుగు.

అదిగలా మా కంబారొక్కడే కాదు. అలాగ వరి పంట లొక్కటేకాదు.

ఊళ్లో ప్రతి కంబారీ ప్రతి కూలోడూ ఎప్పుడో ఒకప్పుడు దేనికో ఒకదానికి అది గింజ కావచ్చు. కాయ కావచ్చు. కర్ర కావచ్చు. చొప్ప కావచ్చు - రైతు మొహం చాటైతే శాన కుక్కుర్తి పడినోడే. అలా పడనోడు ఎవడేనా ఉంటే తీసుకురా - నా చెవి కదపాయిస్తాను" అంటూ లేచిపోయి-

"అవునండీ దోచుకోడం మాటకొస్తే ఉన్నోడిని లేనోడు దోచుకోవాల, రైతు పాలేరుని దోచుకోడవేటే సబుపు తక్కువమాట!" అంటూ ముగించాడు.

అతని వాదన అందరికీ అర్థమయ్యింది. దానికింక జవాబు లేదనుకున్నారు కూడా. సుదర్శనం మాత్రం అలా అనుకోలేదు. అందుచేత -

"నువ్వలా భరత నాట్యం చేస్తే నేను చెప్పలేను. కూర్చుని మాటడితే జవాబివ్వగలను" అన్నాడు.

"సరే చెప్పు" అంటూ బైరాగి కూర్చుండిపోయాడు.

"నువ్వు దోపిడీనీ దొంగతనాన్నీ ఒక్కటే అనుకుంటున్నావు. దొంగతనమంటే నువ్వింతాక చెప్పినట్టు ఎవరూ చూడకండా ఎవరికీ తెలియకండా కాటేసుకుపోవడం. దోపిడి అనేది వేరు. పట్టపగలు అందరూ చూస్తుండగానే భుజబలంతోనో ఆయుధ బలంతోనో సంఘబలంతోనో ప్రతిఘటించడానికి అసమర్థుణ్ణే చేసి దౌర్జన్యంగా ధనాన్నో బంగారాన్నో లేక యింకొక సంపదనో స్వంతదారుని చేతే తెప్పించి పుచ్చుకొని మహారాజులా తీసుకుపోతే అదీ దోపిడి."

తన నిర్వచనానికి తిరుగులేదన్నంత ధీమాగా చెప్పేడు సుదర్శనం.

కాని బైరాగి అడిగాడు:

"సరే. దోపిడి అంటే అదే అనుకుందాం. ఎలాగైనా నువ్వు నాకన్నా ఎక్కువ చదివినోడివి కదా! అయితే పాలేరోళ్ళమీదపడి దుడ్డుకర్రల్తో బెదిరించి రైతులు అళ్ళయిళ్ళల్లో ఉన్న కుండబొచ్చెలూ చింకిపాతలూ లాక్కుంటున్నారంటావా?"

విన్న వాళ్ళకే ప్రశ్న కితకితలు పెట్టింది. సుదర్శనానికి ఆ మాటలో చురుకు తగిలింది.

"కాదు, అంతకన్నా ఎక్కువే దోచుకుంటున్నారు. దుడ్డుకర్రను చూపి కాదు, ఆకలి రాక్షసి కోరలను చూపి. నువ్వు పేదవారని వెక్కిరించే పాలేర్లవద్దా, కూలీల వద్దా అమూల్యమైన శక్తి ఒకటి ఉంది. ఆ శక్తే మట్టిలోంచి మనకందరికీ కావలసిన తిండి గింజలు పుట్టిస్తుంది. ఆ శక్తే కలపలోంచీ ఖనిజంలోంచీ మనమందరం వాడుకునే సమస్త వస్తువులనీ తయారు చేస్తుంది. ప్రతి ఉదయం వాళ్ళు నిద్ర లేచేసరికి చలమలో నీరూరినట్టు వాళ్ళ నరాల్లో యీ శక్తే నిండి వుంటుంది. అది తప్ప వాళ్ళ దగ్గర ఇంకేమీ వుండదు. దానిని అమ్ముకొని తప్ప వాళ్ళు ఇంకోలా బతకలేరు. మీకూ ఆ ఫ్యాక్టరీ యజమానులకూ కావలసింది అతివిలువైన ఆ శ్రమ శక్తే!"

ఏ పూట ఆ శక్తి అమ్మడు పోకపోతే ఆ పూట వాళ్ళకు తిండి వుండదు. ఆకలి రాక్షసి పేగులు నమిలేస్తుంది. వరసగా కొన్నాళ్ళు తిండి లేకపోతే మాడి చస్తారు.

వాళ్ళు అలాంటి నిరుపాయ స్థితిలో వుండగా ఆ స్థితిని ఆసరా చేసుకుని ఇక్కడ మీరైనా, అక్కడ ఫ్యాక్టరీ వారైనా వాళ్ళ శ్రమశక్తిని బేరమాడతారు.

అన్నరేటుకి సరుకు దొరకకపోతే కొంతకాలందాకా అయినా మీరు ఆగగలరు.

ఏదో ఒక రేటుకి ప్రతిరోజూ వాళ్ళ శ్రమ అమ్ముడుపోకపోతే ఒక్కరోజైనా వాళ్ళు బ్రతకలేరు.

అందుకూ—హీన క్రయానికైనా వాళ్ళు శ్రమశక్తిని అమ్ముకుంటారు.

"మీ కొనుగోలులో వాళ్ళ అమ్మకంలో బలప్రయోగం ఉందో లేదో మీరే ఆలోచించండి" అంటూ ఆగి వెంటనే మళ్ళా చెప్పసాగాడు.

"మీరేకాదు, బాగా చదువుకున్న వాళ్ళు కూడా ఒక ప్రశ్న వేస్తుంటారు. జీతాలు చాలనివాళ్ళు ఆ ఉద్యోగాల్లో చేరడమెందుకు? తరవాత సమ్మెలు చేయడమెందుకు అంటారు.

బంగారమో వాడుకుంటున్న సైకిలో ప్రాణావసరం పడ్డప్పుడు అమ్ముకునే అనుభవం అందరూ ఎరిగినదే. వస్తువుకి సగం విలువకట్టి మీ కిష్టమైతే అమ్మండి లేకపోతే యింకొక చోటికి వెళ్ళండి—అనగలడు కొనేవాడు. కొనడం అతనికి ప్రాణావసరం కాదు. అమ్మడం నీకు ప్రాణావసరం కాబట్టే నువ్వు హీనక్రయానికి అమ్ముకుంటావు.

హీన క్రయంలో వేదన ఏమిటో అమ్ముకునేవాడికే తెలుస్తుంది.

"తెలిసింది కూడా. పల్లెటూళ్ళలో ఇళ్ళూ పొలాలూ అమ్మకాలన్నీ హీన క్రయానికే జరుగుతాయి." కొంతసేపు ఊరుకొని బైరాగి అన్నాడు.

"సరే, నువ్వన్నట్టు దోపిడి జరుగుతోందని ఒప్పుకుంటాము. దోచిన దొంగమాలు ఎక్కడో ఒక దగ్గిర ఉండాలి కదా! మిల్లులు పెట్టే దోచినోళ్ళ దొంగమాలు వాళ్ళమేడల్లోనూ కార్లలోనూ కనపడుతుంది. ఆళ్ళతో సమానంగా రైతులం – మేమూ దోస్తున్నాం అంటావు –"

"నేనలా అనలేదు."

"పోనీ, మేం చిన్న దోపిడిగాళ్ళం. అయినప్పుడు తక్కువో ఎక్కువో దొంగమాలు మా దగ్గిర కూడా దొరకాలి కాదా? ఏదీ, ఏ రైతు మేడలూ మిద్దెలూ కట్టేసేడో ఏ రైతు పదికూరలతో పరమాన్నాలు తినేస్తున్నాడో చూపించుమీ?"

సుదర్శనం దీనికి కూడా జవాబిచ్చాడు.

"దొంగామాలు మీ దగ్గిరా కనిపించును. కానీ కూలీలు రైతుల చేతుల్లో అన్యాయమై పోతున్నట్టే రైతులు, వ్యాపారులూ షాహుకార్ల చేతుల్లో అన్యాయమై పోతున్నారు."

ఆ మాట వినగానే అక్కడున్న ఒక షాహుకారు బిడ్డ –

"ఇక సరి రా!" అన్నాడు యీసడిస్తున్నట్టు.

అతడన్న మాటకన్నా ఆ మాట తీరుకి అందరికీ నవ్వొచ్చింది.

బైరాగి జేబులు తడుముకుంటూ లేచిపోయి తొందర తొందరగా చుట్టా అగ్గిపెట్టే వెతికితీస్తూ –

"అయ్యా, రైతులం మా పని అయిపోయింది. ఇంక వ్యాపారులూ షాహుకారులు వంతొచ్చింది. మీరూ మీరూ చూసుకోండి" అన్నాడు చుట్ట నోట్లో బిగిస్తూ.

దానిమీద అంతా గొల్లుమన్నారు.

తనంత చెప్పాక కూడా ఒక్కమాటతో మొత్తం తన వాదాన్ని అభాసుపాలు చెయ్యగలిగిన బైరాగిని సుదర్శనం మెచ్చుకోవాలి. కాని మెచ్చుకోలేకపోయాడు. తను ఓడటం తనకు కష్టమే అయినా అతడు సహించగలడు. నమ్మిన సత్యం అభాసుపాలవడం అతనికి చాలా బాధగా ఉంది.

అక్కడ –

చిదిగిపోయిన బుచ్చిలింగం, చిన్నరైతు నారాయణయ్య, పెద్ద రైతు బైరాగే కాక ఇద్దరు షాహుకారి బిడ్డలూ, అందర్నీ మించి పెద్ద షాహుకారు సూరప్పడూ ఉన్నారు. తన వాదన ఇంతమందినీ నొప్పించేదే అయినా అతడు విడవదలచుకోలేదు. ఓడినకొద్దీ పంతం పెరుగుతోంది.

షాహుకార్లూ వ్యాపారులూ చేసే అన్యాయాలమీద కొన్ని చిన్నచిన్న ప్రశ్నలూ చిలిపి ప్రశ్నలూ వేసి షాహుకారి బిడ్డలు అతణ్ణి రెచ్చగొట్టబోయారు. అంతమాత్రాన అతడు రెచ్చిపోలేదు.

"మీకు నిజం తెలుసుకోవాలన్న కోరిక ఉంటేనే, నిజం వినగల ధైర్యం ఉంటేనే ప్రశ్నలడగండి. చెబుతాను. నవ్వుతాలుగా ప్రశ్నలువేసి నిజాల్ని అబద్ధాల్లా చూపించటానికి ప్రయత్నిస్తే మాటాడను" అన్నాడు సుదర్శనం.

షాహుకారు బిడ్డలు–నవ్వుతాలు కాదు చెప్పు చెప్పు–అన్నారు. రైతులకే దొరకని సుదర్శనం తమకే దొరకవచ్చనే ఆశ వాళ్ళకేమూలో ఉంది. ఇంతలో బైరాగి కల్పించుకొని–

"అలాక్కాదు. ఇందాక దొంగమాలనుకున్నాం కదా–రైతుల దగ్గిరిది చేతులు మారిపోయిందన్నావు. అదెలాగో చెప్పు" అని–

"ఏం దద్దా!" అన్నాడు సూరప్పడితో.

సూరప్పడు మాటాడలేదు. నవ్వు ముఖంతో తల ఊగిస్తూ ఊరుకున్నాడు.

బుచ్చిలింగంకేసి తిరిగి బైరాగి కన్ను గిలపడం, సూరప్పణ్ణి ఇందులోకి లాగి తన్ను చెదరగొట్టబోవడం సుదర్శనానికి ఒళ్ళు మండించాయి.

"ఆయన్ని ముందుకు నెడుతున్నావు. కాబట్టే ఆయన చెప్పమంటేనే చెబుతాను" అన్నాడు అకాడికీ.

"చెప్పు చెప్పు" అన్నాడు సూరప్పడు దూరం ఆలోచించకుండానే.

"ఉదాహరణకి మిమ్మల్నే తీసుకోండి" అన్నాడు సుదర్శనం.

సూరప్పడు కూడా అనుకున్నదానికన్నా తల ఎక్కువగా ఊపుతూ—

"ఆఁ ఆఁ" అన్నాడు వింటున్నట్టు.

"మీరు తల కట్టేసరికి నిజంగా మీ దగ్గర ఉండిన దెంత? నాలుగు వేలు ఐదువేలు మహా అయితే పదివేలు. ఈనాడెంత? లక్ష దాటిందా? అందరూ అనుకునే అంకే నేను చెపుతున్నాను. ఈ తొంభైవేలూ మీకు ఎలా వచ్చాయి?"

సుదర్శనం సాహసానికి తక్కినవాళ్ళు నిచ్చరపోతున్నారు.

సూరప్పడు మాత్రం, తల ముందుకీ వెనక్కీ అలా ఊపుతునే తడబడే మాటలతో అన్నాడు.

"లక్షా! లక్షా! లక్షే! ఎక్కడిది? సరే లక్షే అను! లక్షో పదిలక్షల్లో అయితే ఎలా వచ్చిందంటావు? అదీ నువ్వే చెప్పు"

సుదర్శనం రెట్టిస్తూ అన్నాడు—

"మీరు చెప్పండి."

"దేవుడిచ్చాడు. ఎవరికైనా ఎలాగొస్తుంది? దేవుడిస్తాడు. ఏమయ్యా నారాయ ణయ్యా—ఏమంటావు? దేవుడిచ్చాడు. ఆ జగన్నాథుడిచ్చాడు."

ఉడుకు రక్తపు సుదర్శనానికి దేవుడి ప్రసక్తి వినగానే పుండుమీద కారం చల్లినట్టయ్యింది.

"దేవుడిచ్చాడా?" అని, చేతకాని అయ్యవారు మొద్దబ్బాయిని యీసడించినట్టు—

"ఒక ఉదయమో ఒక సాయంకాలమో చల్లని వేళ చూసుకొని ఆ తొంభైవేలూ సంచిలో వేసుకొచ్చి మిమ్మల్ని అందుకోమన్నాడా?" అనేశాడు. తొందర తొందరగా అన్నాడే గాని హద్దుమీరి మాటాడినందుకు బాధగా మొహం పక్కకు తిప్పేశాడు.

"లేకపోతే మరెలా వచ్చింది? ఎలా వచ్చిందో చెప్పండి" అన్నాడు సూరప్పడు. మొహం మీద నవ్వుని నిలబెట్టుకోవడం కష్టంగా ఉంది ఆ ప్రాణికి. తల మాత్రం అలా ఊగుతూనే ఉంది.

"ఎలా వచ్చిందా?... వడ్డీల వల్ల వచ్చింది. వర్తకం వల్ల పోగయ్యింది. ఈ రెండూ అన్యాయాలెలాగయ్యాయని మీరడగక్కరలేదు. నేనే చెబుతాను.

ఒక సామాన్యరైతుకి ఏటా కావలసే వ్యవసాయపు మదుపు నాలుగైదు వందలు. భార్య వంటిని ఆ విలువకు మించిన బంగారం ఉంటుంది. అది తియ్యడు. పాతిక సెంట్ల పొలమమ్మినా ఆ మదుపు చేతికొస్తుంది. ఆ పనీ చెయ్యడు. ఈ రెంటిలో

ఏది చేసినా అతడు మీదగ్గరికి రానక్కరలేదు. తిప్పి తిప్పి దాన్నే వాడవచ్చు. కాని అలా జరగదు.

ఏటా మదుపు కోసం మీదగ్గర కొస్తాడు. అదే కాదు– ఏ అవసరం వచ్చినా అప్పుచేసే ఆ అవసరం తీర్చుకొంటాడు. అదీ ఒక్కసారి చెయ్యడు. దఫదఫాలుగా చేస్తాడు. ఆ అప్పులన్నింటిమీదా మీరు వడ్డీలు కట్టి వసూలు చేస్తారు.

రూపాయకి కానీ (రూపాయిలో అరవైనాలోవంతు) వడ్డీ చాలా తక్కువలా కనిపిస్తుంది. మీ లెక్కలు సంవత్సరాంతానికి గాని తేల్చరు. అప్పుడు రైతు పుచ్చుకునే ప్రతి రూపాయికీ మూడణాలు (3/16 రూ॥) వడ్డీ అవుతుంది. రూపాయిలో ఇంచుమించు ఐదోవంతు. ఏడాది మొత్తంమీద ఐదు వందలు తీసుకుంటే ఏటి చివరికి అసలు వృద్ధులు ఆరు వందలు. అంటే మీకారైతు నుండి ఒక్క వడ్డీవల్లే వంద రూపాయలు లాభం.

కాగా – మీ కాసుల వడ్డీలో ఎంతెంత తికమకలున్నాయో వింటే మీరు విస్తుపోతారు.

సంవత్సరం మొదటి రోజున అప్పిచ్చిన డబ్బుకి ఎంత వడ్డీ లెక్కవేస్తారో ఆఖరు రోజున ఇచ్చిందానికి కూడా అంతే వడ్డీ లెక్కవేస్తారు. ఉదాహరణకు మీరైతొకడు సంవత్సరం ఆఖరు రోజున నూరు రూపాయలు తీసుకున్నాడనుకోండి. రూపాయికి మూడణాల వంతున నూటికి దరాదరి పందొమ్మిది రూపాయల వడ్డీ. కాలం ఒక్కదినమే. అంటే నూటికి సంవత్సరానికి ఇంచు మించు ఆరువేల తొమ్మిది వందలు వడ్డీరేటు అవుతుంది. (కరెక్టుగా కావలిస్తే రు.6843.75 శాతం)"

షాహుకారు బిడ్డ లిద్దర్లో ఒకడు ఏఁవిటీ లెక్క అన్నట్టు గుడ్లప్పగించి చూస్తున్నాడు. రెండోవాడు–

"రూపాయికి కానీ వడ్డీ అంటే సంవత్సరానికీ నూటికీ ఏడువేలా!" అన్నాడు సుదర్శనం కేసి అసహ్యంగా చూస్తూ.

సుదర్శనంకి అతని బాధ అర్థమయ్యింది. అందుచేత శాంతంగా –

"ఇది గణితం. కావలిస్తే ఆ తరవాత కాగితం మీద వేసి చూడు" అంటూ

"ఇంక వర్తకం. ఇది అచ్చంగా ఇందాక చెప్పిన పద్ధతిలో జరిగే దోపిడీ!

నీ వద్ద అప్పు తీసుకున్నరైతు తన పంట నీకే అమ్మాలి. ధర నిర్ణయించేది నువ్వు లేదా నీసాటి వాడే ఇంకొకడు. కొలిచేది నీ కుంచంతో. బజారు కుంచం నాలుగడ్డలైతే నీ కుంచం ఐదు అడ్డలు. పైగా కొలతలో చెక్కుపట్టు.

నీ అప్పుకి సరిపడా ఐదువందల ఇరవైఐదు రూపాయల సరుకు నువ్వు తీసుకుంటే, రైతు నీకిస్తున్నది ఆరు వందల ఇరవై అయిదు రూపాయల సరుకు. ధర నిర్ణయంలో లాభం, చెక్కుపట్టులో లాభం కలిపితే ఎంత లేదన్నా రెండువందలు ఔతుంది. ఇందాక వడ్డీతో కలిపితే మూడు వందలు.

ఆ విధంగా ఏడాదిలో ఐదువందలు అప్పు తీసుకున్న రైతువల్ల సునాయాసంగా నీకు మూడు వందలు లాభం. అంటే అతడికి నష్టం మూడు వందలు."

సుదర్శనం లెఖ్ఖలైతే చెప్పేడు కాని ఆ లెఖ్ఖలు ఎవరికి చెప్పేడో ఆ మనిషి వంక తల ఎత్తి చూడలేదు. ఆ సూరప్పడితో సహా అందరూ దెయ్యం కొట్టినట్టు చూస్తూ ఉండిపోయారు.

ఇందాకటి షాహుకారు బిడ్డే ముందుగా తేరుకొని –

"ఎలాగైతేనేంగాని మా గొప్పలెక్కలు చెప్పేడు పంతులు. నిజంగా అంతంత లాభాలేవస్తే యీ పాటికి యీ వుళ్ళో షాహుకార్లందరూ బంగారం మేడలు కట్టింతురు" అన్నాడు పుంజుకుంటున్న కోపంతో.

సుదర్శనం ఊరుకోవలసింది – కాని ఊరుకోలేకపోయాడు.

"నే నిందాకే చెప్పాను. నిజం తెలుసుకోవాలని కోరిక వుంటేనే, వినగల ధైర్యం ఉంటేనే అడగమన్నాను. ఇప్పుడైనా మించిపోయింది లేదు. ఈ ఊళ్లో ఏ షాహుకారివైనా చిఠా అవర్జాలు తీసుకు రావచ్చు. నేనన్న ప్రతి మాటకూ రుజువు చూపిస్తాను" అన్నాడు శాంతంగానే.

అది వినగానే రెండో షాహుకారి బిడ్డ సర్రున లేచిపోయాడు.

"ఏటయ్యా నీ నిజం – ఏటి నీ నిజం? నూటికి ఏడువేల రూపాయల వడ్డీ రేటు నిజమా? ఎవడేనా వీధిని పోయేవాడిని పిలిచి చెప్పు. నోటితో కాదు నవ్వడం. దేనితోనో నవ్వుతాడు. ఈపాటి నిజాలకి పెద్ద సవాలొకటి! మా చిఠా అవర్జాలు తెమ్మనడానికి నువ్వెవడివి? కాదు – నువ్వెవడివి అంటాను!..." మాట మాటకు రెచ్చి పోతున్నాడు షాహుకారు బిడ్డ.

ఇంక తను ఓర్చి లాభంలేదనుకున్నాడు సుదర్శనం. లేచి నిలబడి –

"ఇదిగో – నువ్వు నోరు పారేసుకోకు. నీతో నేను మాటాడలేదు." తీవ్రంగా అతడి కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

"మరెవరితో మాట్లాడావు? ఇంతసేపూ ఎవరితో మాటాడావు?"

"ఆయనతో మాటాడుతున్నాను. సూరప్పడితో మాటాడుతున్నాను. ఆస్తి ఎలా వచ్చిందో ఆయన చెప్పమన్నాడు. ఆయన చెప్పమంటేనే ఆ లెక్కలు ఆయనకు చెప్పాను."

"అయితే? ఆయన ఊరివాళ్ళ సొమ్ము ఉబ్బరగా పడేసుకున్నాడంటావా? ఆయనగాని యింకో షాహుకారు గాని రైతుల దగ్గర కెళ్ళి నాయన్నాయనా బాబ్బాబూ మా దగ్గిర అప్పులు తీసుకోండని బతిమాల్తున్నారా? వద్దంటే బలిమిని కట్టబెట్టారా? అవసరానికి ఆళ్ళేవచ్చి కాళ్ళా వేళ్ళా పడి అడిగితే తన దగ్గిరున్నదో ఒక్కాడ తెచ్చిందో ఇచ్చి సాయం చేస్తారు. చేసినందుకు లోక రివాజు ఎలా ఉంటే అలా వడ్డీ తీసుకుంటారు. నువ్వయితే మాత్రం వూరికినే అప్పిస్తావా?"

రెండో షాహుకారు బిడ్డ మధ్యలోనే అందుకున్నాడు.

"కాదు. ఆయన గొప్ప లోకోద్ధారకుడు! అందుకే ఆళ్ళ నాన్నగారు ఎనమల అప్పలస్వామికి ఎనిమిదొందలు అప్పిచ్చి మూడువేల రూపాయల పొలం రెండువేలకు కట్టుకున్నారు!"

ఇలా వాళ్ళిద్దరూ రేచుకుక్కల్లా సుదర్శనం మీద పడిపోతుంటే అసరికే బుచ్చి లింగం, నారాయణయ్య వాళ్ళ మధ్యకి జొరబడిపోయి వాళ్ళను శాంతించమంటూ నచ్చచెపుతున్నారు. బైరాగి సుదర్శనం రెండు జబ్బలూ పట్టుకొని అతడి స్థలంలో కూర్చుండబెడుతూ తగ్గు తగ్గు అని తగ్గమంటున్నాడు.

సుదర్శనం కూర్చుంటూ షాహుకారి బిడ్డ ఆఖరి విసురికి జవాబిస్తున్నాడు.

"నేను ఇందాకే చెప్పాను - తప్పు ఎవరు చేసినా తప్పే అని. నేనో నా వాళ్ళో చేసేది ఏదైనా రైటే అనే ఉద్దేశం - నాకు లేదు" అన్నాడు విసురుగా.

"మరెవరికుందీ?" అన్నాడు షాహుకారు బిడ్డ - పెడముఖంగా.

"ఇంతసేపూ నాతో వాదించిన వాళ్ళ కందరికీ ఉంది" - సుదర్శనం.

బుచ్చిలింగం, నారాయణయ్యా మళ్ళా కూకలేస్తే అప్పటికా వాదం ఆగిపోయింది.

ఇంతలో సూరప్పడు -

"అయితే పంతులూ, అళ్ళ మాటకేం గాని నాకు చెపుదూ" అన్నాడు తల తాటించుకుంటూ.

సుదర్శనం సావధానుడయ్యాడు.

"భగవంతుడు నా కిచ్చిన సంపదంతా అన్యాయార్జితమే నంటావా?" అన్నాడు సుదర్శనం కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

సుదర్శనం గమనించలేదుగాని - సూరప్పడి ముఖం మీద అంతకు ముందల్లా వెలిగిన చిరునవ్వు ఆ సమయానికి అంతరించి పోయింది. అది గమనించి -

"ఇంక ఊరుకో బావా! ఏదో కుర్రాయన!" అన్నాడు బుచ్చిలింగం.

"కాదు కాదు చెప్పనీ. చిన్నవాడైనా పెద్దవాడైనా నిజం చెప్పినప్పుడు వినాల." సూరప్పడు మళ్ళా తల ఊపుతూ అన్నాడు.

సుదర్శనం జంకలేదు.

"మీకే కాదు. ఆస్తంటూ ఎవరి దగ్గరకు ఏమేరకి చేరినా అది అన్యాయార్జితమే. న్యాయంగా సంపాదించిన డబ్బు మనిషి భుక్తికి మాత్రమే సరిపోతుంది. కడుపుకి లేని పేదవారు యీ లోకంలో ఉన్నంతకాలం అంతకు మించి చేసిన ఆర్జనంతా అన్యాయార్జితమే.

ఎవడి పొట్టో కొట్టందే మన పొట్టకు మించిన తిండి మన యింట్లో మిగలదు. పదిమంది ఆస్తి చెదిరితే గాని ఒకడి ఆస్తి పెరగదు.

నా ఎరికని యీ ఊళ్ళో ఎందరెందరో రైతులు వ్యవసాయ కూలీలయ్యారు. బుచ్చిలింగం లాంటి చిన్న చిన్న సంసారు లెందరో అప్పులు చేసి ఆస్తులమ్ముకున్నారు. ఈ భూములూ, ఆస్తులూ అన్నీ ఎవరికి దఖలు పడ్డాయి? ఎలా దఖలు పడ్డాయి? శ్రమించి చెమటోడ్చడం వల్లా? శ్రమించి చెమటోడ్చినవాడు ఒక్కడైనా సెంటుభూమి కొనగలిగాడా?" సుదర్శనం ప్రశ్నించి ఆగాడు.

సుదర్శనం ఎంతో జాగ్రత్తగా మాటాడేడు. నిజం వెల్లడించడమే అతని అభిమతంగాని నిష్ఠురం వెయ్యడం అతని ఉద్దేశం కాదు. అయితే నిజం నిష్ఠురమైనది అంటారు పెద్దలు. అందుచేత -

"అంటే బుచ్చిలింగం భూములు నేనన్యాయంగా తీసుకున్నానంటావా?" అన్నాడు సూరప్పుడు.

"అలా అని నేనలేదు. ఇప్పుడడిగారు కాబట్టి చెపుతున్నాను. వడ్డీ విలువకు మీరు తీసుకున్న భూముల్లో నూటికి డెబ్భైపాళ్ళు అన్యాయమే!"

అంతే. సూరప్పుడు వెంటనే లేచి ఆ మెట్లుముందే మోకరిల్లి దేవుడికి దండంపెట్టి. లేచి నిటారుగా నిలుచుని రెండు చేతులూ నెత్తి మీదకి చేర్చి నమస్కరిస్తూ వణికే కంఠంతోపాటు ఆపాదమస్తకం వణికిపోతూ –

"హే నారాయణమూర్తీ మహాప్రభో! నువ్వే సాక్షివి. నేను, బుచ్చిలింగం దగ్గర్నుండికాని, ఇంకేమనిషి దగ్గర్నుండైనా కాని, నాది కానిది, ఒక దమ్మిడీ ఐనా, నేనన్యాయంగా తీసుకుంటే, ఆ పాపఫలం నెల తిరగకుండా, నేననుభవించాలి. లేదు నన్నన్యాయంగా ఎవరైనా ఆడిపోసుకుంటే –" అంటూ అర్ధాంతరంలో ఆగిపోయి, క్షణకాలంలో ఆవేశాన్ని నిగ్రహించుకొని –

"కాదు. తప్పు తప్పు" అని గొణుక్కుంటూ నాలుగైదుసార్లు లెంపలు వేసుకున్నాడు.

తరువాత పూజాద్రవ్యాలతోడి పళ్ళెం తీసుకొని, తిన్నగా గర్భగుడి ద్వారం దగ్గరకి వెళ్ళి, పళ్ళేరం అక్కడ ఉంచేసి వెనక్కి తిరిగి, ఎదురైన బుచ్చిలింగంతో –

"బావా! బాబొస్తే నేను వచ్చి వెళ్ళానని చెప్పు. భోగం గంట కొట్టగానే వచ్చి దర్శనం చేసుకుంటానని చెప్పు" అంటూ కదలిపోబోయాడు.

బుచ్చిలింగం అడ్డుగా నిలబడి –

"బావా! తప్పు. నువ్వు పెద్దవాడివి. ఆయన కుర్రాడు. తెలిసిన గోలా కాదు, తెలియని గోలా కాదు..." అంటూ ఏదో చెప్పబోయాడు.

"అబ్బే... అబ్బే... నాకేం కోపం లేదు. ఒక్కక్షణం బాధేసింది. మనిషిని కదా ఒక్కక్షణం బాధేసింది. అంతే" అంటూ నవ్వడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ తల చాటించుకుంటూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

బుచ్చిలంగం గుడిలోంచి బయటికి వచ్చేసరికి కొయ్యబొమ్మలా సావిడి రాటకు చారబడిపోయిన సుదర్శనం కనిపించాడు. అతడి స్థితిచూస్తే షాహుకారి బిడ్డలకు కూడా నోరొచ్చినట్టులేదు. కొంతసేపు అందరూ అలాగే ఉండిపోయాక బైరాగి గభాలున లేచిపోయి సుదర్శనాన్ని రెక్కపట్టుక లేవనెత్తుతూ –

"మాంచి పంతులువే! ఇంతమందినీ ఇంతసేపూ హడలుగొట్టి ముసిలోడి దెబ్బకి మూర్ఛపోతావా? పద పద, నేనూ మీ యింటి కాసే రావాల" అంటూ తనతో తీసుకుపోయాడు.

☆ ☆ ☆

జరిగిన సంగతి విని తల్లిదండ్రులు సుదర్శనాన్ని మందలించారు. నాలుగైదు రోజులు అతడు వీధి ముఖం చూడలేదు. ఈలోగా చెప్పుకొని చెప్పుకుని ఊళ్లోవాళ్ళు కూడా మరిచిపోయారు.

కానీ పదిహేనురోజుల తరవాత సూరప్పడి ఏకపుత్రుడుకి కాళ్ళూ చేతులూ పడిపోయాయన్నారు. నాలుగైదు రోజులు జ్వరం కాసి తగ్గాక ఏదో అపథ్యం జరిగిందన్నాడు వైద్యుడు. దానితో వూరూ వాడా ఒక్కసారి గుప్పుమంది.

సూరప్పడి ఇంట్లో అతని చుట్టపక్కాలూ ఆశ్రితులూ అటు సూరప్పణ్ణీ ఇటు సుదర్శనాన్నీ ఇద్దర్నీ ఆడిపోసుకున్నారుట. సూరప్పడి వియ్యపురాలూ అతడి భార్యా అయితే సుదర్శనాన్ని తిట్టని తిట్టులేదట. ఈ విషయం తెలిసి సుదర్శనం తల్లి చేసిన గొడవనంతట్నీ సుదర్శనం మౌనంగా భరించాడు.

ఆనాటి చిత్తక్షోభలో అతడి మూల మూలల విశ్వాసాలు కదలిపోయాయి. ఆ రాత్రి అతడికి ఎంతకూ నిద్రపట్టలేదు. అర్ధరాత్రి దాటుతూ ఉంటే వెల్లకిలా పడుకున్నవాడు మంచంమీద లేచి కూర్చోని చేతులు రెండూ ఒడిలో ఒకదానిపై ఒకటి ఉంచి క్రైస్తవులు ప్రార్థనచేసే ధోరణిలో ఒక్కొక్కమాటే అనుకోసాగాడు. అతని చుట్టూ చిమ్మ చీకటి.

“మహేశా! నువ్వు నిగ్రహానుగ్రహాలకు అతీతుడవని నా నమ్మిక. కాని అపవాదభీతి నన్ను సంశయాత్ముణ్ణి చేస్తోంది. ఒకవేళ తక్కిన వారందరూ నమ్మేటట్టు నువ్వు ప్రార్థనలకు కరిగి మా కోర్కెలు తీర్చేవాడివే అయితే నా జన్మానికి తొలిసారిగా తుదిసారిగా కూడా ఒకే ఒక్క కోరిక కోరుతాను. సూరప్పడి ఏకపుత్రుణ్ణి బ్రతికించు.”

ఇలా చెప్పకొని, ఆత్మ సంస్కృతి చేసే అవహేళనను మూగగా భరిస్తూ నిద్రపోవటానికి ఎంతసేపో వ్యర్థప్రయత్నాలు చేశాడు.

లోకాపవాద భీతిలో కొందరు ప్రాణాలనే త్యాగం చేస్తారు. సుదర్శనం విశ్వాసత్యాగం చేయడం వింత కాదు. అయితే యింతచేసినా అతనికి మాట దక్కలేదు.

సూరప్పడు పెట్టిన గడువు తప్పకుండా చచ్చిపోతాడనుకున్న అతడి కొడుకు లేచి కూర్చున్నాడు. అతడికి ఆరోగ్య స్నానం చేయించిన నాటి సాయంత్రమే సుదర్శనం పరీక్షా ఫలితాలు తెలిశాయి. అతడి పరీక్ష పోయింది.

“మరేం అవుతుందయ్యా! అన్యాయంగా ఒకరిని ఆడిపోసుకున్నా ఒకడికి ఉందని చెప్పి ఏడుచుకున్నా మనిషి జయం పొందడు. ఈ పంతులు పదేళ్ళయో పన్నెండేళ్ళయో పట్నంలో చదువుతున్నాడు. ఎప్పడైనా పరీక్షపోవడం ఎరుగనా? మరి ఇప్పడే పోవడమేమిటి? అదీ – సూరప్పడి కొడుకు ఆరోగ్య స్నానం చేసిన్నాడే తెలియడమేమిటి?” అనుకున్నారు జనం.

ఇది విన్న సుదర్శనానికి కలిగిన బాధముందు పరీక్ష పోయినందుకు కలిగిన బాధ ఒక బాధ కాదు.

☆ ☆ ☆

ఇది జరిగి ఎంతో కాలం కాలేదు. అప్పడప్పడూ సుదర్శనానికి యీ దుర్ఘటన జ్ఞాపకం వస్తుంది. అందులో రెండు దృశ్యాలని అతడెప్పటికీ మరిచిపోలేదు.

ఆ అర్ధరాత్రి అతడు మంచంమీద నిశ్చలంగా కూర్చుని పరమేశ్వరుని గూర్చి ప్రార్థన చేసేది మొదటి దృశ్యం. ఆలయం మెట్లముందు నించొని రెండు చేతులూ నెత్తిన ఉంచుకున్న సూరప్పడు జగన్నాథుని సాక్షిగా ఒట్టుపెట్టడం రెండవది.

మొదటిది జ్ఞాపకం వచ్చినప్పుడు తన సిగ్గుమాలిన పనికి సాక్ష్యం లేనందుకు సంతోషిస్తాడు. ఆ తరువాత అందుకు కూడా సిగ్గుపడతాడు.

రెండోది జ్ఞాపకం వచ్చినప్పుడు మాత్రం అతడు దరీదాపూలేని ఆలోచనా సముద్రంలో పడతాడు.

లోకంలో – ఇతరులకుగాని తమకుగాని జరుగుతున్న అన్యాయమేమిటో తెలియనప్పుడు, మనుష్యులు తప్పులు చేయవచ్చు. తప్పుగా ఆలోచించవచ్చు. తప్పుగా అర్థం చేసుకోవచ్చు.

విషయం యిది అని తెలిసినవాళ్ళు విపులంగా చెప్పాకనైనా నిజాన్ని ఏల చూడరు? ఎలా గ్రహించరు?

శ్రమ దోపిడీని గురించి తను చెప్పిన విషయాలు అనుభవం తమది కాదు కాబట్టి వాళ్ళకు అర్థం కాకపోవచ్చు. షాహుకార్ల చేతిలో రైతులకు జరిగే అన్యాయాన్ని వివరించినప్పుడు వాళ్ళు రైతులయ్యుండీ వాళ్ళకు జరిగే అన్యాయాలనైనా వాళ్ళు ఏల చూడలేకపోయారు?

అలాగే ఆనాటి సూరప్పడి చర్య కూడా అతనికి అర్థమయ్యేది కాదు.

తనకైతే భగవంతుని నిగ్రహానుగ్రహాలపట్ల విశ్వాసంలేదు. కాని సూరప్పడు భగవంతుడిపట్ల విశ్వాసమున్నవాడు. భగవద్భీతి కలవాడు. అలాంటివాడు అంకెలతో సహా అతనివల్ల జరుగుతున్న అన్యాయాన్ని అంత స్పష్టంగా వివరించాక కూడా భగవంతుణ్ణే పిలిచి తన విత్తం పాపార్జితమైతే తన్ను శిక్షించమని ఎలా అనగలిగాడు?

ఎంత ఆలోచించినా యీ రెండు ప్రశ్నలకూ అతడికి జవాబులు తెలిసేవి కావు. జవాబులు అంత కష్టమై ఉండేవి కావు.

అవగాహన వేరు. అవగాహన మేరకు జీవించడం వేరు. కాగా తనకున్న శక్తి సామర్థ్యాలు ప్రతివారికీ ఉంటాయనీ, అందరి స్వభావాలూ ఒక్కలానే ఉంటాయని అనుకోవడం కూడా సుదర్శనం. పొరపాటే.

ఇంక సూరప్పడి గురించి –

సూరప్పడి గురించి అన్ని విషయాలూ సుదర్శనంకు తెలియవు. అతడి ఆస్తి సుదర్శనం అనుకున్నట్టు ఒక లక్షకాదు– రెండు లక్షల ఇరవై వేలు.

అయితే, యీ ఆస్తిలో ఒక్క పైసైనా అతడు ప్రయత్నించి సంపాదించలేదు. తండ్రి చూపి విడిచిన వృత్తి తండ్రి యిచ్చిన పెట్టుబడితో అరంభించాడు. అతడికి అక్షరజ్ఞానం లేదు. అక్షరాల వ్యవహారమంతా గుమస్తా చూసేవాడు. డబ్బు ఇచ్చి పుచ్చుకోడాలు తను చేసేవాడు.

లెక్కల్లోగాని వ్యవహారాలలోగాని మాట తభావతు రానిచ్చేవాడు కాదు. ఆ విషయంలో గుమస్తాని అడుగడుగునా హెచ్చరించేవాడు. అతని జ్ఞాపకశక్తి అమోఘం.

తనకు రావలసేది ఎంత నిక్కచ్చిగా రాబట్టుకునేవాడో, ఇవ్వవలసేచోట అంత నిక్కచ్చిగానూ చెల్లించేవాడు.

వ్యాపార విషయాలలో అతని నిక్కచ్చితనం కాతాదార్లలో అతనిపట్ల గౌరవాన్ని పెంచేవి. కాలం గడుస్తున్నకొద్దీ వ్యాపారం పెరిగింది.

ఒక్క మాటలో చెప్పాలంటే అతను దోపిడి చెయ్యలేదు. అతనివల్ల దోపిడీ జరిగింది. ఫలితం భౌతికంగా ఒకటే అయినా నైతికంగా రెంటికీ తేడా ఉంది.

సుదర్శనం ఈ విషయం గుర్తించలేదు.

అతడు తన ప్రతివాదులకు వివరింపదలచిన విషయం వారి పాలిట ఎలాంటి అజ్ఞేయాంశమో సుదర్శనం పాక్షికబుద్ధికి పై చెప్పిన విషయం అలాంటి అప్రజ్ఞాతం.

● *'జయభారత్', నవంబర్, 1951* ●

★ ★ ★

18

వట్టికోట ఆళ్వారుస్వామి

# "మాకంటె మీరేం తక్కువ!"

"ఒరేవెంకా! అయనెవరో గుర్తుపట్టినావు?" బూట్లఫ్యాక్టరీలో నిలబడి గప్పాలు కొడ్తున్న రంగడు తోటిఖైదీ వెంకనితో అన్నాడు.

"ఎవరైతె మనకేంలే, ఎవరో మారాజు" అంటూనే రంగడు చూసిన వ్యక్తి వైపు వెంకడు శ్రద్ధగా చూడసాగాడు.

"నేనుకూడా మొదలు గుర్తుపట్టలే, ఆ వంకరచెయ్యినిచూచి జ్ఞాపకమొచ్చిందురా!"

"ఆయన తొంటదొరే అంటావా, అవునేయ్ ఆయనే. చోడుకాడ తంతె తన్నిండుగాని, భలేగట్టిమనిషిరా. నీవేమన్న అను."

"గట్టా, గట్టా, ఆ యంకల్లో ఇంకోడిని అడుగు పెట్టనిచ్చిండురా?"

"అడుగంత దూరం పోయినావు. అసలు నీడ పారనిచ్చాదురా."

"ఏమన్నాకానిగాని, మననోట్లోకూడా మన్నుబడ్డదారోజుల్లో."

"ఇటు మనకాడికివస్తడో, అట్నుంచేపోతడో."

"అసలు అయన ఇక్కడి కెందుకొచ్చిండో."

"ఏదో సర్కారు పనిమీదనే వచ్చుంటడు."

"పోనీగాని, మనను గుర్తుపట్టి పాతయన్ని బయట పెట్టడుగద."

"అప్పుడంటె ఆ రోజులట్లాఉండె. ఏదో మనరోజులు బాగలేక, కర్మంగాలి చావుదెబ్బలుతిన్నంగాని, తొంటదొర బలేమంచోడని లోకమంతా దండం పెట్టదిరా."

"మంచోడుకాకేం. మనబుద్దులు బాగలేక వాండ్లననటమేకాని, వాండ్లేం పెండ్లాంపిల్లలకోసం ఆపనులు చేసినారా, ఏదో మంచికే చేసుంటరు. వాండ్లెంత సంపాయించినా బీదోళ్ళకే. మనం ఎంత సంపాయించినా ముండలకు, తాగుడుకేచాలదు మనకు వాండ్లకు పోలికెక్కడ."

"ఇటేవస్తుండశ, మనమైతె దండం పెడ్తాం. గుర్తుపడ్తడో లేదో సూదాం."

"ఎంబడి మన జమేదారే ఉండు. పర్వాలే."

జేలువిజిటర్‌గా ప్రభుత్వముచే నియమింపబడిన ఇంద్రసేనారెడ్డి జేలు పరిశీలనకై వచ్చి అన్ని బారకులను చూస్తూ బూట్లఫ్యాక్టరీకి చేరుకోగానే, అక్కడ పనిచేస్తున్న వెంకడు. రంగడు ముసి, ముసిగా నవ్వుతు, దండంపెట్టి "గుర్తుపట్టాడా లేదా" అని ఇంద్రసేనారెడ్డిని చూడసాగారు.

ఇంద్రసేనారెడ్డి రంగడ్ని, వెంకడ్ని గుర్తుపట్టలేదు. సహజపద్ధతిని ఫ్యాక్టరీలోని పనితానాన్ని, సిద్ధమైయున్న వస్తువులను శ్రద్ధగా చూస్తూ ఫ్యాక్టరీబయట అడుగు పెడ్తుండగా, వెంకడు ఇంద్రసేనారెడ్డి నుద్దేశించి "ఒక మంచి బూట్లజోడు చేయించుకోరాదు దొరా. చాలారోజులు షనిస్తయి" అని చనువుధోరణిలో అన్నాడు.

"నిజందొరా, మీరు మమ్ముల మర్శిపోయినా, బూడ్సులున్నన్నాళ్లు మేం యాదికొస్తం."

వాండ్ల సంభాషణధోరణిలో ఆకర్షితుడై ఇంద్రసేనారెడ్డి శ్రద్ధగా వాండ్లవైపు చూచాడు.

"బాగున్నారా దొరా. దొర బొత్తిగా మర్శిపోయిండు." రంగడు మందహాసముతో మందలించాడు.

"వాండ్లకేం మారాజులు పెట్టిపుట్టిన దొరలు." వెంకడు ఇంద్రసేనారెడ్డిని చూస్తూ అన్నాడు.

ఏమిటి వీండ్లకింత చనువన్నట్లు వింతచూపుతో వాండ్లను తిరిగి ఒకసారి చూచి, "ఎక్కడో చూచినముఖాలె. ఎవరైయుంటారు" అని తర్కించుకొని "ఎవరు వీండ్లు" అని వెంటనున్న జమేదారును ప్రశ్నించాడు.

"వాండ్లా, పాపంముండాకొడుకులు. ఇంకెవరు, దొంగలు." జమేదారు కొంటెగా నవ్వి "పోరాదండర్రా, పనిచేయిపొండి" అన్నాడు.

"పనికేం. ఎప్పుడున్న పనేనాయె. కడుపుకొచ్చేదా ఏదోరోజులెళ్లబోసుకోవడానికి చేసేపనాయె, చెయ్యకేంచేస్తాం." వెంకడు వెటకారంగా అన్నాడు."

"సిగ్గులేని వెధవలు, ఎంతచెప్పినా వాండ్లమాటవాండ్లకే." జమేదారు ఇంద్రసేనా రెడ్డిని చూస్తు అన్నాడు.

"మారాజులు కష్టపడ్డందుకు గట్టెక్కిండ్రు. మేము ఉన్నచోటనే ఉన్నాం. పాపంపుటుకలు" రంగడు గోళ్లుగిల్లుకుంటు అన్నాడు.

"వాండ్లంటే ఇల్లనక, ముంగిలనక, పిల్లనక. మేకనక చెట్టు, గుట్టలుపట్టి ఎంత చెఱపడ్డారు. పాపం!" వెంకడు రంగనికి తోడుగా మాట్లాడాడు.

ఇంద్రసేనారెడ్డి ఆలోచనలో పడ్డాడు. పోరాటకాలములో తన జీవితఘట్టాలను కష్టాలను ఒక్కొక్కటి జ్ఞాపకము రావడంతో కలిగిన ఆనందాన్ని పట్టలేక కండ్లద్దాలు తీసి, తుడుచుకుంటు "మిమ్ముల నెక్కడనో చూచినట్టుంది. ఏ వూరు?" అని ఉత్సాహంతో ప్రశ్నించాడు.

"ఇల్లు, ఊరు మాకిదే దొరా. మేం ఇండ్లుపట్టుకొని కూకొని తినేదశ నోసుకోలేదు దొరా!" రంగడు నిస్పృహతో అన్నాడు.

"అయితే, నన్నెక్కడ చూచారు?" ఇంద్రసేనారెడ్డి ప్రశ్నించాడు.

"చూడటమేంటి దొరా. మీహోండ్లు మీకండ్లెదుట మమ్ముల దొక్కదొక్క ఇర్గుగతన్నింది మరిచారా దొరా" వెంకడు దీనంగా అన్నాడు.

"ఎవరు, ఎక్కడ, ఎందుకు మిమ్ములకొట్టారు. నేను కొట్టించానా? అబ్బే, నేను మిమ్ముల నెందుకు కొట్టిస్తాను?" అంటూ ఇంద్రసేనారెడ్డి ఆశ్చర్యంగా వాండ్లవైపు చూచాడు.

"తేనెతెట్టెబోడులో జరిగినసంగతి మరచారాదొరా?" రంగడు అడిగాడు.

"సుఖపురోజుల్లో ఆ కష్టపురోజుల సంగతెందుకులే. దొరలు బాగుంటేచాలు, ఓనాడు కాకపోయినా ఓనాడైనా మన కష్టాలు గట్టెక్కుతై" అంటూ దీనంగా ఇంద్రసేనారెడ్డివైపు వెంకడు చూచాడు.

"తేనెతెట్టెబోడు సంగతా? ఇంకా మీరు మరవలేదా? పాపము. మీరు చావు దెబ్బలు తిన్నారు." ముసి, ముసిగా నవ్వుతు ఇంద్రసేనారెడ్డి అన్నాడు.

"అవును దొరా! మేమే. అప్పటిదెబ్బలు కడితికట్టే ఇప్పటికి నొప్పిపెడ్తాంది." రంగుడు దెబ్బలు చూపించాడు.

"అవునుగాని, మీరు ఏమిటా పిచ్చిచేష్టలు. అందరు ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని నిద్రహారాలు లేక ఉంటూంటే మీరు సమయం కనిపెట్టి దొంగతనాలకు దిగటం ఏంబాగుంది?" ఇంద్రసేనారెడ్డి ప్రశ్నార్థకంగా అడిగాడు.

"అది మాకేం కొత్తదా దొరా, మా తాతల ముత్తాతల కాలంనుండి వస్తున్నదాయె. మేంచేసిన కొత్త పనేముందనిదొరా? మీరే మా నోట్లో మన్నుకొట్టిన్రుకాని." వెంకడు నిస్పృహతో అన్నాడు.

"మా అయ్య చిన్నప్పుడు మోచేతులు మోకాళ్లు కాయలు కాచేటట్టు కొట్టి కొట్టి సిద్ధం చేశాడు. చూడు దొరా!" రంగడు మోకాళ్లు, మోచేతులు చూపించాడు.

"అయితే మీరాపని మానుకోరన్నమాట?" కోపం నటిస్తు ఇంద్రసేనారెడ్డి అన్నాడు.

"వేరేఏముంది గనుక చూచుకొని, దీన్ని మానుకోవడం దొరా? మా బతుకంత జేళ్లలోనే గడిచిపోతాంది. జమేదారునడుగిరి, మే మెన్నిమాట్లు జేలుకొచ్చింది చెప్తడు." వెంకడు తడబడకుండా చెప్పాడు.

"వీండ్లేం సామాన్యులనుకున్నారా. జేల్లో చాలీచాలని కూటితో అట్లా ఉన్నారు కాని, బయటపడితే చాలు, దేశమంతా తమ జాగీరన్నంత పనులుచేస్తారు. ఏమి అలవాటో ఏం బుద్ధులో అర్థంకాదు." జమేదారు ఇంద్రసేనారెడ్డికి వివరించాడు.

"దొరా! మీకు కోపం రాకపోతే ఒకటి అడుగుత. మీరు సర్కారుమీద కత్తికట్టిన ఆ రోజుల్లో మా నోట్లోమాత్రం మన్నుకొట్టిన్రు. ఎక్కడపోయినా మీదేగోల, ఏది దొరికినా మీకేనాయె. అరోజుల్లో మేము పడ్డ కష్టాలు చెప్పితె తీరవు." రంగడు అన్నాడు.

"అయితే మీరు మా పేరుపెట్టుకొని ఆ పనులెందుకు చేశారు?" ఇంద్రసేనారెడ్డి కొంచెం కటువుగా అన్నాడు.

"మే మేదిచేసిన పొట్టకేకద దొరా! మాకు వేరే ఏముందని బ్రతకడం?" వెంకడు ప్రశ్నించాడు.

"మరెనేమొ, ఏదో "జై" అంటే దొంగలుకారని లోకులనుకుంటారు. అందుకోసం అట్ల చేసినం. అంతేకాని మీవోలె దొరతనము చేయటానికికాదు దొరా!" రంగడు ఉన్ననిజం వెళ్లగక్కాడు.

"అఖరుకు దొంగలుకూడా "జై" అంటున్నారని లోకానికి తెలిసిపోయె. అదికూడా దాగకుండవచ్చె." వెంకడు నవ్వుకుంటూ అన్నాడు.

"అయితే మాదగ్గర ఇదా మీరు నేర్చుకున్నది." ఇంద్రసేనారెడ్డి ఆలోచనావస్థలో అన్నాడు.

"మీ దగ్గర మేము నేర్చుకున్నదేముంది దొరా దీంట్ల. మీరే కొన్నాళ్ల మా పనులకు ఎగబడ్డారని మావోడు అంటున్నాడు. అవునులేరి. ఎవరికినచ్చిందివాండ్లు శేస్తుంటారు" అని రంగడు కొంటెగా నవ్వాడు.

"ఊహుఁ" అంటూ ఇంద్రసేనారెడ్డి బయలుదేరసాగాడు.

"మా గతి ఇంతేనా దొరా?" వెంకడు అడిగాడు.

"పిచ్చోడా, మీ ఖర్మం అట్లాఉంటే ఎవరుమాత్రం ఏం చేస్తారు? సరే పొండి. పనిమీదకి." అంటూ జమేదారుకూడా పోవసాగాడు.

"మేము బయటపడగానే మీకాడికి వస్తాం. ఏదైనా కొలవిప్పించురి." రంగడు ఆశతో అడుగుతు జమేదారువెనుక అడుగులువేస్తూ ముందుకుసాగాడు.

"దొంగల నెవరు కొలువుంచుకుంటారురా, మీ పిచ్చిగాని" అంటూ గంభీరంగా దోవబట్టాడు ఇంద్రసేనారెడ్డి.

"మీరు సర్కారు నడిపితే మేము చప్రాసికొలువుకుకూడా పనికిరామా?" అంటూ రంగడు కొంటెగా నవ్వుతూ వెంకడుతో ఫ్యాక్టరీలోకి వెళ్లాడు.

ఇంద్రసేనారెడ్డి విననట్టే బిర, బిరగా వెళ్ళిపోయాడు.

● *'జేబు లోపల' కథాసంపుటి 1952 నుండి సేకరణ* ●

★ ★ ★

19

జి. రామకృష్ణ

# గంజి కోసరం

ముసలి అవ్వ ముందు నడుస్తూవుంది. వెనుక కోడలు పోతూవుంది. ఆమె వెనుక మనుమరాలు – పదేండ్ల బాలిక వెన్నాడుతూవుంది. మనుమడు – ఎనిమిదేండ్ల బాలుడు వారి వెంటబడి పోతున్నాడు.

ఎండ పొద్దయింది. దోవ పయనం సాగిస్తూనే వున్నారు. అవ్వ జల్లవంటి పెద్ద గంప నెత్తిన పెట్టుకొని వుంది. గంపలో తన సామానులు తెడ్డుకట్టె, పప్పుగుత్తి, విరిగిన గరిటె, రెండు చట్లు, చినిగిన ఈతచాప, గోనెపట్ట చుట్ట వగైరా వున్నాయి. కోడలికి గోనెపట్ట సంచిలో యేమేమో వేసి నెత్తికి ఎత్తింది. మనుమరాలికి సద్దిమూట యిచ్చింది. మనుమడు అల్లాడిపోతూ నడుస్తూ వున్నాడు బాట సాగుతూ వున్నది.

కరువు వచ్చి బాగా దెబ్బతిన్న గ్రామాలలో అవ్వ గ్రామముకూడా ఒకటే. అవ్వ గ్రామములో కరువు మొదటి దెబ్బకే ఓదాసాదా పుట్టగోచులతోనే వూరువిడిచి పోయినారు. మలిదెబ్బకు అంతో యింతో గడిచిపోయేవాళ్ళే తట్టా బుట్టలతో గ్రామాంతరం పోయినారు.

అవ్వ తన కొడుకు, కోడలు, ఇద్దరు పిల్లలతో జీవనం గడిచేకాలం దాటిపోయినప్పటికిని వలస పోకుండా బిగువుగా అక్కడే వుండిపోయింది. అయిదెకరాల మడి, పదెకరాల చేను, పాడి పశువులతో రెండు కాండ్ల సేద్యాన్ని విడిచిపెట్టి పోలేక పోయింది. వరుసగా అయిదా రేండ్లు వర్షాలు లేక వరుపుదెబ్బ పడేవేళకు, అవ్వ కుటుంబం చితికిపోయి ఇరక తరక లయిపోయింది. ఉన్న బంగారం అమ్మేసినారు. కొన్నాళ్ళు జీవనం గడిచింది. చేను అయినకాడికి అమ్మేసి కొన్నాళ్ళు గడిపినారు. పశువులగోడు చూడలేక తెగనమ్మినారు. అయినా కాటకం తగ్గేజాడ కనపడటంలేదు అయిదెకరాల మడి, రెడ్డికి కుదువబెట్టినారు. కాలం గడిచిన తర్వాత బాకీ కట్టలేని స్థితిలో భూస్వామి భూమిని స్వాధీనం చేసుకున్నాడు.

పండువంటి సంసారం నిట్టనిలువున కూలినందుకు అవ్వ దిగులుపడింది. కుటుంబముతో పాటు పశుసాలలో కొక్కర కూచొని అయోమయంగా ఆలోచించింది. పశువులు లేని గాటపట్టును చూసి భోరున యేడ్చింది. దుఃఖం కొంత చల్లారిన తర్వాత అవ్వ కొడుకు యిట్లా అన్నాడు:

"మన నారాయణిగాడు, పెద్ద నాగప్పమామ, సుబ్బన్న ఇంకా చానామంది పెన్నేరు ప్రాజెక్టు పనికి పోతావుండారు. నేనూ పోయి కూలి నాలి చేసుక వస్తానమ్మా" అని తల్లి జవాబుకు ఎదురు చూచినాడు.

"సస్తేనో – బ్రతికితేనో అందరం ఒక చోట పడివుందామనుకుంటే నీ కేమో పొయ్యేకాలం వచ్చిందేమిరా?" అని అవ్వ గదురుకుంది.

"ఇంక యెట్ల చెయ్యమంటావ్. అందరు పోతావుండారు కదా. వాళ్ళతోపాటు నేనూ పోయి నాలుగు దుడ్లు సంపాయించి, అంతో యింతో మీకూ పంపుతా – నేనూ యెట్లో కాలం దొర్లించుకొని వస్తా" అని చెప్పినాడు.

"సరే నువ్వా అక్కడ కొల్లబో. ఈ నేదర్లను కట్టుకొని నే నెట్లో యిగ్గులాడుతాలే" అని అవ్వ సమాధానపడింది.

అందరితోబాటు అవ్వకొడుకు అనంతపురానికి పోయినాడు. కలెక్టరాఫీసువద్ద పడిగాపులపడి, కడకు అర్ధరేతిరికల్లా ఒక లారీ వస్తే దాంట్లో యెక్కి పేరూరుకు పోయినాడు.

పేరూరులో, కనిన కలలన్నీ కల్లలయినాయి ఇంత పనికి యింత కూలి అని పని చేయిస్తా వుండారు. కూలిపనికి వచ్చినవా రనేకమంది సేద్యపు పనికి అలవాటుపడినవారే కాని వడ్డె పనికి తరముకానివా రైనారు. అందులో యెముకల గూళ్ళతో పని అంతంతమాత్రమే అయింది అర్ధరూపాయికిమించి ఎవరికీ కూలిగిట్టలేదు. ఇంతలో వున్నట్లుండి – ప్రాజెక్టు పని నిలుపుదల చేసినట్లు తెలిపినారు. కూలోళ్ళందరు దిక్కు పరదిక్కులై పరారీ అయినారు. అవ్వకొడుకు కూడా తన వూరివాండ్లతో తుంగభద్ర ప్రాజెక్టు పనికని పోయినాడు. తరువాత సంగతి అతీగతీయని యింతవరకు అవ్వకు తెలియలేదు.

అవ్వ పిల్లలను తన రెక్కల క్రిందనే అకులలములు తిని పోషించుకొంటూనే వస్తావుంది. ఇంకా వలసపోయేవాండ్లు, గంజి కేంద్రాలకు పోయేవాండ్లు పోతూనే వున్నారు.

"ఇంక యిక్కడవుంటే బతకలేము. కలమంద గడ్డ గ్యాదరాకు కూడా అయిపోయింది. నువ్వారా ముసిల్దానా, ఆ పల్లెలో సర్కారోళ్ల గంజిపోస్తా వుండారంట" అని ఇరుగుపొరుగు అమ్మలక్కలు అవ్వను పిలిచినారు కాని, అవ్వ బొందిలో ప్రాణముండగా తిరిపెంగంజికి మాత్రం దేబిరించమని చెప్పి బిగిసికూర్చుంది. ఎట్లనో కాలం వెళ్ళబుచ్చుదామనుకుంది. కాని కూలినాలి చిక్కదు. గ్యాదరాకు అయిపోయింది. అన్ని కుటుంబాలు అణగారి పోయినాయి. రెడ్డిగారి కుటుంబంవంటి ఒకరిద్దరు పచ్చగా వున్నారు.

రెడ్డిపై నిక్క జూసేవాడు ఆ చుట్టుపక్కల గ్రామాలలో యెవరూ లేకుండా పోయినారు. భూములు – అన్ని షరతులు పెట్టి స్వాధీనం చేసుకొని మదించి పోయినాడు. స్వంత భార్యమీద మోజు మామూలై పోయింది. కొత్తరుచి కావలసి వచ్చింది. అవ్వకోడలపై కన్ను పడింది. అవ్వకు తత్తర పుట్టింది.

రెడ్డిప్రబలుడు; పరిస్థితులు మారినాయి. తలచుకుంటే యేమయినా చేయగలడు. ఎదిరించి నీలదీసేవాడు యెవరూ లేరు, భూమి పుట్ర పోయినా పర్వాలేదు. కాని వంశమర్యాదకే చేటుకాలం వచ్చేటట్లుంది. అవ్వ దీర్ఘంగా ఆలోచించింది. పెద్ద ఆసామి నుంచి మానమన్నా దక్కించుకుందామని గంజి కేంద్రానికి బయలుదేరింది. బాట సాగుతానేవుంది.

అవ్వ మనుమడు మధ్యమధ్య నేలకూలబడి "గంజిపోసేతావు యింకా యెంత దూరమవ్వా? అని అడుగుతాడు. "నాకు ఆకలి అయితాందే" అంటాడు. అవ్వ సమాధానం చెప్పతూ "అదిగో ఆ కొండ కిందనే వూరు. ఆ వూర్లోనే సర్కారోళ్ళు గంజి ముంతలు ముంతలు పోస్తారంట. బాగా, కమ్మగా వుంటుంది. కడుపునిండుగా తాగొచ్చు" అని బుజ్జగిస్తూ, బంగపోతూ నడిపిస్తావుంది.

"ఏమే పాపా, మీ యిద్దరిలో యెవరు ముందు నడుస్తారో వాళ్ళకు నా బాగం గంజి యిస్తా" అని పోటీ పెట్టి నడిపిస్తావుంది. పాప కూడా అవ్వకు సహాయంగా, "సర్కారోళ్ళు గంజి బాగుంటుంది కదవ్వా, పరమాన్న మాకట్లు వుంటుంది కదా" అని నోట్లో నీళ్ళు వూరుతుంటే నడుస్తున్నాది.

అప్పుడే మధ్యాహ్నం మీరింది. మనువడు యింక నడువగల స్థితిలో లేడు. ఆకలవుతుంది అన్నాడు. ఏడ్చినాడు. రంపు చేసినాడు అవ్వ ఆటలు యింక సాగలేదు.

"అదిగో ఆ వచ్చే మోరీమీద కూచొని సద్దితిందాము పదండి" అని ఆ కొంత దూరము నడిపించింది. ఆ రోడ్డులోనున్న మోరీమీద, మనుమరాలు ముందు పరుగెత్తిపోయి కూచుంది. అవ్వ తన గంప దింపుకుంది. కోడలి మూట దింపింది. పాప దగ్గరనున్న గ్యాదరాకు సద్దిమూట విప్పి, తలాకొంత పంచి. తన చిన్న మనుమనికి జాస్తి పెట్టి తినమన్నది. పొద్దున్నే వచ్చేటప్పుడు యింత గ్యాదరాకు ఉడకబెట్టి, ఉప్పు కారం చల్లి, సద్దికట్టింది అవ్వ. పోయిగా తిన్నారు. ముంతలో తెచ్చిన నీళ్ళు అవ్వ అందరికి యిచ్చింది. ఉసులుబాటు కలిగింది.

ప్రక్కన చీలి దోవగుండా ఒక మనిషివచ్చి "ఏ వూరవ్వామంది? గంజి కేంద్రానికేనా ప్రయాణం" అని అడిగినాడు. అవ్వ ఉలిక్కిపడింది.

"లేదు నాయనా, గంజిపోసే చోటికికాదు – మేము పొయ్యేది. ఆ వూరికి మా తోడబుట్టినోని బిడ్డనిచ్చివుంటే సూసిరాను పోతావుండాము" అని బదులు చెప్పింది. ఆ మనిషి ఎగాదిగా గంపలోకి చూచి ఎల్లబారి పోయినాడు.

మనుమడు కుయ్యి కుయ్యిమని యేడుపు మొదలుపెట్టినాడు.

"ఏమిరా, యింత గ్యాదరాకు తిని యింత సేపూ వూరికే వుండి యిప్పుడు మళ్ళా యేడుపు మొదలుపెట్టితివా? నీకేమొచ్చిందిరా – ఓరి నీయాకు జించా" అని అంటుకుంది అవ్వ.

"గంజికని చెప్పి నువ్వు యెక్కడికో పిలుచుకొని పోతావుండావులే. ఆయప్ప అడిగితే గంజిపోసే చోటికి కాదని చెప్పలా నువ్వు?" అని మనుమడు యేడుపు మొదలుపెట్టినాడు.

"లేదు నాయనా, నా తోడు లేదమ్మా, మనం పొయ్యేది గంజిపోసే చోటికే. ఆయప్ప అడిగితే తిరిపెం గంజికి పోతావుండామని యెందుకు చెప్పల్లని మర్యాద

కాపాడుకుందామని అట్లా చెప్పినాను. అంతే నాయనా. లెయ్యి పోదాం. చిన్నగా నడుచుకుంటూ సందకాడ గంజి పోసేటప్పటికల్లా వూరు చేరుకుందాము. పదండి లెయ్యేపిల్లా పదండి పోదాం" అని అవ్వ తన కుటుంబాన్ని బయలుదేరదీసింది. బాట సాగుతూనే వుంది.

పిల్లలకు కాళ్ళు నొప్పులు తెలియకుండా అవ్వ కాకమ్మ, గువ్వమ్మ కథలు చెప్తూ నడిపించింది. పొద్దు తిరిగింది. చల్లపొద్దు పడింది. కొండ దగ్గర దగ్గరకు వచ్చింది. గుండ్లు బండలు కనబడుతూన్నాయి; ఊరు అంచుకు వచ్చినారు.

ఇంతలో మరొక మనిషి వెనుకనుంచి వచ్చి అవ్వను కలుసుకొని "ఏమవ్వా, మీరూ గంజి కేంద్రానికేనా" అని అడిగినాడు.

"అవున్నాయనా, మేమూ గంజిపోసే చోటికే. గంపంత సంసారం పాడయి పోయింది. ఉన్నవూరు కన్నతల్లి ఒకటేనని వూరు విడిచి పెట్టకుండా అక్కడే వుంటిమి. కాని, ఆ దొంగనాబట్ట పుణ్యమా అంటూ యిట్లా ఎల్లబారి రావలసి వచ్చింది" అని తనగోడు వెళ్ళబోసుకుంది.

"నేనూ అటికే లేవ్వా. కాలమట్లా వచ్చింది. ఏమి చేస్తాం, కూలి నాలి చేసుకొని బ్రతుకుదామన్నా పనులు లేవు" అని ఒకరి బ్రతుకు ఒకరు వెళ్ళబోసుకున్నారు. అప్పుడు ఆ మనిషి దయగా–

"కాదవ్వా, ఈ పిల్లోనికి గంజి పోస్తారు. ఈ పిల్లకూ గంజి పోస్తారు. నీకూ గంజి పోస్తారు. కాని, నీ కోడలకి మాత్రం పోయరు. ముసిలోళ్లకు పిల్లోళ్లకు మాత్రమే పోసేది. ఎట్లా చేస్తావు?" అని అడిగినాడు. అవ్వ దిగాలు పడింది.

"అయినా నేను ఒక ఉపాయం చెప్తాను వినవ్వా. ఈ యమ్మను యాగటి మనిషి అని చెప్పు. యాగటి మనుషులకి కూడా గంజి పోస్తారులే" అని అతడు ఉపాయం చెప్పినాడు.

"ఏమో నాయనా. మంత్రసాని పనికి పూనుకున్నాక యేమొచ్చినా పట్టుకోవలసిందే కదా. కానీ అన్నిటికీ దిగినాము. ఏమి చెప్పాలన్నా చెప్పాలిసిందే" అని జవాబు చెప్పింది.

"నేను ముందు పోతానవ్వా, నా యగచాట్లు నేను చూచుకోవల్ల" అని ఆ మనిషి ముందుకు వెళ్ళిపోయినాడు.

అవ్వ "అదిగోనర్రా వూరు అంచంచుకు వచ్చింది. దిరిదిరీన రాండి" అని వాళ్ళను సోపుకుంటూ పోయింది. ఊరుదగ్గిర పడినారు. ఊరు మంకాళమ్మగుడి యెదురైంది. గుడి అరుగుమీద సామాన్లు దింపుకొని అవ్వ కోడలిని పిల్లలను పిలిచి అమ్మవారికి మొక్కుమని చెప్పింది తాను దోర్లపడి.

"తల్లీ మంకాళమ్మా! మమ్మూ రచ్చించు తల్లీ! మా సంసారం కుదుటబడి మళ్ళా మా వూరు చేరిస్తే నీకు యాట కొట్టిస్తాను తల్లీ" అని చేతులు జోడించి మొక్కింది. పిల్లల చేతులు తానే పట్టుకొని మళ్ళా మొక్కించింది. తర్వాత యథాప్రకారం సామాన్లు నెత్తిన నెత్తుకొని "పదండి. వూర్లోకి పోదాం. గంజి పోస్తావుంటారు" అని వూరిలోకి పోయినారు.

జనం గుంపులు గుంపులుగా తరలిపోతావుండారు. అందరూ, గంజికి వేళ అయింది కాబట్టి పోతూవున్నా రనుకుంది అవ్వ. వెనకకు తిరిగి చూచి, "రాండ్రా రాండి" అని పిలిచింది.

ఇంతలో ఒక యువకుడు జెండా పట్టుకొని వచ్చి, "ఏమవ్వా యింకా పెండ్లినడక నడుస్తావుండారే. తాశీల్దారు అప్పుడే వచ్చి చావిట్లో కూచోనుంటే – పదండి పదండి" అని హెచ్చరించి మరొక సందుకు పోయినాడు. అవ్వ గంజి వేళ మించిపోయిందేమోననీ, అందుకే హెచ్చరిస్తా వుండారని తనవాండ్లను రమ్మని గదమాయించింది. అనేకమంది పుట్టగోచులవారు, చింపిరితలవారు, చీరపేలికలవారు, చంటిబిడ్డలవారు రకరకాల మనుషులు గుంపులుగుంపులుగా చావడి దిక్కుగా సాగినారు. చావడివద్ద అందరు మోరలెత్తి చావడివైపు చూస్తావున్నారు. అవ్వకూడా మూటాముల్లె దింపుకుని చావడి మొగమై మోరెత్తి చూచింది. ఒక కుర్చీమీద తాశీల్దారు లేచి నిలబడి మాట్లాడుతా వున్నాడు.

"నన్నేమి చేయమంటారు. పైవారి ఉత్తరువు మేరకు నేను గంజికేంద్రము మూయవలసి వచ్చింది. మీ దొక్కటే కాదు మూసింది, ఇంకా అనేకం మూసినాము – మూస్తాము. మంత్రిగారు కూడా ఈ ప్రాంతం వచ్చినప్పుడు గంజికేంద్రాలు మూయమని ఖుద్దునచెప్పి పోయినారు. భూముల్లో పనిచేసేదానికి యెవరూ కూలికి రావడంలేదని కొంతమంది రిపోర్టులు పంపినారట. అందువల్ల మీరంతా యెక్కడికన్నా పోయి కూలినాలి చేసుకోండి. కూలిపనులు దొరకలేదంటే నేనేమి చేసేది? మీ రిచ్చిన అర్జీలు కావలిస్తే మంత్రులకు పంపమంటే పంపుతాను. అంతకంటే నేనేమీచేయలేను" అని దిగిపోయినాడు.

అవ్వకు గుండె జారిపోయింది. పిచ్చెత్తినట్టయింది. ఎదబాదుకుంటూ జనంలో కలిసిపోయింది – "మీకు దూము తగలా! మీకు పాడెగట్టా" అని అరచుకుంటూ....

● *'ఆంధ్రప్రభ' సచిత్ర వారపత్రిక – 9-9-1953* ●

★ ★ ★

కొడవటిగంటి కుటుంబరావు

20

# పైకి వచ్చినవాడు

సీతారామారావు ఒక విచిత్రమైన వాతావరణంలో పెరిగాడు. అతడు హైస్కూలు చదువు పూర్తిచేసినదాకా ఉన్న ఊరు విడిచిపెట్టి వెళ్ళలేదు. ఆ ఊరే అతని ప్రపంచంగా ఉండేది. ఎందుకంటే, అతని అయినవాళ్ళంతా అక్కడే ఉండేవాళ్ళు. అతని మేనత్తలిద్దరినీ ఆ ఊరే ఇచ్చారు. అతని అక్కను కూడా మేనరికం ఇచ్చారు. హైస్కూలు తప్ప చెప్పుకోదగిన సంస్థ మరేదీ లేని ఆ గ్రామంలో ప్రతిమూలా సీతారామారావు సొంతం లాగుండేది – కొన్ని బంధువుల ఇళ్ళు, కొన్ని స్నేహితుల ఇళ్ళు, కొన్ని బాగా ఎరిగున్న వాళ్ళ ఇళ్ళు, మిగిలినవి కూడా అంతా తెలిసిన ఇళ్ళే. ఊళ్ళో ప్రతివీధి గురించీ సీతారామారావుకు ఏవో స్మరణలున్నై. ఊరినిండా అతను ఎక్కిన చెట్లే. అతని జీవితం ఆ వూరితో బాగా పెనవేసుకొనిపోయింది.

అతని చిన్నప్పటి వాతావరణంలో ఉండిన మరొక విశేషమేమిటంటే, వాళ్ళ వాళ్ళు చాలా సాధారణ కుటుంబమయినప్పటికీ దారిద్ర్యమూ, సంపదా అనే ద్వంద్వం ఎన్నడూ అతన్ని బాధించలేదు. వాళ్ళది చిన్న పెంకుటిల్లు. వాళ్ళ చిన్న మేనత్తగారిది రెండు నిట్టాళ్ళ పాకా. పెద్దమేనత్త డాబా వేయించింది. అయితే తన ఇంటికన్న పెద్ద మేనత్త ఇల్లు గొప్పదనిగాని, చిన్న మేనత్త ఇల్లు తక్కువదనిగాని అతనికెన్నడూ తట్టలేదు – తట్టేటట్టు ఎవరూ చేయలేదు కూడా. తీరే అవకాశం లేని కోరికలు లేనివాడికి ఐశ్వర్యం గురించీ దారిద్ర్యం గురించీ ఆలోచనలు రావు. అటువంటివాడు "నేను డబ్బున్నవాణ్ణి, డబ్బులేనివాణ్ణి" అనుకోడు. సీతారామారావుకూడా అట్లాగే పెరిగాడు. అతని బంధువర్గంలో మనిషి ఆదరం హెచ్చుగా ఉండేది. వాళ్ళ మధ్య కలహాలూ, కక్షలూ, సాధింపులూ రావటం సీతారామారావు ఎరగనే ఎరగడు. అతని అక్కగారి భర్తా, బావగారూ ఆస్తులు పంచుకున్నప్పుడు తమ్ముడికి మంచివాటా వచ్చిందన్న అభిప్రాయం అన్న ప్రకటించినప్పుడు సీతారామారావు తండ్రి, "వాడేం కట్టుకు పోతాడుట్రా? అవసరం వస్తే తనదంతా తెగనమ్మి నీకు పెట్టడూ?" అన్నాడు. అందులో అతిశయోక్తి కూడా ఏమీలేదు. ఎందుకంటే, అందుట్లో ఎవరికే ఏ అవసరం వచ్చినా నలుగురూ కమ్ముకునేవాళ్ళు. ఎవరూ తీర్చలేనంత అవసరాలు రానూలేదు.

నిజానికి మానవజాతి యావత్తూ ఎంతో కాలంపాటు ఇటువంటి ఏర్పాటుమీద కాలం వెళ్ళబుచ్చలేదు. జీవితంలో పెద్ద పరివర్తనలేని సమయాల్లో ఒకటి రెండు

తరాలమధ్య మాత్రమే తాత్కాలికంగా ఇటువంటి పొత్తు కుదురుతుంది. ఇటువంటి వాతావరణం సాధ్యమవుతుంది. కాని సీతారామారావు ఆ వాతావరణం తప్ప మరేమీ ఎరగని కారణం చేత ప్రపంచమంతా ప్రతి యుగంలోనూ ఆ పద్ధతినే నడిచిందనీ నడుస్తుందనీ పొరపడ్డాడు.

☆ ☆ ☆

సీతారామారావు కాలేజీ చదువు కోసం పైవూరు వెళ్ళవలసి వచ్చినపుడు చాలా బాధపడ్డాడు. తనకుగల సర్వస్వమూ వొదిలేసి ఏ అరణ్యవాసమో పోతున్నట్లనిపించిందతనికి. అతనివెంట ఊరి కుర్రాళ్ళు మరిద్దరూ కూడా బయలుదేరారు. సీతారామారావు అన్న ఈ ముగ్గుర్నీ తన బండిలో ఎక్కించుకుని హైరోడ్డుదాకా తోలుకుపోయాడు. సీతారామారావు అన్న రాఘవులు చదివేటప్పుడు ఊళ్ళో మిడిల్ స్కూలుండేది.[1] రాఘవులు ఉన్నంతవరకూ చదివి, తరవాత వ్యవసాయంలో ప్రవేశించి తండ్రికి సాయపడసాగాడు. అతనికి పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు కూడానూ.

బస్సు వచ్చిందాకా రాఘవులు తిరిగిపోలేదు. ఏవేవో విషయాలు మాట్లాడుతూ నిలబడ్డాడు. సీతారామారావు ఎక్కువగా మాటాడలేదు. కాని అన్నను చూచి గర్వపడ్డాడు. రాఘవులంత మంచివాడు ఊళ్ళోలేడని అందరూ అనుకునేవాళ్ళు. అతనిలో ఏ కోశానా స్వార్థమూ, కోపమూ లేనట్టుండేది.

బస్సు వచ్చింది. ముగ్గురు కుర్రాళ్ళూ ఎక్కారు. రాఘవులు బండి మళ్ళించుకుని బయలుదేరాడు. బస్సు కాలవ వంతెన ఎక్కి దిగేదాకా సీతారామారావు అన్న తోలుకుపోయే బండిని చూస్తూనే ఉన్నాడు. ఆ బండిలో తన పంచప్రాణాలూ ఇంటికి తిరిగిపోతున్నట్టనిపించింది. సమ్మె చేసినట్టుగా ముగ్గురూ మాట్లాడటం మానేశారు. మరో అరగంట గడిచినాక మిగిలిన కుర్రాళ్ళలో ఒకడు తనకేసి తిరిగి, "ఏరా? ఈ పాటికి రాఘవులన్నయ్య వాముల్దొడ్డికాడికి పోయి ఉండడూ?" అనేసరికి సీతారామారావుకు ఏడుపు వచ్చినంత పని అయింది. మరికాస్సేపటికల్లా రైలుస్టేషను వచ్చేసింది.

టిక్కెట్లుకొని రైల్లో ఎక్కికూచున్న మరుక్షణం నుంచీ సీతారామారావుకు తన జీవితం మీద తనకేమీ అధికారం లేనట్టయింది. అయితే అది కేవలం భ్రమ. ఆ క్షణానే అతని మనస్సు ఈ మారిన పరిస్థితులకు అనుగుణంగా మారే ప్రయత్నం. రహస్యంగా ప్రారంభించింది.

"మన వాళ్ళందరిలోకీ పెద్దచదువు చదవబోతున్నవాణ్ణి నేనే. చదవగానే సరి కాదు– నలుగురికీ సాయపడాలి. పొలం అన్నకుంటుంది. నే నందులో దమ్మిడీ ముట్టుకోకుండా జరుపుకోవాలి. కాకపోయినా ఏం పొలం? అన్నకిప్పుడే ఇద్దరు కొడుకులు, ఇంకా పుట్టుకొస్తారు! ముగ్గురు నలుగురు పుట్టి పంచుకుంటే ఏమొస్తుంది? తిండికి చాలదు. లాభంలేదు. నా సంపాదనతో ఒక్కొక కుంటకొని పొలం చేర్చాలి. అన్న పిల్లలకు చదువులు చెప్పించాలి. వాళ్ళు కూడా సంపాదించుకోగలిగితే ఇబ్బంది ఉండదు..."

---

1 8వ తరగతి దాకా ఉన్న పాఠశాల.

సీతారామారావు ఆలోచనలు గాలికి కొట్టుకుపోసాగాయి. షావుకారు కోటయ్య గారికి మెరకా మాగాణీ కలిసి నూటయాభై ఎకరం, ముగ్గురు పిల్లలు. వాళ్ళకు ముగ్గురేసి పుడితే? పెద్ద ఆస్తి ముక్కచెక్కలై పోవటానికి మూడు తరాలు కూడా పట్టదు గద!... బియ్యే పాసయితే కనీసం నెలకో యాభై తెచ్చుకోవచ్చు. ఆరేడుపుట్ల ధాన్యం ఇంటికొచ్చినట్లే! అయిదారెకరాలు కొనుక్కున్నట్టన్నమాట! ఇంకా పెద్ద జీతం వస్తే అడగనే అక్కర్లేదు.

నిరాశ కలగకుండా ఉండగలందులకు సీతారామారావు యాభై రూపాయలు నెల జీతం లెక్కవేసుకున్నాడే గాని నూరు నూటయాభై దాకా సంపాదించగలనని అతనికి ధైర్యం లేకపోలేదు. అయితే పానకంలో పుడకలాగా ఒక్క ఆలోచన అతనికి గొంతు కడ్డం పడింది. అంత ఉద్యోగం చెయ్యాలంటే పొరుగూరు వెళ్ళాలి! పుట్టి పెరిగిన ఊళ్ళో ఉండి ఉద్యోగం చెయ్యటం సాధ్యంకాదు, ఏం చేసేట్టు?

☆ ☆ ☆

ఆ ప్రశ్నకు కాలమే సమాధానం చెప్పింది. సీతారామారావు బియ్యే పూర్తి చేసేసరికి కాటకం వచ్చి ధరలు పడిపోయినై.[1] అతన చదువుకని చేసిన అప్పు క్రింద ఆరెకరాల పొలం తెగనమ్మవలసి వచ్చింది. తండ్రికి పక్షవాతం వచ్చింది. రాఘవులన్న నలుగురు పిల్లల తండ్రి అయినాడు. ఇప్పుడు తను కోటయ్యగారి తూర్పు పొలం కమతానికి చేస్తున్నాడు. జీవితం ఎంతమాత్రం సుఖంగా లేదు. సీతారామారావుకు ఉద్యోగం లేదు. గోళ్ళుగిల్లుకుంటూ కూచున్నాడు.

కాని ఊరు పాచిపోయిన చద్దికూడులాగా తయారయింది. చలికాలం రాగానే ఎవరి ఇళ్ళలో వారు దూరి తలుపులూ కిటికీలూ బిడాయించుకున్నట్టుగా అయిపోయినారు జనం. బంధువుల ఇళ్ళు పూర్వం స్వంత ఇళ్ళల్లే వుండేవి. ఇప్పుడు పరాయి ఇళ్ళల్లే ఉన్నై.

"బోలెడంత డబ్బు తగలేసి పెద్ద చదువు చదివావు. ఈ వూళ్ళో కూచుంటే ఏముందిరా? ఎక్కడికికన్నా వెళ్ళి నాలుగురాళ్ళు సంపాదించుకుని నీ దారిని నువు బతుకు. నీ అన్న సంసారం ఈదలేక రెక్కలు విరుచుకుని నానా హైరానా పడుతున్నాడు. వాడికి నీ బరువు కూడా దేనికి?" అని చాలా మంది సలహా యిచ్చారు.

ఎవరో పిలిచి తనకేదో ఉద్యోగం ఇస్తారని సీతారామారావు భ్రమ. తాను పొరుగూరు వెళ్ళి నలుగుర్ని యాచించి, కొందరిచేత లేదనిపించుకుని, దొరికిన చోట ఉద్యోగం సంపాదించుకొనటమన్నది అతనికి చాలా అవమానకరంగా తోచింది. అయినా తనకు అది తప్ప మార్గాంతరం లేనట్లు అందరూ చెబుతున్నారు. అంతకన్నా తన అన్న చేసేపనే మగసిరిగా ఉంది - మనిషి ఎంత హైరానా పడుతున్నా!

మొత్తానికి సీతారామారావు ఒక ఏడాదల్లా అన్నకి బరువుగానే వున్నాడు. తరువాత అతనికి పెళ్ళయింది. బస్తీపిల్లనే చేసుకున్నాడు. మామగారు ప్లీడరు. బాగా సంపాదించుకుంటున్నవాడు. మునిసిపల్ వ్యవహారాలలో ఒక వర్గానికి సలహాలిస్తూ

---

1 ఆర్థిక కాటకం (1929-1934).

పలుకుబడి ఉన్నవాడు. సీతారామారావుకు ఆ సంబంధం రావటం చాలా అదృష్టమని అందరూ అన్నారు. పిల్ల కొంచెం స్థూలంగా ఉన్నా అనాకారి కాదు.

పెళ్ళి అయినాక సీతారామారావు మామగారి ఇంటనే జాస్తిగా ఉంటూ వచ్చాడు. అతనికి అదే సుఖంగా ఉంది. ఇక్కడ అతను ఎవరి ఆర్థికచిక్కులూ ఎదుర్కోనవసరంలేదు. తన మామూలు ఖర్చులు కూడా ధారాళంగా వెళ్ళిపోతున్నాయి.

మామగారు సీతారామారావుకు క్లబ్బు గుమాస్తాగిరీ ఇప్పించాడు. కరువు రోజుల్లో నలభైరూపాయల జీతం పెద్ద పెద్ద వాళ్ళందరితోనూ పరిచయం, కొద్దిగా పలుకుబడికూడా. ఈ నలభైలోనుంచి కనీసం పదో పదిహేనో అన్నకి పంపుదామని సీతారామారావు అనుకున్నాడు. కాని ఎందుకో పడలేదు. ఈ మాట భార్యతో అంటే ఇంత చిన్న మొత్తాలను గురించి నిరసనగా మాట్లాడింది.

"తిండిఖర్చా, ఇంటిఖర్చా లేదాయె. మంచిబట్టలు కొనుక్కోరాదు?" అన్నది భార్య. భార్య ముచ్చట తీరటంకోసం ఖరీదైన సూటు కుట్టించాడు సీతారామారావు.

☆ ☆ ☆

ఇంతలో ఎన్నికలు వచ్చాయి.[1] కాంగ్రెసు ఎన్నికల్లో పోటీచేయ నిశ్చయించి ప్రణాళిక ప్రకటించింది.[2] ఆ ప్రణాళికను ఉన్నదున్నట్లు కాపీకొట్టి ఒక రాజాగారు తామొక పార్టీ లేవదీసి వేరు వేరు నియోజక వర్గాల్లో నిలబెట్టటానికి అభ్యర్థులను వెతికారు. ఆయనకు చిక్కినవారిలో సీతారామారావు మామగారొకడు.

ఆయన సీతారామారావును వెంట పెట్టుకొచ్చి మద్రాసు కాస్మాపాలిటన్ క్లబ్బులో దిగాడు. ఈ కొత్తపార్టీ గెలుస్తుందనీ, ప్రభుత్వం నిర్వహిస్తుందని ఎవరి అంతరాత్మలలోనూ అట్టే ధైర్యం ఉన్నట్టు కనబడలేదు. అదివరకే దెబ్బ తిన్న జస్టిస్ పార్టీకి[3] మరొక బురఖా తొడిగి రంగంమీదికి తీసుకొస్తున్నారు. ఇది అందరికీ తెలిసిన రహస్యం. సీతారామారావు మామగారిలాంటివాళ్ళు పూర్వం బహిరంగంగా కాంగ్రెసు ఉద్యమాలకు సానుభూతి చూపినవారు. ఈ ఎన్నికలలో ఈ పార్టీకి పెద్ద అండ ఎన్నికల ఖర్చుకు కొంత డబ్బు తీసుకుని మామా అల్లుళ్ళు తిరిగి వచ్చారు.

ఈ పార్టీ అభ్యర్థుల జాబితాలో సీతారామారావు మామగారి పేరు పడింది. ఎన్నికల ప్రచారం అరంభమయింది. ప్లీడరుగారికి డొక్కు కారొకటి ఉన్నది. (ఇది కూడా ఆయన అభ్యర్థిత్వానికి తోడ్పడినమాట అబద్ధంకాదు.) ప్లీడరుగారు తన

---

1. 1937 ఎన్నికల ప్రస్తావన కావచ్చు. ఈ ఎన్నికల్లో కాంగ్రెసు విజయం సాధించింది. జూలై 14వ తేదీన రాజగోపాలచారి నాయకత్వంలో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర మంత్రివర్గం ఏర్పడింది.

2. 1916 నవంబరులో పిట్టి త్యాగరాజు చెట్టి మొదలైనవాళ్ళు 36 మంది సభ్యులు కలిసి దక్షిణ భారత ప్రజల సంఘం అనే పేరున మద్రాసులో ఒక సంస్థను ఏర్పాటు చేశారు. ఇది బ్రాహ్మణేతరుల సంఘం. ఈ సంఘం జస్టిస్ అనే పత్రికను వెలువరించింది. 1916 డిసెంబరులో బ్రాహ్మణేతరుల ప్రయోజనాల పరిరక్షణకోసం South Indian Liberal Federation అనే సంస్థకూడా స్థాపితమైంది. ఇదే త్వరితకాలంలో జస్టిస్ పార్టీగా అవతరించింది. 1920 నుంచి ఎన్నికల్లో పాల్గొంది. అధికారంలోకి వచ్చింది. తర్వాత జరిగిన ఎన్నికల్లో దాని స్థానాలు తగ్గుతూ వచ్చాయి. ఇది జమిందారులూ సంపన్నుల పార్టీ అని పేరుగాంచింది. 1930 నాటికి పార్టీ పతనావస్థ చెందింది.

అనుచరులతో అల్లుడితో ఎన్నికల ప్రచారానికి బయలుదేరాడు. కొద్దిరోజుల పాటు పలుకుబడిగలవాళ్ళచుట్టూ తిరిగారు. వారిలో కొందరు తమకిందనున్న ఓట్లు ప్లీడరుగారికే వచ్చేట్టు చూస్తామన్నారు. కొందరు నమ్మకంగా చెప్పలేమన్నారు.

"ఈ ఎన్నికలలో నేను ఓడినా నా కభ్యంతరం లేదు. నా యందు విశ్వాసం వున్నవాళ్ళ వోట్లు నాకు పడితేచాలు. నేను మాత్రం కాంగ్రెసువాణ్ణి కానా? ఈసారి కాంగ్రెసు గెలవదు. కాంగ్రెసు ఎన్నికలకు నిలబడడం మహాత్మాజీ[1] దగ్గర్నుంచీ ఎవరికీ ఇష్టంలేదు. నేను పోటీ చేయకపోతే ఇంకో క్షుద్రుడు వస్తాడని నిలబడటమే. పార్టీనిచూచి నాకు వోటివ్వవద్దు. నన్ను చూసే ఇవ్వండి" అని వేడుకున్నాడు ప్లీడరుగారు.

ఇంతకీ ఈయన కెదురుగా నిలబడిన కాంగ్రెసు "క్షుద్రుడు" అప్పటికే అయిదేళ్ళు జైళ్ళలో మగ్గినవాడు!

ఎన్నికలు దగ్గిర పడినకొద్దీ ప్లీడరుగారికి వేడెక్కింది. కారులో ఊరంతా తిరగటమూ, నలుగురు చేరినచోట కారు ఆపి అప్పటికప్పుడే ప్లీడరుగారు ప్రసంగం ప్రారంభించటమూ, గొడ్లకాడ పిల్లలు చుట్టూమూగి నోళ్ళు తెరుచుకు వినటమూ, పెద్దవాళ్ళు వినిపించుకోకుండా పోవటమూ, చదువుకున్న కుర్రకారు నవ్వటమూ—యిది నిత్యకార్యక్రమం అయిపోయింది.

ఈ మీటింగుల్లో సీతారామారావు కూడా మాట్లాడసాగాడు. తన అల్లుడికి మాట్లాడేశక్తి ఉండటం గమనించి ప్లీడరుగారు ఆశ్చర్యపడ్డాడు. ఇంకా పెద్ద సభలు ఏర్పాటుచేసి రేపో ఎల్లుండో ఎన్నికలనగా అల్లుడిచేతా, మరికొందరు మిత్రులచేతా మాట్లాడించాలని ప్లీడరుగారు ప్రయత్నించాడు. ఈ ప్రయత్నం అభాసయిపోయింది. వచ్చిన జనమే పాతికమంది. వాళ్ళు సభ జరగనీయకుండా అల్లరి చేశారు.

ఎన్నికలు జరిగాయి. ప్లీడరుగారి డిపాజిట్ పోయింది. ఆయనపడ్డ శ్రమకు నాలుగైదు వందలు దక్కాయి, పరవాలేదు.

☆ ☆ ☆

సీతారామారావు పట్నంలో నూరు రూపాయల ఉద్యోగం సంపాయించాడు. కాస్మోపాలిటన్ క్లబ్ ఊరికే పోలేదు. ఆ రోజులకది మంచి సంపాదనే. నెలకు రెండు పుట్లు! కాని అదేం కర్మమో ఇంటికి పంపించాలంటే కానీ వుండేదికాదు. పాతిక రూపాయలు ఇంటి అద్దెకిందే పోయేది. ఉద్యోగానికి తగిన దుస్తులుండాలి. ఇంటికెవరన్నా వస్తే కూచోటానికి నాలుగు కుర్చీలూ, ఆదివారాలు బయటకిపోతే నాలుగేసి రూపాయల ఖర్చూ, భార్యకు అప్పుడప్పుడూ చీరలూ, నగలూ— ఎంతచెట్టుకంత గాలిలాగా—ఎక్కడికక్కడ సరిపోతూనే ఉంది.

రాఘవులు ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు. ఇప్పుడు రాఘవులుకు అయిదుగురు పిల్లలు. మొత్తం ఏడుగురయితే ఇద్దరు పోయారు. పిల్లలెవర్నీ బడికి పంపటంలేదని రాశాడు. తిండే పెట్టలేనివాడు పిల్లలకు చదువు లెక్కడ చెప్పిస్తాడు?

---

1 మహాత్మాగాంధీ.

"ఈ దుర్దశలో నేనుకూడా వాళ్ళగొంతుమీద లేను. అంతేచాలు" అని తన అంతరాత్మను సమాధానపరుచుకో జూశాడు సీతారామారావు. అధమం నెలకో పది పంపినా వాళ్ళకెంతో లాభంగా ఉంటుంది. కాని ఆ పదీ పంపటం అతనికి పడటం లేదు.

అతను పట్నంచేరి దాదాపు రెండేళ్ళు కావస్తోంది. ఈ లోపుగా రెండు మూడుసార్లు అత్తవారింటికి వెళ్ళి నాలుగేసి రోజులుండి వచ్చాడుగాని ఇంటికి వెళ్ళటం పడలేదు. అఖరుసారి వెళ్ళినపుడు ఎట్లాగో తెలిసి రాఘవులే చూడవచ్చాడు. అన్ననూ, అతని పెరిగిన గడ్డమూ, పీక్కుపోయిన మొహమూ చూడగానే సీతారామారావునకు శూలం పెట్టి డొక్కలో పొడిచినట్టయింది. ఎంత దారిద్ర్యం! అటువంటి దారిద్ర్యాన్ని మనుషులు ఎందుకు సహిస్తారు! తాను మారానని ఒప్పుకోవడం ఇష్టం లేక రాఘవులు చాలా మారాడనుకున్నాడు.

"అంతా కులాసాయేనా?" అన్నాడు సీతారామారావు.

"అదే కులాసా! ఉన్నాం!" అన్నాడు రాఘవులు విశాలంగా నవ్వుతూ. "ఇంటికేసి చూడకపోతివేం? ఒకసారి రారాదూ?"

"రావాలనే అనుకున్నా! రావటానికీ, పోవటానికీ ఒకరోజు ప్రయాణమే!" అన్నాడు సీతారామారావు.

"అవుననుకో! అయితేమటుకు? పెద్దవాడు ఇంటిపట్టునుండటంలా. ఈ ఊళ్ళోనే ఏదో ప్రెస్సులో పనిచేస్తున్నాడు. నెలకొకసారో, రెండుసార్లో వచ్చి రూపాయో, రెండూ ఇచ్చిపోతుంటాడు. నా కిప్పుడు వాడి బరువులేదు. పెద్ద పిల్లదే దిగులు పట్టుకుంది. ఎక్కడన్నా ఓ ఇరవై తెచ్చుకుంటున్న వాణ్ణిచూసి పెళ్ళి చేద్దామనుంది. ఆ బరువుపోతే మిగిలినవాళ్ళం ఎట్టాగోట్టా తంటాలు పడతాం మరి. ఏవంటావ్?"

ఏమనటానికీ సీతారామారావుకు పాలుపోలేదు. తాను తన అన్నకు ఏవిధంగానూ సహాయపడలేక పోవటం తలుచుకున్నకొద్దీ ఆశ్చర్యంగా ఉంది.

"నా సంగతీ అంతంత మాత్రంగానే ఉంది. సంపాదిస్తున్నానేగాని నా సంపాదనంతా పట్నమే తినేస్తుంది. కనపడని ఖర్చు!" అన్నాడు సీతారామారావు.

"కాదుమరీ!" అన్నాడు రాఘవులు.

"నీ కెప్పుడన్నా డబ్బు కావలిస్తే రాస్తూండు. అయిదుకూ పదికీ అవస్థ పడమాకు" అన్నాడు తమ్ముడు.

రాఘవులు నవ్వాడు.

"ఒరే! డబ్బవసరం ఎప్పుడూ ఉంటుంది. ఏం రాసేది? నీదగ్గర మిగిలినప్పుడు నువ్వే పంపిస్తూ ఉండు. నువ్వు ఇబ్బంది పడబోకు సుమా!"

రాఘవులు వెళ్ళిపోగానే సీతారామారావు హృదయంలో ఉండిన భ్రాతృప్రేమ కట్టతెగినట్టయింది. పుట్టి నూరుదాకా అమ్ముతుండిన రోజుల్లో రాఘవులు చదువుమాని నాగలి పట్టాడు. ఆ కాలంలో రాఘవులు బియ్యేదాకా చదివినా సంసారం ఇంత చితికేది కాదు. తన చదువుకోసం రాఘవులు చేసిన త్యాగం ఏమిటి?

ఇవాళ రాఘవులెక్కడున్నాడు? తాను ఎక్కడున్నాడు? రాఘవులు ఏడాదికి నూరు సంపాదిస్తున్నాడో లేదో!

పట్నం తిరిగిరాగానే తీసుకున్న జీతంలోనుంచి సీతారామారావు ఇరవై రూపాయలు అన్నకు పంపాడు. జీతం తక్కువ వచ్చిందేమని భార్య అడిగింది. అన్నకు పంపానన్నాడు భర్త. భార్య ఏమీ మాట్లాడలేదుగాని ఆవిడ మౌనం మాటలకన్న ఎన్నో రెట్లు భావయుక్తంగా ఉంది.

కొంచెం సేపుండి, "ఈనెల మటుకేనా? నెలనెలా పంపుతారా?" అన్నది.

సీతారామారావుకు చిరాకెత్తింది.

"నెల నెలా పంపుతాను. ఒక నెల తిని మిగతానెలలు పస్తుంటారా?" అన్నాడు.

"నెలకు ఇరవై చొప్పున?"

"నెలకు అరవై చొప్పున చదువుకింద నాలుగేళ్ళపాటు ఉమ్మడి ఆస్తిలో నించి తగలేశాను. మరేంపరవాలేదు. నా చదువుమూలంగా వాళ్ళకు తిండి లేకుండా పోయింది."

☆ ☆ ☆

యుద్ధం వచ్చింది.[1] మామగారు తన పలుకుబడితో సీతారామారావుకు రకరకాల ఉద్యోగాలిప్పించాడు. యుద్ధనిధి వసూళ్ళూ, ప్రాపగాండా, రిక్రూట్‌మెంట్, చివరకు సప్లయిశాఖ – వీటిల్లో పనిచేసి అతను చాలా డబ్బు పోగుచేశాడు. పెద్ద పెద్దవాళ్ళను పట్టుకున్నాడు. లంచాలు పెట్టాడు. కోటాలు సంపాదించాడు. యుద్ధం ముగిసినా సంపాదన హెచ్చింది.

ఇప్పుడు రాఘవులు పరిస్థితికూడా వెనకటంత ఘోరంగా లేదు. రాఘవులు పల్లెటూరు వొదిలి బస్తీ చేరాడు. కూతురికి పెళ్ళిచేశాడు. ముగ్గురుకొడుకులు చిన్న చిన్న ఉద్యోగాలు చేసి సంపాదిస్తున్నారు. రాఘవులుకూడా బస్తీలో పొగాకు వ్యాపారం, నేతి వ్యాపారం పెట్టాడు. ఇదంతా విని సీతారామారావు తన అన్న భోగభాగ్యాలతో తులతూగుతున్నట్లు ఊహించుకుని తన అంతరాత్మను సంతృప్తిపరుచుకున్నాడు.

కాని సంతృప్తిపడటాని కేమీలేదు. రాఘవులు పెద్దకొడుకు ప్రెస్సులో కంపోజిటర్. రెండోవాడు సైకిల్‌షాపులో పనిచేస్తున్నాడు. మూడోవాడు ఎవరో డాక్టరుగారిదగ్గర నౌకరీ చేస్తున్నాడు. రాఘవులు అల్లుడు కాస్త డొక్కశుద్ధి కలవాడు. యుద్ధానికి ముందరే కమ్యూనిస్టులతో కలిసి తిరగసాగాడు. కమ్యూనిస్టు సాహిత్యం తెగచదివాడు. తన సిద్ధాంతాలను బావమరుదులకు నూరిపోస్తుండేవాడు. ఇక రాఘవులు అమాయకుడు. కల్మషం ఎరగనివాడు. కాస్త మంచిగా మాట్లాడినవాళ్ళకు వీశెలకొద్దీ పొగాకూ, నెయ్యీ అప్పు పెట్టి భాగస్తుడికి కోపం తెప్పించాడు. రెండునెలలైనా తిరగకుండానే ఆ వ్యాపారంలో రాఘవులుకు భాగం లేకుండాపోయింది.

పెళ్ళయిన చాలాకాలానికి సీతారామారావు భార్య గర్భవతి అయింది. ఆమెను భర్త పుట్టింటికొకసారి తీసుకొచ్చినప్పుడు అన్నగారి ఇంటికి కూడా వెళ్ళాడు.

---

1 రెండవ ప్రపంచ యుద్ధం (1939–1945) ప్రస్తావన.

అక్కడి స్థితిగతులన్నీ చూశాడు. అన్నను చూస్తే జాలివేసింది. ముగ్గురు కుర్రాళ్ళకూ కమ్యూనిస్టుల భాష అలవడింది. ఇదంతా డబ్బు లేకపోవటంవల్ల వచ్చిన జబ్బే అనుకున్నాడు.

"అన్నయ్యా! వీళ్ళని నావెంట పట్నం పంపిస్తావా? ఎక్కడో ఒకచోట వేయిస్తాను" అన్నాడు సీతారామారావు.

"నీ యిష్టం" అన్నాడు రాఘవులు. కాని అతన్ని పిల్లలే పోషిస్తున్నారు. అందుచేత పిల్లలతోబాటు ఆయనకూడా పట్నం రావలసినవచ్చింది. అయితే, ఇప్పుడిటువంటి కుటుంబాలు సీతారామారావుకు బరువులేదు. అతనికి చాలా వ్యాపారాల్లో వాటా ఉంది. చాలా రకాల సంపాదన ఉన్నది. స్వాతంత్ర్యం వచ్చిన రోజునుంచీ అతను పలుకుబడిగల కాంగ్రెసు వాదులతో దోస్తీగా తిరుగుతున్నాడు.

రాఘవులు పిల్లలతోసహా పట్నం రావటం మంచిదయింది. వాళ్ళు వచ్చిన కొద్ది రోజులకే కమ్యూనిస్టుల మూలంగా కల్లోలాలు బయలుదేరాయి. రాఘవులు కూతురూ, అల్లుడూ అండర్‌గ్రౌండ్ అయిపోయారు.

సీతారామారావు రోజూ కమ్యూనిస్టులను తిడుతుండేవాడు. రాఘవులు పిల్లలు వాళ్ళని సమర్థిస్తుండేవాళ్ళు. ఈ విధంగా తనకెదురు చెప్పటం కృతఘ్నతలాగా తోచేది సీతారామారావుకు.

ఒకనాడు సీతారామారావు ఇంటికి వచ్చేసరికి ఇంట్లో కొత్త మొహాలు కనిపించాయి. తీరా విచారిస్తే వాళ్ళు రాఘవులు కూతురూ, అల్లుడూ అని తెలిసింది! రాఘవులు అల్లుడు తానూహించుకున్నట్టు లేకపోవడం చూసి సీతారామారావు ఆశ్చర్యపడ్డాడు. అతను ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడగలడు. ఎంతసేపు మాట్లాడినా తొణకకుండా హాస్యంగా కూడా మాట్లాడగలడు. పోలీసులుచేసిన దుర్మార్గాలను వర్ణించేటప్పుడుకూడా సాధారణ విషయాలు మాటలాడుతున్నట్టే కనబడ్డాడు. అయితే లోపల ఎంత ఆవేశాన్ని నిగ్రహించుకున్నాడో సీతారామారావు ఊహించగలిగాడు.

వాళ్ళిద్దరూ తమ ఇంట్లో అజ్ఞాతవాసం పెడతామంటారేమోనని సీతారామారావుకు చెడ్డభయం కలిగింది. కాని వాళ్ళు ఉండలేదు. అన్నాలుతిని చీకటిలో పడివెళ్ళిపోయారు. వాళ్ళను దిగబెడతామని బయలుదేరివెళ్ళిన రాఘవులు కొడుకులు తిరిగి ఇంటికి రాలేదు.

తరవాత కొద్దిరోజులకు రాఘవులు పెద్దకొడుకును కొండపల్లి ప్రాంతంలో కాల్చి చంపారు.

☆ ☆ ☆

మళ్ళీ ఎన్నికలు వచ్చాయి.[1] తనను కాంగ్రెసు మిత్రులు పోటీ చెయ్యమంటున్నారనీ, రెండువారాలపాటు వచ్చి అక్కడే ఉండి సహాయపడవలసిందనీ మామగారు సీతారామారావుకు రాశారు. సీతారామారావు భార్యతోనూ, కొడుకుతోనూ

---

[1] 1952 ఎన్నికలు, మొత్తం స్థానాలు 140, కమ్యూనిస్టులకు 41, కాంగ్రెసుకు 40, కిసాన్ మజ్దూర్, ప్రజాపార్టీ, కృషికార్ పార్టీ, సోషలిస్టు పార్టీ, స్వతంత్రులకూ 59 స్థానాలు లభించాయి.

వెళ్ళాడు. ఎవరెవరోవచ్చి తన మామతో మాట్లాడివెళ్ళే విషయాలన్నీ వింటుంటే కాస్మొపాలిటన్ క్లబ్ జ్ఞాపకం వచ్చింది.

ప్లీడరుగారు పోటీ చేస్తున్న సీటుకు కమ్యూనిస్టూ, లోక్‌పార్టీ మనిషీ, ప్రజాసోషలిస్టు కూడా పోటీ చేస్తున్నారు.

"ఏంటే కాంగ్రెసువోటు బాగానే చీలుతుంది. అదొక్కటే మనకు కాస్త ఆశ!" అన్నాడు ప్లీడరుగారు.

తీరా విచారిస్తే తన మామగారితో పోటీచేసే అభ్యర్థి రాఘవులు అల్లుడేనని తెలిసింది. సీతారామారావు అతనితో మాటలాడాడుకూడా. మంచిమాటలతో అతను తప్పుకుంటాడేమోనని సీతారామారావు చూశాడు కాని అటువంటి ప్రయత్నం అనవసరం.

మామగారి ఎన్నికలకుగాను సీతారామారావు స్వయంగా చాలా ఖర్చుచేశాడు. మీటింగులలో మాటలాడదామనికూడా అనుకున్నాడు. కాని కాంగ్రెసు పక్షాన మీటింగు పెట్టడమే దుస్సాధ్యమయింది.

ఆ ఎన్నికలో కమ్యూనిస్టు అభ్యర్థి గెలిచాడు. ప్రజా–సోషలిస్టుకుకూడా బాగానే వోట్లుపడ్డాయి. మళ్ళీ ప్లీడరుగారికి డిపాజిట్ పోయింది.

ఈ అర్థంలేని ఎన్నికకుగాను తన సొంతడబ్బు ఇరవైవేలదాకా తగలేసుకుని పట్నం తిరిగిపోతూ సీతారామారావు "రాఘవు లన్నయ్య అల్లుడు పైకి వచ్చినదారి ఏమిటో?" అనుకున్నాడు.

● *'ఆంధ్రప్రభ' వారపత్రిక – డిసెంబరు, 1954* ●

★ ★ ★

కె. సభా

# 21 ఎండమావుల్లో తిమింగిలాల వేట

ముక్కంటి సీమలో పెద్దకాటకం వచ్చింది. క్షామదేవత విలయతాండవంలో జన పదాలన్నీ అల్లల్లాడి పోయినవి. దప్పిక చల్లార్చుకోవడానికి చుక్కనీరు కూడా లభించని అసహాయ స్థితిలో కొంపాగోడూ వదలి ఆ దేశం ఎల్లలు దాటిపోతున్న కూలీల గోడు అవర్ణనీయమై పోయింది.

రోజా పత్రికల్లో ఈ వార్తలే అచ్చుకావడం వల్లా మంత్రివర్గం అత్యవసర సమావేశంలో కొన్ని ముఖ్య నిర్ణయాలను తీసుకొన్నది. మండలానికో మంత్రి వెళ్ళి అప్పటికప్పుడే కరువు నివారణ కార్యక్రమాలను ప్రారంభించాలని, ఎన్ని కోట్లనైనా వెచ్చించి ప్రజలను కాపాడి తీరాలని అమాత్యులందరూ కంకణం కట్టుకొన్నారు.

మత్స్యశాఖామాత్యులు రాజా సుందరప్రకాశ గోవర్ధన శతపథిగారు కనకాచలం జిల్లా పర్యటనకు బయలుదేరారు. మంత్రిగారి పర్యటన కార్యక్రమాన్నంతా స్థానిక పత్రికలు ప్రముఖంగానే ప్రచురించాలనుకొన్నందున ఆ జిల్లా పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ అవసరమైన ముందు జాగ్రత్తలన్నీ తీసుకొన్నాడు. దినపత్రికల విలేఖరులనే కాక మాసపత్రికల విలేఖరులను కూడా పిలిపించి కనకాచలంతో ప్రెస్సు కాన్ఫరెన్సును యేర్పాటు చేశాడు.

ఆరోజు కనకాచలం ట్రావెలర్సు బంగళాలో జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో మత్స్యశాఖామాత్యులు రాజా సుందరప్రకాశగోవర్ధన శతపథిగా రనేక కొత్త విషయాలను వెల్లడించారు.

డైనమెట్ పత్రిక విలేఖరి అడిగిన ఒక ప్రశ్నకు సమాధానం చెబుతూ మత్స్యశాఖామాత్యులు యిలా అన్నారు:

'మనం సామ్యవాద యుగంలో ఉన్నాము. రుచిలో బేడిసెలే బాగుంటాయనీ బుడ్డశక్కెలు బాగుండవనీ భేదాలుంచుకోరాదు. మనకు కొరదైనా ఒకటే కొరమేనైనా ఒకటే. పోజేపను పెంచుతూ మావురాయిని మరచిపోరాదు. మన నేతలవలె పీతలను కూడా సంరక్షించుకోవాలి. జపానులో నేను గమనించాను. వాళ్ళు సీఫుడ్‌ను బాగా ఉపయోగించుకొంటారు. ఈ కరువులో ప్రతి చెరువులో జెల్లలనో ఇసకు దొందులనో పెంచుకోకుంటే దేశం దెబ్బ తింటుంది.'

'మన చెరువుల్లో నీళ్ళుంటేగద సార్!' మధ్యలో ప్రశ్నించాడు సౌధామిని విలేఖరి.

'డోన్‌ట్ డిస్టర్బ్‌మి, దటీజ్ అనదర్ ప్రాబ్లం' అంటూ అమాత్యులు సిగరెట్ ముట్టించి–

'యుసీ... ఈ నత్తలున్నాయే వీటిని పుష్కలంగా పెంచాలి. వాటిలో కొవ్వుపదార్థం యెక్కువ. ప్రతి గుంటలోనూ పెంచే వీలుంది. అన్నట్టు మరచాను– నేను ఇండోచైనా వెళ్ళినపుడు అక్కడొక మ్యూజియంలో నాయెత్తు తాబేలునూ చూశాను. కాదూ కూడదంటే కొంత మసాలా ఎక్కువవుతుంది. కాని అది బలేరుచిగా కూడా ఉంటుందని నాన్‌వెజిటేరియన్ ఫ్రండొకాయన చెప్పాడు. అతడిపుడు చికాగోలో ఉన్నాడనుకోండి. ఇక్కడ చెరువు లెక్కువేగా?" ప్రశ్నించాడు గౌరవనీయులైన మత్స్య శాఖామాత్యులు.

అందరూ కాకున్నా ఇంచుమించు సగం మంది ఎక్కువనే చెప్పారు. కాని జాజిమల్లె పత్రిక కరస్పాండెంటు మాత్రం 'అర్థం చెరువులకు పైగా కట్టలు తెగిపోయినవే' అన్నాడు.

'డజన్‌ట్‌మేటర్. ఆ పని మనది కాదనుకోండి. ఇర్రిగేషన్ మినిస్టర్ చూస్తారు, మన చెరువుల్లోనే కాదు. ప్రతి బావిలోనూ చేపల్ని పెంచాలి. కరువులో చేపల్ని పెంచే కార్యక్రమం క్రింద కనీసం పదికోట్ల రూపాయలనైనా ప్రత్యేకించమని నేనే సి.యం.తో గట్టిగా చెప్పాను. కానీ మా ఫైనాన్స్ మినిస్టర్ ఒప్పుకుంటేగా? చివరికి యాభైలక్షలిచ్చాడు. కడకు నేను మొండిగా పేచీ పెడితే రెండుకోట్లు చేపలుపట్టే వలల్ని కొనడానికి అలాట్ చేశారు.'

'పెంచకనే పట్టే ప్రశ్న ఎక్కడుంటుందండీ?' చిన్నగా నసిగాడు సిగ్నల్ పత్రిక విలేఖరి.

"మీ కదే అర్థం కాదు. ఒక్కసారిగా వలల్ని కొంటే పెంచే చేపల్నంతా పడుతూ ఉండవచ్చు. జాలర్లు వీకర్ సెక్షన్‌కు చెందినవాళ్లు. అసలు మైనారిటీస్‌ను డెవలప్ చెయ్యడమే మన ధ్యేయం. సోషలిజం ముఖ్య సూత్రం ఒకటుంది. చిన్నచేపల్ని పెద్ద చేపలు మింగినట్లు మెజారిటీ కమ్యూనిటీస్ మైనారిటీ కమ్యూనిటీస్‌ను మింగి వేయడాన్ని చూస్తూ ఊర్కోరాదు. అందుకే మా డిపార్ట్‌మెంటు ఇచ్చిన ఇన్‌స్ట్రక్షన్సులో పెద్ద చేపలు చిన్న చేపల్ని మింగివేయ్య కుండా చూడాలి అన్నాము. ఒకే సైజు చేపల్ని పెంచమన్నాము. బొంబడాయిలుండే బావిలో మావురాయల్ని వదిలితే ఏమవుతాయి చెప్పండి? తాటాకు చేపల్ని పాము చేపల్ని పక్కల్లో విడిస్తే బతకవు!..." అంటూ టైం చూచుకొని 'వెరీజ్ అవర్ ఇన్‌స్పెక్టర్' అన్నారు అమాత్యులు. ఏడు కొండలవాడికంటే వెడల్పైన నామాలు పెట్టుకున్న బంట్రోతు వచ్చి 'వారు పరిగిల గుట్టలో తమ రాకకు యేర్పాట్లు చెయ్యడానికి వెళ్ళారు దేవరా! అన్నాడు.

పరిగిల గుట్ట అక్కడికి పాతిక మైళ్ళుంది. కార్యక్రమం ప్రకారం చెన్నారాయుడి చెరువులో చేపల పెంపకం కేంద్రానికి మంత్రి ప్రారంభోత్సవం చేస్తారు. మధ్యాహ్నం మూడు గంటలకు జరిగే ఆ ఉత్సవానికి కనకాచలం జిల్లాపరిషత్ అధ్యక్షులు మచ్చా జీవానందంగారు అధ్యక్షత వహిస్తారు. అదే సభలో బెస్తలకు కొత్తవలలు పంచబడుతాయి.

జిల్లాకలెక్టర్ కారు ముందు దారి తీసింది. ఆ వెనుక మత్స్యశాఖా మాత్యుల కారు. ఆ వెనుక పబ్లిక్ రిలేషన్సు డిపార్టుమెంటు వారి వ్యాను నిండుకూ పత్రికా

విలేకరులు, పరిగిలిగుట్ట సమితి అధ్యక్షుల జీపు ఇంకా యేవో కొన్ని వాహనాలు తుర్రుమంటూ దూసుకపోయాయి.

పరిగిలి గుట్టలో పెద్ద పందిరి వేశారు. భగభగమండే ఎండను లెక్కచెయ్యకుండా ఆ పరిసరాల నుండి పంచాయితీ సర్పంచులు, మునసబులు, కరణాలు, కాంట్రాక్టర్లు, సమితి ఉద్యోగులు, ఉపాధ్యాయులు వందల సంఖ్యలో సమావేశమయ్యారు. బాగా అలంకరించిన బండిపై పెద్దగాజుతొట్లలో రకరకాల చేపలు విలాసంగా విహరిస్తున్నాయి. వాటిలో బంగారువన్నెల మీనులూ, కుచ్చుతోకల జలపుష్పాలుకూడా వున్నాయి.

మంత్రిగారు పరిగిలిగుట్టకు చేరేలోగా గంట మూడు దాటింది. అక్కడినుండి రాయడి చెరువు అరమైలు. ఆ దారిపొడుగునా పెద్ద ఊరేగింపు. అమాత్యులను లారీపై అమర్చిన పూలపల్లకీలో కూచోబెట్టారు. ఆ పల్లకిని కూడా మత్స్యాకారంతో అతి రమణీయంగా పచ్చచామంతి పూలతోనే జోడించారు.

'కరువులో చేపల్ని విరివిగా పెంచండి'

'ఎండు చేపల తిండి గుండె బలాన్నిస్తుంది'

'పూజేపల్ని పెంచితే పుణ్యం వస్తుంది'

"తాబేళ్ళను పెంచండి, కుబేరులై పొండి'

'ఎండ్రకాయల కొవ్వులో ఎంతో బలముంది'

'అన్నిరకాల చేపల్ని పెంచడమే అసలైన సోషలిజం'

'కరువు బరువు తగ్గాలంటే కరవాళ్ళను వాడండి.'

'పప్పన్నం తినకండి, ఉప్పు చేపలు వాడండి'

ఇంకా రకరకాల నినాదాలు వ్రాయబడిన అట్టలతో కొమ్ములు, తుతార్లు పిల్లన గ్రోవులు, జేగంటలు, జవనికలు, తుడుములు, పలకలు, డోళ్ళు, మేళాలు, నాగస్వరాలు, కిలారిట్లతో భూ నభోంతరాళాలు దద్దరిల్లేటట్లు ఊరేగింపు అరంభమైంది.

మత్స్యశాఖామాత్యులు శ్రీ రాజా సుందరప్రకాశ గోవర్ధన శతపధి గారు కోరమీసాలను మెలివేసుకొంటూ సుఖాసీనులైన దృశ్యం నయనానందకరమైనా ఎండధాటికి తట్టుకోలేక విలేఖరులందరూ ముందుగా చెన్నారాయుడి చెరువువేపు దారి తీశారు.

పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరు వారిని చెరువులోనున్న వేదిక వద్దకు తీసుకపోయి తలో కొబ్బరిబోండా ఇప్పించాడు. వారా ఎలనీటిని త్రాగి సిగరెట్లు కాల్చుకొంటూ వేదికకు దక్షిణంగానున్న సిమెంటు తొట్టి దగ్గరకు వచ్చి నిలబడ్డారు. వంద అడుగుల పొడవు, నలభై అడుగుల వెడల్పున్న ఆ తొట్టిలో అర్ధానికి పైగా నీరున్నది. నును వెచ్చని ఆ నీటిని ఆ ఉదయమే తెచ్చిపోసినట్లు అతిప్రయత్నంమీద కనుగొన్నారు. ఏడేండ్ల క్రితం మొరవసాగిన చెన్నారాయుడి చెరువులో మూడేళ్ళనుండి నీటిచుక్క లేదు. నిరుడు చెరువు గర్భంలోనే జొన్నలు చల్లినా వానబొట్టు లేక విత్తనాలు మాడిపోయాయట!

ఐనా మత్స్యశాఖామాత్యులు ఇటీవలనే అనేక దేశాలలో పర్యటించి వచ్చిన విశేషానుభవాలతో కరువులో చెరువుల్లో చేపల్ని పెంచే విస్తృతమైన పథకాన్ని చేపట్టారు. అతి సాహసోపేతము, పరిశోధనాత్మకమూనైన ఈ పథకంతో ముక్కంటిసీమ లెక్కలేనన్ని టన్నుల చేపల్ని ఉత్పత్తి చెయ్యగలదని వారి విశ్వాసం. ఈ దెబ్బతో

ఇంటర్నేషనల్ మార్కెట్టు లభించినా ఆశ్చర్యం లేదు. విలేఖరులా విచిత్రమైన భోగట్టాలనంతా సేకరిస్తుంటే అప్పుడే జీపునుండి దిగిన ఫోటోగ్రాఫర్లు ఊరేగింపు దృశ్యాలను కెమరాలలో సంక్షిప్తంగా దాచుకొంటున్నారు.

ఆకసమే చిల్లులుపడే అట్టహాసాలతో ఊరేగింపు చెన్నారాయడి చెరువులో ప్రవేశించింది.

బ్రహ్మాండమైన పందిరిలో అత్యంత శోభాయమానంగా అలకరించబడిన వేదికపై అమాత్యశేఖరులు, నాయకులు ఆసీనులైన వెనుక స్థానిక నియోజకవర్గం యం.యల్. ఏ. మైక్ ముందు నిలబడ్డారు. రెండున్నరమీటర్లు వ్యాసంకల వారిబొజ్జపై హాయిగా శయనించి యుండిన వారి హస్తాలను అతిప్రయత్నంమీద పైకెత్తి ఒక్కదండం పెట్టి సభాంగణము నుద్దేశించి వారిట్లా అన్నారు:

'నా రైతు సోదరులారా! కూలీ సోదరులారా! హరిజన సోదరులారా! ఈ దినం శుభదినం. ఎన్నో వ్యయప్రయాసలతో ఎంతో దూరం నుండి ఈ చంద్ర నిప్పులుకురిసే – బండలైనా చిట్లిపోయే యెండల్లో మన మంత్రి మన మధ్యకే వచ్చాడంటే ఏమనాలి? ఇది ప్రజా రాజ్యం. సోషలిజంలో ఇదే ఉంది. నా సేవ మీకు తెలిసిందే. గుంద్రాళ్ళపల్లె కుంటకట్టకు మన్ను పోయించాను. పాపాది ఊరిబడిలో రెండో టీచర్ని వేశాను. సక్కావాళ్ళ పల్లెలో మంచినీళ్ళ బాయి తొవ్వించాను. ఇప్పుడు వేళకాదు. ఎన్నో ఉన్నాయి. ముందు మంత్రిగారు మాట్లాడుతారు" అని అంటుండగానే–

సన్మాన పత్రాలు, సన్మానపత్రాలు... సన్మానపత్రాలు' అంటూ కేకలేశారు జిల్లా పరిషత్ చేర్మన్ మచ్చా జీవానందంగారు.

కోర్టులో విన్పించే నిశ్శబ్దంవంటి ఆ కేకతో సభలో నుండి పది మంది వేదికపైకి దుమికారు. వాటిలో ఒక్కటి మాత్రం చదివితే చాలన్నారు అమాత్యులు.

పరిగిలిగుట్ట హైస్కూల్ సీనియర్ తెలుగు పండిట్ హానరబుల్ పొయట్ సుగ్రీవాచార్యులుగారు గసపోసుకొంటూ మైక్ దగ్గరికివచ్చి వణుకుతూ గొంతును సవరించుకొని పఠనానికి ఉపక్రమించారు. ఆయన పంచాయతీ సమితికి ఆస్థాన కవి.

గౌరవనీయులు ముక్కంటి సీమ మత్స్యశాఖా మాత్యులు శ్రీ రాజా సుందరప్రకాశ గోవర్ధన శతపథిగారికి పరిగిలిగుట్ట పంచాయితీ సమితి సమర్పించిన సన్మానపత్రము.

అమాత్య సత్తమా!

అత్యంత పరాక్రమోపేతులై, అరివీర భయంకరులై, అత్యధిక శౌర్య ధైర్య సాహసోపేతులై, అతల వితల తలాతల రసాతల పాతాళ లోక భయద వికటాట్టహాస వీర విహారంతో అలనాటి భారత స్వాతంత్ర్య సంగ్రామం రంగమునందు దుమికి విజయ దుందుభి మ్రోగించి స్వరాజ్యమును సాధించి..."

అనగానే సభాగణంలో నున్న సౌదామిని కరస్పాండెంటు 'అనాడీయన వయస్సు ఐదారేండ్లుంటాయా' అని నసిగాడు' కానీ ఎవరికీ వినిపించలేదు. "స్వరాజ్యమును సాధించి నేడీ సామ్యవాదమును స్థాపించుటకు కంకణము దాల్చి మత్స్య శాఖామాత్యులుగా మన ముక్కంటి సీమలోని ఒక్కొక్క చెరువులోనూ లెక్కలేనన్ని

చేపలను పెంచి దశదిశలకూ పంచి కరువును నివారించి కొత్త చరిత్రను సృష్టించుటతో అవతారమెత్తిన మత్స్యవతారుడైన మీరాక మాడెందముల కానందాయకమై నోటమాట రాక యున్నది.

మంత్రిశేఖరా!

మా చేదబావులలో చేపలు లేవు, నీరులేకున్ననూ బ్రతికే చేపలను శాస్త్రజ్ఞులు పరిశోధించునట్టు ఉత్తరువులు దయచేయ ప్రార్థన, మంత్రిపుంగవా!

మా వాగులలో అక్కడక్కడ మడుగులున్నవి. వాటిలో వదలుటకు తాబేళ్ళను నత్తలను సరఫరా చేస్తూ వాటిని భక్షించడానికి వచ్చే కొంగలను కాల్చడానికి తుపాకులతో పాటు లైసెన్సులు కూడా యిచ్చునట్లు కలెక్టర్ల కిప్పుడే అర్డర్లు అనుగ్రహించమని మా విజ్ఞప్తి!

ప్రజలపాలిటి పెన్నిధీ!

మా చెరువులన్నీ ఎండిపోయి ఉన్నందున ప్రతి చెరువులోనూ, సిమెంటు తొట్లు కట్టించి వాటినిండుకూ నీటిని పోయించి చిన్న చేపలతోపాటు పెద్ద చేపలను కూడా తెప్పించి కొరదలు బ్రతకడానికి వీలుగా సిమెంటు తొట్టిలో బొరియలు త్రవ్వించమని అభ్యర్థన.

మేరునగధీరా! సాగరగంభీరా!

మా పెరళ్ళలో నీటి తొట్లలో కూడా చేపల్ని పెంచడానికి అనువుగా వారానికొక కిలోవంతున ఉలసల్ని జెల్లల్ని సరఫరా చేసి ఈ కరవులో ఆదుకోవాలనీ ఈ చేపలనంతా పట్టుకోవడానికి ఇంటికొక వలను కూడా మంజూరు చేయాలని ప్రార్థన.

ఇంత శ్రమతో ప్రయాసతో మా మొర ఆలకించిన మీకు దేవదేవులు శివుడు, అల్లా, ఏసు ఆయురారోగ్య ఐశ్వర్య భోగభాగ్యములను ప్రసాదించుగాక!

ఇట్లు,
పంచాయతీ సమితి అధ్యక్షులు
మరియు సభ్యులు.

పరిగిలిగుట్ట
1-10-1972.

చిరునవ్వు లొలికిస్తూ సమయోచితంగా తల నాడిస్తూ ఉన్న మంత్రిగారు పైకి లేవడంతో దాదాపు వంద పూలదండలు వారి మెడను అలంకరించాయి. పరిగిలి గుట్టంత పూలగుట్టను ప్రక్కకు నెట్టి అమాత్యవర్యులు అత్యంత గంభీరస్వరంతో ఇలా అన్నారు:

"సోదరులారా!" అనడంతోనే కెమెరాలు క్లిక్కుమన్నాయి. కరస్పాండెంట్లందరూ కలాలు తీసుకొన్నారు. ప్రేక్షకుల చెవులు రిక్కపొడుచుకొన్నాయి.

'ముందుగా కావలసింది పని' అంటూ మంత్రి ఉన్నట్టుండి వేదిక దిగారు. వారి వెంట నాయకులూ నడిచారు. సిమెంటు తొట్టిలోనికి మంత్రిగారు గాజుతొట్టిలోని చేపల్ని వదిలాడు. అప్పటికే సుమారు కాగిన వేడినీటిలో ప్రవేశించిన చేప పిల్లలు అల్లల్లాడుతుండగా అమాత్యులు వేదికవద్దకు వచ్చి ఉపన్యాసం ప్రారంభించారు.

ఇంగ్లాండు, స్కాట్లాండు, ఐర్లాండు, పోలెండు, ఫిన్లాండ్, నార్వే, స్వీడన్, డెన్మార్క్ మొదలైన దేశాలలో తాను చూచిన చేపల్ని గురించి చెబుతూ ముక్కంటి

సీమనంతా మత్స్య పరిశ్రమతో నింపి తన బాధ్యతను నెరవేర్చుకొంటానన్నారు. కరువులో చేపల్ని పెంచాలనీ కరువు నివారణకి అదొక్కటే తరుణోపాయమనీ సెలవిస్తూ పరిగిలిగుట్టలోని బెస్తలకు వలలను బహూకరించారు. వలలతోపాటు సింగితాలు, కొడాలు, గాలాలను కూడా విరివిగా పంచి పెట్టి చేపల్ని ఎలా పట్టాలో కూడా పట్టి చూపెట్టారు. ఆయాశాఖకు అధిపత్యం వహించే అమాత్యుడాయా పనులను స్వయంగా చేసి చూపడం ఆ దేశంలో అనుశ్రుతంగా వస్తున్న సాంప్రదాయం.

మంత్రిగారు తొట్టిలోకి వదలిన చేపలన్నీ నీటిపై తేలుతూ ఉన్నందున సింగితంతో దేవి దేవి తీసారాయన. చేపలట్లా వెల్లికిల్లా పడిపోవడం ఎందుకని జాజిమల్లె పత్రిక కరస్పాండెంట్ అడుగబోతుండగా పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ అతని వెనుకనుండి చొక్కాలాగాడు! కరస్పాండెట్ మౌనంగా వ్యాన్ వైపు నడచిపోయాడు.

మత్స్య శాఖామాత్యులు సరదాగా పట్టిన చేపల్ని ఆ జాలర్లకే యిచ్చి మళ్ళీ వేదికపై ఆసీనులయ్యారు.

పంచాయతీ సమితి అధ్యక్షుల కృతజ్ఞతతో సమావేశం ముగిసిపోయింది. ఆ సమాయానికి సరిగ్గా పొద్దుకూడా పోయింది.

పరగిలిగుట్టలో ఆ రాత్రి డిన్నరున్నట్లు విలేఖరులకు తెలిసింది. వెజిటేరియన్స్ల క్కూడా మత్స్యాల ఆకారంతో కజ్జికాయలు, రొయ్యల రూపాలతో బూంది వడ్డించబడుతాయనీ ఆ రాత్రికేదో ఎంటర్‌టెయిన్‌మెంటు ఉంటుందనీ పౌరసంబంధ శాఖాధికారి సెలవివ్వడంతో విలేఖరులందరూ ఆలోచనలో పడ్డారు.

కరువులో విందులేమిటని నసిగాడు సౌదామిని విలేఖరి.

అసలు బస్సెక్కడుందయ్యా మనకు? ఆయన బండే శరణ్యం అర్ధరాత్రైనా" అంటూ అంగీకరిస్తున్నట్టు తల ఊపాడు జాజిమల్లె కరస్పాండెంటు.

అందరూ పంచాయతీ సమితి అధ్యక్షుల వారి కొత్త భవనంలో ప్రవేశించేలోగా హాలంతా విస్తళ్ళు కన్పించాయి.

ఎన్నోరకాల పిండివంటలతో పంచభక్ష్యపరమాన్నాలతో వడ్డించిన ఆ విందును ఆరగించి తాంబూలాలను సేవిస్తూ అక్కడే అందిచ్చిన సిగరెట్లను కాలుస్తూ అప్పుడే ప్రారంభమైన వినోద కాలక్షేపంలో నిమగ్నులైన విలేఖర్లు కరువునే కాదు– ఈ లోకాన్నే మరచిపోయారు.

మత్స్యశాఖామాత్యులు శ్రీ రాజాసుందరప్రకాశ గోవర్ధనశతపధిగారు మరునాటి కార్యక్రమాన్ని గురించి కలెక్టరుతో ముచ్చటిస్తూ సోఫాలో పడుకొన్నారు.

చేపల మంత్రి పర్యటనలో తొలిరోజు కరువు నివారణ కార్యక్రమం నిర్విఘ్నంగా జయప్రదంగా జరిగిపోయింది. ముక్కంటి సీమ సామ్యవాద ప్రభుత్వ క్షేత్రరధం ప్రగతి పథంలో ఒక కిలోమీటర్ ముందుకు సాగింది.

● 'నీటిదీపాలు' కథా సంకలనం నుండి ●

★ ★ ★

22

మంద రామారెడ్డి

# సర్కారు కిస్తు

"ఈ రసత్తానికి మన నడిపిదానికి పదకొండేండ్లు నిండుతయి. సమర్తీడుకొచ్చిన పడుచుదాన్ని ఇంట్లోపెట్టుకొని ఇట్లా పెండ్లి పేరంటమనిగూడా తలవకుండా మీకు కంటికి నిద్రలెట్లొస్తున్నయిరా నాయనా? నాదీ పెద్దప్రాణం, వూరు దూరమయింది. కాదు దగ్గరయింది. నా తల్లి తల్వాలైనా కండ్లజూస్తానో లేదో! బతికినన్నాళ్ళు బతుకవోతానా! యేదో ఓ కులమింటయ్యను చూచితెచ్చి ఇంత పప్పన్నంబెట్టి దబ్బున దారవోస్తే యెందుకైనా బాగు." వంగుతూ వాలుతూ వడ్డెనతెస్తూ కొడుకు కోదండయ్యను మందలిస్తూంది తల్లి బాగమ్మ.

"తోటకాడి కెళ్ళి మిరపకాయలు తెంపుకునేసరికే పొద్దుకూ మాకూ సరిపోయె. ఇంట్లో పోటువడ్డ బియ్యంగూడా లేకున్నె. ఈ పూటకు నూకలుమాత్రం వుంటే వొండినా" అని స్పష్టంగానే సమాధానం చెబుకూంటుంది భోజనం మీద గూచున్న భర్తకి భార్య రంగమ్మ, ఒకప్రక్క చంటిబిడ్డకు చన్ను నోటబెడుతూ, వేరొకప్రక్క యేడుస్తూ మారాంచేసే యెడబిడ్డను కాళ్లమీద వేసుకొని సముదాయిస్తూ.

కోదండయ్య తల్లిమాటలుగాని, భార్యమాటలుగాని వినిపించుకోవడంలేదు. బజారు తట్టు వినిపించే తప్పెటదరువుదిక్కే చెవులు వాలేశాడు. తప్పెట హటాత్తుగా ఆ యింటిమూలన ఆగానే... "సర్కారు కిస్తు రేపే పోవాలెనంటా, రకంగట్టని ఆసాములంతా రేపు తెల్లవారుగట్లా, రసీదు బొక్కులూ, రకం తీసుకొని కరణం పటేండ్లముందరికి చావట్లకు రావలెనంటా, తకావీరకం, కిస్తురకం అంతా కలిపి కట్టాలెనంటనో హోయ్..." అని కావలిచిన్నోని కేక వినిపించింది. అవ్వలుకిస్తు వసూలు చేసేరోజులు అవి.

నూకలబువ్వ, గోకరికాయ కూర పదిబుక్కలైనా దిన్నాడో లేదో కోదండయ్య చాటింపువిన్న తర్వాత అతనికి ఒక్క బుక్కైనా నోట్లకు వోవడంలేదు. కొడుకువాలకం చూస్తున్న ముసలమ్మ "పాలు కాగినయి నాయనా" అని పొయిమీది పాలచట్టిని ఈడ్చుకుంటూ దగ్గర తెస్తుంది. కాని "ఊహుఁ" అని అతడు పీటమీదినుంచి లేచి చేయి, మూతి కడుక్కొని అవతలియింట్లోకి వెళ్ళిపోయాడు. "అయ్యో కొడుకా!" అనుకుంటూ ముసలమ్మ తిరిగి పాలచట్టిని తీసుకవెళ్లి పొయిమీద ఉంచి మూత పెట్టుకుంది.

కుంపటిముందు కూచొని కారుచుట్టను కాల్చుకుంటూ ఆలోచనలో పడ్డాడు కోదండయ్య. తప్పెటదరువు చెవులోబడ్డ లగాయితీ అతనికి దడదడ వదలలేదు. నిన్న పొద్దుటిపూటే మాలిపటేలు నరసింహారెడ్డి పిలిపించి తన కాతాకు తగిలేరకం వివరంగా చెప్పాడు– "యఱ్ఱచెల్కకు ఇంతా, చెరువుకొమ్మొచిడతకు ఇంతా, సివారంచు చెల్కకు ఇంతా, బావి పొలానికి ఇంతా, మొత్తానికి పునాసకు ఇంతా, తరికి ఇంతా, అసలు ఇంతా, దానికి లోకల్ ఫండు ఇంతా, (జమాబంది కర్చులు, గిర్దావరు మామూళ్లు మినహా) అంతా కలిసి ఇన్నూటా ముప్పైయేడు రూపాయిల పాంచాన చార్ పాయి" అని.

"కరువులోనే అధికమాసం అన్నట్టు తకావీరకం గూడా యిప్పుడే తగులాలా! ఇంకా నయం. ఎరువుసంచులూ, విత్తనాలూ గురించి అడుగలేదు. జిరాతి (వ్యవసాయశాఖ) వాళ్ళదే పుణ్యం. శ్రావణమాసపు వరపుల్లో నేల సెనగచేనుకు వేరుపురుగు తగులకుంటే అది బాగానే సమయానికి అక్కరొచ్చేది. అప్పుడట్లా మంచి పొట్టపాలువోసే కాలంలో జీతగాడు యెగదొబ్బి రిక్షాలాగ పట్నమెళ్లె. ఆ కాస్తవరిమళ్లు అవురుతప్పె. పిల్లల నోట్లో మన్నుపడె. జ్వరమొచ్చినా బువ్వలేదు. జేజకు పెడదామన్నా బువ్వలేదు. కాలంలో కరువు అన్నట్టు చిత్త పొశం వోసింది మొదలూ మింటికి మంటికి ఒక్కటేధార కుండతో కుమ్మరించినట్లే. ఈనినకంకి ఈనినట్టే బుసిరాలి పాలారిపోయింది. ఈననిది ఈననట్టే నిలువునా నల్లగట్టి పడిపోయింది. తిప్పి తిప్పి కొడితే జొన్నలు, సజ్జలు కలిసి ముప్పందుము ఇంటికొస్తే యేమన్నట్టు? చాటప్పలకు సరిపెట్టంగా సంక్రాంతిదాకనైనా జీవనము జరిగేటట్టులేదు. అమిదపుచేల సంగతి చూస్తే దినదినగండం. యెప్పుడూ దాసరి పురుగే. ఇక యాసంగిపంట వకనాటిపంట, రేపటిదానికి రూపంలేదు."

ఒకటా? రెండా? యెవనికొంపకు కన్నమేయాలి? సర్కారురకం ఆగేదెట్లా? జొన్నో సజ్జో! ఇంత పూట జరుగుతూంది. అయిన్ని బోర్లవేస్తే ఆవల బుక్కెడేదెట్లా? ఒకరా! ఇద్దరా! వచ్చేటోడు, పొయ్యేటోడు, బిచ్చగాడు, అచ్చగాడు అటుంచి చదువుపంతులు మొదలూ, చాకలి వరకు పూటకు యేడుగురు. అమిసిన బత్తెం అయిదుసేర్లు గావాలి రోజొక్కంటికి.

నులకమంచంమీద గొంగడి అడ్డమేసుకొని కూచున్న కోదండయ్య ఇవన్నీ తలుచుకుంటూ, అట్లే నెత్తికి చేతులు పెట్టుకొని కూర్చున్నాడు. అర్ధరాత్రిమీరినా అతనికి రెప్పకు రెప్ప అంటుకోవడంలేదు.

రంగమ్మ చంటిబిడ్డను పక్కనేసుకొని పండుకొంది. యెడబిడ్డ గడెగడెకు యేడుపు సాగిస్తుంటే "దానికి కండ్లు మంటలేస్తున్నాయో ఏమో! ఈ రెండుమాపులనుంచీ దానికి నిద్రలేదూ, నాకూ నిద్రలేదు. ధారణమేమొ చేసింది. యేంజేయాలె? ఈ పాడు గాన్పునూనె వచ్చింతర్వాత ఇంత పిల్లల మాడపట్టుకు రాసేదటువోగా, కంట్లో యేసుకుందామంటే గూడా అంత అముదపుచుక్క గతిలేకుంటయింది" అని విసుగుతూ జోకొడుతుంది ముసలమ్మ.

కొమ్ములా అలానే కూచున్న కోదండయ్య "కొక్కొరోకో" అన్న కోడికూత విని, గొంగడి దులుపుకొని బుజానవేసుకొని పొలం మొగాన పొయ్యాడు.

☆ ☆ ☆

చిత్తెండ పటపట గొడుతూంది. ఆసామీలకు సగం నాగులకూ, సరినాగులకూ యిచ్చిన తిండిగింజలు తిరిగి ప్రోగుజేసి భద్రపరచడానికి పాతగుమ్ములు వూతవేయించి అరబెట్టిస్తూ, తాను వుల్లిగడ్డ చెరుక్కొంటూ వాకిట్లో నిల్చున్నాడు, షావుకారి మిర్యాలపాపయ్య.

యెప్పుడో వచ్చి గొంగడి మడతమీద నెట్టుగా గోడనీడలో గూచున్న కోదండయ్య సావుకారి యెప్పుడింట్లకు వస్తాడా, యెప్పుడడుగుదామా అని అనుకుంటూ చుట్టలకు పొగాకునలక నలుచుకుంటూ చూసుకుంటూ గూచున్నాడు.

చెరిగిన ఉల్లిగడ్డలచేట చేతబట్టుకొని కోదండయ్యను చూసి గూడా చూడనట్టే దుకాణంలోకి పోతున్నాడు సావుకారి పాపయ్య.

'నీవద్దికే వచ్చినా' అంటూ వెనుకాల నడిచాడు కోదండయ్య.

'యేంపని?'

...మూడు నిముషాలు మౌనంగా గడిచాక 'కిస్తు' అన్నాడు కోదండయ్య.

'కిస్తా? కిస్తులేదు గిస్తులేదు.'

'అట్లంటే యెట్లా?' మందస్వరంతో అన్నాడు.

"యెట్లాలేదు యాసంగిలేదు."

"గతి!" దీనంగా అన్నాడు.

"గతో, గంగో, నావద్ద రాగిదుడ్డు దొరకదు."

"సర్కారురకం, ఆపేదెట్లా? యెందు కిట్లా జేస్తవ్. నీ సొమ్ము ఇదివరకేమన్నా ఉంచుకున్నామా?"

"ఆగకుంటే నా యల్లుని కట్నాలా! అంతా ఉంచుకోనివాడవే. పెద్దబిడ్డ పెండ్లిజేస్తె కోరా పత్రం అట్లే మూలుగుతుంది. ఒక్క దమ్మిడి వసూలులేదు. మళ్ళీ అల్లునికేదో కట్నాలన్నీ కానుకలనీ బట్టలు బాతలు యాభైకై పైగా చేసి కూచున్నావ్. విత్తనాల బాబతుత గిద్దెడుగూడా గొలువలేదు. ఈ రెండు సంవత్సరాలనించీ తిండి గింజల బాపతు తీసుకపోయిన ముఖమే కాని యిచ్చిన ముఖం గాదు."

పాపయ్య సావుకారి యిచ్చిపుచ్చుకునే మోతుబరి మనిషి. అతడా వూరికి వచ్చేనాడు ఆస్తి అంటూ వెంట యేమీ తేలేదు. అసిమిసంచిలో అర్ధసేరు నూకలూ, తక్కెడా, బాట్లూ తప్ప. మొదలు చిన్నపూరిగుడిసెలోబుట్టి దుకాణంబెట్టి బతికాడు. అట్లే అట్లే నాలుగు కాసులు చేజిక్కించుకొని ఆసామీలకు నాగు గింజలీయడం ప్రారంభించాడు. టిక్కమొగపు అమ్మలక్కలకు అతడు చిల్లరసామాను యిచ్చి లెక్కరాసే అప్పుడు సంపటం మీద బెల్లందుడ్డు, బెల్లంబాపతు దుడ్డు అని అతకంత కల్పించి మడతరాతలు రాసి అది పెద్ద కాతాకెత్తి చూపి దానికి మిత్తిగట్టి పంటల మీద గింజలు గొలిపించుకొని ఆరు నెలలనుండీ యిచ్చుకుంటూ వచ్చాననీ బజారు ధరకు పావలా తక్కువ చొప్పున ధరలు ఖరారు చేసుకొనేవాడు. మిత్తికిచ్చిన రూపాయిలకు ముద్దతు దాటితే పెచ్చులు గట్టేవాడు. తిండిగింజలు కాగులలో బోసి, గుమ్ములలో మెత్తువెట్టి, గోనెసంచుల్లో గుట్టేసి, పాతర్లలో పూడ్చి, శ్రావణ భాద్రపద మాసాల్లో తీసేవాడు. శ్రావణ భాద్రపద మాసాలు తెలుగుగడ్డకు ప్రకృతి ప్రసాదితమైన గడ్డు కరువుకాలాలు. పాతపంటల తాలూకు చిట్టెడు గూడా మిగిలివుండవు. కొత్తపంటలు అప్పటివరకు

యేమీ మెదలవు. కొడవలి పడని కత్తెరపంట లేవైనా ఉంటే కుంభవర్షాలూ, పిల్ల గోదావరులూ కలసి సర్వమంగళం చేసే శుభదివసాలు అవి. సమయజ్ఞతగా పాపయ్య తన అర్థిక సూత్రప్రకారం, కడుపు కక్కుర్తిని రేపే అట్టి కాటకంలో పేద రైతులను ముప్పై మూడుమాట్లు ఇంటిచుట్టు తిప్పించుకొని, ముప్పతిప్పలుబెట్టి అప్పలిస్తూ, సరివాగులకు రాయించుకోవడమే కాక, "గండ గరువులో కూటిగింజ లిస్తున్నాను సుమా?" అని చూపి చెప్పి, చొప్ప, గడ్డి బండ్లకొద్ది మెప్పగా తీసుకొనేవాడు. అంత జాణతనంతో అతడు గాదెపంటను పెంపుజేస్తూ వచ్చాడు. రెండు భవంతుల యిల్లు గట్టాడు. మూడు లగ్నాలు జేసుకున్నాడు.

కోదండయ్య కాతా తాలూకు నాగుబాబతు గింజలు కొన్ని మూడేండ్లనుండీ అట్లే పట్టుకొచ్చినై. వచ్చేవాడి వద్ద వడ్డీకేడ్చే సామెతగా అతడు నలుగురిని గూర్చి నానాచేసి గింజకు మూడుగింజలు పద్ధతిప్రకారం తీర్పు చెప్పించుకొన్నాడు. పైగా గొణుగుతూ, సణుగుతూ 'యేదో నూటికి నూలుపోగు' అనుకుంటూనే ఓ దాపటెద్దును దాని కిందికి తూడ్పు వెట్టుకున్నాడు.

ఇప్పుడు గూడా కోదండయ్య వద్ద అతడేదో గిరువుకో కుదవకో ఒప్పందానికో ఆశించి అలా సర్కారురకం దగ్గరకొచ్చేసరికి అడ్డగాలేసి కూచున్నాడు. ఈ కోపమంతా కోదండయ్యకు లేకపోలేదు. కాని బ్రతికే దినమంతా ముందుంది. షావుకారితో గాని, సర్కారుతో గాని కంటుగట్టుకుంటే రైతు జీవితంలో మేడి మెదలదూ, కాడి కదలదూ. అతన్ని బతిమిలాడలేక, బాములాడలేక కోపం కొనముక్కుమీదికి వచ్చింది. అయినా చేదుమందులా దిగమింగుతూ లేచిపోయి చేతులు దొరికించుకొని, "చూడు పాపయ్యా! రేపు నలుగురు పాలివాళ్ళ ముందు నన్ను గడ్డి గరపించకు. నగేవాని ముందు జారిపడినట్టవుతుంది నా పని. ఇవి చేతులుగావు కాళ్ళు" అని అడుక్కొన్నాడు. ఉహూ ఫలంలేదు. అతడు దులిపి వదిలించుకొని స్నానాలగదికి వెళ్ళిపోయాడు. కోదండయ్య చేతులు నలుచుకుంటూ వచ్చిన మొఖాన పొయ్యాడు.

ఇంటికి వెళ్లి అతని కేమీతోచక నెత్తికి చేతులు దెట్టుకొని నేలలు జూస్తూ కూచున్నాడు. వంగి వంగి మోకాలు బట్టుకొని నడిచేతల్లి ముసలమ్మ దగ్గరొచ్చి, "సావుకారి యేవన్నడు నాయినా!" అని అడిగింది. మారు మాట్లాడతోచక చింతలుజేస్తున్న కొడుకు ముఖం చూడలేక ఆమె వెనికికి మళ్లి, "యెట్ల మాట దక్కించుకొంటావో కొడకా! తనోడనక, మనోడనక, కులమనక, తలమనక కూస్తాడా పటేలు. సర్కారుతోమాట. యెదురుగా వుంటే యెందుకైనా మంచిదికాదు. యిజ్జతువోకుండా మొకం దప్పించాలె. 'సావుకారిముందు సర్కారుకు చాటు' అన్నరు. ఇన్ని దినాలోలె నా వద్దనన్నా యేదన్న బంగారం ఉండికాలవడిందా! అంతా గండగత్తెర వచ్చింది కొడుక్కు" అని నిట్టూరుస్తూ, మూలుగుతూ పోయింది ముసలమ్మ.

బాగమ్మకు చిన్నతనంలోనే మొగుడువోయి నెత్తివనీడ లేకుంటైనా వ్రేలెడంత మొగమొల్క కోదండయ్యను నమ్ముకొని, వెంట్రుకపట్టుకొని కొండవాకినట్లు నడుపు కుంటూ వచ్చింది సంసారాన్ని. అకాస్త భూమికే పాలివాళ్లు పెట్టే పంచాయతీలు, చిక్కులు, కాలికితప్పితె మెడకూ మెడకుతప్పితే కాలికీ ఉండేది ఆ రోజుల్లో. కరువనక

కాలమనక అప్పుడు తులం ఇప్పుడు తులం తెగ్గొట్టి, సర్కారుతాకిడి వచ్చినప్పుడల్లా అష్టకష్టాలుపడి "చినుగని వస్త్రం" అనుకొని ఆయింతా భూమిని నిలబెట్టుకు వచ్చేసరికి ఆమె గొంతులో గుండ్లుగూడా కరిగిపోయినై. యిప్పట్లో అలాంటి బండార మేమీలేదు మాటదక్కించుకోను.

"సర్కారుకు చాటు" అన్న తల్లిమాట అతనికే మర్థ మిచ్చిందో ఆ కాసేపటికే దుప్పటి దులుపుకొని బయటికెళ్లిపొయ్యాడు. అతడిపుడూళ్లోలేడు.

☆ ☆ ☆

అక్టోబరు 11 వ తరీకు కిస్తువోయేరోజు. చావడిముందు అంతా హడావిడి ఉంది.

"వీనమ్మ ఊరమ్మను మాదుగులడగా అంతా చిన్నాయనలూ, పెదనాయనలూ, బావలూ, మామలూ, కొంపనిండా తనవాళ్లే, మనవాళ్లే" అయ్యాక యెవరినేమనాలి, యెవరినేమనగూడదు? తిట్టవోతే అక్కబిడ్డా కొట్టవోతే యాకటిమనిషి. ఈ వూళ్ళో సర్కారురకం వసూలుచేసేవరకు కురుక్షేత్రంలో యుద్ధంజేసిందానికన్నా కాసంతెక్కువేగాని తక్కువగాదు. ఒకయ్య బాపనయ్య, ఒకయ్య గురువులయ్య, ఒకడు అయ్య, ఒకడు మియ్య, అంతా అయ్యలు మియ్యలు. నడుమ నావి తకతయ్యలు. ఒకడు పెద్ద పట్టాదారు, ఒకడు షావుకారు, ఒకడు ఇనాందార్, ఒకడు వతన్‌దార్. అంతాదార్లే సర్కారురకం సదారద్. కిస్తు ఇవాళ్ల వోవాలి. పోకుంటే యిస్కూలు బరాయిందా. ఆరుగాలంజేసి నోట్లోయేలు వెట్టుకున్నట్టే. తహసీల్దారు తగనిమిండడు. చప్రాసివచ్చి గొంతుమీద గూచున్నాడు. రోజు రెండు రూపాయలు వాని కర్చుకు నా జేబు కాళి అవుతుంది. యెవని పెండ్లికోయ్ ఇదంతా? ఇంతైతే మా యింట్ల తినాలి, మందింట్ల పనిజేయాలి. తీర్వకువస్తే ఊరికి చేసిన ఉపకారం పీనుగుకు చేసిన సింగారం... అరే యెల్లుగా! ఈ నల్గురు యెట్టిగాళ్ళను తోలుకపో, ఆ మదారుసావును ఇట్ల గుంజుకరా, ఆ చింతకింది ముత్తని బర్రెను గొట్కరా, అట్లే ఆ కోదండయ్య నిటపట్కరా."

మసీదుముందు మాలిపటేలు మంటలై మండుతూండు. అతని దొక విచిత్ర ప్రవృత్తి. రకం వసూలుకు కూచునేరోజుల్లో బాగా తర్కించి అతణ్ణి గమనిస్తే రోజురోజుకూ అతని మనస్తత్వం మారుతూంటుంది. మొదట మొదట "ఆ దొరను పిలుచుకురా, ఈ దాతను పిలుచుకురా, ఆ అయ్యను పిలుచుకురా, ఈ అమ్మను పిలుచుకురా, మావను పిలుచుకురా, బావను పిలుచుకురా" అని మర్యాదపద్ధతి నవలంబించేవాడు, తర్వాత తర్వాత "ఫలానివాణ్ణి పట్టుకురా, అదుగో వాడు, ఇదుగో వీడు" అనేవాడు. రాగారాగా రకం బకాయి చాలా కనిపించెనా ఇగ ఆ నోటికే మొక్కాలి. కుక్కను మూతికి కట్టుకున్నట్టే కూసెవేడు.

యెట్టిమాదుగులూ, కావలికార్లూ, మచుకూరీలు, విరామంలేకుండా ఉరుకు లాడుతున్నారు. కరిగట్లో నాగళ్లు గొట్టే వాళ్ళనూ, ఆమిదపుచేలలో అరకలు తోలే వాళ్లనూ, మోటలు గొట్టేవాళ్ళనూ, మొద్దులు గొట్టేవాళ్లనూ, ఇంకా చేనుకాడివాణ్ణీ, తలుగుపేనేవాణ్ణీ, చెట్టుకాడివాణ్ణీ, చెట్టుమీదివాణ్ణీ, గుట్టమీదివాణ్ణీ, తాడుపేనేవాణ్ణీ, తలుగుపేనేవాణ్ణీ, అందరినీ యేపనిజేయనీయకుండా యెంటదగిలి రైతులను మసీదు ముందరికి కుప్పకూరుస్తున్నారు.

పట్టాదార్లకూ, షక్మీదార్లకూ, పట్టాదార్లకూ, కౌలుదార్లకూ మధ్యగల తగాదాలను గ్రామకరణం పరిష్కారంచేస్తూ, యెవరెవరి తాకిడి రకం వారికి వేరువేరు కాయితాలమీద వేసి... "ఇది అస్సలు రకం – ఇది లోకల్ ఫండు – ఇది బకాయ బాబతు, జమాబంది కర్చులీవీ, గిర్దావరు మామూళ్ళీవీ – మొత్తం ఇంతా. దీనికి కల్దారు పెచ్చు ఇంతా"– అని ఒకరొకరి గుండెలు గుభిల్లుమనేటట్టు వినిపిస్తున్నాడు.

కరణంగారి పద్దులను తలుచుకుంటే, కట్టెపుస్తైలు గట్టించే వానిలానే కన్పిస్తున్నాడు. మాలిపటేలును చూస్తే కుక్కాయి కూస్తున్నాడు. షావుకారిని మందలిస్తే, అడ్డకి శేరుప్రకారం ఇండ్లు ఊడిసేయించుకుంటున్నాడు... చాలామంది బీదరైతులకు ప్రాణం ప్రాణంలో లేదు. మనసు మనసులో లేదు. తలకాయలువంచీ నేలలు జూస్తూ పుల్లలు విరుస్తున్నారు.

మగదిక్కులేని ఆడపట్టాదార్లు కొందరు మాలిపటేలు బండ బూతులకు చెవు లప్పగించి, నెత్తిగోకుకుంటూ, కాలివ్రేళ్ళ నేలరాస్తూ, మొకం బిందుకొని యేమీతోచక గోడచాటుకు నిలబడ్డారు.

పట్టుకొచ్చేవాళ్ళను పట్టుకొస్తూనే వున్నారు. తెచ్చేవాళ్ళను తెస్తునే వున్నారు. చెల్లించేవాళ్ళు చెల్లించి రశీదుబుక్కులపైన రాయించుకొని పోతున్నారు. షావుకారి మిర్యాల పాపయ్యగూడా అక్కడే కూచున్నాడు. రెండుంపావులకాడికి యిప్పుడు జొన్నలూ, రెండుకాడికి వడ్లూ, లేక మూడుకాడికి అప్పటికి ఆమిదాలూ, ఒప్పందం చేసుకున్న ఆసామీల రకంవొప్పకొని తనపేర జమాగట్టించి రసీదు లిప్పిస్తున్నాడు. వచ్చేవాళ్ళు వస్తున్నారు, పొయ్యేవాళ్ళు పోతున్నారు.

"ఉత్తరదిశాభి ముఖంగా సీతాన్వేషణకేగిన వానరమూకలా ఈ కోదండయ్యకోసం పోయిన యెట్టిగాళ్లు యేమైనట్టో? పొయ్యిందేపోకడ ఒక్కడూ రావడంలేదు" అని పురాణఫక్కిలో వినిపించింది కళ్ళకు సులోచనాలు తగిలించుకుంటూన్న కరణంగారి ఉవాచ.

కిస్తును సాగనంపి పీడ వదలించుకుందా మనుకుంటున్న పటేలుకు ఒకరొకరి జాప్యాలూ, నిదానాలూ, నిష్క్రమణాలూ చూస్తుంటే ఎత్తించే పీనుగును ఇంట్లో బెట్టుకున్నంత అసహ్యమేస్తుంది. పైగా కోదండయ్య విషయం స్ఫురించేసరికి కోపం యెక్కువైంది. కోదండయ్య దగ్గిరిచుట్టం. తల్లికి తమ్ముడనిపిస్తాడు. తనకు వ్రేలువిడిచిన మేనమామ. అయితే మాత్రం అతనేం జేస్తాడు? సర్కారుహుకుం, రకం. ఆ పనిచేసే బాధ్యత గల వ్యక్తులు తల్లిచన్ను గోయమంటే కోయాలి.

పొద్దున్నే పొయ్యారు కావలికార్లు, యెట్టిగాళ్లు, కోదండయ్య పశువుల జప్తికి. అవులనూ, లేగలనూ కలెదోలుకొస్తున్నారు. మేకలదొడ్డి తడక తీస్తుంటే ఊడుగుజల్లల్లో ఉన్న కుడుపని మేకపిల్లలు ఉరుందొక్కుతూ 'బ్యా' అంటున్నాయ్. దొడ్లోకివెళ్ళి యెడ్లనూ, దున్నపోతులనూ పగ్గాలతో పట్టుకొంటున్నారు. బొల్లికోడెమాత్రం పగ్గం కొలికిన పణకు తగులనీయకుండా, ఈగలను దులుపుకుంటూ పశువులసందుకు ఈగిఈగి పోతుంది. ముఖానికి ముక్కులా దొడ్డికి అలంకారంగా అదొక్కటేవుంది కోదండయ్యకు. అత్తగారిచ్చిన అరణం అవుది. అరుగురుమనుషులు చుట్టూ

దొడ్డిగట్టి, పగ్గాల కొలుకులు తెరచి నుచ్చుకొడుతూ, పన్నాగం చేస్తుంటే బుస్సుమని యెలుగుమీదినుంచి లగుగొట్టి కంగున రంకెవేస్తూ కంచె మొగాన కాలులేపింది.

ఇక్కడ ఇంటిముందరి పాడిబర్రెను గూడా పట్టుకుపోవడానికి యిద్దరు యెట్టి మాదుగులొచ్చారు. గుంజకుకట్టిన బర్రెను విడిచి గుంజుతున్నారు. పెండకడి తీస్తున్న రంగమ్మ యేమీ అనలేక నిలువురాయిలా నిలుచుంది. తడకలోపల తంబానికి కట్టేసిన లేగదూడ చుట్టూ గంతులేస్తూ 'అంబా' అని చెవులు టిక్కరించి అరుస్తుంది. "దూడనన్నా కుడుపలేదు నాయినా, గడ్డిగరవని దూడ అరచిచస్తది" అని బాగమ్మ బావురమంటుంటే బర్రెను తోలుకొనిపొయ్యారు యెట్టిగాళ్లు.

● *ప్రచురణ, 1956* ●

* * *

అందే నారాయణస్వామి

23

# శిల్పి

శివయ్య, అతని భార్య సీతమ్మ శుష్కించిన శరీరాలతో ఇంటి వసారాలో నేలమీద ఎదురుబళ్లుగా కూర్చున్నారు. ప్రక్కగా చాపమీద పెద్దపిల్ల నిద్రపోతున్నది. రెండవపిల్ల కూర్చుని యేడుస్తున్నది. కొంచెం అవతల రెండవ అస్తిపంజరంలా కాలీమగ్గం వేళ్లాడుతున్నది. దగ్గరగా యితర పరికరాలు విశ్రాంతి తీసుకుంటున్నవి.

"బిడ్డ అన్నం అన్నం అని యేడ్చియేడ్చి శోషవచ్చి నిద్రపోయింది" అన్నది సీతమ్మ.

"సోలెడుగింజలు ఎక్కడైనా బదులుతెచ్చి పిల్లలకైనా వండి పెట్టకూడదు?" అన్నాడు శివయ్య.

"ఇంకా యెవరిస్తారు? అవతలవాళ్లకో మానెడు. యివతల వాళ్లకో తవ్వెడు యివ్వవలసి వుంటిమాయె. ఇంకా ఏ మొఖం పెట్టుకొని వెళ్లి అడగమన్నారు?"

"ఏం చేస్తాం చెప్పు? మనం వుండగలం. ఎక్కడైనా తెచ్చి పిల్లల వరకైనా వండి పెట్టకపోతే వాళ్లేం వుండగలరు? రెండురోజుల్లో షావుకారు మగ్గానికి పడుగుచూసి యిస్తానన్నాడు. ఇవాళా రేపు కళ్లుమూసుకుంటే ఎల్లుండి మజూరీ వస్తుంది."

"ఆఁ– అయన యిచ్చేది నిజమే! యీ వారం రోజులబట్టి అట్లాగే చెపుతున్నాడు. ఇక గింజలు అప్పు తీసుకురావడం నావల్లకాదు బాబూ! అయినా మనం మాత్రం ఎన్నాళ్లని పస్తులు చెయ్యగలం? యింట్లో కంచం తప్పాళాలన్నీ అఖరై పోయినయ్యా, మీరు ఎవరి దగ్గరకైనా వెళ్లి పడుగు సాధించుకుని రాకపోతే వీల్లేదు."

"నేను వూరుకున్నాననంటావా? అందర్నీ అడిగి చూశాను. ఎవ్వరూ లేదన్నారు. అయినా యీ మందంలో యితర్లు ఎవరు మగ్గానికి పడుగిస్తారు, గిరాకీలో నేయించుకునేవాళ్లు యివ్వవలసిందే గాని!"

"గిరాకీలో నేయించుకుని లాభాలకి లాభాలు తిన్నవాళ్లు మాత్రం యిస్తున్నారా?"

"వాళ్లు మాత్రం యేం చేస్తారు? అటు శాల్తీ అమ్మకపోయే ఇటు నేయిస్తే దండగ వస్తావుండే యెందాకని వాళ్లు మాత్రం నేయిస్తారు?"

"లాభం వచ్చినప్పుడు సంతోషంగా తిని దండగ వచ్చేటప్పుడు మనల్ని మాడుస్తారా?"

"ఏం చేస్తాం? వాళ్ళకు సరుకు విడుదల కావడం లేదు. మనం నేసే షావుకారు దగ్గిర నిల్వవున్న సరుకు చూస్తే కళ్లు తిరిగిపోయినై. సందు లేకుండా సరుకు యింటినిండా పేర్చారు. యింతకీ మిల్లుగుడ్డ వచ్చి మన గుడ్డను పడగొట్టింది. యీ

కరవు మన ఒకళ్లకే కాదు. వూళ్లో రెండువేల మగ్గాలవాళ్లూ అంతా ఇలాగే అవస్థ పడుతున్నారు."

చూర్లో నుంచి ఎలుకలు కొట్టివేసిన కార్డు ఒకటి కిందపడింది. దాన్ని శివయ్య చేత్తో తీసుకున్నాడు. ఆ కార్డు 1940లో మద్రాసు ఖాదీ కాన్ఫరెన్సు వాళ్లు అతనికి వ్రాసినది. అప్పుడు అతడు నేతలో గాంధీజీ విగ్రహాన్ని నేసి ఆ కాన్ఫరెన్సుకు పంపి బహుమతి పొంది వున్నాడు. శివయ్య గొప్ప శిల్పి. నేతలో కుట్టులేకుండా షరాయి చొక్కా మొదలైనవి చిత్రములైన పనులు ఎన్నో చెయ్యగలడు. అతడు జరీలతలు తీర్చినేసిన చీరె రాణులు సహా చూస్తే తలలూపి కట్టితీరవలసిందే. అటువంటి శిల్పాలకు ప్రోత్సాహం లేనందున శివయ్య అవి మానివేసి మామూలు బట్టలే నెయ్యడానికి పాల్పడ్డాడు. అందులోనూ అతనికి భుక్తి జరగడంలేదు. ఆ కార్డు చూసేసరికి వెనుకటి స్మృతులు గుర్తుకురాగా అతడు విచారంలో మునిగిపొయ్యాడు.

రావు వచ్చాడు. అతన్ని చూడగానే సీతమ్మ లేచి యింట్లోకి వెళ్లిపోయింది. శివయ్య "నమస్కారం, రండి రావుగారూ!" అంటూ పీటతెచ్చి వెయ్యగా రావు కూర్చున్నాడు. రావు పట్టణ కాంగ్రెసు సంఘ అధ్యక్షుడు. గ్రామంలో పలుకుబడి వున్నవాడు.

"ఇలా దయచేశారు! మా యోగక్షేమాలు విచారించడానికి వచ్చారా? తిండిలేక పిల్లలూ మేమూ అలమటించి పోతున్నాం" అన్నాడు శివయ్య.

"అలాగా! పత్రికల్లో చూస్తూనే వున్నాం" అన్నాడు రావు.

"మా అవస్థ చెప్పడానికి వీల్లేదు. వెనక నూలు దొరకక చాలినంత పనిలేక పస్తులు చేశాం. ఇప్పుడు ఎట్లాగో ఒకలా నూలు దొరుకుతున్నది గాని నేసినబట్ట ఖర్చుగాక మగ్గానికి పడుగు యిచ్చేవాళ్లు లేక యిపుడు పస్తులు వుంటున్నాం. నూలు దొరికినప్పుడూ దొరక్కపోయినప్పుడూ కూడా ఆఖరికి ఫలితం ఒకటే అయింది. మిల్లు బట్ట మా పరిశ్రమను కూలదోసింది" అన్నాడు శివయ్య.

"అయితే యీమధ్య చీరెలు ధోవతులు ప్రభుత్వం వారు మీకు కేటాయించే ఆలోచనలో వున్నారని పత్రికల్లో చదివాం" అన్నాడు రావు.

"ఏమి కేటాయించడమో యేమిటో! ప్రభుత్వము మిల్లులతో యే నిబంధనలనైనా ఏర్పరచుకోనివ్వండి. మొత్తంమీద మాకు పనిచూపి అన్నం బట్ట కలిగించడం ప్రభుత్వం విధి. స్వరాజ్యం స్వరాజ్యం అని బంగారు కలలు కన్నాం. అదివరకు బ్రిటిషువాళ్ల పాలనలో వున్నప్పుడు ఢక్కా మజిలీలు, చీరెను వుంగరములో దూర్చిన కథలు చెప్పకొని పరాయి ప్రభుత్వము వల్ల యిటువంటి పరిశ్రమలన్నీ నాశనమై పోయాయని వాపొయ్యాం. ఇప్పుడు స్వంత ప్రభుత్వం వచ్చిమాత్రం యేం చేసింది? ఖద్దరు వస్త్రాలతో ప్రారంభమైన స్వరాజ్యోద్యమం, తీరా స్వరాజ్యం వచ్చిన తరువాత నేతగాళ్లకు తినడానికి తిండి లేకుండాపోయింది." చెపుతూ వుంటే అతని గుండెల్లో నుంచి ఆవేదన పొంగుకొస్తోంది.

"అట్లా చూడండి, నా బిడ్డ అన్నం అన్నం అని ఏడ్చి శోషవచ్చి పడిపోయింది. మేమెందుకు యిట్లా పస్తులు వుండాలి? నేరాలు చేసి జైళ్లలో పడ్డవాళ్లను గూడా

ప్రభుత్వం పస్తులు వుండనివ్వదే! మేము ఎందుకు పస్తులు చెయ్యవలసి వచ్చిందని ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను. నేనేం సోమరిపోతునా? పనివుంటే పిల్లలూ మేము తిని ఒకళ్లకు యింత పెట్టగలను" అన్నాడు శివయ్య.

"అవును పాపం! మీ అవస్థ చూస్తే విచారం వేస్తున్నది. ప్రభుత్వం యేదో ఒకటి చేస్తుందిలే. సరేకాని, నూలు చిలప ఒకటి కావలసి వచ్చింది. కాస్తవుంటే చూద్దూ" అన్నాడు రావు.

శివయ్య ఆవేదనతో "అందుకా తమరు దయచేసింది! గొంతుకు ఉరేసుకునేందుకైనా ఒక పోగులేదు. మీకు పుణ్యం వుంటుందిగాని మాకీ సహాయం చేసిపెడుదురూ. మీరంతా ప్రభుత్వం చేత మాకు చాలినంత పనైనా చూపించేటట్లు చేయండి. లేదా సునాయాసంగా చచ్చిపోయ్యేటందుకు మందైనా సప్లయి చేయించండి." అన్నాడు. అంతటితో రావు వెళ్లిపొయ్యాడు.

రాఘవయ్య వచ్చాడు. ఈయన శివయ్య తమ్ముడు. అక్కడకు పదికోసుల దూరంలో వున్న ఓ పల్లెవాళ్లది. లాంఛన ప్రకారం కాళ్లకు నీళ్లివ్వగా రాఘవయ్య కాళ్లు కడుక్కొని కూర్చున్న తర్వాత శివయ్య యాధాలాపంగా "అక్కడ మీ పరిస్థితులు యెట్లావున్నయిరా అబ్బాయి?" అని అడిగాడు.

"ఏం చెప్పమన్నా వన్నయ్యా! అక్కడ మా సహకార సంఘంలో పడుగులు యివ్వడం మానివేశారు. సరుకు నిలవుండి పోయిందట. పనిలేక నానా అవస్థపడుతున్నాను. జరుగుబాటు లేక చాలామంది ఇతర గ్రామాలకు వెళ్లిపొయ్యారు. మేమూ మీ వూరు రావాలనుకుంటున్నాం. నిన్ను కనుక్కుపోదామని వచ్చాను" అన్నాడు రాఘవయ్య.

"ఇక్కడ పరిస్థితులు అంతకంటే అధ్వాన్నంగానే వున్నవి. రోలువెళ్లి మద్దెలతో మొరపెట్టుకున్నట్టున్నది" అన్నాడు శివయ్య.

తమ్ముడితో మాట్లాడుతున్న శివయ్యను యింట్లో నుంచి భార్య పిలవగా లేచి వెళ్లాడు. "పై మనిషి వున్నాడుకదా, ఆయనకు భోజనం యెట్లా?" అన్నది.

"నేనూ అదే అలోచిస్తున్నాను" అన్నాడు భర్త.

"షావుకారు దగ్గిర అవసరమని చెప్పి ఓ రూపాయి పట్టుకరాండి. పెద్దపిల్ల శోషవచ్చి పడిపోయింది, చిన్నది గోలచేస్తున్నది" అన్నది భార్య, బాధతో.

"ఇదివరకే కొంత వాడుకున్నాం ఏమిస్తాడో యేమిటో. అయినా వెళ్లివస్తాను" అంటూ షావుకారు యింటికి వెళ్లాడు శివయ్య. అతదు మాస్టరు వీవరు అరవై, డెబ్బై మగ్గాలు నేయిస్తాడు. శివయ్య వెళ్లేసరికి షావుకారూ మరి ఒక ఆసామీ ఘర్షణ పడుతున్నారు. ఆ ఆసామి నూలు షావుకారు. "నూలు తీసుకెళ్లి యిన్ని మాసాలైనా డబ్బు యివ్వవేం?" అని యిల్లెగిరిపొయ్యేటట్లు కేకలు వేస్తున్నాడు. "ఏం చెయ్యమన్నారు? సరుకు నిల్వ వుండిపోయింది. అమ్మగానే యిస్తా"నని చెపుతున్నాడు షావుకారు.

అది చూసి శివయ్య అడక్కుండానే యిల్లు చేరుకున్నాడు. వచ్చిన చుట్టం పనిమీద ఎక్కడికో వెళ్లాడు. భర్తను చూడగానే "తెచ్చారా?" అని ఆశతో అడిగింది భార్య. "లేద"ని బదులు చెప్పాడు శివయ్య.

ఆమె కళ్లవెంట నీళ్లుకారుస్తూ "అయ్యో! యెట్లాగు చిన్నపిల్ల గూడా శోషవచ్చి పడిపోయింది. మీరు యిక్కడ వుండండి. ఎవరి కాళ్లయినా పట్టుకుని గింజలు తెస్తాను" అంటూ సీతమ్మ లేచి గబగబా వీధిలోకి వెళ్లిపోయింది.

కాస్సేపటికి సీతమ్మ తిరిగి వచ్చింది. కొంగునవున్న మూట చూసి శివయ్య "గింజలు తెచ్చావు! అయితే త్వరగా వుడకెయ్యి" అన్నాడు.

ఆమె కంపిత కంఠంతో "యేం వుడకెయ్యమన్నారు! గింజలు దొరకలేదు. మీకు చెప్పకుండా నేనో పనిచేశాను" అన్నది.

"ఏం చేశావు యేమిటి?" అని ఆదుర్దాతో అడిగాడు శివయ్య.

సీతమ్మ కళ్లవెంట నీళ్లు కారుస్తూ "యేం చెయ్యను. నాలుగిళ్లు మాదాకవళం అడిగి తెచ్చాను" అన్నది.

శివయ్య తొట్రుపాటుతో "ఏమిటి, మాదాకవళమా? వీడు బ్రతికి వుండగానే మాదాకవళం అడుక్కొచ్చావా? వీడి శరీరం మంటలో కాలి భస్మం కాకముందే నువ్వు జోలి కట్టావా? అవును. నీ తప్పేముంది? వీడు బ్రతికి వుండే చచ్చిన వాళ్లలో జమే అయ్యాడు" అని ఆక్రోశించాడు.

● *'స్నేహితుడు' కథల సంపుటి – ఆగస్టు, 1956* ●

★ ★ ★

జి. సురమౌళి

24

# ముక్కోటి బలగమోయి

కోటాయి ఓ కంబళీ, తుండు గుడ్డా బ్యాగులో సర్దుకుని హైదరబాదు వెళ్ళే బండిలో ఎక్కాడు. పెట్టెనిండా జనం కిక్కిరిసివుండారు. భారతదేశంలో రైలుబండ్లు బోల్తాకొడతానే వుండయి. వందలకు వందలు జనం చస్తానే వుండారు. కాని ప్రజలు రైలు ప్రయాణాలు మానర్తారా? జనాన్ని అటీటు తోసుకుని బ్యాగు సంకన గట్టిగా అదిమి పట్టుకుని పెట్టెలో ఓ మూలన నిలుచున్నాడు కోటాయి.

కోటాయి సెక్రెటేరియటు ప్యూను. కర్నూలు నుంచి హైదరాబాదుకు తరలిస్తున్న ఆఫీసుల్లో తన దొకటి. సూపరింటు సుందర్రామయ్యా, యూడీసీ వెంకటప్పయ్యా వారం రోజుల ముందే ఆఫీసు సామాన్లు ఓ వాగెనులో నింపుకుని హైదరాబాదుకు చేరుకున్నారు. కోటాయి తనూరికి పోయి, విశాలాంధ్ర వచ్చిన సంగతీ, తాను హైదరాబాదు కెళుతున్న సంగతీ భార్య బిడ్డలకు చెప్పి అలస్యంగా బయల్దేరాడు. ఎట్టాగయిన ఫస్టు నవంబురు నాడు పది గంటలకి ఆఫీసుకు జేరుకోవాలి. తెల్లారేసరికి హైదరాబాదుకు చేరుతుందన్నారు బండి. అందులోనే ఎక్కాడు.

ఉండి ఉండి కోటాయి కళ్ళమీదకి నిద్రకప్పుకొస్తోంది. ఉలిక్కిపడి కళ్లు నలుచుకొని మళ్ళీ సరిగ్గా నిలుచుంటున్నాడు. ఇలా లాభం లేదని జేబులో ఉన్న మాంచి ఘాటైన లంక పొగాకు సుట్టోటి దీసి అంటించాడు. సుట్ట కాలుస్తున్నాకొద్దీ, ఒక్కొక్కదమ్మే ఆ పొగ పీల్చి వదుల్తావుంటే కోటాయి మెదడులో ఏవేవో ఆలోచనలు రాసాగినయి.

తెలంగాణావోళ్ళు తన్ను ఎన్ని అగచాట్లు పెడతారోననే భయం గబుక్కున కోటాయికి దట్టింది. తానా మధ్యన పేపర్లో చదివిన సంగతులు జ్ఞాపకానికి రాసాగినై. "ముల్కీ నాన్ముల్కీ" అని ఏదో అల్లరిజేసి, పొట్టకూటికి తమ పుట్టినూరినీ, ఇంటినీ వదలి అంధ్రదేశం నుంచి వచ్చి హైదరాబాదులో కాపురం పెట్టుకున్న తన బోటి వాళ్ళని ఎక్కడ బడితే అక్కడ దొరికించుకుని తన్నారట. వాళ్ళకు ఆలోచనే లేదట. ఇక తన్నటం మొదలుపెడితే పెద్దా చిన్నా చూడకుండా – డొక్క లిరిగేట్టు తన్నడవేనట. అక్కడి తెలుగువారు కూడా తురకం మాట్లాడుతారుట! అంటూ తన వాళ్ళు. పత్రికలు, అప్పుడప్పుడూ కొన్ని సంవత్సరాలనుంచీ తెలంగాణా ప్రజలను గురించి తనకు కలిగించిన, తన మనస్సులో బాగా నాటుకుపోయిన తెలంగాణాలోని తెలుగు వారిని గురించిన తప్పుడు అభిప్రాయాలతో తాను వెళ్ళబోతున్నదేదో

నరకమన్నట్టు అక్కడివాళ్ళంతా యమదూతలన్నట్టూ భావించుకుంటూ, ఉలికులికి పడుతున్నాడు కోటాయి. బండి మహబూబు నగరం స్టేషను దాటేంతర్వాత కొంత స్థలం దొరికింది కోటాయికి కూర్చోడానికి. బ్యాగును మోకాళ్ల మీదేసుకుని తలకాయ దానిమీద పెట్టి నిద్రపోయాడు.

ఏదో ఒక స్టేషనులో ఎవరో లేపారు కోటాయిని, 'లేవండి తెల్లారింది' అని. కోటాయి గబుక్కున లేచి బ్యాగు చూసుకుని చక్కాగా కూచున్నాడు. ఆ లేపినాయన కోటాయిని, పేరూ, ఎక్కడినుంచి ఎక్కడికి ఎందుకు ఎళ్ళుతున్నదీ వివరాలనడిగాడు. చుట్టదీసి కోటాయి కొకటిచ్చి, తానొకటి నోట్లో పెట్టుకుని కాల్చాడు. "మీ పేరేటండీ?" అడిగాడు కోటాయి. "రామప్పంటారు. హైదరాబాదే. ఇది నా అడ్రసు. దగ్గరబెట్టుకో, ఎప్పుడన్న ఏమన్న గావలసివస్తే రా" అని విజిటింగ్ కార్డు ఇచ్చాడు. ఆ విజిటింగ్ కార్డుమీద "డా. రామప్ప, ఎమ్.బి.బి.ఎస్., బషీర్‌బాగ్, హైదరాబాదు–1" అని చదివి కోటాయి ఆశ్చర్యపోయాడు. "అసలు మీది ఈ వూరేనా? లేక మన ప్రాంతంనుంచి ఇక్కడకొచ్చి స్థిరపడ్డారా?" అని అడిగాడు కోటాయి. ఈ ప్రశ్నవెనుక కోటాయిలో ఎన్ని సందేహాలు నాట్యం చేస్తున్నాయో డాక్టర్ రామప్ప గమనించకపోలేదు. "ఇవన్నీ మన ప్రాంతాలే. ఇన్నాండ్లు మీ మనస్సుల్లో ఉన్న మీ తప్పుడు అభిప్రాయాలను మార్చుకోవాలె. నాది ఖాస్ హైదరాబాదే" నన్నాడు. ఇంతలో స్టేషన్లో బండాగింది. "హైదరాబాదు, కాచీగూడ" అని అరుస్తున్నారు. రామప్ప కోటాయి దిగారు. రామప్ప కోటాయిని తనవెంట రమ్మని తనతోపాటు కోటాయిని కోఠీదాకా నడిపించుకొచ్చి, సెక్రెటేరియటు కెళ్ళాలని కోటాయంటే అక్కడే ఎనిమిదో నెంబరు బస్సు కోటాయి నెక్కించి, తాను ఏడవ నంబరు బస్సెక్కి ఇంటికి చేరుకున్నాడు.

బస్సు రెండో అంతస్థులో కూర్చుని చూస్తున్న కోటాయికి హైదరాబాదు నగరం గమ్మత్తుగా కనపడుతోంది. కండక్టరుకు డబ్బులిచ్చి టిక్కెట్టు కొన్నాడు, సెక్రెటేరియటు కని. ఆబిడ్స్, నాంపల్లి, లకడీకాపూల్ – బస్సుపోతూంది. బస్సాగినప్పుడల్లా, కోటాయి కండక్టరు నడుగుతూనే ఉన్నాడు, సెక్రెటేరియటు కెక్కడ దిగాలని. సెక్రెటేరియటు రాగానే కండక్టరే కోటాయిని 'ఇదే సెక్రెటేరియటు' అని చెప్పి దించాడు. కోటాయి బస్సు దిగాడు. అటూ ఇటూ పరికించాడు. ఎక్కడా 'సెక్రెటేరియటు' అనే బోర్డు చిన్నదిగాని, పెద్దదికాని కనిపించలా. అట్లా బేలిపోయి చూస్తుంటే "ఏంరోయి కోటాయి, ఈ బండికేనా వచ్చింది?" అనే కేకవిని, అటేటు చూశాడు. ఎక్కడ చూసినా తన ప్రాంతంనుండి వచ్చినవాళ్ళు గుంపులు గుంపులుగా చేరి ఉండడం చూచి కోటాయెందుకో ఉబ్బిపోయాడు. 'ఇక్కడా ఇక్కడా' అని మళ్ళీ కేక వినిపించేసరికి ఆ వైపు చూశాడు. తన ఆఫీసు ప్యూను బలరామయ్య. గబుక్కున పరుగెత్తాడా వైపుకు, మధ్యన కారొస్తున్నది కూడా గమనించకుండా. కొద్దిలో తప్పించుకున్నాడు గాని లేకపోతే యాక్సిడెంటే. బలరామయ్యది కర్నూలే. మద్రాసునుంచి తనాఫీసు కర్నూలుకు తరలించబడ్డాక ఉద్యోగంలో చేరాడు ప్యూనుగానే. నిన్నగాక మొన్న ఇద్దరూ కర్నూలు వీధుల్లో తిరిగారు. మళ్ళీ ఇవాళ. ఎంతోకాలం విడిపోయిన అప్తులవలె అప్యాయంగా కలుసుకొని, ఎన్నెన్నో విషయాలు మాట్లాడుకున్నారు. వారు మాట్లాడుకున్న విషయాల్లో ముఖ్యమంత్రి ఎన్నిక దగ్గర్నుంచి, హోటల్సులో

కాఫీకి ఉన్న ఎక్కువ ధరదాకా ఉన్నాయి. బలరామయ్య కోటాయిని తీసుకెళ్ళి తమకోసం కేటాయించిన ఆఫీసు గదులెక్కడున్నదీ చూపించాడు. సెక్రెటేరీయటు భవనం చూస్తూ, కోటాయి ఉప్పొంగిపోతున్నాడు. 'మెద్రా సిడిచినా, దానబ్బలాంటి పట్నం సంపాదించుకున్నాంలే' అన్నాడు. ఇంకా ఆఫీసు గదులకి తాళాలు తియ్యలేదు. "మనకి సన్నతు నగరుట, అడ ఏర్పాటు చేసినారు అస్టలు" అని సనత్ నగర్‌కు ఎట్లా వెళ్ళాలిసిందీ వివరించి చెప్పాడు బలరామయ్య. 'ఔనుగాని ఈ ఊరోళ్ళు మంచివాళ్ళేనా?' అనడిగాడు కోటాయి బలరామయ్యను, తాను రైల్లో ఎక్కుతుండగా కలిగిన సందేహానికి సుస్పష్టమైన సమాధానం పొందాలన్న ఆశతో. 'ఏహె మంచేటి? మంచి అడుండాదిలే. నైజాం కాలేజి. ఆ కాలేజికుర్రోళ్లు నిన్న కార్లని ఆపి టపాకాయలు పేల్చినారంట. కారుమీద నంబరు సూడ్డంవట. అది మన ప్రాంతం కారు అని తెలిసిపోంగనే ఆటిని అపటవట, అద్దాలు పగలుగొట్టటం. గాలి తీసేయటం, టపాకాయలు కొట్టటం, శానా బాధ పెట్టినారంటలే—" అని చెప్పుకుపోయాడు. బాలరామయ్య. "అయితే ఈళ్ళతోటి జాగ్రత్తగానే ఉండాలే?" అంటూ "అస్టలేపు వెళ్ళొస్తా. సుందర్రామయ్యగారికీ, ఎంకటప్పయ్యగారికీ చెప్పు..." అని బయల్దేరినాడు.

సనత్‌నగర్‌కు వెళ్ళే విధానం బలరామయ్య వివరంగా చెప్పాడుగనుక, కోటాయి కాట్టే కష్టం కలుగలేదు. బస్సులో కోటాయికి ఎన్నో ఆలోచనలు వచ్చాయి. రామప్పగారు అంత మంచిగా ప్రవర్తించారే, మరి ఇక్కడివాళ్ళు మంచివాళ్లు కాదంటాడేమిటి బలరామయ్య? – బలరామయ్య అబద్ధమెందుకు చెబుతాడు? మరి రామప్పగారు మంచిగా ప్రవర్తించిన సంగతి తనకే అనుభవమాయె. ఇంతకూ ఇక్కడివాళ్లు మంచివాళ్ళా? కాదా? అనే సంగతి కోటాయి ఇదమిద్ధంగా తేల్చుకోలేకపోయాడు. సనత్‌నగర్‌కి వెళ్ళి తనకోసం ఏర్పాటు చేయబడ్డ చోటును చూసుకుని, మళ్ళీ పదకొండు గంటలకల్లా తిరిగి ఆఫీసుకు చేరుకున్నాడు. ఆఫీసు కెళ్ళగానే సుందర్రామయ్యా, వెంకటప్పయ్యలు కోటాయి నాహ్వానించారు. రిజిస్ట్రారుగారి రూము చూపించి అక్కడ తన పేర్రాయించుకుని సంతకం పెట్టి రమ్మన్నారు. అక్కడ ఆ ఫార్మాలిటీస్ అన్నీ ముగించుకున్నాక, సుందర్రామయ్యగారి ప్రక్కన నిలుచుని, నమస్కరించి సవినయంగా నుంచున్నాడు కోటాయి. సుందర్రామయ్య కోటాయిని చూసి, ఓ కవరు చేతికిచ్చి దాన్ని చీఫ్ సెక్రెటెరీగారి కిచ్చి రమ్మన్నాడు. 'వచ్చాడో లేదో అప్పుడే పని జెబుతాడేటే సుందర్రామయ్య?' అని కోటాయి కడుపులో మండింది. కానేం జేస్తాడు? ప్రభుత్వోద్యోగమాయె తప్పుతుందా మరి? "ఎట్టా ఎల్లాలీ? దారి తెలీదుగా?" అన్నాడు కోటాయి నసుగుతూ. "అడుగుతే ఎవరన్నా చెబుతారు – బేగంపేట వెళ్ళే బస్సెక్కి వెళితే అదేవస్తుంది. పో"మ్మన్నాడు సుందర్రామయ్య. కోటాయి మాట్లాడకుండా బయలుదేరాడు, సుందర్రామయ్యను మనసులో తిట్టుకుంటూ. 'యదవ అంబోతు మొగం ఈడూనూ, ఎప్పుడొచ్చావనన్నా అడగడేం? తిన్నావా? అస్టలు దొరికిందా? ఏదీ అడగడేం? మనిషి కనపడితే ఇక పని జెప్పటవేనా?' అనుకుంటూ తన నడక సాగించాడు. దారిలో మళ్ళీ రామప్పగారు కనిపిస్తే దారడిగాడు. రామప్పగారు బేగంపేటకు పోయే బస్సు ఆగేచోటు చూపించి, 'అక్కడ నిలబడు. చిన్న సింగిల్ డెక్కర్ బస్సు వస్తే ఎక్కి కండక్టరు నడిగి చీఫ్ సెక్రెటరీగారింటికి పోవడానికి ఎక్కడ

దిగమంటే అక్కడ దిగు. మంచిగా వినయంగా అడుగుతే ఈ వూరివాండ్లు చెప్తారు. గర్వంతోటి మాట్లాడితివా–సహించరు' అని రామప్పగారు వెళ్ళిపోయారు. రామప్పగారు చెప్పిన ప్రకారమే బస్సు ఎక్కి చీఫ్‌సెక్రెటరీగారి కా ఉత్తరం అందించి, తిరిగి ఆఫీసుకు చేరుకున్నాడు కోటాయి.

ఆఫీసుకు చేరుకున్నాక, కోటాయి బలరామయ్యను పిలుచుకుని అడిగాడు, తన్ను బస్సులో బాధించిన సందేహానికి సమాధానం– "అసలీవూరువాళ్ళు మంచివాళ్లేగా?" అని. "అప్పుడే చెప్తిని గదా!" అన్నాడు బలరామయ్య, తాను ఇక్కడి వాళ్ళను చెడ్డవాళ్లేనని నిర్ణయించుకున్న నిర్ణయం అబద్ధం కాదనే మాటను పునరుద్ఘాటించుకుంటూ. కోటాయి రామప్పగారి సంగతి చెప్పాడు. బలరామయ్యకు నమ్మకం కుదరలే. బలరామయ్యకూడా ఆలోచించాడు. ఆలోచించి వెంటనే ఒక నిర్ణయానికొచ్చాడు. గవర్నమెంటుతో అవసరమున్నవారు గుమాస్తాలూ, ఉద్యోగులు, బాగా చదువుకున్నవారూ, నాయకత్వంకోసం పాటుపడేవారు మాత్రమే తమతో మంచిగా ప్రవర్తిస్తున్నారనీ, ఆ మంచితనం స్వార్థంతో కూడుకున్నదనీను. కోటాయికీ వాదంలో సబబు కనిపించినా వెంటనే విశ్వాసం కలుగలా. "రామప్పగారు డాక్టరు. ఆయనకేం స్వార్థం ఉంటుంది?" అనడిగాడు. "డాక్టరేనేమొ? కాని బహుశా నాయకత్వం కోసం పాటుపడేవాడయ్యుంటాడు. ఖద్దరు కట్టాడా?" కోటాయి జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. రామప్పగారి రూపం. అవును. ఖద్దరే కట్టినట్టున్నాడు. బలరామయ్య మాటల్లో విశ్వాసం కుదిరింది కోటాయికి. తమంటే ఇక్కడి వాళ్లు భయపడాలనుకున్నాడు కోటాయి. రామప్పగారిమీద కోటాయికి కలిగిన గౌరవమంతా పటాపంచలైపోయింది. "నెహ్రూగారి మీటింగెక్కడా?" అడిగాడు కోటాయి మాట మారుస్తూ. "ఫతే మైదానంలో – అటేపు కెలితే వస్తుంది." అప్పటికే మూడయింది. కోటాయి సుందర్రామయ్యకు చెప్పి, ఈ పూటకు తన్నిడిసి పెట్టమని సెలవు తీసుకుని ఫతేమైదానం వైపు నడిచాడు.

కర్నూల్లో కోటాయి బండెక్కినప్పుడు, హైదరాబాదువారంటే క్రూరులని భయపడ్డాడు. తన్నేం చేస్తారో ఎన్ని తిప్పలు పెడతారోనని ఆరాటపడ్డాడు. బండిలో కూడా అవే ఆలోచనల్తో సతమతపడ్డాడు. రామప్పగారిని చూసింతర్వాత, కోటాయికా భయం విచ్చుకుపోయింది. హైదరాబాదు వాళ్ళు చాలా మంచివాళ్ళనే అభిప్రాయం కలిగింది. సుందర్రామయ్యగారి ప్రవర్తనను చూసింతర్వాత కోటాయికి కలిగిన ఈ అభిప్రాయం మరీ గట్టిపడింది. సుందర్రామయ్య తన్ను విచారించనే లేదు. మరి రామప్పగారెంత మంచిగా ఆదరించారు? సుందర్రామయ్య కంటే రామప్పగారే వెయ్యిరెట్లు నయమనే అభిప్రాయం కలిగింది. తెలుగువాళ్ళందరిదీ ఒక్క కుటుంబం అనే మాట నిజమే ననుకున్నాడు. కాని బలరామయ్య మళ్లీ కోటాయి ఆలోచనల్ని మార్చాడు. దానికేదో కారణముందని ఊహించి కోటాయిని కూడా తనలాగే ఊహించేటట్టు చేశాడు. కోటాయిలో ఇప్పుడు ఎన్నడు లేని గర్వం ప్రవేశించింది. ఆ గర్వంతో ఆనందం కలిగింది. ఆంధ్రప్రదేశ్ అవతరిస్తుందని విన్నప్పుడు కొందరికి ఈలాంటి ఆనందమే కలిగి ఉంటుంది. ఇక్కడి వాళ్ళందరినీ తానే ఏలుతున్నా ననుకున్నాడు. సుందర్రామయ్యలాంటి అధికార్లు తన్ని పెట్టే కష్టాలు మరచిపోయి,

తానూ, సుందర్రామయ్య, బలరామయ్యలూ కలిసి హైదరాబాదు వాళ్ళమీద రాజ్యం చేస్తున్నట్టు భ్రమపడ్డాడు. నైజాంను గద్దె దించింది తానే ననుకున్నాడు. ఆ గద్దె తన కోసమే ఖాళీ అయిందనుకున్నాడు. ఇట్లా అనేక విధాలుగా అనుకుంటూ ఫతే మైదానం చేరుకున్నాడు కోటాయి. అన్నీ గళ్ళు గళ్ళుగా కట్టారు. పోలీసు లెక్కడివారి నక్కడ కూచోపెడుతున్నారు. దారులు చూపిస్తున్నారు. దూరంగా ఓ వింగులో ఓ మూల కూచొని, జేబులో మిగిలిపోయిన మరో లంక పొగాకు చుట్ట అంటించుకున్నాడు. మూడున్నరయిందప్పటికి, ఇంకా మూడు గంటలు గడవాలి. అప్పటిదాకా ఓ నిద్ర తీద్దామనుకుని అక్కడే వాలాడు కోటాయి, బ్యాగులో కంబళిని పరుచుకుని, తుండుగుడ్డ నెత్తికి చుట్టుకుని, బ్యాగును తలకింద పెట్టుకొని. బాగా అలసిపోయాడేమో వెంటనే నిద్రపట్టింది.

"ఏమండి, లెవ్వండి, లెవ్వండి, కూర్చోండి" అని ఎవరో లేపేసరికి ఐదున్నరయింది. జనం నిండుతున్నారు. తన చుట్టూ చాలమంది ఈ వూరి వాళ్ళే చేరారు. తన ఊరు వివరాలడిగారు. తను చెప్పిందంతా విసుగులేకుండా విన్నారు. తాను తనకు లేనిపోని కొన్ని గొప్పతనాల్ని చెప్పొకుపోతుంటే–అవన్నీ విని నిజమే ననుకుని నమ్మి 'ఒహో' అన్నారు. పక్కనుండి ఒక ఆసామి కోటాయికి ఓ చుట్ట ఇచ్చి చుట్ట కాల్చండి అన్నాడు. కోటాయి చుట్ట తీసుకుని నోట్లో పెట్టుకుని, తన జేబులోంచే అగ్గిపెట్టె తీసి గీసి, తన చుట్టతోబాటు ఆ ఆసామీ చుట్టగూడా వెలిగించాడు. కోటాయడిగాడు "మీ పేరేంటి?" అని ఆ ఆసామిని. 'కోటయ్య' అని చెప్పాడా ఆసామి. తమ ఇద్దరి పేర్లూ ఒక్కటి కావడంతో ఆ యిద్దరికి కలిగిన సంతోషానికి మేరలేదు. ఇద్దరివీ తనువులు వేరైనా ఇద్దరూ ఒకటే ననుకున్నారు. ఇంతలో ఎవరో వస్తే కోటయ్య కొంచెం పక్కకు తొలిగాడు.

నెహ్రూగారు వచ్చారు. సూర్యకుమారి పాట పాడింది. ముందరున్న పిల్లలు కొంతమంది మోకాలి మీది దాకా లేచి నిక్కి చూస్తున్నారు. "ఏయ్, కూచోండి కూచోండి." వాళ్ళు కూచున్నారు. 'నైజాం వాళ్లంతా వట్టి దద్దమ్మలనీ, తానేం చెపితే అది నమ్ముతారని,' తన కిందాకా కలిగిన అభిప్రాయం–వాళ్ళు తన ఆజ్ఞనుకూడా పాలించటంతో దృఢపడ్డది. తమను చూసి నైజాంవాళ్లు భయపడుతున్నారనీ, అందుకని వాళ్లే తమకు లొంగి ఉంటారనే నిర్ణయానిక్కూడా వచ్చాడు కోటాయెప్పుడో.

నెహ్రూగారు ఉపన్యాసం ప్రారంభించారు. ముందున్న పిల్లలు మళ్లీ తలలు నిక్కించారు. కోటాయి మళ్ళీ కేకేశాడు,'కూచోండమ్మాయిలూ కూచోండ'ని వాళ్ళు మళ్లీ కూచున్నారు. ఈ తతంగం ఇట్లా నాలుగైదుసార్లు సాగేసరికి ప్రక్కనే ఉన్న ఒక ఆసామికి కోపం వచ్చింది. ఉపన్యాసం స్పష్టంగా వినపడుతూనే ఉంది నెహ్రూ గారెట్లాగూ కనపడ్డం లేదు. ఈనిట్లా అరవటం ఆ ఆసామికి నచ్చలేదు. "ఉపన్యాసం ఇనకుండ ఏందా అరుపులు" అని కోటాయిని మందలించాడు. కోటాయిక్కోపం వచ్చింది. ఇందాకా అనుకున్నాడుగా, తమంటే వీళ్లు భయపడాలనీ, లొంగి ఉండాలనీ. "ఏంటయ్యా నువ్వనేదీ, అందర్నీ నుంచోమంటావేటి?" అన్నాడు. ఆ ఆసామిని దబాయిస్తూ. ఇప్పుడింత మందిలో ఇదో అల్లరెందుకని ఆ ఆసామి తప్పించుకున్నాడు 'నన్నుగాదు లేమ'ని. 'ఏదీ, ఏదో వాగుతున్నావేటి?' ఎదుటివాడు తనకు భయపడి

లొంగిపోతున్నట్టు గ్రహించి 'ఏయి జాగర్త ఏమనుకున్నావో ఎక్కువ తక్కువొదిరితివా బొక్క లిరుగుతయి మల్ల – ఏంవో, పోనీ లెమ్మని ఊకున్నాకొద్ది నీలుగుడు శానయిందే"

ఈ వాదం విని ప్రక్కనుంచి ఓ రూమీ టోపి, 'మ్యారోస్సలేకూ' అంటూ మాయమైంది. కోటాయి లేచి "కొడతావేటీ?" అంటూ ఆ ఆసామీపై కురికాడు. "అంతకాడికి దెస్తె ఆ పని గూడ అయిద్దిమల్ల" అంటూ ఇతనూ లేచాడు. చుట్టూ జనం లేచారు. కోటాయి చెంప చెళ్లుమన్నది. అటేటు చూస్తు వుండగానే మరో చెంప చెళ్లుమన్నది. తలమీద బలమైన దెబ్బ తగిలింది. పోలీసులు వెంటనే వచ్చి కోటాయి నొకవైపూ ఆ ఆసామీ నొకవైపు తీసుకువెళ్ళి ఫతే మైదానం ఆవరణ బైట విడిచారు.

రెండు చెంపలూ చుర్రుమంటూ జవజవ లాడుతున్నాయి. నెత్తికి కొద్దిగా గాయం తగిలి రక్తం కారుతోంది. ఎటు పోవాలో తోచలేదు కోటాయికి, మనసులో ఏదో తిట్టుకుంటూ ముందు కదు గేయబోయాడు. పొద్దుట్నుంచీ తినలేదేమో ఆయాసమైంది. కళ్లు బైర్లు క్రమ్ముకున్నాయి. ఫుట్ పాత్ మీదే కంబళీ పరుచుకుని, తుండుగుడ్డ తలకు చుట్టుకుని అక్కడే వాలాడు కోటాయి.

కోటాయి లేచేసరికి మంచంలో వున్నాడు. ప్రక్కన కోటయ్య కూచుని వున్నాడు. కోటాయి ఆశ్చర్యపోయాడు. ఈ ఆశ్చర్యాన్ని గమనించి కోటయ్య చెప్పాడు. అది డాక్టర్ రామప్పగారి ఇల్లనీ, తానే అక్కడికి కోటాయిని చేర్చాననీ, చాలామంది బీదవాళ్ళకు రామప్పగారు ఉచితంగా వైద్యం చేస్తారనీను. ఇంతలో రామప్పగారు కూడా వచ్చారు లోపల్నుంచి. "గాయం ఏమంత పెద్దది కాదులే. ఈ కట్టు మూడురోజుల్దాకా విప్పకు – అన్నం తినలేదుగా? వడ్డనయింది. తిందుగాని పా, కోటయ్యా, నువ్వు కూడా లేచి కాళ్ళు కడుక్కో"మన్నారు రామప్పగారు. ముగ్గురూ ఒకే పంక్తిలో కూచుని భోజనాలు చేశారు.

భోజనాలయింతర్వాత డాక్టరుగారింట్లో రేడియోలో–

"ముక్కోటి బలగమోయి ఒక్కటై మనము
ఇరుగు పొరుగూలోన ఊరు పేరుంటాది
తల్లి ఒక్కటె నీకు తెలుగోడా...
సవతిబిడ్డల పోరు మనకేలా?..."

అనే పాట వినిపించింది.

ఆ పాటనే మనస్సులో అలపించుకుంటూ కోటయ్యా కోటాయిలు డాక్టరుగారినుండి సెలవు పుచ్చుకున్నారు.

● *'తెలుగుస్వతంత్ర' వారపత్రిక – 14 డిసెంబరు, 1956* ●

★ ★ ★

నెల్లూరి కేశవస్వామి

# 25 కేవలం మనుషులం

"షహ్!" (చెక్) అన్నాడు అలీహుసేన్ మిర్జా, శకటు ఎత్తు వేస్తూ, సగర్వంగ మహబూబ్‌రాయ్ కళ్ళల్లోకి చూడటానికి ప్రయత్నం చేస్తూ, వెనక్కు దిండ మీదికి వొరిగి, హుక్కా గొట్టాన్ని అందుకుని గుడగుడా పీలుస్తున్నాడు. మెలికల తిరిగిన మీసాలు, జులపాల జుత్తు, ఎత్తైన నుదురు, తెల్లని తెలుపు మల్లెపూవులాంట మఖ్‌మల్ కుర్తా, చుడీదార్ పైజామాలో ఠీవిగా కూచున్నాడు.

ఎదురుగా కూచున్న రాయ్ మహబూబ్‌రాయ్ సక్సేనా చదరంగం పావులకే తదేకంగా చూస్తూ, తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. కొంచం చామన ఛాయ; పల్చబడుతోన్న జుత్తు; సన్నగా గొరిగిన మూతీ, గెడ్డం; ఊరిన బుగ్గలు, కొంచెం లావెక్కిన శరీరం సిల్కు శేర్వానీ, తెల్ల పైజామా వేసుకున్నాడు. సిగరెట్‌పైన సిగరెట్ పీల్చేస్తున్నాడు

ఇద్దరి వయసూ దాదాపు అరవై. చిన్ననాటి స్నేహితులు. చార్‌మినార్‌క ఇటువేపున వున్న పంచ్‌మహల్లాలో, కొద్దికొద్ది దూరంలో ఇద్దరి భవంతులూ వున్నాయి హైస్కూలు వరకు సిటీకాలేజీలో చదివారు. అటు తర్వాత, మిర్జా అలీగఢ్ వెళ్ళి బి. ఏ. పూర్తి చేసి వచ్చాడు. ఇటు సక్సేనా బి. ఎస్సి., ఎల్. ఎల్. బి. చేశాడు మిర్జా ఉద్యోగంలో చేరలేదు. తాత తండ్రులనించి సంక్రమించిన ఆస్తిని జాగ్రత్తగ కాపాడుకుని, ఇటీవల ధరలు పెరిగాక, ఖాళీ స్థలాలను ప్లాట్లుగా మార్చి అమ్మి బాగా డబ్బు గడించాడు. సక్సేనా కొన్నాళ్ళు ప్రాక్టీసు చేసి, ఆ . తర్వాత మున్సి మాజిస్ట్రేట్‌గా చేరి, ఆఖరికి డిస్ట్రిక్ట్ జడ్జిగా చేసి ఉద్యోగవిరమణ చేశాడు.

మిర్జా భోజన ప్రియుడు. దుర్‌వ్యవసనాలేవీ లేవు. కాని అప్పుడప్పుడు, సక్సేన ఇంట్లోనే తయారు చేసే 'మోతియా' అనే ప్రత్యేకమైన సారాయి రుచిచూస్తాడు సక్సేనాకు భోజనమంటే అట్టే ఆసక్తిలేదు. స్కాచ్ విస్కీ మీద మహామోజు. అది లేకపోతే బీర్‌తో సంతృప్తి పడతాడు. "మోతీయా" సరే, ఇంట్లోనే తయారవుతుంది

మిర్జాకు దైవభక్తి మెండు. అయిదుపూటలా నమాజ్ చదువుతాడు. భార్యత కలసి "మక్కా" వెళ్ళి "హజ్" (దైవయాత్ర) చేసి వచ్చాడు. మతద్వేషికాడు. కా "సున్నీ" లంటే బొత్తిగా పడదు. మహమ్మద్ ప్రవక్త తదనంతరం ఇస్లాం మతాని "ఖలీఫా" (మతగురువు)గా, ఆయన చిన్నాయన కొడుకూ, తర్వాత అల్లుడూ అయి "అలీ" కావలసిందని నమ్మే "షియా" తెగకు చెందినవాడు. సక్సేనా "కాయస్థ

హిందువు. కాయస్థులు ఉత్తర హిందూస్థానీ హిందూ తెగకు చెందినవారు. చాలా మంది హైద్రాబాద్‌కు వలసవచ్చి, నిజాం ప్రభువుల నాశ్రయించి, మంచి మంచి ఉద్యోగాలు, జాగీర్లూ సంపాదించారు. వేషభాషలన్నీ ముస్లింల అనుకరణ. ఉర్దూ ఫార్సీ బాషల్లో నిష్ణాతులు. మహబూబ్ రాయ్ తండ్రి ఆరవ నిజాం మీర్ మహబూబ్ అలీఖాన్ దర్బారులో మంచి కవిపండితుడుగా రాణించాడు. కొడుక్కు తన ప్రభువు పేరే పెట్టుకున్నాడు. మహబూబ్ రాయ్‌కు పూజా పునస్కారాల మీద మోజులేదు. కాని భార్యకు అడ్డురాడు. ఆమె పరమ సాధ్వి. ఇంటిలోనే పూజాగృహం ఏర్పాటు చేసుకుని, కృష్ణ విగ్రహానికి ప్రొద్దునా సాయంత్రం పూజచేసి, నైవేద్యం పెట్టందే మంచి నీళ్ళైనా ముట్టదు. శని, మంగళవారాలు ఉపవాసాలు చేస్తుంది. అప్పుడప్పుడు పూజారిని పిలిపించి సత్యనారాయణ వ్రతాలు కూడా చేయిస్తుంది.

మిర్జాకు ఇద్దరు మగ సంతానం. ఆ తర్వాత చాలాకానికి పుట్టింది బిల్కీస్ – ఒకే ఒక్క కూతురు. ఇద్దరు మగపిల్లలు పెద్ద చదువులు చదివి, ఒకడు ఇంగ్లాండులోనూ, ఒకడు అమెరికాలోనూ స్థిరపడిపోయారు. పెళ్ళిళ్ళుకూడా అయిపోయాయి. తలిదండ్రుల్నీ చెల్లెల్నీ తమ దగ్గరికి వచ్చేయమని ఎన్నోసార్లు ప్రాధేయపడ్డారు. కాని హైద్రాబాద్ వదిలి రామని ఖచ్చితంగా చెప్పేశాడు. బిల్కీస్ అల్లారు ముద్దుగా పెరుగుతోంది. మెడిసన్‌లో ఆఖరి సంవత్సరం చదువుతోంది. సక్సేనాకు ఇద్దరు కూతుళ్ళూ, ఒక కొడుకు, కంవల్ రాయ్. కూతుళ్ళకిద్దరికీ పెళ్ళిళ్ళయి పోయాయి. హైద్రాబాద్‌లోనే వేరు వేరు చోట్ల, పిల్ల పాపలతో సంసారాలు చేసుకుంటున్నారు. కంవల్ మెడిసన్ పూర్తి చేసి హౌస్‌సర్జన్ చేస్తున్నాడు.

మిర్జా, సక్సేనాలకు ఉభయత్రా ఒకే ఒక్క వ్యవసనముంది–చదరంగం. రాత్రింబవళ్ళు, నిద్రాహారాలు మాని ఆడమన్నా ఆడటానికి వెనుదీయరు. మిర్జా 'దీవాన్ ఖానా' లోనో సక్సేనా డ్రాయింగ్ రూంలోనో, తఖత్ మీద తెల్లని చాదర్ పరచుకుని, దిండ్లకానుకుని, హుక్కా సిగరెట్లు పీలుస్తూ గంటల తరబడి ఆడుకుంటూ కూచుంటారు. ఒక్క భోజనానికి మాత్రం లేస్తారు. చాయ్‌లూ, ఫలహారాలూ అక్కడికే వస్తూంటాయి.

"మహబూబ్! లాభం లేదు, ఓటమి ఒప్పేసుకో. 'మాత్' (ఆటకట్టు) తప్పదు," అన్నాడు మిర్జా, సక్సేనాను జాలిగా చూస్తూ.

"చప్! వాగకు" అని విదిలించి వేశాడు సక్సేనా, పావులకేసే చూస్తూ. మరో సిగరెట్టు వెలిగించాడు.

స్కూటర్ శబ్దం వినిపించింది. మిర్జాదృష్టి అటువేపుకు వెళ్ళింది. గేటులోంచి ఆవరణలోకి స్కూటర్ దూసుకు వచ్చి, మెట్ల దగ్గిర ఆగింది. ముందు కంవల్, వెనక బిల్కీస్ కూచుని వున్నారు. ఇద్దరూ దిగి, మెట్లెక్కి దివాన్ ఖానా వేపుకు వచ్చారు. కంవల్ పొడుగ్గా సన్నగా వుంటాడు. ఆకర్షణీయమైన ముఖ వర్చస్సు. తండ్రి ఛాయకంటే కాస్తమెరుగు. ప్యాంట్ షర్ట్ వేసుకున్నాడు. బిల్కీస్ తెల్లగా, బొద్దుగా చూడముచ్చటగా వుంటుంది. గులాబీరంగు షల్వార్, కమీజ్, దుపట్టా వేసుకుంది. ఇద్దరూ ఏప్రెన్‌లు తొడుక్కున్నారు. మెళ్ళో స్టెతస్కోప్‌లు వేళ్ళాడుతున్నాయి.

"హై డాడీ! హై అంకుల్!" అంటూ గుమ్మం దాటి వచ్చింది బిల్కీస్.

"ఆదాబ్ చచా!" అంటూ అనుసరించాడు కంవల్.

"జీతేరహో బేటే!... రా, కూచో" అంటూ మిర్జా కంవల్‌ను తన ప్రక్కనే కూచో బెట్టుకున్నాడు.

సక్సేనా తిరిగైనా చూళ్ళేదు.

బిల్కీస్ కుర్చీ లాక్కుని, సక్సేనా దగ్గరిగా కూచుంటూ, "చూడండి అంకుల్! కంవల్ నా మాట వింటంలేదూ" అంటూ అతని చెయ్యి పట్టుకుంది.

"అంకుల్‌ను డిస్టర్బ్ చెయ్యకు తల్లీ. వాడసలే పాపం, 'మాత్' తప్పించుకోలేక గింజుకులాడుతున్నాడూ" అన్నాడు మిర్జా, వ్యంగ్యంగా.

సక్సేనా చప్పున తలెత్తి, మిర్జాని ఒకసారి కోపంగా చూసి, బిల్కీస్ వేపుకు దృష్టి మరల్చి, కాస్త తేరుకుని "అరె, మీరెప్పుడొచ్చారూ?" అన్నాడు.

"అయితే మీరీ ప్రపంచంలోనే లేరన్న మాట. ఇహ నా మొరాలకించే దెవరూ?" అంది ఏడుపు గొంతుతో బిల్కీస్.

"మొరా?... మొరేం ?" అన్నాడు సక్సేనా.

"అదే, నేనిందాక చెప్పకున్నానే, కంవల్ నా మాట వింటంలేదనీ..."

"కంవల్ నీ మాట వింటంలేదా?... ఎందుకు వినడూ? తప్పకుండా వింటాడు" అనేసి, మళ్ళీ చదరంగం వేపుకు తిరిగాడు సక్సేనా.

పెద్దగా నవ్వాడు మిర్జా.

ముసిముసిగా నవ్వుతూ, బిల్కీస్ వేపు కొంటెగా చూశాడు. కంవల్.

బిల్కీస్‌కు ఉక్రోషం పొచ్చింది. "ఏంవిటెది అంకుల్! వెధవబోర్ ఆటా..." అంటూ పావుల్ని చెల్లాచెదరు చేసేసింది.

"అరెరె," అంటూ, చిరుకోపం ప్రకటించాడు సక్సేనా, ఇలాగైనా ఓటమి తప్పించుకున్నానని, లోలోపలే సంతోషిస్తూ. "ఊం, ఇప్పడు చెప్ప, ఏంవిటి నీ గొడవా? మీరిద్దరు పోట్లాడుకున్నారా?"

"పోట్లాడుకోలేదూ, కాట్లాడుకోలేదు."

"మరీ?"

"నాకు ఫైనల్ పరీక్షలు దగ్గరికొస్తున్నాయూ, సర్జరీలో గోల్డ్‌మెడల్ కొట్టేసిన మీ కొడుకును కాస్త నాకు పాఠాలు చెప్పమంటే, దెట్టుసరి చేస్తున్నాడు."

"అలాగా?...ఏం, కంవల్! ఏంవిటి నీ సంజాయిషీ?"

"ఏంలేదు పితాజీ! నాకు హాస్పిటల్ డ్యూటీ వుంటుందికదా, తీరిక ఎక్కడిదీ, అన్నానంతే."

"అవునవును, తీరికెక్కడిదీ?... ఏమ్మా, నువ్వేమంటావు?"

"అదేంవిటి అంకుల్! హాస్పిటల్ డ్యూటీ మధ్యాహ్నానికల్లా అయిపోతుంది. ఆ తర్వాత ఏంచేస్తాడటా...?"

"అవునవును, ఏంచేస్తాడూ? నీకు పాఠాలు చెబుతాడు, అంతే. నువ్వింకేమి సాకులు చెప్పకు కంవల్! అమ్మాయికి పాఠాలు చెప్ప."

"ఇహనేం, జడ్జీగారు తీర్పు చెప్పేశారు. దానికి తిరుగులేదు. ఇహలేవండి భోంచేద్దాం" అన్నాడు మిర్జా.

"లేదు లేదు, మేమింటికెళ్తాం" అన్నాడు సక్సేనా.

"అదేం కుదరదు. మీరిద్దరూ ఇక్కడే భోంచెయ్యాలి. ఆతర్వాత, మనం రెండు మూడు ఆటలు వేసుకోవాలి, కంవల్ బిల్లూకు పాఠాలు చెప్పాలి. ... ఊ బిల్లూ బేటీ! వెళ్ళి సిద్ధం చేయించు."

"వొద్దు అలీభాయ్! మా శ్రీమతి వేచి వుంటుంది."

"బుకాయించకు. ఇవాళ ఏకాదశి, ఉపవాసం చేస్తోందని నువ్వే చెప్పావు... అమ్మా! అంటీకి ఫోన్‌కూడా చెయ్యి: వీళ్ళు ఇప్పుడప్పుడే రావటంలేదని."

"యస్ డాడీ!" అంటూ చెంగునలేచి, లోపలకి తుర్రుమంది బిల్కీస్.

క్షణాల్లో పిలుపు వచ్చింది, భోజనం సిద్ధంగా వుందని. అందరూ లేచి, చేతులు కడుక్కొని దస్తర్‌ఖాన్‌మీద కూచున్నారు.

బేగం నుస్రత్‌మిర్జా కూడా వచ్చి కూచుంది. కళావిహీనమై పోతూన్న పాలరాతి శిలావిగ్రహంలాగుంది.

రెండు ముద్దలు మింగాక, మిర్జా, "కంవల్ బేటే! నీ హౌస్ సర్జన్‌షిప్ ఎప్పటికై పోతుందీ?" అన్నాడు.

"మరి రెండు నెలలుంది చచా!"

"ఆ తర్వాత ఏంచేద్దా మనుకున్నావు?"

"ఇంకా ఏమీ నిర్ణయించుకోలేదు"

"నా మాట విని స్టేట్సుకు వెళ్ళిపో, బాగుపడతావు."

"దానికి ఇ.సి.ఎఫ్. ఎం.జీ.,వి.క్యూ. ఈ పరీక్షలుంటాయి చాచా!"

"ఉంటే ఏం? నువ్వు పాసు కాలేవా?"

"... ఆ పరీక్షలిప్పుడు ఇండియాలో జరగటం లేదు."

"మరెక్కడా?"

"దగ్గర్లోవున్నవి మనీలా, కరాచీ, లాహోర్."

"మరింకేం, కరాచీ వెళ్ళు. పాకిస్తాన్‌లో మా తమ్ముడున్నాడు, కో బ్రదర్ కూడా వున్నాడు. నీకే ఇబ్బందీ వుండదు. అన్ని ఏర్పాట్లు నేను చేయిస్తాను."

"కాని... కాని అమ్మ ఒప్పుకోదు చాచా!"

"ఏం, ఎందుకొప్పుకోదూ?"

"నేను స్టేట్సుకు వెళ్ళితే మళ్ళీ తిరిగి రానని అమ్మ భయం."

"అవును బాబూ! అది నిజం, వెళ్ళకు." నుస్రత్ బేగం కలిగించుకుంటూ అన్నది. "మా అబ్బాయిల్నిద్దర్నీ ఇలాగే తరిమేశారు ఈయన" అంటూ నిష్ఠూరంగా భర్తకేసి చూసింది.

కొడుకులు జ్ఞాపకం రాగానే, మనస్సులో కలుక్కుమందేమో, మిర్జా మారు మాట్లాడకుండా తల దించేసుకున్నాడు.

అప్పటివరకూ చదరంగం ఎత్తుల గురించే ఆలోచిస్తోన్న సక్సేనా, పూర్తిగా తేరుకుని బిల్కిస్‌ను అడిగాడు, "బిలూ బేటీ! ఇందాకా నువ్వేదో పరీక్షలన్నావు. ఏంటివీ?"

"మా ఫైనల్ పరీక్షలు అంకుల్!"

"ఓహో! అయితే, నీ చదువూ పూర్తికావస్తోందన్న మాట... భాభీ! మాకు బిర్యాని భోజనం ఎప్పుడు పెట్టిస్తావు?"

"దాందేముందిరా మహబూబ్! ఈ సాయంత్రమే వండిద్దాం. రాత్రికి నువ్విక్కడే వుండిపో. మనం ఎన్నో ఆటలు ఆడుకోవచ్చు" అన్నాడు మిర్జా హుషారుగా.

"అది కాదులేరా... భాభీకి అర్థమైంది...ఏం భాభీ?"

"భయ్యా! అది మీ చేతిలోనే వుంది."

"నా చేతిలోనా?"

"అవును. మీ ఇద్దరి కూతుళ్ళకు సలక్షణంగా పెళ్ళిళ్ళు చేశారు. దీన్ని మీ మూడోకూతురనుకోండి. మీ చేతుల మీదుగానే జరిపించండి."

కంవల్, బిల్కిస్‌లు ఒహార్నొహారు క్రీగంట చూసుకున్నారు.

"ఓ, దానికేం. బిలూ బెటీ వజ్రపుతునక. ఎవరైనా కళ్ళకద్దుకుని చేసుకుంటారు."

"అదే భయ్యా! మీకు చాలామంది తెలిసి వుంటారు. ఏదైనా తగిన సంబంధం మీరే కుదర్చండి."

కొద్దిక్షణాలు ఆలోచించి, సక్సేనా అన్నాడు, "నాకు తెలిసిన సంబంధం ఒకటి వుంది. అది అన్ని విధాలా సరిపోతుందనుకుంటాను."

"ఎవరువాళ్ళు భయ్యా?" ఆసక్తిగా అడిగింది నుస్రత్.

"సయ్యద్‌హష్మతుల్లా అని నా స్నేహితుడున్నాడు. నాతోబాటు సెషన్స్ జడ్జీచేసి రిటైరయాడు. అతని కొడుకొకడున్నాడు. జెనిటిక్స్ లో పి.ఏచ్ డి. చేసి, ఇప్పుడు పోస్ట్ డాక్టరేట్ రిసెర్చి చేస్తున్నాడు. చాలా మంచికుర్రాడు. మన బిల్కిస్‌కు తగిన వరుడు."

అంతవరకూ మౌనంగా వింటూన్న మిర్జా కొంచెం గంభీరంగా అన్నాడు– "ఎవరా హష్మతుల్లా? ఫీల్ఖానాలో వుంటాడే, అతనేనా?"

"అవునవును, అతనే. నీకు తెలుసా?"

"బాగా తెలుసు... అది కుదరని సంబంధంలే."

"ఏం?"

"వాళ్ళు సున్నీలు."

"ఓ... ఆ విషయం నేను మరిచేపొయ్యాను... అయినా అలీభాయ్! ఈ రోజుల్లో ఇంకా ఈ పట్టింపు లేంటి?"

"అంటే? నేను నా మత సాంప్రదాయాల్ని వదులుకోమంటావా?"

"ఇందులో వదులుకునేదేమీ లేదు. మీరు ముస్లింలే, వాళ్ళూ ముస్లింలే. ఏనాడో మీ మత గురువు వారసత్వంలో వచ్చిన భేదాభిప్రాయాలని ఇంతవరకూ పట్టుకుని..."

"మహబూబ్! నీకు అర్థంకాదులే, పూర్కో" అన్నాడు మిర్జా కోపంగా.

"... చూడు అలీ భాయ్! అనవసరంగా ఆవేశపడకు. పెళ్ళి విషయంలో మనం చూడాల్సింది చదువూ, సంపదా, మంచి సంస్కారంగల కుటుంబం, యోగ్యుడైన వరుడూ... అంతే. షియా సున్నీలమధ్య పెళ్ళిళ్ళు జరిగిన ఉదంతాలు ఎన్నిలేవు?"

"ఉంటే వుండొచ్చు. ఎవరో తలమాసిన వెధవలు చేసిన పని నేను చెయ్యలేను. నా బొందిలో ప్రాణం వుండగా నేను నా కూతుర్ని సున్నీల కివ్వను. అంతగా అయితే 'కాఫిర్ల' (ముస్లిమేతరుల) కైనా ఇస్తానుగాని"... ఆవేశంగా అన్నాడు మిర్జా.

అందరూ ఖిన్నులై మిర్జావేపు చూశారు. కోపంగా అతని మొహం జేవురించింది... వాతావరణం గంభీరంగా మారింది. ఎవరిమట్టుకు వారు మౌనంగా, గబగబా తినేసి, లేచి వెళ్ళిపోయారు.

☆ ☆ ☆

తండ్రీ కొడుకులు ఇల్లు చేరుకునేసరికి సాయంత్రం అయిదు దాటింది. సరస్వతీ సక్సేనా ఒక్క పొద్దు విడిచి, మంచం మీద వొరిగి అలసట తీర్చుకుంటోంది. రవివర్మ చిత్రించిన సరస్వతీదేవి బొమ్మలాగుంటుంది.

కేవల్ నేరుగా వెళ్ళి తల్లి పక్కలో పడుకున్నాడు.

"ఛీ ఛీ! దూరంపో, నన్ను ముట్టుకోకు" అన్నది తల్లి, లేనికోపం తెచ్చుకుంటూ.

"ఏమ్మా? నేనేం నేరం చేశానని?"

"నేరమే మరి. ఏకాదశి రోజున మీరిద్దరూవెళ్ళి మిర్జా గారింట్లో మాంసాహారం తినివస్తారా?"

"అబ్బ! నీకు అన్నీ పట్టింపులేనే... అసలు, ఇవాళక్కడ ఏంజరిగిందో తెలుసా?" అంటూ, మధ్యాహ్నం భోజనాల దగ్గర తండ్రికీ, మిర్జాకూ జరిగిన సంభాషణంతా చెప్పాడు.

ఇంతలో సక్సేనా బట్టలు మార్చుకుని అక్కడికే వచ్చాడు.

"ఏఁవండీ! ఇది నిజమేనా?"

"ఏఁవిటి?"

"అదే, మీరేదో మిర్జాగారితో ఘర్షణ పడ్డారటగా?"

"ఘర్షణేం కాదులే..."

"అయినా మీకెందుకూ? ఎవరి మతాచారాలు వారివి, ఎవరి నమ్మకాలు వారివి."

"నాకు తోచింది నేనన్నాను. అందులో తప్పేముంది?"

"తప్పా, తప్పన్నరా! మన పిల్లల పెళ్ళిళ్ళు మన మెలా చేశాం? వెతికి వెతికి కాయస్థులకే ఇచ్చి చెయ్యలేదూ? ముస్లింలతోగాని, ఆఖరికి మరో హిందువులతోగాని చేశామా?"

"చేసివుంటే నాకేమీ అభ్యంతరం వుండేదికాదు."

"ఆఁ ఆఁ చేస్తారు, నేను చచ్చినా వొప్పుకునేదాన్నికాను."

"అమ్మా! ఆవేశపడకు." కేవల్ లేచి కూచుని అన్నాడు. "నా మాట ఒకటి వింటావా?"

"ఏఁవిటి?"

"అక్కయ్యల పెళ్ళిళ్ళు నీ ఇష్టప్రకారమే జరిపించావు, బావుంది. కాని, నా పెళ్ళి నా ఇష్టప్రకారమే జరగాలి."

"అంటే?"

"నేనూ బిల్కీస్ పెళ్ళిచేసుకోబోతున్నాం."

"ఏఁవిటీ, ఏమన్నావ్?" దిగ్గునలేచి కూచుంది సరస్వతి.

సక్సేనా కూడా ఆశ్చర్యంగా కొడుకువేపు చూస్తూ వుండిపోయాడు.

"అవునమ్మా. ఈ విషయం మేము ఇప్పుడప్పుడే వెల్లడి చెయ్యొద్దనుకున్నాం. కాని పరిస్థితులు విషమించేట్టున్నాయి కాబట్టి..."

"కఁవల్! పిచ్చిపిచ్చిగా వాగకు. అది అసంభవం."

"ఏమ్మా? ఎందుకసంభవం?"

"మనం కాయస్థులం. హిందువులం. వాళ్ళు ముస్లింలు."

"నేను ముస్లింల అమ్మాయిని చేసుకున్నంత మాత్రాన కాయస్థుణ్ణి కాకుండాపోతానా?... మన కుల శ్రేష్ఠుడు, మహారాజా కిషన్ ప్రసాద్‌కు నలుగురు ముస్లిం భార్యలుండేవాళ్ళు."

"ఆయనకు ముగ్గురు హిందూ భార్యలుకూడా వుండేవాళ్ళు. నువ్వూ సప్త భార్యల్తో కులకాలనుకుంటున్నావా?"

"అదేంకాదు, నాకు కాబోయే భార్య ఒక్కర్తే. ఆమె బిల్కీసే అవుతుంది."

"అదే అసంభవ మంటున్నాను. మీ మగవాళ్ళ ఎలాగూ చెడిపోయారు. మన ఇండ్లల్లో ఇంకా హిందూమతం నిలిచివుందంటే, మా స్త్రీలవల్లే. నాకు కాబోయే కోడలు ఈ ఇంటికి యజమానురాలేకాదు, నా పూజా మందిరానికి వారసురాలు కూడా కావాలి."

"... అయితే నా పెళ్ళిమాటే మర్చిపోండి."

"విన్నారా వాడి మాటలు?... మీరేం మాట్లాడరేమండీ?..."

"ఏం మాట్లాడను? తూర్పు పడమరలు కలవ్వే? వాడేమో బిల్కీస్‌ను తప్ప చేసుకోనంటున్నాడు, నీకేమో హిందువుల పిల్లే కోడలు కావాలాయె... పోనీ, ఒక పని చేద్దామా?"

ఏఁవిటన్నట్టు తల్లీకొడుకులు సక్సేనా కేసి చూశారు.

"... బిల్కీస్‌ను హిందువుగా మారిస్తే సరిపోతుంది."

ఉలిక్కిపడ్డది సరస్వతి. "హిందువుగానా?... అదెట్లా సాధ్యం?"

"ఈ రోజుల్లో అన్నీ సాధ్యమే. మన బంధువు నరేందర్ సక్సేనా, అంటే పండిత్ నరేందర్‌జీ అంటారే. ఆయనే దారి చూపాడు. ఆర్యసమాజ్‌వాళ్ళచేత శుద్ధి చేయిస్తేచాలు."

"కాని ... కాని, మిర్జా వాళ్ళు వొప్పుకుంటారా?"

"వాళ్ళు వొప్పుకుంటారన్న నమ్మకం నాకూ లేదు. కాని బిల్కీస్ గనక కంవల్‌ని నిజంగానే ప్రేమిస్తోంటే ఆ అమ్మాయి వొప్పుకుంటేచాలు. ఏం కంవల్! వొప్పుకుంటుందా?"

"... ఏమో. చెప్పలేను... అడిగి చూస్తాను."

సరిగ్గా అదే సమయానికి, అటు మిర్జా ఇంట్లో అదే ప్రస్తావన వచ్చింది.

నుస్రత్ బేగం రుసరుసా భర్తదగ్గిరికొస్తూ, "చూశారా, మీ మాటలు ఎంతటి అనర్థానికి దారితీశాయో అర్థం చేసుకున్నారా?" అన్నది.

ఇంకా చదరంగపు ఎత్తులు మీదే ధ్యాసవున్న మిర్జా, హుక్కాపీల్చటం ఆపి, భార్యకేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"బిల్లూ ఏమంటోందో విన్నారా?"

"ఏంవిటి?"

"నా నోట నేను చెప్పలేను. దాన్నే అడగండి. బిల్లూ! బిల్లూ! ఇలారా."

బిల్కీస్ మెల్లిగా గదిలోకి అడుగుపెట్టింది.

"బిల్లూబేటీ! ఇలారా.... కూచో... మమ్మీ నేమన్నావ్?"

"అయ్యోరాత! నన్నుకాదండీ, తనగురించే చెబుతోంది."

"తనగురించా?... అంటే?"

"... చెప్పవేమే..."

"... ఏంలేదు డాడీ! ఇందాక భోజనాలప్పుడు నా పెళ్ళి ప్రస్తావన వచ్చిందికదా... ఏ సంబంధమూ చూడద్దన్నాను."

"ఓహో, అంతేనా... సరేలే... నీ పెళ్ళి కిప్పుడేం తొందరొచ్చిందనీ?"

"అదికాదండీ, అది నిజం చెప్పటంలేదు. ఎవర్నో ప్రేమించిందట, పెళ్ళి చేసుకుంటుందట."

"ఆఁ! ... నిజమా?" ఆశ్చర్యంగా కూతురువేపు చూశాడు.

అవునన్నట్టు తలూపింది.

"ఎవర్ని?" "కంఠంలో కొంచెం కఠినత్వం పొడసూపింది....."

"కంవల్ సక్సేనా....."

అదిరిపడ్డాడు మిర్జా... "కంవల్?... మహబూబ్ కొడుకు కంవల్ సక్సేనా?" నమ్మలేనట్టు కళ్ళు పెద్దవి చేశాడు. చేతిలోని హుక్కాగొట్టం జారిపడ్డది.

బిల్కీస్ తలవంచుకుని మౌనంగా కూచుంది.

"అనండి, ఇంకా అనండి, 'కాఫిర్లకైనా కూతుర్నిస్తానని' అనండి." బేగం దెప్పి పొడిచింది.

"బేగం! నువ్వూర్కో.... బిల్లూ!... బిల్లూ బేటీ! నువ్వు నిజంగా ఇంత ఎదిగిపోయావని నేను నమ్మలేకుండా వున్నాను... నేనేదో ఉద్రేకంలో అన్నమాటల్ని నమ్మి..."

"కాదు డాడీ! మీ మాటల్ని నమ్మికాదు. నా పరీక్షలైన తర్వాత మేమే మీతోనూ, అంకుల్‌తోనూ చెబుదామనుకున్నాం. కాని ఈలోగా మీరు మరోచోట మాట ఇస్తారేమోననీ..."

"వాళ్ళు వొప్పుకోరు, నాకు తెలుసు, .వాళ్ళు వొప్పుకోనక్కర్లేదు. కంవల్ యుక్తవయస్కుడు. అతనొప్పుకుంటే చాలు... ఏమంటావు బేటీ?... కంవల్ వొప్పుకుంటాడా?"

"... ఏమో డాడీ! చెప్పలేను... అడిగి చూస్తాను."

☆ ☆ ☆ ☆ ☆ ☆

రెండోరోజు మధ్యాహ్నం కాలేజీకి ఎదురుగా వున్న ఐస్‌క్రీం పార్లర్‌లో కూచునివున్నారు కంవల్ టిక్కీస్‌లు.

"భలే గమ్మత్తుగా వుందికాదూ? మన వాళ్ళ కోర్కెల్ని మనం మన్నిస్తే, రేపు నువ్వు హిందూవై పోతావు, నేను ముస్లింనై పోతాను. మరి మన పెళ్ళి జరగటం ఎలాగో? మందిరంలోనా, మస్జిద్‌లోనా?" అంటూ పెద్దగా నవ్వాడు కంవల్,

"కంవల్! నీకు వేళాకోళంగా వుంది కదూ?"

"కదా మరి? ఇంతా చేసి, మళ్ళీ మనం మొదటి గదిలోకే వొస్తామే?"

"నవ్వులాటలు ఆపి, ఏదైనా పరిష్కారం మార్గం ఆలోచించు."

"ఇందులో పెద్ద ఆలోచించాల్సిందేమీలేదు టీల్లూ! మనవాళ్ళు ఇలాంటి వింత కోర్కెలు కోరుతారని అనుకోలేదు కాని, మన పెళ్ళికి వొప్పుకోరనీ, మనం ఎదురించాల్సి వుంటుందనీ అనుకున్నదే కదా? ఆ నిర్ణయానికే నిలబడదాం. నువ్వేమీ ఎరగనట్టే వుండు. అడిగితే, పరీక్షల తర్వాత ప్రస్తావిస్తాను, తప్పకుండా వొప్పుకుంటాడని హామీ ఇవ్వు. నేనూ అలాగే నటిస్తాను. నేను యథాప్రకారంగా రోజూ మీ ఇంటికి వచ్చి పాఠాలు చెబుతూ ఉంటాను. నువ్వు అన్నీ మరిచిపోయి చదువుమీదే శ్రద్ధ వహించు. బాగా చదివి పరీక్షలు రాయి."

"ఆ తర్వాత?"

"అప్పటికి చాలా వ్యవధి దొరుకుతుంది. ఏదో ఒక మార్గం కనిపించకపోదు... ఇక లే, ఇంటికెళ్ళు. నేను నాలుగింటికొస్తాను."

ఇద్దరూలేచి ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు.

☆ ☆ ☆

ఏ పేచీ లేకుండానే రోజులు గడుస్తున్నాయి. రోజూ కంవల్, టిక్కీస్‌లు హాస్పిటల్‌లోనో, లైబ్రరీలోనో, ఇంట్లోనో కలుసుకుంటూనే వున్నారు. మిర్జా, సక్సేనాలు కలుసుకోవటం మాత్రం కాస్త మందగించింది. పూర్వంలా ఫ్రీగా లేరు. తేలుకుట్టిన దొంగల్లా, బెదురు బెదురుగా వుంటున్నారు. తమ కుటుంబాల విషయాలు అసలే ఎత్తటం లేదు.

కంవల్ టిక్కీస్‌లు కలిసి ఒక పథకం తయారుచేశారు. దాని ప్రకారం ఒకరోజు ఇద్దరూ కలిసి రిజిస్ట్రార్ ఆఫ్ మేరేజెస్ ఆఫీసు కెళ్ళి, తమ పెళ్ళి నోటీసు ఇచ్చి

వచ్చారు. కంవల్ ఒక స్నేహితుని క్లినిక్‌లో సాయంత్రాలు కూచోడం ఆరంభించాడు.

బిల్కీస్ పరీక్షరోజులు వచ్చాయి. వెళ్ళిపోయాయి. చాలా బాగా రాసింది. మెడిసన్‌లో ఫస్టు కూడా రావచ్చనుకుంది. పరీక్షలు పూర్తయేనాటికి కంవల్ హౌస్ సర్జన్ షిప్ కూడా పూర్తయింది.

పెళ్ళి నోటీసు ఇచ్చాక సివిల్ మారేజ్ ఆక్ట్ ప్రకారం నెలరోజుల గడువుకూడా పూర్తయింది. ఒక రోజు నలుగురు స్నేహితుల్ని వెంట బెట్టుకుని రిజస్ట్రార్ ఆఫీసుకెళ్ళి, దండలు మార్చుకుని సివిల్ మారేజ్ చేసుకున్నారు. స్నేహితుల్లో ఇద్దరు వరుడి తరఫునా, ఒకరు వధువు తరఫునా సాక్షులుగా సంతకాలు చేశారు.

అక్కణ్ణించి తిన్నగా హోటల్ కెళ్ళారు. మరో పదిమంది స్నేహితుల్ని కూడా పిలిచి విందు చేశారు. ఆ సాయంత్రమే కాశ్మీరుకు ప్రయాణం కట్టారు. వెళ్ళేముందు, ఒకే ఉత్తరానికి రెండునకళ్ళు చేసి, ఇద్దరూ సంతకాలు చేసి, ఇద్దరి తలిదండ్రులకూ పోస్టుచేశారు.

అందులో తాము చేసినపని సవిస్తరంగా, సవినయంగా మనవిచేసుకుని, చివరకి, "మా దృష్టిలో మతం వ్యక్తిగత విషయం, పెళ్ళి సామాజిక వ్యవస్థ. రెంటికీ పరస్పర వైరుధ్యం వుండనవసరంలేదు. మేము మా మతాలు మారకుండానే భార్యా భర్తల్లా మనగలం. ఇప్పటికీ, ఎప్పటికీగూడా మేము కంవల్‌రాయ్ సక్సేనా, బిల్కీస్ మిర్జాగానే వుండిపోతాం... మరో సంవత్సరంలో బిల్కీస్ హౌస్ సర్జన్‌షిప్ కూడా అయిపోయాక, మేము పట్నంలో కూడా వుండం. దగ్గర్లోని ఏదైనా పల్లెటూళ్ళో స్థిరపడిపోయి, అక్కడి జానపదుల సేవలో మా వైద్యవృత్తిని సద్వినియోగం చేసుకుంటాం... మానవత్వమే మా మతం; మానవసేవే మా ధ్యేయం; మేము కేవలం మానవులం" అని ముగించారు.

● *ప్రచురణ 1960* ●

★ ★ ★

మంజీర

26

# ధర్మవ్యాధుడు

అనేక మతకలహాలు వచ్చేయి. పోయాయి, ఏవో ఉప్పెనలూ వరదలూ వచ్చి పోయినట్లు. రాజకీయ నాయకుల ఉద్బోధలు, ప్రజల ఆవేశాలు, వట్టి రక్తపాతాలు తీసుకవచ్చాయి. అలాంటివి వస్తూనే ఉంటాయి.

షేరాలీ యిలాంటి సంఘటనలు తన జీవితంలో చాలావరకు ఎదుర్కొన్నాడు. అపరిస్థితులలోను, వాతావరణంలోను ఎలా మసలుకోవాలో అలా మసలుకున్నాడు కూడా.

భారత దేశానికి స్వాతంత్ర్యంతోపాటు పాకిస్తాన్ కూడా వచ్చింది. దేశాన్ని ముక్కలుగా త్రుంచారు.

అదీ చూశాడు.

దానికి సంబంధించి జరిగిన కల్లోలాలు. అమానుష చర్యలుకూడా చూశాడు. తన యింటిపక్కన్నే అయోమయంగా వినపడే మూలుగులు, వికటాట్టహాసాలు. గర్జనలు. ఏడ్పులు అన్నీ యింటితలుపు బిగించుకుని వాటె సందులోంచి సన్నంగా విన్నాడు. ప్రశాంతత ఏర్పడ్డాక, తనసోదరులు కలలుగంటూ ఏదో తెలీని ఆనందం అనుభవిస్తూ, ఉన్న ఊరు, కట్టిన యిల్లు వదలి, ఎక్కడో ఏదో ఉందనిపోవడం మౌనంగా చూశాడు. కన్నకూతురు, అల్లుడు వచ్చి సంతోషంతో నిండిన ముఖాలతో, ఎక్కడికో ఎందుకో పోదాం-రమ్మన్నప్పుడు, వాళ్ళ ముఖాలలోకి కూడా మూగగా చూశాడు.

తనకు ఎక్కువ మాటలు, చాలా చదువు రాకపోవడంవల్ల, వాళ్ళని ఏ విధంగా సమన్వయించాలో తెలీక తికమకపడ్డాడు. హృదయంలోని ఆరాటం, బాధ, ఆవేదన మాటలద్వారా వెళ్ళబుచ్చుకోడానికి అశక్తుడయి కళ్ళతో తెలియపర్చాడు. తనకు తెలుసున్న రెండు మాటలు మాత్రం అనగల్గాడు- "ఉన్నఊరు, కన్నకడుపు వదల్లేనవి."

అల్లుడు కోపగించి పెళ్ళాన్ని కసిరి మాట్లాడకుండా మూటముల్లె సర్దుకుని మారుబండికే ప్రయాణమై పోయాడు భార్యతో. నాటికీ నేటికీ అల్లుని గొడవే తెలీదు. ఆరేళ్ళు గడిచినా, వాళ్ళు వెళ్ళిన కొత్తలో ఉత్తరంముక్క వస్తుందేమోనని ప్రతీ ఉదయం పోస్టుమాను కనుక్కునేవాడు. శాంతంగా చల్లగా నవ్వుతూ జవాబిచ్చే ఆ పోస్టుజవాను ముఖం చూచి విచారం కాస్త తగ్గించుకునేవాడు. బరువెక్కిన హృదయంతో యింటికి చేరుకునేవాడు.

ఇలా కొంతకాలం జరిగింది. కాలం గడచినకొద్దీ మామూళ్ళు మారిపోతూంటాయి. మనకు తెలీకుండానే. కష్టాల్లో కష్టాలగురించి బాధపడడం కాస్త సుఖంగా కూర్చున్నప్పుడు కూతురునుగురించీ బాధపడడం మామూలయింది షేరాలీకి. రోజులు పోనుపోను ఏదో ఎప్పుడో విద్యుల్లతలా మనస్సులో మెరవడం, కాస్త కన్నులు చెమ్మగిల్లడం మామూలయింది.

షేరాలీ ఉన్న ఊరు పెద్దది కాదు. చిన్నది కాదు. రైలుబండి, ఎలక్ట్రిక్ దీపం, టెలిఫోను, తపాలాఫీసు, తారురోడ్లు, రేడియో, గుజరాతీకొట్లు, మార్వాడీ బజారు, కార్మికులు, కాబూలీ వాళ్ళూ ఉన్నారు. తన తండ్రి తాతలనుండి వచ్చే కసాయి పనిని నిర్వర్తిస్తూ గానుగెద్దులా లాక్కొస్తున్నాడు సంసారాన్ని. సంసారంలో ఉన్న సుఖము, జీవితంలో ఉన్న ఆనందం తప్ప మిగతావన్నీ అనుభవిస్తున్నాడు ఆ రెంటికోసం భగవంతుణ్ణి గురించి తలక్రిందులా తపస్సు చేసే మహామునిలాగ.

తన జాతివాళ్ళు చాలామంది ఆ వూరి ఖాళీజేశారు. తనొక్కడే ఆ వూరి చివర కాకిగూడులాంటి తన కొంపలో కాపరం చేస్తున్నాడు. వల్లమాలిన పిల్లలు, పెళ్ళాం, తల్లీ, తండ్రీ, బామ్మ తనతోపాటు ఆ సంసార సముద్రంలో పడి కొట్టుకుంటున్నారు. వంశంలో అనుశ్రుతంగా వచ్చే కసాయివృత్తి తప్ప తన తండ్రి తనకేమి అప్పగించలేదు.

అవును, తన తండ్రికి మాత్రం వేరే ఆస్తి యేం సంక్రమించింది?

ఆ ఆస్తే సణుగూ, గొణుగూ లేకుండా అంగీకారయుక్తంగా తీసుకున్నాడు; గొఱ్ఱెలను మేకలను నరికే కత్తీ, కట్టెదుంగాను అతని ఆస్తి. అలాగే అతని జీవితం గడుస్తూంది. చుట్టుపక్కలవాళ్ళకు యేవిధంగాను కష్టం కలగజేయకుండా, తన పరిస్థితి, ఉన్న వాతావరణం గ్రహించి మెలగడం నేర్చుకున్నాడు. ఇరుగు పొరుగుల వాళ్ళెవరు అతన్ని, అతని కుటుంబాన్ని మతాంతరుడనే భావంతో చూడడంలేదు కూడా. మామూలుగా ఇలాంటి విషయాలన్నీ ఆలోచించడానికి వాళ్ళకు తీరుబడిలేదు. అతను కూడా తమలో ఒకడే అయినట్లు తమ తమ పనుల్లో లీనమయ్యేవారు.

షేరాలీ మేకలను చంపడానికి తీసుకుపొయ్యేటప్పుడు, అవి జాలిగా పెట్టే అరుపులు విన్నప్పుడు మాత్రం, కొందరు అతన్ని నిందిస్తూండేవారు. ఈ నిందలు ఒకటి రెండుసార్లు షేరాలీ విన్నాడు కూడా. ముఖ్యంగా తన యింటి కావల కాపురం ఉన్న అద్దె యింటిపంతులు ఇతని జీవహింసకు చాలా బాధపడేవాడు. మేకల అవస్థ చూచి చాలా జాలిపడేవాడు. షేరాలీకి వినిపించాలనే కాస్త గట్టిగా అన్యాపదేశంగా ఏవో నిందాభాషణాలు విసిరేవాడు. షేరాలీ ఈ గొడవలేం పట్టించుకొనేవాడుగాదు. తన పిల్లల కోసం, కుటుంబం కోసం తన పని చెయ్యాలి తప్పదు. ఎంతమంది పంతుళ్ళు అరచినా, అహింసావాదులు చెలరేగినా, మాంసాహారులున్నంతవరకు తనకా పని తప్పదు. అందుకే పంతులెంత అరిచినా యేం ప్రయోజనం లేకపోయేది. పాపం! పంతులు మేకలకోసం కరుణతో తొణికిసలాడిపోయేవాడు!

ఆరోజు షేరాలీ మాంసం అమ్మినగంప భుజంమీద వేసుకుని సంతనుంచి యింటికి వస్తున్నాడు గతుకులదారంట.

సూర్యుడు చాలా వేడిగా ఉన్నాడు. కోపంతో అగ్గి కురుస్తున్నాడు 'స్టవ్'లోంచి వచ్చే జ్వాలల్లాగ.

అసలు దారంతా రాళ్ళమయం అవడంవల్ల, చెప్పులులేని షేరాలీ కాళ్ళు ఉదుకెత్తి పోతున్నాయి. ఏదయినా సూదయిన రాయి కాలికి గ్రుచ్చుకున్నప్పుడు మరీ అవస్థ పడేవాడు. ఎంత అవస్థపడుతున్నా విసుగుకోకుండా శాంతంగా తల వంచుకు పోతూన్నాడు. అదే యేమో అతనిలో విశేషం.

తన యింటిముందుకు వచ్చాడు. ఇంటిప్రక్క వేపచెట్టు నీడలో ఎవడో కుఱ్ఱాడు యేడుస్తూ నుంచున్నాడు. కొంచెందూరంగా ఉన్నయింట్లో మొగుడూ పెళ్ళాలు దెబ్బలాడుకుంటున్నారు. ఇద్దరినోళ్ళూ గూడా వినిపిస్తున్నాయి. సుస్పష్టంగా, భయంకరంగా, ఎన్నికల ప్రచారంచేసే 'లౌడ్' స్పీకర్లగొంతుకలాగ.

వాళ్ళు వాళ్ళ మనోవికారాల్లో తమ బాంధవ్యాన్ని, మానవత్వాన్ని చుట్టూ ఉన్న ప్రజల్ని, ఆఖరుకి పుట్టి పెరిగిన జీవిత వాతావరణమే విస్మరించినట్లు కనబడుతూంది.

షేరాలీ తలెత్తి అటువైపు ఓసారి చూశాడు. మళ్ళీ తలదించుకుని ఇంటి గుమ్మంలోకి వచ్చి తలుపు తట్టాడు. తలుపు తెరవడంతోనే గూట్లోనుంచి బయట పడిన కందిరీగల్లా ఇద్దరు పిల్లలు విసురుగా పైకివచ్చి "బాబా బాబా" అంటూ అతని రెండు కాళ్ళూ పట్టుకున్నారు. వాళ్ళిద్దరినీ వెంటబెట్టుకుని లోనికిపోయాడు.

వీధిలో దంపతుల కేకలు యింకా వినపడుతూనే వున్నాయి. ఆ కేకల మధ్యనుండి అప్పుడప్పుడు సన్నటిరోదనకూడా వెలువడుతోంది. షేరాలీ లోపలనుండి పైకివచ్చాడు. ఇంటి రాటలకు కట్టిన మేకపిల్లలు అదోలా చూస్తున్నాయి అతనివైపు. చెట్టు క్రిందకుఱ్ఱాడు అలా యేడుస్తూనే ఉన్నాడు. ఎదురుగుండా ఉన్న రెండు మూడు యిళ్ళ తలుపులు మూసుకున్నాయి.

ఏడుస్తూ ఉన్న ఆ కుఱ్ఱాడివైపు షేరాలీ ఓసారి చూచాడు. వాడు ఆ వీధికి చెందినవాడు మాత్రం కాదని అతడు గ్రహించాడు. దగ్గరిగా వెళ్ళాడు. కుఱ్ఱాడు ఏడుపు స్థాయి హెచ్చించాడు. షేరాలీ యేమడిగినా వాడిదగ్గరనుంచి యేడుపే సమాధానం. మరో మాట లేదు. ఏదో అర్థంలేని మాటలు చెబుతూ, బుజ్జగిస్తూ ఇంట్లోకి తీసుకుపోయాడు. ఒక్కింతసేపు మాత్రమే ఇంట్లోనుండి ఆ కుఱ్ఱాడి యేడ్పు వినవచ్చింది.

షేరాలీ తన బట్టలు మార్చుకుని కుఱ్ఱాణ్ణి ఎత్తుకుని బయలుదేరాడు. ఆ కుఱ్ఱాడెవరో, ఏమిటో అతనికి ఏం తెలియదాయె. కొత్తగా వచ్చిన ఆ ఉద్యోగస్తుని తాలూకేమో అనుకుని తిన్నగా అతని ఇంటికి తీసుకపోయాడు. అతడు ముద్దొస్తూన్న అ కుఱ్ఱాడి బుగ్గమీద ఓ చిటుకవేసి "మా తాలూకు కాదు" అంటూ సమాధానం యిచ్చాడు ముక్తసరిగా.

"ఎవరి పిల్లాడయి ఉంటాడు బాబూ?" అంటూ షేరాలీ అడిగాడు. ఏమి చెపితే తనకేమి పని తగులుతుందో అనే బెంగతో తనకు తెలీదని చెప్పి, ఇంట్లోకి పోయాడు. కాస్త సహాయం చేస్తాడేమో నన్న ఆశతో కాబోలు షేరాలీ కాస్త సేపు అక్కడ నిలబడ్డాడు. కాని యింట్లోకి పోయిన పెద్దమనిషి యిదేం పట్టించుకున్నట్లు కనబడకపోవడంవల్ల, మళ్ళీ అక్కడనించి తన బరువైన పాదాలను సూదుల్లాంటి చిన్న చిన్న రాళ్ళమీద యీడ్చుకుంటూ వెళ్ళాడు. రెండు మూడు యిళ్ళు వాకబు

చేసుకుంటూ వచ్చాడు అందరూ ఒకటే ధోరణిలో ఉన్నారు. ఈ ప్రవర్తన అంతా, షేరాలీకి విచిత్రంగా కనిపించింది.

ఎవరూగూడా ఆ కుఱ్ఱాడు యెవరో ఏమిటో అన్న ఆందోళనే కనపరచలేదు ఇదంతా యింటి అరుగుమీద నిలబడి కళ్ళజోడు మధ్యనుంచి చూస్తున్న పంతులు "తీసికెళ్ళి పోలీసుస్టేషనుకు వప్పజెప్పవోయి సాయిబూ! ఎందుకు నీకు అనవసరపు శ్రమ? వాళ్ళే చేసుకుంటారు యీ పనంతా" అన్నాడు.

షేరాలీ మాట్లాడకుండా ఆ కుఱ్ఱాణ్ణి తీసుకుని తన యాత్ర సాగిస్తున్నాడు. ఆ పిల్లాడు బెదురుగా అందరి వైపు చూడడం తప్పితే యింకేవిధమయిన సహాయం చెయ్యలేకపోతున్నాడు. షేరాలీ సందుమలుపు తిరిగి రెండిళ్ళు దాటాడు. షేరాలీ వెనుకనుండి యిద్దరు స్త్రీలు "హరినాయనా! ఎక్కడికి పోయావురా, బాబూ!" అంటూ పరిగెత్తుతూ వచ్చారు. షేరాలీ వెనక్కి తిరిగాడు, పిల్లాడుకూడా "అమ్మా" అంటూ ఒకామె మీదకు ఒరిగాడు. "ఈ పిల్లాడు మీవాడేనా?" అంటూ షేరాలీ వాడి బరువు వదుల్చుకున్నాడు. మాట్లాడకుండా ఆ స్త్రీలు పిల్లాణ్ణి ఎత్తుకుని ముఖంమీద ముసుగులు ముందుకు లాగుకుని చల్లగా యింట్లోకి జారుకున్నారు.

షేరాలీ వెనుదిరిగి – యింటిముఖం పట్టాడు. ఏదో ఆలోచిస్తూ యింటికి చేరాడు. అతని కొఱకు ఎదురుచూస్తూన్న పిల్లలు "నాన్నా నాన్నా" అంటూ వాకిట్లోనే అతన్ని చుట్టుముట్టారు. ఆనందంతో యిద్దరినీ చెరో చేత్తో పట్టుకుని యిటూ, అటూ ఊగుతూ షేరాలీ యింట్లోకిపోయి చతికిలబడ్డాడు. ఇంటిలో వాళ్ళంతా అతనిచుట్టూ చతికిలబడ్డారు.

కన్నాలుపడ్డ యింటికప్పునుండి వెల్తురు ప్రసాదిస్తున్నాడు సూర్యుడు. కాకులో, యెలకలో యింటిమీద పెంకులు కదుపుతున్నాయి. ఎండగాలుపు దారుణంగా కొడుతూంది బయట.

"నాన్నా, పండుక్కి బట్టలు తేవూ" అంది షేరాలీ కూతురు. ఏ పండుగన్నట్లు తలెత్తి చూశాడు. "రేపు రమ్‌జాన్ కదా"అంది ఆ పిల్ల ఆనందంగా. "అలాగా" అన్నాడు పిల్లలవైపుచూస్తూ.

తనకు పండుగని తెలిసినందుకు చాలా ఆశ్చర్యపడ్డాడు. ఆ వూళ్ళో తన వాళ్ళు నలుగురూ వున్నప్పుడు ఎంత ముందుగా ఆ సంగతి తెలిసేది! ఎంత ఆనందంతో పండుగకొరకు వేచి ఉండేవాడో కాస్త వెనుదిరిగి ఊహించుకున్నాడు.

"ఏంబట్టలు కొంటావు నాన్నా?" అని మళ్ళీ వినిపించింది షేరాలీకి. పిల్లలంతా తలోవైపు మూగారు. కొడుకు అవస్థ గ్రహించిన ముసలివాడు "ఉండండ్రా. తెస్తాడు లెండి సాయంత్రం" అంటూ ఒక కేక వేశాడు. పిల్లలంతా సింహగర్జనకి భయపడి పరుగెత్తే లేళ్ళలాగ చెల్లాచెదరయ్యారు.

షేరాలీకి ఏం తేవాలో, ఎలా తేవాలో యేమీ బోధపడలేదు. ఇంట్లో తిండి జరగడమే పెద్ద ఘనకార్యంలా ఉంది.

"పాపం, పిల్లలు వాళ్ళకేమి తెల్సు?" అనుకున్నాడు మనస్సులో షేరాలీ.

"రేపే నాన్నా పండుగ. కొత్తబట్టలు లేకపోతే యెలాగ?" అన్నారు పిల్లలు మళ్ళీ దూరాన్నుంచే. బూబమ్మ ముసుగు కాస్త ముందుకు లాగింది.

"ఇంకెప్పుడు తెస్తావు నాన్నా? ఎప్పుడు కుడుతారు?" అని కాస్త రాగ ధోరణిలో పడ్డారు.

"నాయనా, ఎలా ఓలాగ కాస్తచూడు మరి. పాపం పిల్లలు, యేంజేస్తాము" అన్నాడు ముసలివాడు, డెబ్బయియేళ్ళ జీవితము అవలోకిస్తూ. షేరాలీకి ఏం చెయ్యాలో బోధపడలేదు సరికదా ఊహించనైనాలేకపోతున్నాడు.

వీధిలోని మేకపిల్ల ఓసారి అరిచింది అయోమయంగా.

షేరాలీ నల్లగా మాసిన తుండుగుడ్డ తలకు చుట్టుకుంటూ బయలుదేరాడు. ఇంట్లోవారంతా అతని వైపే చూస్తూన్నారు. వీధిలోపడి ఏనుగులా అడుగులో అడుగు వేసుకుంటూ పోతున్నాడు ఆ యెండలో. బ్రహ్మాండమయిన సుడిగాలి లేచింది. ప్రక్కనున్న చెత్త ఎండిన ఆకులు ఓ పెద్ద స్తంభంలా తిన్నగా ఆకాశంలోకి తీసుకుపోయింది. పరిసరప్రాంతమంతా దూళితో నిండిపోయింది. ఆ జంఝూమారుతం అలా ప్రయాణం చేస్తూపోతూంది. ఆ వాయువుబారినుండి బయటపడ్డ ఆకులన్ని తమాషాగా తలక్రిందులవుతూ క్రిందికి దిగుతున్నాయి.

షేరాలీ నఖశిఖపర్యంతం ధూళితో నిండిపోయాడు. కళ్ళు నులుముకుంటూ నడుస్తున్నాడు. బజారులో ప్రవేశించాడు.

వడ్డీకి డబ్బుయిచ్చే పంజాబు సింహం, సర్దార్ షేర్ సింగ్ ఏవో చిట్టాలు సరిదిద్దుతున్నాడు. రాసిన లెక్కలు రాస్తున్నాడు. ఓ కంటితో దారంటపోయే వాళ్ళందరినీ చూస్తున్నాడు: హఠాత్తుగా తనవద్దకు వచ్చిన షేరాలీని చూడగానే చిన్న మందహాసంచేస్తూ—

"ఏమండోయి, నవాబుగారు! ఇలా దయచేశారు" అన్నాడు.

"తమవద్దకే" అన్నాడు షేరాలీ ఓ సలాంకొట్టి.

"రండి కూర్చోండి" అన్నాడు. మళ్ళీ చిట్టాల్లో నిమగ్నుడయ్యాడు.

"ఆమధ్య మీరు నాతో చెప్పారుగా" అన్నాడు షేరాలీ నీళ్ళునములుతూ

"అవునవును. ఏం?"

'ఏంలేదు. దాన్ని తమ కిచ్చేద్దామని."

"మరి యివ్వనన్నావు కాదుటోయి."

"ఇచ్చేస్తాను బాబూ, తమకు కావలిస్తే"

"ఇప్పుడు నాకు ఆ మేక అంత అవసరంలేదు. మరోటిబేరంచేసేశాను"

"ఆహా! అలాగా" అని ఊరుకున్నాడు షేరాలీ.

"ఇంకా పూర్తిగా కొనెయ్యలేదనుకో. బేరంమాత్రం అయింది."

"మేక చాలా మేలురకండండి. ఒక చూలికి మూడు పిల్లల్ని పెడుతుంది. పాలుకూడ బాగా ఇస్తుంది. తమకు వేరేచెప్పాలేమిటిలెండి."

"ఆలోచించడాని కేముందిగాని, ఎంతకిస్తావు?"

"తమరిదివరలో యిప్పిస్తానన్న ధర ఇప్పించండి. నేనసలు అమ్ముకుందామను కోలేదనుకోండి. ఏమిచెయ్యాలి, పరిస్థితులల్లా వచ్చాయి."

"ఇదిగోచూడు, ఆ ధర ఆ బేరం ఆవేళే పోయాయి. పాతికరూపాయలు యిస్తా. అంతకన్న ఎక్కువలేదు" అన్నాడు దృష్టంతా చిట్టాలమీదేఉంచి.

షేరాలీకి కాస్త కష్టం అనిపించింది. మనస్సులో బాధ రోషం ఒక్కుమ్మడిగా వచ్చాయి. ఏమీ చెయ్యలేని తన అసహాయతకు చిహ్నంగా కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఈ పదిరోజులకు ఇంత తేడాయేనా? కాస్త న్యాయం ఆలోచించండి."

"ఆలోచించడానికేముందోయ్! ఇదంతా వ్యాపారం, వ్యాపారం అంటే అంతే. ఏరోజుధర ఆరోజునే. నీకు మరో పది ఎక్కువ యిస్తానంటే నువ్వూరికే పోనిస్తావ్వా?"

"అది నేడో రేపో యీనుతుంది బాబూ! చాలా బాగా పాలుకూడా యిస్తుందండి. అలా కానినాడు మీ డబ్బు మీకిచ్చి నా మేకను నేతోలుకుపోతాను" అన్నాడు షేరాలీ ధైర్యంతో.

"అవన్నీ చూచుకునే పాతిక ఇస్తానంటూాంటు. అంతకంటె ఎక్కువ యెవరైనా యిస్తే అమ్ముకోవోయ్, పాపం!" అన్నాడు తేలికగా.

"అయిదురూపాయిాలు ఎక్కువ ఇప్పించండి చాలు."

"అబ్బె, అంతకు ఎక్కువలేదు. తర్వాత నీ యిష్టం" అన్నాడు సర్దార్‌జీ.

"తమలాంటి గొప్పవాళ్ళకి యీ అయిదు రూపాయిాలు లెక్కేమిటి చెప్పండి. పదిరోజుల క్రితం తమరిస్తానన్నదేకదా ముప్ఫయి అయిదు రూపాయిలూను."

"ఆరోజే నువ్వు అమ్మేసి ఉంటే ఎంత బాగుండిపోను. ఆరోజు ఆరోజే. ఈరోజు ఈరోజే తెలిసిందా?" అన్నాడు షేరాలీవైపు చూస్తూ.

షేరాలీకి యేం మాట్లాడ్డానికి తోచడంలేదు. ఒకమూల బంగారంలాంటి మేక, యింకోప్రక్క పిల్లలూ, పండుగానూ. "పిల్లలు పిల్లల్లా, ఉంటారా? ఇంక వాళ్ళ సరదాలెప్పుడు? మన దరిద్రం, బాధ ఇలా ఉండేవే" అనుకున్నాడు మనస్సులో.

"అయితే తీసుకోండి, సాయింత్రంగాని రేపు ప్రొద్దునగాని మీ యింటికి తోలేస్తా" అన్నాడు.

"దానికేంలేవయ్యా నువ్వీ వూరాడివి, యెక్కడికి వెడతావుగనుక, అంత నమ్మకం లేకపోవడానికి పాకీస్తానే పోనన్నావు" అన్నాడు తన తెలివికి తనే సంతోషిస్తూ.

"ఆ డబ్బిప్పిస్తారా?"

"ఇప్పుడే కావాలా యేమిటి? అలా చెప్పవేం మరి?" అంటూ పెట్టె తలుపు తీసి లెక్కపెట్టి డబ్బు ఇచ్చాడు.

ఓసారి పెట్టెలో మూలుగుతున్న డబ్బువైపు అసూయతో చూశాడు షేరాలీ. అతడిచ్చిన డబ్బు జేబులో తోసుకుని, సర్దారుజీకి వందనశతాలర్పిస్తూ మెట్లుదిగాడు. సర్దారుజీ సంతృప్తితో మందహాసం చేస్తూ ఓసారి షేరాలీ వైపు చూచాడు. ప్రపంచంతో సంబంధంలేనట్లు నడుస్తూ పోతున్నాడు. షేరాలీ

"ఏమండోయి నవాబుగారూ! పండక్కయినా మావేపు కన్నెత్తి చూడ్డం మానేశారు?" అంటూ వినబడింది షేరాలీకి వెనకనుండి. అతడు వెనుదిరిగి చూచాడు. కుట్టుమిషను ప్రక్క కూర్చున్న దర్జీ ఓ సలాం విసిరాడు. షేరాలీ అతని

కొట్టుకు వెళ్ళాడు. "నాకు యిలా కూర్చున్నపళంగా బట్టలు కుట్టేయ్యాలి ఏం" అంటూ చూచాడు.

"తప్పకుండా. తమరు బట్టలు ఇప్పించండి ముందు" అన్నాడు దర్జీ.

"నువ్వు కుట్టి ఇచ్చేవరకూ ఇక్కడే కూర్చుంటాను సుమీ!" అన్నారు నవాబుగారు నవ్వుతూ.

"సరిపోయిందండి! మీరలా కూర్చుండగానే కుట్టేయిచ్చేస్తా పోనీ. యిదివరకులాగ ఏ పండుగకి ఏమన్నా గిరాకీవుందా? ఉన్నవాళ్ళంతా ఊరొదిలి పోయారాయె. కలకల్లాడే అంతమందికి మహాఉంటే, యీ చివర మీరు. ఆ చివర ఇబ్రహీంగారు. పోతే స్టేషను దగ్గర జట్కాబండి అహమ్మదేగా? ఆ జట్కాబండివాడి పాట్లు తెలివితేటలు లేకపోయాయి వాళ్ళందరికీని" అన్నాడు దర్జీ తన స్వంతవస్తువేదో పోయినట్టు బాధపడుతూ.

షేరాలీ కూడా మౌనంగా, అతనితో ఏకీభవించాడు. అంతమంది ఆలోచించకుండా అమాయికంగా యిళ్ళూ వాకిళ్ళు స్నేహితుల్నీ వదలిపోవడం ఎంతో తెలివితక్కువేనని అతని అభిప్రాయం. అలాంటి అవస్థలో ఉన్నవాళ్ళకి తెలివితేటలు చదువు, జ్ఞానం, సౌఖ్యం ఎప్పుడు ప్రసాదిస్తావో దేవా! అంటూ హృదయపూర్వకంగా, అమాయికంగా, శూన్యంలోపడి మ్రొక్కుతుంటాడు అనిర్వికార నిష్ప్రయోజనస్వామిని ఎప్పుడూ.

"అయితే బట్టలు తియ్యండి. గబగబా పని మొదలెడతాను" అన్నాడు దర్జీ తన మిషనుమీదికి వంగి.

నలుగురు పిల్లలకు పెళ్ళానికీ కూడా ఒకేలాంటి బట్టలు తీసుకుని వచ్చాడు తిరిగి. దర్జీవాడు, అతని సహాయకులు, ఆశ్చర్యంతో చూస్తున్నారతనివైపు. ఇదివర కెప్పుడూ షేరాలీ అంటువంటి బట్టలు తొడుక్కోలేదు. కుట్టించుకోనూ లేదు. వాళ్ళలా విచిత్రంగా చూడ్డం షేరాలీకి చాలా కష్టం కలిగించింది.

అయినా పరిస్థితులు. మనమంతా పరిస్థితులకు వారసులం. వాటిని అనుసరించి నడుచుకోవాలి. ఇంత తక్కువ కాలంలో యేలాంటి దారుణ పరిస్థితుల నెదుర్కొనవలసి వచ్చిందో. దాన్లోపడి మునగకుండా బయటపడి జీవితం సరిదిద్దుకోడం ఎంత కష్టమో తనే ఊహించలేదు. కొట్టు పెట్టుకుని కూర్చుని సంపాయించేవాళ్ళకేం తెలుస్తుంది? హఠాత్తుగా, కొట్లూ, యిల్లూ ఏ ఏట్లోనో కొట్టుకుపోతే పెళ్ళాం పిల్లలతో బ్రతకమంటే తెలుస్తుంది అనుకున్నాడు మనస్సులో

"అయితే సాయిబుగారూ! అంతా ఓలాంటి బట్టే తీశారేం?"

"ఆ! దానికేముంది లెండి. పిల్లలను కొట్టుకు తీసుకువచ్చి, నచ్చింది కొనివ్వలేని బీదవాడు. అందరికీ ఓలాంటిది కొనివ్వకపోతే అందరిని సంతృప్తిపరచేదెలాగ? అసలే మంచి, నచ్చిన బట్టలు తేలేదని మథనపడే మనస్సులతో ఉన్నవాళ్ళకి, వేరువేరు బట్టలు తీస్తే, అది నాకు కావాలి, ఇది నాకు తేలేదు అని మరీ బాధపడుతుంటే చూచేదెలాగు? ఇప్పుడయితే అందరికి ఒకటేరకం అని ఒకళ్ళను జూచి ఒకళ్ళు సంతృప్తిపడతారు, అంతే" అన్నాడు తేలికతో లేనినవ్వు తెచ్చుకుంటూ.

"పాత కొలత ప్రకారం కుట్టేయమంటారా?"

"అలా కాకపోతే రెండు మూడంగుళాలు ఎక్కువ ఉంచండి" అని మిషనుప్రక్క చతికిలపడ్డాడు షేరాలీ.

అన్నట్టు చచ్చినట్టు కుట్టి ఇచ్చేవరకు కదలడని మిషనువాడికి తెలుసు. ప్రస్తుతం తను కుట్టే బట్టలు ప్రక్కకునెట్టి, సాయిబుగారి బట్టలు కత్తిరించి కుట్టడం మొదలు పెట్టాడు.

మిషను పశ్చిమదేశస్తులు 'టాప్ డాన్సు' చేస్తున్నట్లు ధ్వనిచేస్తూ, చలిస్తూంది.

షేరాలీ ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. వెలుతురు పోవడం, చీకటి రావడం తటస్థించింది. షేరాలీ మాత్రం ఇదేమీ గమనించనట్లులేదు. చల్లటిగాలి వీస్తూంది. కొట్టుప్రక్కనున్న మురికికాలువనుండి కంపు మెల్లగానే వస్తూంది ప్రక్క కొట్లన్ని మూతలు పడ్డాయి.

తల మిషనుపై పెట్టి, దర్జీమాత్రం జోరుగా కుట్టేస్తున్నాడు. ప్రక్క కొట్ల తలుపులు మూసే చప్పుడు విని, తల పైకెత్తి "నవాబుగారూ, ఇంటికెళ్ళి భోంచేసి రండి. అంతలో పని పూర్తిచేస్తా" అన్నాడు.

"దానికేంలెండి. గబగబా కుట్టిచ్చేయండి. పట్టుకుని ఒకేసారి పోతా. మళ్ళీ రావడం చికాకు, కష్టంకూడా" అన్నాడు కాలం గమనించకుండానే.

అక్కడక్కడ ఒక్కొక్క కుట్టుపనికొట్టు, కిళ్ళీకొట్టు తప్పితే బజారులో అలికిడిలేదు. అప్పుడప్పుడు కుక్కల మొరుగులూ, మనుషుల నడకలూ మాత్రమే వినిపిస్తూ కనిపిస్తున్నాయి. మూతపడిన బట్టల కొట్లో గడియారం పది కొట్టింది.

షేరాలీ దర్జీవైపు చూశాడు. దర్జీ బట్టలు మూట గడుతున్నాడు, షేరాలీ లేచాడు. మూటచేతికిచ్చాడు దర్జీ. జేబులోని చిల్లరతీసి లెక్కపెట్టి దర్జీకిచ్చి మెల్లగా మెట్లుదిగి వీధిన పడ్డాడు షేరాలీ. త్వరగా నడచి యిల్లు చేరాడు.

వేపచెట్టు గాలికి కాస్త చప్పుడు చేస్తూ కొమ్మలు కదుపుతూంది. చుట్టూ ఉన్న యిళ్ళ తలుపులన్నీ మూయబడి ఉన్నాయి. తలుపు సందుల్లోంచి దీపరేఖలు పైకి తొంగిచూస్తున్నాయి, మబ్బులోని తారకా కాంతిలాగ. కొయ్యకు కట్టిన మేకలు అరుస్తున్నాయి.

ఇంటి తలుపులు తెరుచుకుని కూర్చున్నారంతా అతనికోసం ఆత్రంగా. బట్టలు తీసుకువచ్చిన తండ్రిని చూచిన పిల్లలు కేరింతాలు కొట్టారు. "నాకు కావాలి. నాకియ్యి" అంటూ అతని చుట్టూ ఎగురుతూ గంతువేస్తున్నారు. ఆ బట్టలు ఒక్కొక్కళ్ళే ఒక్కొక్కటి తీసుకుని వంటికి అంటించుకుని ఆనందంతో వలయాలు తిరుగుతున్నారు. ముసలిది, ముసిలివాడు మురిసిపోయారు.

"అంతా అన్నాలు తిన్నారా?" అన్నాడు చొక్కావిప్పుతూ.

"ఆ, అంతా తిన్నారు. లే నాయనా, వేగంగా రెండు మెతుకులు తిని పడుకో, చాలా రాత్రి అయింది" అంది ముసలితల్లి. పెళ్ళాం వెనకాలె వెళ్ళాడు షేరాలీ వంటింట్లోకి. ఉన్నకాడికి వడ్డించింది. అన్నంముందు కూర్చున్నాడు.

వీధిలోనుండి దీనంగా అవ్యక్తంగా అస్పష్టంగా యేదో మూలుగు.

షేరాలీ వంగిన శరీరాన్ని తిన్నజేసి కూర్చున్నాడు.

ఇంటవతల పంతులు గొంతు సుస్పష్టంగా విన్పిస్తోంది. ఎవరినో కసురుతున్నాడు. "రాత్రి పదకొండు గంటలకు ఆడుక్కోడం ఏమిటి? ఏమిటా వెధవ ఏడుపులూ, మూలుగులూను? ఫో" అంటున్నాడు. విసురుగా తలుపువేసిన చప్పుడు.

మూలుగు దగ్గరగా, దగ్గరగా వినిపిస్తున్నది.

షేరాలీ ముద్దముట్టుకోలేదు. రోదన వినిపిస్తూంది.

మనుష్యుల మధ్య అరణ్యరోదన.

ఎడతెగకుండా, దీనంగా, నీరసంగా వినిపిస్తోంది.

"అన్నం కలపండి" అంది షేరాలీ పెళ్ళాం ముసుగు వదులుచేస్తూ. మాట్లాడకుండా లేచాడు షేరాలీ. ఎందుకో బోధపడలేదామెకు, వేగంగా వెళ్ళాడు వీధిలోకి. చీకట్లో అటూ యిటూ చూశాడు. మూలుగు వేపచెట్టు మూలనుండి వస్తూంది. అటు అడుగు వేశాడు, పడిపోయిన వస్తువేదో వెతుకుతూన్నట్లు. చెట్టుక్రింద ఓ ముద్దలా పడుందో గుడ్డలమూట. మూటనుండి వినవస్తోందో మూలుగు, హృదయాన్ని తాళ్ళుకట్టి లాగుతున్నట్లు.

"దీపం పట్రండి" అంటు అరిచాడు. కూతురు దీపం పట్టుకొచ్చింది. ఏళ్ళతో వ్రేలాడుతున్న ముసలమ్మ కనుపించింది గుడ్డపీలికల మూటలమధ్య.

"ఏం మామ్మా - ఎవరునువ్వు?"

"నేనా!" అంటూ తలెత్తింది ముసలిది కష్టంతో. "నేనా? ఎవరిని? నాకే తెలీదు. చావురాని ముసలిదాన్ని, అంతే" అంది ఎత్తిన తల క్రిందికి వాలుస్తూ.

"నీకెవరూ లేరూ?"

"ఎవరూ లేరు. లేకేం, అంతా ఉన్నారు. ఈ చెట్టు" అంది యేమిటో.

"ఇంకా ఎన్నాళ్ళో వెధవ బ్రతుకు. ఎవరు నాయినా నువ్వు? ఇంత ముసలితనంలో దిక్కా మొక్కా? యేదో యీ బాధ" అంది.

ఆమె వయస్సు ఊహ కందదు. ఆమెను ఏంచెయ్యాలో షేరాలీకి యేమితెలీడంలేదు. ఆమె అవస్థచూస్తే కడుపు తరుక్కుపోతూంది. ఆమె ఆ చెట్టుక్రింద ప్రాణాలు వదులుతుందేమోనని భయమేసింది. ఆ చెట్టుక్రింద చచ్చిపోతుంది. తన కాళ్ళఎదట. తనయింటిప్రక్క. ఎలాగ ఊరుకోడం?

"జీవితపరిణామం ఇంతే కాబోలు?" అనుకున్నాడు లోలోపల.

"కాస్త తిండి పెట్టమంటావా మామ్మా!" అన్నాడు.

"పోయే ప్రాణాలు నిలబడ్డానికా? ఎందుకు నాయనా నీకీబాధ, నన్ను చావనీయి" అని గొణిగింది.

"పోనీ, మా యింట్లో ఉండిపో. యింకెంతకాలం బ్రతుకుతావు? ఇలా బలవంతంగా చావడమెందుకు?" అన్నాడు అప్రయత్నంగా.

"మీ కందరికీ ఎందుకు నా బాధ చుట్టడం. పోతాయా - ప్రాణాలుపోనీ" అంది.

"మా యింట్లో ఉండిపో. ఆఖరురోజుల్లో యెందుకు నీకీబాధ?" అన్నాడు మళ్ళీ. ఊరుకుంది ముసలిది.

షేరాలీ అలాగే నిలబడ్డాడు. చల్లగా వణికిస్తూ వీచింది గాలి. ముసలిది మళ్ళీ మూలిగింది.

"రా మామ్మా యింట్లోకి" అంటూ షేరాలీ కూతురు ముసలిదాని చెయ్యిపట్టుకుని లేవదీసింది.

షేరాలీ నిశ్చలంగా నిలబడ్డాడు.

రెండడుగులు వేశాక "చూడుమామ్మా! నేనుమాత్రం హిందూనిగాదు మరోలా అనుకోకేం" అన్నాడు సంకోచంతో.

"తిండి లేనివాళ్ళకు యీ గొడవలన్నీ ఎందుకు నాయినా! నువ్వే ఓ దేవుడివి" అంది వంగి అడుగులేస్తూ ముసిలిది.

షేరాలీ ఆ ముసలమ్మ చేతిని తన చేతిలోకి తీసుకొని నెమ్మదిగా నడుస్తున్నాడు. ముందు దీపం చూపుతూ కూతురు నడుస్తూంది.

మేకలు దీనంగా అరుస్తున్నాయి. వేపచెట్టు ఊగుతూనే ఉంది, గాలితో కబుర్లాడుతూ.

"పాపం, మేకల గొంతులు కోస్తున్నాడు కాబోలు కసాయివాడు!" అనుకున్నాడు పంతులు మనస్సులో.

● *'భారతి' జనవరి, 1959* ●

★ ★ ★

## 27

మా.గోఖలే

# మార్పు

ఉన్నట్టుండి నాన్న పెద్దవాడై కూచుంటాడని వుద్యోగంలోబడ్డ సత్యానికి వూహించడానికైనా అవకాశం లేకపోయింది. ఇన్నాళ్ళు నుంచీ యింటి పెత్తనం చేస్తున్న నాన్నకు అకస్మాత్తుగా రెండు మోకాళ్ళూ పట్టుకుపోయి గడప దిగటంలేదు. తాలూకాఫీసులో గుమాస్తాగిరి చేస్తున్న సత్యంమీద మరికొన్ని ఫైళ్ళు పడ్డాయి, యింటి ఉద్యోగంకూడా కలిపి వొచ్చేసరికి.

ఏ నెలా సత్యం సంపాదించే ఆ నాలుగురాళ్ళతో ఎప్పుడూ ఇల్లుగడవదు గనుక, అమ్మ చేతులు అడ్డాలు పెడ్తున్నా అటుండమంటూ స్వగ్రామంలో పోయిందిపోగా మిగిలివుంటూ వొచ్చిన – రెండూ ముప్పాతిక ఎకరంలో రెండెకరాల మాగాణీ భూమిని లోగడే యోగ్యత గలవారికి సద్విక్రయం చేశాడు నాన్న.

ఏ పని మొదలుబెట్టినా ఆసాంతం చూడంది విడిచేమనిషి కాదు నాన్న వున్న ముప్పాతికా వుండి వుద్ధరించే దేవిటి, శిస్తు కూలీలు దండగ కాకపోతే – అని మరీ దరిమిలానుంచి ఆలోచనలు పీడగా నెడ్తూంటంవల్ల – మోకాళ్ళుపడ్డ మర్నాడే మందులన్నా తిని బతుకుతానంటూ, ఆ ముప్పాతిక ఎకరం విక్రయం సత్యం చేతులకు వొప్పగించాడు నాన్న.

దివాళా వ్యవహారంలో మొహం చూపించేందుకు మనస్సు కంగాలీగా వున్నా పదేళ్ళకు మళ్ళీ స్వగ్రామాన్ని చూసే అవకాశం దొరికినందుకు సత్యానికి ఇంకొకవైపు ఆనందం కలగకపోలేదు.

స్టేషన్నుంచి అన్ని మైళ్ళూ ఆలోచనల్లోబడి నడుస్తూ వొచ్చిన సత్యం స్వగ్రామం పరిసరాల పిల్లకాలవల దగ్గిరకొచ్చి వెనకటి ఆ నీటివాసన తగిలేసరికి ఒక్క శ్వాస విడిచి తలెత్తి చూశాడు తన చుట్టుపక్కలా.

ఆ పిల్లకాలవలు మెలికలు మెలికలు తిరుగుతూ దూరపు చేలల్లోకి మాయమవటం, వాటి నీటిపారుదలవైనం, అంచుల్నే మెత్తగా పేరుకున్న ఒండ్రుమా ఒక క్షణం – ఆవిధంగా – చూసి చప్పున రోడ్డుమీద కంకర్రాయి నొకటి దీసి ఒండ్రులోకి "తాప్పన" విసిరేసి, అది మాయం కాగానే చేతులు దులుపుకుంటూ గబగబ పది అడుగులు ముందుకువేసి – టపీమని బ్రేకువేసినట్టు ఆగిపోయి వెనక్కు తిరిగిచూశాడు సత్యం. మూడడుగులవెనక ఆ మూలతిరుగుడులోనే వుంది ఆ నానుగ చెట్టు.

ఆశ్చర్యం, తను దాన్ని గమనించకుండానే ముందుకుపోటం! ఆ గానుగచెట్టుమీద తను కొన్ని జీవితాలకి సరిపొయ్యే కోతి కొమ్మంచులాట లాడాడు.

వెంకయ్య ఏమయినాడో! ఒకరోజు వెంకయ్య కాకమీద తనను కూతతో తాకి ఔటు చేస్తానని శపథంచేసి "కోతికోజ్జిల్లా" రంటూ కూత పెడ్తూ వొచ్చి చెట్టు గజం ఎక్కేసరికి కట్టుకున్న పంచ వూడి కిందపడ్డది. నిమిషంలో వెయ్యోవంతులో వెంకయ్య నిర్ణయించుకోవాలి – శపథం ప్రకారం తనను ఔటు చేయటమో, గుక్క అయిపొయ్యేటట్టు పంచ కట్టుకుంటూ పంతం చెల్లించుకోలేకపోవటమో. వెంకయ్య మొండిమొలతో, గుక్క ఆపకుండా చెట్టెక్కటం చూసి తనకు గుండె దిగజారి పట్టుదప్పి కిందపడి పరుగెత్తటానికి ప్రయత్నించేలోపల గభాల్న ఔటుచేసి పంచగట్టుకున్నాడు; మిగతా ఆటగాళ్ళు నోళ్ళుతెరిచి చూస్తుంటే, పక్కనవ్వు నవ్వుతూ.

ఆ దృశ్యాన్ని చెట్టుమీద పోల్చుకుంటానికి అది అంగవికలంగా బోడిదై బీటలుదీసి నుంచునివుంది. ఆ గానుగుచెట్టుకు తను దూరమయిందీ, తను గానుగు చెట్టుకు దూరమయిందీ బోధపడలేదు సత్యానికి.

అక్కణ్ణుంచే వుత్తరంగా చేలల్లోగుండా స్వగ్రామం కనిపిస్తూంది. పూర్వం తను పరాయివూరు వెళ్ళి తిరిగివస్తూ యీ మూలనుండే చూసేవాడు. రామయ్యగారి ఎర్ర బంగాళా పెంకుల డాబాకు వెనుకగా వంటపొగతెరల్లోంచి తొంగిచూస్తుండే స్వగ్రామాన్ని, ఆ ఎర్ర డాబా కనిపించగానే ఎంత ఆనందంగా వుండేది, వూరు సమీపాన్ననుభవిస్తూ! చెట్లు చుట్టూతా దట్టంగా పెరిగి యిప్పుడా ఎర్ర డాబా, ఆ దృశ్యం, కనుపించకపొయ్యేసరికి ఒక్క క్షణంపాటు సత్యం గుండె బీటు ఆగింది.

ఏమయినా తన కీ గ్రామంమీద ఏమధికారం వుంది? భూమి మిగల్లేదు. పదేళ్ళనుంచి శూన్యంగా వున్న ఇల్లు–అది ముందు ఏ క్షణాన్నయినా ఇతర్లకు చేర్తుంది. ఊళ్ళో చుట్టాలుపక్కాల్తో సానుభూతి సంపర్కాలు పంచుకొనే అవకాశం అంతకన్నా లేదు. తనలాగా ఇలాంటి స్వగ్రామాలున్న అభాగ్యులు చాలా మంది తోడున్నారనుకొన్నాడు సత్యం. అయినా వూరి పొలిమేరలోకి అడుగు పెట్టినప్పట్నుంచీ తన ఒళ్ళు అర్థంగాని వుత్సాహంతో చువ్వ వొంగినట్టు వొంగుతున్నది.

గనువుల వెంట గొడ్లమందల్ని చూసి నవ్వుకున్నాడు సత్యం, "ఖడే జర్భడే" అంటూ కొండెజడ సుబ్బాం పరికిణీ ఎగురుకుంటూ పరుగెత్తటం జ్ఞాపకం వొచ్చి.

ఆ వొస్తున్నది పాపయ్యే. తమాషాగా పెద్దవాడయినాడు. దూరాన్నుంచే కళ్ళకు చెయ్యి అడ్డంపెట్టుకుని చూస్తూ వొచ్చి, "అంతా బాగుండారుగా?" మాటవరసకు అడిగినట్లు అడిగి దాటిపోయినాడు పాపయ్య. గొడ్లపిల్లకాయల్ని కూడా దాటేనాక సత్యానికి అనుమానం కలిగింది, యీ మనుష్యులకూ తనకూ దూరం ఏర్పడిందని.

వూళ్ళోకి ప్రవేశిస్తూనే భావయ్యగారింటి ముందర దృష్టి ఆగింది సత్యానికి. ఆ పొద్దుగుపాటే అరుగుమీద భావయ్యగారు కనుపించకపోవడం శుభశుకునం కాదు. వూళ్ళోకి ఎవరు ప్రవేశిస్తూన్నా ఆయన్ని తప్పించుకోవటం కష్టం.

"ఏ వూరు?"

"భలానివూరు."

"ఏం పనిమీద వొచ్చారు?"

"ఇదిగో, వెంకటప్పయ్యగారి పొలం బేరాని కుందని తెలిసింది – ధరెంతో కనుక్కుపోదామనీ–"

"చాలా ప్రయాసపడి వొచ్చారుగాని మావూళ్ళో చెడిపోయిన వాళ్ళేం వున్నట్టులేదే! మీరు పొరపాట్న దారితప్పి వచ్చినట్టుంది. అబ్బే! ఇక్కడ అల్లాంటివేంలేవు గానీ తమరు వెంటనే తిరిగి వెళ్తే పదకొండుగంటలబండి అందుతుంది. దయచెయ్యండి."

ఆయన భావయ్యగారు! మనిషిసింహో లుంటయ్యని ఎవరికయినా నమ్మకం కుదరకబోతే ఆ ఎత్తాటి గోడలముందర పొడుగాంటి అరుగుమీద కూచున్న భావయ్యగార్ని చూచిన మరుక్షణం నరసింహావతారం భావనలోకివచ్చి భక్తితో అడుగు వెనక్కు వెయ్యటం కద్దు.

"యీయింట్లో ఎవరూ లేరేం?" చెరువులాంటి భావయ్యగా రిల్లు ఎండినట్లుంటం చూసి పక్కగా బెల్లం నాక్కుంటూ తన నోకంట కనిపెడ్తున్న ఒడ్డెపిల్లవాణ్ణి చూసి అడిగాడు సత్యం.

"ఒరూ లేరుగా" అన్నా డాపిల్లవాడు సత్యాన్ని యింకొంచెం ఓరచూపు చూస్తూ.

"అదే అడుగుతున్నా–ఏమయినారు?"

"బాగాలు పంచుకుని బత్తీలమీనకు బొయ్యారు భావయ్యగోరు సావంగానే–" అని తుర్రున పరుగెత్తాడు ఒడ్డెపిల్లవాడు, గభాల్న బెల్లంగడ్డ నోట్లోవేసుకొని ఎగురుకుంటూ.

భావయ్యగారు చచ్చిపోయినట్లు ఎప్పుడో ఎవరో తనతో చెప్పినట్లు చప్పున సత్యానికి స్ఫురణ కొచ్చింది. అప్పుడు తనామాట నమ్మినట్టులేదు.

ఊళ్ళోకి పోతూ జరిగిన ఒక్కొక్క మార్పూ సత్యం గమనించాడు. ఇన్నాళ్ళూ పొలం అమ్మకంలో నాన్నకు సాయపడ్తూ వొస్తున్న వెంకటప్పయ్య గారికి కనిపించి మాట్లాడి రంగమ్మగారింట్లో భోజనంచేసి యింకో రెండురోజులకు వారం చెప్పుకున్నాడు. ఇల్లుమొహం ఒక్కసారి తొంగిచూసి కొంచెంసేపు ప్రయాణపు బడలిక దీర్చుకొని తిరిగి వూళ్ళోకి వద్దామని బయలుదేరేసరికి సుబ్బులు ఎదురుగా వొచ్చాడు.

తనని చూడంగానే సుబ్బులు కావలించుకుని ఏడ్చినంతపనై, చిన్ననాటి స్నేహాన్ని ప్రకటించినందుకు స్వేచ్ఛగా శ్వాసాట్టం మొదలుపెట్టినా, తనతో చదువుకున్న భావాన్నారాయణా, వెంకట్రత్నం, వెంకట్రామయ్యలు తనను చూసీ చూడనట్టు పోవటంకూడా సత్యం గమనించకపోలేదు. సత్యంవెంట పోవటానికి సుబ్బులు సందేహించలేదు.

తాళందీసి యింటి బాహ్యస్వరూపం చూడంగానే కాళ్ళు కీళ్ళు ఒక్కసారిగా వూడొచ్చినట్లయింది సత్యానికి. అక్కడంతా పచ్చపచ్చటి రంగులు తనని ఆహ్వానిస్తయ్యని సత్యం భావించకపోయినా గోడల్ని నెర్రెలుచేసుకుని పిల్లమర్రి వృక్షాలూ, నేలంతా బీటలు తీసివుండడం– ఎదుర్రొమ్ములో ముల్లుకర్ర పొడిచినట్టయింది సత్యం హృదయానికి.

మూడుగదులూ, ఒక హాలూ, వంటిల్లూ చూసేలోపల ఒక గుమ్మడి గింజల త్రాచుపామునూ, బారన్నర జెర్రిపోతు పిల్లనూ, రెండు తండ్రీకొడుకుల మండ్రగబ్బల్నీ, మూడు ముచ్చుతేళ్ళనూ పారలు పలుగుల్తో గోడవతలవేసి, యీతాకుల చాపలో పరధ్యానంగా ఉన్న పందికొక్కులు, ఎలకల్ని తూముల గుండా అదిలించి, సాలీడు

వ్యూహాల్నుంచి మెల్లిగా – అవిరిగక్కుతూ – పంచలో గచ్చరుగుమీదికి వచ్చి చేరారు సత్యం, సుబ్బులు.

"మీ ఇల్లు ఓ చిన్న చరిత్రను నిర్మించింది" అన్నాడు సుబ్బులు.

"సిగరెట్టు యిందు, కొంచెం మనసు తేరుకుంటుంది."

సిజరుపెట్టి బయటకు తీసి, రెండు సిగరెట్లకు నిప్పు ముట్టించాడు సత్యం.

"ఇంతకూ యీ వూరు నువ్వు ఎందుకు వచ్చినట్టూ? పోయినవాళ్ళు ఎందుకురా మళ్ళీ యిట్లా వొస్తుంటారు మధ్య మధ్యా?"

"నాన్న పొలం వ్యవహారాలు తగిలించాడు" అని దాటేసి, "మనవూరు యింత మారిపోయిందేంరా సుబ్బులూ?" అనడిగాడు సత్యం.

"మనుషులు మార్తుంటే వూళ్ళూ మార్తాయి."

"ఏదో పురాతన శిథిలాల్ని చూస్తున్నట్టుంది."

"నువేదో గ్రాంధికంలో మాట్లాడ్తున్నా వేమిటి – గొరిగించిన మొహం లాగా వుంది నువ్వు!"

"ఏం జరిగింది యీ పదేళ్ళలో! ఏ గడపలోనూ జీవం కనుపించటం లేదు. లేక గడిచిన రోజులు గొప్పవని వూహా మటుకేనా?"

"నేను వూళ్ళో వుండేవాణ్ణి గనక నీ మనస్సులో ఎట్లా అనిపిస్తున్నదీ తెలుసుకోవటం కష్టంగాని – మార్పు లున్నయిలే."

"బహుశ చిన్నతనపు స్వేచ్ఛ – ఏ యావలు లేకుండా ఆటల్తో గడిపినట్టు వయసు ముదుర్తున్నకొద్దీ ఏర్పడే జంకుతునం కూడా యిట్లా బావించటానికి కారణమై వుండొచ్చు. సంపర్కాల విషయంలో యావలు ఎక్కువై మనుష్యుల్లో మార్పు వచ్చిందనుకున్నా యిళ్ళ మొహాల సంగతేమిటి? పూర్వం దిష్టి గుమ్మడి కాయలున్నా అందంగా వుండేవి."

"అంతదాకా దేనికి, మీ యింటి సంగతేమిటో చెప్పవోయ్?"

"వొరేయ్ సుబ్బులూ, స్వగ్రామంలోకన్న పరాయి గ్రామంలో ముష్టెత్తుకున్నదానికి తేడా వుందిలేరా! మాకంటే సరే ముద్రపడింది. కాస్త పచ్చపచ్చగా పాడీ పంటా వుండే యిక్కడేం చీడపట్టింది, అంతా బూజు వాసన కొట్టుకుంటూ? కనకయ్య వీధిలో ఒక్క పురుగు లేదు. ఆశ్చర్యంగా వుంది! మన చిన్నతనంలో ఆ వీధిలో ఇరవైనాలుగు గంటలూ వెలుగులేని వ్యవధి నెరుగుదువా నువ్వూ?"

"ఒరే తండ్రీ, నీ కిక్కడి సంగతులు కొన్ని తెలియవు. వెంకటేశ్వర్లుగారు పోయినారు. వెంకటసుబ్బయ్య పొలం అప్పుల పాలైనాక పిచ్చెత్తి ఆ గనువుల వెంటే తిరుగుతుంటాడు. బ్రహ్మయ్య కూతురు లేచిపోతే మొహం చెల్లక బయటికిరాడు. వెంకయ్యమామ మర్రిచెట్టుక్రింద సోడాకొట్టు పెట్టుకుని అక్కడే నిద్రపోతుంటాడు. ఇహ మిగిల్నవాళ్ళకు యీ గాలి సోకిందో ఏమో, ఎప్పుడూ బయటికీ లోపలికీ తిరుగుతుంటారు. మరి ఎప్పుడు చూసినా ఆ అరుగులమీద కుక్కలు పడుకుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటుంటయి. ఒకనాడు నేను స్వయంగా చూశాను. ఒక కుక్క ఆ వీధి చివరికి తొందరగా వెళ్ళాల్సి వొచ్చి ఒక్కొక్క అరుగూ ఎక్కి

దిగుతూగాని ఆ వీధి చివరికి చేరలేదు. అసలు సంగతి ఆ దరిద్రపు సూచనలకు మీ కుటుంబం యిక్కడ నుంచి లేవటం ఒక వుదాహరణేమో!"

నాన్న అప్పుడప్పుడు యిక్కడి సంగతులు టూకీగా చెవిన వేసినా—మనిషిని మనిషి తాకి స్పర్శ ననుభవించినట్టు స్వయంగా చూసి కలుగుతున్న అనుభవంలాగా లేదప్పుడు.

"వెంకయ్యమామకేం – కాస్త బాగా వున్నవాడుగా? సోడాషాపు గతేంబట్టింది?"

"ఒరే, దౌర్భాగ్యానికేంరా? వాతావరణంతో కొట్టుకువొస్తుందీ! ఈ కొంపలన్నిటికీ ఏదో గాకుండా యిట్లా ఏడుస్తుంటయ్యా! యిదుగో, పుటిక్కిన ఎవర్తోనన్నా అనేవు నే చెప్పినట్టు. ఈ వెంకయ్యమామ మూడోపెళ్ళికి దిగొద్దంటే విన్నాడూ? వున్నట్టుండి అమ్మగారికి ఆ బ్రహ్మచారిలో బ్రహ్మత్వం కనుపించింది. పోనీ, ఈ వెంకయ్యమామ ఆ వున్నదేమో వస్తురూపంలోనన్నా వుంచుకున్నాడా? ఆ గదిలో పాతిపెట్టిన సొమ్మంతా పరబ్రహ్మకు నైవేద్యం చేస్తూ రోజూ యిల్లలికి ముగ్గులు పెట్టేది, వెంకయ్యమామ పసిగట్టడానికి వీల్లేకుండా. ఒకనాడు మంచినక్షత్రం చూసుకుని ఆత్మసంతృప్తికి వెంకయ్య మామ యిట్టే చిందెను జూసి – మరుఘడియలో సోడా షాపు పెట్టుకుని – అక్కడే నిద్రపోతున్నాడన్నమాట మృచ్ఛకటికంలో మాదిరి."

"ఛా!"

"యిహ నీవొంతు యిప్పుడు చెప్పిందంతా మరిచిపోవటం."

"అఁ, ఎవరికి తెలియకుండా వుంటయి ఇవన్నీ?"

"తెలుస్తే బ్రహ్మచారి రోజా మర్రిచెట్టు కింద కెళ్ళి సోడా తాగొస్తాట్రా?"

"అదొక సరసమేమో?"

"చచ్చుపీనుగ లౌక్యాలన్రా – గడపన్నా తొక్కనిచ్చేవాడు గాదు యీ వెంకయ్య."

"అంతమటుకు అదృష్టమేలే వూర్కో. అన్నట్టు పెదనాన్న – అంజనేయులు పెదనాన్న ఎట్లా వున్నాడు?"

"యిల్లెక్కి కూస్తున్నాడు."

"అఁ–?"

"కనకయ్య వీధి సొమ్మంతా ఆంజనేయం అయిందంటే నమ్ము; మరి ఎప్పుడు జూచినా రామాలయంలోగాని కనిపించడు. వేలిముద్దర్లమీద వ్యవహారం నడిపాడనుకో."

"అంటే?"

"అంటే ఏముంది? అప్పుగా వెళ్ళిన సొమ్ము రిజిస్ట్రారాఫీసులో వేలి ముద్దర్లతో భూమి అవతారం దాల్చి తిరిగి వస్తుందన్నమాట!"

"మళ్ళీ అంతా దగ్గర బంధువులే!"

"ఘట్టిసొమ్ము గనుక పరాయివాళ్ళకు దక్కలేదు. ఇహ నువ్వూ, నేనూ విచారించడం దేనికి?"

"అంతా మాయగా వుంది! ఇందాక రంగమ్మత్తయ్యగారింట్లో భోంచేసేటప్పుడు నీళ్ళమజ్జిగ పోస్తుంటే పల్లెటూళ్ళో – అందుట్లో రంగమ్మత్తయ్యగారింట్లో ఎన్నాళ్ళకు గడ్డపెరుగు తింటున్నామా అని ముందుగానే వూహాలు – జరం తగిల్నట్టయి

నే నంటే – ఆ నీళ్ళ చుక్కలకే జనం ఎగబడ్తున్నారని ఆవిడ చీమ కుట్టనట్టు అంటుంటే ఎంతాశ్చర్యం వేసిందో నువే ఆలోచించు."

"ఆలోచించే దేమిటి, మనం యిందులో పండిపోతే. ఇంకా నయం! నువు అసలు గ్రామ రాజకీయాల సంగతే తెలియకుండా, పైపైవాట్నే గురించి స్థూలాభిప్రాయా లిస్తున్నావ్. మొన్నీమధ్య మన రత్తయ్య పెద్దమనిషి తరహాకు వుంచుకుంటున్న రంగయ్య భార్య నాగరత్తమ్మ యింటో నుంచి అర్ధరాత్రి బ్రాహ్మణయ్య నెత్తిన ముసుగుతో తలుపు తెరుచుకుని బయటికి రాబొయ్యే సమయంలో – అదే విధానంలో తలుపుగొట్టే ప్రయత్నంలో గుమ్మంలోనేవున్న రత్తయ్య తారసిల్లాట్ట. మర్నాడు బ్రాహ్మణయ్య ఏడి ఏడని వూరంతా గాలించి, యిట్లా జూస్తే వూరి బయట బందెల దొడ్లో రెండు చాకలివాళ్ళ గాడిదెలచాటున దిసమొలతో ధ్యాన నిద్రలో కూచుని వున్నాట్ట. తెలిసిందా?"

"నువు చెప్పింది జీర్ణించుకుంటానికి కొంత వ్యవధి పడ్తుందిరా సుబ్బులు తండ్రీ!"

"నాకు కామయ్యతో తొందరపని వుంది. మళ్ళీ ఆనక్కు కలుసుకుందాంలే. పోయి వస్తా"నంటూ వెళ్లాడు సుబ్బులు.

తన వూరును గురించి ఒక అభిప్రాయానికి వొచ్చేసరికి సత్యానికి కునుకు పట్టింది, ప్రాణి అలసివుంటంవల్ల.

ఆ విధంగా తను ఎంతసేపు పడుకొన్నాడో – ఎక్కడో లాకులు తెరుచుకుని నీరు ప్రవహిస్తున్నట్టు – "ఏమండోయ్ సత్తిమయ్యగోరూ!" అని ఎవరో తనను పిలుస్తున్నట్టనిపించింది సత్యానికి. కలలో గొంతులు లాకుల్లోంచి తప్పించుకున్న నీటిలాగా వుంటాయి గావాల్ను అనుకుంటూన్న సత్యానికి మళ్ళీ "యిదేంది యాలగానియాల నిదరబోతుండాడూ?" అన్నట్టయి, గభాల్న కళ్ళుతెరచి చూశాడు – ఆ మనిషి ఎదురుగా నుంచుని వుంది.

"నేను మాలచ్చిని –" అన్నదా మనిషి కడియాల చప్పుడ్తో. సగం నోరు తెరచి మూసుకున్నాడు సత్యం.

"కొండడు మిమ్మల సెపటాకాడ సూశాడంటా – సెప్పాడు" అన్నది.

పదేళ్ళ క్రిందట తమయింట్లో పనిజేసేది మహాలక్ష్మి. ఎట్లా పెరిగింది?

"అంతా బాగుండారా – అమ్మా, నాన్నా – యింకా నిదరమైకం వొదల్లేదెట్లా?"

"ఏం మహాలక్ష్మి –" నిద్రపోయేవాణ్ణి గబగబ లేపి నీళ్ళు పార్తున్న నారు మళ్ళ మధ్యన కూచోబెట్టినట్టయింది సత్యానికి.

"గురు తుండదా!"

"వుండు. నిద్రపట్టింది –"

"యిందేంది. లెగిసి కూకుని మళ్లీ అట్టంటాడూ!"

"అదికాదు. నిన్ను చప్పున గుర్తుపట్టలేకపోయినా–" అంత పెద్దదయినా మహాలక్ష్మిలో మార్పు లేకుండా అదే విధంగా మాట్టాట్టం చూసి సత్యం కాస్త తికమకలో పడ్డాడు.

"బలే వోరండీ!"

"నుంచున్నావేం, కూచో."

"అబ్బే. ఎల్లాలండీ, అయ నొచ్చే యాలయిందీ. అమ్మోర్ళంతా బాగుండారుగా?"

"ఆ, వున్నారట్లా – నీకు పెళ్ళయిందా?"

"అప్పుడే అయిందిగా!"

"పిల్లలా?"

"అఁ, అళ్లుకూడా దేనికి లెండి, మొదలే కూటికి కనాకష్టంగా వుంటే!"

"అదేమిటి – నీ మొగుడేం పని చేయడా?"

"మొగు డొక్కడే ఏం కర్మ! యిద్దరం జేత్తుండా అంతంత మాత్రంగానే వుంది. యిదుగో, ఏవండోయ్, ఎనక మీ యింటో పనిజేసే దినాల్లోనే బాగుండదండీ! యిప్పుడంతా బొహూ దరిద్రం గుండది."

"మరి పెళ్ళంటే ఏమనుకున్నావ్?" అని చూశాడు సత్యం.

"ఆయన కేవండోయ్, సానా మంచోడయితే – మీకు తెలదు గావాల్ను? కూలిగింజ లీయక పానాల్దీసుకు తింటున్నారండీ!"

"ఎవరూ?" డబ్బులకు కాదుగదా అనుకున్నాడు సత్యం.

"ఎవరేంది, ఆసాములు కాక యింకెవరుంటారూ? యిదేందండి, నాట్లేసినా, కోతగోసి కుప్పలు నూర్చినా, గింజలు కొలవక డబ్బిత్తానంటా రేందండీ! ఆ డబ్బులు కాత్తా కోమటాయన దగ్గిరికి తీసికెళ్ళి గింజలు కొలమంటే నాలుగు గుప్పిళ్ళు వాళ్లో దులిపి పోమంటున్నాడు. ఇదేం అన్నాయమండి, యిన్నాళ్లా మా గూడెం మడుసులు యిట్టాటివి ఏమన్నా ఎరుగుదురూ?"

"అదే నాకు బోధపడకుండా వుంది!"

"శాకిరి చేసేదంతా మేమూ – గోతాల్లో పోసేది పొయ్యాక తలికే గింజలు కానాకుండా సేసి ఏడిపిచ్చుక తింటుండారు. మా కూలోళ్ళను పస్తుపాడుకోబెడ్తే ఆళ్ళకేం లాబం వొచ్చుద్ది మీరే సెప్పండి? మా గూడెంలో మడుసులు ఎట్టుండారో ఓపాలి వొచ్చి చూడండి మీకే తెలుసుద్ది!"

"అన్యాయం!"

"అన్నాయ మేందీ, మొన్నామద్దె మా లచ్చయ్య ముటా గింజలుకొలుత్తేగాని యీలులేదని పేసీ పెడ్తే, లచ్చయ్య, లచ్చయ్యకొడుకుని యీపులు పగలగొట్టిచ్చారు – సూశారంటండీ?"

"మరి ఎవరన్నా పెద్దమనుష్యుల్తో చెప్పలా మీరూ?"

"ఆ మద్ను లెవరో ఎవరూ కానారు!"

"ఏదో సద్దుకుని పోవటం వుండాలిగా మరి."

"యింకా సద్దుకునేం దేం వుండది, పానం నీలుగారి పోతుంటే! సచ్చేది గూడెంలోనే కూకుని సద్దామని ఏ పనికీ పోకుండా అంతా అటనే గూడెంలో కూకుండారు– కడుపు కాలిపోతుండది."

ఇంతలో ఓ పొడుగాంటి చువ్వలాంటిమనిషి కళ్ళు మెరిపిస్తూ, తుబుక్కున వుమ్మేసుకుంటూ వొచ్చి మహాలక్ష్మి పక్కన నుంచున్నాడు.

ఆ వొచ్చిన మనిషెవరో తననూ, మహాలక్ష్మినీ ఎత్తి నేలకేసి కొడ్తాడనుకున్నాడు సత్యం.

"నేను సుబ్బణ్ణిలెండి" అన్నాడా మనిషి ఒక్కసారిగా నవ్వుతూ.

మహాలక్ష్మి మొహం ఓరగా పెట్టుకుని సుబ్బడి వెనకకు జరుగుతూ నవ్వింది.

"మిమ్మల గురించిం సెబ్తావుంటది లెండి – యిహీ!" అని నవ్వాడు సుబ్బడు గిరజాలు వెనక్కి ఎగరేసుకుంటూ.

"కొంచెం పనివుండివొచ్చా–" యీ మనిషి నవ్వందిగాని మాట్లాడ్డుగావాల్ను అనుకుంటున్నాడు సత్యం.

"గూడెంలో కొత్తె పని వుండది. దొబ్బున ఎల్లాల. రాయే, దొబ్బునెల్దాం–" అంటూ గబగబ యిద్దరూ చేతులు పట్టుకుని వెళ్ళిపోయినారు.

ఒక్కసారి ఫిలిం తెగి లైట్లు వెలిగినట్టయింది సత్యానికి. మహాలక్ష్మి ఎంత మారింది! ఎంత మార్పు యీ మనుషుల్లో!

తన ఆప్తవర్గంలోని పతనాన్ని వెళ్ళబోసిన సుబ్బులూ, తమ గూడెంలోని మనుషుల్తో సమభాగంగా నిలబడి పరుగెత్తుకు వెళ్ళిన ఆ దంపతులూ – ఆ శూన్యంలో తనముందు నృత్యం చేస్తున్నట్టనిపించింది సత్యానికి.

● ప్రచురణ కాలం ? ●

★ ★ ★

రాచకొండ విశ్వనాథశాస్త్రి

28

# న్యాయం

గుప్పున సారా కంపు!

కోర్టు.

గొల్లున సంతగోల!

కోర్టు.

అబద్ధాలకి పాముల పుట్ట!

కోర్టు.

బందిలదొడ్డికి రాచబాట!

కోర్టు.

(అక్కడ అనాథుల ఆక్రందన. అక్కడ అసహాయుల ఆర్తనాదం. అక్కడ పేదల కన్నీటిజాలు. అదే సుమా కోర్టు! అని కూడా నాకు రాయాలనుంది. అయితే, సెంటిమెంటల్ సాబ్‌స్టఫ్, ఏడుపురాత రాసేనని తప్పక చాలామంది వెక్కిరిస్తారు.)

పదకొండున్నర. పచ్చని పగలు, మేజిస్ట్రేటుకోర్టులో పల్చపల్చని నీడలు. బెంచిమీద కూర్చున్న మేజిస్ట్రేటుగారి తలలో చిక్కువీడని ఆలోచనలు.

వరండాలో జనుల కిటకిట. వారి కేకల గోల. వారి శరీరాల వాసన. వారి బట్టల దుర్వాసన.

మేజిస్ట్రేటుగారు యువకులు. ముఖంలో లేత తనువు ఛాయలు ఇంకా పోలేదు. పెదవుల కటూ ఇటూ రెండు గీతలు అస్పష్టంగా ఉన్నప్పటికీ, ముడుతలింకా నుదుట మీదకి ఎక్కలేదు. అతనేదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఎక్కడికి వెళ్ళాలని బయల్దేరేడో ఆ సంగతి మధ్యదార్లో మర్చిపోయినవాళ్ళా ఉన్నాడతను. వెళ్తూన్న దారి సరైన దారేనా అని అనుమానం తగిలినవాళ్ళా ఉన్నాడతను. ఏదో ఆలోచిస్తూ కొంతసేపు కాయితం మీద ఏదో రాసుకున్నాడు. తరువాత ఆగి, చూరువైపు చూస్తూ కూర్చున్నాడు.

బెంచీకి ఎదురుగా నాలుగైదు నల్లకోట్లు కూర్చున్నాయి. అయిదారు ఎర్రటోపీలు నిల్చున్నాయి. బెంచి వెనక్కి గోడని ఎత్తుగా ప్రభుత్వ చిహ్నం మినుకు మినుకుమంటూ హాల్లో చీకటిని చీల్చుకొంటోంది. ఒక గోడనున్న పటంలోంచి ప్రెసిడెంటుగారు

పట్టుదలగానూ, మరో గోడ నుంచి సర్దార్ పటేల్‌గారు భీకరంగానూ చూస్తున్నారు. మీదనున్న పంకాని చిరకాలపు సాలెగూళ్ళు గట్టిపట్టు పట్టుకోనున్నాయి. అవి పంకా కదలిక్కి సాగుతున్నాయేగాని సడలి తెగిపోవడంలేదు.

మేజిస్ట్రేటుగారి చూపు ఇంకా చూరు మీదుండగానే రెండు బూట్ల టకటక ఆయన చెవిన పడింది. టకటకలాడుతూ వచ్చిన బూట్లు టక్కున ఆగేయి. చూరుమీదున్న మేజిస్ట్రేటుగారి చూపు నెమ్మదిగా కిందికి దిగి, ఒక సబిన్‌స్పెక్టరుగారి సాల్యుట్‌నీ, అతని చిరునవ్వునీ, సాల్యూటనంతరం కుర్చీలో అతను కూర్చోడాన్నీ గమనించింది.

"ఈ కేసు మీదే కదా?" అని అడిగేరు మేజిస్ట్రేటుగారు.

"ఏదిసార్?" అన్నాడు సబ్ ఇనస్పెక్టరు.

"ఆ కేసు" అని ఓ ఆడపిల్లని చూపించేరు మేజిస్ట్రేటుగారు.

ఇన్‌స్పెక్టర్ గారికి వెనగ్గా గోడకి బల్లిలా చేరబడి నిల్చుందొకామె. దూరంనుంచి చూస్తే, చీకట్లో చూస్తే ఆమె పిల్లలా ఉంటుంది. దగ్గిర్నుంచి చూస్తే పాతికేళ్ళు కనిపిస్తాయి. అందరూ తనవేపు చూడ్డంచూసి ఆమె కొంచెం సిగ్గుచూపింది. అంతలోనే ఆ సిగ్గుని కట్టేసింది. పగటివేళ మెరుపులా వికృతంగానూ, అర్ధరాత్రి మెరుపులా భయంకరంగానూ ఉందా సిగ్గు. కోర్టులో అంతా ఆ సిగ్గుచూసి ముచ్చటపడ్డారు. ఆమె పైటని తలమీదికి ముసుగుగావేసుకుంది. సగానికి ఉందా ముసుగు. ఆమె గుండెలు పుష్టిగా, మాయగా ఉన్నాయి. ముఖంలోనూ, మిగతా శరీరంలోనూ మాత్రం నిజం కనిపిస్తోంది. ఆమె వంట్లో ఊపిరిలేదు. ఆమె ముఖంలో కళాకాంతుల్లేవు. మూడో తరగతి రైలుపెట్టెలో ఓ మూల నలిగిపడి వాడిపోయిన పువ్వులదండలా వుందామె.

'తూస్తే పావుశేరు మాంసం ఉండదు' అని ఆమెని చూడగానే తోచింది మేజిస్ట్రేటుగారికి.

"కేసు మనదేకదోయ్?" అని ఇనస్పెక్టరు హెడ్డుని అడిగేడు.

"మనదేబాబూ! 'గేలం' పెట్టేం. పట్టుకున్నప్పుడు తమరుకూడా ఉన్నారు" అని దగ్గరకొచ్చి గొణిగేడు హెడ్డు.

"ఈ కేసు మా కేసే సార్!" అన్నాడు ఇనస్పెక్టరు కోర్టువారితో. తరువాత హెడ్డుని మెల్లిగా "నేరం వప్పేసుకుంటుందా?" అని అడిగేడు.

"చిత్తం! అలాగే అంది అనడం మన్తో" అన్నాడతను.

"ఛార్జిషీటు చూస్తే నిన్న సాయంకాలం 'గేలం' సారాతో మీరే స్వయంగా పట్టుకున్నట్టుగావుంది" అన్నారు మేజిస్ట్రేటుగారు.

"అవునంతేసార్! అది రైటేసార్!" అని కోర్టువారితో చెప్పి, "ఏమే! కేసుని వప్పేసుకుంటావుకదూ?" అని ఆమెని అడిగేడు సబ్ ఇనస్పెక్టరు.

ఆమె మరోసారి వికృతంగా సిగ్గుపడింది. ఎడమచేతి ఎర్రని గోళ్ళని కుడిచేతి ఎర్రని గోళ్ళతో సాపుచేసుకుంటూ నిలబడింది. ఆమె కట్టుకున్న నీలిపువ్వుల

పరికిణీమీద ఎర్రని కండువా పంకా గాలికి తలమీదా, గుండెలమీదా అతి నెమ్మదిగా కదుల్తోంది. రోడ్డువార నల్లకుక్క జూలులా ఆమె జుట్టంతా రేగిపోయింది.

"సిగ్గెందుకే, జవాబు చెప్పక?" అన్నాడు ఇనస్పెక్టరు.

కళ్ళెత్తి ఓసారి అతనివైపు చూసిందామె. ఆమె కళ్ళనే చూశేడు కాని కంటిలో తడిని గమనించలేదాయన.

"వీళ్ళకీ రాత్రిళ్ళు సిగ్గుండదుసార్; పగలే ఈ సిగ్గంతాను" అన్నాడు ఇనస్పెక్టరు కోర్టువారివైపు తిరిగి.

"ఏం అమ్మాయ్! నీకేంపని?" అని మేజిస్ట్రేటుగా రామెను ప్రశ్నించారు.

ఆ ప్రశ్నకి అంతా నవ్వేరు.

మేజిస్ట్రేటుగారు నెల్లాళ్ళయి ఉద్యోగంలో ప్రవేశించేరు. ప్లీడర్లంతా ఆయనను గురించి 'చాదస్తం ముండాకొడుకు' అని తీర్పు చెప్పేరు. ఆయన గురించి "పట్టువిడుపూ లేదు. సర్దిపుచ్చుకోవడం తెలీదు. 'సత్యం సత్యం' అని తినేస్తున్నాడు. కల్పన కొంచెం అయినాలేని కేసు పృథ్విలోనే లేదు. అసలు ఈ ప్రపంచమే భగవంతుడి పెద్ద కల్పన అంతా మాయే అయినప్పుడు మాయలోంచి మాయగాక యింకేమిటొస్తుంది? న్యాయంట, ధర్మంట, సత్యంట! ఇలాంటివాడే వెనకటికోసారి 'నిజంచెప్పు! నిజం చెప్పు!' అంటూ పెళ్ళాంపీక పిసికేసి నూతిలోకి దూకేశేడు. నిజమూ, న్యాయమూ కావాలి; కావాలంటే, నేను కాపరంచేసి పుట్టించాలిగాని, ఎక్కణ్ణించి వొస్తుంది నిజం, న్యాయం? కేసుల్లోనే న్యాయంవుంటే ఈ పోలీసులం మేమెందుకు? ఇంతమంది ఈ ప్లీడర్లు అంతా ఎందుకు? ఈ కోర్టులన్నీ ఎందుకు" అని హెడ్డు – అతను పర్మెనెంటుగా రివర్టయేడు – నాలుగైదుసార్లు వరండాలో చమత్కరించాడు.

"ఏం అమ్మాయ్? ఏంపని చేస్తావ్" అని ఆమెని మేజిస్ట్రేటుగారు మళ్ళీ అడిగేరు.

అంతా మళ్ళీ నవ్వారు.

మేజిస్ట్రేటుగారికేమీ బోధపడ్డంలేదు. అతను పెద్దింటివాడు. ప్రాక్టీసు చేసిన రోజుల్లో అతను, డబ్బున్నవాడే అయినా, నలుగురిలో తిరిగేవాడు కాదు. ప్రాక్టీసు వుండకపోవడంచేత అతను కథలే చదివేవాడు. ఎవరికీ చూపించకుండా పద్యాలు రాసుకొని దాచుకొనేవాడు. అతనికి కాకినాడలో పెద్దమేడా, హైదాబాదులో ఒక కొత్త యిల్లూ ఉన్నాయి. అతనికి పల్లపు భూములున్నాయి. మెట్టున తోటలున్నాయి. బ్యాంకులో మంచి అకౌంటుంది. పురుష లక్షణానికి ఉద్యోగం వుంది. తల్లిదండ్రులకతను మంచి కొడుకు. తోబుట్టువులతనికి లేరు కాని, వుంటే వాళ్ళకతను మంచి అన్నదమ్ముడు. భార్య కతను ప్రేమించేభర్త. డెయిసీ ఇరానీ, షెర్లీ టెంపిల్, వాసంతి లాంటి కూతురుకతను మంచి తండ్రి. అతను చాలా మంచివాడు కాదని ఎవరూ ఇప్పటిదాకా అనలేక పోయేరు.

అందుచేత ఆయనకేమీ బోధపడ్డంలేదు.

"దానికేం పనా?  అదేపనండి" అని అప్పుడు పొద్దు వస్తూన్న నవ్వుని నిలిపిపారేసుకుని, కోర్టువారికి తెలియజేశాడు.

"ఏమే? నూకరాజు కంపెనీలో కదూ వున్నావు?"

అని ఇనస్పెక్టరు అడగ్గా ఆమె అవునన్నట్టు తలూపింది.

"ఏం కంపెనీ అది?" అని మేజిస్ట్రేటుగారు తిరిగి ప్రశ్నించేరు.

"కంపెనీ అంటే మామూలు కంపెనీ కాదు సార్! ముండల కంపెనీని ఇక్కడ టూకీగా 'కంపెనీ' అంటారు" అని ఇనస్పెక్టరు బెంచి దగ్గరగా వెళ్ళి నెమ్మదిగా చెప్పేడు.

మేజిస్ట్రేటుగారు పెదవి కరుచుకున్నారు.

ఎదురుగా నిల్చున్న ముద్దాయిగురించి ఆ సంగతి తెలియగానే అతనికి ఎందుకో గాని అసహ్యం వేసింది. అసహ్యం కలగడం ఆయనకే ఆశ్చర్యం కలిగించింది. కథలో పతితలా లేదామె. వాస్తవదృశ్యం చూసేసరి కాయనకి కడుపులో వికారం పుట్టింది.

"నిన్న సాయంకాలం నూకరాజు అనే ఆసామీ ఇంటిప్రక్కన సందులో, నీ స్వాధీనంలో ఒక గేలం వంటసారా వుండగా నిన్ను పట్టుకొన్నామని, మదరాసు ప్రొహిబిషన్ ఆక్టు సెక్షన్ 4(1) ఎ ప్రకారం నువ్వు నేరం చేసేవని పోలీసువారు నీమీద కేసు పెట్టారు. నేరం చేసేవా?" అని ముద్దాయీగా నిలబడ్డ ఆమెని పద్ధతి ప్రకారం ప్రశ్నించేరు.

సమాధానంగా పిల్ల తలవూపింది.

"తలూపడము కాదు, నోటితో సమాధానం చెప్పాలి."

"కేసు వొప్పేసుకుంటానండి!" అందామె.

"అంటే, నేరం చేసేనంటావా?"

"కేసు కొప్పేసుకుంటానండి!"

"నేరం చేసేవా?"

"కేసు కొప్పేసుకుంటాను బాబుగారూ!"

"అంటే నేరం చేసేనంటావా?"

"నే నేం నేరం చెయ్యలేదండి!"

"అయితే కేసు వొప్పుకుంటానని యెందుకంటున్నావు?"

"కేసు కొప్పేసుకుంటానండి!"

"కేసు వప్పుకోవడం అంటే ఏమిటో నీకు తెలుసా?"

ఈ విధంగా కోర్టువారికీ, ఆమెకీ సంభాషణ సాగుతోంది. 'ఈ కేసుతో తెల్లారిపోతుంది కాబోలు, చాదస్తం మొగుడు చెబితే వినడు, చెప్పేందాక ఒగ్గడు. అలా సూస్తావుండు–' ఇలా హాల్లో అంతా అస్పష్టంగా గొణుక్కుంటున్నారు. బెంచి గుమాస్తా కుర్చీలో ఈడిగిలబడి, కాళ్ళు పూరాగా జాచుకొని కూర్చున్నాడు. గోడ గడియారపు ముళ్ళు నెమ్మదిగా నడుస్తున్నాయ్.

"నీ దగ్గర గేలం సారా దొరికిందా లేదా?" అని చివరికి గట్టిగా అరవ్వలసి వచ్చింది మేజిస్ట్రేటుగారు. ఆయనకి నుదిటిమీద చెమట చిమ్మింది. నుదుట నరాలు ఆకుపచ్చని గీతలుగా మారేయి.

"నా దగ్గర సారా దొరకలేదండీ! తాగేననీ పట్టుకున్నారు" అని గబుక్కున సమాధానం చెప్పింది ముద్దాయి.

"సరిరా" అన్నాడొక ముసలాయన. కిటికీల దగ్గరున్న జనం హాయిగా నవ్వేరు. ఒక పడుచు లాయరు ఉద్రిక్తుడయి కూర్చున్నాడు.

మేజిస్ట్రేటుగారు నిర్ఘాంతపోయేరు.

"ఏం తాగేవు?" అని నీరసంగా అడిగేరు.

"బీరు, జిన్ను, బ్రాండి, విస్కీ, వాళ్ళేదిస్తే అది. వేరే ఎక్కణ్నుంచొస్తుంది?"

ఆమె కళ్ళు ఎరుపుతో తడిసేయి.

"సారా దొరకలేదా?"

"త్రాగేను."

కోర్టువారు ఇనస్పెక్టరువైపు అసహాయంగా చూసేరు. అతను హెడ్డుని కళ్ళతో అడిగేడు. హెడ్డు బెంచి దగ్గరగావెళ్ళి గొంతు సవరించుకున్నాడు. పురాణం చెప్పేవారి మాటలా గంభీరంగా, మృదువుగా, శ్రావ్యంగా వుంటుందతని మాట.

"మొన్న అమెరికన్ షిప్పొచింది బాబుగారూ! తమరితో చెప్పకేం! నిన్నరాత్రి ఊళ్ళోకి బేచి బేచంతా దిగిపోయింది. పాపం, షిప్పులో అవస్థలు పడిపడి ఊళ్ళోకి దిగేసరికి వాళ్ళకెలా వుంటుంది బాబూ! ఏదో కాస్త జల్సా చేద్దామనుంటుంది. ఆ జల్సాలో వాళ్ళు తాగేసి దీన్ని తాగించేసి పోయేరు. పోయినవాళ్లు మామూలుగా పోకుండా ఆ సర్దాలో దీన్ని ఎలా వున్న దాన్నలా గుమ్మందాకా తీసుకొచ్చి ఒదిలేసి పోయేరు. మరింక రోడ్డు మీద దీని అల్లరి చూసుకోండి. పట్టుకొని స్టేషన్‌కి తీసుకొచ్చే సరికి మా తాతలు దిగొచ్చేరు. నక్కలా వుందేకాని తాగేసినమీద దాన్నోట్లోనుంచి యెన్ని బూతులు గలగలా రాలాయో చెప్పలేం. ప్రొప్రయిటరుగాడికి కబురు పంపిస్తే వాడు బట్టలు పంపించి, తనుమాత్రం కనుపించడం మానేసేడు. వాడికి గలాటా అంటే భయం. ప్రొద్దున్న లేపి బట్టలు కట్టించి బయల్దేరదీసేసరికి బ్రహ్మాండమయింది. మమ్మల్నేం చెయ్యమంటారు? తాగిన మాట నిజమే! కాని సారాకూడా దొరికింది బాబుగారూ!"

డిపార్టుమెంటులోని అన్ని బాధలూ, సకల కష్టాలూ మూర్తీభవించేయా అన్నట్టుగా వుంది ఆ సమయంలో హెడ్డుగారి మూర్తి.

మేజిస్ట్రేటుగారి ముఖంలో రకరకాల ప్రశ్నలు కనిపించేయి. ఆయనకేం చెయ్యడానికి పాలుపోకుండా వుందని స్పష్టంగా తెలుస్తోంది.

నేరం చెయ్యలేదట. కేసుకి వొప్పేసుకొంటుందట. ఇదో సమస్య. అన్నీ సమస్యలే! ఏదీ యెవరూ సాఫీగా సవ్యంగా నడవనివ్వరు.

అంతలోనే అకస్మాత్తుగా ముద్దాయీ కళ్ళంట నీళ్ళు బొటబొట కారేయి. కొబ్బరాకులమీద ఎండ మెరుగూ, ఇంటిముందు కళ్ళాపుమీద ముగ్గులూ, చెరువుగట్టున దేవుడి గుడిప్రక్కన కన్నూ కన్నూ కలిపిన యువకుడూ, తొలిసారిగా కాలుజారిన చీకటి సమయం, ఏమేమి జ్ఞప్తికి వచ్చేయోకాని అవిడ అక్కడ కోర్టు చీకట్లో గోడవారి నిల్చొని రెండు బెక్కులు బెక్కింది.

"కోర్టులో ఏడవకూడదు" అన్నారెవరో.

"తాగి తందనాలాడ్డం, కోర్టుకొచ్చి ఏడవడం!" అని ఇనస్పెక్టరు ఆమె మీద కేకలు వేసేడు.

"ఆవిణ్నేం భయపెట్టకండి" అని మేజిస్ట్రేటుగారు విసుక్కొంటూ అన్నాడు. విసుక్కోవలసిన మూడ్‌లో ఆమె తనని పెట్టినందుకు ఆమె యెడల ఆయనకి విసుగు ఎక్కువయింది.

"మరోడూ మరోడూ కాదు, అమెరికన్ ప్రెసిడెంటొస్తే అందుకోసమే వచ్చాడనుకొని, ఎంతిస్తావని అడుగుతుంది. అటువంటి రకంసార్ ఇదీ! ఉరితీస్తాం అంటే ఖాతర్ చెయ్యని మనిషికి ఏడుపా?" అన్నాడు ఇనస్పెక్టరు.

"తాగడం ఏమిటి? అందులోనూ ఆడది! ఛ!" అన్నాడు మేజిస్ట్రేటుగారు.

"కలికాలం బాబుగారూ!" అన్నాడు హెడ్డు, అలా అనగలిగిన వయసు అతనిది. సర్వీసులోనే నెరసిపోయిందతని తల.

"సార్! తమరు నన్ను తిడితే తిట్టండి. ఏమనాలనివుంటే అనండి. కాని నిజం చెపుతున్నాను నమ్మండి. ఇలాంటి లంజలకి – తప్పమాట అన్నాననుకోకండి–అది అది! అందుకన్నాను–అలాటివాళ్ళకి ఓట్లిచ్చి గవర్నమెంటుని ఎన్నుకుంటే అదింకేం గవర్నమెంటు సార్! ఇంగ్లీషువాడి టైములో–" అని ఇన్‌స్పెక్టరు మాట పూర్తికాకుండానే హెడ్డు అడ్డొచ్చి–

"ఆ టైములో ఒక చిన్న జవానుకాదు, యింకా ట్రైనింగు పూర్తవని రిక్రూట్ వైపైనాసరే ఎవడైనా కన్నెత్తి చూస్తే చాలు బాబుగారూ! వెంట్నే తెచ్చి కొట్టులో వేసేడమే! శిశుపాలుడి పరిపాలన! తన్ని పరిపాలించాడు తెల్లబాబు. అందుకే అంత 'హేపీ' గా వెళ్ళిపోయింది" అని పూర్తిచేసేడు హెడ్డు. ఆ హోయైన పూర్వపు రోజులకి ఒక చిన్న నిట్టూర్పుకూడా పారేశాడు సమయానుకూలంగా.

"తంతేకాని వీళ్ళు లొంగరు సార్!"

"కాని యిప్పుడు తన్నడానికి మాకు గుండెలున్నాయా బాబూగారు! మేం కుక్కని కాల్తోతంతే గుద్దేస్తున్నారు? టెలిగ్రాంలు – నెహ్రూగారికే. స్టేషన్లో కుక్కలు జొరపడిపోతున్నాయంటే దండం పెట్టి ఊరుకుంటున్నామనుకోండి బాబూ! అదీ పరిస్థితి. ముద్దాయిమీద చెయ్యి వెయ్యడానికే పోలీసువాడు జంకితే యింకేం ప్రభుత్వం బాబుగారూ?"

"మనకి నిజంగా డిక్టేటరుండాలి సార్!"

"ఉండి మనల్ని – తప్పు బాబుగారూ! మనల్నంటే యిదిగో యిలాటివాళ్ళని – కమ్చీతో కొట్టాలి బాబుగారూ! నిన్న రాత్రి రోడ్డుమీద యిది చేసిన అల్లరి తమరు చూసేరు కారు. చూస్తే అప్పుడే పంపించేసుందురు, అన్నేళ్ళకి తక్కువ కాకుండాను."

తన నెవరో ఆకాశం పైనుంచి క్రిందికి గబగబా లాగుతున్నట్టుగా అనిపించింది మేజిస్ట్రేటుగారికి. కిందటి రాత్రి ఆ ముద్దాయీ ఏవిధంగా ఉండుంటుందో ప్రయత్నంజేసి ఊహించే రాయన మనసులో. అందులోనూ ఆడవారిలో అంత

అసహ్యంగా ప్రవర్తించే వారుంటారా అనిపించిందాయనకి. ఈ ఆడమనిషికూడా మనిషేకదా! అని ఆశ్చర్యపోయారాయన.

"అయినా, అదీ మనలాటి మనిషేనా!" అని కొంచెం హీనస్వరంలో అన్నారాయన.

అప్పుడు ఇనస్పెక్టర్ "సార్, నా సంగతి తీసి పెట్టి నన్ను వేరే ఉంచండి. కాని తమకీ, దానికీ కూడా తేడా లేదని తమరు సెలవియ్యడం ధర్మమా సార్!" అన్నాడు.

"బాబుగారిది అతి మెత్తని మనసు" అని హెడ్డుకూడా అతి శ్రావ్యంగా పలికేడు.

మేజిస్ట్రేటుగారికి కాళ్ళు తేలిపోతున్నట్లుగానూ, బరువుతో దిగలాగి పోతున్నట్టు గానూ, రెండు విధాలాకూడా ఉంది. ఆ సమయంలోనే తన డిపార్టుమెంటులోని ఒక పెద్దమనిషి సలహా గుర్తుకొచ్చిం దాయనకి.

"నీ కోర్టులో నెలకి ఎన్ని కేసులు? కనీసం అయిదు వందలు. కొండ కొండా చొప్పున అయిదువందల కొండలు తవ్వాలంటే తవ్వు, దానికి నీకు శక్తుంటే ఉండవచ్చు; కాని టైముంటుందా? ఆలోచించు" అన్నాడా పెద్దమనిషి.

మేజిస్ట్రేటుగారు ఆ సలహాని చూరువైపు చూస్తూ మననం చేసుకొని, తరువాత ఫైనల్‌గా ఇనస్పెక్టర్ని ఒక మాట అడిగేరు.

"మరైతే, ఆ కంపెనీలు – మీరు చెప్పినవి – అవన్నీ ఎందుకు ఎత్తించరూ?" అని అడిగేరు.

"ఎత్తించేస్తూనే వున్నాంసార్! ఎత్తించేస్తే వీళ్ళు రోడ్లు కాసేస్తున్నారు సార్! ఏం చెయ్యమంటారు? వీళ్ళతో మా కెంత టెరిబుల్ న్యూసెన్స్‌గా వుందో తమరితో చెప్పాలంటే వారంరోజులు పడుతుంది. అంత న్యూసెన్స్‌గా వుంది. కంపెనీలోంచి తన్ని తగిలేస్తే చేరదీసే వాడెవడూ కనిపించడు" అన్నాడు ఇనస్పెక్టరు.

"దిక్కుమాలిన ముండల్ని యెవరు చేరతీస్తారు బాబూ? మరింక పొట్ట పోషించుకుందికి ఈ పన్లు మానమంటే చస్తే మానరు వీళ్ళు. అది వాళ్ళ బతుకు! వాళ్ళని పట్టుకోవడం బతుకు మా బతుకు– ఏ బతుకు బతికేవాళ్ళు ఆ బతుకు బతకాలి కదా బాబుగారూ?" అన్నాడు హెడ్డు ఫిలాసాఫికల్‌గా.

ఇదంతా జరుగుతున్నంతసేపూ ముద్దాయి కొంచెం కొంచెం బెక్కుతోందంతేకాని 'బతుకు బతుకు' నే మాట ఆరేడుసార్లు వినేసరికి ఆమె మెదడ్లో ఏ నరానికి నిప్పంటుకుందోగాని, ఆమె ఒక్క పెట్టున ముందుకొచ్చి పెద్దగా ఏడుస్తూ కేకలు వేయడం మొదలు పెట్టింది.

"నా కొడ్డుబాబూ నా కొడ్డు" అంటూ ప్రారంభించింది. "నా కొర్దీ బతుకు. నన్ను చంపేయండి కాని బాబూ నా కొర్దీబతుకు. నేనింక బతకలేనసలు. ఇంత నీచం బతుకు, హీనం బతుకు నేబతకలేను. ఇంత కష్టపడి తెచ్చుకున్న కూడయినా తిందావంటే సయిస్తుందా? అన్నం తింటే వాంతులు, కడుపు నొప్పి, తల బాధ, లేకపోతే మూర్ఛలు. రాత్రల్లా నిద్దర్లేదు, పగలు నిమిషం హాయిలేదు. వంట్లో నీరసం, వళ్ళంతా విషం. పగలంతా బాధ. రాత్రంతా బాధ. నిన్న రాత్రి మీరు చూళ్ళేదు. హెడ్డుబాబు చూసేరు. అదుగో ఆ బాబు; బాబూ! నీకు తెలుసు. ఎంతమందున్నారు? ఎలా వున్నారు? మరి తాక్క చచ్చి పోమంటారా?

చెప్పండి. బాబూ చెప్పండి. చచ్చిపోమంటారా? చెప్పండి. చచ్చిపోతాను. చచ్చిపోతే, యెవరేడవాలి? మీ రేడుస్తారా? యెవరేడవాలి? తల్లా తండ్రా తోబుట్టువా? ఎవరున్నారు? అందరూ వుంటే ఈ బతుకెందుకు బతకాలి? అందరూ వుంటే మీ కడుపున పుట్టిన ఆడకూతుర్లందర్లాగానే నేనూ బతుకుదును. ఈ కుక్క బతుకెందుకు బతకాలి? చూడండి బాబూ చూడండి! నాకు సిగ్గులేదు. చూడండి. మరేం సిగ్గుపడక చూడండి. ఒకరు కాదు, ఇద్దరు కాదు. ఒక్క రాత్రికి అంతమంది ఇలా కరిసేసి, రక్కేసి, రక్తం తాగేసి, ప్రాణాలు తీసేస్తే నిన్నరాత్రి – ఇందరు ప్లీడరుబాబులు, యిందరు జవాను బాబులు, ఇందరు ధర్మప్రభువులు ఇంతమందీ ఉన్నారు – నిన్న రాత్రి యే బాబొచ్చి అడ్డుకున్నాడు? చెప్పండి, యెవరొచ్చేరు? యెవరూ రాలేదే? మరింక ఈ బతుకు నన్నింక బతకనివ్వక నన్ను చంపేయండి. మెడకి తాడేసి ఆ గుమ్మానికి వేలాడదీసేయండి. మీ మడాలకింద పడేసి మన్ను కుమ్మేసినట్టు కుమ్మేసి మట్టిలో కలిపేయండి. రెండు కట్టెలుంటే చాలు, గుప్పెడు బుగ్గయిపోతాను. గుప్పెడు బుగ్గిచేసి గాలి కెగరేసేయండి. కత్తితో పొడిచేయండి. సముద్రంలోకి తోసేయండి. నన్ను చంపేయండి, చంపేయండి."

– అంటూ మేజిస్ట్రీటుగారివైపు పరిగెట్టిందామె.

కోర్టులో అంతమందికీకూడా ఆమెని పట్టుకు ఆపడం చాలా కష్టమయుంటుంది. ఆఖరి కామె ఎలాగో అలాగా చల్లారుతూ చల్లారుతూ గోడవార కూలబడింది.

"చూసేరుబాబూ! ఎలా తిరగబడుతూందో" అన్నాడు హెడ్డు.

ఆమె చింపేసుకున్న జాకెట్టు వైపు చూడలేకపోయేరు మేజిస్ట్రీటుగారు. ఆయనకి వమనం వచ్చేట్టయింది.

"ఒక్కసారిగా తుఫాన్లా లేచిపోయిందండీ!" అన్నాడు ముసలి వకీలొకాయన.

"ఇంకా యిలా చూస్తూకూర్చోండి – వీళ్ళంతా కలిసి, అది చెప్పినట్టు – రేపొద్దున్న మనల్నింతమందినీ గాలి కెగ రేసేస్తారు. అలా చూస్తూ వుండండి; నా మాట నిజం కాకపోతే చూసుకోండి" అన్నాడు ఇనస్పెక్టరు.

"పోనీ, ప్రథమ తప్పు క్రింద వదిలేస్తాను" అన్నాడు మేజిస్ట్రీటుగారు.

"పాత కేసు లింకా మరో మూడున్నాయి బాబుగారూ దీనిమీద! అవికూడా వచ్చేసుకుంటుంది." అన్నాడు హెడ్డు.

"అయితే పోనీ జరిమానా కట్టుకుంటుందా?"

"దాని ప్రొప్రయిటర్‌గాడు రాలేదు, మరింక రాడు బాబూ!"

చివరికి నాలుగు కేసుల్లోనూ కలిసి "ఒక నెల" అన్నారు కోర్టువారు.

"న్యాయం" అన్నాడు హెడ్డు.

ఆ తరువాత, మేజిస్ట్రీటుగారు, మిగతా కేసుల్ని చకచకా పిలవ నారంభించేరు.

● *విశాలాంధ్ర దినపత్రిక 23-4-1961* ●

★ ★ ★

29

ముళ్లపూడి వెంకటరమణ

# శాసన క్రీడాభిరామం

"నిన్న కనబళ్ళేదేం" అన్నారు రామిరెడ్డిగారు.

"లిటిగేష నొచ్చింది" అన్నాడు సుబ్బరాజు ఉసూరున కూర్చుంటూ.

రెడ్డిగా రిప్పించిన దాహం పుచ్చుకుని స్తిమితపడ్డాక "ఎరక్క చిక్కడ్డా నిందులో.... అన్నీ అడ సవాళ్ళూ, మడత పేచీలూను" అన్నాడు. సుబ్బరాజు స్వతహా అరు బయటపడే మనిషి కాడని రెడ్డిగారికి తెలుసు. "ఏవిటి కథ?" అన్నారు.

"అఁ! నామినేషనులో చౌదరిగారి వైసుకి లిటిగేషను పడింది. ఇస్కూలు చదువు కేసిన పుట్టిన్తారీక్కీ, చావు పుటక లాఫీసులో రాయించిందానికీ తభావతొచ్చిందట. ఈనేదో ఉద్యోగం వెలగబెడతాడనీ చిన్నప్పుడు అందులో ఎక్కు వేయించారు. అవతలాళ్ళకీ పేచీ తెలిసిందట. నామినేషను పణ్నిచ్చి ఎలక్షను దాకా రానిచ్చి అనక ఈనే గెలిస్తే ఇదుగో ఈ గొడవెత్తి, కేసు పెడతారని ప్లానుట. ఎలాగో తెలిసింది. లబోదిబో మంటున్నాడాయన. కాళ్ళు బారజాపేసాడు. దాన్సంగతి కనుక్కుందుకు పట్నం పరిగెత్తాం" అన్నాడు సుబ్బరాజు.

రెడ్డిగారు మందహాసం చేశారు.

"ఓ ప్లీడరిటంటే మరోడటంటాడు. ఏ తేదీ వేసినా పేచీ పెట్టొచ్చునుట. ఏం దారనీ గింజుకుంటున్నారు."

"పెద్ద చిక్కే."

"ఛ ఛస్. ఇదా చిక్కు? మొగసిరుంటే సజావుగా పోట్లాడాల్దప్ప..."

రెడ్డిగారు కొంచెం ముందుకు వంగి సుబ్బరాజు భుజం తట్టారు చనువుగా. "రాజా, నివ్వు వైసుకి చిన్నోడివైనా చాలా దెలుసుగాని, ఇందులో తప్పు ఊహ జేస్తున్నావు. ఇలా టెవారాల్లో – ముఖ్యంగా కోర్టు గొడవల్లో చిన్నదనేదే లేదు. ఉన్నా అది అవుసరాన్నిబట్టి పెద్దదవుద్ది. ఇపుడు ప్రెసిడెం టెలక్షను గురించి రాజ్యాంగాన్నెందుకు సవరించారంటా? అజ్జెప్పు. తొంభై ఓట్లేటూ తొమ్మిదటూ పడి గెలిచినా, ఆ నూరో ఓటు పణ్ణందువల్ల ఎలక్షను చెల్లదంటున్నారని గదా! మరది చిన్నదికాక మరేటి? కానీ, రేపొద్దున్న యాభయ్యేటూ నలభై తొమ్మిదటేపూ పడ్డపుడు అదే పెద్దదవుద్ది గదా!"

"అయితే ఇప్పుడు చౌదరిగారి కోసం రూలును సవరించాలంటారా?" అన్నాడు సుబ్బరాజు.

"దానికేవుంది? మార్చడానిగ్గాపోతే రూలుసు మరెందుకులే. ఎవడో జెప్పినట్టు రూలుసు సవరించడానికీ, మార్చడానికే పుట్టాయిట. కుంటి వ్యాఖ్యానాల్జేసి చమత్కారంతో వాటిని నెగ్గించే వాళ్ళున్నప్పుడు మార్చకేం జేస్తారు మరి. సాంబయ్య కథ తెలీదు గావాలు. ఎలక్షనులో ఏనాడూ నిలవాలేదు, గెలవాలేదు గానీ, చిన్నచిన్న రూలుసు తోటే పెద్దపెద్ద ఆటలాడించాడు వెనకనించి. ఆడి చదువెంతో మనకి దెలీదుగాని, కావల్సింది తెలిసి వెవహారం జేస్తాడనిపించింది. మైన రచ్చిరెడ్డింట జూశాను మొదటిసారి మా తోటల్లుడింటికి చుట్టపు చూపుగా వెళ్తే. యలక్షన్లవుతున్నాయి నాఁళ్ళోలుండూ అన్నాడు. అచ్చిరెడ్డికి మైన్లు లేవుగాని, దర్జా, ఆ ఖర్చూ జూసి మైనరని బిరుదిచ్చారు. బియ్యేదాకా కాలేజీ చదివాడులే. ఆసా రెల్లక్షనుకి అతనికి పార్టీ టికెట్టు రాలేదు. బుచ్చిరెడ్డి అని అతని పింతంఁడ్రి కొడుకు. అతనికిచ్చారు. చాలా తగాదా పెట్టాడు అచ్చిరెడ్డి. పైనించి పెద్దలొచ్చి సర్ది చెప్పి ఆపారు. ఆళ్ళెళ్ళగానే, కింది నించి చిన్నలొచ్చి రెచ్చగొట్టి ఎగసందోశారు. ఇండిపెండెంటుగా నిలబడూ – ఒక్క ఊపు ఊపేద్దారి పార్టీని, ఆళ్ళ ప్రిష్టీజీనీ" అన్నారు. అయినవాళ్ళొద్దన్నారు గాని, కానోళ్ళ మాటే చెవినిబెట్టి ఈ గోదాలోకి దూకాడు అచ్చిరెడ్డి నే వెళ్ళేసరికి తతంగవంతా అయ్యేపోయిందనుకో.

ఈ యన్నదమ్ముల తగాదా జూసి అవతల పార్టీ వోళ్ళు తగ్గి అచ్చిరెడ్డి ఇండిపెండెంటుగా నిలబడితే బలపరుస్తామన్నారు. మీ పలుకుబడీ, డబ్బూ, మా మద్దతూ గలిస్తే ఇహ జెప్పాలా అన్నాడు వాళ్ళ రాయబారి. అచ్చిరెడ్డి సై అన్నాడు.

నామినేషను రాయిస్తున్న రోజున నలుగురం కూర్చున్నాం. హస్తవాసి మంచిదని నన్నే రాయమన్నారు ఫారం. ఆపండాపండంటూ వచ్చాడు సాంబయ్య. చాలా గొప్పగా నవ్వాడు. నామినేషను మీద అచ్చిరెడ్డిగారే రాయాల్లప్ప, మీ దస్తూరీ పనికి రాదన్నాడు. సాంబయ్యకి బుచ్చిరెడ్డి మనిషని పేరుండట లోగడ. కాని, అతని వెంట తిరగడం మానేశాట్ట. దానికి తోడు అచ్చిరెడ్డి డ్రెస్సు వేసుకోడం మొదలుపెట్టాడు – ఆ వేస్టుకోటు, బెల్టు, జోడు, పంచెకట్టూ, పట్టుకండువా అన్నీ ఇవే. ఢిల్లీలో చూడు – అచ్చు నెహ్రూగారిలా ఎందరు పొలిటీషియన్లు కనబడతారోను. అదో సూచన. ఇహ మళ్ళీ మళ్ళీ నోరెత్తి విడమర్చి వేరే చెప్పకుండా, ఇలా వేషభాషల్లో ఒక్కసారి ఇమిటేషన్ జేసి పారేస్తే సరిపోతుంది. సాంబయ్య డ్రెస్సు మార్చినప్పట్నించి అచ్చిరెడ్డి కనిబెడుతూనే ఉన్నాడు. నాఁళ్ళోలు చూసి పలకరించాడుట. స్నేహం మళ్ళీ ఆరంభమయింది. కొత్త స్నేహం గదూ – సామెజ్జెప్పినట్టు ఇట్టే పుంజుకుంది.

సరే, అతనలా అనగానే అందరం తెల్లబోయి చూశాం. నాకూ పాలుబోలేదు. ఎలక్షనెవరాలూ, కేసులూ, గట్రా చాలా చూసి తిరిగినవాడు సాంబయ్య, ఉత్తి పుణ్యానికిలా అండని దెల్సు మరి.

నామినేషను ఫారంలో 'ఫిల్డుబై' అని ఉంటది. 'ఫిల్డుబై' అనగా ఫలానావాడి 'చేత' అని అర్థం. చేత అంటే సాక్షాత్తూ స్వయానా వాడి స్వహస్తాలతోటే రాయాలిట.

కావాలిస్తే పాట్నా హైకోర్టు కేసు ప్రెసిడెంటుంది. పరమేశ్వర కుమార్ వర్సెసు లహతాన్ చౌదరి చూసుకోండి అన్నాడు సాంబయ్య దర్జాగా.

అచ్చిరెడ్డి నాకేసి అదోలా చూశాడు. పెద్దోడివి జహంగేరులా బుర్రమీసాలు పెంచావ్వూ ఈపాటి దెలీదా అన్నట్టు.

నేను ఏదో చెప్పబొయ్యేలోగా సాంబయ్య మళ్లీ అందుకుని, "రెడ్డిగారూ, వీట్లో చాలా జాగర్తగా ఉండాలి. అంతెందుకు? ఇంగ్లాండులో ఓ కేసయింది. అందులో అభ్యర్థి తన పేర్రాసినపుడు ఇంటి పేరు సొంతం రాయకుండా పొడక్షరాలు వేశాడుట. అంతేనండి. కేసు పెట్టాడవతలివాడు. నామినేషను సరికాదని ఎల్లక్షను కొట్టేశారు" అన్నాడు.

అందరూ నివ్వెరపోయారు. అచ్చిరెడ్డిగారు ఇంకో ఫారం రాయాలా అంటున్నాడు. ఇంకెవరో అపశకునం అని గొణిగారు.

"అయితే సాంబయ్యగారూ, మీరు చెప్పిందేవిటి? లహతాన్ చౌదరి కేసులో, బై అంటే స్వహస్తం అన్నది ఆర్గ్యుమెంటా? జడ్జిమెంటా?" అన్నాను నేను కొంచెం బెరుగ్గానే.

సాంబయ్య ఉలికిపడి నాకేసి చూసి, "ఏం? జడ్జిమెంటే కామోసు" అన్నాడు.

నా వ్యూహ రైటే అయింది. సాంబయ్య బుకాయించనన్నా బుకాయించాలి, లేకపోతే, సొంతం తెలీకనన్నా పోవాలి.

"నామినేషనులలో అభ్యర్థి స్వహస్తం ఉండాలని తీర్పిస్తే ఎలాగయ్యా? అదే రూలయితే, చదువుకోని వాళ్ళు, నావంటి నిశానీలు ఇహ యెల్లక్షనుకు నిలబడకూడదనేగా. అలా అయితే, అది మరి రాజ్యాంగానికి చుక్కెదురు కదూ?" అన్నాను.

సాంబయ్యే అందరికన్న ముందు అందరికన్న గట్టిగా నవ్వేశాడు.

"రైటే. రైటే. తమాషాకన్నాను రెడ్డిగారూ. ప్లీడరుగారు అలా ఆర్గ్యుమెంటు చేస్తే జడ్జిమెంటులో ఆ వాదాన్ని కొట్టేశారు. అహ... రేప్పొద్దున్న ఎలాటి చిక్కులొచ్చేదీ మన అచ్చిరెడ్డి గారికి తెలియద్దా అని హెచ్చెరుగ్గా చెప్పానంతే" అన్నాడు.

అచ్చిరెడ్డి ముఖం ముడుచుకుని ఇకిలించాడు.

"ఇహనేం? ఈయన్ని మనకి లీగ లెడ్వయిజరుగా వేసుకోరాదూ?" అన్నాన్నేను.

సాంబయ్య నా చేతులు పట్టుకున్నాడు. "ఛఛ ఎంత మాట.....?" అంటూ. సర్లే, అవన్నీ ఎందుకు. ముఖస్తుతి మాటలనుకో. మొత్తానికి మేమిద్దరం నేస్తం గట్టాం.

నామినేషను రాయడం పూర్తి అయి అంతా సంతకాలు పెట్టేశాక, సాంబయ్య మళ్ళీ ఓసారి క్షమాపణ లాటిది చెప్పుకున్నాడు.

"అసలు చిన్నచిన్న విషయాలమీద ఎల్లక్షను కేసులకి ఆస్కారం ఉండరాదని ఒక నియమమే ఉందనుకోండి. అంచేత పాట్నా కేసు ప్రెసిడెంటు కాకపోయినా రేపు బుచ్చిరెడ్డి ఓడాక తెలివితక్కువగా కేసుకి దిగినా దెబ్బతింటాడు" అన్నాడు.

"సర్లేవయ్యా సంజాయిషీ లింకా ఎందుకు" అన్నాను నవ్వుతూ భుజం తట్టి.

మేఁవిద్దరం జతగట్టడం చూసి అచ్చిరెడ్డి పొంగిపోయి, "ఇహనీ కాంపెయిను నడిపే భారం మీ ఇద్దరిదీ అన్నగారూ" అనేశాడు.

ఇద్దరిదీ అని అతనన్నా, అంతా సాంబయ్యే చేశాడు. ఏ మాటకామాటే జెప్పాలి. అందులో అతనికతనే సాటి. నాకా ప్రజ్ఞ లేదు. చురుకు పాలెక్కువ వున్నవాడు గాబట్టే దూకుడుగా దిగాడు. ఆరంభంలో కొన్నాళ్ళపాటు ఎదటి వాడిమీద దాడి చేదామన్నాడు. దాన్ని నెగెటివు కాంపెయి నంటారని చెప్పాడు. ఓహో అన్నాను.

కాని ఆ నెగెటివ్ కాంపెయిను బెడిసి కొడుతుందని నాకు భయం. ఇప్పటికీ అంతేననుకో. బుచ్చిరెడ్డి దగ్గర కొన్నాళ్ళున్నాడేమో. అతని గురించి నాలుగు తెలుసు. అందుకని అతని జాతకం దీసి బజార్న బెట్టాడు సాంబయ్య. పోస్టర్లలో అచ్చిరెడ్డికి ఓటెయ్యమన్న వాటికన్న బుచ్చిరెడ్డికి వద్దనే ధోరణిలోనే ఎక్కువేయించాడు. బుచ్చిరెడ్డి చేస్తానన్న పన్లు ఏకరువు బెట్టి, మాకు ఓటేస్తే ఇంకేవన్నా జేస్తాంగాని, ఇవి మాత్రం చెయ్యం. ఇవి జనానికి మేలు చేసేవిగావు అంటూ ప్రచారం చేశాడు. కథ కాస్త పైస్థాయి కొచ్చేసరికి వ్యక్తినింద దాకా వచ్చేశాడు.

ఒక సభలో గావోసు, అచ్చిరెడ్డికి ఓటేస్తే అపోజిషను వాళ్ళకి మూగతనం వచ్చేస్తుంది. కార్టూనులు వేసేవాళ్ళూ, విమర్శలు చేసేవాళ్ళూ, సెటైర్లు రాసేవాళ్ళూ మూలబడి మాడిపోతారు. అంత గొప్పగా వేలెట్టి చూపి వంకబెట్టేందు కాస్కారం లేకుండా ఉంటుంది అన్నాడు. చమత్కారం బాగుందని చుట్టూ ఉన్న వాళ్ళు అనడంతో రెచ్చిపోయి మరి పదిసార్లు అదే మాట అన్నాడు.

ఓనాడు బుచ్చిరెడ్డి అందుకుని దానికి జవాబును ప్రయోగించాడు.

"మరే, అచ్చిరెడ్డికి ఓటేస్తే హేళన చేసేవాళ్ళు మూలబడతారు. అందుక్కారణం పరిస్థితులు అంత ఘోరంగా హేళన లన్నిటినీ దాటిపోయి ఉండడమే" అన్నాడు.

"అచ్చిరెడ్డికి ఓటేస్తే అపోజిషను వాళ్ళ నోళ్ళు మూతపడతాయట. నిజమే. వాళ్ళంతా ఆయనగారి పరిస్థితులు చూసి నిశ్చేష్టులై కొయ్యబారిపోతారు" అన్నాడు.

ఈ దెబ్బతో అచ్చిరెడ్డి కంగారుపడి, సాంబయ్యని పిలిచి చివాట్లేశాడు. "ఇదేందయ్యా నువ్వు నీ నెగెటివ్వులును. చూడు కథ అడ్డం తిరిగి బెడిసి కొట్టింది. ఆళ్ళూ గూబ్బద్దల కొడతన్నారు, అత్తెలివి చమత్కారాలకి దిగొద్దు ఇంకెప్పుడూ" అన్నాడు.

అక్కడితో సాంబయ్య కొంచెం తగ్గాడు. కాని అప్పటికే అవతలివాళ్ళు కొత్త పంథాలో కూడా ప్రచారం ఆరంభించారు. "ఓటు కావలిస్తే తనేం చేస్తాడో చెప్పాలప్ప ఇలా మనల్ని తిట్టిపొయ్యడం ఏం బుద్ధి? ఇదేం మర్యాదా?" అన్నారు. జనం కూడా ఈసడించుకున్నారు.

ఎవరన్నా జెప్పారో, తనకే దట్టిందో మరి – మరి – నాకు దెలీదుగాని, ఆ రాత్రి అచ్చిరెడ్డి నన్ను చాటుకి దీసుకెళ్ళి సాంబయ్య గురించి నా కనుమానంగా ఉందన్నాడు.

అబ్బే. దగాజేసేవాడు కాడు అని నేను అనబోయే వరకూ అచ్చిరెడ్డి తన అనుమానం మరేం కాదనీ, ఇతనికి నిజంగా సాధక బాధకాలూ, శాస్త్రం దెలుసా అనీ అన్నాడు. నేను మాటాడకూరుకున్నాను. ఆ సాయంత్రవేఁ కబుర్ల మధ్య సాంబయ్య నిష్కారణంగా ఓ కేసు యేకరు బెట్టాడు. అంబేద్కరుగారు పోయినప్పుడు

స్టేటు కవున్సిలులో సీటు కాళీ అయితే, దానికి జరిగిన బై ఎలక్షనులో పి.ఎస్. రాజ్‌భోజ్‌గారిని కాంగ్రెసు నిలబెట్టింది. అప్పుడే బొంబాయి అసెంబ్లీ కొత్తగా ఏర్పడింది. సరే, ఆ సీటుకి అదొక్కటే నామినేషను అయినందువల్ల పోటీ లేదని ఆయన ఎన్నికయినట్లు ప్రకటించారుట. కాని అప్పటికి కొత్త అసెంబ్లీ సభ్యులింకా ప్రమాణ స్వీకారాలు చెయ్యలేదు. ఒక వారం పదిరోజులు తేడాలో జరిగింది. ప్రమాణం చెయ్యని సభ్యులు రాజ్యసభకి ప్రతినిధిని ఎలా ఎన్నుకున్నారు? అది చెల్లుతుందా? అంటూ కేసు పెట్టారొకాయన. అందుమీద బొంబాయి హైకోర్టు మీమాంస చేసింది. పుస్తె ముడిపడినట్టా కానట్టా? అని. 'అసెంబ్లీలో ప్రవేశించడం' అనే మాటకి అర్థం ఏమిటి అన్నారు. ప్రవేశించడం అంటే బొందెతో వెళ్ళి కూర్చోడమేనా – లేక చట్టరీత్యా సభ్యుడు అయి, ఆ హక్కులు పొంది వాడుకోడమనా? ప్రమాణ స్వీకారం చెయ్యకుండా సభ్యుడుగా వ్యవహారం చేసి ఓటింగుల్లో పాల్గొనడం ఎన్నికల చట్టం 188 ప్రకారం అక్రమం కాబట్టి, ప్రమాణం చేసేవరకూ ఎన్నిక అయినవాడు సభ్యుడి కింద లెక్కకాదని ఒకరు వాదించారు. అలా కాదు. ఎన్నిక అయిన సభ్యులు రాజ్యసభకి తమ ప్రతినిధిని ఎన్నుకోవాలని 80వ సెక్షను చెబుతూంది కాబట్టి 188 కన్న 80 అంకె ముందర వస్తూంది కాబట్టి ప్రమాణం చెయ్యకపోయినా ఎన్నుకునే హక్కు ఉన్నట్టు తేలుతూందని కొందరన్నారు. ఆరునెలలు వరుసగా గైరుహాజరయితే అతని సభ్యత్వం రద్దు అయినట్టు అసెంబ్లీ ప్రకటించాలని 190లో ఉంది గాబట్టి – ప్రమాణం చేసినా మానినా ఎన్నిక అయినవాడు సభ్యుడికిందే జమయినట్టు రుజూ అవుతుందన్నారు. అసెంబ్లీలో ప్రవేశం అన్న చిన్న మాటకి అర్థంమీద అంత లిటిగేషనయింది. అంచేత మనం జాగర్తగా ఉండాలి, అవటాని చెప్పొకొచ్చాడు సాంబయ్య.

సందర్భం లేకుండా, దానికి సంబంధించిన చర్చగాని, ప్రస్తావనగాని లేకుండా ఉత్తి పుణ్యానికి సాంబయ్య ఇదెందుకు చెప్పాడో ఎవరికీ అర్థంకాలేదు. ఎవరూ మాటాడలేదు. ఇప్పుడే వస్తాను అంటూ పనున్నట్టు లేచి పక్క గదిలో కెళ్ళిపోయాడు సాంబయ్య.

మావసం దిన్నోడు బొమికలు మెళ్ళో గట్టుకున్నట్టుంది. ఏదో సతిగాడు గావాల – అది గాస్తా మన్నెత్తిన రుద్ది పొయ్యాడు అన్నాడొకాయన మెల్లిగా.

కోటి విద్యెలూ కూటి కొరకే అన్నాడింకో పెద్ద గుంభనంగా.

అదేమ్మాటలే, శానా యెక్కువ సతిగినా అంతేనూ. లోపల ఇవడక అలా పైకి తన్నుకొస్తది – ఈ సతిగిన వాళ్ళతో ఇదే సిక్కు. యెప్పుడెందుకేం జెబుతారో మనకి తెలిస్తావదు అన్నాడు అచ్చిరెడ్డి బావమరిది.

మొత్తానికి సాంబయ్య యెందుకు చెప్పాడో తెలీదుగాని అచ్చిరెడ్డి మనసు కుదుటపడింది. ఈడిక్కొంత డొక్క సుద్దుందిలే అని స్తిమితపడ్డాడు.

ఇజ్జరిగిన మూణ్నాలుగు రోజులగ్గావాల సాంబయ్య అదరాబాదరా వచ్చి రాచకార్యముంది రమ్మన్జెప్పి అచ్చిరెడ్డిని, నన్ను ఓ గదిలో కూచోబెట్టి తలుపేశాడు.

ఇపుడు ఎలక్షనుకి కొత్త మలుపొచ్చిందన్నాడు ఆయాసపడుతూ. పార్టీ తరపున ఒకడూ, సొతంత్రుడుగా ఒకడూ మాత్రవే నిలబడడం చూసి, ఇందాకా తటపటా

యించిన మరో పార్టీ పెద్ద మనిషికాయన ఈవాళ నామినేషను పడేయించేస్తాన్నాడని చెప్పాడు. అచ్చిరెడ్డి అదిరిపడి, అయితే మన ఖర్చులు తడిసి మోపెడవుతాయా? అన్నాడు. సాంబయ్య నవ్వి బుజం తట్టి అదేగా నేను చెప్పొచ్చిఁగీ అంటూ తన ప్లాను చెప్పాడు.

అతనితో బుచ్చిరెడ్డి మాటాడాడుట. మనం మనం తగూలాడుకుని డబ్బు తగలేసుకోడవేల, మీ వోట్లే తగ్గమనూ, కొత్తగా గోదాలో కొచ్చినవాడి పసేవిటో నీకు దెల్సుగదా? అంచేత మనోడు తప్పుకుంటే నా గెలుపు ఖాయవ్వూఁ అన్నాట్ట. పోతే అలా తప్పుకుందుకు ప్రతిఫలంగా – ప్రతిఫలవఁను ఏవఁను – అచ్చిరెడ్డికి కవున్సిలులో సీటుకి ఏర్పాటు చేయిస్తానన్నాట్ట. పార్టీ పెద్దలతో మాటాడ్డవయిందనీ, అచ్చిరెడ్డికి కవున్సిలు సీటివ్వడానికి అంతా ఒప్పుకున్నారనీ కూడా చెప్పాట్ట.

“మనవలా ఇప్పుడు తగ్గి, ఇంకో నెల్లాళ్ళ తరవాత ఆళ్ళ పార్టీ తరపున కవున్సిలు సీటు సంపాదించుకుంటే, అది లంచం దిన్నట్టుగాదా. అది దగా అవదా, నేరం అవదా?” అన్నాను నేను.

సాంబయ్య నవ్వాడు. “రెడ్డిగారు సత్తెకాలపు మనిషి. మీదంతా విడ్డూరం. ఇందులో కొత్తేవుంది గనక? ఎన్నికలనేవి మొదలయిన కాణ్నించి నామినేషను చివర్రోజు దాకా నిలబడి తప్పుకోవడం, ఏదో ఒకందాన బాగుపడ్డం రివాజుగానే ఉంటూంది గదా. నే నెరిగిన ఎందరో ఇలా బాగుపడి మేడలు గట్టారు. ఇది రాజకీయ వ్యాపార ధర్మం. దీన్ని దగా అనీ, నేరవఁనీ ఎవడంటాడు?” అన్నాడు.

“అది సర్లే. మామూలుగా ఎవుడూ అనడంలేదనుకో. మనం తప్పుకున్నప్పుడూ రుకున్నా అనక కవున్సిలు కెక్కినపుడు, మన దగ్గర దగా తిన్న పార్టీ వాళ్ళూరుకుంటారా? పరువు పైకోర్టుదాకా తీసుకెళ్ళి ఎల్లక్షను రద్దు చేయించెయ్యరూ?” అన్నాను నేను.

అచ్చిరెడ్డి కొంచెం కంగారు పడ్డాడు.

సాంబయ్య మాత్రం గర్వంగా చూశాడు. పకపక నవ్వాడు. ‘అందుకే నాలాటోడి సలహా అన్నారు మరి. అయన్ని చూడకుండానే నేనీ బేరాని కొప్పుకున్నానా? మీరు గావాలంటే కనుక్కోండి – ఏదో కొంత నష్టపరిహారం తీసుకుని పోటీ నుంచి తప్పుకోడం మీరన్నట్టు లోగడ నేరవేఁ! కొన్నాళ్ళలా ఉంటూ వచ్చి దరిమిలాను – 1956 నించి గాబోలు ఉండడం మానేసింది. ఇపుడది రాజాలాటి పని’ అన్నాడు.

అచ్చిరెడ్డి నవ్వాడు, సాంబయ్యకి పౌరుషం వేసుకొచ్చింది. “నవ్వకండి. నమ్మకం లేకపోతే రాజస్థాన్ కోర్టులో దుర్గాప్రసాద్ చౌదరి వర్సస్ బెహారీలాలు కేసు చూడండి. అందులో చౌదరి మీద పోటీకి దిగిన సేఠ్ సోభగ్‌మల్ లొడా అనే అయన మీలాగే నిలబడి కొన్నాళ్లు ప్రచారం కూడా చేశాక మానుకున్నాడు. అనక చౌదరి తరపున ధేబరుగారెళ్ళి మాట్లాడి సేటుగారికి రాజ్యసభ సీటిప్పిస్తామని పార్టీ తరపున మాటిచ్చాక పోటీనించి తప్పుకున్నాడు. మీక్కావాలంటే చూసుకోండి నాకు బాగా గుర్తు కూడాను. ఎ.ఐ.ఆర్. 1958 కేసుల వాల్యూములో 324 వ పేజీ. ఆఁ” అన్నాడు ఆయాసపడుతూ.

ఎన్నికల చట్టంలో కరప్షను ప్రాక్టీసులు అన్న పేరిట రెండు సెక్షనులున్నాయిట. ఆ యపరాధాల జాబితాలో పెద్దరకం, నాసిరకం కేటాయింపుగా ఉంటాయి. నూటెనిమిదో వైనాలుగో సెక్షన్లో ఏదో అన్నాడు – అందులో ఉండేదిట ఈ 'లంచం' పుచ్చుకోడం. దరిమిలాను చట్టం సవరించి తీసిపారేశారు. ఒకరకంగా రైటేననుకో. ఎన్నికల చట్టం ఎన్నికల గురించి మాటాడాలి దప్ప – తప్పొల్ని ఎంచి దండించడం దాని పనిగాదన్న ఉద్దేశంతో సవరించారు.

అసలదీగాక, శానామంది ఇదేపని చేస్తూ ఉంటే ఎందరి మీదని కేసులెడుతూ కూచుంటారు? మెజార్టీ జనం చేసేది నేరమెలా అవుద్ది?

"అలాగయితే ఇహా కావలసిందేవుందయ్యా. నీకు హైరాణ తప్పుతుంది. ఖర్చు తప్పుతుంది. సీటుకి సీటు వస్తుందే" అన్నాను నేను.

నామినేషను ఉపసంహారం జేసుకుందు కింకో షరతుందన్నాడు సాంబయ్య. ఆఖ్రరోజుదాకా ఆగి, మళ్లీ ఇంకోడెవడూ నిలబడకుండా, నీకు మద్దతిస్తున్న పార్టీ ఎవణ్ణీ నిలబెట్టకుండా, దేనికీ టైము లేకుండా జేసి మరీ మానుకోవాలన్నాడు. పోతే, ఇంతవరకూ పబ్లిసిటీ కయిన ఖర్చులిగ్గాను పదివేల దాకా ముట్టజెబుతానన్నాట్ట బుచ్చిరెడ్డి.

"అంతేగాదు, మన దగ్గర ఇంకా వాడకుండా మిగిలిపోయిన పోష్టరు కాయితాలను, బోర్డులను, అట్టలను, బుట్టలను ఈ సరంజామా అంతా ఏదో ఓ ధర జేసి బుచ్చిరెడ్డి కమ్మేద్దాం" అన్నాడు సాంబయ్య.

"అదెలాగ? అయన్నీ ఆడు మటుకేం జేసుకుంటాడు?" అన్నాడు బుచ్చిరెడ్డి.

"ఆ ఏవుందీ ఒక్కక్షరవేఁ గదా తేడా? అచ్చిరెడ్డి అన్న పేర్లో 'అ' మీద 'బు' అక్షరం అతికించేస్తే పోలా?" అన్నాడు సాంబయ్య నవ్వి.

అక్కడితో అచ్చిరెడ్డి ఒక తీర్మానాని కొచ్చేశాడు– ఇది లాభసాటి బేరవనీ, దీనికి ఒప్పుకోవచ్చుననీ.

ఈ ముక్క మూడో కంటి వాడికి తెలీరాదన్నాడు సాంబయ్య.

"మూడో కంటివాడికి తెలీకుండా ఏదీ ఉండదు. వాడి పేరు గలాడివి నువ్విక్కడ ఉండనే ఉన్నావు" అన్నాన్నేను.

సాంబయ్యకి నా మాట తెలీలే. తికమకపడి నవ్వి, సావిట్లో పోస్టర్లు లెక్కచూడబోయాడు.

ఇందులో పెద్ద దగాకోరెవరూ అని ఆలోచిస్తూ కూర్చున్నాను నేను. లాభసాటి బేరం చూసి, ఇటు తనను నమ్మి మద్దతిచ్చిన పార్టీని దగా చేసిన అచ్చిరెడ్డా? అచ్చిరెడ్డిని వాడుకుని ఎదటి పార్టీలు రెండింటిని, కడవఁ సొతంత్రుల్నీ నిలబడకుండా జేసి పోటీ లేకుండా నెగ్గుతున్న బుచ్చిరెడ్డా, అతని పార్టీనా అన్నది తెలీలేదు. ఇంకో గంటకి సాంబయ్యొచ్చి, కొత్తగా పోటీకి దిగిన మూడో ఆసామి కూడా దారి కొచ్చేస్తున్నాడనీ, అది కూడా జరిగితే నామినేషన్‌లు గడువు తీరిన మర్నాడు బుచ్చిరెడ్డి ఒక్కడే ఫీల్డులో ఉంటాడనీ, పోటీ లేకుండా గెల్చుకుంటాడనీ, ఎన్నిక ఏకగ్రీవంగా జరిగినట్టవుతుందనీ చెప్పాడు సంబరపడిపోతూ.

ఈళ్ళంతా ఎవర్నెవరూ దగా జేసుకోటం లేదనీ, అంతా కలిసి ప్రజల్ని బోల్తా కొట్టిస్తున్నారనీ తోచింది. మధ్యాహ్నవేళ మనసు బాగుండక అలా ప్లీడరుగారింటికేసి షికారెళ్ళాను. ఎలక్షను 'లా పాయింట్లా'యనికీ బాగా తెలీవు. కొత్తగదా! మన కెలక్షన్లొచ్చెన్నేళ్ళయింది గనక? కాని పాపం, ఓపిగ్గా నేనడిగిన పాయింట్ల కోసం కేసులు దిరగేసి చూసి చెప్పాడు. శానా సంగతులు దెలిశాయి.

కొంచెం కంగారు బుట్టింది. చురుగ్గా అడుగేసి కొంపజేరాను. వాకిట్లో జీపులు, లవుడు స్పీకర్లు, కుర్రాళ్లు, బుర్రకథల దళంవాళ్ళు అంతా – రోజూలాగే సందడిగా ఉన్నారు. అచ్చిరెడ్డి ప్లాను ఎవరికీ దెలిసినట్టు లేదు. గబగబా లోనకెళ్ళాను. 'అచ్చిరెడ్డీ ఇలా' అని గదిలోకి కేకేశాను.

"పోటీనించి దిగద్దనేగా. తెల్సు. సాంబయ్య చెప్పాడిప్పుడే" అన్నాడు అచ్చిరెడ్డి నవ్వి.

నాకు శానా ఆశ్చర్యమైంది. కవున్సిలులో సీటుకి మాట దీసుకుని, ఈ పోటీ నించి తగ్గడం ఎలక్షను చట్టం 124 వ సెక్షను కింద అక్రమంగాకపోయినా ఆ మనిషి మీద పీనలుకోడు 171 వ సెక్షను కింద కేసు బనాయించి గూబ కదలెయ్యొచ్చు. దానికింద ఖాయమైతే ఎలక్షను చట్టంలో నూట ముప్ఫయి తొమ్మిదో, ఏదో సెక్షను కింద ఉన్న సూత్రం ప్రకారం ఆ అభ్యర్థి ఎన్నిక మీద దెబ్బతీస్తుందట. ఇటు శిక్షా పడుతుంది. అటు సీటూ చెడుతుంది. ఇంత వయినం ఉందని ప్లీడరుగారు చెప్పారు. ఇదంతా మరి సాంబయ్యెంచేత చెప్పలేదూ అని కంగారు బుట్టింది నాకు. అంతకు ముందున్న సెక్షన్లు చదివినోడు ఇది మటుకెందుకు చెప్పలేదూ? తెలీదా?

అంతేట. సాంబయ్యకి తెలీదుట గాని అనుమానవుండి మాకీ సలహా జెప్పాక తనూ తన దారిన ప్లీడరింటికెళ్ళి లా పుస్తకాలు చూసి సలహా జేశాట్ట. సంగతెలీగానే నేను రావడానికో నిమిషం కితవేఁ వొచ్చి, అచ్చిరెడ్డికి వొయినం అంతా జెప్పి తప్పు మన్నించమన్నాట్ట. బుచ్చిరెడ్డితో బేరాలూ, రాయబారాలూ రద్దు చేసేద్దాం అని వెళ్ళాడట.

సర్లే. గండం దప్పిందని సర్దుకున్నాం. ప్రచారం ముమ్మరంగా సాగింది. అన్నదమ్ముల బిడ్డలు రచ్చకెక్కి పోటీ చేస్తున్నారని ఊరూ వాడా హోరెత్తిపోయింది. దానధర్మాలను, నాటకాలను, బుర్రకథలను– ఒకటేవిటి ఎన్ని ఎన్నందాల చెయ్యాలో అన్నందాలా చేశారు. పార్టీలిచ్చారు. కూతవేటు దూరంలో దొరికిన కవులికి సన్మానాలు చేయించారు. పెళ్ళిపీటల వెనక నించుని ఉపన్యాసాలిచ్చారు. బళ్ళు, కార్లు సప్లయి చేశారు ఎవరెక్కడికి వెళ్ళాలన్నా. కొన్నాళ్ళపాటు ఊళ్ళో కిరాయి రిక్షాల గిరాకీ పడిపోయింది.

రెండు గుర్రాలూ – 'ఫోటో ఫిని'షంటారు జూడూ గుర్రప్పందాల్లో - అవిగో అలాగొచ్చాయి. పోలింగు రేపనగా ఇవాళ పోటీ ఎలా పడితే అలా వుంది. ఆ రోజు పొద్దుణ్ణించీ ఇంటింటికీ వెళ్ళి ఓటు హక్కున్న ప్రతివాడికీ పళ్ళు తోమి కాఫీ అందించడం దాకా వెళ్ళిపోయారు. రోడ్ల మీద రొజాయిలు పరిచేశారు. కాని పోలింగు నాడు కాన్వాసింగులు ఒళ్ళు దగ్గర పెట్టుకు చెయ్యాలని ఎవరికి వారే హెచ్చరించుకున్నారు.

ఆ రోజున ఒకటి రెండు హోటళ్ళవాళ్ళు కాఫీ ఫలహారాలు చాలామందికి ఊరికినే ఇచ్చారు. అక్కడా అక్కడా కూర్చున్న పెద్దమనుషులు బుచ్చిరెడ్డికే తాము ఓటేస్తున్నట్లు ప్రకటించారు యధాలాపంగా. కొందరు, పక్కవాళ్ళకి నూరిపోశారు ఫలానావాడికే వెయ్యాలని. పోలింగు రోజు ఉదయం ఏడున్నరకల్లా సాంబయ్య ఎక్కణ్ణించో పరుగున వచ్చి పోలింగు స్టేషను దారిలో దారి పొడుగునా మూడు నాలుగుచోట్ల బుచ్చిరెడ్డిగారు కాఫీ ఫలహారాలూ, గ్రటా సప్లయి చేస్తున్నాడని చెప్పాడు. మనం చిట్టచివరి చోటయినా 'చలివేంద్రం' పెట్టకపోతే మాట దక్కదనీ, మన ఓటర్లు నవ్వుతున్నారనీ అన్నాడు. పోలింగు మిడిల్ స్కూలులో పెట్టారు. దాని కిసింటా ఆ వీధి కీ చివర సాంబయ్య మేనల్లుడి ఇల్లుంది. లంకంత కొంప. తోరణాలు కట్టి అక్కడ భోజన ఫలహార వసతులు పెడదామన్నాడు.

పోలింగు బూతునించి నూరు గజాల లోపల కాన్వాసింగు జరక్కూడదనీ, ఎలాంటి తిళ్ళూ, చిరుతిళ్ళూ పెట్టరాదనీ రూలుందిట. అదీ సాంబయ్యే చెప్పాడు. తను దూరం కొలిచే వచ్చానన్నాడు.

అచ్చిరెడ్డి సరే నన్నాడు. తక్షణం హోటళ్ళనించి రెండు బళ్ళ మీద కాఫీ ఫలహారాలు అక్కడికి తరలించాం. నలుగురు వంటబ్రాహ్మల్ని పెట్టి ఫలహారాల తయారీ కూడా ఆరంభించాం. సాంబయ్య అచ్చిరెడ్డి ఏజంటుగాబట్టి అక్కడ ఉండరాదనీ, ఎవరో సంబంధం లేనట్టుండేవాళ్ళని పెడదామనీ చెప్పి నలుగుర్ని కుదిర్చాడు. వాళ్లు దారేపోయేవాళ్ళని మర్యాదగా పిలిచి ఫలహారాలు బెట్టి అచ్చిరెడ్డికి ఓటిస్తే మంచిదని మాటవరసకన్నట్టే ఏకవరసన చెప్పుకుపోయారు.

అవతలి వాళ్ళిది చూసి గోలపెట్టారు. సాంబయ్య ఎదిరించి నూరు గజాలు కొలిచేశామన్నాడు. కావలిస్తే కొలిచ్చూసుకోమన్నాడు. సాయంత్రం పోలింగు తెమిలే వేళకి తగాదా తారాస్థాయి నందుకుంది.

ఆఫీసరు, ఇన్‌స్పెక్టరు అంతా వుండగా, పట్టుదల మీద బుచ్చిరెడ్డి పోలింగు స్టేషనుకీ, ఈ టీ పార్టీ కొంపకీ మధ్య దూరం కొలుస్తానన్నాడు.

స్టేషనుగాదు, బూతు దగ్గర్నించి, అనగా బాలెట్ పెట్టెల చుట్టూ కట్టే తడికల గది నుంచి నూరు గజాలు కొలవాలనీ, ఆ లోపలగా ఈ పార్టీ ఇల్లు ఉంటేనే సెక్షను 77 క్రింద కేసు అవుద్దనీ సాంబయ్య వాదించాడు.

ఈ మతలబులన్నీ ఇలా యాకరువు బెట్టడంతో అవతలాళ్ళు రెచ్చిపోయి, సరిహద్దు పాయింటు మీద పట్టుబట్టారు. పోలింగు స్టేషనంటే బూత్ అని అర్థమా, అది ఉన్నగదా, ఆ గది ఉన్న భవంతా, ఆ భవంతి ఉన్న ఆవరణ గోడా, దాని గుమ్మమా, ఆ మెట్లలో ఆఖరి మెట్టు చివరి అంచా అన్నది మీమాంసకొచ్చింది.

బూతు దగ్గర్నించీ కొలిస్తే నూరు గజాల అవతలే తేలింది. కాని బుచ్చిరెడ్డి పట్టుదల మీద బూతువున్న హాలు సరిహద్దు నించి ఈ స్కూలు భవంతి హద్దు నుంచి, కాంపౌండు గోడ నించి కూడా కొల్తలు తీశారు. అవన్నీ కూడా నూరు గజాలకి లోపలే తేలాయి.

నాల్రోలు తరువాత, అచ్చిరెడ్డి నెగ్గినట్టు ప్రకటన వచ్చింది. మెజారిటీ అట్టే

లేదు. మరి నా(్రోలు తరువాత బుచ్చిరెడ్డి కేసు పడేశాడు – ఎన్నిక రద్దు చేయాలని, తను ఎన్నికయినట్టు ప్రకటించాలనీ.

అచ్చిరెడ్డి సాంబయ్య మీద మాట వరసకి మండిపడ్డాడు. కాస్త ఒళ్ళూ పై జాసుకు మరీ చేసుకు రావలసింది యియ్యన్నీ అన్నాడు.

ఆ మాటతో సాంబయ్య అలిగి పెడముఖం పెట్టాడు. నా(్రోలు మొహం చాటేసుకు తిరిగాడు. వారం తరువాత బుచ్చిరెడ్డి గ్రూపులో తిరగసాగాడు.

చివరికి కేసేమయిందని నన్నడక్కు. ఏమయితేనేం, కొన్ని వేలమంది ప్రజలు ఎన్నుకోబోయిన ప్రతినిధి ఎన్నిక అంతా గజమున్నర దూరం మీద ఆధారపడి, పోయింది. సాంబయ్యకి రూల్సన్నీ తెలుసుననీ, అసలతను బుచ్చిరెడ్డి మనిషనీ, పెందలాళే ఇటేపుజేరి, సలహాదారుగా నటించి, కొన్ని రూల్సు తప్పజెప్పి అనకా సరుదుకున్నట్టు మళ్ళీ నటించి నిజాయితీ చూపెట్టి, అచ్చిరెడ్డిని బోల్తా కొట్టించాడన్నారు నలుగురూ. అతనే ద్రోహి అన్నారు.

ఎన్నిక రద్దు అయి ప్రజల డబ్బు మరో ఎన్నిక పేరిట దండగ కావడానికి ఇలాటోళ్ళే కారణమన్నారు.

సాంబయ్య చెప్పాడని అచ్చిరెడ్డిని పచ్చిగడ్డి తినమన్నదెవడూ? ప్రజల ప్రతినిధిగా ఎన్నికయి దేశాన్ని పాలిస్తాననే వాడికి ఈ మాత్రం తెలీదా, అలాటోణ్ణి నమ్మిన వాడే ద్రోహి అన్నారు కొందరు.

ఇలా ఎన్నికలలో కలగజేసుకున్నందుకూ, మనం చెయి జేసుకున్నందుకూ, ఇంత అపర్దిష్ట పాలయినందుకూ నాకు చాలా చిన్నతనంవేసింది.

ఇహ కేసులో నేను జోక్యం బెట్టుకోనని జెప్పి చక్కా పోయాను.

నువ్వు జెప్పు సుబ్బరాజా!

ఈ ఎన్నికకి నిజంగా ద్రోహం చేసిందెవరు? పెడదారి పట్టిన అచ్చిరెడ్డా? పెడదారి పట్టించిన సాంబయ్యా? అతన్ని వెనకనుంచి నడిపిన బుచ్చిరెడ్డా? వెనకనించి కనిపెట్టి ఉంటానని నమ్మించి బోల్తాపడిన నేనా? చెప్పు జూద్దాం" అన్నారు రామిరెడ్డిగారు కథ అపుజేసి.

సుబ్బరాజు ఒక్కక్షణం మౌనం వహించాడు.

"మీరెవరూ గాదు. బ్రహ్మాండమైన ఎన్నిక ఫలితాన్ని గజంన్నర కొలత మీద ఆధారపడేలా చేసిన రూల్సు, రూల్సుని ప్రియురాలి ముంగురుల్లా సవరించడానికి గల సదుపాయాలు. ఇవే విలనులు. నూరు గజాల లోపల కూడదు అంటే నూటొకటో గజంలో చెయ్యొచ్చునని ఒప్పుకున్నట్టేగా; గజం ఇవతల చేసింది నేరం అయి, గజం అవతల చేసింది కాకపోవడం కన్నా అన్యాయమేటి?" అన్నాడు సుబ్బరాజు.

"చాలా అయాసపడ్డావుగాని ఇలాటూహాలు పెట్టుకుంటే పాలిటిక్సులో ఆటిరావు. రూల్సు విలవ నీకింకా దెలీలే" అన్నాడు రెడ్డిగారు.

● *ప్రచురణ, 1961* ●

* * *

మునిపల్లె రాజు

# 30 నెత్తురుకన్నా చిక్కనిది

తుప్పర తుప్పర వానజల్లుల్లో క్లబ్బు ఆవరణంతా బావురుమంటూన్నది. వాన పడకపోయినా ఉదయం పూటా, మధ్యాహ్నమూ అట్లాగే వుంటుంది. సాయంత్రానికిగాని, దాని ఇంద్రలోక వైభవం కనిపించదు. చీకటి పడుతున్నకొద్దీ దాని శోభగూడా ఇనుమడిస్తూంటుంది. అది అధికారులూ, గుత్త వ్యాపారులూ, జీవితంలో అన్ని విధాలా విజయులైనవారి క్లబ్బు.

వానలో కొద్దిగా తడిసి, వణుకుతూ వరండాలోకి అడుగు పెట్టిన జగన్నాథాన్ని చూసి, తృళ్ళిపడి లేచాడు. బంట్రోతు కాసిమ్. జగన్నాథం కొత్త మెంబరైనా అప్పుడే రెండు మూడు పెద్ద పార్టీ లిచ్చాడు. పెద్ద పార్టీలంటే అక్కడి వాళ్ళకే తెలుసు. ఒక్కోసారికి అయిదారు వేలయినా ఖర్చయి వుంటుంది. రెండుసార్లు పట్నంలోని గొప్ప గొప్ప అధికార్లూ, బ్యాంకర్లూ, కంపెనీల డైరెక్టర్లూ విందుకు వచ్చారు. పోలీసుబ్యాండ్ వచ్చింది. బొంబాయి నుంచి నైట్ క్లబ్బుల డ్యాన్సు తారగూడా వచ్చింది.

అప్పట్నించీ, అందరికీ లభించే ఒక్క సలాముగాక జగన్నాథానికి "యింకా వంగినతలల" రెండు మూడు అదనపు సలాములు కూడా దొరుకుతుంటాయి క్లబ్బు సిబ్బందినుంచి. ఆ పట్నంలో గొప్పవ్యక్తుల కందరికీ జగన్నాథం పేరు ఆప్తంగా తెలిసిపోయింది. ఈ పెద్దపార్టీల ద్వారానే.

"క్యాసాబ్, బుఖార్ ఆయాక్యా" అంటూ వణుకుతూన్న జగన్నాథం ఓవర్‌కోటు నందుకున్నాడు కాసిమ్.

అతను పరధ్యానంగానే చిరునవ్వు తెచ్చుకొని – "లేదు లేదు కాసిం! కొంచెం పనివుంది" అంటూ గాజుతలుపులగుండా వానవంక చూస్తూ నిలబడిపోయాడు.

సాబ్ బిలియర్డ్స్ గదిలోకిగాని లైబ్రరీ గదిలోకిగాని పోక అక్కడే నిలబట్టం చూసి బంట్రోతు కుర్చీ తెచ్చి వరండాలోనే వేశాడు.

"కాశిం! నన్ను గురించి టెలిఫోన్‌లో అడుగుతారు. కాల్ రాంగానే నాకు చెప్పాలి. బార్‌రూమ్‌లో ఎవరైనా వున్నారా?"

"హై సాబ్!"

"అచ్చా – నేను బార్‌రూమ్‌లో వుంటాను."

జగన్నాథం బార్‌రూం సోఫాలో కూలబడి బ్రాండీ, సోడా చప్పరిస్తున్నాడు. అప్పటికీ అతని వణుకుపోలేదు. ఎట్లా పోతుందీ? వేసింది పెద్ద పందెపు జూదం. ఓడిపోయాడా – అంతే! అంతే అంటే మళ్ళీ యీ క్లబ్బూ, ఈ దిగులు లేని, బీదతనం అంటే తెలీని సంఘ పెద్దల స్నేహమూ, ఇన్ఫ్లూయెన్సూ, వీళ్ళమధ్య కొనుక్కొన్న హోదా, సిబ్బంది సలాములూ, పార్టీలూ – అన్నింటికీ దూరమైపోతాడు. ఈ వెలుగునుంచి చీకట్లోకి పోతాడు.

జగన్నాథం కోటు తడిమి చూచుకొన్నాడు. అందులో కొత్తగా లైసెన్సు తెచ్చుకొన్న రివాల్వరుంది. ఎందుకైనా మంచిదని జేబులో వేసుకొచ్చాడు. దాన్ని తాకగానే అతని వణుకూ, అదురూ కొంచెం తగ్గినట్లయింది. ఈ క్లబ్బులో మెంబరుగా చేరక మునుపు ఎన్నోసార్లు లైసెన్సు కోసం ప్రయత్నించాడు. ఊహూ! కాని క్లబ్బులో చేరిన పక్షం రోజుల్లోనే దానంతటదే వచ్చింది. ఈ క్లబ్బులో ఏదైనా "ఫిక్స్" చేయవచ్చు. "ఫిక్స్" అంటే అదేమీ కోడ్ పదంగాదు. బార్‌రూమ్‌లోనో, బిలియర్డ్సు టేబిల్ వద్దో, బ్రిడ్జి టేబిల్ మీదో సరైన వ్యక్తితో ఒక్క ముక్క అంటే చాలు – "ఫిక్స్!" ఐ షల్ ఫిక్స్ ఇట్ అప్ ఫర్ యూ, పరిపాలనా, రాజ్యయంత్రాంగం పెద్ద పెద్ద మెట్లు, బిళ్ళ జమానులూ వున్న రాతికట్టడాల ఆఫీసుల్లోగాదు. వున్నది క్లబ్బులో ఈ క్లబ్బులో.

"బాయ్!"

బార్ రూమ్‌లో తెల్ల యూనిఫారం బాయ్ వచ్చి కొత్త గ్లాసూ, నిండు సోడా, ఛోటా పెగ్గూ ముందుంచి పోయాడు. బయట జల్లు పడుతూనే వున్నది. ఏదో శబ్దమైతే ఉలిక్కిపడి చూశాడు జగన్నాథం.

"కాసిమ్!"

"నైసాబ్, కోయీ నైసాబ్!"

గ్లాసులో ద్రవపదార్థం మళ్ళీ చప్పరిస్తూ వుండిపోయాడు.

జగన్నాథం ఒక పెద్ద కాంట్రాక్టు కోసం టెండరు వేశాడు. దాన్ని "ఫిక్స్" చేయటానికే రెండు పార్టీలూనూ. దాన్ని గురించే కారుగూడా కొన్నది. అయితే, ఈ టెండరుకు పెద్ద పోటీ వుంది. ఆ పోటీ కంట్రాక్టర్లు కూడా కొందరు ఈ క్లబ్బులో సభ్యులే. నిజానికి ఈ టెండరు వేసే తాహతులేదు తనకు. ఫిక్స్ చేసే వాళ్ళుగూడా బాగా గ్యారంటీ యివ్వలేదు. ఈ టెండర్లో పెద్ద పనులున్నాయ్. పెద్ద ఇంజనీరూ కావాలి. పెద్ద పెట్టుబడీ కావాలి. చాలా మందిని పట్టాలి. కాని, మేపుళ్ళన్నీ పోనూ లక్షదాకా పెర్సంటేజిలోనే మిగుల్తుంది. తను పెద్ద లిస్టులోకి పోతాడు. ఈ దిన దిన గండాలు తప్పతాయ్. తనే ఒక "ఫిక్సర్" అయిపోతాడు.

అసలు యింతకుముందు మొదలెట్టిన కాంట్రాక్టు పనులకే తన పెట్టుబడి చాలనిది. కాని, ధైర్యే సాహసే అంటూ దిగాడు. కాలం–కర్మం కలిసి వస్తున్నై. "ఇది" అట్లాంటిదిగాదు. ఇన్‌కంటాక్స్ సర్టిఫికెట్టే కొద్దిగా దిద్దాలసి వచ్చింది. ఎర్నెస్టు మనీకిందనే కొన్ని వేలు కట్టవలసి వచ్చింది. జగన్నాథం ఎవర్నీ సలహా అడగలేదు. తనవంతు పిత్రార్జితం యిదివరకే అమ్మేశాడు. ఇప్పుడు దేశాలమీద పోయిన తమ్ముడి సంతకంతో పవర్ ఆఫ్ అటార్నీ పుట్టించవలసి వచ్చింది. దాని ఆధారంతోనే, వాడి ఆస్తంతా అయిన కాడికి అమ్మేశాడు. తెచ్చి ఎర్నెస్టు మనీ

కట్టాడు. పందెంలో జొరపడ్డాడు. ఏమి పందెం? ఇది పోయిందా – అన్ని సంతకాలూ బయటపడతై. బయటపడటమేనా? తను బయట వుండడు. "లోపల" వుంటాడు.

తమ్ముడి ఆస్తి సంగతి తెలిసినప్పుడు రుక్మిణి "ఇదంతా ఏమిటండీ? ఎందుకు చేస్తారు యీ పన్లన్నీ – నలుగురూ మనల్ని ఆడిపోసుకుంటారు!" అన్నది.

"పిచ్చిదానా – వాడికి తల్లైనా తండ్రైనా మనమేనా? మనకు కలిసొస్తే వాడికి వచ్చినట్లు గాదుటే? ఎక్కడికి పోతుంది? ఏదో లెక్కలకోసం భాగాలు గాని నిజానికా?"

"ఏమో – ఆ ఏడుకొండల వాడి దయ. పిచ్చినాయన, ఏ వూళ్ళు పట్టుకు తిరుగుతున్నాడో ఏమో!"

"ఎక్కడికి పోతాడే? అలవాటేగా – విసుగు పుట్టగానే వాడే వస్తాడు. బెడవాడలోనో ఎక్కడో నాటకాల కంపెనీలవాళ్ళతో తిరుగుతున్నాట్టలే."

రుక్మిణి నిజానికి సత్తెకాలం మనిషి. వెంకటేశ్వర స్వామి పెద్దపటం వెండిది – అడుగుతున్నది. ఇది "అయితే" వెంటనే కొనాలి. ఒకసారి తిరుపతి గూడా పోయిరావాలి. పిచ్చిసన్నాసి రంగడు ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో. తను వాడికేం తక్కువ చేయలేదు. కాని కర్మ. ఈ మాటు యిది "అయితే" మళ్ళీ కొంచెం తీరిక చిక్కుతుంది. ఇది "అయినా" చాలా ఖర్చులున్నై. ఇంకో పార్టీ కోసం పీక్కుతింటారు. ప్రెజెంటేషన్స్ గూడా చాలా వున్నైగా. పార్టీ గూడా కొత్త తరహాగా వుండాలిట. నవాబులు వెలిగిన పట్నమాయెను. వాళ్ళ పార్టీలో ఏమేమి జరిగేది వీళ్ళందరికీ అనుభవపూర్వకంగా తెలీకపోయినా – వినికిడిగా తెలుసుగా!

"సాబ్ –"

"టెలిఫోన్ అయాక్యా?"

"జీ సాబ్!"

జగన్నాథం దిగ్గున లేచాడు. అతను తూలటం లేదు. అలవాటయి పోయింది. కాని, యిందాకటి అదురుడు మళ్ళీ వచ్చింది. పెద్ద అంగల్తో టెలిఫోన్‌వున్న సెక్రెటరీ గదివైపు పరుగెత్తాడు.

"అఁ–అఁ మాట్లాడుతూన్నా!"

"ఎవరండీ–? మే ఐనో?"

"చెప్పండి – కాయా పండా?"

జగన్నాథానికి ముచ్చెమటలు పోసినై.

"నేను ఎడ్వొకేట్ జగన్నాథాన్ని – ఐ వాంట్ ద సెక్రెటరీ – రావ్"

"సారీ సర్ – నాకనుకొన్నాను. అయనింకా రాలేదు."

చిరుచెమటలు కారుతూన్న ముఖంతో కాసిమ్‌వంక చూశాడు.

"జగన్నాథం" అన్నమాట విని పిలిచాడు.

"మాఫ్ కర్నా సాబ్!"

జగన్నాథం వరండాలోకి వచ్చాడు. అక్కడి చల్లగాలికి గాని అతని చెమటలు ఆరిపోలేదు. కోటు విప్పదీస్తుంటే లైసెన్సు తెచ్చుకొన్న వస్తువు – రివాల్వర్ – కింద పడ్డది.

"సాబ్‌కు తబీయత్ ఠీక్ నైక్యా సాబ్?"

చల్లగా చేతికి తగిలింది – ముసలి కాసిం అందిస్తున్న ఉక్కు వస్తువు. సాబ్ – ముఖాన్ని కొత్త "ఎడ్మిరేషన్‌తో" చూశాడు బంట్రోతు.

"కుచ్‌నై – కుచ్‌నై – ఠీక్ హై – ఠీక్‌హై కాసిమ్!"

అందరూ వాణ్ణి "చప్రాసీ" అని పిలుస్తారు. కాని, ఆ గుంపులో తాను ఒకడైనా అట్లా పుట్టలేదుగా! మనుషుల్ని పేరుబెట్టి పిలిస్తే వారి ఆత్మగౌరవం ఎంత పెరుగుతుంది తనకు తెలుసు. బార్ రూమ్‌లో మాత్రం వాళ్ళందరి పేర్లూ తెలిసినా – "బాయ్" అంటేనే మర్యాద. పిచ్చి సన్నాసి రంగడు కూలీలందర్నీ పేరు పేరునా పిలిచేవాడు – పనులమీదికి పంపిస్తే. వాళ్ళ కెందరు పిల్లలు ఇల్లెక్కడ? కూలితో గడుస్తున్నదా? అని యోగక్షేమాలు అడుగుతుంటాడు. ఏమి శాశ్వతం? చివరికి మిగిలేది మనిషిమీద మనిషి ప్రేమే గదా? ఈ గొప్ప దర్జాల్లో ఏది నిజం?

అట్లా అని ఈ బీదవాళ్ళందరూ నిజాయితీపరులా? తన పెద్ద మేస్త్రీ – దొంగ రాస్కెల్ – కూలివాళ్ళకు బేడవడ్డీకి అప్పులిస్తుంటాడు. ఒకసారి తనకు డబ్బు కొరవబడి ఏదో చేసి కూలిపైకం సర్దమంటే బట్వాడా చేసి తనవద్దే బేడ వడ్డీకి తెచ్చానని వసూలు చేశాడు.

టెలిఫోను గంట గణ గణమని మోగింది. కాసిమ్ సాబ్ వంక చూసి ఆగిపోయాడు.

"లేలో – తుమ్‌లేలో –" అన్నాడు జగన్నాథం వణుకుతూనే,

కాసిమ్ రిసీవరెత్తి – "ఆప్‌కూ బులారేహే సాబ్" అన్నాడు, దాని మూతి అరచేతిగుంటతో మూస్తూ.

"యస్..."

"మిస్టర్ జగన్నాథం..."

"యస్ ప్లీజ్... యస్ ప్లీజ్..." కొంచెంసేపు నిశ్శబ్దం.

జగన్నాథం కోటును చేత్తో గట్టిగా అదుముకొన్నాడు.

"కాయా – పండా?"

"కాయా – ఇంకానా?"

"ఓ. కే?"

"ఓ. కే అండ్ ఫిక్స్‌డ్!"

"థాంక్యూ సర్... థాంక్యూ..."

"మరి...?"

"ప్రామిస్ ఈజ్ ప్రామిస్!"

"ఎక్కడుంటారు సాయంత్రం?"

"ఇక్కడే."

జగన్నాథం వణుకు పాతది ఆగిపోయి కొత్త వణుకు ముఖంలో వచ్చింది. అతనికి క్లబ్బంతా కొత్త శోభతో కనబడింది. జేబులోకి చేయి పోనిచ్చి, కాచుకొన్న కాసింమీద

అయిదు రూపాయలనోటు విసిరేసి "అచ్చా కామ్‌కియా కాసిమ్ - అచ్చా కామ్! పిల్లలకు మిఠాయిలు కొనుక్కో. నే నీపూట యిక్కడున్నానని రేకేదార్లు ఎవరడిగినా చెప్పొద్దు" అన్నాడు.

రాత్రికి జగన్నాథం యింటికి చేరేసరికి పదకొండు దాటింది. కారు హారన్ వింటూనే రుక్మిణి ఎదురొచ్చింది.

"చెప్పుకోండి... ఇంటికెవరొచ్చారో?" అన్నది.

నోటివాసన పట్టకుండా ఆమెకు కొంచెం దూరంగా నుంచున్నాడు.

"ఎవరే?"

"చెప్పుకోండి..."

"రాజ్యమా?"

రాజ్యం అతని మరదలు. ఆ పిల్ల పెళ్ళి యీ మధ్యనే అయింది. తోడల్లుడిని తీసుకురమ్మని వ్రాశాడు.

"పప్పులో కాలేశారు - రంగడు."

జగన్నాథం ఆమెను తేరిపార చూశాడు. ఇంకొంచెం దూరంగా జరిగి-

"ఎందుకొచ్చాట్ట?" అనడిగాడు.

"అదేమిటండీ - యిక్కడికి రాక ఎక్కడికి పోతాడు?"

"అదిగాదే...."

జగన్నాథం నేరుగా తన గదిలోకి పోయి జోళ్ళు విప్పదీసుకొని, సూటు విప్పేసి బర్మా లుంగీ కట్టుకొన్నాడు. తమ్ముణ్ణి చూచే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు.

"నాకు ఆకలిగా లేదు. లైటార్పేయ్. తలనొప్పిగా వుంది."

కొంచెంసేపట్లో పాలగ్లాసు పట్టుకొని వచ్చి టేబిల్‌మీద పెట్టి లైటార్పేసింది.

"రుక్కూ!... నీకు తెలీదు. రంగడ్ని మళ్ళీ పంపించేసేయ్. ముద్దుచేసి వాణ్ణి చెడగొట్టవాక."

మసక చీకట్లో భర్త ముఖం ఆమెకు కన్పించలేదు. కాని, ఆ మాటలు రక్తసంబంధపు మాటలుగా ఆమెకు విన్పించలేదు. అనుమానిస్తూ ఏమో అడిగింది-

"పిచ్చిముండా - నీకు వ్యవహారాల సంగతి బొత్తిగా తెలీదు. రెండు దోవతులూ చొక్కాలూ కొనిపెట్టు. ఇరవైరూపాయలు చేతికియ్యి. పంపించేసెయ్. తెల్సిందా? మన జ్ఞాతివర్గం యిక్కడా చేరింది. అవీ యివీ వాడికి నూరిపోస్తారు."

రుక్మిణికి ఈ మాటు అతని నోటి వాసన బాగా కొట్టింది. కాని, మాటలు మత్తుగా రావటంలేదు. స్మారకం మాటలే. కాని, అర్థం కావటంలేదు.

నెత్తురుకన్నా చిక్కని వేరే విలువల వలయంలో తన భర్త చిక్కుకొని వున్నాడని ఆమె ఎప్పటికీ తెలుసుకోలేదు. సత్తెకాలం మనిషి!

● *కృష్ణాపత్రిక 1965, జనవరి 9.* ●

★ ★ ★

31

పెద్దిభొట్ల సుబ్బరామయ్య

# అలజడి

కిటికీ బాగా ఎత్తుగా వుండటంవల్ల అతనికి కనిపించడం లేదుగాని, ఆకాశం ఘోరమైన రణరంగంలా వుంది. మబ్బులు గుమిగూడి గర్జిస్తున్నాయి. సన్నగా జల్లు పడుతున్నది. మరి కాస్సేపటిలో కుంభవృష్టి తప్పదనిపిస్తున్నది. జిలార్ద్రమైన నల్లని మబ్బుల వెనుక గొప్ప కోలాహలం. అలజడి...

బయట బరువైన బూట్ల సవ్వడి...

మోకాళ్ళ చుట్టూ చేతులు కట్టుకుని కూర్చున్న గాంధీ తల ఎత్తి చూశాడు. కటకటాల అవతల వరండాలో నిలబడి బీడీ కాల్చుకుంటున్నాడు అప్పలస్వామి. రెండు దమ్ములు పీల్చి వరండా క్రిందికి ఉమ్మివేసి, వెనుదిరిగి కటకటాల దగ్గరగా వచ్చి నవ్వుతూ "ఏం బాబూ! నిద్ర పట్టలేదా?" అని అడిగాడు గాంధీని.

గాంధీ తల అడ్డంగా ఊపాడు. అప్పలస్వామి మళ్ళీ ఏదో మాట్లాడబోయి అంతలోనే విరమించుకుని నెమ్మదిగా నడిచివెళ్ళిపోయాడు. అతని బూట్ల సవ్వడి వరండాలో క్రమంగా దూరమైపోయింది.

గాంధీ ఉన్నట్టుండి లేచి కళ్ళజోడు తీసి తుడుచుకుని ఆ చిన్న గదిలో చేతులు వెనక్కు కట్టుకుని అటూ యిటూ పచార్లు చెయ్యడం ప్రారంభించాడు.

బయట వర్షం కొంచెం పెద్దదయింది. బుల్లిపిట్ట ఒకటి –దాని రంగు ఏదో సరిగా తెలియడం లేదు. అంత రాత్రివేళ ఎందుకు వచ్చిందో మరి. కిటికీలో నిలబడి సన్నగా అరుస్తున్నది. అది బహుశా పూర్తిగా తడిసిపోయి వుండాలి. గాంధీ ఆగి చూశాడు. ఒక నిముషం గడిచి వుంటుంది. ఆ పిట్ట, పాపం, లోపలికి వస్తే బాగుండుననిపించింది. కాని అది రాలేదు. కొద్ది క్షణాల్లో చిన్న చిన్న రెక్కలు విదిలించుకున్న ధ్వని, ఆ వెనువెంటనే అది ఎగిరిపోయిన మృదువైన సవ్వడి... ఆ తర్వాత అంతా నిశ్శబ్దం...

కిటికీలోనుంచి ఆకాశం, కత్తిరించిన నల్లని కాగితం ముక్క లాగున్నది. కిటికీ అవతల ఏమున్నదో తెలియదు. బహుశా, అది అంతా ఖాళీ స్థలం కావచ్చు. ఆపైన బలమైన కొండరాళ్ళతో కట్టబడిన ఎత్తయిన ప్రహరీ గోడ ఉండే వుంటుంది. ఆ ప్రహరీ పైన గాజు పెంకులు దట్టంగా బిగించబడి వుంటాయి.

ఎక్కడో గంటలు కొడుతున్నారు. గాంధీ ఆగి చెవులు రిక్కించి వింటూ, వ్రేళ్ళు మడుస్తూ లెక్క పెట్టాడు. మొత్తం తొమ్మిది గంటలే వినిపించాయి. ఇప్పుడు తొమ్మిదేనా అయింది? కాదు. బహుశా గాలివాలు కారణంగానూ, వర్షపు జల్లు మూలంగానూ కొన్ని గంటలు తనకు వినబడి వుండవు.

మళ్లీ అప్పలస్వామి వరండాలో నడిచి వచ్చాడు. అతడు గాంధీ వంక ఆ సన్నని వెలుతురులో ఒకసారి చూసి కటకటాలమీద చేతితో మీటుతూ 'ఇవాళ కోర్టులో ఏమయింది?' అని అడిగాడు.

గాంధీ చేతివ్రేళ్లు విరుచుకుని చప్పరించి 'ఏమీ కాలేదు...' అన్నాడు.

'అంటే విచారణ జరగలేదా?'

'జరిగింది...'

'అదే, ఏం జరిగిందీ అని అడుగుతున్నాను.'

గాంధీ నుదురు తుడుచుకున్నాడు. ఒక్క క్షణం ఆగి నెమ్మదిగా 'ఏమీ జరగలేదు. అన్నట్టు కాసిని కాయితాలూ, కలమూ కావాలని అడిగా కదా! ఎప్పుడిస్తారు?' అని అడిగాడు.

అప్పలస్వామి అనునయంగా చూశాడు. తర్వాత 'అడిగాను... వీల్లేదన్నారు. అవి అంత అవసరమా?' అన్నాడు.

'అవసరమే... చాలా రాసుకోవాలి... ఎన్నో విషయాలు బుర్రను పాడుచేస్తున్నాయి. రాసుకునే వీలుంటే బాగుండిపోను. నా పుస్తకాలూ, నేను రాసుకున్న కాయితాలూ అన్నీ ఏం చేశారో ఎవ్వరూ చెప్పడం లేదు. అన్నీ నాకు ముఖ్యమైన సైన్సు పుస్తకాలు' అన్నాడు గాంధీ చాపమీద కూలబడుతూ.

అప్పలస్వామి 'అవన్నీ నీకు ముఖ్యం... కాని వాళ్ళకు మాత్రం అవేవీ పట్టవు. ఒక్క కాయితమే వాళ్ళకు ముఖ్యం... ఆ చిన్న చీటీ... ఉత్తరం...' అని ఒక్క క్షణం ఆగి పక్కకు చూస్తూ 'ముసురు బాగా పట్టింది. ఇప్పట్లో తగ్గేట్టు లేదు...' అన్నాడు.

తర్వాత మళ్లీ 'ఆ ఉత్తరంలో ఏం రాశావు?' అని అడిగాడు.

గాంధీ మాట్లాడలేదు. అతని కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. మనసులో ఏదో అజ్ఞాత కంఠం దిగులుగా గుసగుసలాడుతున్నట్టున్నది.

'గాంధీ అనబడే నేను... ఎం. ఎస్. సి... న్యూక్లియర్ ఫిజిక్స్... యూనివర్సిటీ మొత్తంమీద సెకండ్... నిరాశా నిస్పృహలతో జీవితంలో ఓడిపోయి... నిరుద్యోగిగా బ్రతకలేక... జీవితాన్ని అంతం చేసుకుంటున్నాను. నాకు ఎవరూ లేరు... కావలసిన వారూ లేరు... శత్రువులూ లేరు... నా చావు కెవరూ బాధ్యులు కారు... ఎవరినీ నిందించను... నా అంతట నేను స్వయంగా చచ్చిపోతున్నాను.' (అవును. ఈ వాక్యం కూడా వ్రాశాడు. అయినా ఇదేం వాక్యం?)

గాంధీ ఏమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా కూర్చుండిపోయేసరికి అప్పలస్వామి ఒకసారి నిట్టూర్చి మళ్ళా వరండాలో నడుచుకుంటూ వెళ్లిపోయాడు.

గాంధీ చాపమీదకి వొరిగి గోడ కానుకుని కళ్ళు మూసుకున్నాడు. అంతేనా తాను అనాడు వ్రాసింది? బహుశా అంతే... కాకపోతే ఇంకా నాలుగైదు అర్థరహితమైన

వాక్యాలు వ్రాశాడేమో గుర్తులేదు... అప్పుడు తన మనసంతా ఇప్పటి అకాశంలాగే ఘోరంగా అస్తవ్యస్తంగా అరణ్యంలా వుంది. భయంకరంగా కూడా వుంది.

గాంధీ మళ్ళీ కళ్లజోడు తీసి మాసిన లాల్చీ చివరితో అద్దాలు తుడుచుకుని మళ్ళీ మొహానికి తగిలించుకున్నాడు. తల తిప్పి గోడవంక చూస్తూ కూర్చున్నాడు. అకస్మాత్తుగా ఆ గుడ్డి వెలుతురులో అతనికి ఆ గోడమీద పెన్సిలు గీతలు కనిపించాయి. కళ్లు చిట్లించి జాగ్రత్తగా చూశాడు. ఎవరు, ఎప్పుడు గీశారో మరి....

ఒక సున్నా... అది తల... రెండు గీతలు... అవి చేతులు... తొడలు మాత్రం లావుగా గీశారు. వక్షస్థలాన్ని సూచిస్తూ మళ్లీ రెండు పెద్ద సున్నాలు... అవి అసహజంగా, పెద్దవిగా ఉన్నాయి. అంతే... ఇంకేమీ లేదు.

అతడు అప్రయత్నంగా నిట్టూర్చి మోకాళ్ల మధ్య తల పెట్టుకుని కూర్చున్నాడు. అతనికి హఠాత్తుగా తల్లి గుర్తుకు వచ్చింది. పదేళ్ళ క్రిందట – అవును. సరిగ్గా పదేళ్ళు – ఆమె చనిపోయేముందు యెలా వుండేదో గుర్తుచేసుకునే ప్రయత్నం చేశాడు. అప్పటికి ఆమెకు బహుశా నలభై ఏళ్ళుంటాయేమో! దుఃఖభారంవల్ల, పేదరికంవల్ల మనిషి జవసత్వాలు కోల్పోయి చాలా ముందుగానే వృద్ధురాలై పోయింది. అకాలవార్ధక్యం ఆమెను లొంగదీసుకుని అశక్తురాలిని చేసింది. ఒకనాడు తాను బడిలో వుండగా – మధ్యాహ్నం సూర్యుడు నిప్పులు చెరిగేవేళ అట్టే బాధపడకుండానే చనిపోయింది. అది మొదటిసారి అతడు శవాన్ని చూడటం... తండ్రిని యెరుగడు... తాను తల్లి కడుపులో ఉండగానే తండ్రి చనిపోయాడు. వారూ, వీరూ చెప్పుకోడం మాత్రం గుర్తు... ఆయనను గురించి అందరూ జాలిగా, సానుభూతిగా మాత్రమే అనుకుంటూ వుండేవారు– ఒక్క ఋణదాత తప్ప... అదీ అయిదు వందల రూపాయలే ... తన తల్లి తర్వాత రెండేళ్ళకు గాని ఆ అప్పు తీర్చలేకపోయింది. ఎవరో ఒక ముసలాయన తన తండ్రిని గురించి మాట్లాడటం అతనికి బాగా గుర్తున్నది. 'పాపం! మంచివాడు. కలియుగంలో ఉండవలసిన మనిషి కాదు. "సాతంత్రం...సాతంత్రం..." అంటూ వున్నదంతా కరిగించుకుని జైళ్ళకుపోయి, లాటీ దెబ్బలు తిని, నానాబాధలు పడ్డాడు. ఏం మిగిలింది? ఏం సాధించాడు? ఏమీలేదు. పైగా మిమ్మల్ని దిక్కులేని పక్షులను చేశాడు.' బహుశా అప్పుడు అమ్మ అక్కడ కళ్ళనీళ్లు పెట్టుకుని నిలబడివుంది. తానూ అప్పుడు అక్కడే వున్నాడు. పోనీ, చూద్దామంటే, తండ్రి ఫోటో కూడా ఏదీ మంచిది లేదు. ఒక పాత గ్రూప్ ఫోటో – ఆయన కాలేజీలో చదువుకుంటుండగా తీయించుకున్నది – ఉన్నది కాని, అందులో మొత్తం నలభైమంది పైగా ఉన్నారు. ఫోటో పట్టనట్టు కిటకిటలాడుతున్న అంతమందిలోనూ, 'ఇరుగో, వీరే మీ నాన్న...' అని ఒకసారి తల్లి చూపించింది. కాని ఆ బొమ్మ చాలా చిన్నది. తల తప్ప ఏమీ కనిపించలేదు. ఆ కళ్లు మాత్రం చెంపకు చేరెడేసి వున్నాయి. భవిష్యత్తులోకి ఆశగా, అద్భుతంగా చూస్తున్నట్టు ఉన్నాయవి. తనవీ అచ్చం అవే కళ్ళని అమ్మ ఎన్నోసార్లు అన్నది.

గాంధీకి అంతలో అనవసరంగా నవ్వు వచ్చింది. తాను కడుపులో వుండగా తన తండ్రి స్వాతంత్ర్యోద్యమంలో ముమ్మరంగా, నిర్విరామంగా తిరిగాడు. తనకు కూతురు పుడితే 'స్వరాజ్యలక్ష్మి' అనీ; కొడుకు పుడితే 'మోహన్‌దాస్ కరంచంద్

గాంధీ' అని పేరు పెట్టాలన్నాడు. పెద్దల పేర్లూ, దేవుళ్ళ పేర్లూ అసలు వొద్దు పొమ్మన్నాడు. ఇన్నీ అని తాను పుట్టకముందే పోయాడు.

బయట రణగొణ ధ్వని. కాటుక కొండలవంటి మేఘాల చాటున ఫిరంగులు మ్రోగుతున్నట్టున్నది. ఉరుములు... మెరుపులు...

ఎనిమిది, తొమ్మిది నెలల క్రిందట... తాను అప్పటికే కనిపించిన ప్రకటన లన్నిటికీ అప్లయిచేసి వున్నాడు. మొదటిసారి ఒక చిన్న, కొత్త కాలేజీకి ఇంటర్వ్యూకు వెళ్ళిన ఉదంతం గుర్తుకు వచ్చింది. ఆలస్యంగా వచ్చిన రైల్లో ఆ వూళ్ళో దిగేసరికి వర్షం... సన్నగా ప్రారంభమై అంతలోనే పెద్దదయింది. కాస్సేపు స్టేషన్లో తలదాచుకుని తర్వాత వూళ్లో వారినీ వీరినీ అడుగుతూ చివరకు పొలాలగట్లవెంట నడిచి కాలేజీకి పోయాడు. బురదలో నడుస్తూవుండగా తాను అనుమానిస్తున్నట్టే చెప్పు తెగింది. శుభ్రంగా తడిసి ముద్దయిపోయి వున్నాడు. చేతిలో సర్టిఫికెట్లు, టెస్టిమోనియల్సుతో నిండినసంచీ, తెగిన చెప్పు, చప్పగా తడిసి నిలువెల్లా నీళ్లుకారుతూ తాను కాలేజీ చేరుకున్నాడు. కాలేజీ అంటే చుట్టు తాటాకుల పాకలు... వాటిలో రొదచేస్తూ విద్యార్థులు... మధ్యలో కొంచెం దిట్టమయిన చిన్న కట్టడం... తాను అక్కడికి చేరుకున్న కొద్ది క్షణాల్లోనే విద్యార్థులందరూ 'పాకలు కురుస్తున్నాయి... సెలవు కావాలి...' అని ప్రిన్సిపాలు గదిముందు వర్షంలో నిలబడి నినాదాలుచేసి అయిదు నిముషాల్లో సెలవు సంపాదించుకుని ఎటువారటు పోయారు. అంతా సద్దుమణిగిన తర్వాత తాను ప్రిన్సిపాల్‌ను కలుసుకుంటే ఆయన చప్పరించి 'ఆలస్యమైపోయింది... అప్పాయింట్‌మెంట్ జరిగిపోయింది...' అన్నాడు. తర్వాత తెలిసింది–అది ముందే నిశ్చయమైపోయిన విషయం. కాకపోతే ఇంటర్వ్యూ అనేది ఒక తప్పనిసరి ప్రహసనం...కేవలం తమాషా... అంతే...

గాంధీ అనవసరంగా దగ్గి చాపమీదికి జారి పడుకున్నాడు. కళ్ళు మూసుకున్నా నిద్ర పట్టడంలేదు. మళ్ళీ రేపు కోర్టుకు తీసుకుపోతారు. ఇవాళ ఎక్కువ ఏమీ జరగలేదు. రేపు ప్రశ్నలవర్షం కురిపిస్తారు. ఉక్కిరిబిక్కిరి చేస్తారు.

ఆ తర్వాత చాలా రోజులు ఏ ఉద్యోగమూ రాలేదు. కనీసం ఇంటర్వ్యూలైనా పిలుపు రాలేదు. తన పని మామూలే. నెలకు ఆరు రూపాయలకు అద్దెకు తీసుకున్న చిన్నగదీ, (దానికి రెండునెలల అద్దె బకాయి) గదిలో చాప, పక్కన పాత ట్రంకుపెట్టె, పైనా క్రిందా పుస్తకాలు, పెచ్చులూడిపోయిన గోడకు ఒక పిల్లిబొమ్మ ఉన్న క్యాలెండరూ, ఒక ఐన్‌స్టయిన్ ఫోటో, గ్లాసు, అద్దం... ఇదీ తన సంపద. వారానికి అయిదు రోజులే తిండి... రోజుకో యింటి చొప్పున అయిదు ఇళ్లే మిగిలాయి అప్పటికి. సోమవారం, శుక్రవారం తనకు తిండిపెట్టే మంచివాళ్ళకు ట్రాన్సరయి ఎటో వెళ్ళిపోయారు. రోజూ సాయంకాలం పూట అయిదారుగురు పిల్లలకు ట్యూషన్ చెప్పడం. మిగిలిన కాలమంతా. 'కావలెను' ప్రకటనలు చూస్తూ ప్రతిచోటకీ అప్లయి చేయడం, చదువుతూ, వ్రాస్తూ గడపడం. ఏమీ తోచనప్పుడు ఐన్‌స్టయిన్ ఫోటో చేతిలోకి తీసుకుని ఊరికే చూస్తూకూర్చోడం, ఇంతే... ఆ రోజుల్లో అతడు సాధించిన ఘనకార్యం ఒక్కటే, ప్రక్కయిళ్ళలో పనిచేసే పదేళ్ళ రంగడనే అనాధబాలుడికి చదవడం, వ్రాయడం నేర్పాడు. ఉద్యోగం దిగులెక్కువై

పోయింది. ఎక్కడికి పోయినా 'లేదు' అనే మాట తప్ప మరోటి వినబడలేదు. కొన్ని చోట్ల –

'మాకు న్యూక్లియర్ ఫిజిక్స్ పనికిరాదు బాబూ! మామూలు ఫిజిక్స్ అయితే ఏదో చూసేవాళ్ళం. అయినా రిసెర్చికి పోకపోయావా? స్కాలర్‌షిప్ వచ్చేదిగా!'

'అవకాశం రాలేదండీ... ప్రయత్నించాను.'

'ప్చ్! ఏం లాభం లేదు.'

మరికొన్నిచోట్ల –

'ఇంత క్వాలిఫికేషన్ మా కెందుకు నాయనా? ఏదో మామూలు స్కూలు...'

ఇతరచోట్ల –

'మాకు మామూలు అక్కౌంట్స్ తెలిసిన గుమాస్తా కావాలి. ఈ సైన్సు లెందుకు?'

'పోనీ.... అదే చేస్తానండీ...'

'కుదరదు... నువ్వు చెయ్యలేవు...'

చదువుకున్నన్నాళ్ళూ తాను వారాలు చేసుకుని లోకులమీద ఆధారపడ్డాడు. ట్యూషన్లమీద పెద్దగా వచ్చిందేమున్నది? పై ఖర్చులు మాత్రం వెళ్ళిపోయేవి. చదువైపోయింది. డిగ్రీ చేతికొచ్చింది. విన్నవారూ, చూసినవారూ ఏమనుకుంటారో అనిపించేది. ఎవరింటికయినా పొద్దున్నే వెళ్ళి 'ఇవాళ మీ యింట్లో వారం!' అని చెప్పిరావడానికీ, తిండికి వెళ్ళడానికీ సిగ్గుతో క్రుంగిపోయేవాడు.

గాంధీ చలికి ముడుచుకు పడుకున్నాడు. తల్లి కడుపులోవున్న పిల్లవాడిలాగున. అతని తల్లి అంటూ వుండేది. మా వాడు నిద్రలో కదలడు. పుస్తకంలాగు పడుకుంటాడు అని. అతనికి మాగన్నుగా నిద్రపడుతున్నది. కాని అది సరయిన నిద్రకాదు. కళ్ళముందు ఏవేవో చిత్రాలు... దృశ్యాలు.

అతడు గురువారంనాడు భోజనంచేసే యిల్లు. ఆయన ఒక మెడికల్ రిప్రెజెంటెటివ్... చాలా మంచివాడు... బ్రహ్మచారి... వయసులో వున్న వితంతువైన చెల్లెలు. ఆమెకు ఒక పసిపిల్ల...వరండా ప్రక్కన గదిలో వయసు మళ్ళిన ముసలి తండ్రి... అనాడు రాత్రి తొమ్మిదిగంటల వేళ గాంధీ భోజనానికి వెళ్ళాడు. ముసలాయన గదిలో అలికిడి లేదు. బహుశా నిద్రపోతున్నాడేమో, లేకపోతే వూళ్ళో లేడో!... మూడేళ్ళ పిల్ల హాల్లో సోఫాలో పడుకొని నిద్రపోతున్నది సోఫాక్రింద నేలమీద ఒక చెయ్యి విరిగిన బొమ్మ... గోడమీద 'టిక్కుటిక్కు' మంటున్న గడియారం...చుట్టూ నిశ్శబ్దం... తలుపు తట్టిన శబ్దం విని ఆమె వచ్చింది. 'నీ కోసమే చూస్తున్నా' నంటూ లోపలికి తీసుకువెళ్ళి అన్నం పెట్టింది. ఆ తర్వాత హాల్లోకి వచ్చాడు. ఆమె వెనుకనుంచి 'ఇప్పుడంతదూరం వెళ్ళడం దేనికి? ఇక్కడే పడుకో... నాకూ భయంగా వుంది. ఒంటరిగా వున్నాను.' అన్నది. అతడు హాల్లోనే సోఫాలో ఒకపక్కన కూలబడ్డాడు. అంతలోనే అతనికి నిద్ర ముంచుకు వచ్చింది. ఎంతసేపు నిద్రపోయాడో ఏమో! ఆమె అతని మీదికి వంగి లేపుతూ వుండగా మెలకువ వచ్చింది. ఆమె మెడలోని ఒంటిపేట బంగారు గొలుసు అతని నుదుటికి చల్లగా తగులుతున్నది. ఆమె "లే...

లేచి లోపలపడుకో" అంటూ పక్క గదిలోకి వెళ్ళింది. అతడు లేచాడు. చేతి(వేళ్ళు విరుచుకుని నుదురు గట్టిగా తుడుచుకుని ఒక్కక్షణం నిలబడి, అంతలోనే తలుపు తీసుకుని వరండాదాటి మెట్లుదిగి వీధితలుపు విసురుగా తోసి వీధిలోకి వచ్చాడు. విసవిసనడవడం ప్రారంభించాడు. ఆమె వెనకనుంచి 'అదేమిటి? వెళ్ళిపోతున్నావా?' అనడం వినిపించింది. కాని అతడు ఆగలేదు. వెనుదిరిగి చూడనైనా లేదు. వెలుగు చీకట్లతో నిండిన వీధిలో గబగబ నడచి పోయాడు.

గాంధీ పక్కకు ఒత్తిగిలి పడుకున్నాడు. అంతలో అతనికి ఎప్పుడో తాను చూసిన కడుపుతోఉన్న పెద్ద బల్లి గుర్తుకువచ్చింది. ఆ వెనువెంటనే వందలాది కాళ్ళతో అసహ్యంగా నడిచే కాళ్ళజెర్రి గుర్తుకు వచ్చింది. 'దానికి అన్ని కాళ్లెందుకో!' అనిపించింది. ఎక్కడినుంచో మృదువైన వాసన... జైల్లో ఈ వాసన ఏమిటీ? ఆనాడు తాను సీసాలో తెచ్చుకున్న పదార్థం వాసన ఇలా మృదువుగా లేదు... చాలా ఘాటుగా ఉంది.

ఆనాడు ఆగస్టు పదిహేనవతేదీ... దేశమంతటా గొప్ప కోలాహలం...సంచలనం... హడావిడి...ప్రబోధాలు... హితోక్తులు... ప్రసంగాలు... ప్రదర్శనలు... పతాకాలు... అంతా...సంతలాగు, సంబరంలాగున్నది. ఆ చిన్నరూములో పగలంతా ఒంటరిగా గాంధీ... రాత్రి పది గంటలు...చుట్టూ నిశ్శబ్దం... కిటికీలో లాంతరు మందంగా వెలుగుతున్నది... బహుశా ఆనాటితో అందులో కిరసనాయిలు అయిపోతుంది... ట్రంకు పెట్టెమీద ఫోటోలో ఐన్‌స్టయిన్ కళ్ళు, నిశితమైన, చురుకైన కళ్ళు తీవ్రంగా చూస్తున్నాయి. గోడమీది క్యాలెండరులో పిల్లి – ఏ క్షణంలోనైనా యూలవేస్తేచాలు లేచి రావచ్చునన్నంత సహజంగా వుంటుంది – మూతి ముడుచుకుని వెలిగే కళ్ళతో చూస్తున్నది. చాప పక్కన మూలగా ఆ చిన్నసీసా. అతడు లావాటి పుస్తకం తీశాడు. దానిలో పేపరు కటింగ్స్ చాలా ఉన్నాయి. హోల్డేన్, నర్లేకర్, ఖొరానాల ప్రసంగాలు. బొమ్మలు, ఇంకేవేవో వైజ్ఞానిక వ్యాసాలు. బాబా ఫోటో ఒకటి. చంద్రమండలంమీద మానవుడు పాదం పెడుతున్న రంగుల దృశ్యం; తన క్లాస్‌మేట్ ఒక అమ్మాయి (ఆమె నతడు ప్రేమించాడా?) ఎప్పుడో పంపిన గ్రీటింగ్ కార్డు వెనక వెన్నెలలో తాజ్‌మహల్ సుందర దృశ్యం; తాను వ్రాసిన ఏవేవో వ్యాసాల కట్టలు; సైన్సులో నోబెల్ బహుమతి పొందిన వారి వివరాలు; ఒక యువ సైంటిస్టు, నిరాశా నిస్పృహలతో ఆత్మహత్య చేసుకుంటూ వ్రాసిన విషాదకరమైన చివరి ఉత్తరం– ఇన్నింటినీ ఒక్కసారి తిరగవేశాడు. తర్వాత ఒక కాగితం చేతిలోకి తీసుకున్నాడు. కలంలో సిరా అయిపోయిందో ఏమో విదిలిస్తేకాని వ్రాయలేదు. అప్పుడు తనకు మనస్థిమితం ఉన్నాదా? ఉన్నదనే అనుకున్నాడు. కళ్ళవెంట మాటిమాటికీ నీళ్ళు ఉబుకుతున్నాయి. వొణుకుతున్న చేత్తో కాసిని వాక్యాలు వ్రాశాడు. చివర సంతకం పెట్టబోతే సిరా అయిపోయిందేమో, పూర్తిగా వీలుపడలేదు. చివరి అక్షరం తేలిపోయింది. తేదీ వెయ్యలేదు. ఆ తర్వాత చాలాసేపు కదలకుండా కూర్చుని వొణుకుతున్న చేతులతో ఆ సీసా తీసుకుని దానివంక కాస్సేపు కన్నార్పకుండా చూశాడు. మనసంతా మొద్దుబారిపోయింది. ఏ అనుభూతీ ఆలోచనా లేని అవస్థ...గ్లాని... చేతులు వొణుకుతున్నా పని పూర్తిచేసుకున్నాడు.

తర్వాత చాపమీద వెల్లకిలా పడుకున్నాడు. కొద్ది క్షణాలే... బహుశా నిమిషం కూడా అయివుండదు. మెదడులో ముందు, కేవలం యెర్ర తామరపూలతో నిండిన చెరువు... తర్వాత అంకెలూ, అక్షరాలూ, ఏవేవో ఈక్వేషన్‌లూ తిరిగిపోయాయి... ఏదో అజ్ఞాతలోకంలోకి వేగంగా ప్రయాణం చేస్తున్న అనుభూతి... తర్వాత భారరహితస్థితి... రెక్కలు వచ్చి మబ్బులుదాటి కాంతివేగంతో వెళ్ళిపోతున్నట్టు... 'అన్నట్టు కాంతివేగం సరిగ్గా ఎంతో' అన్న బావన... సరిగ్గా ఆ క్షణంలో రంగడు మెరుపులాగా వచ్చాడు. ఎందుకు వచ్చాడో తెలియదు. ఆగస్టు పదిహేను హడావిడి అంతా వాడి మొహంలోనే ఉన్నట్టున్నది. గుండెమీద చిన్నజెండా పెట్టుకునివున్నాడు. వాడు గాంధీని పిలిచి, అతడు బదులు పలక్కపోయేసరికి పెద్దగా అరిచి కేకలు పెట్టాడు. అంతలో హడావిడిగా అందరూ వచ్చారు. గుంపుగా వచ్చారు. తర్వాత అతన్ని అపస్మారకస్థితిలో అస్పత్రికి తీసుకుపోయారు. అక్కడ డాక్టర్లు అతని పొట్టలోని విదేశీ పదార్థాన్ని విజయవంతంగా యివతలికి తీసి అతన్ని బ్రతికించారు. తర్వాత రెండుమూడు రోజులే ఆస్పత్రిలో వుంచారు. ఈ మధ్యలో పోలీసులు హడావిడి చేశారు. అతని రూము అంతా గాలించారు. అవసరమైనవీ, అనవసరమైనవీ, అన్నీ తీసుకున్నారు. 'ఆస్పత్రిలో ఇంక ఉండనక్కరలేదు, వెళ్ళిపొమ్మని' డాక్టర్లు సాగనంపేసరికి సిద్ధంగా ఉన్నారు పోలీసులు...

కోర్టులో విచారణ... కొండరాళ్ళతో కట్టబడిన పాతకాలపు కట్టడం ... విశాలమైన హాలు... ఎదురుగా జడ్జి... నల్లకోట్లు ధరించిన న్యాయవాదులు... తలలకు పాగాలతో వరండాలలోనూ, లోపలా ప్లీడరు గుమాస్తాలు, బిళ్ళ బంట్రోతులు... జడ్జిగారి పైన గోడమీద పెద్దసైజు జాతిపిత, ప్రధాని, రాష్ట్రపతుల రంగుల ఫోటోలు..

న్యాయమూర్తి నడివయసువాడే... మూర్తీభవించిన మంచితనంలా వున్నాడు. అవసరం వస్తే కరుడు కట్టిన కాఠిన్యంలాగానూ ఉండగలవాడిలా కనిపిస్తాడు. గాంధీని మధ్యాహ్నం వేళకు లోపలికి తీసుకుపోయి బోనెక్కించారు. ఒక న్యాయవాది – దళసరి కళ్ళద్దాలు ధరించినవాడు – విషయం అంతా పెద్దగొంతుతో నివేదించాడు. న్యాయమూర్తి ప్రసన్నంగా గాంధీ వంక చూస్తూ బుగ్గన చెయ్యి అనించుకుని విన్నాడు. కొందరు న్యాయవాదులు కూడా ఉత్కంఠతో విన్నారు. పోలీసులు గుమ్మందగ్గర నిలబడి వున్నారు. వెనక బల్లలమీద కొందరు కూర్చున్నారు. వారు కూడా విన్నారు. గాంధీ అంతసేపూ నుదురుచేత్తో రుద్దుకుంటూనూ, లాల్చీ జేబుల్లో చేతులుంచి మళ్ళా బయటికి తీస్తూనూ నిలబడిపోయాడు. అంతలో అతనిచేత నిజమే చెబుతానని ప్రమాణం చేయించి ప్రశ్నలు ప్రారంభించాడు. అతని రూములో పోలీసులు లోబరుచుకున్న కాయితాలలో అతని స్కూల్ ఫైనల్ రిజిస్టరు మొదటి పేజీ కాఫీ వుంది.

పేరు – మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, ముష్టి.

పుట్టిన తేది – ఆగస్టు మొదటతేదీ పందొమ్మిది వందల నలభై ఏడు.

పుట్టుమచ్చలు – ఎడమ మోచేతిపైన పెద్ద పుట్టుమచ్చ ఒకటే, కుడిభుజాన పైన చిన్న పుట్టుమచ్చ మరొకటి.

నడవడి – సంతృప్తికరం.

గాంధీ నిశ్చలంగా వింటున్నాడు. అతనికి అంతలో ఎప్పుడో తాను నీళ్ళలో చూసిన శవం గుర్తుకు వచ్చింది. అది నీళ్ళలో నాని బాగా ఉబ్బిపోయివుంది. బోర్లా పడుకుని నీళ్ళలో తేలుతూ లాకులదగ్గర ఆగిపోయింది. 'అది తనకు ఎందుకు గుర్తుకు వచ్చిందా' అని ఆలోచించాడు. ఆ ఆలోచన తెగలేదు. అంతలో అతన్ని పరధ్యానంగా ఉన్నందుకు మందలించి ప్రశ్నలు మొదలుపెట్టారు.

గాంధీ కంఠం వొణుకుతూవుండగా చెప్పాడు.

'అవును. ఆత్మహత్య ఘోరమైన నేరమే.' అతని కళ్ళలో నీళ్లు నిలిచాయి.

'అయినా గత్యంతరం లేకపోయింది. అయినవాళ్లెవరూ లేరు. చిన్నప్పటినుంచీ శ్రద్ధగా చదువుకున్నాను. వారాలు చేసుకుని, వీధి లాంతర్ల క్రింద చదువుకున్నాను. ట్యూషన్లు చెప్పుకున్నాను. చదువైపోయిన తర్వాత రిసెర్చి స్కాలర్‌షిప్ వస్తుందికదా అని ఆశపడ్డాను. కాని రాలేదు. ఎన్నో ఉద్యోగాలకు అప్లయి చేశాను...' అతడు ఆగి వొణుకుతున్న వ్రేళ్ళతో కనుతుదలు తుడుచుకుని కళ్ళజోడు పెట్టుకుని మళ్ళీ అన్నాడు.

"ఏదీ రాలేదు. ఎంతకాలం ఇట్లా? ఇట్లా బ్రతకలేననిపించింది. అంతే..."

జడ్జి కళ్ళజోడు తీసి ఎదురుగా బల్లమీద పెట్టి నుదురు తుడుచుకుని కాస్సేపు కళ్లు మూసుకున్నాడు. కొద్ది క్షణాలు కోర్టుహాల్లో నిశ్శబ్దం వ్యాపించింది. జడ్జి అంతలో గడియారం చూసుకొని కళ్ళజోడు అందుకుని చివాలున లేచి లోపలికి వెళ్ళిపోయాడు. మరునాటికి వాయిదా వేశారు.

గాంధీకి నిద్రపట్టింది. కాని కలవరిస్తూనే వున్నాడు. ఏవో అస్పష్టమైన మాటలు.

అప్పలస్వామి అర్ధరాత్రివేళ వచ్చి కటకటాల పక్కన నిలబడి బీడి ముట్టించుకుని, ఆ అగ్గిపుల్ల వెలుతురులో లోపల నిద్రపోతున్న గాంధీవంక చూసి తనలో తను నెమ్మదిగా నవ్వుకుని బీడీదమ్ముడి పీలుస్తూ చాలాసేపు అక్కడే నిలబడ్డాడు. తర్వాత బూట్ల చప్పుడు కాకుండా నెమ్మదిగా నడిచి వెళ్ళిపోయాడు.

గాంధీకి మెలకువ వచ్చేసరికి బాగా పొద్దెక్కింది. అతని కళ్లు ఎర్రగా జ్యోతుల్లాగా ఉన్నాయి. కణతలమీద నరాలు ఉబ్బి ఉన్నాయి. నిద్రలో వరసగా కలలు వచ్చాయి. ఒక కలలో అంకెలు... అన్నీ అంకెలే అల్లిబిల్లి తిరుగుతూ అద్భుతంగా కనిపించాయి. మరో కలలో లెక్కలేనన్ని పాములు...వందలూ వేలూ – తర్వాతి కలలో అసంఖ్యాకమైన సౌరకుటుంబాలూ, తారా సందోహాలూ, గ్రహాలూ, గ్రహ శకలాలూ, తోకచుక్కలూ, పరమాణు ప్రయోగాలూ కనిపించాయి.

అప్పలస్వామి తలుపు తీయగానే గాంధీ 'ఏవీ కాయితాలు? కలం ఏదీ?' అని అడిగాడు. అప్పలస్వామి ఏమీ మాట్లాడలేదు.

గాంధీకూడా మళ్ళీ ఏమీ అడగలేదు. బయటికి వచ్చిచూస్తే పలుచని ఎండ మృదువుగా, మెత్తగా అతని మొహానికి తగిలింది. ఆవరణలో కాస్సేపు అటు ఇటు తిరిగి కాపలావాడిని పిలిచి, ఆ ప్రహరీ గోడను చూపిస్తూ 'ఆ గోడ అవతల ఏముంది?' అని అడిగాడు.

కాపలావాడు కళ్ళు పెద్దవిచేసి చూసి 'ఏమీలేదు' అన్నాడు.

'ఏమీ లేదూ?' అని గొణుక్కున్నాడు గాంధీ. 'అవును. ఏమీ ఉండి ఉండదు. అడివేమో అది అంతా' అన్నాడు మళ్లీ.

వ్యానులో కోర్టుకు తీసుకుపోతూండగా అప్పలస్వామి అతన్ని నిశితంగా చూశాడు. అతని కణతలమీద నరాలు ఉబ్బి ఉన్నాయి. కళ్లు ఎర్రగా ఉన్నాయి. కళ్ళజోడు తీసి జేబులో ఉంచుకుని మాటిమాటికీ కళ్లు నులుముకుంటూ కూర్చుని వున్నాడు. చూపులు ఎక్కడా నిలవడం లేదు.

కోర్టు హాల్లోకి పిలిచి బోనెక్కించగా ఉన్నట్టుండి పెద్దగా 'నా రూములో ఫోటో ఉండాలి... ఐన్‌స్టయిన్ ఫోటో... అది ముందు నాకిప్పించండి' అన్నాడు.

ఎవరూ పట్టించుకున్నట్టు కనిపించలేదు. కోపంతో కళ్లు ఎర్రబడ్డాయి. గొణుకుతున్న కంఠంతో మళ్లీ 'దాన్ని తీసుకురండి... ఆ పైన గోడకు తగిలిద్దాం... ఇక్కడ ఉండాలి అది... లేకపోతే నేనూరుకోను...' అన్నాడు.

న్యాయవాది వరుసగా ప్రశ్నలు వేశాడు. గాంధీ సమాధానాలు చెప్పకుండా నిలబడిపోయాడు. రెండు చేతులతో లాల్చీ గట్టిదనాన్ని పరీక్షించాడు. అది అంతలో ఫ్రరున చినిగింది. అతడు తలెత్తి 'చూశారా? ఇలా అనేసరికి చినిగిపోయింది...' అన్నాడు.

పోలీసు అధికారీ, పోలీసులూ, అప్పలస్వామీ, న్యాయవాదులూ, వెనక కూర్చున్న వారూ, న్యాయమూర్తీ అందరూ కళ్లు పెద్దవి చేసుకుని చూస్తున్నారూ – అంతలో గాంధీ 'ఎంతసేపూ మీరడగడమూ, నేను చెప్పడమూ కుదరదు. నేను చెప్పవలసినదంతా నిన్ననే చెప్పాను... అవును... చచ్చిపోదామనుకున్నాను. ఇప్పుడు నేనడుగుతాను... తెలిస్తే చెప్పండి...' అని ఒక్క క్షణం ఆలోచించి 'ఆఁ! కాళ్ళజెర్రి తెలుసుగా? దానికి అన్ని కాళ్ళెందుకో చెప్పండీ... చూద్దాం...' అన్నాడు. మళ్ళీ 'చెప్పలేరు... నాకు తెలుసు... పోనీ 'ఈ ఈజ్ ఈక్వల్ టు ఎం సి స్క్వాయిర్' అంటే ఏమిటి?' అని అడిగాడు. తర్వాత ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాడు. అతని చూపులెక్కడో ఉన్నాయి.

న్యాయమూర్తి చివాలున లేచి లోపలకి వెళ్లిపోయాడు. అంతలో గాంధీ ముందు మెరుపు మెరిసినట్టయింది. ఎవరో కెమేరా 'క్లిక్' మనిపించారు. గాంధీ పెద్దగా అరిచాడు... 'ఎవర్రా అది... పట్టుకోండి...' తర్వాత తనలో తాను గొణుక్కుంటూ నిలబడిపోయాడు. కొద్దినిముషాల తర్వాత పోలీసు అధికారి అతన్ని సమీపించి 'రండి వెళదాం' అన్నాడు. గాంధీ వాక్ప్రవాహం ఆపి 'ఎక్కడికి?' అని అడిగాడు.

'ఇంటికి పోదాం' అన్నాడాయన.

'నాకు యిల్లు లేదు. వాకిలీ లేదు...' అన్నాడు గాంధీ.

'మీ యిష్టం వచ్చిన చోటికి తీసుకుపోతాను రండి' అన్నాడు అయన మళ్ళీ.

'అయితే పదండి... రామలీలామైదానంలో మీటింగు ఉంది. అక్కడ మాట్లాడుతాను ఇవ్వాళ... ఆ తర్వాత గేట్ వే ఆఫ్ ఇండియాకు పోదాం...'

'సరే... అక్కడికే పోదాం...' అన్నాడు పోలీసు అధికారి అతని చెయ్యి పట్టుకుని.

'రైటో... కాని అక్కడ ఫిరంగులూ అవీ ప్రేల్చగూడదని చెప్పండి... అవి నాకు గిట్టవు... అన్నట్టు నాకు కాయితాలూ, కలమూ కావాలి... ముందు అవి తెప్పించండి...'

వ్యాను రోడ్డుమీద నడుస్తూ వుండగా రోడ్డుమీద ఏదో ప్రజాప్రదర్శన... అంతటా అలజడిగా, కోలాహలంగా ఉంది.

గాంధీ రహస్యం చెబుతున్నట్లు 'అన్నట్టు మీకు రోజువారీ వాడకానికి ఆటంబాంబులు కావాలి కదా? ఎట్లా మేనేజ్ చేస్తున్నారు? మీక్కావాలంటే చెప్పండి... రెండు రోజుల్లో చేసేయిస్తాను. కావలసిందల్లా కాయితాలూ – కలమూ అంతే...' అంటూ వెర్రినవ్వు నవ్వాడు.

అప్పలస్వామి పోలీసు అధికారిని నెమ్మదిగా ప్రశ్నించాడు– 'సార్! ఏమిటి సంగతి?'

పోలీసు అధికారి కణతమీద బొటనవ్రేలుంచుకుని నవ్వి నెమ్మదిగా 'మతి చెడింది... ఇక పిచ్చాసుపత్రే శరణ్యం...' అన్నాడు.

జైలుకు వెళ్ళగానే అతనికి కాసిని కాగితాలూ, కలమూ ఇచ్చారు. గాంధీ వాటిని ఆశగా అదుర్దాగా అందుకుని వెంటనే చాపమీద కూలబడి వ్రాయడం ప్రారంభించాడు. అప్పలస్వామి దగ్గరగా నిలబడి చూశాడు. ఏవేవో వ్రాసి గాంధీ అయిదు నిముషాల తర్వాత అలసిపోయాడు. తర్వాత కాస్సేపు ఆలోచించి ముందు ఒక సున్నా గీచాడు... అది తల. .. తర్వాత రెండు గీతలు గీచాడు... అవి చేతులు... మళ్ళీ చాలా గీతలు – అవి తొడలు... కాళ్ళు... తర్వాత వక్షస్థలాన్ని సూచిస్తూ రెండు పెద్ద సున్నాలు గీచాడు... అంతే... ఇక ఇతర వివరాలేవీ కన్ను, ముక్కు వగైరాలేవీ లేవు. బొమ్మవేసి అప్పలస్వామి వంకచూసి నవ్వి 'పేరు పెడతాను చూడు...' అంటూ కొద్ది క్షణాలు ఆలోచించి ఆ బొమ్మ క్రింద పెద్ద అక్షరాలతో 'కాళ్ళజెర్రి' అని వ్రాశాడు... తర్వాత నిద్ర వచ్చింది కాబోలు – చాపమీద బోర్లా పడుకుని గురకపెడుతూ నిద్రపోయాడు.

● ప్రచురణ కాలం ? ●

★ ★ ★

32

శ్రీపతి

# కుంకుమ

శకూ అక్కను చూట్టమంటే దిగులు. ఇన్నేళ్ళూ పోయి చూడనందుకు బాధ. ఆ ఊరు వెళ్ళటమంటే ఎడారిలో ప్రయాణం. ఎక్కడో పదిమైళ్ళ దూరంలో బస్సు వొదిలేస్తుంది. అక్కణ్ణించి కాలినడక, లేక ఎడ్లబండి. ఇప్పట్లో వెళ్ళకపోతినో ఈ ఆంధ్రదేశం మళ్ళీ రావటం ఏ రెండేళ్ళకో!

శకూ అక్క నుదుట కుంకుమ కనిపించదని చాలాసార్లు అనుకున్నాను. కాని మొట్టమొదట – ఆ సముద్రపు టొడ్డు అగ్రహారంలో పగుళ్ళలోంచి రావిమొక్కల్లేచిన నాచు పట్టిన గోడలతో, పచ్చటి గడ్డి మొలచిన పైకప్పులతో గోల్కొండ శిథిలాల్లా ఉన్న ఆ భవనంలో శకూ అక్కను చూసినప్పుడు కోపమొచ్చింది. కుంకుమ తీసేసి అక్కను అవమానపరుస్తున్నారు. 'భర్త లేనిది' అని లోకానికి చాటుతున్నారు. ఏ ఒక్కరి రక్షణలోనూ లేదని చిన్నబుచ్చుతున్నారు. ఏడుపొచ్చింది. నేను ఊహించుకున్నదానికంటే మారిపోయి కనిపించింది శకూ అక్క.

బళ్ళో ఒకటో తరగతి చదువుకొంటున్న సుభాష్ నేను వెళ్ళిన పదిహేన్నిమిషాలకి వచ్చేడు. మామయ్యారా అంటే కొత్తగా చూశాడు. దగ్గరకు తీసుకుంటే బలవంతంగా ఏడుపు తెచ్చుకుని జారిపోయి వెళ్ళిపోయాడు.

శకూ అక్క మొదట నాన్నగారి ఆరోగ్యం గురించి అడిగింది. హోమియో మందు వాడుతున్నారు. సుగర్ తగ్గిందని చెప్పాను. అమ్మ గురించి అడిగింది. బావుందన్నాను. అక్క దురదృష్టానికి అమ్మ ఎప్పుడూ పడే బాధ చెప్పలేదు. అన్నయ్యగురించి అడిగింది. 'బాగా ఉన్నాడు.' పిల్లలు – రేణు, వెంకటేశ్వర్లు సుభ గురించి ఎంతో తెలిసినట్టు అడిగింది. వాళ్ళని శకూ అక్క అసలు చూణ్నేలేదు, ఉత్తరాల్లో తప్ప. సుభని మిషనరీ ఇంగ్లీష్ మీడియమ్ నర్సరీలో చేర్చటానికి మూడొందలు డొనేషన్ కట్టాల్సొచ్చిందని నేను చెప్తుండగా – శూన్యంలో ఏవేవో చిత్రాలు చూసి – దుఃఖాన్ని ఆపుకోలేక మొదట బొటబొట కన్నీరు కార్చి మొఖం చేతులతో కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

ఏడుపు విని మామయ్య ఆ గదిలోకి వచ్చాడు. అత్త వచ్చింది. ఇంట్లో మనుషులు వచ్చారు. శకూ అక్కను చుట్టుముట్టారు. ఏమో అనుకున్నారు. నాకు వినిపించలేదు. అక్క ఏడుపంతా నా గుండెలు నులుముతోంది. అక్క కన్నీరంతా నా కళ్ళలో నిండిపోయింది.

దయ్యాలు చుట్టుముట్టినట్టయింది. కనీసం ఏడవనివ్వలేదు. ఇద్దరు నన్ను బయటికి మోసుకొచ్చారు. ఆడాళ్ళు అక్కను వేరే గదిలోకి యీడ్చుకు పోయాగా అట్లా చేయటం నాకు అవమానమయింది.

మన సాంఘిక వ్యవస్థలో ఏర్పడిన ఈ సంబంధాలు ఎంతవరకూ మేలు చేస్తున్నాయో ఏమో! నన్ను చూశాక అక్కలో రేగిన దుఃఖం, ఆ ఏడుపు ఎందుకని? నేనేం చేయనందుకు? ఆమె ఏ తప్పు చేసినందుకు? కన్నీరు మున్నీరుగా గుండెలు అలసిపోయేట్టు భోరున ఏడ్చింది. ప్రయాణపు బడలిక, దప్పిక, ఆకలి ఏమీలేవు. గుండె తరుక్కుపోయింది. అన్నయ్య, అమ్మ, నాన్నగారు, పిల్లలూ మేము సుఖంగా బతుకుతున్నాం. ఎప్పుడూ ఇంత దుఃఖం ఎవ్వరమూ చూళ్ళేదు. కొంచెంసేపు కోపాలు, పట్టుదలలు తప్పించి, ఆత్మని ఊపిరాడనీకుండా ముంచేసే ఇంత కన్నీరు తెలీదు.

క్షణంక్రితం నన్ను ఆనందంతో పలకరించిన మామయ్య కొరకొర చూస్తున్నాడు. అక్కడ కూచోలేక వీధిలోకి వెళ్ళిపోయాడు.

నా లేత కళ్ళతో పెళ్ళి పందిరితో ఈ ఇల్లు చూశాను. మామిడాకుల తోరణాలకింద పరుగులెత్తాను. ఇప్పుడు–

ఈ పదేళ్ళ కాలంలో సంఘ మెంత మారిపోయిందని! మా పూర్వీకుల నివాసం విజయనగరం. ఆంధ్రరాష్ట్రం వచ్చిన కొత్తలో అన్నయ్యకి సెక్రెటేరియట్‌లో ఉద్యోగం వచ్చింది. కర్నూల్‌లో చేరాడు. తర్వాత హైదరాబాద్. వాడికి ఆరోగ్యం బాగాలేదని అమ్మా, నాన్నా వెళ్ళారు. మరుసటి ఏడు నన్నూ, అమ్మమ్మనూ తీసుకుపోయారు. అమ్మా, నాన్నా హైద్రాబాద్ వెళ్ళిన ముందుయేడు శకూ అక్క పెళ్ళయింది. బావ బాగా చదువుకున్నవాడు. శ్రీకాకుళం జిల్లా, వందన్నర ఎకరాల ఆస్తి. అగ్రహారం భుక్తలు. వాళ్ళ ఇళ్ళు జమీందార్ల ఇళ్ళలా ఉండేవి.

అప్పట్లో శకూ అక్కకి ఈ సంబంధం కుదిరిందంటే కారణం శకూ అక్క అందం. శకూ అక్క పాట. వాళ్ళ స్థాయిలో పెళ్ళి చేయటానికి పల్లెటూళ్ళో ఉన్న అయిదెకరాల భూమీ ఆ చవకధరల్లో మేము అమ్ముకోవాల్సి వచ్చింది. ఆడపిల్ల ఒక్కతే కాబట్టి దాని పెళ్ళికి ఏ లోటూ చేయకూడదని అమ్మ, నాన్న, అన్నయ్య పట్టుబట్టి ఘనంగా చేశారు.

కొన్నాళ్ళకు పరిస్థితులు మారేయి. కింది కోర్టులో ఇనామ్‌దారీ వివాదాల్లో గెలుచుకున్న భూములు పై కోర్టుల్లో రైతులు గెలుచుకున్నారు. ఒకప్పుడు బాగా బ్రతికిన కుటుంబం అవటంవలన దెబ్బతిన్నారని విన్నానేగాని ఇంటికి కనీసం వెల్లవేయించుకోలేని ఈ స్థితికి దిగజారిపోయారనీ, శకూ అక్క ఇంత దుర్భరజీవితాన్ని భరిస్తున్నదనీ తెలీదు.

పెళ్ళి పేరుతో శకూ అక్కని ఇటు విసిరేసి, బ్రతుకు ఆశతో హైద్రాబాద్ పారిపోయాము. వారసుడయిన కొడుకుకోసం, మిగిలిన ఈ ఇళ్ళూ, ముప్ఫయి ఎకరాల భూమికోసం అక్కని ఈ గుహల్లో మరచిపోయాము. బావ పోయినప్పుడు, అయిదేళ్ళ క్రితం, అమ్మ, నాన్నా, అన్నయ్యా వచ్చి చూశారు. ఈ బాధ చెప్పలేదు. చిన్నాన్న ఉత్తరాలు రాస్తూంటాడు. ఎప్పుడూ ఈ దయనీయ జీవితం గురించి

రాయలేదు. బహుశా వాళ్ళ దృష్టిలో ఇవి కష్టాలే కావేమో! ఈ కష్టాలనించి గట్టెక్కించేదుకు అశక్తులేమో వాళ్ళు!

ఆ రాత్రంతా నిద్రలేదు. అక్కను ఏదో మిష పెట్టి తీసుకుపోవడం తప్ప వేరే ఉపాయం తోచలేదు. మామ్మగారితో నాన్నగారి అనారోగ్యం గురించి చెప్పి ఒప్పించి అక్కనీ, సుభాష్‌నీ తీసుకుపోవాలి ఇక్కడనించి.

☆ ☆ ☆

బ్రాంచి పోస్టాఫీస్‌నించి దినపత్రిక తెచ్చి మామయ్యకి ఇవ్వటం సాంబం పని. ఆ తెచ్చేదారిలో సినిమా బొమ్మలు చూస్తాడు. వంశపారంపర్యమైన చర్మరోగమేదో సాంబానికి ఉంది. చర్మంలో తడి కనిపించదు. పొడిబారిపోయి బూడిద పూసుకున్నట్టు ఉంటుంది. ముఖంమీద, శరీరమంతటా సన్నటి నూలుపోగుల్లాగ పగుళ్ళు. మెడ పొట్టిది. తలకాయ భుజాలమీద పడుతుంది. అల్పమైన మనిషి.

పంచాయితీ లైబ్రరీనించి తను తీసుకెళ్ళిన కాశీమజిలీ కథలు ఇవ్వటానికి ఉదయం వచ్చినప్పుడు పరిచయం. టీచర్ ఉద్యోగం కోసం పాట్లుపడుతున్నాట్ట. ఆరోగ్యం విషయం శ్రద్ధ తీసుకోమని చెపితే 'ఉద్యోగంలో చేరితే మందులు వాడుకుంటాను బాబుగారూ' అని జవాబు చెప్పినప్పుడు సాంబంమీద జాలేసింది.

ఉదయం మామయ్య నాగురించి కనీసం ఓ పదిమందితోనన్నా, వాళ్ళు అడక్కపోయినా, "శకుంతలమ్మ తమ్ముడు; ఢిల్లీలో ఎనిమిదొందలరూపాయల ఉద్యోగం. ఐ.ఎ.ఎస్. ఆఫీసర్. అంటే కలెక్టరవుతాడన్నమాట" అని అబద్దాలు కలిపిచెప్పాడు. ఒకప్పుడు ఇంగ్లీషు కలెక్టర్లు ఎంత తరుచుగా తనని చూట్టానికి వచ్చేదీ చెప్పిన అదే గొప్పతనం తనకి ఇప్పుడూ ఉన్నట్టు నాతో మాటాడుతూ వాళ్ళతో ఓ పాతిక శాతం అబద్దాలు చేర్చి చెప్పాడు. మామయ్య మాటలు విన్న సాంబం మరింత భక్తి విధేయతలు చూపించాడు. చేతులు నులుముకుని కింది మెట్టుమీద కూచున్నాడు.

మన దేశానికి ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి. రాష్ట్రపతి కామరాజ్‌నాడార్. మన దేశంలో ప్రధానభాష తెలుగు. మళ్ళీ ఇంగ్లీషువాళ్ళొస్తేనేగాని ఈ దేశం బాధలు తప్పవట. ఇదీ సాంబం చదువు. సర్వీస్ కమీషన్ పరీక్షల్లో వచ్చిన వింత జవాబులు. టీచర్ ఉద్యోగం తప్పించి ఇంకేదన్నా వెతుక్కోవడం మంచిదని చెప్పాను.

స్వరాజ్యం వచ్చిన ఇరవై యేళ్ళ తర్వాతకూడా ఆ ఊళ్ళో అర్థంకానిసవిధానముంది. ఒకప్పుడా ఉళ్ళోని రైతులంతా మామయ్య పొలంలో పనిచేసే కంబార్లు. శూద్రులు. బ్రాహ్మణులంటే సనాతనంగా ఏర్పడిన భక్తి, గౌరవం. ఎడంగా ఉంటారు. సెకండరీ ట్రయినింగ్ చదువుకున్న సాంబం కూడా 'బాబుగారూ,' 'తమ ఆశీర్వాదం' లాంటి మాటలు ఉపయోగించి తనని తనే చిన్నబుచ్చుకునేవాడు. ఇప్పటికీ సాంబం కులంవాళ్ళు చాలామంది రైతుల దగ్గర కంబార్లుగా ఉన్నారు.

ఆరోజు సాంబాన్ని తోడు తీసుకుని సముద్రం చూట్టానికి వెళ్ళాను. సముద్రమంటే శకూ అక్కకి ఎంతో ఇష్టం. వైజాగ్ పిన్నిగా రింటికి వెళ్తే మహారాణీ పేట బీచ్‌లో పరుగులు తీసేది. నాకు బాగా గుర్తు – 'వాళ్ళూరికి (బావగారి) సముద్రం చాలా దగ్గరట' అని పెళ్ళిచూపుల తర్వాత అక్క నాతో చెప్పటం. పెళ్ళయిన తర్వాత

మొట్టమొదటిసారి ఇక్కడికి వస్తున్నప్పుడు – చీకటి రాత్రి – పల్లకిలో కూచుని నిద్రమత్తుతో ఊగుతున్న నన్ను లేపి మా ముందు, వెనకాల వస్తోన్న ఇరవై ముప్ఫయి ఎడ్లబళ్ళ గంటల మోతలో 'తమ్ముడూ, ఆ సముద్రపుమోత విను. విన్నావురా' అని చెప్పటం నాకు బాగా గుర్తు. సంక్రాంతి పండక్కి బావతో వచ్చినప్పుడు అరుసార్లు సముద్రానికి వెళ్ళాను. బావగారు అయిదుసార్లు తీసుకెళ్ళారు. గ్రహణ స్నానాలకి ఒకసారి అని స్వర్గం చూసిన ఆనందంతో శకూ అక్క చెప్పటం మరచిపోలేను.

కెరటాలు హోరున విరుచుకుపడి మోకాలివరకూ తడిసి వెనక్కి మళ్ళిపోతున్నాయి. సముద్రపు పిట్టలూ, నీటికాకులూ ఒడ్డున ఎగురుతూ సముద్రపు పురుగుల్ని ఏరుకుంటున్నాయి. తూర్పున చూపు పరుగెత్తేంతదూరం బంగాళాఖాతం. పడమట వెడల్పాటి ఇసక మేటలు. మధ్యమధ్య మంచినీటి చెలమలు. సముద్రపు ఒడ్డంతా పంచవర్షప్రణాళికల భాగంగా పెంచిన కొన్నివేల ఎకరాల సరుగుడు తోటలు. ఆ తోటలకూ సముద్రానికీ మధ్య మాకు దక్షిణంగా ముదురు బూడిదరంగు పైకప్పుల పల్లె. ఆ పల్లె సమీపంలో పడవలు. ఆకాశంలోకి లేచిన జెండాలు.

"ఇంక ఇక్కడ కూచుందాం" అని ఆగేను.

"వొద్దు. అటు పదండి బాబుగారూ!" అన్నాడు సాంబం.

"ఏం?" అంటే –

చేప లమ్ముకొనే ఒక తురకబ్బాయి మోజులోపడి సాంబం కులంపిల్ల గర్భం తెచ్చుకుని సముద్రంలో పడి చనిపోయిందట. నేను కూచుందామన్నచోట ఆ పిల్లను పాతారంట.

ఒక్కొక్క ఇసుక రేణువూ ఒక్కొక్క కథ చూసుంటా యక్కడ.

ఆ పల్లెకు ఓ ఫర్లాంగుదూరాన, నేను సముద్రంకేసీ, సాంబం సరుగుడు తోటలకేసీ తిరిగి ఎదురెదురుగా కూచున్నాం.

సాంబంతో మాటాడ్డం సరదాగా ఉంది. తల్లీ తండ్రీ లేరట. వాళ్ళ మామ పెంచాడట. చిన్నతనంలో తలిదండ్రుల ప్రేమను కోల్పోయిన వాళ్ళమీద నాకు ఒక అభిప్రాయముంది. వాళ్లు సామాన్యంగా పిరికివాళ్ళవుతారు. లేదా క్రూరులవుతారు. సాంబం పిరికి గొంతుకు ఇదొక కారణమయ్యుండాలి. తండ్రి ఆస్తి నాలు గెకరాలు ఉందట. ఆ భూమి సావుకారు అప్పు తీర్చటానికి అమ్మేయాల్సి ఉంటుందట. అప్పు తీర్చమని, లేకపోతే కోర్టుకు వెళ్తానని భయపెడుతున్నాడు. ఎవరూ కొనకుండా చేసి భూమికి ధర రానియ్యటం లేదని సొంత బాధలు చెప్పుకున్నాడు సాంబం.

జమీందారునించి భూమి రైతు కిచ్చి ప్రభుత్వం ఏం మేలు చేసింది? అప్పు లిచ్చే సావుకారు చేతుల్లో పెట్టింది. ఈమాత్రానికే 'దున్నేవాడికే భూమి' అని ప్రచారం. 'జమీందారీ రద్దు' అని శాసనం ఎందుకో తెలీదు. ఈ ఇనాందారీ రద్దు రాకపోతే శకూ అక్క దశ ఇట్లా ఉండేదికాదు.

ఆ పల్లెనించి మావేపు రంగుదుస్తుల పేంట్ మార్కు కుర్రాడు వస్తోంటే సాంబం చూసి, లేచి నిలబడి చప్పట్లుకొట్టి కేకేసి పిలిచాడు. "చేపల ఇనస్పెక్టరండీ బాబుగారూ. మా దొడ్డమనిషి" అన్నాడు నాతో సాంబం.

"మనూర్లోనే తమ మామయ్యగారింటిలో పంచాయితీ బోర్డు పక్కగదిలో ఉండేవోడు. తమ కులమే. ఆరేడు నెలలయింది పక్కూర్లెల్లిపోయి" అని చెప్పి, అటు ఆయన వస్తున్నవేపు చూసి "సుధాకరరావు అంటారు. పాటలంటే చెవి కోసుకుంటాడు. నాటకాలంటే ఎంత దూరమన్నా ఎల్లి చూసొస్తాడు" అన్నాడు.

సాంబం అడక్కుండానే చాలా వివరాలు చెప్తాడు.

సుధాకరావు అంతదూరంనించే "సరుగుడు తోట లొాదిలేసి ఇలా దిగబడ్డావేం?" అని, నావేపు కొత్తగా చూసి, చూపులు తిప్పుకుని "నీదగ్గర ఈరోజు మకాం అనుకున్నా కాని ప్రెసిడెంటుగారు కందాకి చెప్పారు. రావటం మానేశానని నింద" అంటూ ఇసుకలో కూలబడ్డాడు.

"సుభాష్ బాబుకి మామయ్యగారు" అని పరిచయం చేసి నా గురించి చెప్తున్నాడు సాంబం.

"అంటే శకుంతలమ్మగారి –"

"తమ్ముణ్ణి" అన్నాను.

"ప్రెసిడెంట్‌గారు మీ గురించి చెప్పా రొకసారి" అన్నాడు సుధాకర్రావు.

అతడి చూపుల్లో నా దగ్గర స్నేహితులు గుర్తుకొచ్చారు. ఎదటివాళ్ళ మంచితనాన్ని నమ్మి మాటాడే గొంతు. శ్యామల గుర్తుకొచ్చింది.

నా పేరు వెనక ఉన్న ఐ. ఎ. ఎస్ గురించి చెప్పాడు. ఆ అక్షరాల బరువు మామయ్య యిచ్చిన అంకెలతో చెప్పాడు సాంబం.

"మీరు బాగా పాడతారని –"

తన కళని ఇతర్లు గుర్తించినప్పుడు కలిగే ఆనందంతో నవ్వు. ఉంగరాల జుత్తు. చందనంరంగు శరీరం. ఉన్న జీవితానికి శాంతించగల కళ్లు.

ఇసుకలో పడుకున్నాను.

మల్లీశ్వరిలోని 'ఆకాశవీధిలో' పాడేడు. 'కొండగాలి వీచింది' పాడేడు. 'చుక్కలన్నీ కొండమీద' పాడేడు. 'ఎలుతురంతా మేసి' పాడేడు.

వెల్లకిలా పడుకుని ఆకాశాన్ని చూస్తున్నాను.

'ఇదే పెన్న' పాడేడు. 'మాట్లాడని మల్లెమొగ్గ' పాడేడు. క్షేత్రయ్య పదం పాడేడు. జానపదగేయం 'రాజు రమ్మన్నాడు' పాడేడు.

అక్కడ సంగీతం శృంగారమయింది. శృంగారం యౌవనమయింది. యౌవనం పరిమళమయింది. పరిమళం సాగర సమీరమయింది. సాగర సమీరం ఆత్మల ఆక్రందనయింది. ఆ ఆక్రందన అంగాంగాల్లో పరుగు తీసింది.

పక్కకి వొరిగి సముద్రాన్ని చూశాను. సహస్రకోటి తంత్రుల వీణమీద పవనుడి వేళ్లు నాట్యమాడుతున్నాయి.

సాంబం సరుగుడు తోటలకేసి చూస్తున్నాడు. శూన్యంలోకి చూస్తున్న సుధాకర్రావుని చూశాను. నాకంటే ఒకటి రెండేళ్ళు పెద్దుండొచ్చు. యౌవనం సంస్కారంతోనూ, సాధుత్వంతోనూ కళాత్మకంగా ఉంది. అతడి యౌవనానికి

కోరికల ముదురురంగు లేదు. ఉద్రేకం వేడి తక్కువ. కళ్ళలో త్యాగం చేసి పోగేసుకున్న తెల్ల తామర్లెక్కువ. కన్నీటి చినుకులకు కరిగిపోయే కాటుకలాంటి లేతమనసు.

తిరిగి వస్తున్నప్పుడు సరుగుడు తోట మధ్యలో ఉండగా "తమరు వెళ్తాండండి" అని ఇసుకలో ముత్యాలనో, అరుద్రపురుగులనో వెతుక్కుంటున్నట్టు కిందికి చూస్తూ ఉత్తరంగా వెళ్ళిపోయాడు సాంబం.

కొంచెం ముందుకి నడిచాక "అడుగులు కన్పించాయి" అన్నాడు సుధాకర్రావు.

అర్థం కాలేదు నాకు.

"ప్రేమ" అన్నాడు ఈసారి. చెట్ల మానుల చాటున సాంబం తప్పిపోయినవేపు చూస్తున్నాడు సుధాకర్రావు.

ప్రియురాలు సరుగుడు పుల్లల నెపంమీద వచ్చిందట. అడుగు జాడ వెతుక్కుని సాంబం.

శ్యామలని కలియటానికి నాకు కళాభవన్‌లో ఎగ్జిబిషన్లూ, భాషా నిలయంలో ఉపన్యాసాలూ, వైఎమ్‌సిఏలో సభలూ, రవీంద్ర భారతిలో నృత్యాలూ నాటకాలూ, జూబిలీ హాల్లో, మాక్స్‌ముల్లర్ భవన్‌లో, అమెరికన్ కల్చరల్ సెంటర్లో సాంస్కృతిక కార్యక్రమాలు సంకేతాలు.

చర్మరోగం ఉన్న సాంబం ప్రేమ ప్రమాదకరమైనది. జాతికీ, సంఘానికీ ద్రోహం.

"ఆ అమ్మాయితో ఈ మాఘంలో పెళ్ళిలెండి."

ఈమాట మరింత కటువుగా ఉంది నాకు.

"తండ్రి చిన్నప్పుడే పోయాడు పాపం. మామ పెంచాడు. ఆయనే ఈ పెళ్ళి చేస్తున్నది."

సుధకర్రావు మాట వింతగా విన్పించింది. తల్లీ తండ్రీ చిన్ననాడే పోయినట్టు సాంబం ఇప్పుడే చెప్పాడు. తండ్రిమాత్రమే పోయినట్టు సుధాకర్రావు చెప్తున్నాడు.

"తల్లి కూడా పోయింది కదా?"

"వీళ్ళ కులంలో మారు మనువుంది. భర్తపోయిన కొన్నాళ్ళకి ఆమెకు రెండో పెళ్ళి చేశారు. ఆమె అదిగో ఆ పల్లెలో. తల్లికి రెండో పెళ్ళి సాంబానికి చిన్నతనం. నాతోకూడా మొదట ఇదే అబద్ధం చెప్పాడు. అడక్కుండానే తల్లీ తండ్రీ పోయారని చెప్తాడు. అట్లాగే చెప్పాడు కదా మీతో?"

"అవును."

నేను సాంబాన్ని క్షమించలేకపోయాను.

నాతోపాటే సుధాకర్రావు ఇంటికి వచ్చాడు.

☆ ☆ ☆

'పంచాయితీ కార్యాలయం' అని రాసిన బోర్డున్న గదిదగ్గర వరండాలో, పూర్వకాలపు హోదాకు గుర్తుగా ఉన్న నగిషీ చెక్కిన కుర్చీలో మామయ్య కూచోనున్నాడు. తూర్పుపక్క రాటకి చేరగిలబడి, నుదుట పొడవాటి కుంకుమబొట్టుతో, మెలితిరిగిన మీసాలున్న ఏళ్లు ముట్టిరినాయన కూచోనున్నాడు. ఆయన చెవులకి బంగారపు గుళ్ళు

వేలాడుతున్నాయి. వీపుమీదికి జుత్తు వేలాడుతోంది. అక్కడ టీ తాగేసి ఉంచిన రెండు వెండిగ్లాసులున్నాయి.

మొత్తం ఆ భవనం దక్షిణంగా ఎదురుచేసి ఉంటుంది. ఆ ఊళ్ళో ఆ భవనం ముళ్ళతుప్పల మధ్య ఆకురాల్చిన మహావృక్షంలా కన్పిస్తుంది.

వాకిట్లో మేముండగా మామయ్య చాలా అప్యాయతతో సుధాకర్రావుని పిలిచి, కూచోమన్నాడు. అతనితో మామయ్య మాటాడుతోంటే నేను లోపలి కెళ్లాను.

వెలిగించిన అరికెన్ లాంతరుతెచ్చి గదిలో గజానికి వేలాడేసి పెట్టి పనివాడు వెళ్ళిపోయాడు.

"ఎక్కడి కెళ్ళావురా?" అని అడిగింది శకూ అక్క.

"సముద్రానికి" అన్నాను.

శకూ అక్క కొంతసేపు ఆపుకోవాలని ప్రయత్నంచేసి సాధ్యంకాక కట్టలు తెంచుకున్న కెరటాలతో ఏడ్చింది.

బావ పోయాడన్న బాధ, అమ్మ నాన్న అన్నయ్య తమ్ముడూ దూరం చేశారన్న బాధ, తనకి ఏదోకావాలన్న బాధ, ఎవరో లేకపోయారన్న బాధ, అందరిలా తనని బతకనివ్వడం లేదని బాధ, తన బాధ ఎవ్వరికీ ఎందుకు అర్థం కావడంలేదన్న బాధ, అర్థమయికూడా తనని రక్షించటంలేదన్న బాధ – ఆ బాధలన్నీ గుండెను పిండుతోంటే ఏడుస్తోంది.

నాలుగేళ్ళ క్రితం – నా చదువులకీ, నాన్నగారి డైబిటీస్‌కీ, వదిన కాన్పులకీ, చిన్న పిల్లల జబ్బులకీ డబ్బుచాలక, అప్పు పుట్టక బాధపడుతోంటే శకూ అక్కకి ఒక ఉత్తరం రాశాను – డబ్బు ఏమన్నా పంపించమని. అక్క రెండొందలు పంపింది. శకూ అక్క పంపించిందని అన్నయ్యకు ఇవ్వబోతే తిట్టాడు. అప్పుడు శకూ అక్క ఆ డబ్బు ఎట్లా పంపించిందో తెలీదు. ఈ ఆస్తికి, ఈ సంపన్నతకి అధికారిణి. సుభాష్ వారసుడు. వాడిని పెంచి పెద్ద చేయాలి. అదీ నా ఊహ. కాని శకూ అక్క చేతుల్లోకి డబ్బు రాదు. సరుగుడు తోటలమీదా, పొలంమీదా చాలా అప్పులున్నాయి. బంగారం చాలా మురిగిపోయింది. అన్నయ్య అప్పుడు ఎందుకు తిట్టాడో ఇక్కడ అర్థమయింది. ఒక్కదగ్గర మాత్రం నా ఊహ తప్పు కాలేదు. శకూ అక్క చీపురుపుల్ల కూడా ముట్టుకో అక్కరలేదు. చాలామంది పనివాళ్ళున్నారు. వాళ్ళే చేస్తారు.

శకూ అక్కకేం కావాలో నాకు తెలుసు. నుదుట కుంకుమ. మహానగరాల్లో శకూ అక్క వయసువాళ్ళు జీవితంలోని తీయని ఆశలతో, ఉన్నతమైన ఆశయాలతో, చేతినిండా పనితో, అందమైన జీవితంతో కనిపించినపుడు శకూ అక్క స్మృతి వెలిగేది. శకూ అక్క ఆస్తి వీళ్ళల్లో ఎంతమందికి ఉంటుంది అనుకునేవాడిని. కాని చిటికెడు కుంకం కూడా నుదుటుపెట్టుకోలేని శకూ అక్క పేదరికాన్ని ఊహించనన్నా లేదు.

సాంబం తల్లికి పెళ్ళిచేసిన ఆ తల్లిదండ్రులు తెలివైనవాళ్లు. అది నీతిగా, ధర్మంగా అంగీకరించిన ఆ కుల పెద్దలు వ్యక్తి అవసరాలని గుర్తించగలిగారు. తమ

బాధ్యతను నిర్వర్తించుకున్నారు. కుటుంబగౌరవం, కులధర్మం, భర్తమీద అనురాగం, మాతృప్రేమ–ఇవన్నీ బయటకి చెప్పుకునే పచ్చి అబద్ధాలు. ఇంతకంటే సతీసహగమనం నయం. సిలవవేసి చంపడం న్యాయం. ఉరికంబానికి ఎక్కించడం సుఖం.

శకూ అక్క ఏడుపు విని మామగారు లోపలికొచ్చాడు. ఆయనతో నుదుట పొడవాటి కుంకుమబొట్టు, మెలితిరిగిన మీసాలు ఉన్న వయసు మళ్ళినాయన వచ్చాడు.

ఆయన శకూ అక్కదగ్గరకొచ్చి, ఒక చేత్తో భుజంపట్టి, నడినెత్తిమీది జుత్తుపాయ తీసి, నుదుట కుంకుమపెట్టి, కళ్ళలోకి తీవ్రంగా చూసి, "ఎవరు నువ్వు? నీ పేరేమిటి?" అని భయపెట్టే గొంతుతో అడుగుతోంటే మొదట నాకు అర్థంకాలేదు. శకూ అక్క మాటాడలేదు.

ఆ ఊళ్ళో, చేపలమ్ముకునే తురకబ్బాయి మోజులోపడి ఒక శూద్రపిల్ల గర్భంతెచ్చుకుని సముద్రంలోపడి చనిపోయిందట. అది దయ్యమయి శకూ అక్కను పట్టుకుని "సముద్రం," "సముద్రం" అని కేకలేస్తుందట. మొట్టమొదటిసారి ఆ దయ్యం పట్టుకున్నప్పుడు కత్తిపట్టుకుని శకూ అక్క పెరట్లోని పూలమొక్కల్ని ఒక్కటి మిగల్చకుండా నరికేసిందట. పూల కుండీలన్నిటినీ విరగ్గొట్టేసిందట, నిన్నటినుంచి శకూ అక్క ఏడుపుతో మామయ్యకు అనుమానం కలిగి భూతవైద్యుణ్ణి రప్పించాడు.

ఆ భూతవైద్యుడు పళ్ళికిలించి కటువుగా "ఎవరు నువ్వు?" అని పట్టుకున్న శకూ అక్క జుత్తు పాయను బిగిస్తున్నాడు. ఇంకా ఏమిటేమిటో చేసేట్టున్నాడు. శకూ అక్క మొదట్లో తప్పించుకునే ప్రయత్నంచేసి తర్వాత నావేపు చూసి మానుకుంది. మాటాడలేదు. ఇట్లా మాటాడకపోవడం, ఏడ్వడం, తొందరగా జవాబు చెప్పకపోవటం తురకబ్బాయి మోజులోపడ్డ శూద్ర పిల్ల దయ్యం లక్షణమట! మొండిదట.

"ఇదిగో, ముందు ఆ జుత్తు విడిచిపెట్టు" అని అరిచాను. ఆ భూతవైద్యుడు వినిపించుకోలేదు. నా గొంతు విని నన్నుచూసి జడిసి మామయ్య వెనక్కి తప్పుకున్నాడు.

చుట్టూచేరిన మనుషుల గుంపుని చీల్చుకుంటూ "విడిచిపెట్టు" అని గట్టిగా అరచి బలవంతంగా వాడిని బయటికినెట్టాను. "వెళ్ళండి" అని బిగ్గరగా అరిచాను. ఒకరిద్దరు నన్ను ఆపబోతోంటే వాళ్ళని విదలించుకున్నాను. వాళ్ళనక్కడ తన్నాలన్నంత ఉద్రేకం కలిగింది. అంతా అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

ఈ గొడవకి సుధాకర్రావు వచ్చాడు.

సాంబాన్ని తీసుకురమ్మని ఆయన్ని పంపించాను.

శకూ అక్క పిచ్చిగా కూచుంది మంచం మీద. జరజరా కన్నీళ్ళు కళ్ళలోంచి జారిపోతున్నాయి.

నా గొంతు చల్లారింది. "సుభాష్ ఎక్కడుంటాడు?" అని అడిగాను.

కొంచెంసేపు నన్నుచూసి "ఇలా చంపుతున్నార్రా!" అంది. మళ్ళీ కన్నీళ్ళు. మళ్ళీ వెక్కివెక్కి లోలోపల కుక్కుకుంటోన్న దుఃఖం.

"ఏడవ్వొద్దక్కా!" అంటున్నానేకాని ఏడవటానికి కూడా స్వేచ్ఛలేక అక్కడ శకూ అక్క భరిస్తోన్న శిక్ష నాకు అర్థమౌతోంది.

"సుభాష్ ఎక్కడుంటాడు?" మళ్ళీ అడిగాను.

కన్నీట తడిసిన పెదాలతోనే "దేవాలయం దగ్గర" అంది.

తీసుకురమ్మని ఇంట్లోని కంబారిని పంపించాను.

"ఇప్పుడు మనం వెళ్ళిపోవాలి. నువ్వు తయారవక్కా!"

నా చొక్కాలూ అవీ బాగ్‌లో సర్దుకున్నాను.

అక్క అట్లానే ఆ పొట్టి మంచంమీదినించి కదలకచూస్తోంటే "మనం వెళ్లిపోవాలి" అని, "ఇంతకీ నీకు ఇష్టమున్నట్టా, లేనట్టా? నువ్వొస్తావా" అని అడిగాను.

అట్లాంటి నా ప్రశ్న అక్కకి ఎంత బాధిస్తుందో కూడా నాకాసమయంలో తోచలేదు.

"ఆ!" అంది.

"మరి తయారవు. సాంబం వస్తే బండి ఏర్పాటు చేస్తాడు."

శకూ అక్క లేచి చిన్న ట్రంకుపెట్టె సర్దుతోంది.

సుధాకర్రావు వచ్చి "సాంబం ఇంకా రాలేదు" అన్నాడు.

☆ ☆ ☆

సుధాకర్రావే బండి ఏర్పాటు చేయించాడు. మాకు తోడుగా వచ్చాడు. సుభాష్‌ని దాచేశారు. కనిపించనివ్వలేదు. పెద్ద పోట్లాటయింది. అయినా శకూ అక్కను అక్కడుంచ దలచలేదు.

సుభాష్‌కోసం ఏడుస్తోంది.

శకూ అక్క ఏడుస్తోంటే నాక్కోపం.

కొంచెంసేపు నాతోపాటు ఓదార్పు కబుర్లు చెప్పిన సుధాకర్రావు గొంతు మధ్యలో ఆగిపోయింది. "ఏమిటి మాటాడరేం?" అని ముఖం తిప్పబోతే చేతికి చల్లగా కన్నీరు.

"ఎందు కేడుస్తున్నారు? ఎందు కేడుస్తున్నారు?" అన్నాను.

"రెండేళ్ళు ఈ చిత్రహింస చూశాన్నేను. కాని రక్షించలేకపోయాను. నేను పరాయివాణ్ణి. రక్షించే అధికారంలేదు. హక్కులేదు. తమ్ముడు మీరు. ధైర్యంగా ఎదిరించి తిట్టి ఆ క్రూరహింసలనించి రక్షించగలిగారు. తమ్ముడంటే, అన్నంటే, నాన్నంటే, అక్కంటే, భార్యంటే, కొడుకంటే అధికారాలు పొందడం, ఒకరి మీద ఒకరు అధికారాలు పొంది ఒకర్నొకరు రక్షించుకోపడం..."

అందుకేనా సుధాకర్రావు కన్నీరు పెట్టుకున్నది?

"నేను ఏమీ చెయ్యలేక, ఆ పక్కగదిలోనే ఉండి ఆ బాధలు చూడలేక అక్కణ్ణించి తప్పించుకుని పొరుగూరు వెళ్లిపోయాను. ఎందుకట్లా హింసిస్తున్నారని ఏ అధికారంతో అడగ్గలను? దానికి తోడు నా వయసు."

సొంత దుఃఖంలో శకూ అక్క.

ఎడ్లగంటల గణగణ మోత. బండిచక్రం రాళ్ళమీంచి నడుస్తున్న శబ్దం. ఎద్దుల అడుగుల క్రమబద్ధమైన లయ. బండియిరుసు కిర్రుకిర్రు రాగం. సముద్రపు హోరు. చల్లగాలి.

సుధాకర్రావు గొంతు శకూ అక్క విందో లేదో.

బలహీనమైన గొంతుతో ఏడుస్తోనే ఉంది.

"రావటం ఇష్టంలేదా?" అని అడిగితే నోరు విప్పదు.

మాతృప్రేమ అట్లాంటిది. నిజమేకాని మనిషి సొంతబాధల నించి తప్పించుకోవటంకంటే ఏ ప్రేమా, ఏ బాధ్యతా గొప్పదికాదు. ప్రేమనే, బాధ్యతనే మనిషి లెక్కిస్తే పిల్లల్ని విడిచిపెట్టి ఆత్మహత్యకి తెగించడాలూ, సంసారాన్ని వొదిలేసి సన్యాసుల్లో చేరిపోవడాలూ, తల్లినీ తండ్రినీ మరచిపోయి పారిపోవడాలూ ఉండవు. అక్కడ ఊపిరాడని ఆ చీకటిగుహల్లో ఉండటం అక్కకి ఇష్టంలేదని భాషతోకాక కన్నీటితో చెప్పింది. మామగారికి సుభాష్ కావాలిగాని శకూ అక్క అక్కర్లేదు. కాని నాకు శకూ అక్క కావాలి.

వేకువజాముకి మా బండి జంక్షన్ చేరుకుంది. మాతోపాటు స్టేషన్‌వరకూ వస్తానన్న సుధాకర్రావు బస్సు వచ్చినప్పుడు "నేను ఉంటాను" అంటు ముఖంతిప్పుకున్నాడు. బస్సువరుగు హెచ్చిన కొద్దీ సుధాకర్రావు చిన్ననయి, ఇంకా చిన్ననయి, చివరికి అక్కడి నేలరంగులో, అక్కడి ఆకాశం రంగులో కలిసిపోయాడు.

● *ప్రచురణ, 1967* ●

★ ★ ★

33

ఇల్లిందల సరస్వతీదేవి

# మూగజీవులు

ఆ విశాలమయిన స్థలంలో ప్రహరీగోడ నాలుగడుగుల ఎత్తు – కత్తిరించిన సరుకుచెట్లు ఆరడుగుల ఎత్తు తెలుపూ పచ్చటి గోడల మాదిరిగా నాలుగువైపులా అందంగా కనబడుతున్నాయి. ఆ చిన్న బంగళా ఆధునిక సౌకర్యాలతో సరికొత్త నమూనాలో, ఆవరణలో మధ్యగా ఒక అందమైన బొమ్మను నిలబెట్టినట్టుగా ఉంది. బంగళాకు ఎదురుగా నాలుగు చదరపు గజాల హౌజ్ నీళ్ళతో నిండి ఉంది. దానిలో బంగారు రంగు చేపలు మునుగుతూ తేలుతూ ఈతకొడుతుంటే తోకలు ఝాడిస్తుంటే చూడముచ్చటగా ఉంటుంది. హౌజ్ చుట్టూ పచ్చిక – దానిచుట్టూ పూలతోట కన్నుల పండువుగా ఉంటుంది. వీధి వాకిలి ప్రహరీగోడవైపు నానుకుని ఒక మోటారు గారాజి – దాని పక్కగా నౌకరుకొక గది – ఆ గది ముందర గోల్డ్ మొహర్ చెట్టు – తెల్లవారేసరికి ఇంతెత్తు పూలరాసిని రాలుస్తూ ఉంటుంది.

ఇది నసీరుద్దీన్ జాగీర్దారుగారి విలాస భవనము.

"రంగన్నా, ఈ తోటా, ఈ బంగళా బాగా చూశావా? ఈ బంగళాను దులిపి తుడిచి ఎప్పుడూ శుభ్రంగా ఉంచాలి. ఈ తోట ఎప్పుడూ పచ్చపచ్చగా ఉంచాలి. ఏ చెట్టు వాడినా – ఎండినా దొర ఊరుకోడు. ఆ మూల నున్న ఎరువులు వేసి నీరు బాగా పట్టు. ఎండల్లోనయినా తోట ఇట్లానే ఉండాలె. బంగళా మీద దుమ్ము పడనీయకు. రెండుపూటలా ఊడ్చి కుర్చీలూ సోఫాలూ దులుపుకునీ పని కాగానే ఇంత వండుకుతిను. ఈ గేటు దగ్గర గోనెపట్టా యేసుకుని కూకో. నేను సరింగ మూడు నెలలకు తిరిగొస్త." శాయన్న రంగన్నను కూర్చోబెట్టుకుని బంగళావైపు చూస్తూ చెబుతున్నాడు.

"అదేం? నీవెటు బోతవు?" ఆశ్చర్యపడ్డాడు రంగన్న.

"నీకు తెలియందేముందిర రంగన్న? మా లింగమ్మకు లగ్గంచేసి అత్తగారింటి కంపివస్త. ఏదయిన కొరవడితే తల్లిలేని బిడ్డ ఏడిచిపోతది." శాయన్న తలపాగా విప్పి మళ్ళీ చుట్టుకున్నాడు.

"ఈ దొర ఎన్నడు ఈడికొచ్చేది?" రంగన్న ఆ తోటను మరొకసారి పరికించి చూశాడు. కొత్తగా రంగులు వేసిన బంగళా ముచ్చటగా ఉంది చూడటానికతడికి. కళ్ళు పెద్దవి చేసుకుని మరీ మరీ చూస్తున్నాడు రంగన్న.

"దొర వస్తడుగాని, ఎన్నడు వస్తడో చెప్పలేము. ఇప్పుడో అప్పుడో వస్తడన్నట్టు ఉండాలె నీవు" అన్నాడు శాయన్న.

"చూడు రంగన్న, ఊరిబయట ఉన్న బంగళా అని భయపడేవు. అరమైలు దూరం దాటితే చిన్న, పెద్ద ఇళ్ళు చాలా ఉన్నాయి. జనం తిరుగుతూ ఉంటారు" అన్నాడు మరిచిపోయిన మాటను జ్ఞాపకం తెచ్చుకొని చెప్పినట్టుగా.

రంగన్న ఆలోచనా రహితంగా నిలబడిపోయాడు. తను కమతం చేసే చోట పని ఎక్కువ – ఆదాయం తక్కువ. గొడ్డుచాకిరి చేసినా ఒక గుప్పెడు గింజలు ఎక్కువ ఇచ్చేవారు కారు. చేసిన పనికి మెచ్చేవాళ్ళూ కారు. కాని – తల్లీ తండ్రీ ఆ భూకామందు ఇచ్చిందే తింటూ ఆ గొడ్డుచాకిరీ చేయాలంటారు కాని – అక్కడి నుండి కదలరు. తను కూడా అక్కడే ఉండాలంటారు. ముందు తను పెళ్ళి చేసుకుంటే తన భార్యా అక్కడే. తనకు పిల్లలు పుడితే వాళ్ళూ అక్కడే. ఇలా తరతరాలుగా ఎదగని జీతంతో చాలని భత్యంతో బతకాలి. ఇక తమ జీవితాలు ఎందులోనూ ఎదగకూడదు, చదువుకోకూడదు. ఇంకో నౌకరీ నాలుగు డబ్బులు ఎక్కువ వచ్చేది చెయ్యకూడదు.

ఏమిటిది? ఎంతకాలం? ఏం బ్రతుకులు?

ఆ రాత్రికి రాత్రి బయలుదేరి వచ్చేశాడు రంగన్న, ఏదయినా కాస్త మెరుగ్గా ఉన్న నౌకరీ చూసుకోవాలని.

శాయన్నకు అతడిని చూడగానే ఎంతో సంబరమనిపించింది. సంతోషంకొద్దీ మనసు గంతులు వేసింది. తన బిడ్డకు లగ్గం ఎట్లా చేస్తానని బెంగపెట్టుకున్నాడు. చేసిన అప్పుతీరలేదు. అది తీరందీ దొర పోనీయడు. అసలు ఇక్కడినుంచి బైటపడటానికి మార్గంలేదని క్రుంగిపోయాడు.

"రంగన్న! నీవు దిగులుపడమాక, నేనిప్పిస్త నీకు నౌకరీ. నేనొచ్చినదాంక నీవు ఈడుంటివా మంచి నౌకరీ ఇప్పిస్త." రంగన్న భుజమ్మీద చెయ్యేసి నమ్మబలికాడు శాయన్న. చేతిలోకి వచ్చిన పిట్ట జారిపోకుండా జాగ్రత్త పడుతున్నాడు.

"చూడు రంగన్న, దొర వస్తడు, వచ్చినప్పుడు తెలివితో చెప్పినపని జర మంచిగ చెయ్యాలె. వచ్చి నప్పుడు నాలుగు నెలల జీతం ఒక్కసారి ఇస్తడు. మళ్ల ఎప్పుడన్నా రానీ, నౌకర్లను దొర మంచిగ చూస్తడు. నీకేం ఫికర్ లేదంటున్న గద?" ధైర్యం చెప్పాడు శాయన్న.

రంగన్న కళ్లు ఒప్పగించి చూస్తున్నాడు.

"దొర విసుమంటోడంటె దొరా అనంగనే ఒంటిమీద అంగీ అయిన తీసి ఇస్తడు. నా బట్టలు చూసినావా? అన్నీ దొర ఇచ్చినవే." పెట్టె తెరిచి చూపించాడు రంగన్నకు. చలికి వేసుకునే కోట్లు రెండు – మామూలుగా వేసుకునే అంగీలు ఖరీదయినవి నాలుగు.

"మరి – రేపు పొద్దుగల పోదునా?"

"పోదువులే." రంగన్న మాటలో ఏదో జంకు కనబడుతున్నది. కలిగిన సందేహం తీరలేదు.

"చీకటి పడకుండ తిందాముర." తన గదిలోకి తీసుకువెళ్లాడు. ఇద్దరూ గిన్నెల్లో అన్నం పెట్టుకున్నారు. కుండలోనుంచి ఉల్లిపాయకారం వేసుకున్నారు.

శాయన్నకు మొదటినుంచీ అన్నంలో చల్లపోసుకుని తినే అలవాటు. ప్రతి రోజా ఊళ్ళోకి వెళ్ళి ఎవరి నయినా అడిగి చిన్న ముంతతో చల్ల తెచ్చుకుంటాడు. అదే రెండుపూటలా వాడుకుంటాడు. రంగన్న కోసం ఆ రోజు మరింత తెచ్చాడు. ఇద్దరూ అదే పోసుకు తిన్నారు.

అన్నం తినగానే శాయన్న ఈతాకుల చాప పరచుకొని బీడి కాలుస్తూ పడుకున్నాడు.

రంగన్న తలక్రింద బట్టపెట్టుకుని పడుకున్నట్టే పడుకున్నాడు. శాయన్న గురక వినగానే లేచి చప్పుడు కాకుండా గేటు తెరుచుకొని మెల్లగా ఊరి ముఖంగా నడవటం మొదలుపెట్టాడు.

శాయన్న చెప్పినట్టు అరమైలు దాటితేగాని ఊరు రాలేదు. ఊళ్ళో పెంకుటిళ్ళు, గుడిసెలు – మిద్దెలు – ఐదారువందల గడప ఉంది. మగవాళ్లు ఇళ్ల ముందర కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఏడు గంటలయినా కాలేదు. ఇంకా నడుస్తూ పోతున్నాడు. ఊరు నాలుగు వీధులూ తిరిగాడు. ఒక్క ఆడదయినా కనబడలేదు. ఒక్క పిల్ల కనబడలేదు.

ఆ ఊరి జనం రంగన్నను చూడగానే మాట్లాడుకోవడం మానేసి – అతడిని అనుమానంగా చూడటం మొదలుపెట్టారు. ఒకచోట పదిమంది చేరి గుసగుసలాడుకోవటం మొదలుపెట్టారు. రంగన్న చొరవతీసుకొని వాళ్ళ మధ్యకు వెళ్ళి కూర్చున్నాడు.

అందరూ అతడిని ఉలిక్కిపడ్డట్టు చూశారు. చూపులతోనే గుచ్చి గుచ్చి చూశారు అతడిని.

"మనదేవూరు?" ఆ గుంపులో పెద్ద అడిగాడు.

రంగన్న చెప్పటానికి జంకాడు. వాళ్ళంతా తన ఆచూకీ తండ్రికీ, భూకామందుకూ చెబుతారేమోనన్న అనుమానంతోపాటు భయం కూడా కలిగింది.

తడు జవాబు చెప్పటానికి జంకినకొద్దీ వాళ్ళకు అనుమానం ఎక్కువ కావటం మొదలు పెట్టింది.

"నాది ఇక్కడే. నేను శాయన్న మేనల్లుణ్ణే, చూసిపోదామని వచ్చిన" అన్నాడు వాళ్ళంతా నమ్మేటట్టుగా.

"నీ అసుమంటి మేనల్లుడుంటే శాయన్న పిల్లను ఎందుకివ్వడు?" ఆ గుంపులో నుంచి ఎవరో సన్నగా అన్నారు చాటుగా కూర్చొని.

"అవును గద. శాయన్న తనకు మేనల్లుడు ఉన్నట్టు యెన్నడు అనలేదే?" మరొకరికి సందేహం వచ్చింది.

"చెప్పడు, చెప్పడానికి మనసిరిగిపోయింది. మా నాయనకూ మామకూ మాటల్లేక చాలా దినాలయింది." రంగన్న పరిస్థితులను అతుకుపెట్టటానికి ప్రయత్నిస్తున్నాడు.

"మరి ఇప్పుడెట్ల వచ్చినవ్?" సందేహాలు పరిష్కృతం కాలేదు.

నవ్వాడు రంగన్న. "మా నాయన చూడకుండ మాయమ్మ పంపింది."

అందరూ తలలూపి ఊరుకున్నారు. వాళ్ళ సంభాషణ మరి సాగలేదు.

రంగన్న లేచాడు. తనను వాళ్ళు నమ్మటంలేదు. ఆ ఊరేమో కొత్తగా ఉంది అనుకుంటూ ముందుకు సాగి వెనక్కి మళ్ళాడు. చెట్టుకింద ఒక వృద్ధుడు ఒంటరిగా కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నాడు.

"తాతా, నా బీడికి కూసింత అగ్గిపెట్టు." దగ్గరగా కూర్చున్నాడు రంగన్న.

తన చుట్టతో అతడి బీడి వెలిగించి అప్పటినుంచీ అందరూ అడిగిన ప్రశ్నలడిగాడు తాత. రంగన్న ఓపికతో చెప్పాడు.

తాతకు దగ్గుతెర వచ్చి తిప్పుకునేసరికి అరగంట పట్టింది.

"నీవు సూస్తే సురుకైనవాడివిగా ఉన్నావు. ఈ నెత్తురుకూడు కాకపోతే ఇంకెక్కడ బతకలేవా?" మళ్ళీ దగ్గాడు తాత.

రంగన్నకంతా అయోమయంగా ఉంది. శాయన్న తననేదో మభ్యపెడుతున్నాడని అర్థమయింది. తాత దగ్గర కూర్చుని మంచి మాటలు మాట్లాడాడు. అసలు సంగతి చెప్పమని తాతను గడ్డం పట్టుకున్నాడు.

"మరెవరితోనయిన అనేవ్." రహస్యంగా చెప్పుకు వచ్చాడు తాత. జాగీర్దార్ల పుట్టుపూర్వోత్తరాలు చెప్పి కథ సాగించాడు.

☆ ☆ ☆

నసీరుద్దీన్ సాబ్ వరండా పైమెట్టు మీద నిలబడ్డాడు.

మూలనున్న నౌకర్ల గదిలో నుంచి శాయన్న పరుగుల మీద వచ్చి ఒంగి దణ్ణంపెట్టి "ఏం దొరా" అన్నట్టు చూశాడు.

"ఇంకా మోటరు రాలేదా?" అడిగాడు. ఆ భాష తెలంగాణాలో ప్రభువులు నౌకర్లతో మాట్లాడే తురక తెలుగు. ఆ కంఠస్వరం బానిసలతో మాట్లాడే ప్రభువుల కంఠస్వరం.

"ఇంక రాలేదు దొర, ఆడిదాకా పోయొచ్చిన." శాయన్న మోకాళ్ళు రెండూ గజగజ వణుకుతూ కొట్టుకుంటున్నాయి.

నసీరుద్దీన్ సాబ్ కళ్ళు ఎర్రపడుతున్నాయి. కనుబొమలు ముడిపడుతున్నాయి. పళ్ళు పట పటలాడిస్తున్నాడు.

కారు తీసుకుని వెళ్ళిన డ్రైవరు అంతులేడు.

శాయన్న మనసు అయోమయంగా ఉంది. దొర ఇక్కడ ఉన్న నాలుగు రోజులు నలుగురు కొత్త మనుష్యులు కావాలి. వాళ్ళు మంచి వయసులో ఉండాలి. సారా తాగి సీసాను విసిరేసినట్టు ఆ ఆడపిల్లలను తెల్లారేనంక కాళ్ళతో తన్ని తగలేసి పోవాలి.

ఈ దారుణ కృత్యానికి అటు డ్రైవరు, ఇటు శాయన్నా తలపడాలి. రెండు రోజులు గడిచాయి.

ఎట్లాగడిచాయో? అది మూడో రోజు.

శాయన్న, డ్రైవరు రాములు మధ్యాహ్నం నుంచి ఊరంతా తిరిగారు. నచ్చిన మనిషి కనబడలేదు. ఊరికి దూరంగా ఎరుకలవాళ్ల గుడిసెలున్నాయి. ఈత పేళ్ళతో బుట్టలల్లుకునే జాతి. పేళ్ళు ముందరేసుకుని కత్తితో మరింత సన్నగా చీల్చుకుని బుట్టలల్లుతున్నారు. ఆ తండాలో పదిమందివరకు పెద్దవయసు మగవాళ్ళున్నారు. ఇద్దరు వయసులో ఉన్నవాళ్ళు – ఇద్దరు ఇరవై ఏళ్ళ ఆడపిల్లలున్నారు. ఐదురుగురు నడీడు స్త్రీలు, ముగ్గురు చిన్న పిల్లలు ఉన్నారు. ఆడవాళ్ళూ మగవాళ్లూ కలిసి పాటలు పాడుతున్నారు. పని చకచక సాగిపోతున్నది.

ఆ తండాను, వాళ్ల చేతుల్లో ఉన్న కత్తులను చూసే సరికి శాయన్నకు గుండె లయ తప్పినట్లయింది. వాళ్ళను ఎట్లా అడగటం? ఏమని అడగడం?

"మీరల్లే బుట్టలు బాగా అమ్ముడు పోతాయా? ఎక్కడినుంచి వచ్చారు?" తెలంగాణా యాసలో అడిగాడు.

"మేము అల్ల ఆ ఊరి నుండి ఈ పేళ్లతో లారీలో వచ్చినాం సామీ. ఈ బుట్టలు ఈడ కొనేవాళ్ళు తక్కువ. కొన్ని పోతయి." ఆ తండాలో మధ్య ఈడు మగవాడు జవాబిచ్చాడు.

ఆడవాళ్ళవైపు చూస్తూ కూర్చున్నాడు రాములు.

మెడలో పూసలదండలు, చేతులనిండా కొమ్ముగాజులు, మాసి చిరిగిన బట్టలు కట్టుకున్నా నిండైన విగ్రహాలు. పసిబిడ్డలు పాలు తాగుతున్నారు. పని సాగుతూనే ఉన్నది. చిలిపి నవ్వులు – కొంటె నవ్వులు సాగుతున్నాయి. చేతులు పనిచేస్తున్నా పాటలు ఆపి మాట్లాడుతున్నారు.

మధ్య మధ్య తండా పెద్ద "ఏహే పని గానీయండి," అదలిస్తున్నాడు. మళ్ళీ పని చురుకుగా సాగుతోంది.

మెల్లగా రాములు తండా పెద్ద దగ్గరిగా జరిగాడు.

"ఇవిగాక చిల్లర పన్లేమయినా చేస్తారా?" జంకుతూ అడిగాడు.

"ఈ పన్లే చాలు మాకు." కళ్లయినా తిప్పి చూడకుండా అన్నాడు పెద్ద.

"అదికాదు అన్నా. ఈడ పెద్ద దొరోళ్ళ ఇంట్ల నిన్న పయోజనం జరిగినాది. అంట్లగిన్నెలు తోమితే అన్నంపెట్టి పైసలిస్తరు. ఎంత – జరసేపు. ఓర్నన్న పంపుతావా?" రాములు అతడి భుజమ్మీద చెయ్యేశాడు స్నేహపూర్వకంగా.

తలవూపాడు పెద్ద. ఆలోచించాడు. కొంతసేపటికి "ఏమిస్తారు" అన్నాడు.

"ఎంత పనిచేస్తే అంత!" ఆశ పెడుతున్నట్టుగా మాట్లాడాడు.

"ఎవరన్న పోతారా?" పెద్ద అడిగాడు ఆడవాళ్ళవైపు చూస్తూ.

నడీడు సత్తి ఎల్లివైపు చూసింది. ఎల్లి మంగివైపు చూసింది. మంగి నాలుగు నెలల గర్భిణి. తొలిచూలు. నిగనిగలాడుతోంది నల్లరూపున.

మంగి ఎర్రోడివైపు చూసింది. ఎర్రోడికి కండ బలమెక్కువ. ముక్కుమీద కోపం. మాటకు మీసం మెలివేస్తాడు. ఎర్రోడంటే వెర్రివాడు కాదు. ఆ తండాలోకి ఎర్రటివాడు. చేతిమీద ఎర్రోడన్న పచ్చకూడా పొడిపించున్నాడు.

"నీ పేరేంటన్నవు?" తండా పెద్ద అడిగాడు రాములును చూసి.

"రాములు."

"ఏం పనిచేస్తావు?"

"నేను దొర కారు నడుపుత."

"చూడు, మాతండా ఆడది మాగోడు లేందీ ఎక్కడబోదు. పనిచేసే ఇద్దరు మడుసులు వస్తరు. మంచి ఇనాం ఇచ్చి పంపాలి. బేగిపంపాలి. కాకపోతే తండా అంత వస్తది" కళ్ళు పైకెత్తి గంభీరంగా అన్నాడు.

ఆ మాటలకు బెదిరాడు రాములు.

"నీవెట్ల జెపితే అట్ల" కంఠస్వరం తగ్గించాడు రాములు.

శాయన్న దూరం నుంచి చూస్తున్నాడు.

"మాట తప్పితే చూసుకో" మళ్ళీ అన్నాడు హెచ్చరింపుగా పెద్ద.

ఓ దణ్ణం పెట్టాడు రాములు. పీక నులిపెయి అన్నట్లు రెండు చేతులు మెడకు తగిలించుకున్నాడు.

పెద్ద కనుసైగ చెయ్యగానే ఎర్రోడు, మంగీ లేచారు. రాములు లేచి నిలబడి దారి తీశాడు. వాళ్ళిద్దరూ బట్టలు దులుపుకుని వెంట అడుగులు వేశారు.

"ఎట్టయిన రాములు అనుబవం కలోడు" అనుకుంటూ శాయన్న నిలుచున్న చోటినుండి కదిలాడు.

ఊళ్లోకి నడుస్తుంటే రాములు గుండె దడదడ లాడింది.

మంగి, ఎర్రోడు కొత్త జంటలా ఉన్నారు. ముఖాలు లేతగా ఉన్నాయి. రాములూ శాయిలూ చూడకుండా లోపల్లోపల నవ్వుకుంటూ కొంగులు పట్టి లాక్కుంటున్నారు.

బంగళా ముందుకు రాగానే 'లోపలికి పోదాం' రమ్మని రాములు ముందుకు నడిచాడు.

గేటులో అడుగు పెట్టగానే కనపడిన ఎర్రటి పువ్వులకు మంగి ముఖం చేటంతయింది. రాములు చూడకుండా రెండు పువ్వులు కోసి తల్లో తురుముకుంది. శాయన్న చూసీ చూడనట్టూరుకున్నాడు.

ఎడమచేతివైపు పెరట్లోకి పోవటానికి మరొక గేటు వుంది. ఆ గేటు తెరిచాడు రాములు.

"ఎక్కడ పని?" అన్నట్టు చూశాడు ఎర్రోడు. "నీళ్ళు బావిలో నుంచి తోడి తొట్టిలో పోసుకో. మంగిలోన అంట్ల గిన్నెలు తెస్తది."

రాములు తలుపు గొళ్ళెం తీశాడు. మంగి లోపల అడుగుపెడుతూ అటూఇటూ చూసింది. పెద్ద సాపడి – నాలుగు వైపులా నాలుగు గదులలోకి దరవాజాలు, వాటికి తెరలు.

"ఎల్లమ్మా– ఎల్లి గిన్నెలు తెచ్చుకో చెల్లెమ్మా" అంటూ వెనక్కు తిరిగాడు రాములు.

మంగి రాములు చూపించిన గదిలో అడుగుపెట్టగానే దభాలున తలుపులు మూసుకున్నాయి.

ఎర్రోడు నీళ్ళు తోడి గాబులు నింపాడు.

మంగికోసం చూశాడు.

ఏదీ మంగి? అరుస్తూ తనూ లోపల అడుగుపెట్టాడు. అక్కడ అతడికి మంగి కనబడలేదు. మంగీ అంటూ తలుపులు బాదాడు.

లోపలనుంచి గొడ్డు అరిచినట్టు అరుపులు వినపడుతున్నాయి.

బైటనుంచి ఎర్రోడు వెర్రిగా తలుపులు బాదుతున్నాడు. లోపలినుంచి వినిపించే అరుపులకు ఎర్రోడు బేజారెత్తిపోతున్నాడు. ఎంత బలంగా తన్నినా తలుపులు కదలటంలేదు.

ఎర్రోడు మండిపడుతూ గేటులోంచి అంగణంలోకి వచ్చాడు. అక్కడ శాయిలు లేడు. రాములు కంటపడగానే ఎర్రోడు గొంతు పట్టుకున్నాడు. ఇద్దరూ ఎంతోసేపు పట్టుపట్టారు. ముందుగా అనుకున్నట్లు రాములు ఎర్రోడిని చెట్టుకు కట్టేశాడు.

అరిచి అరిచి గొడ్డు అలిసిపోయినట్టుంది. అరుపులకు బదులు మూలుగు వినిపిస్తోంది. ఎర్రోడికి ముఖం ఎర్రబడ్డది, హుంకరిస్తున్నాడు. కట్టిన తాళ్లను వదిలించుకోవటానికి గుంజుకుంటున్నాడు.

సింహద్వారం భడాలున తెరుచుకుంది. క్రాపు సవరించుకుంటూ దొర చరచర గరాజి దగ్గరికి నడిచాడు. తలుపులు తెరిచి కారు బైటికి తీశాడు. కార్లో కూర్చుంటూ ఇటూ అటూ కలయజూశాడు. తాళ్ళమధ్య గింజుకుంటున్న ఎర్రోణ్ణి చూసి వెధవనవ్వొకటి నవ్వి కారు తలుపు వేసుకున్నాడు. కారు దూసుకుపోయింది, ఏ దిశన వెళ్ళిందో కూడా తెలియకుండా.

రాములు ఎర్రోడికట్లన్నీ విప్పి "అంత గింజుకుంటవ్ ఎందుకు?" అన్నట్టు చూశాడు.

ఎర్రోడికంతా అర్ధమయింది. సింహంలా రాములు మీదికి ఎగిరాడు. అతనిని గోడకానించి నిలబెట్టాడు. రెండు చేతులతో మెడ పట్టుకుని పటపటలాడేటట్టు మెడ మెలికలు తిప్పాడు. రాములు గుడ్లు బైటికి వచ్చేవరకూ తిప్పాడు. మెడ వాలిపోయేవరకూ తిప్పాడు. కాలితో ఒక తన్ను తన్నాడు. ఛీ, ఛీ అని ముఖమ్మీద ఉమ్మేశాడు.

పిచ్చెక్కినట్టే జుట్టు పీక్కుంటూ సింహద్వారంలోంచి లోపలికి వెళ్ళాడు.

పెద్ద హాలు, ఆ హాలు అందాన్ని మరొకప్పుడయితే ఎర్రోడు చూసి ఆనందించేవాడు. ఒక పెద్ద మంచంమీద మంగి పడుకుంది. తల వెంట్రుకలు చిందరవందరగా ఇటూ అటూ పాయలు పాయలుగా మంచానికి తల వైపున ఆవరించుకుని ఉన్నాయి. మంగి దేహం అస్తవ్యస్తంగా మంచమ్మీద పడి ఉంది. మంగి మెడలోని పూసల పేరు తెగి మంచమ్మీద పూసలు అక్కడక్కడ పడ్డాయి. చేతి గాజులు, ముంచేతి గోట్లు విరిగినముక్కలు గది నావరించుకున్నాయి. మంగి కళ్ళు అరమోడ్పుగా ఉన్నాయి.

మంగిని కదిలించి చూశాడు. కడుపులోనించి దుఃఖం అలలు అలలుగా పైకి లేచింది. కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. అంతలో అతడి కళ్ళు పెద్దవయ్యాయి. ఎర్రటి జీరలు మరింత ఎర్రవయ్యాయి. పిచ్చి ఎక్కినట్టు అక్కడి బీరువా తెరిచి దానిలో

ఉన్న బట్టలన్నీ మంగి మీద పడేశాడు. ఆ చుట్టపక్కల ఉన్న దుప్పట్లు, దరవాజాలకు కట్టిన తెరలు తెచ్చిపడేశాడు. రొండిన చెక్కుకున్న బీడీ అవతలపారేసి అగ్గిపుల్ల గీశాడు.

బైటికి రాగానే మళ్ళీ రాములు శవం కనబడ్డది. మళ్ళీ ఒక్కసారి ఉమ్మేసి ఒక్కసారి బలంగా తన్నాడు.

ఎర్రోడికి నిజంగా పిచ్చే ఎక్కింది. మంగి, మంగి అని గొణుక్కుంటూ, ఏడుస్తూ నోట్లో తలగుడ్డ కుక్కుకుంటూ ఎవరో తరుముతున్నట్టుగా పరుగుతీశాడు. ఆ పరుగు తండా దగ్గరికి కాదు, మరొక దిశకు.

నిజాం నవాబు కాలంలో జాగీర్దారు నశీరుద్దీన్ సాబ్ తన జాగీరులో నాలుగు చోట్ల కట్టిన అందమయిన భవనాలలో ఇదొక విలాస క్రీడ. ఈ క్రీడలకు నౌకర్లూ ఊరివాళ్ళూ అలవాటుపడ్డారు. ఆ ఊళ్ళల్లోని స్త్రీలలో ఎప్పుడు ఎవరికి ఏమి మూడుతుందోనని భయపడుతూనే ఉంటారు. కొందరు జాగీరు దాటించి మరొక ఊళ్లో కుటుంబాలను ఉంచి చూసివస్తూ ఉంటారు.

"మేము కొంపాగోడు ఇడువలేక ఉండిపోనాము. శాయన్న తనకిక్కడ ఉండబుద్ధి కాటం లేదన్నాడు నాతో." తాత ఆ ఊరి కథ చెప్పాడు.

రంగన్నకాకథ విన్న తరువాత ఒళ్ళు ఝల్లుమన్నది. రోలుపోయి మద్దెలతో మొరపెట్టుకున్నట్టుందనిపించింది.

తిన్నగా అటునుంచి అంటే ఊరిదారి పట్టాడు తన కిర్రు చెప్పులతో అతడు నడుస్తూంటే తండ్రి మాట్లాడిన మనువు భూలక్ష్మి జ్ఞాపకానికి వచ్చింది. అమావాస్య వెళ్ళిన అయిదవనాడు లగ్నం. లగ్నం అయిన మరునాడు మట్టితట్టలు మొయ్యటానికి నాగార్జునసాగర్ పోయినా "నాలుగు డబ్బులు కండ్లబడతయ్" అనుకుంటూ తలకు తువాలు బిగించి ముందుకు అడుగులు వేశాడు.

తెల్లవారిలేచి రంగన్నకోసం చూసిన శాయన్నకు గుడ్లు తేలిపోయాయి. తనకే జన్మకు ఆ బంగళా నుంచి విముక్తి లేదని ముఖం వేలాడేసుకుని కూర్చున్నాడు తలమీద చేతులు పెట్టుకుని.

● *ప్రజాతంత్ర, 1969* ●

★ ★ ★

కొలకలూరి ఇనాక్

34

# పిండీకృతశాటీ

తూరుపున చుక్కపొడిచి బారెడెక్కింది. నిద్రలేచిన మనిషి ఆవులిస్తూ ఒళ్ళు విరుచుకొన్నట్లుగా వుంది ఊరు. ఊరచెరువు చుట్టు ప్రక్కల ఇళ్ళ ముంగిళ్ళలో కళ్ళాపి చల్లుతున్న చప్పుళ్ళు వినబడుతున్నాయి. దూరంగా మసీదులోంచి నమాజు వినిపిస్తూ వుంది. సత్రంలోవుండే పొగాకు బైరాగి గడ్డంలోంచి దొర్లి వెలుపలికి వచ్చిన లల్లాయిపదాలు సన్నగా ఊళ్ళోకి ప్రాకుతున్నాయి. పల్లెలోంచి వూళ్ళోకి డొంకనబడి వచ్చే జీతగాళ్ళు పాడుతున్న కురుక్షేత్రంలోని పద్యాలు డొంకకు రెండు ప్రక్కలా పెరిగిన చిల్లకంపముళ్ళ గుండెలు చీల్చుకుని సాగి ఊరూ పల్లెలమధ్య సంగీతం వంతెన కడుతున్నాయి.

ఊరచెరువు గట్టుమీద రావిచెట్టుకు అవతల ప్రొద్దుపొడిచేప్రక్క పొడుబడ్డట్టుగా ఉన్న పూరింటిముందు వేపచెట్టుక్రింద చీకట్లో, చీకటి ఆకారం తెల్లటి బరువు ఎత్తుకొని, చెప్పులులేని కాళ్ళు ఇసుకలో గుచ్చుకుపోతుంటే, నెమ్మదిగా కాలుతీసి కాలువేస్తూ, పూటీగావున్న రెండెడ్లబండి ఇసుకలో మెత్తగా, ఎగిరి పడకుండా అణిచి పెట్టబడి ముందుకుపోయినట్లూ; పాత జ్ఞాపకాలు, అనుభవాలూ త్రవ్వుకొని వెలికివచ్చిన ప్రత్యంశం భద్రంగా పరిశీలించుకొని అవసరమయింది స్వీకరించి, అనవసరమయింది నెమ్మదిగా అవతలకునెట్టి సాగే రచయిత కలంలాగా వెళుతూవున్న ఆకారం, ఊరచెరువుదాటి, దద్దనం మీంచి తిరిగి, ఇంటిముందుగా నడిచి, పెద్ద డొంకలో బళ్ళగాడి ప్రక్కగా అడుగులు వేసి, దేవళ్ళ చెరువుగట్టు మీదవున్న బావివైపు వెళ్ళింది.

ఆ ఆకారం ఒక మనిషి!!! ఆ మనిషి గూగడు. 'గూగడంటే గూగడు, ఆగడంటే ఆగడు' అని పిల్లలు అతని చుట్టూచేరి గంతులేస్తూ పాడుతూ వుంటారు, బడికి వెళ్ళేటప్పుడో, బడినుండి వచ్చేటప్పుడో, ఎదురయితే. గూగడు ఎప్పుడూ ఆగలేదు. వీపుమీద బరువు వుంటే తాబేటినడక. చాలా నెమ్మది. ప్రతి అడుగూ అతి భద్రంగా మరీ జాగ్రత్తగా వేస్తాడు. మూపుమీద బరువు లేకపోతే చిటుకు చిటుకు అక్కడక్కడే అతివేగంగా అడుగులు వేసే చిన్ని ఆకారం గూగడు. ఎంత నడచినా దూరం పోలేడు. అయితే అందరూ అనుకొనేటట్లుగా గూగడు ఆగడంటే ఆగడు. ఎప్పుడు ఏదో పని చేస్తూనే వుంటాడు.

కొందరు నోట్లో వెండి చెంచాతో పుడుతారని ఆంగ్లంలో నుడికారం ఉంటే ఉండవచ్చు. కానీ తెలుగులో వీపుమీద బరువుతో పుడతారని మాత్రం లేదు.

అయితే గూగడు నోచి పుట్టాడని ఎవరూ అనలేరు గానీ, వీపుమీద బరువుతో పుట్టాడని ఎవరయినా అంటారు. అలా పుట్టలేదని కొందరు చెబితే చెప్పవచ్చు గానీ, పుట్టీపుట్టకముందే అతని భుజాలమీద బరువు పడింది. అతను వేసుకోలేదు. అదే పడింది. అలా పడింది మధ్యలో ఎప్పుడయినా తొలగిపోయిందా అంటే పోలేదు. చిన్నతనంలోని చిన్న బరువు అతనెంత పెద్దవాడయితే అంత పెద్ద దయింది. బరువు శరీరంలోని భాగంగా పెరిగింది. కాదంటే అధికమే అయింది.

చెరువు గట్టుమీద, ఊళ్ళమర్రి ప్రక్క, నారింజతోట మొగదల, మోటబావి చప్టాకివతల మూపుమీది బరువు దించుకొన్నాడు గూగడు. ఎండాకాలం. చెరువు ఎండిపోయింది. ఎంత పైకిలాగితే అంత అధికంగా పెరిగే విద్యలాగా, ఎన్ని బొక్కెనలు చేదినా అంతకంత మిగిలివుండే నీరున్న మోటబావి, నిండుకుండవంటి మనిషిలాగా నిశ్చలంగా ఉంది.

గిలకమీద బొక్కెన కట్టివున్న తాడుతీసి, చప్టాకు అవతల పెట్టి, తాడి చెట్టుదగ్గర అంతకు ముందురోజు పెట్టుకుపోయిన చేంతాడూ కడవలూ వెలుపలికి తెచ్చి, తాడు గిలకమీద వేసి, బావిలోకి పోనిచ్చి, ఉచ్చుముడి తడిపి, పైకిలాగి, కడవకు ఉచ్చువేసి, బావిలోకి వదిలాడు గూగడు. చేదిన కడవల నీళ్ళు బావి చప్టా కవతల అల్లంత దూరంలో ఉన్న రాతిబండ చుట్టూ కుండల్లో తొట్టిలో పోసి, వీపుమీంచి దించిన బరువు పీటముడి విప్పి, గుప్పెళ్ళు గుప్పెళ్ళుగా తీసి బానలో అదిమిపట్టి ముంచాడు.

అవి బట్టలు. ఊరి బట్టలు. మాసిన బట్టలు. మాసిన ఊరి బట్టలు. నీళ్ళలో నానుతున్నాయి. అవి రకరకాలవీ, రంగు రంగులవీ; పిన్నలవీ; పెద్దలవీ; స్త్రీలవీ, పురుషులవీ; కొత్తవీ, పాతవీ; అన్ని దశలలో మురికి అయినవీ, అన్నిరకాల మనుష్యులవీ; మంచివారివీ, చెడ్డవారివీ; సుఖం కలిగించినవారివీ, దుఃఖం పంచిపెట్టిన వారివీ, అన్నం పెట్టినవాళ్ళవీ, అవస్థలు పెట్టినవాళ్ళవీ, ఆరోగ్యవంతులవీ, రోగిష్టివారివీ; అందానికి కట్టుకొనేవీ, అవసరానికి కట్టుకొనేవీ; అన్నీ అన్ని విధాలయిన బట్టలూ నానుతున్నాయి.

మిగిలిన బానల్లో నీళ్ళు పోయడానికి కడవ చేదుతున్నాడు గూగడు. అప్పటికే ఆడా మగా చిన్నా చితకా ముసలీ ముతకా చాలామంది చేరారు. బావికి ఎనిమిది గిలకలూ విరామం లేకుండా మ్రోగుతున్నాయి. ఆ ధ్వని ఎండిపోయిన చెరువు మీదుగా పెద్ద డొంకలోంచిపోయి, దద్దనం మీద నాలుగు ప్రక్కలకూ చీలి, సందుల్లో గొందుల్లో పడి, వాకిళ్ళలోంచి, కిటికీలలోంచి, చూరుల్లోంచి, మేడలు, మిద్దెలు, పెంకుటిళ్ళు, పూరిళ్ళలోకి పోయి, నేలమీద, గచ్చుమీద, అరుగులమీద, నులకమంచాలలో, పట్టెమంచాలలో నిద్రపోయే అదృష్టవంతులూ, దురదృష్టవంతులూ, స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ, పెద్దలూ అందరి చెవులలోపడి, ఆ రాత్రి నలిగిపోయిన బట్టలు అవతల పెట్టి, ఉతికిన బట్టలు కట్టుకోవచ్చునని ఉత్సాహం ప్రసాదిస్తూ నిద్ర లేపుతున్నాయి.

మర్రిచెట్టు కల్లంతదూరంలో మూడురాళ్ళ పొయ్యిమీద ఉన్న బానలో నీళ్ళుపోసి, సోడామందు వేసి, కలదిప్పి, నానిన బట్టలు పడేసి, పొయ్యి రాజేసి మంట

మండింతర్వాత బావిదగ్గరకు వచ్చాడు గూగడు. ముతకబట్టలు, నూలు బట్టలు, నేత బట్టలు ఉడుకుతున్నాయి.

పట్టుబట్టలు – రెండు – పైపంచె, కట్టు పంచె – రత్తయ్యవి, రత్తయ్య పెళ్ళినాటివి, అతి భద్రంగా పులిమాడు. ఉతకలేదు. నీళ్ళు పోయేట్టు ఒత్తాడు. పిండలేదు. నీళ్ళు తుంపర్లు లేచేటట్లు విదిలించాడు. జాడించలేదు. ఆ రెండు తడిబట్టలనూ పసిపిల్లల్ని చేతులమీద ఆడించటానికి వేసుకొన్నట్లుగా చేతులమీద పెట్టుకొని, చిన్న చిటకేసర చెట్టుమీద ఆరవేశాడు. కొమ్మలకు, ముడతలు పడతాయి కొంగులు అని కట్టలేదు ఆరవేశాడు. ఆకులుపైన ఆరవేశాడు. నేలమీద ఆరవేస్తే దుమ్ము అవుతుంది. పట్టుబట్టలు ఎండకూడదు. ఆరాలి. ఎండరాకముందే ఆరిపోవాలి. ప్రొద్దుపొడవకముందే ఆరిపోతే వెంటనే భద్రం చేయవచ్చు. అందుకని మొట్టమొదటే పులిమాడు.

గూగడు పట్టుబట్టల పట్ల అటువంటి జాగ్రత్త తీసుకోవడం మామూలే! ఈ పట్టుబట్టలు విషయంలో జాగ్రత్త నంటిపెట్టుకొని భయం కూడా వుంది. రత్తయ్య అంటే గూగడికే కాదు, వూరికే భయం. రత్తయ్య మామూలు మనిషి కాదు. అంతటి రైతు ఆ ఊళ్ళో లేడు. ఆ చుట్టుప్రక్కలా లేడు. అతనంటే అందరికీ గౌరవం! అది ధర్మజం కాదు. ప్రేమజం కాదు. భయజం! రత్తయ్య అనుకుంటే చేయలేని పనిలేదు. అసాధ్యం లేదు. అసాధ్యుడు. అతనికి ప్రాణం ఇవ్వటమయినా తీసుకోవటమయినా నీళ్ళు తాగినంత తేలిక. నోరు దురుసు మనిషి. అంతేకాదు. చేయీ, కాలూ కూడా దురుసు! అతని మీసాలమీద నిమ్మకాయలేం కర్మ, దానిమ్మకాయలు నిలబెట్టవచ్చు. అయితే అతన్ని నిలబెట్టగల దమ్ములున్న మగాళ్ళు, ఆ ఊళ్ళోనేగాదు, ఆ ఫిర్కాలోనే లేరు. రత్తయ్యకళ్ళు ఎప్పుడూ చింతనిప్పులు! అతను తాగుతాడంటారు లోకులు! నిజం చెప్పుకోవద్దూ, అతను చుట్ట తప్ప మరేం తాగటమూ ఎవరూ చూళ్ళేదు. ఏమాట కామాట చెప్పుకోవాలి, రత్తయ్య దయతలిస్తే, ఆ యిల్లు స్వర్గం. ఆ యింటిమీద పొరుగూరి కాకి వాలదు. కోపపడితే ఆ యిల్లు దగ్ధం. వల్లకాడు. ఏ ఊరి కాకి అయినా ఎకాఎకిని వచ్చి వాలుతుంది. అతనికి కోపం రాదు. వస్తే పోదు. అలాగే దయ. పులిని జూడు, పులి మీసం జూడు అన్నట్లుగా వుంటుంది రత్తయ్య వాలకం.

రత్తయ్యకు ఏ విషయంలోనూ ఆది లేదు. అంతం లేదు. అంతా వర్తమానమే! గతాగతాల విషయంలో రత్తయ్య గుడ్డివాడు. పుట్టినప్పుడు నాలుగెకరాల గరువూ, రెండు నిట్రాళ్ళ యిల్లూ అతని ఆస్తి. రత్తయ్య పుట్టింతర్వాత మరొకరాతల్లి కడుపున పుట్టలేదు. అతను పెరుగుతున్నకొద్దీ ఆస్తీ పెరిగింది. పిల్లికి బిచ్చం పెట్టడు. ఎంగిలిచేత్తో కాకినికూడా తోలడు. సంతోషం కలిగితే, కలిగించిన మనిషిని, ఎర్రయేగాణి ఖర్చులేకుండా నెత్తికెత్తుకొంటాడు. కష్టం కలిగిస్తే కాలికింద చీమతో సమానం. సుఖంగా బతకదల్చుకొన్నవాళ్ళెవళ్ళూ రత్తయ్యకు కష్టం కలిగించరు. ఆ ఆలోచనే రానీయరు. వస్తే దాచి పెట్టుకొని అతనికి ఆనందం కలిగిస్తారు. రత్తయ్యవల్ల ఎంత కష్టం కలుగుతున్నా, ఆ ఊళ్ళో ఉండటం తప్పనిసరి అయినవాళ్ళు నోరు మెదపరు. భయభక్తులతో, భక్తిశ్రద్ధలతో, శ్రద్ధాసక్తులతో, బుద్ధిమంతులయిన బడిపిల్లలు మాదిరిగా, పలకా బలపంవంటి పనిముట్లు పుచ్చుకొని, తమ తమ పనుల్లో కూరుకుపోతారు.

ఒకసారి, మునసబు, మునసబునని గుర్తు తెచ్చుకొని, మునసబులాగా ఉండబోతే, నువ్వు మునసబువే కాదు, ఈ ఊరి మనిషివి కూడా అని రత్తయ్య గుర్తు చేయటంతో మునసబు, మునసబు కమ్ మనిషి కమ్ రైతు అయి ఊరుకొన్నాడు. అందుచేత రత్తయ్య ఆ ఊరుకు మకుటంలేని మహారాజు, సైన్యం ఉన్న చక్రవర్తి. ఆ చక్రవర్తి సేవకుడు గూగడు. రత్తయ్యకు ఎంత ఆస్తి వుందీ ఎవరికీ ఎలా తెలియదో గూగడికీ అలాగ తెలియదు. ఆస్తివివరం అడిగితే రత్తయ్యే "ఉండక పోద్దా కొన్ని లచ్చెలు" అంటాడు.

లక్షాధికారి రత్తయ్య పట్టుబట్టలు చిటికేసర చెట్టుమీద వెల్లకిలా పడుకొని, ఆకాశంలోకి చూస్తున్నాయి. ఉడకేయడానికి వీలులేని బట్టలు సబ్బు పెట్టి పులిమి, ఒత్తి, ఉతికి, పిండి, భుజంమీద, చేతులుమీదా వ్రేలాడవేసుకొని తీసుకుపోయి ఆరవేశాడు గూగడు. స్వయంగా బరువులేని బట్టలు నీటి సాహచర్యంతో బరువెక్కి, పిచ్చితులసి మొక్కలనూ చిల్లకంప కొమ్మలనూ అణగద్రొక్కుతుంటే, పాపం, నోరూ వాయీ లేనివి, కిమ్మనకుండా తలలు వంచుకొంటూ వున్నాయి.

ఉడికిన బట్టలు బండదగ్గరకు తెచ్చుకొన్నాడు గూగడు. ఒక బట్ట తీసుకొని, బండమీద సుయ్యోం- అహా-సయ్యోం అంటూ అటూ ఇటూ ఉతికి, మంచినీళ్ళ తొట్టెలో పాయలు తీసి, జలవరించి, మెలివేసి, పిండి, ఎదురుగా పరిచిఉన్న దుప్పటిమీద పడేశాడు. అలా పిండిన బట్టలు దుప్పటి మీద పడి కంటబడగానే వంచిన నడుం ఎత్తి, కరెంట్ ఆగిపోతే, ఆడుతున్న కర్మాగారం కిరు కురుమన్నట్లు; మిల్లులో ఇనుప తీగె తెగితే కటకట మన్నట్లు; ఒక్క మూలుగు మూలిగి, ఒక్కసారి నడుం విరుచుకొని, గుదులుబట్టిన కాళ్ళలోకి చేతుల్లో ఉన్న నెత్తురు పంపించి, ఆగిన రైలు సాగినట్లు మొదట నెమ్మదిగా తర్వాత వేగంగా అడుగులు వేసి, బట్టలు దూరంగా ఆరవేసి వచ్చాడు గూగడు.

ఊరి వెలుపల, చెరువు గట్టున, ఊళ్ళమ్మ్రి పక్క, మోట బావి చప్టాచుట్టూ రాతిబండలమీద బట్ట ఉతుకుతున్న మనుష్యుల్ని, కర్మజీవుల్ని చూడటానికో, కర్మయోగం నేర్పటానికో, వాళ్ళు లయబద్ధంగా అరిచే సుయ్యోం-అహా-సయ్యోం వినటానికో, అక్కడ జరుగుతున్న కర్మకాండను కళ్ళారా తిలకించటానికో కురుక్షేత్రం మధ్యలో ఉబికి వచ్చిన గీతలాగా కర్మసాక్షి ఉదయించాడు.

సూర్యుడు నిద్రలేచి ఆకాశంలో ఆవులిస్తూ కళ్ళునులుంకొంటూ కరాలు మగతగా చాపుతూ చెరువు గట్టుమీదకి వచ్చేసరికి ఆరే బట్టలు, ఉతకబడే బట్టలు, నానే బట్టలు, ఉడికే బట్టలు, తడిసే మనుష్యులు, ఆరే మనుష్యులు, నానే మనుష్యులు, సబ్బు పెట్టేవాళ్ళు, ఆరేసేవాళ్ళు, నీళ్ళు తోడేవాళ్ళు, ఆవులిస్తూ తిరిగేవాళ్ళు, పసివాళ్ళు, పెద్దవాళ్ళు, స్త్రీలూ, పురుషులూ ఎవరి పని వాళ్ళు, ఎవరి తోచన వాళ్ళు, ఏం చేస్తే వాళ్ళదే చేస్తూ వింతగా పెద్ద సంతగా వుందా ప్రదేశం. సూర్యుణ్ణే చూచే ఓపికా, ఆలోచించే ఓర్పూ వాళ్ళకు లేవు. బట్టలను, మనుష్యుల్ని సూర్యుడు చూశాడు. తడి అయిన బావి చప్టా నీరు ఓడుస్తున్న బండలు, రొచ్చురొచ్చుగా ఉన్న నేల, నీలిమందు సోడామందు నీళ్ళు నేలమీదపడితే విచిత్రమయిన వాసన వస్తుంటే పీలుస్తూ తిరిగే జనం- అంతా చూస్తున్నాడు సూర్యుడు.

పొయ్యి-పొయ్యి ప్రక్క పొయ్యి వరుసగా మండుతున్నాయి. నిన్న మొన్నటిదాకా, ఏ చెట్టునో పచ్చగా, పచ్చిబాలెంతరాళ్ళు మాదిరిగా కళ కళలాడిన కొమ్మలు, అంతకుముందే సూర్యుడి సంతానంతో స్నేహం చేసి, అనుకోకుండా మండిపోతున్నాయి. ప్రక్కనే పెరిగి పెద్ద కావాలని, ఏనాటికయినా కాలిపోవటం కోసం పెరుగుతున్న పిచ్చితులసి మొక్కలు, చిల్లకంప కొమ్మలు, మర్రిచెట్టు కొమ్మలు, రెమ్మలు, ఊడలు, చిటికేసర చెట్టుకొమ్మలు పెరుగుతూనే ఉన్నాయి. ఎండు కొమ్మలు కాలిపోతున్న పొయ్యి ప్రక్కనే మంటల దాపునే సెగ తగులుతూవున్నా, పచ్చిగా, పచ్చగా బ్రతుకుతున్న పిచ్చితులసి మొక్కలు ఎంత పిచ్చివయినా తులసి మొక్కలు సజీవంగా ఉండటం జీవకోటి ప్రాణదాత కర్మసాక్షి చూస్తూ వున్నాడు.

తలక్రిందులుగా వ్రేలాడుతున్న నాగుబాముల వంటి మర్రివూడలు క్రింద ఇద్దరు పసిపిల్లలు మడతలు వేసిన రెండు దుప్పట్లమీద, సొంగకారుస్తూ నిద్రపోతున్నారు. వాలుతున్న ఈగలనూ, పడే దుమ్మునూ తోలేవాళ్ళు, వూదేవాళ్ళు అక్కడ లేరు. బావి దగ్గరున్నారు. బట్ట లుతుకుతున్నారు.

కళ్ళలో పుసి, ముక్కువెంట చీమిడి, నూనెలేక రేగిన జుత్తు, మాసి పేలికలై చీలికలై వ్రేలాడే బట్టలు, ఉతుక్కోని శరీరం, గజ్జిపట్టి కురుపులయి చీమూ నీరూ కారుతున్న ఒళ్ళు, నడుస్తున్న రోగాలు, కనిపించే ఏడుపులవాళ్ళు-ఆ పసివాళ్ళు. బావిచుట్టూ ఉన్నవాళ్ళ సంతానంవాళ్ళ జీవితంలో ఆనందాలకు సంకేతాలు. ఊరికి పరిశుభ్రత ప్రసాదించేవాళ్ళ బ్రతుకులు పొందిన ప్రతిఫలం. మురికివంటి ప్రతిఫలం. ఉతికిన బట్టలు విడిచిన మురికి ఏకీకృతమయిన రూపాలు. కర్మసాక్షి చూస్తున్నాడు. కళ్ళుండి చూడకేం చేస్తాడు సూర్యుడు? సామాన్యుడికి అందని న్యాయం వంటి సూర్యుడు ఆకాశంలో బందీ!

రోహిణికార్తె మొదలై రెండురోజులైంది. రోళ్ళు పగలటం ఏం కర్మ! బండలూ, బండవంటి గుండెలూ పగిలే ఎండ ప్రతాపం చూపించబోతూవుంది. బారెడు ప్రొద్దెక్కింది. ఆరోజు ఉదయమే పడమటి శాంబరం ప్రారంభమయింది. ఆ చెవిలోంచి, ఈ చెవిలోకి దూసుకుపోతూవుంది గాలి.

గూగడు బట్టలన్నీ ఉతికి ఆరవేశాడు. నడుంమీద చేయి పెట్టుకొని వెనక్కు విరుచుకొన్నాడు. తనా దినం పడిన కష్టం వెలుతురుతో చెలిమి చేసుకొంటూవుంటే ఈషణ్మాత్రమయిన తృప్తితో బట్టలవైపు చూచి, నిర్వికారంగా నిట్టూర్చి మర్రిచెట్టు దగ్గరకు నడిచాడు. చెట్టు మొదట్లో, రెండు పైకి ఉబికిన వేళ్ళు పంగచీలిన చోట నడుం మోటించి కూర్చుని కాళ్ళు బారజాపుకొన్నాడు.

గూగడి కాళ్ళూ చేతులూ కురచవి. ఒకప్పుడు ఎంత గట్టిగా వుండేవో చెప్పటం అసాధ్యం గానీ, అప్పుడు మాత్రం దళసరిగా, బలంగా వున్నాయి. కొంచెంగా సడలి మడతలువడ్డ చర్మం ఒకనాటి రూపం స్ఫురింపజేస్తూవుంది. తన పని తాను చేసుకోవటానికి ఏ కష్టమూ లేదు గూగడికి. అతను ఎత్తు పెరగలేదు. అందుక్కారణం పూర్తిగా మూట బరువు కాకపోవచ్చు. శరీరతత్వం కావచ్చు. అయితే గూనిమాత్రం మూటబరువల్లనే పెరిగిందని నమ్మే అవకాశం వుంది. గూగడు గూనితో పుట్టలేదు. అతను పెరుగుతున్నకొద్దీ గూని పెరిగింది. బట్టలమూట బరువుకు మనిషి వీపూ,

మూపూ, తలా వంగిపోవటంవల్ల పెరిగిందో, మూట నిలవటంకోసం ఎదురు మోటుకుంటూ పెరిగిందో కాని గూని మూరెడెత్తు పెరిగింది. ఎంత తలకు మించిన బరువు అయినా గూనిమీద పెట్టుకొని, గూగడు వంగి, తూచి తూచి ఒద్దికగా, క్రమంగా అడుగువేస్తూ ఎంతదూరం అయినా నడిచిపోగలడు.

గూగడు మూతిమీద మీసం చూచినవాళ్ళు కారీతరంవాళ్ళు. మీసం గొరిగిన జాడ కనవడదు. పోనీ, ఒకనాడు మీసంవున్న తీరూ గోచరించదు. అయితే అతనికి మీసం మొలవకపోలేదు. మొలిచింది. దాన్ని అరిచేతంత అద్దంలో చూచుకోకపోలేదు. చూచుకొన్నాడు. మీసం వచ్చిన మొదటి రోజుల్లో తేప తేపకూ తడుంకొని ఆనందించలేకపోలేదు. ఆనందించాడు. అయితే అప్పటికే తయారయింది గూని. పెరుగుతున్నకొద్దీ తల వంచుకొనిపోయింది. తల వంగినకొద్దీ మీసం తగ్గిపోయింది. తగ్గించుకొన్నడు. తగ్గించుకొంటున్నా, గూని పెరుగుతున్నంతకాలం మీసం పెరిగింది. గూని పెరుగుదల ఆగిపోయింది. మీసమూ అంతే! ఎందువల్లనో కొంతకాలానికి ఓష్ఠం పైభాగం, ముక్కుక్రింద భాగం, అధరంలాగా, నున్నగా అయిపోయింది. అతన్ని ఉబ్బి పెదాల గూగడిని కూడా ఆ రోజుల్లో పరాచికానికి పిలిచేవాళ్ళు జనం.

గూగడి వయస్సు చెప్పగలవాళ్ళు ఆ ఊళ్ళో లేరు గూగడికంటే ముందు పుట్టినవాళ్ళుకాదు, అతనితో పుట్టినవాళ్ళే లేరా ఊళ్ళో. అన్నా అనీ, తాతా అనీ, మామా అనీ పిలిచేవాళ్ళుకాక ఏరా అని పిలిచేవాళ్ళు మాత్రమే వున్నారు. వీళ్ళంతా తాము పుట్టి భూమ్మీద పడ్డ దగ్గర్నుంచి, బుద్దెరిగిందగ్గర్నుంచి గూగడు ఇప్పుడెలా వున్నాడో అలాగే ఉన్నాడని చెప్పుకొంటుంటారు. రత్తయ్య తన ఆస్తిని అంచనా వేయలేకపోయినా, గూగడి వయస్సు అంచనా వేశాడు– "ఉండకపోద్దా డెబ్బయ్యో, యెనబయ్యో"నని.

గూగడు చిన్నతనంలో బోయీలు నలుగురుతోపాటు నారాయణా అంటూ పల్లకీ మోసేవాడు. ఆ రోజుల్లో – రైలుగానీ బస్సుగానీ లేని కాలంలో ఆ వూర్నుంచి పెళ్ళికూతుర్ని ఇంకో వూరు తీసుకుపోవలసివచ్చినా, తీసుకురావలసివచ్చినా, పెళ్ళిమాట వినబడితే, పల్లకీ మాట వినిపించేది. ఒహోం– ఒహోం-హాయ్; ఒహోం-ఒహోం-హాయ్ అంటూ పల్లకీ కట్టి భుజాన పెట్టుకొని, పల్లకీతోపాటు వచ్చే పెళ్ళికూతురూ పెళ్ళికొడుకూకంటే ముఖ్యంగా పల్లకీని బోయీలను, ముఖ్యంగా కురుచ కాళ్ళ, చిట్టి చిట్టి అడుగుల గూగణ్ణి చూడటానికి ఎదురుపోయిన పిల్లలు, క్రోసుదూరంలో అయినా పల్లకీని కలుసుకొని వూళ్ళోదాకా వెంటవచ్చినవాళ్ళతో పెద్దవాళ్ళయి పెళ్ళిళ్ళయి పిల్లలకు తల్లీదండ్రులయినవాళ్ళు, గూగణ్ణి అంతకాలం తర్వాత చూచి, అప్పటికంటే ఎత్తు తగ్గిపోయాడని, ఎంత విడ్డూరమయినా చెప్పుకుంటూ వుంటారు.

బోయీగా పల్లకీ మోస్తున్న రోజుల్లో ఎవరయినా తనని కూడా పల్లకీలో మోసుకుపోతుంటే, కాలిమీద కాలువేసుకొని, నోట్లో చుట్టపెట్టుకొని రత్తయ్య భార్య ప్రక్క కూర్చున్నట్లు కూర్చోవాలని, ఠీవిగా అటూ, ఇటూ చూడాలని ఎంత కోర్కెగా ఉండేది! లోకంలో ఎవ రెవరికో ఏవో కోర్కెలో వుంటాయి. అన్నీ తీరతాయనే నమ్మకం ఏమీలేదు అంతే! గూగడి కోర్కె తీరలేదు. తెలిసో తెలియకో ఉన్న ఈ

ఒక్క కోర్కె తీరకపోతే అతనేమీ ఏడ్చి ముఖం కడుక్కోలేదు. జన్మకొక శివరాత్రి అన్నట్లుగా ఎప్పుడయినా తీరకపోతుందా అని చాలాకాలం ఎదురు చూశాడు. ఎదురు చూడటంలో పుణ్యకాలం కాస్తా గంగలో కలిసింది.

గూగడు పుట్టినప్పుడు అందరూ అతణ్ణి ఆడిపోసుకొన్నారు, తండ్రిని పొట్టన పెట్టుకు పుట్టాడని. పెద్దయిన తర్వాత పొట్టలో తండ్రికోసం గాలిస్తే ఆకలి దొరికింది. అయితే గూగడు తల్లిని పొట్టన బెట్టుకోలేదు. చనిపోయిందాకా బ్రతికించుకొన్నడు. తల్లికి కాలంతీరి చనిపోయిందిగానీ, కన్నకొడుకు కళ్ళలో పెట్టి పెంచుకోకకాదు.

ఇరవై ఏళ్ళయినా నిండని గూగడు, తల్లిని పోగొట్టుకొని ఒంటరి వాడయ్యాడు. అప్పటికి రెండెకరాల కుంటనేల, ఒంటి నిట్టాడి యిల్లు నిక్షేపంలా వున్నాయి. అప్పట్లో 'పెళ్ళి చేసుకోవంటరా?' అని అడిగిన వాళ్ళు లేకపోలేదు. గూగడు సిగ్గుపడకపోలేదు. అయితే పెళ్ళి చేసినవాళ్ళు మాత్రం లేరు. పోనీ నేనీ గూగణ్ణి కట్టుకొంటానని ఏ పిల్లా ముందుకు రాలేదు. ఏ ఆడకూతురుకయినా తాళి కడతానని గూగడు ముందుకు రాలేదు. తన అన్నం తను వండుకొన్నాడు. తన బట్ట తను ఉతుక్కొన్నాడు. తన పక్క తనే వేసుకొన్నాడు. అందుచేత ఆడమనిషి అవసరం కనిపించలేదు. దేవుడిచ్చిన వరం నిద్ర. హాయిగా, చీకూ, చింతా లేకుండా, పగలు ఒళ్ళు పడిన శ్రమ అంతా రాత్రి పడకలో మరచిపోయేవాడు. అప్పటికే మీసాలు మాయమయి, గూని స్థిరమయింది. తనకూ, రాతిబండకూ అయితే రేవులో, కాకపోతే బావి చప్టాప్రక్క దాంపత్యం ఖాయమయిపోయింది. అప్పటికీ, ఇప్పటికి మార్పులేదు.

గూగడికి బీడీ కుతిమళ్ళింది. బీడీ కాల్చడం ఆధునిక నాగరికత అతని మెడలు వంచి నేర్పింది. అంతకుమించి అతని జోలికి రాలేకపోయింది. అలవాటుకొద్దీ బొడ్లో తడుంకొన్నాడు. బీడీ దొరకలేదు. రాత్రే అయిపోయాయి. సుబ్బారావు దగ్గర ఉండవచ్చు. 'సుబ్బిగా, ఓరి సుబ్బిగా' అంటూ చూశాడు. చిటికేసరి చెట్టుక్రింద తలగుడ్డ ఎత్తుపెట్టుకొని, పదేళ్ళ కూతురుతో ఏవో కబుర్లు చెప్పతూ పడుకొన్నాడు. అక్కడికిపోయి పైన ఆరవేసి ఉన్న పట్టుబట్టలు తడిమిచూచి, ఇంకా చెమ్మగా వుంటే, తర్వాత తీయవచ్చులే అనుకొంటూ 'సుబ్బిగా, సుబ్బిగా పిలిత్తే పలకవే?' అన్నాడు.

'యేంది మావా, నన్నేనా యేంది బిలిసింది?'

'ఆ! నిన్నుగా కింకెవుణ్ణి బిలుత్తాన్రా! బీడీవుంటే యిత్తావనీ–వుందేంది–వుంటే యిటు బడెయ్ నాకోటి.'

'ఆ! వుంది. లేకేం? యిదుగో దీసుకో. యేంది మావో, దిక్కులు జూత్తుండావు?'

'యేంది లేదురా! తే యిటు.' గూగడు తీసుకొన్నాడు. బీడీ ముట్టించుకొని, కొన్ని క్షణాలు పొగలోపలే ఆపుకొని, ఆ పైన ముక్కువెంట, నోటివెంట వదిలిపెట్టాడు. గుప్పున పొగగొట్టాలలోంచి వచ్చినట్లు వచ్చింది పొగ. మరుక్షణం ముఖమంతా కమ్ముకొంది. అప్పుడు చూస్తే ముఖంలోని ప్రతి వెంట్రుక పాదులోంచి వచ్చిందనిపించింది.

సుబ్బారావు అడిగాడు:

'యేందిమావ, యెట్టోవుంది వాలకం? యేంది కతా? అఁయేందంట?'

'యేందిరా యెట్టుందేంది–సెప్పు! సెవులారాయింట.'

'యేందో యేదో యిదంగా యెట్టాగో; సరింగాలేదు. నిద్దరలేనట్టూ, ఆకలయినట్టూ, గుబులు పుట్టినట్టు యేందో....యెట్టాగో యెట్టాగో వుంది వరస!

'సరింగా సెప్పరా పిచ్చిసన్నాసి–నచ్చికిట్టాడతావే! దిగులుగుండట్టూ, ఏడుత్తున్నట్టూ వుందంతేనా యింకెట్టాగానన్నా వుందా?'

'అంతే మావాఁ!'

ఇద్దరూ మాట్లాడలేదు మళ్ళీ. వాళ్ళిద్దరూ వదులుతున్న పొగ మాట్లాడుకొంటూ వుంది. బీడీ ఇవ్వటానికి లేచిన సుబ్బారావు కూర్చునే వున్నాడు. గూగడు నిలబడే వున్నాడు. సుర సురలాడిస్తూ వస్తున్న సూర్యుణ్ణి చూస్తూ గూగడు అడిగాడు: 'దీన్ని బళ్ళోకెయ్యలా?' పదేళ్ళ పాపనుద్దేశించి.

'ఆ యెందుకులే మాఁవా! రొండేళ్ళాగి ఓయ్యా చేతుల్లో పెడితేపోయె.' సునాయాసంగా చెప్పేశాడు సుబ్బారావు.

అరవయి డెబ్బయ్యేళ్ళు ఊళ్ళోకి చెరువుగట్టుకీ తిరిగి సాధించింది ఏమిటని వెనక్కు తిరిగి ఆలోచించుకొంటే అనంతమయిన ఖాళీ కనిపించే గూగడు ఏమీ అనలేకపోయాడు. ఆ పిల్లకు పెళ్ళవుతుంది. భర్త యింటికి కాపురానికి వెళుతుంది. ఒక మూట మోసుకు వస్తుంది. ఉతుక్కొని తీసుకుపోతుంది. ఆద్యంతాలు లేకుండా వూరికీ చెరువుకూ మధ్య తిరుగుతున్న పదేళ్ళ పాప పండుముసలి కావటం కళ్ళముందు చిత్రం అయింది. మళ్ళీ పాపవైపు చూడలేకపోయాడు.

'దాన్నెందుకురా యీడకి దీసుకొత్తా?'

'మీ యమ్మాయినేనా యేంది? యేం దీసుకొత్తే!'

'యేందన్నా అయితే ఆపైనేడిచి యేం లాభం సెప్పు!'

'యేంది మాఁవా, దాని కేందవుద్ది దుక్కలాగుంటే!'

'శా! పనికిమాలోడా! అసలే నిండు మనిసి! దాంతోడు మూట బరువా? అదెట్టా బరిత్తదిరా! కాల్జారినా కీల్దప్పినా కట్టవే గందా!'

'అఁ యేందిలే మావాఁ, అట్టాటేది ఉత్త పుణ్ణేనికే యెందుకవుద్ది?'

'ఒరె ఒరేయ్, అట్టా తునకారించి పారెయ్యొద్దురా!'

'అఁ! యేందిలే మాఁవా! కాలూ, సేయి ఉండప్పుడే నాలుగు రాళ్ళు పోగేసుకోకపోతే ఏదన్నా అయితే ఎవుడు జూత్తాడు? అది పాతికేళ్ళు, నేం బాతికేళ్ళ చేసుకొంటే ఏదన్నా యెనకేసుకోవచ్చు, లేకపోతే ఏంవుంది–సిప్పే!'

ఇంక అక్కడ నిల్వలేదు గూగడు.

'యెందోలేరా! యేందోలే! యేందోలే!' అంటూ మర్రిచెట్టువైపు నడక సాగించాడు. 'ముసిలోడు వూరకే యేందేందో గొణుగుతాడు' అనుకొన్నాడు సుబ్బారావు. నాలుగడుగులేసి, ఆగి, వెనక్కు దిరిగి 'సుబ్బిగా, ఓరి సుబ్బిగా! మా సుతారంగా గాలుత్తున్నావ్ బీడీ, నువ్వురవ్వల్లేసేను. పైన బట్టలు–పట్టుబట్టలుండాయ్,

రత్తయ్య గోరి పట్టుబట్టలు. ఆఁ!' అని మళ్ళీ మర్రిచెట్టువైపు నడుస్తున్నాడు. 'అట్టాగే అట్టాగే' అన్న సుబ్బారావు మాటలు వినపళ్లేదు. వినిపించుకోలేదు.

రవ్వపడి బట్టలకు చిల్లిపడితే ఏమయినా వుందా? కొంపలారిపోవూ? గూగడికి భయం కలిగింది. అంతలో బూసిమ్మ కళ్ళలో మెదిలింది. కుర్రతనంలో దొడ్డదే! ముసిల్దవుతున్నకొద్దీ పిసినారితనం పట్టుకొంది. మొదట్లో పట్టెడన్నం పెడితే పొట్ట బరాబారుగా నిండిపోయేది. కాలప్రభావం ఏమో అంతలోనే మారిపోయింది. నాలుగు మెతుకులు రాలవటానికి గింజుకొంటుంది. బట్టలు బాగా తీసుకుపోతేనే కొంప మునిగిపోయినట్లు గిలగిల తన్నుకులాడుతుంది. నిజంగా ఏమన్నా అయితే ఇంకేమన్నా వుందా? గూట్లో సిలక ఎగిరిపోదూ!

ఒక రోజు బట్టలు చక్కగా మడచి, మడుపులు అందించాడు. అన్నీ చూచుకొంది బూసిమ్మ. కొత్తబట్ట నలిగిపోయిందనీ, పాతబట్ట రాలేదనీ, చీరకు కొర్రు పట్టిందనీ, పంచెకు చిల్లి పడిందనీ, మగాళ్ళ బట్టల మురికిపోలేదనీ, తన బట్టలకు గరువుదుమ్ము కొట్టుకొందనీ, ఇట్లా చేసేదికాక, కల్లాలప్పుడు గింజలు గింజలంటూ గోనెసంచు లేసుకొని ఎగబడటం తెలుసుననీ, పో పొమ్మని కసురుకొంది.

ఆరోజు అన్నం పెట్టటం ఆమెకు ఇష్టంలేదనీ, ఇష్టంలేని రోజు ముందుగానే, అనవసరంగా అలా తిడుతుందనీ గూగడికి బాగా తెలుసు. కాచివడపోసిన బ్రతుకు!

మధ్యాహ్నం రేవునుంచి యింటికి వచ్చాడు. మధ్యాహ్నం అంతా నిద్రపోయాడు. సాయంకాలం బువ్వబుట్ట ఒక చంకలో పెట్టుకొని, బట్టల మూట ఒక భుజంమీద వ్రేలాడవేసుకొని బట్టలు ఇచ్చి అన్నం పెట్టించుకొని పోవటం గూగడి అలవాటు.

'అద్సర్లేండి బూసిమ్మగోరూ! ఆ మురికికట్ట లిట్టాబడేయండి!'

'పొట్టు పొట్టు! ఎట్టో దగలడు. యియ్యన్నా సుద్దంగా ఉతుక్కురా' అని ధర్మంచేసే వాళ్ళ ధోరణిలో మురికిబట్టలు గూగడిముందు కుప్పవేసింది. ఆ బట్టలు ఉతుక్కొని రాకపోతే గూగడికి నరకం వచ్చేసినట్టూ, దాన్నుంచి కాపాడటం కోసమే ఆమె బట్టలు వేస్తున్నట్లూ ప్రవర్తించింది బూసిమ్మ.

'బూసిమ్మగోరూ, బట్టల్సంగతి సరేగాన్లెండి, కూసింతి బువ్వబెట్టండి!' ఆమె ఆ పూట పెట్టదని తెలిసికూడా కడుపాత్రం పట్టలేక అడిగాడు గూగడు.

'యేం బువ్వరా? నీ తలమాడ! నీ మొకంమండ! నీ శ్రార్దంబెట్ట! యేం బువ్వరా! నీ బువ్వ బుగ్గిగాను! యేళాపాళా లేకుండా యేడదెచ్చి పెట్టేదిరా నీకు? యేం ఒరగబెట్టావని బువ్వబెట్టాల్రా నీకు? పో పో కూళ్ళేదు, కుమ్మలేదు.'

బూసిమ్మ అంటే ఆ ఊళ్ళో తెలియనివాళ్ళు లేరు. ఆమె పుట్టినింటికీ మెట్టినింటికీ ఏకైక వారసురాలు. ముగ్గురు కొడుకుల్లో పెద్దవాడికి అయిదేళ్ళయినా లేనప్పుడు భర్తకు కాలం తీరింది. నాజా పూసా, బొట్టూ కాటుకా , తాళీ, పూలూ చనిపోయిన భర్తకు సమర్పించింది. కానీ, రాత్రి సమయాలలో అలంకరించుకొనేదనీ, పూలు బొట్టూ కాటుకా సింగారించుకొనేదనీ, చిన్న పిల్లలు పెళ్ళీడుకెదిగిందాకా ఈ తతంగం సాగిందనీ, జీతగాళ్ళు చెవులు కొరుక్కుంటూ వుంటారు. ఆమె దూరపు బంధువు, వరసకు మామ అయిన రత్తయ్య ఇల్లు ఆమె యింటిప్రక్కనే వుంది.

అతని మీసం చూచి, జనంపైకి ఏమీ అనుకోలేదుగానీ పైవ్వాళ్ళకు పొక్కలేదని అందరూ అనుకొంటారుగానీ, చుట్టుప్రక్కల జనానికీ ఊళ్ళకూ ఈ వ్యవహారం బాహాటంగానే తెలుసు.

ముగ్గురూ పెరిగి పెద్దవాళ్ళు కావటంతో, ముసలితనం ముసురుకొని రావటంతో బూసిమ్మ మహాపతివ్రత అయిందని అనుకొంటుంటారు. అయినా ఇంగువకట్టిన గుడ్డ బూసిమ్మ! ఏ సంగతి ఎట్లావున్నా ఇరుగింటి, పొరుగింటి కాకి బూసిమ్మ ఇంటిమీద వాలకుండా కట్టుదిట్టం చేయించాడు రత్తయ్య. అదేం పోయేకాలమో బూసిమ్మ ముగ్గురు పిల్లలూ రత్తయ్యతో మాట్లాడరు. రత్తయ్యతో తగాదా పడేవారు. బ్రతికివుండే అవకాశంలేదుగానీ, బూసిమ్మ ముఖం చూచి రత్తయ్య ఆ ముగ్గురకూ పోయేకాలం రాకుండా దూరంగా వుంచాడు.

బుట్టలో అన్నంతో, భుజంమీద మురికిబట్టల మూటతో ఒక వీధినుంచి ఇంటికి వస్తాడు గూగడు. ఆ అన్నం ఆ పూట వండింది సాధారణంగా ఎవరూ వేయరు. ఉదయం మిగిలిపోయిందే వేస్తారు. ఒక్కొక్కప్పుడు అంతకుముందు రోజు రాత్రి మిగిలిన అన్నం గూగడికి అట్టే పెడతారు. పాచిపట్టి నీరు ఒడుస్తూ జవజవలాడుతున్న అన్నమయినా, మాడిన అన్నమయినా, ఏదయినా, అన్నమే కాబట్టి, అన్నం పరబ్రహ్మ రూపం గనుక, తెచ్చుకొని, కొంత తిని, మిగిలినా, మిగలకపోయినా కొంత మిగుల్చుకొని, అటికలో వేసి, చెంబెడు నీళ్లూ, పిడికెడుప్పూ దానిలో వేసి, మూతపెట్టి, ఉట్టిమీద పెట్టుకొని బట్టలమూట తలదగ్గర పెట్టుకొని, కుక్కిమలక మంచంలో రాత్రికి నిద్రపుచ్చి, ప్రొద్దున్నే అటికలో ఉన్న బువ్వ పులిసి బుర్రట్టలాడుతున్నా, అందులో నీళ్ళు–పుల్నీళ్ళు 'చల్లాబొల్లాదాగి గల్లక్రింద బొడుకుంటే తెల్లారేసరికి కొల్లబోయినన్ని కల్లు' అన్నట్లుగా అటికెడు పుల్నీళ్ళు కడుపునిండా తాగి, వూరు అనే యింటికి మురికి కుప్ప వంటి గూగడు, గూనిమీద మురికి బట్టల మూట పెట్టుకొని, నెత్తిన గంపెడు చీకటి వేసుకొని రేవుదగ్గరకుపోయి, బట్టలుతికి, మధ్యాహ్నానికి తీసుకువచ్చి, ఇంత అన్నం వండుకొని తిని, మళ్ళీ సాయంకాలం మామూలే! గూగడికి ఆకలి ఎక్కువ! ముసలితనం పైబడే కొద్దీ ఆకలి మరింత ఎక్కువవుతూ వచ్చింది. అతను కడుపు నిండా తిని ఎంతకాలమయిందో! ఆ మధ్య అతని దినచర్య మారిపోయింది. మార్పంటే అదెంతో పెద్ద మార్పేమీకాదు. మధ్యాహ్నం అతను అన్నం వండుకోవటం లేదు. రాంసోమి పెళ్ళాం వండిన అన్నం తన పిల్లలకింత పెట్టినట్లే ముసిలోడనీ, చిన్నప్పుడు తన నెత్తుకొని ఆడించాడన్న కృతజ్ఞతతో జాలితో గూగడికి మధ్యాహ్నం వడ్డిస్తూ వుంది.

గూగడు పాతికిళ్ళ బట్టలుతుకుతున్నాడు. అందులో అయిదుగురికే మాగాణి పొలం వుంది. మిగతా వాళ్ళందరికీ మెట్టపొలం! మునుపు ఒక్కొక్క రైతూ ధాన్యం పండినప్పుడు కల్లాల్లో అతను మోయగలిగినన్ని వడ్లు ఇచ్చేవాళ్ళు. ఏడాది పొడుగునా ఉబ్బిడి మబ్బిడి బియ్యం కొదువ ఎరుగడు. కాలం మారింది. వాళ్ళంత మెండుగా దండిగా గుండె నిండుగా ఇవ్వటం మానివేశారు. ఇంటికి అవసరమయిన వస్తువుల ఉప్పుతో ఆరూ పొగాకుతో సహా పంటల కాలంలో రైతులు దగ్గర్నుంచి తెచ్చుకునేవాడు గూగడు. ఆ వ్యవస్థ రూపం మార్చుకొంది. క్రొత్త వ్యవస్థలో పాత అలవాట్లు, పాత జీవితం గడిపిన గూగడు అలవాటు పడలేకపోయాడు.

వూళ్ళో అందరూ ప్రతి సంగతీ లెక్కలు వేసి, జమా ఖర్చులు చూచి ఇవ్వటం–తీసుకోవటం కాదు, నేర్చుకొన్నారు. పిదపకాలం! ఒకప్పుడు రెండు పూటలూ ఇంట్లో అన్నం వండుకొనేవాడు గూగడు. కొంతకాలం తర్వాత ఒకపూట వండుకోవటం ఒక పూట అడిగి పెట్టించుకొని తెచ్చుకోవటం బాగానే వుంటూ వచ్చింది. ఆపైన కాలమే గడ్డుకాలం. ఒక పూట వండు కోవటానికి ఏడాది పొడుగునా కల్లాల్లో తెచ్చుకొన్న ధాన్యం సరిపడకపోయింది. అడిగి తెచ్చుకొన్న అన్నమూ చాలని స్థితి వచ్చింది. అప్పుడు రెండోపూట కూడా అన్నం వండుకోవలసిన స్థితీ వచ్చింది. బియ్యం లేని స్థితీ, డబ్బు అవసరమయిన స్థితీ క్రమంగా గుర్తించాడు గూగడు. డబ్బు కోసం– ఉండనే ఉన్నాడు పెద్ద దిక్కు రత్తయ్య. రత్తయ్యను అడగటం తప్పనిసరి అయింది. గూగడు డబ్బు సంపాదించటం ఎరగడు. బట్టలుతికి డబ్బు అడిగే నాగరికత అతనికి అంటలేదు. అంటుకోదు. అంటుకోవటం అతనికి ఇష్టం కూడా లేదు. అన్నీ నాగరకంగా తెలుసుకొంటున్న ఊరు అతని అవసరం గుర్తిస్తే బాగుండేది. ఎవడికోసం చేస్తాడులే అనే పరిస్థితి వూర్లో బాగా ప్రాకింది. అడగందే అమ్మ అయినా పెట్టేకాలం కాదిది. ఆ కాలం మనిషి గూగడు. ఈ కాలంలో బతకవలసి రావటం దుర్భరమే అయింది. కడుపు నిండా తినటానికి డబ్బు తప్పనిసరి అయింది. ధనం సంపాదించలేని గూగడు ఖర్చు పెట్టవలసి వచ్చింది. రెక్కలు ముక్కలు చేసుకొనే గూగడు డొక్క మాడిపోవలసిన వాడయ్యాడు. ఆ రోజుల్లోనే అతని ముఖంలోని నవ్వును కళ్ళలోని నిప్పురవ్వలు, ఒంటిలో మంట కాల్చివేశాయి.

సుబ్బారావు ఇచ్చిన బీడీ పీల్చు పీల్చుకి దుమామసిగా కాలిపోయింది. బీదరికం కాలి బీడీ చివర్లో సుర సురలాడుతూ వుంది. మర్రిచెట్టు ప్రక్క ఆరవేసివున్న బట్టల చుట్టూ తిరిగివచ్చాడు. మళ్ళీ మర్రిచెట్టు మొదట్లో గూని వెనుక తగిలేటట్లుగా కూర్చున్నాడు. మళ్ళీ బీడీ కాలుద్దామంటే అందుకు గతిలేకపోవటంతో గూగడికి నాగలింగం గుర్తుకు వచ్చాడు.

నాగలింగం వేపచెట్టు కింద మంచం వేసుకొని బీడీ కాలుస్తూ వుండవచ్చు ననుకొన్నాడు గూగడు. గూగడు పెళ్ళీడు కెదిగినప్పుడు పుట్టాడు నాగలింగం. బళ్ళో కెళ్ళి పలక పగులకొట్టి, బలపం అరగదీసి, పుస్తకం చింపేసుకొని, అయ్యవారితో తిట్లూ, దెబ్బలూ తిని అయిదో తరగతి అనిపించుకొన్నాడు నాగలింగం.

బట్టల మూట తలకెత్తితే తలతిక్కకొద్దీ దాన్ని విసిరి నేలకేసి కొట్టి, ఇల్లు వదిలి పెట్టి ఎక్కడికో పారిపోయిన నాగలింగం డిప్టీ తాసీల్దారు దగ్గర ప్యూనుగా చేరి, జీపులో వూరు వచ్చిందాకా అతను బ్రతికి ఉన్నాడని ఎవరికీ తెలియదు.

మునసబు, కరణం డిప్టీ తాసీల్దారు ధాం ధూంలాడుతున్నాడనీ, నువ్వు మనూరు వాడివి కాబట్టి అది చెప్పు ఇది చెప్పు, అయ్యగారితో అని బ్రతిమాలుతుంటే చూచి 'అరి దీనియాలి– అ అలలో యెంతుందిరా' అని గూగడు ఆశ్చర్యపడ్డాడు.

నాగలింగం పట్టణంలో పెళ్ళి చేసుకొన్నాడు. నలుగురు బిడ్డల తండ్రి అయ్యాడు. నలుగురికీ పెళ్ళిళ్ళు చేశాడు. కూతుళ్ళిద్దరూ కాపురాలకు పోయారు. అల్లుళ్ళకు ఉద్యోగాలున్నాయి. కొడుకు పెద్దవాడు లారీ డ్రైవరు, రెండోవాడు స్కూలులో ప్యూను. వాళ్ళకు నెలనెలా జీతం వస్తుంది.

నాగలింగం ఉద్యోగం వదిలిపెట్టినా కొంచెం తక్కువయితే మాత్రం ఏమిటి నెలనెలా జీతం వస్తుందని గూగడిక ఎక్కలేని ఆశ్చర్యం. నాగలింగం చేసింది ఫ్యాను పని. పెద్దగా ఒళ్ళేం విరుచుకోలేదు. తలేం బద్దలు కొట్టుకోలేదు. అయితే అతనికి ముసలితనంలో బాధ లేదు బాధ్యత లేదు. హాయిగా నిశ్చింతగా భార్యతో సొంత యింటిలో కాలం గడుపుతున్నాడు.

గూగడు తనని గూర్చి ఆలోచించసాగాడు. ఒళ్ళంతా మగతగా వుంది. కళ్ళు మూసుకుపోతున్నాయి. పైకి వచ్చిన మర్రివేరు మీద తల పెట్టుకుని నేల మీద పడుకొన్నాడు గూగడు. మత్తుగా నిద్ర ముంచుకువస్తూ వుంది. అప్పటికే బాగా ప్రొద్దెక్కింది. సూర్యుడి వేడి చెట్టు క్రింద తెలియటం లేదు. పడమటి శాంబరం విదిలించి కొడుతూ వుంది. చల్లగా ఉండవలసిన చెట్ల క్రిందే ఒళ్ళు ఇరఇర లాడుతూ వుంది. అలిసిపోయిన ముసలిప్రాణం నిద్రవొళ్ళో ఒరిగిపోయింది.

ఒక రోజు–ఎండాకాలం–అర్ధరాత్రి, తూరుపు వీధి అంతా అల్లకల్లోం అయిపోయింది. పగలంతా ఒళ్ళు హూనం అయి, రాత్రి ఆదమరచి నిద్రపోతున్న గూగడు పూర్తి మెలకువా, పూర్తి నిద్రా కాని స్థితిలో మంచంమీంచి లేచి ఇటూ, అటూ పరుగెత్తి ఎదురయిన ఎవరికో ఢీకొని ఈ లోకంలో పడ్డాడు.

ఇళ్ళు కాలుతున్నాయి. ఆడవాళ్ళూ, పిల్లలూ ఆల గోల బాల గోలగా వుంది. మగవాళ్ళు కంగారుగా అరుస్తున్నారు. పరుగెత్తుతున్నారు. మంటలార్పటానికి వూరచెరువు ఎండిపోయింది. నీళ్ళు లేవు. బావుల్లో నీళ్ళు ఎందరు తోడినా ఎన్ని నీళ్ళు పోసినా మంట లారటం లేదు. మంటల నాల్కలు అగ్నిదేవుడి శాపం లాగా ఆకాశంలోకి ప్రాకుతున్నాయి.

గూగ డింటి ప్రక్కయిల్లు కాలుతూ వుంది ఫెటేల్లుమని ధ్వని వచ్చింది. గాలి బాగా తోలింది. ఆ యింటిమీది నుంచి మండుతున్న తాటాకు లేచి వచ్చి గూగ డింటిమీద పడింది. చూస్తూ వుండగానే, ఆర్పే యత్నం చేస్తూ వుండగానే ఇల్లు అంటుకొని గుప్పున మంట లేచింది. గూగడి గుండెలు అవిసిపోయాయి. గబగబా లోపలికి పోయి, మురికి బట్టల మూట వెలుపలికి తెచ్చాడు. రెండోసారి ఇంట్లోకి పోవటానికి వీలు లేకపోలేదు, పోవద్దని అందరూ అతన్ని వారించారు. మంచం, పెట్టె, వంట కుండ, పాత కుండ, గ్లాసు, తపేలా, చెంబు, ముంతా, మూకుడు, చట్టి, పిడత, ఉట్టి, దణ్ణెం ఇంట్లోనే ఉండిపోయాయి.

తెల్లవారిం తర్వాత, మిగిలిన మసి, మసిలో నిప్పురవ్వలు, ఇంకా కాలుతున్న దూలం, నల్లకప్పేసిపోయిన గోడలు చూచి అవురుమని ఏడ్చాడు గూగడు. ఆ గోడల మీద మళ్ళీ ఇల్లు ఉందనిపించటానికి, బొంగులు, తాటాకు కావలసి, రత్తయ్య దగ్గరే అప్పుచేసి, తనకూ ఇల్లు ఉందనిపించుకొన్నాడు.

కాలూ చేయీ కూడదీసుకొని ఇంట్లోకి కావలసిన నాలుగు పనిముట్లు సంపాదించుకొనేసరికి ఏడేండ్లు పట్టింది. ఏ పండుగకో, ఏ రైతో దయతో ఇచ్చిన పాత బట్టలు గూగడి శరీరం పరువు వెలితిగా కాపాడుతూ వుంటాయి. రూపాయో రెండో ఎవరయినా ఎప్పుడయినా ఇస్తే బీడీలకు సరిపోతుంది.

కాడ పొగాకు మూడు చుట్టలు చుట్టుకొంటాడు. నాటు పొగాకు వూరి పొలంలో పండేరోజుల్లో రోజుకు నాలుగు కాడల చుట్టలయినా కాల్చేవాడు. రైతులంతా దొర పొగాకు పండింటం ప్రారంభించిన తర్వాత నాటు పొగాకు మోటయింది. దానిమాటే మరచిపోయారు. చుట్టలు కాల్చే రైతులు చాలామంది సిగరెట్లు నేర్చుకొన్నారు. మారిన కాలంతోపాటు తానూ మారి, ఒక్క పొగాకు కాడతో రోజంతా నెట్టుకు వద్దామంటే దాని ధరా ఆకాశం అంటింది. అంతకంటే బీడీల ఖర్చు తక్కువని, అణాకి ఆరు బీడీలు కొనుక్కొని రోజంతా జరుపుకు వస్తున్నాడు గూగడు.

గూగడు బట్టలెప్పుడూ కొనుక్కోలేదు. రైతు లిచ్చినవే కట్టుకొనేవాడు. మునుపు చిరిగిన బట్ట, ఆపైన చిరగని బట్ట కట్టుకొని ఎరుగడు. అందరి బట్టలూ ఉతికే, మడతపెట్టే, మడుపులు అందించేవాడు అయితే అతడి ఒంటి మీద బట్టలు ఒంటిమీదే తడిసిపోయేవి. మురికి అయ్యేవి. మురికొదిలిపోయేవి. ఆరిపోయేవి. ఆ తర్వాత చిరిగిపోయేవి. ఉతికితే, బండ తగిలితే నిలిచే బట్టలు కావుకాబట్టి. గూగడాబట్టలు ఉతుక్కోవడం మానుకొన్నాడు.

రత్తయ్య గూగడి కిచ్చిన డబ్బు కాలంతోపాటు ఖర్చయిపోయింది. కానీ కాగితం మీద లెక్కమాత్రం పిల్లల్ని కంది. పిల్లలు పెరిగి తల్లి అంత అయ్యేసరికి రత్తయ్య ఆలోచన నెరవేరే అవకాశం కనిపించింది. అసలుకు రెండు రెట్లు అయిన వడ్డీలో సగం తీసేసిన ధర్మాత్ముడు రత్తయ్య. సగంవడ్డీ పూర్తిఅసలూ తీర్చేమార్గం, తీర్చేపద్ధతీ తీరికగా ఆలోచించే అవకాశం ఇచ్చి, వృద్ధుడయిన గూగడి పసి మెదడుకు ఎంతకీ ఆలోచన తట్టకపోతే మార్గం చూపించాడు రత్తయ్య. 'ఆఁ యేవుంది. ఆ రెండెకరాల కుంటా, ఇల్లూ ఇంటి స్థలఁవూ రాసిపారేత్తేపోద్ది.' ఆ సూచన విన్న తర్వాత మూడు రోజులు గూగడికి ఆకలి చచ్చిపోయింది. మాట పడిపోయింది. కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఆ తర్వాత కాలుగాలిన పిల్లి అయిపోయాడు. అమ్మబాబో అని లబోదిబో మన్నాడు. వినటానికి అమ్మా బాబూ లేరు. వుంటే గింటే, వింటే గింటే ఏంచేయాలో తోచక స్వర్గంలో ఉన్నాసరే ఏడ్చేవుంటారు.

'అంతా యిత్తే నేనేఁవయ్యేది?' అన్నాడు గూగడు గుండెబలం కూడ దీసుకొని అయిదోరోజు.

'యాఁవవుతావ్ రా? యేంగావు!'

'యిల్లూ వాకిలీ, దొరా, నీకు రాసిపారేత్తే నే నేడుండేదీ అంట!'

'సచ్చిందాకా ఆ యింట్లోనే జావరా ముసిలోడా! సచ్చినాక ఆ యిల్లు నా కయ్యేటట్టు రాసుకుందాంలే! యాఁవంటా?'

ఏమనటానికి మాత్రం ఏం అవకాశం వుంది? అందువల్ల గూగడు ఏమీ అనలేదు. రత్తయ్యతోపాటు రిజిస్ట్రారు ఆఫీసుకు పోయాడు. పొలం రాసిపారెయ్యటం అంతగా బాధ కలిగించలేదు. ఇల్లూ, వాకిలీ లేకుండా చేసుకోవటమే ఇష్టంలేకపోయింది. సన్నరైతులకే పొలం పనులు కష్టం! అటువంటిది, తనకి పొలంతో సేద్యం ఇబ్బందిగానే వుంది. ఒక్కొక్కప్పుడు పెట్టినంత అయివేజు కూడా రావటం లేదు. ఆ పొలం ప్రక్కనే రత్తయ్య పొలం వుంది. పొలంలో పొలం కలిసిపోతుంది.

పది రూపాయలున్నవాడికి పైసంటే ఎంత గౌరవమో అంత ఆనందమే కలిగింది రత్తయ్యకు.

'యేరా, పొలం పుట్రా, యిల్లూ, వాకిలీ అంతా రత్తయ్యకు రాసిపారేసే వంటగా!' అని ఎవరయినా రైతు అడిగితే 'నేనేం రాయలేద్దొరో! అట్టాటన్నేయం నా కంటగట్టమాకండి! అక్కడున్నోళ్ళంతా సదుంకున్న మారాజులు. ఆళ్ళు కాగితాలమీద కలంపోటు పొడిసేరు, నే వేలంటిచ్చా. అంతే దొరా!' అనేవాడు గూగడు.

రత్తయ్య దయగల మనిషి. మాట మీదే నిలబడ్డాడు. గూగణ్ణి ఆ యింటిలో ఉండనిచ్చాడు. వెళ్ళగొట్టలేదు. ఒకనాడు స్వతంత్రుడయినవాడు ఆ రోజునుంచి బానిస. రత్తయ్య దయాధర్మాల మీద ఆధారపడ్డాడు. వూరు అనే ఆఫీసుకు డస్టబిన్ వంటి గూగడు ఆ రోజునుంచీ మురిగిపోయిన డస్టబిన్.

ఆ యింటి కప్పుతో గాలిదేవుడు పరాచికాలు ఆడితే నిద్రలేచిన జులపాల తల మనిషి జుత్తులాగా, పిచికలు పీకుతున్న మొక్కజొన్నకండెలాగా, కాల్చటానికి పారేసిన కలెక్టరాఫీసు కాగితాల కుప్పలాగా వుంటుందా యింటి కప్పు. ఆ యింటి నడికొప్పుమీద చేరిన చెదలు సంతానాభివృద్ధి చేసుకొంటూ లక్షోపలక్షలుగా పెరిగి తాటాకురూపం కనిపించకుండా ఎర్రమట్టితో అలికేసినట్లు చేసిన రోజుల్లో వానదేవుడు దయతలిస్తే మట్టి అంతా కరిగిపోయి, వర్షం సరాసరి యింటిలో కురిసి, వాన వెలిసింతర్వాత, సూర్యచంద్రులకు తడిసిన కళ్ళజోడులా వుంటుందా యింటికప్పు.

అటువంటి తరుణంలో దయామయుడయిన రత్తయ్య రెండెడ్ల బండితో మేళతాళాలతో వరిగడ్డి తోలి యింటి మీద కప్పించుకోమని చెప్పి వూళ్ళోవాళ్ళ కళ్ళలోకి సూటిగా చూచి, 'వాణ్ణి నేంగాకబోతే ఎవడాదుకుంటాళ్ళే' అంటాడు.

గూగడి పొలం రత్తయ్యకు చెందకముందు అందులో పండించుకొన్న అల్లేరు సెనగకాయలు కొర్రుగట్టి, గుంటకదోలి, కుప్పయిన కాయలతో పాటు, గరువునేల గులకరాళ్ళూ, రాయీ రప్పలను అల్లేరు సెనగకాయలు ఏరుకొన్నంత భద్రంగా ఏరి చేనుగట్టుచుట్టూ కట్టపోసుకొన్న గూగడు ఆ కాస్త పొలాన్ని చిన్నపిల్లలను పెంచుకొన్నట్లు సాకాడు. ఆ పొలం రత్తయ్యకు హక్కు భుక్తాలతో చెందింతర్వాత, ఒకసారి పోయిచూచి, తల్లి చనిపోతే ఏడ్చినంతగా ఏడ్చి తిరిగి వచ్చాడు. మళ్ళీ ఎప్పుడూ గరువుకు పోలేదు. పోతే చేను చూస్తే ఏడుపు వస్తుంది. ఏడవటం ఇష్టంలేదు. ఏడవటం మంచిదికాదు కూడా. 'ఏడిత్తే నీ ఉసురు మాగ్గొట్టుకుంటుం'దని రత్తయ్య కోప్పడతాడని భయం. గూగడు ఏడవటానికే స్వేచ్ఛలేని బానిస!

రాంసోఁవి బార్య పిచ్చమ్మ లేకపోతే రెండేళ్ళ నుంచీ గూగడి పని ఇరకాటంలో పడేది. ఆమె నలుగురు కొడుకులూ చేతికెక్కి వచ్చారు. ఆ నలుగురుతోపాటూ తనకూ నాలుగు మెతుకులు పెడుతూ వుంది.

పదేళ్ళ క్రితం, ఆ వూళ్ళో పుట్టి పెరిగిన రాంసోఁవి తమ గానుగెద్దు బ్రతుకుల మీద విరక్తితో పట్టణం వెళ్ళాడు. మెయిన్ రోడ్డుమీద చిన్న గది పెద్ద మొత్తానికి అద్దెకు తీసుకొని లాండ్రీ పెట్టాడు. జనం మురికి బట్టలు వేసి ఇస్త్రీ బట్టలు తీసుకుపోతారు. తాను ఇంటింటికి తిరిగే తంటా తప్పింది. డబ్బూ దస్కం బాగా

గిట్టుబాటు అవుతూ వచ్చింది. పిల్లల్ని దొరబాబులు లాగా పెంచాడు. భార్య వంటినిండా నగలు చేయించాడు అయిదేళ్ళు హాయిగా గడిచింది. వూళ్ళో ఎవరికీ తలవంచేవాడుకాడు. మునసబులాగా, రత్తయ్యలాగా, పెద్ద రైతులు లాగా తలెత్తుకు తిరిగాడు. రెండు రోజులకు, మూడు రోజులకు ఇంటికి వచ్చేవాడు.

ఒకసారి పట్టణంనుంచి వచ్చి వారంరోజులయినా మళ్ళీ వెళ్ళలేదు. తలవంచుకొని నడిచేవాడు. అందరికీ అనుమానం పట్టుకొంది. 'యేందో కతుంది!' అనుకొన్నారు. పోలీసులు ఇద్దరు వచ్చింతర్వాత, సంగతంతా తెలిసిపోయింది. పట్టణంలోవాళ్ళ బట్టలన్నీ ఎవరికో అమ్మేసుకొని ముఖం తప్పించి, ఆ వూళ్ళో తలదాచుకొంటున్నాడని. దొంగలు పడ్డారనీ, బట్టలన్నీ పోయాయనీ ఏం చెయ్యాలో తెలియక వచ్చేశాననీ రాంసోఁవి చెప్పిన మాటలు ఎవరి చెవికీ ఎక్కలేదు.

ఆ వూరు ఆడపడుచును అత్తవారింటికి బొట్టూకాటుక పెట్టి సారె చీరలతో అన్ని హంగులతో పంపినట్టు పోలీసులవెంట రాంసోఁవిని సాగనంపారు, ఆ వూళ్ళో ధర్మం నాలుగు పాదాలమీద కలియుగంలోనూ నడిపించాలని తలంచే రత్తయ్య అండ్ పార్టీ!

వారం రోజులు తర్వాత రాంసోఁవికి ఆర్నెల్లు జైలుశిక్ష వేశారని వూళ్ళో అందరికీ తెలిసింది. ఆ కాలం గడిచిపోయింది. రాంసోఁవి రాలేదు. ఏమయ్యాడో తెలియలేదు. అయిదు సంవత్సరాలయినా అయిపులేదు. ఆ వూళ్ళోకి రావటం అవమానం అని మానివేశాడో, మరేమయిందో ఏమో! ఆర్నెల్లు ఏకధారగా కంటికీ మంటికీ ఏడ్చిన పిచ్చమ్మ, ఆపైన కన్నీరు ఇంకిపోయిన పిచ్చమ్మ; కాలం గడిచే కొద్దీ ఆకాశంలోకి వెర్రిగా చూచిన పిచ్చమ్మ, చేతికెదిగొచ్చిన పిల్లలతో ఈ లోకంలో పడింది. బ్రతుకుతూవుంది.

'రాంసోఁవి సచ్చిపోడు. సచ్చిపోయేంత పిరికోడు గాడు. అనవసరంగా అవమానం వొచ్చిందన్న బాత్తో ఈ వూర్రాలేకపోయాడు. ఈ వూరు సిన్నసూపు సూసింది. అందుకే వూళ్ళో మొకం సూపలేకపోయేడు. యే పట్నఁవో యెల్లుంటాడు. బాగా సంపాయించే వుంటాడు. పెళ్ళాంపిల్లల్ని గురించి ఇనే వుంటాడు. లాండ్రీ బాగానే సాగుతా వుంటుంది. ఏ అపరేత్తిరేలో వొచ్చి మిమ్ముల్ని సూసే పోయుంటాడు. వాడబిఁవానం ఉన్నోడు. యెప్పుడో ఒక రోజొచ్చి మిమ్మల్ని యెంటేసుకు తీసుకుపోతాడు' అని గూగడు పిచ్చమ్మను అనేక విధాలుగా వోదార్చాడు. అతని హృదయంలో లోలోపల పొరల్లో ఎక్కడో బ్రతుకు ఆశకు సంబంధించిన స్వార్థం దాగి వుండివుంటుంది. ఎప్పుడయినా పిచ్చమ్మ ముఖాన ప్రొద్దుపొడిస్తే ఆ వెలుతురులో తన చరమకాలం హాయిగా గడపవచ్చుననే ఆశ వుంది.

మర్రిచెట్టు వేరుమీద తలపెట్టుకొని నిద్రపోతున్న గూగడు ఎవరో తట్టిలేపినట్లు ఉలిక్కిపడిలేచాడు. చుట్టూ పరికించాడు. కునుకువల్ల ఒంటికి ఎక్కలేని బలం వచ్చింది. ఒళ్ళు విరుచుకొంటూ నిలబడ్డాడు. చుట్టూ అంతా హడావుడిగా వుంది. వాతావరణంలో పడేసరికి కొంచెం సమయం పట్టింది. పడమటి శాంబరం విదిలించి కొడుతూ వుంది. బట్టలు లేచిపోతాయని, అరబెట్టిన బట్టలు మడతపెట్టకుండా

పోగు బెడుతున్నారు. గూాగడు గబగబా తన బట్టల దగ్గరకుపోయి, గాలివేగానికి అల్లలాడుతున్న బట్టలు పోగేశాడు.

ఎండ ఎక్కువయింది–నిప్పులు కురుస్తున్నట్లుగా వుంది. ఒంగి బట్టలు తీస్తుంటే చొక్కాలోంచి చొరబడి వీపు కాలుస్తూ వుంది. కాలు పెడితే నేల భగ్గున వుంది. అసలే దువ్వనేల. నిప్పుకణికలు కాళ్ళకు అతుక్కొంటున్నట్లుగా వుంది. చెప్పుల్లేని కాళ్ళతో ఎత్తెత్తి అడగులువేస్తూ గూాగడు నడుస్తుంటే పిల్లలు ఎగురుతున్నట్లుగా వుంది.

బట్టలన్నీ పోగుచేసి, అమ్మయ్య అనుకొన్నట్లుగా నడుం పైకెత్తి చిటికేసర చెట్టువైపు చూచేసరికి ప్రాణాలు పైకేపోయాయి. రత్తయ్య పైపంచె! కట్టుపంచె!! పట్టు బట్టలు!!! ఎండ తగలకుండ చేయాలనుకొంటే పాడునిద్ర పట్టి, మండుటెండలో మాడిపోయాయి. మెత్తటి బట్టలు! పట్టుబట్టలు!! మునుపటి భయం స్థానంలో అప్పుడొక విధమయిన నిర్లక్ష్యం కలిగింది గూాగడికి. చెరువు గట్టుమీద, ఎక్కడా ఆరవేసిన బట్టలు లేవు, ఆ రెండూ తప్ప. గబగబా అటువైపు వెళ్ళాడు గూాగడు.

సమాధుల్లో పుట్టిన సన్నని సుడిగాలి, ఒగుడాకులు, చెత్తా చెదారం, ఎర్రదుమ్ము, నల్లదుమ్ము కలుపుకొని, క్షణ క్షణం పెద్దదవుతూ, ఎర్రగా అకాశంలో కావురు గ్రమ్మేట్టు చేస్తూ, తాటిచెట్లు దాటి, చెరువుగట్టుమీదగా మళ్ళింది. సుడిగాలికి చిటికేసరచెట్టు అడ్డమయింది. దెయ్యం పట్టిన, గణం పెరిగిన, చలి పుట్టిన, భయం కలిగిన మనిషి వణికిపోయినట్లు చిటికేసరచెట్టు సంచలించింది. సుడిగాలి చెట్టుజుట్టు రేగగొట్టగా, పట్టుబట్టలు గూాగడి ప్రాణాలు మాదిరిగా పైకి లేచాయి. సుడిగాలి గింగిరాలు తిరుగుతూ పైకీ పైకీ పైపైకీ పోతూవుంది. సుడిగాలి నడిబొడ్డులో మెడలు చాచుకొని ఎగిరిపోతున్నాయి బట్టలు! పట్టుబట్టలు!! రత్తయ్య పట్టుబట్టలు!!!

అలా చూస్తూవుండగానే చేతికందకుండా ఆకాశంలోకి పోయిన బట్టలు గూాగడి గుండెల్లో వేగం పెంచాయి. లబోదిబోమన్నా బట్టలు వినలేవు కాబట్టి గూాగడు మాటా పలుకుల్లేని మూగబొమ్మ అయిపోయాడు. ఆ బట్టలు ఎక్కడ పడతాయో, దొరుకుతాయో లేదో, దొరికితే ఎంత దుమ్ముకొట్టుకొని దొరుకుతాయో ఏమో, ఏం జరుగుతుందో ఏమిటో ఆలోచించుకోలేకపోయాడు.

చెరువులో అలలు మాదిరిగా, గుండె దడ మాదిరిగా, కల్లోలినిలో తుఫాను తరంగాలు మాదిరిగా ఉంగరాలు చుట్టుకుపోయిన పట్టుబట్టలు విచ్చుకుపోయి ఆకాశంలో చెట్టా పట్టాలు పట్టుకొని, రాబందులు రెక్కలు వూపుకొంటూ ఎగిరిపోతున్నట్టు సాగిపోతున్నాయి.

ఇంత పెద్ద సుడిగాలి తను ఎరిగి వున్నంతలో ఎప్పుడూ రాలేదు. ఇంత ఎత్తుకు ఎప్పుడూ బట్టలు ఎగిరిపోలేదు. ఎప్పుడూ ఇటువంటి మంచి బట్టలు గాలిలో లేచిపోలేదు. తలుచుకొంటుంటే ఒళ్ళు కంపరమెత్తిపోతూ వుంది. ఏం మూడుతుందో ఏమోనని వొంటినిండా చెమట పట్టి చితచితలాడుతూ వుంది. జలజలలాడుతూ వుంది.

బట్టలు గాలిలో తేలిపోతూ దక్షిణంగా తిరిగాయి పైనవెళ్లే బట్టలు చూస్తూ క్రింద గూాగడు వెళుతున్నాడు. కొంతదూరం నిరామయంగా నడిచాడు. ఇక పరుగెత్తుతున్నాడు.

'లగెత్తు! లగెత్తు! మావా! యెందూరం పోతాయ్యో యేందో, లగెత్తు లగెత్తు!' సుబ్బారావు వెనుకనుంచి చెబుతూనే వున్నాడు. వూరు అనే యింటికే మురికి బట్టల మూటవంటి గూగడు పరుగెత్తుతున్నాడు. గూగడి బట్టలన్నీ మూటగట్టి తన మూట దగ్గర పెట్టుకొని, భార్యను, పిల్లల్నీ ఇంటికి పంపించి, గూగడివైపు చూస్తూ నిలబడ్డాడు సుబ్బారావు.

ఎండలకు రేగడినేల పగిలి నెర్రెలు పడింది. మట్టిగడ్డలు ఎండి, కొనదేలిన ఇనుప తుంటెలులాగా గట్టిపడ్డాయి. మట్టిగడ్డలు గుచ్చుకొంటుంటే ప్రాణం గిలగిలలాడుతూవుంది. రేగడిమట్టి పగుళ్ళ కోపులు పదునైన బాకుల లాగా పైకి తేలాయి. గడ్డ కాలికింద పడ్డా, కోపుమీద కాలు జారినా, నెర్రెలో కాలు దూరినా, కాలూ, కాలుతోపాటు మనిషీ, మనిషితోపాటు ప్రాణం అల్లడ తల్లడ అయిపోతుంటే, పైకి మాత్రమే చూస్తూ, ఎటు బట్టలు వెళుతుంటే అటే వెళుతున్నాడు గూగడు.

ఎండ వేడికీ, శరీరం తొందరకూ, మనస్సు వేగానికీ తట్టుకోలేని ముసలి ప్రాణం గూగడు. ఒళ్ళంతా చెమటపట్టి కసకసలాడుతూ వుంది. రొప్పగా ఎగశ్వాసగా ఉంది. కాళ్ళు తేలిపోతున్నాయి. రేగడిమట్టి నెర్రెలో పడి కుడికాలి బొటనవ్రేలు విరిచినట్లు అయిపోయింది. ఎండిన మట్టి పెడ్డలు కోపులు అరికాలులో గీసుకుపోయాయి. సర్వేరాయి ఎదురుదెబ్బ తగిలి బిళ్ళ బీటుగా ముందుకుపడితే, ఎదుర్రొమ్ములో ఎండిన మట్టిపెళ్ళ పొడుచుకొంది, ఎడంకాలి వ్రేళ్ళు అన్నీ, ముఖ్యంగా బొటనవ్రేలు, చితికిపోయాయి. గూగడు లేచి నిలబడ్డాడు. పైకి చూశాడు. పైకి చూస్తూ పరుగెత్తుతున్నాడు.

రెండు తుమ్మ ముళ్ళు ఒకేసారి అరికాలులో దిగబడ్డాయి. కాలు నేల మీద రాసి ముందుకు పోతున్నాడు. కాలువేస్తే నేల కాలిపోతూ వుంది. బొబ్బలెక్కినట్లు గూగడికి తెలియదు. రక్కిస కంపలో అడుగేసి, ఆగకుండా వెళుతున్నాడు.

సుడిగాలి తీవ్రత తగ్గింది. ఆకాశంలో గువ్వలు మాదిరిగా కనిపించే బట్టలు రాబందులు మాదిరిగా దిగివస్తున్నాయి. రేగడినేల నలుపు సాంద్రత మాయమవుతూ, పోతున్నకొద్దీ గరువు నేల ఎరుపు సాంద్రత పెరుగుతూ వుంది. రోడ్డు కవతల ఎర్రని గరువు. బట్టలు రోడ్డు రెండు ప్రక్కలా ఉన్న చింతచెట్టు చిటారుకొమ్మలమీద పడిపోతే బాగుండుననుకొన్నాడు.

రోడ్డు దాటాడు. పంచెలు క్రిందికి రాలేదు. ఎర్రదుమ్ము, మరీ దువ్వ పెనంలో వేయించినట్లుంది. రెండు పంచెలూ దిగుముఖం పట్టాయి. రెంటికీ మైత్రీ చెడింది. వేరైపోయాయి. చిన్నపెంచె ముందుగా పడిపోయేటట్లుంది.

ఎదురుగా చేను చుట్టూ అలవగా పెరిగిన చిల్లకంపకంచె బేకంటి మనిషి చేయి ఎత్తు పెరిగింది. ఆ పైన తాటితోపు, ఏనాటి చెట్లో ఆకాశంలోకి పెరిగిపోయాయి. ముందున్న చిల్లకంపనూ, పైనుంచి పడుతున్న పైపంచెనూ జాగ్రత్తగా చూస్తూ పరుగెత్తుతున్నాడు పొట్టికాళ్ళ పొట్టిమనిషి గూగడు. కంచె మీద పంచె పడకుండావుంటే బాగుండునని అనుకొంటున్నాడు. కంచెమీద పడితే తీసుకోవటం తనకు కష్టం. చిరుగుతుంది!

పంచె ఉన్నట్టుండి సయ్యిన జారింది. కంచె కివతల పడుతుందనిపించింది. కంచె ఎదుట వికృతంగా నిలిచింది. పంచె సుకృతంగా దిగింది. గజం దూరంలో కంచె! గజం ఎత్తులో పంచె! కంచెమీద పంచె పడకూడదు. కాళ్ళూ, చేతులూ ఎత్తినా అందటం లేదు. అడుగు ముందుకు వేశాడు. కంచె! అడుగు క్రిందికి జారింది పంచె! గూగడు ఎగిరాడు. రెండు చేతులతో పొదివి పంచెను పట్టుకొన్నాడు. కాలు నేలమీద అనలేదు. తూలిపోయాడు. నిట్టనిలువునా కంచెలో పడ్డాడు. చేతులు పంచెను వదలలేదు. ఒక కాలు చిల్లకంప ముళ్ళు చీరుతూ, నేలమీద పెట్టుకొన్నాడు. రెండో కాలు చిల్లకంప వెన్నుమీద తన్నిపట్టి లాక్కున్నాడు. తొడల్లో దిగిన ముళ్ళు, విరిగినవి విరిగి లోపలే ఉండిపోగా, ఊడివచ్చిన కన్నాలలోంచి ముసలి నెత్తురు చెదురు చెదురుగా వెలుపలికి వచ్చి, కట్టు పంచెకు గోరంత పులిమి ఇంక ఓపికలేక బైటికి రాలేక వచ్చేందుకు లేక ఆగిపోయింది.

కట్టుపంచె, పట్టుపంచె, అల్లంత దూరంలో పడే వాటంలో ఉంది. పైపంచె గబగబా మడతపెట్టి, చంకలో పెట్టుకొని, వస్తూ పోతూ పశువులు కంచెలో చేసిన కంతలోంచి దూరి చేనులోకి పోయి, ఎండిపోయిన కందిమోళ్ళు కాలి బొటన వ్రేళ్ళ పుళ్ళను కెలుకుతూవుంటే, చేనుకు అడ్డంపడి పరుగెత్తి అవతల చేరుకొన్నాడు. ఎదుట తాటితోపు!

కట్టుపంచె కిందికి దిగుతూ వుంది. తాటిచెట్లుమీద పడుతుందనిపించింది. గ్రద్ద, కోడిపిల్లను సుతారంగా తన్నుకుపోయినట్లు, పసిపిల్లాడి చేతిలో తాయిలం కాకి తన్నుకుపోయినట్లు, కట్టుపంచె, ఒక తాటి చెట్టు మాడు మీద అంటీ అంట కుండా తన్ని, రెండో చెట్టుమీద కొరిగి, ఆకులన్నింటిమీదికీ కప్పేసినట్లు జారి, ముండమోపికి ముసుగు వేసినట్లు ఆ ఆడతాడి తలమీద ముసుగువేసినట్లు పడింది- పాలరంగు పట్టుపంచె!

గూగడు క్రిందనుంచి పైదాకా చెట్టును పరిశీలనగా చూశాడు. ఆరేడు నిలువులెత్తుంది. చెట్టు గెలలతో విరగబడుతూవుంది. ఆ తాడికి కల్లు గీయలేదు. కల్లుముంత, చుట్టూ ఆడతాడి చెట్టుకున్నట్లు ఆ చెట్టుకు లేదు. ముంజెలు కోసం ఉంచి ఉన్నట్లున్నాడు మోతాదు. చెట్లు చూస్తూంటేనే కాళ్ళు వణుకుతున్నాయి.

మునుపు వయస్సులో ఉన్న కాలంలో ఎంత *పరుగెత్తేవాడయినా, ఆనాటి తోపులోంచి, ఊళ్ళోకి పోయి, వేణుగోపాలస్వామి దేవాలయంలో దణ్ణం పెట్టి తిరిగి వచ్చేసరికి, పది తాడిచెట్లు ఎక్కి, ఒక్కొక్క చెట్టునా నాలుగు గెలలు కొట్టి, ధీమాగా నిలబడేవాడు గూగడు. అటువంటి వాడిప్పుడు ఆ చెట్టునూ, చెట్టు మీద పంచెనూ చూచి వణికిపోతున్నాడు. చివరిసారి గూగడు తాడి చెట్టెక్కి, పాతికేళ్ళయినా అయివుంటుంది.

సుడిగాలి తగ్గింది. పడమటి శాంబరం ఆ గూబలో దూరి ఈ గూబలోంచి పోతూ వుంది. చంకలో పట్టు పైపంచె తీసి ఎండు తాటాకుమీద పెట్టి, నున్నటిరాయి, దుమ్ముపోయేట్టు చొక్కాను తుడుచుకొని, పంచెమీద ఎత్తు పెట్టి, తాటిచెట్టు మొదట్లో నిలబడి, రెండు చేతులెత్తి దణ్ణం పెట్టి, రెండు చేతులతో తల్లిని వాటేసుకొన్నట్లు చెట్టును వాటేసుకొని కాళ్ళెత్తి చెట్టుకు మోటించి ముందు

గ్రరున తిరిగి పడిపోతున్నారు. అంచాత ఆ 'ఇంజక్షన్లిచ్చేముందు 'పెన్సిలిన్' రోగి వొంటికి పడుతుందా పడదా అని ఆరా చూచుకోవలసొస్తోంది డాక్టర్లు. ఈ 'పడక పోవడాన్ని' ఎలర్జీ' అంటున్నారు డాక్టర్లు. దానిమీద పరిశోధనలు జరగ్గా... 'పెన్సిలిన్ ఆయింటుమెంటు' తరుచు వాడే 'పేషెంట్లు' సర్వ సాధారణంగా ఈ 'ఎలర్జీకీ' గురి అవుతున్నారని తేలింది. ఆ 'ఆయింటుమెంటు' వాడకం నిషేధించాలిసిన అవసరమెంతేనా వుంది. ఆ పాయింటు 'నోట్సులో' వ్రాసుకున్నాడు డా. రాజారావు.

బయల్దేరేముందు 'నోట్సు' ఒకసారి తిరగెయ్యడంలో ఏమి స్ఫురణ కొచ్చిందో మరి, చట్టున 'నోట్సు' లో ఆ భాగం కొట్టిపారేసి కాగితాలు పంట్లాంజేబులో కుక్కేసి 'కాన్ఫరెన్సు'కి వెళ్ళిపోయాడు.

'కాన్ఫరెన్సయిం' తరవాత, సాయంత్రం 'క్లబ్బు'లో 'లాన్' మీద కూర్చుని 'గోల్డ్‌స్పాట్' తాగుతూ తీరిగ్గా ఆలోచించుకున్నాడు. తనెందుకు ఆ భాగం కొట్టేసినట్టు? 'కాన్ఫరెన్సు'లో ఎందుకు ఆ విషయ మెత్తుకోలేదు తను? ప్రసక్తాను ప్రసక్తంగా పెన్సిలిన్ ఆయింటుమెంటు నిషేధించాలీ అని తను ప్రచారం చేసుకొంటో పోతే... 'సంజీవినీ మెడికల్ స్టోర్సు'లో నిలవున్న 'పెన్సిలిన్ ట్యూబు'లు అమ్ముడుకావన్న భయం లోపల పనిచేసిందా కొంపతీసి?

ఈ రామనాథం తన వ్యక్తిత్వాన్నే కులుషితం చేసి వదలిపెట్టి నట్టున్నాడు. 'కీ' యిచ్చి వొదిలినట్టు అతనికి ఇష్టమొచ్చిన విన్యాసంలో తన వూహాపోహాలు మెలితిరిగి పోతున్నాయి ఖర్మ. తను పాపకూపంలో పడిపోతున్నాడా? ఇంతాజేసి 'పెన్సిలిన్. ఎలర్జీ' ని గురించిన పరిశోధన లప్పుడే ముగిసినట్టు లెక్కా? కొన్నాళ్లయిం తరువాత... వెనక్కి తిరిగి... 'పెన్సిలిన్ ఆయింటుమెంటు' లో దోషమేమీ లేదని తేలనూవచ్చును. ఎన్ని చూట్టంలేదూ? 'రిసెర్చి'కి అంతేముందీ? డాక్టరుగా తనుచేసిన ద్రోహ మేమున్నదీ ఇందులో?

తనవీపు తానే చరుచుకుని... ఒక 'గార్డినాల్' మాత్రవేసుకుని, 'సీలింగ్‌ఫాన్' మీటనొక్కి, 'వులెన్‌రగ్గు' మెడమీద కంటా లాక్కుని గాఢంగా నిద్రపోయాడు డాక్టరు.

☆ ☆ ☆

ఆసుపత్రి 'కన్‌సల్‌టేషన్ రూం'లో కూచున్నాడు డాక్టరు. 'కాఫీ హోటల్' సర్వరొకడు వచ్చాడు. రక్తహీనంగా బలహీనంగా వున్నాడు. వైన వైనాలుగా అతగాడు చెప్పింది విన్నాడు డాక్టరు.

మలపరీక్ష అయిన తరువాత కడుపులో పాములున్నాయని నిర్ధారణ కొచ్చాడు డాక్టరు. 'పెప్పరజిన్ సిట్రేట్' బిళ్లలు తెచ్చుకొమ్మని 'ప్రిస్‌క్రిప్షన్' వ్రాసిచ్చాడు. 'సంజీవిని స్టోర్సు'కి వెళ్లి దానికి బదులు 'సాన్‌టోనిన్' తెచ్చుకున్నాడు పేషెంటు.

'మీరు వ్రాసిచ్చింది లేదన్నారండి... ఇది దానికితూగే మందేనట' అన్నాడు వాడు.

డాక్టరు ఆలోచించాడు. మొన్నమొన్ననే 'పెప్పరజిన్ సిట్రేట్' 'కన్‌సైన్ మెంటొ'కటి వచ్చినట్టు బాగా గుర్తు - 'డిస్‌ట్రిబ్యూటరు' 'స్టోర్సు' ముందు 'డెలివరీ వాన్' మీదనించీ పేకేజీ పెట్టెలు దింపుతుండగా - 'రవుండ్సు'లో తాను స్వయంగా

చూశాడు కూడాను. అప్పుడే అయిపోయినయ్యా? అసంభవం. వాడి వ్యాధికి 'సాన్‌టొనిన్' సయితం పనిచేస్తుంది. కాని, దరిమిలా... దానికి ప్రత్యామ్నాయంగా వచ్చిందీ... అంతకన్న రూఢిగా గుణ మివ్వగలదీ 'పెప్పరజిన్ సిట్రేట్.' రామనాథం తను వ్రాసిన మందిి వ్యక 'సాన్‌టొనిన్' ఎందుకిచ్చాడో లీలగా అర్థమయింది డాక్టరికి. ఆ 'స్టాక్కు' టయిముదాటి నిల్వలు పేరుకుంటున్నాయి గావున – 'స్టోర్సు'లో.

ఆలోచన వొక కొలిక్కి రానేలేదు. 'ఇంజక్షన్'నిచ్చి 'పేషంటు'ని పంపేశాడు.

తరువాత తరవాత గుర్తుకొచ్చింది డాక్టరికి. 'ఆల్బుమిన్' దోషమున్న 'పేషెంట్ల'కి 'సాన్‌టొనిన్' పడదు. తన 'ప్రిస్క్రయిబ్' చేసింది అది కాదు గదా అన్న భరోసామీద అతని నీరుడు పరీక్షకి పెట్టలేదు తను. దానా దీనా రోగ మెంతకీ లొంగుబాటుకి రాలేదు. నాలుగు రోజులనుకున్నది ఇరవై రోజులు పట్టింది. ఆఖర్న తన 'సాంపుల్స్' లోనించీ 'పెప్పరజిన్ సిట్రేట్' వాడిన తరవాతనే గుణం కనిపించింది. వాడికి 'హోటల్‌ప్రొప్రయిటరు' ఇరవై రోజులే నాగా వ్రాశాడు పాపం. 'నన్నేమి చెయ్యమంటావురా?' అని నిష్ఠూరంగా మొహం పెట్టాడుగాని, డాక్టరు లోలోపల విలవిల్లాడి పోయాడు. వంకర నడకలు నడిచే అలవాటు లేని వాడికి కాస్తంత క్రూరంగా పోవాలిసొస్తే ఎవరో గొంతు నులిమేస్తున్నట్టు గింగిరాలు తిరిగిపోతాడు! స్వయంకృతాపరాధానికి శిక్షగా వాడి దగ్గరనించీ దమ్మిడీ ఫీజు తీసుకోలే దక్కడికేమూ.

ఇలా వొకటేమిటి... టైఫాయిడొస్తే 'టెట్రాసైక్లిన్ సిరప్' తెచ్చాడొక పేషెంటు. అంతకన్న గుణమిచ్చేదీ... వెయ్యగానే పలికేదీ 'క్లోరోఫెన్ కాల్‌సిరప్' ప్రిస్క్రయిబ్ చేశాడు తను. ఈ రామనాథం... అక్కడ 'స్టోర్సు'లో ఖరాగా కూచుని... ఏమీ ఎరగనట్టు... ఇక్కడ ఆసుపత్రిలో తన వైద్యాలన్నీ తారుమారు చేస్తున్నాడు త్రాష్టుడు!

రాత్రి బోజనాలకి ముందు రామనాథాన్ని పట్టుకుని కడిగేశి వదిలిపెట్టాడు. తానొకటి వ్రాశిస్తే అతగాడు ఇంకోమందు చేతిలో పెట్టి పంపిన సందర్భాలన్నీ ఏకరువు పెట్టాడు.

'మీరు వ్రాసిన 'పెప్పరజిన్ సిట్రేట్' స్టాక్కులో వున్నదనుకోండి. 'సాన్‌టొనిన్' మురిగిపోతుంది మరి. అది ముందు వొదిలించు కోవాలి గదాని...' తలగోక్కున్నాడు రామనాథం.

'అంటే నీ వుద్దేశ్య మేమిటి? 'పలానిమందు' అని 'ప్రిస్క్రయిబ్' చేశేది నువ్వా నేనా? నీ ఇష్టమొచ్చిన మందులు నువ్విస్తుంటే ఇక నేనెందుకిక్కడ? ఈ ఆసుపత్రి కూడా నువ్వే నడుపు. నేను జపం చేసుకుంటూ కూచుంటాను' అని ఒక్క కసురు కసిరాడు. డాక్టరు రాజారావు మొహం కండలుబ్బినై.

'మీ ఇష్టం... ఏదిమ్మనమంటే అదే ఇస్తా... నాదేం పోయింది? అసలు మీ రొకసారి 'స్టాక్సు' విడివిడిగా పరిశీలించి ఏవేవి 'టయిం ఎక్స్పయిర'వుతున్నాయో...'

అర్థోక్తిలో చర్రుమన్నాడు డాక్టరు.

'ఠాట్' – స్టాక్సూ చట్టుబండలూను. నా ఇష్టమొచ్చిన మందు నేను 'ప్రిస్క్రయిబ్' చేస్తాను. ఏది రాస్తే అదివ్వు. అది 'స్టోర్సు' లో లేకపోతే లేదనిచెప్పు. ఇంకొక 'స్టోర్సు'కి వెళ్లి తెచ్చుకుంటాడు. అంతేగాని నీబోడి పెత్తనమొకటా యిందులో?' రెచ్చిపోయాడు డాక్టరు.

గుక్కిళ్లు మ్రింగి బిరబిరా మెట్లుదిగి పొయ్యాడు రామనాథం.

తరువాత డాక్టరికి పశ్చాత్తాపం ముంచుకొచ్చింది. రామనాథాన్ని అనుకోవడం దేనికి? తనూ నిజానికి కొంత అస్తవ్యస్తంగానే 'ప్రిస్క్రయిబ్' చేస్తున్నాడు డ్రగ్గులు. తనకేదో వొరగబెడదామని అతగాడు అడపాదడపా బురదలో అడుగువెయ్యనూ, తనచేత మొహం వాచేలా చివాట్లు తినటూ జరుగుతున్న తంతు. అతనేదో తనపట్ల అపచారం చేస్తున్నట్టు తేపతేపకీ నోరుచేసుకోవడం బాగుండలేదు. ఏదో బావమరిది కాబట్టి తలవొంచుకుని పోతున్నాడు మానవుడు అమట్న పారిపోకుండా. కాలునిలద్రొక్కుకుని, 'నువ్వొకటి వ్రాస్తే నేనొకటివ్వడం చూస్తుంటివిగదా... ఎందుకు తిరగొట్టలేదూ? 'ఆ మందే పట్రమ్మని ఎందుకు పట్టుబట్టలేదూ?' అని ఎదురుదాడిచేస్తే... తన నోటికి తాళం పడదూ? ఈ వ్యాపారంలో తనూ రామనాథమూ లాలూచీ అన్న గుట్టు గుట్టుగా వున్నంత సేపేగాని... ఆ వాసెన కాస్తా తొలగించి కుండ బద్దలుకొడితే మెతుకులు చెల్లాచెదరైపోవూ?'

డాక్టరికి బెంగపట్టుకుంది. తను ఇట్లా దిగజారిపోతున్నాడేమిటి?

మెట్టుకి... ఈ వ్యాపారంలో తల దూర్చిన తరవాత తన 'ట్రీట్మెంటు' పద్ధతులు ఇదివరకంత వుదారంగా, ఉన్నతంగా, ఖచ్చితంగా నడుస్తున్నాయా అంటే లేదనే చెప్పకోవాలిసొస్తుంది. తన బుద్ధి పెడతలబడుతోందా యేమిటి చెప్మా? కంపనబడ్డ కాకిలా గిలగిలకొట్టుకున్నాడు డా.రాజారావు. తేపతేపకీ 'బ్యాంక్ ప్యాస్ బుక్కు' లోవున్న అంకెల మీదకి దృష్టిపోతోంది. బుద్ధి గడ్డితింటోంది! ఏమి చెయ్యాలి?

☆ ☆ ☆

కొయ్య గుర్రమెక్కి ఊగుతున్నాడు గోపీ.

చారల పైజమా వేసుకొంటో, 'ప్రయివేటు మేష్టారు రాలేదుట్రా?' అని కళ్లెరజేసి గదమాయించాడు డాక్టరు రాజారావు.

'మేష్టారు రాలేదు నాన్నా!' అన్నాడు గోపీ, ఊగడం ఆపి.

'మేష్టారబ్బాయికి జ్వరమంటండీ. మూడు రోజులనించీ రావటం లేదు. ఎలావుందో పాపం!' అని టీ అందించింది రాజేశ్వరమ్మ.

చటుక్కున స్ఫురించింది డాక్టరికి. అమధ్య మేష్టారు. కుర్రాణ్ణే తీసుకొచ్చాడు ఏదో జ్వరమని. లోగడ ఆయనెప్పుడు వచ్చినా తన ఆసుపత్రిలో మందులే ఉచితంగా వాడనూ, 'ఫీజ్'వ్వ బోయినా తిప్పిగొట్టనూ జరుగుతున్నదేను. ఈ సారి అందరితోపాటు అలవాటుగా ఆయనకీ 'ప్రిస్క్రిప్షన్' చీటీ వ్రాసిచ్చాడు. 'యాంపూల్స్' కొని తీసుకొచ్చాడాయన. నాలుగింజక్షన్లయిన తరవాత ఆయన మళ్లీ రాలేదు కుర్రాణ్ణే తీసుకుని, వ్యాధి తగ్గుముఖం పట్టగానే రోగులు తన దగ్గరికి రాకపోకలు తగ్గించడం అనవాయితీ వున్నదేను. అంతే అనుకుని పట్టించుకోనేలేదు తను.

మేష్టారు పెద్దవాడు; పేదవాడు; బహుకుటుంబీకుడు. భారంగా సంసారమీదుస్తున్న వాడు. ఏమయిందో ఏమో పాపం. సొంతకారు వేసుకుని మేష్టారింటికి వెళ్లాడు తిన్నగా.

ఇల్లు నానా దరిద్రంగానూ వుంది.; అక్షరాలా అయ్యవారి నట్టిల్లు. కుర్రవాడు కుక్కిమంచం మీద పడివున్నాడు. ముక్కాలిపీట మీద మందులూ అరఖులూ పేర్చిపెట్టివున్నాయి. ఇంట్లో అంతా గాబరాగా వున్నారు.

మేష్టారు క్షమించమని ప్రాధేయపడ్డాడు డా.రాజారావుని. వారంరోజులు చూచి... జ్వరమెంతకీ తగ్గకపోగా... ఇంకో డాక్టరి దగ్గర ట్రీట్‌మెంటు ప్రారంభించాడు. అదీకథ.

డాక్టరికి కోపంరాలేదు. సిగ్గువేసింది పైగా.

కొత్త డాక్టరు 'ప్రిస్క్రయిబ్' చేసిన 'డ్రగ్గే'మిటాని ముక్కాలిపీట మీద వున్న 'స్లిప్పు' పరిక్షగా చూచాడు డా. రాజారావు. స్ట్రెప్టో పెన్సిలిన్ వ్రాసివుంది. తలకొట్టేసి నట్టయింది. అది న్యూమోనియా అని తెలిసీన్నీ, తను అన్నాళ్ళూ, 'సల్ఫాడైజిన్ ఇంజక్షన్ని'స్తో పాతకాలపు వైద్యం చేసినట్టు తెలిస్తే ఏ చిన్న డాక్టరయినా నవ్వుతాడు.

'సల్ఫాడైజిన్' మీదకి తన కలం ఎందుకు పోయిందో డా.రాజారావుకి తెలుసు. మవునంగా ఇంటికొచ్చి ముడుచుకుని పడుకున్నాడు. కుర్రవాడి పరిస్థితి ఏం బాగాలేదు. సరియైన డ్రగ్గు సకాలంలో పడలేదు.

☆ ☆ ☆

మధ్యాహ్నం ఎండ మిటమిటలాడుతోంది.

అప్పుడే ఒక ఆపరేషన్ ముగించి 'వాష్‌బేసిన్లో' చేతులు కడుక్కుంటుండగా మేష్టారబ్బాయికి ప్రాణంమీద కొచ్చిందని కబురొస్తే పరిగెత్తాడు.

వెళ్లేసరికి అంతా అయిపోయింది.

తిరిగొచ్చేసి కాస్త విశ్రాంతి తీసుకుందామని మెట్లెక్కి పైకొచ్చాడు.

రామనాథం మేడమీద 'హోపెన్‌వరండా'లో కాచుకుని వున్నాడు.

గడిచిన క్వార్టర్లీ అంటే మూడు నెలలు జమాఖర్చులూ చూపిద్దామని వచ్చాడు.

'రిజిష్టర్లూ' 'వోచర్లూ' అన్నీ టేబిలు మీద పరిచి వివరిస్తున్నాడు.

డాక్టరు మూతి బిడాయించుకుని కూచున్నాడు.

ఈ మెడికల్ స్టోర్సు డాక్టరిదే అనీ... అయన పెట్టుబడి మీదనే అది నడుస్తున్నదనీ... తానేదో బేడ వాటా తీసుకొంటున్నా నెలజీతగాణ్ణి మాత్రమేననీ... దాని మీద తన యాజమాన్యం నిమిత్త మాత్రమయిందనీ... అక్షరాలా కాదుగానీ... ఆ అర్థం వొచ్చేలా సంజాయిషీ ఇచ్చుకొంటూపోయే ధోరణి రామనాథానిది.

'ముందూ వెనకా చూచుకోకుండా బావగారు 'ప్రిస్క్రిప్షన్లు' రాశేస్తున్నారు. ఈ నెలాఖరికి 'టయిం ఎక్స్‌పైర' య్యే మందులు బోలెడున్నాయి. తరవాత మీ యిష్టం' అని 'రిజిష్టర్లు' మూసిపెట్టాడు రామనాథం.

డాక్టరు తాచుపాములా బుస్సుమని లేచాడు కుర్చీలోనించీ.

అమట్న ఆ రిజిష్టర్లూ, మందులూ, బిల్లులూ... అన్నీ కలపి రామనాథం మొహాన్ని కొట్టాడు.

'యు... యు... గెటవుట్ రాస్కెల్! నువ్వూ, 'నీ స్టోర్సూ', నీ 'స్టాక్సూ' గంగలో కలవండి. ఘడీఘడీకీ లాభనష్టాలు బేరీజు వేసుకొంటో 'ట్రీట్‌మెంట్లు' సాగించమంటావా నన్ను? ఆ మందు ప్రిస్క్రయిబ్' చెయ్యమనీ ఈ మందు 'ప్రిస్క్రయిబ్' చెయ్యమనీ నాకు సలహా ఇవ్వు ఇంకోసారి, తంతాను. ఇక నించీ ఆ 'స్టోర్సూ' ఆ 'క్లినిక్కూ'... వాటి లాభనష్టాలతో నాకు నిమిత్తం లేదు. ఆ వ్యవహారాలన్నీ నీ నెత్తినే వేసుకుని వూరేగు – నాకొద్దు

"నువ్వు నా జీవితంలో అడుగు పెట్టక ముందు నేనొక డాక్టర్ని ... రూపాయికి పదహారణాల డాక్టర్ని. అతిశయోక్తి... ఆత్మస్తుతి కాదు, అక్షరాల దేముడి డాక్టర్ని, ఈ రొంపిలోకి దిగిన తరవాత ... నేనొక శిక్షపడని దొంగని... దగాకోరుని... ఆశ్చర్యం లేదు... ఒక హంతకుణ్ణి! మళ్లీ నీ మొహం నాకు చూపావా?... ఆ....' అని వూగిపోయాడు.

రామనాథం బిత్తరపోయి... కండువా చంకనెట్టుకుని...మాట పెగిలిరాక హొణికిపోతూ... ఆ పాటున నిల్చుండిపోయాడు.

రాజేశ్వరమ్మ ఆ గలభాకి లోపల నించీ వొచ్చేసి... పెనిమిటి నరసింహావతారమ్మీద వున్నది గమనించి అప్రతిభురాలై పోయింది.

'ఇదిగో, నువ్విందులో తల దూర్చావా... మాట దక్కదు' అని ఆమె వంక ఒక్క ఉరుమురుమి, లోపలకి దూరి గడియవేసుకున్నాడు డాక్టరు.

☆ ☆ ☆

మర్నాడు ఉదయం 'కన్‌సల్టింగ్ రూం'లో కూచున్నాడు డాక్టరు. ఆయన ముఖం ప్రసన్నంగా వుంది. కిటికీలో నించీ రాత్రిరంతా మంచులో తడిసిన మాలతి తెల్లగా పరిశుభ్రంగా మెరుస్తోంది.

కనపడని సంకెళ్ళేవో విడుల్చుకున్నట్టయి... ఒక్కసారి వొళ్లు విరుచుకున్నాడు. మిస్టర్ రాజారావు మళ్లీ డాక్టర్ రాజారావయ్యాడు ఆ క్షణం.

● *ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 22–5–1970* ●

★ ★ ★

## కలువకొలను సదానంద

# 37 తాతదిగిపోయిన బండి

"మహాపచారం!" అంటూ ముక్కున వేలేసుకున్నాడు వెంకటాచలం.

అతనికి మహాపచార మనిపించిన దృశ్యమే నా కంటికి సముచితమైనదిగాను, విడ్డూరంగానూ కనిపించింది.

జాతిపితకు నూరేళ్ళూ నిండి, నూటొక్కటోయేడు వెడుతున్న శుభదినాన యావద్భారతదేశం పండుగ జరుపుకొన్నది. ఉడతాభక్తిగా మేము, మా పాఠశాల పిల్లలూకూడా సదరు ఉత్సవాన్ని జరుపుకొన్నాం.

అయితే, ఈ శతజయంత్యుత్సవ సరళిలో ఒకింతమార్పు!

ఇన్నాళ్ళూ ప్రతి జాతీయ దినోత్సవాన్ని బడి ఆవరణలోనే జరుపుకునేవాళ్ళం. తమకు తెలిసిన సంగతులేవో పంతుళ్ళు చెప్పేవాళ్ళు. పిల్లలు వినేవాళ్ళు. వేడుకలతో బడి సందడిగా వుండేది. ఇది రివాజు.

ఈసారి అలా కాదు.

గ్రామ పంచాయతీ ఆఫీసునుండి ముందుగా మాకో ఉత్తర్వు వచ్చింది, పంచాయతీ ప్రాంతానికి చెందిన అన్ని పాఠశాలల్లోని అందరు ఉపాధ్యాయులు బడిపిల్లలందర్నీ తరలించుకుని, అక్టోబరు రెండో తేదీ ఉదయం ఏడున్నరగంటలకు పంచాయతీ ఆఫీసు సన్నిధిలో హాజరు కావాలన్నది – ఆ ఉత్తర్వుయొక్క సారాంశం.

గ్రామ పెద్దల ఈ జోక్యాన్ని గూర్చి పంతుళ్ళు నలుగురూ నాలుగు రకాలుగా వ్యాఖ్యానించుకున్నారు.

సాధారణంగా పంచాయతీ ఆఫీసులకు, ప్రాథమిక పాఠశాలలకూ వున్న బాహిర సంబంధం ఒక్కటే! ఆ సంబంధానికి ఆకారం వుంది. రంగు వుంది. వాసన వుంది. రుచి వుంది. దాని పేరు మిఠాయి వెనకటి జాతీయ దినోత్సవ వేళల్లో తీపిమిఠాయిలు పంచాయతీ ఆఫీసునుండి రెక్కలుకట్టుకుని ఎగిరివచ్చి బడిపిల్లల జిహ్వలపై వాలేవి. ఈసారి పంచాయతీవారు వాటి రెక్కల్ని విరగ్గొట్టేశారు. పిల్లల్నే రెక్కలు కట్టుకు రమ్మంటున్నారు.

"ఫలానా పాఠశాల కూడా గాంధీజీ శతజయంత్యుత్సవాన్ని జరుపుకొన్నది" అనేమాట చరిత్రకెక్కకుండా చేస్తూ, "ఫలానా పంచాయతీ గాంధీజీ శతజయం

త్యుత్సవాన్ని ఘనంగా జరుపుకొన్నది" అనే మాటను మాత్రమే సువర్ణాక్షరాలతో లిఖింపబూనుకున్నారు.

పంతుళ్ళు సహజంగా పరమభాగవతోత్తములు, సాత్వికులు, ఏ గంభీరస్వరం విన్నా తలలు వంచేవాళ్ళు, పౌరసత్వంవున్న ప్రతివాడికీ విధేయులూ గనుక – ఏడున్నరకంటే ఏడుగంటలకే వెళ్ళి హాజరు వేయించుకుంటారనడంలో ఏ భారతీయుడికీ ఎట్టి సందేహమూ లేదు.

రమ్మన్న వేళకు పిల్లల్ని వరుసల్లో నిలిపి, పంచాయతీ చావడికి అభిముఖంగా నడిపించాం.

నేలమీద బంకమన్ను మెత్తి, దానిమీద చీపురుపుల్లతో గీత గీచినట్లు క్రిక్కిరిసిన కట్టడాల నడుమ సన్నటి రోడ్డు.

ఓసారి ఓ లావాటి ఆఫీసురుగారు మా బడికి వచ్చారు. మళ్ళీ ఆయన వెళ్ళిపోతుండగా ఆయన్ని రోడ్డుమీదికి సాగనంపాం. సరిగ్గా ఆ సమయంలో రోడ్డుమీద అటునుంచి ఓ బస్సు, ఇటునుంచి ఓ బస్సు ఎదురుపడ్డాయి. రోడ్డుమీదికి వెళ్లిన ఆఫీసరుగారు గబగబా బడిలోపలికి పరుగెత్తుకొచ్చారు. బస్సులు రెండూ వెళ్లిపోయినతరువాత ఆయన నింపాదిగా బయటపడ్డారు. అంత ఇరుకైన రోడ్డు అది.

ఆ రోడ్డుమీద పోగాపోగా – పంచాయతీ ఆఫీసు భుజానికి రాచుకుంటుంది. నేలమీద చోటు చాలకపోగా, ఆఫీసునెత్తినే మరో అంతస్తు వుంటుంది. మునిసిపాలిటీ కావాలని ఉవ్విళ్ళూరుతున్న మేజర్ పంచాయతీ అది. ప్రెసిడెంటుగారు ఆఫీసులో కూర్చుని ఏ దిక్కునైనా చేయిసాచితే, ఆ అధికార హస్తం రెండుమైళ్ళవరకూ సాగుతుంది. ఆ రెండు మైళ్ళ దూరానకూడా బడి వుంది. అన్నీ కలిపితే పన్నెండు ప్రాథమిక పాఠశాలలు. వీటిలో పదిహేను వందలమంది బాలబాలికలు చదువుకుంటున్నారు. వారిలో కనీసం పన్నెండు వందలమంది పిల్లలు ఈరోజు పంచాయతీ ఆఫీసుముందర నిలబడబోతున్నారు. బుడ్డీలో భూతం దూరినట్లు! ఇది ఎలా సాధ్యం? ఈ రోడ్డుమీద రెండు బస్సులు ఎదురుపడితే–మనిషి తప్పుకుపోవడానికైనా చోటు లేదే!

తినబోతూ రుచి అడగడం ఎందుకూ? అందాకా నడిస్తే ఆ సందేహమూ తీరిపోతుందికదా? నడవడం మన వంతు! నడిపించడం వాళ్ళ వంతు!

ఇంజను ఆఫీసుముందర ఆగింది. వెనుకనున్న పెట్టెలన్నీ చిందర వందరగా ఒకదానిమీద ఒకటి తూలిపోయాయి. కాళ్ళు పచ్చడైపోయాయనీ, బట్టలు నలిగిపోయాయనీ పిల్లలు ఒకర్నొకరు కీచులాడుకున్నారు.

"ఇంకొక నాలుగడుగులు నడవండి!" అన్నాడు ఆఫీసుగుమాస్తా.

"ఎక్కడికి?" అన్నారు మా హెడ్మాష్టరుగారు.

గుమాస్తా రెండో మాట మాట్లాడలేదు. అతనిచేయిమాత్రం రెక్కమానులాగా కదిలింది.

ఆ చేయి వూగినవైపుగా మా దండు కదిలింది.

"చినదానా! చినదానా! ఓ చిలిపికనులదానా! రా ముందుకు సిగ్గెందుకు? నీ ముందు నేనులేనా!" అంటూ లౌడ్‌స్పీకరు గొంతెత్తి పిలుస్తోంది.

పంచాయతీ ఆఫీసు ఎదుటివైపున పోలీసు మైదానం వుంది. మైదానంలో రోడ్డుకు దగ్గరాగా ఎడ్లబండి నిలిచివుంది. రంగురంగుల తోరణాలతో అందంగా అలంకరింపబడి వుంది. రాజకీయోపన్యాసకుల నోళ్ళలాగా – అందులో రెండు లౌడ్‌స్పీకర్లున్నాయి. కొత్తగా తీర్చిన దిష్టిబొమ్మలా తెల్లటిబట్టలతో బండివద్ద నిలబడివున్న ప్రెసిడెంటు రామభద్రుడుగారు మమ్మల్ని చూచి, గంభీరంగా రిస్టువాచీవైపు చూసుకున్నారు.

"పొద్దెక్కిపోతోంది. పిల్లల్ని అటువైపున కూర్చోబెట్టండి."

సముద్రందాటి లంకలో వాలిన కోతిమూకలా పిల్లలందరూ సైడు కాల్వను లంఘించి, పోలీసు మైదానమంతటా నిండిపోయారు. క్రమంగా పాఠశాలలన్నీ ఒక్కటొక్కటే రాసాగాయి. నదులన్నీ వచ్చి సముద్రంలో కలిసినట్లు–వచ్చిన వాళ్ళందరూ పోలీసుమైదానంలో క్రిక్కిరిసిపోసాగారు. మైదానంలో ఆటుపోటులు ఎక్కువైనాయి.

అది పేరుకుమాత్రమే మైదానం. అందులో ఆ చివర ఒకడు, ఈ చివర ఒకడు నిలబడి చేదత్రాడు పేనుకోవచ్చు. ఆ మైదానం అంచుల వెంబడే గోడకట్టి, ఓ ఎలిమెంటరీస్కూల్ బిల్డింగు కట్టుకోవచ్చు! (అడుకునే నాథుడుంటే!)

ప్రజలకు అందకుండా నిచ్చెనపై మెట్టున వున్నవాణ్ణి లోకం ప్రజాసేవకుడనటంలేదూ? ఆ పరిభాషలో ఇది మైదానమే!

పోలీసువాళ్ళది గనుక పోలీసుమైదానమైంది. అయితే ఆ పోలీసువాళ్ళుఅరుదుగానైనా దీన్ని వాడుకుంటున్నట్లులేదు. "సత్యం చెప్పడానికి భయపడనవసరంలేదు" అన్నది గాంధీగారి సూక్తి. తొలగించడానికి వీలులేనంతగా పెరిగిపోయిన అవినీతిలా పోలీసుమైదానమంతటా నిండిపోయిన పల్లేరుమొక్కలు మలమూత్రావశేషాలు నిర్భయంగా నిజం చెబుతున్నాయి.

గంట ఎనిమిదిన్నరైంది. దయలేని సూర్యుడు పసిపిల్లల్ని ఎండలో మాడ్చసాగేడు. ఒకవైపు కొందరు పంతుళ్ళు పిల్లల్ని గదమాయించి కూర్చోబెడుతున్నారు. వాళ్ళపాలిటికి అది గోడకుర్చీకంటే కఠినమైన శిక్షగా పరిణమించింది. "అయ్యో! ఇక్కడ ముళ్ళు గుచ్చుకుంటున్నాయి మాష్టారూ! ఇక్కడ గలీజుగా వుంది మాష్టారూ!" అంటూ కుయ్యోలిడుతున్నారు. మరోవైపున – "ఉత్తరువు మేరకు తప్పక వచ్చాము. అందుకు దాఖలాగా, ఇదిగో మా అవనత ముఖాలు!" అంటున్నట్లు పంతుళ్ళు రామభద్రుడుగారి కట్టెదుట నిలబడి ఓ "నమస్కారం" సమర్పించి వచ్చే తంతు కొనసాగుతున్నది.

పిల్లలకు యివ్వగలిగింది యిచ్చివేయగా, పెద్దలకు యివ్వగలిగింది పేదపంతుళ్ళదగ్గరేముంటుంది? నమస్కారం తప్ప.

ఏదో సినిమాలో దొరలను తూర్పారబట్టే తందానపాట లౌడ్‌స్పీకరులో గింగురుమంటూ ప్రారంభమైంది. ప్రెసిడెంటు రామభద్రుడుగారు వెంటనే నోరుచేసుకున్నారు. "ఏయ్ మస్తాన్! అదేం పాటోయ్? ఏదన్నా మంచిపాట వెయ్!"

పాట ఆగిపోయింది.

"ఈ పాట నేను వెయ్యాలని వెయ్యలేదండీ! అదే వొచ్చేసింది!" అంటూ జవాబిచ్చాడు బండిలోకూర్చున్న మస్తాన్. "ఇదిగో, ఈ పాట వినండి సాబ్!..."

"బలేతాత మన బాపూజీ
బాలల తాత మన బాపూజీ...
కులమత భేదం వలదన్నాడు
కలిసి బ్రతికితే బలమన్నాడు
మానవులంతా ఒకటన్నాడు
మనలో జీవం పోశాడు..."

వెంకటాచలం ప్రెసిడెంటుగారివైపు చూశాడు. బండిలోని మస్తాన్ వైపు చూశాడు. అతని చూపులు బండిమీదే నిమిషంపాటు నిలిచాయి. అప్పుడన్నాడామాట!

ఆ రోజు ఉదయం ఎనిమిదిన్నర గంటలవేళ – పోలీసు మైదానంలో నిలబడి, ముక్కున వేలేసుకుని వెంకటాచలం అన్నమాట –

"మహాపచారం!"

"ఎవరికి?" అన్నాను.

"ఇంకెవరికి? గాంధీకి!"

"ఎందుకూ?"

"ఆ బండిని చూశావా?"

"చూశాను."

"మళ్ళీ చూడు."

"చూశాను..."

"ఆ బండి చాలా దిట్టంగా వుంది. లారీకిమల్లే నాలుగువైపులా ఇనపగోడలు. అది పంచాయతీవాళ్ళ పాకీబండి. వీధుల్లోని పెంటకుప్పలు ఖాళీచేసేందుకు ఉపయోగిస్తున్నబండి. ఈ బండితో ఇప్పుడు ఊరేగింపు జరగబోతున్నది. బండిని శుభ్రంగా కడిగారు. రంగుకాగితాలు కట్టారు. పూలసరాలు వేలాడదీశారు. అందంగా వుంది. అంతా బాగుంది; అయితే... సదానందం! సరిగ్గా చూడు!"

"వెంకటాచలం! నాకు ఓపిక ఎక్కువ. నాకు కోపం తెప్పించడం నీవల్లకాదు."

"నీకు బుద్ధిలేదు!" అన్నాడు వెంకటాచలం.

ఎందుకు బుద్ధిలేదని నేనడగలేదు.

"ఎందుకు లేదంటే – ఆ బండిని చూడు – సరే, నువ్వు చూడలేవులే! అది ఒంటెద్దు బండి!"

నేను పలకలేదు.

"అందులో గాంధీపటం పెట్టబోతున్నారు. గాంధీగారి బండికి కాడెద్దుల్ని కట్టాలి. అదే సమంజసం! ఒంటెద్దును కట్టి ఊరేగటం తప్పుకదూ?... ఇంత ముఖ్యమైన లోపం నీ బుద్ధికి తోచకపోయిందేమా అని నాకు ఆశ్చర్యంగా వుంది. నీకు మల్లేనే – ఆ పంచాయతీ వాళ్ళకు కూడా బుద్ధి లేనందుకు విచారిస్తున్నాను."

"వెంకటాచలం! నువ్వే బోల్తాపడ్డావు."

నేనా!"

"వార్తాపత్రికలు చదివే ముఖం కాదు నీది."

"డబ్బిచ్చి కొని, మరీ చదువుతున్నాను తెలుసా?"

"అయితే, నీకు బుద్ధిలేదని స్పష్టమైపోయింది. చదివిన మాటలు నీకు అర్థమై వుండవు. జోడెడ్లు ఒకదానితో ఒకటి పోట్లాడుకున్నాయనీ, ఎడమొగం పెడమొగంగా వుంటున్నాయనీ వార్తాపత్రికలలో నువ్వు చదవలేదూ? ఇక బండికి మిగిలింది ఒంటెద్దే!"

వెంకటాచలం కళ్ళు చిత్రంగా మెరిశాయి. "ఔను సుమా! బుద్ధి నీకూ వుంది. లేనిది నాకూ నాటోటి వాళ్ళకే!... అయితే, ఈ బండికి కట్టింది ఎలపటెద్దా, దాపటెద్దా?"

"ఈ ప్రశ్న ప్రెసిడెంటుగారిని అడగాలి!"

మా బడి మాస్టర్లందరూ ఒక్కచోట చేరాము. పల్లెలనుండి వచ్చిన తెలివైన పంతుళ్ళు కొందరు గొడుగులు తెరచి పట్టుకున్నారు. గొడుగులు లేనివాళ్ళందరూ కండువాలతో, జేబురుమాళ్ళతో చెమటలు తుడుచుకోసాగారు. ఇక పిల్లల మాట చెప్పాలా? వాళ్ళలో గోల ఎక్కువైంది.

"ఇంత ఆలస్యం చేస్తున్నా రేమిటీ? పిల్లల్ని యిలా ఎండబెట్టి, ఎక్కడికైనా ఎగుమతి చేయాలనుకున్నారా?" అంటూ విసుగ్గా గుసగుసలాడాడు నారాయణమూర్తి.

"ఊళ్ళోని పెద్దలెవరో రావాలట! అందుకే ఆలస్యం!" అన్నాడు రంగనాథం.

అప్పుడు ఉగాది పచ్చడిని తలపింపజేస్తూ సీతాలక్ష్మి గొంతు వినిపించింది. ఆ గొంతులో కొత్తబెల్లంలోని తీపిలా రాగం, మామిడి పిందెలోని వగరులా విసుగు, వేప చిగురులోని చేదులా కాస్తంత కోపమూ కలిసిపోయాయి.

"అసలు మనకు బుద్ధిలేదు. వాళ్ళు రమ్మంటే రావటానికి, నుంచోమంటే నుంచోటానికి – వాళ్ళు కొనుక్కున్న మనుషులమా మనం? ... ఎందుకొచ్చిన బెడదసార్ యిది?"

సీతాలక్ష్మి అందంగా వుంటుందని నేనెప్పుడూ అనుకోలేదు. ఆమె ఇవాళ అందంగా వుందనిపించింది. ఆమె ముఖం ఎందుకో కాస్త ఎర్రబడి, రావి చివురులా మిసమిసలాడుతోంది. సూర్యాస్తమయం తరువాత ఆకాశంలో కనిపించే పల్చని ఎరుపుజీర ఆమె కంటిలో తొంగిచూస్తోంది. అందుకే సీతాలక్ష్మి అందంగా వుంది.

మైదానం చేరుకొన్నప్పటినుంచీ ఆమె ఎవరితోనూ ఒక్కమాట కూడా మాట్లాడలేదు. మనుషులందరూ తనకు కానివాళ్ళయిపోయారన్నంత బెంగతో, ఆగ్రహంతో అక్కడక్కడా ఒదిగి నుంచుంటోంది. ఆమె గుండెలో ఎక్కడో ముల్లుగుచ్చుకున్నట్లుంది.

"ఏమైందమ్మా?" అన్నాడు వెంకటాచలం.

"తెలియనట్లడుగుతారేమండీ?" అంది సీతాలక్ష్మి నిష్ఠురంగా.

"ఎక్కడో పడాల్సిన పిడుగు నా నెత్తిన పడుతోందేమిటి?... నిజంగా నాకేమీ తెలియదమ్మా!"

కళ్ళు చక్రాల్లా త్రిప్పుతూ, అభినయిస్తున్నట్లు చేతులు వూపుతూ సీతాలక్ష్మి చెప్పసాగింది: "మనం యిక్కడికి పిల్లల్ని తీసుకుని వస్తున్నప్పుడు, మీరు ముందొచ్చేశారు. నేను లైను చివర వస్తున్నాను. పిల్లలందరూ వరసగా సైడు కాలవ దాటుకుంటున్నారు. ఒక కుర్రవాడు కాలుజారి కాలవలోపడి, మోకాళ్ళదాకా బురదపట్టించుకున్నాడు. ఆ పుప్పిపళ్ళ ప్రెసిడెంటు బండి దగ్గరే నిలబడున్నాడు. ఊరికంతా తానొక్కడే నాథుడైనట్లు ఒకసారి ఎగాదిగా చూసి, పొట్టి మెడ అటూ యిటూ తిప్పి, 'ఈ పంతుళ్ళకూ బుద్ధిలేదు, పంతులమ్మలకూ బుద్ధిలేదు. పిల్లల్ని ఎలా నడిపించాలో కూడా తెలియకపోతే ఎట్లా?' అంటాడా? ఎంత ప్రెసిడెంటయితే మాత్రం అంత తెంపరితనమా?... ఈ – ఈ మొనగాడేనా నాకు పెట్టి పోషిస్తున్నది?... పంతుళ్ళూ పంతులమ్మలూ ఈ పొగరుబోతుగాడి పెళ్ళాలనుకుంటున్నాడేమో?" అంటూ కొంగుతో కళ్ళొత్తుకుంది ఆమె.

పంతుళ్ళందరూ చాలా బాధ పడ్డారు. ఆమె మీద జాలిపడ్డారు. రామభద్రుడిగారి మీద కోప్పడ్డారు. అయితే ఆ కోపం పరోక్షంగా మాత్రమే. ప్రెసిడెంటుగార్ని నిలువునా పాతెయ్యకపోయినా, నిలుచున్న చోటే ఘెరావో చేసి ప్రాయశ్చిత్తం జరిపించేంత చైతన్యం పంతుళ్ళ బోడి బ్రతుకుల్లో ఎక్కడేడ్చింది? వాళ్ళ బ్రతుకే వాళ్ళకు పద్మవ్యూహమైపోతేను!

చేయగలిగింది ఒక్కటే! ఆమె పట్ల సానుభూతిగా తలా ఒక్కమాటా మాట్లాడడం. ఆ సానుభూతికోసమే సీతాలక్ష్మికూడా ముఖం వాచిపోయినట్లుంది, పాపం!.

రంగనాథం అన్నాడు. "మనందర్నీ అతగాడి పెళ్ళాలే అనుకున్నాడుపో, అయితే మొగుడికి కూడా హద్దులున్నాయి. సీతాలక్ష్మిగారూ! హద్దు మీరితే, పెళ్ళాం కూడా 'పోరా ధగిడీ!' అంటుంది ఈ రోజుల్లో. అంతెందుకు? మన రామభద్రుడుగారి కథే తీసుకుందాం. గడిచిన పంచాయతీ ఎలక్షన్లప్పటి సంగతి. రామభద్రుడు – ప్రెసిడెంటు అయిన తర్వాతనే "గారూ" అన్నారు, అంతకు ముందు వుత్త రామభద్రుడే లెండి – చావు తప్పి కన్నులొట్టబోయి, చివరికి ఎలాగైతేనేం ఒక వార్డులో గెలిచాననిపించుకున్నాడు. అతగాడి భార్యకూడా ఓ ఆడవాళ్ళ సీటుకు పోటీచేసి గెలిచింది. ప్రెసిడెంటు కావటానికి బొటాబొటిగా సరిపోయేంత బలాన్ని సంపాదించుకోగలిగాడు రామభద్రుడు. తన పెళ్ళాం తనదేకదా అనుకున్నాడు. ఆమెను బయలుదేరదీసుకురావటానికి యింటికి వెళ్ళి, ఆలుమగల మధ్యనున్న సహజసంబంధాన్ని మరచిపోయి, ఓ పనికిమాలిన ప్రెసిడెంటు మార్కు పోజు వెలగబెట్టి, 'ఒసేవ్ అఖిలాండం! అక్కడ నా పేరు చెప్పినప్పుడే చెయ్యి పైకెత్తు! లేకుంటే ఒళ్ళు చీరేస్తాను సుమా! చూలుతో వున్న ఎనుములా కూర్చున్నావేం? తొందరగా తెములూ!' అన్నాడు. ఇన్నాళ్ళూ ఆమె అతని ఇల్లాలైతే అగుగాక; ఇప్పుడు ఆమె కూడా తనంత మెంబరే కదా? సాటి మెంబరు అలా మర్యాద లేకుండా ప్రవర్తిస్తే ఏ మెంబరు మాత్రం సహించగలదు, లేదా, సహించగలదు? అప్పుడామె అందిగదా – 'నీ చచ్చు బెదిరింపులకు జడుసుకుని, నీకు చెయ్యెత్తాలని రూలు రాసి పెట్టుందా? నేనే ప్రెసిడెంటు నౌతాను. నువ్వే నాకు చెయ్యెత్తు!'

'ఒసి గచ్చకాయ జానా! నీకు ప్రెసిడెంటు గిరీ ఒకటి తక్కువైందా? నువ్వు గెలవ్వు!'

'ఎందుకు గెలవనో అదీ చూస్తానుగా? గయ్యాళి గంగారత్నం అంతటిదాన్నే గెలిచేశాను. తక్కినవాళ్ళు నాకొకలెక్కా?'

'అఖిలాండం! నిజంగా చెబుతున్నానే! నీ తోడు! నువ్వు గెలవ్వు! నీ ఓటు నాకిచ్చేయ్! నా పంచదార చిలకవుగదూ? బుద్ధి గడ్డితిని నిన్ను తేలిగ్గా మాట్లాడేశాను. తప్పు! లెంపలేసుకుంటాను.'

'కాదంటుంటే నీక్కాదూ? మనిషికొక మాట, గొడ్డుకొక దెబ్బ! ఆరు నూరైనా నా విలువైన ఓటు నీకివ్వను. అంత తప్పనిసరైతే యింకెవరికైనా పారేస్తాను.'

"మాటలతో పెళ్ళాన్ని దారికి తెచ్చుకోవడానికి రామభద్రుడికి తగినంత వ్యవధి లేదు. అయినా ప్రెసిడెంటు కావటానికి సరిపోయే తెలివి అతనికి వుంది. వెంటనే అతనేం చేశాడో తెలుసా?... శ్రీకృష్ణుడు పుట్టినప్పుడు గాడిద అరవబోతుంటే వసుదేవుండేం చేశాడో, రామభద్రుడూ అదే చేసి, రామభద్రుడు గారైనాడు."

అందరితోబాటు సీతాలక్ష్మికూడా పగలబడి నవ్వింది.

"ఈసారి ఎన్నికల్లో మళ్ళీ వృత్త రామభద్రుడే అయిపోతాడులే! ధరావతు లేకుండా ఓడిపోతాడు. సీతాలక్ష్మి శాపం వూరికే పోదు" అన్నాడు వెంకటాచలం.

"ఏమయ్యా, అలా విరగబడి నవ్వుతున్నారు?... ఇదిగో సదానందం! ఇలారా..." అంటూ కేకవేశారు రామభద్రుడుగారు.

ఆ వైపున – రెండు బల్లలు, వాటి వెనుక ఇరవై కుర్చీలూ వేసి వున్నాయి. ఆఖరికి ముఖ్య అతిథులు దయతలచి వేంచేసినట్లున్నారు. బల్ల ముందర పతాక ధ్వజం వుంది. బండిలోంచి తీగె లాగి, బల్లమీద హేండ్ మైక్ అమర్చబడి వుంది. బల్లమీద పుష్పమాలాలంకృతమైన గాంధీ పటం కూడా వుంది.

ప్రెసిడెంటుగారి దగ్గరకు వెళ్ళాను.

"ప్రార్థన పాడేవాళ్ళు కావాలి!" అన్నారాయన. "కూలివాళ్ళెవరన్నా దొరుకుతారా?" అన్నట్లుంది ఆ అడగడం.

భజరంగం ముందుకు దూకాడు. "నేను పాడతానండీ! వైష్ణవ జనతో తేనేకహిరే! గాంధీగారికి యిష్టమైన పాట!"

"ఓహో! ఔనౌను! సరే, పాడు!... సదానందం! మీ మేష్టర్లలో మాట్లాడే వాళ్ళెవరన్నా వుంటే, కనుక్కుని చెప్పు. ఒక పేరు చాలు."

వెనక్కు వెళ్ళి, మేష్టర్లను అడిగాను. ఒకరూ ముందుకు రాలేదు. పేదవాణ్ణి గోతిలోకి నెట్టే సాధనాల్లో – వాడి నోరు కూడా ఒకటి! భద్రతకోసం ఆ నోటికి తాళంవేసిపెట్టడం పంతుళ్ళ నైజం!

ఇంట్లో వెన్న పెట్టుకుని నెయ్యికోసం ఊరంతా తిరిగినట్లయింది. కావలసిన ఆ ఒక్కడూ దొరికాడు. ఆ పేరే ప్రెసిడెంటుగారి కిచ్చాను.

"వెంకటచలం!"

పెద్దలందరూ కుర్చీలలో ఆసీనులైనారు. కార్యక్రమం ప్రారంభమైంది. రాజకీయ ప్రపంచంలో కాస్తో కూస్తో పలుకుబడివున్న ఓ వర్తక శ్రేష్ఠుడు అధ్యక్షత వహించాడు. స్వాతంత్ర్యం వచ్చిన క్రొత్తలో అతని చేతిలో చిల్లిగవ్వయినాలేదు. విచిత్రమేమంటే – దేశం ఒక్కొక్క స్వాతంత్ర్యదినోత్సవం చొప్పున జరుపుకుంటుండగా, అతని సంపద ఒక్కలక్ష చొప్పున పెరిగిపోతున్నది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తొలిరోజుల్లోనే మా హెడ్మాష్టరుగారు సర్వీసు మొదలెట్టారు. ఇప్పుడాయనకు దక్కింది నయం చేయించుకోలేని గుండెనొప్పి మాత్రమే! ఎవరికి ఏమి యివ్వాలో మన జాతికి బాగా తెలుసు! ఆ వర్తక శ్రేష్ఠుడికి అధ్యక్ష స్థానం, మా హెడ్మాష్టరుగారికి నిలువు జీతం.

మరొక ప్రముఖుడు పతాకాన్ని ఆవిష్కరించాడు. ఆయన పేరు భూపతి. అతి త్వరలో స్వాతంత్ర్యం రాబోతున్నదనగా కొన్నాళ్ళు జైలు లోపల కాలక్షేపం చేసి, తరవాత బంజరుభూముల దాహంతో నాలుగు దిక్కులా దిగ్విజయయాత్రచేసి, కడుపులో చల్ల కదలకుండా కూర్చున్న రాజకీయ బాధితుడాయన! పతాకావిష్కరణ గావించడానికి దయతో అంగీకరించినందుకు – కార్యక్రమం చివర ప్రెసిడెంటుగారు అతనికి తప్పక కృతజ్ఞత చెప్పుకుంటారు.

కుర్చీలలో కూర్చున్న తతిమ్మా వాళ్ళుకూడా – కేవలం డబ్బున్న కారణంతో అర్హతను సంపాదించుకున్నవాళ్ళే. పేకాటకోసం క్లబ్బు నడుపుతున్న లోకనాథం, దొంగసారా అమ్మే రంగన్న దొరకూడా వాళ్ళలో వున్నారు. ఆ కుర్చీలలో ఒక్కటీచర్రైనా లేడు. కుర్చీల ఎదుట ఎదురెండలో కూర్చుని వాడిపోతున్న పసిపిల్లల్ని అదుపు అజ్ఞల్లో పెడుతూ తిరుగుతున్నారు – రోజూ కుర్చీలలో కూర్చునే టీచర్లందరూ.

అధ్యక్షులవారు, భూపతిగారూ, రామభద్రుడుగారూ మాట్లాడారు. కర్త, కర్మ, క్రియలు – ఎర్రసిరాతో మార్కులిచ్చే పంతుళ్ళకు కావాలిగానీ, వాళ్ళకెందుకు? వాళ్ళు సెలవిచ్చింది. క్రొత్తవిషయా లేమీకావు. రెండోతరగతి పుస్తకంలోనూ వున్నవే! జాతి రక్తంలో జీర్ణించిపోయిన ఆ కొన్నిసంగతులైనా వివరంగా చెప్పారా అంటే, అదీలేదు. వాళ్ళ మాటల్ని సంస్కరించితే ఈ క్రింది మహోపన్యాసం తయారవుతుంది:

"గాంధీ పూర్తిపేరు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ. ఆయన గుజరాత్‌లోని పోర్‌బందరులో పుట్టెను. అతనితల్లి పుతలీబాయి. తండ్రి కరంచంద్ గాంధీ. గాంధీ బ్రిటిషువారిని పారద్రోలి, మనకు స్వరాజ్యమును సంపాదించిపెట్టెను. ఆయన మనకు సత్యాహింసలను బోధించెను. అంటరానితనము ఉండరాదనెను. మీరు గాంధీని మరచిపోకూడదు. ఆయన చెప్పినట్లు నడుచుకొనవలెను. ఇంతటితో నా ఉపన్యాసమును ముగించుచున్నాను."

ఆ ముగ్గిరిలో – భూపతిగారు బాలబాలికలను "సోదరసోదరిమణులారా!" అంటూ సంబోధించారు. ఆయన వయస్సు దాదాపుగా ఏభై! పిల్లలందరూ తనంతటి వాళ్ళనుకున్నాడో, లేక తానుకూడా పిల్లల్లో ఒకడనుకున్నాడో, ఆయనకే తెలియాలి!

ఆ ముగ్గురూ మాట్లాడిన పదిహేను నిమిషాలలో వెంకటాచలం నన్ను హడలగొట్టేశాడు. అతడు ఉపన్యాసాలు వినటంలేదు. తాను మాట్లాడబోయే మాటల్ని రిహార్సలు వేసుకుంటున్నాడేమో ననిపించింది నాకు.

"పెద్దలారా! మిత్రులారా! బాలబాలికలారా! మీకు సీతాలక్ష్మి తెలుసా? చవకరకం చీరగట్టుకుని, చేతులకు మట్టిగాజులు తొడుక్కుని, అదిగో, ఆ మూల, ఎండలో సిగ్గుపడుతూ, జంకుతూ నిలబడివుంది చూశారూ, ఆ టీచరే సీతాలక్ష్మి. సీతాలక్ష్మి వయస్సు ముప్పై. ఈనాటి వరకూ ఆమెకు పెళ్ళి కాలేదు. దేవుడు చేస్తున్న లెక్కలేనన్ని ఘోరాల్లో ఆమెకు పెళ్ళి కాకపోవటముకూడా ఒకటి. ఆమెకు మగదిక్కే వుండివుంటే ఈనాడు శ్రీమద్రామ భద్రుడిగారి గూబలదిరిపోయి ఉండేవి. సీతాలక్ష్మికి ఎందుకు పెళ్ళికాలేదు? గంతకుతగ్గ బొంత ఏదో ఒకటి దొరక్కపోదు. తానే చేసుకోలేదు. ఎందుకు? ఆమె దరిద్రంలో పుట్టింది. దౌర్భాగ్యంలో పెరిగింది. ఆమెకు నలుగురు తమ్ముళ్ళున్నారు. ఐదుగురు చెల్లెళ్ళున్నారు. మంచం దిగలేని ముసలి తండ్రి వున్నాడు. ఆమె పెళ్ళి చేసుకుంటే, వాళ్ళందరూ ఏ నూతిలో దూకాలి? అందుకే ఆమె పెళ్ళి చేసుకోలేదు. వాళ్ళందరికోసం తన స్వార్థానికి నీళ్ళు వదులుకుంది. తనవారు పదిమంది కోసం తన బ్రతుకును త్యాగం చేసింది. ప్రాణమూ, నీతీ – రెండూ నిలవాలిగనుక పంతులమ్మగా చేరింది. తనకు జీతం వస్తే చాలని ఆమె అనుకోలేదు. పిల్లలకు చదువుకూడా రావాలనుకుంది. కాలం వృథాచేయకుండా తన పనిని తాను చేసుకుంటోంది. జోలిమాలిన పనులలో జోక్యం పెట్టుకోవటం ఆమెకు తెలియదు. తక్కిన పంతుళ్ళతో ఉబుసుపోకకైనా బాతాఖానీ వేసుకునే తత్వం ఆమెకు లేదు. తన ఉద్యోగంపట్ల ఆమెకు అపారమైన భయభక్తులున్నాయి. బడికి ఏనాడూ ఆమె ఆలస్యంగా వచ్చి ఎరుగదు. నాలుగైదు రోజులకంటె ఎక్కువగా ఏ సంవత్సరంలోనూ క్యాజువల్ సెలవు వాడుకుని వుండదు. అలాంటి సీతాలక్ష్మి మచ్చలేని చందమామ – ఈనాడు ఇల్లు విడిచి, బడి విడిచి, వినయవిధేయతలతో ఇక్కడి కొస్తే – 'పంతులమ్మా! నీకు బుద్ధి లే'దంటాడా ఈ రామభద్రుడుగారు! ఆమె నీకు ఓటుయిస్తే యిచ్చింది. నీవు ప్రెసిడెంటువయితే అయినావు గానీ, ఆమెను అంత మాట అనాలని ఆ ఓటుకర్థమా? నువ్వు పన్నులు వసూలుచేసుకో! నీకిష్టమైతే ఖర్చుపెట్టు, ఇష్టంలేకపోతే నీగాట్లోనే వేసుకో! పట్టించుకునే ఓపిక ప్రజలకు లేదు. అంతవరకే నీ హద్దు. అంతకుమించి – పరస్త్రీలను అవమానించి, వాళ్ళ హృదయాలను గాయపరచే హక్కు ఎంతటి ప్రెసిడెంటుకైనా లేదు ... అయ్యలారా! గాంధీ శతజయంత్యుత్సవ సందర్భంలో యిలా మాట్లాడవలసి వచ్చినందుకు చింతిస్తున్నాను. క్షమించండి."

వెంకటాచలం మైకుదగ్గరకూడా యిలాగే మాట్లాడుతాడా? నా గుండె గుబగుబలాడింది.

అంతలోనే అధ్యక్షులవారి పిలుపు వినిపించింది.

"ఇప్పుడు వెంకటాచలంగారు ఉపన్యాసం గావిస్తారు"

వెంకటాచలం నాచేయి విదిలించుకుని వెళ్ళిపోయి, మైకు చేతికి తీసుకున్నాడు.

"కట్టె, కొట్టె, తెచ్చె అను మూడు ముక్కల్లో ముగించేయ్ పంతులూ! నెత్తి మాడిపోతోంది!" అన్నాడు అధ్యక్షుడు బట్టతల తడుముకుంటూ.

"చిత్తం!"

అక్కడ కుర్చీలలో కూర్చున్నవాళ్ళనందర్నీ పేరుపేరునా సంబోధించి, నమస్కార బాణాలు వేశాడు వెంకటచలం. తర్వాత "ప్రియమైన బాలబాలికలరా!" అంటూ కొనసాగించాడు.

"పంతుళ్ళంగాబట్టి, మీ మనస్సులో ఏముందో మాకు బాగా తెలుసు. మామూలుగా యిలాంటి వేడుకల్ని - చల్లగా చద్ది తాగివచ్చి బడిలోనే జరుపుకునేవాళ్ళం, నీడలో హాయిగా కూర్చునేవాళ్ళం, మన పంతుళ్ళు ఎన్నో విషయాలు మనకు చెప్పేవాళ్ళు. ఇలాంటి పండుగలు మళ్ళీ మళ్ళీ వస్తే బాగుంటుందనిపించేది, ఈసారేమో మాస్టార్లు మనల్ని యిక్కడికి తోలుకొచ్చారు. కూర్చోటానికి శుభ్రమైన చోటుకూడా లేదిక్కడ. ఎండకు నెత్తి మాడకుండా జానెడు నీడైనా లేదు ఏడుగురు రాజకుమారులు తెచ్చిన చేపల్లా గంటల తరబడి ఎండిపోతున్నాము. 'గాంధీ పుట్టినరోజు పండుగ పండు వెన్నెలలాగా వుండక మండుటెండలాగా వుందేమబ్బా!' అని మీరు అనుకుంటూ వుండవచ్చు. నిజమే! అయితే, జాతీయ దినోత్సవాలను ఇట్లా భారీఎత్తున జరపడం మన పంచాయతీవారికి యిదే తొలిసారికాబట్టి స్థలం శుభ్రం చేయించాలని, గంటల తరబడి కూర్చోవలసివస్తే పచ్చని ఆకు ఒకటి పైన వేయవలసి వుంటుందనీ వారికి తోచివుండదు. ఇప్పుడు ప్రత్యక్షంగా మన యిబ్బందులు వాళ్ళు చూశారు కాబట్టి, ముందు ముందు వారు యిలాంటి సమావేశాలు జరపాలనుకున్నప్పుడు తప్పక మైదానం బాగుచేయించి, పందిళ్ళు వేయించగలరు. చలివేంద్రాలు పెట్టించగలరు. ఇప్పుడు మీకు కలిగిన యిబ్బందికి పంచాయతీవారి తరఫున మేము మీకు క్షమాపణ చెప్పుకొంటున్నాము...."

రామభద్రుడుగారు కండువాతో నుదురు తుడుచుకున్నారు. "అసలు సంగతిలోకి రండి! మనకింకా చాలా పనులున్నాయి" అంటూ తెచ్చికోలు నవ్వు నవ్వారు.

"బాలబాలికలారా! మీకు ఓ చిన్న కథ చెప్పదలచుకున్నాను. ఈ మీటింగు మన బడిలో జరిగివుంటే - ఒకటిగాదు, పది కథలు చెప్పేవాణ్ణి. ఇక్కడ మనకు వ్యవధి లేదు గనుక ఒక్కటి మాత్రమే చెబుతాను. ఒక మహాభక్తుడు 'అన్నం పెడతా రావోయ్' అని ఒక పేదవాణ్ణి యింటికి పిలిచాడు. అతను వచ్చాడు. ఇద్దరూ ఆమాటా ఈమాటా మాట్లాడుకుంటుండగా, సంభాషణ దేవుడిపైకి వెళ్ళింది. అప్పుడు ఆ పేదవాడన్నాడూ 'ఏం దేవుడో, పాపిష్టిదేవుడు! కలిగినవాళ్ళకే ముక్కోటి దేవుళ్ళు! లేనివాళ్ళ కెక్కడున్నాడు? నీతిలేనివాడేమో అంతస్థులమీద అంతస్థులు కట్టుకుంటున్నాడు. ఒళ్ళు గుల్ల జేసుకుని బ్రతుకుతున్న నా బోటివాడికి గుడిసె వేసుకోటానికి సెంటు నేలయినా లేదు. దేవుడుంటే ప్రపంచం యిట్లా అఘోరిస్తుందా? లేనేలేడు! ఒకవేళ వుంటే - వాడికి కళ్ళూలేవు, చెవులూలేవు!' అని. వెంటనే భక్తుడికి కోపం వచ్చింది. 'నా దేవుణ్ణే అంతలేసి మాటలంటావా? అన్నంలేదు, గిన్నంలేదుపో!' అంటూ అతన్ని మెడపట్టి గెంటేశాడు. తరవాత భక్తుడికి దేవుడు కనిపించి, 'ఎంత పని చేశావు!' అంటూ వాపోయాడు. 'మహాప్రభో! ఆ నాస్తికపు వెధవ నిన్ను నోటికి వచ్చినట్లు తిడుతుంటే ఎలా సహించమంటావు?' అన్నాడు భక్తుడు. 'భక్తా! నాకు వాడూ ఒకటే, నువ్వూ ఒకటే! దూషణ భూషణలు రెండూ నాకు సమానమే! ఇన్నేళ్ళుగా వాణ్ణి పోషిస్తుంటే, నా భక్తాగ్రణిగా

వుండి నువ్వు ఒక్కమాటు వాడికి కూడు పెట్టలేకుండా బయటకి గెంటేశావు గదా? ఎంత పొరపాటు!' అన్నాడు దేవుడు.

"ఇంతకూ చెప్పొచ్చిందేమంటే – దేశమంతటా గాంధీ జయంత్యుత్సవాలు ఘనంగా జరుగుతున్నాయి. అవి జరగాలి కాబట్టి జరుగుతున్నాయి. న్యూస్ పేపర్లన్నీ అందుకు సంబంధించిన వార్తలతోనే నిండిపోతున్నాయి. అందరూ గాంధీని పొగిడేవాళ్ళే! ఆవు సాధుజంతువే! ఈ మాటలు బడిపిల్లలు వల్లెవేయటం సబబుగానీ, మనుషుల్ని తినడం మానని పెద్దపులికూడా 'ఆవు సాధు జంతువు' అంటే ఎలా? గాంధీజీకి కావల్సింది వట్టి పొగడ్తలు కావు. ఆయన దేవుడులాంటి వాడు. తనను పొగిడిన వాళ్ళనూ ప్రేమిస్తాడు. పెదవి మెదపని వాళ్ళనూ ప్రేమిస్తాడు. ఆయన్ని పొగడడానికి మారుగా ఆయన సెలవిచ్చిన సిద్ధాంతాల్ని నిజంగా ఆచరణలో పెట్టినప్పుడే గాంధీతాత సంతోషిస్తాడు..."

రాజకీయ బాధితుడనబడే భూపతి ముళ్ళమీద కూర్చున్నట్లుగా అసహనంగా అటూ ఇటూ కదిలాడు. చేతివ్రేళ్ళు టైపు చేస్తున్నట్లు బల్లమీద అవస్థపడుతుండగా "కానిచ్చేసేయ్ బాబూ! కుర్రకుంకలు చచ్చిపోతున్నారు!" అంటూ వగర్చాడు అధ్యక్షుడు.

"చిత్తం, చిత్తం!... బాలబాలికలారా! సముద్రాన్నే దాటగలిగిన హనుమంతులవారికి పిల్లకాలువ ఒక లెక్కా అన్నట్టు, రెండుగంటలసేపు కూర్చోగలిగిన మీరు మరో రెండునిముషాలు కూర్చోలేరా?... గాంధీ ఏమన్నాడంటే – ఏనాడైతే ప్రతివాడికి ముప్పూటలా తిండి, కట్టుకోడానికి బట్ట, వుండటానికి యిల్లూ లభ్యం కాగలవో ఆనాడే దేశం రామరాజ్యం మనిపించుకుంటుంది. నీ ప్రక్కయింటివాడు పస్తుంటే, నువ్వు పంచభక్ష్య పరమాన్నాలు తింటావా? వాడికి గోచిపాతకైనా గతిలేకుండా వుంటే, నువ్వు సిల్కుచొక్కా వేసుకుంటావా? వానతో వాడి అర్ధెకొంప తడిసిపోయి, చలికి గజగజలాడుతూ నిలబడివుంటే, నువ్వు మేడమీది గదిలో అద్దాల కిటికీదగ్గర కూర్చుంటావా? వాడికి కనీసం ఆ మూడు అమరేవరకు – విలాసంగా జీవించే అర్హత నీకు లేదు' అన్నాడు గాంధీ. ఈ ఒక్కసూత్రాన్ని అక్షరాలా పాటిస్తే చాలు; అంతటి మహానుబావుడెవరైనావుంటే – అతనే నిజమైన గాంధేయవాది!"

ఆ మాటతో తామందరూ ఏకీభవిస్తున్నట్లు, తాము నిజమైన గాంధేయవాదులైనట్లు కుర్చీలలోని వాళ్ళందరూ గాంధీగారి బోసినవ్వుల్లాంటి పవిత్రమైన మందహాసాలు వెలార్చారు.

"... గాంధీ యింకా ఏమంటారు – 'ఏ జాతి గొప్పది అని నన్నడిగితే – స్త్రీని గౌరవించగల సంస్కారంవున్న జాతి అన్ని జాతులకంటే గొప్పదంటాను నేను' అని అంటారు. 'నీ భార్య ముఖం చిన్నబోతే నీ మనసు ఆరాటపడదూ? నిన్ను కన్నతల్లి కష్టాల్లోవుంటే నీ గుండె కలుక్కుమనదూ? నీ సోదరిని ఎవడైనా అవమానిస్తే, నీ నెత్తురు ఉడుకెక్కిపోదూ? నీ కన్నకూతురు కంట్లో నీళ్లుకారితే నీ హృదయం కరిగిపోదూ? పరస్త్రీల విషయంలోకూడా అలాగే భావించుకో!' అని అంటాడు. అన్నివిధాలా స్త్రీ అధికురాలు. మనం చేసే పనులన్నీ వాళ్ళు మనకంటే బాగా చేస్తారు. గాంధీ అంతటివాడే స్త్రీని ఉన్నతురాలిగా భావించి గౌరవించాడు. స్త్రీని

గౌరవించడం తెలియనివారు వట్టి అడివిమనిషి! మనమంతా నాగరికులమే! స్త్రీలను ఎలా గౌరవించాలో మనకు తెలుసు కదా?....

"బాలబాలికలారా! గాంధీగారికి పిల్లలంటే చాలా యిష్టం! ఆయనకు పెద్దలమీద కంటే పిల్లలమీదనే నమ్మకం ఎక్కువ. తాను ఆశించిన రామరాజ్యం ఏనాటికైనా క్రొత్తతరాల బాలల మూలంగానే సాధ్యం కాగలదని ఆయన గట్టినమ్మకం కనుక, మీరందరూ బాగా చదువుకోవాలని, పెరిగి పెద్దవారై గాంధీగారి సూక్తులన్నిటినీ తు.చ. తప్పకుండా పాటించాలని, మీరు గాంధీ అంతటివాళ్ళు కావాలని ఆశిస్తున్నాను. నాకు ఈ సదవకాశం కల్పించిన పెద్దలకు కృతజ్ఞత తెలుపుకుంటూ. విరమిస్తున్నాను."

పెద్ద తలనొప్పి తొలగిపోయినంత తేలికగా ఊపిరి పీల్చుకున్నారు రామభద్రుడుగారూ, తదితరులూ. తమ అమూల్యమైన కాలమంతా కొల్లబోయినట్లు తొందర తొందరగా మిగిలిన కార్యక్రమంలోకి ఉరకలు వేశారు.

వెంకటాచలం నావద్దకు మరలివచ్చాడు.

"బ్రతికించావు స్వామీ!" అన్నాను.

"సరిగ్గా అంటించావు!" అంటూ అభినందించారు పంతుళ్ళు.

"ఏమిటి?"

"చురకలు!"

సీతాలక్ష్మి ముఖం కలకలలాడుతోంది. దుర్యోధనుణ్ణి సంహరించి వచ్చిన భీమసేనుడివైపు చూసే ద్రౌపదిలా ఆమె వెంకటాచలంవైపు చూచి "థాంక్సండీ!" అంది.

జాతీయగీతం ముగిసింది.

"వెంకటాచలం!" అంటూ ప్రేమపూర్వకంగా పిలిచారు ప్రెసిడెంటుగారు.

"పిలిచారాండీ?" అంటూ దగ్గరకు వెళ్ళాడు వెంకటాచలం.

అతని భుజంమీద ప్రేమగా చేయివేశారు ప్రెసిడెంటుగారు.

"ఇక ఊరేగింపు మొదలెడదామా?"

"అవశ్యం!"

"పిల్లల్ని బండివెనుక వరసల్లో నుంచోబెట్టమని చెప్పు!"

"సరేనండీ!"

వెంకటాచలం మళ్ళీ నావద్దకు వచ్చి చెవిలో ఊదాడు. "మొరిగే కుక్కను మచ్చిక చేసుకోవడం దొంగల కలవాటే!"

గాంధీపటాన్ని బండిలో పెట్టారు. ఎద్దును బండికి కట్టారు. సినిమాపాట గాలిలోకి ఎగిరింది. బండి కదిలింది. బండివెనుక పెద్దలు నడిచారు. వారివెనుక పిల్లలు కదిలారు. వాళ్ళను అదుపులో పెడుతూ మేకల కాపరుల్లాగా – పంతుళ్ళు! మహాత్మునిపేరు జయజయ ధ్వానాలతో కలిసి మిన్నుముట్టింది. జయజయధ్వానాలతో పోటీచేస్తూ రోడ్డుపొడుగునావున్న దుమ్ముకూడా మింటికెగిరింది.

ముందు గాంధీగారు, వెనుక రెండుఫర్లాంగుల పొడుగున ప్రజావాహిని! ప్రజారథం ఎన్నో మలుపులు తిరుగుతూ వీధులన్నీ పరిభ్రమించి, ఎట్టకేలకు తడబడే నడకతో మళ్ళీ పంచాయతీ ఆఫీసు ప్రాంగణం చేరుకొంది.

ఇక పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టాలిగదా? సులభంగా వుంటుందని ఓ పని చేశారు. పంచాయతీ ఆఫీసుపక్కనే బందెలదొడ్డిలా ఓ పెద్ద రైస్‌మిల్లు వుంది. పిల్లలందర్నీ మిల్లు ఆవరణలోకి తోసి, గేటు మూసేశారు. మహాసముద్రమంత పెద్దపళ్ళెంలో నీటిబిందువులంత చిన్నచిన్న పిప్పరమెంట్లు రాశి పోసుకుని లక్ష్మణస్వామి అనే ఆయన గేటువద్ద నిలబడ్డాడు. ఆయన పంచాయతీ మెంబర్లలో ఒకడు. రామభద్రుడు గారికి కుడిభుజం. పిల్లలు ఒక్కొక్కరే ఆయన యిచ్చిన ఒక్కొక్క పిప్పరమెంటు చేతికి తీసుకుని, బోనులో చిక్కుకున్న ఎలకపిల్ల తలుపు తీయగానే బయటకి దూకినట్లు, గేటులోంచి బయటపడుతున్నారు.

గంట పదకొండు కావస్తోంది. ఈ పంపకం ముగిసేదెప్పుడు? మిల్లు ఆవరణలో వున్న చేదబావి కన్నతల్లిలా ఆహ్వానించింది. బావిలో నుంచి నీళ్ళుచేది కడుపునింపుకో సాగారు పిల్లలు.

ఆఖరిపిల్లవాడుకూడా పిప్పరమెంటు తీసుకుని గేటు దాటుకోగానే రైస్ మిల్లు ఆవరణ ఖాళీగా మిగిలిపోయింది. అయితే, లక్ష్మణస్వామి చేతిలోని పళ్ళెంలో పిప్పరమెంట్లుమాత్రం ఖాళీ కాలేదు. ఇంకా సగం వున్నాయి.

లక్ష్మణస్వామి పళ్ళెం క్రింద పెట్టాడు. కండువా అరుగుమీద పరిచాడు. రెండుచేతులు చేర్చి నాలుగు దోసిళ్ళు పిప్పరమెంట్లు కండువా మీద పోశాడు! మూటగట్టాడు. ఎంగిలాకులో మెతుకుల్లా పళ్ళెంలో నాలుగు పిప్పరమెంట్లు మిగిలిపోయాయి. ప్రక్కనున్న కొడుకుచేతికి మూట అందించాడు లక్ష్మణస్వామి. "ఒరే! దీన్ని తీసుకెళ్ళి యింట్లో పెట్టు" అన్నాడు. దూరంగావున్న ఆఫీసు నౌకర్ని కేకేసి పిలిచాడు. అతనిచేతికి పళ్ళెం అందించాడు. "దీన్ని తీసుకెళ్ళి ఆఫీసులో పెట్టు" అన్నాడు.

ఆహా! దేశం ఈతీరున కొల్లబోతోందా?

పిల్లలంతా వెళ్ళిపోయారు. పంతుళ్ళుకూడా పలచబడిపోతున్నారు. మా బడి టీచర్లంతా పంచాయతీ ఆఫీసు ముందరికి నడిచాము.

బయట ప్రెసిడెంటుగారు నిలబడివున్నారు. "పరువు ప్రతిష్ఠలు" గల ఎవరినో ఉద్దేశించి ఓగ్గరగా "ఇదిగో శ్రీపతీ, వెళ్ళిపోతున్నావా? అల్పాహారపువిందు ఉందయ్యా!" అంటున్నాడు.

"వెళ్ళటంలేదులే!" అన్నాడు శ్రీపతి.

మా హెడ్మాష్టరుగారు ప్రెసిడెంటుగారి ముందు నిలబడి, చేతులు జోడించి, "ఇంక వెళ్ళొస్తామండి!" అన్నారు.

"ఆc! వెళ్ళిరండి, వెళ్ళిరండి!"

అక్కడినుండి నాలుగు అడుగులు నడిచాక – "ముద్దు ముద్దుగా, ముచ్చటగా వుంది!" అన్నాడు వెంకటాచలం.

"ఏమిటి?" అన్నాను.

"అదే! ఏనుగులు తినేతిండిని అల్పాహారం అనటం!"

ఆకలితో అవురావురుమంటూ, ఎండలో కాళ్ళీడ్చుకుంటూ యింటివైపు నడుస్తూ వుంటే – చిలకమర్తివారి పద్యం చప్పున గుర్తుకు వచ్చింది.

"....పిండుచున్నారు. మూతులు బిగియగట్టి!"

☆ ☆ ☆

మరునాటి ఉదయం బడికి వెళ్ళాను.

బడి ముందర రోడ్డుమీద బండి కనిపించిది. తెల్లటి ఎద్దు – చియ్యబలిసి పోతరించినట్లున్న ఎద్దు – నెమరువేసుకుంటూ మెల్లగా బండిని లాగుతూ వెడుతోంది. నిన్న ఊరు ఊరంతా దానివెంట నడిచింది. ఇప్పుడెవ్వరూ దానివెంట వెళ్ళటంలేదు. అందరూ ముక్కుమూసుకుని దూరంగా తొలగిపోయేవాళ్ళే! ఈ పరిణామానికి కారణం ఏమిటి?

నిన్న బండిలో తాత కూర్చున్నాడు. తాతగారి అడుగుజాడల్లో అందరూ నడిచారు. ఇప్పుడు బండిలో తాత లేడు.

తాతకు మారుగా మరేముంది?

చెత్త, చెదారం, కుళ్ళు, కంపు...

భుజం మీద చేయివేశాడు వెంకటాచలం.

"బండిని చూస్తున్నావా సదానందం? అది – తాత దిగిపోయిన బండి! దాని ప్రతిష్ఠ తాతతోనే పోయింది!"

● *ప్రచురణ, 1970* ●

★ ★ ★

38

శీలా వీర్రాజు

# నీడ

కిటికీ దగ్గర కూచుని ప్రయాణం చేయడం నాకు చాలా సరదా. అలాటి సీటు దొరికితే ఎంత దూరపు ప్రయాణమైనా బోర్ అనిపించదు. గిరగిరా తిరుగుతూపోయే చెట్లనీ, గట్లనీ మధ్యమధ్యన ఆసక్తిగా చూస్తూ మరో ధ్యాసలేకుండా ప్రయాణం చేసెయ్యగలను. కిటికీలోంచి చూస్తే మరీ అందంగా కనిపిస్తుంది ప్రకృతి. ఎవరి హృదయపు లోతుల్లోకో తొంగిచూస్తున్నప్పుడు మరింత సన్నిహితంగా వెళ్ళినట్టు, ప్రకృతి కూడా అలా చూస్తుంటే మరింత దగ్గరైనట్టుంటుంది. మాట్లాడుతూనే మనిషి అంతర్యాన్ని చదవడం నాకు యిష్టం. చూస్తూనే ప్రకృతి లోలోపలి సౌందర్యాన్ని గురించి ఆలోచించడంకూడా అంత యిష్టం. అలా చూస్తున్నప్పుడు తరచుగా నాకు కవులు ప్రకృతిని గురించి చేసిన ఉపమానం గుర్తుకొస్తుంది. స్త్రీతో ప్రకృతిని పోల్చడంవల్ల స్త్రీహృదయం ఎలా అర్థంకాక రహస్యంగా ఉండిపోయి, ఆ రహస్యాన్ని విప్పాలన్న ఆసక్తి కలుగుతుందో, అలా ప్రకృతిని చూసినా! అందుకే నాకు కిటికీ పక్క సీటంటే అంత యిష్టం.

కాని నా కిటికీ పక్క సీటుని మరొకాయన ఆక్రమించుకున్నాడు. బందరునుంచి బస్సులో వస్తున్నాను. పగటిపూట ప్రయాణం. బెజవాడలో కాఫీ తాగొచ్చేసరికి నా సీటుమీద మరో ఆయన చాలా హుందాగా ఠీవిగా కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. రెండు మూడు నిమిషాలు అతని పక్కనే నుంచున్నాను, ఇటు చూస్తాడేమోనని. ఇటు చూస్తే సీటు గురించి చెప్దామనుకున్నాను. ఎంతకీ చూడకపోతే నేనే పలకరించాను.

"మేష్టారూ! మీరు యిలా జరుగుతారా?"

"ఏం?" అన్నట్టు చూశాడాయన. అతని ముఖంలో చిరాకు, ఆశ్చర్యం పడుగుపేకల్లా అల్లుకున్నాయి.

"ఆ సీట్లో కూచున్నానండి. కాఫీ తాగొద్దామని దిగాను" అన్నాను, సాధ్యమైనంత నమ్రతతోనే.

చిరాకు, ఆశ్చర్యంతోపాటు కోపం వచ్చిచేరి ముప్పేటల గొలుసైంది.

"అవతలకు వెళ్లినవాళ్ళు సీట్లో ఏవైనా పెట్టుకొని వెళ్లలేకపోయారా? ఇలా కూచున్నవాళ్ళను లేవగొట్టడం ఏం సభ్యత?" అన్నాడాయన. అన్నాడే కాని అక్కడనుంచి జరగలేదు.

బైటికి వెళ్ళినప్పుడు సీట్లో న్యూస్ పేపరు పెట్టి మరీ వెళ్ళాను. అది ఏమైందా అని చూస్తోంటే వెనకసీట్లో వున్నతని చేతిలో కనిపించింది.

"ఇక్కడ న్యూస్ పేపరు పెట్టి వెళ్ళానండి. ఎవరో తీసి చదువుతున్నారు గాబోలు!" అన్నాను.

అతను చిరాగ్గా ఓసారి నా ముఖంలోకి చూసి విసుక్కుంటూ యిటు జరిగాడు.

"ఛీ ఛీ, ఏం బస్సులో ఏమో. దీనికన్న రైలుప్రయాణం సుఖం. వెళ్ళదలచుకున్న వాళ్ళకి క్లాసు కంపార్టుమెంటులైనా వుంటాయి. బస్సుల్లోనూ కొన్ని సీట్లు స్పెషల్‌గా వేసి వాటికి ఎక్కువ ఛార్జి వసూలుచేస్తే వీళ్ళ సొమ్మేంపోయిందో? తాహతున్నవాళ్ళు దానిలో వెళ్ళేవాళ్ళుగా!"

గొణుక్కుంటున్నట్టుగా అన్నా చుట్టుపక్కల వాళ్ళకు వినిపించేటట్టుగానే వున్నాయి మాటలు.

నిజమే, మనిషిని చూస్తోంటే బస్సుల్లో తిరిగేవాడిలా లేడు. భారీ శరీరం. నీటుగా అతను చేసుకున్న ముస్తాబు, హోదా వెలగబెడుతున్నట్టు నిటారుగ్గా బిగుసుకుపోయి కూర్చున్న తీరు, ఒళ్ళంతా కదపకుండా ఒక్కమెడమాత్రమే తిప్పి అటూయిటూ చూసే అతని చూపుల్లో ఠీవీ – చూస్తోంటే యిలా యిరుగ్గా అందరితోపాటు బస్సుల్లో ప్రయాణంచేసేవాడిలా అనిపించడంలేదు. విశాలంగా వెనక సీట్లో కూచుని ఠీవిగా వెనక్కుజారపడి, నాజుగ్గా ఏ పుస్తకమో తీసి చదువుకుంటూ మధ్యమధ్య కిటికీలోంచి అవతలకి చూస్తూ కారుల్లో తిరిగేవాడిలా వున్నాడు.

ఈనాడు దేశంలో సోషలిజం కనిపించకపోయినా బస్సుల్లోమాత్రం కనిపిస్తోంది. ఇలాటివాళ్ళు అర్జీలు పెట్టుకుని ఆమాత్రంకూడా లేకుండా చేసేట్టు వున్నారు. దేశంలో పైతరగతి, మధ్యతరగతి, కిందితరగతి అంటూ మూడు వర్గాలున్నట్టే రైళ్ళల్లోనూ ఉన్నాయి. ఇప్పట్లో ఈ హెచ్చుతగ్గులు తొలగిపోయేట్టు లేవు. ఫస్టుక్లాసులనీ, సెకండు క్లాసులనీ బోగీలు తగిలించి ప్రయాణీకుల్ని వర్గాలుగా విడదీసే యీ బ్రిటిష్ పెట్టుబడిదారీ పాత సంప్రదాయం తొలగిపోవాలి. అన్నీ ఒకే క్లాసులో వుంచి, అవసరమైతే సగం రిజర్వేషన్ సీట్లు కేటాయిస్తే సరి, రైళ్ళలోనూ సోషలిజం వస్తుంది. ఇంత చిన్న రైల్లోనే సోషలిజం తేలేనప్పుడు యింత సువిశాలదేశంలో సోషలిజం తేగలరని అనుకోవడం కల్ల.

ఆలోచనల్లోంచి తప్పుకుని కిటికీలోంచి అవతలకి చూస్తే గలగల్లాడుతూ కృష్ణ కనిపిస్తోంది. ఆలోచనల్లో గుర్తించనేలేదు, బస్సు అప్పుడే కదిలిపోయిందన్నమాట!

ఆగస్టునెల కృష్ణ పరవళ్ళు తొక్కుతూ పరుగెడుతోంది. ముఖమంతా జేవురించి ఆవేశంతో వూగిపోతూ చేతులు సాచి ఒళ్ళు విరుచుకుని కదులుతోంది. దూరంగా సన్నబడిపోయిన ఒంటిరేఖ గీతలా నీరసంగా అవతలిగట్టు, గట్టు వెనక గుంపులు గుంపులుగా దాక్కొని సమయం చూసి తిరుగుబాటు లేవదీద్దామని ఎదురు చూస్తోన్న మేఘాలు, ఆ తిరుగుబాటును చూడాలన్న ఉత్సాహంతో బారులు బారులుగా ఆవైపు ఎగిరి వెళ్తున్న పక్షులు– చూస్తుండగానే ఆ చిత్రం మారిపోయింది.

ఇళ్ళు, పొలాలు, కలుపుతీస్తోన్న బక్కచిక్కిన కూలీలు, గట్లమీద ఊరికే ఎదిగిపోయి అసహ్యంగా భయంగా ముళ్ళడొంకలు, అక్కడక్కడ తిండికి మొహంవాచి ఆకలికి

తట్టుకోలేక పొలాల్లోకి జొరబడి మేస్తోన్న పశువులు, ఈ బస్సుల్నీ, యీ కార్లనీ యీ మోటారు సైకిళ్ళనీ ఎక్కే తాహతు లేక కాళ్ళీడ్చుకుంటూ ధూళి కొట్టుకుపోయి దారిపక్క ఒదిగొదిగి నడిచే సన్నకారు పల్లెజనం.

చిన్నపల్లె, పల్లెనిండా పూరిపాకలు జాలిగా, బీదగా. ఆ పాకల మధ్య ఆ వూరిని ఏలుతున్నట్టు – ఠీవిగా కోటగోడల్లా పటిష్టంగా, పదో పన్నెండో పెంకుటిళ్ళూ, మేడలూ. ఇరుకైన ఆ వూరి వీధుల్లో మురికి కాలువలూ, పెంటకుప్పలూ, రోడ్డుపక్క వచ్చేపోయే బస్సుల ధూళిని పీలుస్తూ తమ జీవితాలకి అదే గొప్ప ఎంటర్‌టెయిన్‌మెంట్‌గా సంబరపడిపోయే పిల్లల గుంపులూ, వొంటిమీద నిండుగా బట్టల్లేని ఆ పిల్లల అంటుకుపోయిన పొట్టలూ, వాళ్ళని కసురుకొనే వాళ్లపెద్దల వొంగిపోయిన నడుములూ – దారిపొడుగునా ఎన్నెన్ని చిత్రాలో!

చూస్తూ చూస్తూ యిటు తిరిగాను. నా పక్కతను నావైపే తదేకంగా చూస్తున్నాడు. దృష్టి మార్చుకుని మళ్ళీ కిటికీలోంచి అవతలకు చూస్తూ కూర్చున్నాను. కొద్దిసేపటి తర్వాత మళ్ళీ యిటు తిరిగితే అతని చూపులన్నీ నామీదే వున్నాయి! పరిచయస్తుని చూపుల్లా కుతూహలంగా లేవు. 'ఆ కిటికీని అంటిపెట్టుకుని ఏమిటలా చూస్తాడీయన' అన్నట్టు చిత్రంగా వున్నాయి. అందుకే ఆ నొసలు చిట్లింపు. కుతూహలపు చూపులైతే కళ్ళు అలా కుంచించుకుపోవు. పెదాలు అలా బిగుసుకుపోవు.

నందిగామలో బస్సు ఆగింది. డ్రైవర్ కాఫీ తాగొద్దామని ఆ పక్క హోటల్లోకి వెళ్ళాడు. ప్రయాణీకుల్లో అరడజనుమందివరకు దిగారు. బస్సు ఎక్కువసేపే ఆగేట్టువుంది. నాక్కూడా బస్సుదిగి బయటి గాలిలో నుంచుందామని వుందిగాని నా పక్కాయన్ని తప్పుకోమని అడగాలి. అతన్ని పలకరించడం నాకిష్టంలేక అక్కడే కూచుండిపోయాను బయటికి చూస్తూ. రోడ్డవతల హోటలు పక్కన ఏనాడో మనం నిలువునా పాతేసిన రాచరికపు వ్యవస్థని తవ్వితీసి తెరమీద ఆడించి డబ్బు చేసుకుందామనే జానపద బాక్సాఫీసు దోపిడీ నిర్మాత తాలూకు సినిమా వాల్‌పోస్టర్‌వుంటే చూస్తున్నాను. ప్రజల అమాయకత్వాన్ని డబ్బుగా మార్చుకునే యీ దోపిడీకి కేరళలో, పశ్చిమ బెంగాలులో యీనాడు ఉద్వాసన జరిగింది. ఇక్కడి ప్రజలుకూడా అలా ఎప్పుడు తెలివిమీరుతారో మరి!

నా ఆలోచన తెగిపోయింది. పక్కన ఏవో కేకలు వినిపిస్తున్నాయి. ఇటు తిరిగి చూస్తే నా పక్కాయన ఓ ముష్టాడిమీద గొంతు చించుకుని అరుస్తున్నాడు.

"...చెప్తే నీక్కాదూ. ముందిక్కడ్నించి పో. అలాపోయి ఆ రోడ్డు మీద అడుక్కో, డర్టీ స్కౌండ్రల్! ఛీ ఛీ... బస్సుల్లోకికూడా ఎగబడ్డమే."

ఆ ముష్టి ముసలాడికి చెవుడో, లేక యిలాటివాటికి అలవాటు పడిపోయాడో ఏమో అతని మాటల్ని ఏమీ పట్టించుకోక బస్సులో మిగతావాళ్ళదగ్గరికికూడా పోయి యాచించి, రెండుచోట్ల యిచ్చిన పైసల్ని అందుకుని వాళ్ళకు దణ్ణాలు పెట్టి దిగిపోయాడు.

"ఛీ ఛీ... అడుక్కుతినే వెధవలకి కూడా ఎంత నిర్లక్ష్యం! చెప్తే వినిపించుకోడమంటూ ఉందా... ఒకటే ఎగపడడం. ఈ దేశానికి వీళ్ళనుంచి ఎప్పటికి విముక్తి

లభిస్తుందో, వీళ్ళతో వేగలేక ఛస్తున్నాం" అన్నాడాయన యిటు తిరిగిన ముందుసీటు అతనితో.

ఆ వ్యక్తి నిజమేనన్నట్టు తలతిప్పాడు. "ఎక్కడ చూసినా వీళ్ళే కదండీ! రోజు రోజుకీ పెరిగిపోతున్నారు. వొళ్ళొంచి కష్టపడి పనిచేయడంకన్నా యిదే లాభసాటి వృత్తిగా వుంది వీళ్ళకి. అందుకే యిలా ఎగబడుతున్నారు జనం!"

అసలు ప్రభుత్వమే అడుక్కుతినే ప్రభుత్వమైనప్పుడు ప్రజలు ఐశ్వర్యవంతులు ఎలా అవుతారు? ఈ దేశంలో అడుక్కోవడమే లాభసాటి వృత్తి. ఈ దేశంలోనే కాదు, రోజంతా పనిచేస్తే దొరికే రోజువారీకూలి బత్తేనికీ, అడుక్కుతినేవాడి రోజువారీ ఆర్జనకీ అట్టే తేడాలేని ఏ దేశంలోనైనా అడుక్కోవడమే లాభసాటి. అడుక్కునేవాళ్ళు లేకుండా వుండాలంటే కూలీల రోజువారీ బత్తెం ఎక్కువ కావాలి. అది ఎక్కువయినప్పుడు దుర్బలులు, అంగవికలులు తప్ప మిగిలినవాళ్లంతా కూలిపనికే ఎగబడతారు.

"మొక్కజొన్న పొత్తులు సార్, వేడివేడి పొత్తులు సార్. ఇమ్మంటారా?" ఆలోచనలు చెదిరిపోయాయి. మొక్కజొన్న పొత్తులమీద దృష్టి పడింది. పొడుగ్గా నిగనిగలాడుతున్నాయవి. దారిపొడుగునా ఒక్కోగింజ వొలుచుకు తినొచ్చు. మంచి కాలక్షేపం. కొందామనిపించింది. ఒకటి ఇవ్వమన్నాను. మంచిది ఏరి ఒకటి తీసియిచ్చాడు. డబ్బులకని చెయ్యి సాచాడు. వెనక జేబులోంచి తీస్తున్నాను. లోపలికి ఉన్నాయేమో తొందరగా చేతికి అందడంలేదు.

"ఏయ్ ఏమిటది.... అలా మీద పడతావేం. కాస్త దూరంగా వుండలేవూ? ఆయన డబ్బులు యివ్వకుండా పారిపోడులే!"

కసురుకుంటున్నట్టు అంటున్న నా పక్కాయన మాటలకి మొక్కజొన్న పొత్తుల కుర్రాడు బిత్తరపోయి దూరంగా జరిగి నుంచున్నాడు. ఒంటిమీద మాసిన చెడ్డీతప్ప మరింకేంలేని ఆ నల్లటి కుర్రాడి తెల్లటి కళ్ళల్లో మహాపరాధం జరిగిపోయినంత దిగులు ఆవరించుకుని వుంది.

అలా కుర్రాడ్ని బెదరకొట్టేసిన నా పక్కాయన్ని చూస్తే నాకు మహా చిరాకేసింది. అసలు, ఆయన యింట్లో పిల్లల్నికూడా అలా కసురుకొని ఎప్పుడూ చిరచిరలాడుతాడో, లేక మట్టికొట్టుకుపోయిన ఆ కుర్రాడి వొంటి దుమ్ము తన బట్టలకు అంటుకుపోతుందన్న చిరాకో మరి. ఏమయినా అంత అమాయకమైన ఆ పదేళ్ళ కుర్రాడ్ని అలా కసురుకోవడం నాకు నచ్చలేదు.

డబ్బు యిచ్చేశాను. పుచ్చుకొని వెళ్ళిపోయాడు.

కాస్సేపట్లో బస్సుకూడా కదిలింది. తీరిగ్గా కిటికీ అద్దానికి జారబడి బయటికి చూస్తూ ఒక్కొక్క గింజే వొలుచుకు తింటున్నాను. ఎంత మెల్లగా తిన్నా గంట పట్టింది. కడుపు నిండిపోయింది. మరో పెద్ద వూళ్ళో బస్సు ఆగినప్పుడు కాఫీ తాగొచ్చాను. వస్తూ వస్తూ ఇలస్ట్రేటెడ్ వీక్లీ కొనుక్కొన్నాను. కాస్సేపు తిరగేసి దాన్ని పక్కన పెట్టాను. బస్సు కదిలాక కుదుపుల్లో చదవడం కష్టంగా వుంది.

"ఎక్కడికి వెళ్తున్నారు?"

ఇటు తిరిగాను. నన్నే! నా పక్కాయన అడుగుతున్నాడు!!

"హైదరాబాదుకండి."

"బెడవాడ అవతలనుంచి వస్తున్నట్టున్నారు?"

"అవునండి, బందరునుంచి వస్తున్నాను"

"హైదరాబాదులో ఎక్కడికి ఎళ్ళాలి?"

"చిక్కడపల్లి వెళ్ళాలండి. అక్కడ మా బాబాయిగారు ఉన్నారు."

ఆయన ఓ నిమిషం ఆగి "ఏదండీ ఆ వీక్లీ, ఓసారి చూసిస్తాను" అంటూ చెయ్యి సాచాడు.

ఇందుకన్నమాట ఆయన పలకరించినది! బోరుకొట్టి కాలక్షేపానికి పలకరించాడేమో అనుకున్నాను. లేకపోతే అంత అభిమానమా నా మీద!

అతనికి పుస్తకం యిచ్చాను.

గంట తర్వాత దాన్ని తిరిగి యిచ్చేస్తూ "ఏం చేస్తున్నారు? ఉద్యోగమా?" అంటూ ప్రశ్నించాడాయన.

అవునంటూ తలూపాను. ఆ తర్వాత చాలా ప్రశ్నలూ, ఉద్యోగ విషయాలూ, స్వస్థలం–చాలా విషయాలు దొర్లిపోయాయి. ఒకచోట ఆయన ఆశ్చర్యంగా "ఏమిటీ...! మీ పేరు?" అంటూ అడిగాడు.

పేరు చెప్పాను.

"ఓహ్! మీరా... భలే చిత్రంగా కలుసుకున్నాం సుమండీ? నన్ను మీరు గుర్తుపట్టలేదేమో... నేనూ – వెంకటేశ్వర్రావుని... సూరిబాబుగారి అల్లుడ్ని... చందనం మా..."

"మీరటండీ? గుర్తుపట్టలేకపోయాను. ఎప్పుడో పెళ్ళిలో పెళ్ళిపీటలమీద చూశాను. ఆరేడేళ్ళు అయ్యుంటుందేమో కదూ! మీరు యిప్పుడు రామచంద్రపురం పావీ ఎలక్ట్రికల్స్‌లోనేనా పనిచేస్తుంట? చందనంగారు బావున్నారా?"

"బాగానే వుంది. అప్పుడప్పుడు మీ గురించి చెపుతుంటుంది."

యిద్దరమూ కబుర్లలో పడ్డాం. సంసార విషయాలు, ఉద్యోగ విషయాలు–ఇవే. ఏది మాట్లాడినా ఒక పరిధికి మించి అవతలకి పోవటంలేదు సంభాషణలు. ఏ విషయం మొదలెట్టినా కాస్సేపట్లోనే ఆగిపోతోంది. మా ఇద్దరి మధ్యా ప్రత్యక్షపరిచయం లేకపోవడం వల్లా, యిద్దరి అభిరుచుల మధ్యా సామ్యం లేకపోవడంవల్లా ఓ అర్ధగంట గడిచేసరికి మరింకేం మాట్లాడుకోవాలో మాకే తెలీలేదు. అప్పుడప్పుడు ఒకో మాట ఒకో పలుకు – అలా గడుస్తోంది.

సూర్యాపేటలో బస్సు ఆగినప్పుడు ఆయనే కాఫీ ఆఫర్ చేశాడు. తాగొచ్చిన తర్వాత అతను మళ్ళీ యిలస్ట్రేటెడ్ వీక్లీ తీసి చదువుతూ కూచున్నాడు. నేను ఆలోచనల్లోకి జారుకున్నాను.

చందనం!

చందనం అప్పుడు సూరిబాబుగారి అమ్మాయి మాత్రమే.

"ఇదిగో చందనం! నువ్వు కాస్సేపు అలా వుండు, నువ్వు తలదూరిస్తే యీ పని అయినట్టే" అనేంత దగ్గర అప్పుడు.

ఇప్పుడు "చందనంగారూ బావున్నారా?" అని అడిగేంత దూరం.

సూరిబాబుగారు మా అందరికీ గురువులాంటివారు. వృత్తిరీత్యా లాయర్ అయినా మంచి కార్యకర్తగానే సుపరిచితులు. సభలు, సమావేశాలు, ఊరేగింపులు, ఉద్యమాలు ఆయన ఊపిరి. ఎలక్షన్లు వస్తే యింక ఆయన యిల్లే మర్చిపోయేవారు. మాలాటి యువకుల్నందర్నీ కూడగట్టుకుని తరచు ఏదో ఒక కార్యక్రమం జరిపిస్తుంటారాయన. అందరికన్నా నాకే ఆ యింట్లో ఎక్కువ చనువు వుండేది.

"శంకరం! సమయానికొచ్చావు. పనుంది. నాతోపాటు బయలుదేరు. ఇంటికెళ్ళి భోంచేసి వచ్చేంత టైములేదు. యిక్కడ తినేసెయ్యి" అనేవారు సూరిబాబుగారు. మొదట్లో మూడు నాలుగుసార్లు మొహమాటపడినా తరచుగా యిలాటి సంఘటనలు ఎదరవుతూండడంవల్ల అక్కడే భోంచేసేవాడిని. అందుకే ఆ యింట్లో చనువు యెక్కువ. చందనంకూడా తండ్రిలాగ చనువుగా మెసిలేది.

"ఏమండోయ్ శంకరంగారూ! మీరు మొన్నటి మీటింగులో బ్రహ్మాండంగా మాట్లాడారట. నాన్నగారు చెప్పారులెండి. మరి నాకు మంచిపార్టీ యివ్వాలి. సగం పాయింట్స్ నేనే చెప్పానుకదా, ఏమంటారు? ఇస్తున్నారా. .. అలా దాంతో పాటు సినిమా కూడాను" అనేది చందనం.

"ఓ తప్పకుడా యిస్తా" అనేవాడ్ని.

అంతే. ఆమె యెప్పుడూ రానూలేదు. నేను ఇవ్వనూలేదు. ఇది ఏ మద్రాసో, హైదరాబాదో కాదని మా ఇద్దరికీ తెలుసు.

చందనం ప్రభావం నా ఆలోచనలమీదకూడా పడుతుండేది. ఓసారి ఓ రచయిత మిత్రుడ్ని చూసి నాకూ కథలు రాయాలని అనిపించింది. అరడజను కథలు రాశాను. ఒక కథ స్థానికంగా వచ్చే ఓ చిన్న పత్రికలో అచ్చయిందికూడా. ఆ కథ చందనం చదివి 'ఏం కథండీ యిది? అర్థం పర్థంలేని యీ ప్రేమలూ, త్యాగాలూ పెట్టి కథ రాయకపోతేనేం? సామాజిక చైతన్యం వుండాలండి శంకంరంగారూ! సాహిత్యానికి సాంఘిక ప్రయోజనం విధిగా వుండితీరాలి. మీ చుట్టూ ఎన్ని సమస్యలు లేవు? పొద్దున్న లేస్తే పేపరు మిల్లు కూలీలనీ, అల్యూమినియం వర్కర్లనీ, వాళ్ళనీ, వీళ్ళనీ కార్మిక సోదరుల మధ్యే తిరుగుతుంటారుకదా, వారి సమస్యల్ని తీసుకుని రాయగూడదటండీ? పెట్టుబడిదారుల గుత్తాధిపత్యం, శ్రమజీవుల పాట్లు యెన్నిలేవు రాయాలంటే. ఏమంటారు? వాటివల్ల కొంత మేలైనా జరుగుతుంది! వీటివల్ల ఏం ప్రయోజనం ఉంది చెప్పండి. ఇలాటి కథలు రాసేకన్నా చేతులు ముడుచుకుని కూచోడం మంచిది" అంది. ఆ తర్వాత మళ్ళీ నేను కథలు ముట్టుకోలేదు.

చందనం చాలా తెలివైనది. కాలేజీలో బి.ఎస్సీ చదువుతోంది. ఆ చదువుకన్నా తండ్రి దగ్గర ఆమె పొందిన శిక్షణే ఆమెకు విశేషమైన జ్ఞానాన్ని యిచ్చింది. అవిడేకాదు, ఆ ఇంటిలో అందరూ అంతే. వాళ్ళన్నయ్యకూడా చాలా అభ్యుదయ భావాలున్న వ్యక్తి. విశాఖలో 'లా' చదువుతున్నాడు. సెలవల్లో వచ్చినప్పుడు మాతోపాటు అన్ని కార్యక్రమాల్లోనూ పాల్గొనేవాడు.

చందనం అంటే మొదటినుంచీ నాకు అభిమానమే – ఆమె తెలివితేటలు – ఆమె ఆలోచనలు – ఆమె చొరవ నాకు చాలా నచ్చాయి. ఒక్కొక్కప్పుడు నాకు అనిపించేది – అభిప్రాయాల్లో యింత సామ్యం వుండి, యింత సన్నిహితంగా వచ్చిన

ఈ అమ్మాయిని పెళ్ళాడితే బావుండునుకదా అని. ఆమెను ప్రేమిస్తున్నాననీ, నాకు తెలియకుండానే ఆమెపట్ల ఆరాధన పెరిగిందనీ నేననుకోను. ఆమె నాకు నచ్చింది. పెళ్ళి చేసుకుంటే బావుండుననిపించింది. అలాటి అవకాశం ఏమాత్రంవచ్చినా వదిలిపెట్టగూడదని అనుకున్నాను. సమయం వచ్చినప్పుడు చెప్పాలనుకున్నాను. అప్పట్లో నాకు ఉద్యోగం లేదు. రాజకీయాల్లోపడి చదువు వెనకబడి అత్తెసరు మార్కులతో బి.ఏ పాసయ్యాను. పైకి చదవాలనుకుంటే మార్కులు బాగా రాక సీటు రాలేదు. ఉద్యోగాన్వేషణలో వున్నాను.

ఒకసారి ఓ యింటర్వ్యూకని వైజాగ్ వెళ్ళి వచ్చాను. ఇంటర్వ్యూ హడావుడిలో పడి ఓ పదిహేను రోజులపాటు సూరిబాబుగారింటికి వెళ్ళలేదు. ఆ తర్వాత వాళ్ళ యింటికి వెళ్ళినప్పుడు తెలిసింది చందనానికి పెళ్ళిచూపులు జరిగాయని. ఫిజిక్సు రిసెర్చి స్టూడెంటట. వచ్చి చూసుకుని వెళ్ళారట.

సూరిబాబుగారు యీ విషయం చెప్తున్నప్పుడు మామూలుగానే ఆలకించినా ఆ తర్వాత యింటికి వెళ్ళి ఆలోచించినప్పుడు మనసు సన్నగా మూలిగింది. సూరిబాబుగారు ఎంత అభ్యుదయ భావాలున్నవారైనా తన కూతుర్ని తీసుకొచ్చి నాలాటి ఏ ఉద్యోగమూ సద్యోగమూలేని అతి సామాన్యుడికిచ్చి పెళ్ళిచేస్తారని నేను ఏనాడూ భ్రమపడలేదు. ఈలోగా ఏదైనా మంచి ఉద్యోగం దొరికితే నేనే ఆమెను కదిపి చూచాయగా ఆమె మనసు తెలుసుకుందామని అనుకున్నాను. కానీ ఆ అవకాశం రాలేదు.

వారం రోజులతర్వాత ఆ సంబంధం కుదరలేదని తెలిసినప్పుడు మనసులో ఆశ చిన్నగా మిణుకుమంది. కొద్దిగా సంతోషంకూడా కలిగింది. నెల రోజులపాటు ఉద్యోగం గురించి గట్టి ప్రయత్నాలే చేశానుకాని లాభంలేకపోయింది. ఎక్కడా వచ్చేజాడ కనిపించలేదు.

చందనానికి మరో సంబంధం చూస్తున్నారు. సూరిబాబుగారే ఓ రోజు ఓ మధ్యవర్తితో ఏలూరులో ఫలానా వాళ్ళబ్బాయి ఉన్నాడనీ, డాక్టరీ పూర్తిచేసి యీ మధ్యే స్వంత డెస్పెన్సరీ పెట్టుకున్నాడనీ, ఆ సంబంధం చూసిపెట్టమనీ చెప్తున్నప్పుడు నేను అక్కడే వున్నాను. అప్పుడే నన్ను నేను తెలుసుకున్నాను.

కొద్దిరోజులు చందనంతో మాట్లాడటానికి అదోలా వుండేది. ఇప్పుడు మళ్ళీ పూర్వంలా హాయిగా స్వేచ్ఛగా మాట్లాడగలుగుతున్నాను.

ఆమెకు ఆ డాక్టరుదికూడా తప్పిపోయి, చివరకు ఓ సంబంధం ఖాయపడింది. ఆయన ఇంజనీరు. హైదరాబాదు అవతల రామచంద్రాపురంలో పనిచేస్తున్నాడు.

చందనం బి.ఎస్సీ, పరీక్షలు రాసిన వెంటనే పెళ్లి జరిపించేశారు. పెళ్ళయి వెళ్ళిపోయిన తర్వాతకూడా కొంతకాలంపాటు ఉత్తరాలు రాస్తూ వుండేది.

ఓ అయిదారు నెలల తర్వాత చందనం పుట్టింటికి వచ్చినప్పుడు చూశాను. అప్పటికి నాకు యింకా ఉద్యోగం దొరకలేదు. ఇంకా నేను ఆ ప్రయత్నాల్లోనే వున్నానని విని "పోనీ హైదరాబాదు వస్తారా? ఆయనతో చెప్తాను, ఎక్కడయినా చూసి పెట్టమని" అంది. అంతదూరం వెళ్ళడం యిష్టంలేక మాట్లాడక ఊరుకున్నాను.

ఆ తర్వాత నాలుగు నెలలకు కాకినాడలో టెంపరరీగా ఓ ఉద్యోగం దొరికింది. రెండేళ్లు చేశాక, చివరికి బందర్లో యూ ఎల్.ఐ.సి ఉద్యోగం వచ్చింది. ఆ తర్వాత భార్యకూడా.

"దగ్గరపడ్డట్టున్నాం... అదిగో ట్రాన్స్‌మిషన్ టవర్స్‌కూడా కనబడుతున్నాయి." చందనం భర్త వెంకటేశ్వర్రావు నా ఆలోచనల్ని తరిమేశాడు.

ఆలోచనల్లోంచి తేరుకుని చూశాను. దూరంగా టవర్ కనిపిస్తోంది.

"మరయితే మీరు మా యింటికి ఎప్పుడొస్తారు? రేపు కుదరదేమో, ఎల్లుండి రండి. అడ్రసు రాసిస్తాను" అంటూ చిన్న కాగితం తీసి అడ్రస్సు రాసిచ్చాడు.

మరో అర్థగంటలో బస్‌డిపో వచ్చేసింది. రిక్షా చేయించుకుని వెళ్ళిపోయేముందు "చందనంగారిని అడిగినట్లు చెప్పండి. వీలుచూసుకుని తప్పకుండా వస్తాలెండి" అని చెప్పి బయలుదేరాను.

ఆ మర్నాడూ, ఆ తర్వాత రోజుకూడా నాకు తీరిక చిక్కలేదు. మూడోరోజున పనేంలేకపోయినా మర్నాడు ఎలాగూ ఆదివారమేకదా, ఆయనకూడా యింట్లోనే వుంటాడుకదా ఆ రోజు వెళ్ళొచ్చులే అని ఆగిపోయాను.

ఆదివారం ఉదయాన్నే వెళ్ళేసరికి ఆయన ఇంట్లోనే వున్నాడు. ఆయన కంఠం వీధిలోకే వినిపిస్తోంది. ఎవరినో చెడామడా తిట్టేస్తున్నాడు! అలాటి పరిస్థితిలో నేను లోపలకి వెళ్ళడం బావుండదని కాస్సేపు మెట్లదగ్గరే తచ్చాడానుగాని ఆయనే చూసి "రండి! రండి! అక్కడే వుండిపోయారేమిటి?" అన్నాడు. లోపలికి వెళ్ళి చందనాన్ని కేకేసి వచ్చి "ఇంకా నుంచున్నావేం? వెళ్ళు, బైటికి తగలడు. ఆ రమాపతిగారి యింటికెళ్ళి, నేను రావడంలేదని చెప్పి, వాళ్ళను వెళ్ళిపోమను" అన్నాడు.

గతుక్కుమన్నాను నేను. ఆ మాటలు నన్నుకాదనీ, ఆ గదిలో బిక్కమొహం వేసుకుని చేతులు కట్టుకుని నిల్చున్న చింపిరితల పనిపిల్లననీ నాకు తెలుసు. కాని ఆ మాటల్లో, నేను రావడంవల్ల తను ఎక్కడికో వెళ్ళాలనుకున్న ప్రోగ్రాంకాస్తా ఆగిపోయిందన్న విసుగు లేదుకదా అనిపించింది.

చందనం వచ్చింది. వస్తూనే "నిన్నా మొన్నా మీరు వస్తారేమోనని ఎదురు చూశాం. రాకపోతే మర్చిపోయారేమో అనుకున్నాను. బస్సులో వారు కలవకపోతే అసలు మీకు మేం గుర్తుండేవాళ్ళమా–నిజం చెప్పండి!" అంది.

ఆమె చెప్పింది నిజమేగాని నిజమని ఒప్పుకోలేదు. నేను. నిజం చెప్పకుండా విషయం దాటేస్తూ "చాలా దూరమండీ మీ యిల్లు. ఒక వూరికి వెళ్ళినట్టే. సిటీలోకి రావాలంటే మీకు యిబ్బందే సుమా!" అన్నాను.

"స్కూటర్ వుందిగనక ఫరవాలేదు. అయినా తరచుగా సిటీలోకి రాము. పిల్లలతో బయలుదేరేటప్పుడు కాస్త యిబ్బందే అనుకోండి. అయినా ఎవరో ఒకరు లిఫ్ట్ యిస్తుంటారు–కార్లున్న ఫ్రెండ్స్ వున్నారులెండి, ఫరవాలేదు" అన్నాడు ఆయన.

చందనం కుశల ప్రశ్నలు వేస్తోంది–సంసారం, పిల్లలు, అత్తవారింటి విషయాలు–అన్నీ ఆడవాళ్ళ ప్రశ్నలే. చందనం భర్త ఆ రోజు బస్సులో కలిసినప్పటి మా సంభాషణ వేరు – ఈ సంభాషణవేరు.

మాట్లాడుతూ మాట్లాడుతూ యిప్పుడే వస్తానని లోపలికి వెళ్ళి కాఫీ కాచి పట్టుకొచ్చింది చందనం. గంటకుపైగానే కబుర్లుచెప్పుకుంటూ వుండిపోయాం. ఆడుకోడానికి వెళ్ళిన పిల్లలు వచ్చారు. ఓ అమ్మాయి, అబ్బాయి. అమ్మాయి ఆమె పోలికే.

మరో గంట కూచుని వచ్చేద్దామని లేవబోయానుగాని చందనం వెళ్ళనిచ్చిందికాదు. "ఇంత దూరం వచ్చి భోజనం చెయ్యకుండా ఏం వెళ్తారు? కూచోండి, భోంచేసి వెళ్దురుగాని" అంది. నేను ఎన్నిసాకులు చెప్పినా వీల్లేకపోయింది.

"మీరు మాట్లాడుకుంటూ వుండండి. వంట చేసేస్తాను" అని ఆమె వెళ్ళిపోయింది. చందనం భర్తకీ నాకూ అట్టే సంభాషణ సాగలేదు. పొడిపొడిగా నడుస్తోంది. అంతలోకే ఆయన మిత్రుడుగాబోలు ఒకాయన వస్తే వాళ్ళిద్దరూ మాట్లాడుకొంటున్నారు. నన్ను ఊరికే పరిచయంచేసి మళ్ళీ వాళ్ళ సంభాషణలో వాళ్ళు వుండిపోయారు. వాళ్ళేదో స్కూటరు గురించి మాట్లాడుకుంటున్నారు.

"...వాడు మొన్న మనం వెళ్ళినప్పుడు పెద్దగా రిపేరేం లేదండీ... కాస్త దెబ్బతింది. సరిచేస్తాలెండి అని అన్నాడా. నిన్న సాయంకాలం వెళ్తే యాభై రూపాయలు ఛార్జి చేశాడు. వీడికన్న ఆ గేరేజీలో పెట్టుకున్నారు చూడండి- హుస్సేన్-వాడే నయం" అన్నాడు ఆయన మిత్రుడు.

"వాడూ అలాటివాడేనండీ, దొంగ వెధవ. అసలు వీళ్ళంతా యింతే. వెధవలకి అందుకే ఎంత కష్టపడ్డా ఆ దరిద్రపు బతుకు తప్పదు" అన్నాడు చందనం భర్త.

సంభాషణ అలా కొనసాగుతూనే వుంది. ఆ వచ్చినాయన కంఠం చాలా పెద్దది. రూపాయి నాణాలు గలగల్లాడినట్టు మోగుతోంది. కాని నాకు అవేం వినిపించడంలేదు. చందనమే నా కళ్ళల్లో కదులుతోంది. పాపం! చందనం యిలాటి భర్తతో ఎలా నెట్టుకొస్తోందో? ఆమె ఆలోచనకీ అతని ఆలోచనకీ ఉత్తర దక్షిణ ధృవాలంత తేడా వుంది. పేదవాళ్ళ సమస్యలే తన సమస్యలుగా భావించి బాధపడే చందానానికీ, వాళ్ళను చూస్తేనే అసహ్యించుకొనే చందనం భర్తకీ మధ్య ఒకరి దగ్గరికొకరు దాటిరాలేనంత లోతైన అగాధం వుంది. చిన్నప్పటినుంచీ ఒకరకమైన వాతావరణంలో పెరిగి ఆ రకమైన ఆలోచనల్నే నరనరాన జీర్ణించుకున్న ఆమె, యీ కొత్త వాతావరణంలో ఊపిరి సలపక ఎంతగా గిలగిల్లాడిపోతోందో పాపం! క్షణం క్షణం అతని ప్రవర్తన ముల్లులా గుచ్చుకొంటుంటే ఎలా భరిస్తోందోకదా? ఆమె మనసునిండా ఎన్ని తూట్లో? ముళ్లగాయాలతో మనసంతా చింకిపేలికలా అయిపోయివుండాలి. ఆమె నవ్వుతూ తుళ్ళుతూ మాట్లాడినా ఆ వెనక విషాదమే నిండివుంటుంది!

"వస్తానండీ! మళ్ళీ కలుసుకుందాం" అంటూ ఆ స్కూటర్ అతను నా దగ్గరకొచ్చి షేక్‌హేండ్ ఇచ్చి వెళ్ళిపోయాడు. చందనం భర్త గేటువరకూ వెళ్ళాడు. నేను కూడా వెళ్ళబోతూ ఆగిపోయాను. వంటింట్లోంచి చందనం కంఠం కంచుగంటలా వినిపిస్తోంది.

"ఇందాకనగా పంపిస్తే ఇప్పుడటే రావడం, పోతులా తిరగడం తెలుసుకానీ పనిచేయడం తెలీదేం. రోజూ మాతోపాటు కాఫీ టిఫిన్లు పడుతున్నాయికదూ – ఒళ్ళు కొవ్వెక్కి పనిమీద మనసు నిలవడంలేదేమో! నీకూ నాజూకు వొచ్చేసిందే. ఇటున్న

యీనెప్పుల్ల అంటెయ్యడానికికూడా బద్ధకం బలిసిపోయింది. ఏవిటలా బెల్లంకొట్టిన రాయిలా నుంచున్నావ్? సంచి పట్టుకెళ్ళి యాదయ్య దగ్గర కాయగూరలు పట్టుకురా. ఇదిగో, యీ చీటీలో రాశాను–తీసికెళ్ళి చూపించు. బైట పెత్తనాలు చెలాయించక తొందరగా తగలడు" అంటూ విసుక్కుంటూ బైటికొచ్చి నన్ను చూసి ఆగిపోయింది.

చందనం అలా మాట్లాడడం ఆశ్చర్యంగానే వుంది. పనివాళ్ళమీద పెత్తనం చెలాయించే ధోరణిలో ఇంతకు ముందెప్పుడూ ఆమె మాట్లాడగా చూడలేదు. బహుశా చందనం మాటల్లో కోపమేగాని అసహ్యం లేకపోవచ్చు. పని తొందరగా చెయ్యలేదన్న కోపం తప్ప పనిపిల్లమీద చిన్నచూపు కాకపోవచ్చు.

కాని నేను అక్కడ వుండగానే జరిగిన మరో సంఘటన నన్ను నిర్విణ్ణుడ్ని చేసింది. నా అభిప్రాయాల్ని తారుమారు చేసింది.

భోంచేసిన తర్వాత సిగరెట్టు కాలుద్దామని వీధి అరుగుమీదకి వచ్చాను. చందనం పిల్లలూ, మరో ముగ్గురు పిల్లలూ అరుగుమీద రైలాట ఆడుకుంటున్నారు. వాళ్ళ మాటలూ, వాళ్ళ చేతలూ సరదాగా వున్నాయి. వాళ్ళవైపు చూడకుండా సిగరెట్టు కాల్చుకోవడంలో మునిగిపోయినట్టు నటిస్తూ వాళ్ళ మాటలు వింటున్నాను.

అంతలో చందనం హడావుడిగా వచ్చింది. ఆమెను చూస్తూనే బైటిపిల్లలు ముగ్గురూ గేటు తీసుకుని పారిపోయారు.

"ఏరా రఘూ! ఆ పిల్లల్తో ఆడొద్దని చెప్పానా. చదువూ సంధ్యా లేకుండా వాళ్ళలాగే తయారవుదామనుకుంటున్నావా? ఈసారి మళ్ళీ వాళ్ళతో ఆడ్డం చూసానో వీపు చీరేస్తాను, జాగ్రత్త!" అని కసురుకుని, అక్కడే వున్న నన్ను చూసి –

"వీళ్ళతో వేగలేక చస్తున్నాననుకోండి! వద్దన్నపనే చేస్తారు. పక్కవాళ్ళింటికిపోయి ఆడుకోగూడదూ? ఎదురింటి పిల్లలే కావాలి వీళ్ళకి. ఈ కొంప ఒకటి యిలా తగలడింది. క్వార్టర్సు మార్చేసుకున్నా బావుణ్ణు" అంది.

నాకేం అర్థంకాలేదు. ఆమె లోపలకి వెళ్ళిపోయిన తర్వాత వాళ్ళ రఘుని పిలిచి అడిగాను. పక్కింటి సునంద, రమేష్‌ల నాన్నగారు ఇంజనీరు. ఎదురింటి రమణ నాన్నగారు గుమాస్తా. ఓసారి బైటికి వచ్చి చూస్తే ఆ తేడా స్పష్టంగా తెలిసింది. రోడ్డుకి యివతల వుంటున్న యిళ్ళన్నీ ఒక తరహావి, అవతల వుంటున్నవి మరో తరహావి.

చందనాన్ని యిలా నేనెప్పుడూ ఊహించలేదు. సూరిబాబుగారి శిక్షణలో పెరిగిన చందనం, ఆయన భావాల్ని పుణికిపుచ్చుకున్న చందనం యిలా మాట్లాడ్డం చాలా ఆశ్చర్యంగా వుంది. ఆ విషయమే ఆమెతో అన్నాను.

ఆమె ఒక్కర్తే వున్నప్పుడు "మీరు చాలా మారిపోయారు సుమండీ! ఊహించలేనంత మార్పు వచ్చింది మీలో" అన్నాను.

ఆమె ఓసారి తన వొంటికేసి చూసుకుని నవ్వేసింది.

గంటసేపు వుండి నేను వచ్చేశాను. దారిపొడుగునా నాకు అదిడే గుర్తుకొచ్చింది.

హైదరాబాదులో మరో మూడురోజులు వుండి, వూరు అదీచూసి బందరు వెళ్ళిపోయాను. వెళ్ళిన రోజు ఆఫీసునుంచి అలా అలా తిరిగి ఇంటికివచ్చేసరికి చందనం దగ్గరనుంచి ఉత్తరం వచ్చివుంది.

అందులో మామూలు క్షేమసమాచారాలు అయిపోయాక –

“...శంకరంగారూ! ఆ రోజు మీరు నేను చాలా మారిపోయానని చెప్తే వెంటనే అర్థం చేసుకోలేకపోయాను. ఈమధ్యకాలంలో ఒళ్ళు చేయడంవల్ల అలా అన్నారేమో అనుకున్నాను. కాని ఆ రాత్రి ఆలోచిస్తుంటే మీరు ఏ ఉద్దేశంతో అన్నారో అర్థమైంది. మానసికంగా నేను చాలా మారిపోయాననీ, వెనకటి నా ఆలోచనలకీ యిప్పటి ఆలోచనలకీ విపరీతమైన తేడా వుందనీ మీ ఉద్దేశంకావచ్చు.

నిజమే, నేను చాలా మారిపోయాను. నేనిలా మారిపోవడం ఒక్కొక్కప్పుడు నా మట్టుకు నాకే ఆశ్చర్యం వేస్తూ వుంటుంది. మొదట్లో యీ మార్పుకు నాకే బాధ కలిగేది. ఎంతో సంఘర్షణ జరిగేది. తర్వాత నాకు తెలియకుండానే నా మనస్తత్వంలో మార్పు వచ్చేసింది.

ఈ దేశంలో భర్త ఎప్పుడూ భార్య తన అడుగుజాడల్లోనే నడవాలని కోరుకుంటాడు. తనకన్న భిన్నమైన ఆలోచనలు గల భార్యను ఏ భర్తా సహించలేడు. భార్య ఎప్పుడూ తనకు నీడలా వుండాలని, తనదే పైచేయిగా వుంచుకోవడానికి ప్రయత్నిస్తాడు. తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోడానికి ప్రయత్నించే భార్యముందు ఇన్ఫీరియారిటీ ఫీలయి, ఆమెకు అలాటి అవకాశమే యివ్వకుండా జాగ్రత్తపడుతుంటాడు. తన గొప్పతనం తనవల్లే రావాలని, భార్యవల్ల రాగూడదని ఆలోచించే పాతకాలపు ఆలోచనలు మనవి. ఇది ఇక్కడి నరనరంలో జీర్ణించుకుపోయింది. ఈ వ్యవస్థలోంచి తొలగించి తీసేయలేనంతగా కలిసిపోయింది.

ఇలాటి పరిస్థితుల్లో నేనుమాత్రం యింకెలా ప్రవర్తించగలను? నా భర్త అనురాగం దూరమైపోతుంది. కలతలు ప్రారంభమవుతాయి. నా సంసారం వీధిన పడుతుంది. నా జీవితమే దుఃఖమయమవుతుంది.

అందువల్ల మరో గత్యంతరంలేక నేనూ మారకతప్పలేదు. చిత్రమేమంటే – నాకు తెలియకుండానే నాలో యీ మార్పు వచ్చేసింది. నేనేకాదు – ఈ దేశంలో ప్రతి స్త్రీ ఇంతే. ఇంతెందుకు మీ ఆవిడ విషయమే తీసుకోండి. ఆమె మీకన్న భిన్నమైన ఆలోచన్లు కలిగి వున్నదేమో ఆలోచించండి. పెళ్ళికి పూర్వం ఆమె ఆలోచనాతీరు ఎలావున్నా మీ ఇంట్లో అడుగు పెట్టినతర్వాత మీ మార్గంలోనే నడుస్తున్నదో లేదో ఆలోచించండి. ఆమెను నేను చూడకపోయినా యీ విషయంమాత్రం గట్టిగా చెప్పగలను. ఆమె మీకు నీడ. ఎందుకంటే – ఇది భారతదేశం గనుక. అలాగే నేనుకూడా...”

ఉత్తరంమీద నీడ పడింది. ఇటు తిరిగాను.

మా ఆవిడ!

● ప్రచురణ కాలం ? ●

★ ★ ★

బీనాదేవి

# 39 ఎ మేటర్ ఆఫ్ నో ఇంపార్టెన్స్

అవి మూడుజతల తొడలు, జవజవ లాడుతున్న జవరాళ్ళవి... దొరసాన్లవి!

ఆ వాల్ పోస్టరు చూసి తల్లినీ చెల్లినీ తల్చుకునేవాడు మహర్షో, మందదృష్టివాడో అయివుండాలి. ఆ పోస్టరు చూస్తున్న సత్యం చూపుకి గెద్ద. అతనికి మహర్షి అయ్యే చిహ్నా లేవీ లేవు.

రిక్షాలో కూర్చుని సీటుకి కాళ్ళు నిగడదన్ని విలాసంగా బీడీ కాలుస్తున్న అతను పనస తొనల్లాంటి ఆ తొడలని మరోసారి చూసి, "ఆడముండకి గుడ్డవిప్పినా కట్టినా దొరే సెయ్యాలి గురూ!" అన్నాడు.

పక్క రిక్షాలో "గురుడు" గుర్రుపెడుతున్నాడు. "రికసాఓడికీ, రంకుముండకీ రేత్తిరి నిద్దరేటి, నెగు నెగు" అని సత్యం పక్క రిక్షాని కాలితో తన్నేడు. ఆ తాపుకి "ఓ రుండేస్" అంటూ కళ్ళు తెరిచేడు సింహాచలం. తెరిచిన అతని కళ్ళకి మెరుపుతీగను తెచ్చి అద్దాల బీరువాలో బిగించేసినట్టు కనిపించింది, ఎదుటి షాపులో అప్పుడే పెట్టిన కొత్తబొమ్మ.

ఆ బొమ్మ ఒక ఆడదాన్ది. ఆ బొమ్మకే ప్రాణం వస్తే, ఆమె కోసం మహర్షులుకూడా మర్డర్లకి వెనుదియ్యరు. ఆమె ఒక చుక్కలా చీర సగమే కట్టుకుంది. మిగతా సగమూ కట్టుకోకపోవడానికే నిశ్చయించుకుంది. ఆ చీర చుక్కలరాత్రి తళుకులా సింహాచలం కళ్ళలో మెరిసింది. ఆ చీర కప్పని వంపులు వెన్నెల వలపుల్లా అతని ఎముకల్లో మెదిలేయి.

ఆ చీర "ముగ్గురు మొగుళ్ళు" చీర. ఖరీదు ఇరవై రూపాయలని చీరకున్న బిళ్ళ చెపుతోంది.

సింహాచలం అంతకుముందు రాత్రి "ముగ్గురు మొగుళ్ళు" సినీమాకి రాజమ్మతో వెళ్ళేడు. ఆ సినీమాలో బీద హీరోయిన్ కాలేజీకి హీరో కార్లో వెళ్ళి హీరోయిని యింటికి దిగబెడతానని కార్లో ఎక్కించుకున్నాడు. కారు ఊరు దాటడం కనిపెట్టిన హీరోయిన్ బెదురుబెదురుగా "యిటెక్కడికి?" అంది. ఇంకా ఎక్కడికో తీసుకుపొమ్మన్నట్టు వళ్ళు వెయ్యివంకలు తిప్పి.

హీరో కారాపేసేడు. ఆపేసి, కార్లోవున్న హీరోయిన్ని ఎత్తుకొని పరిగెత్తి పాదాలలోతు పన్నీరులా ప్రవహిస్తున్న సెలఏట్లో నిద్రపోతున్న నీటి ఏనుగులా ఉన్న ఒక నల్లబండమీద

నిలబెట్టి "యిక్కడికి!" అన్నాడు, ఆ పలుకే పెద్దవిట్టులా నవ్వుతూ, "అమ్మ దొంగా!" అంది హీరోయిను. "అమ్మ దొంగా" అన్నప్పుడల్లా పాడే "కీ" బొమ్మలా హీరో "దొంగవు నువ్వే... గజదొంగవు నువ్వే..." అన్న పాట రెండు చరణాలు పాడేడు. పాడుతూ మత్తగజంలా అరిచేడు. అరుస్తూ నీట్లో దొర్లేడు. బండ మీద మొగ్గలు వేసేడు. ఆఖరున అలిసిపోయిన పిల్లడు తల్లిదగ్గరకు పోయినంత అమాయకంగా హీరోయిన్ దగ్గర కెళ్ళి ఆమె చెంగు పట్టుకున్నాడు. వెంటనే హీరోయిన్ మూడో చరణం పాడుతూ "వానా వానా చల్లప్ప" తిరిగింది. తిరగడంలో ఆమెచీర కుచ్చెళ్ళ వరకూ విడిపోయింది.

విడిపోయిన ఆమె చుక్కలచీర మణులు పొదిగిన మంచు తెరలా వుంది.

ఆ చీరలోంచి ఆమె వంపులు ఆకర్షణీయంగా కనిపించేటంత అస్పష్టంగానూ, యింకా చూడాలని కోరుకొనేటంత స్పష్టంగానూ కనిపించేయి. ఆ సీను అందరి ప్రేక్షకుల హృదయాలనూ దోచుకుంది. ఆ సీను చూసిన ప్రతి ఆడదీ అలాటి చీరకోసం తహతహలాడింది. ప్రతి మొగాడూ అలాటి చీర తన ప్రియురాలికి కొనాలని తహతహలాడేడు.

సినీమానుండి వస్తూ, "ఆ కోక బావుంది" అని "గదూ" అని కలిపింది రాజమ్మ. అది విన్న సింహాచలం "ఊనాను" అనేసేడు. "నిన్ను, నన్నూ కలిపి తాకట్టు పెట్టినాకూడా ఆ చీర ఖరీదు రాదు" అని ఆ "ఊనాను" అర్థం.

ఆ రాత్రి నిద్ర పట్టలేదు సింహాచలానికి. ఆడదానికి నచ్చిన చీర కొనలేని మొగుడూ ఒక మొగుడేనా అన్న సందేహం వచ్చిందతనికి. "కాదు" అన్న సమాధానంకూడా వచ్చింది. తనమీద తనకే అసహ్యం వచ్చిం దతనికి.

దగ్గర దగ్గర పదిహేనేళ్ళ కాపురంలోనూ రాజమ్మ అతన్ని ఏమీ కోరలేదు. ఆఖరికి అమ్మలాంటి తన అరణం అవుని కోర్టు అమీనా తీసుకుపోతున్నప్పుడుకూడా దాన్ని విడిపించమని కోరలేదు. తన కంటే, కాసులుపేరూ కోర్టు ఖర్చులకి కరిగిపోయి, నాగరం, నల్లపూసా పోయినా, పసుపు కొమ్ముతో నవ్వే నగగా మిగిలిపోయినా ఆమె ఆనందంగానే యీదుతోంది సంసారపు విషపులోతుల్ని.

బతుకులోని భారం అంతా సంతోషంగానే మోస్తోం దామె. రైతుకి పుట్టి, రైతునే కట్టుకొని, కవలపిల్లల్ని పోగొట్టుకొన్నట్టు అటు పుట్టినూరికీ, యిటు మెట్టినూరికీ దూరమై పట్నంలో అంట్లు తోముకు బతుకుతున్నా ఆమె బాధపడలేదు. "నచ్చింతల్లి నాగ నువ్వొక్కర్తివె మిగిల్నావు నాకు" అని సింహాచలం అన్నప్పుడు మినిష్టరైన ఆడ "ఎంపీలా" ఆమె గుండెలు సంతోషంతో బరువెక్కిపోతాయి.

అటువంటి రాజమ్మ – "సేపంకొద్దీ నాకు దక్కింది గాన్నేకపోతే పురాణాల్లో పుట్టుండును" అని సింహాచలం అనుకునే రాజమ్మ ఆ చీర బాగుందని అన్నప్పుడు "ఊనాను" అనిమాత్రం అనగలిగిన తనని "ఆకిరికి రాజమ్మకూడా చెమించలేదు" అనుకున్నాడు. సింహాచలం. రాజమ్మకి కోకకాదు సరిగదా పకోడీలు కొనడానికిక్కూడా పదిపైస లైవు అతని దగ్గర. ఏడేళ్ళై అతను తొక్కుతున్న రిక్షా, రిక్షా ఓనరుదే.

మూడేళ్ళై వుంటున్న గుడిసె గుడిసేటిదానిదే.

అతని ఐదెకరాలూ పోయేయి. ఇదివరకుండే చల్లని యిల్లు యిప్పుడతన్ది కాదు గతంలో పరువూ, భవిష్యత్తులో ధీమా, మంచీ మమతా స్నేహాలూ, చుట్టరికాలూ అన్నీ పోయేయి.

“ఆఖరికి అడుక్కుతినే కాడికొచ్చినాది జనమ” అన్న విచారం, “సావుకోరి కేసులో సాచ్చీకం సెప్పేసినా బాగుండిపోను” అన్న రిగ్రెట్ మాత్రం మిగిలేయి.

అతను పుట్టిన వూళ్ళో షావుకారు మూడు ముఖాల్లేని సృష్టికర్త, మూడుకళ్ళులేని లయకారుడు. అతని దగ్గర అప్పు పుచ్చుకోని మనిషి ఆ వూళ్లో లేదు. ఇచ్చిన డబ్బుకి రసీదు అతను స్వంతం తల్లికి కూడా యివ్వడు. ఊళ్ళో పదోవంతు భూములు అతని స్వంత. మరో పదోవంతు తాకట్టులు వాకట్టులు అవగానే అతనివే అవుతాయి.

లొంగినవాడికి పది రూపాయలు మాఫుచేసే ధార్మిక బుద్ధితోపాటు, అతనికి, ఎదురు తిరిగినవాడిని వారు బాకీ వున్నది పది రూపాయలే అయినా, పదివేలు ఖర్చుచేసి మసిచేసేసే పట్టుదలా, బిజినెస్ టాక్టిక్సు, వ్యవహార వ్యూహ రచనాకూడా అతనికి ఉన్నాయి. అతనికి ఎదురుతిరిగి బూడిదైపోయిన వాళ్ళల్లో అప్పల్నాయుడు ఒకడు.

కోర్టులో కొన్న అప్పల్నాయుడి భూమిని అమీనాద్వారా స్వాధీనం చేసుకొని, స్కూటరు మీద వస్తున్న షావుకారుకొడుక్కి ఎక్కడినుంచో రాయివచ్చి తగిలింది. అతను స్కూటరు ఆపగానే చెట్టుచాటునుండి పులీ ఎలుగుబంటీ కలిసి చేసిన వింతమృగంలా అప్పల్నాయుడు వచ్చి, అతన్ని పట్టుకొని. కసుక్కున గుండెల్లో కత్తిగుచ్చి పారిపోవడం ఏటిసీళ్ళూ, చెట్ల వూలుమాత్రం చూసేయి. ఆ తర్వాత అరగంటకి అక్కడికి వచ్చిన అమీనా, సింహాచలం వగైరాలకు కనిపించినవి పడిపోయిన స్కూటరూ, చచ్చి పడున్న షావుకారు కొడుకు కళ్ళల్లో అప్పల్నాయుడు వేసిన భయం ముద్రా మాత్రమే.

ఖూనీకేసు ఖూనీకేసులాగే దర్యాప్తు జరిగింది. షావుకారు సంచులు కోసేడు. చూడని నేరం చూసినట్టు చెప్పేవారికి ఎటువంటి కొరతా విచారంలేకుండా చేసే భారం తనదన్నాడు.

అమీనా పట్నపు గరళపు నీడల్లో పెరిగిన వ్యక్తి. ఖూనీకత్తి అంచు మెరుపు, ఎర్రదనం, పోర్జరీ సిరా నల్లదనం అతన్ని భయపెట్టవు. పదిమంది పిల్లల్నీ, పాతమొగుడ్ని వదిలేసి లేచిపోయిన ఆడదీ, తల్లినీ పిల్లనీ ఉంచుకున్న విటులూ, డబ్బు ముట్టలేదని ఆపరేషను చెయ్యని గవర్నమెంటు డాక్టరూ, పదిరూపాయలకోసం అబద్ధం సాక్ష్యం చెప్పే ఐశ్వర్యవంతులూ, అతని దృష్టిలో సామాన్యదారులు. దేవుడి సాక్షాత్కారం, కోర్టుసాక్ష్యంలో నిజం మాత్రం అతన్ని ఆశ్చర్యపరచగలవు. ఒక నిజం కేసు నిలబెట్టడానికి అబద్ధపు సాక్ష్యం చెప్పటం అతను తన నైతిక విధిగా తీసుకున్నాడు.

అమీనాకి వున్న నైతిక సర్దుబాటు సింహాచలానికి లేకపోయింది. చూడనిది చూసేనని అనలే నన్నాడు. అనగలిగినా ప్రమాణం చెయ్యలే నన్నాడు. “అప్పల్నాయుడు పిల్లలో” డన్నాడు. “ఆడి పెళ్ళాం ఉసురు పోసుకో”లేనన్నాడు. “యీపాలికి ఒగ్గీ” మని షావుకార్ని ప్రార్థించేడు.

చిన్న పిల్లడికి నచ్చజెప్పినట్టు అతనికి నచ్చజెప్పేడు షావుకారు. తన కొడుకుని అప్పల్నాయుడుతప్ప యింకెవరూ పొడవలేదన్నాడు, పొడవలేరన్నాడు. దౌర్జన్యాన్ని అబద్ధం సాక్ష్యం చెప్పి అయినా శిక్షించాలని ధర్మపన్నాలు చెప్పేడు. చెప్తే సింహాచలం పొలం మీదున్న ఐదువేల తనఖా వదిలేస్తానని ఆశ చూపించేడు. చెప్పకపోతే రసీదులేని నాలుగువేల రూపాయ చెల్లులూ తొక్కేసి, పూర్తి మొత్తానికి దావాచేసి, అతని భూమినీ, యింటినీ కొనేసుకొని "నిన్ను బికారిని" చేస్తాను అని బెదిరించేడు,

బికారిని చేసేడు.

"...సేసి బతుకులో పసుపు తుడిసేసినాడు" అని కొడుకుని ఎత్తుకొని యిల్లు వదిలివస్తూ రాజమ్మ అన్నప్పుడు ఆమె కంటిముత్యం పేలిపోయి గుమ్మం పసుపుమీద పడి యింకిపోయింది.

"ఆడు తలుసుకుంటే యిలాటివి పదిస్తాడు" అని తనకు తనే ధైర్యం చెప్పుకున్నాడు సింహాచలం.

కాని "ఆడు" తల్చుకోలేదు.

ఆలోచనలు ఎడారి దుమారంలో మనసుని చుట్టుకున్న సింహాచలానికి సత్యం పక్క బీడీల దుకాణం దగ్గరకి వెళ్ళడం, అతని వేపు తిరగడం కనపడలేదు. సింహాచలం మొహంలో వచ్చిన మార్పుకి అతను కొత్త మనిషిలా కన్పించేడు సత్యానికి. ముప్పై ఐదేళ్ళ వయస్సే వున్న సింహాచలం నలభై ఐదేళ్ళ వాడిలా కనిపిస్తాడు. ఆరడుగుల పొడవూ, దానికి తగిన ఒడ్డూవున్నా అతను ఆదిపర్వంలోని భీముడిలా కాకుండా అరణ్యపర్వంలోని భీముడిలా నీరసంగా వుంటాడు. అతని ముఖంలో ధర్మజుని శాంతమేకాని, భీముని రౌద్రం కనిపించదు. అతను రిక్షా తొక్కుతూ వుంటే మూడుచక్రాల సైకిలు తొక్కుతున్న ముసలాడిలా ఆక్వర్డుగా కన్పిస్తాడు. తలుచుకుంటే ఎదుటివాడి కాళ్లు రెండు పీకేసి వాడి చేతిలోనే పెట్టేసే బలం వున్నప్పటికీ అలాంటి దుర్మార్గం చెయ్యలేని "మంచితనం" వల్ల కలిగిన నీరసం అతని కళ్లలో కన్పిస్తుంది. అతని జుత్తు నల్లగా వంకీలు తిరిగి అతి దట్టంగా వుండడం వల్ల జెయింట్ సైజుకి ఎదిగిపోయిన ఇడియట్‌లా కన్పిస్తాడు అతను. అతను తొడుక్కున్న సైను బనియను చేతులు అతి పొట్టివి కావడంవల్ల రిక్షా తొక్కుతున్న అతని చేతి కండలు ఎర్రటి ఎండలో నల్లటి రాతి కండల్లా కన్పిస్తాయి.

మోకాళ్ళవరకూ ఎగ్గట్టిన అతని పంచ కొన్ని చిరుగులు మాత్రమే దాస్తుంది.

అతని తలకు చుట్టుకున్న గుడ్డ కాలేజీ పిల్ల జాకెట్టు క్కూడా సరిపోదు.

ఒక బంగారు ఉదయాన బంగారు కొండలాంటి ఒకడిని రిక్షా ఎక్కించుకొని కూరల మార్కెట్టు దగ్గర దింపేడు సింహాచలం. "ఇప్పుడే వస్తా నుండు" అంటూ అతను మార్కెట్లోకి వెళ్లేడు.

వెళ్లినవాడు మూణ్ణిమిషాల్లో తిరిగి వచ్చేసేడు. తల్లినీ, పిల్లనీ ఒక్కసారి పోగొట్టుకున్న వాడిలా అతను కుంగిపోయివున్నాడు. ఆ విచారానికి అతనికి జుట్టుంటే రాలిపోయేది, మీసంవుంటే పండిపోయేది. అతని పక్కనున్న పొడ్డు యినపకొండలా బలంగా, లావుగా వున్నాడు, నీ దుమ్ములు ఏరేసి వాటిని సుద్దముక్కల్లా రాసెయ్యగల బలం అతని కుంది. బొచ్చుకుక్కని ఒక్కొక్క వెంట్రుక పీకి చంపెయ్యగలిగే క్రౌర్యం

అతని కళ్ళల్లో వుంది. అతని పక్కనున్న సత్యంమాత్రం బొచ్చుపోయిన కుక్కపిల్లలా దీనంగా, చూసేవాళ్ళకి జాలీ, అసహ్యం ఒక్కసారే కలిగేట్టు వున్నాడు.

అతని కళ్ళల్లో యితర దయాదాక్షిణ్యం చూడని మనిషి అపనమ్మకం వుంది.

అతనిజుట్టు ఎప్పుడూ దువ్వనట్టుంది.

అతని పేంటు ఎప్పుడూ ఉతకనట్టుంది.

అతని మొహాన ఉన్న దెబ్బమాత్రం ఎర్రగా, తాజాగా పగిలిన దానిమ్మపండులా వుంది.

వాళ్ళను చూసిన సింహాచలం రిక్షా ఎదురు తీసికెళ్ళి "ఏటైనాది బాబూ?" అన్నాడు.

"పరుసు" అని ప్రాణం పోతున్న మనిషిలా బెక్కేడు కూరలు కొనడానికి వచ్చిన మనిషి.

"పోతే పోనాది, ఎక్కండి బాబు" అంటూ వెనక్కి తిరక్కుండానే రిక్షా సీటుమీద కొట్టేడు సింహాచలం.

గుండు దెబ్బతిన్న పిట్టలా పర్స్ బంగారుకొండ కాళ్ళదగ్గర పడింది.

తర్వాత కథ సుఖాంతం.

పర్సు దొరికినందుకు సంతోషంతో హెడ్డు సత్యాన్ని కొట్టేడు. అది తియ్యనందుకు మరోసారి కొట్టేడు. "నీ యదురుష్టం బాగుండి పోనాది" పొమ్మన్నాడు. అతను పోయీలోగా "మాపిటికి టేసన్ కి రా" అని ఆర్డరేసి పర్స్ మనిషితో వెళ్ళిపోయేడు.

వాళ్లు వెళ్ళిపోయేక, "నీ యిల్లెక్కడ" అని అడిగేడు సింహాచలం, సత్యాన్ని. హైదరాబాదు నవాబుగార్ని హైదరాబాదులోనే ఆ ప్రశ్న అడిగినా, వారు సత్యమంత ఆశ్చర్యపోరు.

సత్యానికి, సూపరెంటుగారి అబ్బాయికీ పద్ధతిప్రకారం ఒకే అవకాశాలూ, హక్కులూ వున్నాయి. కాని సత్యం యిల్లు యింకా కట్టబడలేదు.

"మీ యమ్మ?"

భూదేవివంక చూసేడు సత్యం.

"మీ బాబు?"

నింగిని తొంగిచూసేడు అతను.

"పోనారా?"

"తెల్దు."

సెక్సు కుళ్లులో పుట్టిన పురుగు సత్యం, అతను పుట్టేక అతన్ని తల్లి కనువిప్పి చూడలేదు. తండ్రి కావాలనే నిర్దయా, రాక్షసంగా, క్రూయల్ గా, మెర్సిలెస్ గా కాదని కాలువ వడ్డున పారేసేడు.

అతనికి జరిగిన అన్యాయానికి ప్రకృతి విలయ తాండవం చేసింది. ఆకాశం కడుపు చించుకొని ఏడ్చి అతనికి పురిటిస్నానం చేయించింది. ఆ తర్వాత ఆ అన్యాయం తలుచుకొని బాల భానుడు మండిపడి సత్యం వళ్లు వత్తేడు.

ఆ తర్వాత వెంకన్న కంటపడ్డాడు సత్యం. వెంకన్న పగలంతా దగ్గుతాడు. రాత్రి "మాదాకవళం" అడుక్కుంటాడు. అతని కింద అప్పటికే యిద్దరు ముష్టిపిల్లలు పనిచేస్తున్నారు. వాళ్లలో ఒకడికి కాళ్లు లేవు, రెండో వాడికి కళ్లు లేవు.

దొరికిన పిల్లడికి వెంకన్న 'సత్యం' అని నామకరణం చేసేడు. సత్యాన్ని పోషించ వలసి వచ్చినందుకు వెంకన్న విచారించలేదు. అతన్ని ఒక పెట్టుబడిగా స్వీకరించి సంతోషించేడు.

మూడు నెలలు వచ్చేసరికి సత్యం ఖంగుమని ఏడవటం నేర్చుకున్నాడు. "ఫర్లేదు. మూడేదులు యినిపిస్తాది గొంతుకు" అని అంచనా వేసుకున్నాడు వెంకన్న.

సత్యాన్ని కింగ్ ఆఫ్ బెగ్గర్స్ చేద్దామనే వెంకన్న ఆశ. అలా చెయ్యడానికి అతను అనవసర తొందర పడలేదు. సత్యం కాళ్లు విరిచెయ్యడమో, కళ్లు పొడిచెయ్యడమో నిర్ణయించుకోలేక రెండేళ్లు దగ్గి దగ్గి ఒక కాళరాత్రి కన్ను మూసేడు అతను.

వెంకన్న పోగానే కుంటివాడూ, గుడ్డివాడూ కనిపించకుండా పారిపోయేరు.

చావు అంటే ఏమిటో తెలియని సత్యం వెంకన్న కడుపు మీద తల పెట్టి కొంతసేపు నిద్రపోయేడు. అతడు నిద్రలేచేసరికి మోహంలేని మనిషిలా భయంకరంగా వుంది రాత్రి.

నరకంపొగలా నల్లగా వుంది చీకటి.

పాముకళ్ళలా మెరుస్తున్నాయి దూరాన వున్న దీపాలు.

సత్యం నిద్రలేచేసరికి అతనికి స్ఫురించిందల్లా ఆకలి మాత్రమే. తాతని అన్నం పెట్టుమని ఆప్యాయంగా అడిగేడు, దీనంగా అర్థించేడు. భక్తితో ప్రార్థించేడు. ఎన్ని చేసినా దెయ్యం నవ్వు నవ్వుతున్న వెంకన్న లేవలేదు. ఆ నవ్వు వికారం – రాత్రి ఒంటరితనం – ఒక్కసారి భయపెట్టేయి సత్యాన్ని.

అప్పుడు సత్యం అతిభయంతో, మితిలేని ఆశతో, భరించలేని బాధతో "ఒక్కసారి లే తాతా!" అని అరిచేడు.

ఆ అరుపుకి కాలువ కరడు కట్టుకుపోయింది.

నక్షత్రాలు భయంతో వణికిపోయేయి.

ఆ అరుపు విన్న నల్లనాగు గజగజ వణికి వంకీలు తిరిగిపోయింది.

ఆ అరుపు పెనుపాము బుసలా వినిపించి గూళ్లలో పక్షులు కిరకిరలాడిపోయేయి.

సత్యం కేకకి దూరంగా చెట్లకింద వున్న ముష్టివాళ్లు పరిగెత్తుకొచ్చేరు. ఆ తర్వాత మార్పులు అతి త్వరగా జరిగిపోయేయి.

కాళ్ళూ, చేతులూవున్న కొంతమంది ముష్టివాళ్లు వెంకన్న శవాన్ని ఊళ్లోకి మోసుకుపోయేరు, చందాలు దండుకోవడానికి.

చేతులున్నా వేళ్లులేని ఒక ముష్టిది వెంకన్న తాత చెట్టునీ, చెట్టుకింద అరుగునీ, అరుగుమీద డొక్కులీ స్వంతం చేసుకుంది. ప్రపంచంలో మంచీ, చెడూ విడి విడిగా వుండవు కాబట్టి, చెట్టూ అరుగూ డొక్కులతో సహా మూడేళ్ళ సత్యాన్ని కూడా స్వీకరించిందామె.

ఇవేమి గుర్తులేవు సత్యానికి. కాని మరో రెండేండ్లుపోయేక ఆ వేళ్లులేని ఆవిడ తనని ఒక గుడ్డి ముష్టివాడికి అసిస్టెంటుగా పది రూపాయలకు అమ్మెయ్యడం, తను "గుడ్డోడు బాబయా, కళ్లులేని కబోది, దరమం సెయ్యండె బాబూ" అని అరుస్తూ వాడిని కర్ర సాయంతో వీధులన్నీ తిప్పడం, ముష్టి దొరకనిరోజుల్లో అదే కర్ర చేత గుడ్డివాడు కొట్టిన దెబ్బలు తినడంమాత్రం బాగా గుర్తున్నాయి అతనికి.

దేశాలకి స్వతంత్రం ఏవిధంగా వస్తుందో తెలియదు గాని వయసొచ్చిన కొంతమంది ముష్టిపిల్లలకి ముసిలి ముష్టివాళ్ళ చావు మూలంగా వస్తుంది.

గుడ్డివాడు చచ్చేసరికి సత్యానికి దగ్గర దగ్గర పన్నెండేళ్ళున్నాయి. అంచేత అతను గుడ్డివాడి వారసురాలనని వచ్చిన ఆమె హక్కులు ధిక్కరించి స్వాతంత్ర్యం ప్రకటించి, దాన్ని నిలుపుకున్నాడు.

ఆ తర్వాత అతను ఎలా బతికేడు?

ముష్టి ఎత్తేడు, మూటలు మోసేడు. పేడ అమ్మేడు. బస్సులు కడిగేడు. జోళ్లు పాలిష్ చేసేడు. వళ్లు మాలిస్ చేసేడు, లొంగినవాడికి మస్కా కొట్టేడు. చిక్కిన జేబులు కొట్టేడు. పట్టుబడినప్పుడు తన్నులు తిన్నాడు, పోలీసులకి కేసులు తక్కువైనపుడు జైలుకెళ్లేడు.

ప్రపంచంలో వున్న – ధర్మం, దగా; కరుణ; కాఠిన్యం; త్యాగం, స్వార్థం; నమ్మకం, ద్రోహం; ప్రేమ, విరోధం; అన్నీ అతను చూసేడు, వీటిల్లో మొదటివి రమారమి అనలేనంత తక్కువని గ్రహించేడు.

అతని కిప్పుడు ఇరవై రెండేళ్ళ వయసు.

ఇరవై రెండేళ్ళ మొగాడి ఆకలి వున్నది.

అది తీర్చుకుందామన్న పట్టుదలమాత్రం వుంది.

ఓటులేని పౌరుడు అతను.

కలుసుకున్ననాడే సత్యాన్ని ఇంటికి తీసుకొనివచ్చేడు సింహాచలం. అప్పుడు యింట్లో రాజమ్మా, ఆమె కొడుకు, చెల్లెలు వజ్రం వున్నారు. వజ్రానికి పద్దెనిమిది ఏళ్లుంటాయి. ఆమెని చూడగానే సత్యం గుండె గొంతుకులోకి వచ్చింది.

ఆమె...

రవ్వల పువ్వులా మిలమిలలాడుతోంది.

కొత్త దిండులా ఆరోగ్యంగా ఆకర్షణీయంగా వుంది.

వట్టివేళ్ళ వాసనలా చల్లగా వుంది ఆమె చూపు.

అధేరాత్రి సింహాచలం తన కథనంతా చెప్పేడు సత్యానికి. అది తన కథే అయినా విని భయపడిపోయిన రాజమ్మ "బతుకులో ఏటి మిగిలింది బాబూ! వేసిన సేనూ – ఏసిన సెట్టూ – పెంచిన పసుపూ – అన్నీ పోనాయి. పోనివి పేనాలే..." అని ఆగిపోయింది.

సత్యానికి మనుషుల మంచితనంలో ఏమాత్రం నమ్మకంలేదు. అంచేత కథ విన్నవెంటనే "నువ్వుట్టి ఎర్రిసన్నాసివి గురూ" అని సింహాచలంమీద జడ్జిమెంటు చెప్పేడు. క్షణం ఆలోచించి "వాల్ రైట్, నా నొప్పుగుంటా – మడిసి మంచిగానే వుండాలని! కాని ఎప్పుడు? అవతలోడు ఎడాపెడా లాడించేస్తుంటే యిప్పేమీద గుద్దమని వంగి ఏం నాబం?

"మంచోడికి దణ్ణవెట్టు, నాను కాదన్ను.

"కాని సెడ్డోడి దవడపళ్లు రాలగొట్టే, నేకపోతే ఆడు నిన్ను బతకనీడు. ఆడికాడ మంచి నాబం నేదు. ఆడి జోడు తుడు. అదే నీమీది కెత్తుతాడు. కాని ముందు సెప్పి నువ్వే ఎత్తు, నీకు సలాం ఎడతాడు.

"సెయ్యి సాపుతే నొంగని నోకం సెయ్యెత్తితే నొంగుతాది" అని జ్ఞానోపదేశం చేసేడు. ఆ తర్వాత సింహాచలం యింటిలోనే అతను వుండిపోయేడు.

ఇదంతా కథ ప్రారంభంనాటి రాత్రికి చాలాముందు.

ఆ రాత్రి బట్టలషాపు బొమ్మవేపు వెర్రివాడిలాగా చూస్తున్న సింహాచలాన్ని బీడీబంకు దగ్గర నిలబడిన సత్యం "ఏటి గురూ అలా చూస్తున్నావ్?" అని ప్రశ్నించి, బీడీషాపులో వేలాడుతున్న బూతుపుస్తకాల్లో తలదూర్చి, బీడీ కట్టకొని "సాతనైతే నీ యాడదాని కలాటి కోక్కొనను" అని సవాలుసేసి. బుర్ర బొమ్మల్లోంచి తీసేడు.

ప్రశ్న విన్న సింహాచలం పీటలమీద పెళ్ళికూతురిలా సిగ్గుపడి, "ఎలా?" అని సిగ్గువిడిచి సలహా అడిగేడు.

"నీ జోబీలో ఎంతుంది?"

జేబు ఖాళీ చేసేడు సింహాచలం – ఏడు బీడీలు. ఒక అగ్గిపెట్టె, రూపాయిన్నర చిల్లరా బైటికొచ్చేయి.

"ఆ రూపాయిన్నర రిచ్చావోడిది, ఏడు బీడీలకి కోకివ్వడు సావుకారు. ఆఖరికి అగ్గిపెట్టిచ్చినాసరే" అని నవ్వేడు సత్యం.

ఏడవలేక నవ్వేడు సింహాచలం.

వ్యూహం పన్నుతున్న సైనికాధికారిలా క్షణం ఆలోచించి, తర్వాత "యీ యవ్వారం నాకొగ్గి" అన్నాడు సత్యం కురుక్షేత్రంలో కృష్ణుడిలా.

మర్నాడుదయమే ప్రభుదాసు ఆస్పత్రికి వెళ్ళి సత్యం రక్తం అమ్మేడు. ఏడు రూపాయలన్నర చేతికొచ్చింది. జేబులు కొట్టడం మానేసేక అంత డబ్బు అతనిదగ్గర ఎప్పుడూ లేదు. ఆ ఊళ్లో ఆ ఆస్పత్రిలోనే రక్తం కొనుగోలు, అమ్మకాలు జరుగుతాయి.

ఆ సాయంత్రం సత్యం సలహామీద సింహాచలం ఆస్పత్రికి వెళ్లేడు. డాక్టరు పరీక్ష అయ్యేక అతన్ని ఒక గదిలోకి తీసుకొని వెళ్లేరు.

ఆ గదిలోకి కిటికీలోంచి గాలి కలలో విన్న పాటలా చల్లగా వచ్చింది.

గది మధ్య తెల్ల బల్ల దంతపు బల్లలా మెరుస్తోంది.

గోడలమీద పడిన విద్యుత్కాంతి జారి వెన్నెల ఏరులా ప్రవహిస్తోంది.

కొత్త కరెన్సీ నోట్లలా చప్పుడుచేస్తున్న యూనిఫారాల నర్సులు సింహాచలాన్ని బల్లమీద పడుకోబెట్టేరు.

బల్లమీద పడుకున్న అతనికి బల్లచుట్టు వున్న నర్సుల మొహాల నిండుగా నెత్తురు కన్పించింది.

గోడలమీద మేకుల దేవుడి కళ్లనిండా తడి కన్పించింది.

రక్తం యివ్వడం బాధ అనిపించలేదు సింహాచలానికి. డబ్బు పుచ్చుకొని అతను వచ్చేస్తూవుంటే పోయిన రిఫ్రిజిరేటరు తాళాలు నర్సులు వెతుకుతున్నారు.

సింహాచలం ఆస్పత్రిగేటు దాటి రెండు ఫర్లాంగులు వెళ్ళేసరికి, వెర్రివాళ్ళు వెంట తరుముతున్నట్లు రిక్షా తొక్కుతూ సత్యం ఎదురువచ్చి, రిక్షా దిగి "గోరవైపోనాది గురూ, నీ కొడుకు లారీ కింద పడిపోనాడు. దరమాసుపత్రోళ్లు రకతం కావాలన్నారు. ఇదిగో సీటీ" అని చెప్పి మరి మాటాడలేకపోయేడు.

ఆ తర్వాత వాళ్లిద్దరూ పందెంవేసుకున్నవాళ్ళలా రిక్షాలు తొక్కి అస్పత్రి చేరేసరికి డ్యూటీలు మారిపోయిన కొత్త నర్సులు యింకా తాళాలకోసం వెతుకుతూనే వున్నారు. వాళ్ళకి సింహాచలం రక్తం చీటీ చూపించేడు.

నర్సులు ముందు చీటి, తర్వాత బల్లమీదున్న రక్తం సీసా మీదున్న లేబిలూ చదివేరు. వెంటనే సింహాచలం అదృష్టవంతుడన్నారు. అతని క్కావలసిన రక్తం తాళాలుపోయిన రిఫ్రిజిరేటర్లో లేదన్నారు. బైట బల్లమీదే వుందన్నారు. ముప్పై రూపాయలిస్తే అది అతనిదే నన్నారు.

సింహాచలం ఆ రక్తం తనదే నని మొరపెట్టుకున్నాడు. వాళ్ళు యిచ్చిన ఏడున్నరా తప్పితే తనదగ్గర కాణీలేదని ప్రమాణం చేసేడు. కావలిస్తే తన వంట్లోవున్న రక్తమంతా తీసుకొమ్మని హామీ యిచ్చేడు. ఆ సీసా యిస్తే వాళ్ళ కుక్కగా పుట్టి ఋణం తీర్చుకుంటానని శపథం చేశాడు. "నా కొడుకుని బతికించండి తల్లుల్లారా!" అని భూమిలోకి దిగిపోతున్న కొండలా కుప్పకూలి వాళ్ళ కాళ్ళమీదపడి వెక్కి వెక్కి ఏడిచేడు.

అతని ఏడుపుకి చలించకుండా కాగితం మనుషుల్లా వాళ్ళు అతనివేపు చూసేరు. అతని ఏడుపుని అసహ్యించుకున్న నర్సు కుట్టి "ఈ ఆంధ్రాస్ అంతా యింతే - మేనర్లెస్ బ్రూట్స్" అన్నట్టు చూసి. "గురవాయూ" అని ఒక పొలికేక పెట్టింది.

అంతవరకూ వరండాలో స్తంభంచాటు నీడలో వున్న సత్యం మెరుపులా కదిలి, రక్తం సీసా వున్న టేబిలు దగ్గరకు పరుగెత్తి, ఆ సీసా పీక ఎడమచేత్తో పట్టుకొని, ఒక కాళీ సీసా పీక కుడిచేత్తో పట్టుకొని దాన్ని టేబిలుమీద కొట్టడం గాజుముక్కలు విసిరేసిన మణుల్లా తుళ్ళడం రెప్పపాటులో జరిగిపోవడంవల్ల ఎవరూ సమంగా చూడలేదు.

కాని అందరూ సమంగా చూడగలిగింది అతని కుడిచేతిలో సగం పగిలిన సీసా వజ్రాయుధంలా మెరయడం.

అప్పు డతను యీనిన పులిలా అతి భయంకరంగానూ క్రూరంగానూ వున్నాడు.

అతన్ని చూసి నర్సులు వేసిన కేకలు వింటే తల్లి కడుపులో పిల్ల కడుపులోనే చచ్చిపోయుండేది.

"అరుస్తే సంపేస్తా" అనరిచేడు సత్యం. వాళ్లు అరుపులు మానేసేరు.

"అడ్డొచ్చినా సంపేస్తా" అని కలిపేడు. అతనికి ఎవరూ అడ్డురాలేదు.

☆ ☆ ☆

కోర్టు, గుహలోపలి గుహలా చలిచలిగా చీకటిగా వుంది.

నీటి మేఘంలా నిండుగా వున్నారు జడ్జిగారు.

కళ్లు మూసుకొని కత్తులు విసిరే సర్కస్ వీరుల్లా వున్నారు ప్రాసిక్యూటర్‌గారు.

బాకుల్లా వున్నారు పోలీసులు.

బాతుల్లా వున్నారు సాక్షులు.

ముద్దాయీ తరఫు ప్లీడరు, వృత్తిరీత్యా చెక్కిళ్లనుండి పాలూ, కళ్ళనుండి నీళ్లూ కారే వయసులో వున్నాడు.

డాక్‌లో సత్యం బోనులోని వింతజంతువులాగా, కోర్టులో మనుషులు అతన్ని పరీక్షిస్తున్న జంతుశాస్త్ర ప్రవీణుల్లాగా వున్నారు.

కేసు విచారణా, ప్రాసిక్యూటర్‌గారి సునిశితమైన వాదనా అతి క్లుప్తంగా ముగిసిపోయేయి.

ముద్దాయి తరపు ప్లీడరు లేస్తూనే ప్రాసిక్యూటరుగారివేపు చూసేడు. రైల్లో పక్కసీట్లో అందమైన పిల్లడిని చూసి, ఆ పిల్లడికి చాక్‌లెట్ యిద్దామా, వద్దా అని ఆలోచిస్తున్న పెద్దమనిషిలా ప్రాసిక్యూటరుగారు అతనివేపు చూసేరు.

అతను లేస్తూనే "యీ కేసు పెద్దదికాదు. ముఖ్యమైనదీ కాదు. ముద్దాయి మహారాజుకాదు. రమారమి ముష్టివాడు. కానీ యీ కేసు చాలాసార్లు చదివేను. ముందునుండి వెనక్కీ, వెనక నుండి ముందుకీ చదివేను" అని ఆగేడు.

"తల, వల" చదువుతున్న మనవడిని జమీందారు తాతగారు చూసినట్టు ఉత్సాహపరుస్తూ ఎంకరేజింగ్‌గా చూసేరు ప్రాసిక్యూటరుగారు.

"కన్పించేది చూడకపోవడం బహుశా అల్పుల లక్షణం. కనిపించేదిమాత్రం చూడడం మధ్యమం. మరుగునవున్న సత్యాన్ని తరచి చూడడం ఉత్తమం" అని మళ్ళీ ఆగేడతడు.

బాల్యంలోనే భగవద్గీత చదువుతున్న మనవడిని తాతగారు చూసినట్టు గర్వంగా చూసేరు ప్రాసిక్యూటరుగారు అతనివేపు.

"నేను ఎంత చూసినా, ఎంత వెదికినా, నాకు ఈ కేసులో ఎదురయ్యే సమస్య ఒకటే. కళ్లు మూసుకున్నా కనిపించే క్వొశ్చన్ మార్కు ఒక్కటే.

"ముద్దాయి నర్సులను అందర్నీగాని, కొందరినిగాని చంపదల్చేడా, వారిలో ఎవరైనా అడ్డొస్తే ఆమెను చంపివుండేవాడా అన్న సమస్య అంత ముఖ్యం కాదు.

"ఈ ముద్దాయికీ, యితనిలాంటి వాళ్ళకి, వాళ్ళవాళ్ళకి జబ్బుచేస్తే చికిత్స చేయించుకుందికి ముప్ఫై రూపాయలు ఎందుకుండవు? వారికి లేకుండా చేసే పరిస్థితి నిందనీయమైనదీ కాదా? నింద్యార్హమే అయితే దానిని సృష్టించిన నేరస్తులు ఎవరు? ఇదే ముఖ్యంమైన ప్రశ్న."

మనవడు చదువుతున్న భగవద్గీతమధ్య బూతు పుస్తకాన్ని చూసి షాక్‌తిన్న తాతగారిలా త్రుళ్లిపడిన ప్రాసిక్యూటరుగారు బూతు పుస్తకాన్ని ముక్కలు ముక్కలుగా చింపేసే నిశ్చయంతో అడ్డు తగిలేడు. "యిప్పుడు ఎలక్షన్లు లేవు. ఇది ఉపన్యాస వేదిక కాదు. యౌవన దశలోవున్న నా స్నేహితుడు అజ్ఞానులను ఆవేశపరిచే చౌకబారు ఉపన్యాసాలు, సత్యాసత్యాలను సమదృష్టితో చూచే న్యాయమూర్తిలో ఎగతాళిమాత్రం కలిగిస్తాయని గ్రహించాలి. కాని కరుణించి కోర్టు అతని లెక్చర్స్ వినదల్చుకుంటే నేను అభ్యంతరం చెప్పను" అని కూర్చున్నారు.

ముద్దాయి ప్లీడరు తన పాత పంథాలోనే ఆర్య్గుమెంటు చెప్పకుపోయేడు. "నేను రాజకీయాల మనిషిని కాను. ఇది ఉపన్యాస వేదిక కాదని నాకు తెలుసు. ఇది కోర్టు అని, ఇక్కడ న్యాయాన్యాయాలను సాక్ష్యంతోనే తూస్తారని తెలీని మూర్ఖుణ్ణి కాను.

"కాని ఏ మనిషైనా మనిషి కానందుకే శిక్షించాలి. అమానుషాన్ని మాత్రమే అంతా గర్హించాలి కాని మనిషి దేవుడు కానందుకు, దేవతలా ప్రవర్తించనందుకు దండించడానికి ఏ మనిషికీ, ఏ కోర్టుకీ, ఆఖరికి దేవుడిక్కూడా అధికారం లేదనే నా నమ్మకం.

"ముద్దాయి ఉన్న పరిస్థితిలో నేను మరో రకంగా ప్రవర్తించేవాడిని కాను. ఇక్కడున్నవాళ్ళల్లో ఎవరైనా ఆ పరిస్థితుల్లో మరో విధంగా ప్రవర్తించి వుండగలిగితే నేను వారికి మ్రొక్కుతాను. వారు మామూలు మనుషులు కారు – మహానుభావులు, దైవస్వరూపులు.

"కాబట్టి ఒక పరిస్థితిలో ఏ ఒక్కరైనా ఒకేలాగ ప్రవర్తిస్తే, ఆ ప్రవర్తన ఏమైనప్పటికీ నేరం కాదు. ఆ పరిస్థితి నింద్యమైనది, దాన్ని సృష్టించినవారే నేరస్తులు కావచ్చుకాని దానిలో చిక్కుకున్నవారు దోషులు కారు. ముద్దాయి నేరస్తుడా? కాడా? నేరస్తుడే అయితే ఏ శిక్షకు అతను తగుతాడు అన్నవి న్యాయమూర్తి ఒక్కరే పరిష్కరించవలసిన సమస్యలు..."

అతను ఆర్గ్యుమెంటు చెప్తూవుంటే కోర్టులో దీపాలు గుప్పుమని వెలిగేయి.

తాము నశించిపోయే వరకూ దీపంచుట్టూ తిరిగే దీపం పురుగుల్లా కోర్టులో పాత ఫేన్లు తిరుగుతూనే వున్నాయి.

ముద్దాయి ప్లీడరు వాదన అయిపోయేక ప్రాసిక్యూటరుగారు "నేను ప్రతివాదన చెయ్యదల్చుకోలేదు. ఇది చిన్నకేసు. ఎ మేట రాఫ్ నో యింపార్టెన్సు" అని కూర్చున్నారు.

● *ప్రచురణ: ఆగస్ట్ 1971* ●

* * *

భూషణం

40

# పులుసు

పిట్టపాడు గ్రామంలో తెల్లవారుఝామున నాయుళ్ళ కోళ్ళు 'కొక్కొరొకో' అని కూత కూసేయి. నాయుళ్ళ కోళ్ళ కూతలకు మాలపేట కోడిపుంజులు లేచి రెక్కలు 'టపటప' దులుపుకొని శృతి కలపగా సాలల్లోని పశువులు కుడితి తాగటానికి కదులాడసాగాయి. దుక్కిపూజులు భుజానవేసుకొని కాపులు కళ్ళాలవేపు కదులుతున్నారు. నాయురాళ్లు పేడ తట్టలు పట్టుకొని కసువు ఊడ్చుడానికి చీపుర్లతో సహా కదిలేరు.

పిట్టపాడు నిద్రవదలి మేల్కొంటుంది.

మాలపేటలో సంగడు అంకమ్మ పక్కనుండి బద్ధకంగా లేచి ఒళ్ళు విరుచుకొని తడక తీసి వీధిలోనికి వచ్చేడు.

అప్పటికే పక్క గుడిశెలోని గుంపడు కట్టుకొయ్యకున్న కోడె పెయ్యి ముందరగడ్డి వేస్తున్నాడు. ఎదుట పాకలోని బోడెమ్మముసిలి గడప తుడుస్తుంది. సంగడు మరొకసారి బద్ధకంగా అవులించి చింకిగంపలో ఉంచిన పచ్చగరిక పరకలు తీసి పడ్డపెయ్యకు వెయ్యడానికి వెళ్ళేడు. సంగడ్ని చూసిన గుంపడు కోడెపెయ్యి దగ్గరనుండి వస్తూ–

"ఇయాల బుదోరంగదా సంగన్నా! సింతపండు కెల్తువేటి?" అని అడిగేడు.

సంగడు ఇంకా సమాధానం చెప్పకముందే గడప తుడుస్తున్న బోడెమ్మ ముసిలి గుంపడి మాటవిని చీపురు గడపల పడేసి వస్తూ–

"ఔన్రా సంగా? నిజంగా సంతకెల్తారేట్రా? నానూ వొత్తాను. పుల్లటి పులుసుక్కతాగి సానారోజులై పోనాది. సింతపిక్క సవికోసం జిమ్మ సచ్చిపోనాదిరా! పాడుముండకాలం కాపోతే వయిదు పంటలకిందట పందుల తినీవికాదు సింతపండుని. ఎక్కడ సూసినా ఎక్కితొక్కిడిగా దొరికేది. అదేటి మాయరోగం వచ్చిపడిపోనాదో! సింతపండు వొట్టుకోనొచ్చి పోల వొల్లు వోయగొట్టేత్తన్నారు. ఆ కారపరేసన్నా గండలు. ఆ లెక్క దొచ్చినార్రా ఈ మద్దిన మన పీకలమీదికి! ముండగండలు... కుక్కల కొడుకులు" అని తిట్లకు లంకించుకుంది.

బోడెమ్మ ముసిలినోరు విప్పిందంటే మరిక మూతపడదని తెలిసిన గుంపడు, ముసిలిదాన్ని కోప్పడుతూ;

"వల్లకోయే ముసిలిముండా! వుత్తుత్తి కూాకలేల? సంగన్న బయలెల్దువంటే సంతకి ఎల్దుంగాని. ఏఁవన్నా? ఏటంటావు?" అని సంగడ్ని అడిగేడు.

అప్పటికీ సంగడు మాట్లాడకుండా పందిట్లో ఉన్న పచ్చగడ్డి పరకలు పడ్డపెయ్యి ముందు పడేసి దానివీపుమీద చరుస్తూ 'ఛా...ఛో...' అని పడుకున్న పడ్డపెయ్యిని లేపేడు. పడ్డపెయ్యి లేచి ముందున్న గడ్డిలోకి మూతి పెట్టింది.

సంగడి వెనకనే వచ్చి గడప ఊడ్చడానికి చీపురుపట్టుకుని నిల్చున్న అంకమ్మ, సంగడు బెల్లం గొట్టిన రాయిలా మాటాడకపోవడం చూసి నిష్ఠూరంగా–

"ఆడెందుకు బయలెల్తాడు? వోరం రోజుల్నుండీ సెవల ఇల్లు కట్టక సెపతన్నాను; సింతపండు కెల్లమని! పంతులుకోరి సింతసెట్లు రొండుకాస్తండు గదా! ఆ సింతసెట్లు ఏరి బొట్టలొలిసి బుగత వొప్మానం బుగతకొప్పజెప్పి తెత్తాడు సూడు బండితో బండెడు పండు. ఇంటిల్లిపాదికీ పల్లు పులిసిపోవాల; పులుసు తాగనేక" అంది.

సంగడికి పెళ్ళాం ఎత్తిపొడుపుతో చిరాకు వచ్చింది.

"వల్లకోయే పకీరు ముండా! నోటికొచ్చిందల్లా పేలీడం తెలుసును గానీ మరింకేటి తెల్దు. నోరుమూసుకోని గడప తుడుసుకో" – అని కసిరేడు.

అది విని అంకమ్మ ఊరుకోకుండా–

"మూసుకోంటాన్నే! నామీదనైతే ఎగిరిపోతావు నాకు తెల్దేటి. నాను గాబట్టి కట్టిన పుస్తికి కట్టుబడిపోనాను గానీ, మరెవర్తయినా అయినాదిగాదు. నువ్వొడతన్న కూడుకీ గుడ్డకీ ఆ పూసల పుస్తి పుటుక్కున తెంపేసి ఎలిపోద్ది" అంది గడపలో నుండి వీధిలోకి వస్తూ.

సంగడికి ఎక్కడలేని కోపం వచ్చింది.

"మాటి మాటికీ పుస్తి తెంపేస్తానని దెప్పతన్నావు గదే? నిజంగా నువ్వు మా వెంకడి కూతురెవైతే పుస్తి తెంపేసి నామీదన పడేసి ఎల్లే. నువ్వెల్లపోతే మల్లా...!" అని అంకమ్మ మీదకి బయల్దేరాడు.

పరిస్థితి మొగుడూ పెళ్ళాల తగువులోకి దూరిపోతుందని గ్రహించిన గుంపడు, సంగడ్ని పట్టుకొని ఆపుతూ–

"ఆడోల మాట్లాకి నెక్కేటన్నా? ఉందూ!" అని ఆపేడు.

సంగడు ఆగిపోయినా అంకమ్మ మాత్రం ఆగకుండా–

"గుడియ్యా! అడ్ని వొదిలిద్దూ! ఆడి సంగతి నాకు తెల్దా! నా బీసిమీద మాట్లాడితే గుబీ గుబీమని గుద్దీడం తెలుసుమ గాని ఆ కారపరేసన్నాకుక్కల కొడుకుల్ని తన్ని సింతపండు తేడం తెల్దా! జీపీకార్లమీద ఆ బాఁవులు ఝుఁయ్యిమని వొచ్చీసరికి కావుల్లతోటి సరుకు నొదిలేసి తోకముడిసేసి పారొత్తన్ను! సిగ్గునేదు మల్లా! మొగపుట్టక పుట్టేరు మొగపుట్టుక..." అని చీదరించుకుంది.

సంగడు గుంపడ్ని విదిలించుకోబోయేడు. గుంపడు వదలకుండా ఆపుతున్నాడు. అప్పొడు బోడెమ్మ ముసిలి గుంపడి దగ్గిరికి వస్తూ–

"తాఁవస పడతా వేందిరా సంగా! అదన్నమాటలోన దోసవేఁటున్నాది! పుల్లటి పులుస్సుక్కకి పిల్లాది మొదల వోసిపోతన్నాఁవు గదా! కాటిక్కాలుసాపుకోని కూకున్న నాలాటదాన్నే! నిరుటి ఆ మావిఁడిబద్దల పులుసు తాగనేక కటకటలాడిపోతున్నాను. వోటికంపు కొడుతున్న ఆ పులుసు గెంజిలోన పోసుకొని మూతి దగ్గిట ఎట్టేసరికి వోవనం వొస్తున్నాది. ఆ గుంటముండ అంటందంటే దోసఁవున్నాదేటో సూడు" అని సర్దింది.

సంగడు కూడా కొంచెం తగ్గి—

"అదికాదే బోడీ! పొయ్యిదగ్గిట కూకోని చెప్పటం కాదే! అక్కడ దేవీ ఇక్కడ దేవీ దొరికిన సొమ్మట్టుకోని రెండు గాటేలుదాటి సింతమాను గూడ కెల్లాల! తీరా మాను సరుకు కావిడికెత్తేసరికి పోలీసోలతోటి ఆ బావులు సిద్దవైపోయి ఎఁవికెలిరగబొడుస్తున్నారు. సరుకూ పోతన్నాది తాపులూ తప్పకుంటన్నాయి. అది అందుకూ నాను, నానుస్తున్నాను" అన్నాడు.

అంకమ్మ సంగడి మాటలు విని మరీ మండిపడుతూ—

"అడికేటీ సెప్పకు బోడెమ్మత్తా! పోలీసోలంటే అడికి వల్లమాలిన బయ్యం. నిరుడు ఆ కామిరేడు బావు రానేదా! మీటింగెట్టి సాగనంపి తిరిగొచ్చేసరికి పోలీసోల్లు కాఁవుసెట్టుకట్టి వొల్లు పుండు జేసినారు గదా! అది గప్పట్నుండీ బయ్యం పడిపోనాడు" అంది.

ఆ మాటతో సంగడు ఒక్క ఉదుటున అంకమ్మ దగ్గరకు వచ్చి గుప్పిటతో కొప్పు పట్టుకొని తల వెనక్కి వంచి—

"ఏటి పేలేవే? మల్లీ పేలు! అదిగా వూసెత్తొద్దని నీకు సెప్పనేదే!" అని పళ్ళు పటపట కొరుకతూ చెయ్యి ఎత్తేడు.

అది చూసిన గుంపడు పరిగెత్తుకు వచ్చి సంగడి చెయ్యి పట్టుకున్నాడు. బోడెమ్మ ముసిలికూడా గబగబా వచ్చి—

నాయిన్నాయినా! సంగియ్య నాయినా! సచ్చి నీ కడుపుల పుడతా వొరె నాయినా! దాన్ని కొడితే నాను సూడ్లెన్రా! బాబ్బావూ! దానికి నోటి దురసెక్కువే గానీ మనసు మామెత్తన్రా! నువ్వంటే దానికి పంచెపేణాలూన్రా! అది గప్పుడా పోలీసు బావులు నిన్ను కొడుతుంటే అదెనాగ ఇదైపోనాదో, దాని పానాలెలాగ కొట్టుకులాడేయో నీకు తెల్దురా నాయినా! వొదిలీయ్యరా బావూ" అని బ్రతిమాలింది.

సంగడు కొంచెం మెత్తడ్డాడు. తరువాత సిగ్గుపడి అంకమ్మ నొదిలేసి కట్టుకొయ్య పక్కనున్న రాయిమీద మాటాడకుండా కూచున్నాడు. సంగడు అలా రాయిమీద కూచున్నా తరువాత బోడెమ్మ ముసిలి అంకమ్మను కసురుతూ—

"ఏందే! ఆడదానికి అద్దూపద్దూ ఉండక్కరనేదేటే! నోటికేదొత్తే అది పేలిడవేఁనేటి? పద పద" అని గడపలోకి తీసుకు వెళ్ళి అంకమ్మని వదిలేసి సంగటే దగ్గరకు వచ్చింది.

"తెల్లారి నెగిసీసరికి వొవులి మొకం సూసినానో సంగియ్యతగువు జూసినాను. పాపిట్టి ఎదవమొకం" అని తిట్టుకుంది.

అప్పుడు గుంపడు సంగడితో మెల్లగా నచ్చజెపుతూ—

“అదిగాదురా సంగియ్యన్నా! నీకు సానా సంగతులు తెలుసును. నువ్వొత్తే మరి మాకు బయ్యం నేదు, కారపరేసను భావులొత్తే సింతపండు అమ్మనానికి కట్టికెల్లనేదని నచ్చజెపతావు. నువ్వు బయలెల్లితేగానీ మాలపేట ఈ ఏడు సింతపండు మొకం సూడదు, పులుసుక్కి వోసిపోతారు. అదిగందు కన్నానురా! అంకమ్మేదినితో నేటిగానీ నువ్వు బయదెల్దా!” అని బ్రతిమాలేడు.

సంగడు కోపం చల్లార్చుకొని—

“ఒరే గుంపా, నీకు తెల్దురా! బతిమలాడి కాలొట్టుకున్నా అలు సింత పండు వొదలర్రా! అయ్యేల కామ్రేడు సెప్పింది మరొకపాల యాదకి తెచ్చుకోరా! పాఁవులికి దండాలెడితే కరడం మానవుగాక మానవని సెప్పినారు గదా! అదిగదే నిజంరా!” అన్నాడు.

గుంపడు మామూలుగా—

“నిజవేఁన్నా కామ్రేడు సెప్పింది నిజవేఁ, సూడూ కారపరేసను బావులు సదుం కొన్నోలు గదా! బాబ్బావూ అని బతిమాలుకుందుంగాని, నువ్వు పస్తాయించకుండా బయలెల్దా!” అన్నాడు.

బోడెమ్మ ముసిలి కూడా—

“బయలెల్లు బావూ! నానూ గంపొట్టుకోని నీతో వొత్తాను. కోతలకెల్లి దాసుకుని పది రూపాయలు పట్టుకుంటాను. పది రూపాయల సింతపండు ముసిల్దానికి ఈ పంటంతా సరిపడతాది” అంది.

సంగడు రాయిమీదనుండి లేస్తూ—

“సింతపండు నాకే అక్కర్నేదనుకున్నారేఁటా! బయలెల్లయితే!” అన్నాడు.

గుంపడు సంతోషంగా—

“కొసింటి రాఁవుడూ ముత్తేలుగాడూ వొత్తావన్నార్రా” అన్నాడు.

“బేగి బయలెల్లమనైతే!” అని సంగడు కావిడి కోసం డబ్బు కోసం ఇంట్లోకి వెళ్లేడు.

ఇంటిలోనికి వచ్చిన సంగడ్ని చూసి అంకమ్మ మరేమీ అనకుండా సందుగ పెట్టెలోని రూపాయి కాయితా లందించింది. సంగడు రూపాయలందుకొని మూలనున్న గంపలు రెండుతీసి కావిడిబద్దకు కట్టిన ఉట్టిల్లో సర్దేడు. కావిడి పట్టుకొని బయల్దేరబోయేసరికి అంకమ్మ సంగడి భుజం మీద చెయ్యేసి—

“సల్లంది గెంజి తాగకుండా ఏటనాగ ఎలిపోతావు! ఎవలమీదలుగు తావేటి?” అని ఆపింది.

సంగడు కూడా కొంచెం బెట్టుగా—

“ఈదిలోన కడుపు నిండిపోనాదిగదా! మరి గెంజేల? నీలాటిదాయె ఒకర్తి సంతలకొకెప్పేసి ఇంటికొచ్చి మొగుడి దగ్గిట సిగ్గుపడిపోయి కట్టుకున్నాదట. అదిగనాగున్నాది నీ వొరస” అన్నాడు.

“సాఁవితలు నాకూ వొచ్చునెత్తూ! గెంజితాగు” అని సత్తుగిన్నెలో?

"అలీసం అయిపోతాది గావాల" అని ఉప్పు కలిపిన గెంజి ఎత్తిపెట్టుకుని గటగటా తాగీసి అన్నం దేవుకుని మూడుముద్దల్లో తినేసి కావిడి భుజాన వేసుకొని బయల్దేరేడు.

సంగడు మాలపేట చివరకి వెళ్ళేసరికి బోడెమ్మ ముసిలి, గుంపడు, రాంవుడు, ముత్తేలు గాడూ సిద్ధంగా ఉన్నారు. సంగడితో వాళ్ళ ఊరికి తూర్పుగా నున్న కొండలవైపుగా నడక సాగించేరు.

ముందు సంగడు నడుస్తుంటే ఆ వెనక గుంపడు, గుంపడి వెనకన బోడెమ్మ ముసలి, ఆ వెనక రాంవుడు, ముత్తేలు వరసగా ఉన్నారు.

కొండల వరసమీదుగా తూరుపు తొలిరేఖలు తెల్లదనం నుండి ఎరుపుదనానికి మారుతున్నాయి. కొండలమీద చెట్లు ఆకులు రాల్చడంతో పచ్చగా కనిపించవలసిన కొండలన్నీ జేగురురంగులో కనిపిస్తున్నాయి. కాయలతో నున్న మామిడిచెట్లూ పువ్వులతోనున్న ఇప్పచెట్లూ అక్కడక్కడా పచ్చగా కనిపిస్తున్నాయి. అడవి పక్షులూ నీటిబాతులూ బారులు బారులుగా పల్లానున్న చెరువులవైపు అరుచుకుంటూ వస్తున్నాయి. నిద్రలేచిన నెమళ్ళు మనుషులు నడుస్తున్న అలికిడి విని టపటపా రెక్కలు కొట్టుకొని ఆకాశం మీదకి లేచిపోతున్నాయి. కారుకోళ్ళు పిల్లల్ని వెంటపెట్టుకొని గచ్చపొదల్లోకి పరింకంపల్లోకి పారిపోయి దాక్కుంటున్నాయి.

కొండమీదనుండి సూర్యుడు కరకరమని పొడవగా సంగడు చింతమానుగూడ ఘాటీ ఎక్కుతూ వెనక్కి చూసి, అలసిపోతున్న బోడెమ్మ ముసిలితో—

"బోడీ! నువ్వెందుకొచ్చినావే మా ఎనకాతల? బరువు నేకండా ఘాటీ ఎక్కేసరికే జాపోసి పోతన్నావు. సింతపండు గంపతోటి ఎనాగ సేత్తావే?!" అని అడిగేడు.

బోడెమ్మ ముసిలి అలుపు తీర్చుకొందికి నిలబడి—

"పుల్లటి పులుసుస్సుక్కకి ఆసపడిపోయి బయలెల్లినాన్రా నాయినా! పేణాలు కడారిపోతన్నాయి" అని మళ్ళీ నడక మొదలెట్టింది.

గుంపడు వెనకనున్న బోడెమ్మ ముసిలితో—

"మెల్లిక నడు. సవ్వగలవు" అని సంగడితో "సంగన్నా! సంత నాదిలేసి ఇటూకాసొచ్చినావేటి?" అని అడిగేడు.

సంగడు నవ్వుతూ—

"ఆ కారపరేసనుబావుల్నేరా! ఆ లియాల సంతకొత్తారు. సంతలోన మన్ని సింతపండు కొన్నివ్వకుండా అడ్డేత్తారు. సింతమాను గూడ సవర్లు సానామందిని నా నెరుగుదును. ఆలు సింతపండొట్టుకోని ఇనాగే సంతకొత్తారు. తోవల మనం కాస్సేవంటే మంచి బొట్టసరుకు దొరుకుతాది. అదొట్టుకోని మన అడ్డతోవల బడి అలకంట బడకుండా దాటెద్దుం" అని వివరించేడు.

ఆ మాటలు విన్న బోడెమ్మముసిలి సంతోషంగా "నీ కడుపు సల్లగుండ, నీ బుర్రలో ఎన్నాలోసన్లున్నాయిరా? మా కడజాతిల పుట్టేసేవుగానీ రాజు పుట్టకరా నీది. సింతపండు సల్లగ ఇంటికి సేరి పోనాదంటే ఈ పంటంతా నీ పేరు సెప్పుకోని పుల్లటి పులుసుస్సుక్క తాగుతాను" అని నోరొకసారి చప్పరించింది.

బోడెమ్మ ముసిలి మాటలకు సంగడు పకపకా నవ్వి—

"ఒరే గుంపా! అదుగో ఆ సెట్టునేదా? దాన్ని దారి మావిడి సెట్టంటారు. సంతకనొచ్చిన సవర్లు ఆ దార్నే వొత్తారు. ఈ పాలికి సానామంది రావొచ్చును గూడా! నాలుగడుగులెయ్యి!" అని తొందరగా నడిచేడు.

సంగడు దారిమామిడిచెట్టు చేరేసరికి చింతపండు గంపలు దించి చెట్టుక్రింద అడా మగా ఇరవై మందివరకూ కూర్చున్నారు. సంగడు తనకు తెలిసిన ముఖాలున్నాయేమోనని చూస్తూ, కూచున్నవాళ్ళదగ్గరకు వెళ్ళేడు.

చెట్టుక్రింద కావిడి దింపుతుండేసరికి గుంపులోకూర్చున్నసవర్లలో ఒకతను చూసి–

"ఏంది నేస్తం? ఇటు కాసలికిడైనావేంది? సింతపిక్కకే నేటి?" అని పలకరించేడు.

సంగడు సుక్కాయ్‌ని చూచి చాలా చాలా సంతోషించేడు. సంతోషంలో–

"సింతపండుకే ఇటుకాసొచ్చినాను. కుసింత మా కమ్ముతారేటి?" అని అడిగేడు.

సుక్కాయ్ తల వూపుతూ–

"మీకు పడినంత కొనుక్కోండి, ఆ కారపరేసను బావుల కమ్మడం మా కిట్టమనుకొన్నారేటి?" అని "అమ్మీ! ఆ గంపలిటు పట్టండి. సంగియ్య ఎంచుకుంటాడు" అని కేకవేసేడు.

అడా మగా గంపలతో చింతపండు తెచ్చి సంగడి ముందుంచేరు. బోడెమ్మముసిలి గంపలముందుకు వచ్చి కూచొని గంపలోని చింతబొట్టల్ని ఎత్తిచూసి–

"మా బాగున్నాదిరా సంగా! కట్టసరుకు. ఎండుపండు దొరికినాది. బెల్లం నాగున్నాది" అని ఒక బొట్టతింటూ "దర బేగి తేలిసిమ్మి" అని తొందరచేసింది.

సుక్కాయ్ సంగడితో–

"మీ పల్లపోలు ఎనాగకొంటన్నారో ఆ నెక్కన ఇచ్చే సంగయ్యా! ఆ కారపరేసను బావులున్నారు సూసేవా? అలైతే ఎనబయపైసాలనెక్కన కేజీ కడతారు పైన మాఁవమ్ముకుంతే రూపాయపావలా దర పలుకుతాది. మాఁవుగాని పై నమ్మితే పోలీసోల సేతన కొట్టించేత్తన్నారు. అది గందుసేతన సంతలకి మోసుకెల్తన్నావుఁ. మావోలుగూడా తక్కవ తిన్నేదునే! ఈ సింతపండుని గాటే దిగవన గెడ్డనేదా? అదిగక్కడ తడిపేత్తారు. ఆ కాడికీ ఆ లింతకంత తూస్సి డబ్బు దొబ్బుతారు" అని చెప్పేడు.

బోడెమ్మముసిలి, గుంపడు, రాఁవుడు, ముత్తేలుగాడూ చింతపండు తూయిస్తున్నారు. సింగడు, సుక్కాయ్ మాటాడుకుంటూ కూర్చున్నారు.

సుక్కాయ్‌తో సంగడు–

"మనోలు ఈ మద్దిన ఇటుకాసొస్తున్నారేటన్నా?" అని అడిగేడు.

సుక్కాయ్ అటూ ఇటూ ఒకసారి చూసి–

"రానేదు. సానా దెబ్బలు తినేసేఁవు సంగియ్యా! పోలీసోలమద్దిన బతక తన్నావు. నేపోతే ఇలాటి వింటి అన్నేయాలు సాగిపోతాయేటి? మీరు మాత్తరం ఈ సింతపండు అల కంట్ల బడకండా వొట్టికెల్లాల. కంట్ల బడితే సానా సిక్కు" అన్నాడు.

ఈలోగా బోడమ్మముసిలి సంగడ్ని కేకేసింది. సంగడూ, సుక్కాయ్ లేచి వెళ్ళారు. సంగడు రావడంతో బోడెమ్మ ముసిలి-

"నీ సొమ్ము తియ్యిరా! తూకంపై పోనాది. పండు కావుళ్ళకెత్తాల" అంది.

సంగడు డబ్బుతీసి బోడెమ్మముసిలి చేతికిచ్చి తూచిన చింతపండు తన గంపల్లోకి ఎత్తేడు. గంపలు కావిడి ఉట్టిల్లో పెట్టి మోచేతులతో ఒకసారి కావిడి ఎత్తేడు. బరువుతో కావిడి పెట పెటలాడింది. తృప్తిగా తలూపి కావిడి బుజానికెత్తుకున్నాడు. బోడెమ్మముసిలి సుక్కాయ్ చెయ్యిసాయంతో గంప నెత్తిమీదకి ఎత్తుకుంది. మిగిలినవాళ్ళు ఎవరి కావుళ్ళు వాళ్ళు బుజాల మీద సర్దుకున్నారు. సంగడు సుక్కాయ్‌తో వస్తామనిచెప్పి ముందు తోవతీసేడు.

ఘాటీమీదనుండి వరుసగా నాలుగు కావుళ్ళూ, ఒక తలగంప చింతపండు దిగుతుండడం కొండ ఎక్కబోతున్న (గిరిజన) కార్పొరేషన్ అధికారి చూసేడు. వెంటనున్న నలుగురు సిబ్బందికీ చూపించేడు. వెంటనే ఐదుగురూ తోవప్రక్కకి తప్పుకున్నారు.

సంగడు ముందు నడుస్తూ ఘాటీ దిగి ఆగి, వెనకనున్నవాళ్ళతో -

"ఇదిగిప్పుడు మనం తోవ తప్పించేసి అడ్డదార్ని పడాలి. నా ఎనకరండి" అని చెప్పేడు.

గుంపడు వెనకనుండి-

"అనాగే పద" అన్నాడు.

సంగడు కదిలేసరికి కార్పొరేషన్ అధికారి పక్కనున్న చెట్టు కొమ్మ విరిచి రెమ్మలు వలచి పచ్చిబడితెగా తయారుచేస్తూ-

"త్రోవ తప్పిస్తావురా! దొంగలంజాకొడకా! ఇలాగ చింతపండు దాటవేసీబట్టే గవర్నమెంటు నష్టపోతుంది. నిలబడురా! అక్కడే నిలబడు" అన్నాడు.

హఠాత్తుగా కార్పొరేషన్ అధికారి మాటలు వినేసరికి వాళ్ళందరి గుండెలు గుభేలుమన్నాయి. సిబ్బందినిచూసి పై ప్రాణాలు పైనే ఎగిరి పోయేయి. ఒక్క సంగడు మినహా మిగతా ముగ్గురూ కావుళ్ళ దించేసేరు. బోడెమ్మముసిలి-

"అమ్మనాయినోయ్! సింతపండు పోనాదోర్నాయినోయ్!" అని అరుస్తూ వెనక్కి పరుగెత్తి పారిపోబోయింది.

అదిచూసిన కార్పొరేషన్ అధికారి మండిపోతూ ఒక్క ఉదుటున బోడెమ్మముసిలి దగ్గరకు వెళ్ళి-

"ఎటు పారిపోతావే దొంగలంజ కూతురా! ఆగక్కడ" అని చేతినున్న పచ్చి బడెతెతో ముసలిదాని నడుంమీద ఒక దెబ్బ కొట్టేడు.

ఆ దెబ్బకు బోడెమ్మముసిలి గంపతోసహా రాళ్ళమీద "సచ్చిపోనాను బావోయ్!" అని పడిపోయింది.

కార్పొరేషన్ అధికారి పడిపోయిన ముసలిదాని వీపుమీద చేతికి వచ్చిన దెబ్బకొడుతూ-

"చచ్చిపోయినావటే దొంగముండ కూతురా! చింతపండు మా కంట్లో కారం కొట్టి పట్టుకుపోతున్నప్పుడు రాని చావు దొరికిపోయేసరికి వచ్చిందా? అలాగయితే చావు. గుమ్మితీసి ఇక్కడే పాతేస్తాను" అంటూ బడితె పిరాయించేడు. బోడెమ్మ ముసిలి కిరకిర చుట్టుకుంటూ-

"దండాలు బాబోయ్! కొట్టకు బాబోయ్!" అంటూ దెబ్బలకు ఓర్చుకోలేక అటూ ఇటూ దొర్లుతూ చేతులెత్తి దండాలెడుతుంది. ఆ దొర్లడంలో ఆమెకున్న చింకిపైట తొలగిపోయి ఎండుగుండెలు బైటపడ్డాయి. అది చూసి అధికార కోపం ఇంకా ఎక్కువైపోయింది.

"చాలించే దొంగవేషాలు ఛత్కారీముండా?" అంటూ పైటతొలగిన ఆమె ఎండుగుండెల మధ్యన బూటుకాలితో తన్నేడు.

బోడెమ్మముసిలి తీవ్రమైన బాధతో-

"బాబూ!" అని పెద్దగా అరిచింది.

అప్పటివరకూ నోటమాటరాని సంగడు కావిడి దించి కార్పొరేషన్ అధికారికి బోడెమ్మముసిలికీ మధ్యకు వచ్చి నిలబడి అధికారికి దండం పెడుతూ-

"బావ్వూ, తఁవరు పెద్దోలు, సదుంకున్న మారాజులు. మాఁవు ఈ సింతపిక్క పులుసుకాసుకోనానికి కొనుక్కున్నాం అమ్మకానికి, నాబాలు తియ్యానానికి కాదుబావ్వూ! ముసిల్ది తఁవరు ఇదిగీఇదంగా కోపఁవైపోతే సచ్చిపోతాది. పుల్లటి పులుసుకి వోసిపోయి పానాలు బిగబట్టుకొని ఇనాగొచ్చినాది. కొట్టకండి బాబూ!" అని బ్రతిమాలేడు.

అధికారి సంగడ్ని చూసి మరీ కోపంగా-

"పులుసుకోసం వాచిపోనా్రా! ఒరే, మీ దొంగబ్రతుకులికి పులుసు కావలసి వచ్చిందిరా? అడివి మీ యబ్బ సొమ్మనుకొంటున్నారా! గవర్నమెంటు మీకు అలుసైపోయిందిరా! కార్పొరేషనంటే మీ కాలిగోరులాగ కనబడుతుంది. ప్రతి తలమాసిన్నాకొడుకూ కొండలెక్కిపోయి కావుళ్ళతో చింతపండు మోసేస్తే మా గొడాన్లెందుకు? మా లారీలూ జీపులూ జీతాలూ ఉద్యోగాలు ఎందుకు? నిన్ను ముందు తన్నాల్రా!" అని బడితతో సంగడి మోకాలిమీద ఒక్కటి కొట్టేడు.

సంగడు దెబ్బ ఓర్చుకుంటూ-

"బావ్వూ! తఁవురు కొట్టేరని బాదనేదు బావ్వూ! ముసిల్ది. దానిగంప వొదిలీసి మా కావుళ్ళు తీస్సకొండి, మాఁవే మోసుకోనొచ్చి మీ గోదాంల పడేత్తాం" అని చేతులెత్తి దండం పెట్టేడు.

అధికారి దండంపెట్టిన చేతిమీద మరొకటి కొట్టేడు. కొట్టిన తర్వాత తన సిబ్బందితో-

"చూస్తున్నారేమి? ఆ ముసిల్దాని గంపలోని చింతపండు నాలుగు కావుళ్ళలో సర్దీండి" అన్నాడు.

సిబ్బంది నలుగురూ గబగబా గంపదగ్గరకు వచ్చేరు. అది చూసిన బోడెమ్మముసలి జారిపోతున్న బట్టనుకూడా సర్దుకోకుండా గంపలోని చింతపండును రెండు చేతుల్తోనూ ప్రేమగా పట్టుకుంటూ-

"నా సింతబుట్ట కొంచబోకండిబావూ! దొరబావులూ! మీకు దండాలు! ముసిలిముండని ఏడిపించొద్దు" అని ఏడుస్తూ చింతపండుమీద బోర్లాపడిపోయింది.

చింతపండును తియ్యనీయకుండా అడ్డంగా పడిఉన్న బోడెమ్మముసిలిదాన్ని కార్పొరేషన్ సిబ్బంది నలుగురూ పక్కకు ఈడ్చేసి చింతపండు గంపను కావుళ్ళలో సర్దడానికి తెస్తున్నారు.

బోడెమ్మముసిలి చింతపండు చెయ్యిదాటిపోతుందని గొల్లున ఏడుస్తూ నెత్తి బాదుకుంటూ—

"ఆపండి బావూ! మీ కాళ్ళట్టుకొంటాను" అని అధికారి కాళ్ళమీద అమాంతం పడిపోయింది. అతని తెల్లని ఇస్త్రీపేంటు మురికైపోయింది. అదిచూసి అధికారి అగ్గిమీద గుగ్గిలం అయిపోయాడు. ఆ కోపంతో చేతినున్న బడితెతో మాటాడకుండా బోడెమ్మముసిల్ని బాదెస్తున్నాడు.

బోడెమ్మముసిలి దెబ్బదెబ్బకూ మెలితిరిగిపోతుంది. వొంటిమీద బట్ట చాలామట్టుకు వూడిపోయింది. అదికూడా గమనించని అధికారి పచ్చి బడితెని మరొక్కసారి ఎత్తేడు.

సంగడి కళ్ళు నిప్పులు కక్కేయి. ఛరాలున తన కావిడి దగ్గరకు వెళ్ళేడు. కావిడిబద్దలు ఉట్లెల్నుండి ఊడదీసి తనవారితో—

"సూత్తారేందిరా! సవట నాకొడకల్లారా! ఒరే గుంపా, రావుడూ, ముత్తేలూ! సచ్చిం దొకరోజా, బతికింది ఒక రోజేన్రా! తియ్యండ్రా కావిడ బద్దలు" అంటూ—

"ఒరే! ఆగొరే కసాయి నా కొడుకా! ఈ అడివి నీ అత్తోరిచ్చేర్రా నీకు? నీ పెల్లాం మెడలోని బంగారవ్వూఁ నువ్వెనకేసిన ఏలూ నచ్చలూ ఎక్కడివిరా? నీ బామ్మరుదులుకీ సుట్టపక్కాలుకీ పెదబావుకీ సింతపండు సరదనానికి దొంగరవానాలు సెయ్యనానికీ పరవానేదు గదరా! ఆ ముసిల్దాని బుట్టడు సింతపండు పోతే నీకూ నీ పెల్లానికీ గవరుమెంటోడికీ నట్టాలేవి వొచ్చినాయిరా! తీసుకుంటే ఆ సింతపండు తీసుకోమని నీకా గవురమెంటు సెప్పిందేటోగానీ సావుదెబ్బలు కొట్టమనీ తిట్టమనీ నీకే నా కొడుకు సెప్పినాడు? సవ్వురా నా కొడకా" అని కావిడి బద్ద తిరగేసి సాచి ఒక్కటి కొట్టేడు. అంతే!

"అమ్మబాబోయ్! నక్సలైట్లు" అని అధికారి పరుగుపెట్టేడు. సిబ్బంది బోడెమ్మ ముసిలి చింతపండు బుట్టను వదిలేసి అధికార్ని అనుసరించారు. పారిపోతున్న కార్పొరేషన్ వార్ని చూసి గుంపడికి అంతబాధలోను నవ్వాగలేదు.

"ఒరే! పిరికి నాకొడకలు గదర కొడకలు. నిలబడండొరే?" అని కేకవేశాడు.

తుప్పల్లో డొంకల్లో పడుతూ లేస్తూ కార్పొరేషన్ సిబ్బంది కనబడకుండా పారిపోయేరు.

సంగడు కోపాన్ని దిగమింగుకొని తొందరగా కావిడిబద్దకి ఉట్టేలు తగిలిస్తూ.

"దాని బుట్టడు సింతపండు మన నాలుగు కావుల్లలోన సరిదీసి పరుగులమీద పదండి. ఈసారి, పోయిన పిరికి నా కొడుకులు పోలీసోల దగ్గిరకెల్లి ఆల నొట్టుకొత్తారు. బేగి పదండి" అన్నాడు.

గుంపడూ రాంవుడూ ముత్యాలూ బోడెమ్మముసిలి గంపడు చింతపండునీ నాలుగు కావుళ్ళలో సర్దుతుండగా సంగడు, ఏడుస్తూ కోక సర్దుకొంటున్న బోడెమ్మముసలితో–

"మరేనేడకు! నడు. మిట్టకాయేసినంతసేపుట్లో మనూరెలిపోవాల" అన్నాడు.

బోడెమ్మ ముసిలి ఏడుపుకూడా ఆపకుండా–

"సచ్చిపోతాన్రా నాయనా! రకతాలు సిమ్ముతన్నాయి. సచ్చిపోతాను గావాల" అంది.

సంగడు తొందరగా తన కావిడి భుజానికి ఎత్తుకుంటూ–

"మన పానాలు మా గట్టియి. అవంత బేగి పోవునే! నడు నడు" అన్నాడు. ఐదుగురూ నడక సాగించేరు.

బోడెమ్మ ముసిలి వారితో సమంగా నడుస్తూ అప్పుడప్పుడూ కుంటుతూ–

"గుండిలమీద తన్నేవు గదూ! నీ కాలు పడిపోనూ, నీకు పెద్దరోగం పట్టుకోనూ – నీ ఇంట్ల సెవం సెల్లిపోనూ" అని తిడుతూంది.

అడ్డదారంట ఐదుగురూ మాలపేట చేరుకున్నారు. ఎవరింట్లో వాళ్ళు చింతపండు సర్దేసి సంగడింటికి వచ్చేరు. అప్పటికే సంగడిదెబ్బల్ని చూసిన అంకమ్మ ఏడుస్తూ–

"ఏట్రా? ఈ దెబ్బలు. ఎవుడు కొట్టినాడ్రా? ఆడిసేతులు పడిపోనూ" అని తిడుతూంది.

బోడెమ్మ ముసిలి ముక్కు ఎగజీదుతూ–

"నా దెబ్బలు సూడే" అని వీపూ గుండే చూపెంచింది.

అది చూసిన అంకమ్మ మరీ గట్టిగా ఏడుస్తూ–

"సచ్చిపోనా వోలత్తో –" అని దెబ్బల్ని తడివింది.

ఏడుస్తున్న అంకమ్మని కసురుతూ సంగడు–

"ఇదిగో, మీతోటి వొకటి సెప్పాల! మనం సింతపండుకెల్లినట్టుగ ఎవురికీ తెలియనియ్యగూడదు. కిక్కురు బొక్కురు మనగూడదు. సూశినాంగదా. ఈ యన్నేయపు రాజ్యం కల్లతోటి సూస్సినాంగదా! ఇదిగీసింటి ఇదంగా మనలాటోల్లకి పెతిరోజునా కొడతన్నారు. తంతన్నారు, జేల్లోన పెడతన్నారు. కాలస్తన్నారు.

"ఇయాల మనం పుల్లటి పులుస్సుక్కకోసం – మరేటిగా – దుపులుకోసం, మనవొల్లు పులుసు సేసుకొన్నాం. మన వొల్లు పులుసు సేసుకున్నప్పుడు ఆడు కారపరేసన్నా కొడుకు పులుస్సుక్క ఇవ్వనేదు సరిగదా, సింతపండంతన్నూపడేసికోనానికే సూసేడు. మనం బతిమాలాడేం, దండాలెట్టినాం. మన దండానికి మనకి పులుసు దొరకనేదు సరికదా వొల్లంతా పులుసైపోనాది.

"అదిగప్పుడు అలాటప్పుడు మనవేటి సేసినాం? కర్రెత్తి అదిగా నా కొడుకు వొల్లు పులుసై పోయినట్టుగా వొక్కటంటే ఒక్కటే ఇచ్చినాం. అప్పుడేటైనాది? పులుసుకి సింతపండు దొరికినాది. వొణ్ణంలోకే కాదు; గెంజిలోకి పులుస్సుక్క కోసం కర్రెత్తితేనేగాని దొరకనేదు.

"మరందుసేతన పులుసుకోసమే కర్రెత్తినాంగదా, మరి కడుపునిండా వొణ్ణం కావాలంటే వుత్తిపున్నేనికే దొరుకుతాదనుకొంటున్నారేటి? మరి దానికోసం ఏదట్టుకోవాల? తెలిసిపోతన్నాదిగదా!

"కర్రపట్టుకుంటే పులుసు దొరికినాది. మరి కత్తిగాదు, అడవిలోని అన్నల్లా తుపాకొట్టుకుంటేనే వొణ్ణం దొరుకుతాది" అని సంగడు ఉద్రేకంతో చెబుతుండగా;

బోడెమ్మ ముసిలి కసిగా, తాను ఆ నోటా, ఈ నోటా విని గుర్తుంచుకొన్న నినాదం

"ఇప్లవం వొర్దిల్లాలి" అని అరిచింది.

అంతా ముక్తకంఠంతో ఆ బాధలో ఆ అనుభవంతో "విప్లవం వర్ధిల్లాలి!" అని నినదించేరు.

● *ప్రమరణ, 1973* ●

* * *

అబ్బూరి ఛాయాదేవి

41

# కర్త, కర్మ, క్రియ

ఇప్పుడతను ఇరకాటంలో పడ్డాడు. వనజ పంపిన అర్జీ కాగితాన్ని బుట్టదాఖలు చెయ్యనూ లేదు. దానిమీద చర్య తీసుకోనూ లేదు. డైరెక్టర్ జనరల్‌కి నేరుగా అర్జీ పెట్టుకుని, దాని కాపీని డైరెక్టర్‌కి పంపించింది వనజ. అయితే గత సంవత్సరం పొడుగునా వనజ చాలా అర్జీలు పెట్టుకుంది డైరెక్టర్ జనరల్‌కి – తనకి న్యాయం చేకూర్చమనీ, తనకి ఆఫీసులో డైరెక్టర్ చేతుల్లో జరిగే చిత్రహింస అపు చేయవలసిందనీను. ప్రతి అర్జీతోబాటూ డైరెక్టర్ గౌరీశంకర్‌కి వనజ మీద కక్ష మరింత ఎక్కువైందేగాని తగ్గలేదు.

మొట్టమొదటిసారి – అంటే సంవత్సరం క్రితం వనజ ధైర్యంచేసి డైరెక్టర్ జనరల్ సారథికి తనకి జరిగిన అన్యాయాన్నంతా పూసగుచ్చినట్లు వ్రాసింది. తనకు రావలసిన ప్రమోషను తనకు రాకుండా చెయ్యటం ఇది రెండవసారి అనీ, మొదటిసారి డైరెక్టర్ అతని కిష్టుడైన ఒకతన్ని, పైనుంచి వచ్చినవాణ్ణి సెలెక్ట్ చేశాడనీ, ఈసారి అతని కులం వాడని చెప్పి తనకన్న రెండేళ్ళు జూనియర్ అయిన వాడిని సెలక్ట్ చేశాడనీ, తనకున్న ఆరు సంవత్సరాల అనుభవాన్నీ కాదని అనుభవం లేని వాడికి పైకి ప్రమోట్ చెయ్యటం అన్యాయం అనీ, ఇందంతా చేసింది చాలక తన సెక్షను మార్పించి ఆ సీనియర్ పోస్టుకి కొత్తగా సెలక్టయిన తన జూనియర్ క్రింద పని చెయ్యమని ఆదేశించాడనీ, ఈ చర్య మానసికంగా చాలా క్రూరమయినదని కాబట్టి తనకి జరిగిన అన్యాయాన్ని సరిచేయవలసిందనీ డైరెక్టర్ జనరల్‌కి వ్రాసింది వనజ.

గౌరీశంకర్ సారథిని ఏదో పనిమీద కలుసుకున్నప్పుడు 'ఈ వనజ సంగతేమిటి? ఏం జరిగింది' అని సారథి ఆరా తీశాడు. గౌరీశంకర్ చాలా తేలిగ్గా కొట్టిపారేశాడు. ఆ వనజకి తెలివితేటలు శూన్యమనీ, ఏ బాధ్యత అప్పగించినా సక్రమంగా నిర్వర్తించలేదనీ, లేకపోతే తాను మాత్రం పరాయివాణ్ణీ, జూనియర్నీ ఎందుకు సెలక్టు చేస్తాననీ, తనేకాక సెలక్షన్ బోర్డు అంతకీ వనజ మీద సదభిప్రాయం కలగలేదనీ చెప్పి, 'సెలెక్టు కాకపోవటం వనజ కర్మ! ఆ సంగతి నా కొదిలెయ్యండి. నేను చూసుకుంటాను' అన్నాడు తొణక్కుండా. గౌరీశంకర్ చాలా పేరుమోసిన డైరెక్టర్. తెలివైనవాడూ, చురుకైనవాడూ, ఎన్నో క్లిష్టమైన ప్రాజెక్టుల్ని విజయవంతంగా సాధించినవాడూ అని డైరెక్టర్ జనరల్ సారథికి తెలుసు. సరేనని ఊరుకున్నాడు వనజ విషయంలో.

మళ్లీ నెల రోజులు తిరక్కుండా వనజ దగ్గర్నుంచి మరొక అర్జీ వచ్చింది సారథికి. అతను నొసలు చిట్లించాడు. 'నెలరోజులు తిరక్కుండా మళ్లీ మీకు అర్జీపెట్టుకోవలసి రావటం నా దురదృష్టం. నెల రోజులు కూడా ఆ కొత్తసెక్షన్‌లో నన్ను పనిచెయ్యనివ్వకుండా, నా కొత్త సెక్షన్ హెడ్ చేత (ఇంతకు ముందు నా జూనియర్) నా పని తృప్తికరంగాలేదని రిపోర్టు రాయించారు డైరెక్టర్. నేను ఇక్కడ చేరింతరవాత ఆరు సంవత్సరాలుగా ఒకే సెక్షన్‌లో పనిచేశాను. అందులో అనుభవం సంపాదించాను. మరొక సెక్షన్‌లో పని ఆకళింపు చేసుకోవటానికి అధమం నెలరోజులైనా పట్టదా? ఈ నెలలోగానే నా పని అసంతృప్తికరంగా ఉందని రిపోర్టు రాయించి నన్ను మరో సెక్షన్‌కి బదిలీ చేయించటంలో సబబు ఏమైనా ఉన్నదేమో ఆలోచించండి. ఈ విధంగా నా రికార్డు పాడుచేసి నన్ను కావాలని హింసించటం ఎందుకో దయచేసి విచారించవలసిందని ప్రార్థిస్తున్నాను' అని మొరపెట్టుకుంది వనజ. సారథి ఈసారి తనని కలుసుకుని మాట్లాడవలసిందని వనజకి ఉత్తరువు జారీ చేశాడు. వనజ వెళ్లి మాట్లాడింది. సారథితో.

కొంతమంది వందిమాగధులు వెళ్లి గౌరీశంకర్‌తో ఈ సంగతి చెప్పారు. విని మండిపడ్డాడతను. 'వెడుతుంది వెడుతుంది. ఇవాళ డైరెక్టర్ జనరల్ దగ్గరికి వెళ్లింది, రేపు మినిస్టర్ దగ్గరికి వెడుతుంది. దానికేం, పచ్చి భోగంది' అన్నాడు కోపం పట్టలేక. ఇలా తిట్టాడని కొందరు వెళ్లి వనజ చెవిలో ఊదారు. వనజ గుండె భగ భగమంది. ఆమె సీతా మహాదేవి కాదు, అమాంతం అవమాన భారంతో భూమిలో కుంగి పోవటానికి. అలాగే స్థిరంగా నిలబడి మనస్సు రాయి చేసుకుంది. ఆ దెబ్బతో రాజీనామా ఇస్తుందేమో, ఒక పోస్టు అయినా ఖాళీ అవుతుందని ఆశించిన కొలీగ్స్ కొందరు నిరుత్సాహపడి, 'మొండి ఘటం', 'సిగ్గులేదు' అని గొణుక్కున్నారు. వనజకి అన్యాయం జరిగిందని నమ్మిన ఏ కొద్దిమందో ఉన్నప్పటికీ, డైరెక్టర్‌కి అప్రియులవుతారన్న భయంతో వనజకి దూరంగా ఉండేవారు కొందరు. వనజతో కలిసి కాఫీ తాగటానికి కాంటీనుకి వెళ్లే ఇద్దరు ముగ్గుర్ని పిలిచి గౌరీశంకర్ హితబోధచేశాడు – 'అది తుచ్ఛురాలు. దానితో తిరిగితే మీకు ఒరిగేదేమిటి? మీమీద నాకెన్నో ఆశలున్నాయి. శ్రద్ధగా పనిచెయ్యండి. మీకు మంచి పొజిషన్స్ వస్తాయి' అని అభయం కూడా ఇచ్చాడు.

ఏదో కొత్త ప్రాజక్టు విషయం చర్చించటానికి ఓ రోజున గౌరీ శంకర్ వనజ పనిచేస్తున్న సెక్షన్ వాళ్లందర్నీ తనగదిలోకి రమ్మని కబురంపించాడు. వనజని చూడగానే డైరెక్టర్ ముఖం చిట్లించి, 'సెక్షనంతా ఖాళీచేసి వస్తే అక్కడ పనెవరు చూస్తారు? నువ్వెళ్లి నీ పని చూసుకో' అన్నాడు. అందరూ తెల్లబోయారు ఆ ధోరణికి. వనజ అర్రక్షణం నిర్ఘాంతపోయినా, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, 'కొత్త ప్రాజక్టు గురించి చర్చించటానికి మా సెక్షన్‌లో అందర్నీ రమ్మని కబురంపించారు మీరు. సెక్షన్‌లో నేనూ ఒకర్తెనే. నేనూ ఆ ప్రాజక్టు గురించి తెలుసుకోవలసిన అవసరం ఉంది' అంది తల ఎత్తి సూటిగా గౌరీశంకర్ కళ్లల్లోకి చూస్తూ.

'తెలుసుకుని నువ్వుచేసే నిర్వాకం ఏమీలేదు. నేను వెళ్ళమంటున్నాను – వెళ్లు' అన్నాడు గౌరీశంకర్. కోపంతో అతని గొంతూ, అతని వేళ్లూ వణికాయి. వనజ

మరింత ధైర్యం తెచ్చుకుంది. 'నేను వెళ్లను' అంది మొండిగా. డైరెక్టర్ మరింత కోపంతో గుప్పెళ్లు బిగించి టేబుల్ మీద గుద్దుతూ 'నువ్వుండగా నేను చస్తే ఆ ప్రాజక్టు గురించి మాట్లాడను. మీరంతా వెళ్లొచ్చు' అన్నాడు సెక్షన్ హెడ్ వైపు చూస్తు. అందరూ తలలు వంచుకుని గదిలోంచి ఇవతలికి వచ్చేశారు.

అందరికీ అతని ప్రవర్తన చాలా అసమంజసంగా ఉందని అనిపించింది. కానీ ఒక్కరూ ఆ మాట పైకి అనలేదు. ఒకళ్లిద్దరు మాత్రం సాయంకాలం వనజ ఇంటికెళ్లి బాగా పురెక్కించారు. 'ఏమైనా సరే, మీరు ఊరుకుంటే లాభం లేదు వనజగారూ, ఆ గౌరీశంకర్ తిక్క కుదుర్చవలసిందే మీరు సారధిగారికి మరింత ఘాటుగా రాయండీసారి' అని సలహా ఇచ్చారు.

వనజకి గతమంతా మనస్సులో మెదిలింది. తను ఈ ఆఫీసులో చేరిన తరవాత ఒక సంవత్సరం ఎంతో ఉత్సాహంగా గడిచింది. ఎంతో దీక్షగా మనస్ఫూర్తిగా పని చేసేది. ప్రతి పనినీ శ్రద్ధతో గమనించి డైరెక్టర్ గౌరీశంకర్ తనని అభినందించేవాడు. తనంత అదృష్టవంతురాలు లేదని మురిసిపోయింది. రెండో సంవత్సరం నుంచీ తన పాట్లు ప్రారంభమయ్యాయి. తను చేసే పనిని మెచ్చుకోవటం మానేసి తనని మెచ్చుకోవటం మొదలుపెట్టాడు. మొదట్లో 'ఈ చీర నీకు బాగుంద'నీ 'ఈ రంగులో మెరిసి పోతున్నావ'నీ అంటూ కామెంట్ చేసేవాడు. రెండు మూడుసార్లు స్త్రీ సహజంగా సిగ్గుపడింది. తరవాత తరవాత అర్థం చేసుకుని తీక్షణంగా చూసి తలవంచుకునేది. అటువంటి ధోరణి తనకి నచ్చదన్న భావం కళ్ళల్లో సుస్పష్టం చేసింది. క్రమంగా అతనికి 'చెయ్యివాటుతనం' ఆరంభమయింది. ఏ కాగితాలు ఇచ్చేటప్పుడో కావాలని చెయ్యి తగిలించటం మొదలుపెట్టాడు. ఎంత జాగ్రత్తపడినా ఎలాగో తగిలేవాడు.

ఓ రోజున పిల్చి 'నీతో ఒక విషయం మాట్లాడాలి' అన్నాడు గంభీరంగా.

'ఏమిటి చెప్పండి' అంది వనజ నమ్రతగా.

'ఇక్కడ కాదు. పర్సనల్ విషయం. ఇంకెక్కడయినా కలుసుకుందాం. నీకెప్పుడు వీలవుతుందో చెప్పు' అన్నాడు.

వనజ గుండె దడదడలాడింది. అదే సంకేతంగా తీసుకుని, ధైర్యం కూడా దీసుకుని 'నాతో అంత రహస్యంగా మాట్లాడవలసిన వేమున్నాయ్? మాట్లాడేదేదో ఇక్కడే మాట్లాడండి' అంది.

ఈ లోపల ఎప్పుడు చెయ్యి ముందుకి చాచాడో తెలియదు. హఠాత్తుగా వనజ వేళ్ళమీద అతని వేళ్ళు స్పృశించాయి. షాక్ కొట్టినట్లువెనక్కి లాక్కుని కుర్చీలోంచి లేచింది. 'క్షమించండి. మీరనుకునే రకం మనిషిని కాదు నేను' అని చరచరా ఇవతలి కొచ్చేసింది.

అప్పటినుంచి మొదలైంది గౌరీశంకర్‌కి వనజంటే మంట. ప్రతి పనినీ ప్రత్యేకంగా పరిశీలించి విమర్శించటం మొదలుపెట్టాడు. వనజకి ఒక్కొక్కప్పుడు రాజీనామా ఇవ్వాలన్నంత ఉద్రేకం కలిగేది. కానీ, తన మీద ఆధారపడ్డ తల్లినీ, తమ్ముణ్ణీ తలుచుకుని దుఃఖాన్ని దిగమింగుకుని పనిలో నిమగ్నమయేది. ఒకోసారి తనని తానే సమాధాన పరుచుకునేది అడదానికి ఎక్కడికి వెళ్లినా ఇంతేకదా, ఈ అధికారి కాకపోతే

మరొక అధికారి! ఆత్మరక్షణ చేసుకోగల స్తోమత, ఎక్కడయినా సర్దుకుపోగల తత్త్వం ఉండాలి గాని ఆఫీసు మారినంత మాత్రాన మనుషుల నైజగుణాలు మారుతాయా – అనుకుని ఒక విధమయిన నిర్లిప్తత అలవరచుకుంది. అయిదు సంవత్సరాలు అలాగే గడిపింది.

ప్రమోషన్ రావలసిన సమయం ఆసన్నమైంది. సీనియర్ పోస్టులు రెండు కొత్తగా ఏర్పడ్డాయి. ఎడ్వర్టైజ్ చేశారు. మొదటిసారి తనూ మరి కొందరితోపాటు అప్లైచేసింది. ఇంటర్వ్యూలో తను నెగ్గలేదు. పైనుంచి ఎవరో కొత్తమనిషిని సెలెక్టు చేశారు. కొంచెం బాధ పడి ఊరుకుంది. రెండో పోస్టుకి ఎడ్వర్టైజ్ చేసినప్పుడు తను అంతగా పట్టించుకోలేదు. ఇక ఆఖరి రోజున గౌరీశంకర్ వనజని పిలిచి 'నువ్వు అప్లై చెయ్యలేదేం?' అని అడిగాడు. వనజ మాట్లాడకుండా తలవంచుకుంది.

'మాట్లాడవేం? అప్లై చెయ్యమని కూడా బతిమాలించుకోవాలా?' అన్నాడు. గొంతు సౌమ్యంగానే ఉంది. అతన్ని ఎలా అర్థం చేసుకోవాలో తెలియక మౌనం దాల్చింది. 'ఇవాళ సాయంకాలంలోపుగా అప్లికేషన్ నా చేతికియ్యి. నీ సెక్షన్ వర్క్ గురించి పుస్తకాలు క్షుణ్ణంగా చదువు. బాగా ప్రిపేరయి రావాలి ఇంటర్వ్యూకి. తరవాత నన్నని లాభంలేదు' అన్నాడు. సరేనని బుర్రఊపి బయట పడింది. అప్పటికే గుసగుసలు ఆరంభమయినాయి వనజ ఇంకా అప్లై చెయ్యలేదని. ఎలాగో సాయంకాలం లోగా అప్లికేషన్ టైప్ చేయించి ఇచ్చింది డైరెక్టరుకి. నెల్లాళ్లపాటు ఇంటర్వ్యూకి కష్టపడి తయారైంది.

ఇంటర్వ్యూలో ఒకాయన మొదట అడిగాడు 'ఏ సెక్షన్‌లో పని చేస్తున్నావ్?' అని. చెప్పింది. ఎన్నాళ్ల నుంచి పని చేస్తున్నావని అడిగాడు. 'ఆరేళ్ళనుంచి' అని చెప్పింది. అంతలో డైరెక్టర్ గౌరీశంకర్ అందుకుని ఫలానా ప్రాజెక్టు ప్రారంభించటంలో గల ఉద్దేశాలేమిటి అని అడిగాడు. తన సెక్షన్‌కి సంబంధించిన ప్రశ్నకాదది. జ్ఞాపకం చేసుకుని కొంచెం తడుముకుంటూ చెప్పింది.

'ఏ ప్రాసెస్ ప్రకారం వేస్టేజ్ తక్కువవుతుంది?' అని అడిగాడు ఆ ప్రాజెక్టు గురించే. వనజ జవాబు చెప్పలేకపోయింది.

'ఆరు సంవత్సరాలనుంచీ ఇక్కడ పని చేస్తున్నావు. నీ చుట్టూ ఏం జరుగుతున్నదో తెలుసుకోవాలనే కుతూహలంకూడా లేదన్నమాట' అన్నాడు గౌరీశంకర్ నిరసనగా. వనజ ఏదో చెప్పబోయే లోపలే 'ఇహనువ్వెళ్లొచ్చు' అన్నాడు. నమ్మలేనట్లుగా తక్కిన సెలక్షన్ బోర్డు మెంబర్సు వైపు చూసింది వనజ. వాళ్ళు గౌరీశంకర్‌వైపు చూశారు. అతను 'ఊఁ' అన్నాడు – 'ఇంకా వెళ్ళవేం' – అన్నట్లుగా.

వనజకి కళ్ళనీళ్ళ పర్యంత మయింది. తన సెక్షన్ వర్కు గురించి ఒక్క ప్రశ్నకూడా వెయ్యలేదు. తన అనుభవంతో సంపాదించిన విజ్ఞానాన్ని ప్రదర్శించటానికి రవంత అవకాశం కూడా ఇవ్వలేదనిపించింది. ఊరుకున్నదాన్ని పిలిచి అప్లై చెయ్యమనీ, సెక్షన్ వర్కు గురించి పుస్తకాలు చదవమనీ ప్రత్యేకం సలహా ఇచ్చిన పెద్ద మనిషి ఇంటర్వ్యూలో అలా కర్కశంగా ఎందుకు ప్రవర్తించాడో అర్థంకాలేదామెకి. ఏదో అన్యాయం జరిగిందని మాత్రం మనస్సు మూలిగింది. ఆ రాత్రి అన్నం సయించలేదు. తల్లి ఎంత బ్రతిమాలినా భోజనానికి లేవలేదు. చివరికి తమ్ముడు వచ్చి 'అక్కా,

నువ్వు తినకపోతే నేను తినను' అని దీనంగా మొహం పెడితే కళ్ళనీళ్ళు తిరిగి వాడి కోసం పీట మీద కూర్చుని ఏవో నాలుగు మెతుకులు నోట్లోకి తోసింది.

మర్నాడు ఆఫీసులో అందరూ అనుకుంటూంటే అప్పుడర్థమయింది తనకి జరిగిన అన్యాయం ఏమిటో. గౌరీశంకర్ తన కులంవాణ్ణీ, తనకు కావలసినవాణ్ణీ ప్రమోట్ చెయ్యటంకోసం వనజని కావాలనే ఇంటర్‌వ్యూలో చిన్న చూపు చూశాడనీ, బోర్డ్ మెంబర్స్‌కి ముందుగానే హింటిచ్చాడనీ అంతా గుసగుసలాడుకున్నారు. 'ఏడు కొండలవాడా, నేనేం పాపం చేశానని నాకీ శిక్ష విధించావు' అని వాపోయింది. వనజ.

ఇద్దరు కొలీగ్స్ సాయంకాలం వనజ ఇంటికొచ్చి అయాచితంగా సలహా ఇచ్చారు – 'మీరు ఊరుకోకండి. మీకు జరిగింది అక్షరాలా అన్యాయం. డైరెక్టర్ జనరల్‌కి అర్జీ పెట్టుకోండి, ఈ గౌరీశంకర్ గీర అంతా అణుగుతుంది' అన్నారు.

'ఎందుకొచ్చిన గొడవలెండి. ఏదో నా కర్మ! నాకు ప్రమోషన్ వచ్చే రాతలేదు. ఆయనమాత్రం ఏం చేస్తాడు?' అంది వనజ విరక్తిగా.

'మీరలా సన్యసిస్తే లాభంలేదు వనజగారూ! ఇవాళ మీకు జరిగింది అన్యాయం. రేపు మాకు జరుగుతుంది. మొగ్గలోనే తుంచాలి చీడపడితే. గౌరీ శంకర్ మీకు అన్యాయం చేశాడు. మీరు మీ కర్మ అనుకుంటే లాభంలేదు. క్రియాపూర్వకంగా మీరతనికి పాఠం నేర్పాలి' అన్నారు వాళ్ళు. అని, వాళ్లే ఏమేం రాయాలో కూడా చెప్పి డైరెక్టర్ జనరల్‌కి వనజ చేత అర్జీ పెట్టించారు. కాపీ డైరెక్టర్‌కి వెళ్లింది.

అప్పటినుంచి మొదలైంది డైరెక్టర్‌తో ప్రచ్ఛన్నయుద్ధం. అదంతా మనస్సులో మెదిలింది వనజకి. డైరెక్టర్ తన సెక్షన్ వాళ్లందర్నీ కొత్త ప్రాజెక్ట్ చర్చించటానికి పిలిచి తన్నొక్కర్తెనీ వెళ్లిపొమ్మనగానే వనజ మనస్సు కుత కుతలాడింది ప్రతి క్షతో. ఈ సంగతంతా పూస గుచ్చినట్లు డైరెక్టర్ జనరల్ సారధికి రాసింది. క్రిందటిసారి తను ఆయన్ని కలుసుకున్నప్పటి నుంచి నలుగురిముందూ తన గురించి ఉచ్చరించరాని నీచమయిన మాటలు మాట్లాడుతున్నారనీ, తనతో కలిసి మెలిసి తిరగొద్దని తన కోలీగ్స్ అందరికీ నూరి పోస్తున్నారనీ, ప్రతి విషయంలోనూ తనిని ప్రత్యేకంగా కించపరుస్తున్నారనీ, ఈ చిత్రహింసని అరికట్టవలసిందనీ, లేకుంటే తను ప్రాణత్యాగం చెయ్యవలసి వస్తుందనీ, అందుకు బాధ్యత ఎవరిదో తను వివరించనక్కర్లేదనీ ఘాటుగా రాసింది.

సారధి ఈసారి గౌరీశంకర్‌ని పిలిపించి, 'ఏమిటయ్యా ఇదంతా? ఆ వనజంటే మీకెందుకీ కక్ష?' అన్నాడు నవ్వుతూనే. గౌరీశంకర్ కూడా అదేదో జోక్ అయినట్లుగా పకపకా నవ్వేసి 'ఏమిటండీ, మీరు కూడా అదే మాటంటారు! అధికారుల మన్న తరవాత ఇలాంటి వాళ్ళనెంతమందినో ఎదుర్కోవాల్సి వస్తుంది. చాకులాంటి యువకుల్ని సంస్థలోకి తీసుకురావాలనీ, సంస్థని వృద్ధి చెయ్యాలనీ, దేశ సౌభాగ్యాన్నికి పాటుపడాలనీ మీరే ఉపన్యసిస్తూంటారు కదా! వనజలాంటి మొద్దమ్మల్ని పైకి తీసుకొచ్చి బాధ్యతలప్పగిస్తే ఇంక పనులేం సాగుతాయి ముందుకి' అన్నాడు.

'నేనా అమ్మాయితో మాట్లాడిచూశాను. బుద్ధిమంతురాలిలాగే ఉంది. తెలివైన దానిలాగే తోచింది' అన్నాడు సారధి, గౌరీశంకర్ మాటల్ని నమ్మలేనట్లు ముఖం పెట్టి.

'ఆc, పైపై మెరుగులు చూసి మోసపోకూడదండీ! కాకపోయినా, ప్రతి చిన్న విషయానికీ నన్ను కాదని మీదగ్గరకి పరుగెత్తుకొస్తూంటే ఇహ నా ఆఫీసులో క్రమశిక్షణ ఏముంటుంది? నా సంస్థకి మంచేదో చెడేదో నాకా మాత్రం తెలియదా?' అన్నాడు గౌరీశంకర్ బింకంగా.

నిప్పు లేకపోతే పొగ ఎందుకొస్తుంది-అని మనస్సులో అనుకుని సారధి పైకి మాత్రం 'ఏమైనా, ఇంకముందైనా ఇలాంటివి జరక్కుండా చూసుకోండి గౌరీ శంకర్!' అని మర్యాదగా మందలించి ఊరుకున్నాడు.

వనజని పిలిపించి ఆ అమ్మాయికి కూడా కొంత ఉపదేశం చేశాడు సారధి. 'అమ్మాయ్!' అధికారి అన్నతరవాత కొన్ని నిర్ణయాలు తీసుకోవలసి ఉంటుంది సంస్థ మంచీచెడూ ఆలోచించి. అందులో ఎవరికో ఒకరికి ఎప్పుడో ఒకప్పుడు అన్యాయం జరిగినట్లు అనిపించక మానదు. కొంచెం అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు. గౌరీశంకర్‌కి నీమీద ఏదో ప్రత్యేకమయిన కక్ష ఉందని భ్రమించి అనవసరంగా మనస్సు కలుషితం చేసుకోకు. నీ సామర్థ్యమే దెబ్బతింటుంది. శ్రద్ధగా నీ పని నువ్వు చూసుకో. నీకేవిధమయిన అన్యాయం జరక్కుండా నేను చూస్తాను' అని అప్పటికి అభయమిచ్చి పంపించాడు డైరెక్టర్ జనరల్.

ఆరు నెలలు కాస్త ప్రశాంతంగా జరిగిపోయాయి. గౌరీశంకర్ కాస్త ఒళ్ళు దగ్గర పెట్టుకునీ, నోరుకట్టుకునీ వనజని పట్టించుకోనట్లు నిర్లక్ష్యంగా మాత్రం ఉంటూ వచ్చాడు. ఈ లోపల ప్రసాద్ అనే అతను స్వంతంగా స్కాలర్ షిప్ సంపాదించి జర్మనీ వెళ్ళాడు ట్రెయినింగ్‌కోసం. అతను జర్మనీనుంచి రాసిన ఉత్తరాలు చూసి అతను చేస్తున్న కృషికి గౌరీశంకర్ ముగ్ధుడైపోయి అందరితోనూ ప్రసాద్ గురించి గర్వంగా చెప్పటం మొదలుపెట్టాడు. అతను జర్మనీనుంచి తిరిగివచ్చినప్పట్నుంచీ, అతను వనజతోటివాడే అయినా అతన్ని సీనియర్ ఆఫీసర్‌లాగ చూడటం ఆరంభించాడు గౌరీశంకర్.

కొద్దిరోజులకే ఒక సీనియర్ ఆఫీసర్ రెండు నెలలు సెలవు పెట్టాడు. ఆ సెలవు సమయంలో ప్రసాద్‌ని ప్రమోట్‌చేసి అతన్ని సెక్షన్ హెడ్‌గా చెయ్యాలని గౌరీశంకర్ ఆలోచించాడు. ఇలా జరగొచ్చునని ముందుగానే ఊహించి వనజ శ్రేయోభిలాషులు వనజకి సలహా ఇచ్చారు-డైరెక్టర్ జనరల్‌కి ముందుగానే అర్జీ పెట్టుకోమని. తన సీనియారిటీని గుర్తించి, ఈ లీవ్ వేకెన్సీలో తనని ప్రమోట్ చెయ్యవలసిందిగా అర్జీ పెట్టుకుంది వజన డైరెక్టర్ జనరల్‌కి. డైరెక్టర్‌కి కాపీ పంపించింది.

గౌరీశంకర్ ఇప్పుడు ఇరకాటంలో పడ్డాడు. ఈ సమయంలో దాని మాట నెగ్గిందంటే ఇక దానికి పట్టపగ్గాలుండవు. రూలు ప్రకారం లీవ్ వేకెన్సీలో వనజకే ప్రమోషన్ రావాలని తెలుసు. కాని, ప్రసాద్ క్వాలిఫికేషన్స్ ముందర ఈ వనజ ఎందుకు పనికొస్తుంది? ఇటువంటి పరిశోధనా సంస్థల్లో చదువు సంధ్యలూ తెలివితేటలూ ముఖ్యంకానీ, గాడిదలాగ పదేళ్ళు పని చెయ్యటం ప్రధానం కాదు. ప్రసాద్‌కే ఇవ్వాలి ఈ ప్రమోషన్ - అని గౌరీశంకర్ మనస్సు ఘోషించింది.

తన మనస్సులోని ఆరాటాన్ని తగ్గించుకోవటానికి ఇద్దరు ముగ్గురు వందిమాగధుల్ని పిలిచి సంప్రదించాడు - ఈ విషయమై. అందరికీ మనస్సులో వనజకే రావటం

న్యాయం అనిపించినా, ఉన్నమాట అని డైరెక్టర్‌కి అయిష్టత కలిగించటానికి జంకి నోరెత్తలేదు. ఒకతను కొంచెం ధైర్యంచేసి, విషయాన్ని ఎంతో తేలిగ్గా కొట్టి పారేస్తున్నట్లు పోజు పెట్టి, 'వెధవది రెండు నెల్లే కదండీ, ఆవిడ మొహాన్న పారేస్తేపోలే! ఎందుకొచ్చిన గొడవ?' అన్నాడు. మరొకతను అడ్డొచ్చి 'అమ్మమ్మ! అలా అనుకోకోయ్! రేప్పొద్దున్న మరో అవకాశంవస్తే ఈ రెణ్ణెల్ల అనుభవమే ఆదుకుంటుంది సీనియారిటీలిస్టులో' అని విశదీకరించాడు. డైరెక్టర్ చిరునవ్వు నవ్వాడు అతని మేధావి బుర్రని మెచ్చుకుంటూ. చివరికి మూడో అతను మరింత ఆలోచించి 'పోనీ, కొన్నాళ్లు నాన్చెయ్యండి. ఆ తరవాత వేకెన్సీ ఫిలప్ చెయ్యాల్సిన అవసరం లేదు, పని సాగిపోతోంది అని చెప్పొచ్చు' అన్నాడు.

ఈ సలహా బ్రహ్మాండంగా ఉందనుకున్నాడు డైరెక్టర్ – పాము చావకుండా కర్రవిరక్కుండా! డైరెక్టర్ జనరల్ వచ్చేవారం అమెరికా వెడుతున్నాడు. మరో మూడునెల్లదాకా రాడు. 'ఈ వారం రోజులూ మాట్లాడక ఊరుకుంటే సరి' అనుకున్నాడు. మనస్సులో బిక్కు బిక్కు మంటూనే ఉన్నా, పైకి ఛాతీ విరుచుకున్నాడు తన తఢాకా చూసుకోమన్నట్లు.

అమెరికా వెళ్లేందుకు ముందురోజు గౌరీశంకర్‌ని కలుసుకోవటానికి స్వయంగా వచ్చాడు సారధి.

గౌరీశంకర్ ఆయనకి అడుగులికి మడుగులొత్తుతూ సంస్థలో జరుగుతున్న కార్యక్రమాలన్నిటినీ చూపించాడు అన్ని సెక్షన్లలోకీ తీసుకువెళ్ళి. అక్కడ పనిచేస్తున్న వాళ్లందరితో సమయోచితంగా మాట్లాడాడు సారధి. వనజని చూడగానే 'బావున్నావా వనజా?' అని ఆప్యాయంగా అడిగాడు. గౌరీశంకర్ ముఖం అప్రసన్నంగా మరోవైపుకి తిప్పుకున్నాడు.

ఆ మర్నాడు తన టేబుల్‌మీదికి వచ్చిన ఉత్తర్వాన్ని చూసి నిర్ఘాంతపోయాడు గౌరీశంకర్. 'శ్రీ జాకబ్ సెలవు తీసుకోవటం వల్ల ఏర్పడిన ఖాళీజాగాలోకి కుమారి వనజని రూల్సుప్రకారం ప్రమోట్ చెయ్యవలసింది' అని డైరెక్టర్ జనరల్ డైరెక్టర్‌కి ఉత్తరువు జారీచేశాడు. గౌరీశంకర్ పళ్ళు పటపట నూరాడు. 'ఇల్లు అలగ్గానే పండుగైపోదు, నేనూ చూస్తాను దీని అంతేమిటో. ఇటువంటి సంస్థ వ్యవిషయాల్లో కూడా డైరెక్టర్‌కి నిర్ణయాధికారం ఎందుకులేదో నేను తేల్చుకుంటాను. మినిస్టర్‌దాకా వెడతాను. అవసరమైతే ప్రధానమంత్రి దాకా వెడతాను' అని శపథం తీసుకున్నాడు.

ఆఫీసు ఆర్డరు వనజ చేతికింకా అందకపోయినా ఆ వార్త అప్పుడే అందరికీ చేరిపోయింది. వనజని ఆఫీసులో అందరూ అభినందించారు. గౌరీశంకర్ చూడకుండా ఒకతను రహస్యంగా అన్నాడు 'ఇప్పుడు మన గౌరీశంకర్ గారి ముఖం చూడాలి!' అని. మరొకతను లేచి 'ఈయనగారు తనే సర్వాధికారిననీ, సృష్టికర్తననీ అనుకుంటాడు! తనేం చేసినా – కిందవాళ్ళు నోరు మూసుకుని అనుభవించాలనుకుంటాడు! ఇప్పుడు తెలిసొస్తుంది ఎవరు కర్త! ఎవరి కర్మ! ఎవరి క్రియ!' అన్నాడు వెటకారంగా.

ఈలోపుగా డైరెక్టర్ పిలుస్తున్నాడని వనజకి కబురొచ్చింది. డైరెక్టర్ కోపపు మంటల్ని ఎలా తట్టుకోవాలా అని ఆలోచిస్తూ వనజ బిక్కు బిక్కుమంటూ అతని

గదిలోకి వెళ్ళింది. కాని ఆమె ఎదురుచూసినట్లుగా గౌరీశంకరమ్ చూపు నిప్పులు కక్కటం లేదు. చాలా సౌమ్యంగా కనిపించాడు. కుర్చీలో కూర్చోమన్నాడు.

'వెల్! ఐ మస్ట్ కంగ్రాట్యులేట్ యూ' అన్నాడు. మరొకరన్నట్లయితే సంతోషంతో చిరునవ్వు నవ్వేదే, కాని అతని ఎదుట చిరునవ్వు నవ్వటానికి ఆమె పెదవులు నిరాకరించాయి. నమ్రతగా తలవంచుకుంది.

'ఆ చేసేదేదో ఆయనతో చేసేబదులు నాతోనే చేస్తే సరిపోయేది కదా!" అన్నాడు.

'ఏమిటి?' అంది నిర్ఘాంతపోతూ.

ప్రమోషన్ ఆర్డర్ కాగితాన్ని అందించటానికి చెయ్యిముందుకి చాచాడు. అందుకోబోతూంటే ఆమె వేళ్ళని పట్టుకున్నాడు.

తక్షణం చెయ్యికాలినట్లుగా వెనక్కి గుంజుకుని సీటులోంచి లేచి నిలబడింది. ఆర్డర్ కాగితాన్ని తీసుకోకుండా 'యూ క్రూక్' అని మనస్సులోనే బుసకొట్టి బయటకి వచ్చేసింది.

డైరెక్టర్ జనరల్ ఇచ్చిన ఆర్డరుని డైరెక్టర్ వనజకి అందచేస్తూంటే అతనిముఖం ముడుచుకుపోవటం చూసి విజయగర్వంతో మందస్మితంతో ఇవతలికి వస్తుందని చూస్తున్న కొలీగ్స్ వనజ ముఖాన్ని చూడగానే తెల్లబోయారు.

కోపంతో ఆమె ముఖం కందగడ్డలా అయింది. ఉబుకుతూన్న కన్నీళ్లు కొలీగ్స్ కంటపడకుండా వనజ గబగబా క్లోక్ రూమ్‌లోకి వెళ్లిపోయింది.

(ఈ కథ 'అంతర్జాతీయ స్త్రీల సంవత్సరానికి' అంకితం)

● *జ్యోతి, దీపావళి ప్రత్యేక సంచిక, 1975* ●

★ ★ ★

సింగమనేని నారాయణ

42

# జూదం

మూడు గంటలప్పుడు రెండో విడత యింత ముద్ద తిని తోట దగ్గరకు బయలుదేరాడు నారప్ప. దారిలో రామశేషయ్య ఎదురై "ఏం నారప్పా! బట్టలప్పు యియ్యనే యియ్యక పోతివి. సంవత్సరం దాటిపాయె" అని హెచ్చరించాడు.

"బొత్తిగా ఎసులుబాటు గాలేదు శేషయ్యా! నాకు మాత్రం నీ బాకీ నిలపల్లని వుందా."

"రాగులూ, జొన్నలూ మంచి పంటే అయ్యిందంటనే, అమ్మినావా?"

"ఏందమ్మడమప్పా! అడిగే నాథుడే లేకపోతే. మనమై మనం కొంటావా అంటే, మూట అరవైలోపుగానే బేరమాడితే ఎట్టాచచ్చేది. నిరుడు నూటికి పైనుండే ధర, వుట్టుపాటుగా అరవైకే తెగనమ్మాలంటే మనసెట్టా వప్పతాది? ఓ వైపు కరెంటుబిల్లు కట్టల్ల – తనకా బేంకోల్లు జీపులమీద జీపుల్లో వస్తూనే వున్నారా? వుండేకేమో పది మూట్లు జొన్నలూ, పది మూట్లు రాగులూ వుండాయనుకో, ఏంజెయ్యల్లో దిక్కే తెల్లేదు."

"మీ కతజూస్తే యిట్లావుంది. నా కతజూస్తే దబ్బాడితే గాని పొట్ట గడవదాయే. మీ లాంటోల్లందరికీ అప్పులిచ్చి అంగడి ఎండకపొయ్యిందనుకో. ధర్మారం నుండి అప్పులోళ్ళు మనిషి మీద మనిషిని పంపుతుండారు. మీ లాంటోల్లు ఎప్పుడి దప్పుడు యిస్తేగదా నాకూ జరుగుబాటయ్యేది. కటినిట్టుగా అడుగుతున్నానుకోవద్దు నారప్పా! ఓ వారం దినాల్లో బాకీ మాత్రం పైసలు చెయ్యాల్సిందే. అంగట్లో బొత్తిగా సీపు ముక్కలు కూడా లేవు. దసరా వస్తోంది. దసరా కన్నా రొవన్ని బట్టలు అంగట్లో ఏసుకోకపోతే ఎట్లా – వస్తామరి" అంటూ సమాధానం కూడా ఆశించకుండా ముందుకు సాగిపోయాడు రామశేషయ్య.

నారప్ప సన్నగా నవ్వుకున్నాడు. రామశేషయ్య వ్యవహారం నారప్పకు తెలీందేమీ గాదు –– ఇరవై ఏళ్ళ కిందట గుగ్గుళ్ళు గంపతో వ్యాపారం మొదలుపెట్టిన రామశేషయ్య యీనాడు తనలాంటి రైతుల్ని చుట్టూ తిప్పకొనే వాడయ్యాడు. అప్పట్లో రైతులందరి దగ్గరా నయంగా మెలిగి పాతికో పరకో వాళ్ళదగ్గరే చేబదుళ్ళు తీసుకొని చిన్న అంగడి పెట్టుకున్నాడు. రైతులు కల్లాల దగ్గరకు తినుబండరాలు తెచ్చి అమ్మి గింజలు పోగు చేసుకొని అమ్మేవాడు. పాపం, తండ్రి చచ్చినోడని రైతు

లంతో యింతో దయ దలచేవారు. క్రమంగా అంగడి పెంచుకున్నాడు. మెల్లగా బట్టల వ్యాపారం కూడా తోడు చేసుకున్నాడు. చూస్తూ చూస్తూండగానే మూడంకణాల యిల్లు కట్టుకున్నాడు. మెల్ల మెల్లగా రైతులకు అవసరాలకు వడ్డీ కిచ్చుకుంటూ, యీనాటి కింత వాడయ్యాడు. ఎంత లేదన్నా యిరవై వేలకుపైగానే వడ్డీకి తిప్పుకుంటున్నాడని వూర్లో అందరూ అనే మాటే. ఇంట్లో పెండ్లాం పిల్లల దర్జా, బట్టా బాతా, తిండీ తీర్థం చూస్తే ఎట్టాంటి రామశేషయ్య ఎట్టా మారాడబ్బా అనుకోక తప్పదు. ఒక కొడుకును అనంతపురంలో కాలేజీ చదివిస్తున్నాడు. ఒక కొడుకు అతనితో పాటు వ్యాపారంలో నిగ్గుదేలాడు. మంచి సంబంధం చూసి యీ మధ్యనే బిడ్డకు పెళ్ళి చేశాడు. ఇదంతా ఆశ్చర్యంగా, మాయలా కనిపిస్తుంది నారప్పకు.

ఇరవై ఏళ్ళ కిందట నారప్ప తండ్రి యింకా బతికున్నప్పుడు, అన్నదమ్ములింకా భాగాలు విడిపోనప్పుడు, పదెకరాల తరీ ముప్పయ్ ఎకరాల మెట్టతో వూర్లో పెద్దరైతు కుటుంబంకిందే వారిది లెక్క. తండ్రి చచ్చినాక ముగ్గురన్నదమ్ములూ విడిపోయారు. విడిపోయినప్పుడు ఆస్తితో పాటు మూడు వేల అప్పు కూడా నారప్ప మీద పడింది. ఆ అప్పుయితే తీర్చాడుగానీ, రకరకాలుగా యీనాటికి కొత్త అప్పులు పేరుకొని ఐదువేల పైచిలుకే అప్పుల్లో పడ్డాడు నారప్ప. బుద్ధి వచ్చినప్పట్నుంచీ కష్టపడుతూనే వున్నాడు. పంటలు పండిస్తూనే వున్నాడు. అయినా యిదేం విచిత్రమో ఓమైన అప్పు పెరుగుతూనేవుంది. ఇదంతా తల్చుకొని "ఏం సేద్యమో! ఏం పాడో! గడియ తీరికలేదు, దమ్మిడీ ఆదాయం లేదు" అని నిట్టూర్చాడు నారప్ప.

పొద్దు ఏటవాలుతున్నా ఎండ యింకా తగ్గలేదు. భుజంమీదున్న టవ్వలు తీసి నెత్తిన చుట్టుకున్నాడు నారప్ప. బనీను జేబులోంచి బీడీ తీసి వెలిగించుకున్నాడు. పొగ బీలుస్తూ తోట దగ్గరగా వచ్చేసరికి పక్కతోట లోంచి గడ్డిమోపుతో వెంకటన్న ఎదురై "బీడివుంటే ఈ మామా!" అని అడిగాడు నారప్పను. నారప్ప బనీను జేబులోంచి బీడీ తీసి యిస్తూ "ఇయ్యాలకాడ గడ్డిమోపేటికోయ్?" అనడిగాడు.

"ఆ రామశేషయ్య యింతకు ముందొచ్చిండె – వాళ్ళావుకు గడ్డి గావల్లంట – కాసింత గడ్డిమోపు తెచ్చెయ్యరా వెంకా అంటేను...." అని బీడీ వెలిగించుకొని, "వత్తా మామా!" అంటూ ముందుకు కదిలాడు వెంకటన్న.

"రామశేషయ్య పనే బాగుంది" అనుకున్నాడు నారప్ప. చారెడు భూమి లేదుగాని రామశేషయ్య యింటి అవ్వూ, ఎనుమూ వున్నంత నున్నగా ఎవ్వరి వున్నాయ్? ఆడింత యీడింత గడ్డి అడుక్కొనే తన పసుల్ని మేపుకుంటున్నాడు. ఇంత గడ్డి పండించీ తన పసులు ఆ మాత్రం యాడున్నాయి? "దమ్మిడీ కర్చులేకుండా పాలూ నెయ్యీ తినే రాత వానికుంది. మజ్జిగ నీళ్ళ గతి మనకు పట్టింది" అనుకుంటూ తోటలోకి అడుగుబెట్టాడు నారప్ప.

చింతచెట్టు కింద పుల్ల లేరుకుంటూ కనిపించింది ఎల్లమ్మ.

"ఏం ఎల్లమ్మా, ఎప్పుడూ మా తోట పుల్లలేనా నీకు దొరికేది?" అన్నాడు నారప్ప దగ్గరగా వస్తూ.

వంగున్నదల్లా నడుం పైకెత్తి చూసింది ఎల్లమ్మ. నవ్వు మొగం పెట్టింది. "ఎప్పుడూ యాడదన్నా! మీ తోట మొగం చూడకే వారమైతే – అందరూ

నీ యట్టటోళ్లే వుంటారా! ఆ నారపరెడ్డి తోట్లోకి అడుగు పెడితే చాలు మక్కెలిరగందంతా నంటాడు ఆయప్ప కొడుకు–ఏదో మీ లాంటోళ్ళు ఏమీ అనరనే గదా యీటికొచ్చేది. నేనొచ్చే కాటికి ఎవురిదో ఎనుంగొడ్డుంటే బయటికి తోలి యీ పుల్లలేరుకుంటున్నా" అన్నది.

నారప్ప కాస్తంత వుబ్బిపోయాడు. "అద్సరేగాని, మర్నాడు మడి కలుపుకు నువ్వూ నీ కోళ్ళీ రాండి. కలుపు మొక్కలు బాగా పెరిగినాయి" అన్నాడు.

"అట్లాగేన్నా! నువ్వు పిలిత్తే ఎప్పుడు కాదన్నాము? రొవన్ని మెరపకాయలు పీకియ్యన్నా! రాత్రి ముద్దులేకి ఏందీ లేదు" అంది ఎల్లమ్మ.

"ఓస్సే" అనుకున్నాడు నారప్ప. "నువ్వే ఎల్లి ఓ పదికాయలు పీక్కో, సందు చిక్కిందని దులిపేశేవ్."

"అయ్యయ్యో, పిడికెడైతే అయితాయి" అంటూ మిరప పాదుల్లోకి నడిచింది ఎల్లమ్మ. చింపిరిజుత్తు, చిరుగులుపడ్డ పాతచీర, అరవై ఏళ్ళు దాటుతున్నా కష్టం చెయ్యక తప్పని ఎల్లమ్మవేపే చూస్తూ వరి మడివేపు నడిచాడు నారప్ప. మడి చుట్టూ తిరిగి వచ్చేసరికి ఎల్లమ్మ పుల్లల మోపెత్తుకొని బయలుదేరుతోంది. మిరపకాయల మూట సన్నగా చీర ముడతల్లో మోకాళ్ళమధ్య వేలాడుతోంది.

"నీ కొడుకును సంజప్ప యింట్లో జీతానికి పెట్టినావే – ఏమాత్రం వప్పందం?"

"ఆ సంజప్ప దగ్గరే వాడి పెండ్లికి మూన్నూర్రూపాయలు తీసుకుండాం గదా – ఈ సంవత్సరం జీతం పెట్టమన్నాడు. బువ్వపెట్టి బట్టలిత్తానన్నాడు."

"మున్నూటికేనా? వూరంతా ఐదు నూర్లిస్తుండారే!"

"అయ్యో! ఆ సంజప్ప మెడకెస్తే కాలికి, కాలికేస్తే మెడకూ ఏసే రకం. ఐదునూర్లడిగితే, రెండేళ్ళవడ్డి మీ యబ్బ యిత్తాడేమే అంటాడు. బతుకు జరగడం శానా కట్టమైందన్నా – నేనూ కోళ్ళీ ముప్పూటలా కట్టపడుతున్నా తిండికే సాలటంలా – వాని కట్టమేమో ఆ సంజప్పకే సరిపాయె. పూటకు పూట సంపాయించుకోవల్ల – తినల్ల– ఇప్పుడు కోళ్ళీ వుత్తమనిషికూడా కాదు."

నారప్ప ఏం మాటాడలేదు.

ఎల్లమ్మ యింకా తనలో ఏదో గొణుక్కుంటూనే మెల్లగా నడిచిపోయింది.

కూరపాదులకు నీళ్ళు పెడదామనే వుద్దేశ్యంతో తలుపు తెరచి 'మిషన్ రూమ్'లోకి వెళ్ళాడు నారప్ప. స్విచ్ ఆన్ చేశాడు. కరెంటు లేదు. "థూ"... అని తిట్టుకున్నాడు. "ఏం కరెంటో....ఏం పాడో, రోజూ యిదే అవస్థ... కరెంటు బిల్లులు మాత్తరం టంచనుగా కట్టాల్సిందే! కట్టకపోతే డిస్కనెక్షులూ సర్‌సార్జీలూ! టౌనులో సూస్తే యాడ సూసినా ఎప్పుడు సూసినా కరెంటుంటుంది... పల్లెకొంపల కిడసల్లంటే ఏం రోగమో?" గొణుక్కుంటూ రూమ్‌లోనుండి బయటకొచ్చాడు నారప్ప.

కాళ్ళీడ్చుకుంటూ కూరపాదుల్లోకి వెళ్ళికూచున్నాడు. అక్కడక్కడా పెరిగిన గడ్డి పీకేసుకుంటూ ఆలోచనల్లో పడిపోయాడు.

"తనకా బేంకోల్లు ఈ పొద్దో రేపో రానే వస్తారు. వాళ్ళప్పు నిలపటానికి యీల్లేదు. రెన్నెల్లబట్టి తిరుగుతుండారు. వాళ్లొచ్చినప్పుడుల్లా టిఫిన్లూ, కాఫీలూ.

ఆలెస్సమయితే భోజనాలు కూడా పెట్టల్ల. ఆ బేంకు జవాను రాజయ్య మరీ జిడ్డు, వచ్చినప్పుడల్లా రెండో మూడో గుంజుకోందీ కదల్డు. ఆలెస్సంచేసే కొద్దీ కర్చులన్నీ బాకీదార్ల మిందే యేస్తారు."

ఎంత వారించుకున్నా అతని ఆలోచనల్లో డబ్బు అవసరాలు తప్ప మరోటి చోటు చేసుకోలేకపోయాయి.

నారప్ప మనసులోనే వెంటనే జమలు ఇవ్వాల్సిన డబ్బును లెక్క బెట్టుకోసాగాడు. బేంకు అప్పు మున్నూరు.... రామశేషయ్యకు ఎంత లేదన్నా యిన్నూరు....గానుగ చెక్క బాకీ నూరు... కిరాణా సరుకులు తెచ్చిన ఎంగటేసులశెట్టి అంగిట్లో మున్నూరు....మూడునెల్లు కరెంటు బిల్లుకు శివయ్యతో తెచ్చింది నూటయాభై... యీ నెలకట్టే బిల్లు యాభై... ఇలా లెక్కించుకుంటూ మొత్తం ఒక్క వెయ్యీ నూరు అని తేల్చుకున్నాడు. ఇవి తక్షణ అవసరాలు. తీర్చకపోతే మర్యాద దక్కదు. దీంతోపాటు పుట్టింటికొచ్చిన పెద్ద బిడ్డకు పండగనాటికి బట్టలు పెట్టి పంపల్ల– ఆ కర్చూ ఎంతలేదన్నా నూటికి తగ్గదు – మడికి యూరియా మూట ఒకటి తెచ్చుకోవల్ల – అదొగ నూరు.

చెలమలో నీరులా అవసరాలు వూరుతున్నాయి. నారప్పకు, ఎక్కువ ఆలోచన చేసేందుకు భయమేసింది.

ఇంట్లో వుండే రాగులూ జొన్నలూ అమ్మితే యిప్పుడుండే రేటులో ఆ వచ్చేది యేమూల కయితుందీ? పండిన పంటకు చేతికొచ్చేది పంటకు పెట్టిన పెట్టుబడీ, లెక్కలు గడితే కూలే గిట్టదే. యాదేవున్తో చెప్పుకొనేట్టు? ఓవైపు కొనాల్సిన సరుకుల ధరలన్నీ వున్నచోట వుండకుండా పెరుగుతూనే వుండాయా! ఎరువుల ధరలు తగ్గలే! కరెంటు రేటు తగ్గలే. భూమి పన్ను తగ్గలే – బట్టల ధరలు సరేసరి. ఏందబ్బా తగ్గిందేది?

నారప్ప ఆలోచనల్లో మునిగి గడ్డి మొక్కకు బదులుగా మెరప మొక్క పీకి, వెంటనే నాలుక కరచుకున్నాడు.

"నాయనోయ్... నాయనో!" అన్న కేకలు విని వెనక్కు తిరిగి చూస్తే తొమ్మిదేళ్ళ కొడుకు కిష్టిగాడు పరుగు పరుగున వస్తున్నాడు. నారప్ప కొడుకు వేపే చూస్తూ ఏదో శంకించాడు.

"ఏందిరా కిష్టా?" అన్నాడు కొడుకు దగ్గరకు రాగానే.

"జీపులో ఆ పొద్దు వచ్చినోళ్ళు వచ్చినారు నాయనా – నువ్వు బిరీనా రావాల్లంట – ఇంటికాడే కూకుండారు" అన్నాడు వాడు, పరుగెత్తు కొచ్చిన ఆయాసంతో వగరుస్తూ.

నారప్పకు బాగా అర్థమయింది.

ఆ వచ్చినోళ్ళు తనకా బేంకోల్లు. వాళ్ళు రావటం యిది మూడో సారి... 'ఎట్లా జేస్తే బాగుంటుందబ్బా!' అనుకుంటూనే కొడుకు వెంట కదిలాడు.

దారిపొడుగునా వకటే ఆలోచనలు – ఇప్పుడున్న పళంగా ఎవర్నడగాలి? అడిగితే శివయ్య యివ్వకపోడు. పొద్దున్నేవచ్చి గింజలు కొలవమంటాడు... రేటు దగ్గర శానా

మొండి మనిషి... చూసి చూసి యింత తక్కువ  రేటుకు అమ్మటానికి మనసొప్పలే. అమ్మకపోతే అనువులు తీరేటట్టులేవు. ఈటికే నెల నుండి అందరి దగ్గరా "యిదిగో యిదిగో" అంటూ గడువు కొస్తుండాడు. సరే. ఎట్లయితే అట్లగానీ!

సూర్యకిరణాలు బాగా ఏటవాలుగా పడుతున్నాయి. గాలి ఆగి ఆగి మందంగా వీస్తోంది. పొలాల్లోంచి  అప్పుడప్పుడు కూతలు వినిపిస్తున్నాయి.

కిష్టిగాడు ముందుగా గంతులేస్తూ నడుస్తున్నాడు. వాడిప్పుడు నాలుగో తరగతి. బలే తెలివైనవాడని  అయ్యవార్లంతా తనతో అంటూంటే తన కెంత ఆనందం! వాణ్ణయినా బాగా చదివిచ్చుకోవల్ల – పెద్దానికెట్లా చదువబ్బలే  – ఇంకో ఏడు గడిస్తే వీన్ని అయిస్కూలుకు పంపల్ల – వాడు తన మాదిరి భూమి మీద ఆధారపడకుండా ఓ రకమైన  ఉద్యోగం చేసి బతుక్కుంటే చాలు – అందుకే వాన్నిప్పట్నుండే సేద్య పనుల్లోకి బలవంత పెట్టకుండా శ్రద్ధగా  సదువుకొనేట్లు సూడల్ల – తెల్లవారుజామున వాడు లేసి సదువుతూంటే సందులో ఆడోళ్ళంతా పనీ పాట్లకు లేస్తూ  వుంటారు – నారప్ప పెదవుల మీద ఒక క్షణం అందమైన మందహాసం మెరిసింది.

దూరం నుండే తన ఇంటి దగ్గర జీపు నిలబడి వుండటం చూశాడు నారప్ప. జీపు చుట్టూ కొందరు  పిల్లలూ, ఒకరిద్దరు పెద్దవాళ్ళూ మూగివున్నారు.

కుడి భుజం మీదున్న తువ్వాలు తీసి విదిలించి ఎడమ భుజం మీద వేసుకొని యింటి ముంగిట్లోకి వచ్చాడు నారప్ప.

వరండాలో అరుగుపై కంబడి మీద సుఖాసీనులై వున్నారు బ్యాంక్ అధికారులు. నడవలో బ్యాంక్ జవాను రాజయ్య  నిలబడి వున్నాడు. వాళ్ళు తాగి పెట్టిన కాఫీగ్లాసుల మీద ఈగలు ముసురుతున్నాయి. తలుపు వెనకాల నారప్ప  భార్యా, పెద్ద బిడ్డా నిలబడి తొంగి చూస్తున్నారు.

నారప్పను చూడగానే "రావయ్యా – రా పెద్దమనిషీ! నీకోసం అర్ధ గంటనుండీ కాసుకోనుండాం" అని  చిర్నగవుతో ఆహ్వానించాడు, వారిలో ఒకాయన – ఆయన నారప్పకు బాగా పరిచయం. ఆ మాటకొస్తే నారప్పకే  గాదు – ఆ వూళ్ళో చాలామందితో బాగా పరిచయాలున్నాయి ఆయనకు.

నారప్ప వచ్చి ఎదురు అరుగు మీద కూలబడ్డాడు, మాటా పలుకూ లేకుండా.

"మరి లెక్క సరిచేసినవా, మేం యిక్కన్నుండీ వెంటనే వెంకటంపల్లి పోవల్ల – మళ్ళీ టైమైపోతుంది" అంటూ ఆయన తొందర చేశాడు.

"నన్నేం ఎగిరి దుంకమంటావా సార్! ఇంట్లో వున్న గింజలమ్మిడు పోందీ నా పిండాక్కూడు  ఎక్కన్నుంటే తెస్తాను?"

"ఇది మరీ బాగుందప్పా! నా యింటికా ఏమన్నానా? నీ చుట్టూ తిరగబట్టి యిప్పటికి రెన్నెల్లయింది. వచ్చినప్పుడల్లా యిదే మాటేనా?"

"మీరేం జీపుల్లో తిరుగుతారు, జీపుల్లో పోతారు – బాదల్లా నాకే గదా! నా పాట్లు నేను పడుతూనే వున్నాను."

"ఏం బాధపడి ఏం ప్రయోజనం – లేచి ఏదో ఒకటి చూడు – మీలాంటి మర్యాదస్తుల యిండ్లకాడ జప్తు గిప్తు  అంటే ఏమన్నా బాగుంటుందా?" చివరి అస్త్రం ప్రయోగించాడాయన.

"ఏమప్పా నారప్పా! అప్పుతీసుకొని యిట్లా దబాయిస్తే ఎట్లాగా, మా ఉద్యోగ ధర్మం మేం చెయ్యల్లా వద్దా? ఒక్కొక్క రైతూ యిట్లా మొండికేస్తే మేం వసూళ్ళు చేసినట్టే." ఇంకో వుద్యోగి సంభాషణలోకి దిగాడు.

"నా మాటిను నారప్పా! నువ్వడిగితే యింత వూర్లో ఎవరీరు? ఆ చలపతి దగ్గరకో, శివయ్య దగ్గరకో పోయిరారాదా? నువ్వులపంట మామూలుగా వాళ్ళకే గదా యిచ్చేది?" మొదటాయన సలహా యిచ్చాడు.

నారప్ప రెండు నిముషాల సేపు మాటాడకుండా కూచున్నాడు. ఏమనుకున్నాడో ఏమో, ఏదో నిశ్చయానికి వచ్చినట్టు లేచి, "ఒరే కిష్టా! రొవన్ని మంచినీళ్ళు తేరా!" అని కేకేశాడు. కిష్ట మంచినీళ్ళు తెచ్చి యివ్వగానే తాగి, "సరే, వూర్లోకి పొయ్యొస్తాను. మీకు అప్పు తీర్చకూడదని నాకేమన్నా కోరికా? నా బాదల్లా గింజలకు రేటు గిట్టలేదనే – ఏం జేస్తాం?" అనేసి వూర్లోకి దారి తీశాడు నారప్ప.

నేరుగా శివయ్య యింటి దగ్గరకెళ్ళి బయట నుండి గట్టిగా "శివయ్యా!" అంటూ కేకేశాడు. లోపల్నుండీ 'ఎవరూ' అంటూ ఓ గొంతుకతో పాటు, ఓ తల నిక్కి చూసింది.

"నువ్వా నారప్పా! రా, రా! ఏమిటి సంగతి – అసలు సందకాడొచ్చినావ్" అంటూ పిలిచాడు శివయ్య.

"ఆ తనకా బేంకోళ్ళు కుతికల మీదికొచ్చి కూకుండారు. ఓ మున్నూరు కావల్ల" అంటూ లోపలికొచ్చి తలుపువారగా వున్న బెంచీమీద కూలబడ్డాడు నారప్ప.

శివయ్య ఏం మాటాడకుండా కుర్చీని దగ్గరగా ఈడ్చుకొని కూర్చున్నాడు.

"ఇంట్లో పది మూట్లు రాగులు, పది మూట్లు జొన్నలూ వుండాయి. రేపు వచ్చి కొలుచుకో – ఇంతకూ ఏమాత్రముంది యిప్పుడు రేటు?"

"రాగులేమో అరవై ఐదు – జొన్నలు అరవై – అయినా బొత్తిగా గిరాకీ లేదు నారప్పా!"

"ఏం జేస్తాం – అయినకాడికి అమ్మకపోతే అనువులేరేట్టు లేదు – ఒక రకంగా చూసి ధర తెంచుకో శివయ్యా!"

"నా చేతుల్లో ఏముంది నారప్పా! నేనేమన్నా ధర పెంచేవాణ్ణా – తగ్గించేవాణ్ణా – టౌన్‌లో రేటునుబట్టి కొంటుంటాను. అన్నవస్తులూపడి వ్యాపారం చేస్తే మూటకు అబ్బ అంటే అర్ధరూపాయ మిగల్దు. ఐనా రాగులూ జొన్నలూ అడిగేవాడేలేదు. రైతుల్ని పోగొట్టుకోలేక తీసుకోవల్సిందేగాని నాకు శానా బరువు నారప్పా! ఒక లారీడు సరుకన్నా అయితే ఎక్స్‌పోర్టు ఖర్చులు తగ్గుతాయి. ఇరవయ్యో ముప్పయ్యో మూటల కయితే దిక్కులేని ఖర్చులు – బండిలో టౌనుకు తోలల్లంటే మూటకు రెండున్నరకు తక్కువ యెవ్వడూ బండి బాడుగ కట్టరు–"

శివయ్య మాటల ధోరణి చూస్తే నారప్పకు దిగులేసింది. "ముందు ఓ మూడు నూర్లే శివయ్యా – మళ్ళా వచ్చి మాట్లాడుతా."

"శానా అర్జెంటా?"

"నీ కత ఇంకా బాగుంది. అవతల వాళ్ళు యింటికాడ కూకుండారయ్యా అంటే!"

"రేపు గింజలు కొలవాలమరి – మర్నాడెట్లా సంతగదా! సంత బండ్లల్లో నన్నా మూటలు సాగించక పోతాను. రేటు కూడా యిప్పుడు చెప్పినట్లే! నువ్వు మళ్ళా గుయ్ గుయ్ అంటే బాగుండదు – మూటకు రెండున్నర బండి బాడుగా, రూపాయి వాణిజ్యం పన్నూ తీసివేసే ధర కడతా – ఆ పైన నీ యిష్టం."

"బండి బాడుగ కూడా నా నెత్తిమీద వేస్తే ఎట్లా శివయ్యా?" నారప్ప గొంతులో జీర పలికింది.

"మరి నన్ను బోడిచ్చుకోమంటావా? నువ్వు బలవంతపెడితే నేను కొంటున్నాగాని, నాకేం దీంట్లో లాభమా, పాడా? పాతరైతువి – సరుకు తీసుకోనంటే బాధ పడతావనే కొంటున్నాగాని."

నారప్ప వేడిగా నిట్టూర్చాడు. "సరేగాని లెక్క తీసకరా మరి" అన్నాడు మింగలేక కక్కలేకా.

శివయ్య లోపలికెళ్ళి ఐదునిమిషాల్లో తిరిగి వచ్చాడు. చాలా జాగ్రత్తగా ఒక్కొక్క నోటే ఎంచి నారప్ప చేతికిచ్చాడు "మున్నూరు" అంటూ.

"లెక్కాచారం చేసి మిగిలింది రేపిస్తాను. పొద్దున్నే జీతగాన్ని పంపిస్తా" అన్నాడు.

నారప్ప సమాధాన మివ్వకుండా డబ్బును బనీను జేబులో పెట్టుకొని యింటివేపు నడిచాడు.

☆ ☆ ☆

మరురోజు పొద్దున్నే ఎనిమిది కూడా దాటకుండానే, శివయ్య సంచులతో జీతగాన్ని వెంటబెట్టుకుని నారప్ప యింటికి వచ్చాడు. ఇంటిముందున్న పసుల కొట్టంలో, అట్టవ మీదనుండి గడ్డిని తీసి, పశువుల ముందు వెదజల్లుతున్నాడు నారప్ప. శివయ్య గొంతు వినిపించి "అప్పుడే వచ్చినాడే మాన్నుబావుడు" అనుకుంటూ కొట్టంలోంచి బయటకొచ్చాడు.

శివయ్య అరుగుమీద కూచొని సంచిలోంచి 'శేరు' బయటకు తీశాడు. ఆ శేరును చూస్తే నారప్ప కెప్పుడూ భయమే!

"నీ పెద్దకొడుకు నరసింహులు కనిపించలేదే నారప్పా?" కుశల ప్రశ్నలు వేశాడు శివయ్య.

"వానికింటి దగ్గరుండే తీరికేడిది? పొద్దున్నే శేనికి పొయ్యినాడు?"

"శేన్లో శెనక్కాయ ఏమాత్రం వేసినావీసారి?"

"రెండు మూట్లు వేసినా – ఏం లాభం – వాన అతీగతీ లేకుండా పాయె. పావలా పంట కూడా యీసారి కట్టమే. నిరుడు పండిన మాత్రమన్నా చేతికొస్తే కొంత గట్టెక్కొచ్చు అనకుంటే, నెల రోజులుగా వాన లేక పైరు ఎండకపోతోంది. మీకేం యీ బాదరబందీ లేదు. వానొచ్చినా రాకపోయినా మీరేం ఎండకపోరు."

"అదెట్లా నారప్పా! రైతులు సల్లగుంటేనే గదా మాకూ యింత తిండి." చిరునవ్వు వలకబోశాడు శివయ్య.

"రైతుల సల్లగుంటేనా – రైతుల్ని పీలిస్తేనా?" అని మనసులో అనుకుంటూ ఇంట్లోకి తొంగిచూసి "ఇదుకో.... ఏమీ! ఓ గలాసు పాలు పంపీ.....శివయ్య వచ్చినాడు" అంటూ కేకేశాడు నారప్ప.

పది గంటలకల్లా బస్తాలు నింపేపని పూర్తయింది - గింజలు కొలుస్తున్నంత సేపూ, ఏదో పోగొట్టుకున్నట్టే బాధ పడ్డాడు నారప్ప. ఎవరో దొంగలొచ్చి తన యింటి సంపదను దోస్తున్నట్టు యాతన అనుభవించాడు.

కొసరి, కొసరి బస్తాకు రెండు శేర్ల గింజలు అదనంగా కొల్చుకున్నాడు శివయ్య.

నారప్ప యింత ముద్ద గతికే ఓ గంట తర్వాత, లెక్కా-చారం చూసుకొనేందుకు శివయ్య యింటికి వెళ్ళాడు.

నారప్ప శివయ్య ఇంట్లోకి అడుగుబెట్టేసరికి, శివయ్య స్నానం చేస్తున్నాడని చెప్తే బెంచీమీద కూచొని బీడీ వెలిగించినాడు. ఎదురుగా గోడ మీద వేలాడుతున్న నిలువెత్తు వెంకటేశ్వరస్వామి ఫోటోనూ, ఫోటో చుట్టూ వున్న చిన్న కరెంటు బల్బులనూ చూస్తూండిపోయాడు నారప్ప. "సంవత్సర సంవత్సరానికీ యెంగటేసుల బొమ్మ పెద్దదయితోందే!" అనుకున్నాడు.

స్నానమూ, పూజా పూర్తి చేసుకొని నుదుటిమీద కుంకుమ బొట్టుతో హాల్లోకి వచ్చి "అప్పుడే వచ్చినావా నారప్పా? సరుకేసినంక మీకతంతా యింతేనప్పా! లెక్క పూర్తీ యిచ్చేదంకా కొంప కాపలా కాస్తారు" అన్నాడు నవ్వుతూనే. ఆ రకమైన నవ్వు నారప్పకు ఒంట్లో కంపరం పుట్టిస్తుంది.

"మల్లా మల్లా యాడ తిరుగుతాను. ఇచ్చేవాళ్ళకేదో యిచ్చేస్తే పానం రవ్వంత కుదుటబడుతుంది. నీకేడా కనబడుదు."

"సరేలేవయ్యా" అంటూ కొల్చుకున్న పంటకు ధర కట్టాడు శివయ్య. మొత్తం 1250 రూపాయలు. బండిబాడుగ యాభై రూపాయలు, వాణిజ్యం పన్ను ఇరవై రూపాయలు, మొత్తం డెబ్బై రూపాయిలు, సాయంత్రం తీసుకున్న మూన్నూరు, ఇంతకు మునుపు కరెంటు బిల్లులకు తీసుకున్న నూట యాభై, మినహాయించుకొని మిగతా 730 రూపాయల్లో ఐదునూర్లిచ్చి, తక్కింది రెండు మూడు రోజుల్లో సర్దుతానన్నాడు శివయ్య.

నారప్ప "ఆ కొదవా వుంటే యీకూడదా - నాకుండే నూరు బొక్కల్లో మల్లా యిదొకటా?" అన్నాడు.

"ఇదే మీతో వచ్చిండేది. నేనుగాంగ సరుకు తీసుకుంటానే లెక్క యిస్తున్నా. ఇంగొగరికేస్తే నెలలు తిప్పుతారయ్యా - సంతకు పొయొచ్చినంక నేనే పంపిస్తాలే" అన్నాడు శివయ్య మొగం మార్చుకుంటూ.

నారప్ప యింకేం మాట్లాడలేదు.

డబ్బును బనీను జేబులో జాగ్రత్తగా పెట్టుకొని, లేవబోతుంటే "వుండయ్యా, అంత తొందరేమి?" అని నిలబెట్టి ఇంట్లోకి వెళ్ళి ఒక డబ్బా తెచ్చి నారప్ప ముందు బెట్టాడు. ఆ డబ్బా మీద "శివాలయ నిధి" అని రాయబడి వుంది.

"లింగ ప్రతిష్ఠ ఈసారి శివరాత్రికి చెయ్యాలని అందరూ అనుకొనిందేగదా - ఏదో దైవకార్యం - నీకు తోచింది దీంట్లో వెయ్యవయ్యా!" అన్నాడు.

నారప్ప గుటకలు మింగాడు. ఒక నిమిషం తటపటాయించాడు. "లింగప్రతిష్ఠ చేయిచ్చేది నువ్వు - లెక్క మమ్మల్నిడిగేది ఏం బాగుంటుంది శివయ్యా?" అన్నాడు.

"ఏంది నారప్పా - ఇదేం నా ఇంటిపనా - దేవుడు నా యబ్బ సొత్తా!

వ్వూరందరి పని – కలిగిందాంట్లో అంతో ఇంతో దేవునికిస్తే ఆ పుణ్యమేమీ వ్వూరికే పోదులే! ఆ దేవుని దయేవుండల్లగాని యిట్టాంటివి మనమెంత సంపాదించకూడదు?"

నారప్ప చేసేదిలేక రెండు రూపాయల నోటొకటి తీసి వెయ్యబోతే "మరీ ఇంత అద్వాన్నమైతే ఎట్లా నారప్పా! ఓ పదన్నా వెయ్యి" అని బలవంతం చేస్తే గొణక్కుంటూనే ఆ నోటుకు బదులుగా ఒక ఐదురూపాయల నోటు తీసి ఆ డబ్బాలో వేసి "వస్తా శివయ్యా, సంతనుండీ రాగానే లెక్క పంపీ – యిబ్బందులు శానా వున్నాయి" అని హెచ్చరించి బయటకు నడిచాడు.

మిట్ట మధ్యాహ్నం – పొద్దు కరకర మంటూంది. వీధిలో నడుస్తూన్న నారప్పకు అదేమంత తీవ్రమైన ఎండలా కన్పించలేదు – ఏదో ఏట్లోకి పారవేసి వచ్చినంత బాధగా వుందతనికి. నిరుటిలాగే ధరవుంటే రెండు వేలన్నా కళ్ళచూడాల్సింది. ఒక రకంగానన్నా వుండేది... ఈ మిగిలింది యాటికని సరిపోతాది? ఆ యంగటేసులు శెట్టీ, రామశేషయ్యా, సందకాటికల్లా యింటికాడ మూగుతారు. ఎక్కడి పీడ? అనుకుంటూ వాళ్ళకొట్ల వేపు నడిచాడు.

శెట్టి అంగట్లో మొత్తమయిన అప్పు మున్నూటికిగాను 250 జమ కట్టాడు. రామశేషయ్య బట్టలంగట్లో ఇన్నూటానలభైకిగాను, ఇన్నూరు జమవేసి మిగిలిన నలభై ఐదురూపాయల్ని లెక్కబెట్టకుంటూ యింటిదారి పట్టాడు నారప్ప.

దారిలో నడుస్తూ మడికి తేవాల్సిన యూరియా మూట. ఈ నెల కట్టాల్సిన కరంటు బిల్లూ లెక్క వేసుకున్నాడు. ఇంకా గానుగచెక్క తెచ్చిన గాండ్ల మల్లప్పకూ యివ్వల్ల. శివయ్య ఆ తతిమా లెక్కయిస్తే బొటాబోటీ సరిపోతుంది. పండగకు బట్టలూ, పెద్దబిడ్డకు బట్టలూ, మల్లా అప్పులే! ఏం బతుకో ఏం పాడో!

నారప్ప తువ్వాలుతో ముఖం తుడుచుకొని యింటి ముంగిట్లోకి అడుగుబెట్టాడు. ఇంటి అరుగు మీద ఓ వ్యక్తి కూచొని సిగరెట్ పీలుస్తున్నాడు. స్లాకు, పాంటూ వేసుకున్నాడు. ముప్పయ్ ఏళ్ళుంటాయి. "ఎవరబ్బా?" అనుకుంటూ అనుమానంగానే నారప్ప అరుగు దగ్గరకు వచ్చాడు.

ఆ వ్యక్తి నారప్పను చూడగానే "పది గంటలప్పుడు వచ్చినాను, నువ్వు చూస్తే అతీగతీలే. రామ్మూర్తి పంపించినాడు" అన్నాడు.

రామ్మూర్తి పేరు చెప్పగానే, కరెంటు ఇంజను, అనంతపురం, వాసవీ ఎలక్ట్రికల్స్ షాపూ నారప్ప కళ్ళముందు మెదిలాయి.

"కరెంటింజను బాపతు లెక్క యింకా ఎనిమిది నూర్లుందంట. నెల కిందటనే తెచ్చి యిస్తానని చెప్పింటివంటా – నీకోసం చూసి చూసి ఎన్నాళ్ళకూ రాకపోతే నన్ను పంపించినాడు రామ్మూర్తి. వెంటనే బాకీ పైసలు చెయ్యకపోతే బాగుండదని చెప్పినాడు. ఇదిగో, నీ పేరుతో చీటీ కూడా రాసి పంపించినాడు" అంటూ ఓ తెల్లకాగితం మడత నారప్ప చేతికందించాడు ఆ వచ్చిన మనిషి.

నారప్ప ఏం మాట్లాడలేదు.

● ప్రజాసాహితి – నవంబర్, 1978 ●

★ ★ ★

43

చిలుకూరి దేవపుత్ర

# సమిధలు

తూరుపింకా ఎర్రబడలేదు......

కాపోళ్ళ బావి గిలక 'కిర్ కిర్' మంటూ శబ్దం చేస్తోంది-అలా శబ్దమయిందంటే తెల్లారుతున్నట్టే లెక్క కొల్లప్పకి. జీతగాళ్ళని తెల్లారకనే లేపి నీళ్ళు తోడిస్తారు కాపులు.

కొల్లప్ప గుడిసె కెదురుగా ఉన్న గుడిసెలోంచి మారెక్క నిద్దరలేపుతోంది బిడ్డని- 'లెయ్యే ఎల్లమ్మా! పొద్దు పుడతాది... లేసి ముద్దకెసరుబెట్టు' అంటూ.

ఆ హరిజన వాడలో దాదాపు అన్ని ఇళ్ళల్లో తమ పిల్లల్ని ఆ వేళకే లేపుతారు ముసలోళ్ళు. ఆ వేళకే లేచి.... నీళ్ళు తెచ్చుకొని వంట చేసేటప్పటికే పొద్దు పొడుస్తుంది. కొంత తిని, కొంత చద్ది కట్టుకుని పోతారు కూలికి.

కొల్లప్ప ఎడం వేపుకి పొర్లి పడుకున్నాడు. గుడిసెలో కుండల చప్పుడవుతూంటే - 'నారమ్మ లేసినట్లుంది.... నెలలు నిండినాయి గదా, ఇయ్యాలకే లెయికుంటేనేం' అనుకున్నాడు.

నారమ్మ కొల్లప్ప కోడలు. ఎనిమిదేండ్ల కిందట ఆ ఊరికి కలరా సోకినప్పుడు నారమ్మ అయ్యా, అమ్మా సరైన వైద్యంలేక కన్నుమూశారు. అప్పట్నుంచి నారమ్మ తన అక్క బావల దగ్గరే పెరిగింది. సంవత్సరం కిందట కొల్లప్ప తన ఒక్కగానొక్క కొడుకయిన పోతప్పకి పెళ్ళి చేసుకొచ్చాడు నారమ్మని. కోడలంటే కొల్లప్పకి ప్రాణం. పోతప్ప ఎప్పుడయినా నారమ్మని కొద్దిగా కసురుకున్నా - "ఆ పాపదేం తప్పురా!" అని ఒంటికాలిమీద పోయేవాడు పోతప్ప మీదికి. కూతురున్నా అంత బాగా చూసుకునేవాడు కాదేమో!

కొల్లప్ప మనసు గుబులు గుబులుగా ఉంది. లేచి గొంతు కూర్చున్నాడు. కళ్ళుమండుతున్నాయి. అలా కళ్ళు మండుతున్నందుక్కారణం రాత్రంతా నిద్దర లేకపోవడమే.

మామూలుగా ఏ దగ్గు ఆయాసంతోనో, ఇంట్లో గింజలు లేవన్న దిగులుతోనో, చనిపోయిన కొడుకుని తలుచుకునో. పెళ్ళయిన ఆర్నెళ్ళకే ముండమోసిన నారమ్మని తలుచుకునో, నారమ్మ కడుపున పుట్టబోయే తండ్రిలేని బిడ్డని తలుచుకునో నిద్దరొచ్చేది కాదు కొల్లప్పకి. కానీ, ఆరాత్రంతా కొల్లప్పకి నిద్దర లేకపోవడానికి ఇవేవి కారణాలు కావు.....

క్రితంరోజు సంధ్యవేళ ఇంటికొస్తూనే కోడలు కాచి యిచ్చిన గంజి యింత తాగి గుడిసెబయట చిరుగుల కంబళి కప్పుకొని కూర్చున్నాడు – తాపీగా బీడీ అంటించుకుని తాగుతూ. ఆ సమయంలో మల్లేసు వచ్చి చెప్పాడు "కేశవరెడ్డీ, మల్లారెడ్డి ఇద్దరూ యాకమైనా"రని. ఒక్కసారి ఉలిక్కిపడ్డట్టు "నిజమా?" అన్నాడు. బీడీ నోటికాడి వరకూపోయి ఆగిపోయింది. 'అవు' నన్నాడు మల్లేసు. కొల్లప్ప గుండెల్లో కలుక్కుమన్నట్టయింది.

"ఈ పెద్దోల్లకి సిగ్గూ, ఎగ్గూ లేదు మామా!" అన్నాడు మల్లేసు. వినిపించు కున్నట్టు లేదు కొల్లప్ప. ఆలోచిస్తున్నాడు – దేన్నిగురించో.

ఉన్నట్టుండి – "ఒరే మల్లేసూ! యిద్దరూ యాకమైతే యట్లరా....మన పోతిగాని కేసు యేట్లో గలిసినట్లేనా?" – ఆ కంఠంలో చెప్పలేనంత బాధ ఉంది, బరువు ఉంది, ఆవేదన ఉంది.

ఆ బాధకూ, ఆ బరువుకూ, ఆ ఆవేదనకూ కారణం చాలా ఉంది.

దాదాపు ఆర్నెల్ల కిందట పంచాయితెన్నికలొచ్చాయి. ఎప్పట్లాగే కేశవరెడ్డి ప్రెశిడెంటు ఎన్నికకి పోటీ చేశాడు.... ఎన్నో రోజుల్నుంచి మల్లారెడ్డికి కూడా ప్రెశిడెంటు కావాలని చాలా మోజుంది. "ప్రెశిడెంటు మల్లారెడ్డి" అని ప్రజల్తో పిలిపించుకోవాలని బోల్డంత ఆశుంది. తన మోజూ, ఆశ తీర్చుకోడానికి కేశవరెడ్డికి పోటీగా నిలబడ్డాడు. నిజానికి పోటీదార్లిద్దరూ దగ్గర బంధువులే. ఇంకా చెప్పాలంటే బావ బామ్మరుదులు కూడా. పదవీ వ్యామోహానికి బంధుత్వం అడ్డురాదుగా – దాంతో వారిద్దరి మధ్యనా శత్రుత్వం వాళ్ళకి తెలీకుండానే చోటు చేసుకుంది.

ఆ ఎన్నికల్లో కేశవరెడ్డికి కొల్లప్ప కొడుకు పోతప్పే కుడి బుజంగా ఉన్న అంగరక్షకుడూ, ప్రచారకుడూను. పోతప్ప చేస్తున్న సేవను మెచ్చుకున్నప్పుడల్లా మురిసి పోయేవాడు కొల్లప్ప. తన కొడుకెంతో ప్రయోజకుడయినట్టు ఉబ్బిపోయి – "ఆడు అంతే సామీ, పిల్లప్పన్నించీ యాపనికయినా గుండ్లు దీసిన బంటు" అనేవాడు. "వాని బయంబక్తి సూస్తే నాకెంత యిష్టమనుకున్నావ్! వచ్చే యాడాది నించి వాని కింకొక యాబయి ఎక్కిస్తారా, జీతం" అని కేశవరెడ్డి అన్నప్పుడు కొల్లప్ప ఆనందానికి పట్ట పగ్గాల్లేవు. ఆ మాటని ఆ రోజంతా ఊరంతా చెప్పుకున్నాడు.

ఎలక్షన్లు దగ్గర పడే కొద్దీ ప్రచారం విపరీతంగా మారింది. ఇరుపక్షాల్లో కోపాలూ ఉద్రేకాలు తారస్థాయి చేరుకున్నాయి. నువ్వెంతంటే నువ్వెంత అని వ్యక్తిగతమైన కొట్లాటలు గూడా జరిగాయి. ఎన్నికరోజు రానే వచ్చింది. పోతప్ప ఇంటింటికీ తిరిగి ప్రతి మనిషి వెంట పోలింగ్ బూతు వద్దకు వెళ్ళి ఓటేయించాడు. తన కులంవాళ్ళందరికీ కేశవరెడ్డి యిచ్చిన డబ్బుతో కల్లు, సారా పోయించాడు. ఓట్లేయించాడు. ఏమయితేనేం, కేశవరెడ్డి మంచి మెజారిటీతో గెలిచాడు.

ఆ రోజు సాయంత్రం పోతప్ప వరిమడికి నీళ్ళు పారించి వస్తున్నాడు. మల్లారెడ్డి పెద్ద కొడుకు తిప్పారెడ్డి, అతని పాలేరు ఓబిలేసు దార్లో ఎదురయినారు – గడ్డివాముకిపోతూ. పోతప్పని చూస్తే తిప్పారెడ్డికి అరికాలినుంచీ మండుతుంది, కేశవరెడ్డి గెలవటానికి మూల కారణం వాడేనని. హరిజనవాడలోని వోట్లన్నీ తమకే

వస్తాయని అనుకున్నాడు తిప్పారెడ్డి. కాని పోతప్ప మూలాన హరిజన వోటర్లంతా తమకే వేయలేదు..... అందుకే పోతప్ప మీద కుత్తిక వరకూ వుంది కోపం.

అంత దూరంలో పోతప్పని చూడగానే ఓబిలేసు చెవిలో ఏదో చెప్పాడు. సరేనన్నట్టు తలూపాడు ఓబిలేసు. పోతప్ప దగ్గర కొస్తున్నట్టుగానే - "తూ....ఈ నెక్క దొంగ లంజ కొడుకులు. కల్లూ, సారాయీ పోయిచ్చి దొంగోట్లు ఏపిచ్చినారు. అట్ల గెలిసేదేం పెద్ద సుద్ది..... ఆడిది గెలుత్తుంది. ఇట్లా నా కొడుకులుంటే దొంగోట్లెన్నన్నా పడ్తాయి" అన్నాడు ఓబిలేసు.

పోతప్పకి ఛర్రున మండింది. ముందుకెళ్ళినవాడు వెనక్కి తిరిగొచ్చి "నీకి యేగితుంటే యాల గెలిపించలే మీ యయ్యని" అన్నాడు. కోపంతో ఊగిపోతూ-ఈ అదను కోసమే నక్కలా పొంచున్న తిప్పారెడ్డి పోతప్ప మెడ కరుసుకొని కింద పడేశాడు. ఎడాపెడా కాల్తో తన్నాడు. తప్పు చేసినవాడిలా చూస్తున్నాడు కొంచెం దూరంలో నిలబడ్డ ఓబిలేసు - "ఊరికే అంటినే" అన్న పశ్చాత్తాపం అతని మొహంలో కనబడుతోంది. ఆపాలని వారించబోయాడు. తిప్పారెడ్డి ఓ తోపు తోసి, నడుంలో ఉన్న కత్తితో పొడిచాడు పోతప్ప కడుపులోకి. చావుకేక పెట్టాడు పోతప్ప. ఆ కేకలకి దూరంగా గడ్డివాముల్లో, దొడ్డెండ్లలో వున్న మనుషులొచ్చారు. అప్పటికి కొన ఊపిరితో ఉన్నాడు పోతప్ప. తిప్పారెడ్డి అప్పటికే పరారయాడు. ఆ పోగయినవారు పోతప్పని కేశవరెడ్డి ఇల్లు చేర్చారు.... చంపినవాడి పేరు చెప్పి ప్రాణాలొదిలాడు పోతప్ప.

పోతప్ప కూనీ చెయ్యబడ్డం కేశవరెడ్డి అహం మీద దెబ్బకొట్టినట్టయింది. పోలీసుల్ని పిలిపించి కేసు బనాయించాడు. తిప్పారెడ్డికి ఉరిశిక్ష పడుతుందనే నమ్మకంతోటే జీవిస్తున్నాడు కొల్లప్ప. "తిప్పారెడ్డిగాన్ని ఉరికంబ మెక్కిచ్చేదంకా నేన్నిద్దర పోను" అని కేశవరెడ్డి హామీ యిచ్చాడు కూడా.

కాని.....యిప్పుడు మల్లేసు మాటల్ని బట్టి చూస్తే....అంతా తారుమారయినట్టుంది. అందుకే ఆ బాధ! ఆవేదన!!

"మల్లేసూ....ఏకమెట్లయినార్రా? ఇద్దరి మద్దెనా పచ్చగడ్డేస్తే బగ్గుమని కాలిపోయ్యేది గదా!"

"నీకేం తెల్దు మామా.....మద్దెంతరెన్నికలనీ యిప్పుడొచ్చినాయి."

"ఎట్లెట్లా?" అంతకుముందు కాల్చి ఆర్పేసిన బీడీని వెలిగించాడు.

"పట్నంలో యమ్మెల్లె సుబ్బరాయుడు గుండెబట్టుకొని సచ్చిపోలేదా మూన్నెల్ల కిందట? ఆయప్ప సచ్చిపోయిందానికి, ఆ తానంలో మల్లా ఎలచ్చన్లు జరిపిత్తన్నారు. రంగారెడ్డి యిప్పుడు పోటీజేత్తన్నాడు. నిన్ననే మనూరికి ఆయప్పొచ్చినాడు. లోపల్లోపల ఏమేమ్మాట్లాడుకుండారో యేమో.....రెడ్లంతా ఒగటయినారు."

"అదెట్లా? నా కరతంగాలే."

"రంగారెడ్డికి పోటీగా నిలబడినాయప్ప కమ్మాయప్ప. కమ్మోల్లు కమ్మోల్లు అంతా ఒకటయినారు. దాన్నించి రెడ్లుగూడా అంతా ఒకటయినారు."

"ఒగటి కాకుంటే పన్నెండు గాన్లే....మన పోతిగాని కూనీ కేసేంజేస్తార్రా?" మల్లేసుకే ఆ జవాబు కూడా తెలిసుంటుందన్నట్టు అడిగాడు.

"ఏమో మామా! రెండెద్దులూ జోడాయె, సేను బీడాయె అని వాళ్ళు వాళ్ళు ఒగటయితే ఇంగెక్కడి కేసు మామా.....నేను బొయ్యొస్తా, మాయమ్మ బిరీన్రమ్మన్నేది" అని చెప్పేసి వెళ్ళిపోయాడు మల్లేసు.

కొల్లప్ప ఆలోచనలు ఒట్లో పోతున్నాయి....కేశవరెడ్డి ఆ పొద్దు యిచ్చిన మాట తప్పతాడా? ఆయప్పమాట తప్పినా కోర్టులోనన్నా నాయం జరగదా? తన కొడుకు ఎవురి పరంగా ఉండి సచ్చింది కేశవరెడ్డికి గ్యాపకం లేదా!....పంచాయితెన్నికల్లో శత్రువులయినోల్లు, మద్దెంతర ఎన్నికల్లో ఎట్లొగటయితారు? అంతకుముందుండే పాత కచ్చలు అప్పుడే మర్చిపొయ్యినారా! కులం ఒగటయితే, ఏం జేసినా అన్నేయమనిపించదా!

వెంటనే కేశవరెడ్డి ఇంటివద్దకుపోయి అతన్ని లేపి అడగాలని ఉంది. తనికి అన్నేయం సెయ్యొద్దని కాళ్ళు బట్టుకొని బతిమాలుకోవాలని ఉంది. అసలుకి-తను పోయి లేపితే ఈవేళకాడ లేస్తాడా ప్రెశిడెంటు కేశవరెడ్డి- "పద్దనికి రాపోరా....యాాలా పాలా లేదా?" అని కసురుతాడో!.....

కేశవరెడ్డి కేసు రద్దు చేయిస్తానంటే తనుండి ఏం ప్రయోజనం? తన బతుక్కి ఫలితమేముంది? బోరున యాడవాలన్నా గొంతులో ఏదో పడ్డట్టు పూడుకుపోయి ఉంది. "పద్దన్నే పోయి ఆడగల్ల" అనుకుని కంబళిని తలవరకూ కప్పుకొని గొంతు కూచున్నాడు.... ఏవేవో ఆలోచనలు తన చుట్టూ మెదలుతూనే ఉన్నాయి.... అందుకే కొల్లప్పకి నిద్దర రాలేదు రాత్రంతా......

అప్పుడే తెల్లారింది....గుక్క తిప్పుకోకుండా దగ్గు వస్తున్నా ఈ ఆలోచనల ముందు అదేమంత లెక్కలోకి రాకుండాపోయింది.

☆ ☆ ☆

కొరకొర పొద్దు పొడిచింది.

కేశవరెడ్డి ఇంటి వద్దకు బయల్దేరాడు కొల్లప్ప. గుడిసె వాకిట్లోనించి కోడలు దీనంగా చూస్తోంది. 'ఏ మౌతుందో ఏమో' అన్నట్టుంది ఆమె మొహం.... కొల్లప్పని చూస్తుంటే.

దారిలో వెంకన్న ఎదురయి- "యాడికిరా పోతా వుండావు" అని పలకరించాడు కొల్లప్పని. వెంకన్న కొల్లప్పకంటే వయసులో చాలా పెద్దవాడు. కొల్లప్ప యే విషయం అయినా సరే వెంకన్నతో చెబితేనే మనసు కుదుటబడేది. తను పోతున్న విషయం తెలియ పరిచాడు.

"ఎంత పనయిందిరా! మూాడు దినాల కిందట తిప్పారెడ్డిని పురికంబమెక్కిచ్చేదంకా నిద్దరపోనని కేశవరెడ్డి చెప్పినాడంటివి..... అపుడే మారిపోయుంటాడా?.... అదే ముండదులే అడిగి సూడి.... ఈల్లని నమ్మేకి లేదురా దొంగ నా కొడుకులు. ఎప్పుడేకమయితారో, ఎప్పుడు పగదార్లయితారో సెప్పేకొచ్చెల్లేదు..... కేసు రద్దు సేపిత్తానంటే ఆనెంక ఆలోసిద్దాం గాని, నువ్వు ముందు పొయిరా; నేను ఎగవ సేన్లో ఉంటా - అన్నిసయాలు సెప్పు" అని చెప్పి వెళ్ళిపోయాడు వెంకన్న.

కొల్లప్ప వెళ్ళేటప్పటికి కేశవరెడ్డి, అల్లుడు క్రిష్టారెడ్డి ఇద్దరూ ఎదురూ బదురుగా ఎత్తులో ఉన్న అరుగు మీద కుర్చీలో కూచుని ఉన్నారు. దేన్ని గురించో చాలా సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు.

కొల్లప్ప పోయి, వాళ్ళుకూచున్న అరుగుకి నాలుగు గజాల దూరంలో నిలబడ్డాడు. పిలవలేదు – పిలిస్తే యామనుకుంటారోనని.

కేశవరెడ్డి, క్రిష్టారెడ్డి శరీరాల లావులో ఏమాత్రం ఒకరికొకరు తీసిపోరు. నలభై ఏళ్ళకు తగిన హుందా, గంభీర్యం ఉన్నాయి కేశవరెడ్డికి. ముప్పయి ఏళ్ళ వాడయినా మీసాలు పైకెగదువ్వి తన అహోన్నంతా మీసాల్లోనే కనబరుస్తాడు క్రిష్టారెడ్డి.... వీరి ఆకారాలకి పూర్తిగా భిన్నం కొల్లప్ప ఆకారం. జుట్టులాగే ఎడ్డి మడ్డిగా పెరిగిన గడ్డం. లోకంలోని దైన్యమంతా ఒక్కచోటే కాపురం చేస్తోన్న కళ్ళూ, ముడతలు పడి మరీ నల్లగా కనిపించే శరీరాన్ని చూస్తే కొల్లప్ప వయసుని టక్కున చూడగానే ఎవరూ అంచనా వేయలేరు. ఒకవేళ అంచనా వేసినా తప్పకుండా తప్పే అవుతుంది. ముఖ్యంగా ఆర్నెల్లకిందట కొడుకు కూనీ చేయబడ్డపట్నించి పదేళ్ళు ఎక్కువగా ముసురుకున్నాయి. పారపాట్న పని చేసుకుంటూ పొలంలో చనిపోతే కాకి పీకేందుకు కండయినా ఉండదేమో అనిపిస్తుంది.......

"ఏమో, కొల్లిగాడొచ్చినాడు మామా!" అంటూ కళ్ళెగరేసి చెప్పాడు క్రిష్టారెడ్డి వెనక్కి తిరిగిచూసి.

"ఏరా కొల్లిగా, యింత పద్దన్నే వస్తివి?" అన్నాడు కేశవరెడ్డి.

"నువ్వూ, మల్లారెడ్డి యాకమైనారంట గద సామీ!"

"అవును, నీకింగా తెల్దా?"

"మరి, మా పోతిగాని కూనీ కేసూ....." అంటూ నీళ్ళు నమిలాడు కొల్లప్ప.

"ఓ ...అదా...అందుకేనా? నువ్వొచ్చింది. ఇపుడర్థమాయె– ఇపుడర్థమాయె...." అంటూ అల్లుడి వేపొకసారి చూశాడు కేశవరెడ్డి. తను 'అప్పుడే ఇదంతా పసిగట్టాను' అన్నట్టు తలూపాడు క్రిష్టారెడ్డి.

కొల్లప్పకు ఎదురుగా ఉండేలా కుర్చీని తిప్పుకుని కూచుంటూ అన్నాడు కేశవరెడ్డి – "బలే మనుస్రులా....నేనూ, మల్లారెడ్డి యాకమైనామంటానే పోతిగాని కూనీ కేసే రద్దు చేస్తామని అనుకుండావ్.... మేమిద్దరూ యాకమయితే కచ్చలుండవు కదా! కూనీ కేసు రద్దయితే మాత్రమేమి?"

"ఊర్లో ఎకస్పార్టీల్లేకుంటే కొట్లాట్లు ఉండవుగదా!" మామగారి మాటలకి చిలక పలుకులతో తాళం వేశాడు అల్లుడు.

"మీకు పున్నెముంటాది సామీ! అట్లసేయద్దండ్రి....మీ కాళ్లు బట్టుగుంటా."

"నీ మాటే నువ్వు మాట్లాడ్తావుగాని, మా మాట గూడా కొంచెమినరా.... ఊరు సల్లగుండల్లంటే మేమిద్దరం యాకమయితేనే గదరా! ఉత్తరమూ, దక్షిణమూ యాకమయిందానికి సంతోషించల్లగాని; పోతిగాని కూనీ కేసు కొట్టేస్తారు మొర్రో అని ఏడుస్తావేరా ఎర్రి లంజకొడుకా!"

"మీరు రాజీ అయ్యి యాకమయితే సంతోషమే సామీ! గానీ, పోతిగాని కూనీ కేసు కొట్టిపిత్తే మాత్తరం అన్నెయం సామీ!... ఆ పొద్దు 'నీ కొడుకుని సంపినోన్ని ఉరికంబమెక్కిత్తా కొల్లప్పా' అంటివి. ఈ పొద్దు జూత్తే యిట్ల మాట్లాడుతుండావ్!"

"అవున్రా....ఆ పొద్దంటే. ఆ పొద్దు నేనూ, మల్లారెడ్డీ యిరోదులం, అందుకే అట్లంటే. ఈ పొద్దు మా మద్దెన ఆ యిరోదం లేదు. ఇంగొగ యిసయం నీకే తెల్దనుకుంటా....నేనూ మల్లారెడ్డి యియ్యమొల్లం కాబోతుండాం....అరతం గాలే?....తిప్పారెడ్డికి నా బిడ్డనిచ్చి పెండ్లి సేస్తుండా. కష్టాల్లో ఆదుకొనేది నా కులమొల్లేరా, మీరుగాదు." ఈ మాటలు ఎంతో వ్యంగ్యధోరణిలో వచ్చాయి కేశవరెడ్డి నోటివెంట. కొల్లప్ప మనసు చివుక్కుమంది.

"ఎలచ్చన్లో మల్లారెడ్డి పారిటీ వోల్లు నీమింద సెయ్యి జేసుకుంటారని కంటికి రెప్పాకట్ల కాపల గాసిన మేమెట్ల కట్టాల్లో ఆదుకుంటాం సామీ? నీ గురించే గదా ఆ తిప్పారెడ్డి నా కొడుకుని సంపింది?"

"దుడ్లు పారేస్తే వచ్చే మాదిగ నాయాండ్లు....మీరు గూడా నన్నాదుకుంటా రేంరా–కష్టాల్లో? ఆ పొద్దు నీ కొడుకు నా గురించా సచ్చిపోయింది–నోర్ముయ్, తప్పున్నాకొడకా! నీ కొడుకు బాగా తాగొచ్చి ఆ తిప్పారెడ్డిని యిష్టమొచ్చినట్లు తిడ్తే ఊరికే యిడుస్తాడా సంపకుండా?"

"మీరు గొప్పోల్లు సామీ....ఎట్లన్న మాట మారుత్తారు. అల్లతో రాజీ అయినంక అల్లు సేసినవన్నీ నీకి తప్పుగా కనబడవు. మీరు మీరు ఒగటయినారు."

"ఒరేయ్! ఎక్కువ మాట్లతో పన్లే... రెండెకరాల బంజరిపిస్తా కర్మమయ్యతో జెప్పి... నోర్ముసుకొని పో! వద్దన్నే ఏంటికి నాయింటె కాడగోడోమంటావు."

కొల్లప్ప గుండె పిసికినట్లనిపించింది. తనపట్ల అంత అధ్వాన్నంగా ప్రవర్తిస్తున్నాడా కేశవరెడ్డి! తను ఎన్నాళ్ళనించో "దేవునట్లావోడు" అనుకుంటున్న కేశవరెడ్డి తనకింత అన్యాయం తలపెడుతున్నాడా? తన కొడుకు కేసు ఎంత తేలిగ్గా తీసుకుంటున్నాడు!! చివరికి – రెండెకరాల బంజరిప్పించి తన నోరు శాశ్వతంగా మూయించాలనుకుంటున్నాడే!!!

"పప్పులు పెట్టి పోరు మాన్పేకి నేనేం పిల్లోన్నిగాదు సామీ! సెట్టంత కొడుకు నాకు దక్కకుండా బోయినాడు. నువ్విప్పించే రెండెకరాలు నాకు వొల్ల! నా కొడుకుని సంపినోనికి సిచ్చపడల్ల!! ఆడు ఉరికంబ మెక్కల్ల!!!" అంటూ తీవ్రంగా అన్నాడు కొల్లప్ప. అతని మొత్తం జీవితంలో అలా తీవ్రంగా ఆవేశంతో ఎవ్వరితోనూ మాట్లాడి ఉండడు. కొల్లప్ప అలా మాట్లాట్టం చాలా ఆశ్చర్యంగా ఉంది కేశవరెడ్డికి....క్రిష్ణారెడ్డి కూడా విస్మయంతో చూస్తున్నాడు.

"సిచ్చపడదు.....పడనీను. కేసు రద్దయిపోతాది, యింకా ఎక్కువ మాట్లన్నావంటే కేళ్ళిరుస్తా నా కొడకా!" కళ్ళెర్రజేస్తు గుడ్లురిమి అరిచాడు కేశవరెడ్డి.

కేశవరెడ్డి గొంతు గట్టిగా వినబడ్డంతో పొలం పనులకు పోతున్నవాళ్ళూ, చుట్టు పక్కల వున్నవాళ్ళూ అంతా గుమికూడారు.

"పెద్దోల్లు సామీ! యామన్నా జేస్తరు. యాపక్కకన్నా తిరుగుతారు సామీ!...మీరెట్ల తిరిగినా దొడ్డ గునమంటారు... అదే మమ్మన్నయితే తప్పున్నా కొడుకులంటారు!..." అని కొల్లప్ప మాటల్ని సూటిగా వదలడంతో అగ్నిమీద ఆజ్యం పోసినట్టయింది.

"రేయ్ ముసిలోడా! తల తిరుగుతాందా? తక్కువ కులానికి ఎక్కువ కూడు పెడితే తల తిక్కట. మీ మాదిగ నాయళ్ళకాడ గవురవంగా మాట్లాడగూడదురా.

ఇక్లే మాట్లాన్నేవంటే నీ రగతం కండ్ల సూస్తా, ఈట్నించి ఎల్లిపో!!" అంటూ గాండ్రించాడు కేశవరెడ్డి.

"నాయం జరుపే పెద్దోల్లే అన్నేయానికి దిగుతాంటే ఎట్లపోతాను? పోను.....! పొయ్యేల్లేదు!! యేంజేసిన సరే!

"యేరా, సెప్తా వుండేది నీక్కాదా!" ఉరిమాడు క్రిష్టారెడ్డి.

"నాయం జరపండ్రి మడిపోతాను! మొండి కేస్తున్నట్టు మాట్లాడాడు కొల్లప్ప.

దాంతో రెచ్చిపోయాడు కేశవరెడ్డి. కుర్చీలోంచి లేచి వచ్చి "నీకి నాయం కావల్లా లంజకొడకా!" అంటూ ఎదపైన చెయ్యేసి వెనక్కి తోసాడు. దబ్బున వెల్లకిలా పడ్డాడు కొల్లప్ప....లేచి కూర్చుని వెర్రిగా చూస్తూ అన్నాడు:

"నీ కొడుకునీ కూనీ సేసుంటే నీకీ నా బాదేందో తెల్సేది. దేవుడు గుడ్డోడు గాదు.....నా ఉసురు తగుల్తాది....." అంటూండగానే-

"నీ యమ్మ, ముసిల్లంజ కొడకా!" అనరుస్తూ కొల్లప్ప కడుపు మీద సత్తువ కొద్దీ తన్నాడు. ఆ దెబ్బకు కొల్లప్ప అడ్డంబడి కడుపు పట్టుకొని చుట్టుకుపోయాడు.

చుట్టూ పోగయిన జనంలో కొద్దిగా కదిలిక వచ్చింది. అంతవరకూ మామూలు కొట్లాటగా చూస్తున్న జనం యింతదాకా జరగడంతో "ఇడిసి పెట్టప్పా! ఆ ముసిలోనితో ఏంది?" అని కొందరు, "పాపం! కొడుకు పోయినప్పంన్నించి పిచ్చి పట్టినట్లుంది......అట్ల వాన్నెందుకు దంతావు!" అని కొందరు అన్నారు.

"నీకి తెల్దారుకోరా.....ఈ ముసిలోనికి కండ్లు నెత్తి కెక్కినాయి. లమిడి కొడకు నా యింటికాటి కొచ్చి యిష్టమొచ్చినట్ల మాట్లాడ్తాడా!" వాగరుస్తూ ఒక యువకుడికి చెప్పాడు కేశవరెడ్డి.

అంతవరకూ కన్నులపండగ్గా చూస్తోన్నా క్రిష్టారెడ్డికి వ్యవహారమంతా చప్పబడి పోయినట్టనిపించి జోక్యం కలగ జేసుకున్నాడు.

"యిడుసు మామా! ఇంగా రెండు...ఇట్లా నా కొడుకుల్ని మూలాజా పెట్టగూడదు!! అంచేపట్నించి సూస్తండా యీని తల తిరుగుడు మాటలు....యెయ్యి!!!"

కేశవరెడ్డి రెచ్చి పోయాడు అల్లుడి మాటలకి. అతని ఉద్రేకానికి ఊపిచ్చినట్టయింది. తన చేతికర్ర తీసుకొని దెబ్బమీద దెబ్బ, దెబ్బమీద దెబ్బ పదే పదే కొట్టాడు. "అమ్మా!...అబ్బా!!" అంటూ పెడబొబ్బలు పెట్టాడు కొల్లప్ప.

"యాడుంచే నాకొడుకుల్ని ఆడుంచల్ల!" అంటూ కొల్లప్ప మూతిమీద తన్నాడు.

చితికిన శరీరంలో ఉండటం ఇష్టం లేక రక్తం బయటకువచ్చింది. కళ్ళు తేలవేసి అస్పష్టంగా ఏదో గొణగుతున్నట్టు పెదవుల్ని వణుకుతూ కదిలిస్తున్నాడు కొల్లప్ప, అరిచే శక్తిలేక.

జనం మొహాలు జేవురించాయి....తమ కళ్ళ ఎదుటే దారుణం!.....న్యాయాన్ని కాలరాస్తున్న అన్యాయం!! మంచిని మసిచేస్తున్న దగా......!!!

ఈ ఘోరాన్ని చూసి తీవ్రంగా ప్రతిఘటించాలని ఉంది. కాని.....ప్రతిఘటించి బతగ్గలమా? అనే భావన వాళ్ళని అచేతనంగా ఉంచింది.

☆ ☆ ☆

దీపాలు పెట్టే వేళయింది....చీకటి దట్టంగా ముసురుకుంది.....

చెరువు నీళ్ళు వరి మడికి పారిస్తూ వున్నాడు వెంకన్న. పిల్లకాలువలోని నీరు సన్నగా గల గలమని శబ్దం చేస్తోంది.

"పెద్దయ్యా! పెద్దయ్యా!!" అని చిన్న పిలుపు వినబడితే తిరిగి చూశాడు.

"ఎవరూ?" అన్నాడు.

"నేను మల్లేసుని" అంటూ వచ్చి చెంతగా వెంకన్న పక్కనే కాలువ గట్టుమీద కూచున్నాడు మల్లేసు.

"ఈ కయ్యొకటీ పారించి వస్తుంటిగదా నువ్వేలొస్తివి?"

మల్లేసు తనెందుకొచ్చిందీ చెప్పాడు. ఆశ్చర్యంగా చీకట్లోనే మల్లేసు మొహంలోకి చూశాడు వెంకన్న.

"ఉష్! మెల్లగా జెప్పరా....గోల్లకి సెవులుంటాయి.....ఏందేంది పోలీసోల్లొచ్చింగ్రా?" అన్నాడు వెంకన్న.

"వచ్చింగ్రా కాదు పెద్దయ్యా! కేశవరెడ్డి పోలీసోల్లని పిలిపిచ్చినాడు."

"ఎంతన్నేయం! ఎంతన్నేయం!! కొల్లప్పని సంపింది గాక!!!"

"ఇంకా అసలిసయం యినూమల్ల."

"ఊఁ ఊఁ..... సెప్పు."

"పోలీసోల్లని పిలిపిచ్చి....కొల్లప్పకి అర్నెల్ల కింద ఎర్రికుక్క కరిసిందనీ, దాన్నించి ఈ పొద్దు పద్దన కొల్లప్ప కెర్రిబట్టి కేశవరెడ్డిని కరిసేకి బొయినాడనీ. ఆయప్ప తన్ని రచ్చించు గొనేకి కొట్టినాడనీ, ఆ దెబ్బలకి కొల్లప్ప చచ్చిపోయినాడని సేటిమెంటిచ్చినాడు... పెద్దయ్యా! శానా మంది సాచ్చికాలు గూడా సెప్పినారు. ఆ సాచ్చికం జెప్పినోళ్ళలో నేనొగన్ని పెద్దయ్యా!!... దొంగసాచ్చిం సెప్పినప్పన్నించి ఏందో తప్పు జేసినట్ల పానం పీకుతాంది పెద్దయ్యా!!!" ఆ మాటల్లో కొంచెం వణుకు వచ్చింది- మల్లేసు గొంతునించి.

"నువుగానేంజేస్తావురా!....అళ్ళకి ఎదురుజెప్పి బతికే వోడెవడు? కొల్లప్పకి జరిగిన అన్నేయాన్ని చూసయినా మనం బుద్ది దెచ్చుకోవల్లరా..... సమయమొస్తే ఈ గొప్పోల్లంతా ఒగటయి పోతుండారు. మనమూ? ఒగరి కొగరూ పట్టించుకోం.... కొల్లప్పకి నాయం జరిపించమని మన పేదోల్లంతా కల్సి అడిగింటే ఈ పొద్దు నాయమే జరిగేది.....కాని, అట్లలేం కాబట్టే కొల్లప్ప కేశవరెడ్డి పొగరుకి బలయిపోయినాడు. ఈ పొద్దు కొల్లప్పకి జరిగిన అన్నేయం రేపు మీ నాయనకే జరుగుతాది.... ఆయప్పనీ ఏ ఎర్రికుక్కో కర్సినట్ల నేనే సాచ్చిగం జెప్పాలిసొస్తుంది......అంతే, తప్పదురా.....మన పేదోల్లంతా ఒగటైనానంత కాలం.... అంతే! అంతే!!" ఆవేశంగా చెబుతున్నాడు వెంకన్న.

వరిమడి కయ్యి నీరునిండి పొర్లుతోంది.

● *1979 ఆగస్టు, ప్రజాసాహితి* ●

★ ★ ★

జుగాష్ విలి

# 44 ఎవరు వాళ్లు? ఎవరి వాళ్లు?

"దయచేసి వినండి."

దయచేసి విందామని నిక్కబొడుచుకొన్నాయ్ చెవులు.

ఒకటి కాదు

రెండు కాదు

వందలు. వందల చెవులు.

"మద్రాసు నుండి హైద్రాబాద్ వెళ్ళు ఎక్స్‌ప్రెస్ సుమారు తొంభై నిముషములు ఆలశ్యముగా నడుచుచున్నది" – ఆడా, మగా కాని గొంతుతో రైల్వే అనౌన్స్‌మెంట్.

నిక్కబొడుచుకొన్న చెవులు క్రమంగా వాలిపోయాయి.

వెయింటింగ్ రూం గోడమీద దక్షిణ మధ్య రైల్వేవారి ప్రకటన "ప్రజల సేవలో భారత రైల్వేలు."

అవును!

ప్రజల సేవలో భారత రైల్వేలు 90 నిముషాలు లేటు.

కాదు కాదు. మన రైళ్ళు నడుస్తాయి కనుక ప్రజల సేవలో భారత రైల్వేలు 90 యుగాల లేటు.

ప్లాట్‌ఫాంమీద జనం

గుంపులు గుంపులుగా జనం

పట్టు చీరెలు, సిల్కు చీరెలు, షిఫాన్, నైలెక్స్‌లు, సీతాకోక చిలుకల కోకలు, బెల్ బాటమ్స్, లంగాలు, లుంగీలు–

పరుగెడుతున్నాయ్

జిగ్ జాగ్ బల్బుల్లా.

ప్లాట్‌ఫాంమీద జనం

గుంపులు గుంపులుగా జనం

ఎగుమతి కావడానికి

ఎగుమతి చెయ్యడానికి

దిగుమతి చేసుకోవడానికి

జనం జనం

గుంపులు గుంపులుగా జనం
నేను ఎగుమతి కావడానికి కాదు
దిగుమతి చేసుకోవడానికీ కాదు
ఎగుమతి చెయ్యడానికి
అనంతను పురిటికి పుట్టింటికి పంపడానికి.
వెయిట్, వెయిట్, వెయిట్!
ఇంకా రెండు గంటలు.

"కూర్చుందాం పదండి."

"పద."

ప్లాట్‌ఫాం చివర సిమెంటు బెంచి.

ఆ సిమెంటు బెంచి మా జ్ఞాపకాల కేంద్రం. అనుభూతుల నిలయం.

దూరంగా రైల్వే క్వార్టర్స్ మీదుగా, కొబ్బరి ఈనెల మధ్యగా చందమామ. ఆకాశం తెల్లగా వెన్నెల సున్నం వేసినట్లు.

ఎండలో ముత్యాలారబోసినట్లు వెన్నెల్లో ఆకాశం నిండా నక్షత్రాలు.

గగనం యవ్వనం బుగ్గమీద దంతక్షతాల్లా నక్షత్రాలు. కనుచూపు మేరా రైలుపట్టాలు సమాంతర రజత ప్రవాహాలు.

అనంతా నేను పెళ్ళి చేసుకోకముందు యిక్కడే కూర్చొని కబుర్లు చెప్పుకొనేవాళ్ళం. పరస్పరం కళ్ళలోకి చూసుకొంటో; భవిష్యత్తు కలలు కంటో;

మొదటిసారి అనంత చేతిని నా చేతిలోకి తీసుకొన్నదీ; ఆమె వ్రేళ్ళు నా జుట్టుతో ఆడుకొన్నదీ–ఇదిగో– ఈ చోటే. అందుకే ఇది మా జ్ఞాపకాల కేంద్రం. అనుభూతుల నిలయం.

అనంత పరిచయం కాకముందూ ఆ తర్వాతా రమణా నేను అనేక సాయంకాలాలు యిక్కడే కూర్చునేవాళ్ళం. నేటి సాహిత్య ధోరణులు, ప్రపంచ రాజకీయాలు మొదలుకొని రాంబాబు కవిత్వం వరకు మా కబుర్లలో దొర్లిపోయేవి.

"యిదీ మన చోటు. యిక్కడ కూర్చుందాం."

అనంతా నేనూ ఆ చివరి బెంచిమీద కూర్చున్నాం.

"ఏం మనిషివో బాబు! ఇంత సెంటిమెంటు వుండకూడదు."

"యేంటీ సెంటిమెంట్ కూడా ఒక సెంటిమెంటే. బ్లయిండ్ సెంటిమెంట్స్ పనికిరావని, మనిషికి ఆనందాన్నిచ్చేవి, ఆ ఆనందాన్ని అభివృద్ధిపరిచేవి అయిన సెంటిమెంట్స్ వుండి తీరాలన్నాడు రస్సెల్ తెలుసా?"

"నీతోనా? ఎప్పుడు?"

"ఆయనవెవరితోనో చెప్పాడు. వాళ్ళు మనతో అన్నారు సరేనా?"

అనంత చిన్నగా నవ్వింది. ఆమె నవ్వితే వెన్నెల నవ్వినట్లుంటుంది.

తెల్లని శరీరానికి ఎర్రని చీరె, జాకెట్టు చాల అందంగా వున్నాయి. తెల్లని నుదుటిమీద ఎర్రని బొట్టు వుదయిస్తున్న సూర్యుడిలా వుంది.

ఈ రాత్రి గగనంమీద, అనంత అధరం మీద మెరుస్తూ ద్విపాత్రాభినయం చేస్తున్నాయి నక్షత్రాలు.

అనంత చేతిని తీసుకొని గాజులు లెక్కబెడుతున్నాను. ప్రతి మూడు ఎర్రగాజుల నడుమ రెండు తెల్లగాజులు. మొత్తం పదమూడు గాజులు.

"మీరూ వస్తే బావుండేది" అనంత కళ్ళనిండా దిగులు.

"వస్తాను నిన్ను తీసుకురావడానికి."

"ఎప్పుడు? మూడు మాసాల తర్వాతా?"

"అలాంటి ఆశలేం పెట్టుకోకు. డెలివరీ కాగానే తీసుకొస్తాను."

"ఇందులో ఆశేముంది? మా అమ్మావాళ్ళు పంపాలి గదా?"

తన ఎడమ చేతిలోకి నా కుడిచేతిని తీసుకొని కుడిచేత్తో నిమురుతోంది. తీయటి స్పర్శ.

స్పర్శ యెన్ని రకాలు!

ప్రేమ, వాంఛ, కోపం–విభిన్న మనఃప్రవత్తుల సంకేతం స్పర్శ.

కొంచెం ఎత్తయిన పొట్టతో కొత్త కాంతుల్ని తెచ్చుకొని అనంత అందంగా వుంది.

మాతృత్వం యిద్దరు స్త్రీ పురుష ప్రకృతి సహజమైన సంగమ ఫలితమే కావచ్చు. కాని కేవలం ఒక భౌతిక విషయంగా మాత్రమే తీసుకోలేము. అది ఒక అవ్యక్తానుభూతి.

అనంతదగ్గర నుండి 'పాండ్స్' పరిమళాలు ఆగి ఆగి వస్తున్నాయి.

"పాపకేం పేరు పెడదామంటారు?"

"నీ కిష్టమైన పేరు."

"పాప పేరు చాల అందంగా వుండాలి. లావణ్య బాగుంది కదూ!"

"చాల పాత పేరు. అయినా పేరులో ఏముంది? ఇవాళ నువ్వు కనవలసింది సుబ్బమ్మలనూ, లావణ్యలను కాదు అనంతా! ఒక పాణిగ్రాహిని. ఒక నిర్మలను కనాలి. ఒక కవి యేమన్నాడో తెలుసా? "ప్రతి తల్లీ ఒక సూర్యుని ప్రసవిస్తే చాలూ" అని."

"మన పాపో, బాబో పెరిగి పెద్దవాళ్ళయ్యేంతవరకు మీరు కావాలనుకొనే వర్గాలులేని సమాజం రాదంటారా?"

"రావాలనే మనం కోరుకుంటాం! వస్తుంది కూడ. మారిన ఆ నూతన సమాజాన్ని కంటికి రెప్పలా కాపాడుకోవాల్సిన అవసరం ఎప్పుడూ వుంటుంది. ఆ బాధ్యత వాళ్ళదే గదూ?"

అనంత సుదీర్ఘమైన చర్చల్లోకి ఎప్పుడూ వెళ్ళదు, విషయాల్ని కదిపి వూరుకోవడం తప్ప.

"పుస్తకాలేమైనా తీసుకెడుతున్నావా?"

"చలం ప్రేమ లేఖలు, బిడ్డల శిక్షణ."

"బిడ్డల శిక్షణ సరైన వేళలో సరైన పుస్తకం. ప్రేమలేఖలు ఇప్పుడెందుకు? ఇంకెన్ని సార్లు చదువుతావ్?"

"ప్రేమ లేఖలే కాదు, చలం ప్రతి రచనా నిత్యనూతనమే. ఎన్నిసార్లు చదివినా మొదటిసారి చదివినట్లే వుంటుంది."

ఇక్కడి మౌనం నా వంతు. చలాన్ని అర్థం చేసుకోవడంలో నాకూ అనంతకూ కొన్ని తేడాలున్నాయి. అయినప్పటికీ చలం మా యిద్దరికీ అభిమాన రచయితే.

లూప్ లైన్లో వున్న కంపార్ట్‌మెంట్‌లో నుంచి నలిగిపోయిన పూలవాసనా, చౌక రకం పౌడర్ వాసనా వుండి వుండి గుప్పుమని మా మీదుగా వెళ్తున్నాయి. ఆ వాసనలు మన ప్రజాస్వామ్యంలా ఎబ్బెట్టుగాను, జుగుప్సాకరంగాను వుండి గబ్బుకొడుతున్నాయి.

మేము కూర్చున్న బెంచీకి కొంచెం దూరంలో చింకి గుడ్డల మధ్య ముసలి బిచ్చగత్తె స్వాతంత్ర్యం ప్రకటించుకున్న తర్వాత భారత దేశంలా మూలుగుతూ ముడుచుకునుంది.

రెండు గంటల లేటుగా వచ్చిన తిరుమల ఎక్స్‌ప్రెస్ కొంచెంసేపు చేపల మార్కెట్‌లా చేసి ప్లాట్‌ఫాంను వదలి వెళ్ళిపోయింది.

బెల్ కొట్టారు.

"దయచేసి వినండి."

ఈసారి చెవులు నిక్కబొడుచుకోలేదు.

"మద్రాసు నుండి హైదరాబాద్ వెళ్ళు ఫిఫ్టీత్రీ ఎక్స్‌ప్రెస్ మరికొన్ని నిముషములలో నాల్గవ నెంబరు ప్లాట్‌ఫాం పైకి వచ్చుచున్నది–"

అనౌన్సమెంటు పూర్తికాలేదు. ఫిఫ్టీత్రీ ప్లాట్‌ఫాం పైకి దూసుకొచ్చింది.

ఎన్నికలకు ముందు కొద్ది రోజులూ, అయిన తర్వాత వెంటనే కొద్దిరోజులూ ప్రజల చుట్టూ తిరిగి ఆ తర్వాత కనిపించని రాజకీయనాయకుల్లా మన రైళ్ళు రెండు స్టేషన్లమధ్య నెమ్మదిగా నడచి స్టేషన్లో మాత్రం పరుగెత్తుతుంటాయి.

అనంతకు కిటికీ ప్రక్కనే సింగిల్ సీటు దొరికింది. తను తెచ్చుకొన్న ఒక సూట్‌కేసు తన కాళ్ళదగ్గర పెట్టుకుంది.

"శనివారం వస్తారుగా! తప్పక రావాలి. రెండురోజుల కొక లెటరయినా రాయాలి. ఆరోగ్యం జాగ్రత్త. హోటల్ తిండి తినకండి. అత్తయ్యను పిలిపించండి."

"ఇక ఆపు తల్లీ! అన్ని జాగ్రత్తలూ తీసుకుంటాను. నువ్వు జాగ్రత్త. మామయ్య స్టేషన్‌కు వస్తార్లే. లెటర్స్ రాయడం మర్చిపోకేం. ఆరోగ్యం జాగ్రత్త."

"ఇక ఆపు తండ్రీ! అన్ని జాగ్రత్తలూ తీసుకుంటాను."

ఇద్దరం నవ్వుకున్నాం.

గార్డు విజిలేసాడు.

పచ్చలైటు వూగుతోంది.

"జిబ్బూ"– అవ్యక్తానుభూతుల అంచుల చివరికి వెళ్తేనే అనంత అలా 'బుజ్జీ'ని తిరగేసి పిలుస్తుంది.

"ఏమిటోయ్?"

"జిబ్బా! రియల్లీ ఐ లవ్ యూ; ప్లీజ్ రిమెంబర్ మి."

"ఏమిటి? రియల్లీ అని ఇంత తొందరగానా చెప్తున్నావ్."

అనంత గొంతులో దుఃఖం.

అనంత కళ్ళలో దుఃఖం.

"ఏమిటి చిన్నపిల్లలా? ఇప్పుడేమైందని?" అనాలనుకొన్నాను. కాని మాట గొంతుచించుకొని రావడంలేదు.

అనంత నా చేతిని తన పెదాలతో చిన్నగా 'టచ్' చేసి వదిలింది. ట్రైన్ కదిలింది. బయట గాలిలో ఎర్ర గాజులతో అనంత తెల్లని చేయి వూగుతోంది.

నా చూపులే ఆమెకు వీడ్కోలు చెప్పాయి.

☆ ☆ ☆

స్టేషన్ బయటికొచ్చాను. టైం రెండూ ముప్పావు కావొస్తోంది. ఈమధ్య డే అండ్ నైట్ టీ స్టాల్స్ వూళ్ళో బాగా పెరిగాయి. ఒకసారే కాఫీ తాగిపోవచ్చు అనుకొంటూ టీ స్టాల్ లోపలి కెళ్ళాను. టేబుల్ ముందు కూర్చున్నాను. లైట్లు డిమ్‌గా వెలుగుతున్నాయి. టేబుల్‌మీదున్న ఈవెనింగ్ ఎడిషన్ న్యూస్ పేపరు తీసుకొన్నాను.

చీకటిరాజ్యంలో దుర్మార్గపు రాజకీయాలు పేపరు నిండా. అత్యవసర పరిస్థితి పెట్టిన తరువాత పిల్లలు సరిగ్గా టైముకు వస్తున్నారట. సిగ్గులేకపోతే సరి. పిల్లలు సరిగ్గా స్కూలుకు రావడానికి యెమర్జెన్సీ అవసరమైన దేశం మనది.

"అరేయ్ చంద్రా!"

పేపర్లోంచి ముఖం బయటకు తీసాను.

నా ఎదురు కుర్చీల్లో యిద్దరు యువకులు. ఎక్కడో చూసిన గుర్తు. చెవులమీదుగా గడ్డం క్రిందుగా మఫ్లర్ చుట్టుకున్నారు. కొంచెం పెరిగిన గడ్డం, దట్టంగా మీసాలు. మీసాల మధ్య చిరునవ్వు.

అవును! ఆ నవ్వు రామసూరిది. రామసూరి. అవును రామసూరే. మరి–అతను–కొనదేరిన ముక్కు, గంభీరమైన కళ్ళు–ఇంకెవరివి? అంజిరెడ్డివే.

నా ఆనందం అవధులు దాటుతోంది.

వాళ్ళను చూసి దాదాపు తొమ్మిదేళ్ళవుతోంది.

"ఏమిటిరా గుర్తు పట్టలేదా! నేను రామసూరిని. వీడు అంజిరెడ్డి."

"బావున్నార్రా?" అన్నాను.

"ఏం చేస్తున్నార్రా?" అనబోయి మానేసాను.

వాళ్ళేం చేస్తున్నారో నాకు తెలుసు.

అటువంటి వాళ్ళేం చేస్తారో కూడా నాకు తెలుసు.

నా ఆలోచనలకు పదేళ్ళ వయస్సు తగ్గింది.

మా వూరు పల్లెటూరే అయినా ఒక హైస్కూలుంది.

మా స్కూలుకు చుట్టుపక్కల గ్రామాల నుండి కూడా విద్యార్థులు వస్తుండేవాళ్ళు. మొత్తం అరువందలదాకా వుండేవాళ్ళం. మాది కమిటీ స్కూలు. రామసూరి, అంజిరెడ్డి ఎస్సెల్సీ నేను టెన్తూ చదువుతున్నాం. మా వూరిమీదా, స్కూలుమీదా మా గ్రామ భూస్వాములదే పెత్తనం. మా స్కూలు హెడ్‌మాస్టారు, మిగతా టీచర్లందరూ దాదాపు ఆ కుటుంబాలవారే. మా గ్రామ పెత్తందార్లందరూ పాలకవర్గ రాజకీయ పార్టీ అనుచరులే. ఒకే ఒక వ్యక్తి తప్ప. ఆ ఒక్క వ్యక్తి రామసూరి నాన్న. రామసూరి నాన్నను మా వూళ్ళో అంతా "కమ్యూనిస్టు ప్రకాశరావు" అని పిలుస్తారు. ఎన్నికల్లో తప్ప కమ్యూనిస్టు రాజకీయ సంచలనం మా వూళ్ళో దాదాపు కనిపించేది కాదు.

రామసూరి నాన్న రామసూరికోసం మంచి మంచి పుస్తకాలు, సోవియట్ పిల్లల పుస్తకాలూ, నార్ల చిరంజీవి బాలసాహిత్యం తెస్తుండేవాడు. ఎవరింటిలోనూ లేనన్ని పుస్తకాలు వుంటుండేవి వాళ్ళింట్లో. రామసూరి తను చదువుతూ ఇతర్లచేత చదివించాలని ప్రయత్నించేవాడు. "కమ్యూనిస్టు సూరి" "కమ్యూనిస్టు పుస్తకాలు" అంటూ యెవరూ చదివేవారు కాదు.

రామసూరి స్కూల్ డిబేట్సులోనూ, మోడల్ పార్లమెంటులోనూ చురుగ్గా పాల్గొనేవాడు. మా స్కూల్‌లో ప్రతి శుక్రవారం ఈవెనింగ్ లాస్ట్ పిరియడ్ డిబేట్ గాని, పార్లమెంటు గాని వుండేది.

ఒకరోజు "భారతదేశంలో ప్రజాస్వామ్యం" గురించి డిబేటు జరుగుతుంది. ఆ రోజు సూరి ఆ విషయమ్మై మాట్లాడుతూ "ఉత్పత్తి సాధనాలమీద ప్రజలకు అధికారం వుండటమే నిజమైన ప్రజాస్వామ్యమని, వ్యక్తిగత ఆస్తి రద్దు కాకుండా ప్రజలందరూ సమానహక్కులతోనూ, నిజమైన స్వేచ్ఛతోనూ బ్రతకడం సాధ్యంకాదని, మన దేశంలో చలామణి అవుతున్న ప్రజాస్వామ్యం పాక్షికమైనదని' ' చెప్పాడు. ఈ చర్చకు అధ్యక్షత వహించిన మా తెలుగు మాస్టారు సుబ్బారెడ్డిగారు సూరిని ఎగతాళి చేస్తూ మాట్లాడారు. ఆయన తన ఉపన్యాసంలో "సూరి చెప్తున్నది రష్యా కమ్యునిజం గురించి. వాళ్ళు సమానత్వం సమానత్వం అని గొడవ చేస్తారు. సమానత్వం అంటే వాళ్ళ ఉద్దేశంలో ఏమిటి? రష్యాలో యేం జరుగుతుంది. ఇవాళ చైనాలో ఏం జరుగుతుంది, ఉదాహరణకు సూరి పొట్టివాడు. అతని స్నేహితుడు అంజిరెడ్డి పొడవుగా వుంటాడు. రష్యాలోనో, చైనాలోనో అయితే సూరి ఎత్తుతో సమానంగా అంజిరెడ్డి తల నరికేస్తారు. అవును, హెచ్చుతగ్గులు వుండనివ్వరు వాళ్ళు. సొంత ఆస్తి వుండకూడదు. సొంత పెళ్ళాలుండకూడదు. నీ పెళ్ళాం నా పెళ్ళాం అవుతుంది. కనుక అది మన దేశానికి పనికిరాదు. మనకు గాంధీ, నెహ్రూ......" మాస్టారి ఉపన్యాసం పూర్తికాలేదు. రామసూరి స్టేజీమీదికి పరుగెత్తాడు.

"తెలుగుమాస్టారిలాంటి కమ్యూనిస్టు వ్యతిరేకులు కమ్యూనిజానికి ఇలాంటి వక్రభాష్యాలు చెప్పడం కొత్తేమీ కాదు, రాజకీయ అవగాహన స్పష్టంగా లేని, అర్థం చేసుకొనే స్థితిలో లేని విద్యార్థుల్లో యిలా కమ్యూనిస్టు వ్యతిరేకత రెచ్చగొట్టడం దుర్మార్గమైన చర్య" అని, పెద్దగా ఉద్రేకంగా మాట్లాడాడు.

ఆ తరువాత క్లాసులో యేదో నెపం పెట్టి రామసూరిని తెలుగుమాస్టారు పిచ్చి కొట్టుడు కొట్టారు.

రామసూరి భూస్వాముల బిడ్డలతో కాక మిగతావాళ్ళతో స్నేహం చేసేవాడు. వాళ్ళు కూడా అతని రాజకీయాలతో తప్ప అతనితో స్నేహంగా వుండేవారు. వాళ్ళు యెక్కువ భాగం సోషల్ వెల్ ఫేర్ హాస్టల్లో వుంటుంటారు. హాస్టలు తిండి, అక్కడి అధ్వాన్న పరిస్థితులను పరిశీలించి ఆ విద్యార్థులతో చర్చించేవాడు. ఇతని అభిప్రాయాలతో ఏకీభవించినా పరిస్థితుల మార్పుకోసం కృషి చేసేవాళ్ళు కాదు.

రామసూరి, అంజిరెడ్డి మంచి స్నేహితులు. నేను కూడా రామసూరితో కలిసి తిరుగుతూ అతనివద్ద నున్న పుస్తకాలు చదువుతూ దగ్గరవాణ్ణయ్యాను.

మా వూరు పొగాకు పంటకు ప్రసిద్ధి. కొన్ని వందలమంది కూలీలు పొగాకు బ్యారన్లలోనూ, పొగాకు కంపెనీలోను పని చేస్తుంటారు. ముఠా కార్మిక సంఘం పెట్టాలని సూరి ప్రయత్నించాడుగాని అది సాధ్యపడలేదు.

చేనేత కార్మికులు జరిపే భావనారుషి పండుగకు యువకులందరినీ ఒకచోట చేర్చి ప్రతి యేడూ వుండే రికార్డు డ్యాన్సులకు బదులు ఒక సాంఘిక నాటిక ప్రదర్శింప చేయడం కుల పెద్దలకూ, ఊరి పెద్దలకూ గిట్టలేదు.

రామసూరి వాళ్ళ నాన్నవల్ల లేని ప్రమాదాన్ని తీసుకొస్తున్నాడు.

ఇదే సమయంలో ఎస్సెల్సీ పబ్లిక్ పరీక్షలొచ్చాయి.

నైన్త్, టెన్త్, ఎస్సెల్సీ మూడు సంవత్సరాలు చదివిన సైన్సు హిందీ పరీక్షలు ఒకే రోజు జరిగేవి. దీనికి వ్యతిరేకంగా అన్ని స్కూలు విద్యార్థులు సమ్మె చేస్తున్నారు.

రామసూరి మన స్కూల్లో కూడా చేయించాలన్నాడు. విద్యార్థులతో మాట్లాడితే కొందరు అవునని కొందరు కాదనీ అన్నారు. మనం అసంతృప్తిని, మన కోర్కెల్ని ప్రజలకు చెప్పాలి. డిమాండ్స్ గోడలమీద రాద్దాం అన్నాడు.

ఇది మాకు ఒక కొత్త అనుభవం. నేను, సూరి, అంజిరెడ్డి, శివప్పిరెడ్డి గోడలమీద నినాదాలు, డిమాండ్స్ రాయాలని నిర్ణయించుకున్నాం. చిన్న చిన్న డబ్బాల్లో కాకిరాయి రంగు కలుపుకొన్నాం. ఈతపుల్లలు నమిలి బ్రష్‌లు తయారుచేశాం.

రాత్రి పదిన్నరకే మా వూరు నిదురపోయింది.

రామసూరి యింటి దగ్గరనుండి మేము బయలుదేరాం.

డబ్బాల్లో కుంచెలు మునుగుతున్నాయ్.

గోడల మీద అక్షరాల్లా తయారవుతున్నాయ్.

తెల్లని గోడమీద ఎర్రటి అక్షరాలు.

పచ్చని చెట్టుకి ఎర్రని మందారాలు.

"ఎస్. ఎస్. యల్. సి. పబ్లిక్ పరీక్షల్లో రోజుకొక పరీక్ష మాత్రమే పెట్టాలి."

"కొఠారి కమీషన్ సిఫార్సులు అమలు చేయాలి."

"లేబొరేటరీ వసతులు కల్పించాలి."

"హాస్టలు గ్రాంటు పెంచాలి."

"హాస్టల్లో అధ్వాన్నపు పరిస్థితులు నశించాలి."

"ఫీజులు తగ్గించాలి."

రంగులో మునుగుతున్న కుంచెలు
గోడలమీద నినాదాలు
నినాదాలు కావవి
మా చైతన్య పరిమళాలు
ఊరు తెల్లవారింది
తూర్పు ఎర్రబడింది
మా స్కూలు గోడ ఎర్రబడింది
మా వూరి గోడల నిండా ఎరుపు
మా వూరి కామందుల కళ్ళనిండా యెరుపు.
"ఎరుపంటే కొందరికి (కామందులకి) భయం భయం."
"పసిపిల్లలు (మేము) వారికన్న నయం నయం."
మరునాడు మేము మామూలుగా స్కూలుకు వెళ్ళాం.

మా హెడ్మాస్టారు, ప్రసాదరెడ్డిగారు, సుబ్బారెడ్డిగారు మా ఐదుగురిని ఒక గదిలోకి పిలిచి లోపల గడియపెట్టారు.

మొదట ఎగతాళి చేశారు. తరువాత ప్రశ్నల వర్షం కురిపించారు. మా సమాధానాలు నచ్చలేదన్నారు. మాకు రెట్టమతం ఎక్కువన్నారు. పొగరు బాగా ఎక్కిందన్నారు. మా వూరి పరువు, మా స్కూలు 'గుడ్ నేము' గంగలో కలిసాయన్నారు. ఇలా వదిలితే మేము వాళ్ళ కొంప ముంచుతామన్నారు. చివరికి మా అందరికీ తలా నాలుగంటించి బయటకు పంపారు.

"హెడమాస్టర్ దురాగతం" పేరుతో ఈ సంఘటనను రామసూరి ఖుంటికి వచ్చే ఒక పత్రిక మోసుకొచ్చింది.

ఎస్సెల్సీ విద్యార్థులు తమ కోర్కెల్ని సాధించారు.

దీనితో రామసూరి మాట వినడం ప్రారంభమైంది. రామసూరి, అంజిరెడ్డి మా గ్రామ రాజకీయాల్లో ప్రముఖ పాత్ర వహించి, యువజన సంఘాలు, కూలి సంఘాలు అని యేర్పాటు చేశారు.

ఎస్సెల్సీ అయిపోగానే రామసూరి, అంజిరెడ్డి పి.యు.సి. కోసం టౌను కెళ్ళడం, అక్కడ స్టూడెంట్ ఫెడరేషన్‌లో పనిచేయడం, ఇంతలో నక్సల్‌బరీలో వీచిన గాలి శ్రీకాకుళం, గోదావరి జిల్లాల్లోకి జొరబడటం, ఆ విప్లవ రాజకీయాల్లో పనిచేస్తూ అజ్ఞాతవాసంలోకి వెళ్ళడం – ఇలా ప్రజలకోసం పాటుపడే క్రమంలో వాళ్ళు.

డిగ్రీ పూర్తిచేయడం, ఉద్యోగం దొరక్కపోవడం, అనంతతో పరిచయం, ఆ తరువాత పెళ్ళి కావడం, నేను టైపు ఇన్స్టిట్యూట్ పెట్టుకోవడం, అనంత హైస్కూల్లో తెలుగు టీచరుగా పని చేస్తూండడం, పుస్తకాలు చదవడం – విషయాలు తెలుసుకోవడం, ఏవో కవితలూ, కథలూ రాయడం–ఈ పరిధి దాటని జీవితం సాగిస్తూ నేను.

"మీ అమ్మా నాన్నా బావున్నారా? మీ చెల్లిలి పెళ్ళి చేశారా?"

–అప్పుల్లా కుటుంబ క్షేమ సమాచారం.

నిజమైన చుట్టాలు మరింకెవరు?

నేను సమాధానాలు చెప్పాను.

"పత్రికల్లో నీ రచనలు చూస్తున్నాను. నీలో వ్యక్తివాదం, ఆత్మాశ్రయవాదం పూర్తిగా పోలేదు."

"నేనేమీ ప్రజలకు వ్యతిరేకంగా రాయడంలేదు కదా? అయినా భావాలన్నీ ఆత్మాశ్రయాలే కదా?"

"ప్రజలకు వ్యతిరేకంగా వ్రాయకపోవడం ఒక్కటే చాలదు. వ్రాయగల శక్తి, ఆ స్వభావము వున్నప్పుడు ప్రజల గురించి వ్రాయక పోవడం కూడా తప్పే. భావాలన్నీ ఆత్మాశ్రయాలని అంటున్నావు నువ్వు. కాని యిది కొత్త వాదనేమీ కాదు. ఇది కాలం చెల్లిన సూత్రీకరణ. ఆలోచనలు, భావాలు, ఆనాటి సమాజిక వ్యవస్థలో వున్న ప్రజల జీవన పరిస్థితులను ఆశ్రయించుకొని వుంటాయి. ఆ భావప్రకటనా రూపాలే సాహిత్యము, కళలు. దీనర్థం సాహిత్యమూ, కళలు ప్రజల జీవితాల్లోంచి పుట్టుకొస్తాయని.

ప్రజల జీవితం, ప్రజల పరిస్థితులు, వాటి కారణాలు, వాటిని మార్చడానికి ప్రజలు చేసే ప్రయత్నాలు – అన్నీ అధ్యయనం చేయాలి.

ప్రజలు ఆ పరిస్థితులు మార్చుకోవడానికి కావాల్సిన చైతన్యం కలిగించడం, ఆ ప్రయత్నాలకు ఊపిరి పోయడం, ఆ ప్రయత్నాల విజయాలను నిలబెట్టుకొనే శక్తిని వారికివ్వడం–ఇవే నేటి దశలో సాహిత్యం, కళలు యొక్క ప్రయోజనం."

రామసూరి ఒక వ్యక్తి కాదు

రామసూరి ఒక పాఠశాల

రామసూరి ఒక మంచి పుస్తకం.

రామసూరి మాట్లాడని విషయం లేదు. రామసూరి సంచిలో నుంచి యేవో తీసాడు. తీసి నా కిచ్చాడు. నా కిచ్చి చదవమన్నాడు.

కరపత్రాలు; సైక్లోస్టయిల్ చేసిన పత్రికలు.

అత నెక్కడుంటే అక్కడ విప్లవం

అత నెక్కడుంటే అక్కడ చైతన్య భాండాగారం.

మూడు కాఫీ లొచ్చినయ్.

కరపత్రాలు, పత్రికలు జేబులోకి నెట్టాను.

కాఫీ త్రాగడం పూర్తిచేసి కప్ టేబులుమీద పెట్టి తల పైకెత్తాను.

రామసూరి, అంజిరెడ్డికి రెండువైపులా–వెనుక పోలీసులు.

నా ముఖంలో షాక్ కనిపించిందేమో – సూరి వెనక్కి తిరిగాడు. తన చుట్టూ పోలీసులు. పరిస్థితి అర్థమైంది.

రామసూరి, అంజిరెడ్డి నిల్చున్నారు.

రామసూరి పిడికిలి ఎత్తి పెట్టాడు.

"ప్రియమైన ప్రజలారా! కామ్రేడ్స్!"

అక్కడున్న పాతికమందీ అంతకుముందునుంచీ యిటే చూస్తున్నారు.

"నా పేరు రామసూరి. ఈ కామ్రేడ్ పేరు అంజిరెడ్డి. మేము కమ్యూనిస్టు విప్లవకారులం. మన దేశాన్ని రెండువందల సంవత్సరాలపాటు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పాలించారు. 1947 ఆగస్టు 15 అర్ధరాత్రి అధికార మార్పిడి తతంగం జరిగింది. దాన్నే మనం "స్వాతంత్ర్యం" అని ప్రకటించుకొన్నాం. స్వాతంత్ర్యం గురించి ప్రజలు కన్న కలలు కలలుగానే మిగిలిపోయాయి. ఉత్పత్తి సాధనాలు ప్రజల చేతుల్లోకి రాలేదు. మనది వ్యవసాయక దేశం. ప్రధానమైన వుత్పత్తి సాధనం భూమి. ఆ భూమిని అతి కొద్దిమంది భూస్వాములు తమ చేతుల్లో వుంచుకొని, వారే పాలక వర్గంగా తయారయ్యారు. 1947కు ముందు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దోపిడీకి మాత్రమే గురయిన మనం ఈ రోజు ప్రపంచంలోని అన్ని సామ్రాజ్యవాద దేశాల, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదుల దోపిడీకి గురవుతున్నాం. ఆర్థిక, రాజకీయ, మిలిటరీ, సాంస్కృతిక రంగాలన్నిటిమీదా విదేశీ సామ్రాజ్యవాదుల, సోషల్ సామ్రాజ్యవాదుల పెత్తనం బలంగా వుంది. అందుకనే మేము ఈ సామాజిక వ్యవస్థను "అర్ధవలస, అర్ధఫ్యూడల్ స్వభావం కలిగిన వ్యవస్థ" అని అంటున్నాం.

ఈ దేశంలో భూస్వామ్య వ్యవస్థ నిర్మూలించబడి, ప్రధాన ఉత్పత్తి సాధనమైన భూమి ప్రజల పరం కావడం ద్వారాను, విదేశీ బేక్యాన్ని, వారి పెట్టుబడులను, వారి పెత్తనాలను అన్ని రంగాల నుంచి ఎత్తివేయడం ద్వారాను భారత ప్రజలు దోపిడీనుండి విముక్తి సాధించగలరని మా విశ్వాసం.

ప్రస్తుత దశలో శ్రామికవర్గ నాయకత్వాన కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా మధ్యతరగతి ప్రజలు, జాతీయ బూర్జువా వర్గంతో ఐక్యసంఘటన యేర్పాటు చేసుకొని సాగే జనతా ప్రజాతంత్ర విప్లవ మొక్కటే ఈ కర్తవ్యాలను నిర్వర్తించగలదు. ఈ కర్తవ్య నిర్వహణకు ప్రజలను సిద్ధం చేయడమే మా కార్యక్రమం.

ఈ కార్యక్రమంలో భాగంగానే మేము ఏజెన్సీ ప్రాంతాల్లో రైతు కూలి సంఘాలను పెట్టాము. వారి స్థానిక సమస్యల మీద వారిని కదిలించి వారికి పోరాట చైతన్యం కలిగించడమే మేము చేస్తున్న కృషి.

చట్టబద్ధమైన ప్రభుత్వాన్ని సాయుధపోరాటం ద్వారా కూలద్రోయాలని మేము కుట్ర పన్నామని, మామీద కుట్రకేసు బనాయించింది ప్రభుత్వం. దోపిడీలతోను, హత్యలతోను మాకు సంబంధాలున్నాయని ఆరోపణలు చేసింది. ఇంటా బయట అత్యవసర పరిస్థితి ప్రకటించి నామ మాత్రమైన ప్రజాస్వామ్య హక్కులను సైతం కాలరాసి తన నియంతృత్వాన్ని, నిర్బంధాన్ని ప్రజలమీద ప్రయోగిస్తున్నది. ఎంత నిర్బంధం ప్రయోగించినా అంతిమ విజయం ప్రజలదేనని ప్రజలు జనతా ప్రజాతంత్ర విప్లవాన్ని పూర్తిచేసి సోషలిస్టు విప్లవానికి పునాది వేయగలరని మా గాఢ విశ్వాసం. ఈ రోజు మీ అందరి ముందే అరెస్టు చేస్తున్న వీళ్ళు విచారణ లేకుండా యేళ్ళపాటు జైల్లో వుంచవచ్చు. నానా చిత్రహింసలపాలు చేయవచ్చు. ఎదురు కాల్పుల్లో చనిపోయామని ప్రకటించవచ్చు. మేము పోయినా పోరాటం ఆగదు. అంతిమ విజయం ప్రజలదే. ప్రజలే చరిత్ర నిర్మాతలు."

పీలగావుండే రామసూరి కంఠంలో ఎక్కడిదీ గాంభీర్యం?
ఈ శక్తి ఎక్కడి నుంచి వచ్చింది?
ఈసారి అంజిరెడ్డి పిడికిలి ఎత్తాడు.
"విప్లవం—"
"వర్ధిల్లాలి"—రామసూరి గొంతు అందుకుంది.
"కమ్యూనిస్టు విప్లవకారులు—"
"వర్ధిల్లాలి."
ఇదేమిటి? వీళ్ళు వ్యక్తుల పేర జేజేలు కొట్టడంలేదు.
నా చిన్నతనంలో నినాదాలన్నీ వ్యక్తులకు జేజేలు కొట్టడంతోనే పూర్తయ్యేవి.
"ప్రజా ఉద్యమాలమీద నిర్బంధకాండ—"
"నశించాలి."
హోరు—హోరు—నినాదాల హోరు.
"కమ్యూనిస్టులం—మేము కష్టజీవులం."
..................
పాట సాగుతుంది.
"అరచేతిని అడ్డుపెట్టి సూర్యకాంతి నాపలేరు.
అరెస్టులను సాగించి ప్రజాశక్తి నడ్డలేరు."
పాణిగ్రాహి పాట రామసూరి, అంజిరెడ్డి గొంతుల్లోంచి ప్రపంచంలోకి—
పాట పాడే గొంతుల్ని పోలీసులు తీసుకెళ్ళిపోతున్నారు.
పాట వారివెంట సాగిపోతున్నది.
వాళ్ళు కనుచూపు దాటిపోయారు.
ఆ పాట గాలిలో కలిసి యిటువైపింకా వస్తూనే వుంది.
జనంలో గుసగుసలు—
"ఎవరు వాళ్ళు! ఎవరు వాళ్ళు?"—అని. కాని—
"ఎవరి వాళ్ళు? ఎవరి వాళ్ళు?"—అని అనరేం?

☆ ☆ ☆

ఆ రోజు ఆదివారం. ఆలస్యంగా నిద్రలేచాను.
పక్కనే టీపాయ్‌మీద ఉత్తరం.
అనంత దగ్గరనుండి వచ్చిన ఉత్తరం.
తన ఆరోగ్యం బాగానే వుందని, నన్ను శనివారం రమ్మని మంగళవారం పోస్టుచేసిన ఉత్తరం.
నాకు శనివారం అందిన ఉత్తరం.
పేపర్‌బోయ్ పడేసిన పేపరు కిటికీలోంచి పరుగెత్తుకొచ్చింది.
మంచంమీద పడుకొనే పేపరు తిప్పుతున్నా.

అత్యవసర పరిస్థితి సాధించిన నూరు విజయాలతో పేపరు నిండిపోయింది.

ఐదో పేజీ చివర్లో–

"ఎదురు కాల్పుల్లో యిద్దరు

నక్సలైట్ల మృతి.

"....ఏజెన్సీ ప్రాంతంలో మొన్న రాత్రి నక్సలైట్లకు పోలీసులకు జరిగిన సంఘర్షణలో ప్రముఖ నక్సలైటు సూరన్న అనబడే రామసూరి; అతని అనుచరుడు దాసు అనబడే అంజిరెడ్డి చనిపోయినట్లు, మరి నలుగురు తప్పించుకుపోయినట్లు, వీరి వద్ద రెండు నాటుతుపాకులు, నక్సలైటు సాహిత్యం, చేతిబాంబులు దొరికినట్లు యిక్కడ కందిన సమాచారంవల్ల తెలుస్తుంది."

రామసూరి అంజిరెడ్డి యిక కనిపించరు. నా గుండెనిండా నిశ్శబ్ద విషాదం.

కంటినుండి చెవులమీదుగా నా జుట్టులోకి వెచ్చగా జారుతున్న దుఃఖం.

ఈ రోజు మూడు రంగుల జండా క్రిందకు దిగదు.

పత్రికలు సంపాదకీయాలు రాయవు.

రేడియోలో విషాద సంగీతం వినబడదు.

కాని

నాకు తెలుసు

అక్కడ– అడవి ఎరుపెక్కుతుంది. నేల ఎరుపెక్కుతుంది. అడవి పూలు ఎరుపెక్కుతాయి– కొండలూ కోనలూ యెరుపెక్కుతాయి. రామసూరి, అంజిరెడ్డి గొంతులతో "విప్లవం వర్ధిల్లాలని" ఆ అడవీ, ఆ కొండలూ ప్రతిధ్వనిస్తూనే వుంటాయి.

ఎప్పుడో, ఎక్కడో విన్న పాట అస్పష్టంగా గుర్తుకొస్తుంది.

"ఎవరు వాళ్ళూ

ఎవరు వాళ్ళూ

ఎవరి వాళ్ళూ

ఎవరి వాళ్ళూ

ఎవరికోసం వచ్చినారు

ఎవరికోసం పోయినారు?"

కళ్ళు తుడుచుకొంటూ లేచి బ్యాగులో రెండు జతల బట్టలు సర్దుకొన్నాను, అనంత దగ్గరకైనా వెళ్దామని.

● జ్యోతి మాసపత్రిక, అక్టోబర్ 1979 ●

★ ★ ★

45

కేతు విశ్వనాథరెడ్డి

# పీర్ల సావిడి

పచ్చని వేపచెట్టుకు యెదురుగ్గా పాతకాలంనాటి పీర్లసావిడి. గోడలకు అక్కడక్కడ బెచ్చులు వూడిపొయ్యాయి. పీర్లపండగ రోజుల్లో పూసిన సున్నం అప్పుడే మాసి వెలవెలబోతోంది. సావిడికి పైన కప్పిన దంతెలు రేపో మాపో పుచ్చిపోవటానికి సిద్ధంగా ఉన్నాయి దంతెల్లో యెలుకలు అటూ యిటూ పరిగెత్తినప్పుడు, చవుడు అడపా దడపా రాలుతోంది. రెండు గట్టి దంతెలకు పీర్ల పెట్టె వేలాడుతోంది. పీర్లపండుగ రోజుల్లో మాత్రం తళతళ మెరిసి, గుండం తొక్కి, వూరేగిన చిన్నా పెద్ద పీర్లు ఆ పెట్టెలోనే వున్నాయి – మళ్ళీ పీర్లపండగ యెప్పుడొస్తుందా అని యెదురుచూస్తూ.

సరిగ్గా ఆ పీర్లపెట్టెకు కింద కొంచెం యిటుగా కుక్కి మంచంలో మస్తాన్ వొక్కడే కూచొని పందెం కోడికి గింజలు పెడుతున్నాడు.

పుంజు కాళ్ళూ రెక్కలూ తొడకింద యిరికించుకొని, యెడమచేతి వేళ్ళతో ముక్కులు చీల్చి, కుడిచేతి పిడికిలినిండా కలబోసిన పచ్చజొన్నలూ, పెసల్ని పక్కనుండే చేటలోంచి తీసుకొని, పుంజునోటికి వాటంగా, అలవాటుగా, నెమ్మదిగా, గింజలు చెదిరి పక్కల రాలకుండా యెక్కించాడు. మంచం నులకసందులో దూర్చిన సత్తు లోటాతీసి పుంజు గొంతులో రెండు మూడు గుక్కలు నీళ్ళుపోశాడు. పుంజు మెడ విదిలించుకుంది. పుంజు మెడ సాదుతూ, పీర్లసావిడి కలియచూశాడు. తనతో తాను మాట్లాడుకోవటం మొదలుపెట్టాడు:

'నీయమ్మ రేపు సంకురాత్తిరి పందేల్లో అవతల కోళ్లను యెగిసి వొక్క తన్నుతో నీలిగేటట్లు సెయ్యాల. పంచెంలో అట్లా గెల్సినావా నీకు లోలాకులు కుట్టిస్తా. వాటం కుదిరిందా యీ పీర్లసావిడిని యీ యాడాదన్నా బాగుసెయ్యాల. మాంఛి పందెం గెలిస్తే కొత్త పీరు సెయ్యిస్తా... బాగా తిను నీ యమ్మ......'

పుంజు ముక్కు మళ్ళీ తెరచి, పిడికెడు గింజలు చేటలోంచి అందుకున్నాడు. సావిడికి ముందు వేపచెట్టు దగ్గర నిల్చిన ప్రెసిడెంటు అశ్వత్థరెడ్డిని అతనివెంట వచ్చిన నలుగురైదుగుర్నీ మస్తాన్ గమనించనేలేదు.

'యీ యెలక్షన్లొస్తే ప్రతి అడ్డమైన నాకొడుకు చుట్టు తిరగాల', అని లోలోపల అగ్గి మింగుకుంటూ వచ్చిన అశ్వత్థరెడ్డి, రంగు మార్చి, మర్యాదగా మస్తాన్‌ను పలకరించాడు.

మస్తాన్ పుంజు లోకంలోంచి పెద్దమనుషుల లోకంలోకి దిగాడు. కుక్కి మంచంలోంచి తాట్రుపాటుగా చిరిగిన బనియను, పంచెలో వున్న పీలమనిషి మస్తాన్ పీరులాగా నిటారుగా లేచాడు. పట్టు విడిన పుంజు వొక్కసారి చేటలో దూకి, గింజల్ని నేలపాలు చేసి పీర్లపెట్టె మీదెక్కి కూత వేసింది.

అర్ధరూపాయి గింజలు మట్టి పాలయినందుకు మస్తాన్‌కు కోపం వచ్చింది.

"పందెం కోళ్ళను పెంచితే మస్తానే పెంచాల."

–అశ్వత్థరెడ్డి పొగడ్తకు మస్తాన్ కోపం మాయమైంది. పరిగెత్తి సావిడి కెదురుగ్గా వుండే తన గూడ మిద్దెలోంచి బొంత తెచ్చి కుక్కి మంచంమీద పరిచి ఆత్మీయంగా "కూకోండి" అన్నాడు.

వచ్చినవాళ్లెవళ్ళూ మంచంమీద కూచోలేదు.

"మంధికి మంచం వంచితే యెట్లా?"

–గుంపులో వొకరు ఛలోక్తి విసిరారు.

"యేమన్నా సాయిబుల మర్యాదలు మన కాపోళ్ళకి రావు."

–మరొకరు అకాశానికెత్తారు.

"యిప్పుడేందీ, వీళ్ళ నాయిన బుడేన్‌సాబు బాగా బతికిన రోజుల్లో చూచి చూచి వుండాల. వీళ్ళ మర్యాదలకు బొంబాయి సేట్లే అదిరిపోయినారు. అప్పుడెప్పుడో ధరలు పడిపోయి నిమ్మకాయల వ్యాపారంలో పెద్ద నష్టం వచ్చి కానీ, లేకుంటే, మన రైతులకు తీసిపోయేది కాదు వీళ్ళ కుటుంబం. నిమ్మకాయలకు యిప్పుడున్న గిరాకీ వుంటేనా?"

అశ్వత్థరెడ్డి మస్తాన్ కుటుంబ కీర్తిగానం ప్రశ్నార్థకంతో ఆపాడు.

"యిప్పుడు మాత్తరమేం? వూళ్ళో మిగతా సాయిబులకంటే మస్తానే కాలుమీద కాలేసుకొని దర్జాగా వున్నాడు–పీర్లసావిడి కదలకుండా."

–మరొకరు అశ్వతరెడ్డికి వంత పాడారు.

మస్తానుకు పీర్లపండగ వచ్చినంత సంబరమైంది. ఆ సంబరంతో కంగారుగా అడిగాడు:

"యేంది రెడ్డీ! యింతమంది వచ్చినారే. నేనేం సెయ్యాల?"

"నువ్వు చేస్తావనే వచ్చింది. అసెంబ్లీ యలక్షన్లు వస్తాండాయి. యీయన మన తుమ్మలపల్లె పుల్లారెడ్డి, బస్సులు, ఫాక్టరీలు అవి వున్నే! మా బంధువే. జనతా తరఫున నిలబడుతుండాడు. రైతుల వోట్లన్నీ నేనున్నా కాబట్టి యెట్లా మనకే ననుకో. మాలా మాదిగలు యాడ బోతార్లే? నువ్వు దిగితే మనూరు, చుట్టుపక్క పల్లెల్లో సాయిబుల వోట్లన్నీ మనకే పడతాయి."

–అశ్వత్థరెడ్డి వచ్చిన వైనం తెలిపాడు.

మస్తాన్ మురిసిపోయేడు.

పార్లమెంటు యెన్నికల్లో అశ్వత్థరెడ్డి యిందిరమ్మకు వోటు వేయమన్నది జ్ఞాపకం వచ్చి, 'యిప్పుడేంది యీయన జనతాకు వెయ్యమంటాడే' అనుకున్నాడు. తమవాళ్ళు

పదిమందితోనూ మాట్లాడకుండా మాట యివ్వడం ఏం నెత్తిమీది కొస్తుందో యేమో అని తటపటాయించాడు. అశ్వత్థరెడ్డితో ఆ మాటే అన్నాడు.

అసెంబ్లీ అభ్యర్థి పుల్లారెడ్డి ఆత్రంగా అన్నాడు:

"అదీ మంచిదేలే. యీ రేత్రికి ఫైసలు చెయ్యి పొద్దున్నుంచీ మాతో నువ్వు జీపెక్కవచ్చు. రేత్రికి వీలయితాదా?"

మస్తాన్ సందేహిస్తూనే "రేత్రి మాట్లాడతా" అన్నాడు.

అక్కణ్ణుంచి కదిలి వెళ్ళబోయేముందు అశ్వత్థరెడ్డి నలుగుర్నీ కట్టిపడేసే మొదటి పథకం మాత్రం చెప్పాడు:

"అట్లానే మీవాళ్ళతో మాట్లాడు..... యీ పీర్ల సావిడి రిపేరు చెయ్యించమని చానా రోజుల్నుంచీ మీరంతా చెప్తానే వుండారు; వూర్లో వాళ్ళూ చెప్తానే ఉండారు; నువ్వు మరీయిదిగా. పేరుకు పంచాయితీబోర్డు ప్రెసిడెంటునేకానీ, వూళ్ళో అంతా చుట్టాలే వుచ్చపోసుకోను తావు లేదని, యిండ్ల పన్నులు వసూలు చేస్తామంటే కుదరదు. కట్టే నాథుడే లేడు. పంచాయితీకి ఆదాయం లేదు. చేతినుంచి గవర్నమెంటు వాటా కట్టడం, పంచాయితీ ఆఫీసర్లను మేపడం నా పీకల మీద యెప్పుడూ. పోనీలే.... యీసారి మేము ఆ ఖర్చు పెట్టుకుంటాము. మీ వాళ్ళకు చెప్పు. యీ రోజే నా చందాగా రాత్రిళ్ళు సావిట్లో పెట్టుకోను పెట్రమాక్సులైటు పంపిస్తా. లైటు లేకపోతే యే మొబ్బులోనో కక్కుర్తి నాకొడుకులు పీర్లు యెత్తకపోయినా దిక్కులేదు. పీర్లపండగ మనందరం చేసుకునే పండగకదా?......అదిసరె, నువ్వు వూం అంటె మీవాళ్ళు సరే అంటారు."

మస్తాన్ తలవూపాడు.

వోట్లు యిక మన పెట్టెలో పడినట్లే అనుకుంటూ యెన్నికల బలగం ముందుకు వెళ్ళారు–మరోచోట మరోచోట ఇలాంటివే యేవో వలలు విసిరేందుకు.

మస్తాన్ కుక్కిమంచం మీద పడుకొని 'ఇన్నాళ్ళకు ఈ పీర్ల సావిడికి మంచి రోజులు వచ్చినాయి' అనుకున్నాడు. పీర్ల పెట్టెమీద పుంజుకోడి కూతవేసింది.

అశ్వత్థరెడ్డి అవసరానికి ఆడిన మాట తప్పలేదు ఆ రాత్రికి పెట్రోమాక్సు లైటు వచ్చింది. అప్పుడప్పుడు గప్పు గప్పుమంది. మాటిమాటికి పంపుకొడుతూ పిన్ను కదుపుతూంటేనే వెలుగు వస్తోంది. ఆ వెలుతుర్లో ముసలీ ముతకా చిన్న పెద్దా తోమని పీర్లలాగా కూచున్నారు. రోజంతా కూలీ నాలీ పనుల్లో మునిగిన వాళ్ళ ముఖాల్లో అలసట; నిర్లిప్తత, నిర్లక్ష్యం కనిపిస్తున్నాయి. కడుపులోంచి పుట్టిన వుత్సాహం యెవరికీ లేదు.

అశ్వత్థరెడ్డి వచ్చిన సంగతీ, అతని ప్రతిపాదనా మస్తాన్ అందరికి చెప్పాడు. అందరికి పైకి బాగానే వుందనిపించింది. అయితే యిన్నాళ్ళూ కాడెద్దులకో, అవుదూడకో వేసిన విషయం మనసుల్లో పీకుతోంది. వాళ్ళ జీవితాలలో అంతరాత్మ ప్రబోధం కోసం వేచివుండే తీరికా లేదు, అవకాశాలూ లేవు. వాళ్ళకు ముఖ్యంగా అశ్వత్థరెడ్డిని కాదని వెళ్ళడం ఏవిధంగానో తోచలేదు. సొంతానికి అంతో యింతో ముడితే బాగుంటుందనిపిస్తోంది. ఎన్నికలకు ముందురోజైనా పంపకాలు వుండకపోతాయా

అనే ఆశ కలుగుతోంది. ఈ వ్యవహారాల్లో మస్తాన్ మిగిలించుకొంటాడేమో అనే అసూయకూడ కొందరిలో తలయెత్తుతోంది. 'గొడవలేమైనా వస్తాయేమో? ప్రెశిడెంటు జనతా అయితే రెడ్డి తప్పకుండా ఇందిరమ్మ వైపుంటాడు' అని కొందరికి భయంగా వుంది. యెవళ్ళూ అదీ యిదీ అని నిష్కర్షగా ముందుకు రాలేదు.

"యేమ్రా? యేదో ఒకటి తేల్చండి."

–విస్సుగ్గా మస్తాన్ హెచ్చరించాడు.

"తేల్చడానికేముంది? ముందడిగింది అశిత్తురెడ్డే కదా?"

–యెవరో అడిగారు.

"అవు. రెడ్డి యింకా రాలేదు."

"పీర్లమాన్యం, రెడ్డి ముప్పై యేండ్ల కిందట్నే తన భూముల్లో కలిపేసుకున్నాడు. ప్రెశిడెంటు వోట్లప్పుడు రెడ్డితో మాన్యం కక్కిస్తానని అశిత్తురెడ్డి మనకు మాటిచ్చినాడు. వోట్లేసినాం. మాన్యం రెడ్డికిందే వుంది."

–ముసలి పీరు సాయిబు గొణిగాడు.

"యింటికి యాభై యిచ్చిన్లే....మాన్యం మాన్యం అని మొత్తుకున్నా వొరిగేదేముంది? అది రెడ్డి పేరుతో వుంది. మన దగ్గర పట్టా వుందా, అడగటానికి? పోయింది పోయింది. యీ పీర్లసావిడన్నా నిలుపుకుందాం. గెట్టిగా వొక్క దబ్బట వానొస్తే పీర్లతో కూడా సావిడి కూలిపోతాది."

–మస్తాన్ వాదన అందరికీ బాగానే వుందనిపించింది.

కానీ మళ్ళీ ఎవరో సందేహం తెలిపేరు:

"అయితే జండాలు కడదామంటారా? అవతలోళ్ళు వస్తే! అందులోను మనం యిన్నాళ్ళూ ఇందిరమ్మకే వోట్లేసినాం."

"వస్తే రెడ్డి రావాలి. రాడు–మనం పీర్లమాన్యం సంగతి యెత్తుతామని. అశిత్తురెడ్డి మనల్ని ముందుగా అడిగినాడు. మనవాళ్ళంతా అశిత్తురెడ్డి, ఆయన దాయాదుల యిండ్లలోనే పని పాటలు సేస్తున్నారు. దానికితోడు యీ సుట్టుపక్కల మనవాళ్ళుండేది అయిదారు పల్లెల్లోనే. అశిత్తురెడ్డితో పెట్టుకోడమంటే మాటలు కాదు. పైకి మెత్తగా వున్నా సమయమొస్తే కట్టేదంటే మెట్టేదంటాడు. యెందుకొచ్చిన పీడ. అవతలవాళ్ళొస్తే ముందుగా అశిత్తురెడ్డి వచ్చినాడు; మాటిచ్చినాం అంటాం."

–మస్తాన్ వాదనను యెవరూ కాదనలేదు. ముసలి పీరు సాయిబు తెగేసి చెప్పినాడు:

"యెవల్లకన్నా వోట్లు వెయ్యనీ, మన పీర్ల సావిడి పని వోట్లు పడేతలికి పూర్తి గావాలని సెప్పాల. ఆ తర్వాత యేదన్నా యిస్తే తీసుకుందాం."

అందరూ "అచ్ఛా అచ్ఛా" అంటూ లేచారు. పోతూపోతూ 'ఏం వోట్లో యేం లాబమో, పొద్దున లేసింది మొదలు మన రెక్కలకష్టం మనకు తప్పదు' అనుకున్నారు.

పీర్లసావిట్లో అశిత్తురెడ్డి పంపిన పెట్రోమాక్సు లైట్లో కిరోసిన్ యింకా అయిపోలేదు. అపుడప్పుడు గప్పు గప్పుమంటున్నా వెలుగుతూనే వుంది. మస్తాన్ అన్నంతిని కొడుకు వలీని పీర్లసావిట్లోకి వెంటబెట్టుకొచ్చాడు. అవాళ తనేదో సాధించినట్లు కొడుక్కు చెప్పుకోపోయాడు:

"వొరే వలీ! ఈ సావిడి పెద్దోళ్ళు కట్టింది. నా పిన్నతనంలో యిక్కడే అడుకున్నా. ముసలి పీరుసాబ్ నానా దగ్గర మన పీర్లకతలు యీ సావిట్లోనే విన్నా. పీర్ల పండగలో పులి యేసాలు యేసి, అ రోజుల్లో యెంత తమాషానో....మీ దాదా బుడన్‌సాబ్ నిమ్మకాయల యాపారం చేసినప్పుడు యిక్కడే గుట్టలు గుట్టలు నిమ్మకాయలు రాసులుపోసి గోనె సంచులకు యేసినాం. నువ్వు పుట్టిన ప్పుడు–పదమూడేండ్లయింది–సుట్టు పక్కల తోటలన్నీ మీ అబ్బ తీసినాడు. లచ్చ మిగుల్తాదనుకున్నాం. హుబ్లీకి, బెంగులూరుకు, బొంబాయికి సరుకు పంపితే రైలు సార్జీలు రాలేదు. దానితో మనకున్నదంతా పోయింది. దిగుల్తో మీ దాదా సచ్చినాడు, యీ సావిట్లోనే. అప్పట్నించి యాపారం సెయ్యకూడదనుకున్నా. యీ సావిడి కోడిపందాలకు అచ్చి వచ్చింది. మన కోడి వొక్కటిగాని వొక్కటి అల్లెనుంచి కొప్పెత్తి పారిపోలేదు; సావలేదు. అందుకే యీ సావిడి అంటే నాకింత. ...యిన్నేండ్లకు యిది బాగుపడతాంది....మనింటికి గుమ్మళ్ళు పడితే యిక్కడ పండుకోవచ్చు. రోజా రాత్రి నువ్వు సదువుకోవచ్చు....."

వలీకి తన తండ్రి యిన్ని విషయాలు తనతో యెందుకు చెప్పుతున్నాడో అర్థం కాలేదు. వాడంతకు ముందు జరిగిన తతంగమంతా చూశాడు. యెప్పుడో గుబులుపుట్టి అశ్వత్థరెడ్డి నిమ్మచెట్లను కత్తిరించడానికీ, నిమ్మకాయల కోతలకీ తప్ప యెప్పుడూ సావిట్లో కూచోని కోళ్ళు తప్ప యేమీపట్టని తండ్రిగోడు వానికేనాడూ పట్టలేదు. నానా చాకిరీచేసి యింటి పెత్తనమంతా చూసుకొనే వాళ్ళమ్మంటేనే వాడికిష్టం. స్కూల్లో మొదట చేర్చమని పోరింది వాళ్ళ అమ్మే. యిప్పుడు యేడో క్లాసులోకి వచ్చాక తండ్రి శ్రద్ధ వాడిమీద కన్పిస్తోంది. యీ రకంగా యిటీవల వలీ కాస్త దగ్గరయ్యాడు. యీరోజు వలీని అన్నిటికంటే ఆకర్షించింది, పెట్రోమాక్సులైటు. వాడి బుర్రలో దాని వెలుతురే మెదలుతోంది. తండ్రి గోడేదో అయ్యాక వాడొకే వొక ప్రశ్న వేశాడు;

"యిక్కడే రోజా చదువుకుంటా. యీ లైటు మనదగ్గరే వుంటుందా?"

కొడుకు ప్రశ్నకు ముచ్చటపడినా, రోజా కిరసనాయిలు ఖర్చు యెట్లా భరించాలో మస్తాన్‌కు అర్థం కాలేదు. "మన దగ్గరే వుంటుంది బేటా!" అని మాత్రం గొణిగాడు.

మరుసటిరోజు మస్తాన్ అన్న ప్రకారం అశ్వత్థరెడ్డికి మాట యిచ్చాడు. పీర్ల సావిడికి యేమేం మరమ్మత్తులు చెయ్యాలో కనుక్కురమ్మని మస్తాన్‌ముందే వొక వడ్డెవాన్ని పంపి, మస్తాన్‌ను ప్రచారానికి జీపు యెక్కించాడు.

వారం రోజుల్లో దూదేకులవాళ్ళ ఇండ్ల మీద జనతా జండాలు యెగిరాయి. మస్తాన్ బంధుబలగం వల్లనయితేనేం, అశ్వత్థరెడ్డి వరప్రసాదం వల్లయితేనేం, పక్కపల్లెలోని దూదేకులవాళ్ళ యిండ్ల మీద కూడా జెండాలు రెప రెపలాడాయి.

రైతు–నాగలి గుర్తు కొట్టాలు, గూడమిద్దెల మాసిన గోడలమీద బలంగా కన్పడింది.

అనుకున్నట్లే హస్తం గుర్తు వైపుకు వెళ్ళిన రెడ్డి, యిది చూసి మంటలు గక్కాడు. హరిజనుల్ని ముందుకు తోయాలనుకున్నాడు. కానీ 'లోపల యెట్లాగు ఇందిరమ్మకే కదా' అని తప్పించుకున్నారు. దూదేకులవాళ్ళు యెప్పుడు అశ్వత్థరెడ్డివైపే వుండటం పట్ల రెడ్డి 'యీ చిల్లరజనం సంగతేదో అంతు చూడా'లనుకున్నాడు. ముఖ్యంగా పాత వాసనతో పలుకుబడి వున్న మస్తాన్ సంగతి తేల్చాలనుకున్నాడు. ఆలోచించి, యెప్పుడో యేదో కోడి పందెంలో మస్తాన్‌తో మాటా మాటాపడ్డ పక్కూరి తోళ్ళ కమాలును గట్టిగా పట్టుకున్నాడు. ఆ చుట్టుపట్ల మస్తాన్‌కు కోళ్ళ పందెంలో సరివుజ్జీ తోళ్ళ కమాలే. సంక్రాంతి కోడి పందాల్లో మస్తాన్ కోడిమీద తోళ్ళ కమాల్ తన కోడికి కత్తి కడుతున్నాడనే వార్త పల్లెల్లో గుప్పుమంది.

అశ్వత్థరెడ్డి మస్తాన్ దగ్గరకు స్వయంగా పొకరాత్రి వెళ్ళి, పీర్ల సావిడికి ముఖ్యుల్ని పిలిపించి మంతనాలాడాడు.

"వెనుక నేమున్నా. యెంత డబ్బున్నా కానీ పందెం కట్టండి. మన మనుషులున్నారు," అని గీతాబోధ చేశాడు.

వూరిబయట వనంలో సంక్రాంతినాడు కోళ్ళ పందానికి రంగం సిద్ధమైంది. కారాలు, కర్జికాయల అంగళ్ళు వెలిశాయి. కడవలకు కడవలు కల్లు దిగింది. డబ్బాలకు డబ్బాల సారా చెట్లకింద చేరింది. జనం హడావిడి, పరాక్రమాలు, విసుర్లతో జాతరైంది.

అక్కడ ప్రెశిడెంటు, రెడ్డి మాత్రం లేరు. వాళ్ళసలు వూళ్ళోనే లేకుండా ఎలిబీలు వెతుక్కుంటూ వెళ్ళారు–యెందుకైనా మంచిదని వాళ్ళ బలగాలు మాత్రం సమయమొస్తే కలబడ్డానికి సిద్ధంగా వున్నాయి.

రెండుమూడు మామూలు పందాలు జరిగాయి. మస్తాన్, తోళ్ళ కమాల్ పందెంలోకి దిగుతూనే "యెల్లుకోండి మాది జనతా కోడి....యెల్లుకోండి దమ్ములుంటే మాది యిందిరమ్మ...." అని ముందుగా దమ్ముకొట్టేవాళ్ళు, మెడిమె తొక్కేవాళ్ళూ సవాళ్ళుచేశారు. జనంలో వీరావేశం చోటు చేసుకుంటోంది. పందెం నాలుగువేలకు చేరుకుంది.

మంచి కత్తులు కట్టిన రెండు పక్షాల కోళ్ళూ అల్లెలోకి దిగాయి.

"యెగురు! చించు!! సీయమ్మ!!!" అంటూ పొలికేకలు.

పొకటి రెండు యెగుర్లు యెగిరాయి రెంటికే యీకెలు మాత్రం ఒకటి రెండు వూడాయి. మూడో యెగురు యెగరడానికి రెండు కోళ్ళు పొంచుకొని మెల్లిగా నడుస్తున్నాయి. అంతే......

యెవళ్ళో "అవిగో, రెండు జీపులు రిజరు పోలీసొస్తాంది" అని కేకలు వేశారు. వురుకులు, పరుగులు.

మస్తాన్ తన కోడిని యెదురుకోవడంలో, చేతికి బలంగా కోడికత్తి తగిలింది. రక్తం బొల బొలా కారింది. భయంతో కోడిని విడిచి అడ్డంగా పరిగెత్తాడు. యేదో రాయి తగిలి పడ్డాడు. ఆ సమీపంలోనే ఎద్దుల బండి వుంది. మనిషి నొగళ్ళో లేడు. ఆ హడావిడికి అవి బెదిరి పరుగెత్తాయి. కిందపడ్డ మస్తాన్ కాళ్ళ మీద

బండిచక్రాలు దొర్లాయి. "అమ్మా, అరే యాఅల్లా" అని కేకలువేసి మస్తాన్ తెలివితప్పి పడిపోయాడు.

తెలివి వచ్చేవేళకి పీర్లసావిడి కుక్కి మంచంలో వున్నాడు. భార్యబిడ్డలు నెత్తీ నోరు మొత్తుకుంటున్నారు. చుట్టూ వున్నవాళ్ళకు యేం చేయాలో తోచలేదు. కొందరు పుత్తూరు కట్టు మేలంటున్నారు. మరికొంతమంది కడప పెద్దాసుపత్రికంటున్నారు. కర్నూలు కంటున్నారు. తగిలిన గాయాలనూ, లేవని కాళ్ళనూ చూసుకొని మస్తాన్ బోరుమని యేడ్చాడు. యేదో నాటు వైద్యం జరిగింది. మెలికలు తిరిగిపోతున్న బాధతో మస్తాన్ ఆ రోజు గడిపాడు.

అశ్వత్థరెడ్డి, ఎం.ఎల్.ఏ. అభ్యర్థి పుల్లారెడ్డి వుదయానికి అక్కడ అవతరించారు. క్షణాలమీద మస్తాన్‌ను వ్యానులో వేసుకొని వేలూరు అస్పత్రికి చేర్పించే ఏర్పాట్లు చేశారు.

వాళ్ళ ఔదార్యాన్ని కూలీనాలీ పేదజనం తెగ మెచ్చుకున్నారు. అంతెందుకు, తోళ్ళ కమాల్ యిది విని యిటువైపే తిరిగాడు. వొక కవి రాసిన 'అన్నా పుల్లారెడ్డి నీ చెయ్యే బంగారు కడ్డీ.....' అనే పాట పల్లెపల్లెల్లో మోగింది.

రెడ్డి తన పాచిక పారనందుకు చింతించాడు. మస్తాన్‌ను వేలూరు చేర్చడంతో జనంలో వచ్చిన మార్పుచూసి పుల్లారెడ్డికి గెలుపు ఖాయం అనుకున్నాడు. 'వోట్ల రోజు ముందు రాత్రి చూసుకుందాం లే'మ్మని తమ అభ్యర్థికి నచ్చచెప్పి, ప్రచార వుధృతి తగ్గించాడు.

మస్తాన్ రంగంలో నేరుగా లేకపోతేనేం? జనతా అభ్యర్థి పుల్లారెడ్డి ఎన్నికల్లో గెలిచాడు.

వొక కాలు తీసివేస్తేనేం? చేతివేళ్ళు రెండు పోతేనేం? నెలరోజులు గడిచాక మస్తాన్ పీర్లసావిడి చేరుకున్నాడు. వూరు వూరంతా వచ్చి పరామర్శించారు. అశ్వత్థరెడ్డి స్వయంగా రాకపోయినందుకు యే మూలో బాధ కలిగినా, తన కష్టకాలంలో సాయంచేసిన మనిషి అని మస్తాన్ అనుకున్నాడు. పుల్లారెడ్డి మాత్రం ఎం.ఎల్.ఏగా యెప్పటికీ గెలవాల్సిందే అని అల్లాను ప్రార్థించాడు.

తీరికగా పీర్లసావిడికేసి చూస్తే పెద్దగా మారిందేమీలేదు. వొకటిరెండు దంతెలు మార్చి, బెచ్చులు పూడ్చి, సున్నం దాని ముఖాన పూసినట్లు మస్తాన్ నెమ్మదిగా గుర్తించాడు. పైన చవుడుకూడా పూర్తిగా మారినట్లు లేదు. కప్పు మారలేదు.

మస్తాన్ ముసలి పీరుసాబ్‌ను పిలిచి అడిగాడు. నీళ్ళు నములుతూ జరిగిన విషయం చెప్పాడు.

యింటికి పాతికా పరకా ముట్టేయి. కొందరికి బాండ్లమీద రెండు మూడు వందలు అప్పులు పుట్టాయి. దానికి తోడు మస్తానుకు అంత డబ్బు ఖర్చు పెడుతున్నారని నలుగురూ అఖరుకు తనుకూడా పీర్లసావిడి విషయం గట్టిగా అడగలేదు.

'ముసిలోనికి ముట్టే వుంటుంది. పోనీలే; యిప్పుడు యీ సావిడి కాస్త నయం. మళ్ళీ యెలక్షన్లు వచ్చినప్పుడు చూసుకోవచ్చు. తను బతికి బయటపడ్డాడు' అని మస్తాన్ ఓదార్పు పొందాడు.

మస్తాన్ వూరుచేరి రెండు మూడు నెలలు గడిచాయి. రోజంతా పీర్లసావిట్లోనే గడిచిపోతోంది. ఉన్న వొక్క యకరం పొలంతో, తోటల్లో పనుల్తో మస్తాన్ భార్య సంసారం నెట్టుతూనే వుంది. కోడిపందెం అంటే భయం పట్టుకొని మస్తాన్ కోళ్ళ పెంపకం మానేశాడు. కోళ్ళ మస్తాన్ పేరు, వూర్లో క్రమంగా కుంటి మస్తాన్ అయింది.

యింట్లో జరుగుబాటు కష్టమైంది. హైస్కూళ్ళు మామూలుగానే తెరిచారు. వలీని పక్కవూర్లో యెనిమిదో క్లాసు చేర్పించే రోజులొచ్చాయి. అశ్వత్థరెడ్డిని సాయం అడుగుదామా వద్దా అని మస్తాన్ రోజూ మధనపడుతున్నాడు.

ఒకరోజు ఉదయం అశ్వత్థరెడ్డి సేద్యగాడు వచ్చాడు – ప్రెశిడెంటు పిలుస్తున్నాడంటూ.

కొడుకు వలీని తోడుతీసుకొని కుంటి మస్తాన్ అశ్వత్థరెడ్డి యింటికి ఆశగా బయలుదేరాడు. అశ్వత్థరెడ్డి యింటి ముందట వసార్లో జగిలిమీద కూచొని "రా మస్తాన్!" అన్నాడు.

కూచోమని మాత్రం అనలేదు. వోట్ల కాలంలోతప్ప మిగతా సమయాల్లో యెవర్ని యెక్కడుంచాలో అశ్వత్థరెడ్డికి తెలుసు.

వలీ బిక్కు బిక్కున అంతా పరిశీలిస్తున్నాడు.

అశ్వత్థరెడ్డి కత్తుల పొది విప్పాడు:

"చూడు మస్తాన్! నిన్ను చూస్తే యెట్లానో అనిపిస్తుంది.....పుల్లారెడ్డి యిదుగో జాబు రాశినాడు – నిన్ను అడగమన్నాడు. మరొకసంగతి. నీకు వేలూరు ఆస్పత్రిలో మూడువేలు ఖర్చయింది. ఆస్పత్రిలో నువ్వున్నప్పుడు మీ బూబమ్మ జరుగుబాటుకు నాలుగైదు నూర్లు యిచ్చినా. నువ్వు పెద్దమనిషివి. అవతలేమో ఎం.ఎల్.ఏకి పాపం, యేడెనిమిది లక్షలు మొన్న యెలక్షన్లలో గాలి కెగిరిపోయింది. యెలక్షన్లంటే చావబొయ్యే నా కొడుకు కూడా వోటు కెంతిస్తావనే చెడ్డ రోజులివి. అదిసరే, నీకయిన ఖర్చులు సగమైనా నువ్వు పెట్టుకుంటే బాగుంటుందని రాసినాడు. యేం చెయ్యాల?....."

మస్తాన్ నెత్తిమీద పిడుగు పడింది. నోట మాట రాలేదు. కోపం వచ్చింది. వుక్రోషం కలిగింది. బాధ వేసింది. అశక్తత గుర్తుకొచ్చింది. అవిటితనం చూసుకొన్నాడు. వలీవైపు చూశాడు. తొణకని అశ్వత్థరెడ్డి ముఖంలోకి చూశాడు. తన గోడేదో వెళ్ళబోసుకుందామంటే ముందరి కాళ్ళకు బంధం పడింది.

అశ్వత్థరెడ్డి జాలిమాటలతోనే ఖండితంగా చెప్పాడు:

"నువ్వు మాత్రం యిప్పుడెట్లా ఇస్తావులే. యిదో ఈ బాండుమీద సంతకం పెట్టు. పదైదు నూర్లకు రాయించినా. కావాలంటే యివిగో ఆస్పత్రి బిల్లులు చూడు. కాలం బాగున్నప్పుడు యివ్వచ్చు..."

మస్తాన్ బాండుమీద సంతకమేదో బరికి వొక్కమాటైనా మాట్లాడకుండా వెనక్కి తిరిగాడు. ఎదురుగా ప్రెశిడెంటు యింటికి వస్తున్న రెడ్డిని చూశాడు. ఇందిరమ్మ పార్టీలో ఎం.ఎల్.ఏ. చేరటం, వీళ్ళు యేకం కావటం గుర్తుకొచ్చింది. అంతా వీళ్ళ ఆటలే అనుకున్నాడు.

పీర్లసావిట్లో కూలబడి 'ఈ కష్టం మీ వల్లనే వచ్చిందికదా' అని యెందుకడగ లేకపోయానని వాపోయాడు. తండ్రిని నిమ్మకాయలు ముంచినట్లే, తనను కోళ్ళు ముంచాయని బాధపడ్డాడు.

వలీ తండ్రి దగ్గర కూచొని సందేహంగా అడిగాడు:

"బా! అశిత్తురెడ్డి మంచోడేనా?"

మస్తాన్ పలకలేదు.

"ఎల్లక్షన్లప్పుడు లారీలో తిరిగినందుకు మా యిస్కూలు పిల్లకాయలకు తలా రూపాయిస్తే నాకు రెండు రూపాయ లిచ్చినాడు."

"అవసరంపడితే యిస్తాడు యే కాఫిర్ నాకొడుకైనా."

"నేనప్పుడు డబ్బు తీసుకోలేదు. వొకరోజే లారీ యెక్కినా. మా కొత్తయ్యవారు అట్లా లారీలు యెక్కొద్దన్నాడు... యెల్లక్షన్లలో డబ్బుండేవాళ్ళదే రాజ్జెం అంటగదా?"

"ఆ నాకొడుకులదే."

–మస్తాన్ మంటకొద్దీ బండబూతులకు దిగాడు.

"అయితే మనమెందుకు ఓట్లెయ్యడం? వోట్లేసినా నీతో బాండు రాయించుకున్నారే? దేనికి?"

మస్తాన్ దగ్గర ఆ ప్రశ్నకు సమాధానం లేదు. యిప్పుడు తనకొచ్చిన కష్టం గురించే ఆలోచిస్తున్నాడు. మిగిలిన ఆ వొక్క ఎకరా బాకీలోకి పోతుంది. అశిత్తురెడ్డి తన తోటలో కలిపేసుకుంటాడు. 'అంతా దొంగలమ్డీకొడుకులు' అనుకున్నాడు. పైన పీర్లపెట్టెవైపు చూశాడు. కడుపుమంటను ఆపుకోలేక–

"మల్లా తొందర్లో యెల్లక్షన్లు రావా? అప్పుడు సెప్తా యీ నాకొడుకుల సంగతి" అంటూ చేతికర్రను నేలకు గట్టిగా కొట్టాడు.

యిదంతా వలీ చిన్నబుర్రకు అక్రమంగా కన్పించింది. జరిగిందీ, మొన్న మొన్న కొత్త టీచరు చెప్పిందీ గుర్తుకొస్తూవుంటే వాడి రక్తం మరిగిపోతోంది. వాడి బాల్యరక్తంలో కోపం రూపుదిద్దుకోవటానికి యాతనపడుతోంది.

తండ్రీ కొడుకూ ఇద్దరూ పీర్లసావిట్లో....

కొత్తసున్నం పూసినా, వొకటి రెండు దంతెలు మారి కొత్తవి వచ్చినా పూర్తిగా మారని పీర్లసావిట్లో ఆ యిద్దరూ....

పీర్ల పండగ రోజుల్లో తళతళ మెరిసి, గుండం తొక్కినప్పుడు విరిగి, మళ్ళీ పీర్లపండగ యెప్పుడొస్తుందా అని యెదురుచూసే పీరులాగా కుంటి మస్తాన్; యే యెన్నికలకో యెదురుచూస్తూ.. ...

సావిడిముందు పచ్చని వేపచెట్టులాగా కొమ్మ కొమ్మ కదులుతూ, యే మంచిగాలికో వెలుతురుకో యెదురుచూస్తూ వలీ.....

యిద్దరూ ఆ పీర్లసావిట్లోనే........

● *(1980)* ●

★ ★ ★

46

చాగంటి తులసి

# వలయం

గేటు తీసి లోపలికి అడుగు పెట్టాను.

మామగారు వీధి అరుగుమీద కూర్చుని ఉన్నారు.

"నువ్వా, అమ్మా! ఉత్తరం రాయ లేదేం? స్టేషన్‌కి రమణో, చిట్టో వచ్చేవారు కదా?" అంటూ పలకరించేరు.

"ఎవరూ వస్తే?" అంటూ పక్క గదిలోంచి రమణా, శాంతా, అమ్మలూ బయటికి వచ్చేరు.

"అరే, వదినే! అమ్మోయ్! వదినొచ్చిందేవ్!" ఇంటిలోకి కేకెట్టింది అమ్మలు.

"రావనుకున్నానుస్మీ! – వచ్చేవే!" అన్నది శాంత.

"వదిన వస్తుందని నాకు తెలుసు!" అన్నాడు రమణ. శాంత తను రాననుకోవడమూ సబబే. రమణ వస్తాననుకోవడమూ సబబే. తనకి నవ్వొచ్చింది. రావడం, రాకపోవడం రెండూ సబబులే! ప్రతీ విషయం అంతే! ఎటుపక్కకి అటుపక్క సబబూ, సరి అయిన కారణం దొరుకుతాయి. కాస్త తర్కం ఉండాలి కాని రెండింటిని సమర్థించవచ్చు.

లోపల్నించి అత్తగారూ, ముసలమ్మగారు కూడా బయటికి వచ్చేరు. సొజ్జ చేసుకుంటూ లేచి వచ్చేరేమో ముసలమ్మగారు చిన్నగావంచాగుడ్డ కట్టుకుని ఉన్నారు. బుర్రమీద ముసుగు లేనేలేదు. మెళ్ళో పెద్ద రుద్రాక్షల తావళం గావంచ పైనుంచి వేళ్లాడుతూంది?

"వచ్చేవా, మనవరాలా! రాజేడీ? వాడు రాలేదా? ఉత్తరం రాకపోతే ఇద్దరూ కలిసి వస్తున్నారూ, ఎందుకు రాయడమని మానేసి ఉంటార్లే అనుకున్నాం. స్టేషన్ నుంచి ఒక్కర్తివీ వచ్చావా?"

అత్తగారూ నా చేతిలో సూటుకేసు తీసుకున్నారు.

"వదినకేం భయం అనుకున్నావా?" అంటూ సాగదీసింది శాంత.

రాజుతో తర్కించి, రాజుని ఒప్పించి రావడమే బ్రహ్మాండమైపోయింది. నాకు ఉత్తరం రాయడానికి సావకాశం ఎక్కడ దొరికింది? రాసినా, రాయకపోయినా ఒకటే అంటాడు రాజు? స్టేషన్‌నుంచి ఇంటికి వెళ్ళలేకపోతేకదా!

నా చేతిలో ఉన్న నాగుల్ను తీసుకున్నాడు రమణ.

"ఆడవాళ్ళ గాగుల్సు నువ్వు పెట్టుకోడం ఏంట్రా?" అంటూ అమ్మలు ముందుకు వచ్చింది.

"ఈ 'గాగుల్సు' ఆడా మగా – ఇద్దరూ పెట్టుకోవచ్చు." రమణ గాగుల్సు పెట్టుకుని వీధిలోకి పరుగెట్టేడు.

"ఏం రీసెరిచిలో ఏం లోకమో! అమ్మాయి పూర్తిగా చిక్కిపోయింది కదండీ, అత్తయ్యా!" ముసలమ్మ గారితో అత్తగారు అంటున్నారు.

"పొద్దున్న ఎప్పుడనగా బయలుదేరిందో ఏమో స్నానానికి నీళ్లుపెట్టు. రెండు మెతుకులు తిని పడుకుంటుంది."

నాకు తెలుసు, ఎంత అవుననుకున్నా, ఎంత కాదనుకున్నా వీళ్ళంతా నా వాళ్ళు. రాజు నా వాడయేక వీళ్ళు పరాయివాళ్ళు ఎలా అవుతారు? అయితే రాజే వీళ్ళని పరాయివాళ్లుగా అనుకుంటున్నాడు. తల్లీ, తండ్రీ, బామ్మగారూ, చెల్లెళ్లు, తమ్ముళ్ళు అందరూ రాజుకి పరాయివాళ్ళే! ఈ బంధాలు తెంపుకోకపోతే వీల్లేదు అంటాడు. "పట్టుకుని వేళ్ళాడి వేళ్ళాడి ఇన్నాళ్ళు పడ్డ బాధంతా చాలు! మనస్సులోంచి వీళ్ళని తీసేస్తేనే పని చెయ్యగలను! నే నేమన్నా అవగలను! నువ్వన్నా అంతే! ఆదర్శాలు! త్యాగాలు! కర్తవ్యాలు! దిబ్బాదిరుగుండం! నథింగ్! ఎవడికి వాడు తమకి తాముగా నిలబడి మీదికి లేవాలి. వీళ్ళు నిన్ను నిన్నుగా పైకి వెళ్ళనివ్వరు వాళ్ళు బయట పడలేరు. వాళ్ళతో నిన్నూ కిందికి దిగలాగేస్తారు! నువ్వూ వాళ్ళ మాటలు మాట్లాడి నన్ను దిగలాగకు!" ఇదీ వరస! రాజు చేసే తర్కం చిత్రంగా ఉంటూంది. మొదట్లో ఎబ్బెట్టుగా వినిపించేది. ఈ మధ్యే రాజు ఇల్లాగా తయారయేడు. నిరుటివరకూ ఈ తర్కవితర్కాలు ఏంలేవు.

స్నానంచేసి వచ్చేసరికి చిట్టి వీధిలోంచి వచ్చేడు.

"వదినా! ఎప్పుడొచ్చేవ్? అమ్మయ్యా! నువ్వు వచ్చేవు! మంచిదయింది. నాల్రోజులూ ఉంటావుగా! మా కెమిస్ట్రీ లెక్చరరు ఓ కుర్రకుంకలే! వాడికి చెప్పడం రానూ రాదు, మా కుర్రాళ్ళు చెప్పానివ్వరు! హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంటా? ఆయన క్లాసే తీసుకోరు. కాస్త చెపుతావు కదూ!" చిట్టి అడిగేడు. బి. యస్‌సి. సెకండియర్. యూనివర్సిటీ పరీక్ష. ఈ ఊళ్ళనే రాజా, నేనూ ఉంటే పిల్లలకీ ఇబ్బంది ఉండేదికాదు.

"ట్యూషన్‌కి వెళతాను, అన్నయ్యా! లేకపోతే ఫస్టుక్లాసు రాదు. కాలేజిలో తిన్నగా చెప్పడంలేదు. చెప్పేది నాకు అర్థం కావటంలేదు. అమ్మా, నాన్నా ట్యూషనూ లేదు గీషనూలేదు అంటున్నారు. నాన్నకి నువ్వో ఉత్తరం రాయి అన్నయ్యా!" అంటూ ఉత్తరాలు రాసేడు. చిట్టి – తెలివైనవాడు! చిట్టి ఉత్తరాలకి రాజా, నేనూ ఏం జవాబు రాయగలం? ఇద్దరికీ వచ్చే ఆ స్కాలర్‌షిప్ డబ్బులో సహం ఇంటికి పంపుతూనే ఉన్నాము.

మామగారి జీతం, ఆ డబ్బూ–మొత్తం కలిపి ఇల్లూ, పిల్లలు చదువులూ ఎలాగో వెళ్ళబోస్తున్నారు. చిట్టి ట్యూషన్‌కేం వెళతాడు?

ఏం కాలేజీలో ఏం లోకమో! ఏం లెక్చరర్లో ఏం చదువులో! కాలేజిలో ఏం చెప్పరు! ఇళ్ళ దగ్గర ట్యూషన్లు చెపుతారు!

మనస్సంతా పాడయింది. నీళ్ళు పోసుకొచ్చిన 'ఫ్రెష్‌నెస్' అంతా తుడుచుకుపోయింది. బతుక్కి హాయి ఎక్కడ? దిగులు పట్టుకుంది!

ఈ రిసెర్చిలో ఇద్దరం చేరకుండా ఉంటేనే బాగుండేదేమో! ఇద్దరం సైన్సు వాళ్ళం! ప్రోస్టుగ్రాడ్యుయేట్లం! ఫస్టుక్లాసు స్టూడెంట్లం. మా పెళ్ళయిన వెంటనే మమ్మల్నిద్దర్నీ చూసి ఎంత మంది అసూయ పడ్డారని! జోడి కుదరడమంటే అలా కుదరాలి అని ఎంత పొగిడేరని! ఇద్దరికీ స్కాలర్‌షిప్పులు దొరికి ఇద్దరూ రీసెర్చిలో జాయినయ్యేసరికి "ప్రామినెంట్ ఫిగర్స్" అయిపోయేము. అందరి కళ్ళలోనూ పడ్డాము! సైంటిస్టు దంపతులు! క్యూరీ దంపతులు! అంతటివాళ్ళవాలనే తపన! ఆశ! ఆశయం! ఇటు కుటుంబాలు, అటు కుటుంబాలు అంతా సంతోషించేరు. గర్వపడ్డారు. కాని, ఏం లాభం? నాలుగేళ్ళు గడిచేయి! ఈ యూనివర్శిటీలు! ఈ రీసెర్చిలు! ఈ చదువులు! ఉత్సాహం చప్పగా చల్లారిపోయింది! ప్రొఫెసర్లు అప్ టు డేట్ నాలెడ్జితో ఉండరు. సైంటిఫిక్ జర్నల్సు చదవరు! వాళ్ళు పని చెయ్యరు. పని చేద్దామన్న పట్టుదలతో ఉన్న పిల్లల్ని ప్రోత్సాహపరచరు సరికదా, నీళ్ళు కార్చేస్తారు. నిరంతరం అధ్యయనం చేయందే ఆచార్య అర్హత లేదన్న ప్రాథమిక విషయం మరిచిపోయిన గురువులు! వాళ్ళ జ్ఞానం పెద్ద ఫుల్‌స్టాప్‌తో ఆగిపోయింది. తాము తమపై నున్న "కుర్చీ"కి ఎలా ఎగబాకడమా అన్న తాపత్రయంతో ఆ రాజకీయాల్లో పడి కొట్టుమిట్టాడే వాళ్ళకి అప్ టు డేట్ నాలెడ్జి ఎలా ఉంటుంది? జర్నల్సు రిఫర్ చేసే తీరుబడి ఎక్కడ దొరుకుతుంది? అన్ని హంగులతో ఓ మంచి ఇల్లు, సోఫా సెట్లు, డైనింగ్ సెట్లు, రిఫ్రిజిరేటర్లు, కార్లు, డబ్బు, హోదా – కావాలి! వీటి కోసమే పాట్లు! రోజు రోజుకీ దిగజారిపోతున్న గురువులు! వీటన్నిటి మధ్యా మీదికి లేచి డాక్టరేట్లు పుచ్చుకొని గురువులని మించిన శిష్యులు ఉండటం లేదా? లేకేం? ఉంటున్నారు. కాని, వాళ్ళ యోగ్యతలు వేరు! ఆ యోగ్యతలు రాజుకీ లేవు, నాకూ లేవు! డబ్బున్నవాళ్లం కాము! పెద్దవాళ్లెవరికీ సంబంధీకులం కాము! పుల్ ఉన్నవాళ్లం కాము! కనీసం నేను బ్రాహ్మణపిల్ల కాకుండా ఉన్నా ఈపాటికి రీసెర్చి పూర్తి అయిపోయేది! రాజు ప్రొఫెసరు మరీ అన్యాయం! ఎప్పుడూ యూనివర్శిటీలో ఉండే ఉండడు. ఈ మీటింగో, ఆ మీటింగో ఏదో ఓరకంగా దేశం అంతా తిరుగుతూనే ఉంటాడు. పెద్దవాడు! గొప్పవాడు! ఆయన ఈ తిరుగుడుతో సైన్సు పురోగమిస్తుందా? ఆయన బాంక్ బాలెన్సు పెరుగుతూంది!! సనాతనుడు! ఆర్. ఎస్. ఎస్. వాడు! ప్రోగ్రెసివ్ కబుర్లు చెప్పే రాజంటే ఆయనకి ఒళ్లు మంట! రాజు, తనూ ఆ వలయంలో చిక్కుకున్నారు! కొట్టుకుంటున్నారు! యూనివర్శిటీ చుట్టూ బ్రహ్మజెముళ్ళు! విజ్ఞానం చుట్టూ నాగజెముళ్లు!

పొరపాటే చేసేమని అనిపిస్తూంది. అలా అంటే రాజు కస్సుమంటాడు. "ఏంబిషన్' ఉండడం పొరపాటా? ఏదో అవుదామనుకోవడం పొరపాటా? పొరపాటు నీదీ, నాదీ కాదు! చుట్టూ ఉన్న విషపురుగులది!" రాజుని కదిపితే ఇల్లాగానే మాట్లాడతాడు! మాట్లాడేది పచ్చినిజం అయినా, చుట్టూ ఉన్నవాళ్ళు రాజుని 'ఉగ్రవాది' అంటారు. చుట్టూ జరుగుతున్న పొరపాట్లని, అన్యాయాల్ని తర్కయుక్తంగా కారణాలతో సహా చెప్పేవాడు దేశంలో 'యంగ్ టర్క్' అవుతున్నాడు! రాజుని

సమర్థిస్తూ తను మాట్లాడితే భర్త మాటలకి తందానతాన పాడుతూంది అంటారు!! ఈ పరిస్థితుల ఉక్కిరి బిక్కిరిలో బతుకుతో ఎక్కడ రాజీ పడడం?

"వాడు కూడా వస్తాడనుకున్నాం. పండక్కీ పబ్బానికీ కూడా ఇంటికి రాకుండా చెయ్యాల్టే ఆ రీసెరిచి! నాకు తెలీకడుగుతా—ఇంక ఎన్నేళ్లుట ఈ చదువు? వాడూ నీలా చిక్కి శల్యమయ్యేడా? ఏమన్నా బాగున్నాడా?" ముసలమ్మగారు అడుగుతున్నారు.

"శాంత ఉషాస్కూలుకు వెళుతోంది. ఇంట్లో ఉత్తినే కూర్చుంటే ఏం తోస్తుంది? అందుకే నేనే వెళ్లమన్నాను. దానికీ ఖర్చే అనుకో. గుడ్డలు కొనందే వాళ్లు మాత్రం ఏం చెపుతారు? పాతగుడ్డలు పట్టుకెళితే నేర్పరు సరిగదా, ఎగతాళి చేసి నవ్వుతారుట! అమ్మలు టెన్తులో కొచ్చిందాఏం చేస్తుందో మరి? తిన్నగా చదవదు. ఎప్పుడూ పుస్తకం పట్టుకోవడమే కనిపించదు. నా మొహం! వాళ్ళిద్దరికీ పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది; శాంత దగ్గర అది నేర్చుకుంటుందా? ఇరవై నాలుగ్గంటలూ కీచులాడుకుంటూనే ఉంటారు. అదెప్పుడో పోసయింది. అన్నీ మరిచిపోయింది. దానికేం రాదంటుంది. అమ్మలు నీకు రాదు అంటే శాంత ఎగురుతుందనుకో. కాని, మనలో మన మాట, పాసయి అప్పుడే నాలుగేళ్లవుతోందా? ఇంట్లో ఉత్తినే కూర్చుంటే మరిచిపోదూ? చదివిస్తే బి.ఎస్సి. అయిపోయి ఉండేది. సంబంధాలా? చూస్తూనే ఉన్నారు మీ మామగారు! డబ్బు పొయ్యందే కుదరవే, తల్లీ! చదువుకున్నదానివి నీకు తెలీనిదేముంది? మీ ఇద్దరి రీసెరిచి పూర్తికావాలి. పిల్లలు ఎదిగిరావాలి. అంతవరకూ ఈదాల్సిందే. ఏం చేస్తాం?"

ఎమ్.ఎస్సి. ఫస్టు క్లాసులో పాసయిన నాకూ కట్నం ఇస్తేనే రాజు దొరుకుత! నా తండ్రీ ఈ ఉచ్చుల మధ్యే ఉరి పడుతున్నా నాకు రాజుని వెదికి తెచ్చి ఇచ్చేడు! రాజుని చూసి ఇద్దరమూ స్నేహితులై, సహకర్ములై ఆదర్శంగా జీవించవచ్చని మురిసిపోయాను. జీవితపు చేదునిజాలు పూర్తిగా తెలీని రోజులవి!

శాంత కోసం ఆరాటపడుతున్న అత్తగార్ని ఎలా ఊరడించాలి? వయస్సు మళ్లిన అత్తగారూ నన్నూ పెద్దదానిగా చేసి మాట్లాడుతున్నారు! నేను ఎత్తుగా ఎదిగిపోయాను. నిజమే! అయితే ఈ ఎదుగుదలతో ఈ ప్రశ్నలకి జవాబులు చెప్పగలనా? మెట్రిక్యులేషన్ పాసయిన శాంతికి డబ్బు పొయ్యందే మొగుడు దొరుకుతాడా? నేను తెచ్చిన కట్నం మిగిలే ప్రశ్న లేదు. పెళ్లికి ముందే, రాజు చదువుకీ ఇంటికీ అయిన అప్పు తీర్చడానికే ఆ కట్నం సరిపోయింది!

"రెండోవాడి సంగతి అడక్కమ్మా! వాడెవరి మాటా వినడు, ఎవరన్నా భయం లేదు, భక్తీ లేదు. వాడితో మాట్లాడ్డమంటే మాకే భయం. ఇప్పుడప్పుడే ఇంటికే వస్తాడా? వాడి మీటింగులూ, వాడి పనులూ పూర్తి అయి ఏ రాత్రప్పుడో వస్తాడు! వాడే వంటింట్లోకి వెళ్ళి అన్నం పెట్టుకుని తింటే తింటాడు. లేకపోతే అలాగే పడుకుంటాడు! పోతే పోయింది పరీక్ష, మళ్లీ కట్టకూడదూ? పరీక్షలు పోయినవాళ్ళు మళ్లీ మళ్లీ కట్టి పాసవటం లేదూ? మీరు చదివే చదువులు చదువులు కావట! బి.ఎ. పోయిందన్న చింతే వాడికి లేదు! పరీక్ష పోయి జ్ఞానోదయం అయిందంటాడు. నాకేం బోధ పడదనుకో. చిట్టిగాడు చెపుతాడూ—'చిన్నన్నయ్య విప్లవం తెస్తాడు! మీటింగులూ అవీ అందుకే చేస్తూ ఉంటాడు' అని! ఒక్కొక్కసారి వాణ్ణి చూస్తే భయం వేస్తోంది.

బెంగగా ఉంటోంది! రాజు వస్తే వీడి సంగతి ఏమన్నా కనుక్కుంటాడేమో, కేకలేసి ఓ దారికి తెస్తాడేమో అనుకున్నాను. వాడు రానేలేదు. నువ్వయినా కాస్త కనుక్కో, తల్లీ!"

పెద్ద మరిది కృష్ణుడి గురించి రాజుకీ నాకూ తెలియకపోవడమేం? తెలుసు! కృష్ణుడు ఉగ్రుడు! అత్తగారికి కృష్ణుడు అర్థం కాడు. నాకు అర్థం అయినా నేను అత్తగారికి బోధపరచలేను!

"పోనీ చదువంటే మానీసేడు. ఎందులో అన్నా బుర్ర దూరుస్తే ఎంత బాగుణ్ణు! వేణ్ణీళ్ళకి చన్నీళ్ళు! వినే వినిపించుకోడు. మీ మామగారి కష్టం పెద్దవాడైనా వాడికి బోధపట్టం లేదు. బాధ్యత చెపితే వస్తుందా, దానంతటది రావాలిగాని!"

కొడుక్కి చెప్పుకోవల్సిన బాదర బందీ అంతా కొడుకు రానందుకు నాతోనే చెప్పుకుంటున్నారు. అవును. నేను కోడుకుతో సమానమైనదాన్నే! రాజు పెద్దకొడుకు. నేను ఇంటికి పెద్దకోడల్ని, అంతేనా - కొడుకెంత గణించగలడో నేనూ అంతే గణించగలను. అత్తగారు, మామగారు, చిన్న మరదలు, ఆడపడుచులు, ముసలమ్మగారు ఇంటిల్లిపాదీ నన్నిలా చూడ్డానికి కారణం అదే! ఒక్క కొడుకు మీదే కాదు ఆధారపడత! కొడుకూ, కోడలూ ఇద్దరిమీదా ఆధారపడి - మీరిద్దరే ఈ బండి లాగి సంసారాన్ని ఓ ఒడ్డుకి చేర్చాలి అంటున్నారు!

రాజు చూడబోతే వీటన్నిటికీ దూరంగా ఉండాలనే నిశ్చయాని కొచ్చీసేడు. నేనేమన్నా తర్కం పెరుగుతూంది కాని, లాభం లేకపోతూంది.

"దసరా దశమీ లేదు, గిశమీ లేదు, సబ్మిట్ చెయ్యాల్సిన పేపర్లు పడి మూలుగుతున్నాయి. నువ్వూ వెళ్ళక్కర్లేదు. నేనూ వెళ్ళక్కర్లేదు. వెళితే అయ్యే డబ్బు కావాలంటే ఎమ్. ఓ. చేద్దాం" అన్నాడు రాజు.

"డబ్బుకాదు ముఖ్యం. మనిద్దర్నీ చూసి చాలా రోజులైంది. ఎప్పటికప్పుడు రండి, రండని మీ అమ్మగారు ఉత్తరాలు రాస్తున్నారు. ముసలమ్మగారు సరేసరి. పిల్లల సంగతి అడగే అక్కర్లేదు. వారి సెంటిమెంటునీ మనం కాస్త చూడాలి" అన్నాను నేను.

"సెంటిమెంటుట! సెంటిమెంటు! నువ్వూ ఉత్తి మామూలు ఆడదానిలా మాట్లాడుతున్నావ్! డబ్బు తగలెయ్యడం తప్ప ప్రయోజనం సున్నా. నువ్వెళ్ళిపోతే నా పేపర్లు టైప్ ఎవరు చేస్తారు?" రాజు విసుక్కున్నాడు. అసలు ఈమధ్య రాజుకి విసుగు ఎక్కువైపోతూంది. అసహనం పెరిగిపోతూంది. రాజు మారిపోతున్నాడు. నాకు తెలుసు - వీటన్నిటికి కారణాలు ఉన్నాయి. కారణాలు తెలిసి ఏం లాభం? వీటిలో వేటినన్నా సరిచెయ్య గలనా? ఎందుకీ వివేకం? ఎందుకీ విచక్షణ? రాజుకు హెల్పు చెయ్యలేకపోతున్నాను. ఇంటికీ హెల్పు చెయ్యలేకపోతున్నాను. నాకు నేను ఏమీ కాలేక పోతున్నాను. అత్తగారు, మామగారు, ముసలమ్మగారు ఎవరికివారు రైటే. పిల్లలు వాళ్ళకి వాళ్ళు రైటే. కృష్ణుడు? అతనికి అతనూ రైటే! రాజు? రాజుకి రాజూ రైటే.

రాజు ముందే చెప్పేడు: "ఇంటికి వెళ్ళేవా మరింత దిగజారి కుంగిపోయి వస్తావ్. ఉన్న కాస్త ఉత్సాహం ఇగిరిపోతుంది. నీ మూడ్స్ పాడవడమేగాక నన్నూ

చంపుతావ్! కొన్నాళ్లవరకూ మళ్లీ పనిలో పడలేం; చేసే దేమన్నా ఉందా? ఊహుఁ! చెయ్యగలిగేదేమన్నా ఉందా? ఊహూ! నథింగ్!"

రాజు ఎస్కేపిస్టు అయిపోతున్నాడని నేను దెబ్బలాడాను. "ఎస్కేపిస్టు నేమిటి? అన్నిటినీ దులిపేసుకుని దూరంగా ఉండదలుచుకుంటేనే!" అని రెచ్చిపోయేడు.

అత్తగారికి మాత్రం తెలీదూ? ఈ బాధలన్నీ క్షణంలో తీరేవికావనీ, నేనుకాని, రాజుగాని ఏం చెయ్యలేమనీ! వయస్సూ, బతుకూ ఆవిడకి పాఠం చెపుతూనే ఉన్నాయి. అయితే వీళ్లందరి మనస్సులోనూ అట్టడుగున ఉన్న భావం నాకు తెలుస్తూనే ఉంది. గట్టిగా ఆ మాట వాళ్ళు అనటం లేదు. అనలేకపోతున్నారు! ఈపాటికే రీసెర్చిలు మానేసి ఇద్దరూ ఉద్యోగాలు చేస్తే ఓ దరికి చేరవచ్చునని మధ్య మధ్య నాకూ అనిపిస్తూంది. అయితే ఇంతకాలం శ్రమపడి డాక్టరేటు పుచ్చుకోకుండా ఉండడం – నామోషీకి నామోషీ సమయానికి సమయం దండగ!! ఉద్యోగాలన్నా ఏవీ ఎదురుగా! బాధలన్నీ ఏకరువు పెడితే వినడానికి తనవాళ్లన్న వాళ్లు ఎవరన్నా కావాలి. సానుభూతితో ఊఁ కొట్టేవాళ్లు ఉంటే కాస్త ఊరట!! పండక్కి వచ్చి ఆ ఊరటే కలగ చేద్దామనిపించింది! మారిపోతున్న రాజుకీ, మా మీద ఆశ పెట్టుకుని ఆధారపడి ఉన్న వీళ్లకీ నేను సేతువు! ఈ సేతువూ కూలిపోయేటట్లు ఉంది!

"బొమ్మలకొలువులు వదినని తీసుకెళ్ళి చూపించవే, శాంతా! నువ్వూ నలుగు రిళ్లకీ వెళ్ళినట్లూ అవుతుంది, చూసినట్టూ అవుతుంది. బామ్మగారు చూసివచ్చేరు. అమ్మలూ, నేనూ వెళ్ళివచ్చేం. అందరూ అడగడమే – శాంత రాలేదేమండీ? అని! వెళ్లమ్మా, శాంతతో నాలుగు కొలువులూ చూసిరా. మా రోజుల్లో ఉన్న సరదాలు మధ్యకాలంలో పోయినా మళ్ళీ ఈ కాలపు పిల్లలు వాటికే ఎగబడుతున్నారు. పేరంటానికే వెళుతున్నారు. ఎటొచ్చీ కుంకంబరిణ పట్టుకుని వెళ్ళి పిలవటం లేదు! కార్డులు పంచిపెడుతున్నారు, కార్డులు!" అత్తగారు శాంతకీ చెప్పేరు. నాకూ చెప్పేరు. శాంత ఊఁ ఆఁ అనలేదు, కదల్లేదు.

"ఏమే, వెళ్లవా? ఇదీ తల్లీ, వరస! ముంగిలా ఇంట్లోనే కూర్చుంటోంది! ఎలాగో నా బాధపడలేక ఆ ఉషా స్కూలుకి వెళుతోంది! ఎవరింటికీ వెళ్లదు, ఏమన్నా అంటే, వాళ్లంతా కాలేజీలో చదువుతున్నారు, తనతో తిన్నగా మాట్లాడరు. వాళ్లకి గర్వం, టెక్కు, మిడిసిపాటు అంటుంది! అదో గోడలా తయారవుతోందనుకో! వదిన చదువుకున్నది కాదా! వాళ్లకంటే ఎక్కువే చదువుకుంది. వదినతో ఎలా మాట్లాడుతున్నావ్ అంటే, వదిన చదువుకున్నదానిలా కనిపించదు అంటుంది. ఏం చెప్పమంటావ్? అమ్మలూ, అది గుమ్మం కదలదు. వదిన్ని నువ్వు తీసుకెళ్లవ్!"

వచ్చిన దగ్గర్నుంచీ చూస్తున్నాను–శాంత అదో మాదిరిగా ఉంది. పెళ్లై నేను వచ్చేసరికి మెట్రిక్యులేషన్ పాసయింది! ఆ చక చకా, ఉత్సాహం ఇప్పుడెక్కడా లేవు. శాంతకి తక్కువతనం పట్టుకుంది. ఇన్ఫీరియారిటీతో బాధపడుతూంది! మగపిల్లల చదువులకే డబ్బు పెట్టడానికి అల్లల్లాడిపోతూ ఉంటే శాంతిని కాలేజిలో ఎక్కడ చేరుస్తారు? ఇంట్లో కూర్చోపెట్టేరు! పెళ్ళయేదాకా గోళ్లు గిల్లుకుంటూ కూర్చోమన్నారు! ఆ పెళ్ళి ఎప్పుడవుతుందో ఎవరికీ తెలీదు!

కాలేజీలో చదువుతున్న అమ్మాయిలు, వాళ్ళ వేషభాషలు, మాటతీరూ, ఏదో పెద్దచదువు చదివేస్తున్నామన్న టెక్కూ, భేషజం, నటన, ఏమీ రాకపోయినా ఏదో తెలిసున్నట్టు పోజుకొడుతూ అందర్నీ వెటకారంగా చూడ్డం, డిగ్రీలు చెప్పకుని గొప్పవడం! వీళ్ళని చూసి శాంత బెదిరిపోయి లోలోపల ముడుచుకుపోతూంది! కాలేజీ చదువులు వివేకాన్ని పెంచడం లేదు! వినయాన్ని నేర్పటం లేదు! అన్నిరకాల ఆడంబరాల్ని పెంచుతున్న ఈ చదువుల శాలలకి నిప్పుపుల్ల గీస్తే!

వదిన చదువుకున్నదానిలా కనుపించదు! నాకిది కాంప్లిమెంటు! గొప్ప కాంప్లిమెంటు!

శాంత కోసం నేనేం చెయ్యాలి? చుట్టూ ఉన్న వాతావరణాన్ని తిట్టడమా? చదువు చెప్పించలేని పెద్దల్ని నిందించడమా?

చదువు చెప్పించకాపోయి పెళ్ళి చెయ్యాలేకపోయి శాంత మనస్సుని రోగిష్టి మనస్సుగా చేస్తున్న పెద్దల్ని ఏం చెయ్యడం?

పెద్దలు ఎవరు? మేమే! ఏం చెయ్యలేని అశక్తులు! ఆ పెద్దల్లో నేనూ ఉన్నాను? అశక్తతకి కారణం ఏమిటి? అశక్తతకి కారకులు ఎవరు? ఈ కారణాలు వెతికే కృష్ణుడు ఉగ్రుడయేడు! ఈ కారణాలవల్లే రాజు మారిపోతున్నాడు! నా బుర్ర పిచ్చెక్కిపోతూంది.

వచ్చి రెండు రోజులైంది. రెండు రోజులూ రాత్రుళ్ళు అత్తగారు ఏం తినకుండా పడుకున్నారు!

"నీకేం తెలీదు, వదినా! అమ్మ కెన్ని వారాలో! ఏడు వారాలు పూర్తి చేసేస్తే మంచిదని చెపుతున్నాం' వెంకట్రమణ మూర్తిదోవారం! సూర్నారాయణ మూర్తికో వారం! పరమశివుడి కో వారం! ఇదిగో, ఇప్పుడు వీటికి మరో వారం కలిసింది. లక్ష్మింవారం! బాబావారం! ఏమిటనుకున్నావ్? ఎందు కనుకుంటున్నావ్? ఓ వారం శాంత పెళ్ళి కోసం, మరో వారం చిన్నన్నయ్య తిన్నగా దారికి రావడం కోసం! ఇంకో వారం అల్ టుగెదర్ మనందరి శుభంకోసం! మంచికోసం! ఓ వారం నీకోసం; అన్నయ్యకోసం స్పెషల్!! మళ్ళీ ఒంట్లో ఏమన్నా బాగుంటోందా? కాళ్ళ నొప్పులు, నడుం నొప్పి! పండగయేది పబ్బమయేది ఏం తినదు కదా!"

"ఏడిసేవ్! వెధవ చెప్పడాలూ నువ్వూనూ! మిమ్మల్నేమన్నా చెయ్యమంటు న్నానా? నా పిచ్చి నమ్మకాలు నావి! మీరేమన్నా చేస్తున్నారా? మిమ్మల్నే మన్నా భజన చెయ్యమన్నానా?" అత్తగారు కసురుకున్నారు. కష్టాలు మూర్ఖత్వాన్నీ, మౌఢ్యాన్నీ పెంచుతున్నాయి!

మాలక్ష్మి మందిరం దగ్గర దేవుడి ఫోటోల్లో బాబా ఫోటో ఉండడం చూశాను. కాని ఇంట్లో ఈ పిచ్చి వీళ్ళని పట్టిందనుకోలేదు!

"బామ్మ మరీ అనుకో! శివపూజ చేసుకుంటున్నావుగా! ఆ బాబాకన్నా నీ శివలింగమే గొప్పదంటే వినందే. ఇప్పుడు మూడు కోవెళ్ళకీ వెళ్ళటం మానేసింది! బాబా భజనకి వెళుతోంది! లక్ష్మివారం వరకూ ఉంటే నిన్నూ తీసుకెళుతుంది. అవునా, బామ్మా?"

"నోర్మూయ్యి, బడుద్దాయి వెధవా!" ముసలమ్మగారు ఒంటికాలిమీద లేచేరు. రమణ అక్కణ్ణించి పారిపోయేడు.

"చూసేవా, మనవరాలా, వీళ్ళ రాలుగాయితనాలు! అదిగో ఆ కిష్టిగాణ్ణించే కుర్ర వెధవలంతా ఇలా తయారవుతున్నారు! పరాయి ఇంటి నుంచి వచ్చిన పిల్లయినా, పెద్ద చదువు చదువుకున్నా మీ వదినకి మంచీ చెడ్డా తెల్సు! మీలాంటిది కాదు! అవునే, మనువఁరాలా! లక్ష్మింవారం వరకూ ఆగకూడదు? మళ్లీ ఎన్నాళ్ళకి వస్తావో ఏమో! నీ అత్తగారూ, నేనూ అదే అనుకుంటున్నాం. పెళ్లై నాలుగేళ్ళయినా మనవఁరాలు నీళ్ళోసుకోలేదని ఊఁ ఇదవుతున్నాను. బాబాగారికి దణ్ణం పెట్టుకోండి, మళ్ళీ ఈ రోజులకి పండంటి మునిమనమణ్ణే ఎత్తుతారు అన్నారు చిట్టెమ్మగారు! వారింట్లోనే భజన! ఉపోషా లుండమని నీకు చెప్పను అనుకో. ఈ కాలప్పిల్లలు, మీ రుండలేరు! మాలా సాగలేరు. అయితే ఏం? లక్ష్మింవారం లక్ష్మింవారం ధ్యానం చేసుకో, అమ్మా!" ముసలమ్మగారు బోధచేసేరు.

రాజు, నేను మా జాగ్రత్తలో మేము ఉన్నాము. లేకపోతే ఈపాటికి ఇంకా చింతల్లో పడిపోయేవాళ్ళం! ముసలమ్మగారికేం చెబుతాను–మాకు ఇప్పట్నించీ పిల్లలక్కర్లేదని! కావాలనుకున్నప్పుడు బాబాగారి దయ అక్కర్లేదని! చెప్పినా ఆవిడ కోరిక ఆవిడదే! ఆమెతో, అత్తగారితో వాదించడం, బోధపరచడం అనవసరం!!

లక్ష్మింవారం వరకూ ఉండడానికి వీల్లేదని మర్నాడే బయలుదేరాను. ఈసరికే రాజు అక్కడ పేపర్లు టైప్ చేసుకోలేక గొడవ పడుతూ ఉంటాడు! నేను వెళ్ళి అవి టైప్ చెయ్యాలి!

మామగారు నేను ఉన్నన్నాళ్ళూ నాతో ఏం విశేషించి మాట్లాడలేదు. బయలు దేరుతూ ఉంటే–"రాజుని ఉత్తరాలు రాస్తూ ఉండమని చెప్పమ్మా!" అన్నారు. రాజు ఉత్తరాలు ఆయనకి ఆసరా!

చిట్టికి నోట్సులు ప్రిపేర్ చేసి పంపుతానని మరోసారి చెప్పాను. తెలీనివి ఉత్తరాల్లో రాస్తే బోధపరుస్తూ జవాబు రాస్తానని ఇంకోసారి చెప్పాను.

రిక్షా ఎక్కబోతూ ఉంటే, "వదిన గాగుల్స్ ఇచ్చేసేవా, లేదురా?" అంటూ మామగారు రమణని అడిగేరు.

నేను వచ్చిందగ్గర్నుంచీ రమణ ఆ గాగుల్సు పెట్టుకునే ఉన్నాడు. చిన్న పిల్లాడు. సరదా ఎక్కువ! బయలుదేరే ముందు తనంత తనే ఇచ్చేసేడు. "తీసుకో, రమణా!" అంటూ నేను ఇచ్చేస్తే పొంగిపోతాడు. తనంత తాను కావాలని అడగడు. కాని అతి కష్టం మీద, కిందా మీదాపడి రాజు తిట్టే తిమ్మి నాకా గాగుల్సు కొని ఇచ్చేడు! రమణ కిచ్చేస్తే నేను మళ్ళీ కొనుక్కోలేను! మనస్సుని అదిమి రమణ చేతిలో గాగుల్సు తీసుకున్నాను! ఇదీ బతుకు!

లక్ష్మింవారం వరకూ ఉండలేదు. అయితే ఏం? ముసలమ్మగారు చిట్టెమ్మ గారింటికి వెళ్ళి బాబా విభూతి తీసుకొచ్చి, భద్రంగా మూటకట్టి ఇచ్చేరు.

రిక్షాలో కూర్చున్నాక మరోసారి చెప్పేరు: "లక్ష్మింవారం లక్ష్మింవారం ధ్యానం చేసుకో, అమ్మా! విభూతి పెట్టుకో. మరిచిపోకు."

ఇదీ బతుకులోని వ్యంగ్యం!

"బెల్లమావకాయ వాడికిష్టం అని సీసానిండా పెట్టేను. నూనె కారకుండా బట్టకట్టేననుకోకాని, మధ్యలో ఓసారి చూస్తూ ఉండు." అత్తగారు జాగ్రత్త చెప్పేరు.

"వదినా! నన్ను నీతోపాటు తీసుకెళ్ళవా? అన్నయ్య దగ్గరా, నీ దగ్గరా ఉంటాను." బయలుదేరేముందు అడిగింది శాంత. ఎప్పుడూ ఏమీ అడగని శాంత! లోలోపల ముడుచుకుపోతున్న శాంత!

నేను జవాబు ఏం చెప్తాను? అలాగే అని తీసుకెళ్ళాలేను. కాదని చెప్పాలేను. "మీ అన్నయ్య వస్తారు. ఆయనతో వద్దువుగాని" అన్నాను.

ఇదీ బతుకులో వంచన!

చిట్టివచ్చి ట్రెయిన్ ఎక్కించేడు. ఇంకో విజయదశమిని భూతకాలంలోకి పంపి దిగులుని, దుఃఖాన్ని, విచారాన్ని, పరాజయాల్ని పదిలపరచుకుని ఇంటినుంచి రాజు దగ్గరికి వెళుతున్నాను! నిరుత్సాహాన్ని మూటకట్టుకుని రాజు దగ్గరకి వెళుతున్నాను.

ఉన్న నాల్రోజులూ కృష్ణుడు ఇంట్లో తిన్నగా కన్పించలేదు! ఏరాత్రప్పుడో వచ్చి తెల్లవారకుండా మాయమైపోయేవాడు! అలాంటిది ఆశ్చర్యం, ట్రెయిన్ టైమ్‌కి సరిగ్గా ఎక్కణ్ణించి వచ్చేడో, నా కెదురుగా నిలుచున్నాడు!

"ఏం వదినా! చిన్నపుచ్చుకుని, దిగులుతో వెళుతున్నావా? విచారంగా, భారంగా నువ్వుంటే ఎలా? ఈ సమస్యలు మనింటివే కావమ్మా, ఇంటింటివీ!

వదినా! ఇంటింటినీ, మొత్తం యావత్తుదేశాన్నీ కుదిపి కుదిపి కదిలిస్తే నేకాని వీటికి జవాబు దొరకదు! అప్పుడే ఇవన్నీ ఓ కొలిక్కి వస్తాయి!

ఆ రోజు వస్తుంది! మనం దిగులుపడకూడదు. నిరుత్సాహపడకూడదు! ఆ రోజు కోసం మనం పని చెయ్యాలి. నడుం కట్టాలి.

నీ లాంటివాళ్లే కుంగిపోతే, దిగాలుపడిపోతే, బెదిరిపోయి నిరుత్సాహపడితే ఆ రోజు దూరమైపోతుంది!

వదినా! ఛి యర్ అఫ్! వదినా! ఛి యర్ అఫ్!"

రైలు కదిలి 'ఛియర్–అఫ్, ఛి యర్–అఫ్, ఛి యర్–అఫ్, ఛి యర్–అఫ్' అంటూ వేగాన్ని అందుకుంది.

కృష్ణుడి కళ్ళలోని స్నేహం, ఆర్ద్రత, పట్టుదల, ఆశావాదం నా వెంట పరుగెట్టుకుంటూ వస్తున్నాయి!

● ప్రచురణ కాలం ? ●

★ ★ ★

47

సదానంద్ శారద

# తొక్కుడుబండ

అతని మొహంలో విసుగులేదు.

అతని వొంటిమీద అంగీలేదు.

అతని వయసు మూడు పదులు దాటలేదు.

అతని పేరు గంగడు.

అతని తల్లి బ్రతికివుంటే ప్రేమగా "గంగన్నా" అని పిలిచేది. తండ్రివుంటే "గంగులూ" అనేవాడు. అతనికో పదెకరాల పొలంవుంటే గంగారావుదొర అయ్యేవాడు. అతనికి డబ్బుంటే షావుకారు గంగయ్య అయ్యేవాడు.

ప్రస్తుతం పాపారావు మనవఁడికి గుర్రం అయ్యాడు. ఇంకాస్సేపట్లో పాపారావు మనవరాలికి నిచ్చెన అవుతాడు. ఆ అమ్మాయికి గన్నేరు పూలగుత్తి అందడం లేదు.

"ఒరే గంగడూ, పూలగుత్తి అందడంలేదురా....." అని పిలిచింది–

"నేను తెంపియ్యనా అమ్మగోరూ...." అంటూ వెళ్ళాడు గంగడు.

"ఉహూఁ....నేను తెంపుకుంటా" అంది.

అతని వీపుమీదికి ఎక్కి ఆ అమ్మాయి పూలగుత్తులు కోసుకుంది. మొహాన నవ్వులు పూసుకుంది.

అంతలో పాపారావు భార్య రంగమ్మగారు–" "అరేయ్ పెదబాబు స్నానం చేస్తాడట నీళ్ళుతోడు పో...." అని చెప్పారు.

గంగడు నీళ్ళు తోడడానికి వెళ్తూంటే పాపారావు... "జల్దిన కచ్చరం కట్టమన్న గదరా – కట్టినవా?" అని అడిగాడు.

గంగడు రంగమ్మగారి వంక చూశాడు... ఇందాక కచ్చరం కట్టడానికి వెళ్తుంటే, ఆమె వొద్దన్నారు.

"అమ్మగోరు వొద్దన్నారు దొరా..." చేతులు నులుముకుంటూ అన్నాడు గంగడు.

"నేను కట్టమన్నాకదా. కట్టు పో నడూ" కోపంగా అన్నాడు పాపారావు.

ఎవరు చెప్పింది చేయాలో అర్థంగాక భయపడుతూ గంగడు రంగమ్మగారి వంక చూచాడు.

"ఇప్పుడెందుకండి కచ్చరం? అరేయ్, నువ్వు నీళ్ళుతోడు పో....." అన్నారు రంగమ్మగారు.

గంగడు భయంగా దొరవైపు చూశాడు.

"ఇంక ఈడనే నిల్చున్నవేందిరా....పో....." కసురుకున్నారు రంగమ్మగారు.

దొర మాట్లాడకపోవడంతో నీళ్ళు తోడడానికే వెళ్ళాడు గంగడు.

"ఇప్పుడు కచ్చరం ఎందుకండీ?" అని మళ్ళీ అడిగారు రంగమ్మగారు భర్తను.

"జెర కల్లెడకుపోయే పనుంది......."

"మీకు పనిలేంది ఎప్పుడుగాని పెదబాబు ఇల్లెందకు వెళ్తున్నాడు, రేపు పోదురులెండి."

"వాడు పోయేది మధ్యాహ్నం కదే....అప్పటోరకు రానూ...అయినా పెదబాబు కొత్తగా పోతున్నాడా ఇల్లెంద? పోయి వస్తూనే వుంటాడు కదా......"

"పిల్లలు బస్సులో పోరట – కచ్చరంలో పోతమని ముచ్చటపడుతున్నరండి–"

"నేను రాగానే పంపొచ్చులే.....తయారయి వుండమను" అంటూ భుజం మీద కండువా వేసుకొని వెళ్ళిపోయాడు పాపారావు.

గంగడు దొరగోరిని కల్లెడకు తీసుకపోయి తీసుకవచ్చేసరికి సూర్యుడు నడినెత్తి మీదికొచ్చాడు. ఎండ ఎర్రగా వుంది. గంగడి కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయి.

దొరగారి పెద్దకొడుకు అత్తగారింటికి వెళ్ళడానికి ఆత్రపడుతున్నాడు. అక్కడికి పదిహేనుమైళ్ళ దూరంలో వుంది అతని అత్తగారి ఊరు ఇల్లెంద. భార్య పుట్టింట్లోనే వుంది. ఇద్దరు పిల్లల్ని తీసుకొని తనే వచ్చాడు. మామగారికి కొడుకులు లేనందున వ్యవహారాలు చక్కబెట్టడానికి రెండు ఊర్ల మధ్య తిరుగుతుంటాడు.

"ఈ పెట్టె కచ్చరంల పెట్టుపోరా–" అని గంగడికి ఒక పెట్టె చూపించాడు.

గంగడు పెట్టెనెత్తుకొని పోతుంటే.......

"అరేయ్, ఆ ఎడ్లు అలిసిపోయినయి కావచ్చు....వాటిని విప్పి మేతేసి వేరే ఎడ్లు కట్టుకపో...." అన్న పాపారావు మాటలు వెనకనుంచి వినిపించాయి.

"అట్లనే అయ్యా...." అంటూ వెళ్ళాడు గంగడు.

పాపారావుకు ఎడ్లమీద ఎనలేని జాలి......

పాపారావు పెద్దకొడుకును, అతని పిల్లల్ని మోస్తూ కచ్చరం బయలుదేరింది.

☆ ☆ ☆

బండి చక్రంలా కాలచక్రం గిర్రున తిరుగుతోంది–

బండి ముందుకు పోతోందిగాని చక్రం తనచుట్టు తాను తిరుగుతోంది......

పశువుల పాకముందు కూర్చొని గంగడు పలుపుతాళ్ళు పేనుతున్నాడు.

"ఒరేయ్ ఇట్రా....."

పేనుతున్న తాళ్ళు కట్టెకు చుట్టి పరుగు పరుగున వెళ్ళాడు గంగడు.

"బస్సొచ్చే టైం అయిందా?"

"అయింది చినబాబూ......"

"చినబాబు" పాపారావు చిన్నకొడుకు. పేరు కె.కె.రావు. పూర్తి పేరు కేదాడ కేశవరావు. చదివేది పట్నం కాలేజీలో బి.ఏ., కాల్చేది పొడుగాటి సిగరెట్లు.....ఖాళీచేసేవి ఖరీదైన సీసాలు. నిల్చున్నది అరుగుముందు తొక్కుడుబండమీద. పల్లెటూరు అతనికి ఖైదు. ప్రస్తుతం అతనికి సెలవులు. ఎన్నటికైనా తాను ప్రధానమంత్రినో .....కాకపోతే కనీసం ముఖ్యమంత్రినో అయి గరీబులను, పల్లెటూళ్ళను లేకుండా చేయాలను కుంటున్నాడు. ఇప్పుడు మాత్రం సిగరెట్లు కావాలనుకుంటున్నాడు–పల్లెటూళ్ళో తన సిగరెట్లు దొరకవు... సీసాలు దొరకవు....అందాలు దొరకవు......కాగితం పూలు దొరకవు... కాల్గేట్ నవ్వులు దొరకవు.....కాబరే డ్యాన్సులు దొరకవు....క్యాహై "పల్లెటూర్" మే హటావో!

ఓ పచ్చకాగితం.....ఓ కాగితం ముక్క గంగడికిచ్చి "డ్రైవర్‌కివ్వు.....నేనిచ్చానని చెప్పు. రాత్రి ట్రిప్‌లో వచ్చేప్పుడు తెమ్మను. జాగ్రత్త, ఎవరికీ చెప్పకు–" అన్నాడు.

తలూపి చీటీ, డబ్బులూ రుమాలులో దోపుకొని వెళ్ళాడు గంగడు.

దొడ్డిదారిగుండా వెళ్ళబోతుంటే ప్రక్క గదిలోంచి "ఒరేయ్ గంగా....." అని పిలిచింది.

"పిలిచింద్రా చిన్నమ్మా......" గదిలోకి వెళ్ళాడు గంగడు.

"ష్.....మెల్లగా......" అంటూ చిన్నమ్మ దగ్గరికి పిలిచింది. "మోహన్రావు లేడూ....."

"ఎవలూ, రంగారావు దొర కొడుకా?"

"ఆఁ. ఈ చీటీ ఎవరూ చూడకుండా అతనికివ్వు–"

"అట్లనే....."

"జాగ్రత్త, ఎవరికీ తెలవొద్దు."

"నా పాణంబోయినా చెప్ప చిన్నమ్మగోరూ, మీరు బుగులు పడకుంద్రి" ఆ కాగితం కూడా రుమాలులో దోపుకొని బయటికొచ్చాడు గంగడు.

నడుస్తున్న గంగడికి ఒక సమస్య యెదురయింది. ముందు చినబాబు చీటీ బస్ డ్రైవర్‌కివ్వాలా?....లేక చిన్నమ్మగారి చీటీ మోహన్రావు కివ్వాలా? "బస్సు టైము అయిందిగదా.....ముందుగాల చినబాబుగారి చీటే యిచ్చేపోతా... అని "వడ్లగిర్ని"వైపు నడిచాడు గంగడు. పట్నం నుంచి వచ్చే బస్ అక్కడికి వచ్చి అక్కణ్నుంచే తిరిగిపోతుంది.

గంగడు వెళ్ళేసరికే వడ్లగిర్ని దగ్గర ఎదురు చూపులెన్నో నిల్చున్నాయి. గంగడి చూపులుకూడా యెదురు చూపులై నిల్చున్నాయి.

పది నిమిషాలు అయింది......పావుగంట అరగంట అయింది. ఎంతకూ బస్ రాదు. ఎదురు చూసేదేదీ తొందరగా రాదు!

"ఇంతల చిన్నమ్మగోరి చీటన్నా ఇచ్చి రాకపోతి....." అనుకున్నాడు గంగడు. "పోయి ఇచ్చొద్దునా..." అని రెండడుగులు వేసి ఆగిపోయాడు. "ఇంతల బస్ గిట్టవచ్చి ఎళ్ళిపోతే? రంగారావు దొర కొడుకు యాడికి పోతడు.....ఊర్లనే ఉంటడు.

బస్ ఊర్లె ఉండదు. జెరసేపె నిలబడిపోతది. ముందుగాల చినబాబుగోరి చీటే ఇచ్చిపోతా....." అని తిరిగి బస్ కోసం ఎదురుచూస్తూ నిల్చున్నాడు.

మరో పావుగంట గడిచి పది నిమిషాలయింది.

"ఇయ్యాల బస్సు గింత జాము చేయబట్టె....." అని అడిగాడు పక్కన నిల్చున్న ఓ ఎదురు చూపును గంగడు.

"అఁ గెప్పుడు జల్దిన వచ్చింది గనుక...." అని నిట్టూర్చిందా చూపు.

గంగడి రుమాలు బరువెక్కిపోతున్నది....కాళ్లు తొందర పెడుతున్నాయి. చూపులు దొర ఇల్లవుతున్నాయి. సుబ్బిశెట్టి పొలం దున్నడానికి పొమ్మన్నాడు–

వడ్లగిర్నిలో బస్ దుమ్ము దూరడానికి, పల్లె చెవిలో బస్ హారన్ మ్రోగడానికి మరో అరగంట పట్టింది.

డ్రైవర్‌కు చినబాబు చీటీ, డబ్బులిచ్చి.....మోహన్రావును ఒంటరిగా కలుసుకోడానికి రంగారావు దొర ఇంటి ముందు చాలాసేపు తచ్చాడుతూ నిల్చున్నాడు గంగడు.

ఆ తరువాత–

భయం భయంగానే ఇంట్లో అడుగుపెడుతున్న గంగడికి "ఎక్కడకి పోయినవురా ఇంతసేపు?" అన్న దొర గర్జన వినిపించి వణికిపోయాడు.

"చెప్పవేందిరా?" అది మాటకాదు, పిడుగు!

"నిన్ను ఈడ కూసోని పలుపుతాళ్ళు పేనమన్నానా లేదా?.......సుబ్బిశెట్టి పొలం దున్నడానికి పొమ్మన్ననా లేదా?...... " అని హంటర్ తీశాడు.

గంగడు లేడిలా బెదిరిపోయాడు. ఆకులా వణికిపోయాడు.

"ఈ తాళ్ళీడ పడేసి యెక్కడికి పోయినవో చెప్పు?....." హంటర్ కొస అచ్ఛాదనలేని గంగడి వీపును నిప్పులా తాకింది.

తన పనులెకాక యితరుల పొలాల్లో కూడా గంగడితో పనిచేయిస్తుంటాడు పాపారావు. గంగడికి పోసేది రెండు పూటల అంబలి. కాని గంగడు బయటి పనికిపోతే తెచ్చిపోసేవి కుంచాలకొద్ది గింజలు. అలాంటోడు తనకు తెలియకుండా ఎవరికైనా దొంగతనంగా పనిచేస్తూ గింజలు సంపాదిస్తున్నాడేమోనని పాపారావుకు అనుమానం. వీడినిలా వొదిలేస్తే చేయి దాటిపోతాడు. పాపారావు మొహం కోపంతో కందగడ్డలా అయింది.

"చెప్పిన పనులు చేయకుండా బయటి తిరుగుళ్ళు మరిగినావురా లంజికొడుకా!" అంటూ గంగడిమీదకి దూకాడు– గండుపిల్లి మీసంఉన్న, గుండెలో సీసం ఉన్న ఆరడుగుల పాపారావు.

"చెప్పరా, ఏడికి పోయినవో చెప్పు." హంటర్ కొసలు గంగడి వీపుమీద గంతులు వేశాయి.

ఏం చెప్పాలి?......"చినబాబుగోరు" పంపారని చెప్పడానికి వీల్లేదు– "చిన్నమ్మగోరు" పంపారు అనడానికి వీల్లేదు. నోరు మూసుకోడానికి వీలుంది– తల వంచుకోడానికి వీలుంది..... వీపును దొర హంటర్‌కు వప్పజెప్పడానికి వీలుంది....అదొక్కటే గంగడు చేయగలిగింది.

ఆ హంటర్ కెంత కసో నల్లని వళ్ళంటే.....గంగడి వీపుమీద ఎరుపుగీతలు గీసింది. చేయని తప్పుకు గంగడు చావుదెబ్బలు తిన్నాడు. చేయని తప్పుకు దెబ్బలు తినడానికే గంగయ్యలు పుడతారు.

కొట్టి కొట్టి.... తన ఆజానుబాహువులు అలిసిపోయేదాకా కొట్టి..... "లంజికొడుక్కు కొవ్వెక్కింది.....వీడికి కూడు పెట్టకుండ్రి....." అంటూ బూతులు తిట్టి కాలితో తన్నాడు పాపారావు.

"చినబాబుగోరు" గది నుంచి బయటికి రాలేదు.

"చిన్నమ్మగోరు" గది నుంచి బయటికి రాలేదు. రాతినుంచి పూవ్వురాదు.

మండే వీపును మోస్తూ.....దూకే కన్నీళ్ళను దాస్తూ....పలుపుతాళ్లు పేనసాగాడు గంగడు.

మధ్యాహ్నం పన్నెండయింది. పాపారావు ముందు గదిలో భుక్తాయాసంతో మెలికలు తిరిగిపోతున్నాడు. రంగమ్మగారు పగటి కునుకు తీస్తున్నారు. చినబాబు మెల్లగా గంగడి దగ్గరికి వచ్చి అడిగాడు.

"డ్రైవర్‌కు నేనిచ్చినది ఇచ్చినవా?"

తలెత్తిచూశాడు గంగడు.

"ఇచ్చిన బాబూ...." అన్నాడు. చినబాబుగోరి మొహంలోని తృప్తిని చూశాడు.

గంగడి నీళ్ళు నిండిన కళ్ళను చినబాబు చూడలేదు.

గంగడి ఎరుపుచారల వీపును చినబాబు చూడలేదు.

ఈల వేసుకుంటూ మేడమీది తన గదిలోకి వెళ్ళిపోయాడు. అసలు తనే వెళ్ళి వద్దామనుకున్నాడు. కాని మూడురోజులు కాలేదు పట్నం పోయివచ్చి.....మళ్ళీ వెళ్తే తండ్రి కోప్పడతాడేమోనని భయం.

మరికొంచెం సేపటికి గంగడి దగ్గరికి చిన్నమ్మ వచ్చింది.

"చీటీ ఇచ్చినవా?...." అని గుసగుసగా అడిగింది.

తలూపాడు గంగడు.

ఆమె కళ్ళు ఆనందంతో మెరిశాయి......

ఆమె పాపారావు కూతురు

ఆమెకు పెండ్లయి రెండేండ్లయింది.

ఆమె ఒంటిమీద అరకిలో బంగారం వుంది.

ఆమె ఒడిలో కుక్కపిల్ల ఆడుకుంటోంది.

☆ ☆ ☆

సాయంకాలం ఆరు గంటలయింది.

సందె వెలుగులు ఊరి చెమట కడుగుతున్నాయి. పశువులు, రేపటి పనులు ఊరికి తిరిగొస్తున్నాయి. కొన్ని పశువులు అడవిలో మేత మేసి ఊరికి పాలు మోసుకొస్తున్నాయి.

గంగడు పలుపుతాళ్ళు పేనాడు.

పెద్ద గోలెంలో నీళ్ళు నింపాడు.

చిన్న గోలాల పాకుడు కడిగి నీళ్ళు నింపాడు.

కోళ్ళను కమ్మాడు. పశువులకు కుడితి పెట్టాడు.

అరుగుమీద దీపం వెలిగించాడు.

కడుపులో కుంపటి మోశాడు.

☆ ☆ ☆

సూర్యుడు తల్లి ఒడినుంచి లేవకముందే గంగడు నిద్ర ఒడిలోంచి లేస్తాడు.

గంగడి తండ్రికి తుమ్మల గడ్డలో ఎకరం పొలం ఉండేది. తల్లి చిన్నప్పుడే పోయింది. వాళ్ళ పొలం పక్కన పాడుబడిన ఓ మోటబావి వుండేది. ఒకరోజు ఉదయం ఆ బావిలో చాకలి ముత్తమ్మ శవం తేలింది. ఆ మరునాడు తన తండ్రి పొలం దున్నుతున్నవాడు దున్నుతున్నట్టే రక్తం కక్కుకొని ప్రాణాలు వదిలాడు. అప్పట్నుంచి అక్కడ దెయ్యాలు తిరుగుతున్నాయన్న పుకారు బయలుదేరింది. పగటి పూట కూడా జనం అక్కడ అడుగు పెట్టడానికి జడిసేవారు. ఆ విధంగా వాళ్ళ పొలం "దెయ్యాల దిబ్బ"గా మారిపోయింది. అందులో తుమ్మలు, తుప్పలు మొలిచాయి.

మరునాడు పొద్దున్నే లేచి పాలు పితికి, పశువుల పాక బాగుచేసి, కోళ్ళను వదలి, పశువుల్ని పశువులను దోసెడు నీళ్ళు తాగాడో, లేదో బడాబడా కక్కేశాడు. మొన్న మధ్యాహ్నం తాగిన అంబలి. కడుపులో ఏ ఆసరా పడక పరగడుపున్నే నీళ్ల తాగేసరికి గంగడికి వాంతి అయింది.

"వాడు నిన్న ఏడికి పోయిండో చెప్పిండా?" అని భార్యను అడిగాడు పాపారావు.

"లేదండి. ఎక్కడికి పోయిండు కావచ్చు ముండాకొడుకు" అన్నారు రంగమ్మగారు.

"పోతడే.....వాడి తోలు వలుస్త ఎవని పనికన్న పోయిండంటె. లంటికొడుకును బయటికి పోనీయకు- ఇయ్యాలగూడ కూడుపెట్టకు-"

"వాడు బయటికి పోకపోతే ఎట్లనుండి, పొయ్యిల కట్టెలు అయిపోయినయి గదా?"

"పోయి కొట్టుక రమ్మను.... ఏడికన్న పోయిండో బొక్కలు విరుగుతయని చెప్పు. నేను పొలంకాడికి పోతాను....." అని చెప్పి వెళ్ళిపోయాడు పాపారావు.

గంగడికి నీరసంగా ఉంది. తల దిమ్ముగా ఉంది. కళ్ళకు చీకటి కమ్ముతోంది. అడుగుతీసి అడుగు వేయలేకపోతున్నాడు. అయినా గొడ్డలి భుజాన వేసుకొని కట్టెలకు బయలుదేరాడు.

గొడ్డలి బరువును మోయలేక భుజం వణకుతున్నది. కాళ్ళు తడబడుతున్నాయి. నాలుక పిడచగట్టుకపోతోంది.

ఎండ తీవ్రంగా వుంది.

గంగడి వీపు మండుతున్నది.

నల్లగుట్ట పక్కన మధ్యాహ్నం రెండు గంటలదాకా గంగడు కట్టెలు కొడుతూనే ఉన్నాడు.

కొంచెం దూరంలో ఎల్లడు, అతని కూతురు మనెమ్మ ఊరిలో అమ్మడం కోసం కట్టెలుకొట్టి మోపులు కడుతున్నారు.

గంగడి ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది. బలమంతా కూడదీసుకొని.....ప్రాణాలు బిగపట్టుకొని.... కళ్ళల్లో కొనఊపిరితో....కట్టెలు మోపులు కడుతున్నాడు......ఇక అతని వశం కాలేదు. మూసుకపోతున్న కనురెప్పలు తెరవలేక, పడిపోతున్న చేతులు ఆపలేక.....కూలబడిపోయాడు–

పడిపోయిన గంగడిని చూసి ఎల్లడి కూతురు మనెమ్మ.... "ఓయ్య, గంగయ్య పడిపోయిండే....." అంటూ చేతిలోని మోపు వదిలి గంగడి దగ్గరికి పరుగున వచ్చింది.

చంకలకింద చేతులువేసి గంగడిని చెట్టు నీడకు చేర్చింది.

దూరాన ఉన్న ఎల్లడుకూడా ఆత్రంగా వచ్చాడు.

"వొద్దు బిడ్డ అళ్ళు ఎక్కువ కులమోల్లె, ముట్టుకోకు...." అన్నాడు ఎల్లడు.

"నేను కులాన్ని ముట్టుకుంటలేనయ్యా, మనిషిని ముట్టుకుంటాన....." అంది మనెమ్మ.

గంగడిని చెట్టుకు ఒరిగించి కూర్చోబెట్టింది. తాము తెచ్చుకున్న చద్దిమూట విప్పి చిప్పలో గతక అంబలి పోసుకొచ్చి– "తాగు గంగయ్యా......" అంటూ నోటికి అందించింది.

ఆకలి ఆకలికే అర్థమవుతుంది.

ఆకలికళ్ళు ఆకలికళ్ళకే అర్థమవుతాయి.

ఆత్రంగా ఆ అంబలి తాగాడు గంగడు.

ఎల్లడు భయపడుతూ అటూ, ఇటూ చూశాడు.....చుట్టుపక్కల ఎవరూ లేరు.

"నీ తోటి ఇంత గొడ్డుచాకిరి చేయించుకొని బుక్కెడు అంబలి కూడా పోత్తలేరా గంగయ్యా....." అంది మనెమ్మ జాలిగా చూస్తూ–

గంగడు మనెమ్మను చూశాడు. ఆమె కళ్ళలోని తడిని చూశాడు.... ఆమె దయకు ఆర్ద్రతకు గంగడి గుండెలోంచి దుఃఖం పొంగుకొచ్చింది. నీళ్ళు నిండిన కళ్ళతో రెండు చేతులు జోడించాడు.....ఆమె తన ప్రాణాలు కాపాడిన దేవత....

అటునుంచి పోతున్న సాతాని పాపయ్యను చూసి ఎల్లని పంచ ప్రాణాలు పోయాయి.

"లేవే.... అక్కణ్నుంచి లేవే...." అని బిడ్డను దూరంగా లాక్కుపోయాడు.

కాని అప్పటికే సాతాని పాపయ్య మనెమ్మ గంగడికి అంబలి తాగించడం చూశాడని అతనికి తెలియదు.

☆ ☆ ☆

సాయంకాలం......

గంగడు కట్టెల మోపులు తెచ్చి దొడ్లో వేశాడు.

అంతలో బయట్నుంచి పాపారావు నిప్పులుకక్కుతూ వచ్చాడు.

"ఏడే వాడు–ఆ లంబ్డికొడుకేడి?....మాదిగదాన్ని ముట్టుకున్నడట" అంటూ హంటర్ అందుకొని గంగడిమీదికొచ్చాడు.

"మాదిగదాని చేతికూడు తింటావురా కుక్కలకొడకా...." అని బూతులు తిడుతూ గంగడి వీపు మీద హంటర్‌తో కొట్టసాగాడు. గంగడు కిందబడిపోయాడు. నిన్న తాకిన దెబ్బల మీదనే దెబ్బలు...? నిన్నటి ఎర్రచారల మీద రక్తం చారలు...?

"ఓయ్యి, కొట్టకు... ఓయ్యి నీ కాల్మొక్కుతా కొట్టకు... " గిలగిల కొట్టుకోసాగాడు గంగడు.

"దూరం వుండురా ముండాకొడుకా దూరం వుండు. మాలదాని కూడు తిని నా కాళ్ళు ముట్టుకుంటావా..." బలంగా మరొదెబ్బ...

"ఓయ్యి, నీ బాంచెను....కాల్మొక్త, కొట్టకు...."

"నీకు బుద్ధిలేకపోతే ఆ ముండకుండొద్దా? నిన్ను ముట్టుకుంటదా.....నీకు అంబలి తాగిస్తదా..." మోచేతులమీద, మోకాళ్ళ మీద దెబ్బలు పడుతున్నాయి..... మనెమ్మ జాలిచూపులు దయ ఆమె కళ్ళలో తడి....... "నీతో గొడ్డుచాకిరీ చేయించుకొని బుక్కెడు అంబలి పోత్తలేరా గంగయ్యా......"

అంతేదొర చేతిలోని హంటర్ అలాగే ఆగిపోయింది.

గంగడు లేచాడు.....

రెండడుగులు ముందుకు వేశాడు.....

"దొరా......."

గంగడి పిడికిలి బిగుసుకుంది.....

ఆ హంటర్ పట్టి....లాగి.....

దూరంగా విసిరేశాడు......

ధొర కొయ్యబారిపోయాడు......

అతని చేతులాడటంలేదు....గొంతు పెగలడంలేదు.

గంగడు చుట్టూ చూశాడు.....చిన్నప్పట్నించి అక్కడ తాను చేసిన చాకిరంతా గుర్తుకొచ్చింది.... ఏడుపొచ్చింది....

వెనక్కు అడుగులు వేసి....ఏడుస్తూ, పరుగెత్తుకుంటూ అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

ఎటుపోతున్నాడో తెలియదు....గమ్యమేదో తెలియదు.... అలా పరిగెడుతూ వెళ్ళిపోసాగాడు......

రాత్రయింది......

గంగడు పరిగెడుతూ పోతూనే ఉన్నాడు.... చీకట్లో ఎటు పోతున్నాడో అతడికి తెలియదు.....

ఎదురుగా ఏదో తగిలింది.... బండ.....దానిమీద కూలబడిపోయాడు.

గంగడి పిడికిలి బిగుసుకుంద.....చేతికేదో తగిలింది. గట్టిగా ఉంది... పాహారావు తలను రాకుతున్నట్టు దాన్ని తీసి బండ కేసి రాకసాగాడు......

తెల్లవారింది.....

గంగడి చేతిలోది, గొడ్డలి! ఎప్పటిదో మట్టిలో సగం కూరుకుపోయి చిలుము పట్టిన గొడ్డలి. రాత్రంతా బండకు రాకడంతో ధారు తేలి మెరుస్తున్నది.

గంగడు చుట్టూ కలయజూశాడు. తానున్నది దిబ్బలో... దెయ్యాల దిబ్బలో దెయ్యాల దిబ్బగా మారిన తన తాత తండ్రుల పొలంలో...

ఓ కొమ్మ విరిచి ఆ గొడ్డలికి వేశాడు తుమ్మలన్నీ నరక సాగాడు.

తుమ్మచెట్ల మొదళ్ళ మీద బలంగా గంగడి గొడ్డలి పడసాగింది.

తూర్పు వెలుగుతోబాటు ఊరు ఊరంతా "గంగడు దెయ్యాల దిబ్బల తుమ్మలు కొట్టేసి పొలం చేస్తున్నాడట...." అనే వార్త ప్రాకిపోయింది!

కొంతమంది వచ్చి అప్పటికే చూసి వెళ్ళారు కూడా– గంగడు ఎవరిని చూడటంలేదు....తన పొలాన్ని చూస్తున్నాడు. తుమ్మలు నరుకుతున్నాడు– తుప్పలు తవ్వేస్తున్నాడు.

మనెమ్మ తప్ప గంగడి దగ్గరకి ఎవరూ పోలేదు.....

గంగడు ఇంకా రక్తం కక్కుకొని చావకపోవడం ఊరును ఆశ్చర్యపరచింది

తుమ్మల్ని నరుకుతున్న గంగడు దయ్యాల్ని నరుకుతున్న గంగడిలా కనిపించాడు.

● *ఆంధ్రజ్యోతి వీక్లీ, 10–7–1981* ●

★ ★ ★

48

అల్లం శేషగిరిరావు

# శిథిల శిల్పాలు

బ్రిటిష్ సామ్రాజ్యపు హయాం మంచి ఉచ్చదశలో ఉంది. సంస్థానాధీశులు సెక్స్, స్పోర్ట్స్‌ల్లో మునిగి తేలుతున్న రోజులు. పెద్దపులి వేటకి వేలకి వేలు ఖర్చయినా లెక్కచేయకుండా రోజుల తరబడి అడవుల్లో కేంపులు వేసి "మృగయావినోదం" లోని రాయల్ థ్రిల్‌ని అనుభవించడం ఆనాటి రాచరికపు ఆనవాయితీ.

రామాపురం ఎస్టేటుకి వైస్రాయిగారు పులివేటకి వస్తున్నట్లు జమీందారు రఘుపతిగారికి వర్తమానం అందింది.

వైస్రాయా, మరొకరా? – వెంటనే హాలెండ్–హాలెండ్ కంపెనీకి పురమాయించి వైస్రాయిగారి బరువుకి, ఎత్తుకి తగ్గట్టుగా పులివేటకి తగిన తుపాకీని తయారుచేయించి తెప్పించారు.

వైస్రాయిగారు దిగేరు. అంగరక్షకులు, కార్లు; మంది మార్బలం, గుర్రాలు, వేటకుక్కల అరుపులు! ఒకటేమిటి ఎక్కడ చూసినా 'మృగయావినోద' కోలాహలం.

ఆ రాత్రి రఘుపతిగారి ప్రయివేటు ఫారెస్టులో వైస్రాయిగారు ప్రత్యేకంగా దిగుమతిచేయబడిన తుపాకీతో ఒకే ఒక దెబ్బతో పెద్దపులిని కిక్కురుమనకుండా కాల్చేశారు. ఆ పులిని చెప్పిన టైముకి, అనుకున్న జాగాకి, వైస్రాయిగారున్న మంచె దగ్గరకు ఠంచనుగా తోలుకొచ్చేరు. వైస్రాయా, మరొకరా! తపేల్మని పిట్టని పేల్చినట్టు పేల్చేశారు.

రఘుపతిగారి షికారీ నిర్వహణాదక్షతని తెగమెచ్చుకుంటూ వైస్రాయిగారు "రావు బహద్దూర్" అని బిరుదు నిచ్చారు.

తుపాకీ మీద వైస్రాయిగారి పేరు, పులిని వేటాడిన తేదీ మొదలైన వివరాలు సంక్షిప్తంగా బంగారంతో చెక్కించి, ఆ తుపాకీని జీవితాంతం ప్రాణప్రదంగా చూసుకుంటూ ఒకరోజు రఘుపతిగారు కాలంచేశారు.

రఘుపతిగారి కుమారుడు నరేంద్రవర్మ తండ్రిగారి తుపాకీతో చాలా చాలా పులుల్ని వేటాడి సంస్థానం పేరు నిలబెట్టడమే కాకుండా, ఒకసారి ఎస్టేట్ తగాదాలో అరడజను మంది తిరుగుబాటుదారుల్ని వెంటాడి, వేటాడి వైస్రాయిగారి తుపాకీతో కాల్చి హతమార్చేశారు. ఆనాటి కోర్టులు ఆ చర్య–ఆస్తి రక్షణ, ఆత్మ సంరక్షణకోసం అలా జనాన్ని చంపడం–న్యాయ సమ్మతమేనని తీర్పు ఇచ్చేయి.

అప్పట్నించీ నరేంద్రవర్మగారంటే ఆ సంస్థానంలో అందరికీ హడల్. తగువుకి దిగితే తుపాకీ చూపించేవారు. అతనూ చనిపోయారు......

తరువాత బ్రిటిష్ సామ్రాజ్యం అంతరించింది. సంస్థానాలు, సంస్థానాధీశులు పోయారు.

పోయింది పోగా మిగిలిన రామాపురం ఎస్టేటుకి రాజారావు వారసుడయ్యేడు. తరతరాలుగా వస్తున్న తుపాకీని మాత్రం అలనాటి వైభవ చిహ్నంగా తాతలు చంపిన పులి తలల మీద అందంగా అమర్చారు.

రాజారావుకి కూడా వేటంటే సరదా. స్నేహితుల్తో తరచూ వేటకి వెళ్తూంటాడు. వెంట వైస్రాయిగారు వాడిన తుపాకీ ఉంటుంది. మరో తుపాకీ ముట్టుకోడం అతని డిగ్నిటీకి లోపంగా భావించేవాడు. రాజా వంశస్థులు పెద్ద పులిని మాత్రమే వేటాడాలి–అనే గట్టి అభిజాత్యం కలవాడు. దేశం మొత్తం మీద పెద్ద పులుల సంఖ్య క్షీణించడంతో రామాపురం ఫారెస్టులో ఒక్క పులికూడా మిగలకుండాపోయింది. అందుచేత రాజారావు వేటకి పులులు కరువయ్యాయి. స్నేహితులతో వేటకి వెళ్ళినప్పుడు మిగతా జంతువులు కనబడితే ఆ ఛాన్స్‌ని వారికే వదిలేసేవాడు. స్నేహితుల చేత వేటాడించి ఆనందిస్తూ ఉండేవాడు. "రాజా! ఒక్కసారి మీరు మీ తుపాకీతో ఎగ్జిబిషన్ షాట్ కొడితే చూడాలని ఉంది" అని స్నేహితులు ప్రాధేయపడితే "నో, థేంక్స్! బలవంతం చెయ్యకండి. మా తాత ముత్తాతలు పులివేటలో గజవేటగాళ్ళు. నన్ను జింకల్ని, దుప్పుల్ని కొట్టమంటారా?" అని సగౌరవంగా నచ్చజెప్పేవాడు. "ఈ జన్మకింతే. ఈ తుపాకీని పేల్చే అదృష్టం మరి నాకులేదు." అని నిట్టూరుస్తున్నప్పుడు అతని ముఖం మీద విషాద ఛాయలు చూచాయగా కనిపించేవి.

ఒకరోజు అనుకోకుండా అకస్మాత్తుగా తన తుపాకీని పేల్చే అవకాశం లభించింది.

బంగళా గేటుముందు రైతులు, వ్యవసాయకూలీలు గుంపుగా చేరి గోలచేస్తున్నారు. రాజారావుని బైటకి రమ్మంటున్నారు. పేదరైతులకు పంచిన బంజరుభూముల్నీ, దేముడి మాన్యాల్నీ ఆక్రమించుకోడానికి ప్రయత్నం చేస్తున్న రాజారావుని ప్రతిఘటించడానికి వందల సంఖ్యలో రైతులు గుమిగూడేరు. ఏవోవో నినాదాలు చేస్తున్నారు.

రాజారావుకి తండ్రి జ్ఞాపకం వచ్చేడు. తనూ ఒక పదిమందిని కాల్చేద్దామనుకున్నాడు. ఒక అంగలో వెళ్ళి పులితలల మీద తుపాకీని అందుకున్నాడు.

"ఒద్దుబాబూ, ఈ దురితం తగదు. రోజులు మనవి కావు" అని నౌకరు రాజారావు చేతిలో తుపాకీని బలవంతంగా లాక్కున్నాడు. బయట తలుపులు మూశాడు.

రాజారావు బోనులో ఇరుక్కున్న సింహంలా పిచ్చెత్తినట్టు పచార్లు చేస్తున్నాడు. జుత్తు పీక్కున్నాడు. తుపాకీని చేతుల్లోకి తీసుకుని వలవల ఏడ్చాడు. "నా వంటి చవట చేతిలో ఉండదగినదానవు కాదు. మా తండ్రిగారే ఉంటే ఈపాటికే రక్తం ఏరులై పారేది."

బయట జనం గోల.

గేటు తోసుకొస్తున్నారు.

రాజారావు మరి ఉండలేకపోయేడు. పట్టరానికోపంతో నౌకర్ని లెఖ్ఖ చెయ్యకుండా ప్రక్కకు నెట్టి తుపాకీ తీసుకుని గభాలున తలుపులు తెరచుకుని బయటకు వచ్చేడు.

జనంగోల "అన్యాయం, అక్రమం!" అరుపులతో గింగుర్లెత్తిపోతోంది.

"అడుగు ముందుకు పడిందా – పిట్టల్లా రాలిపోతారు. నా చేతిలో ఏమిటుందో తెలుసుగా! కొన్ని సంవత్సరాల క్రితం దీనితో అరడజను మందిని హారీమనిపించేరు మా నాన్నగారు. నన్ను రెచ్చగొట్టద్దు."

"కాలుస్తావా–కాల్చు" అని ముందుకొచ్చేడొకడు.

"నువ్వేకాదు, చాలామంది రాలిపోతారు, జాగ్రత్త! అసలు మీకు కావలసిందేమిటి?"

"మాకు పంచిన బంజర్లని, దేవుడు భూముల్ని అక్రమంగా ఆక్రమించుకుంటున్నారు. ఇదన్యాయం."

"ఆగండి, మీలో ఏ ఒక్కరో లోపలికి రండి, దాన్ని గురించి ఆలోచిద్దాం. అనవసరంగా రాద్ధాంతం చేసి రక్తపాతం చెయ్యకండి."

ముందున్న వ్యక్తి వచ్చి నిలబడ్డాడు. "నేను వస్తాను పదండి." అన్నాడు లోపలికి వెళ్ళబోతూ.

"వద్దు, చంపేస్తారు. లోపలికి వెళ్ళద్దు. అందరం వస్తాం."

"ఆ భయం మీకు అనవసరం. రాజకుటుంబంలో పుట్టినవాణ్ణి. అసహాయుల్ని చంపడం మా వంశంలో లేదు. మీకు అభయం ఇస్తున్నాను" అని రాజసం ఉట్టిపడుతున్నట్లు హుందాగా గదిలోకి వెళ్ళేడు. వెంటే వెళ్ళాడు రైతు కూడా.

'కూర్చో' మని ఎదురుగుండా కుర్చీ చూపించాడు.

రైతు అనుమానంగా చూస్తూ నిలబడే ఉన్నాడు.

"ఫరవాలేదు, కూర్చో" అని గంభీరంగా ఆజ్ఞాపించాడు.

రైతు కుర్చీలో కూర్చున్నాడు. ఇవతలవైపు రాజారావు కూర్చున్నాడు. వాళ్ళిద్దరి మధ్య తుపాకీ బల్లమీద ఉంది.

"ఇప్పుడు చెప్పు. ఏమిటి కావాలి? ఎందుకీ గోల?"

"మాకు పంచిన బంజరు భూముల్ని కలిపేసుకుంటున్నారు మీ జనం. కాదంటుంటే కలబడుతున్నారు."

"ప్చ్. దీని కోసమా ఇంత రాద్ధాంతం? బంజరు భూముల్నీ, సాక్షాత్తూ మా తాతలు ప్రతిష్ఠించిన దేముడు భూముల్నీ మేం కలిపేసుకుంటామటయ్యా? ఒకప్పుడు ఈ ఎస్టేటంతా మాది కాదూ! దీనిలో ప్రతీ గడ్డిపోచా మాది! మీకు వదిలేయలేదూ? ప్రజాసేవకి అంకితమైన మా కుటుంబం మీ అరముక్కా చెక్కా కలుపుకుంటుందా? ఒకవేళ అలా జరిగి ఉంటే అది మా వాళ్ళ పొరపాటు. మీది మీరు తీసుకోండి. సరా? – లేక నన్ను చంపితేనాని మీకు తృప్తి లేదా – అదీ చెప్పండి. నా కంఠంలో ప్రాణం ఉండగా ఈ తుపాకీతో మిమ్మల్ని కాల్చి కాల్చి తరువాత నేలకొరిగిపోతాను. అరగంట వ్యవధి ఇచ్చేను, ఆలోచించుకుని మీ నిర్ణయం చెప్పండి. ఇక నువ్వు వెళ్ళచ్చు!"

"అదేంటి బాబూ, ఉత్తి పుణ్యానికి మిమ్మల్నెందుకు చంపుతాం? మా కష్టాల్ని చెప్పకుందామని వచ్చేంగాని చంపడానికి కాదే! ధర్మప్రభువులు, మీరు హామీ ఇచ్చారుకదా! వెళ్ళిపోతాం." అంటూ బయటకు వస్తూ "రాజారావు బాబుకీ జై! రాజారావు బాబుకీ జై!" అని దిక్కులు దద్దరిల్లేలా అరిచాడు.

జనంలో జయ జయ ధ్వానాలు హోరెత్తిపోతున్నాయి.

రాజారావు రైఫిల్ పట్టుకున్న గౌతమ బుద్ధుడిలా ప్రశాంత వదనంతో తుపాకీతో బయటకు వచ్చి అందరూ నమస్కరిస్తుండగా చిరునవ్వుతో ప్రతి నమస్కారం చేసి లోపలికి వెళ్ళిపోయేడు.

తుపాకీని గోడకి తగిలించాడు.

జనం వెళ్లిపోతున్నారు.

ఆకస్మాత్తుగా రాజారావు ఇంత మంచి నిర్ణయం తీసుకున్నందుకు అర్థంకాక రాజారావు నౌఖరు తికమకపడిపోతున్నాడు.

రాజారావు సాలోచనగా సోఫాలో వాలి గదంతా కలయజూస్తున్నాడు.

తాత తండ్రుల తైలవర్ణ చిత్రాలమీద సాలీళ్ళు తిరుగుతున్నాయి. నిరుపయోగంగా వ్రేలాడుతున్న గాజు దీపాల గుత్తుల్లో కొడిగట్టిన క్రొవ్వత్తుల అవశేషాలు మసగ్గా కనిపిస్తున్నాయి. మాసిపోయి చివికిపోతున్న పులి చర్మాలు, ముడతలు దేరుతూ జీర్ణావస్థలో గోడలికి వేలాడుతున్న పెద్ద పులుల తలలు గత వైభవాన్ని వెక్కిరిస్తున్నాయి.

రాజారావు కిటికీలోంచి బైటకి చూశాడు.

దూరంగా పొలాల్లో దివాణం గుర్రం పచ్చగడ్డి కోసం వెతుక్కొంటోంది.

గోడకి వేలాడుతున్న తుపాకీని మరొక్కసారి చూశాడు. వైస్రాయిగారు వాడిన తుపాకి.

కిటికీలోంచి నీరెండ పడి సువర్ణాక్షరాలతో నగిషీలు చెక్కిన తుపాకి తళతళ మెరుస్తోంది.

ఒకనాడు ఎన్నో పులుల్ని, ఎందరో మనుష్యుల్ని హతమార్చి తరతరాల వైభవాన్ని నిలబెట్టిన తుపాకి.

ఆ తుపాకీని చూస్తూ బరువెక్కిన హృదయంతో కళ్ళుమూసుకున్నాడు.

అసలు విషయం ఒక్క రాజారావుకే తెలుసు.

ఆ తుపాకీ పేలదు!

● *ఆంధ్రజ్యోతి వీక్లీ, దీపావళి 1981* ●

ఈ కథ ఇంగ్లీషు అనువాదం "వైస్ రీగల్ గన్"
న్యూస్ టైమ్‌లో ప్రచురించేరు.

★ ★ ★

49

ఉప్పల నరసింహం

# తిరగబడ్డ భూమి

"ఊశెల్లెకు గిర్దావర్ వొస్తే అని సుట్టు దిర్గాలే. అమీన్‌సాబొస్తే అని ఎనక దిర్గాలే, తహసీల్దారొస్తే సంకల కట్టె యిరికిచ్చుకుని సాకలింఢ్లు, సాలింఢ్లు, ఎర్రలింఢ్లు, ఎనాదులింఢ్లు తర్వాయిన తిర్గాలే – ఈల్లుగాక యెల్లిగాడు, మల్లిగాడు యెవడొచ్చినా ముందుగాల నాపంగ పల్గుతది – నీళ్ళు దెచ్చుడు కాడ్నుంచి, కట్టెలు కొట్టేదాక యిరాం లేకుంట, రెక్కకు శైన్ లేకుంట గాడ్దిలెక్క ఒకటే పనాయే నీయవ్వ, పనికున్నవారేతు... అరె. జెరంతనన్న ఈశెత్త (శరీరం)కు 'ఇరాం' ఇయ్యాలే! ఎక్కడ్డి? ఎద్దుకు ముల్లుగర్ర పొడ్సినట్టె ఈడుగాకుంటె ఆడు. ఆడుగాకుంటె ఈడు ఊడిబట్టనే ఉంటరు – ఒంగడుగాకుంటె ఒకడు పని శెప్పేడేనాయే... నీయవ్వ బతుకుకున్న వారేతు..."

అని కావలి ముత్యాలు స్వగతంలో గొణుక్కుంటూ వడివడిగా ముందుకు అడుగులేస్తున్నాడు.

తనలో పెల్లుబుకుతున్న కోపాన్ని, చిరాకును, అసహాయతను, ఆవేశాన్ని మరో రూపంలో వెళ్ళగక్కలేక ముత్యాలు ప్రతిసారి ఇలాగే గొణుగుతూ పనిచేస్తాడు – ఆ బలహీనత తెలిసి చెప్పేవాళ్ళుకూడా ఇంకా కొన్ని పనులు ఎక్కువ చెపుతూనే వుంటారు – ముత్యాలు తెగించి ఒక్కమాటకూడా తనపైవాళ్ళను అనలేడు.

కావలి ముత్యాలు చేతిలో కర్రవుంది – ఆ కర్రకు ఒకవైపు ఇనుముతో తయారు చేసిన 'బాకు' దిగేసివుంది, దాన్నే బరిసెకర్ర అంటారు – తన నడకకు అనుగుణంగా బరిసెకర్ర వూపుతూ నడుస్తూ వున్నాడు – కావలి ముత్యాలు నడుస్తున్నప్పుడు లయబద్ధంగా 'బాకు' కదలడం ఎంతో హుందాగా వుంది... రాజుల యుద్ధాలలో ఆరితేరిన సైనికుడిలా వున్నాడు.

ఎడమ భుజంపై గొంగడి జారుతున్నప్పుడల్లా ఎగదోసుకుంటూ అడుగులేస్తున్నాడు. ఎడమచేతికి వున్న వెండి 'కడెం' ఎండకు 'తళుక్కు' మంటోంది – ఎడమచేతి వేలికి ఉన్న రాగి ఉంగరం సూర్యకిరణాలు పడినప్పుడల్లా మెరుస్తూ వుంది.

పిడికెడు పిడికెడు మీసాలు, వెడల్పయిన మొఖం, తలకు రుమాలు, చెవి ప్రక్కన సగం కాల్చిన మొదుగాకు 'చుట్ట', చెవికి రాగిపోగు, పైకి ఎగకట్టిన ముతక ధోవతి, అక్కడక్కడ చిరిగిన ముతక కమీజు – చెప్పులులేని కాళ్ళతో బలంగా అడుగులేస్తూ, కావలి ముత్యాలు స్వగతంలో గొణుగుతూ నడుస్తూవున్నాడు.

తెలంగాణ ప్రాంతం గ్రామాల్లో దుష్టచతుష్టయంగా పేరుమోసిన సర్పంచ్, పట్వారి, పోలీస్ పటేల్, మాలి పటేల్ అధికార్ల ఆజ్ఞలను పాటిస్తూ, వారి వారి ఇంటి పనులుగూడా చేస్తూ, పై అధికారి ఎవరైనావస్తే వారి సకల సౌకర్యాల ఏర్పాట్లలో తల మునకలయ్యే 'కావలి' వాళ్ళలో ఒకడు ఈ కావలి ముత్యాలు – (కొన్ని ప్రాంతాలలో వీరిని 'మస్కూర్' అనిగూడా అంటారు.)

ఈ గ్రామాధికార్లు, మోతేబరులు ఈ కావలివాళ్ళతో తమ ఇంటి పనులు ఎక్కువగా చేయించుకుంటూవుంటారు – వాళ్ళు తమ అసంతృప్తిని ఎలా తెలియజేయాలో తెలియక ఒంటరిగా ఉన్నప్పుడు తిట్టడమో, గొణుక్కోవడమో చేస్తూ వుంటారు – ముత్యాలు గూడా అదేరకమైన అసంతృప్తిని పట్వారివద్ద వెళ్ళగక్కలేక నడుస్తూ... "నీ యమ్మ కూరుకు పొద్దుగాల లేశి పంతులు (పట్వారి) ఇంటిముంగట దీటి సలామ్ చేస్నాగాని కైకర మొఖపోడు కసురుకుంటనే వుండడు" అని గొణుగుతూ గొల్ల కొమ్రయ్య ఇంటిముందు ఆగాడు.

వాకిట్లో ఎవరు కనిపించకపోయేసరికి "ఓ... కొమ్రయ్య బావా..." అని పిలుస్తూ ఇంటి వసారాలోకి వచ్చాడు ముత్యాలు.

గొల్ల కొమ్రయ్య గొర్రె బూరుతో దారం వడుకుతూ కూర్చున్నాడు – కావలి ముత్యాలును చూసి "నువ్వా?" అని "కూసో, అట్ల పీటమీద కూసో" అన్నాడు నిదానంగా.

"నేనేం కూసుంతందుకు రాలేదే బావా!"

"పని మీదనే వస్తే వస్తివిగాని కూసో రాదోయ్!" – కొమ్రయ్య.

"బయట పనుంది, జెల్ది పోవాల్నే." – ముత్యాలు.

"ఎహే... పోదువు కూసోవొస – ఎప్పుడొచ్చినా గుర్రంమీదనే వస్తవు. పోకుంటే వుండిపోమంటలేనుగని కూసోని సంగతేందో శెప్పు" అన్నాడు కొమ్రయ్య దీర్ఘం దీస్తూ.

ముత్యాలు వసారాలోని గుంజకు ఆనుకుని కూర్చున్నాడు.

కొమ్రయ్య బుడ్డ గోచితో, కింద గొంగడి వేసుకుని కూర్చుని, తొడకు దారం వడికే ఏకును గట్టిగా రుద్ది తిప్పుతూ, కొర్రెబూరుతో దారం తీస్తున్నాడు – తలకు రుమాలు – చెవికి రాగిపోగు, చేతికి వెండి 'దండె కడెం' వుంది – రెండు చేతుల వేళ్ళకు రాగి వుంగరాలు వున్నాయి. నడుముకు వెండి గొలుసు వ్రేలాడుతూ వుంది. దాంతోపాటు పొగాకు తోలుసంచి వ్రేలాడుతూవుంది – కమీజు లేదు, ఛాతిమీద వెంట్రుకలు కూడా తెల్లబడ్డాయి – పిక్కలమీద చర్మం ముడతలు పడింది. మనిషి చూపులకు బలంగానే కనిపిస్తున్నాడు. మీసాలు మరింత గంభీరాన్ని తెచ్చిపెట్టాయి కొమ్రయ్యకు –

పేడ, ఎర్రమట్టి కలిపి వసారాలో అంతకుముందే అలకడంవల్ల ముత్యాలుకు అదోరకమైన తీయటి వాసన వస్తోంది. ఆ వాసనే గాకుండా ప్రతి గొల్ల కుర్మవాళ్ళ ఇంట్లోవచ్చే 'గొర్రెలమంద' వాసన వస్తోంది.

కొమ్రయ్య దారం వడుకుతూనే "ఆ ఏందోయ్, ఏం పనిమీద వచ్చినవ్ –

ఏంది కత – హాఁ..." అన్నాడు – ఆ గొంతులో బావ, బావ మరదుల వరసతో కూడిన పరాచిక భావం ద్యోతకమైయింది.

కావలి ముత్యాలు చెవి వెనకాల వున్న చుట్టతీసి చేతిలో పట్టుకోని–

"ఏంది ఏందే, పోయిన బేస్తారం పంతులు పన్ను గట్టుమన్నడని శెప్పేపోతి నీకు – నీకు అంతగనం శెప్పినా శెవుమీద 'పేనే' పారలేదు – ఆడ దినాం పంతులు నన్ను తిట్లు పెడుతుండు – 'శెప్పినావ్‌రా క్రొమిగానికి శెప్పొచ్చినావ్‌రా' అని అడిగితె శెప్పినపంతులు, శెప్పినపంతులు అని శెప్పవట్టి – నువ్వేమో ఈడ అకరు పికరు లేకుండా జీవాలను సూసుకుంట, దారం ఏకుకుంట నిమ్మలంగ కూసుంటివి – నీ పని పరాకత్‌గుంది – నేనేమో వానితోని, వీనితోని తిట్లు పడుకుంట నిష్ఠురంగావాలే... నీయవ్వ..." అన్నాడు నిష్ఠూరంగానే.

"అరె, శెప్పినవ్‌రా, శెప్పలేదని అంటలేను గదరా..."

"శెప్పినవంటవు, పన్ను గట్టకపోతివి, వారం దినాలయిపోయె. ఆడ పంతులు నామీద గరమయితుండు – ఏమనబోయినా కష్టమే, నిష్ఠురమే. ఇగ సప్పుడు జెయ్యకుంట, ఎన్ని అన్నా పడుతున్న – ఏం జెయ్యాలే ఎక్కడ సక్కి లేక 'కావలితనం' సేశినట్టుగున్నది. అండ్ల వచ్చేది ఏం లేదు – 'పైకం భాగోతులోనికి, తిట్లు మంగలోనికి' అన్న శాస్త్రముంది నా కత.' హెచ్చుస్వరంతో అన్నాడు కావలి ముత్యాలు.

"అనంగానే పైసలు ఎల్తయా? నీ కతగాని రెండురోజులు అటూ, ఇటు అయితది – పన్నులు గట్టకుంటె వూకుంటరా? కడతమోయ్ బామ్మర్దీ!..." అన్నాడు క్రొమయ్య 'బామ్మర్ది' అన్న పదాన్ని వత్తి పలుకుతూ.

కావలి ముత్యాలు చుట్ట మొదలును వొత్తుతూ "జెరంత ఇంగలమైతే ఇయ్యి" అన్నాడు.

గొల్ల క్రొమయ్య దారం వడికే 'ఏకు'ను గట్టిగా తొడకు రుద్దుకుని వదిలేసి పొగాకు సంచిలోనుంచి కొంత జెకముక దూది, రాయి ముత్యాలు వైపు విసిరాడు – ఈ లోపుగా ఏకు గిరగిరా తిరిగి దారానికి 'కరి' పడింది – క్రొమయ్య ఏకును అందుకుని దారాన్ని ఏకుకు చుట్టాడు –

ఎడమ చేతిలోవున్న గొర్రె బూరు, కుడిచేతిలో వున్న ఏకును కిందపెట్టి క్రొమయ్య రుమాల్లో వున్న కరకు చుట్ట తీసాడు తానూ రెండు బుక్కలు చుట్ట తాగుదామని – ముత్యాలు జెకముకతో అగ్గిజేసి కొంత తన చుట్ట మొదట పెట్టుకుని, కొంత అగ్గి క్రొమయ్యకు ఇచ్చి, తను గట్టిగా రెండు దమ్ములు లాగాడు.

క్రొమయ్య ముత్యాలు ఇచ్చిన అగ్గిని చుట్ట మొదట పెట్టుకుని తల వంకరగా పెట్టి, నిప్పుకిందపడిపోకుండా గట్టిగా పొగ పీల్చాడు – ఆ తరువాత ముత్యాలు వద్దనుంచి జెకముకరాయి తీసుకుని తన సంచిలో వేసుకుని ఏకును, గొర్రె బూరును చేతిలోకి తీసుకున్నాడు – చుట్ట నోట్లోనే వుంది.

ముత్యాలు గట్టిగా పొగపీల్చిన తరువాత వాకిట్లోకి ఉమ్మి–

"పైసల్ లేవంటవూ? మొన్ననేగదా జీవాలమ్మినవ్? పైసలేం జేస్తివి ఇంతలమే?" అని అడిగాడు.

కొమ్రయ్య పక్కకు వున్న బూడిది పోసిన చిన్నడబ్బాలో వూసి,

"జీవాలమ్మితే ఏం ఫాయిదయింది – కట్టెటోనికి గట్టి, ఇచ్చటోన్కి ఇస్తి – తెచ్చేటివి తెస్తి. ఇంక వున్నాయి? పోయిన శివరాత్రి లగ్గాలళ్ళ శిన్నపోల్ల పెండ్లిజేస్తే ఐదువేల ఖర్చయింది – మల్ల అత్తగారు ఏం బెట్టలేదు, ఏం బెట్టలేదు అని శెప్పక తిర్గుతనేవున్నర్. సావుకారి దెగ్గర దెచ్చిన అప్పు ఇంక తీరనేలేదు – సాలాయన దెగ్గర తెచ్చిన బట్టల పైసలు ఇంక ఇయ్యనేలేదు... ఎన్ని జీవాలమ్మితేమి, ఎన్ని గొంగళ్ళమ్మితేముంది? – ఏడి కాడికే అయితుంది సంసారం" అన్నాడు.

"మరి ఎట్లజేస్తనంటవ్ పన్నుల సంగతి?"

"ఎట్లజేశేది ఏముంది? పెద్దపోరడు ఐలయ్య అత్తగారింటికిపోయి ఏడు దినాలాయే – రేపొస్తడో మాపొస్తాడో అని రోజా యెదిరి సూస్తున్నం – ఆడు రాంగనే కడ్తంపో – కట్టకుంటె యాడికన్న దెంకపోతమా?" కొమ్రయ్య.

"యాడన్న దెంకపోవుడు సవాల్ గాదు – ఇయ్యాలగాకంటే రేపుగట్టవు పన్నులు గట్టక వూకోవుగాని, ఆడ రాకాసి మొఖపొడు పట్వారి వూకుంటాడా? – 'ఏమాయెరా? పాయొచ్చినవా? వసూలు చేస్కొచ్చినవా?' అని అడుగుతడు. 'ఇయ్యాళ రేపట్ల గట్టనన్నడు పంతులు' అంటే ఇగ మోటుకూతలు కూస్తడు – నీ తల్లి ఇద్దరి పొత్తుల నేను సాట్లు దినాలే" అని కావలి ముత్యాలు వాకిట్లోకి వూసి, చుట్ట త్రాగడం ప్రారంభించాడు.

"నా దిక్కుకేలి నువ్వేందుకు సాట్లు దింటవొయి? నేనొచ్చి పంతులును కలుస్తపో – పొద్మికె జాముల పంతులు ఇంటికొచ్చి కలుస్తపో" అన్నాడు ఏకును తొడకు రుద్దుకుంటూ కొమ్రయ్య.

"వొస్తే వచ్చి మాట్లాడ్తవేమో గాని, దుర్గక్క కనిపిస్తలేదు యింట్ల?" అని అడిగాడు కావలి ముత్యాలు.

"పెద్దపోరడు లేకపాయే, రాత్రిళ్ళు చిన్న పోరడు, కిష్టయ్య పటేలు పొలంల మంద పెట్టిండు. పోరన్కి సద్ది తీస్కపోయింది. వస్తుండొచ్చు. శాలసేపయింది పోయి." కొమ్రయ్య.

"జెరన్ని జొన్నలు పెట్టక పోయినవ్ బావా – తమామ్ తింతందుకు లేకుంట అయినయ్." ముత్యాలు.

"జొన్నలు ఏడియోయ్ – మేమే కొనుక్కోని తింటున్నం – మొన్ననే పాపిరెడ్డి దగ్గర పావుపళ్ళ జొన్నలు కొనుకొచ్చిండు పెద్దపోరడు. అవి దుడిశి పోయినయ్. ఎండవోశి, శేశి, యిసురుకోని రొట్టె చేస్తున్నది మీ యక్క." కొమ్రయ్య

"శెల్కల పండిన జొన్నలేమాయో బావా? అప్పుడే అయిపోయినాయి?" గాలికి తనవైపుకు వచ్చిన గొర్రె బూరును కొమ్రయ్య వైపుకు వేస్తూ అడిగాడు ముత్యాలు.

"శెల్కల ఏమంత పండినయోయ్ పిలగా! రోణి కార్తిల (రోహిణి కార్తెల) వాన గొట్టె– కాలుకు శేలికి యిరాములేకుంట పొద్దు, మాపు ఇంటిల్లాదులం మర్లాడి దున్ని మక్కజొన్న అలికితే, తల జుట్టు లేశేయాళ్ళకు జోరు ఎండలు గొట్టె – ఒక్క వానగూడా కొట్టకపాయె, కంకెడు కంకెడు కంకి అయితదనుకుంటే పిడ్స కట్టుకపోయినట్టయింది. శెట్లు పైకి లేవకనేపాయె. ఇగ పెరిగిన కంకులు వాకిట్ల

మంచె మీద రెన్నెల్లు వుండె. సొప్ప జెరంత అమ్మి, జెరంత ఉంచుకుంటి. ఇగ మా సద్దుకుడు పడమటికేలివచ్చి... 'కాలంగాలేదు ఎడ్లు సచ్చిపోతున్నయ్' అని శెప్పి ఆ యింత సొప్ప, ముత్తుం మక్కజొన్నలల్ల కేలి ఓ తూమెడు మక్కజొన్నలు తీసుకపోయిండు. మిగిలిన జొన్నలు మొన్నటిదాక మాకే ఒడిశినయ్. అవి అయిపోయినంకనే పెద్దపోరడు పావుపళ్ళ తీస్కొచ్చిండు" అని కొమ్రయ్య డబ్బాలో వూసాడు. ఉమ్మి వూసేప్పుడు మీసాలకు అంటుకున్న తడిని రుమాలు కొసతో భుజంతోనే తుడుచుకున్నాడు.

కావలి ముత్యాలు చుట్టను నేలకు రాసి, కిందరాలిన అగ్గిని కాలితో రాసి, కరుకు చుట్టను తిరిగి చెవి వెనకాల పెట్టుకుని వాకిట్లోకి వూసాడు.

ఇంతలోనే తలపై తట్టతో దుర్గమ్మ వచ్చి "బాగున్నావురా ముత్యాలు?" అని పలకరించింది.

"ఆ... బాగున్ననక్కా!" ముత్యాలు.

"మా మర్దలు బాగుందా? పోరలు ఎట్లున్నరు?"

"అందరు బాగనే వున్నరక్కా!" ముత్యాలు.

"శాల దూరం వచ్చినవేం తమ్మి"– దుర్గమ్మ.

"బావదగ్గర్కే వచ్చిన."

"అట్లనా?" అంటూ దుర్గమ్మ 'జారట్లో' కాళ్ళు కడుక్కొని తట్టతో ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"ఈ సారి కాలమెట్లుంటదంటవే కొమ్రయ్య బావా?" అని అడిగాడు ముత్యాలు కొమ్రయ్య వైపుచూస్తూ.

"కాలం సంగతి ఎట్ల చెప్తాస్తదిరా ముత్యాలు!' రెండేడ్ల నుంచైతే శెరువునిండకపాయె – శెల్కలల్ల పంటలు గూడా గట్ల గట్లనే వుండె – శెరువుకింది పొలాలు అల్కకుంట అయితిమి–పనిపాటలోళ్ళయినాము. భూములల్ల శెట్లు మొల్వవట్టె. ఈసారైనా వానలు గొట్టి శెరువు నిండితే ఏమన్న బతుకుదెరువైతది – లేకపోతే పుణ్యానికి సస్తరు మంది." జ్యోతిష్యం చెప్పినట్టు చెప్పాడు కొమ్రయ్య దారం వడుకుతూ.

"నీయవ్వ... నేనైతే ఉరివోసుకుని సచ్చేటట్టుందే ఈ సారి వానలు కొట్టకపోతే – రెండేండ్లనుంచి పాలొంల అల్కుడులేకపాయె–కల్లాల కాడ ఇంత బిచ్చెమోలె ఇన్ని గింజలు దొరుకు. అవికూడా కరువైపాయె. మూన్నెల్ల నుంచి జీతం పైకం రాకపాయె. పైస పైసకు ఎంత తక్లీబ్ అయితుందో ఆ పరమాత్మునికే ఎరుక – అదల్ బదల్ ఎంత కాలమని దెచ్చి ఎల్లదీస్తం? ఈ బాధలు, కష్టాలు పడలేక ఎక్కడైనా దెంకపోదామన్నంత యాష్టొస్తుంది.– 'హొంగలేనోడు దొంగల్ల పోయిండ'ని బదులాము యేడ పడుదునని ఇజ్జత్‌కు అన్ని బాధలు వోర్చుకుని బతుకుతున్న..." బొంగురు పోయిన గొంతుతో అన్నాడు ముత్యాలు.

"మూన్నెల్ల నుంచి జీతం రాలే బావా నీకు?" అని అడిగాడు కొమ్రయ్య. ఆ గొంతులో ఆశ్చర్యం కనిపించింది.

"నీతోటి అబద్ధమాడ్తాను – రాలేదు బావా! మూన్నెల్ల నుంచి పొయ్యిలకు – పొయ్యిమీదికి శిన్న తక్లీబ్ అయిత లేదు. గిజగిజానుకుంట కాలం ఎల్లదీస్తున్నం. అది (భార్య) ఒక్కతీ ఎంతగననుని కష్టపడ్తది. ఒక్క రెక్క మీద సంసారం ఎల్లాలంటే ఈ కరువుగొట్టు దినాలల్ల ఎల్తాది?" అని దీనంగా అన్నాడు ముత్యాలు.

"మరి అడుగొద్దురా పట్వారిని?" కొమ్రయ్య.

"అడిగిననే!"

"ఏమంటడు మరి?"

"ఏమంటడు, తశీల్ నుంచీ ఇంక రాలెదంటడు. గిట్ల తక్లీబ్ అయితుంది పంతులూ అంటే నన్నేం జెయ్యమంటవ్‌రా అన్నడు – ఒక్కసారి అడిగితి, రెండుసార్లు అడిగితి. అడిగినప్పుడల్ల గట్లనే అనవట్టె ఇక అడుగొద్దని సాలిచ్చుకున్న."

"తశీల్ (తహసిల్ ఆఫీసు) కన్నపోయి గిట్ల గిట్ల సంగతని శెప్పనుంటివి?" కొమ్రయ్య సలహా ఇచ్చాడు.

"నాకు సదువొస్తదా, గిదువొస్తదా? ఎడంట ఫిర్యాదు జెయ్యాలె. ఎడంట మొత్తుకోవాలే? ఎటు తోస్తలేదు. ఈ ఐదారు రోజులు సంది అయితే పిచ్చిలేశినట్టుంది – ఏ పని చేయబోదామన్నా మనసుకు పడ్తలేదు బెచైన్ బెచైన్‌గుంది."

తన బాధలు, కష్టాలు చెప్పుకోవడం వల్ల ముత్యాలుకు ఉదయంనుంచి ఉన్న బరువు తగ్గుతున్నట్టనిపించింది. తనలోవున్న కోపం, ఆక్రోశం, అలసట మంచులా కరిగిపోతున్నట్టనిపించింది – ఆ ఉత్సాహంతోనే రెండడుగులు ముందుకు జరిగాడు – కింద గొంగడి జరుపుకుని కొమ్రయ్యకు దగ్గరగా కూర్చున్నాడు.

"మరి ఎట్ల జేస్తననుకుంటున్నవ్‌రా?" కొమ్రయ్య.

"ఏంజెయ్యాల్నో తోస్తలేదే–నువ్వన్న శెప్పు, ఎట్లజేస్తె బాగుంటదో?" అని అడిగాడు ముత్యాలు.

"ఎట్లజేస్తవేంది–మనూర్ల మొన్న 'సంగం' బెట్టిండ్రుగదా, సంఘంల వున్నోలను యిశారియ్యి – వాళ్ళు ఏమంటరో తెలుస్తది." కొమ్రయ్య.

"సంగంల శేరినోళ్ళంతా మనుషులను సంపేటోళ్ళు, దోసుకునేటోళ్ళు అని మొన్న మా పంతులు ఎవరితోనో అటుంటే యిన్న. అళ్ళను యిశారిస్తే అయితదంటవా? నీ లెక్కనే మొన్న మా పాపయ్య మామ గూడా అన్నడుగాని నేను మనసు మీద పెట్టలే –" తన సందేహాన్ని వ్యక్తం చేశాడు ముత్యాలు.

"మీ పంతులుజేసే దొంగ లెక్కలకు ఖిలాఫ్‌గా కొట్లాడేటోళ్ళు ఎట్ల దోసుకుంటారురా నీ మాటలుగాని – మా తమ్ముని కొడుకు ఓరప్పగాడు సంగంల జేరిండు. యిప్పుడు ఆడే సంగంల పెద్దనంట – అడు మనుషులను సంపుతాడా? అని గుణం నీకు గుర్తే కదరా! నువ్ పోయి వాణ్ణి కలువ్, నీకు అన్ని సంగతులు యిప్పి జెప్పుతడు" అని కొమ్రయ్య వివరించి చెప్పాడు.

కావలి ముత్యాలుకు ఏదో కాంతి కిరణం కనిపించినట్లయింది – తాను చీకటిలో లేనని తోచింది. తనకు అసరాగా, ఊతగా ఒకరున్నారనిపించింది. అలా అనిపించేసరికే మనసు కాస్త కుదుటపడింది. కళ్ళు మెరిశాయి. అప్రయత్నంగా కళ్ళల్లోకి నీళ్ళు

వచ్చాయి. గొంతు పొరమారినట్టయింది. కాస్త సంతోషంతో ఉక్కిరి బిక్కిరవుతూ–

"అయితే బీరప్పగాడిని కలువుమంటవావే?" అని అడిగాడు.

"కలుస్తనే మల్ల ఏదైన తోవ బుట్టది, నువ్వు వూకుంటే గిట్లనే కాలం గుజారాయించిపోతది. నిన్ను గోశిల ఏసుకపోతరు" అన్నాడు క్రొమయ్య.

కావలి ముత్యాలుకు బీరప్పను కలవాలన్న కోరిక బలపడింది. అలా అనిపించడంవల్ల కొండంత బలం వచ్చింది. గుండెలమీద అంతవరకు గుండులా వున్న బరువు తొలగించినట్టయింది – శ్వాస సునాయాసంగా తీసుకుంటున్నట్టు అనుభూతి చెందాడు.

"అయితే నేన్ పోయొస్త బావా!" ముత్యాలు.

"పోయొస్తవా?... ఆ అట్లనే కొనింటి నర్సిరెడ్డి శెవులగూడ ఎయ్యి ఈ ముచ్చట – ఇద్దర్ ముగ్గురు శెవుల ఏస్తెనే మంచిది ఏ ముచ్చటైన." మరో సలహా ఇచ్చాడు క్రొమయ్య.

"మంచిది. పొద్మీకి కలుసుకోని శెప్త" అని ముత్యాలు లేచాడు. కిందనున్న గొంగడి భుజంపై వేసుకున్నాడు. పక్కకు పెట్టిన బరిసె కఱ్ఱను తీసుకొని "ఇగ మరి నేన్ పోయొస్త బావా!" అన్నాడు.

"మంచిది – పొద్మీకె జాములు వచ్చి పంతుల్ను కలుస్త ఫో"– క్రొమయ్య.

"నీ యిష్టం – నేన్ పోతున్నా..."

"ఫో... ఫో..."

కావలి ముత్యాలు అటు, ఇటు చూడకుండా పరుగులాంటి నడకతో పట్వారి ఇంటికి చేరాడు.

పట్వారి ప్రహ్లాదరావు వసారాలో కుర్చీ వేసుకుని కూర్చున్నాడు – అతని పక్కన మరో కుర్చీలో ఆ ఊరి స్కూల్ టీచర్ రామారావు కూర్చున్నాడు. కొద్ది దూరంలో కావలి చంద్రయ్య నిలబడ్డాడు – ప్రహరీగోడ ఈవల ఇద్దరు ముగ్గురు రైతులు నిల్చున్నారు.

ప్రహ్లాదరావు ఇంట్లోనుంచి సన్నగా రేడియోలో పాటలు వినిపిస్తున్నాయి, అప్పుడప్పుడు ప్రహ్లాదరావు భార్య లక్ష్మమ్మ కేకలు వినిపిస్తున్నాయి.

రామారావు, ప్రహ్లాదరావు మాట్లాడుకుంటుండగా కావలి ముత్యాలు గేటువద్దకు వచ్చాడు.

కావలి ముత్యాలును చూడగానే "ఏమాయెరా? పోయొచ్చినావరా ఆ క్రొమిగాని దగ్గర్కి?" అని అడిగాడు ప్రహ్లాదరావు.

కావలి ముత్యాలు కిందికి చూస్తూ చేతిలోవున్న కఱ్ఱతో కింద పొడుస్తూ "పోయొచ్చిన పంతులు – అప్పటికొచ్చి కలుస్తనన్నడు" అని చెప్పాడు.

"వాడు ఏమనుకుంటుండు ఇంతుకు? పది రోజుల సంది పన్ను గట్టుమంటే నీల్గుతున్నడేంది? ఇంతకు నువ్వు పోయినావా, లేదా?" ప్రహ్లాదరావు.

ముత్యాలు మనసు చివుక్కుమన్నది. పుండుమీద కారం చల్లినట్లయింది. ఒక్క క్షణం పట్వారివైపు సూటిగా చూసి–

"నా పిల్లలతోడు పంతులు – ఇప్పుడు ఆడికేలే వస్తున్న" అని కుడిచేతిని తలపై పెట్టుకున్నాడు.

"మరి ఆడికేలి వస్తున్నోనివి తన్నుకుంట గుంజుకరావొద్దురా ఆ కొమ్రిగాణ్ణి? ఇంత బీడి, సుట్ట దాగి సల్లబడి వొచ్చినావ్ – నిన్ను వసూలు చేసుకరమ్మని తోలిన్నా? లేక ముచ్చటపెట్టిరమ్మని తోలిన్నారా కావలోడా?" కోపంతో అన్నాడు పట్వారి.

ముత్యాలుకుకూడా కోపం వచ్చింది – కాని పెదవుల మధ్యనే ఆ కోపాన్ని బిగపట్టి "ఎంత శెప్పాల్నో అంత శెప్పిన. ఇయ్యకుంటే నేనేం జెయ్యాలే పంతులు?" అన్నాడు.

"శేతులు లేనోళ్ళయి పీకాలే – ఏంజేస్తడంట, ఏంజేస్తడు – నువ్ ఎందుకున్నవ్‌రా చెప్పినపని శెయ్యకుంటె? అణ్ణి తన్నుకుంట గుంజుకరానుంటివి. వాని అయ్యసొమ్మా? అమ్మసొమ్మా? పన్నులు గట్టకపోను. ముందుగాల నిన్ను రెండు తల్గిస్తే పన్నుల పైసలు అవంతల అవే ఉరుకొస్తయ్!" అన్నాడు ప్రహ్లాదరావు కుర్చీలోంచి ఒక్కసారిలేచి. కళ్ళు ఎర్రగా మారాయి – తిట్టేటప్పుడు గొంతువద్ద నరాలు పొంగుతున్నాయి.

రామారావు, కావలి చంద్రయ్య ముత్యాలువంక దీనంగా చూసారు.

కావలి ముత్యాలు పొంగుకొస్తున్న కోపాన్ని ఆపుకుని ఒక్కసారి ప్రహ్లాదరావు వంక తలెత్తి చూశాడు. వెంటనే ప్రహ్లాదరావు–

"మెడల మీదికేసి సూస్తవేంది కావలి లంజకొడుకా! నీ తల్లీ, పెండ్లాన్ని పట్టుకుని........." అని బూతులు తిట్టాడు.

కావలి ముత్యాలు మొఖం ఎర్రబారింది. కళ్ళలో ఉక్రోషం బుసలు కొడుతోంది. ముక్కు పుటాలు ఎగురుతున్నాయి. చేతిలో కర్ర బిగుసుకుంటోంది. పాదాల క్రింద భూమి నలిగిపోతోంది. దేహమంతా వేడివల్ల పొగలు గక్కుతున్నట్టనిపించింది. ఆ చండ ప్రచండమైన కోపంతోనే ప్రహ్లాదరావు వంక అలాగే చూస్తూ నిల్చున్నాడు, తరతరాలనుంచి వస్తున్న బానిసత్వాన్ని ఒక్కసారి తెంచుకోలేక....

కావలి ముత్యాలు అలాగే చూడడంతో పట్వారి సహనం దెబ్బ తిన్నది. తన అధికారాన్ని ఎదిరిస్తున్నట్లనిపించింది – తన గౌరవాన్ని పెల్లగిస్తున్నట్టనిపించింది. తన వంశ ఆచారాన్ని, మర్యాదను మట్టిపాలు చేస్తున్నట్టనిపించింది. ఆ కోపంతోనే–

"ఇంకా సూసుకుంట నిలబడ్డవేందిరా లంజకొడుకా – పో – బయటకు పో – నీ తాశిలి మొఖంల...." బూతులు తిట్టాడు.

ముత్యాలు కదలలేదు – చూపులు కదల్చలేదు, ఆ చూపులకే శక్తి వుంటే ప్రహ్లాదరావునేగాదు ఆయన ఇంటిని గూడ కాల్చేయగలవు.

ఆ చూపులు ప్రహ్లాదరావు కోపానికి అగ్గిమీద గుగ్గిలం వేసినట్టయింది. ఫట్వారిని రెచ్చగొట్టాయి – ముత్యాలు అంతు చూడాలని మనసు ముందుకు తరిమింది. వెంటనే కుర్చీకి వ్రేలాడేసిన తన తండ్రి పూతకర్రను తీసుకుని ఆవేశంతో ఊగిపోతూ రెండు అడుగులు ముందుకేసి ముత్యాలు వొంటిపై నాలుగు దెబ్బలు బలంగా వేశాడు. మరో దెబ్బ వెయ్యబోయేసరికి ముత్యాలు పట్వారి కర్రను అందుకుని రెండుముక్కలుజేసి అవతల పారేసాడు. బాకు దిగేసిన తన బరిసె

కర్రను ఎత్తాడు. అంతే – పట్వారి పరుగు పరుగున ఇంట్లోకి పరుగు దీశాడు. ఇంతలోనే రామారావు, కావలి చంద్రయ్య, గేటు ఈవలవున్న రైతులు అందరూ వచ్చి కావలి ముత్యాలను పట్టుకున్నారు. ఇదంతా క్షణంలో జరిగిపోయింది. చక చకా ఈ సంఘటనలన్నీ జరిగిపోయేసరికి అక్కడవున్న రామారావు గుండె వేగంగా కొట్టుకోసాగింది. అందరూ నిశ్చేష్టులై కావలి ముత్యాలువంక చూస్తూ నిల్చున్నారు.

కావలి ముత్యాలు అందరిని విదిలించుకుని, తనకు తగిలిన దెబ్బలను చూసుకుని బీరప్పను కలుద్దామని పట్వారి ఇంటినుంచి బయలుదేరాడు కోపంతో. అతని కళ్ళల్లో ఎదురుతిరిగిన సహనం బుసలుకొడుతోంది...

● *జ్యోతి, అక్టోబరు – 1981* ●

★ ★ ★

## 50

అల్లం రాజయ్య

# శత్రువు నేర్పిన పాఠం

కోర్టు బోనులో ఒక గొల్లవాడు నిలబడి ఉన్నాడు. చెదలు దిన్న గుంటుక చెక్కలాగా అమ్మతల్లి గుంటల ముఖం–అక్కడక్కడ పెరిగిన గడ్డం....ఎడమచెవికి అరిగిపోయిన ఎర్రరాయి కొనుకపోగు– బాగా మాసి చిరిగిన కుప్పాసపు ధోవతి నిండా పేడ మరకలు. నల్లగా మాగిన గడుకకుండలాంటి ఒళ్ళు....ఇదీ అతని రూపం.....ఎడం కాలు ఏదో రాయి మీది నుండి పడ్డప్పుడు కీలు తొలిగి కొంచెం వంకరయ్యి ఎగుడు దిగుడుగా ఉన్నది.....అతని బట్టలనుంచి, ఒంటినుంచి గొర్ల వాసన గుప్పుమంటోంది....అతని పక్క ఇంకా మీసాలు సరిగా మొలవని బోడిగుండు యువకుడున్నాడు. అతని కణతల మీద అర్ధరూపాయంత బర్రలు. ఒంటిమీద బుజాలు చిరిగిన ముతక బనీనూ.... యువకుడి కుడికాలుకు మోకాలుదాకా ఏనుగు గజ్జిపుండు బాగా రెచ్చిపోయి సొనకారుతోంది. వారిపోలికలిస్తే తండ్రి కొడుకులదిలాగుంది.

ఇంతలో ఎత్తుపళ్ళ గూని లాయరొకడు నల్లగౌను వేసుకొని కొంపలు మునిగి పోయినట్టుగా ముఖం మాడ్చుకొని హడావిడిగా వచ్చాడు..... గుమ్మడి పండులాంటి జడ్జీ సుతారంగా అలవాటు ప్రకారంగా సుత్తిని బల్లమీద కొట్టి ఊబ చెంపలు కిందూమీదూ కాగా, "ఆడర్......ఆడర్" అన్నాడు.....జడ్జీ టేబులు ముందు కూర్చున్న కోతి ముఖపు గుమస్తా తన ముందున్న చెక్క బల్లమీది అద్దాలు కళ్ళకు తగిలించు కొని పెన్నుమూత తీశాడు.

ఎత్తుపళ్ళ లాయరు ఓమారు గాలిపంఖా వేపు, మరొకమారు కోర్టు బయటికి చూసి, ముద్దాయిలను చూడకుండానే జడ్జీవేపు కళ్ళు తిప్పి ముద్దాయిల బోను వేపు నడిచాడు.

కోర్టు గుమాస్తా లావుపాటి పుస్తకమొకటి తెచ్చాడు.

"రాళ్ళవానకూ బోడనెత్తికీ దంట–" అన్నాడు యువకుడు.

తండ్రి తనకేవేమి పట్టనట్టు జడ్జీ తల మీదుగావున్న గొప్ప వాళ్ళ బొమ్మలు చూస్తున్నాడు.... అలవాటున్న వానిలాగానే పుస్తకం మీద చేయుంచాడు.

లాయరు మంత్రం లాగా ఏదో చెప్పి చివరకు "అంతా నిజమే చెప్పుతాను" అనమన్నాడు.

తండ్రి మామూలుగానే అనేశాడు. కొడుకు "అంతా నిజమే చెప్తాను"... అన్నాడు వ్యంగ్యంగా.....

జడ్జి కళ్లు పులపొడిసిందు. నల్లకోటు లాయరు అప్పుడు సూటిగా ముద్దాయిల వేపు చూస్తూ....

"నీ పేరేమిటి?"

"గొల్ల గంగులు."

"మే 24వ తారీఖున నీ యింట్లో బాంబు పేలింది నిజమేనా?"

"నిచ్చమే......"

"ఆ తరువాత పోలీసులొచ్చి నీ యిల్లు సోదాచేస్తే మరో అయిదు బాంబులు దొరికినయ్ – నిజమేనా?"

"నిచ్చమే......."

"యువరానర్ సార్....అంటే అంతకుముందునుంచి నీదగ్గర బాంబులున్నయన్న మాట"

"ఉన్నయి....."

"1978, అంటే రెండేండ్ల కింద నీదగ్గర బాంబులున్నయా?"

"అటి సంగతే నాకెర్కలే.....అయ్యేట్లుంటయో సుతదెల్వదు."

"1978లో మీవూళ్లో రైతుకూలి సంఘం బెట్టుకున్నారు. అందులో నువ్వు మెంబరు వైనావు......"

"అయిన–గదంట్ల దొంగతనమేమున్నది? పొటుకునాదు సంగం నేటుకే పెట్టుకున్నం."

"శ్రీపతి లక్ష్మణ్‌రావు నీకు తెలుసా?"

"గదేం మాట–మా నెత్తురు, మాంసం మింగి కూసున్న మా వూరిదొర మాకెర్క లేదా?"

"రైతుకూలి సంఘం 1978 ఆగష్టు 14వ తేదిన శ్రీపతి లక్ష్మణ్‌రావు ఇంటి మీద దాడిచేసి ఫర్నిచర్ విరగ్గొట్టింది, అదే సంవత్సరం నవంబర్ 29 నాడు అతని గొర్లమందమీద దాడిచేసి వంద గొర్రెలు ఎత్తుకపోయింది, 1979 మార్చి 12వ తేదిన నాలుగెకరాల మొక్కజొన్న పెరడు దోపిడి చేసింది...." ఇట్లాగా మరో పది నిముషాలు తేదీలు నెలలుచెప్పి, చివరకు "ఇవన్నీ నిజమేనా?" అన్నాడు లాయర్.....

"తమరి మాటల సెప్పన్నంటె నిచ్చమే–సంగం మాటల సెప్పన్నంటె అవద్దము....."

"అన్నిట్లో నువ్వున్నావు......."

"ఉన్నననే కద కేసులు బెట్టింది....."

"యువరానర్ సర్! తను సంఘ సభ్యుడయినట్లు ముద్దాయి మొదటే ఒప్పుకున్న సంగతి గమనించాలి."

"నిచ్చమే....నిచ్చమే....గదంత భారతమినియిని సెవులు సిల్లులుబడిపోతున్నయి.

మేం సంగం బెట్టుకున్నం....మావూల్లె లేనోల్లకు ఉన్నోల్లకు లఢాయి షురువయ్యింది గప్పుడే...." యువకుడు అసహనంగా క్రోధంగా అన్నాడు.....

"యువరానర్ సర్....1978 నుండి ఈ జిల్లాలో సంఘ విద్రోహాల కార్యకలాపాలు పెరిగిపోయాయి.....చాపకింది నీళ్ళలాగా గ్రామ గ్రామంలో సంఘ విద్రోహులు చొచ్చుకపోయారు. పాడిపంటలతో పరమ ప్రశాంతంగా ఉన్న గ్రామాలలో అశాంతి ప్రబలింది..... అందుగులపల్లి అనే గ్రామంలో మొదటి ముద్దాయి గొల్ల గంగులు, వరఫ్ చిన వెంకులు, రెండవ ముద్దాయి దొల్ల పర్వతాలు వరఫ్ గంగులు, యిద్దరు సంఘ సభ్యులయ్యారు..... సంఘం చేసిన దౌర్జన్య పూరితమైన ప్రతి చర్యలో పాల్గొన్నారు. అందుకు సాక్ష్యంగా కోర్టులో ఇంకా విచారణలో కేసులున్నాయి..... అందుగులపల్లి వాస్తవ్యుడైన శ్రీ శ్రీపతి లక్ష్మణరావుగారి పంటలు, పశువులు, భూములు దోచుకోవడమేకాక అనేకసార్లు ఇంటిమీదికి దాడి చేసి అతన్ని చంపుతామని బెదిరించారు. చంపే ప్రయత్నాలు కూడా చేశారు శ్రీపతి లక్ష్మణరావుగారు ఈ అరాచక చర్యల్ని అటు ప్రభుత్వం దృష్టికి, యిటు కోర్టువారి దృష్టికి ఎప్పటికప్పుడు తెస్తూనే ఉన్నారు. ప్రభుత్వంవారు కల్పించుకొని తగిన సమయంలో ఆ గ్రామంలో పోలీసు బందోబస్తు జరిపించారు....

"ఇది గమనించిన సంఘంవారు కుట్రలుపన్ని మారణాయుధాలతో మరోమారు దాడికి సిద్ధపడుతున్నారు....కాని ప్రమాదవశాత్తు గొల్ల గంగులు యింట్లో బాంబు పేలి కుట్ర బహిర్గతమైంది....సోదా చేసిన పోలీసులకు అయిదు బాంబులు దొరికాయి.....చట్ట ప్రకారంగా కల్లోలిత ప్రాంతంలో ఏరకమైన మారణాయుధాలు కలిగిఉన్నా నేరమే......"

"గరీబోల్లేనా? అందరా?" కొడుకు అడిగిండు.

"మరైతే మాలచ్చుదొరకు రొండు తుపాకులున్నయి, గాటి మాటేంది?" గంగులు అడ్డు తగిలాడు. ...

జడ్జీ ముఖం చిట్లించి "ఆడర్....ఆడర్" అని సుత్తి కొట్టాడు.

"సంఘ సభ్యులు కొందరు నాటుబాంబులేకాదు, తుపాకులుకూడా ధరించి రాత్రి గ్రామాలలో బీభత్సం సృష్టిస్తూ, పగలు కొండల్లో ఉంటున్నట్లు ఇటీవలి వార్తలు తెలుపుతున్నాయి....ఇట్లాగా మారణాయుధాలు ధరించిన సంఘసభ్యులు అమాయక ప్రజలను, దొరలను బెదిరించి గ్రామాలలో భయాందోళనలు సృష్టిస్తున్నారు. ఇట్లాంటి వాటిని, సాధారణ ప్రజా జీవితానికి భంగం గలిగే విద్రోహ చర్యలను సకాలంలో అరికట్టకుంటే–లక్ష్మణరావు గారిలాంటివారికేకాక ప్రజలకు మాన, ధన, ప్రాణహాని జరిగే ప్రమాదమున్నది. ఇలాంటి సంఘ విద్రోహచర్యలు ఒక్క గ్రామానికే పరిమితం కాక ముందు ముందు దేశ భద్రతకు కూడా ముప్పు తెచ్చిపెట్టగలవని ఆనరబుల్ జడ్జీగారికి మనవి చేస్తూ–ఇలాంటిచర్యలను అరికట్టడానికి ముద్దాయిలిద్దరినీ ఉచితరీతిలో శిక్షించగలరని కోరుతున్నాను." పబ్లిక్ ప్రాస్యిక్యూటర్, లేదా ఎత్తుపళ్ళలాయరు కంఠపాఠంగా అప్పగించి కూర్చున్నాడు.

తర్వాత మరో పది నిముషాలు యస్. ఐ. గారిని, ఇద్దరు పోలీసులను, మరొక సాక్షి అనబడే లక్ష్మణరావు తొత్తును ప్రశ్నించడం జరిగింది. గంగులు ఒప్పుకున్న విషయాలే వాళ్ళు చెప్పారు.... గుమస్తా రాసిందే మళ్ళీ రాశాడు....

అంతదాకా గొల్ల గంగులు అందోళన పడుతున్నట్టుగాని, భయపడుతున్నట్టుగాని కనిపించలేదు. అందరి మాటలయిపోయిన తరువాత కొడుకు ముఖం చూశాడు....అది అప్పటికే ఎరుపెక్కింది.... పొదిల గొర్రెపిల్లలాగా బోనులో చిరాకుపడుతున్నాడు.

"మున్సొసాబ్ దొర–తమరి ముంగట నేనోరొండు ముచ్చెట్లు సెప్పాల్లనుకుంటున్న" అన్నాడు గంగులు.....

జడ్జీ యాంత్రికంగా జీవంలేనినవ్వు కనిపించీ కనిపించకుండా నవ్వి తలూపాడు.

"నేను తమరి ముంగట గిప్పుడే కొత్తగా నిలుసుండలేదు.....రెండేండ్లబట్టి ఆకులు జాడిచ్చిన అడవిల మేకలు దిరిగినట్టు కచ్చిర్ల పొంట దిర్గుతనేఉన్నం....మంచో సెడ్డో తమరినేటియిని సేసేటియి సేత్తండ్లు.....మిమ్ముల ననేదేముండదని నాకు తెలువక్కాదు. తమరు కూకున్న కుర్సిమీన ఎవలుగూకున్న గంతే సేత్తరని మా కెపుడో ఎరికయ్యింది.....నా మట్టుకు నాకు."

"తమరు సుత మంచేసేత్తరని అప్పుడప్పుడు ఆశ గలుగుతది." కొడుకు వెక్కిరింపుగా అన్నాడు.....

"ససరాదుర...సను...ఎవారం కట్టెకొట్టె తెచ్చెనన్నట్టుంటె గింత పీకులాటెందుకు?" అని కొడుక్కి చెప్పి కొంచెం ముందుకు వంగిండు.....

కొడుక్కి ఎప్పటినుంచో గజ్జెకర్ణి దురద పెడుతోంది. మనుసంతా చిరాకు గున్నది....గోకాలంటె వంగాలె...గోకాలో లేదో తేల్చుకోకుండా ఉన్నాడు.

"నిచ్చమే....మేం బాంబులు పట్టుకున్నం–బందూకులు సుతపట్టేయేల్లత్తదేమొ ఎవలు సెప్పచ్చిండ్లు....ఒక సెయ్యితోని సప్పట్లగయి. రొండుసేతులుండాలె....మైదానంల కొట్లా టకు దిగినంక ఎదుటోడు కత్తి తిప్పుతంటె ఉత్త సేతుల గొట్లాడెనోడు కత్తిపోట్లు దింటడు....ఎదుటోడు కత్తిబట్టుడు ఖానూనైతె–ఇంకొకడు సుత కత్తిబట్టటం దాని ముత్తాత ఖానూను. కనిఖానూను కత్తిబట్టే నోనికే మెడియ్యమని సెప్పిందని తిర్గేసి మర్లేసి అకేలు సెపుకచ్చి పెద్ద పెద్ద మాటలతోని మేం దొంగలమో లంగలమో మరేదో అని సెప్పుకచ్చిండు....అదట్ల ఉండనియ్యిండ్లి

"నా పక్కన నిలుసున్న నా కొడుకు కంతల్ల బర్రలు సూసిండ్లా?"

జడ్జీ, వకీలు, అమీన్ అంతా చిత్రంగా చూశారు....

"మూడేండ్లల్లనో, నాలుగేండ్లల్లనో ఈనికే కేరిమచ్చి పిడికెల్లు, పండ్లు ఓగబట్టిండు.... సూసినోల్లంత పోరడు దక్కడంటె దక్కడన్నరు. బిచ్చగాళ్ళ రాయలింగుబావచ్చి పసుపు గొమ్ము కాలబెట్టి సుర్రుసుర్రున గాలంగ కణతల్ల ఒత్తిండు.....తమరిలాంటె పెద్ద లోకులు మందో మాకో సూదో, గోలో ఏసుకొని దక్కిచ్చుకోవచ్చు. మోటునాళ్ళం–నా నెత్తురే నా కొడుకే..... కాని కంతల్ల కాల్చకుంటె బతికెటోడుగాదు. ఆ యేల్లన పసుపు కొమ్మే అతారయ్యింది. నేను గొల్లోన్ని....గొర్లగాసుక బతికెటోన్ని....నాకు తెలుసున్న మరొక్క ముచ్చట సెప్పుత..... పది దినాల కేంద మాట–మా మంద మీదికే తోడేలు అలవాటయ్యింది.....కండ్లల్ల అత్తులేసుకొని మందసుట్టు ఎన్నిపారేలు తిరిగినా ఏనాత్రో గుట్టుసప్పుడు గాకుంటచ్చి మందమీన బడేది..... మాంచి పసక పిల్లను ఈడ్చుక పోయ్యేది....సెట్టో, పుట్టో ఒర్రో సిర్రో సాటుకు ఇంకోటుండేది. రెండు

గలిసి గొర్రె పిల్లను రెండుగ సీరుకొని ఎత్తుక పోయేటేయి. గొల్లోల్లమంత మొఖాన కొంగుబెట్టుకొని ఏడిత్తేమున్నది అరుత్తేమున్నది? మేం ఎంత మందిముంటేంది? సేతుల్ల గుతుపలుంటేంది? అఖరు కేమయ్యిందంటె–మాదాంట్ల కత్తెర సాలడో ఉపాయం జెప్పిండు....గొర్రె పేగుల్ల తూట బెట్టి అదచ్చె తొవ్వల బెట్టినం.. దానేల్లకు అది రానే అచ్చింది. దొంగ బుద్ధి ముండ పేగులు మురికి సూసింది....నోటబట్టుకొని ఒర్రెలకు బొయి తిందా మనుకున్నది. తూట బేలింది. ఎగిరిసచ్చింది. మందకు తోడేలు పీడ బాసింది.

"అఖరు ముచ్చెట. తమరికి తెలిసే ఉంటది. కౌరవులచ్చి ఇరాట్రాజు అవుల గొట్టుకపోయిండ్లు– అందరు పిసపిసలాడిండ్లు–ఇజ్జానికి బోవాల్నంటె కౌరవులకున్న బానాలు ఇరాటరాజుకు లెవ్వు. మరందు సేత అటపంతు లేషంలున్న అర్జైనుడు. జంబిసెట్టు మీదున్న బానాలు తియ్యకతప్పలే–లడాయి జెయ్యకతప్పలేదు. అవుల మలిపినోడె అర్జైనుడు.

"మావూళ్ళె సంగతి....ఇవ్వాల్దన్క మావూళ్లె ఏమేమి జర్గిపోయినయొ దొరల పచ్చాన చెప్పొకచ్చిండ్లు....

"మేమెందుకు సంగం బెట్టుకున్నం? మావూళ్లె లచ్చయ్యదొర అయినె బంట్లు గలిసి ఇల్లిల్లు దోసిండ్లు–ఎట్లాగా? కిందికుండ కిందుండగనే మీదికుండ మీదుండగనే నడిం కుండ తప్పదీసినట్టు – కుంచెడు మంచెడు – పది అయిదు అప్పొలిచ్చి – పెచ్చులు అడ్డీలు కట్టికట్టి మా కురిబెట్టి మా ఎకురా అరెకురం బూములు నాకేసిండ్లు....మీదికెల్లి ఎట్టిపిల్లల పేర, దండుగుల పేర మేం పెంచిన కోళ్ళు గొర్లు గొడ్లు అన్ని గుంజుకున్నరు. గియ్యన్నేంది–మా ఒంట్లె గోరెడు మాంసం లేకుంట ఒలుసుకున్నారు. సిమ్మెడు నెత్తురు లేకుంట పీల్చుకున్నారు. బరాంచినంత కాలం బరాంచినం. ఏటోక్కని కొంప గూలుతంటె–ఏటొక్కని సంసారం గోదాట్లె గలుత్తాంటె మేము పెనుగులాడలేదనిగాదు....ఆడు పొట్ల తవ్వుడు బోసి కుక్కల తాకులాట బెట్టిచ్చినట్టు ఎత్తుమీదెత్తు లేసి నడుపుకచ్చిండు."

"పెండ్లిల్ల సావుమంతురం సదివినట్టు ఏందీ గులుగుడు?" కొడుక్కు తిక్క తిక్కగా ఉన్నది.....

"గిది గులుగుడు గాదుర.... కడుపులసొద....ఇన్నేండ్లబట్టి కడుపుల గడ్డ తీర్గ పెరక్కచ్చిన సొద...." మళ్ళీ జడ్జివేపుతిరిగి.....

"నిచ్చమే, మావోడన్నట్టు తవ్వకుంటె పెంకలు తప్ప బొగ్గెంరాదు....ఇదివరకు గిదిగిట్లని మాట్లాడెరుగం....గట్లల్లగట్టోలె సెట్లల్ల సెట్టోలె–మందల గొర్రెతీర్గ బతికే నోన్నే... సంగమచ్చినంకనే నేను నలుగుట్ల మాట్లాడిన మనిషి తీర్గ.....లచ్చపారేల జెప్పిన ఈ సొదతీరంది..... నాకండ్ల ముంగట ఒర్రంగ నా మేకల మెడలు గోసుక తిన్నరు....కార్జమసొంటి పెరడి అని కొమ్మున్నే పెట్టుకున్నాడు సరె: గదంత గంగల పోనియ్యిండ్లి. నేనెందుకు బాంబు దగ్గెర బెట్టుకున్ననో గదిసుత సెప్పొత.....

"మొట్టమొదట్ల అందరం కుప్పగూడినంక గాంధోనైరో సెప్పినట్టుగనే సేతులు ముంగట బెట్టుకునే మాకు కయిదెల్లు బెరుగాలని, ఎట్టి బందు గావాల్నని మొత్తుకున్నం....దొరగప్పుడేం మాట్లాడలేదు....గని దిన మొకనింటికే సుంకరోన్ని

దోలిచ్చి పాత బాకీలన్ని కక్కితీరాలన్నడు.... మా పెండ్లాలను పోల్లగండ్లను అమ్మినా తీరనంత బాకీలు తేలదీసిండు.....దొంగ పద్దులు మేం గట్టమన్నం... అప్పటికే ఆరందినాల నుంచి ఉపాసముప్పడి ఉంటన్నం...లొల్లి ముదిరిపోయింది దొర అప్పుడు సంగతి ఎత్తకుంటనే కాపు రంగయ్యను ఈదుల్లదొరికిచ్చుకొని తనిచ్చిండు. అట్ల ఊకున్నం, మరొకన్ని తాళ్ళల్ల.....అఖరుకు మా పోశాలును అద్దుమనాతిరి పురుసాలు పెసికి సంపిచ్చిండు. గిదేందని అడుగబోయినందుకే.... గడితలుపులు మూపిచ్చి-ఆడొల్ల పోల్లగండ్లని సూడకుంట గుండనాళ్ళతోని నెత్తుర్లు గారంగ కొట్టిచ్చి-తనే ఉల్టా మామీన కేసు బెట్టిండు....

"గిట్ల తమరి ముంగటె కచ్చిన అన్ని కేసులు జర్గినయ్....మేం దుక్కమో కోపమో ఆగబట్టగ అందరం తిట్టుకుంటనో మొత్తుకుంటనో అనిముంగటికి బోవటం అదు పకడ్బందిగా మామీన ఇరుసక పడటం-అందరం తన్నులు దెబ్బలు దినటం జరిగేది.....మల్ల మీదినుంచి కేసులు.....

"గిట్ల దగ్గితె కేసు-నోరు తెరిత్తె కేసు-మూత్తె కేసు....మందుకు మందను తానకు దోలివచ్చెటోడు....బేల్లు, కేసులు, అకేల్లు-మా బతుకంత కుక్కలు సింపిన ఇత్తారయిపోయింద..... పంటలు గంగలగల్సినయ్.

"గిన్ని సేసిన సుత ఆని పనులు నడువలేదు....అసింట్లాడే ముసిగి సచ్చేకాల మచ్చింది....మీదికెల్లి పిరికేజొచ్చింది. దస్కంబట్టుకొని ఏడాది కింద ఊళ్లె నుంచి ఎల్లిపోయిండు. పీడ బాసిందనుకున్నం. అడుబోయిన పోలీసోల్ల పీడ దప్పలే......

"పోయినోడు ఎవల భరువస దొరికిందో ఏడాదికి పోలీసోల్ల ఎంటబెట్టు కచ్చిండు....పోలీసోల్లు తోలు బూట్ల టకటకలాడిచ్చుకుంట ఏదుంటె అద పట్టుక పోవుడు. కల్లు సారలు దాగి ఇండ్లల్ల సొచ్చుడు. మాట్లాడితె నచ్చలేటని తన్నుడు కేసులు బెట్టుడు షురువు జేసిండ్లు."

"గిందట్ల రొండు సంగతులున్నయ్ ఒకటేమొ-మేం కోపమచ్చిన దుక్కమచ్చినా పసురాలసొంటోల్లం గన్క దానికోరీతి లేకుంట ఎల్లబోసుకున్నం. దొరేమొ పకడ్బందిగా ఇసారం జేసి మామీద ఎదురుదెబ్బ దీయ బట్టిండు...మేం తిట్లల్లున్నప్పుడు దొర దుడ్లు బట్టిండు, ఏడుపులు బనికిరావని మేం దుడ్లు బట్టడం మేం దొరగుండనాళ్ళ నుంచి నేర్చుకున్నం-దొర కత్తులు కటారులు దీసి దొంగదెబ్బ దీసిండు. మేం కత్తులు బట్టినం-దొర తుపాకుల పోలీసుల దెచ్చిండు....మరింక మేం ఎదురు జవాబియ్యకుంటే బతుకలేమని బాంబులు బట్టినం.

"ఎర్రి గాల్లోని కెన్ని దమ్ములని తమరు కోప్పడవచ్చు. కని ఊళ్ళె తుపాకు లేసుకొని పోలీసోల్లు లేకుంటే మేం ఇన్ని పుల్లెందులుబడకనే పోదుము....."

"ఊళ్లె ఉన్న ఒక లంగ, దొంగ, మంది కొంపలు ముంచెటోడు, మంది నెత్తురు తాగెటోడు ఒక్కడు.. ..మల్లింక అళ్ళ పచ్చాన్నె తుపాకులేసుకొని గుండనాళ్ళు, పోలీసోల్లచ్చి మా యిండ్లు సత్తె నాశిడంజేత్తె తప్పుగాదు. మరింక దిక్కులేక, మా అడోల్లకు, మాకు యేవిల్లల ముప్పుత్తదో తెల్వక మా బొడ్లె సిన్నకత్తి బెట్టుకుంటె-సిన్న బాంబుబెట్టుకుంటె-తప్పెట్లయితది నాకు సమఝయితలేదు."

"మేం పనులుజేసుక బతికెటోల్లం. మేం బాంబులు గోదాల్లె పారెత్తం, మా

దగ్గర గుంజుకున్న బూములు, పసురాలు మా కియ్యమనుండ్లి.....మాట్లాడ్తినే తన్నులు గుద్దులన్నోడెట్లిత్తడు? మరందుచేత మేం లడాయి సెయ్యక తప్పదు. ఎదుటోడు అన్నెయంగ తుపాకులు పట్టుకుంటె మేం నాయం కోసం బాంబులు పట్టినమ్. మీరెంతమొత్తుకున్న, మీ కితాబులెంత మొత్తుకున్న, మీ పోలీసులు ఎన్ని ఎత్తులేసిన–మీ అకీల్లు ఎన్ని కీల్లమాటలు మాట్లాడిన మీ గాంధీ నైరు సర్గంల బాదపడిపోయిన గిది తప్పదంటె తప్పదు. కిర్మి రోగమత్తె సంత కొడుకైన కంతలు గాల్సినట్టే–తోడేలు పీడ బోవన్నంటె తూట బెట్టక తప్పనట్టే–అవుల మలుపాలంటె అర్జెనుడు బానం పట్టక తప్పదు....." గొల్ల గంగులు గుంటల మొఖంలో ఉద్వేగం......కంఠంలో తీవ్రత.....

ఎత్తు పళ్ళ వకీలు ముఖం మాడిపోయింది. యస్. ఐ. పండ్లు గొరుకుతూ "నక్సలైటు నా కొడుకును...." గొణుక్కున్నాడు, జడ్జీ అసహనంగా కదిలి అసహ్యంగా ముఖం పెట్టి అదే దెబ్బ.. .. "ఆడర్...ఆడర్....." అదే గొంతు. గుమస్తా చేతిలోని పెన్ను బెల్లంరంగు కాయితం మీద దిగబడి పోయింది.

గంగులు అందరి ముఖాలు చూసి ఎలుగు రాసిన గొంతుతో, "గొల్ల లంజకొడుక్కు ఎన్ని గుండెలని మీరంతా అనుకుంటారు. మీకు సందు దొరుకుతె దొడ్లె దోల్తరని నా కెరికె.... నాకేం ఫికరులేదు నేను ఊఁ అన్నా ఉప్పురాయన్న దొడ్లె దోలటానికి మాటొక్క ఖానూన్లు నిండ మునిగినం. సలిబెడ్తందని కూకుంటె పాయిదాలేదు....మేం ఎప్పుడో సర్వనాశిడమై పోయినం. మరింక అయ్యేదేమిలేదు...

"మున్సోసాబ్ దొరా! నా మీన దీనితోని ఆరు కేసులున్నయి. మావోని మీద ఏడో ఎనిమదో ఉన్నయి. ఇంకా కొత్తయి రావనే నమ్మికలేదు. దొరలు తల్సుకుంటె దెబ్బలకేంకొదువ? సేతుల తుపాకి బెట్టి, తుపాకితోటట్టుక పట్టుకున్నమంటరు.....కాదు పోదంటె నడూర్లె తుపాకి నేసి సంపి గుట్టల్ల ఎదురు కాల్పుల్ల నచ్చిండంటరు.... ఇప్పటికే కేసులకు, జమానతులకు, అకీల్లకు పెట్టి పెట్టి యాష్టకచ్చినం......ఏది జేసిన, ఏదన్న మీ సేతకు నోటికి ఉదరు లేదు–మీరాజ్జెంగన్క.

"మరింక నేను గీ కేసుల సుట్టు పుచ్చిన కుక్క తీర్గ తిరుగలేను. నా వొంట్లె జిగసచ్చింది..... మీరు మాట్లాడే మాటలు బడలేను. నేను లంగనుకాదు. దొంగను కాదు–గొల్లోన్ని....ఎర్ర గొల్లోన్ని ఆఖరుకు...." గంగులు కంఠం పూడుకపోయింది.

జడ్జీ కుర్చీమీది నుంచి లేస్తూ కేసు వాయిదా పడ్డట్టుగా ప్రకటించాడు.

"నేను కేసుల సుట్టు దిరుగలేను–మీ కానూన్లు, కచ్చీర్లు, మీ పోలీసులు, అళ్ళ తుపాకులు.... తన్నులు గుద్దులు–తప్పిచ్చుకోకుంటె బతుకలేను. మాకు అన్ని నేర్పింది మీరే.... మీ దుట్టితనమే.... ఆఖరుకు లఢాయి సుత మీరే నేర్పుతండ్లు...." గంగులు గొణుగుతున్నాడు.

కొడుకు గంగులు ఎడం రెక్క బట్టుకొని బయటకు తీసుకొచ్చాడు......

కోర్టు ముందు జనం ఆ తండ్రీ కొడుకులను వింతగా చూస్తుండగా గొల్ల గంగులు వెనుకకు తిరిగి కాండ్రకిచ్చి ఉమ్మేసిండు.......

● ప్రచురణ, *1982* ●

★ ★ ★

51

వారాల కృష్ణమూర్తి

# జీవంలేని మొక్క

భూమిని నమ్ముకున్నోడు రాజులా బతకచ్చంటారు. కానీ లచ్చుమన్నను చూస్తే అది తప్పనిపిస్తుంది. అతనికి పదెకరాల భూమి ఉంది. ఎప్పుడొస్తుందో కాలువ.....దాన్ని తలచుకుంటూ రాబోయే మంచికాలం కోసం ఎదురు చూస్తున్నాడు. ఎదురుచూపుల వయసు ఇరవై దాటాయి. లచ్చుమన్న పెళ్ళినాటి నుండి కూతురి పెళ్ళినాటికి శ్రీశైలం కాలువ తవ్వకాలు నల్గొండ వరకు వచ్చాయి. తవ్వకాలు ఎప్పుడు పూర్తిగాను.....అందులో నీళ్ళు ఎప్పుడు రాను....ఇన్నాళ్ళూ వట్టిపోయిన మట్టికి చేవ ఎప్పుడొచ్చేను? లచ్చుమన్న ఎదురుచూపులతో సగం జీవితం దాటింది.

పేరుకు పదెకరా లయినా పండించేది రెండెకరాలే–అదీ వాన లొస్తేనే పంటొస్తుంది. వానల మీద నమ్మకం లేక, విత్తిన విత్తనాల ఖర్చు కూడా గిట్టుబాటు కాదని ఇంటిల్లిపాదీ గ్రహించి తలో రకంగా కూలీ నాలీ చేసుకుని బతుకు ఈడుస్తున్నారు. పెద్దోడు పట్నంలో రిక్షా లాగుతున్నాడు. రెండోవాడు లచ్చుమన్న, గౌరమ్మలతో కాలవ తవ్వకాలకు పోతాడు. వచ్చే కూలితో కడుపు నింపుకుంటూ, ఆశ చావక, దశ తిరక్కపోతుందా అని ఏ ఏటి కాయేడు అంతో ఇంతో జొన్న వెయ్యడం...చెయ్యి కాల్చుకోవడం పరిపాటయింది.

వ్యవసాయం అంటే వ్యయం తప్ప సుఖం లేదని కూతురి పెళ్ళికి ఇల్లు కుదువ పెట్టిన్నా డనిపించింది.

వ్యవసాయం అంటే వెట్టిచాకిరీ తప్ప మరేం కాదని సారా లమ్మి వచ్చిన డబ్బు వడ్డీలకు తిప్పి ఇల్లూ, సినిమా హాలు కట్టిన నర్సింలును చూసినప్పు డనిపించింది. వ్యవసాయం అంటే గానుగెద్దు జీవితమని మండలాఫీసులో బంట్రోతు పని చేస్తున్న రామన్న రెండిండ్ల అధికారి అయినప్పు డనిపించింది.

అంతా వ్యవసాయానికి దూరమై బాగుపడ్డవాళ్ళే. వ్యవసాయానికి అంకితమైన వాళ్లు మట్టిలాగే.... మట్టికొట్టుకపోతున్నారు!

“కూతురు కాన్పుకొచ్చింది. చేతిలో పైసా లేదు. ఏంజేస్తావ్.....మావా?” అన్న భార్య ప్రశ్నకు జవాబు కోసం వెతికి వెతికి మరే మార్గం లేక ఎడ్లజత మీద కన్నుపడింది. అదే చెప్పాడు భార్యతో.

“ఎడ్ల నమ్మి బిడ్డ పురుడు పోద్దునా?”

"మరేం జెయ్యనే–పైస లెవరిస్తారు? ఇల్లు గిర్వి పెడితిమి. పొలమూ పెడుదునా....గిర్వి పెడితిమంటె గది సెయ్యి దాటినట్టే. ఇంటి మీద అసలు వడ్డీ ఎంతో ఎరికా!"

"నా కే మెరిక–బెట్టినోడివి నువ్వు!"

"గందుకే గీసారి ఎద్దు ల్నమ్మి....."

"సరేగానీ....బండిపోయె....ఇంక దున్నుడుకు ఎద్దు లుండవు. కూలికి దున్నిస్తవా?" భయం వెల్లడించింది.

"దున్నిందంతా పండి సస్తావుందా! చల్....నీ యవ్వ. ఇంక కాలువల నీల్లు రావాల–దశ తిరగాల, గంతె–గంతదాక దున్నుడు లేదు గిన్నుడు లేదు. అల్లుడు బిడ్డను పురిటె కొదిలిండా....మరి సెయ్యాలా? అదీగాక నువ్ రోజు పని చేస్తే మూడు రోజులు బిస్తరి నంటక పోతున్నావ్....నిన్ను దవాకానాకు తీస్కబోవాలా! శ....శ. జనమలో మన ఎతలు తీరవు." జీవితంమీద కలిగిన విసుగును భార్యమీద చూపించాడు.

ఎద్దుల్ని పట్టుకొచ్చి మేపబట్టి మూడేండ్లయింది. ఆ ఏడు వాన లొచ్చి గింజలొచ్చి జత ఎద్దుల్ని కొని అప్పుతో బండి తీసుకొచ్చాడు. వానలు బిగదీసి ఎద్దుల్ని మేపనూ కష్ట మనిపించింది. మనిషికే తిండి కష్టమాయె–కూలికి బండి తిప్పినా బతుకు బండి సాగింది కాదు.

కొన్న రోజు పదిహేను వందలు విసిరి మరీ కోడెల్ని పట్టుకొచ్చాడు. ఈ రోజు చితికిపోయిన వాటిని తెగనమ్మా లనుకున్నాడు. ఆ విషయం కూతు రింటికి వస్తుందన్నప్పటి నుండి లచ్చుమన్న మనసులో మరిగిస్తున్నాడు. మల్లేపల్లి సంతలో బేరాలు ఎలా ఉన్నాయో....ఎంత లేదన్నా రెండు వేలు దొరుకుతా యనిపించింది. అందుకే తెగించాడు లచ్చుమన్న.

☆ ☆ ☆

మల్లేపల్లి సంతలో పశువుల బేరం మా జోరుగా సాగుతోంది. ఉదయం నుండి సాయంకాలం వరకూ వందలు, వేలు చేతులు మారుతుంటాయి. పశువులు ఇళ్లు మారుతుంటాయి. అవసరం ఈ మార్పుల్ని నిర్వహిస్తుంది.

ఆ రోజు గౌరమ్మ పని చేస్తూ కళ్లు తిరిగి పడిపోతే దవాకానాకు తీసుకుపోతె ఫోటో లన్నారు.... కడుపులో గడ్డన్నారు....పట్నం పొమ్మన్నారు. ఇవేవీ భార్యకు చెప్పక పట్నం తీసుకపోను మార్గం వెతుకుతున్న తరుణంలో చిన్నమ్మి కాన్పుకు దిగబడింది. ఇంక తప్పదు.....ఎద్దుల్ని సంతకు తోలాల్సిందే అనుకున్నాడు లచ్చుమన్న.

తొలి జామునే లేచి గౌరమ్మ కట్టిచ్చిన జొన్న రొట్టెల్ని మూట గట్టుకుని బయటకొచ్చాడు. గౌరమ్మ ఎద్దుల జతని విప్పి లచ్చుమన్న చేతికి పట్టిచ్చింది.

"ఓ చనం మామా!" అంటూ లోనికెల్లి ఓ చెంబుతో నీళ్లు తెచ్చి ఎద్దుల ముఖాన్నీ, కొమ్ముల్నీ తుడిసి పసుపుపూసి కుంకుం పెట్టి దండం పెట్టుకుంది. ఆమె కళ్ళలోని బాధని కళ్లు రాల్చాయి. లచ్చుమన్న గుండెల్లోని బాధని మొహంలో కనిపించకుండా చీకటి కప్పేసింది.

"వచ్చిందే బేరమని తెగ నమ్మకు." బొంగురుపోయిన గొంతుతో అంది.

సమాధానం చెప్పకుండా ఎద్దుల తాళ్ళని కదిలించి సైగ చేశాడు. చీకట్లో పడిపోతున్న భర్తనీ ఎద్దుల్నీ చీకటి పూర్తిగా కప్పేసేవరకు చూసి బరువెక్కిన హృదయంతో లోనికెళ్ళింది గౌరమ్మ.

లచ్చుమన్న తల్లి చిన్నప్పుడే కాలం చేసింది. తండ్రి లచ్చుమన్న మనువు చూసి మంచ మెక్కాడు. తండ్రి జబ్బు నయం చేయిద్దామని చేతి కందినంత అప్పు చేశాడు. ఇల్లో, భూమో అమ్మదా మనుకుంటె–

"ఒరే లచ్చూ! గా పన్నెయ్యకు–మా అయ్య నాకు ఇరవై ఎకరాలు ఇచ్చిండు. దాన్ని పదికి దించి నీ కిస్తున్న. ఇద్దరు మగబిడ్డ లున్నారు. ఇద్ద రాడపిల్ల లున్నారు. మన దసలే గొడ్డు దేశం. ఎపుడూ వానలు రావు, బతుకులో ఎలుగు లేదు. ఈ భూమి, ఇల్లూ బోతె బికారోడివైపోతావు. నా కాలం పోయింది. మందుల కోసం కర్సు దండగ. సస్తే ఈడిసిపడై. సచ్చినాక కర్సులు కూడా వద్దు" అని చెవిలో జోరీగలాగ సచ్చినంతవరకూ పోరాడు.

పెద్దది ఈడు పెళ్లి చెయ్యలే డనుకుందో ఏమో గొల్లోడితో లేచిపోయింది. చిన్నమ్మి చెయ్యి దాటుతుందని భయమేసి ఇల్లు గిరివి పెట్టి కులపోడికి కట్టబెట్టి, గతాన్ని కాస్త కప్పిపుచ్చుకున్నాడు. పెద్దోడు– "ఏందే...గీడ తిని బతికేది? నేను లష్కర్ బోతా – రిచ్చా లాగుతా. నన్నడిగితే అందరం గాడికి బోతే కూలైనా జేసుకి తినొచ్చు. గాడ కూలోల్లు బాగ పైసలు జేసుకుంటరంట. మీరొస్తారా రండి. లేదా నన్నాపకండి" అని తెగేసి పట్నం చేరిండు. రిక్షా లాగుతున్నాడు.

అడి బతుకాదు బతకనీ– మంచిదే అని మనసు గట్టి చేసుకున్నాడు. ఆరు నెలలు తిరక్కముందె– "ఓరయ్యా! రిచ్చా ఏక్సిడెంటయింది. ఓనరు రిచ్చా పైసలు గట్టమంటాండు. కాలు ఇరిగింది" అని కబురు చేశాడు.

లచ్చుమన్న గౌరమ్మ పట్నంలో కొడుకుని చూసి "గిదేం రాతర....నాయనా!" అని నెత్తి నోరు బాదుకున్నారు. సర్కారు దవాకానాలో కాలుకు పట్టీ ఏశాక–"ఇంక రిచ్చా ఎట్టా దొక్కుదువురా బిడ్డా!" అని గౌరమ్మ కంట తడి పెట్టింది. కాలు కుదుటపడ్డాక రిచ్చా ఓనరుకు వంద రూపాయలు పోసి దండం పెట్టి వచ్చారు.

గతం చీకటిలా ముసురుకుంటుంటే పొడుచుకొస్తున్న సూరీడు కొత్త ఆశల్ని రగిలిస్తున్నాడు.

గీ ఎద్దులు మంచివి....సుళ్లు సూసినోళ్ళు నోళ్ళు నొక్కుకున్నారు. గీ ఎద్దులు నీ రాత మారుస్తాయని పుబ్బేశారు. ఎద్దుల బాగున్నా లచ్చుమన్న సుడి బాగులేదు. ఆ మాట కొస్తే వ్యవసాయం చేసేవాడి సుడి వానలో వుంది. అదను కొచ్చిన వాన రైతుకు వరం, అదును తప్పిన వాన రైతుకు భారం. వాన కనుమరుగైతే రైతులు బతుకులు ఎండి కూలీలై పోతారు. ఇది యుగయుగాల సత్యం.

"సూద్దాం! గీ ఎద్దు ల్నమ్మితే సడి తిరుగుతుందేమో!" అని ఓటమిలో విజయాన్ని చూడాలని ఆశపడ్డాడు.

మల్లేపల్లి సంత చేరుకోగానే లచ్చుమన్న చుట్టూ పదిమంది మూగారు.

"ఎద్దు లమ్మొచ్చినావు....సెంత కమ్మనుంటివి?"

"రెండేలు."

"గంతనా....ఒంగోలు గిత్త లనుకుంటివేంరా! జరా సోచాయించి జెప్పు."

"గంతనే!"

"దేకోభై! గంత పైసలు రావు. పైస లెవ్వడితా నుండాయి ఇవ్వనీకి. గీడికొచ్చే వాళ్ళంతా పైస ల్లేనోళ్లే గదరా!"

"గదంతా నాకు తెల్వదు. నాకు రెండేలు గావాల."

"గంతే నంటావ్.....సరే ఎద్దుల్ని తోల్కపో....."

"పోతాన్లే తీ...నువ్ ఎవరు నాకు జెప్ప?"

"గీడు అమ్మను రాలేదురా వారీపాద్‌మీకి మళ్లీగా ఎద్దుల్ని తోల్కబోనుచ్చింది."

ఇలా తలా ఓ మాట విసిరి, మరొక డెవడో ఎద్దుల్ని తీసుకరాగా అటు వెళ్ళారు.

"చా తాగు పటేలా!" అన్నాడో యువకుడు.

"పటే లెవ్వడు బే....."

"బాంచన్...గా మాటంటే తప్పేనా! సర్లే టీ తాగు సేటూ!"

"ఒద్దు పో......"

"గంత కోప మెందుకో - సూడు.....గీడ కొచ్చేవాల్లంతా యత లున్నోల్లే....మన యతల్ని లోపలే దాసుకోవాల. పైన జూపితే అందరితో ఎర్రోడివి గానే....సీ.....సీ....నీ యసుంటోల్లు బూమ్మీదెట్ల బతుకుతన్నరో గా దేవుడికే ఎరిక.....జరంత చా తాగు."

"నాతాన పైస ల్లేవు!"

"నే న్నిన్ను పైస లడిగినానా దొరా! గంత కోపమెందుకే? ఎదవ పైసలు. నిన్ను జూస్తుంటే మా నాయ న్యూసినట్టు అయితాంది. చా తాగు....." అని గ్లాసు లచ్చుమన్న కిచ్చాడు.

ఎద్దుల్ని ఓ చెట్టు కింద రాయికి కట్టి ఆ రాయి మీదే కూర్చుని చాయ్ తాగుతున్నాడు.

'రెండేలు లేకుంటే ఎందుకు? పిల్లదాని పురుడు, గౌరి కడుపులో గడ్డ, సిల్లర బాకీలు...ఎట్లా తీరేను? గీ నాయాండ్లు గంతనా అంటారు....దొంగ కొడుకులు.' తిట్టుకుంటూ చాయ్ తాగి గ్లాసు కింద పెట్టాడు.

"ఓ లచ్చుమన్న! ఎద్దులమ్మ వొస్తివా?"

ఎవరూ....అని ఆలోచించి-"యాద్గిరీ, నువ్వే!...బాగున్నావా?" అన్నాడు.

"ఏం బాగులే......"

లచ్చుమన్నకు ఎద్దులు పట్టిచ్చింది యాద్గిరే కాబట్టి యాద్గిరి ద్వారానే అమ్మితే లాభసాటిగా ఉంటుం దనిపించింది. యాద్గిరి పదేండ్లగా సంతల్లో ఎద్దుల్ని అమ్మించడమే జీవనంగా బతుకుతున్నాడు. ఈ వ్యాపారంలో బాగా నలిగిన మనిషి, ఆ రోజు యాద్గిరికి, ఈ రోజు యాద్గిరికీ మాటలో తప్ప మరెందులోనూ పోలిక లేదు. మామూలు చొక్కాలు, పంట్లాంలు వేసుకునేవా డప్పుడు. ఈ రోజు సిల్కు లాల్చీ, పంచ. అప్పుడు చేతిలో గుడ్డ సంచి., ఈ రోజు కంపెనీ తోలు సంచి.

కళ్ళద్దాలు లే వప్పుడు. చేతులు బోసిపోయి ఉండేవి. ఇప్పుడు వాచీ, ఉంగరాలతో తళుక్కుమంటున్నాయి.

"ఎద్దు లమ్మొచ్చినావె! మరి చెప్పవే....అమ్ముతా....మనతాన నికార్సు బేరం. నీ కెరికే గదా!"

"చా...సేటూ!" అంటూ వచ్చాడు 'చా' వాడు.

"గిదో మా లచ్చుమన్న కియ్యి."

"నే తాగిన!"

"దాందేంలే....మళ్ళీ తాగు–చా నీళ్లే గాదె. ఒరే నర్సింలూ! లచ్చుమన్న తాన పైసలు తీస్కోకు.... నేనిస్తా....ఇకబో. మాట్లాడవేందే....జెప్పు అమ్మనొస్తివా!"

"ఆ!"

"ఎంత గావాల జెప్పు?"

"రెండేలు!"

"రెండేలా?"

"ఔ."

"తగ్గదా?"

"బిడ్డ పురిటి కొచ్చింది. నా యాడదానికి పానం బాగలే...ఊర్లో సిల్ల రప్పులు. రెండేలు దక్కందే కుదరదు."

"సర్లే! గిదో ఈ రెంద్రూపాయలు నీతా నుంచు. గిది బయాన. నీ ఎద్దుల్ని నే నమ్మి పెడతా! ఇంకెవ్వ రడిగినా ఒప్పుకోమాక–గీడంతా లంగ నాయాళ్లు జేరింద్రు. గదో గొడ్లకు గాద గడ్డి తెచ్చుకో....అది మనదే నా బండిలోది. మరి రెండేలన్నావ్....నీ జరూర్ నీది. కొనేవాడు దొరకద్దా? సర్లే సూద్దాం! మల్ల నా సంగతి ఎరికే గదా?"

"నీ కమిసన్ కాదంటానా?"

"గది మాట. ఇంక నువ్ బేఫికరుండు. బేరం నే బట్టుకొస్తా!" అంటూ వెళ్లాడు యాద్గిరి.

"మంచోడు....కష్టం, సుకం తెలిసినోడు!" అనుకుంటూ గడ్డిమోపు తీసుకొచ్చి ఎద్దుల ముందువేశాడు.

సంతకు పశువు లమ్మను వచ్చినోళ్ళ చుట్టూ గద్దల్లా వాలిపోయి వాళ్ళ రేటు అడగడం....బేరాలు చెయ్యడం, బయానా అని ఒకటో రెండో చేతిలో పెట్టి బేరం చూస్తామని వెళ్ళడం అంతా ఓ తమాషాలా ఉంటుంది. వాళ్ళ కదే వృత్తి. మాటలతో మభ్యపెట్టి రూపాయికో రెండుకో వాళ్ళను కట్టేయడం.... ఈ కార్యక్రమం మధ్యాహ్నందాక సాగుతుంది.

అమ్మ నొచ్చిన వాళ్ళు ఒకరి పశువుల్ని ఒకరు చూసుకోవడం, మా ఆవులచ్చిందేవని ఒకరంటే–మా ఎద్దులు బసవన్నలు...ఏ ఇంట కాలు మోపినా సిరులు సిందాల్సిందే – అని గొప్పలు చెప్పుకుంటూ తెచ్చుకున్న సద్ది మూటలు విప్పి కడుపు కింత పడెయ్యడం, తినింది మొదలు బేరాలకోసం ఎదురుచూడ్డం.

అవసరం....కాలం....మనుషుల్ని క్రుంగదీస్తుంది. సాయంకాలానికి సంత ముగుస్తున్నప్పుడు ఎంత హడావిడో.

"లచ్చుమన్నా!" అంటూ వచ్చాడు యాద్గిరి. వెంట మరో మనిషి ఉన్నాడు. ఆ వచ్చినవాడు ఎడ్ల చుట్టూ తిరిగి తోకమీద, వీపుమీద, నుదుటిమీద, మూపురాన, తొడల దగ్గర, మోకాళ్ళ మీద పరీక్షించసాగాడు. అతను చూస్తున్నంతసేపూ లచ్చుమన్న గుండె వేగంగా కొట్టుకోసాగింది.

"ఎయ్యి రూపాయలు. ఏంది యాద్గిరి – గివి ముసలవి. సేద్దానికి ఏం పన్జేస్తాయి. అదీగాక సుల్లు. ...."

"ఎయ్యా....కుదర్దు!" అన్నాడు లచ్చుమన్న.

"కుదరకుంటె గట్లనే తీస్కబో...గీ ఎద్దులకు అంతకన్నా ఎవరిస్తారు?" అంటూ కదిలా డతను.

అతని వెంట యాద్గిరీ వెళ్ళాడు. లచ్చుమన్న గుండె బేజారయ్యింది. ఎదవ నాయాలు–ఎయ్యి రూపాయాలా! ముస లెద్దులా! – అని మనసులోనే వాణ్ణి తిట్టుకున్నాడు. ఇంతలో యాద్గిరి లచ్చుమన్న వద్దకు వచ్చాడు.

"ఏంది లచ్చుమన్నా, నువ్ బేరం చెడగొడుతున్నావ్!"

"ఎయ్యి రూపాయలంటే ఎట్లా సేటూ!"

"వా డడిగిండు నే నిస్తానంటినా! మద్దెన నే నెందుకు? నేను మాట్లాడనా–నువ్వే బేరం చేస్తే ఇంక నే నెందుకు? నే న్నిన్ను మోసం జేస్తానా....చెప్పు."

"గట్లంటావా! సర్లే ఈసారి నోరెత్తను."

యాద్గిరి వెళ్ళాడు వేటకు. యాద్గిరి చెప్పింది నిజమే అనిపించింది. మధ్యన మనిషిని పెట్టుకున్నాక మాట్లాడ్డం తప్పే అనుకున్నాడు.

"గీ ఎద్దుల్ని అమ్ముతావా, లేదా?" పొద్దున అడిగినవాడు మళ్ళీ వచ్చాడు.

"యాద్గిరికి మాటిచ్చినా!"

"బద్మాష్‌గాడు! సంతంతా వాడే అయిండు. గెంత కమ్ముతా నంటివి?"

"గంతనే జెప్పిన! నీ కొకటి, యాద్గిరి కొకటి చెప్తునా!"

"నీయమ్మ గంత కెవడు కొంటాడ్రా! గా ఎద్దులు బక్కగున్నాయి. సేద్దేనిక్కాదు, తుర్కలు కోస్క దినడానికీ పనికిరావు. గాటికి రెండే లెవరిస్తార్రా!" అని విసురుగా వెళ్ళాడు.

'థూత్ నా కొడుకు...కోస్క తినడాని కమ్ముతాన్రా?' అని మనసులోనే విసుక్కున్నాడు లచ్చుమన్న.

"చా తాగు సేటూ, యాద్గిరన్న పంపిండు" అంటూ వచ్చాడు యువకుడు.

"యాద్గిరి పంపిండా?" అంటూ అందుకున్నాడు.

"యాద్గిరన్న మంచోడె! నేను గింతప్పటి నుండి జూస్తున్న. గా సేటు ఎవర్ని మోసం జెయ్యలా. యాపారం అందరూ జేస్తారు. కానీ నిలదొక్కుకునేది ఎందరు? ఎదుటోడి కష్టాన్ని దోచుకోడు. గందుకే ఇన్నేల్లయినా ఈ యాపారంలో నిలబడే ఉన్నాడు. మద్దెన ఎందరు రాలేదు, పోలేదు. నీ ఎద్దుల్ని అమ్మిస్తాడు. పరేశాన్

గాకు. గిదో సేటూ, నీ బేరం అయ్యాక నన్ను యాద్ మరువకు. మరి నే వస్తా!" అంటూ ఖాళీ గ్లాసు తీసుకుని వెళ్ళాడు.

మూడు గంటల సమయంలో యాద్గిరి మరో బేరం తెచ్చాడు. వాడు ఎడ్లను పరికించి-"గిదో గీ సుడి సూడు యాద్గిరి.....గీటి చెవులు సూడు....తోకమీద సూడు" అంటూ సుళ్ళు పరికించి వెళ్ళిపోయాడు.

లచ్చుమన్న ఎడ్లను చూశాడు. వాటిని రోజూ చూస్తున్నాడు. వాటికున్న సుడులన్నీ తెలుసు. అవన్నీ మంచివే. ఆరోజు యాద్గిరి చెప్పి మరీ కొనిపించాడు.

"కాలం మారింది లచ్చుమన్నా! కాలంతో పాటే సుడుల ఇలువలూ మారాయి. నువ్వేం దిగులుపడకు. సందేల లోపల బేరం కుదిరిస్తా!" అని ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు.

లచ్చుమన్న కంతా అగమ్యగోచరంగా ఉంది. అసలు ఎద్దులు అమ్ముడు పోతాయా అన్న శంక మొదలయింది. సంతలో కొందరు బేరాలు కుదుర్చుకుని డబ్బులు చేతులు మార్చి పశువుల్ని పట్టుకపోతున్నారు.

అవసరం.....కాలం మనిషిని పిచ్చివాడిని చేస్తుంది. అందుకు నిదర్శనం మల్లేపల్లి పశువుల సంత.

సాయంకాలం అయిదు గంటలకు యాద్గిరి ఒక్కడే వచ్చాడు. లచ్చుమన్న గుండెల్లో గుబులయ్యింది.

"సూడు లచ్చుమన్నా.....నీ వడిగిన బేరం దొరికేట్టు లేదు. జరంత పట్టు విడుపు ఉండాల. అంతా ఎయ్యికే అడుగుతున్నారు. సుళ్ళు సూడంట్రా అన్నా....అయినా ఇప్పుడు సుళ్ళు సూసి కొనేవా ళ్ళెవరు మన పిచ్చిగాని? సుళ్ళ దేముంది, ఎద్దుల బలంగుంటే ఏదో ఒకటి చెయ్యొచ్చు....నువ్వేం పరేశాన్ గాకు."

"సేటూ, చా!"

"ఏందిరా నీ గొడవ?"

"బాంచన్-గీయన పొద్దున్నించి పరేశా న్లుండాడు. జర నువ్వే సూడాలి...పాపం, ఎన్ని కష్టాల్నుండో....."

"ఏం జేత్రునా! గీయన రెండే లనబట్టె. సచ్చినోల్లు ఎయ్యనబట్టిరి."

"గట్లంటే ఎట్ల సేటూ....జర సోచాయించు. గరీబోడికి సాయం జేస్తే ఊరకపోదు. సూడు..... మద్దెస్తంగన్నా బేరం సూడు."

"గంతె నంటవా! ఏం లచ్చుమన్నా, గట్లనే జూతాం ఏమంటావ్...మల్లీ నా మాట పోకూడదు. దునియల మాట బోయి బతకజాల."

"గట్లనే జెయ్యి!" అన్నాడు లచ్చుమన్న.

"నీ బాధ నా కెరికే....ఏం జేస్తాం? అమ్ముదమంటే అడివి...నువ్వుండు, నేనో సుట్టేసొస్తా!" అంటూ కదిలాడు.

లచ్చుమన్న నీరసంగా కూర్చుండిపోయాడు. చా వాడు లచ్చుమన్న పక్కన చేరి ధైర్యం నూరిపోసి గ్లాసు పట్టుకెళ్ళాడు.

అరగంటకు యాద్గిరి ఓ ఆసామిని వెంటబెట్టుక వచ్చాడు. అతడు ఎడ్లను పరికించి చూసి ఏం బేరంరా అన్నట్టు ముఖం పెట్టి "పన్నెండు" అన్నాడు.

"పద్దెనిమిది వందలు"– యాద్గిరి.

"ఒద్దు–అదో గాడ పద్మూడుకే జత...నువ్ గాడ్నుండె గాదె తీసుకొచ్చింది?" అంటూ జేబులోంచి నోట్ల కట్ట తీశాడు.

లచ్చుమన్న నోట్ల కట్ట చూసి ఎద్దుల్ని చూశాడు.

"చివరగా పదేడు వందలు–ఇంక మాట్లాడకు." బతిమాలుతూ అన్నాడు యాద్గిరి.

"గదెట్లే! ను వ్వేదో తెల్సినోడివని వస్తే నాకే జరంత టోపీ ఏస్తావా! ఆఖరి మాట పద్నాలుగు. గంతే ఇంక నీ ఇష్టం." నోట్లకట్ట ఓ చేత్తో ఆడిస్తూ మరో చేతికి తాకిస్తూ అన్నాడు.

"చా...సాబ్!"

"చల్ సాలె....బేరంలో మేముంటే!" కసిరాడు యాద్గిరి.

"గంత కోపమెందు కన్నా?"

"కోపంగాక ఇంకేందిరా! ఈయనేమో పద్నాలు గంటాండు.... లచ్చుమన్న పదే డంటాండు. ఏంజేతు?"

"సేటూ, బాంచన్.... నీకాల్మొక్తా! నా దో మాట. గిదో సేటూ! గీ ఎద్దుల గురించి జెప్పగూడదు. నా కంటే నీకే తెలుసు. ఎదవ డబ్బులు చూసుకుంటే ఎట్లా సేటూ– ఓ గరీబోడికి సేసినట్టుండాలా! నీకు కష్టం వద్దు. లచ్చుమన్నకు కష్టం వద్దు. నా మాట మీ రిద్దరూ ఒప్పుకోవాల, సరేనా?"

"జెప్పు నీ యమ్మ....నీ మాటె గాని....కానీ ఒరే నాయంగుండాల" అన్నాడు ఆ వచ్చినోడు.

"బాంచన్...గట్లన్యాయం చేస్తనా? గీ ఎద్దులు తీస్కబోండి. పద్దైదు వందలివ్వండి. ఇంక బేరం వద్దు. నేను సిన్నోడిని, నా మాట బెమ్మ వాక్కనుకోండి. ఇద్దరికే జయమే. కాదంటే అమ్మమీద ఒట్టే!"

"నీ యమ్మ! ఇరకాటంలో పెడితివిరా తమ్మి. సరే నీ మాటే–ఇదిగో" అంటూ డబ్బు లెక్క పెట్టి పదిహేను వంద కాగితాలు ఇచ్చాడు యాద్గిరికి. యాద్గిరి ఎద్దుల జత అప్పజెప్పాడు. ఆ ఆసామి ఎద్దులను తోలుకపోయాడు.

"ఇదో లచ్చుమన్న, పదేను వందలు. ఇంద్ల నా కమీషన్ నూట యాభై, మిగిలింది తీసుకో" అంటూ ఇచ్చాడు యాద్గిరి.

"గదేందే యాద్గిరన్నా! ముందు కమీషన్ గంతకు పాతికే గదా!" ఆశ్చర్యంగా అడిగాడు లచ్చుమన్న.

యాద్గిరి నవ్వి–"నువ్ ఎర్రోడివిరా లచ్చుమన్న!...గా రోజుల్లో గింజ లెట్లా దొరికేటివి ఇప్పడెలా గున్నాయి. రేట్లు పెరగలా!" అంటూ కదిలాడు.

లచ్చుమన్నకు గుండె దడ ఎక్కువయింది. రెండు వే లనుకున్న ఎద్దుల జత పదిహేను వందల కమ్మడం, తన చేతికి పద్మూడు వందల యాభై రావడం...బిడ్డ కానుపు కెంతవుతుందో....ఆడదాని కడుపులో గడ్డకు మిగులుతుందో...లేదో!

"సేటూ, బేరం కుదిర్చాను. నన్ను మరుస్తవా?"

"ఏం జెయ్యమంటావ్?"

"ఓ పది రూపాయ లిప్పే!"

"ఒరే, ఆ ఎద్దులు నా గుండె(లా...అట్నమ్మినా! ఎవరికోసం....నా పెండ్లం, బిడ్డకోసం....దాని కొచ్చింది ఇది. ఇంద్ల నీకూ కమిసనా?" జారిపడుతున్న కళ్ళనీళ్ళను అపుకుంటూ అన్నాడు.

"శ.....శ....గంత బాదయితే ఒద్దులే సేటూ! నీవు సంతోసించి ఇస్తేనే ఇయ్యి."

"పొద్దుట్నుండి కనిపెట్టుకున్నావ్. డబ్బు ల్లేవన్నా చా ఇచ్చావ్...తీసుకో పది. ఎల్లు. గీ పదిలో ఏం బోతాదిలే....పో" అంటూ ఇచ్చాడు.

సందేలయింది. సంత జోరు అణిగింది. అంతా చల్లగా జారుకున్నారు. లచ్చుమన్న మాత్రం ఎద్దుల్ని కట్టేసిన చోటే కూర్చుండిపోయాడు.

ఎద్దు లేసిన పేడలో తన జీవితాన్ని చూసుకుని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

తనివితీరా పేడని చేతులలోనికి తీసుకుని పూజా పుష్పంలా కళ్ళ కద్దుకుని రైతు జీవితానికి తర్పణం వదిలినట్టు వదిలాడు.

చీకట్లో......

బరువెక్కిన మనసుతో......

తిరుగుముఖం పట్టాడు.

మల్లేపల్లి ఊరి చివర సారా దుకాణం ముందు చా కుర్రాడు, తనతో వెయ్యి రూపాయలకు బేరమాడినవాడు, చివరకు కొన్నవాడు అంతా కలిసి తాగుతున్నారు.

'ఎద్దు లేమయ్యాయి?.....' అనుకున్నాడు లచ్చుమన్న. "చల్.....చల్" అన్న మాటలు వినబడి వెనక్కి చూశాడు. చీకటిలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. అవి తనవే. తనమ్మినవే....మరతను... చీకటి చారలు తరిమే కరెంటు దీపం వెలుగులో కనిపించాడు. ఎద్దుల్ని పరిశీలించి ఏ మాటా మంతీ లేకుండా పోయినవాడు.

ఎద్దులు దగ్గర కొచ్చాయి. లచ్చుమన్నను గుర్తుపట్టి ఆగాయి. ఆగిన ఎద్దుల్ని చూసి లచ్చుమన్న గుండె బరువెక్కింది.

"నువ్వా! యాడికి?"

"నాలుగో మైలు రాయి తాన గొల్లపాలెం." జీరబోయిన స్వరంతో అన్నాడు లచ్చుమన్న.

"మొత్తానికి రెండేలూ గుంజినవ్!"

"రెండేలా!"

"హా మరి!"

"నీ కెవ రమ్మిండు?"

"గాడే యాద్గిరి."

మంచులా కరిగిపోయిన రోజు కంటనీరు పెట్టించింది. కుంపటిలా రాజుకునే కడుపుమంట నిలువునా దహించివేస్తోంది. జీవిత పొలంలో పచ్చదనాన్ని హరించే పురుగుల మధ్య నలిగినట్టనిపించింది.

"దొంగ కొడుకు. నా తాన నాటక మాడి పదేను వందలని, అందులో నూటాయాభై కమిసన్ అని మింగి, మిగిలింది నా చేతిలో పెట్టిండు." ఆశ్చర్యం, బాధ ధ్వనించాయి గొంతుకలో.

"గట్లనా–యెదవ! నా తాన మొదలు రెండేలా అయిదొందలని రెండేలకు బేరం చేశానని నన్ను రానీకుండా నాటకమాడి రెండేలూ తీసుకుని ఎద్దులు పట్టుకొచ్చి ఇచ్చాడు. రెండొందలు కమిసన్ కొట్టిండు పైగా!"

"గా చా పోరడు నా తాన పది దొబ్బినాడు!"

"నా తానా దొబ్బినాడు–అంటే అందరితానా దొబ్బినాడు."

ఇద్దరూ భూమి న్నమ్ముకున్నవాళ్ళే!

ఇద్దరూ మోసపోయినవాళ్ళే!

అందుకే ఇద్దరిమధ్యా ఆ తరువాత మాటలు కరువయ్యాయి!

మధ్యలో దారి మళ్ళిన ఎద్దుల్ని చూసి విలవిల్లాడుతూ జీవంలేని మొక్కలా.... మొలకెత్తను భూమిని చీల్చలేని విత్తనంలా చీకటిలో నిల్చుండిపోయాడు లచ్చుమన్న.

● ఆంధ్రప్రభ వీక్లీ ●

★ ★ ★

పురాణం సుబ్రహ్మణ్యశర్మ

52

# శివకాంత

"ఎదిగిన ఇద్దరు మగవారిమధ్య వున్న స్నేహం, ఇద్దరు ఆడవాళ్ళమధ్య ఛస్తే వుండదు. ఆడవాళ్ళు స్నేహానికి పనికిరారు" అన్నాడు శివప్రసాదరావు.

ఆ ఉదయమే మా ఆవిడా వాళ్లావిడా పోట్లాడుకున్నారు. ప్రసాదరావు భార్యకి తను అందగత్తెననే గర్వం. వాళ్లాయన తనను ఎక్కడపడితే అక్కడికి వెంటపెట్టుకు వెళ్తాడనీ, నేను మా ఆవిడను ఎక్కడపడితే అక్కడకు తీసుకువెళ్ళకపోవడానికి మా ఆవిడ అంత చక్కనిది కాకపోవడమే కారణమనీ ఆవిడ వెక్కిరించిందట–ఇలా నా స్నేహితుని భార్యమీద నాతో చెప్పి "తెల్లతోలుతప్ప ఒంట్లో ఎక్కడా ఎముకా కండాలేదు. అలాటి గర్విష్టి వాళ్ళంటే నాకు ఒళ్ళు మంట" అని మా ఆవిడ విసుక్కుంది.

"ఆ మొగుడు చచ్చీ చెడీ యింటికి రావడంతడవు నెత్తినెక్కి సవారీ చేస్తుంది. ఏ బజారుకో షాపింగ్‌కో స్నేహితురిళ్ళకో సినిమాకో ఎక్కడికో అక్కడకు తీసుకెళ్తే కాని వదల్దు. అందుకే వాళ్ళకి వూరినిండా అప్పులు–" అంటూ ప్రసాదరావు భార్య గురించి విమర్శించింది.

నాకు చాలా సిగ్గుగా వుంది. ప్రసాదరావూ, నేనూ ప్రాణస్నేహితులం –కావాలని పక్కపక్క యిళ్ళలో వుంటున్నాం. ఈవిడ మాటలు అతనికి వినిపిస్తాయేమోనని నేను గిజలాడిపోతున్నాను. ఎటూ చెప్పలేక–

"ఆవిడ నీకంటే చిన్నది. లోపాలుంటే మనం సర్దుకోవాలి. మాటల్లో బయటపడగూడదు" అన్నాను.

"మీరు నన్నెక్కడికీ తీసుకెళ్ళరు. అందుకే నేనావిడకు లోకువ. అనుకుంటే సరా–ఏ మందంలెండి నా మొహం అందం–తెల్లగా పాలిపోయి వుంటుంది. వాళ్ళు నవయవ్వన విలాసవంతులు. మనవేమో ముసలి దంపతులం. అందుకే ఆవిడకంత మిడిసిపాటు" అని ఆ అందచందాల తగూలోకి నన్ను కూడా యిరికిస్తూ మాట్లాడింది మా ఆవిడ.

కాస్త ఆలోచించి, ప్రమాదకరమైన ఈ అందచందాల వివాదంలోంచి మా ఆవిడ బుర్రను తిప్పాలనే ఉద్దేశంతో–

"అందమైనవాళ్ళయితేమటుకు మొగుడూ పెళ్ళాలు పోట్లాడుకోరా?" అన్నాను.

మా ఆవిడ నా ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పకుండా–తను మరో మెలికె వేస్తూ–

"అయితే ఆవిడ అందమయిందని మీరూ ఒప్పుకుంటున్నారా?" అని 'యూ టూ బ్రూటస్'లా నాకేసి చూసింది.

"చూడు–స్నేహితుని భార్య అందం గురించి నన్ను ప్రశ్నించి చంపకు. ఆవిడ చాలా మంచిది" అన్నాను.

"ఏం మంచి? ఆవిడ మంచితనం మీకేం తెలుసు?"

"నీకూ తెలుసు. ఇప్పుడేదో కోపం మీదున్నావు. అందుకని కఠినంగా వున్నావు. నీ మనసులో పాపం, ఆవిడంటే జాలిలేదా?"

"నాకా? పాపమంటూ జాలా? దేనికి?"

"నువ్వే చెప్పావుకదా – ప్రసాదరావుగారి కోసం ఎవరెవరో స్నేహితులు వేళాపాళా లేకుండా వస్తారనీ, వాళ్ళకు స్నానపానాలు, తిళ్ళూ, టిఫిన్లూ, కాఫీలు చేసిపెట్టలేక ఆవిడ సతమతమయిపోతుందనీనూ."

"అమ్మ–ఏం చిత్రంగా మాట్లాడుతారండీ? వేళాపాళా లేకుండా వచ్చే అతిధులంటే ఏ ఇల్లాలికి విసుగ్గా వుండదూ?"

"ఆవిడ ఎల్లా చేసి పెడుతోందోనని నువ్వే ఆశ్చర్యపోయావుగా–అతను మొండి వాడనీ–ఇల్లాలి కష్టసుఖాలు ఆలోచించడనీ – పైగా వాళ్ళంతా వాళ్ళ ఒకే ఒక మంచంమీద ఎక్కి కూర్చోడం, పడుకోడం ఆవిడ కసహ్యమనీ– తువ్వాళ్ళూ దుప్పట్లూ లుంగీలు అన్నీ వాళ్ళు వాడేస్తూంటే ఆవిడ పళ్ళు పట పటా కొరుక్కుంటుందనీ నువ్వే చెప్పావుగా–మళ్ళీ ఇప్పుడిలా మారిపోయావేం, కాస్తంత పేచీ వచ్చి?"

"బావుందండోయ్ – ఆడవాళ్ళ కష్టాలు మీకేం తెలుస్తాయ్!ఎంత స్నేహితులయినా మంచాలమీదెక్కి దొర్లితే ఏ ఇల్లాలికయినా ఒళ్ళు మండుకొస్తుంది. ఇది ఇల్లా–హోటలు రూమా అనిపించదా? వాళ్ళిద్దరిమధ్యా అందుకే అస్తమానూ పోట్లాటలు వచ్చేవి."

"అందమయిన వాళ్ళుకూడా పోట్లాడుకుంటారని నువ్వు ఒప్పేసుకుంటున్నావన్న మాట!"

"పోట్లాట వెలిశాక ఆయన ఆవిడని షాపింగ్‌కో, సినిమాకో తీసికెళ్ళేవాడు. తన గెస్టులనుంచి ముందు అల్లరిపెట్టకుండా సహించి చాకిరీ చేస్తున్నందుకు, ఆవిడ దుబారా ఖర్చుల్నీ ఆ మగాడు చచ్చినట్లు కుక్కిన పేనులా భరిస్తున్నాడు. అది ఆవిడ చక్కంది కావడంవల్ల ఆయన్ను కొంగునకట్టుకు తిప్పుకుంటున్నాననుకుంటే అది పొరపాటు. పొరపాటే కాదు, తెలివి తక్కువకూడా."

"ప్రసాదరావు పెళ్ళాంమీద నీ కిప్పుడు కోపం వుందా, పోయిందా? పోయిందంటే నీకో మాట చెప్తాను."

మా ఆవిడ మొహం ఎర్రబడింది. తమాయించుకుని–

"ఆవిడ గర్విష్టి అవునా కాదా? ముందామాట చెప్పండి" అన్నది.

"ఆవిడ స్వయానా అతనికి అప్పకూతురు. చిన్నప్పట్నుంచీ మేనమామ నెత్తెక్కి తొక్కేది. అదంతా పైవాళ్ళకు మరోలా కనపడొచ్చు. అతి గారం వలన ఆవిడ చేష్టలన్నీ అప్రియాలైనా ప్రియాలైనా అతను భరించక తప్పదు."

"ఇదేనా మీరు నాకు చెప్తానన్న రహస్యం?"

"కాదు, ప్రసాదరావు ఉద్యోగం మానేస్తున్నాడు. మానేసి వాళ్ళ పార్టీవర్క్‌కి అండర్‌గ్రవుండ్‌కి వెళ్ళిపోతున్నాడు."

"మరి పెళ్ళాం, పిల్లలూ?"

"వాళ్ళను వదిలేస్తున్నాడు."

"మరి ఆవిడ యిష్టపడిందా?"

"ఆవిడ కసలు తెలీదు."

"రామ రామ! మీ రెల్లా వూరుకున్నారండీ? పాపం, ఆవిడ కాపరంలో నిప్పులుపోసి అతనల్లా చేస్తూంటా–"

"ఎవరు చెప్పినా వినడు."

మా ఆవిడ కాసేపు నిర్ఘాంతపోయి 'కర్కోటకుడు' అని గొణుక్కొని "మరిం కేమీ లాభంలేదా?" అన్నది.

"లేదు."

ఇంతవరకూ దూషించిన ప్రసాదరావు భార్య కోసం మాఆవిడ మనస్ఫూర్తిగా బాధపడి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

☆ ☆ ☆

సన్నగా పొడుగ్గా పెట్టె మరకలుపడ్డ జరీచీరలా వుంటుంది శివకాంత. నాకు తెలిసిన ఆడవాళ్ళే చాలాతక్కువ. అందులో నా కిష్టమైన ప్రియస్నేహితుడి భార్య శివకాంత. ఆ అమ్మాయి అసలు పేరు శివకాంత కాదు. శివప్రసాదరావు నా కిష్టమైన స్నేహితుడు కాబట్టి అతని పెళ్ళాన్ని 'శివకాంత'ని నేనే రిఫర్ చేస్తూ వుంటాను.

మా ఆవిడ అంటే శివప్రసాద్రావుకి గౌరవం–నేనంటే చిన్న గురి. ఈ ఆడ తగూ గురించి ప్రస్తావిస్తూ "గురూ గారూ, ఆడవాళ్ళు స్నేహితులుగా వుండలేరు" అని వ్యాఖ్యానించాడు.

"మనం వాళ్ళని ఎదగనియ్యలేదు. చీరలు నగలూ బజార్లూ సినిమాలు అసూయలూ. వాళ్ళనల్లా చావనివ్వండి–" అని చేత్తో గాలిలో కొట్టిపారేశాడు.

శివకాంతని గురించికూడా సిద్ధాంతీకరిస్తూ–

"అదో పెద్ద మూర్ఖురాలు–ఎడ్యుకేట్ అవలేదు. చెత్త నవలలు తప్ప అది మరింకేమీ చదవలేదు. ఎంతమంది పేదజనం ఎన్నికష్టాలు పడుతున్నారో వీళ్ళకి తెలుసా? జీవితాన్ని ఎదుర్కోవడం పేద స్త్రీలకు తెలిసినట్లు వీళ్ళకేం తెలుసు? మగాళ్ళకి ఎపెండేజస్‌గా కాకుండా తమ కాళ్ళమీద తాము నిలబడేటట్లు ధైర్యంగా జీవితాన్ని ఫేస్ చేయడం వీళ్ళకి ఛస్తేరాదు. ప్రేమ ప్రేమని మిడిల్‌క్లాస్ వాల్యూస్‌ని పట్టుకుని ప్రాకులాడతారు. పూర్ క్రీచర్స్" అన్నాడు.

☆ ☆ ☆

శివప్రసాదరావు ఉద్యోగానికి రాజీనామా యిచ్చి హైదరాబాద్ వెళ్తున్నప్పుడు వాళ్ళని భోజనానికి పిలుద్దామా అని మా ఆవిడను అడిగాను.

"మీ ఫ్రెండ్‌కి ఎంతో మంది లంచ్‌లూ డిన్నర్లూ ఆఫర్ చేశార్ట. ఎన్నిటికని వెళ్ళగలం అందిట ఆవిడ. మనం పిలిచినా ఆవిడ పడనివ్వదులెండి. మనకిది మళ్ళీ మరో అవమానం" అంది మా ఆవిడ.

శివప్రసాదరావుని శివకాంత కట్టిపడేస్తుంది, ఎక్కడికీ పోనివ్వదని మా ఆవిడకు యింకా అనుమానంగానే వుంది. ఉద్యోగం మానేసిన రోజున వాళ్ళిద్దరూ అరకు రాజా అరకురాణిల్లా ఆటోలో భోజనాలకీ విందులకీ సినిమాలకీ స్నేహితులిళ్ళకీ తిరగడాన్ని మా ఆవిడ మరోలా అర్ధం చేసుకుంది.

శివప్రసాదరావు యూజీలోకి వెళ్ళిపోయాడని నమ్మకంగా విన్నాను. దొరికితే ఏంచేస్తారని బిక్కమొగం వేసుకొని మా ఆవిడ అడిగింది. కాల్చి చంపేస్తారన్నాను.

☆ ☆ ☆

శివప్రసాదరావు ఏమయ్యాడని అతని కొలీగ్స్, ఫ్రెండ్స్ నన్ను అడిగేవారు. మీకు తెలిసేవుంటుంది, మీకు తెలీకుండా ఉంటుందా అని అనేవారు. అతని ఉద్యోగం మానేముందు నాకు అప్పగించిన చిన్న చిన్న పనులు చేస్తూ వచ్చాను. కొంతమంది అతను ఈ చుట్టుపక్కలే వర్క్ చేస్తున్నాడని అనేవారు. అతని గురించి అంతా మిస్టరీగా చెప్పుకునేవారు.

మా ఆవిడకూడా–'అలాటివాళ్లు పెళ్ళి చేసుకోకూడదు. పెళ్ళి చేసుకున్నాక వాళ్ళను నట్టనడి సముద్రంలో ముంచకూడదు. మీ స్నేహితుడు చేసింది తప్పే'నని పెళ్ళయినవాళ్ళకు దేశభక్తి వుండకూడదన్నట్లు మాట్లాడేది.

ఆవిడకు తను అందకత్తెననే గర్వం వున్నందుకు తగిన శాస్తి జరిగిందని మాత్రం మా ఆవిడ అనలేదు. అతని భార్య తమ్ముడి దగ్గరకు వెళ్ళిపోయిందనీ, మెట్రిక్యులేషన్‌కు ప్రయివేటుగా కట్టి ప్యాసయి, ఏదయినా జాబ్ చేసి పొట్టపోషించుకోవాలనే అభిప్రాయం వుందని విన్నాను. పిల్లల్ని చదివించుకుంటోంది.

☆ ☆ ☆

శివకాంత మెట్రిక్యులేషన్‌కు కట్టి ప్యాసయింది. శివప్రసాదరావు స్నేహితులు సూపర్‌బజార్‌లో సేల్స్‌గరల్‌గా జాబ్ సంపాదిస్తే, ఆమె తమ్ముడు "మా అక్క ఉద్యోగం చేస్తే మాకు పరువు తక్కువ" అని పేచీపెట్టి ఆమె జాబ్‌లో చేరకుండా అడ్డుపడ్డాడని విన్నాను. శివకాంతను పిల్లలుమాత్రం "నాన్న ఏడీ? ఎప్పుడు వస్తా"డని అడగడం, ఆవిడ కలకత్తాలో వున్నారనీ, ఢిల్లీలో వున్నారనీ, రీసెర్చి చేస్తున్నారనీ చెప్పి తప్పించుకుంటూ వుండేది. పిల్లలకి జ్వరాలు, పైఖర్చులూ, స్కూలు ఖర్చులూ వచ్చినపుడు కొద్దిగా అప్పులు చేసేది. సహాయం ఎవరు చేస్తామన్నా ఒప్పుకునేది కాదు. ఉండి ఉండి "మావయ్య ఇంత అన్యాయం చేస్తాడనుకోలేదు" అని గొల్లున శోకాన్నాలు పెట్టేది. ఆవిడ్ని అలా ఏడ్వనిస్తే మళ్ళీ తనకుతానే సర్దుకునేది.

☆ ☆ ☆

రెండేళ్ళు, మూడేళ్ళయింది.

"ఇంకా మీ ఫ్రెండ్ బయటకు రాలేదా?" అని అంటూండేది మా ఆవిడ.

"ఆయన బావున్నాడా? ఆయనకేం ప్రమాదం జరగలేదు కదా?" అని అడిగేది.

శివకాంత పిల్లలకి జ్వరాలు, ఆమెకూడా సుస్తీపడి లేచిందని విని మా ఆవిడ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

☆ ☆ ☆

ఒకరోజు ఒక దూతవచ్చి నాకో చీటీ యిచ్చి నన్ను ఫలానా చోటుకి ఫోన్ చేయమన్నాడు. అవతల మనవాడి గొంతుని గుర్తుపట్టి అతను బతికే వున్నందుకు చాలా సంతోషించాను. సందులూ గొందులూ యిరుకు గల్లీలు దాటి ఓ మారుమూల కొంపలో నే నతన్ని కలుసుకున్నాను. ఇద్దరం చాలాసేపు కబుర్లు చెప్పుకున్నాము. టీ తాగాము. అతను భార్యాపిల్లల విషయం అడిగి తెలుసుకున్నాడు. ఒకమాటు వెళ్ళి చూడకూడదా అని సూచించాను. "మా ఆవిడ రాగాలు పెట్టి గొడవ చేసిందంటే నన్ను మోసేస్తారు. దానివల్ల నాకు, నా వల్ల మా వాళ్ళకీ డేంజర్...నేను దాన్ని కలుసుకోను" అన్నాడతను నిర్లిప్తంగా.

చిక్కలేదు. నీటుగా, ధీమాగా వున్నాడు. ఎప్పటిలానే అతని అభిప్రాయాలతనివి. వంగని శివధనుస్సులా వున్నాడు. స్నేహితులందరి గురించీ అడిగాడు. ఫలానా పుస్తకాలు, పత్రికలు కావాలన్నాడు. మా ఆవిడనీ మా పిల్లల్నీ అందరినీ మరీ మరీ అడిగాడు. బయటకు రావడం ఎప్పుడు అనే ప్రశ్నకు దేశ పరిస్థితులు మారినప్పుడు అనేది జవాబు. అతని మీదేం కేసులు లేవుట. పార్టీ ఆర్గనైజేషన్ వర్క్ కాని యాక్షన్‌లో లేడుట. కాని, బయటకు వస్తే ఏవో కేసులు బనాయించి జైలుకి పంపిస్తారట. జైల్లో కెళితే లాభం కదా, చంపరు. కేసులమీద కేసులు నడుస్తూ వుంటాయి, అంతేకదా అన్నాను. అతను నవ్వాడు. నాకేం భయంలేదు. మీరు గాభరా పడకండి అన్నాడు.

"ఒకసారి మీ ఆవిడనూ పిల్లలనూ చూసి ఓదార్చివస్తే మంచిది కాదా?" అని మళ్ళీ అడిగాను.

"ఎవర్ని ఎందుకు ఓదార్చాలి? కోట్లాది భారత ప్రజానీకాన్ని ఎవరు ఓదార్చగలరు?"

"మీ గురించి ఎక్కడవున్నదీ చెప్పమని పోలీసులు ఆవిడను యిబ్బంది పెడితే-"

"ఇబ్బంది పెట్టినవారి అందరి చరిత్రలూ ఎలా వుంటాయో దీని చరిత్రా అలానే అవుతుంది. దేశభక్తుల పెళ్ళాల్నీ, తల్లుల్నీ, చెల్లెళ్ళనీ అవమానించడం – అది పోలీసువాళ్ళ పవిత్రకర్తవ్యం ఈ ఎమర్జెన్సీలో-"

"మరి ఆవిడ యిలాటి అవమానాలకు తట్టుకోగలదా?"

"దేశభక్తుని భార్య కావడం అవమానం అయితే తట్టుకోలేదు."

చాలాసేపు రాజకీయాలు మాట్లాడుకున్నాం. దేశం ఒక అంధకారయుగంలో వుంది. ఇందులోంచి జాతి మొత్తం ఎలా బయటపడుతుందోనని ఆలోచించాం.

కోట్లాది భారతీయుల గురించి, వారి కష్టాల గురించి నా మిత్రుడు ఆలోచిస్తున్నాడు. నేను నా మిత్రుడి భార్య, పిల్లలు, వారి కుటుంబం పడే కష్టాల్ని గురించి మాత్రమే ఆలోచించగలుగుతున్నాను.

☆ ☆ ☆

శివప్రసాదరావును నా పక్క వాటాలోకి నేనే తెచ్చుకున్నాను. ఎక్కడికి వెళ్ళినా మేమిద్దరం కలిసే వెళ్ళేవాళ్ళం. అతని వాదనా పటిమను, విశ్లేషణా శక్తిని నేను మెచ్చుకునేవాడిని. నా చొరవను, ధైర్యాన్నీ, సాహసాన్ని అతను పొగిడేవాడు. యథాప్రకారం అతనూ, అతని విజిటర్సూ, చిన్న చిన్న మీటింగ్సూ, తిరుగుళ్ళూ, అతని రాజకీయాలూ మామూలు మనుషులకి అర్థమయేవి కావు. వీటిని మనహాయిస్తే అతను గొప్ప స్నేహశీలి, సారస్వతప్రియుడు, చక్కని ఉపాధ్యాయుడు, కార్యకర్త. అతనిలో అరాచకత్వం కాని, అశాస్త్రీయమైన ఉద్వేగంగాని వుండేది కాదు. ఎవరేపని చెప్పినా మీద వేసుకునేవాడు. విసుగూ అలసటా లేని మనిషి.

ఓ రోజు రాత్రి–నా తలుపుమీద ఎవరో ఏడుస్తూ బాదుతున్నారు. నిద్దట్లో లేచి తలుపు తెరవగానే శివకాంత నన్ను పట్టుకుని ఏడుస్తూ నా కాళ్ళమీద వాలిపోయింది. ఆ ఏడుపులో నాకు తెలిసింది – నా మిత్రునికి రోడ్డుమీద అక్సిడెంటయిందట – ఆటోవాళ్ళు తీసుకెళ్ళి గవర్నమెంటు ఆస్పత్రిలో చేర్చారట.

ఆమెను ఓదార్చి ఆ రాత్రి ఆటోలో ఆమెను తీసుకుని ఆసుపత్రికి వెళ్ళి శివప్రసాదరావుని చూశాను. అతనికి మైనర్ ఫ్రాక్చర్, మైనర్ ఇంజరీస్ తగిలాయి.

అప్పుడతను రిక్షా తిరగబడిందనీ, తనకేమీ ఫరవాలేదనీ, ఆ రిక్షావాలా సంగతి చూడవలసిందనీ, అతనికేమైనా సహాయం చేయవలసిందనీ కోరాడు.

అప్పుడతని భార్య–

–ఇలా వేళాపాళా లేకుండా, స్నేహితులకోసం, వారికోసం, వీరికోసం, రైలుస్టేషన్లకీ, బస్‌స్టాండ్లకీ తిరగవద్దనీ, బయటపనులు తగ్గించుకోమని చెప్పమంది.

"నీతో సినిమాకెళ్ళి వస్తూండగా పడిపోకూడదా రిక్షాలోంచి–" అని తనని వెటకారం చేసినందుకు ఆమె చిన్నబుచ్చుకుంది.

ఆ యాక్సిడెంట్ జరగడంవలన వారిద్దరూ చాలా క్లోజ్ అయారు.

"ఈవిడ పెంకితనం, నామీద జులుం ఎక్కువయిపోయిందండీ" అని అతను శివకాంతను చూపించి నవ్వాడు.

"ఆవిడ అలా పేరంటానికో పెళ్ళికో వెళ్ళినట్లు ముస్తాబు చేసుకుని ఆసుపత్రికి వెళ్తుందేమిటండీ?" అని మా ఆవిడ కామెంట్ చేసింది.

"శుభ్రంగా నీటుగా వుండక ఏడుపు మొగంతో వుండమంటావా?" అన్నాను.

"అబ్బే – మీకు తెలియదు లెండి" అని మా ఆవిడ విసుక్కుంది. తన భర్తను అన్య మార్గాలనుంచి తనవేపుకు తిప్పుకోవాలని 'శివకాంత' తన ఆకర్షణను శ్రద్ధగా పెంచుకోవడం మా ఆవిడ గమనించింది కాని, నేను గమనించలేకపోయాను.

"స్పెషల్ రూమూ స్పెషల్ వార్డూనూ–ఈవిడెప్పుడూ అతడ్ని రాసుకుంటూ పూసుకుంటూ ఆ మంచంమీదే ఎక్కి కూర్చుంటుంది!"

"అయితే–"

"ఎవరూ లేనప్పుడు ఆ మానవుణ్ణి ఈవిడ ఏమి ఇబ్బందులు పెట్టేస్తూందో ఏమిటో?" అని పైకి ఆకాశంవైపు చూసింది.

"అబ్బ–ఏమి బుర్రలర్రా మీవి–" అని నవ్వేశాను.

ఇల్లాలుకూడా శారీరక ఆకర్షణను ఆయుధంలా వాడాలా – అని కొంచెం ఆలోచించి నా బుర్ర పాడు చేసుకున్నాను. శివకాంతమీద నాకు జాలి కలిగింది.

☆ ☆ ☆

ఎమర్జెన్సీ చివరి దశలో మరోసారి ఓ పాత హోటల్లో ఓ రూములో మళ్ళీ కలుసుకున్నాను అతని ఆహ్వానంమీదే. సమూసాలు తిని, చా త్రాగాము. కష్టసుఖాలు చెప్పుకున్నాం. కొంతసేపయాక టాపిక్ శివకాంతమీదకు మళ్ళింది – అతనే అన్నాడు:

"మా వూరు వెళ్ళానండోయ్" అని.

"మీ ఆవిడ్ని కలుసుకున్నారా? మాట్లాడారా? ఏమయింది?" అని ఆదుర్దాగా అడిగా.

మళ్ళీ నవ్వాడు–"మా వాళ్ళు వున్న వీధికి రెండు ఫర్లాంగుల దూరంలో వున్నా కాని కలుసుకోలేకపోయా."

"అదేమిటి? అన్యాయం–"

"ముఖ్యమంత్రి ఊళ్లో కొచ్చాడు–ఊర్నిండా పోలీసులు మఫ్టీలో దిగిపోయారు. వీధిలోకి రావడానికీ, కదలడానికీ వీలు లేకపోయింది. ఒకరిద్దరు ముఖ్యమైన మిత్రులకి కనిపించి వెనక్కు వచ్చేశాను."

"మరి ఆవిడ–"

"ఆవిడకు నేను వచ్చి వెళ్ళిపోయానని తెలిసి చాలా కోపం వచ్చివుంటుంది. ఏం చేస్తాం?" అని గాలిలోకి చేతులు విసురుతూ నవ్వాడు.

నాకు నోటమాట రాలేదు.

☆ ☆ ☆

అతను కులాసాగానే వున్నాడనీ, కుటుంబ విషయాలన్నీ అతనికి తెలిపాననీ, ఆరోగ్యంగా మునపటంత ఉత్సాహంగా వున్నాడనీ నేను శివకాంతకు ఛోగట్టా అందేలా ఉభయులకీ సంబంధించిన మిత్రులకి తెలియపరిచేవాడిని

శివకాంత ఎలా వుందని అడిగినప్పుడల్లా ఎవరూ నాకు సంతృప్తి కలిగేలా చెప్పలేకపోయారు. పరిస్థితులను అర్థం చేసుకుందా? ఏమిటి ఆవిడ ధోరణి – అని అడిగితే – ఆమె మరింత బిగుసుకుపోయిందని అన్నారు. ఎవరెంత చిన్న సహాయం చేయబోయినా అవమానంగా ఫీలై నిరాకరిస్తుంది. భర్త యూజీలో వున్న స్త్రీకి ప్రయివేటు సంస్థలలో పిలిచి ఎవరు ఉద్యోగం యిస్తారు? అగ్రవర్ణస్థులమనే అభిజాత్యంకూడా ఆమెను ఓ మెట్టు క్రిందకు దిగి ఆలోచించనివ్వలేదు.

బయటకు వెళ్ళడం మానుకుంది. పేరంటాలు, పుట్టినరోజులు, పెళ్ళిళ్ళు, వేడుకల సమయాల్లో భర్తను గురించిన ప్రసక్తి వస్తుందనే భయంతో కాలు బయటపెట్టలేదు. ఎంతో ఇష్టపడి వెళ్ళే సినిమాలు బోరుకొట్టాయి. అన్నిటికంటె ముఖ్యమైనది కుటుంబ బాధ్యతను స్వీకరించి సంసారాన్ని నడపడం–జాయింట్ ఫామిలీ కాబట్టి సరిపోయింది. ఉమ్మడి ఆస్తులమీద సీకుతున్నారు.

భార్యాభర్తల్ని, తల్లీకొడుకుల్నీ, తండ్రీబిడ్డల్ని విడదీసే రాజకీయాలంటే ఆమెకు గల వైముఖ్యం మరింత పెరిగిందే కాని తగ్గలేదు. భర్త స్నేహితవర్గంలో ఏ ఒకరో యిద్దరోతప్ప మిగతా అంతా తమ కుటుంబానికి ద్రోహం చేసినవారిలా కనిపించారు.

ఎవరి పిల్లలతో వారు కాపరం చేసుకుంటున్నారు. ఎవరి ఉద్యోగాలు వారు చేసుకుని కుటుంబాలు చూసుకుంటున్నారు. తనకే ఎందుకు యిలా జరగాలి? ఎందుకు ఆయన్ను నిలబెట్టుకోలేకపోయాను–నాకే, నా పిల్లలకే ఈ అన్యాయం జరగాలా–అని కుమిలిపోయేది. చివరకు అతనిపట్ల గల వ్యతిరేక భావన తప్ప – అతను అనుసరించిన పంథాపట్ల విముఖత్వం తప్ప – ఆమెలో దేశభక్తి పెరగలేదు.

ఇది యిలా వుండగా స్కూలు కెళ్ళిన పిల్లలిద్దరూ పరిగెత్తుకుంటూ వచ్చి–

"అమ్మా అమ్మా, మనం ఎవరం?"అని అడిగారుట.

"నువ్వేం చెప్పావు?" అని చిన్నవాడిని అడిగిందట.

వాడు "మేం బ్రాహ్మలం" అన్నాడుట. పెద్దాడు అది తప్పని తమ్ముడ్ని ఖండించాడుట.

"మరి నువ్వేం చెప్పావురా?" అని శివకాంత పెద్దవాడి నడిగింది.

"మేం కమ్యూనిస్టులం అని చెప్పానమ్మా!" అన్నాడు వాడు. శివకాంత తెల తెల బోయింది. ఏడిచి తల మొత్తుకుందిట.

ఈ వివరాలన్నీ నాకు చెబుతూ, ప్రసాదరావు శ్రేయోభిలాషి – "కాలమే ఆవిడ మనస్థితిని చక్కదిద్దాలి. అంతే" అన్నారు.

"అతను వస్తాడు, మళ్ళీ సంసారం చక్కబడుతుందని ఆమె ఆశిస్తోందా?"

"పిల్లలేవో అడిగినప్పుడు ఆశగానే చెపుతుంది. కాని తన స్టేటస్‌ని అతను డేమేజి చేసినందుకు ఆవిడ చాలా బాధపడుతోంది."

"ఏమిటా స్టేటస్?"

"భర్త వదిలేసిన స్త్రీగా మిగిలిపోవడం అన్యాయం కాదా?"

"అతనీవిడ్ని కూడా లోపలికి లాక్కోవచ్చనుకుంటానే–"

"ఈవిడ రహస్యజీవితానికి పనికిరాదు."

"మరి ఉప్పూ, పులుసూ తినే మనిషికదా, కోరిక కలగకుండా ఉంటుందా?"

"ఏం చేస్తుంది? ఏడుస్తుంది – పాపం!"

"మనవాడ్ని యిందులోంచి బయటకు లాగే మార్గం ఏదన్నా ఆలోచించాలి."

☆ ☆ ☆

"మీవాడిమీద ఛార్జెస్ ఏమీలేవు. వచ్చి మాకు లొంగిపోమనండి" అన్నారు పోలీసులు. ఆ ముక్క అతను వినలేదు. మళ్ళీ ఓసారి ఓ వర్కర్ ఇంట్లో కలిశాడు. ఎమర్జెన్సీ గురించి మాట్లాడుకున్నాం. పరిపాలించేవారి నిజస్వరూపం ప్రజలకు బాగా తెలిసిపోయింది. మా పని తేలికయింది. పరిపాలకులే రివల్యూషన్ ఆవశ్యకతను, అది రావటానికి గల ఛాన్సెస్‌ను స్పీడ్ అప్ చేస్తున్నారు. ఎవరు వచ్చినా వీరు

పేదప్రజలకు ఏమీ చేయలేరు. ఎమర్జెన్సీవలన బ్రహ్మాండమైన అవేకెనింగ్ ప్రజలలో వస్తున్నదని అన్నాడు.

ఆ వర్కర్ భార్య మమ్మల్ని పలకరించింది. మాకు టీ యిచ్చింది. ఆవిడతో మనవాడు వాళ్ళ పిల్లవాడి చురుకుదనం, అల్లరి గురించి మాట్లాడాడు. ఈవిడ కూడా తనకు ఉద్యోగం చేయాలని వుందని అన్నది. చూస్తా, అతనికి కూడా చెప్పి ఒప్పిస్తానని మనవాడు అన్నాడు. ఆవిడ పని చేసుకునేప్పుడు, పిల్లల్ని ఓ కంట కనిపెట్టడం, వారి చదువు గురించి కనుక్కోవడం చేస్తున్నా నన్నాడు. మొదట్నుంచీ నేను గమనించాను. చాలామంది పరాయి స్త్రీలు మనవాడితో చాలా చనువుగా వుంటారు. మంచీ చెడూ అతనితో చెప్పుకుంటారు, ప్రసాదరావుని ఓ కుతూహలకరమైన ప్రశ్న అడిగాను–

"అందరూ నీలాటివారు లేరనుకో–ఈ వర్కర్స్ ఇళ్ళలో యీాజీలో వున్నవారికి ఆ ఇంటి స్త్రీలతో తప్పక చనువు ఏర్పడుతుంది. వీరంతా స్త్రీ సంబంధం లేక అలమటించిపోతూ వుంటారు. ఇలాటి పరిస్థితుల్లో నిగ్రహించుకోలేని సందర్భాల్లో ఆతిథ్యం యిచ్చిన ఆసామీకే ఎసరు పెట్టినట్లవుతుందికదా–"అన్నాను.

"అప్పుడప్పుడు అలాటివి జరిగినపుడు పెద్దలు సరిచేస్తారు."

"ఏమిటి సరిచేస్తారు?"

"ఇలాటివి అవతలి పెద్దలక్ష్యం – కోట్లాది ప్రజల విముక్తికోసం ఇగ్నోర్ చేయవలసి వస్తుంది."

"మరి సెక్సుబాధలు తట్టుకోడంకోసం మీరంతా ఏం చేస్తారు?"

"ఇళ్ళకు వెళ్ళి రహస్యంగా కలిసి వస్తారు. లేదా తమ తమ భార్యలను ఎక్కడికయినా రప్పించుకుంటారు దూతల ద్వారా–"

"మరి వ్యభిచార గృహాలకు వెళ్ళరా?"

"వెళ్ళరు, వెళ్ళకూడదు. బ్రోతల్స్‌లోని స్త్రీలనుకూడా పీడిత ప్రజానీకంలోకి చేర్చి, వాళ్ళను మళ్ళీ సెక్స్ దోపిడీకి గురిచేయడం తప్పు. రెండోది, వాళ్ళకు అలవాటు పడితే ఎప్పటికో ఒకప్పుడు శత్రువుకి తేలికగా దొరికిపోతారు."

"ఇప్పుడు యిలా యీాజీ జీవితం గడుపుతున్న స్త్రీలకు కూడా కోరిక లుంటాయికదా? వారు ఒత్తిడికి తట్టుకోలేక కాలు జారచ్చు. అవునా కాదా?"

"ఇవన్నీ చచ్చు ప్రశ్నలండీ–ఆ విధంగా బలవత్తరమైన వాంఛలకు లోబడిన స్త్రీలు అందుకై ఏమైనా చేస్తే అది తప్పు కాదండీ! సెక్స్ నేరాల్ని తేలిగ్గా క్షమించేస్తాం, దేశభక్తుడే స్త్రీని వ్యభిచారంలోకి దింపితే అది ఆ పరిస్థితుల్ని కల్పించిన సమాజానిది తప్పవుతుంది. ఆ తప్పు ఆ స్త్రీది కాదు."

"మరి మీరు శివకాంతతో కొన్నాళ్ళు గడిపి ఆమెకు సంతోషం కలిగించడం అవసరం అని నేను అంటాను" అన్నాను వాదనకు.

"నేనలా అనుకోవడంలేదు. ఆమె అందుకు పనికిరాదు" అన్నాడు ముసిముసి నవ్వులు నవ్వుతూ.

నాకు కాస్త చిరాకు వేసింది అతని పిడి వాదనకు.

"ఆమె ఎందుకు పనికిరాదు?"

"సమావేశాలకు, సమాగమానికి ఆవిడ పనికిరాదు. ఆమె తత్వం నాకంటే మీకు ఎక్కువ ఎలా తెలుస్తుంది?"

"ప్రయత్నించి ఆవిడకో అవకాశం యివ్వరాదా?"

"నేను ఫ్రీగా మూవ్ అయే పరిస్థితులు వచ్చినప్పుడు అలా చేస్తే చేయవచ్చు."

"కాదు, ఆమెను సంతోషపెట్టాలి. అది కనీస బాధ్యత, మానవత అనిపించుకుంటుంది."

అతను మళ్ళీ పకపక నవ్వాడు.

☆ ☆ ☆

అనుకోకుండా—పార్లమెంటు ఎన్నికలు జరిగాయి. పాత ప్రభుత్వం, దాని పార్టీని మూక ఉమ్మడిగా ప్రజలు తిరస్కరించారు. ఎమర్జెన్సీ ఎత్తివేశారు. జైళ్ళలోంచి ముందు స్మగ్లర్సనీ, ఆలోచించి కొంతమంది దేశభక్తుల్నీ, మిగతావాళ్ళనూ విడుదల చేశారు. బూర్జువా లిబరల్స్, మితవాదులు అధికారంలోకి వచ్చారు. ఒక కుటుంబానికి దేశ రాజకీయా మీద గుత్తాధిపత్యం ముగిసింది.

"ఏమండీ మన ప్రసాదరావు బయటకొచ్చేశాడా? వాళ్ళ ఫామిలీ గురించి ఏమయింది?" అని మా ఆవిడ కుతూహలంగా అడిగింది.

"మన రాష్ట్రంలో యింకా ఎమర్జెన్సీనాటి పార్టీయే అధికారంలో వుంది. ఇప్పుడు బయటకు వచ్చినా మళ్ళీ లోపలికి తోసి మూసేస్తారు. రాకూడదు. ఇంకా వేచి చూడాలి" అని చెప్పాను.

☆ ☆ ☆

శివకాంతనీ, అతడినీ తరచూ కలిపితే, అతను యీ మారిన పరిస్థితుల్లో – నెమ్మదిగా అటునుంచి యిటు వచ్చి కుటుంబంవైపు మొగ్గి పూర్వజీవితం కొనసాగించవచ్చని మాకు మనసులో మారుమూల ఒక ఆశాకిరణం అవలేశంగా మెదులుతోంది. మా స్నేహితులంతా కొంత గ్రవుండ్ ప్రిపేర్ చేశారు. ఏదో ముహూర్తంలో అతను వచ్చేస్తాడు. ఓపిక పట్టమని శివకాంతకు 'హింట్' యిచ్చారు.

☆ ☆ ☆

ప్రసాదరావు వెళ్ళాడా? శివకాంత ఏమంది? వారు కలుసుకున్నారా? ఈ ప్రశ్నలు మమ్మల్ని సస్పెన్స్‌లో ముంచి చంపుతున్నాయి. ఇంతలో దివి సీమలో ఉప్పెన వచ్చింది. కోస్తా ఆంధ్ర శోక సముద్రంలో మునిగిపోయింది. అలాటి రోజుల్లో ఓ రోజున ప్రసాదరావు ఏమీ జరగనట్లే ఎప్పట్లానే నవ్వుకుంటూ మా యింటికి వచ్చాడు. మా ఆవిడ పెసరట్లకు నానవేసిన పెసరపప్పు రుబ్బుతోంది. అతన్ని చూడ్డానికి పెసరపప్పు రుబ్బుతున్న చేత్తో వచ్చి 'తప్పిపోయిన తమ్ముడ్ని' చూసినట్లు చూసి – పెసరట్లు చేసిపెట్టి తినిపించింది సాదరంగా.

"అక్కడంతా ఎలా వున్నారు?" అని అడిగింది.

"నేనింకా అక్కడకు వెళ్ళలేదమ్మా! ముందిక్కడికే వచ్చా"నన్నాడు.

"మూర్ఖుడు" అనుకుంది మా ఆవిడ.

☆ ☆ ☆

ఓరోజు ఫలానా సెంటరుకి రావలిసిందని ఫోన్ వచ్చింది. అక్కడతను నా కోసం కిళ్లీకొట్టు దగ్గర నిలబడి ఎదురుచూస్తున్నాడు.

"ఈ ఊళ్ళో చెత్తసినిమా ఎక్కడ ఆడుతోంది?" అన్నాడు.

చెప్పా.

"ఆ సినిమా హాల్లో కూర్చుందాం, పదండి" అన్నాడు.

టిక్కెట్లు కొనుక్కుని ఆఖరి క్లాసుకి ముందు క్లాసులోకెళ్ళి కూర్చున్నాం.

"ఇంటికెళ్ళి వచ్చా"నన్నాడు.

పొంగిపోయి చీకట్లో షేక్ హాండిచ్చాను.

–వివరాలింకా యిలా చెప్పాడు:

వెళ్ళినతరవాత ముఖ్యస్నేహితులద్వారా రాయబారాలు జరిగాయట. అతను ఓ హోటల్లో రూములో వున్నాడు. ఆమె అక్కడకు వెళ్ళి ఆయన్ను కలుసుకుని, ఆ రాత్రి ఆయనతో వుండవచ్చుట. వాళ్ళకు ఏవిధమైన డిస్టర్బెన్స్ కలగకుండా గట్టి బందోబస్తు ఏర్పాటు జరిగిందిట.

ఆవిడకు ఎంత చెప్పినా, ససేమిరా నేను లాడ్జింగ్ రూముకి రాను. మొగుడి దగ్గరకి ముండలా వెళ్ళలేను – వస్తే ఆయనింటికి ఆయన్ని రమ్మనండి–అంతేనందిట.

"నేను చెప్పాను కదా–"అని ఫ్రెండ్స్ మీద విసుక్కున్నాడు ప్రసాదరావు. ఇతను విరగని శివధనుసు, ఆమె శోకించని సీత. వీళ్ళను కలపడానికి వాల్మీకికూడా పనికి రాడు.

ఆ మర్నాడు ప్రసాదరావే తెల తెలవారుతూండగా ఉషోదయం మేలుకొలుపులా వెళ్ళి తలుపు తట్టాడట. శివకాంతే వచ్చి తలుపు తీసిందట. ఆమె భుజంమీద చేయివేసి లోపలికి నడిచి తనకు అలవాటైన గదిలో ఆమె మంచంమీద చుట్టంలా వచ్చి కూర్చున్నాడట. ఆమె కాఫీ కాచి పట్టుకు వచ్చిందట. నిద్రపోతున్న పిల్లల్ని లేపాడట.

ఇంతలో తల్లికూడా వచ్చి కావిలించుకుని ఏడ్చిందట. ఏడిస్తే యిప్పుడే వెళ్ళిపోవాల్సి వస్తుందమ్మా అన్నాడట. ఏమీ జరగనట్లే–ఈ మధ్యన ఈ వియోగమంతా మిథ్య అన్నట్లు గడిపారట. తల్లి కొడుక్కి యిష్టమని పప్పుచారు చేసి దగ్గర కూర్చుని తినిపించిందట.

శివకాంతని, పిల్లలని తీసుకుని రిక్షాలో ఓ మ్యాట్నీ సినిమాకు కూడా వెళ్లొచ్చాడట. అస్సలేమీ జరగనట్లే నిన్నటెనుండి ఈవాళ ఉదయించినట్లు – 'స్మాల్ నతింగ్స్' చెప్పుకున్నారట.

–సినిమాహాలునుంచి వచ్చేసరికే, వాళ్ళమ్మ స్వయంగా కొడుకూ కోడలికోసం వణికే ముసలి చేతులతో పడకటేగదిని సర్ది అలంకరించి, పటాల బూజుల్ని తుడిచి,

కొత్త దుప్పట్లు వేసి–అగరొత్తులు వెలిగించి పెట్టేందిట. ఓ పళ్ళెంలో మల్లెపూలు కుప్పపోసి వున్నాయి.

ప్రసాదరావు యిలా యింట్లోకి అడుగుపెట్టాడో లేదో అతనికోసం ఆటో వచ్చింది. అతను వెనక్కు తిరిగి చర చరా తను నమ్మిన ప్రపంచంలోకి వెళ్ళిపోతున్నాడు.

శివకాంత గుమ్మం పొదిగిటన నిలబడి, మాయమవుతున్న భర్తకేసి చూస్తోంది.

తల్లి కోడలి తరఫున నోరు చేసుకుని అడిగింది –

"నాయనా, ఈ రాత్రికి వుండిపోరాదురా?"అని.

అతను ఆటోలో ఎక్కబోతూ వెనుదిరిగాడు.

"మీరిద్దరూ" అని రెండు వేళ్ళతో వారిద్దర్నీ గుచ్చి చూపుతూ "కోట్లాది పేద ప్రజానీకానికి తల్లులు–" అని అగరొత్తుల పొగ వస్తున్న పడక గదికేసి చూపించి "మీరిట్లాటి పని చేయకూడదు" అని ఆటో ఎక్కేశాడట!

● ప్రచురణ కాలం: ? ●

★ ★ ★

53

వల్లంపాటి వెంకట సుబ్బయ్య

# పరిష్కారం

నిద్ర లేచి, నిద్ర పట్టని రాత్రి ఆలోచనల్లా రేగిన జుట్టుని గోళ్లతో దువ్వుకొని, లైటువేసి, అద్దంలో ముఖం చూసుకుంది లలిత.

సుఖం లేని నిద్రలో ఎర్రగా ఉబ్బిన కళ్ళు, కళ్ళకింద నల్లని చారికలు, బుగ్గల మీద నాజూకుతనం తగ్గిన చర్మం, నోటి చెరువైపులా గీత గీచినట్టున్న ముడతలు, గడ్డంకింద జారుతున్న గడ్డం – అన్నిటినీ మించి నువ్వులు, బియ్యం కలిసి కుప్ప పోసినట్లున్న తల.

"ముప్పై అయిదేళ్ళకే ముసిలతనం" అనుకుంది. లలిత.

తనతోపాటు చదువుకుని, ఇప్పుడు తనతోపాటే ఉద్యోగం చేస్తున్న నీరజ తనలా ఉండదు. దానికి పదేళ్ళుగా వయసు ఆగిపోయింది.

"ఎందుకే?" అంటుంది తాను.

"నీ కర్థంకాదులే" అంటుంది నీరజ – ఒక కన్ను మూసి.

"నీకు పూర్తిగా సిగ్గులేదు" అంటుంది తాను.

"నీకుమాత్రం ఎందుకుండాలే" అంటుంది అది.

తన ఆలోచనకు నవ్వొచ్చింది లలితకు, నవ్వుకుంటూ కిటికీలోంచి బయటకి చూచింది. తొలి వెలుగు పసుపు పచ్చగా, చలి నులివెచ్చగా ఉన్నాయి. గది తలుపు తీసుకొని హాల్లో కొచ్చింది లలిత.

శివరామయ్య ముఖం కడగడం పూర్తిచేసి, మొదటి కప్పు కాఫీ కోసం ఉడిపి హోటలుకు బయల్దేరుతున్నాడు.

"వాళ్ళెప్పుడొస్తారుట?" అన్నాడు లలితను చూచి చిరునవ్వుతో.

"తొమ్మిది గంటలకు."

"ఏమిటే అప్పుడే నిద్రలేచావ్? ఈ రోజు ప్రైవేటు పిల్లలు రారుగా?" అంది సరస్వతమ్మ, అప్పుడే తెల్లవారినందుకు చిరాకుపడుతూ

"కానీ వాళ్ళొస్తారుగా?"

"ఎవరూ?"

"నీరజ చెప్పినవాళ్ళు" అంది లలిత ఎలా చెప్పాలో అర్థంకాక.

"ఎన్ని గంటలకూ?" అంది సరస్వతమ్మ విసుగ్గా.

ఆ విసుక్కు అలవాటుపడిపోయిన లలిత బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది. నెమ్మదిగా పళ్ళుతోముకుని, రెండుసార్లు సబ్బుతో ముఖం కడుక్కొని, బాత్‌రూమ్‌లోని అద్దంముందు నిలబడి ముఖం తుడుచుకుంది. అద్దంలో తన ప్రతిబింబాన్ని చూస్తుంటే చిలిపి ఆలోచన లొచ్చాయి లలితకు.

"మీరు నవ్వితే చాలా అందంగా ఉంటారు" అన్నాడు ఒకతను చాలాకాలం క్రితం.

తాను నవ్వితే కుడి బుగ్గమీద నొక్కుపడేది...

లలిత ఒకసారి అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచి సాధ్యమైనంత చిలిపిగా నవ్వాలని ప్రయత్నించింది.

బుగ్గమీద సొట్టపడిందికానీ – అది పదేళ్ళముందున్నంత లోతుగా, నాజూగ్గా ఆమెకే అనిపించలేదు.

"ముప్పై అయిదేళ్ళకే ముసలితనం" అనుకుంది.

శివరామయ్య కాఫీతాగి, పేపర్ కొనుక్కొని తిరిగొచ్చాడు. లలిత బాత్‌రూమ్ లోనుంచి బయటికొచ్చేసరికి లైటుకింద పేపరు చదవటానికి సిద్దపడుతున్నాడు.

"ఏమండీ! తొమ్మిది గంటలకు లలితను చూడ్డానికి వాళ్ళొస్తారుగా?" అంది సరస్వతమ్మ.

"అవును – వస్తారు... ఈ ఎన్. టి. రామారావు..."

"రాజకీయాలు అలా పక్కన పెట్టి, కాస్త వీలు చూచుకొని బజారుకు వెళ్ళొస్తారా?"

"ఓ – అలాగే...రవి నిద్రలేచాడా?"

"వాడి కప్పుడే తెల్లవారదు. మీరే వెళ్ళిరండి" అంది సరస్వతమ్మ, తన మామూలు విసుగు పద్ధతిలో.

"అలాగే... పేపరు చూసి... అన్నట్టు..."

"డబ్బు నే నిస్తాలే, నాన్నా!" అంది లలిత.

"అలాగే లేమ్మా!" అంటూ మళ్ళీ పత్రికలో మునిగిపోయాడు శివరామయ్య.

ఎనిమిది గంటలౌతుండగా రవి నిద్రలేవటమూ, నీరజ రావటమూ ఒకేసారి జరిగాయి. అప్పటికి శివరామయ్య వార్తా పత్రికలో వాతావరణం వివరాలు శ్రద్ధగా చూస్తున్నాడు.

"మావారువాళ్ళతో పాటొస్తారు" అంది నీరజ, చుట్టూరా చూసి ఆశ్చర్యపోతూ. ఎవరి ముఖంలోనూ చింతాకంత ఉత్సాహం కూడా కనిపించలేదు. లలిత ముఖం కూడా ముడుచుకుపోయే ఉంది.

"ఏమిటే, అందరి ముఖాలూ ఇలా ఏడోసారి దివాలా తీసినట్టున్నాయి?" అంది.

"ఏడోసారి దివాలా తీసేవాడు కోటీశ్వరుడై ఉంటాడు. మాలాంటివాళ్ళకు మొదటిసారి చాలు." నిరాశగా అన్నది లలిత.

నీరజకు పరిస్థితి అర్థం కాలేదు.

"ఇదో, ఇలాగా మాట్లాడవంటే నిన్ను ఒప్పుకోవద్దని వారి ఫ్రెండుతో చెప్పమని మా వారితో చెబుతాను." చిలిపిగా అంది నీరజ, వాతావరణాన్ని కాస్త మార్చాలన్న ఉద్దేశంతో.

కానీ వాతావరణం మారలేదు. లలిత నవ్వలేదు.

"నా రామచిలకా! ఏడపు మొహం ఆడదాన్ని ఏ మగాడూ మెచ్చడే. నవ్వవే. నవ్వవే."

లలిత నవ్వింది – కాస్త నీరసంగా, నిరాశగా.

"అత్తయ్యగారూ! మీ కూతురు చాలా నీరసంగా ఉంది. ఒక డోసు మాంచి కాఫీ పంపండి." గట్టిగా అంది నీరజ.

నీరజ, లలిత గట్టిగా నవ్వారు.

గదిలో కొచ్చిన సరస్వతమ్మ మాత్రం నవ్వలేదు.

"ఇదో...ఇలా చూడు... ఈ వస్తువులు తెప్పిస్తావా?" అంది ఒక పట్టీని లలిత చేతిలో పెడుతూ.

పేపరు చదువుకుంటున్న శివరామయ్యా, అప్పుడే పళ్ళు తోమాలా, వద్దా అని ఆలోచిస్తున్న రవీ ఒక్కసారిగా తాము వెళ్ళొస్తా మన్నారు.

ఒకర్నొకరు అనుమానంగా చూసుకున్నారు. చివరకి రవే గెలిచాడు.

"సరే. నువ్వే వెళ్ళి రారా" అన్నాడు శివరామయ్య.

లలిత ఇచ్చిన డబ్బులు అందుకొని రవి బజారుకు వెళ్ళాడు. శివరామయ్య మళ్ళీ పేపర్లోకి తలదూర్చాడు.

"ఇంత పొద్దెక్కినా ఇల్లు ఇంకా ఇలా ఉందేమిటే?" అంది నీరజ.

"ఎలా ఉంది?"

"అప్పుడే చెప్పాగా?"

నీరజ కోపానికి లలితకు నవ్వొచ్చింది.

నీరజ ఇల్లు సర్దటం ప్రారంభించింది. ఇంట్లో అందరూ చేతులు తుడిచిన కర్టెన్స్ తీసేసి, ఉతికినవి వేసి, నడి వీధిలో కాగితపు ముక్కల్లా పడిఉన్న పాతగుడ్డల్ని మూట గట్టి, దాచి, పక్కింట్లోనుంచి నాలుగు మంచి కుర్చీలు తీసుకొచ్చి వేసి, వాటిముందొక టీపాయ్‌లాంటిదాన్ని వేసి, దానిముందు మాసిన డోర్ కర్టెన్‌ను తిరగేసి పరచి, దానిమీద కాస్త శుభ్రంగా చిరిగిపోకుండా ఉన్న పుస్తకాల్ని ఉంచింది.

పత్రికలోని చివరి వాక్యాలు కూడా చదవటం పూర్తిచేసిన శివరామయ్య హాల్లో కొచ్చి చూసి, "ఇదేమిటె, హాలు ఇంత శుభ్రంగా ఉంది!" అని ఆశ్చర్యంగా ముఖం పెట్టి వంటింట్లోకి వెళ్ళాడు.

తొమ్మిది గంటలు కావచ్చింది.

నీరజ మళ్ళీ గదిలోకొచ్చి లలితను పెళ్ళిచూపులకు తయారుచేయటం ప్రారంభించింది.

"అదికాదే. కొంపలో నాలుగు కుర్చీలుకూడా లేవు. నీ సంపాదనంతా ఏమవుతోంది?" అంది నీరజ కూర్చుంటూ.

వంటింట్లోంచి నేతిలో వేగుతున్న జీడిపప్పు వాసన గుబాళించటం ప్రారంభించింది.

"ఆ వాసన చూడవే. అదే నీకు జవాబు" అంది లలిత.

నీరజ లలితకు జడ వేయసాగింది.

"ఏమిటో ఈ వయస్సులో పెళ్ళిచూపులు... అలంకరణలు..." విసుగ్గా అంది లలిత.

"నాటకాలాడకే. లోపల్లోపల నీ కిష్టంగా ఉందా, లేదా?"

"ఇష్టమే ననుకో..."

"మరి నోరు మూసుకో..."

"ముఖంలోని ముసలితనం కప్పెయ్యటానికి పౌడర్లు, క్రీములు రాస్తున్నావు. ముగ్గుబుట్టలా ఉన్న ఈ తలనేం చేస్తావే?" అంది లలిత.

"నీ తల ముగ్గుబుట్టలా ఉందా? ఎవడే అన్నది? నల్లని ఆకాశంలో మెరుపులా అక్కడక్కడా వో తెల్ల వెంట్రుకుంది... ఇంతకూ నీకు తల నెరిసే వయస్సొచ్చిందని ఎవరంటారే?"

లలిత చిన్నగా నవ్వింది.

"ఇదే ఈ పెళ్ళికానివాళ్ళతో వచ్చిన తంటా. రాకముందే తమకు ముసలితనం వచ్చేసిందనుకుంటారు. మే మలా కాదు. వయసొచ్చినా రాలేదనుకుంటాం" అంది నీరజ.

"ఎందుకూ?" నవ్వుతూ ప్రశ్నించింది లలిత.

"షటప్. అప్పుడే మతి చెడగొట్టుకోకు. అదికాదూ... ఆయనేం పదిహేనేళ్ళ బాలాకుమారుడు కాడుగా? నీకు జుట్టు నెరిస్తే ఆయనకు రాలిపోయింది. అంతే తేడా."

"గంతకు తగ్గ బొంత" అంది లలిత.

"కాదు. ఈడు జోడు."

ఇద్దరూ బిగ్గరగా నవ్వారు.

నవ్వులు ఆగకముందే శివరామయ్య లోపలికొచ్చాడు – విభూతి రేఖల మీద ఎర్రగా వెలిగిపోతున్న కుంకుమను సర్దుకుంటూ.

"వాళ్ళొచ్చే వేళయింది. అంతా రెడీయేకదమ్మా?" అన్నాడు.

"రెడీ" అంది నీరజ.

"లల్లీ, నువ్వు త్వరగా తెములు. టిఫిన్ పూర్తయిందో లేదో చూడు."

లలిత వంటింట్లో కెళ్ళింది.

ఇస్త్రీ పంచ నలిగిపోకుండా జాగ్రత్తపడుతూ శివరామయ్య కుర్చీలో కూర్చున్నాడు.

"బాబాయిగారూ!"

"ఏమిటమ్మా?" అన్నాడు శివరామయ్య.

"లల్లీ పెళ్ళి కుదిరితే – కుదిరేలాగే ఉందనుకోండి – ఏం చేయాలనుకుంటున్నారు?"

"అంటే?"

"వెంకటేశ్వర్లుగారు మంచి ఉద్యోగంలో ఉన్నారు. కష్ట సుఖాలు తెలిసినవారు. కట్నం ఆశించనని మా వారితో చెప్పారట కూడా. కానీ... పెళ్ళి ఖర్చులు ఎంత కాదన్నా పదివేలవుతాయి. ఆ డబ్బు..."

నీరజ వేయని ప్రశ్నకు జవాబుగా శివరామయ్య జేబులోంచి ఒక కాగితాన్ని తీసి, మడత విప్పి నీరజ కందిచ్చాడు.

అది బ్యాంకువాళ్ళిచ్చిన నోటీసు.

తమ బాంకులో తాకట్టు పెట్టిన ఇంటికి సంబంధించిన అసలు, వడ్డీ కలిసి తొమ్మిదివేల ఎనిమిది వందలైందనీ, దాన్ని నోటీసు అందిన నెల రోజుల్లోగా చెల్లించాలని, చెల్లించనిపక్షంలో ఇల్లు వేలం వేయబడుతుందని అందులో ఉంది.

దాన్ని చదివిన నీరజకు కళ్ళు చీకట్లు కమ్మినట్టనిపించింది. ఎంతోకాలం తరవాత చిగురించిన ఆశ ఎండిపోయింది. ఎదుట కూచున్న శివరామయ్య మీద కోపం, అసహ్యం పొంగివచ్చాయి. కష్టపడి తన్నుతాను తమాయించుకుంటూ మెల్లగా అడిగింది:

"అంటే... లక్ష్మీ పెళ్ళి చేయటం కుదరదంటారా బాబాయిగారూ?"

శివరామయ్య మెల్లిగా నవ్వాడు.

"పెళ్ళి జరిగితీరుతుంది!" అన్నాడు.

"ఎలాగ?"

"ఇల్లు అమ్మేయాలనుకుంటున్నాను. ఈ పెంకుల కొంప ఎంత పాతదైనా ఇరవై వేలు వస్తాయి. మనకు ఏ సమస్యా లేదు."

"అంటే...."

"పదివేల రూపాయలు అప్పుకు, మిగిలిన పదివేలు లక్ష్మమ్మ పెళ్ళికి..." పోయినా నవ్వాడు శివరామయ్య.

"ఇల్లు పోతుందిగా. బాబాయ్?"

"ఎలాగూ పోతుంది. పదివేల రూపాయల అప్పు తీర్చటం ఎలాగూ నా చేత కాదు. ఇల్లు అమ్మటం తప్పదు. ఆ పని ఇప్పుడే చేస్తే అప్పూ తీరుతుంది, పెళ్ళీ అవుతుంది."

"తరవాత?"

"తరవాత సంగతి తరవాత."

"ఇల్లు అమ్మడం వద్దు, నాన్నా!" అంతవరకూ బయట ఉన్న లలిత లోపలి కొస్తూ అంది.

"అమ్మకపోతే ఎలా కుదురుతుందమ్మా?" అన్నాడు శివరామయ్య.

"నా పెళ్ళికోసమని మీరు ఇంటిని పోగొట్టుకోవడం నాకిష్టం లేదు."

"ఇల్లు అమ్మకపోతే అప్పూ తీరదు, నీ పెళ్ళీ కాదు."

"అప్పు సంగతి తరవాత ఆలోచిద్దాం. పెళ్లిని గురించి మీరు బాధపడకండి." తల వంచుకొని కాస్త సిగ్గుగా అంది లలిత.

"అంటే?" ఆశ్చర్యంగా అన్నాడు శివరామయ్య.

"నా దగ్గర పెళ్ళికి సరిపోయే డబ్బుంది."

తన చెవుల్ని తనే నమ్మలేకపోయాడు శివరామయ్య.

"అంటే?" అన్నాడు మళ్ళీ, ఏమనాలో తోచక.

"ఏడెనిమిదేళ్ళుగా కొంచెం కొంచెంగా డబ్బు దాచుకుంటూ వచ్చాను. అది దాదాపు పదివేలైంది" అంది లలిత తప్పు చేసినదానిలా.

"పదివేలే!"

అవునన్నట్టు తలూపింది లలిత.

శివరామయ్య కనుబొమలు ముడిపడి, మళ్ళీ విచ్చుకున్నాయి. క్షణం తరవాత సంతృప్తిగా నవ్వాడు.

"అలాగైతే నా కింకేం కావాలి? చూశావా, నీరజమ్మా! మా లల్లెమ్మ తన పెళ్ళికి అన్ని ఏర్పాట్లూ తానే చేసుకుంది. నా బాధ్యత ఎంత తగ్గించిందో చూడు. ఇక సంబంధం కుదరడమే తరువాయి..." శివరామయ్య లేచాడు.

"బాబాయిగారూ! ఒక మాట..."

"ఏమిటమ్మా?"

"పెళ్ళిసంగతి ఎలాగో సర్దుకుంటుందనుకోండి – ఇంటి సంగతి?"

శిరామయ్య గట్టిగా నవ్వాడు.

నీరజ, లలిత ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

"ముందు పెళ్ళి, తరవాత ఇంటి విషయం..."

"అలాగంటే ఎలా నాన్నా? ఇంటి విషయంకూడా ఆలోచించాలి" అంది లలిత.

"ఆలోచించాల్సిందే. కానీ మన దగ్గర ఇరవై వేలు లేవుగా ఉంది పదివేలే." శివరామయ్య ముఖం చిత్రంగా ముడుచుకుంది.

సరస్వతమ్మ గదిలోంచి వచ్చింది.

"ఏమండీ! అందరూ నన్ను వేధించుకు తినేవాళ్ళే! ఆ రవిగాణ్ణి ఇంట్లో ఉండరా అంటే వెళ్ళిపోతున్నాడు – చూడండి" అంది.

"టిఫిన్ తిన్నాడా?" శివరామయ్య అడిగాడు.

"వ్రూఁ... తిన్నాడూ..."

"అలాగైతే వెళ్ళనీ. వాడు ఉండి ఏం చేయాలిక్కడ?"

"నా ఖర్మ!" మళ్ళీ వంటింట్లోకి నడిచింది సరస్వతమ్మ.

శివరామయ్య భార్యను అనుసరించాడు.

నీరజ వాళ్ళ వెనకే వెళ్ళి తలుపు మూసింది.

లలిత అలాగే తల వంచుకొని నిలబడి ఉంది.

"ఏయ్ రాస్కెల్! ఇలా రా!" అంది నీరజ.

లలిత ముందుకొచ్చింది.

నీరజ అకస్మాత్తుగా లలితను గట్టిగా కౌగలించుకొని ముద్దుపెట్టుకుంది.

"ఛీ! నీకు సిగ్గులేదే" అంది లలిత బుగ్గ తుడుచుకుంటూ.

"నీకుమాత్రం ఉందేమిటి?"

"అవును. నాకు నిజంగా సిగ్గులేదు. ఉంటే నా పెళ్లికి దొంగతనంగా అంత డబ్బు దాచుకునేదాన్నికాను."

లలిత కళ్ళనిండా నీళ్ళు నిండాయి.

"నేను ఆ ఉద్దేశంతో అనలేదు లల్లీ! అదేమిటే ఇప్పుడు కళ్ళనీళ్ళు పెట్టుకుంటావ్? తప్పుకదూ? వాళ్ళొచ్చే వేళయింది. కళ్ళు తుడుచుకో. ఇలా నా ముందు కూచో. నీ మేకప్..."

"అదికాదు, నీరజా! ఒక మాట సూటిగా చెప్పు. నేను చేసింది తప్పంటావా?"

"కాదు... కాదు..."

"మా ఇంటి పరిస్థితి చూస్తున్నావుగా, అలాంటప్పుడు..."

"చెప్పాగా, నువ్వు చేసింది తప్పుకాదు. నువ్వు సిగ్గుపడాల్సిన అవసరం లేదు." లలిత కళ్ళు తుడుస్తూ అంది నీరజ.

"నాన్నాగా రేమనుకుంటారో..."

"ఏమనుకుంటారు? తాను చేయవలసిన పని నువ్వు చేసి తన బరువు తగ్గించావనుకుంటారు."

"రవి?"

"వాడేమనుకుంటే నీకేం?"

"అమ్మ?"

"సాటి ఆడదానిగా మీ అమ్మ నిన్నెప్పుడు అర్థం చేసుకుందే?"

లలిత జవాబు చెప్పలేదు.

"అంటే ఏమిటో తెలుసా? వివరించమంటావా?"

"అక్కర్లేదు" అంది లలిత నవ్వుతూ.

"వివరించటమే మంచిది. నిన్ను కాస్త రెచ్చకొట్టాల్సిన అవసరం కనిపిస్తోంది – మరీ ముఖ్యంగా పెళ్ళిచూపులకు ముందు..."

ఇద్దరూ నవ్వుకున్నారు.

ఇంటిముందు స్కూటర్లు ఆగిన చప్పుడు కావటంతో నవ్వులు ఆగిపోయాయి.

"ఏయ్, వాళ్ళొచ్చినట్టున్నారే!" అంది ఎగిరిగంతులేస్తూ నీరజ.

లలిత మనసులో సంతోషమూ, భయమూ ఉప్పెనగా పొంగివచ్చాయి. రామకృష్ణ, వెంకటేశ్వర్లు లోపలికొచ్చారు.

రామకృష్ణ లోపలికి రాగానే చుట్టూరా చూసి, కాస్త సంతృప్తిగా ముఖంపెట్టి కుర్చీ చూపించి, "కూర్చోండి" అన్నాడు.

వెంకటేశ్వర్లు చిరునవ్వుతో అందులో కూర్చున్నాడు.

"ఫరవాలేదు" అనుకుంది కిటికీలోంచి తొంగిచూస్తున్న లలిత. వెంకటేశ్వర్లు బాగా ఒడ్డూ, పొడవూ ఉన్నాడు. రంగు నలుపు మాత్రం కాదు. తెలివితేటలు, చురుకుతనం కనిపించే కళ్ళు – చెంపలమీద వెంట్రుకలు కాస్త తెల్లబడ్డాయి...

"నీకు అద్దం అక్కర్లేదు" అంది నీరజ.

"అంటే?"

"ఆయనగారి బుర్రచూడు ఎలా మెరిసిపోతోందో. దాన్నిచూసి బొట్టు పెట్టుకోవచ్చు."

"ఏదో గంతకు తగిన బొంత" అంది లలిత.

"కాదు, ఈడు జోడు."

ఇద్దరూ మళ్ళీ చిన్నగా నవ్వుకున్నారు. ఇతరులకు చెరలాటంగా, లలితకు ప్రాణ సంకటంగా పెళ్ళిచూపులు ముగిశాయి – ఫలహారాలు, కాఫీలు పూర్తయాయి.

"మా అన్నయ్య, వదిన వస్తా రనుకున్నాను. ఎందుకో వాళ్ళు రాలేకపోయారు" అన్నాడు వెంకటేశ్వర్లు.

లలిత తలవంచుకొని కుర్చీలో కూర్చుంది. ఫన్నెండు సంవత్సరాలుగా పాఠాలు చెబుతూ, క్లాసుల్ని గడగడలాడిస్తూ ఉన్నా, ఆమెకు చాలా భయమనిపించింది. వెంకటేశ్వర్లు గొంతు వింటే భయం ఎక్కువైనట్లు అనిపించింది.

"ఫరవాలేదులెండి" అన్నాడు రామకృష్ణ

నీరజ రామకృష్ణను కొరకొరా చూసింది. తానన్నమాట ఎంత బుద్ధిలేనిదో అప్పుడు స్ఫురించింది రామకృష్ణకు.

"నాకు కట్నాలు కానుకలు అక్కర్లేదు. పెళ్ళికూడా సాధ్యమైనంత సింపుల్‌గా చేసెయ్యండి చాలు. మా అన్నయ్య, వదిన చూడాలంటే మరోసారి వస్తారు. కానీ వారు చూసి తీరాల్సిన అవసరం మాత్రం లేదు" అన్నాడు వెంకటేశ్వర్లు – లలిత వైపు చూచీచూడనట్లుగా ఒకచూపు చూస్తూ.

ఆ చూపు గుచ్చుకున్నట్టనిపించింది లలితకు. వెంకటేశ్వర్లు మాటలు ఆమె మనస్సులో ఝంకారం చేస్తూ తిరిగాయి.

"ఎంత మంచివాడు!" అనుకుంది లలిత.

"లేద్దామా?" అన్నాడు వెంకటేశ్వర్లు.

అందరూ లేచారు. రామకృష్ణ, వెంకటేశ్వర్లు బయటికి నడిచారు.

లలిత, నీరజ గదిలో కెళ్ళారు.

"అదేమిటే– అలా కూర్చుండిపోయావ్, మాటాపలుకూ లేకుండా?" అంది నీరజ.

"భయమేసింది. ఇతరుల్లాగా పాట పాడమంటాడేమోనని లోలోపల హడలి చచ్చాను."

"నేనే గనక పెళ్ళికూతుర్నయితే పెళ్ళికొడుకుని శీర్షాసనం వేయమనేదాన్ని."

"వెయ్యమంటారా, సార్?" అప్పుడే లోపలికొచ్చిన రామకృష్ణ అన్నాడు.

లలిత నవ్వింది.

"నవ్వటం తరవాత, ముందు నాకు థాంక్స్ చెప్పండి" అన్నాడు రామకృష్ణ.

"ఎందుకూ?" అంది లలిత.

"ఏం, వెంకటేశ్వర్లు చెప్పిన మాటలకు మీ కర్థం తెలియలేదా? వివరంగా చెప్పమంటారా?"

"వద్దు" అంది లలిత సిగ్గుతో.

"నాకు చెప్పాలనిపిస్తోందండీ!"

"ఇంటికొచ్చి నాకు చెప్పండి, మీకు నేను థాంక్స్ చెబుతాను. పదండి ముందుకు." నీరజ రామకృష్ణ ఎదమీద చేయివేసి తోసింది.

"ఇదేమిటే, ముందుకు పదమని వెనక్కు తోస్తున్నావ్?"

"అరిగిపోయిన జోకులు" అంది నీరజ.

శివరామయ్య, సరస్వతమ్మ గదిలో కొచ్చారు.

నీరజ, రామకృష్ణ సెలవు తీసుకొని బయలుదేరారు.

నీరజ ఒక కన్నుమూసి "వెళ్ళొస్తానే లల్లీ... జాగ్రత్త!" అంది.

రామకృష్ణ, నీరజ స్కూటరెక్కారు. నీరజ రామకృష్ణ భుజం మీద ఎడమ చేయి వేసి, కుడిచేత్తో అతని నడుమును పొదివి పట్టుకుంది.

"దీనికి నిజంగా సిగ్గులేదు" అనుకుంది లలిత.

సర్రుమని స్కూటరు ముందుకు కదిలింది.

సంతోషంతో వెలిగిపోతున్న కూతురి ముఖాన్ని చూస్తూ ఉండిపోయాడు శివరామయ్య.

☆ ☆ ☆

రెండోరోజు రాత్రి ఆలస్యంగా ఇంటికొచ్చాడు రామకృష్ణ. ఎదురు చూచిచూచీ సోఫాలో పడుకొని నిద్రపోయింది నీరజ. అర్ధరాత్రి దాటిన తరవాత తలుపు తడుతున్న శబ్దం విని నిద్ర లేచింది. భర్త మీదపడి రక్కేయాలన్నంత కోపంతో వెళ్ళి తలపు తీసింది.

రామకృష్ణ లోపలి కొచ్చాడు.

"హలో... అదేమిటే, అప్పుడే నిద్రపోయావ్?" అన్నాడు రామకృష్ణ ఉత్సాహంగా. ఆ ఉత్సాహం సహజంగా అనిపించలేదు నీరజకు.

రామకృష్ణ ముఖాన్ని నిశితంగా చూసింది. అతనికి ముఖంలో విసుగూ, కోపమూ స్పష్టంగా కనిపించాయి నీరజకు.

"ఏమిటలా ఉన్నారు? ఎవర్తోనైనా పోట్లాడి వస్తున్నారా?" అంది.

"ఏం? నీ భర్త రత్నంలా లేనా?" అన్నాడు రామకృష్ణ నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"చాల్లెండి, మీ అరిగిపోయిన జోకులు. అసలు సంగతి చెప్పండి."

రామకృష్ణకు నిజం చెప్పాలనిపించింది.

"వెంకటేశ్వర్లుతో మాట్లాడి వస్తున్నాను" అన్నాడు.

"ఏమిటండీ? ఏమంటాడు?"

"డబ్బు ఆశ పుట్టిందా?"

"లేదు."

"మరేమట?"

"కారణం చెప్పలేదు."

"అంటే... అంటే... పెళ్ళి..."

"లేదు."

నీరజ దిగ్భ్రాంతురాలై పోయింది.

"ఏం? లల్లీ నచ్చలేదనట్నా? ఈ మగాళ్ళంతా ఇంతే. తాము కోతుల్లా ఉన్నా పెళ్ళాలు మాత్రం దేవకన్యల్లా ఉండాలనుకుంటారు. రాస్కెల్! ఆ చెంబు తలకాయగాడికి..."

"కారణం తెలియకుండా అలా మాట్లాడకూడదు నీరజా!"

"ఏమిటండీ ఆ కారణం?"

నీరజ కోపం క్షణక్షణానికీ పెరిగిపోతున్నట్లనిపించింది రామకృష్ణకు.

"నాకూ తెలీదు" అన్నాడు.

"వాడు చెప్పలేదా?"

"లేదు."

"మీ రడగలేదూ?"

"అడిగాను. కానీ అతడు చెప్పలేదు."

"రాస్కెల్!" అంది నీరజ.

"కారణం నెమ్మదిగా తెలుసుకుందాంలే – పడుకో" అన్నాడు తానూ పడుకుంటూ.

గులాబి మొగ్గలా వెలుగుతున్న నైట్ లాంప్ వెలుగులో గది ఎర్రగా కనిపిస్తోంది. రామకృష్ణ ఆలోచిస్తూ పడుకున్నాడు. తాను అన్నం తినలేదని రామకృష్ణకు జ్ఞాపకం రాలేదు, నీరజా జ్ఞాపకం చేయలేదు.

ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టలేదు రామకృష్ణకు. భార్య నిద్రపోయిందేమోనని చూశాడు. గోడవైపు తిరిగి కదలకుండా పడుకొనుంది నీరజ. లలిత జ్ఞాపకం వచ్చింది రామకృష్ణకు.

నీరజ భుజం మీద చేయివేసి తనవైపుకు తిప్పుకున్నాడు రామకృష్ణ.

నీరజ ముఖం కన్నీళ్ళతో తడిసి ఉంది. భర్త ముఖాన్ని చూడగానే దుఃఖం పొర్లివచ్చింది నీరజకు.

"ఏమండీ! నిజం చెప్పండి. మీరేదో దాస్తున్నారు. నా దగ్గర మీకు దాపరికమా? నిజం చెప్పండి" అంది వెక్కిళ్ళ మధ్య.

ఇక దాచటం కష్టమనిపించింది రామకృష్ణకు. కానీ ఎలా చెప్పాలో అర్థం కాలేదు.

"ఎవరో లలిత ప్రవర్తనను గురించి చెడుగా వెంకటేశ్వర్లుతో చెప్పారు."

"ఆ చెంబు తలకాయగాడు ఆ మాటల్ని నమ్మాడా? కానివాళ్ళు గూడా దాన్ని గురించి చెడుగా చెప్పలేరండీ! ఆ విషయం నాకు తెలుసు! మీకు తెలుసు."

"అయినవాళ్ళు చెప్పొచ్చుగా?" అన్నాడు రామకృష్ణ.

"ఏమిటండీ, అలా మతిలేకుండా మాట్లాడుతారు? అయినవాళ్ళెందుకు అలాంటి మాటలు చెబుతారు? దాని పెళ్ళి చెడగొడితే వాళ్ళకొచ్చే లాభమేంటి?"

"లాభముంటే అపకారం చేయవచ్చునంటావా?"

"మీ మాటలు నాకేం అర్థం కావటం లేదు. మీరేదో దాస్తున్నారు. అందకుండా, పొందకుండా మాట్లాడుతున్నారు" అంది నీరజ విసుగ్గా.

"అందటం, పొందటంకాదు అసలు విషయం."

"మళ్ళీ ప్రారంభించారా మీ అరిగిపోయిన జోకులు. లల్లీని గురించి అంత చెడుగా ఎవరు చెబుతారండీ మీ పిచ్చి కాకపోతే? ఉదయాన్నే నేను వెళ్ళి వెంకటేశ్వర్లుతో మాట్లాడుతాను. అతడు విన్నవన్నీ తప్పని నిరూపిస్తాను. లల్లీని పెళ్ళి చేసుకోమని బ్రతిమాలుతాను."

"అలాగే..." అన్నాడు రామకృష్ణ.

"మీరూ వస్తారా?"

"అలాగే."

"ఉదయాన్నే వెడదామా?"

"అలాగే."

"ఏమిటండీ అన్నిటికి చిలకలా 'అలాగే, అలాగే' అంటున్నారు. ఈ పెళ్ళి తప్పిపోతే లల్లి గుండె పగిలి చచ్చిపోతుందండీ! తనకు పెళ్ళి కుదిరిపోయిందని అందరితోనూ చెప్పుకుంటోందండీ!" అంది నీరజ.

"అలాగా?"

"చూచారా – మీరేదో దాస్తున్నారు. మీకంతా తెలుసు. ఎవరండీ..."

వీధి తలుపు గట్టిగా తడుతున్న చప్పుడు వినిపించింది.

"ఎవరూ?" అంది నీరజ భయంగా.

"ఎవరో చూద్దాం."

ఇద్దరూ వెళ్ళి తలుపు తీశారు.

మసక చీకట్లో శివరామయ్య నిలబడి ఉన్నాడు.

"ఏమిటి బాబాయిగారూ, ఇలా వచ్చారు?" అంది నీరజ.

"లల్లెమ్మ ఆత్మహత్య చేసుకుందమ్మా!...." బావురుమన్నాడు శివరామయ్య.

"ఎందుకూ?"

"ఏమోనమ్మా?"

"రాస్కెల్! గెటవుట్!" గట్టిగా అరిచాడు రామకృష్ణ.

"ఏమిటండీ, మీ కేమైనా మతి పోయిందా?"

అడ్డం వచ్చిన నీరజను తోసిపారేసి, శివరామయ్య చొక్కా పట్టుకొని చేయి పైకెత్తాడు రామకృష్ణ.

పైకెత్తిన భర్త చేయి వేట కొడవలిలా కనిపించింది నీరజకు.

"ఏమిటండీ ఈ పిచ్చికోపం?..." తన శక్తంతా ఉపయోగించి రామకృష్ణను దూరంగా లాగింది.

తలవంచుకొని శివరామయ్య వెనక్కు తిరిగాడు.

భర్త ప్రవర్తనకు దిగ్భ్రాంతురాలైన నీరజ రామకృష్ణ ముఖంలోకి చూస్తూ అలాగే నిలబడిపోయింది.

తాను ఎంతోసేపట్నుంచి అడుగుతున్న ప్రశ్నకు రామకృష్ణ కళ్ళలో మండుతున్న కోపం జవాబుగా కనిపించింది నీరజకు.

● *ప్రచురణ, 1984* ●

★ ★ ★

రాధిక

# 54 నలుగురు కలసి నవ్వే వేళ

కోణార్క్ ఎక్స్‌ప్రెస్ హుందాగా, అందంగా కోణార్క్ శిల్పాన్ని నేనేసుమా అన్నట్టు రైలు పట్టాలపై నిలుచుని ఉంది. సికింద్రాబాద్ ప్లాట్‌ఫారమ్ పెళ్ళి పందిరిలా ఉంది. ప్రయాణీకులు అందరూ హడావిడిగా, కోలాహలంగా గోల చేస్తూ తిరుగుతున్నారు. ఠీవిగా నిలుచున్న కోణార్క్ ఎక్స్‌ప్రెస్‌లోనికి చారుమతి, రాజేష్‌లతో పాటు మరో నలుగురు అమ్మాయిలు ఎక్కారు. వారు ఎక్కుపెట్టిన విల్లుల్లా, భవిష్యత్తులో కూడా లోకంలోని ఆనందమంతా తాగేస్తాం అన్నట్లు అందర్నీ తప్పించుకుని దూసుకుపోతున్నారు. వారు అప్సరసలు కాదు, కాని అందకత్తెలే. చూసేకొద్దీ చూడలనిపించేవారే. చారుమతి, రాజేష్‌లు నవ దంపతులు. కూర్చున్న తరువాత "ట్రయిన్ ఎప్పుడూ ప్లాట్‌ఫారమ్ మీద నిలబడి ఉంటుంది. ఎందుకు?" అపర్ణ అడిగింది. అందులో అందరికంటే ఎక్కువ అందమైనది, సరదా అయినది ప్రత్యేకంగా స్మిత ఒక్కతే. మిగిలినవారికందరికీ జోక్స్ వెయ్యడంకంటె నవ్వడం బాగా వచ్చు.

"అ౦ ఏంలేదు. దానికి కూర్చోవడం చేతకాక."ను స్మిత అంది. అందరూ నవ్వారు. "ఇదేదో సినిమాలో జోక్ లాగుందే" రమ్య అంది. "సినిమాలోదైనా, మరేదైనా సమయానుకూలంగా జోక్ చెప్పడం కూడా ఒక కళే. జోక్స్ వెయ్యడంతోపాటు మౌనంగా ఉండడం కూడా ఒక కళ" అపర్ణ అంది.

"ఏమిటి కళలమీద కవిత్వం చెబుతున్నారు?" నిరీక్షణ అంది.

"లేకపోతే నీ మీద చెప్పమంటావా? నిరీక్షణ అమావాస్య నిశీధిలా తెల్లగా ఉంది." స్మిత మాటలకు నిరీక్షణ ఉడుక్కుంది.

వారు అయిదుగురూ ఆడ పంచపాండువులలాగ ఉండేవారు విశాఖపట్నంలో కాలేజీలో. అందులో నిరీక్షణ, అపర్ణ, రమ్యలకు ముందుగా పెళ్ళిళ్ళు అయిపోయాయి. వారందరూను స్మిత పెళ్ళిలోనే ఆఖరుసారి కలుసుకున్నారు. ఇప్పుడు మరలా చారుమతి పెళ్ళిలోనే కలవడం. స్మిత పెళ్ళి అయిన తరువాత ఆమె కాపురం సంగతులు వారికి తెలియవు. తెలుసుకోవాలనే ఆరాటం అందరిలోనూ ఉంది. అంతకు ముందు రోజే చారుమతికి పెళ్ళి అయింది. చారుమతి వాళ్ళ అమ్మమ్మ ఊరిలో పెళ్ళి చేయాలని పట్టుబట్టడంతో పెళ్ళి హైదరాబాదులో జరిగింది.

పెళ్ళి కాగానే అందరూ విశాఖపట్నం బయలుదేరారు. అందరూ డిగ్రీ చేశారు. పెళ్ళిళ్ళు చేసుకున్నారు.

రన్నింగ్ రేస్‌కి బయలుదేరుతున్నట్టు ట్రెయిన్ కదిలింది ట్రయిన్‌లో ఉన్న వారి సుఖదుఃఖాలతో ప్రమేయం లేకుండా అది సాగిపోతుంది. అందులో ఎవరు ఎలాంటివారైనా అందరినీ ఒకేవిధంగా వారి వారి గమ్యాలకు, తారతమ్యాలు చూపకుండా చేర్చాలని దాని తాపత్రయం. పెళ్ళికొడుకు రాజేష్ ఏమనుకున్నాడో వారి దగ్గరినుండి వెళ్ళిపోయి మరోచోట పెళ్ళిబంధువుల దగ్గర కూర్చున్నాడు.

"ఏమిటే చారుమతీ, మీ ఆయన అలిగాడా ఏమిటి? దూరంగా కూర్చున్నాడు." చారుమతి సిగ్గుపడింది అందంగా. విరిసీ విరియని పువ్వు ఆకుల మధ్య దాగినట్టు మొహం క్రిందకు వంచుకుంది భర్తను గుర్తు చేయగానే. వారి అయిదుగురి పుట్టిళ్ళు విశాఖపట్నమే. అత్తారిళ్ళు మాత్రం వేర్వేరు ఊర్లు.

"ఆఁ అలిగాడు. అలకపాన్పు మీద ట్రెయిన్ కొనిమ్మని అడిగాడట. మామగారు ట్రెయిన్ కొనివ్వలేదని ఇంకెప్పుడూ ట్రెయిన్‌లో మీ అమ్మాయి. పక్కన కూర్చోను అని అలిగాడట." స్మిత మాటలకు అందరూ నవ్వారు, పువ్వులు విరిసినట్టు.

"ఇదేం కోరిక, చిన్నపిల్లాడిలాగ? పోనీ ఆడుకుంటానంటే లియో టాయిస్ ఉన్నాయిగా!" రమ్య అంది.

"అబ్బే! వాళ్ళింట్లో జనాభా చాలామంది ఉన్నారట. ఎంబాసిడర్‌లో అయితే సరిపోరట పాపం!" రమ్య అంది.

"ఎంబాసిడర్ సరిపోకపోతే ఏ లారీయో అడగాలిగాని ట్రెయిన్ ఏమిటి?"

"లారీలో కూడా సరిపోరట పాపం, వారి చుట్టాలు!" స్మిత అంది. వారు మాట్లాడుకుంటుంటే, నవ్వుకుంటుంటే చుట్టుపక్కలవారు వింతగా చూసినా ఆ అమ్మాయిలు ఎవరినీ కేర్ చెయ్యడం లేదు. మేము టికెట్ కొనుక్కున్నాము కాబట్టి మాకు మాట్లాడుకోవడానికి, నవ్వుకోడానికి సర్వహక్కులూ ఉన్నాయి అన్నట్టు ప్రవర్తిస్తున్నారు.

"ఏయ్ స్మితా! అలకపాన్పు మీద మీవారు ఏమి కోరారు?" రమ్య అడిగింది.

"నా ప్రాణాలు." స్మిత నవ్వుతూ అంది.

"ఏం, మీ ఆయన యమధర్మరాజా? ప్రాణాలు ఎందుకు? జోక్ చెయ్యక సరిగా చెప్పు."

"పోనీ నిజం చెప్పనా? నా నవ్వులు!"

"నవ్వులా—ఏం చేసుకుంటాడట? పువ్వులుగా గుచ్చి నీ మెడలో వెయ్యడానికా?"

"కాదు. తీసుకెళ్ళి సముద్రంలో పారేయడానికి." స్మిత అంది.

"మీకు సముద్రం దగ్గరలేదుగా! పాపం, ప్రయాణం ఖర్చులు దండుగ." అపర్ణ.

"మీ వారికి హాస్యం, లాస్యం ఇష్టమేనా?" నిరీక్షణ అడిగింది.

"హాస్యం, లాస్యం నాకెంత ప్రాణమో, ఆయనకు అవి చంద్రుడు, సూర్యుడు లాంటివి. అవి అందవు ఆయనకు. నోరుంది నమలడానికిగాని, నవ్వడానికి కాదు అంటారు."

"మీ ఆయన పేరు అశోక్ కదా! అందులో 'అ' తీసేసి శోకబ్రహ్మ అని బిరుదు ఇచ్చేయి. పద్మశ్రీ కూడా ఇవ్వచ్చేమో శోకబ్రహ్మలకు." రమ్య.

"పద్మశ్రీ ఎందుకు? జయశ్రీ ఉందిగా!" నవ్వింది స్మిత.

"నీవు పెళ్ళయినా కథలు అల్లడం, చెప్పడం మానలేదన్నమాట?" నిరీక్షణ.

"అమ్మో! మానేస్తే ఎలాగ? అవి నా ప్రాణం."

"మీ అత్తగారు నీ పెళ్ళికి కట్నం తీసుకోలేదుగా! బాగా చూస్తారా?"

"అవును. ఆవిడ చాలా మంచివారు. కట్నం వద్దన్నారు. ఆస్తిహక్కు కావాలన్నారు."

"ఆస్తి అడిగారా?" ఆశ్చర్యంగా అడిగింది. అపర్ణ.

"ఏం, అంత ఆశ్చర్యపోతావు? ఆవిడ ఏమీ వేరే గ్రహంమీద నుండిగాని, వేరే దేశం నుండిగాని రాలేదు. ఆవిడ పదహారణాల భారతీయ అత్తగారు. సారీ, పదహారణాల కాదు. అణాలు ఇప్పుడు లేవుగా? పదహారు పైసలు!" స్మిత చెప్పే తీరుకి నవ్వకుండా ఉండలేకపోయారు అందరూ.

"ఛ! అత్తగార్లను గుర్తు చెయ్యకే, నాకు కిరోసిన్ జ్ఞాపకం వస్తుంది." రమ్య అంది.

"మా అత్తగారు అంత పాతకాలం ఆవిడకాదు, కిరోసిన్ వాడడానికి?"

"మరేం వాడతారు?"

"ఏ గేస్‌స్టౌ అయినా, స్లీపింగ్ పిల్స్ అయినా వాడతారు."

"ఛ! మరీ అన్యాయంగా మాట్లాడుతున్నావు!" నిరీక్షణ అంది.

"న్యాయంగా మాట్లాడాలి అంటే అబద్ధం ఆడాలి. నాకు ఆడపిల్లని కనడం ఇష్టం లేదు."

"ఆడపిల్ల అంటున్నావు. ఏమైన విశేషం ఉందా? కంగ్రాచ్యులేషన్స్!" అపర్ణ.

"విశేషం లేదుగాని, విషం ఉండే ఉంటుంది. మా ఇంట్లో." స్మిత.

"ఎవరికీ విశేషాలు లేకపోతే అందరం ప్రస్తుతం ఫ్యామిలీ ప్లానింగ్‌ని పాలో అవుతున్నామన్న మాట. బాబోయ్! మన భారత దేశం బాగుపడిపోతుంది. నేనేం చెయ్యాల్రోయ్! నేను భరించలేనురోయ్!" నాటకీయంగా అంది రమ్య.

"ఫామిలీ ప్లానింగ్‌వాళ్ళమో, భర్తలను ఫాలోయింగ్‌వాళ్ళమోగాని మన పెళ్ళిళ్ళు అయిపోయాయి. ఈసారి మనం కలిసేది బారసాలలకే." నిరీక్షణ అంది.

ఇంతలో చారుమతి మొహం వికారంగా పెట్టింది.

"ఏం అలా ఉన్నావు?" అపర్ణ అడిగింది.

"వాంతొచ్చేలా ఉంది. నాకు ఈ ట్రెయిన్‌లు, బస్సులు పడవు."

"అప్పుడే వాంతొస్తుందా? నిన్నేగా పెళ్ళయింది. మరీ ఇంత ప్రోగ్రెస్సా!" స్మిత అంది.

"ఛీ పోవే! నాకు కడుపులో తిప్పుతుంటే నీ గోల నీది." చారుమతి అంది.

రమ్య హేండ్‌బేగ్‌లోంచి ఏలక్కాయ తీసిచ్చింది, నోట్లో వేసుకోమని.

రమ్య అంది – "తరువాత తరువాత ఇలా అందరం ఒంటరిగా కలుసుకోవడానికి కుదరదు. మొగుళ్ళను అయితే బుట్టలో పెట్టి, అందరం ఒక్కొక్కళ్ళమే వచ్చాము. పిల్లలు పుడితే వారిని చంకలో వేసుకుని రాకతప్పదు."

"పెళ్ళయితే స్వేచ్ఛ పోయిందని అనుకున్నాంగాని, మన భర్తలు మంచివారే!" అపర్ణ.

"ఒక జోక్ చెప్పనా?" అని స్మిత అంది.

"చెప్పు." అందరూ ఒకేసారి అన్నారు.

"మా పక్కింటివాళ్ళు తమిళియన్స్. ఆవిడకు తెలుగు సరిగా రాదు. మీ హజ్‌బెండ్ ఆఫీసునుండి వచ్చారా అనడానికి 'మన హజ్‌బెండ్ ఆఫీసునుండి వచ్చారా?' అంటుంది."

అందరూ తెరలు తెరలుగా ఫక్కున నవ్వారు. సముద్రపు అలలు సంతోషంతో ఎగసిపడుతున్నట్లుంది వారు నవ్వుతూంటే. ఇప్పుడు ట్రెయిన్‌లోని చుట్టూ ఉన్నవారు వారి అల్లరికి అలవాటు పడిపోయారు. వింతగా చూడడం లేదు. వీలుంటే ఒక చెవి వీరివైపు పడేస్తున్నారు.

అలా నవ్వుతూంటే చారుమతికి పొలమారింది. అది చూసి రాజేష్ హడావిడిగా వచ్చాడు. అతని కంగారు చూసి మరింత నవ్వారు.

"కొత్త పెళ్ళికొడుకు కదా, కంగారెక్కువ. కొత్త భార్యను, కొత్త కారును చాలా అపురూపంగా చూసుకోవాలి అని ఎక్కడో చదివినట్లున్నాడు." స్మిత అంది.

చారుమతి చిరుకోపం ప్రదర్శించింది. "మీరు మరీ ఘోరంగా మాట్లాడుతున్నారు" అంది.

"అవి భర్త లక్షణాలు." అపర్ణ అంది.

"మగవాడు భర్త లక్షణాలు సంపాదించడానికి. చాలా వ్యవధి పడుతుందట. కాని స్త్రీ భార్య హోదా పొందడం మహా తేలికట." స్మిత అంది.

"నీ సొంత వాక్యమేనా?" నిరీక్షణ.

"సొంత వాక్యమైతే ఆ 'ట'లు ఎందుకు – ఉపయోగిస్తాను అని – "అసలు ఆడవారికి తృప్తి అనేది తక్కువ. ఆడవారు పెళ్ళి కాకముందు, పెళ్ళి అయ్యి భర్తవస్తే చాలనుకుంటారు. తీరా పెళ్ళయిన తరువాత భర్తను తప్పించి అన్నీ కోరుకుంటారు."

"అది నీ జీవితానుభవమా?" రమ్య అడిగింది.

"నాది కాదు. మీ అందరిదీ అయి ఉండవచ్చు అని అనుకుంటున్నాను."

"నీదీ కాదు, నాదీ కాదు, మన ఆడవారి జీవితానుభవం!" అపర్ణ.

"వార్ధక్యం, వివాహం అందరూ కోరతారట. తీరా వచ్చిన తరువాత విచారిస్తారట. మావారు అంటారు ఎప్పుడూ!" రమ్య అంది.

"అయితే మీ ఆయన పెళ్ళి చేసుకున్నందుకు విచారిస్తున్నారన్న మాట!" స్మిత అంది.

"మరి ఆయన స్వాతంత్ర్యాన్ని రమ్య ఎప్పుడో హస్తగతం చేసేసుకుందిగా!" అపర్ణ అంది.

"నేను మాత్రం వార్ధక్యాన్ని కోరుకోను." స్మిత అంది స్థిరంగా.

"ఏం, ఇలాగే ఉండిపోతావా?" రమ్య ప్రశ్నించింది.

"తప్పకుండా, మీరందరూ ముసలివాళ్ళయినా నేను మాత్రం కాను. చూస్తూ ఉండండి."

"ఏం? మీ వారు ఏమైనా అమృతం పోశారా?"

"ఆఁ – పోశారు. అమృతంలాంటి విషం. ఎంత బాగుందో, కాడ్‌బరీలాగ." నోరు చప్పరించింది.

"మీ వారు నిన్ను ఎలా చూస్తారు?" అపర్ణ అడిగింది.

"ఎలా చూస్తారు? అందరిలాగే కళ్ళతో చూస్తారు. కాళ్ళతో తన్నుతారు. బెల్టుతో కొడతారు. గరిటతో కాలుస్తారు." పకపకా నవ్వింది.

"అందరిలాగే అంటున్నావు. మావారు అలా చెయ్యరు." నిరీక్షణ అంది.

"అయితే మీ వారు మగవారే అన్నమాట, మనిషే అన్నమాట!"

"మీ ఆయన నలుగురిలోను కలుస్తారా?" రమ్య అడిగింది.

"ఊహూఁ! ఆయనకు ఒంటరితనం అంటే ఇష్టం. ఆఖరికి పడగ్గదిలో కూడా!"

"ఒంటరితనమా?" ఆమె హేళనగా, సరదాగా చెబుతున్న జవాబులు ఇంటరెస్టుగా వింటూ ప్రశ్నించారు అందరూ ఒకేసారి.

"అవును. పెళ్ళవగానే పాత పద్ధతులు మార్చుకొని పెళ్ళాం కొంగుకి ముడిపడకూడదనేది ఆయన వాదన." అందరూ నవ్వారు, స్మిత అన్నమాట తీరుకి. స్మిత మాత్రం కిటికీలోనుండి చూస్తూ ఉండిపోయింది సాగే చెట్లవైపు. నిజానికి సాగేవి చెట్లుకాదు. ట్రయిన్ మాత్రమే. కాని ట్రయిన్ పరుగుపెడుతూ చెట్లు పరుగుపెడుతున్న భ్రమ కలిగిస్తుంది. జీవితం కూడా ఒక భ్రమేనేమో!

"మరి మీ అత్తగారు ఏమంటారు?"

"ఏమంటారు? 'ఏమే దౌర్భాగ్యపుదానా! మీ అన్నయ్యను అడిగి ఇంకా ఆస్తి పట్టుకురా' అని పట్టుకుని మరీ పట్టుబడతారు. ఆవిడ మా ఆయనలా కాదు. చేత్తో కొడతారు. ఎందుకంటే ఆవిడ పాంటు వేసుకోరుగా? నడుముకి బెల్టులేదుగా?"

"చాల్లే, స్మితా! మీ అత్తగారిని రాక్షసిలా చిత్రిస్తున్నావు."

"మీ అన్నయ్య నీకు ఏమీ ఆస్తి ఇవ్వలేదా?"

"ఒక ఇల్లు ఇచ్చాడు. తనొక ఇల్లు పెట్టుకున్నాడు. ఇస్తూ ఇస్తూ మరలా పుట్టింటి గుమ్మం తొక్కద్దు అని లక్ష్మణరేఖ గీశాడు. తాను రామాయణ కాలంనాడు పుట్టాననుకుంటాడు. అందుకే నేను ఇంక పుట్టింటికి వెళ్ళకూడదు."

"మీ వదిన ఏమనలేదా?"

"ఎదుటివారిని ఏడిపించడంలో మాత్రం అన్నయ్యను ఎప్పుడూ అనుసరిస్తుంది."

ఇంతలో ట్రెయిన్ ఆగింది. రాజేష్ వచ్చి అందరికీ టిఫిన్ తెచ్చి ఇచ్చాడు. అందరూ వద్దు వద్దు అంటూనే అందుకున్నారు. అందరూ తిన్నారు.

"అసలేమీ బాగాలేవు. కాఫీకూడా ఛండాలంగా ఉంది. ఎలా చేస్తారో ఏమో?" రమ్య అంది.

"మంచినీళ్ళు మాత్రం బావున్నాయి, ఎవరు వండారోగాని!" స్మిత మాటలకు మరొక్కసారి అందరూ ఫక్కున నవ్వారు. మంచినీళ్ళు ఆ కుదుపుకి అపర్ణ చీరమీద పడ్డాయి.

"అబ్బ! నీమాటలకు నాచీరపాడైంది."

"పాడైనా ఫరవాలేదులే. ఇప్పుడు నీకేం పెళ్ళిచూపులు కాదు ఇక్కడ."

"అయితే పెళ్ళిచూపులకు మాత్రమే మంచిగా ఉండాలా?"

"ఆడది ఎక్కడ ఎలా ఉన్నా పెళ్ళిచూపుల్లో మాత్రం లక్షణంగా కనబడాలి. లక్షల కట్నం ఇవ్వాలి."

"ఆస్తి హక్కు వచ్చిందిగా! లక్షలు కట్నం రోజులు పోతాయి."

"నిజమే! ఉరి పోసుకోవడానికి చేంతాడు బదులు ప్లాస్టిక్ తాడు." స్మిత అంది.

తరాలు మారుతున్నాయి. తరాలతోపాటు స్త్రీసమస్యలూ మారుతున్నాయి గాని సమస్యలు మాత్రం పోవడం లేదు. అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ మగవాడు హాయిగానే ఉన్నాడు.

"మీ అన్నయ్య ఇచ్చిన ఇంట్లోకి మారిపోయారా?" అపర్ణ అడిగింది.

"అది అమ్మేశాము." స్మిత అంది.

"అమ్మేశారా?" ఆశ్చర్యంగా అడిగారు అందరూ.

"అమ్మేశారా కాదు, కొనేశారా కాదు. ఏ సారా అయినా మా అయనకు మంచినీళ్ళ ప్రాయం. మరోచోట ఇల్లుకొని జయశ్రీని అందులో పెట్టారు. అలా చేసినందుకు ఎవరైనా పద్మశ్రీ ఇస్తారా అని గుమ్మంలోనే కూర్చుని ఎదురుచూస్తున్నాను."

"నీ ఆస్తి మరొకరికా? జోక్ చెయ్యకు."

"మన ఆడవారి జీవితమే మరొకరిది. ఇంక ఆస్తి ఎందుకు మనకు? అసలు బ్రహ్మదేవుడు ఆడవారిని మీబాల్లాగా సృష్టించి, అసలు కళ్ళు, ముక్కు, చెవులు, నోరు, మాటలు ఎందుకిచ్చాడో? మెదడు లేకుండా చేసేస్తే ఆలోచనలూ ఆవేదనలూ ఉండవుకదా! ఆడది ఒక ద్రవపదార్థం మగవాడి దృష్టిలో. ఎందులో వేస్తే ఆ రూపాన్నే సంతరించుకోవాలి గాని, సొంత రూపాలు, సొంత ఆలోచనలు ఉండకూడదు. ఆడది ఆడేదిగా ఉండాలంటాడు మగవాడు. తాను బాట్ అట, ఆడది బాల్ ఆట. బాట్ ఎప్పుడూ బాల్‌ని తన్నుతూనే ఉంటుంది."

"గొప్పగా ఇచ్చావే స్పీచ్! అబ్బా, స్టేజ్ లేదుగాని అదిరిపోయిందనుకో!" రమ్య అంది.

"ఇంకా ఇస్తానే! అసలు జీవితం అంటే యౌవనం, వార్ధక్యం. పెళ్ళి, పిల్లలు, సుఖం, దుఃఖం అంటారుగాని అందులో చావుని కూడా చేర్చాలి. చనిపోయినవాడే ఏ ఆలోచనలూ లేక స్థిరంగా ఉండగలడు. బ్రతికున్నంతకాలం బాధలు తప్పవు."

"పెళ్ళయిన తరువాత వేదాంతం నేర్చుకున్నావా?"

"అవును. మరి మనకు కాలేజీలో నేర్పలేదుగా! నా జీవితమే నేర్పింది." పకపకా నవ్వింది స్మిత – ముత్యాలు గిన్నెలో వేసి గలగలలాడించినట్టు. అసలు ఆడదాని అందంలోనే అన్ని రకాల ఆభరణాలు ఉన్నాయి. ఇంకా ఆడదానికి ఆభరణాలెందుకో?

ఆడదాని మంచి మనసు బంగారం, నవ్వులు ముత్యాలు, చూపులు పగడాలు, ప్రేమ వజ్రం అంతటి విలువైనవి.

"స్మిత చాలా చిక్కింది కదూ!" రమ్య అంది.

"అవును, మా అత్తింటివారి చేతిలో చిక్కాను." నవ్వింది స్మిత.

"డైటింగా?" సన్నగా ఉన్నా, వారందరిలోనూ స్మిత అందం కొట్టొచ్చినట్టు కనబడుతోంది అందరికీ. చక్కనమ్మ చిక్కినా అందమేనట.

"కాదు. మా ఆడబడుచు మెడిసిన్ చేస్తోంది. ఎనాటమీకి శవాలు కావాలట. అమ్మా! మనింట్లోనుంచి వదిన్ని ఇచ్చేద్దామే అంది."

"ఆమెను మెడిసిన్ చదివిస్తున్నది మనుషులను చంపడానికా?"

"మా అత్తగారు మెడిసిన్ చదవకుండానే చంపగలరు."

"నీ ఆస్తి అమ్మడానికి ఎందుకు ఒప్పుకున్నావు?" నిరీక్షణ అడిగింది.

"నన్ను నొప్పించకుండానే నాతో సంతకం చేయించారు. మావారు జాగ్రత్తగా నా చేయి పట్టుకుని నా చేతికి నొప్పితగలకుండా సంతకం దగ్గర ఉండి చేయించారు. ఎంత మంచివారో చూడు." మరోసారి నవ్వింది స్మిత.

స్మిత ఎప్పుడూ అందర్నీ నవ్విస్తూ, తను నవ్వుతూ ఉంటుంది. అందరినీ ఒకే ఒక్కసారి ఏడ్పించింది. హైస్కూలులో పుత్తడిబొమ్మ పూర్ణమ్మ నాటకం వేసినప్పుడు, "నలుగురు కలిసి నవ్వే వేళ నాపేరొకపరి తలవండి" అంటూ పూర్ణమ్మ పాత్రలో లీనమై ఎంతో బాగా ఏక్ట్ చేసి అందరినీ ఏడ్పించింది.

"మరి మీ అత్తగారు ఇల్లు అమ్మవద్దు, సంతకం పెట్టవద్దు అనలేదా?"

"పాపం, ఆవిడా మంచావిడే! సంతకం పెట్టేటప్పుడు నేనెక్కడ గింజుకుంటానో అని నోట్లో గుడ్డలు కుక్కి, కాళ్ళు కట్టేశారు అంతే! ఇంకా నయం, మంచావిడ కాబట్టి వదిలేశారు. మరొకరైతే నోటితోపాటు ముక్కులో దూదికూడా పెట్టి మూసేసేవారే!"

"నీకు చిన్నప్పటినుండి కథలు అల్లి చెప్పడం అలవాటేగా! ఈ కథ ఏ పత్రికలోది?" రమ్య అడిగింది.

"నిజమే! ఆ అలవాటు మానుకోలేకపోతున్నాను."

"మా దగ్గర చెబితే చెప్పావు. మీ ఆయన దగ్గర చెప్పకేం?" అపర్ణ అంది.

"చెప్పను. అసలు ఆయనతో మాట్లాడాలంటే ముందే జయశ్రీ దగ్గర అపాయింట్‌మెంట్ తీసుకోవాలి. ఇంక కథలు చెప్పడానికి అవకాశం ఏది?"

"ఏం, మీ ఆయన అంత బిజీనా?"

"ఊహుఁ– బిజీకాదు, మాజీ ప్రియురాలి దగ్గర ఉంటారు కదా!"

"మీ మరిది ఏం చేస్తున్నాడు? ఉద్యోగం దొరికిందా?" నిరీక్షణ అడిగింది.

"ప్రస్తుతం ఉద్యోగం లేక నావెంట పడుతున్నాడు."

"అంటే?"

"మా అన్నయ్య చేయలేని పని నేను చేస్తాను, ఎంతకాలం ఒంటరిగా ఉంటావు అంటాడు."

"ఛీ! నీకు మరీ సిగ్గులేదే!" సరదాగా అంది అపర్ణ.

"మా మామగారు కూడా అలాగే అంటారు. నేను సిగ్గులేనిదాన్నని. నీతిలేని దాన్నని. నన్ను వెంటాడేది మా మరిది. వేటాడేది మామగారు. ఏమైనా అంటే పుట్టింటికి పో! మా అబ్బాయికి వేరే పెళ్ళి చేస్తాం అన్న మాటలు తప్పనిసరిగా ప్రొద్దున్నే సుప్రభాతంతో వినిపిస్తాయి." విషాదంగా నవ్వింది.

"నేనైతే అలాంటి ఇంట్లో ఉండను సుమా!" రమ్య అంది.

"నేనూ ఉండను, నీవే కాదు." స్మిత అంది.

"మీ అన్నయ్య దగ్గరకు వెళ్ళిపోతావా?"

"లక్ష్మణరేఖ గీశాడు. దాటి లోపలకి ఎలా వెళ్ళను?" స్మిత.

"దాటెయ్యి. చిన్నప్పుడు హైజంప్, లాంగ్‌జంప్‌లు చేసేదానివిగా!" నిరీక్షణ అంది.

"ఆ జంప్‌లన్నీ ఇప్పుడు పనికి రావడం లేదు."

"ఏం? పని మానేశామా? బట్టలు కూడా ఉతకడం లేదా?" చారుమతి అంది.

"ఓహో! పెళ్ళి కూతురు కూడా మాట్లాడుతూందే! వికారం తగ్గిందా?" వెక్కిరించింది స్మిత.

ఇంతలో 'చల్లని రాజా, ఓ చందమామా' అని పాడుకుంటూ అడుక్కునేవాడు వచ్చాడు. "ఈ అడుక్కున్నేవాళ్ళంటే నాకు చిరాకు బాబు! వీళ్ళని..." అంటూ ఆగిపోయింది రమ్య.

"భిక్షంవేసి పంపించెయ్యాలి" అని మాట పూర్తిచేస్తూ పర్స్ తీసి పది రూపాయలు వేసేసింది స్మిత.

"ఏయ్, ఏమిటా పని? అదెంతో తెలుసా?"

"తెలుసు, పది రూపాయలు. అల్లుడి హోదాలో అడుక్కుని భార్యను బాధించే వాళ్ళకంటే, వాళ్ళేం తక్కువవాళ్ళు కాదు. రెండుపూటలా కడుపునిండా తిననియ్!"

భిక్షగాడు మాత్రం ముందు బిత్తరపోయినా తరువాత ఆ నోటు కళ్ళ కద్దుకొని గబగబ అక్కడినుండి వెళ్ళిపోయాడు – స్మిత ఆ నోటు లాక్కుంటుంది అని కాదు ఆమె ఫ్రెండ్స్ లాక్కుంటారనే భయంతో.

"మరలా స్టేషన్ వస్తే బాగుండును!" స్మిత అంది.

"ఎందుకూ?" ప్రశ్నించింది చారుమతి.

"మీ ఆయనకు కూల్‌డ్రింక్స్ బిల్ అప్పజెప్పడానికి!" స్మిత మాటలకు చారుమతి నవ్వింది.

ఉన్నట్టుండి "మనుషులు ఒంటరిగా వెళ్ళేది ఎక్కడికి?" అడిగింది స్మిత.

"పైకి." వేలు పైకిపెట్టి చూపించింది రమ్య.

"కాదు. ఇంకో చోటు కూడా ఉంది" అంటూ చటుక్కున లేచి నిలబడింది స్మిత.

"ఏమ్! ఎక్కడికి?" కంగారుగా అడిగింది నిరీక్షణ.

"ఇదిగో, ఇక్కడికి" అంటూ నాలుగు వేళ్ళు మూసి చిటికెన వ్రేలు చూపించింది.

"ఏయ్, నీకు కొంటెతనం ఇంకా పోలేదు."

"వెడతా, ఒంటరిగా వెళ్ళే చోటుకి" అంటూ టాయిలెట్ వైపు వెళ్ళింది స్మిత.

స్మిత కొంటెతనం చూసి అందరూ నవ్వుకున్నారు.

"వాళ్ళ అత్తగారు, భర్త మంచివారేనట. స్మిత ఎందుకు అలా మాట్లాడుతుంది?"

"అఁ! దాని సంగతి కొత్తగా అడుగుతావెందుకు? ఏదైనా పుస్తకంలో చదివిన కథలు మనకు చెప్పడం మొదటినుంచీ అలవాటేగా!" అపర్ణ అంది.

"నిజమేనంటావా?"

"నిజం కాకపోతే అది చెప్పిన కథలన్నీ నమ్మేసి కడివెడు నీళ్ళు కార్చు."

ఇంతలో స్మిత వచ్చింది. ట్రయిన్ ఎందుకో ఆగిపోయింది.

"మనం బయలుదేరిన తరువాత ఈ ట్రయిన్ ఇలా ఆగిపోవడం అప్పుడే నాలుగవసారి. ఇలాగే ఈ బండి నడిచిందంటే చారుమతికి డెలివరీ కూడా ఇందులోనే అయిపోతుంది. – మనం విశాఖ వెళ్ళేలోపుగా."

అందరూ నవ్వారు. చారుమతి సిగ్గుపడింది. బండి ఆగడం తరువాయి కాఫీలు, కూల్ డ్రింక్స్ వచ్చేశాయి. అందరు అన్ని కూల్ డ్రింక్స్ తాగారు. "ఇంకా కావాలాండి?" అడిగాడు డ్రింక్స్ అబ్బాయి.

"ఇంకేమొద్దని చెప్పవే, బిల్లుకూడా!" స్మిత మెల్లగా అంది అపర్ణతో.

"మొత్తం అయిదు" అని లెక్కలు కడుతున్నాడు డ్రింక్స్ అబ్బాయి.

"అదిగో, అక్కడ కనబడుతున్నారు చూడు, ఆయనకు ఇవ్వు." స్మిత అంది రాజేష్‌ని చూపిస్తూ.

"గోల్డ్‌స్పాటా, మాజానా!" అన్నాడా అబ్బాయి.

"రెండూ కాదు, బిల్లు!" ఆ మాటలకు ఆ అబ్బాయి బిత్తరపోయినా, మిగిలినవారు గొల్లున నవ్వారు.

"నీవు ఊరుకోవే, స్మితా!" అంటూ చారుమతి పర్స్ తీయబోయింది.

"అబ్బో! అప్పుడే ఆయనగారు అంటే ఎంత ప్రేమే! ఏమీ అననివ్వడం లేదు."

వారు తాగిన కూల్ డ్రింక్స్‌లో ఏరకం అయిన హుషారు ఉందోగాని ఈసారి వారు మరింత విజృంభించారు అల్లరితో.

చారుమతి ఇంకా మెల్లగా తాగుతూనే ఉంది.

"అబ్బ, ఎంత సేపే బాబూ! త్వరగా తాగు. వేడిగా ఉందా! నీవు కొత్త పెళ్ళికూతురివని దానికి తెలియదులే. మెల్లగా తాగనక్కరలేదు." స్మిత అంది.

"అబ్బ, ఇదికూడా నన్ను సరిగా తాగనియ్యవే నీవు." విసుక్కుంది సరదాగా చారుమతి.

"నీ కిష్టమైతే సీసా కూడా మింగెయ్యవే." రమ్య అంది.

"సీసాను కాదు, నోట్లో పట్టనుగాని పడితే నన్నే మింగేయాలని ఉంది దానికి, వాళ్ళాయనకు బిల్లు అప్పజెప్పానని."

అందరితోపాటు చారుమతీ నవ్వింది.

వాళ్ళ మాటలు ట్రయిన్‌లోనివారికి డిస్ట్రిబెన్స్ అయినాసరే మా దారి మాదే సుమా అన్నట్లు వాళ్ళు మాట్లాడుకుంటూనే ఉన్నారు. ఒకరిమీద ఒకరు జోక్స్ వేసుకొని నవ్వుకుంటునే ఉన్నారు.

ట్రయిన్ ఎందుకో ఆగిపోయిది. అప్పుడే చీకట్లు కమ్ముకొంటున్నాయి.

"అబ్బ! ఈ ట్రయిన్ ఇలా ఆగిపోవడం అప్పుడే అయిదోసారి." రమ్య అంది.

"ఈ ట్రయిన్ ఇలాగే ఆగుతూ వెళ్ళిందంటే చారుమతి కొడుక్కి అన్నప్రాశన రైల్వే భోజనంతో రైల్లోనే చేయాల్సి ఉంటుంది." చారుమతిని చూస్తూ వెక్కిరిస్తూ అంది స్మిత.

మరోసారి అందరూ నవ్వారు ఆనందంగా. పచ్చని కలశంలో మేలిమి ముత్యాలు వేసినట్లు వారి తీరు చూస్తుంటే గాలినే ఆనందంగా మలుచుకొని పీలుస్తూన్నట్లుంది. వారు.

"నాకు కథలు వ్రాయాలని ఉంది. మంచి కథ చెప్పవే!" రమ్య అడిగింది స్మితను.

"ఇప్పుడు చెప్పిన కథ వ్రాసెయ్యి!" స్మిత అంది.

"అందులో బలం లేదు."

"అయితే అపర్ణ వాళ్ళ ఆయన్ని అడుగు. డాక్టరు కదా, ఒక టానిక్ ఇస్తారు!"

"సరేలే! ఎనాల్జిన్ ఎందుకు పనికొస్తుంది అని ఎన్నిసార్లు అడిగినా మాట్లాడరు. ఇంటినిండా మందులుంటాయిగాని ఏది ఎందుకు పనికి వస్తుందో తెలియదు. ఒకసారి కడుపులో కుడిపక్క నొప్పివచ్చి అపెండిసైటిస్ అని భయపడి – అపెండిసెటిస్ నొప్పి ఎక్కడ వస్తుంది? ఎలా వస్తుంది? ఆపరేషన్ ఎక్కడ చేస్తారు? అని అడిగాను."

"ఏమన్నారు మీ ఆయన?" నిరీక్షణ ప్రశ్నించింది.

సమాధానం స్మిత చెప్పింది: "ఏమీ చెప్పి ఉండరు. అవన్నీ చెప్పేస్తే 'మీరు అయిదు సంవత్సరాలు చదివి డాక్టరయ్యారు. కాని మిమ్మల్ని పెళ్ళాడి డాక్టరయ్యాను. అపెండిసెటిస్ ఆపరేషన్ చేయడం నాకూ వచ్చేసింది. చేసేస్తాను!' అని అంటుందని పాపం ఆయన భయపడి ఉంటారు." అందరూ నవ్వారు మరోసారి.

"అబ్బ, పొట్ట చెక్కలవుతోందే!" రమ్య అంది.

"ఫరవాలేదు. మీరు... ఇల్లు కట్టించుకున్నారుగా! తలుపులు చేయించుకోండి!" అంటూ స్మిత తిరిగి అంది – "నేనూ ఒక కథ వ్రాశాను."

"ఏయ్ నిజంగా! మరి మెల్లగా చెపుతావేం. పడిందా ఎందులోనైనా?" రమ్య అంది.

"ఆ పడ్డాయి వీక్లీలో కథ, నా వీపుమీద వాత!"

"వాతా? ఎందుకు?"

"కథలో హీరోయిన్‌కి అనుకోకుండా పెళ్ళికి ముందు ఒక కూతురు పుడుతుంది. ఆ కథను నాకు అన్వయించి, నీకూ పెళ్ళికి ముందు ఒక కూతురుందా అని మా మామగారు నన్ను అనరాని మాటలన్నారు."

"ఉంది. నాతోనే బియ్యే చదివేది అని చెప్పలేకపోయావా!"

"అసలు కథలు ఎవరికి వారివే రాసుకుంటే ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క కథే వస్తుంది. ఇన్ని కథలు ఎక్కడినుండి వస్తాయి రచయిత(త్రి) సంఘంలోని సమస్యలను తీసుకొని, వాటిని వ్రాసి పరిష్కారం కూడా చూపించాలి. అందుకే 'రవి కాంచని చోటు కవి కాంచున్' అన్నారు. అంతేగాని ఎవరో ఏదో అన్నారని భయపడుతూ కూర్చుంటే అసలు ఎవరూ ఏమీ వ్రాయలేరు. అయినా రామాయణం వ్రాసిన వాల్మీకిని 'నీవు రామాయణంలో రాముడివా? రావణుడివా?' అని అడిగితే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో అలాగే ఉంది నీ గొడవ." నిరీక్షణ అంది.

"ఏమో! బహుశా తప్పు నాదేనేమో! నేనే తప్పుగా వ్రాశానేమో!" అవతలి వారిని ఏమీ అనలేక తప్పు తనమీదే వేసుకుంది.

"అవును. తప్పు నీదే! నిన్ను ఏం చేసినా పాపం లేదు. నిన్ను నరికినా తప్పులేదు. లేకపోతే నాకు చెప్పకుండా కథలు వ్రాస్తావా? బంగారుతల్లీ, కథలు ఎలా వ్రాయాలో నేర్పించవూ?" రమ్య అడిగింది లాలనగా స్మితను.

స్మిత నవ్వేసి "కథలు వ్రాయడం ఒకరు నేర్పిస్తే వచ్చేది కాదే! ఏ కళనైనా – చిత్రకళ, శిల్పకళ, సంగీతం ఏదైనా ఒకరి దగ్గర నుండి ఒకరు నేర్చుకోవచ్చు కాని, రచనలు చేయడం అలాకాదే. అదొక వరం. కాగితం, కలం, చేయి ఉంటే సరిపోవు. ఆలోచించే మెదడు, అవి కాగితం మీద పెట్టగలిగే శక్తి ఉండాలి. అయినా నీవూ వ్రాయగలవులే! ఉత్తరం వ్రాయడం వచ్చినవారికి కథలు వ్రాయడం వస్తుందట!" అంది.

"అయితే నాకు మెదడు లేదంటావా?" రమ్య అంది.

"ఏమో? నాకేం తెలుసు. బ్రెయిన్ స్కానింగ్ చేయించుకొని న్యూరోసర్జన్ని అడుగు." స్మిత అంది నవ్వుతూ.

అపర్ణ కునికిపాట్లు పడసాగింది.

"దుర్మార్గురాలా! మేమందరం మాట్లాడుకుంటుంటే నీకు మత్తెలా వస్తోందే?"

ఉలిక్కిపడి లేచి నవ్వేసింది అపర్ణ. బాత్‌రూమ్‌కి వెళ్ళి నీళ్ళతో మొహం కడుక్కొని వచ్చింది. అపర్ణ వచ్చిన తరువాత టాయిలెట్‌కి చారుమతి వెళ్ళింది. నిజానికి టాయిలెట్‌కి కాదు, వాళ్ళాయన ఏం చేస్తున్నాడో చూడడానికి. అప్పటికే అందరితోపాటు రాజేష్ కూడా నిద్రపోయాడు. వీళ్ళుమాత్రం పడుకోకుండా కూర్చుని అలాగే కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఏయ్, చారూ! ట్రయిన్‌లో మనుషుల్నే గాని, పిల్లల్ని ఎక్కనివ్వరు." స్మిత అంది.

"ఇప్పుడు నీకు పిల్లలు ఎందుకు గుర్తుకు వచ్చాయి?"

"అబ్బే! మీ ఆయన్ని పిల్లెత్తుకుపోయిందేమోనని చూసివచ్చావుగా!"

అందంగా సిగ్గుపడింది చారుమతి. "మీ ఆయన పేరు నచ్చలేదోయ్! రాజేష్ ఏమిటి బాటా మాలాగా!" మరలా ఏడిపించింది. స్మిత, చారుమతిని.

"మరి మమ్మల్ని ఇన్ని ఆటలు పట్టిస్తున్నావు! మరి మీ ఆయన్ని ఎన్ని ముప్పతిప్పలు పెడుతున్నావే?" రమ్య అంది.

"ముప్పతిప్పలు పెట్టడం లేదు, పడుతున్నాను." స్మిత అంది నవ్వుతూ.

"అసలు ఆడది మగవాడికి ఎందుకు లొంగి ఉండాలి?" నిరీక్షణ అంది.

"ఆడది కాబట్టి!" స్మిత అంది.

"అసలు అందరూ మగవాళ్ళని ఆడిపోసుకుంటారుగాని, భార్యల వల్ల నరకం చూసే భర్తలు లేరా? వారిమీద ఏదైనా వ్యాసం వ్రాయాలనుకుంటున్నాను." రమ్య అంది.

"వారిమీద వద్దులే! కాగితం మీద వ్రాయి. అయినా నీకిదేం బుద్ధి? అసలే ఆంధ్రుల బ్రతుకు అంతంత మాత్రంగా ఉంది. నీవు కలంతో వారిని మర్డర్ చేయకు."

"మీకు వంట మనిషి ఉందా?" అపర్ణ అడిగింది స్మితను.

"ఆల్–ఇన్–ఒన్‌ని నేనుండగా ఇంకెందుకు వంటమనిషి? వాళ్ళు పెట్టిన తిండి తినడం, ఇచ్చిన బట్ట కట్టడం, మెలకువగా ఉన్నంతసేపూ చాకిరీ చెయ్యడం. మా అన్నయ్య ఆస్తి పట్టుకుపోయానని నా విషయం కల్పించుకోడు. నన్ను పట్టు పరుపులమీద పడుకోబెడుతున్నారనుకుంటాడు. అది అంపశయ్య అని తెలియదు. అది సరేగాని, ఇంక వైజాగ్ వస్తే ఎవరిదారి వారిదే. మనం అందరం ఎప్పుడూ ఆడుకునే ఆట ఆడదాం" అంటూ గబగబా హేండ్‌బేగ్‌లో నుండి కాగితాలు, పెన్ను తీసి రహస్యంగా వ్రాయడం మొదలుపెట్టింది స్మిత.

"మరలా ఆటలు మొదలుపెట్టావా?" ఆవలిస్తూ అంది అపర్ణ.

"వెధవ మొద్దు నిద్రా, నీవూనూ! అప్పటికీ ఇప్పటికీ నీకు ఆ నిద్ర పోవడం లేదు. మీ ఆయన నీతో ఎలా వేగుతున్నాడో. అలాగే నిద్రపో! నీ కసలు పిల్లలే పుట్టరు." స్మిత విసుక్కుంది.

గబగబా చీటీలమీద వ్రాసినవి ఎవరివి వారికి ఇచ్చింది.

"ఎవరూ విప్పి అప్పుడే చూడవద్దు సుమా!" అని అంది. అది వారికి సుగ్రీవాజ్ఞ.

"నా దాంట్లో ఏం వ్రాశావో? బాబోయ్, రైల్లోనుండి దూకమంటే నేను దూకలేను. అసలే మావారికి నేనంటే పంచప్రాణాలు." నిరీక్షణ అంది.

"పోనీలే, నీ బదులు నేను చేస్తాను ఆ పని."

స్మిత అనగానే – "ఒకరి బదులు ఒకరు చేసేది లేదు. ఇంతవరకు అలాగే చెట్టుమీద నుండి దూకమని చీటిలో ఉంటే నిరీక్షణకు నీవు సాయం చేశావు. అసలే నిరీక్షణ అంటే ఎక్కువ ఇష్టం!" రమ్య అంది.

"సరే, ఈసారి ఎవరికీ సహాయం చేయను. చీటీలో పాడమని ఉంటే పాడాలి. సిగరెట్ తాగమని ఉంటే తాగాలి!"

"బాబోయ్, ట్రయిన్‌లోనా?" అపర్ణ భయంగా అంది. "ట్రయిన్ కాబట్టే సరదాగా ఆడదాం. మరలా ఇలాంటి అవకాశం మనకు రాదు. ఈ ఒక్కసారి మనం ట్రయిన్‌లో ఎవరు ఏమనుకున్నా లెక్క చెయ్యవద్దు. మనం ఆర్ట్స్ స్టూడెంట్స్ కదా, లెక్కలు ఎలాగూ రావనుకో మనకు!" అంటూ లేచింది.

"నేను బాత్‌రూమ్‌నుండి వచ్చేవరకూ అవి విప్పనివాళ్ళకి ఒక మంచి ప్రజంటేషన్ ఇస్తాను." స్మిత అంది.

"అందరం విప్పకపోతే అందరికీ ప్రజంటేషన్ పంచబడుతుంది." రమ్య అంది.

"బాత్‌రూమ్‌లో ఎంతసేపు ఉంటావు?"

"నాకు వంద సంవత్సరాలు వచ్చేవరకూ!"

'అయ్యబాబోయ్!' అంటూ అందరూ నవ్వారు.

ట్రయిన్ సామర్లకోట దాటింది. అందరూ మంచి నిద్రలో ఉన్నారు స్మిత టాయిలెట్‌కి వెళ్ళడానికి లేచింది.

"విష్‌యూ బెస్ట్ ఆఫ్ లక్!" నిరీక్షణ అంది స్మితను ఏడిపిస్తూ.

"థ్యాంక్యూ!" నిరీక్షణ బుగ్గని ముద్దు పెట్టుకుంది.

"మరి నాకో? నాకో?" అంటూ అందరూ ఆమె వెనుక పడ్డారు. అందరికీ తలో ముద్దు పెట్టింది. ఆ ట్రయిన్‌లో అందరూ నిద్రపోతున్నా, వీరు అయిదుగురు అల్లరిమాత్రం మానలేదు. ఎటొచ్చీ వారు కూర్చున్న సీట్ల దగ్గర పరాయివాళ్ళు లేకపోవడంతో అల్లరికి ఏమీ ఆటంకం కలగలేదు.

స్మిత టాయిలెట్‌కి వెడుతుంటే "నేనూ రానా?" అపర్ణ అంది.

"ఛీ! వెధవబుద్ధి! అక్కడికి కూడా ఒంటరిగా వెళ్ళనివ్వరు!" నవ్వుతూ విసుక్కొంది.

"సర్లే తల్లీ! ఒంటరిగానే పని పూర్తి చేసుకొని రా! సస్పెన్స్ భరించలేకపోతున్నాం!"

స్మిత చిరునవ్వు నవ్వుతూ వెళ్ళింది. ట్రయిన్ మంచి స్పీడుగా నడుస్తూంది.

ఆ చీటీలో ఏముందోనని అందరికీ ఆత్రుతగా ఉంది. విప్పి చూడాలని ప్రయత్నించారు. కాని నిరీక్షణ ఊరుకోలేదు– వద్దు, స్మితతో చెబుతానని బెదిరించింది. అందరూ స్మిత గురించి మాట్లాడుకుంటూంటే ఎవరో చెయిన్ లాగినట్టున్నారు. ట్రయిన్ ఆగింది.

ఏమిటా అని అందరూ బయటకు చూశారు. బయట అంతా చీకటి. స్మిత ఇంకా ఏం చేస్తోంది? అని టాయిలెట్‌కి అపర్ణ వెళ్ళింది. టాయిలెట్స్ రెండూ ఖాళీ. ఒకసారి కెవ్వున అరిచింది అపర్ణ.

"ఇందాక అమ్మాయి ట్రయిన్‌లోనుండి దూకింది. నేనే చెయిన్ లాగాను." ఎవరో అన్నారు. ఆ ట్రయిన్ అంతా గందరగోళం అయిపోయింది. అందరికీ వెన్నులోనుండి వణుకు వచ్చింది.

"స్మితా! నీవు చెప్పిన కథ నిజమేనా?" అందరూ గొల్లుమన్నారు.

చేతిలో చీటీలు తడిసిపోయి నలిగిపోయాయి. దుఃఖంలో విప్పి చూశారు. నిరీక్షణ విప్పింది – "ఆడపిల్లకు ఆస్తిహక్కు వద్దు. దానివలన పుట్టింటికి దూరం కావడం తప్ప ఉపయోగం లేదు."

అపర్ణ చీటీలో – "నేను చెప్పింది అబద్ధం కాదు. అంతా పచ్చి నిజం. ఒక్క అక్షరం కూడా తప్పు చెప్పలేదు నేను. దినదినగండంలాంటి ఈ బ్రతుకు నాకు వద్దు. వారి చేతిలో చచ్చేకంటే మీ అందరి ముందూ ఇదే హాయి కదూ!"

రమ్య చేతిలో – "నాకు ముసలితనం రాదు. మీరందరూ ముసలివాళ్ళయినా మీ దృష్టిలో నేనెప్పుడూ పడుచు స్మితనే కదూ!"

చారుమతి చీటీలో – "విష్ యూ హేపీ మారీడ్ లైఫ్! మీలో ఎవరికి ముందు ఆడపిల్ల పుట్టినా ఆమెకు నా పేరు పెట్టండి. బారసాలలకు పెళ్ళిళ్ళకు కల్సినట్టే అందరూ కలవండి. అప్పుడు నలుగురు నవ్వే వేళ నాపేరు తలవడం మానకండేం!"

గుడ్ బై!

అంతవరకూ నవ్వులు వినబడిన ఆ సీట్లలో ఇప్పుడు ఏడుపులు ప్రారంభమయ్యాయి. ఈసారి అయిదుగురు కాదు – నలుగురు మాత్రమే! ఆ నిశీధిలో స్టేషను కాకపోయినా నిశ్శబ్దంగా నిలబడిపోయింది, స్మిత చావుకు సంతాపసూచకంగా కోణార్క్.

● *ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 1986* ●

★ ★ ★

మధురాంతకం మహేంద్ర

55

# పాడి ఆవు

దండాల్సామీ! నా పేరు నీలా సిన్న మునెప్ప. అయితే ఆ పేరుతో మా వూర్లో నన్ను పిలిచేవాడెవెడు? ఇంతొని కాణ్ణించి అంతోడి దాకా అందరూ పిలచేది మునిగాడనే. నా పెండ్లాన్నడుగు, మునిగాడి పెండ్లామని అంటాది. నా కొడుకు నడుగు, మునిగాడి కొడుకునంటాడు.

ఎవురెట్లా పిలిస్తేనేం గాని, నా పేరు ఏనాడో సర్కారు లెక్కల్లోకే ఎక్కిపో యుండాది. నీలా పెద్దమునెప్ప కుమారుడు నీలా సిన్నమునెప్ప, సింతమాకులపల్లె, సిత్తూరు జిల్లా... అంటే ఎవుడు...? ఇహిహి... నేనే!

నా కత జెప్పుకోవాలంటే నువ్వు దొరికినావు. పెద్ద మనుసు బెట్టి నేను జెప్పేదంతా ఇనాల. మొగం సిట్లించుకోవద్దు. దూరందూరం పోవద్దు. దగ్గరికి రాన్లే, ఇద్దో నేనీ మాత్రంలోనే వుంటా. ఇందులో దాసిపెట్టేదే ముండాది. నేను తాగిన మాట నిజమే. అయితే తాగినప్పుడొక మాట. వట్టప్పుడొక మాట జెప్పే తప్పుడు నా కొడుకుని గాదు నేను.

నేనేం సదుమూ, సట్టుబండలూ ఉన్నోణ్ణి గాదు. ఎక్కడెయ్యమంటే అక్కడ ఏలి ముద్దర్లు ఏసేటోడినే! అయితే మట్టూ మర్యాద, చిన్నంతరం పెద్దంతరం తెలీనోణ్ణి కాదు. నలబై గడపలుండే మా కూలోళ్ళ దొడ్డిలో నా మాదిరి అణకవయినోడు నీకు మందుకు దొరకడు.

అయితే నాయాల్ది, రాను రాను మా కూలోళ్ళలో మట్టుమర్యాద తగ్గిపోతా ఉండాది. ఈ మద్దిన మా పల్లెలో కొంతమంది పిల్ల కాకులు పుట్టగొడుగులు మాదిరి లేస్తా ఉండారు. 'గొప్పోడు, సన్నోడు అనేది లేదు. ఒకణ్ణి కోస్తే నెత్తురు, ఒకణ్ణి కోస్తే నీళ్ళు వస్తా ఉండాయా? నేల నుండేవాడు నేలనే ఉండిపోవాలని, ఆకాసంలో ఉండేవాడు ఆకాసంలోనే వుండిపోవాలని ఏడ రాసుండాది? మున్సబుగారి కొడుకు మాదిరిగానే తోటోనికి పుట్నోడు కూడా ఇస్కూలికి పోవాల్సిందే, ఇమానాల్లో ఎక్కాల్సిందే' అంటూ వాళ్ళు సేస్తా వుండే కారుబారు ఏం సెప్పతరం కాదు. నాకాడి కొచ్చి నన్ను వొప్పించాలని శతయుదాల సతపోరిరి. నేను ఇనిందంతా ఇని కడాకు ఒకే మాట సెప్పినా! ఒరే ఎర్రి ఎదవల్లారా! మీరు కొత్తపేటలో సినిమాకు పోతా వుండారు గదా! దాంట్లో నేలకు, బెంచీకి, కుర్చీకి మూడు రకాల రేట్లు, మూడు రకాల గేట్లు ఉండాయి గదా! ఒకే రైలు బండ్లోనే ఎవరికి తగినవి

వారికి మూడు రకాల పెట్లు, మూడు రకాల టికిట్లు ఉండాయి గదా! అందరూ పొయ్యేది ఒకే బాటే, కానీ కొంతమంది నడిసిపోతా వుండారు. కొంతమంది బస్సులో పోతా వుండారు, కార్లలో పొయ్యే మారాజులు కార్లలోనే పోతా వుండారు. తరాల నుంచీ మా తాత, మా నాయిన, నేను – మేమందరమూ పినపెద్దగారింటి కాడ సేద్దానికుండాము. ఈ పొద్దు నా కొడుకును ఇస్కూలి కేసినంత మాత్రాన వానికేవయినా కుచ్చుల కుల్లాయొస్తాదా? ఇద్దో, ఇప్పుడు మాకు దొరికే సద్ది సంగటి కూడా వాడికి దొరక్కుండా బోతాది. గొడ్లకాడికీ పోక, అచ్చరం ముక్క రాక వోడికీ ఇంటితోడూ, దోవతోడూ కూడా తప్పేతాది. తెలివితక్కువ సట్టాలు జేసి మిమ్మల్నంతా తలమీది కెక్కించుకునేదానికి గవర్నమెంటు ఏమంత తెలివితక్కువది కాదురా! అసలు గవర్నమెంటు అంటే ఎవరు? మనూరుకి మన పినపెద్దే గవర్నమెంటు. మన ఇలాఖాకు ఈరాపురం పెద్దాయన – ఆయిన మన పినపెద్దకు సద్యామేనమామే గదా – ఆయిన గవర్నమెంటు. ఎద్దులు గొట్టి ముద్దలు తినే మనకు, వాళ్ళతో సమంగా పీటలేసి, ఇస్తరాకు లేస్తారంట్రా? ఒకేళ వాళ్ళే ఏసినా మనం పొయ్యి కూసింటామంట్రా? పోంట్రా, పోంట్రి...' అని ఇదిలించి పారేసినా!

మా వూరి పిల్లకాయలైతే తెల్లమొగా లేసుకొని సణుక్కుంటూ పొయ్యినారు కానీ, నాయినా, నన్నొక పట్టుపట్టి సూసినోడు మటుకు కొత్తపేట బ్యాంకీ సూపరయిజరే!

కొత్తపేటలో కొత్త బ్యాంకీ పెట్టి మూడు సమ్మత్సరాలాయ! నిరుడు ఎండాకాలంలో ఒకనాడు మా పినపెద్ద 'ఒరేయ్ మునిగా! ఈరోజు మనం బ్యాంకీకి పోవాలా' అని కొత్తపేటకు తోలకపోయ. అప్పుడు జూచినానయ్యా ఈ సూపరయిజర్ని. ఒక్క బక్కగా ఎదురుబరిక మాదిరి ఉంటాడు మనిషి. మాటకు మాత్రం పదును జాస్తి. నీ పేరే మన్నాడు. సెప్తి. వచ్చేస్తి. ఆ సంగతి అంతటితో మరచిపోతి. కానీ ఆ మనిషి నన్నొదల లేదే. జీడి బంక మాదిరి తగులుకున్నాడు. తుమ్మజిగురు మాదిరి పట్టుకున్నాడు.

మూడు వారాల కింద మోటారు సైకిలెక్కి మా వూరికొచ్చి నన్ను నడీదిలో నిలేసేసినాడు. పేరడిగినాడు. సెప్తి. అంతేసావీ అడ్నించి నాకు అరిచేతిలో వయికుంటం సూపించడం మొదలుబెట్టేసినాడు. నేను గనక ఆ మనిషి చెప్పిన మాట యినుకోనుంటే నికార్సుగా బెప్పు పట్టిపోయుందును. సూసీ, సూసీ అయబ్బోడు నన్ను తిన్నయింటికే వాసాలు లెక్కపెట్టమని సెప్పినాడు. సెప్పేవాడి కెట్టన్నా అయ. వినేవాడికయినా బుద్దుండనక్కర్లేదా? నా బుద్ధి నాకుండాది కాబట్టి బదికిపోయినాను.

కాకపోతే ఏం సావీ, నువ్వు జెప్పు? నేనెంత నా తాహత్తెంత? పొద్దుపుట్టిన కాడ్నించీ, పొద్దు పొయ్యేదాకా పిన పెద్ద గొడ్లను మేపి, కుడితి దాపి కొట్టంలో కట్టేసి, కసువేసి, పేడెత్తకపోతే ముద్ద సంగటికి దోవ లేనోణ్ణి. ఏండ్లనాడు సెత్త ఎగిరిపోయిన కొంపమీద నాలుగు తాటాకు పట్లు ఏసుకునే దానికి గతిలేనోణ్ణి. పెచ్చులూడి నుసి రాలతా వుండే గోడలకు సున్నమేసుకునే వగ లేనోణ్ణి, ఇంట్లో మట్టి పెంకులు తప్పించి మెట్టుతో కొట్టినా, సత్తుబోకులు లేనోణ్ణి. అట్టాంటి నన్ను పట్టుకొని ఆ మనిసి ముసిల్దాన్తో వసంతకాలాడినట్లు – సీ మావును దెచ్చి మేపుకోమనె.

పినపెద్ద యింట్లో లక్ష్మిందేవి మాదిరి పండుకోనుండే గోవమ్మను దెచ్చి నా పరిగిలి కొంప ముందర కట్టేసుకోమనె. అది గవర్నమెంటు కొత్తపేట బ్యాంకీ మూలకంగా నాపేరుమీద ఇచ్చేసుండారంట. నీలా పెద్ద మునెప్ప కుమారుడు నీలా సిన్న మునెప్ప మీదనే ఆ యావుండాదని నా ముందర టెంకాయ కొట్టినట్లు సెప్పినాడు. ఆ మాట యినేటప్పటికి నా ఒళ్ళు మానైపోయ. నోట్లో తేమ ఆరిపోయ. ఎదురుగ్గా వుండే మడుసులు తల్లకిందులుగా కనబడిరి.

సీమావంటే ఎట్టాంటేది? మామూలు నాటుగొడ్డు కాదు. దేవతా పసరం. దానికోసరమని పినపెద్ద మా వూరి బజన గుడిని మించిపోయేటట్టుగా సిమెంటు రేకులు తెప్పించి మూడంకణాల కొట్టం వెయ్యించేనుండాడు. నా వూరి కొంపకు దాన్ని తోలుకపోతే దాన్ని ఇంట్లో కట్టేసి మేము సెట్టుకింద సంసారం పెట్టుకోవాల్సిందే. మా పల్లెలో అమాసకు పున్నవకు కూడా ఒంటిమీద నీళ్ళు పోసుకోనోళ్ళు వుండారు. ఆ యావుకు తెల్లారిజాం పొద్దు ఎక్కకముందే పంపు సెట్టు క్రింద అరగంట అబిషేకం సెయించాల. మామూలు వరి కసువు నది మూసూడదు. దానికని మా పిన పెద్ద మిట్టకయ్యల్లో సర్కారు గడ్డి యియించేసినాడు. దానికి మామూలు వరి తవుడు, సెనిగిపిండి సాలక ఏందేందో మూటకు మూటలుగా దెచ్చి దొంతులకింద పరిపించే సుండాడు. అటువంటి అవును దెచ్చి మా యింట్లో కట్టేసి మేపుకోమని చెప్పేదానికి ఆ మనిషికి నోరెట్టా ఆడిందో ఏమో ఆ దేముడికే తెలియాలి?

వొద్దు సామీ అంటి. నన్ను యిడిసిపెట్టెయి దేవరా అంటి. మన్నించుకో మారాజా అంటి. ఆయిన నా మాట సెవిలో పడనీలే. పట్టు యిడిసినోడు గాదు. నన్ను వొదిలినోడుగాదు. నన్నీపెహారంగా సతపోరీ, సతపోరీ కడాకు మా పినపెద్దగారింటికే వచ్చేసి ఆడనే యవ్వారం మొదలుబెట్టేసినాడు గదన్నా!

అన్నన్నా, మా పినపెద్దను ఆ మాదిరి కొచ్చిన్ను కొచ్చిన్నుగా అడిగినోళ్లే నే నింతవరకు సూడలా! ఆయన నా పేరు మీదుగా కొత్తపేట బ్యాంకిలో మూడువేలో, నాలుగువేలో గుంజేసినాడంట. అందులో పన్నాలుగు నూర్లు తిరిగి కట్టాల్సిన పనే లేదంట. గవర్నమెంటోళ్ళు బీదోళ్ళకోసరమని ఒక మేలు తలబెడ్తే, దాన్ని పినపెద్దలాంటోళ్ళు ఎగరేసుకుపోవడంలో నాయం లేదంట. ఆ మాదిరిగా ఆ మనిసి వాగతా వుంటే పినపద్ద కెట్టన్నా అయ, నాకు నెత్తురు వుడుకెక్కిపోతా ఉండాది. అయినా మా పినపెద్ద కుండేంత యినయం, వోపిక, కుదురు ఎవరికుండాది? చెరువు కింద బంగారం పండు మళ్ళుండాయా! గుట్టక్రింది దాకా ఎకరాలు ఎకరాలుగా వుండే చేనుకు యింతా అని లెక్కుండాదా! మామిడి తోపులు, టెంకాయ తోలుపు, చింత తోలుపు, నిమ్మసెట్లు, ఆకుదోట....ఈ పాయకట్టుకే పేరెత్తినోడు గదా పినపెద్దంటే. అట్టాంటోడికి ఇంత వుండాదని ఇసుమంత పెగ్గి వుండాదా! ఆయన అగ్గి మాదిరిగా రేగిపోతా వుండే సూపరయిజరుకు ఆ పాట్నే సావిట్లో కురిచీ ఎయిపించె. ఎండలో బడి వొచ్చినాడని పెద్ద స్టీలు గళాసు నిండాసల్లటి మజ్జిగ తెప్పించె. ఇంకాస్సేపటిలో కోడి కూర ఉడికిపోతాది, తినంది గాక ఇల్లు కదలకూడదని దోవకడ్డ మడ్డం పోయ.

అయితే ఈ యితండం మనిసి పినపెద్ద మాట సూడలా, ఆయన మర్యాద సూడలా.

'నీలా సిన్న మునెప్ప అరిజనుడు. ఆయనకు ఇష్టిహి... (అంటే నాకు)... సర్కారోళ్ళు యిచ్చిన అవును నువ్వు పెట్టుకోవడం నాయం గాదు. దీనికె రూలు ఒప్పుకోదు. ఇప్పటికిప్పుడు దాన్ని ఆయన ఇంటికె తోలించు' అంటూ పంతం బట్టె బరిమీద నిలిసిపోయ. ఇంటి ముంగిట్లో వూరి రైతులందరూ పోగయిపోయి ఇంకొంచెముంటే ఏ కీలు కాకీలు ఇరిగిపొయ్యే సంగతే! పినపెద్ద వాళ్ళనందర్నీ కంటిసూపుతో నిలబెట్టినాడు కాబట్టి సరిపోయింది కానీ లేకుంటే అ సూపరయిజరు కొత్తపేట పొలిమేర్లు సూసేవాడు గాదు.

అ సూపరయిజరుకు నచ్చజెప్పేదానికి పినపెద్ద యీది కడపదాకా పోయినాడు. అసలు కొత్తపేటలో బ్యాంకు పెట్టేదానికి ఆయన, ఆయన మేనమామ యీరాపురం పెద్దాయన పడిన పాట్లన్నీ ఇవరంగా జెప్పినాడు. ఇంతకు ముందు బ్యాంకికి ఏ మేనేజరొచ్చినా, సూపరయిజరొచ్చినా తాను ఏ రకంగా మర్యాద చేసిందీ, వాళ్ళు కూడా తన ఇంట్లో ఏ యిదంగా సొంత మనుషులు మాదిరి నడుసుకునిందీ జెప్పినాడు. వాళ్ళిండ్లకు తను ఏ యిందంగా దినామూ పాలు, కూరగాయలు పంపిస్తావునిందీ జెప్పినాడు. ఎన్ని జెప్పి ఏం లాభం? ఈ మడిసి పట్టిందే పట్టు. ఉడుంపట్టు పట్టేసినాడు. "అదంతా నాకొద్దు. నేనింకొక వారం, పది దినాలు సూస్తా, ఆ లోపల అవు నీలా చిన్న మునెప్ప యింట్లో వుండాల" అన్జెప్పి మోటారు సెకిలెక్కి ఎలబారిపోయినాడు.

వారం గడిచె. పది దినాలాయ. అమాస పోయ. సూపరయిజరు పోవిడిలే. 'బతికిపోతి నాయనా, ఇంక రాడులే' అనుకొంటి. ఆయనవొదిలేవోడేనా! ఇంక ఏమి జెప్పేది సావీ, ఆయన నా కొంపే ముంచేసినాడు గదన్నా! పినపెద్ద నా యావును పట్టుకోని తన కొట్టంలో కట్టేసుకుంటూ వుండాడని పోలీసు టేసన్లో రిపోర్టు ఇచ్చేసినాడంట.

అయితే పోలీసు టేసనంటే మటుకు మా పిన పెద్దకు లెక్కా జమా! ఇనస్పెట్టర్ రాత్రికి రాత్రే ఫోన్లో ఈ సంగతి ఆయనతో జెప్పేసినాడంట. తెల్లారేటప్పటికి పినపెద్ద నన్ను సావిట్లోకి పిలిపించి, "ఏవిరా మునిగా! ఈ దినం ఆఫీసర్లు, ఇనస్పెట్టర్లు అంతా మనూరి మీదికి దండెత్తుకోని వస్తా వుండారంట. నువ్వేవి జప్తావు?" అనడిగాడు.

"నేనేం జెప్తాను సామీ? నువ్వేం చెప్పమంటే ఆ మాటే జెప్తా. నేను గానీ, మా నాయన గానీ, మా తాతగానీ నువ్వు కాల్తో సెప్పిన పని సేత్తో చేసుకోని పోయేవాళ్ళము. నీ పేరు చెప్పుకోని గంజి తాగేవోళ్ళము, నీ చెప్పులు మోసుకోని బదికేవోళ్ళము. అంతేగాని నీ మాట మీరేవోళ్ళము గాము" అంటి. ఆ మాటకు ఆయన ముఖం రెండు అర సేతులంత యిప్పారె. కండ్లు ఇంతింతయిపోయి, "ఒరే మునిగా! నీ సంగతి నాకు తెల్దా?" అని వచ్చిన ఆఫీసర్ల కాడ నే నెట్ల మసులుకోవాల్నో, వాళ్ళతో ఏ పెహారంగా మాట్లాడాల్నో నాకు చిలక్కు చెప్పినట్టు జెప్పె.

పినపెద్ద మనుసులో ఏముండాదో, ఆయన ఏం చెప్తా వుండాడో, నేనేవి ఇన్నానో, నాకేవి అర్థమయిందోగానీ సావీ, నాకా రాత్రి కంటిమీద కునుకుపడితే ఒట్టు. ముందుది వెనక్కి వెనకది ముందుకు వేసి ఆలోసించినా, నాకేమీ గోచరానికి రాలే. నీడ కాస్త వుంది గదా అని నేను పాము పడగకిందనే ఏమన్నా కూసోనుండానా అనే యోచనతో నా వొళ్ళంతా రాత్రంతా ఒకే అదుర్లు పుట్టుకోనిపోయ.

జాము పొద్దెక్కిందని నాయనా, ఒక రెనకాల ఒకటిగా రెండు జీపులు ఊళ్ళోకి వస్తా వుండాయి. జీపుల ఎనకాల రేగతా వుండే దుమ్ములో పిల్లకాయలు అరుచుకుంటూ వస్తావుండారు. మడి కయ్యల్లో నార్లు నాటతా వుండే ఆడోళ్ళందరూ నడుములు పైకెత్తి చోద్దెంగా సూస్తా వుండారు. నే నా టయింకు చింతలొంకలో సాకలోళ్ళ కళింకాడ అవుల్ని దోలుకోనుండా. గొడ్లని వేటివాడవొదిలేసి గసపోసుకుంటా వచ్చి వూర్లో పడిపోతి.

పినపెద్దగారింటి ముందు మద్దెస్తం జరగతా వుండాది. తన అబ్బ గంటునంతా ఎవరో ఎత్తుకోని పోతా వున్నట్టు సూపరయిజరు గొంతు చించుకుంటూ వుండాడు. నోటికి బీగం పడ్డినట్టుగా ఇనస్పెట్టరు కురిచీకి అంటుకోనిపోయుండాడు.

“ఇదో, వచ్చేసినాడు వచ్చేసినాడు” అని కొందరు గుంపులో నుంచీ నన్ను ముందుకు తోసిరి.

సూపరయిజరు సక్కంగా నా దగ్గరికే వచ్చేసి, భుజాల మీద సెయ్యేసి ఊదర మొదులుబెట్టేసినాడు. నీకు తెలిసింది తెలిసినట్టు, జరిగింది జరిగినట్టు చెప్పమన్నాడు. నీకేమి బయం లేదు, నే నుండాను అన్నాడు. సెత్త ఎగిరిపోయుండే నీ కొంపమీద బోద కసువు కప్పుకోవాలని లేదా అనడిగినాడు. నీ పెండ్లానికి సమ్మత్సరానికైనా ఒక కొత్త కోక కొనియ్యాలని లేదా అనడిగినాడు. నీ బుద్ధి నీకొచ్చింది మొదులు రెక్కలు ముక్కలు సేసుకోని అవులు మేపతా వుండావే. సేతులు పడిపోయేట్టుగా ఇరవై శేర్ల పాలు పిండతా వుండావే. నీ కొడిక్కి ఒక లోటా పాలు తాపించుకోవాలని లేదా అనడిగాడు.

ఎక్కడ పుట్టిన మనిసో ఏయయ్య కన్నబిడ్డో నాయట్లా నిరుపోగిపైన ఈ మనిసి కెందుకింత అక్కర? తలమీద రూకబెట్టినా వెలబోని నాకోసం ఈ మనిసి కెందుకింత తాపత్రాయం? ఆ మనిసి నాకోసం పడే తాపత్రాయాన్ని జూసి మదిస్తానికి వచ్చినోళ్ళంతా ఆయన్ను ఎర్రోన్ని జూసినట్లు చూసిరి. అప్పుడు లేసినాడు పోలీసు ఇన్‌స్పెట్టు. లేసి పట్ల బలవంతంమీద సూపరయిజర్ని ఈడ్చుకోని బొయ్యి స్టూలుమీద కూసోనిబెట్టి నా కాడికొచ్చి వొయినాలు వొయినాలుగా ప్రెశ్న లడిగినాడు:

‘ఏమి నీ పేరు’ అనె.

‘మునిగాడు సామీ’ అంటి.

పూర్తి పేరు సెప్పు అనె. అంతమందిలో నా పేరు ఏమని చెప్పకుందు? తల కొట్టేసినట్టుండాది.

నీలా సిన్న మునెప్ప నువ్వేనా అని గద్దించినాడు.

"ఈ అవు ఎవురిది?" అని సీమావును జూపించినాడు. గంగిరెద్దున నడివీధిలో నిలబెట్టినట్లుగా సీమావును దెచ్చి పందిరి కింద నిలబెట్టేసుండారు.

పినపెద్దమొగం జూస్తి. అయన చెప్పమన్నట్లు సైగ చేసినాడు.

"నాదే సామీ" అంటి. ఆ మాటకు సూపరయింజరు మొకం దీపం మాదిరి ఎలిగిపోయ.

"అయితే ఈ యావు నీ యింట్లో లేకుండా ఇక్కడెందు కుండాది? మంచూరి యెంకటయ్య నాయుడు ఇంట్లో ఎందుకుండాది? ఈ యావును నీకు దక్కనీకుండా మీ పినపెద్ద తన యింట్లో కట్టేసి మేపుకుంటా వుండాడని ఈ సూపరయిజరు మాకు రిపోర్టు రాసినాడు. దీనికి నువ్వేం జేప్తావు?" అని నిగ్గదీసినాడు సబ్బినస్పెట్రు.

ఆ రాత్రంతా నా మనసు పుండు జేసి పురుగ మాదిర తొలచిన బాధ ఏందో నా కప్పుడు గోచరమయింది.

నేనేం జెప్పేదు సామీ! రెప్పలారస్తా పినపెద్ద కల్లా జూస్తి. అయన నేను రాత్రి జెప్పిందంతా మరచిపోయినావా అనేట్టుగా సూస్తా వుండాడు. సూపరయిజరు కల్ల జూస్తి. అయన నెను చెప్పింది నీ కర్తమయింది గదా అనేట్టుగా సూస్తా వుండాడు. మా పంచాయితీకి అరిజన మెంబరుగా వుండే ఎంకటసామి "సెప్పరా! తెల్లారి పినపెద్ద జెప్పినట్టు సెప్పేయ్. బింకానికి పోక" అంటూ మోచేత్తో కుమ్మతా ఉండాడు.

ఏం జెయ్యాల! చెప్పేస్తి సామీ. అంతా చెప్పేస్తి. అవు నా దేనని చెప్పేస్తి. నా యింట్లో దాన్ని కట్టేసుకునే తావులేని కతన, దర్మాత్ముడట్లా మా పినపెద్ద, అవును అయనింట్లోనే కట్టేసి మేపుకోమన్నాడని చెప్పేస్తి. ఆ యావు పాలు తాగి నా కొడుకు దినదినాకి మెరుగెక్కిపోతా వుండాడని సెప్పేస్తి. మేం తాగింది తాగ్గా, తినింది తినగా మిగిలిన పాలూ, పెరుగూ, నెయ్యా కొత్తపేటకెత్తుకపొయ్యి అమ్ముకుంటా వుండామని చెప్పేస్తి. ఆ యావు పేడతోనే దినాము ఇల్లు అలుక్కుంటూ వుండానని చెప్పేస్తా. ఆ యావు పేడ ఇంటెనక దిబ్బైపోతే, ఆ యెరువును బండ్లకేసి అమ్ముకుంటూ వుండానని చెప్పేస్తా.

ఈ మాటలన్నీ చెప్పేసేటాళకు నాకు కండ్లు, సెవులు మూసుకునిపోయ. తలెత్తి మనుషుల ముఖం చూడను చెల్లలే. మద్దిస్తమైపోయె. జనాలందరూ ఇండ్లకు పోయిరి. వచ్చి నాఫీసర్లు, పోలీసులు కాపీలు తాగేసి జీపులెక్కి ఎలబారిపోయిరి.

నేను వూరి ముందర సింతచెట్టు కిందికి పోయి నిలుచుకుంటి. మల్లొక గడియ సేపటికే సూపరయిజరు మోటారు సైకిల్లో వచ్చి నా ముందర నిలబడినాడు. మనిషి పల్లెత్తి మాట్లాడలే. చూసిందే సూపుగా వక్క కొరొకేటంతసేపు సూసి మల్ల స్కూటరు స్టార్టు చేసి ముందుకు కదలబోయినాడు. నేను గబగబ పరిగెత్తుకుపోయి, అయన కాళ్ళమీద పడిపోతి.

"సామీ! నువ్వు సదుంకున్నోడివి. నేను ఏలిముద్దర్లు వేసేవోణ్ణె, నీకు తెలవంది గాదు. సర్కారు, సర్కారని దాన్ని పట్టుకోని నువ్వు పీకులాడతా వుండావు. సర్కారంటే ఎవురు సామీ? మా వూరికి పినపెద్దే సర్కారు. ఈపాయకట్టుకంతా ఈరాపురం పెద్దాయన సర్కారు. వాళ్ళిద్దరూ బావా బామ్మర్దులే గదా! అవును

యిచ్చినట్టుగా యిచ్చిరి. తీసుకున్నట్టుగా తీసుకుండ్రి. దీనికి వగచేం లాభం చెప్పు? అనా పుట్టినదాదిగా, తరాల నుండీ మేము గొడ్లు మేపుకునేవాళ్ళము. మా తాత, మా నాయిన, నేను, నా కొడుకు అంతా ఆ బాబత్తే. పేడా, గంజో ఎత్తే రాతేగానీ మాకు పాలు, మజ్జిగ తాగే రాత లేదు. నువ్వు తెల్లనిదంతా పాలు అనుకునేటోడివి..... నా మూలంగా నీకే పొద్దు తల దించుకునే పనైపోయ. నన్ను మన్నించుకో దేవరా!" అంటూ దణ్ణం పెట్టినాను.

అంతేనన్నా నేను అయన్ను సూడ్డం. నెల తిరగకముందే నాకీ సంగతి సెవిలో పడింది. అయన్ను ఎనిమిది జిల్లాల కవతల ఎత్తి కొట్టేసినారంట. ఆడ జనాలకు నీళ్ళు దొరకవంట. నాలుగు మైళ్ళు నడిస్తే గాని బస్సు దొరకదంట. ఆయన చేసిన పనికి సరైన శాస్తి జరిగిందంట!

నాకీ సంగతి తెలిసి మూడు నాళ్ళయింది. అప్పట్నుంచీ ఇంటికె పోలే. నీళ్ళు తాగలే. సారాయే తాగతా వుండా! పొద్దు పొయ్యేటాళకు నా గళాసులో రెండు రూపాయల సారాయి పొయ్యమని పరమాత్తుడట్లా మా పిన పెద్ద సారాయంగట్లోనే చెప్పేసినాడు.

సమ్మత్సరం సివర్లో ఈ లెక్కంతా నా జీతంలో పట్టుకుంటాడంట. జరమొచ్చి నా కొడుకు మూసిన కన్ను తెరవకుండా యింట్లో పండుకోనుండాడంట. వాడికి తాపను లోటా పాలు దొరక్క నా పెండ్లాం దాని కండ్లనీళ్ళు అది తాగతా వుండాదంట. అయినా నేను కొంపకు పోలే. ఎందుకు పోవాలా? జరం రాకుండా వుండాలంటే పాలు తాగాల. జరమొస్తే మందు తాగాల. ఈమూడిట్లో నాకు దొరికింది ఇదే. అందుకని దీన్నే తాగతా వుండా. అయితే తాగినంత మాత్రాన నేను పొల్లు మాట్లాడేవాణ్ణి గాదు. నేను సెప్పిన దాంట్లో కాసు వీసమంత వారా వుంటే నన్ను మెట్టుతో కొట్టు. నువ్వు ఏం వొట్టు పెట్టుకోమంటావో జెప్పు. ఆ ఒట్టుమీద ఒట్టు.

మావూరి ముందర బాట గంగమ్మ మీద ఒట్టు. బజన గుడిలో శ్రీరాముల వారిమీద ఒట్టు. మా పినపెద్ద కొట్టంలో లక్ష్మిందేవి మాదిర పండుకోనుండే గోవమ్మ మీద ఒట్టు. ఏందో, తాగుబోతు ఎదవ, వదరతా వుండాడని అనుకోవద్దు సామీ! తాగనప్పుడొకమాట తాగినప్పుడొకమాట జెప్పే తప్పుడు నాకొడుకును కాదు నేను...

● *8–4–87 ఆంధ్రప్రభ వారపత్రిక* ●

* * *

పి. సత్యవతి

56

# పునాది

సూర్యుడు దిగులు దిగులుగా కొండల చాటుకి తప్పుకుంటున్నాడు.

అక్కడ ఆకాశం విశాలాక్షి మొహంలాగే ఏడ్చీ ఏడ్చీ ఎర్రబడిపోయింది.

ఊరంతా తిరిగి తిరిగి గంపెడు నిరాశ నెత్తినేసుకొచ్చిన సత్యనారాయణ, వీధి వాకిట్లోనుంచి నిన్న సాయంత్రం నుంచీ లోపలికి రాని భార్య భుజంమీద చెయ్యివేసి లోపలికి తీసుకొచ్చేడు.

ఆవిడ నేలమీద కూలబడి బావురుమంది – సత్యనారాయణ చేతిలోని తెలుగు పత్రికని అతని కూతురు కమల అందుకుని తెరిచి చూసింది. రెండవ పేజీలో వుంది ప్రకటన:

"కనిపించుటలేదు" అని హెడ్డింగ్.

"ఐదడుగుల నాలుగంగుళాల ఎత్తు, చామన ఛాయ, స్టెప్ కటింగ్, నల్ల ప్యాంటు, నీలం షర్టూ వేసుకుని వుంటాడు. సన్నగా వుంటాడు. కుడి కణత మీద చిన్న పుట్టుమచ్చ వుంటుంది, ఆచూకీ తెలిపినవారికి బహుమానం –"

కమల ఓణీ కొంగుతో కళ్ళు తుడుచుకుంది.

సత్యనారాయణ వాచీ ఆరుగంటలు చూపించింది.

సత్యనారాయణ రేడియో పెట్టేడు. స్థానిక ప్రకటన లొస్తున్నాయి. వాళ్ళు చెబుతున్నారు:

"తప్పిపోయిన పి. మురళీమోహన్ ఆచూకీ తెలిసినవారు పి. సత్యనారాయణ, మొగల్రాజపురం, విజయవాడకి తెలుపగోర్తాము" అని.

అది విని విశాలక్షి తల రెండు చేతుల్తో బాదుకుంది. సత్యనారాయణ గదిలో లైటువేసి, ఆమెని మంచంమీదకు చేర్చాడు.

విశాలక్షి ఏడవడం మినహా ప్రొద్దుటినుంచీ ఒక్కమాట మాట్లాడలేదు. గ్రుక్కెడు మంచినీళ్ళు త్రాగలేదు – కనీసము పళ్ళు కూడా తోముకోలేదు.

సత్యనారాయణకి ఏడుపు కూడా రావడంలేదు. గుండె బరువై పోయింది. తప్పిపోయిన మురళి కోసం బాధపడాలో, కూలిపోతున్న విశాలాక్షి కోసం బాధపడాలో అతనికి అర్థం కావడంలేదు. విశాలక్షి చేత బలవంతంగా కాఫీ త్రాగించి, ఓ కాంపోజ్ మాత్ర వేసేసరికి అతను చాలా అలసిపోయేడు – ఎవర్నైనా కావలించుకుని

చిన్న పిల్లవాడిలా తానూ ఏడిస్తే బావుండు ననిపించిందతనికి. తాను ఒొంటరి వాడైపోయాడు. తన కుడిభుజం విరిగిపోయింది. స్నేహితులంతా వచ్చేరు. ఆఫీసులో కొలీగ్స్ వచ్చేరు. మామగారూ, బావమరిదీ – ఇంకా తన అక్క – ఆమె భర్తా అంతా వచ్చేరు. సాయంత్రానికి తిరిగి వెళ్ళేరు. ఓదార్చేరు – కానీ విశాలక్షి మాత్రం వీధి వాకిట్లోనుండి లోపలికి రాలేదు, కళ్ళు మూతలు పడేవరకూ తన సర్వప్రపంచమూ కళ్ళే అయిపోగా వీధి చివరికి దృష్టి సారించీ, సారించీ అలసిపోయింది.

కమల అన్నం వండింది. అన్నం వండుతున్న కమలకి అన్న గుర్తువచ్చి పమిటకొొంగు నోట కుక్కుకుని కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. పదిసార్లు ముక్కు చీదింది. దేవుడు మందిరము ముందు సాష్టాంగపడింది. చెంపలు వేసుకుంది. తిరుపతి దేవుడికి తన రెండు జడలూ కానుకగా యిస్తానని మొక్కుకుంది. అన్నం మాడిపోయింది. మాడి పోకపోయినా దాన్ని ఎవరూ తినరని ఆ పిల్లకి తెలుసు. అందుకే గిన్నె దింపేసి, తనూ వచ్చి తండ్రి ప్రక్కన కూర్చుంది.

"నువ్వు కాస్త ఎంగిలిపడమ్మా!" అన్నాడు సత్యనారాయణ.

అతని మాటలు అతనికే ఎబ్బెట్టుగా, అసహ్యంగా కనిపించేయి.

కమల తల అడ్డంగా ఊపింది. వెల్లువలా వస్తూన్న దుఃఖాన్ని బలవంతంగా అణచిపెట్టడానికి ఆ పిల్ల చేస్తున్న వ్యర్థప్రయత్నాన్ని గమనించేడు సత్యనారాయణ.

అతనికీ ఏడవాలని వుంది.

"నాన్నా!" అని అతని ఒళ్ళో వాలి వెక్కెళ్ళు పెట్టింది కమల.

"ఊర్కో అమ్మా, వాడే వచ్చేస్తాడు. పిచ్చి సన్యాసి" అన్నాడు – అని భుజాన వున్న తువ్వాలు నోట్లో కుక్కుకుంటూ వీధిలోకి వచ్చేడు సత్యనారాయణ.

కమల మూగదైపోయింది.

అరుగుమీద కూర్చున్న సత్యనారాయణ మెదడు స్క్రీన్ మీద ఒక్కొక్క మెరుపు మెరుస్తోంది. ఒక్కొక్క దృశ్యం కనపడ్తోంది.

"ఏమయినాసరే మన మురళీని ఆ కాలేజీలోనే చేర్చాలండి. డబ్బెక్కువైనా సరే ఇంట్లో ఓ ఖర్చు తగ్గించుకుందారి" అంది విశాలక్షి ఆ రోజున.

విశాలక్షి ఇంటర్మీడియట్ ప్యాసైంది. కాలేజీ అంటే తెలుసు, సైన్సు గ్రూపు. "చూడు విశాలా, మన బంగారం మంచిదైతే కంసాలి ఏం చేస్తాడు – చదివే వాళ్ళకి ఏదైనా ఒక్కటే" అని నచ్చచెప్పబోయాడు సత్యనారాయణ.

"మీకు తెలీదండీ అసలు – హైస్కూలు నుంచీ కాలేజికి వచ్చే దశవుందే, అదే జీవితంలో చాలా ముఖ్యమైన దశ. ఈ వయస్సులోనే మొగపిల్లలకి డిసిప్లిన్ కావాలి. మీకెందుకు మీరు వాణ్ణే అక్కడ చేర్పించండి, నేను సినిమాలు మానేస్తాను. కావాలంటే వాడి చదువయ్యేవరకూ క్రొత్త చీరెలు కూడా కొనుక్కోను. ఇంట్లో వుండేదానికి ఏ చీరెలైతే నేం!"

విశాలాక్షి ధోరణి అతనికి క్రొత్తకాదు, నిజానికి కొడుకుని కాలేజీలో చేర్పించలేని అసమర్థుడేంకాదు తాను.

"నేను బయాలజీ చదవలేనమ్మా, నాకది పరమబోర్, రికార్డులు వెయ్యలేను – నేను వేరే గ్రూపు తీసుకుంటానమ్మా!" మురళి తల్లి దగ్గర చేరి చెప్పబోయేడు.

"నీ మొహం! చదువు బోర్ అనుకుంటే నువ్వెలా పైకొస్తావ్? చదువు మనిషికి తప్పనిసరి. మన కిష్టమైన చదువులు చదువుకుంటామంటే మిగిలేది, 'ఇదిగో ఇలాంటి గొర్రెతోక బ్రతుకులే. మాకు పెద్దవాళ్ళు ఇదిగో ఇది చదువు, అది చదివితే లాభం, ఈ గ్రూపు తీసుకో' అని చెప్పలేదు, అందుకే ఇలా అయిపోయేం. నువ్వు మాలాగా కాకూడదు, నువ్వు నీ ధ్యాసంతా చదువుమీదే నిలపాలి, చదువొక యజ్ఞంగా భావించాలి. అదొక తపస్సుగా తలపొయ్యాలి, నువ్వు డాక్టర్‌వి కావాలిరా, కావాలి. నేనెందుకోసం బ్రతుకుతున్నానో తెలుసా! నా పిల్లల కోసం – నా పిల్లల ఉన్నతి చూడ్డంకోసం." విశాల ఇంకా మాట్లాడగలదు.

"మురళీ! అమ్మ చెప్పినట్లు చెయ్యి నాయనా!" అన్నాడు సత్యనారాయణ.

"బయాలజీ రికార్డులు చాలా నీట్‌గా వెయ్యాలి తెలుసా? నీకు బార్డర్ ఫస్టుక్లాసు కాదు, డిస్టింక్షన్ కావాలి" అంది విశాలాక్షి.

మురళి తల్లివైపు అయోమయంగా చూసేడు.

అదొక దృశ్యం.

"ఎప్పుడూ చాకిరీ, చాకిరీ చచ్చిపోతున్నాను. అసలు ఈ యింట్లో నేను జీతంలేని పనిమనిషిని. ఇహ ఈ బ్రతుకింతే. ఈ కష్టాలు నాకు తప్పవు. వాళ్ళు పొగరెక్కి కాకపోతే హాయిగా కాలేజీలో చేరి చదువుకుంటే ఫస్టుక్లాసొస్తే ఈపాటికి నేనూ రామరత్నం డాక్టర్‌లా నాలుగంతస్తుల మేడ కట్టేదాన్ని, ఎస్సెల్సీలో ఇద్దరం ఒకే బెంచీలో కూర్చునేవాళ్ళం. 'అమ్మాయ్! బాగా చదవాలి. కావాలంటే ట్యూషనైనా పెట్టుకోవే' అని ఒక్కరోజన్నా మా అమ్మ చెప్పిందా? అవిడొక పిచ్చిమాలోకం. 'చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవా!' అని సామెత చెప్పినట్లు పిచ్చి విత్తనాలు నాటి మల్లెమొక్కలు మొలవమంటే మొలుస్తాయా?" బియ్యం కడుగుతూ, కూరలు తరుగుతూ, నీళ్ళు తోడుతూ, బట్టలు వుతుకుతూ విశాలాక్షి స్వగతాలు.

"నా పిల్లలు నాలా బాధలు పడకూడదు. వాళ్ళు బాగా చదవాలి, డాక్టర్లు కావాలి, మేడ కట్టాలి. మూడు గదులు యిరుకు యింట్లోనూ, గాలీ వెల్తురుకు వాచిపోయి బ్రతక్కూడదు, వాళ్ళకి బెడ్‌రూము లుండాలి. ఎటాచ్‌డ్ బాత్‌రూంలు వుండాలి. ఏ గదిలో అంటే ఆ గదిలో పంపులుండాలి. అలాంటి ఇళ్ళలో నా ఆఖరిదశైనా గడవాలి, నా పిల్లలే నన్ను సుఖపెడతారు. అమ్మా, నువ్వు హాయిగా ఆ ఫోమ్‌బెడ్‌మీద విశ్రాంతి తీసుకోమంటారు."

ఆదివారం మధ్యాహ్నం మూడు గంటలవేళ రేడియో నాటకం వింటూ, కమలకి తల దువ్వుతూ (తనూ పుస్తకం చదువుకుంటూ అక్కడ కూర్చున్నప్పుడు) విశాలాక్షి రోజూ కనే కలల్ని గురించి తెలుసుకున్నప్పుడు ఆమె కడుపులో ఇంత నిరాశ దాగి వుందని, ఆమెకి తన జీవితం పట్ల అంత ఏవగింపు వుందని అర్థం అయింది సత్యనారాయణకి.

"అవునే కమలా, మనలా ఎవరూ వుండరు తెలుసా! చక్కగా ఆదివారాలు ఇల్లు తాళంవేసి షికార్లకి వెడతారు. హోటల్లో భోజనం చేస్తారు. సినిమా చూసి ఇంటికొస్తారు. మా పిన్ని కూతురు నీరజవాళ్ళు అంతే. వాళ్ళాయన డాక్టర్. వాళ్ళకేం? నువ్వూ డాక్టర్ కావాలి తెలుసా? రామరత్నంకన్న పెద్దమేడ కట్టాలి."

విశాలాక్షిని ఓ ఆదివారం హోటల్‌కి తీసుకువెడదాం అనుకున్నాడు. ఓ పాతిక రూపాయలు ఖర్చు ఫరవాలేదనుకున్నాడు. విశాలా, తనూ, మురళీ, కమలా, చంటి బాబూ మొత్తం అయిదుగురు. ఆటోలో వెళ్ళవచ్చు. విశాల ఉత్సాహం చూసి ఆమె అల్పసంతోషిత్వానికి జాలిపడ్డాడు. పదేళ్ళ పిల్లలా ఇల్లంతా గంతులు పెడుతూ చెకచెకా పనులు చేసింది. అంతలోనే పెద్దాపురం నుంచి తన మేనమ్మామా ఆయన భార్యా వచ్చేరు. వాళ్ళు రాకరాక వచ్చేరు. మేనమూమ చిన్నప్పటి నుంచీ బాగోగులు చూసినవాడు. ఆవిడ మంచిది. అతిథి సత్కారాలతో, విశాల మొహం చీకటైపోయింది. బావి దగ్గరా, భోజనాల దగ్గరా మళ్ళీ స్వగతాలు, నిరాశ, డిసప్పాయింట్‌మెంట్.

"ఒరేయ్ చంటీ! ఎక్కడికిరా బయల్దేరేవ్?" విశాల వంట ఇంట్లోనుంచి కేకలు పెడుతోంది.

"స్టేడియంలో క్రికెట్ ఆడుకుంటానికమ్మా! మా ఫ్రెండ్సంతా వచ్చేరు. మాచ్ ఆడతాం. వాళ్ళు గెల్చితే మేము బంతి కొనిస్తాం. మేం గెల్చితే వాళ్ళు కొనిస్తారు." కళ్ళు తిప్పుతూ చెప్తున్నాడు చంటి.

"ముందా స్టంప్స్ వాళ్ళ మొహాన పడేసి నువ్వు నడు లోపలికి. క్వార్టర్లీలో ఆరో ర్యాంకు ఏడిసేవ్. ఈసారి కనీసం నీకు సెకండ్ ర్యాంక్ రావాలి – ఫస్టైలాగూ రాదు – వాళ్ళకేం బంగారు బాబులు – క్రికెట్ ఆడతారు, హాకీ ఆడతారు – వాళ్ళ నాన్నలంతా కారున్నవాళ్ళూ, ఇళ్ళున్నవాళ్ళూనూ – మనకేం వుందిరా బోడిసన్నాసీ! మనకి చదువే ఆధారం. చదువు రాకపోతే రిక్షా తొక్కాలిరా. అందుకూ పనికిరాం మనం."

విశాలాక్షి సహస్రనామ జపం ఆపడం లేదు. చంటి బిక్కమొహం వేసేడు. స్నేహితులు వాడివంక ఎగతాళిగా చూసి స్టంప్స్ పట్టుకుపోయేరు. వాడు అలిగి నేలమీద పడుకుని నిద్రపోయేడు.

"బయాలజీ బొమ్మలు ఇంత అసహ్యంగా వేశావేం? బాగా వెయ్యాలి. ఐదుకి మూడు మార్కులేమిటి! నాకే నయం – నాలుగైనా వచ్చేవి."

మురళి మాట్లాడలేదు.

"సైన్సులో నూటికి అరవై వస్తే చాలదు. తొంభయ్ రావాలి. తొంభయ్ వస్తేనే మెడిసిన్‌లో సీటు."

మురళి అప్పటికీ మాట్లాడలేదు.

"నువ్వు యూనిఫారాలు మానేసి ప్యాంట్లు వేసుకోగానే పెద్దవాడివి కాలేదోయ్! ఈ నెల్లో రెండు సినిమాలు చూసేవు. పరీక్షలయ్యేవరకూ నీకు సినిమా లేదు. నీ షెటిల్ బాడ్‌మింటన్ వగైరాలన్నీ కట్టిపెట్టి శ్రద్ధగా చదువు."

మురళి విసురుగా బయటికి వెళ్ళిపోయేడు.

"తండ్రి వున్నాడన్నమాటేగాని పిల్లలేం చదువుతున్నారో పట్టించుకుంటాడా ఏమైనానా? నా మాట వాడికేం లెక్క? చదువుకోమని గదమకూడదూ!"

సత్యనారాయణ సైకిల్ తీసుకుని వెళ్ళిపోయేడు.

ఇది మరో దృశ్యం.

"అసలు ఇంటర్మీడియట్ అంటేనే జీవితానికి పునాదిరా! పునాది. ఇందులో నీ పెర్‌ఫామెన్స్ మీద నీ జీవితం మొత్తం ఆధారపడి వుంటుంది. నీ పునాది ఓటిదైతే నీ భవిష్యత్తు కూలిపోతుంది. గట్టిదైతే మీద ఎన్ని అంతస్థులైనా నిలపవచ్చు. కాబట్టి చెప్పినట్లు విను. ఆనక విచారిస్తావు. నేను చూడు — ఇలా నీళ్ళు తోడుతూ, వంటచేస్తూ, బట్టలుతుకుతూ." ఇది నిత్యగాయత్రి జపం.

ఆరోజు సాయంత్రం మురళితోపాటు పదిమంది వచ్చేరు. ఒకడు గిటారూ, మరొకడు బాంజో, ఇంకొకడు ఇంకొకటీ – ఆర్కెస్ట్రా అంతా పట్టుకువచ్చి వెస్టరన్ మ్యూజిక్ మొదలెట్టారు – కుర్రాళ్ళు హుషారుగా వున్నారు. కమల పుస్తకం అవతల పడేసి వెళ్ళి వాళ్ళ దగ్గర కూర్చుని పరవశంగా వింటోంది.

మురళి గిటార్ వాయిస్తాడని తనకి తెలీదు. సత్యనారాయణ వసారాలో కూర్చుని సిగరెట్ కాల్చుకుంటున్నాడు.

విశాలాక్షి ఆంజనేయస్వామి గుడినుంచి వస్తోంది. చేతిలో కొబ్బరి చిప్పా, తిరుచూర్ణం పెట్టిన తమలపాకూ.

"ఎప్పుడూ వెధవ రేడియో వొకటి తగిలిస్తారు. హోటల్‌లాగ వెధవగోల" అనుకుంటూ లోపలికొచ్చి కొయ్యబారిపోయింది.

"బాగానే వుంది సంబరం! పరీక్షలు పట్టుమని రెండు నెలలు లేవు. ఇలా తైతెక్కలాడితే బాగుపడ్డట్లే" అని విసురుగా వంట యింట్లోకి పోయింది.

వాద్య సంగీతం ఆగిపోయింది, పదిమందీ వెళ్ళిపోయారు.

"వాళ్ళు వెళ్ళిపోయాక చివాట్లు ఎన్నయినా పెట్టు, భరిస్తాను. వాళ్ళ ఎదుట తిట్టకమ్మా, ఇద్దరం అలుసైపోతాం." మురళి భయం భయంగా అంటున్నాడు.

విశాలాక్షి గొంతు పెంచింది. పట్టుమని పదహారేళ్ళు లేని కుర్రవెధవ అప్పుడే నీతులు చెబుతున్నందుకు విచారించింది. తండ్రి వరండాలో వుండే కూడా తల్లికి అవమానం జరుగుతూంటే విని వూరుకున్నందుకు ఏడిచింది. తను కన్న కలలన్నీ తన కళ్ళముందరే చెదిరిపోతుంటే ఎలా భరించడమని వాపోయింది. మురళి పుస్తకాలు ముందు వేసుకుని కూర్చున్నాడు. కానీ వాడు చదవడంలేదు. సత్యనారాయణ మరో సిగరెట్టు వెలిగించేడు.

వంటగదిలోకొచ్చి విశాలక్షి ప్రక్కన నిలబడి – "చూడు విశాలా! వాళ్ళు పెద్దవాళ్ళౌతున్నారు. కొంచెం వాళ్ళని కూడా మన్నించడము నేర్చుకో. కాసేపు సరదాగా వాయిస్తే చదువుకేం లోపం? మనస్సుకి, మెదడుకి కాస్త విశ్రాంతి కావాలి తెలుసా! నువ్వు చల్లగాలికి గుడికి వెళ్ళి రాలేదూ? అలాగే, కాసేపు హాయిగా వాడూ."

"అవును, వాడూ మీలాగే ఆడుతూ పాడుతూ విశ్రాంతి తీసుకుంటూ బి.ఏ. మూడుసార్లు డింకీలు కొట్టి ఎక్కడో గుమాస్తాగా చేరితే బావుంటుంది. వాడు కూడా గదిన్నర యింట్లో వుంటూ, రెండు జతల బట్టల్తో సరిపెట్టుకుంటూ వుంటే బావుంటుంది. కష్టపడవలసిన టైంలో కష్టపడాలి, సుఖపడే టైంలో సుఖపడాలి. డాక్టరైనాక గిటార్లు వాయించుకోమను, డాన్సు చెయ్యమను – వాడిష్టం. ఇప్పుడు మాత్రం చదవాల్సిందే. తప్పదు తెలుసా!" అంటూ మురళికి వినపడేటట్లు గొంతు పెద్దదిచేసి అరిచింది.

సత్యనారాయణ కాలిపోయిన సిగరెట్టు ముక్కతో మరొకటి వెలిగించుకుని బయటకి వెళ్ళిపోయాడు.

మరో మూడురోజుల తరువాత మురళి తనకి సినిమాహాలు దగ్గర కనపడ్డాడు. తనని చూసి ఉలిక్కిపడ్డాడు.

"సినిమా చూడు, ఫరవాలేదు. అమ్మకి చెప్పనులే" అని తను వాడికి ఐదురూపాయల నోటు యిచ్చి భుజం తట్టేడు.

"వాడికి బొత్తిగా కెమిస్ట్రీ అర్థంకావడంలేదట. స్నేహితుడితో చెప్పించుకోడానికి వెళ్ళేడు. ఓ రెండొందలు పెట్టి ట్యూషన్‌లో చేర్పించకూడదూ? ఏమీ పట్టించుకోరు – ఎంతకని నేనొక్కదాన్నీ తంటాలుపడేది!" అని స్వాగత గీతం పాడింది.

"రెండేళ్ళబట్టి రూపాయి, అర్థా వేస్తూ వచ్చేను – ఆ కుండ పగల కొడితే రెండొంద లొస్తాయి. వాడిని రేపే వెళ్లి లెక్చరర్ ఇంట్లో అప్పగించి రండి – స్నేహితుల దగ్గర చేరితే చదువేం వస్తుంది–కబుర్లొస్తాయి" అని సలహా యిచ్చింది.

"సరే" అన్నాడు.

మురళి ట్యూషన్లో చేరేడు. ఏరోజు కారోజు వాడి నోట్సులు, టెక్స్టు పుస్తకాలు తనిఖీ చేసేది విశాలక్ష్మి.

మురళి చదువుకుంటూ వుంటే రాత్రి ఒంటిగంట వరకూ కాపలా కూర్చునే విశాలాక్షి వాడిని కుదిపి, నిద్రలేపి, టీ త్రాగించి చదివించే విశాలక్ష్మి, వీధిలో నిలబడి, "మా అబ్బాయి ఇంట్లోలేడు, తరువాత రండి" అని స్నేహితుల్ని వెళ్ళగొట్టిన విశాలక్ష్మి పనిమనిషిని మాన్పించి, అంట్లు తోమి, బట్టలు ఉతికి, ఆ డబ్బుతో వాడికి కోడిగుడ్లు, పాలూ రోజు ఇచ్చిన విశాలక్ష్మి, వాడికి మెడిసిన్‌లో సీటొస్తే తిరుపతి తీసుకువచ్చి తల నీలాలిస్తానని ముడుపు కట్టిన విశాలక్ష్మి, వాడి జీవితానికి గట్టి పునాది వేయాలని తపించిపోయిన విశాలక్ష్మి – ఆ విశాలక్ష్మి మొదలు నరికిన వృక్షంలా మంచంలో పడిపోయింది. ఇక లేస్తుందనే నమ్మకం లేకుండా చేస్తోంది.

"ఇంటర్ పరీక్షలతోనే జీవితం ముడిపడి లేదు. నువ్వు యింటికి రావాలి. మీ అమ్మ మంచం యెక్కింది, నిన్ను చూడనిదే బ్రతకలేదు, నువ్వు యెక్కడవున్నా వెంటనే రావాలి" అని పత్రికకి మరో ప్రకటన యివ్వడానికి ఆ చీకట్లో బయలుదేరేడు సత్యనారాయణ.

పత్రికలో తన మిత్రుడు వున్నాడు.

మురళి ఈ చుట్టుప్రక్కలే వుంటాడు, తప్పకుండా వస్తాడు అని అతనికి ఆశగా వుంది.

రిజల్ట్సు వచ్చాయని తెలియగానే స్నేహితులతో పత్రిక ఆఫీసుకి బయల్దేరుతున్న కొడుక్కి సాయిబాబా విభూతి పెట్టింది. దానిక్రింద అంజనేయస్వామి తిరుచూర్ణం పెట్టింది. వాడిచేత దేవుళ్ళందరికీ నమస్కారం చేయించింది.

"నీకు ఫస్టుక్లాసొస్తుంది, తప్పకుండా వస్తుంది. తల్లిదీవెన బ్రహ్మదీవెన అంటారు. ఇవ్వాళ అన్నీ శుభ శకునాలే. నువ్వు తప్పకుండా ఎంట్రెన్సు కూడా ప్యాసవుతావు" అంటూ వాడి నెత్తిన అక్షతలు కూడా వేసింది.

సెకండ్ క్లాసొచ్చిందని తెలిసిన మురళి ఇంటికి రాలేదు – నిన్న సాయంత్రం వెళ్ళినవాడు.

పత్రికాఫీసుకి నడుస్తున్న సత్యనారాయణ మనస్సు నిండా సందేహాలే. ఈ ప్రకటన చూసి మురళి తిరిగి వస్తాడా? వాడు రాకపోతే విశాల గతేమిటి? విశాలలేని ఇల్లు ఎలా వుంటుంది? ఊహలే భయంకరంగా వున్నాయి. వీధుల్లోని చీకటంతా అతని మనస్సులోకి వచ్చేసింది. అవునూ, ఈ పిచ్చి విశాలాక్షిని ఎడ్యుకేట్ చేయాలని ఒక్కరోజైనా తను ప్రయత్నించాడా? ఈ ప్రశ్నకి నిలువునా వణికిపోయాడు సత్యనారాయణ.

● *'సత్యవతి కథలు' సంపుటినుంచి. ప్రచురణ: డిసెంబర్ 1988* ●

★ ★ ★

దాసరి శిరీష

57

# అల

"అమ్మా? అవతల విధిలో గిరజ, సుధాకర్, రాణి అందరూ క్రిష్ణవాళ్ళింటికి వెళుతున్నారు. పేపర్స్ ఎక్కించుకుని వస్తారట."

"పోన్లే, నువ్వలాంటి కబుర్లు వినకు. అసలీ పరీక్షలయ్యే వరకూ ఎవరిళ్ళకీ వెళ్ళకు, మనసు పాడవుతుంది." అనునయంగా అన్నది మాలతి.

మధు పుస్తకం తెరిచాడు. పేజీలు తిరుగుతున్నాయి గాని మనస్సుకేమీ ఎక్కడం లేదు. కొడుక్కి కాస్త దూరంగా కూర్చుని చీర అంచులు కుడుతూ క్రీగంట వాణ్ణి గమనిస్తోంది మాలతి. వాడి సంఘర్షణ తనకి బాగా అర్థమవుతోంది. అందుకే ఉదయం నుంచి అవుటయిన పేపర్స్ భోగట్టాకోసం, బయటకు పరిగెత్తకుండా ఆపడం కోసం తను చాలా కష్టపడాల్సి వస్తోంది.

మధు అసంతృప్తిగా పుస్తకం మూసేసి వేళ్ళు విరుచుకున్నాడు. ఇంతలో కరెంట్ పోయింది.

"కొవ్వొత్తి వెలిగిస్తాను చదువుకుంటావా, లేకపోతే బయట కూర్చుందామా నాన్నా!" లాలనగా అంది.

"అదిగాదమ్మా, అసలొక్కసారి ఆ పేపరూ...."

"మధూ!"

"నువ్వే నాకేమీ తెలియనివ్వడం లేదు. మా ఫ్రెండ్స్ వాళ్ళ అమ్మలంతా ఎంతో ఎంకరేజ్ చేస్తున్నారు?"

"నువ్వు టెంత్ వరకూ రాబోయే పేపర్ల గురించి ముందే తెలుసుకుని రాశావా? కష్టపడి చదవలేదా? మార్కులు ఎప్పుడయినా తగ్గాయా?"

"ఇప్పుడలా కాదుగా? పేపర్స్ కొనుక్కున్న వాళ్ళందరికీ నాకన్నా మార్క్స్ ఎక్కువ వచ్చేయవా?" మధు కంఠం వణికింది.

"రావు. ప్రశ్నలన్నీ తెలుసుకున్నా, పేపరు మీద పద్ధతిగా అన్సరివ్వడం కాపీరాయుళ్ళకి రాదు."

"మా ఫ్రెండ్సంతా కాపీలు కొట్టేవాళ్ళు కాదు బాగా చదివేవాళ్ళు గూడా కొంటున్నారు. తప్పకుండా వాళ్ళకి నాకన్నా మంచి పెర్సంటేజ్ వస్తుంది." కళ్ళు తుడుచుకున్నాడు.

కొడుకు కళ్ళలో తడికి మాలతి ప్రాణం విలవిలలాడింది. అయినా నిబ్బరంగా "ఈ రకంగా మార్కులు సంపాదించినవాళ్ళు ఎప్పుడో ఒకసారి దెబ్బ తింటారు" అంది.

"ఏం తినరు." కసిగా అన్నాడు.

నవ్వు, బాధ, వైరాగ్యం ఒకేసారి వచ్చాయి. ఇది దెబ్బ తింటున్న వ్యవస్థ కాదు కుళ్ళిపోతున్న వ్యవస్థ తనలాంటివాళ్ళ మాటలు తాటాకు చప్పుళ్ళ కింద వస్తాయి. ఈ విపరీతమైన వేగంలో నిట్టూర్చి మృదువుగా అంది: "చూడు మధూ? ఈ ట్విన్ సిటీస్‌లో తప్ప ఆంధ్రా అంతా పేపర్స్ అవుటయ్యాయో లేదో తెలియదు. పెద్ద పెద్ద పట్టణాల్లో తప్పించి, అక్కడయినా మారుమూలల్లో తెలిసే అవకాశం లేదు. వాళ్ళ గురించి మంచి మార్కులకోసం చెడ్డ దారులు వద్దు. నీకేం, సిన్సియర్‌గా చదివావు. అంత సిన్సియర్‌గానే పరీక్షలు రాయి. ఇపుడు అవుటయిన పేపర్స్ చూసేస్తే అన్నీ నీకు బాగా తెలిసినవే అయినా సరే, సిన్సియర్‌గా పరీక్షల కొచ్చాను అనే తృప్తి మిగలదు. అలవాటు లేని పనిచేస్తే చాలా పిరికితనం వస్తుంది."

"రామారావ్ లేడండీ?" అంటూ గేటు దగ్గర్నించే కేక పెట్టాడు మూర్తి.

"లేరండీ...రండి... లోపలికి" అని ఆహ్వానించింది.

"ఏం లేదూ" అంటూ లోపలకొచ్చాడు. "వెళతానండీ పనుంది" అంటూ "మధు కోసమే తీసుకున్నాను" అంటూ జేబులో చెయ్యి పెట్టాడు.

"ఏమిటీ?" అంది బెదురుగా.

"అందరూ ఎగబడి మరీ కొంటుంటే మీరా ప్రయత్నాలేవీ చెయ్యరని నాకు తెలుసుననుకోండి. అయినా ఊరికే వచ్చాయి."

"మధూ! నువ్వు పైకెళ్ళు... మూర్తిగారూ! మీరు గూడా... అయినా నా సంగతి తెలిసుండీ..." ఆవేశం ఆపుకోవటం కష్టమయింది.

"డోంట్ గెట్ ఎక్సయిటెడ్! మా కస్టమర్ ఒకతను ఇచ్చాడు చాలా, కాపీలున్నాయని. ఊరికే పరీక్ష కెళ్ళేముందు ఓసారి చూసుకుంటాడని... పోనీ ఎవరికయిన ఇచ్చేయండి, ఎలాగూ నాకు టెంత్ చదివే పిల్లల్లేరు గదా!" నవ్వుతూ అన్నాడు.

"నేనలా ఎవరికీ ఇవ్వను." సీరియస్‌గా అంది. మూర్తి ఎప్పట్నించో ఈ కుటుంబానికి సన్నిహితుడు. అన్నేళ్ళ అనుబంధపు గట్టితనం వదులవుతున్నట్టుగా అనిపిస్తోంది.

"మధు ఎలాగూ బ్రిలియంటే మాలతిగారూ! మనమేం ప్రయత్నించలేదుగా, ఊరికే వచ్చాయి"

"మూర్తిగారూ!"... చేతులు జోడించింది. "మీ అందరితో ఎన్నోసార్లు నేను వాదించినా దెబ్బలాడినా మీరు సరదాగానే తీసుకున్నారు. నన్నభిమానిస్తూనే వచ్చారు. ఇప్పుడు గూడా ప్లీజ్! అర్థం చేసుకోండి. మధుని కన్విన్స్ చేయడానికి రెండ్రోజుల్నించీ చాలా కష్టపడుతున్నాను. సమాజం ఏ తీరులో ఉన్నా ఓ తల్లిగా నేను అవినీతి గుంటలో చేతులారా దింపలేను. తప్పు ఒప్పుల విశ్లేషణలు గూడా

మనకొద్దు. మనం చదువుకోలేదూ? పరీక్షలు రాయలేదూ? అలాగే... అలాగే – ఆ విధంగానే వీణ్ణిగూడా రాయనిద్దాం..." ఆ రోజంతా బిగబట్టిన అసహాయత, ఆవేదన, బాధ కన్నీళ్ళ రూపంలో బుగ్గల మీదికి జారాయి.

మూర్తి కలవరంగా "మాలతిగారూ! క్షమించండి. మీ ఆత్మ విశ్వాసానికి, ఎదురీతకీ ఇదిగో నమస్కరిస్తున్నాను. మిమ్మల్ని ఏడిపించాను, వెధవని. క్షమించండి" అంటూ పేపర్లు పరపరా చించి, ఆ ముక్కలు పట్టుకుని బయటకెళ్ళిపోయాడు.

కళ్ళు తుడుచుకుని తృప్తిగా నిట్టూర్చింది. మూర్తి తనని బాగా అర్థం చేసుకున్నాడు, చాలు. అయినా తనకి ఓపిక పోతోంది. తనేమిటిలా? చిన్నపిల్లలా... తను మాత్రమే ఏదో నిజాయితీ కోసం పోరాడుతున్నట్లు ఈ ఉద్రేకం... తన దారిని తను మరచిపోనంతవరకూ ఈ పోరాటానికి సిద్ధపడాలి. నిరాశ పడగూడదు.

"మధూ!" అని కేకేసింది.

"ఏంటమ్మా?" అని మెట్లు దిగి వచ్చాడు. తనకన్నా బాగా పొడుగ్గా ఉన్న, బాల్యాన్ని దాటుతున్న మధు ఆ క్షణంలో ఎంతో ముద్దుగా అనిపించాడు. తల నిమురుతూ "కోపం తగ్గిందా?" అంది ప్రేమగా.

"డోంట్ బీ సిల్లీ!" అన్నాడు పెద్దవాడిలా. నవ్వేసింది. "కొత్త మార్పుని తీసుకునేటప్పుడయినా బాగా ఆలోచించాలి. ఈ మధ్య రిజర్వేషన్స్‌కి వ్యతిరేకంగా పేరెంట్సందరూ ఊరేగింపులు జరపలేదా?"

"అవును."

"మెరిట్‌కి స్థానం కల్పించాలన్నదే కదా వాళ్ళ డిమాండ్?"

"ఊ."

"ఇప్పుడిలా పేపర్స్ కొనుక్కొని పిల్లలకి స్వయంగా అందిస్తున్న తల్లిదండ్రులని ఏమని పిలుద్దాం? వీళ్ళంతా వెనకబడిన వాళ్ళూనూ, పేపర్స్ కొనకుండా పిల్లల్ని పరీక్షలకి పంపేవాళ్ళు మాత్రం అగ్రజాతులునూ... అందామా?"

మధుకి తల్లి చెప్పింది చాలా న్యాయంగా అనిపించింది. "అవునమ్మా, మా క్లాస్‌మేట్స్ అమ్మలందరూ రిజర్వేషన్స్‌ని బాగా తిట్టిపోశారు. నువ్వే తిట్టలేదు, మనది ఫార్వర్డ్ కేస్టయినా."

"కేస్ట్ గురించి వద్దులే. ఆర్థికంగాకన్నా సామాజికంగా మనకెంతో సెక్యూరిటీ ఉంది. ఆ సెక్యూరిటీ వల్ల మనం ఎలాగైనా నిలదొక్కుకోగలం. ఈ వ్యవస్థ వల్ల ఆర్థికంగా, సామాజికంగా, నలిగిన ఎంతోమందికి మంచి పుష్ ఇస్తేగాని వాళ్ళకి సంఘంలో సముచితమైన స్థానం రాదు అనేది అసలీ రిజర్వేషన్స్ ఏర్పడడానికి ప్రాతిపదిక. సరే, ఆ గొడవ వదిలేద్దాం. గవర్నమెంట్ వల్ల ప్రతిభకి అన్యాయం జరుగుతోందనిపించిన ఈ ప్రజలందరికీ, ఇలా పేపర్స్ అవుటవడం వల్ల మంచి స్టూడెంట్సందరూ ఎంతో కృంగిపోతారనిపించడం లేదా? ఎవరికీ చీమ కుట్టనయినా లేదే? తిరుగుబాటు చెయ్యరేం? అంటే, ఏ సమస్యకయినా మూల సూత్రాల జోలికి ఎవరూ వెళ్ళలేరు. మెరిట్‌ని ఏ రూపంలో కొనడానికయినా సిద్ధపడే ప్రజలకి సరయిన చైతన్యం లేదని బాగా తెలుస్తోంది."

"మరి వాళ్ళు ఊరేగింపుని మెచ్చుకున్నావు. ఇప్పుడేమో ఇలా..." ఆసక్తిగా, సందేహంగా అన్నాడు.

"నిజమే, మెచ్చుకున్నాను. ఒక్కసారిగా అంతమందిలో ఒకేరకమయిన స్పందన కలిగినందుకు ఆనందపడ్డాను. విషయం ఏదయినా ఎవరి బాధ వాళ్ళది కదా? ఒక్కటే మధూ, పెత్తందారీతనాన్ని తప్పనిసరిగా అంగీకరిచడంవల్ల వచ్చే నిస్సహాయతలో కలిగే అసంతృప్తిని, ఈ రకంగా వెళ్ళగక్కి కొంత రిలీఫ్ పొందుతున్నారా ఈ మిడిల్ క్లాస్ పీపుల్ అని అనిపిస్తుంటోంది నాకు."

తల్లివైపు అభిమానంగా, వింతగా చూస్తుండి పోయాడు మధు. ఆమె ఆవేశంలో దయ, జాలి ఉంటాయి. ఆలోచనల్లో ఎప్పుడూ మూలకారణాలని వెతికి పట్టుకునే పట్టుదలా, నిశ్చలతా ఉంటాయి. అందుకే అందర్లాగా నినాదాల గీతాలు పాడదు, విప్లవ సంగీతం వినదు.

☆ ☆ ☆

ప్రతీరోజూ పరీక్ష రాయడానికి తనతోపాటుగా స్కూలుకి తోడుగా వస్తున్న తల్లిని చూస్తుంటే ఆనందం, సిగ్గు, నిశ్చింత–అన్నీ కలగాపులగంగా కలుగుతున్నాయి మధుకి. తతిమ్మా పిల్లలెవరూ తల్లుల్ని వెంటేసుకురావడం లేదు. ఒకటి రెండు రోజులు తండ్రులే వచ్చారేమో – అంతే. ఎక్కువ మంది పరీక్షలు అద్భుతంగా రాస్తున్నామని చెప్పుకుంటున్నవాళ్ళే. కనీసం పాస్ మార్కులు రావేమో అని ఆశలు వదిలేసుకున్న కుర్రాళ్ళెంతో మంది నూటికి ఎనభయ్యికి తక్కువ రావు అని సగర్వంగా చెప్పుకుంటున్నారు.

"నాకు కనీసం ఇంటర్‌లో సీట్ గూడా రాదులే." నిష్ఠురంగా అన్నాడు మధు. పరీక్షలు సగం పైగా అయిపోయాయి.

పరీక్షల అలసటతో నీరసంగా ఉన్న కొడుకుని చూస్తుంటే మాలతికి వాత్సల్యం, జాలి పొంగుకొచ్చాయి. హార్లిక్స్ అందిస్తూ నవ్వింది.

"అందరికన్నా పూర్ మార్క్స్ నాకే వస్తాయి."

"న్యాయమైన మార్కులు నువ్వు చెప్పిన ప్రకారమే అయితే అన్యాయమంతా మార్కుల రూపంలో ఓ పెద్ద అవతారమెత్తబోతోందన్నమాట! చూద్దాం, ఎటువంటి మార్పులు వస్తాయో మరి."

మర్నాడు పేపరు చూపిస్తూ "చూశావా, ప్రజలంతా తెలివి మీరారు. పాపం, ప్రభుత్వం గుడ్డిది అనుకోవడం, నీలాగా ఊరికే వర్రీ అవడం ఎంత తెలివి తక్కువతనమో చూడు" అంది.

పేపర్స్ అవుటయిన కారణంగా ఇంతవరకు రాసిన పరీక్షలన్నీ రద్దు చేయడం, ఆ తప్పుని అంగీకరిస్తూ విద్యామంత్రి రాజీనామాచేయడం అన్నీ వివరంగా చదివాడు మధు.

"అన్ని పరీక్షలూ కాన్సిలా? అన్నీ నేను బాగానే రాశాను." ఏడుస్తూ అన్నాడు.

"ఛా, ఛా, ఏడవకమ్మా!" కళ్ళు తుడుస్తూ దగ్గరకు తీసుకుంది.

"ఇక నేను చదవలేనమ్మా, ఈసారి పేపర్స్ ఎలా ఉంటాయో!" డీలా పడిపోతూ దీనంగా అన్నాడు.

"ఓ అన్యాయాన్ని ప్రతిఘటించడంలో ఎన్నో త్యాగాలు అవసరమవుతాయి. అన్ని జిల్లాల్లో నిజాయితీగా రాసిన ఎంతో మంది పిల్లలు ఇలా బెంబేలుపడక తప్పదు. చూద్దాం, అన్నీ కాన్సిల్ అంటే ఎవరూ ఊరుకోరు. సమస్య నీ ఒక్కడిదే కాదుగా? రాష్ట్రమంతటా ఎంతో మంది. ఊరుకో మరి, నాన్న గదూ?" చాలా సేపు ఊరడించి మొత్తానికి వాడి బాధ పోగొట్టగలిగింది.

"వాణ్ణి చాలా గారం చేస్తున్నావ్" అంటూ వెక్కిరింపుగా అనే ఆమె భర్త గూడా కొడుకు నీపరిస్థితిలో చూసి చలించాడు.

మళ్ళీ నాలుగు రోజుల తరవాత వచ్చిన వార్తని ఆనందంగా చూపెంచింది మాలతి. కేవలం అవుటయిన పేపర్స్ మాత్రమే కాన్సిల్ చేస్తారు. మిగతా పేపర్స్ వేల్యూ చేస్తారు. తిరిగి పరీక్షలు ఎప్పుడు పెడతారో ప్రకటిస్తారు.

పేపరు చదువుతున్న మధు మోహం వికసించింది. "అమ్మయ్య" అన్నాడు తేలిగ్గా నవ్వుతూ. కళ్ళు తేటగా మెరుస్తున్నాయి.

సంభ్రమంగా వాడ్ని చూసుకుంటూ, చెమర్చిన కళ్ళు తడుచుకుంటూ "న్యాయం ఎప్పుడూ నిరాశా వలయాల్లోంచే హుందాగా నడుచుకుంటూ వస్తూంటూంది. నిజాయితీ సరదాలతో చిరునవ్వుతో అభయమిస్తుంటుంది" అని గొణిగింది.

మధు ఆశ్చర్యంగా తల్లిని చూస్తూ నవ్వుకున్నాడు. "అమ్మేవిటోమరి" అనుకున్నాడు ఎప్పటిలాగానే.

● *ప్రచురణ, 1988* ●

★ ★ ★

58

డా॥ లంకిపల్లె

# కడియాలు

భూమయ్య వూరు వదిలి వెళ్ళటానికి ఒప్పుకొన్నాడనే వార్త తెల్లవారక ముందే ఊరంతా పాక్కింది.

"భూమయ్య ఊరు వదలి వెళ్ళిపోతున్నాడు"-

ఆడా, మగా, పిల్లా, జెల్లా, ముసలీ ముతక ఊర్లో ఎవరి నోటా అదేమాట. ప్రతి ఇంటా అదే వార్త గుప్పుమంటూ వుంది. విషాద గ్రహణం పల్లెను చుట్టుముట్టినట్లుంది.

తరతరాలుగా వున్న భూమయ్య కుటుంబం చేను, చెట్టు, భూమి, ఊరు వదలి వెళ్తున్నాడంటే పల్లె చిన్నపోయింది. పెనవేసుకొన్న మమతానురాగాలు, బంధుత్వాలు తెంచుకొని పోతున్న భూమయ్య సంసారం పట్ల ఊరికి సానుభూతి ఉంది. అదే చింతతో పల్లెలో కలకలంతో సంక్షోభం చెలరేగింది.

ఉన్నదానితో సంతృప్తిపడి, అందనివాటికి అర్రులు చాచక, పరువు ప్రతిష్టలతో బ్రతికిన సామాన్య రైతు భూమయ్య. ఊరు వదులుతున్న భూమయ్య ఊరి కళ్ళలో మెదలాడుతున్నాడు. ఆపదలో తోడివారిని ఆదుకొని పండుగ పబ్బాలలో సంతోష సంబరాలు పంచిపెట్టిన భూమయ్య తలవంచుకొని ఊరు వదలిపెడ్తున్నాడంటే ప్రతి మనిషిలో దుఃఖం ఎదనిండ తన్నుకొచ్చింది.

జీవితం పండినా భూమయ్యలో పొలం పనులు చేయాలనే కోరిక చావలేదు. ఏదో తపన వుంది. నారు పోయాలని, ఏపుగా పెరిగే పైరు పచ్చదనం మధ్య తిరగాలని ఎన్నెన్నో కోరికలు. మట్టితో ఆడిన మనిషి. చెట్టుచేమలతో కలిసి మెలసి పెరిగిన వ్యక్తి. అతని కోరికలు తీరాలంటే కష్టపడాలి. చిన్నతనంనుండే పొలం పనిలో రేయిపగలు చక్రంలా తిరిగిన శరీరం ఎముకల గూడై పటిష్టంగా లేదు. కండరాలు పట్టుతప్పాయి. కీళ్ళు సక్రమంగా కదలటం లేదు. పైరు పెట్టాలంటే ఉత్సాహం తగ్గిపోయింది. కావి పైరుపై మమకారంతో పనులు సాగిస్తున్నాడు. అది తెలుసు ఊరికి.

భూమికి అంకితమై పంట పండించే రైతుకు దారుణమైన అవమానం జరిగింది. భూమయ్య తలెత్తుక తిరగలేని పరాభవం జరిగింది. అందుకే అన్ని బంధాలు తెంచుకొని వెళ్ళిపోతున్నాడు భూమయ్య-పల్లె మూగహృదయం తల్లడిల్లింది.

భూమయ్య పల్లెకంతా కన్ను గలిగిన మనిషి. అతడు దూరమవుతాడనే దిగులుతో అందరిలో అంధకారం గూడుకట్టుకొన్నది. పొద్దు మొలచినా చీకటి తొలగినట్లనిపించలేదు జనానికి.

☆ ☆ ☆

భూమయ్య ఊడలు దిగిన మర్రి చెట్టుకింద కూచున్నాడు, రాతి బొమ్మలా. అది భూమయ్య ముత్తాత నాటిన చెట్టు. అతనికి బుద్ధి తెలిసేటప్పటికి ఎడచెట్టు. చెట్టుమీద పక్షులు లేచాయి. పోతూ పోతూ రెట్టవేసి పోయాయి. రెట్ట మర్రి ఆకులమీద నుండి జారి కొంత భూమయ్య నెత్తిమీద పడింది. భూమయ్యకు హరికథలో విన్న భారతంలో కౌశికుని కథ గుర్తుకొచ్చింది–

చెట్టుమీద నుండి తనపై రెట్టవేసిన పక్షిని కళ్ళెర్రజేసి చూశాడు. అతని కోపాగ్నికి పక్షి నేలపడి బూడిద అయ్యింది–కౌశికుడు తపోధనుడు. పంట సమారాధన చేసే సామాన్య రైతు భూమయ్య. కౌశికుడు తపోధనుడయినా ఆకలిబాధకు అతీతుడు కాడు. ఆకలిమంటను చల్లార్చగలిగినవాడు రైతు ఒక్కడే. భూమయ్య తల పైకెత్తి మర్రిచెట్టును చూశాడు. మర్రిచెట్టులో రెమ్మలు నల్లగా పెద్ద మునీశ్వరుని జడల్లా కదులుతున్నాయి.అది కరువుకాటకాలకు, తుఫానులకు, సుడిగాలులకు ఎదురొడ్డి నిలువగలిగిన చెట్టు.

భూమయ్య మనసులో నిన్న నీడలా వుంది. నేడు చీకటిలా వుంది. మరి రేపు ఎలా వుంటుందో?–అదే ఆలోచనలతో భూమయ్య మనసు సుడులు తిరుగుతూ వుంది.

భూమయ్యలో నిన్నటి నీడ కదిలింది–సరిగ్గా ఇరవైనాలుగు గంటల్లో ఎంత అనుభవం, ఎంత మార్పు!–

☆ ☆ ☆

క్రితంరోజు–

భూమయ్య గోగునారతో గోతం మూతి బిగించి కట్టాడు. అలవాటు ప్రకారం కొడవలి మొల్లో చెక్కుకొన్నాడు. మడిని చుట్టూ కలయజూశాడు. పచ్చదనం ఎక్కడా కనబడలేదు.

భూమయ్యకు భారంగా నవ్వు వచ్చింది, బాధలో నుండి. గోతం మూట నెత్తికెత్తుకున్నాడు. గోతం బరువు తేలికగా తోచింది. మడి గనాలు దాటి కాలిదారి పట్టాడు. గోతంలో గట్టిదనం లేదు. మూట భూమయ్య తల చుట్టూ వంగింది. ఎదుటిమనిషి సరిగా కన్పడనంతగా అడ్డుపడింది.

భూమయ్యకు చిన్నమ్మ ఎదురైంది.

"బాయిలో బండపడె
బక్కెద్దు నేలపడె
భూదేవి తెల్లపడె
భూమయ్య దిగులుపడె"–

మెల్లగా నవ్వుతూ అన్నది చిన్నమ్మ.

"ఎవరది? ఆ మాట మరోమారు అన్నావో నీ నాలుక కోసేస్తా."

భూమయ్య చెయ్యి కొడవలిమీద పడింది.

"భూమయ్య మామా! ఎందుకు మండిపడతావు? ఎగతాళిగా ఏదో అన్నా. అంతే–"

చిన్నమ్మ బిక్కరించింది. పలుకునుబట్టి చిన్నమ్మని గ్రహించాడు భూమయ్య.

"తప్పు మన్నించు."

చిన్నమ్మ తమాషాగా మెల్లగా నవ్వింది. భూమయ్య తేలిగ్గా నవ్వాడు.

ఊరిదారి తొలగి పడమటిగా వెళ్తున్న భూమయ్యను చూచింది చిన్నమ్మ.

"ఏయ్? మామా! అటు ఎందుకు వెళ్తున్నావ్? దారి ఇటు."

"నీ వెంట రమ్మంటావా?"

"ఏం, వేళాకోళంగా వుందా? తల నరిసినా సరసం పోలేదు."

"నీతో సరసంగా మాట్లాడితేనే అందంగా వుంటుంది."

"అంతేలే. ఇంటికాడ తులసమ్మక్క దగ్గర మాట్లాడితే నీ మీసం గుంజుతుంది....."

"మీ అక్క మనసు నీకేం తెలుసు?"

అది వయసుమళ్ళిన బావామరదళ్ళ సరసం. పల్లెలో బావామరదళ్ళు, అన్నా తమ్ముళ్ళు, అక్కాచెల్లెళ్ళ వరసలకు అంతస్తులు, జాతి, కుల, మత భేదాలు లేవు.

క్షణం ఆగిన భూమయ్య కాలు కదిపాడు. తన మాట వినిపించుకోకుండా ఊపేరి పడమటి దారిపట్టిన భూమయ్యను మరోమారు హెచ్చరించింది చిన్నమ్మ.

"ఏయ్ మామా! అటు ఎక్కడికి?!"

"బుద్ధిలేనివారికి గడ్డి పెట్టడానికి."

ఎండుగడ్డి కొడవలితో పరపర కోసినట్లు దొర్లాయి భూమయ్య మాటలు.

చిన్నమ్మకు భూమయ్య ధోరణే అర్థంకాలేదు. ముక్కుమీద వేలేసుకొని పల్లెదారి పట్టింది.

భూమయ్య నడక వేగం హెచ్చింది. మదిలో ఆలోచనలు కదిలాయి. సేద్యం చేసే ఓపిక తగ్గిన వయసు. కొడుకు రామకృష్ణ, కోడలు తమతో రమ్మంటారు. కాని పల్లె వదలాలంటే బుద్ధి పుట్టడంలేదు. అయితే పల్లె వాతావరణం మారుతూవుంది. వానలు సక్రమంగా పడటంలేదు. సమయానికి కూలీలు అందరు. అన్నీ ఏదో విధంగా సర్దుబాటయితే నీటి ఎద్దడి తరుముకొస్తుంది. పచ్చని పైరు కళ తప్పుతుంటే మనసు వికలమవుతుంది.....

కొడుకు వద్దన్నా బావిని లోతు తవ్వించే ప్రయత్నం చేశాడు భూమయ్య. మెత్తగా తెగిన బావిలో పదో మట్టులో సమంగా నల్లబండ వచ్చింది, అందుకే చిన్నమ్మ ఎగతాళి చేసింది.....

భూమయ్య కడుపుకట్టి కొడుకును చదివించాడు. ఫలితం దక్కింది.....ఉద్యోగం చేస్తున్న కొడుక్కు డబ్బు పంపమని జాబు రాశాడు. సమయానికి డబ్బు వుందో, లేదో జవాబు రాలేదు....దూకుడు గాలి ఒక్కమారుగా వెనక్కు నెట్టింది భూమయ్యను.

అతికష్టంతో నిలదొక్కుకొన్నాడు. పది రోజులుగా ఒకటే విసురు గాలి. భూమిలో ఎక్కడో వున్న తేమను కూడా లాగేసింది. భూమి పచ్చదనాన్ని కోల్పోయింది. రైతాంగంలో నిరాశ నిస్పృహలు ఆవరించాయి. రైతు నీరసంతో కృంగిపోయాడు.

భూమయ్య బొటనవేలికి ఎదురురాయి తగిలింది. నడక ఆపి వంగి చూశాడు. వేలు మొద్దుబారినట్లయింది. కాలు కదిలింది. నడక సాగే కొద్దీ బొటనవేలి నుండి రక్తం కారుతూ వుంది. నొప్పి జివ్వుమని పీకుతూ వుంది. రైతు అలాంటి దెబ్బలు ఖాతరు చేయకపోవడమే దానికి మందు.

గాలి వీస్తున్నా భూమయ్యకు నీరెండకు చెమటలు పట్టాయి. తేలిగ్గా వున్న గోతం బరువెక్కింది. శవాన్ని మోస్తున్న పట్టువదలని విక్రమార్కుడిలా ఉద్వేగంతో నడిచాడు భూమయ్య. తడిలేని కొండరాశివంక దాటాడు. పచ్చదనం లేని పాలకలగుట్ట, పల్లేరుకాయలపెంట దాటాడు. ఎండ తీవ్రత హెచ్చింది. చెమటతో ముతక బనియన్ తడిసి మురికి కారింది.

☆ ☆ ☆

భూమయ్య బ్యాంకు వరండాలో నెత్తమీద మూట దించాడు. తలగుడ్డ వూడి కిందపడింది. సగం నెరసిన జుట్టు మంచిచెడ్డల తర్జనభర్జన చేసే వితరణను గుర్తు చేస్తూవుంది. రెండుమార్లు తలగుడ్డను విదిల్చాడు. భూమయ్య తల విదిల్చిన శబ్దానికి బ్యాంకు కౌంటరులో వున్న ఉద్యోగులు తల ఎత్తి చూశారు.

అధికారులు బ్యాంకులో అడుగుపెట్టిన భూమయ్యను వింతగా చూశారు. చెదిరిన జుట్టు, మాసిన గడ్డం, లోతుకు పీక్కుపోయిన కళ్ళు– విచిత్రవ్యక్తిలా కన్పడ్డాడు భూమయ్య.

"ఎవరు నువ్వు?"

అధికార దర్పం కొట్టవచ్చినట్లుంది, ఆఫీసరు ప్రశ్నలో.

"రైతును."

భూమయ్య వినయంగానే చెప్పాడు.

"అది తెలుస్తూనే వుంది."

అధికారి కనుబొమ్మ లెగరేశాడు.

అధికారి హేళన భావం, తేలిక చూపులు భూమయ్య ఎదను తాకాయి. కుబేరుని ముందు కుచేలుడులా నిల్చున్నాడు.

"ఏం కావాలి?"

"పెద్ద ఆఫీసరుతో మాట్లాడుదామని......"

"ఆఫీసరుతో ఏం మాట్లాడుతావు? నీకేం పని?"

"పంటల అప్పు తీసుకొన్నాను."

"డబ్బు తెచ్చావా?"

"లేదు."

"మరి!"

"అప్పుచేసి పెట్టిన పంటను యిచ్చిపోదామని తెచ్చినా!" మెల్లగా నవ్వుతూ అన్నాడు.

"నీ పంటను కొలిచి అమ్మే వ్యాపారం చేసే ఉద్యోగాలు కాదు మేం చేసేది."

"మీరేం చేస్తుంటారో నాకు తెలియదు....."

భూమయ్య మాటలు పూర్తికాక ముందే అధికారుల మాటలు పెళుసుగా దొర్లాయి.

"నీకు చెప్పాలా?"

"వినాలని వుంది."

"విని మా ఉద్యోగాలు ఊడకొడ్తావా?"

"నాకు అంత అధికారం లేదు."

"మా కుర్చీలో కూర్చుంటావా?"

"మా అయ్య అక్షరజ్ఞానంలేని అమాయకుడు. నాకు అంతవరకు చదువు చెప్పించలేదు. ఏదో వానాకాలం చదువు. మీ కుర్చీలో కూచోవడానికి పెద్ద చదువులు చదివినవారు చాలామంది ఎదురుచూస్తున్నారు. కాని నేను చేసేపని మీ రెవ్వరు చెయ్యలేరు."

కౌంటర్ వెనుక పెద్ద టేబుల్ మీద పెద్ద పెద్ద పుస్తకాల మధ్య కూచొన్న అధికారి చేతిలో చిన్న ట్రాన్సిస్టర్ వుంది. అతని చుట్టూ మిగతావారు వంతులవారిగా ట్రాన్సిస్టర్‌లో వచ్చే క్రికెట్ కామెంటరి వింటున్నారు. తలమునకలవుతున్నారు. వాస్తవానికి భూమయ్య గోడు పట్టించుకొన్న పాపాన పోలేదు వారు. అధికార్ల నిర్లక్ష్యానికి గురైన భూమయ్యకు కోపం వచ్చింది.

టీ కప్పులు అందుకొన్నారు అధికారులు. తాపీగా టీ తాగారు. అధికారులు ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు. భూమయ్యకు తెలియని భాషలో ఏదో మాట్లాడుకొన్నారు. కరెంటు లేదు. ఫ్యాన్లు తిరగటంలేదు. చెమటలు తుడుచుకుంటున్న అధికారులకు చిరాకు కలిగింది. చిరాకుతో చులకనగా మాట్లాడారు భూమయ్యను.

"చదువు సంధ్యలు అబ్బని చవటలు చేసేపని వ్యవసాయం."

భూమయ్యకు జాటీతో కొట్టనట్లనిపించింది.

"అక్షరాలు వచ్చి, కొంగలు అడుసు మడిలో తొక్కినట్లు గీతలు పెట్టేవారందరు మేధావులు కారు.. ..చదువుకొనే సౌకర్యాలు లేక ఆర్థిక ఇబ్బందులతో చదువు మాని భూమిదున్ని కష్టించి పంట పండించే వారందరూ చవటలు కారు."

"బాగా మాటలు నేర్చినట్లున్నావే?"

భూమయ్య మూగబాధతో అధికారిని చూశాడు.

కష్టాల కుంపటిలో రగిలే రవ్వలు భూమయ్య మాటలు. రగులుతున్న కుంపటిని కెలికితే మిణుగుర్లను ఆపటం కష్టం. భూమయ్య వచ్చిన పని ఎంత ప్రయత్నించినా సజావుగా జరగటంలేదు. ఎవరితోనూ వాదించటానికి, జగడానికి రాలేదు. అధికార్లు భూమయ్యను రెచ్చగొట్టే మాటలతో బంతి ఆట ఆడుకొంటున్నారు. భూమయ్యకు

దాహం వేసింది. కాని నీరు అడిగే సాహసం చేయలేదు. అధికార్లు సంభాషణ తీరిగ్గా పొడిగించారు.

"నీ పేరేమిటన్నావ్?"

"భూమయ్య."

"ఆహాఁ. ఇంతకూ నువ్వు చెప్పేదేమిటి?"

"మీ రిచ్చిన అప్పుతో పైరు పెట్టి కోసుకొచ్చినా....."

"పెద్దాయనా! అతి తెలివిగా వాగకు. మేం ఇచ్చింది డబ్బు. ఆ డబ్బు కట్టి అప్పు తీర్చు. అనవసరంగా మమ్మల్ని విసిగించి మా టైమ్ వేస్టు చేయకు."

"మీ అప్పుకు డబ్బే కట్టాలా?"

"అవును."

అధికార్లు నిన్నకాదు–మొన్నరోజు ఊరిమీద పడి గందరగోళం చేసిన విషయం గుర్తుకొచ్చింది.

"అయితే. నిన్న నేను లేనప్పుడు ఇంటి దగ్గర ఆడవాళ్ళను బెదిరించి రాగి అండా తీసుకొని వచ్చారట?"

"ఓహో, అదా? ఇంటి దగ్గర నువ్వు వుండివుంటే నిన్నే తీసుకొచ్చేవాళ్ళం."

అది నోట్లు లెక్కపెడ్తున్న ఆఫీసరు హెచ్చరిక!

బాగా కాగిన నూనె ముఖంమీద చల్లినట్లు అనిపించింది.

"ఆఁ"–నోరు తెరిచాడు భూమయ్య.

కౌంటరులో వున్నవారు కరెన్సీ మింగరు. తినేది అన్నం. పంట ఎలా పండుతుందో బ్యాంకులో వున్నవారికి ఎంతమందికి తెలుసు? పంట పండించే రైతంటే ఎంత చులకన భావం!–భూమయ్య మనసు ఆశ్చర్యంతో మూగబోయింది.

"అప్పు కట్టవలసిన గడువు తీరింది. నోటీసు కూడా పంపించాము. అప్పటికీ నీకు అప్పు సంగతి గుర్తుకు రాలేదా?"

"అప్పును గురించి ఎప్పుడూ మరవలేదు."

"మరెందుకు కట్టలేదు?"

అధికారుల రెట్టింపు హెచ్చింది. వారికి నేలపై పారేడే పురుగులా కనిపించాడు ఆరడుగుల భూమయ్య.

"సమయానికి సర్దుబాటు కాలేదు."

"అప్పుతీర్చే శక్తిలేనివాడివి అప్పెందుకు తీసుకోవాలి?"

అప్పు లేనిదే అనంత ఐశ్వర్యం. కాని రైతాంగానికీ, ఆ అనంత ఐశ్వర్యానికీ మధ్య అనంత దూరం. ఆ విషయం అధికారుల కెలా చెప్పాలి?

దీర్ఘంగా నిట్టూర్చాడు భూమయ్య. ఉద్దండ పండితుల మధ్య పామరుడిలా నిల్చున్నాడు. అధికార్లు ఒకరి తరువాత ఒకరు ప్రశ్నలవర్షం కురిపిస్తున్నారు. భూమయ్య అవసరమైనప్పుడు ఎన్నోమార్లు వడగళ్ళ వానలో పనిచేశాడు ఉత్సాహంగా. కాని అధికారుల ప్రశ్నలతో వళ్ళు తూట్లు పడుతున్నట్లనిపించింది. భూమయ్య కోపాన్ని దిగమింగి, తనను తాను సంబాళించుకొని నెమ్మదిగా చెప్పాడు. అది రైతు

విప్పిన కష్టాల మూట. భూమయ్య మాట్లాడుతుంటే-కణతలమీద తేలిన నరాలు కదులుతున్నాయి.

"రైతుకొక తల్లి వుంది. ఆ తల్లికి ఆకలి ఎక్కువ. ఆమె ఆకలి తీర్చటానికి అప్పుచేయవలసి వస్తుంది. కండలు కరగించినా, ఎముకలు వంచి కష్టించినా ఆమెకు కనికరంలేదు. నరాలు సాగేలా పనిచేసి మా రక్తం మరిగించి చెమటతో తడిపినా ఆమెకు సంతృప్తిలేదు. రేయీ పగలు ఎండా వానలో ఆమె ఎండి తడుస్తుంది. మమ్మల్ని తికమక పెడ్తుంది. ఆమె పులకరించి మమ్మల్ని ఉత్సాహపరుస్తుంది. పుడమి తల్లి రైతులనే మమ్మల్ని ఆడిస్తుంది. పాడిస్తుంది. చివరికి ఒక్కోమారు ఏడిపిస్తుంది."

భూమయ్య ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వడగాల్పుల్లా వున్నాయి. మాటలు నెమ్మదిగా వచ్చినా ఎదలో రగిలే బాధకు అవి అద్దం పట్టాయి.

"నీకు కవిత్వం కూడ వచ్చునే?"

విడ్డూరంగా నవ్వారు అధికారులు.

"ప్రకృతి ఒడిలో పుట్టి పెరిగినవాడిని. అంతా ఆమె చలవే.....ఆకరు మాట.... భూమిని నమ్మిన మా ఆకలి తీర్చటానికే మా దగ్గర డబ్బు మిగలదు. ఇక ఆమె ఆకలి ఎలా తీర్చగలం?-ఆమె ఆకలి నీటితో, ఎరువుతో తీర్చకపోతే పచ్చని పైరు పెరగదు. పైరు లేక పంటలేదు. పంటలేక మనిషి బ్రతుకులేదు.... అందుకని అప్పులు ఇస్తామన్న మీ ప్రకటనలు విని, రైతును ఉద్ధరిస్తామనే పెద్దల మాటలు నమ్మి, ఆశపడి అప్పుతీసుకొన్నాం. మాలాంటివాళ్ళ మెందరమో ఆ తల్లితోపాటు మా తలలు కూడ కుదువ పెట్టినాము."

"ఇన్ని నేర్చిన వాడివి నీకు తీసుకొన్న అప్పు తీర్చాలని తెలియదా?"

వాచాలత్వం వున్న పదిమంది లాయర్లముందు దోషిలా నిల్చున్న అమాయక భూమయ్య నిర్జీవంగా నవ్వాడు. ఇక తను చెప్పదలచుకొన్నది స్పష్టంగా చెప్పాలనుకొన్నాడు.

"అప్పు అక్షరాల తీర్చవలసిందే ....అది హరిశ్చంద్రుణ్ణే కూడా వదలలేదు.....రాజుచేత ఆలుబిడ్డల్ని అమ్మించి కాటికాపరిని చేసింది."

అధికార్ల ముందుకు మరోమారు టీ కప్పులు వచ్చాయి.

నింపాదిగా 'టీ'లు తాగుతూ క్రికెట్ కామెంటరీ వింటున్నారు.

అప్పటికే అక్కడ చాలామంది రైతులు చేరారు. వ్యాపారం చేసేవాళ్ళు, ఉద్యోగాలు చేసేవాళ్ళు, చదువుకొన్నవాళ్ళు-వచ్చి వెళ్తున్నారు. భూమయ్యను ఎగాదిగా చూసి ముసిముసి నవ్వులతో హేళనగా పరామర్శించి వెళ్తున్నారు ఉద్యోగులు, వ్యాపారులు.

భూమయ్యలో వేచి వుండే ఓపిక తగ్గింది. భూమయ్య నెత్తిమీద మోసుకొచ్చి దించిన మూట విప్పాడు. మూటను కుమ్మరించి గోతం విదిల్చాడు. పొట్టిరకాల నిండు పొట్టకర్ర వరి తెల్లగా ఎండిపోయింది. కుప్పను చూస్తున్న భూమయ్య ముఖం పాలిపోయింది. అప్పటికే అక్కడ చేరిన రైతుల కళ్ళు బాధతో చెమ్మగిల్లాయి. బ్యాంకు అధికార్ల కోపం తారాస్థాయికి చేరుకొన్నది. పెద్దలు తారురోడ్లమీద తిరిగే వాహనాలకు కూడా భీమా పద్ధతి వుంది. కాని రైతు తీసుకొన్న పంట అప్పు పెరుగుతుంది, పంట పండినా ఎండినా. బ్యాంకు ఆఫీసర్లకు ఎండిన పొట్టకర్ర పైరు

కుప్ప కన్పడనట్లుంది. వారికి కనిపించింది. అధికార ధిక్కారం. క్రికెట్ కామెంటరీ ఆగిపోయింది. కళ్ళెర్రజేసి భూమయ్యను చూశారు.

"అయ్యా, తమ రేదో పెద్ద మొనగాడులా మాట్లాడుతున్నావనుకోవద్దు. నీ వాలకం, చేతలు చూస్తుంటే కోపం ముంచుకొస్తోంది......అప్పు కట్టకపోతే నిన్ను ఇక్కడనుండి కదలనివ్వం."

పెద్ద ఆఫీసరు హెచ్చరించాడు. అందులో బెదిరింపు వుంది. అప్రయత్నంగా భూమయ్య చేయి మొలలోని కొడవలిమీద పడింది, మామూలు అలవాటు ప్రకారం.

"ఖూనీ చేయటానికి వచ్చావా?"

ఆఫీసర్లు నిప్పులు చెరిగారు. భూమయ్య నోట మాట రాలేదు. అతని నోట తడి పూర్తిగా ఆరిపోయింది.

"కష్టాల ఫలితం మీకు చూపి పోదామనే ఇంత దూరం రావలసి వచ్చింది."

"నువ్వు ఏ ఏట్లో కొట్టుకపోతే మాకేం? మా డ్యూటీ మేం చేస్తున్నాం."

డ్యూటీ అంటే ఏమిటి? మానవత్వం లోపించిన ధర్మం అధర్మమే అవుతుంది. భూమయ్యకు కోపం వచ్చింది. మండు వేసవిలో పొగలు గక్కే భూమిలా మారాడు. కాని చేయగలిగిందేముంది?

ఆఫీసర్లు గుసగుసలు పోయారు. భూమయ్యను వాడి చూపులతో పరామర్శించి బయటికెళ్ళారు. తెల్లటి దుస్తుల్లో వున్న జవాను బ్యాంకు తలుపులు మూశాడు. నాలుక పిడుచకట్టుకపోతున్నా ఆఫీసర్లు కనికరిస్తారనే నమ్మకంతో అక్కడే వరండాలో కూచున్నాడు భూమయ్య. త్వరగా ఊరు చేరాలని వుంది. మొల్లో గుచ్చుకొంటున్న కొడవలిని చేతిలోకి తీసుకొన్నాడు.

భూమయ్య వచ్చిన ఉద్దేశం వేరు. అప్పు తీసుకొని పైరు పెడ్తే అది పండే సమయానికి నీటి ఎద్దడితో ఎండిపోయింది. అప్పేకాదు. తను చేసిన కాయకష్టం మట్టిపాలైంది. కొంతకాలం ఆగితే వర్షాలు పడితే మరో పంట వస్తుంది. అప్పుడు తప్పకుండా అప్పుతీరుస్తానని చెప్పటానికి వెళ్ళాడు. ఎండిపోయిన పంటను చూసైనా అధికార్లు కనికరిస్తారని ఆశించాడు. తనలాంటి చాలామంది రైతులు వూపిరి పీల్చుకొనే అవకాశం కలుగుతుందని తలిచాడు. కాని, జరిగింది వేరు.

వడ్డీ వ్యాపారి అప్పు ఇస్తే మూడు సంవత్సరాల వరకు పలుకరించడు. సామాన్య రైతులకు స్వల్ప వడ్డీలతో ఋణాలని బ్యాంకులు ప్రకటనల బాకాలు వూదుతున్నాయి. కాని మూడు నెలల కొకమారు వడ్డీ అసలుతో కలసి పిల్లలు పెడ్తుంది బ్యాంకులో. బ్యాంకులో వడ్డీ నిప్పుల మూటలా అనిపించింది భూమయ్యకు.

మండల కేంద్రంలో రైతుకు సహాయంగా వుండాలని ఆఫీసులన్నీ పెట్టింది ప్రభుత్వం. కొత్తగా పోలీసు స్టేషను కూడా ఏర్పాటైంది.

విద్యార్థిగా వున్నపుడు గ్రామీణాభివృద్ధి శిక్షణా శిబిరంలో 'డిగ్నిటి ఆఫ్ లేబర్' అంశంమీద అనర్గళ ఉపన్యాసం ఇచ్చి, మొదటి బహుమతి గెలుచుకున్న విషయం మరచిపోలేదు ఆఫీసరు. కాని ఆనాటి విద్యార్థికి ఆదర్శం వుంది. నేటి ఆఫీసరుకి

హోదా వుంది. కూచున్న కుర్చీకి అధికారం వుంది. విచక్షణ మరుగునపడిన అధికారికి భూమయ్య నేరస్తుడిగా తోచాడు. జీవిత విలువను పెంచేది నిజమైన చదువైతే ఆ చదువును చదువుకోలేదు ఆ అధికారి.

తీసుకొన్న అప్పు తీర్చకపోగా దౌర్జన్యం చేసినట్లు బ్యాంకు ఆఫీసర్లు భూమయ్యపై పోలీసు రిపోర్టు ఇచ్చారు. క్షణంలో నలుగురు పోలీసులు వచ్చారు. భూమయ్య లేచి నిల్చున్నాడు. కొడవలి లాక్కున్నారు పోలీసులు. భూమయ్యకు అయోమయంగా వుంది. కదలలేదు. భూమయ్యను దొంగనో, దోపిడీదారునో తీసికెళ్ళినట్లుగా సంకెళ్ళు తగిలించి ఈడ్చుకపోయారు పోలీసులు. లాకప్‌లో వుంచారు. భూమయ్య దిగ్భ్రాంతి చెందాడు. మబ్బు లేకనే పిడుగు నెత్తినపడినట్లుంది. ఖిన్నుడయ్యాడు. కోపం కళ్ళలో పొంగుకొచ్చింది. కరకు కొడవలితో తన్ను బంధించిన వారిని ముక్కలు ముక్కలుగా తరగాలనిపించింది. మనసు మండుతూ వుంది. ఆకలి దప్పికలు మాయమయ్యాయి.

అక్కడ చేరిన రైతులు ఎవరికి వారు మాట్లాడుకొంటున్నారు. అందరికీ తెలుసు భూమయ్య తప్పు చేయలేదని. అతను అందరి బాధల గురించి చెప్తున్నాడని తెలుసు. కాని ఎవరి దారి వారిది. తోడి కార్మికుడికి అన్యాయం జరిగితే గర్జించి విరుచుకుపడే సంఘటిత శక్తి కార్మికునికి వుంది. కాని రైతు విషయం వేరు.

వలలో చిగులుకొన్న పక్షిలా భూమయ్య మనసు విలవిల్లాడింది. పది పక్షులు చేరి వలతోసహా ఎగిరిపోయిన కథ వుంది. ఐకమత్యమే మహాబలం కాని, ఆ బలం రైతుకు అన్నిటితోపాటు కరువైంది. రైతు అనైక్యతా శాపగ్రస్తుడు. కష్ట నష్టాల బాధనుండి ఆలోచన పుట్టుక రావాలి. అంతవరకు రైతుకు విమోచన లేదు.

చదువుకొన్న తెలివిగలవారు సమాజాన్ని ఏనాడో వృత్తులవారిగ వర్గీకరించారు. అది వారి సుఖజీవనం కోసం. ఆ వర్గీకరణే వక్రించి వర్ణవిభేదాలతో సమాజాన్ని చీల్చి బీటలు పారించింధి. నేడు స్వార్థపరులు తమ పదవులకోసం, సుఖ సంతోషాలకోసం అమాయక రైతులను చదరంగంలో పావులుగా వాడుకొంటున్నారు.

భూమయ్య మనస్సు మండే కొలిమిలా మారింది. సహనం మండిపోయింది. అన్నదాతను పీడించి ఏడిపించిన ఏ అధికారమైనా అంతంకాక తప్పదు. రైతుకు రక్షణ కల్పించలేని ఏ ప్రభుత్వమైనా పరాభవాన్ని చవిచూడక తప్పదు. రైతుకు సామాజిక ఆదరణలేని ఏ సమాజానికైనా అష్టకష్టాలు తప్పవు– భూమయ్య హృదయం ఆక్రోశించింది; శపించింది!–

జరిగిన పరాభవ జ్వాల గుప్పుమంటుంటే కూచోలేక, ఒకచోట నిలువలేక కదలిపోయాడు భూమయ్య. మంటల మధ్య మిర్చిచెట్టులా, ఎండిన పైరులా తెల్లబడి చిన్నపోయింది ముఖం. అసహాయత, అసహనం, అబలత్వం ముప్పిరిగొన్న దైన్యమూర్తి భూమయ్య! అతనిపై అతనికే జాలి కలిగింది!

☆ ☆ ☆

రామకృష్ణ బస్సు దిగాడు. మండల కేంద్రం గగ్గోలుగా వుంది. విషయం విన్న రామకృష్ణకు ఆశ్చర్యం కలిగింది. ఆవేశం ఉప్పెనలా పొంగింది. ఏం చేయాలో

తోచలేదు. పని తొందరవల్ల ఊరు రావటం ఆలస్యమయింది. ఒక రోజు—ఒక గంట ముందు వచ్చివుంటే వ్యవహారం అదుపు తప్పేది కాదు.

రామకృష్ణకు బ్యాంకు ఋణాల అవకతవకలు తెలియక పోలేదు. వ్యవసాయ ఋణాల బకాయిలు పెరుగుతున్న మాట నిజమే. పెద్దలు పరిశ్రమల పేరుతో అప్పుచేసిన మొత్తాలు కరి మింగిన వెలగపండులా మాయమవుతున్నాయి. అది అడిగే అధికారం, ధైర్యం బ్యాంకు అధికారులకు లేవు. బదులు చెల్లలేని బ్యాంకులు ఋణ మేళాలు జరుగుతున్నాయి, బడుగు వర్గాల సంక్షేమం కోసం. కాని మధ్యవర్తులకు అధికార్లకు అందులో అధిక భాగం జమ అవుతున్నదని అధికార నివేదికే వెల్లడిచేసింది.

రైతు అందుకొనే ఋణం ఖరీదెంత? రైతు బలపడి అధిక పంట పండిస్తే ధరలు తగ్గవా? నిత్యావసరవస్తువుల ధరలు తగ్గితే మానవ సంక్షేమానికి దారి కన్పడదా?

రామకృష్ణ నేరుగా బ్యాంకు కెళ్ళాడు. తండ్రి చెల్లించవలసిన అప్పు చెల్లించాడు. బ్యాంకు అధికారులు తమ పథకం బాగా పనిచేసిందనుకొన్నారు. కాని దాని పర్యవసానం ఎలా వుంటుందో ఆలోచించే తీరిక, ఓపిక వారికి లేదు. అదే విచారించదగ్గ విషయం.

పోలీసు స్టేషను కెళ్ళి తండ్రి తరఫున చేయని తప్పుకు క్షమాపణ చెప్పాడు. రామకృష్ణ. తీవ్రంగా గాయపడ్డ పులిలా పోలీసు స్టేషను నుండి బయటికొచ్చాడు భూమయ్య.

భూమయ్య ఎవరితోనూ మాట్లాడలేదు. పరాభవం బరువుతో పల్లెదారి పట్టాడు. చిరుగాలికి కొట్టుకుపోయే ఎండుగడ్డి పోచలా కదిలాడు.

రామకృష్ణతో ఊరి రైతులు వెనుక నడిచారు.

"కళ్ళెదుటే ఎంత అన్యాయం జరిగింది?!"

"అందరం కలసి బ్యాంకును కొల్లకొడ్తే ఏం చేస్తారు?"

"రాత్రికి పోలీస్‌స్టేషను తగులబెడ్తేగాని కసి తీరదు."

అవి కుతకుత వుడికే రైతుల ఆవేశంలో మాటలు. ఆలోచన మరుగున పడినపుడు అనర్థాలకు దారి తీస్తుంది.

బ్యాంకులు నగరాల, పట్టణాల సరిహద్దులు దాటి పల్లె ప్రాంతాలకు రావటం అభివృద్ధి కార్యక్రమాలలో పెద్ద మలుపు. రైతాంగానికి చేయూత నివ్వాలనేదే అందులో ముఖ్య ఉద్దేశం. కాని జరిగిం దేమిటి? రైతు చేతులకు సంకెళ్ళు!

సమాజంలో ఒక వ్యక్తిగాని, వర్గంకాని అన్యాయంగా అక్రమంగా అణచివేయ బడినప్పుడు జరిగే పరిణామం ఎలా వుంటుంది?—రామకృష్ణలో ఆలోచన కదిలింది.

భూమయ్యకు పగలే రాత్రిలా తోచింది. అవసరం వున్నప్పుడు అమాస చీకట్లో కూడా పొలం పని చేసే అనుభవం వున్న రైతు. వంచిన తల ఎత్తకుండా ఊరు చేరాడు. అప్పటికే విషయం తెలిసి అట్టుడికినట్లుడికిన పల్లె కొంత చల్లబడింది. బ్యాంకు అధికార్లను, పోలీసులను తిట్టిపోశారు. భూమయ్యను చాలామంది కళ్ళతోనే పరామర్శించారు. చిన్నమ్మ భూమయ్యను చూసి కంట తడిపెట్టింది. మిగతా ఆడవాళ్ళు కళ్ళొత్తుకున్నారు.

ఇల్లు చేరిన ఖాళీగోతం, కొడవలి, రాగిబిందె చూసి నిట్టూర్చాడు భూమయ్య. ఆ రాత్రి మామూలుగానే వేడినీళ్ళ స్నానం చేసి అన్నం తిని ఇంటిముందు నులక మంచంమీద పడుకొన్నాడు. రామకృష్ణ, తులసమ్మ మంచం పక్కన కూచున్నారు.

కాలు, చెయ్యి వుడిగే కాలం. ప్రశాంతంగా బ్రతకటం తెలుసుకోవాలన్నాడు రామకృష్ణ. భూమయ్య బదులు చెప్పలేదు.

"రైతు సమిధగా మారినా సత్ఫలితా లివ్వని యజ్ఞగుండంలా మారింది వ్యవసాయం. ఇక పల్లెలో బ్రతకడం కష్టం."

కొడుకు హితబోధ చేశాడు తండ్రికి. వెల్లకిలా పడుకొని ఆకాశంలో పేరుకుపోయి చీకటిని చూస్తున్న భూమయ్యలో వులుకు, పలుకు లేదు.

"ఇప్పటికే వచ్చిన తలవొంపులు చాలు. బతికినన్నాళ్ళు బతకబోము. కడకాలంలో కాళ్ళుచేతులు ఆడేటప్పుడే పల్లెను వదిలేద్దాం. మడి వారానికిచ్చేద్దాం. ఆదాయం వచ్చినా రాకపోయినా కొడుకు, కోడలు ఆప్యాయంగా చూసుకొంటారు. అందరం కలిసి వుందాం....."

తులసమ్మ నెమ్మదిగా నచ్చచెప్పింది.

చీకటి నుండి భూమయ్య చూపులు కదిలాయి. మెల్లగా లేచి కూచున్నాడు. తల్లీకొడుకులను చూసి నెమ్మదిగా నవ్వాడు.

"మీ ఇష్టం"అన్నాడు తలలో చేయిదూర్చి.

తులసమ్మ, భర్త అంత తొందరగా ఊరు వదలటానికి అంగీకరిస్తాడని అనుకోలేదు. సంతోషంగా రామకృష్ణ, తులసమ్మ మూట ముల్లె సర్దటానికి సిద్ధమయ్యారు.

☆ ☆ ☆

నీడలా కదిలిన నిన్నటి గతం ఆగింది. దిగ్గున లేచాడు భూమయ్య. కాళ్ళు మడివైపు కదిలాయి. నడక బరువుగా సాగింది. భూమయ్య చెట్లు, చేమలను మానవభాషలో పలకరించి వచ్చాడు. బండ బావిని చూసి వేడి నిట్టూర్పు విడిచాడు. బ్యాంకులో అప్పుచేసి రైతుగా బ్రతకడంకంటే బండ బావిలో చావటం మేలనుకొన్నాడు.

ఈ దేశం నాడు, నేడు, రేపు వ్యవసాయక దేశం. ఆర్థిక స్వరూపం మారుతూ వుంది. నాగరికత పెరుగుతూ వుంది. కాని సంస్కృతి మౌలికంగా వ్యవసాయ జీవనంమీద ఆధారపడి వుంది. ఈ విషయం అవగాహనం వున్న మేధావు లెంతమంది?!

ప్రతి కయ్య, గనెం భూమయ్య పాదాల తాకిడితో మేల్కొన్నది.

ఎదురుగా వస్తున్న రామకృష్ణను చూసి ఆగాడు, భూమయ్య. మర్రిమాను నిశ్చలంగా వుంది. నీరెండలో కొత్త కాంతితో–మెల్లగా కదులుతున్నాయి ఆకులు.

సామాన్య రైతు జీవితం ఒక విషాద కథ. అతను నడిచేది కరకురాతి బాట. అతను పరిభ్రమించేది ప్రకృతి విద్దూరాల విషవలయం. తండ్రి ఎందుకు విషవలయంనుండి బయటపడటానికి బాధపడుతున్నాడో అర్థం కాలేదు రామకృష్ణకు.

ఈ దేశంలో సామాన్య రైతు జాతకం ఒక్కటే అప్పుడు, ఇప్పుడు. అప్పులో పుట్టి, అప్పులో పెరిగి, అప్పుతో మట్టిలో కలిసిపోతున్నాడు. రైతుకు అప్పు వారసత్వంగా వస్తున్న అనంత ఐశ్వర్యం.

"నాయనా రామకృష్ణా! అప్పిచ్చిన ఆఫీసర్లు అపరాధిని చేసినారు. పోలీసులు ఇనుప సంకెళ్ళను తగిలించినారు. వారి ధర్మం వారు నిర్వహించినారు. నీకు స్థోమత వుంది కాబట్టి కన్నకొడుగ్గా ఇనుప సంకెళ్ళ నుండి నన్ను విడిపించగలిగావు. ఉద్యోగం చేసే కన్నకొడుకు ఆదరణలేని సామాన్య రైతుల స్థితిగతులు ఎంత దారుణంగా మారుతున్నాయో ఆలోచించగలవా? దీనికి పరిష్కార మార్గం లేదంటావా? ఆసరావున్న ప్రతి రైతూ పట్టణం చేరి సోమరైతే పట్టణాలు భరించగలవా? పల్లెలు వలస పోతే, పంట కళ్ళాలు వట్టిపోతే జనం ఏమి తింటారు?"

భూమయ్య మనోభారంతో అన్నాడు.

"ఆరుకాలం కష్టపడే రైతుకు అవరోధాలెన్నో వున్నాయి. అతని కష్టార్జితం ఎన్నోరకాల దోపిడీలకు గురౌతూ వుంది. కాని రైతు పిడికిలి బిగిసే కాలం రాకపోదు....రైతుకు పట్టిన ఋణ గ్రహణం తొలగే సమయం రాకపోదు."

రామకృష్ణకు ఏం చెప్పాలో అర్థం కాలేదు.

"రామకృష్ణా! ఉద్యోగం చేసే మీకు జీతం సంవత్సరాని కొకమారు పెరుగుతుంది. కాని రైతుచేసే కష్టానికి ప్రతిఫలం పంటపై ఆదాయం పెరగటం లేదు. రైతు లెక్కలు చూస్తే నాగలి కూడ మిగల దంటారు. ఇది ఏం న్యాయం?"

ఇరవైనాలుగు గంటలూ ఆరు ఋతువుల్లో మడినే అంటిపెట్టుకొని మరో ధ్యాస లేకుండా ప్రపంచాన్నే మరచిన రైతులో ఆలోచన కలిగింది. రైతు సమాజం పోకడను గమనించ గలిగినప్పుడు తనకు జరిగే అన్యాయం తెలుస్తుంది. ఆలోచన వేడినుండే మార్పుకు పునాది పడాలి- అనుకొన్నాడు రామకృష్ణ.

భూమయ్య ప్రశ్నలకు ఏం సమాధానం చెప్పాలో అంతు పట్టలేదు రామకృష్ణకు. ఉదయభాస్కరుని కెదురుగా నిలబడ్డాడు భూమయ్య. ఉద్వేగంతో అతని మనస్సు చలించింది; కళ్లు జ్వలించాయి. మట్టి చేతికెత్తుకొని వేదమంత్రంలా పలికాడు భూమయ్య.

"మట్టి సకల జీవరాశి పుట్టుకకు, పెరుగుదలకు ఆధారం. ఈ మట్టే బంగారం. మట్టిమీద రైతుకున్న మమతానుబంధాలు సంకెళ్ళు. కంటికి కన్పడని ఆ బంగారు సంకెళ్ళను ఎవరూ విడగొట్టలేరు. అయితే ఆ సంకెళ్ళే కడియాలుగా మారే రోజు వస్తుంది. ప్రతి మనిషికి కడుపునిండా తిండి వున్నపుడే దేశానికి నిండుగౌరవం."

రామకృష్ణకు తనకు చిన్నపుడు తండ్రి మట్టిలో అక్షరాలు రాసి పలికించిన దృశ్యం గుర్తుకొచ్చింది.

● ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక *21-12-1988* ●

★ ★ ★

59

సత్యాగ్ని

# యంత్రం

"మళ్ళీ పెళ్ళి!"

ఆ మాట చెవిన పడితే నాకు వళ్ళంతా జర్రులు ప్రాకినట్లుంది. అమ్మతో చాలాసార్లు చెప్పాను ఈ పెండ్లి సంబంధాలు తెచ్చే ఖాలాబీలను మన యింటికి రానీవద్దని.

తెల్లవారినప్పటి నుండి ఆ గడప, ఈ గడప తిరగడమే వాళ్ళపని. ఆ యింట్లో కాఫీ, ఈ ఇంట్లో టిఫిన్, యింకోచోట భోజనం – ఇదీవరస. పెండ్లీడు పిల్లల బాగోగుల్ని చిలకల్లా వల్లిస్తుంటారు. పట్నంలో ప్రతి ముస్లిం యింటి జాతకం చిటికెలమీద చెప్పేస్తారు. అందరి మంచీ, చెడ్డలు వాళ్ళ నోళ్ళల్లో నానుతూ వుంటాయి.

నజరానాలు కాస్త బలంగా ఇస్తామని ముందే ఆశ చూపెడతారు కొందరు. అటువంటి వాళ్ళ బిడ్డల్ను గూర్చి ఓ అరగంట లేటుగా స్తోత్రం చేస్తారు. ఘరానా కుటుంబీకులుగా వాళ్ళకు తిరుగులేని ముద్ర వేస్తారు. ఫలానా వాళ్ళ సంబంధం మీ అదృష్టంకొద్దీ దొరుకుతుందని గోప్యంగా చెపుతారు. ఆ యింటి కోడలైతే నిజంగా మీ అమ్మాయి అదృష్టం పండినట్లే అంటారు.

సంబంధాలు పొడిగించడానికి వాళ్ళు చెప్పే అబద్ధాలకు అంతూ పొంతూ వుండదు. ప్రస్తుతం ఈ పని చాలా లాభసాటి వ్యాపారంగా చెలామణీ అవుతూంది.

ఈమధ్య రాబియా ఖాలాబీ తరచూ మా యింట్లో దర్శన మిస్తూంది. పెళ్ళి కావలసిన వాళ్ళెవరూ ఈ యింట్లో లేరు. మా అన్నలు ముగ్గురికి పెళ్ళిళ్లు అయిపోయాయి. ఇద్దరి సంబంధాలు ఈ మహాతల్లే కుదిర్చింది. ఆ పరిచయంవల్ల వస్తూందనుకొన్నాను మొదట్లో.

కాని అమ్మతో గుసగుసలాడుతూంటే విన్నాను, నాకు మళ్ళీ పెళ్ళి చేస్తే బాగుంటుందని. ఇటీవలే ఒకతని భార్య చనిపోయిందట. నలుగురు చిన్న చిన్న పిల్లలతో నానా తంటాలు పడుతున్నాడు. నిక్షేపమైన గవర్నమెంటు నౌకరీ. దండిగా జీతం వస్తుంది. మంచి సంబంధముంటే చూడమని ప్రతిరోజు బ్రతిమాలుకొంటున్నాడు. మీరు సరేనంటే క్షణాలలో మీ అమ్మాయికి కుదురుస్తానంటూంది. నేను వచ్చింది గమనించి గతుక్కుమన్నారు యిద్దరు. తర్వాత మాట్లాడుదామని మాట మార్చుకొన్నారు.

అప్పటి నుండి ఆమె మా యింటికి వస్తే గుండె లయ తప్పుతుంది నాకు. ఆమె వున్నంతసేపు నెత్తిన నిప్పుల కుంపటి పెట్టినట్లు బాధ. ఎప్పుడెప్పుడు పోతుందా అని నానా అవస్థ. పోయిన తర్వాతగాని మనస్థిమితంరాదు.

ఈ రోజు మళ్ళీ వచ్చింది!

ఏ అవాంతరం ముంచుకొస్తుందోనని భయంగా వుంది. నా గదిలో కూర్చొని కథల పుస్తకం చదువుతున్నాను. మనసు మాత్రం వాళ్ళను గురించే ఆలోచిస్తోంది, చెవులు వాళ్ళ సంభాషణమీదే లగ్నమయ్యాయి. పుస్తకం చూస్తున్నానేగాని, ఏమీ అర్థం కావడంలేదు. రెండు మూడుసార్లు మాటలు గట్టిగా వినిపిస్తే నన్నే పిలిచారని వులిక్కిపడ్డాను.

మగరీబ్ నమాజ్ (సూర్యాస్తమయం తర్వాత చేసే ప్రార్థన) ముగించి యింటికి వచ్చారు అబ్బాజాన్ (నాన్న). శుక్రవారం కాబట్టి ఆరోజు బట్టలంగడికి పోలేదు. బస్తీలో పెద్ద బట్టల దుకాణం మాది. "సుల్తానా కట్ పీస్ సెంటర్"అని షాపుకు నా పేరే పెట్టారు.

"అబ్బాయి తరపువాళ్ళను వచ్చి రజియాసుల్తానాను చూచి పొమ్మన్నాను." నాన్నవద్ద చాపమీద కూర్చుంటూ చెప్పింది అమ్మ.

నాన్న గంభీరంగా ఆమెవైపు చూచారు.

"ఇద్దతుకాలము (విడాకులిచ్చిన తర్వాత పెట్టే గడువు) దాటి మూడు మాసాలు కావొచ్చింది. ముసలి, ముతకనా మనం వూరుకోవడానికి? ఎంతకాలమని యింటిలో పెట్టుకోగలము? ఆమెకు మనమన్నీ సమకూర్చగలం, కానీ భర్తను యివ్వలేము కదా! ఒక్కగానొక్క బిడ్డ. 'అల్లా' ఆమెను ఇంత చిన్న చూపు చూస్తాడనుకోలేదు." దుఃఖంతో అమ్మ గొంతు బొంగురుపోయింది. కన్నీళ్ళు గట్లు తెంచుకొన్నాయి. ఏడుపును సంబాళించుకోవడానికి పైటతో నోరు వొత్తి పట్టుకుంది.

"ఊరుకో సలీమా! అల్లాకు ఏది ఇష్టమో అదే జరుగుతుంది. ఆమె తలరాతను తప్పించడం మన వశమా? నా బిడ్డ జీవితంలో వెలుతురు ప్రసాదించమని ప్రతి ప్రార్థనలో వేడుకొంటున్నాను. దయామయుడు తప్పకుండా నా మొర ఆలకించి నా తల్లిని చల్లగా చూస్తాడు."

ఆ మాటలను బట్టి అమ్మ అభిప్రాయంతో ఏకీభవించారు నాన్నకూడా అనుకొన్నాను. నాకు కంపరమెత్తింది. ఏం చేయాలో తోచక నా గదిలోకి పరుగెత్తాను.

ఇషా నమాజ్ (రాత్రి ఎనిమిది గంటలకు చేసే ప్రార్థన) ముగించి వెంటనే మంచమెక్కాను. భోజనంచేసి పడుకోమని అమ్మ కేకలు పెడుతూంది. నాకు ఆకలి కాలేదంటే వినడంలేదు. కాదు కూడదని బలవంతం పెడితే ఒక గ్లాసు పాలు తాగాను.

ఎంత పొర్లినా నిద్ర రావడంలేదు. ఏవేవో ఆలోచనలు మనసును ముసురుకొంటున్నాయి. అప్పుడయితే రిజ్‌వానా నిద్రముందు చాలా గొడవ చేసేది. నా యెదమీద కూర్చొని ముసి ముసిగా నవ్వేది. వచ్చీరాని మాటలతో అమ్మా! అమ్మా! అని నా బుగ్గలకేసి గుద్దేది. అంతలోనే పకపకా నవ్వుతూ ముఖమంతా ముద్దులు

పెట్టేది. వాళ్ళ నాన్న ఎంత బెంగపడినా రానంటే రానని భీష్మించుకునేది అది సందడి ముగించి నిద్రపోతే తప్ప మాకు ఏ పని తెమిలేది కాదు.

అది పుట్టినప్పటి నుండే నా కష్టాలు గట్లు తెంచుకున్నాయి. రిజ్వానాకు సరిగ్గా మూడేళ్ళు. నా కడగండ్ల వయస్సుకూడా అంతే.

నా పెండ్లి అయిన ఏడేండ్ల వరకు మా సంసారంలో సంబరాలు పండినాయి. అన్యోన్యత అల్లుకపోయింది. పెండ్లయిన కొత్తలో రాజాఖాన్ నాతో ఏదన్నా మాట్లాడాలంటే సిగ్గుపడేవాడు. తాను యింటర్ ఫెయిల్. నేను బి.ఎ. పాసయ్యాను. తప్పులు పడతానేమోనని అతని భయం.

రాజాఖాన్ తండ్రికి బస్తీలో పెద్ద జూవెలర్సు షాపు వున్నది. ఆయన పోయిన తర్వాత వ్యాపారం రాజానే చూస్తున్నాడు. కొన్ని రోజులకే బిజినెస్‌లో తండ్రిని మించిన దిట్ట అనిపించుకున్నాడు. అతని తండ్రితో వున్న స్నేహంకొద్ది నాన్న పట్టుబట్టి నన్ను రాజా కిచ్చాడు.

యర్రగా బొద్దుగా వుంటాడు రాజా. నల్లని వుంగరాల జుట్టు. తెల్లని కళ్ళు, ముక్కు కొంచెం అణిగివున్నా చూపరులను ఆకట్టుకునే ముఖం.

వాళ్ళమ్మ కోరినంత కట్నము, జెహజు (వస్తుసామాగ్రి) కుమ్మరించారు మా వాళ్ళు. మా అత్తయ్య చాలా నెమ్మది మనిషి. నన్ను తన కూతురుకంటే మిన్నగా చూచేది. నా దురదృష్టానికే అన్నట్లు పెద్దమ్మాయి పుట్టిన రెండవ యేడు చనిపోయింది. రాజాఖాన్‌కు వెనుకా ముందు ఎవరూ లేరు. అతనికి మనసు పడితే అది ఎంత కష్టమైనా చేయాలనే పట్టుదలగల మనిషి. మొండితనం కావలసినంత వుంది. మనసు చిన్నబుచ్చుకుంటే మనమెంత ఓదార్చినా కుదుటపడడు.

నన్ను చూచి మురిసిపోయేవాడు. “అందమనే ముసలి చెట్టుకు కొత్తగా చిగురించిన రెమ్మవలె వున్నావు” అంటూ వచ్చీరాని కవిత్వంతో నన్ను వుక్కిరి బిక్కిరి చేసేవాడు.

నామీద అంత అనురాగమున్న రాజాఖాన్ “తలాక్” యిచ్చాడు. ఒకటి, రెండుసార్లు కాదు – మూడుసార్లు ముక్తాయింపుగా చెప్పాడు. ఇంకెప్పుడూ అతనికి చేరువ కాకుండా చేసుకున్నాడు. ఆ విధంగా యెందుకు మారిపోయాడో యెంత ఆలోచించినా అంతు పట్టడంలేదు. నేను యేం తప్పుచేశానని అంత పెద్ద శిక్ష విధించాడు? ముగ్గురు ఆడబిడ్డల్ని కనడమే నేను చేసిన నేరమా? అంతకంటే నాకు కొంచెం విషమిచ్చి వుండినా సంతోషించేదాన్ని! సజీవంగా ఈ నరకంలో తోసి బాధించడం అతనికి న్యాయమేనా? ఈ ప్రశ్నలు నిత్యం నా అంతరంగాన్ని చిల్లులు కొడుతున్నాయి. ఇక నాకు నిద్ర ఆహారం సహించగలవా?

“వరుసగా ముగ్గురూ ఆడపిల్లలు. మూడవ కానుపయినా కొడుకు పుడతాడని ఎంతో నమ్మకమున్నది. ఇప్పుడు అందరూ నన్ను హేళనచేస్తూ చప్పట్లు కొడుతున్నారు. నాకు తల యెత్తుకోకుండా చేశావు. వాళ్లల్లో తిరగడానికి మొగమెక్కడంలేదు.” ఈ మాటలతో రోజా నన్ను ఒకటే వేధించడం.

ఆరోజు నుండి అతనిలో అసంతృప్తి విరబూసింది. అభిమానానికి అడ్డుకట్టలు పడినాయి. అడపా దడపా వేధింపులు, సాధింపులు ఎక్కువైపోయాయి. మగపిల్లవాడు

కావాలని మోజుంటే ఇంకోపెళ్ళి చేసుకొన్నా నాకు అభ్యంతరం లేదన్నాను. ఇద్దరితో వేగించలేనని తప్పుకునేవాడు. చెరొకవైపు లాగితే సంసార బంధం తెగిపోతుందని నేనే సర్దుబాటవుతూ వచ్చాను. ఉన్నట్టుండి అతనే బలవంతంగా తెగ్గొట్టాడు.

అకస్మాత్తుగా యిరువురు సాక్షులతో యింటికి వచ్చాడొక రోజు. తలాక్!తలాక్!తలాక్!

ఆవేశంగా మూడుసార్లు అరచాడు.

అంతే!

చకచకా కుల పెద్దలంతా గుమిగూడినారు. నా పెళ్ళప్పుడిచ్చిన పాతిక తులాల బంగారు వాపసు ఇవ్వాలని వాదించారు. ఆడపిల్లలున్నారు, యివ్వడానికి వీలుపడదన్నారు రాజాఖాన్ వత్తాసుదార్లు. బంగారు యివ్వకపోవడం అన్యాయమని రాజాఖాన్‌ను దబాయించారు పెద్దలు. అందరూ చెప్పితే వాపసు ఇవ్వడానికి వొప్పుకొన్నాడు రాజాఖాన్. ఇక మహరు, యిద్దతు డబ్బులు తీసుకుని బయలుదేరమన్నారు. ఈరోజునుండి నువ్వు అతని భార్యవు కావని తేల్చేసినారు. బలి పశువువలె చెవులు ఊచుకుంటూ యిక్కడికి చేరుకున్నాను.

పది నిముషాలలో పది సంవత్సరాల వైవాహిక జీవితానికి తెరపడింది. రాజాఖాన్ పనికిరాని యంత్రాన్ని చేసి పారవేశాడు నన్ను. అదే పనిముట్టును యింకొకరికి అంటట్టాలనుకుంటుంది అమ్మ, నాకు యేడ్పు వచ్చింది. ఈ దినమే కాదు, చాలాకాలంగా యేడ్చి, యేడ్చి నిద్దురపోవడం అలవాటయిపోయింది నాకు.

☆ ☆ ☆

తెల్లవారుతూనే రోజువలె వీధిగుమ్మంలో కూర్చున్నాను. ట్రంకురోడ్డు చౌరస్తాలో వుంది మా యిల్లు. ఎనిమిది గంటలకుగానీ రారు వాళ్ళు. ప్రతిరోజు కాన్వెంటుకు మా యింటి ముందునుండే పోతారు. మా యింటి అవలి సందులో వుంది కాన్వెంటు. పక్కకు కదలి అటూ, ఇటూ పోతే వెళ్ళిపోతారేమోనని భయం.

ఒకరోజు చూడకుంటే పోనీలే అని మనసు చిక్కబట్టుకోలేను ఎప్పుడెప్పుడు ఎనిమిది గంటలు కొడతాయా అని ఆత్రుత. మనకు అవసరమైనప్పుడు కాలంకూడా ఆలస్యంగా సాగినట్లుంటుంది. ఒకొక్కక్షణం బరువుగా నా గుండెలమీద నుండి నడుస్తున్నట్లుంది. గమ్మంలో అట్లే కాచుక కూర్చున్నాను.

ప్రతిరోజూ నాతో మాట్లాడుతున్నారని రాజాఖాన్ మందలించాడా? ఈరోజు రాకపోవచ్చా? ఆ మాట అనవద్దని గుండె నోటికి అడ్డుపడుతూంది. వద్దు! ఆవిధంగా జరగకూడదు. అదే జరిగితే నేను భరించుకోలేను. ఈ పాడు ఆలోచనలు వస్తున్నందుకు నన్ను నేను విసుక్కున్నాను. రాత్రి పగలు దిగులు నన్ను చిత్రవధ చేస్తాంది. నా పిల్లల్ని చూచిన పది నిముషాలే నాకు వూరట, ఆనందం. వాళ్ళను గుండెకు హత్తుకున్నప్పుడు నా బాధంతా ఆవిరైపోతుంది. దానికోసమే ఈ నిరీక్షణ.

నా ప్రేగులు త్రెంచుక పుట్టిన అనురాగపు ముద్దులు వాళ్ళు. తియ్యని అనుభూతులతో నవమాసాలు మోసి కన్నాను. కానీ ఈ రోజు నా బిడ్డలని చెప్పుకునే తాహత్తులేదు. ఇప్పుడు రాజాఖాన్ బిడ్డలు. నాకు ఏమీకారు.

అదిగో వస్తున్నారు!

అబ్బ – అప్పుడే హాయి చుట్టుకుంది నన్ను. సంతోషంతో పూనకం వచ్చినట్లుంది. స్వర్గం నా దగ్గరకు కదలి వస్తున్నట్లనిపించింది.

"అమ్మీజాన్" అంటూ ముగ్గురూ పరుగెత్తుకుంటూ వచ్చి నా వడిలో వాలారు. రాజాఖాన్ సంబంధీకులు ఎవరన్నా చూస్తారేమోనని చుట్టూ పరికించాను. వాళ్ళు తీగలవలె పెనవేసుకొన్నారు నన్ను. ప్రేమ పుప్పొంగి కొద్దిసేపు మూగవాళ్ళని చేసింది మమ్మల్ని. తర్వాత పాలకోవా తినమని అందించాను. చిన్నది నాకు వద్దని మూతి ముడుచుకుంది.

"నువ్వు తినవా రిజ్వానా?" అన్నాను.

వద్దని తల అడ్డంగా తిప్పింది.

"ఎందుకని"?

దాని కళ్ళల్లో నీళ్ళు నిండుకున్నాయి. రెప్పలార్చుతూ నావైపు దీనంగా చూచింది.

"నన్ను... నన్ను... ఆమె... కొట్టింది" అంది వచ్చిరాని మాటలతో.

నా హృదయం మెలికలు తిరిగింది. రాజాఖాన్ రెండవ పెళ్ళి చేసుకొని నెల కావచ్చింది. అతని కొత్తభార్య యిక్కడికి వచ్చి పదిరోజులయింది.

"ఎందుకు కొట్టింది?" పెద్దపాప వైపు చూశాను.

అది కోవా తింటూనే "ఏం లేదమ్మా! రాత్రి పిన్నీ, డాడీ ఒకే మంచంమీద పడుకున్నారు. పిన్ని దగ్గర పడుకొంటానని సతాయించింది రిజ్. వద్దు అక్కదగ్గర పడుకోమని రెండుసార్లు నా మంచంమీద పడుకోబెట్టింది. మళ్ళీ లేచి వెళ్ళిపోయింది. పిన్ని కోపంతో కసురుకొని కొట్టింది."

ఆ మాటలు నా గుండెల్ని ముక్కలు ముక్కలు చేశాయి. అయినా ఎవరి బిడ్డలు వాళ్ళకు ముద్దు. ఇంకొకరి బిడ్డలు ఇబ్బందిగానే వుంటారు. తల్లి వుండికూడా లేనివాళ్ళయ్యారు నా బిడ్డలు.

రిజ్జు తల నిమురుతూ "మీ డాడి ఏం అనలేదా?" అన్నాను. "ఊహూ!" అన్నారు పెద్ద పిల్లలిద్దరూ.

"దీన్ని నీదగ్గరే పెట్టుకోమ్మా! రాత్రంతా అమ్మా, అమ్మా అని ఒకటే యేడుపు. యేడిస్తే బయటకు తోసి వాకిళ్ళు మూస్తానని భయపడించారు డాడి. అప్పుడుగాని నోరుమూయలేదు. బేవార్సాముండ ఎట్ల పుట్టినావే అని పొద్దునకూడా తిట్టింది పిన్ని."

ఇంకా యేదో చెప్పబోయింది రెండవ పాప – వద్దని గట్టిగా దాని నోరు మూసాను.

"ఇట్లా వీళ్ళను మురిపించేస్తే నిన్ను వదలిపెట్టరు. దాంతో నీకు బాధ, వాళ్ళకు కష్టాలు తప్పవు. గుండె రాయి చేసుకొని గతాన్ని మరచిపోవాలమ్మా!" దగ్గరకు వచ్చి నా గడ్డం పట్టుకొని బుజ్జగించింది అమ్మ.

"నానిమా! నానిమా!" అంటూ అమ్మను చుట్టుకొన్నారు ముగ్గురు. "మీ నాన్న చూస్తే కొడతాడు, పోండి! పోండి!" అంటూ బలవంతంగా వాళ్ళను పంపించేసింది

అమ్మ. నేను చూడకుండా అటువైపు తిరిగి కన్నీళ్ళు తుడుచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

వాళ్ళు పోతూంటే చూస్తూ వుడికిపోయాను నేను.

☆ ☆ ☆

సాయంత్రం!

ఆదరా బాదరా అబ్బాజాన్ అంగడినుండి యిల్లుచేరుకున్నారు. హాల్లో కూర్చున్న నన్ను చూసి నా దగ్గరకి వచ్చారు. "ఏంమ్మా, యింకా అట్లే వున్నావు?" విస్తుపోతూ అడిగారు. నేను లేచి మౌనంగా తలవంచుకున్నాను.

"త్వరగా బట్టలు మార్చుకో. వాళ్ళు సాయంత్రం వస్తామన్నారు."

సూటిగా ఆయన కళ్ళలోకి చూచాను.

"నీకు తెలియదమ్మా! మేము చెప్పినట్లు చెయ్." నా తలమీద చెయ్యిపెట్టి నిమిరారు. ఆవేశం నన్ను వుండనివ్వలేదు. అబ్బాజాన్ ఏమనుకొంటారో అన్నభయం తుడిచిపెట్టుకపోయింది.

"క్షమించండి అబ్బాజాన్! నాకీ పెళ్ళి వద్దు" అన్నాను.

"పిచ్చిపిల్లా! అది మన ధర్మమమ్మా!"

"అవును. నేను కాదనలేదు. కానీ కారణం లేకుండా తలాక్ యివ్వమని మన ధర్మం చెప్పలేదు. ఈ కాలం విడాకులంటే చాలా తెలికయిపోయింది.

"తలాక్ ఎందుకు ప్రవేశపెట్టారో మీకు తెలుసుననుకొంటాను అబ్బాజాన్!

"భార్యభర్తలలో పరస్పరం అయిష్టత యేర్పడాలి. ద్వేషభావం విస్తరించి దాంపత్య జీవితం కొనసాగని పరిస్థితి రావాలి. వారిద్దరిమధ్య సఖ్యతకు, సర్దుబాటుకు అవకాశం కనిపించకుండా పోవాలి. ఆ సంబంధం అలాగే కొనసాగించడం శ్రేయస్కరం కాదనే అభిప్రాయం కలగాలి.

"అటువంటి విధిలేని పరిస్థితుల్లో విడాకులు అమలుపరచాలి. అంతేకాని కుంటిసాకులు చూపి మూడుసార్లు తలాక్ అనడం సమంజసం కాదు."

నా మనస్సులో వున్న విషయం కుండ బద్దలుకొట్టినట్లు చెప్పేశాను అబ్బాజాన్‌కు. ఆయన తలపంకించారు. నావైపుచూస్తూ కొద్దిసేపు ఆలోచించారు.

"చూడు రజియాసుల్తానా! ఆ పుణ్య పాపాలు తలాక్ చెప్పేవాళ్ళవే. అమలు జరపడమే పెద్దల పని. నువ్వు చదువుకొన్నదానివి. నీ యిష్టానికి భిన్నంగా ఏదీ మేము చేయదల్చుకోలేదు. సాటివారిలో మాకు తలవంపులు రాకుండా చూడు."

బాధతో అబ్బాజాన్ కన్నీళ్ళు పెట్టుకొన్నారు. ఇంతలో అమ్మకూడా మా దగ్గరకు వచ్చింది. ఆమె నా తల నిమురుతూ "నీకు మంచి జరగాలి. అంతకంటే మాకు కావలసినదేముందమ్మా?" అంది.

"అబ్బాజాన్! మూర్ఖులకుభార్యలైన నావంటివాళ్ళకు ఈ బాధలు తప్పవు. ఈ ముళ్ళకంచెలో యిరుక్కుని విలవిలలాడుతున్న సోదరీమణులకు చేయూతనివ్వాలనుకున్నాను. అటువంటి మగమహారాజులకు గుణపాఠం చెప్పాలని నిర్ణయించుకున్నాను.

రేపటినుండి 'లా' కాలేజీలో చేరాలనుకున్నాను. న్యాయవాదినై ఈ అన్యాయాలను ఎదుర్కోవాలని నిశ్చయించుకున్నాను. దయచేసి ఈ అవకాశాన్ని కల్పించండి." ప్రాధేయపడ్డాను.

ఇద్దరూ ఒక్కసారి ఆశ్చర్యంగా "బేటే!" అన్నారు.

"మీ కూతురు నిప్పులాంటిదని నిరూపించుకుంటాను. మన కుటుంబానికి ఏ మచ్చ రానివ్వను. ఆశీర్వదించండి" అంటూ పాదాలమీద పడ్డాను.

ఇద్దరూ ఒక్కసారి "అల్లా రక్షించుగాక!" అని నా తలమీద చేతులు పెట్టారు. వాళ్ళ వేడి కన్నీళ్ళు బొట్లు బొట్లుగా రాలి నా మెడమీద పడ్డాయి.

"నీ యిష్టమే మా యిష్ట" మన్నారు యిద్దరూ.

● *ప్రచురణ, 1988* ●

★ ★ ★

60

పోలవరపు కోటేశ్వరరావు

# రథయాత్ర

వైశాఖమాసం.

ఎండ భరించటం చాలా కష్టంగా వుంది. వడగాలికి భయపడి ఎవరూ బయటికి రావటం లేదు. పిల్లలకు ఇవేమీ పట్టటం లేదు. ఏటి నీళ్ళల్లో దూకి ఈదుతున్నారు. వడ్డెక్కి పొలాల మధ్యగా పరుగులు తీసి మామిడి తోటల దగ్గరకు చేరుతున్నారు. కాపలావాడిని మంచి చేసుకునో, మభ్యపెట్టో పచ్చికాయలు సంపాదించి ఉప్పూ కారమూ అద్ది అరగిస్తున్నారు.

ఈ రోజు నారాయణకు తీరిక లేకుండా వుంది. స్నేహితులతో కలసి గుసగుసలాడుతున్నాడు.

ఎలాగైనా రాత్రికి శ్రీకాకుళం వెళ్ళి రథోత్సవం చూచి రావాలి.

రంగన్న, సీనూ, రామూ వచ్చారు.

అంతా చావడిలో చేరారు.

"నారీ అన్నా! మా నాయన వప్పుకున్నాడు" అన్నాడు రంగయ్య.

"సీనూ, మీ అమ్మ ఏమందిరా?" నారాయణ అడిగాడు.

"వప్పుకోవటంలేదు–" వాడు నిరుత్సాహంగా చెప్పాడు.

రామూ కూడా 'లాభంలే'దన్నాడు.

"ఎలాగైనా వెళ్ళి చూడాలన్నా!" అన్నాడు సీను.

"రాత్రి కళ్యాణం దగ్గర కాంగ్రెస్‌వాళ్ళు గొడవ చేశారని మా అమ్మ కూడా వీల్లేదంటోంది."

"ఏం చేద్దాం?"

అంతా ఆలోచించారు. అమ్మనీ, నాన్ననీ బ్రతిమాలి అనుమతి సంపాదించా లనుకున్నారు.

"ఒకవేళ వప్పుకోకపోతే ఎలాగన్నా?"

నారాయణ ఈ నలుగురిలో పెద్దవాడు. అతని మాటంటే అందరికీ నమ్మకం.

"సీనూ! రాత్రిపూట గొడ్ల దగ్గర చావిడిలో పండుకుంటావుగదా!"

"ఔనన్నా......"

"పెందరాడే అన్నం తిని చావిడి దగ్గరకొచ్చేయ్. అక్కడినుండి అంతాకలిసివెళ్దాం."

ఈ ఆలోచన అందరికీ నచ్చింది.

చీకటిపడే సమయానికి నారాయణ తల్లిని వప్పించాడు.

నారాయణ తల్లికి దైవభక్తి ఎక్కువ. అందువల్ల ఇలాంటి విషయాలలో ఆమె వద్దనదు. కానీ, ఈ సంవత్సరం పరిస్థితి వేరుగా వుంది. ఈ మధ్యనే తెనాలిలో కాంగ్రెస్ వాళ్ళు గొడవ చేశారట. రాత్రి శ్రీకాకుళంలో పోలీసులు లాఠీలతో కాంగ్రెస్ కార్యకర్తలను కొట్టారని తెలిసింది. ఈ రోజు రథోత్సవం. మళ్ళీ ఏమవుతుందోననే భయం.

కాని, కొడుకు బతిమాలుతుంటే, కాదనలేక వప్పుకుంది.

నారాయణ చొక్కా-లాగూ కొత్తవి వేసుకుని బయలుదేరాడు.

తల్లి ఇచ్చిన బేడా జేబులో దాచుకున్నాడు. అతనికి చాలా సంతోషంగా వుంది. బేడా అంటే రెండణాలు. ఎనిమిది కానులు. ఇరవై నాలుగు దమ్మిడీలు. దమ్మిడీ పెడితే చక్కెడం కొనుక్కోవచ్చు. చక్కెరకడ్డీ కొనుక్కోవచ్చు. కానీ పెడితే చెరకు ముక్క వస్తుంది రంగన్న వచ్చి కలిశాడు. ఇద్దరూ గొడ్లచావిడి వద్దకు వెళ్ళారు. సీనూ, రామూ అక్కడే వున్నారు. నలుగురూ, ఎవరికీ కనపడకుండా లంక దిగి ఇసుకలోకి వెళ్ళారు.

"మేరుకాల్వడవ తప్పిందంట." సీను అన్నాడు.

"కొద్ది లెక్కలే లోతుగా వుండేది."

"ఎప్పుడూ లేంది ఈ యేడు పోలీసుల గొడవొచ్చిపడింది."

"అంతా ఆ కాంగ్రెస్‌వాళ్ళ మూలానే-"

"కాంగ్రెసువాళ్లంటే?" సీనూ అడిగాడు.

"తలమీద టోపీ పెట్టుకుని, ఖద్దరు పంచె కట్టుకుని, మూడు రంగుల జెండా పట్టుకుని మన వూరు వస్తుంటారు. వాళ్ళని చూడలేదా?"

"చూశాను."

"వాళ్లే."

"వాళ్లు, మంచివాళ్లేగా."

"ఔను."

"మొన్న అనంతారం నుండి భూషయ్య అని ఒకాయన వచ్చాడు. ఆయనతో యింకా చాలామంది జెండాలు పట్టుకుని జేజేలు కొడుతూ మన వూరంతా తిరిగారు-" అన్నాడు రాము.

"వాళ్లతో సిపాయి బాబాయి కూడా వచ్చాడు." రంగన్న అందుకున్నాడు.

"వాళ్లేం చేస్తారు?"

"నాకు తెలవదు...."అన్నాడు రంగన్న

"నాకూ తెలవదు" అన్నాడు సీను.

"నీకు తెలుసా నారాయణా?"

నారాయణ ఏదో ఆలోచిస్తున్నాడు. వెంటనే సమాధానం చెప్పలేదు.

"నారీ అన్నా! నీకు తెలుసా?" సీనూ అడిగాడు.

"కొద్దిగా తెలుసు....."

"వాళ్లెవరు?"

"మనవాళ్లే. గాంధీగారు వారికి పెద్ద నాయకుడు. వీళ్లంతా మన దేశానికి స్వాతంత్ర్యం రావాలని పోట్లాడుతున్నారు."

"నీకెట్టా తెలుసన్నా?"

"తెనాలి నుండి మా యింటికి చుట్టాలు వచ్చారు. వాళ్ళు చెపుతుంటే విన్నాను. అక్కడ పోలీసోళ్లతో పోట్లాడారని మా అమ్మ చెప్పింది." సీనూ అన్నాడు.

"ఎవరో సైమన్ అనే అయన రైల్లో వస్తుంటే, వెనక్కు పో–రావద్దు అన్నారంట...."

"ఎవరన్నారు?"

"కాంగ్రెసువాళ్లు."

"ఏమయింది?"

"పోలీసులొచ్చి లాఠీలతో చితకబాదారంట."

వాళ్లకు సరిగా అర్థం కాలేదు.

వాళ్లు నలుగురూ మెత్తని యిసుకమీద చకచకా నడుస్తున్నారు.

బుసకలో కాళ్లు పెగలటం లేదు. గరప యిసుకమీదకు వచ్చి, లంక ఎక్కారు. ఎదురుగా ఏటికట్టపైగా, తుమ్మలమీదుగా చందమామ నవ్వుతూ కన్పించాడు.

దేవాలయం నుండి సన్నాయి వినిపిస్తోంది. డోలు వరుసలు మ్రోగుతున్నాయి. బాకాలు ఊదుతున్నారు.

ఆ వాయిద్యాలు వినిపించటంవలన స్నేహితులకు మహదానందంగా వుంది.

నలుగురూ పోటీపడి పరుగులు తీశారు. రొప్పుకుంటూ నీటి అంచుకు వచ్చి ఆగారు.

ఆ వెన్నెట్లో వెండి తరగలతో కృష్ణవేణి వయ్యారంగా పరుగులు తీస్తోంది. సముద్రపు గాలికి చిరుకెరటాలు నీటి జాలుకు ఎదురెళుతున్నాయి. చల్లగాలి పరామర్శిస్తోంది.

నారాయణతో కలసి అంతా లాగూ–చొక్కాలు వూడదీశారు– జాగర్తగా వాటిని తలకు చుట్టుకున్నారు.

కాలినడవ తప్పినా, యిక్కడ నదిలో మెరకగా వుంది.

ఉత్సవాలకు వెళ్లేవారి ఉపయోగం కొరకు నదిలో దారి పొడవునా పుల్లలు పాతి వున్నాయి.

"ఒకరి మొలతాడు మరొకరు పట్టుకోండి. జాగర్తగా నా వెనుకనే రండి" అన్నాడు నారాయణ.

అందరూ ఒకరి వెనుక ఒకరు నడుస్తున్నారు.

ఆ వేసవి ఎండకు నీటి పైపొర వేడిగా వుంది. లోన చల్లగా నీరు ప్రవహిస్తోంది. తొడలోతు వచ్చాక సీనూ అడిగాడు– "అన్నా! కొంచెమాగు. మంచినీళ్ళు తాగుతా."

అంతా ఆగిపోయారు.

రెండు చేతులతో పైనీటిని అటూ ఇటూ నెట్టి, దోసిళ్లతో కడుపారా త్రాగారు.

"అబ్బ! ఎంత చల్లగా వున్నాయో చూచావా?" అన్నాడు రాము.

"పంచదార కలిపినట్టుంది." సీనూ మరో గుక్క త్రాగి అన్నాడు.

"ఔను! దేముడు ఈ నది నిండా బెల్లం కలుపుతాడట.అందుకే కృష్ణ నీరు యింత తీయగా పానకంలా వుంటుందని మా తాత చెప్పాడు" అన్నాడు రంగన్న.

అంతా నిజమే ననుకున్నారు.

నదిలో నడుస్తున్నారు. బొడ్డులోతు దాటింది. మరో పది అడుగులేసేసరికి రొమ్ములోతు అయింది. అందరిలోకీ చిన్నవాడు రంగన్న, నారాయణ భుజం పట్టుకుని నడుస్తున్నాడు.

కాళ్ళక్రింద యిసుక కదలిపోతోంది. కాలుతీసి కాలు వేయటానికి నేలమీద పట్టు దొరకడం లేదు. వడి ఎక్కువగా లేకపోయినా పిల్లలకు కష్టంగానే వుంది.

ప్రయాసపడి నది దాటారు.

రంగన్న లాగూ తొడుక్కుంటూ "నాకు భలేభయమేసింది అన్నా!" అన్నాడు.

నారాయణ వాడి తలమీద మొట్టికాయవేసి, "పిరికి సన్నాసివిరా! నా భుజం పట్టుకుని కూడా భయమేసిందా? ఇంకా నయం, నన్ను వాటేసుకుంటే యిద్దరం మునిగిపోయేవాళ్లం" అన్నాడు.

పిల్లలు నలుగురూ కేరింతలు కొట్టుకుంటూ ఏటికట్ట ఎక్కారు.

కట్టకానుకుని శ్రీకాకుళం వుంది. గ్రామం మధ్య విశాలమయిన బజారు. జనం కిట కిటలాడుతున్నారు.

దేవాలయం దగ్గరలో సందడి హెచ్చుగా వుంది.

వెనుకనున్న ఆంజనేయస్వామి దేవాలయం వరకూ నులక మంచాలు పరచారు. వాటిమీద దుప్పట్లువేసి, పళ్లేలు వుంచారు. వాటినిండా మిఠాయి, కారప్పూస, పకోడి నింపి అమ్ముతున్నారు. మరోవైపు అరటిపళ్లు, కొబ్బరికాయల దుకాణాలున్నాయి. జాడీల కొట్లు, బట్టల కొట్లు వరుసగా వున్నాయి. జనం మంచాల చుట్టూ చేరి కావలసినవి కొనుక్కుంటున్నారు.

పిల్లలు తలా ఒక రకం పొట్లాం కట్టించి, చేత్తో పట్టుకున్నారు. వాటిని పంచుక తింటూ దేవాలయం ముందుకు వెళ్లారు.

గుళ్లో ప్రవేశించారు. మంగళవాయిద్యాల మ్రోతలతో దేవాలయ ప్రాంగణం ఆనందంగా వుంది. భక్తులంతా ఉత్సాహంగా వున్నారు. గర్భగుడిలో గుడిగంటలు అవిశ్రాంతంగా మ్రోగుతున్నాయి. దైవదర్శనం కొరకు తోపులాట ఎక్కువగా వుంది.

నారాయణ చుట్టూ తప్పిపోకుండా నిలచిన ముగ్గురూ మునికాళ్ల మీద లేచి తమ ముందున్నవారి భుజాలపైగా కాకుళేశ్వరస్వామిని చూచారు. ఎగిరెగిరి గంట

ప్రయోగించారు. రంగన్నకు గంట అందలేదు. నారాయణ వాడిని ఎత్తిపట్టుకుని గంట కొట్టించాడు.

వాళ్ల కళ్లు మెరిసిపోతున్నాయి.

ముఖాలు వెలిగిపోతున్నాయి.

గుండాలు ఆనందంతో పొంగిపోతున్నాయి.

జనాన్ని తోసుకుని బయటికి వచ్చారు.

కళ్యాణ మంటపంమీదకు వెళ్లారు. గుడిచుట్టూ తిరిగారు. ధ్వజస్తంభంమీది జెండాను చూచారు. వ్రేలాడుతున్న దీపాలను చూచారు—చిరుగాలికి మ్రోగుతున్న ధ్వజస్తంభపు గంటలను చూచారు. అంతా ఆశ్చర్యమే! అంతా ఆనందమే!

గాలిగోపురం ముందున్న రథానికి అలంకరణ పూర్తి అయింది. వాళ్లు అపుడపుడూ చూస్తున్న రథమే.

కాని ఈరోజు కొత్తగా వుంది. దుమ్ము దులిపి రంగులు వేశారు. దుప్పట్లు కప్పి, తోరణాలతో నింపారు. రెండు పొడవాటి మోకులు చుట్టలు చుట్టి రథం ముందు వేసి వున్నాయి.

అంతా సంతోషంతో రథచక్రాల ప్రక్కన నిలిచారు. వాళ్లకు బూట్లమోత వినపడింది.

అక్కడ నిలబడి రథాన్ని చూస్తున్న జనం భయపడుతూ ప్రక్కకు తప్పుకున్నారు. పిల్లలు ముగ్గురూ కంగారుగా నారాయణ చేయిపట్టుకున్నారు. అందరూ దూరంగా వెళ్ళి చెరువుగట్టున చెట్టుక్రింద నిలిచారు.

పోలీసులు యూనిఫారంలో వచ్చి అక్కడక్కడ నిలబడ్డారు.

వెన్నెట్లో ఆ కాకీబట్టలు వెలవెలబోతున్నాయి.

దేవాలయంలో నుండి వాయిద్యాలు మ్రోగిస్తూ ఉత్సవ విగ్రహాలు తెచ్చారు. సర్వ వాయిద్యాలూ జ్వరం వచ్చినట్టు అరుస్తున్నాయి. ఎవరివరుస వారిదే. ఎవరి తాళం వారిదే. అంతా మ్రోతలతో నిండిపోయింది. కాగడాలు కొడిగడుతున్నాయి. నూనెపోసి జీవం పోస్తున్నారు.

బ్రాహ్మణులు మంత్రాలు చదువుతున్నారు.

వింజామరలతో విసురుతున్నారు. పలురకాల గొడుగులు, శంఖుచక్రాలు వెంటతీసుకువస్తున్నారు.

రథంమీద విగ్రహాలను పీఠంపైన వుంచి, కదలకుండా బిగించారు. పిల్లలూ, పెద్దలూ భయం భయంగా రథం దగ్గరకు వచ్చారు. టెంకాయలు కొట్టి కాకుళేశ్వరునికి జయజయధ్వానాలు పలికారు. రథానికి ప్రక్కల కాగడాలు పట్టుకుని కూర్చున్నారు. పూజారుల నల్లని శరీరాలు ఆ వెలుతురులో నిగనిగలాడుతున్నాయి. వారి ముఖాలు కళావిహీనంగా వున్నాయి. వారి ఫాలతలం మీది వైష్ణవ నామాలు మెరుస్తున్నాయి.

జనం మోకులు పట్టుకున్నారు.

బాకాలు బావురుమన్నాయి.

డోళ్ళు వరుసలు పలికాయి.

సన్నాయి నొక్కులు వినిపించాయి.

బేండుమేళం ఢమఢమలాడింది.

తాసామర్పాలు చెవులు గింగురుమనిపించాయి.

రథంముందు వండిన అన్నం బలిహారణగా పోశారు.

రథపూజ జరిగింది. దేవునికి హారతి ఇచ్చారు.

దేవదాసీలు నృత్యం చేస్తున్నారు.

'గోవిందా! గోవిందా!!' అంటూ మొకులు లాగారు.

రథం కదిలింది.

మబ్బులులేని ఆకాశం నుండి భయంకర ధ్వనులతో పిడుగుపడినట్లు ఎక్కడి నుండో నినాదాలు విన్పించాయి.

"మహాత్మాగాంధీకి జై!"

"కాంగ్రెస్ పార్టీ జిందాబాద్, బోలో స్వతంత్ర భారత్‌కు జై!"

రథానికి అన్నివైపులనుండీ యివే నినాదాలు.

సర్వవాయిద్యాలూ ఆగిపోయాయి. రథం లాగడం మరిచిపోయిన భక్తులు ఆశ్చర్యంతో అన్నివైపులా చూస్తున్నారు. భయంతో నిలిచిపోయారు.

పోలీసు బలగం పరుగులు తీసింది. అన్నివైపులకూ ఆగకుండా దూకింది.

ఒక చినుకు పడితే అపుకోవచ్చు. వాన పడితే గొడుగు వేసుకోవచ్చు–తుఫాను సాగితే ఏ అచ్చాదనా ఆపలేదు.

జనఘోషతో, నినాదాలతో ఆ గుడిముందు తుఫానులా వుంది. పోలీసులవల్ల అది ఆగేటట్టు లేదు.

వారి చేతుల్లోని లాఠీలు లేచాయి. జనంమీద విరుచుకపడ్డాయి. అందిన వాళ్ళనందినట్టు బాదాయి. నిలచి చూస్తున్న నారాయణ వీపుమీద లాఠీ మ్రోగింది. ఆ దెబ్బకు అదిరిపోయి కాలుకుందికీ పరుగెత్తాడు.

ఆగకుండా చెరువుగట్టు దాటి పొలాల్లోకి వెళ్లాడు.

రంగన్నా, సీనూ, రామూ ఏమైనారో తెలియదు.

వాళ్లనుగూర్చి ఆలోచన రావటంతోటే ఆగిపోయాడు. అన్నివైపులా చూచాడు. నెమ్మదిగా ఒక చెట్టు చాటుచేసుకుని నిలబడ్డాడు. పైన వెన్నెల చిమ్ముతోంది. సుడిగాలికి లేచిన ఎండుటాకుల్లా జనం పారిపోతున్నారు.

కానీ ఆ నినాదాలు ఆగటంలేదు.

పోలీసులకు అర్థం కావటంలేదు.

నారాయణ అలాగే నిలిచి చూస్తున్నాడు. ఎవరో భుజంమీద చేయివేసి ప్రక్కనే నిలిచారు. నారాయణ అతనివంక చూచాడు. ఆ వ్యక్తి అప్యాయంగా తనను చూస్తున్నాడు. ఆకుల మధ్య నుండి వెన్నెల కిరణాలు వచ్చి అతని ముఖంమీద నాట్యం చేస్తున్నాయి.

"భయం వేస్తోందా?" ఆ వ్యక్తి అడిగాడు.

నారాయణ సమాధానం చెప్పలేదు. పోలీసుల వంక చూస్తున్నాడు.

"భయపడి పారిపోతే దెబ్బలు తప్పుతాయా? చూడు, ఆ మూర్ఖులు ఎలా బాదుతున్నారో? ఈ పిరికిపందలు ఎందుకు పారిపోవాలి? ఒక్కడు కూడా ఎదురు తిరగడం లేదు" ఆ వ్యక్తి అన్నాడు.

నారాయణ ఆశ్చర్యపోతూ అతన్ని పరిశీలనగా చూశాడు.

లాఠీలు తగిలి పడిపోయినవారి హాహాకారాలు వినిపిస్తున్నాయి. పోలీసులు బూతులు తిడుతూ, బూటుకాళ్లతో తన్నుతున్నారు. ఏడ్పులు, కేకలు, నినాదాలతో అంతా బీభత్సంగా వుంది.

నారాయణ గుండె దడదడలాడుతోంది. కానీ ప్రక్కన నిలిచి ధైర్యంగా నిలబడిమాట్లాడుతున్న అతని ప్రశాంతవదనం ధైర్యాన్నిచ్చింది.

"ఈ జాతి ఎదిరించడం ఎప్పుడు నేర్చుకుంటుందో?"

అతను తనలో తాను అనుకుంటున్న మాటలు నారాయణ విన్నాడు.

"వాళ్ళు చావబాదుతుంటే ఏం చేయాలి?" నారాయణ అడిగాడు.

ఆ వ్యక్తి ఏమీ చెప్పలేదు. నవ్వి, ముందుకు వెళ్ళాడు. నారాయణ ఆశ్చర్యపోతూ చూస్తున్నాడు.

సన్నగా, నల్లగా వున్న ఆ యువకుడు ముతక ఖద్దరు కట్టుకున్నాడు. గోచీ బిగించి, కుచ్చీలు పైకి దోపుకున్నాడు.

జేబులో కాంగ్రెస్ జెండాలున్నాయి. అతను చకచకా రథంవైపు వెళ్తున్నాడు.

పోలీసులు జనాన్ని తరిమి తరిమి అలసిపోయారు.

లాఠీలతో బాది బాది చేతులు పీకుతున్నాయి. నెమ్మదిగా ఒకచోటకు చేరి, నిలబడి చూస్తున్నారు.

ఆ యువకుడు నిర్భీతిగా రథంవద్దకు వెళ్ళి పైకి ఎక్కాడు. పూజారులు బిక్కుబిక్కుమంటూ అతనివైపు చూస్తున్నారు.

"ఆచార్యులవారికి నమస్కారం" అన్నాడు ఆ వ్యక్తి. పూజారులు మాట్లాడలేదు. భయపడుతూ అతనివైపు చూచి తమనేమీ చేయడనే నిర్ణయానికి వచ్చారు. ఐనా వారికి బెదురు పోలేదు. వణుకుతున్న చేతులతోనే నమస్కరించి, ముడుచుక కూర్చున్నారు.

ఆ యువకుడు రెండు త్రివర్ణ పతాకాలను రథానికి రెండువైపులా కట్టాడు.

వెన్నెలలో అవి నవ్వుతున్నాయి. లలితంగా కదలుతున్నాయి. గాలికి ఆనందంగా ఆడుతున్నాయి. పోలీసులవంక చూచి పకపక నవ్వుతున్నాయి.

ఆ వ్యక్తి కాగడా చేతిలో పట్టుకుని, రథంమీద ముందువైపుకు వచ్చి నిలబడ్డాడు. నారాయణవైపు కాగడా వూపుతూ, నాలుగువైపులా చూచాడు.

"మహాత్మాగాంధీకి—జై!" అంటూ నినదించాడు.

పిడుగుపాటుగా ఆ నినాదం గాలిలో కదలింది. అతను వెంట వెంటనే నినదిస్తున్నాడు. పిడికిలి బిగించి, సింహంలా గర్జిస్తున్నాడు.

దూరంగా నిలబడిన పోలీసులు ఆశ్చర్యపోతూ చూశారు. పారిపోతున్న జనం నిలిచిపోయారు. తమ కళ్ళని తామే నమ్మలేకపోతున్నారు–రథానికి రెండువైపులా త్రివర్ణ పతాకాలు ఎగురుతూ వున్నాయి.

రెపరెపలాడుతున్నాయి.

త్రుళ్ళిపడుతూ కేరింతలు కొడుతున్నాయి.

విజిల్లు వినిపించాయి. తాము చేసిన పొరపాటును అర్థం చేసుకున్న పోలీసులు రథాన్ని కాపాడలేకపోయినందుకు ఖిన్నులయ్యారు.

వారిపైనున్న ఆఫీసరు హుంకరించాడు. చేతిలో పిస్టలు పట్టుకుని బూతులు తిడుతూ నిలబడ్డాడు.

లాఠీలన్నీ రథం చుట్టూ చేరాయి.

నిర్భీతితో ఆ యువకుడు నినాదాలిస్తూనే వున్నాడు.

దూరంగా పారిపోయిన జనం గొంతు కలిపి నినదిస్తూ రథంవైపు రాసాగారు.

నారాయణకు యిదంతా అగమ్యగోచరంగా వుంది. అతను చెట్లచాటుగా సాధ్యమైనంత దగ్గరలోకి వచ్చి నిలబడ్డాడు. పైన నిలచిన వ్యక్తిని పోలీసులు క్రిందకు తోశారు. అతను పడిపోతూ రథపుటంచు పట్టుకుని, క్రిందకు జారాడు.

పోలీసులు కమ్ముకున్నారు.

లాఠీలు మ్రోగాయి. బూట్లకాళ్ళు కుమ్మాయి

చివరకు అలసిపోయి లాఠీలు ఆగాయి.

ఆ యువకుని వళ్ళంతా హూనమయిపోతోంది. దెబ్బలు పడనిచోటు లేదు. రక్తంతో అతని చొక్కా, పంచె తడిశాయి. దుమ్ములో నుండి లేచి, దెబ్బతగిలిన తలను చేత్తో పట్టుకున్నాడు. ధారగా వస్తున్న రక్తాన్ని ఆపుకుంటూ, మరో చేత్తో పిడికిలి బిగించి "మహాత్మా గాంధీకి జై!" అన్నాడు మళ్ళీ!

అంతే! లాఠీలు మళ్ళీ విరుసుకుపడ్డాయి. వాటికి చోటు చాలలేదు. రక్తం చింది కాకీలమీద పడింది.

అతను "మహాత్మా గాంధీకి జై!" అంటూనే వున్నాడు.

ఆ స్వరం బలహీనపడి గొంతుదాటి పెగలటం లేదు.

ఆ యువకుని శక్తి తరిగిపోతోంది. అయినా పెదవులు కదులుతూనే వున్నాయి.

పెద్ద ఆఫీసరు వచ్చాడు.

పోలీసులు తొలిగి శాల్యూట్ చేశారు.

"యీ నా కొడుకును యిట్లా కాదు. ఆ కాళ్ళమీద కొట్టండి. నా కొడుకు! కుంటి బతుకు బతకాలి."

ఆ ఆఫీసరు ఆజ్ఞ శిరసా పాలించారు. ఆ దేశభక్తుని కాలు విరిగిపోయింది.

చూసేవాళ్లకు గుండెలు చెరువయ్యాయి.

కన్నులు కొలనులయ్యాయి.

హృదయాలు బాధతో సుడులు తిరిగాయి.

నారాయణ చూస్తూ నిలబడిపోయాడు.

క్రౌర్యంతో మీసాలు మెలిపెడుతున్న ఆఫీసరువంక చూచి ఖాండ్రించి వూశాడు. కాని కదలటానికి కాళ్ళు సహకరించటం లేదు. ఎన్నో తాళ్లతో కట్టివేసినట్టుంది. ఆ యువకునివంక చూస్తూ నిలబడ్డాడు.

తాను దెబ్బలు తింటానని తెలిసికూడా అతనాపని ఎందుకు చేశాడు? తనను ఎదురించమని చెప్పినదాని అర్థం దెబ్బలు తినటమనేనా? పాపం! కాలు విరిగిపోయింది. లేవలేక లేవలేక లేస్తున్నాడు. అయ్యో! మరల పడిపోయాడు. ఒక్క పోలీసు కూడా సహకరించటం లేదే! నారాయణ కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

పోలీసులు బూట్లు టకటక లాడించుకుంటూ అక్కడి నుండి వెళ్ళి, ఆఫీసరు ముందు నిలబడ్డారు.

రథోత్సవం ఆగిపోయింది.

రథచక్రాలు మెత్తగా కదలటానికి వేసిన నూనె ఒకోబొట్టు నేలమీద పడుతోంది. ప్రాణం లేని దేవుని రథంకూడా జాలితో కన్నీరు కారుస్తోంది. కాని, ఆ పోలీసుమంద తెల్లదొరల వూడిగాని కలవాటుపడి తమవారిని నిర్దాక్షిణ్యంగా హింసిస్తున్నారు. జమిందారీ గ్రామాలలో కాంగ్రెసు భావాలు ప్రవేశించటం చల్లపల్లి రాజాకు యిష్టం లేదు. తనను ఎవరు ఎదిరించినా వారికి పట్టే గతి ఏమిటో చూపించదలచాడు. దానికి ఈరోజు జరిగిన క్రూర హింసాకాండ నిదర్శనంగా నిలిచింది. నారాయణకు ఏదో సత్తువ వచ్చింది. పరుగున వెళ్ళి ఆ వ్యక్తిని పట్టుకొని కూర్చోబెట్టాడు. అంతులేని బాధతో వుండి కూడా ఆ యువకుడు కళ్లెత్తి చూడటానికి ప్రయత్నించాడు. ఒక కన్ను దెబ్బతిన్నది. రెండో కనురెప్ప కదిలింది. అతను చూచాడు. గుర్తుపట్టాడు. పెదవులపై చిరునవ్వుతో నారాయణ చేయి సవరించాడు. ఆ పున్నమి మరునాటి వెన్నెల క్రింద రక్తపు మరకలతో నిండిన అతని ముఖంలో ప్రశాంతత ఉంది. గుండె నిబ్బరం ఉంది. ఈ దేశానికి తను ఎంచుకున్న అహింసా మార్గంలో సేవ చేస్తున్నాననే సంతృప్తివుంది. అతను తూలి పడిపోయాడు.

నారాయణ అతన్ని రొమ్ముకానించి కూర్చోబెట్టుకున్నాడు. ఎవరో మంచినీళ్లం దించారు. నారాయణ నెమ్మదిగా త్రాగించాడు. నలుగురు సాయంపట్టి దేవాలయపు ప్రహరీగోడకానించి కూర్చోబెట్టారు.

మరలా పోలీసులు టకటకలాడుతూ వచ్చారు.

జనం ఎడంగా వెళ్ళి నిలబడి చూస్తున్నారు. ఈమాటు పోలీసులు లాఠీలు ఆడించలేదు.

ఆ వ్యక్తిని మోసుకుపోయారు.

నారాయణ ఏటికట్టమీదకు వచ్చాడు. మిగతా మిత్రులు అక్కడ కలిశారు.

సీను అన్నాడు– "అన్నా! నాకు భయంగా వుంది."

నారాయణ అతన్ని దగ్గరకు తీసుకొని "ఎందుకు?" అన్నాడు.

"పోలీసులు కొడుతుంటే చూచాను. అప్పటినుండి నా కాళ్ళు వణుకుతున్నాయి."

"భయం దేనికిరా? అన్ని దెబ్బలు తిన్న ఆయనే భయపడలేదు. ఏ దెబ్బా తినకుండానే భయపడిపోవటం దేనికి?"

"వెళ్ళి పోదామన్నా......."

"పదండి."

నీటి అంచుకొచ్చి కూర్చున్నారు. ఎవరూ మాట్లాడలేదు. నారాయణ అన్నాడు– "ధైర్యమంటే అతనిదే. మనము కూడా అంత ధైర్యంగా వుండాలి–"

రంగన్న అప్పటివరకూ మాట్లాడలేదు. అతనికున్న అనుమానాన్ని వెళ్లబుచ్చాడు.

"గాంధీజీ అనే ఆయన యింకా ధైర్యంగా వుండివుంటాడు."

"గాంధీ అంటే ఎవరు?" అందరూ నారాయణను అడిగారు.

"నాకూ తెలియదు."

"ఎందుకు అలా దెబ్బలు తినటం?"

"ఆ జెండాలు కట్టినందుకు, బోలో స్వతంత్ర భారత్‌కీ జై అన్నందుకు."

"యివన్నీ ఎందుకు చేయాలి?"

"తెలియదు."

వాళ్లకు వెళ్ళేటప్పుడున్న సంతోషం యిప్పుడు లేదు. వాళ్ల జోరు జారిపోయింది. ఆందోళన ఆవహించింది. వాళ్ల చిన్నబుర్రలనిండా ఎన్నో ప్రశ్నలు బయలుదేరాయి. కాని, వాటికి సమాధానాలు దొరకటంలేదు.

"అన్నా!"

"చెప్పు."

"తెనాలిలో కూడా యిలాగే కొట్టివుంటారు."

"ఔననుకుంటా."

"తెనాలి అని ఏముంది, ఎక్కడైనా పోలీసులు యిలాగే బాదేస్తారు." మరో కుర్రవాడు సమాధానం చెప్పాడు.

"మనకు తెలియనిదేదో వీళ్లంతా కావాలంటున్నారు. అది పోలీసుల కిష్టంలేదు. రాజాకిష్టంలేదు. అందుకే ఈ దెబ్బలు."

అంతా ఔననుకున్నారు.

మరలా యేరు దాటాలి. చొక్కాలు విప్పుతున్నప్పుడు నారాయణ తనకు అయిన రక్తపు మరకలు చూచాడు. అంతవరకూ అతనికీ విషయమే పట్టలేదు.

ఆ మరకలు చూస్తూ అతను ఆవేశపడ్డాడు.

"అరే! మీరంతా జై అనండిరా!" అన్నాడు.

తాను ఆ రక్తసిక్తమైన చొక్కాను చేత్తో పట్టుకుని, జెండా మాదిరిగా గాలిలో ఎగరేశాడు, ఆవేశంతో.

"మహాత్మ గాంధీకి – జై!"

"కాంగ్రెస్ పార్టీ – జిందాబాద్!"

వాళ్ళు వోపికకొద్దీ అరుస్తున్నారు.

ఏరు దాటటానికి వచ్చిన జనం కూడా గొంతులు కలిపారు. అంతకంతకూ జనం ఎక్కువయ్యారు.

యిదంతా చూచిన నడినెత్తిన చంద్రుడు నవ్వుకుంటున్నాడు.

ఆ నినాదాలు పెరుగుతూనే వున్నాయి.

ఆ యిసుక తిన్నెలపైగా నలువైపులకూ పరుగులు తీస్తున్నాయి.

కృష్ణవేణి హృదయం మీదుగా సాగిపోతున్నాయి.

బంగారు పండించే లంకభూములను తాకుతున్నాయి.

నిర్మలాకాశపు సౌందర్య చంద్రకాంతులతో కలిసిపోతున్నాయి.

ఆగకుండా సాగిపోతూనే వున్నాయి.

ఆ జనఘోషను ఎవరాపగలరు?

ఆ స్వాతంత్ర్య రథయాత్రను ఆపగల వారెవరు?

● *'కాకుళయ్య కథలు' నుండి – ప్రచురణ, 1989* ●

★ ★ ★

61

కె. సదాశివరావు

# నేకెడ్ ఫకీర్

"LIBERTY DOES NOT DESCEND TO A PEOPLE. A PEOPLE MUST RAISE THEMSELVES TO LIBERTY. IT IS A BLESSING THAT MUST BE EARNED BEFORE IT CAN BE ENJOYED. (An Inscription on the main building of Central Secretariat, New Delhi.)

"స్వాతంత్ర్యం ఏ ప్రజకీ పైనుండి దిగిరాదు. ప్రజలే స్వాతంత్ర్యపు ఔన్నత్యానికి ఎదగాలి. ఆ వరాన్ని ముందుగా సాధించిన తర్వాత దానిని అనుభవించాలి."

ఏమిటి ఈ వాక్యాల అర్థం? ఇది ఆంగ్లేయులు భారతీయులకి యుగ యుగాలకీ ఇచ్చిన సందేశమా? ఉపదేశమా? సలహా? ఛాలెంజ్? ఇన్సల్ట్? వార్నింగ్? ఏమిటది?

☆ ☆ ☆

వర్షం కురుస్తూ ఫాగ్ నిండిన ఓ చల్లటి లండన్ సాయంత్రాన ఇద్దరు డిగ్నిఫైడ్ ఇంగ్లీష్ జెంటెల్‌మెన్ పాల్‌మాల్ ప్రాంతంలో ఓ క్లబ్‌లో భోజనం చేస్తున్నారు. తెలుగు భాష మీద గంగవెర్రి వున్నవాళ్ళు సరదాపడతారని భోజనం చేస్తున్నారు అని రాయడం జరిగింది కాని అది నిజమైన సంఘటనని, సిసలైన పదాలతో వర్ణించడంలో ఓటమిని సూచిస్తుందేమోనని పిసరంత అనుమానం. వాళ్ళు లేట్ డిన్నర్ తీసుకుంటున్నారు. వాళ్ళిద్దరూ డెబ్బైయేళ్ళు దాటిన వృద్ధులు. ఇద్దరూ ఇండియాలో సివిల్ సర్వెంట్స్‌గా పనిచేసి రిటైర్ అయినవాళ్ళు. తమ జీవితాలలో దాదాపు నలభై ఏళ్ళదాకా ఆ దేశంలో గడిపి ఆ దేశ చరిత్రలో భాగం పంచుకున్న మనుషులు. నిజానికి వాళ్ళకి ఇంగ్లండ్‌కన్నా ఇండియా నిజమైన దేశం. ఇంగ్లండ్‌లో వాళ్ళు పూర్తిగా ఏనాడూ ఇమడలేకపోయారు. ఏలియన్‌లలా ఫీలయేవారు వాళ్ళు. వాళ్ళిద్దరికీ బ్రిటిష్ ప్రభుత్వం నైట్‌హుడ్ ఇచ్చింది.

ప్రతి వారం పదిహేను రోజులకి ఇలా సాయంత్రాలు గడపడం వాళ్ళకి అలవాటు.

బయట వర్షం. లండన్ పురవీధులు లైట్ల వెలుతురులో కురుస్తున్న వానలో మెరుస్తున్నాయి. వాననీరు దుమ్మూ, ధూళిని కడిగి నగరాన్ని శుభ్రం చేస్తున్నది.

ఆ ఇద్దరు వ్యక్తులూ అధికారిక జీవిత కాలంలో ఎన్నో అనుభవాలని చవిచూశారు. మంచి–చెడూ, గెలుపు–ఓటమీ, మంచి రోజులు–చెడు రోజులూ చూశారు. అన్ని

దశాబ్దాల అనుభవాలు వారి మనోఫలకం మీద ప్రతిఫలించి క్షణాలలో మారిపోయే స్మృతుల వరదలు వారిని ముంచివేస్తున్నాయి. ఆ అనుభవంలో వారికి ఆనందం వుంది. నోస్టాల్జియా ఈజ్ డిలైట్ ఫుల్!

"నేను ఇండియాని మిస్ అవుతున్నాను రాబర్ట్! ప్రతి క్షణం ఆ జ్ఞాపకాలు నాకు ఇండియాని గుర్తు చేస్తూనే వున్నాయి." నిట్టూరుస్తూ గ్లాస్‌లోని స్కాచ్ సిప్ తీసుకున్నాడు సర్ బేసిల్ మూర్. బేసిల్ ఆరడుగుల నాలుగంగుళాల మనిషి. ఇండియన్ ఆర్మీలో బ్రిగేడియర్ జనరల్‌గా రిటైరయాడు. జాలీగుడ్ ఫెలో. ఆ పెద్ద హేండిల్ బార్ మీసాలు, గంభీరమైన భారీ కాయం వెనక అన్నింటినీ తేలిగ్గా తీసుకుని జీవితాన్ని హాయిగా గడపడం తెలిసిన వ్యక్తి వున్నాడు. పోలోగేమ్, స్క్వాష్ ఆడి అలిసిపోయాక తనివితీరా తాగి కడుపునిండా తినే మనిషి ఎదుటి మనుషులని అంచనా వేసి తన విధినిర్వహణలో ఏమాత్రం తడబాటు లేకుండా చురుకుగా, ఎఫెక్టివ్‌గా పనిచేసే మనిషి. వెరీ పాప్యులర్.

సర్ రాబర్ట్ బ్రూమ్‌ఫీల్డ్ అన్నాడు:

"వెల్, నాకు తెలియదు బేసిల్! ఆ అనుభవాలు ఎన్నో ఏళ్ళనాటివి. అసలు ప్రశ్న ఏమిటంటే మనం అసలు ఇండియాని మరిచిపోవడం సాధ్యమా అని. అదే మనకి తెలిసిన రియాలిటీ."

అతడి గుబురు కనుబొమల కింద నీలికళ్ళు కాండిల్ కాంతిలో మెరిశాయి. నిజమే! ఆ జ్ఞాపకాలు నిజమైనవి. వాటికి అస్తిత్వం వుంది. ఎమోషనల్ నేపథ్యం వున్నది. ప్రేమ, అనురాగం, ద్వేషం, విషాదం, ఆనందం... అన్ని రకాల విరుద్ధ భావాలు... వాళ్ళ చేతుల్లోంచి జారిపోయిన ఆంగ్ల రాజ్యం గురించి ఆలోచిస్తే వాళ్ల మనస్సు వికలమవుతుంది. గుండెలు పగిలే ట్రాజెడీ వాళ్ళ మనసుల లోతుల్లో వుంది.

వారి అధికార కాలంలోనే బ్రిటిష్ మహాసామ్రాజ్యం, బ్రిటిష్ ఎంపైర్ చేజారిపోయింది. రెండు శతాబ్దాలు అవిచ్ఛిన్నంగా సాగిన మధుర స్వప్నం అంతమయింది. భూగోళం మీద వున్న దేశాలలో దాదాపు మూడవ వంతుమీద వున్న ఆంగ్లేయుల సార్వభౌమత్వం వారి పిడికిలి నుండి జారింది. మహా సామ్రాజ్యం కూలిపోయింది. ముక్కలు ముక్కలుగా పగిలి ఆ శకలాలు దేశాలుగా మారిపోతాయి. అవి స్వతంత్ర దేశాలు కొత్త సమస్యలు తలెత్తాయి. జాతిపరమైన, మతపరమైన ప్రాంతీయతత్వపు, భాషాతత్వపు వివాదాలు తలెత్తి టెర్రరిజమ్‌కీ, రక్తపాతానికి దారితీసి ప్రజలని సుఖపడనీయలేదు. వారి పరిస్థితి ఎప్పటిలాగానే వుండిపోయింది.

నిశ్శబ్దాన్ని చీలుస్తూ అన్నాడు బేసిల్ మూర్: "ఆ దేశ చరిత్రలో మన భూమిక మీద నీ అభిప్రాయమేమిటి రాబర్ట్?"

రాబర్ట్ బ్రూమ్‌ఫీల్డ్ కాసేపు ఆలోచించి అన్నాడు:

"ఆల్ రైట్ అనుకుంటాను. మనం మన బాధ్యతలని బాగానే నిర్వహించామనే అనుకుంటున్నాను. కాని కొన్ని సంఘటనల మీద వేరు వేరు అభిప్రాయాలు వుండడంలో ఆశ్చర్యం లేదు. కానీ అన్నీ కలిపి చూస్తే మన నిర్వహణలో నాకు పెద్ద లోపాలు కనిపించడం లేదు. డూ యూ ఎగ్రీ విత్ మి?"

"ఎస్. కాని డైయర్ చేసినది..." అర్థోక్తితో అనాడు.

"అది అమానుష చర్య. అది మన చరిత్రకే మాయని మచ్చ. అదృష్టవశాత్తూ మనం అందరం డైయర్‌లం కాదు" బేసిల్ నిట్టూర్చాడు.

"థాంక్ గాడ్ ఫర్ దట్ రాబర్ట్! డైయర్ అంత దారుణమైన పనిచేసి నిరాయుధులైన వారిని కాల్చి చంపినా మనవాళ్ళు అతడినే సపోర్ట్ చేశారు – అతడు తన డ్యూటీని చేస్తున్నాడనీ, అతడి ఉద్దేశాలలో లోపం ఏమీ లేదని... స్ట్రిక్ట్‌గా న్యాయాన్ని అమలుపరచాలనీ, శాంతి భద్రతల కోసం చర్య తీసుకోవడంలో తప్పేమిటని వారి ప్రశ్న."

'How foolish!'

"గాంధీని గురించి నీ అభిప్రాయమేమిటి రాబర్ట్?"

"నా అభిప్రాయంలో ప్రత్యేకత ఏమీ లేదు. ఇప్పుడు యావత్ ప్రపంచానికి తెలుసు గాంధీ అంటే ఏమిటో. నేనేం చెప్పగలను?"

"అతడిని మనం ఫెయిర్‌గా ట్రీట్ చేశామంటావా? అతడు అలా తన పథకాలలో, తన రాజకీయ కార్యక్రమాలలో విజయవంతం కావడానికి కారణం ఏమిటి? మనం అతడిని దయతో చూశామా? బాధించామా? We are a liberal, Civilized People."

కొద్ది నిముషాలపాటు ఆలోచించాడు రాబర్ట్ బ్రూమ్‌ఫీల్డ్. చేతిలోని బ్రాందీ గ్లాసు అలాగే వుండిపోయింది. ఫైర్ ప్లేస్‌లో నుండి వేడి వస్తున్నది. హాయిగా వెచ్చగా వుంది.

"గాంధీ విజయాలకి దారితీసిన కారణాలను అంత తేలికగా చెప్పడం కష్టమేమో బేసిల్. చరిత్ర మనకి అతి చేరువలో వుంది. Too recent to analyse. ఇంకా కొంతకాలం పోతేకాని వీలుకాదు. కాని ఒకటి నిజం. ఏ ప్రజలు ఏ పరిస్థితుల్లో ఎలా ప్రవర్తిస్తారో చెప్పగలగటం ఎవరికీ సాధ్యం కాదు అనుకుంటాను బేసిల్!" స్కాచ్ సిప్ తీసుకున్నాడు.

"ఏది ఏమైనా గాంధీ ఒక నిజాన్ని ప్రపంచానికి తెలిపాడు– పట్టుదల, కార్యదీక్ష వున్న వ్యక్తి ఏమైనా చేయగలడని. అతడి పేరు వింటే మనకి హడలు He scared the devil out of us and he finally managed to kick us in the pants and send us packing."

ఇద్దరూ నవ్వారు.

ఎందుకో వారికే నవ్వొచ్చింది. గర్భదరిద్రుడిలా వుండే ఓ నేకెడ్ ఫకీర్ మహత్తరమైన సామ్రాజ్యాన్ని ఓడించడంలో ట్రాజెడీకన్నా కామెడీ పాలే ఎక్కువగా వున్నట్లు వారికి తోచింది.

బయట సన్నగా వాన కురుస్తోంది. లండన్ ఫాగ్ దట్టమైంది.

☆ ☆ ☆

ప్రిసైడింగ్ మేజిస్ట్రేట్ రాబర్ట్ బ్రూమ్‌ఫీల్డ్‌కి ఆ రాత్రి నిద్ర పట్టలేదు. సరిగా భోజనం తినకపోతే భార్య ఎమిలీ అతడితో పోట్లాడింది. కాని అతడి మనసు డిన్నర్‌మీద లేదు, ఎక్కడో వుంది.

"బాబ్ డార్లింగ్! నీ కేసులని డైనింగ్ టేబుల్ మీదికి తెచ్చి ఆకలి చంపుకుని మా ఆకలి చంపకు. అసలే సన్నగా, నీరసంగా వున్నావు. ఈ సూప్ మరో బౌల్ తీసుకో. మటన్ ముక్క మరోటి తిను. నీకిష్టమైన కారమెల్ పుడ్డింగ్ చేశాను" అంది ఎమిలీ.

"సారీ డియర్– ఆకలి లేదు." పరధ్యాన్నంగా అన్నాడు.

"రెక్కలు ముక్కలు చేసుకుని వండేది మనుషులు తింటారని. ఇలా వదిలేస్తే మనం ఇలాగే వుంటాం, సర్వెంట్స్ బాగా తిని బలిసి మజా చేస్తున్నారు" అంది బిట్టర్‌గా.

"ప్లీజ్ డార్లింగ్, నన్నొదిలెయ్. నాకు వేరే ముఖ్యమైన పని వుంది. ఎక్స్యూజ్‌మీ" అని లేచిపోయాడు, నాప్‌కిన్ టేబుల్‌మీదికి విసిరేసి.

ఎమిలీ అసహాయంగా చూసింది.

రాబర్ట్ (బ్రూమ్‌ఫీల్డ్ 1908లో ఐసిఎస్‌లో ఇండియా వచ్చాడు. ట్రెయినింగ్ పూర్తయాక గుజరాత్, మహారాష్ట్రలో అక్కడక్కడా రకరకాల జిల్లాల్లో, సంస్థానాలలో పనిచేసి ప్రస్తుతం అహమ్మదాబాదులో మేజిస్ట్రేటుగా పనిచేస్తున్నాడు. అతడి వయస్సు ముప్పయి ఎనిమిదేళ్ళు. రగ్బీస్కూల్, కేంబ్రిడ్జ్ యూనివర్సిటీలో చదువు పూర్తయ్యాక సివిల్ సర్వీస్‌లో చేరాడు. స్వతహాగా సౌమ్యుడు. నిశితమైన వ్యక్తిత్వం కలవాడు. అతడి తండ్రి లండన్‌లో బారిస్టర్‌గా పనిచేస్తున్నాడు. నిశ్చితమైన ఆదర్శాలు వున్న మనుషులు వీళ్ళు.

ప్రస్తుతం రాబర్ట్ బ్రూమ్‌ఫీల్ట్ ఓ చిత్రమైన సమస్యలో ఇరుక్కుని వున్నాడు. అతడి చదువు సంధ్యలు, ట్రెయినింగ్, బాక్‌గ్రౌండ్, అనుభవం – ఇవేవీ ప్రస్తుత పరిస్థితికి అతడిని సిద్ధం చేయలేకపోయాయి.

ఆ సమయం చారిత్రక శక్తుల సమాగపు కాలమని, ప్రతి సంఘటనా ఆ శక్తుల సయ్యాటలకి నాంది పలుకుతూ, ఒకోసారి ఘోర పరిణామాలకీ దారితీస్తూ, తిరుగులేనివిధంగా చరిత్రని మార్చివేస్తాయని అతడికి చూచాయిగా తెలుసు. తను నిమిత్తమాత్రుడు. కాని తన భుజాలమీద వున్న గురుతర బాధ్యతని అతడు మరిచిపోలేదు. ఎంతో మెలకువతో జాగ్రత్తగా తాను వ్యవహరించాలి. తన ప్రతి మాటా, ప్రతి పనీ న్యాయమార్గంలో వుండేలా చూసుకోవడం తన విధి.

కాని ఏది న్యాయమార్గం?

ఏది ధర్మం?

అతడికి స్పష్టంగా తెలియలేదు. అతడికి తెలిసినది ఒకటే. తను ఓ సామాన్యపు ఉద్యోగి. తనకి తెలిసిన విధంగా న్యాయబద్ధంగా తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వహించాలి. ఇలాంటి సమయాల్లో ఎవ్వరూ చెప్పలేరు ఏమి చెయ్యాలో.. ఎవరి సలహాలు, ఎవరి సహాయమూ ఇప్పుడు పనిచెయ్యవు.

అందువల్ల అతడి ఆందోళనలో అర్థముంది.

రేపు తనముందు కోర్టులో ఓ నేరస్తుడు నిలబడబోతున్నాడు.

అతడు చేసిన నేరం?

సెడిషన్! రాజద్రోహం!!

శిక్ష?

ఎన్నో ఏళ్ళ కారాగార శిక్ష!

ఎవరీ ప్రత్యేకమైన వ్యక్తి?

బ్రిటిష్‌వారు సరిగా అంచనా వేయలేకపోయిన మనిషి, ఎవరూ సరిగా అర్థం చేసుకోలేని విచిత్ర వ్యక్తి!

అతడి పేరు మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ!

బ్రూమ్‌ఫీల్డ్ ఆ రాత్రి గాంధీ హిస్టరీ షీట్ తెప్పించి చదివాడు. అతడు వ్రాసిన వ్యాసాలు, అతడి ఉపన్యాసాల టెక్స్ట్.. అన్నీ చదివాడు...

గాంధీ పుట్టింది అరేబియన్ సముద్రపు వొడ్డున వున్న గుజరాత్ రాష్ట్రంలోని పోర్‌బందర్‌లోని ఓ వైశ్య కుటుంబంలో. లండన్‌లో బారిస్టర్ చదివాడు. యవ్వనపు రోజుల్లో ఫాషనబుల్ డాండీ! ఆంగ్ల సంప్రదాయాల మీదా భాషల మీదా మక్కువ వున్నవాడు. ఎత్తయిన తెల్లటి స్టిఫ్ కాలర్‌లు వున్న షర్ట్‌లు వేసుకుని వాటి మీద డార్క్ సూట్‌లు ధరించేవాడు. మంచి పోజులలో దర్జాగా ఫోటోలు తీయించుకున్న మనిషి ఆ ఫోటోలలో పెద్ద పెద్ద చెవులతో, మీసాలతో, క్రాఫ్ చేయించున్న హెయిర్‌స్టయిల్‌తో, సౌమ్యమైన కళ్ళతో చూసే వ్యక్తి కనిపిస్తాడు. చతుర సంభాషణ.. స్మాల్ టాక్ ఆంగ్లంలో చేయగల ప్రావీణ్యం వుండేది. కొన్నాళ్ళు వయోలిన్ వాయించడం కూడా నేర్చుకున్నాడు. ఆ పైన దక్షిణాఫ్రికా వెళ్ళి డర్బాన్ నగరంలో న్యాయవాద వృత్తి ప్రారంభించాడు. అక్కడ నుండి మెల్లమెల్లగా రాజకీయాలలో ప్రవేశించి దక్షిణాఫ్రికాలో ఇండియన్ కమ్యూనిటీ హక్కులకోసం, ఆత్మగౌరవం కోసం ఎన్నో కష్టాలను ఎదుర్కొన్నాడు.

1914లో ఇండియా తిరిగి వచ్చి దారీ తెన్నూ గమ్యం లేని నేషనలిస్ట్ మూవ్‌మెంట్‌లో దుమికాడు. మొదట సహాయ నిరాకరణ.. హోమ్‌రూల్.. ఆపైన సర్వస్వాతంత్ర్యాల నినాదాలకే దారితీశాడు.

ఇదే సమయంలో విదేశీ దుస్తులను, విదేశీ వస్తువులనూ విసర్జించి ఫక్తు స్వదేశీయుడిలా, ఈ దేశంలో కోకొల్లలుగా వున్న పేద ప్రజలలో ఒకడుగా దుస్తులు ధరించడం ప్రారంభించాడు. శాకాహార భోజనం.. పాలు.. పండ్లు.. అతడి ఆహారం.

కాలం గడిచిన కొద్దీ ప్రతిక్షణం తన భవిష్యత్‌తోబాటు దేశ భవిష్యత్తును కూడా మార్చేస్తూ చాపక్రింద నీరులా, సౌమ్యంగా, ఎవరికీ తెలియనీయకుండా ఆంగ్ల రాజ్యానికి ముప్పు తెస్తున్నాడు.

గాంధీకి రడ్‌యార్డ్ కిప్లింగ్ పద్యం 'IF' అంటే ఇష్టం.

రెవరెండ్ ఆల్‌ఫ్రెడ్ న్యూమన్ రచించిన 'లీడ్ కైండ్లీ లైట్' అంటే అతడికి ప్రాణం.

ఒకనాటి పూర్తి ఆంగ్లో ఫైల్ –

ఈనాటి పదహారణాల ఇండియన్. స్వదేశీ విలువలపట్ల ప్రజలకి మక్కువ కలిగేలా చేస్తున్నాడు.

అంగ్లేయులు తమ క్లబ్ లలో, తమ పార్టీలలో గాంధీ గురించి కొద్ది గౌరవంతో, ఎంతో చులకనతో, చాలా భయంతో మాట్లాడుకునేవారు.

'ఈ గాంధి పెద్ద న్యూసెన్స్‌గా తయారవుతున్నాడు బిల్లీ!'

"ఎస్.టెరిబుల్ న్యూసెన్స్ శామ్!"

"అన్నిసార్లు నిరాహారదీక్ష చేస్తాడు. చచ్చేదాకా ఎందుకు చేయడో అర్థం కాదు. ఇతడు తిండి మానేయగానే ఈ దేశ ప్రజలు తిరగబడిపోతున్నారు. ఎలా హేండిల్ చేయాలో తెలియకుండా వుంది. అసలు తిండిలేని వెధవలందరూ ఎవడో ఓ మనిషి నాలుగు రోజులు తిండి మానేస్తే ఇంత రియాక్షన్ రావడం మీనింగ్ లెస్ కదూ?"

"ఎస్."

"మనం చాలా కఠినంగా వ్యవహరించాలి."

"ఎస్.ఎస్."

అతడి మీద అశ్లీలపు జోకులు వేసుకుని నవ్వుకునేవారు.

నేకెడ్ ఫకీర్ జోకులతో పుట్టిన నవ్వులతో క్లబ్ వరండాలు, డైనింగ్ హాల్స్, బార్ రూంలు మారుమ్రోగేవి.

కొందరు అంగ్లేయాధికారులు గాంధీ పేరెత్తిన సర్వెంట్స్‌ని కొరడాలతో చావగొట్టేవారు.

అంగ్లేయులు గాంధీతో ఎలా వ్యవహరించాలో తెలియక తికమకపడ్డారు. తప్పులు చేశారు.

మహాత్మ గాంధీ కోట్లాది ఈ దేశ ప్రజలకి నోటి మాట.

వారి ఆశలకి కేంద్ర బిందువు.

అతడి పేరు వింటే ఈ దేశ ప్రజల వొళ్లు పులకరించేది.

ఈ దేశ ప్రజల గుండెల్లో అతడు ఆశాదీపాలు వెలిగించాడు. శతాబ్దాల తరబరడి ఈ ప్రజలకి నిజమైన సుఖ సంతోషాలు తెలియవు. ఎవరో వొకరు వచ్చి తన్ని, చితకబాది, చంపి వారిని బానిసలుగా మార్చి చెలాయిస్తున్నా అది తమకు దేవుడిచ్చిన వరం, కర్మఫలం అని భావించి ఆనందంగా బ్రతికేవారీ ప్రజలు. వారి వెన్నెముకలు ఎవరెవరో విరిచి తీసేశారు. వారి గుండెల్లోని ఆత్మవిశ్వాసాన్ని ఎవరెవరో ఇగిర్చివేశారు. వారి రక్తంలోని వేడిని ఎవరో చల్లార్చివేశారు. వారి మనస్సులోని కలలని ఎవరో పూర్తిగా నేలరాసి పీడకలలు నిజాలుగా, వారికి దైనందిన జీవిత కార్యక్రమాలుగా చూపించి ఎవరెవరో వారిని యుగయుగాలుగా మోసం చేశారు. రాజులు...మహారాజులు... నవాబులు, చక్రవర్తులు.. రాజ్యాధినేతలు.. ఇన్వేడర్స్.. మ్లేచ్ఛులు.. గవర్నర్స్ జనరల్... అందుకే వారిలో నిర్లిప్తత పెరిగిపోయి నిరాసక్తంగా బతికేస్తున్నారు.. ఏం జరిగినా వారికి పట్టదు.

ఇలాంటి ప్రజలకి అతడు సూర్యుడిలా ప్రభవించాడు.

అతడు సన్నటి మనిషి.

అతడు నల్లటి మనిషి.

ఐదడుగుల నాలుగంగుళాల ఎత్తులో వుండేవాడు.

గుండ్రటి ఇనుప ఫ్రేముల్లో వుండే కళ్ళద్దాలు పెట్టుకుని ఈ ప్రపంచం వంక దయతో, ఆర్ద్రతతో చూసే అతడి కళ్ళల్లోని లోతైన భావాలు ఎవరికీ అర్థం కావు. బోసినవ్వులో పసితనం, వర్ణనాతీతమైన మానవత్వపు నిగూఢత. ఎవరికీ అందుబాటులో లేని ఎవరూ ఇదీ అని చెప్పలేని వ్యక్తిత్వం అది.

'అతడి కళ్ళల్లోంచి ఏదో తెలియని మానవాతీత శక్తి కనిపిస్తూ వుంటుంది...' అన్నాడు అతడి ప్రియశిష్యుడు, భావి భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ.

అతడిలో అమాయకత్వం వుంది.

అతడిలో మొండితనం వుంది.

బ్రిటిష్‌వారు అతడి రాజకీయ కార్యక్రమాలతో నిరాహార దీక్షలతో విసుగెత్తిపోయేవారు – ఇతడు తన నిరాహార దీక్షలతో తమ ప్రాణాలు తీస్తున్నాడని.

(గాంధీకీ, ఆంగ్లేయులకీ, ముఖ్యంగా ఈ దేశప్రజలకీ రానున్న దశాబ్దాలలో, మారిన చరిత్రలో, ఈ నిరాహార దీక్షలే హాస్యాస్పదంగా తయారవుతాయని, అవి సత్యాగ్రహానికి బదులు అన్యాయపు కార్యక్రమాలకీ ప్రతీకలుగా పరిణమిస్తాయని, గాంధీ చేపట్టిన కార్యక్రమాలకి పేరడీలుగా తయారై ప్రజలని బ్రతకనీయకుండా హింసిస్తాయని వారికి తెలియదు. రిలే హంగర్ స్ట్రైకుల కాలం వస్తుందనీ, కార్యకర్తలు మూడుపూటలా బిరియానీలు తిని, సారా తాగి, పూలమాలలతో వేదిక మీద కూర్చుని పోరాటాలు సాగిస్తారనీ, నిరాహార దీక్ష పాటించిన రోజుల్లో మంచి పోతుల్లా బలిసి బరువు పెరిగిపోతారనీ, ఇటువంటి కార్యక్రమాల వల్ల ఉద్యమాలు ప్రజల సానుభూతిని కోల్పోతాయనీ వారు వూహించలేదు.)

గాంధీ సమక్షంలో ప్రశాంతత లభిస్తుందనే వాడుక వుంది.

గాంధీ చల్లని మలయమారుతం లాంటి మనిషి.

మనశ్శాంతి నిచ్చి ఆహ్లాదం కలిగించే మంచి మనిషి

గాంధీ ఈ కాలపు మనిషి.

ఈ సమయం సృష్టించిన కాలమాన పరిస్థితులు, చారిత్రక శక్తులు పుట్టించిన వ్యక్తి. కాలాన్నీ, చరిత్రనీ తన వ్యక్తిత్వంతో ఆత్మస్థైర్యంతో ఋజువర్తనతో మార్చివేసిన మనిషి.

అతడిలో విశ్వ జనీనత వుంది. అవకాశం, కాలమూ, పరిసరాలూ, ఇతర మనుషులు అన్నింటినీ తన అవసరానికి మలచుకోవడంలో సామర్థ్యం వున్న మనిషి.

అతడి కాలం ఈ శతాబ్దపు పూర్వార్థం.

ఇది యుగసంధి సమయం.

ఈ శతాబ్దపు పూర్వార్థంలో ప్రపంచ చరిత్ర మార్చేసిన సంఘటనలు ఎన్నో జరిగాయి. విప్లవాలూ... ప్రపంచ యుద్ధాలూ... అణుశక్తి రహస్యాలు తెలియడం... ఎయిరో డైనమిక్స్... విమానాలు... రాకెట్లు... టెక్నాలజీ .. మానవ జీవన మార్గంలో అనూహ్యమైన మార్పులు తెచ్చాయి. ఎసాసినేషన్స్... టెర్రరిజమ్.. మారణహోమాలు... ఆష్విట్జ్.. రీగా... బెల్సెన్... కాన్‌సెంట్రేషన్ కాంప్స్... నరమేధం అవిచ్ఛిన్నంగా జరిగింది.

No Quiet On Any Front!

చరిత్ర ఎన్నో రకాలుగా మారిపోయింది. ఒకనాటి సామ్రాజ్యాలు నేలకరిచి ముక్కలు చెక్కలై చరిత్ర గర్భంలో కలిసిపోయాయి. పాలక జాతులు అనాథలుగా వేరే దేశాలకి పోయి తలదాచుకున్నారు. ఇది విప్లవాల సమయం. నియంతల పైశాచిక ప్రవృత్తికి భూమి మీద గుర్తులు మిగిలే సమయం. నెత్తుటి వరదలు పారిన కాలం... హాహాకారాలతో, హింసతో, పొగతో భూమి ఉక్కిరిబిక్కిరైన దుష్టకాలం.. ఇతర ప్రాచీన దేశాల్లోని రాజరికాలు పోయాయి.

ఆంగ్ల పాలకులు తోకలు ముడుచుకుని అన్ని ఖండాల నుండీ తమ ద్వీపభాగానికి వెళ్ళిపోయారు. వారి వెంట లక్షలాది మంది ఆసియన్లు బ్రిటిష్ పాస్‌పోర్టులతో వెళ్ళి ఇంగ్లండ్‌ని ఆసియన్ దేశస్థుల మయం చేశారు. తెల్లవాళ్ళ గుండెలు ఝల్లుమనేలా... ఇప్పు రేసియల్ ఘర్షణలు ఇంగ్లీషు నేలమీద.. వేరే దేశాల్లో కాదు.. గాడ్స్ ఓన్ కంట్రీలో జరుగుతున్నాయి.

Inexhorably History is Changing!

England Was God's Own Country!!

And God is An Englishman!!!

కాని ఇండియా వెనుకబడిన దేశం. దెబ్బతిన్న పక్షిలాంటి దేశం.

ఇది ధర్మభూమి!

ఇది కర్మభూమి!! చాలామందికి కర్మభూమి!!!

ఈ ప్రజలకి స్వాతంత్ర్యం కావాలి. మార్గమేమిటి? అది గాంధీ సమస్య. విడిపోయి వేరువేరుగా బ్రతుకుతున్న మానవ సమాజ సముదాయాలకి కలయిక తేవాలి. వారి భాషలు వేరు. వారి ఆచార వ్యవహారాల్లో భోజన రీతుల్లో తేడాలున్నాయి. అందరినీ దగ్గరకి తెస్తే, అందరినీ సంఘటితపరిచే ఓ మార్గం చూపితే; వారు వైరుధ్యాలు మరచి పని చేయగలిగితే తన మార్గం సుగమమవుతుంది. ఈ సూక్ష్మ రహస్యం గాంధీకి తెలుసు. ఆంగ్ల రాజ్య ప్రభువులు అతడి ప్రతి చర్యనీ నిశితంగా పరిశీలించి విశ్లేషించి చర్యలు తీసుకునేవారు.

ఎన్నో ఏళ్లనాడు లార్డ్ మింటో అన్నాడు:

"మనమందరం ఈ దేశంలో సామాన్య యాత్రికులం. కేంప్‌కి వచ్చి వున్నాం. ఏదో ఒకనాడు మన దేశానికి మనం పోక తప్పదు. మార్చ్ చేయక తప్పదు."

రెండు వందల ఏళ్ళ సుదీర్ఘ యాత్ర సాగింది ఈ దేశంలో. కాని, ఆంగ్లేయుల మనసుల్లో ఎప్పుడూ భయాందోళనలు మిశ్రమంగా వున్న అనిశ్చిత భావం. Perpetual insecurity.

గాంధీ దృష్టిలో ఈ దేశానికి స్వతంత్రం సిద్ధించడం ముఖ్యమైన అంశం. దానికి సూత్రబద్ధమైన ఒక ప్రణాళికను తయారుచేశారు. స్వాతంత్ర్యం సంపాదించడానికి గాంధీ వేసిన ప్లాన్ విప్లవాత్మకమైన మిశ్రమం. అందులో తప్పులు, ఒప్పులు, నిర్హేతుక సిద్ధాంతాలు, పరస్పర విరుద్ధమైన నమ్మకాలు, అపక్వపు వ్యూహాలు కలగలుపుగా వున్నాయి. దానికి కారణం గాంధీ కాదు. ఈ దేశ చరిత్ర... ఈ దేశ సంస్కృతి... ఈ దేశ ప్రజలు.

ఆ మిశ్రమంలోని భాగాలివి.

సామాజిక సిద్ధాంతాలు... రాజకీయ వేదాంతం... మత సిద్ధాంతాలు... నమ్మకాలు... జాతి గర్వం... వ్యక్తిగత సహజమైన జ్ఞానం – అన్ని శక్తులనీ సమన్వయపరిచి ఆయుధంగా చేసి వాడడం... అననుకూలతను అనుకూలతగా మార్చుకోవడం... బలహీనతను బలంగా రూపొందించడం, దారిద్ర్యాన్ని శక్తివంతంగా ప్రపంచ ప్రజలకి హైలైట్ చేసి వారి సానుభూతిని సంపాదించడం– ఇవీ గాంధీ ప్లాన్‌లోని ముఖ్యభాగాలు...

ఆ ప్లాన్ పేరు సత్యాగ్రహం!

అది సామాన్యమైన మాట.

కాని అపారమైన శక్తిని పుట్టించగల అపూర్వ పదం. వజ్రాయుధం వంటిది. సామ్రాజ్యవాదుల బలం అంతా వారి మిలిటరీలో, వారి తుపాకులలో, వారి ఫిరంగులలో, వారి బాయ్‌నెట్లలో వున్నది అని గాంధీకి తెలుసు. సత్యాగ్రహం దానికి పూర్తిగా భావవిరుద్ధం. గాంధీ మాటలలో బలవంతుడైన విరోధిని ఓడిండానికి వ్యక్తి తనను తానే శిక్షించుకోవడం. పైగా ఈ ఆయుధాన్ని వ్యత్యాసాలు లేకుండా ప్రయోగించవచ్చు. ఈ ఉద్యమం ద్వారా గాంధీ ముక్కలుముక్కలుగా విడిపోతున్న జాతి శకలాల్ని, భారత జాతీయ జీవనంలోని అసంతృప్తిని, అసమానతల్ని, సామాజిక, ఆర్థిక, రాజకీయ, చారిత్రక శక్తుల్ని కలిపి జాతిని జాగృతం చేసే మహత్తర శక్తిని రూపొందించి బరి మీదికి వదిలాడు.

సత్యాగ్రహం అన్నది ఆయుధం.

సాధించవలసిన ధ్యేయం స్వరాజ్యం.

అది భారతదేశంలోని అందరు ప్రజల సమష్టి గమ్యం.

పరదేశస్తులు ఏలినంతవరకు ఈ దేశానికి భవిష్యత్తు లేదు అన్నది అతడి నమ్మకం.

ఈ దేశస్తులకి గాంధి దేవుడిలాంటివాడు అయ్యాడు. అతడు ఏమైనా చేయగలడని వారి నమ్మకం. అద్భుతాలు చేయగలడని, తమ జీవితాలు అతడి చేతులలో క్షేమంగా వుంటాయని వారి నమ్మకం. వారి మనసుల మీదా వారి నమ్మకాల మీదా గాంధీకి ఉన్న అధికారానికి తిరుగులేదు. మొత్తం దేశ ప్రజలు అతడి సమ్మోహన శక్తికే దాసులై పోయారు. అతడి మెస్మరిక్ స్పెల్‌లో పడిపోయి మంత్రముగ్ధులు లా వుండిపోయారు...

అన్ని రిపోర్టులూ చదివి ఆ రాత్రి చాలా లేట్‌గా రాబర్ట్ బ్రూమ్‌ఫీల్డ్ నిద్రపోయాడు. నిద్రనిండా ఏవేవో అర్థంలేని పిచ్చిపిచ్చి కలలు.

పంధొమ్మిది వందల ఇరవైలో గాంధీని రాజద్రోహ నేరం మీద అరెస్టు చేశారు. ఆ కేసు జడ్జి రాబర్ట్ బ్రూమ్‌ఫీల్డ్ కోర్టులో విచారణకి వచ్చింది. ముద్దాయిని హాజరుపరిచారు. ఆ కేసు గాంధి స్వరాష్ట్రమైన గుజరాత్‌లోని అహ్మదాబాద్ నగరం వెలుపలవున్న సర్క్యూట్ హౌస్‌లో విచారణకి వచ్చింది.

అది మామూలు కోర్టు గదికాదు. క్యాంపులకి వచ్చే అధికారులు బసచేసే వసతిగృహం. నగరంలో అయితే జనం విరగబడి వస్తారన్న కారణం వల్లనే ఆ

సర్క్యూట్ హౌస్‌ని సెలెక్ట్ చేయడం జరిగింది. పైగా బ్రిటిష్ కంటోన్మెంట్ అక్కడికి దరిదాపుల్లో వుంది – ఏవైనా అవాంఛనీయ సంఘటనలు జరిగితే అదుపు చేయడానికి వీలుగా. కోర్టు రూం చాలా సాధారణంగా వుంది.

యూరోపియన్ పోలీసులు ద్వారాన్ని కాపలా కాస్తున్నారు. ముందు సీట్లలో కొద్దిమంది ఇంగ్లీషు అధికారులు కూర్చుని వున్నారు. అడ్వకేట్ జనరల్ సర్ థామస్ స్ట్రాంగ్‌మన్ ఈ కేసులో వాదించడానికి ప్రత్యేకంగా బొంబాయి నుంచి వచ్చాడు. వాతావరణంలో టెన్షన్ వుంది. ఉద్రేకం... సస్పెన్స్...

ఈ కేసులో ఏమి జరగబోతున్నదో అని భారతదేశంలోని ప్రజలందరూ ఆసక్తితో ఎదురు చూస్తున్నారు. ప్రపంచంలోని మేధావుల దృష్టి కూడా ఈ కేసుమీదనే వుంది!

ఆ గదిలో సాక్షులు, ముద్దాయిలూ నిలబడడానికి కావలసిన బోనులు లేవు. చూడడానికి వచ్చిన కొద్దిమంది ప్రేక్షకులలో గాంధీ అనుయాయులు ఖద్దరు వస్త్రాలు ధరించి వున్నారు.

అప్పుడు గాంధీ ఆ గదిలో ప్రవేశించాడు.

ప్రేక్షకులు గౌరవంతో ఆరాధనతో నిలబడి అతడి వంకకు చూశారు. ఆంగ్లేయులు నేకెడ్ ఫకీర్ కేసి చులకన భావంతో చూశారు.

జడ్జి బ్రూమ్‌ఫీల్డ్ గౌరవంతో తెలియకుండా నిలబడబోయి తమాయించుకుని కూర్చుండిపోయాడు. గాంధీ మీద తనకి గౌరవం వుండవచ్చు. కాని ప్రస్తుతపు పరిస్థితిలో తమ భూమికలు జడ్జి, ముద్దాయి. సభా గౌరవం పాటించడం మంచిది అని తోచింది.

ఖద్దరు ధోవతి మాత్రమే కట్టుకుని వేరే ఇతర దుస్తులు లేకుండా పైభాగంలో అనాచ్ఛాదితంగా వున్నాడు గాంధి.

కేస్ నెంబర్ 45. అహ్మదాబాద్ సెషన్స్‌లో ప్రారంభమైంది.

రెక్స్ ఇంపరేటర్ వెర్సస్ గాంధీ.

మార్చి 18, 1922 మధ్యాహ్నం విచారణ ప్రారంభమయింది. గాంధీ చేసిన నేరం రాజద్రోహం.

నేర నిర్ధారణకి ఆధారాలు 'యంగ్ ఇండియా' పత్రికలో గాంధీ వ్రాసిన వ్యాసాలు.

గాంధీ తన నేరాన్ని ఒప్పుకున్నాడు. పైగా ఆ విషయాన్ని గట్టిగా నొక్కి చెప్పాడు. నేను నేరస్తుడనేనన్నాడు. అతడి కళ్ళల్లో అనంతమైన ప్రశాంతత వెల్లివిరిసింది.

"యువర్ ఆనర్! నేను ఓ అభిప్రాయానికి వచ్చాను. ఈ దేశానికి ఇంగ్లండ్‌తో వున్న సంబంధం ఈ దేశ క్షేమానికీ, పురోగతికీ శాపంగా పరిణమించింది. ఆ సంబంధాన్ని త్వరగా అంతమొందించాలని కోరుతూ నేను వ్యాసాలు రాసిన మాట వాస్తవమే. అది ఎంత త్వరగా అంతమొందితే అంత మంచిది అని నా అభిప్రాయం. ప్రస్తుతం వున్న ప్రభుత్వం మీద అసహనం పెరిగేలా ప్రజలకి బోధించడం నా విధి అని నేను భావిస్తున్నాను. అందువల్లనే నేను మిమ్మల్ని అర్థిస్తున్నాను. ఈ నేరానికి శిక్షాస్మృతిలో వున్న అత్యధికమైన శిక్ష వేయమని మిమ్మల్ని నేను వేడుకుంటున్నాను.

మీ న్యాయశాస్త్ర ప్రకారం నేను చేసినది ఉద్దేశ్యపూర్వకంగా చేసిన నేరం. కాని నా దృష్టిలో అది ఈ దేశపౌరుడిగా, నా దేశ క్షేమం కోసం చేసిన నా పరమ ధర్మాన్ని నిర్వహించాననుకుంటున్నాను."

నిద్రలేమితో బ్రూమ్‌ఫీల్డ్‌కి కలతగా వుంది. కేసు ధోరణి గందరగోళంగా వుంది. తన కెరియర్‌లో అతడికి ఇలాంటి పరిస్థితి ఎన్నడూ ఎదురు రాలేదు. ఇలాంటి విచిత్ర నేరస్తుడు తన ముందు ఎన్నడూ నిలబడలేదు.

ఆలోచిస్తే ఒకటి నిజమనిపించింది. గాంధీ వాదంలో నిశితమైన సత్యాలున్నాయి. నిబద్ధత వుంది. సత్యాన్వేషణ, దూరపు చూపు, స్పష్టత, సత్యమార్గంలో వుండే బలం, ఆత్మస్థైర్యం – అన్నీ ప్రస్ఫుటంగా కనబడుతున్నాయి.

కోర్టురూంలో వాతావరణం వేడెక్కింది. గాంధీ మిత్రులు, శిష్యులు అందరూ ఉత్సుకతతో చూస్తున్నారు.

ఆ వేడెక్కిన కోర్టు రూమ్‌లో చెమటతో నల్లగా మెరుస్తూ, సన్నగా ఎండిపోయి ఎముకలు పొడుచుకుని వస్తున్న శరీరంతో ఎగదీసి కట్టిన ధోవతితో నిర్మలంగా, చిలిపిగా తన వంకకి చూస్తున్నాడు గాంధీ. అతడి కళ్ళల్లో మిస్చీఫ్ వుంది. జాలి వుంది. అనంతమైన ఆప్యాయత వుంది.

వ్యక్తులు వేరు, సమస్యలు వేరు. సిద్ధాంతాలకీ, పరిష్కారాలకీ మధ్య వున్న అగాధపు లోతులు అతడికి తెలుసు. అందుచేతనే ప్రశాంతత అతడిలో వెల్లివిరుస్తోంది.

గాంధీ పెద్ద స్టేట్‌మెంట్ ఇచ్చాడు. ఆ వాదంలోని సారాంశం అర్థమవగానే బ్రూమ్‌ఫీల్డ్ ఆశ్చర్యపోయాడు.

'What a strangeman this Gandhi!! What an argument!'

గాంధీ పెదవుల నుండి వస్తున్న మాటల్ని వింటూ తన చెవులు తానే నమ్మలేకపోయాడు బ్రూమ్‌ఫీల్డ్.

చివరికి అన్నాడు గాంధీ: "యువర్ ఆనర్! మీకు రెండు మార్గాలున్నాయి. మీ పుస్తకాల్లో వున్న న్యాయం న్యాయం కాదు – అన్యాయం. కాబట్టి మీరు జడ్జి పదవి నుంచి రాజీనామా చేయాలి. అలా కాకుండా మీ న్యాయమే సరైనదని మీరు నమ్మితే నేను చేసిన నేరానికి అత్యంత కఠినమైన శిక్ష మీరు నాకు విధించాలి."

గాంధీ మెల్లగా మాట్లాడాడు. అతడి కంఠంలో భయంలేదు. ఏమాత్రం ఎమోషన్ లేదు. అందరూ ఆ ధోరణికి ఆశ్చర్యపోయారు.

ప్రాసిక్యూటర్ థామస్ స్ట్రాంగ్‌మన్‌కి ఈ ధోరణి రుచించలేదు. ఇదేదో ఫార్స్‌లా వుంది అనుకున్నాడు తనలో.

జడ్జి బ్రూమ్‌ఫీల్డ్ స్ఫుటంగా తన వాదంలో ఏమీ కాంట్రడిక్షన్స్, యాంబిగ్యుయిటీలు లేకుండా ప్రశాంతంగా వినిపిస్తున్న ముద్దాయి వాలకాన్ని, అతడిలో జ్వలిస్తున్న అనిర్వచనీయమైన అంతరాగ్నినీ చూసి చలించిపోయాడు. బ్రూమ్‌ఫీల్డ్‌కి అర్థమయింది ఇది చరిత్రమయమని. తను ఏమి చేసినా అది రానున్న కాలంలో ముందు తరాల వారికి, న్యాయ వ్యవస్థకి, బ్రిటిష్ రాజ్యపు మనుగడకి, తనకి వ్యక్తిగతంగా సంతృప్తి కలిగించేలా వుండాలని అతడికి తోచింది. లేకపోతే తనకి మనశ్శాంతి వుండదు.

ఈ వ్యక్తి సామాన్యుడు కాడు.

ఇతడు ప్రపంచంలో చరిత్ర సృష్టించబోతున్న మహత్తర శక్తి. ఆంగ్లేయుల కెవ్వరికీ అవగాహనకి అందని యుగపురుషుడు. ఇతడి నైతిక బలానికి ఏదీ సరికాదు.

GANDHI IS A PRIMEVAL POWER OF UNKNOWN ORIGIN! UNBELIEVABLE STRENGTH!!

ప్రాసిక్యూటర్ థామస్ స్ట్రాంగ్‌మన్ ధారాళంగా తన పద్ధతిలో వాదించాడు. అతడి వాయిస్ బూమింగ్‌గా వుంది:

"యువర్ ఆనర్! ముద్దాయి చేసినది రాజద్రోహం. కారణాలు ఏమైనా అవి ప్రస్తుతానికి అనవసరం. బాధ్యత కల వ్యక్తి. అత్యున్నతమైన చదువులు చదివినవాడు. న్యాయవాద వృత్తి చేసినవాడు. అన్నీ తెలిసిన మనిషి. వేలాది మందిచే గౌరవింపబడుతున్న పెద్ద మనిషి బాధ్యతను విస్మరించి దేశ ద్రోహ నేరానికి పాలుపడితే ఇక ఈ లోకంలో శాంతి భద్రతలు కరువైపోతాయి. ప్రజలకు సుఖ శాంతులు లోపించి ఈ ప్రపంచం అంతా అల్లకల్లోలమయిపోతుంది. ముద్దాయి శిక్షార్హుడు. అతడి వాదనలో ఏమాత్రం పస లేదు. అతడి వ్యక్తిగత నమ్మకాలతో న్యాయానికి నిమిత్తం లేదు. ముద్దాయిని శిక్షించాలి."

వాదన జరుగుతున్నంతసేపూ గాంధీ స్ట్రాంగ్‌మన్ వంకకి జాలిగా చూశాడు.

మిగిలినవారికి అనిపించింది, అనవసరపు కంఠశోష ఆ వాదం అని. ఒప్పుకున్న నేరానికి వాదమేల అన్నట్లుగా అందరూ గుసగుసలుగా మాట్లాడుకున్నారు. జడ్జి బ్రూమ్‌ఫీల్డ్ అంతా ఓపిగ్గా విన్నాడు.

చివరకు జడ్జిమెంట్.

కోర్టులో చిక్కటి నిశ్శబ్దం.

బ్రూమ్‌ఫీల్డ్ అన్నాడు:

"మిస్టర్ గాంధీ! మీరు మీపై మోపిన నేరం ఒప్పుకోవడంతో నా పని సులభతరం చేశారు. అయితే ఇప్పుడు మిగిలింది న్యాయపరమైన శిక్షని నిర్ణయించడం. ప్రస్తుతసమయంలో ఈ దేశంలో న్యాయమూర్తిగా వుండటం చాలా కష్టతరమైన పని. అయితే న్యాయానికి వ్యక్తుల మీద గౌరవం వుండదు. నేను ఇన్నాళ్ళూ కోర్టులలో విచారణ చేసిన వ్యక్తులకీ మీకూ ఎంతో భేదం వుంది. సామాన్యంగా నా ముందు నిలబడే వ్యక్తులకి మీరు చాలా భిన్నమైన వ్యక్తి. నా జీవిత కాలంలో మీ వంటి వ్యక్తిని విచారణ చేసే అవకాశం వస్తుందని నేను అనుకోను. కోట్లాది మీ దేశ ప్రజల దృష్టిలో మీరు మహాత్ములు, దేశభక్తులు, గొప్ప నాయకులు అన్న విషయాన్ని నేను విస్మరించడం లేదు. రాజకీయాల్లో మీతో ఏకీభవించనివారుకూడా మీరు ఆదర్శ జీవితం గడుపుతారని ఒప్పుకుంటారు. మిమ్మల్ని వదలివేయలేదని బాధపడే చాలామంది ఆంగ్లేయులతో సహా వున్నారు. అది నిజం."

"కాని జడ్జిగా నేను మీకు ఆరు సంవత్సరాల కారాగార శిక్ష విధిస్తున్నాను. ప్రజా సంక్షేమం దృష్ట్యా కావలసిన శిక్షకీ, నేరానికీ కావలసిన శిక్షకీ మధ్యేమార్గంగా ఈ శిక్షని నిర్ణయించడం జరిగింది. ఈ దేశంలోని ఏ పరిస్థితుల వల్లనయినా ప్రభుత్వం

వారు ఈ శిక్షని తగ్గించినా లేక పూర్తిగా రద్దు చేసినా నాకన్నా ఆనందించే వ్యక్తి వుండడు."

కోర్టు అంతా కలకలం.

పత్రికా విలేకరులు పరిగెత్తారు – టెలిగ్రాఫ్ ఆఫీసులకి.

గాంధీ ముఖంలో చిరునవ్వు. కరుణతో నిండిన కళ్ళతో జడ్జి వంకకు చూసి బయటకు వెళ్ళిపోయాడు పోలీసులు ఇరువైపులా వుండగా.

ఆ రాత్రి జడ్జి బ్రూమ్‌ఫీల్డ్ తనివితీరా తన కంటికి నిండుగా నిద్రపోయాడు. అతడిలో టెన్షన్ పూర్తిగా పోయి ఉల్లాసంగా ఫీలయ్యాడు. ఏం జరగాలో అది సవ్యంగా తను చేశానన్న తృప్తి అతడికి సంతోషం కలిగించింది.

☆ ☆ ☆

సర్ రాబర్ట్ బ్రూమ్‌ఫీల్డ్ చేతిలోని బ్రాందీ గ్లాసులోనికి చూస్తూ వుండిపోయాడు.

ఎన్నో ఏళ్ళు గడిచిపోయాయి. తాను బొంబాయి హైకోర్టు జడ్జిగా రిటైరై ఇంగ్లండ్‌లో సెటిల్ అయిపోయాడు. ఇప్పుడు సర్ రాబర్ట్ బ్రూమ్‌ఫీల్డ్ ఓ.బి.ఇ.

ఆనాటి సన్నటి నల్లటి మనిషి తన దేశస్తుడి చేతిలోనే మరణించాడు.

బ్రూమ్‌ఫీల్డ్ మనసు విషాదంతో నిండిపోయింది. How Ironic!

ఆ జ్ఞాపకాలు బాధాకరంగా వున్నాయి. ఆ చావుకి కారణం ఏమిటి? నామరూపాల్లేకుండా పోయిన, రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యమా? లేక తన ప్రేమతో ప్రజలకోసం దేశంకోసం త్యాగం చేసి తన సర్వమూ ధారపోసి, చివరకు అర్థరహితంగా తన ప్రాణాలని పోగొట్టుకున్న ఆ మహనీయుడి స్మృతివలనా?

"రాబర్ట్! నీవు ఇచ్చిన జడ్జిమెంట్ ఎక్సలెంట్" అన్నాడు సర్ బేసిల్ మూర్.

దగ్గరలో ఫైర్‌ప్లేస్‌లో దుంగలు కాలుతున్నాయి. వెచ్చగా వుంది వాతావరణం. ఒంటిలో ఆల్కహాలు... బాగా వండిన హోయ్ ఆయ్‌స్టర్స్‌తో నిండిన పొట్టలు. ఇతర ఆంగ్లేయులు తమ క్లబ్‌లో మృదు సంభాషణలో మునిగి వున్నారు జోక్స్... బాంటర్... గాసిప్...లోటోన్స్...మర్మర్స్...ఆ క్లబ్‌లో చాలామంది ఓల్డ్ ఇండియా హాండ్స్. ఇద్దరు కలిస్తే ఏవో కబుర్లు గంటలకొద్దీ చెప్పుకుంటారు. ఆ గదుల గోడలకి చెవులుంటే ఈ జ్ఞాపకాల కబుర్లు విని విని విసుగెత్తిపోయేవి.

కొత్తవాళ్ళకి, ఇంగ్లండ్‌లోనే పుట్టి పెరిగిన మెంబర్స్‌కి ఈ ఇండియా హాండ్స్‌ని చూస్తే దడ! బోర్! పారిపోతారు వాళ్ళని చూడగానే.

"బేసిల్! ఆ జడ్జిమెంట్ ఇచ్చినా గాంధీ వ్యక్తిగతంగా గెలిచి వుండేవాడు. What a diabolic man!" మెచ్చుకోలుగా అన్నాడు బ్రూమ్‌ఫీల్డ్.

"ఇంటరెస్టింగ్ రాబర్ట్! ఎలా?"

"వెరీ సింపుల్. నేను శిక్ష వేయక వదిలివేస్తే ఆ దేశస్తులు మనం భయపడి వదిలివేశాం అనుకునేవారు. శిక్షించడం వల్ల ప్రపంచమంతా మనం ఆ మహానుభావుడిని అనవసరంగా హింసించామనుకునే అవకాశం వుంది. ఎటుచూసినా గాంధీయే గెలిచేవాడు. అతడికి ఆ విషయం బాగా తెలుసునని నా అనుమానం. ఏం

జరగబోతోందో అతడికి మంచి అవగాహన వుంది. అతడి ముఖం మీద భావాలు నాకు ఇంకా స్పష్టంగా ఇన్నేళ్ళ తర్వాత కనిపిస్తున్నాయి. అతడికి ఈ గేమ్‌లో గెలుపు తనదేనని తెలిసినవాడిలా ధీమా, స్కోరు కూడా తెలిసినవాడిలా ఆత్మవిశ్వాసం, చివరకు ఫలితం తెలిసి, ఓడిపోయినవాడిని చూసిన చూపు నాకు విసిరాడు గాంధీ – Poor Bloke అన్నట్లుగా. అయినప్పటికీ నా శాయశక్తులా అప్పటి పరిస్థితులను బట్టి నేను చేయవలసినది సవ్యంగానే చేశాననుకుంటున్నాను."

"You have done extremely well Robert! You could not have done better."

"థ్యాంక్యూ బేసిల్1 కాని ఇప్పుడు ఓ విషయం అర్థమౌతోంది. నా దృష్టిలో ఇండియాలో స్వతంత్రం చాలా ముందే వచ్చింది."

ఓ క్షణం నిశ్శబ్దం. బేసిల్ తన చేతిలోని గ్లాస్‌ని టేబుల్ మీద వుంచి చుట్టని వెలిగించాడు. పొగ బ్లూ రంగులో సుడులు తిరుగుతూ పైకి పోతోంది.

"ఎప్పుడు?" అన్నాడు.

"బ్రిగేడియర్ జనరల్ డైయర్ జలియన్ వాలాబాగ్ ఫైరింగ్ ఓపెన్ చేసిననాడే బ్రిటిష్ రాజ్ మన చేతిలో నుండి జారిపోయింది. ఆ దేశ ప్రజలను పాలించే హక్కు ఆనాడే మనం కోల్పోయాము. టెక్నికల్‌గా గాంధీకి ఈ రహస్యం తెలుసు. మనం చేజేతులా చేసుకున్న స్వయంకృతాపరాధం అది. ఈ స్వల్ప విషయాన్ని మనమెవ్వరం అప్పుడు అర్థం చేసుకోలేకపోయాము. We were really foolish! How obvious! What a simple fact!"

"బహుశా మనం అది గ్రహించలేక తప్పులు చేశామేమో? చివరికి ఎలా జరగాలో అలాగే జరిగింది!"

"బేసిల్! గాంధీ చాలా ఇంటరెస్టింగ్ మాన్. అతడు జైలులో ఏమి చేశాడో అన్నీ నేను కనుక్కుంటూనే వున్నాను. పూనా జైలులో అతడు రెండేళ్ళున్నాడు. ఆపైన ప్రభుత్వం శిక్ష రద్దుచేసి విడుదల చేసింది. అతడు జైల్లో ఏమాత్రం కాలం వృథా చేయకుండా బాగా పుస్తకాలు చదివేవాడు. ఆ సమయంలోనే అతడు రడ్‌యార్డ్ క్లిప్లింగ్ రాసిన పుస్తకాలన్నింటినీ చదివేశాడు. గిబ్బన్ రాసిన "డిక్లైన్ అండ్ ఫాల్ ఆఫ్ ది రోమన్ ఎంపైర్" అన్ని భాగాలు చదివాడు. జూల్స్ వెర్న్ రాసిన సైన్స్ ఫిక్షన్ పుస్తకాల నన్నింటినీ చదివాడు. వాళ్ళ గ్రంథం మహాభారతాన్ని మొదటినుండి చివరిదాకా క్షుణ్ణంగా చదివాడు. ఇవన్నీ చాలనట్టుగా తమిళ భాష నేర్చున్నాడు."

సర్ బేసిల్ మూర్ నవ్వాడు.

"రిమార్కబుల్ ఓల్డ్‌మాన్!"

"కోల్ పోర్టర్ అతడి గురించి ఓ పాట రాశాడని తెలుసా నీకు బేసిల్?"

"ఏమిటది?"

"Anything Goes." అందులో నెపోలియన్ బ్రాందీతో గాంధీని అంత్య ప్రాసకి వాడాడు. ఇది విని బోసి నవ్వు నవ్వి వుంటాడు. గాంధీ. కాని ఒక్కోసారి సహనం పరీక్షించేలా ప్రవర్తించేవాడు."

"చెప్పు, ఏం చేశాడు?"

"ఓసారి వైస్రాయితో అతి ముఖ్యమైన మీటింగ్. అందరు అధికారులూ సిద్ధంగా వున్నారు. అప్పుడు గాంధీ మూతిమీద చేయి పెట్టుకుని ఆ మీటింగ్‌కి హాజరయ్యాడు. అతడేమీ మాట్లాడలేదు. ఆనాడు ఆయన మౌనవ్రతపు రోజట!"

బేసిల్ విరగబడి నవ్వాడు.

"I like him for many other things as well. ప్రపంచంలోని మొదటి హిప్పీ జీసస్ క్రైస్ట్. రెండోవాడు గాంధీ. అతడు దుస్తులు ధరించడంలో వున్న నియమాలన్నిటినీ భగ్నం చేశాడు. He Broke all rules of sartorial elegance and decorum.

"ఒకనాటి ఇన్నర్ టెంపుల్‌లో చదివిన బారిస్టర్ హాఫ్ నేకెడ్ ఫకీర్‌గా ధోవతితో రాజులనీ, వైస్రాయిలనీ, మేధావులనీ, కళాకారులనీ కలిసి వారిని ముగ్ధులను చేశాడంటే నమ్మడం కష్టం."

ఇద్దరూ అలసిపోయి వున్నారు. సర్ బేసిల్ మూర్ తన వాచ్‌వంకకు చూసుకున్నాడు.

"రాబర్ట్! బాగా లేటయింది. వెళదామా?"

"ఆల్ రైట్!"

ఇద్దరూ లేచారు.

గొడుగులు, చేతికర్రలూ, టోపీలు తీసుకుని క్లబ్ మెట్లు దిగి పోర్టికో దగ్గరకు వచ్చారు.

"బేసిల్! ఈ జోక్ తెలుసా?"

"ఏమిటది రాబర్ట్? చెప్పు"

"ఓసారి ఓ కేంబ్రిడ్జి యూనివర్శిటీ గ్రాడ్యుయేట్ కుర్రాడు గాంధీని చూసి ఇలా అన్నాడు: 'ఒక విషయం నాకు ఎప్పుడూ తెలిసేది కాదు. గాంధీని కలిశాక అర్థమయింది, సోక్రటీస్‌కి హెమ్‌లాక్ ఎందుకు తాగించారో!'

"హో హో!"

"హో హో!"

వాళ్ళ నవ్వులతో క్లబ్ కారిడార్లు ప్రతిధ్వనించాయి.

"అయితే అందుకేనా అతడిని షూట్ చేసింది?" అన్నాడు బేసిల్ మూర్. నవ్వులు గడ్డకట్టుకుపోయాయి.

"గుడ్‌నైట్ రాబర్ట్! నైస్ ఈవినింగ్!"

"గుడ్‌నైట్ బేసిల్!"

కార్లలో ఎక్కి వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. ఎడతెరిపిలేని వర్షం కురుస్తూనే వుంది.

● ఆంధ్రజ్యోతి వారపత్రిక - *6.10.89, 13.10.89* ●

★ ★ ★

జి. కళ్యాణరావు

62

# పద్మ

నేను మీకు కథ చెప్పటం లేదు. కథ చెప్పే సత్తాగల కథకుణ్ణి కాదు. కాని పద్మని గూర్చి చెపుతున్నాను. కేవలం చెప్పడం మాత్రం చేస్తున్నాను. కుటుంబరావు బతికుంటే, పద్మ అయనకు తెలిసుంటే చాలా గొప్పగా చెప్పేండేవారు. వాస్తవ పాత్రని సాహిత్యంలో బతికించడం అంత చిన్న విషయం కాదు. బహుశ కాళీపట్నానికీ, రాచకొండకీ పద్మ పరిచయం అయి వుండదు. చెప్పే పద్ధతిలో ఏ రచయిత పద్ధతి ఆ రచయితకు వుండొచ్చు. అయితే జీవితం మాత్రం తన పద్ధతిలోనే సాగిపోతుంది. పద్మ కూడా అంతే....

ఇరవై సంవత్సరాల క్రితం ఈ దేశంలో ఏదో ఒక గొప్ప సంఘటన జరిగుండొచ్చు. అవన్నీ చౌదరికి అక్ఖర్లేదు. అన్నపూర్ణకీ అక్ఖర్లేదు. వాళ్ళిద్దరికీ కావల్సింది ఒక్కటే. అప్పుడు పద్మ పుట్టింది. అప్పుడు చౌదరికి వో పదెకరాల మాగాణి వుండేది. నిక్షేపంగ రెండరకలు కట్టేవాడు. కాలుమీద కాలేసుకొని తినలేదు కాని కష్టించినా కాస్తో కూస్తో హాయిగానే గడిచి గట్టెక్కేది. పద్మకి ముందు పిల్లల్లేరు. పద్మ తర్వాతా పిల్లల్లేరు. అందుకే పద్మ అదృష్టవంతురాలని పద్మ మేనత్త మాణిక్యం పద్మని చూసినప్పుడల్లా ముచ్చటపడేది. ఉయ్యాల్లో పద్మని ముద్దు చేస్తూ "ఇది నా కోడలు. దీన్ని ఎలా పెంచుతారో అన్నపూర్ణాదినా!" అని అనగలిగిందే గాని పద్మకి పదిహేనేళ్ళు దాటాక మాత్రం ఆ మాట అనలేకపోయింది. ఆ మాట అనటం అన్నపూర్ణకు బొత్తిగా ఇష్టం వుండదని గుర్తించలేనంత మూర్ఖురాలు కాదు మాణిక్యం. అయినా లోపల ఎక్కడో వో మూల కాస్తంత ఆశ లేకపోలేదు. ఎంతకాదన్నా చౌదరికి తను వొక్కతే చెల్లెలు.....

పద్మ పెళ్ళి విషయంలో చౌదరి బుర్ర పని చేయకుండా వుండలేదు. తాను మర్చిపోతున్నా అన్నపూర్ణమ్మ గుర్తు చేస్తూనే వుంది. ఆ మాట అనుకున్నప్పుడల్లా మాణిక్యం కొడుకు చౌదరికి గుర్తురాకుండా పోడు. మేనల్లుడి మీద తనకు వొల్లమాలిన ప్రేమ అనేది మాణిక్యానికి తెలియంది కాదు. వచ్చిన చిక్కల్లా నరసింహమే. మాణిక్యాన్ని నరసింహానికి యిచ్చేటప్పుడు తనకున్న పదెకరాల్లో అయిదెకరాలు కట్నం కింద యిచ్చాడు. తండ్రి ఆస్తిలో కూతురికి కూడా సమాన వాటా యివ్వాలనే రూలు ఏదీ లేదు ఆ రోజు. ఒకవేళ వున్నా చౌదరి ఆ రూలు కోసం ఆ

పని చేసేవాడు కాదు. శాసనాల మీద, శాసనసభల మీద, వాటికోసం ఎన్నుకోబడే అభ్యర్థుల మీద చౌదరికి నమ్మకం లేదు. అట్లాగని ఎలక్షన్లలో వోటు వెయ్యకుండా మాత్రం లేదు. తన కులపోడు నిలబడ్డప్పుడు వోటేసేవాడు. వాడు ఏ పార్టీ అనేది తనకు అనవసరం.

ఒక్కగానొక్క చెల్లెలికి అయిదెకరాలిచ్చాడు. అప్పటికి అన్నపూర్ణ తన యింటి ఇల్లాలు కాలా. అయివుంటే యిచ్చుండేవాడు కాదు. అయిదెకరాలు తీసుకున్న తర్వాత మాణిక్యం అన్నమాట చౌదరి యింకా మర్చిపోలేదు. నిజానికి మాణిక్యం యిప్పటికీ ఆ విషయం ఎత్తిపొడుస్తుంది. మాణిక్యం ఎత్తిపొడవడంలో ఆమె తప్పూ లేదు. అమ్మ నగలు యిమ్మంది. మాణిక్యం. అమ్మ కూడా నగలు కూతురికే యిస్తానంది. తండ్రి యింతెత్తుకు లేచాడు అమ్మ మీద. ఈ వంశంలో అత్త నగలు కోడలికివ్వటం ఆచారమన్నాడు. అంతగా కూతురికి కావాలంటె అయిదెకరాలు వాడు రాసిస్తాడన్నాడు. మొదట్లో చౌదరి అవాక్కయ్యాడు. ఆ తర్వాత తేరుకొన్నాడు. తండ్రి మాటల్లో బోలెడు నిజం వుందని బ్యాంకులు ఆ తర్వాతర్వాత రుజువు చేశాయి. భూమి తాకట్టుకన్నా బంగారం తాకట్టు సులువు. బంగారానికి కళ్ళకద్దుకున్నట్టు అప్పులిస్తాయి. బ్యాంకులు... యిదిగో అట్టా యిచ్చాడు అయిదెకరాలు...

పద్మ తప్పటడుగులు వేసేనాటికి చౌదరి యిష్టాయిష్టాలకు సంబంధం లేకుండానే వ్యవసాయంలో అనేక మార్పులొచ్చాయి. జొన్నస్థానాన్ని పొగాకు ఎప్పుడో ఆక్రమించేసింది. దాన్ని పక్కకు నెట్టా పత్తి రంగప్రవేశం చేసింది. వ్యాపార పంటలు భూమిని సొంతం చేసుకున్నాయి. బడా బడా పెట్టుబడిదారుల ఫ్యాక్టరీలకు ముడి సరుకును తయారుచేసే కర్మాగారాలయినాయి. భూమ్మీదే పాట పాడి ఏజెంట్లు, దళారులు లక్షలకు లక్షలు గడించడం మొదలెట్టారు. పరిశోధనా సంస్థలన్నీ విదేశీ లావాదేవీలను దృష్టిలో వుంచుకొని పొగాకులో ఈ రకం వెయ్యండి, పత్తిలో ఈ పద్ధతి తీసుకోండి, పామాయిల్ చెట్లు విరివిగా నాటండి అంటూ రైతుల్ని వత్తిడి చెయ్యడం మొదలెట్టాయి. పొలాల మధ్య ఎరువుల కంపెనీల ఎడ్వర్టైజ్‌మెంట్ బోర్డులు వెలిశాయి. గ్రామాల్లో తయారయే నాగళ్ళకు విదేశీ కంపెనీల లేబిల్ వచ్చిపడింది. అందమైన డబ్బాల్లో, ప్యాకెట్లలో ఎరువు అమ్ముడుపోతోంది. ప్రతిదీ కొనాలి. రోజుకో ధర. సూటిగా వొక ధర – చాటుగా వొకధర... రైతు జీవితం మూడొంతులు పట్నాల్లో గడిచిపోవడం మొదలయింది. కోటా కోసం పొగాకో, పత్తో అమ్మడం కోసం, బ్యాంకుల్లో అప్పుకోసం రైతు పట్నం పరిగెత్తాలి. తప్పదు....

పాతకాలపు చౌదరికి ఈ మార్పు అర్థం కావడం లేదు. తన చుట్టూ తనకే అర్థంకాని జూదం ఆట జరుగుతున్నట్టు భయపడకపోలేదు. అయినా తన వంతు ముక్కలు తాను కలపక తప్పదు. దాదాపు ప్రతి రెండిళ్ళకు ఒక స్కూటర్ వుండడం చౌదరికి కొత్తనిపించలేదు. రైతుల్లో నిద్రలేస్తే పొలాలు వెళ్ళేవాళ్ళు వెళుతూనే వున్నారు. మరో తరగతి బయలుదేరింది. నిద్ర లేవగానే పట్నం వెళ్ళాలి పని వున్నా లేకపోయినా. లోకం ఎట్టా చచ్చినా చౌదరి పట్టించుకునేవాడు కాదు. ఆ తరగతిలో తన చెల్లెలి మొగుడు కూడా వుండటం చూశాక అతను కాస్త కలతపడ్డాడు.

నర్సింహం తనిచ్చిన అయిదెకరాల్లో పత్తి వేస్తానన్నాడు. వేశాడు. కాస్త డబ్బు చేతికందింది. పోనీలే అనుకున్నాడు. మాణిక్యం కొత్త నెక్లెస్ పెట్టుకొచ్చినపుడు పత్తి మంచి లాభాలు తెచ్చి పెట్టినట్టుందిగా అని అన్నాడు. ఆ మాటలు అనేప్పుడు నేను వెయ్యలేక పొయ్యాననే బాధ తొంగి చూడటం మాణిక్యం గుర్తించకపోలేదు. చౌదరి చూసేట్టుగా కొత్త జడ కుచ్చులు పద్మకి యిచ్చింది. దానికెందుకే అన్నాడు. మేనకోడలి కిచ్చినట్టే యిచ్చాలే అని వొత్తి పలికింది. చౌదరికి యిలాంటివి వెంటనే అర్థమౌతాయి. నీ కోడలు కాకుండా పోదు అని అనేద్దామనుకున్నాడు. కాని అనలేకపోయాడు.

పద్మ పెళ్ళీడు కొచ్చింది. మాణిక్యమ్మ అదను కోసం చూస్తోంది. నర్సింహం అయిదెకరాలు బేరం పెడతానన్నాడు. చౌదరి ఎందుకు అని అనకముందే మాణిక్యం చెప్పుకొచ్చింది.

"ఈ యేడు పత్తిలో వచ్చిన లాభం అప్పులకే సరిపోయింది. మిగిలిన వాటితో యిదిగో, ఈ నగ తీసిచ్చాడు. కోడలు పిల్లకి కూడా తియ్యాలనుకొన్నాడు. స్కూటరుకు కట్టాల్సొచ్చింది. చాలా బాధపడ్డాడు."

చౌదరి వింటున్నాడు. మాణిక్యం యింకా చాలా విషయాలు దాచిపెడుతోంది. బ్రాందీషాపు లెక్కచెప్పదు. అలవాటయిన టౌన్‌క్లబ్ ఖర్చు చెప్పదు. చెప్పకపోయినా చౌదరికి తెలుసు.

"బళ్ళారి వెళ్ళాలంటున్నాడు...."

అనుకొన్న మాట రానేవచ్చింది నర్సింహం పరుగుపందెంలో ముందుండాలని చూస్తున్నాడు. చుట్టుపట్ల చాలామంది రైతులు బళ్లారికి పరుగెత్తడం చౌదరికి తెలుసు. అయితే నర్సింహాన్ని కాదనలేకపోయాడు. కాని ఉన్న అయిదెకరాలు అమ్మటం, దాన్ని బళ్లారిలో పత్తికి పెట్టుబడిగా పెట్టడం బాగోలేదనిపించింది.

"నీతో అనడానికి ఆయన వెనకాడుతున్నాడు. నన్ను చెప్పమన్నాడు. నాకూ అదే మంచిదనిపిస్తోంది."

మాణిక్యం కాస్త ఆగింది. అప్పుడే పద్మ అక్కడికి వచ్చింది. నిజానికి పద్మ వినడం కోసమే అసలు విషయం దాచేస్తూ చాలా చాలా చెప్పింది. ఇక చెప్పొచ్చు అనుకొంది.

"బయటివాడెవడో కొనేకన్నా...."

చౌదరి మాణిక్యం కేసి చూశాడు. ఆమె పద్మని దగ్గరకు లాక్కొంది. తల్లో వేళ్ళు పెట్టి లేని పేలకోసం వెతుకుతోంది. ఆమె పద్ధతి చూస్తే మా కోసం కాదు, నీ బిడ్డకోసం అన్నట్టుంది. రక్తం పంచుక పుట్టారు. వొకరి బుద్ధి మరొకరికి తెలియంది కాదు. పద్మ మాణిక్యం కోడలే. తప్పదు. చౌదరి బుర్రలో చాలాకాలంగా అస్పష్టంగా వున్న నిర్ణయం స్పష్టంగా బయటికొస్తుంది. 'కాదు' అనలేకపోయాడు. అయినా లోపల ఏదో ఒక మూల కాస్త అనుమానం.

"మీ అత్త పొలం అమ్ముతుందంట పద్మా, కొందామా?" ఆ మాట అని పద్మకేసి చూడకుండా మాణిక్యం కేసి చూశాడు. మాణిక్యం సన్నగా నవ్వింది.

"నా కోడలు నాలాంటిది కాదు. దాని భవిష్యత్తేంటో దానికి బాగా తెలుసు."

అన్నా చెల్లెళ్ళ దొంగ నాటకం పద్మకి అర్థం కాకుండా పోలేదు. ఆస్తికి సంబంధించి, అర్థికానికి సంబంధించి తమ ఇళ్ళలో మాటలు ఎంత తూచి తూచి వుపయోగించబడేది తనకి తెలియంది కాదు. ఇలాంటి విషయాల్లో మాణిక్యమ్మత్త చాలా తెలివితేటలు కలదనే నమ్మకం పద్మకుంది. ఆవిడ పద్ధతులు ఇతరులకు నచ్చినా నచ్చకపోయినా పద్మకి మాత్రం ఆవిడ మీద గౌరవం కలగడానికి అవి కొన్ని కారణాలు. తను ఆవిడ నీడలో హాయిగానే బతకొచ్చు. మామయ్య వొట్టి దగుల్బాజీ కావొచ్చు. నారాయణ మాత్రం అలాంటివాడు కాదు. గొడ్డుచాకిరీ చేస్తాడు. మొద్దు నిద్రపోతాడు. మామయ్య యింటి విషయాలు పట్టించుకోడు. ప్రతి విషయానికి నాన్న అమ్మని సాధించినట్టు అత్తయ్యని సాధించడు. ఒక్కోసారి అతి మంచి సంసారుల కన్నా తిరుగుబోతులే ఈ విషయంలో మంచాళ్ళనిపిస్తుంది. అత్తయ్య తాను తన కోడలు కావడమే తన భాగ్యంగా భావిస్తుంది. నానమ్మ నగల మీద ఆవిడకి మోజు తీరడానికి యిది చక్కని మార్గం. అన్నిటికన్నా మించి నాన్న తనని ఎలాగైనా ఆ యింటి కోడల్ని చేస్తాడు. ఇపుడు తన ఆస్తిని తను కాపాడుకోవాలి. ఈ అయిదెకరాలూ అమ్మితే ఆ యింటికి సొంతమంటూ వుండేది ఎకరా పదిసెంట్లే. అదీ నారాయణ పేరు మీద వుంది కాబట్టి అమ్మడానికి వీల్లేకుండా పోయింది.....

"ఏమ్మా?" చౌదరి అనాలోచితంగా మరోసారి అన్నాడు, నీ అభిప్రాయం ఏమిటన్నట్టు.

పద్మ తలూపింది. మాణిక్యమ్మ కోడల్ని ముద్దుల్లో ముంచెత్తింది. "మరి డబ్బు... నానమ్మ నగలు తాకట్టు పెట్టాలి. ఉన్నపళంగా అంత డబ్బు కావాలంటే...."

చౌదరి ఇంకా మాటలు పూర్తి చేయలేదు, పద్మ అందుకొంది – "నానమ్మ నగలు నాకు కావాలి."

మాణిక్యం కోడల్ని ఏకంగా వొళ్ళో పడుకోబెట్టుకొంది.

ఈ సంభాషణంతా వింటున్న అన్నపూర్ణ మాత్రం తోకతొక్కిన త్రాచులా లేచింది.

"నానమ్మ నగలూ కావాలి, అయ్యచేత పొలమూ కొనిపించాలి, ఈ యిల్లూ నీదనిపించుకో. మేము చిప్పెత్తుకొని దేశాలమీదకు పోతాం."

"నేను నీ సొమ్మేం తీసుకెళ్ళటం లేదు. నా సొమ్ము నేను తీసుకెళుతున్నా. నీ పుట్టింటివాళ్ళు ఏదన్నా ఇస్తే అది నువ్వే వుంచుకో..."

అన్నపూర్ణ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఈ మాట పద్మ నాయనమ్మ పదే పదే అనేది. అదే మాట కడుపున పుట్టిందీ అంటుంది. ఇక అక్కడ వుండదల్చుకోలేదు. లోపలికెళ్ళిపోయింది.

"ఇక వస్తారా అన్నయ్యా!" మాణిక్యమ్మ పైకిలేచింది. మరో సందర్భంలోనైతే అన్నపూర్ణ అంతు తేల్చేదే. అనాల్సిన మాటలన్నీ పద్మే అంటుంది. తను వొక్కమాట అన్నా అనవసరమే. అనవసరమైన పని ఏదీ మాణిక్యమ్మ చేయదు.

పద్మ ఆ యింట్లోంచి ఈ యింట్లోకి అడుగు పెట్టింది. అత్త తెచ్చిన అయిదెకరాలూ, నాన్నమ్మ నగలూ తనతోపాటే తెచ్చుకొంది. చౌదరికున్న మిగిలిన అయిదెకరాలూ అన్నపూర్ణ గట్టిపట్టు పట్టినందువలన వాళ్ళ తదనంతరం పద్మకు

యిచ్చేటట్టు చౌదరి వొప్పుకున్నాడు. సరే, ఎక్కడికి పోతుందిలే అని మాణిక్యమ్మ నొక్కి చూడలేదు. తల్లీ కూతుళ్ళకి మాత్రం మాటలు లేకుండా పోయాయి. అది నా కడుపున పుట్టలేదు అంది అన్నపూర్ణ. అసలు అది నన్ను కనలేదు అంది పద్మ. నారాయణకి మాత్రం యిది నచ్చలేదు. నర్సింహం మీద విరుచుకుపడ్డాడు. “పోయి బళ్ళారిలో నువ్వే చావు. నేనురాను” అని తెగేసి చెప్పాడు.

వీడో చవట అని నర్సింహం అరిచాడు. మొగుణ్ణి చవట అనటం పద్మ విన్నది. అయినా పట్టించుకోలేదు.

బళ్ళారిలో వో ఏభై ఎకరాలు కౌలుకు తీసుకొన్నాడు నర్సింహం. మాణిక్యంతో బళ్లారి వెళ్లిపోయాడు. చౌదరి యిచ్చిన డబ్బు పెట్టుబడికి చాలకపోవచ్చు. ఆ విషయం పద్మతో అన్నాడు. ఆ మాట పద్మతో అనమని మాణిక్యమే చెప్పింది. ఇంటి పెత్తనం పద్మకు ఇచ్చినట్టు ప్రకటించకనే ప్రకటించింది. ముందు కానివ్వండి, తర్వాత చూద్దాం అని పద్మ అన్నదో లేదో “యింకేం భయం లేదు పదవయ్యా!” అని మాణిక్యం వంతపాడింది. ఒక సామ్రాజ్యానికి రాణిలా పద్మ మనస్సు కాస్త గర్వపడక పోలేదు. నర్సింహం మాటవరసకన్నా నారాయణతో అనలేదు. ఆ అవసరం వుందని మాణిక్యమ్మ గుర్తించలేదు. మొగుడు పెళ్ళాం బళ్ళారిలో అడుగుపెట్టారు.

నారాయణ్ణి పద్మ మొగుడనే జనం పిలవడం మొదలెట్టారు. గొడ్డుచాకిరి చేయడం బాగా అలవాటైన నారాయణ వో రోజు పద్మతో కాలవ కింద ఎకరా పది సెంట్లలో వరి వేస్తానన్నాడు. పద్మ లెక్కచూసింది. యాడాదిపాటు తిండి గింజలకు కొదవుండదు. సరేనంది. అయిదెకరాల విషయంలో పద్మ ఫలానా అని చెప్పలేదు. తండ్రి బుర్రలో పత్తి ఆలోచనుంది. నర్సింహం బళ్ళారిలో యాభై ఎకరాలు పత్తేశాడని తెలిశాక చౌదరికి బళ్ళారి వెళ్ళాలని అనిపించకపోయినా వున్న అయిదెకరాల్లో పత్తి వేద్దామనుకున్నాడు. ఆ మాట పద్మతో అన్నప్పుడు పద్మ మనసులోనే తన అయిదెకరాల్లో పత్తి వెయ్యాలని నిర్ణయించుకుంది. ఆ మాటే నారాయణతో అంది. నారాయణకి ఆ మాట నచ్చలేదు. పత్తిమీద అతనికి ప్రత్యేకమైన ద్వేషం లేదు. తండ్రి మీద కోపం అది. వద్దన్నాడు. అయినా ప్రస్తుతం పద్మ మొగుడు. అవుననక తప్పలేదు.

వ్యవసాయానికీ, పద్మకూ దగ్గర సంబంధం ఏర్పడింది. అయితే పద్మ వ్యవసాయంలోకి అడుగుపెట్టేనాటికి మందులకు అలవాటుపడ్డ శరీరంలాగా భూములు ఎరువులకు అలవాటు పడ్డాయి. ఎరువు లేకపోతే పండే సమస్యే లేదు. ఎరువులు, పురుగుమందుల ధరలు ఆకాశాన్నంటుకోవడంతో పెట్టుబడి దానంతటదే పెరగడం మొదలయింది. పెట్టుబడి కోసం అప్పుల కోసం ప్రయివేట్ వ్యక్తుల గడపలు, ప్రభుత్వ బ్యాంకుల గడపలు కాళ్ళు అరిగేలా తిరగాల్సిన దుస్థితిలోకి రైతులు నెట్టబడ్డారు. వ్యవసాయం గిట్టుబాటు కాకుండా పోతోంది. నష్టం మీద నష్టం రైతుల నడ్డి విరగ్గొడుతోంది. చాలామంది రైతులు భూములు కోల్పోయారు. ఈ నేపథ్యం పద్మ గమనించకపోలేదు. అయినా తప్పదు. ఈరోజులా రేపుండదు.

పద్మకి మొదటిసారిగా కన్నీళ్ళొచ్చాయి. నానమ్మ నగలు బ్యాంకు పరం చెయ్యాల్సొస్తుందని అనుకోలేదు. తన యిష్టాయిష్టాలకు సంబంధం లేకుండా పనులు

జరుగుతున్నట్టనిపించింది. భూమిని నమ్ముకున్న ప్రతి రైతు యింతే కావచ్చునని ఆ క్షణంలో అనుకొంది. ఏ పంటకు రాబడి ఎక్కువొస్తుందో ఆ పంటకేసి పరుగెత్తడం రైతు జీవితంలో మామూలైంది. బళ్ళారిలో యాభై ఎకరాల్లో నర్సింహం పెట్టుబడికి నష్టం రాకుండా చూసుకోగలిగాడు. కాకపోతే సొంత ఖర్చులు అప్పులుగా మిగిలాయి. ఇక్కడ పద్మకూడా అంతే. నానమ్మ నగలు బ్యాంకు నుంచి తెచ్చుకోగలిగింది. వడ్డీ మాత్రం చెయ్యి కాల్చింది. చౌదరి తట్టుకోగలిగాడు. బాగా పండిందని కాదు, యితర ఖర్చులు లేవు కాబట్టి.

పత్తి రైతుల్లో చిన్నపాటి అలజడి బయల్దేరింది. అపజయం అభిమానం మీద సవాల్ చేసింది. అపజయం ఎదురైతే వ్యామోహం ఆగిపోదు. ఇంకా విసురుగా దూసుకొస్తుంది. అక్కడక్కడా కొద్దిమంది రైతులకు మంచి లాభాలే వచ్చాయి. వాళ్ళు పొలాలు కొన్నారు. వొకరిద్దరు పత్తి మిల్లుల్లో భాగస్తులు కూడా అయ్యారు. వాళ్ళని చూసి దెబ్బతిన్న రైతులు నష్టపోవడం తమ ఖర్మనుకొన్నారు. దేనికైనా పెట్టి పుట్టాలనుకొన్నారు. పద్మకూడా అదే అనుకొంది. దానికితోడు ఆ ప్రాంతం రైతు లోకంలో కొన్ని సంఘటనలు జరిగాయి. పొగాకు గిట్టుబాటు ధరకు నోచుకోలేదు. పొగాకు బేళ్ళన్నీ అట్టాగే వుండిపోయాయి. పొగాకు కంపెనీలు రైతుల దగ్గర్నుంచి పొగాకు కొని, రైతులకు డబ్బు లివ్వడానికి వాళ్ళని తిప్పుకోవడం మొదలెట్టాయి. రైతుకు నిద్రాహారాలు మాని కంపెనీల పంచల్లో పడిగాపులు కాయడం సరిపోయింది. దినచర్యలో అదో భాగమైంది.

కొన్ని కంపెనీలు మంచి సరుకంతా అమ్మేసి, చెత్తా చెదారం వుంచి గోడౌన్లకు నిప్పు పెట్టుకొన్నాయి. ఇన్సూరెన్స్ కార్పొరేషన్ నుంచి రావాల్సిందానికన్నా ఎక్కువే జమచేసుకొన్నాయి. రైతుకే మాత్రం మొండిచెయ్యి చూపాయి. ఈ కుట్రంతా రైతులకు తెలుసు. అయినా ఈ దేశంలో రైతు సంఘటిత శక్తికాదు. బాధపడ్తాడు. విసుక్కొంటాడు. అయినా ఆ సంవత్సరం పొగాకు రైతు కొన్ని ప్రాంతాల్లో తిరగబడ్డాడు. సంఘటిత శక్తిగా ముందుకొచ్చాడు. పోలీసు కాల్పులు జరిగాయి. నెత్తురు పారింది. కొన్ని ప్రాంతాల్లో పొగాకు బేళ్ళను రోడ్డుకడ్డంగా పెట్టి నిప్పుపెట్టి తమ నిరసన తెలియపర్చారు. దున్నపోతుమీద వానపడ్డా అది దున్నపోతు, నెమలి కంటినీళ్ళు వేటగాళ్ణి కరిగించవు. రైతుమాత్రం మళ్ళీ మోసపోయాడు.

కాలం కాటేస్తున్న విషనాగులా బుసలు కొడ్తున్నట్టుంది. పద్మ అంతు చిక్కని అగాధం నుంచి సహాయం కోసం చేతులు చాస్తున్నట్టుంది. భూమికి తన జీవితాన్ని అంకితం చేసిన రైతుబిడ్డ నారాయణ, అది పచ్చగా వుంటే పిల్లవాడిలా సంబరపడేవాడు. కాని తన కళ్ళముందే అది జబ్బుచేసిన మనిషిలా వుంది. తన పద్మ మోసపోయింది. తనూ మోసపోయాడు. ఉన్న అయిదెకరాలుకాక మరో అయిదెకరాలు కౌలుకు తీసుకొని పత్తి వేశాడు. ప్రతిసారి వద్దనేవాడు. ఈసారి వద్దనలేదు. అయిదెకరాల్లో అసలొచ్చింది. మరో అయిదెకరాలు వేస్తే లాభం రావచ్చనుకొన్నాడు. అయిదువేలకి లోటు కనిపించింది. మళ్ళీ అది పూడ్చుకోవాలనే పట్టుదల. పట్టుదల కాకపోయినా మరో మార్గంలేని నిస్సహాయస్థితి మళ్ళీ పదెకరాల్లో... వరుసగా మూడేళ్ళు...

"నేను పొరపాటు చేశాను. నీ మాట వినాల్సింది."

"ఆ తర్వాత నేను మాత్రం ఏం చేశాను?..."

పద్మా, నారాయణా ఒకరినొకరు వోదార్చుకోవడంకోసం అనుకునేవాళ్ళు. కాని ఒక వాస్తవాన్ని వాళ్ళు గుర్తించలేదు. ఎవరి మాట ఎవరు విన్నా వినకపోయినా నష్టం లేదు. పరిస్థితి అది. ఎవర్ని ఎవరు నిందించుకొన్నా లాభం లేదు.

తరతరాలుగా వస్తున్న సంపద అయిదు సవర్లబంగారం బ్యాంకులో వుండిపోయింది. దగ్గరున్న అయిదు సవర్లు అమ్మకానికి పెట్టారు. సవరు 1400 వంతున అయిదు సవర్లు అమ్మేశారు. ఎరువుల కొట్లో బాకీ తీరింది. లింగయ్య శెట్టి బాకీ ఆరువేలు అట్లాగే వుంది. బాంకువాళ్ళు వడ్డీ మీద వడ్డీ పెంచి, ఇంతయిందని నోటీసు పంపారు. చిల్లర బాకీలవాళ్ళగోల ఎక్కువగా వుంది. నారాయణ బజార్లో తిరగడం మానేశాడు. పద్మ బయటకు రావడం మానేసింది. పదెకరాల్లో పురుగుదెబ్బకి రెండెకరాలు పీకెయ్యాల్సి వచ్చింది. నారాయణ గుండె ధైర్యం చేసుకున్నా, పద్మ తన నరాలను ఏవో అదృశ్యశక్తులు పీకేస్తున్నట్టు విలవిలా ఏడ్చింది. పీకేసిన భాగంలో పెసర వేశాడు నారాయణ. మొక్కొచ్చింది. కాని ముడగ తీసుకోవడం మొదలైంది. పొలం కేసి వెళ్ళడం మానేసిన పద్మకు ఆ విషయం నారాయణ చెప్పాడు. వెర్రిదాన్లా చూసింది. తనకు తెలియకుండానే నారాయణ్ణి తీసుకొని పుట్టింటి గడప తొక్కింది. ఆ రోజు నుంచి ఈ రోజు దాకా గడప తొక్కలా. తల్లి ముఖం చూడలా. కాని, ఈ రోజు చూద్దామనుకొంది. చూసి చద్దామనుకొంది. ఆ ఆలోచన రాగానే భయం వేసింది. పాపం, నారాయణ పద్మ మొగుడు, పిల్లాడులాంటివాడు. వొట్టి పిచ్చివాడు. పద్మకళ్ళల్లో నీళ్ళు ఆగడం లేదు. నీళ్ల తుడుచుకుంటూ తలెత్తి చూసింది. అన్నపూర్ణ తనకేసే చూస్తోంది. మనసొప్పలేదు. ఆత్మాభిమానం వొక స్థాయి కుటుంబాలు బొత్తిగా ఆలోచించని భ్రమ. మధ్యతరగతి మనస్తత్వాన్ని పట్టి పీడిస్తున్న వో భూతం ఆత్మాభిమానం... పద్మ తెల్లారి ఇంటికి బయల్దేరుతుంటే అన్నపూర్ణ అంది: "ఈ గేదె పాలు ఆత్రంగా తాగేది పద్మ. దీన్ని మీ దొడ్లో కట్టేసుకోండి నారాయణా!" అని. పద్మ అన్నపూర్ణ కేసి చూసింది. పిచ్చితల్లి. తన బిడ్డకు ఇంకా రోషం, ఆత్మాభిమానం వున్నాయని వెతుకుతోంది. లేవు. ఆ పద్మను పరిస్థితులు ఎప్పుడో చంపేశాయి. ఇప్పుడు పద్మ అందొచ్చే ప్రతి సహాయానికీ అర్రులు చాస్తోంది. ఆ విషయం తల్లికి చెప్పాలనుకుంది. గేదె పలుపు పట్టుకొంది.

రెండెకరాలు పోను మిగిలిన ఎనిమిదెకరాల్లో చేతికందిన పత్తి అయిదు క్వింటాళ్ళు, క్వింటాళ్ళు ఆరువందల ఇరవై చొప్పున నాలుగువేలా చిల్లర చేతి కొచ్చింది. లింగయ్య శెట్టి బాకీ ఇంకా రెండువేలు మిగిలింది. వడ్డీ కాక బ్యాంక్ నుంచి నోటీసు వచ్చింది. ఫలానా వాళ్ళ బంగారం వేలం వేస్తున్నట్లు పత్రికలో ప్రకటన కూడా వొచ్చింది. చౌదరి సహాయపడే స్థితిలో లేడు. అన్నపూర్ణ బంగారం లింగయ్య శెట్టి ఇంట్లోకి మారి చాలా కాలమైంది. పద్మకు అత్తామామలు గుర్తుకొచ్చారు. వాళ్ళు బళ్ళారికి వెళ్ళి దాదాపు నాలుగేళ్ళు అయింది. ఈ మధ్యన ఉత్తరాలు కూడా ఆగిపోయాయి. పాలు తీసి, పాలక్యాన్ సైకిల్ కు కడుతూ నారాయణతో అంది – హోటల్లో ఓ యాభై అడ్వాన్సుగా అడగమని. సైకిలెక్కుతూ నారాయణ సరేనన్నాడు. మరుసటి రోజు పద్మ బళ్ళారికి బయల్దేరింది. కాని అలాంటి పరిస్థితులలో తిరిగి వస్తాననుకోలేదు.

కాస్తో కూస్తో అత్తామామల నడిగి తెచ్చుకోవచ్చు అనుకొంది. కాని అత్త ఒక్కటే తనను వాటేసుకొని ఏడుస్తుందనుకోలేదు. అప్పటికి నర్సింహం ఇల్లు విడిచి వెళ్ళి నెల దాటింది. ఎక్కడకు వెళ్ళిందీ ఎవరికీ తెలియదు. ఈ రోజు రావచ్చు, రేపు రావచ్చు అని అత్త ఎదురుచూస్తూనే వుంది. వరుసగా నాలుగేళ్ళు పత్తి అత్తా మామలను తినేసింది. కౌలు కట్టందే వెళ్లడానికి వీల్లేదని పొలంగలవాళ్ళు అంక్ష పెట్టారు. డబ్బు తెస్తానని నర్సింహం బయల్దేరాడు. చౌదరిని అడిగి తెస్తానన్నాడు. అక్కడకు రాలేదని పద్మ చెప్పడంతో మాణిక్యం కుప్పకూలిపోయింది. పద్మకు పరిస్థితి అర్థమైంది పొలంగలవాళ్ళను కలుసుకుంది. ఆడకూతురని జాలిపడ్డారో, యిక రానిదానికి రాద్ధాంతమెందుకని అనుకున్నారో తెలియదు గాని, డబ్బు రెండు సంవత్సరాల్లో తీర్చేట్టు మాట తీసుకొని, ఆ తర్వాత ఇద్దరు ఆడవాళ్ళ మీదా జాలి చూపారు. అత్తను తీసుకొని రాత్రే బయలుదేరింది. మాణిక్యం దారంతా ఏడుస్తూనే వుంది. ఆమెని చూసి జాలేసింది. ఆనాటి అత్తయ్య ఎంత తూచి తూచి మాట్లాడేది. ఎంత తెలివిగా మాట్లాడేది. పద్మ ఆలోచిస్తూంది. ఈ చిన్ని జీవితంలో ఎంత మార్పు చూసింది. నర్సింహం తిరిగిరాడని మాణిక్యానికి తెలిస్తే ఏమవుతుంది? అప్పట్లో అత్తయ్య తెలివితేటల మీద తనకు ఎంత గౌరవం వుండేది! ఈ నీడలో సుఖంగా బతకొచ్చని ఎన్ని కలలు కన్నది. చిన్న చిన్న గట్ల దగ్గర కోర్టు పాలయ్యే పరిస్థితి, కొద్ది బంగారం దగ్గిర బంధుత్వం తెంచుకునే అహంకారం. నిజంగా ఆ రోజు తాను తన కన్నతల్లిని ఏం మాట్లాడింది? కన్నీళ్లాగటం లేదు. ఈ ప్రయాణీకుల మధ్యనే గొంతెత్తి ఏడ్వేసేలా వుంది. పరుగెత్తే రైల్లోంచి దూకెయ్యాలని వుంది. కాని నారాయణ....

"కాస్త జరుగుతావా అక్కా?"

పద్మ ఆలోచనలు ఆగిపోయాయి. ఎదురుగా నిలబడ్డ ఇరవయేళ్ళ అమ్మాయి కేసి చూసింది. పక్కకు జరిగింది. ఆ అమ్మాయి కూర్చుంది. ఆ అమ్మాయికేసే మళ్లీ చూసింది. బాగా చూసిన మొహంలా గుర్తుకొస్తోంది. ఈ అమ్మాయి 'స్నేహ'లాగుందే అని అనుకొంది.

"మీరు పద్మ.... అవునా....చాలా మారారు....గుర్తు పట్టలేకపోయాను....."

అవును. గుర్తుపట్టలేనంతగా మారిపోయింది. ఈ పిల్ల తనని కలుసుకొన్నప్పుడు తను చౌదరి కూతురు. పదెకరాలు, పది సవర్ల బంగారం తన వెంట పట్టుకెళ్ళే వున్నయింటి ఆడపడుచు ఈ రోజు అప్పుల పాలయిన వో పేదరైతు భార్య. దగా పడ్డ మరో పేదరైతు కూతురు. స్నేహ పద్మకేసి చూస్తూనే వుంది.

"ఆ రోజుల్లో నీతో మనసు విప్పి మాట్లాడలేకపోయాను... మీరు సభలూ, సమావేశాలంటూ పనీ, పాటా లేని తిరుగుడుగాళ్ళనుకొన్నాను. మీ పాటలు మాత్రం వినేదాన్ని. పాటలు చక్కగా పాడుతారనిపించేది. కాని ఆ పాటల్లో నాలాంటివాళ్ళ గుండె కోతలు అంత బలంగా వుంటాయని అనుకోలేదు. కాని ఇప్పుడనిపిస్తోంది. ఇదిగో – ఈ పద్మ కళ్ళల్లో నిజంగా ఆ ధారలే... ఆ కన్నీటి ధారలే...." అని చెప్పాలనుకొంది. చెప్పలేకపోయింది. అయినా పద్మ ఆగిపోలేదు. ఏదో చెపుతూనే వుంది, తన పెళ్ళి దగ్గర్నుంచి. స్నేహకి ఆ రోజు గుర్తొచ్చింది. ఆ

ఫ్రాళ్ళో మీటింగ్ సందర్భంగా యింటికో మనిషిని అన్నానికి పంపారు. తను పద్మ ఇంటికి వెళ్ళింది. చెదరని చిరునవ్వు, మూర్తీభవించిన ఆశయం. పద్మ తనని చాలా చాలా తినమంది. అయితే ఆ రోజు ఆ ఇంటి దర్పాన్ని చూపిస్తున్న పల్లెటూరి అమ్మాయి మాత్రమే... ఈ రోజు....? స్నేహ వెళ్లిపోతుంటే పద్మ అదోలా చూస్తూవుండిపోయింది. స్నేహ రెండు మూడు రోజుల్లో కలుస్తానంది. తన సీటు కేసి నడుస్తూ పద్మ అనుకొంది. ఆ అమ్మాయికీ తాను చాలా దగ్గరైనట్టుంది. ఆ దగ్గరవడానికి చాలా గొప్ప నేపథ్యం వుందని పద్మకి తెలియకపోవచ్చు.

ఊళ్ళో అడుగు పెడుతోంటే పద్మ మనసెందుకో కీడు శంకిస్తోంది. నారాయణ రూపం ప్రాణం లేనట్టు తన నడక్కి అడ్డం పడుతోంది. హాస్పిటల్ సందు దాటుతూ ఆగిపోయింది. ఊరు ఊరంతా అక్కడే వున్నట్టు అనిపించింది. జనాన్ని తోసుకుంటూ వెళ్లింది. అంజని తన ఈడుదే. తనతోపాటు అత్తింట్లో అడుగు పెట్టింది. చచ్చిపడుంది. మాణిక్యం వివరాలడుగుతోంది. అరు ఎకరాల్లో నాలుగు క్వింటాళ్ళే అయింది. అది సముద్రంలో కాకిరెట్ట. వాస్తవానికి ఓ సంవత్సరం నుంచి వాళ్ళ కుటుంబం పాలమ్ముకొని బతుకుతోంది. అప్పుల బాధపడలేక ఆంజనేయులు గేదెను అమ్మేశాడు. పొలం అమ్మకమైంది. చివరకు గేదె కూడా అమ్మకం కావడంతో భార్యాభర్తల మధ్య మాటలు చెడాయి. ఓ పదిరోజులు మౌనంగా ఉండిపోయింది. అది తుఫానుకు ముందు ప్రశాంతత మాత్రమే!

అంజని పురుగు మందు తాగింది.

ఏదో చప్పున గుర్తుకొచ్చినదానిలా మాణిక్యాన్ని లాక్కొని ఇంటికేసి వడి వడిగా నడిచింది పద్మ. నారాయణ మంచం మీద పడుకుని ఆకాశంలోకి చూస్తున్నాడు.

ఆ ఇద్దర్నీ చూసిన నారాయణ తన తండ్రి కోసం వెతికాడు. మాణిక్యం గొల్లుమంది. పద్మ అంతా చెప్పింది. నారాయణ విని ఊరుకున్నాడు. పద్మ చూపులు గేదెకోసం చూస్తున్నాయని నారాయణ గమనించాడు.

"అమ్మేశాను - ఆ లుచ్ఛా నా కొడుక్కి"

పద్మ నారాయణ కేసి వింతగా చూసింది. సాధారణంగ రైతులు వాడే బూతులు నారాయణ నోటంటరావు.

"అమ్మేవాన్ని కాదు. నిన్ను నీచంగా మాట్లాడాడు. అమ్మేశాను. అదే, బాకీ కింద తోలేశాను."

ఇక పద్మ ఆగలేకపోయింది. నారాయణ్ణి దగ్గరికి తీసుకొని తన గుండెల్లో దాచుకుంది. నారాయణ కంటినీళ్ళు తన గుండెల్ని తడిపాయి. ఇప్పుడు బళ్ళారి ప్రయాణం, ఆంజనేయులు భార్య చనిపోవడం, తన గేదెని అమ్మడం, .... ఇవేవి తన గుండెల్ని పిండెయ్యడం లేదు.

ఆ రాత్రి పళ్లెం ముందు కూర్చొన్న నారాయణకి నోట్లోకి ముద్దపోవడం లేదు. పదే పదే పద్మకేసి చూశాడు. ఏదో చెప్పాలని మనసు తొందరపడుతోంది.

"నువ్వు లేనప్పుడు యిక్కడ చాలా జరిగాయి. లక్ష్మి చచ్చిపోయింది."

పద్మ బిత్తరపోయింది.

"ఇదిగో, ఈ ముద్ద వుండే వుంటే అది బతికి పొయ్యేది. అంజనేయులు పెళ్ళాం అప్పుల్తో చచ్చిపోతే రామిగాడి కూతురు ఆకల్తో చచ్చింది..."

పద్మకు ఏం మాట్లాడాలో తోచలేదు. రాములు చౌదరి పొలాల్లో పని చేసేవాడు రాములు భార్య, పన్నెండేళ్ళ కూతురూ కూలికెళ్ళేవాళ్ళు. పత్తి దెబ్బ తినడంతో వాళ్ళు తెనాలికి వలసెల్లారు. అక్కడ కూలీలు ఎక్కువై, పని దొరక్కపోవడంతో రాములు భార్యని, కూతుర్ని ఇంటికి పంపి తాను అక్కడే వుండిపోయాడు. పత్తి బాగా వున్నప్పుడు పురుగు ఏరేవాళ్ళు. ఇప్పుడదీ లేదు. ఆకలి. ఆకలి రాకాసి రాములు కూతుర్ని బలి తీసుకుంది.

"రాములొచ్చాడా?"

"వచ్చి దాన్ని పూడ్చి పెట్టాడు."

పద్మ వంటిల్లు సర్దింది. గేటు దాటుతోంటె నారాయణ తానూ వస్తానన్నాడు. అంత రాత్రిలో ఊరు శ్మశానంగా వుంది. అదమరచి నిద్రబోవడం లేదు. అలిసి, వోడి నిద్రపోతోంది. దారిలో తన పుట్టింటి కేసి చూసింది. చౌదరి దగ్గుతున్నాడు. ఆర్థికంగా దెబ్బతిన్న వ్యక్తి ఆరోగ్యంగా కూడా దెబ్బతింటాడు. రేపు ఏదైనా జరగొచ్చు. లైబ్రరీ మలుపు తిరుగుతోంటే నాగేంద్రం కనిపించింది. కాస్త దూరంలో ఆమె మొగుడు ఆకాశంలోకి చేతులు చాస్తున్నాడు. ఉండుండీ నవ్వుతున్నాడు. నాగేంద్రం మొగుణ్ణే కనిపెట్టుకుని వుంది. పద్మ నారాయణ చెయ్యి పట్టుకొంది. ఊరి చివర పల్లె. ఆకలి రాకాసి ఆనంద నాట్యం చేస్తున్న రంగస్థలం. రాముల్ని పలకరించింది. రాములు భార్య రేపో మాపో అంటోంది. ఇక అక్కడ వుండబుద్ధి కాలేదు. రాములు భార్య చేతిలో బళ్ళారి ఖర్చుల్లో మిగిలిన పది రూపాయలుంచింది.

ఆ రాత్రి నారాయణ నిద్రపోలేదు. ఆ ఊళ్ళో జరిగిన ఆత్మహత్యలు, ఆర్తనాదాలు అతన్ని నిద్రకి దూరం చెయ్యడం లేదు. రేపు అమ్మకానికి పెట్టిన భూమి అతనికి నిద్ర లేకుండా చేస్తోంది. భూమి మొత్తంగా అమ్మితే తప్ప తలెత్తుకు బతుకలేదు. ఆ తర్వాత... ఆ తర్వాత...

"ఆ ఎకరా పది సెంట్లు వుంచి నీ పేర రాస్తాను."

"నీ పేర్నే వుంచు."

"లేదు."

"పిచ్చిగా మాట్లాడకు... ఇటు తిరుగు, తలుపు గొళ్ళెం పెట్టి వస్తాను."

"నేను అడిగేదానికి సమాధానం చెప్పు."

"నాకు అక్కర్లేదు."

"నేను చచ్చాక...ఆ తిరుగుబోతు నీ నోట్లో దుమ్ముకొడతాడు."

"ఎందుకట్టా కానిమాటలంటావ్? ఇంకా నన్ను ఏడ్పించాలనుందా?"

"బతికుండిమాత్రం ఏం చేస్తున్నాను? పొలం అమ్మాక బతికుండి ఏం చెయ్యడానికి..."

"పొలం లేనివాళ్ళు బతకడం లేదూ? అట్టాగే" అంది ఓదార్పుగా.

"నేను పొలం మీద బతికినవాణ్ణి. అది లేకుండా బతకడం ఎట్టాగో నాకు తెలీదు. చాతకాదు." పద్మ దీపం పెద్దది చేసి చూసింది. నారాయణ వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

తెల్లారి అయిదెకరాలు అమ్మకం అయిపోయింది. చౌదరి దగ్గర వున్న అయిదెకరాలు లింగయ్య శెట్టి ఉమ్మడి బాకీ కింద లాగేసుకున్నాడు. అయిదెకరాలు కొన్నవాళ్ళు డబ్బు అప్పులవాళ్ళ చేతిలో పెట్టారు. ఎవరికి రావాల్సిన వాటా వాళ్ళు తీసుకొన్నారు. నారాయణ, పద్మ ప్రేక్షకులుగా వుండిపోయారు. చౌదరి కేవలం సాక్షిగా మిగిలిపోయాడు. సాక్షి సంతకం చేశాక గుండె పట్టుకున్నాడు. అదింకా కొట్టుకుంటూనే వుంది – బలహీనంగానో, బలవంతంగానో.

పత్తి రైతుల ఆత్మహత్యల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోంది. రైతు కూలీల ఆకలి చావులు ఈ సంఖ్యలో చేరడమైనా లేదు. జిల్లా అధికార యంత్రాంగం ఆ ప్రాంతాన్ని సందర్శించింది. సాధ్యమైనంతవరకు అవి పత్తి వలన జరిగిన ఆత్మహత్యలు కావని నిరూపించడానికి ప్రయత్నించింది. ప్రభుత్వ వర్గాల నుంచి ప్రభుత్వ యంత్రాంగానికి వచ్చిన సూచన అది. యజమాని ఎలా మొరగమంటే అలా మొరిగే జాతికుక్కల్లా కొందరు అధికారులు వితండవాదం కూడా మొదలెట్టారు. మొగుడూ పెళ్ళాం మధ్య స్పర్ధలొచ్చాయి. పెళ్ళాం బావిలో పడింది. దీన్ని పత్తి నష్టం జాబితాలో ఎలా చేరుస్తామని వాదించారు. ఆ యిద్దరి మధ్య గొడవ జరగడానికి కారణం అప్పులని, ఆ అప్పులకి కారణం పత్తి పంటలో వచ్చిన నష్టమని రైతులు మొరపెట్టుకొన్నా పెడచెవిని పెట్టారు.

ప్రభుత్వం చేస్తున్న వాగ్దానాలు, అధికారులు తీస్తున్న లెక్కలు, ప్రతిపక్షాలు చేస్తున్న సందడి... యివేవీ పద్మ మనసులో ముద్ర వేయడం లేదు. ఈ దేశంలో చాలా విషయాలు సాంప్రదాయికంగా జరుగుతాయి. ఇదంతా. అలాంటిదే అనుకొంది. చేతిలో వున్న బ్యాంకు నోటీసు పదే పదే చూసుకొంది.

"అప్పు తీర్చకపోతే నీకు చెందిన బంగారాన్ని ఫిబ్రవరి 27వ తేదీ వేలం వేస్తాము" అని వుంది. మళ్ళీ మళ్ళీ చదివింది.

"ఆ ఎకరా పది సెంట్లు అమ్ముదాం."

"వద్దు. అదన్నా వుంచుకుందాం. కనీస సెంటైనా నాది అనుకొనే భూమి కావాల. లేకపోతే... ఊహూ నేను భరించలేను..."

"భూమికన్నా...."

"బంగారం గొప్పే కావచ్చు కాని...."

"నీకు ఎట్టా చెప్పాలి?..."

"వొద్దు. నాకేమీ చెప్పొద్దు. దాన్ని అమ్మటం వద్దు...." అంటూ నారాయణ లేచిపోయాడు. విసుక్కుంటూ పోయాడు. పగలంతా ఇంట్లో లేడు. రాత్రి బాగా పొద్దుపోయాక వచ్చాడు. కళ్ళు పీక్కుపోయి చింతనిప్పుల్లా వున్నాయి. జుట్టు రేగిపోయివుంది. ఎంతో మానసిక ఘర్షణ తర్వాత ఎటూ తేల్చుకోలేని నిస్సహాయ స్థితి అతన్లో కన్పిస్తోంది. నీళ్ళు తోడి అన్నం పెట్టింది. అంతా మామూలుగానే

జరుగుతున్నా భరించరానిదిగా వుంది. తనూ ఇంత తిన్నాక నారాయణ మంచానికి కాస్త దూరంలో గుంజకానుకొని కూర్చుంది. నారాయణ్ణే చూస్తూ ఏడుస్తోంది.

"ఇట్టాకూర్చో." నారాయణ అన్నాడు. ఉరుము వురిమింది, మెరుపు మెరిసింది, వర్షం కురుస్తోంది.

"ఏడ్వకు...ఇట్టరా....నీకు గుర్తుందో లేదో.... మా నాయన బళ్ళారికి ఎల్లడానికి ఈ పొలం కూడ అమ్మమన్నాడు. నేను ఆయన్ని అప్పుడు నరికేద్దామనుకొన్నాను. అమ్మ చాలా తెలివిగా తన పొలం బయటికి పోకుండా మీ అయ్యచేతనే కొనిపించింది. నేను ఆనందపడ్డాను. ఎందుకు చెప్పుతున్నానంటే....నాకు ప్రపంచమంతా ఆ భూమ్మీద తిరుగుతుంది. లేకపోతే నా చెమట, శక్తి అంతా ఆ భూమికి ఎందుకు ధారపోస్తాను? ప్రేమించాను కాబట్టి. అట్టా ప్రేమించడం నేరం కాదనుకుంటాను. అట్టా అయ్యాను కాబట్టే ఇన్నేళ్ళు భూమి నన్ను దగా చేసినా – అది నాకు దూరం అవుతుందంటే గుండె కోసినట్టుంది."

పద్మ ·బేలగా వింటోంది. ఈ రోజు కొత్తగా వింటోంది.

"నా పొలం మీద నేను ఎంత కష్టపడ్డానో ఆ నాగేటిసాళ్ళకి తెలుసు. అయితే నేను ఎక్కడ మోసపోయాను? ఈ వ్యవసాయం నా జీవితానికి వో సుడిగుండంలా ఎందుకు మారింది? నా ఇష్టాయిష్టాలకు సంబంధం లేకుండా చాలా పనులు జరిగిపోతున్నట్టనిపిస్తుంది. పొలంమీద పెట్టుబడి, దానిమీద వచ్చిన పంట ధర – ఇవన్నీ నేను అనుకొన్నట్టుగాకాక, మరెవరో అనుకొన్నట్టు జరుగుతున్నట్టుంది."

పద్మకు అది అక్షరాలా నిజమనిపించింది. కాని అది నారాయణకే కాదు, తనకూ అర్థం కావడం లేదు.

"పెద్ద కుట్ర జరుగుతోంది పద్మా... ఆ కుట్రకి మనలాంటివాళ్ళం బలి పశువులమౌతున్నాం.... అంతే. ఆత్మహత్యలు... ఆకలిచావులు అన్నీ హత్యలే... అంతా హత్య చెయ్యబడినవాళ్ళే..."

ఎక్కడో పిడుగు పడ్డది. పద్మ కంగారుగా చూసింది. గాలికి గేటు తలుపులు కొట్టుకొంటుంటే బయటికి పరుగుతియ్యబోయింది. నారాయణ పద్మ చెయ్యి పట్టుకొన్నాడు. గాలి వేగం హెచ్చింది. దీపం ఆరిపోయింది. మెరుపు వెలుగులో నారాయణ్ణే చూసింది. ప్రశాంతంగా ఉన్నాడు. బయట జరుగుతున్న ప్రళయం అతన్ని కంగారుపర్చటం లేదు. తన నడుం చుట్టూ పెనవేసుకొన్న నారాయణ చేతుల్ని తీసెయ్యాలన్పించడం లేదు. దొడ్లో మునగచెట్టు విరిగినట్టుంది.... ఏదో మూల ప్రహరి కూలినట్టుంది. నారాయణకివన్నీ అక్కర్లేదన్నట్టుంది. సర్వం నాశనం కానీ అన్నట్టుంది. సమస్తం కూలిపోనీ.... నాదికాని ప్రతిదీ ఏదయినా....నాకేమన్నట్టుంది. పద్మకూడా అదే అనుకొన్నట్టుంది.

తెల్లవారి ఎండపడ్డదాకా మెళకువ రాలేదు పద్మకు. రాత్రి చాలా బీభత్సమే జరిగినట్టుంది. విరిగిన మునగచెట్టు, కూలిన ప్రహరీ గోడ, లేచిపోయిన ఇంటికప్పు–వేటినీ సర్దాలని లేదు. నారాయణ వచ్చాక సర్దుకోవచ్చు. అతనూ పట్టించుకోకపోతే పోనీ, అట్టాగే ఉండి పోనీ. నారాయణ ఎప్పుడు లేచిపోయాడో తెలీదు. మాణిక్యాన్నడిగింది. చీకట్లోనే లేచాడని చెప్పింది. వాన ఎప్పుడు ఆగిందని

అడిగింది. తెల్లారిందాకా కురుస్తూనే వుందని చెప్పింది. నారాయణ వానలోనే వెళ్ళాడు. చీకట్లో, అంత వానలో.... పద్మ నిలువెల్లా వొణికిపోయింది. విసురుగా లేచింది. నడవటం లేదు. పరుగు తీస్తోంది. మాణిక్యమ్మ కేకలేస్తున్నా ఆగటం లేదు.... పరుగెత్తే పద్మని చూసి అంతా విస్తుపోయారు. ఏం జరిగింది ఎవరికీ తెలియదు. ఆమె వెంటే పరుగు తీస్తున్నారు.... ముళ్ళ డొంకల వెంట, పొలం గట్లు దాటుతూ, జారి పడుతున్నా.... పద్మ పరుగెత్తుతోంది.... వెర్రిగా కేక లెడుతోంది.... 'నారాయణా' అంటూ పిలుస్తోంది... ఆవిడ పిలుపు నారాయణకి వినిపించదు... నాగేటి చాళ్ళ మధ్య... బురదలో —నారాయణ శాశ్వతంగా నిద్రపోతున్నాడు. అతని వంటినిండా మట్టి — పిడికిళ్ళనిండా బురదమట్టి.

చౌదరి పెద్ద పెట్టున యేడుస్తున్నాడు. అన్నపూర్ణ, మాణిక్యం, రాములు అందరూ ఏడుస్తున్నారు. నేల ఏడుస్తోంది. నింగి ఏడుస్తోంది.... ఏడ్వ్వరాంది ఒక్క పద్మకే.... గొంతు పెగలంది ఒక్క పద్మకే.... ఆ చూపులు వెర్రిగా లేవు. ఎటో చూస్తున్నాయి దేన్నో వెతుకుతున్నాయి.... బహుశా "స్నేహ" కోసం కావచ్చు. అప్పుడు ఆ కళ్లు వర్షించవచ్చు!

● ప్రచురణ, 1989 ●

★ ★ ★

63

వాడ్రేవు చినవీరభద్రుడు

# సుజాత

లాకప్ రూంలో పోలీసులు నా మీద అత్యాచారం జరిపి ఏడాది కావొస్తోంది. ఈ రోజు ఇట్లా కిటికీ ప్రక్కన కూచుని బయటి వీధుల్నీ – హారన్ మోతలూ, సైకిళ్ళు, పాదచారులూ, అమ్మకపు బళ్ళూ – వీటితో నిండిన రోడ్లనీ చూస్తూంటే ఆ అనుభవం మళ్ళీ ఒంట్లో వికృతంగా మెదుల్తోంది.

మళ్ళీ అదే వసంతమాసపు ఎండ. ఉదయం తొమ్మిది గంటల వేళ. నీలి గౌనుల చిన్నారులు కాన్వెంటులకి త్వరత్వరగా రిక్షాల్లో సాగిపోతున్న వేళ. వీధి మలుపులోంచి దిరిసెన చెట్ల నీడల్లోంచి రాలిన పచ్చపూల తివాచీని కర్కశంగా తొక్కుకుంటో వచ్చే పదో నెంబర్ సిటీ బస్సు – దుర్భరమయిన హారన్ కూడా. బయటి దృశ్యంలోనూ, ప్రపంచంలోనూ ఏమార్పు లేదు. అదే ఆకుల మిలమిల. గాలుల్లో కళకళలాడే ఎండ కిరణాలు. మార్పులేని అవే కవళికల్తో వెయ్యి ముఖాలు.

తల చిట్లుతున్నట్టుగా ఒంట్లోంచి ప్రకంపన. కళ్ళకి కనిపించే లోకమంతా గిర్రున తిరుగుతోంది. ఇక నాసియేటింగా ఏదో భళ్ళున కల్మషమంతా నోట్లోంచి కక్కుకోవాలని అన్పించడం మొదలవుతుంది.

నా ఒంటిమీద జరిగిన దాడి నా రక్తంలో నా దేహాంతరంగాలన్నిటా మజ్జమజ్జకీ ఇంకిపోయినట్టుగా 'మలినపూరితమయిన' భావన. నేను 'అపవిత్రమయ్యా'నని ఎవరన్నా అంటే ఈ రోజు నాకంత కోపం రాదేమో! అనుభవంలోని లోతు అనుభవించినవాళ్ళే మాటలకి నీడలని కల్పించి పట్టింపులు పెట్టుకొంటారు. మాటలు ఏం చెప్పగలవు? నా ఒంట్లోని, ఇంకా పచ్చిగా మండుతున్న ఈ వికారాన్ని అశుభ్రమనీ, అపవిత్రమనీ ఎన్ని మాటలు చెప్పి విశదపరచగలను? ఏడాదిగా నన్ను నేను అనుక్షణం శోధించుకుంటూ నిప్పులాంటి బాధతో ప్రక్షాళనం చేసుకుంటూనే వున్నాను. కానీ ఏమేరకి బయటపడగలిగాను?

"సుజాతా, అక్కడ ఒక్కర్తివీ ఏం చేస్తున్నావమ్మా?"

మేడకింద నించి పెరటివైపు మెట్లు సగందాకా ఎక్కి అమ్మ పిలుస్తోంది. పది నిమిషాలు నేను ఒంటరిగా కూచున్నానంటే అమ్మ కంగారు అధికమవుతుంది. ఆమె మమకారంతో, అనిర్వచనీయమయిన వాత్సల్యంతో నాపట్ల చూపుతున్న ప్రత్యేకమైన ఆదరణ నన్ను విపరీతంగా బాధిస్తుంది. ఇంట్లో జబ్బుపడిన కూతురికి సాధారణంగా

ఒక తల్లి ఎట్లాంటి శ్రద్ధ చూపిస్తుందో అలాంటిదే ఇదంతా అన్పిస్తుంది. ఇది నిజంగా ఒక జబ్బేనా? ఇది ఏనాటికయినా తగ్గే జబ్బేనా? ఇలా ప్రశ్నించుకుంటే మరీ విచిత్రంగా వుంటుంది.

అమ్మకు కనిపించాలని లేచాను. నేను కనిపిస్తే ఆమె ఆరాటం తగ్గుతుంది. కాని లేచి నిలబడలేకపోయాను. రీలింగ్ సెన్సేషన్. ఒంట్లో నరాలు జివ్వుమని లాగేయి. ఇక తర్వాత కొంతసేపు మత్తుగా వుంటుంది. లేచి మంచం మీద పడుకుంటాను. కొన్ని గంటలపాటు మగతనా, నిస్త్రాణగా అలా పడుకుని వుండాలి. మైండ్ బ్లాంక్‌గా వుంటుంది. ముందు అంతా తెల్లగా వుంటుంది. దాని మీద నల్లని, ముదురు ఇటిక రంగు నీడలు పడతాయి. ఇనుప గొళ్ళేల చప్పుడు, తుప్పువాసన ముక్కుని అద్దేస్తుంది. వూపిరాడకుండా గొంతుమీద రాతి పిడికిలి బిగించినట్టు వుంటుంది. తల తిప్పవచ్చు. కాని ఎవరో ఏదో ఆంక్ష పెట్టినట్టుగా కళ్ళు కూడా కదపలేను. లంకలో దబ్బున మిన్ను విరిగి మీద పడ్డట్టు టన్నుల కొద్దీ బరువు నా మీద అకస్మాత్తుగా పడుతుంది. ఒంట్లోంచి పొరల్లో ఎవ్వరో నా ఫ్లెష్‌ని తవ్వి తోడుతున్నట్టుగా వుంటుంది. దాహం, దాహం... మాటలకి గొంతు పెగలదు. కళ్ళు మూతలు పడతాయి.

'ఏమ్మా, మళ్ళీ ఒంట్లో నలతగా వుందా?' – ఆ పిలుపు, ఆ వాత్సల్యస్పర్శ అమ్మది. లేచి చూశాను. బయట ఎండ చిక్కబడింది. రోడ్ల మీద రద్దీ తగ్గింది. దిరిసెన చెట్ల నీడలో రెండు కుక్కలు పడుకుని వున్నాయి. ఎక్కడో మధ్యాహ్నపు ఎండలో కాకులు వుండీ వుండీ కావు కావుమంటన్నాయి.

"డాక్టరుకి కబురు చెయ్యమంటావా? అన్నం తినగలవా? ఈమధ్య మళ్ళీ ఇలా లేదు. కాస్త చిక్కపడ్డావనుకుంటున్నాను. మళ్ళీ ఇదేమిటే అమ్మా?" అమ్మ కళ్ళల్లోనూ, కంఠంలోనూ ఆర్ద్రమైన ఆత్రుత.

"ఫర్వాలేదమ్మా!" అన్నాను. 'ఎందుకమ్మా నీకీ దిగులు' అనాలనే అన్పిస్తుంది. కానీ అనలేను. నా అనుభవం మీద నా రెస్పాన్స్, అమ్మ రెస్పాన్స్ ఒకేలా ఎందుకుండాలి? బాధ పెట్టే ప్రతీదీ అమ్మ దృష్టిలో అశుభం, కీడు. అమ్మ కంఠంలోంచి ఆ ఆత్రుతని చేత్తో తీసి పారెయ్యాలనుంటుంది నాకు. బహుశా నా ఒంట్లోని అస్వస్థతని మంత్రించినట్టుగా మాయం చెయ్యాలనే అమ్మకీ వుంటుందేమో! ఈ ఇద్దరాడవాళ్ళూ ఈ విషయంలో ఒక్కలానే నిస్సహాయులు.

కింది నుంచి గలగల నవ్వులు. ఈ రోజు చెల్లెలు కాలేజీకి వెళ్ళలేదన్నమాట. తమ్ముడు బాంక్‌నుంచి లంచ్‌కి వచ్చే వేళ. "సుభద్ర కాలేజీకి వెళ్ళలేదా అమ్మా?"

"ఈ రోజు దానికి పెళ్ళివారు వస్తున్నారు. అది కాలేజీకి వెళ్తే సాయంకాలం ఆలస్యమవుతుందని వుండి పొమ్మన్నాను. ఉండు – దానికీ, నీకూ అన్నం ఓడ్డిస్తాను, కిందికి రా." అమ్మ వెంటనే వెళ్ళలేదు. కొన్ని క్షణాలు ఆగింది. ఆమె ఏదో చెప్పాలనుకుంది. ఏం చెప్పాలనుకుందో నేను గ్రహించలేనా? పెళ్ళివారు వస్తున్న మాటే ఇంతదాకా నాకు తెలియదే! కాని నిజంగా నేను అక్కడ వుండగలనా? నేను అక్కడ వుండకూడదనే అందరి కోరికానూ. కాని దానికి వాళ్ళకున్న కారణాలు వేరు. నా కారణాలు వేరు. నా ఆలోచనల్లోనాని, మానసికంగాకాని నాకు ఏ

అపసవ్యతా లేదు. నా అనుభవాలు ఎంత అపసవ్యమయినవి అయినా నా ప్రవృత్తికి అపసవ్యత రాలేదు. కాని సాయంకాలం పెళ్ళిచూపుల తతంగమంతా సవ్యంగా వుంటుందని నేను సరిపెట్టుకోగలనా?

కిందకి వెళ్ళాను. డైనింగ్ టేబుల్ దగ్గర తమ్ముడు కూడా ఉన్నాడు. సాధారణంగా వాడు ఉదయం భోంచేసి బాంక్‌కి వెళ్తాడు. వీధి మలుపు తిరిగితేనే ఆంధ్రా బ్యాంక్ బ్రాంచి. మధ్యాహ్నపు వేళ లంచ్ అవర్‌లో ఇంటికి వచ్చేసి విశ్రాంతిగా కూచుని మళ్ళీ వెడతాడు. ఈ కాసేపూ బాంక్‌లోనే కూచోరాదా అంటే 'ఇక్కడ ఉన్న చల్లదనం అక్కడ ఎలా వుంటుంది?' అంటాడు. సాయంకాలం అయిదు కాగానే ఇంటికి వచ్చేస్తాడు. వెళ్తే, వాడూ మరదలూ ముందే ప్రోగ్రాం పెట్టుకుని, సినిమాకో, షికారుకో వెళ్తారు. లేకపోతే ఇంట్లోనే గడుపుతారు. స్నేహితులు లేకపోలేదు. కాని వాళ్ళతో చాలా ఖచ్చితంగా, కాలిక్యులేటెడ్‌గా ఉంటాడు. తమకీ, తమ పిల్లవాడికీ అయ్యేఖర్చు మేరకి తను ఇంట్లో చెల్లిస్తాడు. తక్కిందాట్లో తమ అవసరాలకి పోను మిగిలింది ఫిక్సెడ్ డిపాజిట్‌కి వెళ్తుంది. మరదలు మునిసిపల్ స్కూల్లో టీచర్. నాన్న కావాలనే ఆ సంబంధం చేసాడు. ఆ పిల్ల తండ్రి టౌన్లో బాగా పేరున్న కాంట్రాక్టర్. మున్సిపాల్టీకి అతని కాంట్రాక్టులు బాగా అచ్చివొచ్చాయి. నాన్నా, అతనూ ఒకళ్ళకొకళ్ళు బాగా 'కావలసినవాళ్ళు'. కాని నాన్న అతన్ని 'ఎక్కడ ఉంచాలో అక్కడే ఉంచా'నంటాడు. ఆ అమ్మాయి శ్రావ్యంగా పాడుతుంది. కాని నేను ఆమె పాటలు విన్నది తమ్ముడి పెళ్ళయిన కొత్తలోనే. ఆమెకి మూడు నెలలకుగాని ఒకసారి జీతం రాదు. ఆ విషయంలో 'ఎవరూ ఏమీ చేయలేరట.' అందుకని ఆమె రోజుకొకసారి మునిసిపల్ యాజమాన్యాన్ని ఆడిపోసుకోకుండా ఉండలేదు. ప్రతి రెండవ శుక్రవారం ఆమె విధిగా, కాజువల్ లీవ్ పెడుతుంది. ఆ విధంగా ఆ రోజూ, ఆ తర్వాత రెండు రోజులూ ఆమె పుట్టింటి దగ్గర గడిపి వస్తుంది. ఇందులో తల్లిదండ్రుల పట్ల ప్రేమ కొంతానూ, పుట్టింటిమీద తనకున్న 'న్యాయమైన', ఇప్పుడు 'చట్టబద్ధమైన' హక్కు కొంతానూ.

మా మరదలూ, చెల్లెలూ సాధారణంగా మధ్యాహ్న భోజనం కారియర్ తీసుకునే వెళ్తారు. నాన్నకి పన్నెండు గంటల వేళ అటెండర్ వచ్చి కారియర్ తీసుకుని ఆఫీసుకి పట్టుకెళ్తాడు. రాత్రి భోజనమటుకు అందరం కలిసే చేస్తాం. ఎంత ముఖ్యమైన వ్యవహారాలు ఉన్నా నాన్న రాత్రి టీవీలో హిందీ వార్తలు వచ్చేటప్పటికల్లా ఇంట్లో ఉంటాడు. రాత్రి ఇంటికి వచ్చి పొద్దున్న ఆఫీసుకి వెళ్ళేదాకా ఇంటి దగ్గరికి ఎవర్నీ కలుసుకోడానికి అనుమతించడు.

అమ్మ అన్నం వడ్డించింది. సుభద్ర ఒన్‌డే క్రికెట్ మాచ్ గురించి తమ్ముడితో వాదనపడుతోంది. 'ఈ సారి ఒన్‌డేకి మనవాళ్ళు ఎవర్ని కెప్టెన్‌గా పంపుతారు?' తమ్ముడు కపిల్‌దేవ్‌ని సమర్థిస్తాడు. చెల్లెలికి రవిశాస్త్రి అంటే ఇష్టం. 'అక్కా, నువ్వు చెప్పు' అంది సుభద్ర మధ్యలో నావైపు తిరిగి. నేను నవ్వి వూరుకున్నాను. క్రికెట్ చాలా ఎక్సైటింగ్. కాని ఎంత ఫూలిష్ గేమ్! 'నేను అంత ఎక్కువగా ఫాలో కావడం లేదు. నీకే బాగా తెలుస్తుంది' అన్నాను దానితో. తమ్ముడు నాకేసి విచారంగా చూసాడు. ఆ మాట నేను విచారంగా అన్నదికాదు. నిజంగానే కొంతకాలం

గడిచేకొద్దీ ఇలాంటివాటిపట్ల ఆసక్తి తగ్గాలి మనుషుల్లో. కాని ఆ సంగతి వాళ్ళకి ఎలా తెలియచెయ్యగలను? నిజంగా చేస్తే నేను క్రికెట్‌ని తీసుకున్నంత సీరియస్‌గా వాళ్ళెప్పుడూ తీసుకుని ఉండరు. ఆ చిన్నపిల్ల లిద్దరూ వాదనలో పడిపోయారు. నేను లేచి వాష్‌బేషిన్ వైపు నడుస్తుండగా మధ్యలో వాదన చటుక్కున ఆపి తమ్ముడు అడిగాడు:

"అక్కా, సాయంకాలం నీ ప్రోగ్రాం ఏమిటి?"

ఆశ్చర్యపోయాన్నేను. అదేం ప్రశ్న. ఏ రోజన్నా, ఏ సాయంకాలమన్నా నాకో ప్రోగ్రామంటూ వుందా? ఈ ఇంట్లో అందరికీ ఖచ్చితమైన టైంటేబుల్ ఉంది, అమ్మతో సహా. కాని కాలంతో నిమిత్తం లేకుండా ఉన్నదాన్ని నేనే. అయినా ఇప్పుడు ఈ ప్రశ్న తమ్ముడినుంచి!

ఎవ్వరూ మాట్లాడలేదు. సగం ఒస్తూ వంటింట్లోంచి ఆగిన అమ్మ అడుగుల నిశ్శబ్దం వెనక కూడా ఒక ప్రతీక్ష ఉంది

నాప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ చెప్పాను:

"ఇవాళ శుక్రవారం కదా! ప్రోగ్రెసివ్ ఫోరంవాళ్ళ నెలసరి మీటింగ్ ఇవాళ. ఎప్పటినుంచో నన్ను రమ్మని అడుగుతున్నారు. ఇవాళ వెళ్దామనుకుంటున్నాను. చాలా రోజులయింది కదా, మనుషుల మధ్యకి వెళ్ళి."

అందరి మొహాల్లోనూ ఏదో రిలీఫ్. నిజంగా ఉందో, లేక ఇదంతా నేను ఊహించుకుంటున్నదో!

'ప్రోగ్రెసివ్ ఫోరం' కొంతకాలం నుంచీ పట్టణంలో చాలా యాక్టివ్‌గా ఉంటున్నట్టుగా పేరుపడింది. ఇందులో ఎక్కువమంది వామపక్ష రాజకీయాల్తో ప్రత్యక్ష పరోక్షసంబంధాలు ఉన్నవాళ్ళు, కొంతమంది హేతువాదులు, నాస్తికులు. పౌరహక్కులసంఘం పట్టణ కార్యదర్శి ఈ ఫోరంకి సమావేశకర్తగా పనిచేస్తున్నాడు. వీళ్ళుకాక సానుభూతిపరులూ, నిష్పక్షపాతులూ, ఫ్యూర్ ఆర్ట్ ప్రియులూ, లెక్చరర్లు, బాంక్ కాషియర్లు, కొందరు అధికారులు, ఒకరిద్దరు ఫెమినిస్టులు కూడా ఈ సంఘంలో సభ్యులుగా ఉన్నారు. 'ప్రగతిశీల', 'క్రియాశీల' శక్తులకు అన్నిటికీ ఒక వేదికగా ఉండాలని, కొన్ని కనీస సమస్యల విషయంలో 'ఏకాభిప్రాయం' కలిగి పోరాటం చెయ్యాలని వాళ్ళ ఆశయం.

నాపైని జరిగిన అత్యాచారానికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడం లోనూ, ఆ తర్వాత జరిగిన తినేక పరిణామాల్లోనూ ఈ 'ఫోరం' చాలా ప్రముఖ పాత్ర వహించింది. ఒక 'వ్యక్తి' పైన జరిగిన అత్యాచారాన్ని సమాజంపైన జరిగినదానిగా ప్రజలకు తెలియజేయడంలో ఫోరం సభ్యులందరూ శాయశక్తులా కృషి చేశారు. నేను జైల్లో ఉన్నంతకాలం ఎవరో ఒకరు రోజూ నన్ను చూడడానికి వచ్చేవారు. రోజూ పర్మిషన్ సంపాదించడం దగ్గర నుంచి కూడా నేను విడుదలయ్యే దాకా వాళ్ళు చిన్న చిన్న లంచాలు పెట్టడం నుంచి పెద్ద పెద్ద రికమండేషన్స్ ప్రయోగించడం దాకా అన్ని స్థాయిల్లోను అన్ని ప్రయత్నాలూ చేశారు. కాని నేను బెయిల్ మీద విడుదలయి వచ్చిన తరువాత రోజు రోజుకీ వాళ్ళు నన్ను కలవడం తగ్గింది. ఇందుకు తప్పు నాదే అనవచ్చు. నేను ఎన్నడూ వాళ్ళని

వెళ్ళి కలవలేదు. వాళ్ళే నన్ను కలవడానికి వచ్చేవారు. కొంత సానుభూతి కూడా ఎంత వద్దనుకున్నా వాళ్ళనుంచి నాకు అవసరమయ్యేది. అలాగే వాళ్ళపట్ల నేను కొంత కృతజ్ఞతాపూర్వకంగా మాట్లాడాలని కూడా వాళ్ళు ఆశించేవారు. అందులో అసాధారణమైంది ఏముంది? కాని ఇది ఇలా ఎంతకాలం సాగుతుంది? నిన్ను ఎవరయినా నీటిలో మునిగిపోతుంటే ఒడ్డుకి లాగి రక్షించారనుకో. వాళ్ళు చేసింది ప్రాణదానమే. కాని వాళ్ల సహాయానికి నువ్వు రోజూ వాళ్ళని కలిసి కృతజ్ఞతలు చెప్పవలసి వస్తే ఎలా ఉంటుందో ఊహించుకో! ఇంతకీ మనిషి నీళ్ళల్లో పడటం వేరు. అది ఆకస్మికంగా జరిగిన ప్రమాదం. కానీ నాకు జరిగింది? ఇది కేవలం ఆకస్మికమేనా?

అన్ని రోజుల్లాగే అదీ ఒక రోజు. ఉదయం తొమ్మిది గంటల వేళ, వసంత మాసపు ఎండ. నేను యూనివర్సిటీ నుండి కొన్ని రోజులు సెలవుమీద ఇంటికి వచ్చాను. మళ్ళీ వెళ్ళిపోవాలి. ఆ ఉదయం నేను మా చెల్లెలు కాలేజీకి వెళ్ళి అక్కడ నా పూర్వపు లెక్చరర్లను పలకరించి రావాలని బయల్దేరాను. నీలిగౌనుల చిన్నారులు కాన్వెంటుకి త్వరత్వరగా రిక్షాల్లో సాగిపోతున్న వేళ. వేళకి రావాల్సిన పదో నెంబరు సిటీ బస్సు హారన్ ఇంకా వినిపించలేదు. దిరిసెన చెట్ల నీడల్లోంచి రాలిన పచ్చపూల తివాసీని దాటుకుంటూ వీధి మలుపు తిరుగుతుండగా మా మరదలు రిక్షాలో ఇంటికి వస్తూ ఎదురయ్యింది. 'ఇదేమిటి, స్కూలు లేదా?' అన్నాను. "స్కూలుకి సెలవు కాదు. కాని ఇవాళ అంతా మాస్‌లీవ్. పెట్టారు. సమస్యలున్నాయి చర్చించాలి మీటింగ్ అన్నారు. నాకు తలనొప్పిగా ఉంది ఇంటికి వెళ్ళిపోతున్నాను. ఇక్కడే కదా కాస్త మీ తమ్ముడి గారికి ఈ సంగతి చెప్పెయ్యరా" అని వెళ్ళిపోయింది. నేను తమ్ముడిని బాంక్‌లో కలిసి మాటాడి కాలేజి రోడ్డుమీద నాలుగడుగులు వేసానో లేదో నినాదాల్తో ఊరేగింపు ఎదురయింది. ఉద్యోగులు, టీచర్లు, కార్మికులు సంయుక్తంగా నిర్వహిస్తున్న ఊరేగింపు అది. నేను కాలేజి దగ్గర నుంచి వచ్చేస్తుండగా ఆ ఊరేగింపు కాలేజివైపు వస్తూ కనబడింది. ఇందాకటికన్నా అది పెద్దదయింది. వాళ్ళు ప్రతి స్కూలు దగ్గరా, ఆఫీసు దగ్గరా, హోటల్ దగ్గరా, దుకాణం దగ్గరా ఆగి బలవంతంగా మూయించి తమ వాళ్ళని కలుపుకుంటూ వస్తున్నారు. నేను ఇంటికి వచ్చేటప్పటికి తమ్ముడు కూడా బాంక్ నుంచి వచ్చేశాడు. మరో అరగంటకల్లా సుభద్ర వచ్చేసింది. 'అక్కా, డాక్టర్ సుధాకర్ నిన్ను వెళ్లిపోయేముందు ఒక్కసారి కలవమన్నాడు' అంది. డాక్టర్ సుధాకర్ వాళ్ళ కాలేజీలో సోషియాలజీ లెక్చరర్. యువకుడు, ప్రతిభావంతుడు. నేను సోషియాలజీ పోస్టుగ్రాడ్యుయేట్ కోర్స్ చదవడానికి అతనే కారణం. ఉదయం అతనితో మాట్లాడాలంటే కుదరలేదు. అతనికి క్లాస్ వెనుక క్లాస్. తన క్లాస్‌కి అతను ఇచ్చే ప్రాధాన్యత ఎలాంటిదో బాగా తెలిసాక అతణ్ణి మరి డిస్టర్బ్ చేయలేకపోయాను.

మధ్యాహ్నం మూడింటికి, ఇంకా ఎండ చల్లబడకుండనే బయల్దేరాను నేను అతన్ని కలవడానికి. బహుశా ఒక పదినిమిషాలు నేను జాగ్రత్తగా తయారయి ఉంటాను అప్పుడు. అదీ డాక్టర్ సుధాకర్‌ని చూడబోతున్నందువల్ల అయివుంటుంది. లేత నీలం రంగు చేనేత చీరా, ఆల్విన్ రిస్టువాచీ, ఎడమచేతి అనామికకి పగడపు

ఉంగరం, మెడలో నాకు చాలా ఇష్టమయిన ముత్యాలదండ–అన్నట్టు బుజాన లెదర్ హ్యాండ్ బ్యాగ్. దాన్లో లేతాకుపచ్చ అంచుల్తో రెండు తెల్లని చేతి రుమాళ్ళు, పర్స్, ఒకటి రెండు కవర్లూ, నేను రాసి పోస్టు చెయ్యడం మర్చిపోయిన ఉత్తరం, కేమ్లిన్ పెన్నూ వాడిన గుప్పెడు బొగడ పువ్వులూ–

అనాటి నా రూపం, నా సర్వస్వం నాకు ఎప్పటికీ గుర్తే. ఆ క్షణాన్నే కాదు, ఎప్పుడయినా నేను జీవితంనుంచి కోరగలిగేదీ పొందగలిగేవీ అంతకన్న ఎక్కువుండదు. గుప్పెడు వాడిన పువ్వులూ, సాధారణంగా ఆ వయసు కన్యకి మనసులో తుళ్ళింతలాడే మధురోహలూ – అయినప్పటికీ, జీవితం గురించి, తన గురించి, ప్రపంచం గురించి వుండవలసిన ప్రగాఢమయిన నమ్మకాలూ–

నేను వీధి మలుపుతిరిగానో లేదో అప్పుడు బోధపడింది నాకు, వూరేగింపు తీవ్రత చల్లారలేదని. వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. నేను రిక్షాకోసం చూడడంలో ఉపయోగం లేదనిపించింది. ఎవరూ ఇవాళ పనిచెయ్యరు. ఒకరకంగా ఇది బంద్‌రోజు. భారతదేశంలో అన్ని పర్వదినాలకన్నా నిష్టగా అన్ని మతాల వాళ్ళూ ఆచరించే పర్వదినం. నేను నా కొంగుని తలచుట్టూ చెవుల్ని కాల్చే మధ్యాహ్నపు ఎండ నుండి కప్పుకుని నడుస్తున్నానో లేదో ఒక సందు మలుపులోంచి విడవని నీడలాగా వూరేగింపు కనబడింది. ఇప్పుడది చాలా పొడుగ్గా ఉంది. ఈసారి సందు మొదట్లో ఇంకా షాపు మయ్యని టీ దుకాణంవాడు వాళ్ళ ఆగ్రహానికి గురయ్యాడు. వాళ్ళు అతనిచేత షాపు మూయించే ప్రయత్నంలో ఉండగా వూరేగింపు మధ్యలోంచి ఒకళ్ళిద్దరు తెలిసిన టీచర్లు నన్ను పలకరించారు. నేను ఆగిపోయి వాళ్ళతో మాట్లాడుతుండగానే వూరేగింపుతోపాటు వాళ్ళూ కదిలిపోయారు. నేను నెమ్మదిగా నా దారిలో నాలుగడుగులు వేసానో లేదో ఎంతలో వచ్చిందోగాని, బండగా పడ్డ బ్రేకులు చేస్తున్న చప్పుడు మధ్య నా పక్కగా ఆగింది పోలీసు జీపు.

నేను ఉలిక్కిపడి పక్కకి చూడగానే జీపు ఎదురు సీట్లోంచి కోపంగా మొహం పెట్టి అడిగాడు పోలీసు ఇన్‌స్పెక్టర్–

"ఏమ్మా, ఇందాకా నువ్వేనా అక్కడ దిగింది?"

అతను ఎందుకడుగుతున్నాడో అర్థం కాలేదు. చెమట పట్టిన అతని నుదురు మీదా, పుష్టిగా మొరటుదేలిన అతని ముక్కుమీదా, మీసం మీదా, గడ్డంమీదా ఎండపడి మెరుస్తోంది.

'అవును, నేనే!'

'నీకు వాళ్ళు తెలుసునా?'

ఈ దారమ్మట ఎవడేనా దొంగ పారిపోయాడా అని పోలీసు రోడ్డుమీద పోతున్నవాణ్ణి అడుగుతున్నట్టుంది ఆ ప్రశ్న. కాని ఆ దారమ్మట వెళ్ళినవాళ్ళు దొంగలేమీ కారే!

'అవును, నాకు తెలిసిన వాళ్ళే!'

అన్నానో లేదో–

'వెయ్యండిరా దీన్ని జీపులో' అని వాడు గట్టిగా అరవడం, టకటకమని బూట్ల చప్పుడుతో ముగ్గురు కానిస్టేబుల్స్ జీపులోంచి రోడ్డు మీదకి దూకి నా మీద పడి నా చేతుల్ని పట్టుకుని యీడ్చుకుంటూ జీపులోకి తీసుకువెళ్ళి పడెయ్యడం ఒక్కసారే జరిగాయి. జరిగిందేమిటో నేను అర్థం చేసుకునేటప్పటికే జీపు వేగం అందుకుంది.

ఎండకి కాగిన జీపు గుడ్డ వేడి వాసనా, పోలీసు యూనిఫాం చెమట కంపూ, లోపలికి కమ్ముకొస్తూ వూపిరాడనివ్వని రోడ్లమీది దుమ్మూ, ఒక్కపాటున ఉధృతమైన రక్తవేగం, మెంటల్ కన్ఫ్యూజన్ – వాటిలోంచి గొంతు పెగల్చుకుని అడిగాను:

'నన్నెందుకు ఇట్లా పట్టుకొన్నారు? ఎక్కడికి తీసుకు వెళ్తున్నారు?'

ఎవరూ మాటాడలేదు. మామూలుగా అయితే ఆ కానిస్టేబుల్స్ రోడ్డుమీద ఒక స్త్రీతో అట్లాప్రవర్తించి వుండరేమో. కాని ఈ రోజు వాళ్ళ చూపులు ఇక్కడ లేవు. కసి కండ పట్టినట్టుగా ఉన్నాయి వాళ్ళ ముఖాలు. ఏదో తాగుబోతు, నిద్రమత్తు మృగాన్ని దాని మానాన దాన్ని నిద్రపోనీకుండా రెచ్చగొడితే కలత నిద్రలో లేచి ఒళ్ళు విదిలించుకుంటున్నట్టుగా ఉంది. వాళ్ళు సాయుధులనీ, వాళ్ళ వెనుక దుర్భేద్యమైన ప్రభుత్వాధికారం ఉందనీ ఆ క్షణాన నాకు తోచలేదు. అప్పుడు నా కళ్ళకు బలంగా కట్టింది వాళ్ళ పాశవిక శక్తి. విచక్షణా హీనమైన పశువు కుమ్ముతూవుంటే ఎలా ఆందోళన పడతామో అలా. వీళ్ళు మృగాలే అయితే, ఇలా నట్టనడి రోడ్డున నన్ను బంధించడానికి వీళ్ళకి అధికారం ఎవరిచ్చారో అన్న ప్రశ్నే లేదు. నేను బలవంతుడినైన యువకుడిని అయి కాయశక్తులా ఎదిరించి పెనుగులాడినా కూడా మృగప్రాయులైన వీళ్ళనుంచి తప్పించుకోవడం కష్టం. అయినా అపరిమితంగా పొరలివచ్చే నా భయం నన్ను ఒదల్లేదు.

"నాతో మీకేం పని?"

డ్రైవర్ ఎటువంటి ఒడిదుడుకులు లేనంత స్థిరంగా స్టీరింగ్ మీద ఉన్నాడు. జీపు వేగంలో మార్పులేదు. నా ప్రశ్న ఎవరినీ కదిలించలేదు. మళ్ళీ అడిగాను రెట్టించి. ఈసారి తలవెనక్కి తిప్పకుండానే పోలీస్ ఇన్‌స్పెక్టర్ ముందు సీట్లోంచి గట్టిగా కసిరాడు. 'ఆ సంగతి కోర్టులో తెలుస్తుంది. 'నోర్మూసుకో'

కోర్టు అన్నమాట వినగానే మొదటిసారి నా భయమంతా ఎడతెగని ఆందోళనగా మారింది. అప్పుడు నాకు, నన్ను పట్టుకున్నది ప్రభుత్వ 'రక్షక భటులనీ', జైళ్ళూ, న్యాయస్థానాలూ, ధర్మశాస్త్రాలూ, లాయర్లూ ఉండే ఒక ప్రపంచంలోకి నేను అడుగు పెట్టాల్సి ఉంటుందనీ తట్టింది. దారితప్పి రాక్షసలోకంలోకి ప్రవేశించిన కథల్లోని కన్యలాగా నేనూను అనిపించింది.

నా భుజాల మీంచి జారి జీపుతోపాటు గాలికి ఎగురుతూన్న నా కొంగుని నా ప్రక్కనున్న కానిస్టేబుల్ చెయ్యి చాసి అందుకుని చుట్టగా చుట్టి నా భుజం మీదికి విసిరాడు. నాకు ఒళ్ళంతా షాక్ తగిలింది. నేనేమీ మాట్లాడలేకపోయాను. నా ఒళ్ళు కుంచించుకుని బరువుగా ముద్దగా కూడగట్టుకుంది. ఆ ఇద్దరు కానిస్టేబుళ్ళ మధ్య నలిగిన ఆ జీపు సీటుమీద, నేను కూచున్నదే అన్ని జైళ్ళకన్నా అతి ఇరుకైన జైలు.

నన్ను తీసుకుపోయి ఒన్ టౌన్ స్టేషన్ లాకప్‌లో పడేసినదాకాగాని, ఆ తర్వాత చాలాసేపటిదాకాకాని ఎవరూ నాతో ఏమీ మాటాడలేదు. నన్ను లాకప్‌లోకి పంపుతూండగా మాత్రం నా హేండ్ బ్యాగ్‌నీ, రిస్ట్‌వాచీని, ముత్యాలదండనీ, ఉంగరాన్నీ స్వాధీనపరచుకున్నారు.

పాడుపడ్డ ఇళ్ళల్లోంచి వచ్చే ఒకలాంటి ముక్కివాసనతో చుట్టూ పోలీస్ స్టేషన్ గోడలు. గోడలకు కింద నుంచి సగంపైదాకా జేగురు రంగు సున్నం. ఇనుప వాసన, లాకప్ రూంకి ఎదురుగా సబ్ ఇన్‌స్పెక్టర్ టేబిల్, కుర్చీ. ఎదురుగా, పక్కగానూ రెండు లాంగ్ బెంచీలు. కుర్చీ పక్క రికార్డ్ బాక్స్ మీద పాడవాటి రిజిస్టర్లు. నాలుగైదు కేసు ఫైళ్ళు. దానిపైన నల్లని కాలికో బైండింగ్ పుస్తకం. (అది ఇండియన్ పీనల్ కోడ్, క్రిమినల్ ప్రొసీజరు కోడ్ పుస్తకాల బైండింగ్ అని తర్వాత తెలిసింది).

ఒక పోలీస్ స్టేషన్ గురించి చిత్రించడానికీ, వర్ణించడానికీ ఏమీ ఉండదు అందులోనూ లాకప్ రూంలోంచి పోలీసు స్టేషన్‌ని చూడడం అనుభవిస్తేనేగాని చెప్పలేని దృశ్యం. కాని లాకప్ రూంలోకి ఎవరైనా ఎందుకు వెళ్ళాలి? ఒక్క క్రూర మృగాన్ని బంధించడానికి మటుకే మనం బోనుల్ని వాడతాం. మనుషుల్ని గదిలో బంధించి తాళం వెయ్యాల్సి రావడం ఎందుకని? నేను ఈ ఇనుప వూచల్ని తప్పించుకోగలుగుతాననా? తప్పించుకోగలిగేవాళ్ళని ఏవీ ఆపలేవు. తప్పించుకోలేనివాళ్ళు తలుపులు లేకపోయినా తప్పించుకోలేరు. కాని నా మొహం మీద అట్లా ఇనపవూచల తలుపు మూసినప్పుడు నేను చాలా దుర్భరమైన అవమానాన్ని పొందినట్లుగా భావించాను. నా వ్యక్తిత్వంలోని అతి ముఖ్యమైన అంశాన్ని నిరాదరించినట్టుగా అనిపించింది. నేను చెప్పేది వినిపించని, నా విలువని చూడలేని ఒక చెవిటి, గుడ్డి రాక్షస మృగం నన్ను అదుపు చెయ్యబోతున్నట్టుగా అనిపించింది.

సాయంకాలం ఆరు గంటలవేళ టీ వచ్చింది. ముందు ఆ టీ తాగకూడదనుకున్నాను. కానీ, భయం వల్లా, ఆందోళన వల్లా కలిగిన అలసట. నాకు టీని పంపడం ద్వారా నాతో మానవీయంగా నా ఎదుటి శక్తులు ప్రవర్తించబోతున్నట్టుగా అర్థం చేసుకున్నాను. వాళ్ళు మానవీయంగా ప్రవర్తిస్తే నేను జరిగినదంతా మర్చిపోగలను. ఒక్క తప్పు వరకూ, అది ఎంత పెద్దదయినా సరే – మనిషి క్షమించగలడు.

టీ తాగాను.

ఉదయం నుంచీ అనేక అరెస్టులు జరిగాయి. నిర్బంధాల్లో ఎక్కువ భాగం టూ టౌన్, త్రీ టౌన్ పరిధిలోనే జరిగాయట. ఇక్కడ మాత్రం ఉదయం నుంచీ అరెస్టయిన వాళ్ళను కొద్దిసేపు నిర్బంధించి వ్యక్తిగత పూచీకత్తుల మీద విడుదల చేసేశారట. సాయంకాలానికి ఎవరూ లేరు. నేను వచ్చిన కొంతసేపటిదాకా రెండో లాకప్‌రూంలో (అది ఉందని నాకు తర్వాత తెలిసింది. బహుశా అది పురుషుల కోసం కావచ్చు) మాటలూ, మధ్య మధ్య దగ్గూ వినిపించాయి ఆ తర్వాత ఏవీ లేవు.

రాత్రి పోలీస్ స్టేషన్‌లో కొట్టుకుంటూ కొట్టుకుంటూ ఫ్లోరోసెంట్ దీపం వెలిగాక గానీ, నేను ఎలాగైనా విడుదల కావాలనీ లేకపోతే రాత్రికి ఇంటికి చేరలేననీ

తట్టలేదు. ఇల్లు! ఈ పాటికి అమ్మా, తమ్ముడూ, చెల్లెలూ ఏం చేస్తూ ఉంటారా అని ఊహించడం మొదలుపెట్టాను.

ఏడు గంటలు కావొస్తుండగా రైటర్ వచ్చాడు. అతనిది యాభై అయిదు ఏళ్ళ పైబడ్డ వయసు. నున్నగా, కొద్దిగా ఒంగి ఉన్నాడు. బట్టతల. వాడిఅయిన చూపు.

'అమ్మాయ్, నువ్వు ఇలా ఊరేగింపులో దిగాల్సింది కాదు. పోనీలే, చిన్నపిల్లవి. తెలియక చేసుంటావు. నువ్వు వ్యక్తిగత పూచీకత్తు రాసి ఇవ్వు. ఇంటికి పంపేస్తాం' అన్నాడు.

అతని మాటల్లో ప్రభుత్వం, దాని సర్వపాలనాంగాలతోనూ రూపు కట్టినంత స్పష్టంగా నాకు మరెక్కడా కనిపించలేదు. అతను నన్ను పట్టుకున్న పోలీసులానే మాట్లాడుతున్నాడు. ఒక ప్రాసిక్యూటర్ లాగా నామీద నేరారోపణ చేస్తున్నాడు. తనే న్యాయమూర్తిగా జడ్జిమెంట్ వినిపిస్తున్నాడు. తనే ఈ వ్యవస్థ కొమ్ముకాచే ఒక వ్యాపారస్థుడిలాగా పూచీకత్తు అడుగుతున్నాడు. తన పౌరుల ప్రవర్తనని తన పిల్లల ప్రవర్తనలాగా శాసించాలని చూసే ఒక పితృ ప్రభువులాగా నన్ను మందలిస్తున్నాడు. అతను పోలీస్ స్టేషన్‌లో రైటరు. అతని చేతిలో కలం వుంది. పీనల్ కోడ్ సెక్షన్లు అతనికి కంఠోపాటం. అతని మీదనే న్యాయదేవత త్రాసు నిలిచివుంది.

కానీ నేను ఇవన్నీ ఆలోచించదలుచుకోలేదు. పిల్లల్ని ఎత్తుకుపోయేవాడి చెర నుంచి ఎంత వేగిరం తప్పించుకొందామా అని పిల్లవాడు ఆలోచించినట్టే ఎలాగైనా ఈ చెర నుంచి బయటపడాలనే అనుకున్నాను. 'అలాగే' అన్నాను రైటర్‌తో. అతను కాగితం తీసుకొస్తానని తన గదివైపు వెళ్లాడు.

అప్పటి నుంచి నిమిష నిమిషం ఎదురుచూస్తూ రెండు గంటలు గడిపాను. ఈపాటికి నాన్న ఇంటికి వచ్చి వుంటాడు. 'సుజాత ఏదీ' అని వెతుక్కొంటాడు. నాకోసం మరి కాసేపట్లో ఇంటికి వెళ్ళి ఈ ఎడ్వెంచర్ గురించి అందరికీ చెప్పి సర్‌ప్రైజ్ చెయ్యాలి.

తొమ్మిదింటికి అన్నం వచ్చింది. కాని ఇప్పుడు నాకు అన్నం తినాలని కాదు ఉన్నది. ఎంత తొందరగా బయటికి వెళ్లిపోతానా అనే ఆతృత. మనసులో ఆలోచనలు సన్నగిల్లుతూ టెన్షన్ పెరుగుతూ వుంది.

అప్పుడు వచ్చాడు రైటర్ సబ్ ఇన్‌స్పెక్టర్ వెనగ్గా మరో ఇద్దరు కానిస్టేబుల్స్‌తో. రైటర్ చేతిలో నా హాండ్‌బాగ్ వుంది. ఎస్.ఐ. చేతిలో ఏవో కాగితాలు. రైటర్ తలుపు దగ్గరగా వచ్చి అన్నాడు:

'చిన్న ప్రాబ్లమ్ వచ్చిందమ్మాయ్! నిన్ను పంపేద్దుం, కానీ నీ హాండ్‌బాగ్‌లో ఒక ఉత్తరం దొరికింది. అది నువ్వు రాసిందే అనుకుంటాను. ఎస్.ఐ.గారు మరి దాన్ని సోదాచేసి చదివారు. అందులో కొంత ప్రమాదకరమైన భాష ఉందిట. మరి నీకూ, కొన్ని ప్రభుత్వ వ్యతిరేక పార్టీలకూ సంబంధం ఉందేమోనని ఆయన అనుమానిస్తున్నారు. అలాంటప్పుడు నిన్ను వదిలేస్తే ఏం ప్రమాదమో అంటున్నారు. నేనంటాను – ఆ అమ్మాయి అలాంటిది కాదు, అమాయకురాలు అని. మరి నువ్వేమంటావు?'

ఆశ్చర్యపోయాన్నేను. ఆపైన కుతకుతా ఉడికిపోయాను. అది నేను యూనివర్సిటీనుంచి ఇంటికి రాకముందు డాక్టర్ సుధాకర్‌కి రాసిన ఉత్తరం. ఇంటికి ఎలాగూ వస్తున్నాను కదా, పోస్టు చెయ్యడం దేనికి, స్వయంగా ఇద్దామనుకుని హాండ్ బాగ్‌లోనే ఉంచేసాను. కాని దానికి కవరుగాని, ఎడ్రస్‌గాని ఏమీలేవు. సంబోధన కూడా 'ప్రియమైన స్నేహితుడికి' అని ఉంటుంది. అంతకన్న ఏమని ఉంటుంది కనుక? అందులో ప్రమాదకరమైన భాష ఏమిటో నాకు బోధపడలేదు. ఆ మాటే అడిగాను.

"ఏమంటావ్?" సబ్ ఇన్‌స్పెక్టర్ మొహంలో మళ్ళీ అదే కర్కశత్వం 'ఈ రాసిందేమిటి?'

కూడబలుక్కుంటూ చదివాడతను... "ఈ వ్యవస్థలో ప్రాబల్యంపట్ల, అధికారం పట్ల అందరికీ రుచి, కనుకనే ప్రభుత్వం ఎప్పుడూ తన చేతి నుంచి వాటి పట్టు విడవాలనుకోదు.

"పూర్వం మనుషులు శ్రమని తమ మధ్య విభజించుకునేవారు. కాని ఇప్పుడు రాజకీయ శక్తులు శ్రమని విభజించి మనుషులకి నిర్దేశించి తాము శ్రమకి అతీతమైన జీవితాన్ని జీవించాలని కోరుకుంటున్నాయి." ఇంతకు మించి చదవలేకపోయాడు. కాని ఇందులో ఏముంది? ఒక సోషియాలజీ విద్యార్థి ఒక యువ సోషియాలజిస్టుకి ఇంతతప్ప ఏమని రాసుకుంటుంది?

"ఇక్కడ నువ్వురాసింది ప్రభుత్వానికి వ్యతిరేకంగా కాదా?" అడిగాడు రైటర్ ప్రాసిక్యూటర్ స్వరంతో. ఆ రాత్రి ఆ ఇనుప వూచల వాసన మధ్య, ఆ పాలిపోయిన వెలుతుర్లో, ఆ ఖాకీ బట్టల నీడలో, కటకటాల లోనులో నేను కోర్టులన్నింటిలోకి నిర్దాక్షిణ్యమైన కోర్టులో నిల్చున్నాను.

ఇది నా వ్యక్తిత్వానికీ, నా ఉద్వేగాలకీ, నా అనుభూతికీ, స్నేహానికీ, నమ్మకాలకీ చెందిన విషయం. ఆ మాటలు నేను రాసింది ఒక వ్యక్తికి, ప్రపంచానికి కాదు. వాటి అర్థాల్నీ, అంతరార్థాల్నీ ప్రశ్నించడానికి వీళ్ళెవరు?

"అది నేను ఎవరికీ వ్యతిరేకంగా రాసిందికాదు. అది నిజానికి మనుషులకి వ్యతిరేకంగా రాసింది కాదు. మనుషుల్ని నడిపిస్తున్న కొన్ని 'ఫోర్సెస్'కి వ్యతిరేకంగా రాసింది."

"నేను చెప్పలేదూ, అదేభాష." సకిలించాడు సబ్ ఇన్‌స్పెక్టర్.

రైటర్ నాకేసి అనునయంతో చూశాడు. "నీ వాళ్ళెవరో చెప్పమ్మా, కబురు చేస్తాం. ఈ ఉత్తరం నువ్వు రాయలేదని చెప్పు."

అత్యాచారి తను అత్యాచారం చెయ్యబోతున్నవాళ్ళ నైతిక విలువల మీదుగా ముందుగా దాడి చేస్తాడని నేను ఎక్కడో చదివాను. ఉత్తరం నేను రాసింది కాదనడం నాకు. నిజంగా సాధ్యమా?

నా నీతిని కోల్పోలేకపోయాన్నేను.

"అనుభవించు."

జడ్జిమెంట్ ఇచ్చి వెళ్ళిపోయాడు రైటర్.

అతను ఆ రాత్రి తన ఛాంబర్‌లోకి వెళ్ళిపోతూ నాకు విధించిన శిక్ష ఏమిటి?

సాయంకాలపు సందడి పట్టణంలో, దీపాలు వెలిగాయి. సినిమా హాళ్ళ దగ్గర హడావిడి. తొలి వేసవి సాయం సంధ్య మాధుర్యమంతా గాలుల్లో, ముసురుకున్న చీకట్లలో అల్లుకుంది. జన సమ్మర్దంలోంచి మల్లెలు మత్తెక్కించే గాలుల్తో ఆహ్వానిస్తున్నాయి.

'ప్రొగ్రెసివ్ ఫోరం' మీటింగ్‌కి వెళ్ళాలనిపించలేదు. ఎందుకో వాళ్ళతో కూల్'గానో 'ఎమోషనల్' గానో ఏదయినా 'డిస్కస్' చెయ్యడమో, 'అర్గ్యూ' చెయ్యడమో సాధ్యమనిపించలేదు. వూరికి దూరంగా నడవడం మొదలుపెట్టాను.

ప్రొగ్రెసివ్ ఫోరం వాళ్ళు అరంటే ఖచ్చితంగా ఆరింటికే మీటింగ్ మొదలు పెట్టేస్తారు. వాళ్ళు మీటింగ్ విషయంలో పాత అలవాట్లని చాలా కావాలని ఒదిలేశారు. కాని కొత్త అలవాట్లని కావాలని ప్రవేశపెట్టుకున్నారు. ఇవాళ 'ఇష్టాగోష్ఠి.' సంఘానికి బహుశా ఇద్దరు ముగ్గురు కొత్త సభ్యులు చేరి ఉంటారు. వాళ్లు అప్పటికే నావంక క్యూరియస్‌గా చూస్తుంటారు. కార్యదర్శి వాళ్ళకు పరిచయం చేస్తాడు. "ఈమె...." వాళ్ళు తలాడిస్తారు. 'అవునవును, అప్పుడు పేపర్లో చదివాం' 'అవునూ, ఇప్పుడు ఇంతకీ ఏం చేస్తున్నారూ?' కార్యదర్శి దగ్గర ఇంక ఏమీ సమాధానం ఉండదు. అతను ఏమని చెప్పగలడు? 'ఆ తరువాత ఈమె చదువు మానేసి ఇంట్లో ఉండిపోయింది' అనగలడా? కాని వాస్తవానికి జరిగింది అదేనే. లేక 'మా అందరి మధ్యా మసలుతూ మాకు ఇన్‌స్పైరింగ్‌గా ఉందని' (కొందరు అలా అంటుంటారు) అనగలడా? నాలో ఇన్‌స్పైర్ చేసేది ఏముంది? నాకు కలిగిన గాయమా? జరిగిన అవమానమా?

నా చుట్టూ ఉన్న ప్రపంచంలో మనుషులంతా కుల, మత, వర్గ రహితంగా సుఖ జీవితంకోసం, ఆరోగ్యవంతమైన పుష్టికరమైన సౌఖ్యదాయకమయిన జీవితం కోసం, సౌకర్యాల కోసం అహర్నిశలూ తపిస్తూ, ప్రయత్నపడుతూ ఉన్నారు. గాయపడ్డవాళ్ళనుంచీ, అవమానితులనుంచీ, రోగగ్రస్తులనుంచీ వాళ్ళు ఏదన్నా నిజంగా ఉత్తేజం పొందగలరా? కాని ఆరోగ్యవంతమైన జీవితంపట్ల వాళ్ళకున్న ఆరాటాన్ని, అది ఎంత పోటీతో, కుళ్ళుతో, యుద్ధంతో కూడుకున్నదైనాసరే, ఎలా నిరసించను? పోనీ 'ఈమె జీవితంలో ఎంత కష్టం అనుభవించి కూడా నిశ్చలంగా ఉన్నది' అంటే వినడానికి ఎంత బాగున్నా నిజంగా అది నిజమా? నేను చలించకుండా ఉన్నానా?

ఆ రాత్రి పది గంటలు దాటిన తరువాత స్టేషన్‌లో దీపాలు ఒక్కొక్కటే ఆరిపోయాయి. మగతగా, అలసటగా ఆ గచ్చుమీద అలాగే కళ్ళు మూసుకుని ఉన్నాను నేను. ఇంతలో ఇనుప గొళ్ళేలు ఒదులయిన చప్పుడు, చప్పుడు చేస్తున్న బూట్లతో ఆ చీకట్లో ఒక ఆకారం నా మీదకి వచ్చి పడింది. కంపించిపోయాన్నేను. అరవనీకుండా నా నోటికి అడ్డుగా ఉప్పని అరచేతులు.

'చచ్చిపోతావే, నీకు బతకాలని లేదే?'

గుప్పున సారా కంపు, నిప్పు సెగలాగా,

ఆ చేతులు ముందు నా జుట్టుని పట్టుకున్నాయి. జడ ఊడిపోయి నా జుట్టు ముఖమంతా కప్పి మరీ చీకటయింది. ఆపైన ఆ చేతులు నా ఒంటిమీద

తడుములాడాయి. నెమ్మదిగా ఒంటిమీద బట్టల్ని ఊడ్చివెయ్యడం మొదలుపెట్టాయి.

ఒక మనిషి మీద విధించబడ్డ ఏ నిర్బంధమయినా వాస్తవ రూపంలో అతని శరీరం మీద నిర్బంధమే. ఒక మనిషిపట్ల ఉన్న ఏ అసంతృప్తి అయినా, కసి అయినా, జాలి అయినా, అన్నీ వాస్తవ రూపంలో అతని శరీరంపట్ల సంవేదనలేనని నన్ను నిర్బంధించినప్పుడు ఎందుకు గ్రహించలేకపోయాను?

ఆ రాత్రి నాశరీరం మీద జరిగింది నిజంగా ఘాతుకం. ఒకటి వెనుక ఒకటి ఆ పోలీసు మృగాలు నా శరీరాన్ని ధ్వంసం చేసేశాయి. నాకు ఉచ్చపోసుకోవడానికి కూడా వీలు చిక్కనివ్వలేదు. నెమ్మదిగా తెరుకునేటప్పటికి నాకు తెలీకుండానే అక్కడ రక్తం స్రవిస్తోంది.

అనేక దినాలపాటు, రాత్రులపాటు, ఆ తరువాత, ఆ సంఘటన గురించి ఆలోచించాను. వాళ్లు నాపట్ల జరిపిన ఆ అత్యాచారంలో ఉన్న అసలు కారణం ఏది? ఎంత పైశాచికమయినా ఒట్టి గుడ్డి పాశవిక కాంక్ష ఒక్కటే కారణం కాదనిపించింది. ఒక మగవాడి మీద నిర్బంధం బహుశా శారీరక చిత్రహింసదాకా పర్యవసిస్తుంది. అదే ఒక స్త్రీ అయితే అది అత్యాచారందాకా కొనసాగుతుంది. ఆ అత్యాచారాన్ని నేను కాముకులైన ఘాతుకంగా మటుకే చూడలేకపోతున్నాను. అది తీవ్రాతితీవ్రమయిన నిర్బంధం. దారుణమైన శారీరక చిత్రహింసానూ. నా మీద అత్యాచారం చేసింది మనుషులే. వాళ్ళు పోలీసులే కనుక వాళ్ళకా వీలు చిక్కడం అన్నది తరువాత సంగతి.

ఎంత జంతువునయినా రెండు తప్పులవరకు క్షమించగలం. నన్ను నిర్బంధించినందుకు, నా మీద అత్యాచారం జరిపినందుకూ కూడా నేను పూర్తిగా నశించలేదు. కాని రెండవరోజు మధ్యాహ్నం సర్కిల్ ఇన్‌స్పెక్టర్ నన్ను చూడడానికి వచ్చాడు. 'ఎవరో నీ గురించి 'హెబియస్ కార్పస్' ఫైల్ చేశారని తెలిసింది. నీకు చాలా అండదండలున్నాయన్నమాట!' అన్నాడు. అప్పుడే నాగురించి బయట ప్రయత్నాలు జరుగుతున్నాయని తెలుసుకున్నాను. వాళ్ళు నన్ను స్టేషన్‌నుంచి స్టేషన్‌కు మార్చారు. చివరికి బయట ఒత్తిడికి తట్టుకోలేక సెక్షన్ 120 కింద నేరారోపణ చేసి మేజిస్ట్రేట్ ముందు హాజరుపర్చారు. వాళ్ళకున్న ఏకైక ఆధారం నేను రాసిన పోస్టు చెయ్యని ఉత్తరం. మేజిస్ట్రేట్ నాకు రెండు వారాల రిమాండ్ విధించాడు. నన్ను సెంట్రల్ జైలుకు పంపారు.

అరెస్టు చేసినది మునిసిపల్ ఇంజనీర్‌గారి అమ్మాయి అని తెలిసాక మునిసిపల్ ఛైర్మన్ ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నాడు. ఆయన పెద్ద ఎత్తున జిల్లా రాజకీయ వర్గాలతో కలిసి హోం మినిష్టర్ మీద ఒత్తిడి తీసుకొచ్చాడు. బయట 'ప్రొగ్రెసివ్ ఫోరం' వాళ్ళకృషి వల్ల ప్రజలు, పత్రికలు, పౌరహక్కుల సంఘాలు పెద్ద ఉద్యమం చేపట్టాయి. ఈ సంఘటనకు కారకులయిన పోలీసుల్ని సస్పెండ్ చేశారు. పది రోజుల తరువాత నాన్న నన్ను బెయిల్ మీద విడిపించడానికి జైలుకు వచ్చాడు. ఆ రోజు ఆయన్ని చూడడం నిజంగా ఒక అనుభవం. ఆయన నన్ను అసహ్యించుకుంటాడనుకున్నాను. ఆయన నాపట్ల ఎలాంటి భావాన్ని వ్యక్తం చెయ్యలేదు.

బహుశా, ఏక్సిడెంట్ జరిగింది, చెయ్యి పోయింది. చాలా ముఖ్యమైన భాగంకాని ఏం చెయ్యగలం? ప్రాణాల్తో బతికేం కదా! చాలు.

తర్వాత నేను ఎప్పటిలా యూనివర్సిటీలో చదువుకోవాలని ప్రయత్నించాను. సాధ్యంకాలేదు. ఎవరో నన్ను హేళనగా చూస్తున్నారనీ, సానుభూతి కురిపిస్తున్నారనీ కాదు. ఒకరి సానుభూతికానీ, ఒకరి ద్వేషంకానీ నిజంగా నన్ను కదిలించలేవు ఇప్పుడు. "ఇంతకీ ఆ ఉత్తరం ఎవరికి రాశావు?" అని అడిగాడు డాక్టర్ సుధాకర్ నన్ను చూడడానికి వచ్చినప్పుడు.

..బాగా చీకటి పడింది. ఎక్కడయినా పార్క్‌లో కూచుంటే బాగుణ్ణు అన్పించింది. 'ప్రోగ్రెసివ్ ఫోరం' మీటింగ్ ఈపాటికి ముగింపుకి వచ్చివుంటుంది.

నా అనంతర జీవితం ఎలా వుండాలి? ఈ ప్రశ్న ఏదో ఒకమూల బాధ పెడుతూనే ఉంది. యూనివర్సిటీలో చదువుకుంటున్నప్పుడు 'నా అనంతర జీవితం ఎలా ఉండాలి?' అని ఎవరూ భావించలేరు. బహుశా అమ్మా, నాన్నా, ఒకరిద్దరూ తప్ప. కాని అప్పుడేనా వారు బహుశా నా పెళ్ళివరకూ ఆలోచించి ఉంటారు. ఆ తర్వాతేనా 'నా అనంతర జీవితం ఎలా ఉండాలి?' అని ఎవరు ఆలోచిస్తారు? నా భర్త కూడా ఆలోచించడు. ఆ ప్రశ్న అతనికి అనవసరమైనదిగా ఉంటుంది.

'ప్రోగ్రెసివ్ ఫోరం' వాళ్ళు కూడా ఈ విషయాన్నే ఇవాళ అనేక విధాలుగా చర్చించి ఉంటారు. బహుశా నా పరోక్షంలో చర్చించే ఉంటారు. నేను ఇప్పుడు అందరిలాగా మామూలు జీవితానికి అర్హురాల్ని కాదనే చాలామంది నమ్మకం. అలాగని 'మామూలు జీవితానికి నేను మటుకు ఎందుకు అర్హురాలిని కాకూడదు?" అని వాదిస్తారు. అయినప్పటికీ నేను ఎలాగయినా ఇకనుంచీ నా అనుభవాల ఆధారంగా 'వేరే జీవితం' కోసం 'కృషి' చేస్తే బాగుంటుందని సూచిస్తారు.

'ప్రోగ్రెసివ్ ఫోరం' వాళ్ళని నేను ఇష్టపడతాను. ఈ సమాజంలో నాకున్న ఆత్మీయులు వాళ్ళే. నా అనుభవాన్ని సీరియస్‌గా తీసుకునేదీ వాళ్ళే. మంచి జీవితంకోసం వాళ్ళ ప్రయత్నం నన్నెప్పుడూ ముగ్ధురాల్ని చేస్తుంది. కాని నాపైన జరిగిన అత్యాచారం 'నాపైన' మటుకే జరిగిన అత్యాచారంగా వాళ్ళు భావిస్తారు. అది నా ఒక్కర్తిపైనే జరిగిందా? కాదు. అది నీమీదా, నామీదా, ప్రతిఒక్కరి ఆశల మీదా, ఆకాంక్షలమీదా, స్వేచ్ఛమీదా, ఆనందంమీదా, స్వప్నాలమీదా జరిగింది. అది పోలీసుల వల్లనే జరిగిందా? ఎదుటి మనిషి జీవితాన్ని శాసించాలని చూసే ప్రతి ఒకళ్ళవల్లా జరిగింది.

అలాగని వాళ్ళు తమ జీవితానందాల్నీ, వ్యక్తిగత సౌకర్యాల్నీ ఒదులుకోవాలని కోరుకుంటున్నానా? లేక నేనేదో అట్లాంటి జీవితాన్ని కోల్పోయానని చింతిస్తున్నానా? మనుషులు కోరుకునే సుఖమయమైన జీవితం ఎలాంటిదో నేను రోజూ మా తమ్ముడి మరదలి విషయంలో చూస్తూనే ఉన్నాను.....

ఇంటికి చేరేసరికి బాగా చీకటి పడింది. పెళ్ళివారు వెళ్లిపోయినట్టున్నారు. ఎవరినీ పలకరించకుండా మేడమీదకు వెళ్ళిపోయాను. చెల్లెలిని చదువు మాన్పించయినా సరే, పెళ్లి చేసెయ్యాలని నాన్న పట్టుదల. ఇందుకోసం ఆయన ఎంత ఖర్చుకైనా వెనుదీసేట్టులేడు.

అమ్మ ఏమనుకుందో గాని రాత్రి భోజనం మేడమీదకే తీసుకువచ్చింది. ప్రాపంచిక

విలువల్లో పీకలదాకా కూరుకుని ఉన్న మనిషి ఆమె. కాని తన పెద్ద కూతురిని చూసేటప్పటికి విలువలకి అతీతమైన ప్రేమ పొంగుతుంది ఆమెలో.

నేను ఉదయం నుంచీ అణుచుకున్న టెన్షన్‌ని భరించలేకపోయాను. సుభద్ర జీవితం భద్రంగా ఉండడంకన్నా నాకు కావలసిందేముంది?

'పెళ్ళివారు నా గురించి ఏమన్నా అడిగారా అమ్మా?'

అమ్మ నాకేసి కళ్ళెత్తి ఆశ్చర్యంగా చూసింది. ఆపైన బాధని అణచుకోలేకపోయింది. కొంతసేపు ఏడ్చింది. ఆపైన నెమ్మదిగా అంది: "ముందు ఏమీ ప్రస్తావించలేదు. చివరలో పెళ్ళికొడుకు తండ్రి అన్నాడు మీ నాన్నగారితోటి, 'పెద్దమ్మాయి గురించి మేం విన్నాం. జరిగిందానికి మనం ఏం చేయగలం? మీరు విచారపడకండి. అది మన దురదృష్టం అంతే. ఇంతకీ అమ్మాయి కనిపించదేం' అని అడిగాడు."

"మీకు కన్పించలేక సాయంకాలం బయటికి ఎక్కడికో వెళ్ళింది అన్నారు మీ నాన్నగారు. 'అయ్యో అదేమిటి! లేచిపోయిన మనిషా ఏమిటి, తప్పించుకు తిరగడానికి' అన్నాడు అతగాడి తండ్రి."

"లేచిపోయిన మనిషి" విలువల స్వరూపం నాకు బాగా బోధపడ్డట్టు అయింది. అమ్మ వెళ్ళిపోతూండగా అడిగాను. "కట్నం ఏమాత్రం అడిగారు?"

"ఇదివరకటి మాటలే అనుకో. అయితే, బహుశా మరో పదివేలు ఎక్కువడుగుతారేమో అంటున్నారు ఆయన."

రాత్రి పడుకోబోయేముందు చాలా కాలం క్రితం నేను చూసిన దృశ్యం ఒకటి గుర్తొచ్చింది. ఒక రోజు నేను రిక్షాలో కాలేజి నుంచి వస్తున్నాను. రైలు గేటు పడింది. అటూ ఇటూ చాలా వాహనాలు ఆగిపోయి ఉన్నాయి. గేటు చాలాసేపటినుంచీ వేసి ఉంది. మేం ఆగిన ఎంతోసేపటికిగానీ రైలు రాలేదు. విసుగుతో, అసహనంతో ఉన్న నాకు రైలు గేటు ఇవతల కమ్మీల మీద కొంతమంది చిన్న పిల్లలు కూచుని కనబడ్డారు. అప్పుడు నేను వాళ్ళనంత పట్టించుకోలేదు. ఇంతలో ఇనుప నాగరికతా మహాయుగాల ప్రతినిధిగా చప్పుడు చేసుకుంటూ విపరీతమైన వేగంతో గూడ్సురైలు నా కళ్ళముందు పట్టాల మీద సాగిపోయింది. దాని అదురుకి భూమి దద్దరిల్లుతూనే ఉంది. అప్పుడు చూశాను. పిల్లలు ఆ రైలుకి చేతులెత్తి వీడ్కోలు చెప్తున్నారు. రైలు వెళ్ళిపోగానే, వాళ్ళు అందుకోసమే అప్పటిదాకా ఆగినట్టుగా లేచి వెళ్ళిపోయారు. అటూ ఇటూ వాహనాలు ముందుకు కదిలాయి.

ఆ దృశ్యంలో నన్ను ఏది ఆకర్షించిందో నాకు తెలియదు. కాని, కనీసం ఈ క్షణాన 'నా అనంతర జీవితం ఎలా?' అన్న నా ప్రశ్న హాస్యాస్పదంగా అన్పించింది.

● *ఆంధ్రజ్యోతి వారపత్రిక – 12 జనవరి 1990* ●

★ ★ ★

64

సి. సుజాత

# స్మైల్స్ ఫర్ సేల్

"దిసీజ్ సూటబుల్ ఫర్ యు."

"ఎస్, సార్!" అన్నది రేవతి చిరునవ్వుతో. లోలోపల నుంచి గందరగోళం. రేగుతోంది.

ఇది నాకు సూటబుల్ జాబా? నువ్విచ్చే వెయ్యి రూపాయల కోసం ఎంత మంది వెధవల కోసం నవ్వాల్లా నేను? ఎన్నిసార్లు 'ఎస్ సార్', 'థాంక్స్ సార్' అని అబద్ధాలు చెప్పాలి? నేను చేయని తప్పుకు 'సారీ సార్' అని ఎంత అణకువ చూపించాలి? నథింగ్ డూయింగ్....నువ్వు చెప్పినట్లు చేయనుగాక చేయను.

రేవతి ఫైల్ చేతిలోకి తీసుకుంది.

"రేపు మార్నింగ్.... సెవెన్‌కే ఎటెండ్ అవుతాను సార్! ఆ విషయం నాకు వదిలేయండి. వాళ్ళని రిసీవ్ చేసుకుని హోటల్ 'వంశీ'కి డైరెక్ట్ చేయాలి. అంతేకదా!"

"అంతేకదా అనుకోకు! ఇది మనకు చాలా ముఖ్యం. నువ్వు వాళ్ళనెలా ఇంప్రెస్ చేస్తావో నాకు తెలియదు. రేపు సిట్టింగ్‌లో వాళ్ళు మన ప్రపోజల్‌కి నో అనకూడదు."

రేవతి మళ్ళీ నవ్వింది.

"ఓకే సార్! ఐ కెన్ డూ మై బెస్ట్."

మళ్ళీ లోపల నుంచి గందరగోళం...

"ఎలా ఇంప్రెస్ చేస్తానా, వాడి పక్కలో పడుకుంటాన్రా రాస్కెల్! మొహానికి పూసుకుంటే వున్న అందం పోయి నల్లమచ్చలొచ్చేసే ప్రోడక్టును మార్కెట్‌లోకి వదిలావు. మినప్పిండి మరపట్టించి ఫేస్‌పాక్‌ని చేశావు. వచ్చేవాళ్ళ నెత్తిన అదంతా రుద్దితే నీకు లక్షలొస్తాయి. మధ్యలో నాకేమిట్రా ఈ ఇంప్రెస్ చేసే శిక్ష..."

"అన్నట్లు, ఆ అడ్వర్‌టైజ్‌మెంట్ ఆఫీసర్‌కి ఫోన్ చెయ్యి. ఉదయం కలుస్తానన్నాడు."

"ఎస్ సార్. ఒక్క నిమిషంలో కాంటాక్టు చేస్తాను." రేవతి నవ్వుమొహంతో పొందికగా నడిచివచ్చి సీట్లో కూర్చుంది. నడకలో విసుగు, విసురు వుంటే అద్దంలోంచి వాడు కనిపెట్టేస్తాడు.

ఫోన్ తీసి మళ్ళీ అదే గొంతుతో "దిసీజ్ రావ్స్ అండ్ రావ్స్ కంపెనీ. రేవతీ స్పీకింగ్. కృష్ణన్ ఉన్నారా?"

"ఓ మేడమ్ రేవతీ! వాటే గుడ్ డే! నీ గురించే అనుకుంటున్నాను. మీరు ఫోన్ చేశారు. చెప్పండి. వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ?"

యాడ్ డమ్మీ చూపించే నెపంతో తన చేయి మీద వేసిన వాడి చేయి గుర్తు వచ్చింది రేవతికి, ఆ వెంట్రుకలున్న మొరటు చేయి తన భుజం తాకటం, పొర పాట్న తగిలినట్లు మోచేత్తో రొమ్ము తాకటం - మళ్లీ మనసులో అలజడి. "నాకు బాడ్ డే. నీతో మాట్లాడటమే ఎలర్జీగా వుంటే పైగా నీ సాయం ఒకటి కావాలా నాకు.."

"అదే, మిస్టర్ శంకర్ మీ కోసం అడిగారు. అవును, ఈ రోజు మా యాడ్ వస్తోందా? ఆయన మీతో మాట్లాడతారు. ఒక్క నిమిషం ఉండండి...."

"ఉండు....ఉండు. ఆయనతో నేను మాట్లాడతాలే కానీ, ఏమిటి కబుర్లు.... సాయంత్రం ఏమిటి నీ ప్రోగ్రాం?"

"ఏముందీ, మామూలే. ఇంటికి పోవటం, వండుకోవటం, తిని చదువుకుంటూ పడుకోవటం..."

"అబ్బ! ఎంత కలర్ ఫుల్ లైఫ్. టెన్షన్స్ లేకుండా చదువుకుంటూ...."

మళ్ళీ రేవతి నవ్వింది.

"సాయంత్రం ఫ్లూటిస్ట్ చౌరసియా ప్రోగ్రాం వుంది. నాకు వి.ఐ.పి పాస్ వచ్చింది. మీకు ఇంటరెస్ట్ ఉందా..."

మనసు ఒక్క నిమిషం గాల్లో తేలింది. వేణుగానంలో తేలిపోదాం అన్న ఫీలింగ్ వచ్చింది. కానీ పక్కనే కృష్ణన్‌గాడు, వాడి బొచ్చు చెయ్యి....అంతకంటే కిరోసిన్ కంపుకొడుతున్న రూమ్‌లో వంటొండుకోవటం బెటర్.

"సారీ సర్...నాకు ఆఫీస్ వర్క్ వుంది. సార్ నన్ను వేరే చోటికి వెళ్లి రమ్మన్నారు. ఉండండి, సార్‌తో మాట్లాడండి...." మరో మాటకు అవకాశం ఇవ్వకుండా కనెక్షన్ ఇచ్చేసింది రేవతి.

క్షణం తీరికలేకుండా వరదలా ఫోన్లు.... అవును సార్.... ఎస్ సర్ - నో సర్....

"మేడమ్ ఇది రావ్స్ అండ్ రావ్స్...కదా? మీ "స్వీట్ సిక్స్‌టీన్" ఫేషియల్ గురించి బస్టాండ్‌లో టి.వి.లో చూశానండి. అప్పటినుంచి వాడుతున్నా మొహంలో స్మూత్‌నెస్ ఏదీ కనపడలేదండీ!"

రేవతి రాబోయిన నవ్వు ఆపుకుంటూ....

"ఎలా వాడుతున్నారు మేడమ్! వారానికి ఒకసారా? అబ్బెబ్బే, అలాకాదండి. బెటర్ రిజల్ట్స్ కోసం రోజుకి ఒక్కసారి ఫేస్ పాక్ వేసుకోండి."

"ఫరవాలేదంటారా?" ఆశా నిరాశల మధ్య ఊగిసలాడే గొంతు.

మళ్లీ నవ్వేసింది రేవతి. ఈవిడ ప్రతి పూటా ఈ మినప్పిండి పట్టించుకొని అందంగా అయిపోతానని ఊహించటం...

"నో ప్రాబ్లమ్ మేడమ్! మేం హామీ ఇస్తాం."

రేవతి మళ్ళీ ఎం.డి.కి కనెక్షన్ ఇచ్చి "సార్! మన యాడ్‌కి మంచి రెస్పాన్స్ వచ్చింది సార్! ఉదయం నుంచి చాలా ఫోన్ కాల్స్ వచ్చాయి" అంది.

"అబద్ధం. ఒక్కటంటే ఒక్కటి-ఎవరో పిచ్చిపీనుగు...." మనసు నోరు నొక్కింది రేవతి.

ఎం.డి. ఆనందపు నవ్వు నవ్వాడు. జనాన్ని పిచ్చి వెధవలను చేసాను కదా అనే నవ్వు. ఎదుటివాడి అమాయకత్వం మనకి డబ్బు రూపంలో ఉపయోగపడుతోంది కదా అని నవ్వు.

"యు ఆర్ సో ఎఫిషియంట్ రేవతీ! యువర్ ఫేస్ ఈజ్ సూటబుల్ ఫర్ అవర్ ప్రోడక్ట్."

"థాంక్యూ సార్!"

ఆ రోజు ఆ యాడ్ తీసేటప్పుడు ఆ ఫేస్‌పాక్ పూసుకున్నాక అట్లపిండి మొహం మీద అతుక్కుపోయిన ఫీలింగ్, అది కడిగేయగానే వచ్చిన ఆపుకోలేని నవ్వు ఆ యాడ్‌కి లైఫ్. అట్లపిండి గుర్తు రావటం, వెంటనే నవ్వు రావటం, నవ్వు ఆపుకోలేక బుగ్గలు, చెవులు ఎర్రబడిపోయి యాడ్ బ్రహ్మాండగా వచ్చింది. "ఇది స్వీట్ సిక్స్‌టీన్ ప్రభావం" అని యాడ్‌లో తను కులికిన కులుకు, కనురెప్ప లార్పుతూ వళ్ళంతా కదిలిస్తూ జనంమీద వేసిన సమ్మోహనాస్త్రం. 'మొహం మీద రాసుకునే సుద్దకి వళ్ళంతా వణికిస్తూ భుజాలు పొట్ట చూపించటం ఎందుకురా చెవల వెధవా?' అని ఒక్కరూ అడగరేం? మొహం మీద నవ్వు కరిగిపోయేంత ఉక్రోషం వచ్చిన సమయంలో సూర్యకళ లైన్లో కొచ్చింది.

"ఒసే రేవతీ!' నా ఉద్యోగం పోయిందే" అంది రొప్పుకుంటూ.

రేవతి గుండె జల్లుమంది.

"ఎందుకే?" అంది ఆదుర్దాగా

"నా మొహం ఉద్యోగం, ఎవడో కంప్లయింట్ ఇచ్చాడు."

"ఏమిట్టా విషయం?"

"ఇరవై తొమ్మిదో ఛానల్‌లో మీకు నచ్చే ప్రోగ్రామ్ ఏమిటి? అన్న సర్వే కంట్రాక్ట్ ఒకటి మా మేనేజర్ తీసుకున్నాడు. ఒక్కొక్కళ్ళకి వెయ్యి కాల్స్, రోజుకు ముప్ఫయిరూపాయలు. రోజుకి వెయ్యి ఇళ్ళు తిరిగి పకడ్బందీగా ఇంటర్వ్యూ చేయటం సాధ్యమా? ఊరికే పేర్లు వ్రాసుకొని ఛానల్ చూస్తున్నారా లేదా అని అడిగి మిగతావన్నీ పాజిటివ్ సమాధానాలు. టిక్కులు పెట్టటం-అవన్నీ సబ్మిట్ చేశాం కదా! ఎవడో ఒకడు ఫోన్ కొట్టాడు డీటైల్స్ సరిగ్గా అడగలేదని."

"ఎవడే వాడు?"

"అప్సరా ఎపార్ట్‌మెంట్సులో జండా కొయ్యగాడొకడు తగిలాడు. మనం ప్రశ్నలడిగితే వాడు నటించి చూపెడతాడు. కూల్‌డ్రింక్ త్రాగమన్నాడు. సరదాగా మూవీ చూద్దాం, కాసేపు రండి అని ఆహ్వానించాడు. ఎక్కడ ఛస్తాం. నీ పని చూసుకో బాబూ అని వాడిని ఏం అడగకుండా వచ్చేసా. వాడు తిరిగ్గా ఫోన్ చేసి.... 'మీ డబ్బుతిని

ఆడవాళ్ళంతా ఎక్కడో వీధి అరుగులమీద కూర్చుని టెక్కులు పెట్టుకుంటున్నారు. సర్వే లేదు' పాడూ లేదు అని చెప్పాట్ట. మేనేజరు తిట్లు."

"మేనేజరేమిటే కొత్తగా....చంద్రం కాదా?"

"ఇప్పుడు చంద్రం కాదే: అతను ప్రమోషన్‌మీద వైజాగ్ వెళుతున్న స్పెషల్ ఆఫీసర్. ఇన్నాళ్ళ స్నేహానికి సారీ చెప్పి, తనకు కెరీర్ ముఖ్యం అన్నాడు. బిగినర్ అట తను. ఇప్పుడీ వయసులో అమ్మాయిల స్నేహంతో కెరీర్ పాడుచేసుకుంటే ఫ్యూచర్ ఉండదట."

రేవతి పళ్ళు కొరుక్కుంది. "మరి ఇన్నాళ్ళ నుంచి ఏమయిందట ఆ జ్ఞానం? నీతో షికార్లు కొట్టినప్పుడు, రూమ్‌కి రమ్మన్నప్పుడు కెరీర్ గుర్తు రాలేదా?"

"మనకి ఉక్రోషాలు కుదరవే బాబూ! నమ్మటం తప్పుకదా? చనువివ్వటం తప్పు కదా? ఎం.డి. ముందు పిలిచి ఛడామడా తిట్టి ఉద్యోగంలోంచి తీసేశాడు. తరువాత బుద్ధిగా వుంటే పనిచేసుకోవచ్చునని అభిమానం చూపించి విషయం చెప్పేశాడు. నన్ను మనసు రాయి చేసుకోమన్నాడు."

"ఇప్పుడెలాగే..."

"ఎలాగేమిటే, నేనింటికి పోతున్నా. నువ్వు కూడా పెందరాళే రా." ఫోన్ పెట్టేసింది సూర్యకళ.

ఉసూరుమంది రేవతి.

ఎదురుగా అద్దాల్లోంచి రివాల్వింగ్ ఛెయిర్‌లో వెనక్కి వాలి అటు ఇటు కదులుతూ మాట్లాడుతున్న ఎం.డి. శంకర్ కనిపిస్తున్నాడు. ఎంత ఆనందం, ఎంత నిశ్చింత ఆ మొహంలో. ఆ కూర్చోవటంలో ఎంత దర్జా. ఆ మొహంలో ఏ గొప్పా కనిపించదు. వెయ్యిమందిలో ఒక మామూలు, ప్రత్యేకతలేని ముఖం. కానీ ఆ కళ్ళల్లో ఇతరులని శాసించగలిగే అధికారం. డబ్బుకి ఇంత శక్తి ఎలా వుంది...

రేవతి వణికింది.

మళ్ళీ ఫోను మోగింది. "లుక్ రేవతీ! లంచ్ తీసుకున్నాక నువ్వు కిషోర్‌కి హెల్పు చెయ్యి. నీ ప్లేస్‌లోకి ఉమని రమ్మను."

రేవతి పళ్ళు కొరుక్కుంది.

ఎకౌంట్సు చెక్ చేసేందుకు కిషోర్ వస్తాడు. ఆ వేళకి తను అక్కడ వుంటే కిషోర్ గంటల తరబడి ఉండిపోతాడు. ఉమ పెద్దావిడ. ఆవిడతో కిషోర్ ఎంతసేపు మాట్లాడతాడు? వాడు పని ఎగ్గొట్టకుండా చేసే ఎత్తు ఇది. వాడికి కబుర్లు చెప్పి పని చేయించి....అదీ ప్లాను. ఓరి నీ బుర్ర వక్కలైపోనూ....

లంచ్‌బాక్సు తీసి చల్లారిపోయిన అన్నం, బీరకాయకూర చచ్చినట్లు తిని, మొహం కడుక్కుని మళ్ళీ కొత్త నాటకానికి వేషం వేసుకుని,

"హల్లో కిషోర్!" అంది.

"ఓ రేవతీ....వాట్ సర్‌ప్రయిజ్! నీతో కలిసి పనిచేయవలసి వస్తోందని తెలిస్తే ఉదయమే హాజరైపోయేవాడిని. లెటజ్ సెలబ్రేట్ విత్ కాఫీ."

"ఓ.కె. థాంక్స్! ఇప్పుడే హెవీగా లంచ్ తీసుకున్నా."

"అరె, నేను మిస్సయ్యానన్నమాట! నాకు తెలియక అడుగుతా, ఇంత నాజూగ్గా ఉండటానికి ఏం తీసుకుంటారు మేడమ్. ఓన్లీ జ్యూస్..."

'నా జన్మకి ఎరగను....' అనబోయి మళ్ళీ అదే నవ్వు.

కళ్ళు మాటి మాటికి గడియారం వైపుకు పరుగెడుతుంటే, ఎప్పుడయిపోతుందా ఈ లెక్కల వర్క్ అని మనసు క్షోభ పెడుతుంటే 'విత్ ప్లెజర్'... 'ఓ ఐసీ' అనటం ఎంత కష్టం....ఎంత కష్టం...

☆ ☆ ☆

రూం తాళం తీసే వుంది. అమ్మయ్య సూర్యం వచ్చేసింది అనుకుంది రేవతి.

కనీసం లైటన్నా వేసుకోకుండా మంచమ్మీద అడ్డంగా పడుకుని వుంది సూర్యకళ.

"ఏమిటే సూరిపండు, అంతా గందరగోళంగా వుంది. చంద్రం అలా మాట్లాడటమేమిటి?"

సూర్యకళ విసురుగా లేచి కూర్చుంది.

జుట్టు చిందరవందరై, కళ్ళు ఎర్రబారిపోయి ఏదో కొత్త మనిషిలా ఉంది సూర్యకళ.

'నిన్నిలా వదిలేసి వెళ్ళిపోవటం ఏవిటే?' అన్నది రేవతి.

పెద్దగా నవ్వింది సూర్యకళ. రేవతి బిక్కచచ్చి చూస్తూ ఉండిపోయింది. సూర్యం మంచంమీద లేచి కూర్చుంది.

కళ్ళు గట్టిగా తుడుచుకుని, చెదిరిపోయిన జుట్టుని రబ్బర్ బ్యాండ్‌తో సరి చేసుకుంది.

'నీకో కథ చెప్పనా రేవతీ?' అన్నది. రేవతి సమాధానం ఇచ్చేలోగానే....

"ఓ పురుగుంది రేవతీ! ఈ సృష్టిలో సకల చరాచర జీవులకి ఓ జీవిత క్రమం ఉంది. ఈ పని ఇలా చేయాలి, ఇలా ఉండాలి, ఇలా బ్రతకాలి అని రూల్సున్నాయి. ఈ పురుక్కి ఇలాంటి బోర్డర్ బ్రతుకు ఇష్టంలేదు. దానికి నిర్దేశించిన ప్రదేశంలో ఎప్పుడూ శరీరం ఈడుస్తూ పాకుతూ బ్రతకటంకంటే పక్కన విశాలమైన రహదారిలో చకచకా నడచిపోయే కాళ్ళపైన మనసు. ఆ దారంట నడిచే వేల వేల కాళ్ళల్లో ఓ జతకు ఈ పురుగు కంటపడింది. ఆశ్చర్యంగా, ఆనందంగా, ఆశగా, ఆ రహదారి వైపుచూసే ఆ పురుగు కళ్ళల్లో మెరుపుకి ఆనందించి ఆ కాళ్ళుగల ఆసామి ఆ పురుగుని చేతిలోకి తీసుకున్నాడు. అక్కడ ఆ పురుగుకి ఆ చేతుల వెచ్చదనం, ఆ బలం, ఆవేశం ఎంతగానో నచ్చాయి. అలాగే ఆ బలహీనమైన పురుగుకి ఉన్న అందమైన భావాలు, కలలూ వినటం ఆ పెద్దమనిషికి అంతులేని ఆనందం ఇచ్చాయి. అయితే ఎంతసేపని ఆ పురుగుతో కాలక్షేపం?

"అంతలో అతనికి మంచి పని దొరికింది. అతను వెంటనే పురుగుని నేలకు దింపాడు. 'నువ్విలా రాకమ్మా, కాళ్ళ కిందపడి నలిగిపోతావు. నీతో కూర్చుంటే ఎల్లాగా, నాకు చాలా పని ఉంది. నే వెళ్ళిపోతున్నా' అన్నాడు.

"ఆ పురుగుకు కోపం వచ్చింది. 'ఇన్నాళ్ళుగా ఈ విషయం నాకు చెప్పలేదేం? నా రంగు రంగుల కలలకు ఎందుకు ఊతం ఇచ్చావు?' అంది.

"అందుకు ఆ పెద్దమనిషి 'అదేమిటే? తీరిగ్గా ఉన్నాను కనక నీతో కబుర్లు చెప్పాను. నేనూ ఈ రహదారిపైన కొత్తగా నడవటం మొదలుపెట్టాను. ఇంకా ఎంతో దూరం నడిచి ఎంతో పని చేయవలసి వుంది. అప్పుడు నాకు అందమైన జీవితం దొరుకుతుంది. నీలాటి పురుగులతో, పిచ్చికలతో కూర్చుని కలలు కంటే ఎలా సరిపోతుంది?' అని అతను నడవటం మొదలుపెట్టాడు. పిచ్చిపురుగుకి తాపత్రయం అతనితో నడవాలని. అప్పటికీ అతను చెప్పాడు:

"నీ పురుగు జాతికి చెడ్డ పేరొస్తుంది. వెనక్కు వెళ్ళిపో" అని.

"పురుగు వింటుందా? 'నీతో స్నేహం కట్టినప్పుడే, నీ అరచేతిలో పొందికగా కూర్చున్నప్పుడే నేను నా జాతిని వదిలేశా నీ జాతిలో కలుస్తా' అంది. అలా కుదరదని ఆ పెద్దమనిషి వెళ్ళిపోతుంటే పురుగు అడ్డాలడ్డాలు పడి అతని కాళ్ళ క్రింద పడిపోయింది. అతను పాపం నొచ్చుకొని ఆ నడ్డి విరిగిన పురుగుని జాగ్రత్తగా ఓ పక్కన పడుకోబెట్టి 'ఇలా తొందరపడకు. కొంతకాలంలో నీకు నయమై పోతుంది. నీ తెలివితేటలతో, నీ ఉత్సాహంతో నీ జాతిలో గొప్పగా వెలిగిపోతావు. బీ కేర్‌ఫుల్' అనేసి వెళ్ళిపోయాడు. ఇప్పుడు ఆ నడ్డి విరిగిన పురుగు ముసుగులో ఉన్నానే చిలకా, కనపడని బాధ ఇది. అండర్ స్టాండ్" అన్నది సూర్యకళ.

రేవతి ఏడవబోతే వద్దని కోప్పడింది. ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"అస్తమానం ఉద్యోగం నవ్వు నవ్వుతాం కదా, మన సొంతానికి నవ్వులెందుకు వుండవే సూర్యం?" అన్నది రేవతి.

"ఏమో...." అన్నది సూర్యం.

● *ప్రచురణ, 1990* ●

★ ★ ★

ఆడెపు లక్ష్మీపతి

65

# బంద్

రాత్రంతా కురుస్తూండిన వర్షం ఉదయానికి తెరిపి ఇచ్చింది. క్రితంరోజు సాయంత్రం పెందలాడే టీ కొట్టు మూసేసి, రాత్రంతా కునుకు లేకుండా, ఆందోళనగా వున్నాడు బాల్లింగం. నిప్పులేని పొయ్యి దగ్గర కూర్చుని, దిగాలుగా తూర్పు దిశవైపు చూస్తున్న అతనిప్పుడు పొద్దు పొడుపును చూసి తృప్తిగా నిట్టూర్చాడు.

చకచకా కదలి తన హోటలును ముస్తాబు చెయ్యడం ప్రారంభించాడు బాల్లింగం. గడ్డి గుడిసె ముందర, తడికెలు కప్పిన పందిరి. ఆ పందిట్లో ఒకవేపు ఎత్తయిన మట్టిపొయ్యి – దాని ప్రక్కనే నల్లగా మసిబారిన వెడల్పాటి బల్ల – మూడువైపులా భూమిలో కాళ్ళు పాతిపెట్టబడి కదలకుండా – కష్టమర్లు కూర్చునేందుకు అమర్చిన మూడు చెక్కబెంచీలు – సంక్షేపించి చెప్పాలంటే ఇదీ అతని టీకొట్టు స్వరూపం.

గబగబ కుటుంబ సభ్యులకు పనులు పురమాయించాడు. అతని పదేళ్ళకూతురు రమ అంట్లు తోమి – బకెట్టు నీళ్ళతో పాత్రలు, గిన్నెలు శుభ్రం చేసి – కప్పులు, సాసర్లు గ్లాసులు ప్లేట్లు బల్లమీద పెట్టింది. పన్నెండేళ్ళ కొడుకు రవి గుడిసె లోపల్నుండి ఇడ్లీపిండి పాత్ర, చట్నీ గిన్నె, పాల సరువ ఒక్కొటొక్కటిగా తీసుకొచ్చి తండ్రికందించాడు. పెద్ద చెక్క డబ్బా తెచ్చి, పొయ్యికి – బల్లకు మధ్యవున్న ఖాళీ ప్రదేశంలో నిలబెట్టాడు. బాల్లింగం ఆ డబ్బా లోపలి అరల్లో బీడికట్టలు, సిగరెట్ ప్యాకెట్లు, బిస్కెట్ ప్యాకెట్లు, బ్రెడ్డులు, బన్నులు తదితర సామాగ్రిని పొందికగా అమర్చాడు.

అన్ని వస్తువులను పరికించి తల పంకించి, తుండు గుడ్డతో బెంచీలు తుడుస్తూ భార్య నుద్దేశించి కేకేశాడు – "ఏమయిందహె.....ఇంకా రావూ.....గిరాకచ్చేటయిమయితోంది. పొయ్యిలో మంటబెట్టిపోదువుగానీ రా...."

గుడిసె లోపల్నుండి నాగమ్మ సణుక్కుంటూ, గొణుక్కుంటూ బయటికొచ్చింది. మోపెడన్ని తడిసిన బట్టలు పిండి దండెమ్మీద ఆరవేసింది. "ఎన్నో మాట్ల చెప్తుంటె యినకపోతివి. ఇల్లంతా మడుగయింది. వానచ్చినప్పుడల్లా మనకూ, పోరగండ్లకూ జాగారం గాబట్టె తుంగంతా చెదలు దిన్నది...ఇప్పుడన్నా ఆలోశనచ్చిందా లేదా?"

భార్య సణుగుడు నిర్హేతుకం కాదని బాల్లింగానికి తెలుసు. గుడిసెకప్పు చాలా చోట్ల చెదలుతిని జారిపోయింది. ఆ ప్రదేశాల్లోంచి వర్షపు నీరు ధారాపాతంగా కురుస్తోంది. బట్టలు, పుస్తకాలు, ట్రంకుపెట్టె, మిగతా సామానులు ఒక మూలకు – సాపేక్షికంగా సురక్షితంగా వున్నచోటికి – చేర్చి, పిల్లలకు దుప్పట్లు కప్పి, తాము

భార్యాభర్తలిద్దరూ గిన్నెల్లో నిండిన వర్షం నీరు బయట పారబోస్తూ నిద్రలేకుండా కూర్చోవడం దాదాపు నిత్యమూ జరుగుతున్నది.

ఈ దురవస్థను తట్టుకోలేక – భార్య సణుగుడును ఉపేక్షించలేక – నిల్వ వుంచిన అయిదు వందల రూపాయలు వెచ్చించి గుడిసె మరమ్మత్తు చేయించాలని చాలాసార్లు అనుకున్నాడు. కానీ – రాఘవులు పంతులు సలహా, ఒకరిద్దరు పొరుగువాళ్ళూ, కష్టమర్లూ చేసిన వ్యాఖ్యలు మననం చేసుకుని, బలవంతంగా ఆ ప్రయత్నంనుండి నిగ్రహించుకున్నాడు.

ఎదుగు బొదుగూ లేని వ్యాపారంతో బతకడం ముమ్ముందు కష్టమనీ, హోటలును పెద్దగా చెయ్యమనీ, రెండు మూడు రకాల తినుబండారాలు పెట్టమనీ, కిళ్ళీ కొట్టుకూడా తెరవమనీ రాఘవులు పంతులు సలహా.

ఎప్పుడూ ఇడ్లీలు, బ్రెడ్డులు ఏమీ బాగా లేవనీ, పాత బస్సుస్టాండు దగ్గర కేరళవాడి హోటల్లో ఎప్పుడుచూసినా జనం ఎగబడతారనీ, వాడు పూరీ, గరంగరం అలుగడ్డ కూరచేస్తాడనీ, సాయంకాలం నోరూరించే మిరపకాయబజ్జీలు, వడలు వేస్తాడనీ ఇక్కడా అలాంటి అయిటములు చేస్తే గిరాకీ పెరుగుతుందనీ, రోడ్డు ప్రక్కనవున్న కొట్టును ఆకర్షణీయం చేయడం వ్యాపారపు తెలివి అనీ కొందరి కష్టమర్ల వ్యాఖ్య.

బాల్లింగం బాగా ఆలోచించి, టీకొట్టును విస్తరింప చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. పైసా ఖర్చు చెయ్యకుండా పొదుపు మొత్తాన్ని ఆ పథకం కోసమే ఖాయం చేశాడు. వానాకాలం పోయాక – ఇంకో నెలరోజులు దాటాక – అమలు చేయాలని నిశ్చయించుకున్నాడు. భార్యకు నచ్చచెప్పాడు.

నాగమ్మవేపు చిరాకుగా చూసి కసిరినట్టుగా అన్నాడు బాల్లింగం. "ఊకే అదే పాలూ?" పాసిపండ్ల దాసరోని తీర్గ! ఒక్కసారి జెప్తె సమజేసుకోవాలి! దా... పొద్దెక్కిపోతాంది జెప్పిన పొయ్యి పని జూడు..."

నాగమ్మ చేతులు తుడుచుకుని బిరబిర పొయ్యి దగ్గరికి నడిచింది. పొయ్యి అడుగున ఇనుప పలాక దూర్చి బూడిద దులిపింది. కట్టెపేళ్ళువేసి, పొయ్యినిండా నింపింది. తడిసిన బొగ్గుమూలంగా పొగ రైలింజనులాగా చిమ్మింది. తడికెల కింద పందిరిగుంజల నాశ్రయించిన దోమలు గుయ్యిమంటూ ఎగిరాయి. మురికి కాలువలో అంట్లకోసం కెలుకుతున్న పందులు గుర్గురుమన్నాయి. కుక్కలు భౌభౌమంటూ వాటిమీది కురికాయి. పుస్తకాలు సర్దుకుంటున్న రవి చేస్తున్న పనినాపి, రాల్చిన బూడిదలోంచి బొగ్గుముక్కలు ఏరి – తమ దారిద్ర్యంమీద కసి తీర్చుకుంటున్న వాడిలాగా ఆ జంతువుల మీదికి విసిరి, వాటిని దూరం కొట్టాడు.

పొయ్యి మండిన అరగంట తర్వాత పొగ అదృశ్యమయి పొయ్యిలోని నిప్పుకణికెలు ధగధగమన్నాయి. బాల్లింగం మొదటి విడత ఇడ్లీలు కుక్కర్లో నింపి పొయ్యిమీద కెక్కించాడు.

కొట్టులోకి కష్టమర్ల రాక ఆరంభమయింది. కొందరు టీ త్రాగి వెళ్ళారు. ఇంకొందరు ఇడ్లీకి ఆర్డరిచ్చారు ఉదయం ఏడున్నర గంటల సమయమయింది. నర్సింగు ప్రవేశించాడు. అతడు ఇటీవలే కాలరీలో క్యాజువల్ మజ్దూరుగా ఉద్యోగంలో చేరాడు. చేతిలో వున్న చిన్న బాగును విసురుగా బెంచీమీద పెట్టి ఉసూరుమంటూ కూర్చున్నాడు. నాగమ్మ అతనికి చాయ్ గ్లాసు అందించింది.

అఖరి విడత ఇడ్లీలు కుక్కర్‌లోంచి తీసి, వెడల్పాంటి అల్యూమినియం తాంబాలంలో వేసి, మొత్తం ఇడ్లీలమీద గుడ్డ కప్పాడు బాల్లింగం. నర్సింగు వైపు తిరిగి అతని పాలకం చూస్తూ అన్నాడు – "ఊళ్లె మీ నాయినకు పానం బాగలేదని మతులబచ్చిందని మొన్ననే అంటివి గదర పిల్లగా? పెద్ద మనిషికి మోట బర్లల్ల జారి పడితే కాలిరిగిందేమో గద? ఊరికి పోయి, ఇప్పుడెట్లున్నడో చూసచ్చినవా.... ఇప్పుడు సూడనికి పోతానవా?"

నర్సింగు బీడి వెలిగించి, దాని కొసకొరికి తుపుక్కుమని మురిక్కాలువలో ఉమ్మేసి అన్నాడు – "అ.... పోయొస్తున్నా, బసుస్టాండు దాకా. రొండురోజులు నాగాచేసి అయినా ఊళ్లెపుండి ముసలాయినను పెద్ద దవాఖాండ్లకు తీసుకపోదామనుకున్న, కాని.....పోయెటట్టులేదు. ఇయ్యాల బస్సులు నడుస్తలెవ్వు, లారీలు తిర్గుతలెవ్వు, తెలంగాణా బంద్ అంటాండ్రు...."

బంద్‌మాట వినేసరికి బాల్లింగానికి గుండెలో గుబులు బయలుదేరింది. "నిన్న రాత్రివరకు ఏ అలికిడి లేదు గద! మళ్లా ఏమ్మూడింది? ఏక్‌దమ్మున బంద్ ఏంది?"

తెలియదన్నట్లుగా తల అడ్డంగా వూపాడు నర్సింగు. "ఏమున్నది – మళ్ళేదో రాజకీయం. ఎవడో పార్టీవోడు పిలుపిచ్చినట్టున్నాడు."

అయోమయంగా భార్యముఖంలోకి చూశాడు బాల్లింగం. నాగమ్మ అందోళనగా చూపులు కలిపింది.

"ఓ చార్మినార్ సిగిరెట్టు డబ్బ, ఓ అగ్గిపెట్టె ఇయ్యవోయ్ బాల్లింగం" అంటూ అంకుసాములు వచ్చాడు. బాల్లింగం అవి అందిస్తూ, బందు సంగతి నిజమేనా అని అడిగాడు అతన్ని.

"బంద్?" వివర్ణమైంది అంకుసాములు ముఖం. సిగరెట్టు ప్యాకెట్ అందుకుంటూండగా, కొన్న వస్తువులను మోసే బలం లేనట్టుగా చేయి అప్రయత్నంగా వణికింది. బెంచీమీద కూర్చుని, బజారు రోడ్డువేపు, వివిధ రకాల పోస్టర్లు అంటించిన గోడలవేపు సాలోచనగా చూసి అన్నాడు – "అకాడా వస్తాదు గుండాలు, అబ్కారీ కంట్రాక్టరు రౌడీలు కొట్లాడుకుని పొడుసుక సచ్చినప్పుడు బందు, గాయిన ఎవ్వలో సేటు సచ్చిపోతే బందు, ఎవల్నో – ముక్కూ ముకం ఎరుక లేనోన్ని పార్టీల కెల్లి తీసేస్తే బందు, అఫీసర్ను బదిలీ చేయించమని బందు, పోలీసులకు కిలాఫ్‌గా బందు, ఎలచ్చన్లల్ల పార్టీ టికెటెయ్యకపోతే బందు. టాకీసు కాడ లొల్లి అయితే బందు, బరండి సాపుల పొడుసుకుంటె బందు, బడి పోరగండ్లు తన్నుకుంటె బందు, ధరలు పెరిగినయని, రేట్లు తగ్గియ్యాలనీ బందు. ఇంకేందేందో.....బంద్‌లు. థూథ్ – గీ బందుల కగ్గితగల. గిన్ని మాట్ల బందులయితే మనమెట్ల బతుకుతం?..."

నాగమ్మ విరక్తిగా అన్నది – "ఔను అన్నా, ఉరుము ఉరిమి మంగలం మీద పడ్డట్టు మన పొట్టలమీదనే కొడుతానయ్ గీ బందులు. పోయిన అదివారం ఓ ఖద్దరంగాయన పదిమంది సదువుకునే పోరగండ్లను వెంటేసుకొనచ్చి బందు – అనె. దుకాండ్ల మూయకపోతె గుడిసెలు పీకేయించుత అని పందిరి గుంజను తన్ని గజగజ వణికిచ్చె. మళ్ళొపారి – పచ్చంగోళ్ళు లాఠీలు, కత్తులు తిప్పుకుంటచ్చి వోటలు

బందు పెట్టకపోతే వాడంతా కాలబెడ్తమని బెదిరిచ్చిరి. యేకాశి పండుగ కాన్నుంచి లెక్కగడితె ఇప్పటికి పదో – పన్నెండో బందులు జరిగినై."

"అన్ని పార్టీలోళ్ళు గట్లనే వున్నారు. పేదల పార్టీ అన్జెప్పుకునే ఎర్ర జండోళ్ళేమన్నా తక్కువ తిన్నారా? ఇగ– గీ 'అన్నల' సంగతి జెప్పటట్టె లేదు. ఎత్తుక పోవుడనీ, ఎదురు కాల్పులనీ – వాళ్ళ గురించిన బందులె ఎక్కువున్నాయ్. బందు పాటించకపోతే బాంబులేస్తమని బెదిరిస్తరు..." అన్నాడు బాల్లింగం.

అతడు ఈ రోజు బందు పెట్టిస్తున్నది ఎవరై వుంటారా అని కొద్దిసేపు యోచించాడు. చిన్నచిన్న సంస్థలు, పార్టీలు పిలుపిచ్చినప్పుడు గానీ, సాధారణ విషయాలమీద పిలుపిచ్చినప్పుడు గానీ – బందు ప్రభావం అంతగా వుండదు. ఒకవేళవున్నా – మెయిన్ బజారు, తదితర పెద్ద పెద్ద షాపులు మూస్తారు కాని చిన్నకొట్టుల గురించి ఉద్యమకారులు పెద్దగా పట్టించుకోరు. అలాంటి అవకాశాలు వినియోగించుకుని, బాల్లింగం తన టీకొట్టు తెరిచి వుంచిన సందర్భాలున్నాయి. ఇప్పుడు అలాంటి ఆశే అతని మనస్సు మారుమూలల్లో మెదులుతోంది. "అంకుసాములూ, అసలు బందు వున్నట్టా లేనట్టా సరిగ్గా దెలుస్తలేదు. జర మీ బిడు క్యాపు టేలలదాకా పోయి, చౌరస్తాదగ్గర సంగతి తెల్సుకొని రారాదూ?"

"పోతాన, ఏమన్నా గానీ మోచీ దుకాణం తెరుస్త. వాళ్ళు వచ్చి బందు పెట్టుమన్నప్పుడు సూస్త..." ఇడ్లీప్లేటు కిందపెట్టి, మీసాలు పైకి లేపి, మూతి తుడుచుకుని లేచాడు అంకుసాములు.

నాగమ్మ పిల్లలను స్కూలుకు తయారుచేయడానికి పూనుకుంది. కూతురి తలకు నూనె రాస్తున్నప్పుడు అప్రయత్నంగా పాలసరువ వేపు, ఇడ్లీలున్న తాంబాలం వేపు దిగులుగా చూసింది. బంద్ మూలంగా అవి అమ్ముడు పోకుండా మిగిలిపోతాయేమోనన్న శంక, భీతి ఆమె మస్తిష్కంలో తిరుగాడాయి. బాల్లింగం కాలుగాలిన పిల్లిలాగా అటూ ఇటూ కదుల్తూ, కొట్టుదాటి, రోడ్డుమీద నిలబడి దూరంగా అర కిలోమీటరు మేరకు దృష్టి సారించి, నాలుగురోడ్ల కూడలి వైపూ, పెద్ద బజారు వైపూ చూసి బందు పరిస్థితి బేరీజు వేయడానికి ప్రయత్నించాడు.

సమయం గడుస్తోంది. కొట్టులోకి జనం వస్తూపోతూ వున్నారు. కానీ రోజులాగా గిరాకీ లేదు. హమాలీ పనిచేసే రసూల్, తోపుడుబండి లాండ్రీ షాపు రత్నం వచ్చి ఇడ్లీకి ఆర్డరిచ్చారు. రెండు గుక్కల్లో ఇడ్లీ ప్లేటు ఖాళీ చేసి, "ఏందియ్యాల హోటల్ల గిరాకీ పల్చగున్నది?" అని అడిగాడు రసూలు. బాల్లింగం బంద్ సంగతి ప్రస్తావించాడు. ఒక్క నిముషంపాటు అక్కడ నిశ్శబ్దం గడ్డ కట్టింది.

"గట్లయితె – మా రైసుమిల్లులు ఖుల్లా వుండయ్. కిరాణా దుకాండ్ల తెరువరు. ఈ రోజు హమాలీలకు కూలీ సున్నా, ఇప్పుడు తిన్న నాస్తా ఖరీదు రెండ్రూపాలు దండుగన్న మాట...." అన్నాడు రసూలు.

కొద్దిసేపాగి మెల్లగా అన్నాడు రత్నం – "ఇయ్యాల రికామయితే గట్ల గడ్డమీది దుకాణం కాడికిపోదామా.... ఉద్దెర ఇస్తడు, నేను జెప్త."

సారా ఘాటు గుర్తుకు రాగానె రసూలు మియా హుషారుగా తల వూపాడు. వాళ్ళ ఉద్దేశం అక్కడున్న వాళ్ళకి అర్థమయింది. నర్సింగు ఈసడింపుగా అన్నాడు

– "ఇగో రత్నం, కూసె గాడిద మేసె గాడిదను శెడగొట్టుతునట్టు చెయ్యకు. నువ్వు ఒంటరిగానివి, వానికి – రసూలు గానికి పడుసు పెళ్లమున్నది – వారీ.....రసూల్! మిల్లు కాణ్నుంచి రోజూ అర్ధరాత్రి వస్తావనీ, పీకలదాకా తాగుతావనీ నీ బీబీ గోడుగోడున వలపోస్తది. నీకు గింతనన్న సిగ్గు శరం లేకపాయె. గీ బందు పున్యమా అని ఇయ్యాలనన్నా ఇంటిపట్టున వుండు....."

"ఐనా అన్నీ బందుంటె గదిమాత్రం మీకోసం తెర్సి వుంచుతర్రా.....?" అని ఇంకొకాయన మందలించాడు.

రసూలు నోరు తెరవలేదు. రత్నం అందరి ముఖాల్లోకి చూసి మౌనముద్ర వహించాడు.

అయిదు నిమిషాలయింతర్వాత జనరల్ స్టోర్‌లో నౌకరుగా పనిచేసే శివరాజు వడివడిగా నడుచుకుంటూ వచ్చాడు. ఇస్త్రీచేసిన దుస్తులతో ట్రిమ్ముగా తయారయి, కుడిచేతికున్న సెకండు హేండు గడియారంలో టయిము చూసుకున్నాడు. కొట్టుముందుకు రాగానె రసూలు అతన్ని పిల్చి అన్నాడు – "ఏముర్కుతున్నవ్, తియ్యి జల్దీ. ఏమిలేదు, ఇయ్యాల బందట, ఎరికేనా?"

"ఎరికే. అయినా అట్ల పోయొస్త" అన్నాడు శివరాజు.

"మరి మళ్ళచ్చి మాకు ఏ సంగతి జెప్పు."

☆ ☆ ☆

అజ్ఞాత వ్యక్తుల నుద్దేశించి శాపనార్థాలు పెట్టుకుంటూ ప్రవేశించింది రాజమ్మ. "ఈ బందు పెట్టించెటోని ఇంట్ల మన్నువడ. మా ఉసురు పోసుకునేటోళ్ల కొంపలు కాలిపోను – కూలిపోను. పార్టీల దినాలుగాను, ఏం కలీగం.... అన్నన్న రోత కలీగం....ఎప్పుడు మునిగిపోద్దో."

చంకలోని పిల్లవాడిని బెంచీమీద కూచోబెట్టింది. మాసిన చీర కొంగు సవరించుకుంది. ఊడిపోయిన సిగముడి బిగించుకున్నది. "నాగమ్మొదినా! ఓ డబల్‌రొట్టె, పెద్ద గ్లాసునిండ పాలు తీసుకరా. ఈ సంటోడు నిన్నటినుంచి ఏం తింటలేదు" అంటూ వాడి ముక్కు మూతి కొంగుతో తుడిచింది.

బందు పిలుపిస్తున్నవాళ్ళు పకడ్బందీగా అమలు చేయిస్తున్నట్టు అందరికీ అర్థమయిపోయింది. దువ్వుతున్న కూతురి జడ అలాగే పెట్టుకుని నాగమ్మ దీనమైన రాజమ్మ మొఖంలోకి చూసింది. తల్లి చేతుల్లోని తన జుట్టు పీకుతున్నట్టనిపించి రమ తల ముందుకు వంచింది. నాగమ్మ కూతురి వీపుమీద ఒక గుద్దు గుద్దింది. "సక్కగ నిల్సుండరాదె ముదనట్టప్పోరి? బడికి టయిమయితాందని ఆటలాడిస్తవ్ – జడెయ్యమని అగమాగం జేస్తవ్. ఉడుమోలె ఎందుకు మెసుల్తానవ్?" అంటూ తిట్టింది. తల్లి అకారణంగా ఎందుకు కోపగించుకుంటోందో ఆ పిల్లకు అర్థంకాక బిక్కమొగం వేసింది.

బాల్లింగం నిస్తేజమైన తన చూపులు బల్లమీది నుంచి మరల్చి శూన్యంలోకి చూశాడు. పెద్ద సరువలో మరుగ కాగిన పదిశేర్ల పాలు; నాలుగు కిలోల పిండితో మూడు విడతలుగా వేసి తీసిన పొగలు కక్కుతున్న ఇడ్లీలు, స్టీలు గిన్నె నిండా అరకిలో పుట్నాలు, కిలో కొబ్బరి వేసి నూరిన చట్నీ – ఇవన్నీ ఏం కావాలి? అమ్ముడవకపోతే ఎలా?

హోటల్ తెరవకపోతే అమ్మకాలుండవు. ఆదాయముండదు. బంద్‌నాడు ఒక వేళ దుకాణం తెరిచే వీలున్నా గిరాకీ పల్చగా వుంటుంది. ఇప్పుడు కొట్టు తెరిచి తినుబండారాలు సిద్ధం చేసినాక కొట్టు మూసెయ్యాల్సి వస్తే వెచ్చాల ఖర్చు వ్యర్థమవుతుంది. దుకాణాదారుకు నష్టం వాటిల్లుతుంది. ఇలా ఏ కోణంలోంచి చూసినా బంద్ మూలంగా తన బతుక్కు హానియే – ఎన్నోసార్లు జరిగింది.

నిలబడే సత్తువ లేనట్టుగా బెంచి మీద కూలబడ్డాడు బాల్లింగం. లీటరుకు ఆర్రూపాయల చొప్పున కొంటున్న పాలు రోజురోజుకూ పల్చగవుతున్నాయి. రవ్వ కల్సిన కల్తీ చెక్కెర తొమ్మిది రూపాయలు కిలోకు పెట్టి బ్లాకులో కొనాల్సి వస్తున్నది. నూనె, టీ పొడి, పప్పుల ధరలు విపరీతంగా పెరిగినాయి. ఇవన్నీ తట్టుకుంటూ టీ కొట్టు నడిపిస్తున్నాడు – వచ్చే స్వల్పాదాయంతో తన కుటుంబాన్ని గుంభనగా పోషిస్తున్నాడు. పిల్లల తిండీ, బట్ట, చదువూ – ఎలాగో గడుస్తున్నాయి. 'పాలు మంచివి పొయ్యవయ్యా' అంటే ధర పెంచుతానంటున్నాడు పాలవాడు. కిరాణా కొట్టులో ఖాతా ఎక్కువవుతోందనీ – ఇకనుంచి ఎక్కువ బ్యాలన్సు వుండనివ్వననీ కేకలేస్తున్నాడు షావుకారు. ఆగస్టు పదిహేను నాటికి యూనిఫారం కుట్టించుకొని తీరాలని హెడ్ మాస్టారు వేధిస్తున్నాడని పిల్లల ఫిర్యాదు – ఇవన్నీ సమస్యలు. ఇవికాక తరచుగా ఎదురవుతూ ఆదాయాన్ని కుంటుపరుస్తున్న బంద్ పిలుపులు. ప్రకృతి వైపరీత్యానికి ఏ మాత్రం తీసిపోని క్రూరమైన మానవాస్త్రం – ఈ బంద్ పిలుపు.

మోచీ సామాను ఉన్న తోలు సంచీ మోసుకుంటూ అంకుసాములు తిరిగి వచ్చాడు. వెనకాలె మంగలి యాదగిరి నడిచాడు.

"చౌరస్తా దగ్గర పోలీసులు తిరుగుతున్నారు. డియస్పి జీబు మెయిన్ బజార్ల రెండు మార్లు చక్కర్లు గొట్టింది. మోరీల్ పోలీసును యెన్క కూకో బెట్టుకుని మోటార్ సైకిలు మీద బుర్రు బుర్రుమని తిర్గుతాండు, 'ఇయ్యాల బందు. షాపులు, హోటలు, దుకాండ్లు తెరువకుండ్రి...' అని ఉస్కాయిస్తున్నడు" – చెప్పాడు అంకుసాములు.

"పోలీసులు బందు పెట్టిస్తున్నారంటె అప్సోసుగున్నది. యవ్వారం సూత్తె పెద్దగనిపిస్తున్నది. తెరిచినోళ్ళు తెరిచినట్టే హోటలాలు మూస్తున్నారు. ఎటోళ్ళటు పోతాండ్రు..." అన్నాడు యాదగిరి చెమట తుడుచుకుంటూ.

అయితే పోలీసులు ఎందుకు బంద్ పెట్టిస్తున్నారన్నది అనూహ్యంగా వుంది అక్కడవాళ్ళకు. "పార్టీలోళ్ళు బందు పిలుపిచ్చినప్పుడు – ఎన్నోసార్లు గీ పోలీసులె దుకాండ్లు తెరిపిచ్చింద్రు. బజారు ముయ్యద్దని లాఠీ లూపుకుంట తిరిగింద్రు. కాని పోలీసులు ఇయ్యాల గిట్ల జేసుడు ఇచ్చంత్రంగున్నది" అని తర్కించుకున్నారు. ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ, విస్మయంగా తమకు తోచిన విధంగా కారణాలు చర్చించుకున్నారు.

చేస్తున్న పని ఆపింది నాగమ్మ. "ఈ హోటలు గూడ బందు పెట్టనీకి వస్తరంటవా అన్నా?" అని అడిగింది అంకుసాములును. అతడు ఎటూ చెప్పలేక పెదవి విరిచాడు. రసూల్ అన్నాడు – "గీ సందునున్న హోటల్లకు ఎవడు సూడనికొస్తడు. నువ్వు ఫికరు పడకు అక్కా!" అదే అభిప్రాయాన్ని బలపరుస్తూ, గుడిసెల బస్తీకి పోలీసులు రాకపోవచ్చని అన్నాడు రత్నం.

"ఏమోనమ్మా, ఎటూ జెప్పేటట్టు లేదు. దవాఖాండ్లు, పాన్‌షాపులు మూయిస్తున్నరంటె అనుమానంగనె వున్నది. పోలీసోళ్ళ కెదురేమున్నది జెప్పు. జల్దిన ఎటోళ్ళం అటు పోతే మంచిది" అంటూ రాజమ్మ మనుమడికి తొందరగా గోలి మింగించి పాలు త్రాగించింది.

అప్పుడొచ్చాడు రాఘవులు పంతులు. సైకిలు దిగి స్టాండు వేశాడు. అందరూ అతనికి 'నమస్తే' చెప్పారు. న్యూస్ పేపరు పట్టుకున్న చేతులను ముకుళించి ప్రతి నమస్కారం చేస్తూ బెంచీ మీద కూర్చున్నాడు అతడు.

రాఘవులు పంతులు అక్కడి ప్రయిమరీ స్కూల్లో టీచరు. బస్తీ వాసులకు అతడు తలలోని నాలుక. వీధుల్లో దీపాల గురించీ, నల్లాల గురించీ ఉద్యమం లేవదీసి కార్మికుల మెప్పు పొందాడు.

అతడు పేపరు విప్పగానె విశేషాలు బాగానె వుండి ఉంటాయని అందరూ అతడి వేపు కుతూహలంగా చూశారు. అతడు బందుకు కారణం చెప్పాడు. "పెద్దకొండ చెరువు దగ్గర రాత్రి ఎదురు కాల్పులు జరిగినయ్. ఆ సంఘటనలో ముగ్గురు పోలీసులు, ఒక యస్సయ్ మరణించారని వార్త."

"అజీబుగున్నది. ఎదురు కాల్పులల్ల తీవ్రవాదులు దెబ్బదినుడు గురించి యింటంగని పోలీసులు పడిపోవుడు ఎప్పుడినలే..."

"అయితే గావచ్చు. కాని పోలీసులు బందు పెట్టుమనుడు చేన్ను యెనుగు మేసినట్టున్నది"

"ఆళ్ళు బందు పెడ్తెనాయం, ఈళ్ళు బంద్ పిలిపిస్తే అన్యాయమా? ఎవ్వల్దయినా అక్కు ఒకటేననుకోవాలె..."

రాజమ్మ ఉండబట్టలేక కుండ బద్దలు కొట్టినట్టు అన్నది – "గిసోంటి బందు – మాటిమాటికి దుకాండ్లు మూయించుడు నా యాభయ్యేళ్ళ బత్కులో మునుపు చూలే. ఈ మజ్జెన్నె గీ అయిదారేండ్ల నుండె సమ్మెలు, కొట్లాటలు ఇంటాన్న. తిన్నదరుగని ముండకొడుకులు బందులని ఎగుర్తంద్రు. బందులు పెట్టే ఏ మూడబొడ్తరు – ఏ మొర్గ బెడుతరు. పేదోళ్ళ పొట్టలు కాల్సుడు తప్ప!"

'ఔనౌను' అన్నట్టుగా అందరూ తలలూపారు. టీ త్రాగి లేచాడు రాఘవులు. "పోయొస్త. స్కూలు బందు కాని పేపర్లు దిద్దేపనున్నది. మీరు కూడా అందరూ గుంపుగా వుండకండి, నూట నలభైనాలుగు సెక్షను పెట్టినట్టున్నారు. పోలీసులు ఇటువచ్చినా రావచ్చును" అని సైకిలు వైపు నడిచాడు.

అందరూ భయపడ్డట్టుగా బిగ్గరగా రొద పెట్టుకుంటూ పోలీసు వ్యాను రానే వచ్చింది. స్పీడుగా వచ్చి కొట్టుదాటి పది మీటర్ల దూరంలో ఆగింది. పడిపోయిన సైకిలును రాఘవులు లేవనెత్తుకున్నాడు. ఎర్రబెల్టు జమేదార్ లాఠీ వూపుకుంటూ దిగాడు. అందరూ నిశ్చేష్టులయ్యారు, రైఫిళ్ళతో దిగుతున్న అరడజనుమంది స్పెషల్ పోలీసులను చూసి.

"ఎవర్రా ఈ హోటల్ లచ్మీ కొడుకు? వాళ్ళు చిట్టీలంటియ్యగనె బందు పెడుతరు మీరు. మేం చాటింపు చేస్తుంటె గూడ ఖదర్ జేసుడు లేదు. వీపు ములముల మంటాందారా?" అంటూ జమేదార్ గర్జించాడు. "అరెయ్, మీరందరు

ఇక్కడోళ్ళేనా? ఎల్లిపోండి. కనపడితె కాల్చి పారేస్త, ఫుట్‌పాత్ గాడ్ది కొడుకుల్లారా!"

టీ కొట్టులో కూర్చున్నవాళ్ళు చెల్లాచెదురుగా కదిలారు. వ్యానులో కేబిన్‌లో కూర్చున్న ఇన్‌స్పెక్టర్ కొత్తగా హెడ్డు నుంచి ప్రమోషన్ పొంది ఈ ఊరికి వచ్చిన వాడులాగా వున్నాడు. జమేదార్‌ను పిల్చి "ఇదేం వాడ, పరిసరాలేమిటి?" అని అడిగాడు.

"ఇది లేబరు కాలనీ, ఇక్కడన్నీ గుడిసెలే సార్! రోజా కూలీ చేసుకునే అలగా జనముంటారు. ఈ వోటల్ల మంది జమగూడింద్రు" – చెప్పాడు హెడ్డు.

ఇన్‌స్పెక్టరు చటుక్కున కిందికి దిగాడు. బెల్టుకున్న రివాల్వర్ తడుముకున్నాడు. "వాళ్లందర్ని సాలుపుగ నిలబడుమను. గిసొంటి ఏరియాల మనం వుషారుగ వుండాలెనయ్యా. నక్సలైట్లు గీ జనంలనె, గీ గల్లీల్లనే వుంటరు. అందర్ని ఓ పారి సోదా జెయ్యి" – ఆజ్ఞాపించాడు, ఉత్తరువును శిరసావహించాడు హెడ్డు.

ఇనస్పెక్టరు, నిద్రలేమి మూలంగా ఎర్రబడ్డ తన కళ్ళతో పులిలా అందర్నీ చూశాడు. పరిసరాలు – గుడిసెలు, మురిక్కాలువలు, ఇరుకైన వీథులు తీక్షణంగా పరిశీలించాడు. రాఘవులు పంతులు చేతిలోంచి పేపరు లాక్కుని చూసి విసిరేసాడు. కొన్ని ప్రశ్నలు వేసాడు. సమాధానాలు విని, చేసేదేమీ లేక అందరినీ వెళ్లిపొమ్మని గద్దించాడు.

బాల్లింగం వైపు చూస్తూ అడిగాడు – "ఏం సిగరెట్లు వున్నయ్‌ర నీ వోటల్లో?"

బాల్లింగం చెప్పాడు. వాటిల్లో ఇన్స్పెక్టరు తాగే బ్రాండు కూడా వుంది.

"నాలుగు పాకీట్లు ఇటెయ్యి. రెండు అగ్గిపెట్టెలు గూడ అందుకో." తెప్పించుకున్నాడు. అన్నీ జేబుల్లో పెట్టుకుని సిగరెట్టు వెలిగించాడు.

బాల్లింగం చకచకా వాళ్ళు కోరినవి అందించాడు. పది నిమిషాల్లో ఇడ్లీలు స్వాహా అయిపోయిన్నై. సరువలోని పాలు దాదాపు సగం ఖాళీ అయిన్నై. స్ట్రాంగ్ టీల రూపంలో రక్షక భటుల కడుపుల్లోకి చేరుకున్నాయి. సిగరెట్ ప్యాకెట్లు పంచివేయబడ్డాయి.

అందరూ కూర్చున్నాక పోలీసు వ్యాను స్టార్టయింది. జమెదార్ అన్నాడు – "అరేయ్ బాల్లింగం, మేం మళ్ళీ రాంగ సూస్తం. ఇప్పటిలాగ మంది గుమి గూడింద్రో – నీ వోటలు తెరిపి వుంచినవో – జాగ్రత్త, నీ గుడిసె కాలబెడ్త."

బాల్లింగం భయంగా తల వూపాడు. నసుగుతూ "అయ్యా....పైసలు....ఇప్పుడు మీరు తిన్నయి, తాగినయి, సిగిరెట్లు అంతా కల్సి యాభై రూపాయిలయింది...." అన్నాడు.

"అట్లనా? రేపు ఠాణాకురా." కర్కశంగా అన్నాడు జమెదార్, సిగరెట్ పొగ బాల్లింగం ముఖంలోకి వూదుతూ. పోలీసులు పిలుపు ఇచ్చిన బంద్ దిగ్విజయంగా అమలవుతున్నందుకు పోలీసు శకటం గర్వంగా బురద చిమ్ముతూ, పొగ లేపుతూ – వేగంగా సాగిపోయింది.

తమ వోటల్లో బాల్లింగం, నాగమ్మ స్థాణువుల్లాగా నిల్చున్నారు. పిల్లల్లో ఇంకా వణుకు తగ్గలేదు.

"కారులో షికారు కెళ్ళె పాల బుగ్గల పసిడిదానా....బుగ్గ మీద గులాబి

రంగు...ఇక్ర్...ఇక్ర్.... " పాత సినిమా పాట కూనిరాగం తీసుకుంటూ నిషాలో తూలుకుంటూ వచ్చాడు కొమురెల్లి. "నాగమ్మా....ఓ గిలాసియ్యి" అంటూ కూర్చున్నాడు.

"వోటల్ల ఏం లేదు. అంతా వాళ్ళ బొందల మీద పెట్టుకున్నారు బంద్."

"నేను సూశిన. నాకు తెలుసు. నాకేమద్దు – ఉత్త కాళీ గిలాసియ్యి..." అంటూ జేబులోంచి సారా పొట్లాలు తీశాడు. నాగమ్మ గ్లాసు అందియ్యగానే ఒక పొట్లం చింపి అందులో వంపుకున్నాడు కొమురెల్లి.

"జల్దిన కానిచ్చిపో. ఎవ్వలన్నా సూస్తే లొల్లి. ఇంకోసారి వొటల్ల కూకొని సారా తాగుతనంటె నేను గిలాసియ్య..." విసురుగా అంది నాగమ్మ.

గటుక్కుమని గొంతులో పోసుకున్నాడు కొమురెల్లి. 'వారుణీవాహిని' వాసన అధికార పార్టీ ఎల్లక్షను వాగ్దానపు ఆకర్షణలాగా గుప్పుమంది.

బాల్లింగం ఈ లోకంలోకి వచ్చాడు. కొమురెల్లి వైపు చిత్రంగా చూశాడు.

"ఊళ్ళో ఎవరి సావుకయినా జాడ సూసుకుంట పోతవ్. నిన్ననే కోరిలో పన్జేసే గాకిట్టుగాడు సచ్చిపోతే దహనానికి పోతివి – పూటుగా తాగితివి. ఇయ్యాల ఎవ్వడు సచ్చిండోయ్? గుర్రం జోరు మీదున్నది!"

పెద్దగా నవ్వాడు కొమురెల్లి. "కుక్క చచ్చిపోయింది."

"పారశికాలాడకు. సరిగ్గజెప్పు"

"చెప్తున్న యిను. వాగు అవతల గుట్ట కాడి జాతరకు నిన్న పోయిన – ఇయ్యాల వస్తున్న. రైటర్ల బస్తికాడ గా బక్కపల్చటి, అద్దాలాయిన – గదేదో పత్రికలకు రాసి పంపే యిలేకరి కలిశిండు. సంగతి జెప్పిండు – సిన్న పన్జేసి పెట్టుమన్నడు. వాళ్ళ వాడలో ఓ కుక్క సచ్చి పడున్నదట. తీస్కపోయి దూరం పడెయ్యిమన్నాడు. పోయి సూసిన – మురుగు వాసన గొడ్తున్నది. వాడల ఉన్నోళ్ళు ఆడోళ్ళు – మొగోళ్ళు అందరూ ముక్కులకు బట్టడ్డం పెట్టుకున్నారు. యేగిరం తీసెయ్యమన్నరు. గదే సందనుకున్నా – ఇరవై అయిదు రూపాయిలిస్తే కాని తీసెయ్యనన్న. ఇయ్యాల సపాయి పనోళ్ళు, మున్సిపాల్టీ కూలీలు ఎవరూ దొరకరని జెప్పిన. ఆఖర్కి ఇరువై రూపాయిలకు ఒప్పుకున్న. కుక్కను తీసి పడేశిన."

"సిటికెల ఇరువై రూపాల్ సంపాయించినవు. కిస్మత్ మంచిదే. సరే – కాని గీ బందు రోజున సారా ఎక్కడ దొరికిందోయ్?"

మరింత పెద్దగా నవ్వాడు కొమురెల్లి. "గాంధీ తాత పుట్టినరోజున మాంసం దొరుకుత లేదా? ఆ రోజు ఎవలూ కల్లు తాగరా? అన్నీ నడుస్తయ్. ముంగటి దర్వాజ బందుంటది. దొడ్డిదారి తెర్సి వుంటుంది. సారా దొర్కపోతే ఎట్ల? లోకం సాగెదెట్ల?" అని గ్లాసు ఖాళీచేసి లేచాడు.

బందు కాటు గురించి భీతిలేని కొమురెల్లి రాగం తీసుకుంటూ వెళ్ళిపోయాడు. 'వోటలు' పరిసరాలను నిశ్శబ్దం ఆవహించింది. భద్రత లోపించిన బతుకు బాటలో రేపటి మజిలీ ఎంత చేదుగా వుంటుందోనన్న భయం బాల్లింగం దంపతులను చుట్టుకుంది.

● *ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక – 12–10–90* ●

★ ★ ★

కవనశర్మ

66

# విడాకులు

ఆటోలో వెళుతున్న సుజాత గాలికి నుదుటి మీద పడుతున్న జుట్టును చేత్తో వెనక్కి తోసుకుంది మరోసారి. కొద్ది క్షణాల్లో మళ్ళీ వెంట్రుకలు వచ్చి నుదుటి మీద వాలాయి. మనసులో ముసురుతున్న ఆలోచనల్ని ప్రయత్నించి వెనక్కి నెట్టినా అవి మళ్ళీ వచ్చి వాలుతున్నాయి. తను చూడబోతున్న లాయరు తన సమస్యను తన కోణం నుంచి చూస్తాడో, చూడడో! చూడకపోతే ఆశ్చర్యం లేదు. మొగుడూ, అత్తా, మామా సరే–ఆఖరికి ఆమె తల్లీ, తండ్రీ కూడా ఆమెదే తప్పన్నారు. అందుకే సందర్భం చెప్పకుండా లాయరు దక్షిణామూర్తిని అడిగి సమయం తీసుకుంది. తన సమస్యకి తను కోరే పరిష్కారం సరైనదేనని ఆమె నమ్ముతోంది. లాయర్ని నమ్మించాలి. ఇంతకు ముందు ఆమె కలుసుకొన్న ముగ్గురు లాయర్లూ ఆమెకు వారు హితవనుకొన్నది బోధించి బోధించి వదిలిపెట్టారు. అందుకే ఆమెకి అధైర్యంగా ఉంది. కథకుడు కథ మొదలు పెట్టేటప్పుడు 'ఇల్లాగా? లేక మరోలా బావుంటుందా?' అని రకరకాలుగా వ్రాసి చూసుకొన్నట్టు, లాయరు దక్షిణామూర్తికి తన కేసు ఎలా ప్రెజెంట్ చేస్తే బావుంటుందని రకరకాలుగా రిహార్సల్స్ వేసుకుని చూసుకుంది మనసులో. ఆఖరికి ఏదీ నచ్చక విసుగు వచ్చి అక్కడ ఎల్లా నోటికి వస్తే అల్లా చెప్పాలన్న నిర్ణయానికి వచ్చి మనస్సుకి విశ్రాంతి ఇవ్వబోయింది. కానీ ఆమె మనస్సుకు గుచ్చుకున్న ములుకులు ఆమెను బాధించడం మానలేదు.

ఆటో – 'దక్షిణామూర్తి, అడ్వొకేట్' అని బోర్డున్న ఇంటి ముందర ఆగింది. సుజాత ఆటోకి డబ్బిచ్చి లోపలికి నడిచింది. ఇల్లు అధునాతనంగాను, చక్కని అభిరుచితోను కట్టబడింది. ధన ప్రకర్షకోసం చేసే హంగులు లేవు అనుకుంది ఆమె.

ఆమె గుమాస్తాతో తాను ఎవరో చెప్పింది.

"లాయర్ గారు మీకోసం ఎదురు చూస్తున్నారు. లోపలికి వెళ్ళండి" అని చెప్పి ఆమెను లోపలికి పంపాడు.

రూమ్‌లోకి అడుగుపెట్టగానే అది ఎ.సి.రూమ్ అని గ్రహించింది. చుట్టూ బల్బులు పెట్టిన పెద్ద వేంకటేశ్వర స్వామి ఫోటో ఏ గోడకైనా తగిలించి ఉందేమోనని చూసింది. అటువంటిది లేకపోవడం ఆమెకి ధైర్యం కలిగించింది. ఆమె అత్తవారింట్లో అటువంటిది ఒకటి ఉంది. ఆమె ఆ ఫోటోని ఒక రకపు సంస్కారంతో ముడి పెట్టుకుంటుంది. ఆ సంస్కారం పట్ల ఆమెకి భయం.

"నేను సుజాతని" అంది ప్రతి నమస్కారం పెడుతూ.

"దక్షిణామూర్తి" అన్నాడు దక్షిణామూర్తి లేచి నిలబడి ప్రతి నమస్కారం పెడుతూ చూశాడు. ఆమె జుట్టు భుజాల వరకు కత్తిరించుకుంది. జుట్టుకు నూనె రాసుకోలేదు. కట్టుకున్న చీర నైలానుదే కాని, దళసరిది. కాళ్ళకి ఎత్తి మడమలుండి పాదాలను పూర్తిగా కప్పిన జోళ్ళున్నాయి. ఆమె బ్లౌజ్ చీరలో దోపబడి నట్టుంది. పొట్ట ఏమాత్రం బహిర్గతం కావడం లేదు.

ఆమె దగ్గరకు వచ్చాక–"ఈ మధ్యనే విదేశాల నుంచి వచ్చినట్టున్నారు?" అన్నాడు.

"అవును" అంది సుజాత ఆశ్చర్యంగా.

"యు.ఎస్.ఎ.? కెనడా? యు.కె.? ఆస్ట్రేలియా?"

"యు.ఎస్.ఎ.".

"కూర్చోండి! చెప్పండి మీకు నా నుంచి కావలసిన సహాయం ఏమిటి?"

"నాకు విడాకులు కావాలి" అంది సుజాత సూటిగా.

"ఈ దేశంలో మా లాయర్లతో సహా విడాకులిచ్చుకోవడాన్ని ప్రోత్సహించం."

"అది నా అనుభవంలోకి వచ్చింది. కానీ మీకే నష్టం కదా అది!"

"నిజమే! కానీ మేము ఆ నష్టాన్ని మేరేజ్ కేన్సిలింగ్ పేరిట వసూలు చేసే ఫీజుతో భర్తీ చేసుకుంటాం" అని నవ్వాడు దక్షిణామూర్తి.

"లాయర్లు డబ్బుకోసం ఏ పనైనా చేస్తారు కదా" అని సుజాత మాటల్లో ఉన్న ధ్వనిని గుర్తించి–అది జోక్ కింద తీసుకుని, తనూ ఆ జోక్‌ని పొడిగించాడు.

"నేను విడాకులివ్వాలనుకుంటున్నట్టు చెప్పినప్పటి నుంచి మా అమ్మా నాన్నా, అన్నా వదినా ప్రతి ఒక్కరూ తమ పక్కలో బాంబు పేలబోతున్నట్టు బెదిరిపోతున్నారు. వద్దమ్మా అని బతిమాలుతున్నారు."

"వాళ్ళ దాకా ఎందుకండీ! మీ అమ్మగారు మీ నాన్నగారికో, మీ వదిన మీ అన్నగారికో విడాకులిస్తానంటే మీరే వద్దంటారు. నాన్న ముసలివారని, ఇన్నాళ్ళూ సర్దుకున్నదానివి శేష జీవితం కూడా సర్దుకోమని మీ అమ్మకి చెప్తారు. మీ అన్న మంచివాడని, మరో కొంత కాలం అతనికి అవకాశం ఇచ్చి చూడమని మీ వదినకి చెప్తారు. అవునా?"

దక్షిణామూర్తి వేసిన ప్రశ్నకి సుజాత జవాబు చెప్పడానికి కాస్త సమయం తీసుకుంది.

"అంటానేమో! కాని మా అమ్మకాని, వదినకాని ఆ నిర్ణయం తీసుకున్నప్పుడు వాళ్ళు భరించడాని కింక శక్తి లేకే ఆ నిర్ణయం తీసుకున్నారని అనుకుంటాను. యూనో! విడాకులకి కారణాలు చాలా మంది చాలా బలమైనవి అయి ఉండాలని నాకు చెప్తున్నారు. అక్కర్లేదు. యూ కెన్ ఆల్వేస్ సిట్ మోర్ కంఫర్టబ్లీ ఆన్ హిల్ టాప్ దాన్ ఆన్ పిన్ కుషన్. నసుగుడు, జిడ్డితనం, సాధింపులు లాంటి రోజూ ఉండే పిన్ ప్రిక్స్ ఒకరోజు కోపంలో భర్త కొట్టిన దెబ్బలుకంటే భరింప శక్యంకానివి."

"నిజమే. వివాహితుల్లో నూటికి తొంభై మంది రోజా విడాకుల గురించిన ఆలోచనలు చేస్తూనే ఉంటారు. మిగిలిన పదిమంది వితంతువుల్లో, విధురుల్లో లేక అది వరకే విడాకులు తీసుకుని సుఖపడిపోతున్నాం అనుకున్నవారో అయుంటారు. అంటే డైవోర్స్‌లు సాధారణం కాదు కానీ, వాటి గురించిన ఆలోచనలు సర్వసాధారణం. ఎంతదాకో ఎందుకు? మా ఆవిడ రోజుకు పదిసార్లు నాకు విడాకులు ఇచ్చేయాలనుకుంటూ ఉంటుంది. కానీ ఇవ్వలేదు ఎందుకని? మా పెద్దమ్మాయికే ఇంకా పెళ్ళి కాలేదు. తను విడాకులిస్తే తన కూతురికి పెళ్ళికాదని భయం. తల్లి చాటు పిల్లకి వస్తుందన్న భయంతో సంబంధాలు రావేమోనని భయం. లేకపోతే నన్నే లాయరుగా పెట్టుకుని నా మీద విడాకుల దావా వేసేసును. ఆఫ్‌కోర్స్ ఆవిడకి నా మీద భర్తగా గౌరవం లేదు. కానీ లాయరుగా చచ్చేంత గౌరవం. ఈ ఇల్లూ-కారూ చూస్తే ఎవరికైనా నేను మంచి ప్రాక్టీస్ ఉన్న లాయరు అనిపిస్తుంది కదా!"

సుజాత సరిగ్గా అదే అనుకునీ, అల్లా అనుకున్నవారు చెప్పగా వినీ దక్షిణామూర్తి దగ్గరికి వచ్చింది. దక్షిణామూర్తి తన సంభాషణ కొనసాగించాడు:

"ఇంత మంది నిత్యం విడాకుల గురించిన ఆలోచనలు చేస్తున్నా డైవోర్సులు ఎందుకు సాధారణం కాదు? ఈ ప్రశ్నకి రెండు జవాబులు తడతాయి. కోర్టులు తాము విడదీసిన దంపతుల మీద చెరగని ముద్రలు వేస్తాయి. ఆ ముద్రల వల్ల వారు సంఘంలో ప్రత్యేకంగా కనిపిస్తారు. వీరి పట్ల ప్రత్యేకమైన అగౌరవం జనం చూపించకపోయినా, నిరాదరణ చూపిస్తారు. వెల్ క్వాలిఫైడ్ అమ్మాయిలకే పెళ్ళి అవడం కష్టంగా ఉన్న ఈ రోజుల్లో విడాకులిచ్చిన అమ్మాయికి మరో పెళ్ళి అవడం ఎంత కష్టం? భార్య చనిపోయినవాడికి ఆలోచించకుండా పిల్లనిచ్చే మన దేశంలో విడాకులిచ్చినవాడికి ఏమో, ఎల్లాంటివాడో, ఆ పిల్ల ఉత్తినే విడాకులిచ్చి ఉంటుందా అని పిల్లనివ్వరు."

"అయితే నన్ను విడాకులు తీసుకోవద్దంటారు?" అంది సుజాత అసహనంగా.

"నేననేది అందరూ అనేదే! మీరీ మాటలు చాలాసార్లు వినే ఉంటారు. విడాకులు తీసుకుందామని అనుకున్నంతమంది తీసుకోకపోవడానికి రెండో కారణం, నా దృష్టిలో వాళ్ళకి కనిపించే బలమైన కారణం ఏదో ఒకటి ఉంటుంది. పిల్లల క్షేమం, ఆస్తి మొదలైనవి. మీ విషయంలో అటువంటి కారణం ఏమీ లేదా అని ఆలోచిస్తున్నాను. అంతేకాని, ఆడపిల్లకి వైవాహిక జీవితమే పరమార్థం అని అనుకోవడం వల్ల కాదు. ఆడపిల్లల తండ్రిని కదా! నేనెప్పుడూ ఆడపిల్లల పక్షమే!"

"నాకు విడాకులు కావాలి. అందుకు నాకు మీ సహాయం కావాలి. చేస్తారా?" అని సూటిగా అడిగింది.

"మేము ఉన్నది అందుకే గదా? మీ కథ చెప్పండి. నా సలహా నేను చెప్తాను. నా సలహా విన్నాక మీరు నిర్ణయం తీసుకోండి. ఆ నిర్ణయం విడాకులే అయితే దాన్ని సాధించడానికి నేను లాయరుగా నాకు చేతనైన సాయం చేస్తాను."

దక్షిణామూర్తి మాటలు సుజాతకి ధైర్యాన్నిచ్చాయి "ఈయన అందరిలాగా విడాకులు పుచ్చుకోవాలనుకోవడం పెద్ద అపరాధం అని నీతి బోధ చెయ్యలేదు"

అని సంతోషించింది. దక్షిణామూర్తిలో గొప్ప గుణం అదే. అతను అవతలి వారు చిన్నబుచ్చుకునేలా మాట్లాడడు. సుజాత తన కథ చెప్పింది.

సుజాత భర్త అమెరికాలో పిహెచ్.డి.చేసి గ్రీన్‌కార్డ్ సంపాదించి, అక్కడే స్థిరపడ్డాడు. మంచి ఉద్యోగంలో ఉన్నాడు. ప్రొఫెషనల్ క్వాలిఫికేషన్ ఉన్న అమ్మాయి కావాలని పట్టుబట్టి సుజాతను ఎన్నుకుని పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళినాటికి సుజాత బి.ఇ.పాస్ అయింది–ఎలెక్ట్రానిక్స్ బ్రాంచిలో. ఆమెకి అమెరికాలో మంచి ఉద్యోగమే దొరికింది. ఉద్యోగం మొదటి కొద్దిరోజులు ఉత్సాహంగా గడిచాయి. నెల గడిచేసరికి ఆఫీసులో పనికి అలవాటు పడింది. అలవాటుపడింది కనుక ఆఫీసులో ఆమెకి తోటి ఉద్యోగస్తులతోపాటు సమంగా పని ఇవ్వడం మొదలుపెట్టారు. అప్పుడు సమస్యలు మొదలయ్యాయి ఇంట్లో.

సుజాత భర్తకి పూర్వంలాగా అన్నీ అమర్చలేకపోయింది. అతను సుజాత వచ్చే వరకు తను ఇంటికి ముందు వచ్చినా "పొయ్యి మీద బియ్యం" అన్నా పడేసేవాడు కాదు. కాఫీ అయినా కలుపుకునేవాడు కాదు. కాఫీ తాగిన గ్లాసు సింకులో పడేసేవాడు కాదు. కూర్చున్నచోట పెట్టేసేవాడు.

సుజాత ఏమైనా అంటే – "నాకీ వంట బోరు కొట్టే కదా పెళ్ళి చేసుకున్నది" అనేవాడు.

అయిదు సంవత్సరాలపాటు వండుకు తిన్న మనిషి పెళ్ళవగానే కాఫీ అయినా ఎందుకు కలుపుకోడో ఆమెకి అర్థం కాలేదు.

"మా అమ్మాయికి రెండేళ్ళ క్రితం ఓ అమెరికా సంబంధం వచ్చింది. పెళ్ళి కొడుకు మా అమ్మాయితో 'వంట బోర్ నాకు' అన్నాడట. వెంటనే మా అమ్మాయి–'నాకూ అంతే. అందరికీ అంతే ననుకుంటాను. తినకుండా ఉండలేక వండుకుంటాంకానీ' అందిట. అతను 'అయ్యో వండుకుని తిని అలిసిపోయావా చిట్టి తండ్రీ! నేను వచ్చి వండి పెడతాగా' అంటుందనుకున్నాడు కాబోలు. మా అమ్మాయి అల్లా అనగానే అదే పోత – మళ్ళీ మొహం చూపించలేదు. మా అమ్మాయిని మా ఆవిడ కేకలేసింది. 'అదేమిటే అల్లా అంటారా?' అంటూ. మా అమ్మాయి అంది కదా 'వంట మనిషి కావలిస్తే వంట మనిషి కోసం చూడాలి కానీ చదువుకున్న పిల్ల కోసం–అందులోనూ బాగా చదువుకున్న పిల్ల కోసం–వెదకడం ఎందుకట?" అని – ఇప్పటి మగపిల్లలకి తనతో సమానంగా చదువుకుని ఉద్యోగం చేయగలిగి, వాళ్ళ అమ్మ నాన్నకి అమర్చినట్టు అన్నీ అమర్చిపెట్టే భార్య కావాలి" అన్నాడు దక్షిణామూర్తి.

"నా భర్త – మీ అమ్మాయిని చూడడానికి వచ్చిన వాడిలాంటివాడే. పెళ్ళి చూపులప్పుడు నాతో కాస్సేపు ఏకాంతంగా మాట్లాడాలన్నాడు. మా వాళ్ళు వాళ్ళకి ఇల్లు చూపించే నెపంతోను, వాళ్ళ వాళ్ళు చూసే నెపంతోను అక్కడ్నించి వెళ్ళిపోయారు. అప్పుడు ఇంగ్లీషులో నా అభిమాన రచయితల గురించి, జాయింట్ ఫామిలీస్ విషయంలో నా అభిప్రాయాల గురించి ప్రశ్నించాడు. ఆ పైన ముఖ్యమైన విషయం అని చెప్పి–'నాకు ఉద్యోగం మొదటి భార్య. ఐ పే హర్ మోర్ ఎటెన్షన్. నేను చాలా ఏంబిషస్. ఉద్యోగంలో పైకి రావడానికి నేను అహర్నిశలూ

పని చేస్తాను. వీకెండ్స్‌లో కూడా అవసరమైతే ఆఫీసుకు వెళ్తాను. అందుకని నాకు – ఈ విషయంలో నా కాబోయే భార్య సహకారం కావాలి. నా కంపెనీ డిమాండ్ చేయని భార్య కావాలి. అందుకని ఉద్యోగం చేయగలిగి, చేసే భార్య కావాలి. ఆమె స్వతంత్రంగా బతకగలిగినదై ఉండాలి." అని అన్నాడు అతను. అప్పుడు నాకు అర్థం కాలేదు అతని అసలు భావం. నేనటువంటి దాన్నే అన్నాను అప్పుడందుకుని."

దక్షిణామూర్తి – "అతని అసలు భావం ఏమిటని మీ ఉద్దేశ్యం?" అని అడిగాడు.

"అతని అసలు భావం ఏమిటంటే – భార్య అతని మీద ఆధారపడకుండా బజారుకు వెళ్ళి వస్తువులు తెచ్చుకుని – అతని మీద ఆధారపడకుండా ఇంటి పని చేసుకునేదై ఉండాలి. అల్లా స్వతంత్రంగా పని చేసుకుపోవాలి అన్నాడు కదా అని స్వతంత్రంగా ఆలోచించరాదు. అతని కంటే చిన్న ఉద్యోగం చేస్తూ – ఇల్లు నడపడానికి అతని జీతం మీద ఆధారపడుతూ – అందుకుగాను అణిగిమణిగి పడి ఉండే భార్య కావాలి. అతని ఆధిక్యాన్ని సర్వదా విస్మరించనిదై ఉండాలి."

సుజాత తన భర్త మనోభావాల్ని ఎంతో సమర్థవంతంగా విశ్లేషించింది. అయితే సుజాత భర్త ఒక్కడే ఇటువంటివాడు కాదు. రమారమి తన కూతుర్ని చూడడానికి వచ్చిన ప్రతి కుర్రకుంకా ఇట్లాగే మాట్లాడాడు. ఇది వ్యవస్థలో వస్తున్న మార్పు. తన తరంలో వారికంటే ఈ తరంలో వారికి ఆర్థికావసరాలు హెచ్చు. తను ఇరవై సంవత్సరాలు ప్రాక్టీస్ చేసి –కారు, టీ.వీ. ఫ్రిజ్ కొంటే ఇప్పటి కుర్రవాళ్ళకి అవి పెళ్ళయి భార్యతో విడిగా ఉండడం మొదలుపెట్టేనాటికే కావాలి. అవి తన ఒక్కడి జీతంతో సాధ్యం కాదు. అందుకని భార్య ఉద్యోగం చేసి సంపాదించాలని కోరుకుంటున్నాడు. తప్పులేదు. అయితే తన లాగానే ఆఫీసులో పనిచేసి వచ్చే భార్యకు ఇంటి పనిలో సహాయపడడం ధర్మం అని ఆలోచించడు. చెయ్యకుండా ఉండడాన్ని తనది పెద్ద ఉద్యోగం తన జీతం ఎక్కువ అనడం కారణాలుగా చెప్పుకుని సమర్థిస్తాడు. స్త్రీకి ఇల్లు అనే పంజరంకాక ఇల్లు, ఆఫీసు, బజారు అనే మూడు పంజరాలు కట్టి వాటి మధ్య వాటిని కలుపుతూ కటకటాలలో ఇరుకుదార్లు ఏర్పరచి స్త్రీకి తను స్వార్థంతో ఏర్పరచిన విశాలత గురించి చంకలు గుద్దుకొంటున్నాడు. మూడు పంజరాల మధ్య ఇరుకు మార్గాల్లో నడవలేక మరింత అలిసిపోతోంది ఈనాటి అమ్మాయి. అందుకే ఈనాటి సుజాతలు "నాకు విడాకులు కావాలి." అంటున్నారు దక్షిణామూర్తి ఆలోచనలకి ఆనకట్ట వేస్తూ–

"లాయరు గారు ఏమిటో ఆలోచనల్లో పడిపోయారు!" అంది.

"ఆడపిల్లల తండ్రిని కదా! సమస్యని మీకోణంలోంచి చూడాలని ప్రయత్నిస్తున్నాను. కానీ పురుషుడిని కదా – ఆ పని నాకు కొంచెం శ్రమగా ఉంది. నా కళ్ళకున్న ముసుకలు నన్ను సరిగా చూడనీయడం లేదు" అని నవ్వాడు దక్షిణామూర్తి.

సుజాత కథ చెప్పసాగింది. సుజాత పనిలో చురుకుగా ఉండడం చేత ఆమె పని చేస్తున్న కంపెనీ ఒక సంవత్సరం తరువాత ఆమెకి జీతం పెంచి, దాంతోబాటు బాధ్యత కూడా పెంచింది. దాంతో సుజాత కొన్ని రోజులు ఆలస్యంగా ఇంటికి రావడం, శని ఆది వారాల్లో అప్పుడప్పుడు ఆఫీసుకు వెళ్ళాల్సి రావడం జరుగుతూ వచ్చాయి. మొదట్లో ఆమె ఆలస్యంగా వచ్చినా ఇంటి పని తనే చేసుకుపోగలిగేది.

కానీ కొన్నాళ్ళకి అతని మీద కొంత అతని పని వదిలిపెట్టక తప్పలేదు. కొన్ని వీకెండ్స్‌లో అతని బట్టలు ఇస్త్రీ చెయ్యడం కుదిరేది కాదు సుజాతకి. అవి అతనే ఇస్త్రీ చేసుకుంటే బావుండుననుకునేది సుజాత. కాని అతనికి ఆ పని బోర్. అతను ఇంటి పని చేసుకోలేనప్పుడే పెళ్ళి చేసుకున్నాడు. కానీ అతను ఇంట్లో పనీ పాటు చేసుకోగలిగిన భార్యను కాక ఉద్యోగం చెయ్యగలిగిన భార్యను కోరుకున్నాడు. ఇల్లు, కొనడానికి అతను చేసిన అప్పు త్వరగా తీర్చుకోవాలంటే భార్య సంపాదనాపరురాలు కావాలని అతను లెక్కలు వేసుకున్నాడు. సుజాత తను ఆఫీసులో పనీ, ఇంటి పనీ రెండూ చెయ్యలేకపోతున్నాననీ, కావాలంటే ఉద్యోగం మానేస్తాననీ చెప్పింది.

"నువ్వు మరీ బద్దకస్తురాలివి. పొద్దుట్నించీ సాయంత్రం దాకా ఇంట్లో ఉండి సాయంత్రం నేనింటికి రాగానే నన్ను అక్కడికీ, ఇక్కడికీ తీసుకువెళ్ళండంటూ వేధించుకుని తినడానికే నువ్వు ఉద్యోగం మానేస్తానంటున్నావు!" అంటూ అతను ఒప్పుకోలేదు.

"ఉద్యోగం అంటూ చేస్తూ ఉంటే అది సరిగ్గా చెయ్యడం, తోటివారితో పోటీ, రాట్ రేసూ తప్పవు కదా! అందుకని మీరు సర్దుకోవాలి మరి" అంది సుజాత.

"ఏదో ఉద్యోగం చెయ్యమన్నాను కానీ నిన్ను ప్రమోషన్లు తెచ్చుకుని, కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు అవమన్నానా? నీ కింతకంటే డబ్బు అవసరం లేదనీ, నీకు ఏంబిషన్స్ లేవు అనీ మీ బాస్‌తో చెప్పు" అన్నాడు అతను.

"మీకు మాత్రం ప్రొఫెషన్ ఫస్ట్ వైఫ్. మీరు ఏంబిషస్. మీరు జాబ్‌లో పైకి రావాలి. మీ భార్య మీ అవసరమైన మేరకు సంపాదించి మీ రింటికి వచ్చే సమయానికి ఇంట్లో ఉండి, మీరు కంపెనీ కోరినప్పుడు అందిస్తూ – మీరు బిజీగా ఉంటే అర్థం చేసుకుని ఇంట్లో పడి ఉండాలా? నేనూ మీ అంత తెలివైనదాన్నే! పరీక్షల్లో మంచి మార్కులు తెచ్చుకుని పాస్ అయినదాన్నే! ఉద్యోగంలో సమర్థురాలిననే పేరు తెచ్చుకున్నాను. నా కెందుకు ఏంబిషన్ ఉండరాదూ?"

"నేను పెళ్ళికి ముందే చెప్పాను."

"ఏం చెప్పారు? నేను మీకు అడ్డురాకూడదని చెప్పారు. ఉద్యోగం చెయ్యాలని చెప్పారు. చేస్తే మీరు చెప్పిన మేరకే చెయ్యడం సాధ్యం కాదనీ, మీరు నాకు అడ్డు వస్తున్నారనీ ఇప్పుడు నేను మీకు చెపుతున్నాను."

ఈ విధమైన వాగ్వాదాలు, పోట్లాటలు వారిద్దరి మధ్యా చాలాసార్లే జరిగాయి. సుజాత భర్త సుజాత వాదాన్ని అంగీకరించలేదు. తనది పెద్ద ఉద్యోగం, పెద్ద జీతం కనుక దానికే ప్రాధాన్యం ఉండాలన్నాడు. సుజాత సహకరించకపోతే తన పురోగతి ఆగిపోతుందన్నాడు. అతని వయస్సు ఇప్పుడెంత ఉందో అంత వయస్సు తనకి వచ్చినప్పుడు తను కూడా పెద్ద ఉద్యోగంలో ఉంటానని, (అతను) పెద్ద ఉద్యోగంలో ఇప్పుడు ఉండడంలో పెద్ద విశేషమేమీ లేదని అంది సుజాత.

మనిషి రక్తం రుచి చూసిన పులి, సంపాదన రుచి చూసిన ఆడది ఒకలాంటివారేనన్నాడు అతను. సుజాత కావచ్చునంది.

ఈవిధంగా ఆ ఇద్దరి మధ్యా పోట్లాటలు జరుగుతూ ఉండడం ఇద్దరూ ఏకాభిప్రాయానికి రాలేకపోవడంవల్ల సుజాత తను ఇండియా వచ్చేశానంది.

"అతని భార్యగా సంపాదించుకున్న వీసాతో అక్కడ ఉండడం ఇష్టం లేకపోయింది. ఈసారి వెళ్తే సుజాతగా వెళ్తాను" అంది సుజాత.

మీ తగవు తీర్చడానికి మీ అత్త మామలు ప్రయత్నించలేదా?" అని అడిగాడు దక్షిణామూర్తి.

"ప్రయత్నించారు. కానీ ఆ ప్రయత్నాలు ఫలించడం అసంభవమని నాకు ముందునుంచే తెలుసు. అదే జరిగింది."

"ఎందుకని అసంభవమనుకున్నారు?" ఆశ్చర్యంగా అడిగాడు దక్షిణామూర్తి.

"ఆ సెటప్ అలాంటిది. మా అత్తగారు పెద్దగా చదువుకోలేదు. ఆవిడకి మావగారో పెద్ద హీరో. ఆయనంత తెలివైనవాడు, మంచివాడు మరొకళ్లు ఉండవచ్చునని ఎవరైనా అంటే కూడా ఒప్పుకోలేదు. ఆయన నిజంగా తెలివైనవాడే. చెడ్డతనం ఏమీ లేదు కూడాను. మంచి ఉద్యోగం చేసేవాడు – అందుకని మా మావగారిని ఏ పనీ ముట్టుకోనీయకుండా అన్నీ అమర్చిపెట్టేది. ఆవిడకిద్దరూ మగపిల్లలే కలిగారు. ఆవిడకి వేరే ప్రపంచం లేకపోవడంచేతా, మగవాళ్ల ఆధిక్యాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించడం వల్లనూ ఆవిడ వాళ్లను అపురూపంగా పెంచింది. చొక్కాలకి గుండీలు కుట్టిపెట్టడం దగ్గర్నుంచీ షేవింగ్‌కి నీళ్లు అందించడం, బ్రష్, రేజర్ కడిగి పెట్టడం దాకా అన్నీ చేసి పెట్టేది. నాకు పెళ్లయ్యాక అమెరికా వెళ్లేముందు నెల రోజులు వాళ్లింట్లో ఉన్నాను. ఆవిడ ఆ ఇంటి పద్ధతులు చాలా గొప్పవని, అవి అలవరచుకోవాలని నాకు ఇంటెన్స్ ట్రైయినింగ్ ఇచ్చింది. ఆ నెల రోజులూ – కొత్త మొహమాటంవల్లా – మోజువల్లో ఆవిడ నాచేత చేయించిన పనులన్నీ చేశాను – కాఫీ గ్లాసులందించడం దగ్గర్నుంచి తాగిన గ్లాసు అందుకోవడం దాకా!"

"అంటే మీ అత్తగారు, మావగారు కాంప్రమైస్‌కి వారి ప్రయత్నంగా మిమ్మల్నే సర్దుకోమని సలహా ఇచ్చారా?"

"ఎస్ ఎండ్ నో. మా అత్తగారికి మా గొడవలు తెలియగానే అమెరికా వచ్చారు. వచ్చి వాళ్ల వంశంలో ఏ కోడలూ ఇంటిపని కారణంగా విడాకులిస్తాననలేదన్నారు. ఏ కారణంగా ఇస్తామన్నారు, ఇస్తామన్నవాళ్లు అని అడిగాను. దాంతో అసలు ఏ కారణంగానూ అనలేదని అన్నారు. అయితే ఆ ఇంటి కోడళ్లు అనకపోయినా అనదగ్గ కారణాలు పూర్వం నుంచి ఆ ఇంటి మగవాళ్ల విషయంలో ఉంటాయని, అవి ఆవిడకి తెలిసే ఉండాలి అన్నాను. ఆవిడ చిత్తరపోయింది. ఆఖరికి ఈవిధంగా ఆలోచించిన మొదటి కోడలిని నేనే అంది."

"అప్పుడు నేను అన్నాను. ఆ ఇంటి కోడళ్లలో కాపురానికి అమెరికా వెళ్లిన వాళ్లలో నేనే మొదటిదాన్ననీనూ, వెళ్లి అమెరికాలో ఉద్యోగం చేసినవాళ్లలో కూడా మొదటిదాన్ననీనూ. 'అందుకనీ మరీ గొప్పలు పోకు' అంది ఆవిడ కోపంగా. 'పోనీ మీరు ఊఁ అంటే ఉద్యోగం మానేస్తాను' అన్నాను. ఆవిడ 'మానెయ్యి' అంది. నేను సరే అన్నాను.

"సుజాత ఉద్యోగం మానేస్తే అప్పులెల్లా తీరుతాయి?" అన్నాడు నా భర్త. అప్పుడు మా అత్తగారికి సమస్య కొద్దిగా అర్థమయింది. కానీ మా అత్తగారు నా భర్తకి ముప్పై సంవత్సరాలపాటు కొత్త అవసరాలు, పరిస్థితులు ఉన్న ఈ రోజులలో బతకడానికి అవసరం అయిన ట్రెయినింగ్ ఇవ్వలేదు. కానీ నేనావిడదగ్గర ఉన్న ముప్పై రోజులూ నా భర్తకి అనుగుణంగా నన్ను మలచడానికి శాయశక్తులా ప్రయత్నించింది. ఆ పక్షపాత ధోరణివల్ల మంచి ఫలితాలు రావడం కష్టం. నేను ఆవిడ రూపొందించిన సూత్రాలను పాటించకుండా ఎదురు తిరగడంతో ఆవిడ అప్రతిభురాలై తన కొడుకుకి గుండీలు కుట్టుకోవడం, కాఫీ కాచుకోవడం నేర్పబోయింది. అవి నా భర్తకి రాకపోతే అయిదేళ్లపాటు అమెరికాలో ఒంటరిగా ఎల్లా ఉన్నాడు? వచ్చు. భార్య వచ్చాక చెయ్యక్కర్లేదు అన్న భావం – భార్యే చేస్తుందన్న భావం ఆవిడకి తెలియకుండా ఆవిడ కొడుక్కి తన దగ్గర అతనున్న పాతిక సంవత్సరాలపాటు కలిగించింది. ఆ భావం మానై కూర్చుంది. అతను మారలేదు.

సుజాత తన అత్తగారు చేసిన ప్రయత్నాల నుంచి పెద్దగా ఫలితాలను ఆశించలేదు. కనుక ఆశాభంగం పొందలేదు. భరించినంత వరకు భర్త జడ్డితనం భరించి, భరించలేక పోయినప్పుడు తన జీతంతో తను టికెట్ కొనుక్కుని ఇండియా వచ్చేసింది.

"మరి మీ తల్లిదండ్రులు మీ నిర్ణయాన్ని సమర్థించారా?" లాయర్ దక్షిణామూర్తి ప్రశ్నించారు.

"లేదు. నెత్తీనోరూ మొత్తుకున్నారు" అంది సుజాత.

ఆమె తల్లిదండ్రులు సుజాత ఇండియా వచ్చినందుకు సంతోషించారు. ఆ సంతోషం ఆమె వచ్చిన కారణం తెలియగానే హరించుకుపోయింది. "సర్దుకుపో అమ్మా!" అని సుజాతతో అన్నారు.

"మా పిల్ల చిన్నపిల్ల. తెలియక భర్తని విడిచిపెడుతానంటోంది. మీరు పెద్ద మనస్సుతో సుజాత తప్పిదాన్ని క్షమించి దాన్ని మీ కడుపులో పెట్టుకోండి" అంది సుజాత తల్లి ఆమె అత్తగారితో.

సుజాత వదిన సుజాతతో – "ఆడవాళ్లం మనమే ఎలాగో సర్దుకోవాలి. నేను పెరిగిన వాతావరణం, మీ ఇంటి వాతావరణం మాత్రం ఒక్కలాంటివా? నేను మాత్రం ఉద్యోగం చెయ్యడం లేదా? మీ అన్నకి మాత్రం అన్నీ చేతికి అందించక్కర్లేదా?" అంది.

"ఒప్పుకుంటాను. నీకంటె పనిలో సాయం చెయ్యడానికి మా అమ్మ ఉంది. అవసరమైతే రెస్టు తీసుకోవడానికి పుట్టిల్లుంది. నాకీ రెండూ అమెరికాలో లేవు. అన్నీ నాకు భర్తే. ఏడిపించినా భర్తే. ఓదార్చినా భర్తే. చంపుకుతిన్నా భర్తే. సహాయం చేసినా నా భర్తే చెయ్యాలి. అయినా నీకు మా అన్నయ్యతో కలిసి ఉండడం నీ శక్తికి మించిన పనైతే – ఉండమని మాత్రం నేను సలహా ఇవ్వను" అంది సుజాత.

సుజాతను తీసుకువెళ్ళి అత్తగారింట్లో దింపుదామని చూశారు ఆమె పుట్టింటివారు. సుజాత పడనియ్యలేదు. ఆమె నిర్ణయం మారలేదు. లాయర్ని వెతుక్కుంటూ దక్షిణామూర్తి దగ్గరకు వచ్చింది.

"మీ భర్త అమెరికాలోనే ఉన్నారా? ఇండియా వచ్చారా?" అని దక్షిణామూర్తి అడిగాడు.

"అమెరికాలోనే ఉన్నారు. ఎందుకు?" అని అడిగింది సుజాత.

"దావా ఎక్కడ తేవాలి అన్నది దానిమీద ఆధారపడి ఉంటుంది. ఆయన అమెరికాలో ఉంటే దావా మీకు పెళ్లయిన ఊర్లోగాని, మీ స్వంత ఊర్లోగాని వెయ్యవచ్చు. ఇండియాలో ఉంటే ఆయన ఉన్న ఊళ్లో లేక చివర్లో మీరు కలిసి ఉన్న ఊర్లో వెయ్యాలి. అందుకు."

"మాకు పెళ్లయిన ఊరు హైదరాబాద్. అప్పుడు మా నాన్నగారు ఉద్యోగరీత్యా అక్కడున్నారు. కాని ఇప్పుడు రిటైరై ఈ ఊళ్లోనే ఉంటున్నారు. ఇది మా స్వంత ఊరు" అంది సుజాత.

"ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. మీరు శ్రమ అనుకోకుండా రేపు వస్తే కాగితాలు తయారు చెయ్యవచ్చు" అన్నాడు.

సుజాత లేచి సెలవు తీసుకొని వెళ్లిపోయింది. వాది మనస్సు మార్చుకోవడానికి లాయరిచ్చిన ఆఖరి అవకాశం అది. కొంతమంది మర్నాడు రారు.

రాత్రి భోజనాలయ్యాక దక్షిణామూర్తి భార్య – "పెద్దదానికి పాతిక నిండాయి. రెండోదానికి ఇరవైమూడు నిండాయి. ఇంకా మనం పెద్దదానికే పెళ్లి చెయ్యలేకపోయాం. దానీడువాళ్లు పిల్లా పాపలతో కళకళలాడుతుంటే మీకు చీమ కుట్టినట్టయినా లేదు. కాని తల్లిని నా మనసెంత బాధపడుతోందో తెలుసా?" అని సాధింపు మొదలెట్టింది.

"దానికేమిటోయ్! హాయిగా ఉద్యోగం చేసుకుంటోంది. దానికి తగినవాడు మనకింకా తగల్లేదు. కానీ ఎక్కడో ఉన్నాడు. ఘడియ రాగానే వచ్చి మన తలుపు తడతాడు. మనం చెయ్యాల్సిందల్లా పైవాడిమీద భారం వేసి కూర్చోటమే!" దక్షిణామూర్తి భార్యమీద అస్త్రం ప్రయోగించి – "అయినా మనం పెళ్లి సంబంధాలు చూస్తూనే ఉన్నాం కదా! ఏదో ఒకటి అని చేస్తే రేపు అది విడాకులంటుంది. ఇవ్వాళే ఓ అమ్మాయి విడాకులు కావాలంటూ వచ్చింది. వాళ్లమ్మ తొందరపెడితే వాళ్ల నాన్న ఆ సంబంధం చేసి ఉంటాడు" అన్నాడు దక్షిణామూర్తి.

"చాల్లెండి..... అన్నట్టు మీ సుబ్బారావుగారి భార్య కనిపించింది నిన్న. ఆవిడ చెప్పింది. రెండేళ్ల క్రితం మన అమ్మాయిని చూడటానికి వచ్చాడే వాళ్ల చుట్టాలబ్బాయి రఘు, అతని పెళ్లాం అతనికి విడాకులిస్తానంటోందిట. ఆ పిల్లాడి తల్లి అప్పుడు దక్షిణామూర్తి గారి అమ్మాయిని చేసుకొన్నా బావుండిపొయ్యేది అందిట ఈవిడతో".

"అప్పుడు చేసుకోలేదు కదా! ఇప్పుడే మాటెందుకు. పాపం, ఆ పిల్ల వీళ్లతో ఎంత విసిగిపోయిందో!"

"లేదుట. ఆ పిల్లకీ సంబంధం మొదటినుంచి ఇష్టం లేదు. ఏదో లౌ ఎఫైర్ ఉందిట".

దక్షిణామూర్తికి రఘు వచ్చి తన కూతుర్ని చూడటం తాలూకు తతంగం అంతా గుర్తుకు వచ్చింది.

సుబ్బారావు, దక్షిణామూర్తి తోటి లాయరు. అతను చెప్పాడు. "మా చుట్టాలబ్బాయి రఘు అని అమెరికాలో ఉన్నాడు. రత్నంలాంటి కుర్రాడు. వచ్చేనెల ఆ పిల్లవాడు ఇండియా వస్తాడని, అప్పుడు పెళ్లి చెయ్యదలుచుకొన్నామని, మంచి సంబంధం ఒకటి చూడమని రఘు అమ్మా, నాన్నా నాతో అన్నారు" అని.

"అబ్బాయి ఏం చేస్తున్నాడు?" అని దక్షిణామూర్తి అడిగితే,

"మంచి ఉద్యోగంలో ఉన్నాడు. ప్రాస్పెక్టివ్ గ్రీన్ కార్డ్ హోల్డర్. అతనికి ప్రొఫెషనల్‌గా క్వాలిఫికేషన్ ఉన్న అమ్మాయి కావాలి. మీ అమ్మాయి గారంటీగా వాళ్లకి నచ్చుతుంది. వాళ్లు మీ అమ్మాయిని అటూ ఇటూ చూడకుండా చేసుకునేలా నేను చూస్తాను. మీకిష్టమైతే ఈ అడ్రస్‌కి ఉత్తరం రాయండి" అన్నాడు సుబ్బారావు.

దక్షిణామూర్తి రఘు తండ్రికి తన కూతుర్ని రఘుకివ్వాలని ఉందని ఉత్తరం రాశాడు. దానికి జవాబు రాలేదు. సుబ్బారావు కనుక్కొంటే–

"ఒక్క సంబంధమే వచ్చింది ఇప్పటికి. కనీసం పది పన్నెండైనా వస్తే మేం స్క్రీన్ చేసి ఓ మూడు నాలుగు అబ్బాయికి చూపిస్తాం. అందులో వాడు ఒకటి చేసుకొంటాడు" అన్నారుట. కనీసం మర్యాదకి ఆ విషయం తనకి వాళ్లే డైరక్టుగా తెలియజేసి ఉంటే బావుండేది అనుకొన్నాడు దక్షిణామూర్తి.

రఘు చుట్టాలందరూ విజృంభించి – "మావాడొకడు అమెరికానుంచి వస్తున్నాడు. మీ పిల్లనివ్వండి. మీ పిల్ల అతనికి నచ్చుతుందనే మా నమ్మకం" అంటూ ప్రొఫెషనల్ క్వాలిఫికేషన్స్ ఉన్న ఆడపిల్లల కోసం ఆంధ్రా అంతా వలలు వేయటం మొదలు పెట్టారు.

ఆ తరువాత "వాడికి ఉద్యోగంలో ప్రమోషన్ రావాలిట. ఇప్పుడే రాడు" అనీ, "గ్రీన్ కార్డుకి అప్లై చేశాడు. అందుకని దేశం వదలటానికి అవదు" అని చెపుతూ వచ్చారు.

"మేము స్క్రీన్ చేసి సెలక్ట్ చేసిన నలుగురు అమ్మాయిల్లో మీ అమ్మాయి ఒకత్తి. జాతకాలు నప్పాయి. మా అబ్బాయి తన పి.సి. మీద మీ అమ్మాయి క్వాలిఫికేషన్స్, తన రిక్వైర్‌మెంట్స్ మాచ్ చేసి చూసుకుంటే కోయఫిషెంట్ 0.9 దాకా వచ్చింది. మీ సంబంధం గురించి మేము చాలా సీరియస్‌గా ఉన్నాము. అయితే మా అబ్బాయి ఇండియాలో ముప్పై రోజులే ఉంటాడు. అందులో మొదటి పది రోజుల్లో పిల్లని సెలెక్ట్ చేసుకొని, రెండో పది రోజుల్లో పెళ్లి చేసుకొని, మూడో పది రోజుల్లో మాతోనూ, అతని అత్తా మామలతోనూ గడిపి అమెరికా వెళ్లిపోతాడు. కనక మీరు వచ్చి మీ అమ్మాయిని హైదరాబాద్‌లో చూపిస్తే పిల్లవాడికి టైము సేవ్ చేసినవారవుతారు. పైగా రఘు జెట్‌లాగ్, ఫుడ్ అండ్ వాటర్ ప్రాబ్లెమ్స్‌తో బాధపడుతున్నాడు" అని రాశాడు.

దక్షిణామూర్తికి తప్పలేదు. సంప్రదాయం పేరిట అతను బిగుసుకుపోదల్చుకోలేదు. "మేము హైదరాబాద్‌కి పిల్లని తీసుకువచ్చి మీ ఇంట్లో మీ అబ్బాయిని చూస్తాము" అని రాశాడు.

దానికి వెంటనే – "అది సంప్రదాయం కాదు. మీరు హైదరాబాద్ వచ్చి ఎక్కడున్నారో తెలియజేస్తే అక్కడికి వచ్చి మేమే చూస్తాము" అని రాశాడు రఘు తండ్రి.

ముగ్గురు మనుషులు హైదరాబాద్ వెళ్లి రెండు మూడ్రోజులుండి రావటానికి కనీసం వెయ్యి రూపాయలవుతుంది. అది తను పెట్టుకొంటే, ఆటోకి లేక పెట్రోల్‌కి రఘు తండ్రి పది రూపాయలు పెట్టుకొని సంప్రదాయం పాటిస్తాడుట అని దక్షిణామూర్తి గునిశాడు. కాని సుబ్బారావు – "పాపం! వాళ్ల ఇబ్బంది చాలా జెన్యువిన్, వెళ్లండి" అని వాళ్లని హైదరాబాద్ పంపించాడు.

దక్షిణామూర్తి ఉంటున్న హోటల్‌కి రఘు తల్లిదండ్రులతో వచ్చాడు. పిల్లవాడు బాగున్నాడు పొడుగ్గా. కాసేపు పరిచయాలు జరిగాయి. ఆపైన రఘు–

"నేను మీ అమ్మాయితో ఏకాంతంగా మాట్లాడాలి. టాంక్‌బండ్ మీదకి వాక్ వెళ్తాం. మీకభ్యంతరమా?" అని అడిగాడు.

"మా అమ్మాయి ఉద్యోగం చేస్తోంది. ధైర్యస్థురాలే. మగవాళ్లతో ఫ్రీగా మాట్లాడనూ గలదు. తగు దూరంలో ఉంచనూ గలదు. మీ గురించి తెలియకపోయినా, మా అమ్మాయి మీద మాకు పూర్తి భరోసా ఉంది. యూ కెన్ టేక్ హర్" అన్నాడు దక్షిణామూర్తి.

అతని జవాబుకి రఘు ముఖం చిన్నది చేసుకొన్నాడు. దక్షిణామూర్తి భార్య భయం భయంగా చూస్తూ ఊరుకున్నది.

అప్పుడు రఘు తల్లి వాళ్ల గురించి చెప్పింది. వాళ్లు ఆడపిల్లలు చదువుకోడం, ఉద్యోగం చెయ్యటం ప్రోత్సహిస్తారట. కాని క్లబ్‌లు, పార్టీలు, డాన్సులు ఇష్టం ఉండవుట. వాళ్ల కోడలు రోజూ దేవుడికి దీపం పెట్టేదై ఉండాలిట. కాని చాదస్తంగా పూజలు, పునస్కారాలు అంటూ మడి కట్టుకునేదైతే వాళ్లకి నచ్చదుట. అలా అని దేవుడనేవాడే లేడనే నాస్తికురాలు కాకూడదుట. వాళ్లకి అనాగరికులైన కోడలు పనికిరాదుట. వాళ్లలాగా సివిలైజ్డ్ అండ్ ఫార్వర్డ్ టైపు కావాలి. అంతేగాని, నాగరికత వెర్రితలలు వేస్తే ఇష్టం ఉండదుట. ఏదీ తక్కువ కాకూడదు. ఎక్కువా కాకూడదు. సమతూకంలో ఉండాలి – మా ఇంట్లో ఉన్నట్లు అని చెప్పింది.

ఆవిడ సమతూకానికి తమ అలవాట్లని నిర్వచనంగా ఇవ్వటం దక్షిణామూర్తికి నవ్వు తెప్పించింది. ప్రతివాళ్లూ 'సమతూకా'నికి తమ జీవితం నిదర్శనం అనుకొంటూ ఉంటారు. కాని 'మేం ఏంచేస్తే అదే ఘనకార్యం' అని బయటకి అనగలిగిన హిపోక్రసీ కేవలం పెళ్లికొడుకు తల్లిదండ్రులకి మాత్రమే ఉంటుంది అనుకొన్నాడు.

రఘు దక్షిణామూర్తి కూతుర్ని వెనక్కి తీసుకువచ్చి దింపేసి తన తల్లిదండ్రులతో వెళ్లిపోయాడు.

"మీకు మా నిర్ణయం కొద్ది రోజుల్లో తెలియజేస్తాం. ఇంకా ఇద్దరమ్మాయిల్ని చూడాలి" అన్నాడు రఘు తండ్రి వెడుతూ.

వీళ్లకి అమ్మాయి నచ్చిందంటే మళ్లీ ఇచ్చి పుచ్చుకోవడాలు మాట్లాడుకోడానికి ఈ ఊరు రావాల్రా దేవుడా అనుకొన్నాడు దక్షిణామూర్తి.

పెళ్లివారిని వెళ్లనిచ్చి – "అబ్బాయి నీతో ఏం మాట్లాడాడే?" అని అడిగింది దక్షిణామూర్తి భార్య కూతుర్ని.

"నాకు అమెరికాలో చదువుకోవడం ఇష్టమేనా అని అడిగాడు. అతను గ్రీన్ కార్డు హోల్డర్ అవటంవల్ల పెళ్లి చేసుకొన్నా నాకు వీసా రావటానికి రెండేళ్లు పడుతుందిట. అందుకని స్టూడెంట్ వీసా మీద వస్తే అక్కడ మళ్లీ దొంగ పెళ్లి చేసుకొని నేను గ్రీన్ కార్డు తీసుకోవటం సులభంట. తనకి వంట బోర్ అన్నాడు. నాకూ బోరే అన్నాను. హర్ట్ అయినట్టు పెట్టాడు మొహం.

"నాకు ఏ ఇంగ్లీషు రచయితలిష్టం అని అడిగాడు. వోడ్‌హౌస్‌లాంటి కొన్ని పేర్లు చెప్పాను. తనకి సీరియస్ రచయితలిష్టం అన్నాడు. నాకిష్టం లేదన్నాను. తను పార్టీలో ఎప్పుడైనా తాగుతాడట! కాని తాగుడు పెద్దగా ఇష్టం లేదన్నాడు. ఇంట్లో తాగనన్నాడు. తాగడం అంటూ చేశాక అది వీధిలో చేసినా, ఇంట్లో చేసినా ఒకటేకదా! తాగుడు మోతాదు మించా, తక్కువా అన్నదే ప్రశ్న. కాని, ఎక్కడన్నది ముఖ్యం కాదు అన్నాను. తను ఏం చేసినా లిమిట్స్‌లో చేస్తానన్నాడు. వాటీజ్ యువర్ లిమిట్ దెన్ అన్నాను. దానికి హర్ట్ అయినట్టు మొహం పెట్టాడు. ఏమైనా నన్ను చూసి కొంచెం బెదిరినట్టనిపించింది" అంది ఆమె.

"అలా ఎందుకు చేశావే?" అంది తల్లి నోరు నొక్కుకుంటూ.

"ఇంతకూ, అమ్మా! అతను అమెరికా వదలి నెలకుపైనే అయింది. దార్లో యూరోప్ అంతా చూసుకునీ, హాంగ్‌కాంగ్‌లో షాపింగ్ చేసుకుని వచ్చాడు తెలుసా?" అంది దక్షిణామూర్తి కూతురు.

"అరి బడుద్దాయి! దేశాలు చూడటానికి టైముందా? పెళ్లికూతుళ్లని వాళ్ల ఊళ్ళు వెళ్లి చూడటానికి లేదా! అన్ని ఊళ్లు తిరిగితే రాని కడుపు నొప్పి మన ఊరు వస్తేనే వస్తుందా?" అని దక్షిణామూర్తి భార్య ఆశ్చర్యపోతూ అంది.

"వాళ్లు నలుగురిని చూస్తున్నామంటే లిటరల్‌గా అయి ఉండదు. నలుగురినీ చూడద్దూ అని అయి ఉంటుంది" అన్నాడు దక్షిణామూర్తి.

రఘు నిజంగానే బెదిరిపోయాడు. అమాటే సుబ్బారావు వచ్చి, "మీ అమ్మాయి టూ ఇండివిడ్యువలిస్టిక్ అనుకొన్నారు" అంటూ మరోలా చెప్పాడు.

ఇదంతా దక్షిణామూర్తికిప్పుడు భార్య మాటల వల్ల గుర్తుకు వచ్చింది. సుజాత విడాకులిస్తానంటున్నది రఘుకి కాదు కదా అనుకున్నాడు. రఘు ఒక్కడే అమెరికాలో లేడని, అటువంటివాళ్లు అక్కడ చాలామందే ఉన్నారని అనుకుని సరిపెట్టుకున్నాడు.

మర్నాడు సుజాత వచ్చింది. "నేను మనసు మార్చుకోలేదు. నిన్న మరో విషయం చెప్పటం మరచిపోయాను. మా ఆయన నన్ను చూడటానికి వచ్చే ముందరే జర్మనీ, స్విట్జర్‌లాండ్ చూసి వచ్చాడు."

"జెట్‌లాగ్, కడుపు నొప్పితో బాధపడుతూ వచ్చాడా?" అని అడిగాడు దక్షిణామూర్తి అనుమానంగా.

"అవి మైనర్! మీరు పెళ్లి చూపులకి వెడుతూ కాశ్మీర్ చూసి వచ్చిన పెళ్లికొడుకు గురించి ఏమని అనుకుంటారు? మోస్ట్ అన్ రొమాంటిక్ ఫెలో అని కదా! ఎవడైనా పెళ్లి చేసుకుని పెళ్లాంతో వెళ్తాడు. దానికోసం సెలవు, డబ్బో

దాచుకుంటాడు. మా ఆయన అందుకు విరుద్ధం. హైలీ సెల్ఫ్ సెంటర్డ్ ఫెలో! రెండూ ఖర్చు పెట్టుకుని వచ్చాడు నన్ను చూడటానికి."

ఇదో కొత్త కోణం. తాము రఘు రొమాంటిక్ నేచర్ గురించి ఆలోచించలేదు.

"మీ ఆయనపేరు రఘూ కాదు కదా!" అన్నాడు దక్షిణామూర్తి అనుమానంగా.

"అవును. ఏం? అతను చూసిన డజను అమ్మాయిల్లో మీ అమ్మాయీ ఉందా?" అంది నవ్వుతూ సుజాత. ఆమె ముఖంలో నిన్నటి బెంగ లేదు.

దక్షిణామూర్తి తలూపాడు.

"హైదరాబాద్‌లో అతని ముందర ప్రొఫెషనల్లీ క్వాలిఫైడ్ అమ్మాయిల్నందరినీ బ్యూటీ పెరేడ్‌లో లాగా తెచ్చి మార్చ్ చేయించారు అతని చుట్టాలూ, వాళ్ల కుటుంబ స్నేహితులూను. మీ అమ్మాయికి ప్రొఫెషనల్ క్వాలిఫికేషన్ ఉండి అప్పటికే పెళ్లి కాకుండా ఉంటే వాళ్ల నెట్‌లో పడే ఉండాలి."

"పడ్డాం" అన్నాడు దక్షిణామూర్తి.

"మీ అమ్మాయిని మొదటి పదిరోజుల్లో మొదటి భాగంలో చూశారా? చివరి భాగంలోనా?" అని అడిగింది సుజాత.

"చివరి భాగంలోనే!" అన్నాడు దక్షిణామూర్తి.

"అనుకున్నాను. అంతపనీ చెయ్యగలవాళ్లే! అప్పటికే నేను నచ్చినట్టు మా వాళ్లతో చెప్పి, మిగిలిన సంప్రదింపులు మొదలుపెట్టాకే మీ అమ్మాయిని చూశారు. వాళ్లకి శ్రమ లేదుకదా! మీరు కష్టపడి, ఖర్చుపడి వెళ్లి చూపించారు. వద్దనటం ఎందుకు? మీ అమ్మాయి నాకంటే అందంగా ఉంటే ఏదో కారణం చెప్పి నన్ను వద్దనేవారు. మా మావగారు నాకు లెక్చరిచ్చాడు – పెళ్లిచూపులు సెలక్షన్ ప్రాసెస్ కాదని, మాచింగ్ ప్రాసెస్ అని. మాచింగ్ ప్రాసెస్ అయితే నచ్చాక ఇంకోళ్లని చూడటం ఎందుకట? బెటర్ మాచింగ్‌కా? ఇది సెలక్షన్ ప్రాసెస్ కాకపోతే ఏమిటట నా బొంద! హిపోక్రసీ దైనేమ్ ఈజ్ మై ఇన్‌లాస్" అంది సుజాత.

దక్షిణామూర్తి మరి మాట్లాడకుండా కోర్టు కాగితాలు తీసి ఫైలుమీద 'సుజాత విడాకుల కేసు' అని వ్రాశాడు.

● *ఆంధ్రప్రభ వారపత్రిక 1 సెప్టెంబర్ 1991* ●

★ ★ ★

బండి నారాయణస్వామి

67

# అవశేషం

కురవోల్లది పెద్ద పండగ. పంద్రెండేండ్లకు ఒకసారి చేయాల్సిన పండుగ. కాని యాభై ఏండ్ల తరువాత చేస్తున్న పండుగ.

మా ఇంటిదేవుడు కందుకూరి ఉజ్జినప్ప. ఆ గుడికట్ట పూజారి ముసిలోడు అయిపోయాడు కాబట్టి మరో కొత్త పూజారప్పను నియమించే కార్యక్రమం కూడా ఉంది పండగలో.

ముసలి పూజారప్ప మా ఇంటికొచ్చాడు. అడ్డ పంచె కట్టి మోచేతుల వరకూ అంగీ వేసుకొని ఉన్నాడు. గుడ్డలు నలిగిపోయాయి. మనిషి నల్లగా ఉన్నాడు. చేతికి కడియం, మెడలో ఏదో తాయెత్తు. తెల్లగా నెరిసిపోయిన వెంట్రుకలు. గీసుకోని గడ్డం. బాపన పూజారి మాదిరి కాకుండా జిడ్డుగా మురికిగా ఉన్నాడు. ముందే మనిషి కారు నలుపు. దుమ్ము చుట్టుకున్న కాళ్లు మరీ అసహ్యంగా ఉన్నాయి. పూజారప్పలు కాళ్ళకు చెప్పులు తొడుక్కోకూడదని కులాచారం!

పూజారప్పకు ఇంకా ఎన్నో నియమాలు. బీడీలు కాల్చకూడదు. మద్యం ముట్టరాదు. మాంసం కూడా తినరాదు. ఆవుపాలు తప్ప ఎనుము పాలు తాగకూడదు.. ఇంకా ఎన్నో.

ముందు కాలంలో పూజారప్పలు తమ ఇంట్లో వండిన అన్నం కూడా తినేవాళ్లు కాదంట – స్వంతంగా వండుకుని తినడం తప్ప! ఆ నియమం కొంచెం సడలిపోయింది ఈ మధ్య. తల్లిగానీ, భార్యగానీ వండిన అన్నం తినొచ్చు అని కొంచెం మార్చుకున్నారు ఆ నియమాన్ని.

కాలం మారిపోతుంటే ఆధునిక జీవితపు స్థితిగతులు ఎంతో వేగంగా తారుమారు అయిపోతుంటే, ఒక ఆచారాన్ని ఎంత నిష్ఠాగరిష్ఠులయినా ఎంత కాలమని పాటిస్తారు పాపం!

కొంతకాలానికి పూజారప్ప అందరి మాదిరి చెప్పులు వేసుకు తిరిగినా, ఎనుముపాలు తాగినా, హోటళ్ళలో భోంచేసినా ఆశ్చర్యం ఉండదు.

కాలానుగుణంగా మారిపోతుంటాయి ఆచారాలూ, ఆహార నియమాలూ అన్నీ! ఆ విషయం పూర్వకాలపు మనిషి అయిన మా అవ్వకు బాగా తెలుసు. పక్కింటి బాపనమ్మతో అవ్వ గొప్పగా చెబుతుంటుంది–

'అమ్మయ్యా! మేం శూద్రోల్లమూ, గొర్రెలు కాసేవాళ్ళమే కావచ్చు. కాని మీ మాదిరి మా పూర్వులు కూడా మాంసం ముట్టేవాళ్ళు కాదంట. జీవాలు రోగమొచ్చి సచ్చిపోతాంటే, దాన్లని ఊరకే పారవేసే దానికి మనసు రాక జందేలు తీసి జామిచెట్టుకు తగిలించి మాంసం తినడం మొదలు పెట్టినారంట. ఆ జందెం ఇప్పటికీ ఉంటుంది అమ్మయ్యా మా దేవుని దగ్గర' అంటూ.

ఇలాంటివే ఎన్నో పూర్వపు ఆచారాలు మార్పులకు లోనవడం ఆమెకు తెలుసు. కానీ ఆచారాలూ, నియమాలు తన హయాంలో మారిపోతే మాత్రం ఆమెకు కంపరం కలుగుతుంది. తన అస్తిత్వానికే ఏదో పెద్ద దెబ్బ తగిలినట్లు కలవరపడిపోతుంది.

మా ఇంట్లో అందరితోనూ కాళ్ళకు మొక్కించుకుని, మా నుదుట బండారు దిద్ది, మేం ఇచ్చిన బియ్యమూ బెల్లూ, నలభై రూపాయల దుడ్లూ తీసుకుని వెళ్ళిపోయాడు పూజారప్ప. నూటపదహార్ల మీద ఉన్న పూజారప్పను నలభై రూపాయలకు దించేసరికి మా అవ్వకు తలప్రాణం తోకకు వచ్చింది.

పూర్వం కులం వాళ్ళంతా పూజారప్ప ఇంటికి పాలు తెచ్చేవాళ్ళు. పెరుగూ, నెయ్యి తెచ్చేవాళ్ళు. పండ్లూ కూరగాయలూ, ధాన్యం ఏం పండితే అవి తెచ్చిచ్చేవాళ్ళు. కాని కాలక్రమంలో ఆ సదుపాయలన్నీ అంతరించిపోయాయి.

తను ఉత్పత్తి చేసిన ప్రతి వస్తువునీ డబ్బులోకి మార్చుకోవడం ప్రారంభించాక మనిషిలో మునుపటి ఉదారత్వం పోయింది. అంతేకాదు, సైన్సు అభివృద్ధి చెందడంతో మనిషి అవసరాలు పెరిగాయి. ధరలు ఆకాశానికి అంటాయి. తన ఇంట్లో పాడినీ, పొలంలోని పంటనీ తన కడుపుకు కూడా సరిగా తినకుండా జాగ్రత్తగా అమ్మి సొమ్ము చేసుకుంటే తప్ప బతకలేని దుర్భర పరిస్థితులు కూడా ఏర్పడ్డాయి. ఇట్లాంటి కష్టకాలంలో ఎవరు మాత్రం ఏం సప్లై చెయ్యగలరు పూజారప్ప ఇంటికి?

యాభై ఏండ్ల తరువాత చేస్తున్న పెద్ద పండగను చూడబోతున్నాను కదా అని మా అవ్వ తెగసంబరపడిపోతోంది. నాక్కూడా ఇదే చివరి పండుగ. మరో పన్రెండేళ్ళకు వచ్చే పెద్ద పండుగకు నేను హాజరు కాలేను. కనగానిపల్లిలో పెద్ద పండుగ సంబ్రంభం ఒక ఎత్తైన మైదానంలో.

పన్రెండేడ్లకు ఒకసారి వివిధ ప్రాంతాలకు వెళ్ళిపోయిన వారంతా అక్కడ కలుసుకుని, తమలో బతికిన వాళ్ళెవరో చచ్చిన వాళ్ళెవరో తెలుసుకుంటూ ఉండాలని, పూర్వం సంచార జాతులు ఏర్పాటుచేసుకున్న సంకేతస్థలం.

ఒక ఎత్తైన దిన్నె మీద కులంవాళ్ళంతా విడిది చేశారు. ఎక్కడెక్కడో పల్లెల్లో వ్యవసాయం చేసుకునేవాళ్ళూ, గొర్రెలు మేపుకుని వృత్తి చేసుకు బతికేవాళ్ళూ, ఎక్కడెక్కడో పట్టణాల్లో, సిటీలలో స్థిరపడిపోయి ఉద్యోగాలూ, వ్యాపారాలూ చేసుకుంటున్నవాళ్ళూ....చాలా మంది వచ్చి చేరారు ఆ దిన్నెపైకి.

పూర్వం దిక్కుకొకరు వెళ్ళిపోయి సంచార జీవనం సాగించేటప్పుడు ఉత్తరం నుంచీ ఒక గుంపూ, దక్షిణం నుంచీ ఒక గుంపూ వస్తుంటే, ఆ ఎత్తైన దిన్నెపైకి ముందుగా వచ్చి చేరినవాళ్ళు అల్లంత దూరంలో గొర్రెల మందల్తో వస్తున్న తమవాళ్ళను చూసి 'అదుగో, అదుగోలే! మనోల్లు వస్తాండారు' అని సంతోషంతో కూతలు పెట్టేవాళ్ళంట.

ఇప్పుడు దేశంలో కమ్యూనికేషన్స్ పెరిగాయి. చూడాలని అనిపించాలేగాని ఏ బంధువు ఎంత దూరంలో ఉన్నా ఎప్పుడు పడితే అప్పుడు బస్సో రైలో ఎక్కి చూసి రావచ్చు. పూర్వం మాదిరి పంద్రెండేళ్ళవరకూ కాచుకునే దురవస్థ ఇప్పుడు లేదు.

సంచారజీవనం నాటి పరిస్థితులు ఇప్పుడు లేవు. ఏటేటా గొర్రెలు అమ్మి వాటి బొచ్చు అమ్మి వచ్చిన డబ్బుతో ఇంత నేలచెక్క కొనుక్కుని వ్యవసాయం చేసుకుంటూ ఏదో ఒక ఊళ్లో స్థిరపడిపోయినవాళ్ళే అందరూ!

మా వీధిలోని బంధువుల పేర్లే ఇప్పుడు నాకు సరిగ్గా తెలియవు. పిన్నమ్మ అనవలసిన వాళ్ళని అత్త అనీ, అత్త అనవలసిన వాళ్ళని పిన్నమ్మ అనీ పిల్చి మా అవ్వతో చివాట్లు తింటున్నాను.

'ఈ కాలం పిల్లోల్లకి ఏ బంధువు ఏమవుతాడో వరసలు కూడా తెలీవు. ముందుముందుకు ఇంకా ఎట్లా మారిపోతారో ఈ చదువుకున్న పిల్లోల్లు' అని దిగులుపడిపోయింది మా అవ్వ.

ఒకప్పుడు మనుషుల్ని గుంపుగా కూడగట్టడంతో కులం మాత్రమే ఎక్కువ ప్రాధాన్యత వహించేది. ఇప్పుడూ.....? విద్యా, ప్రాంతమూ, రాజకీయ పార్టీలూ, ఐడియాలజీలూ....ఎన్ని లేవు మనుషుల్ని గుంపులు గుంపులుగా కూడగట్టడానికీ, విడగొట్టడానికీ!

చాలామంది వచ్చారు జనం.

బస్సుల్లోనూ, సైకిళ్ళమీదా, మోపెడ్లా, స్కూటర్లా, మోటర్‌బైక్‌ల మీదా వచ్చారు. ఒకరిద్దరు సంపన్నవంతులు కార్లలో వచ్చారు.

వృత్తి మాత్రమే జీవనాధారం కాదిప్పుడు.

చదువుకునేవాళ్ళు చదువుకుంటున్నారు. ఉద్యోగాలు చేసేవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నారు. వ్యాపారం చేసేవాళ్ళు వ్యాపారం చేస్తున్నారు. సంచార జీవనం నుంచి విడివడి సమాజంలో కలిసిపోయారు. డబ్బు సంపాదించిపెట్టే వివిధ మార్గాల్లోకి చొచ్చుకుపోయి నాగరీకులు అయిపోయ్యారు.

మధ్యతరగతి విలువలు ప్రవేశించాయి మనుషుల్లో.

భర్త వదిలేసిన ఆడదాన్ని హేళనగా చూస్తున్నారిప్పుడు.

చీర కట్టించుకుని మరో మనువు చేసుకునే ఆచారం మూలపడింది.

ఏడుగురు భర్తల్ని మార్చి గౌడసానిగా పేరుపొంది కులంలో గౌరవమన్ననలు పొందగలిగిన స్త్రీలు కాగడా పెట్టి వెతికినా కానరారు ఇప్పుడు ఈ కురవోళ్ళలో.

కులపెద్ద – గురువులయ్య నిర్వహించాల్సిన పెళ్ళితంతుని ఇప్పుడు బ్రాహ్మణ పురోహితులే నిర్వహిస్తున్నారు. పాపం – మా గురువులయ్యలకు కొంగులు ముడివెయ్యడం తప్ప అర్థం కాని మంత్రాల్ని వల్లించడం రాదుకదా!

వరసలో కలకలం!

'జెల్లిపల్లి మల్లయ్య తన కొడుకును పూజారిగా ఎక్కించేదానికి ఒప్పుకోలేదంట!'

'ఎందుకో?'

'ఎందుకో అంటే....? కూలీ నాలీ చేసుకుని పొట్టపోసుకుండేవాళ్ళు పాపం చెప్పులు లేకుండా నడవల్ల అంటే వీలైతుందా? ఇంట్లో ఒకరు ఎంగిలి పడి లేచినంక ఆ అన్నం తినరాదంటే వీలైతుందా? ఎక్కడికన్నా పోయి ఇంత పనీపాట చూసుకోకుండా పొద్దుగూకులూ గుళ్ళో కూర్చోవల్ల అంటే వీలైతుందా? ఎట్ల బతుకుతారు పాపం?'

'ఎవరుంటారో మల్ల పూజారప్పగా?'

'ఏమో! ఎవరుంటారో మల్ల!'

గుంపులు గుంపులుగా చర్చలు.

చెట్లకిందా, ఏటిదగ్గరా, గుడికట్టమిందా ఈగల్లా ముసిరిన జనాలు. కందుకూరి ఉజ్జినప్పకు పూజారిని ఏర్పాటుచేసే సందర్భంగా సాక్ష్యం ఉండటానికి ఇతర ఊర్లనుంచీ తరలివచ్చిన దేవుళ్ళు!

అంతరగంగప్ప, కురుగుంటప్ప, కామారుపల్లి పెద్దయ్య, గొల్ల పల్లయ్య, కనగానిపల్లి పెద్దయ్య, దుర్గమప్ప, బీరప్ప, కాటమయ్యా...మొదలైన దేవుళ్ళంతా అన్నదమ్ములు! డెబ్బై ఏడు గుడికట్టలకు చెందినవాళ్ళు!! అంతా తరలివచ్చారు. మా దేవుని వన్నె చూడు. మా దేవుని వైభవం చూడు అని పోటీలుపడి మాట్లాడుకుంటున్న జనం.

పొడవుగా కొంచెం విశాలంగా ఉన్న చెక్క మీద కర్రలు అమర్చి, వాటి మీద ఒక ఎర్రని గుడ్డని గూటిలా బిగించి, ఆ గూటిలో గుర్రాలూ, ఏనుగులూ లాంటి జంతువుల బొమ్మలు అమర్చుతారు.

అల్ల అమర్చిన కిరిడందిలో, ఆ మూల ఒకటీ ఈ మూల ఒకటీ రెండు వీరుల బొమ్మలు ఉంటాయి గుర్రాన్నెక్కి కత్తి పట్టుకుని రౌద్రంగా. ఆ గుర్రాలూ, ఏనుగుల మీద ఎన్నెన్నో వెండి గొడుగులు ఉంటాయి చిన్నవీ పెద్దవీ. ఒక మూల నెమలి కన్నుల్తో చేసిన వింజామరం మెరుస్తుంటుంది. మరో మూల లింగాయుత జందెమూ, వీరముష్టివల కూడా ఉంటాయి.

పరచిన గొంగళ్ళ మీద దింపారు దేవుళ్ళని.

ఆ నల్లని కంబళ్ళ మీద బండారు మరకలు, వెలుగుతున్న అగరొత్తుల కడ్డీలు, టెంకాయల నీళ్ళవి. కొంచెం పక్కగా కొబ్బరి తిని పారేసిన టెంకాయచిప్ప ముక్కలు.

భుజంమీంచి కాళ్ళకిందవరకూ జారిపోయేటట్లు ధరించిన గొంగళి వస్త్రంతో, మెడలో తాయెత్తులతో, పూసలదండలతో, నెత్తిమీద ఎలుగ్గొడ్డు చర్మపు ఎత్తైన విశాలమైన టోపీతో, పిల్లనగోవి ఊపుతూ, డమరుకం వాయిస్తూ, డబ్బులు యాచిస్తూ తిరుగుతున్న గొరవయ్యలు!

పొద్దు మునిగింది. ఏ కులస్తుడూ ముందుకు రాలేదు తన కొడుకును పూజారిగా చెయ్యడానికి.

డెబ్బై ఏడు గుడికట్లకు పెద్ద – చిన్నసైజు మఠాధిపతిలాంటి గురువులయ్య ఇంటింటికీ తిరుగుతున్నాడు ఏడెనిమిది మంది పెద్ద మనుషుల్ని వెంటబెట్టుకుని. కాని ఫలితం సున్న.

పూజారితనం కట్టుకోడానికి మనిషి దొరికినా, రెండు దినాలు తరువాతగానీ మంచిరోజు లేదు పెద్ద పండగ జరపడానికి.

"రెండు దినాల వరకూ మేం ఎట్లుంటాము ఈ అడవిలో" అంటూ జారుకున్నారు మోటర్‌బైకుల్లోనూ, కార్లలోనూ వచ్చినవాళ్ళు.

"మనం రెండు దినాలు ఉండలేకపోతే మన పూర్వపోల్లు తమ బతుకంతా ఈ అడవుల్లోనే ఎట్ల గడిపి ఉంటారు?" అంది మా అవ్వ.

ఒక మంచి .టీ దొరకక, నా సిగరెట్ బ్రాండు గోల్డుఫ్లేక్ దొరకక చాలా ఇబ్బంది పడిపోయాను ఆ అడవిలో.

బండ్లు కట్టుకొని వచ్చినవాళ్ళు మళ్ళీ వెనక్కి తిరిగిపోలేక జట్లు జట్లుగా చేరి, చెట్ల కింద పెద్ద పెద్ద రాళ్ళు పొందించి, ఆ రాళ్ళ పొయ్యి మీద కాగులూ, పెద్ద పెద్ద తపేలాలూ పెట్టి అన్నం వండుకుని తిన్నారు, ఇంకా వెలుతురు ఉండగానే!

రాత్రి కాగానే పెద్ద టార్పాలు కిందపరచి కంబళ్ళు కప్పుకుని పడుకున్నారు గుడికట్ట మీందా బయల్లోనూ! ఏవోవో తీరకాయపీచు బంధుత్వాల గురించిన మాటలు జోరుగా సాగుతున్నాయి.

మా అవ్వ వక్కాకు నములుతూ తన తండ్రి గురించిన జ్ఞాపకాలు తవ్వుకుంటోంది మా చిన్నాయన దగ్గర.

"నూరేండ్ల కిందటి మాటరా!" అంటూ మొదలుపెట్టింది.

"అనంతపురానికి పది ఆమడల దూరంలో ఉంది కదురా నాగిరెడ్డిపల్లి! ఆ నాగిరెడ్డిపల్లిలో పుట్టినాడు మా నాయన. సంవత్సరం పిల్లోనిగా ఉన్నప్పుడు మా నాయనకు ఏదో రోగం వచ్చిందంట. ఆ ఊరి నుంచీ బండి కట్టుకొని అనంతపురం పాత ఊరి ఆస్పత్రికి పిల్లోన్ని ఏసుకువచ్చినారు.

ఒక దినం జరిగె. రెండు దినాలు జరిగె, వారం దినాలు జరిగె! తెచ్చుకున్న బత్తెమేమో అయిపాయెగానీ పిల్లోనికి మేలు కాలేదంట. అప్పుడు కొడుకులు లేని ఒక స్వకులస్తుని ఇంటికి పోయి 'తల్లీ! మీరు ఇక్కడే అనంతపురంలో ఉండేవాళ్ళు. పిల్లోన్ని మీ దగ్గరే పెట్టుకుని ఆస్పత్రిలో చూపించి రోగం బాగుచేయుండమ్మా! మేము ఇక్కడ ఎంతకాలం ఉంటాము? మా ఊళ్లో జీవాలు ఏమయినాయో? జీవాల వెంట పోయేవాళ్ళకి సంగటి ముద్దలు సరిగా అందుతాండాయో లేదో! గొడ్డూగోదం, ఇల్లూవాకిలీ ఎట్లున్నాయో ఏమో! మేం పోతాము తల్లీ! పిల్లోన్ని బతికించుకుంటారో లేక సంపుకుంటారో అంతా మీ దయ' అని పిల్లోన్ని ఇచ్చేసిపోయినవాళ్ళు మళ్ళీ తిరిగి చూడలేదంట.

ఇప్పుడు జరుగుతూ ఉన్నట్లు పెద్ద పండగ జరిగిందంట ఒకసారి. మా నాయనను కన్నవాళ్ళూ, పెంచినవాళ్ళూ ఇద్దరూ కలుసుకున్నారంట ఆ వరసలో. అప్పటికి మా నాయనకు పండ్రెండు ఏండ్లు! అంత ఎత్తు పెరిగిన తన కొడుకును పట్టుకుని–

'అప్పా! నేను కఠినాత్ముకురాల్ని అప్పా! నిన్ను కన్నతల్లిని నాయనా? నిన్ను పెంచలేకపోయినాను తండ్రీ! సంవత్సరం పిల్లోనిగా ఉన్నప్పుడు ఇడిసిపెట్టిపోయి

తిరిగి మళ్ళీ చూడకపోతిమి. పాపాత్ముర్రాల్ని నాయనా, ఏ జన్మలో ఏ తల్లీబిడ్డల్ని వేరుచేసి ఉంటినో!' అని గోడుగోడుమని ఏడ్చిందంట మా నాయనమ్మ. అప్పుడు ఆ పంద్రెండేండ్ల పిల్లోన్ని పట్టుకుని తండ్రీ ఏడ్చేదే, అన్నలూ ఏడ్చేదే, అక్కలూ ఏడ్చేదే! అబ్బబ్బ! వాళ్ళ ఏడ్పులు చెప్పనలవిగానివంట పాపము!'

'ఇప్పుడు ఊరి ఊరికీ బస్సూ, ఊరికి రెండు మూడు ఆస్పత్రులూ ఉన్నాయి' అంటున్న చిన్నాయనతో–

'బండారోల్లూ, రాగేవాళ్లూ అందరికంటే మా బండివాల్ల గుంపు పెద్దదివాయ్' అని గర్వంగా మీసం దువ్వుతూ మురిసిపోతున్నాడు ఒక బంధువు.

రాత్రి తొమ్మిది గంటలు. మా ఇంటికి టి.వి. వచ్చిన తరువాత రాత్రి తొందరగా నిద్రపోయే అలవాటుపోయింది నాకు.

నిద్రరాక మెల్లగా గుడికట్ట మీద చేరాను. కరెంటు దీపాలకు అలవాటు పడిన నా కళ్ళకు ఆ అరుబయల్లో నిండిన వెన్నెలకాంతి వింతగా కన్పిస్తోంది.

'మన కులమోల్ల ఓట్లు ఒక్కటికూడా పక్కకుపోకుండా చూడల్ల' అని హెచ్చరిస్తున్నాడు మండలాధ్యక్షునిగా పోటీ చేయబోతున్న ఒక కులస్తుడు. వీళ్ళది డబ్బు కులం! ఓట్ల కులం! పైకి మాత్రం తమ కులాభిమానాన్ని చాటుకుంటూనే ఉంటారు స్వప్రయోజనాలు సాధించుకోవడానికి.

'ఫలానా ఎం.ఎల్.ఎ. మనోడే. ఫలానా మాజీమంత్రి మన కులంవాడే' అని గర్వంగా చెప్పుకొస్తున్నాడు మా మామ, తన ఎదుట సల్లాడాలు తొడుక్కున్న నలుగురు అమాయకుల్ని పోగుచేసుకొని.

'హరిహరరాయలూ, బుక్కరాయలూ మన కులంవాళ్ళే. మహారాష్ట్ర నేలిన రాణీ అహల్యాబాయి ఎవరనుకున్నారు? మన కులమే!' అంటూ చరిత్ర చీకట్లో మా పూర్వీకుల ఉనికి కోసం తడుములాడుకుంటూ పోతున్నాడు గురువులయ్య.

రాజ్యాల్ని నిర్మించినవారికంటే, రాజ్యాల్ని ఏలినవారికంటే – చెట్టూ పుట్టా పట్టుకుని అడవిలో గొర్రెలు కాస్తూ, పిల్లనగోవి వాయిస్తూ ప్రకృతిలో ఒక భాగమై పోయి అతి సామాన్యమైన సంచారజీవనం గడిపిన నా పూర్వీకుల జ్ఞాపకాలే నన్ను ఎక్కువగా ఆహ్లాదపరుస్తున్నాయి ఎందుకో!

'మీ దగ్గర కురవోల్ల చరిత్రకు సంబంధించిన ఏవో తాళపత్ర గ్రంథాలు ఉన్నాయంట కదా! మీ ఊరికి వస్తాను. చూపిస్తారా ఒకసారి?' అన్నాను ఇంటరెస్టుగా.

'అయ్యయ్యో! ఆ గ్రంథాల్ని, మేం – గురువులయ్యలు తప్ప ఇంకెవరూ చూడకూడదు' అన్నాడు. గాయత్రిని శూద్రులకు ఉపదేశం చెయ్యకూడదు అనే బ్రాహ్మణాధిక్యతకు ఏ విధంగా తీసికట్టు అవుతుంది మా గురువులయ్య అధిక్యత?

తెల్లారింది.

ఏ తండ్రీ ముందుకు రాలేదు, తన కొడుకును పూజారిగా వప్పగించడానికి.

మధ్యాహ్నం దాటింది.

తన పూజారిని తనే వెదుక్కుంటాడులే దేవుడు అని నిర్ణయం చేశారు పెద్దమనుషులు. ముసలి పూజారప్ప ఏ పిల్లోన్ని ముట్టుకుంటే ఆ పిల్లోన్ని

పూజారప్పగా విడిచిపెట్టక తప్పదు ఆ తల్లిదండ్రులకి. అందుకని తమ తమ పిల్లోల్లని జాగ్రత్తగా ఇళ్ళల్లో దాచి పెట్టుకుంటున్నారు అంతా. మనుషులు మోస్తున్నారు. దేవుళ్ళు ఊరేగుతున్నారు.

మనుషులు కదిలారు.

కిరిదండి కదిలింది.

మనుషులు ఊగుతున్నారు.

దేవుడు ఊగిపోతున్నాడు.

ఇంకా మిగిలి ఉన్న పాత సమాజపు అవశేషాల్లాగా—

దిక్కు దిక్కుమని మిటుకుంటూ, యాచిస్తూ, గుప్పుమనే సారాయి కంపుతో ఎవరో ఒకర్ని పొగుడుతూ పాడే ఆసాదోల్ల పదాలు!

దేవున్ని వరమడిగేవాళ్ళ పక్కన బుర్రు బుర్రుమని బూర్లు కొట్టే బూరోల్లు. భీకరమైన ముఖాల్తో జంతునృత్యాలు చేస్తూ, గిన్నెలో పోసిన పాలని పోటీలు పడి తాగుతున్న గొరవయ్యలు!

ఆగి ఆగి వీధుల్లోకి పరుగెత్తుతున్నాడు దేవుడు.

పరుగెత్తి పరుగెత్తి ఒక కులస్తుని ఇంటి ముందు ఆగాడు.

ఆ ఇంటి యజమాని పరుగెత్తుకొచ్చాడు బైటికి.

'మమ్మల్ని విడిచిపెట్టు స్వామీ! ఏదో కూలీనాలీ చేసుకుని పొట్టపోసుకునే వాళ్ళం. మా ఇంటికి పూజారితనం అచ్చిరాదు దేవరా!' అని తలకాయమీదికి చేతులెత్తి దండం పెట్టేశాడు.

అక్కడినుంచీ మళ్ళీ ముందుకూ వెనక్కూ పరుగెత్తి మరో ఇంటి ముందు ఆగాడు దేవుడు.

ఆ గుంపులోనే ఉన్నాడు ఇంటి యజమాని. కిరిదండికి ఎదుటపడి—

'మా తాత పూజారిగా ఉండె కదా నీకు అన్ని ఏండ్లు! ఏం చేసినావు నువ్వు మాకు? మా జీవాల్ని అభివృద్ధి చేస్తివా? మా పాడీపంటని అభివృద్ధి చేస్తివా? ఏ ముఖం పెట్టుకుని వచ్చినావు మా ఇంటికి మళ్ళీ?' అంటూ విదిలించి పారేశాడు.

మరో రెండు మూడు ఇండ్ల దగ్గర ఆగాడు దేవుడు. కానీ ఫలితం కన్పించలేదు.

కోపం వచ్చినట్టు కాసేపు చిందులేసి, ఎటుపడితే అటు దిక్కూ దివాణం లేకుండా పరుగెత్తి, తన చుట్టూ తానే గుండ్రంగా తిరిగి తిరిగి చివరకు నిస్సహాయంగా వెళ్ళిపోయాడు మళ్ళీ తన గుడిలోకి.

కలికాలం! కలికాలం! దేవుని మాటకు కూడా విలువ ఇవ్వకపోయిరి కదా ఈ మనుషులు! అని ముక్కు మీద వేలు వేసుకుని ఆశ్చర్యపోయింది మా అవ్వ.

ఆ రాత్రి పెద్ద మనుషులందర్నీ కలిపి ఒక సమావేశం ఏర్పాటు చేశాడు గురువులయ్య.

'చూడండప్పా! నేను ఒక మాట చెప్తాను. అందరూ వినండి ఈ గుడికట్ట కింద ఇన్నూట నలభై రెండు జతలు ఉన్నారు, దంపతులు! ఒక్కొక్క జత నుంచీ నూటాపదహోర్లు వసూలు చేస్తే అయిదువేల వరకూ అవుతుంది. ఆ దుడ్లు

పెట్టి అయిదు ఎకరాల చేను కొని పూజారప్ప పేరిట పత్రం రాసిస్తాము. అప్పుడు వాళ్ళ పోషణకు ఏ ఢోకా ఉండదు. ఎవరో ఒకరు ముందుకు వస్తారు పిల్లోన్ని ఇయ్యడానికి' అని ముగించాడు.

పెద్దమనుషులంతా తలలూపారు.

నేను వేయిన్నూటపదహార్లు ఇస్తాను అని అప్పుడే ధారళంగా ప్రకటించేశాడు మండలాధ్యక్ష పదవికి పోటీ చేయబోతున్న కులస్తుడు.

'పూజారప్ప పెరిగి పెద్ద అయినంక అతని పెళ్ళి ఖర్చుకూడా మీరే పెట్టుకుంటే బాగుంటుంది' అని మరో సలహా ఇచ్చాడు గురువులయ్య.

దానిక్కూడా సమ్మతించారు.

అక్కడినుంచీ మొదలైంది పూజారప్ప పదవికోసం పోటీ!

మా పిల్లోన్ని ఇస్తామంటే మా పిల్లోన్ని ఇస్తామని పరుగెత్తుకొస్తున్నారు కులస్తులు.

ఇరవై అయిదువేలు చిన్న మొత్తమా?

అయిదు ఎకరాల చేను పిల్లోని పరమైతే ఎట్లో బతుక్కోవచ్చు కదా అని వాళ్ళకు ఆశ!

ఎన్ని ఏండ్లు కష్టం చేస్తే ఆ మాత్రం భూమిని సంపాదించుకోగలరు? తమకు పుట్టిన నలుగురు అయిదుగురు పిల్లల్లో ఒక్కనికైనా జీవనాధారం దొరికినట్లే కదా, ఆ పూజారి పదవి వస్తే....అని వాళ్ళ ఆలోచన.

రావడానికైతే తొమ్మిది పదిమంది దాకా వచ్చారు పోటీకి. చివరికి రంగంలో ముగ్గురు మిగిలారు.

బతిమాలుతున్నారు.

పై రవీలు సాగిస్తున్నారు.

పూజారి పదవిమీద తమ వంశానికి హక్కు ఉన్నట్టు డిమాండ్ కూడా చేస్తున్నారు.

పది లక్షలకు ఆస్తిపరుడైన పుల్లన్న చెప్పిన మాట విని జెల్లిపల్లి మల్లయ్య కొడుకునే కొత్త పూజారిగా ఒప్పుకున్నారు అంతా.

ఆ చిన్నపిల్లోనికి ఆరేండ్లు. అందరూ ఆ పిల్లోనివైపే వింతగా చూసి 'అదుగో! ఆ పిల్లోడే చూడు కొత్తపూజారి' అని గుసగుసగా మాట్లాడుకుంటోంటే, అదేమీ పట్టించుకోకుండా సపోటకాయ తినడంలో నిమగ్నమైపోయి ఉన్నాడు ఆ కొత్త పూజారప్ప.

రాత్రి ఊరేగింపు!

కందుకూరి ఉజ్జినప్పతో సహా అతిథులుగా పిలిపించుకున్న ఇతర దేవుళ్ళు కూడా ఊరేగుతున్నారు.

దేవుళ్ళను ఎత్తుకున్నారు.

వీధి సందుల్లో జనసందోహాలు.

మిద్దెలపైన క్రిక్కిరిసిన ఆడవాళ్ళ నవ్వు ముఖాలు.

ప్రతి దేవుని దగ్గరా ఎర్రగా వెలిగే ఇలాయికట్లు.

గాలికి రెపరెపలాడే ఇలాయికట్ల వెలుగుల్లో ఎర్రగా మెరుస్తున్న జనం ముఖాలు. కిరిడందీలో ఎర్రగా వన్నె పెట్టిన బొమ్మలు ఇలాయికట్ల వెలుగుల్లో మరింత రక్తవర్ణంతో మెరుస్తున్నాయి గంభీరంగా.

కిరిడందీ కదిలినప్పుడల్లా జిగ్గుజిగ్గుమని మెరిసే వెండి గొడుగులు. ఆ వైభవాన్నంతా చూడటానికి ఒళ్లంతా కళ్లు చేసుకున్న నెమలి ఈకల చామరాలు.

కిరిడందీని మోస్తూ ముందు ఇద్దరూ, వెనుకల ఇద్దరూ!

అప్పుడప్పుడు భుజాల మీంచి దేవుని బరువు దించుకుని సేద తీరడానికి వాళ్ల చేతుల్లో హంసపాదులు.

వొల్లులు కొడుతున్నారు.

పిల్లనగోవి వాయిస్తున్నారు.

కిరిడందీ ముందు భాగంలో ముసలి పూజారప్ప.

పూజారప్ప కాళ్లమింద నీళ్లబిందెలు గుమ్మరించి నుదుటికి బండారు దిద్దించుకుని పోతున్న ఆడవాళ్ళు.

కొందరు ఆడవాళ్ళు నెత్తిమీద నీళ్లబిందెలు గుమ్మరించుకుని వారు పడుతున్నారు, ఏవో కోర్కెలు కోరుకుంటూ.

బిందెల బిందెల నీళ్లతో రొచ్చురొచ్చుగా కలిసిపోయిన నేల.

వాసూనే బందే వనమయ్య చెందూ....దేవుని వైపు చేతులు ఎగరేసి ఉద్వేగంతో పాడే పాటలు!

దుఃఖమో, సంతోషమో, రెండూ కలిసిన భక్తిభావమో ముప్పిరిగొని బొంగురు పోతున్న గొంతుకలు!

కిరసనాయిలు పోస్తే భగ్గుమంటూ రెచ్చిపోయి మండే ఇలాయికట్ల జోరు వెలుగుల్లో తళుక్కుమంటున్న వాళ్ల ఆర్ద్రనేత్రాలు!

గుంపు తొక్కిసలాటకు కొంచెం ఎడంగా నిలబడిన మా అవ్వ.

మా తాత ఒక్కొక్కపదం పాడతాంటే, బ్యాటరీలైటు ముఖం మీద పడిన కుందేలు మాదిరి దేవుడు అట్లే నిలిసిపోతాందే అని చెబుతూ మురిసిపోతోంది.

మనుషులు కదుల్తున్నారు.

దేవుళ్లు కదుల్తున్నారు.

మనుషులు పరుగెత్తుతున్నారు.

దేవుళ్లు పరుగెత్తుతున్నారు.

ఒకరికొకరు ఎదురై బేటీ తగులుతున్న దేవుళ్ళు!

ఇటికల పల్లయ్య అలిగిపోతున్నాడు, తన కంటే తన అన్నలకే పూలు ఎక్కువ వేశారని.

కురుగుండెప్ప పరుగెత్తుతుంటే ఎవరో ఇంట్లో టెంకాయ దాచిపెట్టినారు. దాన్ని కనుక్కునేవరకూ ఇంక స్వామి నిలవడు అని మాట్లాడుకుంటున్న గుంపు!

అంతర గంగప్ప ఆత్రుతపడుతున్నాడు.

తొక్కా్కలాడుతున్నాడు.

జనం మధ్యలోకి దూరి గుంపుల్ని చెల్లాపల్లా చేస్తున్నాడు.

ఎవర్నో ఎదుర్కొంటున్నాడు.

జరగండి. జరగండి. పక్కకు జరగండి. అంతరంగప్ప ఆత్రపడతాండాడు తమ్ముని చూడల్లని. ఇటికల పల్లయ్యను చూడక నాలుగు దసరాలు గడిచిపోయె కదా! జనం పక్కకు పరుగెత్తి దారినిస్తున్నారు.

తమ్ముడు ఇటికల పల్లయ్య ఎదురుపడగానే మంత్రించినట్టు ఆగిపోయాడు. అంతర గంగప్ప. ఇద్దరు దేవుళ్లూ ఒకర్నొకరు చూసుకుంటున్నారు నిశ్శబ్దంగా. వాళ్ల ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తున్న జనానికి, ఆ దేవుళ్లపై మెరిసే వెండిసొత్తుల్లో హర్షాతిశయపు కాంతి రేఖలు కన్పిస్తున్నాయి.

కొంచెం సేపటికి తమ దేవుళ్ల మధ్య నాలుగు సంవత్సరాల ఎడబాటు గుర్తొచ్చి సంబాళించుకోలేక ఏడుస్తున్న మనుషులు!

మనుషులు ఏడుస్తున్నారు.

దేవుళ్లు ఏడుస్తున్నారు.

మనుషులు అలిగిపోతున్నారు.

దేవుళ్లు అలిగిపోతున్నారు.

అలిగిపోయే దేవున్ని వెనకాల నుంచీ చూస్తే సాయంత్రం పూట రెండు కొండల మధ్య సగానికి కూరుకుపోయి అరుణారుణంగా కన్పించే అర్ధభానుబింబం మాదిరి ఎర్రని కిరిడంది.

మనుషులు ఊగుతున్నారు.

దేవుళ్లు ఊగుతున్నారు.

భాషకు అందని ఒక ఆవేశం మనుషుల్ని పూనకమై ఆవహించి తమ సంకుచిత జీవితంలో గాఢంగా పొందడానికి వీల్లేని వివిధ భావోద్వేగపు రుచుల్ని వాళ్లతో అనుభవింపజేస్తోంది తృప్తి అంచులదాకా!

ఆ రాత్రి జల్ది జరిపి పిల్లోనికి స్నానాలూ అవీ చేయించి పూజారిగా తయారుచేశారు.

తెల్లారింది.

దిన్నె మింద బయల్లో కంబళిపరచి దింపినారు దేవున్ని.

కిరిదండి ఎదురుగా నిలబడి, గురువులయ్య జరగాల్సిన కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తున్నాడు.

బియ్యం ముగ్గు వరుసల్తో ఒక పెద్ద చతురస్ర పటం గీయించాడు.

ఆ చదరానికి నాలుగు మూలల్లోనూ బియ్యం కుప్పలు పోయించాడు. ఆ బియ్యం కుప్పల మీద కొత్త కుండలు పెంపొందించాడు.

కొత్తకుండల్ని కలుపుతూ వాటి కంఠాలకు బిగించిన దారాల మధ్య ఒక చతురస్రం ఏర్పడింది.

ఆ చతురస్రం పటం మధ్య మళ్లీ ఒక బియ్యం కుప్ప పోయించాడు.

ఆ కుప్ప మీద మళ్లీ ఒక కొత్త కుండ పొందించాడు.

ఆ కొత్తకుండ కంఠం మీద టెంకాయ పెట్టించాడు.

అట్లగీసిన పటానికీ, అంత తతంగానికీ అర్థం ఏమిటో బహూశా మా గురువయ్యకు కూడా తెలీదేమో!

మా అవ్వ మాత్రం ఆ తతంగాన్ని అంతా ఎంతో ముగ్ధురాలైపోయి గమనిస్తూ ఉంది. ఎప్పుడో బతికి చచ్చిపోయిన మా పూర్వీకులందరూ ఈ పద్ధతుల్నీ నియమాల్నీ పాటించి ఉంటారు కదా అన్న ఊహ ఆమె ఉత్సాహానికి ఒక కారణం.

మొట్టమొదట ఒక బంధువు పటంలోకి అడుగు పెట్టి పూర్వకాలం నాటి ఒక కత్తితో గాయం కాకుండా పొట్టలో పొడుచుకుని అలుగేసుకున్నాడు. అది ఎన్నో వందల సంవత్సరాల నుంచీ అతని వంశానికే సంక్రమిస్తున్న గౌరవమంట!

రండి రండి పటాలు ఎత్తుకుందురు రండి అంటూ ఆహ్వానించాడు గురువులయ్య.

మా అవ్వ ముచ్చటపడి చూస్తుండగానే నేనూ, మా అమ్మ, మా నాయనా ముగ్గురం ఆ చతురస్ర పటంలోకి ప్రవేశించాము. సాంప్రదాయం ప్రకారం మా మేనమామ ముగ్గురికి పెట్టిన కొత్తబట్టల్ని కట్టుకుంటున్నాము. మాలాగే మా బంధువులు కూడా కొత్తబట్టలు కట్టుకుని, గురువులయ్య చేతిలో దక్షిణపెట్టి కాళ్లకు మొక్కుతున్నారు.

మా అమ్మ రెండు చేతుల్లోనూ రెండు పది రూపాయల కాగితాలు పట్టుకుంది – ఒక నోటు గరువులయ్యకూ, మరో నోటు కొత్త పూజారికీ అని.

గురువులయ్య చేతిలో ఒక నోటు పెట్టి మొక్కబోతే, కాళ్లను పక్కకు తొలగించుకుంటూ 'అది అది.... ఆ నోటు కూడా ఇయ్యమ్మా' అంటూ గురువులయ్య ఆత్రం!

ఇది కొత్త పూజారికి స్వామీ అని చెబుతుంటే.

ఆ పూజారికి ఇచ్చే అవసరం లేదులే! ఇవ్వు ఇవ్వు. అది కూడా నాకే ఇవ్వు అంటూ గురువయ్య దురాశ!

నేను పటం నుంచి బైటపడి వచ్చేసరికి మా అవ్వ ముఖం అదోలా మారిపోయి ఉంది.

'చూసినావురా? ఆ ఆడోళ్లందరూ వాళ్ల అన్నలు పెట్టిన కొత పట్టుచీరల్లో తళతళలాడుతుంటే మీ అమ్మ ఆ నాసిరకం చీరకట్టుకుని ఎంత తీసేసినట్లు కనపడుతుందో! చెల్లెలికి ఒక పట్టుచీర పెడితే మీ మామ ఆస్తి ఏమన్నా తరిగిపోతుందా?' అంటూ తన బాధను వెళ్ళమోసుకుని మా మామను తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టడం ప్రారంభించింది.

కులాచారం ఒప్పుకోదని ఒకప్పుడు రవికెలు తీసుకోవడానికి కూడా నిరాకరించిన వాళ్లు ఇప్పుడు పట్టుచీరలపైకి ఎగబడే నాగరికులు అయ్యారు!

తమకు కొత్త బట్టలు పెట్టే తాహతులేని అన్నల్ని తిట్టిపోస్తూ ఏడుస్తున్నారు ఒకరిద్దరు ఆడపడుచులు పటం బయట.

మా కార్యక్రమం ముగిసిపోయాక మరో కార్యక్రమం మొదలైంది.

రెండు చతురస్రపు మూలల్ని కలుపుతూ బియ్యం ముగ్గుతో ఒక పీటవాలు గీత గీశాడు గురువులయ్య. ఆ పటాన్ని రెండు అరపటాలుగా విభజించింది ఆ గీత.

కులం చెడిన వాళ్లకు ఆ అరపటంలోకే మాత్రమే ప్రవేశం!

మా చిన్నాయన కొడుకులు ఏదో తప్పు చేసినట్లు తలలు నేలకేసి వాల్చుకుని నిశ్శబ్దంగా కొత్తబట్టలు కట్టుకున్నారు, ఆ అరపటంలో.

వాళ్ల నాయన ఎప్పుడో చచ్చిపోయాడు – వేరే కులం ఆమెను పెళ్లి చేసుకునీ, వీళ్లను కనీ!

ఆనాడు తండ్రి చేసిన మహాపరాధానికి ఈనాడు కొడుకులకు ఈ శిక్షా, ఈ అవమానం!

కొత్తబట్టలు కట్టుకుంటున్న పండుగ ఉత్సాహం వాళ్లలో ఏ కోశానా లేదు పాపం!

వాళ్ల ముఖాల్లో సిగ్గు.

వాళ్ల ముఖాల్లో దీనత్వం.

తమను కులంలో చిన్నచూపు చూసినా ఫరవాలేదు, అంతో ఇంతో చోటిచ్చి మళ్లీ తమను బంధువుల్లో కలుపుకుంటే చాలు అనుకునే బీద అస్తిత్వాలు వీళ్లవి.

మా అవ్వ ఏవగింపుగా చూస్తోంది వాళ్లవైపు.

'అరచట్టం నా కొడుకులు, థూ! ఎందుకు బతుకుతారో, కులాన్ని ఇట్ల సంకరం చేసేనాయాళ్లు' అంటూ చీదరించుకుంటూ మాట్లాడింది.

మేము సాయంత్రం ఇంటికి బయల్దేరుతుంటే పూర్వకాలంలో ఎనిమిది దినాలు జరిగేదంట ఈ పండగ! ఇప్పుడు చూడు, ఇట్ల పటాలెక్కినారో లేదో, అప్పుడే ఏదో గంటుపోయినట్లు ఎళ్లారతాండారు టౌనుకి అని,

సరేసరి, మీరంతా పొండి. నేను రాత్రి దేవుని మెరవన చూసి పొద్దున్నే వస్తాను అంది.

నేను మా అవ్వకు ఆసరాగా అక్కడే ఉండిపోవలసివచ్చింది ఆరోజు కూడా!

మా చిన్నాయన కొడుకుల్ని అసహ్యంగా చూసి వీలు దొరికినప్పుడల్లా – అరచట్టం నా కొడుకులూ, సంకర జాతి నా కొడుకులూ....అంటూ ఆమె వాళ్లను తిడుతున్న తిట్లే నా చెవుల్లో గింగురుమంటున్నాయి. మా చిన్నాయన కులాంతర వివాహం చేసుకున్నట్లు నేను మతాంతర వివాహం చేసుకుంటే? ఎంత క్షోభిస్తుందో పాపం మా అవ్వ మనసు! కానీ నేనేం చేయగలను? నాకు నా క్లాసుమేటు మార్గరెట్ మీద ఉన్న ప్రేమ అట్లాంటిది.

ఎండిన ఏట్లోని నీటి జాడలు ఎప్పుడు ఏ కొత్త ప్రవాహ ఉధృతికి కొట్టుకుపోతాయో ఎవరు చెప్పగలరు?

మార్గరెట్‌ని పెళ్లి చేసుకుని ఇంటికి తీసుకువస్తే నన్ను కూడా సంకరజాతి నా కొడకా అని తిడుతుందా? లేక తన సొంత మనుమడైన నాకు ఏదైనా మినహాయింపు ప్రసాదిస్తుందా?

బొట్లూ దమ్మిడీలూ, అణాలూ, బేడలూ పట్టుకుని ఊగుసాడిన మా అవ్వకు వాటి స్థానంలో కొత్త కరెన్సీ వచ్చినప్పుడు కొంచెం అయోమయంగానే ఉండి ఉంటుంది.

కానీ, కాలానుగుణంగా సంభవించే ప్రతి మార్పుకూ సర్దుకుని జీవించగలిగిన గుణం, మనిషిలో ఒక జీవనదిలా ప్రవహిస్తూ కొత్తకొత్త నాగరికపు వ్యవస్థల్ని సృజిస్తూనే ఉంటుందని నాకు చాలా గాఢమైన నమ్మకం.

జాడలు నడవ్వు, పురోగమించేది మనిషే అని కూడా నా విశ్వాసం.

● *ఉదయం వారపత్రిక, 25-1-'91* ●

★ ★ ★

మధురాంతకం రాజారాం

68

# ముసుగు నాగమ్మ మహిడీ

చేసుకున్న వాళ్ళకు చేసుకున్నంత అంటారు. బుద్ధి మాలిన పనిచేసినప్పుడు, ఫలితాన్ని అనుభవించక తప్పదు. ఆ బుద్ధి మాలిన పనిచేసిన వాణ్ణి నేనైనా సరే, ఇతరులు నాపట్ల సానుభూతి చూపెట్టవలసిన అవసరం లేదన్న షరతుపైన్నే నేను నా సోదినంతా వెళ్ళబోసుకుంటున్నాను.

మానవుడు మొన్న పుట్టి నిన్న కళ్ళుతెరచిన వాడేమీకాదు. కొన్ని వేలసంవత్సరాల చరిత్రకు వారసుడు. ఈ సుదీర్ఘ చరిత్రలోని ముప్పాతికా మువ్వీసంవంతు కాలంలో అతడు తనకంటూ కొంత స్థిరాస్తులు, చరాస్తులు వుండాలన్న పట్టింపు పెట్టుకున్నవాడు కాదు. ఒక తలచాటు సంగతే తీసుకోండి! కొండ గుహల్లో వున్నాడు. నిక్షేపంగా అలాగే కాల్మ వెళ్ళబుచ్చి వుండొచ్చు. నాలుగు గోడలతో గూడిన పైకప్పుతో తనకొక నివాసగృహం వుండి తీరాలన్న అత్యాశ అతడికి కలిగి వుండగూడదని నా అభిప్రాయం. కలిగిందిపో, అందుకు స్తోమత వున్నవాళ్ళకైతే మంచిదేగానీ, నాబోటి లాకాయి లూకాయిగాళ్ళకు మట్టుకు కలిగి వుండగూడదని నేను త్రికరణ శుద్ధిగా నమ్ముతున్నాను.

ఈ స్వంతయింటి సంకల్పం గూడా ఏ అడవిలో పల్లెకో, ఆముదాల దిబ్బకో పరిమితమైవుంటే ఆ సంగతి వేరు. మునిసిపాలిటీగా వుండీ, వుండీ, ఇక మీదట ఏ సుముహూర్తాన్నో హఠాత్తుగా కార్పొరేషనుగా మారిపోనున్న ఒక భావికాలపు మహానగరంలో స్వంతయింటి కోసం నేను అర్రులు సాచడం పెద్ద పొరబాటు, అలూ చూలూ లేకపోయినా సోమలింగం గురించి కలవరించినట్టు, నేను పేవ్‌మెంటు పైన నడుస్తూ రోడ్డుకిరువైపులావున్న వాటిలో మనకే యిల్లయితే బాగుండునో అని విచికిత్స చేస్తూవచ్చాను. దీనిల్లు బంగారంగానూ, ఒక యింటిని చూచిన కంటితో మరొక యింటిని చూడ్డం సాధ్యమయ్యేది గాదు. ఉద్యోగంలో చేరిన కొత్త. నెలపుట్టగానే నాలుగు రూకలు కళ్ళబడేవేమో, ఆకాశానికి మూడేబారలన్నంత ఉత్సాహం మనసులో ఉరకలు వేస్తుండేది. అంతఃపుర స్త్రీల దగ్గర ఉత్తరకుమారుడు 'కుంభజన్ముడెంత, కురుపితామహుడెంత, కౌరవేంద్రుడెంత, కర్ణుడెంత' అంటూ సొరకాయలు కోయలేదా? సరిగ్గా నేను గూడా 'శ్రీపురం ఎంత? శాంతినగర్ ఎంత? దళవాయి కాలనీ ఎంత? ఖిల్లామహల్ ఏరియా ఎంత?' అనుకునేవాణ్ణి. ఏది ఎంతెంతో కాలక్రమాన తెలిసొచ్చింది. పాతికేళ్ళనాడు నాలో బుద్ధిపుట్టిన నాటికే

గ్రౌండు (60'×40') ధర పదిహేను వేలకు దరిదాపుల్లో వుండేది. ఇంకొక పదేళ్ళు గడిచేసరికి అంకణం (36 చ.అ.) అయిదు వందలే నన్నారు. మళ్ళీ పదేళ్ళు గడిచాక వాకబుచేస్తే చదరపు అడుగు ముప్పైరూపాయల కొచ్చేసినట్టు తెలిసింది. కాలగతికి గ్రౌండు ధర ఏ అనుపాతంలో పెరుగుతుందో గ్రహించడానికి నేను గణితశాస్త్రంలో కొంత మల్లగుల్లాలు పడవలసి వచ్చింది. ఫరవాలేదు. ఒక అనుభవాన్ని గడించడానికి ఎంత శ్రమైనా పడొచ్చు. నా అనుభవం వల్ల నేను మన సమాజంలోని సగటు ఉద్యోగి ఆశల్ని, ఆశయాల్ని వాస్తవ పరిస్థితు లెంతగా అపహాస్యం చేస్తున్నాయో తెలుసుకున్నాను. అయ్యో, గొర్రె తోకంతా ఎంత? జాన, లేక బెత్తెడు మాత్రం. ఇలా నేను నా స్తోమత గుర్తించినవాడినై, నగర శివార్లలో అప్పటికప్పుడే కబంధుడిలా బారలు చాస్తున్న విఠోభా నగరుకు పరుగెత్తి, అక్కడైనా చచ్చి సేయంగల విన్నపాలతో ఒక యింటి జాగా కొని, స్వంతం చేసుకోగలిగాను. ఎవరో ఒక పుణ్యాత్ముడు స్థూపం లాంటి ఎత్తయిన అరుగుపైన తులసికోట లాంటి మండపం నిర్మించి, అందులో పాండురంగడి విగ్రహం ప్రతిష్టించాడు. అంతటితో ఆ ప్రాంతంలో చెల్లాచెదురుగా పడి వుండిన కొన్ని యిళ్ళకు విఠోభా నగరన్న పేరొచ్చేసింది. చరమ జీవితానికి నేనక్కడ ఓ ఉనికిపట్టును సంపాదించుకునేటప్పటికి వీధులతో, సందు గొందులతో, మురికినీటి స్థావరాలతో, ఎలక్ట్రిక్ స్తంభాలతో, ఊరకుక్కలతో, బిచ్చగాళ్ళతో విఠోభానగర్ తన సహజ రూపాన్ని తాను సంతరించుకుంటోంది. ప్రభుత్వ హితవును పాటించి, కుటుంబ శ్రేయస్సుకు ప్రాధాన్యమిచ్చి నేను జాగ్రత్తగా పొదుపుచేసి దాచుకుంటూ వచ్చిన మూలధనం ఇంటి జాగా కొనడానికి సరిపోయింది. యల్. ఐ. సి.లో అప్పుచేసి పునాది గోడలు లేపేశాను. నేలనుంచి మూడడుగులు పైకిలేచిన పునాది గోడల నిండుగా యిసుక పోయించాను. ముందర కొంచెం ఖాళీ జాగా, ఆరడుగులతో వసారా, పదడుగుల వెడల్పుతో ఓ లివింగ్ రూము, పదిహేనడుగులతో పెద్ద హాలు, ఆ వెనుక కిచెను, బాత్‌రూము – యిలా సర్వలక్షణ సమన్వితంగా యింటిని ప్లాను చేశాను. ఇటుకలు తోలించి, గోడలు పెట్టించి, ఏక్ ధమ్మున మోల్డింగ్ దాకా లాక్కొచ్చేయాలనుకున్నాను. అయితే అనుకున్న దొకటి, అయింది మరొకటి. శివపూజలోకి ఎలుగుబంటి జొరబడినట్టయింది. నా పాలిటికి పిట్టపిడుగులా ఒక మహానుభావుడు ఊడిపడ్డాడు.

"చాల్చాలు లేవయ్యా! దినం మంచిదని ముందటికెపుడో పగలే దొంగతనానికి జొరబడినాడంట! అరునెల్లు నేను వూళ్లో లేకపోయేటప్పటికి నువ్వింత పని జేస్తావా? నీ కడగాలు (పునాది) పదడుగులు దాకా నా జాగాలో కొచ్చేసింది గదయ్యా! మంచి మాటల్తో తీసేస్తివో సరేసరి. నేనే చెయ్యి చేసుకోవలసి వస్తే, కడగాలంతా లేపి పారేస్తాను" అంటూ అతడు పుడ్రించాడు.

"అయ్యో, కాదండీ! నేనీ గ్రౌండు పావురాల సుబ్బరాజు దగ్గర కొనుక్కున్నా. రిజిష్టరు చేయించుకున్న కొనుగోలు పత్రాలు నా దగ్గరున్నాయి. పకడ్బందీగా చెక్కుబందీ వివరాలు రాయించాను. ఉత్తరం: వీధి; దక్షిణం: కనుపర్తి రామలింగం గారి సామిల్లు; తూర్పున ముత్యాల రత్తమ్మ గారి ఖాళీ జాగా......"

"ఉండుండు....." పోట్లగిత్తలా అతడు అడ్డు తగిలాడు "ఆ ముత్యాల రత్తమ్మ ఎవరనుకొంటివి? నా మేనత్తే. ముండ, బిడ్డలు లేకుండా సచ్చింది. దానికి తలకొరివి పెట్టింది నేనే. సావడానికి ముందు ఇల్లు, నేలా నట్రా అంతా నా పేరిటకు రాసి యేలిముద్దరేసి పోయింది. దానికిక్కడ ఖచ్చితంగా అయిదు సెంట్ల జాగా వుండేట్టు లెక్క. నువ్వేంత లేదన్నా అయిదడుగులో, పదడుగులో ఆ నేలలోకొచ్చేసి వుండడం ఖాయం. నా సొత్తులో ఎపుడైనా యేలు పెడితే నే నూరుకునేటోణ్ణిగాదు, ఎముకలు యిరగ్గొట్టేవాణ్ణి. నా పేరు పకీర్రాజు. పకీర్రాజంటే ఎవురో, ఏంటో తెలీకపోవచ్చు. సుట్టుపక్కల ఎవురినైనా అడిగి చూడు......"

"అయ్యా, దయచేసి మీరొక మాట వినిపించుకోవాలి. మీరొక అరగంట సేపు గనుక యిక్కడుంటే, నేనింటికి వెళ్లి కొనుగోలు పత్రాలు తెచ్చేస్తాను. ఎవరికైనా పదిమందికి చూపిద్దాం. పత్రంలో రాసిందానికన్నా నేనొక అంగుళం మించి వచ్చినట్టు తేలినా సరే–నేను నా జాగా పునాది గోడలతో సహా మీకు వదిలేస్తాను" అంటూ నేను పరిపరివిధాలుగా నచ్చజెప్పడానికి ప్రయత్నించాను.

"ఏమయ్యో, అక్కడికి చాలించు! పావురాల సుబ్బరాజు పత్రాలు కుంకం కట్టుకోడానికి పనికిరావు. తనకు ఏటిలో ఎయ్యెకరాలుందని ఒకడు రాసిస్తాడు. సెల్లిపోతాదా! అదంతా నాకు చెప్పొద్దు. నువ్వు నా జాగాలో కొచ్చినావు. కడగాలు తీసి కాంకిరీటు గోడ పెట్టేసినాము గదా అని మిడిసిపడొద్దు..." చిటికేస్తూ అతడు కొనసాగించాడు. "చ్చణం ఒక చ్చణం తొవ్వి పారేస్తాను. నాచేతనౌను. నాతో పెట్టుకోవద్దు. బద్దరం బద్దరం జాగరత్త!"

అల్టిమేటం జారీచేసి, అప్పటికే నిజంగానే తనకేదో అపచారం జరిగిపోయినట్టు, అందుకు ప్రతీకారం నెరవేర్చేదాకా తనకిక నిద్రాహారాలు లేనట్టు పకీర్రాజు రొప్పుతూ వెళ్ళిపోయాక నేను గాలి తీసేసిన బెలూనులా అక్కడొక అరుగుపైన కూలబడిపోయాను.

అతడేమో తనను గురించి ఇతరుల్ని అడిగి తెలుసుకోమన్నాడుగానీ నాకలాంటి అవసరమేమీ కన్పించలేదు. పులినీ, తోడేలినీ మనకు ఇతరులు పరిచయం చెయ్యవలసిన అవసరం ఏముంటుంది? రూపం చూడగానే జంతులా స్వభావం తెలిసిపోదా? పకీర్రాజు గుబురుగా గిరజాలు పెంచాడు. కొడవలి – అర్ధవలయాకృతితో వంగిన మీసాలు గుబురు గడ్డంలో కలిసిపోతున్నాయి మరికొంచెం వివరంగా చెప్పాలంటే–మేకప్ చెయ్యకుండా అతణ్ణి బొబ్బిలి నాటకంలో బుస్సీ వేషానికి రికమెండ్ చెయ్యొచ్చు. అతడు చెయ్యిచేసుకుంటాడోలేదో ఆ దేవుడి కెరుక, కానీ సునాయాసంగా నాలుక చివరినుంచి రువ్వుతున్న మోటుమాటల తాకిడికి నేను జడుసుకున్నాను. వాదాన్ని మరికొంచెం పెంచితే అతడి నోట యింక బూతుమాట లొచ్చేస్తాయన్న సందర్భంలో నా నోటికి తాళం పడింది.

రాజ్యం కోల్పోయిన రాజులా, భార్యను కోల్పోయిన భర్తలా, శీలం కోల్పోయిన స్త్రీలా దిగాలుపడి కూర్చున్న నాపైన జాలిపడిపోతూ, పది పదిహేను మంది మనుషులు ఒక్కొక్కరుగా వచ్చి నా చుట్టూ మూగిపోయారు.

"మీ టైము బాగుండలేదండీ బాబుగారూ! వైకుంఠపాళీలో పాము నోట పడిపోయారు. వీడు, ఈ పకీర్రాజు ఆరునెలలుగా యిక్కడ లేనట్టుగా చెబుతున్నాడు గదా! ఏమయ్యాడో అడగరే! ఆ మధ్య మంచినీళ్ళకుంట దగ్గర ఓ హత్య జరిగినట్టు చెప్పుకున్నారు జ్ఞాపకముందా? అది చేసింది వీడేనన్న గుమానీ వచ్చింది. అప్పుడు మాయం కావడం, ఇదిగో యిప్పుడు తేలాడు. మీ జాగా ప్రక్కన ఆ ముసలిదానికెవతకో కాస్త నేల వుంది. వుండడమిప్పుడు ప్రమాదమైపోయింది. ఇంతకూ ఆ ముసల్ది వీడికా నేల రాయించి యిచ్చి వుంటుందన్న నమ్మకమేమీ లేదు. కాదులెండి! బెదిరించి మీదగ్గర అయిదో పదో గుంజుకోవాలన్నది వాడి ప్లాను. ఇవ్వమని మేము చెప్పం కానీ యివ్వకపోతే వాడు మిమ్మల్ని యిల్లు కట్టుకోనివ్వడని మాత్రం చెప్పగలం......"

"అయిదో , పదో అంటున్నారు. ఇచ్చేస్తే పోలా?" అన్నాను నేను.

నా చుట్టూ చేరినవాళ్ళు ఒకరివైపొకరు చూసుకుంటూ చూపులలోనే నవ్వుకున్నారు. ఉబికివచ్చే నవ్వును అపుకుంటూ ఒకాయన "అయ్యో! అయిదుని, పదిని యిక్కడ సహజ విలువల్తో గణించకూడదు. స్థాన విలువల్లోకి తీసుకోవాలి. మీకొకవేళ ఈ బెడదనుంచి బయటపడాలని అయిదువేలో, పదివేలో యివ్వడానికి సిద్ధపడ్డారే అనుకోండి! అప్పుడది పులికి మనిషి నెత్తురు రుచి చూడడమే అవుతుంది. జీవితాంతం ఈ వూబిలో నుంచి బయటపడలేరు" అంటూ మెత్తమెత్తగానే మందలించాడు.

"అయితే ఇప్పుడేం చేద్దామంటారు?" అంటూ నేను రిచ్చపడిపోయాను.

"పోనీ, ఒకమాట పోలీసులతో చెప్పిచూడండి" అంటూ ఒకాయన రహస్యంగా చెవిలో వూదాడు.

బుద్ధి భూము లేలమంటే కర్మ గాడిదల్ని కాయమంటుందట! ఇల్లు పూర్తిచేసి, గృహప్రవేశం చేయడానికి బదులుగా, నేను పోలీసు స్టేషనుకు వెళ్ళవలసి వచ్చిందంటే మరేమనుకోవాలి? కొన్ని కొన్ని చోట్ల కొందరి ఉనికి పరిహాసభాజన మవుతుందన్న విషయం నాకు పోలీసు స్టేషనులో తెలిసొచ్చింది. నాది యిటు కేడీలతో గానీ, అటు పోలీసులతో గానీ వ్యవహరించగల ముఖంలా తోచలేదేమో, అక్కడి పోలీసులు వరహీనపు పెళ్ళికొడుకును చూచినట్టుగా నావైపు చూడసాగారు. నాకెదురైన యిక్కట్టును గురించి నేను ఏకరువు పెడుతుంటే వాళ్ళు ఉప్పూ, కారం లేని చప్పిడి తిండి తింటున్నట్టు నిరుత్సాహంగా కూచున్నారు.

అయినా వీళ్ళైనంతలో నాకు న్యాయం చేకూర్చడమే. తన పరమోద్దేశం అయినట్టు "అయితే యిప్పుడు మమ్మల్నేం చేయమంటారు?" అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

"మీరెలాగైనా పకీర్రాజును అడ్డుకోవాలి."

"ఏ బేసిస్ మీద అడ్డుకోవాలి? మీరతడి జాగాను దురాక్రమణ చేసినట్టు చెబుతున్నాడు గదా?"

"లేదండీ! పావురాల సుబ్బరాజు నా పేరిటకు రాసి, రిజిష్టరు చేసి యిచ్చిన కాగితాలు నా దగ్గరున్నాయి. మీకు చూపించాలని తీసుకొచ్చాను గూడా!" అన్నాను.

"అలాంటి కాగితాలు వాడి దగ్గర గూడా వుంటాయండీ! వాటిలో ఏది అసలో, ఏది నకలో తేల్చేదెవరు? అ పని మా జ్యూరిస్ డిక్షను కిందికి రాదే! మీరు సివిల్ కోర్టుకు వెళ్ళాల్సింది!"

"లేదండీ! పోలీస్ స్టేషన్‌కు వెళ్తే ప్రయోజనముంటుందని ఎవరో చెప్పారు" అంటూ నీళ్ళు నమిలాను.

"అయితే ఒకపని చేయండి" అన్నాడు హెడ్ కానిస్టేబులు.

"చెప్పండి" అన్నాను.

"వెళ్ళి మీ ప్లాటుకు మీరు కట్టడం పని కొనసాగించండి. వాడొస్తాడు. కట్టగలిగితే మీరు కట్టండి. లేదా దెబ్బలు తినండి. నెత్తురూ, గాయాలూ స్పష్టంగా కనిపించాలి. ఇది నెత్తురే. ఇవి గాయాలే నని డాక్టరు ఓ కాగితం రాసివ్వాలి. ఆ కాగితం జేబులో పెట్టుకుని, చక్కా యిక్కడికి రండి. అప్పుడు ఫైనలు మీ కేసు టేకప్ చేస్తాం....."

అయితే, పోలీస్‌స్టేషనుకు వెళ్ళడంలో నా ఉద్దేశం పక్కీరాజు తగాదా నివారణ కావాలన్నదే గాని, అంత ప్రవర్ధమానం కావాలని మాత్రం గాదు, పైగా, పోలీసులకెంతవరకు గాయాలు కావాలో అంతవరకే పక్కీరాజు నన్ననుగ్రహించగలడన్న నమ్మకమేముంది? గాయం మరింత లోతుకు దిగినా, తల మరికొంచెం ఎక్కువగా చీలినా అప్పుడిక నా గమ్యస్థానం పోలీస్‌స్టేషను కానేరదు గదా!

పోలీస్‌స్టేషను పైన పెట్టుకున్న ఆశలన్నీ వమ్మయిపోయాక, ఎందుకైనా మంచిదని, వృత్తిలో తల పండిన అనుభవజ్ఞుడు యస్. యం. సూరపరాజు, బి.ఎ., బి.యల్. గారిని సంధించి చూచాను.

"అయ్యా, వెంకటేశ్వర్లు గారూ! (నాపేరదేలెండి!) చచ్చిందో బ్రతికిందో తెలియకుండా న్యాయదేవతను కలకాలం గాజు తొట్టెలో పెట్టే ప్రిజర్వు చేయగలిగింది మన సివిల్ కోర్టులే! ఒక కోర్టులో మీ కేసు నెగ్గుతుందనే అనుకుందాం. ప్రతివాది పైకోర్టుకు వెళ్ళకుండా వుండడు. మా వకీళ్ళలో గూడా నోరు పెద్దదిగా పెట్టుకుని, బిగ్గరగా అరుస్తూ కూటసాక్ష్యాలు, దొంగ పత్రాలు సృష్టించగలిగినవాళ్ళదే రాజ్యాం. బ్రతికినంతకాలం అద్దె యింట్లోనే ఉంటూ కోర్టుల చుట్టూ తిరగలేరు గదా! ఇందుకు మరొక పరిష్కారమేదైనా చూచుకోడం మంచిది......."

ఆ 'మరొక పరిష్కారమార్గ'మేదో తలచించుకున్నా నాకు స్ఫురించకపోయింది. ఏ సమస్యనైనా సమూలంగా తుడిచిపెట్టగల మహాశక్తి కాలం. నేనా కాలాన్నే నమ్ముకుని, అడపా తడపా ఎప్పుడైనా విఠోభానగర్ వెళ్ళి పునాదులతో ఆగిపోయిన నా యింటి కట్టడాన్ని చూచి గ్రుక్కిళ్ళు మ్రింగుతూ కాలమొక్కరీతినా.గడపసాగాను. ఇలా ఒక అరు మాసాలు గడిచాక నా అదృష్టంకొద్దీ లౌక్యుడైన పెద్దమనిషి ఒకాయన నాకు తారసిల్లి, అమోఘమైన తరుణోపాయం ఒకటి సెలవిచ్చాడు.

"వెంకటేశ్వర్లుగారూ! రెవిన్యూ యిలాకా, రిజిస్ట్రేషను విభాగం, పోలీసు వ్యవస్థ, న్యాయస్థానాలు మొదలైనవాటితో గూడిన ప్రభుత్వ యంత్రాగం వల్ల మీకు న్యాయం చేకూరదని తేలిపోయింది. ఫరవాలేదు. ప్రభుత్వమన్న పేరు లేకపోతే పోయిందిగానీ అది చేయగల-లేదా అది చేయలేని పనులు గూడా-నిరాఘాటంగా నిర్వహించగల వ్యవస్థ ఒకటి ఈ దేశంలో వుందని మీరు గుర్తించాలి. దాని

నేతలు సర్వతంత్ర స్వతంత్రులు. భుజబలాన్ని, ఆయుధాల్ని నమ్మినట్టుగా వాళ్ళు రూల్సుని, రెగ్యులేషన్లని, మనుషుల్ని, మంచితనాన్ని నమ్మరు. ఈ వ్యవస్థకు నియమాలు, నిబంధనలు విధించే రాజ్యాంగచట్టమేదీ లేదు. నయాన్నో భయాన్నో తన ప్రయోజనం నెరవేరితీరాలన్నది దాని లక్ష్యం. నిమిషాలమీద, గంటలమీద–పోనీ, ఆలస్యమైతే రోజులమీద ఏ కేసులోనైనా అమీ తుమీ తేల్చుకోవడం దాని పాలసీ. మీరు దాన్ని శరణు జొచ్చి ఉన్నట్టయితే, ఈ పాటికెప్పుడో స్వంత ఇంట్లో ఉండి ఉండొచ్చు...."

ఆయన మాటలు వింటుంటే నాలో అడుగంటిన ఆశ మళ్ళీ కొనలు సాచి, ననలు తొడిగినట్టయింది. "బాబూ! చాలా తేంక్సండీ! మీరు చెప్పేదాకా యిలాంటి దొకటుందని నాకు తెలియదు. మీ మేలు నేనే జన్మలో మరిచిపోను. మీరిందాకా 'ఒక వ్యవస్థ' అన్నారే, అదెలాటిదైనా దాన్ని నడిపించే కార్యదక్షులెవరో తెలియజేయండి. వాళ్ళకు నా యిబ్బందిని నివేదించుకునే పద్ధతి గూడా సెలవివ్వండి" అని ప్రాధేయపడ్డాను.

ఆయన సాకల్యంగా అన్ని వివరాలు నా చెవిలో వేసి "వెళ్ళిరండి సార్! మీకు శుభమగును గాక!" అంటూ దీవెనలు గూడా అందజేశాడు.

నగరంలో ఆ ప్రాంతానికి డొంకల దొరువు అని పేరెలా వచ్చిందో నాకు తెలియదు. దాదాపు ముప్పైయేళ్ళుగా నేనిదే టౌనులో నివసిస్తున్నప్పటికీ, డొంకల దొరువు వైపు వెళ్ళిన సందర్భాలు చాలా తక్కువ. చిన్నవీ, పెద్దవీ అయిన మురికి కాలవల కడ్డంగా వేసిన ఒకటి రెండు తాటి దూలాలే అక్కడ వంతెనలుగా ఉపకరిస్తాయి. కొత్తవాళ్ళకు వాటిపైన నడవడం ప్రమాదంతో కూడిన పని. ఇరుకైన సందుగొందులు ఎలా వెళ్ళి, ఎక్కడ దిగబెడతాయో బోధపడదు. చిన్న పెంకుటింటి చుట్టూ పెద్ద ప్రహరీ గోడ కట్టుకోవడం వల్ల అక్కడ ఒక్కొక్క ఇల్లూ చిన్నకోటలా వుంటుంది. జనంలో ఎక్కువభాగం బీదకార్మికులు. వాళ్ళ అవసరాలు చాలా తక్కువ. ఎప్పుడో అరుదుగా మాత్రమే వీధుల్లో కనిపిస్తారు. అందువల్ల అదొక నిషిద్ధ ప్రాంతంలా కానరావడంలో విడ్డూరం లేదు. మునిసిపాలిటీ ఎన్నికల్లో కౌన్సిలర్ పదవికి పోటీ లేకుండా ఏకగ్రీవంగా అభ్యర్థి ఎన్నికయ్యే ఏకైక వార్డు డొంకలదొరువే! అట్లాగని అదంతా 'కౌన్సిలర్' పలుకుబడి అనుకోరాదు.

అక్కడ పూచిక పుల్లనైనా నిలబెట్టి గెలిపించగల చొరవ సర్దార్జీ అనే వ్యక్తికి చెందుతుంది. ఇతర వార్డుల్లో గూడా తన అభ్యర్థుల్ని నిలబెట్టి, వారి గెలుపుకోసం శతవిధాలా ప్రయత్నించి, ఎలాగైనా మునిసిపాలిటీ తన చేయి దాటిపోకుండా చూచుకుంటాడంటే ఈ సర్దార్జీ ఎంతటి ప్రజాశ్రేయోభిలాషో గ్రహించవచ్చు. విదేశీ రాయబారులు దేశంలో దిగగానే తమ మొదటి డ్యూటీగా రాష్ట్రపతిని కలుసుకుని, స్నేహసౌజన్యాలను వినిమయం చేసుకున్నట్టుగా, జిల్లాస్థాయి ఆఫీసర్లందరూ ఛార్జీ పుచ్చుకోగానే సర్దార్జీని సందర్శిస్తారట. కౌన్సిలర్లు మారొచ్చు, బేక్‌మన్ మారొచ్చు, యస్.పి. మారొచ్చు, జడ్జీ కూడా మారొచ్చు. కానీ సర్దార్జీ మాత్రం మారడు. సర్దార్జీకి మార్పులేదు. సర్దార్జీ స్థానం అచంచలం! సర్దార్జీ స్థానం శాశ్వతం!

ఈ శతాబ్ది ప్రథమ పాదంలో మల్లవరం పాళేగారు తన ముద్దుల ప్రేయసి ముసుగు నాగమ్మ కోసం నగరంలో కట్టించిన మేడ – ముసుగు నాగమ్మ మహిడీ–అన్న పేరుతో డొంకల దొరువులో ఉండిపోయింది. ముసుగు నాగమ్మను నాయకురాలు నాగమ్మలాంటి విశిష్ట వ్యక్తిగా చెప్పుకుంటారు. పాళెగారిని తన చేత కీలుబొమ్మగా ఉంచుకుని, సంస్థానాన్ని ఆమె తన కనుసన్నల్లో నడిపించిందనడానికి చాలా కథలు ప్రచారంలో వున్నాయి. కాలక్రమాన దీపం పెట్టే దిక్కుగూడా లేక, 'అనాధ'గా మారిపోయిన దశలో ముసుగునాగమ్మ మహిడీని, సంస్థానపు దూరపు వారసుడి ద్వారా సర్దార్జీ తండ్రి తన హక్కు భుక్తాల్లో పెట్టుకున్నాడట. సర్దార్జీ ప్రస్తుత నివాసం ఆ దేవిడీయే!

విరిగి పడిపోతుందేమోననిపించే ఆర్చి క్రిందినుంచి తటాలున ముందుకు దూరి నేను పాడుగాటి దేవిడీ మెట్ల ఎదుట నిల్చున్నాను. మెట్లపైన పులిజూదమాడుకుంటున్న వ్యక్తులు తలపైకెత్తి, ఎత్తిన తలను మెడపైన్నుంచి పైకి క్రిందికి ఆడిస్తూ, ఆ కదలిక ద్వారానే 'ఎవరివోయ్ నువ్వు' అని ప్రశ్నించారు.

సర్దార్జీ కోసం వచ్చినట్లు చెప్పుకున్నాను.

పేరు, అడ్రసు, వచ్చిన పనిలాంటి వివరాలన్నీ ఒక చిన్న కాగితంపైన వ్రాసివ్వమన్నారు.

సమయానికి కలమూ, కాగితమూ జేబులోవుండడం గొప్ప సదుపాయమైపోయింది. రాసిన, వేదన పత్రాన్ని వారిలో ఒకరిచేత పెట్టాను.

అతడు లోపలికి వెళ్ళి, అయిదు నిమిషాల్లో తిరిగొచ్చి "వెళ్ళొచ్చు" అన్నాడు.

మెట్లెక్కితే నేల మట్టానికి ఏడెనిమిది అడుగుల ఎత్తున ఒక వసారా. వసారాలోనుంచి నడవలోకి వెళ్తే దారికిటూ, అటూ కొన్ని గదులు. నడవ దాటుకోగానే పెద్ద హాలు. హాల్లో నాలుగు మూలలా లోపలికి గుమ్మాలు. ఎదురుగా వున్న తూరుపు గోడ కానుకుని ఓ అరుగు. అరుగుపైన మూరెడెత్తు పరుపు. పరుపుమీద గోడ కానించి పెట్టినట్టుగా మద్దెలలాంటి దిండు. దానిపైన చేరగిలబడి సగం పడుకున్నట్టు, సగం కూర్చున్నట్టు చిద్విలాసంగా కొలువైవున్న వ్యక్తిని సర్దార్జీగా పోల్చుకున్నాను. మల్లెపువ్వులాంటి తెల్లటి పైజామా, శరీరాన్ని గట్టిగా అంటి పెట్టుకున్న బనీనుపైన గ్లేజుకాగితంలాంటి గోధుమరంగు జుబ్బా, శిరస్త్రాణంలా పొట్టిగా కత్తిరించిన తలవెంట్రుకలు. వేళ్ళమధ్య కాలుతున్న సిగరెట్టు, కళ్ళల్లో ఎంతటి ఉత్పాతాన్నయినా సరకు చెయ్యని ఓ ఖాతరు లేనితనం – వెరశీ ఈ దృశ్యానికంతా నిండుదనం చేకూరుస్తూ రకరకాల గడ్డాలతో, వైవిధ్య విలసితమైన మీసాలతో, వివిధాకారాల గిరజాలతో, చిత్ర విచిత్ర వేషాలతో పది పన్నెండు మంది వ్యక్తులు అతణ్ణి పరివేష్టించినట్టుగా నిలబడిపోయివున్నారు. కొన్ని కొన్ని ఆకారాలు, సన్నివేశాలు సినిమాల్లో మాత్రమే కనిపిస్తాయని అనుకునేవాణ్ణి. ఇప్పుడు వెళ్ళి ఎదుట నిలబడిపోయేసరికి జివ్వు జివ్వుమంటూ నరాల్లో ఏదో భయవీచిక పారాడసాగింది.

సర్దార్జీ ఒకసారి నావైపు ఎగాదిగా చూస్తూ పెదవి కదిపాడు.

"వెంకటేశ్వర్లంటే......."

"నేనేనండీ!" అంటూ చేతులు జోడించాను.

"ఇల్లు కట్టుకోడానికి పక్షిరాజు అడ్డు తగులుతున్నాడా?"

"అవునండీ!"

సర్దార్జీ సిగరెట్టు గట్టిగా ఒకసారి లోపలికి పీల్చి పొగ వదలిపెడుతూ "ఒరే సాంబూ!" అన్నాడు.

"ఇక్కడ్నే వుంటినన్నా! సెప్పండి" అంటూ ముందు కొచ్చాడు సాంబు.

"వినోభానగర్ ఎవరు చూస్తున్నారు?"

"అది పహిల్వాన్ పాపన్న జ్యూరిస్‌డిక్షన్ కిందికొస్తుందన్నా!"

"పాపన్నను పిలిచింది పక్షిరాజు పని పట్టమని చెప్పు" అంటూ ఫర్మానా జారీచేసి, సర్దార్జీ నావైపు తిరిగాడు. "సరే, పక్షిరాజింక మీ జోలికి రాడు. వాడికి మా పాపన్న పురం పెడ్తాడు. అందుకని పాపన్నకు మీరెంతిస్తారు?"

ఫెళ ఫెళమంటూ పిడుగొకటి నా తలపైన పడినట్టయింది. ఇలాంటి ప్రశ్న ఒకటి ఎదురౌతుందని నేనూహించలేదు. ఒకవేళ నేను తెంపు తెచ్చుకుని ఏదో ఒక సంఖ్యను చెప్పగలనే అనుకుందాం. అది సంతృప్తికరంగా లేకపోతే సర్దార్జీనుంచి వెలువడే ప్రతిస్పందన ఎలా వుంటుందో తెలియదు. ఎరక్కపోయి వచ్చి యిక్కడ యిరుక్కున్నా నేమిట్రా బాబూ అని లోలోపల నేను కలవరపడిపోయాను.

"ఏమిటి? ఆలోచించుకోవాలా?" అన్నాడు సర్దార్జీ.

టీచరు గదమాయింపుకు గజగజ వణికిపోతూ, బెత్తానికీ చివర నిల్చున్న స్కూలు కుర్రాడిలా నాలో నేను ఒదుగుళ్ళు పోతూ, "అవునండి! పది నిమిషాలు గడువిప్పించండి" అంటూ ప్రాధేయపడిపోయాను.

"ఒరే సాంబూ! ఈయన్ను తీసుకెళ్ళి గదిలో కూచోబెట్టు" అని పురమాయించాడు సర్దార్జీ.

హాలుకు ఈశాన్య భాగంలోవున్న గదిలో నన్ను కూచోబెట్టి, సాంబు తన యథాస్థానానికి వెళ్ళిపోయాడు.

గదిలో సీలింగ్ ఫాన్ తిరుగుతున్నా ఊపిరాడని ఉమ్మదనంలో నేను ఉక్కిరి బిక్కిరైపోసాగాను. ఈసారి సర్దార్జీ సముఖానికి వెళ్ళేటప్పటికి నేనేదో ఒక సంఖ్య వెలిబుచ్చక తప్పదు. పదినిముషాల గడువైతే యిప్పించుకున్నాను గానీ, ఆ వ్యవధి గడవడమంతా ఎంతసేపు? వీధి గూండా పక్షిరాజు అయిదో పదో వాంఛిస్తున్నప్పుడు, అతణ్ణి ముగ్గులో నుంచి నెట్టివేయగల పాపన్నకంతకు తక్కువ రేటు నిర్ణయించడం ఏం బాగుంటుంది?

అదిగో....అప్పుడే అయిదు నిమిషాలు గడిచిపోయాయి.

ఒక్కుమ్మడిగా పది పదిహేనుమంది లోపలికి చొచ్చుకొస్తున్నట్టుగా హాల్లోనుంచి కలకలం వినిపించింది. ముందుకు వంగి కిటికీ నుంచి అవతలికి చూచాను. అందరూ ఇరవైకు దరిదాపుల్లో కాలేజి స్టూడెంట్లకుమల్లే వున్నారు. పూలరంగళ్ళలా

ముస్తాబైపోయి, లోకాన్నంతా వేలంపాటలో కొనేసేటంత ధీమాగా, వాళ్ళు రేసుగుర్రాల్లా హుమ్మస్సుపైన వున్నారు.

ఒక్కపెట్టున్న 'నమస్కారమన్నా, నమస్కారం' అంటూ అభివాదం చేశాక, వారిలో ఒకడు "కాలేజీలో ఎలక్షన్లొస్తున్నాయిగదన్నా! ఆ మాట చెప్పడానికని వచ్చినాం" అన్నాడు.

"చెప్పేదేముంది? మనోడి నెవరినైనా నిలబెట్టి గెలిపించిన తర్వాత గదా నా దగ్గరికి రావాలె!" అన్నాడు సర్దార్జీ.

నిలబెడితిమన్నా! మన మనుబోలు చిన్నబ్బాయి కొడుకు వీరేశం లేడా' – వీడే మన కాండిడేటు."

"మంచిదే గదా! పార్టీలు, మందులు, వాల్‌పోస్టర్లు, కరపత్రాలు, మైకులు అన్నీ జమాయిస్తిరి గదా?"

"దానికేంలోటు లేదన్నా! కానీ సుధాకర బాబని ఒకణ్ణి తెచ్చి, మన కాండిడేటుకు పోటీగా నిలబెట్టిరి. వాడు చానా మంచోడంట! నోట్లో యేలు పెట్టినా కొరకడంట! ఈ స్టూడెంట్లకేం పోయేకాల మొచ్చిందో – చానా మంది 'బాబుకే మా వోటు, బాబుకే మా వోటు, బాబుకే మా వోటు' అంటూ గొంతు చించుకుంటూ వుండిపోయిరి......"

"అట్లనా! ఎవడంట ఆ బోడి బాబు?"

"పేరున్నోడేం కాదన్నా! వాళ్ళ నాయన చిన్న గవర్నమెంటు నౌకరీలో వుంటాడంట!"

"ఒరే సాంబూ!" ఉరిమినట్టుగా పిలిచాడు సర్దార్జీ.

"చెప్పన్నా!"

"కాలేజిపైన మన పట్టుండి తీరాల!"

"అవుమరి! అంతేగదా?"

"బస్‌స్టాండు రాంబోగాణ్ణి పిలిపించి, ఇంక కాలేజికి వెళ్ళే పన్లేకుండా ఆ బాబుగాడికి కాలో, చెయ్యో విరిచేయమని చెప్పు......"

"అట్టనే అన్నా! మధ్యాన్నం కేకేసుకొస్తా....."

తల దిమ్మెక్కిపోవడంవల్ల అంతకుమించి నాకేమీ వినిపించలేదు. ఒళ్ళు చల్లబడిపోయినట్టు తోస్తే రొమ్ముపైన చేయి వేసి చూసుకున్నాను. నీళ్ళలో మునిగి లేచినట్టుగా చొక్కా చెమటతో తడిసిపోయింది. ముఖంపైనమాత్రమేగాదు, కురుల కుదుళ్ళలో గూడా స్వేదబిందువులు పొటమరిస్తున్నాయి. భయంకర కుపిత వ్యాఘ్రమేదో తరుముకొచ్చినట్టుగా తలుపు తీసుకుని, నాలుగంగల్లో చివరకు వచ్చి నడవదారిగుండా బయటపడిపోయాను. పులిజాదమాడుకుంటున్న వస్తాదులు నా వాలకాన్ని ఒకింత ఆశ్చర్యంతో చూస్తూ "ఏమిటి? ఏమైంది?" అని ప్రశ్నించారు. నా బుర్ర చురుగ్గా పనిచేసింది. "అయ్యా, నేను కాస్త జబ్బు మనిషిని! అయిదు నిమిషాల్లో ఒక మాత్ర వేసుకోవాలి" అంటూ గబగబా మెట్లు దిగేశాను.

☆ ☆ ☆

'నగరంలో సగటు ఉద్యోగి స్వంత ఇల్లు' అనేది గగనకుసుమంలా, కుందేటి కొమ్ములా, అత్తిపువ్వులా మాటల్లోనేగానీ, భౌతిక రూపంలో వుండదని చెబుతూ ఈ కథను ముగించవచ్చు. కానీ వివరణకోసం పట్టింపు చూసేవాళ్ళకోసం మరికొన్ని మాటలు చెప్పక తప్పదు. పునాదులు దాకా లేచిన నా యింటి జాగాను నేను అంగబలమూ, అర్థబలమూగూడావున్న ఓ ఆసామికి తెగనమ్మి చేతులు దులిపేసుకున్నాను. పోగా, స్వంత యింటి గొడవతో అట్టే సంబంధం లేకపోయినప్పటికీ, ప్రయోగంలో బైప్రొడక్టులా బయటబడిన ఒక పరిణామాన్ని గురించి చెప్పడం యిక్కడ అప్రస్తుతం కాదనుకుంటాను. ముసుగు నాగమ్మ మిహిడీకి వెళ్ళొచ్చిన మరునాటి నుంచి నేను మా అబ్బాయి సుధాకరబాబు చేత కాలేజి చదువుకు స్వస్తి చెప్పించాను. అంతగా చదువుకోవాలనివుంటే ప్రయివేటు కేండిడేటుగా పరీక్షకు హాజరవుతాడు. లేదు, చదువుకోకపోయినా పరవాలేదు. కాలూ చేయీ, ముఖమూ ముక్కూ సజావుగా వుండడం ముఖ్యం. ఊపిరుంటే ఉప్పమ్ముకుంటాడు. బ్రతుకుదెరువు కోసం కాయకష్టం చేసుకోవలసివచ్చినా తప్పేమీలేదుగదా!

● *'రచన' మాసపత్రిక, 1991* ●

★ ★ ★

వివిన మూర్తి

# 69 పయనం-పలాయనం

గొరేజ్‌లో కారు పార్క్ చేస్తున్నాడు సారధి. వాణి ముందుగానే అపార్ట్‌మెంట్‌కి చేరుకుంది. సారధి వచ్చేసరికి ఆమె బట్టలు మార్చుకుంది. అతను లోపలికి వచ్చి తలుపు మూశాడు. ఫోను చాలాసేపటి నుంచి మోగుతున్నట్లుంది. వాణి ఫోను తీయనందుకు సారధికి కొద్దిగా కోపం వచ్చింది.

టైమ్ చూసాడు. 11.40 అయింది.

పిల్లలు నిద్రపోతున్నారు. వాళ్ళ గదిలోంచి, ఫోన్ శబ్దానికి మెలకువ వచ్చిన ఆయా డ్రాయింగ్ హాల్లో ఉన్న యజమానులను చూసి ఆవులిస్తూ వెళ్ళిపోయింది.

ఫోన్ ఆగిపోయింది.

"–డాడీ అయుంటారు–" అన్నాడు ఇంగ్లీషులో.

ఫ్రిజ్‌లోంచిసీసా తీసి గ్లాసుల్లోపోసి తీసుకువచ్చింది వాణి. తన గ్లాస్‌ని పెదాలకు తాకించుకుని రెండోది అతని ఎదురుగా ఉంచింది. సారధి దాన్ని తీసుకోలేదు.

"నువ్వు మునుపటిలా ఉండటం లేదు–"

భుజాలొకమారు ఎగరేసింది. సగానికి పైగా ఖాళీ అయిన గ్లాస్‌ని టీపాయ్ మీద ఉంచింది. రెండు చేతులూ ఎత్తి ఒళ్ళు విరుచుకుని జుత్తులోనికి వేళ్ళు పోనిచ్చి దువ్వుకుంది. తల విదుల్చుకుంది.

"–ఎలా ఉందీ సెంటు?" అంది.

సారధి తేరిపార చూశాడు.

"నీకు టేస్ట్ లేదు. వాసనలలో తేడా తెలీదు. ఇలాంటి సెంటు ఒకటుందని నీకు తెలుసా?"

"నేను భారతీయుడిని–అంత చిన్న విషయాలు నాకు పట్టవు" అని ధ్వనించాడు గ్లాసులోది గల్ప్‌చేస్తూ.

"ఇదొక్కటే ఒప్పుకున్నావు–"

"ఏమిటి నీ అభిప్రాయం?"

"భారతీయులు పోగు చేస్తారు. మరొకళ్ళు ఎంజాయ్ చేస్తారు–"

"నువ్వు నన్ను అవమానిస్తున్నావు"

మళ్లీ ఫోన్ రింగయింది. ఆ సంభాషణను త్రుంచేస్తున్నట్లు చటుక్కున వెళ్ళి ఫోన్ తీసుకున్నాడు.

వాణి సర్దుకొని కూర్చుంది. ఫోనులో అతను మాట్లాడుతున్న దృశ్యాన్నీ గ్లాస్‌లో ద్రవాన్నీ ఎంజాయ్ చేస్తోంది. మాస్టరు ముందు గుంజీలు తీస్తున్న స్కూల్ పిల్లాడు గుర్తు వస్తున్నాడు. ఆ దృశ్యం ఆమెకు యిష్టమో కాదో చెప్పలేదు. చూసే అవకాశాన్ని మాత్రం వదులుకోదు.

సారథి వచ్చి గ్లాస్‌లోని ద్రవాన్ని నోట్లో ఒంపుకుని పుక్కిలించి మింగాడు. అలా చేసేడంటే అతను మాంచి మూడ్‌లోకి వచ్చినట్లే లెక్క.

"అమ్మ రమ్మంటోందిట–"

"––––––"

"బెంగుళూరు హారిబుల్, ముసలి నగరం! ముసలి వాసన! ముసిలాళ్ళ కోసం ముసిలాళ్ళు నడుపుతున్నట్లుంటుంది–" అన్నాడు.

కళ్ళు పెద్దవి చేసి పెదాలు తమాషాగా తిప్పింది వాణి.

"పిటీ! నువ్వక్కడే పుట్టావు."

"అదేం సీక్రెట్ కాదు. ఓ సీక్రెట్ చెప్పనా? నగరాలలో తేడా పేదలకీ మొద్దులకీ తెలీదు. నిత్యం ఉత్సాహంతో ఉండే వాళ్ళకీ, కార్యసాధకులకీ నగరాలు అర్థమవుతాయి! మన ఢిల్లీని చూడు! ఎప్పుడూ ఏక్టివిటీ! ఇక్కడ రాజకీయాలలో వ్యాపారం సాండ్‌విచ్ చేసినట్టుంటుంది. బోంబే? స్వర్గం! అక్కడ రాజకీయం కూడా వ్యాపారానికి మాచింగ్! కలకత్తా? రాజకీయమూ వ్యాపారమూ కూడా కండల సత్తువతో కలగలిసిపోయుంటాయి. ఏ నగరమయినా దాని యీవెనింగ్స్‌నిబట్టే గుర్తు పట్టెయ్యొచ్చు. సాయంకాలాలే వ్యాపారకేంద్రాలు. ప్రతిభావంతులని అవే టీజ్ చేస్తాయి! యీజ్ చేస్తాయి! ప్లీజెస్ ఫైనల్లీ––––"

అతను మాట్లాడుతూనే ఉన్నాడు.

వాణి సోఫాలో జారబడి చూస్తోంది. ఆమెలో ఓ ఊహ ఆడుతోంది.

సారథిని బట్టలు ఊడతీసి రోడ్డు మీద పరుగెత్తిస్తే.....? లావు కాదు. బొద్దు. ఒంటినిండా జుత్తు. ఇంజనీరింగ్‌లో డిగ్రీ, ఎంబీయే చేశాడు. ఆర్ కే ఇండస్ట్రీస్‌లో డిజీయమ్. జీయమ్ అవటంకోసం పరుగులో ఉన్నాడని ఎవరయినా గుర్తించగలరా? అతని హోదా ఏంబిషన్ ఎక్కడ వేలాడతాయి?

"–ప్రతిరోజూ డాడీ యీ టైంకే ఫోన్ చేస్తారు. సాయంకాలం దొరకవుగదా అంటారు. మమ్మీని యిక్కడకు తీసుకొచ్చేయమంటే అంగీకరించరు. బెంగుళూర్లో కూర్చోటానికి నాకేం పనిలేదా?–"

వాణి అతన్ని ఆ ధోరణిలో వదిలి పడకగదిలోకి వెళ్ళి మంచంమీద అడ్డంగా పడుకుంది. పెంపుడు కుక్క ఆమెకి దగ్గరగా ఒదిగింది.

# 2

"–నిద్రపట్టటం లేదు–" అంది కామేశ్వరి.

రంగనాథం ఆమెకు కొద్ది దూరంలోనే ఉన్నాడు. పుస్తకంలో మునిగి ఉన్నాడు. రీడింగ్ బల్బ్ కాంతి దాని మీద పడుతోంది. బెంగుళూర్ మల్లేశ్వరంలో ఉన్న ఆ యిల్లు పెద్ద ఆవరణలో ఉంది. కాస్త పాతగా ఉంది. ఇంటి ముందు చిన్న తోట ఉంది. విశాలమైన ఆ గదిలో రాత్రి నిశ్శబ్దంలో ఆమె క్షీణస్వరానికి రంగనాథం వెంటనే ప్రతిస్పందించాడు.

"పార్థూ గురించా బెంగ?"

"వస్తాడా?..."

"తప్పకుండానూ....వాడు మన కొడుకు–"

"చచ్చాక తల కొరివి పెట్టాలనేం లేదు. నేనుండగా నాతో గడపాలి–"

"నీ గురించి నాకు తెలుసు కాముడూ! పడుకో–" రంగనాథం గొంతులో దాగిన విసుగును ఆమె గమనించలేదు.

"నిద్ర వస్తోందా రంగా?"

"లేదుగానీ....మాట్లాడితే అలసిపోతావు–"

"మాట్లాడను. అలసిపోను. బతుకుతానంటావా పిచ్చీ?!"

రంగనాథం కళ్ళు మూసుకున్నాడు. సర్వాంగాలలోనూ ఓ బలమైన కుదుపు. ఇన్నాళ్ళూ సన్నిహితంగా జీవించిన యీ ప్రాణి చనిపోయాక ఏమవుతుందో తనకు తెలుసు. కర్మ పరిపక్వమయేవరకూ జన్మల నెత్తుతూనే ఉంటుంది. కానీ తనకు? ఇద్దరూ ఒక్కటై జీవించారు. ఆమె తనను విడిచిపోతే తనకేమవుతుంది? ఊహనే అంగీకరించదు మనసు. అది ప్రవేశించాక మనసూ శరీరమూ పట్లు విచ్చిపోతాయి. ఈ కుదుపు తాలూకు గాఢత కొంత తగ్గిందనే అనిపిస్తుంది. కానీ యీ కళ్ళలో తడి ఏమిటి? యీ గుండెలో శూన్యమేమిటి? యిది అనుబంధ చిహ్నమా? వయో ప్రభావమా?

"పడుకోరా కాముడూ!"

"ఊహూ! పడుకోను...." వెనకటి స్మృతులు మారాం..

ఆమె మంచం పక్కనున్న కుర్చీని ఆక్రమించాడు.

"అయితే ఏం చేస్తావు చెప్పూ?" మోచేతిని మంచం మీద ఆనించి అరచేతిలో గడ్డం పెట్టుకున్నాడు. శక్తినంతా కూడతీసుకొని తల కొద్దిగా తిప్పింది.

"రెండే రెండు చెయ్యగలను. ఏంటో చెప్పా–"

"తెలీటం లేదోయ్!...."

"ఆలోచించు మట్టిబుర్రా!...."

"ఉహూ!" కాస్త ఆగి ఓటమిని ఒప్పుకున్న ధ్వనితో అన్నాడు.

"మాటలాడటం...ఆడకపోవటం....అదీ ఎన్నాళ్ళో!" అంటూనే వుంది. కళ్ళలో నీళ్ళు. గొంతులో గాద్గదికత.

రంగనాథం ఆమె తల మీద చేతిని వేసి నిమిరాడు. కుడిచేతిని ఎత్తి కామేశ్వరి అతనిని తాకాలని చూసింది. అది గమనించాక తన చేతిని అందించాడు. ఆమె చేతిలో పట్టు లేదు. శ్రమ మీద వేళ్ళు మూయగలిగింది. ఆ చేయి ఎండిపోయినట్టుంది.

"–మాటలు తప్ప మన మధ్య యింకేముంది రంగా! మాట్లాడకపోవడం తప్ప నేనిచ్చే సేవ ఏముందింక?"

గొంతు కూడా స్పష్టత పోతోంది. అనుబంధాల నిరూపణకు ఆధునిక వైద్యం ఎన్ని సదుపాయాలు చేసింది! పార్థు అవన్నీ ప్రయత్నించాడు! డబ్బు ఖర్చుపెట్టాడు. వైద్యులు రోగనిర్ధారణ కూడా చేయలేకపోయారు.

ఇన్నిచేసినా పార్థు ప్రేమకు అవి నిరూపణ కావు – అనుకున్నాడు రంగనాథం.

"ఎలాగయిందిది సేవ!"

"నీకు నిద్ర వస్తోంది. నీ మనసు పుస్తకం మీదుంటుంది. విసిగించకపోవటం సేవ కదూ!"

"నువ్వలా అనుకోకు కాముదూ! వినగలిగినంత కాలమూ వినే భాగ్యాన్ని యియ్యి. ఏం మాట్లాడాలనుంటే అది మాట్లాడు!"

ఆమె పార్థు గురించి మాట్లాడసాగింది. ఆమె మెదడు సక్రమంగా ఉంది. తేదీలతో సహా ప్రతిదీ గుర్తే! ప్రతి సంఘటనా చిరు వివరాలతో సహా చెపుతుంది. ప్రతి విషయాన్నీ విశ్లేషిస్తుంది. తర్కిస్తుంది. చదివినవాటిని ఉటంకిస్తుంది. కానీ మిగిలిన శరీరంలో ఏదీ పనిచెయ్యదు. చీమ పాకినా తీసివేయలేదు. శరీరమంతటిలోను ఆమెకు యిష్టమైనది చెయ్యి. దాంతోనే ఆమె తన స్పందనలను బయటప్రపంచంతో పంచుకోగలదు. దానితో నొక్కగలిగితే అది ఓ విజయం. ఆ చేత్తో పార్థుని ఆపగలదా? వస్తూనే ఉంటాడు. డాక్టర్లను కలుస్తుంటాడు. పిల్లల్నీ కోడల్నీ ఎప్పుడయినా తీసుకువస్తాడు. ఎన్ని చేసినా దగ్గరగా పది నిమిషాలు కూర్చోడు. ఊళ్ళోకి వస్తే చాలు – ఫోన్ మోగుతూనే ఉంటుంది. రక రకాల మిత్రులు. సర్కిల్స్. అతని జీవితంలో వేగం ప్రధానం. తనూ ఉద్యోగం చేసింది. రంగా చేశాడు. కానీ అంత వేగం తమకు తెలియదు. కానీ వేగాన్ని తాను ముందే పసికట్టింది. కొడుకుని వేగానికి తట్టుకొనేట్టు తయారుచేసింది. జీవితంలో విజయం ఎంత ముఖ్యమో అర్థమయేట్టు పెంచింది. ఇప్పుడు ఆ వేగాన్ని ఆపి....ఒక గంట...ఒక రాత్రి....తన కోసం వాడు ఆగాలి. తన యీ చేత్తోవాడిని ఆపాలి. తన కోసం వాడు ఆగాలి.....

"వాడిని తప్పుపట్టకు కాముదూ!" అన్నాడు రంగనాథం.

"నేనా? వ్యక్తులని తప్పు పట్టటమా!" అంది. రంగనాథం నిదానంగా చూసాడు–"నేను అవిశ్వాసిని రంగా! రాతినీ పామునీ కూడా నమ్మేటంత విశ్వాసివి నువ్వు–" అంది.

'విశ్వాసులు వ్యక్తులని తప్పుపడతారంటావు నువ్వు–' అందామనుకున్నాడు. బాబుకి ఆమె తల్లి. కనుక బాబుది ఆమె దృష్టిలో తప్పుకాదు. తల్లి కోసం సమయం

వెచ్చించలేని కొడుకుది తప్పే- తనకేం సందేహం లేదు. ఎందుకామాట అని కష్టపెట్టడం?

"పోన్లే కాముడూ! ఎవరి దోవ వారిదీ-----" అన్నాడు.

"మనమలా జీవించలేదే! భర్తపోయిన నన్ను మళ్ళీ పెళ్ళాడావు. నన్ను తల్లిని చేశావు! 'నా భావాలేయినా నాకు భావించే అవకాశమిస్తా'నన్నావు! యిచ్చావు. మన ఆలోచనలు ఉత్తర దక్షిణాలు! అయినా కలిసి జీవించాం! చాలా రమ్యంగా జీవించాం కదూ!"

"సందేహమేముంది కాముడూ?"

"పరమాత్మ....ఆత్మ.....స్వర్గ నరకాలు....జన్మ పరంపర....అన్నిటినీ నీవు నమ్మావు. దేన్నీ నేను నమ్మలేదు. మన దాంపత్య జీవిత సాఫల్యానికి బాధ్యత ఎవరిదీ? నీదే....అంటాన్నేను. కారణం ఏది? అభివృద్ధిముఖంగా సాగుతున్న సమాజం -- అంటాన్నేను. రెండూ కాదంటావు నువ్వు- బాధ్యత, కారణమూ భగవంతుడే అంటావు నువ్వు-"

రంగనాధం ఆమె మాటలని వింటూనే, ఆ భావాలను అర్థం చేసుకుంటూనే తనలో తను మునిగిపోయాడు.

ఎంత స్వేచ్ఛగా మాట్లాడుతుంది కామేశ్వరి! ఈమధ్య అప్పుడప్పుడు ఆమెకే మెదడుమీద పట్టు తగ్గుతున్నట్లనిపిస్తుంది. స్పృహలో మాట్లాడుతున్నట్లుండదు! అలాంటప్పుడు కూడా ఆమె తన యీ స్థితి గురించి పశ్చాత్తాప పడదు. తన జీవితంలో జరిగిన 'పాపాని'కి ఫలితమే యీ స్థితి-అన్న భావన ప్రకటించదు.

విశ్వాసం ప్రాధమికమయినదా? విశ్వాసరాహిత్యం ప్రధమికమయినదా? - అన్న విచికత్స కలిగిస్తుంది కామేశ్వరి స్థితి.

ఏమయినా అనాటి సంఘటన - ఆ దుర్భర జ్ఞాపకం - మనసులో కదిలినప్పుడు అతను విల విలపోతాడు. అనాటి పాపఫలమే యీ రోగం - అన్న ఊహ కలుగుతూంటుంది. పాపమనేది ఉందనే వాస్తవం మనిషికి తెలియకపోతే ఎంత బాగుండునూ - తన కామేశ్వరికి యీ అవస్థ వచ్చినందుకు యింత బాధ కలిగేదా-అనుకుంటాడు రంగనాధం.

కామేశ్వరి మాట్లాడుతూనే నిద్రలోకి జారుకుంది. రంగనాధం దుప్పటి సరిచేసాడు. ఫాన్ పెంచాడు. కిటికీ తెరలు సర్దాడు. బయటకు చూశాడు.

ఏదో ఆటో వేగంగా పోతుంది. బయట మొక్కల మీద వాలుతున్న చంద్రకిరణాలు. కుక్కల అరుపులు.

రంగనాధం పడకకుర్చీలో కూర్చున్నాడు. కళ్ళు మూసుకున్నాడు. వదలని ఆలోచనలు పాత సంఘటనలను కళ్ళముందు నిలపసాగాయి.

## 3

మూడేళ్ళ పార్థుని జోకొడుతోంది కామేశ్వరి. రంగనాధం ఏదో ఆధ్యాత్మిక గ్రంధాన్ని చదువుకుంటున్నాడు. రాత్రి పది.

"రంగా!"

"ఊ!"

"నీకో విషయం చెప్పాలి–"

"తమరెప్పుడూ చెపుతూనే ఉన్నారు. వీడెప్పుడూ వింటూనే ఉన్నాడు గదండీ!" అన్నాడు పుస్తకం మూసి.

"రంగా! దయచేసి సీరియస్‌గా ఉండు–"

"ఓకే ఓకే....అయ్యాం రెడీ!"

"నాలో మార్పేం కనిపించటం లేదూ?"

"బ్రహ్మాండమైన మార్పు. రోజు రోజుకీ అందం ఎక్కుతున్నావు!"

పార్థుని జోకొడుతూనే అతన్ని చూసింది. 40 ఏళ్ళు. పసిమి ఛాయ. బలిష్ఠమైన శరీరం. నవ్వు మొహం.

"నీ మీద నాకు చాలా నమ్మకం రంగా! నువ్వు అర్థం చేసుకోగలవు. నేను చెప్పితీరాలి."

"ఏంటోయ్ ఆ డైలాగులు! డైరక్టుగా చెప్పెయ్యగూడదూ?"

పార్థుని జోకట్టడం ఆపి వెళ్ళి కుర్చీలో కూర్చుంది. ఆమె మొహం రంగనాథం వయిపులేదు. పార్థు కదులుతుంటే రంగనాథం జోకొట్టసాగుడు.

కొంతసేపు గడిచాక కామేశ్వరి ఆరంభించింది–

"మన వివాహానికి ముందే నటరాజన్ నాకు తెలుసు. మేము ఒకే కంపెనీలో కలిసి పనిచేస్తున్నాం. మగవాళ్ళు ఎంతటి మర్యాదస్తులో సహోద్యోగినులే చెప్పగలరు. ఎలా చూసినా అతను చాలా మర్యాదస్తుడు. ఇళ్ళలోనే ఉండే ఆడవాళ్ళు బయటికి వచ్చి మగవాళ్ళతో, అపరిచితులతో కలసి పనిచేసే అవకాశమిచ్చింది పారిశ్రామిక యుగం. దాంతో మగవాడి దృష్టిలో యింట్లో ఉండే ఆడవాళ్ళు, బయట తిరుగుతూ కనిపించే ఆడవాళ్ళు వేరయారు. మనసులో ఎవరికెలాంటి ఆలోచనలున్నా బయటికి కనిపించే ప్రవర్తనలనుబట్టి చూస్తే మగవాడు వెకిలిగాను, చపలచిత్తుడుగానూ ఉండటం ఆడవాళ్ల నిత్యానుభవం. కాని నటరాజన్‌లో మచ్చుకయినా అలాంటి వివరాలు కనిపించేవి కావు. స్త్రీనయినా నాకు అదో రకమైన గౌరవం అతనంటే!

ఇద్దరం ఉద్యోగరీత్యా కలిసి ప్రయాణాలు ఎన్నోమార్లు చేశాం! గడచినసారీ మా ప్రయాణం మామూలుగానే అయింది. వచ్చేటప్పుడు పట్టుకుంది తుఫాను. రైలు ముందుకి కదలదన్నారు. ఏం చేయటం? మనసంతా బెంగగా ఉంది. పార్థుతో నువ్వేం అవస్థలు పడుతున్నావో అని ఉంది. నటరాజన్ గమనించాడు. ధైర్యం చెప్పాడు. ఏదైనా మార్గం చూస్తానన్నాడు. ఒక టాక్సీ కుదిరింది. మొత్తం ఆరుగురు ప్రయాణీకులం. వెనకసీట్లో నలుగురం. వెనక్కి వాలటానికికూడా చోటులేదు. అద్దాలమీద పడుతున్న, వాననీరు లోపలికి లీకవుతోంది. బట్టలు చెమ్మగా ఉన్నాయి. అతనూ యిబ్బందిగా కూర్చున్నాడు. అతని అవస్థ చూడలేక ఫ్రీగా కూర్చోమన్నాను. ప్రయాణం ఎలాగవుతుందా అని బెంగగా వుంది. రాత్రి పన్నెండు గంటల

ప్రాంతంలో ఓ చిన్న బస్తీదగ్గర కారు ఆగిపోయింది. డ్రైవరు కొంత ప్రయత్నం చేసి కదలదన్నాడు. తెల్లారేదాకా ఏమీ చేయలేమన్నాడు.

వాన కాస్త తగ్గటంతో అంతా బయటకు దిగాం. మా తోటి ప్రయాణీకులలో కొత్తగా పెళ్ళయిన దంపతులున్నారు. మలయాళం మరెవరికీ రాదన్నట్లు చాలా ఉత్సాహంగా మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ ఆనందం మామూలుగా అయితే ఎలా ఉండేదో గాని అప్పుడు చికాకు కలిగిస్తోంది. మాకు యిడ్లీలు పెట్టి టీలు యిచ్చిన పాక హోటలువాడు మరికొద్దిదూరంలో ఓ లాడ్జి ఉందన్నాడు.

లాడ్జిలో ఆరు గదులున్నాయి. రెండు గదులు ఏర్పాటు చేయగలమన్నాడు. మలయాళీ దంపతుల మొహంలో వెలుతురు. అది గమనించగానే అదోలా అయిపోయాను. బయట రొజ్జగాలి.

వాళ్ళిద్దరికీ మా యిద్దరికీ గదులు కుదురుతాయన్నాడు ఓనరు.

నా మొహంలోకి చూశాడు నటరాజన్.

"నీకు అభ్యంతరమా?"

'అభ్యంతరమే–' అనాలనుకున్నాను. ఎన్నాళ్ళబట్టో పెంచుకున్న భావాలూ, సంస్కారమూ – 'ఛత్' అన్నాయి.

"భలేవాడివేలే" అన్నాను. న్యాయానికి అతను నాకు అభ్యంతరం ఉంటుందని తెలుసుకోవాలని ఆశించాను. అయితే అతను అభ్యంతరాన్ని చూపిస్తే నేనెలా తీసుకొనేదాన్నో!

గదిలో రెండు మంచాలున్నాయి. ఓ టేబిలు, అద్దమూ, రెండు కుర్చీలూ ఉన్నాయి. గదంతా ముక్కకంపు. దిండ్లూ పరుపూ వాసనగా ఉన్నాయి. రెండు రోజులుగా కరెంటు లేదుట. హరికెన్ లాంతరూ, కొవ్వొత్తులూ ఉన్నాయి.

మంచాలు దూరంగా జరిపాడు నటరాజన్. తానే దుప్పట్లు దులిపాడు. వాటిని పరిచాడు. అతను అలా సర్దుతూంటే నేను టేబిలు ముందున్న కుర్చీలో కూర్చున్నాను. టేబిలు సొరుగు లాగాను. అందులో కనిపించిన 'పాకెట్'ని చూసి శరీరమంతా జుగుప్స ఆవరించింది. చటుక్కున మూసేసాను. పెద్ద చప్పుడయింది. ఆ గదిలోకి ఎలాంటివాళ్ళు వస్తుంటారో, ఏ పనిమీద వస్తుంటారో కళ్ళముందు కదిలి రోతగా ఉంది.

ఆ చప్పుడుకి అతను పని ఆపి నా వేపు చూసి–"ఏంటి?" అన్నాడు.

"ఏం లేదు–" అన్నాను కంగారుగా.

అక్కడనించి నా ఫీలింగ్స్ వివరించటం కష్టం రంగా! వివాహ బంధానికి ప్రప్రథమ అవసరం నమ్మకం. ఒకరి మీద ఒకరికి నమ్మకం. ఎవరి మీద వారికి నమ్మకం. మనమధ్య దానికి కొదవలేదు రంగా! నీకు తెలుసుగదా–వివాహేతర లైంగిక సంబంధాలపట్ల నాకు యిచ్ఛ లేదు. అయినా నేను స్వేచ్ఛగా ఆహ్వానిస్తాను. ఇచ్చించే స్వేచ్ఛను బలపరుస్తాను. మరొకరితో సంబంధమే స్వేచ్ఛాపిపాసకు నిదర్శనమని నేను అనుకోలేను.

అతను కుతూహలం వల్లనో, కంగారు వల్లనో వచ్చి సొరుగు లాగాడు. వెంటనే మూసేసాడు. అతని ఫీలింగ్స్ నాకు తెలీవు. నా సంస్కారం, చదువూ, ఉన్నత భావాలూ, మన బంధమూ, అవగాహనా.... యివన్నీ నన్ను సవాలు చేస్తున్న ఫీలింగ్!

నువ్వు మామూలుగా ప్రవర్తించు! అతడు అనుచితంగా ప్రవర్తిస్తున్నప్పుడు గదా–నువ్వు తప్పించుకోవటం? నీమీద నీకామాత్రం నమ్మకం లేదా? ఎదుటి మనిషిని నీ అనుచిత ప్రవర్తన గాయపరిచే పనిని ఎందుకు చేయాలి? నీకేం హక్కుంది?–

ఇలా మొదలయాయి ఆలోచనలు.

ఇద్దరం మంచాల మీద చేరాం! చెమ్మగావున్న చీర బరువుగా ఉంది. మార్చుకుంటే బాగుండును. అతన్ని బయటకు వెళ్ళమనాలి. అదే నువ్వు ఉంటేనా?....నీ ఆలోచనలు, నీ అల్లరి, నన్ను సుఖపెట్టే చాతుర్యం...గుర్తుకు వస్తున్నాయి.

అప్రయత్నంగా పక్కకి చూసాను.

అతను తన మంచం మీద కదులుతున్నాడు. ఎందుకూ? నా స్థితిలోనే ఉన్నాడా? ఉంటే.... ఊరుకుంటాడా? నా ఫీలింగ్స్ అతనికి కనబడుతున్నాయా? అతనికి కనిపించటానికి నాకేం ఫీలింగ్స్ ఉన్నాయి? సరే – నాకు లేవు. మగాడు కదా–అతనికి లేకుండా ఉంటాయా? సంస్కారం వల్ల దాచుకోవచ్చుగానీ లేకుండా ఎలా ఉంటాయి? ఏమో! నాలో అంత ఆకర్షణ లేదేమో! నాకు ముప్పై ఏడు నడుస్తోంది. అయితే ఏం – రంగకి అంత ఉద్రేకం కలిగిస్తుందే నా శరీరం–పరాయి వాళ్ళకి కలిగించదా? భార్యను కావటం వల్ల, ఉద్రేకాలకు మరోచోట అవకాశం లేక రంగ నా ముందు ఉద్రేకపడతాడా? ప్రదర్శిస్తాడా? రంగది నటనా? రంగ నానుంచి పొందుతున్నది నాలో ఉన్నదానివల్లకాదా? నాలో ఏమీలేదా?

–రంగా! మనోగతి ఎంత చిత్రమైనది! కొన్ని యాదృచ్ఛిక పరిస్థితులు ఎంత బలమైనవి! శరీరావసరాలకు మనసు ఎంత చక్కని తర్కం తయారుచేస్తుంది!

నటరాజన్ లేచి మంచం మీద కూర్చున్నాడు. సిగరెట్ ముట్టించాడు.

మంచంమీదనుంచే మోచేతిమీద కొద్దిగా పైకిలేచి టేబిల్‌మీద లాంతరును తగ్గించాను.

"నిద్ర పట్టటంలేదా?"

జవాబివ్వాలని ప్రయత్నిస్తున్నాను.

అతను లేచి సమీపించాడు.

"–చీర తడిగా ఉందేమో! మార్చుకో! బయట నించుంటాను–"

అతని మాటల్లోనూ, మాటలోనూ, ఏదో వెతుకుతున్నాను. అది మామూలుగా ఉండే నన్ను అవమానిస్తున్నట్లనిపిస్తోంది.

'–నీలో ఏముంది? ఏమీ లేదు. నీవు గడచిపోయిన వసంతానివి, వడలి రాలిపోతున్న కుసుమానివి. కావాలన్నా నీవు గుబాళించలేవు–' అంటోంది మనసు. మనసే శరీరాన్ని నడుపుతున్నదో! శరీరమే మనసుని కదుపుతున్నదో! – అర్థం కావడం లేదు. నన్నేదో సవాలు చేస్తున్నది.

నేను అతని చేయి పట్టుకున్నాను.

అది నా సవాలుకు సవాలుగా వేడిగా ఉంది. అది వాతావరణం వల్ల వేడి కాదని, స్త్రీనవటంవల్ల నాకు తెలిసిపోయింది–"

రంగనాథం పార్థుని జోకొడుతూనే స్థాణువులా కూర్చుండిపోయాడు. సమస్త ప్రపంచమూ ఆగిపోయినట్లనిపించింది. ఇలాంటి సందర్భాలలో చాలామంది ఎలా ప్రవర్తించారు? తమని తాము చంపుకున్నారు. లేదా ఎదుటివాళ్ళను చంపారు. ఎలాంటి సందర్భం? భార్యకు మరొకరితో లైంగిక సంబంధం ఏర్పడటమనే సందర్భం. ఎంత సాహిత్యమున్నది యీ సందర్భం మీద! ఈ విషయం మీద ఎన్ని ఆలోచనలు గ్రంథస్తమయాయి! ఎన్ని ధర్మప్రబోధాలు జరిగాయి! కానీ ఏం ప్రయోజనం? ఏ ఒకరి ఆలోచనలూ మరొకరి సమస్యకు పరిష్కారం చూపలేకపోయాయి. ఏ ధర్మ ప్రబోధాలూ, నీతి ప్రవచనాలూ యీ పాప ప్రభంజనాన్ని ఆపలేకపోయాయి. మానవులందరికీ ఉన్నవి అవే అవయవాలయినా భగవంతుడు ఎంతటి వైవిధ్యం కూర్చాడు! అలాగే యీ సందర్భం ఒకటే అయినా ఆవేశాలలో ఎంత వైవిధ్యం! ఈ వైవిధ్యానికి మూలం ఏమిటి? ఎవరి ఆవేశాలు వారివి. ఎవరి ఆలోచనలు వారివి. ఏ ప్రాణికి ఆ ప్రాణే జీవిస్తుంది. ఎవరికి ఎవరితోనూ పోలిక లేదు. మనిషికి మనిషితో సంబంధమన్నదే లేనపుడు పోలిక ఏమిటి? సంబంధమన్నది ఓ భ్రమ. దాంతో ఎవరికి వారు ఓ గూడు కట్టుకుంటారు. గాలిని పోగుచేయటాన్ని యత్నించినట్లు ఆ గూడుకి భయపడతారు. దాన్ని కాపాడుకోజూస్తారు. దానికి కనిపించే సంకేతాలు – వివాహ వ్యవస్థా, కుటుంబమూ, సంఘమూ, ప్రభుత్వమూ.....! కనిపించని పునాదులు దైవమూ, మతమూ, మనస్తత్వమూనూ! దాని ఆలోచనల ప్రకారం అది ప్రవర్తించింది! కనక నా ఆలోచనల ప్రకారం నేను చేస్తాను. దాని ఆవేశాలు దానివే అయితే నావి నావే! నేను దీనితో పడుకోను! సంసారం చెయ్యను! వీలుచూసుకొని చంపేస్తాను! తప్పకుండా చంపేస్తాను! దాని చావు నాకు చావు కారాదు. మా చావు వల్ల పార్థు అనాథ కాకూడదు. అందుకని నేను బతికే ఉండాలి. అది చావాలి. రెండూ సాధ్యమవాలంటే దాని చావు రహస్యంగా జరగాలి.

ఫోన్ ట్రింగ్...... ట్రింగ్‌మంటోంది.

ఆలోచనల నించి రంగనాథ్ బుర్ర పక్కకి తిప్పాడు. వెళ్ళి ఫోను తీసుకున్నాడు.

"డాడీ!" ఢిల్లీ నుంచి పార్థు స్వరం వినపడసాగింది.

## 4

"పార్థూ పిల్లలూ వస్తున్నారు కాముడూ!"

ఫోను దగ్గర నించి సరాసరి కామేశ్వరి మంచం దగ్గరికి వెళ్ళాడు రంగనాథం. ఆమె జవాబివ్వలేదు. నిదానించి చూశాడు. పక్కలు కదులుతున్నాయి. బిగిసిన ఊపిరి సడలినట్లయింది.

నిద్రపోతున్నట్లుంది! పడుకోనీ!–

కొంచెం వంగి తల మీద చెయ్యి వేశాడు. చిరుచెమట. ఫాను పెంచాడు. ఎంత చల్లగా ఉన్నా కామేశ్వరికి ఫాన్ కావాలి. తనకి కుక్క చలి! ముడుచుకుని మూడంకె వేసేసేవాడు. ఎప్పుడూ యిద్దరిదీ ఒకటే మంచం. మెలకువ వస్తే ఆమె కోసం ఫాన్ వేసేవాడు. ఆమెకి మెలకువ వస్తే ఫాన్ ఆపేసేది.

రంగనాథం ఆమెనలా చూస్తూ నించున్నాడు. పార్థు వస్తున్నాడంటే ఆమెకి ఎంత ఆనందం! ఆమె ఆనందిస్తే తనకి ఎంత ఆనందం! తమ బ్రతుకులోని అత్యంత క్లిష్టమయిన సంఘటనని కొంతసేపు క్రితమే గుర్తు చేసుకున్నాడు. ఆనాటి ఆలోచనలుగా యీనాడు అనుకుంటున్నవి పాత ఫోటోల్లో మరణించిన వ్యక్తుల బొమ్మల్లాంటివి. ఆ ఆవేశాలు యిప్పుడు అందవు. ఇప్పటి ఆవేశాలు వేరు. పడవలసినవాటికి ఆవేశపడలేకపోవటమూ, స్వల్పవిషయాలకు వ్యర్థావేశాలూ వృద్ధాప్యస్వాభావికాలేమో!

మరుసటిరోజు సాయంత్రానికి పార్థసారధి వచ్చాడు. వెంట వాణీ, పిల్లలూ వచ్చారు. పిల్లలకి సెలవులుట. ఢిల్లీ ఎండల గురించి పదే పదే చెపుతున్నాడు సారధి. పిల్లలనీ అక్కడే ఉంచుతాడట. కామేశ్వరి మొహం వెలిగిపోయింది. వాణి కూర్చుని సారధినే చూస్తోంది. రంగనాథాన్ని మనవలు చుట్టేసి కబుర్లలో పెట్టారు. అయినా రంగనాథం గమనిస్తూనే ఉన్నాడు. కొడుకు మాటా, కోడలి చూపూ తేడాగా ఉన్నాయి.

అంతట్లోనే సారధి లేచి ఫోన్ దగ్గరకి పరుగెత్తాడు. అక్కడినించే అందరికీ చెయ్యి ఊపేసి నగరంలోకి పరుగెత్తాడు.

వాణి చాలాసేపు అత్తగారి దగ్గర గడిపింది. వంటవాడిచేత చెప్పి వండింపించింది. ప్రయాణ బడలిక వల్ల పిల్లలు కొంతసేపు వీసీపీ చూసి పడుకున్నారు. రంగనాథం, వాణీ కూడా భోజనాలు పూర్తిచేశారు.

వాణి తన గదిలోకి వెళ్ళగానే రంగనాథం కామేశ్వరి పక్కన కుర్చీ వేసుకున్నాడు. ఆమె మొహంలో ప్రకాశం సులువుగానే తెలిసిపోతోంది.

"రంగా! పిల్లలూ, కోడలూ, పార్థూ అంతా ఉన్నారు. నేనుపోతే....."

ఆమె పెదాలు సున్నితంగా వేళ్ళతో మూశాడు రంగనాథం. 'ఇలా మాట్లాడకు' అన్నట్లు తల ఆడించాడు.

"–పిచ్చీ! అన్నంతమాత్రాన అవుతుందా?" అంది.

"ఈ విషయం మీద వాదించనని ఎప్పుడూ అంటూనే ఉంటావు–" అన్నాడు.

"కోడలు నా దగ్గర కూర్చుంది–" అంది కామేశ్వరి. 'తలకి నూనె రాసింది' అని కూడా అనుకున్నాడు. వాణి గురించి మాట్లాడుతూనే చంటిపిల్లలా నిద్రలోకి జారుకుంది కామేశ్వరి.

రంగనాథం ఏదో పుస్తకాన్ని పట్టుకు కూర్చున్నాడు.

పన్నెండు గంటల తర్వాత వచ్చాడు పార్థసారధి. అతను లోపలికి అడుగు పెట్టగానే వాణి చేసిన సేవ గురించి, కామేశ్వరి సంతోషం గురించి చెప్పాడు రంగనాథం.

"–యింకా పడుకోలేదా డాడీ! అమ్మ సంగతి వాణి చూస్తుంది. మీరు పడుకోండి–" అన్నాడు. గదిలోకి వెళ్ళిపోయాడు.

రంగనాధం కొడుకుని తేరిపార చూసి సన్నగా నిట్టూర్చాడు. దీపం ఆర్పి పడక కుర్చీలో కూర్చున్నాడు. కామేశ్వరి మంచంపట్టిన దగ్గర నుంచీ అతనికి రాత్రి నిద్ర కరువయింది.

ఆ గదిలోంచి పక్కగదిలోకి వెళ్ళాడు సారధి.

వాణి మెలకువగా ఉంది.

"–నువ్వు నిజంగానే మంచిదానివి–" అన్నాడు బట్టలు మార్చుకుంటూ.

"అంత సడన్‌గా మంచితనం ఎలా తెలిసిందో....."

"మా అమ్మకి చాలా సర్వీస్ చేసావుట–డాడీ పొంగిపోయారు"

"మీ అమ్మకి కాదు....ఓ పేషెంట్‌కి...." అంది.

"నువ్వెప్పుడూ వాదనకి రెడీ.....! నేను కాదు. గుడ్ నైట్...." అనేసి మంచం మీద పడుకుని దుప్పటి కప్పుకోబోయాడు.

"నువ్వు పడుకుంటే నీ స్లీపింగ్ బ్యూటీ చూడాలని కాదు నేను కాచుకున్నది! నువ్వు నన్నెందుకు ఎవాయిడ్ చేస్తున్నావో చెప్పు?"

"డోంటాక్ రబ్బిష్."

"ఇంత బ్యూటీఫుల్ పెళ్ళాం లేకుండా నీ పనులన్నీ ఎలా అవుతాయో!"

"లిమిట్స్ దాటుతున్నావు."

"మనమధ్య లిమిట్సా? చిత్రంగా ఉందే! ఇంతకీ అసలు సంగతి ఏమిటి? ఈ బెంగుళూర్లో ఎన్నాళ్ళు నన్ను దాచాలనుకుంటున్నావు? ఎందుకు?"

సారధి జవాబివ్వకుండా దుప్పటి ముసుగేసేశాడు.

వాణి లైటు ఆర్పేసింది.

"ఢిల్లీకి ఫోను చేస్తున్నాను–"

"ఎవరికి?"

"చెప్పను–"

ఉద్రేకంగా లేచి గొంతు పెంచి – "ఎందుకు చెప్పవు?" అంది.

"నీకు తెలుసు గనుక....."

"యూ బిచ్...."

"షటప్! నేను బిచ్‌నయితే నువ్వు డాఫర్‌వి–"

"వాణీ! మన సంసారాన్ని కాపాడటానికి నేను ట్రై చేస్తున్నాను. యూ మస్ట్ కోపరేట్...."

"నా కోపరేషన్ చాలా తీసుకున్నావు–నీ ప్రమోషన్ల కోసం–"

"అంతా నా కోసమేనా?"

"కాదు, నా కోసం!"

కొంతసేపు సారధి మాట్లాడలేదు.

"కాస్త కల్చర్డ్‌గా ఉండమన్నాను. సోషల్‌గా మూవ్ అవమన్నాను. నిన్ను వాడితో పడుకోమనలేదు–"

"పడుకొన్నందుకు అభ్యంతర పెట్టలేదు–"

"నువ్వు వింటావా? యిప్పుడు చెప్పటంలేదా లిమిట్స్‌లో ఉండమని–" సారధి వాక్యం పూర్తవలేదు.

"సారధీ! నువ్వు బిస్కత్తులు పెడితే తోక ఊపి, ఉసి గొలిపితే మీదపడటానికి నేను కుక్కను కాను–"

"వాడిని నమ్ముతున్నావేమో! వాడు పక్కా బిజినెస్ మాన్! నిన్ను అమ్మేస్తాడు–"

"నాకామాత్రం తెలుసు! నువ్వు అరువిస్తావు. వాడు ఎరువిస్తాడు."

సారధి మరోసారి మౌనం వహించాడు.

"–ఢిల్లీ నుంచి తెచ్చి యిక్కడుంచింది ఎందుకూ? వాడిని యిక్కడకు రప్పించుకుని నా పరువు తియ్యటానికా? పద పోదాం రేపు."

"ఆలోచించి చెబుతాను–పడుకో!"

పడుకోబోతూ చూశాడు. తలుపు తెరిచివుంది.

"–తలుపు ముయ్యలేదేం?" విసుక్కుంటూ లేచాడు.

"నీకు మూసే ఓపికలేక–"

తలుపు మూస్తూంటే తండ్రి పడక కుర్చీలో కనిపించాడు.

సారధి తలుపు మూసేసి ఒక్క క్షణం అక్కడే నిలబడ్డాడు. శరీరమంతా చచ్చుబడినట్లయింది. మనసనే మృతశిశువు ఎదుటపడినట్లయింది. దానిని వదిలించుకోటానికన్నట్లు కదిలాడు. నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్ళి మంచం మీద వాలాడు. కళ్ళు మూసుకున్నాడు.

"డాడీ వినలేదు గదా మన మాటలు?" అన్నాడు.

## 5

ప్రపంచమంతా అకస్మాత్తుగా చీకటి వ్యాపించినట్టుంది. ఎక్కడ వున్నాడో తెలీదు. కదులుతున్నాడో లేదో తెలీదు. ఎవరయినా తనను కదలించుతున్నారా? ఏదయినా తన చలనాన్ని నిలువరిస్తోందా? అన్నీ వెనక్కి వెళుతూంటే తాను ముందుకు వెళ్తున్నానన్న భ్రాంతా? ఎక్కడనుంచి బయలుదేరాడు? తన ప్రమేయం లేకుండా సాగుతోందా యీ పయనం? ఏమిటి దీని గమ్యం?

ప్రశ్నలను తయారుచేసుకొనే ప్రయత్నం చేస్తున్నాడు రంగనాథం.

ప్రశ్నలే తృప్తికరంగా లేవు.

ఇక జవాబులెలా కుదురుతాయి?

రంగనాథం పడక కుర్చీలో ఎవరో కట్టేసినట్టు ఉండిపోయాడు.

ఆనాడు తమ దంపతుల మధ్యా ఓ సంఘటన జరిగింది. తమ యిద్దరి జీవితాలనూ అది కుదిపివేసింది. భిన్న దృక్పథాలు తమవి. ఆ మహా సంక్షోభం నుంచి ఎలా బయటపడ్డారు?

వర్తమానాన్ని మోయలేకపోతోంది ఆ వృద్ధుని హృదయం. అది గతాన్ని తరచటంలో, తలచటంలో తలదాచుకోజూస్తోంది.

ఆనాడు–రంగనాథం యిల్లు వదిలాడు.

మూడు నెలలు గడిచాయి. తొంభై ఎనిమిది రోజులు గడిచాయి. రెండు వేల మూడొందల ఏభై రెండు గంటలు గడిచాయి.

ఉదయం ఏడున్నర. ఆఫీసుకు తయారవుతోంది కామేశ్వరి. వంటింట్లో మధ్యాహ్నం లంచ్ బాక్స్ కట్టుకుంటోంది. బయటనున్న పార్థు ఏడుపుతో యివతలకు వచ్చింది.

రంగనాథం! పెరిగిన గడ్డం మీసాల్తో, కళ్ళలో ఏదో అర్థంకాని ఉద్వేగాలతో రంగనాథం!

దిగ్భ్రమతో నించుండిపోయింది.

ఆమెని సమీపించాడు. తల మీద చేయి వేశాడు. కదలిపోయింది. కరగి పోయింది.

ఎక్కడికి వెళ్ళావని ఆమె ప్రశ్నించలేదు.

ఎలా ఉన్నావని అతను ప్రశ్నించలేదు.

వారి మధ్య ప్రశ్నలు లేవు. జవాబులు లేవు.

ఊరు వెళ్ళివచ్చినట్లు అతను! ఊరు వెళ్ళివచ్చినతనే అతనూ అన్నట్లు ఆమె!

వండింది. వడ్డించింది. తిన్నాడు. నిద్రపోయాడు. ఇద్దరూ బాబుతో ఆడారు.

రెండవ రోజు కూడా ఆఫీసుకు వెళ్ళలేదు కామేశ్వరి.

రాత్రయింది. భోజనాలయ్యాయి. నిద్రపోయాడు పార్థు. నిద్రకు ఉపక్రమించింది ప్రపంచం. పశువుల్ని కాసే పిల్లల్లా గుమిగూడి ఆకాశంలో చుక్కలు కబుర్లలో పడ్డాయి. ఆటల్లో పడ్డాయి. మానవ శరీరాలను బంధిస్తున్న మస్తిష్కాలు కునికిపాట్లలో పడ్డాయి. మేల్కొన్న శరీరాలు సమాగమానికి ఆహ్వానాలు పలుకుతున్నాయి. తారలూ, యామినీ, చల్లని గాలులూ ఆ ఆహ్వానాలకు సంధానకర్తలయ్యాయి.

తన గుండెలకు అతుక్కుపోయిన అలసిపోయిన కామేశ్వరి నుదుట చిరుస్వేద బిందువులను కొనగోటితో తొలగించి చుంబించాడు రంగనాథం. మరింత దగ్గరగా జరిగింది కామేశ్వరి.

"నా విశ్వాసాలు నిన్ను రక్షించాయి–" అన్నాడు.

అంటె మాధుర్యాన్నీ అనుభవించుతూ అతనిలో యిమిడిపోయినట్లున్న కామేశ్వరి తల ఎత్తి అంది.

"నన్ను కాదు! మన దాంపత్యాన్ని – మన సంసారాన్ని–"

ఆ గొంతు అతనికి పరిచితమే! అయినా అతను ఆశాభంగం చెందాడు. పట్టి పట్టి చూస్తున్న కామేశ్వరిని గమనించుతూ నిట్టూర్చాడు.

"నిజమే! మన దాంపత్యాన్నే! దానికి ఆధారమయిన మన బంధాన్ని – నా విశ్వాసాలు రక్షించాయి."

ఆమె మరికొన్ని సెకన్లు అతని కన్నులలో ఏదో వెదుక్కుంది. తర్వాత తల దించుకుని అతని చేయి అలాగే వుంచి రెండో చేత్తో దుప్పటికి పైకి లాక్కుంది.

"అనేక ప్రదేశాలు తిరిగాను. ఆలయాలు దర్శించాను. దైవాలను ప్రార్థించాను. నదులలో మునిగాను. సాధువులను విన్నాను. కామేశ్వరి తప్పు చేసిందా? పరిస్థితి వల్ల జరిగిందా–కొన్నాళ్ళీ ప్రశ్న నన్ను వెన్నాడింది. కామేశ్వరి చేస్తేనే తప్పా? పరిస్థితి వల్ల జరిగినా తప్పేనా?–మరి కొన్నాళ్ళీ ప్రశ్న. మసిలిన ప్రదేశాల నుంచీ, ఎరిగిన మనుషుల నుంచీ యీ రంగనాథం దూరమయాడు గాని రంగనాథం నుంచి మాత్రం దూరమవలేదు. 'తప్పు' అనేది నిస్సందేహంగా ఉంది. 'పాపం' అనేది ఉంది.

'పాపానికి' శిక్షా ఉంది. పాపాన్నీ, పాపమనే దానికి శిక్షనూ నీవు విశ్వసించక పోతేనేం–నీ 'తప్పు' నీవు నాతో చెప్పటం ద్వారా అంగీకరించావు. వాటిని విశ్వసించే నేను నీ పాపానికి శిక్ష విధించటానికి అర్హుడినా? – నా ప్రశ్నలు సాధువులు విన్నారు. వారి జవాబులు నేను విన్నాను. వారు విన్నట్లు నాకు విశ్వాసం కలగలేదు. ఇక నా ప్రశ్నలకు ఆ దైవమే జవాబియ్యాలి. అన్వేషణ. పూరీ జగన్నాధస్వామి ఆలయంలో నా అన్వేషణ ముగిసింది.

విశాలమయిన సముద్రం, ఆ గాలి, ఆ దేవాలయం, ప్రతీదీ నన్ను సమాధాన పరిచాయి. సుభద్రాదేవి జగన్నాధుడిని కోరిన కోరిక గురించి విన్నపుడు నాలో కలిగిన ప్రశ్నలే నా పరిస్థితికి జవాబులయాయి. ఆలోచనలను ఎవరు అరికట్టగలరు? పూజనీయులకే అది సాధ్యం కాలేదు. 'నా ప్రమేయం లేకుండా ఏదీ జరగదు. నీకు దుస్సహమయిన విషయంలోనైనా నా ప్రమేయం ఉంది–' అంటున్నాడు జగన్నాధుడు. 'తప్పు' భగవత్ప్రేరణ వల్ల జరిగితే దానిని శిక్షించాలా వద్దా అన్నది ఆ భగవంతుని సమస్య. వేరే వ్యక్తినయిన నాకు నిన్ను శిక్షించే అధికారం లేదు – ఇలా సమాధానానికి వచ్చాను.

నా భగవంతుడే, నా విశ్వాసాలే నన్నీ సమాధానానికి చేర్చాయి. చనిపోవాలన్న ఆలోచన నుంచీ, నిన్ను చంపాలన్న ఆలోచన నుంచీ, నిన్ను వదిలెయ్యాలన్న ఆలోచన నుంచీ నన్ను బయటకు చేర్చాయి. 'తప్పు' చేసిన నిన్ను భరించి క్షమించి యిలా స్వీకరించే శక్తిని యిచ్చాయి. నన్నూ నిన్నూ మన పార్థునీ నా విశ్వాసాలే రక్షించాయి. నీవు అర్థం చేసుకోగలిగితే మన అనుబంధాన్ని కూడా అవే రక్షించాయి–"

రంగనాథం చెప్పగలిగాననుకున్నది చెప్పాడు. కామేశ్వరి వినగలుగుతుందని భావించినది చెప్పాడు.

అంతా శ్రద్ధగా విన్న కామేశ్వరి కొంతసేపు కదలలేదు.

తర్వాత లేచి కూర్చుంది. బట్టలు కట్టుకుంది. తననే గమనిస్తున్న అతని పక్కనే కూర్చుంది. అతనిలో ఏదో వెదుకుతున్నాయి ఆమె చూపులు

"నీ మాటలు నాకు మళ్ళీ ఆశ కలిగిస్తున్నాయి. మాట్లాడమంటున్నాయి."

"చెప్పు" అన్నాడు రంగనాథం, కామేశ్వరి మాట్లాడకపోవటంతో!

ఆమె వెళ్ళి తన డైరీని తీసుకువచ్చి అతనికి యిచ్చింది.

రంగనాథం సంకోచించాడు.

"ఇస్తున్నది నేనే గదా–చదువు–"

రంగనాథం ఆమె చూపిన పేజీ చదవసాగాడు.

"ఎక్కడికి వెళ్ళావురా రంగా!

నా హృదయమంతా నీ సానుభూతి కోసం ఎదురుచూస్తోంది. ఈ నా శరీరం మలినమయిందనా – నా వేదన?! మాలిన్యం అంటే ఏమిటి? నిన్ను దగా చేశాననా యీ దుఃఖం?! నిజంగా నిన్ను దగా చేశానా?! జరిగిందేమిటి? నా ముందు నేను ఓడిపోయాను. నా ముందు నేను అవమానం పొలయాను. ఇది నా వ్యక్తిగత వైఫల్యం. ఇందులో దగా నా వల్ల జరిగింది. నాకు జరిగింది. నాలో నేను చూడగలిగే రెండూ వేరు! నీలో నీవు ఊహించుకునే రెండూ వేరు! నా వల్ల జరిగిన దగా, నా వైఫల్యమూ నాకు జీవించే హక్కు లేకుండా చేసాయి.

చావు!

చావు తర్వాత తిరిగి నిన్ను పొందటమనే దాన్ని ఫూలిష్‌గా భావించే నాకు – చావు తర్వాత నాలో చూసే రెండూ నశిస్తాయని తెలిసిన నాకు – చావు ఎలా సమర్థనీయమయింది? చావుకి కావలిసినంత ధైర్యం నాకుంది.

చావుకి అవసరమయినంత పిరికితనం నాకు లేదు.

జరిగిన సంఘటనను చావువల్ల మార్చలేనని నాకు తెలుసు.

చావువల్ల మరెన్నో జరుగుతాయని నాకు తెలుసు.

నేను చనిపోతే నా రంగా ఏమయిపోతాడు? రంగా విశ్వాసి. పిరికితనమే విశ్వాసాలకు మూలం. రంగాకి నేను లేని జీవితాన్ని మోసే శక్తి లేదు. పిరికిగా – మూఢంగా – నశించిన నన్ను వెన్నాడాలన్న పిచ్చిలో – చనిపోయినా చనిపోగలడు. దాంతో – పార్థు అనాధ అయిపోతాడు.

మరి నేనేం చేయాలి? నా రంగా విశ్వాసే కాదు. హేతువాది. మా మధ్య అనుపమాన బంధం ఉంది. అవగాహన ఉంది. నా యీ వ్యక్తిగత వేదనను అతను అర్థం చేసుకోగలడు! అతను నేను 'పాపం' చేశానని అనవచ్చు. కాని పాపం ప్రాయశ్చిత్తంతో నశిస్తుందని విశ్వసిస్తాడు గదా? పైలోకంలో నాకు 'శిక్ష' లభిస్తుందని విశ్వసిస్తాడు గదా! అతనొకవేళ నాకు ప్రాయశ్చిత్తం సూచించితే–? ఆచరిస్తాను. ప్రాయశ్చిత్తం మీద – సరే, పాపం మీదనైనా విశ్వాసంలేని నేను అతను చెప్పినది ఆచరిస్తే – ఏమవుతుంది? 1. అతనికి తృప్తి కలుగుతుంది. 2. నాకు కలగదు. అవును, నాకు తృప్తి కలగదు. నీవు నమ్మినదాన్ని నేనూ నమ్మినట్లు నటించటం నిన్ను వంచించినట్లే కదా! నేను నమ్మనిదాన్ని ఆచరించటం నన్ను వంచించుకున్నట్లే గదా!

అంతా – అతనితో మాట్లాడతాను.

అతను నాకు సానుభూతి నిస్తాడు! దోవ చూపిస్తాడు!"

చదవటం ముగించి రంగనాథం తర్వాతనున్న ఖాళీ పేజీలను ఓమారు తిప్పి ఆమె వైపు చూశాడు. కామేశ్వరి అతనినే గమనిస్తోంది. రంగనాథం చిన్నగా నిట్టూర్చాడు.

"నీకెలాంటి భయమూ సంకోచమూ కలగలేదా?"

లేదన్నట్లు తలూపింది.

"నువ్వు చెప్పకపోతే నాకు తెలిసే అవకాశం లేదు. సాఫీగా సాగిపోయే సంసారం – మన బంధం – నాశనమవచ్చని నీకు అన్పించలేదా?"

"నువ్వలాంటి భయం ఎన్నడూ కలిగించలేదు."

"నేను మరోలా ఉంటే నీకూ భయం కలిగుండేదా?"

"అదే – అదే – నీ ప్రత్యేకత. ప్రశ్న ప్రశ్న. నువ్వు ప్రశ్నలు వెయ్యగలవు. నీ జవాబులు నీకుండొచ్చు. నా జవాబులు వేరుగా వున్నా నీవు సహిస్తావు. బహుశా – మానవ జాతి తొలి విశ్వాసాలు మారుతూ కొత్త విశ్వాసాలు ఏర్పడటానికి కారణం నీవంటి వారేనేమో!"

"నువ్వు నీ జవాబు దాటవేస్తున్నావు."

కామేశ్వరి మాట్లాడలేదు.

"నువ్వు యిప్పుడు భయపడుతున్నావు–"

"లేదు – నేను నీ గురించీ, మన సంసారం గురించీ సామాన్య భయాలను యీ అనుభవంతో దాటేశాను–"

"అయినా జవాబు యివ్వవు–"

"నా జవాబు వల్ల ఉపయోగం గురించి ఆలోచిస్తున్నాను – " అంటూ ఆగి అతన్ని చూసింది. సన్నగా ఆశగా నవ్వింది.

"తెలుసుకుని, తెలియజెప్పడంలోనే మానవజాతి అభివృద్ధి అంతా ఉంది. నేను నీకు చెపుతూనే ఉండాలి – ఉన్నన్నాళ్ళూ, కలిసున్నన్నాళ్ళూ! నువ్వూ చెపుతూనే ఉండాలి–! దాపరికం అభివృద్ధికి అడ్డంకి!"

"నువ్వు జవాబివ్వలేదు–"

"నువ్వు భయం కలిగించేలా వుంటే–నాకు భయం కలిగే ఉండేది. నా వ్యక్తిత్వ వికాసానికి 'నువ్వు' కారణమే!"

రంగనాథం ఆమె తల మీద చేయి వేశాడు. అతను కొంతసేపు కళ్ళు మూసుకున్నాడు. తర్వాత ఆమె దండ పట్టుకున్నాడు.

"నేను వెళ్ళిపోయాక–నీకు చనిపోవాలనిపించలేదా?"

"ఎందుకు అనిపించదూ!"

"ఎలా రెసిస్ట్ చేసుకున్నావూ–"

"నా ఆలోచనల వల్ల! నేను అవిశ్వాసిని కావడం వల్ల–"

"నాకు అర్థం కాలేదు–"

"నా మరణానంతరం నీవు తిరిగొస్తే–? భరించగలవా? అంత ఆశగా తిరిగొచ్చిన నీవు తట్టుకోగలవా? – పార్థు ఏమయిపోతాడూ? – ఇలాంటి ప్రశ్నలు మొదట్లో నాకు 'చావు' ఊహ రాకుండా చేశాయి. నీనుంచి ఉత్తరంకూడా లేదు. సమాచారం లేదు. ఒకవేళ నీవు చనిపోయావా?

ఆ ప్రశ్న అన్ని భయాలనూ తోసుకుని నాలో జొరబడజూస్తోంది. నిన్ను – ఉన్నావో లేవో తెలీని నిన్ను – ఉంచమనీ, రక్షించమనీ నువ్వు ఉన్నాడని ఊహించే భగవంతుడిని నేనూ ప్రార్థించితే?!

అలాంటి ఊహ కలగగానే ఆలోచనలు నన్ను చుట్టుముట్టాయి.

ఇన్నాళ్ళూ నేను మనిషిని నమ్మాను. తన ప్రవర్తనతో మనిషి కలిగించే స్పందనలకు లోనయాను. మనమధ్య అలాంటి అనుబంధాన్ని నేను అనుభవించాను.

నా స్పందనలు, నీ ప్రవర్తన, మన అనుబంధమూ పూర్తిగా గాలి ఊహాలేనా? కాకపోతే ఏమిటది? ఈ అనుబంధానికి సృష్టి నా చేతుల్లోనూ నీ చేతుల్లోనూ లేదా? మరయితే ఏమిటీ భగవంతుని కల్పన? ఇది అసాధ్యమైన కోరిక నుంచీ, భయం నుంచీ పుట్టింది! భగవద్ధ్యానం నిజంగా నాకు ఏమివ్వగలదు? ఒకవేళ – నీవు మరణించే వుంటే తిరిగి బ్రతికించగలదా? – లేదే! ఊరటను యివ్వగలదేమో! ఒక భ్రమను, కల్పనను, ఊహను వాస్తవంగా చేసుకుపొందే ఊరట నన్ను ఎక్కడకి తీసుకుపోతుంది? మానవుడు భ్రమలకూ లోనయాడు. ప్రశ్నలూ వేసుకున్నాడు. ప్రశ్నలు వేసుకునే శక్తివల్లనే మానవుడు యీనాటి స్థితికి చేరుకున్నాడు. ఇది గ్రహించగలిగిన నేను తిరిగి భ్రమలో ఎందుకు పడుతున్నాను?

ప్రశ్నలు వేసుకునే మనోబలం కోలుపోవడంవల్ల!

ఇలా నిశ్చయించుకున్నాక నీ మరణం గురించీ, దాని తరువాతి పరిణామాల గురించీ ఆలోచించ యత్నించాను. నీవు లేకపోతే – నిజమే! – ఓ రకమయిన శూన్యమే! ప్రపంచంలో మనకన్న దగ్గరయిన వారున్నారు. వారంతా తమ ప్రియతములను కోల్పోయినపుడు ఏమయింది? దుఃఖించారు. మరొకరికి చేరువయారు. ఇలా ఎన్నో చేశారు.

నీవు చనిపోయేవుంటే – కారణం – నువ్వే! నీ ఆలోచనారాహిత్యమే – ఇలాంటి పరిస్థితుల్లో చనిపోయిన ఎందరినో నువ్వు అనుకరించావు గాని వాస్తవ దృష్టితో ఆలోచించలేదు. నీ అజ్ఞానమే నీ మరణానికి కారణమవుతుంది

రంగా! నేనిలా ఆలోచించుకున్నాక చావు. ఊహను వదిలించుకున్నాను. నా ఆలోచనలే నేను బ్రతకటానికి కారణం! అంతేకాదు–నిన్ను జీవించేట్టు, నన్ను తిరిగి చూడగలిగేట్టు చేసినవీ నీ ఆలోచనలో మార్పులే సుమా! విశ్వాసాలు కాళ్ళనూ, బుద్ధినీ బంధిస్తాయి గాని నడిపించవు–"

రంగనాథం సావధానంగా విన్నాడు.

ఆమెను దగ్గరికి తీసుకున్నాడు–

"నీ మీదా నీ ఆలోచనా శక్తి మీదా నీకున్నదీ విశ్వాసమే కాముడూ! అవిశ్వాసమనేది ప్రత్యేకంగా లేదు. సందేహమనే భూమి నుంచి పుట్టిన రెండు మొక్కలు విశ్వాసమూ, అవిశ్వాసమూ అనే పేర్లతో వ్యవహరించబడుతున్నాయి. వాస్తవానికి అవి రెండు రకాల విశ్వాసాలు మాత్రమే! వ్యక్తికి తన మీద తనకు అదుపు నివ్వగలిగినదే ఉత్తమ విశ్వాసం–"

కామేశ్వరి- ఆలోచనలో పడింది.

కొన్నాళ్ళు గడిచాయి. కామేశ్వరి అదే ఉద్యోగంలో కొనసాగుతోంది. రంగనాథం ఓ రోజు, "ఉద్యోగం మారకూడదా–" అని అడిగాడు.

"మరో ఉద్యోగం ఎందుకు? నేను పారిపోను–"

"మానేయ్! నా సంపాదన చాలదూ?"

"అనే అనుకునేదాన్ని. నన్నొదలి నువ్వెళ్ళిపోయాక నాలాంటిదానికి ఉద్యోగం ఎంత అవసరమో గ్రహించాను"

మరి కొన్నాళ్ళు ఆగి ప్రశ్నించాడు రంగనాథం:

"మనం ఏకం కాలేమా?"

"నాది ఆలోచించే తత్త్వం. నా చేతులనూ, నా శక్తినీ నేను అర్థం చేసుకోగలను. నా ప్రయత్నలోపం లేదు–"

మరికొంతకాలం తర్వాత అన్నాడు రంగనాథం:

"మనం ఒకే కప్పు కిందా ఒకే మంచం మీదా ఉంటూనే యింత దూరంగా ఉండటం దుస్సహంగా వుంది కాముడూ!"

"నా పిచ్చి! నేను నిన్నూ, నువ్వు నన్నూ విడిచిపెట్టి ఉండలేదు. ఉన్నామన్న భావన పోగొట్టుకునేదాకా నీకు శాంతి లేకపోయింది–" అంటూ అతని తలను గుండెలకి హత్తుకుంది. అతనామెను అల్లుకుపోయాడు.

"రంగా! మన జీవితంలోని ఘటనలకీ, మనలోని ఆలోచనలకీ యీ చుట్టు పక్కల ప్రపంచంతో మనమున్న కాలంతో చాలా సంబంధం ఉంది.

ప్రపంచం మారటం వల్లనే స్త్రీ పురుష సంబంధాలు మారుతున్నాయి. ఈ వివాహ వ్యవస్థ కూడా ప్రపంచ గమనంలోని ఓ భాగం! వివాహమనే నియమంలోనే మనుషులు కలిసి బ్రతికే స్వేచ్ఛ ఉంది. స్వేచ్ఛ కోసమే నియమాలు ఏర్పడుతాయి. స్వేచ్ఛ వల్లనే అవి మారవలసి వస్తాయి. ఈ చుట్టు పక్కల ప్రపంచం ఎప్పుడూ ఒకలాగే ఉంటే మనిషి జంతుదశ దాటకపోను! వివాహం ఏర్పర్చుకోకపోను! ఆడదాన్ని యింట్లో బంధించకపోను! ఈనాడు యిలా ఉద్యోగం కోసం ఆడది వీధిలోకి రాకపోను! వచ్చినందువల్ల యిలాంటి సంఘటనలు జరిగే అవకాశమున్నంతమాత్రాన రాకూడదన్నదని పరిష్కారం కాదు! ప్రపంచంలో జరుగుతున్న ప్రతిదీ అభివృద్ధి ముఖంగా సాగుతూన్నదన్న ఒక్క సత్యం వెలుగులో నువ్వు ఆలోచించితే నీకు కొత్త పరిష్కారాలు దొరుకుతాయి–"

అలా వారిద్దరూ ఏకమయారు.

ప్రపంచంలో ఏనాడో ఏర్పడిన శాశ్వత విలువలన్నీ క్రమంగా క్షీణిస్తున్నాయనీ, అంతా నాశనం వేపే పోతున్నదనీ విశ్వసించే వారి భావాలను అతను ఎన్నోమార్లు తర్కించుకున్నాడు.

ఆ యిద్దరూ ఒకరికొకరు సప్లిమెంటరీగా జీవించారు.

ఈ రోజు కొడుక్కూ కోడలికీ మధ్య జరుగుతున్నదేమిటి?

ఇది పతనం కాదా?

రంగనాథం ఆలోచనల నుంచి, అయోమయం నుంచి కామేశ్వరి మంచాన్ని సమీపించాడు. ఆమె పక్కనే కుర్చీలో కూర్చున్నాడు.

"దీనికి నువ్వేం అర్థం చెపుతావు కాముడూ!

కెరీర్ కోసం పెళ్ళాన్ని అమ్ముకుంటున్నాడు కొడుకు. విలాసాల కోసమో, లాలస కోసమో వాడి మాటలని పాటించింది నీ కోడలు.

వీళ్ళమధ్య జరుగుతున్నదేమిటి?

శరీరాన్ని ఆకలి కోసమయినా అమ్ముకోటం మహాపాపంగా భావించే మనిషిని నేను. ఆకలి ఎంత ఘోరమయినదో నీవు తెలియజెపితే అర్థం చేసుకోగలిగాను.

ఒక యాదృచ్ఛిక సంఘటనగా భావించి నీ భర్త అర్థం చేసుకోవాలని, నీ మనో సంఘర్షణను పంచుకోటానికి యత్నించిన మనిషివి నీవు. పారిశ్రామిక యుగ ప్రభావం వల్లనే స్త్రీ పురుషుల మధ్య కొత్త సంఘటనలూ, సంఘర్షణలూ అన్నావు నీవు. నీవన్న దానిలో నాకెన్ని సంశయాలున్నా నీ స్పిరిట్ మీద నాకెంతో గౌరవం కలిగింది.

మన సంతానం–మన తర్వాత తరం–ఏమిటీ తరం? ఎలా అర్థం చేసుకోవాలీతరాన్ని! అన్నింటినీ అమ్మేసుకునే తరాన్ని – దేన్నయినా కొనేసుకునే తరాన్ని!

ఈ మహా పాతకాన్ని చూశాక నేను వెనక్కి చూడక తప్పటం లేదు. మనది పతనమే–దానికి కొనసాగింపే యీనాడు జరుగుతున్నదని – అనుకోక తప్పటం లేదు. ఈ ప్రపంచం అభివృద్ధి ముఖంగానే సాగుతున్నదని నీ తెలివి తేటలతో నన్ను ఒప్పించావు. నిన్ను విశ్వసించేటట్టు చేశావు. ఒకప్పుడు ధర్మం నాలుగు పాదాలా నడిచిందని, ఇప్పుడది ఒంటికాలితో కుంటుతున్నదని విశ్వసించిన నన్ను మార్చావు. అట్లాంటి భావన ఎలా పుట్టే అవకాశమున్నదీ, ఎవరికి పుట్టే అవకాశమున్నదీ నాకు తెలియజెప్పి నాచేత ఆలోచింపజేశావు.

లాభంలేదు కాముడూ! నేనలా అనుకోలేక పోతున్నాను! మానవ జాతి సర్వనాశనం వేపే సాగుతోంది! భార్యలను కూడా అమ్ముకునే భర్తలూ, అమ్ముడుపోయే భార్యలూ... ఏం తక్కువయిందని వీళ్ళు... ఛ ఛా! ఎలా ఎలా దీన్ని సమర్థిస్తావు? ఎలా వ్యాఖ్యానిస్తావు?"

ఉద్వేగంగా అంటూ కళ్ళు మూసుకున్నాడు రంగనాథం.

అశాంతిగా తల రుద్దుకున్నాడు. కుర్చీలో కదిలాడు.

"మామయ్యగారూ!"

చటుక్కున కళ్ళు విప్పాడు రంగనాథం! వాణి! తల తిప్పుకున్నాడు.

"మీకు మేమంటే అసహ్యమే! మేమంటే నాకు మరింత అసహ్యం! మా మాటలను మీరు విన్నారని గ్రహించాక నాకు నిద్రపట్టలేదు. మీరు ఎలా భావిస్తారో నా ఊహకు అందలేదు. మీరు బాధ పడుతున్నట్లు గమనిస్తూనే ఉన్నాను. అత్తయ్యగారితో మీరంటూన్నవన్నీ విన్నాను. నేనేం మాట్లాడీ మీ అసహ్యాన్ని పోగొట్టుకోలేను. కాని... మాట్లాడక తప్పదు. మీ కోసం... నా కోసం... అత్తయ్యగారి కోసం మాట్లాడక తప్పదు."

వాణి గొంతులో వేదన తెలుస్తున్నా – దాని పట్ల ఎలాంటి సానుభూతీ రంగనాథానికి కలగలేదు. వాణి గొంతు సవరించుకుంది.

"మేం ఎందుకిలా తయారవుతున్నాం? – ఎప్పుడూ యీ ప్రశ్న నాకు కలుగుతూనే వుంది. మీరే అన్నారు – కెరీర్ కోసం అయినా, విలాసాల కోసం నేనూనని! నిజమే! నేనూ అదే అనుకుంటాను. తప్పించుకోవాలనుకుంటాను. కాని ఎలా? దేని నుంచి తప్పించుకోటం? ఎవర్నించి తప్పించుకోటం?

నా నుంచి మొదలయిన ఆలోచనలు యీ ప్రపంచమంతటినీ, దీన్ని నడుపుతున్న శక్తులనీ, వ్యక్తులనీ చుట్టుముడుతుంటాయి.

ఈ కెరీర్ అనేదాన్ని ఎవరు కల్పించారు? ఈ విలాస సాధనాలను ఎవరు సృష్టించారు? మా వ్యక్తిగత జీవితాలలోకి ఎవరు ప్రవేశించారు? మా అనుబంధాన్ని ఎవరు కలుషితం చేశారు? అదుపులేని సంపదల పట్ల, అంతులేని సౌకర్యాల పట్ల మిమ్మల్ని వ్యామోహపరుచుతున్న దెవరు? గుర్రం వీపుమీద కూర్చుని దానికి వెదురు బొంగుతో గడ్డి బుంగ చూపిస్తూ పరుగు తీయిస్తున్నట్లు మమ్మల్ని పరుగెత్తిస్తున్నదెవరు? పుట్టిన దగ్గర్నుంచి చచ్చేదాక చదువులకోసం, ఉద్యోగాల కోసం, పదవుల కోసం, ఆస్తుల కోసం, సౌకర్యాల కోసం, కీర్తుల కోసం... మమ్మల్ని తరుముతున్న దెవరు?

ఈ పరుగే, ఈ పోటీయే, ఇందులో గెలుపే ప్రజాస్వామ్యమనీ, మానవ స్వాతంత్ర్యమనీ ప్రచారం చేస్తున్నావారు! మానవ సమూహాలను నమ్మిస్తున్నవారు! నమ్మేటట్లుగా బలవంతపరుస్తున్నవారు! జాతులను జాతులతో, మతాలను మతాలతో, దేశాలను దేశాలతో పోటీ పెట్టి, విడదీసి, విడదీయటానికి దేన్నయినా నిర్లజ్జగా వాడుకుంటున్న వారు! చిట్టచివరికి మనిషిని మనిషితో కలవకుండా విడదీస్తున్నవారు!

ఏం సాధిస్తారు వారు?

ఫ్రీ మార్కెట్‌ని సృష్టిస్తారు. వ్యక్తి మాన ప్రాణాలతో సహా ప్రతిదాన్నీ సరుకుగా మారుస్తారు. మనుషులే సరుకులు! మనుషులే వినిమయదారులు! ఒకచోట నువ్వు అమ్ముడుపోతావు! ఒకచోట నీవు కొనుక్కుంటావు!

దీన్ని సృష్టిస్తున్నవాళ్ళు, దీన్ని అదుపు చేయగలమని ఆశిస్తున్నవాళ్ళు... వాళ్ళు కూడా.... నాకనిపిస్తుంది – సరుకులే! వినిమయదారులే! వారి మానసిక రోగాలే... అహమే... వారిని సరుకుల్నిగా, వినిమయదారులుగా మార్చేస్తాయి.

ఇలా మనుషుల్నే సరుకులుగా, వినిమయదారులుగా మార్చే తంత్రంలోనే దాని నాశనానికి బీజముంది.

ఈ ఫ్రీ మార్కెట్ మనిషికి తెగింపుని నేర్పుతుంది. తెగింపుని నూరి పోస్తుంది. మనుగడ కోసం తెగించిన మనుషులు చిట్టచివరికి తెగనమ్ముకోటానికయినా, తెగనరకటానికయినా సిద్ధపడతారు. అందరూ తమని అమ్ముకోటానికి సిద్ధపడితే మాత్రం అవసరాలన్నీ తీరతాయా? అవసరాలన్నవి తీరిపోతుంటే అమ్ముకోటానికి సిద్ధపడరుగదా! అవసరాలు సృష్టిస్తూ, తీర్చే తీర్చకుండా ఉంచుతూ విస్తరించే యీ ఫ్రీ మార్కెట్ – తమ అవసరాలు తీర్చ గలిగేదికాదన్న వాస్తవం గ్రహించిన రోజున,

తెగింపు అలవాటయిన మానవ సమూహాలు దానిని నాశనం చేయటమన్నది చిటికెలో పని –"

వాణి మొహాన్ని విభ్రమంతో రంగనాథం చూశాడు.

"అమ్మా! యింత తెలిసిన నీవు!?"

వాణి తల అటూ ఇటూ ఊపింది.

"తెలియటం వల్ల మనుషులు న్యాయంగా, ధర్మంగా ఉంటారన్నది చాలా పురాతన మూఢ విశ్వాసం మామయ్యగారూ! తెలిసిన వాళ్ళు తమ శక్తులకూ, అసక్తులకూ అనుకూలంగా ఆటను తయారు చేసుకుంటారు. రూల్సును ఏర్పర్చుకుంటారు. ఈ మాయాజాలానికి తెలిసిన వాళ్ళే అసలు సరుకులు! అసలు వినిమయదారులు! తెలియని వాళ్ళే తెలిసిన వాళ్ళను అదుపు చేయగలిగిన రోజున యిదంతా యిలా ఉండదు–"

రంగనాథం చటుక్కున కామేశ్వరి వైపు తిరిగి – "అమ్మాయి అంటున్నదాని కేమంటావు కాముడూ!" అన్నాడు.

కామేశ్వరిలో కదలిక లేదు. మాట లేదు. రంగనాథం అనుమానంగా ఆమె చేయి ముట్టుకున్నాడు. ముక్కు దగ్గర చెయ్యి పెట్టాడు. పక్కలు కదులుతున్నాయేమోనని పరిశీలించాడు. నాడి చూశాడు.

కామేశ్వరి లేదు.

ఆ క్షణం వస్తుందని తెలుసు! పుట్టినది పోక తప్పదని తెలుసు! అయినా కుదుపు తప్పదు. తనలో ఓ భాగాన్ని పెకలించుకుపోయిన అనుభూతి తప్పదు.

రంగనాథం తలంతా దిమ్మెరపోయినట్లుయింది.

తనను నడిపించిన శక్తి నశించిపోయింది. అయితే ఎప్పుడది? తన మాటలను విన్నాకా. వాణి మాటలను విన్నాకా? అసంతృప్తి పరాజయ భావాలతోనా? ఆశతో తృప్తితోనా?

ఆమెది పలాయనమా? పయనమా?

దుఃఖ సంశయాలమధ్య రంగనాథం స్థాణువులా ఉండిపోయాడు.

వాణి అతనిని సమీపించింది.

● *రచన–సచిత్ర మాసపత్రిక: ఉగాది 1992* ●

★ ★ ★

70

ఆర్వీయార్

# అందలం

లారీ గతుకుల రోడ్డుమీద మూలుగుతూ నడుస్తోంది.

కందకాల్లాంటి గోతుల్లో పడుతూ లేస్తూవుంటే ఒళ్ళు హూనమైపోతోంది.

దీనికితోడు ఎండవొకటి, పేల్చేస్తోంది. లారీలకి ఎండ తగలకుండా టార్పాలిన్లు కట్టిస్తామని ఆర్.డి.ఓ. చెప్పేడుగాని అలాంటి ఏర్పాట్లు ఏమీ జరగలేదు. బ్యాలట్ పెట్టెలు, మిగిలిన సరంజామా కట్టిపెట్టిన గోనిబస్తాలు లారీ కుదుపులకి స్వేచ్ఛగా అటూఇటూ దొర్లుతున్నాయి.

మరీ అల్లరిగా చెల్లాచెదురైపోయేటప్పుడు వాటికి బాధ్యత మోయాల్సిన ప్రిసైడింగ్ ఆఫీసర్లు తమ తమ గోనెమూటల్ని మళ్ళీ నిలబెట్టి వుంచుతున్నారు. బ్యాలట్ పేపర్లని రూపాయలకట్టకంటే భద్రంగా చేతిసంచుల్లో పెట్టుకున్నారు. బుల్లెట్లతో కాకుండా బాలట్‌లతో నిలబెట్టాల్సిన ప్రజాస్వామ్యమాయె యిది. అంచేత ప్రాణంకంటే ఎక్కువగా చూసుకోవద్దూ వాటిని!

కాని బ్యాలట్ తనంత తను తలెత్తుకు తిరగలేదనోయేమో బుల్లెట్‌లు నింపిన తుపాకులతో రక్షకభటవర్గం కూడా వుంది. "ఇదిబ్రాహ్మ్య మిదెక్షాత్ర" మన్నారుకదా!

"లాస్ట్ స్టేషన్ మీదేనా చలపతిగారూ?" అని నారాయణ అడిగేరు–ఇద్దరూ ఒకే కాలేజీలో పనిచేస్తున్నారు.

"అవునండీ!" అన్నాడు చలపతి.

"అయ్యా!....రేపు పోలింగ్ అయ్యాక పెందరాళే తెముల్చుకు బయల్దేరండి. లేకపోతే మా అందరికీ ఆలస్యమైపోతుంది" అన్నాడు ప్రకాశం, అతను మూడో స్టేషన్‌లో దిగిపోతాడు.

"ఇంతవరకూ మొదటి స్టేషనువాళ్లు కూడా దిగలేదు. ఇక మా స్టేషన్‌కి వెళ్లడం ఎప్పుడు, ప్రిపరేషన్ చేసుకోవడమెప్పుడు, 'పెన్న దాటిన కదా పెరుమాళ్ల సేవ.' మీరప్పుడే రేపు సాయంత్రం తెముల్చుకురావడం గురించి బెంగపడిపోతున్నారు" అన్నాడు చలపతి.

ఆ లారీ రూట్‌కి పది ఊళ్ల పోలింగ్‌స్టేషన్లు వున్నాయి. ఒకోవూరి పోలింగ్‌స్టేషన్ దగ్గరా ఆ ప్రిసైడింగ్ ఆఫీసర్ని, అతని అసిస్టెంట్‌ని దింపుతుంది. ఎన్నిక ముగిసేక మళ్లీ అదే రూట్‌లో లాస్ట్ స్టేషన్‌నుంచి పిక్అప్ చేసుకుంటూ వెనక్కి వస్తుంది.

ఎవ్వరు ఆలస్యం చేసినా అందరికీ జాగారమే. అందుకని రూట్‌లో వున్నవాళ్ళందర్నీ ఒకళ్లకొకళ్లు తొందరగా తెముల్చుకురమ్మని హెచ్చరించుకుంటూ వుంటారు.

"ఆలస్యమైతేనేంలెండి, మునసబుగారు భోజనాలు ఏర్పాటు చేస్తాడు" అన్నారెవరో ప్రకాశానికి భరోసా ఇస్తున్నట్టు.

"ఆc ఆc చేస్తాడు! పిండివంటలతో భోజనం పెడ్తాడన్నారు కాదు. గుళ్లో తుమ్మకుండా వుంటే దీపం పెట్టినంత పుణ్యం. ఏ గొడవ లేకుండా పోలింగ్ జరగనిస్తే విందులు పెట్టినంత" అన్నాడు ప్రకాశం అతనికి లోగడ ఎన్నికల్లో అనుభవం వుంది. గ్రామాధికార్లు అన్నీ ఏర్పాట్లు చేస్తారని వాళ్ళిద్దరూ చెప్పిన ఊళ్లల్లో ఏర్పాట్లమాట సరేసరి, ఎవరూ ఏ సాయమూ కూడా అందివ్వలేదు. గొడవా గోష్టి లేకుండా పోలింగ్ జరిపించుకునేటప్పటికి త్రాహి త్రాహి అయింది.

ఎన్నికల వాతావరణం గురించి, ఎవరికి అవకాశాలు ఎక్కువగా వున్నాయో వాటి గురించీ ముచ్చట్లు సాగాయి. ఎన్నికల్లో పోటీలో వున్న అభ్యర్థుల గుణగణాల గురించి చర్చ సాగింది. ఎంచదలిస్తే మంచమంతా కంతలేనన్నట్లు పరిశుద్ధ నైతికప్రమాణాల దృష్ట్యా అభ్యర్థులు ఎలాంటివాళ్లైందీ ఎవళ్లూ ప్రస్తావించలేదు. అన్నీ కంతలేనన్న ధోరణిలోనే చర్చసాగింది. అంచేత వున్నదాంట్లో తక్కువ కీడుని ఎంచుకోవడమే ఆ సమయానికి నీతిగా భాసించింది.

"తిననివాడెవడండీ? 'అందరూ శ్రీవైష్ణవులే బుట్టలో రొయ్యలు మాయ మయ్యాయి' అన్నట్టుంది. మీ పార్టీ అధికారంలోకి వచ్చినా అంతే. ఏ లాభమూ లేకుండా ఎవడు మాత్రం పనిచేస్తాడు?" అని ఒకతను ఈ యుగనీతిని సూక్ష్మంగా వెల్లడించాడు.

"స్వార్థనీతి తప్ప మరేమీ లేదంటే ఒప్పుకోనండి. ఎంతమంది మహానుభావులు ఎన్నెన్ని త్యాగాలు చేశారు! వాళ్లంతా ఏం లాభం ఆశించి పనిచేశారంటారు? మా వూళ్లో గుర్నాథంగారని వున్నాడు. స్వాతంత్ర్య ఉద్యమంలో సర్వం వదిలి జైలుకెళ్లి నానాబాధలూ పడ్డాడు. స్వాతంత్ర్య సమరయోధులకిచ్చే పెన్షన్‌కి కూడా అప్లై చేశాడుకాదు. 'ఇవన్నీ ఆశించి చేశానా' అని ఈసడించుకున్నాడు. అలాంటి వాళ్లే లేరంటారా?" అన్నాడు ప్రకాశం.

"మీరెక్కడండి బాబూ! మీరు చెప్పినలాంటివాళ్లు నూటికో కోటికో వొకళ్లు న్నారేమో! ఆనాడు త్యాగాలు చేశారు, చెయ్యలేదనం. కాని ఆ పెట్టుబడికి ఇవాళ వడ్డీతోసహా అధికార భోగాలు అనుభవించడంలేదూ?" అని నారాయణ ఆనాటివాళ్ల త్యాగాలకి యుగనీతికి వివరణ ఇచ్చేడు.

"త్యాగాలు చేసినవాళ్ల పెట్టుబడికి వడ్డీ అనుభవిస్తున్నది వాళ్లుకాదండి. ఫర్ యువర్ ఇన్‌ఫర్మేషన్! నేనిందాక చెప్పానే మా వూరి గుర్నాథంగారని, ఆయనకివాళ జరుగుబాటు కూడా కష్టంగా వుంది. పెన్షన్ కోసం అప్లికేషన్ కూడా పెట్టని మనిషి ఏ స్వలాభం ఆశించి త్యాగం చేశాడంటారు? ఆ లాభాల్ని వాడుకుంటున్నది అసలువాళ్లు కాదు – వాళ్లని తప్పించి వచ్చిన దొంగలు" అని ప్రకాశం, మనిషి స్వతహాగా అలాంటి దురాశపరుడు కాదన్న తన వాదాన్ని కొనసాగించాడు.

"ఎవళ్లో వుంటారు అలాంటి ఛాదస్తులు. ఏ కోరికా లేకుండా దేవుణ్ణి కూడా ఎవరూ పూజించరు – ఏమంటారు?" అని యుగనీతికి మొదటగా వివరణ ఇచ్చినతను అన్నాడు.

ఇంతలోకే అతను దిగాల్సిన స్టేషన్ రావడంతో లారీ ఆగింది. అతను, అతని అసిస్టెంట్ ప్రిసైడింగ్ ఆఫీసరు దిగిపోయేరు.

"చలపతిగారు ఏంమాట్లాడ్డంలేదేమిటి? ఏమండీ?" అని నారాయణ చలపతిని కదిపేడు.

"ఆఖరి స్టేషన్‌కదా, ఎప్పటికి చేరతామోనని బెంగగా వున్నట్టుంది" అన్నాడు ప్రకాశం.

చలపతి ఆలోచనలో వున్నాడు. వాళ్లమ్మగారికి వంట్లో బాగాలేదు. గబుక్కున డాక్టరు అవసరం అయితే ఇంట్లో దక్షత లేదు. చంటిపిల్లని వదిలి భార్య ఎక్కడికి కదలడమూ కష్టం. తనని ఎలక్షన్ డ్యూటీనుంచి తప్పించమని తాశిల్దారుని అడిగేడు. ఆయన సానుభూతి చూపించేడుగాని అవకాశం లేకపోయింది– 'ఒక్కరోజుకి ఎలాగో సర్దుకొమ్మ'ని సలహా ఇచ్చాడు. దాంతో డ్యూటీ తప్పలేదు.

అవడం ఒక్కరోజే అయినా అదిగో ఇదిగోనని రెండు పగళ్లు, రెండ రాత్రుళ్లు పడుతుంది. మెటీరియల్ తీసుకుందుకు పోలింగ్ రోజుకి ముందునాడే హాజరవాలి. పోలింగ్‌స్టేషన్‌కి వెళ్లాక బ్యాలట్‌పేపర్లని పోలింగ్‌కి సిద్ధం చెయ్యాలి. పోస్టర్లు కట్టించాలి. పోలింగ్‌బూత్ కట్టించాలి. ప్రతి చిన్న విషయమూ జాగ్రత్తగా చూసుకోవాలి.

ఇక తను వెళ్లే ఊరు కక్షలతో కొట్టుకువచ్చే ఊరయితే ఎంత తలనొప్పి వ్యవహారమో చెప్పనే అక్కర్లేదు. ఇన్ని భయాలతో పోలింగ్ డ్యూటీకి వచ్చేడతను. తను ఎలా భయపడ్డాడో అలాగే జరిగింది. తనకి ఈ ట్రూప్‌లో లాస్ట్‌స్టేషన్ పడింది.

పోటీచేసే కాండిడేట్ ఒకరు ఆ వూరివాడేనట. దేనికయినా తెగించేరకం అని పేరుమోసినవాడట. పోటీ చాలా గట్టిగా వుంటుందిట. ఉన్న ఊళ్లో తనకి ఎదురువుండడమూ అని రంకె వేశాట్ట. పంచాయతీ ఎన్నికల్లో ఓడిపోయినా పైన పలుకుబడితో టిక్కెట్ తెచ్చుకున్నాట్ట. పంచాయతీలో ఓడిపోయినవాడు అసెంబ్లీకి నెగ్గితే తన పరువేంకానని అతని మీద గెలిచిన సర్పంచ్ సవాల్ చేశాడట. ఈ గొడవల్లో తను అక్కడికి వెళ్లాల్సిరావడం, గతుకులరోడ్డు, లారీ కుదుపులు, ఎండ అన్నీ కలిసి చలపతి ఏం మాట్లాడకుండా ఆలోచించుకుంటూ వుండటానికి హేతువులయ్యాయి. దాంతో బెంగగా వుందన్న ప్రకాశం మాట మరింత ఉడికించింది. కాని పైకి తేలకుండా బింకంగా వున్నట్టు వాలకం పెట్టేడు.

"బెంగాలేదు గింగాలేదు. అయినా మధ్యలో మనకెందుకండి బెంగ? ఎవడు నెగ్గినా, ఎవడు ఓడినా మనకేమిటట? లాస్ట్ స్టేషన్ అయినా ఫస్ట్ స్టేషన్ అయినా పోలింగ్‌వర్క్ ఒకటేకదా?" అన్నాడు చలపతి.

అతనలా అన్నాడే కాని ఏదో బెరుకు అతన్ని పీడిస్తోందని ప్రకాశం గ్రహించేడు. అందుకని ఇక మాట పొడిగించలేదు. తన స్టేషన్ దగ్గర దిగుతూ 'విష్ యు ఆల్

ది బెస్ట్' అని చలపతికి చెప్పేడు. ఇది మరోసారి చలపతికి దుశ్శకునంగా తోచింది.

ఆఖరి స్టేషన్ చేరేవేళకి అయిదయింది. దుమ్ము కొట్టుకుపోయి, నీరసం ముంచుకువచ్చి లారీ దిగేటప్పటికి శిథిలావస్థలో వున్న స్కూల్ బిల్డింగ్ దర్శనమిచ్చింది. ప్రాథమిక పాఠశాల భవనం అది. పోలింగ్ స్టేషన్ అక్కడ పెట్టారు. ఆ శిథిలభవనంలో పోల్ అయిన ఓట్లతో నెగ్గి భాగ్యనగర్ వెళ్లి ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించే పాలన సాగిస్తారని ప్రతినిధులు, ఓట్ల తాకిడికి ఆ పాఠశాల భవనం ఇంకా ఇంకా శిథిలమవుతూనే వుంటుంది. కాని ప్రజాస్వామ్య భవనం మాత్రం ఆ శిథిలాలమీద ఇంకా ఇంకా ఎత్తుకి పోతూనే వుంటుంది. ఆ పాఠశాల శిథిలభవనం మాత్రం దీనంగా అలా దిగజారుతూనే వుంటుంది.

ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థులు గత ఎన్నోఏళ్లుగా మేం నెగ్గితే ఈ పాఠశాలకి కొత్త బిల్డింగ్‌లు కట్టిస్తామని వాగ్దానాలు చేస్తూ వచ్చారో మరి! అనగానే వాగ్దానం నెరవేరిస్తే ఇంక దేన్ని చూపించి ఓట్లు అడగాలి? అంచేత శిథిలభవనం దాని శిథిలావస్థలో కూడా ప్రజాస్వామ్య మనుగడకి గర్వంగా ఊతకర్రగా ఉపయోగపడుతోంది.

"ఏమి సార్....ఇంత ఆలస్యమైంది! మేం ఒంటిగంటకే ఇక్కడికి వచ్చేం సార్!" అంటూ ఆ స్టేషన్ పోలింగ్ డ్యూటీ చెయ్యాల్సిన పోలింగ్ ఆఫీసర్ ఒకతను చలపతే ప్రిసైడింగ్ ఆఫీసర్ అయివుంటాడని బుద్ధికుశలత వల్ల గ్రహించి అతని దగ్గరికి వచ్చేడు.

"మధ్యలో అందర్నీ దింపిరావాలికదా!" అని చలపతి జవాబు చెప్పి "అందరూ వచ్చేరా?" అని తనకి ఇచ్చిన సిబ్బంది లిస్టు చూస్తూ అడిగేడు.

ఎన్నికలప్పుడు సిబ్బంది డిజిగ్నేషన్లు మాత్రం చాలా ఘనంగా వుంటాయి – ప్రిసైడింగ్ ఆఫీసరు, అసిస్టెంట్ ప్రిసైడింగ్ ఆఫీసరు, పోలింగ్ ఆఫీసరు అంటూ! ఆ ఒక్కరోజూ మాత్రం ప్రిసైడింగ్ ఆఫీసరు అధికారాలు ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా అధికారాలతో పోటీపడేట్టు వుంటాయి. కాని ఏంలాభం? ప్రతి చిన్నదానికి జవాబుదారీ వుండాలి. ఎంతో నేర్పుతో వ్యవహరించాలి. ఇన్ని అధికారాలు ఒట్టి అజాగళస్తనాలే.

"వచ్చేరండి. ఇప్పటిదాకా ఇక్కడే వున్నారండి. మీరు రావడం ఇంకా ఆలస్యమవు తుందేమోనని అలా టీ తాగివద్దామని వెళ్లేరండి. ఇప్పుడే వచ్చేస్తారండి!" అన్నాడు అప్పటికే ఆలస్యమయిందని పలకరించిన ఆఫీసరు. అతని పేరు రంగమూర్తిట. పరిచయం చేసుకున్నాడు. 'ఎన్నికల రంగమూర్తేమో కొంపతీసి' అనుకున్నాడు చలపతి.

"ముందు పోస్టర్లు రాయిద్దామా, బ్యాలట్ పేపర్లు రెడీ చేసుకుందామా?" అని చలపతి తన ఆలోచనని పైకి వెల్లడించేడు.

"ఏమండీ, విలేజ్ ఆఫీసర్లు ఎవరూ రాలేదా?" అని చలపతి అసిస్టెంట్ ప్రిసైడింగ్ ఆఫీసర్ రంగమూర్తిని అడిగేడు. రాష్ట్రపతి బదులు అన్ని విధులూ నిర్వహించే ఉపరాష్ట్రపతి లాంటివాడు అసిస్టెంట్ ప్రిసైడింగ్ ఆఫీసరు. అంటే అతను ఏకాఏకి స్కూటర్‌మీద పోలింగ్ స్టేషన్ దగ్గరికి వస్తానన్నాడు. కాని మెటీరియల్ తీసుకోవడం, తనో, అతనో ఎవరో ఒకరు బాధ్యత వహించాల్సి వుండడం, తిరిగి బ్యాలెట్ పెట్టెలు అప్పజెప్పాల్సి రావడం అతనికావీలు ఇవ్వలేదు. పైగా బాధ్యతలేదని

రిటర్నింగ్ ఆఫీసరు అంటాడేమోనని భయపడి లారీలో చలపతితో కలిసే వచ్చాడు. కలిసే వచ్చేడుగాని చొరవగా ఏ పనీ అందుకుని చెయ్యలేదు.

విలేజ్ ఆఫీసర్ల గురించి వాకబు చేశాడంటే తమకి ఏర్పాట్లు ఎలా చేశారో కనుక్కుందామన్నదే చలపతి ఆలోచన.

"వస్తారండి. ఇందాక వచ్చివెళ్లారు" అన్నాడు రంగమూర్తి. అతని ధోరణి చూస్తే ఆ ప్రాంతమంతా అతనికి కొట్టినపిండేనన్నట్టు వుంది. చాలా ధీమాగా, తన అజమాయిషీ ఏదో చెల్లుబడి అవుతున్నట్లు వున్నాడు.

ఇంతలోకి మిగిలిన పోలింగ్ ఆఫీసర్లు వచ్చేరు. అప్పటిదాకా అక్కడేవున్నట్టు అప్పుడే టీకోసం వెళ్లినట్లు సంజాయిషీ చెప్పుకుంటున్నట్టు అన్నారు. విలేజ్ ఆఫీసర్లు కూడా వచ్చారు. పోలింగ్‌బూత్ కట్టించేందుకు ఏర్పాట్లు చేశామని, ఎక్కడ కట్టించాలో చెబితే కట్టిస్తామని అన్నారు. చలపతి స్కూలుహాల్లో చుట్టూతా చూశాడు. ఆ స్కూల్లో అయిదో తరగతిదాకా వుందట. కాని విడిగా ఒక్కగది లేదు. ఆ హాల్లోనే వరసగా అన్ని క్లాసులవాళ్లూ పక్కపక్కనే కూర్చుంటారట. వాళ్లకి చదువు ఎలా చెబుతారో, పిల్లలు ఎలా చదువుకుంటారో చలపతికి అర్థం కాలేదు. ఎక్కడ బూత్ కట్టించాలో వెంటనే బోధపడలేదు. అసిస్టెంట్ ప్రిసైడింగ్ ఆఫీసర్ని అడిగేడు.

"ఎక్కడ కట్టించినా ఒకలాగే వుంటుంది, ఖర్మ! ఆ మూల కుడివైపు కట్టిద్దామండి" అని అతను సునాయాసంగా చెప్పేశాడు.

"అక్కడ ఎడంవేపు కిటికీ వుంది కదండీ! సీక్రెసీ ఏముంటుంది?" అన్నాడు చలపతి.

"కిటికీ మూయించేద్దాంలెండి. ఇంతకంటే మంచి ఏర్పాటు ఎక్కడుంది ఈ హాల్లో?" అన్నాడు అసిస్టెంట్ పి.ఒ.

"కిటికీ మూయించేస్తే చీకటైపోతుంది-ఎలా"

"పెట్రోమాక్స్‌లైట్ పెట్టిద్దాం. ఏమండీ, రెండు పెట్రోమాక్స్ లైట్లు తెప్పించండి" అని విలేజ్ ఆఫీసర్లకి చెప్పి- "ఊఁ... మాకు కొంచెం స్నానానికీ, భోజనానికీ ఏర్పాట్లు చూడండి" అని వాళ్లకి పురమాయించేడు అసిస్టెంట్.

అసలు పోలింగ్ ఏర్పాట్లు చూడకుండా తిండితిప్పలు గురించి అతను దేవులాడడం చలపతికి చిరాగ్గా వుంది. వచ్చిన పోలింగ్ ఆఫీసర్లు అంతా అక్కడక్కడివాళ్లే. రంగమూర్తి పక్కవూళ్లో ఎలిమెంటరీ స్కూల్ టీచరట. రాత్రికి ఇళ్లకిపోయి పొద్దున్నే తెల్లవారులోపే వచ్చేస్తామని ముందే సూచన ఇచ్చేస్తారు. చలపతి అనుమతి ఇవ్వడం ఒక లాంఛనం మాత్రమే, ఇవ్వక చేసేదీలేదు చలపతికి. దాంతో వాళ్లంతా ఆ హడావుడిలో వున్నారేకాని ఏర్పాట్ల విషయం గురించి ఏమీ ఆసక్తి చూపించడంలేదు. బ్యాలట్ పేపర్ల మీద వెనక కుడివేపు పైభాగంలో స్టేషన్ నంబరు, కానిస్టిట్యూయెన్సీ నంబరు వున్న మార్క్ స్టాంప్ చెయ్యాలి. వాటిని బ్యాలెట్ బాక్స్‌లో వేసేందుకు వీలుగా నిలువుగానూ తర్వాత మధ్యకీ మడవాలి. ఆ పన్లు ఎలా చెయ్యాలో చెప్పి చలపతి పోస్టరు రాయించడానికి అసిస్టెంట్‌ని రమ్మన్నాడు. బ్యాలట్ పేపర్లు

సిద్ధం చేసేవాళ్లు పనికి అలవాటు అయి అది పూర్తయ్యేవేళకి తొమ్మిదయింది. విలేజ్ ఆఫీసర్లు ఏదో మొక్కుబడికి భోజనాలు ఏర్పాట్లు చేశారు. ఇళ్లకి పోవాలని తొందరపడ్డ పోలింగ్ ఆఫీసర్లు వెళ్లిపోతారేమోననుకున్నాడు చలపతి. కాని వాళ్లు భోజనాలకి వుండిపోయేటప్పటికి వెళ్ళరేమోననుకున్నాడు. వాళ్లుమాత్రం భోజనాలు చేసి "పొద్దున్నే వస్తా"మని చెప్పి సెలవుతీసుకు వెళ్లారు.

పోలింగ్ ఏర్పాట్లు ఎలా వున్నాయో తనిఖీ చేసుకుందుకు రిటర్నింగ్ ఆఫీసర్, సిబ్బంది జీపులో వచ్చేరు. ఏమన్నా కావాలా అని అడిగి ఏవేవో సూచనలిచ్చి వెళ్లిపోయేరు. విలేజ్ ఆఫీసర్లు భోజనాలు పెట్టించేంకదా, మా పని అయిపోయిందన్నట్టు చక్కాపోయారు. ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థుల ఏజంట్లు వచ్చి, లోపాలు ఏమన్నా వున్నాయేమోనని వెతుక్కుంటున్నట్టు గూఢచారుల్లా పరిశీలించారు. ఓ కాండిడేట్ ది ఆ ఊరేనని, చాలా దొంగోట్లు వేయించే పథకంలో వున్నాడనీ జాగ్రత్తగా, నిష్పక్షపాతంగా వ్యవహరించమనీ చలపతిని హెచ్చరిస్తున్నట్టు సూచించేరు.

పోలింగ్ లో అవకతవకలు లేకుండా, దొంగోట్లు పడకుండా నిఘావేసి చూసుకొని ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించే బాధ్యత ఒక్క ప్రిసైడింగ్ ఆఫీసర్ దేనన్నట్టు వాళ్లు మాట్లాడ్డం చలపతికి చిరాకు తెప్పించింది.

అభ్యర్థులు ఓట్లలో 'ప్రజాస్వామికంగా' ఎన్నిక కావాలని తహతహపడుతున్నంతగా సిసలైన ప్రజాస్వామ్యాన్ని కాపాడ్డానికి ఆసక్తి చూపించరేం? దొంగోట్లు పడకుండా చూడాల్సిన బాధ్యత ప్రిసైడింగ్ ఆఫీసర్ దా? వాళ్లదా? అవతలివాడు బలంతో దొంగ ఓట్లు వేయించుకునే అవకాశం వుంటే ప్రజాస్వామ్యం ఖూనీ అయిపోతోందని గగ్గోలు పెడతారు–సందు దొరికితే వీళ్లూ అందుకేం తక్కువ తినలేదుకదా! చలపతి బుర్రలో ఆలోచనలు సుళ్లు తిరుగుతూ వుంటే ఆ ఏజంట్ 'గూఢచారులు' సెలవు తీసుకుని వెళ్లిపోయారు.

ఆ రాత్రి చలపతికి సరిగా నిద్రపట్టలేదు. ఆడపిల్ల పెళ్ళి ముహూర్తం దగ్గర పడుతున్న తండ్రిలాగా వున్నాడు. మధ్య మధ్యలో ఇంటి గురించిన బెంగ ఒకటి పీడించేది. అసిస్టెంట్ ప్రిసైడింగ్ ఆఫీసరు పెళ్లికి వచ్చిన చుట్టంలా హాయిగా పడుకున్నాడు. అతను రెవిన్యూ డిపార్ట్ మెంట్లో పనిచేస్తాట్ట. విలేజ్ ఆఫీసర్లమీద దర్పం వెలగబెట్టేడు కాని పోలింగ్ డ్యూటీ గురించి ఏం పట్టనట్టు వున్నాడు. పోలింగ్ గురించి చలపతి ఏదో అన్నప్పుడు "ఆఁ... మనదేంపోయిందండీ? సజావుగా వుంటే సరే, లేకపోతే మూసిపారేస్తాం. వాళ్ల ఖర్మ!" అని తేలిగ్గా కొట్టిపారేశాడు. వేణ్ణీళ్ల గురించీ, భోజనం గురించీ చాలా శ్రద్ధ పెట్టేడు. "మా పి.ఓ.గారికి మడత మంచం తెప్పించడని" పురమాయింపులు కూడా చేశాడు. తనకుగా తను కలిగించుకొని ఏ పనీ చెయ్యకపోయినా చెప్పినపని మాత్రం చేశాడు. "మా పి.ఓ.గారికి అది కావాలి, ఇది కావాలి" అని పైమర్యాదలు మాత్రం బాగా జరిపించేడు. 'ఇలాంటివాడు రెవిన్యూ డిపార్ట్ మెంట్లో వుండాల్సినవాడే'ననుకున్నాడు చలపతి. బాధ్యత మోయకుండా అన్నీ అమరేటట్టు చేసుకునే తత్వం.

తెల్లవారగానే చలపతి ముందు తయారయి, బ్యాలట్ పెట్టెని పోలింగ్‌కి సిద్ధం చేశాడు. పోలింగ్ బూత్‌లో వెలుతురు బాగా వుందో లేదోనని చూసుకున్నాడు. పోలింగ్ సిబ్బంది వచ్చేరు. ఎవరెవరు ఏమేం చెయ్యాలో సూచనలు ఇచ్చేడు. పోలింగ్ ఏజంట్లకి బ్యాడ్జీలు ఇచ్చి, వాళ్ల విధులు ఏమిటో చెప్పాడు. ఏర్పాట్లన్నీ సూత్రరీత్యా సజావుగానే జరిగేయి.

పోలింగ్ మొదలైంది. ఓ అభ్యర్థి ఆ ఊరివాడే నన్నారు. ఏదేదో జరగచ్చని భయపెట్టారు కాని, ఆ ఉరవడి ఏమీ కనిపించలేదు. 'ఒట్టి పుణ్యానికి హడలుగొట్టినట్టున్నా' రనుకున్నాడు చలపతి. ఓటర్లు మొదట్లో రద్దీగా వచ్చినా పోలింగ్ ప్రారంభమైన రెండు మూడు గంటలకే పల్చబడ్డారు. "అంతా భోజనాలు చేసి వస్తారండీ!" అన్నాడు రంగమూర్తి, అలాంటి ఏర్పాటు ఏదో తనే చేసినట్టు!

అతను తెలిసే అన్నాడో తెలియకనే అన్నాడోగాని పన్నెండుగంటలవేళకి వరదలా వచ్చి పడ్డారు ఓటర్లు. క్యూలో నుంచోమనీ, వరసగా రమ్మనీ చలపతి వాళ్లకి చెప్పి, గబగబా కానిమ్మని సిబ్బందికి చెప్పేడు. తను బ్యాలట్ పేపర్ల వెనక సంతకాలు చేస్తూ కూచున్నాడు. బ్యాలట్ పేపర్లమీద అవసరాన్నిబట్టి సంతకం చెయ్యాలి. అన్నిటిమీదా ఒక్కసారే చెయ్యడానికి లేదు. ఓటర్ల రాకనిబట్టి అవసరమైనమేరకి చెయ్యాలి. వరసగా ఒక్కసారే ఓటర్లు వస్తే గబాగబా సంతకాలుచేసి అందిస్తేగాని పోలింగ్ ఆఫీసర్ ఓటర్‌కి ఇవ్వలేడు. ఓటరు బూత్‌లోకి వెళ్ళి మార్క్ చెయ్యాలి, బ్యాలట్ బాక్స్‌లో వెయ్యాలి, పని చకచకా సాగాలి. మహారద్దీగా వుండే సమయం.

"ఐ అబ్జెక్ట్! రంగమూర్తిగారూ! మీమీద కలెక్టర్‌కి కంప్లయింట్ చేస్తా" అంటూ ఓ పోలింగ్ఏజంట్ అరవడంతో చలపతి ఉలిక్కిపడ్డాడు.

"చేస్తే చేసుకోండి. నాకేమన్నా భయమా? మాకిచ్చిన ఇన్‌స్ట్రక్షన్స్ ప్రకారం మేం పనిచేస్తున్నాం. మీ బెదిరింపులకేం లొంగేమనిషిని కాను" అని రంగమూర్తి గట్టిగా అన్నాడు.

"మాకూ తెలుసు, ఇన్‌స్ట్రక్షన్స్ ఏమిటో మీరేం పాఠం చెప్పక్కర్లేదు. ఒక్కగుర్తే చూపించి మార్క్ చెయ్యమని మీరు ఓటరుకి చెప్తున్నారు. అలా అని మీకు ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చేరా?" అని పోలింగ్ ఏజంట్ ఇంకా గట్టిగా అరిచేడు.

చలపతి గబగబా సీట్లోనుంచి లేచివచ్చి "ఉండండి, ఉండండి" అని ఏజంట్‌ని సముదాయించి గొడవ ఏమిటి? అడిగాడు. ఓటరుకి ఓటు ఇస్తూ ఎలా మార్క్ చెయ్యాలో పోలింగ్ ఆఫీసర్ వివరించాలి. "ఇక్కడ ఇన్ని గుర్తులు వున్నాయి చూశారా, మీకు నచ్చిన గుర్తుమీద మార్క్‌చేసి మడచి పట్టుకొచ్చి ఈ పెట్లో వెయ్యాలి" అని ఓటరుకి పోలింగ్ ఆఫీసరు వివరించి చెప్పాలి. ఆ చెప్పేటప్పుడు నిష్పాక్షికంగా ఏమాత్రం కాన్వాసింగ్ చేస్తున్నట్టు కనిపించకుండా చెప్పాలి. మన ఓటర్లు అంత విద్యాగంధం లేనివాళ్లు కాబట్టే ప్రొసీజరు వివరించాలి. అంతేకాని, ఫలానా గుర్తుకే ముద్ర వెయ్యండి అనిపించేటట్టు వుండకూడదు. రంగమూర్తి 'మీ కిష్టం వచ్చిన గుర్తుమీద ముద్రవెయ్యండి' అని అంటూనే ఒక ప్రత్యేక గుర్తుమీద వేలుపెట్టి చూపిస్తున్నట్టు, ఆ రకంగా ఓటర్ల నిర్ణయాన్ని నడిపించేట్టు చేస్తున్నాట్ట. ఆ గుర్తు ఆ ఊరివాడైన అభ్యర్థిది. దానిమీద పోలింగ్ ఏజంట్‌కి నచ్చచెప్పి రంగమూర్తిని

హెచ్చరించాడు. ఓ ఇరవైనిమిషాలసేపు చలపతి జోక్యం వుండగా కూడా, వాళ్లిద్దరూ అరుచుకుంటూనే వున్నారు. నువ్వెంత అంటే నువ్వెంత అనుకున్నారు. ఓట్లు వెయ్యడానికి వచ్చిన ఓటర్లకి ఇది వేడుకగా వుంది. వాళ్లలో కూడ రెండు వర్గాలకి చెందినవాళ్లు వున్నారు. కాని ఓటర్లు అంతా మూకుమ్మడిగా లోపలికి రావడానికి లేదు కాబట్టి. ఆ గొడవ పోలింగ్‌బూత్ లోపలికంటూ రాలేదు.

'ఇలాంటివాళ్లని డ్యూటీకి వేస్తే, ఇదుగో, ఇలానే వుంటాయి ఎన్నికలు. ఓటరుకి చెప్పడం కూడా ఎందుకు, వాళ్లే ముద్రకొట్టి పెట్లో వేసేసుకోవచ్చుగా" అని ఒకళ్లు, 'అఁ..... మీరేం తక్కువ తిన్నారట, పంచాయతీ ఎన్నికల భాగోతం ఎవరికి తెలీదుట' అని ఒకళ్లు – ఇలా వాదులాడుకున్నారు. ఈ మాటలు చలపతి చెవినపడ్డాయి. కాని పోలింగ్‌బూత్ ఈ లోపలవరకే అతను బాధ్యుడు కాబట్టి, తన ఆఫీసరు మీద అధికారం వుంటుంది కాబట్టి రంగమూర్తిని హెచ్చరించి, ఏదన్నావుంటే నేరుగా తనకి చెప్పమనీ డ్యూటీలో వున్నవాళ్లతో గొడవ పెట్టుకోవద్దనీ ఏజంట్‌కి చెప్పి సర్దుబాటు చేశాడు. ఆ తర్వాత ఇన్‌డెలిబుల్ ఇంక్ సరిగా మార్క్ చెయ్యడంలేదని ఇంకో గొణుగుడు లేచింది. సరిగ్గా మార్క్ చెయ్యకపోతే ఆ ఓటరు వెంటనే ఇంకొచోటికి పోయి మళ్లీ ఓటు వెయ్యొచ్చు. ఈ గొడవల్లో పిడకలవేటలా మరో వింత జరిగింది. ఒక ముసలావిడ ఓటువేసి చలపతి దగ్గరికి వచ్చింది. ఆ చలపతి బ్యాలట్ పేపర్ల మీద సంతకాలు పెట్టడం, ప్రిసైడింగ్ ఆఫీసరు డైరీ రాయడం, పోలింగ్ పూర్తయ్యేదాకా ఆ వ్యవహారం కాగితాలు రాసుకోవడం పనిలో వున్నాడు. ఆ ముసలావిడని చూడగానే మళ్లీ ఏదన్నా గొడవ రేగిందేమోనని చలపతి బెదిరి ఆమెకేసి చూశాడు.

"డబ్బులియ్యండయ్యా!" అందామె.

"డబ్బులేమిటి? ఇక్కడ అడుక్కోవడమేమిటి? ఇక్కడ ఓట్లు వేస్తారు" అన్నాడు చలపతి.

"అడుక్కోవడానికి నేనేం ముష్టిదాన్ననుకున్నావా బాబూ? కూలి చేసుకు బతికేదాన్ని. నేనేం అడుక్కునేదాన్ని కాను. ఓట్లు వేస్తారని మాకూ తెలుసు. ఓటు వేసినా. ఓటేత్తే డబ్బులిత్తారని చెప్పేరు. ఓటు వేసినా కాబట్టి డబ్బు ఇమ్మంటున్నా" అంది.

అప్పటికి చలపతికి అర్థమైంది. అభ్యర్థుల తరఫువాళ్లెవరో ఆ ముసలామెకి ఓటు వేస్తే డబ్బు ఇస్తామని చెప్పివుంటారు. కూలిచేసి డబ్బులు తీసుకున్నట్టు ఆ ముసలామె వచ్చి తనని అడిగింది. ఓటు గురించీ, ప్రజాస్వామ్యం గురించీ ఆమెకి వివరించి చెప్పడం వ్యర్థం. చెప్పినా ఆమెకి ఏమీ బోధపడదు. "చూడమ్మా! మేం డబ్బులు ఇచ్చేవాళ్లం కాదు. ఓట్లు వేస్తున్నారే – ఆ పెట్టెని మీ ఓట్లతోసహా తీసుకెళ్లి పై అధికార్లకి అప్పగించడమే మా డ్యూటీ. డబ్బులు ఇస్తామని నీకెవరు చెప్పారో నాకు తెలీదు. ఓటు వేశావుకదా – నువ్వు వెళ్లిపోవచ్చు. కావాలంటే నీకు అలా చెప్పినవాళ్లనే అడుగు" అని నచ్చజెప్పాడు చలపతి. ఆ ముసలామె కూలి దండుగయిందని మొత్తుకుంటూ వెళ్లిపోయింది.

పోలింగ్ పన్నెండుగంటలయ్యేటప్పటికి పుంజుకుంది. భోజనాలు చేసి తాపీగా దిగారు జనం. పోలింగ్ డ్యూటీ చేసేవాళ్లకి భోజనం టైమే. "మీరు వెళ్లండి పి.ఓ.గారూ!" అని మిగతా పోలింగ్ ఆఫీసర్లు సగౌరవంగా అన్నప్పటికీ చలపతి ముందుగా వాళ్లనే ఒకళ్లతర్వాత ఒకళ్లని వెళ్లమన్నాడు. వాళ్లు తిరిగి వచ్చేదాకా వాళ్లపని తను చేస్తూ కూర్చున్నాడు. విలేజ్ ఆఫీసర్లు ఎక్కడ భోజనం ఏర్పాటు చేశారో, ఎలా ఏర్పాటు చేశారో వర్ణించడం మొదలుపెట్టారు వాళ్లు. జనం రద్దీవల్లా, భోజనాలకి వెళ్లినవాళ్ల బదులు ఆ పన్లు చెయ్యడంవల్లా చలపతికి ఆకలి చచ్చిపోయింది. కాని తప్పదన్నట్టు రెండుగంటల ప్రాంతంలో వెళ్లి రెండు మెతుకులు కతికి వచ్చాడు. ఆ భోజనం చూశాక ఎందుకు మిగిలినవాళ్లు అంత వర్ణించారో అతనికి అర్థం కాలేదు. తిరిగి వచ్చేదాకా అసిస్టెంట్ ప్రిసైడింగ్ ఆఫీసర్ని జాగ్రత్తగా చూడమని చెప్పి వెళ్లాడు.

వచ్చేటప్పటికి ఓ పెద్దమనిషి పెద్దగా గొంతు చించుకుంటూ తాండవం చేసే దృశ్యం కనిపించింది.

"ఏమిటి, ఏమిటి?" అని చలపతి కంగారుగా అడిగాడు.

ఆ పెద్దమనిషి ఓటు ఎవళ్లో అంతకుముందే వేసేశార్ట.

"ఇదేనా ఇక్కడ జరిగేది? ఇదేనా మీరు చేసే డ్యూటీ" అంటూ అరుస్తున్నాడు.

చలపతి అతన్ని పిలిచి, పనికానిమ్మని మిగతావాళ్లకి పురమాయించేడు. అతను చలపతి దగ్గరికి వెళ్లాడు. అతని బదులు ఎవరో ఓటు వేశారు. అతని పేరు దగ్గర ఓటర్ల లిస్టులో ఓటు చేసినట్లు వుంది. అప్పుడే పోలింగ్ ఏజంట్లు చూసి అభ్యంతరపెట్టాలి. అలా చెయ్యలేదు. ఎవరు అసలు ఓటర్లో ఎవరు కాదో స్థానికులకి తెలుస్తుంది కాని మధ్యలో వచ్చినవాళ్లకి ఏం తెలుస్తుంది? అలాంటి దొంగోట్లు పడకుండా కాసుకుందుకే పోలింగ్ ఏజంట్లని అభ్యర్థులు నియమిస్తారు. మరిప్పుడేం చెయ్యాలి? ఈ వచ్చినతనే అసలైన ఓటరనీ, అతని పేరుమీద వేసింది దొంగఓటనీ ఓ ఏజంట్ అన్నాడు. ఈ పరిస్థితిలో టెండర్ఓటని వుంటుంది, దాన్ని ఇవ్వాలి. దానికి కాగితాలు రాయాలి. ఆ ఓటుని కవర్లో పెట్టాలి. ఇదంతా పెద్ద గొడవ. చలపతికి విసుగు వచ్చింది. ఏదో సర్దిచెప్పి అతన్ని పంపివేస్తే ఈ తతంగం తప్పించుకోవచ్చు. "చూడండి, ఎక్కడో పొరపాటు జరిగింది. మీకు రూలు ప్రకారం ఓటు ఇవ్వొచ్చు. కాని దాన్ని మీరు పెట్లో వెయ్యడానికి లేదు. మేం దాన్ని వేరొక కవర్లో పెట్టాలి. దాన్ని కౌంట్ చెయ్యను కూడా కౌంట్ చెయ్యరు. అంచేత ఎందుకు శ్రమ పడతారు, మమ్మల్ని శ్రమ పెడతారు? కాదూ కూడదూ అంటే తప్పదనుకోండి" అంటూ మచ్చిక చేశాడు అతను.

"లెక్కపెట్టందానికి ఈ గొడవ అంతా ఎందుకులెండి!" అని, "ఇక్కడ ఇలాంటి అకృత్యాలు జరుగుతున్నాయన్నమాట!" అంటూ పోలింగ్ ఏజంట్లకేసి వెటకారంగా చూసి వెళ్లిపోయాడు.

ఓటరే అలా వెళ్లిపోవడంతో అతని ఓటు పడుతుందనుకున్న పోలింగ్ ఏజంట్ కూడా ఏమీ అనలేకపోయాడు.

ఈలోపున రద్దీ తగ్గింది. నాలుగయ్యేవేళకి ఒకళ్లూ, అరా ఓటర్లు వచ్చి ఓటు వెయ్యడందాకా వచ్చింది. పోలింగ్ సిబ్బంది కొంచెం ఊపిరి పీల్చుకున్నారు. మిగిలినచోట్ల పోలింగ్ ఎలా సాగుతుందో, జనం ఏమనుకుంటున్నారో అనే విషయాలమీద ముచ్చట్లు సాగాయి. తమ ఓటర్లు ఇంకా చాలామంది రావాలని ఆ ఊరి నుంచి నిలబడ్డ అభ్యర్థి తాలూకు ఏజెంట్ అన్నాడు. "ఇంకెక్కడొస్తారు?" అని ప్రత్యర్థి తరఫు ఏజంట్ అన్నాడు. వాళ్లందరికీ మందు కొట్టించేసి మత్తులో పడుకోబెట్టిన కిటుకు తనొక్కడికే తెలిసినట్టు. అలాంటి పనేదో జరిగి వుంటుందనే ఆ ఊరి అభ్యర్థి ఏజంట్ ఆ ముక్క అన్నాడు. "అయిదింటిదాకా ఓట్లు ఇస్తాం, మరి ముందే జాగ్రత్తపడండి" అని చలపతి ఏజంట్లకి హెచ్చరికలాంటిది చేశాడు.

ఇంత హడావుడిపడ్డా యాభైశాతం ఓట్లుమాత్రం పడ్డాయంతే, "ఏం ప్రజాస్వామ్యం! యాభై ఓట్లలో ఇరవైఆరు వచ్చినవాడు నెగ్గడం, మిగిలిన ముప్పాతికమంది మీదా అధికారం చాలాయించడం!" అన్నాడు ఏ.పి.ఓ.

"మనకెందుకండీ? గట్టిగా ఈ ముక్క అంటే మనకి రాజకీయాలు పులుముతారు" అని చలపతి, ఎక్కడ ఏజంట్లు ఆ ముక్క తీవ్రంగా అర్థం చేసుకుంటారోనని సర్దుబాటుగా అన్నాడు.

"ఆయన చెప్పింది కరెక్టేకదండీ!" అని ఏజంట్లు స్పోర్టివ్‌గా అన్నారు. వాళ్లు ఏజంట్లుగా అభ్యర్థుల తరఫున వచ్చేరేగాని రాజకీయాలు లోతుగా తెలిసినవాళ్లుకాదు కదా! కక్షలూ, కావేషాలూ తెలిసినంతగా రాజకీయ సిద్ధాంతం తెలియదు.

చలపతి టైం చూసుకున్నాడు. ఇంకో అరగంట ఓపికపడితే తెరిపిన పడిపోవచ్చు. 'పెందరాళే తెములుచ్చుకురండోయ్' అని ముందటిరోజున హెచ్చరిక చేసినవాళ్లదగ్గర కాలర్ ఎగరెయ్యొచ్చు. మరో పావుగంట గడిచింది. చలపతి మళ్లీ ఏజంట్లకి హెచ్చరించాడు. పావుగంటలో పోలింగ్ ముగుస్తుందనీ, ఆలోపున వచ్చినవాళ్లందరికీ ఓట్లు ఇవ్వగలరనీ చెప్పేడు. ఆ ఊరి అభ్యర్థి తరఫున ఏజంట్ కంగారుపడిపోతున్నాడుగాని వాళ్ల ఓటర్లు ఎవళ్లూ వచ్చేజాడ కనిపించడంలేదు. అయిదుకాగానే చలపతి ఇవతలకి వచ్చి చూశాడు. దూరంగా అభ్యర్థుల తరఫువాళ్లు అరుగుల మీద గుంపులుగా కనిపించేరు. తమ దగ్గరున్న లిస్టులు చూపి ఐడింటిఫికేషన్ స్లిప్పులు రాసిచ్చేవాళ్లు వీళ్ళేనేమో అనుకున్నాడు చలపతి. లోపలికి వచ్చి– "అయిదయింది....ఇక పోలింగ్ క్లోజ్ చేస్తున్నాం" అని ఏజంట్లకి చెప్పి, పోలింగ్ అయిపోయిందన్న ఎనౌన్స్‌మెంట్ చెయ్యమని పోలింగ్ డ్యూటీకి వచ్చిన ఊరి నౌకరికి చెప్పాడు. అతను గట్టిగా పోలింగ్ అయిపోయిందని అరిచి లోపలికి వచ్చేడు. తలుపు వెసెయ్యమని చలపతి ఆదేశించేడు. ఇక బ్యాలట్ పెట్టె మూసి ఏజంట్ల సంతకాలు పెట్టేస్తే వాళ్లు వెళ్లిపోతారు. మిగిలిన పనులు చేసుకోవచ్చు. త్వరగా తెమిలిపోవచ్చు.

తలుపులు అని పేరేగాని ఇలా తోస్తే పడిపోయేటంత అవుకుగా వున్నాయవి. అయినా వాటినే లాంఛనంగా మూశేరు.

సరిగ్గా ఆ సమయంలో పాలోమంటూ వచ్చేరు జనం. సగంమంది గట్టిగా రెండు కాళ్ళ మీద నిలబడలేకుండా వున్నారు. తూలిపోతున్నారు. కొంచెం నిలబడగలవాళ్ళు వాళ్ళకి చోటు ఇస్తున్నారు. మొత్తంమీద అంతా అరుస్తూనేవున్నారు.

"ఓట్లు ఇవ్వండి, ఓట్లు! ఓట్లేయ్యడానికే వచ్చాం" అని రాగవరసలో అరుస్తున్నారు. చలపతికి పరిస్థితిని అర్థం చేసుకుందుకు అయిదు నిమిషాలు పట్టింది. 'మా ఓటర్లు ఇంకా చాలామంది రావాలని' ఏజంట్ అన్నమాట ఇప్పుడర్థమైంది. 'ఆ ఇంకేం వస్తారు' అని ప్రత్యర్థి ఏజంట్ అన్నమాటల భావం ఇప్పుడు బోధపడింది.

"ఏమండీ....నేనిందాకనే చెప్పానుగా. అయిదులోపున వచ్చినవాళ్లందరికీ ఓట్లు ఇస్తామని. మీకు చెప్పే పోలింగ్ క్లోజ్ చేశాం. బ్యాలట్ బాక్సు క్లోజ్ చేశాను కూడా. మీరు సంతకాలు పెట్టడమేకాదా తరవాయి? ఇప్పుడు వాళ్లకి ఓట్లు ఇవ్వడం ఎలా కుదురుతుంది?" అని ఏజంట్లకేసి తిరిగి అన్నాడు. "కుదరదు" అని ప్రత్యర్థుల ఏజంట్లు హక్కుతో అన్నారు. "ఎన్నిరూల్సు మారిపోవడంలేదు. అయినా ఓ పదినిమిషాల ఆలస్యానికి కొంపలంటుకుపోతాయా?" అన్నాడు ఆ వూరి అభ్యర్థి ఏజంట్. కాని గట్టిగా పట్టుబట్టే నైతికబలం అతనికి లేకపోయింది. పోలింగ్ క్లోజ్ చేస్తున్నానని చలపతి చెప్పేదాకా అతను తమ ఓటర్లు వస్తారని ఒకటికి రెండుసార్లు లోపలికీ బయటికీ తిరిగాడు. పోలింగ్ క్లోజ్ చేస్తానని చలపతి అన్నప్పుడు తను 'ఊ....' అన్నాడు. అంచేత నిస్సహాయంగా వుండిపోయేడు. అతను అభ్యంతరపెట్టినా ఇప్పుడు లాభంలేదు.

చలపతి రూల్సు ప్రకారం చెయ్యనే చేశాడు. దాంతో వాళ్లు అరుచుకుంటూ వెళ్లిపోయేరు. చలపతి మిగతా తతంగం పూర్తిచేసి, సంతృప్తిగా తిరిగి వెళ్లగలుగుతున్నా మన్న సంతోషంతో వున్నాడు. పోలింగ్‌కి వచ్చేముందు ఇంటి గురించి బెంగపడుతూ వున్నా పోలింగ్ ఏర్పాట్లు, పోలింగ్‌రోజు హడావుడి ఆ బెంగని వెనక్కి నెట్టేశాయి. ఇప్పుడు ఆ బెంగ మళ్ళీ వచ్చింది. తను త్వరగా తెముల్చేసుకున్నాడు కాబట్టి, తనదే తిరుగురూట్‌లో మొదటి స్టేషన్ కాబట్టి తన ఆలస్యం లేకుండా బయల్దేరవచ్చు. దారిలో మరేస్టేషన్‌లోనూ ఆటంకం వుండకపోతే పెందరాళే బ్యాలట్‌బాక్సు అప్పగించేసి వెళ్లిపోవచ్చు. ట్రాన్స్‌పోర్ట్ ఏర్పాట్లు చేయిస్తానని తాసిల్దారు అన్నాడు. చేశాడో లేదో. ఎన్నికలయేదాకానే సిబ్బంది ఓడమల్లయ్యలు. అయిపోయేకా, ఇక బోడిమల్లయ్యలైనట్టు చూస్తాడేమో. అంతగా అయితే ఏ లారీయో కట్టుకుపోవచ్చు. "రాత్రి పన్నెండులోపున ఇల్లు చేరగలడో, ఎంత ఆలస్యం వేసుకున్నా" అనుకున్నాడు.

"ఏమండోయ్....రెడీయేనా?!" అంటూ ఎస్కార్ట్ ఆఫీసరు వచ్చి అడిగేడు.

"ఆc....మీదే ఆలస్యం" అని చలపతి హుషారుగా అన్నాడు.

స్టార్టింగ్ పాయింట్ కాబట్టి చలపతి లారీ కేబిన్‌లో కూర్చోగలిగాడు. "నిన్న ఎండకి కాబిన్‌సీటు వుంటే బాగుండేది" అనుకున్నాడు. అయినా ఇప్పుడు కేబిన్ అయినా ఒకటే, బాడీలో కూర్చున్నా ఒకటే. ఎండ లేదుగా, చీకటి పడింది. ఓ రకంగా లారీపైనే మెరుగు, గాలి వీస్తుంది. లారీ బయల్దేరింది. పోలింగ్ ఆఫీసర్లు పోలింగ్ అయ్యేక విలేజి ఆఫీసర్లు టిఫిన్లు ఏర్పాటు చేస్తారని ఆశగా ఎదురుచూశారు. కానీ లారీ బయల్దేరేవేళకిగాని ఎవరూ జాడ లేరు. దాంతో వాళ్ళు నీరసంగా చలపతికి వీడ్కోలు చెప్పి వెళ్లిపోయేరు. లారీ బయల్దేరేవేళకి వచ్చిన విలేజ్ ఆఫీసర్లు చలపతికి కనిపించి సెలవుతీసుకు వెళ్లిపోయేరు.

లారీ ఊరు దాటింది. ఆకాశంలో నక్షత్రాలు అక్కడా అక్కడా మినుకు మంటున్నాయి. చంద్రుడు ఉదయిస్తున్నాడు. వెన్నెలలో దూరంగా వున్న కొండలు నీలిధూళి కల్పి శోభగా కనిపిస్తున్నాయి. 'ఊరికే భయపడ్డాను. పోలింగ్ సజావుగా ముగిసింది. ఇంటిదగ్గర అంతా బాగానే వుండివుంటుందిలే' అనుకున్నాడు చలపతి.

లారీ ఓ కిలోమీటరు వెళ్లివుంటుంది. గోతుల్లో గొప్పుల్లో ఎంతదూరం ప్రయాణం సాగిందీ తెలిసిచావదు. ఓ అరగంటలో పక్క ఊరి స్టేషన్‌కి చేరిపోతారు. వాళ్లు రెడీగా ఉంటారు కాబట్టి ఆలస్యం అవదు. చలపతికి వెన్నెల, దూరంగా వున్న కొండలు చాలా అందంగా కనిపించాయి. గబగబా వెళ్లి ఇంట్లో పడాలన్న ఆదుర్దా కూడా తగ్గింది. పొద్దుటినుంచీ ఏకబిగిన పనిచేస్తూ వున్నాడేమో కొంచెం కునుకు కూడా వచ్చింది.

అంతట్లోకే లారీ రకీమని ఆగింది. చలపతి తూగు వదిలింది. ఎస్కార్ట్ టీమ్‌లో వున్న ఎస్. ఐ. జీపు లారీ ముందుకు వచ్చింది. "చలపతి ఎవడు? పోలింగ్ అయిపోయింది, ఇక ఓట్లు ఇవ్వం అని నా ఓటర్లని తిరగ్గొట్టేశాడట. ఏంటారూల్సు? ఏడీ?" అని ఓ భారీకాయుడు అరుస్తున్నాడు. చలపతి కేబిన్‌లోంచి చూశాడు, దిగాలా వద్దా అన్న మీమాంసలో పడిపోయేడు. "అయనేనండి....ఈ ఊరునుంచి నిలబడ్డ కాండిడేట్" అని డ్రైవరు మెల్లిగా చలపతికి చెప్పేడు. చలపతికి పరిస్థితి అర్థమైంది. ఆలస్యంగా వచ్చిన ఓటర్లు వెనక్కి వెళ్లిపోవాల్సివచ్చిందికదా, వాళ్లంతా ఈయనకి ఓట్లు వెయ్యడానికి వచ్చినవాళ్లన్నమాట. తన ఓట్లు పడలేదని ఆగ్రహంతో వచ్చేడన్నమాట. నిజానికి ఆ కాండిడేట్ తను ఒక్కడే రాలేదు. జీపులో వచ్చేడు. ఇంకో అయిదారుగురు జీపులో వున్నారు. వెనకాలే కొంచెం దూరంలో ఓ లారీ వుంది. కర్రలతో, బరిసెలతో మనుషులు అందులో వున్నారు. నిదానించి చూస్తే వెన్నెలలో ఆ దృశ్యం అంతా కనిపిస్తుంది. చలపతికి భయం వేసింది. ఎస్కార్ట్ యస్.ఐ.తోబాటు ఇంకో నలుగురైదుగురు పోలీసులు వుంటారేమో. ఈ పరిస్థితిలో వాళ్లు ఏం సాయం చెయ్యగలరు? అయినా తమ ప్రాణాలకి తెగించి ఎదిరించడానికి వాళ్లకి మాత్రం ఏం పట్టింది? అద్దెకొచ్చిన గుర్రాలు అగడ్తులు దాటతాయా అని ఆ పోలీసులు ముందుకు వస్తారా? ఇప్పుడేం దారి?

ఎస్.ఐ. ఆ కాండిడేట్‌ని సముదాయించ ప్రయత్నిస్తున్నాడు. అతను సముదాయించే కొద్దీ ఆ అభ్యర్థి రెచ్చిపోతున్నాడు. ఆ అభ్యర్థిని ఇప్పుడు బాగా చూడగలిగేడు. ఎర్రగా వున్న కళ్లు, తూలుతూవున్న వొళ్లు బాగా కనిపించాయి. ఎస్.ఐ.కి ఏంచెయ్యాలో బోధపడలేదు. దొమ్మీకి సిద్ధమయ్యే ఆ అభ్యర్థి వచ్చినట్టుంది. పోలింగ్ మెటీరియల్‌కి రక్షణ ఇచ్చేటంత బలం చలపతి దగ్గర లేదు. దొమ్మి జరిపితే తను ఎదిరించలేడు. దొమ్మి జరిపి బ్యాలట్‌బాక్స్‌ని ఎత్తుకుపోయినా, చలపతిని ఏమన్నాచేసినా అభ్యర్థికి పోయేదేమీలేదు. కాని టాక్ట్‌ఫుల్‌గా ఎస్కార్ట్ చెయ్యలేదని తనకి రిమార్కు వస్తుంది. అందుకని దండోపాయం లాభంలేదు. మొదటిదే మేలు. కాండిడేట్ మత్తు తగ్గేదాకా జాప్యం చేస్తే అప్పుడు చెప్పినమాట వినచ్చు, ఇప్పుడు అసలు మాట వినే పరిస్థితిలో లేడు.

"అబ్బెబ్బె...మీరు తొందరపడకండి! వాళ్లు డ్యూటీచేసే ఆఫీసర్లు! రూల్సు ప్రకారం నడవకపోతే పైవాళ్లనుంచి మాటవస్తుంది. రేప్పొద్దున మీరు అధికారంలోకే వచ్చినా ఆఫీసర్లు మీరు చెయ్యమన్నట్టు చెయ్యాల్సిందేకదా? మీ కేదన్నా అన్యాయం జరిగిందని తోస్తే కలెక్టర్ కి కంప్లయింట్ యివ్వండి. చలపతిగారూ, మీరూ లారీఎక్కి కూర్చోండి" అని ఎస్.ఐ. అటు కాండిడేట్ కీ, ఇటు చలపతికీ చెప్పాడు.

"ఆఁ రూల్సు ఏంటో మాకూ తెల్సు. పదినిమిషాలు ఆలస్యమైందని మా ఓటర్లకి ఓట్లు ఇవ్వడా? నేను ఓడిపోవాలి! వీడి అంతు తేలుస్తా! నా ప్రచారంలో ఒక్కరోజు ఖర్చుపెట్టినంత లేదు వీడి బతుకంతా కలిపి. పెద్ద ఆఫీసర్ననుకుంటున్నాడు కాబోలు!" అంటూ కాండిడేట్ చిందులు తొక్కేడు.

అతని మందిమార్బలం రంగంలోకి దూకడానికి మహోసరదా పడిపోతున్నారు. చలపతిని లాగి, నాలుగందుకుని బ్యాలట్ పెట్టె అందించుకోక ఏమిటో జాప్యం కబుర్లు అని విసుక్కుంటున్నారు. ఆలస్యమయ్యేకొద్దీ ఏం ముంచుకొస్తుందో, ఏ రిజర్వ్ పోలీస్ వాళ్లో రావచ్చు, ఇప్పుడున్న అవకాశం చెయ్యిజారిపోవచ్చు అని వాళ్ల తొందర. తమ అభివృద్ధికి తాము ఆశించినంత 'క్రియాశీలత్వం' లేదని విమర్శించుకున్నారు.

"ఎందుకొచ్చిన కబుర్లండీ! లాగండతన్ని లారీలోనుంచి! బ్యాలట్ పెట్టెని విప్పదియ్యండి!" అని అభ్యర్థి అంతరంగికులొకరు బోధ చేశారు.

అభ్యర్థి చురుగ్గా ఊఁ అనడంలేదని కసురుకుంటూవున్నా అతని ఆదేశంలేందే బరిలోకి దూకడానికి వాళ్లు జంకేరు. ఈ లోపున ఆ ఉన్న పోలీసులు కొద్దిమందీ బ్యాలట్ పెట్టె వున్న మూట దగ్గర – రాక్షసుడి ప్రాణం వున్న చిలకని కాపాడే శక్తుల్లా సన్నద్ధులై చేరారు. ఇక్కడ ఏదో గలభా జరుగుతోందని ఊళ్లోకి పాకింది. వేడుక చూద్దామని ఉత్సాహవంతులు చాలా మంది అక్కడికే చేరారు. ఓపక్క టైం గడిచిపోతోంది. పది దాటిపోతోంది. పెందరాళే చేరడంమాట దేవుడెరుగు, అసలు ప్రాణాలతో చేరతానా అని చలపతికి భయం పట్టుకుంది. ఊళ్లోనుంచి వచ్చినవాళ్లయినా గొడవని సర్దుబాటు చేద్దాం అన్న ఆలోచన లేకపోగా – ఇది ఎలా పరిణమిస్తుందీ అని ఉత్కంఠగా చూస్తూ వుండిపోయారు. అంతలోకే రిజర్వ్ పోలీస్ వాన్ బంయ్ న దూసుకుంటూ వచ్చింది. ఇంత ఆలస్యమైందేమా అని అధికార్లే పంపేరో, ఊళ్లో ప్రత్యర్థివర్గం వాళ్లెవరైనా రహస్యంగా వెళ్లి చెప్పారో తెలీదు కాని గజేంద్రుణ్ణి కాపాడడానికి వచ్చిన శ్రీమహావిష్ణువులాగా వచ్చిన బలగం. అయితే ఆనాడు విష్ణువు హడావుడిగా ఏమీ లేకుండా బయల్దేరాడుగానీ, ఈ రిజర్వ్ పోలీస్ బలగం మాత్రం సర్వసన్నద్ధంగానే వచ్చింది.

అప్పటికే అభ్యర్థికి మత్తు తగ్గిందానివల్లనైతేనేం, రిజర్వ్ దళం శక్తి కళ్లు తెరిపించేటట్టు వుండడంవల్లనైతేనేం అభ్యర్థి వర్గంలో పూనకం తగ్గింది. చలపతినీ, బ్యాలెట్ బాక్స్ మూటని ఎస్.ఐ. జీపులో పంపేసి, పరిస్థితిని సర్దుబాటు చెయ్యడానికి రిజర్వ్ దళం నడిచిపోయింది. జీపు బయల్దేరేటప్పుడు కూడా అభ్యర్థి "ఎక్కడికి పోతాడు? నేను ఓడిపోవాలి, వీడి అంతు తేలుస్తా" అని అరుస్తున్నాడు. చక్కని అవకాశం జారవిడిచినందుకు అతని వందిమాగధులు నెపం వేస్తున్నారు.

బతుకు జీవుడా అని చలపతి ఊపిరి పీల్చుకున్నాడు. పక్క స్టేషన్లో వున్న పోలింగ్ డ్యూటీవాళ్లు అతన్ని చూడగానే హమ్మయ్య అనుకుని కలెక్టర్‌కి కంప్లైంట్ ఇమ్మని ఇలాంటి వాళ్లు ఎమ్మెల్యేలైతే దేశం నాశనం అవుతుందని చలపతికి సలహా ఇచ్చేరు. చలపతికి బెదురుమాత్రం తగ్గలేదు. కంప్లైంట్ ఇస్తే ఇచ్చినందుకు "అంతు చూస్తాడేమో" అన్నాడు. ఆ పిరికితనం వుండకూడదని మిగిలినవాళ్లు బ్యాలట్ పెట్టెలు తిరిగి ఇచ్చేటప్పుడు ధైర్యం చెప్పేరు. అదృష్టవశాత్తూ ఆ సమయంలో అక్కడే వున్న కలెక్టర్ దగ్గరికి వెళ్లి చెప్పేరు. మరేం భయంలేదనీ, తను రక్షణ కల్పిస్తాననీ కలెక్టర్ హామీ ఇచ్చేడు.

అయినా ఫలితాలు వచ్చేదాకా చలపతికి స్థిమితం లేకపోయింది. ఫలితాలు వచ్చేయి, ఆ అభ్యర్థి నెగ్గేడు. "హమ్మయ్యా! నాకు ఇంక భయంలేదు" అన్నాడు చలపతి భార్యతో తర్వాత ప్రభుత్వం ఏర్పడింది. ఆ అభ్యర్థికి మంత్రివర్గంలో స్థానం వచ్చింది.

● *విపుల: జనవరి, 1992* ●

★ ★ ★

71

కె. వరలక్ష్మి

# సంధ్యాసమస్యలు

"అమ్మా! నేనో మాటచెప్పనా?" అంది మా పెద్దమ్మాయి శ్యామలి.

ఏమిటన్నట్టు తలెత్తి చూసాను. అదెందుకో సంశయిస్తోంది. ఏదో చెప్పాలను కుంటూ చెప్పలేకపోతోంది. వ్రాస్తున్న కలాన్ని పుస్తకం మీద పెట్టి కుర్చీని పక్కకి జరుపుకుని దానివైపు తిరిగి కూర్చున్నాను. "అలా కూర్చో" అన్నాను సోఫాచూపించి.

టేబుల్ లేంప్ వెలుగుతప్ప, గదంతా చీకటిగా వుంది. చెయ్యిచాపి ట్యూబ్ లైట్ స్విచ్చి వెయ్యబోయాను. "ఆ.. ఆ.. వద్దు" అంది కంగారుగా శ్యామలి. "ఇలాగే బావుంది" అంది సంజాయిషీ చెప్తున్నట్టు.

ఈ రోజిది ఎందుకిలా ప్రవర్తిస్తోంది? ఆడపిల్లలిద్దరూ చిన్న పిల్లలుగా ఉండగా డబ్బుమీది పేరాశతో మరో పెళ్ళి చేసుకుని మానుంచి దూరమయ్యాడు వీళ్లతండ్రి. పెద్దల నెదిరించి గుళ్లో పెళ్లి చేసుకున్న నేను సాక్ష్యాధారాలు చూపలేక నిస్సహాయంగా ఉండిపోయాను. వీళ్లని పెంచడమే నా జీవిత పరమావధి అనుకున్నాను. బాల్యంలో పిల్లలుగా ఏం చూశానో, ఊహ తెలిసినప్పటినుంచీ స్నేహితుల్లాగే ట్రీట్ చేస్తున్నాను. వాళ్ల ఇష్టాలే నా ఇష్టాలు చేసుకున్నాను. వాళ్లు కోరుకున్న చదువులే చదివించాను. నాకొచ్చే జీతానికి నాశక్తికి మించిందే అయినా పెద్దదాన్ని బి.టెక్ చేయించాను. చిన్నది సైన్స్‌లో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేస్తోంది. ఎప్పుడో లోన్ తీసుకుని కట్టించిన ఇంటి అప్పు మొన్ననే తీరింది. ప్రస్తుతం నిరుద్యోగులైన ఇంజనీర్లలో శ్యామలి ఒకత్తి. ఆ ఫీలింగ్ రాకూడదని అతి స్మూత్‌గా వ్యవహరిస్తాను దీన్తో.

"అమ్మా!"

"చెప్పమ్మా!"

"మరీ..వాళ్లడిగిన కట్నం ఇచ్చేస్తేనే బాగుంటుంది కదా?"

ఉలిక్కిపడ్డాను నేను. నన్ను నేనే సంబాళించుకుంటూ "శ్యామలీ! వాళ్లడిగిందెంతో తెలుసా, లక్షరూపాయలు!" అన్నాను.

"అవును, ఈ రోజుల్లో ఇంజనీర్లకి నాలుగైదు లక్షలిస్తున్నారట తెలుసా?"

శ్యామలి గొంతులో ఇందాకటి సంశయంలేదు.

"అలా అని అతను చెప్పేడా?"

"ఎవరు చెప్తే ఏం, ఉన్నమాటేకదా!"

"ఈ మాత్రానికి దీనికి 'ప్రేమపెళ్ళి' అని పేరు పెట్టుకోవడం ఎందుకు?"

"ప్రేమించడం అంటే నష్టపోవడమా నీ దృష్టిలో?"

బాణంలా గుచ్చుకుందీమాట నాకు.

"లాభ నష్టాల బేరీజు లెందుకులే, ఇదేదో బిజినెస్‌లా."

"నువ్వంత సెన్సిటివ్‌గా మాట్లాడితే నేనేం చెయ్యలేను. పరాయింటికి వెళ్తున్నప్పుడు నా లైఫ్‌కంటూ ఓ సెక్యూరిటీ కావాలి కదా?"

"నీ చదువు నీకు సెక్యూరిటీ కాదా?"

"ఉద్యోగం చెయ్యడానికి వాళ్ళొప్పుకోవడం లేదుకదా?"

"అయితే, ఆడపిల్లలు కట్నాలిచ్చే తీరాలంటావ్, అవునా?" నా గొంతులోంచి ఉబికి రాబోతూన్న ఎగతాళిలాంటి భావాన్నేదో అతి ప్రయత్నం మీద వెనక్కి నెట్టేశాను.

"నే నొక్కదాన్నే అనడంలేదు. ఈ రోజు లోకమంతా అలాగే ఉంది. అప్పట్లో మీవాళ్లు కట్నమిచ్చి నాన్నగారితో నీ పెళ్లి జరిపిఉంటే ఇలా జరిగిదేనా?"

"శ్యామలీ!" ఆ చీకటి గదిలో నా గొంతు తరంగాలుగా ప్రతిధ్వనించింది. ఇది నేను పెంచిన ఆడపిల్లేనా? నా ప్రాణానికి ప్రాణంగా చూసుకున్న నా బిడ్డేనా? దీని చదువు దీనికి నేర్పిన నాగరికత ఇదేనా?

అమ్మగా నామీద ఒకింతైనా సానుభూతి లేదా, ఎంత కఠినంగా మాట్లాడుతోంది! కుర్చీ అంచుల్ని గట్టిగా పట్టుకుని నన్ను నేను నిభాయించుకున్నాను.

"అలాగే చేద్దాంలే, నువ్వెళ్లి పడుకో" అన్నాను గొంతు పెకలించుకుని.

☆ ☆ ☆

ఆకాశం చుక్కలచీర కట్టుకున్న అమావాస్య రాత్రి. గదిలో ఉక్కని భరించలేక వాకిట్లో వాల్చిన మంచం మీద నడుం వాల్చాను. దూరంగా ఎక్కణ్ణుంచో గులాం అలీ గొంతు మార్దవంగా గాలిలో తేలి తేలి వస్తోంది. ఒంటరిగా నిలబడిన కొబ్బరిచెట్టు చీకట్లో జుట్టు విరబోసుకున్న అనాథలా ఉంది.

శ్యామలి పెళ్లి తర్వాత అద్దె ఇంట్లోకి మారక తప్పనిసరైంది. ఈ పరిసరాలకి ఇంకా పూర్తిగా అలవాటుపడక కొంత ఇరుకు ఫీలవుతున్నాం.

లోపల గదిలో ఫేను కింద కూర్చొని రాజీవి ఇంకా ఏదో చదువుకుంటోంది. పరీక్షలైపోయినా దాని బిజీ తగ్గలేదు. అర్ధరాత్రి వరకూ ఏదో రాస్తూ, చదువుతూ ఉంటుంది.

వారం క్రితం నా కోలెక్చరర్ పట్టాభి చెప్పింది విన్నట్నుంచీ నా గుండె గొంతుకలోనే కొట్లాడుతోంది.

ఆ రోజు వస్తూనే దాని పుస్తకాలన్నీ వెతికి చూశాను. ఎలాంటి ఆధారం దొరకలేదు. పట్టాభి చెప్పిన మాట తప్ప మరెలాంటి ఋజువులూ లేవు. ఆ స్నేహితులెవర్నీ ఎప్పుడూ ఇంటికి తీసుకురాలేదు. అలాంటిదేదైనా ఉంటే

వంటమనిషి నాకు చెప్పకుండా ఉండదు. బైట ఎక్కడా నేను దాన్ని ఎవరితోనూ చూడనూలేదు.

పట్టాభి ఏమన్నాడూ - "యశోధర గారూ! ఆ పార్టీ, ఆ ఇజం యువతని చాలా తొందరగా ఆకట్టుకుంటాయి. మీ అమ్మాయి ఇప్పుడిప్పుడే దాన్లో అడుగుపెడుతున్నట్టు తెలిసింది. జాగ్రత్త పడండి" అని కదూ!

అడుగుల చప్పుడైంది, రాజీవి వస్తున్నట్టుంది. మంచం పక్కకొచ్చి నిలబడి "అమ్మా, ఇంకా నిద్రపోలేదా?" అంది.

నేను అట్నుంచి ఇటు తిరిగాను.

"మంచినీళ్లు తెచ్చాను, తాగుతావా?"

"వద్దులే, అలా స్టూలుమీద పెట్టు" అన్నాను.

జగ్గు, గ్లాసు స్టూలుమీద పెట్టి వెళ్లబోతోంది.

"రాజీ!"

"ఏమ్మా?"

"ఇట్రా, ఇలా వచ్చి నా పక్కన కూర్చో." లేచి కూర్చుని, జరిగి చోటిచ్చాను.

"ఏంటమ్మా?"

"నీ పరీక్షలైపోయాయికదా, నా కొలీగ్ ఒకాయనకి తెలిసి మంచిసంబంధం ఏదో ఉందట, వాళ్లని రమ్మని రాయనా?"

రాజీవి మౌనంగా ఉండిపోయింది.

"అబ్బాయి డాక్టరట. మంచి పొజిషన్లో ఉన్నాడట."

"నా పెళ్లికేం తొందరొచ్చిందమ్మా? మొన్ననే కదా అక్కయ్య పెళ్లి చేసి పంపించావ్." రాజీవి గొంతులో సన్నని విసుగు.

"అదే, నీకూ చేసేస్తే నా బాధ్యత తీరుతుంది. పోనీ, నీ దృష్టిలో ఎవరైనా ఉంటే చెప్పు. ఆ అబ్బాయినే మాట్లాడదాం."

"ఛ. అలాంటిదేం లేదు. అయినా, పెళ్లితప్ప మరో టార్గెట్ లేదామ్మా జీవితానికి?"

"అలా అంటే ఎలా? మనిషికి తోడూ నీడా అవసరం కదా! పెళ్లి తప్పనిసరైనప్పుడు ఎప్పుడు చేసుకుంటే ఏం? నేను రిటైరైపోతే చెయ్యగలనో లేదో. ఇల్లమ్మిన డబ్బు మరో లక్ష మిగిలింది బేంకులో. అదిచ్చేసి, నిన్నో అయ్యచేతిలో పెట్టేస్తే..."

"అమ్మా!" అరిచింది రాజీవి. "నేనేమైనా బొమ్మనా నన్నెవరిచేతిలోనో పెట్టెయ్యడానికి? తిరిగి కట్నం ఒకటిస్తావా? కట్నం తీసుకునేవాణ్ణి నేనసలు పెళ్లి చేసుకోను!"

"వాళ్లకివ్వద్దులే, పోనీ నీకు సెక్యూరిటీగా ఉంటుంది. నీ పేరుతో బేంకులో వేస్తాను."

"అలా అయితే పెళ్లి ప్రసక్తి లేకుండానే వెయ్యి. డబ్బు పుచ్చుకుని మరీ నన్నుద్ధరించేటట్టు పోజు పెట్టే మగాడికి నన్ను నేను అర్పించుకోవడం నాకిష్టంలేదు.

అసలు మగపురుగులంటేనే నాకిష్టంలేదు. అప్పట్లో ఆ మగాడికి నువ్వు ప్రేమ - పెళ్లి అంటూ బలహీనంగా లొంగిపోకుండా ఉంటే.." గొంతులో ఆవేశాన్ని నింపుకుని ఇంకా ఏదో మాట్లాడుతోంది రాజీ.

ఈ పిల్లల్నికని, పెంచిన తల్లిగా ఇద్దరి దృష్టిలోనూ నేను తప్పుచేసినట్లేనా?

నన్నేదో నీరసం ఆవహించినట్లై వెనక్కి వాలిపోయాను.

ఇప్పటి ఈ యువతని ఎలా అర్థం చేసుకోవాలి? జీవిత సంధ్యాకాలంలో ఈ సమస్యల నెలా పరిష్కరించాలి?

● 'రచన' - జూలై '92 ●

★ ★ ★

మధురాంతకం నరేంద్ర

# 72 నిత్యమూ...నిరంతరమూ...

మునిగాళ్లపై నిల్చుని, విల్లులా వంగి, అరఫర్లాంగు పొడవున్న వీధి మలుపు వరకూ కలయజూసిన తరువాత "యెప్పుడో యిట్ల చూస్తా చూస్తా కాలు జారి కిందపడి చస్తానేమో నేను....." అని నాలుకను కోపంగా కరచిపెట్టి గొణుక్కుంటూ వెనుదిరిగి, యింటిలోకొచ్చి "వీధిలో ట్రాఫిక్ కూడా తగ్గిపోయింది. వదినా!" అంది షర్మిల.

సగం నిద్రలో సైతం యేడుస్తూ రాగాలు తీస్తున్న అయిదేళ్ల అమ్మాయిని జోకొడుతూ తలపైకెత్తి చూసి, కనుకొనుకుల్లోని కన్నీటి చుక్కని మోచేత్తో తుడుచుకుంటూ పెదవినదోలా వంచి నవ్వడానికి ప్రయత్నించి విఫలురాలైపోయింది సుశీల.

నైట్ బల్బు వెలుతుర్లో గది వెలవెలబోతోంది.

నవారు మంచంపైన యేడేళ్ల అమ్మాయొకతి నిద్రపోతోంది. పిల్లలకు నిద్రాభంగం కలిగించకుండా బాగా వాల్యూం తగ్గించి పెట్టిన టీవీలో డిష్ సినిమా ప్రసారమవుతోంది. నేలపై పిల్లల బొమ్మలు చిందరవందరగా పడివున్నాయి. ట్యూబ్‌లైటు వెలుగుతున్న అవతలివైపు గదిలోని వుయ్యాలలో యేడాది వయసున్న పాపాయి నిద్రపోతోంది. గోడపైని యెలక్ట్రానిక్ గోడ గడియారం కదలడం మానేసి చాలా రోజులైపోయినట్టుంది. బాత్‌రూంలోని కొళాయిలోంచీ నీటి గడియారంలా నీళ్లు టపటపమని శబ్దం చేస్తూ రాలుతున్నాయి. దోమల రాకని ఆపుతున్న మస్కిటో మాట్ వాసన గాఢంగా గదంతా వ్యాపించివుంది.

సుశీల మరోసారి పాపాయి ఛాతీపైన చేయిపెట్టి చూసి, "వొళ్లు వేడిగానే ఉంది. యీ సమయంలో డాక్టరు వుంటాడంటావా, వదినా?" అని ప్రశ్నించింది.

వో నిముషంసేపు ఆలోచించిన తర్వాత, "యేమో, యింటికెళ్లిపోయినా పరవాలేదులే! డాక్టరు యీయనకు ఫ్రెండే కదా! వాళ్లిల్లు డిస్పెన్సరీకి దగ్గరే. యింటికాడి కెళ్లినా చూస్తాడాయన" అంది షర్మిల.

గోడపైన పెద్దపెద్ద మసీదుల ఫోటోల మధ్య యేదో లైసెన్స్ తాలూకు ఫోటో కూడా వేలాడుతోంది. నిలువెత్తు అలమారులోని చాలా భాగాన్ని పెద్దపెద్ద పుస్తకాలు ఆక్రమించుకున్నాయి. 'కె.ఎస్. భాషా, చార్టెర్డ్ అకౌంటెంట్' అన్న అక్షరాలున్న ప్లాస్టిక్ బోర్డొకటి పుస్తకాల పక్కన తలకిందులుగా పడివుంది.

టీవీ సినిమాతో లంకె కుదరడం సాధ్యం కాదని అర్థమయిన తరువాత "యింట్లో ధర్మామీటరుందా?" అని అడిగింది సుశీల.

"వుంది, వదినా! చూస్తానుండు. ఆయనెక్కడో సర్దిపెట్టేసుంటారు." పైకి లేచి, అలమారులో వెదికి ధర్మామీటరు తీసుకొచ్చింది షర్మిల.

సుశీల ధర్మామీటరులో రీడింగ్ చూస్తూండగా "నీకు ధర్మామీటరు చూసేదొచ్చునా?" అని ఆశ్చర్యపడిపోయింది.

"నూరు డిగ్రీలుంది జ్వరం. మందో, మాకో పోయకపోతే యెలా తగ్గుతుంది? వూరుగాని వూరికొచ్చాం కదా! 'పెళ్లాం పిల్లల్ని యిలా వదిలిపెట్టి పార్టీలకెళ్లిపోతే వాళ్ల గతేంగాను?' అన్న వూసే లేదు వారికి. 'సెలవు లెప్పుడొస్తాయా, యెప్పుడీ వూరు వచ్చి చిన్ననాటి స్నేహితుడితో వూరేగుదామా' అని వువ్విళ్లూరుతూ వుంటే, తీరా పరాయి వూళ్లోనయినా కొద్ది రోజులు కళ్లముందు నడయాడకపోతారా అని యెదురుచూశాను. రైలులో గంటల తరబడీ ప్రయాణం చేసి అలసిపోయానంటూ యీాయన యీా ప్రోగ్రాం యివ్వాళే పెట్టుకోవాలా?" సుశీల గొంతులో విసుగు స్పష్టంగా ధ్వనించింది.

'నే నొద్దంటే ఆయన వింటారా? నువ్వూ చూసినావు గదా, వదినా! అసలు యీా అన్న కోసరమనే ఆ సీసా యింట్లో యెత్తిపెట్టినానని నాతో యెన్నోసార్లు చెప్పినారు. తీరా ఆయనొచ్చినాక యింక వాళ్ల నాపేదానికి మనవల్లేమవతాది చెప్పు? నేనేమో బిన్నాగా ముగించమని చెప్పే బాటలిచ్చినాను" అంటూ వాపోయింది షర్మిల.

"యింట్లో మీ పాప మందులేమైనా వున్నాయా?" అని అడిగింది సుశీల.

షర్మిల అలమారు గాలించి మూడు టానిక్ సీసాల్ని వెలికితీసింది. "యివన్నీ పాప మందులే! జరం మందుకూడా వుండాల. యిదేననుకుంటా–పెట్టెపైన జ్వరం అని ఆయనే రాసిపెట్టినారు. నేను వేరే ఏదైనా పోసేస్తానేమోనని ఆయన భయం!"

సుశీల టానిక్ సీసాపైని లేబుల్‌నోసారి చదివి చూసిన తర్వాత పాపని బలవంతంగా లేపి కూర్చోబెట్టింది. షర్మిల దగ్గరికొచ్చి యేడుస్తున్న పాపని రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకుంది. పిల్లాడి చేతిలో చిక్కిన తుమ్మెదలా పాప విలవిలా కొట్టుకోసాగింది. బలవంతంగా పాప నోరు తెరిపించి మందు పోసింది సుశీల. సగం మందు పాప పెదవులపైన్నుంచే జారి గౌనుపైన పడిపోయింది.

"యింకో సగం మూత పోద్దామా?" అంది షర్మిల.

"వద్దులే వదినా! కొంత గొంతు దిగింది గదా!" అంది సుశీల.

యుద్ధంలో వోడిపోయిన సైనికుడిలా పాప బుంగమూతి పెట్టుకుని దీర్ఘాలు తీయసాగింది.

మిద్దె మెట్లపైన టపటపమని అడుగుల శబ్దం వినిపించగానే, సుశీల ఆత్రుతతో తల పైకెత్తి చూసింది.

"అది హవాయి చెప్పుల చప్పుడు. సుగుణమ్మ! యేసుదాసు పెండ్లాం" అంది షర్మిల.

సుగుణమ్మ మిద్దె మెట్లెక్కి వరండాలోకొచ్చి నిల్చుంది. షర్మిల అటు వైపుకైనా చూడకుండా సుశీల ముందున్న మందుల సీసాల నెత్తుకుని అలమారులో సర్దసాగింది.

అసలే పొట్టిగా వున్న సుగుణమ్మ మరింతగా వొంగిపోయి నిల్చుని బిక్కు బిక్కుమని చూస్తోంది. ఆమె కట్టుకున్న నాసిరకం నేత చీర రంగు చీకటితో కలిసిపోయి వుంది.

షర్మిల లోపల గదిలోకెళ్ళి వుయ్యాల్లోకి తొంగిచూసి, కాసేపు లోపలే తచ్చాడి ఆ తరువాత ముందుగదిలోకొచ్చింది.

సుగుణమ్మ అలాగే వరండాలో నిల్చుని వుంది.

"యేం సుగుణమ్మా! యేం కావాలి?" అని తాపీగా ప్రశ్నించింది షర్మిల.

"డిష్‌లో సినిమా...."సుగుణమ్మ నవ్వే ప్రయత్నమైనా చేయడం లేదు.

"యీ పొద్దేసిన సినిమాలో వొకటే ఫైటింగు. నీకు సరిపడదులే. రేపురా, బో! వేరే సినిమా చూద్దువుగానిలే!"

సుగుణమ్మ అయిదారు నిముషాల వరకూ వేచిచూసి, యిక యివ్వాల్టికి తన కాహ్వానం దొరకదని నిర్ణయించుకున్న తర్వాత వెనుదిరిగింది.

"పోతే పోనీ అని పగుల్లో డిష్ సినిమా చూడనిచ్చిందానికి, పొద్దుగూకులూ అదే పనా? కొంచెం తావిస్తే చాలు! నెత్తిపైకొచ్చి కూర్చుంటారు" షర్మిల గొణుక్కుంటూ యేమంటావన్నట్టుగా సుశీలకేసి చూసింది.

ఆ మాటలు తన చెవినబడనట్టుగా–"ఇంకే రాత్రికి డాక్టరు దగ్గరికెళ్ళడం లేదన్నమాటే గదా!" అంది ఆమె.

"యీ మగోళ్ళెక్కడ తిష్టేసినారో, యేమో! సాయంత్రం బిడ్డకు వొళ్ళు వుడుగ్గా వుండాదని నువ్వు చెప్పనుకూడా చెప్తివి గదా? మీ ఆయన కూడా మా ఆయనకు తీసిపొయ్యేట్టు లేదు వదినా?" అని అంతలో యేదో జ్ఞాపకం రాగా, గబగబా వరండాలోకి నడిచి, "సుగుణమ్మా! కొంచెం పైకొచ్చి పో!" అంటూ కేకేసింది షర్మిల.

సుగుణమ్మ మెట్లెక్కి, మిద్దెపైకొచ్చేసరికి షర్మిల కుర్చీలో దర్జాగా కూర్చుని వుంది.

ఆమె మౌనంగా నిల్చుంది.

"మీ ఆయనుండాడా ఇంట్లో?"

వున్నాడని తల పైకీ, కిందికీ వూపుతూ తెలియజేసింది ఆమె.

"వాళ్ల సారూ, సార్‌వాళ్ల ఫ్రెండూ సాయంత్రమనగా టౌన్లోకి పోయినారు. యింట్లో ఆ అన్నోళ్ళ బిడ్డకు జరంగా ఉంది. డాక్టరుకాడి కెళ్లాల! కొంచెం వూర్లోకెళ్లి వాళ్లేడుండారో చూసి రమ్మను."

మరోసారి మూకాభినయం చేస్తూ అలాగేనని తెలియజేసింది ఆమె.

"తల వూపినట్టుగాదు. మరిచిపోకుండా చెప్పాల. ఆ టౌను క్లబ్బులో చూడమను. లేకపోతే రంగస్వామి వాళ్లింట్లో చూడమను. ముందా పని చేసి, వాళ్ల సార్‌ని

చూసి, ఇంటికి రమ్మని చెప్పినాక, యింకో పని చెయ్యమన్నానని చెప్పు, పో! బిన్నా చెప్పు!"

సుగుణమ్మ చెప్పుల్ని టపటపలాడించుకుంటూ వెళ్లిపోయింది.

"చెప్తుందో లేదో! మూగెద్దు మాదిరి తలాడించమంటే మాత్రం పనికొస్తాది. కొట్టినా, కోసినా కదిలే రకం కాదు. చెప్తుందో, చెప్పదో!"

"యెవరావిడ?" అని అడిగింది సుశీల.

"యేసుదాసును చూళ్లేదా నువ్వు! మా ఆయన ఆఫీసులో క్లర్కు. నిన్న సాయంత్రం మనకు సినిమా టికెట్లు తెచ్చిచ్చినాడు చూడూ, సన్నంగా, పొట్టిగా, నల్లగా – ముసిలి యెలుంగొడ్డు మాదిరుంటాడు. వాని పెండ్లాం. దీనితో పోలిస్తే యేసుదాసే మేలు. దీనికొళ్లంతా పొగరు. ఆ మొగుడికీ, దానికీ యేడెనిమిదేండ్లుగా మాటల్లేవు. వాడు వుప్పయితే, యిది నిప్పు!"

"వాళ్లు యేడేళ్లుగా మాటాడుకోవడం లేదా, యెందుకని?" సుశీల అడ్డు తగిలింది.

"యేం పాడో! యిద్దరి కిద్దరేలే! సమాచారం తెలుసుకుందామని చానాసార్లు కదిలించి చూసినాను. యేమడిగినా యిద్దరూ జవాబు చెప్పలేదు. జమ్మని రాజుల మాదిరి యిద్దరు మగబిడ్డలుండారు. దానికేమైనా కావాలంటే బిడ్డలతో చెప్తుందంట. అతనికేమైనా కావాలంటే వాళ్లతోనే చెప్తాడంట. వుండేదేమో వొకే కప్పు కింద. మాటలేమో లేవు. కడుపుమంట సంసారం. దానికి సిన్మాలు, అతనికి బీడీలూ, ఇస్పేట్టాకులూ – వాళ్లకేదో రకంగా రాజీ కుదిరించమంటే మా ఆయన వూళ్లో పెత్తనాలు నీకెందుకని యెగిరిపడినాడు!"

"యేళ్ల తరబడి మొగుడూ పెళ్లాలూ మాటాడుకోవడం లేదంటే యేదో పెద్ద గొడవే జరిగుంటది. యిరుగూ పొరుగూ వాళ్లకైనా తెలియదా యేం జరిగిందో?"

"ప్చ్! అయినా యీ టౌన్లలో పక్కింట్లో యేం జరగతా వుందో ఎవరు పట్టించుకుంటారు, వదినా? మా ఆయనకింద క్లర్కు కాబట్టి నాదాకా వచ్చింది ఆ మాట. యేందో జరిగే వుంటుంది. అదేమైనా తప్పుడు పని చేసిందేమో! మొగోళ్లని తినేసేటట్టు చూస్తాదెప్పుడూ! అయినా ఆ మొగ మనిషి పగులూ, రేయి అవస్థలు పడి సాకతానే వుండాడు."

మొదటి సినిమా వదిలిపెట్టినట్టున్నారు.

లోపలి గదిలో వుయ్యాల కింది నేలని పాపాయి తడిపేసింది, యేడవసాగింది.

డిష్‌లో డిస్ట్రబెన్స్ రావడంతో టీవీ రకరకాల విన్యాసాలు చేస్తోంది. విసుగ్గా దాని మీటనొక్కి పాపాయినెత్తుకుంది షర్మిల. వంటగదిలోకెళ్లి పాలు కలిపి సీసాలో పోసి పాపాయి నోట్లో పెట్టింది. పాపని బుజ్జగించుతూ మళ్లీ ముందుగదిలో కొచ్చింది.

"యింతకూ మీ సుగుణమ్మ వాళ్లాయనికి చెప్పిందో, లేదో? అతను వెతుకుతున్నాడో లేదో!" సుశీల స్వగతంలా గణిగింది.

"మందు పోసినాం గదా! పరవాలేదులే వదినా! తెల్లారితే డాక్టరు దగ్గరికి పోదాం" అంటూ మొదలుపెట్టింది షర్మిల. "మా జరీనాకు పోయిన నెలలో నూట రెండు డిగ్రీల జ్వరం వచ్చింది. ఆ పొద్దు కూడా యీ మాదిరే జరిగింది.

ఆయనేమో ఆడిటింగు పనుల్తో వూరంతా తిరగతా వున్నారు. రాత్రి ఎనిమిదయినా ఇంటికి రాలేదు. బిడ్డకు వొళ్ళు కాలిపోతా వుంది. వున్నట్టుండి అదొక మాదిరిగా పడిపోయింది. నా కేడుపొచ్చేసింది. బోరోమని యేడ్చేసినాను. కిందింటి యింటిగల్లామె పైకొచ్చి చూసి వాళ్లాయనని తోడు పంపించింది. ఆయన స్కూటర్లో వెనకే వస్తావుంటే నేను రిక్షాలో బయల్దేరి డాక్టరు దగ్గరికి పోయినాం. ఆ డాక్టరుకు కూడా కోపమొచ్చేసింది. అయిసు నీళ్లతో తుడవలేదెందుకని వురిమురిమి చూసినాడు. వెంటవెంటనే రెండు యింజెక్షన్లు పొడిచినాడు. యెప్పుడో రాత్రి పదిన్నరకు మా ఆయన ఆస్పత్రికొచ్చినారు. బిడ్డకు ఫిట్స్ వచ్చేదాకా వూరికే యెందుకున్నారని నా పైన మండిపడినారు. డిగ్రీ దాకా చదివిందెందుకని, డాక్టరు దగ్గరికెళ్లే పనైనా పెళ్లాం చెయ్యపోతే నేనెట్ల బతకాల–అనీ వొకటే అగిత్యం చేసినారు. అప్పుడే మందులు తెచ్చిపెట్టి, డబ్బాలపైన యేది జరం మందో, యేది దగ్గు మందో, కడుపు నొప్పొస్తే యేది పోయాలో వివరంగా రాసిపెట్టినారు. అంతేగానీ టయం ప్రకారం యింటికి రాకపోయినందుకు ఆయనకు బాధే లేదు. యీ మాదిరి ఎదురు చూసీచూసీ నాకు అలవాటైపోయింది. అయినా మా ఆయనేమైనా మీ ఆయన మాదిరిగా లెక్చరరా యెప్పుడూ యింట్లో కూర్చునేదానికి? ఆడిటరుకు యింట్లో కూర్చుంటే జరుగుతుందా?"

"యెదురుచూడ్డమనేది నాకు కూడా కొత్త కాదులే వదినా?" అంటూ తాను చెప్పసాగింది సుశీల– "పేరుకు లెక్చరరే గానీ వారు ఆ పని తప్ప మిగిలిన అన్ని పనులూ చేస్తూంటారు. వాళ్ల డిగ్రీ కాలేజీలో నెలలో సగం రోజులు స్ట్రయికులే గదా! వారి అసలు వుద్యోగం పబ్లిక్ రిలేషన్ ఆఫీసరు. ఆర్ట్స్ లవర్స్ అసోసియేషన్ సెక్రటరీ ఆయనే! యెన్సీసి ఆఫీసరూ ఆయనే! బంధువులైనా, స్నేహితులైనా యెవరు యే పనిపైన మా వూరొచ్చినా వారి దగ్గరకే వస్తుంటారందరూ. వాళ్లు రావటమే ఆలస్యం. యిక ఆ పని పూర్తయ్యేవరకూ వారికి నిద్రపట్టదు. తిండి రుచించదు. హోస్టలు కొచ్చినట్టుగా భోజనానికీ, నిద్రకూ మాత్రమే యింటికి రావడం. అసలొకసారి భోజనం కూడా బయటే! యెవరికేం పని వచ్చినా, 'శ్రీనాథ్‌గారున్నారాండీ?' అంటూ యింటికొచ్చేస్తారు. తర్వాత ఆయనని పట్టలేం.

"మా యిల్లు సంతేమిటా అంటే అదొక ఖార్ఖానా. పొద్దున అయిదింటికి నిద్ర లేస్తానా, అయినా సమయానికి కాలేజీ కెళ్లలేను నేను. యెనిమిదింటికంతా టిఫన్లయిపోవాలి. తొమ్మిదికంతా వంట పూర్తవ్వాలి. కారుణ్యని కాన్వెంటులో దించి వచ్చాక చిన్నదాన్ని చైల్డ్‌కేర్ సెంటర్లో వదిలిపెట్టి రావాలి. నన్ను మా కాలేజీలో దింపేసి మీ అన్నయ్యగారు తన కాలేజీకి వెళ్లాలి. వారి కాలేజీ వూరికో చివర్లో వుంటే, నా కాలేజీ యింకో చివర్లో వుంది. పెట్రోలు ఖర్చు చెప్పాల్సిన పనే లేదు. యిద్దరూ వుద్యోగాలు చేయటమంత బుద్ధి లేని పని యింకొకటి లేదంటే నమ్ము. అయినా ఇప్పుడు ఫర్వాలేదనుకో. ఉద్యోగంలో చేరిన కొత్తలోనయితే ప్రిపరేషన్‌కు సమయం దొరక్క చచ్చేదాన్ని. క్లాసులు అయిపోయినా వారొచ్చేదాకా కాలేజీలోనే అఘోరించాలి. వొకోసారి విసుగేసి రిక్షా ఎక్కి వెళ్లిపోతుంటాను. రిక్షాలకు పదులూ, ఇరవైలూ తగలేస్తున్నానని వారికి విసుగు. నన్ను గూడా

స్కూటరో, మోపెడో నేర్చుకొమ్మన్నారు. ప్రయత్నించాను కూడా. నేర్చుకుంటూ కిందపడ్డానోసారి. తర్వాత ముట్టుకోలేదు. అదీ వొకందుకు మేలే! యిలాగైతే ఇంటికీ, కాలేజీకి తిరిగేటప్పుడయినా కంటికి కనబడతారు. లేకపోతే అదీ వుండదు. అయితే వున్న బాధల్లా వొక్కటే – ఎదురు చూడ్డం! కాలేజీలో ఎదురుచూడ్డం, ఇంట్లో ఎదురుచూడ్డం.. బాగా అలవాటైపోయింది..”

వీధిలో స్కూటర్ శబ్దం వినిపించడంతో ఆమె మాట్లాడటం ఆపి మెట్లకేసి చూపులు సారించింది.

“అది పక్కింటాయన మోటారుబైకు...స్కూటరు సౌండు అట్లుండదు...” అంది షర్మిల.

లాలిత్య గౌను బొత్తాల్ని విప్పుతూ–“చెమటపోస్తోంది. బిడ్డకు జ్వరం వదులుతోందనుకుంటా...” అంది సుశీల.

“జ్వరానికీ, మన వాళ్లకూ పోటీ పెడితే జ్వరమే వోడిపోతుందిలే వదినా!” షర్మిల మెల్లగా నవ్వేసింది.

“బిడ్డకోవైపు జ్వరం వస్తోంటే వాళ్లెలా పార్టీలో కూర్చున్నారో చూశావా వదినా! యీరోజు వాళ్లని వూరికే వదిలిపెట్టగూడదు. జాడించి వదిలిపెట్టాలి....”

“నేనూ అట్లే అనుకుంటాను గానీ ఆయనొచ్చి ముందు నిల్చుంటే అయ్యో పాపమనిపిస్తాది నాకు.... ఆడిటర్లంటే పెద్దపెద్ద వాళ్లతో పనిగదా? నెలకయిదారు పార్టీలైనా వుంటాయి. ప్రతిసారీ యెప్పుడో అర్ధరాత్రికి యింటికొస్తారు. మందువాసన భరించలేనంత వుంటాది. యిట్లయితే వొళ్లేమయ్యేదని నేను యేడ్చి అగడం చేస్తే యీ మధ్య బాగా తగ్గించేసినారు. కానీ యీ మధ్యెవరో ఆయన ఫ్రెండు శబరిమల పోయొచ్చినాడంట. వాళ్లు వస్తావస్తా కారైక్కాల్ అని పాండిచ్చేరికి చేరిన వూరిమీదుగా వచ్చినారంట. ఆ వూర్లో మందు బాటల్సు తక్కువ ధరకు అమ్ముతారని తెలిసి తలా కొన్ని బాటల్సు కొనుక్కొని సీట్లకింద దాచిపెట్టుకుని వచ్చినారంట. యీయన గూడా రెండు బాటల్సు తెచ్చినారు. అవి మా యింటికొచ్చినప్పటినుంచే మా ఆయన మీ ఆయన యెప్పుడొస్తార్రా, పార్టీ యెప్పుడిద్దామా అని యెదురుచూస్తూనే వుండారు....”

“వారు కూడా చాలా రోజులుగా యిక్కడికి రావాలని అనుకుంటూనే వున్నారొదినా! చివరికి సమ్మర్ హాలిడేస్‌లో కుదిరింది. అన్నట్లు వారు గూడా డిసెంబర్లో శబరిమలై వెళ్లొచ్చారు. కారైక్కాల్ సంగతి వారికి తెలిసినట్లు లేదు. తెలిసుంటే ఆయనా కొన్ని బాటల్సు తీసుకొచ్చి జల్సా చేసే వుండేవారు.....”

“శబరిమల వెళ్లేటప్పుడు చాలా నిష్ఠగా వుండాలంట గద వదినా?”

“అవును. చాలా మహత్యమున్న దేవుడాయన. అంటూ సొంటూ తగల గూడదు. ఆడాళ్లు చేసిన వంట గూడా తినగూడదు. నలభైరోజులు దీక్షలో వున్నారాయన. ఆ నలభై రోజులూ బ్రాహ్మణ హోటలు భోజనమే చేశారు....”

“అక్కడికి ఆడవాళ్లు పోకూడదంట కదా?”

"అవునవును. ముట్లు వుడిగిపోయిన ముసిలాళ్ళూ, యెదగని ఆడపిల్లలూ వెళ్ళొచ్చు..."

"అన్న మాదిరే మా అయనకు కూడా భలే భక్తి వదినా! ప్రతి దినమూ తెల్లారి జామున్నే నమాజుకు పోతారు. నిజానికి దినాని కైదు పూటలూ నమాజు చెయ్యాలని అయన కాశ. కానీ వుద్యోగులకు సాధ్యంగాదు కదా?"

"నువ్వెప్పుడూ మసీదు కెళ్లవా?"

"ఆడోళ్లెక్కడైనా మసీదుకెళ్తారా? యింట్లోనే నమాజు చదువుకుంటాను. మా యిండ్లలో మొగోళ్లకు రాకపోయినా ఫర్వాలేదు గానీ, ఆడోళ్లకు మాత్రం వుర్దూ చదివేది రావాల్సిందే. నేనుకూడా చిన్నప్పుడు వుర్దూ నేర్చుకున్నాను...."

వూరంతా బాగా మాటు మనిగిపోయినట్టుంది. దూరంగా రైల్వేస్టేషను నుంచీ రైలు వేస్తున్న కూత స్పష్టంగా వినిపిస్తోంది. పాప నిద్రలోనే వులిక్కిపడుతోంది. షర్మిల వాళ్లోని పాపాయి నిద్రలోనే పాలసీసాని పక్కకు తోసేస్తోంది. సుశీల గోడ గడియారంకేసి చూసి, అది పనిచేయడం మానేసిందన్న విషయం గుర్తుతెచ్చుకుని "టయిమెంతయి వుంటుందో?" అంది.

పాపాయిని వుయ్యాలలో పడుకోబెట్టి వస్తూ షర్మిల చేతివాచీని వాకబు చేసి "పదకొండు కాబోతోంది..." అంది.

కాస్సేపు మౌనంగా వుండిపోయి, తర్వాత చివాల్న తలపైకెత్తి "నాకు చాలా రోజులుగా వో కోరికుంటాంది. వారి నెలాగైనా యింట్లో వుండమని, నా కోసం వెయిట్ చెయ్యించాలి. అప్పుడు తెలుస్తుంది అయనకి నా బాధ...." అంది సుశీల.

"నువ్వయితే కాలేజీకైనా పోవచ్చు. నేనెక్కడికి పోయేది? పుట్టింటికైనా మా అయన సరిగ్గా పంపించరు. .."

"మనం కూడా పార్టీ చేసుకుంటే సరి...." సుశీల కంఠం కసిగా ఉంది.

"చేసుకుందామా? యింట్లో యింకో బాటిలుంది." తమాషా చేస్తున్నట్టుగా అడిగింది షర్మిల.

"యేం బాటిల్?"

"పేరు వోడ్కా అంట....చాలా సాఫ్ట్ డ్రింక్ అన్నారాయన...."

"నువ్వు పుచ్చుకున్నావా యెప్పుడైనా?"

"అ వాసన చూస్తేనే వాంతొచ్చేసే నట్లవుతాది నాకు. అసలు మా పెండ్లయిన కొత్తలో అదే, హనీమూన్‌కని బెంగుళూరుకు పోయినప్పుడు కబ్బన్ పార్కు రెస్టారెంటుకు పోయినాం. తోటలోనే కుర్చీలు. జంటలు జంటలుగా కూర్చోని అందరూ తాగడమే కార్లల్లో వచ్చిన జనాలు. ఆడోళ్లు కూడా మగోళ్ల మాదిరిగా బీరు తాగేసి, చక్కా సిగరెట్లు కాలుస్తా వున్నారు. అయనేమో నాకూ వొక గ్లాసులో పోసి తాగమని బలవంతం చేసినారు. మందు మాదిరి వొక గుక్క మింగినానంతే! కళ్లల్లో నీళ్లు తిరిగి, వొళ్లంతా అదొక మాదిరయిపోయింది. తిట్టిన తిట్టు తిట్టకుండా ఆ గ్లాసు కూడా అయన తాగేసినారు. అసలు హనీమూనంతా అయన తిట్టేదానికే సరిపోయింది......"

"అక్కడికి నువ్వే మేలు. మాకు హనీమూనూ లేదు, గీనీమూనూ లేదు. పెళ్లయిన కొత్తలో మా యింట్లో రోజూ తగవులే!"

"యెందుకూ....?"

".... ...."

"యేం జరిగింది?"

"ఆ కథంతా యిప్పుడు తవ్వుకుంటే వొరిగేదేముందిలే?"

"అన్నకు పెళ్లికి ముందే....." షర్మిల కుతూహలాన్ని అపుకోలేకపోయింది.

"నీకూ తెలుసన్నమాట! ఆయన ఫ్రెండ్సు కందరికీ తెలిసిన భాగోతమేనట! నీకూ అన్నయ్య చెప్పేవుంటారు. కానీ మా వాళ్లకే పెళ్లయ్యేదాకా ఆ సంగతి తెలియనే తెలియదు. జాగ్రత్తగా మమ్మల్ని గోతిలోకి దింపేశారు వాళ్లు....."

"ఆ అమ్మాయిప్పుడేదుంది?"

"యేమో! యీవైపునెక్కడా కాలేజీలో సీటు దొరకనట్టు మెడ్రాసు కెళ్లారు కదా వారు. యెమ్మే చదువుతూన్నప్పుడు పరిచయంట. ఆ పిల్ల తల్లిదండ్రులకూ్కడా తెలుసునట. అసలు వాళ్లే యెక్కడో గుడిలో దండలు మార్పించి పెళ్లయినట్టనిపించార్ట. వారు చదువుతూనే కొన్నాళ్లు యిల్లు తీసుకుని సంసారం చేశార్ట. యీ సంగతి తరవాతెప్పుడో మా అత్త మామలకి తెలిసి గగ్గోలు పెట్టారట. ఆ అమ్మాయికేదో డబ్బులు ముట్టజెప్పి వదిలించేసుకున్నారట. అయినా యేం వదిలించుకోటంలే? యిప్పటికీ నెలనెలా ఆయన జీతంలోంచి వెయ్యి రూపాయలు బ్యాంకునుంచీ అలాగే దానికెళ్లిపోతాయి..."

"నువ్వెప్పుడూ దాన్ని చూడలేదా?"

"చూస్తే చంపేసెయ్యనూ మరి....."

"అన్న అక్కడికెప్పుడైనా పోతారా?"

"వెళ్లారని తెలిస్తే వూరుకుంటానా? పెళ్లయిన ఆరు నెలలకుగానీ ఆ సంగతి తెలియలేదు. తెల్సిన మరుక్షణం మా యింటికెళ్లిపోయాన్నేను. అప్పుడే కారుణ్య కడుపులో వుంది. మా నాన్నగారయితే యిక అత్తవారింటికి పంపనే పంపనన్నారు. వారొచ్చి పంపమని అడగలేదు. నాన్నగారు నానా కష్టాలు పడి కాలేజీలో వుద్యోగం తెప్పించారు. వుద్యోగం వచ్చిన రెండు నెలలకంతా మా మామగారు రాయబారం పంపించారు. వారుకూడా ప్రాధేయపడుతూ వుత్తరాలు రాయసాగారు. ఆ పిల్ల ముఖం చూడనని ప్రమాణాలు చేశారు. యేం చేద్దాం? చివరకు వాళ్ల వూరికే బదిలీ చేయించుకున్నాను. దాదాపు రెండేళ్ల తరువాత మళ్లీ కాపురం మొదలెట్టాం. అయితే నేను గట్టిగా పట్టుబట్టి వేరే కాపురం పెట్టించాను...."

"అయితే మీ అత్తా, మామా కూడా మీ వూర్లోనే వేరుగా వుండారా?"

"అవును."

"అన్న వొప్పుకున్నారా దానికి?"

"అసలు వేరే కాపురం పెట్టాలని పెళ్లయిన కొత్తలోనే వారనుకున్నారు. ఆ యింట్లో వొకరిని చూస్తే యింకొకరికి కాదు. అందరూ డబ్బు మనుషులు. వాళ్ల

మాట్లాడుకొంటూాంటే వ్యాపారస్తులు మాట్లాడుకొంటున్నట్టే వుంటుంది....."

"అదే మేలులే వదినా, లోపలొకటి బయటికొకటిగా బతికేదానికంటే! మా మామ లేరులే. అత్త ఉండాది. బావలూ, మరుదులూ, ఆడబిడ్డలూ పెద్ద కుటుంబం. వొకరిని చూస్తే యింకొకరికి ప్రేమ కారిపోతాది. యెవరికి వాళ్లు వాళ్ళ సంసారానికని అన్నీ దాచిపెట్టుకుంటారు. యీ వూర్లో ప్రాక్టీసు పెట్టినారు కాబట్టే సరిపోయింది గానీ, లేకపోతే ఆయన వేరే కాపురం పెట్టే వుండరు. వాళ్లేమో నన్నా పాయిలొ పెట్టి యీ పాయిలో తీసుంటారు. యీయనకేమో వాళ్ల మాటే యిష్టం. అంతెందుకు? మీ అన్న నన్ను చూడనైనా చూడకుండా పెళ్లి చేసుకున్నారు తెలుసునా?"

"నిజంగా?"

"అవును. వాళ్లమ్మ, అక్కచెల్లెళ్లు, వదినలు ఎవర్ని చేసుకొమ్మంటే వాళ్లనే చేసుకుంటానని చెప్పేసినారంట. వాళ్లందరూ వచ్చి చూసి ఫిక్స్ చేసుకున్నారు. అసలు పెండ్లికి ముందు ఫోటో అయినా పంపించమని చెప్పమని మా ఫ్రెండ్సు గొడవ చేసినారు. ఫోటో లేదు, యేమీ లేదు. పెళ్లయినాకే నేనాయన ముఖం చూసింది!"

"ముస్లింలలో అది సంప్రదాయమేనటకదా!"

"అది వొకప్పటి సంగతి. యిప్పుడందరూ పెండ్లి చూపులు చూస్తా వుండారు. యీయనొక్కరు నా ప్రాణానికీమాదిరి దొరికినాడు. మా పెండ్లయినప్పుడు నాకు ఇరవైఅయిదు, ఆయనకు ముప్పయ్యి వయస్సు. పెండ్లి కోసరం నాలుగైదేండ్లు యెదురుచూసినా ననుకో. యెట్లాంటి మొగుడో తెలుసుకోవాలంటే ఆరు నెలలు యెదురుచూడాల్సి వచ్చింది. పెళ్లయినాక యీ మాదిరిగా రోజూ యెదురుచూస్తానే వుండాను. యీ వుద్యోగంలో నన్ను మించి నోళ్లెవురూ వుండరు." షర్మిల నవ్వుతోంటే విసుక్కుంటోందో, ఆనందిస్తోందో అర్థం కావడం లేదు.

"ఆ పనిలో నాది డిస్టింక్షను" అంటూ సుశీల తన వాదన మొదలుపెట్టింది: "కాలేజీలో వెయిట్ చేసీ చేసీ విసుగొచ్చి చచ్చిపోదామన్నంత కోపం వస్తోంటుంది నాకు. వొకోసారి బీపీ వచ్చేస్తుందేమో నన్నంత టెన్షను. మా ప్రిన్సిపాల్ రాక్షసి. పది నుంచి నాలుగుదాకా కట్టు కదలనివ్వదు! యీయనగారేమో ప్రొద్దున యెంతకూ కదలరు. సాయంత్రాల్లో సమయానికి రారు. వాళ్ల ప్రిన్సిపాల్ ధర్మాత్ముడు. యెగ్జామ్స్ డ్యూటీలప్పుడు నా గతి భగవంతుడికే తెలుస్తుంది. పిల్లలొకవైపు యేడుస్తుంటారు. అవతల ప్రిన్సిపాల్ రుసరుసలాడుతోంటుంది. వారికి నిమ్మకు నీరెత్తదు. యిప్పుడు మేలే! పెళ్లయిన కొత్తలో నాకుద్యోగం లేదు గదా? యీయన యెంతకూ యింటికొచ్చేవారు గాదు. వెయిట్ చేసి చేసీ కళ్లు కాయలు కాసేవి. తర్వాతేమో మా పుట్టింట్లో రెండేళ్ళున్నాను. నిజానికది యింకా పెద్ద వైటింగ్. మధ్యలో చాలా గొడవలు జరిగాయి. రాయబారాలూ, సంప్రదింపులూ జరిగాయి. కానీ వారు మాత్రం నా కంట పడలేదు. ఆ రెండేళ్లూ ఆయన కోసం ఎదురుచూసినట్టే లెక్క. వొకోసారి బీపీ వచ్చేసిందనే అనుకునేదాన్ని. నా యెదురుచూడ్డం ముందు నీదేముందిలే?"

మంచంపైన పడుకున్న కారుణ్య యిటూ అటూ దొర్లి, పైకి లేచి కూర్చొని యేడవసాగింది. "సరిగ్గా పడుకోవే అంటే వినవు గదా? ఆకలిగా వుందా చెప్పు?" అంటూ విసుక్కొంది సుశీల.

షర్మిల పాలు కాచి కారుణ్య చేత తాగించింది. సుశీల లాలిత్య నెత్తుకుని మంచంపైన కారుణ్య పక్కనే కూర్చుంది. కారుణ్య మళ్లీ నిద్రపోవడానికి ప్రయత్నించింది.

వంటింటిలోంచీ యెలుకలు పాత్రలు దొర్లిస్తున్న చప్పుడు వినిపిస్తోంది. ఫాను సైతం విసుగ్గా డబ డబలాడుతోంది. స్కూటరొకటి యింటిముందు ఆగిన శబ్దం వినిపించింది. సుశీల దృష్టి మెట్లవైపుకు మరల్చింది.

"యింటిగల్లాయన స్కూటరు" అంది షర్మిల.

లాలిత్య వొళ్లు మళ్లీ మినమిన మంటోంది. "డాక్టరు దగ్గరికెళ్లి వో ఇంజెక్షను వెయ్యించి వుంటే బావుండేది." సుశీల గొణుక్కుంది.

షర్మిల పైకిలేచి "వొకసారి కిందింటి కెళ్లి యింటిగల్లామెను చూసి వస్తాను. వాళ్లాయనకు మనవాళ్లేమైనా కనిపించినారేమో అడగతాను" అంటూ వరండాలోకొచ్చి మెట్లుదిగి కిందికి వెళ్లిపోయింది.

సుశీల వంటింటిలోకెళ్లి రెండు గ్లాసుల నీళ్లతో కడుపు నింపుకుని మళ్లీ పిల్లల దగ్గరికొచ్చి వాళ్ల పక్కనే నడుం వాల్చింది. లాలిత్యకు టెంపరేచరుందేమోనని చూసి, కారుణ్యపైకి శాలువ లాగింది. కాస్సేపు ఆగిపోయిన గోడ గడియారం కేసి కోపంగా చూసింది. గడియారం పక్కన రెక్కల పురుగుతో దాగుడుమూత లాడుతున్న బల్లిపైన దృష్టిని కేంద్రీకరించడానికి ప్రయత్నించింది.

అయిదు నిముషాలు గడిచినా షర్మిల పైకి రాలేదు.

మరో అయిదు నిముషాల తర్వాత ఇంటిముందు స్కూటరు శబ్దం వినిపించింది.

సుశీల పైకిలేచి వరండాలో కొచ్చింది.

మెట్లెక్కుతూ "యింటిగల్లాయనను వొకసారి అక్కడికెళ్లి చూసి రమ్మని అడుక్కున్నాను" అంది షర్మిల.

"యెక్కడికి?"

"అక్కడేదో యాక్సిడెంటు జరిగిందంట...."

షర్మిల గొంతు బొంగురుపోతోంది. కళ్లల్లోంచి నీళ్లు దుముకుతున్నాయి.

"యాక్సిడెంటా?...యెక్కడ?..."సుశీల నిలువునా వొణికిపోతూ గోడపైకి వొరిగి పోయింది. షర్మిల గాలిలో గడ్డిపోచలా వూగిపోతోంది.

"గాంధీరోడ్డు క్రాసులో.....స్కూటర్ని లారీ గుద్దేసిందంట! ట్రాఫిక్ జామ్మాయి, లేటుగా యింటికొచ్చినానని యింటిగల్లాయన అన్నారు. నాకేమో భయంగా వుంది. తెల్లరంగు స్కూటరని ఎవరో అంటావుంటే యింటిగల్లాయన విన్నాడంట...సంగతి తెలిసి యింటిగల్లామె మొగుడ్ని చూసి రమ్మని తరిమింది....."

"వూర్లో తెల్ల స్కూటర్లెంతమందికి లేవు..." సుశీల మాటలు తనను తాను వోదార్చుకుంటున్నట్టుగా వినిపిస్తున్నాయి.

"యేమో! నాకు భయంగా ఉంది...ఆయన స్పీడుగా డ్రైవ్ చేస్తారు. రాత్రుల్లో ట్రాఫిక్ వుండదని యింకా స్పీడు పెంచేస్తారు. పైగా పార్టీ...." ఆమె గొంతు వణుకుతూనే వుంది.

"మనవాళ్లయి వుండరులే వదినా! లోపలికిరా...వెంట మా ఆయనున్నారు కదా! ఆయన జాగ్రత్తగా వుంటారెప్పుడూ...." సుశీల బలవంతంగా యేడుపు నాపుకుంటోంది.

షర్మిల కుర్చీలో కూర్చుని కాళ్లు పైకెత్తి గుండెలకదుముకుంది.

సుశీల పిల్లలపక్కన కూర్చుని చీరకొంగుతో కళ్లు తుడుచుకోసాగింది.

గోడపైన బల్లి బిగ్గరగా అరుస్తోంది. సైలెన్సరులేని వాహన మొహటి కారుబారు చేస్తూ పరుగెడుతోంది.

"కోపమొస్తే మా ఆయన స్పీడుగా డ్రైవ్ చేస్తారు..." గ్రుక్కెళ్లు మింగుతూ అంది షర్మిల.

"యిప్పుడేమీ కోపం లేదుగదా!" సుశీల సముదాయించింది.

"యీరోజు తెల్లారి ఆయనకు కోపమొచ్చింది వదినా! నిన్న ఆయన కొక జాబు వచ్చింది. అడ్రసు చూస్తే ఆడవాళ్ళ అక్షరాల మాదిరిగా అనిపించింది. ఆ మాటంటే ఆయన కెక్కడలేని కోపం వచ్చింది. అప్పటినుంచీ నాతో సరిగ్గా మాట్లాడనే లేదు...."

"వుత్తరం పైని రాతని చూసి అనుమానించచ్చా...."

"జాబులు మాత్రమే గాదు. నేనెప్పుడైనా మా వూరికి పోయినప్పుడు ఎవరెవరో ఆడోళ్లు యింటికొచ్చి పోతారని యింటిగల్లామె చెప్పింది. ఆయన్నడిగితే ఆఫీసులో పనిచేసే క్లర్కులని చెప్పారు....."

"వుత్తరం చింపి చదవలేకపోయావా?"

"చదవాలంటే నాకు భయం. తెరిచి చూస్తే అది ఆడపిల్ల రాసిందే అయితే యేం చేసేది? తెలియకుండా వుంటేనే మేలు..... అసలా సంగతి ఆయన్నడగాలంటేనే భయం నాకు. యీ పొద్దెందుకో బుద్ధిలేక అడిగేసినాను. ఆయనకు కోపం వచ్చేసింది. ఛీ.....నాకు.....అయ్యో....పాపం....ఆయన...."

"కోపం తెచ్చుకునేవాళ్లే మేలులే వదినా! మా వారిలాగా మనసులోనే దాచుకునే వాళ్లతో యెప్పటికైనా మోసమే!....మరి....యింతకూ ఆ ఆక్సిడెంటు.... నిజంగా..... వీళ్లు....." సుశీల ముక్కు చీదుకుంది. "వారికి ఫ్రెండ్సుతో కలిస్తే యిక వొళ్లు తెలియదు. గంటల తరబడీ తిరుగుతుంటారు.... యేమైనా అంటే రెండు లక్షలకు యెల్లయిసీ చేసినాన్లేవే అని వేళాకోళం. అప్పటికీ నే నేదో...." యేడుపు ముంచుకురావడంతో ఆమె మాట్లాడలేకపోయింది.

షర్మిల కన్నీళ్లు రాల్చుతున్న కనురెప్పల్ని బలవంతంగా మూసుకుని వణుకుతున్న పెదవులతో ప్రార్థన మొదలుపెట్టింది.

సుశీల పిల్లల ముంగురుల్ని సవరించుతూ వెక్కెళ్లు అపుకునే ప్రయత్నం చేయసాగింది.

కాస్సేపటి తర్వాత చేతులు ముద్దుపెట్టుకుని ప్రార్థన పూర్తిగావించి కళ్లు తెరిచింది షర్మిల.

ఆమెవైపునకు చూసే ధైర్యం చాలక దృష్టి మరల్చుకొంది సుశీల.

గది గుమ్మం దగ్గరి బూట్లూ, అలమారలోని పుస్తకాలూ, లోపలి గదిలో కొక్కానికి వేలాడుతున్న పాంటూ, వంటగదిలోంచీ కనిపిస్తోన్న హాట్ బాక్సూ - అన్నీ తన వేదనని రెట్టింపు చేస్తున్నట్టుగా అనిపించసాగింది షర్మిలకు. వీధిలో యే చప్పుడు వినిపించినా ఆమె ఫులిక్కిపడసాగింది. దూరంనుంచీ వినిపిస్తున్న స్కూటర్ సవ్వడి దగ్గిరికి వచ్చేస్తే యెలాగన్న భీతి చెలరేగసాగింది. తమ గోడ గడియారంలా ప్రపంచం కూడా పనిచేయడం మానేసి, యెక్కడిదక్కడ ఆగిపోతే బావుండుననిపించింది.

ఆమె గుండెల సవ్వడిని వేళాకోళం చేస్తున్నట్టుగా దూరంనుంచీ రకరకాల శబ్దాల్ని మొదలెట్టిన స్కూటరొకటి యెకాయెకిన తన శరీరంపైకొచ్చి నిల్చున్నట్టు ఆమె కనిపించేలా వాళ్లింటిముందుకొచ్చి ఆగింది.

యిద్దరూ వొక్క వుదుటున వరండాలోకొచ్చి నిల్చున్నారు. వొకరి గుండెల సవ్వడి యింకొకరికి వినిపిస్తున్నట్లుగా వుంది యిద్దరికీ....యిద్దరి శరీరాలూ చెమటతో తడిసిపోయాయి.

"అమ్మా షర్మిలా! ఆక్సిడెంటయిన స్కూటరు అక్కడే పడివుందట. మనుష్యుల్ని మాత్రం హాస్పిటల్‌కు తీసుకెళ్లారట....మా అయనకు మీ స్కూటరు బాగా తెలుసు కదా! అది మన స్కూటరు కాదటలే. నువ్వు భయపడాల్సిన పని లేదు...." అంటూ కిందినుంచే యింటిగల్లావిడ బిగ్గరగా అరిచి చెప్పింది.

సుశీల షర్మిల భుజంపైన చేయి వేసింది. ఇద్దరూ వొకరినొకరు అసరాగా చేసుకొని అలాగే నిల్చున్నారు. కాస్సేపు గడిచాక నెమ్మదిగా కదిలి ఇద్దరూ ఇంటిలోకొచ్చారు. ఇద్దరూ నేలపైన కూర్చుని గోడకు చేరగిలబడ్డారు. వుచ్ఛ్వాస నిశ్వాసాలు యెగసెగసి పడుతుండగా యిద్దరూ వొకరినొకరు చూసుకున్నారు. యెందుకో అమాంతంగా యిద్దరికీ సిగ్గు ముంచుకొచ్చింది.

సుశీల పెదవుల్ని సాగదీసి "మీ గుమస్తా అసలు వెతకడం కోసం వెళ్లాడో లేదో! యింతకూ అతడి పెళ్లాం అతడికా వర్తమానం చేరవేసిందో లేదో....." అంది.

"యేమో!.....అయినా మనకంటే సుగుణమ్మే మేలు. మాటాడకుంటే పోయింది, మొగుడనే మనిషి కండ్లముందర పడుంటే చాలును." షర్మిల కంఠంలో విసుగు, బాధ, కోపం వొకసారిగా ధ్వనించాయి.

కాస్సేపు ఆలోచించాక, "అదీ వొక రకమైన యెదురుచూడ్డమే గదా! మొగుడితో సామరస్యం కోసం, సుఖమైన సంసార జీవితం కోసం, వొకే కప్పు కింది వుంటూ, యేళ్ల తరబడి యెదురుచూడ్డం..... అంతే.....తేడాల్లా అంతే!....."

వీధిలో గూర్ఖా బెత్తంతో నేలను మోదుతూ, నాలుగడుగుల కోసారి విజిల్ వేస్తూ వెళ్తున్నాడు. ఆటో ఒకటి గుడుగుడుమని చప్పుడు చేస్తూ యెటో వెళ్తోంది.

బాగా దూరంనుంచీ, చీకటి బాజాపైన చిన్న చిన్న గులకరాళ్లు విసురు తున్నట్టుగా మెల్లగా శబ్దం....

"ఆయన స్కూటరు కూడా ఆ మాదిరి శబ్దం-చేస్తుందప్పుడప్పుడు....." అంటూ వరండాలోకి నడచింది షర్మిల.

"అది మనవాళ్ల స్కూటరు కాకపోయినా పర్వాలేదులే వదినా! కావాలంటే పాపకు యింకోసారి ఆ మందే పోస్తాను. తెల్లవారిపోయినా ఫర్వాలేదు. వాళ్లు క్షేమంగా యిల్లుచేరితే అంతేచాలు...." అంది సుశీల.

షర్మిల పిట్టగోడ పైన్నుంచీ ముందుకు వంగి "యెప్పుడో యిట్ల వొంగుతూ, కాలుజారి కిందపడి చస్తానేమో నేను...." అని మరోసారి అనుకొంది. సుశీల చూపులు వరండా మెట్లవైపుకూ, షర్మిల చూపులు వీధి మలుపుదగ్గరికీ కదిలాయి.

● *ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక: 3–9 నవంబర్ '93* ●

★ ★ ★

తుమ్మేటి రఘోత్తమరెడ్డి

73

# జాడ

"వాన్ని ఇక ఈ జన్మకు చూడగలుగుతానో లేదో?" అది ఆవేదనో, ఆందోళనో తెలియకుండా తనలో తాను గొణుక్కుంటూ సుజాత రైలు దిగింది. తుఫాను గాలిలో మొదలంటా కదిలిపోయే చెట్టులా వొణుకుతూ ఈ మాట ఆ రోజు ఉదయం నుండి లెక్కలేనన్ని సార్లు అనుకుంది. ఒక్కొక్క చినుకే కురిసి కురిసి పాయలు పాయలుగా బయలుదేరి నీరు సముద్రం చేరినట్లుగా సుజాత ఆలోచనలు సాగి సాగి 'వాడి' దగ్గరే ఉంగలు చుట్టుకపోతున్నాయి. వాడు అంటే సుజాత తోబుట్టువు.

ఆ చిన్న రైల్వే స్టేషన్లో కలో, భ్రాంతో తెలియనంత సందిగ్ధంలో సుజాత రైలు దిగే సమయానికి సాయంత్రం వెలుగు చీకట్ల సందిగ్ధంలో నుండి క్రమంగా చీకటి ముసురుకుంటోంది. సుజాతలాగే దిగిన ప్రయాణీకులు చాలా తక్కువ మంది. ఎక్కింది కూడా చాలా తక్కువ మందే. ఎత్తు తక్కువగా ఉన్న ప్లాట్‌ఫాం మీదికి దిగుతుంటే సుజాత కాళ్లు వణికాయి. తూలి పడబోగలదేమోననుకొని కాబోలు వెనకనుండి "పదిలం – పదిలమక్కా" అంటూ ఎవరో దించారు.

సుజాతలాగే ఆకాశం ఉరుములతో, మెరుపులతో తల్లడమల్లడంగా ఉంది. చినుకు రాలదు... ఘర్షణ ఆగదు. ఉధృతంగా వీస్తున్న గాలికి స్టేషన్‌లోని పాతకాలపు రాలచెట్లు మొదలంటా ఊగిపోతున్నాయి. గాలి రేపిన దుమ్ముకు స్టేషన్ మావురు గప్పినట్టుగా ఉన్నది. స్టేషన్ మాస్టర్ గదిలో ఎవరో అటేటు తిరుగుతున్నారు. స్టేషన్ మాస్టర్ గది పక్కనే గల వెయిటింగు రూంలో స్టేషన్‌ను తీవ్రవాదుల నుండి రక్షించడం కోసం నియమించబడిన పోలీసులు ఆక్రమించుకున్నారు. పోలీసుల్లో ఒకడు ఇసుక బస్తాల మాటున నిలబడి తుపాకీతో సెంట్రీ చేస్తున్నాడు.

సుజాతకు ఆ గాలి, అక్కడి వాతావరణ ధ్యాస ఉన్నట్టే లేదు. నెత్తిమీదికంటా కొంగు లాక్కొని ప్లాటుఫాం దాటుకొని స్టేషన్ వెనుకకు వచ్చింది. గాలిలో ప్రయాణీకుల సందడేం విన్పించడం లేదు.

స్టేషన్ వెనుక అడ్డదిడ్డంగా పెరిగిన ముసలి తుమ్మ చెట్లు – నిశ్శబ్దంగా ఉన్న నాలుగైదు రైల్వే క్వార్టర్లు – సరిగ్గా స్టేషన్ వెనుక నుండే ముసలి తుమ్మలను చీల్చుకొని మట్టి రోడ్డు తూర్పు దిశకు సాగుతోంది. స్టేషన్‌కు కొద్ది దూరంలో

ఒక ముసలి తుమ్మ కింద హోటల్ గుడిసెలో గుడ్డి లాంతరు గాలికి రెప రెపలాడుతోంది. ఒకరిద్దరు ప్రయాణీకులు నడవవల్సిన దూరానికి మజిలీగా హోటల్ ముందు నిల్చున్నారు. ఎప్పుడో యాభయ్యేళ్ల క్రితం కులాంతర వివాహం చేసుకొని ఊరు విడిచి వచ్చి స్థిరపడి ఇరువై ఏండ్ల క్రితం భర్త మరణించగా ఒంటరిగా ఆ స్టేషన్నే నమ్ముకొని బతుకుతున్న రాధమ్మ రైలు దిగిన ప్రయాణీకుల గిరాకీ కోసం ఎదురు చూస్తోంది.

సుజాత ఇవేవి పట్టించుకోకుండా మట్టి రోడ్డు మీద నడుస్తోంది. ఆమె మెదడు నిండా తమ్ముడే నిండిపోయాడు. ఆమె తనువెల్లా తమ్ముడే తచ్చాడుతున్నాడు. ఆమె కడుపులో దుఃఖం సుళ్లు తిరుగుతోంది. ఆ దుఃఖానికి ఎంత వెతికినా అది అంతం కన్పించడం లేదు.

బొయ్యిమని గాలి రేగుతోంది. పైన ఆకాశం ఉండీ ఉండీ ఉరుముతోంది. మెరిసిన మెరుపులో బిజిగిరి గ్రామం, దాని పక్కలా సకల దుఃఖాలను దాచుకున్న పంట భూములు నిశ్శబ్దంగా పడి ఉన్నాయి. సుజాత తలెత్తి చీకటి నిండిన ఆకాశంలోకి చూసింది. కుడివైపున గుట్టమీది మైక్రోవేవ్ స్టేషన్లో పచ్చలైటు రాత్రి పూట పులికన్నులాగా పచ్చగా మెరుస్తోంది.

"ఇప్పుడు వాడెక్కడున్నాడో?" రెపరెపలాడే గాలిలో ముందుకు నడుస్తూ అనుకున్నది. నిర్మానుష్యమైన మట్టిరోడ్డు మీద శబ్దం చేస్తూ ఒక పెద్ద బండి రావడం కన్పించింది. "ఎవరవ్వా! సీకటి బడ్డది. ఎంటెవలు లేకుంటనే పోతన్నవ్ – రైలచ్చిందా?" ఒక గొంతు సుజాతను పరామర్శించింది.

సుజాత మరేదో లోకంలో ఉన్నట్టు ఆగకుండా ముందుకు సాగింది.

బండి చప్పుడు, గొణుగుడు గాలి శబ్దంలో కలిసిపోయాయి.

"ఎన్ని హింసలు పెడుతున్నరో వాన్ని." సుజాత పెదవులు వణుకుతున్నాయి. వద్దు వద్దనుకుంటూనే ఇలాంటి ఆలోచనలు.

"ఈ రాత్రి ఎక్కడని తిరిగేది? వాని జాడ ఎట్లా తెలుసుకునేది?" సుజాత ఒక నిముషం నిలబడిపోయింది. అనేక ప్రశ్నలు వచ్చాయి కాని ఇంతదాక ఈ ప్రశ్న రాలేదు సుజాతకు. ఒక మహోధృతమైన ఆవేశంలో ఇంటినుంచి బయలుదేరి స్టేషన్లో దిగేదాక ఇలాంటి ప్రశ్నే వేసుకోలేదు సుజాత. ఎందుచేతనో సుజాత మనసు ఆ ప్రశ్న మీద నిలవలేదు. తనకు తెలియకుండానే తిరిగి నడవసాగింది.

ఉధృతంగా వీస్తున్న గాలి ఆమెను రోడ్డు మీద ఒక పక్కకు ఈడుస్తోంది. ఆమె కట్టుకున్న లేతాకు పచ్చరంగు కాటన్ చీర గాలికి రెపరెప కొట్టుకుంటోంది. పద్దెనిమిదేండ్ల వైవాహిక జీవితంలో వేళకు తిండి తినక, నిద్రపోకా తప్పని ఇంటిచాకిరిలో ఆమె దేహం చీకిపోయింది. చౌటనేల లాంటి కుటుంబ జీవితంలో సన్నబడి తెల్లగా పాలిపోయింది. ఇతమిత్థంగా సుజాతకు తెలియని ఒక బలీయమైన విశ్వాసమేదో ఆమెను బతికిస్తోంది కాని సుజాత శారీరక స్థితిని బట్టి ఆమె బతుకాల్సింది కాదు. ఇప్పుడు కూడా ఈ చీకటి నిండిన వర్షాకాలపు రాత్రి కూడా సమస్త

సాంసారిక బంధనాల కట్టుదిట్టాలను త్రెంచుకొని పరుగెత్తుకొని వచ్చేలా చేసింది ఆ విశ్వాసమే.

భర్త ఉద్యోగరీత్యా సుజాత బొగ్గు గనుల 'కాలరీ'లో ఉంటోంది. నిన్నటి రోజు ఉదయాన్నే పత్రికల్లో ఆమె తమ్ముని అరెస్టు వార్త అచ్చయ్యింది. ఆ వార్తను సుజాత ఆలస్యంగా చూసింది. సుజాత భర్త మధుసూదన్ బలవంతంగా దినపత్రికను బందు చేయించాడు. పిల్లల చదువు పాడవుతున్నదని అతను చెప్పిన కారణం అయితే అతని మనసులో ఉన్న కారణం తనకు తెలుసు. నక్సలైట్లను జైల్ల నుండి వదిలి వేసిన కాలం. అప్పుడు సుజాత తమ్ముడు కూడా అనేక మందితో పాటు వరంగల్ జైలు నుండి విడుదలయ్యాడు. ఆ విడుదల వార్త పత్రికల్లో రెండురోజుల ముందే వచ్చినా సూజాత చూడలేకపోయింది. అకారణంగానే జైలుదాకా వెళ్ళి సుజాత తమ్ముని చూడలేకపోయింది. అక్కడి నుండే అతనెవరితోనో తన మంచి చెడ్డలు విచారించి అటునుండటే అజ్ఞాత వాసంలోకి పోయాడు.

అప్పటి నుండి సుజాత భర్తను ధిక్కరించి పత్రిక ఇంటికి తెప్పిస్తున్నది. భర్త ఊహించిన దానికి సరిగ్గా వ్యతిరేకంగా సుజాత పత్రిక ద్వారా లోకంతో సంబంధం కలుపుకోవడానికి ప్రయత్నం చేసింది. తను పుట్టిన ఊరైన బిజిగిరి పరిసర ప్రాంతాల్లో జరుగుతున్న ఘటనల తాలూకు వార్తల కోసం – ఆ వార్తల్లో తన తమ్ముని ఉనికి కోసం ఆమె రోజు ఎంతో ఆసక్తితో వార్తాపత్రిక కోసం ఎదురుచూసేది. ఇది చెప్పకపోయినా తన భర్తకు తెలుస్తూనే ఉన్నది. నెల రోజుల క్రితం జరిగిన తీవ్ర వాగ్యుద్ధం తర్వాత ఆ యింటికి పేపరు వేయడం ఆగిపోయింది. ఎప్పటిలాగే తీవ్రమైన నిరసనతో సుజాత మిన్నకుండిపోయింది. సుజాత అంతరంగం వార్తల కోసం వెతుకుతూనే ఉండేది.....పక్క యింటి నుండి పేపరు తెప్పించుకొని చదివేది.

ఆ రోజు భర్త డ్యూటీకి, పిల్లలు స్కూలుకు వెళ్లిన తరువాత పక్కింటి పేపరు చూస్తే పిడుగులాంటి వార్త. "తన తమ్ముణ్ని పోలీసులు అరెస్టు చేశారని" వాడి సంబంధీకులెవరో ప్రకటన చేశారు.... "అలాంటిది మేమెరుగం" అని పోలీసులు ప్రకటించారు.

సుజాతకు మెదడు మొద్దుబారిపోయింది. సకల చేష్టలుడిగిపోయి ఆ ఉదయం మధ్యాహ్నం చెప్పుకోవడానికి మనిషి లేక తల్లడిల్లిపోయింది. తన సమస్త కలల ప్రపంచం కరిగి పోయినట్లుగా మంచంలో పడి వెక్కి వెక్కి ఏడ్చింది. తమ్ముడు తన ప్రతిచర్యను గమనిస్తున్నట్లే – ఆ చర్య మంచి చెడ్డల విచక్షణ చేస్తున్నట్లే తను ఊహించుకొని ఇంతకాలం బతుకుతూ ఉన్నది. జీవితంలో తనకున్న తల్లిపేగు సంబంధాన్నెవరో ఒక్కసారిగా త్రెంచివేసినట్టుగా కుప్పకూలిపోయింది.

ఆమె మరిచిపోయిన ఆమె జీవితమంతా క్రమంగా స్ఫురణకు తెచ్చుకున్నది. అంతకంతకూ జీవితేచ్ఛకు దూరమైపోతున్న సారహీనమైన సంసార జీవితం కండ్ల ముందు కదలాడింది.

పెండ్లి అయి వచ్చిన కొత్తలో తను తెలుసుకోలేక పోయింది గాని అతను – తన భర్త మధుసూదన్ మొదటి నుండి డబ్బు మనిషే – పెండ్లి పల్లకి బోయిల ఓంకార నాదంతో – అర్ధరాత్రి విషాదకరమైన వీడ్కోలుతో తాను పుట్టి పెరిగిన

బిజిగిరి నుండి భర్తతో పాటు కాలరీ మీదికి కాపురానికి రావడం – సంవత్సరం గడిచేలోగా మొదటి కూతురు, తరువాత మరో కూతురు – భర్తకున్న కొడుకు కాంక్షతో మరో సంతానం. ఆమె కూడా కూతురే కావడం – తుదకెట్లాగో ఘర్షణ పడి ఆపరేషన్ చేయించుకోవడం – సంసారమన్నాక సవాలక్ష గొడువలనుకుంటూ సర్దుకుపోవడానికి తన సవాలక్ష ప్రయత్నాలు – తిరిగి తిరిగి మళ్ళీ మొదటి కొచ్చే సమస్యలు – యవ్వనం పురిటి వాసనల మధ్య ఎడతెగని గొడవల మధ్య గడిచిపోయింది. అంతకంతకూ గొడవలు, అసంతృప్తులు ముదిరిపోయి ఇద్దరి మధ్య దూరం పెరగసాగింది. తను నిరాశపడుతూకూడా – ఈ నరక సదృశ్యమైన కనిపించని యుద్ధాల మధ్య పిల్లల లేత ముఖాలు – పిల్లలు దిక్కులేనివారైపోతారని తను తన జీవితానికి ముగింపు పాడలేదు.

పదే పదే వెంటాడే ప్రశ్నలు సుజాతను పీల్చి పిప్పిచేశాయి. ఈ మొత్తం కుప్పకూలిన జీవితంలో తానెక్కడ తట్టుకొనిపోయిందో? ఆ రోజు మంచంలో దుఃఖంలో సుజాత కొట్టిపోసుకున్నది.

మళ్లీ ఆలోచనలు తమ్ముని మీదికి పోయాయి. హఠాత్తుగా ఆకాశం గుడగుడలాడింది. తళుక్కున మెరిసే మెరుపుల సమారోహాలు. సుజాత రోడ్డు మీద నిలబడి చుట్టూ చూసింది. ఇది కలా, నిజమా? తనెక్కడున్నది? ఎటు పోతున్నది? తన చుట్టు చీకటి ఎందుకు కమ్ముకున్నది? ఆకాశం ఎందుకు గుడగుడలాడుతోంది? తెగిపోతూ అతుక్కుంటూ మళ్లీ తెగిపోయే ఆలోచనల పరంపరలో నుండి మళ్లీ తమ్ముడు...తమ్ముడి జ్ఞాపకాలు నిలువెల్లా వ్యాపించగా సుజాత ఆ మట్టి రోడ్డు మీద నడవసాగింది.

వాడు తనకు తమ్ముడేనా? చిన్ననాడే వాన్ని కని తల్లి చనిపోయింది. అలాంటి సమయంలో తన లేత రెక్కల ఆలనలో, పాలనలో తొలి సంతానంగా పెరిగాడు వాడు. ఇంటి నిర్వహణతోపాటు తమ్ముని పెంపకం తనమీద పడింది.

వాడు ప్రైమరీ స్కూలుకు వెళ్లే వయసులోనే తనకు వివాహమయ్యి, కాలరీ మీదికి తరలి వచ్చింది. తల్లిలేని తమ్మున్ని తనతో తెచ్చుకోవడం కోసం మధుసూదన్‌ను అడిగింది. ఎందుచేతనోగాని మధుసూదన్ అంగీకరించాడు. ఎంత ప్రయత్నం చేసినా తమ్ముడు చదువులో అంతగా రాణించలేదు. వాడికి ఆ చదువు రుచించినట్టులేదు. ఎప్పుడు దిగులుగా, ఒంటరిగా కన్పించేవాడు. వాడి చిన్నారి మెదట్లో ఏయే తుఫాను గాలులు రేగుతున్నాయో తనకు అర్థమయ్యేది కాదు. క్రమంగా క్లాసు పుస్తకాలకంటే మరేవో పుస్తకాలు దొంగచాటుగా తెచ్చుకొని చదివేవాడు. పోనీలే ఏవో పుస్తకాలు, ఏదో చదువు చదువుతున్నాడు గదా అని తను తనకు తాను జవాబు చెప్పుకునేది. కాని మధుసూదన్ చిరచిరలాడుతూ ఉండేవాడు. వాళ్లిద్దరి మధ్య ఏదో అఖాతం పెరగడం ఆరంభమౌతున్నట్లు తనకు తెలుస్తూనే ఉన్నది. మధుసూదన్ ఇంట్లో వుంటే వాడు బయటెక్కడో తిరిగి వచ్చేవాడు... మధుసూదన్‌కు ఇది కంటగింపుగా ఉండేది. ఓ రోజు వాడి కోసం కాచుక్కూర్చున్నాడు. రాత్రి పదిగంటలకు వాడొచ్చాడు. చేతిలో ఏదో పుస్తకం, వాడట్లా నిలబడే ఉన్నాడు. "ఆ చదువులేం కూడు బెట్టాయి? ఒక్కొక్కడికి చదువుకునే స్తోమత లేక అంగలారుస్తున్నారు....మేం

ఎంత ఇబ్బంది పడుతున్నామో నీకు అర్థమయ్యే ఉంటుంది. నువ్వు మంచి చదువులు చదువుకో – ఎంత డబ్బైనా నేను పెడుతాను." మధుసూదన్ కంఠంలో అధికారస్వరం. వాడు ఔననలేదు. కాదనలేదు. తను ఏం మంచుకు రాగలదోనని హైరానా పడుతున్నది. వాడి ముఖంలో నాన్న – అనేక కష్ట, నష్టాలల్లో ఏమాత్రము తొట్రుపడకుండా నిలబడిన నాన్న – అమ్మ చనిపోయి, బంధువులు, చుట్టాలు మళ్లీ పెళ్లి చేసుకొమ్మన్నపుడు ఇట్లాగే నిర్వికారంగా నిలబడిపోయిన సంగతి జ్ఞాపకం వచ్చింది. నాన్న సాత్విక సంస్కారానికి తోడు వీడికి పరిశీలనా శక్తి అబ్బింది. తమ్ముని గురించి తనకు అర్థమయ్యింది అప్పుడే–

వాడు ఇంటర్మీడియట్‌లో తప్పాడు. సుజాత తమ్మునికి అంత మంచి చదువు చెప్పించలేకపోయామని లోలోపల బాధపడ్డది. మధుసూదన్ ఎప్పుడో అతని పట్ల ఆశలు చాలించుకున్నాడు.

మధుసూదన్ ఆలోచనలు విరిగిపోయాయి. వాడు ఏ డాక్టర్రో, ఇంజినీరో అయితే తన కూతురునిద్దామనే ఆలోచనలు చేసినట్టు తనకు తర్వాత అర్థమయ్యింది.

సరిగ్గా ఆ రోజుల్లోనే సుజాత తండ్రి గ్రామంలో చనిపోయాడు. తండ్రి వారసత్వంగా మిగిలిన కుప్పకూలిపోతున్న వ్యవసాయం ఇంటర్లో తప్పిన తమ్ముని మీద పడ్డది. తమ్ముడు వెళ్లకముందే వ్యవసాయంలో పెట్టుబడులు పెరిగిపోయాయి. గిట్టుబాటు ధరలు లేక రైతులు విలవిలాడ్డం – బ్యాంకుల చుట్టూ తిరగడం – అప్పుల ఉచ్చులు, భూములను తెగనమ్ముకోవడం – ఇవన్నీ సుజాత తండ్రితో ఉన్నపుడే చూసింది. తమ్ముడు ఆ రొంపిలోకి దిగకూడదనుకొని ఎంత ప్రయత్నం చేసినా వాడు అందులోకే పోక తప్పలేదు. తమ్మునికి తోడుగా ఇంటి దగ్గర ఎన్నడో భర్త చనిపోయి పుట్టింటికి చేరిన మేనత్త ఉండేది. తమ్ముడు వ్యవసాయం చేసిన మూడు నాలుగేండ్లు సుజాత వాడు కుప్పకూలిపోకూడదని ఎంతో తండ్లాడిపోయేది.

"వాడక్కడ నిప్పుల మీద మొక్క జొన్న కంకిలీరుగ బొర్లిపోతున్నడు. వాడికి అయిదో పదో అప్పుగానే యివ్వండి వాడు బతకలేడు." అన్నది సుజాత భర్తతో.

"ఈ బుద్ధి నీకుగాదు వాడికుండాలే – మేమంతా బుద్ధిలేనివాళ్లమై ఇక్కడికి వచ్చినమా? చెప్పంగ వినని వాడు చెడితేనే తెలుస్తది." మధుసూదన్ అకారణంగా కోపం తెచ్చుకున్నాడు. వ్యవసాయం, పాతబొంద, అది ఒడ్డున పడేదా! గడ్డన పడేదా?

"మీ తమ్ముడికి అంతకన్నా గొప్ప పనేం తోచదు...అయినా పెద్దల మాట మీద గౌరవం లేని మనిషికి మన మాటలేం రుచిస్తాయి? అయినా నా దగ్గర ఎక్కడున్నయి పైసలు?"

సుజాతకు అంతా అర్థమౌతూనే ఉన్నది. వాళ్లిద్దరు చెరో పక్క నిలబడ్డారని – వాళ్లిద్దరికి యుద్ధమే తప్ప సఖ్యత కుదరదని సుజాతకు అర్థమౌతూనే ఉన్నది. భర్త ఎక్కడ నిలబడ్డాడో తెలిసినంత స్పష్టంగా తమ్ముడి స్థానం తెలిసేది కాదు. అదే రోజుల తరబడి సుజాతను వ్యాకులపరిచేది.

తను దాచుకున్న పదీ పరకా తమ్ముడు వచ్చినప్పుడల్లా చేతిలో పెట్టేది. వాడు అవి తీసుకుంటున్నా కూడా వాడి కళ్లల్లో విలవిలలాడడం కన్పించేది.

అప్పటికే ఊళ్లల్లో రకరకాల గొడవలు. సరికొత్త రాజకీయాలు వచ్చి చేరుతున్నాయి. ఊళ్లు తల్లడిల్లిపోతున్నాయి. ఒక పెనుతుఫాను ప్రతి మనిషిని మొదలంటా కదలించినట్టయిపోయింది.

తరువాత మేనత్త చనిపోవడమో మరెందుకోగాని తమ్ముడు ఊరు విడిచి వచ్చాడు. సింగరేణిలో పరుగు పందేలతో ఉద్యోగాలు యిచ్చేకాలంలో వాడు అందులో గెలిచి బదిలీ ఫిల్లరు ఉద్యోగంలో చేరాడు.

మధుసూదన్‌కు వాడి పొడ గిట్టకుంటయ్యింది. డాక్టరుగానో, ఇంజినీరుగానో చూడాలనుకున్న బావమరిది బదిలీ ఫిల్లర్ ఉద్యోగం చేయడం నామోషీగా ఉన్నది. ఒక సంవత్సరం కాగానే ఇంకో రాగం ఎత్తుకున్నాడు. లంచాలిచ్చో, పైరవీలు చేసో పైమెట్టుకు పొమ్మని చెప్పేవాడు. వాడు ఎప్పుడు వచ్చినా ఇదే రాగం. తమ్ముడు జవాబు చెప్పేవాడు కాదు. అది మధుసూదన్‌ను మరింత బాధించేది.

వాడు ఇంతకన్నా ఎంత తండ్లాడుతున్నాడో సుజాతకు ఆ తరువాతనే తెల్సింది. కాలరీ ప్రాంతాల్లో సమ్మెలు, లాకౌట్లు, ధర్నాలు, ఊరేగింపులు, అరెస్టులు, కాల్పులు... ఈ వివరాలన్నీ కేవలం తమ్ముడి కోసమే సుజాత ఆరా తీస్తుండేది. ఈ మొత్తం గడిబిడల్లో తమ్ముని హృదయం లీనమైపోగలదని సుజాత ఆలోచించి దడదడలాడేది. సుజాత అనుకున్నంత అయ్యింది. ఈ సమ్మెల వెనుక తన తమ్ముడున్నాడని అరెస్టు చేయడం, విడిచిపెట్టడం జరిగింది. గనుల మీద అంతకంతకు ఉద్రిక్తత నెలకొన్నది. అందులో భాగంగానే మధుసూదన్‌లాంటి అధికార్లపట్ల కార్మికులకు తీవ్ర వ్యతిరేకత ఏర్పడింది. ఘర్షణలు పెరుగుతూనే ఉన్నాయి. తాగుడు నిషేధించాలనే గొడవల్లో మధుసూదన్ బజారులో పెట్టి ఎవరితోనో నడిపిస్తున్న బ్రాందీ షాపు మూతపడ్డది.

అనేక కారణాలతో మధుసూదన్ ఉగ్రుడైపోయాడు. తనకు వ్యతిరేకంగా మారిన పరిస్థితులన్నిటికి తన బావమరిదే కారణమన్నట్టుగా అతని ఉనికినే సహించేవాడు కాదు. తమ్ముడు అదేమి లెక్క చేసేవాడు కాదు. వారం వారం వచ్చి ఈ గొడవలు తనకేమి పట్టనట్లు సుజాతను కలుస్తుండేవాడు. వాడి చిన్నారి మనసు ఈ ఎదురు దెబ్బల వలన ఎంత చెదిరిపోయిందోనని సుజాత తమ్ముని ముఖంలోకి గుచ్చి గుచ్చి చూసేది. విచిత్రంగా తమ్ముని మాట, చేత పరమ ప్రశాంతంగా, ఒక క్రమపద్ధతిలో ఉండేవి. బావ - బావమరిది కలుస్తే ఎంత గొడవ జరుగగలదోనని సుజాత ఆందోళన పడేది. బావ ప్రసక్తి లేకుండా మాట్లాడేది. బావ గురించి అన్నీ తెలిసినవాడిలాగే ఉండేవాడు.

అట్లా తమ్ముని ద్వారా సుజాతకు కొత్త ప్రపంచమేదో లీలగా తెలుస్తున్నట్లే ఉండేది. వారం వారం తనలో తానే సిగ్గుపడేవిధంగా తమ్మునికోసం ఎదురు చూసేది....వాడు క్రమక్రమంగా రక్త సంబంధంకన్నా ఎక్కువగా తోచేవాడు. తన భర్తతో తను పడుతున్న యాతన తనకు తెలియకుండానే చెప్పుకునేది. తమ్ముడు వెళ్లిపోయిన తరవాత ఈ గొడవలన్నీ ఎందుకు చెప్పానా అనుకునేది. ఒక్కొక్కసారి అలాంటి వ్యతిరేకతలు, గొడవలు తనకు కొత్తగా ఎందుకు స్ఫురిస్తున్నాయో తెలిసేది కాదు. తను ఎలాంటి స్నేహాల గురించి, ఎలాంటి ఆత్మీయత గురించి, ఎలాంటి మనుషుల గురించి తలపోస్తున్నదో అర్థమయ్యేది కాదు...వాడు లోకం గురించి,

మనుషుల గురించి అదో విధమైన వెలుగు రాసిన గొంతుతో వివరించేవాడు. సిగ్గుపడుతున్నట్లుగా తెచ్చి పుస్తకాలు యిచ్చేవాడు. స్వార్థం, తండ్లాల గలిగిన మనుషుల ప్రవర్తనకు మూలమెక్కడో ఆ పుస్తకాలల్లో సుజాతకు అర్థమౌతుండేది.

తమ్ముడు పుట్టెడు దుఃఖంతో ఉన్నట్టు సుజాతకు ఒకమారు అన్పించింది. ఆ కన్నీళ్లు ఏ వేదనల నుండి ఊరి వచ్చాయో ఎంత విచారించినా తెలిసేది కాదు. అలాంటి తమ్ముణ్ని పోలీసులు అరెస్టు చేసి, బయటకు రావడానికి వీలుకాని కేసులేవో పెట్టారు. వాణ్ని వరంగల్ సెంట్రల్ జైలుకు పంపారు....

"వాళ్లు బతుకరు, ఇంకొకరిని బతకనియ్యరు." మధుసూదన్ ఈ మాటో ఇలాంటి మాటలో పదే పదే అంటుండేవాడు.

ఒక్కొక్కమారు తీవ్రమైన కోపంతో మధుసూదన్‌కు జవాబు చెప్పాలనుకునేది. అప్పుడు తమ్ముడు కన్పించేవాడు. వాడు జీర్ణించుకున్న వేలాదిమంది మంచి మనుషుల సంస్కారం ఆమెకు స్ఫురించేది. "వీళ్లకు పైమనుషులే సరిగా కన్పించరు లోపలి మనుషులు తెలుస్తారా? ఎవరి చుట్టు వాళ్లే తిరిగే మనిషులకి లోకం తెలుస్తుందా?" అనుకునేది. ఇలాంటివో మరెలాంటివో అనేక మాటలు మనుషులతో పంచుకోవాలని ఉవ్విళ్లూరేది.

సుజాత చిత్రమైన సంఘర్షణలో బతుకుతూ ఉండగానే వాడు జైల్లో ఉన్న కాలంలోనే బయట అనూహ్యమైన మార్పులు జరిగిపోయాయి. సుజాత వార్తాపత్రిక ఆధారంతో ఈ మార్పులను ఊహించడానికి అలవాటుపడ్డది.

రామారావు ప్రభుత్వం తీవ్రవాదులపై విరుచుకపడ్డది. తాత్కాలికంగా తీవ్రవాదులు వెనుకంజ వేశారు. అప్పుడు కాలరీ ప్రాంతంలో తిరిగి బ్రాందీ షాపులు తెరిచారు. తీవ్రవాదుల హెచ్చరికలను ఖాతరు చేయని రెండు పెద్ద బ్రాందీ షాపులపై కార్మికులు దాడి చేశారు. అందులో మధుసూదన్ బ్రాందీ షాపు ఒకటి. బ్రాందీషాపు ధ్వంసమైపోగానే ఎక్కడికక్కడ ఖాతాదార్లు మధుసూదన్‌కు మొండి చెయ్యి చూయించారు. ఆ విధంగా మధుసూదన్ నష్టపోయిన దశలోనే గనిమీద మధుసూదన్ కార్మికులతో నిత్యఘర్షణ ప్రారంభమయ్యింది. వీటన్నిటిమధ్య మధుసూదన్ తీవ్రమైన కోపంతో అందరిని వరుసబెట్టి తిట్టేవాడు. సుజాతతో యుద్ధం చేసేవాడు.

"తమ్ముడు చెడిపోవడానికి నువ్వే కారణం" అంటూ నిందించేవాడు." ఉల్కాగా తిరిగే ప్రతి లంపెన్‌గాడు చేసే పనే అది. వాడు గుండ.." ఇట్లా సాగేవి మధుసూదన్ తిట్లు.

సుజాత విల విలలాడిపోయేది. తను తమ్ముణ్ని చెడగొట్టిందా? తమ్ముడి చేతల మంచి చెడ్డలేమిటో తనకు మళ్లీ మీమాంస ప్రారంభమయ్యేది. తిరిగి జవాబు చెప్పాలనే ఆలోచన ఎప్పుడు చెయ్యలేదు. "వాడు ఆత్మ గల మనిషి – ఆత్మ కలిగి ఉండడమే నేరం అంటున్నాడు భర్త." మంచి చెడ్డలు రెండుగా చీలిపోయినట్లుగా కన్పించేది. అయినా అప్పుడప్పుడు "వాడు ఈ నిప్పుల దారిని ఎందుకు ఎంచుకున్నాడో?" అనుకునేది. తనకు తెలియకుండా తను ఆ దారిలో నడుస్తున్నట్లుగా తోచి ఉలిక్కిపడేది. తను జవాబు చెప్పకున్నా భర్తతో కనిపించని,

నెత్తురేమి కారని తీవ్ర బహు దీర్ఘ యుద్ధంలో కూరుకపోయినట్లుగా ఒకనాడు అర్థమయ్యింది. అసలు భర్త జైల్లో ఉన్న తమ్మునితో కాదు – తనతో తలపడుతున్నాడని అర్థమై విస్తుపోయింది. తన సమస్త సాంసారిక జీవితాన్ని కుప్పపోసుకొని తనకు తెలియకుండానే సుజాత వెక్కి వెక్కి ఏడ్చింది.

చివరకు సుజాతకు తేలిన అంశమేమింటే – తమ్ముడు జైల్లో బందీ. అది ఎలాంటి బందికానో తనకు తెలియదు. తను ఈ ఇంట్లో బంది. తన సమస్త మొగుడి అధికారాలతో తన సమస్త శరీరంలోని ఆర్తిని ఎండగట్టాలని చూస్తున్నట్లుగా సుజాత అర్థం చేసుకున్నది. తమ్ముడు పదే పదే మానవ జీవితంలో ఇనికిపోయిన హింస గురించి, తనకు అర్థంకాని మరేమిటో గురించి చెప్పినవన్నీ గుర్తుకొచ్చేవి. నాకన్నీ తెలుస్తున్నాయి చూడు అని చెప్పాలనిపించేది. తమ్ముని కోసం వేయి కండ్లతో ఎదురుచూసేది.

ఒక్కొక్కమారు జైలుకు వెళ్లి తమ్మున్ని చూసి రావాలనుకునేది. ఆ మాట తాను చెప్పకుండానే మధుసూదన్ అర్థం చేసుకున్నట్లుగా – "మరింక వాడితో మనకు ఎలాంటి బాంధవ్యాలు లేవు. ఆ బాంధవ్యాలు పెట్టుకుంటే నా గడప తొక్కవద్దు" అన్నాడు.

తన చేతకానితనం మీద ఎనలేని కోపంతో సుజాత ఏడ్వనిరోజు లేదు. ఒక్కొక్కమారు ఇంత బలహీనమైన బంధం ఉంటేనేమి పోతేనేమి అనే తెగింపు కలిగేది. పిల్లల ముఖాలు ఆమెను నిలవేసేవి. ఈ మొత్తంలో పిల్లల పెంపకం సవ్యంగా జరగడం లేదని తెలిసి మరీ బాధ వేసేది.

సుజాత లోలోపల జరుగుతున్న భీకర సంగ్రామమే ఇంచుమించు బయట జరుగుతున్నట్లుగా సుజాతకు అర్థమయ్యింది. ఎక్కడో మండలాధ్యక్షున్ని చెరపట్టి చంపేయడం, తర్వాత ప్రభుత్వం దిగివచ్చి తీవ్రవాదుల కోర్కెలు తీర్చడం – జైల్లో. లాకప్పుల్లో ఉన్నవాళ్లను విడుదల చేయడం – కూల్చి వేసిన స్తూపాలను తిరిగి కట్టడం... తన సమస్యలు అడుగున పట్టేంత ఉద్విగ్నత సుజాతను ఊపేసింది. ఆ గొడవల్లోనే తమ్ముడు విడుదలై మందిలో కలిసిపోయాడు.

తర్వాత ఎన్నికలు – ప్రభుత్వం మారిపోయింది.

బ్రహ్మాండమైన బహిరంగ సభలు, సమావేశాలు – వేన వేల ఎకరాల భూమి పంపకాలు – అలాంటి అల్లకల్లోలాల మధ్య ఉవ్వెత్తున ఎగిసిపడే రైతుల పోరాట కెరటాల మధ్య ఆమె రోజూ వార్తపత్రికలో తన తమ్మున్ని పోల్చుకోవడానికి వెతుకులాడేది.

అదిగో, అలాంటి ఉద్విగ్న రోజుల్లోనే తన తమ్ముని అరెస్టు వార్త సుజాతకు తెలిసింది. అప్పటికే విరుచుకుపడే కెరటాలకు అడ్డుకట్టవేయడానికి ప్రభుత్వం అరెస్టులు, కాల్చివేతలు ముమ్మరం చేసింది.

మొదట ఆ వార్త చదివి సుజాత కుప్పకూలిపోయింది. ఆ తరువాత తన మీద తనకే చెప్పరాని ఆగ్రహం కలిగింది. ఈ ఇంట్లో పిడికెడు మెతుకులు, నాలుగు చీరల స్థానం పోతే పోయింది. పిల్లలు అడుక్కు తినైనా బతకగలరు. ఆలస్యం చేస్తే తమ్ముడు తనకు దక్కడు. ఎట్లాగైనా వాన్ని రక్షించుకోవాలి. ఎవరి అండ

తీసుకునైనా వాన్ని విడిపించుకోవాలి. అలాంటి నిర్ణయానికి వచ్చిన తరువాత తమ ఊళ్లోని మేనబావ గుర్తొచ్చాడు. అప్పుడు అతను ఆ మండలానికి అధ్యక్షుడు. చిన్ననాడు సుజాతను అతనికే యిచ్చి పెండ్లి చేద్దామనుకున్నారు. సుజాత తల్లి చనిపోవడం మొదలుగా సుజాత కుటుంబం తరిగిపోయింది. వాళ్లు పెరిగిపోయారు. పెద్ద మేనత్త ఈ సంబంధం మీద అయిష్టత చూపింది. ఏది ఏమైనా అతన్ని కలువాలని నిర్ణయానికి రాగానే సుజాత పిల్లలకు చెప్పి రైల్వే స్టేషన్‌కు చేరుకున్నది. ఆమె దుఃఖంతో, విచారంతో వచ్చిన రైలు ఎక్కింది. రైల్లో వరుస క్రమంలేని ఆలోచన మధ్య ఇతర ప్రయాణీకులెవరిని పట్టించుకోలేదు. కనీసం అస్పృహ కూడా లేకుండా రైలు దిగింది.

ఎందుకో గాని ఉరుముడు, మెరుసుడే గాని వర్షం కురవడం లేదు. గాలి ఆ పక్క ఈ పక్క బొయ్యిమంటూ వీస్తోంది. మిణుగురుల్లా ఊరి దీపాలు కన్పిస్తున్నాయి. ఆ దారి, ఆ పరిసరాల స్పృహే లేదు. తను ఒంటరిగా చీకటి పూట నడుస్తున్నానన్న ధ్యాసే లేదు. ఆ దారంట అప్పుడప్పుడు సుజాత లాగే ప్రయాణించే వారి గురించి పట్టింపు లేదు. పెను తుఫానులో అల్లకల్లోలమై పోతున్న సముద్రంలోని కెరటాల్లాగా ఆమె మనసులో అనేక జ్ఞాపకాలు. ఎక్కడో తెగి ఎక్కడో అతుక్కుంటున్న ఆ జ్ఞాపకాల సారాంశం మాత్రం అది.

సుజాత వడివడిగా నడుస్తోంది. ఇప్పుడు సుజాతకు ఊరు దగ్గరౌతున్నది. తన గుండె పెద్ద శబ్దం చేస్తూ కొట్టుకుంటున్నది. చీకటి రాత్రి, మేఘాలు గిరేసుకున్న ఆకాశం కింద ఎడతెగని శోకంలాగా చిమ్మెట్ల రొద సాగుతూనే ఉన్నది.

కాసేపు ఈ ఆలోచనలు కట్టిపెట్టి సుజాత నడవసాగింది. తుఫాను తర్వాత ప్రశాంతత ఆమె ముఖంలో లిప్తకాలం చోటు చేసుకున్నది. బలహీనమైన మెరుపు మెరిసింది. కొద్దిగా గాలి ఉధృతం తగ్గింది.

ఆ మెరుపు వెలుగులో చుట్టు పరికించి చూసింది. కుడివేపు గుట్టబోరు కింద ఏనాడో చనిపోయిన ముస్లిం మత పెద్ద సమాధి (దర్గా) తెల్లగా కన్పించింది. దర్గ గుడికి ఆవలి వేపున గల ఖాజీపల్లెలో ఏ అలికిడి లేదు. మళ్లీ తమ్ముడు మదిలో మెదిలాడు. తన చుట్టు విస్తరించిన ధరిత్రి సాంతం వల్లకాడులా తోచింది. గాలికి వూగుతున్న చెట్లు వెంట్రుకలు విరబోసుకొని శివాలెత్తుతున్నట్టుగా తోచింది. ఎదురుగా బిజిగిరి రెండు గుట్టల మధ్య 'బిజిగిరి' మెరుపు మెరుపుకు కనిపించి మాయమౌతోంది.

తమ్ముడి ఆలోచనలు పక్కకు నెట్టి సుజాత రోడ్డుకు రెండు పక్కలా చూస్తూ నడుస్తోంది. రోడ్డుకు ఎడమ పక్క విస్తరించిన అపారమైన నల్లరేగడి భూములు దున్నక పడావు పడి ఉన్నాయి. ఆ భూముల్లో అక్కడక్కడ రంగు వెలిసిన ఎర్ర జెండాలు రెపరెపలాడుతున్నాయి. ఈ భూములన్ని తన మేనబావవే... రోడ్డుకు కుడివేపున ఉన్న భూముల్లో కొన్ని బిజిగిరి గ్రామస్తులది. మరికొన్ని ఖాజీపల్లె తురకలవి. జులై నెల చివరి రోజులు – కుడివైపు భూముల్లో మొక్క జొన్న, పత్తి పంటలు ఎందుచేతనో చాలా బలహీనంగా ఉన్నాయి.

తను వార్తాపత్రికలల్లో చదివిన ఈ భూముల చరిత్రంతా సుజాతకు జ్ఞాపకం రాసాగింది. ఈ మట్టి, ఎందరి మనుషుల సుఖదుఃఖాలను చూసిందో? ఆ మట్టి మీద సుజాతకు చెప్పరాని ప్రేమేదో పొంగుకొచ్చింది. హఠాత్తుగా సుజాతకు ఆ జెండాల మధ్య తమ్ముని ముఖం కనిపించినట్లయ్యింది. సుజాత పిచ్చిదానిలా నిలబడిపోయింది. ఈ సమస్త ప్రపంచం ప్రతిధ్వనించే విధంగా తమ్ముని పేరు పెట్టి పిలువాలని వెర్రి ఊహ మెదిలింది. ఆ పిలుపు ఆమె కంఠంలో అణిగిపోయి, దాని స్థానంలో – చింపిరి తలలవాళ్లు చిరిగిన బట్టల అసంఖ్యాక జన సమూహం కోలాహలంగా ఎటో పోతున్నట్టుగా తోచింది....

"వాళ్లకి బలం ఎక్కడి నుండి వచ్చింది? చిన్నదానికి చితకదానికి వాళ్లల్లో వాళ్లు కొట్లాడే మనుషులు, ఒకే ఇంట్లో బతుకుతూ వేరు వేరు పాయలుగా చీలిపోయినవాళ్లు – వాళ్లంతా ఎట్లా జమకూడారు? ఇది జరిగే పనేనా? వీళ్లందరి ఆయింపట్లు తమ్మునికి దొరికినట్లుగానే ఉన్నది. వాడికి గట్టిగా ఒక దురుసు మాట మాట్లాడరాదు. ఇలాంటి మనుషులతో ఏం మాట్లాడాడు? వాళ్లల్లో వాడెట్లా ఇమిడిపోయాడు?" సుజాత తనలో తానే గొనుక్కుంటూ నడుస్తోంది.

సుజాత వెనుక నుంచి ఎడ్లబండొకటి ఆ చీకట్లో బొకబొకలాడుతూ వస్తోంది. ఎవరో రావాల్సిన బంధువుల కోసం వచ్చిపోతున్నట్లున్నది. ఆ పెద్ద బండిలో నొగల కిందికి కాళ్లు జారిడిసి ఒక ముసలాయన మునిలాగ కూర్చుండి తోలుకపోతున్నాడు. ఆ ముసలాయనలో సుజాతకు తండ్రి జ్ఞాపకం వచ్చాడు.

"బతుకు చేతకాని పరమ దరిద్రులు!" మధుసూదన్ తన తమ్మున్నుద్దేశించి చెప్పిన మాట ఎందుకో గుర్తొచ్చింది.

ఆ రోజు సుజాతకు మనసు విల విలలాడిపోయింది.

"నిజమే. వానికి బతక చేతకాదు. చేతనైన మీలాంటివాళ్లు బతికే తీరేమిటో కన్పిస్తనే ఉన్నది." సుజాత జవాబు చెప్పాలనుకున్నది. కాని అనలేకపోయింది. బీరువాలో కుప్పలు కుప్పలుగా పడున్న కుదవబడిన నగలు ఆమెకు పాములు తేళ్లలాగా కన్పించాయి.... భర్త అడ్డమైన లంచాలు, వడ్డీ వ్యాపారం, బీరుబ్రాందీ అమ్మకాలు – డబ్బు కక్కుర్తిలో భర్త అన్ని కుటుంబాలను ఆర్పివేస్తున్నది – ఎవరి మీదనో పగ సాధించడానికన్నట్టు బంగ్లా మీద బంగ్లా కడుతున్నది – డబ్బుతో సర్వ ప్రపంచాన్ని గెలువగలననే యావతో ఆయన మనుషులకు, స్వయాన కన్నతల్లికి కూడా ఎట్లా దూరమైపోతున్నది – తనను గెలువాలని చేసే ప్రతి ప్రయత్నం తనకు అసహ్యాన్ని కలుగజేస్తున్నది. చివరకు అతని ఉనికి కొండచిలువ స్పర్శలాగ తనకు భరింపరానిదయ్యింది. తీవ్రమైన ఒంటరితనంతో ఆయనెట్లా మానసిక వైద్యం చేయించుకున్నది... నిద్రరాక నిద్ర మాత్రలు మింగేది... అతని బతుకు సాంతం తనకన్నా మరెవరికి బాగా తెలుసు?... తను అనుకున్నా అతనికి తన నిరసన అర్థమైతున్నట్టే ఉండేది.

ఉరుములు, మెరుపులు, గాలి దుమారం మధ్యనే సన్నగా వర్షం ప్రారంభమయ్యింది. గాలికి కరంటు తీగలు హోరుమంటున్నాయి. తను తడుస్తున్న ధ్యాసే లేదు. సుజాతకు భర్త రూపం మారిపోయి తండ్రి గుర్తుకొచ్చాడు. మధుసూదన్‌కు తన

తండ్రి పట్ల ఎందుకో తగని ద్వేషం. తండ్రి చనిపోయేదాకా అతను తండ్రితో ఒక్క మాట మాట్లాడింది లేదు. మా ఇద్దరి పెంపకంలో తండ్రి అంశ ఉందని అతని అనుమానం కాబోలు...'మీ తమ్ముడు అట్లా కావడానికి మీ నాయిన చేతకాని తనమే కారణం' అంటూ దెప్పిపొడిచేవాడు. భర్త ఏ అర్థంలో వాడినా తన తండ్రి తన భర్తలాగా బతకడం చేతకానివాడే. పెద్దతండ్రిలాగా ఉమ్మడి కుటుంబాన్ని మాయచేసి ఆస్తి వెనుకేసుకోవడం తన తండ్రికి చాతకాకపోయింది. పెద్దతండ్రిలాగానో, పెద్ద మేనత్తలాగానో మనుషుల పట్ల కఠినాత్మునిలాగా ఉండడం చేతకాకపోయింది. ఎకరాలకెకరాలు దున్ని, పుట్ల ధాన్యం పండించి కూడా తనేమి కూడ బెట్టలేకపోయాడు. సుజాతకు నిలువెల్లా దుఃఖం ఆవరించింది. తండ్రి రూపం మసక మసకగా కన్పించింది. తన తల్లి చనిపోయినప్పుడు గాని, వ్యవసాయం కుప్పకూలిపోతున్నప్పుడుగాని ఆయన పడ్డ యాతన తనకు మాత్రమే తెలుసు.

ఊరు దగ్గరైంది. ఆ చీకట్లో ఊరు మొదట కూలిపోయి కూడా కర్మసాక్షిలాగా నిలుచున్న నైజాంకాలం నాటి బురుజు కన్పించింది.

ఉగ్గబట్టుకున్న హృదయంతో అదిమి పెట్టుకున్న దుఖంతో ఆమె గ్రామంలోకి ప్రవేశించింది. గ్రామం కూడా తనలాగే దుఖాన్ని ఉగ్గబట్టుకున్నట్టే ఉన్నది. ఇండ్లల్లో మసక మసకగా దీపాలు వెలుగుతున్నాయి. సందడేమి లేదు. తోడేళ్ళు పడ్డ గొర్రెమందలాగా ఊరంతా బెగ్గం పాడైపోయినట్లుగానే ఉన్నది. ఊళ్లో ఎవరు తిర్గడం లేదు. ఎక్కడో ఆవు దూడ కోసం హృదయవిదారకంగా అరుస్తోంది. సుజాతకు ఇద్దరో ముగ్గురో ముసలివాళ్లు ఎదురు పడ్డారు. వాళ్లు ఒంటిమీద గుడ్డలు కప్పుకోవడం వలన వాళ్లెవరైంది సుజాతకు తెలియలేదు. వాళ్లు ఏదో గొణిగారు. సుజాతకు ఆ మాటలేవి అర్థం కాలేదు. సుజాత ఆ మాటలేవని, ఆ మనుషులెవరని పట్టించుకోకుండా నడుస్తోంది.

ఈ వానలో ఈ రాత్రి ఎవరింటికని పోయేది? తను పుట్టి పెరిగి ఆడుకున్న ఊరే – ఎట్లా తెగిపోయాయో గాని ఆ వూరితో తనకు తెలియకుండానే అన్ని బంధాలు ఏనాడో తెగిపోయాయి. తను తన తమ్ముని్న పోలీసుల నుండి విడపించుకుందామని మేనబావను కలువడానికి బయలుదేరానని సుజాతకు జ్ఞాపకం వచ్చింది. 'వాన్ని ఈ జన్మకు చూస్తానో లేదో?' సుజాత ముద్దయిపోయిన గొంతుతో అనుకుంటూ వడివడిగా మేనబావ ఇంటికేసి నడిచింది.

బయటి పాఠకులు (పెద్ద దరువాజ తలుపులు) తోసుకొని లోపలకు అడుగు పెట్టింది. చుట్టూ విస్తరించి ఉన్న ప్రహరి గోడల లోపల విశాలమైన వాకిలి చివర బంగళా ఎక్కడిక్కడ కుప్పకూలిపోయి ఉన్నది. కూలిన గోడలతో ఆ లోగిలి వల్లకాడులా కన్పించింది. సుజాత ఆ దృశ్యాన్ని చూసి విస్తుపోయింది. మంది మార్బలంతో నిత్య పెళ్లివారిల్లులాగ కళకళలాడే ఈ బంగళా ఇట్లా కుప్పకూలిందేమిటి? ఈ మార్పులేవి సుజాత వార్తాపత్రికలల్లో చదువలేదు.

ఎక్కడి నుండో కుక్క అరుపు విన్పించింది. మరి కొద్ది సేపట్లో ఆ శిథిలాల మధ్య నుండి ఒక ముసలమ్మ 'కందీల' చేత్తో పట్టుకొని "ఎవరూ?" అంటూ

వాకిట్లోకి వచ్చింది. ఆ ముసలమ్మ గుడ్డిగా వెలిగే కందీల పైకెత్తి సుజాతను చూసి పోల్చుకోలేకపోయింది.

సుజాత ఆ ముసలమ్మను పోల్చుకున్నది. ఆ ముసలమ్మ మేనత్త ఇంట్లో బాల్యం నుండి పని చేస్తున్న దాసి లచ్చిమి. ఏటా వేల పుట్లు వడ్లు పండే రామప్ప చెరువు కింది గ్రామంలో నుండి నాయికప్లో లచ్చిమిని చిన్ననాడే తన మేనత్త నాలుగు కుంచాల వడ్లకు కొనుక్కొచ్చింది. తనకు తెలియదు గాని లచ్చిమి ఎన్ని సార్లో పారిపోయిందట. అయినా లచ్చిమికి దాసితనం తప్పలేదు. పెళ్లి పెటాకులు లేకుండా లచ్చిమి బతుకంతా మేనత్త కుటుంబంతోనే గడిచిపోయింది. సుజాతకు ఇలాంటివో మరెలాంటివో ఆలోచనలు సాగుతుండగా–

"ఎవరవ్వా! ఎవలు కావాలె?" అని హీనమైన స్వరంతో కొద్దిగా భయం నిండిన గొంతుతో అడిగింది.

సుజాతకు తనెందుకు వచ్చినట్టో గుర్తుకు రాలేదు. గొంతు పెగల్చుకొని తన తండ్రి పేరు చెప్పింది.

"సుజాతవ్వా! నువ్వా? ఎవలో అనుకున్న." లాంతరు దించింది.

"బావ కోసం వచ్చిన." సుజాత.

దాసి లచ్చిమి ఇందాకటి కంఠంలో ఏదో మార్పు వచ్చింది. "బావా?" చేతులు చిత్రంగా తిప్పింది. మళ్లీ ఏమనుకున్నదో ఏమో–

"ఇగో సుజాతవ్వా! ఈ బంగుళను బాంబులతో కూలగొట్టక ముందునుంచే మీ బావ పిల్లలతోనట్టు హన్మకొండకు చేరుకున్నడు. మీరంతా పరంధీరవుసు లేకుంట కాలేర్ల మీదికి పోయిండ్లు – ఈ వూళ్లె ఎన్ని జరిగినయో నే చెప్పజాల. మీ బావ గొడ్డు గోదా భూమి జాగ గంగల కల్సినయ్. మీ బావ జాగ మీ బావ చూసుకున్నాడు. నాకే ఏదారి కానరాక ఈ బంగులల ఉంటున్న." ముసలమ్మ గొంతు వణికింది. మరింక మాటలురాక మూగపోయింది.

ఆ వర్షంలో సుజాత ఏమి తోచకుండా నిలుచున్నది. తన తమ్ముని మీద పెట్టుకున్న ఆశలన్నీ కుప్పకూలిపోయాయి. మరింక ఎటు పోవాలి? కాళ్లు వణుకుతున్నాయి. లోలోపల దుఃఖం కట్టలు తెగుతోంది. పరుగెత్తుతున్నట్టుగా సుజాత అక్కడినుండి బయటకువచ్చి నిలుచున్నది.

"ఏం మనుషులో?" ముసలవ్వ గొణుగుతూ ఆ శిథిలాల మధ్యకు వెళ్లిపోయింది.

నిలువెల్లా మైకం కమ్మిన మనిషిలాగ సుజాత బజారులో నడవసాగింది. సమస్త జీవితాన్ని గడ్డిపోచలాగ వదిలిపోతున్న మనిషిలాగా నడుస్తోంది. దేన్ని ఖాతరు చేయని మనిషి ఉన్మాదం ఆమె అడుగుల్లో కన్పిస్తోంది. అట్లా సుజాత తనకు తెలియకుండానే తను పుట్టి పెరిగిన ఇంటికే నడిచింది. ఆ యిల్లు ఆ బంగ్లాలాగే ఎక్కడి కక్కడ కూల్చివేయబడి ఉన్నది.

ఈ ఇంటిని తన లేత చేతులతో అలికింది. ముగ్గులు వేసింది. ఈ ఇంటి ప్రతి మూలతో తాను మాట్లాడింది. ఆ శిథిలాల మధ్య సుజాత పిచ్చిపట్టినదానిలాగా తిరుగాడింది. ఈ ఇంటికే, ఇక్కడి జీవితానికి తనను దూరం చేసిందేమిటి?

మళ్లీ మళ్లీ పదే పదే సుజాత చిక్కు దారుల్లోకి వెళ్లిపోతోంది. వాతావరణం మాపురు కప్పినట్లుగా ఉన్నది. ఉరుములు మెరుపులు తగ్గాయి. ఏడ్చేడ్చి సొమ్మ సిల్లినట్లుగా వర్షం తగ్గింది.

తల్లి చనిపోతే తమ్ముణ్ని భుజానేసుకొని పాలకోసం తాను మాదిగ ఇండ్లల్లోకి పోయేది. తల్లి చనిపోయిన పిల్లవానికి తల్లి పాలకోసం అడగరానివాళ్లనల్ల అడిగాడు తండ్రి – చింతకింది రాజమ్మ ఆ మాదిగ వాడలో తన తమ్ముడికి రోజు పాలిచ్చేది. రాజమ్మకు కూడా తన తమ్ముని వయస్సంత కొడుకుండేవాడు. ఇద్దరు పిల్లలకు పాలు సరిపోవని తన తండ్రి రాజమ్మకు కొంత ధాన్యం పంపేవాడు. అర్ధరాత్రి అపరాత్రి ఆ పసిగుడ్డు ఏడ్చేవాడు. వాన్ని భుజాల మీద వేసుకొని మాదిగ వాడకు పరుగెత్తేది. సుజాత తల్లి మనుసుతో తడిసి ముద్దైపోయింది. వర్షంలో తడిసిన దానికన్నా ఈ భావనతో ఆమె నిలువెల్లా వణికిపోయింది.

సుజాత ఈ ఒక్క రోజు ఈ భూప్రపంచంలో స్త్రీ ఎన్ని భావ ప్రకంపనాలకు లోను కాగలదో అన్ని భావ ప్రకంపనాలకు లోనయ్యింది.

అప్రయత్నంగా లేచి నిలబడి సుజాత ఊరికి దక్షిణం వేపునే గల గుట్టబోరు కింది మాదిగ వాడకేసి నడిచింది. తమ్ముని జాడ కోసం, వివరాల కోసం ఆమె మనసు పరితపిస్తోంది. ఎక్కడో రవ్వంత ఆశ కొట్టుమిట్టాడుతోంది. తప్పక తన తమ్ముడు తన హృదయాన్ని ఆ మాదిగ వాడలో దాచి ఉంటాడని సుజాతకు గట్టి నమ్మకం కలిగింది.

పాము వలె మెలికలు తిరుగుతూ వడివడిగా ప్రవహించే నీళ్ల ధారల్లో నుంచి, చితచితలాడే బురదలోంచి ఆమె నడుస్తోంది.

☆ ☆ ☆

"ఈమె ఈ రాత్రి ఎక్కడికి పోయినట్టు? ఈ వర్షాకాలపు రాత్రి ఎక్కడని వెతికేది?" మధుసూదన్ రైలు ప్లాట్‌ఫాం మీద నిలబడి చాలా సేపు కలియజూశాడు. రైలు దిగిన ప్రయాణీకులు తమ తమ పల్లెలను వెతుక్కుంటూ చేలకడ్డం పడి పోతున్నారు.

రైలు కాసేపు ప్లాటుఫాం మీది నుండి కదలలేదు... మధుసూదన్ ప్రతి పెట్టె వెతికాడు. రైల్లోనివాళ్లు ఎవరి గొడవల్లో వాళ్లున్నారు....స్టేషన్ బయట–ప్లాట్‌ఫాం మీద అంతటా వెతికాడు. కాని ఆ చీకట్లో సుజాత కన్పించలేదు.

మధుసూదన్‌కు ఒక్కసారిగా నిస్సత్తువ ఆవరించింది. తన సర్వశక్తులు ఎవరో లాగేసుకున్నట్లుగా ప్లాట్‌ఫాం మీద ఒక సిమెంటు బెంచి మీద కూలబడిపోయాడు – కళ్లు మూసుకుంటే భయంగొలిపే చీకటి.

ఎట్టకేలకు రైలు నీరసంగా కూత వేసి ఖాజీపేట వైపు కదిలిపోయింది. అడుగుల చప్పుడు తగ్గిపోయింది. కళ్లు తెరిచి చూస్తే తన మెదడులాగే ప్లాట్‌ఫాం ఖాళీగా కన్పించింది.

"ఎటు వెళ్లాలి? ఏమి చేయాలి? వెనక్కి తిరిగి పోదామంటే గంట దాకా రైలు లేదు. ఏమో తనకు కన్పించకుండా ఆ మనిషి ఓజీగిరికి వెళ్లిందేమో?"

మధుసూదన్ స్టేషన్ బయటకు వచ్చి రాధమ్మ హోటల్లో చాయ్ తాగాడు. అక్కడున్న వాళ్లను అడుగుదామంటే గొంతు పెకలలేదు.

మట్టి రోడ్డు మీదికి వచ్చి కాసేపు నిలుచున్నాడు. ఆకాశంలోకి చూశాడు. ఆ వురుములు మెరుపులు – తనకు తెలియని గందరగోళమేదో జరుగుతున్నట్లుగా ఉన్నది. విచిత్రం. వాన వస్తుందో రాదో తెలియకుండా ఉన్నది. వానేవస్తే – సాంతం తడిసిపోతే. అసలే ఈ వూళ్లు బాగుండలేదు... ఇంత రాత్రి ఒక్కనివి ఎటుపోతున్నావంటే – ఆ వూళ్లో ఆ రాత్రి ఎట్లా గడిపేది? మధుసూదన్‌కు భయం నిలువెల్లా పాకింది.

ఈ మనుషులు తనకెప్పుడు అర్థం కాలేదు.....

మధుసూదన్‌కు బుస బుస కోపం పొంగింది. "ఈ దరిద్రురాలు తన నెందుకింత కష్టపెడుతోంది. ఈ గాలి దుమారంలో ఈ ఉరుములు మెరుపుల మధ్య నేను ఎక్కడని వెతికేది?" మనసులోనే తిట్టుకుంటూ ఎటూ తేల్చుకోలేక నిలుచున్నాడు.

ఇంతలోనే బిజిగిరి వేపు నుండి బండి రావడం కన్పించింది.

"ఓ బండాయిన – నీకు తొవ్వల ఎవలన్న ఆడామె కన్పించిందా?" ఒకవిధమైన విసుగుతో అడిగాడు.

బండాయిన మాట్లాడలేదు. ఈ దరిద్రులందరికి పొగరే. "ఏం కాలమచ్చింది?" అనుకుంటూ రెండడుగులేసి "విన్పిస్తాలేదా? ఈ దారంట–" మధుసూదన్ మాట పూర్తి కాకముందే–

"మా ఇనత్తంది. నువ్వా పిల్ల పెనిమిటివా?" బండాయన.

"సన్నగా ఉన్నామె చేతులేమి లేకుంట పోతున్నాదా?" మధుసూదన్ ఆదుర్దాగా అడిగాడు.

"పోతంది పో" అన్నాడు బండాయన.

"అరె! తనకు కన్పించకుండా ఎప్పుడు రైలు దిగింది? మధుసూదన్ మరో ఆలోచన లేకుండా ఆ మట్టి రోడ్డు మీద నడువసాగిండు.

కాస్తంత దూరం పోయిన తరువాత ఇందాకటి ఆదుర్దా స్థానే సుజాతను ద్వేషించడానికి ఆసరా కోసం వెతుక్కోసాగిండు!

"ఇంతకూ తను చేసిన తప్పేమిటి?" ఈ ప్రశ్నను మధుసూదన్ తన సంసారం ఆరంభమయిన దగ్గర నుండి అనేక మార్లు వేసుకున్నాడు. ఎప్పటికప్పుడు జవాబులు తనకు తానే చెప్పుకున్నాడు. మధుసూదన్ సంస్కారంలో 'తను' తప్ప ఇతరులు లేరు. అట్లా ఉంటారనే విషయం కూడా అతను ఇంత పెనుగులాటలో కూడ నమ్మలేకపోయాడు.

"నాలుగు పైసలు సంపాయింకోవడం తప్పా? డబ్బు లేనోడు దుబ్బుకు కొరగాడు. ఈ ప్రపంచం మీద మనిషి విలువ డబ్బుతో కొలువబడుతోంది. ఎట్లా సంపాయించావన్నది లెక్క కాదు – ఎంత సంపాయించావన్నది లెక్క. సుజాతకేం తెలుసు? తన కడుపున పుట్టిన పిల్లలకేం తెలుసు? దరిద్రం ఎంత దుర్భరమైనదో!

ఈ సంపాదనంతా ఎవరి కోసం?" అతని అంతరంగంలో ఎక్కడో బలహీనమైన మూలుగుడు పెనుగులాడుతోంది.

"తనను లోకమంతా పైకి వచ్చిన మనిషని కీర్తిస్తోంది! కాని....తన భార్య తన సమస్త సంపదను, శక్తిని కళ్ల కద్దుకోవాల్సిన భార్య ఒక్కమారు...ఒక్కమారు...." మధుసూదన్‌కు తన కాపురం తలుచుకోవడానికే భయమేసింది.

"సుజాత తనకు ఎందుకు దూరమైపోతోంది? తను తాగడు. ఇతర దురలవాట్లేవి లేవు... తన భార్యకు తనకు ఎక్కడ తగువు ప్రారంభమయ్యింది?" మధుసూదన్‌కు ఒళ్లు జలదరించింది. ఇలాంటి ప్రశ్న మధుసూదన్‌కు మొలకెత్తడం ఇదే కొత్త.

అయినా ఆ ప్రశ్న అంతకంతకు పెద్దది కాసాగింది. "ఎంత కాలమైంది? ఎక్కడ మొదలయ్యింది? వెండి కొంటే సంతోషపడుతుందనుకున్నాడు. బంగారం కొంటె ఆమె కళ్లు మెరుస్తాయనుకున్నాడు. బంగళా కడితే ఆమె తృప్తిపడుతుందనుకున్నాడు. స్త్రీలు ఇలాంటి అవసరాలకు పొంగిపోవడం తనకు తెలుసు. కాని అవేవీ సుజాతను చేరనేలేదు. తన దగ్గరకు చేరవేయనే లేదు. అంతకంతకూ ఇద్దరి మధ్య దూరం పెరిగిందే. కాని తరుగలేదు. ఈ లోకం దేనికోసమైతే పడి చస్తుందో – ఈ లోకం దేన్నైతే 'బతికే విధానం' అంటోందో అవేవి సుజాత గుర్తించలేదు...ఆమె తమ్ముణ్ని తెచ్చుకుందామంటె కాదంటినా? ఆమె అడుగాలె గాని ఏదైనా చేద్దును. కాని ఏది అడుగదే? వాడు బాగుపడితే అక్క సంతోషపడుతుందనుకుంటి. కాని వాడేమిటో తనకు ఎప్పుడు అర్థం కాలేదు. ఆ చూపులు తనను సవాలు చేస్తుండేవి. వాడు నాలాగే మాటకు మాట అంటే తనకు అంత పెరుగకపోవును. కాని ఆ మవునం....అదే తనను రెచ్చగొట్టేది."

"దాన్ని తనెంత ప్రేమించాడు!" మధుసూదన్ కళ్లల్లో ఎందుకో బుస బుస కన్నీళ్లు పొంగాయి. ఇది చిత్రమైన పరిస్థితే. మధుసూదన్ ఈ మధ్యకాలంలో ఎప్పుడు ఏడ్వలేదు! ఏడ్వవల్సిన అవసరం కలుగలేదు. ఆ మట్టి రోడ్డులో ఏమి మహత్యమున్నదో? ఆ దారి ఎంత కన్నీటితో తడిసిందో?

"ఇన్నేండ్లు కష్టపడి ఇంత డబ్బు, ఇంత ఆస్తి సంపాదించింది తన పిల్లలు, తన భార్య సుఖపడాలనే కదా!" లోకులందరికి దూరమైపోయింది ఒక్క రూపాయి కూడ బెట్టడం కోసం. బయట లోకులతో పెద్ద భీకర యుద్ధం, ఎంత కఠినంగా చేయాల్సి వచ్చేది. సుజాతకు ఎట్లా తెలిసేది? తెలిస్తే......

ఒకవైపు తోడబుట్టిన అన్నలూ, అక్కా బాగుపడితేనే, మోసం చేస్తేనే సుజాత కుటుంబం చితికిపోయింది. తండ్రి వాళ్లతో కొట్లాడితే వీళ్లకీ గతి పట్టేదా? మాలమాదుగులతో కలిసి వాడు అట్లా తిరిగేవాడా? ఆ తండ్రి తన చాతకానితనం వల్లకాదా వీళ్ల భవిష్యత్తు నాశం చేసింది? ఈ కాలంలో పిల్లలు ఎంత హుశారుగా ఉంటున్నారు? తను అలాంటి చేతకాని బావమరిదిని చేరదీసింది సుజాత కోసం కాదా? అట్లాగైనా ఒక్క మంచి మాట. పోనీ..." మధుసూదన్‌కు సుజాత రాతిగుండె గలదనిపించింది. అసలు దానికి ప్రేమ లేదని అనుకున్నాడు. స్త్రీకి సంబంధించిన అతని పరిజ్ఞానం సుజాతను అంచనా కట్టడానికి సరిపోలేదు.

తనకు నలభై సంవత్సరాలు దాటుతున్నాయి. సగంలో పడిపోయాడు. ఈ మొత్తం జీవితంలో తాను బాగా అలసిపోయాడు. ఇక్కడి నుండి వెనుదిరిగి చూసుకుంటే తనకు మిగిలిందెవరు? భార్య నా భార్య కాదు. పిల్లలు నా పిల్లలు కాదు.....

మధుసూదన్ అనేకమార్లు ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాడు. ఆ పని చేయగలంత సాహసం, తెగింపు తనకు లేవనిపించాయి. బాగా తాగాలనుకున్నాడు. కాని అప్పుడప్పుడు నిండా తాగినా కూడా అదీ తాత్కాలికమే అయ్యేది – తిరిగి పెద్ద బాధగానే మారేది. అనేక మార్లు సుజాత గొంతు నులిమిపారేయాలనుకున్నాడు. ఆ పనీ చేతకాలేదు. అన్నిరకాలుగా విఫలమై, మానసిక వైద్యుని దగ్గరికి పరుగెత్తాడు.

అతగాడు భార్యను తీసుకరమ్మన్నాడు.

తనకు ఆ వైద్యున్ని తన్నాలన్నంత కోపం వచ్చింది. తను సుజాతతో ఆ మాట చెప్పగలడా? చెప్పకుండా ఈ నరకయాతనలో ఎంతకాలమని బతకడం?

"ఇంతకూ తాను చేసిన నేరమేమిటి?" పదే పదే ఈ ప్రశ్న గింగురుమంటుండగా మధుసూదన్ నడుస్తున్నాడు.

ఆ రోజు డ్యూటీ నుంచి ఇంటికి రాగానే పిల్లలు చెప్పారు – "అమ్మ మామయ్య కోసం పోయిందని." మధుసూదన్‌కు పరిణామాలన్నీ అందరికంటె బాగా తెలుసు. మధుసూదన్ ఈ సంకుల సమరంలో ఇంటా బయటా తనో వేపు నిలబడే ఉన్నాడు.

తన డబ్బుకూ, లావాదేవీలకూ తన సమస్త భవిష్యత్తు పట్ల మధుసూదన్ జాగ్రత్తగానే ఉన్నాడు. వాటికి సంబంధించిన ప్రతిబంధాకాలు గురించి ప్రతిదీ తెలుసుకుంటూనే ఉన్నాడు.

సరిహద్దు భద్రతా దళాల మోహరింపుతో మధుసూదన్ తనలాంటి వాళ్లందరిలాగే ఊపిరి పీల్చుకున్నాడు....ఎప్పటికైనా తనదే గెలుపు అనుకున్నాడు.

కాని చిత్రంగా తాను ఇంటా బయటా ఓడిపోతున్నట్లుగా ఆ క్షణంలో అన్పించింది. అణిగిపోతున్నదనుకున్నది ఎక్కడో రేగుతోంది.

తమ్ముని జాడకోసం ఒంటరిగా తన భార్యే వెళ్లిపోయింది. కాసేపు తీవ్రమైన కోపంతో పెనుగులాడాడు. కాని తనకు ఇష్టం లేకపోయినా బయట లోకం ఒకటున్నది. అప్పుడు మధుసూదన్ కోపం దిగిపోయింది.

అట్లాగే బయలుదేరాడు. దొరికిన రైలు ఎక్కాడు. ఆ మట్టి రోడ్డు మీద నడుస్తున్నాడు.

సన్నగా తుంపర మొదలయ్యింది. ఆ చిరాకులో తానెందుకోసం వస్తున్నదీ కాసా మొదలు మరిచిపోయినవాడిలాగా ఊరి మొదటనే గల మర్రి కింద కాసేపు నిల్చున్నాడు....అక్కడ నిలువ బుద్ధి కాలేదు.

ఊళ్లోకి నడిచాడే గాని తను ఎక్కడికి పోవాలో, ఎవరిని అడుగాలో, ఏమని అడుగాలో ఏమి తోచలేదు. అతనికి తలియకుండానే అత్తగారింటివేపు నడిచాడు. అక్కడ కుప్పకూలిన ఇల్లు తప్ప సుజాత కన్పించలేదు. మధుసూదన్ పూర్తిగా తడిసిపోయాడు...

తనకు జరిగిదంతా భ్రమలాగే తోచింది. అతని మానసిక స్థితి మీద అనుమానం వేసింది. అసలు సుజాత ఇంట్లోనే ఉందేమో?

మధుసూదన్ ఈ స్థితిలో ఉండగానే మాదిగ వాడ నుండి ఊళ్లో కొచ్చిన ఒక యువకుడు మధుసూదన్ దగ్గరి దాకా వచ్చాడు. అతను మధుసూదన్‌ను గుర్తుపట్టాడు.

"సుజాతవ్వ మా ఇండ్లల్ల ఉన్నది" అన్నాడు.

మధుసూదన్‌కు ఏదీ అర్థం కాలేదు. కాళ్లీడిస్తూ ఆ బురదలో తాగినవానిలాగా ఆ ఇండ్ల వైపు నడిచాడు. ఆ యువకుడు ఎందుకో వెనుతిరిగి మధుసూదన్ వెనుకనే దారి సూచిస్తూ నడవసాగిండు.

హరిజనవాడలో చాలా మంది పోగై ఉన్నారు....చింత చెట్టు కింద అనేక గొంతులు ఏడుస్తున్నాయి.. .అలాంటి ఏడుపులు – మొత్తం మనిషిని చుట్టుముట్టే ఏడుపులు తనకు కొత్త – మధుసూదన్ లోలోపల ఏదో కల్లోలం రేగుతోంది. ఆ గొంతుల్లో సుజాత గొంతును మధుసూదన్ పోల్చుకున్నాడు.

మధుసూదన్ ఆ మంది ముందుకు చేరేసరికి ముసలి రాజమ్మ, సుజాత ఒకరినొకరు పెనవేసుకొని ఒకే రక్తం మనుషుల్లాగా ఏడుస్తున్నారు.

మధుసూదన్‌ను చూసి కొందరు దూరం జరిగారు.

"అయ్యో, మా కొడుకు దినాలకచ్చిండ్లావయ్యో!" రాజవ్వ వర్ణిస్తూ పొర్లి పొర్లి ఏడుస్తోంది.

మధుసూదన్‌కు అంతా అర్థమౌతూనే ఉన్నది. అతని పాదాలు భూమిలోనికీ, శిరస్సు నేలమీదికి వాలిపోతున్నట్లుగా ఉన్నవి.

అక్కడ గుమికూడిన స్త్రీలు ఏడుస్తున్నారు. కొందరు ఏదో ఏదో గొణుగుతున్నారు. మరికొందరు తమ సమస్త దుఃఖాలకు కారణభూతమైన వాళ్లెవరినో ఆగ్రహావేశాలతో శపిస్తున్నారు, తిడుతున్నారు. ఒకరినొకరు అంతలోనే ఓదార్చుకుంటున్నారు.

భూమ్యాకాశాలను కలిపేస్తూ ఎడతెగని వర్షం – చుట్టూ కటిక చీకటి.

దూరంగా ఎగువన మానేరు బ్రిడ్జి మీది నుంచి ధణ ధణలాడుతూ ఏదో రైలు ఉత్తరం వైపు వెళ్లిపోతోంది.

సుజాత ఆ ముసలమ్మ మీదపడి అట్లాగే ఏడుస్తోంది.

మధుసూదన్ ఒంటరిగా కలో, భ్రమో తెలియకుండా, జీవిత సాఫల్య వైఫల్యాల వివేచనాశక్తి నశించి నిలబడి ఉన్నాడు.

ఉరుములు, మెరుపులు, ఎడతెగని వర్షంతో ఆ రాత్రి అంత చప్పున తెల్లవారేట్టు లేదు.

● సృజన – జనవరి 1993 ●

★ ★ ★

74

పులుగు శ్రీనివాస్

# లా అండ్ ఆర్డర్

ఆ సెంటర్లో అసహనంగా నిలుచున్నాడు ఈశ్వర్. ఆటోరిక్షాలు చాలానే ఉన్నాయి ఎదురుగా. కానీ అతను పోవాల్సిన దూరం ఎక్కువా, అతని వద్ద వున్న డబ్బు తక్కువా కావడంవలన ఆ ఆలోచనని విరమించుకున్నాడు.

ఆగిన ప్రతి బస్సు బోర్డునూ ఆతృతగా పరిశీలించి తను పోవాల్సిన బస్సు అది కాకపోవడంతో అక్కడే నిలబడి అర్ధగంటసేపటినుంచి నిట్టూర్పులు విడుస్తున్నాడు ఈశ్వర్.

అలసటతో వున్నట్లు ఆలస్యంగా తొమ్మిదవ నెంబరు బస్సు మెల్లగా వచ్చి ఆగింది. గభాల్న బస్సుదగ్గరకు వచ్చి రద్దీగా వున్న ప్యాసింజర్లను తోసుకుంటూ, పట్టువదలని విక్రమార్కుడిలా లోనికి ప్రవేశించాడు ఈశ్వర్.

ఒకసారి గుండెల నిండుగా ఊపిరి తీసుకుని నింపాదిగా వెనుకజేబు తడుముకున్నాడు. డబ్బులు భద్రంగానే ఉన్నాయి. కానీ, అక్కడే పొరపాటు చేశాడు ఈశ్వర్.

ఆ జేబు తడుముకోడాన్ని ఓ గద్దముక్కు ఆగంతుకుడు పసికట్టాడు. ఆ వెంటనే ఆ ఇద్దరిమధ్య ఎడం తగ్గింది. ఆ ఆగంతుకుడు మెల్లగా ఈశ్వర్ వద్దకు వచ్చి నిల్చున్నాడు.

బస్సు కదిలింది.

ఈశ్వర్ ఒక సామాన్య కార్మికుడు. నిన్ననే అతని తమ్ముడు ప్రభాకర్ ఒక అనుకోని చిక్కుల్లో ఇరుక్కున్నాడు. వాడు పదవ తరగతి ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అయినా పైచదువులకు ఓపికలేని తండ్రి ఊరునుంచి ఉద్యోగార్ధమై ఈశ్వర్ వద్దకు పంపించాడు.

ప్రభాకర్ హైదరాబాద్‌కు వచ్చిన మర్నాడే ఈశ్వర్ అద్దెకు వుంటున్న ఇంటి పక్కవాటాలో దొంగలు పడ్డారు. ఆ పక్కవాటాలో వుంటున్నది కూడా ఫ్యాక్టరీ ఉద్యోగే. నైట్ డ్యూటీకి వెళ్ళింది చూసి దొంగలు చాకచక్యంగా దొంగతనానికి పాల్పడ్డారు. వేసిన తలుపులు, తాళం వేసినట్లుగానే వుంచి, గొళ్లెం స్క్రూలు మాత్రం తీసి సామాన్లు ఎత్తుకుపోయారు. నగలు, టేబుల్‌ఫ్యాను, వాచీలు, రేడియో, టేప్‌రికార్డర్, కొంత నగదు మాయమయ్యాయి.

ఉదయం డ్యూటీ నుంచి వచ్చిన ఆ ఉద్యోగి తలుపులు తీసి, లబోదిబోమని మొత్తుకుంటూ పోలీసుల వద్దకు పరిగెత్తాడు. ఆ తర్వాత పోలీసులు వచ్చి దొంగతనం జరిగిన విధానాన్ని పరిశీలించిన అనంతరం, ఆ ఇరుగు పొరుగువాళ్ళ గురించి ఆరాతీస్తూ నిన్ననే కొత్తగా వచ్చిన ప్రభాకర్‌ను అనుమానించారు. అమాయకమైన కళ్ళు, దెబ్బలను తట్టుకోగల దేహదారుఢ్యం తప్ప మరే బ్యాక్‌గ్రౌండ్ లేని పల్లెటూరి సరుకు అని తేలిపోగానే, ప్రభాకర్‌ను సరాసరి పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్ళారు.

ప్రభాకర్‌ను పోలీసులు దొంగల జాబితాలో చేర్చడానికి మరో కారణం కూడా వుంది. ఈ మధ్య ఆ ఏరియా హౌసింగ్ బోర్డు కాలనీలో దొంగల బెడద విపరీతమైంది. ఆ పోలీస్‌స్టేషన్‌కు కొత్త సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఈ మధ్యనే ప్రమోషన్ మీద వచ్చాడు. అతను ఒక్క దొంగను కూడా ఇంతవరకూ పట్టుకోలేకపోయాడు. అనేక ప్రాపకాలు పడి ఈ స్థాయికి ఎదిగిన ఆ కొత్త సి.ఐ.ని ఎస్.పి. అసమర్థుడవని తిడుతూ, ఏదేదో బెదిరించాడు. దాంతో రారెత్తిపోయాడు ఆ సర్కిల్. "ఈ దొంగతనం కేసులో ఒక్కరినైనా తక్షణం అరెస్ట్ చేయకపోతే అడవుల్లో నక్సలైట్ల డ్యూటీ వేస్తానని" చిందులు వేస్తూ, ఎస్.ఐ.ల మీద కసితీర్చుకున్నాడు. అప్పుడు వీరావేశంతో రంగంలోకి దిగారు ఎస్సైలు.

ఫలితంగా అనామకుడైన అమాయక ప్రభాకర్ పోలీసుల బందీ అయి, వాళ్ళ ఫుట్‌బాల్ గ్రౌండులో ఓ బంతిగా మారాడు. పోలీసులు తన్నిన ప్రతీ తన్నుకూ వారు నిర్ణయించుకున్న గోల్‌కు దగ్గరగా చేరుకున్నాడు. ఆ ప్రాంతంలో ఇదివరకు జరిగిన దొంగతనాలను కూడా ప్రభాకర్‌కే అంటగడుతూ వారు అతన్ని బలిపశువును చేశారు.

కార్మికులూ, చిన్న ఉద్యోగులూ నివసిస్తున్న ఆ కాలనీలో, వారి పేదరికాన్నీ అవసరాన్నీ సొమ్ము చేసుకుంటూ నిశ్చింతగా వ్యాపారాలు చేసుకుంటున్న మార్వాడీలను కూడా ఈ సందర్భంగా పోలీసులు చాకచక్యంగా రంగంలోకి దించారు. తాను వచ్చి చాలా రోజులైనా కనీసం ఒక్క మార్వాడీ కూడా తనను కలసి మామూలు సమర్పించుకోలేదని అసలే సర్కిల్‌కు తెగ చిరాకుగా వుంది!

అందుకే ప్రభాకర్‌చేత రకరకాల సర్కస్ ఫీట్లు చేయించారు. గారడీవారు కోతిని ఆడించినట్లుగా, పోలీసులు ప్రభాకర్ చేత మార్వాడీల షాపులే స్టేజీగా గొప్ప నాటకం ఆడించారు. తానే పలు దొంగతనాలు చేసి ఆ సొమ్ములూ, వస్తువులూ, ఆయా మార్వాడీల షాపులలో అమ్మివేసినట్లు తన్ని మరీ ప్రభాకర్‌చేత బట్టీ పట్టించినవన్నీ చెప్పించారు.

ఈ హఠాత్ పరిణామానికి హతాశులైన మార్వాడీలు లబోదిబోమని మొత్తుకుంటూ సర్కిల్ కాళ్ళు పట్టుకున్నారు. అప్పటికే వారి షాపుల్లో తాకట్టులో వున్న బంగారు ఆభరణాలను, ఇతర వస్తువులను జప్తుచేసేశామన్నారు పోలీసులు.

మార్వాడీలవద్ద దొరికినవన్నీ దొంగసొత్తులేననీ, మార్వాడీలు లైసెన్సులు లేకుండా చట్ట విరుద్ధమైన వడ్డీ వ్యాపారం చేస్తున్నారనీ దబాయించి యమ సీరియస్‌గా సంజాయిషీలడిగాడు సి.ఐ.

ఆ దెబ్బకు భీతిల్లిన మార్వాడీలంతా కలసి అర్జంటుగా ఒక మీటింగ్ ఏర్పాటు చేసుకున్నారు. తమ వడ్డీ వ్యాపారాలకు, అప్పుల వసూళ్ళకు ఎప్పటికయినా పోలీసుల సహకారం తప్పనిసరి అవసరమని ఆ సమావేశంలో మర్వాడీల సంఘం ఏకగ్రీవంగా గుర్తించింది. అందుకే ఇకనుంచి సర్కిల్‌సాబ్ సహకారాన్ని పొందటానికీ, ప్రస్తుతం పోలీసులు జప్తుచేసుకున్న సొమ్ములను దక్కించుకోవడానికీ, సంఘం తరపున తగు మొత్తం చందాగా ఇవ్వాలని తీర్మానించింది. అలాగని మార్వాడీలు సర్కిల్‌కు ప్రైవేటుగా ఓ వర్తమానం పంపారు. అదే విధంగా ఇక నుండి ప్రతి నెలా పోలీసులకు కూడా మామూళ్ళు పంపుతామని వివరించారు.

ఒక దెబ్బకు రెండు పిట్టలు పడిపోవడంతో సర్కిల్ ఆనందానికి అవధులు లేకుండాపోయాయి. దొంగతనాల మాట దేవుడెరుగు కానీ, మార్వాడీలు ఇచ్చేసొమ్ములో, కొంత ఎస్.పి. మొహాన కొడితే-సరి. మళ్ళీ తన మీద నోరెత్తడు అనుకున్నాడు సి.ఐ.

మార్వాడీల సంఘం నుంచి చందాలు రాగానే ఎవరి సామానులు వారికే ఇచ్చేశాడు సర్కిల్. ఎస్.పి. కూడా తన దారిలోకి రావడంతో ఇక ప్రభాకర్‌తో పని లేకుండా పోయింది సర్కిల్‌కు. అయినా, ప్రభాకర్‌ను అంతగా చితకతన్నాక, ఊరికే వదిలేస్తే ప్రజలు అనుమానపడతారని యోచించాడు సర్కిల్.

అందుకే ఈశ్వర్ మంచితనాన్నీ, పేదరికాన్ని చూసి మానవత్వంతో ప్రభాకర్‌ను వదిలేస్తాననీ ప్రకటించాడు. అయితే అతన్ని కష్టపడి పట్టుకున్న పోలీసులకు కనీసం ఓ అయిదొందలన్నా సమర్పించుకోవాలని ఈశ్వర్‌కు సూచించాడు.

తాను అంత ఇచ్చుకోలేననీ ఓ రెండు వందల రూపాయలు మాత్రం ఇవ్వగలనని కాళ్ళావేళ్ళాపడి ఒప్పించగలిగాడు ఈశ్వర్.

ప్రస్తుతం ఆ రెండు వందల అప్పుకోసమే ఇక్కడున్న తన మిత్రునివద్దకు వచ్చాడు ఈశ్వర్. పరిస్థితిని అర్థం చేసుకున్న ఆ మిత్రుడు ఆ రెండు వందలు అప్పిచ్చాడు.

ఇదంతా నెమరేసుకుంటున్న ఈశ్వర్ తన ప్యాంటు జేబు మీద ఏదో తగిలినట్లు కాగానే ఉలిక్కిపడ్డాడు. గుండెలు ఝల్లుమన్నాయి. ఆ వెంటనే తన వెనుక జేబు తడుముకొని చూసుకున్నాడు. జేబు భద్రంగానే ఉందని సంతృప్తి చెందాక ఆ తగిలిన వ్యక్తిని చూశాడు. ఈశ్వర్ అప్రయత్నంగా, ఇంకెవరు! అతనే! ఆ గద్దముక్కువాడే!

ఇంతలో కండక్టర్‌తో ఒక ప్యాసింజర్ వాగ్వివాదానికి దిగాడు.

"ఇగో!.....నా పావలా పైసలు నాకు ఇచ్చేయ్.... ఇదివరకు పదిపైసలే ఎగ్గొట్టేవాళ్ళు.... ఇప్పుడు....మీ కమీషన్‌కూడా పెరిగి పావలాలదాకా వచ్చిందన్నమాట. ఆఁ... పోనీ! ఒక్కపని చేయ్.... నీ పైసల బ్యాగు ఈ జనానికి చూపెట్టు. చిల్లర లేకపోతే మేమంతా కలసి నీకు చందాగా ఆ డబ్బులను ఇచ్చామనుకుంటాం" అంటూ నిలదీయడంతో తెల్లమొహం వేసిన కండక్టర్ అవమాన భారంతో వెంటనే అతని పావలా అతనికి ఇచ్చేశాడు.

సరిగ్గా అదే సమయంలో ఎందుకో.... అనుకోకుండా ఈశ్వర్ చేయి తన జేబుమీదకు వెళ్ళింది.... గుండె గుభేలుమంది.

జేబులో డబ్బులేదు!

కంగారుగా గిరుక్కున వెనుకకు తిరిగిన ఈశ్వర్, అప్పుడు గబగబా డోర్ వైపు అడుగులేస్తున్న గడ్డముక్కు అగంతుకుడిని గమనించి గబుక్కున పట్టుకున్నాడతని చెయ్యి.

"నా డబ్బు!... నా డబ్బు" అంటూ అరిచాడు ఈశ్వర్. గబగబా అతని జేబు తడిమాడు. తన వంద రూపాలయ నోట్లు రెండూ కన్పించగానే "దొంగ!... దొంగ!... పట్టుకోండి!.... కొట్టండి!!" అంటూ బిగ్గరగా అరవడం ప్రారంభించాడు.

"ఏంది బే!.... నన్ను దొంగంటవ్?...." అంటూ ఈశ్వర్‌ను బలంగా వెనుకకు తోశాడు గడ్డముక్కు వ్యక్తి గాండ్రిస్తూ.

ఆ వూపుకు ప్రయాణికుల మీద పడ్డ ఈశ్వర్ కండక్టర్ సహాయాన్ని అర్థించాడు. ఆ కండక్టర్ బస్సు ముందు డోర్ ఫుట్‌బోర్డు మీద నించొని, సిగరెట్లు కాల్చుకుంటున్న ఇద్దరు పోలీసులను పిలిచాడు.

పోలీసులు రంగ ప్రవేశం చేసి గడ్డముక్కు వ్యక్తిని చెరో వైపు పట్టుకుని బస్సులోనే బాదటం ప్రారంభించారు. బస్సులోని మహిళలు, పసిపిల్లలు భయభ్రాంతులైపోయారు. "పోలీసులు ఇంత దారుణంగా కొడతారా?" అనే ఆశ్చర్యంలో వారు బిక్కచచ్చిపోయారు.

రోడ్డుమీద పోలీస్‌స్టేషన్ కన్పించగానే బస్సును ఆపమన్నారు పోలీసులు.

"సార్! నా డబ్బులు?" అన్నాడు ఈశ్వర్ దీనంగా.

"అరే!.... నీ డబ్బులెక్కడికెళ్ళవు గానీ, నీవు కూడా మాతో రా!...." అన్నారు పోలీసులు, దొంగను లాక్కెళ్తూ.

గబగబా బస్సుదిగి వారిని వెంబడించాడు ఈశ్వర్.

ఆ పోలీస్‌స్టేషన్ చూడగానే, తాను ఇదివరకు ఒకసారి ఆ స్టేషన్‌కు వచ్చినట్లు గుర్తుపట్టాడు ఈశ్వర్.

తన మిత్రుడు ఒకడు ఆ పోలీస్‌స్టేషన్ పరిధిలోనే ఒకసారి రోడ్డు ప్రమాదానికి గురయ్యాడు. ఆ మిత్రుడి కొత్త లూనాను ఎదురుగా వస్తున్న ఒక జీపు దురుసుగావచ్చి గుద్దివేయడంతో ప్రమాదం సంభవించింది. మిత్రునికాళ్ళు పూర్తిగా విరిగిపోయాయి. ఇప్పటికీ లేవలేని స్థితిలో ఆస్పత్రిలోనే చికిత్స పొందుతున్నాడు. ఆ లూనాను పోలీసులు స్వాధీనం చేసుకుని ఈ స్టేషన్‌లోనే వుంచారు. తన మిత్రుని బంధువులతో కలిసి అప్పట్లో ఆ లూనాను విడిపించుకుపోవడానికి ఇక్కడకు వచ్చాడు ఈశ్వర్.

అది కొత్తగా కొన్న లూనా. రోడ్డు ప్రమాదంలో ముందు చక్రం వంగిపోయింది గానీ మిగతా భాగాలన్నీ బాగానే వున్నాయి. కానీ తమ రక్షణలో వున్న ఆ లూనాను పోలీసులే భక్షించేశారు. విడి భాగాలన్నీ మటుమాయమైనాయి. కొన్ని కొత్త విడిభాగాలను పోలీసులు పీకి తమ లూనాలకు బిగించుకోగా, మిగతావి అమ్ముకున్నారు.

చివరికి ఆ లూనా అవతారం, పాత సామానులవాడి వద్ద నుంచి దొంగిలించి తెచ్చిందానిలా తయారయ్యింది. అందుకే ఇన్సూరెన్సువారు ఆ లూనా కేసు అలాగే పెండింగ్‌లోనే వుంచారు.

దురుసుగా డ్రైవ్ చేసి ప్రమాదానికి కారణమైన జీపు యజమాని వద్ద లంచం పుచ్చుకొని అతని పేరుకూడా పైకిరాకుండా జాగ్రత్తపడ్డారు పోలీసులు. ఏవిధమైన నష్టపరిహారం దొరకక, కాళ్ళు విరిగి ఇంకా ఆస్పత్రిలోనే బాధపడుతున్నాడు ఆ మిత్రుడు.

ఈ సంఘటన గుర్తుకు రాగానే ఈశ్వర్ గుండెల్లో ఏదో రొద, బాధ, అనుమానం ప్రారంభమైనాయి.

వీళ్ళను చూసి, "కేసు!.... కేసు!...." అంటూ అక్కడి పోలీసులు సంబరపడ్డారు. స్టేషన్‌లో అంతా అప్రమత్తులయ్యారు.

ఈశ్వర్‌తో వచ్చిన ఇద్దరు కానిస్టేబుళ్ళూ ఆ స్టేషన్ కానిస్టేబుళ్ళతో పోలీసు భాషలో ఏదో మాట్లాడుకున్నారు.

గడ్డముక్కు దొంగను ఆ స్టేషన్ పోలీసులు పక్క గదిలోకి మర్యాదగా తీసికెళ్ళారు. బస్సులో వచ్చిన ఇద్దరు పోలీసులూ ఈశ్వర్‌ను ఎస్.ఐ. ముందు ప్రవేశపెట్టారు.

ముందుకు పొడుచుకువచ్చిన మూతిమీద అతికించినట్లు అసహజంగా వున్న కోరమీసాల ఎస్.ఐ.ని చూడగానే గుర్తుపట్టాడు ఈశ్వర్.

"డబ్బులు కావాలన్నా, కేసులు లేకపోయినా, ప్రమోషన్ పొందాలన్నా, చివరికి ట్రాన్స్‌ఫర్ కావాలన్నా పోలీసులు అతి తెలివిగా తమ అధికారాన్ని ఉపయోగించి దిక్కుమాలినవాళ్ళని కేసుల్లో ఇరికిస్తారని" ఎవరో చెప్పగా విన్న విషయం గుర్తుకు వచ్చింది ఈశ్వర్‌కు. అందుకే గుమ్మున నించున్నాడు ఎస్.ఐ. ముందు.

పొడుచుకువచ్చిన కోరమీసాలను ఒకసారి చేతులతో బుగ్గలకు అదుముకుని "ఎవరితను?...." అని ప్రశ్నించాడు ఎస్సై.

"ఇతను బస్‌ప్యాసింజర్ సార్!... ఎవరో ఇతన్ని పిక్‌పాకెటింగ్ చేసింద్రు!.... చెప్పవయ్యా.... ఏం జరిగిందో!...." అన్నారు కానిస్టేబుల్స్ ఈశ్వర్ భుజాన్ని అదిలించి.

"సార్!.... బస్సులో రద్దీ ఎక్కువగా వుంది. అయినా ఏదో ఆయాసపడుతూ ఓ పక్కన నించున్నాను సార్!.... కాసేపైన తర్వాత ఒక వ్యక్తి మెల్లగా నా వెనుకకు వచ్చి నించోని, నా జేబులో వున్న డబ్బు కాజేశాడు సార్!.... అదృష్టవశాత్తు వెంటనే అది గమనించి ఆ దొంగను పట్టేసుకున్నాను సార్!.... నా డబ్బులు అతని జేబులోనే ఉన్నాయి సార్! ఇంతలో ఈ పోలీసులు మమ్మల్ని స్టేషన్‌కు తీసుకొచ్చారు. నా డబ్బులు నాకు ఇప్పిస్తే నేను వెళ్ళిపోతాను సార్! నేను చాలా ఆపదలో వున్నాను" అంటూ ఈశ్వర్ ఒక్క ఉదుటున తన బాధనంతా వెళ్ళగక్కాడు.

"అచ్చా! నీ పేరు?...." అడిగాడు ఎస్.ఐ.

చెప్పాడు ఈశ్వర్.

ఒక చిన్న హ్యాండ్‌బుక్ మీద రాసుకుంటూ–

"ఏ ఊరు?...." అడిగాడు ఎస్.ఐ.

అడ్రసూ వగైరాలన్నీ వివరంగా చెప్పాడు ఈశ్వర్.

"ఏం పని చేస్తావు?"

"కె.కె. ఇంజనీరింగ్‌లో టర్నర్‌ని సార్!"

"ఎక్కడ బస్సెక్కావు?"

"అబిడ్స్‌లో...."

"ఎక్కడికెళ్తున్నావు?"

"కూకట్‌పల్లికి!...."

"బస్సు రూట్ నెంబరెంత?"

"9వ నెంబరు."

ఎంతో పరిశోధనాత్మకంగా ప్రశ్నలడిగానని ఎస్.ఐ. సంతృప్తిగా మరోసారి కోర మీసాలను సర్దుకొని హ్యాండ్‌బుక్ మూసివేశాడు. మరెంతో వేగంగా ఆ ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చినందుకు తృప్తిపడుతూ తన డబ్బులు వెంటనే తిరిగి వస్తాయని సంబరపడ్డాడు ఈశ్వర్.

"అరేయ్.... ఫోర్‌ట్వంటీ!" కేకవేశాడు ఎస్.ఐ.

"ఎస్ సార్!" అన్నాడు ఆ కానిస్టేబుల్.

"ఆ చోర్ బడ్కావ్ బట్టలూడదీసి మొత్తం చెక్ చేయండి! ఇంకా ఒక తడి తగిలించారా లేదా?" అడిగాడు ఎస్.ఐ.

"సార్!.... ఇంకా ఇంటరాగేషన్ చేస్తున్నాం సార్!"

"ఒకే!.... తోలు వొలిచేయండి నా కొడుకును!" అని కానిస్టేబుల్‌ను పంపించాడు ఎస్.ఐ.

"మేము వెళ్తాం సార్!" అన్నారు ఈశ్వర్‌తో బస్‌లో వచ్చిన కానిస్టేబుళ్ళు నమ్రతగా ఎస్.ఐ.కి మరోమారు సెల్యూట్ కొట్టి.

"ఆ.... మీ పేర్లు?" అన్నాడు ఎస్.ఐ. తిరిగి హ్యాండ్‌బుక్ ఓపెన్ చేసి.

"వద్దు సార్!... మేము వేరే డ్యూటీమీద వునాం. శుక్రవారం కదా? ఇవ్వాళే కొత్త సినిమా రిలీజ్ అయింది. డ్యూటీ పాయింట్ మీది నుంచి ఆ టాకీసువద్ద బ్లాక్‌లో టికెట్లు అమ్మేవాళ్లని పట్టుకుందామని వచ్చాం సార్! మీరిప్పుడు మా పేర్లు రాసుకుని డిపార్టుమెంటుకు తెలియజేస్తే మా కథ మొత్తం అడ్డం తిరుగుతుంది. అందుకే వద్దు సార్! మాకు సెలవు ఇప్పించండి చాలు" అన్నారా కానిస్టేబుళ్ళు గుసగుసగా.

"అచ్చా!.... అయితే డ్యూటీ తర్వాత కన్పించండి" అని వారికి సెలవిచ్చాడు ఎస్.ఐ.

"ఏదో సార్! మీ దయ" అని వెళ్ళిపోయారు ఆ కానిస్టేబుళ్ళు.

"ఆ జేబు దొంగను అంతా చెక్‌చేశాం సార్! ఇవే దొరికాయి" అని కానిస్టేబుల్ ఒక కొత్తబ్లేడ్, కత్తెర, బీడీకట్ట, చిల్లర డబ్బులు వుంచాడు ఎస్.ఐ. ముందు.

వాటిని చూసి షాక్‌తిన్న ఈశ్వర్, "సార్! నా రెండు వందల రూపాయల నోట్లు ఏవి సార్? నేను స్వయంగా అతని జేబులో చూశాను సార్!...." అంటూ అరిచినంత పనిచేశాడు గజగజ వణుకుతూ.

"ఎందుకు అంత పరేషాన్ అయితవ్?... అరే!.... ఆ చోర్ బాడ్కావ్‌ను ఇటు పట్టుకరారా...." అన్నాడు ఎస్.ఐ. పళ్లు కొరుకుతూ.

ఇద్దరు కానిస్టేబుళ్ళు ఆ గద్దముక్కు దొంగను ఎస్.ఐ. ముందు నిల్చోబెట్టారు.

"చెప్పు...! ఈయన రెండు వందలు ఏం చేశావు?...." అడిగాడు ఎస్.ఐ. గద్దిస్తూ

"నాకేం తెల్సు సార్?" అన్నాడు వాడు.

"పచ్చి అబద్ధం సార్! ఆయన జేబును చూస్తూనే వచ్చాను సార్! ఈ స్టేషన్‌కు వచ్చాకే నేను మీ వద్దకు, అతను వేరే గదిలోకి విడిపోయాం! ఏదో మాయ చేస్తున్నాడు సార్! నా డబ్బులు నాకు ఇప్పించండి సార్!...." అంటూ ఎస్.ఐ.ని దీనంగా వేడుకున్నాడు ఈశ్వర్.

"లేదు సార్! నాకు అదేం తెలీదు సార్!" అన్నాడు దొంగ తన గద్దముక్కును కుడిచేయి మణికట్టుతో రుద్దుకుంటూ.

ఎస్.ఐ. ఒక్క ఉదుటున తన సీటులోంచి లేచాడు. దొంగను దొరకబుచ్చుకుని బూతులు తిడుతూ, బాదటం ప్రారంభించాడు. ఉగ్రరూపం దాల్చి ఇష్టం వచ్చినట్లు కొట్టాడతన్ని.

ఈశ్వర్‌కు భయంతో కాళ్ళు చేతులు వణకసాగాయి.

"ఆ డబ్బులే పోతే..." అన్న ఆలోచన అతన్ని అదరగొట్టింది.

తన తమ్ముడి దీనస్థితి గుర్తుకువచ్చి ఈశ్వర్ కళ్లల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. ఈ సమాజం అంతా ఏకమై, తనమీద మూకుమ్మడిగా దాడిచేసి, తనను పీక్కుతింటున్నట్లు బాధపడ్డాడు.

ఎస్.ఐ. ఆ జేబు దొంగనలా కొట్టీకొట్టీ వగరుస్తూ కుర్చీలో కూలబడ్డాడు. ఆయాసంతో ఒక్కసారి బొజ్జ తడుముకున్నాడు. వాలిన మీసాలను సవరించుకున్నాడు.

"మంచిది..... తర్వాత నీ డబ్బులు దొరికితే పంపిస్తాను!..... ఇక నీవు వెళ్ళొచ్చు!...." అన్నాడు ఎస్.ఐ.

పిడుగుపడ్డట్లు అదిరిపడ్డాడు ఈశ్వర్. విద్యుత్‌ఘాతం తగిలినట్లు విలవిలలాడాడు.

చిట్టడవిలో హఠాత్తుగా తనను చిమ్మచీకట్లు చుట్టుముట్టినట్లు హడలెత్తిపోయాడు. దిక్కులు పిక్కటిల్లేలా అరవాలనుకున్నాడు, కానీ గొంతు పెగల్లేదు.

"సార్!.... ఇది అన్యాయం సార్!..... ఆ దొంగ అన్నీ అబద్ధాలాడుతున్నాడు సార్!.... నా డబ్బులు ఎక్కడోగాని ఈ స్టేషన్లోనే దాచాడు సార్! ప్రామీస్ సార్!.... నా డబ్బులు నాకు ఇప్పించండి సార్!" అంటూ ఏడుపు గొంతుతో ఎస్.ఐ.ని బతిమిలాడాడు ఈశ్వర్.

"నువ్వెక్కడి మనిషివయ్యా బాబూ!.... నీముందే కదా నిజాన్ని కక్కించడానికి వాడిని అంతగా తన్నింది? వాడి జేబులు చెక్‌చేస్తే ఏమి దొరికాయో నీవు కూడా చూశావు కదా? ఎందుకు ఇంక నీ నస! వెళ్ళిపో!.... ఒకవేళ దొరికితే తర్వాత పంపిస్తానన్నాను కదా?...." అంటూ కసురుకున్నాడు ఎస్.ఐ.

ఈశ్వర్‌కు ఇంక ఏం మాట్లాడాలో తోచలేదు. అయినా, డబ్బులు తర్వాతనైనా పోలీసులు పంపిస్తారేమోననే ఆశ అతనిలో ఎక్కడో ఊపిరిపోసుకుంది.

"సార్!.... పోనీ మీరు తర్వాత డబ్బులు పంపించడానికైనా నా వివరాలు కావాలికదా సార్....! ఒక దరఖాస్తు రాసిస్తాను తెల్లకాగితం ఇప్పించండి సార్" అడిగాడు ఈశ్వర్ దీనంగా.

"ఓకే!.... నీవు దరఖాస్తు రాసిస్తే నాకు పోయేదేం లేదు. కేసు రిజిస్టర్ చేస్తాను. కానీ నీకే చిక్కులు వస్తాయి. మేము పిలిచినప్పుడల్లా కోర్టుకు రావాల్సి వస్తుంది సుమా!...." బెదిరించాడు ఎస్.ఐ. సున్నితంగా.

"ఫర్వాలేదుసార్!.... నాకు డబ్బులు రావడంతోపాటు ఆ దొంగకు శిక్ష పడడటం కూడా ముఖ్యం సార్!... తెల్లకాగితం ఇవ్వండి రాసిస్తాను!...." అన్నాడు ఈశ్వర్ ఒక నిశ్చయానికి వచ్చినట్లుగా.

"అరేయ్!... ఫోర్ట్వంటీ తెల్లకాగితం తేరా!"

కానిస్టేబుల్ తెల్లకాగితం ఇవ్వగానే ఎస్.ఐ. ముందువున్న బెంచ్‌మీద కూర్చొని తనకు జరిగిన అన్యాయాన్ని తనకు తెలిసిన తెలుగు భాషలో వివరంగా రాసి ఎస్.ఐ.కి అందజేశాడు ఈశ్వర్ వినయంగా.

ఆ ఫిర్యాదు పత్రాన్ని తీసుకొని వెంటనే ఆ కోరమీసాల ఎస్.ఐ. ఆ పక్కనే వున్న మరో గడ్డం ఎస్.ఐ.కి అందించాడు.

అంటే అతని కేసు కోరమీసాల ఎస్.ఐ. నుంచి గడ్డం ఎస్.ఐ.కి బదలీ అయిందన్నమాట! ఈశ్వర్‌ను తన వద్దకు రమ్మన్నాడు. గడ్డం ఎస్.ఐ. ఆ ఫిర్యాదును పక్కనబెట్టి, అతనో చిన్న హ్యాండ్‌బుక్‌ను తెరచి, తిరిగి ఈశ్వర్‌ను ప్రశ్నించడం ప్రారంభించాడు:

"నీ పేరు?.... తండ్రిపేరు" అన్నాడు గడ్డం ఎస్.ఐ. హైదరాబాద్ ఉర్దూలో.

ఈ తతంగం అంతా చాలా నింపాదిగా జరుగుతూ వుంటే ఈశ్వర్‌కు పట్టరాని కోపం వచ్చింది. "పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణ సంకటం" లాగ తయారైంది పరిస్థితి.

"చూడండి సార్!... ఆ దరఖాస్తులో అన్నీ వున్నాయి. మళ్ళీ అడగడమెందుకు?" అన్నాడు తెగించిన ఈశ్వర్ చిరాకుతో.

"అయ్యయ్యో! నాకు తెలుగు చదవడం రాదే! ఏం చేసేది?" అన్నాడు గడ్డం ఎస్.ఐ. యాసలో.

"ఆంధ్రదేశంలో ఉద్యోగం చేసుకుంటూ తెలుగు రాదంటావేంరా మూర్ఖుడా! ఆ భాష రాకుంటే నేర్చుకో! లేదా, వచ్చినవాడితో చదివించుకో! అదీ కాకపోతే ఉద్యోగానికి రాజీనామా చేసి వెళ్ళిపోరా నా కొడకా!" అనాలనుకున్నాడు ఈశ్వర్ కోపంగా.

కానీ అలా అనలేకపోయాడు. నిరపరాధి అయిన తన తమ్ముడిని అపరాధిని చేసి విపరీతంగా హింసించడమే కాకుండా, బూటకపు కేసులు బనాయించడం చూశాక ఈశ్వర్ ఆ విధంగా ఆవేశంగా మాట్లాడేధైర్యం చేయలేకపోయాడు.

ఈశ్వర్ మొహంలో అకస్మాత్తుగా ఎర్రరంగు కన్పించడంతో ఏమనుకున్నాడో ఆ గడ్డం ఎస్.ఐ. "సరేలే, ఇక నీవు వెళ్ళచ్చు" అన్నాడు ఉర్దూలో.

"మరి నా డబ్బులు ఎప్పుడు ఇస్తారు? నా కంప్లైంటుకు రశీదు ఇవ్వరా?" అన్నాడు ఈశ్వర్ కాస్త మొండిగానే.

"డబ్బుల సంగతి కోర్టులో తేలుతుంది! ఇక రశీదు కావాలంటే ఇప్పుడే ఇస్తాను. దానికి ఏముంది భాగ్యం?" అంటూ రశీదు బుక్ కోసం కేకేశాడు.

"రశీదుబుక్ లేదుకదా సార్?" అన్నాడు మరో కానిస్టేబుల్ ప్రవేశించి.

"చూడు....! సర్కిల్ సాబు దగ్గరుంది తీసుకురా పో..."

ఆ కానిస్టేబుల్ వెళ్ళిపోయాడు.

గడ్డం ఎస్.ఐ. నింపాదిగా కుర్చీలో ఒరిగి కూర్చొని, పళ్ళల్లో ఇరుక్కున్న దేన్నో అగ్గిపుల్లతో గెలుకుతూ, కుస్తీ పట్టడం ప్రారంభించాడు. ఈశ్వర్‌కు ఆ దృశ్యం కడుపులో వికారాన్ని కలిగించింది. ఎస్.ఐ. కడుపు నిండి ఆయాసంతో బాధపడుతుంటే, ఈశ్వర్ కడుపు ఎండీ, మండీ అలమటిస్తున్నాడు.

ఈశ్వర్‌కు విపరీతమైన కోపం వచ్చింది. ప్రభుత్వం తమకు ఉద్యోగం ఇచ్చి, యూనిఫాం కప్పినందుకు పోలీసులు ఇలా లైసెన్స్ పొందిన రౌడీల్లాగ ప్రవర్తించడం అసహ్యం కలిగించింది.

గడ్డం ఎస్.ఐ. ముందున్న తన కంప్లైంట్ పత్రం గాలికి కింద పడటంతో, ఈశ్వర్ లేచి భద్రంగా దాన్ని తీసి టేబుల్ మీద పెట్టాడు. అలాంటివి ఇంకొన్ని ఉన్నాయక్కడ. అయినా, ఎస్.ఐ ఏ మాత్రం స్పందించలేదు. కనీసం ఆ దరఖాస్తుల వైపు చూసినట్లు కూడా లేదు.

"సర్కిల్ సాబ్ టేబుల్ డ్రాయర్లో కూడా రశీదు బుక్కు లేదు సార్!" అన్నాడు ఎయిట్ ఫార్టీ తిరిగివచ్చి.

"పోనీ, స్టాంప్ తీసుకురా!" అన్నాడు ఎస్.ఐ. కాస్త కోపాన్ని ప్రదర్శిస్తూ.

"స్టాంప్ వుంది. కానీ, స్టాంప్ ప్యాడ్ లేదు సార్!"

"అన్నీ సరిగ్గా చూడరా వెధవా!" అని కసురుకున్నాడు ఎస్.ఐ.

ఇక తప్పేట్టులేదని ఎయిట్ ఫార్టీ, చివరికి రబ్బర్ స్టాంప్ తెచ్చి ఇచ్చాడు.

"సబ్ ఇన్‌స్పెక్టర్ లా అండ్ ఆర్డర్" అన్న ఆ రబ్బరు స్టాంప్‌ను, తెల్ల కాగితం మీద వేసి, ఆ గడ్డం ఎస్.ఐ. దానిపై సంతకం చేసి ఇచ్చాడు ఇబ్బందిగా.

"థ్యాంక్యూ సార్! నా డబ్బులు కూడా త్వరగా ఇప్పించండి సార్!" అన్నాడు ఈశ్వర్ ఆరిపోని ఆశతో.

"అలాగేలేవయ్యా! గజ్జిలాగా పట్టుకున్నావు విడువకుండా! ఇక నీవు వెళ్ళవచ్చు" అన్నాడు ఎస్.ఐ. ఉర్దూలోనే.

ఆకలి, అసంతృప్తి, అసహాయత ఒకేసారి ఆవరించడంతో కళ్ళు తిరిగినట్లైంది ఈశ్వర్‌కు. తన తమ్ముడు ప్రభాకర్ దీనస్థితి గుర్తుకు రాగానే అక్కడే ఏడవాలని కూడా అన్పించింది. మిట్టమధ్యాహ్నం కావడంతో మండిపోయే ఆకలి అతన్ని వెంబడించి వెంటాడుతోంది.

ఈశ్వర్ నీరసంతో తూలిపోయినట్లు అడుగులు వేస్తూ అక్కడినుంచి కదిలాడు నెమ్మదిగా.

పోలీస్‌స్టేషన్ నుంచి బయటకు వస్తుంటే కుడివైపున వున్న గదిలోకి చూసి ఆశ్చర్యపోయాడు ఈశ్వర్. ఆ గది తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. అవి గాలికి కొద్దిగా తెరుచుకోవడంతో ఏర్పడిన సందుగుండా పోలీసుల అవతారాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

ఇంతసేపూ తనతో మాట్లాడిన కోరమీసాల ఎస్.ఐ. ఫోర్ట్వంటీ కానిస్టేబుల్, గద్దముక్కు దొంగ, ఒకరిద్దరు పోలీసులూ కలసి చికెన్ బిర్యానీలు తింటున్నారు. ఇంతవరకు తనకు రశీదు ఇవ్వకుండా ఇబ్బంది పెట్టిన కానిస్టేబుల్, పార్సిల్స్ ఊడదీస్తూ చికెన్ బిర్యానీ వడ్డిస్తున్నాడు ఆప్యాయంగా.

ఆ గదిలోనే ఓ రెండు కాబిన్స్‌లాంటి చిన్న గదులున్నాయి. ఒక గది ముందు "లాకప్" అనీ, మరో గది ముందు "ఆర్మ్స్" అని రాసి వుంది. అక్కడ కొంతమంది జోరుగా పేకాటలో మునిగివున్నారు. మరికొంతమంది గది గోడల వెంట వరసగా పెట్టిన ఇనుపపెట్టెల మీద మత్తుగా నిద్రపోతున్నారు.

అంతమందిలో పోలీసులు ఎవరో, దొంగ లెవరో అసలు గుర్తుపట్టలేకపోయాడు ఈశ్వర్. బనియన్లు, డ్రాయర్లు, ప్యాంట్లు, వివిధ రకాల దుస్తులు ధరించి అందరూ ఒకేలాగ వుండటం వల్ల వారిని విభజించి చూడటం సాధ్యం కాలేదు.

"ఇప్పుడు మల్ల ఏ రూట్ల బోతవురా బచ్చా," ఎవరో అడిగారు బొంగురు గొంతుతో, గద్దముక్కు దొంగను.

"ఏమో! ఎస్.ఐ. సాబ్ దయ" అని గద్దముక్కు దొంగ, ఆ పక్కనే ఇనుపపెట్టెమీద కూర్చొని, అవురావురుమంటూ బిర్యానీ తింటున్న కోరమీసాల ఎస్.ఐ. కాళ్ళు పడుతూ అన్నాడు.

"బహుత్ బహుత్ షుక్రియారే! జాదా తన్నులు తిన్నా ఆ రెండు వందల రూపాయిలతో మంచి తిండే పెట్టినవ్! రాత్రికి నాకు ఒక మర్డర్ కేసు అడ్వాన్స్ వస్తుందిలే! తన్నిన తన్నుల నొప్పులు తగ్గేదాకా మందు కొట్టిస్తాలే! ఫికర్ మత్ కరో!" అని ధైర్యం చెప్పాడు మరో రౌడీ, చేతులు కడుక్కుంటూ.

ఈశ్వర్ అవన్నీ వింటూ షాక్ తిని బ్రమాన్పడిపోయాడు.

ఒక పచ్చి నిజం ఈశ్వర్‌కు అవగతం కాగానే, కోపంతో రక్తం వేడెక్కింది.

"ఆర్మ్స్" అన్న అక్షరాల మీద అతని చూపు క్షణకాలం నిలిచింది. తన చేతిలో వెక్కిరిస్తున్నట్లు ఉన్న రశీదు కాగితాన్ని కసకసా నలిపి, ఆ గదిముందు కసిగా విసిరి, అక్కడినుంచి వెళ్ళిపోయాడు విసురుగా.

● *1993 ఫిబ్రవరి 'విపుల' మాసపత్రిక* ●

★ ★ ★

75

పినాకపాణి

# విత్తనాలు

సాయంత్రం ముఖంమీద నల్లని చీకట్లు పారాడుతున్నాయి. చెట్లమీది కాకులు భక్తిపాటలో, బానిసత్వపు పాటలోగాని సహజంగా లేనివి పాడుతున్నాయి. ఊళ్ళో జనాలు నెలలతరబడి జ్వరం మంచాలు దిగనివాళ్ళలాగున్నారు. ఎవరికీ పనిలేదు. మోకాళ్ళ మధ్య తల పెట్టి కూర్చున్నట్లుంది ఊరు. పనుల్లేక చేతులు జివజివలాడుతున్నాయి ఏ టీకొట్టువాడు పెట్టాడోగాని సినిమాపాటలు రంజుమీదున్నాయి. అవి జనాలకు ఉత్సాహాన్నివ్వడంలేదు, మత్తునూ యివ్వడంలేదు.

టైం ఆరున్నరవుతుండగా గుళ్లో జాగంటలు మోగడం మొదలయింది. అయిదు నిమిషాలపాటు ఊరు, ఊరు నానుకొని శతాబ్దాలుగా పడున్న కొండలు ఆ శబ్దాన్ని ప్రతిధ్వనించాయి. ఊళ్లో కనీసం యింటికొకరైనా నీరసంవోడే ముఖాలతో గుళ్ళో ఉండిఉంటారు. కానీ, వొక్కరికీ మనసు దేవునిమీదలేదు. అది ఆకలికడుపుల్లో చిక్కుకొనిపోయి ఉంటుంది.

బసప్పకు గుడితో పనిలేదు. గుడితోనే కాదు, అసలు ఏపనీలేదు. కానీ మనసు అదేపనిగా బాధపడ్తుంది. కొండలకు వెనకవైపున బసప్ప ముత్తాత సంపాదించిన మూడెకరాల పొలముంది. ఇంటి వసారాలో గుంజకు కట్టేసిన రెండు ఎద్దులున్నాయి. సొంత భూమిలో సొంతగా వ్యవసాయం చేసుకోడానికి సొంత ఎద్దులు ఉండాలనేది బసప్ప యింటి సాంప్రదాయం.

ఇప్పుడు పొలంలో పంటలేదు. ఎద్దులకు మేతలేదు. తనిప్పుడు రైతునన్న అభిప్రాయంకూడాలేదు. ఎప్పుడైనా ఆ విషయం గుర్తొస్తే భయమేస్తుంది. తను రైతైతే ఎప్పుడో చచ్చిపోయేవాడే! కాకుంటే ఇప్పటిదాకా బసప్పగానే బతుకుతున్నాడు.

అయినా పొలం వెళ్ళొస్తుంటాడు. వ్యవసాయం చేయడానికి కాదు. వ్యధలు పంచుకోవడానికి. భూమికి ఎప్పుడు కష్టాలే! ఆ భూమ్మీద తనకెప్పుడూ కష్టనష్టాలే! ముప్పై అయిదేళ్ళు నిండని బసప్ప యాభైల్లో ఉన్నట్లుంటాడు. నెత్తి నెరవలేదు కానీ ఆలోచనలే నెరిసిపోయాయి – వెలిసిపోయాయి. సూర్యుడట్లా పడమటి కొండలవైపు ముఖం చూపగానే పొలానికని బయల్దేరాడు. గెనిమ్మీద నిలబడి పొలంలోని రేణువురేణువును మౌనంగా పలకరించాడు. వొంగి కుడిచేత్తో పిడికెడు మట్టి తీసుకొని పిడికిలి బిగించి తెరిచాడు. మట్టి ముద్దకాకుండా విరిగిపోయింది. వారం కిందటే విత్తనాలు వేయాల్సింది. ఇప్పటికీ కుదర్లేదు. అసలు ఈసారి

వానలే ఆలస్యమై కార్తె మీరిపోయింది. మళ్ళా ఇప్పట్లో వానలు కురిసేటట్లులేదు. ఎండ పళపళ కాస్తుంది. ఇట్లే యింకో నాలుగు రోజులుపోతే ఈ యేడు కూడా బీడు పెట్టాల్సివస్తుంది..... బసప్ప మనసు వికలమైంది. వొళ్ళంతా నీరసం కమ్మింది. కాసేపయ్యాక లేచి పొలంచుట్టూ నాలుగు గట్లెంట కర్ర పొడుచుకుంటూ తిరిగాడు. బాధను భుజానేసుకొని ఇంటిదారి పట్టాడు.

అతను రైతుననుకోడానికి బెదిరే భూమిబిడ్డ.

అది ఊళ్ళోని రెండు ప్రధాన దారులు కలిసే చోటు. అంతేగాక చెరువుకట్టమీది నుండి వచ్చే దారి కూడా కలుస్తుంది. అక్కడ – ఎండపొడ పడకుండా గుబురుగా అలుముకున్న యాపచెట్టు – దానికింద చుట్టూ మూడు మెట్లతో నడుముల ఎత్తున విశాలమైన గౌరమ్మరుగు. సాయంత్రం దాటి రాత్రయింది. అరుగుమీద పదిహేనుమంది దాకా కూర్చోని ఉంటారు. ఎవరూ మాట్లాడటంలేదు. మాట్లాడినా ప్చ్....ఊఁ....అనే నీరసపదాలే!

బసప్ప దారెంటపోతూ వాళ్ళవైపు చూచాడేగాని ఎవరినీ నోరెత్తి పలకరించలేదు. అరుగు దాటింతర్వాత రోడ్డుకు ఎడమపక్క పచ్చరంగు ప్రజా టెలిఫోను కేంద్రం కనిపించింది. రోజూ చూచేదే అయినా ఆగి నిమిషంపాటు దానికేసి చూచాడు.

ఊర్లో దీన్ని పెట్టినాల్నుండి ఏ వొక్కడు మాట్లాడంగ చూడలేదు. తనేగాదు ఎవరూ చూడలేదేమో! మొదట్లో మధ్యంతరంగా టౌన్ చదువు మానేసిన కుమార్ కనిపెట్టుకోని ఉండేవాడు. ఇప్పుడు వాడూ ఉండటంలేదు. వేసిన తలుపులు వేసినట్లే, తెరిచిన పాపాన పోయినోడు లేడు....అనుకుంటూ కదిలాడు.

యింటి కెళ్ళేసరికి వాకిలికి తాళం తగిలించి ఉంది. ఉసూరుమంటూ వసారాలోని మంచం వాల్చుకొని కూలబడ్డాడు. ఆ పక్కన కట్టేసిన ఎద్దులు బసప్పకేసి ఆబగా చూచాయి. అతను ధైర్యంగా వాటివైపు చూడలేకపోయాడు. అవి ఆకలి డొక్కల మీద తోకతో విదిలించుకున్నాయి. తల విసురుతూ టపటపా చెవులు కొట్టాయి. భుజమ్మీది తువ్వాలు చుట్టచుట్టి పడుకున్నాడు. ఆకాశంకేసి తదేకంగా చూస్తుండిపోయాడు. అమవాస్య దగ్గర కావడంతో ఆకాశం చిక్కని చీకట్లతో పేరుకుపోయింది. ఆ చీకట్లు పైనుండి తనమీదే పడ్తున్నట్లనిపించింది. గతంలోంచి మనసును వొరుసుకుంటూ స్మృతులు వల్లా వచ్చిపడ్డాయి. అవి అలల్లా వచ్చేవేకాదు – కన్నీటి ఊటలో ఏండ్ల తరబడి నాని ఉబ్బినవి.

తొమ్మిదో ఏటనేమో ఏరువాక రోజు తండ్రి మొదటిసారిగా తనచేత మేడి పట్టించాడు. తనారోజు చిన్నపెండ్లికొడుకులా అలంకరించుకున్నాడు. కాళ్ళకడ్డం పడే కావిపంచె. సిల్కు బుసుకోటు, పైన ఎర్రంచు టవలు, చేతిలో ములుగర్ర పట్టుకొని ఎద్దుల ముందు నిలబడితే తల్లి హారతి తీసింది. తర్వాత ప్రేమగా ఎత్తుకొని ముద్దుపెట్టుకుంది. గుండెలకానించుకొని తలకట్టు సవరించింది. ఆరోజు దున్నింది మురిపెంగా పదహారు చాళ్ళే! అయితేనేం, ఆ గుర్తులు ఎన్నేళ్ళయినా అట్లే నిల్చున్నాయి. అప్పటినుండి మట్టిలో తిరుగుతూ, మట్టి వాసనలో తేలుతూ దర్జానుభవించడం మొదలయింది.

తెల్లారీ తెల్లారకముందే తల్లి పక్కలోనుండి లేచి వద్దన్నా వినకుండా తండ్రి వెంట పొలానికి బయల్దేరేవాడు. ఎప్పుడైనా మధ్యలో తనకు కాళ్ళు నొప్పులు పుడ్తున్నాయని అంటే, "అదిగో, దగ్గరికి వచ్చినం...." అని మిలమిల్లాడే పంటచేను చూపించేవాడు. అప్పుడు 'అదిగో అమ్మ....' అని చూపించినట్లుండేది తనకు.

ఉన్నది మూడెకరాలే అయినా నాయినకు తను రైతునన్న దర్పం ఉండేది. వ్యవసాయంలో కష్టనష్టాలకు, కుడిఎడమలకు తల్లి బాధగా ఏమన్నాకూడ, 'రైతంటే ఏమనుకున్నావ్? బూమమ్మ అప్పుడప్పుడు తన బిడ్డల్తోని ఆడుకుంటుందంతే!....' అనేవాడు.

వాకిలి తెరిచిన శబ్దానికి ధ్యాసలోకి వచ్చి, గుడినుండా రావడం....? అనడిగాడు బసప్ప. కొడుకుచెయి పట్టుకొని లోపలికి నడిపించుకపోతూ, ఊఁ.... అంది అనంతలక్ష్మి.

ఏం గుడో! పైకే అని మంచంలో పక్కకు వొత్తిగిల పడుకున్నాడు.

.......ఒకప్పుడు దేవుడు మనసులో ఉండేవాడు. కానీ ఇప్పుడు నెత్తిమీదెక్కి కూర్చున్నాడు. చిన్నప్పుడు తండ్రి సాయంకాలాల్లో వొళ్ళో కూర్చోపెట్టుకొని పలికించిన భజనపాటలు ఇప్పుడు వెగటుగా వినిపిస్తున్నాయి. దేవుడు బజార్లో పడ్డాక మనుషులు ఏట్లో పడాల్సొచ్చింది. సుఖంలేదు పాడులేదు. బతుకులు బుగ్గిపాలయిపోతున్నాయి. అక్కడ రామాలయంలోనేమో రోజా జాగంటలు... హారతిపళ్ళాలు... వాటిలో పదిపైసలు కాదుగదా, కన్నీటి బొట్లు కూడా పడవు. జనాల కంటితడి పొలాల్లో ఎప్పుడో యింకిపోయింది.

"......పలకవ్! యింత రొట్టె తిందువుగాని రా!" అనంతలక్ష్మి రెండోసారి కూడా పిలవడంతో లేవక తప్పలేదు. తలకిందున్న తువ్వాలు విదిలించి భుజానేసుకొని లోనికెళ్ళాడు. భార్య రెండు పళ్ళాల్లో రెండు రొట్టెలు యింత పచ్చడి వేసి పెట్టింది. గుడ్డిదీపం వెల్తుర్లో స్టీలు పళ్ళాలు మెరుస్తున్నాయి. చెక్క పీటమీద కూర్చొని రొట్టె తుంచి నోట్లో పెట్టుకోబోయాడు. బైట ఎద్దులు అసహనంగా కచబిచ తొక్కులాడుకుంటూ, కొమ్ములు గోడకు కొడ్తున్న శబ్దం వినొచ్చింది. బసప్ప తిండి తినలేకపోయాడు. మోకాటిమీద అట్లే చేయి సాచి యింటి కప్పువైపు చూస్తూ కూర్చున్నాడు. చిన్నరొట్టెముక్క కొడుకునోట్లో పెడ్తూ......" పొద్దుననంగ ఎంకటేసులునన్నా యింత చొప్పో గడ్డో అడగమంటె...." ఆమె యింకా పొడిగించలేకపోయింది. భర్త సమాధానంగా మాట్లాడ్తాడనుకుంది. కాని అతను నిశ్శబ్దంగా ఉన్నాడు. రెండు నిమిషాల తర్వాత......పాపిష్టికాలమొచ్చింది గాని యింకేమన్నానా? గొడ్లకు మేతరాని పంటలు వచ్చి నెత్తినపడ్డాయి..... అనంతలక్ష్మి మనసులోని గోడు వెళ్ళబోసుకుంది.

బసప్ప ఏదో మాట్లాడబోయాడు. గొంతు పెగల్లేదేమో మరి ఊరుకున్నాడు. తటాలున లేచివచ్చి మంచంలో పడుకున్నాడు.

ఇంకా తెల్లారకముందే భార్య వాకిట్లో ఊడుస్తుంటే మెలకువొచ్చింది. అనంతలక్ష్మి గబగబా వంట అయిందనిపించి యింత తినింది. సత్తు కారియర్‌లో మధ్యాన్నానికని పెట్టుకొని పనికి బయల్దేరింది. నిద్ర మంచంమీది నుండి లేస్తూనే కొడుకు ఏడుపు లంకించుకున్నాడు. నాయిన కాడికిపోయ్యా! బెరీతవస్తా.... అని బుజ్జగించింది.

ఆమాటయితే అనిందిగాని తను పొద్దుగుకేదాకా రాను కాదని ఆమెకు తెలుసు. బహుశా పిల్లాడికీ తెలుసేమో! వెంటబడి ఏడుస్తున్నాడు.

ఊరికి అర్ధమైలు దూరంలో ఒక అగ్గిపెట్టెల కంపెనీ ఉంది. దాన్ని పెట్టి సంవత్సరం దాటింది. పుల్లలను సర్దడానికి దాంట్లో ఆడవాళ్ళను మాత్రమే తీసుకుంటారు. నాలుగు నెలలనుండి బైటపనిలేక వాళ్ళిచ్చేది కొంచెమేనైనా చేరిపోయింది అనంతలక్ష్మి.

అనంతలక్ష్మి వెళ్ళిపోయాక పావుగంటదాకా పిల్లవాడు కిందపడి దొర్లిదొర్లి ఏడ్చిండు. బసప్ప వాణ్ణి సముదాయించడానికి ప్రయత్నించలేదు. కాకుంటే మధ్య మధ్య "ఊరుకోరా! అమ్మ వొస్తదిలే.... బువ్వదిని ఆడుకోపో...." అంటున్నాడు. తండ్రి మాటలకు కాకున్నా ఏడ్చి ఏడ్చి అలత వచ్చి మానుకున్నాడు. అయినా ఎక్కిళ్ళతో గుండెలు ఎగిసిపడ్తున్నాయి. పక్కింట్లో ఉండే వాడియాడు పిల్లలు గోడకింద రాలిన ఉప్పు మట్టిని కుప్పలు చేసుకుంటూ ఆడుకుంటున్నారు. ఎక్కిళ్ళు పెడ్తానే నిక్కరు పైకి లాక్కొని ఆటల్లోకెళ్ళాడు.

బసప్ప పొద్దు బాగా పైకెక్కింతర్వాత మొఖం కడిగి తిండి తిన్నాడు. కొడుకును పిలిచి యింత తినిపించాడు. తినంగానే వాడు మళ్ళా ఆటల్లోకెళ్ళాడు. ఇప్పుడు వాడికి అమ్మ గుర్తుకు రావడంలేదు. బసప్ప వాకిలి చిలుకేసి నాగిసెట్టి యింటికి పెద్దబజారుగుండా బయల్దేరాడు. పనిలేక చీట్లపేకలాడేవాళ్ళు, బీడీలు, చుట్టలు కాల్చేవాళ్ళంతా గుంపులుగా గౌరమ్మరుగుమీద కనిపించారు.

వానలు పడగానే దున్నుకోవడం, ఇత్తనాలేసుకోవడంలో క్షణం తీరికలేకుండా ఉండేవాళ్ళంతా అక్కడే ఉన్నారు. ఇంతకుముందు సేద్యం పనుల్లో పొద్దంతా కనిపించని ఆడోళ్ళు కూడా బజార్లలో ముచ్చట్లు పెట్టుకోని కూర్చున్నారు.

"ఏం సిన్నాయినా! యాడికిపోతున్నావ్?" అని అరుగుమీదినుండి మల్లన్న పలకరించాడు.

"నీకు తెలీకుండా నేనేడికిపోతనోయ్?......." అన్నాడు కుశాలగా బసప్ప.

"అదీ నిజమే! ఎవరు మాత్రం ఏ చేస్తారు, యిత్తనాలు రాన్దే?"

"యింకా రాలేదా?"...... బసప్ప గొంతు జీరగా పలికింది. అతనికీ వచ్చి ఉంటాయని గట్టి నమ్మకమేం లేదు. మొన్న పొద్దున్నే సెట్టి గుడికిపోతూ, అడిగినోళ్ళందరికి రాలేదని చెప్తుంటే తనూ విన్నాడు.

ఇత్తనాలు వచ్చిఉంటే ఊరు, పొలాలు ఇట్లా నిద్రపోయేవేనా? అనుకున్నాడు.

"నీ ఆత్రంగాని, ఈ అదును ఉన్నంతదాక ఆ పైయ్యోడు పంపించడు. మొత్తంగా దున్నిన భూమి బండగట్టింతర్వాత వస్తే వస్తయ్. అయినా ఇట్లాంటి ఎవసాయంజేసి యింకా బతుకుదామనుకోవడం భ్రెమగాని యింకేమన్నానా? కిందటేడు పంటలో ముత్యాల్లాంటి యిత్తనాలు తీసిపెట్టుకొని అదునుమీద చల్లుకుంటేనే ఆడికాడికి బతుకులు ఎల్లమారుతుండె....."

తనకు తెలిసిందే అయినా 'అంతేనంటవా' అన్నాడు బసప్ప.

"అంతేగాక యింకెంతనుకున్నావ్? దేశంగాని దేశం నుండి రావాల్నా? వాడు ఏ యిత్తనాలు పంపిస్తాడో మనకు తెలీకపోయె! తీరా ఆ పంట మన భూముల్లో నిలుస్తదో లేదో!!"

"......ప్చ్! సేద్యం జేసేటోనికి తనేం పండించేది తనకే తెలీనికాలం....పరాయి దేశాలకు ఎత్తిపంపించాలనే పోటీకొద్ది నానాక పంటలన్ని వచ్చినయ్. మనుషులు గొడ్లు డొక్కలెంచి సచ్చేరోజులు. ...ఈడి పంట ఈడున్న కుడుపులకు సాల్దంలేదు గాని యింకేడికి పంపిస్తారు? ఆకలిమీద యాపారం మొదలయింది......" కదలబోయాడు.

"కొద్దిగ అగ్గిపెట్టియ్యి సిన్నాయినా!" నోట్లో బీడి పెట్టుకుంటూ అడిగాడు మల్లప్ప. అంగీ జేబు తడుముకొని తీసిచ్చాడు. బర్రన పుల్లగీసి అంటించుకొని గుప్పన పొగలాగాడు. "యాడికోపోదువ్‌గాని వచ్చి కూర్చోరాదు....." అన్నాడు. "ఏం కూర్చోవడమో లేవోయ్! కాలు నిలుస్తలేదు. యింతకు యిత్తనాలు రావంటవా?" మల్లన్న పక్కనే కూర్చున్నాడు. ఇప్పటికైతే రాలేదట. యింకెప్పుడు వచ్చేది సెట్టికే తెలియాల.... మల్లన్న చెప్పాడు.

బసప్ప స్థిమితంగా కూర్చోలేకపోయాడు. కడుపులో మెలిపెడ్తున్నట్లుంది. అరుగుదిగి కిందికొచ్చాడు. యింక సెట్టికాడికి పోవడం దేనికి అనుకున్నాడు. మళ్ళీ నాలుగడుగులే కదా! ఎప్పుడొచ్చేదైనా అయన్నే అడిగితే సరిపోతది అనుకోని ముందుకు నడిచాడు.

దారెంట మల్లన్న మాటలు చెవిలో వినిపిస్తున్నట్లే ఉంది. యింక ఎవసాయం జేయలేను. మరి బతకడమెట్లా? ఈ అప్పులనేంజెయాల?..... ఎక్కువగా ఊహించలేకపోయాడు.....

ఆ రోజుల్లో పండిన పంటలో తాలు లేకుండ గట్టి గింజలు యిత్తనాలకని ఎత్తి పెట్టుకొనే వాళ్ళం. అదునుమీద దున్ని చల్లుకుంటుంటిమి. యిత్తనాలను పొలానికి తీసకపోయేటప్పుడు అనంతలక్ష్మి పొరపాటునకూడా పాతగంపలో వాటిని పోయనిచ్చేదిగాదు. ముందురోజే మేదరిండ్లకుపోయి కొత్త గంప కొనుక్కొచ్చేది. దానికి ఎర్రమట్టితో సున్నంతో పట్టీలు దిద్దేది. కుంకంబొట్లు పెట్టి గంపను, యిత్తనాలను దేవుని మాదిరి పూజించేది.... ఇప్పుడవన్నీ తారుమారయ్యాయి.

అసలు ఇత్తనాలకు రైతు యింకోనికాడికి పోవడం నామోషీగా తండ్రి మాట్లాడే వాడు. తన తరం వచ్చేసరికి కొత్త కొత్త రకాల పేరుతో అంగట్లో సంచులు తెచ్చుకోవడం మొదలయింది. కానీ ఇప్పుడు అమెరికానుండో యింకేడినుండో తెచ్చుకోవాల్సి వచ్చింది. పండించిందంత తిన్నాక, అమ్ముకొనకనే గాని మళ్ళీ పంట వేసుకోనీక లేకపోయె..... అనుకుంటూ నాగిసెట్టి యింటి గేటు దాటి లోపలికి అడుగేశాడు. వరండాలో స్థంభానికి కట్టేసిన తెల్లకుక్క గయ్య్..... మనడం మొదలు పెట్టింది. థయ్.... అని దానిని అదిలించాడు. కుక్క మొరుగుకు సెట్టి బైటికొచ్చాడు మడిమీద. అప్పుడే భోజనం చేసినట్లుంది. ముక్కు మీది నుండి నుదురు దాక సింధూరం నామం పెట్టుకున్నాడు. బొజ్జ నిమురుకుంటూ బసప్పను పలకరించాడు:

"ఏం బసప్ప! డబ్బులు తెచ్చినావేంది?"

సెట్టిని పలకరించబోతే చిక్కువచ్చిపడ్డట్లేనని బసప్పకు తెలుసు. ఇంకో సమయంలోనైతే ఎక్కడ బాకీ అడుగుతాడోనని తప్పించుకోవడానికి కూడా సిద్ధమే! ఇప్పుడట్లాకాదు. అయినా రోట్లో తలకాయ పెట్టినాక పోటుకు బెదురుతే అయితదా? ఇప్పుడు కాకుంటే రేప్పొద్దునయినా తీర్చాల్సిందే! అంతదాకా సెట్టి గడిగడికి పీడిస్తూనే ఉంటాడు.....

"యాడి డబ్బులు సామీ! నీకు తెలీకుండ వస్తున్నాయా? మా లెక్కపత్త మొత్తం నీకెరికేగదా? నీకు దాపున పైసా వస్తున్నాదా? ఒక గింజ అవతలకు పోతుందా? ఇంతకు ముందు మా ఎవసాయంలో ఎరువులు, పురుగు మందుల ఖర్చు, రాబడులే నీకు తెలుస్తుండె. ఇప్పుడల్లా కాదుగదా? యిత్తనాల కాడినుండి నీ కాతాలో లెక్కతేలకుండ మేమేం జేస్తున్నం చెప్పు?.... ఆ యిత్తనాలుగూడ అంతకు నాలుగంతల ధరపెట్టి నీలాంటి డీలర్లకాడ కొనాల్సివచ్చే!..... అవిగూడ యింకా రాలేదు సామీ!" అన్నాడు.

"యాడొచ్చినయ్! ఇత్తనాలంటే మాటలా? అబ్బో! యాడాడినుండి రావాల్నో, ఎంత పెద్దకతో నీకేం తెలుస్తది....." అంటూ సెట్టి ఏవేవో చెప్పుకవచ్చాడు.

రైతులకు ఇత్తనలు సప్లై చేయడానికి ప్రభుత్వం పెట్టిన తనలాంటి డీలర్లకు ఎన్నెన్ని కష్టనష్టాలో ఏకరువుపెట్టాడు.

బసప్ప విన్నాడేగాని, బొత్తిగా అర్థంకాలేదు.

"అయితే ఎన్ని రోజులకు వస్తయ్‌సామీ?" అడిగాడు.

కొస పెదాలతో కొద్దిగా నవ్వి చేతులు పైకి చూపాడు. నిమిషం తర్వాత "పోయొస్త సామీ!" అని కదిలేడు బసప్ప.

'మరి బాకీ సంగతి' గుర్తు చేశాడు నాగిసెట్టి.

"నీ బాకీ తీర్చకుండా నేనేడికిపోత సామీ! నన్ను నమ్మవు......"

సెట్టికి అదే గట్టి నమ్మకమేమో ఊరుకున్నాడు.

అయిదేళ్ళ పైనుండి సెట్టిదగ్గర ఏ యేటికాయేడు అప్పు అవుతూనే వస్తుంది. తీర్చిందిపోంగ మిగిలిందీ, దాని వడ్డీ, మళ్ళీ చేసేది కలిసి మోపెడవుతుంది. జమేసేది తక్కువ....తీసుకోవడమే ఎక్కువ. దానికితోడు రెండేళ్ళ కిందట పెట్టుబడిలో సరిగ్గా సగం పంటే చేతికొచ్చింది. సెట్టి దగ్గర తీసుకొచ్చిందానికి వడ్డీమాత్రం అడ్డం లేకుండా పెరిగిపోయింది. బాకీలో పదిపైసలవంతుకూడా చెల్లుపడలేదు. వచ్చేసారి బాగా పండకపోతదా – కొంతలో కొంతయినా తీర్చవొచ్చని ధయిర్యంగానే ఉన్నాడు. కానీ ఆ యేడు భూమికి జిబ్బెడు ఎత్తున పచ్చంగ కనిపించిన మూడెకరాల పంట మట్టంగ తుడిచిపెట్టకపోయింది. బసప్ప గిలగిల్లాడేడు. అనంతలక్ష్మి నేలబట్టింది. ఆ యిత్తనాలు మన నేలకు సూటు అవలేదని కొద్దీగొప్ప చదువుకున్నోళ్ళంత అన్నారు. బసప్ప వొక్కన్దేగాదు – ఊళ్ళో చాలామంది పొలాల్లో పంట అతకలేదు. మళ్ళా దున్ని యిత్తనా లేద్దామనుకున్నాడు. కానీ, ఆకాశంలో ఒక మబ్బు ముక్క కూడా కనిపించేదికాదు. వానల్లేకుండా ఏం జేస్తాడు? నెలదాటాక అప్పుడప్పుడు నేల తడిసినా యిత్తనాలకు మళ్ళా సెట్టి దగ్గర అప్పుపెట్టాల. రెండేళ్ళ నుండి పైసా జమలేకుండా పీక్కురావడమే! అంతకు ముందుది ఉండనేఉంది. వడ్డీలతో కలసి పాతికవేలు దాటిందని పోయినసారి ఇత్తనాలకు పోయినప్పుడు సెట్టి లెక్క చెప్పాడు. వచ్చే సంవత్సరం అసల్లో సగమైనా జమ వేయకుంటే పొలం రాయించుకుంటానని హెచ్చరించాడు. దాంతోటే బసప్ప మళ్ళీ దున్ని వేయడానికి భయపడ్డాడు. ఇత్తనమేస్తే ఏమవుతుందో? అప్పులు పెరగడమేగాని, పంట చేతికి వచ్చేదాక నమ్మకంలేదు.

పొలంమీద రాబడి లేకుంటే సెట్టి బాకీ తీర్చే నమ్మకంకూడా లేదు. ముందు బాయి వెనక చెరువు అన్నట్లుంది బసప్ప పరిస్థితి.

ఒకప్పుడు వానలు పడగానే నాగళ్ళు పరిగెత్తేవి. లక్షల లాభాలు రాకున్నా ఎవసాయమంటే భయం కలిగేదికాదు. కానీ ఇప్పుడు నాగలిని ముట్టుకోవాలంటేనే భయం. డబ్బులు కండ్లజూసేదాకా భయం. మునుగుతమో తేలుతమోనని ఒకటే పీకుడు.....

అప్పటినుండి ఇప్పటిదాకా రోగాలకో, కుటుంబం గడవడానికో యింకింత అప్పుపీక్కొచ్చాడు. సెట్టి రోజు రోజు సతాయిస్తునే గొణుక్కుంటూ అడిగినదాంట్లో ఎంతో కొంత ఇస్తున్నాడు. మళ్ళీ ఈసారి యిత్తనాల దగ్గర్నుండి సెట్టి ఇవ్వాల్సిందే. ఇప్పుడూ నేలతల్లి మోసంచేస్తే ఆముందుటేడుకు వడ్డీ అసలు కలిసి చంపకతింటది. మూడెకరాల్ను అరాయించుకుంటది.

రెండేళ్ళపైనుండి ఇద్దరి తిండికోసం ఇద్దరూ కూలీకిపోతున్నారు. సంవత్సరం పిల్లోణ్ణి వదిలేసి అనంతలక్ష్మి మొదట బాయి పనులకు, రోడ్డు పనులకు పోబట్టింది. ఆ పనులు దొరకడం కూడా కనాకష్టం. ఒక నెల్లో పదిహేను ఇరవైరోజులు కూలీ దొరికితే, తర్వాతనెల్లో అసలు పనే ఉండేదికాదు. ఆర్నెల్లకిందటే అగ్గిపెట్టెల కంపెనీలో అనంతలక్ష్మికి పని దొరికింది. బసప్పకు ఎక్కడా పనిలేదు. అక్కడక్కడ ఊరక కూర్చోవడంతో ఆలోచనలు చెదపురుగుల్లా తొలిచేవి. మనిషికి పరధ్యాస పెరిగింది. ముఖమ్మీద నవ్వు ఎప్పుడో జారిపోయింది. రోగానపడ్డట్లు చిక్కి సగమయ్యాడు. ఎప్పుడు అప్పులు, వడ్డీలు భూతాల్లా కనిపిస్తుంటాయి. భూమి దైన్యంగా ఏడుస్తున్నట్లు ఉంటుంది.

చిన్నప్పటినుండి కష్టానికి అలవాటుపడ్డ శరీరం, మనసు పనిలేక విలవిల్లాడాయి.

పదేళ్లకిందట బసప్ప దర్జాగా సేద్యం చేసుకుంటున్నప్పుడు నాగిసెట్టి చక్కిలాలు అమ్ముకొని బతికేవాడు. చిన్నగంపలో పెట్టుకొని ఊరంత తిరిగి అమ్మేవాడు. క్రమంగా యింట్లో చేసే చక్కిలాలనే కవర్లలో ప్యాక్‌చేసి, డొక్కు సైకిల్‌మీద చుట్టుపక్కల పల్లెలకెళ్ళి అమ్మేవాడు. చిన్న చిన్న అంగళ్ళవాళ్ళు సెట్టి దగ్గరే కొనుక్కునేవాళ్ళు.... అట్లట్ల పెరిగి, రైతులకు అప్పులిచ్చి ఊరునంతా చేతిలో పెట్టుకున్నాడు. అంతలో వాళ్ళను వీళ్ళను పట్టుకొని ఈ డీలర్‌కూడా అయ్యాడు. ఇప్పుడు సొంత మేడ, భూమి, బంగారు..... లక్షలమీదున్నాడు. ఆ రోజుల్లో సెట్టి చక్కిలాలు అమ్ముకోవడమేగాని గుడివైపు వెళ్ళినవాడుకాదు. ఇప్పుడు ఊర్లోకెల్లా భక్తుడు....ఊర్లో అందర్నీ భక్తుల్ను చేసేవాళ్ల నాయకుడు. ముప్పొద్దులా ముఖంమీద సింధూరం నామం పెట్టుకొని తీరాల్సిందే! గుడికెళ్ళి భజన చేయాల్సిందే!

ఇప్పుడు సెట్టి ఏం మాట్లాడినా, ఎవరితో మాట్లాడినా వ్యాపార లావాదేవీలే కాకుండా రాజకీయాలూ వరదలై వస్తాయి. దేశం పాడైపోయిందని గగ్గోలు పెడ్తాడు. 'బాగుచేసేదారి ఇదీ' అని తన అభిప్రాయాల్ని ముఖం మీద గుద్దినట్లు చెప్తాడు. దేశంలో కొన్ని అరాచకశక్తులు ఉన్నాయని, అవి అంతం కావాలని ఆవేశపడ్తాడు. 'ధర్మాన్ని' నిలబెట్టినప్పుడే అది మనల్ను, దేశాన్ని రక్షిస్తుందని ఉపదేశాలిస్తాడు.

ఈ ఏడు పంచాయితీ ఎన్నికల్లో సెట్టి నిలబడ్తాడని బైట పుకారు.

పొద్దు నెత్తిమీదకొచ్చింది. బసప్ప గాలిపటం మాదిరి తిరిగి ఇల్లు చేరుకున్నాడు. నలుగురు ఎక్కడ కూర్చొనిఉన్నా వెళ్ళి అక్కడ చోటు చూసుకుంటాడు. అయితే ఎవరితోనూ పల్లెత్తిమాట్లాడడు. మనసు మళ్ళుతూ ఉంటుంది. చూపులు ఎప్పుడూ గిలగిల్లాడుతున్నట్లే ఉంటాయి. చటుక్కున అక్కడినుండి లేచి దారిపడ్తాడు. ఎందుక్కూచున్నాడో తెలియదు. ఎందుకు వెళ్ళిపోతున్నాడో తెలియదు.

బైట ఎండకో, దేనికోగాని బసప్ప కళ్ళు అలసటగా ఉన్నాయి. యింటి పక్కనే ఉన్న యాపచెట్టునీడకు కుక్కిమంచంలో కొడుకు నిద్ర పోతున్నాడు. ఆడి ఆడి అలసటయిందో..... ఆకలయిందో.... మరి గుండీల్లేని అంగీలోంచి పొట్టమీది మట్టి చారికలు కనిపిస్తున్నాయి. మంచం పట్టె మీద కూర్చొని తట్టి లేపాడు. వాడు చేతులు తల్లో దూర్చి బరుక్కున్నాడేగాని కళ్ళు తెరచి చూడ్లేదు. బసప్పకు కడుపులో బాధగా ఉంది. కానీ అది అన్నంతింటే పోయేదికాదేమో!.... తినాలనుకోలేదు. కొడుకును లేపి పెట్టలేదు. ఎప్పటికో వాడే లేచాక వెళ్ళి వాకిలి తెరిచాడు. గిన్నెలమీది మూతలు తీసి అన్నం కూర పళ్ళెంలో వేసిచ్చాడు.

ఎండ వేడి తగ్గింది. అప్పుడప్పుడు చల్లగాలి వస్తుంది. పిల్లవాడు బైటికి పోయాడు. బసప్ప చెరువుకట్టమీదుగా కొండదారి పట్టాడు. వానలకు కొండంతా పచ్చగా కళకళలాడ్తూ కనిపిస్తుంది. రాళ్ళలోంచి గడ్డి, చిన్న చిన్న మొక్కలు తొలుచుకొని బైటికొచ్చాయి. ఎండుబట్టిన కొమ్మలు చిగురేశాయి. దాని ముందు, చుట్టుపక్కల ఉండే పొలాలు పంటలేకుండా పేలవంగా కనిపిస్తున్నాయి. భూమిని ముక్కలు చేస్తూ ఇది నాది – ఇది నాది అనుకోడానికే వేసుకున్న గెలియలు కూడా పచ్చబడ్డాయి. బసప్ప తిన్నగావెళ్ళి గట్టుమీద కూర్చున్నాడు.

ఎవరో గెనిమల్ను ఆక్రమించుకుంటూ చొచ్చుకొని లోనికి వస్తున్నట్లు....అలా వచ్చి వచ్చి..... పొలం కుంచించుకపోయి అదృశ్యమైనట్లు కనిపించింది......

నేలపైన చెయిపెట్టి తడిమాడు. యింకా అది వేడి సెగలు కొడ్తూనే ఉంది. ఆ వేడి తన ముఖంమీదికి సోకినట్లయింది. దోసిలితో పొలంలోని మట్టిని తీసుకున్నాడు. చేతులు, ఆలోచనలు వణుకుతున్నాయి. దానివైపే తలొంచి చూస్తుండిపోయాడు.

చేతుల్లోంచి మట్టి పొడిపొడిగా జారి కిందపడింది.

● ఆహ్వానం, జూన్ 1994 ●

* * *

76

ఎ.వి. రెడ్డిశాస్త్రి

# పాముకాటు

వైశాఖ మాసపు కృష్ణపక్షం కరంటు కోతవల్ల యావత్ప్రపంచం మీదా నల్ల దుప్పటి కప్పినట్లు చీకటి. శాపం తగిలినట్లు కదలకుండా నిల్చిపోయిన చెట్లు. ప్రాణాలు తీసేస్తూ ఉక్క. గేదెలు నెమరువేస్తూ మాగన్నుగా నిద్రపోతున్నాయి. వాటిపక్కనే నులక మంచం మీద సాయిత్రమ్మ పడుకొని గుర్రు తీస్తోంది. సాయిత్రమ్మకూడా గేది రంగులో నల్లగా వుంటుంది. ఆమె ఒంటిమీద వున్న చీర పేడరంగులో వుంది. వెదురు బొంగుల్తో చేసిన నులకమంచం పరిధిని దాటి బయటికి చాచుకున్న ఆమె పాదాలు పేడా, మట్టితో నిండివున్నాయి. మంచం మీంచి చిందరవందరగా కిందికి జారి పడుతున్న ఆమె దృఢమైన, దట్టమైన తల వెంట్రుకలు అస్తిత్వం నిలుపుకోడం కోసం భూమిలోకి చొచ్చుకుపోవాలని చూస్తున్న మహావృక్షపు వూడల్లా కనిపిస్తున్నాయి. నక్షత్రాల చిరువెలుగులో మట్టికొట్టుకుపోయిన ఆమె కాళ్లు, పేడ మరకల్తో మాసిపోయిన ఆమె చీర, నల్లటి ఆమె శరీరకాంతి, బాహాటంగా వినిపిస్తున్న ఆమె గురక వాటన్నిటినీ కలిపిచూస్తే ఆమె ఒక భయంకరమైన వ్యక్తిగా అనిపించవచ్చు. అయితే, కరుకుతనం ఆమె కావాలని తెచ్చిపెట్టుకున్న గుణం. గొంతుకల్లోంచి లాలిత్యాన్ని బలవంతంగా బయటికి నెట్టేసి, అమ్మతల్లిలా రంకెలు వెయ్యడం అభ్యాసం చేసుకుంది సాయిత్రమ్మ. కాని నిశితంగా చూసేవాళ్లకి మాత్రం యీ కరకుతనం వెనకాతల ఏదో అనిర్వచనీయమైన మార్దవం కనపడుతుంది ఆమెలో. మనవల్ని ఆమె ముద్దాడే తీరులో, పాలివ్వడానికి అల్లరిపెడ్తున్న గేదెల్ని ఆమె బుజ్జగించే నేర్పులో, పాలవాడికలవాళ్లని కసురుకుంటునే వాళ్లకి మంచి పాలుపోసే ఆమె నైజంలో యిదీ అని చెప్పడానికి వీల్లేని అది మాతృమూర్తి లక్షణాలు కనిపిస్తాయి. అయితే, పరమ కఠోరంగా ధ్వనించే గొంతుని అవసరంగా గుర్తించి అలవర్చుకుందామె. ఆ గొంతే లేకుంటే అలివిడు సంసారాన్ని వీధిన పడకుండా కాపాడుకురావడం సాధ్యపడే విషయమేనా? కొడుకులయ్యాది, కోడళ్లయ్యాది, మనవలయ్యాది, కడకు కట్టుకున్న మొగుడయ్యాది – ఆమె హుంకరించిందంటే, గడగడలాడుతూ నుంచోవలసిందే. ఏ మాటకామాటే చెప్పుకోవాలి. సాయిత్రమ్మ పేరు చెబితే ఆమె కటుంబంలో వున్నవాళ్ల కొక్కళ్లకే కాదు – మొత్తం ఆ గల్లీలో వున్నవాళ్లందరికీ హడలే.....

సాయిత్రమ్మ మొగుడు తాగుతాడు. ఆమె కొడుకులు పొమ్ములు కాస్కోడానికి తప్ప మరిదేనికి పనికిరారు. అవకాశం వొస్తే చాలు – వాళ్లుకూడా తండ్రిలాగే తాగి

తందనాలాడాలని లోలోపల కోరికపడుతూ వుంటారు. అయితే యీ అలగామూకల ఆటలు సాగనివ్వలేదు సాయిత్రమ్మ. బండగొంతుక పెట్టుకుని, యింట్లోవున్న బండెడు మందినీ అదుపులో వుంచుకొస్తోంది. అదిగో అలాటి సాయిత్రమ్మ యీ వైశాఖ మాసపు కృష్ణపక్షం రోజున సుమారు రాత్రి తొమ్మిది గంటలకే బుడ్డిదీపం సాయంతో యింటిపన్లు ముగించి, వాకిట్లో నులకమంచం వాల్చుకొని నిద్రపోతోంది గురకపెట్టి. సరిగ్గా ఆ సయంలో చీకట్లో నడుచుకొచ్చిన తక్షకుడిలా తారట్లాడుతూ ఓ మనిషొచ్చి సాయిత్రమ్మ గుడిసెకి కొద్ది దూరంలో నిలబడి, తనక్కావలసిన వ్యక్తి ఎక్కడున్నాడా అని గాలించడం మొదలెట్టేడు. వెలుతుర్లోకన్నా చీకట్లోనే బాగా చూడ్డం అలవాటయిన బావురు పిల్లి కళ్ళల్లాంటి వాడికళ్ళకి ముందుగా సాయిత్రమ్మ కనపడింది. ఆమెని చూడగానే గతుక్కుమన్నాడు. "ఈ రాచ్చసి ముండ నెగిసిందంటే పనిసెడగొట్టేస్తాది కావాల" అనే అనుమానం మనసులో కలిగి, తన దృష్టిని మరికొంచెం సారించి చూసేటప్పటికి తనక్కావలసిన కుష్టుడు వరండాలో బోని పెట్టెమీద పడుక్కొని టోకుర్లు కొడుతూ కనిపించేడు.

కుష్టుడు సాయిత్రమ్మ రెండో కొడుకు. వాడ్ని పిలవాలని వచ్చిన తక్షకుడు సాయిత్రమ్మని చూసి తటపటాయిస్తున్నాడు. తన పిలుపుగాని పొరపాట్న దాని చెవిని పడిందో, అది లేచి కూర్చుంటుంది. ఆ తర్వాత దాని నోరు మొయ్యడం వూర్లో యెవరికీ సాధ్యంకాని పని. అయినా తప్పదు. తనొచ్చిన పని అలాటిది – కిష్టడ్ని లేపితీరాలి. అంచేత వచ్చినవాడు, మెల్లిగా, పిల్లిలా వరండావైపు నడిచి, బోనిపెట్టెకి చేరగలిగినంత దగ్గరగా చేరి, "కుష్టా" అని పిలిచేడు – నెమ్మదిగా. అయితే తుమ్మమొద్దులా నిద్దరోతున్న వాడికి రహస్యంగా, గుసగుసలాడుతున్నట్లు పిలిస్తే వినపడిచస్తుందా? గొంతు పెంచి పిల్చిన పిలుపు సాయిత్రమ్మ చెవిలో పడనేపడింది. "కిష్టా" అని తన కొడుకుని ఎవరో పిలుస్తుండడం చెవిని పడగానే టక్కున లేచి కూర్చుందామె. లేచి కూర్చుని "ఎవుడ్రాడు?" అని గావుకేక పెట్టి మరీ అడిగింది. ఆమెకేకకి అంతా లేచారు, లేచి కూర్చున్నారు.

సాయిత్రమ్మ మొగుడు కూడా లేచాడు. వాడు తాగుతాడు కనక పడుకుంటే సాధారణంగా లేవడు. కాని సాయిత్రమ్మ వాడి తాగుడుక్కూడా పరిమితి విధించింది. "ఇంతకుమించి అడు గింజుకు సచ్చినా ఎక్కువివ్వకు – ఇచ్చావా, నా సంగతి నీకు తెల్సు" అని సారాకొట్టు పాపారావుకి హెచ్చరిక చేసిందావిడ. పాపారావు లాటి కంగాలీ ముండాకొడుక్కి కూడా సాయిత్రమ్మంటే చచ్చేంత బెదురు. ఆవిడ నోటెని ఎదుర్కొనే ధైర్యం వాడికి లేదు. దరిమిలాను ప్రభుత్వం సారాకొట్లు మూయించేడంతో సాయిత్రమ్మ మొగుడి అవస్థ నానాదరిద్రంగానూ తయారయింది. ఎక్కడెక్కడ్నుండో పుట్టించి తెచ్చి సాయిత్రమ్మే వాడికి నిర్ణయించిన కోటా అందించేది సాయంకాలం అయేటప్పటికి. అదిగో, ఆ విధంగా యివాళ అందిన సరుకు బొత్తిగా నాసిగా వుండి వాడికి నిద్ర పట్టి చావలేదు. అందువల్ల పెళ్లాం వేసిన కేకకి వాడూ లేచిపోయి "ఎవుడ్రాడు, ఎవుడ్రాడు" అని కేకలకి లంకించుకున్నాడు. ఈ గోలకి వరండాలో బోనిపెట్టెమీద పడుక్కున్న కుష్టుడుకూడా లేచిపోయి బయటికొచ్చేశాడు. కుష్టుడు పాతికేళ్లవాడు, పెద్దవాడు. మూడోవాడిలాగే వీడూ అమాయికంగా తల్లిచాటు

బిడ్డలా కనిపిస్తాడు బయటికి! కాని వాడి మనస్సులో వాడి ప్రపంచం వాడికుంది. ఒడ్డూపొడుగూ, పుష్టైన జబ్బలు, రింగులు తిరిగిన పొట్టిక్రాపు – వీటితో తనెలావుండాలి? సినిమాల్లో చిరంజీవితో ఫైటింగ్‌కి దిగే విలన్లా వుండాలి. గళ్ళలుంగీ, చారలబనీను, ఎర్రటి మత్తుకళ్లు, చేతిలో చైనూ, వీటితో, కాని తనకి ఏర్పాటయిన బతుకేటి? తల్లి దగ్గరుండి వేయించిన అంట్లకత్తెరక్రాపు, సంవత్సరాలతరబడి వుతుకు మొకం యెరగని మురికినిక్కరు, వంటిమీదకి చిరిగీ చిరగని బనీను–యిదీ అవతారం, ప్రతిరోజూ చేతిలో కర్ర, మరో చేతిలో తాటిగొడుగు, ముందుగా నడుస్తున్న గేదెల మంద – యిదీ తన నిత్యజీవితం. గొడ్లవెనకాతలపడి, రోజంతా తిరిగి తిరిగి అలసిపోయి, ఒళ్లు హూనమైపోయి సాయంత్రం యింటికి చేరేటప్పటికి – అందర్లాగా పెద్ద పెద్ద దోసుల కాకపోయినా, తండ్రి మాదిరి ఓ చిన్న బస్తాయేనా మందు వేస్కుంటే ఎంత బావుంటుందీ అని కుష్టడి కల! కాని తాగుడు మహమ్మారి తన తల వాకిలి దగ్గిరికి కూడా చేరడానికి వీల్లేదని సాయిత్రమ్మ ఖాయిదా. మొగుడి మాటంటేనా – అది వాడికి తన్తో పెళ్ళికాక పూర్వంనుండే వున్న అలవాటు. అదుపు తప్పకుండా చూస్కోడం వరకే తన బాధ్యత.

ఇంట్లోవున్న జనాన్ని ఎంత ఖాయిదాలో వుంచితే ఆ మాత్రం ముద్ద అందరి నోట్లోకి వెళుతోందో సాయిత్రమ్మకి బాగా తెలుసు. అక్కడికీ అనేక రాత్రులు అవిడకి యిన్ని మంచినీళ్లుతప్ప మరేమీ మిగలని పరిస్థితి వస్తుంటుంది. అలాటి వేళల్లో కులదైవాన్ని "కృష్ణా" అని తల్చుకొని, ఆ మంచినీళ్లనే అమృతాన్ని నోట్లో పోసుకుంటున్నంత సంతోషంగా స్వీకరించి, నులక మంచం మీద నడుం వాలుస్తుంది. ఇల్లు గడపడానికి అత్త ఎన్ని తంటాలు పడుతోందో, ఎన్ని రాత్రులు పస్తులతో ఆమె గడుపుకొస్తోందో కోడళ్లకి బాగా తెలుసు. ఉన్న దాన్ని అందరికీ సర్ది, ఆఖర్న తనకేమీ మిగలకపోయినా బాధపడకుండా, గుక్కెడు నీళ్లుతాగి పడుకునే ఆమె గొప్పతనం కూడా వాళ్లకి తెలుసు. అందుకనే కోడళ్లకి ఆమె అంటే ఆరాధన, అయితే యింట్లో భత్యానికిగాని, మరి దేనికీగాని యిబ్బందిగా వుందని ఏ కోడలేనా ఎక్కడేనా అన్నట్టు తెలిసిందో, దాన్ని పట్టుకొని పిడిగుద్దులు గుద్దేసిందన్నమాటే సాయిత్రమ్మ. ఇంటిగుట్టు వీధికెక్కకూడదనేది ఆమె కోడళ్లకి చెప్పకుండా నేర్పిన తారకమంత్రం.

అమ్మ పెడబొబ్బలు, అంతా లేచి అరవడం – వీటితో తనకి తెలివొచ్చేసి బోనుపెట్టె మీంచి గెంతిరావడం జరగడానికి పూర్వం కుష్టడు మాంచి అందమైన కలలో వున్నాడు. కొండచిలువంత పాముమీద చిరంజీవి పక్కలో బ్రేక్‌డాన్స్ చేస్తున్నట్టు. అట్టహాసంగా డప్పుల చప్పుడు, తనని తినేసేలా చూస్తూ పేడగుంటలు, వాళ్ల వెనకాతల బురద కొట్టుకుపోయిన గేదెల గుంపులు – ఇదీ వాడి కల. అయితే అమ్మ కేకలతో కల చెదిరిపోయింది. తన బతుక్కి కలలొకటే అని నిట్టూర్చాడు కుష్టడు.

అయితే, అంత చీకటిలాటి బతుకులోను కుష్టడికి ఓ చిన్న వెలుతురు కిరణంలాంటి సన్నివేశం కూడా లేకపోలేదు. ఆ విద్య వాడికి ఎలా పట్టుబడిందో తెలీదుగాని, పావుల్ని పట్టడంలో కుష్టడికి గొప్ప నేర్పు అలవడింది. అది ఎంతటి భయంకరమైన సర్పం కానివ్వండి, దాని మెడ దగ్గర మెరుపువేగంతో నొక్కి పట్టేసే నేర్పు వాడికి

పట్టుబడింది. వాడి వేళ్ల మధ్యని యిరుక్కున్న పావు, పెనుపటకార్లో చిక్కుకుపోయినట్టే. అది ఎంత గింజుకు చచ్చినా వాడి పట్టునుండి తప్పించుకొని బయటపడ్డేదు.

అన్నిసమయాల్లోనీ, అని రుతువుల్లోనీ, అన్నీరకాల బయట జాగాల్లోనీ గేదెల్తో సంచరిస్తుండడం మూలాన, వాడి చేతికి అందకుండా తప్పించుకున్న పాము జాతంటూ లేదు. వాటి మెలకువలు, వాటి గమనవేగాలు, వాటి ప్రవర్తన విధానం – యివన్నీ వాడికి కొట్టినపిండి. పాంవుని చూస్తునే దాని గమన విధానం చేప్పే గలడు వాడు. చూస్తానే దాన్ని పట్టుకోడానికి తను ఎన్నుకోవలసిన వ్యూహం వాడి మనసులో ఏర్పడిపోతుంది. ఏ భావాన్ని వ్యక్తం చెయ్యని వాడి రాతి మొహం, మట్టి కొట్టుకుపోయిన వాడి పొట్టి నిక్కరూ, చురుకుతనం అసలు కనిపించని వాడి నైజం – యిలాటి కుష్టడు మెరుపువేగంతో పాముల్ని పట్టగలగడం మహాద్భుత విషయంగా కనిపిస్తుంటుంది చూసేవాళ్ళకి. ఈ పాముల్ని పట్టడం విద్య వాడికి రావడం కాదు గాని వాడికి 'పాముల కుష్టడు' అనే పేరు వచ్చేసింది. మా యింట్లో పాము పట్టమని మనుషులొచ్చిన ప్రతీసారీ సాయిత్రమ్మ కొడుకుమీద విరుచుకుపడిపోతూనే వుంటుంది – "యీ పాములగోల నీకేలా" అని! ఆమె మాటలు విని కుష్టడు నవ్వేస్తూనే వుంటాడు. "అవి నన్నేటి సెయ్యవే అమ్మా!" అంటాడు వాడు. గయ్‌మని లేస్తుంది సాయిత్రమ్మ "ఏటీ సెయ్యవా? ఏవీ? పావంటే ఏటనుకుంట్‌న్నావురా? ఇసప్పురుగు! తెలిసిందా? దానికి యిశ్వాసాలు, మంచీచెడ్లూ ఏటీ వుండవు. దానికి పాలుపోసినా అది మన్ని కరవక మాన్దు. అలాటి యిసప్పురుగుల జోలికి నివ్వేల యెల్లాల? ఈపాలి యెవుడేనా పాముని పట్టడానికి రమ్మనాల, నువ్వు ఎల్లాల, అప్పుడు నా అవతారం నువ్వు సూడాల! నానంటె ఏటనుకుంతన్నావు? జాకర్త, మూడ్రోజులు ముద్దకానకంటా కొట్లో పెట్టి తలుపేసేగల్ను!" "అదికాదే అమ్మ! నాను పాములు పట్టానానికి ఎవుడి కాడా దమ్మిడీ డబ్బు పుచ్చుకోను. నాను పట్టిన పావుని ఏనాడు సంపను. దాన్నొట్టికెల్లి ఏ తోట్లంటో, దొడ్లంటో ఒగ్గేస్తాను. అందికనే ఆటికి నేనంటే నమ్మకం – మన్నాడు యేటి సెయ్యడని! అందికనే అవి నన్ను కరవ్వు."

"ఓర్నాయి నోర్నాయినో – దరవ రాజు మళ్లీ యీ కుష్టడి రూపంలో పుట్టేసి యీ బూమ్మీద పెరగతన్నాడు తండ్రా! ఒరే, ఓర్నంగిర్నాకొడకా! నివ్వేటీ సెయ్యవని అవి నిన్నేటి సెయ్యకంట ఒగ్గేడానికే – యిది శ్రీరావుడ్నాటి కాలంకాదురా! నివ్వేటి సెయ్యకపోయినా సరే, పెతిపామూ టైము దొరికే దొరగ్గానే నిన్ను కరిసి తినియ్యాలనే సూస్తుంటాది. యాదస్తుంచుకో, దాని గుణవది. దానికి మనవేటీ సెయ్యలేం. అందికని నా మాటిని యియ్యాలకాడ్నిండి పాముల జోలికెల్లకు. ఎవుడేన నిన్ను మొగమాటం పెట్టినాడనుకో – మాయమ్మ ముండ నన్ను సంపేస్తాదని నింద నా మీదికి తోసే" అని ఆవేళ సాయంత్రం సాయిత్రమ్మ కిష్టడ్ని బాగా తిట్టి ఒదిలిపెట్టింది. ముంగిలా మొహం మాడ్చుకొని మూలకిపోయి పడుకున్నాడు కుష్టడు – తల్లిని ఎదిరించే ధైర్యం లేక. పాముని పడతన్నప్పుడు యెంత గమ్మత్తుగుంటాదో, యెంత సంతోషం కలుగుతాదో దానికే ఎరిక! ఒంటిమీదున్న ఎంత్రికలు నిక్కబొడుసుకొని, తల్లోంచి ఆవిరినెగసినట్టు చెవట పట్టేసి – అలాటి ఆనందం ఎవుడికొస్తాది! తనకి బతుకులో వున్న యీ ఒక్క సరదా కూడా లేకంట సేసేయాలని సూస్తుంది మహాతల్లి!

తల్లీ కొడుకులా విధంగా పాములు పట్టడం విషయంలో ఘర్షణ పడిపడి చివరకి ఎవరి పక్కల మీద వాళ్లు పడుక్కొని దొర్లుతున్నారు. వైశాఖ మాసపు ఉక్క వూపిరి సలపనివ్వకుండా ఓ పక్కనించి చంపేస్తుంటే తాజాగా ముగిసిన తగువు మరోపక్క నుంచి మనసుని దొలిచేస్తోంది. ఆ యిద్దరికీ నిద్దర్లు రాక యిద్దరికిద్దరూ అటూ యిటూ దొర్లుతున్నారు. చివరకి నిద్రకి దయకలిగి మాగన్నుగా అలా నిద్రపట్టిందో లేదో అంతలోకే "కుష్టా" అనే పిలుపు సాయిత్రమ్మ చెవిలపడి, ఆవిడ గయ్యమని లేచేటట్టు చేసింది "ఎవుడ్రా నువ్వు" అంటూ.

వచ్చిన తక్షకుడు తనెవరో చెప్పుకోడానికి సందేహిస్తున్న వాడ్లా తటపడాయించేడు. సమాధానం రాకపోవడంతో మరింత వెర్రెత్తిపోయి స్వరం ఆకాశం ఎత్తుకి పెంచి గర్జించింది సాయిత్రమ్మ. "ఎవుడంటే పలక్కంట వులక్కంట దెయ్యంనాగ నిలబడ్డావు ఎవుడ్రా నువ్వు?" అని అరుస్తూ మంచం మీంచి లేచి కొప్పుముడి వెయ్యటం మొదలెట్టింది. ఆవిడ ఆ పద్ధతిలో లేచాక యింకా తనెవడో చెప్పుకోకపోతే చెయ్యి చేస్కొని నాలుగు చరచీడానికి కూడా వెనకాడదు సాయిత్రమ్మ అని ఆ వచ్చిన వాడికి తెలుసు. అంచేత నోరువిప్పి "ఏటప్పా ఆ కేకలు? నానూ, పాపారావుని" అన్నాడు.

"పాపారావంటే?" అని రెట్టించింది సాయిత్రమ్మ. కొన్నాళ్లుగా సారాకొట్టు మూసేడం మూలాన్న సారాకొట్టు పాపారావు మాట గభీమని ఆవిడకి గుర్తురాలేదు. "ఏటప్పా మరీ నన్నెరగనట్టు! - నానూ సారాకొట్టు పాపారావుని" అని తన గురించి చెప్పుకున్నాడు. పాపారావు గొంతుకలో మునపటి ధాటీ లేదు. ప్రభుత్వ సారా దుకాణం నడుపుతున్న రోజుల్లోనయితే పాపారావు పులిలా గర్జించేవాడు. సారాకొట్టు మూసేసి వ్యాపారం మూలపడ్డంతో వాడి గొంతుకలో కాస్త నీరసం ధ్వనిస్తోంది.

వచ్చిన వాడ్ని పోల్చింది సాయిత్రమ్మ, పోల్చి, "పాపిగా - నివ్వా? సీకట్లో ఏలకాని ఏలప్పుడు యిలా గొచ్చినావేటి? ఇనాటప్పుడు కుష్టడ్ని పిలుస్తున్నావు - ఆడితో నీకేటి పని?" అని నిలవదీసింది.

పాపిగాడు నంగిరోడుతున్న గొంతుతో -"అదికాదప్పా! పెదబాబు కుష్టడ్ని ఒక్కపాలి తీసుకురమ్మని తోల్నారు" అన్నాడు.

"అదేన్ర, యింత రాత్తిరప్పుడు పెద్దబాబుకి కుష్టడితో పనేటి అని?" "బాబుగారి లోగిల్ల పార్టీ అవుతోంది. బాబుగారి స్నేయితులు, పెద పెద్దోళ్లు యింటినిండా వున్నారు. డిన్నరు పెట్టినారు. ఒండిన వొంటలున్న గదిలోకి ఏదో పెద్దపాము సొరబడి పోయింది. లోపలికి అడుగెట్టనానికి ఎవలుకీ ధైర్య సాలకంటుంది. వొచ్చినోళ్లంతా డ్రింకుల పూర్తిచేసేసి బోజనానికి అవురావురుమని రడీ అయిపోయి కూకున్నారు. ఇత్తలసూస్తే వొంట సామాన్లున్న గదిలోకి పాముసొచ్చిపోయి కూకున్నాది. అందికని..." మాట పూర్తి చెయ్యకుండా నసిగేశాడు పాపారావు. "సేభాస్ బాస్రా పాపిగా నివ్వు సెప్పుకొస్తున్న కత! గడిసేపటికి ముంగల నానేమో గెంజిలోకి వుప్పుగడ్డ కూడా యింట్లో నేకంట అయిపోనాదని కుమిలి కుమిలి ఏడ్చి సచ్చినాను. మరి పెదబాబింటి కాడేమో, ఆయన స్నేయితులు ఫూటుగా తాగేసి, తయారైన కూడు

నోటికాడికి రాకపోవడంతో గంధికైపోతన్నారు. ఇసిత్రం సూసినావా - నానేమో యింట్లో పైసాలేక తిండికి కిరకిర్లాడిపోతే, వొంటగదిలోకి ఓ సిన్న పాము సొచ్చిపోవడం వల్ల పెద్దోళ్ళంతా తిండి దొరక్క కిరికిర్లాడి పోతున్నారు. అయితే తెలకడుగుతాను నీలాటి సెప్పల్నాకీవోళ్లు పెదబాబింటికాడ వొంద మందున్నారు కదా - మీరెల్లి ఆ పాముని ఓ పెట్టు పెట్టేస్తే, బోయినాలకీ మరేటి అడ్డుండదు కదా - అనాటేది మీరంతా ఏల ఆలీసం చేస్తున్నారు?" అని నిలవ తీసింది సాయిత్రమ్మ.

పెదబాబు జిల్లా అంతటికీ పేరు మోసిన సారా కంట్రాక్టరు. ఆయన కూడా మొదట్లో సాదాసీదా మనిషే అయినప్పటికీ, సారా వ్యాపారంతో లక్షలకీ లక్షలు సంపాందించేడు. తరువాత పేదవాళ్ల పేటలోనే వున్న తన యింటిని పడగొట్టించేసి, చుట్టూ వున్న రెండు మూడు జాగాల్ని కొనేసి, ఆ జాగాలో విశాలమైన పెద్ద భవంతిని అన్ని హంగుల్తోనీ కట్టించేడు. అయితే యీ మనుమధ్యని ప్రభుత్వం సారావ్యాపారం నిషేధించడంతో ఆయనకి కొద్దిగా చికాకు పరిస్థితులొచ్చేయి. మళ్ళీ త్వరలోనే కోళ్ళాని ప్రత్యామ్నాయ వ్యాపారం గురించి ఆలోచనలు ప్రారంభించేడు. అలవాటయిన ఫీల్డు కనక సారాని దొంగచాటుగా కాయించి అమ్ముతే లాభాలు యింకా బేషుగ్గా వుండవచ్చుననిపించింది. కాని ఆ ఫీల్డులోకి తను ఒక్కడూ దిగిపోకూడదు. వెన్నుపోటుదార్లు లేకుండా చూస్కోవాలంటే సారా వ్యాపారంలో యింతకుముందు తనతో కలిసి పనిచేసిన వాళ్లందరినీ కలుపుకు రావాలి. ఈ రకంగా ఆలోచన చేసి, తన ఆలోచనలకి ఒక కార్యరూపం యిచ్చే మార్గంలో భాగంగా యివాళ రాత్రి తన మాజీ కొలీగ్స్ అందరికీ డిన్నర్ ఏర్పాటు చేశాడు పెదబాబు.

ఈ సారాగ్రూపులో కర్మకాలి ఓ రిటైర్డ్ ఇంగ్లీషు లెక్చరర్ కూడా తగలడ్డాడు. ముప్పయ్యేళ్లు పనిచేసి మూడు వేలుకూడా వెనుకవెయ్యలేక పోయినాడా పెద్ద మనిషి వ్యసనాల పుణ్యమా అని. వ్యసనాల్నే వ్యాపారంగా మార్చి చూస్తే ఎలా వుంటుందో అనే ఆలోచన కలిగి, రిటైరయినాక నిస్సిగ్గుగా మందు వ్యాపారంలోకి దిగేడు. పెదబాబు యింట్లో ఎటెండయిన వాళ్లల్లో యితగాడ్ని మినహాయిస్తే పెద్దగా చదువుకున్నవాళ్లెవళ్లూలేరు.

పార్టీకి వస్తూనే యింకా యెక్కడో మిగిలిపోయిన పాతకాలపు మిల్టన్ గుర్తుకురాగా, తన ప్రజ్ఞ అందరి ముందూ ప్రదర్శించాలనే తాపత్రయంలో "హలో పెదబాబూ, ఓడిపోయిన తన సైన్యాన్ని మళ్లీ కొత్త దాడికి సమీకరించడానికి తయారయిన సేటన్‌లాంటి వాడివయ్యా నువ్వు! నీ భవనం కూడా అచ్చు మోడర్న్‌డే పెండిమోనియమ్‌లాగే వుంది - చీకటిలో మగ్గుతున్న నరకంలాంటి గుడిసెల మధ్య నీ తళుకు బెళుకుల మందిరం..." అని ఘొల్లున నవ్వేడు రిటైర్డ్ ఇంగ్లీషు లెక్చరర్. అయితే అతగాడి విట్టుని అర్థం చేస్కోగల స్థాయి పాపం, అక్కడెవరికీ లేదు. ఓ వెర్రి నవ్వు మాత్రం నవ్వేసి వూరుకున్నారు.

"గడిసేపటకి ముంగల నానేమో గెంజిలోకి వుప్పుగడ్డ కూడా యింట్లో నేకంట అయిపోనాదని కుమిలి ఏడ్చి సచ్చినాను"అని సాయిత్రమ్మ అనుకోకుండా తన యింట్లో రేగుతున్న ఆకలిజ్వాలల గురించి బయటకి అనేసిన మాట పాపారావు చెవుల్లో పడగానే వాడి మనస్సులో ఓ మెరుపు లాంటి ప్లాను రూపుదిద్దుకుంది.

అయితే తన ప్లాను అంత తొందరగా బయటపెట్టకుండా, ఆఖర్న తురుపుముక్కలా వాడాలని నిశ్చయించుకొని బయటకి మాత్రం "అప్పా! అప్పా! యీ ఒక్కపాలే నన్ను రచ్చించు. ఈ దిక్కుమాలిన పాము కాదు గాని, పెదబాబు గారి పార్టీ పాడయిపోయీలా కనపడతంది. పార్టీగాని పాడయిపోయిందా, అయిన్ని నమ్ముకున్న నాలాటోల్ల బ్రతుకు నాశినమైపోతాది. అప్పుడు నాను కూడా మీ యింటిముందు నిలబడి సిలవరి తపేలా పట్టుకొని గెంజినీళ్లు పొయ్యిమని అడుక్కోవాల" అన్నాడు.

"అడుక్కోరా, నీకదే రాసిపెట్టుంటే అలాగే అడుక్కుంటావు. నీవు సారా కొట్టు ఎట్టి ఎన్ని కొంపల్ని గుల్ల సేసినావో, యెంతమంది యీదులంట ముష్టెత్తుకు తిరగతన్నారో నీకెరికి నేదేటి? అంతమందిని నాశినం సేసినావు కదా - ఆల్ల వుసురు నీకు తగలకంట పోతాదేటి? నీలాటోల్లు చిప్పలు పట్టుకొని తిరగిన్నాడు-బొత్తిగా బగవంతుడన్నోడు నేకంట పోనేదని నమ్ముతాను" అంది సాయిత్రమ్మ వుద్రేకంగా. "అప్పా! పెద్ద దానివి, బూదేవత లాటి దానివి. అలాటి సేపాలు నీ నోట్నుండి రాకూడదు గాక రాకూడదు. కావాలంటే నామీద పిడుగు పడిపోవాలనో బస్సు గుద్దేసి నాను పావాలనో తిట్టు. సారా కొట్టెట్టో, సాని కొట్టెట్టో బతికినానంటే - ఆలెసుట్టూ తిరిగే నా కొడుకులండబట్టే కదా! నీత్తక్కువ పనని నానా యేపారం సెయ్యకపోతే సరా? మరో నీత్తక్కువోడు సేస్తాడా యాపావరం. పెపంచికం తీరే ఆరకం గున్నప్పుడు, నానేల ముక్కు మూస్కోని కూకోవాల? ఏదోచేసి, నానూ, కుటుంబం కూడా బతుక్కురావాలి కదా!" అని లోకధర్మం గురించి తనకి తెల్సింది చెప్పి, మళ్లీ సాయిత్రమ్మ గుక్క తిప్పుకొని వుపన్యాసానికి దిక్కుముందే, బతిమాల్టం ప్రారంభించేశాడు. "అప్పా, అప్పా, మన కిష్టడ్ని బెమ్మాండంగా పాముల్ని పడతాడని అందరికి తెలుసు. అది ఆడికి బగమంతుడిచ్చిన వొరం. ఆ వొరంతో ఆడు అందరికీ వుపకారం సేస్తన్నాడు. పెపెంచికానికి ఆడువుపకారం సెయ్యకంట సేసి పాపం మూటకట్టుకోకు. నీ దుష్టికొచ్చిందో నేదో తెల్దు, కాని మన వూర్లో కొంతమందికి కుష్టడ్ని సూస్తే శ్రీ కిష్టపరమాత్ముడ్ని సూసినట్టనిపిస్తాదిట. కిష్టమూర్తి కాలీయుడ్ని సితకా మతకా తన్నీసి తోలీసినాడు గాని సంపేనేదే! మన కిష్టడ్ని కూడా అచ్చం అనాటోడే. పట్టుకున్న పాముని యీడేనాడూ సంపడు. దాన్ని పట్టుకొని - యిది నివ్వు తిరగవొల్సిన జాగా కాదే అని బోదపర్సినట్టు, తిన్నగా దాన్నొట్టి కెల్లి యే తోట్లంటూ దొడ్లంటూ ఒగ్గేస్తాడు. కిష్టడ్ని దేవుడాటోడని ఆ పాములుకే యెరికే. అందికనే కదా - ఆడ్నే పాము ఏటీ సెయ్యకంట ఆడి సేతిలో గువ్వపిట్ట యిమిడిపోయినట్టు యిమిడిపోయి తపతప సూస్తుంటాది. అప్పా, అప్పా, ముమ్మాటికీ నీ కాళ్లొట్టుకొని బతిమాల్తన్నాను. ఒక్కపాలి కిష్టడ్ని నాతో తోలి. నా బతుకు నిలబెట్టు" అని నానా రకాల లబ్జులూ వుపయోగించి సాయిత్రమ్మని బతిమాలేడు పాపారావు.

పది నిమిషాల్నుండే యీ తమాషానే ఊపిరి బిగబట్టి మరీ చూస్తున్నాడు కిష్టడ్ని - అమ్మ ఏమిటంటుందో వినాలని. చివరకి మరి వుండబట్టలేక, ఎలాగో ధైర్యం చేసి "అమ్మా! పోనీ యీ ఒక్కసుట్టూ పాముని పట్టేసి ఎక్కడేనా జల్లీసి పారేస్తానే! పాపయ్యా మనోడేకాదా, మరాడు అంతలెక్కని బతిమాల్తుంటే యీల్లేదంటే మనకి

మాత్రం మరియాదేటి?" అన్నాడు. "అదిరా మాట కుష్టా!" వుత్సాహంగా కేకవేశాడు పాపారావు, కిష్టడ్ని మాటలకి మద్దత్తులాగా. వెంటనే సాయిత్రమ్మ వేపుతిరిగి, "అప్పా! నివ్వూ నేనూ గొప్పోళ్లం కావు, నిజమే! నానా కష్టాలు పడతన్నప్పటికీ, నాలుగువేళ్లూ నోట్లోకెల్లకంటున్నాయి సరిగ్గా. పెదబాబియాళ దశ తిరిగి పెద్దోడయినాడు. కాని ఒకప్పుడు మన మద్దిన మసిలిన మనిసేకదా! మనమద్ది లెల్లి నెగిసి ఎత్తిరిల్లిన మనిషికి యియాళ యీ పాము వల్ల పరువు పోయిందంటే, ఓ రకంగా మనకీ పరువుపోయినట్టే కదా! అందికని అప్పా, సాయిత్రమ్మప్పా! యీ సుట్టూ పాముని పట్టనానికి కిష్టడ్ని తోలి నా బతుకూ, పెదబాబు పరువు నిలబెట్టు! అతగాడి ఆపతగాని నివ్వు తప్పించినావంటే, రేపు తెల్లారేతప్పటికి పెదబాబు నీకెలాటి యినాం తోల్తాడో నీ కల్లతో నివ్వే సూద్దువు గాని" అని తను వాడ తల్చుకున్న తరుపుముక్కని వాడేశాడు పాపారావు.

"తెల్లారే తప్పటికి యినాం" అన్నమాట సాయిత్రమ్మ గొంతుని మరిలేవనివ్వకుండా బలవంతంగా నొక్కేసింది. తెల్లవారేటప్పటికి యింట్లో బుసలు కొడుతూ లేచే ఆకలి సర్పం – ఆమె మనస్సుకి శాంతి లేకుండా చేస్తూనే వుంది. అలాటి సమయంలో "పొద్దున్నే యినాం" అనే పాపిగాడి మాట ఆమె చెవులకి నాగస్వరంలా వినిపించింది. పాములతో ఆటలాడొద్దని ఓ గంట క్రితంవరక్కూ కొడుకుతో తనువేస్కున్న యిద్ధం సంగతి ఆమె మర్చిపోయింది. ఇంట్లోవున్న పిల్లాజెల్లా రేపు తిండికి అఘోరించనక్కరలేదనే ఊహ ఆమె నుండి ఏదో పెద్ద భారం తీసేసినట్టనిపించింది. సాయిత్రమ్మ ఓడిపోయింది.

అమ్మ మాట్లాడక పోవడాన్ని తను వెళ్లడానికి అంగీకారంగా భావించిన కిష్టడ్ని ఒక్క గెంతులో పాపారావుని చేరుకొని – "పదరా దద్దా!" అన్నాడు. "నాయనా కుష్టా–అదే జాతి పామోటి, కసింత దాన్ని జాగర్తగ సూస్కోమా"–అని దూరమైపోతున్న కొడుకునుద్దేశించి కేకవేసింది. ఆమె గొంతుకలో ఏదో వేదనలాటి జీర, "అనగేలేయే అమ్మ" అని కిష్టడి జవాబు. చీకట్లో కల్సిపోయారు వారిద్దరు.

పెదబాబు గారింటి దగ్గర పరిస్థితి గందరగోళంగా వుంది. "ఏంటయ్యా పెదబాబూ, మా అందరికీ మందు పెట్టేశావ్, తిండి దాచేశావ్–ఏంటయ్యా యీ అన్యాయం?" అని విసుక్కుంటున్నాడు ఓ పెద్దమనిషి.

"మనకి తిండి పెట్టకండా చంపేసి కల్తీ సారా సామ్రాజ్యాన్ని తనొక్కడే ఏలాలని పెదబాబు ఎత్తు!" ముద్దమాటల్లో మరో ఆయిన వేసిన కేక.

"పాము పామంటావ్–అదేమన్నా గార్డెన్ ఆఫ్ ఏడెన్‌లోకి ప్రవేశించిన సేటన్‌లాంటిదేవిటయ్యా?" ఇంగ్లీషుమేష్టరి లిటరరీ జోక్.

"అదెంత పెద్ద పాముయితే మట్టుకు – ఓ నలుగురు మనుషులు కర్రలు పట్టుకొని దాన్ని బాదీలేరటయ్యా? ఇంతకంటే భయంకరమైన శత్రువులు ఎంతమందిని మనం చీకట్లో దొంగచాటుగా హారీ మనిపించలేదు!" ఇంకో కాంట్రాక్టరు సూచన. వాళ్లు ఆడుతున్న మాటలు శూలాల్లా తగులుతున్నాయి పెదబాబు చెవులుకి. అయినా ఓర్మిగా వాళ్లమాటలు భరించవలసిన పరిస్థితి అతన్ది. మాటలంటున్నవాళ్ల చేతులూ గడ్డాలు పట్టుకోని బతిమాల్తూ "ఫ్రెండ్స్–కోపం తెచ్చుకోకండని ప్రార్థిస్తున్నాను.

ఈ డిలే నాకు మాత్రం సరదానా ఏవిటె! లోపల దూరింది జాతైన త్రాచుపాము. మనం కొత్తగా యీ స్కీము ప్రారంభిస్తున్నప్పుడు ఏ దైవం మనని పరీక్షించాలని యీ పాము రూపంలో వచ్చాడో! అంచేత యిలాటి సమయంలో పాముని చంపడానికి నా సెంటిమెంట్ ఒప్పుకోదు. కొంచెం మీరంతా నా మీద సానుభూతి చూపించి ఓపిక పట్టాలి. పాముని అవలీలగా పట్టేసేవాడొకడు యిక్కడికి దగ్గిరగానే వున్నాడు. వాడికి కబురు వెళ్లింది. ఈపాటికి వాడు వచ్చేస్తూ వుంటాడు. నామాటంటే వాడికి బాగా గురి" అన్నాడు.

ఆలస్యం యిక ఎంత మాత్రం భరించలేని ఒక పెద్దమనిషి "ఇదిగో పెదబాబూ! మన సంప్రతింపులు, ఒప్పందాలు పూర్తయి గంటన్నరయింది. మందురౌండ్లు పూర్తయి అరగంట దాటింది. ఇంకా ఫుడ్ లేకపోతే యెలానయ్యా? పోనీ ఓ పన్చెయి. ఏదేనా నాన్ వెజ్ హోటల్నుంచి సరకు తెప్పించేయి – ముందుగా కథ నడుస్తుంటుంది" అని సజెస్ట్ చేశాడు.

విన్లేక చెవులు మూసుకున్నాడు. పెదబాబు. "సారీ ఫ్రెండ్స్! నేనాపని మాత్రం చెయ్యలేను మీలాంటివాళ్లని విందుకు పిల్చి, కబేళా కొట్లల్లో వాళ్లు మిగుల్చా, తగులుగా కొని తయారుచేసిన నాసిరకం ప్రిపరేషన్స్ మీకు సెర్వ్‌చేయించి నన్ను నేను అనుమానపర్చుకోలేను. మీకు అరుదైన వంటకాలు వడ్డింపించాలని యిద్దరు స్పెషల్ కుక్స్‌ని తెప్పించాను. ఆ ఒరియా కుక్, ముస్లిమ్ కుక్ జమీందార్ల దగ్గర వంటలు చేసినవాళ్లు. మీకోసమని రేర్ డిషెస్ తయారుచేశారు. అన్ని ప్రిపరేషన్సు చాలా రుచిగా వచ్చేయట. అయితే మనం వెంటనే భోజనాలు చెయ్యడానికి వీల్లేకుండా భగవంతుడు మన ఓపికని పరీక్ష పెడుతున్నాడు. అంచేత కొంచెంసేపు మీరు సహనం చూపించాలి" అని ప్రాధేయపడ్డాడు. ఇంతలో ఇంగ్లీషు లెక్చరర్ లేచి "పెద్దబాబు! దేవుడు మన సహనాన్ని పరీక్షస్తున్నాడన్నావు. ఇక్కడే చిన్నడౌటు. మనం దేవుడి పార్టీయా లేక దెయ్యం పార్టీయా? మన సహనాన్ని పరీక్షిస్తున్నది దేవుడా, దెయ్యామా? కాసేపు యీ ఎథికల్ క్వశ్చన్ మీద మనం వాదోపవాదాలకి దిగితే కాలం దానంతటదే గడిచిపోతుంది. వాట్ షల్ వియ్?" అని తగులుకున్నాడు.

అసలే ఆకలితో చస్తున్న జనానికి ఆయిన గారి మాటలు కరక్కాయాల మాదిరి మింగుడు పడక నానాయిబ్బందిగానూ ఫీలయ్యారు. ఒకరిద్దరయితే ఆయన అలా అర్థం లేని వాగుడు ఎందుకు వాగుతున్నాడో కనుక్కుంటామని లేచిపోతుంటే, పెదబాబు వాళ్లకి బోధపర్చి కూర్చోబెట్టేడు.

ఇంతలో పాముల్ని పట్టే కుష్టడు వచ్చేశాడనే వార్త డాబామీదికి పరుగెత్తి కొచ్చి చెప్పేరు ఎవరో. పావుల్ని పట్టే మొనగాడు ఏ మాదిరిగా వుంటాడో చూడాలనిపించి, విందుకొచ్చిన అతిథులంతా బిరబిరా డాబా దిగి క్రింది కొచ్చేశారు, సారా మత్తుకి అటూ యిటూ జోగుతూ. పామెక్కడ వుందో, ఎంతుందో, ఎలా వుందో కిష్టడికి అభినయిస్తూ మరీ చెప్పేరు ఒరియా, ముస్లిమ్ కుక్కులు. అసలే వాళ్లభాష అక్కడెవరికీ బోధపడ్డంలేదు. అందులో వాళ్లు మందు పట్టుమీద కూడా వున్నారేమో – వాళ్లు చెప్పింది ఒక్కముక్క కూడా అర్థంకాలేదు కిష్టడికి. వేడుక చూడ్డానికి చుట్టూ పోగయిన జనాన్ని తప్పించుకొని, వండిన పదార్థాలు వున్నాయని చెప్పబడుతున్న గదిలోకి నిర్భీతిగా ప్రవేశించేడు కుష్టడు.

లోపలికి ప్రవేశించేటప్పటికి వాడికి ఆశ్చర్యంతో గుండె ఆగినంతపనయింది. దేదీప్యమానంగా వెలుగుతున్న ట్యూబ్ లైట్లు కాంతిలో తళతళ మెరిసిపోతూ పెద్ద పెద్ద స్టీలు గిన్నెలు. ఆ గిన్నెల్లో తను జన్మలో ఏనాడు చూసిగాని, వినిగాని, తినిగాని వుండని రకరకాల మాంసాలు. గిన్నెల్లోని వంటకాలు వేడిగా వుండాలని సన్నసెగల మీద గిన్నెల్ని వుంచారమో, వాటిలోంచి సుతారంగా ఆవిర్లు బయటికొస్తున్నాయి. వాటి ఆహ్లాదకరమైన చవులూరించే వాసనలు ముక్కుకి తగిలి కిష్టడి నాలిక జివ్వుమనేట్టుగా నోరూరిస్తున్నాయి. వాటిని రుచిచూస్తే బావుండుననే కోరిక ఎలాటి మానవమాత్రుడికేనా కలక్కమానదు.

కిష్టడి పరిస్థితి వింతగా వుంది. ప్రపంచంలోని చాలీ చాలని బతుకులు బతుక్కొస్తున్న అర్ధాకలిగాళ్ల ఏకైక ప్రతినిధిలా గది మధ్యని నిలబడివున్నాడు వాడు. ప్రపంచంలోని అత్యంత రుచికరంగా తయారైన వంటకాలకి సంకేతంలా పాత్రల నిండావున్న వంటకాలు వాడికెదురుగా వున్నాయి. అవన్నీ కిష్టడ్ని ప్రలోభపరుస్తుంటే, వాడు తాత్కాలికంగా తనొచ్చిన పని మర్చిపోయి, ఆబగా వాటి వేపు చూస్తున్నాడు. అయితే యిదంతా కేవలం ఓ అయిదు నిమిషాలు పాటు జరిగిన దృశ్యం. ఇంతలో బయట్నుంచి పాపారావు కేక వెయ్యనే వేశాడు." "ఏట్రా పురక్కనిపించిందా? అని. ఆ కేకకి త్రుళ్లిపడి యీ లోకంలోకి తిరిగొచ్చిన కిష్టడికి తనొచ్చిన పని గుర్తొచ్చింది. వెంటనే వాడి నిశితమైన చూపు గది నాలుగు మూలలకి ఎక్స్‌రే వేగంతో ప్రసరించింది. గదిలో ఎక్కడా పాము అలికిడి లేదు. మరో మారు గదిలో పాము లేదని నిశ్చయం చేస్కోని "ఇందల్లేదురా పాము" అని కేక వేశాడు కిష్టడు.

"లేదూ?" రెస్పాన్స్ పెదబాబుది. "అయితే యింతసేపూ పాము పాము అని భయపెట్టి, యింటికొచ్చిన పెద్దమనుషులకి భోజనాలు పెట్టకండా ఆలిస్యం చేస్తున్నారన్నమాట! దొంగలంజికొడుకల్లారా! పామూ లేదు గీవూ లేదూ, వడ్డించండి వేగిరం" అని రంకెలు వేశాడు పెదబాబు. వెంటనే ఒరియా, ముస్లిమ్ కుక్కలు పెదబాబు కాళ్లమీదపడిపోయి, యెవరికీ బోధపడని మాటల్తో లబలబమన్నారు.

"బాబ్బాయి, ఏ మూల్నో నక్కేసింది పాము. లోపల మాత్రం నిశ్చయంగా వుంది. మాకేమిటి, ప్రాణాలకి తెగించి వడ్డించేస్తాం కాని, వడ్డన మధ్యలో ఏ గిన్నెల మూలనుండో అది బుస్సున పైకొచ్చి ఎవర్ని కరిచేసినా – అప్రతిష్ఠ మీకు, వాడు వెంటనే చచ్చిపోతాడు – అలాటి త్రాచుపామది. విందు మధ్యని ఎవడేనా చచ్చిపోతే, అది ఎలాటి అపశకునమో ఆలోచించండి." ఇదీ వాళ్ల మాటల సారాంశం.

సెంటిమెంట్ పడగవిప్పిన నాగుపాములా లేచింది పెదబాబు మనస్సులో. దాంతో కోపాన్ని అదుపులోకి తెచ్చుకొని "అయితే వేగిరం వెతకండి, అదెక్కడ సచ్చిందో" అని కేకవేశాడు మళ్లీ మరోసారి పాముని వెతకడం ఆరంభమయింది. ఇల్లల్లా దేదీప్యమానంగా వెలిగిపోతున్నది లైట్లతో. అయినా అవి చాలవన్నట్టు గజింబారు టార్చిలైటు పట్టుకొని అంగుళం అంగుళం వెతికేడు కిష్టడు. ఆ వెతకడంలో వంట గదిలోంచి పక్కగదిలోకి వెడుతున్న నీళ్లబొండీ కనిపించింది కిష్టడికి. "పాపయ్యోరే! ఈ బొండీ లొల్లి పామెల్లిపోయుంటాదిరా! ఈ బొండికి అత లేటున్నది?" అనడిగేడు.

"అత్తలా?" ఏవిటి సమాధానం చెప్పాలో బోధపడ్లేదు పాపయ్యకి. ఒక్క క్షణం తర్వాత తేరుకుని "అది అయ్యగారి ప్రయివేటు గదిరా" అని సమాధానం చెప్పేడు.

"అయితే అందులోకి జొరబడిపోయుంటాది" అని సమాధానం చెప్తూ బయటి కొచ్చేశాడు కుష్టడు.

బయట నిలబడ్డ పెదబాబు చెవిలో కూడా పడిందీ సమాధానం. అయనలో బయటికి చెప్పకోడానికి వీల్లేని అందోళనకెరటంలా లేచింది. "అగది తన ప్రయివేటు సెల్లర్. అందులో రకరకాల విదేశాల మద్యాల సీసాలు పదిలంగా దాక్కొని వున్నాయి. ఎన్నోఏళ్ల నుండి ఒకటొకటిగా తను కష్టపడి సంపాదించుకున్న మధువులు అవన్నీ. అవి ఎవరికోసం కొన్నవి కావు. తనే – తన ఆనందంకోసం దాచుకున్నాడు వాట్ని. ఎప్పుడేనా హాయిగా గడపాలనిపించినపుడు, తన యీ ప్రయివేట్ బార్లోకి ఒంటరిగా ప్రవేశించి, ఏసీ చల్లదనంలో ప్రశాంతంగా అన్ డిస్టర్బ్డుగా తన యీ రేర్ వైన్స్ని అస్వాదిస్తూ వుంటాడు. ఆ గదిలోకి తను తప్ప యితరులెవరూ యింతవరకూ ప్రవేశించలేదు. ఇవాళ యీ దరిద్రగొట్టు పాము అందులోకి దూరి, తన ప్రత్యేక మందిరం తాలూకా గుట్టుకాస్తా బైటపడేట్టు చేసి, తన పరువు ప్రతిష్ఠల్ని సర్వనాశనం చేసేటట్టు కనపడుతోంది. పాముకోసమని ఆ గది ద్వారం తెరిస్తే యింకేమన్నా వుందా? తన ప్రయివేటు స్వర్గం ద్వారాన్ని తన చుట్టూ వున్న రాక్షసి ముండాకొడుకులకి తెరిచి చూపించినట్టే కదా! ఈ మందలోంచి ఏ ఒక్కడు లోపలికి చొరబడి చూసినా తను వాళ్లకి సెర్వ్ చెయ్యకుండా దాచిపెట్టుకున్న మధు నిక్షేపాల గుట్టు బయటపడిపోతుంది. దాంతో గగ్గోలు తప్పదు. "మా బతుకులికి యివి చాల్లే అని వూర్లో దొరికే దేశవాళీ సరుకిని సెర్వ్ చేయించి, అసలు సిసలైన విదేశీ సరుకుని నీ కోసం దాచేసుకున్నావా? ఇలాటి ప్రత్యేక సందర్భంలో కూడా కాస్త నీ ప్రత్యేక మధువుని మాకు రుచి చూపెట్టకుండా దాచేసుకున్నావు కదా! నువ్వేం మర్యాదస్తుడివి? లిక్కరే నలుగుర్తోని పంచుకోలేనివాడివి. రేప్పొద్దున్న దొంగ సారా వ్యాపారంలో లాభాలు మాకు సమానంగా పంచియిస్తావా?" అని ఎవడేనా నిలవదీస్తే తనేం చెప్పగలడు? నిజానికి వచ్చిన వాళ్ళకి నాటు సరుకు సెర్వ్ చేయించలేదు. ఓ మాదిరి మంచిరకం విదేశీ సరుకే యిప్పించేడు. పైగా మరో రౌండు తెప్పించమని అంటే, సెర్వ్ చెయ్యడానికి సిద్ధంగా మరికొన్ని సీసాలు కూడా రడీగా వుంచేడు. అయితే, దరిద్రం కాలి ఆ సీసాలు కూడా ఆ గదిలోనే తగలడ్డాయి. ఈ విధంగా తన ప్రయివేట్ రూమ్ ముందు నిలబడి పరిపరివిధాల – అపర ఫాల్‌స్టాఫ్‌లా స్వగతించేడు పెదబాబు. ఏది ఏమైనా ఆ పాముని గదిలోంచి బయటికి తరిమెయ్యాలి. చివరికో ఎత్తుగడెత్తి, అటంబాంబంత నిట్టూర్పు విడిచి, తన అతిథుల్ని వుద్దేశించి యిలా అన్నాడు: "ఫ్రెండ్స్, ఏమిటోగాని యివాళ తలపెట్టిన యీ విందుకి ముహూర్తం సరిగ్గా కుదిరినట్టులేదు. సంప్రతింపులు, ఒప్పందాలు సవ్యంగానే జరిగాయి. కాని తీరా విందు దగ్గిరి కొచ్చేటప్పటికే – విస్తరికీ నోటికీ దూరం పెరిగిపోతోంది." ఇంగ్లీషు లెక్చరర్ గభాలుని కల్పించుకోని "టెంటలస్ కప్" అని గొల్లున నవ్వేడు.

వాడ్ని పట్టుకొని ఇచావగొట్టేయాలన్నంత కోపం వచ్చింది పెదబాబుకి. సాయంత్రం నుండి వాడు పేల్తున్న అసందర్భ ప్రేలాపాలకి అంతులేకుండా పోతోంది. ఇలాటి వాగుడు వాగే వెధవ ఆ మేష్టరుగానే తగలడి వుండకూడదూ – ఏ ట్యుటోరియల్ కాలేజీనో పెట్టుకొని? అయితే, ఏ స్టూడెంటుకీ వాడి పాఠం అక్కర్లేదు – అంతటి గొప్ప టీచరు వాడు. వీడికి నిత్యం మందు, ముండ వుంటేగాని రోజు వెళ్లదు. అందుకని మేష్టరు బతుకు బతికేననే ఆలోచన కూడా లేకుండా సారా సిండికేటులో చేరేడు. ముష్టి లంజికొడుకు – ఏదో చెప్పాలని నేను తంటా పడ్తుంటే, అడ్డుతగిలి ఆలోచన తెంచీసేడు" అని మనసులో ఒక్కక్షణం విసుక్కుని, మళ్లీ ఆలోచనని ట్రేక్‌లోకి తెచ్చి ప్రారంభించేడు పెదబాబు.

"అదీ, మన మేష్టారు చెప్పినట్టు వండింది నోటిదగ్గిరికి రాకుండా అయిపోతోంది యివాళ. ఇదేచూడండి – సరిగ్గా భోజనానికి ముందు, మీ అందరికీ ఒక రౌండ్ ఫ్రెంచి వైన్. సెర్వ్‌చేసి "ఆహా!" అనిపించుకోవాలని ఎంత వుబలాట పడ్డానో ఆ పరమాత్ముడికి తెలుసు. అయితే ఆ సరుకు వుంచిన గదిలోనే పాము బైఠాయించిందని కుష్టడు చెప్తున్నాడు. ఇప్పుడేం చేదామో మీరే చెప్పండి – పాముని దాని మానానికి దాన్ని ఒదిలేసి ఏదో బజారు సరుకు తెప్పించుకొని తాగేద్దామా, లేక గది తెరిపించి పాముని పట్టించేద్దామా?" అన్నాడు.

ఇంగ్లీషు మేష్టారు ముందు కొచ్చేసి "నో,నో, బజారు సరుకు వోన్టడూ. నీ గార్డెన్ ఆఫ్ ఏడెన్‌లోకి జొరబడ్డ ఆ సేటన్‌ని మనందరం చూసి తీరవల్సిందే, చూసింతర్వాత నువ్విచ్చే ఫ్రెంచి వైన్ ఆఫ్ నాలెడ్జిని ఆస్వాదించవలసిందే" అని గట్టిగా, నిర్ద్వంద్వంగా చెప్పి, బడబడ నవ్వేడు ఆయన్ని కాదని మరో ప్రతిపాదనచేసే ఓపిక అక్కడ మరెవ్వరికీ లేదు.

"సరే అయితే, ఒరే పాపారావు – ఆ గది తెరిచి, అందులో ఆ పాముందో లేదో చూడమను" అని ఆర్డరు వేశాడు పెదబాబు.

గర్భగుడి తలుపులు తెరచుకున్నట్టు పెదబాబుగారి మినీబార్ తలుపులు తెరుచుకున్నాయి. ఆ గది అంత విశాలంగా ఏమీ లేదు. కాని ఆ గదిలో ఏ దివ్య సురానందాలు దాగివున్నాయో చూడలనే ఆదుర్దావల్ల కాబోలు పెదబాబు స్నేహితులంతా ఆ గదిలోకి వురకబోయారు. అయితే గదిలోకి అందరి కంటే ముందస్తుగా ప్రవేశించిన కుష్టడు వాళ్లని ద్వారానికి యివతలే ఆపుచేశాడు. వాడి మాటలు వాళ్లకాళ్ళకు సడన్ బ్రేకులు పడేట్టు చేశాయి. "పురుగు గదిలో వున్నాది బాబు! అంచేత ఎవ్వరూ గదిలోకి రాకండి. మీరంతా గుసగుసమాటలు కూడా మాటాడకంట వూరుకోవాల కసింతసేపు. మీరంతా కలిసి ఎనక్కెలిపోండి. ఎట్నుంచి ఎటొచ్చి అదిగాని బయటికి పరుగెత్తుకొచ్చేసిందా, దాని గాబరాలో అది ఎవుర్ని కాటేసేస్తాదో తెల్దుకదా! మన్దెగర్తలో మనం వుండాల. అంచేత మీరంత దూరంగా ఎల్లిపోండి బాబూ! ఒరే పాపయ్యా! ఏదా టార్చిలైటిటిమ్మీ!" అని టార్చీ అందుకొని గదిలోకి ప్రవేశిస్తున్నాడు కుష్టడు. కుష్టడ్ని మనసులోనే అభినందించుకున్నాడు పెదబాబు, తన మినీబార్ చిల్లర మల్లరగాళ్లందరికీ ఎక్స్‌పోజ్ కాకుండా కాపాడినందుకు.

అంతా భయం భయంగా అనుకోకుండానే మెల్లిమెల్లిగా వెళ్లిపోతున్నారు - గదికి సాధ్యమయినంత దూరంగా. అందరూ మాటలు మానేసి, చేష్టలుడిగి చూస్తుండడంతో కిందని చెమ్చాపడ్డా పెద్ద శబ్దంగా అందరికీ వినేపడేటట్టుంది.

అవతల కుష్టడు ఒక్కడే టార్చిలైటు పట్టుకొని, మెల్లిగా జాగ్రత్తగా గదిలోకి అడుగు పెట్టేడు. ధైర్యంగా చీకట్లోకి వెడుతున్న వాడి ఆకారం ఆది మానవుడు గుహలోకి ప్రవేశిస్తున్న దృశ్యాన్ని గుర్తుకుతెస్తోంది ఇంగ్లీషు మేష్టారికి. "వెరిటబుల్ ఏడమ్ వాకింగ్ ఇన్టూ హిజ్ ప్రి హిస్టారిక్ కేవ్!" అని గొణుక్కున్నాడు తనలోతాను. మిగిలిన వాళ్లంతా మనసులో "ఏమి ధైర్యం, ఏమి ధైర్యం! తప్పటడుగు వేస్తే తాచు పాము కరిచేస్తుందని తెలిసికూడా ఎలా వెళుతున్నాడు?" అని అనుకుంటున్నారు.

గదిలోకి ప్రవేశించిన కుష్టడు టార్చీసాయంతో మెల్లమెల్లగా ఓ పక్క నుండి వెతుక్కొస్తున్నాడు. లైట్లువేసి ఆ వెలుతుర్లో పాముని గాబరా పెట్టకూడదని వాడి ప్లాన్. లైట్ల స్విచ్ మీద చెయ్యివుంచే, టార్చీ మెల్లమెల్లగా కదుపుకుంటూ వస్తున్నాడు. అకస్మాత్తుగా, ప్రకాశవంతమైన టార్చి వెలుతుర్ని అవహేళన చేస్తున్నట్టుగా, మిల మిల మెరుస్తున్న రెండు కళ్లు వాడి కంటబడ్డాయి. స్విచ్ వేశాడు.

గది నాలుగు గోడలమీదా వున్న శ్వేత సర్పాల్లాంటి నాలుగు ట్యూబులైట్లు వెలిగేయి. గదిని వరదలా నింపుతున్న వెల్తురులో, అతి నాజూకైన గాజు బీరువాలో అందంగా అమర్చబడిన విదేశీ మద్యం సీసాలు రంగురంగుల మెరుపుల్ని చిలికిస్తూ కనిపిస్తున్నాయి. పొందికైన చిన్నగదీ, గది మధ్యలో మహానాజూకైన చిన్నటేబిలు, దాని ముందర మెరిసిపోతూ కుర్చీ, చేతికందేంత దగ్గరగా చిన్న ఫ్రిజ్, కుర్చీలో కూర్చున్న వాళ్ళని ఆకర్షిస్తున్నట్టు ఎదురుగా బీరువాలో రంగురంగుల మద్యం సీసాలు, వాటికి దగ్గర్లో నిమ్మకి నీరెత్తినట్లు పడుకున్న పాము - యివన్నీ ఓ వింత లోకంలో భ్రమ కలిగిస్తూ, కుష్టడ్ని దిమ్మెరపోయేటట్టు చేస్తున్నాయి.

కాళీ అయిన సీసాల్లోంచి జారిపడిన మద్యం చుక్కల్ని నాకినట్టుంది. ఏదో ఆనందంలో, మత్తుగా చూస్తోంది పాము. ఇలాంటిదృశ్యాన్ని, యిలాటి స్థితిలో వున్న పామునీ, యింతకు ముందెన్నడూ చూసివుండకపోవడంతో, చేష్టలుడిగినవాడిలా నిలబడ్డంలో ఆశ్చర్యంలేదు.

పురిషెడు నాటుసారానేనా యింత వర్కు తనని నోట్లో వేస్కోనివ్వలేదు అమ్మ. సినిమాల్లో హీరోల్లాగ మందుకొట్టి చిందులు వెయ్యాలని తనకెంత కోరిక! అయినా అలాటి కోరికలు ఎన్నటికీ తీరనివ్వకంట లంఖిణిలాటి అమ్మ! ఛీ! ఏంబతుకు? లోకంల యినాటి మందు సీసాలు, పక్కగదిలో గిన్నెల్లో వున్నలాటి మజా అయిన మాంసాలు రుచి సూడకపోయిం తర్వాత - బతికేనా ఒకటే, సచ్చినా ఒకటే! ఎంతకని తనీ గేదెల్ని కాసుకుంటూ దిక్కుమాలిన బతుకు బతకాలి? ఇనాటి ఎదవబతుకు బతికేకంటే యీ పామునోటి ముంగల సెయ్యెట్టి సచ్చిపోతే సరిపోద్దికదా?" ఇలా విషాదయోగంలో పడిపోయాడు కుష్టడు. అయితే వాడికో ఆలోచన కూడా వచ్చింది. తనుగాని యీ పాము కాటువల్ల సచ్చిపోతే, జనమల్లా తనగురించి ఏటనుకుంటారు? "ఈ కిష్టిగాడు ఏదో మొనగాడనుకున్నాంగాని యీడుత్తి నీటి పాములు, మంట

బుక్కడాలు పట్టీ మీసాల్తిప్పిన రకవేరా! అసలు సీసలు తాచుపాము కనిపించేతప్పటికి, నోరెళ్లబెట్టేసి, జావగారిపోయి, సచ్చూరుకున్నాడు" అని. ఈ ఆలోచన రాగానే వాడికి తలకొట్టేసినట్లనిపించిది, ఎప్పటికేనా చిరంజీవిలా ఏక్షన్ చెయ్యాలని అనుకుంటున్న తను నలుగురి ముందర పల్సనైపోడమా? హీరో ఆలోచన వచ్చీరాంగానే కుష్టడు మరి ఆలస్యం చెయ్యలేదు. రంగంలోకి దిగేడు.

సారా చుక్కల్ని బాగా ఎక్కువగానే నాకినట్టున్నాది. తనని ఎదురుగా వున్నవాడు చంపుతాడేమోననే భయం కూడా లేనట్లు ప్రవర్తిస్తోంది పాము. వాడి కందకుండా అది సీసాల మధ్య నుండి పాకుతూ, పట్టు దొరకనివ్వకుండా కదుల్తోంది. వంకర టింకర సీసాలు, ఆడోళ్ల బట్టల్లేనట్టున్న ఆకారంలో సీసాలు, ఎత్తైన వక్షోజాల్లోకి ద్రవం ఎగదన్నుకొస్తున్నట్లు భ్రమ కలిగిస్తున్న సీసాలు, రంగు రంగుల సీసాలు. రంగు రంగుల సారాల్తో సీసాలు, రంగు రంగుల నగ్న స్వరూపాల్లా కనిపిస్తున్న ఆ సీసాల మధ్యనుండి తమకంగా జారుతూ పాము. కుష్టడిలో జ్వాలలు రేగిపోతున్నాయి ఇదీ అని చెప్పడానికి వీలుకాని తృష్ణ, దాహం, వెర్రికోరిక పాములా కదుల్తున్నాయి వాడి మనసులో.

అదిగో అలాటి సమయంలో పాము తాను సాధించదల్చుకున్న పనేదో పూర్తయినట్టు కుష్టడి చేతికి దొరికిపోయింధి. వాడికి అలవాటైన పట్టులో దానిని కంఠం దగ్గర వొడిసిపట్టుకున్నాడు కుష్టడు. వాడి వుక్కువేళ్ల బంధంలోంచి తప్పించుకోలేని పాము, వాడి చేతిచుట్టూ భయంకరమైన పాపంలా చుట్టలు చుట్టుకుంది. పాముని పట్టుకొని బయటికి వస్తున్న కుష్టడు అతి భయంకరంగా కనిపించేడు అక్కడున్న వాళ్లందరికీ. భయం భయంగా అటూ ఇటూ ఒదిగి వాడికి చోటిచ్చేరు. వీధిగేటుదాకా వెనక్కి చూడకుండా నడిచిన కుష్టడు, గేటు దగ్గిర ఆగి 'పాపయ్యా!' అని కేక వేశాడు. పాపారావు పరిగెత్తుకొచ్చేడు. "గొప్ప చీకటిగుంది – టార్చి చూపెట్టుమీ – దీన్ని కాలేజితోట్లో ఒగ్గేసి వొద్దాం" అన్నాడు. ఇప్పుడు వాడి మాటల్లో ఆజ్ఞలాటి స్వరమేగాని, అర్థింపులేదు.

"నానా? యీ సీకట్లో మరినా నెలిపోస్తే యిక్కడ ఎరేంజిమెంటో?" అని సణుగుతున్నాడు పాపారావు.

"దారి సూపిస్తావా – యీ పాముని యిక్కడే ఒగ్గేసి ఎలిపోమంటావా?" అని గర్జించాడు కుష్టడు.

"ఏంట్రా గోల? ఎల్లు, ఎల్లి ఆడికి దోవ సూపించు" అని దూరం నుండి పెదబాబు కేక. లైటు వేసి దారి చూపిస్తూ, పిల్లిలా ముందుకి కదిలేడు పాపారావు.

చీకటి ఆలోచనల పర్వతం కదుల్తున్నట్లు నెమ్మదిగా నడుస్తున్నాడు కుష్టడు. తనకి యింట్లో ఏనాడు సరైన తిండన్నది దొరకలేదు. పెదబాబు గారింట్లో గంగాళాల కొద్దీ మాంసం, సన్నబియ్యపు బిర్యానీ, అన్నాలు – పులుసులు, కూరలు, లడ్లు, జిలేబీలు, పెరుగు.

వేడికి ఎలకలా మాడిపోతూ బోని పెట్టమీదనో తవుడు కట్టలవారనో, పిడకల కుచ్చెర్ల పక్కనో తను నిత్యం తొంగోవాల. పెదబాబు గారింట్లో గదులు విశాలంగా, చల్లగా, హాయిగా – వొయిశాఖమాసం జడిసి పారిపోయినట్టుంది అతనాడింట్లోంచి.

తను తొడగనానికి నిత్యం యీ ముణుకులుదిగని చెడ్డీవే! పేడ, మన్ను, యీటికంపుతో - ఎన్నాళ్లయిందో దాన్ని ఉతికి!

పెదబాబు గారింటికొచ్చినోళ్లంతా సూట్లు, బూట్లు, తెల్లని పంచిలు, కమీజులు - అంతేల - తన పక్కన్నడుస్తున్న యీ పాపిగాడి బట్టలు కూడా యిస్త్రీ నలగనిమడతలే!

ఎండనక, వానక రోజంతా తను బక్కల్ని మేపుకొనొచ్చాక - ఒళ్లు నొప్పులు పోనానికేనా ఓసుక్కమందు యేనాడూ ఏస్కోనానికి లేదు.

మరి పెదబాబు యింట్లోనయితే పార్టీకొచ్చినోళ్లందరి సేతుల్లోనూ, పొట్టిగా, గుండ్రంగా గుమ్మటాల్లాంటి గ్లాసులే! ఆట్నిండా పల్సబడిపోయిన రక్తం రంగులో మందు! దేనికేనా పెట్టి పుట్టాల. తెగించి ఏది సెయ్యినానికీ యీలుకాకంట, ఓ బెమ్మరాచ్చసి ముండ తనకి తల్లె కూకుంది. కుష్టడికి దుఃఖంతో పూనకం వచ్చేసినట్లయింది - తన దీనావస్థని తల్చుకోగానే గింగిరాలు తిరుగుతూ నోట్లోంచి బయటపడాలని చూస్తున్న యేడుపుని బలవంతంగా అదిమిపెట్టేడు. చేతికి చుట్టివున్న పాము చుట్టల్ని మెల్లిగా విప్పి, అతి లాఘవంగా పాముని తుప్పల్లోకి విసిరేసి, వెనుతిరిగాడు. అనుకోకుండా ముఖం మీద పడిన టార్చి వెలుగులో కుష్టడి కళ్లనుండి స్రవిస్తున్న కన్నీటిని చూసి పాపారావు గాబరాపడ్డాడు.

"కుష్టా, ఏడస్తన్నావా? పెపంచికలల ఎవ్వుడూ సెయ్యలేనంత దైర్యమయిన పనినిచేసి, సిన్నపిల్లడిలాగ ఏడస్తన్నావేట్రా?" అనడిగేడు. "ఏడవక యేటి సెయ్యమన్నా వురా? తిండికీ బట్టకీ జాగాకీ అన్నిటికీ కరువేకదా మాయింటికాడ!" అన్నాడు గద్గద స్వరంతో కుష్టడు. స్నేహంగా లాలిస్తూ వాడి భుజంమీద చెయ్యివేశాడు పాపారావు. వాడి ఓదార్పు అభయమిస్తున్నట్లుగా వుంది. పెదబాబింటి వైపు నడిచేరు వాళ్లిద్దరూ...

పెదబాబు గారింట్లో కుష్టడికి హీరోకి లభించనంత స్వాగతం లభించింది. తాగడాలు, తిండాలు పూర్తయినట్టున్నాయి - అతిధులంతా ఖరీదైన సిగరెట్లు వెలిగించి మంచి ఖుషీగా వున్నారు. కుష్టడు తిరిగొచ్చేటప్పటికి, తాగుడు మైకంలో అంతస్తుల భేదాన్ని మరచిపోయిన నలుగురైదుగురయితే ఏకంగా కుష్టడ్ని కౌగలించుకొని వాడి ధైర్య సాహసాల్ని గట్టిగా మెచ్చుకున్నారు. వాళ్లల్లో ఒకాయిన కుష్టడ్ని పెద్దబాబు దగ్గరికి యీడ్చుకెళ్లి, "ఇదిగో పెదబాబు, మన కొత్త ప్రాజెక్ట్‌కి అసలు సిసలు సెక్యూరిటీ గార్డ్ కావాలనుకుంటే - యీ కుష్టడ్ని వేస్కోవయ్యా! మనుషుల్నుండీ, పోలీసుల్నుండీ కాపాడుకోడానికి కావలసిన ట్రిక్స్ మనకి తెలుసు. కొండలంటూ, అడువులంటూ మనకి తెలియని వుపద్రవాలు వచ్చిపడతాయి. అలాటి వాటిని ఫేస్ చెయ్యడానికి కావలసి గట్స్ - యిదిగో యీ కిష్టయ్యలో వున్నాయి. అంచేత నువ్వు మరి రెండో ఆలోచన అన్నది పెట్టుకోకుండా యీ కిష్టయ్యని మన లెఫ్టినెంట్‌గా వేస్కో" అన్నాడు. చుట్టూ వున్న అతిధులంతా ఆ ప్రతిపాదనని బలపరుస్తూ హియర్, హియర్‌లతో చప్పట్లు కొట్టేరు. "తప్పకుండా, తప్పకుండా అలాగే చేద్దాం" అని తన అంగీకారాన్ని తెలిపేడు పెదబాబు. కానీ అతనికి తెలుసు - సాయిత్రమ్మనే బ్రహ్మ రాక్షసి తన కొడుకుని సారా సామ్రాజ్యపు పొలిమేరల్లోకి కూడా రానివ్వదని. అంచేత స్లోపోయిజన్ పద్ధతిలో ఆ ప్రతిఘటన వృక్షాన్ని కూల్చాలి.

అలా అనుకోడమే తడవుగా తన స్కీములో మొదటి స్టెప్ క్రింద అతిథులందరి మధ్యన కుష్టడ్ని నిలబెట్టి, ఓ ఫుల్ బాటిల్ తెరిపించి, పార్టీ పాడైపోకుండా కాపాడిన కుష్టడికి టోస్ట్ ప్రతిపాదించేడు. గ్లాసులు టంగుటంగులు, ఛీర్స్‌ల కోలాహలాలు వువ్వెత్తుగా లేచేయి.

తన చేతిలో బలవంతంగా వుంచబడిన గ్లాసుని భయం భయంగా పట్టుకున్నాడు కుష్టడు. తాగితే బావుండ్నేమోననే కోరిక మనస్సులో మెదలుతున్నా, తాగితే అమ్మ చంపేస్తుందన్న భయం వాడ్ని పట్టి కుదిపేస్తోంది. ఇంతలో పాపారావు వాడి దగ్గర కొచ్చి "ఏట్రా కుష్టా! అనా సూస్తున్నావు నంగిరిపింగిరోడ్లగా? మెల్లిగా తాగేరా! నేకపోతే సుట్టూవున్న బాబులేటనుకుంటారో ఎరికా? మేనర్సులేని మృగం యీడు, యీడికి మనం సాయిం సెయ్యటమేటి అనుకుంటారు. అందికని, పేరంబించు" అని ప్రోద్భలం చేసి, సపోర్టిచ్చేడు.

"తాగితే మాయమ్మ సంపేస్తాదిరా" అని గొణిగేడు కుష్టడు. "సే నోర్మూయ్! ఎవులేన ఆ మటంటే నవ్వుతారు – ఇన్సల్టయిపోతావు నిలువెత్తు మనిషివి యింతంతేసి జబ్బులు, తాచుపాములాటి దాన్ని కిక్కురు మనకంట నొక్కేసిన మొగోడివి – అనాటిది అమ్మ పేరు సెపితే వుచ్చబోసుకునే రకం అని అందరికీ తెలిస్తే ఎంత ఇన్సల్ట్ ఆలోసించినావా? ఇయ్యాల్టి కొక్కసారి దయ్యిరం సేసి నోట్లో పోసేస్కో – అమ్మేటీ అనకంట నాన్సూనుకుంటాను" అని పాపారావు భరోసా యిచ్చేడు.

చుక్క గొంతుకలోకి దిగిపోయింది కుష్టడికి. ముందుస్తుగా తనో లోతు తెలియని నూతిలోకి దిగిపోతున్నట్టనిపించింది. ఆతరవాత మెల్లిమెల్లిగా తేలుతూ ఆకాశంలోకి ఎగిరిపోతున్నట్టనిపించింది. పెదబాబు కన్నుగీటు సంకేతంగా తీస్కొని, కిష్టడ్ని కప్పు కింద పెట్టనివ్వకుండా తాగించేడు పాపారావు. తరువాత వాడి పొట్ట పగిలేటట్టు చేపకూర, కోడిమాంసం యిత్యాదులతో బలవంతంచేసి మరీ భోజనం తినిపించేడు. కుష్టడిప్పుడు అసలుసిసలు చిరంజీవి అవతారంలోకి దిగేడు. లొల్లాయి పదాలు పాడుతూ, తిరగబడిపోతూ, తూలిపోతూ, యింటికి వాడు చేరుకున్నప్పటికి చీకట్లు కొద్ది కొద్దిగా పల్చబడుతున్నాయి.

పేడ కూడవేస్తున్న సాయిత్రమ్మకి వస్తున్న కొడుకుని చూడగానే నెత్తిమీద పిడుగుపడినట్టయింది. కళ్లు చీకట్లు కమ్మినట్టవగానే, పేడతట్ట కిందపడేసి, రొచ్చులోనే చతికిలబడిపోయింది. తను పెట్టుకున్న ఆశలన్నీ పుర్రు పేడలాగ కరిగి భూమిపాలైపోయినాయి. బతుకంతా కన్నీళ్లు తాగేనా సాయిత్రమ్మ కుటుంబం నీతయిన కుటుంబం అని అనిపించుకోవాలని ఆమె పడిన తాపత్రయం, ఒక రాత్రితో చితికిపోయింది. తాచుపాముల్ని కూడా అవలీలగా పట్టుకొని పారేగల కొడుకు యిక తనకెందుకూ పనికిరాకంటయిపోతాడు. తాగుడు మహమ్మారి గుమ్మంలో ఒక్కసారి అడుగుపెడితే, యేటవుతాదో ఆమెకెరికే! తన పుట్టింటోళ్లు తోటలు, దొడ్లు, పొలాలు అన్నిట్నీ పోగొట్టుకున్నారు అన్నదమ్ముల తాగుడు వ్యసనంతో, ఇయ్యాళ వాళ్లకి తాగనానికి గెంజికూడా లేదు. తన కుటుంబం అదే లెక్కన పాడయిపోకంట వుండాలని బెమ్మరాచ్చసిలా కాపలాకి కూర్చుంది తను. అయితేటి జరిగిందియాళ? తన రాచ్చసితనం, తన కేకలు, తన జోరావరీ – యివేవి కాపాడ్నేకపోయినాయి కొడుకుని.

అడి మీద పెట్టుకున్న ఆశలన్నీ మట్టిలో కల్సిపోయినాయి. పాముని పట్టానని యెల్లిన కొడుకు పాము కాటుకి బలైపోనాడు. అలా జరుగుతాదేమో యెప్పుడేనా అని ముందే అనుమానించి, అసలాడ్ని పాములే పట్టొద్దని పట్టుబట్టింది. సరిగ్గియాళ అదే జరిగింది. ఏ గ్రహపాటువల్లో తను కసింత ఒసులుబాటు సూపించగానే మాయిదారి పాము కొడుకుని కాటేసేసింది. ఇక ఆ యిసం అడి వొంటినుండి దిగే ప్రశ్నే లేదు. తనూ అడి ఎనకాతల ఒక్కపాలి ఎల్లింటే యిది జరక్కపోనుకదా! ఛీ! మాయిల పకీరులాటి ఆ పాపిగాడి మాటలకి లొంగిపోయి కొడుకును బలి పెట్టేసుకున్నాను.

ఈ రకంగా వూహించి, వూహించి కుమిలిపోయింది సాయిత్రమ్మ. పాతాళంలోంచి వువ్వెత్తుగ గంగ తన్నుకొచ్చినట్లు సాయిత్రమ్మ దుఃఖం పెల్లుబికింది. హోరున ఏడుస్తూ ఆ పేడ కుప్పల మధ్యనే కూలబడిపోయింది. మొగుడు, తక్కిన పిల్లలు, మనవలు, కోడళ్లు అంతా అమెచుట్టూచేరి అమెని లేవదియ్యబోయేరు. అమె పడుతున్న వేదనకి కారణం అప్పుడే వాళ్లకి తెలిసిపోయింది. శపిస్తున్నట్లు వాళ్లు చూస్తున్న చూపులు, తాగుడు మైకంలో వున్న కుష్టడికి ఏ మాత్రం బోధపడ్లేదు. వాడి సినిమా వెర్రిలో "అమ్మా! నిన్నేడిపించిన ఆ నాకొడుకెవుడో సెప్పు, అడ్ని పట్టుకొని..." అని యేదో అభినయించబోయి తూలి కిందపడ్డాడు. సాయిత్రమ్మ శివమెత్తినదాన్లా లేచి, గబగబా వెళ్లి జుట్టుపట్టుకొని లేవనెత్తి వాడ్ని చితకబాదడం మొదలెట్టింది.

వాడు లబోదిబోమని తాగుబోతు మాదిరి ఏడుపుకి లంకించుకోడంతో, చుట్టూ చేరిన వీధి జనానికి అసలు జరిగిందేదో తెల్సిపోయింది. తన యింటి గుట్టు వీధిలో వాళ్లకి తెల్సిపోయిందన్నప్పటికే సాయిత్రమ్మకి నిజంగా నడిరోడ్డుమీద అవమానం జరిగినట్టనిపించింది. కొడుకుని కసిగా, నిర్దాక్షిణ్యంగా గొడ్డుని బాదినట్టు మరో నాలుగు బాది, గొరగొర వాడ్ని జుట్టు పట్టుకొని వీధి మధ్యకి యీడ్చుకొచ్చి "ఫో నాకొడకా! నా యింట్లోంచి ఫో" అని తోసేసింది. ఆ తోపుకి సరిగ్గా అదే సమయానికి అక్కడికి వచ్చిన పాపారావు కాళ్లమీద పడ్డాడు కుష్టడు. పాపారావు వాడ్ని లేపి, వొడిసి పట్టుకొని "ఏటప్పా! ఏటి జరిగింది? ఏటీ, ఇనాం అడు కర్చు పెట్టేసి నాడని కోపమైపోతున్నావేటి? పెదబాబు గారు యినాం నాచేతికిచ్చి తోల్నారు, ఇదిగో" అని జేబులోంచి కరకరలాడుతున్న ఓ కొత్త వంద కాయితం, కొన్ని చిల్లర కాయితాలు తీసి అమె ముందు వాటిని ఆడిస్తూ, "నూట పదార్లు!" అన్నాడు.

"నా కొడుక్కి మర్యాద సేసి, పూటుగా సారా తాగించి, కక్కలూ ముక్కలూ తినబెట్టి ఇంటికి తోల్నాడు కదా మీ పెదబాబు – నా కుటుంబానికి అంతకంటె పెద్ద యినాం యింకేటుంటాదిరా పాపిగా! పాతికేల్లబట్టి నాచేతికింద ఒదిగి, నాను చెప్పినట్టు యినుకోని బతికిన నా కొడుకు – ఒక్క రాత్రి మీ మాటకి వూకొట్టేసి పాతికేల్లబట్టి నేను బోధపరుస్తున్నదాన్ని తలాయించేసి, మీరిచ్చిన సారా తాగేసి, మీరిచ్చిన తిండి తినేసి – మీ మనిసైపోనాడు కదా – నా బతుక్కి అంతకంటె అవుమానం యేటుంటాదిరా కుక్కల్నాకొడకా? ఎల్లు, యిక్కడ్నుండి బేగెల్లిపో! అదిగో, అడ్ని నెగదీసినావు కదా – అడ్ని కూడా ఒట్టికెల్లి నీ పెదబాబు పాదాలకాడ పడే! పెదబాబుగారి బేపిల్లాగే (కుక్కల్లాగే) యీడూ పెదబాబు

కాళ్లూ, యేళ్లూ నాక్కొని బతుకుతాడు. బేపినాగ సక్కగ నాకడం నేర్పనానికి నివ్వున్నావ్! లే, అడ్నిక్కడ్నుండి తీస్కెల్లిపో! బేగిద్దరూ కదుల్తారా – యిద్దరికీ కలిపి కాల్లిరగ్గొట్టేమంటావా?" అని పెనురక్కసిలాగ అరిచి, దగ్గరున్న గేదెల కట్టుకొయ్యని పెకలించడానికి పూనకం వచ్చినదాన్లా పరుగెత్తింది సాయిత్రమ్మ. కోడళ్లు, కొడుకులు ఆమెని ఆపి సమాధాన పర్చడానికి ప్రయత్నిస్తున్నారు. ఆమె రోదనం, భూదేవి రోదనంలాగ వాడవాడంతటికీ ఎంతో దయనీయంగా వినిపిస్తోంది. పాపయ్య కుష్టడ్ని తీస్కుని అక్కడ్నుండి వెళ్లిపోయాడు.

● *నాగావళి కథలు – ప్రచురణ: 1994* ●

* * *

77

## ఎమ్. వి. రమణారెడ్డి

# రెక్కమాను

ఏకాలంలో పుట్టిందో ఏమో, చేపా చేపా ఎందుకు ఎండలేదనే కథకు ఈనాటి పరిపాలనతో ఎంత చక్కటి సారూప్యత వుందో మూర్తికి ఆశ్చర్యం కలిగించింది. సింపుల్‌గా ఎండుతుందనుకునే చేప, ఎన్ని అవరోధాలు ఎదురై చివరకు ఎండకుండా ఆగిపోతుందో – మన ప్రభుత్వ యంత్రాంగంలో ప్రతి చిన్న పని అలాగే ఆగిపోతుంది. పని తెగకుండా ఫైలు నడపడం పరిపాలనలో ప్రత్యేక నైపుణ్యం. అనాదిలో ఎవడో పనికిమాలిన రాజును దెప్పి పొడుస్తూ రాసిన కథ ఇప్పటి ప్రజాస్వామ్యానికి అతకడం మూర్తివంటి స్వరాజ్యవాదికి నామోషీగా వుంది.

హైదరాబాదు నుండి నిరాశగా తిరిగొస్తున్న మూర్తికి ఊరు చేరువౌతున్న కొద్దీ నీరసం పెరుగుతూంది. చేతగాక తిరిగిరావడం చిన్నతనంగా వుంది. బాబాయికి ముఖం చూపడం ఎలా? బాబాయికి తనమీద ఎంతో నమ్మకం. ఏ పని అప్పగించినా ఇంతవరకు చేతగాక తిరిగి రాలేదు. వృద్ధాప్యంలోకి జారుకుంటున్న బాబాయి నాలుగైదేళ్ళుగా అన్ని పనులు మూర్తికే అప్పగిస్తున్నాడు. గురుమూర్తికి ఆయన దైవం. దిక్కూ మొక్కూ లేని అనాథగా లోకంలో మిగిలిపోయిన మూర్తిని చిన్నప్పటి నుండి పెంచి పోషించి, డిగ్రీ వరకు చదువు చెప్పించి, వొక మనిషిగా తయారుచేసిన బాబాయి అతనికి ఈ ప్రపంచంలో మిగిలిన ఏకైక అనుబంధం. మూర్తి ఈడులో వుండే యువకులకు విలాసాల మీద మోజు సహజం. బాబాయి ఆదర్శాలతో పెరిగిన మూర్తికి వాటిమీద ఆసక్తి లేదు. బాబాయి అప్పగించిన పని శ్రద్ధగా నెరవేర్చడం మినహా మరో ధ్యాస వున్నట్టు అనిపించదు. పిల్లలకు చదువు చెప్పడం, ప్రవేశ పరీక్షలు రాయించి పట్నం తీసుకెళ్లి హైస్కూల్లో చేర్పించడం, పేద విద్యార్థులకు స్కాలర్ షిప్పులు సంపాదించటానికి తిరగడం, పల్లెటూరి రైతులకు చేదోడు వాదోడుగా ఉండటం మొదలైన పనులన్నీ ఇప్పుడు మూర్తిద్వారా జరుగుతున్నాయి.

ఇంతవరకు ఆటంకం లేకుండా పనులు సాగటానికి కారణం మూర్తి కనబరిచే శ్రద్ధ వొక్కటే గాదు, ఆ ప్రాంతంలో బాబాయికున్న పలుకుబడి ప్రధానంగా ఉపయోగ పడేది. స్థానిక కార్యాలయాల్లో మూర్తిని బాబాయి ప్రతినిధిగా వ్యవహరించేవారు. బాబాయికి చెల్లించే భక్తిలో భాగంగా పనులు జరిగిపోయేవి. ఇప్పుడు తలపెట్టిన పని స్థానిక సరిహద్దులు దాటింది. హైదరాబాదు స్థాయిలో బాబాయిని గౌరవించేవాళ్లు కాదు గదా, అనుకునే మనుషులే లేరు. దేశం ఎంతో మారింది. ఆదర్శానికి

చిహ్నమైన ఖద్దరు అధికారానికి సంకేతమైంది; స్వయంకృషికి నిదర్శనమైన రాట్నం ఎన్నికల గుర్తుగా మారింది. స్వరాజ్య సంపాదనకు చైతన్యం రగిలించిన గాంధీజీ విగ్రహంగా మారాడు. స్వాతంత్ర్యం పాతబడింది. స్వాతంత్ర్యం కోసం చేసిన త్యాగాలు అడుగు పేజీలలో పడిపోయాయి. ఆ వాతావరణంలో ఎప్పుడో స్వాతంత్ర్యం కోసం పోరాడిన బాబాయి రాజధానిలో ఎవరికి ఎరుక? ఎం.ఎల్.ఎ. గా ఆయన ఒక్కసారైనా పోటీ చేయలేదు. ఎం.ఎల్.సిగా నామినేట్ కావాలని తిరగలేదు; కాంట్రాక్టుల కోసం ప్రాకులాడలేదు; ఖద్దరు పరిశ్రమకోసం లోను తెచ్చుకోలేదు. మూడున్నర కోటి జనాభాలో ఈ గత చరిత్రులను గుర్తుంచుకునే ధ్యాసలో లేదు హైదరాబాదు.

స్టేషన్‌లో ప్రవేశించబోతున్నానని హెచ్చరిస్తూ రైలు కూతేసింది. మూడో తరగతి పెట్టెలో కిటికీ పక్కనున్న మూర్తి బయటికి తొంగిచూశాడు. చీకటి పూర్తిగా విచ్చుకోలేదు. అప్పుడప్పుడే పలచబడుతూంది. స్టేషన్‌లో వెలుగుతున్న లైట్లు వేగంగా దగ్గరౌతున్నాయి. రైలు ఆ స్టేషన్‌లో ఎక్కువ సేపు ఆగదు. బండి కదిలే లోపు సామానంత గబగబ దించుకోవాలనే ఆత్రుత మూర్తికి లేదు. చేసంచి వొక్కటే అతని దగ్గరుండే సామగ్రి. బండి ఆగగానే దిగటానికి సిద్ధంగా తలుపు దగ్గర నించోవటం అతని అలవాటు. లేచి చేసంచి భుజానికి తగిలించుకొంటూ తలుపు వైపు బయలుదేరాడు. సూట్‌కేసులో పెట్టుకునేంత విలువైన వస్తువులు మూర్తికి లేవు. అతడు తొడిగేది ఖద్దరు చొక్కా, ఖద్దరు పైజమా అవి రెండు జతలుంటే చాలు, ఎంతదూరమైనా వెళ్ళొస్తాడు. ఒక జత ఉతుక్కొని ఆరేసుకుంటే మరోజత మిగులుగా వుంటుంది. కాలేజీ చదివే రోజుల్లో గూడా అంతే. వీడు పుట్టడమే ముసలాడిగా పుట్టాడని స్నేహితులు ఎగతాళి చేసినా మూర్తి నొచ్చుకోలేదు.

ప్లాట్‌ఫాంను వొరుసుకుంటూ బండి నెమ్మదిగా ఆగింది. మూర్తి ప్లాట్‌పాం మీదికి దిగాడు. తనుగాక అక్కడ ఇంకెవరూ దిగుతున్నట్టు లేదు. "టీ సార్....టీ" అంటూ చివరి పెట్టె నుండి మొదలెట్టి ప్రతి కిటికీలో తొంగిచూస్తూ టీకొట్టు కుర్రాడు ముందుకు వస్తున్నాడు. ఆ సమయంలో టీ తప్ప ఆ స్టేషన్‌లో మరేమి దొరకదు. పగటి పూట సోడాలు, వేయించిన వేరుశనగలు దొరుకుతాయి. మూర్తిని చూడగానే టీ కుర్రాడు ఆగిపోయి, వినయంగా "నమస్కారం సార్!" అన్నాడు. "టీ తీసుకోండి సార్!" అనలేదు. మూర్తి టీలు, కాఫీలు తీసుకోడని వాడికి తెలుసు.

"ఏరా భాషా! నువ్వీ పని మానుకోవా?" అడిగాడు మూర్తి.

"ఈ నెల ఐపోతే మానుకుంటాను సార్!"

మూర్తి వాడిని ఈ ప్రశ్న అడగబట్టి ఏడాదైంది. వాడు ఇదే సమాధానం చెప్పబట్టి సంవత్సరమైంది. ఈ పని మాన్పించి వాడు చదువుకొనేలా చేయాలని మూర్తి తాపత్రయం. వాడు చేతికి చిక్కకుండా జారుకుంటున్నాడు. పావలా డబ్బులు మిగిలించుకొని టెంటులో సినిమా చూడకపోతే వాడికి నిద్ర పట్టదు.

రైలు బండి కూతేస్తూ భారంగా కదిలింది. దాన్ని సాగనంపుతున్నట్టు మూర్తి అటువైపు తిరిగి నుంచున్నాడు. రైలు దాటిపోయింది. స్టేషన్ నిర్మానుష్యంగా వుంది. పచ్చజండా మడత చుట్టుకుంటూ వస్తున్న స్టేషన్ మాస్టరు మూర్తిని పలకరించి తన గదిలోకే వెళ్ళిపోయాడు. రైలు వెళ్ళిపోయిన దిశగా ప్లాట్‌పాం

అంచు చేరడానికి మూర్తి నింపాదిగా కదిలాడు. అతడు స్టేషన్ బయటికి రావలసిన అవసరం లేదు. రైలుకట్ట వెంట నడిచివెళితే ఆశ్రమం దగ్గర. ఊరిమీద వెళ్ళాలంటే రెండు మైళ్లవుతుంది. ఫెన్సింగు మధ్య సందుల్లో, దూరంగా ఊరు కనిపిస్తోంది. స్టేషనుకూ ఊరికి మధ్య నాలుగైదు ఫర్లాంగుల దూరం వుంటుంది. ఆ ఊరు పెద్దదీ గాదు, చిన్నదీ గాదు. ఒక మోస్తరు తాలూకా కేంద్రం. గతకుల రోడ్డొకటి స్టేషన్ను ఊరితో కలుపుతుంది. ఆ దారి మధ్యలో, రోడ్డుకు అనుకుని మూర్తి శ్రమపడే పదెకరాల బంజరు స్థలముంది.

రోడ్డుకు ఇరువైపులా ఊరు చేరిందాకా వుండేదంతా బంజరే. సీకు చెట్లు పెరిగి భయంకరంగా వుంది. పైరుకు పనికిరాదు. ఇరవై హరిజన కుటుంబాలు ఇటీవల చెట్లు నరికి గుడిసెలు వేసుకున్న కొద్దిపాటి జాగా తప్ప, మిగిలినదంతా నిరుపయోగంగా వుంది. హైస్కూలు కట్టించడానికి అక్కడైతే అనుకూలంగా వుంటుందని కమిటీ నిర్ణయించింది. ఆ చుట్టుపక్కల ఇరవై మైళ్ళలోపు హైస్కూలు లేదు. దూరంగా వుండే టౌన్లో వుంచి పిల్లలను చదివించే తాహతు, స్థోమత ఆ గ్రామాల్లో లేదు. బాబాయి ప్రోద్బలంతో ఇటీవల విద్యార్థుల సంఖ్య పెరిగినా, అది చెప్పుకోతగ్గ స్థాయిలో లేదు. ప్రతి పౌరునికి విద్య అందించినపుడే దేశం ముందుకు పోగలదని బాబాయి నమ్మకం. అందుబాటులో హైస్కూలుంటే ఎక్కువమందికి చదువుకునే అవకాశం కలుగుతుందని ఆయన ఈ ప్రయత్నం ప్రారంభించాడు.

ఏటవాలుగా కట్టమీదికి దిగుతున్న ప్లాట్ఫాం కొసనుండి కాలిబాట చేరుకున్నాడు మూర్తి. రైలుకట్ట మీద పట్టాలకు సమాంతరంగా నడుస్తుంది కాలిబాట. గ్యాంగ్ కూలీలూ, ఆ వైపు పొలాలున్న రైతులు కట్టమీద రోజూ నడవటం వల్ల ఆ బాట ఏర్పడింది. అనుభవం ఉంటేతప్ప ఆ బాట వెంట నడవడం కష్టం. కంకరరాళ్ళు, పట్టాల అడుగున పేర్చిన స్లీపర్లూ అడుగడుగునా అడ్డుకుంటాయి. అలాటి బాటవెంట మూర్తి జెర్రిపోతులా దొర్లిపోయేవాడు. ఈ రోజు నడకలో ఆ హుషారు లేదు.

అనవసరంగా బరువు నెత్తికెత్తుకున్నాడు బాబాయి. జిల్లా పరిషత్ ద్వారా కట్టిద్దామని కమిటీ సభ్యులు ఎంతచెప్పినా వినలేదు.

"బరువంతా ప్రభుత్వం మీద పడేస్తే ఎంతదూరం సాగుతుంది? నడ్డి విరిగి ప్రజాస్వామ్యం కూలబడుతుంది. తెల్లోడు ఏ స్థితిలో దేశాన్ని విడిచి వెళ్లాడో మీకు తెలీదా? మొత్తం దోచుకొని మన చేతికి చిప్ప మిగిల్చాడు. ఖాళీ ఖజానాతో ప్రభుత్వం అప్పగించాడు. ప్రభుత్వమే ప్రతి పని చేయాలని ఎదురుచూస్తే ఎప్పుడౌతుంది? ఎవరి శక్తికొద్దీ వాళ్ళం చేసుకుంటూ దేశాన్ని నడిపించాలి" అన్నాడు.

తాతలనాడు గొప్ప రైతులుగా బతికిన కుటుంబానికి ఏకైక వారసుడుగా మిగిలిన బాబాయికి ఇంకా ఐదెకరాల మాగాణి నిలిచింది. ఆయన పూర్వీకులకు జూదాలు, గుర్రపు పందాల వంటి వ్యసనాలు లేవు. బాబాయి తండ్రి కమాషులో గాంధీ మహాత్ముడొకసారి ఆ ఊరు రావడం జరిగింది. కాంగ్రెసును పటిష్టం చేస్తూ గాంధీగారు దేశం నలుమూలలా పర్యటిస్తున్న రోజులవి. చెన్నపట్నంలో చదువుతున్న బాబాయి ఇంటర్ పరీక్షలు రాసి ఇంటి కొచ్చాడు. గాంధీగారిని చూడటానికి తండ్రితోపాటు

తనూ వెళ్ళాడు. ఆ పూట తనింట్లో గాంధీగారికి భోజనం పెట్టాలని బాబాయిగారి తండ్రి ఉబలాటపడ్డాడు.

"నాకు పిడికెడు మెతుకులు పెట్టడం దేశసేవ కాదు. స్వరాజ్యం కోసం నువ్వు ఇవ్వగలిగేదేమిటి?" గాంధీజీ అడిగాడు.

"నా యింటికొచ్చి చూడండి!" అన్నాడు బాబాయి తండ్రి.

అతని ముఖంలో గాంధీగారికి ఏమి కనిపించిందో ఏమో, వెంటనే బయలు దేరాడు. ఉద్యమానికి యాచించడంలో మహాత్ముడు వామనావతారానికి తీసిపోడు. బాబాయి తండ్రి బలిచక్రవర్తికి అన్న. భోజనాల తరువాత పెద్ద వెండి తట్టను గాంధీగారి ఎదుట వుంచాడు. దాన్నిండా అంచులకు జారేటన్ని ఆభరణాలు; ఆభరణాల అడుగున రెండు దోసిల్లు వెండి రూపాయలు; బీరువాలో వున్న బంగారం, నగదు మొత్తం ఊడ్చి గాంధీగారి ఎదుట తట్టలో వుంచాడు.

మహాత్మునికి కళ్ళు చెమ్మగిల్లాయి. ముఖం మీద చిరునవ్వు మాత్రం చెరగలేదు.

"ఇంతకంటే నీ దగ్గర ఏమీ లేదా?" అని అడిగాడు.

"అడగండి స్వామీ!" బాబాయి తండ్రి వినయంగా వెనకాడకుండా జవాబిచ్చాడు. ఈ దిగంబరునికి ఇంత ఆశ ఏమిటా అని చూస్తున్న జనం నివ్వెరపోయారు. మహాత్ముడు బాబాయిని దగ్గరగా లాక్కుంటూ—

"ఈ బిడ్డను ఉద్యమానికి ఇచ్చెయ్" అన్నాడు.

బాబాయి తండ్రి కళ్ళల్లో ఆనందం విరిసింది. మహాత్ముని కోరిక తీర్చే మరోసాధనం తన ఆధీనంలో వున్నదని తెలుసుకున్న సంతోషం అది!

"అంతకంటే భాగ్యమా స్వామీ!" అన్నాడు కళ్ళొత్తుకుంటూ.

"ఇప్పుడే కాదు. స్వరాజ్యం కోసం జరిగే ఉద్యమంలో తనవంతు పాత్ర నిర్వహించే బాధ్యత వుందని ఈ పసివాడు తనకై తాను గుర్తించినప్పుడు తీసుకొంటా. అంతవరకు నీ దగ్గరే వుంచు" అన్నాడు మహాత్ముడు.

డిగ్రీ చదవటంకోసం బాబాయి మద్రాసుకు తిరిగి వెళ్ళాడు. తొలి సంవత్సరం పూర్తి చేసిన తరువాత చదువు సాగలేదు. సహాయ నిరాకరణోద్యమానికి కాంగ్రెస్ పిలుపిచ్చింది. బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా దేశం నలుమూలల దావాగ్ని చెలరేగింది. వేలాదిమంది విద్యార్థులు చదువులు మానేసి ఉద్యమంలో దూకారు. బాబాయిని అరెస్టు చేసి చెంగల్పట్టు జైలుకు పంపించారు.

సంవత్సరం తరువాత బాబాయి జైలు నుండి విడుదలయ్యాడు. ఆ తరువాత కొద్దిరోజులకు, సబర్మతి ఆశ్రమాన్ని నిర్వహించటానికి తనకు తోడుగా వుండమని మహాత్మునివద్దనుండి కబురొచ్చింది. గాంధీజీ సాహచర్యంలో బాబాయి నాలుగేళ్ళపాటు సబర్మతి ఆశ్రమంలో గడిపాడు. తండ్రి ఆరోగ్యం దెబ్బతిన్నదని తెలిసి మహాత్ముని అనుమతితో స్వగ్రామం తిరిగొచ్చాడు.

తండ్రి ఆరోగ్యం క్షీణించినప్పటినుండి వ్యవసాయం కుంటుబడింది. ఆయన కాలం చెయ్యడంతో పూర్తిగా మూలన పడింది. ఇంటి యాజమాన్యం స్వీకరించడానికి బదులు బాబాయి జిల్లాలో కాంగ్రెస్ పార్టీని చక్కబెట్టడంలో మునిగిపోయాడు.

ఏ అవసరమొచ్చినా మరొకరిని అడిగే అలవాటు బాబాయికి లేదు. తరుగుతున్న ఆదాయానికితోడు ఖర్చులు పెరిగిపోయాయి. ఏ చిన్న అవసరం కలిగినా బ్రిటీష్ అధికారులు బాబాయిని జైలుకు పంపడం మరవటం లేదు. అప్పుడింత అప్పుడింతగా ఆస్తి కరుగుతూంది. ఒక్కగానొక్క కొడుకు పెళ్ళి చేసుకుంటే వంశం నిలుస్తుందని తల్లి ఆశపడింది. కార్యసాధనకు వివాహం ప్రతిబంధకమని బాబాయి బ్రహ్మచారిగా వుండిపోయాడు. "భార్య పిల్లలు వుండిగూడా సర్వసంగ పరిత్యాగిలా బ్రతకడం మహాత్ముని కొక్కడికే సాధ్యం. మనకంత నిగ్రహం ఎక్కడుంటుంది? సంసారం మీద మమకారం పెరిగితే దేశాన్ని మరిచిపోతాం" అన్నాడు బాబాయి.

తల్లి, ఇల్లు, సంపద పోగొట్టుకోగా మిగిలిన ఐదెకరాల పొలం మీద వచ్చే ఫలసాయంతో బాబాయి జీవితం గడుస్తోంది. అది సరిపోదనే సమస్య ఆయనకెన్నడూ రాలేదు. ఆయనకు సొంత ఖర్చు దాదాపు లేదనే చెప్పాలి. ఏటి వొడ్డున చిన్న కుటీరం వేసుకున్నాడు. కుటీరం చుట్టూ కూరగాయలు పెంచుకుంటాడు. పిడికెడు బియ్యం ఉడకేసుకుని తింటాడు. అందువల్ల భూమ్మీద వచ్చే కౌలు చాలా వరకు మిగిలిపోయి జమ పడింది. ఆ డబ్బుతో హైస్కూలు కట్టించాలని బాబాయి సంకల్పం.

బాబాయి సాయంతో చదువుకున్న పేద విద్యార్థులు వందల సంఖ్యలో వున్నారు. వాళ్లలో చాలామంది ఉద్యోగాలు సంపాదించుకున్నారు. ఎప్పుడైనా వచ్చి బాబాయిని చూసి వెళుతుంటారు. బంజరు కోసం ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టడం అవివేకమని వారిలో చాలామంది అభిప్రాయం. ఆ మాట బాబాయితో చెప్పే ధైర్యం ఎవ్వరికీ లేదు. మనం చెబితేగాని అక్కడ బంజరు వున్నట్టు ప్రభుత్వానికి తెలీదట! ఆక్రమించుకుంటే అడిగే దిక్కుండరు. చట్ట వ్యతిరేకంగా ఆక్రమించుకోడానికి బాబాయి వొప్పుకోడు. ప్రభుత్వాన్ని ఉచితంగా ఇవ్వమని అడగటం లేదు. ఖరీదుకే అమ్మమని అడుగుతున్నారు. దానికి గూడా సంవత్సరం నుండి చెప్పులు అరిగేలా తిరుగుతున్నా పలికే దిక్కులేరు.

కాలికింద కంకర్రాయి పడి కలుక్కుమంది. మూర్తి ఆలోచనా ప్రపంచంనుండి భూమ్మీది కొచ్చాడు. కాలికింద పడిన కంకరరాయిని పట్టాలకింద పరచిన కంకరలోకి ఎగదోసి పట్టామీద కూర్చున్నాడు. వేళ్లతో మడమ వొత్తుకుంటూ పరిసరాలు పరికించి చూశాడు. నునులేత ఎండతో దిక్కులు ఎర్రబడ్డాయి. దూరంగా, ఎండిపోయిన ఏటిలో తెల్లటి ఇసుక వజ్రాల గనిలా మెరుస్తోంది. ఏటి వొడ్డున బాబాయి కుటీరం వొంటరి బాటసారిలా నిలబడింది. అప్పటికే అతను రెండో రెక్కమాను దాపుకు చేరుకున్నాడు. పట్టాలకూ రెక్కమానుకూ నడుమ కాలిబాట ఆవలకు సాగిపోతుంది. రెక్కమాను దాటగానే కట్టదిగి పొలంగట్టు వెంట నడిచి ఆశ్రమం చేరుకోవాలి. కాలికింద రాయిపడటం మంచిదైంది. లేకపోతే అలాగే ఆలోచించుకుంటూ మలుపు తిరగకుండా ఎంతదూరం వెళ్ళేవాడో!

రెక్కమాను వైపు తలెత్తి చూశాడు మూర్తి. అది పట్టాలకు రెండుబార్ల ఎడంగా కట్టను అంటిపెట్టుకొని నిలుచుంది. అది ఇనుప కడ్డీలతో వలలా అల్లిన జాలీ స్తంబం. నిటారుగా ఆకాశంలోకి ఎదిగి, పన్నెండడుగుల ఎగువన రెండు కొమ్మలుగా చీలింది. కొమ్మల్లో వొకటి పెద్దది, రెండోది చిన్నది. పెద్దకొమ్మ ఎత్తుగా, స్టేషన్

వైపుగా వుంటుంది. రెండోది దానికంటే కొంచెం పొట్టిగా వుంటుంది. వాటికొసల్లో వొక్కో కొమ్మకు వొక్కో అకు. ప్రతి ఆకుకు రెండు గుబ్బలు–పైవైపు ఎర్రగుబ్బ, కిందివైపు పచ్చగుబ్బ. ప్రతి ఆకుకు బారెడు జంపున సాగిన తోక. మూర్తికి ఆ ఆకారం కొత్తగాదు. రైలు పట్టాలకు దగ్గరగా వుండటం వల్ల చిన్నప్పటి నుండి రెక్కమాన్ను చూస్తున్నాడు. దాన్ని పట్టుకుని వేలాడుతూ ఎన్నోసార్లు ఆడుకున్నాడు. ఆ రోజెందుకో అది వింతగా కనిపించింది మూర్తికి.

రైల్వే వ్యవస్థ వంటి భారీ యంత్రాంగంలో ఆ చిన్న యంత్రానికి ఎంత అధికారం వుందో మూర్తికి కొత్తగా తెలిసినట్టయింది. వేలాది మైళ్ల పొడవున ప్రాకిన పట్టాలు, వాటిమీద ఘీంకరిస్తూ పరిగెత్తే భారీ ఇంజన్లూ, ఓడలవంటి బోగీలు – వీటి మధ్య రెక్కమానవే చిన్న యంత్రానికున్న ప్రాముఖ్యత గుర్తింపుకు రాదు. కానీ, ఎంత పెద్ద రైలైనా, ఎంత దూరంనుండి వస్తున్నా, రెక్కమాను వంగితేగాని స్టేషన్‌లో ప్రవేశించలేదు; రెక్కమాను వంగితే తప్ప స్టేషన్ వదల్లేదు. ఏ రెక్కవంగితే రైలు ఆ వైపుండే లైనుకే నడుస్తుంది. పెద్దరెక్క వంగితే మెయిన్ లైనుమీద ప్లాట్‌ఫాం అందుకుంటుంది. చిన్నరెక్క వంగితే లూప్‌లైను మీద పక్కకు పడిపోతుంది. ఇలాటి రెక్కమాన్లు ఎన్నింటినో దాటుకుంటేగాని రైలుబండి గమ్యం చేరదు.

పట్టాకోసం పెట్టుకున్న దరఖాస్తు ఆరునెలలైనా జవాబు రాకుంటే, విషయం తెలుసుకోటానికి కలెక్టరేటుకు వెళ్ళాడు మూర్తి. గుమాస్తా కొత్తవాడు. ఫైలు అతని దగ్గరే నిలబడి వుంది. అదే ఆఫీసులో పనిచేసే తన సహచరుల సహాయంతో రెక్కమాను వేయించాడు. ఫైలు రైలులా కదిలి, సెక్షన్ ఆఫీసరు, హుజూర్ సిరస్తార్ పేర్లు గల స్టేషన్లు దాటి జిల్లా కలెక్టరుకు చేరింది. ఆయన ఆర్.డి.వో. రిపోర్టుకు ఆదేశించాడు. ఫైలు తిరుగు ప్రయాణంలో మునుపటి స్టేషన్ల దగ్గర ఆగుతూ గుమస్తాకు తిరిగొచ్చింది. ఆర్.డి.వో.ను ఉద్దేశించి ఆ గుమాస్తా తయారుచేసిన ఉత్తరం చిత్తుప్రతి మునుపటి స్టేషన్ల దగ్గర ఆగుతూ పైకెళ్ళి తిరిగొచ్చింది. చివరి టైపిస్టు దగ్గర ఉత్తరం తుదిరూపం తయారై – మరోసారి పైకెళ్ళి, ఆర్.డి.వో. కార్యాలయానికి తపాలా చేయబడింది. ఆర్.డి.వో. ఆఫీసులో గూడా ఇదే తంతు – యల్.డి.సి., యు.డి.సి., ఆర్.డి.వో. – పైకీ కిందికీ ప్రతి స్టేషన్‌లో ప్యాసింజర్ బండిలా ఆగి ఆగి తిరుగుతూ చివరకు తాసిల్దారుకు పంపబడింది. తాలూకాఫీసులో ప్రయాణంగూడా అలానే వుంది. యల్.డి.సి., యు.డి.సి., డిప్యూటీ తాసిల్దారు, తాసిల్దారు, అదే మార్గంలో తిరిగి యల్.డి.సి.; అక్కడి నుండి రెవెన్యూ ఇన్‌స్పెక్టర్, ఇంకోసారి యల్.డి.సి. నుండి మునుపటి స్టేషన్ల గుండా తాసిల్దారుకు వెళ్ళి యల్.డి.సి.కి తిరిగి రావడం; సర్వేయరు, మరొకసారి పైకీ కిందికీ, కిందికీ పైకీ, పైకి కిందికీ, కిందికీ పైకి – మొత్తంమీద అంతా తెలిసినవాళ్లు వుండటం వల్ల తాలూకాఫీసు నుండి కాస్త తొందరగా బయటపడింది.

"భూమి నీది కాదు. అడిగేది నీ సొంతానికి కాదు. ఎందుకయ్యా మా ప్రాణం తింటున్నావ్?" అన్నాడు గుమస్తా రెవెన్యూ కమిషనర్ ఆఫీసులో. అక్కడ ఫైలు కదిలించడం తనవల్ల కాదని మూర్తికి తెలిసిపోయింది. హైదరాబాదు నుండి తిరుగు ముఖం పట్టాడు.

తనలో తను నవ్వుకుంటూ లేచి నిలుచున్నాడు మూర్తి. రెక్కమాను దాటుకుని, కట్టదిగి పొలంగట్టు చేరుకున్నాడు. పంటకాలువలో తడిలేదు. గట్టు గట్టిపడి నడకకు అనుకూలంగా వుంది. గట్టు తడిగా వుంటే కొంచెం జాగ్రత్తగా నడవాలి. అజాగ్రత్తగా అడుగేస్తే జారుతుంది. ఈ కాలిబాటకాక ఆశ్రమానికి ఊరి మీదుగా బండ్లబాట నడుస్తుంది. పది చినుకులు రాలితే అది మనుషులకు ఉపయోగపడదు. అంత మాత్రాన్నే దాన్ని చులకనగా చూడటం కుదరదు. ఎడతెరపి లేకుండా కార్లూ, జీపులూ నడిచిన చరిత్ర ఆ గతుకుల బాటకు వుంది. ఎన్నికల్లో పోటీ చెయ్యమని వొత్తిడి చేస్తూ మొదట్లో పెద్ద పెద్ద నాయకులు బాబాయిని బ్రతిమాలేవారు. స్వరాజ్యం రావడంతో దేశానికి కాంగ్రెస్ పార్టీ అవసరం తీరిపోయిందని బాబాయి అభిప్రాయం. పార్టీ కోసం ప్రచారం చెయ్యడానికి రమ్మని ఆ తరువాత ఎంతోమంది ప్రాధేయపడుతూ తిరిగారు. చిరునవ్వుతో సమాధానం చెప్పి బాబాయి తప్పుకుంటూ వుండేవాడు. ఆ తరువాత ఎన్నికల్లో ఎంతోమంది అభ్యర్థులు ఆశీర్వాదం కోసం వచ్చేవారు. జిల్లాలో పర్యటించడానికి వచ్చిన మంత్రులు బాబాయి దర్శనానికి వచ్చేవారు. క్రమంగా ఇలాటి రాకలు తగ్గిపోయాయి. ఇటీవల పొత్తిగా లేకుండా పోయాయి. వారి తాకిడి తగ్గిన తరువాత బాబాయికి ప్రశాంతత ఎక్కువైనట్టు ఆయన నడవడిక వల్ల అర్థమౌతుంది.

మూర్తి కుటీరంలో అడుగుబెట్టిన సమయాన పూజ ముగించుకుని బాబాయి రాట్నం దగ్గర కూర్చుంటున్నాడు.

"ఇదేనా రావడం మూర్తీ! ఇంకా ముఖం కడిగినట్టు లేదు." దిగులుతో వాడిపోయిన మూర్తి ముఖాన్ని గమనిస్తూ అడిగాడు బాబాయి.

"లేదు బాబాయ్!"

"వెళ్ళి ముగించుకొని రా. తరువాత మాట్లాడొచ్చు."

మూర్తి స్నానం ముగించుకుని బాబాయి ఎదురుగా వచ్చి కూర్చున్నాడు. కుటీరం మధ్యలో జంపకానా పరిచి, దానిమీద కూర్చుని రాట్నం వడకడం బాబాయి అలవాటు. అది పదిహేను అడుగుల వెడల్పు, ఇరవై అడుగుల పొడవు వున్న కొట్టం. అరలు లేకుండా వొకే గదిగా ఉండడం వల్ల విశాలంగా కనిపిస్తుంది. అందులో వొకమూల పూజాస్థలంగా కేటాయించబడింది. మరోమూల వంట. గోడలకు చుట్టూరా గాంధీ, నెహ్రూ, పటేల్, తిలక్ మొదలైన నాయకుల పటాలు తగిలించి వున్నాయి. మరో మూల ఐదడుగుల టేకు అల్మెరా వుంది. అక్కడక్కడ తగిలించిన తట్టలూ, బుట్టలూ, చెక్క అటకలూ తప్ప చెప్పుకోతగ్గ సామగ్రి లేదు. బాబాయి విశ్రాంతి తీసుకునేప్పుడు ఉపయోగించే పడక కుర్చీ గోడకు ఆనించివుంది. ఆయన మంచం ఉపయోగించడు. పడక నేలమీద పరుచుకుంటాడు. రాత్రి పడుకోవటానికి తప్ప పడక పరచడం మూర్తి చూడలేదు.

రెండు మూడు రకాల పళ్ళుండే తట్టను మూర్తికి అందించాడు బాబాయి. అది వారి ఫలహారం. అవి తిని పాలు తాగుతాడు. మూర్తి తట్టను అందుకుని నింపాదిగా తొక్కతీసి, కొద్ది కొద్దిగా నోట్లో వేసుకుంటున్నాడు. మూర్తి మందకొడితనం చూస్తూనే బాబాయికి విషయం తెలిసిపోయింది. తను కుతూహలం కనబరుస్తూ

అడిగితే చెప్పడంలో మరింత కుంగిపోతాడు. అందువల్ల, మొదలెట్టే అవకాశం మూర్తికే వదిలేస్తూ తన దృష్టి రాట్నం మీద వుంచాడు.

"మీరొస్తేగాని పని అయ్యేలా లేదు." మూర్తి మెల్లిగా అన్నాడు.

"నేనా?"

బాబాయి ఊరి పొలిమేర దాటి చాలా రోజులైంది. మూర్తి చేతికొచ్చిన తరువాత ఆ అవసరం కలగలేదు.

"నాతో అయ్యే పనిగాదు."

కమీషనర్ ఆఫీసులో పరిస్థితి వివరించాడు మూర్తి.

"అక్కడ నాకు మాత్రం తెలిసినోళ్లు ఎవరున్నారు?"

"లక్ష్మయ్యగారు తలుచుకుంటే క్షణంలో ఔతుంది. ఆయనిప్పుడు రెవెన్యూ మంత్రిగా వున్నారు."

లక్ష్మయ్యగాక మరొకరైతే, బాబాయికి ఆ సలహా యిచ్చే సాహసం మూర్తి చెయ్యలేదు. మంత్రుల దగ్గరికి సిఫారుసుతో వెళ్ళడం బాబాయికి ఇష్టముండదు. లక్ష్మయ్యతో ఆయనకు చాలా చనువుంది. బాబాయిని పరామర్శించడానికి వచ్చే నాయకులంతా మానుకున్నా లక్ష్మయ్య మాత్రం వచ్చేవాడు. ఇటీవల ఎందుకో రాలేదు గానీ, రెండేళ్ళ కిందట వచ్చాడు. ఇతర నాయకులు వచ్చినప్పుడు కనిపించే ఇరకాటం లక్ష్మయ్య వచ్చినప్పుడు బాబాయిలో కనిపించదు. ఆయన బాబాయితో పాటు చాపమీద కూర్చుంటాడు; కొద్దిసేపు రాట్నం తిప్పుతాడు; పాలు తాగుతాడు; సొంత ఇంట్లో వున్నంత స్వతంత్రంగా వుంటాడు.

"మంత్రి హోదాలో నువ్వొస్తే, గౌరవించడానికి నా ఇంట్లో ఏముందిరా?" అన్నాడు బాబాయి.

"నన్ను మంత్రిగా ఎందుకు చూస్తావురా? కాలేజీలో నాకు పుస్తకాలు కొనే గతిలేనప్పుడు ఆదుకున్నావే, ఆ హోదాలో నువ్వుండు" అన్నాడు లక్ష్మయ్య.

"ఛ. అది స్నేహం. స్నేహానికి అంతస్తులు వుండవు."

"అయితే ఇప్పుడూ లేవు."

లక్ష్మయ్యకు మూర్తిని పరిచయం చేశాడు బాబాయి. ఇద్దరూ కలిసి చదువుకున్న రోజులు, సబర్మతి ఆశ్రమంలో కలిసి పనిచేసిన రోజులు గుర్తుచేసుకుంటూ కొద్దిసేపు గడిపేవారు. బాబాయి సబర్మతి నుండి తిరిగొచ్చిన తరువాత గూడా లక్ష్మయ్య అక్కడ చాలా కాలం పనిచేశాడట. ఆనాడు ఉద్యమంలో త్యాగాలు చేసిన గొప్ప వాళ్లందరిని వెనక్కు తోసి, అధికారం కోసం వచ్చే అవకాశవాదులతో కాంగ్రెస్ ఖరాబైపోతూoందని లక్ష్మయ్య వాపోయాడు. దేశం ఇప్పుడు ఎదుర్కొంటున్న సమస్యలు ఆయన నోట వింటే గుండె తరిగిపోతుంది. బాబాయి కళ్ళు చెమ్మగిల్లాయి.

లక్ష్మయ్య నిర్వహించే శాఖలో వొక ప్రజాకార్యం ముందుకు సాగకుండా ఆగిపోవడం బాబాయికి నమ్మబుద్ధిగాలేదు. "పాపం, వాడి చేతికి ఈ శాఖ ఇటీవలే వచ్చింది" అని సర్దుకున్నాడు.

"ఇది వాని దృష్టికి పోతే వోర్చుకోడు. కొద్దిరోజులు ఆగి చూద్దాం" అన్నాడు బాబాయి మూర్తితో.

"ఇలాంటివన్నీ మంత్రుల దృష్టికి పోతాయా? ఎవరో వొకరు తీసుకుపోతేగాని ఇంత చిన్న విషయాలు వారిదాకా పోవు. కమిషనర్ నుండి రిజెక్టయి ఫైలు తిరిగొస్తే మళ్లీ కథ మొదటి కొస్తుంది. ఆలోపు ఆయనకు శాఖ మార్చితే మన పని ఎప్పటికీ కాదు" అన్నాడు మూర్తి.

బాబాయిని ఎలాగైనా బయలుదేరేట్టు చెయ్యాలని మూర్తి పట్టుదలగా వాదించాడు. బయలుదేరక తప్పదని బాబాయి నిర్ణయించుకున్నాడు.

తెలుగు ప్రజల రాజధానిగా మారిన తరువాత హైదరాబాదును బాబాయి చూడటం అదే మొదటిసారి. రెవెన్యూ మంత్రికి కేటాయించిన బంగళా ఎక్కడుందో మూర్తి అదివరకే చిరునామా సేకరించాడు. లక్ష్మయ్య బంగళా చూసి బాబాయి గాబరా పడ్డాడు. లంకంత ఇల్లు, ముందువైపు ఉద్యానవనంతో రాజభవనంలా వుంది. బంగ్లా చుట్టూ ఎత్తైన ప్రహరీ గోడ. వాహనాల రాకపోకలకు అనుకూలంగా విశాలమైన గేటు. గేటు పక్కన సెంట్రీ పోస్టు. అందులో ఇద్దరు సాయుధ సిపాయిలు. గేటు దిమ్మకు 'కొండా లక్ష్మయ్య, రెవెన్యూ శాఖామాత్యులు' అని బోర్డు తగిలించి వుంది. ఆ ఆర్భాటం చూసి, లోపలికి అడుగుపెట్టడం మంచిదా కాదా అని ఇద్దరూ ఆలోచనలో పడ్డారు. మూర్తి తమాయించుకొని "పద బాబాయ్" అన్నాడు. బాబాయి అనుమానంగా ముందుకు అడుగేశాడు.

"ఆగు. ఎక్కడికి?" గేటులో అడుగు పడిందో లేదో, సాయుధ సిపాయిల్లో వొకడు తుపాకితో అడ్డొచ్చాడు.

"మంత్రిగారిని కలుసుకోటానికి." ముందుకొచ్చి మూర్తి జవాబిచ్చాడు.

"ఎవరు మీరు?"

ఎవరని చెప్పాలి? చెప్పుకోవలసిన హోదా తమకేముంది?

"ఈయన మంత్రిగారి స్నేహితులు." తడుముకుంటూ అన్నాడు మూర్తి.

సిపాయి ఎగాదిగా చూశాడు. ముతక ఖద్దరు చొక్కా, నీరుకావి గోచిపంచ, పాతకాలం కళ్ళజోడు, చంకలో గుడ్డ సంచి – సిపాయికి ఎంతమాత్రం నమ్మకం కలగలేదు. సిపాయి చూపు మూర్తి వైపు తిరిగింది. ఖద్దరు పైజమా, ఖద్దరు కుర్తా, ఖద్దరు సంచి – ముసలాడికీ కుర్రాడికీ వయసులో తేడా తప్ప నాగరికతలో తేడా లేదు. సిపాయి పెదవుల మధ్య చిన్న పరిహాసం విచ్చుకుంది.

"అపాయింట్‌మెంట్ తీసుకున్నారా?"

"లేదు."

"లోపలికి పంపడానికి మాకు ఆర్డరు లేదు."

సిపాయి మంచివాడులా వున్నాడు. మరొకడైతే వెళ్ళిపొమ్మని అంత మర్యాదగా చెప్పివుండడు.

బాబాయి విగ్రహంలా బిగుసుకుపోయాడు. గత్యంతరమేమిటో మూర్తికి తోచలేదు. అంతలో, పోర్టికోలో బయలుదేరబోతున్న కారు హారన్ వినిపించింది. సిపాయి నాజూగ్గా

వాళ్లిద్దరిని దారికి అడ్డులేకుండా తొలగించాడు. రెండో సిపాయి బయటికొచ్చాడు. ఇద్దరూ అటెన్షన్‌లో నిలుచున్నారు. మబ్బుచాటు నుండి బయటికి వస్తున్న చందమామలా తెల్లటి కారు పోర్టికో దాటుకుని గేటులో ప్రవేశించింది. అశోకచక్రం మధ్యలో వుండే మూడు రంగుల జెండా కారు ముక్కుమీద రెపరెప లాడుతూంది. ఠక్కుమని బూట్లు చరుస్తూ సిపాయి లిద్దరూ సెల్యూట్ చేశారు. గేటు వారన వొత్తిగిల్లిన మూర్తిని, బాబాయిని దాటుకుంటూ కారు రోడ్డుమీదికి జారుకుంది. మంత్రిగారు బయటికి వెళుతున్నారు. ఎక్కడికి వెళుతున్నారో, ఎప్పుడు తిరిగొస్తారో ఏమో!

గేటు దాటి పదిహేను గజాలు వెళ్ళిన మీదట, కారు వొక్క ఊపున ఆగింది. సిపాయిలు అదిరిపడి కారువైపు పరిగెత్తారు. కారు నెమ్మదిగా వెనక్కు దొర్లుతూ గేటు దగ్గరికొచ్చి ఆగింది. డోరు స్వయంగా తెరుచుకుంటూ మంత్రి కిందికి దిగాడు. ఒక్క అంగలో బాబాయిని చేరుకుని కౌగిలించుకొన్నాడు. ఆనందంతో మూర్తి ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. గాయపడిన అభిమానం కోలుకుంది. సిపాయిలవైపు చూశాడు మూర్తి. మొదటి సిపాయికి చెమటలు పట్టాయి. రెండో సిపాయి ముఖం అయోమయంగా మారింది. బట్టలకు ఇస్త్రీలేని పాపర్లు మంత్రులకు సన్నిహితులైవుంటారని వారికేం తెలుసు?

"అబ్బ! ఎన్నాళ్లకు ప్రపంచంలో పడ్డావురా?" అన్నాడు మంత్రి. ఏం సమాధానం చెప్పాలో బాబాయికి తోచలేదు. మంత్రి చూపు మూర్తి మీదికి మళ్లింది.

"నీ పేరు.......గురుమూర్తి కదూ?"

ఎంత జ్ఞాపక శక్తి! ఎప్పుడో రెండేళ్ళ కిందట పరిచయం.

"ఔనండీ!" నమస్కారం చేస్తూ జవాబిచ్చాడు మూర్తి.

"ఈ కుర్రాడిని ఈ తరంలో బతకనీయకుండా ఇలా వుంచావేమిట్రా?" అన్నాడు మంత్రి బాబాయితో.

మూర్తి సిగ్గుతో తలొంచుకున్నాడు. అతని కళ్ళలో మంత్రి గారి రూపం లీలగా మెదిలింది. తలెత్తి ఆయనవైపు చూశాడు. ఆయన కట్టింది గూడా ఖద్దరే. కానీ, దూదిపింజలాంటి తెల్లని ఖద్దరు. గంజి బిర్రున పెళపెళ మంటున్నాయి. పంచెకు మూడేళ్ళ వెడల్పు జరీ అంచుంది. ఎరుపు, ఆకుపచ్చ అంచులుండే కండువా మడత మీద మడుత అతికించినట్టు ఇస్త్రీ వొత్తబడింది.

సెక్రటరీని దగ్గరకు రమ్మని చేత్తో పిలిచాడు మంత్రి. అతడు దగ్గరకొచ్చి వినయంగా నిలుచున్నాడు.

"ఇవాళ ప్రోగ్రాంలన్నీ క్యాన్సిల్ చెయ్."

"అలాగే సర్!"

"అబ్బే. నామూలంగా నీ పని కుంటుపడగూడదు." ఆక్షేపించాడు బాబాయి.

"ఒక్కరోజులో మునిగిపోయేది ఏమీ వుండదుగానీ, పద లోపలికెళ్దాం."

బాబాయి భుజంమీద చెయ్యి వేసి నడిపించాడు మంత్రి. వెనకగా మూర్తి, సెక్రటరీ అనుసరించారు.

పునాది భూమ్మీద నాలుగడుగులు లేపి నిర్మించిన బంగ్లా. ఆరు మెట్లు ఎక్కితే గాని కింది అంతస్తు చేరుకోలేం. తలుపులూ, కిటికీలు, స్తంభాలూ నవాబులనాటి తీరులో వున్నాయి. వరండాలో గోడవార విజిటర్ల కోసం పేము కుర్చీలు ఏర్పాటు చేసున్నాయి. దానికి ఇరువైపులా రెండు గదులున్నాయి. మూర్తి వెంట నడుస్తున్న సెక్రటరీ వొకవైపు గదిలోకి తప్పుకున్నాడు. అది అతని ఆఫీసు గదిలా వుంది. మూర్తి బాబాయి వెంట హాల్లోకి చేరుకున్నాడు. విశాలమైన హాలు నిండా మెత్తని తివాచీ పరచివుంది. గోడల వెంట ముచ్చటగా వుండే కుషన్‌సోఫాలు వరుసగా వేసున్నాయి. వాటికి ఎంబ్రాయిడరీ అల్లిన గుడ్డలు సగందాకా కప్పివున్నాయి. హాలు మధ్యలో, వొకదానికొకటి కొంచెం ఎడంగా మూడు ఖరీదైన టీపాయిలు వేసున్నాయి. వాటిమీద పూలతో అలంకరించిన పింగాణీ కుండీలున్నాయి. బాబాయిని సోఫామీద కూర్చోబెట్టి, మంత్రి ఆయన పక్కన కూర్చున్నాడు. మూర్తి జంకుతూ దూరంగా నిలబడిపోయాడు.

"అలా కూర్చోవోయ్ ఫరవాలేదు. నీ ఆశ్రమంలో ఎంత ఫ్రీగా వుంటావో ఇక్కడా అలాగే వుండొచ్చు" అన్నాడు మంత్రి. అది తనను ఉద్దేశించి అన్నాడో, బాబాయిని ఉద్దేశించి అన్నాడో మూర్తికి అర్థం కాలేదు. దూరంగా వుండే సోఫామీద మోసీమోయనట్టు కూర్చున్నాడు.

కరెంటు బెల్లు గిర్రున మోగింది. పరిచారకుడు పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"గెస్టుకు భోజనానికి ఏర్పాటు చెయ్యమని చెప్పు. పూర్తి వెజిటేరియన్." ఆదేశించాడు మంత్రి. తలూపి లోపలికి దౌడు తీశాడు సేవకుడు.

"ఈ రోజు నువ్వు నాతో భోంచెయ్యాలి. మనం కలిసి భోంచేసి ఎన్నేళ్ళయిందో!" మంత్రి బాబాయితో అన్నాడు.

"నేనొచ్చిన పని నెరవేరిస్తే నూరు విందులు చేసినంత తృప్తిపడతాను" అన్నాడు బాబాయి.

"అంత బరువైన పనిమీద వచ్చావన్నమాట! ఈ పర్వతం కదిలిందంటే ఏదో పెద్దపనే అయ్యుండాలి. ఇంతకూ పని ఎవరితో?"

"నీతోనే."

"మరీ మంచిది. నీ కోసం నేను చేయగలిగిన పని వొకటుండడం నా అదృష్టం."

"నీ ధోరణి కొంచెమైనా మారలేదు." అధికార ప్రపంచపు మాయ స్నేహితుణ్ణి కప్పలేదని బాబాయికి కొద్దిగా నమ్మకం కుదురుతూంది. కానీ, ఇదివరకటి చనువుతో 'ఒరే' అనలేకపోతున్నాడు.

"ఇంతకూ పనేమిటి?"

మూర్తి దగ్గరిగా జరిగి, బాబాయికంటే ముందుగా అందుకున్నాడు. ఫైలు పరిస్థితి మంత్రికి వివరించాడు.

"ఫైలు నెంబరుందా?" మూర్తిని అడిగాడు మంత్రి.

మూర్తి తటపటాయించాడు. ఆఫీసు ఫైలు రహస్యంగా నడిచేది. నెంబరు చెబితే ఎలా తెలిసిందనే సమస్య రావచ్చు. బాబాయి ఇలాంటి పనులు మెచ్చుకోడు.

ఇంతదూరం వచ్చాక పని ఆగగూడదనే పట్టుదల మూర్తికి ధైర్యం కలిగించింది. జేబులోనుండి నోటు బుక్కు తీసి, అందులో మరో కాగితంమీద ఆ నెంబరు రాసి మంత్రి చేతికి అందించాడు.

మూర్తికి సంకోచించిన సమస్య ఎదురుగాలేదు. చీటీ చూసుకుంటూ మంత్రి కరెంటు బెల్లు మోగించాడు. ఈసారి వినిపించిన మోత మునుపటిదానిలా లేదు. సెక్రెటరీ పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"ఈ ఫైలు చూసి వెంటనే నాతో మాట్లాడమని కమీషనరుతో చెప్పు" అన్నాడు మంత్రి.

"అలాగే సర్!" సెక్రెటరీ వెళ్ళిపోయాడు.

"ఇంగ్లీషోడికి మన ఉద్యోగుల మీద నమ్మకంలేక వొకని మీద వొకన్ని తనఖీ పెట్టుకున్నాడు. దానికి సర్క్యులేషన్ అని పేరు పెట్టాడు. స్వరాజ్యమొచ్చి ఇన్నేండ్లైనా ఈ పద్ధతి మానలేదా?" బాబాయి అమాయకంగా అడిగాడు.

"పిచ్చిమాలోకమా! ఇంగ్లీషోడు పోతూనే ఇంట్లో దొంగలు పోతారా? ఈ వ్యాపారస్థులు, కంట్రాక్టర్లూ, కబ్జాదారులు ఎవరు? ఆ రోజూ మనవాళ్లే, ఈ రోజూ మనవాళ్లే. అజాగ్రత్తగా వుంటే దేశాన్ని అమ్మేస్తారు."

"ఈ మాత్రానికి తెల్లోడు ఏలితేనేం, నల్లోడు ఏలితేనేం?"

"అమ్మో........! సన్యాసంలో వున్నావనుకున్నాను గాని కమ్యూనిజంలో దిగినావని అనుకోలేదోయ్! తెల్లోడు దోచుకుని వానీ దేశం పట్టుకెళతాడు. ఇప్పుడు ఎటుతిరిగినా సంపద దేశంలోనే వుంటుంది."

ఫోన్ మోగింది. మంత్రి ఎత్తుకున్నాడు.

"........"

"ఏస్........"

"ఇవ్వు."

"........"

"నమస్తే, ఆ ఫైలు చూశారా?"

"........"

"పట్టాకు ఈ రోజే ఆర్డర్ ఐపోవాలి."

"..........."

"వెరీగుడ్." ఫోన్ పెట్టేశాడు.

అది తమ పనిగురించేనని మూర్తికి బోధపడింది. ఎందుకింత ఆలస్యం చేశారని మంత్రి కమీషనర్ను అడగలేదు. ఇప్పటికైనా ఔతున్నందుకు మూర్తి సంతోషించాడు.

"ఆర్డరు వేస్తారు. కాపీ ఈరోజే పట్టుకెళ్ళు." మూర్తిని ఉద్దేశిస్తూ అన్నాడు మంత్రి.

"సార్! మీ కోసం హోం మినిస్టరుగారు వస్తున్నారు." సెక్రెటరీ వర్తమానం అందించాడు మంత్రికి.

"ఆయన్ను పంపించి వచ్చేస్తా" అని బాబాయికి చెబుతూ మంత్రి తన సహచరుని కోసం ఎదురు వెళ్ళాడు. ఇద్దరూ మరో గదిలోకి వెళ్ళారు. రెండు గంటల సేపు వాళ్ళ సమాలోచన సాగింది. మధ్య మధ్యన టీలూ, చిరుతిండ్లూ అక్కడికే అందుతున్నాయి. చివరకు మధ్యాహ్నం పొంటిగంటకు సహచరుని సాగనంపి మంత్రి తిరిగొచ్చాడు.

"ఏమి అనుకోకురా! అర్జంటు పని. వ్యవహారం మీద ఆయన స్వయంగా వచ్చాడు." క్షమాపణపూర్వకంగా బాబాయికి చెప్పుకున్నాడు.

"ఛ. అంతమాటెందుకురా. పని ముఖ్యంగాని, మన కబుర్లు ముఖ్యమా?" మంత్రుల విలువైన కాలం వృథా కానందుకు బాబాయి నిజంగా సంతోషించాడు.

"భోజనాలకి లేద్దామా?"

"సరే" అంటూ బాబాయి లేచాడు.

"రావోయ్ మూర్తీ!" మంత్రి ఆహ్వానించాడు.

బాత్‌రూంలో ఎక్కడ జారిపడతానో అన్నట్లు భయం భయంగా బాబాయి కాళ్ళు కడుగుతున్నాడు. జారితే పడకుండా పట్టుకోడానికి మూర్తి సిద్ధంగా నిలుచున్నాడు. ఏ ప్రమాదం జరక్కుండా ఇద్దరూ బయటికొచ్చారు.

డైనింగ్ టేబుల్ వైపు చూడగానే బాబాయి నోరు తెరిచి, గుడ్లప్పగించి చూస్తూ ఆగిపోయాడు. అది బాదమాకు ఆకారంలోవుండే పెద్ద బల్ల. దాని చుట్టూరా ఎనిమిది కుర్చీలు, టేబుల్ నిండా కిక్కిరిసిన పింగాణీపాత్రలు, వాటినిండా ఆవిర్లు ఎగజిమ్మే రకరకాల వంటకాలు. ఎన్ని రకాల వంటకాలో మూర్తికి లెక్క తేలీలేదు.

"ఏమిటి ఆగిపోయావ్? అన్నీ వెజిటెబుల్సే." బాబాయితో అన్నాడు మంత్రి.

"అదిసరేగాని లక్ష్మన్నా! ఇవన్నీ తినడానికేనా?" బాబాయి ఆశ్చర్యంనుండి తేరుకుంటూ అడిగాడు.

"నాలుకకు నాలుగు రుచులు తగిలితే కడుపులోకి నాలుగు ముద్దలు దిగుతాయి. రవ్వంత ఈ జిహ్వాచాపల్యం లేకపోతే గాంధీగారికీ మనకూ తేడా ఏముంది?" అన్నాడు మంత్రి.

బాబాయి ఇరకాటంలో పడ్డాడు. గాంధీ మహాత్మునికీ తనకూ తేడా లేదని భావించనూ లేడు, గాంధీగారు అలవాటు చేసిన నడవడికను మార్చుకోనూ లేడు. ఈ మనిషిని ఇంకెప్పుడూ హైదరాబాదు తీసుకురాగూడదని మూర్తి తన మనసులో ఖచ్చితంగా నిర్ణయించుకున్నాడు. లూప్ లైను బండ్లు మెయిన్ లైను రద్దీని తట్టుకోలేవని ప్రత్యక్షంగా తెలిసింది.

Note: రైల్వే సిగ్నల్ పోల్‌ను వాడుకలో రెక్కమాను అంటారు.

● *ఇండియా టుడే – సెప్టెంబర్–6, 1994* ●

★ ★ ★

ఓల్గా

78

# అమూల్యం

ఆరోజు ఆదివారమైనా అందరూ పెందలాడే లేవటం అమూల్యకు ఆశ్చర్యంగా అనిపించింది. కిటికీలోంచి సన్నగా కురుస్తున్న వానను చూస్తూ ఆనందిస్తున్న అమూల్య వంటింట్లో అమ్మ అలికిడి, హాల్లో నాన్నమాటలు, పక్కగదిలో అన్న జస్వంత్ ఈలపాట విని సంభ్రమంగా లేచి హాల్లోకి వచ్చింది. ఎవరినీ ఏమీ అడగకుండానే అమూల్యకు అర్థమయింది - నాయనమ్మ వూరినుంచి వచ్చేది ఆ ఉదయమేనని. సుభద్ర, నారాయణరావు, జస్వంత్ ముగ్గురి హడావుడినీ చూస్తే వాళ్ళింటికి ఏదో ఉపద్రవం రాబోతున్నట్లుంది. ముగ్గురం స్టేషన్‌కి వెళ్లాల్సిందేనంటాడు నారాయణరావు.

"మా అమ్మ ఏవో మూటలూ, పెట్టెలూ చాలా సామానే తెస్తుంది. అది చూడగానే నాకు చిరాకేస్తుంది. వెంటనే అవతల పారేస్తే ఆవిడ బాధపడుతుంది. వాటిని జాగ్రత్తగా ఇంటికి చేర్చటానికి మీరిద్దరూ రావాల్సిందే" అన్నాడు.

"మీ అమ్మ తెచ్చే మూటలు మోయటం మీకు చిరాకైతే మాకు ఆనందమా? ఐనా ముగ్గురం వెళ్లకూడదు. వెళ్తే ఆవిడ గోల చేస్తుంది - ముగ్గురెలా వచ్చార్రా అంటూ" అంది సుభద్ర కాఫీ కలుపుతూ.

పొద్దున్నే చిటపటమని పడే చినుకుల్లో బైటికి వెళ్ళటమనే ఊహే సంబరంగా అనిపించింది పదేళ్ళ అమూల్యకు. "అమ్మా-నేనూ వస్తా" పేచీ పెట్టబోయే గొంతుతో అడిగింది.

"నువ్వొక్కదానివే తక్కువయ్యావు. అసలు నేనూ వెళ్ళను. నాన్నా, అన్నయ్యా వెళ్తారు. నువ్వెళ్ళి చదువుకో - ఫో" ఒక్క కసురు కసిరింది సుభద్ర. అమూల్య ఇక లాభం లేదని తెలిసి అక్కడ్నించి తన గదిలోకి వెళ్ళి మళ్ళీ కిటికీని ఆశ్రయించింది.

సుభద్రకు అత్తగారు మేనత్తే. చిన్నప్పుడు ఆమె దగ్గరే పెరిగింది. చదువుకునే రోజుల్లో కూడా శలవులన్నీ మేనత్తగారి వూర్లోనే గడిపేది. ఆమె అంటే అభిమానమే కానీ ఇప్పుడు సుభద్ర భయాలు సుభద్రకున్నాయి.

ఆ ఎనభైఏళ్ళ ముసలావిడను ఎప్పుడూ తను భరించగలదా? దాదాపు ఇరవైఏళ్ళ నుంచీ తనూ, భర్తా, వూరెళ్లి ఒక పూట ఉండి రావటం తప్ప పదిరోజులు కలిసి ఒకచోట ఉండలేదు. పిల్లలకు ఆ ఒక్కపూటా లేదు. వాళ్ళెన్నడూ ఆ పల్లెటూరు పోలేదు. ఈ నగర జీవిత వేగానికి అలవాటుపడ్డ తమ మధ్యలోకి ముసలమ్మవచ్చి

తమను ఎట్లాంటి గందరగోళంలో పడేస్తుందోననే భయం భార్యాభర్తలిద్దరికీ ఉంది. నాగరత్నమ్మకూడా ఇక ఇక్కడ ఉందామనే వస్తోంది. 'ఇన్నాళ్ళుగా కొడుకూ, కోడలూ రమ్మని అంటున్నా వూరు వదలటానికి ఇష్టపడని నాగరత్నమ్మ రెండు నెలల క్రితం వచ్చిన జ్వరానికి భయపడింది. జ్వరం సంగతి పిల్లలకు తెలియనివ్వలేదు గానీ ఆమెకు నేను ఇట్లాగే ఎప్పుడో రాలిపోతానేమో అనే ఆలోచన వచ్చింది. ఆమె భర్త కూడా హఠాత్తుగా గుండె ఆగిపోయి మరణించాడు. అప్పుడు నారాయణరావూ, కూతుళ్లు శాంతి, సుమతి వచ్చే వరకూ భర్త శవం ముందు కూచుని ఆమె పడ్డ బాధ చెప్పలేనిది. చివరి రోజుల్లో పిల్లలు దగ్గిర ఉండాలని ఆమెకప్పుడు గట్టిగా అనిపించింది. ఈ జ్వరం మళ్ళీ ఆ ఆలోచనలన్నీ తిరగదోసింది.

'అదీ వూరేగాని వల్లకాడు కాదుగా, ఇన్నాళ్ళూ ఈ వూరు అలవాటై పిల్లలకు దూరం అయ్యాను. ఇప్పుడు పిల్లలకు అలవాటైతే వూరు అదే మరుపుకొస్తుంది' అని గుండె గట్టిచేసుకొని కొడుక్కి ఉత్తరం రాసింది – ఫలానా రైల్లో వస్తున్నాను, స్టేషన్‌కి రమ్మని.

చివరికి తండ్రీ కొడుకులిద్దరే స్టేషన్‌కి బయల్దేరారు. సుభద్ర అత్తగారి కోసం కాస్త జాగ్రత్తగా ఫలహారం అమర్చే పనిలో పడింది.

రైలు అనుకోకుండా సరైన సమయానికే వచ్చింది. నారాయణరావు అనుకున్నట్టు నాగరత్నమ్మ మూటలేవీ మోసుకురాలేదు. రెండు ట్రంకు పెట్టెలు మాత్రం తెచ్చుకుంది. కొత్తగా రంగేయించిన పెట్టెలు తళతళా మెరుస్తున్నా నారాయణరావు మనసు వాటిని చూడగానే ముడుచుకుపోయింది. రెండు మంచి సూట్‌కేసులు కొని, ఈ ట్రంకు పెట్టెలు అవతల పారేయించాలి అనుకున్నాడు. సామాను ఎక్కువ లేదనే రిలీఫ్‌తో గబగబా తనూ కొడుకూ చెరో పెట్టె పుచ్చుకుని, ముసలామెను మెల్లిగా నడిపించుకొని స్టేషన్‌బైటికి వచ్చారు. నాగరత్నమ్మకు ఎనభై ఏళ్లయినా కంటి చూపు బాగానే ఉంది. మాటా వినపడుతూనే ఉంది. పళ్ళు కూడా గట్టిగానే ఉన్నాయి. మనిషి కాస్త నిదానంగా తన పనులు తను చేసుకోగల స్థితిలోనే ఉంది.

ఆటోలో ఇంటికొచ్చినంతసేపూ అమూల్యను గురించి అడుగుతూనే ఉంది.

"అదచ్చం నీ పోలికేనే అమ్మా!" అన్నాడు నారాయణరావు.

"బుద్ధుల్లో కూడా!" జస్వంత్ నవ్వాడు.

"నా బుద్ధులు నీకేం తెలుసురా భడవా?" అంది నాగరత్నమ్మ.

"మా అమ్మా నాన్నా చెబుతుంటారుగా?" అన్నాడు జస్వంత్ నవ్వుతూ.

సుభద్ర నాగరత్నమ్మను సాదరంగా ఆహ్వానించింది. వాళ్ళది మూడు బెడ్‌రూంలున్న ఇల్లు. పిల్లలిద్దరూ చెరోగది వాడుకుంటున్నారు. అమూల్య గదిలో నాగరత్నమ్మకు నవారు మంచం వేయించి, పరుపు, దుప్పటి అన్నీ సిద్ధం చేశారు.

నాగరత్నమ్మ స్నానం చేసి, టిఫిన్ తిని అందరినీ గదిలోకి పిలిచింది.

ట్రంకు పెట్టె తెరిచింది. ఆ పెద్ద పెట్టెలో ఉన్నాయి నారాయణరావు భయపడిన మూటలన్నీ. ముందు చిన్నమూట తీసి అమూల్యకిచ్చింది.

"ఇదిగో గోరింటాకు, ఎల్లుండి అట్లతద్దె. నిన్న రైలెక్కబోయేముందే కోయించాను. వెంటనే రుబ్బి పెట్టుకో." అమూల్య ముఖం చాటంతయింది. సుభద్ర మనసు కుంగిపోయింది.

"ఇది రుబ్బేదెలా? పెద్దపనే పెట్టిందీవిడ" అనుకుంది.

ఇంకో పెద్దమూట తీసి సుభద్రకిచ్చింది.

"ఇది చిట్టింటాకు కూర. డబ్బాలో పోసి దాయి. నెలకోసారి చిట్టింటాకు కూర తింటే మంచిది. పెసరపప్పు వేసి ఒండు."

సుభద్ర ఇంతటితో ప్రమాదం తప్పినందుకు నిట్టూర్చింది. ఎప్పటి చిట్టింటాకు. ఐనా ఫరవాలేదు. తియ్యగా బాగుంటుంది. ఎన్నడో మర్చిపోయిన రుచిని గుర్తు తెచ్చుకుంది.

జస్వంత్ అప్పటికే పారిపోయాడు.

నారాయణరావు "అమ్మా! రేపు అన్నీ సర్దుకోవచ్చులే. నువ్వు కాసేపు పడుకోరాదూ! రాత్రంతా రైల్లో ప్రయాణం" అన్నాడు.

"అట్లాగే-గోరింటాకు పాడవుతుందని తీశాను. వెంటనే రుబ్బు తల్లీ!" అని పెట్టె మూసేసింది. సుభద్రకూ గోరింటాకు చూస్తే సంతోషంగానే ఉందిగానీ మూలన పడేసిన చిన్నరోట్లో ఇది రుబ్బటం తల్చుకుంటే కష్టంగా అనిపించింది.

వంటయ్యాకా, భోజనాలయ్యాకా అంటూ వాయిదావేస్తూ వచ్చిందిగానీ అమూల్య పోరు పడలేక అట్లాగే రుబ్బింది. స్టీలు గిన్నెలోకి తియ్యబోతుంటే నాగరత్నమ్మ "కొబ్బరి చిప్ప లేదేమిటే, గిన్నెలో కెందుకు గోరింటాకు?" అంది.

"ఇంట్లో ఖాళీ కొబ్బరి చిప్పలెందుకుంటాయి అత్తయ్యా?" సుభద్ర అప్పటికే పండిన తన చేయి చూసుకుని సంతోషిస్తూ అంది.

"నా దగ్గరుందమ్మా!" అంటూ లోపలికి పరిగెత్తి తన చిన్నరేకుల పెట్టెలోంచి కొబ్బరిచిప్ప తెచ్చి ఇచ్చింది అమూల్య.

"నీ కెక్కడిదిది?" అని సుభద్ర అడిగితే,

"పనికిరాని సామానంతా పోగేస్తుందిగా పెట్టెలో. అందులోంచి తెచ్చింది" అన్నాడు జస్వంత్ వెక్కిరింతగా.

"నిన్న గుడిముందు దొరికింది. తెచ్చి శుభ్రంగా కడిగి దాచా" అంది అమూల్య.

"చూశావా నాయినమ్మా అన్నీ నీ బుద్ధులే" జస్వంత్ చెల్లెల్ని మళ్ళీ వెక్కిరించాడు.

కొబ్బరిచిప్ప నిండా అందంగా నిండింది గోరింటాకు. రాత్రి అన్నాలు తిన్నాక పెట్టుకుందామంది సుభద్ర.

"నాయినమ్మా, నా పెట్టె చూపించనా?" అంటూ అమూల్య నాయనమ్మను గదిలోకి లాక్కెళ్ళింది.

అమూల్య ఒకటో తరగతిలో ఉండగా పుస్తకాల కోసమని కొన్న అల్యూమినియం పెట్టె అది. రెండో తరగతిలో చేరాక కొత్తబ్యాగు కొనుక్కుంది. ఐతే ఈ పెట్టెను పారెయ్యకుండా అప్పటిదాకా అట్టపెట్టెలో దాచుకున్న తన సామాను

ఈ పెట్టెలోకి మార్చుకుంది. ఆ పెట్టెలో రకరకాల వస్తువులుంటాయి. ఆ వస్తువులకు పెద్ద ప్రయోజనం ఉండదు. అదంతా అమూల్య పోగుచేసిన సామాను. ఆ పోగు చెయ్యటంలో కూడా ఒక పద్ధతీ, అర్థమూ లేదు. తనకు నచ్చిన వాటినీ, కావాలనిపించిన వాటినీ పోగుచేసి దాచేది. పెద్దవాళ్ల దగ్గరుంటే అడిగి తీసుకునేది. స్నేహితుల దగ్గర ఉన్నవేవయినా అడిగితే వాళ్ళు ఇచ్చేవారు. బదులుగా అమూల్య వాళ్ళకేదయినా ఇచ్చేది. అలాగే దారిలో దొరికినవికూడా తెచ్చి దాచేది. ఇంట్లో అందరూ – ముఖ్యంగా జస్వంత్, నారాయణరావు అమూల్య పెట్టెను వెక్కిరిస్తారు. ఒకసారి చిన్నపింగాణీ మూత స్నేహితురాలి దగ్గర్నించి తెచ్చింది. వాళ్ళింట్లో జాడీ పగిలి పోయిందని మూత కూడా పారేశారు. మూత పగల్లేదు సరిగదా, దాని మీద చక్కని డిజైను ఉంది. అమూల్యకు అది తెచ్చుకోవాలనిపించింది. అనితను అడిగి తెచ్చుకుంది. దానికి బదులుగా అనితకు పూసలదండ ఇచ్చింది. ఆ జాడీమూత తెచ్చినరోజు ఇంటిల్లిపాదీ తిట్టారు. ఎందుకీ చెత్తంతా అడుక్కుతెస్తావని విసుక్కున్నారు. తర్వాత వారానికి చిన్న జాడీ మూత పగిలిపోతే సుభద్ర అమూల్యనడిగి ఈ మూత తీసుకుని పెట్టి చూసింది. మూత సరిగా సరిపోయింది.

"అట్లా తీసుకుంటూనే ఉంటారు, వెక్కిరిస్తారు." అదీ అమూల్య బాధ.

ఇవాళ కొబ్బరిచిప్పను చూసి నవ్వారుగానీ కొబ్బరిచిప్పలో గోరింటాకు ఎంత బాగుంది.

నాయనమ్మ తన పెట్టె చూసి సంతోషిస్తుందని అమూల్యకెందుకో నమ్మకం కలిగింది.

నిజంగానే నాగరత్నమ్మ చాలా సంతోషించింది. అమూల్య దగ్గరున్న పూసలు, నెమిలిపింఛాలూ చూసి "అయ్యో, నీకివి ఇష్టమని తెలిస్తే బోలెడు తెచ్చేదాన్నే" అంది.

తన పెట్టె తెరిచి అందులోంచి చిన్న ఇత్తడి కుందులు, రాగి గరిటెలు, బుల్లి రాగిచెంబు, ఒక గుర్రపునాడా తీసి అమూల్యకిచ్చింది.

అమూల్య సంతోషం పట్టలేక నాయనమ్మను కావలించుకుంది.

ఆ రాత్రి రెండు చేతులకూ, రెండు కాళ్ళకూ నిండుగా గోరింటాకు పెట్టుకుంది అమూల్య. పక్కబట్టలు పాడవుతాయని సుభద్ర గొణుగుతుంటే నాగరత్నమ్మ పాతచీరె చింపి అమూల్య చేతులకూ, కాళ్ళకూ కట్టింది.

☆ ☆ ☆

రెండు రోజులు గడిచాక నాగరత్నమ్మ తన పెట్టెలోంచి మరో మూట బైటికి తీసింది. కోడల్ని పిల్చింది.

"అమ్మాయ్.....మంచి విత్తనాలు, సొర, పొట్ల, కాకర అన్నీ మంచి రకాలు. వంగనారు కూడా ఉంది. దొడ్లో కాసిన కూర రుచి మీరు వండే సూపరు కూరలకు ఎట్లా వస్తుంది?" అంటూ విత్తనాలన్నీ చూపించింది.

"అత్తయ్యా! మనం ఉండేది మూడో అంతస్తులోని ఒక ఫ్లాట్లో. కాళ్ళకు మట్టి కూడా అంటదు. ఈ పాదులన్నీ ఎక్కడ పెంచుదాం?"

సుభద్ర మాటలకు నాగరత్నమ్మ దిగాలుపడిపోయింది.

"అయ్యో...మంచి విత్తనాలు. ఐనా కాస్త నేలన్నా లేకుండా ఇట్లా చేస్తున్నారేమిటి? ఇదేం ఇల్లు!"

"బాగుందమ్మా! వచ్చిన వాళ్ళందరూ మా ఇంటిని పొగడలేక ఇదైపోతారు. నీకు నచ్చలేదా?" అన్నాడు నారాయణరావు.

"నచ్చకపోవటం కాదురా, కాస్త కూరా నారా పెంచుకోవాలన్నా, ఇన్ని మెంతి గింజలు చల్లుకోవాలన్నా వీల్లేకపాయె" అంటూ ఆలోచించి–

"పోనీ, మీ స్నేహితుల్లో ఎవరికీ చారెడు చోటున్న ఇళ్ళు లేవట్రా?" అని అడిగింది.

"అమ్మా...శ్రీనివాస్ అంకుల్ వాళ్ళింటి ముందు బోలెడు చోటు. వాళ్ళకిద్దామా?" అంది అమూల్య ఉత్సాహంగా.

"ఇవ్వండిరా. మంచి విత్తనాలు. మనపేరు చెప్పుకుని తింటారు. ఎప్పుడన్నా మనకూ కాసిని ఇస్తారు."

"అలాగే ఇస్తాలే. ఈసారి నేను వెళ్ళేటప్పుడు తీసుకువెళ్తాను" అన్నాడు నారాయణరావు.

"నువ్వెప్పుడు వెళ్తావో...ఇప్పటికే వానలు వెనకబడ్డాయి. ఇప్పుడు నాటితేగాని సంకురాత్రినాటికి కాపుకన్నారాదు. ఇవాళ ఇచ్చిరా అయ్యా, నీకు పుణ్యముంటుంది" అంది.

తల్లి తెలివితక్కువతనానికి నారాయణరావుకి కోపం ముంచుకొచ్చింది.

"ఆ శ్రీనివాస్ ఇల్లు మనింటికి పద్దెనిమిది కిలోమీటర్ల దూరంలో ఉంది. వెళ్ళి రావటానికి లీటరు పెట్రోలు. పెట్రోలలా ఉంచి, టైమేది? సాయంత్రం నాకు లక్షపనులున్నాయి" అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడు.

☆ ☆ ☆

సుభద్ర పిల్లల్ని చదువులకీ, భర్తను ఆఫీసుకూ పంపించి వంటిల్లు సర్దుకుని వచ్చేసరికి పదకొండు దాటింది. స్నానం చేసి వచ్చి ఇన్ని పుస్తకాలూ, పేపర్ లూ ముందేసుకుని కూర్చున్న కోడలి దగ్గరకు వచ్చింది నాగరత్నమ్మ. సుభద్ర బి.ఏ. చదివేరోజుల్లో ప్రతి శలవలకూ మేనత్త దగ్గరకొచ్చి పదిరోజులుండి వెళ్ళేది. వస్తూ వస్తూ కాలక్షేపానికి కథల పుస్తకాలు తెచ్చేది. అప్పుడప్పుడూ వాటిని నాగరత్నమ్మ చదివేది. ఒక్కోసారి నాగరత్నమ్మ అడిగితే సుభద్ర చదివి వినిపించేది. ఆ రోజులు గుర్తొచ్చాయి నాగరత్నమ్మకు.

"ఏదన్నా పుస్తకం ఇవ్వమ్మా, కాసేపు నేనూ తిరగేస్తాను" అంది.

ఏ పుస్తకం ఇవ్వాలో సుభద్రకు తెలియలేదు. 'ఇంట్లో ఏం పుస్తకాలున్నాయి? తెలుగు పుస్తకాలు అత్త చదవగలిగినవి ఏవీ లేవు.' ఐనా కాసేపు వెతికి వచ్చి–

"ఏమీ లేవు. అత్తయ్యా!" అంది.

"అదేవిటే! చదువుకునే రోజుల్లో బోలెడు పుస్తకాలు కొనేదానివి. ఏమయ్యాయి?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఎంతకాలమయిందీ. అవెప్పుడో పోయాయి. ఇప్పుడసలు పుస్తకాలు కొనటంలేదు. చదివే తీరిక ఎక్కడిది? ఎన్ని ఇళ్ళు మారాం. ఈ మారటాల్లో ఎక్కడో పోతాయి. స్నేహితులు తీసికెళ్లి ఇవ్వరు. అన్నీ అలా పోతుంటే ఇక చివరికి కొనటం మానేశాను. టి.వి. చూడరాదూ? ఇప్పుడు తెలుగు సినిమా వస్తుంది."

"నా కళ్లు అంతంతమాత్రంగా ఉన్నాయి. ఆ టి.వి. చూస్తే అసలే పోతాయి. నువ్వేదో చదువుతున్నావుగా. అదే పైకి చదువు. కాసేపు విని పోయి పడుకుంటా" అంది నాగరత్నమ్మ సుభద్రకు దగ్గరిగా జరిగి కూర్చుంటూ.

"ఇవి నీకు అర్థంకావు. కథలు కావివి." సుభద్ర నవ్వింది.

"మరేంటి?" అంది నాగరత్నమ్మ ఆ పత్రికల వంక అసక్తిగా చూస్తూ.

"ఇదంతా వ్యాపారం. డబ్బు ఎట్లా పెట్టుబడి పెట్టాలి? ఎక్కడ పెట్టుబడి పెట్టాలి? ఎట్లా, ఎక్కడ పెడితే లాభాలొస్తాయి? అవన్నీ రాస్తారు."

"అవన్నీ నీకెందుకు? నువ్వెందుకు చదువుతున్నావు?" ఆశ్చర్యంగా చూసింది కోడల్ని.

"నేను అన్నీ చదివి వివరంగా మీ అబ్బాయికి చెబుతా. ఇద్దరం ఆలోచించాక ఎక్కడ డబ్బు పెట్టాలో మీ అబ్బాయి వాటిలో పెడతాడు."

నాగరత్నమ్మకు అర్థం కాలేదు. పుస్తకాలు చదివి, ఇంట్లో కూచుని పెట్టుబడి పెట్టి లాభం సంపాదించడం ఆమెకు బొత్తిగా అంతుబట్టలేదు. పెట్టుబడి అంటే కొట్టో, కంపెనీయో, ఏదో ఉండాలిగదా!

ఉత్సాహంగా తన నూతన విజ్ఞానాన్ని వివరించింది సుభద్ర. షేర్ల వ్యాపారం గురించి ఆయాసం వచ్చేవరకూ చెప్పింది.

"పోయినేడాది యాభైవేలు లాభం వచ్చింది. ఈ ఏడాది మొదట్లోనే పదిహేనువేలు నష్టపోయాం. ఫరవాలేదు. అగ్రో కంపెనీలో షేర్ల ధర విపరీతంగా పెరిగింది. ఆ నష్టం పూడి, మరో ముప్పైవేలు వస్తాయి."

సుభద్ర చెప్పినదంతా అర్థం చేసుకోవటానికి నాగరత్నమ్మ చాలా ప్రయత్నం చేసింది.

అంత ప్రయత్నమూ అయ్యాక చిన్నబుచ్చుకున్న ముఖంతో ఆమె అంది:

"ఐతే అమ్మాయ్, ఇద్దరూ కలిసి జూదం అడుతున్నారన్నమాట!"

"ఛా....జూదం ఏమిటి? ఇది వ్యాపారం. ప్రభుత్వం కూడా అంగీకరిస్తుంది."

"బాగానే వుంది. గవర్నమెంటుదైనంత మాత్రాన సారా తాగటం మంచిదంటావా? ఐతే నువ్వు ఆ మంచి పుస్తకాలన్నీ పారేసుకుని ఈ జూదాల పుస్తకాలు చదువుతున్నావా?" నాగరత్నమ్మకు చాలా దిగులనిపించింది.

అత్తను చూస్తే సుభద్రకు ఒళ్లు మండుకొచ్చింది. కష్టపడి డబ్బు సంపాదించుకుని పైకిపోతుంటే జూదం అంటుందా? ఈ ముసలావిడకి ఏమీ తెలియదు. తిని కూచోక, చేసే ప్రతిపనినీ ఇట్లా విమర్శించటం మొదలుపెడితే ఇక అయినట్లే. ఎలా వేగాలో ఏమిటో!

ఆ బాధ మర్చిపోటానికి చదువుతున్న 'వ్యాపార ప్రపంచం'లో మనసుని మరింత లగ్నం చేసింది. ఆ పుస్తకాలు చదువుతుంటే సుభద్రకు పరమానందంగా వుంటుంది. ఆ అంకెలు ఆమెను చుక్కల లోకంలో తిప్పుతాయి. అక్కడ వివరించబడే లాభాల కథలు చదివి ఆమె హృదయం వుప్పొంగుతుంది. ఏ బిజినెస్ మాగ్నెట్ గురించో ప్రత్యేకంగా వ్యాసమో, పరిచయమో వుంటే – అతని సక్సెస్ స్టోరీకి సుభద్ర పరవశించిపోతుంది. త్వరలోనే తామూ ఆ విజయపథంలో అడుగుపెడతామనే వూహతో ఎంతో ఆనందంగా భర్త రాకకోసం ఎదురుచూస్తుంది.

అతను రాగానే ఈ వార్తలన్నీ చెబుతుంది. అతను మరిన్ని కథలతో వస్తాడు. అన్ని సుఖాలూ త్యాగంచేసి, వచ్చిన ప్రతి పైసా షేర్లలో పెట్టి పదేళ్లలో తన తోటి ఉద్యోగి ఎట్లా కోటీశ్వరుడయ్యాడో, అతని కొడుకు ఇప్పుడు ఎలా విమానంలో చదువుకోసం వూటీ వెళ్తున్నాడో చెబుతాడు. కేరళలో ఒక షేర్‌బ్రోకర్ వీధిలో పాన్‌లమ్ముకునే దశనుండి ఎలా మల్టీమిలియనీర్ అయ్యాడో చెబుతాడు.

ఇద్దరూ ఆనందంగా తమ పథకాలు రచించుకుంటారు – ఏ కంపెనీలో పెట్టాలి? ఎంత పెట్టాలి? అని.

పిల్లలు చదువులు ముగించి అన్నాలు పెట్టమంటూ వచ్చేవరకూ యిదే వరస. మధ్యలో స్నేహితులొస్తే వాళ్లింకా మంచి కబుర్లు చెబుతారు. సలహాలిస్తారు.

నాగరత్నమ్మకు వారం రోజుల్లో ఈ వాతావరణం విసుగెత్తింది.

పిల్లలకింత డబ్బు పిచ్చి పట్టుకుందేమిటి?

అబ్బాయి మంచి గవర్నమెంటు ఉద్యోగమే చేస్తున్నాడు. ఎందుకీ హైరానా? ఓ ఆటలేదు. ఓ పాటలేదు. టి.వి.లో కూడా వాళ్లు చూసేది ఈ షేర్ల గురించిన విశేషాలే.

డబ్బు సంపాదించాలిగానీ, అది తప్ప మరింకో జీవితం లేకపోయాక ఆ డబ్బెందుకు అన్నది నాగరత్నమ్మకు అర్థం కాలేదు.

ఐతే ఆ విషయం కూడా నెలరోజులు గడిచేసరికి అర్థమైంది.

జస్వంత్‌కు వాంతులు పట్టుకున్నాయి. అది తెలియగానే నాగరత్నమ్మ తన దగ్గరున్న మందునూరి తేనెలో కలిపి మనవడికి ఇవ్వటానికి వెళ్లింది.

"ఇంకా నయం" అన్నాడు జస్వంత్.

అప్పటికే అతను పవర్‌ఫుల్ యాంటీబయటిక్స్ వాడటం మొదలుపెట్టాడు.

రెండో రోజుకి కూడా తగ్గకపోతే మంచి డాక్టరుకి చూపమనీ, అశ్రద్ధ చేయవద్దనీ ఫోన్లొచ్చాయి స్నేహితుల దగ్గర్నించి.

జస్వంత్‌ని ఆస్పత్రికి తీసుకెళ్లారు. పరీక్షలకోసం రెండురోజులు ఆసుపత్రిలో ఉంచమంటే ఉంచారు.

నాగరత్నమ్మకు అంతా అయోమయంగా ఉంది. వానాకాలం పోతూపోతూ నాలుగు చినుకులు గట్టిగా కురిసింది. చలికాలం మెల్లిగా దొరబడుతోంది. వాతావరణం

మారేటప్పుడు శరీరం కాస్త అటూ ఇటూ అవదూ? పైగా, ఏ కాలంలో తినాల్సిన కూరలూ, పళ్ళూ ఆ కాలంలో తినరు. ఎప్పుడూ ఒకటే కూరలు. కాస్త తనిచ్చిన మందు మూడుపూటలు నాకితే సరిపోయేది. కానీ ఈ మాటలు ఎవరు వింటారు?

అమూల్యతో చెప్పుకునేది. అమూల్యకు నాయనమ్మమీద జాలేసేది.

"నాకు వాంతులైతే నేను నీ మందే వేసుకుంటాలే నాయనమ్మా!" అంది.

రెండు రోజులనుకున్నది జస్వంత్ ఆసుపత్రినుంచి వచ్చేసరికి పదిరోజులయింది. చిక్కిశల్యమై వచ్చాడు. జబ్బేమీ లేదని తెలియటానికి దగ్గర దగ్గర పదివేలు ఖర్చయ్యాయి.

మరి వీళ్లకు డబ్బు సంపాదించకపోతే ఎలా గడుస్తుంది? అందుకే అస్తమానం డబ్బు, డబ్బు, డబ్బు అంటూ తిరుగుతుంటారు. కానీ ఏం లాభం? అట్లా సంపాదించి ఇట్లా ఆస్పత్రులకు అనవసరంగా తగలేస్తున్నారు అనుకుని నిట్టూర్చి వూరుకుంది.

ఎన్నిరోజులు గడిచినా ఆ శ్రీనివాసన్న అబ్బాయికి విత్తనాలు ఇవ్వటం కుదరలేదు కొడుక్కి. "ఇప్పుడివ్వకపోతే ఇక అనవసరంరా!" అంది కొడుకుతో ఓ రోజు నిష్ఠురంగా.

"అనవసరమైతే అవతల పారెయ్. నాకు తీరికలేదు. దగ్గరా దాపా! ఈ బోడి విత్తనాల కోసం నేనంతదూరం వెళ్ళలేను."

నాగరత్నమ్మకు చాలా బాధనిపించింది. నెలరోజుల్నించీ తీరటం లేదంటాడు. ఎన్నడన్నా తీరుతుందా? తల్లిబాధ చూసి నారాయణరావు అతిప్రయత్నంమీద కోపం ఆపుకుని,

"సరే ఇలా ఇవ్వు. సాయంత్రం ఆఫీసునుంచి వాళ్ళింటికి వెళ్ళి ఇచ్చొస్తాను" అన్నాడు.

నాగరత్నమ్మ అదే చాలన్నట్లు విత్తనాలు మూటగట్టి ఇచ్చింది.

ఆ మూట జేబులో కుక్కుకుని వెళ్ళాడు నారాయణరావు. అమూల్య అదంతా చూస్తూ బడికి వేళవుతోందని మర్చిపోయింది. తల్లి కేకలేస్తే హడావుడిగా బస్‌స్టాప్‌కి పరిగెత్తింది.

తనవెనకే మెట్లు దిగిన తండ్రి స్కూటర్‌ని బస్టాపు పక్కనున్న చెత్తకుండీ దగ్గర ఆపటం చూసి తన కోసమేననుకుని నాలుగడుగులు ముందుకు వేసింది. ఇంతలో నారాయణరావు జేబులోంచి విత్తనాల మూటతీసి చెత్తకుండీలో పారేసి స్కూటర్‌మీద వెళ్లిపోయాడు.

అమూల్యకు ఏం చెయ్యాలో తోచలేదు. నెమ్మదిగా చెత్తకుండీ దగ్గరకు వెళ్లింది. పైనే వుంది. ఆ మూటకి మురికేమీ అంటలేదు. తీసి తన బ్యాగులో వేసుకుంది. ఆ పిల్లకు పట్టరానంత దుఃఖం వచ్చిందిగానీ రోడ్డుమీద ఏడవటానికి లేదు. అతిప్రయత్నంమీద కంట్రోలు చేసుకుంటుండగా స్కూల్ బస్ వచ్చేసింది.

ఆ రోజంతా అమూల్య మనసు మనసులో లేదు. పాఠాలేవీ బుర్రకెక్కలేదు. ఈ సంగతి నాయనమ్మతో చెప్పాలా? ఒద్దా? చెబితే నాయనమ్మ బాధ పడుతుంది. నాన్నకు కోపం వస్తుంది. కొడతాడేమో కూడా. చెప్పకపోతే నాయనమ్మకు

మోసం చేసినట్లవదూ? నాన్న చేసినట్లే తనూ మోసం చేస్తుందా? అసలు నాన్న అట్లా ఎందుకు చేశాడు?

ఈ ఆలోచనల్తోనే బడినుండి ఇంటికి వచ్చింది. నాయనమ్మ వంటింట్లో వున్నప్పుడు ఆ విత్తనాల మూటతీసి తన పెట్టెలో అడుగున కనపడకుండా దాచింది. ఆ రాత్రి నాయనమ్మ కథలు కూడా అమూల్య మనసులోకి ఎక్కలేదు.

"నువ్వు విత్తనాలిస్తే మనూళ్లోవాళ్లు నాటతారా నాయనమ్మా?" పట్టలేక అడిగింది.

"బంగారంలా నాటతారు. అమ్మ కడుపు చల్లగా మంచి విత్తనాలిచ్చిందంటూ నాటతారు."

"అసలు నువ్వు వూర్నించి ఎందుకొచ్చావు నాయనమ్మా?"

"మీ కోసమేనమ్మా! ఎన్నాళ్లుంటాను? చివరి రోజుల్లో మీ అందరితో కలసి సంతోషంగా వుందామని వచ్చాను. మీ నాన్న ఎన్నేళ్లనుంచో రమ్మంటున్నాడు. నేనే రాననేదాన్ని."

'నాన్నకు నాయనమ్మంటే ఇష్టమే. కానీ మరెందుకలా చేశాడు? నాయనమ్మంటే ఇష్టమేగాని ఆమె మాటంటే లెక్కలేదు. నాయనమ్మ పనికిరాని పాతదనుకుంటున్నారు. పాతవంటే అమ్మకీ నాన్నకీ ఇష్టంలేదు. అన్నీ పారేస్తారు. నాయనమ్మంటే చాలా ఇష్టం గనక వుంచుకున్నారు. లేకపోతే పారేసేవారే. చక్కగా విత్తనాలిస్తే ఏమయ్యేది? శ్రీనివాస్ అంకుల్ వాళ్లింట్లో కాయలు కాసేవి. ఎట్లా పారేశాడు నాన్న?'

ఈ ఆలోచనల్తోనే నిద్రపోయింది.

☆ ☆ ☆

మరో నెల గడిచిపోయింది. ఈ నెలరోజుల్లో నాగరత్నమ్మకు తను ఈ ఇంట్లో పనికిరానిదాన్ననే భావం బాగా పాతుకుపోయింది.

తను మాట్లాడిందేదీ వాళ్లకు అక్కర్లేదు. తన వంటలు వాళ్ళు చెయ్యరు. అన్నీ బజార్నించి కొనుక్కుతెస్తారు. పచ్చళ్లు పెట్టనివ్వరు. ఉంటే తినబుద్దేస్తుంది. తింటే అనారోగ్యం. మరీ తినాలనిపించినప్పుడు కొనుక్కుంటే సరిపోతుంది అంటారు. తన వైద్యం అసలు పనికిరాదు. నెలకోసారి ఇంట్లో ఎవరో ఒకరు డాక్టరు దగ్గరకుపోయి వందలకు వందలుపోసి మందులు తెచ్చుకుంటారు.

ఈ పిల్లలతో ఏం పొందాలని వచ్చింది? ఏం పొందింది? ఊళ్లో తనకెంత గౌరవం. రోజూ ఇద్దరు ముగ్గురొచ్చి ఏదో ఒక మందు తీసికెళ్తారు. పథ్యానికి చింతతొక్కో, ఎండావకాయో తీసికెళ్తారు. ఉసిరిక లేహ్యం ఎంత పట్టినా చాలదు. సాయంత్రమయ్యేసరికి పదిమంది వచ్చి వెళ్తారు. వాళ్లు చేసే సాయాలు వాళ్ళూ చేస్తారు. పుల్లలు తెస్తారు. నీళ్లు తెస్తారు. చేలల్లోంచి దోసకాయలు తెచ్చిస్తారు. ఇక్కడ మనిషికీ మనిషి మాటలు తప్ప ఇచ్చేదేమీ ఉండదు.

కొడుకూ కోడలూ ఆ జూదం కబుర్లు ఆపితే ఇక వాళ్ల స్నేహితుల గురించి మాట్లాడుకుంటారు. ఒక్క మంచిమాట వుండదు. అందరినీ విమర్శించేటమే. వీళ్ళ మాటలే నిజమైతే వీళ్లకి ఒక్క మంచి స్నేహితుడు లేదు. అందరూ గోతులు

తీసేవాళ్ళే. అందరూ వీళ్ళనుపయోగించుకోవాలని చూసేవాళ్లే. వీళ్లు చెడిపోతే చూసి సంతోషిద్దామనుకునేవాళ్లే.

నిజంగానే ఈ పట్నంలో మనుషులట్లా అయ్యారా? లేక వీళ్లకు పిచ్చెక్కిందా?

మళ్ళీ వాళ్లు వచ్చినప్పుడు అందరూ బాగానే నవ్వుకుంటూ మాట్లాడుకుంటారు.

ఇది వూరు కాదు, వల్లకాడే అనిపించింది నాగరత్నమ్మకు. వూరుమీద గాలి మళ్ళింది.

నాగరత్నమ్మకు వూరు వెళ్దామనే ఆలోచన క్రమంగా బలపడుతుండగా ఓ సంగతి జరిగింది.

ఆ ఇంట్లో పనిచేసే జయ కొడుకు ఏడాది నిండని పసివాడికి విరేచనాలు పట్టుకున్నాయి.

పిల్లాడిని ఆస్పత్రికి తీసికెళ్ళాలి, ఓ వందరూపాయలు ముందుగా ఇప్పించమని సుభద్రను అడిగింది. సుభద్ర తన దగ్గర లేవంది.

జయ పాపం కళ్ళనీళ్లు పెట్టుకుంది. ఆ పిల్లమొగుడు తాగుబోతు. ఏమీ పట్టించుకోడు. ఇప్పుడింకో దారిలేదు. సుభద్రను బతిమాలింది. సుభద్ర లేవంటే లేవంది.

నాగరత్నమ్మ ఇదంతా విస్తుపోతూ చూసింది. అప్పుడెప్పుడో ఇరవయేళ్ళ క్రితం సుభద్ర శెలవలకు వచ్చినప్పుడు నాగరత్నమ్మకు ఓ కథల పుస్తకంలో ఇట్లాంటి కథే చదివి వినిపించింది. అప్పుడు సుభద్ర పనిమనిషి పక్షం. ఆ రచయిత ఎంత బాగా రాశాడంటే చదువుతూ చదువుతూ సుభద్ర ఏడ్చేసింది.

నాగరత్నమ్మ కళ్ళమ్మట నీళ్ళొచ్చాయి.

ఇప్పుడు సుభద్ర యజమాని అయింది. పనిమనిషి కష్టానికి స్పందించటం మానేసింది.

నాగరత్నమ్మ వెళ్ళిపోతున్న జయను వెనక్కి పిల్చింది.

"నీ పిల్లాడికేమయింది?" అనడిగింది.

జయ చెప్పింది.

"నేను మందు నూరి ఇస్తా – తేనెలో రంగరించి గంటకోసారి నాలిక్కిరాయి. రేప్పొద్దునకంతా తగ్గుతాయి" అని చిన్నరోలు తెప్పించి మందు నూరింది. చిన్న సీసా తెప్పించి కాస్త తేనె అందులో పోసి ఇచ్చింది. జయ దణ్ణం పెట్టి అవి తీసుకుంది. అమూల్య అదంతా జాగ్రత్తగా చూసింది. మధ్యలో సుభద్ర కూడా చూసింది. అమ్మకు చాలా కోపంగా వుందని అమూల్యకు అర్థమైంది.

వెళ్ళబోతున్న జయను సుభద్ర పిల్చింది. అమూల్య కూడా జయతోపాటువెళ్ళి నిల్చుంది.

"ఆ మందు అవతల పారెయ్. ఇదిగో వందరూపాయలు. డాక్టరు దగ్గరకు తీసుకుపో. ఆ మందేస్తే పిల్లాడికేమన్నా అయితే మామీద పడి ఏడుస్తావు. ఆ మందు మాత్రం వాడకు. ఆ మాట ఆవిడతో చెప్పొద్దు. సరేనా?"

సుభద్ర కోపం అణుచుకుని సాధ్యమైనంత శాంతంగా చెప్పింది.

జయ సరేనని తలవూపి వందరూపాయలు తీసుకుని వెళ్ళిపోయింది.

కళ్లు పెద్దవి చేసుకుని చూస్తున్న అమూల్య చూసి, "నాయనమ్మతో చెప్పకు, చెబితే చంపుతా" అని గద్దించింది.

"ఈవిడ మందులేమిటో. అందరి ప్రాణాలూ తీస్తానంటే ఎట్లా? దాని కొడుకు ఈ మందులకు చచ్చాడంటే మనమీదికొస్తారు. ఎందుకంత రిస్కు? వందరూపాయలు చచ్చినట్లు ఇచ్చా. అంతకుముందుదాకా నా దగ్గర లేవంటే లేవన్నదాన్ని పది నిమిషాల్లో యిస్తుంటే ఆ జయ ఒక చూపు చూసింది. నా ఒళ్లు చచ్చిపోయిందనుకోండి. ఐనా ఈ ముసలామె తినిపడుండక ఈ లేనిపోని తద్దినాలు తెచ్చిపెడుతుంటే ఎట్లా?"

సుభద్ర ఆ సాయంత్రం నారాయణరావుతో చెబుతున్న మాటలు కూడా అమూల్య వింది.

అమూల్యకెటూ పాలుపోలేదు. అమ్మ అన్నట్లు నాయనమ్మ మందులు పనిచెయ్యక ఆ పిల్లాడికేదన్నా అయితే? కాని నాయనమ్మను మళ్ళీ మోసం చేశారు. ఈ మాటలే నాయనమ్మతో చెప్పొచ్చుగా? అమూల్య మనసు బాధతో మూలిగింది.

నాలుగురోజుల తర్వాత ఇంట్లో సుభద్ర లేని సమయం చూసుకుని జయ వచ్చింది.

నాగరత్నమ్మకు దణ్ణం పెట్టింది.

"మీరిచ్చిన మందు బాగా పనిచేసిందమ్మా! రెండో రోజుకే విరేచనాలు కట్టుకున్నాయి. అమ్మగారు ఆ మందు అవతలపారేసి డాక్టరుకి చూపించమని వందరూపాయలిచ్చింది. నాకు మీ మందుమీద గురి కుదిరి అదే వాడాను. అమ్మగారికి భయం, మీ మందు వికటించి పిల్లాడికేమైనా ఔతుందేమోనని. అందుకనే పారెయ్యమన్నారు."

నాగరత్నమ్మ ముఖం నెత్తురుచుక్క లేకుండా పాలిపోయింది.

జయ ఎప్పుడు వెళ్ళిందో కూడా ఆమెకు తెలియదు. ఇక ఈ వూళ్ళో ఒక్కక్షణం కూడా వుండాలనిపించలేదు. తక్షణం వూరెళ్లిపోవాలనుకుంది.

అమూల్య స్కూలునుంచొచ్చి నాయనమ్మ వీపుమీద ఉయ్యాల వూగబోయి ఆమె ముఖం చూసి ఆగిపోయింది.

నాగరత్నమ్మ అమూల్య ముఖం చూసి నవ్వు తెచ్చుకుంది.

"చిట్టీ, నేను వూరెళ్ళి పోతానే!" అంది. అమూల్యకు అర్థమయింది.

"నాయనమ్మా, జయ చెప్పిందా?"

నాగరత్నమ్మ చివ్వున తలెత్తింది.

"ఐతే నీకూ తెలుసా?"

అమూల్య బిక్కముఖం పెట్టింది.

"ప్రమాదం చేసే మందు నేనెందుకిస్తాను? మీ అమ్మకు చిన్నప్పుడు ఎన్నిసార్లు ఈ మందు ఇవ్వలేదూ? నన్నడగొచ్చుగా? ఓ మాట చెప్పొచ్చుగా? నాకంత విలువలేనిచోట నేనుండకూడదమ్మా!"

"నిజంగా వెళ్ళిపోతావా నాయనమ్మా?"

నాయనమ్మ వెళ్ళిపోతుందంటే అమూల్యకు బాగా దిగులుగా వున్నా ఒకరకంగా అదే మంచిదనిపించింది.

అమ్మా నాన్నా నాయనమ్మ మాటలు లెక్కచెయ్యరు.

నాయనమ్మంటే ఇష్టమేగాని బాధపెడతారు.

వీళ్ళిద్దరికీ ఎక్కడో చాలా తేడావుంది. ఇద్దరిదీ నిజమేగదా అనిపిస్తుంది. కానీ అమ్మా నాన్నా అన్యాయంగా వుండటం మాత్రం తప్పే!

అమూల్యకు క్లాసులో టీచరు చూపించిన ప్రపంచ పటం గుర్తొచ్చింది. ఆ పటంలో కొన్ని ద్వీపాలను చూపించి వివరించారు టీచరుగారు. ఎట్లాగో తెలియటం లేదుగానీ అమ్మా వాళ్ళూ, నాయనమ్మా వేరు వేరు ద్వీపాల్లాగా వున్నారనిపించింది.

ఈ ద్వీపాలలో తను దేనికి చెందుతుంది? ప్రస్తుతం అటూ ఇటూ తిరుగుతోంది. ఎక్కడ, ఏ ద్వీపంలో వుంటే బాగుంటుంది, ఏది మంచిదో, ఎక్కడుండాలో తనకింకా తెలియటం లేదు. లేకపోతే తనదింకో ప్రత్యేకమైన ద్వీపమేమో! అమ్మో, తనొక్కత్తేనా? అమ్మకో, నాయనమ్మకో చెందకుండా తను ఒక ద్వీపంలో! అమూల్యకు దిగులుగా, భయంగా అనిపించింది.

ఆరోజు రాత్రి ఆవేశం అపుకోలేక నాగరత్నమ్మ అమూల్యకు తనకు తెలిసిన వైద్యం ఎంత మంచిదో, ఎంతమందిని రక్షించిందో వర్ణించి చెప్పింది.

"అట్లాంటి నన్ను తీసిపారేసింది మీ అమ్మ. నేనెందుకు ఇక్కడ? నాకు విలువ యిచ్చేవాళ్లే నావాళ్లు. ఇక్కడ నా వాళ్ళెవరూ లేరు."

నాగరత్నమ్మకు ఏడుపాగలేదు.

అమూల్య ఆమెను సముదాయించాల్సి వచ్చింది.

"నాయనమ్మా! నీకు తెలిసిన మందులన్నీ నాకు చెప్పు, నేను నా నోట్సులో రాసుకుంటాను... నేను పెద్దయ్యాక డాక్టరవుతానుగదా, అప్పుడు నీ మందులే అందరికీ ఇస్తాను."

"నా తల్లే... నా తల్లే!" అని అమూల్యను ముద్దాడింది నాగరత్నమ్మ.

అమూల్య నిజంగానే పుస్తకం, పెన్నూ తెచ్చుకుంది. వారం రోజులపాటు నాయనమ్మ చెప్పిన మందుల పేర్లన్నీ రాసుకుంది. సగం పైగా వంటింట్లో వున్నవే. కొన్ని చెట్ల పేర్లూ, దినుసుల పేర్లూ అమూల్య ఎన్నడూ వినలేదు. అంతా రాశాక ఆ పుస్తకం చూస్తే నాగరత్నమ్మకు గుండె నీరయింది.

'తనేంటో అదంతా ఆ పుస్తకంలో వుంది. తను పోయినా మనవరాలు ఆ పుస్తకం చూసి తన వైద్యం చేస్తుంది. అపుడందరికీ తను దగ్గరగా వున్నట్లే వుంటుంది. చచ్చినా బతకటమంటే ఇదే!'

అనుకునేసరికి ఆమెకు ఈ ప్రపంచాన్ని జయించిన ధీమా వచ్చింది. అంతలోనే ఏదో అనుమానం వచ్చింది.

"మీ అమ్మానాన్నల్లా నేనటు వెళ్ళగానే ఈ పుస్తకం పారెయ్యవుగదా?"

ఈ మాటలకు గాయపడ్డ అమూల్య ముఖం చూసి నాగరత్నమ్మ అమూల్యను దగ్గరకు తీసుకుని,

"వూరికే నవ్వుతాలికన్నా, మా అమ్మవు కదూ!" అంటూ సముదాయించింది.

☆ ☆ ☆

ఆ తర్వాత పదిరోజులకు నాగరత్నమ్మకు వూరు ప్రయాణమయింది. నారాయణరావు తెచ్చిన సూట్‌కేసులు ఒద్దని తన ట్రంకు పెట్టెలే సద్దుకుంది.

అమూల్య దిగులుగా తిరుగుతోంది. నారాయణరావు, సుభద్రలకు ఏ మూలో గిల్టీగా వున్నా కాస్తంత రిలీఫ్‌గా కూడా వుంది. జస్వంత్ హుషారుగా ఆటో తెచ్చాడు.

నాగరత్నమ్మ ఆటో ఎక్కింది.

"నాయనమ్మా!.... ఒక్కనిమిషం." అమూల్య లోపలికి పరిగెత్తి తన పెట్టెలోంచి విత్తనాల మూట తీసుకొచ్చి నాయనమ్మ చేతిలో వుంచింది.

"ఇవి మన వూళ్ళోనే బాగా బతుకుతాయి నాయనమ్మా, ఈ వూళ్ళో బతకవు."

ఆ మూట చూసి నారాయణరావు ముఖం నల్లగా మాడిపోయింది.

నాగరత్నమ్మ ఆ మూటను జాగ్రత్తగా పెట్టెలో దాచుకుంది. ఈ పోటీ ప్రపంచంలో, వ్యాపారప్రపంచంలో ఆమెకు తన స్థానం ఏమిటో తెలిసిందిగానీ, తన పిల్లలు ఈ ప్రపంచంలో పడి ఏమైపోతారో, ఎటు కొట్టుకుపోతారో అనే దిగులు వదల్లేదు. కాని, అమూల్యను చూస్తే ఏదో ఆశ.

తన విత్తనాలను విత్తుతుందేమో!

తన వైద్యాన్ని పదిమందికీ చేస్తుందేమో!

ఏమో?.....

అది అమూల్య ఒక్కదాని చేతిలో లేదుగదా, అమూల్య తరం ఏం చేస్తుందో?

అమూల్యమైన విత్తనాలను జారవిడుచుకుంటుందో, రక్షించుకుంటుందో...

అమూల్యమైన జ్ఞానాన్ని పెంటకుప్పలమీద పారేసి, అన్యులకు ధారాదత్తం చేసి, చేతులారా అనారోగ్యాన్ని ఆహ్వానిస్తుందో.....

తన ముంగిట్లో పెరట్లో వున్న జ్ఞానాన్ని రెండు చేతులా పట్టుకుని కాపాడుకుంటుందో..... ఏమో....ఏం చేస్తుందో!

● విపుల, డిసెంబర్ 1994 ●

★ ★ ★

79

గోరుసు జగదీశ్వరరెడ్డి

# వలసపక్షులు

గగనంలోని పక్షులు మరో చోటికి వలస వెళ్ళినా స్వేచ్ఛగా తిరుగాడుతూ వాటి పొట్టలు నింపుకొని కొన్నాళ్ళకే తిరిగి సొంత గూళ్ళకి చేరుకుంటాయి. కానీ, పాలమూరి పక్షులు రెక్కలు ముక్కలు చేసుకుంటూ, డొక్కలు మాడ్చుకుంటూ, మేస్త్రీలనూ, కాంట్రాక్టర్లనూ మేపడానికి వలస వెళ్తుంటాయన్న యధార్థం ఎందరికి తెలుసు?

జాతులు వేరైనా రెండూ ప్రకృతిలోని జీవులే. మొదటివాటికున్న స్వేచ్ఛ రెండోవాటికి లేకపోవటం ఎందుచేత?

ఎందుకీ వ్యత్యాసం?

ఎవ్రరాసినదీ ద్వంద్వనీతి?

☆ ☆ ☆

"ఇంటర్ కామ్‌లో మిమ్మల్ని కాన్ఫరెన్స్ హాల్‌కు రమ్మని పిలుపు వచ్చింది సార్!"

మిషన్ బ్రేక్‌డౌన్ మెమో రాస్తున్న నేను తలెత్తి చూసేను. నా ఎదురుగా వున్న మా సూపర్‌వైజర్ తిరిగి ఆ మాటనే మళ్ళీ చెప్పేడు.

"ఓ.కే...ఈ మెమో పూర్తి చేసి, ప్లాంట్ ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంట్‌కు పంపండి" అంటూ కాన్ఫరెన్స్ హాలుకేసి నడిచాను.

"మే ఐ కమిన్ సార్?" స్ప్రింగ్ డోర్ తెరుస్తూ అన్నాను.

"రండి బాల్రాజ్‌గారూ, రండి!" మా అసిస్టెంట్ మేనేజర్ ఆహ్వానించేడు.

అక్కడి వాతావరణం చూడగానే వారంతా నన్నెందుకు రమ్మన్నారో వెంటనే అర్థమైపోయింది.

నేను వెళ్ళి ఖాళీగా వున్న కుర్చీలో కూర్చున్నాను.

మా ఎ.ఎం. తో పాటే సీనియర్ మేనేజర్, కాంట్రాక్టర్ కృష్ణారావూ వున్నారు.

అంతా కొద్దిసేపు శ్రద్ధాంజలి ఘటిస్తున్నట్లుగా మౌనంగా వుండిపోవటంతో అసహనంగా కుర్చీలో కదిలేను. ఆ వాతావరణం చిరాగ్గా వుంది. నాలో రంగులు మారటం గమనించిన మా ఎ.ఎం. ముందుగా తేరుకొని—

"బాల్రాజ్!...మీతో కాంట్రాక్టర్ కృష్ణారావు ఏదో మాట్లాడాలనుకుంటున్నారు." చిన్నగా నవ్వుతూ సంభాషణ మొదలుపెట్టేడు.

"అవును బాలాజీ! మీ ధోరణిలో మార్పులేకపోవటం ఏం బాగోలేదు. డిపార్ట్‌మెంట్‌లోకి కొత్తగా వచ్చారు. ఈ స్టీల్‌ప్లాంట్‌లో మీరు జూనియర్ మేనేజర్ కావచ్చును. కానీ, ఇలా మా కాంట్రాక్టర్లకు సంబంధించిన విషయాల్లో మీ జోక్యం అనవసరం అని తెలీదా?"

కృష్ణారావు మాటలకు నా పిడికిళ్ళు బిగుసుకున్నాయి. కళ్ళల్లోకి రక్తం పొంగుకు వచ్చింది. మనసంతా కుతకుతలాడింది. ఒక్కసారిగా ఉప్పెనలా పెల్లుబికిన ఆవేశాన్ని అదుపులో ఉంచుకున్నాను.

అతని మాటలకు వొత్తాసు పలికినట్లుగా మిగతా స్టాఫ్ నా జవాబు కోసం చూస్తున్నారు.

"మీరంతా ఎందుకింత నిర్దయతో వున్నారో అర్థం కావటం లేదు. నూకాలమ్మ ఆక్సిడెంట్ విషయం మీలో ఎవరికీ సీరియస్‌గా అన్పించకపోవటం ఆశ్చర్యంగా వుంది. ఆమె కృష్ణారావు వద్ద చాలా సీనియర్ లేబర్. నెల రోజుల క్రితం షాప్‌ఫ్లోర్ ఊడుస్తూ మనవాళ్ళు నిర్లక్ష్యంగా పారబోసిన లూబ్రికేటింగ్ ఆయిల్‌పైన జారి, కాలుని విరగ్గొట్టుకుంది. వారానికో సేఫ్టీ మీటింగ్ పెడ్తూ, వర్కర్స్‌కి భద్రతలో శిక్షణలు ఇప్పిస్తున్నా, వాళ్ళు చేసేది వాళ్ళు చేస్తూనే వున్నారు. మనవాళ్ళు చేసిన నిర్వాకానికి అరవై సంవత్సరాలు దాటిన ఆ ముసలమ్మ కాలు విరగ్గొట్టుకుంటే తన అండర్‌లో పని చేస్తున్న లేబరనే స్పృహ లేకుండా ప్రవర్తించేడు. ఆమెను కనీసం ఆస్పత్రికైనా తీసుకెళ్ళకపోవటం... ఎంత దారుణం! సాటి మనిషిగా ఎవరైనా స్పందిస్తారు. ఆమె తరపున వాదించానని ఈ కృష్ణారావుకు నాపైన కోపం..." కుర్చీలోంచి లేవబోయేను ఆవేశంగా.

"మా లేబర్ విషయంలో మా శ్రద్ధ గురించి మీరు మాకు చెప్పక్కర్లేదు బాలాజీ! వాళ్ళకు ఏ ట్రీట్‌మెంట్ అవసరమో మాకు తెలీదా?" కృష్ణారావు మాటల్లోని వ్యంగ్యం నన్ను రెచ్చగొట్టినా, కాసేపు మౌనంగా వుండిపోయేను.

నా కోపం అంతా బాధగా మారుతోంది.

"మీ కాంట్రాక్టర్లు ఎంత మంచివారో నాకు తెలీదా సార్? విశాఖ ఉక్కులోకి మీరు ఈ మధ్య ఫ్లోరో క్లీనింగ్ కాంట్రాక్టర్‌గా రంగప్రవేశం చేసేరు. కానీ బాల్యం నుండీ ఈ ఉక్కు పొరల్లో, ఈ పునాదుల అరల్లో నా జీవితాన్ని నిక్షిప్తం చేసినవాణ్ణి.

ఇప్పుడిలా మనమంతా హాయిగా జీవితాన్ని గడపడానికి కారణమైన ఈ స్టీల్‌ప్లాంట్ ఉక్కు పొరల్లో ఎన్ని జీవితాలు బలయిపోయి వున్నాయో మీకెలా తెలుస్తుంది? ఇప్పుడు వేల సంఖ్యలో వున్న కార్మికులను, మేనేజ్‌మెంట్ స్టాఫ్‌ను, మీలాంటి కాంట్రాక్టర్లనూ పోషిస్తూ, అందరికీ అందుబాటుగా క్వార్టర్లనూ, స్కూళ్ళనూ, ఆస్పత్రులనూ ఏర్పాటు చేసిన ఈ ప్లాంట్, అందమైన రోడ్లతో, పచ్చని వృక్షాలతో ఇప్పుడున్న ఈ వైభవం వెనక ఎంత చరిత్ర వుందో తెలీదు మీకు.

ఈ ప్రాంతంలో ఎన్నో పల్లెలు వుండేవనీ, ఆ పల్లెల్ని, ఎత్తయిన దిబ్బలనీ ఛిద్రం చేసి, లోతట్టు ప్రాంతాల్ని 'ఫిల్' చేసి.....రెక్కలు ముక్కలు చేసుకుంటూ, పిడికెడు నూకల మెతుకుల్లో చిటికెడు కారపు పొడి వేసుకు తింటూ, డొక్కలు

మలమల మాడుతున్నా మనకోసం అహర్నిశలూ శ్రమించి, ఈ స్టీల్ ప్లాంట్‌కు నాందీ రూపాన్ని ఇచ్చింది పాలమూరి లేబర్.

మీలాంటి కాంట్రాక్టర్లు, మేస్త్రీలు, ఆ అమాయక పక్షుల మెడలూ, కాళ్ళూ విరిచి, రక్తాలు తాగి, కాల్చుకు తిన్నారనడానికి సాక్షిని నేను.

ఇంకా ఈ మట్టిపొరల్లో నా తల్లి సజీవ సమాధి అయ్యిందన్న నగ్నసత్యం మీకు తెలిసినా, తెలియకపోయినా, ఆ జీవాత్మ ఇక్కడే సంచరిస్తోందన్న ఆశతో....జీవిస్తున్నాను....." గొంతులో ఏదో అడ్డుకున్నట్లు ఆగిపోయేను.

నా కంఠంలో జీర!

గుండెలోంచి తన్నుకొచ్చిన దుఃఖం – కళ్ళల్లో చిప్పిల్లిన నీరు వాళ్ళకు కన్పించకుండా తల వంచాను.

అమ్మ జ్ఞాపకాల విస్ఫోటం మెదడంతా చిమ్ముకునేసరికి నన్ను నేను సంభాళించుకోవటం కష్టమయింది.

"చట్టరీత్యా రోజుకి ఎనిమిది గంటలు పనిచేయాలని రూల్స్ వున్నా, అవన్నీ ప్రభుత్వం తరపు చట్టాలే! పాలమూరి లేబర్ విషయంలో రోజుకు పన్నెండు గంటల వరకూ పని కాలాన్ని పొడిగించిన మేస్త్రీలూ కాంట్రాక్టర్లూ వారి చెమటని జలగల్లా పీల్చిన సంగతి మీ కెలా తెలుస్తుంది?

అందరి ముఖాల్లోనూ రంగులు మారుతుండడం గమనించేను. చాలాసేపు ఎవ్వరం మాట్లాడుకోలేదు.

ఓ పాలమూరి కూలీగా ఇరవై సంవత్సరాల క్రితం ఈ విశాఖ నేలపైన అడుగు పెట్టిన నాటినుండీ, ఇప్పటివరకూ నా జీవితంలో జరిగిన పెను మార్పుల్ని ఈ సందర్భంలో వాళ్ళతో సంభాషించడం అయిష్టంగా వున్నా, కృష్ణారావులో ఏ మూలో దాగివున్న మానవత్వం కనీసం తొంగిచూసి, నూకాలమ్మకు సహాయ పడుతుందేమోనన్న ఆశతో కొంతయినా వాళ్ళకు చెప్పాలనిపించింది.

☆ ☆ ☆

తెలంగాణాకు నైరుతి దిశలో వుండి, కరువు కాటకాలకు, వలసలకు ఆలవాలమైన మహబూబ్‌నగర్ జిల్లాలోని ఓ గ్రామంలో పుట్టిన నాకు ఊహ తెలిసింది ఆ గడ్డ పైనే.

నాకప్పుడు పదేళ్ళ వయసు. ఆ జ్ఞాపకాలు ఇప్పటికీ నన్ను నీడలా వెంటాడుతూ వుంటాయి. అవే నా జీవనయాత్రకు దిక్సూచులుగా వున్నాయి.

నాన్న ఒక మేస్త్రీ దగ్గర లేబర్‌గా చేసేవాడు. తాపీ పనిలో నాన్న దిట్ట. తమ శ్రమకు సరయిన ఫలితం లభించకపోయినా, కసాయిని గొర్రె నమ్మినట్లుగా కాంట్రాక్టర్లనూ, మేస్త్రీలనూ నమ్ముతూ ఒళ్ళువంచి పనిచేసే అమాయక జీవులు పాలమూరి లేబర్.

అనుకోనివిధంగా నాన్నకు జబ్బు చేసింది. అది కేన్సర్ అని తెలిసేసరికి సమయం మించిపోయింది. నాన్నని బ్రతికించుకోవటంకోసం అమ్మ ఎంతో తాపత్రయ పడేది.

చివరకి నాన్న దక్కకపోయినా, ఆయన్ని కళ్ళముందు చూసుకోవాలని అమ్మ చేసిన మూడువేల అప్పుమాత్రం మిగిలింది.

అమ్మ ఆ ఊళ్ళో చేయని పనంటూ లేదు. తనతోపాటూ, నా పొట్ట కూడా నింపటం కోసం వరి పొలాల్లో , జొన్న, సజ్జ, రాగి, కుసుమ చేలల్లో నాట్లకూ, కలుపు తీతకూ, కోతలకూ వెళ్ళేది. వేరుశనగ కాయల్నుండి పలుకులు వేరు చేయటం, చింత బోట్లను పండు రూపంలోకి మార్చటం, అడవి నుండి కట్టెలు తెచ్చి అమ్మటం, పేడను కూడేసి, పిడకలు చేయటం....ఇన్ని కూలిపనులు చేస్తూనే నన్ను బడిలోకి పంపుతుండేది అమ్మ.

మేస్త్రీ దగ్గర తీసుకున్న అప్పు రాన్రానూ వడ్డీతో కలుపుకుంటూ పాపంలా పెరిగిపోతోందన్నది ఆ తర్వాతగానీ తెలీలేదు.

ఆ అప్పును తీర్చటంకోసం అహర్నిశలూ తను తనశక్తినంతా ధారపోసేది. అయినా వచ్చే కూలీతో మాకిద్దరికీ తినడానికే కటకటగా వుండేది.

ఒకరోజు మాకు అప్పు ఇచ్చిన మేస్త్రీ వచ్చేడు.

“ఇగో, రాముమమ్మో, ఇగ నా అప్పుదీర్సుడు నీ వొశం గాదుగానీ, లేబర్‌ను బంతి గట్టి దేశం తోల్కపోతున్న. ఇశాకపట్నం కొండవోతున్న. నీవు గాడికొచ్చి అర్నెల్లు కూలి జేసినవంటే నా అప్పు, దానిమీది మిత్తి పైసలు మట్టుగ దీర్తయ్. నీవు గూడ గీ బాలాజీ గాన్ని తోల్కోని బంతిల గలవు....” అంటూ పీకల మీద కూర్చొని అమ్మని బలవంతంగా ఒప్పించేడు. చేసేదేంలేక అప్పు తీరే మరో మార్గం లేక అమ్మ బంతిలో కలవడానికి ఒప్పుకుంది.

మరో రెండ్రోజుల్లో అమ్మతోపాటే తట్టా, బుట్టా సర్దుకొని, పాలమూరి లేబర్‌గా ప్రైవేట్ బస్ సర్వీస్‌లో విశాఖనగరానికి బయల్దేరి వచ్చాను.

నాకు సరిగా జ్ఞాపకం లేదు.

ఎన్నో గంటల ప్రయాణం తర్వాత, ఓ తెల్లవారు జామున విశాలమైన స్థలంలో బస్ ఆగింది.

అంతవరకూ ఎక్కడికీ ప్రయాణం చేయని నేను అన్ని గంటలు బస్సులో వుండటం అదే మొదటిసారి. మాతోపాటూ ఆ బస్సులోనుండి మరో అరవై మంది లేబర్ దిగేరు. మేం బస్సు దిగేసరికి మా కోసమే ఎదురు చూస్తున్నట్లుగా ఒక నర్సు, కాంపౌండరుతో కాంట్రాక్టర్ వున్నారు.

అందర్నీ వరసగా నిల్చోబెట్టి ఇన్‌ఫెక్షన్ రాకుండా ఇంజక్షన్ చేసేరు.

ఆ తర్వాత మేస్త్రీ మమ్మల్నందర్నీ మరో చోటికి తీసుకెళ్ళి, అక్కడ మేం ఎవరికి వాళ్ళం తెచ్చుకున్న సామగ్రితో గుడిసెల్ని కట్టుకోమన్నాడు. రేపట్నుండే తెల్లవారు జామున నాలుగు గంటలకే పనిలోకి వెళ్ళాలని హెచ్చరిస్తూ, మాకు కాస్త దూరంలో వెదురుకర్రలతో, తడకలతో కలిపి చిన్న పర్ణశాలలా గుడిసె వేసుకున్నాడు. మేస్త్రీతో పాటూ అతని భార్యకూడా వచ్చింది.

గుడిసె వేయటంలో అమ్మకు నా చేతనైన సహాయం చేశాను. అమ్మ రావడమైతే వచ్చింది కానీ మనిషి చాలా దిగులుగా వుండటం గమనించేను.

"దేశం గాని దేశం దీసుకొస్తి కొడుకా!
నిన్ను సాలెమాన్పిస్తి కొడుకా......
నా మీద మన్ను వొయ్య......
నీ కన్యాలం జేస్తి కొడుకా...."

అమ్మ శోకాలు తీస్తూ, నన్ను చుట్టేసి బావురుమన్నది. నేను బిత్తరపోయి అమ్మతోపాటే శృతి కలిపేను.

"ఊకో, రాములమ్మా! సన్నవిలగాడు బెదురుకోగలడు. మన రాతలు బాగలేకనే గీదేశంలొచ్చి పడ్డం. ఇగేడ్వకులేయ్...." మాతో వచ్చిన తోటి లేబర్ అమ్మను ఊరడించేరు.

వారంతా కూడా పిల్లా, జెల్లా, తట్టా, బుట్టాతో మాలాగే జీవితంతో యుద్ధం చేయడానికి వచ్చినవారే!

ఆ మర్రోజు తెల్లవారుతుండగా మేస్త్రీతో ఏ ప్రాతంలో తవ్వకం మొదలుపెట్టి, ఏ లోతట్టు ప్రాంతంలో 'ఫిల్' చేయాలో చూయించి, మరికొన్ని విషయాలు మాట్లాడి వెళ్ళేడు కంట్రాక్టర్.

మొదట్లో అమ్మ పని చేస్తుండగా నేను తక్కిన కూలీల చిన్న చిన్న పిల్లల్నందర్నీ పోగుచేసి ఆడిస్తూ దూరంగా వుండేవాణ్ణి.

మగ కూలీలు గునపాలతో తమ శక్తినంతా ధారపోస్తూ, మట్టిని 'సాచ్చెలు'గా చేస్తూ, ఒకేసారి రెండు మూడు ట్రాక్టర్లకు సరిపడే మట్టిని తయారుచేసేవ్వారు.

ట్రాక్టర్లు వచ్చి ఆగడానికి 'రాంపు' అంటూ వాటి టైర్లు దిగేలా రెండు బాటలు చేస్తూ, అందులోకి ట్రాక్టర్ రాగానే కూలీలు మట్టిపోయటానికి అనుకూలంగా చేసుకునేవారు.

విశాఖ వచ్చి వారం దాటింది.

కొంత ఆ వాతావరణానికి అలవాటు పడ్డాము. కానీ అమ్మ మాత్రం ఏదో మనోవ్యాధితో వున్నట్లు, లోలోన కృంగిపోతున్నట్లు కన్పించేది నాకు.

రోజూ సూర్యోదయంకన్నా ముందే నిద్రలేచి పనిలోకి వెళ్ళటం, సూర్యాస్తమయం అయ్యేక రెండు గంటల తర్వాత గుడిసెలకు చేరుకోటం.... మా దినచర్య.

కనుచూపుమేర ఎక్కడ చూసినా ఎందరో కూలీలు పని చేయటం కన్పించేది మేమున్న జోన్ వదిలి, అప్పుడప్పుడూ మా చుట్టుపక్కల వున్న మిగతా జోన్స్‌కి కూడా వెళ్ళేవాణ్ణి.

పాలమూరి లేబర్ కాకుండా శ్రీకాకుళం, ఒరిస్సాలోని బరంపురం నుండి వచ్చిన కూలీలు, అప్పుడప్పుడూ ఒంగోలు నుండి వచ్చినవాళ్ళూ....కన్పించేవారు.

ఎక్కువ శాతం పాలమూరి లేబరే వుండేది.

ముఖ్యంగా ఇతర లేబర్ మాట్లాడే యాస నాకు చిత్రంగా అన్పించేది. బరంపురం లేబర్ దగ్గర కాషాయం, ఎరుపు కలిపిన ఒకరకమైన రంగులోని గుడ్డలు వుండేవి. వాటిని మొలలకి, తలలకీ, భుజాల మీదకీ వాడేవారు.

పసువు, బూడిద కలిపినట్టు ఒక రకమైన పాలిపోయిన రంగులో, ముఖం మీద రోమరహితంగా వుండేవారు.

స్టీల్ ప్లాంట్ అంతా రణగొణ ధ్వనులతో సందడిగా వుండేది. ఎక్కడ చూసినా రాక్షస బల్లుల్లాంటి మట్టిని తీసిపోసే షవల్స్, మట్టిని మోస్తూ తిరిగే ట్రిప్పర్స్, డోజర్స్ పసుపు రంగులో పులుల్లా కన్పించేవి.

ఇక ట్రాక్టర్లు, లారీలూ లెక్కలేకుండా తిరుగుతుండేవి. పుట్టలు పెడుతున్న చీమల బారుల్లా, పుట్టలు పగిలి చెల్లాచెదురైన చెదపురుగుల్లా కూలీలు గజిబిజిగా వుండేవారు.

కూలీలు ఎన్ని ట్రాక్టర్లకు, లారీలకూ మట్టిని నింపుతున్నారో లెక్కలు రాయడానికి తాత్కాలికంగా సూపర్‌వైజర్స్‌ని కాంట్రాక్టర్లు నియమించేవారు. వారంతా మాతోపాటే వుంటూ మా పని తీరునూ, మా మాటలోని యాసనూ గమనిస్తూ, నవ్వుకుంటూ మాలా మాట్లాడాలని ప్రయత్నించేవారు.

సూపర్‌వైజర్స్‌కీ, కాంట్రాక్టర్లకీ జోన్ ప్రకారంగా వెదురు, తాటితో కట్టిన కాటేజీల్లాంటివి వుండేవి.

వాళ్ళకి భోజన వసతి కోసం జోన్స్‌లో తమిళ, మలయాళీయులు చిన్న చిన్న హోటల్స్, డాబాలు నడిపేవారు.

రోజూ పది, పదకొండు గంటల ప్రాంతంలో మేస్త్రీ భార్య అన్నం, కూరలు చేయించుకోని తీసుకువచ్చేది. రోజూ మేం తినేది నూకల అన్నం. అందులోకి వెల్లుల్లితో చేసిన మిరప్పొడికారం. అంతే! వారానికోసారి గోంగూరతో చేసిన పప్పు. నెలకోరోజు మాత్రం సెలవు దినం.

ఆ సెలవునే 'మానకం' అంటూ, శనగల్ని, పెసర్లనీ, అనుముల్ని ఉడికించి గుగ్గిళ్ళుగా చేసుకు తినేవాళ్ళం.

స్టీల్ ప్లాంట్ నెలవు కోసం ధ్వంసం ఐపోయిన ఎన్నో పల్లెలు.....కళ్ళముందే ఒక్కొక్కటీ అదృశ్యం అవటం ఆ బాల్యంలోనే నా మనసుని కలిచివేసేది.

ఆ గ్రామాల్లోని జనమంతా గంట్యాడ, గాజువాక, ఆ చుట్టు పక్కల ప్రాంతాలకి తరలివెళ్ళారు.

అప్పుడప్పుడూ మేముండే జోన్స్‌కి కొందరు ఆడవాళ్ళు వచ్చి, మాముందే టీ, కాఫీలు తయారుచేసి, వాటితోపాటు పునుకులు, బూరెలు, జీళ్ళూ, పెండలం దుంపలూ, బన్నులూ అమ్మేవారు.

ఆ రోజు అమ్మకు ఒంట్లో నీరసంగా వుండి, పనిచేయజాలక కాస్సేపు కూర్చుంది. మామూలుగా అన్నం తీసుకువచ్చే మేస్త్రీ భార్య వస్తూనే అమ్మను అలా చూస్తూ మండిపడింది.

"ఏందే రాములమ్మా, గట్ల పెండ్లోళ్ల ఇంటికొచ్చిన తీర్గ గూసున్నవ్? లేవు తల్లీ. దబ్బున తట్టలు దీసుకో." పెద్ద గొంతుతో అరిచింది.

"జెర పానం బాగలేదు మేస్త్రమ్మా! దినాం కష్టం జేస్తనే వున్న గదనమ్మా? పెయిల బాగుంటే గిట్ల గూసుంటనా?......"

అమ్మ మాటలకు ఆమె శివమెత్తింది.

"ఏమయ్యో! గిది జూసినవా ఎట్ల తిరిగి జవాబిస్తుండదో, బాగనే దెచ్చినవ్ గిసంటోళ్ళను. ఇగ నీ అప్పు దీరుస్తదా? దినాం కుత్తెలదాంక మేపుతుండగదా! మస్తుగ తిని, ఆరాంగ గూసున్నది దుడుకది." భర్త మీద ఎగిరింది.

"ఏం తిండి తల్లీ....పిడెకెడు నూకలన్నంల, మిర్పోడి ఏసి పెడ్తున్నవ్. కడుపుల మంటలేసి సస్తుండ." అమ్మ నీరసంతోనే ఎదురుమాట్లాడింది.

"ఏయ్! నోర్మూయ్ రాములమ్మా! లేవ్, లేసి తట్టదీసుకో. అగో, కాంట్రాక్టరు వస్తుండడు. గాయన ఇచ్చిన టైంల పనిగాకుంటే, ఇచ్చె దుడ్లుగూడ ఇయ్యడు." అమ్మపైకి అంతెత్తున ఎగిరేసరికి నాకు ఎక్కడలేని కోపం వచ్చింది వాళ్ళపైన.

ఇక ఎదురు చెప్పలేని అమ్మ, ఆ నీరసంలోనే మెల్లగా నిల్చుని, పార, తట్ట తీసుకుంది. మేస్త్రి భార్య అందరికీ అన్నం వడ్డించి, నాకు, అమ్మకు పెట్టకపోయే సరికి...ఒకరిద్దరు కూలీలు అడగబోయారు.

వాళ్ళను పచ్చి బూతులు తిట్టేడు మేస్త్రి.

ఆ సాయంత్రానికే అమ్మకు శోషవచ్చి పడిపోయింది. ఉదయం నుండీ మాతోపాటే జోన్‌లో 'టీ' అమ్మే ఆడమనిషి గబగబ వచ్చి, అమ్మ ముఖం మీద నీళ్ళు చిలకరిస్తూ కాసేపు ఉపచర్యలు చేసింది.

తన దగ్గరున్న బన్నును టీలో ముంచి అమ్మకు తినిపించింది. నాకూ తన దగ్గరున్నె పునుకుల్ని, జీళ్ళనీ ఇచ్చింది.

"నా ఒద్ద దుడ్లులేవు తల్లీ! నీ కాల్మొక్త....మేస్త్రమ్మకు కోపమొచ్చింది. నాకు పెట్టకుంటె వాయె. గీ సన్నవిలాగాడు ఏంజేసిండమ్మా....నా నాయనకు ఎన్ని కష్టాలొచ్చినయ్ దేవుడా!" అమ్మ ఏడుస్తూనే, ఆమెను బ్రతిమాలింది.

"అచ్చీ! నాకు డబ్బుల్క్యుఖనేదమ్మా. నాను పొద్దుటేల్నుంచీ సూత్తన్నాను గందా, అది మడిసి జెలమ ఎత్తనేదమ్మా! రెక్కలు ముక్కలు సేసుకంతన్నావు – కనికారం నేకపోనాది ముండకి" అంటూ ఆమె మాట్లాడిన తీరు సరిగా అర్థం కాకపోయినా మాపైన తనకెంతో జాలి వున్నట్లు తెలుస్తోంది.

"నన్ను ముత్యాలమ్మంతారు. అల్లక్కడ అగుపిత్తంది సూడుమీ, ఊరంతా పడగొట్టేసి, మొండి గోడల్తో, మద్దిన రాములోరి కోవిలా....అద్గదీ నెల్లిముక్కు. ఆ ఊరే మాది. మా వందరవీ ఇల్లులు కాలీసేస్సి, గాజువోకనోనుంతన్నాము. మీకు తెల్దుగానీ ఇల్లిక్కడ్నుంచీ అల్లక్కడ సవుద్రుంకేసి అగుపించే గంగోరం దాకా బోల్డు ఊళ్ళుండీవి. ఫ్. ఏట్నాబం! అన్నీ పడగొట్టేసినారు. ఇందనోని టీల్‌పాటు కట్తారటమ్మా..." మాకు అర్థం అయ్యా, కానీ విశాఖ యాసలో ముత్యాలమ్మ మాట్లాడ్తూ వుంటే సంభ్రమంగా చూసేవాణ్ణి.

ఆమె ఒంటి మీద చీరకొంగుని కుడివైపున వేసుకునేది. జాకెట్ లేకుండానే వుండేది. తలనిండా ఆముదం రాసుకొని, కొప్పుని ఒక పక్కగా కట్టేది. ముఖంలో రూపాయికాసంత ఎర్రని బొట్టు, ముక్కుకి వేలాడే బులాకీ, చెవులకి బుట్టలు....అప్పుడప్పుడు పొగాకు చుట్టల్ని తాగుతూ, కాల్తున్న వైపుని నోట్లోకి

పెట్టేసి అడ్డపొగ పీల్చటం...ఆమెకు ఎదురుగా కూర్చుని వింతమనిషిని చూసినట్లు చూసేవాణ్ణి.

మరికొన్ని రోజుల్లోనే ముత్యాలమ్మతో మాకు చనువు ఏర్పడింది. మేం డబ్బుల్ని ఇవ్వకపోయినా అమ్మకూ, నాకూ రోజూ 'టీ' పోస్తూ, తిండానికి ఏమైనా ఇచ్చేది. అప్పుడప్పుడూ ముత్యాలమ్మతో 'టీ కేన్' పట్టుకొని తక్కిన జోనుల్లోకి వెళ్ళేవాణ్ణి. ముత్యాలమ్మకి పిల్లలు లేరు. ముప్ఫయి ఏళ్ళు దాటి వుంటాయి. తన భర్త ఎలక్ట్రిసిటీలో 'పోల్స్' పాతుతాడనీ, వైరింగు పనేదో చేస్తాడనీ చెప్పింది.

తినడానికి తమకేలోటూ లేకపోయినా, మనిషికి వ్యాపకం అంటూ లేకపోతే పిచ్చెక్కుతుందని, సరదాగా ఇలా జోనులు తిరిగి చిన్నగా టీ వ్యాపారం చేయటంలో ఆనందం వుందనేది.

నాన్నకై చేసిన అప్పు మీద వడ్డీ రోజు రోజుకూ పెరిగిపోతోంది. కూలీ చేస్తూ, రెక్కలు ముక్కలు చేసుకుంటున్నా, మేస్త్రి రోజుకోసారి–

"రాములమ్మా, అప్పు తీర్వాల్నంటే గీడ యాడాదన్న పనిజేయాలె" అనేవాడు.

'పాలమూరు వెళ్ళి కలో, గెంజో తాగి బతుకుదం గానీ, ఈ గాడిది చాకిరి వద్దురా భగవంతుడా!' అనుకునే అమ్మ మేస్త్రి మాటలకు హతాశురాలయ్యేది.

నేను అప్పుడప్పుడూ ముత్యాలమ్మతో కలిసి బాలచెరువు సంతకి వెళ్ళేవాణ్ణి. అక్కడ ఎన్నో రకాల చేపలు. పాలమూర్లో కొరమీన్, పరకలు, తెల్లలూ, బొచ్చలు, రవ్వులు తప్పించి మరే రకం చేపలు చూసెరగను.

సొరలు, వంజురం, సందువాలు, కవ్వల్లు, కొరలు, సావల్లు, పీతలు, రొయ్యలు...ఇట్లా చిత్రమైన చేపల పేర్లు చెప్పేది ముత్యాలమ్మ.

సంతలో తాటి తేగల్ని కొనిపెట్టి, వాటిని ఎలా తినాలో చెప్పేది.

ఎందుకో....అమ్మ ఆరోగ్యం రాన్రానూ క్షీణించసాగింది. ముత్యాలమ్మ అప్పుడప్పుడూ నన్ను గాజువాకలోని స్కూల్లో చదివించమనీ, వీలుకాకపోతే తన ఇంట్లోనే నన్ను వుంచమనీ అమ్మతో చెప్పేది.

"ముద్దుగ సదువుకు సాలెకు వొయెటోన్ని దెచ్చి, గీడ పనిజేపిస్తున్న ముత్యాలమ్మా! మా బత్కులుల్ల మన్నువడ. మా మీద దేవుడు గింతగనం కచ్చవట్టిండు ఏమిటికో....." అమ్మ తన మనసులో ఆవేదనని వెళ్ళగక్కేది.

☆ ☆ ☆

స్టీల్ ప్లాంట్‌కు వచ్చి దాదాపుగా నాలుగు నెలలు దాటింది.

మేస్త్రీలు పెట్టే తిండిని తినలేక, ఈ పన్నెండు గంటల కష్టం చేయజాలక కొందరు కూలీలు దొంగచాటుగా తప్పించుకొని, పాలమూరు పారిపోవటంతో కలకలం రేగింది.

ముందుగా అడ్వాన్స్‌లు ఇచ్చి, లేబర్‌ని తీసుకు వస్తే, చెప్పా పెట్టకుండా పారిపోవటంతో మేస్త్రి వచ్చి బూతులు గుప్పిస్తూ, పిచ్చెక్కిపోయేడు.

జనం తక్కువయ్యేసరికి, పని మందకొడిగా సాగేది.

కాంట్రాక్టర్ మేస్త్రీపైన విరుచుకుపడేవాడు.

"అనుకున్న టైంలో పని పూర్తిచేయకపోతే, డబ్బులు ఇవ్వడం కుదరదని" బెదిరించేవాడు. కాంట్రాక్టర్ నుండి వత్తిడి పెరగటంతో మేస్త్రీ మా మీద పడేవాడు.

ఆ రోజునుండి అమ్మకు ఆరోగ్యం సరిగా లేకపోయినా, రోజూ పన్నెండు గంటలు తట్టలు మోసేది.

మేం వుంటున్న పక్క జోన్‌లో మా ఊరి లేబరే కొందర్ని మరో మేస్త్రీ బంతి గట్టుకొని వచ్చేడు. ట్రాక్టర్ నిండా మట్టిని నింపి, ఫిల్లింగ్ ఏరియాలో 'అన్‌లోడ్' చేయడానికి బయల్దేరినప్పుడు, ఎదురుగా వస్తున్న మరో ట్రాక్టర్ ఢీ కొనడంతో ఇద్దరు లేబర్ అక్కడికక్కడే చనిపోగా, పదిమందికి పైగా కాళ్ళూ, చేతులూ విరిగాయి.

ఆ వార్త విన్నప్పటినుండి, ఆ దృశ్యం చూసేక....మా బంతిలోని లేబర్ చాలా ఢీలాపడిపోయారు. పని సరిగా చేయటంలేదు.

మా మేస్త్రీ తీసుకున్న పని దాదాపు చివరి దశలో వుండగా, అమ్మకు పెద్ద జబ్బు చేసింది. కనీసం హాస్పటల్‌కైనా అమ్మని తీసుకెళ్ళలేదు మేస్త్రీ.

ఎప్పుడూ దగ్గుతూ వుండేది అమ్మ. అమ్మ పనిలోకి రాకపోతే....మా గుడిసె దగ్గరకు వచ్చి, తిట్టి, కొట్టబోయేంత పని చేసేది మేస్త్రీ భార్య.

"బాల్రాజా, ఏటి! మీయమ్మేటి ఇనాగయిపోతన్నాది రోజు రోజుకీనూ? ఆ కొండముచ్చు యెదవకేటీ పట్టదా? పాలోమని మీ ఊరునుండి గేదిర్ని తోలుకొచ్చేసినట్లు తోలుకొచ్చిడం తప్పించి, మీ బాగోగులూ, మంచీ సెడ్డా ఆడికక్కర్నేదా?" అంటూ ముత్యాలమ్మ అమ్మని బలవంతంగా తనతోపాటూ కె.జి.హాస్పటల్‌కి తీసుకెళ్ళి, మందులు ఇప్పించేది.

ఆమె చేసే సేవలకూ, ఆ మంచితనానికీ, ఆమె దయాగుణానికీ మాకు ఆశ్చర్యం వేసేది. ఆమె ఎవరు? మేం ఎవరం? ఇంతవరకూ ఎన్నో వందల కిలోమీటర్ల దూరంలో వున్నాం. ఇప్పుడిలా కలవటం... ముత్యాలమ్మతో ఏ పూర్వజన్మ అనుబంధమో అన్పించేది.

మా చుట్టూ వున్న జోన్స్‌లో ఎక్కువగా పాలమూరులోని కొల్లాపూరు, వనపర్తి, నాగర్‌కర్నూలు, ఆత్మకూరు, గద్వాల, కల్వకుర్తి, అచ్చంపేట ఊర్లనుండి వచ్చిన వారు వున్నారు.

మాకు దూరపు బంధువులు కొందరు మా అచూకీ తెలుసుకొని, ఇతర జోన్ల నుంచి వచ్చి. అమ్మని పలకరించి వెళ్ళేవారు.

ఒకరోజు.......

ఉదయం నుండీ వర్షం తుంపర్లు తుంపర్లుగా పడుతూనే వుంది. మధ్యలో వర్షం ఎక్కువవటంతో కాస్సేపు పని ఆపేరు. తలపైన గొడుగుతో అటుగా వచ్చిన మేస్త్రమ్మ అలా పనివదిలి కాళీగా వుండటం చూసి సహించలేకపోయింది.

"మీ తలలు గొట్ట! మీ కేమొచ్చిందిరా? మనకు ఎండేంది? వానేందిరా? లేవుండ్రి. పనిగాక నెత్తిగొట్టుకుంటుండము. మా నోట్ల మన్నువోసి బడపలు పాలమూరికి పారిపోయింది. మీరన్న దబదబ పనిజేయకుంటే ఎట్లరా..." అంటూ

అందుకుంది. పాలమూరికి పారిపోయిరి. మీరన్న దబదబ పనిజేయకుంటే ఎట్లరా...." అంటూ అందుకుంది.

ఆవిడ తిట్లకన్నా, వర్షంలో తడుస్తూ, పనిచేయటంలోనే సుఖం వుందనుకున్న కూలీలు మెల్లగా పనిలోకి దిగేరు. అమ్మ నీరసంతో వున్నా....తలమీద కొంగేసుకొని తట్టా, పార తీసుకోక తప్పలేదు.

శ్రమ మరవడానికి ఆ వర్షంలోనే పాటలందుకున్నారు లేబర్.

"గోదిల్ల గరిల్లకింద నేరల్ల వనము
నేరల్ల వనముల్లా కోమల్లి పుట్ట
కోమల్లి పుట్టల్ల కోడే నాగన్నా
నాగన్న వెట్టిండు నాలుగూ గుడ్లు
శ్రావణ్ణే పెట్టింది శాటేడు గుడ్లూ
పెట్టి పెట్టి నాగన్నా మేతాడవాయే...."

నేను కొద్ది దూరంలో ముత్యాలమ్మ దగ్గరున్న తాటి గొడుగు కింద వుండి, వాళ్ళు పాడే పాటల్ని వినసాగేను.

వర్షపుగాలికి పాట అటూ ఇటూ ఊగుతున్నట్లు అన్పించసాగింది. అమ్మను చూస్తుంటే కడుపు తరుక్కుపోయేది. ఆ వర్షంలో తప్పతడుస్తూ తట్టల్ని తలమీద కెత్తుకొని, మట్టిని ట్రాక్టర్లో పోస్తుంది.

బాగా చదువుకొని, మంచి ఉద్యోగం సంపాదించి అమ్మని సుఖపెట్టాలని వుండేది. ఐనా నన్నెవరు చదివిస్తారు? అప్పుడప్పుడూ ముత్యాలమ్మతో నాజువాక వెళ్ళినప్పుడు బడికి వెళ్తున్న పిల్లల్ని చూసి చాలా దిగులు వేసేది.

ఆ వర్షంలో ఆడా, మగా అంతా పల్లె పదాల్ని వల్లెవేస్తూ, చాలా ఉషారుగా తిరుగుతున్నారు. ఐదారుగురు మగ కూలీలు గునపాలతో పెద్ద సాచ్చెను (మట్టిపెల్ల) లేపాలని ప్రయత్నిస్తున్నారు. అంతకు క్రితం కూలిన పాచ్చె మట్టిని తట్టల్లోకి పారల్తో నింపి ట్రాక్టర్లలో పోస్తున్నారు.

వర్షం మరింత ఉధృతమయ్యింది.

అందరూ గునపాల్ని గజం గజం దూరంగా భూమిలోకి దించి, వాటిని వెనక్కీ, ముందుకీ ఊపుతూ మట్టి సాచ్చెకోసం ప్రయత్నిస్తూనే వున్నారు.

అన్ని దిక్కుల్ని కమ్మిన నల్లని మబ్బుకు చీకటి, చీకటిగా మసకలా వుంది అంతాను. ముత్యాలమ్మను గట్టిగా అదిమి పట్టుకొని కూర్చున్నాను.

టీ చేసే బొగ్గుల పొయ్యి ఎప్పుడో ఆరిపోయింది.

మళ్ళీ పాటని గాలి మోసుకొస్తూ, మా చెవుల కందిస్తోంది.

"చెట్ల సాటున, గుట్ల సాటునా
ఈతకల్లు తాగిస్తివ చిన్న సెంద్రమ్మా
ఏమెరుగని రామసెంద్రికి ఏం బెడ్తివో
మందు వెడ్తివో...మాకు వెడ్తివో
ఏం బెట్టి రామసెంద్రిని మల్పుకుంటివో...."

'ఫెళ....ఫెళ....ఫెళ....' ఎక్కడో పిడుగు పడినట్లు ఉరుములు శబ్దాలు. ఆ వెంటనే మాకు దగ్గర్లో మరేదో పెద్ద కోటగోడ కూలిన చప్పుడులాంటిది విన్పించేసరికి భయపడ్డాను.

పాట ఆగిపోయింది.

ఆ వర్షపు హోరులో ఎవరివో పెద్ద పెద్ద అరుపులు విన్పిస్తున్నాయి. లేబర్ అంతా పెద్దగా అరుస్తూ కూలిన మట్టి సాచ్చె చుట్టూ చేరారు. ముత్యాలమ్మ నన్ను గొడుగు కిందే కూర్చోమని, తను కూలిన మట్టి సాచ్చె దగ్గరకు వెళ్ళింది.

అంతలోనే పెద్దగా ఏడుస్తూ, రాగాలు తీయటం విన్న నాలో వెన్నులోంచి వణుకు పుట్టుకొచ్చింది. మెల్లగా నేనూ అడుగులు వేస్తూ ఆ గుంపు వైపు వెళ్ళేను.

ముత్యాలమ్మ నన్ను వాటేసుకొని బావురుమంది.

ఎందుకంతా పోగయ్యారో? అసలేంజరిగిందో అర్థం కావటం లేదు.

లేబర్ కూలిన మట్టి సాచ్చెను కంగారుగా పొడుస్తూ, మట్టిని లాగేస్తున్నారు.

అప్పుడు అర్థం అయ్యింది - అది కూలినప్పుడు ఎవరో దానికింద పడిపోయి ఉంటారని. అంతే! ఒక్కసారిగా తొలగించిన మట్టిలోంచి అమ్మ ఎర్రని చీర కన్పించే సరికి అలాగే చూస్తూ కొయ్యబారిపోయాను.

"అమ్మా!" అని అరుస్తూ, ఆ వర్షంలో కూలిన సాచ్చె చుట్టూ పిచ్చెక్కినట్లు గెంతుతూ ఏడుస్తున్న నన్ను ముత్యాలమ్మా, తక్కిన కూలీలు గట్టిగా పట్టుకున్నారు.

పడ్డ సాచ్చెలోంచి మరో పది నిముషాల్లో కర్రలా నిగడదన్ని వున్న మా అమ్మను పైకి తీశారు. బ్రతుకంతా చీకటయిన క్షణాలవి.

నాన్న ఆరోగ్యంకోసం అప్పుచేసి, దాన్ని తీర్చే మార్గంలేక, మేస్త్రి మాట ప్రకారం కూలీగా విశాఖ వచ్చి, ఈ ఉక్కుపారల్లో నలిగిపోయింది అమ్మ.

దగ్గర్లో వున్న శ్మశానంలో అమ్మను పూడ్చిపెట్టారు. మా ఊళ్ళోనూ మాకు మరీ దగ్గర బంధువుల లేనికారణంగా శవాన్ని పాలమూరు తీసుకెళ్ళలేదు.

అమ్మ చనిపోయేక. దాదాపుగా ముత్యాలమ్మ దగ్గరే వున్నాను. మా మేస్త్రి పైకి జాలి చూపిస్తూ, లోలోపల 'అప్పు ఎగ్గొట్టి సచ్చింది ముండ' అనుకొని వుంటాడు.

ఇప్పుడు నా భారంతో చిరాకు కల్గుతోంది వాళ్ళకి.

నేనొక ప్రశ్నగా మిగిలిపోయాను.

మా ఊళ్ళో వున్న పూరిగుడిసె...అదీ మరొకరి దయతో వాళ్ళ స్థలంలో వేసుకుంది. నాకంటూ వేరే ఆస్తి ఎక్కడా లేదు.

వలస వచ్చిన కూలీలు ప్రమాదవశాత్తూ చనిపోతే, ఏరకమైన నష్టపరిహారం చెల్లించకపోగా, అప్పు తీరలేదన్న కోపంతో చనిపోయినవాళ్ళ వారసుల్ని పనిలోకి పెట్టుకోవటం మామూలే.

కానీ నా విషయంలో మరీ చిన్నవాణ్ణి. నాతో ఎంత పని చేయించుకున్నా తక్కువే. నాకు పెట్టే భోజనం దండగ ఖర్చు అని మేస్త్రికి, మేస్త్రమ్మకు వున్న సందేహం.

నన్ను ఎలా వదిలించుకోవాలో అని చూస్తున్న సమయంలో ముత్యాలమ్మ మా మేస్త్రీ దగ్గరకు వచ్చింది.

"ఇదిగో బాబూ! ఈ సంటోన్ని నా దగ్గిరాగ్గేసి ఎల్లండి. అడికేటి అమ్మా, అయ్యా? మీరున్నారెందుకూ, ఈడి తల్లికి ఒన్నవెట్టకంట మాడ్సేసినారు......బాలాజునీ సంపేత్తారు తవరు. సుబ్బరంగా ఒగ్గీయండెక్కడే. నా దగ్గిరే వుంతాడు. మావు తాగిన కలో, గెంజో ఈడికీ ఏసి పెంచుకుంతాము. మీరు ఒప్పేసుకుంతే నానొట్టుకెళ్ళి పోతాను." నిష్ఠురంగా మాట్లాడుతూనే దర్జాగా అడిగింది ముత్యాలమ్మ.

నిజానికి నాకూ తిరిగి మహబూబ్ నగర్ వెళ్ళాలని లేదు. జీవితంలో నాకంటూ మిగలని అక్కడికి వెళ్ళి ఏంచేయాలి?

దేవుడు పంపిన ప్రేమదూతలా వచ్చింది ముత్యాలమ్మ. ఏమనుకున్నాడో మేస్త్రీ, 'పీడా వదిలిందనుకున్నాడు' కాబోలు–

"గట్లనే బాలాజును కొండవో గానీ, మాకు గీని తల్లి మూడు వెయిల దాంక బాకున్నది. ఎయ్యి రూపాయల మిత్తి గూడ అయ్యింది. మరిగా అప్పు ఎవడి దీరుస్తడు? గీనితోన జెరజెర పని చేపించుకుంటే. ...తోడెమన్న తీర్తదంటని అనుకుంటుండ."

మేస్త్రీ మాటల్లోని నంగితనాన్ని కనిపెట్టింది ముత్యాలమ్మ. తిరిగి మాట్లాడ కుండా వెళ్ళిపోయి, వారం తర్వాత డబ్బుతో వచ్చింది. అమ్మ చేసిన బాకీని వడ్డీతోసహా మేస్త్రీకి అప్పజెప్పింది.

తర్వాత నా చేయి తన చేతిలోకి తీసుకుంది. కళ్ళతోనే నన్ను ఆహ్వానించింది. నాకంటూ వున్న బట్టా, బుట్టా సర్దుకొని ముత్యాలమ్మతోపాటూ గాజువాకలో వున్న ఆమె ఇంటికి వచ్చేశాను.

చనిపోయిన మా అమ్మని ముత్యాలమ్మలో చూసుకునేవాణ్ణి. నాచేత ఏపనయినా చేయిస్తుందనుకున్నాను మొదట్లో.

నన్ను తిన్నగా గాజువాకలోని బడికి తీసుకెళ్ళింది. బళ్ళో నన్ను చేర్పించి, నాకు కావలసిన పుస్తకాల్ని కొన్నది.

నా ఆనందానికి అవధులు లేవు. అలాగే సంభ్రమాశ్చర్యాలతో ముత్యాలమ్మ కేసి కళ్ళప్పగించి చూసేను.

"ఏట్రా బాలాజా! అల్గ సూత్తన్నవేట్రా? నాకు పిల్లలు నేకపోయినా, నాకు కొడుకు నాటోడివిరా నివ్వు. నాను నిన్ను సూసిన యాళా ఇసేసమేటో గానీ, పూర జనమలో నా కొడుగ్గునాగగుపించినావు. నా పెనిమిటికి పిల్లలంతే బోల్డు ఆసి. కానేట్నాబం? మాకు పిల్లల్నీయనేదు దేముడు. ఇదిగో నీ రూపాన్ని పంపినాడు దేముడు. నీవు పుట్నా నీకూ అమ్మా, బాబూ కరవయి పోనారు. మా దగ్గిరా వుంతూ సుబ్బరంగా సద్వియ్...."

చాలా రోజులుగా ముత్యాలమ్మతో సహవాసం వుంది గనక, ఆమె మాటల్ని పూర్తిగా అర్థం చేసుకుని, తను చెప్పిన మాటలు అర్థం అయ్యాయని తల ఊపేను.

స్టీల్ ప్లాంట్ కట్టడానికి కావలిసిన స్థలం 'లెవల్'గా అయ్యేవరకూ, దాదాపు నాందీ దశ పూర్తి కావస్తుండగా అక్కడికి వెళ్ళి 'టీ' అమ్మటం మానేసింది ముత్యాలమ్మ.

తర్వాత ఎన్నో వ్యాపారాలు చేసింది.

పచ్చి పెండలం దుంపల్ని విశాఖ చుట్టూ వున్న పల్లెల్నుండి తెచ్చి, ఉడకేసి, పూర్ణమార్కెట్‌లో అమ్మి, డబ్బులు గడించేది.

కొన్నాళ్ళు మామిడి పళ్ళ వ్యాపారం, మరి కొన్నాళ్ళు కూరగాయలమ్మటం–ఎన్నో రకాలుగా.... మనిషి ఖాళీగా వుండకుండా ఏదో ఒకటి చేసేది.

జీవితం పైన గొప్ప ఆశ తనకి.

నా జీవితంలో ముత్యాలమ్మ కొత్త వెలుగు. కాలచక్రంలో తన భర్త గతించేడు.

నేను ఇంటర్ పాసయ్యాక, ఇంజనీరింగ్ చదవాలని నాకు ఆశగా వుండేది. కానీ ముత్యాలమ్మ ఆర్థికస్థితి నాకు తెలుసు గనక బయటకి చెప్పలేకపోయాను.

నా మనసులో మాట ఎలా కనిపెట్టిందో....ససేమీరా నా చదువు ఆగడానికి వీల్లేదని, తన పుట్టింటివాళ్ళు పసుపు కుంకాల కింద ఇచ్చిన స్థలం భీమ్లీలో వుంటే దాన్ని అమ్మి, నా చదువును కొనసాగించింది.

ఆంధ్రా యూనివర్సిటీలోనే ఇంజనీరింగ్‌లో సీట్ రావటం, చదువు అయిపోయేక కొన్నాళ్ళకి తిరిగి స్టీల్ ప్లాంట్‌లోనే ఉద్యోగం రావటం అంతా యాదృచ్ఛికమే అయినా అదంతా ముత్యాలమ్మ చలువే.

నా చర్మం వలిచి, చెప్పులు కుట్టించినా ముత్యాలమ్మ ఋణం తీర్చుకోలేను. అన్ని వ్యాపారాలు చేసి అలిసిపోయిన ముత్యాలమ్మను నేను ఉద్యోగంలోకి వచ్చేక బలవంతంగా ఏ పనీ చేయనీయకుండా ఇంట్లో వుంచేను.

ఇప్పుడు గతాన్ని నెమరు వేసుకుంటూ, నా ఎదుగుదలని గొప్పగా అనుభూతి చెందుతూ....నన్ను పెంచిన తల్లిగా విశ్రాంతి తీసుకుంటోంది.

ఆమె నాకు జీవితాన్నిచ్చిన దేవత!

☆ ☆ ☆

ఇదంతా వారికి కట్టు కథలా తోచినా ఆశ్చర్యపోను. దాదాపు ఇరవై సంవత్సరాల క్రితం నా కన్నతల్లి ఈ ఉక్కులో సమాధి కావటానికి పరోక్షంగా కారకులైన ఈ మేస్త్రీలు, కాంట్రాక్టర్లూ..నా దృష్టిలో మమతానురాగాలకు అతీతులు.

నెలక్రితం నా కళ్ళముందే కాలుజారి పడిన నూకాలమ్మను అలా చూస్తూ వుండిపోయిన మిగతా స్టాఫ్‌ని ఏమనాలో అర్థం కాలేదు.

గబ గబ వెళ్ళి నా రెండు చేతులతో ఎత్తి, అంబులెన్స్ కోసం పరిగెత్తాను. ఫ్లోర్‌లోని మా స్టాఫ్ ఆశ్చర్యంతో నావైపు చూస్తుండటం నేను గమనించకపోలేదు.

ప్రస్తుతం ఆస్పత్రిలో కోలుకుంటున్న నూకాలమ్మ ఆక్సిడెంట్ విషయంలో పరిహారంగా పదివేలయినా చెల్లించాలని డిమాండ్ చేసేను ఆమె తరఫున.

నా హయ్యర్ రాంక్ ఆఫీసర్లు నా జోక్యం అనవసరమని చీవాట్లు వేసారు. అది మనకూ, స్టీల్ ప్లాంట్‌కు సంబంధించిన విషయం కాదన్నారు.

ఐనా....నా పట్టు వీడలేదు నేను.

నా అంతరంగంలోని అలజడిని వారు అర్థం చేసుకుంటారనుకోవటం నా భ్రమే! నా గతాన్ని టూకీగా వాళ్ళకు చెప్పి, ముత్యాలమ్మతో నా అనుబంధాన్ని వివరించేసరికి ఆశ్చర్యంతో నోరు తెరిచినా, తర్వాత వారి కళ్ళల్లో నాపట్ల చులకన భావాన్ని నేను గమనించకపోలేదు.

చంటిపాపకు పాలిచ్చే తల్లిని బలవంతంగా విడదీసి, పనిచేయమంటూ ఆ కూలీని గద్దించే రాక్షసుల్ని నేనెరుగుదును.

తమ కళ్ళల్లో అందమైన ఆడకూలీ కన్పిస్తే, నయానో, భయానో, మంతనాలతోనో తమ కాటేజీల్లోకి లాక్కువెళ్ళిన కామాంధులను ఎరుగుదును.

తమ దృష్టిలో సరిగా పనిచేయలేని కూలీని కాళ్ళతో తన్ని, కాండ్రించి మొహం మీద ఊసిన కరుడుగట్టిన కాంట్రాక్టర్లను .... ఎందర్నో చూసేను.

పొట్ట కోసం రోజుకు పన్నెండు గంటలు పనిచేసే దరిద్రదేవత సంతానంలోంచి వచ్చినవాణ్ణి.

రెక్కల కష్టానికి తగినంత ఫలితం దక్కకపోయినా, మందుకో, మాకుకో తీసుకున్న చిన్న అప్పుకోసం జీవితాంతం రుణగ్రస్తులై బతుకుల్ని తాకట్టు పెట్టుకునే నిర్భాగ్యుల పుత్రుణ్ణి.

ఈ చక్రభమణంలోంచి బయటపడి, ముత్యాలమ్మ దయతో అందలమెక్కిన అదృష్టవంతుణ్ణి.

దేశంలోని అన్ని ప్రాంతాల్లో బారులు బారులుగా దారులు కడుతూ, తమ దారిని పూడ్చుకుంటున్న పాలమూరి వలసపక్షుల్లోని ఒక పక్షిని.

వలసగా విశాఖ వచ్చి, తిరిగి నివాసం చేరని పక్షిని కూడా.

"అయ్యాం వెరీ సారీ బాల్‌రాజ్!....నూకాలమ్మ విషయం గురించి ఆలోచిద్దాం" అంటూ ఒక్కొక్కరే వచ్చి, నా భుజం తడుతూ బాధను అభినయిస్తున్న మా స్టాఫ్‌నూ, కాంట్రాక్టర్ కృష్ణారావునూ ఆశ్చర్యంతోనూ, అనుమానంతోనూ చూశాను.

● *ప్రచురణ: ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 1994* ●

★ ★ ★

80

జి. ఆర్. మహర్షి

# నన్ను క్షమించు కన్నా!

ప్రియమైన కన్నా!

ఈ రోజు నువ్వు నన్నొక ప్రశ్న అడిగావు. దానికి సమాధానమే ఈ ఉత్తరం. నీ ప్రశ్నలో న్యాయముంది. బహుశా ప్రతి మధ్యతరగతి తండ్రీ తన బిడ్డలనుంచి ఏదో ఒకరోజు ఈ ప్రశ్న ఎదుర్కోక తప్పదేమో!

నువ్వు మంచి మార్కులతో పాసయ్యావు. అయినా నువ్వు కోరిన కోర్సులో సీటు రాలేదు. తక్కువ మార్కులొచ్చిన నీ మిత్రులు డొనేషన్లు కట్టి చదువుతున్నారు. ఆ దుఃఖంలో నువ్వు నన్ను ప్రశ్నించావు.

"నువ్వు డబ్బెందుకు సంపాదించలేదు నాన్నా?" అని నిలదీశావు.

ఇప్పుడు నేను చెపుతున్నది నా ఒక్కడి కథ కాదు. మన వూరి రైతులందరిదీ.

మా నాయన నాకు పదెకరాల భూమిని ఇచ్చాడు. అది బంగారం పండే నేలని అందరూ అనేవాళ్ళు. మా అమ్మ బంగారాన్నంతా ఆ భూమి మింగేసింది.

వానదేవుడు బలే పిసినారి, చినుకు విదిల్చేవాడు కాదు.

మన వూరి భూములకు కాలువనీళ్లు వస్తాయని మా నాయన కాలం నుంచి అంటూనే వున్నారు.

"నా బతుకంతా వానకోసం ఎదురు చూడటానికే సరిపోయింది. మబ్బులవైపు ఎంత ఆశగా చూసేవాన్నంటే, చూసి చూసి నా కళ్లలో నీళ్లొచ్చేవి. అందుకే నాకు చత్వారం వచ్చుంటుంది. అవి జాలిలేని మబ్బులు. వాటి గుండెల్లో కొంచెం కూడా తడిలేదు. మాది ఎండిపోయిన కాలం. నువ్వు అదృష్టవంతుడివి. కాలువ నీళ్లతో మారాజులాగా సేద్యం చేసుకుంటావు" అనేవాడు మా నాయన.

జీవితమంతా కాలువకోసం కలవరించాడు మా నాయన. ఆయన నాలుగు మాటలు మాట్లాడితే ఒక మాట కాలువగురించే అయివుండేది.

ప్రతి విషయాన్ని కాలువతో ముడిపెట్టి మాట్లాడేవాడు.

'ఇంటిని రిపేరు చేయించుకుందాం నాయనా!' అని నేనంటే–

"ఎందుకురా తొక్కులాడుతావు? కొంచెం నిదానంగా వుండు. కాలువ నీళ్లు రానివ్వు. మాంచి మిద్దె కట్టుకుందాం" అనేవాడు.

కాలువ నీళ్లొస్తే సంవత్సరానికి ఎన్ని పంటలు వేయాల్నో అంచనాలు వేసేవాడు. వరిలో ఏరకం నాటితే బాగుంటుందోనని అందరిని సలహాలు అడిగేవాడు.

"బంగారు కడ్డీలు బియ్యమైతే బ్రహ్మాండంగా వుంటాయి. నోట్లోపెట్టుకుంటే నమిలే పనిలేకుండ కరిగిపోతాయి. పండ్లులేకపోయినా బాధేలేదు. రాగిసంకటి తినితిని ప్రాణం రోసిపోయింది. కాలువనీళ్లొస్తే రోజూ వరన్నమే!"

"ఎకరాకు ఎన్నిమూటలు వడ్లొస్తాయి? నాటే రకాన్నిబట్టి, కష్టాన్ని బట్టి వుంటుందిలే. ఇంటి వాడకానికి కనీసం పది మూటలు అవసరం. పది సరిపోవేమో! పన్నెండు వేసుకుందాం. రైతు ఇంటికి నలుగురు వచ్చీపోయే వాళ్లుంటారు. అయినా కొనిన బియ్యమైతే చూసుకొని వాడుకుంటం. పండిన బియ్యమేకదా, ఒక సేరు అటో ఇటో!"

"కాలువొస్తే శనొదిలిపోతుంది. ఇప్పటిమాదిరి అమాసకి, పున్నానికి నాలుగు ముక్కలు మాంసం వండుకొని, గోకిగోకి తినే దరిద్రముండదు. వారానికి రెండు కోళ్లు కోసుకొని తినొచ్చు. మెత్తటి ముక్కల్ని నూనెలో వేయించుకొని తింటూ వుంటే నాసామిరంగా, ఇంద్రభోగమంటే అదేకదా!"

ఇలావుండేది ఆయన ధోరణి.

ఆయన మంచం మీద కొనప్రాణంతో వున్నప్పుడు, నన్ను దగ్గరికి పిలిచి "నీళ్లు" అన్నాడు తులసి తీర్థాన్ని నోటి దగ్గరికి తీసుకెళ్లాను. నా చెయ్యిని తోసేసి "కాలువ నీళ్లు వచ్చాయా?" అని గొణిగాడు.

రాలేదన్నాను. ఆ మాటతో ఆయన ప్రాణం పోయింది.

రాజకీయనాయకులకు కాలువ ఒక ఆయుధం. దాని గురించి చెప్పిచెప్పి మమ్మల్ని వూరించేవాళ్లు. ట్రాక్టర్లలో, లారీల్లో మమ్మల్ని తోలుకొని వెళ్లి ధర్నాలు, వూరేగింపులు చేయించారు. మమ్మల్ని వీధుల్లోకి లాగి కేకలు వేయించిన వాళ్లందరికీ అధికారం వచ్చింది. ఇప్పుడు వాళ్లు మంత్రిపదవులకోసం కొట్టుకుంటున్నారు.

కాలువకోసం ఎదురుచూసి చూసి రైతులు కార్చిన కన్నీళ్లన్నీ ఒకచోట కలిపివుంటే అటువంటి కాలువలు రెండైవుండేవి.

కాలువంటే ఒక ఎండమావి – అంతే!

వానదేవుడు కన్ను తెరిస్తే ధరలు మోసం చేసేవి. విత్తనం వేసేటప్పుడు వేరు శెనగకి మంచి రేటుండేది. విత్తనాలు విత్తి, రూపాయలు ఏరుకోవచ్చని ఆశపడేవాళ్లం.

పంటచేతికొచ్చేసరికి ధర పాతాళంలో వుండేది. కల్లంనుంచి చెనిక్కాయ మూటలతో ఇంటికొచ్చేసరికి, పెళ్ళాం బిడ్డలకంటే ముందు అప్పులోళ్లు ఎదురొచ్చేవారు. ఇంట్లో కూటినీళ్లు మెతుకులు తాగినా అప్పులోళ్లదగ్గిర మాత్రం మానం కాపాడుకోవాలికదా! పంటను అయినకాడికి అమ్మేవాళ్లం. రైతుల దగ్గర పంటంతా అయిపోయేసరికి ధర ధగధగమని మెరిసేది.

కష్టపడిన ప్రాణాలు ఉసూరుమనేవి. వ్యాపారస్తుల ఇంట్లో బంగారుపొగ లేచేది.

ప్రతి ఏడూ ఇదే పరిస్థితి. ఒకసారి పంట బిడ్డలానా ఎదిగొచ్చింది. అందరమూ గుండెలనిండా గాలి పీల్చుకున్నాం. రెండేళ్లు పంటలు లేకున్నా బతకొచ్చనుకున్నాం.

సంతోషపడినంతసేపు నిలవలేదది. పంటకు తెగులొచ్చింది. అప్పులు చేసి మందులు కొట్టాం. పంటపోయి అప్పు మిగిలింది. తరువాత తెలిసింది. మేము కొట్టినవి కల్తీమందులవి!

రైతు పరిస్థితి మూగెద్దుకంటే అన్యాయం. ఎద్దుకి కోపమొస్తే కొమ్ముతోనైనా పొడుస్తుంది.

మనకు జత ఎద్దులుండేవని నీకు తెలుసు. ఈ భూమండలాన్నంతా దున్నేశక్తి వుండేది వాటికి. ఒక సంఘటన గుర్తుందా? అప్పుడు నీకు తొమ్మిది పదేళ్ళ వయసు. ఒకరోజు నా ఎదురుగా ఎద్దుల్ని చెలకోలతో కొట్టావు, నా ప్రాణం గిలగిలలాడింది. 'మూగజీవాలను కొట్టకూడదు నాయనా!' అని మంచిగా చెప్పాను. నువ్వు వినలేదు. మరో దెబ్బవేశావు. నీ చేతిలోని చెలకోలాను లాక్కొని నీ- వీపుమీద ఒక్కటి పీకాను. వాత తేలింది. మీ అమ్మ పరిగెత్తుకుంటూ వచ్చింది.

నిన్ను వాటేసుకొని "నువ్వు మనిషివా, పసరానివా?" అని నన్ను తిట్టింది. నేను తలవంచుకొని వెళ్లిపోయాను.

ఎద్దులంటే నాకు ప్రాణం!

పొరుగూళ్లకు పోయినపుడు, పెళ్లాం బిడ్డలకంటే ఎక్కువగా ఎద్దులే గుర్తొచ్చేవి. వేళకు మేతవేశారో లేదో? కుడితి తాగించారో లేదో? ఇవే ఆలోచనలు. బస్సుదిగిన తరువాత ఇంట్లోకంటే ముందు ఎద్దులకొట్టంలోకే వెళ్లేవాన్ని.

రెండేళ్లకిందట వూర్లో కరువొచ్చింది. మేతనేది కనిపించకుండాపోయింది. వూర్లో ఎద్దులన్నీ ఎముకలపోగులయ్యాయి. చాలా మంది తమ పశువులను కసాయోళ్లకే అమ్ముకున్నారు. నేను అమ్మలేదు. నా ఎద్దుల్ని బతికించుకునేదానికి భూమ్మీద ఇంత మేతను దేవుడు మిగల్చకపోతాడా అని వాటిని తోలుకొని కొండలన్నీ తిరిగాను. ఇంత గడ్డి కనపడితే బంగారంలాగా కోసుకొచ్చాను.

ఆ సమయంలో నీ దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. ఇంటర్మీడియట్ పరీక్ష ఫీజులకీ, పుస్తకాలకీ డబ్బులు కావాలని రాశావు. విషం తాగాలన్నా నా చేతిలో పైసా లేదు. అప్పు పుట్టదు. గుండెను రాయి చేసుకొని ఎద్దుల్ని తీసుకొని బయలుదేరాను. కసాయి సాయిబు చేతిలో ఎద్దుల పగ్గాల్ని పెట్టాను. ధర అడగలేదు. బేరం చేయలేదు. మాట్లాడేశక్తి లేదు. మాట్లాడితే వెక్కివెక్కి ఏడుస్తానని భయం.

నిన్ను జమిందారుల బిడ్డలాగా పెంచలేకపోవచ్చు. కాని రైతుబిడ్డ మాదిరి పెంచడానికి నేనూ, మీ అమ్మా కూలివాళ్లమయ్యాం. ఎర్రటి ఎండలో మట్టితట్టలు మోశాం.

నువ్వు సెలవలకి ఇంటికొచ్చినపుడు టవున్లోవుండి చదువుకోకుండా ఇంటికెందుకు వస్తావని అరిచేవాణ్ణి. నువ్వు వెళ్లేవరకూ తరుముకునేవాన్ని. ఇంటి పరిస్థితులు నీకు తెలియడం నాకిష్టంలేదు.

నీ కోసం మేము చాలా కష్టాలు పడ్డామని చెప్పడం నా ఉద్దేశం కాదు. పిల్లలకోసం కష్టపడటంలో తల్లితండ్రులకి ఆనందముంది.

మన పొరుగూళ్లో హైస్కూల్ వుండటంతో నేను కూడా పదవతరగతి వరకూ చదువుకున్నాను. ప్రయత్నం చేసివుంటే ఆరోజుల్లో నాకు ఏదో ఒక ఉద్యోగం వచ్చుండేది. కాని నాకు ఇష్టంలేదు. నేను భూమిని నమ్ముకొని బతికేవాణ్ణి. సేద్యం నా కల.

పెద్దలు ఒకమాట అనేవారు – "చిన్నడబ్బులుంటే చిల్లరఅంగడి పెట్టుకో. ఎక్కువ డబ్బులుంటే మండీవ్యాపారం చేసుకో. ఇంకా ఎక్కువ డబ్బులుంటే ఆడపిల్లని కను" అని చెప్పేవారు.

కాని నా దగ్గర డబ్బులు లేకపోయినా ఆడపిల్లని కన్నాను. మీ అక్క పెళ్లి చేయాల్సివచ్చింది. ఆమె కోసం ఐదు ఎకరాల భూమిని అమ్మాను. నా ప్రియమైన బిడ్డని, భూమిని ఒకేసారి పరాయివాళ్ల చేతిలో పెట్టాను.

నిజానికి నాకంటే ఎక్కువకష్టం చేసిన వ్యక్తి మీ అమ్మ. కోడికంటే ముందే లేచేది. గొడ్డుకంటే అన్యాయంగా కష్టంచేసేది. ఆమె ఎంత ఒద్దికగా సంసారాన్ని సాకిందంటే, దారిలో నడిచేటప్పుడు కంపపుల్ల కాలికి గుచ్చుకుంటే, ఆ పుల్లను పీకిపారెయకుండా ఇంటికి తీసుకొచ్చేది. కాలిబాధ లెక్కచేయకుండా, పొయ్యిలోకి ఒక పుల్ల వచ్చిచేరిందని తృప్తిపడేది.

ఆమెకిప్పుడు ఆరోగ్యం బాగాలేదు. అయినా ఆరోగ్యంగా వున్నట్టు నటిస్తూవుంది. ఆమెకి ఏ జబ్బూ లేదని నేను కూడా చెపుతున్నాను. డాక్టర్ల దగ్గరకి వెళ్లి పరీక్షలు చేయించాలంటే భయం. వేలరూపాయలు ఖర్చవుతాయని అంటారేమోనని భయం. రోగం గురించి తెలుసుకొని నయం చేయించుకోలేకపోవడంకంటే తెలుసుకోకుండా వుండటమే అదృష్టం.

నువ్వు బాగా చదువుకొని గొప్పవాడివి కావాలని నాకేవేవో ఆశలుండేవి. కాని ఇప్పుడిప్పుడే ఈ చదువులమీద నాకు భ్రమలు తొలగిపోతున్నాయి.

డబ్బుంటే మరింత చదువు. చదువుంటే మరింత డబ్బు. ఇదొక సూత్రం.

ఎదుటిమనిషి దుఃఖాన్ని అర్థం చేసుకునే శక్తి ఈ చదువులకుందా?

మన రంగయ్య మామ తెలుసు కదా, బండితోలుకొని బతుకుతాడు. పాపం, వాడికి ఒకటే ఆయాసం. బండిలాగే ఎద్దుల కంటే వాడే ఎక్కువ గసపోస్తున్నాడు. వాడిని టవున్లో గవర్నమెంట్ ఆస్పత్రికి పిలుచుకొనిపోయాను. డాక్టరు ఏవేవోరోగాల పేర్లు చెప్పాడు. మా కర్థంకాలేదు. తరువాత రెండు వందలు లంచమడిగాడు. ఇది మాత్రం అర్థమయ్యింది.

రంగయ్యమామ డాక్టర్ని ఎగాదిగా చూసి, నన్ను బయటికి తీసుకొచ్చి "రెండు వందలకి ఎన్ని కోళ్లొస్తాయిరా?" అని అడిగాడు.

కోడికి, డాక్టర్కి ఏమి సంబంధమో నాకు అర్థంకాలేదు. అయినా నాలుగైదు కోళ్లు వస్తాయని చెప్పాను.

"ఆరునెలలనుంచి కోడిమాంసం తినాలని ప్రాణం తనకలాడుతావున్నా, డబ్బుల్లేక నోరు కుట్టుకొని బతకతా వుండాను. రెండు వందలు డాక్టర్కు ఇచ్చేదానికంటే, ఇంటికి పోయి కోడి కోసుకొని తినేది మేలుకదా! పోతే రోగం పోతుంది. లేదంటే

ప్రాణం పోతుంది. అయినా కోడి మాంసం తినిన తరువాత ప్రాణం పోతేనేం?" అన్నాడు.

సరే, ఆ సంగతి వదిలెయ్యి. బలహీనుల్ని పేదవారిని దోచుకోవడమే చదువుల యొక్క అంతిమలక్ష్యంగా మారినపుడు ఈ చదువులకు కొంచెంకూడా అర్థంలేదు.

నాకు ఆయుష్షు పెంచమని దేవుణ్ణి ఎప్పుడూ మొక్కుకుంటూవుంటాను. నాకేమైనా జరిగితే అప్పులు నీ నెత్తిన పడతాయి. ఆ భారాన్ని నువ్వు మోయలేవు. అప్పులు తీర్చడానికైనా నేను బతికుండాలి. నీ మనసు బాధపెడితే నన్ను క్షమించు కన్నా!

● *ఆహ్వానం మాసపత్రిక – ఏప్రిల్, 1994* ●

★ ★ ★

అక్కినేని కుటుంబరావు

81

# పనివాడితనం

నమ్ముకున్న కులవృత్తిలో పనితనం నేడు కూడు పెడుతుందా అన్నది ప్రశ్నార్థకమే. కానీ, ఆ కళాకారునికి సన్మానం, కళాసేవ పేరుతో డబ్బూ పేరూ సంపాదిస్తూ అసలు పనితనం చూపిస్తున్న కుహనా కళాపోషకులే ఎక్కువయ్యారిప్పుడు.

"ఇంతకీ ప్రసాదు అదృష్టం బాగుందిలే. లేకపోతే నీకీ బుద్ధి పుట్టేదినాదు" అంది పార్వతి అన్నకేసి తిరిగి.

"వాడదృష్టం, నా అదృష్టం, ఎత్తుభారపు అదృష్టాలు." వెంకటాచారి కంఠంలో ఎక్కడలేని విషాదమూ వినిపించింది.

"నీ అదృష్టం సంగతేమోగానీ, వాడికి ఫర్వాలేదులే బావా! వాడ్ని గురించి నువ్వు దిగులు పడక్కర్లేదులే" అన్నాడు తిరుమలాచారి. తల దించుకుకూచున్న ప్రసాదుకేసి చూసి, "ఏమోయ్ అల్లుడూ, నువ్వేం చేద్దామనుకుంటున్నావ్?" అనడిగాడు.

"వాడికేమొచ్చనీ? ఏం తెలుసనీ?"

తండ్రి వెంకటాచారి మాటలకు పౌరుషంగా చూశాడు ప్రసాదు.

"శిల్పాలు చెక్కటం తప్ప ఏ పనైనా చేస్తాను."

"మరింకేం? ఆ పని ఎలానూ లేదు. అది మన తాతలకేం పెట్టిందో, తండ్రులనాటికే అంతంతమాత్రమయింది. నేను చెప్పిన పని శ్రద్ధగా చెయ్యి, మనూళ్ళో సగం కొనెయ్యొచ్చు."

నవ్వుతూ అంటున్న మామవైపు చూస్తూ సంతోషంగా తలూపాడు ప్రసాదు.

"మీ మామయ్య కొనగా మిగిలితే...." సన్నాయి నొక్కు నొక్కింది పార్వతి.

నవ్వుతూనే భార్యవంక గుడ్లురిమిచూసి, బావవైపు తిరుగుతూ "ఇప్పటిలాగే మరో సంవత్సరం తిప్పలు పడు. తర్వాత నీ కొడుకే నిన్ను చూసుకుంటాడు" అన్నాడు.

"వాడు నన్నడక్కపోతే అదే చాలు" అన్నాడు వెంకటాచారి.

వెంకటాచారీ, తిరుమలాచారీ మేనత్తా మేనమామ బిడ్డలు. పైగా కుండ మార్పిడి. వెంకటాచారికన్నా ఐదేళ్ళు చిన్నవాడు తిరుమలాచారి. ఆ చనువూ, చిన్నప్పటి నుంచీ ఒక్కచోట పెరుగుతూ తిరుగుతూ పెంచుకున్న అనుబంధం.

పెళ్ళవగానే కులవృత్తి కూడు పెట్టదని తిరుమలాచారి కృష్ణాతీరం నుంచి మూసీ తీరానికి చేరాడు. ఒక మోస్తరు ఉద్యోగం చేస్తూ అట్టే ఇబ్బందులు పడకుండా బతుకుతున్నాడు. శిల్పాలు చెక్కటంతో సంసారం నడవకపోయినా, రానురానూ శిల్పాల కోసం ఎవరూ అడగకపోయినా వెంకటాచారికి శిల్పాలు చెక్కడం ఓ వ్యసనమైపోయింది. వెంకటాచారి తాతపేరు కూడా వెంకటాచారే. ఆయన ఆంధ్రదేశంలోనే పేరుపొందిన శిల్పాచార్యుడు. ఆయన కాలంలో వాళ్ళిల్లు ఒక గురుకులం. ఎక్కడెక్కడినుంచో యువకులు వచ్చి శిష్యులై, శిల్పాలు చెక్కటం నేర్చుకుని వెళ్ళేవాళ్ళు. తాత వెంకటాచారి పదిమంది శిష్యులనూ, వందమంది పనివాళ్ళనూ వెంటబెట్టుకుని ఆంధ్రదేశమంతటా గుళ్ళు కట్టించాడు. విగ్రహాలు ప్రతిష్ఠాపన చేయించాడు.

ఆయన శిష్యులకు పాఠం చెబుతుంటే, ఉలి పుచ్చుకుని చెక్కి చూపుతుంటే మామూలువాళ్ళకు కూడా శిల్పాలు చెక్కాలనిపించేది. కొడుకు రామాచారిని కూడా ఆయన శిష్యుడిగానే చూశాడు. మిగిలిన శిష్యులెంతో కొడుకూ అంతే. చిన్న వెంకటాచారి పుట్టిన నాలుగేళ్ళకు పెద్ద వెంకటాచారి చచ్చిపోయాడు. మనవడితో వినాయకుడి విగ్రహం చెక్కించాలనే కోరిక తీరకుండానే చచ్చిపోయాడని రామాచారి కుమిలి కుమిలి ఏడ్చాడు. అయితే, తొందరలోనే రామాచారికి పితృవియోగ దుఃఖం మాయమయింది. చిన్న వెంకటాచారిలో తాతను మరిపించే పనివాడి లక్షణాలు కనిపించాయి. తండ్రి తనకు నేర్పిన విద్యంతా కొడుక్కి నూరిపోశాడు రామాచారి. మరి ఇప్పుడు నేర్పమని అడిగే శిష్యులు కూడా లేరు. కొడుకు పనిలో ప్రవేశించి ఉలి పట్టుకుంటే ఎలాంటి శిలయినా వెన్నలా కరిగి, మైనంలా ఒదిగి, మనసులోని మూర్తి కళ్ళ ఎదుట ప్రాణం పోసుకునే తీరు తన్మయంగా చూసేవాడు రామాచారి. ఏకశిలా శిల్పాలు చెక్కడంలో తండ్రిని మించిన తనయుడని అందరూ అంటుంటే ఉబ్బితబ్బిబ్బయ్యేవాడు.

అయితే, రామాచారి జీవితకాలంలోనే శిల్పవిద్య కడుపు నింపుతుందా అన్న సందేహం మొదలయింది. రామాచారి చివరి రోజుల్లో పేదరికాన్ని రుచి చూసి, కొడుకు గురించి దిగులుపడుతూనే చచ్చిపోయాడు. వెంకటాచారికి తాత పోలికలొచ్చాయిగానీ, తాత పుట్టిన కాలంలో పుట్టకపోవటంతో ఆ అదృష్టం మాత్రం రాలేదు. బతుకు దినదిన గండం నూరేళ్ళాయుష్షులా తయారయింది. అయితే, వెంకటాచారి తన ఇంటినిండా సంపద ఉన్నట్లే తిరిగేవాడు.

సంపదలేకేం? దొడ్డీ, పెరడూ, ఇల్లూ ఎక్కడ చూసినా శిల్పాలు, శిల్పాలు..... దేవుళ్ళవేగాదు, దేవతలవేగాదు – చిలుకలు, పావురాళ్ళు పూలు, పళ్ళు, మనుషులు, పశువులు....ఒకటా – సృష్టిలో ఉన్న సమస్తమూ అతని దొడ్లో ఎక్కడ చూస్తే అక్కడ కనపడుతుంటే, ఆ ఇల్లు తాకట్టులో ఉందనీ, తాను విడిపించుకోలేననీ వెంకటాచారికి గుర్తొచ్చేది కాదు. తన చిన్నప్పుడు ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చిందంటే డజన్ల కొద్దీ విగ్రహాలకు ఆర్డర్లు వచ్చేవి. ఇప్పుడు రెండు, మూడు కూడా ఎందుకు రావడంలేదో వెంకటాచారికి అర్థమయ్యేది కాదు. విగ్రహం చెయ్యమని బయానా ఇచ్చినవాళ్ళు కూడా విగ్రహాలను తీసికెళ్ళడానికి ఎందుకు రారో అర్థమయ్యేది కాదు. వీటన్నిటికంటే కొరుకుడుపడని విషయం వెంకటాచారి జీవితంలో ఒకటి జరిగింది.

ఆ ఊరి సర్పంచ్‌గారబ్బాయి అమెరికాలో ఉద్యోగం చేస్తున్నాడు. సెలవులకు వచ్చినప్పుడు తనతోపాటు ఒక అమెరికన్ స్నేహితుడిని తీసుకొచ్చాడు. ఆ స్నేహితుడికి కాలక్షేపం కోసం వెంకటాచారి శిల్పాలు చూడటానికని తీసుకొచ్చాడు. ఆ అమెరికా యువకుడు సరస్వతీ విగ్రహం చూసి ముచ్చటపడి, వెంకటాచారి పేదరికం చూసి దిగులుపడి ఆ విగ్రహం కొంటానన్నాడు. కొన్నాడు. అమెరికా వెళ్ళగానే పదివేల రూపాయలు విలువచేసేన్ని డాలర్లు పంపుతానన్నాడు. వెంకటాచారికి మహా అదృష్టం పట్టిందన్నారు అందరూ. నాలుగు నెలల తర్వాత ప్రభుత్వంవారు వెంకటాచారికి అయిదొందల రూపాయల చెక్కు పంపుతూ, అమెరికా నుంచి వచ్చిన పదివేలకి వృత్తిపన్ను వంటి పన్నులన్నీ వేయగా మిగిలింది పంపుతున్నామని ఉత్తరం రాశారు. వెంకటాచారి దరిద్రం తీరేది కాదని అందరూ తీర్మానించారు. అప్పుడు కూడా వెంకటాచారి కుంగిపోలేదు.

వెంకటాచారిని అంతరాంతరాల్లో నిజంగా బాధించే విషయం ఒకటుంది. తన తండ్రి తనను చూసి సంతోషపడినట్టే, తను తన కొడుకును చూసి సంతోషపడాలనుకుంటే ఆ కోరిక తీరలేదు. తమ దరిద్రానికంతటికీ ఈ శిల్పవిద్యే కారణమన్నట్టుగా ప్రవర్తించేవాడు ప్రసాదు. తండ్రి బలవంతాన పని నేర్చుకున్నాడుగానీ, అతనేనాడూ మనఃస్ఫూర్తిగా శిల్పం చెక్కలేదు. మొక్కుబడిగా, యాంత్రికంగా ఉలి పట్టుకున్న ప్రసాదుని చూస్తే మనసు చివుక్కుమనేది వెంకటాచారికి.

"సరే – కులవృత్తి ఎలాగూ లేదు. ఇక వాడిని దేన్లో పెడతావో, ఏం చేస్తావో నీ ఇష్టం" అన్నాడు వెంకటాచారి బావమరిదితో.

☆ ☆ ☆

మొదటిసారి హైదరాబాద్ వచ్చిన వెంకటాచారినీ, ప్రసాదునీ తీసుకుని పార్వతీ, తిరుమలాచారీ, వాళ్ళమ్మాయి పద్మజా బిర్లా మందిరానికి వచ్చారు. అక్కడ దైవదర్శనం పూర్తయ్యాక పబ్లిక్ గార్డెన్సు, లలిత కళాతోరణం చూపించి, నాంపల్లిలో బస్సు కోసం ఎదురుచూస్తూ నుంచున్నాడు.

"చూపిద్దాం, తొందరేం, నాలుగురోజులుంటాడుగా?"

తిరుమలాచారి దృష్టంతా బస్సుల మీదే ఉంది.

"అన్నట్లు జోగేశ్వరంగారు ఇళ్ళల్లోకెళ్తున్నారుగా. మనం రేపు వాళ్ళింటికి ఒట్టి చేతుల్తో ఎలా వెళ్తాం? ఏమన్నా కొని పట్టుకెళ్ళొద్దూ?" అంటూ హడావిడిపడింది పార్వతి.

"అరగంట నుంచీ ఎదురుచూస్తున్న బస్సు అదుగో వస్తోంది. ఇప్పుడు నీకిది గుర్తొచ్చింది. మనకా బస్సెక్కే యోగం లేదు. పద, మరి ఏమన్నా కొందాం." అందరూ అబిడ్స్ వైపు నడక మొదలెట్టారు.

ఓ చోట ఆగారు. ఎదురుగా "చిత్రశిల్ప" అనే అక్షరాలు నాలుగు భాషల్లో....వెలుగుతూ ఆరుతూ... రంగు రంగుల్లో.

"ఏమిటిది? దీనిలో ఏముంటుంది?" అడిగాడు వెంకటాచారి.

"దీనిలో ఏముంటుంది అనిగాదు అడగాల్సింది. ఏముండదూ అని అడుగు ఏది కావాలంటే అది ఉంటుంది. మన దగ్గర డబ్బుండాలి – అంతే" అంటూ లోనికి దారి తీశాడు తిరుమలాచారి.

అట్టహాసంగా ఉన్న ఓ ద్వారం – దాని దగ్గర రాజాధిరాజులా ఓ దర్వానూ ఉన్నారు. దర్వాను వీళ్ళను చూడగానే వంగి సలాం చేస్తూ తలుపు తెరిచాడు. వెంకటాచారి బెదిరిపోయాడుగానీ, పైకి కనపడకుండా ఎలాగో లోనపడ్డాడు.

లోపలంతా చల్లగా, హాయిగా ఉంది. దేవేంద్రలోకంలోకొచ్చినట్లు....సువాసనలు... మధురమైన వీణానాదం చెవుల్లో అమృతం కురిపిస్తూ.....అడుగు వేస్తే మెత్తగా – లోపలికి దిగుతున్నట్లు ఎర్రని తివాచీలు.

మనుషులున్నారుగానీ, నిర్మానుష్యంగా ఉంది.

మాట్లాడుతున్నారుగానీ, చప్పుడు లేదు.

నడుస్తున్నారుగానీ, కదలిక లేదు. కాదు, కాదు – కదుల్తున్నారుగానీ, నడవటంలేదు.

కనుచూపుమేర ఎటు చూసినా రంగులు – అద్దాలు కాంతులు – విశాలంగా విస్తరించుకుంటున్న ఈ లోకం – ఏమిటిది? ఆ బస్టాండులోంచి దీన్లోకెలా వచ్చాం?

"మామయ్యా, ఇది చూడు." చూశాడు.

ఒక వైపంతా రంగురంగుల కాంతులతో మెరుస్తూ రకరకాల పిల్లల బొమ్మలు. అప్పటివరకూ అరుచుకుంటూ మాట్లాడిన మనుషులేనా వాళ్ళు! పార్వతీ, చారీ కూడా గుసగుసగా ఏదో అనుకుంటూ చిన్నగా ఎవరూ చూడకుండా నవ్వుకుంటూ ముందుకు నడిచారు. పద్మజ వారి వెనకాలే. వెంకటాచారీ, ప్రసాదూ ఆ పిల్లల బొమ్మల దగ్గర్నించీ కదల్లేకపోతున్నారు.

"నాన్నా!" నెమ్మదిగా పిలిచి ముందుకెళ్తున్న తలిదండ్రులను ఆపింది పద్మజ.

మాట్లాడకుండా కళ్ళతోనే ఏమిటని అడిగాడు తిరుమలాచారి.

"ఈ రాధాకృష్ణుల శిల్పం ఎంతో తెలుసా?"

పద్మజ ప్రశ్న వినిపించినా మనసులో దూరలేదు. రాధాకృష్ణుల విగ్రహాన్ని చూస్తూ నిలబడిపోయాడు. పార్వతి కూడా ఆ సౌందర్యానికి తన్మయురాలై ఆనందంగా శిల్పాన్ని చూస్తోంది.

"ఎంత అద్భుతంగా ఉందీ! కళ ఉట్టిపడుతోంది...కృష్ణుడి పెదవిలో ఆ విరుపు – దానిలో ఆ కొంటెదనం..." తిరుమలాచారి చూస్తూనే ఉన్నాడు.

"రాధలో ఆ మోహపారవశ్యం ఎక్కడ, ఎలా తెప్పించారు? అసలా కళ్ళు చూడండి. తన్మయత్వమా, భక్తా? ఎలా మూతలు పడుతున్నాయో ఆ కళ్ళు!" పార్వతి పరవశంగా అంటోంది.

"నిజంగా ఎంతయినా ఇవ్వొచ్చు దీనికి....ఎంత?" అడిగాడు కూతుర్ని.

"ఇరవై నాలుగు వేల రూపాయలు!" గంభీరంగా చెప్పింది పద్మజ.

"నిజం?" పార్వతి గుండెల మీద చేయి వేసుకుంది.

"చూడు. పైగా అమ్ముడు పోయింది." రేటు, సోల్డ్ అవుట్ బోర్డు చూపింది.

"చూడు బావా! ఈ విగ్రహం ఖరీదు పాతిక వేలట." వెనుకగా వస్తున్న వెంకటాచారికీ, ప్రసాదుకీ చూపించాడు.

ఇద్దరూ విశ్చేష్టులై ఆ శిల్పం వంకే చూస్తూ నిలబడ్డారు. ప్రసాదు కళ్ళు శిల్పాన్నంతా వెదుకుతూ ఓచోట ఆగి చిత్రంగా మెరిశాయి. తండ్రివంక చూశాడు. తండ్రి చూపు కూడా సరిగ్గా అక్కడే ఉంది. నెమ్మదిగా ఆ చూపు ప్రసాదు వైపు తిరిగింది. ప్రసాదు ఏదో మాట్లాడబోవటం చూసి 'వద్దు' అన్నట్లు తలూపాడు తండ్రి. ఇద్దరూ మరోసారి ఆ బొమ్మవంక చూశారు. రాధాకృష్ణుల సల్లాపం, ఆ ఇద్దర్నీ చుట్టుకున్న లతలూ, వాటికి పూలు, వాటి మధ్యలో ఎనిమిది చోట్ల లేగదూడలు. ఎనిమిదో దూడ కన్ను.....ఆ లేగదూడ కన్ను లేక విషాదంగా చూస్తున్నట్టుంది. దాన్నే చూస్తున్న ప్రసాదు కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి.. వెంకటాచారి తదేకంగా అటే చూస్తున్నాడు. అతని హృదయం తరుక్కుపోతోంది.

'అసలా సన్మానం వల్ల జరిగిందిదంతా' అనుకున్నాడు ప్రసాదు. తండ్రిని బాధపెట్టి హైదరాబాద్ వచ్చిన క్రమమంతా ప్రసాదుకీ; ప్రసాదు ముఖాన్నీ, శిల్పాన్నీ చూస్తున్న వెంకటాచారికీ ఒక్కసారే గుర్తొచ్చింది.

☆ ☆ ☆

ఎలాంటి సన్మానమది – ఎలాంటి రోజది – ఇంట్లో గంజి కాయడానికి పట్టెడు నూకలన్నా లేవు. విగ్రహం తీసుకెళ్ళటానికి వస్తానన్న మనిషి వస్తేగాని డబ్బు చేతికి రాదు. పొద్దుట్నించి సన్నగా తుప్పర. ఇంట్లో ఉన్న ముగ్గురూ మధ్యాహ్నం దాకా చలికీ ఆకలికీ ముడుచుకు పడుకున్నారు. మూడవుతూ౦దనగా వెంకటాచారి లేచి బయల్దేరాడు. "అయిదింటికల్లా టౌనుహాలు దగ్గరకు రమ్మన్నారు." నెలరోజుల నాడు సుభాష్ చంద్ర బోసు విగ్రహం చేయించుకువెళ్ళి టౌన్‌లో ఆవిష్కరించిన చౌదరిగారు ఇవాళ వెంకటాచారికి సన్మానం ఉంది రమ్మని పిలిచాడు. భార్య లేచి డబ్బాలన్నీ వెతికి కాసిని అటుకులుంటే పెట్టింది, "నడిచి వెళ్ళాల్సిందేగా" అంటూ.

తుప్పర పడుతూనే ఉంది. వెంకటాచారి తలమీద కండువా కప్పుకొని నాలుగు కిలోమీటర్లు నడిచేసరికి దాదాపు తడిసిపోయాడు. టౌన్లో తుప్పర ఆగింది గానీ, చలిగాలి ఈడ్చికొడుతోంది. టౌను హాలు దగ్గర ఎవరూ లేరు. వెంకటాచారి లోపలికి వెళ్ళి కూర్చున్నాడు. గంటన్నర తర్వాత హడావిడి మొదలైంది. దండలొచ్చాయి. మైకొచ్చింది. మనుషులొస్తున్నారు. ఎవరో ఒకతను వెంకటాచారిని చూసి గుర్తుపట్టి చికాగ్గా ముఖం పెట్టాడు. ఇంకో కుర్రాడిని పిలిచి ఏదో చెప్పాడు. ఆ కుర్రాడు వెంకటాచారిని "రండి రండ"ని హడావిడిపెడుతూ బయటకు లాక్కెళ్ళాడు.

'ఏదన్నా టిఫిను పెట్టించి, ఇంత కాఫీ తాగిస్తే బాగుందు' అనుకున్నాడు వెంకటాచారి. అలా అనుకుంటున్నందుకు సిగ్గుపడుతూనే. పెద్ద హోటల్ని దాటి పక్కనున్న హెయిర్ డ్రెసింగ్ షాపులోకి వెళ్తున్నందుకు తెల్లబోయాడు. "పెద్ద పెద్ద వాళ్ళొస్తున్నారు. గడ్డం మాసింది. బాగుండదు. కూచోండి. టైము అయిపోతోంది." ఆ అబ్బాయి తొందరపెట్టాడు.

వెంకటాచారి సిగ్గుపడుతూ – తన మాసినగడ్డంకోసం సిగ్గుపడుతూ కూచున్నాడు. పది నిమిషాల్లో పదిసార్లు టైము చూసుకున్న కుర్రాడు వెంకటాచారిని సభ దగ్గరకు పరిగెత్తించాడు "వేదిక మీదికి పిలవగానే రండం"టూ ముందు వరసలో కూచోబెట్టి వెళ్ళాడు.

"మీరేనా వెంకటాచారిగారు!" వెనుక వరుసలోంచి ఓ కుర్రాడు ముందుకొచ్చి వెంకటాచారి పక్కన కూచున్నాడు.

"మిమ్మల్ని చూద్దామని వచ్చాను. మీరు చెక్కిన విగ్రహం చాలా బాగుంది." వెంకటాచారికి అనుకోకుండా ఎదురైన ప్రశంస కళ్ళమ్మట నీళ్ళు తెప్పించింది. ఆ కుర్రాడి వంక అప్యాయంగా చూశాడు.

"నేను అదృష్టవంతుడిని. సభకు ముందే మిమ్మల్ని చూసి మాట్లాడాను. ఇంక వెళ్తాను." వెంకటాచారి ఆశ్చర్యపోతూ "అదేం బాబూ – సన్మానం చూడవ్వూ?" అనడిగాడు. ఆ కుర్రాడు చిత్రంగా నవ్వాడు.

"సన్మానం! ఆ పేరుతో వాళ్ళు మీకు చేసే అవమానం చూడలేనండీ!"

వెంకటాచారి అయోమయంగా, భయంగా ఆ కుర్రాడికేసి చూశాడు.

"మీకు సన్మానం చేసే వీళ్ళకు మీ గురించి ఏమీ తెలియదు. మీ విద్య గురించి తెలియదు. ఆ ముక్క మీతోనే చెబుతారు. ఇక ఆ తర్వాత వాళ్ళంతా ఒకళ్ళ నొకళ్ళు పొగుడుకుంటారు. అందరూ కలిసి మీకు సన్మానం చేస్తున్న చౌదరిగార్ని పొగుడుతారు. మిమ్మల్ని ఎవరూ పట్టించుకోరు."

"మరి అసలు నన్నెందుకు పిలిచారు?"

"మీరు కావాలి. మీ సన్మానం పేరుతో వాళ్ళ పేర్లు పేపర్లో వస్తాయి. నెలకో సభ ఇలాంటిది జరిపితే కళాప్రియుడనీ, పోషకుడనీ పేరొస్తుంది. పూర్వం రాజులు పాలకులు గాబట్టి కళాపోషణ చేసేవారు. ఇప్పుడు ఇలాంటి సోకాల్డ్, సూడో కళాపోషణతో పాలకులవ్వాలని చూస్తున్నారు డబ్బున్నవాళ్ళు. వచ్చే ఎన్నికల్లో ఈయన పోటీ చేస్తాడు. అదంతా ఓ కళ – ఓ విద్య – ఓ పనివాడితనం. దాని ముందు మీ కళ, మీ పనివాడితనం ఎందుకూ పనికిరాదు." కుర్రాడు విసురుగా లేచి వెళ్ళిపోయాడు.

ఆ కుర్రాడి మాటల్లో వ్యంగ్యం, కోపం, హేళన ఎందుకో, అతనెందుకలా మాట్లాడుతున్నాడో వెంకటాచారికి అర్థం కాలేదు.

సభ అచ్చం ఆ కుర్రాడు చెప్పినట్లే ముగిసింది. వెంకటాచారి దండ వేయించుకొని, శాలువా కప్పించుకుని బిక్కుబిక్కుమంటూ కూచున్నాడు. సభ పూర్తయ్యాక ఇంకొకతను ఎవరో వచ్చి, రండి రండని హడావిడి చేసి, అతని పుణ్యమా అని బస్సెక్కించి, టికెట్టు కొని వెంకటాచారి చేతిలోపెట్టి మరీ వెళ్ళాడు.

అర్ధరాత్రి ఆకలితో పడుకున్న భార్యాపిల్లల దగ్గరికి వట్టి చేతుల్తో వెళ్ళటానికి సిగ్గుపడ్డాడు వెంకటాచారి.

'పాపం, ఏదన్నా తెస్తానని చూస్తుంటారు' అనుకున్నాడు.

భార్య శాంతమ్మ వెంకటాచారిని చూసి లేచి, అతని చేతిలో పూలదండలూ, శాలువా అందుకుని పక్కనపెట్టి, ఓ క్షణం ఆగాక–

"ఇన్ని పూలివ్వకపోతే పళ్ళన్నా ఇవ్వగూడదా?" అంది.

"రేపొద్దున్నే లేచి ఎనిమిదో దూడ కన్ను చెక్కాలి. అదొక్కటే మిగిలింది. అదయిపోతే రేపాయన వచ్చి డబ్బిస్తాడు. పస్తుల బాధ తప్పుతుంది." సంజాయిషీ ఇస్తున్నట్టు గొణిగాడు వెంకటాచారి.

తెల్లారింది. చారి లేవలేక అలాగే పడుకున్నాడు. తండ్రి లేకపోవటంతోపాటు సన్మానం కోసం పడ్డశ్రమ కలిసి నీరసం వచ్చింది. ప్రసాదు తండ్రి పరిస్థితి చూసి తనే ఉలి అందుకుని నెమ్మదిగా ఎనిమిదో దూడ కన్ను చెక్కటం మొదలెట్టాడు.

ఉలి చప్పుడుకు లేచిన చారి గబగబా వచ్చి, "ప్రసాదూ!" అని అరిచాడు. ప్రసాదు చేతిలో ఉలి తగలరాని చోట తగిలి ఎనిమిదో దూడ కన్నుండవల్సిన చోట చిన్న ముక్క లేచి అవతల పడింది. చారి నిస్సత్తువగా కూలబడిపోయాడు.

"నాశనం అయిపోయింది. సర్వనాశనం అయిపోయింది" అంటున్నాడు.

"ఏమయింది? అంత చక్కని విగ్రహంలో అదెవరికీ కనపడదు. మనం తప్ప మరెవరూ అది గమనించలేరు. ఎవరికీ తెలియదు, కనపడదు."

"కనపడనివారి గురించి కాదురా–కనపడాలంటే కన్నుండాలి. ఆ కన్నున్నవారు ఎవరన్నా ఎవడిది చెక్కిందీ అని అంటే, ఆ మాట పడి బతకటం అనవసరం. దాన్ని ఓ మూల పారెయ్. నేను మళ్ళీ రాయి కోసం వెళ్తాను. విగ్రహం కోసం ఆయన వస్తే మూడ్నెల్ల తర్వాత రమ్మను. ఇది మాత్రం ఇవ్వొద్దు" అంటూ లేచి–

"బజారుదాకా వెళ్ళొస్తా. ఎక్కడన్నా అప్పు పుట్టించాలి. ఎన్నాళ్ళుంటాం పస్తులు?" గొణుక్కుంటూ వెళ్తున్న తండ్రిని చూస్తూ ఆలోచనలో పడ్డాడు ప్రసాదు.

ఈ శిల్పానికి వాడే రాయి ప్రత్యేకమయింది. నెమలి కన్ను రంగు రాయి ఎక్కడంటే అక్కడ దొరకదు. ఆ రాయి తెచ్చి మళ్ళీ మూడ్నెల్లు కష్టపడితే వచ్చేది ఖర్చులు పోను వెయ్యి రూపాయలు. మూడు నెలల కష్టానికి వెయ్యి! ఉలితో కాకుండా సుత్తితో రాళ్ళు పగలగొడితే నెలకి వెయ్యి దొరుకుతాయి. ఎవరికీ కనపడని చిన్ని లోపానికి ఇంత కష్టం బూడిదపాలు చేస్తున్నాడు తండ్రి. ప్రసాదు ఆలోచనలో ఉండగానే విగ్రహం కోసం మనిషొచ్చాడు. ప్రసాదు చేతిలో అయిదొందలు పెట్టి విగ్రహం తరలించుకుపోయాడు.

కాసేపటికి వెంకటాచారి దిగులు ముఖంతో ఇల్లు చేరాడు. ఎక్కడా రూపాయి అప్పుపుట్టలా. విగ్రహం లేదు. కొడుకు చేతిలో డబ్బు. వెర్రి కోపం వచ్చింది చారికి. ఎదిగిన కొడుకని కూడా చూడకుండా ఎడా పెడా కొట్టాడు. చేతులు నొప్పెట్టి, ఆయాసమొచ్చి ఆగాడు.

"అమ్మా! ఈ అయ్య పెట్టడు, ఎవడన్నా ఇంత పెడతానన్నా తిననివ్వడు. నేనీ విగ్రహాల పనిమాత్రం చెయ్యను. నన్ను మామయ్య దగ్గరకు పంపు. ఏదో ఓ పని చేసి, నేనింత తిని, మీకింత పెడతాను." వెక్కి వెక్కి ఏడ్చాడు ప్రసాదు.

రెండో రోజు రాత్రి తండ్రీకొడుకులిద్దరూ హైదరాబాద్ బస్సెక్కారు.

☆ ☆ ☆

వెంకటాచారి ఆ జ్ఞాపకాల బరువుతో కుంగినట్టు వంగి నిలబడ్డాడు.

ప్రసాదు బుర్రంతా ఉలితో కొడ్తున్నట్టుగా ఉంది.

తిరుమలాచారి భార్యతో అంటున్నాడు: "పనివాడితనమంటే అదీ!"

"నిజం! ఎంత చక్కటి శిల్పం! ఎంత గొప్ప శిల్పి చెక్కాడో!" పార్వతి ఆనందంగా అన్నది.

"ఓసి పిచ్చిమొహమా! ఆ శిల్పిని గురించి కాదే! శిల్పుల్దేముంది? ఓ రాయి వాళ్ళముందు పడేసి, ఉలి చేతికిస్తే చాలు – రొట్టెముక్క ఇవ్వకుండా మాడ్చినా ఆ శిల్పం చెయ్యకుండా ఉండలేరు. ఆ శిల్పికి ఎంతిస్తారనుకుంటున్నావు? ఏ నాలుగైదు వేలో ఇస్తారు. వీళ్ళెంతకమ్ముతున్నారో చూడు."

"నాలుగైదు కాదు – వాళ్ళిచ్చింది రెండు వేలే. అది చేసింది నాన్నే–" నోటిమీది కొచ్చిన మాటలు నోట్లోనే ఉండిపోయాయి ప్రసాదుకి.

'పనికిరాదనుకున్న శిల్పం ఖరీదు పాతికవేలు, ఏడాదికొక్క శిల్పం అమ్ముడయితే చాలు – తిండికి వెతుక్కునే పని లేదు. కానీ, తనకొచ్చేది రెండు వేలు. రెండు నెలలు అతి కష్టం మీద దొర్లించటానికి సరిపోయేంత. అంతే పనివాళ్ళ తలరాత!'

వెంకటాచారి మనసంతా దిగులుతో నిండిపోయింది. తిరుమలాచారి అంటున్నాడు–

"నువ్వు బంగారం సృష్టించు. అమ్మకోటం తెలియకపోతే అది మట్టితో సమానం. సృష్టించేవాడికి అమ్మకోటం రాదు. అందుకే సృజన ఎంత గొప్పదో అంత పేదది. నేను చెప్పే పనివాడితనం ఇలా అమ్మగలిగినవాళ్ళది. ఈ కాలంలో పనివాడితనమంటే అదే. అదే అసలైన పనివాడితనం."

సన్మాన సభలో కుర్రాడి మాటలు గుర్తొచ్చాయి వెంకటాచారికి.

"నువ్వు మాట్లాడేది నిజమేనేమో! కానీ, సృష్టించే చేతులే లేకపోతే ఏం అమ్ముకుని పనివాడితనం చూపిస్తార్రా వీళ్ళంతా?" వెంకటాచారి కంఠంలో ఆవేదనతోపాటు ఉక్రోషంకూడా ఉందేమో!

"సంపాదన లేదని నువ్వు శిల్పాన్ని సృష్టించడం మానుకున్నావా? గిట్టుబాటు ధర లేదని ఏ రైతన్నా సాగుచేయడం, పండించడం మానుకున్నాడా ఎప్పుడయినా? కొడుకులు చూడటం లేదని ఏడవటమేగాని, కొడుకుల్ని కనడం మానుకుందా ఏ తల్లయినా? సృజన కోసం పుట్టినవాళ్ళు సృష్టిస్తూ ఉంటే, సంపాదన కోసం పుట్టినవాళ్ళు సంపాదిస్తుంటారు. అందుకే ప్రసాదు చేతులకి అమ్మకోవటం నేర్పుదామనుకుంటున్నాను. ఈ కాలానికి పనికొచ్చే పని అదొక్కటే." ఆవేశంగా అన్నాడు తిరుమలాచారి.

ఆ మాటల్ని అంగీకరించలేకా, ఏం సమాధానం చెప్పాలో తెలియకా తన చేతుల వంక చూసుకున్నాడు వెంకటాచారి.

'ఈ చేతులు సృష్టించటానికే పుట్టాయి – అమ్ముకోటానికి కాదు' – మరోసారి మనసులోనే స్థిరంగా అనుకుని నిట్టూర్చాడు.

● ఇండియా టుడే – జనవరి *21–5, 1995* ●

* * *

జి. రేణుకాదేవి

82

# విదూరపు మనిషి

"నువ్వు విదూరపు మనిషివి. నువ్వెప్పుడు విదూరంగా ఆలోచిస్తావు" అంటుంటాడు నన్ను మా ఆయనెప్పుడూ. ఆయనే కాదు, మా అత్తగారూ అప్పుడప్పుడు అంటుంటారు. చిన్నప్పుడు మా తల్లిదండ్రులూ అనేవారు. బహుశా మా పిల్లలు కూడా మనసులో అనుకుంటారేమో! అందరికీ ఎందుకన్పిస్తుందో నాకర్థం కాదు. అవునూ మీక్కూడా నేను విదూరపు మనిషిలాగే అన్పిస్తున్నానా? ఓహ్! క్షమించండి. నాగురించి మీకేమీ తెలియదు కదూ? సరే అయితే నాగురించి చెప్తాను వినండి. నేను చెప్పేది విన్నాక మీరూ ఆలోచించండి.

నిజానికి నల్గురికీ చెప్పేంత గొప్పదేమీ కాదు నా జీవితం. నేను అందరిలాగే పుట్టాను అందరిలాగే పెరిగాను. అందరిలాగే బ్రతుకుతున్నాను. మరి నన్ను అందరూ విదూరంగా ఎందుకు చూస్తారో నాకర్థం కాదు. అందుకే నా జీవితం గురించి కాస్తయినా మీకు చెప్పాలనుకుంటున్నాను.

నా చిన్నతనంలో నేను బాగా చదువుకొని ఉద్యోగం చేయాలని కోరుకుంటూ ఉండేదాన్ని. నేనలా కోరుకోవడానికి ఓ కారణం ఉంది. నేను మా అమ్మ, అమ్మమ్మ, ఇంకా ఇరుగు పొరుగు ఆడవాళ్ళను చూస్తూ ఉండేదాన్ని. వాళ్ళ జీవితాలన్నీ ఒకే మూసలో పోసినట్లుగా అన్పించేది నాకు. ఎప్పుడూ వండటం, వార్చడం, తోమడం, ఉతకడం, భర్తకు పిల్లలకూ సేవలు చేయడం, భర్త కొట్టినా తిట్టినా బాధ పడటం. తరుచుగా పిల్లలను కేకలేయడం, కొట్టడం – ఎప్పుడూ ఇవే పనులు యంత్రాల్లా చేస్తూనే ఉండేవారు. నాకు మొదట్లో ఈ పనులన్నీ మామూలుగానే అన్పించేది. కానీ ఓ రోజు మా వూరికి కొత్తగా ఓ టీచరమ్మ వచ్చారు. ఆమె మా ప్రక్కింటిలోనే ఉండేవారు. ఆమె భర్త వేరే ఊళ్లో ఉద్యోగం చేసేవారు. పిల్లలుకూడా పట్నంలో హాస్టల్‌లో ఉండి చదువుకునేవారు. అందుచేత టీచర్ వంటరిగా ఉండేవారు. ఆమె ఎప్పుడు చూసినా ఏదో చదువుకుంటూ వ్రాసుకుంటూ కనబడేవారు. ఎవ్వరితోనైనా నవ్వుతూ చక్కగా మాట్లాడేవారు. ఆడ, మగ ఎవరైనా టీచర్‌తో చాలా గౌరవంగా ప్రవర్తించేవారు. మా వూరి ప్రెసిడెంటుతో కూడా టీచర్ మామూలుగా నవ్వుతూ మాట్లాడేవారు. మా అమ్మ, ఇంకా ఇరుగుపొరుగమ్మలెవరైనా పరాయిమగవాళ్ళని చూస్తే భుజాల చుట్టూ కొంగు కప్పుకుంటూ పక్కకు తప్పుకునేవారు. కానీ టీచర్ ప్రెసిడెంటుతోనైనా ఎదురుగా నిలబడి

మామూలుగా నవ్వుతూ మాట్లాడటం చూస్తే నాకు ముచ్చటేసేది. నాకు క్రమంగా చూస్తే నాకు ముచ్చటేసేది. నాకు క్రమంగా మా అమ్మలాంటివాళ్ళ జీవితాలు పట్ల విసుగూ టీచర్ జీవితం పట్ల ఆకర్షణా కలిగాయి. టీచర్‌కు ఆ గౌరవం ఆమె చదువు ఉద్యోగం వల్లేనని అనుకునేదాన్ని. అందుకే నేను బాగా చదువుకోవాలని ఉద్యోగం చేయాలని కోరుకున్నాను. అయితే నా కోరికను ఓ విడ్డూరపు కోరికలా భావించి మా నాన్న నాకు హైస్కూల్ చదువు కూడా పూర్తికాకుండానే పెళ్ళి చేసాడు. పెళ్లై ఈ పట్టణానికి వచ్చాక రోజూ కాలేజీలకు, ఉద్యోగాలకు వెళ్లే ఆడవాళ్ళను చూసి ఎంతో ముచ్చటపడిపోయేదాన్ని. నేనలా చదువుకోలేక పోయినందుకు బాధపడుతూ ఉండేదాన్ని.

నాకిప్పుడు ముగ్గురు పిల్లలు – ఒకమ్మాయి, యిద్దరబ్బాయిలు. నేను మొదటి సారి గర్భవతి నైనప్పుడు ఆడపిల్ల పుడితే బావుండుననే నా కోరిక విని మా ఆయన "ఇదేం విడ్డూరపు కోరిక, మొదటిసారి మగపిల్లాడు పుట్టాలని కోరుకోక?" అన్నాడు. నేను ఆడదాన్నై ఉండీ మరో ఆడపిల్లకు జన్మ నివ్వాలనుకోవడంలో విడ్డూరం ఏముందో నాకిప్పటికీ అర్థం కాదు. ఆడపిల్ల పుట్టాలనీ, నా తీరని కోరికలను నా కూతురు ద్వారానైనా తీర్చుకోవాలని నా ఉద్దేశం. కానీ రెండో కాన్పుకి కానీ నా కోరిక తీరలేదు. పాప పుట్టిందని తెలియగానే నేనెంత సంతోషపడిపోయానో. నిజానికి నాకప్పుడే సంపూర్ణ మాతృత్వం పొందినట్లనిపించింది. నా కోరికలను తీర్చడానికే విజయ పుట్టిందనుకున్నాను. పెరిగి పెద్దదవుతోన్న విజయను చూసి నేనెంత మురిసిపోయేదాన్నో. కాలేజీకీ, ఉద్యోగానికి వెళ్లే ఏ ఆడపిల్లను చూసినా "నా విజ్జీ కూడా ఇలా చదువుకుంటుంది, ఇలా ఉద్యోగం చేస్తుంది" అనుకునేదాన్ని. నా ఆశలకు తగ్గట్టే విజ్జీ చదువులో చురుగ్గా ఉండేది. మా అబ్బాయిలు కూడా చదువులో చురుకైనవారే. రోజురోజుకూ పెరిగి పెద్దవుతోన్న పిల్లల్ని చూసి నేను సహజంగానే సంతోషించేదాన్ని. కానీ దాని పెరుగుదలను చూసి మా ఆయన, అత్తగారు దిగులుపడేవారు. "ఈ వయసుకే ఇది ఇంతలా పెరుగుతుందేమిటే!" అంటూండేవారు మా అత్తగారు. ప్రకృతి సహజమైన పెరుగుదలను చూసి ఎందుకు బాధపడతారో నాకర్థమయ్యేది కాదు.

నేను నా ముగ్గురు పిల్లల్ని అన్ని విషయాల్లోనూ సమానంగా చూసేదాన్ని. నేనెప్పుడూ వాళ్ళ ఇష్టాయిష్టాలకు అనుగుణంగా నడుచుకునేదాన్ని. విజయ పదమూడేళ్ళ వయసులో ఉండగా ఓ సంఘటన జరిగింది.

ఆరోజు రాత్రి మా అత్తగారు, ఆయన, పిల్లలు కూర్చొని భోజనం చేస్తున్నారు. పాప రెండు ముద్దలు తిని "నాకీకూర సహించట్లేదమ్మా!" అంది. "అయితే ఓ నిమిషం ఆగమ్మా!" అంటూ నేను స్టవ్ వెలిగించి గబగబా ఓ ఆమ్లెట్ వేసి దాని కంచంలో వేశాను. ఆమ్లెట్టంటే విజ్జీకి చాలా యిష్టం. నేను ఆమ్లెట్ వేస్తుంటే మా ఆయన, అత్తగారు నావైపు విడ్డూరంగా చూడటం నా దృష్టిని దాటిపోలేదు. రోజూలాగానే పిల్లలు త్వరగా భోజనం ముగించి లేచి వెళ్ళిపోయారు. ఇక మా ఆయన మొదలెట్టాడు:

"పిల్లలు ఏదుంటే అది సర్దుకుపోయి తినేలా చూడాలిగానీ వాళ్ళు కోరిందల్లా చేసిపెడితే ఎలా?" అన్నాడు. ఆయన దృష్టిలో 'పిల్లలు' అంటే 'ఆడపిల్లట' అని అర్థం కాబోలు! ఎందుకంటే, నేను మా అబ్బాయిల విషయంలో కూడా అలాగే చేస్తాను. కానీ వాళ్ళ విషయంలో ఏమీ అనని మా ఆయన అమ్మాయి విషయంలోనే అభ్యంతరం చెప్తున్నాడు.

"అది పొట్లకాయ కూర సరిగా తినదండీ! ఆమ్లెట్ ఉంటే దానితోపాటు కూరకూడా తినేస్తుంది." చెప్పాన్నేను.

"ఇప్పుడయితే నువ్వు కోరిందల్లా చేసి పెట్టావు, బాగానే వుంది. కానీ రేపు అది అత్తారింటికి వెళ్ళాకా కోరినవన్నీ ఎవరు చేసి పెడతారూ? ఇక్కడ కమ్మగా తినడం అలవాటయ్యాక అక్కడ బాధ పడొద్దూ!" అని మా అత్తగారు అందుకున్నారు.

"అయితే ఎప్పుడో వెళ్లే అత్తగారింటి కనువుగా నా కూతుర్ని ఇప్పట్నించీ సన్నద్ధం చేయాలా? ఎప్పుడో భవిష్యత్తులో అత్తారింట్లో దొరకదని దాన్నిప్పట్నుంచే పస్తు పెట్టాలా?" చురుగ్గానే అన్నాన్నేను.

నా మాటలు మా ఆయనకు కోపాన్ని తెప్పించాయ్. "నీ కసలు ఆడపిల్లల్ని పెంచే విధానం తెలియదు" అన్నాడు.

"నాకు నిజంగానే తెలియదు – ఆడపిల్లల్నొకలాగా, మగపిల్లల్నొకలాగా పెంచాలనీ!" కాస్త విసురుగానే అన్నాను నేను.

మా ఆయనకు కోపం వచ్చి అన్నం మధ్యలోనే చేయికడుక్కొని లేచి "చూడూ! అది నీకు మాత్రమే కూతురు కాదు. దాని మీద నాకు ప్రేమలేదనుకోకు. ముందు ముందు సమస్యలు రాకుండా ఇప్పటినుండి జాగ్రత్తపడటం మంచిది" అంటూ విసురుగా వెళ్ళిపోయాడు.

అతను భోజనం మధ్యలోనే చేయి కడుక్కుంటుంటే నేనేమీ వాదించలేదు. ఆయన అన్నం పూర్తిగా తిననందుకు నేనేమీ బాధపడలేదు. నేను చిన్న చిన్న కోరికలను తీర్చుకోవడం కోసం ఎన్ని పూటలు తిండి మానేయలేదనీ!

ఏమాట కామాటే చెప్పుకోవాలి. మా ఆయనక్కూడా విజ్జీ అంటే ప్రేమే. ఆయన ఏ వూరికెళ్ళినా అబ్బాయిలకేం తెచ్చినా తేకపోయినా అమ్మాయికి మాత్రం గాజులో రిబ్బన్లో ఏవో ఒకటి తెచ్చేవారు. అలాంటి దాయనకు ప్రేమలేదని ఎలా అనుకుంటాను కానీ, ఆయన ప్రేమ హద్దులు పెడుతుంది. పిల్లలకు హద్దులు అవసరంలేదని నేననుకోనుగానీ, మగపిల్లలకు అవసరం లేని హద్దులు ఆడపిల్లలక్కూడా అనవసరమని నా ఉద్దేశం. ముందు ముందు సమస్యలు రాకుండా జాగ్రత్త పడటం కన్నా, మగపిల్లలనయినా, ఆడపిల్లలనయినా ఏ సమస్యలు వచ్చినా ఎదుర్కొనేలాగా పెంచాలని నా అభిప్రాయం.

ఆ రోజు విజ్జీ పదో తరగతి రిజల్ట్స్ వచ్చిన రోజు. అది ఫస్ట్ క్లాసులో పాసయ్యిందని తెలిసి నా ఆనందానికి అవధులు లేవు. ఎంత హడావుడి చేసానో! అందరికీ స్వీట్లు పంచాను. నా కలలు తీరే రోజు దగ్గర్లోనే ఉన్నట్టనిపించింది. ఆ రోజు రాత్రి నాకు సంతోషంతో నిద్ర పట్టలేదు. విజ్జీని కాలేజీలో చేర్పించాలి...

మంచి మంచి డ్రెస్సులు కొనాలి....ఇలా ఎన్నెన్నో ఆలోచనలు మా ఆయనకూడా మెలుకువతోనే ఉండి ఏదో ఆలోచిస్తున్నట్టు గమనించాన్నేను.

"ఏంటండీ, నిద్రపోవడం లేదు – ఏమాలోచిస్తున్నారు?" అడిగాను.

"నా ఫ్రెండ్ రాజారావు లేడూ – అతనికి తెల్సిన వాళ్ళబ్బాయి ఏదో మంచి ఉద్యోగంలో ఉన్నాడట. మీ అమ్మాయికి చూస్తే బావుంటుందీ సంబంధం అన్నాడు. ఆ విషయమే ఆలోచిస్తున్నాను." చెప్పాడాయన.

ఆయన చెప్తుందేంటో కొన్ని క్షణాలు అర్థం కాలేదు నాకు. "అమ్మాయికి సంబంధం చూడటమేమిటి?" అన్నాను ఆశ్చర్యంగా.

"అది యుక్తవయస్కురాలై రెండేళ్ళయింది. పదోతరగతి కూడా పాసయింది. రోజురోజుకూ కట్నాలు పెరిగిపోతున్నాయి. కాబట్టి ఎంత త్వరగా పెళ్ళి చేస్తే అంత మంచిదని భావిస్తున్నాను" అన్నాడు మా ఆయన ఆలోచనగా.

నిర్ఘాంతపోయాను నేను. ఇరవయేళ్ళ క్రితం మా నాన్న ఎలా ఆలోచించాడో ఇప్పుడు మా ఆయనా అలాగే ఆలోచిస్తున్నాడనిపించింది. "మీకేమయినా మతిపోయిందా? ముక్కుపచ్చలారని పిల్ల – దానికిప్పుడు పెళ్ళి చేసి గొంతు కోస్తానంటా రేమిటీ?" కాస్త కోపంగానే అన్నాను.

"నేను శుభమా అని పెళ్ళి చేస్తానంటే నీకు గొంతు కోయడంలాగా కనబడుతుందా?" ఆయనా కోపంగానే అన్నాడు.

"కాక మరేమిటీ! దాని పెళ్ళికిప్పుడు తొందరేమొచ్చిందీ? అది హాయిగా చదువు కుంటోంది కదా! ఈ సంవత్సరం కాలేజీలో చేర్పిద్దాం" అన్నాన్నేను, కోపాన్ని అదుపులో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తూ.

"కాలేజీ చదువు చదివి ఏం చేస్తుందీ, సమయము డబ్బు దండగ" అన్నారాయన. ఆ మాటకి నేను కోపాన్ని అదుపులోకి తెచ్చుకోగలిగాను. "అలా మాట్లాడుతారేమిటండీ! ఈ రోజుల్లో ఎంతమంది ఆడపిల్లలు పెద్దచదువులు చదవటం లేదూ! అది కూడా చక్కగా చదువుకొని ఏదైనా ఉద్యోగంలో చేరి దానికాళ్ళమీద అది నిలబడుతుంది. తర్వాతే పెళ్ళి గురించి ఆలోచిద్దాం." సాధ్యమయినంతవరకూ అనునయంగా చెప్పాన్నేను.

"చూడూ! చదువు, ఉద్యోగం అంటే మాటలనుకుంటున్నావా? ఎంత డబ్బు ఖర్చవుతుంది చెప్పు. మనకింకా ఇద్దరు పిల్లలున్నారు. వాళ్ళ చదువులకీ డబ్బు ఖర్చవుతుంది. మగపిల్లల చదువులకు ఖర్చు పెట్టామంటే అర్థముంది. రేపు వాళ్ళే మనల్ని పోషిస్తారు. పైగా మనం పెట్టిన ఖర్చంతా వరకట్నం రూపేణా వడ్డీతో సహా మనకొస్తుంది. కానీ ఆడపిల్లను చదివించామనుకో. దాని చదువుకీ వేలు ఖర్చు పెట్టాలి. ఎంత చదివినా ఉద్యోగం చేసినా కట్నం ఇవ్వక తప్పదు కదా! అంతేకాదు, చదువు పేరిట పెళ్ళి ఆలస్యం అవుతుంది. అప్పటికి కట్నాలు కూడా బాగా పెరుగుతాయి. ఇంత ఖర్చును భరించే స్తోమత నాకు లేదు. కాబట్టే విజ్జీకి వీలైనంత త్వరలో పెళ్ళి చేయాలనుకుంటున్నాను." మా ఆయన చాలా వివరంగా, నిశ్చయంగా చెప్పారు.

"లేదు లేదు. దానికి పెళ్ళి చేస్తానంటే నే నొప్పుకోను. అది బాగా చదివి ఉద్యోగం చేయాలి. నా కల ఫలించాలి. దయచేసి దాని పెళ్ళి మాట ఎత్తకండి." అర్థించే ధోరణిలో అన్నాన్నేను.

"నీదంతా విడ్డూరం. కాకపోతే ఉద్యోగం చేసే ఖర్మ దానికేం పట్టిందే? చేసుకొనే వాడు దాన్ని పోషించడా?" విసుగ్గా అన్నాడు మా ఆయన.

"ప్రతిదానికి మొగుడి మీద ఆధారపడే బ్రతుకు నా కూతురికొద్దు. తను తన కాళ్ళమీద నిలబడగలగాలి. అది వ్యక్తిత్వం ఉన్న మనిషిగా ఎదగాలి. ఆ తర్వాతే పెళ్ళి." స్పష్టంగా చెప్పాన్నేను.

కానీ మా ఆయన నా మాటలు చెవినపెట్టలేదు. కని పెంచిన నాకంటే మా ఆయనకే అమ్మాయి మీద అధికారం ఉండటం నాకు విచిత్రమనిపించింది. ఆయనకు చెప్పి లాభం లేదని మా అమ్మాయికే చెప్పాను, నాన్నను ఎదిరించమనీ పెళ్ళి చేసుకోనని చెప్పమనీ.

కానీ ఇరవయేళ్ళ క్రితం మా నాన్న నిర్ణయానికి ఎదురుచెప్పకుండా నేను తలవంచాను. ఇప్పుడు మా అమ్మాయీ తలవంచింది.

నా ఆశలు నిరాశలయి, కలలు కల్లలయి మా అమ్మాయి పెళ్లై పోయింది. అల్లుడిగారికి ఇక్కడే ఉద్యోగం. వాళ్ళ అమ్మా నాన్నలతో ఇక్కడే ఉంటారు. ఆటోలో వెళ్తే అరగంట ప్రయాణం వాళ్ళింటికి. కానీ నేను వాళ్ళింటికి ఎప్పుడోగానీ వెళ్లేదాన్ని కాదు. విజ్జీ మాత్రం పండగలకూ పబ్బాలకూ వచ్చేది. వచ్చినప్పుడు వంటింట్లో పనిచేసుకుంటున్న నా దగ్గరకొచ్చి ఏవేవో కబుర్లు చెప్తూ కూర్చునేది. అత్తగారింటి పద్ధతుల గురించి, అత్తగారి మాటకారితనం గురించి, వాళ్ళాయన ఇష్టాయిష్టాల గురించి, కోపతాపాల గురించి ఉత్సాహంగా చెప్తూ ఉండేది. కానీ ఎందుకో ఆ కబుర్లు నాకు ఏమాత్రం ఆసక్తిని కలిగించేవికావు. నేను అనాసక్తిగా వింటూ పనులు చేసుకునేదాన్ని. నిజంగా చెప్పాలంటే విజ్జీ పెళ్ళయ్యాక నాలో ఒకలాంటి స్తబ్దత వచ్చేసింది.

నా అనాసక్తిని గమనించి క్రమక్రమంగా అమ్మాయి నాతో కబుర్లు చెప్పడం తగ్గించి, మా అత్తగారితో చెప్తూ ఉండేది. మా అత్తగారు ఆ కబుర్లు ఆసక్తిగా వింటూ, మధ్యమధ్యలో కుతూహలంగా ఏదో ఒకటి అడుగుతూ దాని ఉత్సాహాన్ని పెంచేవారు.

అప్పటికి మా విజ్జీ పెళ్ళయి ఇంకా సంవత్సరం కానేలేదు. ఓ రోజు మా ఆయన ఇంట్లో కొస్తూ "ఓయ్ ముసలమ్మా" అని పిలిచారు నన్ను.

ఆ సంబోధనకు కాస్త ఆశ్చర్యపోయి "ఏంటే! నేనప్పుడే ముసలిదాన్నై పోయానా?" అన్నాను నవ్వుతూ. చాలా రోజుల తర్వాత మా ఆయనకు నా పెదాలమీద నవ్వు కన్పించి ఉంటుంది, అందుకే మరింత ఉత్సాహంగా "ముసలమ్మవు కాక మరేమిటోయ్? త్వరలో అమ్మమ్మవు కాబోతుంటేనూ!" అన్నాడు.

ఆయన మాటలు అర్థం కాగానే నా పెదాలపై నవ్వు టక్కున ఎగిరిపోయింది. "ఏమిటే మీరంటున్నది?" అన్నాను.

"ఈ రోజు విజ్జీని చూడడానికి వెళ్ళినప్పుడు తెలిసింది నాకీ శుభవార్త" అన్నాడాయన.

"అయ్యో! దానికింకా పదిహేడేళ్ళయినా నిండలేదు అప్పుడే గర్భవతైతే దానారోగ్యం పాడైపోదా" అదుర్దాగా అన్నాను నేను.

నా మాటలకు మా ఆయన చిరాకుపడ్డారు. "ఏ తల్లైనా కూతురు గర్భవతైందంటే సంతోషపడుతుంది. కానీ నువ్వేమిటీ బాధ పడిపోతున్నావు? నీ అంత విడ్డూరపు మనిషిని నేనెక్కడా చూడలేదు. అయినా పదహారేళ్ళకే నువ్వు తల్లివి కాలేదా?" అన్నాడాయన.

ఆయన మాటలకు నేనేమీ సమాధానం చెప్పలేదు. నా జీవితంలాగా నా కూతురు జీవితం ఉండకూడదని ఎంత కోరుకున్నాను? కానీ దాని జీవితం నా జీవితంకంటే ఏమాత్రం భిన్నంగా లేదనిపించింది.

అలా ఓ రెండేళ్ళు గడిచిపోయాయి. మా పెద్దబ్బాయి డిగ్రీలోకి, చిన్నబ్బాయి ఇంటర్‌లోకి వచ్చారు. విజ్జీ ఇద్దరు పిల్లల తల్లయింది. అమ్మాయి పిల్లలు వచ్చినప్పుడు మా యింట్లో అందరికీ పండగలా ఉండేది. పిల్లలను ఎత్తుకొని మురిసిపోతూ అందరూ ఆనందంగా ఉండేవారు. కానీ నేను మాత్రం ఎప్పటిలా ముభావంగా ఉండేదాన్ని. పిల్లల పనులన్నీ మొక్కుబడిగా చేసేదాన్ని. వాళ్ళ నవ్వుల కేరింతలు ఏవీ నాస్తబ్ధతను కరిగించలేకపోయాయి. నాలోని మార్పుకు మా ఆయన పిల్లలు అలవాటుపడ్డారు. నా స్తబ్ధత పోగొట్టడానికి వాళ్లేమీ ప్రయత్నించేవాళ్లుకాదు. నన్ను దాదాపు పట్టించుకోవడం మానేశారు. ఒకలాంటి విరిక్తతతో నేను జీవితాన్ని గడుపుతున్నాను. అప్పుడు నాకింక ఏ కోరికలూ లేవు. ఏ ఆశలూ లేవు, ఏ లక్ష్యాలూ లేవు. ఎలాగో ఒకలా రోజులు వెళ్ళదీయటమే నా లక్ష్యం. ఇక నా జీవితం అలాగే స్తబ్దంగా గడిచిపోయేదేమో! నా స్తబ్ధతను బద్దలుకొట్టే రోజు వస్తుందని నేనెప్పుడూ ఊహించలేదు. కానీ వచ్చింది!

ఆ రోజును నేనెన్నటికీ మరచిపోలేను.

ఇంటిముందు ఆటో శబ్దాన్ని నేను పట్టించుకోలేదు. ఆటో దిగి ఇంట్లోకి వచ్చిన మా ఆయన మమ్మల్ని చూడగానే భోరుమని ఏడ్చాడు. నాకు ఆశ్చర్యమనిపించింది. మా ఆయన ఏడ్వగా నేను చూడ్డం అదే మొదటిసారి.

"ఏమయిందిరా?" మా అత్తగారు అడిగేశారు.

"కొంప మునిగిందే అమ్మా! అల్లుడు స్కూటరు మీద వెళ్తుంటే లారీ గుద్దేసిందంట. అక్కడికక్కడే ఘోరం జరిగిపోయింది. నా కూతురు బతుకు నట్టేట మునిగింది." గుండె బాదుకుంటూ చెప్పాడు మా ఆయన.

ఆయన మాటలు అర్థం కావడానికి నాకు కొన్ని క్షణాలు పట్టింది. అర్థమయ్యాక 'నా గుండె ఇంకా ఎందుకు ఆగిపోలేదా?' అని ఆశ్చర్యపోయాను. మా ఆయన్ని పట్టుకొని మొదటిసారిగా స్వేచ్ఛగా గట్టిగా ఏడ్చాను. మరికొన్ని నిమిషాల్లో మేమందరం ఆటోలో ఉన్నాం. ఆటో వెళ్తుంటే నేను కాస్త దుఃఖం నుంచి తేరుకొని విజ్జీ గురించి ఆలోచించసాగాను. అమాయకమైన దాని మొహం నాకు మాటిమాటికీ గుర్తు రాసాగింది. "విజ్జీ! అమ్మను నేనొస్తున్నానురా నిన్నూరడించడానికి." కన్నీళ్ళు వత్తుకుంటూ అనుకున్నాను.

ఆటోదిగి ఇంట్లోకి వెళ్లాము. మూర్తీభవించిన శోకంలా ఉంది నా కూతురు. నన్ను చూడగానే "అమ్మా!" అని బావురుమంది. నేను రెండు చేతులతో విజ్జీని చుట్టేసి గుండెలకు హత్తుకున్నాను. దాన్నేమని ఊరడించాలో నాకు మాటలు రాలేదు.

"అమ్మా! నేనింక ఎలా బ్రతకాలమ్మా? ఎందుకు బ్రతకాలమ్మా? ఆయనతోపాటు నేనూ చచ్చిపోతానమ్మా" అంటూ హృదయవిదారకంగా ఏడుస్తోంది విజ్జీ.

నా గుండెనెవరో ఉక్కుపిడికిలితో కర్కశంగా పిండినట్లు అన్పించింది నాకు. 'అయ్యో! భర్త లేకపోతే దానికిక బ్రతుకే లేదనుకుంటోంది" అనుకున్నాను బాధగా.

"అయ్యో! అలా అంటే ఎలా తల్లీ? నీ పిల్లల్నిచూడు. వాళ్ళకోసమైనా నువ్వు ధైర్యం తెచ్చుకొని బ్రతకాలి" అందో పెద్దావిడ.

"ఇన్నాళ్లు భర్తకోసం, ఇకనుంచీ దాని జీవితం పిల్లల కోసమేనా?" నా మనసు ఆక్రోశించింది.

అమ్మాయి వీపు నెమ్మదిగా తడుతూ దృఢంగా చెప్పాను: "విజ్జీ! ఎవరి కోసమో కాదమ్మా – నువ్వు నీ కోసమే బ్రతకాలి. నీకింకా ఇరవయ్యేళ్ళన్నా నిండలేదు. ఎంతో భవిష్యత్తుంది నీకు. ధైర్యంగా బ్రతకాలి. నీ జీవితం నీ కోసమే, ఎవరి కోసమోకాదు" అని.

నా చుట్టుపక్కల ఉన్న అమ్మలక్కలు నావైపు విడ్డూరంగా చూశారు. అంత దుఃఖంలోనూ నా కూతురు తలెత్తి నా కళ్ళలోకి చూసింది.

ఆ తర్వాత జరగాల్సిన తతంగాలన్నీ జరిగిపోయాయి. కర్మకాండలు ముగిసాక విజ్జీని మా ఇంటికి తీసికెళ్ళాలన్న ఉద్దేశంతో నేనింకా అక్కడే ఉన్నాను. తనను వదిలి వెళితే ఇరుగుపొరుగు అమ్మలక్కలు వాళ్ళ సానుభూతి మాటలతో ఆమెనింకా అధైర్యపరుస్తారనే భయంతో కూడ నేనక్కడే ఉండిపోయాను. పైగా నేనుంటే తనకీ ధైర్యంగా కూడా ఉంటుందనుకున్నాను.

కర్మకాండ దగ్గర పడుతుందనగా ఓ రోజు అల్లుడిగారి సహోద్యోగులు వచ్చారు పరామర్శకోసం. వాళ్ళామాటా ఈ మాటా మాట్లాడి "విజయగారికి డిగ్రీ ఉంటే బావుండేది, శేఖర్ ఉద్యోగం తన కొచ్చేది" అన్నారొకరు.

"ఇప్పటికైనా ఫర్వాలేదు క్లర్క్ పోస్ట్ ఇస్తారు" అని మరొకరు అన్నారు.

"ఇప్పుడది ఉద్యోగం ఏం చేస్తుందిలే బాబూ!" అన్నారు విజయ అత్తగారు.

"దానికుద్యోగం చేయాల్సిన ఖర్మేమీ పట్టలేదులెండి. దాన్ని చూసుకోవడానికి మేంలేమా?" అన్నాడు మా అయన.

రెండు మూడు రోజులనుండి నేనావిషయం ఆలోచిస్తూనే ఉన్నాను. కానీ ఎవరిముందు బయటపెట్టలేదు. ఇక ఆరోజు సందర్భం వచ్చింది కదాని అమ్మాయితో "విజ్జీ! నువ్వుద్యోగంలో చేరితే బావుంటుందమ్మా!" అన్నాను.

"నేనా! ఉద్యోగమా? నా బ్రతుక్కి ఇప్పుడదొక్కటే తక్కువయింది! నేను చేయలేనమ్మా!" నిరాశగా అంది విజ్జీ.

"విజ్జీ! అంత నిస్పృహగా మాట్లాడకమ్మా! నా దృష్టిలో నువ్విన్నాళ్లు గడిపింది బాల్యమే. నీ యవ్వనం, వృద్ధాప్యం అన్నీ ఇంకా ముందున్నాయి. ఎన్నాళ్ళని ఇలా మూల కూర్చొని ఏడుస్తావు? నువ్వెక్కడయితే నీ జీవితాన్ని పోగొట్టుకున్నావో అక్కడే మళ్లీ జీవితం కొరకు వెతుక్కో. కొత్త జీవితాన్ని ప్రారంభించమ్మా! పుట్టింటిపైనో మెట్టింటిపైనో ఆధారపడి బ్రతుకడం చాలా కష్టం. బాగా ఆలోచించుకోమ్మా!" అంటూ చాలా వివరంగా చెప్పాన్నేను.

నా మాటలకు కన్నీళ్లు తుడుచుకొని ఆలోచనలో పడిపోయింది విజ్జీ. తను సరైన నిర్ణయమే తీసుకుంటుందని నాకనిపించింది ఆ క్షణం.

ఆ పదోరోజు కర్మకాండ చేయాలని నిర్ణయించారు. అదేరోజు విజయను విధవను చేయాలని కూడా నిర్ణయించుకున్నట్టున్నారు. కొందరా తతంగానికి ఏర్పాట్లు చేస్తున్నారు. మరికొందరు తెల్లచీర, వెండిగాజులతో విజయ కన్పించగానే శోకాలు పెట్టడానికి సిద్ధమవుతున్నారు. కానీ నేనాతతంగాన్ని సాగనీయలేదు. "తాళి, మట్టెలు తీస్తుంది కానీ బొట్టు, గాజులు తీయడానికి" వీల్లేదన్నాను.

బంధువులందరూ 'ఆచారాలు సాంప్రదాయాలు' అంటూ గగ్గోల పెట్టారు. నువ్వో విడ్డూరపు మనిషివి అన్నాడు మా ఆయన.

"మీ ఆచారాలను సంప్రదాయాలను మీ దగ్గరే పదిలంగా ఉంచుకోం"డన్నాను కోపంగా.

అందరూ గోలగోలగా అరుస్తున్నారు. మరికొందరు నావైపు విడ్డూరంగా చూస్తున్నారు. విజయ మాత్రం ఎటూ తేల్చుకోలేక కన్నీళ్లు పెడుతూ పాపకు పాలిస్తూ ఓ మూలన కూర్చుండిపోయింది. ఇక్కడ ఉండడం దుర్భరమనిపించింది. అందుకే విజ్జీని పిల్లలను తీసుకొని ఇంటికి బయల్దేరాను. మేం వచ్చేస్తుంటే ఎవరూ అడ్డు చెప్పలేదు. అమ్మాయి కూడా ఏమిటే ఎక్కడికని ప్రశ్నించకుండా, చేయి పట్టుకొని తీసుకొస్తుంటే బొమ్మలా వచ్చి ఆటోలో కూర్చుంది.

మేం ఇంటికి వచ్చిన గంట తర్వాత మా ఆయనా, అత్తగారూ, పిల్లలు వచ్చేశారు. రాగానే మా ఆయన నామీద విరుచుకుపడ్డారు. నేను బంధువులందరిలో ఆయనకు తలవంపులు తెచ్చానట. అల్లుడిగారి ఆత్మకు శాంతిలేకుండా చేశానట. ఇంకా ఏమేమో అన్నారు. నేనేమీ మాట్లాడకుండా నన్నుకాదు అన్నట్లు ఉండిపోయాను. నా మౌనం ఆయన్నింకా రెచ్చగొట్టినట్టుంది. "అయినా నాకు చెప్పా పెట్టకుండా అమ్మాయిని నా యింటికి తీసుకొచ్చే అధికారం నీకెవరిచ్చారే?" అన్నాడు కోపంగా

"ఈ యింట్లో ఉండొద్దు అని చెప్పండి – ఈ క్షణమే నేను అమ్మాయిని తీసుకొని వెళ్ళిపోతాను." చాలా శాంతంగా చెప్పాన్నేను.

నా మాటలకు మా ఆయన అదిరిపోయారు. నేనన్నంతపనీ చేస్తాను అనుకొని ఉంటాడు. అందుకే మౌనంగా ఉండిపోయాడు.

అలా కొన్ని రోజులు గడిచిపోయాయి. నేనెప్పుడూ అమ్మాయిని అంటిపెట్టుకొనే ఉండేదాన్ని. వంట చేస్తున్నప్పుడు తనను వంటింట్లో కూర్చోబెట్టుకొని కబుర్లు చెప్తూ వంటచేసేదాన్ని. తను దుఃఖంనుండి కాస్త తేరుకుంది. ఓ రోజు తనను

వెంట బెట్టుకొని అల్లుడిగారి ఆఫీసుకు వెళ్లాను. ఆఫీసర్‌గారిని కల్సి, అన్ని విషయాలు మాట్లాడాను. అతను ఏవేవో సంతకాలు తీసుకొని, త్వరలోనే కబురు పెడతానన్నారు. కబురు కూడా వచ్చింది – 'ఉద్యోగంలో చేరమని'.

ఆ రోజు మళ్లీ మా ఆయన గొడవ. "మొగుడు చచ్చినదాన్ని ఏదో ఇంట్లో పడి ఉండనీయక ఉద్యోగమంటూ ఊరేగిస్తావా?" అన్నాడు కోపంగా.

"అవును." చెప్పాన్నేను మామూలుగా.

"దానికుద్యోగం చేయాల్సిన ఖర్మేం పట్టిందే దాన్ని చూసుకోవడానికి నేను లేనా?" అన్నారాయన.

"జీవితాంతం తోడుగా ఉంటాడని నమ్మిన మొగుడే దాన్ని నట్టేట ముంచిపోయాడు. మరి మిమ్మల్నెలా నమ్ముకోమంటారు?" అడిగాన్నేను చాలా శాంతంగా.

మా ఆయన నిశ్చేష్టుడయ్యాడు. ఏదో అనబోయి నోరు తెరచి మళ్లీ అంతలోనే విరమించుకొని అక్కడనుండి వెళ్ళిపోయాడు.

విజయ ఉద్యోగంలో చేరేరోజు నేనెంత హడావుడి చేశానో! తను కట్టుకోవాల్సిన చీరను చక్కగా ఇస్త్రీ చేశాను. తను చీర కట్టుకుంటుంటే కుచ్చిళ్లు సర్దాను. తలస్నానం చేసిన జుట్టును చక్కగా దువ్వి జడవేశాను. తనకిష్టమైన టిఫిన్ చేసి కొసరి కొసరి తినిపించాను. పిల్లలను తయారుచేసి, నేనూ తయారయ్యాను. నేనన్నీ చేస్తుంటే విజయ మాత్రం "అమ్మా! నాకేంటో దిగులుగా ఉందే" అని అంటూనే ఉంది. తనకి ధైర్యం చెప్తూ ఆటో ఎక్కేశాం. దిగులుపడ్తున్న తనకి ధైర్యం చెప్పి ఆఫీస్‌లోకి పంపించి, పాపను వళ్లో పడుకోబెట్టుకొని ఆఫీస్‌ముందున్న చెట్టుకింది బెంచీమీద కూర్చున్నాను. బాబు అక్కడే గంతులేస్తూ ఆడుతున్నాడు. ఓ గంట తర్వాత పాపకు పాలివ్వడానికి వచ్చిన విజ్జీ మొహంలో దిగులుస్థానే ధైర్యాన్ని చూశాను. భోజనం వేళలో ఇంటినుండి తీసికెళ్ళిన భోజనం బాబుకు తినిపిస్తూ మేమూ తిన్నాం. మాతోపాటు ఇద్దరు విజ్జీ సహోద్యోగులు వచ్చి చేశారు. అందరం సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనం ముగించాం. ఆ రోజు సాయంత్రం ఆఫీస్‌నుంచి ఆటోలో తిరిగి వస్తున్న నాకు విహారయాత్రకు వెళ్ళివస్తున్నట్లనిపించింది.

అలా ఓ రెండుమూడు రోజులు తనకు తోడుగా పిల్లల్ని తీసుకొని నేనూ వెళ్లాను. కానీ యిప్పుడు తనొక్కతే బస్‌లో వెళ్ళి వస్తోంది. పాపకు సీసాపాలు అలవాటు చేశాను. ఇప్పుడు నాకు స్తబ్దత అంటే ఏమిటో తెలియదు. ప్రతిక్షణం ఏదో ఓ పని తీరికలేకుండా చేస్తూనే ఉంటాను. ఇప్పుడు నాకు పనంటే విసుగులేదు. పనిలో యాంత్రికత లేదు. ఏ పనైనా ఉత్సాహంగా చేస్తూ ఉంటాను. నేనిప్పుడు పిల్లల పనులు మొక్కుబడిగా చేయడంలేదు. వాళ్ళను ఆడిస్తూ పాడిస్తూ ఎప్పుడూ సంతోషంగా ఉంటున్నాను. మధ్యాహ్నం భోజనాలయ్యాక పిల్లలను ఆడిస్తూ – విజ్జీ చీరలు ఇస్త్రీ చేస్తూనో, చీరలకు ఎంబ్రాయిడరీ చేస్తూనో, ఫాల్స్‌కుడుతూనో, పాప గౌనుకి లేసులు కుడుతూనో, లేక పిల్లలకు స్వెట్టర్లు అల్లుతూనో సాయంత్రం దాకా గడిపేస్తాను. సాయంత్రం అవుతూనే పిల్లలకు స్నానాలు చేయించి, చక్కగా బట్టలు తొడిగి, తలలు దువ్వుతాను. వాళ్ళను చూస్తుంటే నా మనవడు, మనవరాలు అని అస్సలు అన్పించదు నాకు. వాళ్లూ నా బిడ్డలేనేమో అన్పిస్తారు. చాలాసార్లు నా

పిల్లల బాల్యం గుర్తుతెస్తారు వాళ్లు. పాపను చూస్తుంటే చిన్నప్పటి విజ్జీనే గుర్తు వస్తుంటుంది.

ఆఫీస్‌నుంచి రాగానే విజ్జీ పిల్లలను ఎత్తుకొని ఆడించి, ఆ తర్వాత స్నానం చేసి. నేను కలిపిచ్చిన కాఫీ  త్రాగుతూ తన ఆఫీస్ కబుర్లూ, ఇంకా అవీ ఇవీ పేపర్లలో వచ్చిన వార్తలూ చెప్తూ ఉంటుంది. నాకా  కబుర్లు వినాలంటే ఎంత సంతోషమో! అయినా విజ్జీ నుండి ఇలాంటి కబుర్లు వినాలనే కదా నేను  కలలు కంది.

మొన్న విజ్జీ ఆఫీస్ నుండి వస్తూ ఏదో ఫారాలు తెచ్చుకుంది. నాకా ఫారాలు చూపిస్తూ "అమ్మా!  నేను ఓపెన్ యూనివర్శిటీ ద్వారా డిగ్రీ చేయాలను కుంటున్నానమ్మా! డిగ్రీ చేస్తే ప్రమోషన్ కూడా  వస్తుంది" అంటూ ఏదేదో చెప్పింది. దాని కళ్ళల్లో ఎంతో ఆత్మవిశ్వాసం, భవిష్యత్తుపై ఎన్నో ఆశలు.

ఏమని వర్ణించను నా ఆనందాన్ని? విషయం తెలిసి మా ఆయన "ఉద్యోగం చేసేది చాలనట్టూ ఇప్పుడు  కాలేజీ చదువుకూడానా?" అన్నాడు.

"చదువుకుంటే తప్పేంటి! అయినా విజ్జీ ఇలా చదువుకోవాలనే నేను కలలు కంది. ఇలా ఉద్యోగం  చేయాలనే నేను కోరుకుంది. నా కల ఫలించింది. నా కోరిక తీరింది." అన్నాన్నేను ఉద్వేగంగా

మా అయన నావైపు విడ్డూరంగా చూస్తూ "నీ కల ఫలించిందని సంతోష పడుతున్నావు కానీ దానికి  జరిగిన ఘోరం గురించి నువ్వాలోచించడం లేదు. ఆమె తన జీవితంలో అతి ముఖ్యమైనదాన్ని  పోగొట్టుకుందనే విషయాన్ని నువ్వు విస్మరిస్తున్నావు. తనీ రోజు ఉద్యోగం చేస్తోందని  ఆనందపడుతున్నావు కానీ ఆ ఉద్యోగం దాని మొగుడు చనిపోవడంవల్లే దానికొచ్చింది. అంటే – పరోక్షంగా నువ్వల్లుడు చనిపోయినందుకు సంతోషిస్తున్నావా?" సూటిగా అడిగాడాయన.

నేను నిర్ఘాంతపోయాను. కొన్ని క్షణాల తర్వాత తేరుకొని "నేనలా ఎన్నడూ కోరుకోలేదు. అతను  చనిపోయినపుడు నేను చాలా బాధపడ్డాను. కానీ విజ్జీ తన జీవితంలో అతి ముఖ్యమైనది  పోగొట్టుకుందనే మీ మాటలతో నేనేకీభవించను. విజ్జీ తన భర్తను మాత్రమే పోగొట్టుకుంది. కానీ  అంతకంటే విలువైన తన జీవితాన్ని మళ్లీ తన చేతుల్లోకి తీసుకుంది. అల్లుడు చనిపోయాడని నేను  సంతోషించడం లేదు.  అలాగని నా కూతురు జీవితంలో మనిషిగా బ్రతుకుతున్నందుకు నేను సంతోషిస్తున్నాను కూడా." చెప్పాన్నేను ఆవేశానికి లోనుకాకుండా.

"అంటే ఏంటి!  దానికి మొగుడక్కర్లేదు – చదువు, ఉద్యోగం ఉంటే చాలంటావ్?" విసురుగా అన్నాడు  మా ఆయన.

"తనకేకాదు – ఏ స్త్రీకయినా భర్తా, కుటుంబం అవసరంలేదని నేననడం లేదు. కానీ వాటితోపాటు  తనకంటూ ఓ సొంత జీవితం కూడా ఉండి తీరాలి!" ఖచ్చితంగా చెప్పాన్నేను.

"నువ్వో విడ్డూరపు మనిషివి. నీమాట లెప్పుడూ నాకర్థంకావు." నిరసనగా అంటూ వెళ్ళిపోయాడు  మా ఆయన అక్కడనుంచి.

ఏమిటీ ఆలోచిస్తున్నారు! మీక్కూడా నేను విడ్డూరపు మనిషిలాగే అన్పిస్తున్నానా?

● *ఆహ్వానం – సకుటుంబ మాసపత్రిక – మార్చి, 1995* ●

83

దాదా హయాత్

# ఎల్లువ

"యెంకటేస్వర సామీ, కాపాడు తండ్రీ!" కోర్టు హాల్లోకి వెళ్తూ తిరుపతి కొండ వున్న దిక్కుకు తిరిగి దండం పెట్టుకున్నాడు గొల్ల నారాయణ.

దావా గెలిస్తే కొండకొస్తానని మొక్కుకున్నాడతను. ఆ రోజే తీర్పు. కొద్దిసేపటి క్రితమే అతని వకీలు అతనికి ధైర్యం చెప్పాడు. "మరేం పరవాలేదు. దావా గెల్చేది మనమే నువ్వు నిమ్మళంగా వుండు," అన్నాడు.

గొల్ల నారాయణ అలానేనని బుర్రూపాడు. అయితే అంతటితో అతనికి ధైర్యం చిక్కలేదు. "అన్నింటికీ నువ్వే వుండావు సామీ!" తిరుతి వెంకన్నను తల్చుకుని అప్పుడే మనసులో దండం పెట్టుకున్నాడు. అతని భార్య కూడా అతను కోర్టుకు బయల్దేరే ముందు అదే చెప్పింది. "సామి సల్లంగా సూడాల్నే గాని, ఈ వకీల్లతో యేమైతాది? కోరటుకాడ నిన్ను బిల్సినప్పుడు యెంకటేస్వర సామిని తల్సుకో," అని హితబోధ చేసింది. గొల్ల నారాయణ ఇప్పుడలాగే చేశాడు. దాంతో మనసుకు కొంత ధైర్యం చిక్కింది. 'అన్నింటికీ బగవంతుడే వుండాడు. యెవరికీ ఆయన అన్యాయం సేయడు,' అనుకున్నాడు. దాంతో మరికొంత ధైర్యం చిక్కింది. జడ్జిగారి ముందు వణక్కుండా నిలబడగలిగాడు.

"గొల్ల నారాయణ నువ్వేనా?" అడిగాడు బెంచి గుమాస్తా.

"నేనే సామీ," అన్నాడు నారాయణ.

"నీ దావా కొట్టేసినారు పో," అన్నాడు బెంచి గుమాస్తా. నారాయణకి అతనేం చెబుతున్నాడో తెలీలేదు. దావా కొట్టేసినారంటే గెల్చినట్టో ఓడినట్టో అర్థం కాలేదు.

"అంటే దావా గెల్సినానా సామీ?"

ఆ ప్రశ్నకు కోర్టు హాలంతా గొల్లున నవ్వింది.

"ఓడిపోయినావు పోవయ్యా! నీ దావా పోయింది," అన్నారెవరో.

గొల్ల నారాయణ కళ్ళముందు చీకటి వ్యాపించినట్లయ్యింది.

"అన్యాయం సామీ, ఆ భూమి నాదే!" మొరపెట్టుకున్నాడు.

జడ్జి మొదటిసారిగా నోరువిప్పాడు. "భూమి నీదేనంటే అప్పీలు చేస్కో. ఇంక నేను చెయ్యగలిగిందేంలేదు."

నారాయణ ఎలా కోర్టు హాల్లోంచి బయటికొచ్చాడో అతనికే తెలీదు.

"యెంకటేస్వర సామీ, నువ్వు గూడా మోసం జేస్తివా!" బిగ్గరగానే అనుకున్నాడు.

అతని వకీలు ఎక్కడా కనిపించలేదు. మాల ఈరిగాడు మాత్రం కనిపించాడు.

"ఈరిగా, మీకేం జేసినాననిరా నన్నీమైన సతాయిస్తావుండారు?" కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుండగా అడిగాడు.

ఈరిగాడు అతనివైపు జాలిగా చూశాడు.

"మాదేం లేదన్నా. గవర్నమెంటోల్లు ఆ భూమి మాకిస్తామంటే తిరుగుతాండాం," అన్నాడు.

"ఆ భూమి నాదిరా!" వాపోయాడు నారాయణ.

"గవర్నమెంటుదంట గదన్నా! నీది కాందాని కెందుకు గసపెట్టుకుంటా తిర్గుతావ్? లెక్కంతా కొండబోయి వకీల్ల నోట్లో యెందుకు బోస్తావ్? దావా వదిలేయరాదా?" సలహా ఇచ్చాడు ఈరిగాడు. "యేంత మాటంటివిరా ఈరిగా! ఆ భూమి నాదన్నా!" ఏడుపొక్కటే తక్కువగా అన్నాడు నారాయణ.

ఈరిగాడు అతని మొహంలోకి చూడకుండా కళ్ళు తిప్పుకున్నాడు.

"వస్తాన్నా. నే బోతాండా ఈ పొద్దు ఎమ్మార్వో రమ్మన్న్యాడు," అంటూ మళ్ళీ అతనివైపు చూడకుండా వెళ్ళిపోయారు.

నారాయణ హతాశుడై ఒక చెట్టుకింద ముడుచుకుని కూర్చుండిపోయాడు. ఎదురెండకు కళ్ళు బైర్లు కమ్ముతున్నట్లనిపించి భుజం మీది పైగుడ్డ దులిపి నెత్తికి చుట్టుకున్నాడు. సూర్యకిరణాలు అప్పటికీ అతన్ని వదలకపోవడంతో నుదుటి మీద అరచేతులు చేర్చుకుని కూర్చున్నాడు.

కాసేపటికి అతని వకీలు అటుగా వెళ్తుండడం కనిపించింది. గొల్ల నారాయణ చెట్టుకింద నుంచి లేచి అతనివైపు పరిగెత్తాడు.

"స్వామీ!"

పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఆగి అతని వైపు తిరిగాడు.

గొల్ల నారాయణ ఆయనకు రెండు చేతులూ జోడించాడు.

"దావా గెలుస్తామంటిరి గదసామీ! ఓడిపోతిమి."

పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఇబ్బందిగా మొహం పెట్టాడు. ఆయనకు బదులు ఆయన వెనకే దావా కట్టలు పట్టుకొస్తున్న వకీలు గుమాస్తా చంద్రాయుడు నోరు తెరిచాడు. "సారుదేం తప్పులేదు నారాయణ! మన కేసు బలంగా వుండింది. ఆ మాల నాకొడుకులే జడ్జికి లంచమిచ్చారు," అన్నాడు.

పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఆ ట్రిక్కుతో కొంచెం తేరుకున్నాడు.

"అవునవును. చేసిందంతా వాళ్ళే. అందులోనూ ఆ జడ్జీ పరమనీచపు ముండాకొడుకు. లంచమిస్తే చాలు, లొంగిపోతాడు," అన్నాడు.

"ఆ మాలోల్ల కాడ లంచమిచ్చినంత లెక్క యాడిది సామీ? అదే వుంటేగిన ఉద్దరగొచ్చే భూమి కోసరం యెంపర్లాడతారా?" ఆశ్చర్యం ప్రకటించాడు నారాయణ.

"వెర్రి గొల్లోనివి నీకేం తెలుసులే నారాయణా! వెనకటి కాలం కాదు. ఈ కాలం మాలోళ్ళకాడ ఎంత డబ్బుందో నీకేం తెలుసు? ఉద్యోగాలు వాళ్ళవే. ఊళ్ళో భూములు వాళ్ళవే. అన్ని సదుపాయాలు వాళ్ళకే. అంత దూరం ఎందుకు, నీ భూమి కూడా వాళ్ళకే పోతోంది చూశావా! అడిగే నాధుడేడి? కోర్టులు కూడా వాళ్ళకు అనుకూలంగానే తీర్పులు చెబుతున్నాయి." తన ఆర్గమెంటు వినిపించాడు పరబ్రహ్మేశ్వరశాస్త్రి.

"ఇప్పుడేం చేయాల సామీ?" అడిగాడు నారాయణ.

"ఏం చేసేదేముంది? సబ్ కోర్టులో అపీలు చేసుకోవాలి," అన్నాడు చంద్రాయుడు.

"అలా చేస్తే నా భూమి నాకు తిరిగొస్తాదా సామీ?"

"ఎందుకు రాదు? మన కేసులో బలం వుందని చెప్తిని గదా!"

"అందుకెంతైతాది సామీ?" పరబ్రహ్మేశ్వర శాస్త్రి వైపు తిరిగి అడిగాడు నారాయణ.

"ఆ విషయం చంద్రాయుడు చెప్తాడు. నాకవతల ఇంకో కేసుంది," అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడు పరబ్రహ్మేశ్వర శాస్త్రి.

నారాయణ చంద్రాయుడి వైపు చూశాడు.

"ముందో పది రూపాయలు త్యా, చెప్తాను," అన్నాడు చంద్రాయుడు.

"ఇప్పుడు లేవు సామీ! జేబులో లెక్క లేదు."

అయితే సాయంత్రం ఆఫీసుకురా, ఆడ చెప్తాను," అంటూ వెళ్ళిపోయాడు చంద్రాయుడు.

నారాయణ కాసేపు దిక్కు తోచనివాడిలా అక్కడే తచ్చాడి నెమ్మదిగా కోర్టు ఆవరణలోంచి బయటికొచ్చాడు.

"ఏం నారాయణా, యేమైంది కేసు?" అడిగాడు రాముడు.

కోర్టు వెలుపల టీ బంకు అతనిదే. అక్కడికి వచ్చినప్పుడల్లా నారాయణ రాముని టీయే తాగుతాడు.

"పోయిందన్నా, దావా కొట్టేసినారు." దిగులుగా అన్నాడు నారాయణ.

రాముడు అతని మొహం చూసి ఆ మాట ముందే గ్రహించాడు. ఏళ్ళ తరబడి కోర్టు ముందు టీ బంకు నడుపుతుండటంవల్ల ఎవరికేసు ఏమైందో మొహం చూసి చెప్పగల అనుభవం సంపాయించుకున్నాడతను. నారాయణ ఆ మాట చెప్పగానే గమ్మున గ్లాసులో టీ పోసి అతనివైపు చాచాడు.

"ఇదో, టీ తాగు."

"వద్దులే," అన్నాడు నారాయణ.

"పరవాలేదు తీస్కోన్నా. కోర్టులో కేసు గెలవాల్నంటే అంత సులభంగా అయితాదా? అవసరమైతే హైకోర్టుగ్గుడ్కా పోవాల్సొస్తాది. ముందు టీ తాగు."

నారాయణ టీ గ్లాసందుకున్నాడు. అతనికి టీ తాగాలని లేదు. కడుపులో దహించుకుపోతోంది. అయినా నెమ్మదిగా టీ చప్పరించడం మొదలెట్టాడు.

రాముడు పిస్టన్‌కొట్టి కిరసనాయిలు స్టవ్ మంట ఎక్కువచేస్తున్నాడు. బుస్‌మని శబ్దం చేస్తూ మంట క్రమంగా పెరుగుతోంది. స్టౌమీదున్న పాత్రలో టీ మరింత వేగంగా మరగనారంభించింది.

నారాయణ ముభావంగా స్టౌ మంటకేసి చూస్తూ కూర్చున్నాడు. తన పరిస్థితి ఆ స్టౌమీద మరుగుతున్న టీ పరిస్థితి ఒకటే ననిపించిందతనికి. చూస్తుండగనే చేజారిపోతున్న తన నాలుగెకరాల భూమి గుర్తుకొచ్చింది. ఇక టీ తాగబుద్ధి కాలేదు. గ్లాసు పక్కనే బల్లమీద పెట్టేసి శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

ఆ నాలుగెకరాల భూమినే నమ్ముకు బతుకుతున్న సన్నకారు రైతు అతను. వాన సరిగ్గా పడదు. చాలాకాలం క్రితం అతనికా భూమికి పంపుసెట్టు వేయించాలనే ఆలోచన వుండేది. తన భూమికి పక్కనే వున్న రామిరెడ్డి పంపుసెట్టు కోసం బ్యాంకు ఋణం ఇప్పిస్తానని కూడా చెప్పాడు.

అయితే ఋణం తీసుకుని పంపుసెట్టు వేయిస్తే ఏమవుతుందో నారాయణకు తెలుసు. రామిరెడ్డి ఆ వూళ్ళోకల్లా పెద్ద పాలెగాడు. ముప్పై ఎకరాల ఆసామి. తన పల్లెలో పెత్తనమంతా అతన్దే. అతని మాట విని తను పంపుసెట్టు వేయించుకుంటే ఋణం ఇప్పించిన నెపం మీద పంపు నీళ్ళు తన భూమిలోకి మళ్ళించమంటాడు. తన నాలుగెకరాల సంగతేమో కాని అతని ముప్పై ఎకరాలకు నీళ్ళు సప్లై చేయడానికే తన జీవితకాలం సరిపోతుంది. ఆ భయంతో పంపుసెట్టు గురించి ఆలోచన మానుకున్నాడు. నీళ్ల సదుపాయం వుంటే వరి సైతం పండే పొలం అతన్ది. వేరుశెనగ, పొద్దుతిరుగుడు పూలు – అలాంటి వ్యాపార పంటలతోనే కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. అంతలోనే పొలాన్ని వదిలిపెట్టి పొమ్మని గవర్నమెంటు అర్డరు పిడుగులా వచ్చిపడింది.

'ఫలానా సర్వే నంబరు ప్రకారం గవర్నమెంటు పోరంబోకుగా వుంటూవున్న భూమిని చట్టవ్యతిరేకంగా నువ్వు దురాక్రమణచేసి సాగు చేస్తున్నట్టు మాకు తెలియవచ్చింది. కావున వెంటనే భూమిని వదిలిపెట్టి పోవలసింది. అట్లు కాని యెడల నీ పై చట్టపరమైన చర్యలు తీసుకొనబడును' – అదీ అర్డరు.

అలాంటి అర్డరు రావడంతో నారాయణకు మతి పోయినట్లయింది. ఇదేం న్యాయం! తను సాగుచేస్తున్న భూమి గవర్నమెంటు పోరంబోకు కాదు. తాత తండ్రులనుంచి తనకు సంక్రమించింది. లబోదిబోమంటూ అతనా అర్డరు పట్టుకుని ఎమ్మార్వో ఆఫీసుకు వెళ్ళాడు. వాళ్ళకాళ్ళు పట్టుకుని, వీళ్ళకాళ్ళు పట్టుకుని ఎలాగో తన భూమికి సంబంధించిన రికార్డులు బయటికి లాగించాడు.

"రికార్డుల్లో ఆ భూమి గవర్నమెంటు పోరంబోకనే వుంది. కాబట్టి నువ్వా భూమి వదులుకోవలసిందే," అన్నారు వాళ్ళు.

ఆ రికార్డులు పుట్టక ముందునుంచీ ఆ భూమిని వంశానుగతంగా తామే సాగుచేస్తూ వస్తున్నారు. అలాంటిది రికార్డుల్లోకి ఆ భూమి గవర్నమెంటు పోరంబోకని ఎందుకు ఎక్కిందో ఎంత బుర్ర బద్దలుకొట్టుకున్నా అతనికి అర్థం కాలేదు.

"ఇదంతా కరణమయ్య పనే అయ్యుండాల. మీ నాయన బతికుండగా చానా పితలాటకం చేసిందా యప్పే కదా? ఇప్పుడంటే ఈ ఎమ్మార్వోలూ వీల్లంతా

వచ్చినారు. అప్పుడంతా కరణమయ్యే గదా! పోయి అడుగు," అని సలహా ఇచ్చింది నారాయణ భార్య.

లక్ష్మయ చెప్పింది నిజమే. ఇది కరణమయ్య చేసిన పితలాటకమే అయ్యుండాలి. నారాయణ పిల్లప్పుడు నారాయణ తండ్రికి తీవ్రంగా జబ్బు చేసింది. దాంతో భూమి సాగుచేసే వాళ్ళెవరూ లేకపోయారు. అప్పుడు కరణమయ్యే ఒక ప్రతిపాదన తెచ్చాడు.

"చూడు శేషన్నా! ఈ పరిస్థితిలో భూమి నువ్వెలాగా సాగుచేసుకోలేవు. కాబట్టి నాకు గుత్తకిచ్చేయ్. వచ్చిన పంటలో ఎంతోకొంత నీకిస్తాను. దాంతో నీకు దిగులుండదు," అన్నాడు.

నారాయణ తండ్రికి కూడా ఆ పరిస్థితిలో అంతకంటే చేయగలిగిందేం లేదనిపించింది. దాంతో కరణమయ్యకే ఆ పొలం గుత్తకిచ్చేశాడు. కరణమయ్య ఒక రెండేళ్ళు బాగానే వున్నాడు. ఆ తర్వాత మనిషే మారిపోయాడు. ఆ భూమి తనదేనని ప్రచారం చేసుకోవడం మొదలెట్టాడు. గుత్త ఎగ్గొట్టేశాడు.

అలా కొన్నేళ్ళు గడిచాయి. ఈలోగా నారాయణ తండ్రి జబ్బునుంచి కోలుకున్నాడు. కరణమయ్య సంగతి పదిమంది పెద్దల్లో పంచాయితికి పెట్టించాడు. ఆ భూమి తనదేనని కరణమయ్య మంకుపట్టుపట్టి కూర్చున్నాడు. ఒకసారి అది తన తాతల కాలంనాటిదని బుకాయిస్తాడు. ఒకసారి శేషన్నే అది తనకు అమ్మేశాడంటాడు.

ఆ సమయంలో ఆ ఊరి రెడ్డిగా వున్న భూమిరెడ్డి, శేషన్న పక్షాన నిలిచాడు. అంతకుముందు కొద్ది రోజులుగా కరణమయ్యకూ రెడ్డికీ ఏదో విషయమై కీచులాట జరిగింది. అదే శేషన్నని రక్షించింది. లేకపోతే భూమి కర్ణమయ్యదేనని తీర్పు చెప్పేసేవాడు రెడ్డి. శేషన్న భూమి శేషన్నకు అవిధంగా తిరిగి ఇవ్వక తప్పలేదు కరణమయ్యకు. అప్పట్నుంచీ శేషన్న కుటుంబం మీద గుర్రుగానే వుంటూ వచ్చాడు. ఎలాగైనా ఆ భూమి కాజేయాలని పథకాలు వేస్తూనే వున్నాడు.

శేషన్న తదనంతరం ఆ భూమి నారాయణకు వచ్చింది. ఆ తర్వాత కరణమయ్య పరిస్థితి కూడా మారిపోయింది. ప్రభుత్వం రెడ్డి, కరణం పోస్టులు రద్దుచేసి మండలకార్యాలయాలు తెరిచింది. కరణం తన కొడుక్కి విలేజ్ ఆఫీసర్ ఉద్యోగం తెచ్చుకోవాలని చాలా ప్రయత్నించి విఫలమయ్యాడు. ఆ తర్వాత ఆయనకు పక్షవాతం కూడా వచ్చింది. నారాయణకు శ్రీముఖం చేతికొచ్చే సమయానికి కరణమయ్య మంచానపడున్నాడు. నారాయణ గవర్నమెంటు ఆర్డరు పట్టుకుని కరణమయ్య దగ్గరికె వెళ్ళాడు.

"చూడు కరణమయ్యా, ఏందిది?" అన్నాడు నారాయణ. కరణమయ్య పరిస్థితి దారుణంగా వుంది. కుడిచెయ్యి, కుడికాలు పడిపోయాయి. మూతికూడా వంకర తిరిగింది. అయినా మాట్లాడగలిగే స్థితిలోనే వున్నాడు. నారాయణ పట్టుకొచ్చిన ఆర్డరు చూసి వంకర మూతితో అసహ్యంగా నవ్వాడు.

"ఇలాంటిది ఏదో రోజున జరుగుతాదని నాకు తెలుసురా! నేనే ఆ పని చేసింది," అన్నాడు ఏమాత్రం సిగ్గుపడకుండా.

నారాయణ గుడ్లు మిటకరించి, "ఏం చేసినావు కరణమయ్యా?" అన్నాడు.

"మీ నాయన నాకు చేసిందానికి రెండింతలు చెయ్యాలనుకున్నా. రికార్డుల్లో ఆ భూమి గవర్నమెంటు పోరంబోకని నేనే నా స్వహస్తాలతో రాసినా."

'న్యాయంకోసం పోట్లాడ్డమే మా నాయన చేసిన నేరమా కరణమయ్యా?' అని నారాయణ అడగలేదు. "నీ కోపం మా నాయనమిందైతే నేనేం జేసినా కరణమయ్యా? బీద నాకొడుకుని నన్నన్యాయం చేస్తివే!" అన్నాడు గుండె బాదుకుంటూ.

"నువ్వు మాత్రం? మీ నాయన కొడుకువి కావేమిరా?" అన్నాడు కరణమయ్య.

"ఎప్పటిదో పగ ఇప్పుడు నామీద ఎందుకు తీర్చుకుంటావు కరణమయ్యా? ఈ కుడిసేత్తో ఎన్ని దొంగరాతలు రాసి ఎందరి కొంపలు ముంచినావో బగవంతుడా చెయ్యి పడిపోయినట్టు చేసె. ఇంకనైనా కనికరించి ఈ భూమి గొల్ల నారాయణదని సాచ్చెం చెప్పుదొరా!" కడుపుమంట ఆపుకోలేక అనేశాడు నారాయణ.

కరణమయ్య తల అడ్డంగా వూపాడు. "నువ్వన్నెట్టు ఎన్నో పాపాలు చేసిన. చెయ్యి పడిపోనే పడిపోయింది. అయితేమాత్రం నీకు నేనెందుకు సాయం చెయ్యాల? నా చెయ్యి నాకు తిరిగొస్తాదా? ఇప్పుడీ భూమి నీదని సాక్ష్యం చెబితే దొంగ రికార్డులు రాసినందుకు నా గొంతుమీదికొస్తాది. పో, పోయి కోర్టులో కేసేసుకో," అన్నాడు.

"అంతేనంటావా కరణమయ్యా?" ఖిన్నుడై అడిగాడు నారాయణ.

"అంతే పో. నేనేం చేయలేను."

నారాయణ వకీల్ని చూడ్డానికి వెళ్ళాడు.

ఈలోగా మరొకటి జరిగింది.

ముప్పై సంవత్సరాల క్రితం ఎప్పుడో కుందేరు పొంగి చుట్టుపక్కల పల్లెలు కొన్ని మునిగిపోయాయి. ఆ ముంపులో బాగా దెబ్బతిన్నవి హరిజన కుటుంబాలు. వాళ్ళంతా కూడబలుక్కుని ఆ పల్లెలు వదిలేసి ఎగువ ప్రాంతాలకు వలస వచ్చారు. వాళ్ళంతా నారాయణ వుండే వూరు చివర కొట్టాలు వేసుకున్నారు. అప్పట్లో వాళ్ళని కొట్టాలు వేసుకోనిచ్చింది ప్రస్తుతం నారాయణ భూమికి పొరుగువాడైన రామిరెడ్డి తాతగారే. అప్పట్లో ఆయన పంచాయతీ బోర్డు ప్రెసిడెంటుగా వుండేవాడు. ఆ వూరి రెడ్డి అయిన భూమిరెడ్డి నుంచి తీవ్రమైన పోటీ ఎదుర్కొంటున్నాడాయన.

"మరేం పర్వాలేదు. ఇవన్నీ మన స్థలాలే. మీరంతా కొట్టాలు వేస్కోండి. మీ పేర్లు ఓటర్ల జాబితాలో ఎక్కిస్తాను. ఓట్లు నాకు వేయండి," అన్నాడు రామిరెడ్డి తాత.

హరిజనులు సరేనన్నారు.

రామిరెడ్డి తాతగారి రాజకీయాస్త్రం బ్రహ్మాండంగా పనిచేసింది. కొత్తగా తెచ్చుకోగలిగిన ఓట్లతో పంచాయితీ బోర్డు ఎన్నికల్లో ఆయన భూమిరెడ్డిని చిత్తుగా ఓడించాడు. అప్పట్నుంచీ హరిజనులు అక్కడే వుంటున్నారు. వాళ్ళ ఓట్లన్నీ ఎప్పుడూ రామిరెడ్డి తాతకే పడేవి. దాంతో ఆయన జీవితకాలంలో రాజకీయ పలుకుబడికి తిరుగులేకపోయింది.

ఆయన తదనంతరం రామిరెడ్డి హయాం వచ్చింది. అతనూ పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు కావాలని ఆశపడ్డాడు. అయితే చాలాకాలంపాటు ప్రభుత్వం ఎన్నికలు జరపనేలేదు. ఇప్పుడు మళ్ళీ ఎన్నికలు జరుగుతాయనే అలికిడి వినిపించసాగింది.

ఈసారి ఎన్నికల్లో హరిజనుల ఓట్లు రామిరెడ్డికి పడవనే విషయం ముందే తేలిపోయింది. రామిరెడ్డి హరిజనుల్ని ఎప్పుడూ మనుషులుగా చూసినవాడు కాదు. మాల నాకొడుకులు అనే పదం తప్ప వాళ్ళను గురించి అతని నోటివెంట మరోమాట దొర్లిపడదు. దానికితోడు అతని మనుషులుకూడా హరిజనులపట్ల నీచంగా ప్రవర్తించడం మొదలెట్టారు. హరిజనుల ఆడవాళ్ళు కనిపిస్తే ఏడిపించడం, ఒంటరిగా దొరికితే పైటలాగడం వంటివి నిత్యకృత్యాలయినాయి. దాంతో హరిజనులు ఈసారి ఎన్నికల్లో రామిరెడ్డికి బాగా బుద్ధి చెప్పాలనే కృతనిశ్చయంతో వున్నారు.

రామిరెడ్డితో ఎవరు పోటీ చేస్తారో ఇంకా తేలలేదు. అతని తాతగారి కాలంలో గట్టి పోటీ చేస్తూవచ్చిన భూమిరెడ్డి ఇప్పుడు లేడు. అతను బతికుండగ తన కుటుంబం నుంచి ఎవర్నో ఒకర్ని పోటీగా నిలబెట్టేవాడు. వాళ్ళలోనే ఎవరైనా పోటీకి నిలబడవచ్చు. అదే జరిగితే ఈసారి ఎన్నికల్లో హరిజనుల ఓట్లు అవతలకి పోవడం ఖాయం. రామిరెడ్డి ఓడిపోవడమూ ఖాయమే.

దాంతో హరిజనుల్ని స్థలాలు ఖాళీచేయమని పట్టుబట్టాడు రామిరెడ్డి. "మాయబ్బ ఉద్దర కిచ్చిన స్థలాలు. ఎల్లకాలం ఆడనే వుంటారేమిరా మాల నాకొడుకుల్లాలా? ఖాళీ చేయండి," అంటూ తాఖీదు ఇచ్చాడు.

ఆ తర్వాత చాలా కథ జరిగింది. విషయం కలెక్టరు దాకా వెళ్ళింది. ఎప్పుడో ముప్పైసంవత్సరాల క్రితం ఆక్రమించుకున్న స్థలాలు ఇప్పుడు హరిజనులు వదలడమేమిటని కలెక్టరు అడగలేదు. అలా అడగటానికి బదులు ఒక నిర్ణయం చేశాడు. హరిజనులను వేరేచోట స్థలాలు చూపిస్తానన్నాడు. వాళ్ళూ అందుకు ఒప్పుకున్నారు.

ఇక వాళ్ళకు వేరే స్థలం చూపించే విషయం వచ్చేసరికి ఎమ్మార్వోగారికి గబుక్కున దొరికింది నారాయణ సాగుచేస్తున్న భూమే. దాన్ని హరిజనులకు అలాట్ చేస్తూ ఆర్డర్లు కూడా జారీ అయిపోయాయి.

నారాయణ దాంతో మరీబెంబేలెత్తిపోయాడు.

వకీలు పరబ్రహ్మేశ్వరశాస్త్రి నారాయణకు అభయం ఇచ్చేశాడు. "మరేం పరవాలేదు, నీ భూమి ఎక్కడికీ పోదు. టైటిల్ డిక్లరేషన్‌కి సూటు పడేద్దాం. దాంతో అటు గవర్నమెంటువాళ్ళూ ఇటు మాలవాళ్ళూ ఇద్దరూ అణిగిపోతారు. నీ భూమి నీకొస్తుంది," అన్నాడు.

నారాయణ సరేనన్నాడు.

కోర్టులో దావా మూడున్నరసంవత్సరాలు నడిచింది. నారాయణ ఓడిపోయాడు. తనకళ్ళముందే తన భూమి అన్యాక్రాంతమైపోయే పరిస్థితి దాపురించింది.

"ఏమన్నా, ఇంకో టీ ఇమ్మంటావా?" అన్నాడు రాముడు.

స్టేటమెంటకేసి చూస్తూ కూర్చున్న నారాయణ నిట్టూర్పుతో లేచి నిలబడ్డాడు. "వద్దులే."

అక్కడ్నించి అతను తన వూరికి వెళ్ళలేదు. ఆ పూట భోజనం కూడా చేయలేదు. భోం చేయడానికి ఆకలిగా కూడా అనిపించలేదు.

సాయంకాలందాకా పిచ్చివాడిలా అటు ఇటూ తిరిగి పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఆఫీసుకు వెళ్ళాడు.

"రారా, కూర్చో," అన్నాడు పరబ్రహ్మేశ్వర శాస్త్రి.

"అపీలు చేసుకుంటావా?" అడిగాడు చంద్రాయుడు.

నారాయణ బుర్రూపాడు.

"సరే, రేపు లెక్కతెచ్చి. ముందు కాపీ స్టాంపులు పడేయాల. జడ్జిమెంటు కాపీ వచ్చినాక సబ్ కోర్టులో అపీలుచేసుకోవాల," అన్నాడు చంద్రాయుడు.

"అపీలుకెంతైతాది సామీ?" అడిగాడు నారాయణ.

"ఎంతవుతుంది? సూటుకెంతైతాందో దాదాపు అంతే అవుతుంది," అన్నాడు పరబ్రహ్మేశ్వరశాస్త్రి.

నారాయణ గుండె గుభేల్మంది.

"అంతనా?" అన్నాడు నోరు తెరచుకుని.

"అంతేమరి. కోర్టా మజాకా!" అన్నాడు పరబ్రహ్మేశ్వరశాస్త్రి.

నారాయణ మొహం వేలాడేసుకుని తన వూరు తిరిగొచ్చాడు.

వస్తూనే అతను నేరుగా తన ఇంటికి పోలేదు. కరణమయ్య ఇంటికే వెళ్ళాడు.

ఈ మూడునాలుగేళ్ళలోనూ కరణమయ్య పరిస్థితి మరింత క్షీణించింది. ఇది వరకు మాట్లాడగలిగేవాడు. ఇప్పుడదీలేదు. అతనికి అన్నీ మంచంమీదనే జరుగుతున్నాయి.

నారాయణ వెళ్ళేసమయానికి కరణమయ్య మంచం దగ్గర ఎవరూ లేరు. నారాయణ తిన్నగా వెళ్ళి ఆ మంచం పక్కనే నేలమీద కూర్చున్నాడు.

"నీ పగ తీరినాది కరణమయ్యా! కోర్టుకూడా నువ్వు రాసిన దొంగలెక్కే ఒప్పుకున్నాది. ఇంక మాలోల్లు నా భూమి ఇగ్గుకుంటారు," అన్నాడు.

కరణమయ్య కదల్లేదు. గాజు కళ్ళతో నారాయణకేసి చూస్తున్నాడు.

"మీరంతా ఒకటే కరణమయ్యా! రెడ్డికూడా యాపొద్దూ నాకాడ పన్ను తీసుకున్నాక రసీదు యియ్యేలా. ఒక పనికిమాలిన నోటుపుస్తకంలో రాసిస్తావున్న్యాడు. ఆ రెడ్డీ సచ్చినాడు. ఇంక నువ్వు సస్తావ్." కసిగా అన్నాడు నారాయణ.

కరణమయ్య గాజుకళ్ళతో ఇంకా చూస్తూనే వున్నాడు.

"ఎర్రిగాల్లోన్ని చేసి ఈ భూమ్మీద నాకింత అన్యాయం చేస్తే బగమంతుడు మాత్రం మిమ్మల్ని చమిస్తాడా కరణమయ్యా? మీరంతా సక్కంగా నరకానికి పోతారు."

నారాయణగొంతులో క్రమంగా దుఃఖం చోటు చేసుకోసాగింది.

"నా భూమి నాక్కాకుండా చేస్తావా కరణమయ్యా? భూమి పోయినాక కూలిపన్జేసి నా బిడ్డల్ని సాక్కుంటా. కానీ నాకింత చేసినావు నీ బిడ్డలు మాత్తరం అడక్కదింటారు. చేతిలో చిప్పపట్టుకోని ఇంత ముద్ద కోసరం ఇల్లిల్లా తిరిగేరోజు నీ

పిల్లలకి వచ్చితీర్తాది కరణమయ్యా! నా ఉసురు నీ పిల్లలకి తగుల్తాది" నారాయణ గుండె దబదబా బాదుకున్నాడు. "నా ఉసురు తగుల్తాది కరణమయ్యా! ఇంకా తగుల్తాది. ఇంకా తగుల్తాది."

అతని మంచం దగ్గర్నించి దిగ్గున లేచిపోతూ మళ్ళీ ఆగాడు. వెనక్కొచ్చాడు. కరణమయ్యమొహంలో మొహంపెట్టి చూశాడు.

"ఇప్పుడు నీ మంచంకాడ యెవ్వులూ లేరు కరణమయ్యా! ఇప్పుడు నీ గొంతు పిసికి సంపినా నాకడ్డమొచ్చేటోల్లు ఎవ్వులూలేరు." రెండుచేతులూ కరణమయ్య గొంతు దగ్గరికి తీసుకెళ్ళాడు.

కరణమయ్యలో మొదటిసారిగా కొంత చలనం కనిపించింది. ఎడంచెయ్యి ఎడంకాలు ఆడించడానికి ప్రయత్నిస్తూ గొంతులోంచి కీచుమనే శబ్దం మాత్రం తేగలుగుతున్నాడు.

నారాయణ అతనిగొంతు దగ్గరగా పోనిచ్చినవాడల్లా మళ్ళీ చేతులు వెనక్కి తీసుకున్నాడు. "ఛీ" అంటూ ముప్పావు వంతు నిర్జీవంగా వున్న ఆ మొహం కేసి అసహ్యంగా చూసి, చరచరా అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

ఇంటికెళ్ళాక భార్యాబిడ్డల్ని దగ్గరికి తీసుకుని ఏడ్చాడు నారాయణ. "ఉండే అధారం పాయ. ఇంగ మనం ఎవల్దగ్గర్నో కూలిచేసి బతకాల," అంటూ బావురుమన్నాడు.

అతని భార్య అతనంత బేలకాదు.

"ఛా, వూర్కో! పిల్లలు బెదిరిపోయి సూస్తుండారు. మిందికోరటుకు దావా తీస్కెల్లాలని వకీలు చెప్పినాడంటివి గదా! మన భూమి యాడికీ పోదులే," అని ధైర్యం చెప్పింది.

ఆమె ప్రోద్బలం మీదనే ఆ మర్నాడు నారాయణ మళ్ళీ టౌనుకు వెళ్ళి కాపీ స్టాంపులు పడేయించి వచ్చాడు.

అతన్లో ఇప్పుడేమాత్రం ఉత్సాహం లేదు. అపీల్లో కూడా తను గెలుస్తాడని నమ్మకం కుదరడం లేదు. దేవుడే తననింక రక్షించాలి.

ఇంట్లోంచి బయటికిరావడంకూడా అతను మానేశాడు.

అతని భార్య అతన్ని ఓదార్చడానికి ప్రయత్నించి ప్రయత్నించి విఫలమై, ఇక తన చేతకాదని వూరుకుండిపోయింది.

ఒక వారం రోజులు గడిచాయి.

నారాయణ ఇంట్లో మంచంమీద పడుకొని పైకప్పుకేసి చూస్తూ భూమి తన చెయి దాటిపోయాక ఏంచేయాలని ఎడతెగని ఆలోచనల్లో మునిగిపోయివున్నాడు.

అదే సమయంలో బయట్నించి ఒక పిలుపు వినిపించింది–

"నారాయణా!"

నారాయణ లేచికూర్చున్నాడు.

"ఎవరు?"

"నేను రామిరెడ్డిని."

అ పేరు వింటూనే నారాయణలో బద్దకం వదిలిపోయింది. గబగబా బయటికి పరిగెత్తాడు.

"నువ్వా అన్నా! రా, లోపలికి రా," అన్నాడు కంగారు కంగారుగా.

"ఏం లేదు, నీతో మాట్లాడేదుంది," అన్నాడు రామిరెడ్డి.

"రాన్నా, లోపలికిరా," అంటూ లోపలికి దారితీశాడు నారాయణ.

చెట్టంత మనిషి రామిరెడ్డి. ఎత్తుకుతగ్గ లావు. నారాయణ ఇంటి పొట్టి గుమ్మంలోంచి బాగా వంగి లోపలికొచ్చాడు.

నారాయణ నులకమంచం మీద దుప్పటిపరిచాడు.

"కూకోన్నా!"

రామిరెడ్డి హుందాగా కూర్చున్నాడు.

మంచం కీళ్ళు కరకరమన్నాయి.

నారాయణ అతని కెదురుగా నేలమీద కూర్చున్నాడు.

"మరేంలేదు నారాయణా, నీ భూమి నాకమ్ముతావేమోనని వచ్చినా." రామిరెడ్డి మాట్లాడుతుంటే గొంతు ఖణేల్ ఖణేల్ మంటుంది.

నారాయణ తన చెవుల్ని తానే నమ్మలేక నోరు తెరిచేశాడు. రామిరెడ్డి నుంచి ఇలాంటి ప్రస్తావన వస్తుందని అతను కల్లోకూడా అనుకోలేదు.

'అది కాదన్నా!.....,' అంటూ ఏదో చెప్పబోయాడు.

రామిరెడ్డి అతన్ని మాట్లాడనివ్వకుండా చెయ్యి అడ్డు పెట్టాడు. "నువ్వేసిన దావా కొట్టేసినారు - నాకు తెల్సు. అందుకే నేనొచ్చినా నారాయణా! ఆ భూమి నువ్వు నిలుపుకోలేవు. నువ్విస్తానంటే ఎకరా పదివేలకు నేను రాపిచ్చుకుంటా. ఏమంటావు?"

నారాయణకు వెంటనే నోటివెంట మాట వూడిపడలేదు. బుర్రగోక్కుంటూ వుండిపోయాడు.

"నాకు తెల్సు నారాయణా!" మళ్ళీ చెప్పనారంభించాడు రామిరెడ్డి. "నీ భూమి ఎకరా పద్దైదు వేలు పలుకుతాది. పదివేలు ధర అగ్గువే. కానీ, దావాలో ఇరుక్కోనిపోయిన భూమిని పది రూపాయలు పెట్టైనా ఎవురు కొంటారు? నా మాటిని ఒప్పుకో. ఆ లెక్కతో ఇంగోచోట యాడైనా భూమి కొనుక్కో. నాకు మాత్రం ఈ నాలుగెకరాలు ఇచ్చేయి. నీ మంచికోరే చెప్తాండా."

"అది కాదన్నా!....' మళ్ళీ బుర్రగోక్కున్నాడు నారాయణ.

"నాకు తెల్సులే, నువ్వేందనాలను కుంటాండావో! చెప్తా, యిను. నీ భూమి పక్కనే నా భూమి వుండాది. నీ భూమి కొంటే నా భూమి ఇంగా పెరుగుతాది. అవునా? అందుకే నీ భూమి కొందామనుకుంటాండా."

కొద్ది క్షణాలు నిశ్శబ్దం.

"అసలు కారణం ఇంగోటుండాదిలే నారాయణా! సరే, అది గూడా చెప్తా, యిను. నీ భూమి గవర్నమెంటోల్లకుబోతే అల్లు మాల్లోలకేస్తారు. ఇంతకాలం

ఈ మాల నాకొడుకుల్ని ఊరవతల బరిస్తావస్తిమి. ఇప్పుడు నా భూమి పక్కనే వస్తానంటాండారు కొడుకులు. సూడు నారాయణా! నువ్వు గొల్లోనివి, నేను రెడ్డిని. ఉంటే ఈ భూమి మనమద్దెనే వుండాల. మద్దెన ఈ మాలనా కొడుకులెవరంట? ఈల్లకు మల్లా ఓట్లు! వాల్లు నా పక్కకు రానీక లేదు. నేను రానివ్వను. ఇంక కోర్టు అంటావా? కోర్టంటే నాకేం భయంలేదు. కావాల్నంటే మండలాఫీసులో రికార్డులే తిరగరాపిస్తా. అదంతా నీకు తెల్వదులే. చెప్పుమరి, భూమి నాకమ్ముతావా? ఎప్పుడో ఎల్లువొచ్చి, ఈ వూరి మిందొచ్చి పడితే ఈ మాలనాకొడుకులందర్కీ మా యబ్బ కొట్టాలేపిచ్చుకోనిచ్చినాడు. అయ్యి బట్కోని ఇప్పుడాల్లు నామింద ఎగర్లాడతాండారు. నువ్విగిన భూమి నాకమ్మితే యెట్లా ఎల్లువొచ్చి యీల్లంతా పూర్వం పల్లెల్నొదిలేసి లేచినారో అట్టే మల్లా లేపిస్తా. ఎకరాకి పదివేలు ఇస్తానంటండా, చెప్పు, న్యాయమైన మాటేనా?"

నారాయణ ఏదో అనడానికి మళ్ళీ నోరు తెరిచాడు.

అప్పటికే పెరట్లో వున్న అతని భార్య తలుపుచాటుకొచ్చి ఆ సంభాషణంతా వింటోంది. మొగుడు నోరు తెరుస్తూనే ఏం అనేస్తాడోనని గబగబా ఆమె వాళ్ళ ముందుకొచ్చేసింది.

"అన్నా! రామిరెడ్డన్నా! ఆ దేముడే మిమ్మల్ని మాకాడికి పంపినాడు. నా మొగునికి ఒకటంటే ఒకటి తెల్వదు. అట్నే తీస్కోన్నా. ఎకరా పదివేలకిచ్చేస్తాం" అంది.

రామిరెడ్డి ఇంకేమనడానికీ నారాయణకు అవకాశం ఇవ్వలేదు..

"అదీ మాట, నీకంటే మీ ఇంటిదానికి తెలివి జాస్తిగా వుండాది. యాడున్నా బతికిపోతావుపో. ఇంకేమనాకు, ఎకరా పదివేలు. రేపే రిజస్టరు చేయించుకుంటా. అగ్రిమెంటూ, గిగ్రిమెంటూ యేమొద్దు. ఈ అడ్వాన్సు నీకాడుంచు," అంటూ జేబులోంచి పదివేల రూపాయల కట్టలు రెండు తీసి నారాయణ చేతిలో వుంచేశాడు.

నారాయణ వెర్రివాడిలా ఆ కట్టల వంక చూస్తుండగా, ఎలా వంగి లోపలికొచ్చాడో అలాగే వంగి గుమ్మంలోంచి బయటికి వెళ్ళిపోయాడు రామిరెడ్డి.

ఆ రాత్రి నారాయణకు కలొచ్చింది.

కల్లో పెన్నానది పొంగింది. తమ ఊళ్ళోకి ఎల్లువొచ్చింది. ఆ ముంపులో తనూ హరిజనులూ కొట్టుకుపోతున్నారు.

ఈరిగాడు గూడ తన పక్కనే కొట్టుకుపోతుండడం నారాయణకు స్పష్టంగా గుర్తు.

● సాహిత్య నేత్రం – త్రైమాసపత్రిక – ఏప్రిల్–జూన్, 1995 ●

★ ★ ★

వల్లూరు శివప్రసాద్

84

# నాగేటిచాలు

పోస్టమాన్ తెచ్చిన రిజిష్టర్ ఉత్తరం అందుకుంటుంటే చలమయ్య చేతులు సన్నగా వణికేయి. గుండె దడ దడలాడింది. అలాంటివి గతంలో అనేకం వచ్చి, జీవనవృక్షాన్ని కొమ్మకొమ్మగా నరుక్కుంటూ వెళ్ళాయి. ఇక సవినయంగా సమర్పించుకోవటానికి మిగిలింది తలొక్కటే.

చలమయ్య ఆత్రంగా కవరు చించాడే కాని, తానుగా చదివి విషయం తెలుసుకోగలిగిన అక్షరజ్ఞానం వుంటేనా! రచ్చబండ మీద కూర్చుని కబుర్లాడుతున్నవారిలో చదవగలిగినవాళ్ళు లేకపోలేదు. కాని పదిమంది దృష్టికీ విషయం వెళ్ళటం ఇష్టం లేకపోయింది.

ఇంటికెళ్ళేదారిలో బంధువుల కుర్రాడు ఒంటరిగా తారసపడ్డాడు. చదివి విషయం చెప్పమని కవరు అతని చేతిలో పెట్టాడు.

గుంటూరు నుండొచ్చిన ప్లీడరు నోటీసది.

సుభద్రా ఫైనాన్స్ గుంటూరు వారి నుండి ఋణంగా తెచ్చిన నలభైఐదువేలు రొక్కం, అసలు ఫాయిదాలతో తక్షణమే చెల్లించాలనీ, లేకుంటే చట్టపరమైన చర్యలకు సిద్ధపడమనీ సారాంశం.

అప్పట్లో శంకరం అప్పు తెచ్చిన మాట నిజమే! వ్యవసాయ ఖర్చులకోసం పీకల మీదున్న చిల్లర బాకీలు తీర్చటం కోసం ఇరవైవేలు అవసరపడ్తే రాజారావు ఇప్పించేడు. వడ్డీ లెక్కలు ఎట్లా వేసుకున్నా మూడేళ్ళకు నలభైవేలు కూడా కాదే! అసలు నలభై ఐదు వేలంటాడేమిటి? రాసుకున్న కాగితాల్లో తఖరారు చేసేరనుకోవటానికి శంకరం చదువు రానోడేం కాదే !

ఇల్లు చేరుతూనే కొడుకు ఇంట్లో లేని సంగతి పసిగట్టి, "శంకరం ఏడే?" అడిగాడు భార్యని.

"పొయ్యిలోకి పుల్లలు అయిపోవచ్చినై. పత్తికట్టె ఏసుకురమ్మంటే ఎల్లాడు." భర్త చిర్రు బుర్రులాడటం గమనిస్తూనే చెప్పింది సత్యవతి.

"పని కెల్లినోడు తిన్నగొత్తేనా! యాడ పెత్తనాలు కొడ్తన్నాడో!" చిరాగ్గా అనుకున్నాడు.

కొడుకు గురించి భర్త ఎందుకలా చిర్రు బుర్రులాడుతున్నాడో సత్యవతికి అర్థం కాలేదు. అదేమని అడిగితే సమాధానం రాకపోగా ఇంకా కస్సు బుస్సులాడతాడు. అందుకే మరో ప్రశ్న వేయలేదామె.

కాసేపటికి శంకరం వగరుస్తూ బండెడు పత్తికట్టె మోసితెచ్చి దొడ్లో పడేశాడు. తల కండువా దీసి కారుతున్న చెమట ధారలు తుడుచుకుంటూ పంచలోకి వచ్చాడు.

తండ్రీ కొడుకుల మధ్య తలెత్తబోతున్న వివాదం గురించే సత్యవతి ఆందోళన పడసాగింది.

"ఏరా ! అప్పట్లో రాజారావు గుంటూరులో ఇప్పించింది ఎంత?" సూటిగా ప్రశ్నించాడు చలమయ్య.

ఆ ప్రశ్నకు శంకరం ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు. ఇంత హఠాత్తుగా ఆ వివరం తండ్రికి ఎందుకు కావలసి వచ్చిందో అర్థం కాలేదు. తండ్రి ముఖకవళికలు అతన్ని కలవరపెట్టాయి.

"ఇరవైవేలనుకుంటాను" అన్నాడు కలవరపాటును అణచిపెడ్తూ.

చలమయ్య విసురుగా జేబులో నుండి రిజిష్టర్ ఉత్తరం బయటకు లాగి శంకరం చేతికిస్తూ, "అయితే ముండాకొడుకు ఇలా ప్లీడరు నోటీసు ఇచ్చాడేమిట్రా! కోర్టు కీడుస్తాడట కోర్టుకి...." అంటూ కోపంతో ఎగిరిపడ్డాడు.

శంకరం నోటీసు చదువుకున్నాడు. అందులో వున్న విషయం అతనికి చెమటలు పట్టించింది.

నిజం దాచి ఎవరినైనా ఎంతకాలం మభ్యపెట్టగలరు! ఏదో రోజు నిజం బయటపడి తను దోషిలా, ద్రోహిలా అందరి ముందూ నిలబడక తప్పదు. ఇప్పటికైనా వాస్తవం తండ్రికి చెప్పటం మంచిదనుకున్నాడు. గుండె దిటవుపరుచుకున్నాడు.

"వాళ్ళు రాసింది అబద్ధం కాదు." ఉత్తరం మడిచి నీళ్ళు నములుతూ అన్నాడు శంకరం.

చలమయ్య పిడుగుపాటుకు గురైనట్లు అదిరిపడ్డాడు. ఆవేశం కట్టలు తెంచుకుంది.

"మరి మిగిలిన పాతికవేలు ఏవి? పేకాట క్లబ్బుల్లో తగలేశావా? తాగి తందనాలాడావా? ముండలకు పెట్టావా?" అంటూ శంకరం మీదకు పులిలా వురికి మెడపట్టుకున్నాడు.

లోపల్నుండి సత్యవతి పరుగున వచ్చి కొడుకును ఇవతలకు లాగింది. "ఏందయ్యా! మనం ఎండలో కష్టపడుతుంటే ఆడేవన్నా నీడలో కూచున్నాడా? మనం పచ్చడి మెతుకులు తింటుంటే ఆడేవన్నా పరమాన్నాలు మింగుతున్నాడా! ఆడెలాంటోడో నీకు తెలవదా?" దుఃఖం ముంచుకొచ్చిందామెకు.

"నీ కొడుకు సత్య హరిశ్చంద్రుడేనే! ఆ పాతిక వేలు ఏమైనట్టు చెప్పమను." నిలదీశాడు తల్లీ, కొడుకుల్ని

శంకరం రైలు దిగి రాజారావు ఇంటికి వెళ్ళేసరికి రాత్రి ఏడు కావస్తున్నది. అప్పటికే రాజారావు ఆఫీసునుండొచ్చి స్నేహితులతో ముచ్చటేస్తున్నాడు.

ఊర్నుండొస్తూ తెచ్చిన కందిపప్పుమూట లోపలపెట్టి వరండాలోకొచ్చి రాజారావుతో పాటు కూర్చున్నాడు.

"అంతా కులాసేనా! ఇదేనా రావటం?" పలకరింపుగా అడిగాడు రాజారావు.

"అవునన్నా! నాలుగ్గంటల బండికొచ్చినా! ఉదయం బండి కొద్దామంటే ఆవేళకు ఆఫీసుకెళ్ళే తొందర్లో వుంటావాయె!" అన్నాడు శంకరం.

"అదీ నిజమేలే!" అంటూ రాజారావు నవ్వి, స్నేహితులతో మాటల్లోకి దిగాడు.

"నీ అభిప్రాయం చెప్పు రాజా!" మిత్రులిద్దర్లో ఒకతను అందుకున్నాడు.

"గుడ్ ఎస్డా మంచిది కాబట్టే ఆ కంపెనీ షేర్ మార్కెట్లో నూటయాభై అంటే ఎగరేసుకెళ్తున్నారు. ఇప్పుడు అదే కంపెనీ ప్రమోట్ చేస్తున్న స్టీల్స్‌కి కూడా మంచి భవిష్యత్తు వుండొచ్చు. ప్రమోటర్స్ కోటాలో మనకు పదిరూపాయల షేర్ ఇరవై ఐదు రూపాయల కొస్తుంది. అంటే, పదిహేను పెచ్చు. రెండు మూడు నెలల్లో పబ్లిక్ ఇష్యూ కొస్తాడు. నాకు తెలిసి గుంటూరులో బ్రోకర్లు ఇప్పటికే లక్షషేర్లపైనే అమ్మారు. మంచి డిమాండ్ వుంది." చెప్పుకొచ్చాడు రాజారావు.

"నీ అంచనా ఎంత లాభం రావచ్చని?" అడిగాడు మరో మిత్రుడు.

"పబ్లిక్ ఇష్యూకొచ్చిన కొద్దినెలల్లోనే షేర్ వంద పలకొచ్చు."

"అంటే, ఏడాదిలోనే మూడు రెట్లు లాభిస్తాయన్నమాట. అయితే ఒక పని చేస్తా. నా దగ్గర స్ట్రింక్ షేర్లు రెండొందలున్నాయి. వందకు మించి పెరగటం లేదు. అవమ్మితే ఇరవై వేలొస్తాయి. గుడ్‌ఎస్డా ఎనిమిది వందలు నాపేరన బుక్ చెయ్యి." చెప్పాడొక మిత్రుడు.

"నాకూ ఒక వెయ్యి బుక్‌చెయ్యి. బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్ కాన్సిల్ చేసి తెస్తా. ఏడాదిలో రెండు రెట్లు పెరిగితే మాత్రం లాభం కాదూ!" అంటూ మరో మిత్రుడు తన నిర్ణయం చెప్పాడు.

"ఒకే! అలాగే! బ్రోకర్‌కి చెప్తాను" అన్నాడు రాజారావు.

రాజారావు మిత్రులిద్దరూ శలవు తీసుకున్నారు. అతను స్నానం చేశాక ఇద్దరికీ భోజనాలు వడ్డించింది రాజారావు భార్య.

"ఏదో పనిబడే వచ్చినట్లున్నావు?"

"ఏం పనుల్లే! ఊళ్ళో వుంటే అరక్కి, ఊరొదిలితే అప్పకేగా మేం సాగారేది? తొలకరొస్తుంది. య్యగసాయానికి పెట్టుబడి కావాలి." చెప్పేడు శంకరం నవ్వుతూ.

"బ్యాంకీవాళ్ళు అగ్రికల్చరల్ లోన్ ఇస్తారుగదా! ఫైనాన్స్ కంపెనీలంటే వడ్డీ పెచ్చవుతుంది."

"పాత బాకీ చెల్లేస్తేగా కొత్తబాకీ పుట్టేది! అన్ని దారులూ మూసుకుపోయాకనే ఈ దారి పట్టేంది."

"ఎంత అవసరమంటావు?"

"యగసాయానికి పదిహేను, చేబదుళ్ళకి ఐదు. మొత్తం ఇరవైవేలు."

"అప్పంటే తనఖా పెట్టాలిగా!"

"మా రైతుల తలలు తనఖాలకు పనికొచ్చేపాటి విలువలేనివి గందా! పొలం దస్తావేజులు తెచ్చినా!"

"అవి పెట్టినా ఇవ్వడం కష్టంరా!"

"మా కష్టాలు ఎరిగినోడివి గనుకనే ఇప్పిస్తావని అయ్య పంపాడు. బంగారం తెద్దామంటే, యాడుందన్నా? ప్రతియేడూ మా మొక్కల్నిబట్టే పురుగు అడోళ్ళ బంగారం తినేగదన్నా అంతో ఇంతో పంట చేతికందనిస్తంది. నువ్వే నచ్చజెప్పాలి." నిరాశగా అన్నాడు శంకరం.

ఇద్దరూ భోజనం చేసి ఆరుబయట కుర్చీలు వేసుకుని చల్లగాలికి కూర్చున్నారు. ఊరిలో అయినవాళ్ళ మంచి చెడ్డలు, రాజకీయాల గురించి కాసేపు చర్చలు సాగేయి.

"అన్నా! ఇందాక మీరు మాట్లాడుకున్న విషయాలు కాస్త నా చెవి కెక్కినయిలే. మనూళ్ళో కూడా ఈ మధ్య కొందరు చెప్పుకోవటం విన్నాను. షేర్లంటే ఏమిటి?" అడిగాడు ఆసక్తిగా శంకరం.

"కొత్తగా ఒక కంపెనీ పెట్టాలనుకుంటే మూలధనం అవసరం గదా! కంపెనీ తనకు కావలసిన మూలధనాన్ని చిన్న చిన్న వాటాలుగా జారీ చేయడం ద్వారా సమకూర్చుకుంటుంది. ఆ వాటాలనే షేర్లు అంటారు. వాటి కనీస విలువ పది రూపాయలుగా వుంటుంది. దరఖాస్తుదారులకు సాధారణంగా వంద లాట్లుగా ఇస్తుంటారు. అలా స్థాపించబడిన ఆ కంపెనీ సామర్థ్యం, ఆర్జించే లాభాలను బట్టి ఆ వాటాల విలువ వందల్లో పెరగొచ్చు" – ఓపిగ్గా చాలా విషయాలు చెప్పాడు రాజారావు.

రాత్రి చాలాసేపు శంకరానికి నిద్రపట్టలేదు.

"ఏడాదిలోగా మూడురెట్ల లాభం" అన్న మాటలే అతని చెవుల్లో గింగురు మంటున్నాయి.

తనలాంటి పల్లెటూరి గబ్బిలాయిలకు ఇవన్నీ ఏం తెలుస్తాయి! జీవితాంతం తన శక్తినంతా భూమికి ధారపోసి తండ్రి ఏం బావుకున్నాడు? తను మాత్రం ఏం బావుకుంటున్నట్లు! బ్రతుకును కష్టాలతో పేనుకుంటూ ఒక రాటకు కట్టేసుకు తిరగడమేగా! వారసత్వంగా ఆ తాడే తన మెడకు బిగుస్తున్నది. స్కూలుఫైనల్ దాటని తన చదువూ నిరర్థకమైంది.

చదివి ఉద్యోగాలు చేస్తూనో, తెలివితేటలతో వ్యాపారాలు చేసుకుంటూనో ఎండవేడికి అందక, చినుకు తడికి చిక్కక, పట్టణాలలో జనం ఎంత ఆనందంగా బ్రతుకుతున్నారు! ఏ పూట కష్టాన్ని ఆ పూటకు కుండ కెక్కించుకు తినే కూలి నాలి జనం బాధలు, బ్రతుకులూ తమలాటివే కావచ్చు.

ప్రకృతి ప్రతికూల శక్తులతో తలపడుతూ ముడి సరుకుల్ని ఉత్పత్తి చేస్తే దళారులకు, వ్యాపారులకు దండుకోగలిగినవాడికి దండుకున్నంత. వ్యవసాయ ఉత్పత్తుల్ని చవకగా కొనుకోలు చేసే పరిశ్రమలకు రెట్టింపు లాభాలు. పట్టణాలకు సకల సౌభాగ్యాల నందిస్తూ పల్లెలు దరిద్రాన్ని పంచుకుంటున్నాయి.

నగరాల్లో వానొస్తేనేం, రాకుంటేనేం! అతివృష్టయితేనేం, అనావృష్టయితేనేం! ఎండేదేముంది! మునిగేదేముంది! పండేదేముంది! ఎవరికందాల్సిన సౌఖ్యాలు వాళ్ళకందాల్సిందే! పంపకాల్లో తేడాలొస్తే మీటింగులు, సమ్మెలు, నిరసనలు, ధర్నాలు, సమ్మెలు! హక్కులకోసం ఐక్యపోరాటాలు!

"ఎలాంటి శక్తి యుక్తులూ లేకుండా మూగజీవాల్లా పల్లెల్లో పడుంటున్నది తామే గదూ! దోపిడీదార్ల కసాయితనానికి అమాయకంగా తమ తలలే కదూ తెగుతున్నది!

దారీ తెన్నూ తోచక నిస్తేజమవుతున్న జీవితాన్ని గట్టెక్కించాలి. గాలి వాలును బట్టి తెరచాప ఎత్తితేనే పడవ సులువుగా, వేగంగా ఒడ్డుకు చేరేది. దిశ మారిస్తేనే దశ తిరిగేదనుకున్నాడు శంకరం.

"అన్నా! మరో పాతిక వేలు అదనంగా ఇప్పించాలి." ఉదయం బయల్దేరే ముందు రాజారావును అడిగాడు శంకరం.

"అదేమిటి! రాత్రి ఇరవై చాలన్నావుకదా!"

"అన్నాననుకో! ఆ పాతిక వేలుబెట్టి మీతోపాటు నేనూ వెయ్యి షేర్లు కొందామనుకుంటున్నా."

ఆ మాటలకు రాజారావు ఆశ్చర్యపోయాడు. "తెలిసీ తెలీని వ్యాపారాల్లో తల దూరుస్తావెందుకు?" అన్నాడు.

"నమ్మినోడికి సొమ్ము, నమ్మనోడికి దుమ్ము అన్నారు. కలుసుబాటు లేని యగసాయాన్ని బట్టుకుని ఎంతకాలం వేలాడమంటావు! రూపాయికి రూపాయి పోవటమేగాని ఏం దక్కుతున్నది! ఈ రకంగానైనా నాలుగు రూపాయిలు మిగిల్తే అప్పులు తీర్చి చెల్లెలి పెళ్ళి చేస్తాం. కాదనకన్నా!" ప్రాధేయపడ్డాడు శంకరం.

"పొలం మీద అంత అప్పు ఇవ్వొద్దూ?"

"అదేంటన్నా! తనఖా పెడ్తున్న నాలుగెకరాల పొలం విలువ లక్షపైనే వుంటది. షేర్లు మంచి రేటు రాగానే అతని డబ్బు వడ్డీతో సహా తీరుస్తాం గదా!" చెప్పాడు శంకరం.

"ఆలోచన బాగానే వుంది. మీ నాన్న కివన్నీ ఇష్టం వుండొద్దూ?" అనుమానం వ్యక్తం చేశాడు రాజారావు.

"నాన్నకు తెలవకుండానే బాకీ సర్దుబాటు చేసుకుందాం" అన్నాడు శంకరం.

రాజారావు ఫైనాన్స్ కంపెనీవాళ్ళకు నచ్చచెప్పటంతో రుణంగా అడిగినంత ఇవ్వటానికి అంగీకరించారు. తండ్రిచేత అవసరమైన కాగితాల మీద వేలు ముద్రలు వేయించుకొచ్చాడు. తనూ సంతకాలు పెట్టాడు.

డబ్బు తీసుకున్న వెంటనే పాతికవేలు రాజారావు చేతికిచ్చి షేర్లు కొని పెట్టమన్నాడు. ఇరవైవేలు తండ్రికిచ్చాడు. అప్పుతీసుకున్నది అంతేననుకున్నాడాయన.

పనుల ఒత్తిడి తగ్గిన తర్వాత గుంటూరు వెళ్ళి రాజారావును కలిశాడు. షేర్ సర్టిఫికెట్‌లు తీసి శంకరానికివ్వబోయాడు.

"నా దగ్గరెందుకన్నా! నాన్న కంటబడి ఏమిటని నిలదీస్తాడు. సమాధానం చెప్పలేక చస్తాను. ఇక్కడే వుంచు." తీసుకోలేదు శంకరం.

శంకరం ఏడెనిమిది నెలల తర్వాత తిరిగి గుంటూరు వెళ్ళాడు.

"ఏమన్నా! షేర్లు రేటు ఎంత పెరిగినై?" ఆసక్తిగా అడిగాడు.

"ఈపాటికే కంపెనీ పబ్లిక్ ఇష్యూకి వచ్చి వుండాల్సింది. రాలేదు. ఒక షేర్ ఇన్ఫర్మేషన్ పేపర్‌లో ఆ కంపెనీ గురించి అనుమానాస్పదంగా రాసేరు." చెప్పాడు రాజారావు.

ఆ మాటలకు శంకరం భయపడ్డాడు. "కొంపదీసి కథ అడ్డం తిరిగితే నిలువునా మునిగినట్లేన్నా!" అన్నాడు ఆందోళనగా.

"అంతగా కంగారు పడనక్కరలేదు. కాకపోతే అనుకున్నంత లాభం రాకపోవచ్చు నంతే!" ధైర్యం చెప్పాడు రాజారావు.

శంకరం మనస్సులో అనుమాన బీజం పడనేపడింది. తొందరపాటుతో ఇందులో తల దూర్చలేదు కదా అనుకున్నాడు.

ఫైనాన్సియర్స్ నుండి ఉత్తరం వచ్చింది. అది తండ్రి చేతిలో పడనందుకు సంతోషించాడు. అప్పు ఇచ్చి సంవత్సరం దాటిందనీ, అనుకున్న మాట ప్రకారం వడ్డీ చెల్లు పెట్టాల్సిందనీ సారాంశం. శంకరానికి కాళ్ళూ చేతులాడలేదు.

రాజారావును కలిసి ఉత్తరం చూపాడు. కొంత గడువిచ్చేలా చూస్తానని హామీ ఇచ్చాడతను.

"షేర్లు కొని సంవత్సరం దాటింది కదా! ఒకరెట్టన్నా పెరగలేదంటావా?" ఆశగా అడిగాడు శంకరం.

"ఏం పెరగటమోరా! ఇన్‌కంటాక్స్ దాడి జరిగి ఆ కంపెనీ ఛైర్మన్‌ను అరెస్ట్ కూడా చేశారట. ఈ మధ్యనే పేపర్లో చదివాను. తప్పటడుగు వేశామేమోననిపిస్తుంది." అన్నాడు రాజారావు.

శంకరానికి నిలువెల్లా చెమటలు పోసుకొచ్చాయి. ఆశలన్నీ కుప్పకూలి పోతున్నట్లనిపించింది.

నెలల తర్వాత ఫైనాన్సియర్స్ దగ్గర్నుండి రిజిష్టర్ ఉత్తరం వచ్చింది. తండ్రి తన చేతికే ఇచ్చి విషయం ఏమిటని అడిగాడు. తెచ్చిన ఇరవైవేలు అప్పుకు వడ్డీ జమవేయించమని రాసేరన్నాడు.

"తెచ్చిందంతా ఎరువులకు, పురుగు మందులకు పోస్తిమి. పండిన పంట సగం పురుగు తినిపోయె. తినక దిగిడిచిన పంటనేమో తోచినకాడికి లెక్కగట్టి దళారీలు తిన్నారు. మనకేం మిగిలింది! అప్పులు, అవసరాలు! ఈ యేడన్నా పిల్లకు సంబంధం చూద్దామనుకుంటే, బతుకులు ఇట్లా కుంటుతావుండె." తండ్రి కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాడు.

"అన్నా! ఎంతో కొంతకు అమ్మి పెట్టు. అసలుకు, వడ్డీకి సరిపడా వచ్చినా చాలు. ఎంతకాలం అయ్యకు తెలవకుండా దాచగలను?" రాజారావును కలిసి బ్రతిమాలు కున్నాడు.

రాజారావు భారంగా నిట్టూర్చాడు. "ఆ కంపెనీ గుడ్‌విల్ దెబ్బతిందిరా! పదిరూపాయలకు కొంటారన్న నమ్మకం కూడా లేదు. తెలిసీ, తెలీని వ్యవహారాలు నీకెందుకంటే విన్నావు కాదు." అసలు సంగతి బయటపెట్టాడు.

కొద్దిసేపు శంకరం నోటమాట పెగల్లేదు. పిచ్చిచూపులు చూస్తుండిపోయాడు. కళ్ళలోకి నీరు అలలు అలలుగా పొంగుకువస్తున్నది. బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

"అన్నా! వచ్చిన కాడికి తెగనమ్మి పెట్టు. ఫైనాన్స్‌వాళ్ళకు వడ్డీ జమవేస్తేనన్నా కొంత గడువు దొరుకుతుంది. నాన్నకు తెలిసేలోగా ఏదో ఉపాయం చూడొచ్చు." చెప్పి వెనుదిరిగాడు.

నెల తర్వాత రాజారావును కలిశాడు.

"ఎనిమిది రూపాయల చొప్పున అమ్మేసరికి బ్రోకర్‌కి తలప్రాణం తోకకొచ్చిందట. అమ్మిపెట్టినందుకు కమీషన్ పోను మిగిలిన డబ్బు ఇదిగో" అంటూ డబ్బు తెచ్చి చేతిలో పెట్టాడు రాజారావు.

ఇరవైఐదువేలుపెట్టి కొంటే చివరకు ఎనిమిది వేలన్నా దక్కలేదు. డబ్బందు కుంటుంటే శంకరం చేతులు వణికాయి.

"నా రోజులు బాగుండి డబ్బందక కొనలేదు. నా స్నేహితులు ఈ గొడవ ముందే పసిగట్టి అయినకాడికి అమ్ముకుని నష్టం లేకుండా బయటపడ్డారట. ఇలా జరగటం నీ దురదృష్టంరా!" సానుభూతి చూపాడు రాజారావు.

"నమ్మబలికినోడికి సొమ్ము, నమ్మినోడికి దుమ్ము! ఏమనుకొనేం లాభంలే!" కన్నీళ్ళు తుడుచుకున్నాడు శంకరం.

ఆ డబ్బు తీసుకెళ్ళి ఫైనాన్స్‌వాళ్ళకు వడ్డీ కింద జమవేయించి గడువు ఇమ్మని కాళ్ళు వేళ్ళాపడి సరేననిపించుకున్నాడు.

ఆ తర్వాత అసలుగాని, వడ్డీగాని చెల్లువేసే అవకాశం చిక్కలేదు. నోటు గడువు తీరబోతున్నదని ఫైనాన్స్‌వాళ్ళు ముందు జాగ్రత్తగా లాయర్ నోటీసు ఇచ్చారు.

☆ ☆ ☆

కొడుకు ద్వారా అంతా తెలుసుకున్న చలమయ్య కోపం నిగ్రహించుకోలేకపోయాడు. మొకరానికున్న పలుపుతాడు లాగి శంకరం వళ్ళు వాతలు తేలేలా కొట్టాడు. సత్యవతి నెత్తీనోరు కొట్టుకుంటూ అడ్డుపడింది.

"చెట్టంత బిడ్డను కొట్టేందుకు చేతులెట్టావస్తన్నయ్! ఇంత ఆస్తీ ఎవరు నుప్పేస్తే కర్పూరంలా కరిగిపోయింది? ఇట్లా శని రాసుంటే ఆడేం చేస్తాడు?" బిడ్డను వాటేసుకుని దెబ్బలు కాసుకుంటూ బావురుమన్నది.

"ఉన్ననాలుగెకరాలు అప్పులపాలుజేసి, ఎదిగిన పిల్లను ఏ అయ్యచేతిలో పెడ్తామే! ఇంత బతుకు బతికినూళ్ళో పూట గడవటంకోసం కూలంటూ ఎన్ని గడపలెక్కి దిగాల్నో వాడ్నే చెప్పమను!" అంటూ తల్లడిల్లపోయాడు చలమయ్య.

చలమయ్య ఆవేశం కాసేపటికి తగ్గుముఖం పట్టింది. తండ్రిచేత తిన్న దెబ్బలకు బాధను మూగగా దిగమింగుకుంటూ ఒక మూల పడున్న బిడ్డను చూస్తూ కడుపు తరుక్కుపోతుంటే వుండుండి ఏడుస్తున్నది సత్యవతి. చుట్టింట్లో మోకాళ్ళ మధ్య తల ఇరికించుకుని పసిదానిలా వెక్కిళ్ళు పెడ్తున్నది కస్తూరి. శంకరం పుట్టి బుద్ధెరిగాక తప్పుచేసి మాట పడ్డవాడూ కాదు, దెబ్బలు తిన్నవాడూ కాదు.

ఇంట్లో వుండేందుకు మనస్కరించక వీధిలోకి నడిచాడు చలమయ్య. కాళ్ళెటులాగితే అటు నడుస్తున్నాడు. ఆలోచనలు గత జీవితంలోకి జారిపోయాయి.

పాతిక ఎకరాల భూమి, మూడు జతల ఎడ్లు, ఆరేడు పాడి గేదెలు తండ్రి అప్పగించాడు. ఇద్దరు జీతగాళ్ళున్నా సేద్యపు పనులతో కూసింత తీరిక చిక్కేది కాదు. పాడిపంటలతో జీవితం పచ్చగా కళకళలాడుతుండేది. నేడు ఆ వైభవం, వైభోగం ఏవి?

ఊటలేని బావిలో ఎన్నిమార్లు బొక్కెన వేస్తే మాత్రం నీటితో నిండుతుందా? యుగసాయం కూడా అంతే!

తనొకరకంగా, తన బిడ్డ మరొక రకంగా మోసపోయారు. మోసగించటమే తెలివితేటలకు గీటురాళ్ళుగా చెలామణీ అవుతున్నరోజులివి.

తండ్రిపోయి, యగసాయం తన పెత్తనం కింది కొచ్చిన యేడది. దొరపొగాకు వేస్తే మంచి దిగుబడి వచ్చి వేలకు వేలు ఆదాయం వస్తుందని ఆశతో రైతులు పోటీలు పడుతున్నకాలం. ఏకంగా ఇరవై ఎకరాల్లో పొగాకు వేయాలని తలపెట్టాడు. ఊరిపి సలపని పనులు.

పొలం దుక్కులు దున్ని, పదును చేసి, నారు కొనితెచ్చి నాటేశాడు. సకాలంలో వానలొచ్చి మొక్కల్ని సాకినయ్! ఎరువులు, పురుగులమందులు అవసరమెరిగి చల్లాడు. కాడలు నిలువెత్తు లేచి, ఆకులు ఏనుగు చెవుల్లా దిగలారినయ్! చూసినోళ్ళంతా నోరెళ్ళ బెట్టారు. వంద క్వింటాళ్ళ పైనే దిగుబడన్నారు. చలమయ్య దశమంతుడన్నారు. కాదు పిల్లల అదృష్టమన్నారు.

ఆకు విరిసి (కర్రలకు ఆకులు అల్లే కొయ్య పరికరం) గుర్రాలకు కర్రలకు పొగాకు అల్లించి, బేరన్‌లకు ఎక్కించాడు. ఆకును కాల్పించి, బేరన్ దించాడు. పందిరిలో రాక్స్ పెట్టించాడు. పదునైన రోజుచూసుకొని మండెలు తొక్కించాడు. ఆకులు గ్రీడ్ చేయించాడు. ఒకటో నంబరాకు వంద క్వింటాళ్ళయింది.

కంపెనీ బయ్యర్లు ఎగబడ్డారు. ఎరవేశారు. పోటీలు పడ్డారు. సరుకిచ్చిన నెలలో డబ్బిస్తామన్నారు. మంచి రేటుకు బేరం కుదుర్చుకుని పంట అప్పగించాడు.

నెలాగి డబ్బుకోసం కంపెనీకి వెళ్ళాడు. ఇదిగో నిన్ననే సరుకు విదేశాలకు ఎక్కించామన్నారు. నెలాగి రమ్మంటే వెళ్ళాడు. డబ్బు ఇంకా అందలేదంటూ ఒక వంతు మాత్రం ఇచ్చారు.

విదేశాల్లో అనుకున్నంత రేటు పడలేదనీ, నష్టపడ్డామనీ, మరికొంత వ్యవధి ఇమ్మనీ దొంగ ఏడుపులు ఏడిచారు. నమ్మాడు తను.

తొలకరొచ్చింది. తిరిగి పొగాకే వేశాడు తను.

"మేం ఇబ్బందుల్లో వున్నా మీకు పెట్టుబడులకు అవసరం గదా!" అంటూ మరికొంత డబ్బిచ్చారు.

మరుసటి యేడు కూడా మంచి దిగుబడొచ్చింది. బయ్యర్లు ఎగబడసాగేరు. రేటు ఐదో పదో తక్కువైనా మంచి కంపెనీవాళ్ళకు పంట ఇద్దామనుకున్నాడు.

ముందరేడు బకాయివున్న కంపెనీవాళ్ళూ వచ్చారు. వడ్డీ కలిపి పాతబాకీ, కొత్త పంట డబ్బూ అణాపైసత్తో అప్పగిస్తామన్నారు. రాదంటే పాతబాకీకి నీళ్ళొదులుకోవాల్సి వస్తుందని భయపడ్డాడు. వ్యాపారస్తులకు మాత్రం ఇబ్బందులుండవాని, మాట నమ్మకంమీద వాళ్ళకే పంట అమ్మాడు.

ఏడాదిపాటు తిరిగినవాడు తిరిగినట్లే వున్నాడు. అదిగో ఇదిగో అంటూ వాయిదాలు. తియ్యటి కబుర్లు. అప్పుచేసి తెచ్చిన పెట్టుబడులకు వడ్డీలు పెరుగుతున్నాయి. గట్టిగా నిలదీస్తే వెయ్యో, రెండువేలో చేతికిస్తున్నారు. ఇవ్వాల్సింది లక్షకు తక్కువుండదు. తనలానే దిక్కుతోచక తిరుగుతున్న ఎందరో రైతులు.

ఓసారి వెళ్ళేసరికి కంపెనీకి తాళాలు పెట్టి వున్నాయి. దివాళా తీసిందన్నారు నష్టాలొచ్చి. కంపెనీ పెట్టిన పెద్దలుమాత్రం బంగళాల్లో వుంటూ కార్లలో తిరుగుతూనే వున్నారు.

నిజం నిలకడ మీద తెలిసింది. అదొక బినామీ కంపెనీ. ఊరూ పేరు లేనివాడి పేరు మీద పెట్టారు. సరుకు తరలించి, దొంగలెక్కలు రాయించి, కాగితాల మీద దివాళా తీయించారు. లక్షలాది రూపాయిలు పొట్టనేసుకున్నారు. అమాయక రైతుల్ని నిలువునా ముంచారు.

తను పోలీసు కేసు పెట్టాడు. అయిదూ పదీ తిన్నారు. హడావుడీ చేశారు. పట్టనూ లేదు. శిక్షలు వేయించనూ లేదు.

"ఎందుకు సామీ! పనులొదులుకొని పిచ్చోడిలా ఎందుకు టేసెను చుట్టూ తిరుగుతావు? బుగ్గయిందేదయినా తిరిగి చేతికి అమరుద్దా. ఇవి పెద్దోళ్ళ యవ్వారాలు. ఏ నోటి కందాల్సంది · ఆ నోటికందాక నీ తరపున నోరు తెరిచేదెవరు? పోకుండా మిగిలిందే దక్కుదలనుకో. వెళ్ళెళ్ళు." రోజూ పోలీసు స్టేషన్ చుట్టూ తిరుగుతుంటే జాలిపడి ఒక పోలీసు నిజం చెప్పాడు.

అప్పులు తీర్చటానికి వున్న పళంగా ఐదెకరాలు తెగనమ్మాల్సి వచ్చింది.

పోయిందెటూ పోయింది. గుండెలో బలం వుంది. చేతుల్లో సత్తువుంది. కురిసేందుకు మబ్బుల్లేవా! చినుకులు బడితే పదునెక్కటానికి ఇరవై ఎకరాల కొండ్ర లేదా! గింజలు చల్లితే పేనం పోసుకుని మొలకెత్తవా! మొక్కలు చల్లని మా తల్లుల్లా పంటల్ని కనవా! బిడ్డలకోసం ధైర్యం కూడదీసుకుని దుఃఖం దిగమింగుకున్నాడు.

నాగేటి చాళ్ళను ఇరవైయేళ్ళ పైనే చెమటతో తడిపి సేద్యం చేశాడు. వర్షాలు కురవకో, గాలిపాటు తప్పో పండలేదనుకున్న యేడాది ఖర్చులు దండగ పడితే, పండిందనుకున్న యేడు గిట్టుబాటు ధరలు లేక మిగులు తేలేది కాదు. చిగుళ్ళేస్తుందనుకున్న జీవితం మోడుబారే వుంది. ఆదాయం మించిన సేద్యపుఖర్చులు, కుటుంబ అవసరాలు భూమిని ముక్కలుగా మింగేశాయి.

చివరకు మిగిలింది నాలుగెకరాలు. అదీ ఇప్పుడున్న అప్పు తీర్చాలంటే అమ్మక తప్పదు. అమ్మి బాకీలు తీరిస్తే మిగిలేది ఎంత? కూతురి పెళ్ళి ఎట్లా చెయ్యాలి? ఏం చేసుకుతినాలి? ఏది చూసుకు బతకాలి?

చలమయ్య ఆవేదనతో కుమిలిపోసాగాడు. బ్రతకాలనే ఆశ ఒక్కసారిగా సన్నగిల్లింది. ఆ బలహీన క్షణాల్లో అతనో నిశ్చయానికొచ్చి ఇంటికేసి నడిచాడు.

ఇంట్లోకి వెళ్ళి నిశ్శబ్దంగా అల్మారా వెదికాడు. కావాలనుకున్నది అనుకున్న చోటలేదు. నాలుగు రోజుల క్రితం తనే సర్దిపెట్టాడు. కొడుకూ, తనూ ఒక విడత కొస్తుందని లెక్కలు గట్టారు. ఇంతలోకే ఏమైంది? దాంతో ఎవరికి అవసరమొచ్చింది?

ఉన్నట్లుండి ఒక ఆలోచన తళుక్కున మనస్సులో మెదిలి ఉలిక్కిపడ్డాడు. గుండె గుభేలు మన్నది. నిలువునా వణుకు పుట్టుకువచ్చింది.

"ఏవే! శంకరం ఏడి?" ఇంట్లో కలయజూస్తూనే ఆతుర్దాగా భార్యను అడిగాడు.

"ఇంతకుముందే బయటికెళ్ళినట్లున్నాడు!" చెప్పిందామె.

"ఏమన్నా చెప్పాడా?"

"బిడ్డ చెప్తేమాత్రం చెవివేసుకునే వాళ్ళున్నారా?" ఆమె కంఠంలో దుఃఖం పొంగుకొచ్చింది.

చలమయ్య కొచ్చిన అనుమానం బలపడింది. క్షణాలు లెక్కిస్తూ కూచుంటే ప్రాణాలు దక్కవనుకున్నాడు. ఒక్క ఉదుటున బయటపడ్డాడు.

గనేల మీరుగా, పొలాల కడ్డంపడి పరిగెత్తసాగేడు. ఆయాసంతో వగరుస్తున్నాడు. సరిగా పెరకని పత్తి మొదళ్ళు పాదాల్ని కుళ్ళబొడుస్తున్నాయి. రక్తపు చారికలతో మట్టిపెళ్ళలు ఎర్రబడుతున్నాయి.

"ఒరే! కన్నోళ్ళకు కడుపుకోత పెట్టమాకురా!" పదేపదే సణుగుతూ పరిగెడుతున్నాడు. కళ్ళు జలపాతాల్లా వర్షిస్తున్నాయి.

కావలి మనిషొకడు వూళ్ళోకొస్తూ తారసపడ్డాడు. "వీరయ్యా! మా శంకరంగాని కంటబడ్డాడ్రా నీకు?" రొప్పుతూ అడిగేడు.

"అవుపడ్డాడయ్యా! ఈ యాలప్పుడు ఎక్కడికని అడిగితే, 'యాలదేవుందిరా! ఎల్లాల్సిన చోటికే ఎల్తున్నాలే' అన్నాడు." చెప్పాడు వీరయ్య.

"దేవుడా! బిడ్డని దక్కించు!" అనుకుంటూ శక్తిని కూడదీసుకుని ముందుకు దూసుకెళ్ళసాగేడు చలమయ్య.

పడమటి ఆకాశంలోకి వాలుతున్న సూర్యుడు పరిగెడుతున్న చలమయ్యకు తోడు నడుస్తున్నట్లుగా వుంది.

చేలోకి అడుగు పెట్టాడు. పత్తిమండెల చాటుకి పరిగెత్తాడు. పురుగు మందు సీసా మూత సీలు దీసే ప్రయత్నంలో వున్న కొడుకు కంటబడేసరికి ప్రాణం లేసొచ్చింది.

"రేయ్! నువ్వు మట్టయితే ఏం జూసుకు బతకాలిరా! నా తల కొరివి పెట్టాల్సినోడివి. ఆ మందు ముందుగా నా గొంతులో పొయ్యి" అంటూ కొడుకు ప్రక్కన నిస్సత్తువగా కూలబడ్డాడు.

శంకరం నిర్ఘాంతపోయాడు. పురుగు మందు సీసా చెయ్యి జారింది.

"అయ్యా! ఈ భూమిని నమ్ముకున్నంత కాలం ఈ దరిద్రం తీరదనుకున్నా! దారి మళ్ళితేనన్నా సుఖపడ్తామని ఆశపడ్డానయ్యా! కాని ఇట్లా దారితప్పి గోతిలో బడతాననుకోలేదు." ముఖాన్ని చేతుల్లో దాచుకుని ఏడవసాగేడు.

"శంకరం! విత్తనాలు నాటాల్సిన ఈ చాళ్ళలో నిన్ను పాతటానికట్రా ఇన్నేళ్ళు పేనానికి పేనంగా సాకింది?" అంటూ కొడుకుని పసివాడిలా గుండెల్లోకి పొదువుకుని మూగగా రోదిస్తుండిపోయాడు చలమయ్య.

● ఆహ్వానం – మే, *1995* ●

★ ★ ★

85

ఎ. అప్పల్నాయుడు

# జీవనస్రవంతి

"ఆ లూనా మీద వొస్తుండు. సూడూ...అడికి సెడ్డ గోరోజినం వుందనుకో..." టూటవున్ రైటర్ కళ్లల్లో నిప్పులు గక్కుతూ, ప్రక్కనే వున్న హెడ్‌కి చూపేడు. ఆ హెడ్ లూనాని చూసేడు.

"...అడ్ని యెక్కడో చూసినట్టుగుంది. యెక్కడ చెప్మా...?" హెడ్ గోక్కున్నాడు హెడ్ కానిస్టేబులు.

లూనా వచ్చేసింది. మున్సిపల్ గెస్ట్‌హౌస్ ముందరి గేటువద్ద యెవరి ఆలనాపాలనా లేకపోయినా బేఖాతరుగా పెరిగిన అశోకచెట్లలో ఒకదాన్ని యెంచుకొని, దానిముందు స్టేండ్‌వేశాడు. డిక్కీలోంచి డైరీ తీసుకొని–– గెస్ట్‌హౌస్ అంతటి వైపూ దృష్టి సారించేడు. అతనికి రైటర్ కన్పించేడు.

"... మున్సిపల్ గెస్ట్‌హౌస్ ముస్తాబయిన పెళ్ళి.పందిరిలా వుందండీ..." అన్నాడు, రైటర్‌తో. గెస్ట్‌హౌస్ ముందరి మైదానంలో పిచ్చి మొక్కలూ, గడ్డి దుబ్బులూ పీకేసారు. శుభ్రంచేసి రంగుల సున్నపు పొడితో బోర్డరు గీసేరు. గోడలు, అపుడే మేకప్ అద్దిన మొహాల్లా వున్నాయి. గెస్ట్‌హౌస్ పోర్టికోలో... యెపుడూ వెలగని గొట్టపుదీపం ఆ రోజు తెల్లగా వెలిగిపోతోంది. హాలులోకొస్తే – మున్సిపాల్టీ వాసన గాక, సెంటెడ్ ఫినాయిల్ వాసన! ఆశ్చర్యపోతూ, లూనా వ్యక్తి మళ్ళీ–

"మొత్తానికి మంత్రిగారి రాకతో గెస్ట్‌హౌస్‌కి... పెళ్లిపందిరి డెకరేషనొచ్చింది..." అంటూ వరండాలో మిత్రులకోసం కళ్ళతో వెదికాడు.

రైటరు కుడిచేతి ముడుకుతో హెడ్ కడుపు ఎడమభాగంలో చిన్న స్ట్రోక్ యిచ్చాడు– చూసేవా? ఈడి గోరోజినం.. అన్నట్లు – ఆ తర్వాత ఆ వ్యక్తి వైపు చూస్తూ...

"యింకా నయం. ముస్తాబయిన పెళ్ళిపందిరన్నావు... శోభనం గదన్లేదు.." అన్నాడు.

లూనా వ్యక్తి ఆ మాట వినలేదు... వరండా చివరివైపు నడిచేడు. హెడ్, కడుపు ఎడమ భాగం తడుముకుంటూ. "యెవుడాడు?" అనడిగేడు.

"ప్రెస్, ప్రెస్సోడు! స్పెషల్ కరస్పాండెంటూట. అందికే, ఆ, గోరిజినం..." జవాబిచ్చి జేబులోంచి గోల్డ్‌ఫ్లాక్ ప్లెయిన్ సిగరెట్ పెట్టీ, అగ్గిపెట్టీ తీసేడు.

హెడ్... "ఓస్... ప్రెస్సా..!" అని, తేలిగ్గా నాలిక చప్పరించేసి చేయి చాచాడు సిగరెట్ కోసం. రైటర్... నాలుక్కరుచుకున్నాడు.. సిగరెట్ పెట్టె తీసినందుకు...!

"పెట్టె మీద రెండు పడీసేరు మా ఊరిల! ఇక్కడో..?" సిగరెట్లపై పడిన ధరలను చెప్పాడు హెడ్.

"ఇక్కడా? ఏమో..! పెంచే వుంటారు. నేను సిగరెట్లు కొన్నుగదా. పార్టీలొస్తే...పంపిస్తుంటాను." సిగరెట్టిస్తూ రైటర్.

ఆ సిగరెట్ అంటించి, పీల్చి, పొగవదిలి...

"... పోలిటిక్స్‌లోకి క్రిమినల్స్ యెలిపోవొస్తం(డని గోల గోల చేస్త(న్నగాని వెల్ఫేరోళ్లు (సంక్షేమ పథకాలవాళ్లు...) యెలిపోవొస్త(నని తెలుసుకోరు— అడ్డమయిన వెల్ఫేర్ ప్రోగ్రాం కోసమే గదా... అడ్డదిడ్డంగా అన్నీటికి ధరలు పెంచేసేరు." అక్కసు వెళ్ళగక్కేడు హెడ్. సిగరెట్ పొగ నోట్లోంచి ముక్కు రంధ్రాల్లోంచీ... నీళ్ళను పీల్చి, వొదిలే నీటి ఏనుగులా వొదుల్తున్నాడు హెడ్.

"... యీ ప్రెస్సు కొడుకులు... ధరల మీద రాయరు..." మళ్లీ ఆ లూనా వ్యక్తి మీదకే యెక్కుబెట్టాడు రైటర్.

"ఆళ్లురాస్తే...తగ్గిపోతాయేటి? జనం, హరిగోసబెడతేనా...లేదు! మళ్లీ ఆ జనాన్ని గోసబెట్టకుండా— మనమే లాఠీలూ, తుపాకులూ యెత్తుతాం. మనం తగ్గించమని అడగాలేము అడిగేవోళ్లకి సపోర్టూ యివ్వలేం..." సిగరెట్ పీక విసిరేశాడు హెడ్.

కళ్ల మీదకి, స్కూటర్ హెడ్ లైట్ పడింది. కళ్లకడ్డంగా చేయిపెట్టుకొని, నోటిలో బండబూతు పదం పెట్టుకొని—

"లైటార్పొచ్చు గదేటి..." కేకేసాడు హెడ్.

స్కూటర్ వాలా, లైటార్పేసి, స్టేండ్ వేసి, వస్తూ...

"నమస్తే సార్... రైటర్‌గారు" అని రైటర్‌ని పలకరించి, ప్రక్కనున్న హెడ్ వైపు ప్రశ్నార్థకంగా చూసి, ఓ చిర్నవ్వు విసిరేసి, లోనకి నడిచేడు.

"... యెవుడీడు?" అడిగేడు హెడ్.

"... యిలగుండాల ప్రెస్సోడంటే..." రైటర్ మెచ్చుకుంటూ!

హెడ్, కళ్లలో స్కూటర్‌లైట్ యింకా పోలేదు. కళ్లు పులుముకుంటూ——

"యీడూ. ప్రెస్సోడేనా! అందికేనన్నమాట... ఆ గోరిజినం..." అన్నాడు కోపంగా.

"...సె.సే. ఈడలాటోడు గాదు. మంచోడు. మనం చెప్పిందే రాసుకుంటాడు. మనకొక్కోసారి... యిన్ఫర్మేషనూ యిస్తుంటాడు. సరదాగా జర్నలిజం చేస్తండు. జరక్కగాదు. బోల్డు ఆస్తివుంది. జంటిల్మేన్." కాండక్ట్ సర్టిఫికేట్ యిచ్చేడు రైటర్.

ఇద్దరు పత్రికాప్రతినిధుల కాండక్ట్ గురించి, యిద్దరు రక్షకభటులు—— ఆ విధంగా ముచ్చటించుకుంటుంటే— బంగ్లాలోంచి వారి ఇన్స్పెక్టర్‌లు బయటికి వచ్చేరు. ఇద్దరు రక్షకభటులూ, లేచి నిల్చున్నారు. ఇన్‌స్పెక్టర్లిద్దరూ... బులెట్ మోటార్లు తీసేరు.

"...పోలీసులంటే...యితని పాలేర్లనుకుంటండా?" ఒక ఇన్స్పెక్టర్ ప్రశ్నించి...బులెట్ స్టార్ట్ చేశాడు.

"...పాలేర్లయినా ఆ పని చెయ్యలేరు..." మరో ఇన్స్పెక్టర్.

ఇద్దరు రక్షకభటులూ ప్రశ్నార్థకంగా చూసేరు-- మంత్రిగారు రక్షణశాఖవారికి-- యేపని చెయ్యమన్నారా -- అని!

బులెట్ మోటార్లు... పెద్దగా శబ్దం చేస్తూ కదిలిపోయేయి.

☆ ☆ ☆

బంగ్లాలో, పెద్ద హాలులో అనుచరుల మధ్య ఆసీనులై వున్నారు మంత్రిగారు. విలేకర్లు.. కుర్చీల్లో సర్దుకు కూర్చున్నారు. మంత్రిగారిపార్టీ జిల్లాకమిటీ అధ్యక్షులు- విలేకరులకు, మంత్రిగారి పత్రికా ప్రకటన జిరాక్స్ కాపీ అందించేరు. ఆ నియోజకవర్గ ముఖ్యుల్లో ఒకాయిన... అందంగా పార్శెల్ చేసిన పెద్ద పెద్ద ప్యాకెట్లు - విలేకర్లకు అందించేరు.

మంత్రిగారు ఫోన్ అందుకొని --

"అఁ.. ఎస్. వస్తున్నాం. ఇపుడే.. ఓకే..." అని ఫోన్ పెట్టేసి-- లేచి నిల్చొని చేతులు జోడించేరు- శలవ్ తీసుకోండిక -- అన్నట్లుగా.

లూనా విలేకరి-- యిదేనా ప్రెస్‌మీట్- అని ఆశ్చర్యపోతున్నాడు. స్కూటర్ విలేకరి మంత్రిగారి ఫోటో.. తీస్తున్నాడు. మరోవిలేకరి, పార్టీ జిల్లాకమిటీ అధ్యక్షునికి సైగ చేస్తున్నాడు. మంత్రి ప్రక్క నిల్చోమని.

మంత్రిగారు బయటికి నడిచేరు, మందీ, మార్బలం, కదిలింది. వాహనాల కాన్వాయ్‌తో... గెస్ట్‌హౌస్ మెరిసిపోయింది.

"...ఈ మాత్రం దానికే, ప్రెస్ మీట్ అని రప్పించడమెందుకూ? ఇదేదో ఆఫీసుకే పంపించేస్తే... చూసుకోమా...?" లూనా విలేకరి విసుగ్గా.

"... పత్రికా ప్రకటన వొక్కటే యిచ్చారేంటండీ? మరి, యిదో? ఇదే అసలుది..." చేతిలో ప్యాకెట్‌ని, చూపుతూ నవ్వేడు ఓ విలేకరి. లూనా విలేకరి అప్పుడు చూసుకున్నాడు ప్యాకెట్‌ని. పార్శెల్ బాంబ్‌లా - అన్పించింది. పార్శెల్ అక్కడే వొదిలేసి, పత్రికా ప్రకటన తీసుకొని -- లూనా యెక్కేడు.

ఆఫీసుకి చేరాక -- లూనా విలేకరి, టేబుల్ మీద ప్రకటన పెట్టేసి, కుర్చీలో కూర్చుని -- రింగవుతోన్న ఫోన్ అందుకున్నాడు.--

"అఁ.. అఁ పంపిస్తాను. టి.వి.ఆపరేటర్‌కిస్తాను." ఫోన్ పెట్టేసి, మంత్రిగారి ప్రకటన అందుకున్నాడు.

"జనజీవన స్రవంతిలోకి రావాల్సిందిగా.. నక్సల్స్‌కు పిలుపు" శీర్షికతో ఎన్నికల వాగ్దానాలు నెరవేరుస్తామనీ, సారాపై నిషేధం కొనసాగిస్తామనీ, అభివృద్ధి కార్యక్రమాల అవసరరీత్యా... ధరలు పెంచాల్సి వచ్చిందనీ... సమాజంలోని అన్ని వర్గాల ప్రజలమూ.. దేశంకోసం త్యాగం చేయాలనీ... యిలా సాగింది ప్రకటన.

సమాజంకి దూరంగా, అడవుల్లోంచి హింస చేసే నక్సల్స్.. జనజీవన స్రవంతిలోకి వచ్చి అభివృద్ధి కార్యక్రమాల్లో పాలుపంచుకోవాలని పిలుపునిచ్చేరు.

విలేకరి, అంతా చదివి... ఆలోచనలో పడ్డాడు. "అభివృద్ధి వెలుగునీడలు.." పుస్తకం గుర్తొచ్చింది. జనజీవనస్రవంతి – పదం చూస్తే.. కాళోజీ ఉపన్యాసం గుర్తొచ్చింది. అంతలో, అర్జెంట్‌గా... న్యూస్ పంపమన్న ఫోన్ కాల్ గుర్తొచ్చింది. కలం, కాగితం అందుకొని –– రాయబోతుంటో––

"నమస్తే సార్.." యెవరో అగంతుకుడు.

"శ్రీనివాస్ గారంటే.." ప్రశ్నించేడు.

"నేనే..." జవాబిచ్చేడు విలేకరి.

సిగరెట్ పెట్టె – అందించేడా వ్యక్తి. శ్రీనివాస్ ఆశ్చర్యంగా అందుకున్నాడు. ఖాళీ సిగరెట్ పెట్టె! విసుగ్గా దాన్ని విసిరేయబోతుంటే–– పెట్టెలోపలి భాగంలో అక్షరాలు కన్పించేయి. ఆతృతగా చదివేడు.

"శ్రీనూ! నిన్న ఒక ఎప్పాయింట్‌వుంది. సంకేత స్థలానికి వెళ్లాను... అప్పటికే అక్కడ మాటుగాసేరు. నేను గ్రహించేలోగానే బందీనైనాను. నిన్నటినుంచే..."

ఆ చుక్కలు, శ్రీనివాస్‌కి వెన్నెముకలో భయాన్ని కల్గించేయి. బాధగా మళ్లీ ఉత్తరంలోకి చూసేడు.

"...నా అరెస్ట్ పార్టీకి, ప్రజలకీ తెలీదు. నా ప్రాణం కోసం కాకున్నా... మరిన్ని అరెస్టులు ఆపడానికి చూడాలి. అదృష్టవశాత్తూ, యీ వ్యక్తి. స్టేషన్‌లో పోలీసులకి టీలూ, సిగరెట్లిస్తుంటాడు. నీ దగ్గరికి పంపించేను..." ఆ తర్వాత మరి అక్షరాలు లేవు. ఆ ఆగంతుకుని కోసం చూస్తే అతనూ లేడు.

శ్రీనివాస్‌కి యేం చేయాలో బోధపడలేదు. చంద్రాన్ని అరెస్టు చేసినట్లు– పోలీసులు యెందుకు ప్రకటించలేదు? ఈ ప్రశ్న శ్రీనివాస్ మనసులో ఆందోళనను కలిగించింది.

వెంటనే, శ్రీనివాస్ ఫోన్ అందుకొని – గెస్ట్‌హౌస్‌కి డయల్ చేశాడు. మంత్రిగారు– పేపర్ మిల్స్ ఎం.డీ. గారి విందుకి వెళ్లి యింకా రాలేదట. ఎస్పీ ఆఫీస్‌కి ఫోన్ చేశాడు. సరైన సమాచారం చెప్పలేదు. దొరగారు వొస్తేగానీ, – రిమాండ్ విషయం తెలీదట!

ఇక యీ ప్రయత్నాలకంటే ముందు వార్తరాసి, టి.పి.కి అందించటం మంచిదన్న నిర్ణయానికొచ్చేడు.

శీర్షిక యెలా పెట్టాలా – అని గింజుకున్నాడు. ప్రముఖ తీవ్రవాది... ఛఛ... భయంకరబందిపోటు అన్నట్లుగా వుంది. కొట్టేశాడు. నక్సలైట్ చంద్రం... యిదీ ముద్దాయి తీరుగే వుంది. కొట్టేసాడు నక్సలైట్లే దేశభక్తులన్నాడు ఎన్టీఆర్...! "దేశభక్తుడు.. . చంద్రం పోలీసుల చెరలో ..." బాగుంది. గానీ, యీ శీర్షిక... ఎడిటర్ వుంచుతాడా?

చివరికి, మంత్రిగారి ప్రకటనకీ, చంద్రం అరెస్టుకీ... యెలాగో లింక్ చేసి, రెండు వార్తలూ.. ఒకే బాక్స్ ఐటమ్‌గా రాసేడు. అప్పుడు అనుమానం వచ్చింది –

అరెస్ట్ వార్త రేపు పత్రికలో వచ్చేదాకా ... చంద్రం ప్రాణానికి హామీ యేమిటి.?

ప్రాణం.. యెంత విలువైనది!.......

హైస్కూల్ కి ఫర్లాంగు దూరంలో జంఝావతీ నది! మధ్యాహ్నభోజనాలు. నదిఒడ్డున పణుకురాళ్ల మీద కూర్చుని చేస్తుంటారు. కేరేజీలు శుభ్రంగా, తోమి... నదివాలులో కడగటం... తీరని సరదా! చంద్రం.. ఎంత బాగా.. తోముతాడో కేరేజీని. తెల్లగా మెరుస్తుంది...వాడి కేరేజీ! ఓసారి శ్రీను అంతకంటే బాగా తోమి, కేరేజి కప్పుల్ని... నది వాలులో కడుగుతోంటే – చేయిజారి... కప్పు ప్రవాహంలో పడిపోయింది. జంఝావతీ నది.. నిండుగా వుంది. విపరీత వేగంతో ప్రవహిస్తోంది. పడిపోయిన కేరేజీ కప్పు కోసం ఆతృతగా కాళ్లుదించి, చేయి చాచాడు శ్రీను. కాళ్లు జారి ప్రవాహంలోకి... కొట్టుకుపోయేడు. శ్రీనుకి ఈతరాదు. ప్రాణభయంతో కేకలు..! రాతిమీద భోజనాలు చేస్తోన్న మిత్రులూ.. కేకలు వేస్తున్నారు కానీ – యెవ్వరూ సాహసం చేసి –– నదిలోకి దిగటం లేదు. చంద్రం మాత్రం గభాల్న దుమికేడు. అంగలు వేసి యీదుకొని – శ్రీనుని చేరుకున్నాడు. నీటిలోంచి శ్రీనుని... పైకి తేలించి, ప్రవాహంతో పాటుగా.. అలా..అలా.. కొట్టుకుంటూ.. అవతలి ఒడ్డుకి చేరుకున్నాడు. ఒడ్డు చేరాక, గుండెలు కుదుటపడ్డాక, ఊపిరిదీసుకుని.. శ్రీనివాస్ చంద్రాన్ని చూస్తూ–

"చంద్రం.. నీకు భయమెయ్యలేదా.. నా కోసం నదిలో దిగటానికి?" అనడిగేడు.

"భయం సాహసాలు చెయ్యనియ్యదు..!" చంద్రం జవాబు!...

మిత్రమా...! సాహసీ!

శ్రీనివాస్ కళ్లు చెమర్చాయి...! కళ్లు తుడుచుకొని, టి.పి. ఆపరేటర్ని పిల్చి – రాసిన వార్తల్ని ఇచ్చేడు.

☆ ☆ ☆

చంద్రశేఖరం, శ్రీనివాసూ బాల్యమిత్రులు. కలిసి హైస్కూల్ వరకూ చదువుకున్నారు. హైస్కూల్ తర్వాత శ్రీను కాలేజీకి... చంద్రం పొలానికీ..!

చంద్రం తండ్రి ప్రమాదవశాత్తూ ఎడ్లబండి నుంచి... కిందకు పడిపోయి... కాళ్లు విరిగిపోయేయి. తండ్రి మోసే బరువుని... చంద్రం మోయవలసి వచ్చింది. చదువుకి స్వస్తి చెప్పాడు.

తలపాగా చుట్టుకొని సగర్వంగా తలెత్తుకు పచ్చని పంట పొలాన హాయిగా నవ్వే రైతు బొమ్మలను... పుస్తకాలలో చూసిన చంద్రం.. దమ్ము మడి బురదలో జలగల్ని చూసేడు. చేనుతోపాటుగా యెదిగొచ్చే... గాబుని చూసేడు. ఎన్నుగింజను పట్టిదినే... పేను పురుగుని చూసేడు. నాగేటిచాలులో.. తెగిన.. వానపాముల్ని చూసేడు. ఏడాది తిరిగేసరికి.. శిస్తు వసూలుజేసే కరణం నుండి, కాటా దీసుకు వచ్చే వ్యాపారి దాకా – పంట మీద కన్నేసే యెన్నింటినో, యెందరినో చూసేడు.

శ్రీనివాస్... సెలవులకి ఊరొచ్చినపుడల్లా.. చంద్రంతో పొలంలోనే తిరుగాడుతాడు. దుక్కిదున్ని నొల్లదోలి, దమ్ముబట్టిన ఉడుపు మడిలో... ఆకు కట్టల్ని వరుసల మీద వేస్తోన్న మిత్రుని జూస్తూ –

"చంద్రం..! ప్రకృతితో ఘర్షించీ, హొక్కోసారి దానితో చెలిమి జేసీ... నువ్వు సేద్యం చేస్తున్నావు! నీ ఉత్పత్తికీ.. ప్రకృతికీ మధ్య ఘర్షణా, ఐక్యతా కన్పిస్తోందిరా.. నాకు.." అన్నాడు శ్రీను.

చంద్రం... ఆ మాటకు సాలోచనగా మిత్రుని చూస్తూ—

"అది నీజమేనేమో గాని... ఉత్పత్తి వరకే అయితే... నువ్వు అన్నది కరెక్టే గాని.. ఇంకా యేదో గ్రహింపులోకి రానిది వుందిరా! ఈ ఉత్పత్తికీ.. నా బతుక్కీ.. మధ్య మరేదో వుంది. నాకు చెప్పటం రాకుంది గానీ.. నేనే గాదు, యే రైతూ.. సుఖంగా లేదురా.." అన్నాడు.

☆ ☆ ☆

"సార్, మంత్రిగారి ప్రకటనకీ, నక్సలైట్ అరెస్టుకీ లింక్ జేసి రాసారేంటి? దేనికదే.. కొట్టేసేదా?" చేత్తో వ్రాతప్రతి పట్టుకువచ్చి, ప్రశ్నించేడు టి.పి. ఆపరేటర్.

"... దేనికది విడగొట్టి, దేనికిరా రాయటం?" కసురుకున్నాడు శ్రీను. టి.పి. ఆపరేటర్.. గొణుక్కుంటూ వెళ్లిపోయాడు.

ఏదీ విడిగా, యేదానితో సంబంధం లేకుండాలేదు. ఆ సంబంధాలు – పరస్పర విరుద్ధప్రయోజనాల మధ్యనైతే ఘర్షణతోనూ, ఒకే ప్రయోజనమైతే – ఐక్యతతోనూ.. వుంటాయంటాడు చంద్రం..! ఎంతగా యెదిగిపోయేడు!.........

"కోలనీ బెనిఫిషరీస్ లిస్ట్‌లో పేర్లను కురిమినాయుడు మార్పులూ, చేర్పులూ చేస్తున్నాడు. మన జనాల పేర్లు కొన్ని తీసేసారట.." మండలాఫీసులో భోగట్టా చేసి తెలుసుకున్నాడు చంద్రం.

"...జాయింట్ కలెక్టర్ దగ్గరకి మళ్లీ వెళ్లటమే. ఆయనకు మన వ్యవహారమంతా తెలుసుగనక, న్యాయం చేస్తాడు..." సలహా యిచ్చేడు శ్రీను.

శ్రీనివాస్...డిగ్రీ పూర్తిచేసే నాటికి–చంద్రం భూమి కోల్పోయి, రిజర్వాయర్ ప్రాజెక్ట్ డిపార్ట్‌మెంట్‌లో... నాన్ మజ్దూర్‌గా మిగిలేడు.

ఆ ప్రాంతంలో రిజర్వాయర్ నిర్మించే నిమిత్తం – కొన్ని గ్రామాలూ, ఆ గ్రామాల వ్యవసాయ భూములూ... ప్రభుత్వ స్వాధీనం చేసుకుంది. చంద్రం.. ఆ రకంగా భూమినీ, యింటినీ కోల్పోయేడు. నిర్వాసితులకు – ప్రభుత్వం – రిజర్వాయర్‌కి రెండున్నర కిలోమీటర్ల దూరంలో – కోలనీ నిర్మాణం చేస్తోంది. రిజర్వాయర్ కోసం స్వాధీనం చేసుకున్న భూమికి – ధర గూడా చెల్లించింది. కొంతమంది నిర్వాసితులకు ప్రోజెక్ట్ నిర్మాణంలో – ఉద్యోగాలు కల్పించింది. రిజర్వాయర్ నిర్మాణ వ్యవహారంతో – గ్రామంలో చాలా మార్పులొచ్చేయి. ఎక్కువమంది, భూములు అమ్మకమయ్యేక.. మరోచోట భూములు కొనుక్కోలేకపోయేరు.

చంద్రం అప్పులూ, సప్పులూ తీర్చేసి, చెల్లెలి పెళ్లి జరిపించేడు. రైతు జీవితం నుండి – లేబర్ జీవితంలోకి వచ్చేడు.

భూముల విలువ లెక్కించి, రైతులకు అందించే వ్యవహారంలో – అధికారుల చాలా తాత్సారం చేశారు. బడా నాయకులు పైరవీలు చేశారు. కురిమినాయుడు మండలాధ్యక్ష పదవీ అండతో... యీ వ్యవహారంలో చాలా పైరవీలు చేశాడు. రికార్డులు

తారుమారయ్యేయి... నిర్వాసిత రైతుకి పరిహారం అందలేదు. చంద్రం...వీటన్నిటినీ జాయింట్ కలెక్టర్ దృష్టికి తీసుకెళ్లి - న్యాయం జరిపించేడు. అందుకనే... శ్రీను.. కోలనీ సమస్యనూ అక్కడికే తీసుకెళ్ళమని సలహా యిచ్చేడు. రిజర్వాయర్ కారణంగా గ్రామంలో జరిగిన మార్పుల్లో భాగంగానే - శ్రీనివాస్ కుటుంబం... దగ్గరిలోని బస్తీకి మారింది. శ్రీనివాసూ, చంద్రం... కలవటం తగ్గింది. ఎన్ని చలనాలు.. చంద్రం జీవితంలో......

ఫోన్ రింగయ్యింది. శ్రీనివాస్ రిసీవర్ యెత్తి - 'హలో.' అన్నాడు. అవతల నుంచి అందిన వార్తతో శ్రీనివాస్ గుండెలు గబ గబ కొట్టుకున్నాయి.

"..నాకేం యిన్ఫర్మేషనివ్వలేదు. సరే.. అఁహఁ... అయితే, మీరు రండి. మీతోటే వొచ్చేస్తాను.." ఫోను పెట్టేసాడు.

మూర్తి చెప్పింది.. యెవరి గురించి..? చంద్రం గురించి కాదుగదా? చంద్రం ......

"... యీ నౌకరీ నాకిష్టంలేదురా. సూపర్వైజర్ యింటి చాకిరీ చేయడానికి. నాకు జీతమిస్తోంది.. ప్రోజెక్ట్! రిజర్వాయర్ నిర్మాణంలో శ్రమిస్తే నా చెమట చుక్కలు.. యీ రిజర్వాయర్లో వున్నాయి గదా అన్న సంతృప్తి అయినా వుంటుంది. ఛఛా... యీ కూరగాయలు తేవటం, కేరేజీలు అమర్చటం.. నాకిష్టంలేదు.."

చంద్రం నాన్ మజ్దూర్గా చేసే పన్లు యేమిటో వివరించేడు. శ్రీనివాస్... మిత్రుని వైపు సానుభూతితో చూడటం తప్ప యింకేమీ సహకరించలేకపోయేడు.

మరోసారి, శ్రీనివాస్ కలిసేసరికి - చంద్రం రిజర్వాయర్ వద్ద కిల్లీ బడ్డీ ఓనర్గా కన్పించేడు.

"... ఆ సూపర్వైజర్ గాడి యింటికి అడ్డమైన చాకిరీ చేశాను. ఇష్టం లేకపోయినా.. సరిపెట్టుకున్నాను. కానీ, వాడు.. రిజర్వాయర్కి వాడాల్సిన సిమెంట్ బస్తాల్ని... ప్రైవేట్ డీలర్ షాపుకి తరలించమన్నాడురా! ఎలా తరలిస్తాను..? ఆ రిజర్వాయర్.. యీ రోజు నన్ను భూమిలేనివాణ్ణిజేసినా రేపు యెందరో రైతుల భూములకు జలాధారం! అందరికి మోసం చెయ్యలేం గదరా? వ్యతిరేకించాను. పత్రికలవాళ్లకి చెప్పాను. నాకు నౌకరీ పోయింది...వాడికి బదిలీ అయ్యింది ఇదిగో..యీ అవతారమెత్తాను.." నవ్వుతూ, తేలిగ్గా చెప్పాడు ఉద్యోగం పోయిన విషయాన్ని.......

బయట, అదే పనిగా, స్కూటర్ హారన్ మ్రోగుతోంది. చంద్రం ఆలోచనల్లోవున్న శ్రీను తేరుకున్నాడు. సీట్లోంచి లేచి, వీధిలోకి చూసేడు.

స్కూటర్ మీంచే ఫోటో గ్రాఫర్ మూర్తి-

"... రండిసార్. మనదే ఆలస్యం. అంతా వెళ్లిపోయుంటారు." పిలిచేడు.

శ్రీను గబగబా వచ్చి స్కూటర్ వెనక సీట్లో కూర్చుంటూ -

"...ఎస్పీగారి వద్ద సరెండరవతున్న నక్సలైట్ పేరుగాని తెలుసా నీకు?" అనుమానంగా అడిగేడు మూర్తిని.

"..తెలీదుసార్, పోలీసులు చెప్పలేదు. మోస్ట్ వాంటెండ్ పర్సనట. లక్ష వుందట అతడి తలమీద రేటు! పోలీసులు.. తెగ విసుక్కుంటున్నారు. లక్ష అతడికి వెళ్లిపోద్దట

గదా? అదే అరెస్టో, ఎన్‌కౌంటరో అయితే పోలీసులకి దక్కునని.. గొణుగుడు.." స్కూటర్ రన్నింగ్‌లో మూర్తిమాటలు.. సరిగ్గా విన్పించటంలేదు.. శ్రీనివాస్‌కి.

ఇంకేవో గుర్తొస్తున్నాయి.....

"తల మీద రూపాయి పెట్టి – వేలం వేస్తే – అర్ధరూపాయికి చెల్లరు. మీకెందు కురా.. యీ తిరుగుబాట్లు. అసలు, నువ్వు, ఆ చంద్రంతో కలవొద్దు. చెడిపోతావు. వాడెలాగూ చెడిపోయినట్లే. చదువూ సంధ్యా తగలడింది. వ్యవసాయంలో కెళ్లాడు – భూమి ఆనకట్ట కల్సిపోయింది. నౌకరీలోకెళ్లాడు – ఊడిపోయిందది. పోనీ, ఆ బడ్డీ కొట్టు పెట్టాడు.. బతకొచ్చుగదా..? ఊరూసులల్లా.. ఆడికేల? నువ్విక అటు బంద్. మీ మామ యేదో పత్రికాఫీసులో పనిచూసేడట...రేపే బయల్దేరు..." తండ్రి నిష్కర్షగా చేసిన హెచ్చరిక. శ్రీనివాస్... మహానగరం చేరిపోయేడు. మనసులో చంద్రం మాత్రం వీడిపోలేదు.

ఆనకట్ట దగ్గర బడ్డీకొట్టు చంద్రాన్ని యెన్నాళ్లో ఆదుకోలేదు. రెండేళ్లకు – రిజర్వాయర్‌కు శాంక్షనయిన తొలివిడత నిధులు పూర్తిగా ఖర్చయిపోయేయి. రిజర్వాయర్... గర్భంలో రెండవ రీచ్ మట్టిపని మాత్రమే జరిగింది. మూడో యేడాది విడుదలయిన నిధులు – డిపార్టుమెంట్ మెయింటెనెన్స్‌కి చాలలేదు. తర్వాతయేడు... అదీలేదు... పనులాగిపోయేయి. కాంట్రాక్ట్ కంపెనీలు కదిలిపోయేయి. డిపార్టుమెంట్ ఉద్యోగులు తప్ప.. జనం అలికిడి తగ్గిపోయింది. బడ్డీ కొట్టుమీద ఈగలు వాలటం ఆరంభించేయి. రిజర్వాయర్ పూర్తికై కృషి ఎన్నికల హామీగా మిగిలింది.

"రిజర్వాయర్ పూర్తికావాలని నినదిద్దాం, రిజర్వాయర్ పూర్తయ్యేదాకా బంజరుగా మిగిలిపోయిన భూములను.. పేదలం సాగు చేద్దాం" అంటూ పిలుపిచ్చింది విప్లవపార్టీ. రైతాంగ పేదలంతా కదిలేరు. అప్పటికే, అనధికారికంగా – భూమిని కురిమినాయుడు సాగుచేయటం ప్రారంభించేడు. కురిమినాయుడికీ, పేదలకీ ఘర్షణ జరిగింది. కురిమినాయుడు అనధికారికంగా సాగుజేస్తే రాని పోలీసులు, పేదలు సాగుజేస్తే వచ్చేరు. రిజర్వాయర్ కోసం సేకరించిన ప్రభుత్వ భూమిని సాగుచేయడానికి వీల్లేదన్నారు. దాంతో, కురిమినాయుడు వెనక్కి వెళ్లిపోయేడు. అతనికి బ్రతుక్కి ఢోకా లేదు గనక – కానీ పేదలు తగ్గలేదు. రిజర్వాయర్ నిర్మాణమన్నా సాగించి పనులు చూపండి, లేదా అంతదాకా ఆ భూమిని సాగుజేసుకు బతకనీయండని.. ఆందోళన చేశారు. అరెస్టులు, లాకప్పులో చిత్రహింసలు, జామీనుపై విడుదలలు, మళ్లీ ఆందోళన, అరెస్టులు... చంద్రం.. పూర్తికాల పార్టీ కార్యకర్త అయ్యేడు....

స్కూటర్.. పెద్ద గతుకులో పడి, కుదుపిచ్చి, ప్రక్కకు వొరిగింది. జాగ్రత్తగా బ్యాలన్స్ కీప్‌చేసి, బ్రేకువేసి నెమ్మది చేస్తూ –

"ఈ రోడ్‌కి బిల్స్ పేమెంటయి మూడు వారాలవలేదు! అసలిక్కడ రోడ్డు వేశాడా? చూడండి సార్.. యీ గోతులూ! దీనిమీద మంచి ఫోటో ఐటమ్ న్యూస్ రాయండి సార్!..." అన్నాడు మూర్తి.

"యెవరు దీని -కాంట్రాక్టర్?"

"ఇంకెవరు? మున్సిపల్ ఛైర్మన్ తమ్ముడు."

"అతనేదో జాబ్ చేసేవాడు?" శ్రీను అనుమానంతో

"అదా? పోయింది లెండి. ఆఫీస్ సొమ్ము. అత్తారిసొమ్ములా వాడేసేడట.. యింటికి పంపించీసేరు. అయినా అతనికేటంట లోటు? మీకు తెలిన్దేటి? నూరుగురు తమ్ముళ్ళి పోషించీలేదండీ... రారాజు! పదవి మహిమ అలాటిదీ..." మూర్తి యిలాంటి వ్యవహారాల బ్లూప్రింట్లు తీయగలడు.

"..మూర్తీ! సరెండరవుతోన్న వ్యక్తిని చూసావేంటి?" శ్రీనుకి మరో ధ్యాసలేదు. చంద్రమే... కదుల్తున్నాడు హృదయంలో...!

"లేదుసార్! అసలు, నా వరకూ రాకపోను కబురు. రాజులు జవాను లేడా? అతగాడు మనకి ఫ్రెండు లెండి..! ఫోను గొట్టాడు..బాసూ, కొత్తగా కలర్ లేబ్ బెట్టాడుచూడూ కుమార్ – మా రైటర్ని పట్టుకొని ఫోటోగ్రాఫర్ ఛాన్స్కి ట్రై జేస్తండు. నీకు ఎర్త్ యిచ్చీగల్డు కాసుకో – అని ఫోనుకొట్టేడు. ఏటి సెయ్యిడం? రైటర్కి... విలేకరి ప్రసాద్కి దోస్తు. విలేకరి ప్రసాదుకి... పోలీస్ అఫీషియల్స్ల మంచి ఇన్ఫ్లూయన్స్! ఆఁ! మీకు లేదు. మీకు కొత్త... యేటి తెల్దుగానీ..సార్.. లాభంలేదుసార్ మీరు మారాల! ఎక్కడికక్కడ.. మీ గురించే.. అందరూ డిస్కషన్స్! మీకు.. అఫీషియల్ సెక్షన్ల..గుడ్ఒపీనియన్ లేద్సార్. లాభంలే..తెల్సిపోయింది నాకు..మీరు మారాల.."

ఎన్ని విషయాల్ని.. కలిసి మాట్లాడతాడు మూర్తి! అదెలా సాధ్యమో? అతని కెమెరా లాగానే.. దృశ్యంలో యెన్నెన్ని బంధించబడతాయో... మూర్తి మాటల్లో గూడా...!

శ్రీనుకి మొదట్లో పట్నం వొచ్చినపుడు మూర్తితో పరిచయం ఆరంభమైంది. అప్పట్లో శ్రీను ఒక స్థానిక వార్తా పత్రికలో పని చేసేవాడు. ఆ పత్రిక కేవలం నిజాలు మాత్రమే ప్రచురించి నెలనెలా నష్టాల్ని మూటగట్టేది. రెండేళ్ళకి మూటగట్టిన నష్టాలకి – ప్రెస్ ప్రోపర్టీ చెల్లిపోగా పత్రిక ఆగిపోయింది. అపుడు మూర్తి రికమండేషన్ మీద.. అక్కడా, యిక్కడా కాన్వెంట్లలో పనిచేశాడు.

ఈ బ్రతుకు యాతనలో శ్రీను..చంద్రంని ఒక్కసారే కలియగలిగేడు. అదీ, గాయాలతో, జిల్లా ఆసుపత్రిలో చంద్రం చికిత్స పొందుతున్న విషయం తెలిసినపుడు.

భూమి విషయంలో యేర్పడ్డ వివాదం... గ్రామకోలనీకీ, నిత్యజీవిత వ్యవహారాలకీ ప్రాకి–కురిమినాయుడు.. చంద్రం మీద కక్షగట్టేడు. చంద్రాన్ని చంపిస్తే – మిగిలిన పేదలు బెదిరిపోయి, సంఘం చెదిరిపోద్దని.. రౌడీల్ని నియోగించేడు. చంద్రం గాయాలతో.. బ్రతికి, బట్టగట్టేడు. చంద్రంతో వున్న పైడయ్య అనే రైతు చనిపోయేడు....

స్కూటర్ ఆగింది. ఎస్పీగారి బంగ్లా.. ఎత్తయిన అశోకా చెట్ల మధ్య వెలుగుతోన్న గాజు మందిరంలా వుంది. రెండంతస్తుల మందిరం! భవంతి ముందర.. నాలుగైదు టూవీలర్స్, ఒక వైర్లెస్ సెట్ అమర్చిన జీపు, ఒక కారూ.. వున్నాయి. ముఖద్వారం వద్ద యిద్దరు సాయుధ పోలీసులు– నిల్చున్న రెండు అశోకా చెట్లలా వున్నారు.

మూర్తి స్కూటర్ డిక్కీలోంచి కెమేరా బ్యాగ్తీసి, భుజానికి తగిలించుకొని,

బంగ్లాలోపలికి దారితీసేడు.. వెనకే శ్రీను అటునుంచీ – రైటరూ, హెడ్డూ వస్తూ యెదురైనారు.

"...యేంటంత గాభరా? ఏంలేదు. అంతా పూసిపోయింది..." అన్నాడు రైటర్! అది మూర్తికో...? శ్రీనుకో...?

"...సరెండరవుతున్నారని చెప్తే..."మూర్తి సంశయంగా..

"ఔనౌను. ఎస్పీగారే మీకు కబురు చెయ్యమన్నారు. మళ్లీ ఆయనే – పదినిమిషాల కిందట – ఎండీ గారింటినుంచి.. ఫోన్ జేశారు... యిప్పుడు కాదనేశారు. వొచ్చిన విలేకర్లు.. వెళ్లిపోయేరు.." చెప్పాడు రైటర్ – మీరూ వెళ్లిపోండి అన్నట్లుగా!

"ఇంతకీ యెవరు సరెండరయ్యేది...?" శ్రీను ప్రశ్నించాడు.

"..నో..న్యూస్.." ఇంగ్లీషు ఫోజు గొట్టేడు రైటర్.

"..నిన్న ఉదయం..మీరు..ఒకతన్ని అరెస్టు చేశారటగదా?" శ్రీను ప్రశ్నించకుండా వుండలేకపోయేడు.

"..ముద్దాయి అయితే, అరెస్ట్ చేసే వుంటాం.." ఘరానాగా జవాబిచ్చేడు రైటర్.

"అతను, నక్సలైట్.." శ్రీను పూర్తి చేయలేదు.

"..మరింకేం? పెద్దముద్దాయన్న మాట.." అని, పొట్టకదిలినట్లు నవ్వేడు. ఆ తర్వాత, నడుముబెల్టు సర్దుకుని–

"..మీపేరేంటీ...శ్రీనివాస్‌గదా? చూడండీ, కొశ్చినెయ్యకుండా మీరుండలేరు! కొశ్చినంటేనే.. మా డిపార్ట్‌మెంటుకి యెగినెస్ట్. కొశ్చిన్ పేపరు లీకయితే మునిగే కొంపలు కంటే, మా ఆన్సర్‌లు లీక్ అయితే యెక్కువ కొంపలు మునిగిపోతాయి. అందిసేత రేపటివరకూ.. నో కొశ్చిన్...నో ఆన్సర్స్..." బూట్లు, టక టక టక టకలాడించుకుంటూ వెళ్లిపోయేడు రైటర్, హెడ్‌ని తీసుకొని.

శ్రీనుకి యేంచేయడమో బోధపడలేదు. చుట్టూ చూసేడు...కాకీదుస్తులూ, తుపాకీలూ–కాకీవనం!

"పదండిసార్. ఏదో ఛేంజ్ అయ్యింది ప్రోగ్రాం. కొంపదీసి, సరెండర్‌డ్రామాని – ఎన్‌కౌంటర్‌గా మార్చేయరు గదా రేపటికి?" మూర్తి ఆలోచనలు.. బ్లూప్రింట్ల దాకా పరుగెత్తాయి.

శ్రీను గుండెలు దడ దడా కొట్టుకున్నాయి. అప్రయత్నంగా.. కళ్లవెంబడి నీళ్లు....

"..యేంటిసార్? యేమైంది" గాభరాపడ్డాడు మూర్తి.

"మూర్తీ! ఒన్‌టవున్ స్టేషన్ కెళ్లి, లాకప్పులో యెవరున్నారో గమనించి రాగలవా...?" రుద్ధకంఠంతో శ్రీను.

"ఎందుకు సార్?"

"చంద్రం కోసం..."

"చంద్రమెవరు సార్...?"

శ్రీను.. యెక్కడో వెదుకుతున్నాడు. బాల్యం నుండీ ప్రవహించిన స్నేహనది.. కలిసి ఆడిన ఆటలు, కలబోసిన ఊసులు... కేరేజీ కడుగుతూ నదిలో మునక..

చంద్రం సాహసించి ...బ్రతుకు పోరులో.. తను ఓవైపు... శ్రీను యేడ్పు అదుముకోలేక పోతున్నాడు.

మూర్తి వెంటనే శ్రీను భుజాల మీదుగా, చేయివేసి, ఓదార్చుతూ, బంగ్లాబయటకు తీసుకువచ్చి, స్కూటరు తీసేడు. తిన్నగా శ్రీనివాస్ ఆఫీసుకి చేరాక...

"...చెప్పండి సార్ ఎందుకు బాధపడ్తున్నారు? అసలేమైంది? చంద్రమెవరు...? నాకు చాతనయిన సాయం చేస్తాను. చెప్పండి.." ఓదార్పుగా అడిగేడు మూర్తి.

శ్రీనివాస్...వెక్కిళ్లు ఆపుకున్నాడు. టేబుల్ సొరుగులోంచి, సిగరెట్ పెట్టె..చీటీ తీసి, మూర్తికిచ్చేడు.

మూర్తి..చీటీ చదువ సాగేడు.

"..చంద్రం..నా మిత్రుడు. నా ప్రాణరక్షకుడు. భూమితగువుల్లో.. గాయాలనుండి తేరుకున్నాక.. మరోసారి రౌడీలు దాడిచేస్తే..సంఘంవాళ్లు..ఒక రౌడీని చంపేశారు. అపుడు చంద్రాన్ని అరెస్టుజేసి... లాకప్పులో పోలీసులు చంపేస్తారనీ.. అజ్ఞాతంలోకి వెళ్లిపోయేడు. అప్పటినుంచి, నాకు అంతగా వాడి భోగట్టాలు తెలిసేవికావు. అడవిభూముల పోరాటం, గిరిజనసంఘాల నిర్మాణం, గత ఉద్యమ అమరుల స్మారక స్థూప నిర్మాణం.. తదితర వార్తలు వినడమే! ఇదే వాడి.. చేవ్రాలుతో అందిన లేఖ..." శ్రీనివాస్ వివరించేడు.

"...నోడవుట్ సార్! ఇతని గురించే అయుంటాది. లక్ష పోతుందని వొకటే యేడుపు. మినిస్టరేమో...త్వరలో పార్లమెంటు ఎన్నికలున్నాయి.. దెబ్బ గొడతాయని..యేడుపట! ఏదీ తేలకపోయి వుంటుంది.. మనల్ని పొమ్మన్నారు.." చెప్పాడు మూర్తి.

"మరిపుడేంటి చెయ్యడం? జనజీవనస్రవంతిలోకి రమ్మని పెద్ద ప్రకటనిచ్చేడే మంత్రి?" క్రోధంగా ప్రశ్నించేడు శ్రీను.

"..ఏం జనజీవనస్రవంతండీ? సారాజులూ, రౌడీలూ, ఇసక కాంట్రాక్టర్లూ, టాక్సు యెగ్గొట్టే ఎం.డీ.లూ జనజీవనస్రవంతా? ఎవడిస్రవంతి అడిది..? జనంలోన..ఆళ్లున్నారా? ఈళ్లా..? పోలీస్ ప్రొటెక్షన్‌తోటి జనంలోకి యెళ్లే మంత్రులూ..జనజీవనస్రవంతి గురిండి ప్రకటనలు..." మూర్తి మాటలకు అదుపు లేకుంటోంది.

ఇంతలో ఫోన్ మ్రోగింది. శ్రీను..రిసీవర్ అందుకున్నాడు.

"..మండలాధ్యక్షుడు కురిమినాయుడు కిడ్నాప్.. చంద్రం విడుదలకై డిమాండ్.." వార్త!

శ్రీనులో చలనమొచ్చింది. వాచీ చూసుకున్నాడు. "సక్సెస్ మూర్తీ!..." అని కేకేసి టి.పి. దగ్గరకు వెళ్లాడు.. కిడ్నాప్ వార్తను స్వహస్తాల్తో టైపు చేసేందుకు...

● *యువత – సెప్టెంబరు, నవంబర్ 1996* ●

★ ★ ★

శాంతి నారాయణ

86

# ఉక్కుపాదం

ఉదయం నుండీ మనసంతా ఆందోళనగా ఉండడంతో కాలేజీకి సెలవు పెట్టి ఇంట్లోనే కూర్చున్నాను. మధ్యాహ్నం పన్నెండు దాకా టీవీలో కానీ రేడియోలో కానీ వార్తలయితే ఏవీ లేవు. టైం గడుస్తున్నకొద్దీ మనసులో ఉత్కంఠ పెరగసాగింది.

టౌన్లో రకరకాల వార్తలు వినిపిస్తున్నాయి. గిరిధర చౌదరిని మంత్రివర్గంలోకి తీసుకున్నట్లు ఫోన్ మెసేజ్ వచ్చిందని పది గంటలకే ఆయన అభిమానులు పెద్దయెత్తున టపాకాయలు కాల్చినారు. అనంతపురం మెయిన్ రోడ్లన్నీ హోరెత్తిపోయినాయి. మధ్యాహ్నం పన్నెండు గంటలకు మరొక వార్త వినిపించింది. రంగారెడ్డి మంత్రి అయినట్లు తెలిసిందని ఆయన అనుయాయులు ఆనందోత్సాహాలతో కేకలు వేసినారు. టౌనంతా భరించరాని శబ్దాలతో దద్దరిల్లిపోయింది.

కదిరి శాసన సభ్యుడు రంగారెడ్డి, ధర్మవరం శాసన సభ్యుడు గిరిధర చౌదరీ జిల్లాలో పుష్కలంగా అంగబలమూ అర్థబలమూ ఉన్నవాళ్లే. ఉదయం నుండీ వాళ్ల అభిమానుల ఆనందోత్సాహాలను గమనించిన తర్వాత వాళ్లిద్దరూ తప్పక మంత్రివర్గంలో ఉంటారని అనుకున్నారు. వారం రోజులుగా పత్రికలు కూడా వాళ్లను గురించే రాసినాయి. నేను మనసులో అయితే అనుకున్నాను కానీ అనుకున్నప్పటి నుండి అసంతృప్తితో మనసంతా నీరసపడిపోయింది. ఈ అగ్రకుల రాజకీయాల్లో శివరాం వంటి బడుగువర్గం వారికి మంత్రిపదవి వస్తుందని ఆశించడం పేరాశే అవుతుందని మనసును సమాధానపరుచుకుంటూ రేడియో బటన్ నొక్కాను. మంత్రిమండలి ప్రమాణ స్వీకారం గురించి ప్రత్యేక వార్త లొస్తున్నాయి. వింటూ నన్ను నేను నమ్మలేకపోయాను. మిత్రుడు శివరాం మంత్రి అయినాడు. సంతోషంతో శరీరమంతా తేలిపోయింది. వెంటనే మాలతిని పిలిచి చెప్పినాను. తానూ ఆనందంతో మురిసిపోయింది. పిల్లలిద్దరూ కాలేజీనుండి మధ్యాహ్నం భోజనానికి వచ్చినారు. ఇల్లంతా సంతోషంతో వెల్లివిరిసింది.

భోజనం చేసి సంతృప్తిగా తాంబూలం నములుతూ మిద్దెమీదున్న రూములోనికి వెళ్లి ఈజీచైర్లో కూర్చొని వెనక్కి వాలి కళ్లు మూసుకున్నాను.

మిత్రుడు శివరాం కేబినెట్ మంత్రి అయినాడు. ఎంత సంతోషమయిన వార్త! శరీరం నిండా ఏవో చెప్పరాని అనుభూతులు పారాడినాయి. గతానికి చెందిన

ఎన్నో జ్ఞాపకాలు మనసు నిండా కదలాడినాయి. అవి మననం చేసుకున్నప్పుడు మధురమయినవే అయినా ఆ దినాల్లో శివరాంకూ, నాకూ అవి విషాదమయినవే.....

ముప్పై ఆరు సంవత్సరాల కిందటి మాట. నేనూ శివరామూ హైస్కూల్లో చదువుతున్న రోజులవి. తిమ్మాపురం హైస్కూల్ ఆరోజుల్లో బాగా ప్రసిద్ధి పొందిన స్కూలు. తిమ్మాపురం దగ్గర ఉన్న 'ఎనుముల దొడ్డి'లో మా పిన్నమ్మ ఉండేది. అప్పట్లో వాళ్ల సంసారం బాగుండేది. ఆ దినాల్లో శింగనమల చెరువు సరిగా నిండేది. కాదు. ఆ చెరువు కింద పల్లెలన్నీ ఎప్పుడూ కరువుతో కటకటలాడేవి. మావంటి వాళ్ల కుటుంబాలు గాలికి కొట్టుకొనిపోయే జొన్న వొగుడు మాదిరి కూలి కోసం దిక్కుల కొకటి పోయేవి. అంత పేదరికంలో కూడా నాకు చదువు కోవాలని కోరిక ఉండేది. అది గమనించిన మా పిన్నమ్మ నన్ను ఎనుముల దొడ్డికి పిలుచుకొని పోయింది. మా చిన్నాయన నన్ను తిమ్మాపురం హైస్కూల్లో ఎనిమిదో తరగతిలో చేర్చినాడు. నేను ప్రతిరోజూ ఉదయం ఎనుముల దొడ్డి నుండి మూడు మైళ్లు నడిచి హైస్కూలుకు వెళ్లి చదువుకొని మళ్లీ సాయంకాలానికి ఎనుముల దొడ్డి చేరుకునేవాణ్ణి. అప్పుడే శివరాం కూడా ఎనిమిదో తరగతిలో చేరి నాకు పరిచయమయినాడు.

శివరాం వాళ్లది తిమ్మాపురానికి దక్షిణం వైపున్న కొత్తపల్లి. నా మాదిరే శివరాం కూడా కొత్తపల్లి నుండి హైస్కూలుకు నడిచి వచ్చి వెళ్లేవాడు. పల్లెల నుండి వచ్చే వాళ్లందరమూ క్యారియర్లలో మధ్యాహ్నం భోజనం తెచ్చుకునే వాళ్లం. నాదీ, శివరాందీ, ఇంకా అయిదారు మందివీ సిల్వర్ (అల్యూమినియం) క్యారియర్లే. కొంతమంది మాత్రం స్టీలు క్యారియర్లు తెచ్చుకునేవాళ్లు. ముగ్గురు నలుగురు మూడు నాలుగు గిన్నెల క్యారియర్లు తెచ్చుకోవడం చూసి నేనూ, శివరామూ ఆశ్చర్యపోయేవాళ్లం. అందులో ఏమేమి తెచ్చుకుంటారోనని ఆలోచించేవాళ్లం.

మధ్యాహ్నం స్కూలు వదలగానే క్యారియర్లు తెచ్చుకున్న వాళ్లందరమూ ఊరి బయటున్న నారపరెడ్డివాళ్ల తోటదగ్గరికి వెళ్లేవాళ్లం. తోటమధ్యలో ఉన్న కపిల బావిలో ఎప్పుడూ నీళ్లు తొలుకులాడేవి. క్యారియర్లు తెచ్చుకున్నవాళ్లలో కాపుదనం పిల్లలు మాత్రం బావిలోకి దిగి కాళ్లూ మొగం కడుక్కొని అక్కడే మెట్ల మీద కూర్చొని అన్నం తినేవాళ్లు. నేనూ శివరాం నరసిగాడూ రంగన్నా కలిసి బావికి దూరంగా గెనుము ముందున్న కాలువ పొర్ర పక్కన కూర్చొని తినేవాళ్లం. పప్పు వొకరూ పులుసు వొకరూ ఊరు మిండి వొకరూ పండుకారం వొకరూ తెచ్చుకున్నవన్నీ తలాకింత పంచుకోవడం, అవీ ఇవీ మాట్లాడుకుంటూ తినడం అలవాటయిపోయింది మాకు. శివరాం మాత్రం ఒకనాడుకూడా పప్పూ పులుసూ తెచ్చుకొనేవాడు కాదు. అది నాకు బాధ కలిగించేది ఒకసారి కారణమడిగినాను. తన ఇంటి పరిస్థితులన్నీ చెప్పి కళ్లనిండా నీళ్లు నింపుకున్నాడు శివరాం. నాకంటే పేదవాడయిన శివరాం పరిస్థితి తెలిసి మనసు బాధ పడింది.

ఒకరోజు మామూలుగానే కాలువపొర్రపక్కన అన్నం తినడానికి కూర్చున్నాం. నేను క్యారియర్ మూత తీసి ముద్ద మీదున్న వంకాయ బజ్జి మూతలో వేసుకుంటున్నాను. నరసిగాడూ రంగడూ క్యారియర్లోనే అన్నం కూరా కలుపుకుంటున్నారు. శివరాం మాత్రం ఎంతసేపటికీ క్యారియర్ మూత తీయకుండా ఎక్కడో చూస్తున్నాడు. అక్కడ

కూర్చోడానికి ఇబ్బందిపడుతున్నాడు. నాకు అనుమానం వచ్చి శివరాం క్యారియర్ మూత తీసి చూసినాను. క్యారియర్ ఖాళీగా ఉంది. పరిస్థితి నాకర్థమయింది. ఎందుకు ఖాళీ క్యారియర్ తెచ్చుకున్నాడో అర్థం చేసుకున్నాను. శివరాం తటాలున పైకి లేచి వెళ్లబోయినాడు. నేను చేయి పట్టుకుని లాగి కూర్చోబెట్టి అతని ముఖం వైపు చూసినాను. శివరాం కన్నీళ్లు కారుస్తున్నాడు. ఏం జరిగిందని అడిగాను. రాత్రి ఇంట్లో అందరూ పస్తున్నారని ఆకలితో కళ్లకు మబ్బులు వస్తున్నాయని చెప్తూతూ బోరున ఏడ్చేసినాడు. నా పేగులు తరుక్కుపోయినాయి. దుఃఖం పెల్లుబికి వస్తూ ఉంటే భరించలేక దగ్గరికి జరిగి శివరాంను నా ఒంట్లోకి లాక్కొని కన్నీళ్లు తుడుస్తూ ఓదార్చినాను. కాసేపు అందరమూ బాధపడి తెచ్చుకున్నదంతా ఒకచోట కలిపి తిని చేతులు కడుక్కున్నాం. క్యారియర్లన్నీ కడిగిపెట్టి ఒకచోట గెనుము మీద కూర్చున్నాం. పది నిమిషాలపాటు ఎవరమూ మాట్లాడలేదు. గాలికి వరి వెన్నులు గల గలలాడుతున్నాయి. ఎక్కడో పాము నోట్లో చిక్కిందేమో, కప్ప మూలుగుతూ ఉంది.

'మా ఇంట్లో పూటపూటకూ గడవడం శానా కష్టమై పోయింది మారెప్పా. ఇంగ చదవడం నా శాత కాదు. స్కూలు మానేసి యేదన్నా పని చూపుకోవల్లను కుండాను.' శివరాం నావైపు చూస్తూ బాధగా అన్నాడు. వచ్చే సంవత్సరం హాస్టల్ పెడతారని హాస్టల్లో చేరితే ఎట్లో కాలం గడిచిపోతుందని అంతవరకూ మేము తెచ్చుకున్నది తింటూ ఉండమని అందరమూ ప్రాధేయపడినాం. నరిసిగాడూ రంగడూ పుస్తకాలకు సహాయం చేస్తామన్నారు. కొత్తపల్లికి వచ్చి అందరమూ కలిసి ఇంట్లో పెద్దోల్లకు నచ్చజెప్తూతామన్నాం. శివరాం ఏమీ మాట్లాడకుండా మవునంగా ఉండిపోయినాడు.

కూటికి గుడ్డకూ నలుగుతూ శివరాం, నేను అట్లే కాలం గడిపినాం. కష్టాలకు అలవాటయిపోయిన మాకు అవన్నీ బాధ కలిగించలేదు కానీ మమ్మల్ని సంఘం చూసే పద్ధతిని తలచుకొని కుమిలిపోయేవాళ్లం. ఒకనాడు మామూలుగానే మధ్యాహ్నం క్యారియర్లు తీసుకోని తోట దగ్గరికి పోయినాం. కాలువ పార్రలో నీళ్లు లేవు. మాకు దిక్కు తోచలేదు. బాగా ఆకలిగా ఉంది. నీళ్లు తర్వాత చూసుకోవచ్చులే అనుకొని ఆకలితో గబగబా నాలుగు ముద్దలు తిన్నాం. శివరాం తెచ్చుకున్న కొర్ర మెతుకులు పొడిపొడిగా ఉన్నాయేమో గొంతులో పొరపోయింది. శివరాం నీళ్లకోసం పరుగెత్తినాడు. రంగారెడ్డీ సుబ్బిరెడ్డీ వెంకట నాయుడూ తిరుపాలుశెట్టీ బావి మెట్లమీద కూర్చొని అన్నం తింటున్నారు. వాళ్లంతా మా క్లాస్‌మేట్స్... వాళ్లకు కొంచెం దూరంగా నిలబడి 'రంగారెడ్డీ, రోన్ని నీళ్లు తెచ్చి పొయ్యవా' అని దగ్గుతూ అడిగినాడు శివరాం.

'మెట్ల తీసక రావల్లోయ్! రోంత సేపుండు. తినేది అయిపోయినంక క్యారియర్ ముంచుకొనిచ్చి పోస్తాను' అన్నాడు రంగారెడ్డి. నోట్లో మెతుకులు నసాళానికి ఎక్కినాయేమో శివరాం తట్టుకోలేక బావిలోకి దిగి దోసిలితో నీళ్లు తాగి ఊపిరి పీల్చుకొని బయటికొచ్చినాడు. వాళ్ళందరూ శివరాంను తిట్టినారు. అది చూసి మేము నలుగురమూ ఏకమయినాం. వాళ్లు చేతులు కడుక్కొని నీళ్లు తాగకుండానే నారపరెడ్డి ఇంటి వైపు వెళ్లినారు. ఏదో జరగరానిదే జరుగుతుందని మేము భయపడుతూ స్కూలు చేరుకున్నాం.

మధ్యాహ్నం స్కూలు ప్రారంభమైంది. సోషియల్ టీచర్ హనుమప్ప మా క్లాస్ తీసుకున్నాడు. ఆయన క్లాసులో మాత్రమే మేము రెండో బెంచీలో కూర్చుంటాం. మిగతా లెక్కల అయ్యవారు రామిరెడ్డి, తెలుగు పండిట్ సుబ్బాశాస్త్రీ, సైన్స్ టీచర్ రంగారావు క్లాసుల్లో మమ్మల్ని వెనక బెంచీలో దూరంగా కూర్చోబెట్టే వాళ్లు. అదేమిటని అడగడానికి మాకు ధైర్యం వచ్చేది కాదు. చిన్నబుచ్చుకొని బాధపడుతున్న మమ్మల్ని చూసి మా కులం ప్రస్తావించకుండా 'మీరు పెద్ద పిల్లలు. వెనక ఉంటేనే మేలు' అని తెలివిగా సర్దిచెప్పేవాళ్లు. వాళ్ల వెటకారపు మాటలు మాకు బాధ కలిగించినా కొన్నాళ్లకు అవి మాకు అలవాటయిపోయినాయి. కూటికి గతిలేని వాళ్లం, ఏమి మాట్లాడగలం?

శివరాం, నేనూ క్లాసులో పాఠం శ్రద్ధగా వింటున్నాం. అంతలో నారపరెడ్డి గట్టిగా నోరు చేస్తూ, 'మా బాయిలేకి దిగి నీళ్లు తాగిండే ఆ మాదిగ నా కొడుకులు యెవురు? యేలు పెట్టేకి సందిస్తే కోలు పెట్లల్లని చూస్తారు తప్పొడు ముండాకొడుకులు' అని బండబూతులు తిడుతూ స్కూల్లోకి వచ్చినాడు. నారపరెడ్డి ఆ ఊర్లో మోతుబరి రైతు. పైగా స్కూలు కమిటి ప్రెసిడెంటు. పూర్తి మొరటు మనిషి. అతనంటే హెడ్మాష్టరుకు కొంచెం భయమే. అందుకే అతన్ని చూడగానే హెడ్మాస్టరు బయటికొచ్చి తన గదిలోకి పిలుచుకొని వెళ్లి కూర్చోబెట్టినాడు. తర్వాత మాకు పిలుపొచ్చింది. మేము భయపడుతూ హనుమప్ప సార్‌తో జరిగిందంతా చెప్పి హెడ్మాష్టర్ గదిలోకి పోయినాం. మమ్మల్ని చూడగానే నారపరెడ్డి బూతులు తిడుతూ అరికాలి మీద పైకి లేచినాడు. శివరాం అతనికి ఎదురుగా నిలబడి ధైర్యంగా తలపైకెత్తి జరిగిందంతా చెప్పినాడు. తన కాళ్లు పట్టుకొని ప్రాధేయపడలేదని కోప మొచ్చిందేమో నారపరెడ్డి శివరాంను కాలితో ఎగిచ్చి తన్నినాడు. 'యేం తప్పు చేసినాం రెడ్డీ, అట్ల కొడతాండావు?' అని నేను ప్రశ్న వేసినాను భయపడుతూ. శివరాం అతని చేతిని పట్టుకొని విదిలించి వేసినాడు. అది భరించలేక నారపరెడ్డి కాలికి వేసుకున్న చెప్పు తీసుకొని మమ్మల్ని ఇద్దరినీ కొట్టాడానికి పూనుకున్నాడు. హెడ్మాష్టరు నిలువు గుడ్లు వేసుకొని చూస్తున్నాడు. అంతలోనే హనుమప్ప సార్ వచ్చి అతని చేతిలో ఉన్న చెప్పును లాగి పారేసినాడు. ఆయనకూ నారపరెడ్డికి కొంచెం వాదులాట జరిగింది. హెడ్మాష్టరు సర్దిచెప్పి నారపరెడ్డిని ఇంటికి పంపినాడు. మేము అవమానంతో క్లాసుకు వెళ్లి కూర్చున్నాం.

హనుమప్ప సార్ ఓదార్చి అర్ధగంటసేపు ఆవేశంగా మాట్లాడినాడు. 'కుల వ్యవస్థ దేశాన్ని ఇంకా నాశనం చేస్తూనే ఉంది. కుల రహిత సమాజం కోసం మనం పాటుపడాలి. ఆర్థిక సమానత్వం వచ్చినప్పుడు ఈ దేశంలో సాంఘికమయిన అసమానతలు అవంతకవే నాశనం కాకతప్పవు. బాగా చదువుకొని ఉన్నత స్థాయికి వెళ్లితే అగ్రవర్ణాలవాళ్లే మన కాళ్లకు మడుగులొత్తుతారు' అని చెప్పిన హనుమప్ప గారి మాటలు మాకు అంతగా అర్థం కాకపోయినా మాలో పట్టుదలను పెంచినాయి. వేరే విషయాలేవీ పట్టించుకోకుండా చదువుమీదే మనసంతా లగ్నం చేసినాం.

అతి కష్టంగా నాలుగేండ్ల కాలం గడిచిపోయింది. శివరాం నేనూ నరసన్నా స్కూలు ఫైనల్లో పాసయినాం. రంగారెడ్డితోపాటు అతని మిత్రులందరూ ఫేల్ అయినారు. అది మాకు గొప్ప విజయంగా తోచింది. చదువు చాలించి యేదయినా

ఉద్యోగం చూసుకొని సంసారాలను ఆదుకోమని మా ఇళ్లల్లో ఒకటే పోరు. నాకయితే ఎక్కడయినా చిన్న ఉద్యోగం దొరికితే చేరాలనిపించింది. కానీ ఉద్యోగం ఏవిధంగా సంపాదించుకోవాలో తెలీదు. మనసులో మాత్రం కాలేజీ లెక్చరర్ కావాలన్న కోరిక బలంగా ఉంది. శివరాం కూడా హనుమప్ప సార్ సహాయంతో ఎక్కడయినా ఒక చిన్న ఉద్యోగం సంపాదించుకోవాలనుకున్నాడు. అయితే హనుమప్ప సార్ మా అభిప్రాయాలకు అడ్డం వచ్చి, కొండంత ధైర్యం చెప్పి, మమ్మల్ని కాలేజీలో చేర్పించినాడు. అప్పుడు డిగ్రీ కాలేజీ అనంతపురంలో మాత్రమే ఉండేది. అనంతపురం డిగ్రీ కాలేజీలో చదవడమేనేది మావంటివాళ్లకు అప్పుడు కలలో కూడా సాధ్యం కానిపని. అటువంటిది మేము నాలుగేండ్లు అనంతపురంలో చదవడమంటే సామాన్యమయిన విషయం కాదు. హనుమప్ప కష్టపడి మాకు వెల్ఫేర్ హాస్టల్ సీటు కూడా ఇప్పించినాడు. కానీ అప్పటికే హాస్టల్లో ఉన్న రూములన్నీ నిండిపోవడంతో వార్డెన్ మాకు హాస్టల్లో భోజన సౌకర్యం మాత్రం కల్పించి, బయట రూము తీసుకొని చదువుకొమ్మన్నాడు. మాకయితే ధైర్యం చాలలేదు. హనుమప్ప టీచరే మా చేతిలో పది రూపాయలు పెట్టి, ప్రతినెలా సహాయం చేస్తానని, ధైర్యంగా చదువుకొమ్మని చెప్పి వెళ్లిపోయినాడు. ఏమి చెయ్యాలో, హనుమప్ప టీచర్ని ఏమని అనుకోవాలో మాకు దిక్కు తోచలేదు.

భయంభయంగా దిగులుగా బిక్కుబిక్కుమనుకుంటూ శివరాం, నేనూ డిగ్రీ చదవడం ప్రారంభించినాం. చదువు కోసం అప్పుడు మేము అనంతపురంలో ఉండడం విక్రమార్కుని సాహసం వంటిది. ఎవరెస్ట్ శిఖరాన్ని ఎక్కడం వంటిది. ఆకాశానికి నిచ్చెన వెయ్యడం వంటిది. అయినా మొండి ధైర్యం తెచ్చుకున్నాం. భవిష్యత్తు మీద ఆశలు పెంచుకున్నాం. అయితే అడుగడుగునా పేదరికం వల్ల ఎన్నో ఇబ్బందులు కలిగేవి. ఆ ఇబ్బందులు మాలో పట్టుదలను పెంచేవి. కానీ పేదరికంకంటే మమ్మల్ని సమాజం ఎక్కువ గాయపరిచేది. మమ్మల్ని పురుగులకన్నా హీనంగా చూసేది. ఒక్కొక్క సంఘటనా మాలోని రక్తాన్ని మరిగించేది. మమ్మల్ని సమాజం బాధపెడుతున్నట్లు ఎక్కడా కనిపించేది కాదు. రాజకీయ నాయకుల ఉపన్యాసాల్లో, స్వాముల ఉపదేశాల్లో, రేడియో ప్రసంగాలలో ఎక్కడ విన్నా సర్వ మానవ సౌభ్రాతృత్వ ప్రసంగాలే. కానీ జీవితంలో మాకు అడుగడుగునా అవమానాలే. ఏవిధంగా నయినా గట్టిగా చదువుకొని మంచి ఉద్యోగాలలో చేరి ఆ అవమానాలకు దూరం కావాలని నేనూ శివరామూ దృఢసంకల్పం పెంచుకున్నాం.

మేమిద్దరమూ డిగ్రీ ఫైనల్ చదువుతున్న రోజులవి. ఒకనాడూ మా తరగతి గదిలో మా క్లాస్‌మేట్ దేవదాస్‌ను అభినందిస్తూ ఒక మీటింగ్ జరిగింది. దేవదాస్ బ్యాంక్ ఉద్యోగిగా సెలెక్ట్ అయిన సందర్భంగా మా క్లాస్‌మేట్స్ అందరూ కలిసి ఆ మీటింగును ఏర్పాటు చేసినారు. మీటింగుకు కొంతమంది లెక్చరర్లు కూడా వచ్చినారు. మేమంతా దేవదాస్‌ను అభినందించినాం. మాతోపాటు చదువుతున్న వాసుదేవశాస్త్రి చివరగా మాట్లాడుతూ, అదే ఉద్యోగానికి తాను కూడా ప్రయత్నం చేశానని, తనకు దేవదాస్ కంటే పది మార్కులు ఎక్కువ వచ్చినా రిజర్వేషన్స్ కారణంగా దేవదాసుకు ఉద్యోగం వచ్చిందని అది ప్రజ్ఞను అవమానించడమేనని రిజర్వేషన్స్ ఉన్నతకులాల

వాళ్లకు తీరని నష్టం కలిగిస్తున్నాయని ఆవేశంగా ఉపన్యసించినాడు. దానిమీద వాదోపవాదాలు జరిగినాయి. ఆనందంగా జరగవలసిన సమావేశం ఆవేశాలతో ముగిసింది. నేనూ శివరాం బరువుగా నిట్టూరుస్తూ ఇంటికి బయలు దేరినాం. మేము మా రూముకు చేరుకునేటప్పటికి అక్కడ ఇంటి ఓనర్ ప్రభాకరరావుగారి భార్య మా రూములో ఉన్న మరొక మిత్రుని మీద విరుచుకుపడుతూ ఉంది. నేను ప్రశాంతంగా ఆమె దగ్గరికి వెళ్లి విషయమేమిటో తెలుసుకున్నాను. "ఏమిటని అడుగుతావేమయ్యా? రూములో చేరేటప్పుడు జ్ఞాన ముండనక్కరలేదా? కులం దాచిపెట్టి మా ఇంట్లో చేరుతారా? మేము బ్రాహ్మలమన్న బుద్ధీ జ్ఞానం లేదా?" ఆవేశంతో చేతులు ఊపిందామె. ఆమె మాటలు విని శివరాం కొంచెం సేపు అవమానంతో కుంగిపోయినాడు. నేను అసహనంతో ఉడికిపోయినాను. ఇద్దరమూ కులాలను గురించి ఆమెకు క్లాస్ తీసుకున్నాం. మా మాటలేవీ పట్టించుకోకుండా ఆమె యేదేదో గొణుగుతూ సాయంకాలానికంతా రూము ఖాళీ చెయ్యండని చెప్పి ఇంట్లోకి వెళ్లిపోయింది.

మిత్రులం ముగ్గురమూ రూములో కూర్చున్నాం. కొంచెం సేపు మౌనం ఆవరించుకుంది. పొందిన అవమానం మాటిమాటికి నిట్టూర్పుల రూపంలో బుసలు కొడుతూ ఉంది. నా చెవుల్లో ఇంటి ఓనర్ మాటలూ క్లాస్‌రూమ్‌లో శాస్త్రి అన్న మాటలూ మేకుల మాదిరి గుచ్చుకోసాగినాయి.

మాలా మాదిగలకున్న రిజర్వేషన్ సౌకర్యం వల్ల ఉన్నత కులాల వాళ్లకు అన్యాయం జరుగుతూ ఉందట! మరి సాంఘికంగా మాదిగలకు ఇంత అన్యాయమూ, అవమానమూ జరుగుతూ ఉంటే దానికి కారకులెవరు? ఈ రోజు మాదిగల ప్రతిభను అవహేళన చేస్తున్నారు. తరతరాల నుండి వాళ్ల ప్రతిభను దోచుకున్నదెవరు? శతాబ్దాలుగా కష్టం చేసింది మాలామాదిగలయితే వాళ్ల కష్టాన్ని దోచుకుని సుఖపడడానికి ఉన్నత కులాలవాళ్లకు ఎవరు రిజర్వేషన్ సౌకర్యం కల్పించినారు?

అనేక ప్రశ్నలతో నా శరీరం అగ్నిగుండమయింది. పల్లెలో హీనంగా ఉన్న మా కులం సోదరులను ఈ దేశ కులసంస్కృతి తరతరాల నుండి ఎంత నీచంగా చూస్తూ ఉందో అనుభవాలతోపాటు గుర్తుకు తెచ్చుకొని నేనూ శివరాం ఉడికిపోయినాం. ఆర్థికంగా రాజకీయంగా మాలామాదిగలు ఎదిగినప్పుడే వాళ్లకు సాంఘిక న్యాయం లభిస్తుందని, ఎలాగయినా రాజకీయాధికారం దక్కించుకోవాలని శివరాం దృఢంగా మనసులో నిర్ణయించుకున్నాడు.

కాలం మమ్మల్ని ఎన్నో అవమానాలకు గురిచేస్తూ బరువుగా సాగిపోయింది. నేను చదువు ముగించుకొని లెక్చరర్‌గా ఉద్యోగంలో చేరడం, శివరాం బి.ఎల్.చదివి లాయరుగా ప్రాక్టీసు పెట్టడం, మంచి పేరు తెచ్చుకొని రాజకీయాల్లో చురుగ్గా పాల్గొనడం, అంత లోపలే కళ్యాణ దుర్గం రిజర్వుడు నియోజక వర్గానికి అభ్యర్థిగా నిలుచుకోమని అధికార పార్టీ నుండి పిలుపు రావడం, శివరాం ధైర్యం చేసి పోటీకి దిగి కళ్యాణ దుర్గం నుండీ శాసన సభ్యుడుగా ఎన్నిక కావడం నాలుగైదు సంవత్సరాలలో చక చకా జరిగిపోయినాయి.....

శివరాం మంత్రి అయినాడన్న ఆనందంతో తేలిపోయిన మనస్సు వెనకటి జ్ఞాపకాలతో కొంచెం బరువెక్కింది. ఈజీ ఛేర్‌లో నుండి పైకి లేచి వరండాలోకి వెళ్లి వీథుల్లోకి చూసినాను. మధ్యాహ్నందాకా ఆనందోత్సాహాలతో హోరెత్తిన పట్టణం నిశ్శబ్దంగా ఉంది. ఎక్కడా కేకలూ కేరింతలూ లేవు. అవును, ఎందుకుంటాయి? ఒక మాదిగవాడు మంత్రి అయినాడు కదా! మాదిగల అభివృద్ధిని అభినందించడానికి జనం ఎవరొస్తారు? తమ బలాన్నీ ఐకమత్యాన్నీ చూపుకోడానికి మాదిగలకు తెగింపు కానీ ఆలోచన కానీ ఎందుకొస్తుంది? ఏమి చెయ్యాలనుకున్నా, చివరికి ఆనందం చాటుకోవాలనుకున్నా తరతరాల నుండీ పొందిన అవమానం వెనక్కి లాగుతుందేమో!

చీకాకు పడుతూ బజార్లోకి వెళ్లి మిత్రులందరినీ కలుసుకుందామని బయలుదేరు తున్నాము. అంతలోనే, 'రంగారెడ్డిని మంత్రివర్గంలోకి చేర్చుకోవాలి. కదిరిసింహం రంగారెడ్డి నాయకత్వం వర్ధిల్లాలి!' అంటూ సుమారు ఐదారు వందల మంది గట్టిగా నినాదాలు చేస్తూ పోయినారు. నా శరీరమంతా తేళ్లు పారాడినట్లయింది. మరొక అర్ధగంటలోపలే దాదాపు వెయ్యిమంది 'ధర్మవరం రాజకీయ కిశోరం గిరిధర చౌదరి వర్ధిల్లాలి. గిరిధర చౌదరికి మంత్రి పదవి ఇవ్వాలి. అసమర్థ రాజకీయ నాయకుడు శివరాం – డౌన్ డౌన్' అని పెద్దగా కేకలు వేస్తూ ఆవేశంతో చిందులు తొక్కుతూ వెళ్లినారు. నా నరాలు చిట్లినట్లయినాయి. అసహనంతో రక్తం వేడెక్కింది. కిందికి దిగి వచ్చి కొంచెంసేపు అట్లే కూలబడిపోయినాను. మాలతి కాఫీ తెచ్చి ఇచ్చి, 'ఎందుకు అదోకరకంగా ఉండారు?' అని అడిగింది. నేను విషయం చెప్పినాను. 'ఉన్నత కులాలవాళ్లు ఈ కాలంలో ఎస్సీలను రాజకీయంగా ఎదగనిస్తారేమండి?' అని చాలా తేలిగ్గా అనేసి మాలతి లోపలికి వెళ్లిపోయింది.

కాఫీ తాగుతూ వీథిలోకి చూస్తున్నాను. మరొక గుంపు వచ్చింది. నలభై యాభైమంది ఎస్సీలు మాత్రం 'బడుగు వర్గాల నాయకుడు శివరాం గారికీ జై! మంత్రివర్యులు శివరాం గారూ వర్ధిల్లాలి!' అంటూ వెళ్లినారు. ఆ అరుపుల్లో ఎంతో నీరసం ధ్వనించింది. మనసంతా అసంతృప్తితో నిండిపోయింది.

నాలుగు రోజులు గడిచిపోయినాయి. ఆ రోజు శివరాం అనంతపురానికి మొదటి సారిగా వస్తున్నాడు. ఇటీవల రాష్ట్రంలోనూ, జిల్లాలోనూ దళితుల మీద జరిగిన అనేక దాడుల కారణంగా దళితుల్లో కదలిక వచ్చిందేమో, మంత్రికి స్వాగతం చెప్పడానికి చాలామంది బయలుదేరినారు. నేను నా శక్తికొద్దీ దళిత సంఘాలనూ బడుగు వర్గాలవాళ్లనూ ప్రోగు చేసినాను. అందరమూ బయలలుదేరి జిల్లా సరిహద్దుకు చేరుకున్నాం.

అనుకున్న సమయానికే శివరాం వ్యవసాయశాఖ కేబినెట్ మంత్రిగా పోలీసు ఎస్కార్టుతో జిల్లా పొలిమేరలోకి అడుగు పెట్టినాడు. ముందర నాలుగూ వెనక నాలుగూ కార్ల మధ్య తెల్లని కారొచ్చి ఆగింది. తన మనసు మాదిరి స్వచ్ఛంగా తెల్లగా నిగనిగలాడుతున్న కార్లో నుండీ మా శివరాం కిందికి దిగినాడు. నా శరీరం పులకరించింది. ఆనంద భాష్పాలు పొంగి పొర్లినాయి. అందరితోపాటూ నేను ఒక పూలహారం శివరాం మెడలో వేసినాను. శివరాం నావైపు చూసినాడు. అతని కళ్లల్లో

నుండీ కొన్ని సంవత్సరాల మా స్నేహానికి చిహ్నంగా ఎన్నో విషాద జ్ఞాపకాలకు గుర్తుగా బాష్పబిందువులు ముత్యాల మాదిరి రాలిపడుతూ ఉంటే నన్ను అలింగనం చేసుకున్నాడు. నా శరీరం నలుమూలల నుండి ఉద్వేగం పొంగి వచ్చింది. జీవితంలో కలిగిన ఆటుపోట్లకూ పొందిన అవమానాలకు ప్రతిఫలంగా ఆ గౌరవం దక్కిందనీ అది సమాజంలో మేము సాధించిన విజయమనీ మౌనభాషలో గర్విస్తూ తృప్తి పడినాం. అక్కడికి చేరుకున్న వందలాదిమంది జనం శివరాంను అభినందించినారు. ఎంతో ఔన్నత్యం లభించినట్లు గర్వపడింది మనస్సు.

శివరాం ముందూ వెనకా ముప్పై నలభై వాహనాల్లో అందరూ అనంతపురం బయలుదేరినారు. కార్తీకమాసం. రోడ్డుకు ఇరువైపులా పొలాలన్నీ పచ్చని కాంతులతో మిలమిలలాడుతున్నాయి. పచ్చగా విరబూసిన సూర్యకాంతం మొక్కలు రోడ్డు వైపు వొంగి మిత్రునికి శుభాకాంక్షలు తెలుపుతున్నాయి. పండిన సద్దచేలూ జొన్నచేలూ ఆనందంగా ముఖాలెత్తి స్నేహితుని వైపు గుడ్లప్పగించి చూస్తున్నాయి. కందికొమ్మలు విరబూసి సంతోషంతో చేతులు ఊపుతున్నట్లున్నాయి. అక్కడక్కడ పెరికె వోదికి వేసిన వేరుశెనగ చేలల్లో నుండి రైతు జీవితాలను పరవశింపజేసే పరిమళం వీస్తూ ఉంది. గట్లమీదా నట్లమీదా ఉన్న తంగేడు చెట్లూ పల్లేరు మొక్కలూ రకరకాల గడ్డి మొక్కలూ అందంగా విరబూసి తమను ప్రేమించిన ఆ మిత్రునికి సువాసనలతో స్వాగతం పలుకుతున్నాయి.

అంతా గమనిస్తూ స్కూటర్లో వెళుతున్నాను. వచ్చిన జనమంతా బడుగు వర్గాల వాళ్లే. జిల్లా రాజకీయ నాయకులు కలికానికయినా లేరు. ఉన్నత కులాల రాజకీయ నాయకులు అసలే లేరు. మళ్లీ మళ్లీ గమనించి చూసినాను. నిజం! ఉన్నత కులాల నాయడొకడూ లేడు. నా మనస్సు చివుక్కుమనింది. వెనకటి మంత్రవర్యుల అర్భాటాలు గుర్తుకొచ్చినాయి.

సరిగ్గా నాలుగు సంవత్సరాల కిందట. ఎన్నికలు కాగానే రాష్ట్ర మంత్రిమండలి ఏర్పడింది. ధర్మవరం శాసనసభ్యుడు గిరిధర చౌదరికి డిప్యూటీ మంత్రి పదవి వచ్చింది. ఆయనగారు మంత్రిగా జిల్లాకు వచ్చినప్పుడు అనంతపురం నుండి గుత్తి వరకూ యాభై కిలోమీటర్ల పొడవునా రోడ్డుకు బ్యానర్లు కట్టినారు. రోడ్లో మామూలు వాహనాలన్నిటినీ రద్దు చేసినారు. జిల్లా నలుమూలల నుండీ మండలానికి పది వాహనాల చొప్పున ఆరు వందల వాహనాలను రోడ్డా పొడవునా నిలబెట్టినారు. బెంగుళూరు నుండీ మంత్రిగారి బరువుతో సమానమయిన గులాబీల హారాలు తెప్పించినారు. మూడు నాలుగు లక్షల మందిని కూలి ఇచ్చి వాహనాల్లో తోలి గుత్తి దాకా జనహారం కట్టినారు. కిలోమీటరుకొకటి మంత్రిగారి నిలువెత్తు కటౌట్లను నిలబెట్టినారు. ప్రతి వాహనం మీదా తప్పెట్లను ఏర్పాటు చేసినారు.

జిల్లాలోని అగ్రనాయకులందరూ మంత్రిగారికి స్వాగతం చెప్పడానికి తరలి వచ్చినారు. ప్రతి పల్లెలో నిక్కబొడుస్తున్న అగ్రకులాల నాయకులందరూ ఆనందోత్సాహాలతో అక్కడ చేరుకున్నారు. అభిమానులు లక్షలాది రూపాయల విలువచేసే టపాకాయలను పేల్చినారు. కూలికి వచ్చిన పేద జనాన్ని రోడ్డు దాటి పక్కకు పోకుండా నాయకులు కట్టెలు పట్టుకొని అదిలించినారు. గుత్తి దగ్గర నుండీ సాగి వచ్చిన జన

సమూహమంతా వచ్చి చేరేటప్పటికి అనంతపురం సముద్రం మాదిరి హోరెత్తింది. అరాచకమయిన శబ్దాలతో నినాదాలతో మందుగుండు పేల్చిన పొగలతో అనంతపురం యుద్ధంలో తగలబడినట్లు మారిపోయింది. సారాయీ కల్లూ ఏరులై పారినాయి. అల్లరి మూకలు వెర్రి ఆవేశంతో తాగిన మైకంలో చిందులు తొక్కుతూ ఆరు మంది అమాయకుల ప్రాణాలను బలి తీసుకున్నారు.

జరిగిన బీభత్సన్ని గుర్తుచేసుకొని బరువుగా నిట్టూరుస్తూ అటువంటి ఆర్భాటం నా మిత్రునికి అవసరం లేదనుకుంటూ నిరాడంబరంగా ఆత్మీయంగా సాగిన మిత్రుని స్వాగత ప్రదర్శనలో కలిసి వచ్చి ఊరు చేరుకున్నాను. తర్వాత ఉద్యోగబాధ్యతలో మునిగిపోయిన నేను వీలయినప్పుడు మాత్రమే శివరాంను కలుసుకోసాగినాను. శివరాం కొత్త జీవితానికి క్రమేణా అలవాటు పడినాడు. తమ బడుగు వర్గాల వాడు మంత్రి అయినాడని అతనితో తమ కష్టాలను చెప్పుకోడానికి వస్తున్న పేదల సంఖ్య పెరుగుతున్నా పరిపాలన సంబంధమయిన సమస్యలు చర్చించడానికి అధికారులు వస్తున్నా శివరాం అంతకుముందు బాడుగకున్న ఆ చిన్న ఇంట్లోనే మంత్రి అయిన తర్వాత కూడా ఉండడం అందరితోపాటు నాకూ ఆశ్చర్యం కలిగించినా సంతోషమయింది.

రెండు నెలల కాలం గడిచిపోయింది. శివరాం నెలకు కనీసం పది దినాలు తన సొంత నియోజక వర్గంలో జిల్లాలో తిరుగుతూ ప్రజల సమస్యలను నెరవేర్చడానికి పూనుకున్నాడు. క్రమంగా పేదవర్గాలవాళ్లు అతనికి దగ్గరవుతున్నారు. తమకేదో కొత్త బలం వచ్చినట్లు ఆనందిస్తున్నారు. తమ మీద దౌర్జన్యం చేసే అగ్రకులాల వాళ్ల మీద తిరగబడుతున్నట్లు వార్తలొస్తున్నాయి. సమాజంలో ఏదో మార్పు జరుగుతున్నట్లు నేను పొంగిపోయినాను.

పల్లెలో వస్తున్న మార్పులు అగ్రకులాలవాళ్లకు ఒంటి మీద జిల్లేడు పాలు చల్లినట్లు బాధ కలిగించినాయి. జిల్లాలోని అగ్రకుల రాజకీయ నాయకులను కాదని ఒక దళితునికి మంత్రిపదవి ఇవ్వడం ఎవ్వరికీ రుచించలేదు. అధికార పార్టీకి చెందిన నాయకులే ప్రతి చిన్న విషయంలోనూ మంత్రి చేసే పనులను వ్యతిరేకించడానికి పూనుకున్నారు. కొంతమంది శివరాం మీద బురద చల్లడానికే దిగినారు. మంత్రిపదవి నుండి తప్పించడానికి పన్నాగాలు పన్నసాగినారు. ఒకవైపు చాటుమాటునా గోతులు తవ్వుతూనే మీటింగులు పెట్టి శివరాంకు సన్మానాలు చేసి తమ పబ్బం గడుపుకోసాగినారు.

ఒకరోజు శివరాం వచ్చినాడని తెలిసి సాయంకాలం నేను బంగ్లాదగ్గరి కెళ్ళినాను. బి.ఎల్. చదివే రోజుల్లో తనకు మంచి స్నేహితుడైన కుల్లాయప్పను నాకు పరిచయం చేసినాడు శివరాం. అంబేద్కర్ చైతన్యక్లబ్ ఆధ్వర్యంలో తాను నడుపుతున్న స్కూలు ద్వారా కుల్లాయప్ప పేరు నాకు బాగా తెలుసు. ఆ స్కూలుకు పట్టణంలో మంచి పేరుంది. కుల్లాయప్ప ఆ స్కూల్ ద్వారా బాగా పేరు పొంది, ఎన్నో అవమానాల కారణంగా ఇటీవలే రాజకీయాల్లోకి దిగి వార్డు కౌన్సిలర్ అయినాడు. వాళ్లస్కూల్లో అంబేద్కర్ సాంస్కృతికోత్సవాలను ప్రారంభించడానికి ముఖ్య అతిథిగా శివరాం బయలుదేరుతున్నాడు. నేను వెళ్లడంతో నన్నూ రమ్మన్నాడు. ఆ కార్యక్రమం వారం రోజుల కిందటే ఫిక్స్ అయినట్లు కుల్లాయప్ప నాతో అన్నాడు.

అందరూ బయలుదేరుతున్నాం. అంతలోనే గిరిధర చౌదరి ఒక పదిమంది తమ ప్రయివేట్ సైన్యంతో హడావుడిగా వచ్చినాడు. వచ్చీరావడంతో సిగరెట్ అంటించుకొని మంత్రికి ఎదురుగా కూర్చొని పొగ పీల్చి ఒదులుతూ "ఏమయ్యా శివరాం, అప్పుడే శానా పెద్దోనివి అయిపోయినావే! అగ్రికల్చర్ అసిస్టెంట్ డైరెక్టర్ ఆ కొండన్న గాన్ని నేను ట్రాన్సిఫర్ చేయిస్తే నువ్వు వాన్ని మల్లా అటికే వేయిస్తావేమయ్యా? నీ కులస్తుడని నువ్వు సపోర్టు ఇస్తే మాత్రం వాడు ధర్మవరంలో పనిచేస్తాడనుకుండావా? అదిసరేగానీ, ఇతడు సుబ్బానాయుడని మా బంధువు. ఒక పెద్ద క్లబ్బు ఈ రోజే ప్రారంభిస్తా ఉండాడు. నిన్ను ముఖ్య అతిథిగా పిలుచుకొని వస్తానని మాట ఇచ్చినాను. నా మాట ప్రకారం వాళ్లు ఈ రోజు ప్రోగ్రాం పెట్టుకొని ఇన్విటేషన్స్ కూడా వేసినారు. ఇంకొక గంటకు కార్యక్రమం మొదలవుతాది నువ్వు ఎట్లున్నా గానీ బయలుదేరల్ల." అంటూ తాను కూర్చున్న అందమయిన సోఫా హ్యాండ్ మీద సిగరెట్ నలిపేసినాడు.

అతని ధోరణి చూసి నాకు అసహ్యమయింది. టీపాయ్ మీద సిగరెట్ ముక్కలు వేయడానికి యాష్ట్రే ఉంది. కానీ ఆ శాసన సభ్యుడు నలిపేసిన సిగరెట్ ముక్క, సోఫా పక్కన కార్పెట్ మీద అసహ్యంగా కనిపిస్తూ ఉంటే తలొంచుకొని శివరాం దాని పక్కనే చూస్తున్నాడు. ఆ శాసనసభ్యుడు తాను ముఖ్యమంత్రికి ఒక తమ్ముడయిపోయినట్లు మంత్రి శివరాంను శాసిస్తున్నాడు. అతని దర్పాన్నీ మంత్రిగారి మౌనాన్ని చూసి కుళ్లాయప్ప దిగులుపడిపోయినాడు. అక్కడున్న వాళ్లందరూ గుడ్లప్పగించుకొని చూస్తున్నారు.

కిందినుండి పైదాకా అధికార పార్టీలో కులం పేరుతో పెరిగిన సంబంధాలూ తరతరాల నుండీ వచ్చిన డాబూ దర్పమూ అర్థబలమూ అంగబలమూ అన్నీ ఉన్న గిరిధర చౌదరిని గురించి అక్కడే కాదు, జిల్లాలోనే తెలియనివాళ్లుండరు. అటువంటప్పుడు అతని దగ్గర నోరు మెదపడానికి ఎవరికి ధైర్యముంటుంది? నాకయినా స్నేహితుని పక్షాన మాట్లాడగలిగే సాహసం ఎక్కడుంది?

శివరాం నెమ్మదిగా నిగ్రహంగా తనకు వేరే ప్రోగ్రాం ఉందన్నాడు. ముందే వచ్చి అడిగి ఉంటే తప్పక వచ్చేవాణ్ణని అన్నాడు. ఆ మాటతో గిరిధర్ అహం దెబ్బ తినింది. నోటికొచ్చినట్లు వాగినాడు. దాన్ని భరించలేక శివరాం ఎదుర్కొన్నాడు. అక్కడున్న వాళ్లందరూ బిత్తరపోయినారు. "మంత్రిపదవి వొస్తానే మనుషులెవరూ కనిపించడం లేదా నీకు? ఎవరి వల్ల మంత్రివయినావో రొంత గుర్తు తెచ్చుకో" అంటూ కోపంగా పైకి లేచినాడు గిరిధర్.

"తక్కువ జాతి నాయాళ్లను అందల మెక్కిస్తే ఇంతేరా....రారా, అతన్నేమి బంగపోతావు! మనం అనుకుంటే ముఖ్యమంత్రి రమ్మంటే రాడా?" అంటూ సుబ్బానాయుడు గిరిధర చౌదరిని లాక్కొని బయటికి వెళ్లిపోయినాడు. వాళ్ల వెంట సైన్యమంతా ఏదేదో మాట్లాడుతూ వెళ్లిపోయింది. ఎవడో బయట గట్టిగా నోరు చేస్తున్నాడు: 'ఈ మాదిగ నా కొడుక్కి అపుడే కండ్లు నెత్తికెక్కినాయన్నా! పట్టుకొని బయటికి జరజర ఈడ్చుకరమ్మంటావా?'

వింటున్న నా శరీరం నిప్పుల కుంపటయింది. శివరాం ముఖమంతా కోపంతో

బాధతో అవమానంతో రంగులు మారింది. అందరమూ కొంచెం సేపు ఉడికిపోయినాం. ఏసీ రూము వేడెక్కింది. నేనూ కుళ్లాయప్పా జరిగిన విషయమంతా ఎన్‌పీకి రిపోర్టు చెయ్యమన్నాం. శివరాం తీవ్రంగా ఆలోచించినాడు. పది నిమిషాల పాటు మౌనం పరుచుకుంది. చేతగానితనం శివరాం చూపుల్లో కనిపిస్తా ఉంది. తన మీద దౌర్జన్యం జరిగితే మంత్రి అయి కూడా శివరాం ఎందుకు మౌనం వహిస్తున్నాడు? పాలనాధికారం ఉండి కూడా దళితుడు పీడింపబడవలసిందేనా? శివరాంకి అధికారాన్ని ఉపయోగించుకునే శక్తిలేదా?

ఎన్నో ప్రశ్నలు నాలో బుసలు కొట్టసాగినాయి. శివరాం గట్టి నిర్ణయంతోనే కుళ్లాయప్ప వెంట బయలుదేరినాడు. నేనూ వాళ్లను అనుసరించినాను.

తెల్లవారింది. ఒక వార్తాపత్రికలో తాటికాయంత అక్షరాలతో 'మంత్రిగారిచే తాగుడుకూ పేకాటకూ నిలయమయిన క్లబ్బుకు ప్రారంభోత్సవం' అని శివరాం మీద అభియోగం వచ్చింది. చదువుకున్న నా మనస్సు అసహనంతో నిండిపోయింది. అగ్రకుల రాజకీయాలకు కొమ్ముకాస్తున్న ఆ పత్రిక మీద వెగటు పుట్టింది. ఆ వార్తకు శివరాం తీవ్రంగా స్పందించి, ప్రెస్ మీట్ ఏర్పాటు చేసి, విషయాలను వివరించినాడు. దళితుడు రాజకీయాల్లో ఎదగకూడదా అని ఆవేదన వ్యక్తం చేసినాడు. మరుసటి రోజు పత్రికలన్నీ శివరాం చెప్పిన వాస్తవాలను వదిలేసి ఎక్కడో ఒక మూల 'మంత్రి ఆవేదన' అంటూ జాలిపడుతూ రాసినాయి. ఒక పత్రిక మాత్రం గిరిధర చౌదరి చర్యను ఖండిస్తూ రాసింది. ఒక పత్రికయినా దళితుల పక్షం వహించినందుకు శివరాం సంతోషపడుతుండగానే ఆ సాయంకాలం ముఖ్యమంత్రి గారి నుండి శివరాంకు ఫోన్ వచ్చింది. పక్కన నేనూ కుళ్లాయప్పా మరొక మిత్రుడూ తప్ప ఎవరూ లేరు.

ఫోన్లో మాటలు వింటున్న శివరాం ముఖం చప్పబడిపోయింది. మౌనంగా ఫోన్ పెట్టేసి దిగులుగా కూర్చున్నాడు. మేము ఏమయిందని ఆదుర్దాగా అడిగినాం.

'దేనికోసం ఈ మంత్రి పదవి? దళితులకు కూడా పరిపాలనలో భాగం కల్పించి రాజ్యాంగాన్ని గౌరవిస్తున్నామని చెప్పుకోడానికా? వ్యతిరేక వర్గంలోని ఒక శాసన సభ్యునికున్న స్థానం కేబినెట్ మంత్రికి లేకపోవడమేమిటి? కారణం మేము దళితులం అనేగదా! తమ కులస్థులు ఏమి చేసినా చెల్లుతుందా? ఎవడు అంగలాసినాడు ఈ మంత్రిపదవి కావల్లని?'

శివరాం చాలా బాధ పడినాడు. మంత్రి పదవితో తానేదో ఉద్ధరిస్తానన్న భ్రమలన్నీ తొలగిపోతున్నాయని వేదన చెందినాడు. బొమ్మ మాదిరి తాను మంత్రిగా ఉండడం దండగని రాజీనామా చేస్తానని కాగితమూ పెన్నూ తీసుకున్నాడు. పత్రికల వాళ్లకు తాను రాజీనామా చేస్తున్నట్లు చెప్పడానికి ఫోన్ ఎత్తినాడు. నేనూ, కుళ్లాయప్పా శివరాంను శాంతపరిచినాం. రాజీనామా చెయ్యడంతో సమస్య తీరిపోదని దళిత సమస్య చాలా లోతయినదని దాన్ని హేతుబద్ధంగా తీర్చుకోవాలని నచ్చజెప్పినాం. అతను మౌనం వహించినాడు.

రోజులు బరువుగా గడిచిపోతున్నాయి. దళిత సాంస్కృతిక మండలి కార్యదర్శిగా చాలా రోజుల నుండీ నేనొక విషయాన్ని శివరాంకు చెప్పుతూ వస్తున్నాను. శివరాం

ఆ విషయాన్ని తేలిగ్గా తీసుకోలేదు. అయితే తన అశక్తతను వ్యక్తం చేస్తూ సమయం వచ్చినప్పుడు ప్రయత్నిస్తానని చెప్పుతూ వొచ్చినాడు. ఒకరోజు హైదరాబాద్ నుండీ ఫోన్ చేస్తూ రాష్ట్ర హోంమంత్రి పద్మారావుతో కలిసి తాను కళ్యాణదుర్గానికి వోస్తున్నట్లు తెలిపినాడు. నేనింతకు ముందు చెప్పిన విషయాన్ని ఫోన్లోనే ప్రస్తావిస్తూ దాన్ని గురించి ఒక మెమొరాండం రాసుకొని సాయంకాలం అనంతపురం గెస్ట్‌హౌస్ దగ్గర కలుసుకోమన్నాడు.

నేను మా మండలి సభ్యులను ఐదారు మందిని వెంటేసుకొని గెస్ట్ హౌస్ దగ్గరికి వెళ్లినాను. అక్కడ ఒక అయిదారుమంది అనామక వ్యక్తులూ వ్యవసాయ శాఖకు చెందిన ఇద్దరు ఆఫీసర్లూ కొంతమంది పోలీసులూ తప్ప ఇంకెవరూ లేరు. ఆ రోజు దినపత్రికల్లో కూడా హోంమంత్రి వొస్తున్నట్లు వార్త వచ్చింది. అయినా గెస్ట్‌హౌస్ ప్రాంతమంతా బోసిపోయి ఉంది. ఆ వాతావరణం చూసి నా మనసు చిన్నబోయింది. అందుకు కారణాలేమిటని ఆలోచిస్తూ ఉండగానే కళ్యాణదుర్గం నుండీ పైలెట్ జీపూ దాని వెనకాలే మంత్రుల కార్లూ వచ్చినాయి. ఏ హడావుడీ లేదు. మంత్రులిద్దరూ కారు దిగి జనం ఎవ్వరూ లేనిది చూసి గెస్ట్ హౌస్ వరండాలోనే కూర్చున్నారు. ఒక్క రాజకీయ నాయకుడు కూడా వెంటలేడు. ప్రోటోకాల్ చూసే నాథుడే లేడు. జిల్లా అధికార్ల అచూకీయే లేదు. కలెక్టర్‌గానీ చివరికి ఎస్పీ గానీ అటువైపు తిరిగి చూడలేదు. మంత్రిగారి పి.ఏ. ఫోన్ చేసి కనుక్కున్నాడు. వాళ్లిద్దరూ గిరిధర చౌదరీ రంగారెడ్డీ ఇంకా కొంతమంది ఎం.ఎల్.ఏ.లతో కలిసి పుట్టపర్తికి పోయినట్లు తెలిసింది. మంత్రులిద్దరూ మవునంగా ఒకరి ముఖం వొకరు చూసుకుంటూ కూర్చున్నారు. వాళ్ల చూపుల్లో చెప్పలేనంత చిన్నతనం కనిపిస్తూ ఉంది.

తరతరాల నుండీ ఆశించిన పదవులకు కష్టపడి చేరుకున్నా అడుగడుగునా వెలి వేయబడుతూ వొస్తున్న దళితుల దైన్యం అక్కడ దళిత మంత్రుల ముందు పరుచుకుంది. హాలంతా నిశ్శబ్దంగా ఉంది. వచ్చిన ఐదు పదిమందీ ఏమీ మాట్లాడకుండా వాళ్లవైపు చూస్తున్నారు. నేను అంతా గమనిస్తూ ఆలోచిస్తున్నాను.

ఎంత దయనీయమయిన పరిస్థితి? కనిపించకుండా సమాజం దళితుల ఔన్నత్యాన్ని ఎంత మవునంగా అవమానిస్తున్నది! ఒక అగ్రకుల మంత్రికి ప్రజలు బ్రహ్మరథం పట్టడమేమిటి, దళిత మంత్రిని లెక్క చేయకపోవడమేమిటి? దళితుని దగ్గర అధికారం కూడా అంటరానిదై పోతూఉందా?

రకరకాల ప్రశ్నల మధ్య నలిగిపోతున్న నన్ను శివరాం పిలవడంతో బరువుగా నిట్టూర్చి దగ్గరికి వెళ్లినాను. శివరాం నన్ను హోం మంత్రి పద్మారావుకు పరిచయం చేసినాడు. నేను సవినయంగా నమస్కారం చేసి, తెచ్చిన మెమొరాండం ఆయనకు అందజేసినాను. హరిజనుల్లో గొప్పగా చదువుకొని విశ్వవిద్యాలయంలో సీనియర్ ప్రొఫెసర్‌గా పనిచేస్తూ రాష్ట్రంలో గొప్ప మేధావిగా పేరుపొందిన రాజరత్నం వంటివాళ్లు చాలా అరుదని, ఆయనను మా యూనివర్సిటీ వీసీగా వేయించండని గట్టిగా విన్నవించినాం. అంతస్థాయికి ఎదిగిన వ్యక్తి దళితులలో దొరకడం సులభం కాదని ఆయన పేరు ముఖ్యమంత్రికి రెకమెండ్ చేయండని కోరినాం.

పద్మారావు మా మెమొరాండం చూసి మమ్మల్ని అభినందించినాడు. కొంచెం సేపు మవునంగా ఉండి శివరాం వైపు చూసి నవ్వినాడు. ఆ నవ్వులో శతాబ్దాల తరబడి వెన్నంటి వొస్తున్న దళితదైన్యం పారాడింది. 'రిజర్వేషన్ ఉండడం వల్ల మమ్మల్ని మంత్రులుగా తీసుకున్నారేగానీ మా మాటలకు ఏం విలువ ఉంది నాయనా? రాజరత్నం గొప్పవాడని నాకూ తెలుసు. అయినా పి.సి. పోస్టును ఒక మాదిగవానికి ఇప్పించగలిగిన శక్తి మాదిగలకు ఉన్నప్పుడు ఈ వాతావరణం ఇల్లా ఉండేది కాదు బాబూ!' అంటూ పద్మారావు అన్నప్పుడు నా కనుగుడ్ల మీద నీళ్లు పారాడినాయి.

దాదాపు ఇరవై యేళ్లుగా పద్మారావు శాసన సభ్యుడుగా ఉంటున్నాడు. రెండు దఫాలుగా మంత్రి అయినాడు. అంత పేరున్న పద్మారావే దళితుల మంత్రులయినా కేవలం బొమ్మలేనన్న అభిప్రాయం వ్యక్తం చెయ్యడం నాకు ఆశ్చర్యం కలిగించింది. తీవ్రంగా ఆలోచిస్తున్నాడేమో, శివరాం పెదవులు మునిపళ్ల కింద నలిగిపోతూ ఉంటే చూసి బరువుగా నిట్టూరుస్తూ వాళ్ల దగ్గిర శెలవు తీసుకొని ఇంటికి బయలుదేరినాను.

మాఘమాసం వచ్చింది. పెళ్లిళ్లు ఎక్కువగా జరుగుతున్నాయి. శివరాం బాడుగకు ఉంటున్న ఇంటి యజమాని శివరాంకు దూరపు బంధువే. తన కూతురు పెళ్లి చేస్తున్న కారణంగానూ, ఇంట్లో బాడుగకు ఇచ్చిన పోర్షన్ కూతురుకు కట్నం కింద రాసివ్వడం కారణంగానూ అతడు శివరాంను ఇల్లు వదలమన్నాడు. వాళ్లకు ఇబ్బంది కలిగించడం ఇష్టం లేక తొందరగా మరొక ఇల్లు చూడమని నాకూ మరొక మిత్రునికీ చెప్పి శివరాం హైదరాబాద్ వెళ్లిపోయినాడు. స్నేహితుడుగా నేను ఆ బాధ్యతను మోసుకొని బాడుగ ఇంటికోసం గాలిస్తున్నాను. మా ఇంటి వెనక వీధిలో ఒక మంచి ఇల్లు ఖాళీగా ఉన్నట్లు నా దృష్టికి వచ్చింది. నేను వెంటనే వెళ్లి ఇల్లు చూసినాను. ఇల్లేమో చాలా బాగుంది. ఆ ఇంటి యజమానితో కలిసి నా స్నేహితునికని చెప్పి బాడుగ మాట్లాడి అడ్వాన్స్ ఇచ్చి ఆ విషయం శివరాంకు తెలియజేసినాను.

రెండు రోజుల్లో ఇల్లు మారాలని శివరాం మనుషులు ఇంట్లో సామాన్లన్నీ ప్యాక్ చేయసాగినారు. చేరబోతున్న ఇంటిని ఒకసారి చూసి వచ్చేది మేలనుకొని నేను అటువైపు వెళ్లినాను. ఇంటి యజమాని జయచంద్ర గౌడు ఇల్లంతా శుభ్రం చేయిస్తున్నాడు. నేను 'నమస్తే సార్' అంటూ దగ్గరికి పోయినాను. అతడు నన్ను చూడగానే జేబులో నుంచీ డబ్బు తీసి నా చేతికిస్తూ 'సారీనండీ! మీ అడ్వాన్స్ వెనక్కి తీసుకోండి. ఈ ఇంట్లోకి మంత్రి శివరాంగారు చేరుతున్నారట కదా!' అంటూ నవ్వినాడు.

'అవునండీ, మీకెవరు చెప్పినారు?' ఆత్మీయంగా అడిగినాను. మంత్రిగారి నుండి ఇంటిబాడుగ అడ్వాన్స్ తీసుకోవడం మంచిది కాదనుకొని నాకు వాపసు ఇస్తున్నా డనుకున్నాను. శివరాం పట్ల అతడు గౌరవం చూపుతున్నందుకు ఆనందించినాను. అతడు ఒక నిమిషమయిన తర్వాత చెప్పడానికి చాలా ఇబ్బంది పడుతూ, 'సారీ నండీ, ఎస్సీలకు ఇల్లు బాడుగకు ఇవ్వడానికి మా ఇంట్లో ఒప్పుకోలేదండీ! వెరీ వెరీ సారీ!' అని గబగబా చెప్పేసి అతడు లోపలికి వెళ్లిపోయినాడు.

జయచంద్ర గౌడ కులమేదో నాకు తెలుసు. బీసీలకు కూడా మేము వెలివాడల వాళ్లమే. అంటరానివాళ్లమే – అయిపోతున్న పరిస్థితి.

నా తల తిరిగిపోయింది. కోపంతో బాధతో సిగ్గుతో అవమానంతో నా వొళ్లంతా చెమట పట్టింది. తరతరాల నుండీ నన్ను అవమానిస్తూ వచ్చిన విష సంస్కృతి వెక్కిరించింది. 'ఆర్థిక సమానత్వం వస్తే అన్ని అసమానతలూ తొలగిపోతాయి' అంటూ పదే పదే చెప్పిన మా గురువు హనుమప్పగారి మాటలు సడన్‌గా గుర్తుకొచ్చి నా పెదవులమీద వికృతమయిన నవ్వు పారాడింది.

● *ప్రచురణ: ఆంధ్రప్రభ వారపత్రిక, 1996* ●

★ ★ ★

87

సొదుం జయరాం

# పాడె

చిన్నపురెడ్డి కాలమైపోయాడు. పుట్టినవాళ్లు గిట్టక తప్పదు కదా? మంచానా కుంచానా పడి, తాను ఇబ్బంది పడీ, ఇతర్లను ఇబ్బంది పెట్టకుండా చాలా సుఖమైన చావు చచ్చాడు.

చావడమైతే సుఖంగానే చచ్చాడు కానీ, చచ్చిన తర్వాత ఆయన శవానికి ఇబ్బందులు ఎదురయ్యాయి. ఆయన్ని కడసారిగా చూడవచ్చిన వాళ్లూ ఇబ్బంది పడిపోతున్నారు.

చిన్నపురెడ్డి బ్రతికి వుండగా, ఆయన మూలంగా ఏ ప్రాణీ ఇబ్బంది పడలేదు. గ్రామంలో అందరికీ తలలోని నాల్కలాగా మసలుకున్నాడు. చదువుకున్నది వీధి బళ్లోనే అయినా, ప్రబంధాలూ, కావ్యాలూ కూలంకషంగా చదువుకున్నాడు. "కవిత చెప్పెను చిన్నప్ప కడలి తెప్ప" అనే మకుటంతో ఒక శతకం రాసి పడేశాడు. ఆ మహానుభావుడు తన్ను తాను కడలికి తెప్పనని ఎందుకనుకున్నాడో ఏమో–ఆయన్ని మోసే పాడె శ్మశానానికి వెళ్లే తెప్పలాగా ఉదయం నుంచి రెడీగా వుంది కానీ ఆ పాడె మీదికి ఆయన్ను చేర్చే మార్గం కనిపించడం లేదు.

ఆయన నిన్న ఉదయం ఏడింటికి హాస్పిటల్లో చనిపోయాడు. పదింటికే శవం జీపులో ఇంటికి చేరింది. కొడుకులూ, కూతుళ్లూ, అల్లుళ్లూ అంతా సాయంత్రానికి చేరుకున్నారు. చుట్టుపక్కల పల్లెల్లో వున్నవాళ్లూ వచ్చారు. మొత్తానికి చీమల బారుల్లా జనం వచ్చారు. బుడిబుడి ఏడ్పులు కొందరివైతే, గుండె పట్లు సడలే ఏడ్పులు కొందరివి. ఏది ఏమైతేనేంగాని, అంతిమ దర్శనం పూర్తయ్యేసరికి బాగా చీకటిపడింది. సరే, మరుసటి రోజు ఉదయం భూస్థాపితం చేద్దాం లెమ్మన్న నిర్ణయానికి వచ్చారు.

రాత్రి అయ్యేసరికి వర్షం మొదలయింది. ఆయన చావుకు ప్రకృతి కూడా చలించిపోయిందా అన్నట్లు, ఆకాశం కళ్ల నుండి ఏకధారగా వర్షం కురుస్తోంది!

అంత వర్షంలోనూ, శవయాత్రకని వూరు వూరంతా కదిలి వచ్చింది. ఐదు నిమిషాల్లో పాడె తయారయింది. దారి పొడుగునా వెదజల్లడానికి చిల్లర డబ్బులు, బొరుగులు గంపలతో సిద్ధమయ్యాయి. స్టేట్స్‌లో వున్న కొడుకు రాజిరెడ్డి వస్తూ వస్తూ గంపలతో గులాబీ పూలు పట్టించుకొని వచ్చాడు. ఇక పూల దండలకు లెక్కే లేదు. శవానికి స్నానం చేయించి, అలంకరించి పాడె మీద గులాబీలు పరిచి పడుకోబెట్టడమే తరువాయి.

ఆ కార్యక్రమానికి అంతరాయం ఏర్పడింది. "వర్షం వస్తే వస్తుంది. కార్యక్రమం కానివ్వండి. నేను ఈ సాయంత్రమే వెళ్లిపోవాలి" అన్నాడు రాజిరెడ్డి తన చుట్టూ మూగిన జనాన్ని వుద్దేశించి. శవాన్ని చూడవచ్చినవాళ్లలో చాలామంది రాజిరెడ్డినీ చూచి వెడుతున్నారు. తనతో మాట్లాడడానికి వచ్చిన ప్రతివాడికీ అతను త్రిబుల్ ఫైవ్ సిగరెట్లు ఆఫర్ చేస్తున్నాడు. స్టేట్స్ నుంచి చాలా సిగరెట్ పాకెట్లు తెచ్చినట్టుంది. పొగతాగేవారికి అదొక అపూర్వ అవకాశం!

రాజిరెడ్డి మాటకు ఎవరూ సమాధానం చెప్పలేదు. ఉదయం నుంచి చాలా విసుగ్గా వున్నది అతనికి. ఈ కార్యక్రమం ఎప్పుడయిపోతుందా అని ఎదరుచూస్తున్నాడు. ఎందుకనో అది ఎంతకీ తెమలడం లేదు.

"వాటీస్‌ది ప్రాబ్లం – ఏమిటి సమస్య?" అన్నాడు రాజిరెడ్డి మళ్లీ. ఇంగ్లీషులో మాట్లాడడం, మళ్లీదాన్ని తెలుగులో చెప్పడం అతనికి అలవాటు.

"వర్షం. మాలవాళ్లు ఎవరూ గుంత తవ్వడానికి వీలు లేదంటున్నారు" అన్నాడు పిచ్చిరెడ్డి. ఉదయం నుంచీ అంతా అతనే అజమాయిషీ చలాయిస్తున్నాడు.

"వాట్ నాన్సెన్స్. పే దెం హెవీ అమౌంట్. అడిగినంతా డబ్బివ్వండి. ఎందుకురారు?" అన్నాడు రాజిరెడ్డి.

పిచ్చిరెడ్డి తలగోక్కున్నాడు తప్ప సమాధానం చెప్పలేదు.

"మామూలుగా అయితే గుంత తవ్వడానికి ఎంతిస్తున్నారు ఈ వూళ్లో?" అడిగాడు రాజిరెడ్డి. అతను వూరు ఎప్పుడో వదిలాడు. ఊరు ఆనవాయితీలు అతనికి తెలియవు.

"ఎంతన్నా ఎంతిస్తారు? నలుగురు మనుషులు గుంత తీయడానికి వెళ్తే నాలుగిరవైలు సారాయికిస్తారు. పీనుగు మీది సైనుగుడ్డో మరొకటో వాళ్లే తీసుకుంటారు. మళ్లీ దివసం రోజు ఎక్కి తొక్కేంత పప్పన్నం. అంతే" అన్నాడు పిచ్చిరెడ్డి.

"పే దెం తౌజండ్ రూపీస్. వెయ్యి రూపాయిలు కాలబెట్టండి" అంటూ జేబులో నుంచి నోట్ల కట్ట తీశాడు రాజిరెడ్డి. పిచ్చిరెడ్డి తలగోక్కుంటున్నాడు.

జనంలోంచి ఎవరో అన్నారు: "మీ డబ్బున్న వాళ్లు ఎంత డబ్బంటే అంతా మంచి నీళ్లప్రాయంగా యిస్తారు. రేపు ఇదే అలవాటవుతుంది. ఆచారం అడుగంటిపోతుంది. ఫలానా రాజిరెడ్డి ఇంత ఇచ్చాడు అంటారు. డబ్బు లేనివాళ్లు ఏ చావు చావాలి? ఇది ఆచారం. డబ్బుతో ముడిపెట్టకూడదు రాజిరెడ్డన్నా!" ఆచారం, సంప్రదాయం చట్టంకన్నా, డబ్బుకన్నా బలవత్తరమైనవి అని రాజిరెడ్డికి అర్థమయ్యేలా చెప్పాలని అతని ఆరాటం.

"దెన్ వాటీస్ ది సొల్యూషన్? దీనికి పరిష్కారమేమిటి?" అన్నాడు రాజిరెడ్డి రుసరుసలాడుతూ, వెలికి తీసిన నోట్లకట్ట మళ్లీ జేబులో వుంచుకుంటూ.

పరిష్కారం దొరక్కనే ఉదయం నుంచి ఎంతగా మల్లగుల్లాలు పడ్డా మార్గం కనిపించలేదు. రాజిరెడ్డి ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేదు.

"పోనీ, గుంత తవ్వడం మన చేతగానిపని కాదుగదా–మనమే చేసుకోవచ్చు గదా" అన్నాడు రాజిరెడ్డి సమస్యకు పరిష్కారం సూచిస్తూ.

జనంలోంచి ఎవడో పకాలున నవ్వాడు. పడిపడి నవ్వాడు. ఆ నవ్వును అనుకరిస్తూ మరో ముగ్గురు నలుగురు నవ్వారు.

"వై డూ యు లాఫ్? నవ్వుతారెందుకు?" అన్నాడు రాజిరెడ్డి చిరాగ్గా.

"ఆచారం, సంప్రదాయం అంత తేలిగ్గా వదులుకునేవేనా రాజిరెడ్డీ? మన చేతనయిన పనే గనుక ఇవ్వాళ గుంత తవ్వుకుంటాం. రేపు ఇంట్లో ఎనుమో ఎద్దో చచ్చిందనుకో. దాన్ని మీరే పారేసుకోండి అంటారు. అలగా జనానికి అలుసిస్తే ఏమవుతుందో నీకేం తెలుసు?" అన్నాడు పిచ్చిరెడ్డి త్రిబుల్ ఫైవ్ సిగరెట్టు రెండోది అంటించుకుంటూ.

ఈ ఆచారంలో యిన్ని తిరకాసులున్నాయని రాజిరెడ్డికి తెలియదు. ఈ సమాధానం విన్న తర్వాత ఇక నోరెత్తలేదు. డబ్బుతో ఏ పనైనా చెయ్యవచ్చునని అతని అభిప్రాయం. ఈ ఆచారం దానికన్నా బలీయంగా వున్నట్టుంది. రాజిరెడ్డి చుట్టూ కాసేపు నీరవ నిశ్శబ్దం అలముకొంది. ఈలోగా సర్పంచ్ క్రిష్ణారెడ్డిగారు వచ్చారు. ఆయన గొడుగు బయటపెట్టి సరాసరి శవం దగ్గరికి వెళ్లాడు. ముసుగుతీసి ముఖం చూచాడు. ఆయన్ను చూడగానే ఆడవాళ్లు మళ్లీ శోకాలు మొదలుపెట్టారు. క్రిష్ణారెడ్డి ఆయనకు అత్యంత సన్నిహితుడు. ఆడవాళ్లు ఏడవటం చూస్తే ఆయనకూ ఏడుపు వచ్చింది. ఏడుపు దిగమింగి, ఏడవకూడదని అందర్నీ గదురుకున్నాడు. అంతా నోళ్లు మూశారు.

క్రిష్ణారెడ్డి బయటకు రాగానే రాజిరెడ్డి మంచం మీద నుంచి లేచి నిలబడి, "రా, చిన్నాన్నా!" అన్నాడు. క్రిష్ణారెడ్డి కూచోగానే రాజిరెడ్డి కూచున్నాడు. శవయాత్రలో జరుగుతున్న జాప్యానికి కారణాలు, ఎవరో ఆయనకు దారిలోనే చెప్పినట్టుంది.

"ఇంతకూ వంతెవరిదిరా పిచ్చిరెడ్డీ?" అడిగాడు క్రిష్ణారెడ్డి.

ఊర్లో అన్ని కుటుంబాలవాళ్లనీ మాలవాళ్లు వంతులవారీగా విభజించుకుంటారు. ఇట్లాంటి కార్యక్రమాలు ఎవరివంతు అయితే వాళ్లు చెయ్యాలి. అదీ క్రిష్ణారెడ్డి అడిగిన వంతు విషయం.

"వంతేమో మరియమ్మది. దానికి మగదిక్కు లేరు. వంతుకానివాళ్లని మనం బలవంతం చెయ్యలేం గదా? మామూలుగా అడిగితే ఒకడు జ్వరమంటే మరొకడు పులకరమంటే ఏవేవో సొద్లు చెబుతున్నారు. జ్వరమూ లేదు – పులకరమూ లేదు. గుడిసెల్లో కూచొని చీట్లపేకలూ, పులిగీతాలూ ఆడుకుంటున్నారు"పిచ్చిరెడ్డి చెప్పాడు.

"మీరే ఏదో మార్గం ఆలోచించాలి" అన్నాడు రాజిరెడ్డి క్రిష్ణారెడ్డితో. ఎందుకనో ఆయన నోటంట ఈసారి ఇంగ్లీషు దొర్లలేదు.

"ఒకటే మార్గం – ముల్లుగర్ర" అన్నారు ఆ మూలనుంచి ఎవరో. క్రిష్ణారెడ్డి అటువైపు చూడకుండానే ఆ కంఠస్వరం గుర్తించాడు. అది తన ప్రత్యర్థి వర్గానిది.

"ఆ రోజులు పోయినై" అన్నాడు క్రిష్ణారెడ్డి గంభీరంగా.

"మాలవాన్ని మాట్లాడించకుండా కొట్టాలని వూరికే అనలేదు పెద్దలు. ఓట్లొచ్చినయ్‌గదా! ఆ రోజులు పోక ఏం చేస్తాయి?" అన్నాడు మళ్లీ క్రిష్ణారెడ్డి ప్రత్యర్థి ఎత్తి పొడుపుగా.

భయంతో వేశారో, భక్తితో వేశారో, డబ్బుకే అమ్ముడు పోయారో హరిజనవాడంతా క్రిష్టారెడ్డికే కట్టకట్టుకొని ఓట్లేసింది. ముళ్లుగర్రను ఒకరు సపోర్టు చేయడానికీ, మరొకరు వ్యతిరేకించడానికీ అసలు కారణం అది!

"పదరా నేనొస్తున్నాను పిచ్చిరెడ్డి!" అంటూ క్రిష్టారెడ్డి పిచ్చిరెడ్డిని వెంటేసుకొని బయలుదేరాడు.

బయలుదేరడమైతే బయలు దేరాడు కానీ వాడలో తన మాట వింటారో వినరోనన్న సందేహం పీకుతూనేవుంది. తనకు అరవైఐదు ఏండ్లు. ఒకప్పుడు నత్తనడక నడిచిన కాలం ఇప్పుడు శరవేగంతో పరుగెడుతున్నది. ఆచారాలూ, సంప్రదాయాలూ అన్నీ అడుగంటిపోతున్నాయి. మాలవాడకూ వూరికీ మధ్య సంబంధాలు విచ్ఛిన్నమైపోతున్నాయి. పాతరోజులు వేరు. ఉత్తరకార్తెలోనూ, హస్తకార్తెలోనూ ఒకటే దడివాన కురిసేది. వాడలో బీదా బిక్కీ తిండిగింజలకోసం నానా యాతనా పడేవారు. ఊర్లోని రైతుల చుట్టూ మూగేవారు. వాళ్ల అస్తులూ పస్తులూ పడకుండా రైతు ఆదుకొనేవాడు. కొట్టినా తిట్టినా తమ కడుపు కొట్టడనే భావం వాడలో వాళ్లకుండేది. ఒక పేడపుటికెడు జొన్న కంకులు దొంగిలిస్తే కాలా చేతా పడదన్నేవాళ్లు. ముల్లుగర్ర తీసుకొని తాటవలిచేవాళ్లు. వాడలోవాళ్లకి కిక్కురు మనే ధైర్యం వుండేది కాదు. దెబ్బలు తిన్న మూడోరోజు మళ్లీ అదే రైతు పంచన కూర్చునేవారు. తాము నికృష్టంగా బ్రతుకుతున్నామనే భావన వాళ్లకు వచ్చేది కాదేమో! ఇక ఆడవాళ్లు సరేసరి. రెడ్డిసాని చెమటను తడిసిన పాతచీరెకు, పాతరవికెకు నానా వూడిగం చేసేవాళ్లు. అంతమాత్రమే అయితే ఫరవాలేదు. తెల్లారగట్ల రెడ్డి వాడలోకి వెళ్లి జీతగాళ్లను పనిలోకి పంపి, వాళ్ల స్థానంలో తను పడుకొనేవాడు. మగవాళ్లే బానిసలై బతుకుతుంటే, వాళ్ల ఆడవాళ్లకి ఒక వ్యక్తిత్వం ఎక్కడుంటుంది? పాతివ్రత్యం ఎక్కడ కాపాడుకుంటారు? కిక్కురుమనకుండా సహించేవాళ్లు. క్షోభ పడడానికీ, మధన పడడానికీ వాళ్ళకు ఒక ఆత్మ అంటూ వున్నదో లేదో ఆ పరమాత్మకే తెలియాలి!

క్రిష్టారెడ్డి వడివడిగా నడుస్తున్నాడు. దారి దారంతా బురదమయమయిపోయింది. కాలు గిరిగిలలోతు దిగబడిపోతున్నది. ఇలా వర్షం వస్తే రోతా పీతా కాకుండా బజార్లన్నీ బండ చప్పట్లు వేయిద్దామనుకున్నాడు క్రిష్టారెడ్డి. కానీ గ్రామంలో ఐకమత్యం లేదు. రకరకాల అభ్యంతరాల్లు తెచ్చారు.

"మనకెప్పుడూ ఈ బండ చప్పట్లే వున్నవా? ఇప్పుడెందుకు?" అని కొందరన్నారు. "ఎడ్లు జారి కిందపడిపోతాయి. అవెందుకు?" అన్నారు మరికొందరు. "ఊరు బాగుకోసమా పాడా? కాంట్రాక్టులో మిగిలించుకోవచ్చని ప్లాను" అని మరికొంత మంది చాటుమాటుగా విమర్శించారు. ఊరు బాగుపడకపోయినాసరే ఇతరులు బాగుపడకూడదన్నది వారి మతం. క్రిష్టారెడ్డి ఆ పని మానుకున్నాడు.

"వర్షంలో బయలుదేరినారు. ఎందాకా?"

క్రిష్టారెడ్డి చివుక్కున తలపైకెత్తి చూచాడు. చినమస్తాన్. గొడుగు పట్టుకొని ఆ బురదలో కాళ్లీడ్చుకొని తనలాగే కిందామీదా పడి వస్తున్నాడు.

"వాడదాకా" అన్నాడు క్రిష్టారెడ్డి.

"మరి నన్ను పిలవరేం. నేను రానా?" అన్నాడు చినమస్తాన్.

"ఎద్దుని అలాల్ చెయ్యలేదట – ముర్దార్. నువ్వు తింటావా మరి?"

"పరాచికాలతో ఏంగానీ వాడలో ఏం పని?"

క్రిష్ణారెడ్డి విషయం చెప్పాడు. "ఎవర్నయినా పంపవచ్చనుకో. పని సానుకూలమవుతుందో లేదోనని నేను స్వయంగా పిచ్చిరెడ్డిని వెంటేసుకొని బయలుదేరాను"

"బాగుంది. కొండ మహమ్మద్ దగ్గరకు రాకపోతే మహమ్మదే కొండ దగ్గరికి వెళ్లాలి అంటారు. ఔనా?" అన్నాడు చినమస్తాను.

"ఔను."

"ఏమిటి ఔనండీ? రౌతు మెత్తనయితే గుర్రం మూడుకాళ్ల నడుస్తుంది. చేటు కాలం వచ్చిపడింది. పనిబాటలవాళ్లకు కళ్లు నెత్తిమీదికి వచ్చాయి. నిన్నూ నన్నూ ఎవర్నీ లెక్క చెయ్యడం లేదు. మనమే వాళ్లని పైకెత్తుతున్నాం. చేసుకున్నవాళ్లకు చేసుకున్నంత – అనుభవించక తప్పదు. వెళ్లిరండి" అంటూ విసవిసా ముందుకు దాటుకొని వెళ్లాడు.

క్రిష్ణారెడ్డి వాడవైపు నడక సాగించాడు. చినమస్తాన్ మాటల్లోని ఆగ్రహం క్రిష్ణారెడ్డికి నవ్వు తెప్పించింది. పనిబాటలవాళ్ల పేరెత్తితే ఈమధ్య అతను ఆగ్రహోదగ్రుడై పోతున్నాడు. ఆ ఆగ్రహానికి కుదురు ఎక్కడ వున్నదో క్రిష్ణారెడ్డికి తెలుసు.

ఆ మాటకొస్తే నిన్నమొన్నటిదాకా చినమస్తాన్ స్థితి పనిబాటలవాళ్ల స్థితికంటే అధ్వాన్నంగా వుండేది. కానీ ఆ విషయం అతను మర్చిపోయాడు. అతని తప్పేం లేదు. స్థితి మారితే ఎవరైనా అంతేనేమో! చినమస్తాన్‌కు పిత్రార్జితం ఒక పూరి కొంప తప్పితే – చెప్పుకోదగ్గ ఆస్తి మరొకటి లేదు. అర్ధ రూపాయో, రూపాయో కూలి పనులకు వెళ్లేవాడు. యుద్ధాలప్పుడూ, దేశం అభివృద్ధి చెందే దశలోనూ సంపాదనకు విస్తృతావకాశాలు ఏర్పడుతాయి. చినమస్తాన్ వున్న వూరికి సమీపంలో ఒకదాని తర్వాత ఒకటి మూడు సిమెంట్ ఫాక్టరీల నిర్మాణం ప్రారంభమయింది. అవకాశాల్లేక వూరుకున్నాడుగాని చినమస్తాన్ గడన తెలిసినవాడు. నిర్మాణం జరిగే చోట మొదట లేబర్ సప్లైకి కుదురుకున్నాడు. ఊర్లో నుంచీ, వాడ నుంచీ నలభై యాభై మందిని రోజు పట్టుకెళ్లి ఫ్యాక్టరీవాళ్లకి అప్పగించేవాడు. కూలి మనిషికి రోజుకి ఇరవై రూపాయలు గిట్టేది. ఇస్త్రీ బట్టలు నలగకుండా చినమస్తాన్‌కు కూలీల మీద కమీషన్ మాటయాభై గిట్టేది. దాంతో అతనికి తృప్తి కలగలేదు. లేబర్ సప్లై ద్వారా పెట్టుబడికి కొంత డబ్బు సమకూడింది. చిన్న చిన్న కాంట్రాక్టు వర్కులు మొదలుపెట్టాడు. సిమెంటూ, ఇనుమూ ట్రాక్టర్లకు ట్రాక్టర్లు బయటకు తరలించి అమ్ముకున్నాడు. ఈ పనులన్నీ ఒక విధంగా బాహాటంగానే చేశాడు. కాకపోతే సెక్యూరిటీ గార్డులకూ, ఇంజనీర్లకూ, ఎమ్.డీలకు కొంత వాటా ఇచ్చాడు. అంతా ఒకడే తింటే ఆ సొమ్ము అరగదు! రెండేండ్లలో పది లక్షలకు పైగానే సంపాదించాడు. అతనికిప్పుడు రెండు లారీలున్నవి. ఒక ట్రాక్టరు వుంది. వడ్డీ వ్యాపారం వుంది. పూరి గుడిసె వాడ్లో మేడగా మారింది.

"పనిబాటలవాళ్లమీద మన పట్టు సడలడానికి చినమస్తాన్‌లాంటివాళ్లే కారణం' అన్నాడు పిచ్చిరెడ్డి. క్రిష్ణారెడ్డి ఆలోచనలు ఎక్కడోవున్నవి. అతను వెళ్లేపనిని గురించే ఆలోచిస్తున్నాడు. ఐనా, పిచ్చిరెడ్డి అన్నమాట అతను చెవిలో వేసికోకపోలేదు.

"ఎందుకని?" అన్నాడు పరధ్యానంగా.

"ఎందుకంటే – చినమస్తాన్ లారీలూ, ట్రాక్టరూ వూళ్ళో దించాడు. అతణ్ని చూచి మరికొంతమంది ట్రాక్టర్లు తెచ్చారు. ఈ బండ్లతో కూలీలకు అరవై, డెబ్బై రోజుకు కూళ్లు గిడుతున్నవి. రైతు మీద ఆధారపడటం పోయింది – ఇక ఆచారాలూ, ఆనవాయితీలూ పడుబాటుగాక ఏం చేస్తాయి?" అన్నాడు పిచ్చిరెడ్డి, ఎంతగానో దిగులుపడిపోతూ.

"కడంతకాలం ఎడ్లబండ్లే ఎక్కడ వుంటాయి? కాలం మారింది. ట్రాక్టర్లూ లారీలూ వచ్చినై. కాలంతోపాటు మనం మారడం నేర్చుకోవాలి." క్రిష్టారెడ్డి అన్నాడు.

పిచ్చిరెడ్డికి క్రిష్టారెడ్డి చెబుతున్నది మింగుడు పడటం లేదు. ముఖమంతా మాడ్చుకున్నాడుతప్ప మారుమాట చెప్పలేదు.

"పలకవేం?" అన్నాడు క్రిష్టారెడ్డి.

"ఆచారాలు వదులుకోవాలా?" అన్నాడు పిచ్చిరెడ్డి పెడసరంగా.

"ముందీ సంగతి చెప్పరా పిచ్చిరెడ్డీ! మన ఆచారాలు మనం సక్రమంగా పాటిస్తున్నామంటావా? మాసూలు కాలంలో ఇంటిమాల కళ్లంలోకి వచ్చి ధాన్యం రాసికి పొలి చుట్టితే రాశి అడుగు వాళ్లకే వదిలేవాళ్లం. ఒక రాశి కింద ఏదుము గింజలుండేవి. మూడు రాసులకు పొలి చుడితే వానికి సంవత్సరం పొడుగునా బత్తెం దొరికేది. అవన్నీ ఇప్పుడెక్కడున్నాయో చెప్పరా?" అన్నాడు క్రిష్టారెడ్డి.

"ధాన్యం గిట్టుబాటుగాక అవి పండించడమే మానుకుంటిమి. మనకే లేనప్పుడు ఇక వాళ్లకెక్కడనుండి వస్తాయి?"

"గిట్టుబాటు కాదని వ్యాపారపు పంటలు పండించుకుంటున్నాం. వ్యవసాయాన్ని వ్యాపారం చేశాం. ఇక షబ్బందుకులాలవాళ్లు వాళ్ల వృత్తుల్ని వ్యాపారం చేసుకుంటున్నారు. ఇంక ఆచారం ఎక్కడ చచ్చింది?" అన్నాడు క్రిష్టారెడ్డి.

పిచ్చిరెడ్డి బెల్లం కొట్టిన రాయిలా గమ్మున వుండిపోయాడు. కాని క్రిష్టారెడ్డి నోరు మూతపడలేదు. దారి పొడుగునా చెబుతూనే వున్నాడు. "మన పనులు మనం చేసికోవడం మనకు నామోషి. ఆ పనులు మనకు ఎవరో చేసి పెట్టాలి. శవాలకు గుంతలు తీయడానికి ఒక కులంవాళ్లు కావాలి. గుడ్డలు ఉతకడానికి మరొకరు కావాలి. ఇంట్లో పశువు చస్తే తీసుకెళ్లడానికి మరొక కులంవాళ్లు కావాలి. మనకు ఈ పనులు చేస్తున్నందుకు వాళ్లను నీచంగా చూడటంతప్ప మనుషులుగా గౌరవించడం మనకు చేతగాదు. షబ్బందు కులాలలోనూ ఆత్మాభిమానం పెరిగింది. ఆచారాలను అడ్డం పెట్టుకొని పనులు చేయించుకునే రోజులకు కాలం చెల్లిందిరా పిచ్చిరెడ్డి! అది మనం గమనించాలి."

క్రిష్టారెడ్డి వాగ్ధోరణి అలా ఇంక ఎంతసేపు కొనసాగేదోకాని ఇద్దరూ హరిజన వాడ చేరుకున్నారు. క్రిష్టారెడ్డి ఒకసారి వాడంతా కలయచూచాడు. ముసలీ ముతకా, పిల్లా పీచూ వున్నారే తప్ప కుర్రకారు ఎవరూ కన్పించలేదు. తన్నుచూచి ముఖం చాటేసుకున్నారో ఏమో!

క్రిష్టారెడ్డి ఒక ఇంటిముందు ఆగి "ఒరే ధనియాలూ!" అంటూ కేకవేశాడు. కేకవేసిన కాసేపటికి ఇంట్లో నుంచి ఒక ముసలివాడు వచ్చి క్రిష్టారెడ్డి ముందు నిలబడ్డాడు. నిజానికి వానిపేరు ధనియాలు కాదు. తల్లిదండ్రులు పెట్టిన శుభ్రమైన

పేరు డేనియల్! ఆ పేరు అలా అపభ్రంశం అయింది. రైతులు కావాలనే వాళ్ల పేర్లను అపభ్రంశం చేస్తారు.

"పిల్చినారా అయ్యా?" అన్నాడు ధనియాలు.

"అవున్రా, నీతో పనిబడింది."

"చెప్పబ్బా పనేందో. నా చేతనయిందయితే సేత్తాను."

"చిన్నపు రెడ్డి కాలమై పోయినాడు. తెల్సుకాదా? గుంత తీయాల. ఇద్దరో ముగ్గురో మనుషుల్ని పురమాయించు. అర్థంటు" అన్నాడు క్రిష్ణారెడ్డి టకటకా.

ధనియాలు నిమ్మకు నీరెత్తినట్టు నిలబడ్డాడు తప్ప ఉలకనూ లేదు పలకనూ లేదు. కాకపోతే కాసేపు తల గోక్కున్నాడు. కాసేపు పిర్రె బరుక్కున్నాడు.

"చెప్పేది నీకేరా!" అన్నాడు క్రిష్ణారెడ్డి.

అప్పుడు దనియాలు నోరు తెరిచాడు. వాడు చెప్పిన సారాంశం ఏమిటంటే – పీనుగు మీది సైను గుడ్డకూ – దివసం రోజు పెట్టే పప్పన్నానికి గుంత తవ్వే రోజులు పోయాయి. దీనికి ఓ రేటు వుంది. ఆ రేటు చెల్లిస్తే మనుషుల్ని పురమాయించడానికి అభ్యంతరం లేదు.

ఇక క్రిష్ణారెడ్డికి కొండ దిగిరాక తప్పలేదు.

"ఎంతిమ్మంటావు?" అన్నాడు క్రిష్ణారెడ్డి

"వెయ్యి రూపాయలిప్పించండబ్బా!" అన్నాడు ధనియాలు.

"వెయ్యా?!" అన్నాడు క్రిష్ణారెడ్డి ఆశ్చర్యంగా.

"దాంతో మేం మిద్దెలూ మేడలూ కట్టం. ముగ్గురు మునుషులం. తలా మూడొందలపై చిలుకు" అన్నాడు ధనియాలు.

తప్పదు. అవసరం అలాంటిది. "సరే. క్షణాల మీద గుంత తవ్వాల. నేను వూర్లోకి పోవడం, పాడె లేవడం ఆలస్యం. వెళ్లండి" అంటూ క్రిష్ణారెడ్డి వూరి వైపు నడక సాగించాడు.

క్రిష్ణారెడ్డి వూర్లోకి వచ్చేసరికి, అంతా క్రిష్ణారెడ్డి కోసమే ఎదురుతెన్నులు చూస్తున్నారు. "ఏమైంది?" అన్నారు ఐదారుమంది ఏక కంఠంతో.

"ఇక ఆలస్యం దేనికి? సాంగ్యాలు కానిచ్చి, పాడెలేవదీయండి."

అన్ని సాంగ్యాలూ అర్ధగంటలో అయిపొయ్యాయి గోవిందా గోవిందా! అంటూ పాడె పైకెత్తుతున్నారు. ముందు నడుస్తున్న దాసరి తంతె మీటుతూ తత్వం అందుకున్నాడు.

"ఆటన్నా పాటన్నా
తెరపై ఒక బొమ్మలాటన్నా"

పిచ్చిరెడ్డికి మట్టుకు తత్వమూ వినిపించలేదు. గోవిందలూ వినిపించలేదు. ఒక ఆచారానికి పాడె లేచినట్లుగా తెగ బాధపడిపోతున్నాడు!

● *సాహిత్యనేత్రం – 6, 7 సంచికలు. 1996* ●

★ ★ ★

88

సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి

# అంటు

ఉత్తరంలోని విషయాల్ని మరోసారి మననం చేసుకొన్న కొండన్నకు ఆనందంతో బాటు ఆత్రుత కూడా ఎక్కువైంది. చేని దగ్గర్నుంచి ఎప్పుడెప్పుడు ఇంటికి చేరుకుందామా అని ఆరాటంగా ఉంది.

గగనం దిక్కు చూశాడు.

మబ్బుల చాటున పొద్దు మసకేసి ఉంది. మధ్యాహ్నానికో, సాయంత్రానికో వాన వంగేట్టుంది. దేవమూల అప్పుడప్పుడూ ఉరుముతూ ఉంది.

ఉత్తరలో ఉరిమితే ఖచ్చితంగా వానొస్తుందట!

అందులోనూ ఇది రైతుల కార్తె.

కొండన్న గుండెల్లో సన్నని జలదరింపు మొదలైంది.

ఈ కూలీల్తో సాయంత్రం దాకా సంతనగా పన్జేయించుకొంటేగాని చేనంతా పత్తి విరవటం అయిపోదు. మధ్యలో వానొస్తే పత్తి అంతా మట్టిపాలు.

నిండు రోహిణి కార్తెలో ఈ పైరు మొలిపించుకొనేందుకు తానెంత అగచాట్లు బడింది కళ్లముందు మెదిలింది.

సర్కారోళ్ళు ఏడెకరాలు పట్టా ఇచ్చి ఉచిత బోరుబావి తవ్వించారు గాబట్టి పత్తిపైరు పెట్టడం సాధ్యమైంది. లేకుంటే తామెక్కడ? ఈ ఎండాకాలం పైరెక్కడ?

ఈ భూమి, బోరుబావి తను పొందటంలో స్టీఫెన్ సహాయం కూడా కొంత ఉంది.

దళితుల సహాయార్థం అతను ఎంతో పాటుబడుతున్నాడుట.

పక్క తాలూకాలోనే, ఏదో ఊల్లో అగ్రవర్ణాలవారికి చెందిన మంచినీటి కుంటలో హరిజనులు కూడా గొంతు తడుపుకొనేందుకు ఎదురైన ఆటంకాల్ని తొలగించేందుకు – కలెక్టర్‌తోటి వస్తున్నాడుట.

ఆ సందర్భంగా తన్ను కలుసుకొనేందుకు ఈ రోజు వస్తానని రాశాడు.

పాలెమంతా తిరిగి తిరిగి రంగని దగ్గర పెద్ద కోడిపుంజు నొకదాన్ని మూ్రూపాయలకు బేరమాడి పట్టుకొచ్చి ఇంట్లో గంపకింద వేశొచ్చాడు కొండన్న.

స్టోరు బియ్యం బావుండవని శేరు పద్దెదు రూపాయ లొంతున మొలగొలుకుల బియ్యం కొనుక్కొచ్చి ఉంచాడు.

రాకరాక వచ్చే చుట్టం.

దాదాపు ముప్పయేళ్ళయింది ఊరొదలి..

సింగరయ్యగా ఊరొదలినవాడు స్టీఫెన్‌గా మారాడు.

పదిమందికి బతుకుదెరువిచ్చేంత పైస్థాయికి ఎదిగాడు.

"కొండన్నో! గంప దీసకరా వొడి నిండింది." కేకేసింది ఒక కూలి.

ఆలోచల్నుంచి తేరుకొని గంప అందుకొన్నాడు కొండన్న. తన పంచెలోని పత్తిని గంపలో వేసి అందరి వద్దకు తిరిగాడు. రెండు గంపలైంది.

"నీల్లు దప్పి కెయితండా యన్నో!" కేకేసింది మరో కూలి.

"అయిగోమ్మా. బిందెనిండా....వంకలో నీల్లు బురదని, బోరింగుకాడ పట్టుకొచ్చినా." చెప్పాడు.

"బిందె మీదేనా?" అనుమానంగా చూసింది.

"కాదమ్మా! మా రైతు నారాయన్రెడ్డిది."

"తెచ్చింది నువ్వేగాదూ?" ఆమె నొసలు ముడి ఇంకా విడవలేదు.

"నేనుగాక!...నాకు రైతులు కూలికొస్తరా తల్లీ?"

నీళ్లకోసం బిందెవద్దకొస్తున్నవాళ్లు కాస్తా ఆగిపోయారు. ఒకరికేసి మరొకరు చూసుకొని, గుసగుసలాడుకొని, "వంకలో నీళ్లే తాగొస్తంలే" అంటూ వెనుదిరిగారు.

ఉస్సురుమన్నాడు కొండన్న.

పళ్లికిలిస్తూ, పరాచికాలాడుకొంటూ, హంస గమనాల్తో వాళ్ళు వంకలోకి వెళ్ళొచ్చేసరికి ఎంతలేదన్నా పదినిమిషాల సమయం అర్ధగంట అవుతుంది.

మబ్బెక్కి వచ్చే అకాశం కేసి దిగాలుగా చూసి పత్తి విరవటాన్ని కొనసాగించాడు.

కూలీలంతా తిరిగొచ్చారు.

కళ్ళు మిరుమిట్లు గొలిపే పసుపుపచ్చని తంగేడుపూలు తలలో తురుముకుంటూ తన మునంలో వంగబోతూ అడిగింది మరోకూలి "సంగటె రైతు లింద్లల్లో సేయిస్తాండవా, లేదా?" అని.

"రైతు లింద్లల్లోనే సేయిస్తాండలే తల్లీ!"

"మీరు తగిలేరు....వాళ్ల సేతనే తెచ్చి పెట్టేయండి." చెప్పింది.

"ఆ.....ఆ....." ఒప్పుకోలుగా ఊ కొట్టాడు కొండన్న.

ఆ కూలీలు తమ చేతి నీళ్లు తాగరు. తమ కుండలోని పెడచ తినరు. ఎందుకంటే, వాళ్లు మాదిగలు, తాము మాలలు కాబట్టి!

☆ ☆ ☆

మునంలోంచి తలెత్తి ఊరికేసి చూసేసరికి, చేల గెట్లెంట రవరవ సుడిగాలిలా దూసుకొచ్చే భార్య కనిపించింది కొండన్నకు.

ఆమె నడకే అంత.

ఎప్పుడూ ఉరుకుల పరుగుల మీదుంటుంది. కనుదెరిచింది మొదలు కనుగూరికే దాకా ఒకటే తొందర. క్షణం తీరికుండదు. నిమిషం ఊరకుండదు. అప్పుడప్పుడూ తాను అంకె వేసినా తన కోపుకూడా ఆమే ఈడ్చుకుపోతుంది.

ఇంత చేసినా బండి సరిగ్గా నడవదు. ఎప్పుడూ కందెన తక్కువై, ఇరుసు కీచుకీచుమని అరవటమే

"అబ్బోవ్! ఓ మొగోడా!....యాం దీమాసి పలకరూ? నిన్నే...." అతను తలెత్తబోయే లోపలే అరాపడుతూ వచ్చింది. "టీపెనన్న వచ్చిండంట..." అతను ప్రశ్నించబోయేలోపలే చెప్పింది.

"నా కయితే వొళ్లు తత్తరబుడ్తాఉంది. ఏంజేసి పెట్టాలబ్బా? ఏం దింటడో... ఎట్టదింటడో...బల కొట్టకుండా మూగెద్దాల ఉంటవే?.....ఏంజేస్తవో నువ్వే జెయ్యి." అతను తేరుకోబోయేలోపలే లొడలొడమనసాగింది.

ఒక్కసారిగా స్టీఫెన్ దగ్గరకు ఎగిరిపోదామనిపిస్తోంది కొండన్నకు. అంత హోదాలో ఉన్నవాడు తనకోసం, తన ఇంటికి రావడం కొండన్న గుండెల్ని ఆనందంతో తత్తరబెడుతోంది.

అతనికి ఎలా మర్యాదలు చేయాలో తనకు బాగా తెలుసు.

అతని నాలుక ఏ ఏ రుచులకోసం సవ్వబడి పోయిందో తనకు ఎరుకే. తను హైదరాబాదు వెళ్లినపుడంతా రాత్రుళ్లు నిద్రబోనిచ్చేవాడు కాదు. చేయి చంకలోతున బొక్కల్లోకి దూర్చి పట్టుకొచ్చిన ఎండ్రకాయలు చారును గూర్చి పలవరించేవాడు.

పందివార్ల వేపుడు స్మృతుల్ని కెలికేవాడు.

సొర్ద సాత్తేలు, చేపల పులుసులో కలుపుకుతింటూ చూరునీళ్ల ధారల్లో జడివానను చూడాలని తపనపడేవాడు.

ఉసుర్లు వేయించి ఉలవ గుగ్గిళ్లలో కలుపుకొని, జేబునిండా పోసుకొని, పెద్దతనమంతా వదిలి వీధి వీధి తిరగాలనే ఉబలాటం అతనికి.

ఉలవ గుగ్గిళ్లకు బెల్లం కలిపి రోట పోసి, తొక్కి ముద్దచేసి; రెండు నేతిచుక్కలు అద్దుకు తినటమన్నా; బరిగె కూటిలో పెరుగు కలుపుకొని ఉల్లిగడ్డ నంజుకోవటమన్నా, జొన్నరొట్టెను అప్పడే పిండుకొచ్చిన జుంటితేనెలో ముంచి నోట బెట్టుకోవటమన్నా, కొర్రకూటిలాగా కలమాగిన దోసకాయను మూతికి పూసుకుంటూ పొంకోవట మన్నా, ఉడకేసిన అనపకాయల బుట్టను ముందేసుక్కూచ్చోవటమన్నా తెగ ఆసక్తి చూపించేవాడు.

పల్లె రుచుల్నీ, సావాసాల్నీ ఇంకా మరవకుండా ఉన్న అతన్ని తల్చుకొని మురిసిపోయేవాడు తను.

అతని కోరికల్ని వీలున్నంతవరకు తను తీర్చేందుకు ప్రయత్నించాలి. తక్షణమే ఇంటికి పరువెత్తాలనిపిస్తోంది కొండన్నకు.

వెంకటమ్మ ఏదేదో చెబుతుంది.

ఇంటివద్ద తనకోసం నులక మంచమ్మీద నిరీక్షిస్తున్నాడు కాబోలు! చుట్టుముట్టిన ముసలీ ముతకల ప్రశ్నలకు సమాధానాలు తడువుకొంటుంటాడు బహుశా.

"మంచినీళ్లన్నా యిచ్చొచ్చినవా?" అప్పుడు ప్రశ్నించాడు భార్యను.

గడ్డంకింద చెయ్యి అన్చి "యాం దీమాసీ!" అంటూ ఆశ్చర్యపోయింది ఆమె. "అయాల్నుంచి సెబుతాంటే నీకు సెవి ఎచ్చబన్నేట్టే లేదే. ఇట్టయితే ఎట్టబ్బా? మనింటికాడికి రాలే. రెడ్డోరింటికాన్నే ఉండాడంట...."చెప్పింది.

"రెడ్డోరింటి కాన్నా?....."

"ఆ....ఆ నీల్ల పంచాయితి కాడికి రెడ్డోరుగూడా పొయ్యిన్నెడంట. టీపెనన్నను గుర్తుబట్టి ఇంటికి తోడుకొచ్చుకొన్నెడంట...."

కొద్దిసేపు మౌనంగా ఉండిపోయాడు కొండన్న.

ఎవ్వరూలేని తనింటివద్దకొచ్చి దిక్కు దిక్కుమనేకన్నా కొంతసేపు రెడ్డోరింటికాడ ఉండటమే మేలనుకొన్నాడు.

పెద్దరెడ్డివద్ద గౌరవం పొందేంత స్థాయికి తన సావాసగాడు ఎదగడంవల్ల గర్వం కూడా కలిగింది.

అతని ఆలోచన్ని భగ్నం జేస్తూ వెంకటమ్మ అంది–"రైతు లెవరికీ తీరికెలేదం టండ్రే...ఎట్ట జెయ్యాలబ్బా?" అని.

క్షణకాలం పాటు అయోమయంగా చూశాడు ఆమెకేసి.

"అందర్నీ బంగపొయ్యినా...మాకు పనులుండాయంటే మాకు తీరికె లేదంటే.... యమ్మ యమ్మ... ఊరికే సంగటి గెలికియ్య మంటాండమా? అడుగులకు బియ్యమిచ్చిమి...కూరగాయలిచ్చిమి... ఎప్పుడన్నా పనికి పలుకుతాంటిమి."

రైతు లెవ్వరూ చెయ్యందియ్యకపోవటంపట్ల ఆశ్చర్యంగా ఉంది కొండన్నకు.

"అయ్యోరు యింట్లోనన్నా అడగ్గాద్దూ!"

"యాం దీమాసీ! ఆ యమ్మకేం నాలుగు సేతులుండయా? నిన్న ప్రెకాశానికి జెయస్పె. మొన్న రవనమ్మకు వొండిచ్చె. రోజూ ఎవరికోకరికి కుండ గాలుస్తానే ఉండిపాయనే...."

"మనకూ ఒక రోజు గెలికియ్యమని కాల్లో కడుపో పట్టుకుపోయే తిక్కదానా!" ఉపదేశించాడు.

"ఏమోబ్బా! నాకు నమ్మకంలే.." అంటూ వెనుదిరిగింది ఆమె.

కొండన్నకెందుకో కొంత ఆశగా ఉంది.

సంకటి సమస్య ఒకవైపుకు ఒత్తిగిలినట్లే అన్పించింది.

మనస్సు స్టీఫెన్ వద్ద కెళ్లాలని ఉబలాటపడసాగింది.

కూలీల్ని వదలి వెళ్లేందుకు మబ్బులు భయపెడుతున్నాయి. ఇన్నేళ్లూ తను వెళ్లటమేగాని ఎప్పుడూ ఇక్కడకురాని స్టీఫెన్....తనంటే ప్రాణాలిచ్చే స్టీఫెన్....

తన ప్రాణంలాంటి కొడుక్కి చదువు చెప్పించే స్టీఫెన్....

అతనొచ్చినాడని తెలిసీ తన్నిక్కడుండేటట్లు చేసిన పరిస్థితులపట్ల ఆక్రోశం కలిగింది కొండన్నకు.

కూలీలు తమ సంకటి తింటే ఈ అగచాట్లు ఉండేవి కావు. తమ చేతినీళ్లు కూడా తాగరు.

మాల – మాదిగల మధ్య అనాదినుంచీ ఇంతే.

తనకు ఆశ్చర్యం కలుగుతుంది....అందరిచేతా హీనంగా చూడబడే ఈ కులాలు రెండూ; ఒకర్నొకరు నీచంగా చూసుకోవటం ఏమిటా అని – అగ్రకులాలవాళ్లు తమ బావుల్లో నీళ్లు వీళ్లను తెచ్చుకోనివ్వరు. వీళ్లు ఒకరి బావి నీళ్ళు మరొకరు అంటరు.

హిందూమతంలో తమను తక్కువ జేస్తున్నారని క్రిష్టియన్ మతంలో చేరినవాళ్లలో కూడా ఈ భేదభావాలు ఏమాత్రం చావలేదు.

మాదిగలు వెళ్లిన చర్చికి మాలలు వెళ్లరు. మాలలు చేరిన శాఖలో మాదిగలు చేరరు. ఒకరు ఆర్.సి. యం. అయితే, మరొకరు యస్.పి.జి. ఒకరు ఎ.బి.ఎం. అయితే, మరొకరు సి.బి.యం. ఒకరు సి.యస్. ఐ. అయితే, మరొకరు పెంథకోస్టు.....

అక్కడ కూడా క్రిష్టియన్ రెడ్లు, క్రిష్టియన్ నాయుళ్ల...క్రిష్టయన్ అగ్రవర్ణాల గుత్తాధిపత్యం కింద వీళ్లు నలిగిపోవటమే!

మతం మారమని చాలా కాలంనుంచి తనతో చెబుతున్నాడు స్టీఫెన్.

తన ప్రమేయం లేకుండానే ఇంజనీరింగ్ చదువుతోన్న తన కొడుక్కి మతం మార్పించాడు.

ఎప్పుడో తెల్లదొరల కాలంలో, పెద్దకులాలతోటి సమాన గౌరవం కోసం; దొరల మతం పుచ్చుకోవటమనేది నిమ్నకులాలకు ఒక మార్గమయితే కావచ్చుగాని, ఇప్పుడది ఏమాత్రం సత్ఫలితాలనిస్తుందని!

మతమార్పిడి వల్ల ఈ పల్లెలో అగ్రవర్ణాలవాళ్ళు తమతో సమానంగా ఈ మాలమాదిగల్ని చూస్తారా? – పెద్ద ఉద్యోగం వల్ల మంచి హోదాలో ఉండటమో, బాగా డబ్బు సంపాదించటమో చేస్తే తప్ప...

☆ ☆ ☆

"ఎట్టజెయ్యాల్యబ్బా?" అంటూ ఆదరాబాదరా వచ్చింది వెంకటమ్మ.

పరిస్థితి అర్థమైంది కొండన్నకు. గుండెలు లబలబలాడాయి.

"అయమ్మ ఈ పూట ఎవరికీ సంగటి చేసి పెట్టల్లే....సెయ్యనంటాంది. ఎర్రోల్ల పిచ్చిదీ, బరుగొడ్లోల్ల పాసిదీ, సుంకన్న పెండ్లామూ నాయాల్నే ఊరంతా పరవేసకొన్నెరు. ఎందుకోమల్ల...రైతు లెవరూ పలకలేదబ్బా!" చెప్పింది.

పొద్దు కనపళ్ళేదుగాని పైటేల అయింది. ఉబ్బరపు ఎండగాసుంటే ఇప్పటికే సంకటికోసం ఎగమల్లి ఉండేవాళ్లు.

ఏం జెయ్యాలో అర్థంగాకుండా ఉంది కొండన్నకు.

సరుకులిచ్చి వాళ్లనే వండుకోమన్నా, కుండా చట్టీ కావాలిగదా! తమవి వీళ్లు తగలరు.

రైతులు వీళ్లను తగలనివ్వరు.

జడలు విరబోసుకొని మెల్లిగా నడిచొచ్చే భూతమైంది సంకటి సమస్య కొండన్నకు. నెత్తికి చుట్టుకొనేట్టే ఉంది.

విషయం సగమర్థమై – కాక వెంకటమ్మను అడిగింది ఒక కూలిమనిషి. "ఊరంతా లొడ బెట్టినా ఒక్క తల్లికీ కనికరం పుట్టలే... మీ కియ్యాల సంగటి లే, సారక లే...." మునంలో వొంగుతూ చెప్పింది వెంకటమ్మ.

"లేకుంటేనా? పైటేలకే రోజు కూలిస్తావ్, ఇంటికి బొయ్యి తింటం."

"ఒక్కొంతుకు రొండొంతుల కూ లెందుకిస్తం?"

"అయితే పచ్చుండి పనెట్టజెయ్యాల? సంగటి బెట్టుమరి – మాపిట్టేల్దాకా సేస్తం."

"బో సంబడమబ్బా మీది! మా సంగటి తింటే మీదేం తరుగు బోద్ది? ఇద్దరం తగ్గుజాతోల్లమే గదూ! మీ ఎక్కువేంది? మా తక్కువేంది?" చేతులు తిప్పుతూ చెప్పింది వెంకటమ్మ.

దాంతో అక్కడి వాతావరణంలోని ప్రశాంతత మారిపోయింది.

"ఏం నేర్చుకొన్నైవమ్మా, నువ్వు! మాలోల్లను మాట్లాడకముందే కొట్టాలని రైతులంటరు; ఇందుకేనేమో? నీకు పనిబడి నీ ఇంటి పిడ్సను తినమంటివే....మాల కాకిని గూడా మా ఇండ్లల్లేకి రానియ్యం. మాలోల్ల కుండల్లో నోరు బెడ్తమా? భూమి సంపాయిచ్చుకొని దున్నుకున్నంత మాత్తరాన పెద్దకులపోల్లు గారు." రోషంగా చెప్పింది ఒక కూలి.

"ముందు మా ఇండ్లల్లో కొచ్చి మా కుండలో పిడ్స ఇంత సేతల్లో యేయించుకొని తినండి. ఇయ్యన్ని మల్ల మాట్లాడ్డం." ఒడిలో పత్తిని గంపలోకి వదల్తూ విసురుగా అంది ఇంకొక మనిషి.

సంకటి లేకుండా తాము పన్జేసేది లేదనీ, కూలిడబ్బు వెంటనే చెల్లిస్తే తమ ఇళ్లకెళ్లి ముద్ద మింగుతామనీ అన్నారు వాళ్లు. పత్తి విరపటం చాలించి గంపలవద్ద కొచ్చారు.

వర్షం వచ్చి దూకేట్టుంది.

తెల్లగా మంచుముద్దల్లా ఉన్న పత్తి రాలి మట్టిగొట్టుకు పోతుంది. ఆ నష్టానికి తోడు ఒక్కొంతుకే రెండొంతుల కూలి.

"యమ్మా యమ్మా! మా బాసేలికి బుద్దుండో బుద్దిలేకో కూసింది. నేను బొయ్యి సంగటి దెస్తతల్లీ! వానొస్తే నాశనమయితమ్మా! పత్తి ఇరుస్తాం దండి తల్లీ!" కొండన్న బతిమాలాడు.

"ఇప్పుడు బొయ్యి నువ్వు సంగటి సేయిస్స కొచ్చేదెన్నడు?"

"బువ్వ జేయిస్తానమ్మా.....!" అంటూ వాళ్ల మాటకు ఎదురుచూడకుండా ఊర్లోకి కదిలాడు.

రెడ్డోరి పంచలోకి తన తల కనబడకుండా ఊరంతా తిరిగాడు కొండన్న. తనున్న పరిస్థితుల్లో స్టీఫెన్ కళ్లబడాలంటే మనస్కరించట్లేదు. రెడ్లచేత సేవలు

చేయించుకొనే అతనివద్దకు, రెడ్ల దయాదాక్షిణ్యాలకోసం అంగలార్చే తాను వెళ్లటం ఎబ్బెట్టుగా అనిపించింది.

ఊర్లో ఒక్క రైతు కూడా తనకు ఆసరా నివ్వకపోవటం ఆశ్చర్యంగా ఉంది అతనికి.

"ఒకరికి సంగటి జేసిపెట్టడం.....ఇంగొకరి సేత మాటబడ్డం.....ఎందుకొచ్చిన తంటా నాయనా!" అయ్యోరి భార్య అంది.

తంటా వచ్చేది ఎవరితోనో కొండన్నకు అర్థం కాలేదు.

కొండంత దిగులుతో నీరసంగా అడుగులేస్తూ క్వార్టర్లు దగ్గరకొచ్చేసరికి ఆగిపోయాడు....రెడ్డోరి ఇంట్లో అడిగితే?

స్టీఫెన్ కళ్లబడకుండా దొడ్డిదారి గుండా వెళ్తేసరి....బహుశా సుభద్రమ్మ కాదనదు. వంటమనిషి కూడా ఉందిగదా!

ఒక్కక్షణం ఆశ మొలిచింది. తప్పనిపరిస్థితి మరి.

సందులోంచి తొంగిచూశాడు.

రెడ్డోరి పంచ కన్పిస్తోంది.

పట్టెమంచమ్మీద ఆసీనుడై ఉన్నాడు పెద్దరెడ్డి. పక్కనే ఈజీఛేర్ మీద వాలి ఉన్నాడు స్టీఫెన్. ఇద్దరూ సిగరెట్లు పీలుస్తున్నారు.

నేలమీద తమ పాళెంవాళ్లే కొంతమంది మూలలు కూచుని ఉన్నారు.

కొత్తగా వచ్చి చేరేవాళ్లు పెద్దరెడ్డితోటి స్టీఫెన్‌కూ చేతులు జోడించి, అక్కడే నేలమీద కూలబడటం కొండన్నకు ఆశ్చర్యమనిపించింది.

తమ కులంవాడు, తమ పాళెంవాడు, తమవాడయిన స్టీఫెన్‌కు తమవాళ్లంతా సమస్కరించటం వింతగా ఉంది అతనికి.

'త నక్కడికి వెళ్లినా వాళ్లతోటే......'

భరించలేకపోయాడు.

రేపు తన కొడుకు ఇంజనీరై మంచి హోదాలో ఇక్కడకొస్తే పెద్దరెడ్డి గౌరవిస్తాడు కాబోలు!

అతని హృదయంలో ఎక్కడో ఆనందపు జలదరింపు.

అంతలోనే అతనికో అనుమానం.

తన కొడుకు పెద్దరెడ్డితోటి సమాన హోదాలో ఆసీనుడైనా, తను మాత్రం రెండు చేతులు జోడించి నేలమీద కూచోక తప్పదేమో!

☆ ☆ ☆

ఒంటరిగా వస్తోన్న కొండన్నను చూసి దూరాన్నించే పరిస్థితి అంచనా వేశారు కూలీలు. ఒళ్లో పత్తి గంపల్లో పడేసి, కడుపులోంచి ఎగదన్నుకొచ్చే ఆకలిని అలుమొగుళ్లమీద కక్కారు.

'ఒక్కరైతుగ్గాడ మంచిగుండని మీదేంబతు' కన్నారు.

'అడుగు కదపకుండా, కూలిదుడ్లు రాల్చ' మన్నారు.

'వంతు కూలి ఇస్తా' నంది వెంకటమ్మ.

అక్కడ కొంతసేపు అరుపులు, తిట్లు చెలరేగాయి.

ఇరుగుపొరుగు చేలవాళ్లు ఎగమల్లి వచ్చారు.

మాలలు కొండన్నకే వత్తాసిచ్చారు.

పనిబాటలవాళ్లకాడ ఏం మాట్లాడినా ఇబ్బందేనని రైతులు మెల్లిగా జారుకొన్నారు కొంతసేపు తిట్లాట అనంతరం "నువ్వు రోజుకూలి ఎట్టియ్యవో మేమూ జూస్తం.' అంటూ పచ్చనిచేలమీద బండబూతులు దొర్లించుకుంటూ వెళ్లారు మాదిగ స్త్రీలంతా.

తల పట్టుకున్నాచుండిపోయాడు కొండన్న.

మాదిగలను కూలికి పిల్చుకొంటే ఇట్లాంటి అగచాట్లు తప్పవు.

తమకు వాళ్లుతప్ప మరో కులంవాళ్లు కూలికి రారు మరి!

సంకటి పెట్టలేని ఇంకో ముగ్గురి చేలవద్ద ఇలాగే జరిగిందట.

ఇప్పుడు ఇంటికెళ్లి సంగటి గెలుక్కొని ఆకలి బాద్చుకోవడం వాళ్లకు సాధ్యమయ్యే పనిగాదు.

తమగుండా వాళ్లీపూట పస్తులున్నట్టే.

సమస్యను మరింత జటిలం చేస్తారు వాళ్లు.

ఎట్లా బైటపడాలో దిక్కుతోచకుండా ఉంది కొండన్నకు.

తనకు తోడు ఇంకొందరున్నారనే విషయం అతనికి కొంత ఊరట నిచ్చింది.

వానవచ్చి దూకేట్టుంది.

పత్తిగంపలు ఇళ్ళకు మోయాలి.

పనిజరిగుంటే కూలోళ్లే తలొక గంప మోసుకెళ్లి ఉండేవాళ్లు.

అతనిలోని అన్ని సమస్యల్ని ఈ ఆత్రుత ముంచేసింది.

గబగబ రెండు గంప లెత్తుకొని కదిలారు అలుమగలిద్దరూ.

ఇంటి కెళ్లేసరికి వాళ్లకోసం ఒక వార్త కాచుకొని ఉంది.

సాయంత్రం నాలుగ్గంటలకే స్టీఫెన్ తమ ఇంటికే వస్తాడుట.

పత్తి గంపలు మోస్తూనే స్టీఫెన్‌తోటి తిరగాల్సిన తావుల్నీ కలవాల్సిన మనుషుల్నీ ఒకసారి మననం చేసుకొన్నాడు కొండన్న. తను హైదరాబాదు వెళ్లినపుడంతా ఇక్కడే పరిసరాల్ని గురించి స్టీఫెన్ పలవరించేదంతా జ్ఞాప్తికి తెచ్చుకొన్నాడు.

ప్రసంగాల ద్వారా; పేపర్ స్టేట్‌మెంట్ల ద్వారా, రచనల ద్వారా; పెద్ద కులాల కర్రపెత్తనం మీద అతను చేసే తిరుగుబాటును తల్చుకొన్నపుడంతా కొండన్న ఆశ్చర్యపోతూనే ఉంటాడు.

ఎక్కడ దళితుల మీద అగ్రవర్ణాల వాళ్లు దాడిజేస్తారో అక్కడంతా ప్రత్యక్షమవుతాడుట స్టీఫెన్. న్యాయంకోసం పోరాడుతాడట.

అంటరానితనం నేరమంటాడు. అందరూ సమానం కావాలంటాడు.

అతని ధాటికి జడిసి పెద్ద కులాలవాళ్లే అతనితో ఎక్కువగా స్నేహం చేస్తుంటారు. కుల మతాల్ని పట్టించుకోకుండా తమ ఇళ్లకుసైతం తీసుకెళ్తుంటారు.

సహాయం కోసం వచ్చినవాళ్లకు చెయ్యందించకుండా ఉండలేడుట. తనతోబాటు ఈ పాలెంలో మరో నలుగురు ప్రభుత్వం సహాయం పొందేందుకు అతనెంతో కృషి జేశాడు.

స్వతహాగా తెలివిమంతుడైన తన కొడుక్కి కోచింగ్ ఇప్పించి ఇంజనీరింగ్ సీటు తెప్పించాడు. వాణ్ణి అతడే చదివిస్తున్నాడు. అమ్మా నాన్నల్ని కూడా మరిచేంత ప్రేమను చూపిస్తున్నాడు. తోటి మాలలంతా అతనికోసం వెళ్తోంటే అతను తన్ను చూట్టానికి రావటం....!

కొండన్నకు ఏనుగెక్కినంత సంబరం కలిగింది.

పత్తి గంపలు మోసింతర్వాత పటపట కట్టెపేళ్లు చీల్చాడు. అంగడికెళ్లి గోధుమపిండి కొనుక్కొద్దామని మళ్లీ చాలించుకొన్నాడు. స్టీఫెన్‌కు పల్చగా కాల్చిన జొన్నరొట్టెలంటే మహాప్రీతి!

నాల్గుగంటల టిఫెన్‌కు అవే వడ్డిద్దామనుకొన్నాడు.

"యాం దీమాసీ – యింగా ఎర్రిసూపులు సూస్తాండడూ! కోన్ని కోసేదిలే.....? దడెం సియ్యాలు బడే కోడిపుంజు దెస్తివి. ఇప్పుడు కోస్తేగాదూ, అయిపొయ్యేది?"

వెంకటమ్మ మాటల్తో లేచాడు.

చూర్లుకత్తి నూరి గంపకింది కోణ్ణి పట్టుకొనేసరికి; ఊర్లోంచి ఇళ్లకొస్తూ అతని వద్ద ఆగాడు ఓబన్న. "మాపిటేలగ్గాని స్టీపెనయ్య యాడికి రాలేడంట. నీకు జెప్పమన్నెడు." చెప్పాడు.

ప్రశ్నార్థకంగా అతనికేసి చూశాడు కొండన్న. "రేత్తిరి గ్గూడా యాడి కేమొస్తడోబ్బా!"

నొసలు ముడేశాడు కొండన్న.

"రొండు కోళ్ల గోసిందు పెద్దరెడ్డి. బ్రాందిగ్గూడా మనసుల్ను పంపిచ్చిందు." అసలు విషయం బైటేశాడు.

మనసారా స్టీఫెన్ ఇక్కడకు రావాలనుకొంటే అవేమీ పెద్ద అడ్డంకులుగా తోచలేదు కొండన్నకు.

రొట్టె కాల్చేందుకు జొన్నపిండి కలుపుతోన్న భార్య వద్దకు నడిచాడు. ఆమెతో విషయం చెప్పి, కోణ్ణి గంపకింద మూశాడు.

"పొద్దుగల్లవస్తే – పిల్లోని మంచీ సెడ్డా అడుగుదామనుకొంటి. రేత్తిరి ఏ జాం కొస్తాడో?" విచారంగా అంది.

"పొద్దున్నే అడగొచ్చులే."

"సీకట్లో దోవబడ్తే ఎట్ట జెయ్యాల?"

"మనకాడ ఒక్క పూటన్నా ఉండకుండా పోడులే." చెబుతూ బైటకు నడిచాడు. ఉరుములు మెరుపుల్తో కారుమేఘాలు కమ్ముకొస్తున్నాయి.

నోటికాడి కొచ్చిన పంట వానపాలయేట్టుంది. "వానొచ్చేలోపల బుట్టెడు పత్తి యేరకొచ్చినా మేలేగదా!" అనిపించింది. వీథిలో కొచ్చి పైకెగజూసి పెదవి విరుస్తూ సపారం కింద మంచం మీద వాలాడు.

మొదటి రొట్టె కాల్చి వెంకటమ్మ అతనికి అందించేసరికి, వచ్చిపడింది వాన. రొట్టె తినేంతసేపు జమాయించి కురిసింది.

జరుపవలసిన నష్టాన్ని జరిపి మెల్లగా పాటుకులోకి దిగింది.

కొండన్న కెందుకో మనస్సులో ఏదో వెలితిగా ఉంది. స్టీఫెన్ వచ్చివుంటే ఎట్లా ఉండేది!

ఇక్కడ సరైన వసతి లేకపోవచ్చు, కాని....తన లేమిడితనంలోకి అతను జొరబడి వచ్చి కూరుకుపోయి గుండెల్ని కలియబెట్టి ఉంటే ఎంత బావుండేది! పెద్ద రెడ్డిలాగా తను విందు భోజనాలు పెట్టలేకపోవచ్చు. అతను పలవరించే అద్భుతమైన బీదవిందు తనందివ్వగలడు గదా!

ఇక్కడ సపారం కింద మంచంలో కూచుని, పళ్లెంలోని కోడిపులుసు అద్దుకొంటూ, జొన్న రొట్టె కొరుక్కు తింటూ; జడివానను చూస్తూ – గడపటం ఎంత ఆనందమో – స్టీఫెన్‌కు మాత్రం తెలీదా?

మరెందుకు అక్కణ్నించి వూడబీక్కుని రాలేకున్నాడు?......

ఇప్పుడనిపిస్తూ ఉంది – బ్రాందీకూడా తెప్పించారంటే రాత్రంతా అక్కణ్నించి కదలటం స్టీఫెన్‌కు సాధ్యంకాకపోవచ్చు.

తను ఎదురుచూడటంకూడా దండుగేనేమో!

శరీరమంతా నిస్సత్తువ ఆవరించింది కొండన్నకు.

అంతలో తపేల ప్రకాశం వచ్చాడు.

ఊర్లోకి మాదిగలు వచ్చారట.

బాగా తాగి వున్నారట.

తమ కులాన్ని భ్రష్టు పట్టించాలనుకొన్న మాలల్ని బండబూతులు తిడుతున్నారుట.

పెద్దరెడ్డి జోక్యంవల్ల కొంత సద్దుమణిగిందట.

ఆయన మాలపాలేనికి మనిషిని పంపేడుట – రైతులుగా మారిన తమ కోసం. తనకు తలనొప్పిగా ఉందంటూ మిగతావాళ్లను పంపాడు కొండన్న – 'మీ నిర్ణయమే నా నిర్ణయ' మంటూ.

స్టీఫెన్ ముందుకు పంచాయితీకి వెళ్లటం అతనికిష్టంగా లేదు.

గంటకంతా తిరిగొచ్చారు వాళ్లు.

పంచాయితీ సారాంశం విని ఆశ్చర్యపడ్డాడు కొండన్న.

"మీరు కూలి కెళ్లారు కాబట్టే వాళ్ల సంకటి తినటంలో తప్పులేదు. అంతే కాకుండా, ఈ మాలలు మీ సంకటి కోసం రెడ్ల చేతికిచ్చే గింజలూ, ఉప్పూ, పప్పూ; అన్నీ వీళ్ల కుండల్లోటివే కాబట్టి, వీళ్ల ఇళ్లలో చేసిన సంకటి తినేందుకు మీరు సంకోచించాల్సిన పన్లేదు" అని వాదించాడుట స్టీఫెన్.

"మాలోల్ల సంగటి మేం దింటమా? వాల్లకు కూలికి రాడమే బుద్ధితక్కువైతే...."

గబుక్కున పెద్దరెడ్డి అందుకొని "అయితే పోగాకంద్రా! వాల్ల సంగటి తినని నా కొడుకులు; వాల్లకు కూలి కెట్టా బోతరు?" అన్నాడట.

వంతుపనే చేశారు కాబట్టి సగం కూలి ఇవ్వటమే న్యాయంగా తీర్మానించారుట.

కొండన్న ఆలోచనలో పడ్డాడు.

స్టీఫెన్‌తో కలసి రెడ్డి ఇచ్చిన తీర్పు వెనక అంతర్యం అర్థమవుతూ ఉంది. తనకు తెలీకుండానే స్టీఫెన్ రెడ్డికి సహాయపడినట్టుంది.

మాదిగల్ని ఇంకా రెచ్చగొట్టాడు రెడ్డి. మాలోల్లకు మరెప్పుడూ కూలి కెల్లకుండా చేశాడు.

ఊరంతా తిరిగినా ఒక్క రైతు కూడా సంగటి గెలిగించకపోవటానికి వెనకున్న కారణం ఇప్పుడు తెలిసివస్తోంది.

తమకు సంకటి గెలికిపెడితే తంటా వస్తుందని అయ్యవారి పెండ్లాం అన్నమాటల్లో, తంటా ఎవరి ద్వారా వస్తుందో అర్థమవుతూ ఉంది.

భూముల్లేని మాలలు అప్పోసప్పో మెడకు తగులుకొని రెడ్లచేతుల్లో ఇరుక్కుపోయారు.. మరికొందరు తోటి మాలోనికి కూలి కెళ్లేందుకు అభిమానపడుతున్నారు. అభిమానం అనేకన్నా అసూయ అంటేనే బావుంటుందేమో!

ఈ మాదిగలు కూడా రూపాయి పెంచేసరికే వచ్చారు.

రైతులకు అది కన్నెర్ర అయుండవచ్చు.

కూలి, నాలి చేసికోకుండా వ్యవసాయంలోకి దిగటం తాము చేసిన ఒక మోస్తరు తప్పయితే, రైతులకు వెళ్లే కూలీల్లో తామూ కొంత వాటా పంచుకోవటం క్షమించరాని నేరమైనట్లుంది.

తా మెట్లా వ్యవసాయం చేయాలో తెలీకుండా ఉంది.

కూలీలుగా బతికే కులం రైతులుగా తయారుకావటం ఎంత కష్టమో, ఎంతమందికి కంటగింపో ఇప్పుడర్థమవుతూ ఉంది.

గవర్నమెంటు ఇచ్చిన మోటార్లనీ, పైపుల్నీ, ఎద్దుల్నీ, బండ్లనీ అమ్ముకుని; ప్రభుత్వ పథకాల్ని మాల మాదిగలు ఎందుకు దుర్వినియోగం చేస్తున్నారో ఇప్పుడు బాగా అవగాహన కొస్తోంది.

తనకూ అందరిలా అంతో ఇంతో తాగుడూ, పెట్టుబడికి సావుకార్లవద్ద వంగే బీదరికమూ ఉంటే రేపు సీజనుకే బండెద్దులు, బోరుబావులూ అమ్మక తప్పదు గదా!

పంచాయితీని గురించి ఆలోచించేకొద్దీ స్టీఫెన్ ప్రవర్తన వింతగా తోచింది కొండన్నకు.

కుల ప్రసక్తిలేని కూలి పంచాయితి చేసుండొచ్చు గదా! వాళ్లను రెచ్చగొట్టట మేమిటి? తన కులంవాళ్లకే సహాయం చేద్దామనుకొన్నాడు కాబోలు!

ఇది సహాయమెట్లా అవుతుంది?

పంచాయితీలో మాదిగలకు అన్యాయం జరిగింది.

దాని ప్రతిఫలం ఖచ్చితంగా మాలల మీద పడుతుంది. పక్క తాలూకాలోని నీళ్ల పంచాయితీలో కూడా విఫలమై వచ్చాడుట స్టీఫెన్. తమకు చెందిన మంచినీళ్ల గుంటలో మాలలు నీళ్లు తెచ్చుకొనేందుకు రైతులు ఓ మెలిక పెట్టారుట. మాదిగ వాడలో కూడా, ఉన్న ఒక బోరు బావీ చెడిపోయే దశలో ఉంది. కాబట్టి మాల మాదిగలిద్దరూ ఒకే రేవులో నీళ్లు ముంచుకెళ్తే తమకు అభ్యంతరం లేదన్నారుట.

ఆ ప్రతిపాదనకు కలెక్టరు కూడా సమ్మతించాడుట.

రెండు మైళ్ల దూరంలోని చెలమనీరు తెచ్చుకోవటమే తమకు సమ్మతంగా వెనుదిరిగిపోయారట మాలలు.

తమను తక్కువగా చూసే అగ్రవర్ణాలమీద దళితుల పక్షాన తిరుగుబాటు జెండా ఎగరేస్తున్న ఈ స్టీఫెన్ దళితుల్ని ఏకం చేయకుండా ఎట్లా యుద్ధం చేయాలనుకొన్నాడు? ప్రత్యర్థిని ఎదుర్కొనే ముందు తమలో తాము వైషమ్యాల్ని చంపుకోవాలి గదా!

పల్లెలంత జటిలంగా ఈ సమస్య నగర దళితుల మధ్య లేకపోవచ్చు. కానీ దళితులంతా ఒక్కటే గదా!

ప్రస్తుతం నగరాల్లో దళిత ఉద్యమం మంచి ఊపు మీదుంది గాని – అందులో కూడా అపశ్రుతి జీర స్పష్టమవుతోంది. తమను చూసి అగ్రవర్ణాల వాళ్లు నవ్వుకొనేలా కులాల పేరిట అనైక్యతా వేదికలు, అస్పష్ట శంఖారావాలు పెచ్చు మీరుతున్నాయి. ఈ విపక్ష అనువంశిక లక్షణాలు విద్యావంతుల్లో సైతం చావకుండా ఉండటం విచిత్రంగా ఉంది.

పల్లెనించి పైకెదిగి మంచి హోదాలో ఉన్న ప్రతి హరిజనుడూ తన పల్లెను మరుస్తున్నాడు. తల్లిమట్టిని విస్మరిస్తున్నాడు. తనవాళ్లను పైకి తెచ్చేందుకు ప్రయత్నించడం లేదు – అగ్రవర్ణాలవాళ్లలా!

పల్లెకొస్తే అక్కడి పెద్దకులాలవాళ్లు అతన్నింకా తక్కువ కులంవాడిగా చూస్తారని అనుమానం. ఫలానా వృత్తిపనివాడి కొడుకుగా వేలెత్తి చూపుతారేమోననే ఆత్మన్యూనతా భావం.

స్టీఫెన్‌కి కూడా అలాంటి భావమే ఉందేమో!

తన ఇంటికొచ్చేందుకు ఆ భావమే అడ్డుపడిందేమో!

తనెరిగిన స్టీఫెన్‌కు అలాంటి భావం లేదనుకున్నా, పెద్దరెడ్డి వలలో పడేంతర్వాత ఖచ్చితంగా వచ్చి దొండుకుని ఉంటుంది.

రేపు తన కొడుకు కూడా ఇట్లాగే ప్రవర్తించవచ్చు బహూశా.

ఇప్పటికే – సంవత్సరానికి ఒక్కసారి కూడా ఇక్కడకు రావటంలేదు. వచ్చినా నాల్రోజులు కూడా ఉండటం లేదు.

ఉన్నరోజుల్లో కూడా ఎవరితో కలవడు – ఏకాంతంగా చేలెంట, చెల్లెంట తిరగటం తప్ప.

వాడికీ, తమకూ మధ్య ఏదో పెరిగిపోతున్నట్లుగా అన్పిస్తుంది.

చిన్నప్పటినుంచీ వాడు మంచి మేధావే.

వాడి తెలివి చూసే స్టీఫెన్ చేరదీసినట్లుంది.

వాడికి పెద్ద హోదా కల్పించి రేపు అల్లునిగా కూడా చేసికోవచ్చు. ఈ విషయంలో తమ సహకారం స్టీఫెన్‌కు పెద్దగా అవసరం లేకపోవచ్చు.

ఎంతగా మారిపోయాడు?

హైదరాబాదు వెళ్లినప్పుడంతా పల్లె రుచుల్ని గురించీ, సావాసాల్ని గురించీ పలవరించేదంతా.... పెద్దరెడ్డి సరసన కూచోగానే మాసిపోయినట్లుంది.

దళితుల పక్షాన పోరాడేవాడు దళితుల్ని మరవటం వింతగా ఉంది.

పెద్దరెడ్డి విసిరిన వల బాగా కన్పిస్తూ ఉంది గదా!

ఆయన హోదా ముందు తమ పాలేనికి వచ్చేందుకు నామోషి పడ్డాడేమో!

తోటి మాలలంతా వచ్చి పెద్దరెడ్డితో సమానంగా తన్నూ గౌరవించేసరికి – రెడ్లు నీచంగా చూసే ఇళ్లకు తాను అతిథిగా వెళ్లేందుకు సిగ్గుపడ్డాడు కాబోలు! రెడ్డి ముందు చులకన అవుతాననుకున్నాడేమో!

రెడ్డికీ, స్టీఫెన్‌కూ పెద్ద తేడా ఏమీ కన్పించలేదు కొండన్నకు.

తరతరాలుగా రెడ్లు దళితుల శ్రమను దోపిడీ చేస్తున్నారు. స్టీఫెన్‌లాంటివాళ్లు దళిత వనంలో వికసించిన మేధావి పూలను తుంచుకుపోతున్నారు. పల్లె దళితుల్ని మోడు పైరుగానే ఉండేటట్లు చూస్తున్నారు.....

రాత్రంతా ఆలోచిస్తూనే ఉన్నాడు కొండన్న.

☆ ☆ ☆

మాదిగలకు న్యాయమైన కూలి ఇచ్చేందుకే నిర్ణయించుకున్నాడు కొండన్న. తనతోటివాళ్లతో కలిసి చర్చించాడు కూడా.

ఉదయం వంతు పనెక్కువ జరుగుతుంది కాబట్టి సగం కంటే కొంత ఎక్కువ కూలి ఇస్తూ సంకటి ఖర్చు కట్టించాలనుకున్నాడు.

"టీపెనన్న వూరికి పోతాండడంట. నీతో ఏదో మాట్లాడాల్నంట. అడ్డరోడ్డు కాడికి రమ్మన్నెడు. పొయ్యిరాపో!" వెంకటమ్మ చెప్పింది.

"నువ్వేపో...." సమాధానమిచ్చాడు కొండన్న.

"యాందీమాసీ...." అంటూ ఆశ్చర్యపోయింది ఆమె.

డబ్బు జేబులో దురుముకుని, కోడిపుంజును చంకన పెట్టుకుని మాదిసిండ్లకేసి సాగే మొగున్ని చూసి విస్తుబోయింది.

రాత్రి స్టీఫెన్ బొజ్జకు కాకుండా, ఇప్పుడు మాదిగిల కోసం ఈ కోడిపుంజు వినియోగపడుతున్నందుకు కొండన్నకు కొండంత ఆనందంగా ఉంది.

● ఆంధ్రప్రభ వీక్లీ అపురూప కథాప్రభ: *20-11-1996* ●

★ ★ ★

బమ్మిడి జగదీశ్వరరావు

89

# ఆలౌట్

క్రిక్కిరిసిన దేవుళ్ళతో దేవుడి గది ఇరుకుగా వుంది. తన మెట్టినింటి ఇలవేల్పయిన ఏడుకొండల వెంకటేశ్వరుడితోపాటు, తన పుట్టినింటి ఇలవేల్పయిన గరళ కంఠము గల శివుడి ముందు శారద మోకరిల్లింది. ఆ శివ వైష్ణవుల మధ్య వైరాన్ని కొనసాగిస్తున్నట్టు ఆమె కొడుకు లిద్దరైతే అక్కడే చేరి గిల్లి కజ్జాలాడు కుంటున్నారు.

శారదకు మనోభంగమైంది. శపించేంత శక్తిలేక కోపించబోతే, ఆ బుడత గాళ్ళిద్దరూ 'అమ్మా నువ్వే చెప్పు' అన్నారు. ఏవిటన్నట్టుగా చూసింది శారద.

"అమ్మా! క్రికెట్ ఆ దేవుళ్ళ కాలంలో కూడా వుండేదా?"

ఆ ప్రశ్నే అర్థంకాక శారద అనుమానంగా చూసింది.

"....మరేమొచ్చి..... వెంకటేశ్వరుడి నుదిటిమీద క్రికెట్ స్టంప్స్ వున్నాయి. ఆ మూడు అవేకదా? అయినా మధ్యలో స్టంప్ తప్ప రెండువైపులవీ వంకరగా పాతేరు....." అన్నాడు ఒకడు.

".....నిజమే..... మరి ఈశ్వరుడిక్కూడా నుదిటిమీద మూడు స్టంప్స్ వున్నాయి. కాని అడ్డుగా వున్నాయి. కోకోకోలావాళ్ళ బాల్ మధ్యలో వుంది. మంచి సింబల్....." అన్నాడు రెండోవాడు.

'అమ్మా.....' అని కొడుకు లిద్దరూ అమెని కుదిపేరు.

"ఇందుగలడందు లేడని సందేహము వలదు. ఎందెందు చూసిన అందందే గలడు – దేవుడూ దైవము కాదు. క్రికెట్టా...?!" శారద తను లెంపలు వేసుకొని పిల్లలకు వేయబోతే వాళ్ళు వీధిలోకి పరుగుతీశారు.

శారద వీధిగుమ్మందాక వచ్చింది.

అప్పటికే కొడుకు లిద్దరూ ఫీల్డులో వున్నారు. ఆ క్రికెట్ ఫీల్డు మధ్యలో మూడు పుల్లలు ఇసుకపోసి పాతి వున్నారు. ఆ పుల్లలకు కొద్ది దూరంలో ఇటుక బెడ్డపెట్టి 'పిచ్'గా పిలచి రన్స్ చేస్తున్నారు.

"స్కూల్‌కు టైమవుతోందర్రా!" అరిచింది శారద.

ఎవ్వరూ పట్టించుకోలేదు.

"ఒరే పెద్దొడా! నువ్వు ఏడో తరగతి....నీకు పబ్లిక్ పరీక్షలు....ఒరే చిన్నోడా! నువ్వు ఐదోతరగతి పాసయిపోతావ్, కాని కోరుకొండ, నవోదయా ఏ సీటూ రాదు...." శారద గొంతు చించుకుంది.

"మధ్యలో డిస్టర్బ్ చేయకు......నువ్వెయ్యరా బాల్".... వాళ్ళకు ఖాతరులేదు. జాతర లాగుంది. వీధిలోని గుంటలు వచ్చి చేరారు. జట్లు కడుతున్నారు.

"శారదా! నువ్వింట్లోకి రావే. నేను ఇన్నాళ్ళూ క్రికెట్ ఆడొద్దని తిట్టేదాన్నా..... మరి తిట్టనుగాక తిట్టను..." శారద అత్త పున్నమ్మ వంటగదిలోంచి పిలిచింది.

"ఏం అత్తమ్మా....." వంట గదిలోకి వస్తూ అడిగింది శారద.

"చదివితే ఎందలెట్టనే? మీ అక్కయ్య కొడుకు ఎమ్మేలు బియ్యేలు చదివాడు ఎందుకు? ఉద్యోగం రాదు. వచ్చినా రెండు వేలే. క్రికెట్టయితే లక్షలకి లక్షలు. అయినా ఇంటర్వ్యూల్లో జీకేల్లో ఆ క్రికెట్ బిట్లే అడుగుతున్నారట....." ఆశ్చర్యపోతూ చెపుతున్న పున్నమ్మ వేపు విస్తుపోతూ చూసింది శారద.

'శారదా....శారదా!' వీధి గుమ్మంలోంచి పిలుపు.

శారదతోపాటు పున్నమ్మ వంటగదిలోంచి ఇవతలకు వచ్చింది.

"అదేమిట్రా, ఆఫీసు సెలవేమిటి? ఇలా వెళ్ళినవాడివి అలా తిరిగివచ్చేశావ్?" పున్నమ్మ తన కొడుకు శేఖరాన్ని అడిగింది.

శారద భర్త చేతిలోని బ్యాట్ని అందుకుంటూ "ఎవరో పోయుంటారత్తమ్మా!......" అంది.

"ఒకరోజా, మూణ్రోజులా?....." శేఖర్ తండ్రి కామయ్య మంచం దిగుతూ కొడుకుని అడిగాడు.

"అదేమిటి?" పున్నమ్మకు అర్థం కాలేదు.

"స్టేటయితే ఒకటి, సెంట్రల్ అయితే మరోటి.....స్టేటస్నిబట్టీ వారందాకా." కామయ్య అనుమానం తీర్చి 'ఇదీ తెలీదా?' అన్నట్టు భార్య పున్నమ్మ వంక చూశాడు.

"ఇంతకీ ఎవరండీ పోయింది? వెన్నుపోటా..... గన్నుపోటా.....గుండెపోటా? ఎలా పోయారండీ?" తెలుసుకోవాలన్న ఆసక్తితో ఉత్సాహంగా అడిగింది శారద.

"ఎవరే పోయారు?" అప్పటికి అవకాశమొచ్చిన శేఖర్ తిరిగి ప్రశ్నించాడు.

"నాకేం తెలుసు? సెలవిచ్చింది మీకు, మీకు తెలియాలిగాని....." శారదకు కోపం వచ్చింది.

ఇదంతా చూస్తున్న కామయ్యకు అనుమానం తీరక "స్టేటా......సెంట్రలా?.....ఏ మినిస్టరీయో...." అడిగాడు.

"సింగపూర్ తాతయ్యా!....."

వీధిలో ఆడుతున్న బుడతలిద్దరూ ఎప్పుడు వచ్చారో ఏమోగాని చర్చలో పాల్గొన్నారు.

"అదేమిటి, సింగపూర్ వాళ్ళు పోయినా ఇక్కడ ఇండియాలో సెలవు ఇస్తున్నారన్నమాట! దేశాలమధ్య సమైక్యతంటే అలావుండాలి. ఇంతకీ ఎవరో చెప్పనేలేదు...." ఆనందంలో కూడా అనుమానాన్ని వదలక ప్రశ్నించాడు కామయ్య.

శేఖర్‌కాక, మాటాడే అవకాశాన్ని పిల్లలు తీసుకున్నారు:

"మనమున్నూ జయసూర్యవాళ్ళున్నూ....."

"అదేమ్మాటలురా? ఎదురింటి జయసూర్యవాళ్లు పోవడమేమిటి? వాళ్ళమ్మ వింటే తిట్టిపోస్తుంది......" పున్నమ్మ కంగారుపడింది.

"అబ్బబ్బా......నాయినమ్మకు ఏదీ అర్థం కాదు." పిల్లలిద్దరూ విసుక్కున్నారు.

శేఖరు నోరు విప్పబోయాడు. మళ్ళీ అవకాశం చేజారిపోయింది. అతగాని తమ్ముడు హాల్లోకి వస్తూ "అన్నయ్యా.. ...మైడియర్ సన్స్ కపిల్, సచిన్ మీరూ" అడిగాడు. 'రెడీ వచ్చేశాం' పిల్లలిద్దరూ ముక్త కంఠం.

"నువ్వు డ్యూటీకి...." శేఖర్ అనుమానంగా అడిగాడు.

"లేదన్నయ్యా.....అడ్వాన్సుగా వుండబట్టే డ్యూటీకి పోలేదు. ఈ జనార్దన్ గవాస్కర్...." గర్వంగా అన్నాడు జనార్దన గవాస్కర్.

"నీకు ముందే పోతారని తెలుసా జనార్దనా?" ఆశ్చర్యంగా అడిగింది శారద.

"వదినా..... వదినా! నీ కెన్నిసార్లు చెప్పాలి, జనార్దన గవాస్కర్ నా పేరు. కాలేజీలో కూడా...." నొచ్చుకుంటూ విప్పబోయాడు జనార్దన్ గవాస్కర్.

"బంగారం లాంటి పేరుకు గవాస్కరూ....గంధపుచెక్కా తగిలించుకొని ఇదేం ఖర్మరా నీకు...." పున్నమ్మ నొచ్చుకుంది నెత్తి బాదుకుంది.

"అమ్మాః....." జనార్దన కోపంగా అరిచాడు.

"నేను లీవు పెట్టుకు వచ్చింది బేటింగ్ చూడ్డానికి గాని, మీ చేతిలో బేటింగ్ కావడానికి కాదు...." శేఖరు జుట్టు పీక్కున్నాడు.

"అంటే..... అంటే....." శారద తేరుకోలేక మాటరాక....

"ఏముంది కోడలా! ఇవాళ 'క్రికెట్ అదివారం" తేలిగ్గా చెప్పాడు కామయ్య.

"ఇవాళ శనివారం కదా?" పున్నమ్మ అనుమానం పున్నమ్మది.

"అదేనే దద్దమ్మా..... క్రికెట్ ఏ రోజు అడితే ఆ రోజు 'క్రికెట్ అదివారం' అందుకనే ఆఫీసుకీ స్కూళ్ళకీ అన్నిటికీ గైర్హాజరు...." కామయ్య భార్యను సమాధాన పరిచేడు.

"మా మాష్టారెవరూ రాలేదు. అందుకే మాకూ స్కూల్ శలవ్....."

"నాకు శలవ్....."

పిల్లల సమాధానం పిడుగులా తోచింది శారదకి.

"పచ్చి పండగ పూటయినా సెలవు లేదంటావ్, అవున్రా శేఖరూ..... మరి ఇప్పుడెలా ఇచ్చార్రా సెలవ్?" పున్నమ్మ కొడుకుని అడిగింది.

"ఏముందత్తయ్యా! వాళ్ళ మేనేజరూ క్రికెట్ పిచ్చోడయి వుంటాడు. లేకపోతే మేరేజ్‌డేకి లేదు, ఇప్పుడొచ్చిందా?" ఉక్రోషంతో అంది శారద.

"వాళ్ళ మేనేజరుకే కాదు, మనింట్లో కూడా క్రికెట్ పిచ్చి......" కామయ్య మాట పూర్తికాలేదు.

"కపిలన్నయ్యా.....మనది 'క్రికెట్ కుటుంబం' కదరా?"

"యాస్, మైడియర్ సచిన్....."

మనమలిద్దరూ ఒకర్నొకరు అభినందించుకోవడంతో వ్వూరని వుమ్ముకి గుటకలు మింగాడు కామయ్య.

"టీవీ పెడుతున్నాను....ఆగండి....." శేఖర్ పిల్లల మీద అరిచాడు.

"ఇదేమిటి, ఈవేళప్పుడు కరెంట్ ఇచ్చాడు....." ఆశ్చర్యపోయింది శారద.

"దటీజ్ క్రికెట్....యాడ్..... అడ్వర్టైజింగ్ వాళ్ళంతా కోర్టుకు పోయి కరెంట్ తియ్యకుండా అర్డర్ తెచ్చుకున్నారు....." అన్నాడు జనార్దన గవాస్కర్.

"పోన్లే, క్రికెట్ పుణ్యమాని కరెంటు వుంది. ఎండాకాలం. పైగా పరీక్షలు పిల్లలకీ....." సంతోషపడబోయింది పున్నమ్మ.

"కరెంటు వుంటే మాత్రం టీవి ముందు కూర్చుంటారు కాని పుస్తకాల ముందు కూర్చోరు. అవసరమైతే కాలేజీ కుర్రాళ్ళు పరీక్షలు వాయిదా వెయ్యమని సమ్మె చేస్తారనీ విన్నాను....." కామయ్య అన్నాడు.

అది విన్న శారద, పున్నమ్మ నోళ్లు వెళ్ళబెట్టారు.

జనార్దన్, శేఖర్ – టీవీలోకి తల దూర్చేశారు.

టాస్ వేశారు.

"సచిన్! బేటింగ్ వాళ్ళ కిచ్చేద్దామా?" కపిల్ అన్నాడు.

"తప్పకుండా..." అన్నాడు సచిన్.

"ఏమిట్రా, అంత డబ్బులు పెట్టి బ్యాట్ తెస్తే వాళ్ళ కెవలకో ఇచ్చేస్తావా? మీకేమయినా బుద్ధుందా?" మనమల మాటలు విని తిట్టింది పున్నమ్మ.

అందరూ నవ్వారు. అందరూ నవ్వాక బాగుండదని పున్నమ్మ కూడా నవ్వింది.

టీవీలో ఆట ప్రారంభమయింది.

ఎక్కడి వాళ్ళక్కడే గప్‌చిప్!

శారద మధ్యాహ్నం భోజనాలకు పిలిచింది. ఎవ్వరూ రాలేదు. పున్నమ్మ కూడా టీవీ ముందరే కూర్చుండిపోయింది. అందరి కంచాలు టీవీ ముందుకే వెళ్ళాయి. సాయంత్రం ఆట ముగిసే సమయానికి టెన్షన్!

టెన్షన్!

టెన్షన్!

ఎదురింటి మీనాక్షత్త మొగుడికి టెన్షన్‌తో కళ్ళుతిరిగి కూలబడిపోతే – డాక్టర్లు 'హైబీపి' అని చెప్పారు. ఆయన డాక్టర్ల కేర్లోనే టీవీ చూస్తున్నాడు. ఆసుపత్రికి వెళ్ళి చూసొద్దామని శారద భర్తని అడిగింది. బతిమలాడింది.

"పోతేపోనీ ఆటయ్యాకే!" ఒకటేమాట శేఖరానిది.

"అలా అంటే ఎలాగండి, చావు బతుకుల్లో వుంటే....." శారద ప్రాధేయపడింది.

"పోతే ఇటే తీసుకొస్తారుగా!" శేఖరం మామూలుగానే అన్నాడు.

శారద కొయ్యబారి నిలబడిపోయింది.

టీవిలో ప్రేక్షకుల్లాగే పిల్లలు చప్పట్లు.....అంతలోనే ముఖం మాడ్చుకోవడాలు.....

చూసిన కొద్ది కాలంలోనే పున్నమ్మలోనూ ఆత్రుత పెరిగి ఇండియా గెలవాలని దేవుడికి దండం పెట్టుకుంది. మొక్కుకుంది.

ఎట్టకేలకు ఎదురులేని విజయం సాధించిన భారత్!

శ్రీలంక ఓటమి!

ప్రపంచకప్పు పోయినా సింగర్‌కప్పు రావచ్చు?!

ఇంట్లోనే కాదు – వీధి వీధంతా పండుగ. ఊరూ వాడా పండుగ. మీనాక్షత్త మొగుడికి ఆరోగ్యం నయమయింది.

ఆ రాత్రి ఆనందం పట్టలేని శేఖరం శారదని 'శారూ' అన్నాడు.

"లేదండి, పప్పు పులుసు కాచాను. చారు పెట్టలేదు" అంది శారద.

శేఖరం ఆనందాన్ని పట్టలేక శారదతో పంచుకోవాలనుకున్నాడు. శారద మాత్రం మూతి ముడుచుకుంది. మేరేజ్ డేకన్నా క్రికెట్ ఎక్కువయిందా?' పదే పదే ఎత్తి పొడిచింది. 'సెలవు పెట్టి మేరేజ్‌డే ఎందుకు, రోజు జీతం పోదూ....?' దెప్పిపొడిచింది. శేఖరానికి చీమ కుట్టినట్టులేదు. సంతోష సాగరంలో అనరాని మాటలన్నా తుడిచిపెట్టుకుపోయాయి.

"ఈ దఫా విశాఖపట్నంలో మేచయితే నువ్వు టీవీలో చూడక్కర్లేదు. గ్రౌండ్లోనే ఇలా ఎదురుగా ఎంచక్కా దగ్గరగా చూడొచ్చు. ఎంత రేటయినా అప్పు చేసయినా టిక్కెట్లు కొంటాను." శారద అడగని విషయానికి అభయమిచ్చాడు శేఖరం.

ఆ రాత్రి తెల్లారగానే మూర్తి వచ్చాడు. జనార్దన గవాస్కరుకు పెళ్ళి సంబంధం తీసుకువచ్చినట్టు చెప్పాడు.

"మా వాడికోసం నేను చూడనిపిల్ల లేదు. అందం చందం......ఆస్తి అంతస్థు కులం గోత్రం..... ఇవి కాదు మావాడిక్కావలసింది. క్రికెట్ క్రీడాకారిణే కావాలి. లేదా కనీసం క్రికెట్ అంటే కిరకిరలాడిపోయే పిల్లయితే...." కామయ్య ఇంకా చెప్పబోయేవాడేకాని మూర్తి మధ్యలోనే "నాకు తెలుసు మావయ్యా.....వాడి టేస్టుకు తగ్గ అమ్మాయి" అన్నాడు.

వెంటనే అందుకున్న పున్నమ్మ "బాబూ.....అమ్మాయిది ఈ దేశమేనా, లేకపోతే...."

'ఇంగ్లాండా?' శారద మాటందించింది.

"ఈ ఊర్లోనే చెన్నాపట్నం చిన్నోడి కూతురు. ఎంకటి అంటే వెంకటి....." సర్దుకున్నాడు మూర్తి

"అదేం పేరు?" అడిగాడు జనార్దన్ గవాస్కర్.

"నీకు సూటయిన పేరోయ్ బావా, అమ్మాయి పేరు వెంకటి. నువ్వు దాని 'పతి'వి. పెళ్ళాయ్యాక వెరసీ 'వెంకటపతి' అయిపోద్ది. ఆంధ్రా ఆటగాడి పేరు అదురుద్ది." భుజాలెగరేసుకు మరీ చెప్పాడు మూర్తి.

"రేర్ కేసు కూడా అని, మీనింగ్ మారిపోద్దని రేర్‌గా దొరక్కదొరికింది. ఏ క్రికెట్ మేచ్ లేదు కాబట్టి ఇవాళే పెళ్ళి చూపులంది అమ్మాయి. మీరేమంటారు?" మూర్తి పెళ్ళి చూపులకు రెడీ అయిపోయాడు.

"వాడికి నచ్చి పెళ్ళయిపోతే అవే పదివేలు." కూడబలుక్కు అన్నారు పున్నమ్మ కామయ్యలు.

"రన్నవుటు కాకపోతే అవే సిక్సర్లు....." అన్నారు పిల్లలు కపిల్, సచిన్.

అక్కడికో మూడు గంటల్లో ఆడపిల్ల ఇల్లు చేరారు.

స్పోర్ట్స్ బుక్ పేజీలు చించేసి గోడల నిండా అంటించి వున్న అత్తవారిల్లు చూడగానే జనార్దన గవాస్కర్‌కి 'రన్‌రేటు' పెరిగింది. అతగాని తలిదండ్రులకు నమ్మకం కలిగింది.

తలకు హెల్మెట్ రెండుకాళ్ళకు రెండు పేడ్సు కట్టుకొని చేతికి గ్లౌజెస్‌తో ఒక చేత్తో బేటు మరో చేత్తో బంతి పట్టుకొని వచ్చింది వెంకటి.

"ప్రాక్టీసు నుంచి....." ఆమె తండ్రి అంభుజిరావు అనుమానం తీర్చాడు.

పళ్ళేరాల్లో ఐస్‌క్రీమ్స్ అందరూ లాగిస్తూ వుండగా జనార్దన్ గావస్కర్ వెంకటిని ప్రశ్నలతో బేటింగ్ చేశాడు.

"క్రికెట్ బంతి బరువెంత?"

"5–1/2 ఔన్సెస్."

"వెరీగుడ్..... మరి బేట్ పొడవెంత?"

"22 ఇంచెస్."

"వెరీనైస్. వాల్డ్‌లో హైయ్యెస్టు సెంచురీస్ చేసిందెవరు?"

"సునీల్ గవాస్కర్.....34 సెంచరీస్."

"అంటే, మా చిన్నాన్నే...." అరిచారు కపిల్ అండ్ సచిన్స్.

శారద పిల్లలిద్దర్నీ నోర్మూయ్యమంది

కంఠస్థం చేసిన ప్రశ్నల్లా ఆపకుండా మళ్ళీ మళ్ళీ అడిగాడు జనార్దన గవాస్కర్.

"ఫాస్టెస్టు సెంచరీ ఒన్డేల్లో చేసిందేవరు?"

"సనత్ జయసూర్య – 48 బాల్స్‌లో...."

"ఇట్స్ ఒకే. టెండూల్కర్...." జనార్దన గవాస్కర్ అడగకముందే, 'మైనేమీజ్ సచిన్ టెండూల్కర్ అంటే!' తనని పరిచయం చేసుకున్నాడు సచిన్‌బాబు.

శారద కళ్ళెర్రజేస్తే కపిల్‌బాబు తన పరిచయాన్ని వాయిదా వేసుకున్నాడు.

"టెండూల్కర్‌కంటే అతని వైఫ్ ఎన్నేళ్ళు పెద్ద...?"

"సిక్స్‌యియర్స్."

"ఫైనల్ క్వశ్చిన్. ఒన్డేల్లో హైయ్యెస్టు వికెట్స్ ఎవర్తీశారు?"

"వసీమ్ అక్రమ్....."

జనార్దనుడిలోని గవాస్కరుడు అడిగిన అన్ని ప్రశ్నలకు సమాధానాలు రావడంతో జనార్దన గవాస్కర్ వికెట్ పడిపోయింది.

వెంకటి 'వెంకటపతి'యై నిలువగా, మూర్తి ముహూర్తం నిర్ణయించాడు. మళ్ళీ నాలుగు రోజుల్లో ఏ క్రికెట్ మేచూ లేకపోవడంతో పెళ్ళి తొందరలోనే జరిగిపోయింది.

ఆ తరువాత రోజు శుక్రవారం మేచ్!

ఇండియా వెర్సెస్ పాకిస్తాన్!

ఆట ప్రారంభానికి ముందే వెంకటపతితో సహా ఇంట్లో అందరూ ఆందోళనతో వుండడం శారదకు అంతుపట్టలేదు.

"ఈ దరిద్రపు శుక్రవార మొకటి....." శేఖరం తిట్టుకున్నాడు.

"శ్రావణ శుక్రవారం పూట తిడతారా? నా తాడు ఆ భగవంతుడ్ని తెంపీమానా?.....మా ఆయన తప్పు కాయి తల్లీ......" అని తాళిబొట్టుని కళ్ళకద్దుకుంది శారద.

"శుక్రవారాన్ని వారాల్లోంచి కాన్సిల్ చెయ్యాలి" అన్నాడు జనార్దన్ గవాస్కర్.

"ఎందుకయ్యా?" అడిగింది పున్నమ్మ.

"నైంటీ పర్సెంట్ పాకిస్తాన్ గెలిచిన ఆటలన్నీ దాదాపు శుక్రవారంపూట ఆడినవే. 'అల్లా' అద్భుతశక్తి అది..." అన్నాడు శేఖరం.

"నాన్నా!..... మనమూ అల్లాని పూజిస్తే..." అడిగాడు చిన్నాడు సచిన్.

"నువ్వు నోర్మూయ్యి....." కళ్ళెర్రజేసి మరీ కసిరాడు శేఖరం.

"శుక్రవారం మహిమలని సినిమా తియ్యొచ్చు పాక్‌వాళ్లు....." పెద్దాడు అనేసి తలదించుకున్నాడు.

"అయినా మనకు శుక్రవారం సంతోషిమాత లేదా? వినాయకుడు లేడా?" శారద అడిగింది.

అప్పుడు అక్కడే వున్న పున్నమ్మ "ఆ మాటకొస్తే సోమవారం శివుడున్నాడు. మంగళవారం ఆంజనేయుడున్నాడు. అన్నట్టు అమ్మోరు తల్లులు అరువై నాలుగుమంది అప్పచెల్లెల్లున్నారు. బుధవారం అయ్యప్పున్నాడు. లక్ష్మీవారం పేరులోనే వుంది లక్ష్మీతల్లి, అష్టలక్ష్మీ ఆవిడే. ఆవిడ్నటుంచితే అన్నింటిని సృష్టించే ఆదర్శ మూర్తి సాయిబాబా వున్నాడు. ఇప్పుడ్లేకపోయినా షిర్డీసాయి వున్నాడు. శుక్రవారం సంతోషిమాత, వినాయకుడని చెప్పనే చెప్పావే. శనివారం ఆ ఏడుకొండలవాడు వెంకటారమణమూర్తి ఈ యింటి ఇలవేల్పున్నాడు. ఆదివారం అన్నిటికీ వెలుగునిచ్చే సూర్యభగవానుడున్నాడు......ఇంతమందున్నారు. ఏ రోజు ఆడినా బాధలేదు..." గుక్క తిప్పకుండా చెప్పింది.

"మనకి ముక్కోటి దేవతలున్నారు కదత్తమ్మా?....." శారద శేఖరంవైపు చూస్తూ పున్నమ్మ నడిగింది. పున్నమ్మ ఏదో చెప్పబోయింది.

ఇంతలో వీధిలో సందడయి అందరూ అరుగెక్కారు.

వీధి నిండా జనం. మధ్యలో మూర్తి. మామూలుగా లేదు కాళ్ళూ చేతులు విరిచి ఎలక్ట్రిక్ స్థంభానికి కట్టేసి వున్నారు. శేఖరం జనార్దన గవాస్కరు పరుగున వెళ్ళి 'ఏమైంది..... ఏమైంద'ని ఆరా తీశారు.

"బావా......నేను క్రికెట్ చూడను బావా, నా మాట నమ్మండి.....ఇండియా ఓడిపోవడం నాకు మాత్రం ఇష్టమా. ఏదో క్రికెట్ వస్తే చూడకుండా వుండలేక...." ఏడుస్తూ ఉన్నాడు మూర్తి.

"మాష్టారూ!..... ఈ మూర్తిగారు ఏ మేచ్ చూస్తే అది పోవడమే. ఓడి పోవడమే...ఎప్పుడూ అంతే. మొన్న వరల్డ్ కప్ మూర్తిగారు చూడ్డంవల్లే పోయింది. ఆయనే ఈ విషయం స్వయంగా చెప్పారు. ఈయన గనక ఇప్పుడు చూస్తే సింగర్‌కప్పూ దక్కదు. ఐరన్ ఐస్....." వివరణ ఇచ్చారు కుర్రకారు.

కొద్దిసేపు నిశ్శబ్దం.

మూర్తిగారు బావలు విడిపిస్తారనే ఆశగా చూస్తున్నాడు.

"వీల్లేదు. మూర్తిగార్ని మేచయేంతవరకూ వదలొద్దు. మంచిపని చేశారు. ఇండియా గెలిచాకే కట్లు విప్పండి...." ముక్తకంఠంతో అన్నారు శేఖరం అండ్ జనార్దన్ గవాస్కర్ అండ్ సన్స్ బ్రదర్స్.

'మేచ్ స్టార్టయిపోయింది!' ఎవరో అరిచారు.

క్షణకాలంలో అందరూ అదృశ్యమైపోయారు. వీధి వీధంతా ఊరు ఖాళీచేసి నట్టు నిసంకుడపోయింది.

దిష్టిబొమ్మలా మూర్తి ఒక్కడూ ఎలక్ట్రిక్ స్తంభంలా! అతని అరుపులూ పెడబొబ్బలూ టీవీలోంచి వస్తున్న క్రికెట్ క్రీడాభిమానుల అరుపులూ పెడబొబ్బల్తో కలిసి కోరస్ ఇస్తున్నట్టుగా వుంది.

ఆట రమ్యంగా సాగుతోంది.

మీనాక్షత్త మొగుడు మళ్ళీ టెన్షన్ పడి ఆసుపత్రిలో చేరాడు. డాక్టర్లకేర్‌లో టీవీ చూస్తున్నాడు.

......ఇదంతా చూస్తూవుంటే శారదకు ఏమిటేమిటోగా వుంది. మరో పక్క మరిదికి ఆ రాత్రికే శోభన కార్యం. ముహూర్తం అలా పడింది. పున్నమ్మ పనుల్లో సాయపడుతోంది. ఒకరిగురించొకరుకాక క్రికెట్ గురించే పట్టించుకొని అందులోనే మునుగుతున్న కొత్త దంపతుల్ని చూస్తే మతిపోతోంది ఆ అత్తాకోడళ్ళకి.

శేఖరం వెళ్ళనంటే కామయ్యే వెళ్ళి స్వీట్సు తెచ్చాడు. అలాగే రెండు పాల పేకట్లూ తీసుకువచ్చాడు.

మల్లెపూలు శారద ఎవరిచేతో తెప్పించి దండ కట్టింది. 'వెంకటపతి'ని రమ్మంటే 'వుండక్కా ఆట మాంచీ దీంట్లో వుంది' అందేకాని రాలేదు.

చీకటి పడుతోంది.

"పాపం, మూర్తికి పొద్దున్న నుంచి తిండీ తిప్పలూ లేవు - వదిలేయండిరా!" కామయ్య కొడుకులతో అన్నాడు.

"నో.....నో.... అసలే టౌటుగా వుంది. చూస్తే ఇంకేమన్నా వుందా? ఇండియా ఏమైపోతుంది?...." ఖరాఖండీగా చెప్పారు కొడుకులు.

వీధిలోకెళ్ళి చూస్తే మేచ్ టౌటుగా వుందని ఇద్దరు కుర్రాళ్లు మూర్తి దగ్గర కాపలా వున్నారు.

కామయ్య కాలుకాలిన పిల్లిలా ఇంట్లో తిరుగుతున్నాడు. పున్నమ్మ పరిస్థితీ అలాగే వుంది.

పిల్లలు బుల్లితెరకు కళ్ళలికించేశారు.

అజారవుట్!

అజారుద్దీన్ అవుట్!

బండబూతులు తిట్టాడు శేఖరం. అమ్మా ఆలీ చేసి మరీ తిట్టాడు. పిల్లలిద్దరూ ఆ అసహ్యామైన తిట్టుల్ని ఆనందంగా వింటున్నారు. అందువల్ల వారికేదో తృప్తి కలుగుతున్నది.

'ఇండియా వేస్టు' అన్నాడు జనార్దన గవాస్కర్. అడ్వర్టైజ్‌మెంట్లకు తప్ప ఆడడానికి పనికిరారనీ తేల్చేశాడు. పాకిస్తాన్నుంచి ఎంతో కొట్టేసుంటాడనీ అన్నాడు.

ఇంట్లో అందరి ముఖాలు కందగడ్డలైపోయాయి.

కొద్దిసేపు నిశ్శబ్దం తరువాత కామెంటరీ మధ్యలో "నాన్నా....! మరేమొచ్చి అజారుద్దీన్ అంటే మహమ్మదెన్నే కదా......మరి ఆయన శుక్రవారంపూట డెక్ అవుట్ కావడమేమిటి?" పెద్దాడు బుర్రలో తట్టింది బయటకు అనేశాడు.

'అఁ....అ....' సమాధానం దొరక్క శేఖరం, జనార్దన గవాస్కర్ నీళ్ళు నములుతుంటే శారద టీ తెచ్చిపెట్టింది. టీ నీళ్ళు నమిలారు.

వెంకటపతి మనసు మనసులో లేదు. టీ కూడా ముట్టుకోలేదు.

సచిన్ చేయి తగిలి ఆ 'టీ' కప్పు ఒలికి నేలపాలయింది.

అంతే.....

వాడి వీపు వాయగొట్టి, చెవులు ముయ్యకుండా వదిలాడు శేఖరం. పున్నమ్మ కామయ్యలు అడ్డుకున్నా ప్రయోజనం లేకపోయింది. పున్నమ్మ కొడుకుని తిడుతోంది.

శారద కొయ్యబారి నిలుచుండిపోయింది. ఆమెకు ఆ కిందటి వారం ఇండియా గెలిచిన రోజు గుర్తుకొచ్చింది ఆవాళ ఇంట్లోనే క్రికెట్ ఆడి అద్దం పగులగొట్టాడు సచిన్. ఆ రోజు వీపు పగిలిపోతుందని తనయితే అనుకుంది. కాని అలా జరుగలేదు,..... "సచిన్..... పద..... పెప్సీ ఇప్పిస్తాను" ఆనందంగా ఇదే తండ్రి కొడుకుని బజారుకు తీసుకుపోయారు.

శారద గొంతువరకూ వచ్చిన కోపాన్ని దిగమింగుకుంది.

పున్నమ్మ ఒలికిన టీని, కారిన సచిన్ కన్నీళ్ళనీ తుడిచింది.

వాడు అన్నీ తినీ టీవి చూస్తున్నాడు.

క్షణాల్లో.....గాలికి పడిపోయినట్టు ఒక్కో వికెట్ పడిపోయింది.

ఇండియా టీమ్ ఓడిపోయేముందర శేఖరం కాలుకాలిన పిల్లిలా ఇల్లంతా అటూ ఇటూ తిరిగాడు. నాలుగు పెట్టెల సిగరెట్లూ ఊదేసినా ఉపశమనం కలుగలేదు. జనార్దన గవాస్కర్ తొలిసారిగా ఇంట్లో బూతులు ఉచ్చరిస్తున్నాడు. వెంకటపతి కోపంతో విస విసా పెరట్లోకి వెళ్ళిపోయింది.

చీకటిపడేవేళకి ఎప్పటిలాగే ఫలితాలు చెప్పకుండా తెలిసిపోతున్నాయి.

అంతలోనే......

క్షణాల్లోనే.....

వీధి రోడ్ల మీది అలజడి.....అందోళన..... అందరూ కుర్రాళ్ళే! ఏదో యుద్ధానికి సిద్ధపడుతున్నట్టు.... మండిపడుతూ మంట పెట్టారు. ఆ మంటల్లో అజారుద్దీన్ దిష్టిబొమ్మను తగులబెట్టారు 'సిటీ అజారుద్దీన్ క్రికెట్ అసోసియేషన్' వాళ్లు.

పున్నమ్మ, కామయ్యలకు కాళ్ళు చేతులాడ్డం లేదు.

'ఎందుకురా ఇదంతా....?' అంతకు మించి మాట రాలేదు కామయ్యకి.

"ఎందుకేమిటి?, ప్రెస్టేజి యిష్యూ..... పరువు సమస్య...." శేఖరం మాటకు అడ్డుతగులుతూ 'ఒకసారి గెలుస్తాం, ఒకసారి వోడుతాం, దీనికి పరువేమిటి?' కామయ్య ఇంకా అడగబోయేవాడే జనార్దన గవాస్కర్ అందుకున్నాడు.

"నీకు తెలీదు నాన్నా!.....కొలంబియా దేశస్థుడైన ఎస్కబర్ సెల్ఫ్‌గోల్ చేసినందుకు హోటల్ రూమ్‌కు వెళుతుండగానే చంపేశారు. ఎందుకు? అలాచేస్తేగాని ఒళ్లు దగ్గరపెట్టుకొని ఆడరు....."

కామయ్యకే కాదు – పున్నమ్మకూ మాట రాలేదు. వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. ఇల్లంతా నిశ్శబ్దం.

"పాకిస్తాన్ ఓడిపోయినప్పుడేమొచ్చి టీవీని చూస్తున్న కుర్రాడు టీవీని షూట్ చేసి.... అదే రివాల్వర్‌తో తనని తాను షూట్ చేసుకున్నాడు తాతయ్యా?....." పెద్ద మనవడు కపిల్ దేశభక్తి బాంబుని తన్మయత్వంతో పేల్చాడు.

"మనదేశంలో అంత సీరియస్‌నెస్ లేదు ఆటలంటేం, అందుకే ఇలా వున్నాం...." జనార్దన గవాస్కర్ కోపంతో టవల్ భుజం మీద వేసుకొని పెరట్లోకి వెళ్ళాడు.

ఇంతలో శారద వచ్చి భోజనాలకు పిలిచింది.

భోజనాల దగ్గర "ఎప్పుడూ ఇవే కూరలా? వంకాయి.....బంగాలాదుంప......దొండ బెండ బీర.... లేకపోతే చిక్కుడు – హాఁ!" విసుక్కున్నాడు శేఖరం. జనార్దన గవాస్కరూ అలానే వున్నాడు.

పిల్లలు తిని పడుకున్నారు.

వెంకటపతి ముస్తాబుని ఇరుగుపొరుగు అప్పటికే కానిచ్చేసారు. "ఈ రాత్రి మా మరిదికి పాపం, నిద్దరే వుండదు...." అందరూ నవ్వారు వెంకటపతి తప్ప. అమెలో సిగ్గు తొణికిసలాడలేదు. ఏదో బాధ ననుభవిస్తున్నట్టుంది. అది భయమేమో ననుకొని అమ్మలక్కలంతా 'తలుపులేసినదాకే' అని కొట్టిపారేసేరు.

జనార్దన గవాస్కర్‌ని పెద్దలంతా అప్పటికే గదిలో కొలువుదీర్చి వుంచారు.

అమ్మలక్కల బలవంతంతో వెంకటపతి పాలగ్లాసుతో నడిచింది.

చెవిలో రహస్యాలు....చెక్కిళ్ళపై ముద్దులు – వెరసి చెరిగిపోని మొదటిరాత్రి.... గుసగుసలు వరుసైన ఆడవాళ్ళ సరసాల నడుమ ద్వారం దాటింది. తలుపులు మూసుకున్నాయి.

శృతిమించాకే ముహూర్తం. మించిపోతున్నదని అమ్మలక్కలు కదిలేరు. వీధివైపు గుమ్మం మీదికి పున్నమ్మ, కామయ్యలు చేరారు. శారద, శేఖరం వేరేగదిలోకి చేరారు.

గడియారపు ముళ్ళు ముళ్లమీద నడుస్తున్నాయి.

"వాళ్ళిద్దరికీ ఇష్టమేనంటావా? నాకదేమీ కనిపించలేదు" అంది పున్నమ్మ.

"నాకూ అదే అర్థం కావడంలేదు...." అన్నాడు కామయ్య.

"ఇష్టపడి.....ఇంటర్వ్యూ చేసే చేసుకున్నాడు...." పున్నమ్మ అనుమానం నివృత్తికాలేదు.

"....ష్.... మాటలు వినిపిస్తాయి..... ఊరుకో....." అన్నాడు కామయ్య.

నిశ్శబ్దం!

'శేరూ' మధ్యలో 'ఖ' తీసి ముద్దుగా పిలిచింది శారద.

"పావు శేరూ.... అర్ధ శేరూ....ఏమిటీ పిలుపు?" కస్సుమన్నాడు శేఖరు. "మన మొదటి రాత్రి....." సిగ్గుపడుతూ గుర్తు చేసింది శారద.

"ఎప్పుడూ అదేనా? వేళాపాళా లేదా? సమయమూ సందర్భమూ వద్దా? మనం మనుషులం....." అంటూ ఆప్యాయంగా నిమురుతున్న వేళ్ళని అధికారికంగా విదిల్చి కసిరేడు.

సిగ్గు చివికి – తెగిన నరాల చప్పుడు రాకుండా ఊపిర్ని బిగబట్టింది శారద. ఇంతలో కొత్త దంపతుల గదిలోపల్నుంచి తలుపు తరుతున్న చప్పుడు. ఉలిక్కిపడి అంతా పరుగున వెళ్ళారు.

"గాళ్ళం తియ్యండి!" కొత్త దంపతులది ఒకటే రాగం.

తలుపుతీసి "ఏమైంది? ఏమైందర్రా?" మిగతా అందరికీ ఏకరాగం.

జవాబులేదు. మధనపడ్డ మౌనం. గదిలోకి చూస్తే పాలగ్లాసు అలాగే వుంది. పట్టెమంచం అలాగే వుంది. పరుపు నలక్కుండా అలిగి వుంది.

"శోభనం గదిలోకి వెళ్ళి మూర్డోజుల్దాక తలుపు తియ్యకపోయేవాళ్ళం. మీరేంటర్రా.... మూడు నిముషాలకే....." కామయ్య మాటలు నములుతున్నాడు.

"ఇష్టం లేదు!" కూడబలుక్కున్నట్టు అనేసి కొత్త దంపతులిద్దరూ హాల్లోకి వచ్చి వేరు వేరుగా పడుకున్నారు.

"శోభనం రాత్రి ఇదేమిటి? ఎవరైనా వింటే నవ్వుతారు?" పున్నమ్మ గొణుక్కుంటూ వుంది. ఇరుగూ పొరుగూ ఇంకా ఆట పట్టించొచ్చని చూరు కింద చేరారు. అందరూ విషయం తెలిసి ముక్కున వేలేసుకున్నారు. ఆ అర్ధరాత్రి అందరికీ నిద్రలు వదిలిపోయి వీధంతా తెల్లవారిపోయింది.

ఆ తర్వాత అందరి అనుమానాలకి ప్రశ్నలకీ జవాబు దొరికింది. అది.....

"ఇండియా క్రికెట్ జట్టు ఓడిపోవడం...."

ఎంత బతిమాలాడినా బలవంతపెట్టినా ఇద్దరూ మళ్ళీ గదిలోకి పోలేదు.

"చేసుకోకండి నాయినా చేసుకోకండి.....ఆలెవరో ఆటలాడించి రెచ్చగొడితే రెచ్చిపోతున్నారుగాని ఆటివెనుక ఎన్ని యాపారాలు ఎవ్వారాలున్నాయో తెలుసుకోకండి....." అని ఆగి, "ఇంగ్లండు టూర్‌లో ఇండియా గెలిచినపుడే చేసుకోండి శోభనం.... గెలిచినపుడే పిల్లల్ని కనండి" అనేసి తన గదిలోకి వెళ్ళిపోయింది శారద.

● *'అరుణతార' – ఫిబ్రవరి 1997* ●

★ ★ ★

90

బి.ఎస్. రాములు

# దక్షయజ్ఞం

"నేను సార్ పెంటయ్యను. అవును. అలియాస్ ప్రవీణ్. నిజమే సార్!

నా బతుకంతా పొగ చూరింది. ఈ బతుకులో యిక నిప్పురాదు. ఈ శరీరం బూడిద కాదు. నా బతుకు గుడిసె మొత్తం పొగ చూరిపోయింది. ఇంతంత వంటకు పిడుకల పొగతో యిల్లంతా పొగచూరిపోయింది. ఈ రెక్కలు చూడండి సార్! ఈ బరిబద్ద బొక్కలు చూడండి సార్! ముత్తెమంత వెలుగు కోసం నా యిల్లంతా పొగ చూరిపోయింది. నా బతుకు కాటికి కాకుండా పోయింది. ఇంటికి కాకుండా పోయింది. నాకు ఈ బతుకుమీదే రోసిపోయింది సార్! ఈ శరీరంలో జీవితంలో ఏం మిగిల్చారు సార్?

ఇయ్యాల్ల మీకు దయ గలిగింది. మీకు దయగలిగేసరికి నా గుండె ఎండిపోయింది. నా పొలం ఎండిపోయింది. నా బతుకు ఎండిపోయింది. నా బాధ ఎండిపోయి వరుగులైపోయింది. ఏడ్వడానికి కన్నీళ్ళు లేవు. మాట్లాడ్డానికి భాష లేదు. ఇప్పుడు మీకు నా మీద దయగలిగింది సార్!

ఏం జరిగిందో ఇప్పుడు చెప్పమని అడుగుతున్నారు సార్! మీదేం తప్పులేదు. నాదే తప్పు. నేను మీ చేతికి చిక్కడే తప్పు. మీరు అడిగే స్థితిలో నేను చెప్పే స్థితిలో ఉండడమే తప్పు. నా మనస్సు న్యాయం కోసం అని చిక్కుల్లో పడడమే తప్పు. నా ఆలోచనల్లో పడి బతుకు రోసి చచ్చిపోవాలనుకొని చావురాక మీకు చిక్కడమే తప్పు. ఉన్న నిజం చెప్పలేక చిక్కుల్లో పడడమే తప్పు. మీదేం తప్పుకాదు సార్!

మీదేం తప్పుకాదు. తెల్లారి లేస్తే మీకెన్నో పనులు. మీకు ఎన్నో కేసులు. మీకు ఎన్నో సెలవులు. నా ఏడ్పు వినే తీరిక మీకు యిప్పుడు దొరికింది. మీరు ఏడువు మన్నప్పుడు ఏడ్సుటానికి నేను వేషాలు వేసే నటున్ని కాదు సార్! మీరు వినాలని దయ చూపేలోపే నా ఏడుపు ఎండిపోయింది సార్!

సరిగ్గా రెండు సంవత్సరాల మూడు నెలలకు నా కేసు వినడానికి మీకు తీరింది. ఈలోపు యిదేం బతుకురా అని ఏడ్సి ఏడ్సి నా నాయిన్న చచ్చిపోయాడు. మీరు నాకు బేల్ యిచ్చే లోపలే చచ్చిపోయాడు. తలకొరివి పెట్టటానికని శవం రెండు రోజులు యింట్లోనే మురిగిపోయినాక మీరు బేల్ యిచ్చారు సార్!

నన్ను మీరు ఆ రోజు నా మొకమైనా చూడకుండానే జైలుకు పంపారు. యాదికి ఉందా సార్ మీకు? ఏమైనా చెప్పుకునేదున్నదా అని ఆ రోజు అడగలేదు మీరు. ఆ రోజు యిట్లా అడిగి ఉంటే బురదలో దుంకిన రాయిలా అయ్యేవి మీ కాగితాలు. అప్పుడు నా హృదయం బురద బురదగా ఎవరు పెల్లగించినా మీద చిల్లేదిగా ఉండేది. మీకు బాధ తెల్సు. బతుకు తెల్సు. మీకు మీ బతుకు బాధ తెల్వకపోతే అప్పుడడగడం మానేసి యిప్పుడెందుకు అడుగుతారు సార్?

మీకు అన్నీ తెల్సు సార్? తెల్సీ మల్లా నా నోటినుంచి చెప్పించాలనుకుంటున్నారు. నా బతుకును మల్లా నా నోటినుండి రప్పించాలనుకుంటున్నారు. నా కథ మల్లా చెప్పించాలనుకుంటున్నారు. నాకు కథలు చెప్పడం రాదు సార్! నేను చచ్చిపోవాలనుకున్నది నిజమే. దానిగ్గల కారణాలను యిపుడు చెప్పమంటే మనిషి గుండె ఎండిపోయినాక వేదాంతంతో తప్ప వేదనతో ఎట్లా చెప్పగలను సార్?

ఎందుకంటే, కాలం గడిచిన కొద్దీ అవసరాలు గతించి అనుభూతులు మిగిలిపోతాయి సార్! అనుభవాల వివరాలు అదృశ్యమై దృక్పథాలుగా కొనసాగుతాయి. ఆ ముద్రలు జీవిత దర్శనాలు సరైనవో కావో యిపుడు తెలియవు సార్! తెల్సుకోవాలంటే ఆ వివరాల్లోకి వెళ్ళాలి. అనుభూతులను, దృక్పథాలను అవి రూపొందిన అనుభవాల్లోకి తిరిగి అనువదించుకోవాలి సార్! అది చారిత్రక సినిమా కోసం అనాటి జీవితాల్ని సంస్కృతిని తిరిగి సృష్టించుకోవడం వంటిది సార్! అది కష్టం సార్!

మీరేమీ అనుకోకపోతే ఒకమాట అడుగుతాను సార్! ఆ రోజు రాత్రి ఎనిమిదిన్నరకు నన్ను మీ యింటికి తెచ్చారు. మీరు భోం చేస్తున్నారంటే మమ్మలను బయటనే నిలబెట్టారు. మీరు తువ్వాలుతో మూతి తుడుచుకొని సోఫాలాంటి కుర్చీలో కూర్చున్నారు. మా వెంట వచ్చిన పోలీసు మీకు ఏవో కాగితాలు యిచ్చాడు. మీరు వాటిని చదివినారో లేదో, సంతకాలు పెట్టినారు. నన్ను మీరు దూరం నుంచే చూశారు. మీరు లోపలికి వెళ్ళిపోయారు. ఆ రాత్రి నన్ను తీసుకపోయి మల్లా అదే లాకప్పులో వేశారు.

ఆరోజు నేను మీ ఎదుట హాజరుపరుచబడ్డ రోజు – సెప్టెంబరు యిరవై మూడో తేది రాత్రి ఎనిమిది గంటలు. ఈదురు గాలి. కరెంటు పోయింది. వర్షం పడుతున్నది. ఆ రోజు రాత్రి మీరు ఏ కూరతో అన్నం తిన్నారు సార్? ఎన్ని ముద్దలు తిన్నారు సార్? ఆ రోజు భోజనం టేబుల్ కాన్నుంచి నన్ను చూసుటానికి మీరు వేసిన అడుగులెన్ని సార్? ఏ కాలు ముందు వేసారు సార్? ఆ రోజు మీ యింట్లో పనిమనిషి ఎన్ని గంటలకు యింటికి పోయింది? మీ తెల్ల బొచ్చుకుక్క ఎన్నింటికి నిద్రబోయింది? ఆ రాత్రి గాలి ఈదురుతో వర్షం పడింది. కరెంటు పోయింది. అప్పుడు ఫ్యాన్ ఆగిపోయి మీకు ఎన్ని దోమలు కుట్టినై సార్?

ఇవన్నీ మీరు లెక్కకట్టి చెప్పగలరేమోగానీ నా కష్టాల్ని వివరంగా లెక్కలు తీసి చెప్పలేను సార్! లాకప్పులో మూత్రం వాసన ఎన్ని రోజులు పీల్చానో చెప్పమంటే చెప్పగలను. ఏ పూట ఎలాంటి తిండి పెట్టారో చెప్పగలను. ఎవరి మీద ఎందుకు ఎన్ని కేసులు బనాయించారో చెప్పమంటే చెప్పగలను. కాని నేనెందుకు చచ్చిపోవాలనుకున్నానో చెప్పమంటే చెప్పలేను సార్! రోజూ చచ్చిపోవటానికి

చచ్చిపోయేన్ని కారణాలు ఉన్నాంక ఏ రోజు కారణాలని గుర్తుంచుకోవాలె సార్? ఏ ఏ కారణాలని గుర్తుంచుకోవాలె సార్?

ఒక్క మాటలో చెప్పమంటే చెప్తాను సార్! నా పేదరికమే నా చావుకు కారణం సార్! నా అజ్ఞానమే నా చావుకు కారణం. నా పేద కులపు జన్మే నా చావుకు కారణం. మేకను చూస్తే బ్రహ్మకు కూడా కోసుక తినబుద్ధి అయిందట సార్! అందరూ నన్ను కోసుక తినాలనుకుంటున్నారు. నా బతుక్కు ఏదైనా మార్గం చూడండి అని బ్రహ్మదేవునికి మేక మొరపెట్టుకున్నదట. నిన్ను చూస్తుంటే.....నీ మెత్తదనం చూస్తుంటే నాక్కూడా నిన్ను కోసుక తినబుద్ధి అవుతున్నది అని బ్రహ్మదేవుడు నవ్వినాడట సార్! మా బతుకులు మేక బతుకులు సార్! పులికేకాదు తోటిమనిషికి కూడా మమ్ముల చూడగానే కోసుక తినాలనిపిస్తుంది సార్!

మమ్ములను మొత్తం కోసుక తిన్నా మంచిగానే ఉండు. అలాల్ చేసేటప్పుడు నరం తెంపి వదిలేసినట్టు... ..మా రక్తమంతా కారిపోయి...మా కోరికలన్నీ ఉడిగి రాలిపోయేట్టు మా జీవితాల్ని కొంచెం కోసి వదిలేస్తారు సార్! నాకు మల్లా బతుకునివ్వడం కోసం జైల్లో పెట్టాననుకున్నారు మీరు. మాకు బతుకునీయడం కోసమే చచ్చిపోకూడదనే చట్టం చేసినట్టున్నారు. కాని మీకు తెల్సా సార్? మీ ఉదాత్త హృదయం మమ్మల్ని బతికిస్తూ చంపుక తింటున్నది.

ఆ రోజు లాకప్‌లో వారం ఉంచుకున్నాక రాత్రి ఎనిమిది తర్వాతే నన్ను మీ దగ్గరకు ఎందుకు తెచ్చారనుకుంటున్నారు? మరుసటి రోజు ఉదయం ఎందుకు తేవాలనుకోలేదు వాళ్ళు? కోర్టులో అందరి ముందు హాజరుపరిస్తే ఆవేదనతో అన్నీ చెప్పేస్తానని వాళ్ళ భయం సార్! వారం రోజులు లాకప్పులో ఉంచి చిత్రహింసలు పెట్టారు. పోలీసోల్ల చిత్రహింసలు భరించలేక చచ్చిపోదామనుకున్న మాట చెప్పవద్దని మల్లా కొట్టారు. ఆ హింసలు చూడలేక మూడు వేలు అప్పు తెచ్చి వాళ్ళ చేతుల్లో పోశారు మావాళ్ళు. అదంతా పోనీయండి సార్! అసలు కథ టూకీగా చెప్తాను సార్!...

☆ ☆ ☆

"మా తండ్రికి మేం నలుగురం సంతానం సార్! మా అక్కకు చిన్నపుడే పెళ్ళయి పోయింది. చెల్లెలు మాలచ్మికి మూడేళ్ళ వయస్సులో అమ్మ పోయింది. కొంతకాలానికి నాన్న మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. ఆమె తనకన్నా చిన్నవాడైన ఆనందరావుకు అలవాటైంది. ఇంత మందిని సాదలేనని ఆమె రెండేళ్ళకే వెళ్ళిపోయింది. ఆనందరావు తన పెళ్ళయ్యేదాకా ఆమెను ఉంచుకున్నాడు. ఆ తర్వాత ఆమె బతుకు ఆమెదైపోయింది సార్!

"....ఈ కారణంగా మా అక్కను బావను కొంతకాలం యిల్లరికంలా తీసుకొచ్చాడు నాన్న.... సరిపడక కొన్నేళ్ళకే వాళ్ళు వెళ్ళిపోయారు...ఆనందరావు అక్కమీద కన్నేశాడని ఆ తర్వాత తెల్సింది....ఇంట్లో ఆడతోడు అవసరం అని భావించాడు నాన్న. నాకలా చిన్న వయస్సులో పెళ్ళయింది సార్!

"...నాకు యిరవై అయిదేళ్ళు వచ్చేటప్పటికే ముగ్గురు పిల్లల తండ్రినయ్యాను. అప్పటి నా భార్య నర్సవ్వకు యిరవై ఏళ్ళే... పన్నెండో ఏట నుండే ఆ యింటి భారమంతా నర్సవ్వ మీదే పడింది. ఇరవై ఏళ్ళకే నలభయి ఏళ్ళ వయస్సు వచ్చేసింది... మా తమ్ముడు అయిదో తరగతితో చదువు ఆపేశాడు. చెల్లెలు మాలచ్మి తరం నుండి మా పల్లెల్లో పెళ్ళి చేసే వయస్సు పెరుగుతూ వచ్చింది సార్!

"....ఆనందరావు నర్సవ్వను కూడా వదిలిపెట్టలేదు సార్! అప్పటికే అతనికి పెళ్ళయింది. అప్సరస అంత అందమైన దొర్సాని అతని కుండగా ఎండిపోయిన చేపలా ఎముకలు తేలి చెమటకంపు కొట్టే నర్సవ్వ మీద కన్నెందుకు పడిందో...తెలియదు. అంతకన్నా విచిత్రం, ఆరడుగుల అందగాడు ఆనందరావుండగా దొర్సాని నాపై కన్నేయడం...పైస్థాయివారితో అక్రమ సంబంధం స్త్రీకైనా, పురుషుడికైనా ఎంత ఆత్మవిశ్వాసాన్నిస్తుందో...సార్!

".....మంచివాళ్ళు తొందరగా పోతారంటారు. ప్రభాకర్ మంచివాడు సార్! తొందరగా పోయాడు. మాకు ప్రపంచాన్ని పరిచయం చేసిపోయాడు. పోయేనాటికి ముప్పయి ఏళ్ళయినా ఉండవు. అతను యింటి కొచ్చినప్పుడల్లా అందర్నీ పేరుపేరునా పలకరిస్తాడు. చదివింది అయి.టి.అయి. అయినా లోకాన్ని చదివేసిన విశ్వాసం అతని నవ్వులో....

"...అతడిని చూస్తే చాలు - అన్ని కష్టాలు తీరినట్లుగా ఉండేది. మంచి బతుకు పోరాడైనా గెల్చుకోవాలనే ఆశ, ఆర్తి కలిగేవి. అతని నవ్వులో...అతని మాటల్లో ఏదో శక్తి ఉంది...అలా పరిచయమయ్యాయి రాజకీయాలు...వివరాలు గుర్తులేవు...సభలు...ఊరేగింపులు...పాటలు... .జండాలు పాతడం...

"....ఆ తర్వాత కొద్దికాలానికే పరిస్థితి మారిపోయింది. ప్రభాకర్ కనుమరుగ య్యాడు. అతని దర్శనమే మహాభాగ్యం అయిపోయింది. అతని జాడ కోసం నీళ్ళను వడపోశారు...చెరువును వడపోయడం ఎవరితరం?.....

"...సార్! వాళ్ళు దొరక్కపోతే వీళ్ళకు జరిగే నష్టం ఏమీ లేదు. కాని చట్టానికి తన పెద్దరికం పోతున్నదని అసహనం పెరిగింది...అసహనం శాడిజంగా మారింది. క్రూరత్వం పడగ విప్పింది. పశుత్వం రాజ్యమేలింది...అతడు దొరకలేదు. అతన్ని దొరక్కుండా కాపాడుతున్నారని కసి...అత్తమీది కోపం దుత్తమీద....

"...అలా ఎందరో ఇంటి నుండి లాకప్పుకు...లాకప్పునుండి కోర్టుకు...కోర్టు నుండి జైలుకు...జైలులో పాతాలు...జైలు నుండి బేల్‌పై యింటికి...ఇంటినుండి కేసుకోసం కోర్టుకు హాజరు...కేసు కేసుకూ...వాయిదా నుండి మరో వాయిదాకు నడుమ మారే మా బతుకుల తీరు గురించి ఏ రికార్డుల్లో ఉండదు. ప్రతికేసులో గలవారి గురించిన ఈ వివరాలు రాసుకుని ఎంక్వయిరీ కమిషన్లేసి చట్టం అమలయ్యే తీరును లోలోతుల్లోకి వెళ్ళి పరిశీలించి ఎప్పటికప్పుడు సరిచేసుకొనే విధానం ఉంటే యిన్ని సమస్యలు ఉండకపోను సార్! ఒక్కమాట అడుగుతాను సార్! ఏమనుకోవద్దు. మేం ఎన్నిసార్లు కేసులకొచ్చినా కేసులు వాయిదా పడుడేగద? నాలుగుసార్ల రాకపోతే మీకు జరిగిన నష్టమేంది? మీదెంత దయగల హృదయం సార్! ఎన్నిసార్లు వచ్చినా కేసు వాయిదా వేసుడే అని తెల్సీ నేను రాలేకపోయినందుకు బేల్ క్యాన్సిల్

చేసి జైల్లో వేస్తిరి. దొరా! మీరు మా పెద్దొరకన్న పెద్దదొరలు. మీ గీతకు తిరుగుండదు. ఆ పెద్దొర ఆలస్యమైతే అవ్వనక్కను తిట్టి మర్సిపోవు. కాని మీరు చల్లగా మాట్లాడుతూనే జేల్లోకి పంపుతారు. చట్టాలు మీ చేతిలోని బంగారం. మీరెట్లా చేస్తే అట్లా వింటాయి సార్!

"....ఈ బాధలు పడలేక యిల్లు వదిలాను...నేను అడవులు పట్టేనాటికే నాకు ముగ్గురు పిల్లలు. మాలచ్మి జొన్నకర్రలా పెరుగుతోంది...తమ్ముడు కరెంటు మోటార్ల రిపేరింగ్ నేర్చుకొని కొంత సంపాదించడం మొదలెట్టాడు...నన్ను సర్పంచుగా నిలబడాలన్నారు...నాకూ అదే ఆలోచన ఉండింది...చిన్న కులంలో పుట్టడం ద్వారా కోల్పోయిన గౌరవం తిరిగి పొందడానికి అది కూడా ఒక సాధనం అనే విశ్వసించాను....అయితే మీరు పెట్టే తిప్పలు, చిత్రహింసలు యిల్లుకన్నా అడవులు పట్టడమే సుఖం అనుకునేట్టు చేసాయి. ఇల్లువదిలి ఎన్ని ఊర్లు తిరిగానో...ఎన్ని అనుభవాలో... ఎంత ప్రేమో...ఆ అనుభవాల్తో నిలబడగలిగి ఉంటే సునాయాసంగా ఎమ్మెల్లేగా గెలిచి ఉండేవాడిని... టగ్గాఫర్‌గా నిలబడి ఉంటే ప్రభాకర్ పార్లమెంటు సభ్యుడై ఉండేవాడు సార్!

"....న్యాయమూర్తిగారూ...! అవన్నీ పాలకవర్గ రాజకీయాలనుకున్నాం... పాలకవర్గాల క్కూడా శాసనాధికారం...చట్టబద్ధత ఈ ఎన్నికల ద్వారానే వస్తుందని అపుడు మాకు తెలియదు...కాన్షీరాం వచ్చి చెప్పేదాకా ఈ విషయం అంబేద్కర్ చెప్పాడని కూడా తెలియదు సార్! దాంతో పార్లమెంటునే గడగడలాడించాల్సిన ప్రభాకర్ ఎన్‌కౌంటర్లో పోయాడు...ఏ అధికారాన్ని, ఎన్నికల్ని గుర్తించ నిరాకరించామో వాటి ద్వారానే నిర్బంధాలకు గురయ్యాం...జీవితాల్ని ఓడిపోయే వ్యూహం ఎత్తుగడలకు నాంది అక్కడే పడింది....అది సమర్థుల్ని అసమర్థుల్ని చేసింది. తాను సృష్టించుకున్న నిర్బంధాలకు తానే భయపడేట్టు చేసింది...పోయి...పోయి...ఇపుడు ఆకురాలినా భయమే...స్వేచ్ఛగా మాట్లాడుకోవాలన్నా భయమే... చివరకు ప్రజల్ని... సన్నిహితుల్ని నమ్మాలన్నా భయమే... అన్నిటి మీదా నిఘా... అనుమానం... టెన్షన్స్...అల్సర్స్...కోపం...అసహనం... రహస్యంలో తప్పేడు సమాచారం....అంతా అస్తవ్యస్తం.... ఒక పద్ధతి ప్రకారం జరిగిపోయింది. ..ఆ పద్ధతిని రూపొందించినవాళ్ళు పార్టీలో తమ అధికారం పోనాని పోయిగా ఎంచక్కా భార్యా పిల్లల్తో...మనుమరాళ్ళతో కాలం గుడుపుతున్నారు...వాళ్ళు మళ్ళీ విప్లవం అని ఊసెత్తితే ఒట్టు...అలాంటివాళ్ళను నమ్ముకొని ముందటపడి మూతిపళ్ళు రాలగొట్టుకున్నవాళ్ళల్లో నేనొకడిని సార్!

☆ ☆ ☆

"...మీకా విషయం తెలియదు. అందులో ఉండే ఆనందం, ఉత్తేజం మీకు తెలియదు...అడవుల్లో చెట్ల కింద కూర్చుని ఈ ప్రపంచాన్ని మారుస్తామని చర్చలు చేస్తుంటే కలిగే ఆనందం, ఆత్మవిశ్వాసం మీ ఊహకు అందదు...పల్లెల్లో...గూడెంలలో గుడిసెల్లో దీపం వెలుగులో...మా మాటల్తో వాళ్లకు బతుకుమీద విశ్వాసం కలుగుతుంటే...ఎండిన చాపల్లాంటి ఆ శరీరాల్లో...మాసిపోయిన ముఖాల్లో రాసిపోసినట్టు ఆశలు, చైతన్యం కదలాడుతుంటే...మనిషైన వాడెవడికైనా వారికోసం ప్రాణాలీయాలనే అన్పిస్తుంది...నా భార్య నర్సవ్వ పొద్దుల్తో ఉన్నప్పుడు, ఈ ప్రపంచాన్ని మోస్తున్నది

నా కడుపులోనే కదా అన్నట్టు నిండుగా నవ్వే ఆ నవ్వు చూస్తే నాక్కొంచెం ఈర్ష్య కలిగేది. మేం ఈ ప్రపంచాన్ని మారుస్తున్నాం అనే భావన మాలో, ఈ ప్రపంచాన్ని మోస్తున్నది మేమే అనే ఆత్మవిశ్వాసాన్నిచ్చింది...విప్లవంలో గల ఈ సుఖం...ఆత్మవిశ్వాసం వల్లే ఎన్ని బాధలైనా. పడడం సాధ్యపడింది.

"....నూకపెల్లి సారవ్వది ఎంత చక్కని గొంతు!...ఆమె పార్టీలోకి రావడానికి ఎంత కృషి చేశానో...ఆమె చాలా తటపటాయించింది...కానీ చేరాక చకచకా ఎదిగిపోయింది. ఆమె కారణంగా నాకు మళ్ళీ పెళ్ళి చేసికోవాలనే ధ్యాస కలిగింది. ఆమెను ప్రేమించడం ప్రారంభించాను. ఇంటివద్ద పెళ్ళాం పిల్లలు ఉండగా పార్టీలో మరో పెళ్ళాం కావాలా అని కొందరు ఈసడిస్తారు...పార్టీలో కూడా ఎవరితో చెప్పుకోలేని మానసిక ఏకాకితనం తాలూకు జీవితం కూడా ఉంటుంది...చెప్పుకోవడానికి మనిషంటూ తోడులేని జీవితంకన్నా నరకం ఉండదు... ఆ స్థితిలో మరో తోడు కోసం మనిషి అభిలషిస్తాడు సార్!...

"....కాని సారవ్వ ప్రేమకు నేను ఆనలేదు. ఆమె పార్టీ జిల్లా కార్యదర్శి సుధాకర్‌ను ప్రేమించింది. పెళ్ళి చేసుకొంది. నేను హతాశున్నయ్యాను...కోలుకోలేకపోయాను...ఆమె మనిషిని ప్రేమించలేదు....ఆమె అతని పదవిని, హోదాను ప్రేమించింది...బాధతో ఉండబట్టలేక పెళ్ళయ్యాక ఏడాదికి సారవ్వతో ఈమాటే అన్నాను...ఆమె నవ్వింది...నవ్వుతూనే నన్ను నిలేసింది...అతను నీకన్నా ఎందులో తక్కువ...చదువులోనా...అందంలోనా...కమిట్‌మెంట్‌లోనా...త్యాగంలోనా...అని అంది. నిజమే... అతడు నాకన్నా సంస్కారవంతుడు...బాగా చదువుకున్నాడు... ఆ చదువు అతని ముఖంలో ఒక చెప్పలేని కళాకాంతుల్ని, ఆత్మవిశ్వాసాన్ని నింపుతుంది.... అతనికి భాష వస్తుంది. అనుకున్న భావాన్ని చెప్పడం వస్తుంది....

"...ఒక టీచర్ కొడుకు అతడు...ఒక రైతుకూలీ బిడ్డను నేను...నాకా సౌందర్యం సంస్కృతీ తెలియవు...ఆమెకు కావాల్సినవేవో అడగకముందే సమకూర్చి ఆమె ప్రేమను గెల్చుకోవాలనుకున్నాను...గెల్చుకున్నాను కూడా...అయితే సొంత అన్నయ్యలా చూసుకుంటానంది సారవ్వ...నిజంగా చివరిదాకా సొంత చెల్లెలులాగే నన్ను చూసుకుంది. అడవి దోమల్తో ఎన్నిసార్లు మలేరియాతో తీసుకున్నా... అన్నయ్యా అంటూ అన్నీ సమకూర్చింది సారవ్వ...ఎక్కడెక్కడి నీళ్లో తాగి అడవుల్లో అమీబియాసిస్ కడుపునొప్పితో. బాధపడ్తుంటే సారవ్వ ఎంత విలవిల్లాడేదో... చెట్టుకింద నిద్రపోయిన నన్ను కాపాడ్డం కోసం సెంట్రీ చేస్తున్న వెంకన్న తానే బలి అయ్యాడు... అక్కడ ఎన్నో కష్టాలు...ఆ కష్టాల్లోనూ ఎంతో సుఖం ఉండేది... ఆ సుఖంలో దృక్పథం ఉండేది. మా దృక్పథంలో భాగంగా ఆ సుఖం ఉండేది....

".....నా దృక్పథం మా వాళ్ళ జీవితాలకు సంబంధించింది...పట్నంలో, కోస్తాలో విప్లవం గురించి మాట్లాడే మేధావులు, రచయితలు ఎట్లా స్వేచ్ఛగా బతుకుతూ మంచి జీవితం జీవిస్తున్నారో...పల్లెల్లో మా వాళ్ళూ విప్లవం చేస్తూనే అలా స్వేచ్ఛగా మంచిగ జీవించే విధంగా రాజీ... శాంతికాలంగా...వ్యూహం ఎత్తుగడలు కార్యక్రమాలు మార్చుకోవాలని నా ఆశ, ఆర్తి...నా కులం, నా పుటుక, నేను పుట్టి పెరిగిన

బాల్యం...అనుభవాలు నాకలా అన్పించాయి... నాకెందుకలా అన్పించిందో...కొంచెం చరిత్రలోకి వెళ్తేగానీ అర్థం కాదు న్యాయమూర్తి గారూ!...

"...మీకు తెల్సే ఉంటుంది...చరిత్ర కందని కాలంలో గిరిజన తెగలు ఎక్కడికక్కడ వలసమాని స్థిరనివాసాలు ఏర్పరుచుకున్నాయని... వ్యవసాయం చేయడం నేర్చుకున్నాక స్థిర జీవితం అవసరమైందని. వ్యవసాయం కోసం అడవుల్ని నరికి సాగుచేశారని, వ్యవసాయం ఆధారంగా వృత్తులు ఎదిగాయని...అదంత పాత కథ...

"...పాతపల్లెల్లో వెలివేయబడ్డవాళ్ళు బతుకు కోల్పోయినవాళ్ళు...... అడవులు పట్టి చిన్న గూడెం ఏర్పర్చుకొని మళ్ళీ కొత్త అడవిని నరికి సాగు చేసుకోవడం మొదలెట్టారు. అట్లా వలసలు సాగి గిరిజనులు మాల మాదిగ యానాదులు కొత్త కొత్త ఊళ్ళను రూపొందించుకున్నారు.... చెరువులు, కుంటలు నిర్మించుకున్నారు... పోను పోను పాత ఊళ్ళల్లో బతుకు కోల్పోయిన చేతివృత్తి కులాల యువతారలవాళ్ళు ఆ కొత్త ఊళ్ళను చేరేవాళ్ళు...వ్యాపారం కోసం కోమట్లు... పన్నులకోసం జాగీర్దారు, పట్వారీ, గుమాస్తాలు చేరేవాళ్ళు...వీళ్ళ కోసం బ్రాహ్మణుడు చేరేవాడు...క్రమంగా ఊరేవాళ్ళదై పోయేది. పన్నుల కిందా, వస్తుమారకం, బాకీల కింద పొలాలన్నీ వాళ్ళ చేతిల్లోకే చేరిపోయేవి...మళ్ళీ అక్కన్నించి కొందరు గిరిజనులు...యానాది మాల మాదిగలు కొత్త అడవుల్ని సాగుచేసికోవడానికి వలస వెళ్ళే వాళ్ళు....

"...బహూశా వందయాభయి రెండు వందల ఏళ్ళ క్రితం ఈ కరీంనగర్ జిల్లాకు అటువైపు కరువుల వల్ల కొందరు పొట్ట చేతపట్టుకొని బతకడానికి వచ్చారు. అవి కాటన్ దొర ప్రాజెక్టుల కట్టడానికి ముందే వచ్చిన కరువులై వుంటాయి. మా ముత్తాత చెప్పేవాడు – ఆ వచ్చినవాళ్ళు బుడ్డగోచితో, మూటెడు సామానైనా లేకుండా వచ్చారని. అలా ఒకర్ని చూసి ఒకరు వారి బంధువుల వలస సాగేది...

"...ఆ కాలంలో యాభయి రూపాయలకు ఎకరం మంచి భూమి... మా తాత కాలంలో ఎకరానికి నూటయాభయి నుండి మూడు వందలే ఉండేది... ఇక్కడివాళ్ళ అమాయకత్వాన్ని చూసి వాళ్ళు పెరిగిపోయారు. వాళ్ళలో చాలామంది కాలక్రమంలో దొరలుగా రూపాంతరం చెందారు. నైజాంకు దగ్గరై, పన్నులు వసూలు చేసి జాగిర్దార్‌లు సంపాదించారు... వాళ్ళకు ఆనందరావు దొర ఎనిమిదో తరం వారసుడు... అతని తండ్రి రాంరావుదొర నాటికి మమ్మల్ని దోచుకోవడం పూర్తయి – నాలుగు తరాలు గడిచినట్టున్నాయి.

"...పోంగ...పోంగ...మా వంతు వచ్చేసరికి కొంచెం పెరడు మిగిలింది... ఎనభై ఎకరాల కింద కరువుల్లో తహసీలు కట్టలేక సాగులోకి తెచ్చిన నలభయి ఎకరాల భూమిని వదులుకున్నాడట మా తాత. దొరలు పట్వారీలు కల్సి అలాంటి భూములన్నిట్నీ తమ పేరు మీద రాసుకొని, వందలు వేల ఎకరాలకు ఎదిగారు....

"....ప్రభాకర్ వచ్చి ఊర్లో సంగం పెడ్దామంటే అందరి తీరు నేనూ సంతోషపడ్డాను. ముందు వాళ్ళు ఊళ్ళోకొచ్చి డప్పుకొట్టి కొన్ని పాటలు పాడారు... కొన్ని మాటలు చెప్పారు... కూలీలు పాలేర్ల జీతాలు పెంచడం... వెట్టిరద్దు... దండుగల దడవతుల వాపసు అన్నాము.... అంతదాకా సహాయ నిరాకరణతోపాటు సాంఘిక బహిష్కరణ జరిపాము... మూడు వందల ఊళ్ళు కదిలి జగిత్యాల్లో జైత్రయాత్ర జరిపాము...

దాంతో రాంరావుదొర కుటుంబంతోసహా పట్నం పారిపోయాడు. కాని ఊళ్ళో పోలీసు క్యాంపు పెట్టించాడు....

"కాలు వసూలు కోసం ఊర్లోకి వచ్చిన రాంరావు దొరను దొరికించుకొని చుట్టూ మూగి ప్రజా పంచాయితీ చేస్తే అందరి కాళ్ళు పట్టుకున్నాడు... పోలీసు క్యాంపు తీసేయిస్తా నన్నాడు. కేసులుపెట్టి మమ్మల్ని కోర్టుల చుట్టూ తిప్పిన ఖర్చులు ముప్పయి అయిదు వేలు మూడు నెలల్లో యిస్తానని కాగితం రాసిచ్చాడు...

"....అన్నీ విన్నట్టే విని అయినా యిక ఈ ఊరు రావద్దురో అని అంటే పట్నం పారిపోయాడు. కొడుకుల బిడ్డల చదువులన్నీ అక్కడే...పట్నంలో యిండ్ల ప్లాట్ల వ్యాపారంతో ఎంతో సంపాదించాడు... ఏదో కొరియర్ సర్వీసు కూడా పెట్టాడు... మా అత్తగారి ఊరి దొర తుక్కారావు పట్నంలో ఏవో ఏజెన్సీల్తో... డిస్ట్రిబ్యూటర్లుగా ఎదిగారు....

"...దొరలు దెంక పోంగానే మా కష్టాలన్నీ పోతాయనుకున్నాం... ఇక అంతా మనదే రాజ్యం అనుకున్నాం... దొరలు గుంజుకున్న భూములన్నీ మళ్ళీ ఎవరికి వారు దున్నుకోవచ్చనుకున్నాం. స్వేచ్ఛగా బతకొచ్చు అనుకున్నాం... గ్రాంపంచాయతి... పంచాయతి సమితి... సిసీ బ్యాంకులు... అసెంబ్లీలు అన్నీ మావే... అన్నిటా మేమే ఉంటామని అనుకున్నాం... ఇట్లా జరుగుతుందనుకుంటే అట్లా చేసి ఉండేవాల్లం కాదు... ఏమో... ఎప్పటి ఆపద అప్పుడు గట్టెక్కాలనే ఆలోచన... రాంరావు దొర దెంకపోయినాక దొరభూమిలో ఓనాడు జండాలు పాతుదాం అన్నాడు ప్రభాకర్... ఆ జెండాలు మా భూమిలో దాకా ఎక్కడ పాతుతారో... అని అక్కన్నే ఉండాలని ఉన్నాను....

"....అందర్లో నన్ను తన్నారు... జైల్లో వేశారు... ఏమీ చేయని పాపానికే యిన్ని తన్నులా అని రోషం కలిగింది. అవును... యిక అప్పట్నుంచి బేల్ మీద బయటకు వచ్చాక అన్నల్తో బాగా కల్సి తిరిగిందీ నిజమే... నర్సవ్వ అందరికి రాత్రనక పగలనక అన్నం పెట్టిందీ నిజమే... నేనూ నా చెల్లెలూ, పిల్లలూ సద్దులు... ఉత్తరాలు యిచ్చి వచ్చిందీ నిజమే... నాలుగు ఊర్లల్లో దొరల్ని దొరికిచ్చుకొని కాళ్ళు చేతులు విరగ్గొట్టిందీ నిజమే... ఆ తర్వాత అందులో ఒకరు దవాఖానాలో చచ్చిందీ నిజమే... రెడ్డిని ఎన్‌కౌంటర్ చేసినంక నలుగుర్ని వెంటేసుకుని ఊర్లు తిరిగిందీ నిజమే... సంగాలను మల్లా నిలబెట్టిందీ నిజమే... నలభయి ఊర్లల్లో పంచాయతులు చెప్పిందీ నిజమే... సిద్ధాంత క్లాసులు పెట్టిందీ నిజమే... తుపాకులు పట్టుకొని తిరిగిందీ నిజమే... నక్సలైట్‌గా మారిందీ నిజమే... వీటన్నిటి వెనకా ప్రభాకర్ ఉన్నదీ నిజమే... ప్రభాకర్ పైస్థాయిలోకి వెళ్తే ఆ స్థానాన్ని పూరించిందీ నిజమే....

"...అవును... గుర్రాల పెంటయ్య అలియాస్ ప్రవీణ్ అని నా పేరు వినగానే దొరలకు, పోలీసులకు లాగుల్లో ఉచ్చ రాలిందీ నిజమే... నాలుగు తాలూకాలు కలె తిరిగిందీ నిజమే... సారా బందు చేస్తూనే సారా కాంట్రాక్టర్ల దగ్గర లక్షల రూపాయలు పార్టీ ఫండు వసూలు చేసిందీ నిజమే... వాల్లతో ఎన్నో పనులు వెల్లదీసుకున్నదీ నిజమే... మా ముంగట భయపడ్డట్లు నటించి పోలీసోల్లకు వాల్లు

మా జాడలు చెప్పిందీ నిజమే... మనీ అక్షన్ పేరిట దొరల యిండ్లు దోచిందీ నిజమే... అట్లా నాలుగైదేండ్లు గట్టిగా నిలబడిందీ నిజమే....

"....అయితే పోలీసులు మా పెరట్లో గొడ్డు గోదలను మేపారు. నర్సవ్వను నీ మొగడేడే వచ్చిపోతున్నాడంటూ అంటూ చిత్రహింసలు పెట్టారు. తమ్ముడు లచ్చిరాజం ఆ చిత్రహింసలు, లాకప్ నిర్బంధాలు భరించలేక వీసా తీసుకొని పనిపేరిట అరబ్బు దేశాలకు పారిపోయాడు... నా యిల్లు కూలగొట్టారు... పెళ్ళి కావాల్సిన చెల్లెలు మాలచ్మిని కన్నతండ్రిని... వదినెల్ని గుంజకు కట్టేసి, వాళ్ళ కళ్ళ ముందే ఎస్సయితో అయిదుగురు రేప్ చేశారు... నా తండ్రి మంచం పట్టాడు. రక్తస్రావంతో నా చెల్లెలు చీరెలు విడిచేసేది... నా కుటుంబం... పిల్లల బతుకు పల్లేరు కాయలైంది....

☆ ☆ ☆

అపుడు తెల్వలేదుగానీ నాకిపుడు కడుపులో దేవుతోంది సార్! మాకు యింత అన్నం పెట్టిన కర్మానికి మేంపోయినాక పోలీసులచ్చి యిల్లును ఆడోల్లను ఆగమాగం చేసేవాల్లు. మొగోల్లు చెట్లు గుట్టలు పట్టుకొని ఉరుకుదురు. ఆడోల్లు పసిపిల్లలు ముసలోల్లు గొడ్డుగోద ఎటు ఉరుకాలె సార్? విప్లవం కోసం యివన్నీ భరించాలె అని ఊరడించిన మా ప్రేమలో ఎంత క్రూరత్వం ఉంది సార్? ఏదో మంచి పని చేస్తున్నారని ఆదరించినందుకు సిద్ధాంతం, విప్లవ వ్యూహం తెలియని వాల్లంతా ఇన్ని హింసలకు గురికావాలనుకోవడం... ఎంత క్రూరత్వం సార్? వాల్లను అడిగి విప్లవ వ్యూహం రూపొందించుకున్నామా? ఏదో పెద్ద అన్నలు చెప్తే అదే నిజమని నమ్మితిమి, జనమూ నమ్మిరి. మాకోసమని వాల్ల పిల్లల వీపులు చిట్లిపోయినై. వాల్ల పొలాలు బీడులుగా మార్చారు. మేం దొరల భూములు బీడులు వార్చాం. వేల ఎకరాలు బీడు వారిపోయింది. పనిచేసికొని బతికేవాళ్ళు బతుకును వెతుక్కుంటూ ఊర్లు విడిచి దేశాలు పట్టారు సార్! మేం పాపం చేసుకొని పుట్టినాం గనుకనే యిన్ని కష్టాలని మీకు తెల్సుసార్! మేం లేకి కులంలో పేదరికంలో పుట్టినందుకే మాకు శీలం ఉండదని, ఆశలు ఆరాటాలు ఉండకూడదని మీ విశ్వాసం సార్! మీకు తెలియకపోతే మీరు ప్రమాణం చేయించే భగవద్గీత నడగండి సార్! లేకపోతే రాజ్యాన్ని పోలీసుల్ని అడగండి సార్! వాల్లు చెప్పకపోతే నా భార్యను అడగండి సార్! నా భార్య చెప్పకపోతే నా చెల్లెలు చెప్తది సార్! ఎవరు ఎక్కడ గిచ్చిన్రో, ఏం చేసిన్రో, ఆమె శరీరంలో మిగిలిన జాగలేదు. ఆమె మానంలోంచి కారేది రక్తం కాదు సార్! వాల్ల ఆనందబాష్పాలు. నేను జైల్లో ఉన్నపుడూ వదల్లేదు సార్!

....ఈ బాధలు భరించలేను... ఈ సంసారం వేగించడం నాతోకాదు... రాత్రి పగలూ ప్రాణాలరచేత పట్టుకొని గుబులు గుబులుగా ఎన్నాళ్ళు బతకడం?... యిట్లా ప్రతిరోజూ చచ్చిపోతూ బతకడం ఎంతకని?... నన్ను కూడా పార్టీలోకి తీసుకుపో అని నర్సవ్వ ఎన్నోసార్లు చెప్పింది... ఎలాగో జాడదీసుకుని ప్రభాకర్ ముందుంచింది... ఆడవాళ్ళం పిరికివాళ్ళం కాదు... కానీ యీ కుటుంబ జంజాటాలన్నీ ఏంది... అవి ఎక్కడనన్నా పోనీ... అని అన్నది... ప్రభాకర్ ఈ సమస్య చూసి తన జీవితంలో మొదటిసారిగా గతుక్కుమన్నాడు. నర్సవ్వకు ఏం చెప్పాలో ప్రభాకర్‌కే తోచకపోతే నాకేం తోస్తుంది?.....

పిల్లల్ని ఎక్కడో వేరే జిల్లాలో ఏదైనా ప్రభుత్వ హాస్టల్లో వేయాలనుకున్నాం... ఎవరికైనా దత్తత యిచ్చేద్దాం అనుకున్నాం... చెల్లెలు మాలచ్చిని కూడా పార్టీలోకి రమ్మంటే... అంటూ ఆలోచనలు చేశాం... అయితే మంచానపడ్డ తండ్రి మాటేమిటి?... తండ్రిని అట్లా వదిలేసి చెల్లెలు రానంది... తల్లిని విడిచి ఉండడానికి పిల్లలు ఏడ్చేశారు... అదీగాక మా పిల్లలు నల్లగా ఉంటారు... వీళ్ళందర్ని ఎవరు సాదాలి?... ఉన్న యింట్లో... మంచి రంగులో, మంచి కులంలో పుడ్తే యివన్నీ పరిష్కారం కావడం యింత కష్టం కాదు... అలాంటివాళ్ళమీద నిర్బంధం కూడా యింతగా లేదు... మాదిగోల్ల పిల్లలను ముసలి తల్లితండ్రులను కొడుకులు... ఎంత పార్టీలో ఉన్నా... ఎవరు దగ్గరికి తీస్తారు? దానికితోడు ఆశ్రయం యిచ్చినందుకు గురయ్యే నిర్బంధాల భయం ఉండనే ఉంది... ఇద్దరం ఉన్నప్పుడే చాలని చాత... ఒక్కదాన్తో ఎలా సాధ్యం? మీరే చెప్పండి సార్? మీ భార్య మీ జీతం మీదే ఆధారపడి బతుకుత లేదా సార్?... మమ్ముల లాకప్పులో వేస్తే పోలీసులు కొడ్తరని తెల్వదా సార్? పైసలు గుంజుతారని తెల్వదా సార్? నోరు మూసుకుని పండకపోతే నీ మొగున్ని ఎన్‌కౌంటర్ల చంపుతం అని బెదిరించి అలవాటయ్యేది తెల్వదా సార్? మొగన్ని అరుగుమీద కావలి ఉంచి ఇంట్లో ఆడోల్లతో కల్లు దాక్కుంటూ ఏం చేస్తారో! మీకు తెల్వదా సార్?

ఇల్లూ సంసారం... అంతా శిథిలమవుతుంటే వేదనకు గురికాని హృదయం ఉంటుందా?... ఉంటే అది హృదయం కాదు... నా కుటుంబం పిల్లల బాగుకోసం అని ప్రారంభమైన నా ప్రస్థానం ఎటుపోతోందో తెలియదు. ఈ త్యాగాల వల్ల నాలాంటి కుటుంబాలేవైనా బాగుపడ్తున్నాయా అంటే అదీలేదు... అందరూ అష్టకష్టాల్లో నిత్య నిర్బంధంలో కూరుకుపోతున్నవారే... రవంత సుఖం కోసం ఆశపడితే కొండంత కష్టాలు ఎందుకు పడ్డట్టు?... మనసంతా వికలమైపోయింది... పని చేస్తున్న తృప్తి లేకుండా పోయింది.

...ఎవరికీ దొరకకుండా ఎంతకాలమని తిరగడం?...మా తోవలు జాడలు పోలీసులకూ్కడా తెల్సిపోయాయి. దమ్ము (అలసట) వచ్చినపుడు సేద తీరడానికి చూస్తే విప్లవం అంతూ దరీ లేని ప్రవాహం. నిరంతరం ఈదాల్సిందే. విప్లవానికి అవతల ఒడ్డు యివతలి ఒడ్డూ అంటూ లేవు.... అందులోపడి కొట్టుకుపోవడం తప్ప. కుటుంబాన్ని అలాంటి స్థితిలో వదిలేసి నిరందిగా తిరగడం మనిషి లక్షణం కాదనిపించింది. ఎల్లకాలం అలాంటి బతుకు నాతో కాదనుకున్నాను. నా బతుకు నేను బతకాలనుకున్నాను. ప్రభాకర్ ఎన్‌కౌంటరైపోయి... తెల్సిన యితరులు యితర ప్రాంతాలకు బదిలీ అయిపోయి, వేదన తీర్చేవారే కరువయ్యారు... ఉండేవారు ఉంటారు... పోయేవారు పోతూనే ఉంటారని కొందరు అన్నమాటలు శూలంలా దిగాయి... అంత యాంత్రికతను, కఠినత్వాన్ని, హృదయ రాహిత్యాన్ని జీర్ణించుకోలేకపోయాను. ఆ స్థితిలో సారవ్వను ప్రేమించాను. నా ప్రేమను నిరాకరించినప్పటికీ ఒక చెల్లెలుగా చివరిదాకా నా వేదనలో పాలు పంచుకుంది...

...బయటకు వచ్చిన నక్సలైట్లలో కొందరికి జీపులిచ్చారు. కొందరు షాపులు పెట్టుకున్నారు. కొందరు కాంట్రాక్టర్లయ్యారు. నేనో హోటలు పెట్టుకున్నాను. మంచి

సెంటర్లో మంచి గిరాకీ అయ్యేది... అయితే పోలీసులు రోజు వచ్చుడు... తినుడు... బిల్లు అడగితే ఏవో కేసుల్లో ఉన్నావని మళ్ళీ కొత్త కేసులు పెట్టడం... ఏ బందు పిలుపులొచ్చినా యిదే సందు అని తీసుకుపోయి లాకపులో వెయడం.....

ఎవరికి చెప్పుకోవాలి?... ఎవరున్నారని?... నాకోసం మాట్లాడే వారెవరున్నారని?... కొంచెం మంచిగా బతికే ప్రతి ఒక్కరినీ పెటీ బూర్జువా అని తిట్టితి. కులపెద్దల్ని కులగజ్జిగాల్లని తిట్టితి. రాజకీయాల్లో తిరిగే వారిని మీవన్నీ దోపిడీ పాలకవర్గాల రాజకీయాలని తిట్టితి. వాల్లు ఓట్లు అడగవస్తే చెప్పుతో కొట్టాలె అని చెప్పితి. వాల్లకు వోటు వేయవద్దని మీటింగులు పెట్టితి. ఇలా అందరికీ కంటయిపోతి. ఎవరితో మంచిమాటుందని... ఇపుడు వాళ్ళు ఎందుకు సహకరిస్తారు సార్?

...పైగా నేను బయటకు వచ్చాక వారిలో చాలామందికి కొత్త సమస్య లెదురయ్యాయి. వాల్ల రాజకీయాలకు, కులపెద్దరికానికి, వారి పలుకుబడికి ఎక్కడ పోటీ అవుతానో అని వాళ్ళకు గుటగుట తగిలింది. వీడు ఎన్‌కౌంటర్లో ఛస్తే ఎంతమంచిగుండు అని వాల్ల బాధాయె... ఎందుకు పట్టుకపోయి సంపుతలేరా అని ఆశ్చర్యం... తమ గుట్టుమట్లన్నీ ఎక్కడ చెప్తాడో అని నాపై లేనిపోనివి కల్పించి పోలీసోల్లకన్నా ముందే నన్ను లోపల నూకుదామని ధ్యాస... ఇలాంటివాళ్ళు నాకెలా సాయం చేస్తారు సార్?

.....మల్లా మల్లా పోలీసులు పట్టుకపోవుడు... తినుడుకు హోటల్ ఎట్లా నడుస్తుంది?... హోటల్ తీసేసి కొంత లోను తీసుకొని ఆటో కొన్నాను. వాల్లు రాత్రిల్లు ఆటోల అడ్డా కాడికి వచ్చి... ఇంట్లుంటెకూడ వదలక, పనుంది పా అని ఆటోలో ఎక్కి తీసుకపోయి అన్నల జాడ చెప్పుమనిరి.

వాల్ల అనుమానం ఏందంటే నామీద పెట్టిన పద్దెంది కేసుల్లో పదకొండు కేసులు కొట్టేశారు... నా గోస చూసి పార్టీలో ఉన్న అనాటి నా దోస్తులు కొందరు కేసులకు సాక్ష్యాలు రాకుండ కట్టుదిట్టం చేశారు... అందుకని నాకు యింకా వాల్లతో సంబంధాలున్నాయంటారు....

☆ ☆ ☆

......ఇక్కడ ....ఎన్నితీర్ల కష్టాలో.... మేం వాల్ల కన్నతండ్రిని చంపినపుడు కండ్ల నిండా చూసినవాళ్ళున్నారు... వాల్లకు నేను పార్టీలోంచి వెళ్ళిపోయున్నన్నా కనికరం ఎందుకుంటుంది?... ఇదే సందు అని, ఎవలు అడ్డం రారు అని యింకింత ధైర్యంగా సాక్షుల్ని తయారుచేశారు. పార్టీ ఆదుకొని వాల్లను బెదిరించింది అప్పుడే... అట్లా కాదని వాళ్ళు నన్ను అక్సిడెంటులాగా చంపాలని చూశారు...

...సార్! ఈ లొల్లిలో దిగకపోతే నేను ఎపుడో సర్పంచు అయ్యేవాడిని. దొరను చాలా తేలికగా ఓడించేవాన్ని. అట్లా ఊరంతా ఉత్సాహంగా ఉన్నపుడు అన్ని పదవులు పోటీలు వదులుకున్నాను. దాంతో ఎందుకు పనికిరాని పురుషోత్తంరెడ్డి సర్పంచాయె... ఇపుడు బలిసిపోయె... ఆ పిరికిపంద కాల్లు నేను పట్టుకోవాల్సి వచ్చె....

నాకింద పనిచేసిన నాలెముచ్చు రాజిరెడ్డి అపుడు సర్పంచైపోయె... ఇపుడు మండలాధ్యక్షుడైపోయె... రాజిరెడ్డి సరెండర్ కాంగనే బామ్మర్దులు విమానం కాడికిపోయి

ముఖ్యమంత్రిని ఎదురుకున్నట్టు వాళ్ల పార్టీలకు రారమ్మని పూలదండలేసుకొని పిలుచుకున్నారు... సరెండరయ్యాక కూడా కొందరు అట్లా పెరిగారు. ఇపుడు రాజిరెడ్డిని కలెక్టర్, ఎస్పీ కూడా గౌరవించవట్టిరి. వాడు మీదికి లేవడానికి వాని కులం ఉపయోగపడ్డది. నన్ను అణగదొక్కడానికే నా కులం ఉపయోగపడ్డది సార్!

కులం పెద్దదైతే దొరికితే జేలుకు పంపుతారు. కులం చిన్నదైతే సరెండ్ అవుతామన్నా... నమ్మిచ్చి ఎన్‌కౌంటర్ పేరిట చంపేసిరి... కులం పెద్దదైతే సరెండర్ కాగానే పనికిరాని నక్సలైటు కూడా ప్రముఖ నక్సలైటవుతాడు... కులం చిన్నదైతే అంతదాకా ఉచ్చ పోసుకున్న గాడిద కొడుకే ఈ గాడిద కొడుకేనా అని ఉచ్చ పోపిస్తాడు. వాళ్లు వరుసమారినా కులం మారలేదు. వాళ్లు పార్టీ మారినా పవరు మారలేదు. అయిదువేల కోళ్ళఫారం పెట్టుకున్న రాజిరెడ్డి యిపుడు మండలాధ్యక్షుడాయె. నీ నక్సలైట్ రాజకీయాలు వద్దని చికెన్ సెంటర్ పెట్టుకున్న రామేశ్వర్ రెడ్డి రెండుసార్లు మంత్రయి పోయాడు. నా బతుకు యిలా అయిపోయింది.... పాలకవర్గాల్లో బంధు మిత్రులున్నోళ్లే నక్సలైట్లలోను మంచి బతుకున్నది. వాళ్లు పోలీసులకు దొరికినా దొరలాగే మాట్లాడుతారు. చక్కని భాషలో మాట్లాడి, అబ్బ ఎంత పెద్ద మేధావి అన్పించుకోగలరు. మాకు అంత భాష రాదు. అంత సిద్ధాంతం రాదు. వస్తే వాళ్ల తీరే నేను కూడా చీలిపోయినా అంటూ ఒక పార్టీ పెట్టుకోకపోదునా సార్!

నాతో పనిచేసిన వాళ్లు నలుగురు నాలుగు దిక్కులైపోయారు. వేణుగోపాలశాస్త్రి ఏదో దినపత్రికలో సబ్ ఎడిటర్ అయ్యాడు. విశ్వరూపరావు ఏ క్లాసు కాంట్రాక్టరయ్యాడు. ఎమ్మెల్సీ చేసిన ఎమ్మెల్లే బావమరిది కొడుకు తిరుపతిరెడ్డి ఓ ప్రయివేటు కాలేజీకి ఇంఛార్జి ప్రిన్సిపాల్ అయ్యాడు. ఇట్లా ఎవరి కులం తీరు వాళ్ల బతుకులు... ఎవరి చదువు తీరు వాళ్ల బతుకులు... సరెండరైనాక కూడ బతుకులు గెల్చుకున్నారు. జీతాలు కుదురుకున్నారు... నాకేం దొరికింది... ఉన్న జీవితమే కుక్కలు చింపిన విస్తరైపోయింది....

నాకు తెల్సినవాళ్లు లేరని కాదు... మా ఉన్నారు... మా ముత్తవ్వ పొందించిన ఊర్లో పుట్టినవాడే – అచ్యుతశర్మారావంటారతన్ని... అతడికి విప్లవంలో పెద్ద పేరే ఉంది. ఇపుడు పట్నంలో నాలుగు లక్షలు పెట్టి అపార్టుమెంటు కొనుక్కొని పట్నంలో ఉంటున్నాడు. కాని తన తోలు కాపాడుకోవడం ఎట్లానో అతనికి తెల్సినంత ఎవరికీ తెలువది. స్టేట్‌మెంట్ యిచ్చి పేపర్లో తన పేరు చూసుకోగానే అతని ప్రాణం చల్లబడుతుంది. అతడు ఏ కేసు కొసదాక పట్టించుకున్నాడని?.... అతనికి పేరు కావాలి. పేరున్నోళ్ల గురించైతే పట్టించుకుంటాడు. మీటింగు పెడ్తాడు. మాలాంటివాళ్లకైతే వాళ్లు యివన్నీ ఉండేవే గదా... అని సముదాయిస్తారు. కాని వాళ్ల వీపుమీద దెబ్బకాదు గదా... తలుపుమీద గొళ్లెం కొడితేనే పోలీసుల నిర్బంధం నశించాలని దేశమంతా బొబ్బలు పెడుతారు. గవర్నరు ముఖ్యమంత్రులదాకా ఉరుకుతారు... అడిగితే మేం పోలేదు... మా చుట్టాలు నా భార్యను వాళ్ల దగ్గరికి తీసుకపోయారని అంటారు. వాళ్ల కులపోల్లు అన్ని పార్టీల్లో ఉన్నారు... ఇట్లా అరెస్టు కాగానే అట్లా వెంటనే విడుదలయ్యేట్టు ఎన్నో రూపాల్లో పనిచేస్తారు...

....మేం ఛస్తే వాళ్లు కవిత్వం రాద్దామని చూస్తారు. అది చూసి మనం చస్తే మనక్కూడా యింతపేరు వస్తుందని నాలాంటోళ్లు మళ్లా అందులోకి ఉరికి సచ్చుటానికే వాళ్లు రాస్తారు. వెనకట రాజులు యుద్ధాలు చేస్తూ యిలాగే వీరగాథలు పాడించి సైన్యాల్లోకి భర్తీ చేసుకునేవారు... పల్లెల్లో చెప్పించిన పల్నాటి బొబ్బిలి యుద్ధం, మహాభారతం వగైరా వీరగాథలన్నీ అందుకు ఉపయోగించుకున్నవే. వాళ్లకు కావాల్సింది మేం వాళ్ల సైన్యంలో చేరడం... అంతేగాని, మేం బతికి ఉంటే పౌరహక్కుల వాళ్లయినా, విప్లవ రచయితలైనా ఎందుకు పట్టించుకుంటారు సార్?

......నన్ను జేల్లో వేస్తే నా యింటికి పోయి మందలించిన (పరామర్శించిన) వాళ్లు లేరు. చదువురాని మాలాంటి నక్సలైట్లను చూస్తేనే వాళ్లకు ఉచ్చపడుతుంది. రోడ్లమీద కల్సినా మాట్లాడవద్దంటారు... ఇంటికిపోతే ఎందుకు వచ్చావంటారు... నేను వాళ్ల యింటికి పోతే వాళ్ల మీద నిర్బంధం పెరుగుతుందట... నాతో కలవరు. మాట్లాడరు... కాని వారి ధ్యాసంతా విప్లవం గురించేనట.... విప్లవం అని అన్నా వాళ్ల బతుకు పువ్వుల్లో పెట్టినట్లు సాగాలట. వాళ్ల ఉద్యోగాలు... వేల జీతాలు... వాళ్ల పిల్లల సదువులు... సుఖాలు... గౌరవాలు అన్నీ భద్రంగానే ఉంటాయి. నేను కోరుకున్నదీ అదే... మా పల్లెల్లో కూడా విప్లవం చేస్తున్నా కూడా మా వాళ్ల బతుకులు అట్లానే సజావుగా సాగే అవకాశాలుండాలని. అది వారికి తప్పయిపోయింది. అది దిగజారుడుతనం అన్నారు. అలా అన్నవాళ్లే పార్టీలో పదవి పోగానే హాయిగా ఉద్యోగాలు, వృత్తులు చేసుకొని బతుకుతున్నారు... కానీ కనీసం వాళ్లు ఒక పాలకవర్గ పార్టీ నాయకుడు పట్టించుకున్నట్టయినా... పౌరహక్కుల సంగం పట్టించుకున్నట్టయినా ప్రజల గురించి పట్టించుకోవడం లేదు... పార్టీలో నాయకత్వాలు ఉన్నంతసేపు మాత్రం నా అంత మొనగాడు లేడన్నట్టు ప్రవర్తిస్తారు... దేకే గుద్ద తనది గాకపోతే కాశీదాకా దేకుమంటారు వీళ్ళంతా... హింసలు, దెబ్బలు, త్యాగాలు తనవి, తన కుటుంబాలవీ కాకపోతే చాలు... అన్ని వ్యూహం ఎత్తుగడలు కరెక్టేనంటారు... నీ అన్నం నాకు పెట్టు, నీకు ఆకలి కాకుండా మందిస్తా నన్నట్టు వాళ్ళు ఇవాళిటి అభివృద్ధినంతా సొంతం చేసుకుంటూ రేపటి అభివృద్ధి మీకంటారు. అందుకు విప్లవించాలంటారు. వాళ్లు చక్కని చదువులు చదువుకుంటూ తీరొక్క ఉద్యోగాలు వృత్తులు చేసుకుంటూ పిల్లల్ని విప్లవం వాసన అంటకుండ యింగ్లీషు మీడియంలలో చదివించుకుంటూ రోజా పెళ్ళాం పక్కలో పడుకుంటూ అన్ని సుఖాలు అనుభవిస్తూ... అయిదారేళ్ళు పనిచేసి వచ్చిన నాలాంటి వాళ్ళను దిగజారిపోయాడని వదిరే గాడిద కొడుకులను చెప్పుతో పళ్ళు రాలగొట్టాల. ఏ త్యాగాలు చేయకుండానే విమర్శించే వీళ్ళ పెళ్ళాలను... బిడ్డలను... రేప్ చేసినపుడు తెలుస్తుంది...

... వాళ్లు ఇండ్లు కట్టుకుంటారు... పెండ్లాం పిల్లలతో హాయిగా సంసారం చేస్తారు... వాళ్లకు మంచి ఉద్యోగాలు కావాల. మంచి కీర్తి కావాలి... వాళ్ల కీర్తికి మా నిర్బంధాలు, మా చావులు సాధనాలుగా ఉండాలే తప్ప... వాళ్లు మమ్ముల్ని వాళ్లలాగా బతకాలనుకునే మనుషులుగా చూసిందెపుడు?.... ఇలాంటివాళ్ల ఉపన్యాసాలు, పాటలు విని, వాళ్లు రాసే పుస్తకాలు చదివి చెడిపోయాను. అజ్ఞాతసూరీడు కొండపల్లి సీతారామయ్య... పీవీరావు... ముక్కు సుబ్బారెడ్డి, చెంచయ్య, కళ్యాణ్‌రావు అందరూ

యింతే...రేపు గణపతీ...అదిరెడ్డి... యింతే... అయ్యావారు చెప్పే మీది మాటలు విని తీర్థం పోతే అతడు... గుడిలో...నేను చలిలో... అన్నట్టే అయింది. వాళ్ల చెల్లెళ్లకు, బిడ్డలకు, మరదళ్ళకు కట్నాలు లేకుండా లగ్గాలవుతాయి. మాకేం వచ్చింది?... వాళ్లంతా ఏనుగుల్లాంటోళ్లు... ఏనుగు చచ్చినా పదివేలు, బతికినా పదివేలు...వాళ్లు పార్టీలో పని చేసినా, బయటకొచ్చినా....ఎన్‌కౌంటర్లో పోయినా... వాళ్లకయ్యే నష్టం లేదు. వాళ్లకు దేశంలో పట్టనంత పేరొస్తుంది. వాళ్ల పెండ్లాం పిల్లల సాయం కోసం దేశమంతా కదిలివస్తుంది సార్!

ఒకాయన మనుమరాలు పేరుమీద యిరవై లక్షలు యిల్లు కట్టుకున్నాడు... నాక్కూడ అజ్ఞాత సూరీడులా ముక్కుసుబ్బారెడ్డిలా కొండపల్లి సీతారామయ్యలా సాదాగా బతకాలని ఉంది. నలభయి ఏండ్లు విప్లవంలో తిరిగి వేలమంది చావులకు కారణమైనవాడు మల్లా సాదా జీవితం జీవించే హక్కుందిగానీ... నాలుగైదేండ్లు తెల్సీ తెలియక అందులో తిరిగి మల్లా యింటికి వస్తే మాకు సాదాగా బతికే హక్కు లేదెందుకు?

....విప్లవంలో చేరి జీవితాన్ని ఓడిపోయాను. జీవితాన్ని గెలుచుకోవాలని విప్లవంలో చేరితే.... విప్లవం నాకు ఓడిపోయే జీవితాన్నిచ్చింది సార్!

☆ ☆ ☆

....నిర్బంధం పెరగడానికి, పెంచడానికి ఎవరి కారణాలు వారికున్నాయి సార్! నిర్బంధం లేకపోతే రిక్రూట్‌మెంటు ఆగిపోతుందని పార్టీల భయం... ఏమంటే, ఎంత అవగాహన ఉన్నా నిర్బంధంలేని వర్గాలు కులాలు ప్రాంతాల నుండి రిక్రూట్‌మెంటు పది శాతమైనా ఉండడం లేదు... అటుచూస్తే నక్సలైట్ల బూచిలేకుండా లక్షలు కోట్లు ఆడిట్ లేకుండా తినడానికి సందు ఎలా దొరుకుతుంది? ఎన్‌కౌంటర్ల పేరిట చంపకపోతే వాళ్లకు పాతపగలు తీరేదెలా...ప్రమోషన్లు వచ్చేదెలా... నిర్బంధాలు లేకుండా నిలదీసే అవకాశాలుంటే దోచుకునేదెలా, రేపులు చేసేదెలా... ప్రభుత్వానికి తమ అవినీతి అసమర్థతను సమస్యల్ని పరిష్కరించలేని అలసత్వాన్నించి దృష్టి మళ్ళించడానికి నక్సలైట్లు సమస్య లేకపోతే ఎలా?....

...ఇటు చూస్తే కోస్తాలో కదిలిన లక్షల మందిలో నూటికొకరైనా హోల్‌టైమర్ కాలేదు... వాళ్ళకు బాధలే లేకపోతే మీటింగులకెలా వచ్చారు? వాళ్లకు బాధలున్నాయి. బతికే అవకాశాలూ ఉన్నాయి. అందుకని లీడర్లుగానే తప్ప కేడర్‌గా యిరవై ఏండ్లల్లో యాభయిమందైనా కార్యకర్తలు రాకపోయిరి. ఆ వచ్చిన ప్రతివాడూ నా మాట మీంచే విప్లవం నడవాలని కోరేవాడే తప్ప... ప్రజల మాట పట్టించుకున్నదెన్నడు సార్?

...మేం ఎన్నికల్లో దిగితే తామెక్కడ ఓడిపోతామేమోనని ఎన్నికల్లో దిగవద్దనే మాకు పాలకవర్గ పార్టీ నాయకులు ఎన్ని రకాలుగా సాయం చేశారో... ఎన్ని దేవుళ్లకు మొక్కారో... ఆ దేవుళ్లకే ఎరుక... సామాజిక అన్యాయాల్ని కొంచెం గట్టిగ నిలదీస్తే అన్నల్తో సంబంధాలున్నాయని తన్నించాలంటే నిర్బంధం లేకపోతే ఎట్లా సాధ్యం... యిట్లా నిర్బంధం ఉండాలని కోరుకోవడానికి ఎవరి కారణాలు వారికున్నాయి....

కాన్షీరాం మీటింగులకు అయిదు లక్షల మంది వచ్చారు. ఆర్నెల్లు తిరగకముందే అభ్యర్థులకు అయిదువేల ఓట్లన్నా రాలలేదు. నక్సలైట్ల మీటింగులకు పదిలక్షల మంది వచ్చారని నిర్బంధం పెట్టుడేనా సార్? ఓ అయిదేండ్లు అవకాశాలిస్తే దాని అసలు స్థానంలోకి ఎండుకపోతది. మీరే నిర్బంధం నీరుపోసి, రోషం నారుపోసి అమాయకులను నక్సలైట్లుగా మార్చుతున్నారు సార్! స్వేచ్ఛ వుంటే అన్ని పార్టీలను నిలదీస్తారు. ఎదురు తిరుగుతారని ఎవరి కారణాలు వాళ్లకున్నాయి సార్!

....ఈ అవుల పోట్లాటలో దూరిన మాలాంటి లేగల కాళ్ళు విరిగాయి. మాకేం మిగిలింది... మాలచ్చి పెండ్లి కోసం నాలుగు దిక్కులు తిరిగి అప్పులు దూసుకవచ్చాను. నేను విప్లవంలో తిరిగినా కట్నం లేకుండా మా చెల్లెను పెండ్లి చేసుకోవడానికి ఎవరూ ముందుకు రాలేదు. కొందరు విద్యార్థి యువజనుల్ని అడిగాను... ఒక అమ్మాయి ఉంది. వాళ్ళ అన్న విప్లవంలో కెళ్ళాడు. ఆమె పెళ్ళి కావాలి. కొంచెం కుంటి... కొంచెం నలుపు... పోలీసుల్తో రేప్ చేయబడింది... అని మాత్రం చెప్పలేదు. ఏ కులమో కూడా చెప్పలేదు. చాలా చక్కగా ఉంటుందనే చెప్పాను. విప్లవం పట్ల చక్కని అవగాహన ఉంది.... మీరెవరైనా పెళ్ళి చేసుకుంటారా అని అడిగాను. వాళ్ళ ఆదర్శాలు మీటింగుల మేరకే. ఆ ఆదర్శాల కనువుగా జీవితాల్ని మలుచుకోవాలని లేదు. వాళ్ళకు బాగా చదువుకొని ఉద్యోగం చేసే భార్యలు కావాలట. ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుంటూ విప్లవాల గురించి మాట్లాడతారట. అంతేగాని, విప్లవంలో ప్రాణాలర్పించినవారి భార్యలను చెల్లెండ్లను కూతుళ్ళను పెళ్ళి చేసుకోరట... సాది సవరించాల్సిన నాలాంటివాళ్ళు యిల్లు వదిలేసి విప్లవంలో కలిశాక నిత్య నిర్బంధంతో పాటు ఆర్థిక బాధలు మీద పడుతుంటే మా వాళ్ళు చదువుకోవడం ఎలా సాధ్యం?... చదువుకున్నా ఉద్యోగాలు సాధించడం ఎలా సాధ్యం?... ఆ చదువూ ఉద్యోగాలూ... ఇతరుల పాలయ్యాయి. విప్లవంతో పని లేకుండానే యిపుడు వారు హాయిగా బతుకుతున్నారు...

మా చెల్లెల్ని రేప్ చేసిన విషయం తెల్సీ కొంచెం ఎక్కువ కట్నంతో తల్లీ దండ్రీ లేని పేదవాడు చేసుకోవడానికి ముందుకొస్తే ఎంతో సంతోషించాము. మానవత్వం యింకా బతికే వుందనుకున్నాం. కానీ పెళ్ళి కట్నంతో షాపు పెట్టుకొని ఆ షాపుతో డబ్బూ గౌరవం పెరిగాక మాలచ్చిని వదిలించుకోవాలని చూశాడు... పోలీసులు చేసిన రేప్ గురించి గుచ్చి గుచ్చి అడిగి, వారితో అక్రమ సంబంధాలు అంటగట్టి వేధించడం ప్రారంభించాడు... ఆ బాధలకు తాళలేక బావిలో దూకింది. చావుదప్పి కుంటిదైపోయింది. వాడు వదిలేశాడు... ఆకలి అగలేక మాలచ్చి ఎవరికో అలవాటైంది... అది తెల్సీ మళ్ళీ పెళ్ళి చేయలేని నిస్సహాయతతో కుమిలి కుమిలి ఏడ్వడం తప్ప ఏం చేయలేకపోయాను. మొదట అలవాటైన వాడు మోసం చేశాడు... దానికిపుడు తిరుగుబోతు అనే పేరొచ్చింది. లక్షలమంది విద్యార్థి యువజనుల్ని ఆర్గనైజ్ చేసినా వాళ్ళ సంస్కృతిని ఏం మార్చగలిగాం?... వాళ్లల్లో ఏ ఒక్కరైనా మాలచ్చిని పెళ్ళి చేసికొంటే దాని బతుకు యిట్లా మారి ఉండేదేనా?... విప్లవంలో తిరుగుతూ అందరికి అన్నాలు పెట్టూ చెప్పిన పనల్లా చేసే మాలచ్చిని కులపోల్లు చేసుకోవడానికి భయపడిరి... అంత తెలివిగలదాన్ని చేసుకుంటే చెప్పినట్టు వినదని,

మా మీది నిర్బంధం వాళ్ళ మీద కూడా పడుతుందని మరో భయం.... అన్నీ కల్సి మాలచ్మి బతుకు యిట్లా అయిపోయింది.

☆ ☆ ☆

....వెనక్కి తిరిగి చూసుకుంటే సాధించిందేమున్నది సార్? నిర్బంధాలకు తాళలేక నర్సవ్వ తల్లిగారింటికి పోయి... మాలచ్మి అమ్మమ్మ బంధువులింటికి పారిపోయి... మందులూ, అర్సుకునేవాళ్ళు లేక మా నాయిన పోయాడు. తమ్ముడు అరబ్బు దేశం నుండి పంపిన పైసల్తో వీసాకోసం చేసిన అప్పులే తీరలేదు... విప్లవంతో సంబంధం లేకపోయినా తమ్ముడు అరబ్బు దేశం నుండి రాగానే లోపలవేసి చిత్రహింసలు పెట్టి, సంపాదించిందాన్లో సగం వాళ్ళే గుంజుకున్నారు. నా ఒక్కడి కారణంగా నావాళ్ళ ఎన్ని కుటుంబాలు పాడైపోయాయి. నేనూ నా వర్గంవాళ్ళూ... మా కులంవాళ్ళూ విప్లవంలో ఏం బావుకున్నాం?.....

...నా పిల్లలు యిక నా మాట వినకుండా అయ్యారు... వారి తోవ వాళ్ళు చూసుకున్నారు. పెద్దోడు దేవయ్య ఆనందరావు పెట్టిన హోటల్లో జీతానికి కుదురుకున్నాడు. ఆనందరావు కొన్న ప్రయివేటు బస్సుమీద చిన్నోడు కాంతయ్య క్లీనర్‌గా పనిచేస్తున్నాడు... నా కూతురు ఆనందరావు తమ్ముడు బ్యాంకు ఆఫీసరు యింట్లో స్వీపరుగా పని చేస్తోంది. దొరలే కాపాడుతారనే భరోసాతో అట్లా నిర్బంధం బారినుండి బయటపడ్డారు.

ఆనందరావు వాళ్ళు ముగ్గురన్నదమ్ములు... వాళ్ళిపుడు వేర్లుపడ్డారు. భూములు పంచుకున్నారు. రాంరావు దొర గుండెపోటుతో పోయాడు. నేనే కలలో కనపడి గుండె ఆగిపోయిందని బదునాం చేశారపుడు. ఆనందరావు తమ్ముల్లు పట్నంలో చదువుతున్నపుడు యివే సంగాల్తో తిరిగారు. అలా పెద్ద పెద్ద అన్నలంతా వారికి తెల్సు. మా తాత తండ్రులు వెనకట ఎప్పుడో దొరల్లా సాగించుకొని చేసిన తప్పులకు మమ్మల్ని శిక్ష అనుభవించుమంటారా?... అని అడిగి సానుభూతి సాధించారు. మా కోసం కాదు, మా పిల్లల చదువుల కోసం, పెండ్లిల్ల కోసం మా భూములైనా అమ్ముకోనీయరా అని అడిగారు. మధ్యవర్తుల ద్వారా పార్టీ ఫండు పార్టీకి చేరేది. కొంత భూమి సంగానికి విరాళంగా వచ్చేది. వాల్లకు అనుమతి లభించేది.

...అయినా అపుడు అన్నలు భూముల్ని అమ్మనీయనిదే నయమైందని ఆనందరావు... అతని తమ్ముళ్ళూ అన్నలకు మనసులో జోహార్లు అర్పిస్తుంటారు. ఆనందరావు తమ్ముని పిల్లలు మాలచ్మితో నన్ను పొగుడుతూ ఉంటారట... మీ అన్న విప్లవం చేసి మమ్మల్ని ఆ పశువుల రొచ్చు... బురద పొలాలు... ఎండల్లో బతికే బాధ తప్పించాడని... అవును మరి. వాల్లిప్పుడు ఏసీల్లో కారునుండి కాలు కింద పెట్టకుండా బతుకుతున్నారు. మా పోరాటం కొత్త బతుకు దోవకోసం కన్నతండ్రే కొట్టి పంపినట్టయి వాళ్ళు కొత్త ప్రపంచాన్ని గెలుచుకున్నారు. బావిలోని కప్పల్లా మా జీవితాలు, దృక్పథాలూ కుదించుకుపోయాయి. వెనకట గురుకుల విద్యాభ్యాసం పూర్తయ్యాక రాజు కొడుకునూ మంత్రి కొడుకునూ పది వరహాలిచ్చి రాజు మంత్రి కొడుకులం అని చెప్పకోకుండా రెండేళ్ళు తిరిగి ప్రపంచాన్ని తెల్సుకొని

రమ్మంటే రాజ్యాలే గెల్చుకొచ్చినట్టుగా... ఇక్కడి దొరలు పల్లెలు వదిలాక సేట్లయ్యారు. ప్రయివేటు కాలేజీల ఓనర్లయ్యారు. ప్రభుత్వ అధికారులయ్యారు. ఊర్లలోంచి పారిపోయిన దొరలు, వర్గ శత్రువులంతా బాగానే బతుకుతున్నారు. ఎక్కడా వాళ్ల పరువుకూ పవరుకూ భంగం రాలే... వాళ్ళకు జరిగిన నష్టం ఏముంది? అహంకారం వదులుకొని కొంచెం వినయాన్ని నేర్చుకోవడం తప్ప. ఆనందరావు తమ్ముడు హరిగోపాల్‌రావు దొర యూనివర్సిటీ రీడరై, పౌరహక్కుల సంఘంలో ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నాడు. అప్పుడు వాళ్లు అమ్ముదామనుకున్నప్పుడు ఎకరానికి అయిదు వేలున్న భూమి యిపుడు లక్ష రూపాయలైంది. పార్టీ ఫండు ఎంత యిచ్చినా... కొంత భూమి ఫ్రీగా యిచ్చినా వాళ్ళకేం నష్టం......

మద్దునూరు తేజేశ్వరరావు దొర విప్లవం వర్ధిల్లాలని దేవుళ్లకు రోజా కొబ్బరికాయ కొడ్తుంటాడు. పారిపోయి పట్నం వచ్చి వందకోట్లు సంపాయించుకున్నాడు. ఇంకో పదేళ్ళ ముందు విప్లవం వచ్చి ఉంటే వెయ్యి కోట్లు సంపాదించి ఉండేవాన్ని... ఇంకా ఈ పల్లెల్ని పట్టుకొని ఎందుకు వేలాడుతుంటారని తనవారిని సముదాయించడంతోనే ఇక్కడ భూస్వామ్య వర్గం ఇపుడా వర్గంగా అదృశ్యమై పారిశ్రామిక యాజమాన్యంగా ఎదుగుతోందని చాలమందికి తెలియదు. అంటే, నిన్నటి జగిత్యాల పల్లెలు పోరాటంతో.... ప్రాజెక్టు నీళ్ళతో.... రాష్ట్రంలో అత్యంత అభివృద్ధి చెందిన నేటి గుడివాడ పల్లెలయ్యాయి. భూస్వాముల్ని చంపడం పోయి ఇన్ఫార్మర్లు వగైరా పేరిట భూస్వామ్యేతరుల్ని కాల్చి చంపడం కూడ దీన్నే స్పష్టం చేస్తున్నది... అయితే విప్లవం సంస్కృతి కారంచేడు చుండూరుల్లా కులపోరాటాలు జరక్కుండ కాపాడుతున్నది....

తేజేశ్వరరావు దొర అనేదాన్లో ఎంతో నిజం ఉంది. పదేళ్ళ ముందే... సరిగ్గా చెప్పాలంటే యిరవై ఏళ్ళ ముందే విప్లవం వచ్చి ఉంటే... రాజకీయార్థిక సాంస్కృతిక సామాజిక రంగాల్లో తెలంగాణా వాటా తెలంగాణాకు దక్కి ఉండేది... ఆంధ్ర షుగర్స్... నాగార్జున ఫర్టిలైజర్స్ వంటి సంస్థలెన్నో యిక్కడి దొరలే స్థాపించి, కోస్తా వారి దోపిడి విస్తరణను అడ్డుకొని ఉండేవారు... వారిని అధిగమించి ముందుకు సాగి ఉండేవారు. విద్యాభివృద్ధి యిరవైఏళ్ళ ముందే జరిగి, తెలంగాణాలో ఉద్యోగాలన్నీ తెలంగాణా వారికే దక్కి ఉండేవి... వ్యవసాయం యిరవై ఏళ్ళ ముందే అభివృద్ధి జరిగేది. అపుడు ఇక్కడ తెలంగాణా జిల్లాలో రూపొందిన "గుంటూరు పల్లెలు" ఉనికిలోకి వచ్చే క్రమమే ఏర్పడేది కాదు... ఇక్కడ భూస్వాములు పారిశ్రామికవేత్తలుగా ఎదుగుతుంటే ఈ పోరాటాలే ఉండేవి కావు. కోస్తావాళ్ళ ఆధిపత్య విస్తరణ, యితరుల పారిశ్రామిక విస్తరణ ఇక్కడి భూస్వాముల అభివృద్ధిని అరికట్టింది. తద్వారా ఇక్కడి భూస్వాములకు వ్యతిరేకంగా సాయుధ పోరాటాలు చేయాల్సి వచ్చింది...

.....సార్! మీరు కోస్తావారే కావచ్చు. జడ్జి హోదాలో ఉన్నారు గనక న్యాయం వైపు ఆలోచించండి సార్! నిజం చెప్పండి సార్! 1956లో తెలంగాణా అనేది ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడి ఉంటే యీ సమస్యలు వచ్చి ఉండేవా సార్? మీ కోస్తాలాగే ఇక్కడి దొరలు పారిశ్రామిక వేత్తలుగా ఎదిగి, ఊళ్ళు వదిలి పట్నాలకు తరలిపోయేవాల్లు కాదా! అపుడు వాల్లు ఉందుమన్నా ఊర్లో ఉండేవాల్లా? భూస్వామ్యం యిలా కరుడుకట్టుకు పోయేదా? తహసీలుదారుకు

ప్రమోషన్ వస్తే గిర్దావరుకు తహసీల్‌దారుగా ప్రమోషన్ వచ్చినట్టు. జూనియర్ అసిస్టెంటుకు గిర్దావరుగా అంచెలంచెలుగా ప్రమోషను వచ్చినట్టు – ఇక్కడి దొరలు భూస్వాములు, పారిశ్రామికవేత్తలుగా ఎదిగితే మేం కనీసం గుమాస్తాలుగా, టీచర్లుగా, కార్మికులుగానైనా ఎదిగి ఉండేవోల్లం కాదా! కోస్తా కమ్యూనిస్టు నాయకత్వం మా తెలంగాణా పోరాటాల పేరుతో ఎదిగి, మా మీదే నాయకత్వంగా మారి ఒక్కటిగా ఉందామని చెప్తే ఏం జరిగింది సార్? మా బతుకును ముంచింది. తెలంగాణాలో వున్న అవకాశాల్ని కోస్తావాల్లే కొట్టుకుపోయారు. బడ్జెట్‌లన్నీ అటే తరలించుకున్నారు. రాజకీయాధికారమూ వాల్లదే అయిపోయింది. ఇపుడు నక్సలైట్ల పేరు చెప్పి మాకు అభివృద్ధిని అందకుండా చేస్తున్నారు సార్!.....

ఏ గడీ కోసం, ఏ గడీ ఆధిపత్యం కోసం ఉండాలని ఆయనా... పోవాలని మేమూ పోరాటం చేశామో ఆ గడీని యిపుడా మద్దునూరు దొర ఆ వూరికీ ఆ వూరి స్కూలుకూ విరాళంగా రాసి యిచ్చి తన కృతజ్ఞత...విజ్ఞత తెలుపుకున్నాడు... ఆ విజ్ఞతే ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం కోసం విప్లవపార్టీల్తో ఐక్య సంఘటన కట్టాలని చూస్తోంది... ఇలా ఈ విప్లవ పార్టీలు చెప్పేది వర్గ దృక్పథమైనా ఆచరణలో అగ్రకుల భూస్వామ్య వర్గాన్ని నయా ధనిక పారిశ్రామిక ప్రాంతీయ బూర్జువా పాలకవర్గంగా ఎదిగించడనికి మాత్రమే పరిమితమైంది.

...నిజం చెప్పాలంటే ఏ కొందరు అహంకారులకో తప్ప దొరలకు యిప్పుడు విప్లవం అంటే కోపం ఎందుకుంటుంది?... అప్పుడు ఒక పల్లెల్లోనే వాళ్ళుండేది. ఇపుడు పల్లెల్లో వాళ్ళే... పట్నంలో వాళ్ళే. అన్ని పార్టీలు వాళ్ళవే... మాలాంటి వాళ్ళను ఎట్లా పొగపెట్టి వెళ్ళగొట్టాలో వాళ్ళకు కులంతో అబ్బిన విద్యే... ఆ వెలమ... రెడ్డి దొరలే... విప్లవ పార్టీలక్కూడ నాయకులయ్యారు... వాళ్ళంతా అచ్చంగా భూస్వాముల పిల్లలు కాదు... పేదరికం నుండి ఎదిగి అగ్రకుల భూస్వామ్య బూర్జువాగా ఎదగాలనుకుని అగ్రకుల పెటీబూర్జువా నుండి క్రమంగా... నయా ధనిక వర్గ స్వభావాన్ని సంతరించుకున్నవాళ్ళు... కొండపల్లి మొదలుకొని ఆదిరెడ్డి... గణపతి దాకా అంతావాళ్ళే....

...దొరలు పల్లెల్లోంచి పట్నాలకు పారిపోకముందు... పట్నంలోని వ్యాపారాలన్నీ కోమట్లు...పద్మశాలి...విశ్వబ్రాహ్మణ...గౌడ....తదితర శూద్రకులాలే చేసుకునేవారు... ఇపుడు అవికూడా దొరలపాలే అయ్యాయి... రెడ్ టెర్రర్ వారిని పాజిటివ్‌గా అంతగా చైతన్యవంతం చేసి, అభివృద్ధి సైన్సును కైవసం చేసుకునేందుకు పరిగెత్తించింది... అంబేద్కర్ రిజర్వేషన్ల ద్వారా ఈ నూతన అభివృద్ధినే అభివృద్ధి చెందాల్సిన వర్గాలకు అందాలని కోరాడు... విప్లవ క్రమం సరిగ్గా దాన్నే అసాధ్యం చేసి అగ్రకులాలకు సుసాధ్యం చేసింది... నిర్బంధం బరువంతా అభివృద్ధి చెందాల్సిన వర్గాలకు, కులాలకు... అభివృద్ధి అంతా అగ్రకులాలకు, పాలకవర్గాలకు – ఇట్లా అప్పగించడానికే విప్లవం... ఈ విషయం అపుడే తెల్సి ఉంటే అందులో చేరి ఉండేవాడిని కాను. ఇపుడు గతంతో లాభపడింది లేకపోగా పీడలా వెన్నాడుతోంది.... ఇరవైఏళ్ళ విప్లవంలో మాకు లాభించిందేమిటి సార్... ఆత్మ విశ్వాసం తప్ప....

...సరిగ్గా ఆలోచించే దొరలకు, పాలకవర్గాలకు యిపుడు విప్లవం అంటే ప్రేమా భయమూ భక్తీ... అందుకని అంతగా అవసరమైనపుడు ఎన్‌కౌంటర్ కాకుండా వాళ్ళే

కాపాడుతుంటారు... వాళ్ళకది ఎంతో సులభం... ఆఫీసర్లూ... పోలీసు అధికార్లూ... నాయకులూ... అంతా వాళ్ళే... వాళ్ళవాళ్లే... లేదా వాళ్ళు చెప్తే వినేవాళ్ళే...

...న్యాయమూర్తిగారూ!... యిట్లా జరిగిపోయిందని నాకు ఎవరి మీదా కోపం లేదు... గోడకు కొట్టిన బంతిలా తిరిగి మాపైకే విరుచుకుపడే పోలీసుల మీదా కోపం లేదు... నా కోపం ఈ పాలకవర్గాల మీదా కాదు... ఇది కోపం కాదు... ఆవేదన... బాధ... దుఃఖం... కన్నీళ్ళు.... ఈ చరిత్ర నిర్మాణం యిట్లా ఎందుకు తలకిందులైంది?... ఇరవై ఏళ్ళల్లో మా ఆశలు తలకిందులయ్యాయి. తలకిందులైపోయిన దొరల ఆశలు ముందుకెట్లా సాగాయి? విప్లవంలో అణగారిన వర్గాల అభివృద్ధి ఎందుకు అసాధ్యమైంది?...ఇట్లా పోరాటఫలితాలు ఎందుకు తిరగబడ్డాయి? ఎంత పోరాటం చేశామనేది ముఖ్యం కాదు... దాని అభివృద్ధి... ఫలితాలను ఎంతమేరకు చేజిక్కించుకున్నాం అనేది ముఖ్యం... ప్రయోగాలు మా పాలు... ఫలితాలు వాళ్ల పాలు... నిర్బంధాలు త్యాగాలు మా పాలు... అనుభవాలు నాయకత్వాలు అభివృద్ధి వాళ్ల పాలు.... యిలా ఎందుకవుతున్నదన్నదే నా బాధ....

...ఓ నా విప్లవ మిత్రులారా... కాలం గడిచిన కొద్దీ అనుభూతులూ నశిస్తాయి. అనుభవాల చరిత్ర కూడా అదృశ్యమవుతూ ఉంటుంది. వాటినించి పుట్టే దృక్పథాలు మాత్రం ముందుకు సాగుతూనే ఉంటాయి. అందువల్ల చరిత్రంటే దృక్పథాల చరిత్రే... అందుకే కొత్త అనుభవాల నుండి పుట్టే దృక్పథాల ననుసరించి మనిషి తన చరిత్రను నిరంతరం తిరగరాస్తూ ఉంటాడు... నా వాళ్ళు ఏడుతరాల.... స్పార్టకస్‌ల చరిత్ర తిరగరాయాల్సే ఉంది. అదిట్లా అసమగ్రంగానే ఉంటుంది. అసమగ్రత అనే నిర్వచనం మీ దృక్పథానికి సంబంధించినది....

...సార్! నా వాళ్ళకు పోరాటం చేయడమే తప్ప... దాని లాభాలు పొందడం తెలువదు. నా వాల్లకు రోషం ఆవేశమే తప్ప లౌక్యం తెలువదు. లౌక్యం ముందు తుపాకులు ఓడిపోతున్నాయి... నా వాల్లకు చావడం తప్ప బతుకును గెల్చుకోవడం తెలువదు... వేల ఏండ్ల నుండి సకల సరుకులు కళలు సృష్టించిన మా చేతుల్తో వాటిని "మార్కెట్" చేసికొని అమ్ముకోవడం తెలియని అణగారిన కులాలవాళ్ళం....

...మా సరుకులు, కళలు ప్రపంచాన్ని ఆకర్షించాయి... దాంతో ప్రపంచం నుండి యిక్కడకు వలసలు, దండయాత్రలు సాగాయి. మా సరుకులు తిన్నవాల్లు... స్వార్థపరులై దేశాన్ని వాల్లకప్పగించారు... మాకు భాష రాదు... భావం చెప్పడం రాదు... మాకు చరిత్ర లేదు. నాది చరిత్ర కాదు... ఎవరి చరిత్రనో... నాయకత్వాన్నో మోయడమే నా పని....

....అటు చూస్తే పోలీసుల బాధ... యిటు చూస్తే యిన్ఫార్మర్‌గా మారానేమోనని ఆరాలు తీయడం... నిజాయితీని శంకించడంకన్నా చిత్రహింస ఏం ఉంటుంది సార్? ప్రభుత్వాలే భయపడి పోలీసు స్టేషన్లనే పట్నాల్లోకి తరలిస్తున్నారు... ఎస్సైయిలకు మంత్రులకు... చీటీ రాస్తే... భయానికో భక్తికో అడిగినంత పైకం పార్టీ ఫండుగా సమర్పించి సగౌరవంగా సాగదోలే స్థితిలో... అన్నం పెట్టారని... ఆశ్రయం యిచ్చారని అమాయకుల్ని చిత్రహింసలు పెట్టడం ఎందుకు సార్? జైల్లల్లో వేసి కేసుల చుట్టూ తిప్పడం ఎందుకు సార్? భయంతోనే అన్ని పనులు అన్ని పార్టీల నాయకులే చేసిపెడ్తున్నపుడు అభిమానంతో చేయడం తప్పెలా అవుతుంది సార్?... నా భార్య

అభిమానంతోనో... భయంతోనో నాకు తెలియకుండ మళ్ళీ ఒకటి రెండు సార్లు సద్దులు... సమాచారం మోసినందుకు అంత పెద్ద శిక్షనా సార్?... అటు అన్నలూ నమ్మలేదు... అదును చూసి పట్టించడంకోసమే అనుకున్నారట సార్!... అందుకే అటు పోలీసులకు, ఇటు నక్సలైట్లకు యిద్దరికీ వ్యతిరేకంగా అంబేడ్కర్ సంఘాల ఆధ్వర్యంలో లక్షమందితో నిజామాబాదులో తీసిన ఊరేగింపులో నేను కూడా పాల్గొన్నాను సార్!

...సార్!... ఇపుడు మా అడుగడుగూ... అనుమానపు నీడల్లో అంచనా వేయబడుతున్నాయి. మా మాటల్లో లేని రెండర్థాల కోసం రెండు పక్షాలూ డిక్షనరీలు తిరగేస్తున్నాయి... సార్!... నిత్య నిర్బంధం వల్ల మాలోని మంట చల్లారిపోయింది... ఈ బతుకు పొగచూరిపోయింది. విప్లవం వండుకునే యింతంత వంటకు స్వేచ్ఛా ప్రాణవాయువు అందక నా యిల్లంతా పొగచూరిపోయింది... నా చరిత్రంతా మసిబారిపోయింది. ఇపుడు ఈ బతుకంతా నిప్పులేని పొగ... మా జీవితాలు యిపుడు సగం కాలిన కమురు వాసన... ఇక్కడ మనుషులిపుడు ఒక్కసారిగ మండి చావరు... నాకు మరణశిక్ష విధించండి సార్!... అటు మంటకూ యిటు బూడిదకూ కాని ఈ బతుకును ఊరితీయండి సార్!... నేను ఒక వ్యక్తిని కాదు... లక్షలాది కోట్లాది తెలంగాణా నేలతల్లిని... నా బిడ్డల్నీ చెల్లెల్లనీ మునుపటి దేవదాసీలా వేశ్య అనే బోర్డు మెడలో కట్టి నాకు మరణశిక్ష విధించండి!... నా తెలంగాణా కిపుడు స్వేచ్ఛ కావాలి... మేం రూపొందించుకున్న ఊళ్ళు మావి కావాలి... మేం అడవి నరికి సాగు చేసిన ఈ సమస్త భూములు మావి కావాలి... ఈ అభివృద్ధి ఫలాలన్నీ మాకు చెందాలి. మేం అభివృద్ధి చెందాలి. మాకు స్వేచ్ఛ కావాలి. కొంచెం బతుకు మారాలని కోరుకున్న కర్మానికి ఈ సమాజాన్నంతా మార్చే బరువును తలకెత్తిన ఏనుగుపాదాల విప్లవ వ్యూహాల బరువు నుండి కూడ స్వేచ్ఛ కావాలి. మరణశిక్ష మాకు అన్ని స్వేచ్ఛల నిస్తుంది... అందుకే ఇది నా మరణ వాఙ్మూలంగా నమోదు చేయాలని కోరుతున్నాను...

...హా...హాహా...నేను అన్ని ఏర్పాట్లు చేసుకొనే వచ్చాను సార్!... చావవలసినన్ని నిద్రమాత్రలు మింగే ఈ మరణ వాఙ్మూలం యిస్తున్నాను. నా తెలంగాణా తనను తాను ఆత్మహత్య చేసుకుంటున్నది సార్!

...ఓ నా ప్రపంచ ప్రజలారా!... కాలి కమురు కంపుకొడ్తున్న ఈ శవంతో సంభోగాన్ని అరికట్టి మానవత్వాన్ని రక్షించండి... మా స్వేచ్ఛ, సమానత్వం కోసం సహకరించండి."

పెంటయ్య అలియాస్ ప్రవీణ్ కోర్టుహాల్లో అకస్మాత్తుగా పడిపోయాడు... చివరి అరుపులకు అందరూ గుమిగూడారు... కోర్టు హాలులో కోలాహలం.... వ్యాన్.... వ్యాన్... డాక్టర్. ... డాక్టర్... ఫోన్.... ఫోన్.... అరుపులు. కోర్టుహాలు కిక్కిరిసిపోయింది. ఆ గడబిడలో న్యాయమూర్తి కలం విరిగిపోయింది.

● విపుల మాసపత్రిక – డిసెంబర్, 1997 ●

★ ★ ★

91

వి. చంద్రశేఖర రావు

# హైకూ

"సమ్‌థింక్ రాంగ్, సమ్‌థింక్ రాంగ్!" అంటూ గొణుక్కోసాగాడు హరి. క్లాసులో కూర్చోవాలనిపించలేదు. హటాత్తుగా క్లాసునుంచి బయటకు వచ్చాడు. పుస్తకాలు కళ్ళజోడు అట్లాగే టేబుల్‌పై వదిలేశాడు "సార్! మీ పుస్తకాలు." వెనుక నుంచి కుర్రాడు అరుస్తున్నాడు. వాడివైపు తీక్షణంగా చూసి "నీ పేరు అబ్దుల్లా కదూ!" అన్నాడు ఏదో గుర్తుకొచ్చిన వాడిలా.

"అవును సార్!" అన్నాడు వాడు అర్థంకాని ముఖంతో.

"అల్లా గొప్పవాడు! ధైర్యంగా ఉండు!" అంటూ ముందుకు సాగాడు. అబ్దుల్లా తెల్లముఖం వేశాడు. వాడికేం అర్థం కాలేదు.

పరధ్యానంగా అట్లాగే నడుచుకుంటూ స్టాఫ్‌రూమ్‌లోకి వెళ్ళాడు హరి. "ఏం సార్! అప్పుడే వచ్చారు. క్లాస్ అయిపోయిందా?" లక్ష్మీబాయి, తెలుగు లెక్చరర్ అడిగింది. ఆయన అదేం పట్టించుకోనట్లుగా 'ఊళ్ళో గొడవలేమయినా అవుతున్నాయా?' అన్నాడు ఆందోళన పడుతున్న ముఖంతో. "లేదే!" అంటూ ఎస్.ఎస్.రావు, ఇంగ్లీషు లెక్చరర్ వింతగా చూశాడు ఆయన వంక.

హరికి ఎందుకో కంగారుగా ఉంది. ముఖం నిండా చెమటలు పడుతున్నాయి. ఏదో చెడ్డవార్త వినాల్సి వస్తుందనే భావం లోలోపల గుబగుబలాడుతోంది. అతని గుండెల్లో పదేపదే భయంలాంటి, కంగారు లాంటి భావం. "తీతువు అరుపులాగా నా గుండెల్లో ఈ శబ్దం ఏమిటి? ఏ ఉపద్రవం రానుందో?" అని దిగులుపడ్డాడు.

లైబ్రరీవైపు వెళ్ళాడు. ఎంతో నిశ్శబ్దంగా వుండాల్సిన లైబ్రరీ గొడవ గొడవగా వుంది. "ఇన్‌డిసిప్లిన్! ఇన్‌డిసిప్లిన్" అంటూ గొణుక్కున్నాడు. "మూర్తీ ఏమైంది! ఎందుకింత కంగాళీగా వుంది లైబ్రరీ?" లైబ్రేరియన్‌పై మండిపడ్డాడు. "ఏం లేదుసార్! పావురాళ్ళు కొన్ని లోపలి గదుల్లో చేరాయి. రాక్‌లపైన కాపురం పెట్టాయి. పైనున్న గదులన్నింటిలో రెట్టలువేసి పాడుచేశాయి. ఎప్పుడూ కువకువమంటూ ఒకటే గొడవ! కుర్రాళ్ళను పంపాను తోలమని. అవి దొరక్కుండా లైబ్రరీ అంతా ఎగురుతూ గొడవ చేస్తున్నాయి." సంజాయిషీలాగా చెప్పాడు లైబ్రేరియన్. తెల్లని పావురం ఒకటి హరి ముఖాన్ని రాసుకుంటూ వెళ్ళిపోయింది. 'కువ, కువ' – హాయిగా మెత్తగా తోచింది దాని అరుపు. "పావురాళ్ళు శాంతికి చిహ్నాలు కదా!

వదిలెయ్యకపోయ్యావా?" ఏదో గుర్తుకొచ్చినవాడిలా అన్నాడు హరి. "ఊరుకోండి సార్! మీరు మరీ భావుకులైపోతున్నారు ఈ మధ్య" అంటూ ప్రేమగా కసిరాడు లైబ్రేరియన్.

లైబ్రరీ లోపలంతా హడావుడిగా వుంది. ఉష్, ఉష్ అంటూ పావురాళ్ళను తరుముతున్నారు కుర్రవాళ్ళు. వాళ్ళలో ఒకడు కసిపట్టినట్లుగా కోపంగా వాటి వెంట పరుగెడుతున్నాడు. "రిలాక్స్! రిలాక్స్! ఇది యుద్ధరంగం కాదు!" అని ఆ కుర్రాడికి చెప్పాలనిపించింది హరికి. వాడు వినే మూడ్‌లో లేడు.

వాళ్ళ హడావుడికి పుస్తకాల రాక్‌లు పక్కకు వొరిగి దబ్ దబ్ మంటూ పుస్తకాలు నేలపై జారాయి. వందలాది పుస్తకాలు మొదటి అంతస్థులోంచి కిందకు జారి నేలపై గుట్టలు గుట్టలుగా పడ్డాయి. కోపంగా పరుగిడుతున్న కుర్రవాడి చేతిలోని కర్ర తగిలి ఒక పావురం కువకువమని మూలుగుతూ నేలపై పడింది. ముక్కులోంచి రక్తం. అది గిలగిలలాడుతోంది. నేలపాలైన పుస్తకాలు, గిలగిలలాడుతున్న పావురం హరికి బాధాకరమైన ప్రతీకలా తోచింది. ఆయన లోపలి తీతువు మళ్ళీ అలజడి మొదలు పెట్టింది. ఒక అనీజీనెస్ ముఖమంతా పాకింది. "మూర్తీ! ఏమిటీ రాక్షసం? ఇట్లా పావురాళ్ళి చంపటం, పుస్తకాల్ని నేలపాలు చేయటం!" కోపంగా అరిచాడు హరి. ఎపాలజిటిక్‌గా చూశాడు లైబ్రేరియన్. "మీరట్లా పది నిముషాలు బయట నిలబడండి – క్షణాల్లో అంతా సర్దేస్తాను" అని ఆయనకు నచ్చజెప్పి "రంగారావు! ఇంక పావురాళ్ళ వేట ఆపి, పుస్తకాలు సర్దండి!" అంటూ వాళ్ళకు ఆజ్ఞలు జారీ చేశాడు లైబ్రేరియన్.

పెరుగుతున్న అనీజీనెస్‌ను ఎట్లా కంట్రోలు చెయ్యాలో అర్థం కాలేదు హరికి. "ఏదైనా మందు వేసుకుంటేనో" అని ఆలోచించాడు. బి.పి.కోసం డాక్టర్లు ఇచ్చిన 'ఎటెనలాల్' బిళ్ళలు జేబులోనే ఉన్నాయి. ఈ వచ్చిన ఇబ్బంది బి.పి.లాగా తోచటం లేదు. పూర్తిగా మానసికమైన ఇబ్బందిలాగే తోస్తోంది. గతంలో కూడా ఇట్లా వచ్చినట్లు గుర్తు. కానీ ఎప్పుడు ఎట్లా వచ్చిందో గుర్తుకు రావటం లేదు. చాలాసేపు ఆలోచించి, ప్రస్తుతానికి ఒక ఎటెనలాల్ టాబ్లెట్టు వేసుకుందాం అని నిర్ణయించుకున్నాడు.

క్యాంటీన్‌కి వెళ్ళి ఒక కాఫీ ఆర్డర్ చేశాడు. క్యాంటీన్ కుర్రవాళ్ళతో కిక్కిరిసి ఉంది. నలుగురైదుగురు కుర్రవాళ్ళు బల్లలపై విలాసంగా కూర్చున్నారు. వాటిచుట్టూ ఒక పెద్ద గుంపు. స్టీరియోలో వస్తున్న సినిమా పాటకు రెస్పాన్స్‌గా టేబుల్‌పై తాళం వేస్తున్నారు. ఒకళ్ళిద్దరు ఆ పాటను హమ్ చేస్తూ డాన్స్ చేస్తున్నారు. వాళ్ళు ప్రపంచాన్ని పట్టించుకోనంతగా ఆ పాటలో లీనమై పొయ్యారు. హరి రాకను కూడా గమనించలేదు. ఇద్దరు కుర్రవాళ్ళు మాత్రం మేనేజర్‌తో పెద్ద పెద్దగా వాదిస్తున్నారు. కాసేపటికి మేనేజర్ ఓడిపోయినట్లుగా ముఖంపెట్టి స్టీరియో ఆపివేశాడు. హఠాత్తుగా ఆగిపోయింది. డాన్స్ చేస్తున్న కుర్రవాళ్ళలో ఒకడు "ఇట్ ఈజ్ బార్బేరియస్!" అంటూ పెద్దగా అరుస్తూ కౌంటర్ దగ్గరకు వెళ్ళాడు. "ఇట్ ఈజ్ ఇన్‌సల్టింగ్ అవర్ సెంటిమెంట్స్." కౌంటర్ దగ్గరనున్న కుర్రవాడు వాదిస్తున్నాడు. హరి వాణ్ణి గుర్తుపట్టాడు. అబ్దుల్లా, పొద్దున పలకరించిన డిగ్రీ స్టూడెంట్. "ఈ పిల్లలెందుకు ఇట్లా

పోట్లాడుకుంటున్నారు?" అనుకుంటూ విసుగ్గా కౌంటర్ దగ్గరకు వెళ్ళాడు హరి. "వాట్ ఈజ్ హాపెండ్ అబ్దుల్లా?" విసుగ్గానే అడిగాడు. "చూడండి, ఆ ఒక్కపాట పెట్టొద్దంటే వినటం లేదు" అంటూ కంప్లైంటు చేశాడు. "ఏం పాటది?" ఆసక్తిగా అడిగాడు హరి. "అదే...." ఆ పాటను పలకడానికి ఇష్టపడలేదు అబ్దుల్లా. "ముస్తఫా, ముస్తఫా, డోంట్ వర్రీ ముస్తఫా!" పక్కనున్న కుర్రాడు హమ్ చేస్తున్నట్లుగా చెప్పాడు. కాసేపు ఏం మాట్లాడాలో అర్థంకాలేదు వారికి. "ఓకే! ఆపేస్తానన్నానుగా" కౌంటర్‌లో మేనేజర్ సర్ది చెబుతున్నాడు. అబ్దుల్లా కోపంగా బయటకు వెళ్ళాడు. హరి కూడా విసుగ్గా బయటకు నడిచాడు. "ఏం పాడుచుకొచ్చింది...... గాడెస్ సరస్వతికి బట్టలు లేకుండా బొమ్మలేసినప్పుడు..." మిగిలిపోయిన కుర్రవాళ్ళు స్వీపింగ్ కామెంట్స్ పాస్ చెయ్యటం మొదలుపెట్టారు. "స్టాపిట్!" పెద్దగా అరిచాడు హరి. తేనెపట్టు చెదిరి ఈగలు ఝుమ్మని రొదపెట్టినట్లుగా అయిపోయారు పిల్లలు. "నేనేనా? ఎందుకింత ఉద్రేకం నాకు?" అని తనలో తాను అనుకున్నాడు హరి. పిల్లలందరూ లోలోపల గొణుక్కుంటూ బయటకు వెళ్ళారు. కాంటీన్ ఖాళీ అయింది. ఆ నిశ్శబ్దంలో మళ్ళీ 'అలజడి' పెరగటం మొదలుపెట్టింది హరికి.

స్టాఫ్ రూమ్ వైపు నడిచాడు హరి. క్యాంటీన్‌లో మళ్ళీ "ముస్తఫా ముస్తఫా!" పాట వినబడటం మొదలుపెట్టింది. బయటకు వెళ్ళిన కుర్రవాళ్ళు మళ్ళీ కాంటీన్‌లోకి వెళ్ళటం మొదలుపెట్టారు పాటను హమ్ చేసుకుంటూ. లైబ్రరీ దగ్గర పావురాళ్ళ వేట ఇంకా కొనసాగుతోంది. ఒక కుర్రవాడు లైబ్రరీ పైకి ఎక్కి బురుజులాగా ఉన్న ప్రదేశాన్ని కర్రతో తొలుస్తున్నాడు. గూడులోపల వున్న పావురాళ్ళు భయంతో టప్‌టప్ మంటూ పైకి లేచాయి. వాటి అరుపులతో ఆకాశం గొడవ గొడవగా ఉంది. ఫెళఫెళమంటూ గూడు కూలిపోయింది. అప్పుడు హఠాత్తుగా ఏదో మెరిసింది హరికి. తన మనస్సు లోపలి అనీజీనెస్‌కు కారణం అర్థమైంది. ఆ వేళ డిసెంబర్ ఆరు.

ఎస్.ఎస్.రావు ఎదురైనాడు. "క్లాసులు లేవు. ఇంటికి వెళుతున్నాను. మీరూ వస్తారా, ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను" అన్నాడు. "క్లాసు లెందుకు లేవు?" కంగారుగా అడిగాడు హరి. "ఊళ్ళో గొడవలుగా ఉన్నాయుట. కలెక్టర్ ముందు జాగ్రత్తగా ప్రొహిబిషన్ అర్డర్స్ ఇచ్చారుట!" హరి గుండెల్లో అలజడి తీవ్రమైంది. గుండెలోపల దబ్‌దబ్ మంటూ చప్పుడు. గుండె ఆగిపోతుందేమో అని భయపడ్డాడు హరి.

ఎస్.ఎస్.రావును వెళ్ళిపొమ్మని చెప్పాడు. హరి ఒక్కడే స్టాఫ్ రూమ్‌వైపు వెళ్ళాడు. హరికి చాలా దిగులుగా ఉంది. ఎవరైనా ఓదారిస్తే బాగుండు ననిపించింది. కుర్రవాళ్ళు హుషారుగా, ఆనందంగా ఇళ్ళకు వెళ్ళటం ఏమీ బాగా లేదనిపించింది. "కులాసాగా ఉండాల్సిన సమయం కాదర్రా! కళ్ళముందరో శవం వుంది!" అని పెద్దగా అరవాలనిపించింది.

యాభై ఆరేళ్ళ హరికి హిస్టరీ అధ్యాపకుడుగా పెద్ద పేరుంది. అమరావతి దగ్గర వున్న ఆర్కియోలాజికల్ తవ్వకాల్లో ఆయనకు గొప్పపేరు వచ్చింది. ఎంచేతనో బ్రహ్మచారిగా ఉండిపోయేడు. ధార్మికుడిగా, మేధావిగా ఆయనకెంతో పేరు. చరిత్రను కొత్త కోణంలోంచి చూసిన ఆధునికుల్లో ఒకడుగా ఆయనగురించి చెప్పుకుంటారు.

స్టాఫ్‌రూమ్‌లో హరి ఒక్కడే కూర్చుని ఉన్నాడు. కాలేజీ మెల్లమెల్లగా నిర్మానుష్యం అయ్యింది. వాచ్‌మెన్ తలుపులు మూసివేసుకొంటున్న సమయానికి హరి మెల్లగా లేచాడు. చిన్న చేతిగుడ్డ సంచిలో పుస్తకాలు సర్దుకొని బయటకు అడుగులు వేశాడు.

బజారులన్నీ భయాన్నీ, దిగుల్నీ ముఖంపై తొడుక్కున్నాయి. షట్టర్లన్నీ మూసివేస్తున్నారు షాపువాళ్ళు. ఆటోరిక్షాలు, స్కూటర్లు వేగంగా పరుగులు తీస్తూ కళ్ళముందు నుంచి అదృశ్యం అవుతున్నాయి. రెండు మూడు జీపుల్లో పోలీసు దళాలు తరలివెళ్తున్నాయి. అట్లాగే వీధుల్లో మొండిగా నడవటం మొదలుపెట్టాడు హరి.

వీధులన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి. కానీ పెనుశోకం ఏదో వినబడీ వినబడక వెంటాడుతున్నట్లుగా ఉంది. అంతటి నిశ్శబ్దంలో ఒక దృశ్యం హరిని చటుక్కున ఆకట్టుకొంది. విశాలమైన వీధిలో అతనొక్కడే. పన్నెండేళ్లు కూడా ఉండవు. స్కూలు యూనిఫారంలో ఉన్నాడు. కుంచె, రంగుడబ్బా, ఏకాగ్రతతో గోడపై నినాదమేదో రాస్తున్నాడు. గొప్ప దృశ్యం. ప్రపంచమంతా శూన్యమై, వాడొక్కడే మిగిలినట్లుగా, రేపటికోసం ఇవాల్టి చరిత్రను రాస్తున్న చిట్టచివరి మానవుడిలా.

దృశ్యం చెదిరింది. పోలీసు జీపు అటుగా వెళుతూ వాడిపక్కనే ఆగింది. అందులోంచి ఖాకీమృగం. కాలరు పట్టుకొని ఆ కుర్రవాణ్ణి వెనక్కులాగి, నేలపై విసిరికొట్టి, నునుపైన, మృదువైన వాడి చర్మంపై లాఠీతో బాది "ఫో! పరిగెత్తు! ఈ మధ్యన కనిపించావంటే చంపేస్తాను!" అంటూ గర్జిస్తున్నాడా పోలీసు.

కుర్రవాడు పక్కవీధిలోకి పరుగెత్తాడు. జీపు వెళ్ళిపోయింది. ఒక హింస తాలూకు చిహ్నాలు మాత్రం అక్కడ ఉన్నాయి. డబ్బాలోని ఎర్రరంగు ఒలికిపోయింది. కుంచె ముక్కలు ముక్కలయింది.

హరి అటువైపు నడిచాడు. గోడపైన పూర్తికాని నినాదం. గోడపైన పూర్తికాని నినాదం. "లెట్ అజ్ ఆల్ లివ్ ఇన్‌పీస్!" అంటూ ఇంగ్లీషులో రాసి ఉందా నినాదం. ఆ నినాదం కిందనున్న మూడు పంక్తుల కవిత ఒకటి హరిని ఆకట్టుకొంది.

"ఒక స్వప్నం ఇంకా మిగిలిఉంది.
వేసవిలో మొలిచే పచ్చికలా
రండి, పావురాళ్ళి పెంచుదాం!"

క్షణంపాటు విస్మయం చెందాడు హరి. భక్తితో కిందకు వంగి, విరిగిపోయిన కుంచె తాలుకు ముక్కల్ని ఏరుకుని సంచిలో దాచుకున్నాడు. గొప్ప ఏంటిక్ సంపద పొందినట్లుగా అనిపించింది హరికి.

● ఆంధ్రజ్యోతి వారపత్రిక – *14 మార్చి, 1997* ●

★ ★ ★

92

కాలువ మల్లయ్య

# భద్రత

ప్రత్యేక తెలంగాణా ఉద్యమ కాలంలో నేను హైస్కూల్ చదువులో ఉన్నాను. శ్రీకాకుళ పోరాటాలాగి తెలంగాణాలో పోరాటాలు వేళ్ళూనుకుంటున్న సమయంలో డిగ్రీ చదువుతున్నాను. రాజేశ్, విజయ్, చక్రవర్తి నాకు క్లాస్‌మేట్స్. మేమప్పుడెన్నో విషయాలను చర్చించుకునేవాళ్ళం......మేమెప్పుడు కల్సినా ఈ వ్యవస్థ గూర్చే మాట్లాడుకునే వాళ్ళం.

బలవంతులు దుర్బల జాతిని
బానిసలను గావించారు
నరహంతలు ధరాధిపతులై
చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి.

అంటూ శ్రీశ్రీ మహాప్రస్థానం గేయాలను రాజేశ్ ఆవేశపూరితంగా చదివే వాడు.... ఆ గేయాలు వింటున్నా, చదువుతున్నా మా రక్తం సలసలా మరిగేది..... మాలో ఆవేశం తన్నుకొచ్చేది.....

పతితులార భ్రష్టులార......బాధాసర్ప ద్రష్టులారా.....అంటూ మేం కలసి పాడుకునే వాళ్ళం..... అందులోని చాలా గేయాలు రాజేశ్‌కు కంఠతా వచ్చేవి.

"మనోహర్! ఈ వ్యవస్థ మెజారిటీగా ఉన్న దేశ ప్రజల ప్రయోజనాలను కాపాడేది కాదు.... ఇది పునాదులతో సహా మారాలి...." అనేవాడు రాజేశ్ నాతో....

నాకూ అవుననిపించేది..... శ్రీశ్రీ కోరిన మరో ప్రపంచం కోసం కలలు కంటుండే వాళ్ళం మేం..... ఆ వ్యవస్థకోసం కానరాని కాంక్షలతో నాలోనేను మథనపడుతుండేవాన్ని.... అది నాకొక స్వప్నంలాగే అనిపించేది.... శ్రీశ్రీ, శివసాగర్, చెరబండరాజుల పాటలు చదువుతుంటే మా రక్త ముప్పొంగిపోయేది.....

"ఇది మనిషిని మనిషి దోచుకుతినే సమాజం..... మనిషిని మనిషిగా చూసే సమాజం కావాలి మనకు. అందుకోసమే పోరాటాలు జరుగుతున్నాయి. మనోహర్! నా వంతు పాత్ర నేను నిర్వహిస్తాను...." అన్నాడోసారి నాతో రాజేశ్.

రాజేశ్ మాటలు నిజమే అయినా, నాకూ అందులో దూకుదామన్నంత ఆవేశం వచ్చినా ఎందుకో ఆ మాటలు విని భయపడ్డాను.... ఇలా అయితే చదువులేంకావాలి....? నాపై ఎన్నో ఆశలు పెట్టుకున్న తల్లితండ్రులేం కావాలి? అనుకున్నాను..... నా

కందులోకి పోయేధైర్యం లేకున్నా ఆ ఉద్యమమంటే సానుభూతుండేది..... అది విజయవంతం కావాలని మనసారా కోరుకునేవాన్ని......

"ఈ చదువులు కేవలం గుమస్తాలను తయారుచేయడానికే ఉపయోగపడ్తాయి.... ఇవి నిరర్థకం.... ఈ చదువుల కోసం దశాబ్దాల కాలం వృధా చేసుకుంటున్నాం...." అన్నాడు నాతో ఓరోజు.....

"రాజేశ్ ఆ వ్యవస్థ రావాలి నిజమే.....కాని అది మననుంచవుతుందా? చదువులను నిర్లక్ష్యంచేస్తే తల్లితండ్రుల గతేంకావాలి?" అన్నాను....

"మనం మన తల్లిదండ్రుల గూర్చి మాత్రమే ఆలోచిస్తున్నాం.... మనోహర్! ఉద్యమకారులు చెరలో ఉన్న మన దేశమాత గూర్చి ఆలోచిస్తున్నారు...." అని నా నోరు మూయించాడు రాజేశ్.....

రాజేశ్ రాత్రుల్లో గోడలపై రాతలు రాయడం, కరపత్రాల్లాంటివి పంచడం చేస్తుండేవాడు. క్రమక్రమంగా చదువును నిర్లక్ష్యం చేసి అందులోనే కూరుకుపోతున్నాడు. నాకూ ఎంతో ఆవేశంవున్నా నన్ను నేను అదుపులో పెట్టుకుంటూ చదువులో నిమగ్నమయ్యేవాన్ని.... రాజేశ్ పనులకు భయపడి చక్రవర్తి, విజయ్ దూరముండటం మొదలుపెట్టారు. నాకుమాత్రం రాజేశంటే అపరిమితమైన ప్రేమ...... వాళ్ళుకోరే వ్యవస్థ రావాలన్నంత తపన... తప్పకుండా వస్తుందన్న ఆశ.....

మా డిగ్రీ పూర్తయ్యేసరికి రాజేశ్ పూర్తిగా ఉద్యమాల్లో లీనమైపోయాడు.... అప్పుడప్పుడే గ్రామాల్లో ఉద్యమాలు ఉధృతమవుతున్నాయి.... డిగ్రీ సర్టిఫికెట్ భ్యాగులో వేసుకొని నేనుద్యోగం కొరకు కాళ్ళరిగేలా తిరుగుతున్నాను.... రాజేశ్ పేరును పేపర్లలో చూస్తున్నాను..... రాజేశ్ మాట్లాడే బహిరంగ సభలకు జనాలు వేల సంఖ్యలో వస్తున్నారని వింటున్నాను. ఉద్యోగం దొరకడం ఆలస్యమవుతున్న కొద్దీ నాకీ వ్యవస్థపై కోపం పెరుగుతుంది. ఉద్యమాల్లో దూకుదామన్నంత ఆవేశమొస్తుంది.... రాజేశ్ జ్ఞాపకం వస్తున్నాడు.... అయినా ఉద్యోగ ప్రయత్నాలు తీవ్రంగానే చేస్తున్నాను. చాలా కాలంవరకు ఉద్యోగం దొరుకకుంటే ఏం జరిగేదో కాని నాకు త్వరలో ఉద్యోగం దొరికింది.

ఉద్యోగంలో చేరిన రోజున నేనెంతో సంతోషించాను. మా కుటుంబ సభ్యుల ఆనందానికైతే అంతే లేదు.... మా వంశంలోనే మొట్టమొదటి ప్రభుత్వ ఉద్యోగిని నేను..... పెళ్ళి, పిల్లలతో పాటు క్రమక్రమంగా ఉద్యోగంలోనూ ప్రమోషన్లతో ఎదుగుతున్నాను నేను. అటు రాజేశ్ రహస్య జీవితానికెళ్ళి ఉద్యమంలో ప్రముఖపాత్ర వహిస్తున్నట్టు వార్తలు చదువుతున్నాను. పదేళ్ళ తర్వాత మొట్టమొదటిసారిగా "రాజేశ్ ఏదో ఉద్యోగం చేస్తూ హాయిగా బతుకక ముండ్లబాట నెందుకెన్నుకున్నాడు?" అనుకున్నాను నాలోనేను.

స్వల్పమైన ఒడిదుడుకులున్నా నా జీవితమిప్పుడు సాఫీగానే సాగిపోతుంది. నేనిప్పుడు ఆలోచించడం మానుకొన్నాను. ఇతర విషయాల గూర్చి పట్టించుకోవడమూ మానుకున్నాను. నేను, నా ఉద్యోగం, నా భార్య పిల్లలు, కుటుంబం – ఇంతవరకే నా జీవితాన్ని పరిమితం చేసుకున్నాను..... నా పిల్లల ఉజ్వల భవిష్యత్తు కొరకు, వాళ్ళ పైచదువుల కొరకు కొంతైనా డబ్బు కూడబెట్టాలని ప్రయత్నిస్తున్నాను.

నాముందిప్పుడు ఒకే లక్ష్యముంది..... అది నా పిల్లలు ఉన్నతోద్యోగాల్లో చేరడం లక్ష్యంగుర్తుకొచ్చి ఆవేశాన్నణచుకున్నాను..... దేశం అభివృద్ధి చెందలేదనడం, వ్యవస్థపై కసిపెంచుకోవడం అర్థంలేనిదనిపిస్తుంది నాకిప్పుడు......

గ్రామాల్లో కొన్ని మార్పులు చోటు చేసుకోవడం నా దృష్టిని దాటిపోలేదు.... రాజేశ్‌కు ఎన్నో హింసాయుత సంఘటనలతో సంబంధమున్నట్టు, తన ఉద్యమంలో ఎంతో ఉన్నతస్థానాని కెదిగిపోతున్నట్టు వార్తాపత్రికల ద్వారా తెలుసుకుంటున్నాను..... అయితే క్రమక్రమంగా నాకు వాళ్ళ పనులు కేవలం తీవ్రవాద పనులుగానే కనబడ సాగాయి..... వ్యవస్థ మార్పుకు హింస తప్పదని ఒకప్పుడు చదువుకున్నా, వాళ్ళ చర్యలు హింసాపూరితమైనవిగానే అగుపడుతున్నాయి..... దోపిడీ, వంచనంటూ వాళ్ళు చేసే పనులన్నీ అతివాద పనులుగానే తోస్తున్నాయి..... విద్యార్థి దశలోని ఆదర్శాలు, ఆశయాలు, భావాలు, ఉద్యమాలపట్ల ఆసక్తి క్రమక్రమంగా దూరమవుతున్నాయి. వేడి రక్తంలో ఉన్నప్పుడు నా చుట్టూ ఉన్న ప్రాంతంలో ఉద్యమాలు ఉవ్వెత్తున లేస్తూ మా ప్రాంతమంతా అల్లకల్లోలమవుతున్న అగ్నిగుండంగా మారినా నేనేమీ పట్టించుకోవడం లేదు....

నాకిప్పుడీ సమాజంలో భద్రత ఉన్నట్టే అనిపిస్తుంది..... నాకుద్యోగమిచ్చి ఎంతో కొంత సుఖంగా బతకడానికి దోహదం చేసిన ఈ వ్యవస్థపై నాకు నమ్మకం పెరుగుతుంది. ఎవరి పనులు వారు చూసుకోక సమాజంలో ఏదేదో ఉందని గొంతు చించుకోవడం అనవసరమనిపిస్తుంది.... ఉద్యోగంలోనూ, జీవితంలోనూ కొంతకొంత ఎదుగుదల రావడం వల్ల నా భద్రతపై మరింత నమ్మకం పెరుగుతుంది. అందుకోసం నాకు శక్తికి మించిందే అయినా నా పిల్లలను మంచి ప్రైవేటు పాఠశాలలో చదివిస్తున్నాను. వాళ్ళ ఉన్నతిని చూడటమే ధ్యేయంగా, చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష అనుకుంటూ బతుకుతున్నాను.

నా డిగ్రీ చదువయిపోయి దాదాపిరవై ఏళ్ళయింది...... నా పిల్లలిప్పుడు హైస్కూలు చదువుల్లో ఉన్నారు. నా ఉద్యోగం ఫర్వాలేదు... నా మిత్రులు చక్రవర్తి, విజయ్ మంచి ఉద్యోగాల్లో స్థిరపడిపోయారు. రాజేశ్ ఉద్యమంలో తలమునకలవుతూ సుప్రీమ్ స్థితికి చేరుకున్నట్టు వార్తల వల్ల తెలుస్తుంది. మిత్రులు కలిసినప్పుడు మేం రాజేశ్ గూర్చి మాట్లాడుకుంటుంటాం.... మా మిత్రుల్లో అతడొక్కడే అలా అయ్యాడని జాలిపడుతుంటాం... రాజేశ్ కోరి కష్టాలను తెచ్చుకున్నాడని సానుభూతి చూపుతుంటాం.... మాకు మేం మంచిగానే ఉన్నామని సంతృప్తిపడ్తుంటాం.... మాకున్న జీవిత భద్రత గూర్చి ముచ్చటించుకుంటాం.... ఉద్యమం పేరు మీద జరుగుతున్న రక్తపాతం గూర్చి చర్చించుకుంటాం.... మొత్తంగా వ్యవస్థతో రాజీపడి సంతృప్తిగానే బతుకున్నామనుకొని బతుకుతున్నాం.

జీతం ఫర్వాలేదనిపించినా పిల్లల ఉన్నత చదువులకు మరింత డబ్బు సంపాదించాలన్న ఉద్దేశ్యంతో ఓ ప్రముఖ పత్రికకు విలేఖరిగా చేరాను.... డ్యూటీ అయిపోయింతర్వాత నాకా పనే.... విలేఖరిగా చేరింతర్వాత నాకనేక విషయాల గూర్చి తెలుసుకోవాల్సిన అవసరమేర్పడింది. అందువల్ల నా అధ్యయనాన్ని విస్తృతం చేయాల్సి వచ్చింది.

ఓ రోజు రాజేశ్ తలపై ఐదు లక్షలు ప్రకటించిన ప్రభుత్వ ప్రకటన వార్తా పత్రికల్లో చూసి తెల్లబోయాను. నా ఆలోచనలు రాజేశ్ పైకి మళ్ళాయి.

అడవుల్లో రహస్యజీవితం గడుపుతూ వీళ్ళేం సాధించదలుచుకున్నారు....? వీళ్ళు ఎండమావుల వెంట పరుగిడుతున్నారా.....? వీళ్ళలో ఎంతమంది చురకత్తుల్లాంటి యువకులు బలైపోయారు....? ఇంకెంత మంది బలికానున్నారు....? ఇదంతా ఏంటి.....?' నాలో ఎన్నో ప్రశ్నలు..... సమాధానాల కోసమై కొన్ని పుస్తకాలో చదివాను.....

ఇప్పుడా పార్టీకే అధినాథుడైన చిన్ననాటి మిత్రుని ఒక్కసారి కలుసుకుంటే బాగుండునని అనేక సార్లనుకున్నాను.

ఆ అవకాశం మా పత్రిక తరఫున విలేఖరి రూపంలో నాకు, అమర్‌కు దొరికింది. మా పత్రిక ఆతనితో ఇంటర్వ్యూ ప్రచురించడానికి ఎన్నోసార్లు ప్రయత్నించి విఫలమైంది. అనుకోకుండా రాజేశ్ ఇంటర్వ్యూ ఇవ్వడానికి మా పత్రికకు రహస్య సందేశం పంపాడు. నేను, అమర్ రాజేశ్ అనుచరులతో కొన్ని పదులమైళ్ళు అడవిలో నడిచి స్థావరం చేరుకున్నాం. రాజేశ్‌ను చూడగానే నా ఇరవై ఏళ్ళక్రితపు కాలేజీ జీవితం జ్ఞాపకం వచ్చింది..... మేం చదివిన పుస్తకాలు జ్ఞాపకం వచ్చాయి. చర్చించిన విషయాలు మదిలో మెదిలాయి. ఆ తర్వాత మా మార్గాలు వేరు కావడం కళ్ళముందు కదిలాయి.... ఎంతో చురుకైన రాజేశ్, చీమకైనా హానితలపెట్టని రాజేశ్ రక్తసిక్త రాజకీయాల్లో మునిగి తేలుతున్నాడంటే, ఆ పార్టీకే నాయకత్వం వహిస్తున్నాడంటే నాకు నమ్మశక్యం కాకుండా ఉంది.... అయినా నా కళ్ళెదుటే ఆతడుంటే కాదనడమెలా?

రాజేశ్‌ను నేను కౌగిలించుకోబోయాను..... నన్ను వారించి చేతిలో చేయికలిపాడు..... నా మిత్రునికీ చేయికలిపాడు.

"బాగున్నవా మనోహర్....?" అడిగాడు రాజేశ్. తలూపాను నేను.

అమర్‌ను, నన్ను కూర్చోమన్నాడు.... మాకెదురుగా తానూ కూర్చున్నాడు. ఆతని చుట్టూ నలుగురైదుగరు ఆయుదాలతో నిల్చొనున్నారు..... దూరంగా మరో నలుగురు కాపలా కాస్తున్నారు.

రాజేశ్ దిక్కు పరీక్షగా చూసాను..... ఎండలో తిరిగినవాడికున్నట్టుగా ముఖం మాడిపోయింది. చూస్తేనే మధ్య వయసు వాడిలా కనబడుతూ ఉన్నాడు.... మునుపట్లాగే బక్కపలుచగానే ఉన్నాడు. ముఖంలో అదే చురుకుదనం.... ఎంతో మంది భూస్వాములు ఊళ్ళొదిలి పెట్టడానికి కారణమైన పార్టీకి, ఎంతో అల్లకల్లోలం మార్పుకు మూలమైన పార్టీకి నాయకత్వం వహించి పార్టీ సిద్ధాంతాల గూర్చి, వ్యవస్థ గూర్చి అడిగిన రెండు మూడు ప్రశ్నలకు ఏ మాత్రం తొణకకుండా జవాబులిచ్చాడు రాజేశ్..... ఎంతో పరిణతి చెందినవాడిలా సమాధానా లిచ్చాడు..... ఎట్టి పరిస్థితిలోనూ తానెన్నుకున్న మార్గం తప్పవుతుందని తాననుకోవడం లేదని ఆతని మాటల వల్ల అర్థమవుతుంది.... వాళ్ళ హింసాకాండ గూర్చి ఆతని ముఖంలో పశ్చాత్తాపం కనబడుతుందనుకున్న నాకు నిరాశే మిగిలింది. ఆతని భావాల్లో ఏ మార్పూ కనపళ్ళేదు.... కొద్ది క్షణాలాగి నన్ను చూసి నవ్వాడు రాజేశ్....

ఆ నవ్వులో నాకెన్నో అర్థాలు కనిపించాయి. నన్నేదో బచ్చాగాడనుకుంటున్నట్టుగా నావైపు జాలిగా చూస్తూ నవ్వినట్టనిపించిది..... దినదినగండంలా బతుకుతున్న అతని బతుకును చూసి నేను జాలిపడాల్సిందిపోయి హాయిగా బతుకుతున్నాననుకుంటున్న నాపై జాలి చూపడం నాకు రోషం తెప్పించింది.... ఎంత గడగడలాడించే పార్టీ నేతయినా ఒకప్పటి సహపాఠేనన్న ధైర్యముంది నాకు... అతన్ని ఏకవచనంలోనే సంబోధించాలనుకున్నాను.

"రాజేశ్! ఈ అడవిలో క్రూరజంతువుల మధ్య అటు పోలీసుల భయంతో ఇటు జంతువుల భయంతో బతకడం దేనికి....? ప్రభుత్వం నీకుద్యోగ మిస్తానన్నప్పుడు విరమించుకుంటే సరిపోయేది.... ఏదో ఉద్యోగం చేసుకుంటూ బతుకక ఎందుకిలా భయంభయంగా బతకడం....? ఎందుకీ నిప్పుతో చెలగాటం....? మీరా వ్యవస్థనే కొండను ఢీకొంటున్నారు..... పిడికెడు మందున్నారు మీరు.... మీ వల్ల ఇది సాధ్యమవుతుందా......?" అన్నాను.

నా మాటల కాతని ముఖంలో రంగులు మారాయి..... కొద్ది క్షణాలు మౌనంగా ఉండి మెల్లగా అన్నాడు:

"మనోహర్.....! ఆ మానవారణ్యంలో కంటె ఈ అరణ్యామే సురక్షితమైందని భావిస్తాం మేం...... ఈ క్రూరజంతువులు మానవ మృగాలకంటె భయంకరమైన వేంకావు..... మేం పిడికెడు మందిమే ఉన్నామని నీ ఉద్దేశ్యమా.....? మా వెంట వేలాది జనమున్నారన్న విషయం మరచిపోవద్దు..... ఇక భయం గూర్చి... ఏ క్షణంలో ఏ రూపంలో మృత్యువు ముంచుకొస్తుందో మాకు తెలియదు. వ్యవస్థ మార్పుకోసం మేం మృత్యువును కౌగలించుకోవడానికి ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాం. మాకు చావంటేనే భయం లేనప్పుడింకేం భయముంటుంది....? మేం జీవితంలో చచ్చేది ఒకేసారి..... మరి మీరో....? మనోహర్!.... ఒక్కసారి గుండెమీద చెయ్యేసుకొని చెప్పు....! మీకెన్ని రకాల భయాలున్నాయో ఒక్కసారి ఆలోచించు.... బతుకు భయం..... రక్షణ విషయంలో భయం... ఇంకా ఎన్నో భయాలు మిమ్మల్ని వెంటాడుతూనే ఉంటాయి. మీరు భయం లేకుండా బతికిందెప్పుడు? మీరనుక్షణం భయంలో చస్తూనే బతుకుతుంటారు.... కాదంటావా....?"

ఆ మాటలతో నా తల తిరిగింది. 'అవును.... నాలాంటివాడు ఈ వ్యవస్థలో నిర్భయంగా బతికిందెప్పుడు.....' నన్ను నేనే ప్రశ్నించుకున్నాను.... తల్లి కడుపులో ఉన్న ఆ తొమ్మిది నెలలు మాత్రమే మనిషి నిజంగా బతికేదన్న కవిగారి మాటలు జ్ఞాపకం వచ్చాయి.... అయినా నాకీ వ్యవస్థను ప్రేమించడమే ఇష్టం..... 'దేశం నాకేమిచ్చింది....? అనే దానికంటె దేశానికి నేనేమిచ్చాను.....?' అని ఆలోచించాలన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి.... అదే ప్రశ్న రాజేశ్‌కు వేసి అతన్ని చిక్కుల్లో పెట్టానని సంతోషించాను.....

నా మాటలనేం సీరియస్‌గా తీసుకున్నట్టు లేదు రాజేశ్..... "నిజమే. నీ ప్రశ్న చాలా బాగుంది.... మొదలు దేశానికి నువ్వేమిచ్చావో చెప్పు..... నువ్వంటే నువ్వొక్కడవేకాదు.... నీలాగా జీవించేవాళ్ళు.... నువ్వు నీ భార్య, పిల్లలు, సంసారం, ఉద్యోగం, సుఖం, ప్రమోషన్, నీ బతుకంటూ గిరి గీసుకొనున్నావు.... సమాజంలో

ఎన్నో సమస్యలున్నా, ఎన్నెన్నో అవాంఛనీయ సంఘటనలు జరుగుతున్నా ఎప్పుడైనా పట్టించుకున్నావా....? మరి మేం చేస్తున్నదేంటి....? దోపిడీ, పీడన లేని వ్యవస్థ కోసం మా ప్రాణాలను పణంగా పెడ్తున్నాం.... దేశమంటే మట్టి, చెట్లు, గుట్టలు కావు మనిషన్న విషయం నీకు తెలుసుకదా....! ఆ మనుషుల మంచి బతుక్కొరకే మా ఈ పోరాటాలన్నీ....."

రాజేశ్ మాటలు నా హృదయానికి సూటిగా తగిలాయి..... చాలాకాలంగా నేను బతుకుతున్న బతుకుగూర్చి ఎప్పుడూ ప్రశ్నించుకోని నాకు నన్ను నేను ప్రశ్నించుకునేలా చేసాయామాటలు..... రాజేశ్ ప్రశ్నలకు జవాబులివ్వకుండానే మరో ప్రశ్న వేసాను.

"ఏ ప్రజల కొరకైతే పోరాటాలు చేస్తున్నారని మీరనుకుంటున్నారో ఆ ప్రజల బతుకులు మీ పోరాటాల వల్ల ఎంత అల్లకల్లోమవుతున్నాయో మీరెప్పుడైనా ఆలోచించారా....? పోరాట ప్రాంతాలు అగ్నిగుండాల్లా మారి, ప్రజల బతుకు దిన దిన గండంలా ఉంది....."

నా ప్రశ్న రాజేశ్‌కు నచ్చలేదని అతని ముఖం చూస్తేనే తెలుస్తుంది. "వ్యవస్థలో మార్పు జరుగుతున్న కాలంలో ఇలాంటివి తప్పవు....." అన్నాడు.... "మనోహర్ ప్రశ్నను జెనరలైజ్ చేసి దాటవేస్తున్నారు మీరు.... వ్యవస్థ మార్పును మీరు తీసుకొస్తారా....? లేక ప్రజలు తెచ్చుకోవాలా....? మాస్ జనాలు చేయాల్సిన పనిని అడవుల్లో ఉండి మీరు చేయడం ఎలా సాధ్యమవుతుంది......?" అన్నాడు అమర్.....

రాజేశ్ ముఖం ముడతలు పడింది.

"మాకు ప్రజాబలం లేందే ఇన్ని రోజులుగా ఎలా ఉండగలుగుతున్నాం....? పోరాట ప్రాంతాలను ఎలా విస్తరించుకోగలుగుతున్నాం? మొదట్లో ఒక్కచోట ప్రారంభమైన ఉద్యమం క్రమక్రమంగా ఎన్ని రాష్ట్రాలకు విస్తరించిందో మీకు తెలియదా.....? ఇంకా ప్రజల ఇన్‌వాల్వ్‌మెంట్ పెరుగాలన్నమాట నిజమే అయినా, దానికి సమయం పడుతుంది. మాది ఒక్కరోజులో పూర్తయ్యే పోరాటం కాదని గుర్తుంచుకోవాలి సినిమాల్లోవలె హూష్ అంటే వచ్చే మార్పుకాదు...." అన్నాడు.

"మేం ఆ విషయాన్ని కాదనడం లేదు..... కాని ఏ ఉద్యమం విజయవంత మవడానికైనా ప్రజలు చైతన్యవంతులు కావాలి..... మాకిది కావాలని వాళ్ళే కోరుకోవాలి...... ఎవరో చేసిపెట్టడంకాదు.... మొదట్లో సంగతి వేరు కాని ఇప్పుడైతే మీ ఉద్యమాన్ని చూస్తే అలా అనిపించడం లేదు. వ్యక్తిగత కారణాలతోనో, మరే కారణాలతోనో వచ్చినవాళ్ళే ఎక్కువున్నారు తప్ప పోరాట ఉద్దేశ్యాన్ని అర్థం చేసుకొని వచ్చినవాళ్ళు తక్కువనిపిస్తుంది..... అంతేకాకుండా మిమ్మల్ని హంతకులుగా, డబ్బులు వసూలు చేసుకొనేవాళ్ళుగా కూడా అనుకుంటున్నా రెంతోమంది...."

నా మాటలు విని ముఖం చిట్లించాడు రాజేశ్..... అతని ముఖంలో ఏదో తెలియని బాధ కనబడింది నాకు. కొద్ది క్షణాలాగి "మనోహర్!.... ఏ వ్యవస్థలోనైనా తమకు నష్టం కలిగే విషయాలు జరుగుతున్నప్పుడు ఆ వర్గంవారు వ్యతిరేక ప్రచారం చేయడం మామూలే.... మా పోరాటాల వల్ల నష్టపోతున్న భూస్వామ్య వర్గం, ధనస్వామ్య వర్గం మమ్మల్ని దొంగలుగా, హంతకులుగా తప్పకుండా చిత్రిస్తారు.... మా వల్ల కొన్ని తప్పులు జరగడం లేదనడం లేదు.... కాని, అనుక్షణం మృత్యుముఖంలో

ఉంటూ జీవన్మరణ పోరాటాలు చేస్తున్నదెవరికోసం.....? మేం బతుకలేకనా.....? మాకు బతుకరాకనా.....? మనం విద్యార్థులుగా ఉన్నప్పుడు తెలంగాణా గ్రామాలెలా ఉండేవి.....? ఇప్పుడెలా ఉన్నాయో ఒక్కసారి చూడు..... ఈ మార్పులు మా పోరాటాల ఫలితాలు కావా.....?" అన్నాడు రాజేశ్.

మరోసారి టీ తెప్పించాడు. సెంట్రీలాతన్ని కంటికి రెప్పలా కాపాడుతున్నారు... చిన్నగా కొమ్మలూగడం, చల్లనిగాలి, మా మాటలుతప్ప అక్కడంతా నిశ్శబ్దంగా ఉంది.

ఈ విషయంలో రాజేశ్‌తో ఒప్పుకోక తప్పలేదు నాకు.... ఒకప్పటి తెలంగాణ గ్రామాలకు ఇప్పటి గ్రామాలకూ చాలా తేడా ఉంది. ఆర్థిక పరిస్థితుల్లో గొప్ప తేడాలు రాకపోవచ్చుకాని దొరా నీ బాంచెన్, అవ్వబాంచెన్, అయ్యబాంచెన్ సంస్కృతి పోయింది. నీ కాల్మొక్త అంటూ పబ్బతి పట్టుకొని నిల్చుండే జనాలే దొరలకు ప్రశ్నార్థకాలై నిలుస్తున్నారు. కొన్ని గ్రామాల్లో హరిజన యూత్‌దే పైచేయిగా ఉంది. దొరతనం, వెట్టిచాకిరీ లాంటివి చాలా వరకు దూరమయ్యాయి. ఈ మార్పులు ముఖ్యంగా పోరాటాల వల్లనేనన్నది నిజం..... కొద్ది క్షణాల్లో గ్రామాల్లోని మార్పులు నా కళ్ళముందు కదిలి రాజేశ్ మాటలకు తలూపాను.....

"ఒకప్పుడు మీ పార్టీలో రెండవ స్థానంలో ఉన్న సత్యమూర్తి, విప్లవగీతాలెన్నో రాసిన సత్యమూర్తి బయటకొచ్చాడు..... కుల రాజకీయాల్లో మునిగి తేలుతున్నాడు. మీ పార్టీలోనూ అగ్రవర్ణాల అధిపత్యముందన్న ఆరోపణలున్నాయి......"

అమర్ మాటలకు కొంత ఇబ్బందిగా ముఖం పెట్టాడు రాజేశ్..... కొద్దిసేపాగి అన్నాడు:

"ఆ ఆరోపణల్లో కొంత నిజం లేకపోలేదు. ఇప్పటివరకూ మా పార్టీ నాయకత్వం అగ్రకులాల వారి చేతుల్లో ఉండటం వల్ల అలా అనుకోవడానికి అవకాశం కలిగింది. నిజానికి మాకే కులభేదాలూ లేవు..... కుల రహిత్య సమాజం స్థాపించడమే మా ధ్యేయం..... మా పార్టీకి నాయకత్వం ఎవరు వహించినా ముఖ్యంగా మా వెంట ఉన్నది అట్టడుగు కులాలవారే, నిరంతరం దోపిడీకి, పీడనకు గురవుతున్నవారే. ఇక బయటకు రావడం సంగతి..... ఎవరి వ్యక్తిగత అభిప్రాయాలు వాళ్ళవి. కొన్ని సమయాల్లో సిద్ధాంత భేదాలూ కారణమవుతాయి."

"నేను మార్క్సిజాన్ని లోతుగా అధ్యయన మేమీ చేయలేదు. కాని కొంతవరకు చదివాను. నాకు తెలిసినంతవరకు మీరు మార్క్సిజాన్ని మనదేశ పరిస్థితులకన్వయిం చేట్టు కాకుండా సైన్సులాగా, మారని శాస్త్రంలాగా అన్వయించేట్టు చూస్తున్నారు. ప్రతిహింస పేరు మీదనో, మరో పేరుమీదనో మీరు రక్తపాతాన్ని సృష్టిస్తున్నారు. ఇది సరియైందేనా.....?" అన్నాను.

వేళ్ళతో నొసలును టపటప కొట్టుకున్నాడు రాశేజ్....

"ఇది మిడిమిడి జ్ఞానంతో చేస్తున్న విమర్శ. దేశ పరిస్థితుల కనుగుణంగానే మేము అన్వయించడానికి ప్రయత్నిస్తున్నాం. ముఖ్యంగా మేం చేస్తున్నది ప్రతిహింసే కాని హింస కాదు..... ఒక్కొక్కప్పుడది మా అదుపు దాటిపోవచ్చు...." అన్నాడు.

ఇంకేం ప్రశ్నలు వేయాలో నాకర్థం కాలేదు... ఈలోగా "మనదేశంలో ఇన్ని మతాలుండగా మీరు హిందూమతాన్నే ఎందుకెక్కువగా విమర్శిస్తారు....? మిగతా మతాలు మంచివనా మీ ఉద్దేశ్యం......?" అన్నాడు అమర్.

"మీరు పొరపడుతున్నారు.... మాకేమతమైనా ఒక్కటే.... మతం మత్తుమందన్నది అన్ని మతాలకూ వర్తిస్తుంది..... హిందూమత ధోరణులు మరింత ప్రమాదకారి కాబట్టేమేం దాన్నెక్కువ విమర్శిస్తాం..... మాకున్నది వర్గశత్రువులే కాని మత శత్రువులుకారు...."

"మరి దేశానికి స్వాతంత్ర్యమే రాలేదనడం తప్పుడు అవగాహన కాదా.....? అతివాద ధోరణికాదా.....?"

ఎంతో తెలివైన ప్రశ్న వేసాననుకున్నాను నేను.

"దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందన్న భ్రమలో ఉంటే ఉండండి. మాకేం అభ్యంతరం లేదు.... నిజానికి మన దేశానికి స్వాతంత్ర్యం. వచ్చిందా....? ఒక్కసారి ఆలోచించండి..... తెల్లతలలు పోయి నల్లతలలొచ్చాయే తప్ప ఏ విషయంలో మార్పులొచ్చాయో చెప్పండి.... ఇప్పటికే మన దేశం ఎన్ని దేశాల కూడిగంచేస్తూ బతకాల్సి వస్తుందో మీకు తెలియదా.....? ఈ రోజు మన దేశంలో మనం మన కార్మికులకు మన ఇష్టమున్నట్టు జీతాలిచ్చుకునే పరిస్థితులు లేవు. రైతులు ఇష్టమున్న పంట పండించుకునే స్థితి లేదు. మన ఆర్థిక, రాజకీయ స్థితులపై విదేశీయుల ప్రభావముంది.... ప్రతి పార్టీని ఒక్కోదేశం వెనుకుండి నడిపిస్తుంది....." అన్నాడు రాజేశ్.

"మిమ్ములను రష్యా చైనాలు నడిపిస్తున్నట్టు...." అన్నాడు అమర్. ఆ మాటలకు నవ్వే సమాధానంగా చెప్పాడు రాజేశ్. చాలాకాలంగా నాలో సుళ్ళు తిరుగుతున్న ప్రశ్ననడిగి రాజేశ్‌ను ఇరకాటంలో పెట్టామనుకున్నాను. ఆ ప్రశ్నకాతడేం సమాధానం చెబుతాడో చూడాలనుంది.

"ఒకప్పటి మాటేమోకాని ఇప్పుడుమాత్రం మనదేశంలో, రాష్ట్రంలో, తెలంగాణా జిల్లాల్లోనూ మధ్యతరగతి జనాల సంఖ్య గణనీయంగానే ఉంది. మీ పోరాటాల పట్ల ఈ జనాల స్పందన దాదాపు శూన్యం. ఏమైనా ఆకర్షితులవుతున్నారంటే మీ పోరాటాల పట్ల అట్టడుగుజనాలే..... గణనీయమైన సంఖ్యలో ఉన్న మధ్య తరగతిని వదలుకొని మీ ఉద్యమాన్నెలా విజయవంతం చేస్తారు....? పోతే, మీ ఉద్యమానికి నాయకత్వం వహించేవాళ్లలో మధ్యతరగతివాళ్లున్నారు. జనాలేమో – అంటే మధ్యతరగతి జనాలు పోరాటాల పట్ల అనాసక్తంగా ఉన్నారు. ఈ వైరుధ్యాన్ని గూర్చి ఏమంటారు రాజేశ్....?"

నా ప్రశ్నతో రాజేశ్‌ను మంచిదెబ్బే కొట్టాననుకున్నాను. అది నిజం కూడా.... రాజేశ్ ముఖంలో ఏదో బాధ కనబడింది నాకు.... ముఖమదోలా పెట్టాడు... కొద్ది క్షణాలాలోచించి అన్నాడు:

"మనోహర్! నువ్వు చాలా మంచి ప్రశ్నే వేసావు. దీన్ని గూర్చి అన్ని ఉద్యమాలు నడిపేవాళ్ళూ ఆలోచించాల్సిన అవసరముంది. అయితే ఒక్క విషయం మాత్రం జ్ఞాపకముంచుకోవాలి. ఈ దేశంలోని మధ్యతరగతికి ఈ వ్యవస్థపై కొన్ని

భ్రమలున్నాయి. దీనిద్వారా ఏదో ఒరుగుతుందనుకుంటున్నారు. రోజు రోజుకీ తలకు బొప్పెలు కట్టే దెబ్బలు తగులుతున్నా వాళ్ళకున్న భ్రమలు తొలగిపోవడం లేదు. చాలీ చాలని జీతాలు, కొంపలు రోజూ చస్తూ బతికేట్టు చేస్తున్నా తామేదో గొప్పగా బతుకుతున్నామనుకుంటారు..... ఓ తీరు జీతాలున్నవాళ్ళూ పెద్దగా సమస్యలు లేకుండా ఉంటున్నారని నేననుకోను. ఇందుకు మధ్యతరగతి మేధావులూ మినహాయింపుకాదు.... ఈ జనం దృష్టంతా పైపైకి పోవాలనే. అందుకోసం నానా తంటాలుపడుతుంటారు... గొంగళిపురుగుల్లా పైకెగబాకడానికి ప్రయత్నిస్తుంటారు. అయినా కిందికే జారుతుంటారు. షేర్లనీ, ప్రమోషన్లనీ, పిల్లలకు గొప్ప చదువులనీ రకరకాల ఒత్తిళ్ళతో, భ్రమలతో బతుకుతుంటారు. వాళ్ళకీవ్యవస్థపై నున్న భ్రమలు తొలగాలంటే కొంత సమయం తీసుకుంటుంది."

రాజేశ్ మాటలు నాకు సూటిగానే తగిలాయి..... అతడు సాధారణీకరించి చెబుతున్నా నాగురించే చెబుతున్నట్టనిపించింది. నాకు రోషమొచ్చింది.

"అందులో తప్పేముంది....? ఈ సమాజంలోనే భద్రతుందని భావిస్తున్నారు నాలాంటి మధ్యతరగతివాళ్ళు. ఇదేమన్నా కానిపనా....? అవును. చిన్నదో పెద్దదో ఉద్యోగమిచ్చి ఎంతో కొంత సుఖంగా బతకడానికి అవకాశం కల్పించిందీవ్యవస్థే.... అలాంటి వ్యవస్థపై భద్రతా భావముండటంలో నాకైతే తప్పు కనబడటంలేదు. అది అవసరం కూడా.....! తమ బతుకులు భద్రంగా ఉన్నాయనుకున్నప్పుడు ఆ వ్యవస్థకు, దేశానికి వినమ్రులై ఉంటే తప్పా.....?" అన్నాను కోపంగా....

"భద్రత.... భద్రత...." రెండు మూడుసార్లని బిగ్గరగా నవ్వాడు రాజేశ్..... కొద్ది క్షణాలు నవ్వి-

"నా నవ్వు మీకు విలన్ నవ్వులా అనిపిస్తుంది కదూ! మీకున్న భ్రమలు చూస్తుంటే నాకు నవ్వాలో ఏడ్వాలో అర్థంకాక నవ్వాను...." అన్నాడు.... కొద్దిసేపాగి తానే అన్నాడు:

"మీరీ వ్యవస్థలో భద్రతుందని భావిస్తున్నారు..... మీకెక్కడెలాంటి భద్రతుంది....? ఆర్థిక భద్రత గూర్చి ఆలోచిద్దాం. నోరు కట్టుకొని, అన్ని సరదాలూ చంపుకొని దాదాపుగా ఒక్కపూటకు తిన్నట్టుగా తింటూ అతికష్టంగా నెలకు కొంత డబ్బు వెనుకేస్తారు. బ్యాంకుల్లోనో, షేర్లలోనో పెడతారు. షేర్ల సంగతెలా ఉంటుందో హర్షద్ మెహతా కేసు ఋజువు చేసింది...... ఎప్పుడు నిండా మునుగుతారో మీకే తెలియదు. తేలినా ఇన్ని జిమ్మిక్స్‌ని తట్టుకొని ఎంతమంది తేలుతారు....? ఎన్నో బ్యాంకుల్లో కుంభకోణాలు, అవి మూతపడటం చూస్తూనే ఉన్నారు.... వాళ్ళెప్పుడు ముంచుతారో మీకు తెలియదు. ఒకవేళవి సక్రమంగానే ఉంటాయనుకున్నా జెట్ వేగంతో పెరుగుతున్న ద్రవ్యోల్బణ రేటు, ధరల పెరుగుదలతో పోలిస్తే ఐదేండ్లకో ఆరేండ్లకో రెట్టింపయ్యే మీ కొచ్చే డబ్బు విలువెంత....? వడ్డీ మాట వదిలిపెడితే మీరు పెట్టింది మీకొస్తే ఎక్కువే.... ఆ డబ్బుకు కొనుగోలు విలువేముంటుంది....?

మీకున్న ఉద్యోగ భద్రత సంగతి. ఉద్యోగాలను కాపాడుకోవడానికెన్నిపాట్లు పడాలో, ఎంతగా వ్యక్తిత్వాన్ని చంపుకొని బతకాలో ఆలోచిస్తే మీకే తెలుస్తుంది. అయినా ఎన్నో ఫ్యాక్టరీలు, ప్రభుత్వరంగ సంస్థలు మూసివేయబడుతూనే ఉన్నాయి.

ఒక మూలన ఇద్దర్నీ వదిలేస్తారు. చాలా ఇండ్లల్లో ఆ 'మూల' శోభనం గదిగానూ, కాన్పుల గదిగానూ ఉపయోగపడుతూ వుంటుంది. 'అయపిండ్లు' అయితే, ఎలుకల భయమూ, తేళ్ళ భయమూ తప్ప ఎవరన్నా వస్తారేమోనన్న భయం వుండదు కానీ, మూలన చేరిన కొత్త దంపతులకు ఒక మూల అటువంటి భయం వుంటుంది. వాళ్ళకు అటువంటి భయం లేకుండా చేసేందుకు ఇంట్లోవాళ్ళంతా ఒక పథకం అమలు చేస్తారు. ఇంట్లో వుండే పిల్లాజెల్లా, ఆడామొగా అంతా వీధిలోనో, అరుగుల మీదనో, మిద్దెమీదనో పండుకొని..... వాళ్ళక్కొంచెం స్వేచ్ఛనిస్తారు. అయితే, ఇంట్లో అందరూ ఇట్లా పక్షుల మాదిరి ఎగిరిపోయి ( అందులో కొన్ని రెక్కలు రాని పక్షులు కూడా వుంటాయి). ఏ చెట్ల మీదనో ఉడిగి, తెల్లవారుజామున్నో, తెల్లవారాకనో వస్తూ వుండడం అనేది ఇబ్బందిగా వుంటుంది. ఇంట్లో అందర్నీ బయటికి పంపేసి, ఇద్దరే ఇంట్లో వుండడం అనేది ఒకరకంగా బహిరంగంగా వున్నట్టే అనిపించి, ఆ కొత్త దంపతులకూ సిగ్గుగా వుంటుంది. దాన్తో, తొందరలోనే పాతదంపతులైపోతారు. అంతటితో ఆ తతంగం ముగిసి, సాధారణ పరిస్థితి ఏర్పడుతుంది.

అయితే, ఎన్ని భయాల్లో, ఎంత హింసలో భార్యాభర్తలు తొలిసారి కలుసుకున్నా....దాని ఆకర్షణ దానికుండనే వుంటుంది. అప్పుడు ఆ విరక్తిలో "ఈ సుఖం లేకపోతే పీడాపోయింది. ఈ ప్రత్యేక శిక్షలేకుండా అందరి మాదిరే వుంటే బావుంటుంది" అనిపిస్తుంది. ఆ తర్వాత శిక్ష సంగతి పూర్తిగా కాకపోయినా కొంత మరుపున పడుతుందేమో! మళ్ళీ అటువంటి అవకాశం కావాలనిపిస్తుంది. అయితే, ఆ అవకాశం మళ్ళీ ఎట్లా దొరుకుతుంది? ఇక్కడి జీవితంలో ఏ భార్యాభర్తలకైనా ఒకే ఒక్కసారి (కొద్దిరోజులు) దొరికే అవకాశం అది. బహుశా, అందువల్లనే అప్పుడు పడిన హింసను మరచిపోతారేమో! తమకిద్దరికీ పెండ్లయిందనీ, పెండ్లయినాక తామిద్దరూ భార్యాభర్తలయ్యారనీ, భార్యాభర్తలు కలుసుకున్నా, కలిసి మాట్లాడుకున్నా తప్పులేదనీ ఆ ఇద్దరికీ తెలుసు. అందరికీ తెలుసు. అయితే, ఆ అవకాశమే వుండదు. "అత్తా మామా చూసినా, ఆడబిడ్డలు చూసినా, తోడికోడళ్ళూ మరదులూ చూసినా ఏమనుకుంటారు?" అని ఆమె భయపడితే, అతనూ అట్లనే భయపడ్తాడు. బహుశా ఎవరికీ అటువంటి అవకాశం లేకపోవడంతో, అంతా కలసి కొత్త దంపతులక్కూడా లేకుండా చేయాలనుకుంటారేమో.... అనిపిస్తుంది. "ఏం? కొత్తప్పుడు మేం బాధపల్లేదా? కొత్తప్పుడే కాదు, పాతప్పుడూ బాధపడుతున్నాం కదా! మీరెందుకు సుఖపడాల?" అనుకున్నట్లుగా వుంటుంది.

ఏ కొత్తదంపతులన్నా తరుచుగా మాట్లాడుకుంటున్నట్టు కనిపిస్తే, "ఎప్పుడూ మొగుడ్తో గుసగుసలాడ్తానే వుంటాది" అని ఆ పిల్లను గురించీ, "పెండ్లాం కొంగు పట్టుకుని తిరుగుతావుంటాడు" అని వాన్ని గురించీ అంటారు. మరి, అంతకుముందు అందరూ కలిసి వాళ్ళిద్దరికీ అవకాశం ఇచ్చినారు కదా! అవును, ఇచ్చినారు. పెండ్లయినాక ఇద్దర్నీ 'ఒక్కటి' చెయ్యాలగదా! దానికి 'హద్దు' వుంది. అదే 'మూడు రాత్రులు', 'మూడు రాత్రులు గడపడం' అంటారు. అంతటితో సరిపాయె. ఎప్పటికీ అట్లనే గడుపుతామంటే ఎట్లా? తప్పనిసరిగా, 'ఒక్కటి' అయినవాళ్ళు మళ్ళా 'రెండు' కావలసిందే! ఒక సంగతి ఇప్పటికీ జ్ఞాపకముంది. తన తమ్ముడు

'సిన్నోడు' (జయరామిరెడ్డి) పెండ్లయిన కొత్తలో పెండ్లాంతో పగలు మాట్లాడుతూ వుంటాడని, ఈ పెద్దాయనే ఏమన్నాడు? "పనీ పాటా లేకుండా ఎప్పుడూ ఆడోళ్ళతో మాట్లేందిరా అడంగినాకొడకా! అవతలా ఇవతలా మొగోళ్ళందరూ నీ మాదిరే వుండారా?" అని తిట్టినాడు. దాన్తో వాడు అవతలా ఇవతలా వుండే మొగోళ్ళ మాదిరే అయిపోయినాడు.

భార్యాభర్తలు కోరుకున్నప్పుడు శారీరకంగానైనా కలుసుకోగలిగిన అవకాశం వుండి వుంటే, వాళ్ళిద్దరూ వూరికే మాట్లాడుకున్నా, 'అందుకే' ననుకుని, ఈర్ష్యపడే పరిస్థితి లేకుండా వుండేది. అట్లనే, భార్యాభర్తలు కలుసుకోవాలన్నా 'దొంగతనం'గా 'అక్రమసంబంధం' మాదిరి కలుసుకోవలసిన పరిస్థితీ వుండేదికాదు. స్వేచ్ఛగా మాట్లాడుకోగలిగిన అవకాశం లేదు కనుక, ఏదోరకంగా దొరికే అవకాశాన్ని 'అందుకే' ఉపయోగించుకోవాలని వాళ్ళు అనుకోడం సహజమే. "ఏదోరకంగా దొరికే అవకాశం" అంటే, అవకాశం ఏదోరకంగా అదే దొరుకుతుందనికాదు. అట్లా దొరికేవి చాలా తక్కువగా వుంటాయి. అవకాశాన్ని ఏదోరకంగా దొరికించుకోవలసినవే ఎక్కువగా వుంటాయి. అట్లా అవకాశాన్ని దొరికించుకునేందుకు పడిన యాతన తల్చుకుంటే, ఇప్పటికీ నవ్వు వస్తుంది, జాలీ కలుగుతుంది. తనూ, తన భార్యా 'ఒక్కటై' మళ్ళీ 'రెండు' అయినాక, ఆ రెండు ఒకదాన్నొకటి దూరం నుంచీ చూసుకునేవి. అట్లా చూసుకుంటూ, చూసుకుంటూ వుంటే.... వాటికి అట్లా దూరంగా కాక దగ్గరగా వుండాలనిపించింది, ఎప్పటికీ కాదు, ఎప్పుడో ఒక్కసారన్నా! అందుకొక మార్గం తట్టింది. తట్టిందంటే, ఇక్కడెవరికీ తెలియన్దికాదు, అందరికీ తెలిసిందే.

ఆ రోజు పలానా సేనికి సేద్యానికి పోతున్నట్లు చెప్పి, 'తన'[1] తో బువ్వ పంపించమని అమ్మకు చెప్పినాడు. సేనికి ఏ దావన (దారిన) రావాలో 'తన'కు చెప్పినాడు. అప్పటికీ తనకు దావ తెలీదే అని....'తను' అంటే, "దావన ఎదురుపన్నవాళ్ళను అడుగుతా రా" అని చెప్పినాడ. అంతసా తననే ఎందుకు బువ్వ తెమ్మంటున్నాడో 'తన'కూ అర్థమైనట్టుంది. "సరే" నంది సరదాగా. సరదాగానే బువ్వబుట్టి (చిన్న గంప) తీసుకుని సేనికి బయల్దేరింది. దావలో ఎవరెవరో ఎదురుపడినారు. ఇద్దరు ముగ్గురు "ఎక్కడికమ్మా" అనడిగి, ఎట్లపోవాలో చెప్పినారు. గడ్డిమోపుతో ఎదురైన నాగమ్మమాత్రం "ఎక్కడికి?" అని అడిగినాక, ఎక్కడికో చెబితే, "ఓహో!" అని నవ్విందంట. నవ్వి, "పో....పో! బిరీనపో! ఆకలితో నీకోసమే సూస్తా వుంటాడు రామిరెడ్డి పాపం!" అని ఇంకా గట్టిగా నవ్వి, పోయిందంట. ఇదంతా 'తను' చెబుతూంటే, తను వింటూ....ఇద్దరూ బువ్వతిన్నారు. బువ్వ తిన్నాక బుట్టి తీసుకుని "పోతా" అంది. "పోదూలే....." అని బుట్టి పక్కన పడేసి, దగ్గరికి తీసుకున్నాడు. "ఆకలి తీర్లేదా?" అని నవ్వింది. వున్నట్టుండి, ఒక్కసారిగా విడిపించుకుని దూరంగా జరిగింది. "ఏం?" అంటే, "ఎద్దులు చూస్తాండాయి" అని వాటి దిక్కు చూపింది. ఎద్దులు రెండూ సగం కండ్లు మూసుకుని, నెమరేస్తూ నిలబడున్నాయి.

తమకంటే మధు ఒక్కడే కొడుకు కానీ, తను ముగ్గురు అన్నతమ్ముళ్ళూ,

---

1 భార్యను గురించి భర్త, భర్తను గురించి భార్య ఇతరులతో చెప్పేటప్పుడు "తను" అని సంకేతించడం రాయలసీమ సంప్రదాయం.

నలుగురు అక్కచెల్లెళ్ళ మధ్యన పుట్టినోడు. ఇద్దరు అక్కగారూ ఇద్దరు చెల్లెళ్లయితే, మగవాళ్ళలో తనే పెద్దవాడు. మధుకు పద్నాలుగేండ్లు వచ్చేదాకా అందరూ కలిసే వుండినారు. ఆడపిల్లలకు పెండ్లిండ్లయి అత్తవారింటికి పోయినా, ఎప్పుడూ ఎవరో ఒకరు కాన్పుకని పుట్టింటికి వచ్చి వుండేవాళ్ళు. ఒక్కోసారి ఇద్దరుండేవాళ్ళు! తమ్ముండ్లూ, వాళ్ళ భార్యలూ, పిల్లలూ....అందరూ ఒకే ఇంట్లో వుండేవాళ్ళు. పెద్దవాళ్ళు, అంటే అమ్మానాయినా కూడా వుండేవారు. ఇంతమంది ఒకే ఇంట్లో ఎట్లా వుండేవాళ్ళు? ఎక్కడెక్కడ పండుకునేవాళ్ళు? ఇంట్లో సగం పశువులకు సరిపాయె, ఎవరికీ గదులూ లేకపాయె! నువ్వు జెప్పినట్టూ భార్యాభర్తా కల్సుకోడానికి పొలాల్లోకి పోవాల్సివస్తే, ఇంట్లో పడుకోడానికే స్థలం లేకపోతే....ఎట్లా కాపురాలు చేసినారు? ఎట్లా పిల్లలు పుట్టినారు? అని ఎవరన్నా అడిగితే.... "ఎట్లనో చేసినారు, ఎట్లనో పుట్టినారు?" అని ఒక చిన్నమాట చెప్పవలసిందే. అంతకుమించి చెప్పేందుకులేదు. అంతేగదా!

ఎంగటమ్మ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఎంత బాధ కలుగుతాదో! ఆయమ్మిదేం తప్పు? ఏ తప్పూ చేయకుండానే, తప్పు చేసినట్టు బతికినంత కాలమూ ఎంత అవమానపడింది! ఆ సంగతి ఆయమ్మికీ తనకూ తప్ప ఇంగెవరికీ తెలీకపోయినా, ఆ తర్వాత ఎన్నడూ తన ఎదుటపడలేదు పాపం! ఎంగటమ్మ తన పెద్ద తమ్ముడు శివరామిరెడ్డి భార్య. అప్పుడు చలికాలం. అందరూ ఇంట్లోనే పండుకొన్నారు. దీపమార్పితే కన్ను పొడుచుకున్నా కనపడని చీకటి! ఎవరెవరు ఎక్కడుండారో వాళ్ళవాళ్ళ తావుల్ని (స్థలాలను) బట్టి అందాసుగా తెలుసుకోవలసిందే. అట్లాంటి చీకట్లో పొరపాటు పడకుండా కావలసినవాళ్ళ దగ్గరికె పోవడం కష్టమే. అయితే, ఆ చీకటి వల్లనే వాళ్ళకు ఆ అవకాశమైనా దక్కేది. ఎంగటమ్మ ఎట్లా పొరపాటు పడిందో! తన మంచం కాడికొచ్చి తనను 'జరుగు' అన్నట్లు చేత్తో తోసింది. నిద్రబోతున్నందుకు కోపమొచ్చినట్టు తొడమీద గిచ్చింది. తను ఉలికిపడి మేలుకున్నాడు. అరవకుండా అరచేత నోరుమూసింది. ఎవరు? ఎవరైనా తన తమ్ముండ్ల భార్యల్లో ఒకరు (అప్పుడు తన భార్య పుట్టింటికి పోయింది). బలవంతంగా ఆమె చేయి పక్కకు తీసి "నేను మీ బావను" అన్నాడు. అంతే! ఒక్క ఉదుటున మంచం మీది నుంచీ లేచింది. మల్లెప్పుడూ తనకెదురుగా రాలేకపోయింది. నిజానికి, ఆ రాత్రి తనకాడికి వచ్చింది ఆ యమ్మి అని తన ఎదుటికె రాకపోవడం వల్లనే తెలిసింది. తనను బరితెగించినదానిగా బావ అనుకొని వుంటాడనే ఆయమ్మి బాధపడింది. చీకట్లో జరిగిన పొరపాటుకు వెల్తురులో కూడా మొగమెత్తలేకపోయింది! ఆ యమ్మి బరితెగించిందా? అంత సున్నితమైన మనస్సున్న మనిషి బరితెగించిందా? అటువంటి మనిషి ఆ విధంగా బాధపడవలసిరావడానిక్కారణం, తమ బతుకే కదా?

భార్యను భర్తో, భర్తను భార్యో కావాలనుకున్నప్పుడు కలుసుకునే అవకాశమే వుంటే, తను అంత 'పిచ్చిపిల్ల'ను పొలాల్లోకి రమ్మనే అవసరం వుండేదికాదు. ఎంగటమ్మ అంతగా సిగ్గుపడే అవసరం వుండేదికాదు. శారీరకంగా కలుసుకోడానికే కాదు, మంచీ చెడ్డా మాట్లాడుకోడానికో, కాదంటే పోట్లాడుకోడానికో దేనికీ అవకాశం లేకపోతే ఎట్లా? "పసుల్తో కల్సి వున్నందువల్ల మా ఆరోగ్యానికేమయింది?

మేం సంసారాలు సెయ్యలేదా? మాకు ప్రేమల్లేవా? మేం పదిమంది పిల్లల్ని కన్నాం" అనొచ్చు. అవును, సంసారాలు చేసినారు. భార్యా భర్తలు వ్యభిచారం చేస్తున్నట్లు కలుసుకున్నా...వాళ్ళకు పిల్లలు పుట్టినారు. అయితే, పదిమంది పిల్లల్ని కన్నవాళ్ళు ఎన్నిసార్లు స్వేచ్ఛగా మాట్లాడుకొని వుంటారు? మాట్లాడుకునేందుకే వీల్లేకపోతే "మాకు ప్రేమల్లేవా?" అంటే అర్థముందా? మనిషికి మనిషి అర్థం గాకపోతే, వాళ్ళకు పిల్లలు పుట్టొచ్చు కానీ ప్రేమ ఎట్లా పుడుతుంది? "ఇప్పుడెందుకు మనగ్గది?" అన్నదంటే, అందులో ఎంత బరువు మోసిన అనుభవం వుండాలి!

కొయ్య మీదున్న నెమలి (కోడిపుంజు) రెక్కలు తపతపకొట్టి కూతెయ్యడంతో, రామిరెడ్డి ఆలోచన తెగిపోయింది. "అరె.....! అప్పుడే కోళ్ళుకూసే యాళయిందా? ఎన్నెలకు యాళ తెలీక కూస్తావుండాయా?" అనుకున్నాడు. పైకి చూస్తే, 'గొరకోళ్ళు' నెత్తిమీద కొచ్చినాయి. చెంగల్రెడ్డి గారింట్లో ఎద్దులకు మేతేసే, లేవడానికి 'రిక్క' కొడుతున్న శబ్దం వినిపిస్తోంది. వూళ్ళో వున్న కోడిపుంజులన్నీ వరుసగా కూతలందుకున్నాయి. చలిగాలి వీస్తోంటే, తలాపున వుంచిన దుప్పటి తీసి కప్పుకొని పండుకొన్నాడు రామిరెడ్డి. "శివరాత్రి ముందు పగలేమో ఎండ కాస్తాది. తెల్లర్జామున సలిగా వుంటాది" అనుకున్నాడు. "ఇంతసేపు మేలుకున్నానేంది? ఇంగనన్నా నిద్రబోవాల" అనుకున్నాడు.

"నిద్రబోవాల" అనుకున్నాడు కానీ నిద్ర రాలేదు. ఇంతసేపు సాగిన ఆలోచన ఒక సందేహాన్ని ఎత్తి చూపుతోంది. "డబ్బూ, జాగా వుండేవాళ్ళు కూడా పసుల్ను ఇంట్లో పెట్టుకోనుండేది ఎందుకు? అయి మన్లోభాగం" అంటాడు పెద్దాయన. "పసులను ఇంట్లో వుంచుకోకూడదనే ఆలోచనరాక" అంటాడు మధు. ఆ సర్కారోళ్ళూ అట్లనే అన్నారు. అయితే, ఆ ఆలోచన ఎందుకని రాలేదు? సర్కారోళ్ళకు వచ్చిన ఆలోచన రాయలసీమవాళ్ళకు ఎందుకు రాలేదు? ఆలోచన రావడానికి కారణమున్నట్టే రాకపోడానికీ వుండాల గదా! వూరికే "ఆలోచన రాలేదు" అంటే, సరైనదెట్లా అవుతుంది? అది సరికానట్లే "మేం తెలివితక్కువోళ్ళం కాబట్టి ఆలోచన రాలేదా?" అనడగడమూ సరైనదికాదు. అంటే, ఆలోచన రాకపోవడానికి తెలివితక్కువతనం కాక, ఇంకేదో కారణముండాల.

ఇంత రాత్రయినా నిద్ర రాలేదే అన్న చింత దీన్తో ఎగిరిపోయింది రామిరెడ్డికి. ఉత్సాహంగా మళ్ళీ ఆలోచనలోకి దిగిపోయినాడు. వ్యవసాయం చేసేవాళ్ళకు ఇంట్లో నలుగురుంటే, నలుగురూ నాలుగు పనులు చెయ్యడానికి అనువుగా వుంటాది. వ్యవసాయ సమాజంలో, వ్యవసాయంలో ఈడు పడకుండా ఎప్పటికప్పుడు ముందుండేవాళ్ళకుండే గౌరవం, వెనుకబడిపోయేవాళ్ళకుండదు. తాము నలుగురు అన్నదమ్ములుండడం వల్ల వ్యవసాయం బాగా చేసేవాళ్ళు వూళ్ళో పెత్తనం చెలాయించేందుకూ, సన్నజనాన్ని తమ అదుపులో వుంచుకునేందుకూ ఉమ్మడి కుటుంబం ఉపయోగపడుతుంది. తమ తండ్రి శివారెడ్డి చుట్టుపక్కల వూళ్ళల్లో పెద్ద రైతుగా, పెద్ద మనిషిగా పేరు తెచ్చుకున్నాడు. ఉమ్మడి కుటుంబంలో వుండే ప్రయోజనాలూ వున్నాయి. అయితే, వ్యక్తులు నలిగిపోతూ వుంటారు. అందువల్లనే, 'కలసివుంటే కలదు సుఖం' అని ఎంత చెప్పినా, ఉమ్మడి కుటుంబాలు విడిపోతుంటాయి.

అదట్టా వుండనిస్తే, ఇంట్లో ముగ్గురు నలుగురు అన్నదమ్ములూ వారి భార్యలూ వున్నప్పుడు అందరికీ గదులు కట్టుకోలేరు. పైగా గదులు కట్టుకుని ఎవరంతటవాళ్ళు వుండడం అనేది ఉమ్మడి కుటుంబ పద్ధతికి వ్యతిరేకం. అందువల్ల, కొంతవరకూ దొరికిన స్వేచ్ఛను పూర్తి స్వేచ్ఛగా మార్చుకునేందుకు, అంటే విడిపోయేందుకు ప్రయత్నిస్తారేమో అన్నభయం. వ్యక్తుల సౌకర్యాలు చూస్తే, ఉమ్మడి కుటుంబం వుండదేమోనని భయపడితే, వ్యక్తుల సౌకర్యాలు చూడకపోవడం వల్ల ఉమ్మడి కుటుంబం చీలికలయింది. "కాపోని కండ్లముందరే పసులుండాల" అనే పెద్దాయనే, "ఆడోళ్ళతో మాట్లేంది?" అన్నాడు. ఒక వైపు వ్యక్తుల సౌకర్యాలను అడ్డుకుంటూ, మరొకవైపు ఉమ్మడి కుటుంబాన్ని కాపాడుకోడం అది. వ్యవసాయ సమాజంలో భాగమైన ఉమ్మడి కుటుంబంలో పశువులూ భాగం. "పశువులు మాలో భాగమే" అన్నది అందుకే. అందుకే ఎన్నో ఏండ్ల నుంచీ ఇక్కడ వాటితో మనుషులు కలిసి వుండేది. వాటిని కడగా పెట్టాలన్న ఆలోచనే రాన్లి. అయితే, ఇది కూడా ఆలోచించి చేస్తున్నది కాదు. పశువులను విడిగా పెట్టాలన్న ఆలోచన రానట్టే, కూడా వుండాలన్న ఆలోచన కూడా ప్రత్యేకంగా లేదు. కూడా వుంటున్నారు, అంతే. అంటే, ఇక్కడి జీవనవిధానంలో కలిసిపోయింది. ఉమ్మడి కుటుంబం చెదిరిపోయినా, ఆ లక్షణాలు మిగిలివున్నాయి. వాటిని కాపాడవలసిన బాధ్యత ఉమ్మడి కుటుంబానికి ప్రతినిధులైన వాళ్ళమీద వుంది. పెద్దాయన పసులను కడగా వుంచడానికి ఒప్పుకోనిది అందువల్లనే. ఇంట్లో గదులు కట్టడాన్ని కూడా తప్పక వ్యతిరేకిస్తాడు. ఉమ్మడి కుటుంబం అంతరించిన దశకు మధు ప్రతినిధి. తను? ఆ దశకూ, ఈ దశకూ చెందిన మనిషి. ఏది మంచిదో ఎంచుకోవాలి. అది కష్టమేం కాదు, తమ అనుభవాలే తేల్చి చెబుతున్నాయి.

తమ అనుభవాలలో కరువులున్నాయి, వర్షాలు కురవక పోవడమో, తక్కువగా కురవడమో, అవసరం లేనప్పుడు అదే పనిగా కురవడమో వున్నాయి. పంట వేసేటప్పుడు ఆకాశాన వుండే ధరలు పంట వచ్చినాక నేలన పడిన అనుభవాలున్నాయి. చిన్న కొట్లాటకు ఖూనీలు చేసుకున్న అనుభవాలున్నాయి. ఇప్పుడు ముఠా నాయకులొచ్చినారు, జనం వుసురుపోసుకుంటూ.... రాయలసీమను రాళ్ళసీమగా కూడా వుండనియ్యకుండా బాంబుల సీమగా మార్చినారు. ఇవన్నీ ఇక్కడోళ్ళందరికీ తెలిసినవే. ఇవన్నీ వెనుకబడిన ప్రాంతంలో వుండేవని, అందరికీ కాకపోయినా కొందరికైనా తెలుసు.

అయితే, ఇంతకన్నా వెనుకబడినతనం ఒకటి ఎప్పట్నుంచో ఇక్కడున్నట్టు ఇప్పటికీ ఎవరికీ తెలిసినట్టులేదు. అదేదో చెబితే, "ఇండ్లల్లో పసులుండడమూ, భార్యాభర్తలకు గదుల్లేకపోవడమూ వెనుకబడిన తనమా? విచిత్రం కాకపోతే" అనొచ్చు. బార్యాభర్తలంటే ఎవరు? మనుషులేగదా? మనుషులేనని ఒప్పుకుంటే.... "పశువులతో కలిసే వుండినాం, మనుషులం కలవకుండా వుండినాం" అని కూడా ఒప్పుకోవాలి. అప్పుడు ఎంత అసహజంగా వున్నట్లో అర్థమవుతుంది.

● రామకృష్ణా రెడ్డి కథలు, *1998* ●

★ ★ ★

95

తల్లావఝ్ఝుల పతంజలిశాస్త్రి

# రంగురాళ్లు

పచ్చ్రలావు ఎర్రగా కందిపోయాడు. బిగించిన పళ్లలోంచి దూసుకు రాబోయిన రెండు బూతు తిట్లని నోట్లో సిగరెట్టు పెట్టుకుని ఆపాడు. తిట్లు పొగలై పోతిరెడ్డి ముఖం మీంచి చీకట్లో కలిసిపోయాయి. రెండు దమ్ములు పీల్చిన తరువాత పచ్చ్రలావు మామూలు రంగులోకి వచ్చాడు. రెడ్డికి సిగరెట్టు అందిస్తూ అన్నాడు:

'నువ్వింత మొండి నా కొడుకు వనుకోలేదురా బావా!'

పోతిరెడ్డి సిగరెట్టు వెలిగించాడు. సమాధానం మాత్రం చెప్పలేదు. రాత్రి ఏడుగంటలు దాటింది. కొండల కడుపులోంచి చీకట్లు బయటపడి అలుముకున్నాయి. అది కొండరెడ్ల వీధి. చిమ్మచీకట్లో మినుకు మినుకుమంటోంది. కొన్ని గుడిసెల్లో, వరండాల్లో పొయ్యిలు వెలుగుతున్నాయి. పోతిరెడ్డి అరుగుమీద చెరో కఱ్ఱ స్తంభానికీ ఇద్దరూ ఆనుకుని కూచున్నారు. ఇంటి ముందు దడి దగ్గర పచ్చ్రలావు చిన్న మోటారుసైకిలు చీకట్లో కలిసిపోయింది. లోపలి గదిలో పోతిరెడ్డి పెళ్లాం పిల్లాడికి పాలిస్తోంది. సిగరెట్టు అవతల పారేసి పచ్చ్రలావు పక్కనే వున్న సత్తు చెంబులో మిగిలిన జీలుగు కల్లు ఒక్క గుక్కలో ఖాళీ చేశాడు. కడుపులోంచి తన్నుకొచ్చిన త్రేనువుతోపాటు లోపల్నించి పెద్ద మూలుగు వినిపించింది. అప్పటివరకూ వేసిన బొమ్మలా నిశ్చలంగా కూచున్న పోతిరెడ్డి 'అయ్యా' అంటూ ఒక్క గంతులో లోపలికి వెళ్లాడు. పచ్చ్రలావు తుపుక్కున ఉమ్మేసి మరో సిగరెట్టు తీశాడు. లోపల్నించి మరో పెద్ద మూలుగు వినిపించింది. లోపలికెళ్లి ముసలాడి పీక నులిమేద్దామని పించిందతనికి. అతనొచ్చి గంట దాటుతోంది. ఎంత బతిమాలినా పోతిరెడ్డి నోరు విప్పడం లేదు. అసలు వింటున్నాడో, లేదో తెలీలేదు పచ్చ్రలావుకి. రోగంతో ఉన్న ముసలాడు పడుండక మూలగడం అతనికి మరీ ఇబ్బందిగా ఉంది. ("ఆడు పోడ్రా బాబూ, నా మాటిను.")

పచ్చ్రలావు అడ్డతీగల స్టేషన్లో పి.సి. ఉద్యోగరీత్యా ఎవర్నీ బతిమాలడం అలవాటు లేకపోవడం వల్ల పోతిరెడ్డి అతనికి మేజిస్ట్రేట్లా పరిణమించాడు. మూడో మూలుగు తర్వాత పెళ్లాన్ని తిట్టి బయటికొచ్చాడు పోతిరెడ్డి. అరుగుమీద కూలబడి గంగమ్మకి దండాలు పెట్టాడు. గుండెలు బాదుకుంటూ 'అమ్మా, తల్లో,' అంటూ, చీకట్లోకి వెయ్యోసారి కోడిని కోస్తానని ప్రమాణాలు చేశాడు రెడ్డి. పచ్చ్రలావుకి దడి అవతల

గంగమ్మ కనిపించలేదు. కాసేపు నిశ్శబ్దంగా ఏడిచి మోకాళ్ళమధ్య తలపెట్టుకుని ఉండిపోయాడు పోతిరెడ్డి. ముసలాడితో పాటు రెడ్డిని కూడా సొంత చేతుల్తో చంపెయ్యాలనిపించింది పచ్చ్రాలావుకి. చీకటి పడే కొద్దీ ఒక్కడూ అడ్డతీగల వెళ్లగల ధైర్యం అతనికి పోలీసు ఉద్యోగం ఇవ్వలేదు. పది కిలోమీటర్లు పైగా రాత్రి ఒంటరిగా దొరగారి జీపులో కూడా వెళ్లలేదతను. పోలీసు వాసనలు చెట్లలోంచీ, పొదల్లోంచి లోపలికి వ్యాపిస్తాయని తెలుసతనికి. తిరుగు ప్రయాణం గుర్తొచ్చేసరికి జబ్బు చేసినట్టయింది.

"బావా! నా మాట ఆలకించు. నువ్వేడిసి మొత్తుకుంటే నీ బాబు రోగం తగ్గుద్దా? డాక్టర్రావాలి. లేదా అరిచ్చే మీందులేనా రావాలి. స్కూల్లో టీచరుగానీ, డాక్టరుగానీ ఎప్పుడేనా రావడం ఎరుగుదువా? ఇదో సిగరెట్టు... కాల్చుకో. నేను ప్రెమాణం చేసి చెప్తున్నాను. పని అయిపోగానే నీ బాబుకి మందులు ఏలేశ్వరం నుంచి అయనగారు కొని పంపిత్తార్రా మగడా!"

పోతిరెడ్డి సిగరెట్టు వెలిగించాడు. అగ్గిపుల్ల వెలుగులో వాడి చెంపలమీద నీటి చారిక తళుక్కుమంది. వాడి గుండెలో తపసికొండ ఇరుక్కుపోయింది. చీకట్లోకి చూస్తూ ఉండిపోయాడు.

"ఇదో.... ముందీ యాభై ఉంచమన్నారయ్యగారు. ఆడికి పెద్ద జబ్బు గాదురా బావా! ఇరోశనం గాక అంతే." ముసలాడి వ్యాధి వివరిస్తూ సాధ్యమైనంత శాంతంగా మళ్లీ మొదటికొచ్చాడు పచ్చ్రాలావు.

"మా అయగారికి ట్రాన్స్ఫరై పోయింది. దేవుల్లాటి మనిషి. రాళ్లు తవ్వడాలు మొదలెట్టి రెండేళ్లయిందా. అయగారికి మిగిలిందేవీ లేదు. ఇప్పుడసలు ఎల్లెపోతన్నారు. పోనీ, మీ జోలికి ఎప్పుడౌనా ఒచ్చేరేమో ఎరుగుదువా? వైజాగు నుంచి సేట్లు రావడం మాకు తెల్దా? రాజమండ్రి బ్రోకర్లు రావడం మాకు తెల్దా? ఎవరెవరు తవ్వుకుంటున్నారో నీకు తెలుసు, మాకు తెలుసు. మేవూ, బ్రోకర్లూ కిందా మీదా పడ్డాం. అందులో అయగారికి ఒచ్చిందేవీ లేదు. పందేరాలతో సరిపోయింది. పేపరోళ్లు రాశారు. కేసులు పెట్టేం. ఆ గొడవేరు. మీ గురవయ్య తమ్ముడు ఆడి జన్మలో పంట్లాం చూశాడా, తొడిగాడా? సేటు నా కొడుకులు ఎంతిత్తన్నారు? మీ వీధిలో ఇద్దరికి లూనా బళ్లు ఏణ్ణించి ఒచ్చేయిరా బావా? సత్తిరాజు బండిమీద చోడవరం పోయి వీడిలు తగిలించుకున్నాడా, లేదా? నాలుగు డబ్బులూ పోయేయి. వీడిలు మిగిలిపోయాయి. అంతేనా? ఆ గొడవ మనకొద్దు"

పచ్చ్రాలావు ఉపన్యాసానికి లోపల్నించి మరో పెద్ద మూలుగు అంతరాయం కలిగించింది. ఈసారి పోతిరెడ్డి లోపలికి వెళ్లేదు. తల బాదుకుంటూ కూచుండి పోయాడు. రెడ్డి పెళ్లాం ఏడుస్తూ గంగమ్మ తల్లికి మొక్కుకుంటోంది. చంటిపిల్లాడు సన్నగా ఏడుపు మొదలెట్టాడు.

ఒక క్షణం ఆగి పచ్చ్రాలావు అన్నాడు: "జాగర్తగా ఆలకించు మరి. పోనీ అయగారి గొడవదిలెయ్. ముసలాడికి మందులు ఏణ్ణించి ఒస్తాయిరా మావా? అన్నీ సంపేసుకుంటావా? మీరు ఈ పాలికి ఎల్లి రండి. నీకు రావలసిన లెక్క నేను ఎల్లుండి సాయంత్రం నీ చేతుల్లో పెడతాను. అయగారు మందులు పంపుతారు.

ఈడు రెండ్రోజుల్లో సుబ్బరంగా లేచి తిరుగుతాడు. నా మాటేను. ఇంకో ఎదవనీ, ఇంకో ఎదవనీ ఎందుకడగలేదు? నీ దగ్గిర న్యాయం ఉంది. ఇంకోడైతే రాళ్లు కప్పెట్టుకుని మొండి చెయ్యి చూపిస్తాడు. మా అయగారి కోసం కాదనుకో, నీ బాబు కోసం బయలుదేరు. ఇంక మాట్లాడక. లేటయిపోద్ది నాకు. మీ వాళ్లని నలుగుర్నీ కేకేసుకుని ఎళ్లిరండి మరి. రేపు నీకు ఒకటో రకం ఫస్టాసైన కొరియా బేట్రీ పంపుతాను. మళ్లీ జాగ్రత్తగా ఇచ్చేదుగాని. అదీ. డబ్బుల్తో నీ బాబు రోగం నయమౌద్దంటున్నాగా. మా అయగారికి ఏదో ముట్టజెప్పినట్టవుద్ది. ముసిలాడి జబ్బు ముఖ్యం. మరి ఉంటాన్రా బావా!"

పోతిరెడ్డి భుజం తట్టి వాహనం కదిలించి బయలుదేరాడు పచ్చుల్రావు. రెడ్డి కూచున్న చోటునుంచి కదలలేదు. రెండు నిముషాల తర్వాత చీకట్లోంచి పచ్చుల్రావు బండి రోడ్డెక్కడం వినిపించింది. అప్పుడు తలెత్తి చూశాడు. దూరంగా రోడ్డుమీద వేగంగా పచ్చుల్రావు లైటు పరిగెడుతోంది. అరుగు గోడ వారగా ఉన్న చెంబులోంచి కల్లు తాగి అక్కడే వెల్లకిలా పడుకున్నాడు రెడ్డి. ఎప్పుడు నిద్ర పట్టిందో తెలీదుగానీ వాడికి రాత్రి కలొచ్చింది. కలలో ముసలాడు ఆరోగ్యంగా ఒంటినిండా దుప్పటి కప్పుకుని బయట మంచంమీద కూచుని చుట్ట కాలుస్తున్నాడు. కాళ్ల దగ్గిర మట్టిలో మనవరాలు ఆడుకుంటోంది. చటుక్కున మెళకువ వచ్చింది. అరుగు చివరికి దొర్లి బయటికి చూశాడు పోతిరెడ్డి. కొద్దిగా పాలు ఎక్కువైన పల్చటి టీ డికాషన్‌లా ఉంది వెన్నెల. తరువాత ఎప్పుడోగాని నిద్రపట్టలేదు రెడ్డికి.

పోతిరెడ్డి బాబుకి కొంచెం భూమి ఉండేది. అందులోంచి సెంటున్నర పొలం విడిపించుకుని ఏడాది అయింది. అప్పుకింద రెండెకరాల చిల్లరా దఖలైపోయింది. తీసుకున్న అప్పుకీ, రెండెకరాలకీ సంబంధం ఏమిటో తండ్రీ కొడుకులిద్దరికీ తెలియలేదు. తొమ్మిదొందలూ తీర్చినా రెండొందలే జమైందనీ, అది వడ్డీకి కూడా సరిపోలేదని మధ్యవర్తీ, అప్పిచ్చిన పెద్దమనిషీ నచ్చచెప్పారు. ఇచ్చినట్టు రుజువు లేదు. తీసుకున్నట్టూ రుజువు లేదని చెప్పడం పోతిరెడ్డికి తెలీలేదు. ముసలాడు వీధిలో నలుగుర్నీ పోగేసి యాగీ పెట్టాడు. మధ్యవర్తి అంతా విని సబబు చెప్పడానికి ఎమ్మార్వో దగ్గిరకో, పోలీసు స్టేషనుకో పోదాం పదమన్నాడు. వెళ్లిన నలుగురికీ నోట మాట రాలేదు. గంగమ్మ తల్లి ఎదురుగా నిమ్మకాయ కోసి నిజం చెప్తానన్నాడు పోతిరెడ్డి. గిరిజన భూముల్ని అప్పుకింది జమ కట్టుకునే వ్యవహారంలో గంగమ్మకి అనుభవం లేదు గనక అటువంటి 'సాచ్చికాలు' ఒద్దన్నాడు మధ్యవర్తి. మొత్తానికి రెండెకరాలూ పోగా సబబుగా సెంటున్నర భూమీ ముసలాడికి దక్కింది. మొదట సబబు చెప్పడంలో, తరువాత పంటని దక్కించుకోవడంలో గంగమ్మ తల్లీ, పోతరాజూ కల్పించుకోకపోవడం వల్ల మొదటి పంటలో పోతిరెడ్డికి మిగిలిందేమీ లేదు. పది రోజుల క్రితం చెట్టంత ముసిలాడు కడుపు చేతబట్టుకుని కూలిపోయాడు. దెబ్బతిన్న పాములా మెలికలు తిరిగిపోయాడు. గురవయ్య దగ్గిర చెక్క మందులు తెచ్చి పోశాడు పోతిరెడ్డి. తగ్గినట్టే తగ్గి నొప్పి మళ్లీ మొదలైంది. పోతిరెడ్డికి కొండంత బెంగపడింది నెత్తిమీద. రోజురోజుకీ ముసలాడి పరిస్థితి దిగజారుతోంది.

పచ్చుల్రావు చెప్పినట్టు వీధిలో మోటారు బళ్లు తిరగడం, పేంట్లూ చొక్కాలూ పోతిరెడ్డికి తెలీకపోలేదు. తపసికొండకి బొరియ పడింది. జట్లు జట్లుగా రంగురాళ్ల తవ్వకాలు జరగడం తెలుసు వాడికి. బ్రోకర్లు, పోలీసుల, సేట్ల వలయం మాత్రం వాడికి సరిగా తెలీదు. అప్పటికి నెల రోజుల క్రితం గురవయ్య తమ్ముడు పోలీసుల నోట బడి తప్పించుకున్నాడు. రహస్యంగా ఓ రోజు రెండు నీలపురాళ్లు తెచ్చి చూపించి ఓ అరపెట్టె పొడవాటి సిగరెట్లిచ్చాడు పోతిరెడ్డికి. మరో మార్పు కూడా చూశాడు రెడ్డి. ఊరుని మెయిన్ రోడ్డుతో కలిసే మట్టి దారంలాంటి రోడ్డు మొదట్లో రెండు పెద్ద కిళ్లీ కొట్లు వెలిశాయి.

ఉదయం పది దాటుతుండగా పచ్చుల్రావు కొరియా చేట్రీ పంపించాడు. లోపల గదిలో ముసలాడి మీద లైటు వేసి చూశాడు పోతిరెడ్డి. క్షణకాలం గదంతా తెల్లగా మెరిసిపోయింది. రెడ్డి పెళ్లాం చంటిపిల్ల ముఖంమీద లైటువేసి ఆడిస్తుండగా ముసిలాడు పెద్దగా మూలిగి మెలికలు తిరిగిపోయాడు. బాటరీ గట్టిగా పట్టుకుని భయంగా తండ్రివేపు చూశాడు పోతిరెడ్డి. కాసేపు మురిగి కళ్లు మూసుకున్నాడు ముసిలాడు.

మధ్యాహ్నం నలుగురూ చింతచెట్టు కిందికి చేరారు. గురవయ్య తమ్ముడు గొంతు తగ్గించి మాట్లాడాడు. పోతిరెడ్డికి అతని మాటలు పూర్తిగా బుర్రకెక్కడం లేదు. మిగతా ఇద్దరూ తలూపారు. నలుగుర్లో కొత్తవాడు పోతిరెడ్డి. చీకటిపడ్డ తరువాత నలుగురూ విడివిడిగా ఎక్కడ కలుసుకోవాలో చెప్పాడు తమ్ముడు. పోతిరెడ్డి లేచి తువాలు తలకు చుట్టుకు బయలుదేరాడు.

"నువ్వలగాగు. మాతాడాల" అన్నాడు తమ్ముడు.

మిగతా ఇద్దరూ వెళ్లిపోయారు. సిగరెట్టు వెలిగించి తీక్షణంగా పోతిరెడ్డి వేపు చూశాడు. గుడ్లప్పగించి అతనివేపే చూశాడు రెడ్డి. చివరికి అడిగాడు తమ్ముడు:

"పచ్చుల్రావేతన్నాడు?"

"ఏతన్నాడు! అయ్యకి ఏలేశరం నుంచి మందుతెత్తనన్నాడు."

"అంతుకేనా?"

"మరంతుకే"

"గంగమ్మమీద ప్రెమానం జెయ్యి."

ఒకళ్ళ కళ్లలోకి ఒకళ్లు సూటిగా చూసుకున్నారు. "ఒద్దులే" అన్నాడు తమ్ముడు. ఇద్దరూ కలిసి ఇళ్లకి బయలుదేరారు. నిశ్శబ్దంగా నాలుగడుగు లేసింతరవాత తమ్ముడన్నాడు: "పచ్చుల్రావు విసప్పురుగు. పోలీసోడు విసప్పురుగు." తమ్ముడు మలుపు తిరిగి వెళ్లిపోయాడు.

పోతిరెడ్డి ఇంట్లోకి అడుగు పెట్టకముందే పెళ్లాం ఏడుపు వినిపించింది. రెడ్డి కడుపు తరుక్కుపోయి అడుగు ముందుకు పడక క్షణంసేపు అలాగే ఉండిపోయాడు. లోపల ముసలాడు మూలుగుతున్నాడు. మూలుగు, ఆయాసం కలిసి అతని డొక్క లెగిసిపడుతున్నాయి. కొరియా బేట్రీ వేసి అయ్య ముఖం చూశాడు రెడ్డి. మొహం చెమటతో మెరుస్తోంది. కళ్లు గోలీకాయల్లా ఉన్నాయి. నోరు సగం తెరిచి

మూలుగుతున్నాడు. పోతిరెడ్డికి కడుపులోంచి ఏడుపు తన్నుకొచ్చింది. నిద్రపోతున్న శవంలా గున్నాడు ముసలయ్య.

అరుగుమీద కూచుని సత్తు కంచంలో అన్నంవేపు చూసుకుంటూ ఉండిపోయాడు పోతిరెడ్డి. గోడనానుకుని పిల్లాడికి పాలిస్తోంది రెడ్డి పెళ్ళాం. కాసేపు చూసి "బువ్వ దినవా?" అందామె. పోతిరెడ్డి ఆమె మాటలు వినలేదు. మరో నిముషం అలాగే ఉండిపోయి తల వూపుతూ గబగబ మూడు ముద్దల్లో అన్నం ముగించాడతను. బువ్వ తినగానే మాట్లాడకుండా చాప పరుచుకుని నిద్రపోయాడు రెడ్డి.

తపసి కొండ నెత్తిమీద మబ్బు చివర్లు మండుతున్నాయి. క్రమంగా కొండ నల్లబడింది. అడవి చీకటి వల్లో పడిపోయింది. తువాలు తలకు చుట్టుకుని టీ తాగుతూ లోపలికెళ్ళాడు పోతిరెడ్డి. ముసిలాడు బాధతో నిశ్శబ్దంతో గిలగిల్లాడుతున్నాడు. మూలుగు గొంతులోనే సుళ్ళు తిరుగుతోంది. తువాలుతో అయ్య ముఖం తుడిచి, మోకాళ్ళమీద కూచుని ముసలాడి చెవిలో గుసగుసలాడాడు పోతిరెడ్డి. కళ్ళు తెరవలేదు ముసలాడు. కాసేపు పక్కనే కూచుని గంగమ్మ తల్లికి మొక్కాడు రెడ్డి. కొద్దిగా మిగిలిన గోర వెచ్చటి టీ మెల్లిగా ముసలాడి నోట్లో పోశాడతను. ద్రవం గొంతు దిగిందో, లేదో ముసలాడికి పొరబోయి గొంతు బద్దలయ్యేలా దగ్గేడు.

కొరియా బేట్రీ చంకలో పెట్టుకుని చీకట్లో, అనుకున్న చోటికి చేరాడు రెడ్డి. మరో పది నిముషాలు ఆగి, ఆఖరి బీడీ కాల్చి నలుగురూ కొండవేపు నడిచారు. లైటు వెయ్యకుండా నిశ్శబ్దంగా తుప్పలు దాటుకుంటూ నడుస్తున్నారు. చల్లటి గాలేస్తున్నా నలుగురికీ చెమటలు పట్టేశాయి. గుండె చప్పుళ్ళు గాల్లో కలిసిపోతున్నాయి. కొండ ఇంకా రాయి విసురు దూరంగా ఉండగానే జట్టుని ఆపేశాడు తమ్ముడు. కళ్ళు పొడుచుకుని, లేళ్ళలా చెవులు రిక్కించి చాలాసేపు నిలబడిపోయారు. తుప్పల వెనక రెండు కుందేళ్ళు బెదిరి పారిపోయాయి. ఈసారి మెల్లిగా నడుస్తూ నలుగురూ కొండ దగ్గరికి చేరారు. మరో వందగజాలు నడిచిన తరవాత ముగ్గుర్నీ దగ్గిరగా గోడలా నిలబెట్టాడు. దడతో, భయంతో పోతిరెడ్డి నుంచున్న చోటే వెనక్కి తిరిగి ఉచ్చపోశాడు. కొండ చరియ అంతా తమ్ముడికి పరిచితమే. లైటు వేశాడు తమ్ముడు. కొండ కడుపు కింది భాగం పూర్తిగా పెద్ద బొరియలాగ ఏర్పడింది. లైటు ఆర్పి నలుగురూ గునపం దెబ్బలు ఎక్కువ పడని గోడవేపు జరిగారు. చీకట్లో రావడం తమ్ముడి విసుగ్గా ఉంది. అడవిలోంచి విచిత్రమైన శబ్దాలు వినిపిస్తున్నాయి. చిమ్మ చీకట్లో ప్రాచీన మానవుల్లా నలుగురూ తవ్వడం ప్రారంభించారు. మాటిమాటికీ తువాలు చుట్టిన బాటరీ లైటు వేస్తూ పని కొనసాగించారు. కాలంతో నిమిత్తం లేని అంతరిక్షపు అంధకారంలో స్తంభించిపోయిన గ్రహాన్ని తవ్వుతున్నట్టుంది. పోతిరెడ్డికి భయంతో చేతులు వణుకుతున్నాయి. కడుపులో తీవ్రమైన కదలిక మొదలైంది. చెమటతో ఒళ్ళూ, లుంగీ తడిసిపోయాయి. తలమీద పడిన మట్టి, చెమట కాలవలా ఒంటిమీద జారుతున్నాయి. ముగ్గురూ ఒగరుస్తూ కూచుండి పోయారు.

తమ్ముడు మరోసారి లైటు వేసి వెలుతురు పడ్డ మేరంతా వేళ్ళతో గోకుతున్నాడు. అతని పెదాలు నవ్వుతో విచ్చుకున్నాయి. మట్టిపెళ్ళని చేత్తో తీసుకుని మెల్లిగా మట్టిని గోకి తీశాడు. మోకాళ్ళ మధ్య తల పెట్టుకుని కూచున్నాడు పోతిరెడ్డి.

మొదటి మట్టి ముద్ద పోతిరెడ్డి వీపుమీద పడింది. తల పైకెత్తి చూశాడు. లైటు వెలుగులో నాలుగు ఎరుపు, పచ్చ రాళ్లని చేతిలో చూపిస్తూ ఒంగాడు తమ్ముడు. ఈసారి మరో పెద్ద మట్టి పెళ్ల వాడి వీపుమీద పడింది. ముగ్గురూ కూచుని లైటు బయటికి కనిపించకుండా వెలుతుర్లో రంగురాళ్లు చూసుకున్నారు. నలుగురికీ నవ్వొచ్చింది. ఈలోగా కొండ విచ్చుకుంది. నలుగురూ లేచారు. వాళ్లింకా పూర్తిగా లేవకముందే ఒక క్షణంలో చల్లగా, నిశ్శబ్దంగా తపసికొండ కడుపు కండల్లో పెద్ద చరియ విరిగిపడింది. నలుగురూ పెద్ద కేకేవేసి బయటికి దూకబోయారు. పోతిరెడ్డి బాటరీ బైటకి విసిరేశాడు. నలుగురి కేకలూ కొండ కడుపులో తేనుపుల్లా ఆగిపోయాయి. విసిరేసిన ఫస్ట్లాసైన కొరియా బ్యాట్రీ తుప్పల్లో పడింది. బాటరీ కన్ను నిర్నిమేషంగా ఆకాశాన్ని చూస్తూ ఉండిపోయింది.

● *ఆంధ్రప్రభ వారపత్రిక – 1998* ●

★ ★ ★

96

బోయ జంగయ్య

# తుపాకులు

భువనగిరి వెళ్ళే బస్సు నార్కట్‌పల్లిలో స్టార్ట్ అయి రోడ్డెక్కింది. కండక్టర్ వెనుక సీట్ల దగ్గరికెళ్ళి టికెట్స్ ఇస్తూ వస్తూ ముందు సీటు దగ్గర ఆగి –

"అమ్మా, ఎక్కడికి పోవాలె? టికెట్" అన్నాడు ఏదో ఆలోచిస్తూ కూర్చున్న నడివయసు స్త్రీని ఉద్దేశిస్తూ.

"ఏట్లోకి" అంటూ కండక్టర్‌ను ఎగాదిగా చూసింది. ఆమె ముఖం గుంజకపోయివుంది. కాని చురుకైన చూపులు, పుల్లవిరుపు మాటలు.

"అయితే ఇంకో బస్సు ఎక్కు" అన్నాడు తనలో తాను నవ్వుకుంటూ. 'పొద్దున్నే ఎవరి ముఖంరా నాయనా చూసింది. రోజూ ఏదో వాదన, మరేదో గొడవ. ఈ కండక్టర్ నౌకరీ అంత పరేషాన్ నౌకరీ మరొకటి వుండదనుకుంట. ఎంత మంచిగా, ఎంత నిదానంగావున్నా ఏదో రాద్ధాంతం.'

"టికెట్ తీసుకో." ఈసారి మాటల్లో కాఠిన్యం ధ్వనించింది. చూపుల్లో తీవ్రత కదలాడింది.

తీసుకోకుంటే ఏం జేస్తవు అన్నట్లు చూసింది. కోపం, వ్యతిరేకత ఎండవాన కల్సివచ్చినట్లు వొచ్చాయి ఆమె చూపులో.

"టికెట్ తీసుకుంటావా, దింపెయ్యమంటావా?" అన్నాడు చేసేది లేక తను తీసుకోబోయే ఆఖరు చర్యను ప్రకటిస్తూ.

"ఏది, దింపెయ్యి చూస్త." గుడ్లురుమి, ముక్కుపుటాలను కదిలిస్తూ అంది. అప్పుడు బస్సులో సగానికి పైగా ఆమె వైపు చూస్తూ విషయం ఏమిటా అని ఆసక్తిగా వింటున్నారు.

కండక్టర్ బెల్ కొట్టాడు. బస్సు పక్కకు ఆగింది.

"దిగమ్మ" అంటూ కండక్టర్ ఎడమ చేత్తో బస్సు డోర్ తెరిచి, కుడిచేతిలో వున్న టికెట్ పంచ్ ప్లేయర్‌తో సైగ చేశాడు.

"నేను దిగను" అంటు ముందు సీటుపైపును గట్టిగపట్టుకొని, తన మొండితనాన్ని ప్రదర్శించింది.

అందరూ ఆమె వైపు చూస్తూ ఎందుకట్ల అని ఆలోచిస్తూ ఉన్నారు.

ఆమె తీక్షణంగా బస్సు కిటికీలోనుండి బయటకు చూస్తూ వుంది. ఎన్ని రోజుల కింద తలంటుకుందో నెత్తంతా దుమ్ముపట్టి వుంది. కాని ఏదో పరేశానిలో పడి సరిగ తినకనేమో ముఖం గుంజకపోయినట్టుంది. ఆమె నుదురు భాగంలో ఏదో బాధ గూడుకట్టుకున్న గుర్తులు.

"చూడమ్మా, నీవు టికెట్ అన్నా తీసుకో లేదా దిగనన్న దిగు." ఈసారి కండక్టర్ ఓపిగ్గానే అన్నాడు, ఆమెతో గట్టిగ మాట్లాడితే బెదుస్తుందని.

"దిగనంటే దిగను" అన్నది ఆమె.

"బస్సు ఇక్కడ ఆపేస్త" అన్నాడు.

"అమ్మా, టికెట్ తీసుకో" అన్నారెవరో వెనుకనుండి, బస్సు ఆగితే మళ్ళీ ఎపుడు స్టార్ట్ అవుద్దోనన్న అనుమానంతో.

"సర్కారు బస్సు టికెట్ తీసుకోకపోతే ఎట్లా?" అన్నాడు మరో ప్రయాణికుడు.

"సర్కారు బస్సు కనుకనే టికెట్ తీసుకోను" అంది తాపీగ కిటికీలోనుండి బయటకు చూస్తూ.

"చెకింగ్ అయితే కండక్టర్ నౌకరు పోద్ది." మరో ప్రయాణికుడు.

"పోనీ" అంది.

"పిచ్చా, చాదస్తమా?" అన్నాడో ప్రయాణికుడు.

"ఏందిపిచ్చి? నీకు పిచ్చి, నీ అమ్మకు పిచ్చి, నీ అయ్యకు పిచ్చి, మీ అందర్కీ పిచ్చి, పిచ్చి" అని ఎగపోస్తూవుంది. ముందు పిచ్చా అన్న వ్యక్తివైపు చూస్తూ నిజంగా పిచ్చిపట్టినట్లే అరిచింది. అది విన్న ఆ వ్యక్తి చేసేది లేక నోరు మూసుకున్నాడు.

ఆమె వెనుక సీటులో కూర్చున్న సత్యం –

"ఆమె వాదనను బట్టి ఏదో బాధలో వున్నట్టుంది–" పక్కనే కూర్చున్న మూర్తితో అన్నాడు. వాళ్ళ ఇద్దరి వయసు దాదాపు ఒకటే. వాళ్ళిద్దరిలో సత్యం టీచర్, మూర్తి రెవెన్యూలో క్లర్క్. కళారూపాలను అభిమానిస్తూ, సాహిత్యాన్ని ఉపాసిస్తూ, అలాంటి అంశాలు ఎవరిలోనైనా కనిపిస్తే ప్రోత్సహిస్తూవుంటారు. అందువల్ల ఎదుటి వ్యక్తి మాటల్లో ధ్వనిని బట్టి, చూపులను బట్టి అసలు విషయాన్ని ఇట్టే గ్రహిస్తారు సత్యం, మూర్తి ఇద్దరూ కూడా.

"ఆమెకు వలిగొండ టికెట్ ఇవ్వండి" అంటూ డబ్బులిచ్చాడు సత్యం. కండక్టర్ టికెట్ పంచ్‌చేసి అయనకే ఇచ్చి బెల్ కొట్టాడు. బస్సుకదిలింది. అందులో కూర్చున్న జనం అంతా ఒక్కసారి గాలి పీల్చుకున్నారు.

కండక్టర్‌ను గుడ్లురుమి చూస్తూ –

"ఇపుడు నీవు బస్సును అట్లనే ఆపితే ఇక్కన్నే బస్సుకు అగ్గిపెడుదును" అంది.

"తగులబెట్టవు మరి, నీ తాత సొమ్మేమే" అన్నాడు కండక్టర్ యస్సార్ నింపుతూ కాస్త గట్టిగానే.

"ఇప్పటి వరకు తగులబెట్టిన బస్సులన్నీ తాతసొమ్మనే తగులబట్టింగ్రా?" గొంతు తీవ్రతను పెంచుతూ అంది.

"ఇగచెప్పు" అన్నారెవరో వెనుక.

"ఆమెను రెచ్చగొట్టకండి" అన్నాడు సత్యం చుట్టూ చూస్తూ.

"బస్సు కాలినా మీ జీతాలైతే పిట్టలు మేయవుగా, కాలే బస్సులు కాలుతున్నా మీ జీతాలు పెరుగుతూనే వుండె" అంది.

"ఆ నీ ఇంట్లకెళ్ళి ఇస్తుంటివి" అన్నాడు కండక్టర్ రాసుకుంటూనే.

అది విని ఆమె పెద్దగా నవ్వింది.

అంధరూ ఆమె వైపే చూస్తున్నారు.

"అయ్యల్లార, ఇప్పుడు బస్సులో కూర్చున్న వాళ్ళందరూ ఇచ్చిన పైసలు వాళ్ళవాళ్ళయి కావా?" అంది.

"నీవైతే ఇవ్వలేదు కదా?" అన్నాడు కండక్టర్ కాస్త వ్యంగ్యంగా ఆమె వైపు చూస్తూ.

"కండక్టర్ సాబ్, ఎవరిస్తే ఏమి, ఆమె టికెట్ పైసలు మీకొచ్చినయి కదా!" అన్నాడు మూర్తి.

"ఏం సారూ, మీరు ఆమెను సపోర్టు చేస్తరు. ఆమె ఎట్లా మాట్లాడుతుంది?" అంటూ వెనక్కు మళ్ళి చూశాడు. మంటలో పొగ కల్సి వచ్చినట్టు ఆయన చూపుల్లో ఈసడింపు, కోపం.

'కాస్త నిదానం, ఆమె మాటలను పట్టించుకోకు' అన్నట్టు సైగ చేశాడు సత్యం టీచర్.

'ఏమోనండి' అన్నట్టు పెదాలను బిగపట్టే వదులుతూ తదనుగుణంగా, కళ్ళను కదిలిస్తూ చూసి, చూపులను క్యాష్‌బ్యాగ్‌లో వేసుకున్నాడు.

ఆమె మాత్రం తనలో తానే గులుగుతూనే వుంది. ఆమె ఎదలో ఏ బాధ కలుగుతుందో?

"చూడడానికి మంచి ఆరోగ్యంగానే కనిపిస్తోంది. ఎందుకు అట్ల మాట్లాడు తుందో?" అన్నాడు సత్యం వాళ్ళ వెనక సీట్లో కూర్చున్న ఓ పెద్దమనిషి. అది విన్న మూర్తి వెనక్కు మళ్ళి–

"మనిషి ఆరోగ్యంగా వున్నా మనస్సు వుండొద్దా?" అన్నాడు. ఆయన మనుషుల గూర్చి తెలుసుకోవడానికే పుస్తకాలు చదువుతాడు. చదివి మనుషుల గూర్చి ఆలోచిస్తాడు.

"అంతేనంటారా?" అన్నాడు ఆ పెద్దమనిషి.

"ఆమె ఏదో బాధలో వుంది. లేకపోతే అట్లా మాట్లాడదు" అన్నాడు సత్యం.

ఈ లోపు బస్సు చిట్యాలలో ఆగింది. అక్కడ ఓ ఖద్దరు బట్టల రాజకీయనాయకుడు బస్సెక్కాడు. బస్సు ఫుల్ అయి ఒక్క సీటు కూడా ఖాళీ లేదు.

కండక్టర్ లేచి తన సీటిచ్చాడాయనకు. అది చూసి ఆమె మళ్ళీ మొదలుపెట్టింది, దొంగను చూసినట్టు చూస్తూ –

"ఈ దేశంలో బతకాలంటే ఏషం మంచిదేసుకోవాలె" అంది.

ఖద్దరువాలా ఆమెవైపు చూసి, జేబులోనుండి డబ్బు తీసి కండక్టర్‌కేస్తూ–

"రామన్నపేట" అన్నాడు. కండక్టర్ మిగతా చిల్లర తిరిగిచ్చాడు.

"పోరాటమపుడు ఆయుధాలు పట్టుకున్నోల్ల మంట గలిసిండ్రు. స్వరాజ్యం వొచ్చినంక మాయ మాటలు జెప్పి పదవులను పంచుకొని ప్రజా నాయకులం అని బతుకుతుండ్రు" అంది కిటికీలో నుండి బయటకి చూస్తూ. ఆ మాటల్లో వెటకారం నిష్ఠూరం కదలాడింది.

ఏమిటి సంగతి అన్నట్టు చూశాడు ఖద్దర్‌వాలా కండక్టర్‌వైపు. ఏమో సార్ అన్నట్టు పెదవి విరిచి, భుజాలను కదిలించాడు. అప్పుడు చెవిలో ఉన్న పెన్సిల్ కింద పడగా దాన్ని అందుకోవడానికి వంగి –

"బస్సెక్కినప్పటినుండి ఒకటే గోల" అన్నాడు మెల్లగా.

అట్టనా అన్నట్టు చూశాడు ఖద్దర్‌వాలా.

"ఈమెను ఎక్కడో చూసినట్టుంది" అన్నాడు ఖద్దర్‌వాలా.

"ఎక్కడ చూసిండ్రో ఏమో మెదడు తినేస్తుంది" అన్నాడు కండక్టర్ ఆమెకు వినబడకుండా. ఉన్నట్టుండి ఆమె మౌనంగా ఏడుస్తోంది. బస్సంతా నిట్టూరుస్తూ, ఆమె వైపు చూస్తున్నారు. కండక్టర్ మాత్రం ఆమెవేపు చూడకుండా బస్సులోని జనాన్ని లెక్కపెట్టి, ఇచ్చిన టికెట్లను లెక్క చూసుకుంటూ అందరు టికెట్స్ తీసుకున్నట్టే కదా అని జనాన్ని మళ్ళీ లెక్క పెట్టి –

"ఎవరో టికెట్ తీసుకోలేదు" అంటూ చికాకుగా చూసి, ఓ పిల్ల తల్లిని ఉద్దేశించి–

"అమ్మా, ఆ పిల్లకు టికెట్ తీసుకున్నావా?" అంటూ వెనుక సీటు వైపు నడుస్తూ అడిగాడు.

"గీమెకు టికెట్టెందుకు, మూడేండ్లు కూడా లేవు" అందామె తన బిడ్డను పొదివి పట్టుకుంటూ.

"ఆరేండ్ల పిల్లను పట్టుకొని మూడేండ్లంటవు ఎట్టనమ్మా? తే, తియ్యి, తియ్యిపైసలు తీయ్యి" అంటూ ఆమె దగ్గరే నిలుచున్నాడు.

ఆ సంభాషణ విన్న పాప "అవును, నాకు ఆరేండ్లు, ఒకటో తరగతి చదువుతున్నా" అంది కండక్టర్‌వైపు నిక్కి చూస్తూ.

"మంచి పాపవు, తియ్యమ్మా పైసలు తియ్యి" అంటూ అఫ్ టికెట్ ఇష్యూచేశాడు. తల్లి పైసలు ఇవ్వక తప్పలేదు.

"దీన్ని చదివిస్తే ఉన్న మతి పోతుంది" అన్నది బిడ్డవైపు కోపంగా చూస్తూ.

ఖద్దర్‌వాలా దుఃఖిస్తున్నామెను పరిశీలనగ చూస్తూ ఉన్నాడు. ఆమె చేతికి గోట్లున్నాయి. నుదట బొట్టులేదు. పోరాటపు రోజులు గుర్తుచేసినందుకు ఒక్కసారె అతని మనసు పాతికేండ్ల వెనక్కు పరుగెత్తింది.

☆ ☆ ☆

నిజాం గద్దె దిగాలని ప్రతి వ్యక్తి ఆయుధం అందుకొని పోరాడుతున్న రోజులు. పోరాట యోధులు గెరిల్లా దళాలుగా ఏర్పడి రజాకార్ల మీద మెరుపు దాడి చేస్తూ

ఉన్నారు. వలిగొండ నుండి మోత్కూర్ వైపు వెళ్ళే ఏరియా దళ నాయకుడు వలిగొండ బ్రిడ్జిని ఓ కంట కనిపెడుతూ వున్నాడు. రజాకార్లు గెరిల్లాల గాలింపు చర్యను ముమ్మరం చేసారు. దళ నాయకుల చిరునామాలు తెలుసుకొని, వాళ్ళ కుటుంబ సభ్యులను నానా హింసకు గురిచేస్తూ, ఎవరెవరు ఎక్కడున్నదీ చెప్పమని బాధించేవారు. ఆ రోజులు తలుచుకుంటే గుండె చెరువౌతుంది.

మౌనంగా ఏడుస్తున్న ఆమెకు సరిగ్గా అప్పుడే అడ్డంగా కన్నీటి తెరలు. ఓ రోజు పొయ్యిమీద ఎసరు పెట్టి తన ఆరునెలల కొడుకుకు పాలిస్తూ, ఎన్నో నెలలనుండీ ఇంటికి రాని భర్తను తలుచుకుంటూ చాటలో బియ్యంలోని రాళ్ళు ఏరుతూ ఉంది ఓ స్త్రీ. మధ్య మధ్య పాప పాలు తాగడం ఆపి, కాళ్ళు చేతులు ఆడిస్తూ బోసి నవ్వులతో తల్లి వైపు చూస్తున్నాడు. పాలధార ఆగిపోయి కన్నీటి చుక్కలు చేటలో రాలగానే ఉలిక్కిపడి, బాబు ముఖంలోకి చూసింది. ఒక్కసారె దుఃఖం మాయమైంది. అచ్చం తన భర్త నాగన్న ముఖమే. ఎప్పుడున్నా తీరిగ్గా పరాచికాలాడినపుడు ఆయన నవ్వు ఇట్లనే వుండేది. మరొకసారి కొడుకును తనివితీరా ముద్దాడింది. అప్పటి వరకు తన మనస్సులో వున్న తన భర్తతాలూకు ఎడబాటు జ్ఞాపకాలు ఆ ముద్దుతో కాసేపు కనుమరుగు అయినయి.

అంతలోనే ఎవరో వస్తున్న చప్పుడైంది. అది విని బిడ్డను గుండెలకదుముకొని లేచి నిలుచుంది.

"నిమ్మకాయలు" అన్నాడు ఓ వ్యక్తి దర్వాజా దగ్గర నిలుచొని. ఆయన భుజాన ఓ నిమ్మకాయలున్న గోనెసంచి, మరో భుజాన వేలాడుతున్న కండువలో ఒక వైపు సజ్జలు వున్నాయి. తన భర్త వెళ్ళేటప్పుడు చెప్పిన గుర్తులకు, ఈ వచ్చిన మనిషి పోలికలు కలిసాయి. అంతేకాదు, నిమ్మకాయలు అనే రహస్యపు సంకేత పదం గుర్తుకు వచ్చింది.

"అక్కా, నిమ్మకాయలు కావాల్నా?" అన్నాడు.

ఏదో ఉత్సాహం వంటి నిండా నిండుకోగా లోపలికి రమ్మని సైగ చేసింది.

"నీవే రా అక్కా, దర్వాజా దాటలేను" అన్నాడు. బాబును రొంటెన వేసుకొని తానె వచ్చింది. తన భుజానికున్న మూటను దించుకొని చుట్టూ ఓసారి చూసి వంగుతూ,

"ఏరుకో అక్కా, నీ ఇష్టమొచ్చినవి ఏరుకో" అని –

"నాగన్న రేప్పొద్దున వేములకొండ జాతరకు వస్తుండు. జాతరల కుంకుమను కుప్పలు పోసుకొని అమ్ముకుంట కూర్చుంటడు. నీవు బాబును ఎత్తుకొని వచ్చి కూర్చోని ఏం మాట్లాడకు. కుంకుమను కొనుక్కోని పైసలిచ్చిరా. అప్పుడు మాత్రం నాగన్నకు బాబు కనబడేటట్టు ఎత్తుకో" అంటూ అక్కడికెవరో వచ్చేది చూసి "ఎన్నని ఏరుతువమ్మ కానియ్యి, కానియ్యి. ఇంకా ఊరంతా తిరగాలి" అన్నాడు. ఆ వచ్చినవాడు తన దారిన తాను పోయాడు.

"అక్కా, ఆకలైతుంది అన్నముందా?" అన్నాడు. ఆమె అతని అంటుకపోయిన డొక్క వైపు చూసింది. అప్పుడ ఆమె గుండె తరుక్కుపోయింది.

"ఇంకా వండలేదు, ఎసరు కాగుతుంది, కాసేపు ఆగితే –" అంది బాధగా. బయట తిరిగే ఈయనే ఇట్లావుంటే తన భర్త అని తలుచుకోగానే ఆమెకు కన్నీళ్ళు తన్నుకొచ్చాయి. కుక్కలు మొరిగిన చప్పుడు. ఎవరో వస్తున్నట్టు మూటలు సర్దుకొని లేస్తూ –

"అన్నం ఊడికిందాక వుండలేను" అని మూటలను భుజాన వేసుకొని "నిమ్మకాయలు" అంటూ లేచి అక్కడినుండి కదిలాడు. అతను సందు మళ్ళేవరకు చూసి, బాబును ముద్దాడుతూ, నిమ్మకాయలను వడిలోవేసి, రొండికి చెక్కుకొని బాబును రెండుచేతుల్లో ఎత్తుకొని ఉయ్యాల ఊపినట్టు ఊపుతూ మురిసింది. ఎసరు కాగి పొంగి పొయ్యి చల్లారుతున్న చప్పుడు.

ఇక రాత్రంతా కంటికి నిద్రే లేదు. మంచం మీద ముదుసలి మామ గుర్రుపెడుతూ ఉన్నాడు. పందిట్లో కుక్క పడుకొని మధ్య మధ్య గునుసుతూ వుంది. రెండు మూడు సార్లు తలుపు చప్పుడైనట్టు అనిపిస్తే లేచి కూర్చుని, ఎవరూ రాలేదని నిట్టూర్చి బాబుని పొట్టలోకి చేర్చుకుంటూ –

'ఒరే నా తండ్రి, రేపు మీ న్నాన్న నిన్ను సూస్తారు. అచ్చం నాలాగే ఉన్నాడని మురిసిపోతాడుర కన్నా!' అంటూ పసివాని ముఖంలోకి చూసింది. నిద్రలో ఆ నవ్వు ముఖాన్ని చూసి ఓసారి నిద్రాభంగం కాకుండా ముద్దుపెట్టుకుంది.

తెల్లారి వేములకొండ జాతరలో కుంకుమ కుప్పలను వెతుకుతూ వుంది. ఆమె భుజాన పసివాడు. వాని తలకు కుచ్చుల కుల్ల. చేతులకు తెల్లని రాళ్ళు పొదిగిన నల్లని పూసలు గుచ్చి కట్టింది. నుదుట, బుగ్గమీద నల్లని కాటుక పెట్టింది. కాళ్ళకు రాగి, వెండి కలిపి చేసిన కడియాలు తొడిగింది. మెడలో వెండి కత్తి, ఓళ్ళను వేసింది. మొలకు నల్లని దారం కట్టింది.

జాతరంతా తిరిగి చూసింది. అక్కడక్కడా కుంకుమ కుప్పలున్నా అయన లేడు. కళ్ళు దివిటీలై వెతుకుతున్నాయి. మనసు వేయి కళ్ళు చేసుకొని వెతుకుతూ వుంది. అయన మాత్రం కనబడలేదు.

'కాసేపైనాక వస్తుండొచ్చు, ఈలోపు గాజులు వేయించుకుందాం' అని గాజుల దుకాణం ముందు కూర్చుంది. గాజులను చూస్తూ 'అయనకు ఏ రంగు గాజులైతే ఇష్టమో ఎన్నడు చెప్పలేదు. ఏనాడైనా తీరిగ్గా ఇంటి పట్టున ఉంటేకదా?' అనుకొని

"ఆ ఎర్ర గాజులు తొడుగు" అని గాజుల మలారం ముందు కూర్చుంది. భుజం మీద కొడుకు, వాని నోట్లో బొటెమనవేలు. దుకాణంవాడు గాజులను చూపిస్తూ ధర చెప్పాడు. ఆమె సరే అంది.

"పాత గాజులు తీసెయ్యమంటావా" అన్నాడు. "అమ్మో వద్దు వాటిని అట్టనే వుంచి కొత్తయి తొడుగు" అంటూ గాడులు ఎక్కెయ్యడానికి చేయి ఇచ్చింది. అతను "సరే" అని గాజులను జత జతగా కలిపి ఎక్కిస్తూంటే అవి చిట్లిపోతున్నాయి. అతనూ ముఖం చిట్లించుకుంటున్నాడు.

చంకలోని బాబు ముందుకు మళ్ళి రంగు రంగుల గాజుల వైపు చూస్తూ హు కొడుతున్నాడు. అప్పుడప్పుడు వంగి గాజులు అందుకోవాలని ప్రయత్నం చేస్తూ ఉన్నాడు.

"అమ్మో, అట్లా బిగపట్టినట్టు రెక్క పెడితే గాజులెక్కవు" అన్నాడు తన పళ్ళు బిగుస్తూ చికాకుగా గాజులవాడు.

ఆమె కదిలి కూర్చుంటూ ఓసారి కుంకుమ కుప్పలవైపు చూసింది. ఆయన రాలేదు. కానీ ఆయన గురించి పక్క దుకాణంలో అనుకుంటున్న మాటలు చెవిలో పడగానే భూమి గిర్రున తిరిగినట్టు అనిపించింది. కళ్ళు మూతలు పడ్డాయి. వేములకొండ మీద దేవుడు గుట్టమీది నుండి జారి పడ్డట్టు అనిపించింది. గుట్ట మీది గుండం అంతా ఎర్రగై మనిషి రక్తంలా మారినట్టు అనిపించింది. సంకలోని బాబు జారి ఏడుస్తూవున్నాడు. ఆ ఏడుపు విని ఈ లోకంలోకి వస్తూ బాబును ఎదమీదికి ఎగేసుకుంటూ లేస్తూ "నాకు గాజులొద్దు అన్నా!" అంది. అప్పుడామె గొంతు పూడకపోయినట్టు పలిగింది. కళ్ళనిండా నీళ్ళు. గుండెనిండా దుఃఖం.

ఆమె అక్కడినుండి కదిలి వచ్చిన దారివైపు నడుస్తూ ఉంటే జనం ఆరోజు తెల్లవారుజామున వలిగొండ దగ్గర రజాకార్లు కుంకుమ సంచులతో వస్తున్న నాగన్నను తుపాకీతో కాల్చి చంపింద్రు అని అనుకుంటున్నది విని శోకమూర్తిగా మారింది.

☆ ☆ ☆

రామన్నపేటలో బస్సు ఆగింది. ఖద్దరువాలా దిగిపోయాడు.

ఇద్దరు పోలీసులు బస్సెక్కారు. చేతుల్లో తుపాకులు. కండక్టర్ టికెట్ అడగలేదు. వాళ్ళేదో కాగితాన్ని చూపించారు. అది చూసి మళ్ళీ ఆమె మాట్లాడసాగింది. ఈ సారి ఆమె ముఖ కవళికలు మారిపోయాయి దుఃఖం పోయి గొంతులో రోషం చోటు చేసికొంది. తుపాకులవైపు, వాటిని పట్టుకొని కూర్చున్న పోలీసుల వైపు తీక్షణంగా చూస్తూవుంది. అప్పుడామె కళ్ళు ఎరుపు ఎక్కుతూ ఉన్నాయి. గుండెలో నుండి గతం తన్నుకొస్తూవుంది.

'ముందు ఉద్యోగుల జీతాలు పెరగాలని సమ్మె చేసింద్రా?'

పెరగలేదు.

ఈ ప్రభుత్వాన్ని పడగొడదాం అన్నారా?

ఉద్యోగులంతా ఏకమై ఊరేగింపు తీసి, సభలు చేసి, ధర్నాలు చేసింద్రా?

ప్రభుత్వం పడిపోయిందా?. కాకపోతే నడిపేవాళ్ళు మారింద్రు.

విద్యార్థులను రెచ్చగొట్టింద్రా? స్కూల్స్, కాలేజీలను మూయించింద్రా? ప్రభుత్వ ఆస్తులకు నిప్పు బెట్టింద్రా, బస్సులను తగులబెట్టింద్రా? టెలిఫోన్ తీగలను తెంపించింద్రా? చివరికి ఏరే రాష్ట్రం కావాలన్నరా? అవును. ఆ మాటలతో నాయకులు మర్రి వృక్షమంత ఎదిగారు విద్యార్థిలోకం జూలువిదిలించి మళ్ళీ గర్జించారు. ఊళ్ళకు ఊళ్ళు కదిలొచ్చాయి. పట్టణాలన్నీ ఉరుకులు, పరుగులు. విద్యుచ్ఛక్తికి అంతరాయం, హైద్రాబాద్ నగరం అంతా చిమ్మచీకటైపోయింది. రాత్రికి రాత్రి భారత ప్రధాని నగరానికొచ్చి పరిస్థితులు సమీక్షించి వెళ్ళినా పరిస్థితులు యధాతథం. అల్లకల్లోలం.

రైళ్ళను ఆపేశారు. రాష్ట్రాన్నంతా అతలాకుతలం చేశారు. జైళ్ళన్నీ ప్రత్యేక తెలంగాణా పోరాట కార్యకర్తలతో నిండిపోయాయి.

రాజకీయ నాయకులు, విద్యార్థినాయకులు కలిసి పోరాటాన్ని మరింత ఉధృతం చేశారు.

ఊరేగింపులు హద్దులు దాటాయి. నినాదాలు ఆకాశాన్ని అంటాయి. అంతా అల్లకల్లోలం. ఎన్నో కుటుంబాలకు కంటికి నిద్రలేదు. నిన్న కలిసి తిరిగినవాళ్ళు ఇవాళ తప్పక తిరగసాగారు. మాట్లాడకూడనంత మౌనం మనిషి మనిషి మధ్య పెరిగిపోయి అలజడి హద్దులు దాటింది. ఋటేలు చోటు చేసుకున్నాయి. ప్రభుత్వం. స్తంభించిపోయింది. అయినా తెలంగాణా నాయకుని చేతికర్ర కదిలి కదిలి జనాన్ని కదిలిస్తూనే వుంది.

ప్రభుత్వం ప్రజల మధ్య పోరు పెచ్చరిల్లిపోయింది. అది చూసిన ప్రభుత్వం తుపాకులను ఎక్కుపెట్టింది. ఎన్నిచోట్ల లాఠీ ఛార్జీలు, టియర్ గ్యాసులు! మరెన్నో చోట్ల ఫైరింగులు –

ఎందరు నేలకొరిగారు?'

సరిగ్గా అప్పుడే అమ్మో అని అరిచినపుడు పేగు కదిలింది. ఆమె పెదవులు అదిరినయి. అప్పటివరకు మౌనంగా ఆలోచిస్తున్న ఆమె గట్టిగా అరిచి ఏడవసాగింది. పక్కనున్న ఆడవాళ్ళు ఆమె భుజాల మీద చేతులేసి ఓదార్చి కూర్చోబెట్టారు. అయినా ఆమె తలెత్తి –

"అగో పోలీసు! అయే తుపాకులతో నా ఒక్కగానొక్క కొడుకుని నిలువునా కాల్చేసిరి. నా ఒక్క కొడుకే కాదు, ఎందరి కొడుకులనో పొట్టనబెట్టుకుంద్రు. మా శోకం వూకేపోదు, తప్పక తగులుతది."

బస్సంతా కలియజూసి, "మరి తెలంగాణా వచ్చిందా? మనిషి మనిషి మధ్య పరాయితనం పెరిగింది కదా? ఇంత జరిగినా అంతా మరిచిపోయి మల్ల వాళ్ళకే ఓటేసి గెలిపిస్తుంద్రా? ఇప్పుడు వాళ్ళు మంత్రులు! ముఖ్యమంత్రులు!"

బస్సు వలిగొండ బ్రిడ్జి మీద నుండి పోతూ ఉంది. బ్రిడ్జ్ దాటగానే వేములకొండకు వెళ్ళే రోడ్డు కనపడింది.

"బస్సాపు" అని అరిచింది సీటు నుండి లేస్తూ ఆమె.

ఇంత విని గూడ కండక్టర్ బెల్ కొట్టలేదు.

డ్రైవర్ గేరు మార్చి, బస్సు ఆపి, ఆ తరువాత వెనక్కు మళ్ళి, ఆ దిగుతున్న ఆమెవైపు చూశాడు.

ఆమె దిగుతూ పోలీసుల వైపూ, తుపాకుల వైపూ చూస్తూ తనలో తానే ఏదో గునుగుతూనే దిగింది. మూర్తి లేచి వెళ్ళి ఆమె దిగేవరకూ మెట్టు మీద నిలుచున్నాడు.

"ఎంది సార్! మీరట్లనే" కండక్టర్.

కండక్టర్ వైపు చూస్తూ –

"ఆమె పిచ్చిదానిలాగా కనిపిస్తుంది కదా నీకు?" అన్నాడు మూర్తి కండక్టర్ పక్కన ఆగి.

"అయ్యో, ఆమె గురిచి నాకెరుకే. ఆమె ఎన్నోసార్లు ఇక్కడ దిగడం చూశాను. బ్రిడ్జ్ దగ్గిరికి రాగానే శోకమూర్తిగా మారిపోతుంది" అన్నాడు డ్రైవర్.

"ఆమెకు మిగిలింది అదే కదా?" అన్నాడు మూర్తి డ్రైవర్ వైపు చూస్తూ.

"గతం తెలుసుకోక గుర్రుమంటుండు పిల్లడు" అన్నాడు సత్యం తన సహజ ధోరణిలో బస్సు కదిలి పరుగందుకొంది.

మూర్తి కండక్టర్‌నుద్దేశిస్తూ –

"క్లాసు పుస్తకాలు చదివితివి, పాసై ఉద్యోగం కొట్టేస్తివి. ఇంకా వేరేపుస్తకాలు కూడా చదువు. లోకం సంగతి తెలుస్తది" అన్నాడు.

కండక్టర్ నోట్లను పేర్చుకుంటూ విన్నాడే కానీ మాట్లాడలేదు.

"గోర్కీ రాసిన 'అమ్మ' అని ఓ పుస్తకం ఉంది, చదువు. అది చదివితే ఇప్పుడు పోయినామె పిచ్చిదో, మంచిదో తెలుస్తుంది" అంటూ వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు.

ఆమె పిచ్చి ఈనకొచ్చినట్లుంది అని అనుకున్నాడే కానీ బయటకు అనలేకపోయాడు కండక్టర్.

వలిగొండ వచ్చింది. బస్సు ఆగింది.

● *'బోజ కతలు': 1998* ●

★ ★ ★

పాలగిరి విశ్వప్రసాద్

97

# చుక్క పొడిచింది

ఊరు ఊరంతా పీనిగె లేచిన యింటి మాదిరుంది. ఊర్లో ఖూనీ పడి నేటికి మూడో రోజు. ప్రెసిడెంటు కొడుకులూ, వాళ్ళ గుంపులోని ముఖ్యులూ పరారీలో ఉన్నారు.

సుజాత నడవలో స్తంభాని కానుకొని, దేన్ని చూస్తోందో తెలియని చూపుల్తో కూర్చోనుంది. అయిన పాయినోళ్ళు పదిమంది ఆడవాళ్ళు చుట్టూ ఉన్నారు. రవీంద్రారెడ్డి తల్లి స్మృతి లేకుండా, వసారాలో మంచాన పడివుంది. రవీంద్రారెడ్డి తమ్ముళ్ళిద్దరూ జరగాల్సిన పనులు చూస్తూ బయటేడనో ఉన్నారు.

భర్త యింక లేడనే నిజాన్ని అంగీకరించడానికి ఈ మూడు రోజుల నుండీ సుజాత తన వంట్లోని సర్వ శక్తులనూ కూడదీసుకొంటోంది. పరామర్శకు వచ్చిపోయేవాళ్ళ సాంత్వన మాటలతో అదంతా ఎప్పటికప్పుడు తీసికట్టయిపోయి, ఏడుపొస్తోంది. ఈ లోకంలో తను ఒంటరిదాన్నయి పోయాననే ఆలోచనే మాటిమాటికి తలపుకొచ్చి పెనుభూతమయి కూర్చుంటోంది.

రవీంద్రారెడ్డి ఖూనీ అయితాడనీ ఎవరూ ఊహించలే. అసలా వాతావరణమే లేదు. అనుమానించాల్సిన సంఘటనలేవీ జరగలేదు. ఏడేళ్ళప్పుడు అవతలి గ్రూపులోని ప్రెసిడెంటు చిన్న కొడుకును చంపినప్పటి నుండీ ఊర్లో ఏ విధమైన ఘర్షణలూ జరగలేదు. ప్రెసిడెంటు కొడుకును చంపిన ఆ కేసులో రవీంద్రారెడ్డి, అతని తమ్ముళ్ళిద్దరితో పాటు మరో ముగ్గురు ముద్దాయిలుగా ఉన్నారు. ఆ కేసు హైకోర్టులో తోసిపోయింది. అది సుతా ఎవరి పనులు వాళ్ళు చేసుకొంటున్నారు. క్రమంగా ఊర్లో వాతావరణం ప్రశాంతంగా మారిపోయింది. రవీంద్రారెడ్డి స్వతహాగా కక్షకోరు మనిషి కాడు. తమ గుంపు వైపు నుండి రెచ్చగొట్టే చర్యలు జరగకుండా జాగ్రత్త పడతా వచ్చినాడు. అవతలి వైపు నుంచి కూడా ఏరకమైన కవ్వింపులూ లేకపోయినాయి. ఆ మధ్య వచ్చిన అసెంబ్లీ, స్థానిక సంస్థల ఎన్నికలు కూడా ఊర్లో ప్రశాంతంగానే జరిగిపోయినాయి. ఇప్పుడు హఠాత్తుగా యిది జరిగింది. ఏ 'పగ' లూ లేవనిపించి, అవతలి మనిషిని అజాగ్రత్తగా తిరగనిచ్చి, పగతీర్చుకున్న ఎత్తుగడ యిది.

మూడు రోజుల కిందట – పొద్దున్నే చద్దన్నంతిని, సుజాతతో ప్రొద్దుటూరుకని చెప్పి పోయినాడు. పోతా పోతా తమ గుంపువాళ్ళ నిద్దరిని వెంటబెట్టుకొని పోయినాడు.

తమ ఊరి నుండి పేటకు పోవాలంటే రెండు మైళ్ళు నడిచి మెయిన్‌రోడ్ మిందికి పోవాల. రవీంద్రారెడ్డి బయలుదేరిపోయిన అర్థగంటకే కార్చిచ్చులా ఊరంతా పాకింది – 'దుగ్గెమ్మ వొంకలో రవీంద్రారెడ్డి మింద బాంబులేసినారంట' అని.

సుజాతకు ఒక్క క్షణం ఏం విన్నదీ అర్థం కాలేదు. అర్థమైన మరుక్షణం కాళ్ళు చేతులు ఆడలేదు. రవీంద్రారెడ్డి తమ్ముళ్ళు ట్రాక్టరు తీసుకొని వస్తే, ఎవరో చెయిపట్టి ట్రాక్టరు నెక్కించినారు. ట్రాక్టరు పేటకు పోయే దావ పట్టింది. అప్పటికే ఊర్లోని జనంతో పేటకు పోయే దావంతా తీర్థం మాదిరుంది. చుట్టుపక్కల వూర్ల నుండి వచ్చిన జనంతో దుర్గమ్మ వంక ప్రాంతమంతా నిండిపోయి వుంది. ఎమ్మెల్యే తమ్ముడు కూడా వచ్చి ఉన్నాడు.

రవీంద్రా రెడ్డి చచ్చినాడని అందరి నోటా వస్తోంది. అయినా సుజాతకు ఆశగానే ఉంది..... 'ఆ గుమిగూడిన జనం మధ్య, బాంబు దెబ్బ తగిలిన తన భర్త యింకా ప్రాణాలతోనే ఉన్నాడని – ప్రాణాలు పోయేంత ప్రమాదం ఏమీ లేదని'.... అట్లా జరగాలని ఆమె ఆశ.

రవీంద్రారెడ్డి భార్య, తమ్ముళ్ళు, తల్లి వచ్చినారని – గుంపు చీలి దావ యిచ్చినారు. దగ్గరకు పోయి చూసిన ఆ క్షణమే సుజాత మబ్బుకమ్మి కూలబడింది..... రవీంద్రారెడ్డి వంకలో బొక్క బోర్ల శవమై పడి ఉన్నాడు. వీపు కింది భాగమంతా బాంబు దెబ్బకు చిట్లిపోయిఉంది. అక్కడ నేలమింది మట్టి కొంతమేరకు నెత్తురుతో తడిసి వుంది. అది చూసి పడిపోవడం – పడిపోవడం సుజాత, మరుసటి దినం శవాన్ని పూడ్చడానికి సిద్ధం చేసేటప్పుడు లేచింది. అదైనా అందరూ సపర్యలు చేసి లేపినారు.

అంత ముందురోజు 'శవపంచాయితి' అంతా దగ్గరుండి ఎమ్మెల్యే తమ్ముడే చేయించినాడు. పోలీసులకు, డాక్టరుకు తనే ఖర్చు చేసినాడు. బతికుండగా తమ అనుచరులు కనీసావసరాలు కూడా చూడడానికి యిచ్చగించని రాజకీయం....చంప బడినాక వాళ్ళశవం మింద ఉదారంగా ఖర్చు చేసే రాజకీయం.... పొల్లు పోకుండా నడిచిందక్కడ. తనే దగ్గరుండి కేసు కూడా రాయించినాడు. అంతా అయిన తర్వాత, ఆస్పత్రి సిబ్బంది తమ మామూలు తీసుకొని శవాన్ని ఒప్పజెప్పినారు. కోసిన శరీరాన్నంతా దాదాపు మూట కట్టినట్లు కట్టి యిచ్చినారు. తల ఒక్కటే చెదరకుండా ఉంది.

రాజధానిలో ఉన్న ఎమ్మెల్యేకు ఫోన్ చేసి చెప్పినారు. ఈసారి మంత్రివర్గ విస్తరణలో మంత్రి పదవి కోసం ముమ్మరంగా ప్రయత్నం చేసుకొంటున్న ఎమ్మెల్యే, తన స్వంత పనులన్నీ పక్కనబెట్టి బయలుదేరుతున్నానని చెప్పినాడు.

తన నియోజక వర్గంలోని పల్లెల్లో పార్టీ లీడర్లను కాపాడుకోవడం మంత్రిపదవి కన్నా ముఖ్యం అనుకోవడం .... వాళ్ళు యిట్లా అంతమయినపుడు ఆ వూర్లో తమ గ్రూపు చెదరకుండా ఉండడానికి, తన పట్ల నమ్మకం సడలకుండా ఉండడానికీ – అప్పటికి మాత్రం అన్నీ దగ్గరుండి చూసుకోవడం... ఇవన్నీ ఈ ప్రాంత రాజకీయనాయకులకు ఉగుపాలతో ఒంటబట్టినేయ్.

మరుసటి రోజు ఉదయానికి హైదరాబాద్ నుండి నేరుగా ఈ వూరికే వచ్చినాడు. సుజాతను, తమ్ముళ్ళను, తల్లిని ఓదార్చినాడు. సుజాతకు ఆ ఓదార్పులేమీ మనసుకెక్కలేదు. నిశ్చేతనగా ఉండిపోయింది.

పొద్దెక్కే సమయానికి తాలూకాలోని చాలా గ్రామాలనుంచి ఎమ్మెల్లే గ్రూపు నాయకులంతా వచ్చినారు. ఊరంతా జనంతో కిటకిటలాడింది.... అంతా అయిపోయింది..... ఎవరి తోవన వాళ్ళు పోయినారు.

పరామర్శల తాకిడి తగ్గిన ఈ మూడోరోజు, సుజాత మెల్లగా ఈ లోకంలో కొస్తోంది. స్వంతంగా ఆలోచించడానికి ప్రయత్నిస్తోంది. భర్త యింక లేడనే వాస్తవాన్ని అంగీకరించడానికి మనసును గట్టిపరుచుకొంటోంది. తనను గురించి, పిల్లల గురించి ఆలోచిస్తోంది. ఏడేళ్ళ కొడుకూ, ఐదేళ్ళ కూతురూ..... వాళ్ళ భవిష్యత్తు ఏందనేది, ఆమెకు ప్రశ్నగా మిగుల్తోంది.

ఈ కక్షలూ, కార్పణ్యాలంటే తనకు గానీ, తన తండ్రికి గానీ బొత్తిగా ఇష్టం లేదు. తన మేనత్త శారదమ్మను పుట్టినూర్లోనే ఇట్లాంటి 'పార్టీ కుటుంబం'లోనే ఇచ్చినారు. తన మేనత్తను చేసుకొన్న తిమ్మారెడ్డి ఊర్లో పార్టీ లీడరు. వాళ్ళ పెళ్ళయిన నాలుగేళ్ళకే శారదమ్మ మెళ్లో తాడు తెగింది. కడప నుండి వస్తున్న తిమ్మారెడ్డిని, గోటూరు వంకలో బస్సు నిలబెట్టి దింపి వేటకొడవళ్ళతో నరికినారు. తిమ్మారెడ్డికి తన చెల్లెల్నిచ్చి పొరబాటు చేసినానని అంతకుముందే వగచుతాండిన తన తండ్రి ఈ సంఘటనతో పూర్తిగా పశ్చాత్తాప పడినాడు. కూతుళ్ళ విషయంలో ఈ పొరబాటు చేయకూడదని నిర్ణయించుకొన్నాడు. కూతుళ్ళకు సంబంధాలు వచ్చేటప్పుడు కరాఖండితంగా చెప్పినాడు – ఎంత ఆస్తిపరులైనా సరే, ఈ పార్టీల పల్లెకొంపలకు మాత్రం తన ముగ్గురు కూతుళ్ళను ఇవ్వనన్నాడు. సుజాత కన్న పెద్దవాళ్ళిద్దర్నీ – ఒకర్ని వ్యాపారస్థునికీ, మరొకర్ని ఉద్యోగస్థునికి ఇచ్చి చేసినాడు. ఒకరు విశాఖపట్నంలో, ఒకరు నెల్లూరులో ఉన్నారు. 'అక్కాచెల్లెల్లకొకసారెన్నా పిల్లోళ్ళ మొకం సూడ్డానికి లేకపాయ! దూరాభారం జాస్తయింద'ని తల్లి అంగలార్చినప్పుడల్లా – 'అయితే అయిందిలే. తలకాయ సెడి యింట్లో కూర్చుండే దౌర్భాగ్యం తప్పినందుకు సంతోషపడు' అనేవాడు.

ఆ సమయంలో తను సెకెండియర్ డిగ్రీ చదువుతుండగా, ఎవరో రవీంద్రారెడ్డి సంబంధం తెచ్చినారు. తన తండ్రి అన్నీ విచారించి ససేమిరా కాదన్నాడు. రవీంద్రారెడ్డి తండ్రి పట్టుబట్టినాడు – తన కొడుకును ఎమ్మెస్సీ చదివించింది వూర్లో పార్టీలో దించడానికి కాదన్నాడు. ఉద్యోగం రాగానే ఊర్లోనుంచి పంపిస్తాననీ.... తనకు ఎమ్మెల్యే చేతిలో ఉండాడు కాబట్టి అది కూడా తొందరగానే రావొచ్చనీ..... ప్రాధేయపడడంతో తన తండ్రి మెత్తబడినాడు. స్వంత నిర్ణయాలు తీసుకునేంత స్వేచ్ఛ తనకు లేదు. అసలు, పెళ్ళి గురించి మంచి, చెడులు బేరీజు వేసుకునేంత చైతన్యమే తనకింకా రాలేదు – అప్పటికి. తను పుట్టి పెరిగిన వాతావరణం, పరిసరాలు అటువంటివి.

రవీంద్రారెడ్డితో తన పెళ్ళయిపోయింది. పార్టీలో మునిగి తేలుతున్న కుటుంబం.... ఆత్మీయతలకు మాత్రం కొదవలేదు. చదువుకున్నవాళ్ళలో – అభివృద్ధి చెందిన ప్రాంతంలో లేని ఆపేక్షలు..... తనను ఉక్కిరి బిక్కిరి చేసేవి కుటుంబంలో

తొలిసారిగా మంచి చదువు చదివిన కొడుకూ – ఆ కొడుకుకు వచ్చిన చదువుకున్న పెళ్లామయినందువల్లనేమో తనను నెత్తిన పెట్టుకున్నంత పని చేసినారు. రవీంద్రారెడ్డి తండ్రి మెందుమెందుగా కుందేళ్ళను, బట్టమేక పిట్టల్నీ, కంజుల్నీ, పావురాలను తెప్పించి రకరకాల మాంసాల్ని వండించేవాడు.

తనతో – 'తినమ్మా! మీ నాయన నీకు కోడికూర, పొట్లేకూర తప్పిచ్చి యితరం సూపిచ్చి ఉండడు, తిను – తిను' అనేవాడు – వియ్యంకుడికన్నా తనే గొప్పవాడిననేది చతురుగా బయటపెడ్తూ.

తను మరింత చతురుగా – 'మేము రాక్షస జాతోళ్ళం కాదులే మామా! మామూలు మనుషులం. మాకు కోడికూర, పొట్లేకూర తప్ప యితరమెట్ల తెలుస్తాయ్?' అనేది.

తన పెళ్ళయి యేడాది నిండింది. రవీంద్రారెడ్డి ఉద్యోగం కోసం అన్ని రకాలుగా గట్టి ప్రయత్నాలు చేస్తున్నారు. ఇదో – అదో అనేటట్లు ఉంది. అట్లాంటి కాలంలో రవీంద్రారెడ్డి తండ్రి దారుణంగా చంపబడినాడు. ఆ ఇరుబోగుల్లో ఒకనాడు మాలోళ్ళ జయుడ్ని తోడుకొని మడవ కట్టడానికి చేనికి పోయినాడు. అంతకుముందు నెలకిందటే పంచాయితీ ఎన్నికలు ముగిసి వుండె. రవీంద్రారెడ్డి తండ్రి మీద అవతలి పార్టీ మనిషి చావుదప్పి కన్ను లొట్టబోయినట్లు ఏడు ఓట్లతో గెలిచిండె. ఆ ఉడుకు అంతటితో చల్లారిందనుకొన్నారు. అందున్నా, తను ఓడిపోయినవాడు కదాని ఏమారినాడు. దరిదాపుల్లో ఓడిపోవడమే చెరుపయ్యిందేమో!

మడవ కట్టుకుంటున్న మనిషి మీద వేట కొడవళ్ళతో పడినారు. తమ రెడ్డి కోసం మాల జయుడు వచ్చినోళ్ళ కాళ్ళకడ్డం పడినాడు. జయుడ్ని పక్కకు ఈడ్చి, చేలవెంబడి అడ్డంపడి పరుగెత్తుతున్న అసలు మనిషిని వెంటబడి నరికి పోయినారు.

ఆ హత్య కేసులో అవతలి పార్టీలోని సర్పంచ్ కుటుంబాన్నీ, యితర ముఖ్యుల్నీ ఇరికించినారు. తండ్రి హత్యకేసుకోసం తిరగడంలో, తాత్కాలికంగా రవీంద్రారెడ్డి ఉద్యోగ ప్రత్నాలు నిలిచిపోయినాయి. అప్పటికి అతని తమ్ముళ్ళు ఇంటర్, హైస్కూల్ స్థాయిల్లోనే ఉండడంతో తనే అన్నీ చూసుకోవాల్సి వచ్చింది.

కేసు విషయాలు....పొలం పనులు....ఊర్లో తమ పార్టీ పనులు...వీటన్నిటి నడుమ కండ్లుమూసి తెరిచినట్లు మూడేళ్ళు దాటినాయి. అవతలి వాళ్ళ మీద ఉన్న కేసు జిల్లా కోర్టులో తోసిపోయింది. 'హైకోర్టుకు పోదా'మని రవీంద్రారెడ్డి అంటే – 'ఖర్చులు దండగ ఎందు'కన్నారు అతని పెద్దతమ్ముడూ, తల్లీ. వాళ్ళ కడుపుల్లో ఏముందో నెల తిరక్కముందే బయటపడింది.

కేసు తోసిపోయి నెల తిరక్కముందే.....కడపలో డిగ్రీ చదువుతున్న పెద్ద తమ్ముడు, కొంతమంది వూర్లోవాళ్ళను తోడుచేసుకొని – కడపలో బస్టాండ్ యెదురుగా – సర్పంచ్ చిన్న కొడుకును బాకులతో పొడిచి చంపినాడు. ఆ కేసులో రవీంద్రారెడ్డిని మొదటి ముద్దాయిగా ఇరికించినారు. కేసునుండి తన పేరును తొలగించుకోవడానికి ఎమ్మెల్యే ద్వారా రవీంద్రారెడ్డి చాలా ప్రయత్నమే చేసినాడు. మొదటి ముద్దాయి అయినందువల్ల అదేమీ కుదరలేదు.

ఆ తర్వాత స్టేషన్‌లో హాజరు కావడం .... రిమాండ్‌కు పంపబడడం..... ఐదారు నెలలు బెయిలు రాకపోవడం.... ఈ పరిణామాలతో రవీంద్రారెడ్డికన్న సుజాత ఎక్కువగా కుంగిపోయింది. రవీంద్రారెడ్డి తల్లి మాత్రం ఇసుమంత కూడా దిగులు పడ్తాన్నట్లు కనిపించలే. పైపెచ్చు తన కొడుకులు అవతలివాడ్ని ఖూనీ చేసినందుకు తృప్తి పడ్తాన్నట్లు కన్పించేది. సుజాతకది రవ్వంత ఆశ్చర్యంగా ఉండేది.

బెయిలు మంజూరయి రవీంద్రారెడ్డి ఊర్లోకొచ్చిన తర్వాత, మెల్లగా సుజాత భర్తను పోరడం మొదలుపెట్టింది – 'ఈ వూర్లో వొద్దు....టౌన్ చేరదాం... ఉద్యోగం లేకపోతే మానె... భూములూ, బంగారు అమ్ముకొని ఏదైనా వ్యాపారం చేసుకుందాం' – అంటూ. ఈ పోరు వెనుక తన తల్లి తండ్రుల వత్తిడి కూడా ఉండేది. రవీంద్రారెడ్డి ఎవరికీ చెవి ఒగ్గకపోయె – 'కేసు తీరుమానమయినాకే ఏమైనా ఆలోచించేది. అప్పటిదంకా ఎవ్వరేం చెప్పినా వినేది లే' దన్నాడు.

ఆ కేసు నాలుగేళ్ళు నడిచింది. జిల్లా కోర్టులో రవీంద్రారెడ్డితోపాటు మరో యిద్దరికి 'యావజ్జీవం' శిక్ష చెబుతూ తీర్పు వచ్చింది. రవీంద్రారెడ్డి తమ్ముళ్ళతో పాటు మిగిలినవాళ్ళకు శిక్ష పడలేదు. ఒకరిద్దరికి స్వల్పకాల శిక్ష పడినా, కేసు హైకోర్టుకు అప్పీలయినందున వెంటనే బెయిలు మంజూరయింది. రవీంద్రారెడ్డిని, ఆ మరో యిద్దరిని రాజమండ్రి సెంట్రల్ జైల్‌కు తీసుకుపోయినారు. ఈ సంఘటన సుజాతకు అశనిపాతంలా తగిలింది. ఉన్న ఒక్క ఆశా అడుగంటింది. ఇక తమకు శాశ్వతంగా ఈ కక్షలూ కార్పణ్యాల బతుకు తప్పేటట్లు లేదనుకొంది. మానసికంగా అందుకు సిద్ధపడడానికి నిర్ణయించుకొంది.

ఒకటిన్నర సంవత్సరం తరువాత హైకోర్టులో తోసిపోయింది. రవీంద్రారెడ్డి యింటికి వచ్చినాడు. తమ గుంపువాళ్ళ ఆనందం చెప్పనలవి కాలె. రవీంద్రారెడ్డి తన గుంపులోని ఉత్సాహాన్ని రెచ్చిపోయే స్థాయికి చేరకుండా అదుపు చేసినాడు. అవతలి నుండి కూడా పెద్దగా కవ్వింపులేమీ రాలేదు. అరకొరగా వచ్చినా రవీంద్రారెడ్డి తన గుంపును అదుపు చేసుకొన్నాడు. క్రమంగా ఊర్లో ప్రశాంతత వచ్చింది.

సుజాత మళ్ళా భర్తను సలపను మొదలుబెట్టింది – టౌన్ చేరదామని.

తమ్ముళ్ళకు పెళ్ళిళ్ళయి ఒకరిదారిలో పడేంతదాకా ఓపిక పట్టమనె రవీంద్రారెడ్డి.

అదనీ–ఇదనీ సొడ్లు పెడతా, ఈడనే ఉంటే తమ పిల్లల భవిష్యత్తు దెబ్బతింటుందనీ....టౌన్ చేరి పిల్లల్ని చదివించుకుందామనీ.... చెప్పింది – మొత్తుకొంది – ఏడ్చింది.

రవీంద్రారెడ్డి కాదంటే కాదన్నాడు. ఇపుడు గుంపునంతా నడేట్లో విడిచి పెట్టిపోతే – ఇన్నేండ్లూ మనల్ను నమ్ముకొని పార్టీ చేసినవాళ్ళంతా ఏం కావాలన్నాడు. మొహం మీద ఎంగిలి మూస్తారన్నాడు.

దాంతో భార్యాభర్తల నడుమ చిన్నచిన్న తగవులూ అలకలూ ప్రారంభమయినాయి. క్రమంగా అవి మామూలయినాయి గానీ తన ఆశ నెరవేరే సూచనలు కనుచూపు మేరలో కానరాలేదు....మళ్ళా ఓటమి తనదే అయింది.

రవీంద్రారెడ్డి – ఎమ్మెల్యేతో సన్నిహిత సంబంధాలు పెట్టుకొని, ఊర్లో వాళ్ళకు పనులు చేసిపెట్టడం.....ఏవో కాంట్రాక్టులు చేయడం.....వ్యవసాయం చూసుకోవడం.....

ఈ గాడిలో పడిపోయినాడు. మానసికంగా అవిశ్రాంతిమైన యిటువంటి జీవితానికి తను కూడా అలవాటు పడిపోయింది. మంచిదో – చెడ్డదో ఒక జీవితానికి అలవాటు పడింది.

ఇప్పుడు రవీంద్రారెడ్డి పోవడంతో అది కూడా విచ్ఛిన్నమయి పెద్ద కుదుపొచ్చినట్లుంది.

ఏం ఆలోచిద్దామన్నా మెదడు పనిచేయడం లేదు – మొద్దుబారినట్లుగా ఉంది. చివరకు పిల్లల భవిష్యత్తు గురించి ఆలోచిస్తామన్నా మెదడేమీ పనిచేయడం లేదు.

మూడవరోజు తర్వాత, ఉన్న దగ్గరి బంధువులు కూడా ఎక్కడి వాళ్ళక్కడ పోయినారు. మూడవదినం, పదమూడవ దినం జరగాల్సిన చిన్నకర్మ, పెద్దకర్మ ఏమీ జరగలేదు. భర్త ఖూనీ అయితే ఆ కేసు తీరుమానమయ్యేదాకా అటువంటి కర్మలు చేయడం...... భార్యను విధవరాలిని చేయడం వంటివి చేయరు. అవన్నీ కేసు తెగిన తర్వాతనే.

☆ ☆ ☆

కాలం గడిచేకొద్దీ సుజాత క్రమంగా కోలుకొంది. తల్లి తండ్రులు మెండుగా వచ్చిపోతున్నారు.

అప్పుడప్పుడు సుజాత దిగులుగా ఉండడం చూసినప్పుడెప్పుడన్నా..... ఆమె మరుదులనేవారు – "నువ్వు దిగులుపడ కొదినా! కేసు తెగకముందే ఒకరికి ఇద్దర్ని బలిపెట్టకుంటే మేం వీరనాగిరెడ్డికి పుట్టినోళ్ళమే కాదు."

ఆ మాటలకు సుజాత అయోమయంగా చూసేది.... ప్రతీకారవాంఛ తనలో ఏ కోశానా లేదు. మరి వాళ్ళెందుకు అట్లా అనుకుంటున్నారో – అన్పించేదామెకు. పార్టీలలో పెనిమిటిని, కొడుకులను పోగొట్టుకున్న ఆడవాళ్ళెవరైనా ఆ స్థితిలోనే ఉంటారని వాళ్ళ అంచనా. చుట్టూ ఉన్న సమాజం, వాతావరణం అట్లానే ఉంది మరి! తను కూడా ఎందర్నో చూసింది. తన భర్తను చంపితే, అవతలి వాడి పెళ్ళాం కూడా ముండమోసుకొనేది కళ్ళారా చూడాలనుకునేవాళ్ళనే తనింతవరకూ చూసింది.

తన అత్త – రవీంద్రారెడ్డి తల్లిని చూసింది. తన భర్తను చంపినారని, సందు దొరికినప్పుడల్లా ప్రెసిడెంటు కుటుంబాన్ని దుమ్మెత్తి పోస్తా తిట్లకు లంకించుకొనేది. వాళ్ళనారు కుళ్ళేది తను కళ్ళారా చూడాలని అంటావుండే దెప్పుడూ. వాళ్ళమింద కేసు తోసిపోయిన తర్వాత – ప్రెసిడెంటు చిన్నకొడుకు ఖూనీ అయ్యేంతవరకూ – ఆ నెలనాళ్ళూ ఆమెకు నిద్ర కూడా పట్టలే. తన చిన్న కొడుకులను ఆమె ఎగదోసిందేమోనని సుజాతకు అనుమానం.

ఇది ఇప్పటి సంగతైతే.... చిన్నప్పుడు – పదేళ్ళ వయసప్పుడు తమ ఫ్యూర్లో మేనత్త శారదమ్మను చూసింది. ఆమె భర్త తిమ్మారెడ్డి ఖూనీ అయినాక కొంతకాలం ఏం దిగులు పడిందో! ఆ తర్వాత మగరాయుడి మాదిరి యింటి పనులూ బయటి పనులూ ఝమాయించి చేయించేది. శారదమ్మ నోరు తెరిచినప్పుడల్లా అవతలి పార్టీ వాళ్ళ వంశవాళ్ని తూర్పెత్తి పోసేది. తన మరుదలను చేవచచ్చినోళ్ళని ఎత్తిపొడిచేది. తన చిన్న మరిదికి మాత్రం అంతో – ఇంతో రోషముందని, అతని మింద మాత్రం అభిమానం ఒలకబోసేది. అత్తిరాసలు, కజ్జికాయలు చేసి అతనికి మాత్రమే పెట్టేది.

వాటితో పాటు రోషం పోసేది. ఇవన్నీ అప్పట్లో గ్రహించేంత వయసేం లేదు తనకు. కానీ, ఇప్పుడు – ఆమెనూ, ఆమె చర్యల్నీ, మాటల్నీ గుర్తుచేసుకొంటుంటే...... ఆ కాలంలో ఆమె ప్రతి క్షణం పగతో రగిలిపోయిందనిపిస్తోంది. ఆమె వేసిన ప్రతి అడుగూ అవతలివాళ్ళను ఖూనీ చేయించడానికేనని ఇప్పుడనిపిస్తోంది.

అప్పట్లో ఒకనాడు పైటేల పొద్దున తను, మేనత్త కోసం వాళ్ళింటికి పోయింది. తను పోయేసరికి మేనత్త గాడిపాటన ఎనుముకు తలుగు విప్పుతోంది. ఆమె వెనకే నిలబడి వాళ్ళ సేద్యగాడు – బోయ రాముడు వంగి ఆమె చెవిలో ఏదో గుసగుసలాడుతున్నాడు. అతని కుడిచేయి ఆమెభుజం మీదుంది. సుజాతను చూసిన బోయ రాముడు శారదమ్మ భుజం మింద నుండి చెయితీసి, ఒకడుగు వెనక్కు జరిగినాడు. చెప్తున్నదేదో తగ్గుస్వరంతో చెప్పి పక్కకొచ్చిన్నాడు. శారదమ్మ తనను చూసి మామూలుగానే అడిగింది "ఏమ్మే! ఇట్టోచ్చినవ్" అని.

తనకు మాత్రం అక్కడ మామూలుగా అన్పించలే. బోయ రాముడు, శారదత్త దూరదూరంగా ఉండి ఏం మాట్లాడుకుంటా ఉండినా తనకు కొత్తగా అన్పించేది గాదు. అంత దగ్గరగా.... శారదత్త మిందికి వంగి చెవి దగ్గిర గుసగుసలాడడమే తనకేదో కొత్తగా ఉంది. మాట్లాడేటప్పుడు వాడు శారదత్త భుజం మింద చేయి వేసి ఉండడం తనకు వింతగా ఉంది. అప్పుడు శారదత్త "ఒరేయ్, రాముడూ!" అని అజమాయిషీ చెలాయించే మామూలు అత్తలా కనిపించలే.

అత్త అడిగినదానికి తను సరైన జవాబు చెప్పకుండా 'ఏం లే'దంటూ వెనక్కు తిరిగొచ్చింది. తను వెనుదిరిగి వస్తాఉంటే – "ఒరేయ్, రాముడూ ఎద్దల్ను బయట కట్టేసి పయి కడుగుపో" అంటోంది తన మామూలు ధోరణిలో.

తను చూసనది తన తల్లితో చెప్పింది. చెప్పినంత సేపూ ఆసక్తిగా విని తర్వాత కసరుకొంది – "యాడన్నా అనేవు. భద్రం! మీ నాయన నీ తాట ఒలుస్తాడు" అని భయం పెట్టింది.

కొన్నాళ్ళకు బోయ రాముడు, శారదమ్మ చిన్న మరిది కలిసి అవతలి పార్టీ లీడరును ఖూనీ చేసినారు. అతను తోటకాడ ఇంజన్‌రూంలో మాదిగోళ్ళ రంగితో పండుకొనుంటే అర్ధరాత్రప్పుడు ఆ పని చేసినారు. మరుసటిరోజు నుండి రంగి, బోయ రాముడు కనపడలేదు. ఆ ఖూనీలో రంగి సాయం దండిగా ఉందని ఊర్లో గుప్పుమంది. ఊర్లో వుంటే బతకనివ్వరని భయపడి ఊరిడిచి పోయినారని జనం చెప్పుకొన్నారు. తర్వాత్తర్వాత..... నిదానంగా..... మరోవిషయం కూడా ఊర్లో చెవులు కొరుక్కున్నారు – 'శారదమ్మకు, బోయ రామునికుండే సంబంధం ఆమె ఘరుదుళ్ళకు తెలిసింది. ఖూనీ చేసేంతవరకూ వాన్ని ఉండనిచ్చి, ఖూనీ జరిగినాక తమ పరువు పోతుందని వాన్ని ఊర్లోకి రానియ్యలే. వస్తే చంపుతామని బెదిరిచ్చినారంట' అని.

మేనత్త జీవితం జ్ఞాపకమొచ్చేసరికి సుజాతకు ఒళ్ళంతా నిస్సత్తువయిపోయింది. 'ఏం మనుషులో..... వీళ్ళది అజ్ఞానమో! అర్థం లేని పౌరుషమో!..... కాకపోతే భర్తను చంపినవాన్ని చంపడానికి మానాన్ని, ప్రాణాన్ని ఎరగా వేసేంత ఉన్మాదమేంది?' అనుకొంది. అంతకుముందంతా తను బతికింది అవతలివాడిని ఖూనీ చేయించడానికే అన్నట్లు, ఆ పని అయిపోయిన తర్వాత ఆమెలో అంతకు ముందటి ఉత్సాహమే లేదు.

పెంచుకొన్న పగ చల్లారగానే తన జీవిత పరమార్థం అయిపోయిందనుకుందేమో! అంతకు ముందు మగరాయుడిలా సంసారాన్ని నడిపినామె – ఆ తర్వాత మరుదుళ్ళ మింద విడిచి పెట్టి, అందరి మాదిరి ఆడదయిపోయింది.

'తన మేనత్త, తన అత్త..... ఇంకా తనకు తెలిసిన ఇల్లాంటి ఆడవాళ్ళు.... వీళ్ళ జీవితాల నుండి తను నేర్చుకోవాల్సిందేమిటా?' – అని ఆలోచిస్తోంది సుజాత.

☆ ☆ ☆

ఊరంతా సద్దు మణిగింది. మార్గశిరమాసం, కృష్ణపక్షపు చివరిదినాలు – తొమ్మిదికే సగిర పొద్దయినట్లుంది. ఇంట్లో ఎక్కడి వాళ్ళక్కడక నిద్రకుపక్రమించ బోతావుంటే సుజాత అందర్నీ నిలవరించింది – మాట్లాడాలంటూ.

సుజాత చెప్పేటప్పుడే – అందరికీ విస్మయం కలిగింది. సుజాత చెప్పినదంతా విన్నాక ఎవ్వరేం మాట్లాడలేదు. ఆమె తండ్రి కూడా ఉండాడు గదా, అయనేమంటాడో చూద్దామని సుజాత అత్త కూడా ఏమీ మాట్లాడలేదు.

"జాబు రాసి, నన్ను రమ్మనింది – ఇది చెప్పడానికేనా"? అన్నాడు సుజాత తండ్రి.

"ఇందుకే" అనింది సుజాత తొణుకు లేకుండా,

"నీకు యేం తక్కువ జేసినామమ్మా? ఇప్పుడు నీ ఆస్తి పంచిచ్చుకొని ఆ పసిపిల్లోళ్ళను తీసుకొని పేట జేరాల్సిన ఖర్మేం బట్టింది?" నిష్ఠురంగా అంది సుజాత అత్త.

"మీరు తక్కువ జేసినారని కాదత్తా! ఈడుంటే మన బతుకులిట్లనే తెల్లార్తాయ్. మా మామా, భర్తా పోయినట్లే రేపు నా మరుదులూ, కొడుకూ కూడా పోతారు. వచ్చేటట్లయితే అందరూ రాండి. అందరం ఊరిడిచిపోదాం" అంది సుజాత ఖచ్చితంగా.

"అంత భయపడ్తే ఎట్లమ్మా? నన్ను సూడు. నీకన్నా పెద్దదాన్నైనా కొండంత మొగుణ్ణీ, సెట్టంత కొడుకునూ పోగొట్టుకొని కూడా ఎట్ల బతుకుతండానో?"

ఆ మాటలకు కంపరమెత్తింది – "నేననేది మనం ఛస్తామనే భయంతో కాదు. మనం వాళ్ళనే చంపినా మనం సాధించేదేముంది? చంపినా, చంపబడినా సాధించేదేం లేదు. ఎట్ల జరిగినా – వెనక్కి తిరిగి చూసుకుంటే, మనం జీవితంలో ఓడిపోయుండడం తప్ప ఇంకేం మిగిలేది లేదు. ఎటు తిరిగినా బతుకులో ఓడిపోయే ఈ బతుకు నాకూ, నా పిల్లోళ్ళకు వద్దు. కాలికి కత్తి కట్టి నీ కొడుకుల్ని నువ్వు బరిలోకి దించుతావేమోగానీ నా పిల్లోళ్ళను ఈ ఓడిపోయే పోరాటంలోకి దించనుగాక దించను."

సుజాత చెప్పినది ముసలామెకు ఏమర్థమయిందో, ఏమో, ఆమెకు మాత్రం సుజాత చావుకు భయపడ్తున్నట్లే అన్పించినట్లుంది. నిష్ఠురంగా అన్నది – "వచ్చే చావు యాడున్నా వస్తాది లేమ్మా! ఈ చావు గాకుంటే, ఇంకొక చావు. మనం తప్పించుకోవాలంటే తప్పించుకుంటామా?"

"మెట్ట వేదాంతం చెప్పొకత్తా! ఈ చావుదప్ప ఏ చావైనా సుకమే. ఇదేందిది, బతికినంత దూరం శాంతి లేకుండా బతకడం? బతికిన నాన్నాళ్ళైనా నిశ్చింతగా

బతకాలనుకొంటున్నా. ఈడుంటే నా పిల్లోళ్ళు ఈ రొంపికే అలవాటు పడ్తారు. ఇవే బుద్దులోస్తాయి....."

సుజాత తండ్రి కల్పించుకొన్నాడు – "మన ఊరికి పోదాం రా! కొడుకు పోతానే కోడలు ఆస్తి పంపకాలు చేసిందనే పేరెందుకు తెచ్చుకుంటావ్?"

ఆ మాటలోని నిందకు సుజాతకు కోపం వచ్చింది.... "నాకు ఆస్తి మీద మోజేమీ లేదు. వేరుగా ఉండాలనే ఆశా లేదు. నా పిల్లోళ్ళ భవిష్యత్తు గురించే నా తాపత్రయమంతా. ఎంత జెప్పినా అర్థం జేసుకోకుండా ఆస్తి.... ఆస్తి..... అని మీ పదం మీదేనా?...... ఇక మనూరికి రావడమంటావా? – ఈ ఊరైనా ఒకటే. ఆ ఊరైనా ఒకటే ఏ రాయైతేనేం పళ్ళూడగొట్టుకోవడానికి.... అందుకే ఈ పార్టీ కొంపలకు దూరంగా టౌన్ చేరి వాళ్ళను చదివించుకొంటా..... ఈడుండి గోళ్ళు గిల్లుకుంటూ ఎవరి కష్టమో తిని కూర్చొనే బదులు, నేను కూడా సొంతంగా ఏదో పని చేసుకోవచ్చు..... నా నిర్ణయం మారదు."

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు. సుజాత పెద్ద మరిది – "ఎద్దలకు పొట్టు పోయాల" అని లేచిపోయినాడు. అతన్ని చూసి చిన్న మరిదీ లేచిపోయినాడు. వాళ్ళకు వదినంటే గౌరవం – అభిమానం. ఒక్కమాట కూడా మాట్లాడకుండా లేచిపోయినారు.

సుజాత తోడి కోడలు – పెద్ద బావమరిది భార్య అన్నది – "నువ్వు చెప్పిందే నిజమక్కా! ఈడుంటే మన బతుకులెన్నాలున్నా యింతే. ఈ పైర్లు కూడా అంతంత మాత్రమే ఏడుస్తుండయ్. ఇంతోటి పండే భూముల్ను సూపెట్టుకొని, ఈడ పార్టీలు చేసుకుంటా సచ్చే బదులు యాడికన్నా పోవడమే మేలు."

చిన్న కోడలు ఏ ఉద్దేశ్యంతో అన్నదోనని ముసలామె అనుమానంగా చూసింది. "అందరికీ వేరుపడాలనే ఉన్నెట్లుంది" అంటూ గొణుక్కుంది.

పైకి మాత్రం – "సరే, మీకెట్ల బుద్ధి పుడితే అట్ల బతకండి. కాటికి కాలుజాపిన దాన్ని – నేనొద్దనడమెందుకు?" అన్నది. ఆ మాట తర్వాత ఒకింత నిష్ఠురంగా – "అయినా కాలం మారిందిలే. కట్టుకొన్న మొగుణ్ణే సంపినా, కడుపున పుట్టిన బిడ్డను సంపినా రోసం లేకుండా – బతుకుతే సాలనుకొని బతికే తరమొచ్చింది" అంటూ లేచింది.

ఆ మాటకు సుజాతకు రోషం పొడుచుకొచ్చింది. అత్త మూర్ఖత్వాన్ని కడిగిపారెయ్యాలని నోరెత్తబోయింది. తండ్రి మొహంలోకి చూసి తగ్గింది.

ముసలామె కదిలిపోతా – "ఇంక పండుకోమ్మా! రేపు నీ బుద్ధి పుట్టినట్లే కానిద్దాంలే" అని బయటకి పోయింది. తండ్రికూడా నిట్టూర్చి లేచిపోయినాడు.

తోడికోడళ్ని పండుకోమని చెప్పి, సుజాత అక్కడ్నుండి కదిలింది. మిద్దె మీదికి పోయి, పిల్లల పక్కనే పండుకుంది. ఆకాశాన్ని చూస్తూ వెల్లకిలా పడుకుంది.

ఆకాశంనిండా సందులేకుండా మిణుకు మిణుకుమని చుక్కలు కాస్తున్నాయి.

ఆమెలో – ఆశ తీరబోతుందన్నందుకు ఆనందం..... అలవాటుపడిన బతుకు నుండి కొత్త జీవితంలోకి ఒంటరిగా పోతున్నందుకు ఆందోళన..... అన్నీ కలగలిపి మనసూ, శరీరాలను ఉద్విగ్నతకు లోనుచేస్తున్నాయి.

ఏవేవో కొడీ – ముడీ లేని ఆలోచనలొస్తున్నాయి.

తను ఒంటరిగా తప్పించుకొనిపోయినంతమాత్రాన ఈ కార్పణ్యాల మంటలు ఆరిపోతాయా?..... ఉహూ.....

అయినా తను ఏం చెయగలదు? అనాదిగా వేళ్ళూనుకొన్న ఒక జాడ్యాన్ని చేత్తో తుడిచేసినట్లు తుడిచేయడానికి ఎవరివల్ల అవుతుంది?......

ఈ కక్షలూ, కార్పణ్యాలు మాసిపోవాలనే ఉన్నత ఆలోచన తనకు ఉంది. కానీ, అందుకోసం ప్రయత్నం చేసి..... అందుకోసం త్యాగం చేసేంత గొప్పతనం తనకు లేదు.....

అయినా తనలాంటి సామాన్యురాలు ఈ మాత్రం నిర్ణయం తీసుకోవడం కూడా కొత్త మలుపే. పగ తీర్చుకోవాల్సిన స్థానం నుండి పక్కకు తొలగి, కొత్త జీవన పోరాటానికి సిద్ధమౌతోంది. తన మాదిరే ఈ అగ్గిగుండంలో మాడిపోయేవాళ్ళంతా ఒక్కొక్కరే కొత్త నిర్ణయాలు తీసుకుంటే, ఈ కక్షలు వాటంతటవే మాసిపోవా? సుజాతలో ఎడతెగని ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి.

తను తీసుకున్న నిర్ణయంలో కేవలం తన స్వార్థమే కాకుండా...... ఈ కక్షలు మాయడానికి చేసే చిన్న ప్రయత్నం కూడా ఉందనిపించడంతో సుజాతకు కొండంత తృప్తి కలిగింది.

ఏ వేళయిందో, సన్న చుక్కలన్నీ చాలా మటుకు దిగిపోయినాయి.

సన్నగా చలి మొదలయింది. సుజాత పిల్లల మీద దుప్పటి కప్పి, తనూ కప్పుకొని ముడుచుకొంది. మెల్లగా కంటిమీదికి కునుకొస్తోంది.

అప్పటికి తూర్పున వేగుచుక్క పొడిచింది దేదీప్యంగా మెరుస్తోంది.

● *'సాహిత్యనేత్రం' త్రైమాసికపత్రిక 9వ సంచిక, 1998* ●

★ ★ ★

పాపినేని శివశంకర్

98

# సగం తెరిచిన తలుపు

ఉత్తుంగ శిఖరాల కెగబాకి, ఆనందాల ఆకాశాల్లో విహరించి, జలపాత జ్వాలల్లో తడిసి, మైమరిచి పరవశించే సమయాన, రెండు శరీరాలు ఒకే రాగ సంగమంలో రవళించాల్సిన సమయాన ఎక్కడో అపశ్రుతి. భార్య కళ్ళల్లో బాధ. లీలగా, ఇష్టంలేనితనం.

“సారీ లలితా! నా ఆవేశంలో.....”

“ఫర్వాలేదులెండి!” లలిత పెదాల మీద పేలవమైన చిరునవ్వు. అతను తన మనస్సు నర్థం చేసుకోని సందర్భాలు ఎన్ని లేవు?

పక్కకు ఒత్తిగిల్లిన రామకృష్ణ మనస్సులో పశ్చాత్తాపం. ఆపైన రకరకాల ఆలోచనలు. ఇరవయ్యేళ్ళ సంసారంలో ఎప్పుడూ పెద్దగా ఒడిదుడుకులు, అరమరికలు లేవు. లలితలో మొదటినుంచీ ఒక అసంతృప్తి కొనసాగుతూ వచ్చింది. ఆర్థికంగా హోదా గల కుటుంబంనుంచి వచ్చిందామె. ఒక పత్రికలో ఉద్యోగి భార్యగా ఆ హోదా ఏమాత్రం మిగల్లేదు. మెల్లగా ఆమె తనలోకి తను ముడుచుకుపోయింది. ముకుళిత పుష్పాన్ని వికసింపచేయటం రామకృష్ణకి తెలీలేదు. నర్మద పుట్టిన తర్వాతైనా ఇద్దరి మధ్యా అదృశ్య దూరం పూర్తిగా తగ్గలేదు. పల్లెటూరు వదలి నగరంలో స్థిరపడిన తర్వాత ఎవరో తన జీవితాన్ని ఎటూ బెసక్కుండా చట్రంలో బిగించినట్టయ్యింది. బాల్యంలోని తాజాదనం, యౌవనంలోని చురుకుదనం మెల్లమెల్లగా ఇగిరిపోవటం చాలాకాలం దాకా గుర్తించలేదు రామకృష్ణ. గుర్తించిన తర్వాత తీరని అశాంతి మిగిలింది ఒకటే ఇరుకు బ్రతుకులో.

ఏ పన్నెండింటికో నిద్ర పట్టింది. నిద్రలో కల – కొంతకాలం నుంచి విడవకుండా వెంటాడుతున్న కల. హాంటింగ్ డ్రీమ్. సమ్‌వాట్ మిస్టీరియస్. భయంకరమూ కాదు ఆహ్లాదకరమూ కాదు.

ఒక్కగది. కిటికీలు లేని గది. సగం తెరిచిన తలుపు. లోపల ఏముందో తెలీదు. కనుచీకటి. తలుపు పూర్తిగా తెరవటానికి సంకోచం. లోపల అడుగెయ్యటానికి బెరుకు. లోపల మనిషిని చూడాలనే వుంటుంది. సాధ్యంకాదు. తలుపు బిగుసుకుపోయి వుంటుంది. ఎంతకీ వెలుతురు రాదు. లోపలి వ్యక్తి కన్పించదు. చిత్రమైన కల.

☆ ☆ ☆

హైదరాబాద్ నగరంలో ఒకానొక దినపత్రికలో చీఫ్ సబ్ ఎడిటర్ ఉద్యోగం వల్ల రామకృష్ణ తన జీవితంలో వ్యాకోచం పొందాడా సంకోచించాడా అంటే రెండోదే నిజం. ఎవరి కోసమో పని చేస్తున్నట్టు, ఎప్పుడూ ఏదో కనపడని కన్ను చాటుగా తనని పరీక్షిస్తున్నట్టు, భద్రత లేనట్టు అన్పిస్తుంది. పత్రికలో ప్రతి ఆదివారం వచ్చే 'రచన' శీర్షిక చూడడం తన ముఖ్యమైన పని. సాహిత్యవ్యాసాలు, కవితలు మొదలైనవి పరిశీలించటం, ఎన్నిక చెయ్యటం తనకిష్టమైన సంగతే. కానీ ఆ పనిలో పొందాల్సినంత సంతృప్తి పొందలేదు. అబద్ధాలు, దుష్ప్రచారాలు, ఆశ్రయించటాలు మొదలైన దౌర్భాగ్యాలు నిండిన పత్రికా వాతావరణంలో రామకృష్ణ మనస్సు కుంచించుకు పోయింది.

"ఏమిటిది రామకృష్ణా! సాహిత్య పేజీ ఇట్లాగేనా నిర్వహించటం? పత్తిరైతుల ఆత్మహత్యల మీద ఇది రెండో కవిత నువ్వు వెయ్యటం!" ఎడిటర్ మందలింపు.

"అవును సర్! రైతుల ఆత్మహత్యల మీద దాదాపు పది కవితలు డెస్క్‌లో ఉన్నాయ్. ఇప్పటికి మూడొందల మంది ఆత్మహత్యలు చేసుకున్నారు. బర్నింగ్ ప్రాబ్లమ్ కదాని......"

ఎడిటర్ ఒక అజ్ఞానిని చూసిన విజ్ఞానిలా నవ్వి "ఎలక్షన్స్ బర్నింగ్ ప్రాబ్లమ్ కదా? మరి వాటి మీదెందుకు కవితలు వెయ్యలేదు?" అని ప్రశ్నించాడు.

"వాటి మీద ఎలాంటి కవితలు రాలేదు." లోలోపల చిరాకు అణుచుకుంటూ చెప్పాడు. ఎడిటర్ సుబ్రహ్మణ్యం బట్టతల మీద ఒక్కటిచ్చుకుంటే ఎంత బాగుంటుంది? కానీ బాగోదు.

"ఊహూ" అంటూ తలూపి, పెండింగ్‌లో ఉన్న కవితల ఫైలు తెమ్మన్నాడు ఎడిటర్. అతనికి రామకృష్ణ మీద అసహనం కలగటానికి కారణం వేరు. ఆరోజు ఉదయం సుప్రసిద్ధ కవి గువేరా (గుమ్మడి వేణుగోపాలరావు) నుంచి ఫోన్‌కాల్ వచ్చింది. ఎన్నో అవార్డులు, రివార్డులు పొంది చాలాకాలం నుంచి ఆ కీర్తి మీద నెట్టుకొస్తున్న కవి. మాటామంతీ అయ్యింతర్వాత 'మన' పత్రికలో తన కవితలు వెయ్యటం లేదేమిటని మామూలుగానే అడిగాడు. సుబ్రహ్మణ్యం నొచ్చుకున్నాడు. గువేరా మంచి 'పలుకుబడి' వున్న కవి (కవిత్వంలో కాదు). కవిత కన్నా మనిషి ముఖ్యం.

రామకృష్ణ తెచ్చిన ఫైల్లోంచి గువేరా కవిత, అనుమానం రాకుండా ఉండటానికి మరోకవి కవిత బయటికి తీశాడు. అంత బాగున్న కవితలు అంతకాలం పెండింగ్‌లో పెట్టడం బాగోలేదని, తర్వాత వారం వచ్చేట్టు వాటిని వెంటనే కంపోజింగ్‌కి పంపించమనీ చెప్పాడు. చివరగా "అసలు నీకు రచన శీర్షిక తగింది కాదోయ్! 'జనపదం'కి మార్చమంటావా? హాయిగా ఆవు పాడీ, పంట తెగుళ్ళూ చూసుకుంటూ ఉండొచ్చు" అన్నాడు నవ్వులో వెటకారం ధ్వనింపజేస్తూ.

ఎడిటర్ వెటకారానికి తన తిరస్కారం తెలియజేద్దామనే ఆలోచన మానుకొని బయటికొచ్చాడు రామకృష్ణ. అతనికి జవాబు చెప్పటం ఎంతసేపు? కానీ ఉద్యోగంతో పని. మేనేజ్‌మెంట్ దగ్గర అతని మాటే చెల్లుబాటు అవుతుండటం చేతనే అంత దర్పం. ఏమీ చెయ్యలేని అసహనం. పెట్టుబడి గుప్పెట్లో చిక్కుపడ్డ

బ్రతుకు. తన కుర్చీ దగ్గర కొస్తుండగా సబ్ ఎడిటర్ కె. ఎస్. రావు కనీ కనబడని నవ్వుతో ఓరగా చూశాడు. ఎడిటర్‌కి కావాల్సిన మనిషి. ఎప్పుడో తన స్థానంలో అతణ్ణి కూర్చోబెట్టినా ఆశ్చర్యం ఉండదు. ఫైలు తీసి గువేరా కవిత రెండు వాక్యాలు చదివాడు.

పండాలి ప్రతి హృదయంలో మమత
చైతన్యం చివ్వున శిరసెత్తితే
పల్లవిస్తుంది చల్లగా సమత

మూడు దశాబ్దాల నాటి బాణీ. అంత్యప్రాసలు. ఏళ్ళ తరబడి కవులు వాడీ వాడీ అరిగిపోయిన మాటలు. ఇవి ఇవ్వాల్టి పాఠకుడిలో ఏ స్పందన కల్గించగగలవు? కొత్తగా కలం పట్టిన కవులు కూడా మెరుపుల మెరిపిస్తున్నారివాళ. ఆఫ్టరాల్ 'పొగ పొయ్యి'మీద అద్భుతమైన కవిత రాశాడు యమ్వీ రామిరెడ్డి. యౌవనోదయాన్ని వర్ణిస్తూ 'దేహద్వారాలు తెరిచారెవరో' అని శ్రీకాంత్ రాసినప్పుడు పరవశించి పోయాడు తను. కవిత్వం రాయలేకపోయినా చదివి ఆనందించగలడు.

బోయ్ వచ్చి రెండు ఉత్తరాలు టేబుల్ మీద పెట్టి వెళ్ళాడు. ఒకటి శుభలేఖ. గుమ్మా వెంకట్రావు కొడుకు పెళ్ళి తుళ్ళూరులో. తప్పకుండా రమ్మని విడిగా ఉత్తరం కూడా రాశాడు. పాతికేళ్ళ కిందట తను, వెంకట్రావు, ఇంకొంతమంది పిల్లలు నెక్కల్లు నుంచి రోజా పొలాల గట్ల వెంట మూడున్నర మైళ్ళ దూరం నడిచి తుళ్ళూరు హైస్కూల్లో చదువుకున్నారు. తనకన్నా రెండు క్లాసులు సీనియర్ వెంకట్రావు. చాలా స్నేహంగా ఉండేవాడు. అప్పుడే ఎంతకాలం గడిచిపోయింది? వాడిప్పటికీ తనని గుర్తుంచుకున్నాడు. ఈ నగరంలో ఇన్నేళ్ళున్నా ఎవరూ తనని గుర్తు పట్టరు. అయితే వాడి ఉత్తరంలోని చివరి మాటలు తనని బాధ పెట్టాయి – "మీ తమ్ముడి ఆరోగ్యం బాగుండటం లేదు. నువ్వు నెక్కల్లు వస్తే వాణ్ణి చూసినట్టూ వుంటుంది. ఇక్కణ్నుంచే మనం రజని పెళ్ళికి వెళ్ళొచ్చు." మర్చిపోయిన బంధం గుర్తొచ్చి మనస్సు బరువెక్కింది. ఐదేళ్లయింది నెక్కల్లు వెళ్ళి.

తన ఆలోచనలు ఆవేదనలు పంచుకోటానికి ఆఫీసులో ఎవరూలేరు. సబ్ ఎడిటర్ శారదారాణి మాత్రం కాస్త కలివిడిగా వుంటుంది. తను రాసిన వ్యాసాలు (స్త్రీ సమస్యలు) చూపించి అభిప్రాయం అడుగుతుంది. అప్పుడప్పుడు ఆమె సొంత సమస్యలు చెప్పుకుంటుంటే ఆశ్చర్యకరంగా తనకెంతో రిలీఫ్‌గా ఉంటుంది. ఆర్ద్రతలేని, అనుమానాల వాతావరణంలో తన మనోధోరణికి సమీపంగా మరో మనిషి ఆలోచిస్తున్నందుకు కలిగే ఊరట అది.

లంచ్ టైంలో ఏమి తోచక కాంటీన్ కేసి వెళ్ళాడు. ఇద్దరు ముగ్గురు కాఫీలు తాగుతుంటే అసోసియేట్ ఎడిటర్ విశ్వేశ్వరరావు ఎడిటర్ మీద, పరోక్షంగా కారాలు మిరియాలు నూరుతున్నాడు. ఫలానా పత్రిక ఎడిటర్‌కి ఎట్లా ఉద్వాసన జరిగిందో చెప్తున్నాడు. సూటిగా మాట్లాడకుండా ప్రత్యక్షంగా ఎడిటర్‌ని ఖండించకుండా, అతణ్ణి పారదోలటానికి 'ప్రచారం' చేస్తూ ఇతరులకు పురెక్కించే నైజం. మౌనంగా కాఫీ తాగి వచ్చేశాడు.

అరున్నరకి ఇంటికి చేరేపాటికి వరండాలో స్నేహితుడు లక్ష్మీనారాయణ తన కోసం ఎదురు చూస్తుండటం ఆశ్చర్యం కలిగించింది. ఎమ్మేలో తామిద్దరూ క్లాస్‌మేట్స్. ఇద్దరి అభిప్రాయాలూ, అభిరుచులూ ఒకే రకంగా ఉండేవి. ఇద్దరికీ లత పాటలంటే ఇష్టం. శ్రీశ్రీ కవిత్వమంటే ఇష్టం. అతని ఇల్లు దూరమైనా దాదాపు ప్రతిరోజూ తన రూమ్‌కి వచ్చేవాడు. ఇద్దరి మధ్య చర్చల్లో, కబుర్లలో గడిచిపోయిన రాత్రులెన్నో. చెయ్యబోయే ఉద్యోగాల గురించి, చేసుకోబోయే అమ్మాయిల గురించి ఎన్నెన్ని ఊహలు చెలరేగేవి? క్రమక్రమంగా ఎవరి జీవితంలో వాళ్ళు స్థిరపడిపోయారు. తను పత్రికలో, అతను కాలేజీలో. గ్రాంట్–ఇన్–ఎయిడ్ లేని కాలేజీ ఉద్యోగంలో ఎన్నో ఇబ్బందులుపడుతూ, కలసిరాని భార్యతో కాపురం చేస్తూ క్రమంగా ఆత్మన్యూనతకి లోనయ్యాడు లక్ష్మీనారాయణ

"ఎట్లా వున్నావు? చాలాకాలమైంది కలసి" అని పలకరించాడు. రామకృష్ణ.

"అట్లా అట్లా వున్నాను అంతా మామూలే." చెప్పాడు లక్ష్మీనారాయణ. మనిషి మునుపటికన్నా నల్లబడ్డాడు.

లలిత కాఫీలు తెచ్చింది. మాటల మధ్యలో వచ్చిన సంగతి బయటపెట్టాడు. కూతుర్ని రెసిడెన్షియల్ కాలేజీలో డేస్కాలర్‌గా చేర్పిస్తున్నాడు. ఐదువేలు కావాలి. రామకృష్ణ దగ్గర సమయానికి అంత డబ్బు లేదు. అయినా ఏదోరకంగా ఒక వారంలో సర్దుబాటు చేస్తానన్నాడు. మరో అరగంట సేపున్నాడు లక్ష్మీనారాయణ. అన్నీ మామూలు మామూలు మాటలు. మాటల్లో మానసిక సాన్నిహిత్యం లేదు. ఇద్దరి మధ్య ఏదో మంచు గడ్డకట్టుకు పోయినట్టయ్యింది. ఒకప్పటి ఆత్మీయత ఎక్కడ ఇగిరిపోయింది? రకరకాల సంకోచాలు, అసూయలు, స్వార్థాలు మొదలైన తెరలేవో కదుల్తాయి మనుషుల మధ్య. వాటిని తొలగించుకోవటమెట్లా? వ్యవహార సంభాషణలు సరే, హృదయాలమధ్య సంధానమెట్లా?

☆ ☆ ☆

లక్ష్మీనారాయణ వెళ్లిపోయిన తర్వాత శుభలేఖ, ఉత్తరం లలితకి చూపించాడు రామకృష్ణ. నర్మద కూడా పక్కనే వుంది.

"చిన్ననాటి స్నేహితుడంటున్నారు గదా! తప్పకుండా వెళ్లిరండి" అంది లలిత.

"మరి శేషగిరి యింటికి? సంబంధాలు తెగిపోయి చాన్నాళ్లైంది గదా?"

లలిత మౌనం వహించింది. ఆమె కాపరానికి వచ్చిన తర్వాతే రెండు కుటుంబాల మధ్య రవరవలు మొదలయ్యాయి.

"తెగిపోయిన వాటిని ముడేసుకోగూడదా డాడీ?" అడిగింది నర్మద తెలివిగా.

కూతురు ఆలోచనకి ఆశ్చర్యపోయాడు రామకృష్ణ. వయస్సులో చిన్నదైనా పెద్దమాటలు చెప్పింది. అయితే ఒకంతట నర్మద ఆలోచనని ఆమోదించలేక "ఒకవేళ వాళ్ళు మన అభిమానాన్ని యాక్సెప్ట్ చెయ్యకపోతే?" అనడిగాడు.

"అప్పుడది వాళ్ళ తప్పవుతుంది. డాడీ! అసలు అభిమానమే చూపకపోతే అది మన తప్పే గదా?" అంది నర్మద. రామకృష్ణ మాట్లాడకపోవటంతో "శ్యామల ఏం చేస్తోందో డాడీ? నా యీడే గదూ?" అనడిగింది మళ్లీ.

"ఊళ్ళో దాకా వెళ్ళి వాళ్ళింటికి పోకపోతే బాగుండదు. పైగా అనారోగ్యం అంటున్నారు గదా? వెళ్ళి పలకరించి రండి." చెప్పింది లలిత.

రామకృష్ణ ఆలోచనలో పడ్డాడు. ఎప్పుడు తల్చుకున్నా గతం బాధాకరంగా ఉంటుంది.

☆ ☆ ☆

తండ్రికి మొదటిభార్య సంతానం తను. చిన్నప్పుడే తల్లి పోయింది. నాన్న మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. ఆమె కిద్దరు పిల్లలు – శేషగిరి, శకుంతల. సవతితల్లి (సామ్రాజ్యమ్మ) తననెప్పుడూ రాచి రంపాన పెట్టలేదు. కానీ చూపించే ప్రేమలో ఎక్కడో తేడా వుండేది. తండ్రి దగ్గర బిడియం తనకి. అట్లా బాల్యంలో ఇంట్లోనే ఒంటరితనం అనుభవించాడు తను. బయటి స్నేహితులే ఎక్కువ. ముత్యాలు, నర్సిమ్మరావు. వెంకట్రావు, హనుమంతు, పార్వతి – ఇట్లా చిన్నప్పటి స్నేహితులు ఇప్పటికీ గుర్తున్నారు.

తుళ్లూరులో హైస్కూలు. గుంటూర్లో డిగ్రీ. వైజాగ్‌లో ఎమ్మే. జర్నలిజం మీద ఆసక్తి. హైదరాబాద్‌లో ఒక దినపత్రికలో చేరాడు. శేషగిరి ఐదో తరగతితోనే ఆగిపోయాడు. శకుంతలకి పెళ్లై, లింగాయ పాలెం వెళ్లిపోయింది. తనది పెద్దలు కుదిర్చిన పెళ్లే అయినా సవతి తల్లి లలితని సరిగా చూడలేదు. శేషగిరికి కూడా పెళ్లయిన తర్వాత వేర్లు పడ్డారు. పంపకాల్లో అభిప్రాయ భేదాలు. తనకు చదువు ఉద్యోగం ఉండటం వల్ల శేషగిరికి ఎక్కువ పంచమంటుంది సామ్రాజ్యమ్మ. తను అంగీకరించినా తండ్రి ఒప్పుకోకుండా సమాన భాగాలు పంచాడు. ఇల్లు మాత్రం తల్లిదండ్రుల తదనంతరం శేషగిరికే చెందేట్టు తండ్రిని ఒప్పించాడు తను. అయినా బెడిసిన సంబంధాలు కుదురుకోలేదు. తన హైదరాబాద్ ఉద్యోగంవల్ల మనుషుల మధ్య, మనసుల మధ్య దూరం పెరిగింది. తండ్రి మరణంతో శేషగిరి కుటుంబానికీ, తమకీ రాకపోకలు తగ్గిపోయాయి. నెక్కల్లులో శేషగిరి భార్య, ఇద్దరు పిల్లలు, సవతి తల్లి వుంటున్నారు. తను నెక్కల్లు వెళ్లి అయిదేళ్ళు. ఇరవయ్యేళ్లనాడు హైదరాబాద్ వచ్చి పత్రికా ప్రపంచంలో అడుగు పెట్టినప్పట్నుంచీ ఒంటరితనం ఒక జీవన విధానమైంది. తనకి ఉద్యోగ జీవితంలో సహజత్వం లేదు. భద్రత లేదు. పుట్టి పెరిగిన పల్లెటూరికీ, ఆర్ద్రితలేని నగర వాతావరణానికీ పోలికే లేదు. చుట్టూతా మనుషులే. ప్రతి మనిషి చుట్టూ కనపడని కంచెలు. తొందరగా సుఖం కావాలి. అందుకోసం తొందరగా డబ్బు కావాలి. దాని కోసం పరిచయాలు. దానికోసం పార్టీలు. దానికోసం ఆత్మస్తుతీ పరనిందలు. దాని కోసం మాస్కులు. దానికోసం అభినయాలు. అవకాశం అంది పుచ్చుకుని రఫ్‌గా, రాష్‌గా, డాషింగ్‌గా దూసుకుపోయే వ్యవహారశైలి. ఎవడికీ ఎవడి ఆత్మతోనూ పనిలేదు. కరచాలనం కావాలి. హృదయచలనం అక్కర్లేదు. ఈ వాతావరణంలో సహజంగానే తను బిగుసుకుపోయాడు. మనుషులుకంటే పుస్తకాల్లో కొంత ఉపశాంతి లభించింది. అవి మనస్సుతో పలకరిస్తాయి. వంచన చెయ్యవు. అయినా సగం మనిషి తను. జీవితంలో ఎన్నో ఖాళీలు. బాల్యంలో తల్లి ప్రేమ కోల్పోయిన ఖాళీ, బాల్య, యౌవన స్నేహాల్ని కోల్పోయిన ఖాళీ, పల్లెని పల్లెఒడిని

దూరమైన ఖాళీ. సంతృప్తి లేని వృత్తి వల్ల ఏర్పడిన ఖాళీ. వీటి నన్నిటినీ ఒక్క లలిత ఎట్లా పూరించగలదు?

☆ ☆ ☆

మరుసటి రోజు ఎడిటర్ టేబుల్ నుంచి రెండు వ్యాసాలు, మూడు కవితలు వచ్చాయి. 'రచన' కోసం పరిశీలించాలి, పైపైన చూస్తుంటే ఒక కవిత తనని ఆకర్షించింది. 'అవలివైపు', కవి శివారెడ్డి.

"బహుశా నా రెండో పక్క నీ వెప్పుడూ చూచి వుండవు.....

మనం చూడని మహాలోకమొకటి

అవలివైపు ఉంటుందని గ్రహించి వుండవు....

ఎవడికైనా ఇంకొకడి ఆ రెండోపక్క తలుపులు తీసి చూపే స్థోమత. ప్రేమా, సంబంధం వుండొద్దా.....

ఒకడు ఇంకొకణ్ణి ముట్టుకోవద్దా.....

ఒకడు ఇంకొకడి కడలిలోకి దూకి

ఆ అగాధ జలగర్భ సంపద బయటికి తీయవద్దా....

బహిర్గతంకండి! బుద్ధిహీనుల్లారా! బయల్పడండి.

ఒకడు ఇంకొకణ్ణి తవ్వి తలకెత్తుకోవాల్సిందే! లోపలి చీకటి లోకాలన్నింటిని పద్యాన్ని చదివినట్టు చదవాల్సిందే."

కవిత చదివిన గొప్ప ఉద్వేగానికి లోనయ్యాడు రామకృష్ణ నిజం. ఎవడిలోకి ఎవడూ ప్రయాణించడు. ఎవడూ మరొకణ్ణి ముట్టుకోడు. మనుషుల మధ్య అసంబంధం. సామూహిక ఏకాంతం. ఈ మానవదూరాన్ని అధిగమించాలంటే ఎన్నెన్ని అడ్డుగోడలో? అభద్రత, భయం, అసూయ, ద్వేషం. బహుశా వీటన్నిటినీ ఆ కవి అర్థం చేసుకుని వుండాలి. అధిగమించి వుండాలి. కానీ తను? బహిర్గతంకాని బుద్ధిహీనుడు. మనిషి బహిర్గతం కాకపోవటానికి, తనలోకి తనే ముడుచుకుపోవటానికి అంతిమంగా జీవనభీతే కారణం. దాన్ని జయించాలి. ఒక్కసారి ఈ ఫైళ్లూ, పత్రికలూ, సంకోచాలూ, బాధలూ, భయాలూ విసిరికొట్టి, తననుంచి తను విముక్తం కావాలి.

☆ ☆ ☆

హైద్రాబాద్ నుంచి గుంటూరు. గుంటూరు – వడ్లమాను బస్సులో నెక్కల్లు ప్రయాణం. మబ్బులు కమ్మిన శ్రావణమాసపు ఆకాశం. పైరగాలి. చుట్టూతా మోకాళ్లదాకా పెరిగిన పైర్లు. పొలాల సువాసన. ఒక మౌలిక స్పర్శకోసం వెళ్తున్నాడు తను. అది లభిస్తుందా?

చదువుకునే రోజుల్లో పదేపదే పాడుకున్న 'జిందగీ' సినిమాలో పాట పెదాలమీద కొచ్చింది.

"దిల్ ఉసే దో జో జాన్ దేదే, జాన్ ఉసే దో జో దిల్ దేదే" (ఎవరు ప్రాణమిస్తారో వాళ్లకి హృదయమియ్యి; ఎవరు హృదయమిస్తారో వాళ్ళకి ప్రాణమియ్యి.)

కొందరికి ఇవ్వటానికి హృదయాలే వుండవు. కొంతమందికి ఉన్నా ఇవ్వరు. ఇవ్వని వాళ్ళకి కూడా హృదయం ఇవ్వగలగటం నిజంగా గొప్ప సంగతి.

"ఒరివోరి నువ్వా? బాగుండావా? తమ్ముణ్ణి సూట్టాని కొత్తన్నావా?" బస్సులో పలకరింపు. హైదాబాద్‌లో ఎప్పుడూ ఏ సిటీబస్‌లోనూ వినపడని పలకరింపు.

పెదపరిమి దాటి పది నిమిషాలు ప్రయాణించి నెక్కల్లులో ఆగింది బస్సు. ఎక్కడో సన్నాయి మేళం వినపడుతుంది.

పడమటి వీధిలో అదే పాతబడ్డ పెంకుటిల్లు. ఇంటి ముందు అదే వేపచెట్టు. ప్రహరీగోడ ఒక పక్కన పడిపోయింది. పంచలో మంచంలో శేషగిరి పడుకోనున్నాడు. తనను చూడగానే ఆశ్చర్యంగా లేచి కూర్చున్నాడు. పక్కనే ఉన్న ఎర్ర కుక్క తనని చూసి మొరగబోయి ఆగింది. గుర్తుపట్టి తోకాడిస్తూ దగ్గరి కొచ్చింది.

"ఎట్లావున్నావ్ శేషూ?" మంచంమీద అతని పక్కనే కూర్చుంటూ అడిగాడు. శేషగిరి ఏమీ మాట్లాడకుండా తనని వాటేసుకుని కళ్ల నీళ్ళు పెట్టుకున్నాడు. స్పర్శ. రక్తస్పర్శ.

"ఓయ్ రాజీ!" అని కేకేశాడు శేషగిరి భార్యని. వంటింట్లోంచి చేతులు తుడుచుకుంటూ వచ్చింది రాజేశ్వరి. ఒక్కక్షణం కంగారు. తన మొహం చాటంతయ్యింది. "అంతా బాగుండారా బావా?" అని పలకరించి కాళ్ళకి నీళ్ళిచ్చింది. మంచం వాల్చి కొత్త దుప్పటి పరిచింది. కాఫీ పెట్టటానికి మళ్లీ లోపలకెళ్లింది. ఇంతలో పక్కింటి నుంచి సవతితల్లి సామ్రాజ్యమ్మ, శేషగిరి కూతురు శ్యామల వచ్చారు.

"ఏం నాయనా, బాగుండావా? ఇన్నాళ్లకైనా గుర్తొచ్చాం. కోడలూ, పిల్లదీ ఎట్టుండారు?" అని మొదలుపెట్టింది సామ్రాజ్యమ్మ. ఎప్పటి ధోరణే. వయస్సుడిగినా మాట ఉడగలేదు.

శ్యామల నవ్వుతూ వచ్చి తన పక్కనే కూర్చుంది. "ఎక్కడి కెళ్లా?" వనడిగాడు. చేతిలో గిన్నె చూపించింది. నూరిన గోరింటాకు. "ఏం చదువుతున్నా"వని అడిగాడు. టెన్త్ క్లాసని చెప్పింది. నర్మద కూడా అదే క్లాసు. మొహంలో ఎక్కడో నర్మదకీ, శ్యామలకీ పోలికలు కన్పిస్తున్నాయి. కాకపోతే నర్మదది నగరవాసం నిగారింపు. శ్యామలది చామనచాయ.

"అక్కాయ్‌ని తీసుకురాలేదేం పెదనానా?" అనడిగింది శ్యామల. తను నవ్వి ఊరుకున్నాడు. రాజేశ్వరి కాఫీ తెచ్చిచ్చింది.

శేషగిరి ఆరోగ్యం సంగతి అడిగాడు రామకృష్ణ. రాజేశ్వరి అట్లాగే నిలబడి చెప్పింది. కొంతకాలం నుంచి బి.పి. వుంది శేషగిరికి. పోయినేడు పంటల్లో నష్టం. అప్పు ఆందోళనతో గుండె పోటు వచ్చింది. గుంటూర్లో వైద్యం. ఇప్పుడిప్పుడే కాస్త కోలుకుంటున్నాడు.

"ఇంత జరిగితే నాకెందుకు కబురు చెయ్యలేదు?" రామకృష్ణ ప్రశ్నకి రాజేశ్వరి బదులు చెప్పలేదు.

"అప్పటికీ నేనంటానే ఉండా నాయనా!" అందుకుంది సామ్రాజ్యమ్మ గడప దగ్గర చతికిలపడుతూ. "ఎనకటి అభిమానాలు ఇంకా ఉండయ్యో లేదోనని వాళ్ల అనుమానం. మీ నాన్న బతికుంటే ఆ పద్ధతే వేరుగా వుండేది. నేనేమో

సవతితల్లినాయె. నిన్ను సదివించటానికి ఎన్ని అవస్థలు పడ్డామో, తిన్నామో తినలేదో ఆ దేవుడికే తెలియాల నువ్వేమో నౌకరీ కోసం దేశం మీద బొయ్యావు. ఎనకటి ప్రేమలు ఉండమంటే ఉంటయ్యా? అడ్డాలనాడు బిడ్డలుగాని, గడ్డాలనాడు బిడ్డలు గాదుగా? ఏదో మా బ్రమగాని."

"అయ్యన్నీ ఇప్పుడెందుకే?" అన్నాడు శేషగిరి తల్లిని వారిస్తూ.

సవతితల్లి పుల్లవిరుపు మాటలు రామకృష్ణకి కొత్తగాదు. కనుకనే నిబ్బరంగా ఉండిపోయాడు. రాజేశ్వరి వంటపనిమీద లోపలికెళ్లింది.

"అమ్మా! గతాన్ని తవ్వుకునేవాళ్ళకి భవిష్యత్తు ఉండదంటారు. ఏం జరిగిందో జరిగిపోయింది. నాలుగురోజుల కిందట గుమ్మా వెంకట్రావు శుభలేఖ పంపిస్తూ ఉత్తరం రాస్తే శేష సంగతి తెలిసింది. ముందు వీణ్ణి హైద్రాబాద్ తీసికెళ్లి మంచి డాక్టర్లకి చూపిద్దాం. నువ్వూ రా, కోడల్నీ మనవరాల్నీ చూసినట్టూ వుంటది." చెప్పాడు నిదానంగా.

దాంతో వెనకటి బింకం కరిగిపోయింది సామ్రాజ్యమ్మలో. "పోనీలే నాయనా! కడుపు సల్లగా మంచి మాటన్నావు, అంతేసాలు" అని కన్నీళ్ళొత్తుకుంది. "లే, లేసి కాళ్లు గడుక్కో, ఎప్పుడు తిన్నావో యేందో."

రామకృష్ణ కుదుటపడ్డాడు. మనస్సులో ఒక గడి తొలగిపోయినట్టనిపించింది.

ఇంతలో వీధిలోంచి "పిన్నాం! మన రాముడొచ్చాడంటగా?" అనడుగుతూ ముత్యాలు పంచలోకి వచ్చాడు. చిన్నప్పటి సావాసగాడు. ఒక కన్ను సరిగా కనపడదు. ఓరగా చూస్తూ పలకరించాడు. "వార్నీ! అప్పటికీ యిప్పటికీ సానా మారిపోయావే? అన్నం దిన్నావా యేంది? ఎంకట్రావు నిన్ను లాక్కురమ్మన్నాడు భోజనానికి."

"చాలు! పిల్లడు రాకరాక యింటికొత్తె అడ భోజనానికి దీసికెల్తానంటా వేందిరా గుంటడా? రేత్రి పెళ్ళి భోజనం జేత్తాళ్లే, అమ్మాయ్, వంటయ్యిందా?" అని కేకేసింది సామ్రాజ్యమ్మ. కాస్త చల్లబడ్డాక వెంకట్రావు ఇంటికి రమ్మని చెప్పి వెళ్ళాడు ముత్యాలు. అక్కణ్ణుంచే అందరూ పెళ్లికి కలిసే వెళ్లొచ్చు.

అన్నం తిన్న తర్వాత శేషగిరిని ఇంటి సంగతులడిగాడు రామకృష్ణ. ఆర్థిక పరిస్థితి అంత బాగున్నట్టు లేదు. ఆ యేటితో శ్యామల చదువు ఆపిస్తానన్నాడు. రామకృష్ణ ఒప్పుకోలేదు. కాకపోతే హైద్రాబాద్‌లో తమ యింట్లోనే ఉండి చదువుకుంటుంది. ఒక వారంలో రాజేశ్వరితోపాటు హైద్రాబాద్ వస్తానన్నాడు శేషగిరి. ఇంతట్లో శ్యామల తమ్ముడు సదాశివ బజార్లో ఆటలు చాలించి ఇంటి కొచ్చాడు. పెదనాన్న కనపడగానే వదిలిపెట్టలేదు. వాడికో బొమ్మ పిస్తోలు, శ్యామలకి పెన్నూ ఇచ్చాడు రామకృష్ణ. పిల్లల సంతోషం చూస్తుంటే ఇన్నేళ్లు వాళ్లకు ఎడమైనందుకు విచారించాడు.

సాయంత్రం ఇంట్లో అందరికీ వస్తానని చెప్పి, వెంకట్రావు ఇంటికి బయల్దేరాడు రామకృష్ణ. రాముల వారి గుడి దగ్గరే అతని యిల్లు. ఇంటిముందు కొత్త తాటాకుతో పందిరేశారు. పందిరినిండా రంగురంగుల కాగితాలు. కింద పరదాపట్ట పరిచారు. అయినవాళ్లు, తెలిసినవాళ్లు, పిల్లా జెల్లా – అంతా సందడి సందడిగా ఉంది. రామకృష్ణ కన్పించగానే సంతోషపడ్డాడు వెంకట్రావు. ఇంటి సంగతులు

పరామర్శించాడు. ముత్యాలు, హనుమంతు, నర్సిమ్మరావు పందిట్లో పెద్దలకి కాఫీ, ఫలహారాలందిస్తున్నారు. ఒక మంచినీళ్ల గ్లాసు నిండా కాఫీ తెచ్చాడు హనుమంతు. 'అమ్మో! ఇంత కాఫీయా?' అని ఆశ్చర్యపోయాడు రామకృష్ణ.

"ఏహె తాగవాయ్! మన నర్సిమ్మ ఇందాకే ఆ గళాసుతో రొండు గళాసులు పట్టిచ్చాడు" అన్నాడు హనుమంతు చనువుగా. రామకృష్ణ నవ్వుతూ గ్లాసు అందుకున్నాడు.

రాత్రి తొమ్మిదిన్నరకి తుళ్లూర్లో పెళ్లి. పెళ్లికొడుకు కార్లోనే రామకృష్ణని కూడా రమ్మన్నాడు వెంకట్రావు.

"నువ్వు నడవగలిగితే పొలాల మీదగా సరదాగా వెళ్దాం" అన్నాడు ముత్యాలు.

రామకృష్ణ సరేనన్నాడు. ముత్యాలు, హనుమంతు తోడుగా బయల్దేరారు. ఎంత పెళ్ళి నడక నడిచినా పొద్దుగూకే లోపల తుళ్లూరు చేరుకోవచ్చు. వానొచ్చే కళలేదు.

ఊరమ్మట చెరువుగట్టు మీదగా ఉత్తరదిక్కునే మళ్ళగా వాగు అడ్డం వచ్చింది. పెద్దగా నీళ్ళు లేవు. అక్కడక్కడా చిన్నచిన్న చేపలు ఈదుతున్నాయి. వాగు దాటంగానే చేలు. జొన్న, పెసర, నువ్వు, వేరుసెనగ - అంతా పచ్చపచ్చగా ఉంది.

పొలాల గట్లమీదగా దారి. పక్కనే డొంక. పాతికేళ్ళ కిందట ఈ దారమ్మటే హైస్కూలు చదువుకోసం తుళ్లూరు నడిచి వెళ్ళారు. ఇప్పటికీ అదే వాతావరణం - వాగులూ, వంకలూ, బీళ్ళూ, ముళ్ళూ.

"ఆ లోపల చొక్కా తీసెయ్యరాదా? కాత్త గాలాడెద్ది" అన్నాడు ముత్యాలు. నిజమే. 'టక్' చేసుకుని వుండటంవల్ల ఫ్రీగా నడవలేకపోతున్నాడు. షర్ట్ పైకి లాగేస్తే హాయిగా వుంది. నడక సహజంగా వుంది.

తుమ్మలబీడు దాటుతుంటే చిన్నప్పుడు ఆ బీట్లోగుండా ఒంటరిగా నడవాలంటే ఎంత భయపడేవాడో గుర్తొచ్చింది రామకృష్ణకి. ఎండాకాలం బీట్లో కిక్కిరిసిన తుమ్మ చెట్లగుండా గాలి విచిత్రంగా శబ్దం చేసేది. ఒక్కోసారి సుడి తిరిగి లేచేది. అక్కడ దెయ్యాలుంటాయని భయం. ఇప్పుడా భయం లేదు. భయమల్లా నగరంలో సన్నిహితుల మధ్య మసలుతున్నప్పుడే. ఏ వ్యక్తీ పూర్తిగా వ్యక్తం కానందువల్ల భయం. ఏ ప్రమాదం ఎవడినుంచి వస్తుందో తెలీని భయం. ఇక్కడ ముందు ముత్యాలు, వెనక హనుమంతు, మధ్యగా తను నడుస్తుంటే భద్రతే తప్ప భయం లేదు.

సగం దూరం నడిచేపాటికి జోడు చింతలు తగిలాయి. పక్కనే కుంట. పెసరకాయలు తిని అందులో నీళ్లు తాగారు. హనుమంతు చింత చెట్టెక్కి కాసిని వాన గాయలు కోశాడు. నిన్నో మొన్నో వాన పడి వుండాలి. నల్లనేల తడి పొడిగా ఉంది. దూరంగా పడమటగా అనంతారం కొండలు, కొండల అవతల వంగిన సూర్యుడు. శ్రావణ మాసం మబ్బుల్లో రంగుల బొమ్మలా పడమటి ఆకాశం. వానతూనీగలు. మనిషి బహిర్గతుడు కావటానికి అంతకన్నా గొప్ప వాతావరణం బహుశా అక్కర్లేదు. చిన్నప్పటి గోలీలాటల దగ్గర్నుంచి ఉద్యోగ విషయం దాకా ఎన్నోసంగతులు వాళ్ళతో ముచ్చట్లాడాడు రామకృష్ణ నడుస్తూనే. మాట్లాడేకొద్దీ తన బరువేదో దిగిపోతున్నట్టనిపించింది. ఈ నాలుగైదేళ్లలో ఊళ్ళో వచ్చిన మార్పుల గురించి, పెళ్ళిళ్ళు, తగాదాలు, లేచిపోవటాలు, చనిపోవటాలు, పైరు పంటలు

అన్నిటి గురించీ చెప్పాడు ముత్యాలు. అవి కొంత అనవసరంగా,కొంత అవసరంగానూ తోచాయి. రామకృష్ణకి.

"చెల్లియొ చెల్లకో తమకు చేసిన యెగ్గులు సైచిరందరున్, తల్లి గతించె, నేడు నను దూతగ పంపిరి సంధి సేయగా......" ఉన్నట్టుండి పద్యం అందుకున్నాడు హనుమంతు. కంగుమనే గొంతు.

"ఎహ్హెహ్హే." నవ్వాడు ముత్యాలు

"ఏందిరా నవ్వుతావు?" అడిగాడు హనుమంతు.

"తల్లి గతించె కాదురా, 'తొల్లి గతించె' అనాల."

"అయితే మాలె, పాడనీ" అన్నాడు రామకృష్ణ. తనకీ హుషారుగా ఉంది.

"ఈడి పద్యాలు ఇనలేకే పెళ్లాం లేసిపొయ్యింది" చెప్పాడు ముత్యాలు నవ్వుతూ.

"పోవాయ్ పుల్లాయ్! ఆళ్ళ లక్షింనరుసు పెళ్లాం లేసిపోలేదా యేంది? అయినా నువ్వుపాడు సూద్దాం."

చూడబోతే హనుమంతు తన భార్య లేచిపోవటం ఆత్మన్యూనతగా భావిస్తున్నట్టు లేదు. ఆ విషయం బహిరంగపరచగూడదనీ అనుకుంటున్నట్టు లేదు. బహుశా వాడికి 'అహంభావ' సమస్య లేదేమో!

ముత్యాలు తలగుడ్డ దులిపి మళ్లీ చుట్టుకుని 'కాసుకో' అన్నాడు. రామకృష్ణ వంక ఓరగా చూశాడు.

"ఎందుకో నానుకుంటె – గోంగూరకీ
నేనెందుకో నానుకుంటె – గోంగూరకీ
మాయదారి నా బట్ట – గోంగూరకీ....."

ఒకప్పుడు అది తన దృష్టిలో కేవలం బూతుపాట. ఇప్పుడు అది ఒక సహజమైన వ్యక్తీకరణగా కూడా అన్పించింది. వాడి పాట అయిపోగానే ఎప్పుడో తను పాడిన పాటల్లోంచి ఒకటి అనుకోకుండా బయటికొచ్చింది.

"నీకూ నీవారు లేరూ నాకూ నావారు లేరూ
తెప్పమీద తేలిపోదాం పదరా
చల్ మోహనరంగా....."

తన గొంతు తనకే కొత్తగా, వింతగా ఉంది. అయినా పాడేకొద్దీ మనస్సు అందులో లీనమై పోయింది. ఏదో ఎక్కడో బందిఖానా నుంచి విముక్తి పొందుతున్న అనుభూతి. చిన్నప్పుడు ఎన్నో రాగాలు తీసిన గొంతుకు నగరంలో స్థిరపడగానే గడిపడింది. బజార్లోనూ, బస్సులోనూ, ఆఫీసులోనూ ఎక్కడ కూనిరాగం తీసినా ఎంత 'అక్వర్డ్'గా ఉంటుంది?..... కానీ నిజానికి పాట అక్వర్డ్ కాదు. పాట గొంతునొక్కే నాగరికతే అక్వర్డ్. హాయిగా విప్పారని ఆధునిక జీవితమే అక్వర్డ్.

పాట ఆగిపోగానే ముత్యాలు తనని కావిలించుకున్నాడు. "నువ్విట్టా అప్పుడప్పుడు మనూరు రావాల, మనం పాటలు పాడుకోవాల."

తనకి కళ్ళు నీళ్లు నిండాయి. స్పర్శ – మానవ స్పర్శ. ఇక్కడ మనుషులున్నారు. రాగ ద్వేషాలున్నా ప్రేమించగల మనుషులున్నారు. ఇక్కడ తనకి జీవనభీతి లేదు.

"డోంట్ స్పేర్ యూ రామకృష్ణా! యూ విల్ బీ...." బట్టతల ఎడిటర్ కళ్లముందు కనబడుతున్నాడు.

"పోవోయ్ ఫుల్లాయ్!" అంటాడు తను. కలబంద డొంక దాటారు. రామకృష్ణకి కాళ్ళు లాగుతున్నాయి. అలవాటు లేని నడక. అల్లంతదూరంలో చెరువు. అడదాని చెరువు. దానికా పేరెందుకు వచ్చిందో తెలీదు. పాతికేళ్ల కిందట ఎట్లా తుమ్మలు పెరిగి, నీళ్లు నిండి, విశాలంగా, కొంగల్తో కాకుల్తో కలకలలాడేదో ఇప్పుడూ అట్లాగే. ఎంతో కాలం నుంచి తనకోసం ఎదురు చూస్తున్నట్టు. 'ఉత్తతీత' అంటూ ఒక పిట్ట ఎగిరిపోయింది. కట్టకి దిగువగా దూరంగా తుళ్లూరు కనబడుతుంది. ఒకప్పుడు ఈ చెరువులోనే ముత్యాలు, హనుమంతుతో కలిసి స్కూల్ ఎగ్గొట్టి దిసమొలతో ఈతేశాడు.

"అరేయ్ ముత్యాలూ! చెర్లో ఈతేద్దాంరా?" అడిగాడు హఠాత్తుగా.

"ఈతా? ఇప్పుడా? పెళ్ళి కెళ్లొద్దూ? ఒకపక్కన పొద్దుగూకుతుంది" అన్నాడు ముత్యాలు.

"జానేదేవ్" అన్నాడు రామకృష్ణ.

"మరి నీ కొత్త బట్టలు?" అడిగాడు హనుమంతు

"జానేదేవ్!"

చెరువు పిలుస్తుంది. ప్రకృతి పిలుస్తుంది. ఈ చదువు సంస్కారం అబద్ధం. కుక్కబతుకు ఉద్యోగం అబద్ధం. ఈ మబ్బులు పట్టిన ఆకాశం, ఆకాశం కింద నల్లరేగడి పొలాలు, వానతుంపర్లు, ఈ పిట్ట, చెట్టు, చెరువు – ఈ సమస్త ప్రకృతి – ప్రకృతి ఒక్కటే నిజం. భ్రమలు, బాధలు. ఆత్మన్యూనత, అవమానం, అభద్రత అన్నిట్లోంచి బయటికి రా. ఓపెన్ ద డోర్! ఓపెన్ ద హార్ట్! ఓపెన్ సెసేమ్!

రామకృష్ణ షర్ట్ విప్పేశాడు పాంటు తీసేశాడు. బనియన్ అండర్‌వేర్ – అన్నీ! ఒక్కసారిగా గట్టు మీద నుంచి నిలువులోతు నీళ్ళల్లోకి ఎగ్గిరి దూకేశాడు. హనుమంతు, ముత్యాలు ఆశ్చర్యంగా చూస్తూ నీళ్లల్లోకి దిగారు. ముత్యాలు 'కయ్' మంటూ ఈలేశాడు.

చల్లని నీళ్లు రామకృష్ణని కావిలించుకున్నాయి. అవయవాలన్నిటినీ తడిమాయి. స్పర్శ, ప్రకృతి స్పర్శ. రామకృష్ణ మనస్సు నిర్వికారంగా ప్రశాంతంగా కలత లేకుండా, కళంకం లేకుండా ఆహ్లాదంగా, ఆనందంగా ఉంది. నగ్నంగా సహజంగా ఉంది. రెండు చేతులూ రెండు కాళ్లూ స్వేచ్ఛగా కదిలిస్తూ తనమంచి తనే విముక్తమవుతూ ఎంతోసేపు అట్లాగే చెరువులో అటూ ఇటూ అలల్లో అలగా కదుల్తూ..... అలా ......అలా.....

● *సుప్రభాతం వీక్లీ – 12 జూలై, 1998* ●

★ ★ ★

99

## కాట్రగడ్డ దయానంద్

# శిశిరం

పండుగ నెల మరో పదిరోజుల్లో పెడతారనగా పట్టుకుంది ముసురు. రాత్రి లేదు – పగలు లేదు – ఆగి, ఆగి ఒకటే జల్లులు.

వాన మొదలైన రోజు పట్టుకుంది ముసలమ్మ గొంతు. మంచంలో కూర్చుని కంచంలో అన్నం ముద్ద చేత్తో కలుపుతూనే ఎక్కిళ్లు పెట్టింది. నోట్లో ముద్ద మింగుడు పడలేదు. మరో ముద్ద నోటికాడికి పోలేదు. చూస్తున్న కోడలు కాళ్ళు, చేతులు ఆడలేదు. ముసలమ్మ అట్లానే ఎంగిలి చేత్తో మంచమ్మీదికి ఒరిగింది. కోడలు ప్రభావతమ్మ ముసలమ్మ కంచం కింద పెట్టి మూతి తుడిచింది. గబగబా బయటకు పరుగెత్తి ఎవరో పిల్లవాడితో గోపాలయ్యకు కబురు చేసింది. హాస్పటల్‌లో ఓ.పీ. రాసే పని వేరే వాళ్ళకు అప్పగించి పరుగెత్తుకుంటూ వచ్చాడు గోపాలయ్య. మంచంలో తల్లి ఎక్కిళ్లు తీస్తూనే వుంది. కింది పెదవి బాగా ఉబ్బి వంకరపోయింది. పరీక్షగా చూచాడు. గొంతు కింద కుడి భుజానికి పైన నరం పైన కుంకుడు కాయంత ఉబ్బు కనిపించింది. ఎగశ్వాస, దిగశ్వాస స్పష్టంగా ఆ కణతిలో కనబడుతోంది. కాళ్ళు, చేతులు కదిలించి చూచాడు గోపాలయ్య. క్షణం సేపు దిక్కు తోచలేదు.

"ఏయ్యా?" అంది ప్రభావతమ్మ.

"పక్షవాతం లక్షణాలు" అన్నాడు గోపాలయ్య.

"అట్టయితే మీ అక్కకీ, తమ్ముడికీ కబురు పెట్టు" అని ఆగి "ఇంతకు మునుపూ బాగా లేదని నాలుగైదు మాట్లు కబురు చేస్తే మీ అక్కకు ఎంత లావు బాదో ఎంత దూరా భారమైతే మాత్రం తల్లికి బాగా లేకపోతే చూచి పోవడానికి బాధైతే ఎట్టా?" ప్రభావతమ్మ అంది. గోపాలయ్య మారు మాట్లాడకుండా మళ్ళీ హాస్పటల్ కెళ్ళి డాక్టరును తీసుకొచ్చాడు.

డాక్టరు వడిలిపోయిన ముసలమ్మ చేతుల్నీ, కాళ్ళనూ అటూ ఇటూ కదిలించి చూచాడు. గొంతు నరమ్మీద ఉబ్బును తట్టి చూచాడు. ముసలమ్మ బాధతో మెలికలు తిరిగింది. కింది పెదాన్ని కొద్దిగా కదిలించాడు. చలనం లేకుండా వెర్రి చూపులు చూచింది ముసలమ్మ.

"లైట్ పెరాలసిస్ స్ట్రోక్" అని, "నీ పిచ్చి గాని ఇంకా ఏమి డాక్టర్లు, ఏమి మందులు గోపాలయ్యా! మీ అమ్మకింకా నూరేళ్ళు నిండలేదా?" అని తన జోక్‌కు

తనే పెద్దగా నవ్వాడు డాక్టరు. గోపాలయ్య కళ్ళల్లో తిరిగిన నీళ్ళు చూచి "ఇంజక్షన్లు రాసిస్తాను. మన దగ్గర లేవు. బయట నుంచి తెప్పించు" అన్నాడు డాక్టరు.

"సార్! నెల్లూరేమైనా తీసుకెళ్ళమంటారా?" అడిగాడు గోపాలయ్య.

"అవసరం లేదనుకుంటా! ఈ కండిషన్లో ఆమెను అటూ ఇటూ కదపడం కూడా ఇబ్బందే" అన్నాడు డాక్టరు.

డాక్టరు వెళ్ళిపోయాక హడావుడిగా మనిషిని పంపించి ఇంజక్షన్లు తెప్పించాడు గోపాలయ్య. తమ్ముడికీ, అక్కకూ కబురు పెట్టాడు. దగ్గర్లో ఉన్న బంధువులు వచ్చి చూచి వెడుతున్నారు. మధ్యాహ్నానికి తమ్ముడు శేషగిరీ, మరదలు దేవసేనమ్మ వచ్చారు. అక్క మాత్రం రాలేదు. వచ్చిన వాళ్ళందర్నీ ఆరాగా చూస్తోంది ముసలమ్మ. ఆమె కళ్ల వెనక ఏవో దిగులు నీడలు – కూతురి కోసం ఆరాటమనుకున్నారంతా!

మంచంలోని ముసలమ్మను క్షణక్షణం కనిపెట్టుకుని ఉంటోంది ప్రభావతమ్మ. ముసలమ్మకు కాఫీని, కాసిని గ్లూకోజు నీళ్ళు, మింగకపోయినా కాస్త కాస్త జావతో గొంతు తడుపుతోంది. చూడడానికి వచ్చేవాళ్ళతో, రెండుమూడు బర్రెగొడ్లతో సతమతమవుతూనే మంచంలోని ముసలమ్మను మల్లెపువ్వులా ఉంచింది. డెట్టాల్ నీళ్లతో గుడ్డలు రోజూ పిండి వేసేది. ఫినాయిల్‌తో నేలను శుభ్రం చేసేది. పనికి సాయంగా ఉంటుందని రెండు రోజులు ఉండమన్నా ఉండకుండా వచ్చిన గంటకే ప్రయాణం కట్టింది తోడికోడలు. గోపాలయ్య అల్లోపతి వైద్యంతో పాటు తనకు తెల్సిన రెండు మూడు చిట్కా వైద్యాలు కూడా చేశాడు. ఎవరో చెప్పిన ఆకు పసరు వైద్యమూ చేశాడు. అయినా లాభం లేకపోయింది.

ముసురు పట్టుకున్న నాలుగో రోజు –

నీరసంగా ఉన్నదని తల్లికి రెండు సెలైన్లు పెట్టాడు గోపాలయ్య. కాస్త తేటగా అనిపించింది. రాత్రి బర్రెగొడ్ల పాలు పిండి, వంట పని ముగించి ముసలమ్మకు రాగి జావ కాచింది ప్రభావతమ్మ. గ్లాసులో చల్లార్చి చెమ్చాతో కాస్త కాస్త ముసలమ్మ గొంతులో పోసింది. జావ ముసలమ్మ గొంతు దిగుతున్నట్లనిపించింది. నాలుగోసారి గొంతులో జావ పడగానే మళ్ళీ మునుపటిలానే ఎక్కిళ్లు పెట్టింది ముసలమ్మ. గొంతు కింద కణితిలా ఉబ్బిన నరం బుస్సున చల్లారి, జాడలేకుండా పోయింది. గొంతులోని జావ బయటకొచ్చేసింది. ప్రభావతమ్మ ఉలిక్కిపడింది. బయటేమో కారు చీకటి. కుండపోతగా వాన.

☆ ☆ ☆

గోపాలయ్య తమ్ముడికి ఫోన్ చేశాడు. అక్కడికి మూడు మైళ్ళ దూరానున్న ఊరి నుంచి అంత వానలోనూ సైకిలు మీద వచ్చాడు. మరదలు రాలేదు.

వరండాలో వరిగడ్డి మీద చాప పరిచి ముసలమ్మను ఉత్తర దక్షిణాలుగా పడుకోబెట్టారు. తల దగ్గర నూనెతో చిన్న ప్రమిద వెలుగుతోంది. సత్తు గ్లాసులో ఇసుక పోసి నాలుగైదు సాంబ్రాణి కడ్డీలు గుచ్చి వెలిగించింది ప్రభావతమ్మ. చాప చుట్టూ చీమలు పట్టకుండా చల్లిన గమాక్సిన్ పౌడర్ ట్యూబు లైటు వెల్తుర్లో తెల్లగా మెరుస్తోంది. సాలలోని పశువులు కింద వాన రొచ్చుకు పడుకోలేక నిలబడే

తప తపమని తోకలతో దోమల్ని అదిలిస్తున్నాయి. చూడటానికి పల్లెటూరిలా ఉన్నా, అది ఉద్యోగాలు చేసే వాళ్ళుండే కాలనీ కాబట్టి చీకటి పడితే ఎవరూ ఇళ్ళల్లో నుంచి బయటకు రారు. టీ.వీ.లు చూస్తూనో, భోజనాలు చేస్తూనో, చదువుకుంటూనో తలుపులు వేసుకుని ఇండ్లలోనే ఉంటారు.

ఆ ఇల్లు కూడా మనిషి పోయిన ఇల్లులా లేదు. ఏడుపుల అరుపులు గానీ, మనుషుల సందడి గానీ అసలే లేదు. లోపలి గదిలో పిల్లలు నిద్రపోతున్నారు. ప్రభావతమ్మ శవానికి దగ్గరగా గోడకు చేరగిలబడి ఆలోచిస్తూంది. గోపాలయ్య, శేషగిరి ఇనుప కుర్చీల్లో కూర్చుని బయట చీకటిలోకి దృష్టి సారించారు. బయట మెరుపుల్లేని వాన. ఏనుగు తొండంతో కుమ్మరించినట్టుగా కురుస్తోంది వాన. ముగ్గురూ దిగులు ముఖాలతో మౌనంగా ఉన్నారు.

ముసలమ్మ చావు కోసం నాలుగేళ్ళ నుంచి ప్రతి సంవత్సరం ఏదో ఒక కాలంలో ఎదురు చూస్తున్నారు వాళ్ళు. వారం పదిరోజులు మంచాన పడటం, మళ్ళీ లేచి కూర్చుని కర్రపోటుతో తన పనులు తానుగా చేసుకోవటం ఒక అలవాటుగా మారింది. నిరుడు ఎండాకాలంలో ముసలమ్మ నెలరోజులు మంచానపడ్డప్పుడు మళ్ళీ లేవదనుకున్నారందరూ. అప్పుడే గోపాలయ్య నాలుగైదు బండ్లు కట్టెలు కొట్టించాడు. ఎటుపోయి ఎటొస్తుందోనని పప్పులూ, ఉప్పులూ సిద్ధం చేసుకున్నారు. అయినా, ముసలమ్మ మళ్ళీ లేచి కూర్చుంది.

"ఏరా! ఎట్ట చేద్దాం?" అన్నాడు గోపాలయ్య.

"ఇక్కడెందుకులే అన్నా! అయినోళ్లందరూ అక్కడే ఉన్నారుగా! మనూరే తీసుకెడదాం" అన్నాడు శేషగిరి.

గోపాలయ్య దృష్టి తల్లి మీద పడింది. మొదట్నుంచీ తల్లి అంటే అమితమైన ఆపేక్ష అతడికి.

మంచాన పడకుండా చేసుకుని తిన్నన్నాళ్ళు ఆమె ఒక్కతే గుడిసెలోనే గంజి కాచుకుని తాగింది. పక్కనే చిన్న కొడుకు ఉంటున్నా చెయ్యెత్తి ఏనాడూ ఏదీ ఆశించలేదామె. గోపాలయ్య ఎంత రమ్మని పిలిచినా "కాళ్ళు చేతులు ఆడినన్నాళ్ళు ఒకమ్మ పంచ కింద చేరడం ఎందుకు లేరా?" అనేది. ఎప్పుడన్నా బాగాలేనప్పుడు గోపాలయ్యే బలవంతాన తన ఇంటికి తీసుకువచ్చేవాడు. మందులూ, మాకులూ వాడి ఆరోగ్యం కుదుటపడగానే మళ్ళీ ప్రయాణం కట్టేది.

"నాకిక్కడేం బాగుండదురా! నాకీ మైకా నీళ్ళు గిట్టవు" అని తల్లి అంటే గోపాలయ్య రెండు రోజులకొకసారి బిందెడు నీళ్ళు సైకిలు వెనక గట్టుకుని తన ఊరి నుంచి తెచ్చేవాడు. అయినా, ముసలమ్మకు తన ఊరి మీద ఆపేక్ష పోయేది కాదు. నెలకోసారైనా ఊరినీ, ఊర్లోని మనుషులనూ చూడాలని ప్రయాణం కట్టేది. కోడలు ఎప్పుడన్నా కోపంగా ఉండి కసిరితే "అమ్మోవ్! ఈడ సస్తే తీసకెళ్ళి ఈ ఊరి ఏట్లోనే దొర్లిస్తావేమో! ఆ పని మాత్రం చెయ్యబాక. నా కట్టె మా ఊళ్ళో కడతేరి పోవాల్సిందే!" అని వేడుకుని దండం పెట్టేది. "ఆ ఏరైనా, ఈ ఏరైనా అంతా కండలేరే లేవే! అని గోపాలయ్య ఆటలు పట్టించేవాడు.

ప్రభావతమ్మకు, గోపాలయ్యకు ఒకేసారి ఆ దృశ్యం కళ్ళముందు పడింది.

"అయినా ఈడ నుంచి మనూరు ఎంత దూరంరా! వచ్చే పోయే చుట్టాలక్కూడా ఇక్కడ వసతి బాగానే ఉందిరా" అన్నాడు గోపాలయ్య.

"అది గాదన్నా! అమ్మ మనసెరిగినోడివి. మనూరంటే ఎంత కొట్టకలాడేది చెప్పు. ఆమె ఇష్టాన్ని మనమెందుకు చెయ్యక పోవాల?" అన్నాడు శేషగిరి.

నిజమేనన్నట్లు తలూపాడు గోపాలయ్య.

"సరేనయ్యా! దేవసేనమ్మ ఏమంటుందో గదా!" అంది ప్రభావతమ్మ.

శేషగిరి మొహం గంటు పెట్టుకుని "దానిదేముంది? ఏదో కోపమొస్తే బడబడా నాలుగు మాటలు అనిద్దిగాని, ఈ విషయానికి ఏం మాట్లాడుద్ది?" అన్నాడు.

"అనకూడదుగాని మీ ఆడోళ్ళ సంగతి నాకు బాగా తెలుసయ్యా! ఏనాడు మీ అమ్మను సవ్రికంగా సూసిందని. కాలంనాడు సంసారం దుబారా చేసుకోవద్దని ముసలమ్మ ఏదో మంచికి చెబితే అత్తని కూడా చూడకుండా కొట్టెనే! నాలుగు రోజుల్నాడు ముసలమ్మని చూడటానికొచ్చి, ఎక్కడ ఎత్తిపోయాల్సి వస్తుందోనని వచ్చిన గంటకే పరుగెత్తినే! పొలమూ, పోరంబోకూ అనుభవించడమే గాని పక్కనే ముసిల్ది ఉందనైనా ఏ పండగనాడన్నా పట్టించుకున్నారా? ఇయ్యాల పీనిగని తీసుకెడితే మాత్రం ఊరుకునిద్దా దేవసేనమ్మ?" ప్రభావతమ్మ అడిగింది.

"నిజమేరా! ఆడకు తీసుకెడతామనుకో! మరి ఖర్చు సంగతి ఒక మాటనుకోవాల గదా?" అన్నాడు గోపాలయ్య.

"ఇన్నాళ్ళూ మంచికైనా, చెడ్డకైనా తనే అన్నీ చూచాడు. తల్లి పోయాక దేవుడు వీడికి మంచి బుద్ధి పుట్టించినట్లుంది" మనసులో తలచాడు గోపాలయ్య.

"అది కూడా నువ్వే చెప్పన్నా!" అన్నాడు శేషగిరి.

"ఆయన చెప్పేందుకేముంది? ఈడ చేసేట్టయితే సావు ఖర్చులూ, కర్మంతరం ఖర్చులూ అణా పైసల్తోటి మేమే భరిస్తాం. అక్కడ చేసేట్టయితే ఆ ఖర్చులన్నీ మీవే." గోపాలయ్యను మాట్లాడనీయకుండా ప్రభావతమ్మ చెప్పింది. శేషగిరి ఆలోచనలో పడ్డాడు.

"సరేనన్నా! మా అసుపత్రి అంబులెన్స్ మాట్లాడు. అమ్మను ఊరికి తీసుకువెడదాం" అన్నాడు శేషగిరి. ప్రభావతమ్మ మనసు తేలికపడింది.

"ఒరేయ్! దేవసేనమ్మతో పేచీ ఏమీ ఉండదుగా?" అనుమానంగా అన్నాడు గోపాలయ్య.

శేషగిరి ముఖంలో అసహనం.

"అదంత అలబరు మనిషి కాదులే" అన్నాడు శేషగిరి.

తూర్పున వెలుగురేకలు పొడచూపకముందే ముసలమ్మ శరీరం ఏ హడావుడీ లేకుండా తన ఊరివైపు తరలిపోయింది.

చెట్టుకింద కుక్కి మంచం మాత్రం ఒంటరిగా మిగిలిపోయింది.

వచ్చే పోయే వాళ్ళకు కనబడేట్టు ముసలమ్మ శవాన్ని గుడిసె మధ్యలో వాకిలికి ఎదురుగా ఉంచారు. తెల్లారేసరికల్లా నానిగ కాడి రాగమ్మ వెళ్ళిపోయిందన్న వార్త ఊర్ని చుట్టు ముట్టేసింది. వాన కూడా చిత్రంగా వెలిసింది. గుడిసె ముందు

షామియానా వేశారు. ఒకపక్కన వెట్టోళ్లు పాడెను సిద్ధం చేస్తున్నారు. గుడిసె వెనుక ఉన్న ఇంట్లో నుంచి దేవసేనమ్మ బయట అవసరమైనప్పుడల్లా హడావుడిగా తిరుగుతోంది. ముసలమ్మను కడసారిగా చూచుకోవడానికి ఊర్లోని ముసలీ, ముతకా తరలి వస్తున్నారు:

మాలపల్లి నుంచి వచ్చిన ఒక ముసలాయన గడ్డం కింద చేతి కర్రను అనించి చెబుతున్నాడు:

"తొలుత పెద్ద గాలోన ఎరిగిన ముసలామె. ఇంకీ ఊళ్ళో మరెవ్వరికీ ఆ ముచ్చట తెలీదు. ఆ గాలోనలోనే పెనిమిటిని పోగొట్టుకుందంట. ఎన్ని అగచాట్లు పడిందో? పొలాల్లో కూలికనే ఎల్లిందా? మైకా గెనుల్లో సరుకే ఏరిందా? ముగ్గురు పిల్లల్ని వదిలి ఆ మహాన్నభావుడు ఎళ్ళిపోతే ఒంటరిదైన ఆడదాని పరిస్థితి – అఖరుకు ఈ గుడిసె ముంగటే గానుగ పెట్టింది. గోచీ పెట్టి ఎద్దుని కట్టి గానుగ ఆడింది. పెద్ద కొడుకు గోపాలయ్య ఎదిగొచ్చినాక కదా ఆ యమ్మ పాట్లు తప్పింది."

"సుబ్బన్నా! కూటేలకు ఎవులన్నా అగపడితే పెద్ద పెద్ద రాగి సంగటి ముద్దలు తినకుండా ఎల్లనిచ్చేది కాదు రాగమ్మ. తను వస్తున్నా సరే, పెద్దోల్లు కనబడనీ, పిల్లలు కనబడనీ, కూటినీళ్ళు తాగకుండా కదలనిచ్చేది గాదు." మరో ముసలాయన అందుకున్నాడు.

ముసలోల్లు జ్ఞాపకాలు తవ్వి పోసుకుంటుంటే, బయటనుంచి వచ్చిన చుట్టాలు మంచాలకు అతుక్కుని పోయారు. అందరూ దూరాభారానున్న ముసలామె కూతురి కోసం ఎదుర్చూస్తున్నారు.

"కూతురి కసలు కబురు చేరిందో లేదో, అక్కడంతా చెరువులు తెగి బస్సులు కూడా తిరగడం లేదంట; బాగు లేనప్పుడు కూడా వచ్చి చూచి పోలేదంట ఆ యమ్మ. ఎత్తుబడికి అందుకుంటదో లేదో?" ఆ మాటలు పూర్తయీ కాకముందే పెద్ద పెద్ద శోకాలు వినపడ్డాయి. కబురు మోసుకెళ్ళిన మనిషితోపాటు బస్సు దిగిన కూతురు కమలమ్మ గుండెలు బాదుకుంటూ ఏడుస్తూ వచ్చింది. వాతావరణంలో మార్పు వచ్చింది. ఎక్కడివాళ్ళక్కడ పన్లన్నీ ఆపేసి ముసలమ్మ చుట్టూ మూగారు. కమలమ్మ ఏడుస్తూనే తల్లిపైబడి ఆమెతో మాట్లాడుతోంది. కోడళ్ళిద్దరూ కూడా ముసలమ్మ పక్కన సర్దుకు కూర్చున్నారు. ముసలమ్మను సాగనంపడానికి సన్నాహాలు వేగతరమయ్యాయి. కమలమ్మ కడుపుతరుక్కుపోయేటట్టు ఏడుస్తూంది.

☆ ☆ ☆

ముసలమ్మను కడతేర్చి ఊళ్ళోకి చేరేసరికి సాయంకాలమైంది. దూరాన్నుంచి వచ్చిన బంధువులు నిద్ర చెయ్యకూడదని హడావుడిగా వెళ్ళిపోయారు. ఇక మిగిలింది ముసలమ్మ కొడుకులూ, కోడళ్ళూ, కూతురూ, వాళ్ళ దగ్గరి బంధువులు. గుడిసె పక్కన ఇంటి ముందు అరుబయట మంచాలు వేసుకుని మగవాళ్ళు కూర్చున్నారు. ఆడవాళ్ళు పనులు చేసుకుంటూ అటూ ఇటూ తిరుగుతున్నారు.

"అన్నా! రేపు చిన్నదినానికి ఏమేం కావాలో పట్టీ రాసుకుంటే మనూల్లోనే తెచ్చుకుందాం." శేషగిరి గోపాలయ్యతో అన్నాడు.

"నారాయణ మామైతే అన్నీ వైనంగా చెబుతాడురా" అన్నాడు గోపాలయ్య

కుర్చీలో కూర్చున్న ముసలాయన వైపు చూస్తూ. నారాయణ ముసలమ్మ చిన్నాయన కొడుకు. ముసలమ్మ తరంలో ప్రస్తుతం మిగిలింది అతడొక్కడే. వాళ్ళ మంచీ చెడ్డలూ మొదటి నుంచీ ఎరిగున్నవాడు కావటాన ప్రతి విషయానికీ అతడినే సలహాలకు సంప్రదిస్తారు వాళ్ళు.

"అయ్యోవ్! అది సరేగానీ! సావు ఖర్చూ, దినం ఖర్చూ అన్నీ నువ్వే భరిస్తానని ఒప్పుకున్నావంటనే, నిజమేనా?" దేవసేనమ్మ వాకిలి పక్కన కూర్చుంటూ శేషగిరిని అడిగింది. శేషగిరి అవునన్నట్లు తలూపాడు.

"ఏం, నువ్వొక్కడివేనా గానిగ కాడి రాగమ్మ కొడుకువి? లేకపోతే పోతా పోతా మడులూ, మాన్యాలూ నీకేమన్నా ఇచ్చిపోయిందా మీ అమ్మ?" దేవసేనమ్మ ఒక నిమిషం భర్తవైపు చూచి మళ్ళీ–

"మూగమొద్దులా కూర్చుంటావేంది? ఎట్టలేదన్నా పది పన్నెండు వేలన్నా అవుద్ది ఖర్చు. నువ్వే ఒప్పుకున్నావో, మాయమాటల్తో వాళ్ళే ఒప్పించేరో గాని, ఖర్చులు చెరి సగం పెట్టుకోవాల్సిందే!" అంది దేవసేనమ్మ.

"అమ్మోయ్! నువ్వు మమ్మల్ని అంటే ఒప్పుకునేది లేదు. నీ మొగుడేమీ తెలీనోడు అయితేగదా మేం మాయమాటలు చెప్పడానికి? మా ఇంట్లోనే అన్నీ జరిగితే ఖర్చంతా మేమే పెట్టుకుంటామని చెప్పాం. కాదూ. కూడదు ఖర్చులన్నీ నేనే జరుపుతానని పీనిగని ఈడకు తీసుకొచ్చాడు." ప్రభావతమ్మ గుంజకు అనుకుని నిలబడి తోడికోడలుతో అంది.

నారాయణ ఎర్రబారిన కళ్ళతో మత్తుగా కుర్చీ వెనక్కి వాలాడు.

"ప్రభావతమ్మా! ఇద్దరు కొడుకులున్నప్పుడు సావు ఖర్చులు ఇద్దరూ పంచుకుంటారు గాని ఒక్కడి నెత్తినే రుద్దితే ఎట్టమ్మా? వాడుమాత్రం పిల్లా జెల్లా కలిగినోడే గదా!" దేవసేనమ్మ తండ్రి పుగాకు కాడను నడిమికి చీలుస్తూ అన్నాడు.

"నువ్వు చెప్పింది నిజమే చిన్నాయినా! ఇన్నాళ్ళూ పెద్దకొడుకై పుట్టేనందుకు ముసిలామె బాగోగులన్నీ మేమే చూచినాం గదా! ఏనాడైనా వీళ్ళు చూచి ఎరుగుదురా! బరువూ, బాధ్యతలన్నీ నెత్తినేసుకుని మా జీతంరాళ్ళతోనే అరవచాకిరీ చేస్తిమి. మాకు మాత్రం పిల్లలు లేరా? అయినా తల కొరివి పెట్టిన కొడుకు ఖర్చులు భరించుకోడంలో తప్పేముంది? అదీ శేషయ్య ఒప్పుకుంటేనేనా?" అంది ప్రభావతమ్మ.

"జరిగిందేదో జరిగిపోయింది. ఎంత ఖర్చయితే అంత చెరి సగం – అదీ ముసలమ్మ గాజొకటి మాకిస్తేనే." మళ్ళీ దేవసేనమ్మ కొత్త పేచీ పెట్టింది.

"ముసలమ్మ గాజేంది?" ప్రభావతమ్మ ముఖం నల్లగా పెట్టుకుని దేవసేనమ్మ వైపు చూస్తూ అడిగింది.

"ఎన్ని గాజులున్నా ఏంది? ఉన్న రెంటిలో మీకొకటీ, మాకొకటీ" అంది దేవసేనమ్మ.

"అయాల ఉమ్మడి మీద బ్యాంకులో కుదవపెట్టే అప్పు తెచ్చిన గాజులు. వేలం పాట కొస్తే మీరేం మాట్లాడకపోతిరే! అప్పూ, వడ్డీ కట్టి మేమే విడిపించుకుంటిమి. ఇయ్యాల వాటిని పంచుకోడానికేముంది?" గోపాలయ్య కటువుగానే అన్నాడు.

"అప్పులు ఎవరికోసం ఎవరు చేశారో, ముసలమ్మ గాజొకటి మాత్రం మాకు రావాలి!" దేవసేనమ్మ అంతే ఖచ్చితంగా చెప్పింది.

ఇవన్నీ విని కమలమ్మ పెద్దగా ఏడుపుకు లేచి ముసలమ్మను శాపనార్థాలు పెట్టింది.

"నువ్వు గమ్మునుండవే అప్పా!" అంటూ గోపాలయ్య గదిమాడు. కమలమ్మను కాసేపు ఏడవ నిచ్చి నారాయణ అన్నాడు: "మీ అమ్మ ఆ రెండు గాజుల్తో రెండు పెళ్ళిళ్ళు చేసిందిగదరా ఏమీ లేకుండా" అని పెద్దగా నవ్వాడు.

"అయినా దాన్నెందుకు గమ్మునుండ మంటావు. అది ఏడిచే దాంట్లో మాత్రం తప్పేముంది? మునుసుబు కూతుర్ని చూడటానికి వచ్చినోడు మరీ ముదురు వయసోడని వెనక్కి పంపిస్తుంటే నువ్వే కదా, వాళ్ళ ఎద్దుల బండి కెదురెళ్ళి మా అప్పనిస్తానని చెప్పి ఇంటికి లాక్కొచ్చేవ్! అప్ప పెళ్ళి కాణీ ఖర్చు లేకుండా చేసేసి ఏడామడల అవతలున్న అరవరాజ్యానికి ముసిలోడితో సాగనంపావ్! అయప్ప ఇయ్యాల ఏడవకుండా ఎట్టుంటది చెప్పు? ఇయ్యాల్టికైనా వెతుక్కోకుండా దానిల్లు ఏడుందో మీరు చెప్పగలరా? నీ పెళ్ళెప్పుడో నువ్వు ముదురోడు నవుతున్నావనీ, పిల్లనిచ్చే తల మాసినోడెవడూ గడప తొక్కడం లేదని మీ అమ్మొచ్చి నాకాడ మొత్తుకుంటే – ఇదుగో, ఈ ప్రభావతమ్మ తండ్రి నా భార్య తరపున దూరపు చుట్టం – పొలమూ, కాస్త పలుకుబడీ కలిగినోడు, నీ జీతం అయిదొందలని అబద్ధం చెప్పి నీ పెళ్ళి కుదిర్చాను. పిల్లకు నాలుగు సవర్ల గాజులు తీసిచ్చి మీ అమ్మ ఆ రోజు నాకేం చెప్పిందో తెల్సా – కూతురి గురించి దాని గుండెల్లో ఎంత బరువుందో నాకప్పుడే తెల్సింది. ఎప్పటికైనా ఆ గాజులు తన కూతురికే చెందాలని చెప్పింది – ఏం చేస్తాం ఆ గాజుల్లేకపోతే ఆయాల నీ పెళ్ళి ఆగిపోయి ఉండేది. పెళ్ళిలో చూపిస్తేనే నీ పెళ్ళి జరిగింది. పెళ్ళైనాక మీ ఇంటికొచ్చి మట్టి కుండా, చిల్లు తపేలా చూచి పిల్లను కాపరానికి పంపకపోతే నేనెన్నిసార్లు ఆ ఊరి చుట్టూ తిరగాల్సొచ్చింది? ఎన్ని చెప్పుదెబ్బలు పడాల్సొచ్చింది?"

"నిజమేనన్నా! ఆయాల నీ మాటలిని మా ఇంటాయన ఇట్టాంటి తిప్పల మారి ఇంట్లో నా బిడ్డను కట్టబెట్టి గొంతు కోశాడు. దాని చాకిరీ, రెక్కల కష్టం, మనేది చూస్తే ఇప్పుడికీ నా కడుపు తరుక్కుపోయిద్ది నాయనా!" ప్రభావతమ్మ తల్లి అంది.

"అదిసరే! తమ్ముడి పెళ్ళిలో నీ అల్లుడేం చేశాడని? మళ్ళీ ఆ గాజులకే మెరుగు పెట్టించి పెళ్ళిలో చూపించి దేవసేనమ్మ మెడలో శేషగిరి చేత తాళి కట్టించాడు. అంతవరకూ బాగానే వుంది. తర్వాత తోడికోడళ్ళిద్దరూ ఆ గాజుల కోసం బ్రహ్మరాక్షస యుద్ధం చేస్తుంటే నేనొచ్చి అన్నీ చెప్పి ఆ గాజుల్ని రాగమ్మకు ఇప్పించాల్సొచ్చింది. అయినా, భలే మహత్తు గల గాజుల్లే అవి!" మళ్ళీ పెద్దగా నవ్వాడు నారాయణ.

"మామా! ఎకసెక్కానికి ఇది యాలకాదు. ఆయాల మా దరిద్రం అట్టుంది. ఏం చేస్తాం? ఇప్పుడు జరగాల్సింది చెప్పు" అన్నాడు గోపాలయ్య అసహనంగా.

"ఉన్న మాటంటే ఉలికిపాటనీ–ఇంతకూ ఆ గాజులు ఎవరి దగ్గరున్నాయిరా?" అడిగాడు నారాయణ.

"నా దగ్గరున్నాయి మామా!"

"ముసలమ్మను చివరి దాకా మేమే చూచాం కాబట్టే అవి మాకే చెందాలి చిన్నాయినా! వాటి మీద ఎవరికీ హక్కు లేదు." ప్రభావతమ్మ మళ్ళీ మొదలెట్టింది.

"ముసలమ్మ గాజుల మీద మాకు హక్కు లేనప్పుడు, సావు ఖర్చులు మేమెందుకు పెట్టుకోవాలి?" దేవసేనమ్మ అంది.

"ఏది ఎట్టున్నా పోనీయండి. ఆడబిడ్డకు పుట్టింటి మీద ఆశ తప్పేంకాదు. కాలంనాడు కట్నకానుకలు లేకుండా నన్ను సాగనంపారు. మాయమ్మ గాజులు నాకే చెందాల." కమలమ్మ కలిపించుకుంది.

"అట్లాయితే ఖర్చులు నువ్వు భరించుకో. నీకో భాగం ఇస్తాం." దేవసేనమ్మ తెలివిగా అంది.

"ఆ తాహతే ఉంటే ప్రాణమున్నప్పుడే కన్నతల్లిని కడసారి చూపులకు నోచుకోక పోదునా! అదిలేకేగదమ్మా మేము మీకు మనుషుల్లా అగపడంది." దుఃఖపడుతూ నోట్లో కొంగు కుక్కుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది కమల.

"ఏరా శేషయ్యా! పేచీ అంతా నీదేరా! ఆఖరుగా నువ్వేమంటావో చెప్పు." నారాయణ అడిగాడు.

అందరూ నిశ్శబ్దమయ్యారు.

"దేవ అనే దాంట్లో కూడా నిజముందిగా మామా!"

"గోపాలయ్య నిశ్చేష్టుడయ్యాడు. ఒరేయ్! రాత్రి నువ్వు చెప్పిందేంది? ఇప్పుడు అనేదేంది?" అన్నాడు.

"అయ్యోయ్! నేను రాత్రే అనుకున్నా. ముసలమ్మ శవాన్ని ఈడకు పంపి తెలివి తక్కువపని చేశావయ్యా! ఆడనే అన్నీ చేసినట్లయితే ఈ పేచీలన్నీ ఉండేయి గాదయ్యో!" ప్రభావతమ్మ ఏడుస్తూ లేచింది.

"కాసేపు నువ్వు నోరుముయ్యవే!" అంటూ "మామా! ఇంక వాదనలొద్దు. నువ్వు ఎంత చెబితే అంత. నలుగుర్లోనూ నవ్వులాట పనులొద్దు" అన్నాడు గోపాలయ్య.

కాసేపు తర్జన భర్జనలు జరిగాక మగవాళ్ళందరూ ఒక నిర్ణయానికొచ్చి నిద్రకుపక్రమించారు.

తోడికోడళ్ళిద్దరూ పడుకునే రేపు జరగబోయే కార్యక్రమం గురించి మాట్లాడు కుంటున్నారు.

ఆ రాత్రంతా కమలమ్మ మాత్రం ముసలమ్మ గుడిసె ముందు కూర్చుని పొగిలి పొగిలి ఏడుస్తూనే ఉంది.

"నన్ను అన్యాయం చేసిపోయేవే తల్లీ! నీ గుర్తుగా పూసెత్తు బంగారమన్నా లేకుండా చేస్తివే అమ్మా! ఈ ఊరికీ, నాకూ రుణం తీరిపోయిందికదే అమ్మా!" అంటూ ముసలమ్మతో మాట్లాడుతూనే ఉంది.

● సుప్రభాతం వీక్లీ – *10 మే, 1998* ●

## నవీన్

(100)

# హెచ్

ఎంతో తెల్లగా, శుభ్రంగా ఉన్న గోడమీద ఎవరో ఎర్ర సిరాతో 'హెచ్' అన్న అక్షరాన్ని రాశారు. ఇది బహుశా పెద్దదాని పనే అయ్యుంటుంది. ఆ అక్షరం కేసి ఇదివరకు చాలాసార్లే చూశాడు. తన పేరు హనుమంతరావు కాబట్టి, పెద్దది ఆ అక్షరాన్ని అలా అందంగా రాసి ఉంటుందనుకున్నాడు. కానీ, ఇప్పుడా అక్షరం తనకు అందంగా కనిపించడం లేదు. ఈ క్షణంలో ఆ అక్షరం తనకు చాలా భయంకరంగా కనిపిస్తోంది.

కణకణ మండుతున్న నిప్పు కణికలా, స్ట్రెచర్ మీద పడుకోబెట్టిన రోగి కక్కుతున్న రక్తంలా, తన గొంతు నులిమేసే బలమైన రెండు ఉక్కు హస్తాల్లా దర్శనమిస్తోందా అక్షరం. తన ఇంటినిండా హెచ్చే. తన పేరు హనుమంతరావు. తన భార్య పేరు హేమలత. తన నాలుగేళ్ల పెద్ద కూతురు పేరు హారిత. తన మూడు నెలల పాప పేరు హారిణి. తాను పనిచేసేది హైదరాబాద్ యూనివర్శిటీలో, తాను హిస్టరీలో ప్రొఫెసర్!

బట్టలు మార్చుకోకుండానే బెడ్ మీద పడిపోయాడు. సాయంత్రం ఆరవుతోంది. హేమ పాపకు ఇంజెక్షన్ ఇప్పించడానికి డాక్టర్ దగ్గరకు వెళ్తున్నానని తనకు ఫోన్ చేసి చెప్పింది. తన దగ్గరున్న డూప్లికేట్ కీస్‌తో తలుపులు తెరుచుకొని ఇంట్లో ప్రవేశించాడు. ఈరోజు తన ఇల్లే తనకు కొత్తగా కనిపిస్తోంది. ఏదో జైల్లో ప్రవేశించినట్లుగా....ఈ జైల్లోనే త్వరలోనే తనను ఉరితీయబోతున్నట్టుగా ఫీలయ్యాడు. అకస్మాత్తుగా అతని లోపలెక్కడో వణుకు ప్రారంభమైంది. కడుపులో ప్రారంభమైన వణుకు శరీరమంతా వ్యాపిస్తోంది. చలికాలంలోలా అతడు వణికిపోతున్నాడు. భయం అతన్ని ఆక్రమించుకుంటోంది. అతని నిలువెల్లా భయం. అతని శరీరంలోని ప్రతి అణువులోనూ భయం ప్రవేశించింది. బెడ్ మీదున్న రగ్ తీసి నిండా కప్పుకున్నాడు. ఇదేమిటి? తానిలా వణికిపోతున్నాడేమిటి? నడి వేసవిలో తనకీ వణికేమిటి? బలికి తీసుకుపోబడుతున్న మేకపిల్లలా వణికిపోతున్నాడతడు. అలా వణికిపోతూనే బెడ్డంతా దొర్లుతున్నాడు. ఉంగలు చుట్టుకుపోతున్నాడు.

ఏ క్షణంలోనైనా తన ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోతాయి. కనీసం హేమ వచ్చేంతవరకైనా తన ప్రాణాల్ని నిలుపుకోలేడు. మేనమామల ఇంటికెళ్లిన హారితనైతే తానీ జన్మలో మళ్ళీ చూడలేడు.

నిండా రగ్గు కప్పుకోవడంతో అతని శరీరమంతా చెమట పట్టేసింది. రగ్గు తీసేశాడు. తనను తాను ఓదార్చుకోవడానికి ప్రయత్నించాడు. అసలా రిపోర్టు తనది కానే కాదు. అంతా మోసం. ఎవరిదో రిపోర్టు ఏదో తన పేరున పడిపోయింది. నోనోనో....తనను తాను మోసగించుకోవ ప్రయత్నించి ప్రయోజనం లేదు. ఆ రిపోర్టు తనదే. ఒకటికి రెండుసార్లు చెక్ చేసుకున్నాడు. రెండుసార్లు పరీక్ష చేయించుకున్నాడు. ఆ డాక్టర్ కూడా తనకు బాగా తెలిసినవాడే. తననతడు మోసం చేసే ప్రసక్తే లేదు.

అసలిదంతా ఎలా జరిగింది? పోయిన వేసవికాలంలో తాను ఢిల్లీ వెళ్లాడు. అందమైన న్యూఢిల్లీ. అందమైన విజ్ఞాన భవన్. వరల్డ్ హిస్టరీ కాంగ్రెస్. ప్రపంచంలోని హిస్టరీ పండితులందరూ వచ్చారు. ఆరోజు జరిగే సెమినార్‌లో తాను పేపర్ ప్రెజంట్ చెయ్యాలి. తనా పేపర్‌ను హోటల్ రూమ్‌లో మరిచిపోయాడు. "హల్లో ప్రొఫెసర్‌గారూ! ఎటూ చూడకుండా ఎక్కడికలా హడావిడిగా వెళ్లిపోతున్నారు?" అంది ప్రొఫెసర్ రమణి, నిజంగానే హడావిడిగా వెళ్తున్న తనను ఆపి.

"సారీ, మీరా! నేను గమనించనే లేదు" అన్నాడు తాను.

"నేను మీరాను కాను, రమణిని" అందామె అందంగా నవ్వుతూ.

"అఫ్‌కోర్స్! నువ్వు రమణివే. హౌ ఆర్ యూ రమణీ?" అన్నాడు తాను.

"ఫైన్. ఎక్కడికలా పరుగెత్తుతున్నారు?" అంది రమణి.

"నెక్స్ట్ సెషన్‌లో మొదటి పేపర్ ప్రెజంట్ చెయ్యాల్సింది నేనే. తీరా చూస్తే బ్యాగ్‌లో పేపర్ లేదు. హోటల్‌నుంచి బయటకెళ్తున్నప్పుడు బ్యాగులో ఆ పేపర్ పెట్టుకున్నాననుకున్నాను. కానీ, ఆ పేపర్‌ను నేను నా రూమ్‌లోనే మరచిపోయినట్టున్నాను. ఇప్పుడు హోటల్‌దాకా వెళ్లి పట్టుకురావాలి."

"ప్రొఫెసర్ల మీద జనం చెప్పుకునే జోక్స్‌ని నిజం చేశారు. మీరే హోటల్లో దిగారు?"

"సదరన్ హోటల్లో, కరోల్‌బాగ్."

"నేనూ ఆ హోటల్లోనే దిగాను."

"మీ రూమ్ నెంటరెంత?"

"టూ నాట్ వన్."

"వాట్ ఎ కో ఇన్సిడెన్స్! నేను టూ నాట్ టులో దిగాను. మనిద్దరికీ ఇది వరకు త్రివేంద్రంలో కూడా ఇలాగే జరిగింది."

"బర్డ్స్ ఆఫ్ ది సేమ్ ఫెదర్ ఫ్లాక్ టుగెదర్ అని ఊరికే అన్నారా?"

"అయితే, మీ పేపరెప్పుడుంది?"

రేపు మార్నింగ్ సెషన్‌లో. నేను ఈరోజే మార్నింగ్ ఫ్లైట్‌లో బొంబేనుంచి వచ్చాను. మీకు టైమెక్కువ లేదు. వెళ్లి పేపర్ తెచ్చుకోండి. తర్వాత తీరికగా మాట్లాడుకుందాం. మన ఆబ్సెంట్ మైండెడ్‌నెస్‌కు ఈమాత్రం ప్రైస్ చెల్లించక తప్పదు మరి" అంది రమణి.

రమణి తెల్లగా, పొడుగ్గా, బాబ్డ్ హేర్‌తో, పంజాబీ డ్రస్‌లో చాలా అందంగా కనిపించింది. వాళ్ళ హజ్బెండ్ సౌదీ అరేబియాలో ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. రెండు నెలలకో, మూడు నెలలకో ఒకసారొచ్చి ఈమెతో ఓ వారం పది రోజులు గడిపిపోతుంటాడు. ఇంత అందమైన భార్యను ఇండియాలో వదిలేసి అతడు సౌదీకి వెళ్లిపోవటం ఆశ్చర్యమే. తానైతే తన భార్యను విడిచి ఓ పది రోజులు కూడా ఉండలేడు.

రమణివాళ్లు తెలుగువాళ్లే. ఇదివరకు త్రివేండ్రంలో జరిగిన హిస్టరీ కాంగ్రెస్‌లో పరిచయమైందామె. పక్కపక్కనే రూమ్స్ కావడంవల్ల ఇద్దరూ ఫ్రెండ్సయిపోయారు. ఆమెను మళ్లీ ఢిల్లీలో కలుసుకోవడం తనకి గొప్ప ఉత్సాహాన్నిచ్చింది. తన పేపర్ రూమ్‌లోనే ఉంది. ఆ రోజు తాను ప్రెజెంట్ చేసిన పేపర్‌కు చాలా గొప్ప రెస్పాన్స్ వచ్చింది. విజ్ఞాన భవనం అంతా చప్పట్లతో దద్దరిల్లిపోయింది. సమావేశం అయిపోగానే రమణి తన దగ్గరికొచ్చి "కంగ్రాచ్యులేషన్స్ ప్రొఫెసర్! మీ పేపర్ చాలా బావుంది" అంది.

"థాంక్స్!" అన్నాడు తాను.

"యువర్ పేపర్ కంటెయిన్స్ సమ్ ఒరిజినల్ ఐడియాస్. ఇదివరకెవరూ ఇండో ఆర్యన్స్‌ను గూర్చి ఇన్ని కొత్త విషయాలు చెప్పలేదు. యూ ఆర్ సింప్లీ బ్రిలియంట్" అంది రమణి.

"థ్యాంక్స్!" అన్నాడు తాను మళ్ళీ.

"యూ ఆర్ యంగ్ అండ్ బ్రిలియంట్, అయామ్ జెలస్ ఆఫ్ యూ!"

"అయామాల్సో జెలస్ ఆఫ్ యూ!" అన్నాడు తాను.

"ఎందుకు?"

"యూ ఆర్ ఆల్‌సో యంగ్ అండ్ బ్రిలియంట్. మీ మెడలో మెరుస్తున్న వజ్రాల నెక్లెస్‌ను చూస్తే ఎవరికైనా ఈర్ష్య కలుగుతుంది. ఐ విష్ ఐ కుడ్ ప్రెజెంట్ వన్ సచ్ నెక్లెస్ టు మై వైఫ్" అన్నాడు తాను.

"ఓ రియల్లీ! యూ రియల్లీ లవ్ యువర్ వైఫ్ సో మచ్!"

"యా! ఐ రియల్లీ లవ్ మై వైఫ్! షీ ఈజ్ సచ్ ఏన్ ఏంజెల్!"

"ఐ విష్ ఐ కుడ్ సీ యువర్ ఏంజెల్!"

ఇలా మాట్లాడుకుంటూనే ఇద్దరూ ఒకే కార్లో హోటల్ చేరుకున్నారు. "ఢిల్లీ యూనివర్శిటీ ప్రొఫెసర్ – అతని పేరు వర్మ అనుకుంటాను. అతని ఆర్గ్యుమెంట్ చూశారా? ఎంత స్ట్రేంజ్‌గా ఉందో" అన్నాడు తాను కార్లోంచి దిగుతూ.

"స్టుపిడ్. హీ ఈజ్ ఎ స్టుపిడ్ ఫెలో. వాడి మొహంలాగే వాడి పేపర్" అంది రమణి తానూ కార్లోంచి దిగుతూ.

"పైగా వాడికి పెద్ద పోజు. నా అంతటివాడు లేడనుకుంటాడు. ఢిల్లీలో ఉండటం అతనికి చాలా లాభమైంది. ఎన్ని యు.జి.సి. ప్రాజెక్ట్స్ తెచ్చుకున్నాడో"

"నార్త్‌లో ఉన్నవాళ్లందరికీ ఈ ఎడ్వాన్‌టేజ్ ఉంది. యు.జీ.సి. ప్రాజెక్ట్స్ అన్నీ వాళ్లకే."

ఇలా అనేక విషయాలు మాట్లాడకుంటూ ఇద్దరూ పక్కపక్కనే ఉన్న తమ రూమ్స్‌కు చేరారు. తాను తన రూమ్‌లోకి, ఆమె ఆమె రూమ్‌లోకి వెళ్లిపోయారు.

తాను బట్టలు మార్చుకుని, స్నానం చేసి కాసేపు రిలాక్సయ్యాడు. రాత్రి ఎనిమిది గంటలు దాటింది. రేపటి ప్రోగ్రామ్స్‌ని గురించి ఆలోచిస్తున్నాడు. రేపు సాయంత్రానికి హిస్టరీ కాంగ్రెస్ అయిపోతుంది. తనకు ఎల్లుండి ఎ.పి. ఎక్స్‌ప్రెస్‌లో ఫస్ట్‌క్లాస్ ఏ.సిలో బెర్త్ రిజర్వ్ చేశారు. తాను ఇంటినుంచి బయల్దేరి అప్పుడే పది రోజులైంది. జైపూర్ యూనివర్శిటీ వాళ్ళు థీసిస్‌లు సబ్మిట్ చేసిన ముగ్గురు రీసెర్చ్ స్కాలర్స్‌కి 'వైవా-వోసి' అరేంజ్ చేసి తనను ఎగ్జామినర్‌గా పిల్చారు. జైపూర్ వెళ్లి ఆ పని పూర్తిచేసుకుని, హిస్టరీ కాంగ్రెస్ అటెండ్ చేయడానికి ఒకరోజు ముందుగానే ఢిల్లీ చేరుకున్నాడు. ఈరోజు రమణి తనకు కలవడం, తన పక్క రూమ్‌లోనే ఆమె దిగడం తనకు గొప్ప ప్లెజెంట్ సర్‌ప్రైజ్.

ఈ అయిదేళ్లలో ఆమెలో పెద్ద మార్పేమీ లేదు. ఇదివరకు చూసినప్పుడు సన్నగా కనిపించింది. ఇప్పుడు కొంచెం లావెక్కింది. ఈ కారణం చేతనే కావచ్చు ఆమె ఇదివరకటికంటే ఇంకా ఆకర్షణీయంగా కనిపించింది. ఇదివరకు బోన్స్ తప్ప ఆమెలో ఫ్లెష్ అండ్ బ్లడ్ లేవనిపించింది. నౌ షీ ఈజ్ ఫులాఫ్ ఫ్లెష్ అండ్ బ్లడ్. అప్పుడామె మెడలో వజ్రాల నెక్లెస్ లేదు. ఇప్పుడీ వజ్రాల నెక్లెస్ ఆమె అందాన్ని ద్విగుణీకృతం చేసింది. తాను తన హేమకు అలాంటి వజ్రాల నెక్లెస్ ప్రెజెంట్ చేయగల్గితే? ఇంపాజిబుల్! తాను తన జన్మలో అంత డబ్బు సంపాదించలేడు.

బయట ఎవరో తలుపు తడ్తున్న శబ్దం.

"కమిన్" అన్నాడు తాను. రమణి తలుపు తెరుచుకొని లోపలకొచ్చింది. దివినుంచి భువికి దిగివచ్చిన ఊర్వశిలా రమణి.....రమణిమీదినుంచి తన చూపుల్ని మరల్చలేకపోయాడు. అప్పుడే స్నానం చేసినట్లుంది. కలోన్ సువాసనలతో తన గదంతా నిండిపోయింది. ఆమె వేసుకున్న నైటీ ఆమె అందాల్ని దాచలేకపోతున్నది.

"ఏం చేస్తున్నారండీ ప్రొఫెసర్‌గారూ?" అంటూ వచ్చిందామె.

"ఏమీ చేయడం లేదు. ఇప్పుడు మీరేం చేస్తుంటారా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు తాను.

"అబద్ధం" అందామె.

"ఎందుకలా అంటున్నారు?"

"మీరు నా గురించి ఆలోచిస్తున్నారంటే నేను నమ్మను."

"ఎందుకు?"

"మీరు మీ 'ఏంజెల్' గురించి ఆలోచించకుండా ఈ డెవిల్‌ను గురించి ఆలోచిస్తున్నారంటే ఎలా నమ్మేది?" అందామె హాయిగా నవ్వుతూ.

"నో నో నో, యూ ఆర్ ఆల్‌సో యాన్ ఏంజిల్."

"యూ రియల్లీ మీనిట్?" అందామె కళ్లు పెద్దవి చేసి.

"ఆఫ్‌కోర్స్ ఐ డూ మీనిట్."

ఇద్దరూ నవ్వారు.

"ఏం చేద్దామంటారిప్పుడు? బాగా ఎగ్జాస్టయి పోయాం. హౌ ఎబౌట్ సమ్ రిలాక్సేషన్"

"హౌ ఎబౌట్ ఎ పెగాఫ్ స్కాచ్?"

"ఐ డోన్ట్ మైండ్ ఇఫ్ ఇటీజ్ వన్ పెగ్ ఓన్లీ. పోయినసారి మీరు నాతో కొంచెం ఎక్కువగానే తాగించారు" అన్నాడు తాను. ఆమె దగ్గర ఎప్పుడూ బెస్ట్ అవేలబుల్ స్కాచ్ ఉంటుందని తనకు తెలుసు. వాళ్ళ హజ్బెండ్ తెచ్చిపెడ్తాడని చెప్పింది.

"ఈసారలా జరగదు. మా రూమ్‌కెళ్దాం రండి" అందామె.

"అయామ్ వెయిటింగ్ ఫర్ ఎ కాల్ ఫ్రమ్ హైదరాబాద్."

"ఈజిట్ యువర్ ఏంజల్ దటీజ్ గోయింగ్ టు కాల్?"

"యా."

"సచ్ ఎ డివోటెడ్ వైఫ్ అండ్ సచ్ ఎ డివోటెడ్ హజ్బెండ్! వెరీ రేర్ కాంబినేషన్. మీ కాల్‌ను మా రూమ్‌కు డైరెక్ట్ చేయమందాం."

"వద్దు. ఇక్కడే కాసేపు వెయిట్ చేద్దాం."

"అయితే ఉండండి. జస్ట్ ఎ మినిట్. ఇప్పుడే వస్తాను" అంటూ ఆమె బయటకు వెళ్లింది.

'ఫూల్! ఆమెననవసరంగా బయటకు పంపించావు' అనుకున్నాడు తాను. ఆమె ఉన్నంతసేపూ ఎంత హాయిగా ఫీలయ్యాడు. తన పక్కనే హేమ ఉంటే ఎంత హాయిగా ఉంటుందో ఆమె ఉన్నంతసేపూ అంత హాయిగా ఉంది.

ఆమె మళ్లీ వస్తుందా? ఒకవేళ రాకపోతే? తనకంటే ఆయనకు ఎక్కడో ఉన్న ఆయన భార్యే ముఖ్యమనుకుని తన గదిలోనే ఉండిపోతుందేమో. లేదు, లేదు. తనను వెతుక్కుంటూ ఆమె తప్పకుండా వస్తుంది. ఆమెక్కూడా ఈ క్షణంలో తోడు కావాలి. తనలాగే ఆమె కూడా ఒంటరితనంతో కాలిపోతోంది. కాబట్టి తప్పకుండా వస్తుంది. ఒకవేళ రాకపోతే తానే ఆమె గదిలోకెళ్తాడు. ఓ పది నిమిషాల్లోనే ఆమె చేతిలో చిన్న బ్యాగ్‌తో వచ్చేసింది. ఆమె ఆ బ్యాగ్‌లోంచి ఓ అందమైన బాటిల్ తీసింది.

"దీసీజ్ రాయల్ సెల్యూట్. ది బెస్ట్ స్కాచ్ ఇన్ ది వర్ల్డ్. సౌదీనుంచి మా హజ్బెండ్ తెచ్చారు. నాలుగేళ్ల తర్వాత మిమ్మల్ని కలుసుకున్నానన్న ఆనందంలో దీన్నిప్పుడు ఓపెన్ చేస్తున్నాను" అంటూ ఆమె ఆ బాటిల్‌ను ఓపెన్ చేసింది. సరిగ్గా అప్పుడే హోటల్ బాయ్ నాలుగు బిస్లెరిసోడా బాటిల్స్ తెచ్చి టీపాయ్‌మీద పెట్టేసి వెళ్ళిపోయాడు. ఆమె రెండుగ్లాసుల్లో విస్కీపోసి సోడాలు కలిపి ఐస్‌క్యూబ్స్ వేసింది. అతని చేతికో గ్లాసిచ్చి తానో గ్లాసు తీసుకుని గ్లాసుల్ని టాస్ చేసి చీర్స్ అంది.

"చీర్స్" అన్నాడు తానూ. ఆమెలో అలా కూర్చొని చల్లని విస్కీ సిప్ చేస్తోంటే గాలిలో తేలిపోతున్నట్లుగా ఉంది. స్వర్గం అంటే ఇదే కాబోలు ననిపించింది. ఇంతలో ఫోన్ మోగింది.

"హల్లో" అన్నాడు తాను. తాను ఊహించినట్టుగానే హేమ. "హాయ్ హేమా! హౌ ఆర్ యు డార్లింగ్? జస్ట్ హెల్! వెంటనే రెక్కలు కట్టుకొని నీముందు వాలాలనిపిస్తోంది. అబద్ధం కాదు. నిజం. ఎల్లుండి ఏ.పిలో బయల్దేరుతున్నాను. ఇంకో 48 గంటల్లో నీతో....." నీ కౌగిలిలో అనబోయి రమణికేసి చూసి ఆగిపోయాడు.

"అబ్బే! రూమ్‌లో ఇంకెవరూ లేరు హేమా! నేనొక్కడినే. ఇప్పుడే కాన్ఫరెన్స్ హాల్‌నుంచి వచ్చాను. స్నానం చేసి రిలాక్సవుతున్నాను. ఇంతలో నీ ఫోనొచ్చింది. ఫ్రీగా మాట్లాడడం లేదా? కమాన్ డార్లింగ్....నిన్నట్నుంచీ జ్వరమా? ఎండలో తిరిగావా? మీ సిస్టర్‌తో షాపింగ్ చేశావా? నేనొస్తే నీ జ్వరం పోతుంది. బై గుడ్‌నైట్ డార్లింగ్!" తాను ఫోన్ పెట్టేశాడు.

"మీ ఆవిడకు జ్వరమొచ్చిందా? విరహంతో వచ్చిన జ్వరమై ఉంటుంది" అంది రమణి చిలిపిగా తన కళ్లల్లోకి చూస్తూ.

"ఐ థింక్ సో. నన్ను విడిచి రెండ్రోజులు కూడా ఉండలేదు."

"మీరూ అంతేనా?" అందామె.

"అఫ్‌కోర్స్!"

"యూ ఆర్ ది మోస్ట్ ఫెయిత్‌ఫుల్ హజ్బెండ్ ఐ హేవ్ ఎవర్ సీన్" అందామె.

"హౌ ఎబౌట్ యువర్ హజ్బెండ్" అన్నాడు తాను ఆమెను ఉడికించాలనే.

"అడగొద్దు. మూడు నెలలకోసారి భార్యను కలుసుకునే భర్త ఫెయిత్‌ఫుల్‌గా ఉంటాడని ఎలా ఎక్స్‌పెక్ట్ చేశారు?" అందామె. ఆమె కంఠంలో కొంచెం బాధ ధ్వనించింది.

"అయామ్ సారీ!"

"సారీలు వర్రీలు వద్దిప్పుడు. లెటజ్ ఫర్‌గెట్ ఎవ్రీథింగ్. కమాన్! లెటజ్ గోటు సెకండ్ రౌండ్. మీ ఫస్ట్ రౌండ్ పూర్తి చెయ్యండి" అందామె.

"నో. సెకండ్ రౌండ్ ఫర్ మి" అన్నాడు తాను.

"ఈరోజు నా కోసం మీరు తాగుతారు. ఎన్ని రౌండ్లయినా నా కోసం భరిస్తారు."

"నో, నో. ఒక్క పెగ్ కంటే ఎక్కువ తాగనని నేను నా వైఫ్‌కు మాటిచ్చాను."

"మై డియర్ మోస్ట్ ఫెయిత్ ఫుల్ హజ్బెండ్‌గారూ! మీరు మీ వైఫ్‌ను కాసేపు మరిచిపోవాలి. ఇంకొక్క పెగ్ తాగినంత మాత్రాన ఏమీ అవదు. ఈరోజు నా కోసం మీ నియమాల్ని కొన్ని త్యాగం చెయ్యాలి" అందామె.

ఆమె ప్రాధేయపడుతున్నట్లుగా తనకేసి చూస్తోంది. ఆ చూపుల్లో తన ముందున్న విస్కీలో ఉన్న మత్తుకంటే ఎక్కువ మత్తుంది.

"ఓకే. ఓకె. ఈ రోజు మీరు తాగమంటే విషమైనా తాగుతాను" అన్నాడు.

"థాంక్యూ. థాంక్యూసర్!" అందామె.

తాను తన గ్లాసులో మిగిలిన విస్కీని ఒక్క గుక్కలో తాగేశాడు. ఆమె మళ్లీ రెండు గ్లాసుల్లోనూ విస్కీ పోసి సోడాలు కలిపి ఐస్‌క్యూబ్స్ వేసింది. తాను గ్లాసు చేతిలోకి తీసుకొని సిప్ చెయ్యడం మొదలెట్టాడు.

"మీరు మరీ త్వరగా తాగెయ్యకండి. అలా అయితే మీరు మీ వైఫ్‌కిచ్చిన మరో ప్రామిస్ కూడా బ్రేక్ చేస్తారేమో జాగ్రత్త!" అందామె.

"ఏమిటిది?" అన్నాడు తాను.

"మై డియర్ మోస్ట్ ఫెయిత్‌ఫుల్ హజ్బెండ్‌గారూ! ఏమీ లేదు. అన్నీ మరిచిపొండి. కాసేపు రిలాక్సవండి."

రెండో రౌండ్ కూడా పూర్తయింది. మూడో రౌండ్ స్టార్టయింది.

తన కళ్ళు మత్తుగా ఆమె శరీరంలోకి చొచ్చుకుపోతున్నాయి. ఆమె ఒంటిమీదున్న ఆ పల్చటి నైటీలోంచి ఆమె ఎర్రటి శరీరపు ఎత్తుపల్లాలు గ్లాసు కర్టెన్‌లోంచి కనిపిస్తున్న నేతి మిఠాయిల్లా కనిపిస్తూ తనను ఊరిస్తున్నాయి.

"ఈ క్షణంలో మిమ్మల్ని చూస్తోంటే...." తాను పూర్తిచేయలేకపోయాడు.

"ఊ. చెప్పండి. నన్ను చూస్తోంటే..... చెప్పండి. ఆగిపోయారెందుకు? నో ఇన్‌హిబిషన్స్. ఫ్రీగా మాట్లాడండి" అందామె.

"మిమ్మల్ని చూస్తోంటే అచ్చం నా హేమను చూస్తున్నట్లే ఉంది" అంటూనే తనామెను సమీపించాడు. తనకేమవుతున్నదో తెలియడం లేదు. మరుక్షణంలో ఆమె వక్షస్థలంమీద తాను.

"ఐ కాంట్ రెసిస్ట్ యువర్ చార్మ్ రమణీ! ప్లీజ్ నన్నాపొద్దు" అన్నాడు తాను.

"ఇదేమిటండి మోస్ట్ ఫెయిత్‌ఫుల్ హజ్బెండ్‌గారూ! రెండు పెగ్గులకే మీ భార్యకింత అన్యాయం తలపెడ్తారా?" అందామె.

"లేదు. లేదు. నేనెవరికీ అన్యాయం చెయ్యడం లేదు. యూ ఆర్ లైక్ మై హేమ. యూ ఆర్ మై హేమ" అంటూ తానామెను హత్తుకుపోయాడు.

"త్రివేండ్రంలో చాలా బెట్టుచేశారే!"

"ఫర్‌గెట్ త్రివేండ్రం. దిసీజ్ ఢిల్లీ అండ్ అయామ్ యువర్స్."

మరుక్షణంలో ఇద్దరూ బెడ్‌మీద. ఆమె అతని కద్దుచెప్పలేదు. చల్లగా, మెత్తగా, మత్తుగా ఆమె శరీరం. ఆమె శరీరంతో పెనవేసుకుపోతున్న తన శరీరం. ఆనంద జలధిలో ఓలలాడుతున్న తాను. ఆనందపు శిఖరాలను అధిరోహిస్తున్న తాను. హేమ కూడా ఇవ్వనంత సుఖాన్ని ఆ క్షణంలో ఆమె తనకందించింది.

ఆ మర్నాడు కూడా సరిగ్గా అలానే గడిచింది.

సో దట్సిట్. ఇప్పుడర్థమౌతోంది. తానా రోజు ఆమె కోసం, ఆ కాస్సేపటి సుఖం కోసం విషమే తాగాడు. విషాన్ని తన శరీరంలో ఎక్కించుకున్నాడు.

అంత రెస్పెక్టబుల్ ఉమన్! అంత నీట్ ఉమన్! ఆమెతో కేవలం ఓ రెండు రాత్రులు మాత్రమే గడిపినందుకు తన జీవితం శాశ్వతంగా వ్యర్థమైపోతుందా?

అతనికి దుఃఖం ముంచుకొచ్చింది. గొంతు చించుకుని దిక్కులు పిక్కటిల్లేలా అరవాలనిపించింది. ఒక్క తప్పుకు ఇంత భయంకరమైన శిక్షా?

"ఇదేమిటిలా చీకట్లో కూర్చున్నారు? ఇల్లంతా చీకటే. ఒక్క లైటు కూడా వేసుకోలేదేమిటి" అంటూ హేమ వచ్చేసింది. ఆమె వెంటనే లైట్లన్నీ వేసింది.

అతను వెంటనే తన ముఖానికి దిండునడ్డం పెట్టుకొని మరోవైపు తిరిగి పడుకోబోయాడు. అతన్నలా చూసిన ఆమె గుండెలు దడదడమన్నాయి. పాపను బెడ్‌కు మరోవైపు పడుకోబెట్టి, "అలా ఉన్నారేమిటి? ఏమైంది?" అంది అతని ముఖం మీదున్న దిండును తొలగిస్తూ.

"హేమా! ప్లీజ్, నన్నిలా వదిలెయ్!" ఆ క్షణంలో అతని కంఠం రుద్ధమైపోయింది. అతడు ఏడుస్తున్నాడని గ్రహించిందామె. పొంగి పొరలి వస్తున్న దుఃఖాన్నతడు ఆపుకోలేకపోయాడు.

"ఏమైంది? ప్లీజ్, చెప్పండి" అందామె. అతడు మళ్ళీ బిగ్గరగా ఏడ్చాడు.

"ప్లీజ్! మీరలా మరోసారి ఏడ్చారంటే నేనీ గోడకేసి తల బాదుకుని చచ్చిపోతాను. ధైర్యంగా ఉండండి. అసలు ఏం జరిగిందో చెప్పండి మొదలు. ఎంతటి సమస్యకైనా పరిష్కారం ఉంటుంది" అంది హేమ.

"కానీ, మనం ఇప్పుడు ఎదుర్కొంటున్న సమస్యకు పరిష్కారం లేదు హేమా!" అన్నాడు వెక్కి వెక్కి ఏడుస్తూనే.

"పరిష్కారం లేని సమస్యంటూ ఏదీ ఉండదు. ఇద్దరం కలిసి ఆలోచిద్దాం. మొదలు సమస్యేమిటో చెప్పండి" అందామె అతని తలను తన ఒడిలో పెట్టుకుంటూ.

అతని కన్నులనిండా నీళ్లు. ముఖంలో గాటు వేసినా నెత్తురు చుక్కలేదు. కొన్ని గంటల్లోనే అతని వయసు ఓ ఇరవై సంవత్సరాలు పెరిగిపోయినట్లనిపించింది.

"ఏమిటో చెప్పండి ప్లీజ్!" అందామె మరోసారి.

అతడు బెడ్‌మీద ఒకపక్కగా పడి ఉన్న తన బ్యాగ్‌ను చూపించాడు.

ఆమె ఆ బ్యాగ్‌ను అందుకొని, తెరచి లోపలున్న డాక్టర్ సూర్యనారాయణ పేరుతో ఉన్న చీటీని, దానికే పిన్ చేసి ఉన్న రిపోర్ట్సుని పరిశీలనగా చూసింది. వాటిమీద తన భర్త పేరే ఉండటాన్ని గమనించింది. కొన్ని క్షణాలసేపు ఆమె ఆ కాగితాలకేసి అలా చూస్తూ ఉండిపోయింది. ఆ కాగితాల్లో ఏముందో ఆమెకర్థమయ్యేటప్పటికి ఆమె తల గిర్రున తిరిగిపోయింది.

తన కాళ్లకింది భూమి కదిలిపోతున్నట్టుగా.....సుళ్ళు తిరుగుతున్న గోదావరి వరదల్లో కొట్టుకుపోతున్నట్లుగా, పైకి రావాలని పెనుగులాడుతున్నకొద్దీ లోపలకే కూరుకుపోతున్నట్లుగా, ఆకాశంలోంచి కిందకు కూలిపోతున్న విమానంలోంచి పడిపోతున్నట్లుగా......అనంత దూరంలోంచి మహావేగంతో ఏదో గ్రహశకలం ఢీకొట్టినట్లుంది. ఆమె కెవ్వున కేకేసి నేలమీద పడిపోయింది.

అతడు దిగ్గున లేచి "హేమా! హేమా!" అంటూ ఆమెను కుదిపాడు. ఫ్రిజ్‌లోంచి నీళ్ళబాటిల్ తెచ్చి ఆమె ముఖంమీద చన్నీళ్లు చల్లాడు.

కాసేపటికి ఆమె కళ్లు తెరిచి చూసింది.

"మీకు...మీకు....నేను తప్ప మరో స్త్రీ తెలీని మీకు హెచ్.ఐ.వి పాజిటివా?" అతి కష్టంగా ఆమె ఆ మాటలంది. ఆమెకు మళ్లీ స్పృహ తప్పింది.

"హేమా! ప్లీజ్ హేమా!" అతడామెను మళ్లీ అటూ ఇటూ కుదిపి ఆమె ముఖంమీద మళ్లీ చన్నీళ్ళు చల్లాడు. ఆమె మళ్ళీ కళ్లు తెరిచింది.

"నేను నమ్మలేనండి! సమ్‌థింగ్ మస్ట్‌బీ రాంగ్. అవి మీ రిపోర్ట్స్ కావు. ఇంకెవరివో అయితే మీకిచ్చారు. నేను నమ్మలేను. ఇట్స్ ఇంపాజిబుల్! మీ మీద సంపూర్ణ విశ్వాసం ఉంది. డాక్టర్ దగ్గరకు మళ్లీ వెళదాం. మళ్లీ పరీక్ష చెయ్యమందాం" అంటోందిమె.

"లేదు హేమా! లేదు. ఆ రిపోర్ట్స్ నావే. నేను చేసిన ఒక తప్పే నా శరీరంలో ఈ విషాన్ని నింపింది. ఇప్పుడా విషం నా శరీరంలోని అణువణువునా వ్యాపించింది"

"ఏం చేశారు? చెప్పండి! ఏం చేశారో చెప్పండి" అరచినట్టుగా అందామె అతని షర్ట్‌కాలర్ పట్టుకుని.

"చెబుతాను హేమా! అంతా చెబుతాను. ఒక సంవత్సరం క్రితం నేను ఢిల్లీలో జరిగిన హిస్టరీ కాంగ్రెస్ అటెండ్ చేయడానికి వెళ్లాను గుర్తుందా?"

"ఔను! గుర్తుంది. పోయిన ఏప్రిల్‌లోనే మీరు జైపూర్ వెళ్లి అక్కణ్ణించి ఢిల్లీ వెళ్లారు."

"ఢిల్లీలో నాకు ప్రొఫెసర్ రమణి పరిచయమైంది. ఆమె బొంబేనుంచి వచ్చింది. ఆమె నేను దిగిన హోటల్లోనే నా పక్క గదిలో దిగింది. ఒక రోజు రాత్రి ఆమె నా గదిలోకొచ్చింది. ఇద్దరం కలిసి కొంచెం ఎక్కువగానే విస్కీ తాగాం. ఆ బలహీన క్షణంలో ఐ హేడ్ సెక్స్ విత్ హర్."

అతని మాటలు వినడంతోటే ఆమె తన తలను నేలకేసి బాదుకుంది. అతడామెను పైకి లేవనెత్తాడు.

"సారీ హేమా! నన్ను క్షమించమని అడిగే అర్హత కూడా నాకు లేదు."

"అయినా ఓ ప్రొఫెసర్ స్థాయిలో ఉన్న స్త్రీలో కూడా!"

"ఆమె భర్త సౌదీలో ఉంటాడట. అతడే ఆమెకిది అంటించి ఉంటాడు."

"దాన్ని ఆమె మీకంటించింది. మీరు దాన్ని నాకూ, నా పాపక్కూడా అంటించే ఉంటారు. ఔను మీరు ఢిల్లీనుంచి వచ్చాకే నేను ప్రెగ్నెంటయ్యాను. అయ్యో దేవుడా! ఎంత పని చేశావు దేవుడా! అంతా సర్వనాశనం చేసేశావు." ఆమె పెద్దపెట్టున భోరుమంది. నిద్రలోఉన్న పాప ఉలిక్కిపడి లేచి కెవ్వుమని అరచి ఏడ్వసాగింది.

ఆమె పాపమీద పడి ఇంకా హృదయవిదారకంగా రోదించసాగింది.

ఆమె అలా ఏడుస్తూనే మళ్లీ స్పృహతప్పి కుప్పకూలిపోయింది.

● *ఇండియా టుడే: 2 జూన్ 1998* ●

★ ★ ★

డా॥ వి. ఆర్. రాసాని

101

# గాలిచెట్టు

"గాలిసెట్టుకాడి కెత్తకపోయే గంపసిద్ధమైందా?" అప్పుడే పెరట్లోనుంచి ముఖం కడుక్కొని తలగుడ్డతో ముఖం తుడుచుకుంటూ వస్తున్న కొడుకును ప్రశ్నించాడు అరవయ్యేళ్ళ మునయ్య.

"ఆఁ అయినట్టే."

"సీనప్పను రమ్మని సెప్పినావా?"

"ఆఁ చెప్పేసినా కానీ, వాళ్ళింకా రాలా."

సమాధానం చెప్పి ఇంట్లోకి వెళ్ళిపోయాడు మునయ్య కొడుకు ముప్పయ్యేళ్ళ మునిరత్నం.

ఆ ఇంటిల్లిపాదీ ఆ ఇంట్లో చిన్న పిల్లలకు పుట్టెంటికలు తీయడానికి చేస్తున్న మునిదేవరోత్సాహంలో మునిగిఉన్నారు.

మునిదేవరకు వచ్చే బంధువులందరూ అప్పటికే వచ్చేశారు. రెండు రోజుల ముందుగానే ఆ గూడమిద్దె గోడలకు పెచ్చులు పూడ్చి, సున్నం కొట్టి, గడపలకు, అరుగులకు ఎర్రమన్ను పట్టెలు తీశారు. ఆరోజు ఉదయానికంతా ఇంటిని కడిగి పేడతో అలికి, ఇంటి ముందర కళ్లాపి చల్లి, ముత్యాల ముగ్గులు వేసి, ద్వారబంధాలకు మామిడి తోరణాలు కట్టి అలంకరించారు. ఆవేళ ఆ ఇల్లు తాజాదనంతో, ఒంటినిండా అలంకరించుకొని పేరంటానికి తయారైన ఇంటి ఇల్లాలి మాదిరి కళకళలాడుతోంది.

ఇంటి ముందర కాస్త పెరటివైపునకు, నీడకోసం టెంకాయ కీతుల్తో పందిరి వేశారు. ఆ పందిరి కింద వేసిఉన్న చాపలపైన కూర్చొని వచ్చిన బంధువులు పిచ్చాపాటీ మాట్లాడుకుంటుంటే, ఆడవాళ్ళు ఇంటి పల్లో మునిగిఉన్నారు.

పెరట్లో రెండు నీళ్ళ తొట్ల కవతల ఎత్తుగా పెరిగిన రెండు బొప్పాయి చెట్లు రామలక్ష్మణుల్లా ముచ్చటగా కనిపిస్తున్నాయి. ఆ రెండింటిలో ఒక చెట్టు నిండుగా పూత వేసి ఉంటే, మరో చెట్టు నిండా కాయలు కాసి ఉంది. కాయలు కాసి ఉన్న చెట్టుకు ఓ నల్లటి మేకపోతు – కారు పిల్ల – కట్టివేయబడి ఉంది. ఆ చెట్లకవతలున్న మల్లె పందిరి నీడలో కూర్చొని నాలుగో క్లాసు చదువుతున్న మునిరత్నం కొడుకు మునిరాజు, మునిలక్ష్మి కూతురు అయిదేండ్ల చిన్నబిడ్డ అచ్చనకాయలాడుకుంటున్నారు.

ఇంటి ముందర కూర్చొని వాళ్ళనే మురిపెంగా చూస్తోన్న మునిలక్ష్మి "వీళ్ళిద్దరికీ ఇట్టే పెండ్లయిపోతే ఎంత బాగుండునో ఓ పినంతాస్తి దానికంతటికీ ఏకైక వారసుడు మునిరాజిగోడే. ఈ ఆస్తినంత ఊరోళ్ళెందుకనుభవించాల? తింటే నా బిడ్డే తినాలా" అనుకుంది.

అయిదేండ్లప్పుడు పెండ్లయ్యి, చిన్న బిడ్డ పుట్టిన సంవత్సరానికంతా టు అడ్రస్ లేకుండా వేసిన చోటుకే తిరిగొచ్చేసిన పోస్టు లెటర్‌లాగా పుట్టింటి కొచ్చేసిన ఆ ఇంటి ఏకైక ఆడపడుచు మునిలక్ష్మి.

"ఏమమ్మణ్ణీ, ఇంట్లో అన్నీ సిద్ధమేనా?" ఇంట్లో నుంచి పందిరికిందికి వచ్చిన మునిరత్నం చెల్లెల్ని అడిగాడు.

"అన్నీ సిద్ధమే అన్నా... వదినా నువ్వూ రెడీగావల్ల అంతే" అంది మునిలక్ష్మి.

"ఏమయ్యా మునిసుందరయ్యా, మీ వంగిశములో అందరికీ పేరు ముందర ముని ముని అంటా పెట్టుకుంటారెందుకు?" పందిరి కింద కూర్చోనున్న మునయ్య అన్న ముని సుందరయ్యను మరో బంధువు అడిగాడు.

"ఎందుకేముండాదబ్బా. మాకు ముందేవరుండాదిగదా. అట్ట ముందేవరుండే వోళ్ళంతా మునీస్పుడి పేరొచ్చేట్టిగా బిడ్డలకు పేర్లు పెట్టుకోవాల. ముందేవరజేసి వోళ్ళకు పుట్టింటికలు దీయాల." వివరించాడు. మునిసుందరయ్య.

"ఓహో! అందుకేనా మునిరత్నం, మునిసుబ్బరమణ్యం, మునిరాజు, మునిలచ్చిమి, మునెంగటప్ప అంటూ పేర్లు బెట్టుకున్నారూ?" అంటూ తల వంకించాడా బంధువు.

"సరే ఉండబ్బా! మళ్ళా వస్తా" అంటూ పెరట్లోకి లేచొచ్చాడు మునిసుందరయ్య.

"ఏం పెదనాయనా, కూసోకుండా ఇట్టొస్తివి?" పెరట్లో నిలబడి ఉన్న మునిరత్నం అడిగాడు.

"యాడబ్బా! పది గంటలుగాలా. అప్పుడే పందిరికింద ఉక్కబోస్తా ఉంది" అంటూ బొప్పాయి చెట్లను పరిశీలిస్తూ... కాయలు కాయని చెట్టును చూసి "ఔరా రత్నా, ఈ పందిరి చెట్టు కాయలు గాయదా ఏమీ?" అన్నాడు.

"ఏమో, కాయలు కాయలేదు పెదనాయనా! పూత సూదు యట్టుండాదో సచ్చినోడి కండ్లు చారడనీ తీగెలు తీగెలుగా జానెడు పొడవుతో" అన్నాడు మునిరత్నం.

"అయితే, అది మగసెట్టబ్బా!"

"మగసెట్టా! అయితే ఏంజేయాల?"

"చేసేదేముండాదీ? వొగ కొడవలెత్తుకోని అట్టకాయలు గాయని మగ సెట్టుమ బూతులు తిడతా, కాయలు కాస్తావా నరికేస్తున్నా కాస్తావా నరికేస్తునా అంటూ మూడుసార్లు అని, మూడుసాట్ల గాట్లు పెడితే, ఆ భయానికి చెట్టు కాయలు కాస్తుందంటారు."

"అట్టనా? అయితే, మచ్చు కొడవలిస్తాగానీ, ఆ పనేదో నువ్వే సెయ్యి పెద్ద నాయనా! ఆడికీ కాయలు కాయకపోతే ఆ తర్వాత నరికేస్తా. కాయలు కాయకపోతే

ఇంటెనకెందుకు దండగ." ఇంట్లోకి వెళ్ళి ఓ మచ్చుకత్తి తీసుకొచ్చి ఇచ్చాడు మునిరత్నం.

దాన్ని తీసుకొని ముని సుందరయ్య చెట్టు దగ్గరకు వెళ్ళాడు. వెళ్ళి కొడవలి పైకెత్తి "రుడపాతిక (ఎందుకూ పనికిరాక రుణం తీర్చుకోవడానికే పుట్టినది) చెట్టా! కాయలు కాయమంటనే నీయబ్బడాలా? కొజ్జాముండా! ఈసారి గనక కాయలు కాయకపోయినావో... నిన్ను నిలువునా నరికేస్తున్నా! కాస్తావా? నరికేస్తునా? కాస్తావా? నరికేస్తునా! కాస్తావా? నరికేస్తునా?" అంటూ మూడుసార్లు నరికినట్టు నటించి చెట్టుపైన మూడు గాట్లు పెట్టాడు ముని సుందరయ్య. కన్నీరు కారుస్తున్నట్లుగా గాట్లు పడినచోట చెట్టు నుంచి తెల్లటి పరింది పాలు బొట్లు బొట్లుగా కారసాగాయి.

ఆ దృశ్యాన్ని చూసిన మునిలక్ష్మి మనసులో దేవురించినట్లయింది.

"ఏం లోకమిది? మగోడు సంతానానికి పనికిరాడు అని తెలిసినా రెండో పెండ్లి చేసుకోడానికైనా సిద్ధపడతారు. ఆడదానికి బిడ్డలు పుట్టకపోతే మాత్రం గొడ్డుదానా, గొడ్డుబోతుముండా అంటూ నానా రకాలుగా ఆడిపోసుకుంటారు. పనికిరాని వస్తువు మాదిరి సూస్తారు. ఈ మాదిరిగానే మొగోడికి బిడ్డల్ని కనే శక్తిలేకపోతే నరికేస్తా నరికేస్తానంటూ బెదిరించగూడదా! ఆడికీ ఫలితం లేకపోతే ఆ చెట్టు లాగానే నిలువునా నరికెయ్యరాదా? మడిసికో న్యాయమూ, మగసెట్టుగో న్యాయమా? మగాడికో న్యాయం ఆడదానికో న్యాయమా?" పరపరివిధాలా ఆలోచించసాగింది.

☆ ☆ ☆

నిజానికి అందరి ఆడపిల్లల్లాగానే పుట్టింట్లో అల్లారుముద్దుగానే పెరిగింది మునిలక్ష్మి. మంచీ చెడూ గ్రహించలేని వయసులో ఇంటర్ ప్యాసవగానే ఆమెను వెదుక్కుంటూ వచ్చింది మనువు. ఒకడే కొడుకు. పైగా, మునిసిపల్ ఆఫీసులో అకౌంటెంట్. ఆ పైన అందగాడు పెళ్ళికొడుకు. ఉద్యోగస్థులే కాదు, స్కూల్ఫైనల్ గట్టెక్కిన కుర్రాడే లేని ఆ పల్లెకి ఉద్యోగస్థుడైన అల్లుణ్ణి తెచ్చుకోవడం ఘనకార్యంగానే భావించాడు మునయ్య. ఆ ఊర్లోకంతా కాస్త స్థితిమంతుడనిపించుకున్న మునయ్య ముప్పయ్ వేలు కట్నం పోసి, అన్ని లాంఛనాలతో ఘనంగానే అత్తారింటికి పంపించాడు మునిలక్ష్మిని.

అత్తగారింట్లో మునిలక్ష్మి కాపురం రెండేండ్లు సజావుగానే సాగింది. కాని, మునిలక్ష్మి కడుపు మాత్రం పండలేదు. ఎన్నో నోములు నోచింది. ఎందరి దేవుళ్ళకో మొక్కుకుంది అయినా, ఫలితం లేకపోయింది. దాంతో "ఈ గొడ్డుముండను కట్టుకోబట్టే కదా ముంగిట్లో చిన్న పిల్లలు దోగాడంది" అంటూ సాధించడం మొదలుపెట్టింది అత్త. "ఈ గొడ్డుబోతుని కొడుక్కి కట్టబెట్టబట్టేకదా నా వంశం నిర్వంశం అయిపోయేట్టుగా ఉండాది. నా వంశం ఈడితో కడయిపోయేట్టుగా ఉండాదే" అంటూ అంగలార్చసాగాడు మామ. దానికి తోడు కట్నం తక్కువిచ్చారనీ, పిల్లలు పుట్టని ఆమెను ఎలాగో ఓలాగు పుట్టింటికి పంపేసి, కొడుక్కి మరో పెండ్లి చేయాలనీ, అదుకోసం ప్రయత్నాలు ప్రారంభించారు ఆమె అత్తమామలు. తల్లితండ్రుల మాట జవదాటని ఆమె భర్త వెంకటమునీ వాళ్ళతో కలిసిపోయాడు.

మునిలక్ష్మి ఆ విషయం తల్లితండ్రులకు చెప్పుకొని వాపోయింది. కూతురి బాధ చూసి మునయ్య ఎలాగో అల్లుణ్ణి ఒప్పించి, ఇద్దర్నీ పట్నం తీసుకువచ్చి పేరుగాంచిన డాక్టర్లదగ్గర చూపించాడు. డాక్టర్లు ఇద్దర్నీ పరీక్షించి ఎన్నో టెస్టులు చేయించారు. మునిలక్ష్మికి ఏ లోపమూ లేదనీ, పైగా ఫెర్టిలిటీ కూడా చక్కగా ఉందనీ చెప్పారు. ఎటొచ్చీ, ఆమె భర్త వెంకటముని సెమన్‌లో వీర్యకణాల సంఖ్య చాలా తక్కువనీ, ఉన్న అవైనా చాలా నిర్వీర్యంగా ఉన్నాయనీ డాక్టర్లు తేల్చి చెప్పేశారు. అతనికి జీవకణాల కౌంటింగ్ పెరిగి, ఆరోగ్యకరమైన వీర్యకణాలు రావడానికి ఏవో కొన్ని టానిక్కులు, మందులు రాసిచ్చి, వాడమన్నారు. అప్పటికీ ప్రయోజనం లేకపోతే ఇక అంతే అన్నారు. దాంతో వెంకటముని ఖంగుతిన్నాడు. ఈ విషయం ఇతరులకు తెలియకుండా జాగ్రత్తపడ్డాడు.

ఎలాగైతేనేం చివరికి ఆమె కలలు, నోచిన నోములు ఫలించాయి. ఆమె కడుపు పండింది. ఆడబిడ్డ పుట్టింది. మునిలక్ష్మికి సంతానం లేనిలోటు తీరిపోయి గొడ్రాలన్న అపవాదు తొలగిపోయింది గానీ, మరో కొత్త సమస్య తలెత్తింది. వంశాన్నుద్ధరించే మగపిల్లవాణ్ణి కనకుండా ఎవరితోనో పడుకొని బిడ్డను పుట్టించుకుందని కొడుక్కి నూరిపోశారు. ఇంకేముంది? అగ్గికి ఆజ్యం పోసినట్లయింది. అత్తమామల్తోపాటు మగడు రాచిరంపాన పెట్టసాగాడు. అతనూ స్వార్థానికి బానిసైపోయాడు. వారి అనుమానమే పెనుభూతమైపోయి ఆమె జీవితాన్ని కబళించివేయసాగింది. అందరూ కలసి మునిలక్ష్మిని ఈ పొయ్యిలో పెట్టి, ఆ పొయ్యిలో తీయసాగారు. మునిలక్ష్మి వాళ్ళు పెట్టే బాధలు భరించలేక 'ఈ మొగుడు లేకపోతే ఏం? ఇట్టాంటి మొగుడు లేకపోయినా బాగుండు. నాకు ఈ పీడ ఎప్పుడు విరగడౌతుందో, ఈ నరకం నుంచి తనెప్పుడు బయటపడతానో' అని ఎదురు చూడసాగింది. ఆమె అలా అనుకున్న కొద్దిరోజులకే నానా తిట్లుతిట్టి, తన్ని తగలేసి, పుట్టింటికి పంపేశారు.

ఆ తర్వాత వెంకటమునికి అతని తల్లితండ్రులు పెళ్ళి ప్రయత్నాలు సాగించారు. ఎలాగైనా సరే కొడుక్కి మారు మనువు చేసి తిరిగి ఎక్కువ కట్నం పొందాలని చూశారు. కానీ, వాళ్ళ ప్రయత్నం ఫలించలేదు. గుణవతి, సంస్కారవతి అయిన మునిలక్ష్మినే, అదీ ఒక బిడ్డ పుట్టింతర్వాత తన్ని తరిమేశారనీ, అలాంటిది ఏ ఆడకూతుర్నిచ్చినా అలాగే చేస్తారనీ ఆడపిల్లల తల్లితండ్రులు భావించారు. చూసి చూసీ తమ కూతుర్ని బలిపెట్టడానికి ఎవ్వరూ ఇచ్ఛగించలేదు. వాళ్ళ ప్రయత్నాలు ప్రయత్నాలుగానే మిగిలిపోయాయి.

రోజులు గడిచిపోతూనే ఉన్నాయి. ఇల్లు చేరిన ఆడబిడ్డను చూసి మునయ్య ఏమీ బాధపడలేదు. తన అనంతరం ఎట్లో, ఏమో అనుకొని ఆమె రక్షణార్థం కొంత ఆస్తిని ఆమె పేరుతో రాసిపెట్టేశాడు. ఈ నేపథ్యంలో మునిలక్ష్మి పట్టుబట్టి టైప్‌రైటింగ్ కూడా నేర్చుకుంది. మునయ్య ఎన్నో తంటాలు పడి పంచాయతీ ఆఫీసులో టైపిస్టుగా ఉద్యోగం కూడా సంపాయించి పెట్టాడు. ఆ తర్వాత నిశ్చింతగా గాలి పీల్చుకున్నాడు.

తన కాళ్ళపైన తాను నిలబడింది మునిలక్ష్మి. పంచాయతీ సమితి ఆ పల్లెకి కిలోమీటరు దూరంలోనే ఉండడంతో రోజూ ఆఫీసుకి పోయి వస్తోంది.

కూతుర్ని కూడా అక్కడే కాన్వెంట్‌లో చేర్పించి చదివించసాగింది.

ఈ విషయం తెలుసుకున్న వెంకటమునికి ఆమె జీతంపైనా బిడ్డ పేరుతో, భార్య పేరుతో ఉన్న ఆస్తులపైనా ప్రేమ ఎక్కువ కాసాగింది.

తాను తప్పు చేశాననీ, ఈసారి ఏలోటూ లేకుండా మునిలక్ష్మిని చూసుకుంటాననీ రాయబారాలు మొదలెట్టాడు. ఎలాగైనా సరే ఆమెను తిరిగి ఇంటికి రప్పించుకొని, ఆమె ద్వారా వచ్చే ఆదాయాన్ని పొందాలని శతవిధాలా ప్రయత్నించాడు. కానీ, మునిలక్ష్మి దేనికీ స్పందించలేదు. తిరిగి సంసారాన్ని దిద్దుకునే అవకాశం వచ్చింది, ఒప్పుకోమని ఆమె తల్లితండ్రులు ఒత్తిడి తెచ్చారు. అన్నావదినలు, అయినోళ్ళు, అమ్మలక్కలు ఎందరో చెప్పి చూశారు. కానీ, మునిలక్ష్మి చలించలేదు. ససేమిరా ఒప్పుకోనంది. అయినా, వెంకటముని తన ప్రయత్నాలు మానలేదు.

☆ ☆ ☆

"ఇంక లెయ్యండమ్మా, గంపలెత్తుకోని గాలిసెట్టు కాడికి పోవాల" అన్న మునిరత్నం పిలుపుతో ఇహంలోకొచ్చింది మునిలక్ష్మి.

గతం గుర్తుకువచ్చి చెమ్మగిల్లిన కళ్ళను పైటతో తుడుచుకుంటూ ఇంట్లోకడుగు పెట్టింది. అక్కడ నట్టింట దీగూట్లో నూనె దీపం నిశ్చలంగా వెలుగుతోంది. దాని కింద, నేలపైన ఆవు పంచితంతో అలికిన గంప, అందులో సగంవరకు బియ్యం, కూరకు కావాల్సిన మసాలా దినుసుల పొట్లం, రెండు కొబ్బరి కాయలు, పూలు, మొగలిరేకులు, పసుపు, కుంకుమ, అగరొత్తులు, కర్పూరం, విభూతి ఉండలు వంటి పూజాద్రవ్యాలు, ఒక వేట కొడవలి పెట్టి ఉన్నాయి.

మునిరత్నం కొబ్బరికాయ కొట్టి, కర్పూరం వెలిగించి, 'సామితల్లీ... మునీస్పుడా మా పిల్లల్ని కలకాలం నువ్వే సల్లంగ కాపాడకరావల్ల. వాళ్ళసంతు వెయ్యి సంతులు గావాల. వాళ్ళకు సకలము గలిగీ సంతోషించాల' అంటూ మనసులోనే మొక్కుకుని హారతి పట్టాడు. ఇంట్లో వాళ్ళందరూ హారతి కళ్ళకద్దుకున్నారు.

మునిసుందరయ్య వీధిలోకి వెళ్ళి. "వారే, ముందేవరోళ్ళు వస్తావుండారు. దూరం పోండి. మల్లేదన్నా సెబ్బర జరిగితే నింద మామింద పెట్టొద్దండే" అంటూ గట్టిగా కేకేశాడు.

శీనప్ప మెడకు డోలు తగిలించుకుని మోస్తూ డుబ్ డుబ్‌మంటూ డోలు కొడుతుంటే, అతని కొడుకు కొండయ్య తుఁ తూఁ... తుఁ తూఁ అంటూ మేళం వాయించసాగాడు. ఆ శబ్దం విన్న వీధిలోని జనం దూరంగా తప్పుకున్నారు. మునిరత్నం గంపనెత్తుకుని ముందు బయలుదేరాడు. అతని వెనుక మేకపోతును పట్టుకొని మునయ్య, అతని వెంట పిల్లల్ని వెంటబెట్టుకొని ఆ ఇంటిల్లిపాదీ బయలుదేరారు. వాళ్ళవెంట బంధువులు నడవసాగారు. మంగళ వాద్యాలు ముందు, వాళ్ళవెంట వీళ్ళు.

కొద్దిక్షణాల్లోనే వాళ్ళు ఊరికుత్తరానుండే వాళ్ళ మామిడి తోటకు చేరుకున్నారు.

అది వసంత ఋతువు కావడంతో చిగుళ్ళు వేసి, పూతపూసిన మామిడి చెట్లతో, కొన్ని చింతచెట్లతో అక్కడ వాతావరణం చల్లగా ఉంది. ఉండి ఉండి

కుహూ... కుహూ అంటూ కూసే కోకిలల గానం, ఆ చెట్ల నుంచి వీస్తున్న కమ్మటి గాలి. ఎంతో హాయిగా, మనోహరంగా అనిపిస్తోంది.

ఆ తోటలో ఈశాన్య మూలనున్న వ్యవసాయపు బావి, దాని గట్టున రకరకాల చెట్లుచేమలు గుబురుగా ఉన్నాయి. ఆ బావి గడ్డకు కొంత దూరంలో తోట మధ్యన ఓ పెద్ద ఊడగ చెట్టు ఎత్తుగా, పొడవుగా కనిపిస్తోంది. ఆ చెట్టు కాండంతో కలిసిపోయి మరో మామిడి చెట్టు, మర్రి చెట్టు నీడన పెరగలేక పెరిగిన తుప్పచెట్టులా పీలగా కనిపిస్తోంది. ఆ చెట్టు మొదట్లో మూరెడెత్తున్న పుట్ట, ఆ పుట్ట కోమలకానించి జానెడెత్తుతో శివలింగం మాదిరున్న ఓ నల్లరాయి. అదే మునిదేవర. ఆ చెట్టే గాలి చెట్టు.

ఆ గాలి చెట్టుకు కొంత దూరంలో ఉన్న ఓ పెద్ద మామిడి చెట్టు కింద గంప దించాడు మునిరత్నం. వచ్చిన వాళ్ళందరూ ఆ చెట్టు కిందనే కూర్చున్నారు. అక్కడే ఓ కంప చెట్టుకు మేకపిల్లను కట్టేశాడు మునయ్య. మునిసుందరయ్య, మునిరత్నం రంగంలోకి దిగారు. ఆ చెట్టు చుట్టూ, ఆ పుట్ట ముందరా పెరిగిన గడ్డీ గాదం పారతో చెక్కేసి, నీళ్ళు చల్లి, చదరం చేశారు. జయమ్మ పేడతో పుట్ట ముందర అలికితే, మునిలక్ష్మి ముగ్గులు పెట్టింది.

మగాళ్ళిద్దరూ కలిసి ఆ రాయిని నీళ్ళతో కడిగి, పసుపు అద్దిన గంధంతో తుడిచారు. మునీశ్వరుడు మహాశివుడి వీరభద్రావతారంగా భావించే కోపిష్టి దేవత కాబట్టి, పూసిన గంధం ఆరిన తర్వాత ఆ శిలకు విభూతి రేఖలు దిద్ది, మధ్యన త్రినేత్రంలా గంధం బొట్టు పెట్టారు. రకరకాల పూలతోను, మొగలి రేకులతోను శిలను అలంకరించారు. ఆ తోటలోనే ఓ మూల పెరిగి ఉన్న మారేడు చెట్టునుంచి కొన్ని మారేడు ఆకుల్ని కోసి తెచ్చి ఆ శిలపైన పెట్టారు.

ఇంకోవైపున మామిడి చెట్టు కింద ఆడవాళ్ళు మూడు రాళ్ళు పొందించి అప్పుడే వంట ప్రయత్నాలు మొదలుపెట్టారు ఇంకో ఇద్దరు ఆడవాళ్ళు. తోట మధ్యలో ఉన్న బండమీద తెల్లగడ్డలు, గసాలు, చెక్క, లవంగాలు వంటి మసాలా దినుసులు వేసి కారం నూరసాగారు. కొందరు పిల్లలు మరో మామిడి చెట్టు కొమ్మకు చేంతాళ్ళు కట్టి ఉయ్యాలలు ఊగుతున్నారు. ఆ వేళ వాళ్ళు వన విహారానికి విచ్చేసినట్లు సందడిగా, సంతోషంగా, ఉత్సాహంగా ఉన్నారు.

యజ్ఞకుండం దగ్గర యూపస్తంభానికి కట్టివేయబడి ఉన్న యజ్ఞ పశువులా మేకపిల్ల అమాయకంగా కంప చెట్టు చిగుళ్ళను ఆబగా కొరికి మేయసాగింది.

"ఏమన్నో శీనన్నో... మీరు కానీ..." అంటూ కేకేశాడు మునిరత్నం. శీనప్ప కూర్చున్నవాడు కూర్చున్నట్లే డోలు ముందరుంచుకొని ఢోలు కొడుతూనే, మరో వైపున నోటితో మేళం కూడా ఊదసాగాడు. కొండయ్య పిర్ర కింద రాయి వేసుకొని కూర్చొని, గిన్నెలో నీళ్ళు పోయించుకొని పాదిని తెరచి కత్తి నూరుతూ, "ఇంక రాండన్నో" అంటూ పిలిచాడు. మగవాళ్ళు ఒకరొకరే వెళ్ళి కొండయ్య ముందర కూర్చొని గెడ్డాలు గీయించుకోసాగారు. చివరన మునిరాజును, చిన్న బిడ్డను కూర్చోబెట్టి శుభ్రంగా గుండు గీయించేశారు. కొండయ్య అడపం పెట్టెను మూసేసి తండ్రి చేతిలో నుంచి మేళం అందుకొని ఊదసాగాడు.

గొరిగేసిన పిల్లల జుట్టులో నుంచి కొన్ని వెంట్రుకలు తీసుకొచ్చి కాసులు జతచేసి పుట్టకోమలో వదిలేశాడు మునయ్య. బావిలో నుంచి తెచ్చిన నీళ్ళతో పిల్లలిద్దరికీ స్నానాలు చేయించి కొత్త బట్టలు వేసి దేవుడి ముందర కూర్చోబెట్టి, కొబ్బరి కాయలు కొట్టి హారతిచ్చారు. అందరూ లేచివచ్చి హారతి కళ్ళకద్దుకున్నారు.

మునిలక్ష్మి కూడా హారతి కళ్ళకద్దుకొని "నా సంసారం బాగుండుంటే, ఆయనే ఈ ముందేవరచేయించాల్సినోడు" అనుకుంది. ఆమె మనసులో అలా అనుకుందో లేదో, సరిగ్గా అప్పుడే అక్కడ ప్రత్యక్షమయ్యాడు ఆమె భర్త వెంకటముని.

భార్యను పుట్టింటికి పంపేసిన నాలుగేళ్ళ తర్వాత కనిపిస్తున్నందుకు మనసులో నొచ్చుకున్నా, మునయ్యా, మునిరత్నం ముభావంగానే పలుకరించారు.

నానా హింసలు పెట్టి, ఇన్నేండ్లు వదిలేసినందుకు ఉక్రోషంతో మునిలక్ష్మి మౌనంగానే ఉండిపోయింది. కూతుర్ని దగ్గరికి పిలిచి ఎత్తుకొని ముద్దాడడానికి ప్రయత్నించాడతను కానీ, చిన్నబిడ్డ అతన్నుంచి తప్పించుకొని వచ్చేసింది. అతని వాలకం చూసిన మునిలక్ష్మికి ఆశ్చర్యం వేసింది.

"ఒకప్పుడు ఇది ఎవడికో పుట్టిందని నిందలేసి పుట్టింటికి తరిమేసి, ఇప్పుడు మళ్ళా తగుదునమ్మాంటూ బిడ్డను ఎత్తుకొని ముద్దాడేదానికి సిగ్గులేదు. ఏమ్మనోళ్ళో ఏమో" అనుకుంది.

కూతురు తన దగ్గరకు రానందుకు వెంకటముని మనసు చివుక్కుమంది. ఆ తర్వాత మేకపోతును తీసుకొచ్చి, గాలిచెట్టు చుట్టూ మూడు చుట్లు తిప్పి పుట్టకెదురుగా నిలబెట్టారు. కొండయ్య వేటకొడవలి తీసుకొని పైకెత్తి 'కిలిలిల్లో' అంటూ ఓ కేక వేసి ఒకే వేటుకు దాని తలను నరికేశాడు. చివ్వున చిమ్మిన దాని రక్తం వేలితో అద్ది, పిల్లల నొసటన బొట్టు పెట్టాడు మునయ్య. ఆ తర్వాత మేకపోతు శరీరాన్ని చెట్టుకొమ్మకు తలకిందులుగా వేలాడదీసి, దాని చర్మం ఒలిచి, శరీరాన్ని ముక్కలు ముక్కలుగా కోసి, వండి, వచ్చిన వాళ్ళకంతా వడ్డించి ఆరగించేశారు. అందరూ హాయిగా భోంచేసి, ఆ మామిడి చెట్టుకిందనే కూర్చున్నారు. కమ్మటి సువాసనల్ని మోసుకొస్తూ ఓ గాలి తెమ్మెర వాళ్ళను సుతారంగా స్పృశించి వెళ్ళిపోయింది. ఓ మూల నుంచి కూస్తున్న కోకిల గొంతు కమ్మగా వినిపిస్తోంది. వెంకటముని చాలా రోజుల తర్వాత సుష్టుగా భోంచేసి, మౌనంగా కూర్చోనున్నాడు. తాను వచ్చిన విషయం ఎలా ప్రస్తావించాలో తెలియక అతని మనసు మల్లగుల్లాలు పడసాగింది. సరిగ్గా అప్పుడే అతని సమస్యను గమనించినట్లు, "ఏమబ్బా వెంకటమునీ, ఇన్ని దినాలకు భార్యబిడ్డలు గుర్తుకొచ్చినారా?" అంటూ పలుకరించాడు ఓ బంధువు.

"ఏదో జరిగిపోయింది సినాయనా! సంసార మన్నాక ఎన్నో వస్తావుంటాయి, పోతావుంటాయి. అప్పటికీ నాదేం తప్పులే. అయినా, మళ్ళీ తీసుకపోదామనే వస్తి" అన్నాడు వెంకటముని. తప్పంతా నాదేనన్నట్లు మాట్లాడేదానికి అయప్పకు నోరెట్లా వస్తావుంది అనుకుని మధనపడసాగింది మునిలక్ష్మి.

"ఆఁ ఏమీలే. ఈ బిడ్డకుద్యోగమొచ్చె. వరుంబడే పెరిగె. పైగా అయమ్మ పేరుతో అస్తుండె. బిడ్డ పేరుతో దుడ్డుండెపాయ. వాటికోసరం వచ్చిండాడులే."

"అంతే అయ్యుంటుంది. లేకుంటే ఇప్పటికి గుర్తుకొచ్చినారా పెండ్లాంబిడ్డలు?" వెనక కూర్చోనున్న ఇద్దరు గుసగుసలాడారు.

"ఉన్నన్ని దినాలూ బంగారట్ల బిడ్డెను రాసిరంపాన పెట్టి తరిమేసిందిగాక, ఇంకా నన్ను సూడు సినాయనాంట ఊగులాడించుకుంటూ వచ్చినాడబ్బా బిడ్డను తీసుకోపోయేదానికి."

"వాడి మొగం, సూడు వొట్టి అంబేద మొగం. రుణపాతిక కొడుకు." మరో పెద్దాయనా వాళ్ళతో గుసగుసలాడుతూనే రుసరుసలాడాడు.

ఆ మాటలు అరకొరగా అతని చెవుల్లో పడుతున్నా వినబడనట్లే ప్రవర్తించాడు వెంకటముని. తినిపారేసిన మెతుకులకోసం, ఎముకలకోసం ఎంగిలాకుల్ని ఆశ్రయించిన కుక్కలు రెండు కొట్లాడుకుంటుంటే, కొన్ని కాకులు కావుకావుమంటూ అరవసాగాయి.

"ఏమబ్బోడా! ఇంతకూ నువ్వేమంటాండావు?" ప్రశ్నించాడు మునిసుందరయ్య.

"ఏమండ్లా మామా, నా పెండ్లాం బిడ్డల్ని తీసుకపోతా అంటావుండా." చెప్పాడు వెంకటముని.

"ఇప్పుడు ఇన్ని దినాల తర్వాత మళ్ళా తీసుకపొయ్యి, అయమ్మను సక్రమంగా చూస్తావని గ్యారంటీ ఏముండాదబ్బా నీదగ్గర?" మధ్యలో కల్పించుకుంటూ అడిగాడు మునయ్య.

"లేదు మామా! అప్పుడేదో పొరబాటైపోయింది. ఇంగమీదట అట్ట జరగదు. మీ బిడ్డను పువ్వుల్లో పెట్టుకోని సూసుకుంటా." భరోసాగా అన్నాడు వెంకటముని.

"ఏమోబ్బా! నీ సంసారం బాగు సేసుకుంటానంటే... మేమేమనేదానికుండాది? కానీ వొగమాట."

"ఏంది?"

"కన్నోళ్ళకు బిడ్డేమీ భారంగాదు. ఆమాట గ్యేవనానికి పెట్టుకో."

"మీరింతగా సెప్పాల్నా... మీకేం భయంలేదు. ఈసారి బాగానే సూసుకుంటా, నాతో పంపిచెయ్యండి మామా!"

"పంపించేదానికి మేమెవ్వురబ్బా? కనిచ్చేసినాము. ఇచ్చేసినాంక అది మీ సొత్తు. వస్తే తీసకపో."

"అట్లగాదు మామా, నువ్వు సెప్పు." అర్థించాడు వెంకటముని. అతని నక్కవినయాల్ని చూసి ఆశ్చర్యపోయింది మునిలక్ష్మి. అందరూ మౌనంగా సంభాషణ వినసాగారు.

"ఏమమ్మా! ఇంటికివిగదా, పోతావా?" అన్నాడు కూతుర్ని చూసి మునయ్య. మౌనంగా ఉండిపోయింది మునిలక్ష్మి.

"అయప్పే దిగొచ్చి అడిగినాంకా, నువ్వు పంతానికి పోవద్దు బిడ్డా! నీ జీవితం బాగుపరుచుకో తల్లీ!" అంది మునిలక్ష్మి తల్లి ఆదెమ్మ.

"అవునమ్మా, వచ్చిన అవకాశం వదులుకోవద్దు." అన్నారు అన్నావదినెలు.

"బాగా యోచ్చన జేసి సెప్పమ్మా!" అన్నాడు సుందరయ్య.

"ఏంది పెద్దనాయనా, సెప్పేది? అడికి పోయ్యి అత్తామామల హింస నేను భరించలేను. ఇబ్బుడేమో ఇట్టే అంటాడు. ఆ తర్వాత ఈ ముండమొగుడి దగ్గిర దినమ్మా పిడిగుద్దులు తినలేను. లంజా లవకా అంటా గబ్బు కూతలు వినలేను." కచ్చితంగా చెప్పేసింది మునిలక్ష్మి.

"అదిగాదమ్మా... నీ సంసారం..." ఇంకా ఏదో చెప్పబోయాడు.

"వద్దు పెద్దనాయనా, చెప్పొద్దు. ఆయప్ప ఎందుకొచ్చిండేదీ నాకు బాగా తెలుసు. మన దేవుడి సత్తెం మనకు, మనకు తెలీకుండా ఉంటుందా? నామింద, నా బిడ్డమింద మమకారం పుట్టుకొచ్చి కాదు ఆయప్పొచ్చిండేది. ఇంక నా సంసార మంటావా? 'మేము కలిసుండాము, మా మద్దెన ఏ పొరపొచ్చాలూ లేవు' అంటూ లోకాన్ని నమ్మించేకోసరం. మనసు విరిచేసిన ఈ మొగోనికి, ఆయన్ను కన్నోళ్ళకీ జీవితాంతం ఊడిగం చెయ్యలేను. ఆ ఉత్తుత్తి సంసారం నాకొద్దు. నేతిబీరకాయలో నెయ్యి లేనట్లే, అట్టాంటి సంసారంలో సుఖముండదు. లోకం మెప్పుకోసం మనసు సంపుకొని నేను నటించలేను." కొట్టినట్టు చెప్పేసింది మునిలక్ష్మి. ఆ మాటతో ఆపైన ఆమెకెవ్వరూ చెప్పలేకపోయారు.

"ఇదే నీ నిర్ణయమైతే, నాబిడ్డన్నాకిచ్చెయ్యి. నేనే సాక్కుంటా" అన్నాడు వెంకటముని. ఆ మాటతో తోకతొక్కిన త్రాచులా కస్సున పైకిలేచింది ఆమె.

"నీ బిడ్డ! ఇన్ని దినాలకొచ్చి ఇది నా బిడ్డ అంటే యట్టయితాదీ?" ధైర్యంగా నిలదీసి అడిగింది.

"నాకు పుట్టింది నా బిడ్డ గాదా? దానిపైన నాకు హక్కూ, అధికారం లేదా?" అతనూ ఆవేశపడిపోతూనే అడిగాడు. అందరూ మౌనంగా వింటూనే ఉన్నారు.

"ఆయప్ప సెప్పేది గూడా కొంచెం నాయమే గదమ్మా!" సర్ది చెప్పడానికి ప్రయత్నించాడు మునిసుందరయ్య.

"యట్ల పెద్దనాయనా నువ్వు సెప్పేది?" ప్రశ్నించింది.

"తల్లికే గాకుండా, పుట్టించినోడికీ అధోటే, హక్కు బిడ్డపైన ఉంటాయి గదమ్మా?..."

"ఆc... అట్ట గడ్డి పెట్టు..." వెటకారంగా అన్నాడు వెంకటముని.

దాంతో ఇంకా రెచ్చిపోయింది మునిలక్ష్మి. అన్ని రోజుల్నుంచీ తనలో దాచుకున్న అక్కసంతా ఆమె గుండెలోనుంచి గొంతులోకి తన్నుకొచ్చేసింది.

"అంతేలే పెదనాయనా. మీరంతా మొగోళ్ళేగాబట్టి అట్టంటారు. వొగతూరి నా స్థానంలోకి వచ్చి మాట్లాండండి తెలస్తాది. పుట్టించినోడికి అధోటె, హక్కు ఉండదా అంటివీ గదా? సూడు పెదనాయనా! ఈ గాలిసెట్టునే సూడు. గాలి సెట్టంటే ఏంది? అసలు ఈ ఊడగసెట్టు గాలిసెట్టు ఎట్టయింది?

పచ్చులు నానా రకాల పండ్లు, కాయలు తినేసి యాడంటే అడ రెట్ట వేస్తాయి. రెట్టతోపాటు తిన్న పండ్లను, కాయల్ను అరాయించుకొని, గింజల్ని మాత్రం అట్టే వదిలేస్తాయి. ఆ గింజలు పడింపోటనే ఎండకు ఎండి, వానొచ్చినప్పుడు నాని మొలకెత్తుతాయి. ఆ మొలకే పెరిగి పెద్ద మానవతాది. అట్ట గాలికి పెరిగిన సెట్టునేగదా గాలిసెట్టు అంటా పిలస్తాం. ఆ గాలిసెట్టు తనవల్లనే పుట్టినా, ఆ పచ్చికే

ఎట్ల అధికార ముంటుంది దానిపైన? దాన్ని తన గర్భంలో దాచుకోని మొలకెత్తించి పెద్దదవడానికి కారణమైన భూమమ్మకేగదా దానిపైన అధికారం ఉంటుంది. అట్ల గాదంటే, ఆ భూమి యజమానికి గదా అధికారం, హక్కు ఉంటాయి? అంతేగానీ, పుట్టించిన ఆ పచ్చికి కాదుకదా! ఈ ఊడగ సెట్టుగూడా అంతే. ఇది ఏ కాకో ఏసిన రెట్టనుంచి మా తోటలో పడి గాలికి మొలకెత్తింది. గాలికి పెరిగింది, గాలికి పెద్దదై గాలిసెట్టయింది. అంతమాత్రాన ఇది ఆ పచ్చిదా... మా నాయన్నా? నా బిడ్డ విషయంలో గూడా అంతే. నా బిడ్డ ఈ గాలిసెట్టు మాదిరి నా ఒడిలో పెరిగింది. పెద్దదయింది. పుట్టించినోడు ఆ యప్పే అయినా, దానికి రక్తమాంసాలిచ్చి నవమాసాలు మోసి కనిపెంచింది నేను. అయినా, ఆయప్ప ఏనాడన్నా దాని అలానా పాలనా చూసినాడా? లేదే! దాని మంచీ సెబ్బరా పట్టించుకున్నాడా? లేదే! కాబట్టి నా బిడ్డపైన నాకే హక్కుండాది, అధికారముండాది. అడిగేదానికి ఆ యప్పకు అధోటీ లేదు. అంతే!" ఆవేశంతో ఊగిపోతూ చెప్పింది మునిలక్ష్మి.

ఆమె ఆవేశానికీ, వాక్ప్రవాహానికీ అక్కడి జనం కొట్టుకుపోయారు. అందులో ముద్దగా తడిసిపోయారు. ఆ ప్రవాహంలో వెంకటమునీ కొట్టుకుపోక తప్పలేదు.

ఎప్పుడూ అమాయకంగా, మౌనంగా కనిపించే మునిలక్ష్మిలో ఇంతటి దృఢ నిర్ణయం, ధైర్యం, తెగువ ఎలా దాగిఉన్నాయో తెలియక ఆశ్చర్యంలో తేలిపోయారు వాళ్ళు. కొన్నింటిని జీవితమే నేర్పిస్తుందన్న నిజాన్ని తెలుసుకోవడం వాళ్ళకు ఎంతోసేపు పట్టలేదు. ఇక లాభం లేదనుకుని లేచి అవమాన భారంతో మెల్లగా అక్కడినుంచి వచ్చేశాడు వెంకటముని. అందరూ అతను వెళ్ళినవైపే చూడసాగారు.

కాని, మునిలక్ష్మి మాత్రం గాలికి పుట్టి, గాలికి పెరిగిన గాలిచెట్టుగా పిలిచే ఆ ఊడగచెట్టునే చూస్తుండిపోయింది. ఆవేళ ఆమెకు ఆ చెట్టు ఇంకా ఎత్తుగా ఎదిగిపోయినట్టు, నిర్మలంగా, నిటారుగా, ఎంతో గొప్పగా అనిపించింది.

● *ఇండియా టుడే – 5 మే, 1998* ●

★ ★ ★

ముదిగంటి సుజాతారెడ్డి

102

# జవాబులేని ప్రశ్నలు

చీకటి పడ్తున్నది. సాయిలు బాయికాడి నుంచి వచ్చాడు. సోలుతూ వస్తున్న అతన్ని చూసి యాదమ్మ –

"తాగొచ్చిండ? ఏంది? ఇంక పొద్దు గూకననన్న లేదు!" అనుకుంది.

ఆ రోజు యాదమ్మ భర్త సాయిలుతో బాయికాడికి పోలేదు. ఇంట్లోనే వుంది.

సాయిలు సోలుతూ వచ్చి వాకిట్లో వున్న నులకమంచం మీద దబీమని పడిపోయాడు.

"ఏమైందయ్యా?" పరేషానయి ఉరికి యాదమ్మ భర్తను దగ్గరగా చూసింది.

సాయిలు నోట్లో నుంచి నురుగులు వస్తున్నాయి.

"పురుగు ముట్టింద ఏంది? మంత్రకాడు లింగన్నను తీస్కరా పోరా!" అని యాదమ్మ పెద్దకొడుకు వీరయ్యను తొందరపెట్టి తరిమింది.

"లింగన్నను నీతోటే తీసుకొని రారా! ఒస్తపా అంటె ఒదిలిపెట్టి రాకు. నీ వెంటబెట్టుకుని రా! బేగరా నాయిన!" అని యాదమ్మ మళ్ళ మళ్ళ చెప్పి తోలింది వీరయ్యను.

వీరయ్య లింగన్న ఇంటివైపు ఉరికాడు ఎక్కడ ఆగకుంట.

లింగన్న విషయం విని వెంటనే ఉరుక్కుంటు వచ్చాడు. సాయిలును దగ్గరగా వెళ్ళి చూశాడు.

"యాదవ్వ! ఇది పురుగు గాదు. సాయన్న పురుగుల మందు తాగిండు జల్ది కక్కవోయించు! బిరాన అవుసలి నారయ్యను పిల్వు" అన్నాడు లింగన్న.

"వీరన్న! పోరా! ఉరుకు! అవుసలి నారయ్యకు ఇసయం చెప్పి బిరాన పిల్సుకరా పో!" అంది యాదమ్మ కొడుకుతో.

చంటి పోరడు యాదమ్మ చంకలో కూర్చొని ఆమె రొమ్మును రెండు చేతులతో పట్టుకొని నోట్లో పెట్టుకొని పాలు తాగుతున్నాడు. అక్కడేమైతున్నదో అర్థ్నెల్ల నాగయ్య కేం తెలియడం లేదు. రొమ్ము లోంచి పాలు రాకపోయేసరికి రొమ్మును గుంజి గుంజి కొరుకుతున్నాడు.

"గీడెక్కడి పోరడే! నా పెయిల రగ్తమంత పీలుస్తుండు. పొద్దంత గిదే వనా! పూతనను సంపినట్లు సంపెటట్లున్నడు!" అంది ఏడుస్తూ యాదమ్మ.

ఎడపిల్ల నీలమ్మ రెండేండ్ల నర్దంది. యాదమ్మ చెంగులు పట్టుకొని వెంట వెంట తిరుగుతున్నది. కాళ్ళల్లో పడుతున్న ఆ పిల్లను రెక్కపట్టి ఈడ్చుకొని పోయి దూరంగా మరో కుక్కిమంచంలో కూలేసింది యాదమ్మ. చంకలోని నాగయ్యను నీలమ్మ చేతుల్లో పెట్టింది. ఆ పిల్ల తమ్ముని వదలకుండ రెండు చేతులతో పట్టుకొని బొమ్మలాగా కూర్చుండిపోయింది.

యాదమ్మ భర్త దగ్గర కురికింది. ఆమెకు ఏడ్పు ఆగడం లేదు. కళ్ళ పొంటి నీల్లు జలపాతంలా కారుతున్నాయి "గిట్ట పుర్గు మందెందుకు తాగితివయ్యో! పత్తిపంట పాడుకాను! నాశనగాలానికె పత్తి యేసినమో ఏందో? పత్తి చేతికొచ్చే యేలకు పురుగుపట్టి కాయలన్నీ తెల్లగా పగిలిపోయే బదులు పొక్కలుబడ్డయి. గా పుర్గులకు మందు కొడ్దమంటె పైసల్లేవాయె. మందు తేకపోతివి. ఇగ నువ్వు తాగెటందుకు పుర్గుమందు ఎక్కడ్నుంచి దొరికిందయ్యో! గా డబ్బిల అడ్గుబొడ్దు ఏమైన వుంటె గదేమైన తాగిండో ఏందో! గట్ట పుర్గుమందెందుకు తాగితివయ్యో! అయ్యో నాయినో! ఎంత పని చేస్తివయ్యో!" అని పెద్దగా శోకాలు పెడ్తు యాదమ్మ ఏడ్వసాగింది.

యాదమ్మ చుట్టూ చుట్టు పక్కల వాళ్ళంతా పోగయ్యారు. సాయిలు మంచం చుట్టూ గుమిగూడారు. ఇంక శానామంది కూలిపోయిన ఇంట ప్రహరీగోడ పక్కన గుంపులు గుంపులుగా నిలబడి వున్నారు.

ఇంతలో అవుసలి నారయ్య బిరబిర వచ్చాడు. ఆ ఊర్లో ఇట్లానే పురుగుమందు తాగినోళ్ళ నెందరినో ఆడాళ్లను, మగాళ్ళను నారయ్య రక్షించాడు.

"గసుంటు జర్గండి. కూసంత గాలి తగల నియ్యండి!" అంటూనే అవుసలి నారయ్య అందరినీ తోసుకుంటు సాయిలుకు దగ్గరిగా వెళ్ళాడు. ఏడుస్తున్న యాదమ్మవైపు చూసి –

"యాదమ్మ! గింత చింతపండు, చిలుంపట్టిన గిన్నెలు గిలాసలుగాని పాత పైసలు గాని వుంటే తీస్కరా పో! జల్ది తేపో!" అన్నాడు.

యాదమ్మ దిక్కులు చూసింది ఎటు తోచక. ఇంతలో యాదమ్మ పెద్ద యారాలు నర్సమ్మ ముందుకు వచ్చి –

"ఇగో నారన్న, చింతపండు అన్నీ తయారు పెట్టిన, తీస్కో" అంది. ఇంటి చుట్టుపక్కల వాళ్ళు లచ్చి, రాములమ్మ, శంకరమ్మలు వచ్చి యాదమ్మకు దగ్గరగా చేరారు.

అవుసలి నారయ్య డాక్టరీ చదువలేదు గాని ఆ ఊళ్ళో వాళ్ళకు ఆయన డాక్టరే! ప్రాణదాత! ఏదొచ్చినా ఆయన దగ్గరికే ఉరుకుతారు. ఊళ్ళో దవాఖానా లేదు. నారయ్య ఏవో కొన్ని మందు గోలీలు, ఇంజక్షన్లు ఇచ్చి వైద్యం నడిపిస్తున్నాడు. ఊళ్ళోవాళ్ళు ఏదో తమ దగ్గరున్నయి తమకు తోచినన్ని పైసలిస్తుంటారు. అవుసలి నారయ్య చిన్నచిన్న కమ్మలు, మెట్టెలు, కడియాలువంటి ఏవో కొన్ని నగలు చేస్తాడు. ఆ వృత్తిపోగా ఈ వైద్యం మీది అభిరుచితో దాన్ని నడుపుతున్నాడు.

చిలుంపట్టి మూలపడేసిన గిన్నెలు గిలాసలు కడిగిన నీళ్ళల్లో చింతపండు పులుసు పిసికాడు నారయ్య. నోట్లో పోద్దామని సాయిలు దవడలు పట్టుకొని ఒత్తిపట్టే నోరు

తెరిపించబోయాడు. కాని నోరు తెరుచుకోలేదు. దవడలు కట్టెకరుచుకు పోయినయి. చేతులు కాళ్ళు పట్టుకొని చూశాడు నారయ్య. చల్లబడి వున్నాయి.

"లాభం లేదు యాదమ్మా, అంతా అయిపోయింది.!" అన్నాడు నారయ్య.

"ఏంది అయిపోయింద? గట్లంటె పానం పోయింద?" యాదమ్మ ఏడ్పు ఆపి నిర్ఘాంతపోయింది. తేరుకొని భర్త శవం మీద పడిపోయి శోకాలు పెట్టింది.

"గిట్లెందుకు చేసినవయ్యో! అప్పు అప్పు అని మనాది పెట్టుకుంటె గింతపని చేస్తావనుకోలేదు నాయనో! ఎంత పనయి పాయనయ్యో! గక్కడికి అంటనే వున్ననయ్యో! అప్పు అప్పు అని మనాది పెట్టుకోకుమని. మల్లమల్ల సెప్తినిగదయ్యా! బతుకుంటే అన్ని అప్పులు రెక్కలకట్టం మీద ఒక్క ఏడాదిలో తీర్చుకుందం అంటిని గదయ్యో! కాలం కల్సి రాకపోతే కూలి పని సేసుకొని అప్పు తీర్చుకుందం అని మొత్తుకుంటనే వున్న నాయినో! గింతల్నే గింతపని సేసి పోయిండురో! అయ్యో నాయనో! నా మీద బారం పెట్టి నీ దారి నువ్వు సూసుకుంటివయ్యో! నాకేమి చెప్పి పోయినవయ్యో! నాకిదంత అప్పజెప్పి పోయినవ! నాయినో! పుర్గుల మందు నోట్ల పోసుకుంటుంటె గీ పోరలయిన యాదికి రాలేద నీకయ్యో! గిదంత ఎట్లజేస్తివయ్యో! గంత ధైర్యమెక్కడ్నుంచి ఒచ్చిందయ్యో నీకు! బతుకంటే లేసి జూసుకుంట రయ్యో! నువ్వేమొ అన్ని కట్టాలు ఒదిలించుకొని పోతివి. నాకేం జెప్పి పోతైతివయ్యో! నన్ను గీ పోరగాల్లను దిక్కులేనోల్లను సేసి పోయినావయ్యో! మమ్ముల్ని అన్నాలం చేసిపోతివి గదయ్యో!" అని నెత్తిమీద చాతీమీద చేతుల్తో చరుచుకుంటు ఏడ్చింది యాదమ్మ. చుట్టూ నిలబడ్డ వాళ్ళందరూ కన్నీళ్ళు పెట్టుకున్నారు. ముక్కు చీదుతూ పైట కొంగులతో కన్నీళ్ళు తుడుచుకున్నారు.

యాదమ్మ యారాలు నర్సమ్మ యాదమ్మను దగ్గరికి తీసుకుంది.

"గిట్ల ఎంతసేపని ఏడుస్తవ్ యాదక్కా! కొర్తి గూరుకో! ఆడు నిన్ను నీ పోరగాల్లను యాది జేసుకుంటే గింతపని చేసెటోడు కాదు! గింత అన్యాలం పని చేసెటోడు కాదు! ఆడికి అంతా అప్పే కండ్ల బడ్డది. పురుగు తగిలిన పత్తిచేనే కండ్లబడ్డది. బాయికాడ కూసొని ఏమి సోంచాయించిండో ఏందో? ముందలున్న డబ్బల నుంచి గింత పుర్గుమందు తాగిండు. దాంతోటి కట్టాలన్ని తీరుతయనుకున్నడు! గంతే! ఆనికి గప్పుడు ఎవరు యాదికి రాలేదు. యాదికొస్తే గిట్లెందుకు సేస్తడు!" అని అంటూ నర్సమ్మ యాదమ్మను సముదాయించడానికి ప్రయత్నించింది. యాదమ్మ ఆ మాటలేవీ వినడం లేదు. ఆమె మనస్సు గత సంవత్సరం మీదికి పోయింది. ఆమె దుఃఖం ఉప్పొంగి వచ్చింది.

"నర్సక్కా! నిరుడు మిరుపసేను ఏస్తే పంట మంచిగనే సేతికొచ్చింది. సేసిన కట్టానికి పెట్టిన పెట్టుబడికి పంట మంచిగనే పండింది గద అని సంబరపడ్డంగాని మిరుపకాయలకు అంగట్ల ధర పల్కలేదాయె! నీళ్ళు పోసి తడిపి తెచ్చినవ్ బే! అని అంగట్ల సావుకారు అడ్డికి పావుసేరు లెక్కగట్టి పైసలిచ్చిండు. మిరుపసేను కోసం ఇత్తనాలని పురుగుల మందని బలం మందని అప్పు సేసిండు! మిరుపకాయలమ్మితె ఒచ్చిన పైసలుగా సెంద్రమౌలి కాడ సేసిన అప్పుకు ఒడ్డికాడికి సరి పోయినయి. గింత రెక్కలు ముక్కల్జేసుకుంటే మాకు పోరలకు నోట్లోకి గింత కూడుకు మిగులదాయె!

గదాంతోటే గప్పుడే గాయన మనాది పెట్టుకుండు. అక్కా! గప్పట్నుంచే ఎట్లనో అయిండు." ఏడుస్తూ యాదమ్మ జ్ఞాపకం చేసుకుంటూ చెప్పింది.

"గా అప్పు మనాదితోనే గింతపని చేసిండు సెల్లె! సెంద్రమౌళి కాడ తెచ్చిన అప్పే గింత మోసం చేసింది. గాయనేమొ శానా వడ్డీకట్టె. గా వడ్డీ కట్టటందుకె పాయె పైసలన్ని. పంట పండినా నిరుడు లాభం లేకపోయె! గిప్పుడు అప్పు సేసె గిట్లాయె. గదే మనాది పాలయిండు సాయిలన్న! మరి నా కెరికె!" అంది నర్సమ్మ. యాదమ్మ నర్సమ్మ వక్షస్థలంలో తలదూర్చి బోరుమని ఏడ్చింది.

"ఊకో తల్లి! గింత గంత కట్టంకాదు నీది! బగవంతుడికీ దయవుంటె గింతయితదా? సెప్పు! నాయెం ఈ భూమ్మీద వుంటె గీ సాయన్న కట్టమంత గిల్ల అయితదా?" అంది లచ్చి. యాదమ్మ నెత్తిమీద చెయ్యేసి నిమిరిందామె సఖుదాయిస్తు.

"నిరుడు సేసిన అప్పు తీరుస్తననే మల్ల అప్పు సేసిండు లచ్చక్కా!" అంది తలెత్తి యాదమ్మ. యేడ్చి యేడ్చి పైట కొంగుతో తుడుచుకొని యాదమ్మ కళ్ళు వుబ్బిపోయాయి.

"నా కెరికే తల్లి! మావోడే గద సెప్పిండు సాయిలన్నకు. పంట ఇత్తనాల కోసం పుర్గు మందు కోసం బలం మందుల కోసం బేంకు అప్పు ఇస్తున్నదని సెప్పితేనె గద సాయిలన్న పోయి బేంకుల అప్పు తీస్కుండు! గా పైసల్నుంచే సెంద్రమౌళి అప్పు కడ్తననె గాని, కట్టటందుకు ఎక్కడ మిగిలినయి పైసలు! నాకంత ఎరికేనే యాదమ్మ! ఏం జేస్తం మన చేతుల్ల వుంద ఏమైన సెప్పు?" అడిగింది లచ్చి.

"బేంకుల అప్పు తెస్తే పైసలెక్కడ మిగిలినయి లచ్చక్కా! మిరుపకాయలకు అంగట్ల ధర పల్కదని ఈ యేడు అందరేస్తున్నరని పత్తియేసె. నాయినో! గా పత్తి ఇత్తనాలు గన్ని పైసలు పెట్టి పక్క ఊర్ల కొనుక్కొస్తే గవ్వి మొదుగాల తెచ్చినయి మొల్వనె మొల్వనాయె! నాయినో! ఏం జేస్తం అదురట్టం గట్లాయె!" అని ఏడుస్తున్న యాదమ్మను రాములమ్మ శంకరమ్మలు ఆమెకు చెరోపక్కన చేరి సముదాయించబోయారు. వాళ్ళను చూసి యాదమ్మ దుఃఖం మరింత ఎక్కువయింది.

"రాములమ్మ! నువ్వు ఇన్నవ్ గద! అచ్చమైన సర్కారోల్లు అమ్మే ఇత్తనాలు తెమ్మని నీ పెనిమిటి పుల్లన్న సెప్తెనె గద పోయి కొత్త ఇత్తనాలు తెచ్చి మల్ల నాగలితో దున్ని యేసిండు! అప్పుల సగం ఇత్తనాలకె పాయె. ఇంట్లకుగిన్న ఒడ్లగింజలు పట్టుకొచ్చిండ. అంతే! ఇగ సెంద్రమౌళి అప్పు ఎక్కడ కడ్తడు అక్కా! నువ్వే సెప్పు!" యాదమ్మ దీనంగా రాములమ్మ వైపు చూస్తు అంది.

యాదమ్మ చుట్టూ చేరిన వాళ్ళకు దుఃఖం ఆగడం లేదు.

"గంతల్నె పత్తిసేను తలెత్తె! గప్పట్నుంచే బలం ఎరువులని తెచ్చి యేస్తనె వుండె. పుర్గు మందులని కొనుక్కొచ్చి కొడ్తనె వుండె! ఇగ సెంద్రమౌళి కాడ అప్పుగట్లనె మిగిలిపాయె! గిప్పుడు బేంకు అప్పు సేసె! ఇంకో దిక్కు పత్తి కాయలన్ని పుర్గుబట్టిపాయె! మల్ల మందుతెచ్చి గొడ్తమంటె సేతిలో ఒక్కపైస లేదాయె! కొట్టకపోతే పంట సేతికొచ్చేటట్టు లేదాయె! గీ కొట్టుమిటాట్టతోనె అక్కా, మీ అన్న గింత పని సేసిండు!" అని యాదమ్మ రాములమ్మ ఒడిలో ఒరిగిపోయింది

ఏడుస్తు. అక్కడా ఆమెకు ఊరట కలగలేదు. వెంటనే రాములమ్మ ఒడిలోంచి లేచి యాదమ్మ చాతి మీద అరచేతులతో కొట్టుకుంటు పెద్దగా ఏడ్చింది.

యాదమ్మ రెండు చేతులు పట్టుకొని నర్సమ్మ తన గుండెల మీదికి తీసుకొని వెన్ను నిమిరింది. "గదె మోసం తెచ్చిందె అవ్వ! గిన్ని తీరుల అప్పు అయె. ఇంకోదిక్కు పంట సేతి కొచ్చెటట్టు కండ్ల బడలేదు. గందుకే సాయన్న గింత పనిచేసిండు! అయనకాయన మా రాజు అయిండు. నిన్ను నీ పిల్లల్ని దిక్కులేనోల్లను సేసిండు. ఎనక్క ముందు ఆలోశన లేక గింతపని సేసిండు. నువ్వెట్ల బతుకుతవ్ అని, పిల్లల్నెట్ల సాదుతవ్ అని ఏమైన ఆలశన సేసిండా?" అంది నర్సమ్మ.

నర్సమ్మ మాటలకు యాదమ్మ దుఃఖం కట్టలు తెంచుకొని ప్రవహించింది.

"నర్సక్క! నేను, గీ పోరలు అగమైపోతరనయిన అనుకోడాయె! గింత పనిచేసి పోయిండు! గిప్పుడు నేనెట్ల బతకాలె సెప్పు అక్క!" ఏడ్చింది యాదమ్మ.

నేలమీద వున్న దుమ్మును పిడికిళ్ళతో తీసుకొని నెత్తిమీద చల్లుకొని పిచ్చిదానిలా బోరుమని ఏడ్చింది. అది చూసి నర్సమ్మ వెక్కి వెక్కి ఏడ్చింది.

"యాదమ్మ! నువ్వు గిట్ల ఏడిస్తే పిల్లలేమైతరు సెప్పు! ధైర్నం తెచ్చుకో సెల్లె!" అని నర్సమ్మ యాదమ్మను దగ్గరికి తీసుకుంది.

అక్కడ తల్లికెదురుగా నిల్చున్న పెద్దకొడుకు వీరయ్య దిగాలుపడి, ఏడుస్తున్న తల్లివెపు కనురెప్ప వెయ్యకుండ చూస్తున్నాడు. వాడి ఒంటిమీద చిరిగిన నిక్కరు అంగి వున్నాయి. వాడి పక్కనే నిలబడి వున్న వాడి తమ్ముడు వెంకన్న ఒంటిమీద అంగి ఒక్కటె చాలీ చాలనిది వుంది. నిక్కరు లేనేలేదు. ఇక వాడి పక్కన నిలబడి వున్న వాడి చెల్లెలు భద్రమ్మ ఆరేళ్ళది పేగులు పేగులైన ఫ్రాకు వేసుకుంది. దాని పక్కనే నిలబడివున్న నాలుగేళ్ళ మంగమ్మ బరిబాతల మురికై ఎన్నాళ్ళనుంచో నూనె లేక ఎర్రబడిన తలవెంట్రుకలతో నిలబడి గుడ్లప్పగించి తల్లివైపు చూస్తున్నది. వాళ్లందరికి తండ్రి ఏం చేశాడో తెలియడం లేదు. తండ్రి ఇక ఈ లోకంలో లేడని వీరయ్య మాత్రం గ్రహించాడు. అందరు ఆకలితో కడుపు లీడుసుకుపోయి వున్నారు.

దీపం పెట్టంగనే తండ్రి వస్తాడు, తండ్రి రాగానే అన్నం పెడ్తనన్నది తల్లి. ఇంతవరకు వాళ్ళు తిన్నారా లేదా అని అడుసుకునేవాళ్ళే లేరు. ఆకలితో వాళ్ళ కళ్ళు తేలిపోతున్నాయి.

అర్గురు పిల్లలైరి! మోపెడన్ని అప్పులాయె! ఇగ యాదమ్మ గీ సంసారమెట్ల ఈదుకొస్తుందో ఏమో? అనే ప్రశ్నలతో చుట్టూ నిల్చున్నవాళ్ళ హృదయాలు ద్రవించిపోతున్నాయి. అందరి హృదయాల్లో వున్న సందేహాన్నే లచ్చమ్మ వెలిబుచ్చింది.

"ఎట్ల నెగుల్కొస్తవో ఏందో యాదక్క! గీ పిల్లల్తో గీ అప్పుల్తో ఏం జేస్తవో నీ సేతిలోనె వుంది! ఆడైతె గీ బందాలన్ని ఒదలించుకొని పోయిండు. ఆడు మా రాజే! గాని నీ బతుకేమైతదో, గీ పిల్లల బతుకులేమైతయె అనుకున్నడ? గింతయిన ఆలోశించిండ" అని యాదమ్మ గదమ పట్టుకొని ఊరిడించే ప్రయత్నం చేసింది.

"నువ్వే జెప్పు లచ్చక్క! నేనేం జేయాలె? గింత పని జేస్తడని కల్లనయిన అనుకోలేదు. ఏం బుద్ధి పుట్టిందో గా బాయి కాడ పొద్దున్నే పోయిండు. పగటాల బువ్వకు రాకపోతే వీరయ్య తోటి పంపిన, గది తిన్నడా లేదో ఎరుకలేదు. గీ పని

చేస్కాని పొద్దుగూకంగ ఇంటికొచ్చిండు! పత్తి సేనుముందల కూసొని కూసొని ఏమి సోంచాయించిండో ఏందో గింతపని జేసిండు!" అంది యాదమ్మ. ఆమె గొంతులో నిస్సహాయత ధ్వనించింది.

అరచేతుల్తో గుద్దుకొని యాదమ్మ నెత్తి బొడుసులు కట్టింది. చాతి మీద కొంగులేదు. చాతంతా ఎర్రబడింది. రైక చినిగిపోయింది. నెత్తిమీద వెంట్రుకలన్నీ చెల్లాచెదరయ్యాయి. కళ్ళు ఎర్రబడి ఎర్రగుల్మాల పువ్వుల లెక్క అయినయి. గొంతు బొంగురుబోయింది. నిస్సహాయంగా యాదమ్మ చుట్టూ వున్న అందరివైపు చూసింది.

"నర్సక్క! నువ్వె జెప్పు, నేనేం జేయాలె? గీ పోరగాల్ల నెట్ల సాదాలె? గీ ఎవసాయం ఎట్ల నడపాలె? ఐదెకరాల చెలక బోరు ఇంజను గవన్ని నా ఒక్కదానికి అప్పజెప్పిండు. తన దారి తను చూస్కుండు! గీ అప్పులన్ని మెడకుబడ్డయి ఎట్ల తీర్చాలె? నువ్వే జెప్పు నర్సక్క, నేనేం జేద్దును? లచ్చక్క, నువ్వయిన జెప్పవే! నాతోటి ఒక మాట అంటే నేమంటనని సూడడాయె! ఓ నాయినో! అందరి ముందల నన్ను నవ్వులపాలు జేసి పోయిండు. శంకరక్క! నేనెట్ల గీ సంసారాన్ని నెగ్గుకొస్తనో నువ్వె జెప్పవే! నాయినో! నేనేం జేయాలె? నేనెక్కడికి పోను?" అంటూ యాదమ్మ బోరుబోరుమని ఏడ్చింది. ఆమె దుఃఖానికి అవధుల్లేకుండా పోయాయి. ఆమె అడిగే ప్రశ్నలకు జవాబులు ఎవరి దగ్గరా లేవు!

● *ప్రచురణ: 'విస్తురాయి' 1998* ●

★ ★ ★

రహమతుల్లా

103

# అమ్మీజాన్

చర్మాన్ని చీల్చుకుని బొక్కలు బయటపడనున్నట్లు, సాయిబుల పీరు మాదిరుందామె.

చేతుల్లోని తన బిడ్డడ్ని (మృత శిశువేమో – అచేతనంగా ఉంది) ఉండీ లేనట్లున్న ఎండిన తన గుండెలకు అదుముకుంటూ, నాముందు చేయి చాపింది. ఆ పిలగాడి కాళ్ళు చేతులు సన్నగా పెన్సిళ్ళ మాదిరున్నాయి. చింపిరి జుట్టుతో, చినిగిన బట్టల్తో ఇద్దరాడపిల్లలు కూడా ఆ పిచ్చిమాతల్లి కాళ్ళు చుట్టుకుని ఉన్నారు. వాళ్ళూ చేతులు చాపి నావైపు దీనంగా చూస్తున్నారు. ఆ తల్లీ పిల్లలు ఎంత హృదయవిదారకంగా ఉన్నారో!

గుండెను అంపంతో పరపర కోస్తున్నట్లు బాధగా మనసు విలవిల్లాడింది. ఆ దృశ్యాన్నుంచి కండ్లను మరల్చి అరచేతుల్లో దాచుకున్నాను.

బస్సు కదిలేసరికి సోయిలోకొచ్చి, జేబులోనుంచి అందిన చిల్లరను ఆ పిచ్చితల్లికిచ్చి ఆమెకై చూడలేక కళ్ళు మూసుకున్నాను.

'తల్లి తల్లే. పిచ్చిదైనా, ఎడ్డిదైనా పేగు సంబంధాన్ని తెంచుకోదు. ఇంకా విచ్ఛిన్నం కాకుండా పవిత్రంగా మిగిలున్న మానవీయ సంబంధం అదొక్కటే గదా!' మనసులో అనుకోకుండా ఉండలేకపోయాను.

ఆ ఎడ్డి పిల్లలు, ఆ ఫాగల్ తల్లి అమ్మలాంటి మా పుప్పమ్మ (అత్తమ్మ)కు సంబంధించిన ఆలోచనల్ని కదిపారు. మనసులో ఆమె మెదలగానే కళ్ళు చెమ్మగిల్లి, ఒక విషాద తెమ్మెర కప్పేసింది.

వెంటనే ఆమెను చూడాలనిపించి తల తిప్పి వెనక్కు చూశాను. ఆమె కిటికీ పక్కనే కూర్చుని 'తస్బీ' లెక్కిస్తుంది. నల్లని బురఖా ధరించి, కళ్ళు మూసుకుని, నిశ్శబ్దంగా పెదాలను కదిలిస్తూ అల్లాను స్మరిస్తుంది. అమ్మ రూపంలో ఉన్న దేవతల తల్లిలా ప్రశాంతంగా ఉంది. ప్రక్కనే ఆమె ముగ్గురు బిడ్డలు కూర్చుని ఉన్నారు. మొదట నా భార్య, తరువాత ఇద్దరు మరదళ్ళు కూర్చుని ఏవో మాట్లాడుకుంటున్నారు. ఇటువైపు కిటికీ పక్కన కూచున్న నా ఇద్దరు కొడుకులు బయటకు చూస్తున్నారు.

పుప్పమ్మకు చాలా ఏళ్ళ తర్వాత కొడుకుని, మనవరాళ్ళను చూడాలనిపించింది. దాంతో మేమంతా మా బావమరిదింటికి బయలుదేరాం.

బస్సు మెత్తగా లయబద్ధంగా సాగిపోతూంది. నా ఆలోచనలు పుప్పమ్మింటి చుట్టూ పరిభ్రమిస్తుండగా, కళ్ళు మూసుకున్నాను.

☆ ☆ ☆

మా పుప్పమ్మ పేరు ఫాతిమాబీ. ఫాతీమా అంటే ప్రశాంతతకు మారుపేరులా అన్పించేది. నిజంగా కూడా ఆమెను చూస్తే గంభీర సముద్రంలా నిశ్చింతగా కన్పించేది. ఆమె సమక్షంలో ఉన్నంత సేపు మనసుకు హాయిగా, నెమ్మదిగా ఉండేది. ఆమెలో అటువంటి నిర్మలమైన శక్తి ఉండేది. ఆమెకు ఊహ తెలిసినప్పటి నుంచి ఐదుపూటలు నమాజు చదువుతూనే ఉంది. అలవాటులా కాకుండా, సంపూర్ణమైన విశ్వాసంతో, ఎంతో భక్తి శ్రద్ధలతో సూరాలను మననం చేస్తుంది. ఈ క్రమం తప్పని పుజా, నమాజులే ఆమె ముఖంలోని ఆ అద్భుతమైన కాంతికి, ప్రసన్నవెలుగుకు కారణాలేమో! పండుగలు కాని, ఇతరత్రా విషయాలు కాని చిత్తశుద్ధిగా, నిజాయితీగా చేసేది. వరుసకు ఆ యమ్మ నాకు పిల్లనిచ్చిన పుప్పమ్మే అయినా, మామధ్య తల్లీకొడుకుల అనుబంధం ఉంది. ఆ కుటుంబంలోని ఇతర సభ్యులు కూడా నేనంటే అభిమానంగా ఉంటారు.

అందుకే మేము రంజాన్ సేమ్యాలు తాగటానికి, బక్రీద్ ఖుర్బానీల బిరియానీ తినటానికీ, మొహరం రాత్రి పీర్లు ఎత్తుకున్నోళ్ళు అలావా నిప్పుల్లో నడవటం చూడటానికి మా పుప్పమ్మింటికి క్రమం తప్పకుండా మా పెళ్ళయిన పదేళ్ళనుంచీ వస్తూనే ఉన్నాం. వారం పదిరోజులుండి మా అలసట నుంచి, మా యాంత్రిక జీవనం నుంచి బయటపడి వాపసు వచ్చేవాళ్ళం.

అట్లా ఆ కుటుంబంతో నాకు ఆత్మీయత, సాన్నిహిత్యం బాగా పెరిగాయి. నా భార్య కాక ఆ ఇంట్లో ఉన్నది నల్గురే అయినా, ఒక్కోరి లోపల ఒక్కో అగ్నిపర్వతం ఉండేది. కదిలిస్తే కన్నీటి సముద్రాలయ్యేవాళ్ళు. ఆ ఇల్లు ఇల్లే సమస్యల నిలయం. నివురుగప్పిన నిప్పు కుంపటి. ఏ సమస్యను ముట్టుకున్నా భగ్గుమనేదే కాని, చల్లబడేది కాదు.

ముఖ్యంగా మా పుప్పమ్మ అంతర్మథన తీవ్రత నాలాంటివారిలో ఉంటే ఏనాడో బాల్చీ తన్నేసి డోలాలో నిశ్చింతగా పడుకుని జనాజేకి నమాజ్ కొరకు మాజీదుకు పోదుము. కాని ఆ యమ్మకు మొదటి నుంచీ కష్టాలను ఎదుర్కోవటం అలవాటే కనుక నిబ్బరంగా ఉండగలుగుతుంది.

పెళ్ళయిన నాటినుంచే ఆమె ఏ సుఖానికీ నోచుకోలేదు. భర్త రెవెన్యూ ఆఫీసులో క్లర్కు. అతగాడు ఈమెకు భర్త అయి ఒరగబెట్టింది ఏమీ లేకపోయినా, ముగ్గురు ఆడకూతుర్లకు, ఒక మగపిల్లవాడికి తల్లిని మాత్రం చేసిపారేశాడు. ఇంటిని, పిల్లల్ని ఆమె ఎదకు వదిలేసి బాధ్యతారాహిత్యంగా తాగి తిరుగుతుండేవాడు. అసలు ఇంటికే వచ్చేవాడుకాదు. జీతాలనాడు మాత్రం కొడుకుతో,

"రేయ్! అమ్మికో బులా!" అని కసిరేవాడు.

పుప్పమ్మ వచ్చి అతని ఎదురుగా నిలబడేది. అతను చాటుకు తిరిగి పైసలు లెక్కబెట్టి, కొన్ని కాగితాలు మాత్రం ఆమె చేతిలోపెట్టి మిగిలినవాటిని జేబులో దోపుకొని బయటపడేవాడు. 'చాలీచాలని డబ్బులతో సంసారాన్ని నడపటం లాంటి

నరకాతి నరకం, తల్లులకు ఇంకోటి ఉండదు. యా ఖుదా! మాతృమూర్తుల్ని ఆ భయంకర శాపం నుంచి విముక్తుల్ని చేయలేవా?' ఎప్పటిలా మనసులో ఒకసారి మననం చేసుకోనేది, చేతిలోని డబ్బుల్ని చూసుకుంటూ...

బిడ్డలకు కడుపునిండా తిండి పెట్టలేనప్పుడు, వాళ్లు అర్ధాకలితో మంచినీళ్ళ కుండవైపు నడుస్తున్నప్పుడు, ఆ తల్లి కడుపులోని పేగుల ఆక్రందనలు ఆకాశాన్ని చేరేవి. చినిగిన బట్టలు తొడుగుతున్నప్పుడు, ఎప్పటివో పాతకాలపు పొట్టిగౌనులను ఎదుగుతున్న కూతుర్ల తొడలు కన్పించకుండా కప్పెట్టటానికి క్రిందికి లాగి లాగి విఫలమవుతున్నప్పుడు, నిజంగా ఆ తల్లి చౌరస్తాలో నగ్నంగా నిలబడినట్లే కళ్ళు, గుప్పెట్లు మూసుకుని విలవిల్లాడిపోయేది.

అయినా ఆ తల్లి, ఫాతిమా, పుష్పమ్మ, పేదరికాన్ని అసహ్యించుకోలేదు. సవాలుగా తీసుకుని, ఎదురైన కష్టాల్ని, అవమానాల్ని ఎంతో సహనంతో అధిగమించింది. కనిపించని ఖుదాను ఆమె కొండంత అండగా చేసుకుంది. పిల్లల్ని వారి మానానికి వారిని వదిలేయలేదు. అయినా తల్లి, పిల్లల్ని తండ్రుల్లా ఎలా నిర్లక్ష్యం చేయగలదు? అయితే భర్త మాత్రం ఆమెకు మనశ్శాంతి లేకుండా చేసేవాడు. తాగి ఎప్పుడన్నా ఇంటికి వచ్చేవాడు. అన్నీ అబద్ధాలు చెప్పేవాడు. అదీ, ఆమెకు ప్రాణప్రదమైన ఖురానే షరీఫ్ మీద ప్రమాణం చేసి మరీ చెప్పేవాడు.

అతనితో విసిగిపోయి, మగతోడు ఎప్పటికన్నా పనికి వస్తుందిలే అని రెపరెప లాడే చిన్ని ఆశను ఒగ్గేసి, తన జీవితాన్ని పూర్తిగా ఇంటికీ, పిల్లలకు అంకితం చేసింది. ఎంతో బాధ్యతాయుతంగా పిల్లలకు చదువులు చెప్పించి, సక్రమంగా పెంచి, మంచి బుద్ధులతోనే పెద్దవాళ్ళని చేసింది.

సడెన్ బ్రేక్‌తో బస్సాగేసరికి ఆలోచనల్లో నుంచి బయటపడి, ముందున్న డ్రయివరు అద్దంలో నుంచి బయటకు చూశాను. ఎడ్లు రోడ్డుకడ్డంగా ఉరుకుతూ కుమ్ముకుంటున్నాయి. డ్రయివరు ఎడ్లని తప్పించి తిరిగి వేగం పెంచాడు. నేను నా ఆలోచనల్లోకి మళ్ళీ వెళ్ళిపోయాను.

పిల్లలు పెద్దవాళ్ళయ్యేంత వరకు, ఆ ఇంటి పరిస్థితి పుష్పమ్మ అందుపులోనే ఉంది. ఆడపిల్లలు పెళ్ళీడుకు వచ్చాక మాత్రం, క్రమేపి పరిస్థితులు ఆమె చేతిల్లోనుంచి జారిపోసాగాయి. నిదానంగా ఒక బాధాపర్వతం ఆమెలో చోటు చేసుకోనారంభించింది. ఉన్నిల్లు అమ్మేసి, ఆ ఇంటి పెద్దకూతుర్ని నాకిచ్చి పెళ్ళిచేశారు. దానితో వారు బజారున పడ్డట్టయింది. కిరాయి ఇండ్లల్లో ఉండాల్సి వచ్చింది.

ఈ సమయంలోనే మామయ్య చనిపోవటం, అతని ఉద్యోగం మా ఏకైక బావమరిది జహంగీర్‌కు రావటం, పోస్టింగు దూరంగా ఉన్న ఇంకో ఊర్లో అవటం జరిగిపోయింది.

పుట్టినన్ని అప్పులు చేసి రెండోమరదలి పెళ్ళిచేశారు. విధి వాళ్ళని ఎక్కిరించినట్ల యింది. ఆ సంబంధీకుల కన్నా పాములు, నక్కలు ఎంతో మంచివేమో! చచ్చీ చెడి వాళ్ళనుంచి తలాఖ్ పొంది, అమ్మాయిని ప్రాణాలతో ఇంటికి తెచ్చుకోగలగటమే గొప్ప అదృష్టం అయిపోయింది. ఆ పెళ్ళి కొరకు అప్పులు చేసి తెచ్చిన డబ్బంతా బూడిదలో పోసిన పన్నీరై, అప్పులు మాత్రం పిశాచాల్లా పట్టుకున్నాయి. చేసిన

అప్పులు తీర్చటం, రెండోమరదలికి మొదటి పెళ్ళిచేయటం, మూడోమరదలికి రెండో పెళ్ళి చేయటం ప్రస్తుతం ఆ ఇంట్లోని సమస్యలు. – ఆ తల్లి సమస్యలు.

ఇక చూడండి ఆ ఇంటి బాధ. ఆ తల్లి నిస్సహాయస్థితి – ఇక్కడి వ్యవహారాలు ఇలా కాల్తుండగా, దూరంగా ఉద్యోగనిమిత్తం పోయిన జహంగీర్ ఒక బ్రాహ్మణపిల్లతో ప్రేమలో పడ్డాడు. ఇంకేముంది, తేనెలో పడ్డ ఈగేనాయె! వారి కథ బాగా ముదిరి, ఒక్కక్షణం కూడా విడివిడిగా ఉండలేని స్థితికి చేరుకున్నారు. ఇక లాభం లేదనుకుని, విషయం ఇంట్లోచెప్పి, అమ్మను పెండ్లికి ఒప్పించాలని అతను ఇంటికి చేరాడు. పెళ్ళిళ్ళు కావాల్సిన చెల్లెళ్ళిద్దరూ గడపలోనే అష్టాచెమ్మ ఆడుకుంటూ కన్పించారు. సగం ఉత్సాహం వాకిట్లోనే నీరుకారిపోయింది.

ఇంట్లోకి అడుగుపెట్టగానే జానిమాజ్‌పైన మోకాళ్ళు మడతపెట్టి అరిపాదాలు మీద కూర్చుని ఉంది. తల్లి. తలనిండుగా చీరకొంగును కప్పుకుని అరచేతుల్లో అల్లాను చూస్తున్నంత ప్రశాంతంగా దువా చేస్తున్నది. ఆమెను చూడగానే ఆమేంటో అతనికి స్పష్టంగా అర్థమైనట్లు అన్పించింది. 'చెర్లోచేప బయటపడితే ఎలా గిలగిలా కొట్టుకోవాల్సి వస్తుందో, తన అమ్మీజాన్ కూడా మతం నుంచి, మతస్తుల నుంచి, మత సంస్కృతినుంచి అవన్నీ కలవగా రూపుదిద్దుకున్న ఆమె మనస్తత్వం నుంచి వెలుపలికి వస్తే అంతకన్నా అధ్వానంగా బతకాల్సి వస్తుంది' అన్పించిందేమో – తన మతాంతరప్రేమను ఇంట్లో చెప్పలేక భారంగా తిరిగి వెళ్ళిపోయాడు. ప్రేమిచ్చే తృప్తి ఒకింతయితే, అసంతృప్తి దానికి తిరిగి రెట్టింపుంటుంది. ప్రేయసిలో ఐక్యంకాక, దూరంగా చూస్తూ భరించడమంటే అగ్నిజ్వాలల్లో బతకటమే. జహంగీర్ కొంతకాలం అలా మంటల్లో ఉండిపోయాడు. ఒక్కోసారి మనుషులు స్వయంగా తమకుతాము పరిష్కరించుకోలేని కొన్ని సమస్యల్ని కాలం ఇట్టే తేల్చి పారేస్తుంది. ఆ అమ్మాయి తల్లిదండ్రులు వేరే అబ్బాయితో వివాహం చేయసంకల్పించేసరికి, ఆ అమ్మాయి పారిపోయి అతని దగ్గరకు వచ్చేసింది. అప్పుడిక తప్పని పరిస్థితిలో గుళ్ళో దండలు మార్చుకున్నారు.

పెళ్ళయిన మరుక్షణం నుంచీ, జరగాల్సినవి చకచక జరిగిపోయాయి. వారికో కుటుంబం ఏర్పడింది. స్వార్థం పెరిగింది. బాధ్యతలనుంచి దూరంగా పలాయనం చిత్తగించారు. జహంగీర్‌కు ఇంకా దూరపు ఊరికి బదిలీ అయింది. అక్కడ బ్రాహ్మణ వాడలోనే కిరాయి ఇల్లు కుదిరింది. జహంగీర్ పేరుకాస్తా జగదీశ్వర్‌గా చలామణిలోకి వచ్చేసింది. ఆ మార్పులే కాదు, ఆ కుటుంబం సమాజంలో పూర్తిహిందూకుటుంబంగా ఎస్టాబ్లిష్ కావటానికి చేయవలసిన హంగులూ, ఆర్భాటాలూ జరిగిపోయాయి. ఇవన్నీ ఆ బ్రాహ్మణపిల్లే చేసిందో లేక ఇద్దరూ కలిసి చేశారో ఆ ఖుదాకే తెలియాలి.

కాని పుప్పమ్మ మాత్రం ఇవన్నీ నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయింది. బాధల్ని లోలోనే దాచుకుంది. అందుకే కాబోలు ఆ రోజుల్లో ఆ యమ్మ నాకు పచ్చిపచ్చిగాయాలతో కదులుతున్న సజీవమూటలా కన్పించేది!

ఒక్కకుదుపుతో బస్సాగేసరికి ఆలోచనల్లోనుంచి బయటపడి బయటకు చూశాను. మబ్బులు సిటీ మనుషుల్లా హడావిడిగా పరుగెత్తుతున్నాయి. వాతావరణం చల్లగా

అయిపోయి, ఎక్కడో దగ్గరలోనే చినుకులు కురుస్తున్న సంకేతంగా చక్కని మట్టితల్లి వాసన మనసును తాకింది.

బస్సుటైరు పంచరయింది. ప్రయాణికులంతా కిందకు దిగారు. ఆలోచనల్లో మునిగి, మౌనంగా శూన్యంలోకి చూస్తూ ఒంటరిగా కూర్చున్న పుష్పమ్మ దగ్గరగా పోయి కూర్చున్నాను... నా రాకను గమనించి,

"దేఖ్ బేటా! పోయినేడాది నీకు కన్పించినప్పుడు జహంగీర్ బాగా చిక్కిపోయాడని అన్నావ్ గదా? కోడలు పిల్ల ఏమన్నా మందు మాకు పెట్టిందంటావా? కడుపులో ఆ ముదనష్టపు మందు పడితే మనిషి చిక్కి చిక్కి రక్తం కక్కుకుని చచ్చిపోతాడు" అన్నది.

"ఈరోజుల్లో కూడా ఆ నమ్మకాలేంటి పుష్పమ్మా?" ఆమె మాటల్ని తీసిపారేస్తూ అన్నాను.

"నయ్ బేటా నయ్. మీ తరం నమ్మరు కాని, అసంటి మందులు బరాబర్ ఉన్నాయ్. నా జీవితం సత్తెనాశ్ అయింది. వాటి వల్లే కద! ఆ ముండెవరో మీ మామయ్యకు ఆ మందు తినిపించింది. అప్పట్నించి ఆయన ఇంటికి రావటమే మానేశాడు. అక్కడే ఉండేవాడు. దానిదగ్గరే పడుకునేవాడు. అదెంతచెప్తే అంత. చివరి క్షణాల్లో ఎవరో రిక్షాలో వేస్కొచ్చి, నా గడపలో పడేసిపోయారు. విరిస్తే పుటుక్కున విరిగే ఎముకమాదిరి సన్నగా అయిపోయాడు. ఇంట్లోకి తీస్కొచ్చి డాక్టరుకు చూపించిన రెండోరోజే అల్లాతాలా పిలిపించుకున్నాడు. ఇప్పుడు వీడివస్తీ అంతే అయ్యేట్లున్నది. లేకుంటే ఏమిటి? వాడు ఇంటికివచ్చి నన్ను చూసి పదేళ్ళయింది. నన్ను చూడకుండా ఒక్క దినం కూడా ఉండలేని బిడ్డ. చెల్లెళ్లను ఎంతప్రేమగా, అభిమానంగా చూసుకునేవాడు. అసంటి కొడుకు ఆ హిందూపిల్లతోపోయి మమ్మల్ని పూర్తిగా మరిచిపోయి, దాని కొంగు పట్టుకుని కుక్కలా దానిచుట్టే తిరుగుతూ, దాన్నే పలవరిస్తూ ఉన్నాడంటే ఏమిటి? ఖచ్చితంగా ఆ మందు ప్రభావమే. ముందు దానికి తెలిసిరావాలి. అదీ ఇద్దరుపిల్లల తల్లయింది. ఈ తల్లీపిల్లల ఉసురు దానికి తగలక మానదు. అమ్మాకొడుకుని, అన్నాచెల్లెళ్లను విడదీసిన పాపానికి దానికి తగిన శాస్తే జరిగితీరుతుంది. మేమేమీ చేయలేకపోయినా పైనుంచి అల్లా అన్నీ చూస్తునే ఉంటాడు. పాపపుణ్యాల లెక్క కడ్తూనే ఉంటాడు. ఆ!" గద్గద కంఠంతో, రోషం, కోపం, బాధ మిళితమైన గొంతుతో అరవైఏళ్ళ పుష్పమ్మ ఆరేళ్ళ పాపలా బయటపడిపోయింది.

అనూహ్యంగా ఆమె అలా భావోద్వేగానికి లోనయ్యేసరికి ఎలా ప్రతిస్పందించాలో తెలియక సందిగ్ధంలో పడ్డాను. ఆమెవైపు చూడలేక బయటకు చూశాను.

బండి రిపేరు పూర్తయ్యేసరికి వర్షం పెద్దగా మొదలైంది. జనం ఒలబిలమని బస్సులోకి ఎక్కేశారు. నేనూ నిశ్శబ్దంగా అక్కడ్నించి తప్పుకొని, నా సీట్లోకి చేరి, కళ్లు మూసుకున్నాను. నాకు తెలియకుండానే నిద్రలోకి జారిపోయాను.

సరిగ్గా నేను లేచేసరికి, బస్సు మా గమ్యస్థానం చేరుకుని ఉంది. అందరం కిందకి దిగాం. వర్షం ఇంకా పెద్దదైంది. కరంటు పోయి, ఊరు చీకటిగా ఉంది. ఒక గుడిసె హోటల్లో దూరి చాయ్‌లు తాగాం.

"సునో! మీరంతా ఇక్కడే ఉండండి. ముందు నే నొక్కడినే పోయి అడ్రసు ప్రకారం ఇల్లు వెతికి పట్టుకుని, జహంగీరును వెంటబెట్టుకుని వస్తాను. అప్పుడు అందరం వెళ్దాం" అని చీకట్లో బయలుదేరాను.

మా బావమరదంటే నాకంత మంచి అభిప్రాయం లేదు. ఇంటి సమస్యల్నించి, బాధ్యతల్నించి పారిపోవటానికే పెళ్ళాంతో దూరంగా ఉంటూ, పెళ్ళయినప్పటినుంచి పుప్పమ్మింటికి రాలేదని నేను అనుకుంటూ ఉంటాను. అందుకే నేను అతన్ని ఎప్పుడూ జ్ఞాపకం చేసుకోలేదు. అతనంటే నాకేమాత్రం గౌరవభావంకూడా లేదు. కాని పుప్పమ్మ ప్రేమమూర్తి నిత్యం అతన్ని గుర్తుచేసుకుంటూ మౌనంగా కుమిలికుమిలి రోదించేది. ఐదుపూట్లా దువాలో అల్లాను ఒకటే వేడుకునేది, కొడుకులో తమపట్ల ప్రేమ కల్గించమని. నమాజ్ పూర్తయ్యాక సిజ్దాలోనే ఉండిపోయి ఏకాంతంగా ఎవరికీ కన్పించకుండా ఎంతగా ఏడ్చేదో! ఆమె బాధను చూడలేక నేనే ఒకసారి ఆమెను, ఆమె కొడుకు పనిచేసే ఆఫీసుకు తీసుకుపోయాను. ఆమెను క్లబ్బురూములో కూర్చోబెట్టి, అతన్ని తీసుకొచ్చాను.

చాలా సంవత్సరాల ఎడబాటు పిదప ఆ తల్లీ తనయుడు ఎదురెదురుగా నిలబడి ఉన్నారు. ఒకర్నొకరు నిశ్శబ్దంగా అలా చూసుకుంటూ ఉండిపోయారు చాలాసేపటివరకు. వారి ముఖాల్లో అనిర్వచనీయభావం. వారి కండ్లు ఏ క్షణంలో అయినా తెగే చెరువుగట్లు. అసంకల్పితంగానే వారి అడుగులు ముందుకు పడి ఒకరి చేతుల్లోకి ఇంకోరి చేతులు తీసుకున్నారు. ఆత్మీయ రక్తస్పర్శ తగలగానే ఒక్కసారిగా ఇద్దరి కళ్ళలోనూ నీళ్ళు ఉబికాయి. పెద్దగా ఏడ్చేస్తారేమోనని భయంవేసి, ఆ క్లబ్బురూము తలుపులు మూసేసి, దర్వాన్‌లా బయట నిలబడ్డాను.

ఓ గంట గడిచాక ఇద్దరూ బయటకు వచ్చారు. ఆందోళనగా వారివైపు చూసిన నాకు తుఫాను తరువాతి ప్రశాంతత గుర్తొచ్చింది. ఇద్దరూ దేదీప్యమానపు ప్రసన్నతతో వెలిగిపోతున్నారు. ఒక మంచిపని చేశానన్న తృప్తి కలిగింది. నాకు.

తిరిగి మళ్ళీ ఐదేళ్ళకు ఈ రోజు వారిని కలపబోతున్నాను. ఈసారి వారి కుటుంబం యావత్తు కలుసుకోబోతుంది. కలవక కలవక కలవబోతున్న చెల్లెళ్ళు, నాయనమ్మ మనవరాళ్ళు అందరూ ఆత్మీయంగా ఒకర్నొకరు దగ్గర తీసుకునే ఆ దృశ్యం ఎంత అద్భుతంగా, కన్నులపండుగ మాదిరుంటుందో!

అలా ఊహల్లో విహరిస్తూనే బ్రాహ్మణ వాడలోని వాళ్ళింటిని సులభంగానే తెలుసుకోగలిగాను. ఇక్కడెవరికీ జహంగీర్ అంటే తెలియదు. అందరూ అతన్ని జగదీశ్వర్ అంటున్నారు.

తన భార్య, ఇద్దరుకూతుర్లతో 'జగదీశ్వర్' ఇంట్లోనే ఉన్నాడు.

"సలాములేకుమ్" అన్నాను బావమరిదితో. అతని భార్య ఉలిక్కిపడి భయంగా నావైపు చూసింది. నేను ఆశ్చర్యపోయాను. నన్ను చూసి ఆత్మీయంగా, ఉత్సాహంగా పలకరిస్తాడనుకున్న జహంగీర్ మామూలుగా ప్రతినమస్కారంచేసి, నావేపు అసౌకర్యంగా చూడసాగాడు.

అందరినీ బస్టాండులో వదిలొచ్చిన సంగతి చెప్పాను. ఈ వార్త విని అతని ముఖం వెలిగిపోద్దనుకున్న నాకు నిరాశే మిగిలింది. చావువార్త విన్నట్లు ఒక్కసారిగా

కుంగిపోయారు. ముందుగా ఆ యమ్మే రియాక్టయి భర్తను రెక్కపట్టుకుని వంటగదిలోకి విసురుగా లాక్కుపోయింది. ఆందోళన, భయం నిండిన స్వరాలతో గుసగుసగా ఏవో మాట్లాడుకున్నారు. వాళ్ళెందుకంత భయపడిపోతున్నారో నాకర్థం కావటం లేదు.

ఇంటిని ఒకసారి పరిశీలించాను. ద్వారానికి ఎదురుగా పెద్ద వెంకటేశ్వరస్వామి పటం. కలర్‌టీవి, సోఫాసెట్టు, ఫ్రిజ్జులతో నేనున్న గది అందంగా సర్దిఉంది. పిల్లలిద్దరు కూర్చుని శ్రద్ధగా, ఎంతో ఏకాగ్రతతో టి.వి చూస్తున్నారు. తెల్లగా, అందంగా, షోకేసుల్లో బొమ్మల్లా ఉన్నారు.

"పాపలూ! మీ పేర్లేమిటమ్మా?" తెలుసుకోవాలనే కుతూహలంకొద్దీ అడిగాను. నేను ఊహించినట్టుగానే హిందూ పేర్లే పెట్టుకున్నారు.

"నా పేరు లక్ష్మి. అక్కయ్య పేరు సరస్వతి" చిన్నపిల్ల ముద్దుముద్దుగా చెప్పింది. ఆ మాటలు వింటుంటే ముచ్చటనిపించి వారితో మాటల్లో పడిపోయాను.

చాలా సేపటి వరకు తర్జనభర్జనలు చేసుకున్నాక, ఏవో కొన్ని తీర్మానాలు తీసుకున్నట్లు, భార్యాభర్తలు ఇవతలికి వచ్చారు. చేతులు నలుపుకుంటూ, నసుక్కుంటూ జహంగీర్ చెప్పటం ప్రారంభించాడు:

"దేఖో భాయిజాన్, మమ్మల్నిక్కడ అందరూ హిందూస్ అనుకుంటున్నారు... మేమూ బ్రాహ్మణుల మాదిరే బ్రతుకుతున్నాం... ఈ ఊర్లో కులంపట్టింపులు ఎక్కువ... అందుకని... అందుకని... అమ్మీజాన్‌నీ చెల్లెళ్లను ఇంకొంచెం చీకటిపడ్డాక తీసుకుని రండి...ఓ గంట మాట్లాడి వెళ్ళిపోతారు. అమ్మను ఎలా అయినా బ్రతిమిలాడి బురఖా తీయించి తీసుకురండి... ప్లీజ్!"

అతని మాటలు వెంటనే అర్థం చేసుకోలేకపోయాను. అర్థమయ్యాక నిర్ఘాంతపోయాను.

పెళ్ళికి ముందు ఉద్యోగ సంఘాల్లో చురుకుగా, సామూహిక ప్రయోజనాల కొరకు పనిచేసిన మనిషేనా ఇతను అనిపించింది.

మహమ్మదీయుడిని ప్రేమించి, తల్లిదండ్రులను లెక్కచేయక, ఇంట్లోనుంచి పారిపోయి వచ్చి, ప్రేమించినతన్నే పెళ్ళిచేసుకున్న వనితేనా ఆమె అన్న సందేహం కల్గింది.

పెళ్ళిళ్ళు, కుటుంబాలు మనుష్యుల్ని ఎంత సంకుచితంగా చేసిపారేస్తాయో! జహంగీర్ మాటలకు ఎలా ప్రతిస్పందించాలో, ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

"సరే, వాళ్ళతో చెప్తాను" అని అక్కడ్నుంచి బయలుదేరి, బస్టాండు చేరాను. అందరూ బాగా తడిసిపోయి, గజగజ వణికేపోతున్నారు. ఫుప్పమ్మకు విషయం చెప్పాను. అందరిముందు, పెద్దమనిషని కూడా చూడకుండా, లాగిపెట్టి చెంప ఛెళ్ళు మనిపిస్తే, ముఖం ఎలా అయిపోతుందో అలా అయిపోయింది ఆమె ముఖం. చాలాసేపు నిశ్శబ్దంగా ఉండిపోయింది. జీవితంలో ఏనాడూ ఆమె బురఖా తీసేసి బయటకు రాలేదు. పైగా పెళ్ళి కావల్సిన ఆడకూతుర్లు ఉన్నారాయె!

అవన్నీ ఆలోచించుకుని ఒక నిర్ణయానికి వచ్చినట్లు "దేఖ్ బేటా! కష్టమనుకోకుండా ఇంకోసారి వెళ్ళి నా మనవరాళ్ళను తీసుకునిరా. వాళ్ళను ఒకసారి చూసుకుని,

ఇట్నేంచిటు మనూరికి వెళ్ళిపోదాం" కండ్లను తుడుచుకుంటూ అన్నది పుష్పమ్మ.

రాల్తున్న వర్షపు చినుకులు చీకట్లో మనకు కన్పించనట్లే, ఆ తల్లి కన్నీటి చుక్కలు అదృశ్యంగా జారి వర్షపునీటిలో కలిసిపోయాయి.

మారు మాట్లాడకుండా జహంగీరింటికి మళ్ళీ పోయాను. అతను లేడు, ఆ యమ్మ కన్పించింది. కోపంగా విషయం చెప్పాను. ఆమంటే మా వాళ్ళందరితోపాటు నాకూ మంచి అభిప్రాయం లేదు. కాని ఆమెకళ్ళు కూడా చెమ్మగిల్లటం చూసి ఆశ్చర్యపోయాను. మొఖం చాటేసుకుని, కళ్ళు తుడుచుకుంటూ లోనికిపోయింది. నా కోపం ఆమెను బాధిస్తుందనుకోలేదు. మనసు చివుక్కుమంది. నా భార్య, మరదళ్లయితే ఈమెను అవకాశం చూసుకుని కొట్టాలనే చూస్తున్నారు.

ఆమె ఒక సంచినిండా ఏవో పెట్టుకుని, తీసుకొచ్చి నా చేతికిచ్చింది. ఏమిటన్నట్లు చూశాను.

"మా ఆడపడుచులు రాకరాక మా ఊరొచ్చారు. వారి కొరకు ఓ మూడు జాకెట్టు ముక్కలు ఉంచాను. చీరెలు తెచ్చే సమయం లేకపోయింది. మీ పిల్లలకు బస్సులో తింటానికి బిస్కెట్లు పెట్టాను. అత్తమ్మ కొరకు కొంచెం పెరుగన్నం కలిపి బాక్సులో పెట్టాను ఆమె హోటల్లో తినదుగద!" ఆమె మాటలు నిజాయితీగానే అనిపించాయి. అయినా అనాలోచితంగానే అడిగేశాను–

"చేసేదంతా చేస్తూ, ఈ దొంగప్రేమలు నటించకపోతే ఏం?"

"చూడండి, మీరు నాకు పరిచయం లేకపోయినా, వారు మీ గురించి, మీ మంచితనం గురించి చెప్పారు. మీకన్నా చిన్నదాన్ని. మీకు చెప్పేంతదాన్నికాను. ఈ మతాంతర వివాహం వలన ఇన్ని సమస్యలు ఉంటాయనుకుంటే నేను పెళ్ళే చేసుకునే దాన్ని కాదు. కాని అన్నీ అనుకుని ప్రేమించం కద? ప్రేమించటం జరిగిపోయాక ఈ మతాలు, సాంప్రదాయాలు, లౌక్యపు ఆలోచనలు లాంటివి ప్రేమికుల్ని వేరు చేయలేవుకద? అందుకే పెళ్ళి చేసుకున్నాను. గృహిణిగా నా భర్త మానసిక ప్రశాంతత, నా పిల్లల భవిష్యత్తు, వారి పెళ్ళిళ్ళు నాకు ముఖ్యం. అత్తమ్మ ఎలా అయితే ఆమె కూతుర్ల కొరకు బురఖా తీసేయలేకపోయిందో, నేనూ నా కూతుర్ల గురించి ఆ కలమాలేవో చదివి, ఆ కాలిపోత్ ఏదో కట్టించుకుని, ఆ బురఖాలేవో తొడుక్కుని ఇస్లాంలోకి మారలేను. మా బతుకేదో మేం బ్రతుకుతున్నాం. మమ్మల్ని ఇలా బ్రతకనివ్వండి" అనేసి లోనికి వెళ్ళిపోయింది.

తోడు పిల్లలు లేకుండా వచ్చిన నన్ను చూసి, మావాళ్ళంతా నిరాశకు లోనయ్యారు. ఏమనుకున్నారో ఏమో, ఎవరూ ఏమీ అడగలేదు. నా భార్యమాత్రం కోపంతో "నేను ముందే ఊహించా, అది పిల్లల్ని పంపదని. దానిక్కావాల్సింది అన్నయ్యకు మనకు మధ్య ఏమాత్రం సంబంధబాంధవ్యాలు ఉండకూడదని. ఉంటే ప్రేమా ఆప్యాయతలు పెరిగిపోతాయి. అప్పుడు దాని పప్పులేమీ ఉడకవు. అదేమన్నా తక్కువ తిన్నదనుకున్నారా? హుషారుపిట్ట..." శాపనార్థాలు పెడుతూనే ఉంది.

అందరూ బాగా ఆకలితో ఉండి ఉండాలి. పొద్దున్న ఎప్పుడో తిన్నది. పైగా ఒకటే వర్షం. ఆకలి, చలితో బాధపడుతున్నా, ఎవ్వరికీ ఆ ధ్యాసే ఉన్నట్లులేదు.

అందరం తిరుగు ప్రయాణం కట్టాం. బస్సు కదులుతుండగా, దూరంగా ఒక లైటుక్రింద మసకవెలుగులో పిల్లల్నెత్తుకుని తల్లివైపే చూస్తున్న జహంగీర్ కనిపించాడు. పుష్పమ్మకు చెప్దామని ఆమెవైపు చూశాను. ఆమె ఎప్పటినుంచో అటువైపే రెప్పలార్పకుండా చూస్తున్నట్లుంది.

బస్సు వేగం పెరగటంతో వారి మధ్య దూరమూ పెరిగి, వాళ్ళు కన్పించకుండా పోయారు. పుష్పమ్మ మాత్రం  కళ్ళుమూసుకుని చీకట్లో చాలాసేపటి దాకా చేయి ఊపుతూనే ఉండిపోయింది.

● *సుప్రభాతం వీక్లీ, 24 ఏప్రిల్, 1 మే - 1999* ●

★ ★ ★

104

పి. చంద్

# హత్య

జులై మాసంలో ఒక రోజు.

వారం రోజులుగా ఒక్కటే ముసురు. ఎటూ కదలడానికి వీలులేకుండా ఉంది. వార్తల కోసం ఏ పని ఉన్నా లేకున్నా పొద్దున్నో సాయంత్రమో అలా ఊరు ఊరంతా తిరిగిరావడం అలవాటయిపోయింది.

కాని ముసురు మూలంగా ఎటూ కదలడానికి వీలుపడలేదు. ఆ రోజే కాస్త ముసురు వెలిసింది. రాత్రంతా సన్నగా తుప్పిరి తుప్పిరిగా పడ్డం వర్షం తెల్లారేసరికి పూర్తిగా వెలిసిపోయింది. లేత సూర్యుని కిరణాలు కడిగేసినట్టున్న చెట్ల కొసల మీదపడి ఆకుల పచ్చదనాన్ని మరింత కాంతివంతం చేస్తున్నది. బురద బురదగా ఉన్న నేల కడిగేసినట్టున్న వీధులు, నులివెచ్చని సూర్యకాంతికి సేద తీరుతున్నట్లుగా ఉన్నాయి.

అటువంటి సమయంలో పరంధామ పరుగు పరుగున వచ్చాడు....

పరంధామ చురుకైన కండ్లు, ఎప్పుడూ తొందరపడని స్వభావం. కాని ఆ రోజు ఎందుకో కాస్త హడావిడి పడుతున్నట్లు కన్పించాడు.

వచ్చీ రావడంతోనే "అన్నా, ఈ సంగతి విన్నావా! దేవాపూర్‌లో ఒక స్త్రీ హత్య జరిగిందట!"

"హత్యా!"

"అవును...రాత్రి జరిగిందట... పొద్దున్నే తెలిసింది. వివరాలేం తెలియదు."

"సరే, పది నిమిషాల్లో బయలుదేరుదాం. ఈ లోపు నీవోసారి స్టేషన్‌కు ఫోను చేసి, వివరాలు కనుక్కో. నేను ఇంతలో తయారు అవుతాను" అంటూ బట్టలు మార్చుకోవడానికి ఇంట్లోకి వెళ్ళాను. పదినిముషాల్లో తయారయి బయల్దేరాను.

మందమర్రి నుండి దేవాపూర్ దాదాపుగా ఇరవై కిలోమీటర్ల దూరం. చుట్టూ వలయాకారపు ఎత్తైన కొండల మధ్య ఉంటుంది. దేవాపూర్‌లో సిమెంట్ ఫ్యాక్టరీ ఏర్పడక ముందు అదో ప్రత్యేకమైన ప్రపంచం. సిమెంట్ ఫ్యాక్టరీ వచ్చిన తరువాత ఎత్తైన ఫ్యాక్టరీ గొట్టాలు, పెద్ద బిల్డింగ్‌లు, అధికారులు, ఉద్యోగులు ఉండే క్వార్టర్స్‌తో అక్కడి వాతావరణమే మారిపోయింది.

ఫ్యాక్టరీ చుట్టు ఎత్తైన గోడ. మెయిన్ రోడ్డు అనుకొని ఉన్న ఎంట్రెన్స్ గేటు, గేటు ముందు నుండి మెలుపు తిరిగే రోడ్డు సిమెంట్ లోడు కోసం వచ్చే లారీల పార్కింగ్ కోసం ఏర్పాటు చేసిన విశాల మైదానం మీదుగా ఉద్యోగులు ఉండే క్వార్టర్స్‌కు పోతుంది.

మైదానంలో రోడ్డుకు అవలివైపు మైదానం అంతమయ్యే చోట శవం పడి ఉంది.

అప్పటికే పోలీసులు పంచనామా కోసం వచ్చినట్టున్నారు. దేవాపూర్ సర్పంచ్ లచ్చిరెడ్డి, కంపెని పర్సనల్ మేనేజర్, పోలీసు అధికారి శవానికి దూరంగా వేసి ఉన్న కుర్చీల్లో కూచొని ఉన్నారు.

మమ్మల్ని చూసి సర్పంచ్ పలకరించాడు. లచ్చిరెడ్డికి యాభయి సంవత్సరాలు పైబడి ఉంటాయి. బక్కగా నల్లగా ఉంటాడు. ఏదో దిగులు ఆవరించినట్లుగా విచారం కమ్ముకున్నట్టుగా ఉంటాడు. మంచి మనిషి. ఆ మంచితనమే ఆయన్ని నల్గురిలో నిలబెట్టింది. ఎలక్షన్ల సమయంలో అంతకుముందోసారి పరిచయం ఉంది. పర్సనల్ మేనేజర్ ప్రసాదరావు చిర్నవ్వు నవ్వి ఊరుకున్నారు. యస్సై చూసీ చూడనట్టుండి పోయాడు.

యస్సైని వివరాల గురించి అడిగినప్పుడు అతను నిర్లిప్తంగా "ఏముందీ, ఎవరో చెరిచి చంపేసిట్టుంది. ఎంక్వయిరీ జరుగుతున్నది. పోస్టుమార్టం పోయి వచ్చినంక కాని పూర్తి వివరాలు చెప్పలేము" అంటూ ముక్తసరిగా అన్నాడు.

అమ్మాయి పేరు జంగుబాయి అని, వయసు పాతిక లోపేనని, తండ్రి సోయంపోషం, తల్లి ఇస్రుబాయి అని, వాళ్ళది ఫ్యాక్టరీ అనుకొని ఉన్న గూడెం అని వివరాలు చెప్పాడు.

శవం చుట్టు గుమికూడి ఉన్న జనానికి మధ్యలో శవం పక్క కొద్దిమంది గిరిజనులున్నారు. ఛాతిమీద ఏ విధమైన అచ్ఛాదన లేని, ఎండిపోయిన ఛాతిని బాదుకుంటు ఏడుస్తున్న ఒక ముసలమ్మ. చనిపోయిన అమ్మాయి తల్లిని పట్టుకొని మరో ఇద్దరు గిరిజన స్త్రీలున్నారు. ముడతలు పడ్డ చప్పిడి ముఖం వృద్ధుడే సోయంపోషు. మాట పలుకులేకుండా ఆ ముసలిదాని పక్కన కాళ్ళమీద కూచొని ఉన్నాడు. ఒక నడీడు మనిషి, మరో ఇద్దరు ముగ్గురు యువకులు వారి పక్కనే ఉన్నారు.

దేవాపూర్ సర్పంచ్ వెంటరాగా మేము ఆ గిరిజన స్త్రీ కుటుంబ సభ్యులను కల్సాము.

"వా! వాల్లింట్ల మన్నుబొయ్య... నా బిడ్డను సంపేసిండ్లు..." అంటు ముసలితల్లి మమ్మల్ని చూసి మరోసారి బోరుమంది.

ముసలి తండ్రి పులుకు పులుకున మాకేసి చూస్తు మాట పలుకు లేకుండా గాజుకళ్ళతో చూస్తుండిపోయాడు.

"ఎలా జరిగింది? మీకెవరి మీదనైనా అనుమానం ఉందా?" అని ఆ పక్కనే ఉన్న వాళ్ళకు సంబంధించిన యువకుల్ని ఉద్దేశించి అడిగాను.

అతను గాఢంగా నిట్టూర్చాడు. "ఏం చెప్పేది సారు... ఎట్లా జరిగిందో మాకు తెలువది. రెండు రోజుల నుండి ఇంటికి రాలేదు. గతంలో కూడా గిట్లనే వారం పది రోజుల దాకా ఇంటికి రాకుండా పోయేది. ఎటో తిర్గి తిర్గి దానికి బుద్ధి

పుట్టినపుడు ఇంటికి వచ్చేది. ఎన్నిసార్లు చెప్పినా దానికి బుద్ధి రాలేదు. చెప్పి చెప్పి యాష్టకొచ్చి ఊరుకున్నాము. కాని గిట్లయితదని ఊహించలేదు." అతని కళ్ళలో నీళ్ళు తిర్గాయి.

"చనిపోయిన అమ్మాయి అన్న అతను. ఇక్కడే కూలినాలి చేసుకుంటు బతుకుతున్నాడు. ఆ పక్కన ఉన్నతను కూడా ఆ అమ్మాయి అన్నే. వాళ్ళకు తోడబుట్టింది ఒక్కతే ఆడపిల్ల. ఉన్న ఒక్కదాని బతుకు ఇట్లా ముగిసింది." సర్పంచ్ లచ్చిరెడ్డి విచారంగా చెప్పుకొచ్చాడు.

అప్పటికే కంపెని వాళ్ళు ఏర్పాటు చేసిన లారీ వచ్చింది. చూడవచ్చిన జనాన్ని అటు ఇటూ తరుముతూ పోలీసులు శవాన్ని పోస్టుమార్టంకు తీసుకుపోయేందుకు తొందరపడుతున్నారు.

ఒక్కసారి శవాన్ని చూసి ఫోటో తీయాలని, ఫోటో ఉంటే న్యూస్ కవరేజ్‌కి బాగుంటుందని మా తాపత్రయం.

ఒక పాత బట్ట శవం మీద కప్పేసి ఉంది. తల, కాళ్ళు బయటే ఉన్నాయి. సగం తెరిచి ఉన్న కళ్ళు నిస్తేజంగా ఫ్యాక్టరీ కేసి చూస్తున్నట్లుగా ఉన్నాయి. చెదిరిన తల, నోటివెంట కారిన సొంగ సిమెంట్ దుమ్ముచే కప్పబడ్డ ఆ మైదానంలో ఇంకిపోయి ఉంది. పాతిక కంటే మించిన వయసు ఉండదు.

"ఫోటో తీయాలి, ఆ బట్టకాస్త తొలగిస్తారా?"

హెడ్‌కానిస్టేబుల్ మా మాటలకు ప్రతిస్పందిస్తూ "చాలా బీభత్సంగా ఉంది సార్! మీరు చూడలేరు..."

"అయినా ఫర్వాలేదు."

బట్ట తొలగించాడు. చిరిగెన జాకెట్టు నగ్నమైన రొమ్ములు. నడుము వరకు చెదిరిపోయిన చీర అచ్చాదనగా మానం మీద కప్పి ఉంది. చాల బీభత్సంగా భయంకరంగా ఉంది. చూడలేకపోయాము. "బట్టకప్పేయండి ఒక్క మొఖం కనిపిస్తే చాలు."

ఒక్కసారి ఆ అమ్మాయి మొఖాన్ని పరీక్షగా చూసాను. గుండ్రటి ముద్ద మొఖము. కాకుంటే గిరిజనులకు సహజంగా ఉండే చప్పిడి ముక్కు. మెడలో పూసల పేరు. చెవులకు బొగరి రింగులు. మాసిన తలలో ప్లాస్టిక్ పూలు. తెచ్చి పెట్టుకున్న పారిశ్రామిక సంస్కృతి బురద బురదగా ఉన్న ఆ సిమెంట్ నేలలో కల్సిపోయింది.

ఫోటో తీసుకొని బయటకి వస్తూ-

"ఏం చేస్తుండేది ఆ అమ్మాయి?" అంటూ సర్పంచ్‌ను అడిగాను.

సర్పంచ్ మొఖంలో విషాదం కమ్ముకుంది. "ఏం చెప్పమంటారు?" అని మౌనం దాల్చాడు.

సర్పంచ్ మాటలు నాలో ఆసక్తిని లేపాయి. లచ్చిరెడ్డి మొఖం వివర్ణమైంది. అంతవరదాకా అణచిపెట్టుకున్న ఆవేదన బద్దలైనట్టుగా గొంతు గంభీరమైంది.

"చుట్టు గీ కొండలు చూడుండ్లి. ఈ కొడల నడుమ గుబురుగా పెరిగిన చెట్లను చూడుండ్లి. మీరు నిలబడ్డ నేలను చూడుండ్లి. అంతా సిమెంట్ దుమ్ము. ఒక చెట్టు బతకదు. మేము బతకం."

విషాద పూరితంగా ఏదో చెప్పాలనే ఆవేశం అతనిని ఇంకేమి మాట్లాడనివ్వలేదు.

"ఇంతకు మీరనేది?"

"ఏం లేదు, ఆ పోరి చెడిపోయింది. ఎవనితోని పడ్తే వానితోని తిర్గేది. అట్లా తిర్గి తిర్గి గిట్లయిపోయింది బ్రతుకు." ఆయన గొంతు పూడుకుపోయింది దుఃఖంతో.

"మీరు బాధలో ఉన్నారు మరోసారి కలుస్తాను" అని లచ్చిరెడ్డి నుండి సెలవు తీసుకోబోతుంటే—

"ఇదిగో అన్న! మా బాధ మా కడుపులనే మసలుతాంది. మా గురించి ఎవరు పట్టించుకున్నది లేదు. కంపినోడు మమ్మల్ని నీళ్ళు లేని కాడ బొందిగ కోసిండు. నీతోని చెప్పుకుంటే కనీసం లోకంకన్నా తెలుస్తది. నీతోని వివరంగా మాట్లాడాలని ఉంది" అన్నాడు ప్రాధేయపడుతున్నట్లుగా.

"తప్పకుండా మాట్లాడుదాం."

"ఎప్పుడంటే అప్పుడే."

"పంచనామ ఎప్పుడైతదో తెలువదు. ఆ తరువాత కావల్సిన కర్మకాండ. రెండు రోజుల తరువాత వీలు అవుతుందా?"

"తప్పకుండా వస్తాం."

శవాన్ని లారీలో ఎక్కించి గవర్నమెంట్ హాస్పిటల్‌కు తీసుకుపోయారు. పెద్ద హడావిడి ఏం లేకుండానే మామూలుగా హత్యా నేరాన్ని నమోదు చేసుకొని వాళ్ల పని ముగించుకొని పోయిండ్లు పోలీసులు. చుట్టుపక్కల గూడెంల నుంచి వచ్చిన గిరిజనులు మెల్లమెల్లగా ఎవరిదారంట వాళ్ళు వెళ్ళిపోయిండ్లు. కావల్సినవాళ్ళను వెంటపెట్టుకుని సర్పంచ్ లచ్చిరెడ్డి గవర్నమెంట్ దవాఖానాకు పోయిండు.

ఆ రోజు సాయంత్రం మామూలుగా దేవాపూర్‌లో జరిగిన హత్య గురించి పోలీసులు ఇచ్చిన రిపోర్టు, అమ్మాయి పేరు వయసు తల్లిదండ్రుల పేర్లు, హత్య మీద పోలీసులు తెలిపిన అనుమానం అంతా రిపోర్టు రాసి పంపాను. కాని ఏదో అసంతృప్తిగా ఉంది. ఎందుకో సర్పంచ్ మాటలు నన్ను కలచివేశాయి.

నేను పుట్టి పెరిగింది కాలనీ ప్రాంతంలోనే. మా నాన్న బొగ్గు బావుల్లో క్లర్కుగా పని చేసేవాడు. నా చిన్నప్పుడు దేవాపూర్ ప్రాంతం నుండే గిరిజనులు కట్టెల మోపులు తెచ్చి కాలనీ ప్రాంతంలో అమ్ముకొనిపోవడం బాగా గుర్తుంది. ఇప్పుడు చుట్టుపక్కల అడవులు లేకుండా పోయినవి. సిమెంట్ ఫ్యాక్టరీ పడ్డ తరువాత అక్కడి వాతావరణమే మారిపోయింది. అడవి అంతరించింది. సిమెంట్ ఫ్యాక్టరీ రేపే దుమ్ముతో అక్కడి చెట్లు, అడివి మసక బారిపోయాయి. అక్కడి సంస్కృతిలో మార్పు వచ్చింది. ఫ్యాక్టరీతోపాటు పనిచేసే కార్మికులు, టెక్నీషియన్లు వచ్చిండ్లు. కార్మికులతో పాటు యూనియన్లు వచ్చినవి, రోడ్లు, రైల్వే లైను వచ్చింది. ప్రతి రోజు ఆ రోడ్డు మీద తిరుగాడే వందలాది లారీలు వచ్చినవి. ఫ్యాక్టరీతో పాటు శాంతి భద్రతలు కాపాడేందుకు పోలీసు స్టేషన్ వచ్చింది. అందులో దేవాపూర్‌లో సిమెంట్ ఫ్యాక్టరీ పెట్టిన బిర్లా యాజమాన్యానికి కేంద్రంలో ఉన్న పలుకుబడి

మూలంగా అన్ని హంగులు ఏర్పడ్డంలో ఎటువంటి ఇబ్బందులు ఎదురుకాలేదు. కోట్లాది రూపాయలు వెచ్చించి వారు ప్రత్యేకంగా ఫ్యాక్టరీకి లైను వేసిండ్లు.

మూడవ నాడు లచ్చిరెడ్డిని కలువడానికి పోయాను. ఫ్యాక్టరీ రోడ్డును అనుకొని వూళ్ళోకిపోయే మట్టి రోడ్డు ఉంది. ఫ్యాక్టరీ గేటును అనుకొని పోయే ఆ మట్టి రోడ్డులో మరికాస్త ముందుకుపోతే దేవాపూర్ ఊరు వస్తుంది. దేవాపూర్ ఒకప్పటి గిరిజన గూడెం. దాని తాలూకు ఛాయలు ఇంకా ఆ వూళ్ళో కనిపిస్తూనే ఉన్నాయి. పాతిక ముప్పయికి మించి లేని పూరి గుడిసెలు, వాటి మధ్య ఒకటి రెండు పెంకుటిండ్లు. సర్పంచ్ ఇల్లు కాస్త పెద్దగా ఉంది. పాత తరం ఇల్లు, లావాటి టేకుదూలాలతో కట్టి ఉంది. ఎప్పుడో లచ్చిరెడ్డి తాతల నాడు గోదావారి ఆవల నుండి ఈ వూరికి బతకవచ్చిండ్లు. అట్లా బతకవచ్చిన ఎలమలు, రెడ్లు అటు తరువాత పెద్దపెద్ద భూస్వాములు అయిపోయి, వేలాది ఎకరాలు ఆక్రమించిండ్లు. కాని లచ్చిరెడ్డి కుటుంబం మాత్రం ఇంకా మధ్యతరగతి రైతు కుటుంబపు పరిస్థితి నుండే మారలేదు. ఉన్న పాతిక ఎకరాల్లో పది ఎకరాలు ఫ్యాక్టరీ కింద పోయింది. మరో ఎనిమిది ఎకరాలు బొడగ రాళ్ళతో నిండిపోయి, పశువులు మేపుకొనే కంచెగా పనిచేస్తుంది. మరో ఏడు ఎకరాల్లో కాలాన్ని బట్టి మక్కలో, పెసరో వేసినా పంట అంతంత మాత్రమే. అంతకుముందు ఎలక్షన్లు జర్గినా అంత గుర్తింపు ఉండేది కాదు. ఫ్యాక్టరీ వచ్చిన తరువాత గ్రామ పంచాయతీ ఎన్నికలకు ఒక ప్రత్యేకత ఏర్పడింది. లచ్చిరెడ్డిది అందరితో కల్సిపోయే తత్వం. అదే అతన్ని స్థానిక దొరలను కాదని సర్పంచ్‌ను చేసింది. కాని సర్పంచ్‌గా తాను ఏం చేయలేనని అర్థం కావడానికి అతనికి ఎక్కువ రోజులు పట్టలేదు.

పెంకుటింటి ఎదురుగా వేసి ఉన్న కొట్టం గుండా ముందు రూమ్‌లోకి పోయి కూచున్నాం. అతను ఇంట్లో ఏదో పనిలో ఉన్నట్టుంది. నేను వచ్చింది తెలుసుకొని చేస్తున్న పనిని వదిలి ఆదరంగా వచ్చిండు.

"మీరు అనుకున్నట్లుగా వచ్చిండ్లు."

పరిచయపూర్వకంగా మాటకలిపిండు.

"అనుకున్న తరువాత రాకుండా ఎలా ఉంటాము?" అన్నాను.

ఇంటి ముందున్న ఓ యువకున్ని లచ్చిరెడ్డి కేకేసి పిలిచాడు. "నారాయణను, పోషను పిలచుకరాపో" అని పంపించిండు.

"చాయ్, ఫలహారం ఏమన్నా?" అడిగాడు లచ్చిరెడ్డి.

"అచ్ఛే ఎందుకు? ఇప్పుడే చాయ్ తాగి వచ్చిన." అన్నాను మొహమాటంగా.

"అట్లా అంటే ఎట్లా సారు? రాక రాక మా ఇంటికి వచ్చిండ్లు. మా తృప్తికోసమైనా ఏదన్నా తీసుకోవాలె" అన్నాడు లచ్చిరెడ్డి...

"అమ్మను చాయ్ పెట్టమను" అంటూ పది పన్నెండు ఏండ్ల వయసున్న వాళ్ళ అమ్మాయిని పురమాయించిండు.

నేను విషయంలోకే లాగాను.

"కేసు ఏమైంది?"

"కేసు ఎమైతది సారు! దానిగురించి పట్టించుకున్నది ఎవరు? ఎంక్వయిరీ కొనసాగుతుందని యెస్సై చెప్పిండు. ఆ రోజు వచ్చిన లారీలోల్లను, ఇంకా అక్కడి చిన్న చిన్న హోటల్‌వాళ్ళను ఇంక్వైరీ చేసిండ్లు. అయినా ఇప్పుడు చేసేది ఏముందీ? పోయిన ప్రాణం పోనే పోయింది. ఉన్న ప్రాణాలన్నా పోకుండా చూసుకోవాలె." లచ్చిరెడ్డి మాటల్లో విచారం.

అయన మాటలేవీ నాకు సరిగా అర్థం కావడం లేదు. అలవాటుగా కలం కాగితము చేతుల్లోకి తీసుకున్నాను.

లచ్చిరెడ్డి ఒకసారి నాకేసి, నా చేతుల్లోని కలం కాగితాలకేసి చూస్తూ చెప్పసాగాడు.

"జంగుబాయి హత్య జరిగింది కాబట్టి కేసయింది. కాని కేసు కాకుండా ఎంతమంది అమ్మాయిలు కనపించకుండాపోయిండ్లో లెక్కే లేదు." అతని మొఖంలో అదే విచారం.

లచ్చులు చెప్పడం ప్రారంభించాడు: "ఫ్యాక్టరీ రాక ముందు మేము ఇక్కడ ఈ అడివిల జంతువుల్లో జంతువుల వోలే మా బతుకు మేం బతికినం. మాకున్న భూముల్ల విత్తో చెట్టో నాటి, దేవుడు కరుణించి ఇంత ఫలమో పత్రో పండితే అదే తిని బతికినం. పంటలు పండని నాడు అడవుల తల్లి జంతువుల తీర్గ ఆకులు అలములు తిని బతికినము. ఎప్పుడైతే ఈ ఫ్యాక్టరీ ఇక్కడ పడ్డదో అప్పుడు మా కష్టాలు మొదలయినవి. ఫ్యాక్టరీ పడ్తె భూములు పోయినవాళ్ళకు ఉద్యోగాలు ఇస్తమన్నారు. పది పన్నెండు సంవత్సరాలయింది. ఇంతవరకు ఒక్కరికి ఉద్యోగం ఇచ్చింది లేదు. మా పొలాలల్ల చెలకల్ల సిమెంట్ దుమ్ము పేరుకుపోయింది ఎంత కష్టపడ్డా ఒక్క మొలక మొలవదు. మొలచిన మొలకైనా గింజ రాల్చదు. ఇక దాంతో మా వోళ్లంతా అన్నమో రామచంద్రా అంటూ తలోదారి పట్టిండ్లు. కొన్ని కుటుంబాలు పొట్ట చేతపట్టుకొని ఇక్కడినుండి వెళ్ళిపోయిండ్లు. మరికొంత మంది ఇక్కడక్కడ కూలినాలి చేసుకుంటూ బతుకులు వెల్లదీస్తాండ్లు."

ఇంతలో ఇందాక వూళ్ళోకి పంపించిన యువకుడు కొంతమంది గ్రామస్తులను వెంటపెట్టుకుని వచ్చిండు.

లచ్చిరెడ్డి వచ్చినవాళ్ళకేసి చూసి నారాయణ లేడా అని అడిగిండు.

"పొద్దున్నే పనికి పోయిండట, సాయంత్రానికి కాని తిర్గిరాడని చెప్పింది" అన్నాడాయువకుడు.

వచ్చినవాళ్ళలో కొంతమంది ఇంటిముందు అరుగు కొసన కూచున్నారు. మరి కొంతమంది వాకిట్లో నిలబడి ఉన్నారు. ఇంకొంతమంది మేమున్న గదిలోకి వచ్చిండ్లు.

లచ్చిరెడ్డి వాళ్ళను ఉద్దేశించి "ఈ సారు పేపర్ల రాస్తడు. మన బాధలు ఈ సారుతోని చెప్పుకుంటే పేపర్ల వస్తది. అట్లనన్నా మన కష్టాలు లోకానికి తెలుస్తయి. అప్పుడన్న కంపినోడు మన గురించి ఏమన్న పట్టించుకుంటడేమో!" అంటూ నన్ను పరిచయం చేసిండు.

వాళ్ళంతా పులుకు పులుకున నాకేసి చూస్తుండిపోయిండ్లు. నిజానికి పేపర్లో వచ్చినంత మాత్రాన వాళ్ళ కష్టాలు గట్టెక్కుతాయని నాకే మాత్రం నమ్మకం లేదు. ఫ్యాక్టరీ వచ్చి దాదాపు పది పన్నెండు సంవత్సరాలైనా వాళ్ళకు ఇస్తామన్న ఉద్యోగాలు

కూడా ఇవ్వలేదు. చట్టాలు అధికారులు చివరికి పేపర్లు కూడా ఏం చెయ్యలేవని అన్నికూడా డబ్బున్నవాని ఇంటిముందు కావలికుక్కలని వాళ్ళకు తెలియకపోవచ్చు.

ఇంట్లో నుండి చాయ్ వచ్చింది. లచ్చిరెడ్డి నాకో కప్పు ఇచ్చి తనొకటి తీసుకున్నాడు.

చాయ్ చప్పరిస్తూ "మేం పేపర్ల రాసినంత మాత్రాన మీ కష్టాలు తీరుతాయని నాకైతే నమ్మకం లేదు. మీ సమస్య పరిష్కారం కావడానికి మా రాతలు ఏమేరకైనా దోహదపడ్తే అదే సంతోషం" అన్నాను.

పొట్టిగా పీక్కుపోయిన దౌడలు, వెడల్పు ముక్కు, సగం నెరిసిన తల, నెత్తికి చుట్టిన పాత పేగు, మొలకో పంచె, చేతులు జోడించి నా ముందు నిలబడ్డాడు ఓ నడీడు మనిషి.

"నా కంటే పెద్దాయనవు. నాకు దండాలు పెట్టవద్దు. అట్లా కూచోని నీవు చెప్పాలనుకున్నది చెప్పు."

నేల మీద కూచున్నాడు.

"నీ పేరు?"

"జంగు... తొడషం జంగు."

"ఫ్యాక్టరీ రావడం వల్ల నీకు వచ్చిన నష్టమేందో వివరంగా చెప్పు పెద్దయ్యా!"

ఎలా మొదలుపెట్టాలో తెలియక క్షణకాలం బిత్తరచూపులు చూసిండు.

లచ్చిరెడ్డి కల్పించుకొని "ఇప్పుడీ ఫ్యాక్టరీ అడుగున్నె జంగు భూములుండేవి. ఫ్యాక్టరీ కింద భూములు గుంజుకున్నారు. కాదు కూడదన్నా మా మాట ఎవరు విన్పించుకోలేదు. ఎమ్మార్వో వచ్చిండు. సర్వేయర్లు వచ్చిండ్లు. కంపెని అధికార్లు వచ్చిండ్లు. ఎకరానికింత అన్నారు. జంగు పదిహేను ఎకరాలకు పదిహేను వేలిచ్చిండ్లు.

"దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకున్నట్టుగా చేసిండ్లు. అదే కాసిపేట దొరభూములు క్వారీకింద పోయినయని ఎందుకు పనికి రాని భూములకు ఎకరానికి పాతికవేలు ఇచ్చిండ్లు. అడిగే నాథుడు లేడు. న్యాయంగా వాల్యుయేషన్ చేసింది లేదు. అంత అన్యాయమే జరిగింది" అని లచ్చిరెడ్డి చెప్పుకొచ్చిండు.

జంగు నిజమే అన్నట్టుగా తలాడించిండు.

"సరే, మరి భూములు పోయిన తరువాత నీవు ఏం చేస్తున్నావు?"

నా ప్రశ్నకు సూటిగా నా మొఖంలోకి చూస్తు తొడషం జంగు "ఏమున్నదయ్యా, ఏదో కూలినాలి చేసుకుంటు బతుకుతున్నాము. కొడుకులు నాతోపాటే కూలిచేస్తరు. నా బిడ్డ పన్లేస్తది అయినా తిండికే ఎటమటమైతాంది."

"జంగన్న, మీ చిన్నోని సంగతి చెప్పు." ఎనక నిలుచున్న అతను ఎవరో అన్నారు.

చిన్న కొడుకు ప్రస్తావన వచ్చేసరికి జంగు మొఖంలో విషాదము అలుముకొంది.

"మా చిన్నకొడుకు పోయినేడు చనిపోయిండు. మా భూములు పోయిన తరువాత ఉద్యోగాలు ఇస్తామని చెపితే, మా చిన్న పోల్లగాన్ని ఫ్యాక్టరీకి పంపిస్తే, కంట్రాక్టరు దగ్గర లోడింగ్ అన్ లోడింగ్ కాడ పెట్టిండ్లు. అక్కడ పని చేసేసరికి బల్లచెక్క తీర్గున్న మనిషి నల్లపూస తీర్గ అయిండు. రోజుకు పది గంటలు సిమెంట్ దుమ్ముల పన్లేసే సరికె వాని ఊపిరితిత్తులు చెడిపోయినయి. ఎన్ని మందులు తిన్నా రోగం తగ్గలేదు.

వాడు ఎంతో అపచ్చని పడి పనిచేసి సంపాదించుకున్న పైసలు వాని రోగానికే సరిపోలేదు. సిమెంటు వాని ఊపిరితిత్తుల గడ్డలు గడ్డలుగా పేరుకపోయిందన్నరు. అపరేషన్ చేస్తే బతుకుతాడన్నారు. కంట్రాక్టరు దగ్గిర పన్డేసే వానికి పర్మినెంటు వాళ్ళ రూల్స్ వర్తించవని కంపెని చేతులు దులుపుకున్నది. చేతిలో చిల్లిగవ్వలేక ఆరునెల్లు నా కొడుకు మంచంల పడి సచ్చిపోయిండు. వానికి ఇద్దరు పోరగాండ్లు, భార్య ఉన్నది."

జంగు కండ్లలో నీళ్ళూరినయి.

అటు తరువాత హన్మంతు మాట్లాడిండు. ఆయన పరిస్థితి కూడా జంగు పరిస్థితి కంటే భిన్నంగా లేదు. కాని ఇంతలోకే యాబయి సంవత్సరాలు పైబడిన ఒక స్త్రీ వచ్చింది. ఆమె ముక్కు దూలానికి వేలాడే రింగ్ లాంటి ఆభరణము. చెవులకు సాగిపోయి వేలాడే గెంటీలు. మెడలో పాతకాలంనాటి వెండి కంటే, పూసల పేర్లు. కట్టుకున్న చీర కొంగుతో రొంటొచ్చెను కప్పుకొని, చీర కొంగు నడుములో చెక్కుకున్నది. ఇక్కడేదో రాతపూతలు జరుగుతాన్నయని తెల్సి ఆగం ఆగంగా ఉరికి వచ్చింది. కాని పేపర్లరాసే వాళ్ళు వచ్చిండ్లని తెల్సి "రాస్తె మనకే మస్తదట? మన భూములు మన కస్తయా? ఏమన్న పైసలు వస్తయా?" అంటూ అమాయకంగా అడిగింది.

"ఆవేమి రావు." ఎవరో వెనుక నుంచి అన్నరు.

అట్లనా అంటు, అక్కడ ఇక తనకేమి పనిలేనట్టుగా తిర్గి పోబోతుంటే లచ్చిరెడ్డి కల్పించుకొని "లచ్చక్క, కాసేపు నిల్చోరాదే! మన కష్టం చెప్పకుంటే వినే మనిషి దొరికేండు" అన్నాడు.

లచ్చమ్మ పెద్ద బోసినోరు తెరిచి–

"ఇదిగో అయ్యా, నేను చెప్పేది లేదు. మాది ఎనిమిది ఎకరాల చెల్క పోయింది. మిగిలిన భూముల దుమ్ముతప్ప మరేమి పండదు. మా ముసలాయన మంచంల పడ్డడు. చేసేటోళ్ళు ఎవరు లేరు. కంపెని వోడు మాకింకా పైసలు ఇయ్యాలె. పైసలు రావాలని రాయిండ్లే."

"పైసలు ఎక్కడివి? పైసలు ఏమి ఇచ్చేది లేదంటా." ఓ యువకుడు ఆమె మాటలకు అడ్డుతగిలిండు.

"అదేందయ్యో, పల్కలవాగు వొడ్డున బంగారం పండేది. ఎకరానికి వెయ్యి ఇచ్చి చేతులు దులుపుకుంటే అయితాది? ఎకరానికి పది వేలు పెట్టినా అటువంటి చెల్కరాదు. వాడిచ్చిన వెయ్యి ఏ లెక్క ప్రకారము? వీల్లందరు పైసలు రావంటరు. పైసలు ఎందుకు రావు? రాకుంటే మాకు మా అటువంటి భూమి చూయించుండ్లి. నీళ్ళు లేని కాడ బొండిగ కోసినట్టు చేసిండ్లు. ఇదేం న్యాయం? భూమి మీద ఇంత అన్యాయం పనికి రాదు బిడ్డా! అన్యాయం చేసినోళ్ళను బాయమ్మ తల్లి (గిరిజన దేవత) ఊరికే ఇడువది."

లచ్చక్క మెరుపులా వచ్చింది. ఉరుములా ఉరిమింది. బడబడ అని, తనకు పని ఉందని వెళ్ళిపోయింది.

"ఒకప్పుడు మంచిగానే బతికింది. మొగోనికంటే ఎక్కువ కష్టపడ్డది. యవసాయంలో లచ్చక్క చేరాని పనంటు లేదు. ఏమైతేనేమి అందరిలాగే దాని భూములూ పోయినవి. ముసలాయన చాతకాకుండా అయిండు. ఒక్క బిడ్డ ఉండేది. బతుకు దెరువుకోసం గా కొండల్లో దొరికే పరికిపండ్లో రేగుపండ్లో ఏరుకొని వచ్చి ఫ్యాక్టరీ గేటుకాడ అమ్మకుంటది. దానితోపాటే లచ్చక్క ఎదిగిన బిడ్డ కూడా అదే పనిచేసేది. అమాయకురాలు. పొల్ల అన్నెంపున్నెం తెల్వనిది. ఫ్యాక్టరీకాడి కంట్రాక్టరు గాళ్ళు దాన్ని మాయమాటలు చెప్పి పావులా పర్క ఇచ్చి మచ్చిక చేసుకున్నరు. చివరికి ఎవనితోనో లేసిపోయింది. ఆర్నెల్లయితాంది, మళ్ళీ తిర్గిరాలేదు."

అటు తరువాత మరికొంతమంది మాట్లాడిండ్లు. కాస్త ఎచ్చుతగ్గులున్నా అందరి బాధ ఒక్కతీర్గనే ఉన్నది. కాకుంటే పేర్ల మార్పు. అంతే తేడా. గూడేల వారిగా ఎన్ని కుటుంబాల వారిది ఎంతెంత భూమి కోల్పోయింది వివరాలు అడిగి నోటు చేసుకున్నాను. కాని ఈ రిపోర్టు ఒక్కటే సమగ్రం కాదనిపించింది. ఒక్కసారి అన్ని గూడేలు తిర్గి ప్రత్యక్షంగా చూడాలనే కోరిక కల్గి, అదే విషయం వారితో చెప్పాను.

లచ్చిరెడ్డి నా మాటకు సంతోషం వ్యక్తంచేస్తూ "మేమే మా గూడాలను చూయించాలనుకున్నాము. కాని మీకు మాతో పాటు తిర్గే ఓపిక ఉంటుందో లేదోనని ఎనక ముందాడినాం" అంటూ దారితీశాడు.

దేవాపూర్ సిమెంట్ ఫ్యాక్టరీ చుట్టు కోట పెట్టినట్టున్న ఎత్తైన కొండల ప్రాంతం. సహజసిద్ధమైన కోటలా ఉంటాయి కొండలు. ఒక్కవైపు నుంచే దారి ఉంటుంది. ఆ దారికి మించి ఫ్యాక్టరీకి పోయే మార్గం మరొకటి లేదు. ఎటు ఐదారు మైళ్ళ వరకు విస్తరించి ఉన్న వలయాకారపు కొండల మధ్య దాదాపుగా పాతిక ముప్పయి దాకా గూడాలున్నాయి. గిరిజన గూడెం అంటే పెద్ద ఊరేమి కాదు. ఒక్క దేవాపూర్ గ్రామమే కాస్త పెద్దది. మిగతా గూడేలల్లో ఎక్కడ కూడా పది పదిహేను గుడిసెల కంటే మించి లేవు. వాళ్ళ బతుకుల్లాగే వాళ్ళ గుడిసెలు కూడా సరైన కప్పులు లేక పేదరికము తాండవిస్తు కనిపించినై. దిసంమొల పిల్లలు, సరిగా అచ్చాదన లేని స్త్రీలు. బక్క చిక్కిపోయి చావుకోసం ఎదురుచూసే వృద్ధులు. ఇంకా ఆదిమ కాలం నాటి జీవన విధానాన్ని తలపిస్తున్నాయి. ఒక గూడేనికి మరో గూడానికి పోవడానికి బండ్ల బాట కూడా సరిగా లేదు. కాలిబాట తప్ప మరో మార్గం లేదు.

ఇంద్రవెల్లి సంఘటన తరువాత సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ వాళ్ళు తవ్వించిన బావులు అవినీతి మూలకంగా నీళ్ళులేని బొందలుగ మిగిలిపోయినవి. కొన్ని చోట్లనయితే అంతకు ముందే గిరిజనులు తవ్వుకున్న బావులు కూడా ఐటిడిఏ వాళ్ళు తవ్వించిన బావుల కిందనే చూయించి దళారులు గుట్టుచప్పుడు కాకుండా నిధులు స్వాహా చేసిండ్లు. అన్ని తెలిసిన కాడ పట్టణాల్లోనే అవినీతి నిలయాలైన ప్రభుత్వ కార్యాలయాలు, అధికారులు ఇక మారుమూల గిరిజనులను దగా చేయడంలో పెద్దగా ఆశ్చర్యపోవల్సిందేమి లేదు.

అన్నిటికంటే విచిత్రమైంది మరొకటి ఉంది. అదే ఫ్యాక్టరీ నిర్మాణం. ఫ్యాక్టరీ ముందు వైపు మరియు క్వార్టర్స్ ఉన్న ఏరియా గాలివాలులకు వ్యతిరేక దిశలో ఉండి ఫ్యాక్టరీ నుండి లేచే దుమ్ము, ధూళి, పొగ అంతగా రాదు. ఫ్యాక్టరీ వెనుక

వైపున ఉన్న గిరిజన గూడెల మీదికి నిరంతరం ఎగజిమ్మే సిమెంట్ దుమ్ము అక్కడి వాతావరణాన్నే మార్చివేసింది. దూరంగా చుట్టు కొండలు ఉండడం వలన ఫ్యాక్టరీ వదిలే విషపదార్థాలతో నిండిపోయింది. అక్కడొక్కటి ఇక్కడొకటినా మిగిలిపోయిన చెట్లుకూడా జీవచ్ఛవాల్లా మోడువారిపోయి ఉన్నవి. వర్షాకాలం ఆరంభమైనా వాటిలో పచ్చదనమే లేదు. ఎక్కడ చూసినా అర అంగుళం వరకు సిమెంట్ దుమ్ము పేరుకుపోయింది.

అయినా ఇప్పటికీ ఆ గూడేల్లోని గిరిజనులు మిగిలిన ఆ భూముల్లోనే వ్యవసాయం చేసుకుంటున్నారు. ఓచోట మక్కొడొన్న చేన్లు చూస్తే వ్యవసాయం ఎంత దుర్భరంగా ఉందో అర్థం అవుతుంది. ఒక్క కర్ర కూడా బలంగా లేదు. ఇక వాటి నుండి వచ్చే దిగుమతి ఎట్లుంటదో ఊహించుకోవచ్చు.

మేము పోయే దారిలో ఒక వాగు అడ్డం వచ్చింది. వాగు దాటుతుంటే లచ్చిరెడ్డి ఒక్క క్షణం ఆగి ఆ వాగు గురించి చెప్పిండు:

"ఒకప్పుడు గీ వాగు ఒడ్డున నిలబడి చూస్తే కింది ఉన్న బండరాళ్ళు స్పష్టంగా కనిపించేవి. ఈ బండరాళ్ళే సిమెంట్ ఫ్యాక్టరీకి ఉపయోగపడే రాయి అని తెలియని రోజుల్లో పల్కాలు పల్కాలుగా ఉన్న బండరాల గుండా ప్రవహించే వాగు కాబట్టి పల్కాల వాగు అని పేరు వచ్చింది. ఇప్పుడీ పల్కాల వాగుల నీళ్ళు కనీస పశువులు తాగడానికి కూడా పనికిరాకుంటైపాయె. ఫ్యాక్టరీ నుండి వెలువడే చెత్తాచెదారం రసాయనాలు కల్సిన వ్యర్థమైన నీరు ఈ వాగులోకి వదిలివేయడం వల్ల కలుషితం అయిపోయింది."

మోకాలు మంటి మురికి నీళ్ళగుండా వాగు దాటుతుంటే చిర్రెత్తించే ఏదో మురుగు వాసన ఊపిరి సలుపనివ్వడంలేదు. ఒడ్డున చేరాం. ఆ వాగు ఒడ్డున ఒక పెద్ద ఊడలు దిగిన మర్రిచెట్టుంది. మర్రి చెట్టు అడుగున మట్టితో కట్టిన గద్దె. దానిమీద ఒక కర్ర పాతి ఉంది.

"ఇదే బాయమ్మ దేవత. పంటలు కోతలు మొదటి పసలు చేతికొచ్చినంక ఇక్కడ జాతర జర్గేది. నా చిన్నప్పుడైతే ఆ జాతర ఎంత సంబరముండేదో! పున్నమినాడు వస్తది ఆ జాతర. పిండిలాంటి వెన్నెల్లో అన్ని గూడేల వాళ్ళు అక్కడ చేరుకొనేటోల్లు. నా చిన్నప్పటి రోజులు నాకింకా గుర్తున్నాయి. అప్పుడు పండుగంటే ఎంత సంబరం ఉండేదో! తుడుం మోతలు, దుప్పికొమ్ములు బాకాలు. రాత్రంత బాయమ్మ తల్లి కథ చెప్పెటోల్లు. తెల్లంగ తెల్లారే వరకు జాతర సాగేది. ఇప్పుడా జాతరలు లేవు. ఆ సంబరం లేదు."

లచ్చిరెడ్డి మొఖంలో ఏదో విచారం. ఎక్కడో కోల్పోయిన అనుభూతితో అతని కళ్ళు సగం మూతలుపడ్డయి.

ఆ మురికి బాయమ్మ దేవతను నా కెమెరాలో బంధించిన. తన చిన్ననాటి సంగతులు చెప్తుంటే ఊకొడ్తు ఇంకా ముందుకు పోయినం. మేము పడమటి కొండవాలు దాక నడిచిపోయినం. అక్కడో గూడెంలో ఆగి వారితో కాసేపు మాట్లాడినం.

అక్కడి జనం ఇంకా వెనుకబడి ఉన్నారు. చాలా మంది మాట్లాడే భాష తెలియకుండా ఉంది. కొద్ది మంది తెలుగు మాట్లాడగల్గినా అంత స్పష్టత లేదు.

ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాలేవి ఇంకా వాళ్ళ ఛాయల్లోకి పోయిన జాడలేమి లేవు. నిజానికి నాకు కొత్త అనుభూతి కల్గింది. అంతకు ముందు నేను ఎన్నడు చూడని కొత్త లోకానికి పయనమైనట్టుగా అన్పించసాగింది. పత్రికల్లో పనిచేస్తున్నవాన్ని, సోమాలియా కరువు బాధితుల ఫోటోలు వాళ్ళ గురించిన వార్తలు కథలు కథలుగా చదివినవాన్ని కాని మన దేశంలో, మన రాష్ట్రంలో, మన జిల్లాలో, మన ప్రాంతంలో మనకు కాస్త పాతిక ముప్పయి కిలోమీటర్ల దూరంలో మరో సోమాలియా వెల్లివిరిసిందని కనీసం ఊహించనైనా ఊహించలేకపోయిన.

ఎండ నడినెత్తి మీదికి వచ్చింది. గూడేలల్లో జనం పలచగా ఉన్నరు. ముసలి ముతక పిల్లలు తప్ప అందరు చెల్కాలపొంటే కొండమీద దొరికే ఆకులు అలుములు ఏరుకోవడానికి వెళ్ళిపోయిండ్లు. మేము ఒకచోట ఆగినప్పుడు మా చుట్టు గుమిగూడిన బరివాత పిల్లలు. ముసలి ఎంకులు. అతని తలమీద చుట్టుకున్న మాసిపోయిన పెద్ద తలపాగ. లచ్చిరెడ్డి ఆయనతో మాట కలిపిండు.

ముసలాయన దృష్టి మందగించినట్టుంది. జీవంలేని కళ్ళతోని అదే పనిగా లచ్చిరెడ్డికేసి చూస్తూ "వెంకటరెడ్డి కొడుకుగదా? కండ్లు కనిపిస్తలేవు. కాళ్ళు చేతులు ఆడకుంటయినవి. దేవునికింకా నా మీద దయకల్గుతలేదు" అన్నాడు.

"అదేంది పెద్దయ్య, అట్లంటవు... నీవు అందరికి పెద్ద దిక్కాటువంటోడివి... ఇంకా చాన్నాల్లపాటు బతకాలి." లచ్చిరెడ్డి అనునయంగా అన్నాడు.

"ఎందుకు బిడ్డా, బతికి... కాళ్ళు చేతులు సక్కంగ ఉన్నోడే బతకలేని రోజులు వచ్చినవి... అన్ని సచ్చినోన్ని నేను బతికేం సాదిద్దామని... కానిరోజులు వచ్చినవి బిడ్డా... బతికేం లాభం లేదు..." ముసలాయన నిర్లిప్తంగా చెప్పుకొచ్చిండు.

కాసేపు అక్కడ గడిపి అటు నుంచి దక్షిణంగా తిరిగి మరో దారిగుండా బయలుదేరినం. ఆ దారిలో మాకు గిరిజన పిల్లల కోసం గవర్నమెంటు వాళ్ళు కట్టించిన బడి కన్పించింది. మొత్తం గూడెంలకు అదొక్కటే బడి. సింగిల్ టీచర్. ఆ రోజింకా వచ్చినట్టులేదు. పిల్లలు గోలగోల అరుస్తు ఆడుకుంటున్నరు.

"గవర్నమెంటు వాళ్ళు బడి పెట్టిండ్లు. ఒక్కడే పంతులు. ఆయన ఎక్కడో మంచిర్యాల నుండి వచ్చిపోతడు. వచ్చినప్పుడు వస్తడు. రానినాడు రాడు. నెలకు నాల్గురోజులు బడి నడిస్తే అదే గొప్ప. అదేందని ఒకసారి రిపోర్టు చేస్తే, అంతకు ముందున్న పంతులు ఇక్కడనుండి ట్రాన్స్‌ఫర్ చేయించుకొని పోయిండు. ఇప్పుడొచ్చిన పంతులు ఇక ఆయన ఇష్టారాజ్యం. అడిగి అడిగి నోరుపోయింది. ఇంకేమి లాభంలేదని నోరుమూసుకున్నా" అన్నాడు లచ్చిరెడ్డి.

మొత్తం గూడెంలన్ని తిర్గి వచ్చేసరికి మధ్యాహ్నం రెండు దాటింది. అన్నం తినిపొండి అని లచ్చిరెడ్డి బలవంతం చేసిండు. అప్పటికే అలస్యం అయిపోయింది. అందులోను నేను పోయేది ఎంత దూరం. మరోసారి ఎప్పుడైనా వచ్చినప్పుడు చూద్దాంలే అని అక్కడ సెలవు తీసుకుని బయలుదేరిన.

అదే రోజు సాయంత్రం రిపోర్టు రాయడానికి కాగితాలు ముందు వేసుకొని కూచున్నా. ఎలా మొదలుపెట్టాలో అర్థం కావడంలేదు.

గత సంవత్సరమే పొల్యూషన్ కంట్రోల్ బోర్డు వాళ్ళు పొల్యూషన్ కంట్రోల్ చేయడంలో ఉత్తమ ఫ్యాక్టరీగా బహుమతి ఇచ్చినప్పుడు పెద్దఎత్తున మేనేజ్‌మెంట్ ఏర్పాటు చేసిన సభ సందర్భంగా జర్నలిస్టులకు గిఫ్టుగా ఇచ్చిన మెమొంటో నా ఎదురుగా ఉన్న కప్‌బోర్డులో నన్ను వెక్కిరిస్తూ నాకేసి చూస్తు కనిపించింది.

ఒక్కటా రెండా - ఎన్ని కుటుంబాలు ఎలా ఛిన్నాభిన్నం అయిపోయినయి? దాన్నంతా మాటల్లో ఎలా పెట్టగలను?

కొత్తగా వచ్చిన పారిశ్రామిక సంస్కృతి అమాయకమైన గిరిజన సంస్కృతిని ఎలా కాలరాసింది ఎలా చిత్రించగలను?

గలగల పారే సెలయేరు లాంటి పల్కాల వాగు విషపు నీళ్ళతో గిరిజన కన్నీళ్ళలా భారంగా కదిలిపోతుంటే ఏవిధంగా వర్ణించగలను?

అమాయకపు గిరిజన స్త్రీ జంగుబాయి హత్యకు ఎవరు దోషి? లచ్చక్క బిడ్డ ఎందుకు కనిపించకుండా పోయింది? తొడషం జంగు కొడుకును ఎవరు చంపినట్టు? నిస్తేజమైన జీవచ్ఛవాల వంటి ఆ గిరిజన తండాల్లోని మనుషులను బ్రహ్మరాక్షసి పట్టి పీడిస్తుంది. ఇంకా డబ్బులు రావాలి అనే లచ్చమ్మ ప్రశ్నకు జవాబు ఏమిటి?

సిమెంట్ దుమ్ముతో నిండిపోయిన వాళ్ళ భూముల్లోకి మళ్ళీ జీవాన్ని నింపేది ఎవరు?

వెన్నెల రాత్రుల్లో బాయమ్మ తల్లి మళ్ళీ కళకళ లాడేనా?

చిందర వందర అయిపోయిన అమాయక గిరిజన బతుకుల్లో మళ్ళీ వసంతం చిగురిస్తుందా?

ఏండ్ల తరబడి అమాయకంగా కొండ కోనల్లో అపార సంపద నింపుకున్న పల్కాల వాగు బిర్లాకు బంగారు గుడ్లు పెట్టే బాతు అయితే, ఏండ్ల తరబడి ఆ నేలను నమ్ముకున్న గిరిజనుల జీవితాల్లో విషాన్ని చిమ్మింది.

ఇప్పటికీ ఇంకా సిమెంట్ ఫ్యాక్టరీ గిరిజనుల గూడేల్లో విషాన్ని చిమ్ముతూనే ఉంది. కూలి కోసం అర్రులు సాచే అమాయక గిరిజనులు ఫ్యాక్టరీ గేటు ముందు అదే పనిగా పడిగాపులు పడుతూనే ఉన్నరు.

హత్య కావించబడ్డ గిరిజన స్త్రీ జంగుబాయి గురించి విచారణ ఇంకా కొనసాగుతూనే ఉంది.

గుట్టు చప్పుడు కాకుండా జరుగుతున్న ఈ హత్యాకాండ గురించి విచారణ జరిగేది ఎన్నడు? దోషులను శిక్షించేది ఎవరు?

అమాయక గిరిజన స్త్రీలు నాగరికపు క్రూర కోరల్లో చిక్కుకుని పోతూనే ఉన్నరు. సర్పంచ్ లచ్చిరెడ్డి కనిపించినవారికల్లా తమ గోడు వినిపిస్తూనే ఉన్నడు.

● "ఆదివారం ఆంధ్రప్రభ" దినపత్రిక: *28-5-2000, 4-6-2000* ●

* * *

డి. కామేశ్వరి

# 105 కాలాన్ని వెనక్కు తిప్పకు

"మమ్మీ!" ఊఁ అంది కల్యాణి. వంటపనిలో మునిగి మామూలుగా అంది.

"మమ్మీ, మమ్మీ! నీకెవరన్నా మంచి గైనకాలజిస్టు తెలుసా? ఇదివరకు నీవొకసారి ఎవరో లేడీడాక్టరు దగ్గరకెళ్ళావు. ఆవిడ పేరేమిటి?" గొంతు తగ్గించి అడిగింది చిత్ర.

చారు పోపు వేస్తున్న కల్యాణి చటుక్కున కూతురివైపు తిరిగి, "గైనకాలజిస్టా! ఎవరికి, ఎందుకు?" ఆశ్చర్యంగా చూస్తూ అంది. చిత్ర కాస్త కళ్ళు వాల్చి, "ఐ మిస్డ్ మై పీరియడ్స్ మమ్మీ!" అంది.

ఆ మాటకు కల్యాణి గుండె ఒక్క బీట్ మిస్ అయింది. కలవరంగా "అంటే... అంటే?" అంది గాబరాగా. కూతురి మొహం చూడగానే ఏదో తట్టింది ఆమెకు.

"ఐ థింక్ ఐ యామ్ ప్రెగ్నెంట్" అంది చిత్ర చాలా మామూలుగా, ఉప్మా కోసం పెట్టిన జీడిపప్పు పలుకు ఒకటి నోట్లో వేసుకుంటూ.

కల్యాణి తెల్లపోతూ చూసింది. కూతురి వంక అయోమయంగా చూసింది.

"ఏమిటి, ఏం అంటున్నావు?" సరిగా వినలేదేమో నన్నట్లు, నమ్మలేనట్లు రెట్టించింది.

"ఈ నెల పీరియడ్స్ రాలేదు మమ్మీ! అనుమానం వచ్చి యూరిన్ టెస్ట్ చేయిస్తే పాజిటివ్ వచ్చింది." చిత్ర తల్లి వంక చూస్తూ అంది.

కల్యాణి కాళ్ళు వణికాయి. చటుక్కున కూర కింద ఉన్న స్టౌ ఆర్పేసి, డైనింగ్ టేబిల్ దగ్గరకు వచ్చి కుర్చీలో కూలబడింది. "ఏమిటంటున్నావు? మతి ఉండే మాట్లాడుతున్నావా? ఏమిటసలు సంగతి? నిజం చెప్పు. ఇదేమన్నా ప్రాక్టికల్ జోకా?" నల్లబడ్డ మొహంతో అడిగింది కల్యాణి.

"ప్రాక్టికల్ జోకా, నీతోనా? నిన్నటి నుంచీ ఈ సంగతి నీకెలా చెప్పాలా అని భయపడి చెప్పలేదు. లేట్ అయిపోతుందని చెప్పానివాళ." ఎంబ్రాసింగ్‌గా చూస్తూ అంది చిత్ర.

కల్యాణి నిలువుగుడ్లేసుకుని చూసింది. 'హౌ...హౌ డిడ్ ఇట్ హాపెన్?' తన గొంతు తనకే వినిపించనట్లుగా గొణిగింది.

ఏమిటా సిల్లీ ప్రశ్న అన్నట్లు చూసింది చిత్ర. "ఇట్ జస్ట్ హాపెన్డ్. దట్ బ్లడీ ఫెలో ఏం ఫరవాలేదు. ఒకసారికి ఏం కాదు. సేఫ్ పీరియడ్ అంటూ చెప్పాడు" కళ్ళెగరేస్తూ అంది.

"ఎవరు? ఎవరు వాడు? నీకెంత ధైర్యమే? ఏ జులుం చేసిందన్నంత తేలికగా చెప్తున్నావు. ఎంత ధైర్యంగా డాక్టరు దగ్గరకెళ్ళాలని అడుగుతున్నావు?" కోపంతో కల్యాణి మాటలు తడబడ్డాయి. "ఇది మీ డాడీకి తెలిస్తే పాతేస్తారు నిన్ను. ఎంతకు తెగించావు!" కోపంతో మొహం ఎర్రబడిపోయింది. అసలు ఇదంతా నిజమని కల్యాణే ఇప్పటికీ నమ్మలేకపోతోంది.

ఇండియాలో ఈతరంలోనైనా ఎంత మాడర్న్‌గా, ఫార్వర్డ్‌గా పెరిగినా, ఓ అమ్మాయి వచ్చి తల్లితో ఓపెన్‌గా తాను ప్రెగ్నెంట్ అన్న విషయం అతి మామూలుగా చెప్పడం అన్నది నమ్మలేని విషయంలా జీర్ణించుకోలేకపోతోంది. ఫారెన్ కంట్రీస్‌లో, అమెరికాలో అక్కడా పిల్లలు చాలా స్వేచ్ఛగా సెక్స్‌లైఫ్ నడుపుతారని, హైస్కూలు లెవెల్ నుంచి బాయ్ ఫ్రెండ్స్, డేటింగులు, విచ్చలవిడిగా తిరిగి కడుపులు, అబార్షన్లు అతి మామూలు అయిపోయాయని చదవడం, వినడం జరిగింది. కానీ, మన దేశంలో కొన్ని చోట్ల అమ్మాయిలు, అబ్బాయిలు ఫ్రీగా తిరిగినా, రహస్యంగా పెద్దలకు తెలియకుండా తిరగడం ఉంది. అక్కడక్కడా అమ్మాయిలకు అబార్షన్లు గుట్టుచప్పుడు కాకుండా తల్లితండ్రులు జరపడం లాంటివి ఉన్నాయి కానీ, ఇలా ఒక అమ్మాయి తల్లితో తాను ప్రెగ్నెంట్ అని కాస్తయినా జంకు గొంకు లేకుండా చెప్పడం, అదీ తన కూతురవడం అన్నది ఊహించలేని కల్యాణికి పెద్ద షాక్ ఇది!

"ఏమిటి మమ్మీ, అలా చూస్తావు కొంపమునిగినట్లు? డాక్టర్ దగ్గిరికెడితే టూ మినిట్స్ జాబ్."

అప్పటికి కల్యాణి ఈ లోకంలోకి వచ్చిందానిలా లేచి కూతురి చెంప చెళ్ళు మనిపించింది. కోపంతో ఆమె మొహం ఎర్రబడిపోయింది. "నోర్ముయ్. ముందు నోర్ముయ్. ఇంకొక్క మాట మాట్లాడావంటే చంపేస్తా. ఎవడా వెధవ? ముందది చెప్పు. ఎవడు వాడు?" కళ్ళెర్రబడగా గద్దించి అడిగింది.

చెంప దెబ్బతిన్న చిత్ర రోషంగా తల్లివంక చూసింది. "ఎవడో ఒకడు. ఎవడైతే ఏం? నీవు డాక్టరు దగ్గరకు తీసుకెళతావా, లేదా? అది చెప్పుముందు." పొగరుగా అంది.

"ఏం, వాడెవడో వాడినే తీసుకెళ్ళమనకపోయావా డాక్టరు దగ్గరకు? నా అవసరం ఏమొచ్చింది? ఇంతకు తెగించినదానివి, ఎవడైతేనేం అన్నదానివి నాదాకా ఎందుకు ఇది? గప్‌చుప్‌గా మాకెవరికీ తెలియకుండా ఆ అబార్షనేదో నీవే చేయించుకోవాల్సింది." కల్యాణి కూతురివంక తిరస్కారంగా చూసింది.

"ఆ సందీప్‌గాడు రావడానికి భయపడి ఏడుస్తున్నాడు." 'సందీప్' పేరు చెప్పేశాక నాలిక కొరుక్కుంది. "ఎవరన్నా చూస్తే అంటూ భయపడుతున్నాడా స్టుపిడ్. డాక్టర్ అబార్షన్‌కి హజ్బెండ్ గానీ, పేరెంట్స్‌గానీ ఉండాలంది."

"ఓ, తమరు అప్పుడే అన్ని ప్రయత్నాలూ చేసే నా దగ్గరకు వచ్చారన్నమాట! ఆ సందీప్ అంటే ఆ తెల్లగా, మెడలో చెయిన్... ఆ అగర్వాల్ కొడుకేనా? వాడు నీ కోసం పుస్తకాలంటూ ఇంటికి కూడా వచ్చాడు. వాడేనా?" కోపంగా అడిగింది.

చిత్ర తలాడించింది కాస్త ఎంబ్రాసింగ్‌గా చూస్తూ "పట్టుమని ఇరవై ఏళ్ళు లేని మీరు చదువుకోమని కాలేజీలకు పంపిస్తే – మీకు ఇప్పటినుంచీ లవ్‌లు,

సెక్స్‌లు కావాల్సి వచ్చాయా? ఉత్తి ప్రేమలూ, సెక్స్‌లేనా, పెళ్ళి కూడా ఏమన్నా చేసుకున్నావా? పెళ్ళెందుకు చేసుకుంటాడులే వాడు! ఈజీగా దొరికావని నీతో తిరిగాడు. వాడి అవసరం తీరాక మొహం చాటేశాడు. డాక్టరు దగ్గరకు కూడా రావాడానికిష్టపడలేదంటే వాడెంత గడుసువాడో, నిన్నెలా తెలివిగా వాడుకున్నాడో అర్థం అయిందా ఇప్పటికన్నా..." కసిగా, హేళనగా అంది.

"మమ్మీ! ఫర్ గాడ్ సేక్. ఇటీజ్ టూ లేట్ టూ డిస్కస్ అన్ దిస్. అయిందేదో అయింది. నా తప్పో వాడి తప్పో జరిగిందేదో జరిగింది. చెప్పు, నీవు హెల్ప్ చేస్తావా? నన్ను ఏదో ఏర్పాటు చేసుకోమన్నావా? ఏదో పొరపాటు జరిగింది. దానికి పెద్ద రాద్ధాంతం చేస్తున్నావు. ఇట్స్ నాట్ ఎ బిగ్ డీల్."

ఆ పొగరు, నిర్లక్ష్యం చూసేసరికి కల్యాణికి తిక్కరేగింది. "ఇంత జరిగినా నీకింకా బుద్ధి రాలేదన్న మాట! ఇట్స్ నాట్ ఎ బిగ్ డీల్. ఎస్. ఓకే! వెళ్ళు, నీవేం చేసుకుంటావో చేసుకో. ఇంత చేసినదానివి అదీ నీవే చూసుకో..." కల్యాణి కోపంగా లేచి స్టవ్ వెలిగించి కూర కలిపింది.

"బుద్ధి అంటే తప్పు చేశాను అని, మీ కాళ్ళు పట్టుకు ఏడవాలా? అలా అయితే సంతోషంగా ఉండేదేమో మీకు?" కసిగా అంది చిత్ర.

"కనీసం నీ మాటల్లో జరిగిందానికి పశ్చాత్తాపం, తప్పు చేశానన్న భావం ఉంటే నాకు కాస్తన్నా జాలి ఉండేది నీ మీద. నాట్ ఎ బిగ్ డీల్ అని అంటున్నావంటే, నీకసలు ఏం జరిగిందో, దాని పర్యవసానం ఎలా ఉంటుందోనన్న ఆలోచన కూడా లేకుండా మాట్లాడుతున్నావంటే నీవెంత మూర్ఖురాలివో తెలుస్తోంది. మన ఇండియాలో ఓ పెళ్ళికాని పిల్ల గర్భం దాల్చడమంటే దాని పరిణామాలు ఎలా ఉంటాయో నీకు తెలీదు. ఇది పైకి తెలిస్తే ఏ తలమాసిన వెధవా కూడా నిన్ను పెళ్ళాడడు. ఉత్తప్పుడు ఎంత మాడర్న్‌గా అభ్యుదయ భావాలు పలికినా పెళ్ళి వేళకి వచ్చేసరికి వంశాలు. సంప్రదాయాలు చూస్తారు."

"పెళ్ళి కాకపోతే కొంప మునగదులే..." చిత్ర మొండిగా వాదించబోయింది.

"అవును. నీకు పెళ్ళవసరం ఏమిటిలే. ఇంతకు తెగించినదానివి..." కల్యాణి కోపంగా ఏదో అనబోయింది.

చిత్ర కోపంగా, "స్టాపిట్ మమ్మీ! నిన్ను హెల్ప్ అడగడం నాది బుద్ధి తక్కువ. ఏదో ఎక్స్‌ట్రార్డినరి థింగ్... లోకంలో నీ కూతురే చేసిందనట్లు మాట్లాడకు. ఇట్ జస్ట్ ఎ నార్మల్ థింగ్ దట్ హేపెండ్... అమ్మాయిలు, అబ్బాయిల మధ్య ఎట్రాక్షన్‌ల మధ్య అప్పుడప్పుడూ ఇలాంటివి జరగడం ప్రపంచ వింతలా మాట్లాడకు. నీవు డాక్టరు దగ్గరకు తీసుకెడతావో, నన్నే వెళ్ళమంటావో త్వరగా చెప్పు." అసహనంగా అంది. కల్యాణి తిరస్కారంగా కూతురి వంక చూసింది.

"డాడీకి చెప్పి ఏం చెయ్యమంటారో అడగాలి. ఇప్పుడు ఆయన నన్ను తిట్టిపోస్తారు, నిన్ను నెత్తి కెక్కించుకుని పాడు చేశానని. నిన్ను నమ్మి ఇంత స్వతంత్రం ఇచ్చినందుకు నా నెత్తిమీదకు తెచ్చావు."

"ఆయనకెందుకు చెప్పడం? డాడీ అసలే ఓల్డ్ ఫేషన్... నీవే అర్థం చేసుకోనిది ఆయనెలా చేసుకుంటారు?"

"ఆయనకు చెప్పకుండా దాస్తే, రేప్పొద్దున ఈ విషయం తెలిస్తే నా ప్రాణం

తీస్తారు. నాకు మతిపోతోంది. నన్ను ఆలోచించుకోనీ. అసలేం చెయ్యాలో. నాకు ఆఫీసుకు టైమైపోతోంది. పనంతా అలాగే ఉంది. నీవిక్కడ నుంచి వెళ్ళు తల్లీ" గాభరాపడుతూ వంట పని పూర్తిచేయసాగింది.

"నీవు డాడీకి చెబితే నేనూరుకోను. నీవు హెల్ప్ చెయ్యకపోతే చెయ్యకు." విసురుగా వెళ్ళిపోయింది చిత్ర.

"ఇదిగో, నీవు ముందు ఆ సందీప్‌ని ఇంటికి తీసుకురా. నేనొకసారి మాట్లాడాలి వాడితో." కల్యాణి వెనకనుంచి అరచింది.

చిత్ర చట్టుక్కున వెనుదిరిగి తల్లిని మింగేసేట్లు చూస్తూ, "నీవేం వాడితో మాట్లాడనక్కరలేదు. ఆ రాస్కెల్ నన్ను తప్పించుకు తిరుగుతున్నాడు. వాడితో నేను మాట్లాడను" అంటూ వెళ్ళిపోయింది.

"హుఁ... వీళ్ళ ప్రేమ, మోజు అన్నీ అప్పుడే అయిపోయాయన్నమాట!" విరక్తిగా అనుకుంది. జరగబోయేది తల్చుకుంటే, ఇంట్లో రాబోయే తుఫాను తల్చుకుంటే, భర్తని ఎలా ఎదుర్కోవాలో తల్చుకుంటే ఆమె కాళ్ళు వణకుతున్నాయి. గుండెలు దడదడలాడుతున్నాయి.

☆ ☆ ☆

కల్యాణి ముందునుంచీ ఆధునిక భావాలు కలిగిన యువతి. స్త్రీ స్వాతంత్ర్యం, వ్యక్తిత్వం, ఆత్మాభిమానం లాంటివి ఆమెకిష్టమైన పదాలు. ఆడది మగాడికన్నా దేన్లోనూ తీసిపోదని, అవకాశం ఇస్తే అతన్ని మించి పోగలదని, ఆడది చదువుకొని తన కాళ్ళ మీద నిలబడాలని, ఆర్థిక స్వాతంత్ర్యం ఉండాలని, తనకంటూ ఓ వ్యక్తిత్వం ఉండాలని అభిలషించేది. తన తల్లి చదువు, ఆర్థిక స్వాతంత్ర్యం లేక తండ్రి ఎన్నన్నా పడే దుస్థితి లాంటిది తనకు కలగరాదని పంతం పట్టి ఏడ్చి రాగాలు పెట్టి, నిరశన వ్రతాలుచేసి, ఇంటర్‌తో చదువాపేసి పెళ్ళి చేస్తానంటే ఎదురు తిరిగి, డిగ్రీ తెచ్చుకుని, బ్యాంక్ పరీక్ష రాసి, క్లర్క్ ఉద్యోగం సంపాదించి, ఇప్పుడు ఆఫీసరు స్థాయికి ఎదిగింది. ఉద్యోగం వచ్చేవరకూ పెళ్ళి మాటెత్తనన్నమాట మీద నిలబడింది.

తన తరువాతి తరం – తన కూతురు తాను పడిన అవస్థలు పడరాదని, ఎలాంటి అడ్డంకులు ఏర్పడకుండా బాగా చదివించింది. మంచి పొజిషన్‌లో ఉండాలని ముందునుంచి కూతురికీ, కొడుక్కీ ఎలాంటి తేడాలు చూపకుండా పెంచాలని ఆరాటపడింది.

రామకృష్ణ పల్లెటూరిలో పెరిగినవాడు. కాస్త సంప్రదాయాల పట్టింపులున్నవాడు. దేవుడు, పూజలు, గుళ్ళూ గోపురాలు అంటూ తిరిగే రకం. ఆడపిల్లని ఆడపిల్లగా పెంచని భార్యని దుయ్యబడుతుండేవాడు.

"దానికి చక్కగా రెండు జడలు వేసి, బొట్టు కాటుక పెట్టకుండా ఆ క్రాఫేమిటి?" "ఆడపిల్ల మగపిల్లాడితో సమంగా ఆ పరుగులు, ఆ సైకిలు తొక్కడం ఏమిటి?" "వయసొచ్చిన పిల్ల ఆ షార్ట్స్, బనీన్లు వేసుకుని మగపిల్లలతో షటిల్ ఆడుతుంది. దాన్ని నీవే పాడుచేస్తున్నావు." "వాడితో సమానంగా దానికీ మోపెడ్ కొనాలా? ఆ పాంట్లు వేసుకుని అది మగరాయుడిలా తిరగలా?" "అబ్బాయికీ, అమ్మాయికీ ఇద్దరికీ ఇంజనీరింగ్ చెప్పించాలా? మగపిల్లాడికంటే తప్పదు. ఇది ఏ బి.ఏనో

చదవచ్చు. తరువాత ఏదో చదివించవచ్చు." "ఆ మగపిల్లలని ఇంటికి రానిస్తావెందుకు? దానికి బుద్ధి చెప్పాల్సింది పోయి వాళ్ళందరికీ కాఫీలు, టీలు పోస్తూ ఎంకరేజ్ చేస్తావా?" "అది, నీ కూతురు ఎవడి స్కూటరు వెనకాలో ఎక్కి వెళ్తోంది తెలుసా? నేను కళ్ళారా చూశాను. ఇది నీవు ఇచ్చిన అలుసు. దాన్నెందుకూ పనికిరాకుండా చేస్తున్నావు."

చిన్నప్పటి నుంచి రామకృష్ణ, కల్యాణిల మధ్య ఆడపిల్ల విషయంలో ఎన్నో వాదనలు, దెబ్బలాటలు. "ఆడపిల్ల" అంటే కల్యాణికి కోపం. "ఏం, ఆడపిల్లయితే పాంటు వేసుకోకూడదని రూలుందా?" "షటిల్ ఆడితే తప్పేమిటి? ఆడేటప్పుడు షార్ట్స్ కాక మరేం వేసుకుంటారు?" "మగపిల్లాడు వాడికి మోపెడ్ కొంటే, వాడికంటే ఇది దూరం వెళ్ళాలి, దీనికెందుకు కొనరు?" "క్లాస్‌మేట్స్ ఏదో సరదాకి ఇంటికి వస్తే తప్పేమిటి?" "వాళ్ళిద్దరిల్లో ఆడ, మగ తేడాలు పెట్టి మనమే పాడు చేస్తాం. ఫ్రెండ్స్‌కు ఆడమగ తేడాలెందుకు?" "దాని మోపెడ్ చెడిపోతే ఫ్రెండు స్కూటరెక్కి వస్తే కొంప మునిగిపోదు..."

ఇలా కూతురిని వెనకేసుకువస్తూ "ఆడపిల్ల" అన్న తేడా లేకుండా పెంచింది. "ఇద్దరం ఉద్యోగాలు చేస్తూ వాళ్ళక్కావలసిన చదువులు చెప్పించలేమా? ఆడపిల్లయితే ఇంజనీరింగ్ చదవకూడదా? వాడికంటే దీనికే లెక్కలు బాగా వచ్చు. దాని చాన్సు మనం పాడు చెయ్యాలా?" అంటూ పంతంగా కూతురుని ఇంజనీరింగ్‌లో పెట్టింది. చిత్ర, చైతన్య ఇద్దరికీ ఏడాది తేడా ఉండడంతో ఇద్దరూ కొట్టుకోకుండా రెండు సైకిళ్ళు, రెండు మోపెడ్లు, రెండు పుస్తకాల సెట్లు – ప్రతీది వంతులు లేకుండా చేసేది.

"నీ కర్మ. అలా గాలికి వదిలేసి నెత్తినెక్కించుకుంటున్నావు. అలా స్వేచ్ఛగా మగపిల్లలతో స్నేహాలు ఎంకరేజ్ చేస్తున్నావు. ఎప్పుడో అది కొంప ముంచుతుంది. అప్పుడేడుస్తావు." ఒకసారి బాయ్ ఫ్రెండ్స్‌తో అమ్మాయిలంతా పిక్నిక్‌కి వెడితే ఆ రోజు పెద్ద గొడవ చేశాడు రామకృష్ణ. "ఈ కాలం పిల్లలు తెలివైనవారు. వాళ్ళ లిమిట్స్ వాళ్ళకు తెలుసు. స్వేచ్ఛ ఇవ్వకపోతే దొంగచాటుగా తిరుగుతారు. అబద్ధాలు చెబుతారు. ఇలా అయితే ఫ్రాంక్‌గా మనతో అన్నీ చెబుతారు" అంటూ వాదించింది ఆరోజు. తల్లి సపోర్ట్‌తో చిత్ర చాలా బోల్డ్‌గా, ఎవరినీ లెక్కచెయ్యని రీతిలో ప్రవర్తించడం రామకృష్ణకి అసలు నచ్చేది కాదు. ఇప్పుడు భర్తకి చెపితే తానే కారణం అని దుమ్మెత్తి పోస్తాడు. అతను అనడం సరే, ఎలాగూ తప్పదు. తాను ఇంత స్వేచ్ఛ, స్వాతంత్ర్యం ఇస్తే అవి దుర్వినియోగం చేసిన కూతురిని క్షమించలేకపోతోంది కల్యాణి. ఇప్పటికీ జరిగిందాన్ని సమర్థించుకుంటున్న కూతురిని ఈ విషయంలో తేలిగ్గా తీసుకోలేదు. తానేం చేసినా తల్లి గుడ్డిగా సపోర్ట్ ఇవ్వదు అన్నది అర్థం కావాలంటే తాను రెండు మూడు రోజులు పట్టించుకోకుండా బింకంగా ఉంటే, కాళ్ళబేరానికి వచ్చి ప్రాధేయపడితే, అప్పుడు చీవాట్లు పెట్టి డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళేముందే భర్తకి ఈ విషయం చెప్పచ్చు. ఒకటి రెండు రోజులు ఊరుకుని కూతురి రియాక్షన్ గమనించాలని నిర్ణయించుకుంది కల్యాణి.

☆ ☆ ☆

అర్థరాత్రి మంచి నిద్రలో ఉన్న కల్యాణికి తనని ఎవరో కుదిపి కుదిపి లేపుతుంటే చటుక్కున మెలకువ వచ్చింది. కళ్ళిప్పేసరికి చిత్ర ఏడుపుగొంతుతో, "మమ్మీ, మమ్మీ" అంటూ రహస్యంగా పిలుస్తోంది. చటుక్కున లేచి కూర్చుంది. కల్యాణి. చిత్ర మొహం బెడ్ లైటు వెలుగులో పాలిపోయి ఉంది. భయంతో ఏడుస్తున్న కూతుర్ని చూసేసరికి దిగ్గున లేచి గదిలోంచి బయటికి వచ్చి చిత్ర గదివైపు నడిచింది. చిత్ర మంచం మీద ఉంగ చుట్టుకుపోతూ,

"మమ్మీ! నొప్పి, మమ్మీ! బ్లీడింగ్ అయిపోతోంది. డూ సమ్‌థింగ్." కడుపు పట్టుకు ఏడవసాగింది. ఆమె పక్కమీద, నైట్ గౌను నిండా రక్తం మరకలు.

కల్యాణి గుండె ఝల్లుమంది. "ఏం అయింది? ఏం చేశావు?" గాబరాగా, కడుపు పట్టుకుని బాధతో మెలికలు తిరుగుతున్న చిత్రని అడిగింది. "ఏం చేశావే? ఏదన్నా మందు మింగావా?" భయంగా చూస్తూ అడిగింది.

"మొన్న ఓ లేడీ డాక్టరు అబార్షన్ చేసింది. ఇవాళ సాయంత్రం నుంచి బ్లీడింగ్. ఇందాకటి నుంచి కడుపులో ఒకటే పోటు. బ్లీడింగ్ అలా అయిపోతోంది. మమ్మీ! ఈ నొప్పి... చచ్చిపోతున్నాను... డూ సమ్‌థింగ్." ఏడవసాగింది బేలగా.

"ఏ డాక్టరు చేసింది? ఒక్కర్తివీ ఎందుకు వెళ్ళావు?" గాబరాగా అంది.

"నీవు ఏం చెప్పలేదు నాకు. నా ఫ్రెండ్ రవి పాపం, తాను హజ్బెండ్‌నని చెప్పి వచ్చి నాకు హెల్ప్‌చేశాడు. ఎక్కడో ఎవరో ఆ డాక్టరు ఉందంటే..."

"ముక్కూ మొహం తెలియని ఎవరి దగ్గరకో వెళ్ళావన్నమాట!" కోపంగా అంది కల్యాణి. అబార్షన్ సరిగా చేయలేదన్నది కల్యాణికి అర్థమైంది. ఇది ఇంక వాదులాడవలసిన టైము కాదని అర్థం అయి, గబగబా రామకృష్ణని లేపడానికి వెళ్ళింది.

☆ ☆ ☆

"ఇన్‌కంప్లీట్ అబార్షన్. ఈ బ్లీడింగ్, ఇంత జ్వరం, కడుపులో పోట్లు – ఇవన్నీ ఇన్‌ఫెక్షన్‌కి సూచనలు. ఎక్కడపడితే అక్కడ ఊరు పేరు లేని ఏదో చిన్న ప్రైవేట్ నర్సింగ్ హోమ్‌లో చేయించుకున్న ఫలం. ఈ కాలం పిల్లలు చదువుకునీ, తప్పొప్పులు తెలుసుకోరు. తప్పు చేశాక చేసినదాన్ని సరిగ్గా అయినా సరిదిద్దుకోరు." తల వాచేట్లు చీవాట్లు పెట్టి, అప్పటికప్పుడు డి అండ్ సి చేసి అబార్షన్ పూర్తి చేసి, పెయిన్స్‌కి, ఇన్‌ఫెక్షన్స్‌కి ఇంజక్షన్లు ఇచ్చింది డాక్టరు.

"మీరు తల్లి అయివుండి పంతానికి పోయి అలా రెండు మూడు రోజులు వదిలేయల్సింది కాదు. పిల్లలు తప్పు చేసినప్పుడు మనం కాకపోతే ఎవరాదుకుంటారు?" అంటూ కల్యాణిని మెత్తగా మందలించింది. ఆవిడ తన కొలీగ్ అడపడుచు. ఇదివరకు పరిచయంతో కల్యాణి అక్కడికి వచ్చింది. ఆవిడ ముందు తానే తప్పు చేసినట్లు తల దించుకుంది.

ఆ రాత్రి సంగతి విని నిశ్చేష్టుడయ్యాడు రామకృష్ణ. అప్పుడు ఒక్కమాట కూడా మాట్లాడకుండా కారు తీసి నర్సింగ్ హోమ్‌కు తీసుకెళ్ళాడు. ఆ తర్వాతైనా కూతుర్ని పలకరించలేదు. మందలించలేదు. కల్యాణి ఏదో చెప్పబోయినా వినలేదు. ఆ రోజు నర్సింగ్ హోమ్‌లో ఉంచి, మర్నాడు కూతుర్ని ఇంటికి తీసుకెళ్ళింది కల్యాణి.

"మీ డాడీ నిన్ను ఒకమాటా అనలేదు అంటే, ఆయన నీవు చేసిన పనికి ఎంత హర్ట్ అయ్యారో తెలుసుకో. ఆయన బాధ, అవమానం మనసులో దాచుకున్నారు. అంటే, మనల్ని క్షమించలేదన్నమాట. ఇంతకంటే ఆయన నిన్ను, నన్ను తిట్టినా బాగుండేది. ఆయనకి మొహం చూపించలేకపోతున్నాను." కల్యాణి కూతురికి పళ్ళరసం తెచ్చి ఇస్తూ అంది.

"సారీ మమ్మీ!" చిత్ర తల వాల్చుకుని అంది. ఈ ఒక్క రోజులో ఆమె పొగరు, వగరు అన్నీ దిగిపోయినట్లు సౌమ్యంగా అంది. పాలిపోయి, కళ్ళకింద నల్లచారలతో మొహం పీక్కుపోయిన కూతురు మొహం చూస్తే శారీరకంగా, మానసికంగా ఎంత బాధపడిందీ అర్థం అవుతోంది.

"చిత్రా! నీ ఈ తప్పటడుగుతో నీవు స్వేచ్ఛను పోగొట్టుకున్నావు. నీపై అందరికీ నమ్మకం పోయేట్లు. చేసుకున్నావు. ఇంక నీపై ఎన్ని ఆంక్షలు పెడతారో మీ డాడీ, చూద్దువుగాని. నీవు ఏం చేసినా, ఎక్కడికి వెళ్ళినా, కాలేజీ నుంచి రావడం ఒక గంట ఆలస్యం అయినా అనుమానంగానే చూస్తాం. నిన్ను వెనకేసుకువచ్చే అవకాశం నాకు లేదు ఇప్పుడు."

చిత్ర ఏడవడం ఆరంభించింది. ఏడుపు మధ్య "మమ్మీ, నేను కావాలని చెయ్యలేదు. ఆ సందీప్ ఇంటికెడదాం అంటే సరదాగా వెళ్ళా. వాళ్ళ పేరెంట్స్ వాళ్ళు అంతా తిరుపతి వెళ్ళారని వెళ్ళాక తెలిసింది. ఏవో కబుర్లు చెప్పాడు. మ్యూజిక్ పెట్టాడు. డాన్సు అన్నాడు. జస్ట్ ఫర్ ఫన్ అన్నాడు. ఇదంతా కాలేజీ అబ్బాయిలు, అమ్మాయిలు అంతా చేస్తారన్నాడు. ఎవరెవరివో పేర్లు చెప్పాడు. ఒక్కసారికి ఏం అవదు, తప్పేమిటి... ఏదేదో అంటూ నన్ను మాటల్లో వశపరచుకున్నాడు. నాకూ ఏ మూలో ఎలా ఉంటుందో అన్న జస్ట్ ఇంక్విజిటివ్‌నెస్. ఇలా అవుతుందని అనుకోలేదు మమ్మీ! సేఫ్ పీరియడ్, ఫరవాలేదన్నాడు." ఏడుస్తూ అంది.

"హుఁ. చిత్రా! ఈ మగపిల్లలకి, ఈ వయసులో దృష్టి ఎంతసేపూ సెక్స్‌పైనే ఉంటుంది. బై హుక్ ఆర్ క్రూక్ ఆ అనుభవం పొందాలని ఆరాటపడే వయసు ఇది. ఈ యౌవన ప్రారంభంలో దీనికోసం ఉచితానుచితాలు మర్చిపోతారు. అబ్బాయిలతో స్నేహం చేసేటప్పుడు హద్దులు గీసుకోవాల్సింది అమ్మాయిలే. స్నేహాన్ని ఆకర్షణకి లోబడకుండా ఉంచుకోవడానికి అబ్బాయిలని గిరిగీసి దూరం ఉంచాలి. నిప్పు కాలడం దాని సహజ లక్షణం. దానికి దూరంగా ఉండాల్సింది మనం. మన పూర్వులు ఆడదానికిన్ని ఆంక్షలు ఎందుకు పెట్టారంటావు? నిప్పు దగ్గరకి వెడితే కాలేది ఆడదానికే. బాధ, హింస, అవమానం భరించాల్సింది ఆడదే కాబట్టి, నీతో ఎంజాయ్ చేసిన సందీప్ హాయిగా ఉన్నాడు. కొన్ని క్షణాల తొందరపాటు వల్ల నీకు ఎంత కష్టం, నష్టం జరిగింది. నిన్ను ఎంత బాధ, అవమానానికి లోనుచేసింది ఆ సంఘటన. మనం ఎంత మాడర్న్‌గా స్త్రీ, పురుష సమానత్వం అని ఎన్ని మాటలు వల్లించినా ఈ ఒక్క విషయంలో మాత్రం మనం పురుషుల ముందు తల ఒగ్గాల్సిందే. ప్రకృతే పురుషుని పట్ల పక్షపాతం వహించి మనకు అన్యాయం చేసింది. ఇద్దరూ పాలు పంచుకున్న ఆనందంలో స్త్రీ మాత్రమే శిక్షకు గురి అవడం దేవుడు మనకిచ్చిన శాపం. ఈ బాధ, ఈ అవమానం మనం తప్పించుకోలేనివి."

చిత్ర గిల్టీగా చూసింది.

"చిత్రా! నీకు నేను ఎప్పుడూ మగ పిల్లాడితో సమంగా 'స్వేచ్ఛ' ఇచ్చాను. స్వేచ్ఛ అంటే విచ్చలవిడితనం కాదు. నీవు చదువుకోవాలి. మంచి ఉద్యోగం చేసుకోవాలి. ఆర్థిక స్వాతంత్ర్యం ఉండాలి. ఏదైనా నిబ్బరంగా ఎదుర్కొనే మనస్థైర్యం ఉండాలి. ఓ వ్యక్తిత్వం అలవరుచుకోవాలి. మగాడి కంటే మనం దేన్లోనూ తక్కువ కాదు అని నిరూపించాలి అన్నది నా ఉద్దేశం. స్వేచ్ఛకి నీవు విపరీతార్థం తీశావు. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అంటే ఇష్టం వచ్చిన మగాడితో విచ్చలవిడిగా తిరగడం కాదు. అలా తిరిగితే ఏ సభ్య సమాజం ఊరుకోదు. సమాజానికి కొన్ని కట్టుబాట్లుంటాయి. ఆ కట్టుబాట్లు దాటితే ఎంత నవీన సమాజమైనా వేలెత్తి చూపి పరిహసిస్తుంది. ఆ యుగం నాటి కుంతి మొదలు నీవరకు ఇలాంటి అక్రమ సంబంధాలని ఏ సమాజమూ ఆమోదించదు. ఇప్పుడే కాదు, ఇంకో యాభై ఏళ్ళు గడచినా ఏ తల్లీ తన కూతుర్ని అబార్షన్‌కి తీసుకొచ్చానని అందరి ఎదుటా చెప్పగలదా! ఏ ఆడపిల్లా నేను అబార్షన్ చేయించుకున్నాను అని ఓపెన్‌గా చెప్పగలదా అంటే అనుమానమే! నిన్ను నర్సింగ్ హోమ్‌లో చూసి ఆ ప్రసాదరావు భార్య ఆశ్చర్యంగా అడిగితే, ఏదో గైనిక్ ప్రాబ్లమ్ అని అబద్ధం చెప్పాను. అది అబద్ధం అని నా మొహమే చెప్తుంది. రేపు ఈ వార్త మా ఆఫీసులో, నీ కాలేజీలో అందరికీ ఎలాగో తెలుస్తుంది. వారి అనుమానపు దృక్కులు, సానుభూతి వాక్యాల చాటున హేళన ఉంటుంది. ఇంతేకాదు, ఇది రేపు నీ పెళ్ళికి అవరోధం అవచ్చు. నీ అంతట నీవు ఎవరినన్నా చేసుకున్నా, సమయం వచ్చినప్పుడల్లా దెప్పడానికిది ఆయుధంగా వాడుకుంటాడు ఆ మొగుడనేవాడు."

చిత్ర మొహం కళ తప్పి నల్లబడింది. "మమ్మీ, నీవిన్ని అంటున్నావు. మా కాలేజీలో కొంతమంది అబ్బాయిలు, అమ్మాయిలు ఎలా తిరుగుతారో తెలుసా హోటళ్ళు, పిక్నిక్కులు అంటూ? అయామ్ ష్యూర్ దే ఆర్ హేవింగ్ సెక్స్."

"ఎవరో ఏదో చేశారని నీవూ చెయ్యక్కరలేదు. పట్టుబడేవరకు అందరూ పవిత్రులే. ఈ ఫామిలీ ప్లానింగ్ మెథడ్స్ వచ్చాక ఎంత పవిత్రంగా ఉన్నారన్నది ప్రశ్నార్థకమే. అపాటి తెలివి కూడా లేకుండా నీవు రొంపిలో దిగబడ్డావు. ఈ మాట నేను ఇంతవరకు ఎందుకు అనలేదో తెలుసా? ఫామిలీ ప్లానింగ్ యూస్ చేస్తూ బాయ్‌ఫ్రెండ్స్‌తో తిరగచ్చు అని నేను సజెషన్ ఇచ్చినట్లవుతుందని చిత్రా! ప్లీజ్ నీలాంటి అమ్మాయిలు విచ్చలవిడిగా తిరిగి మళ్ళీ 'న...స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అని పెద్దలు భావించి, చరిత్ర పునరావృతం అయి ఆడదాన్ని మళ్ళీ నూరేళ్ళు వెనక్కు పంపేయకుండా చూడాల్సిన బాధ్యత ఈ తరం, ముందు తరాల అమ్మాయిల మీద ఉంది. 'ఫరవాలేదు, స్త్రీకి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు ఇచ్చినా దుర్వినియోగం చెయ్యరు' అన్న నమ్మకం సమాజానికి మీ యువతరం కలిగించాల్సిన బాధ్యత ఉంది."

కల్యాణి మాటలకి చిత్ర కళ్ళు వాల్చుకుంది. చిత్ర మళ్ళీ ఇలాంటి తప్పు చెయ్యదని, చేసేముందు పదిసార్లు ఆలోచిస్తుందన్న నమ్మకం కల్యాణికి కలిగింది.

● ఇండియా టుడే – *25 జనవరి, 2000* ●

★ ★ ★

106

కుప్పిలి పద్మ

# యిన్‌స్టెంట్‌లైఫ్

రోజ్‌వుడ్ పెయింట్ చేసిన 2″ × 2″ నలుచదరపు టేబుల్‌కి అటో కుర్చీ యిటో కుర్చీ. టమోటా చిల్లిసాస్ వెనిగర్ సాల్ట్ పెప్పర్ చిన్నిచిన్ని పింగాణీ గిన్నెలతో అమర్చిన ట్రే: యుయెస్ పీజా వాసనలు. ప్లాస్టిక్ గ్లాసుల్లోని కోక్ స్ప్రియిట్ థమ్సప్ చల్లదనాలు.

ఫ్లైవోవర్ మీది నుంచి యెడతెరిపి లేకుండా సాగిపోతోన్న కార్లు స్కూటర్లు ఆటోల మధ్య బస్సులు తక్కువగానే కనిపిస్తున్నాయి. యెదురుచూస్తున్న వాహనం మాత్రం కనిపించంలేదు.

ఎర్ర దీపాలు వెలిగి ఆరుతున్నాయి. రయ్ రయ్‌మంటూ పైలెట్ వాహనం వెనక వరుసగా వో పదికార్లు. టైట్ సెక్యూరిటీతో వో మూడు నిమిషాల తర్వాత అటూ యిటూ ఆపిన వాహనాలని వదిలారు. మూడు గుక్కల కోక్ లాగేలోగా నలుగురైదుగురు వి.ఐ.పి.లు యీ రోడ్డులో అటు ఎయిర్ పోర్ట్‌కో యిటు రాజభవన్‌కో జూబ్లీహిల్స్‌కో కాలేజ్ రోడ్డులోని వి.వి.ఐ.పి.ల యిళ్లకో పోతుంటారు.

రోడ్డు విశాలత్వాన్ని మింగేస్తోన్న వాహన రద్దీ. యిద్దరు విదేశీయులు చేయిచేయి పట్టుకొని రోడ్డు డివైడర్‌పై పెంచిన లాన్‌ని తొక్కకుంటూ రోడ్డుని క్రాస్ చేస్తున్నారు. స్వదేశీయులకి యింకా అంత తెగింపు రాలేదు. కిలో మీటర్ దూరం నడిచే రోడ్డుని క్రాస్ చేస్తున్నారు. రోడ్లు వెడల్పు చేసినా ఫ్లైవోవర్లను నిర్మించినా నడిచేవారికి చోటెందుకు వుండదో?!

ట్రాఫిక్‌లోంచి ఆగి ఆగి వస్తున్న సందీప్.

గత రెండ్రోజులుగా నిద్రపట్టడంలేదు. అత్రుత ఆందోళన దిగులు... బరువుగా భారంగా రెండ్రోజుల నిరీక్షణ.

యమహాని పార్క్ చేసి జుట్టు సరిచేసుకొని లోపలికి వచ్చాడు. వెలుతుర్లోంచి లోపలికి రాగానే అమర్చిన మసకతనం. చల్లదనం అలవాటైౖ మూలకి వచ్చి కుర్చీలో కూర్చుంటూ 'హాయ్ సారీ. ట్రాఫిక్' యిద్దరిలో ముందు వచ్చినవాళ్లకి యిచ్చే కామన్ సంజాయిషీ.

తర్వాత మాటలు పెగలటంలేదు.

రెండ్రోజుల ముందువరకైతే–

మా యిద్దరి కబుర్లకి కామా ఫుల్‌స్టాప్‌లే లేవు. మధ్య మధ్య అమ్మ గుర్తొచ్చినప్పుడల్లా యీ మాటల్లో కొన్నైనా గుర్తుంచుకోవాలనే ప్రయత్నం. కలిసిన ప్రతిసారీ యిదే ఆలోచన. వొక్క మాటా గుర్తుండదు. వో రెండు మూడు గంటలు మా యిద్దరం ఎదురెదురుగా కూర్చుని గడిపాం. ఐ.టి. సాఫ్ట్‌వేర్ హార్డ్‌వేర్ మేనేజ్‌మెంట్ కోర్సులు. హాలివుడ్ బాలివుడ్ సోషియాలజీ పాలిటిక్స్ – వొక్కటేంటి – కలగాపులగం.

'అన్నేసి గంటలు మీరంతా యేం మాట్లాడుకుంటారు?' వోరోజు అమ్మ అడిగింది.

తెల్లమొహం వేసా.

అప్పట్నుంచి వొక్క రోజైనా మేం మాట్లాడేవి గుర్తు పెట్టుకొని అమ్మకి చెప్పాలనే ప్రయత్నం. యేం గుర్తుండవ్.

అలా అని చెప్పగానే అమ్మ నవ్వుతుంది.

పక్కటేబుల్ దగ్గర సర్వ్ చేస్తున్న వ్యక్తి పైనే చూపులు నిలిచాయి. బాగా పరిచయం వున్న ముఖం. అతను లోపలికి వెళ్లిపోయాక గుర్తొచ్చింది. యిడ్లీబండబ్బాయి. అతను మరో ఖాళీ అయిన టేబుల్ క్లీన్ చేయడానికి వచ్చాడు.

'అతను నరసింహా కదా?' అడిగాను.

'వ్వా. నరసింహా. యిక్కడ పనికి చేరేడా?' సందీప్ మామూలుగా అన్నాడు.

'యిక్కడ చేరారా?' పలకరించా.

'ఆ.'

'మీ యిడ్లీబండి?'

'గిరాకీ లేదమ్మా!'

'యిక్కడ బాగుండేది కదా. అసలు యిక్కడ నుంచి మీరంతా యెందుకు వెళ్లిపోయారు?'

'వెళ్లిపోలేదు, మమ్మల్ని...'

'ఎక్స్‌క్యూజ్‌మీ!' పక్క టేబిల్ నుంచి పిలుపు.

'యిప్పుడే వస్తా' అని నర్సింహా వెళ్లాడు.

బేరర్ – క్లీనర్ – సర్వర్ – వొకనాటి వోనర్ నర్సింహా. యిడ్లీబండిపై వేడి వేడి యిడ్లీలు దోశెలు సెనగపప్పు – అల్లంపచ్చడి కారం పొడి టీ కాఫీ. పక్కనే ఛాట్‌బండి. పానీపూరి బేల్‌పూరి రగడాఛాట్ పావ్‌భాజీ జిలేబి.

కాలనీవాళ్లు కాలేజ్ స్టూడెంట్స్ దారేపోయేవాళ్లతో యెప్పుడూ యీ రెండు బళ్లు బిజీగా వుండేవి. చుట్టుప్రక్కల కాలేజ్ స్టూడెంట్స్ అడ్డా. టూ వీలర్స్‌ని ఆనుకొని బండరాళ్లపై కూర్చుని కారుల్లో కార్లపైన కూర్చుని తింటూ. గుంపులు గుంపులుగా అమ్మాయిలు అబ్బాయిలు కబుర్లు చెప్పుకునే వాళ్లం.

అప్పుడప్పుడు యిడ్లీ దోశ పార్సిల్ చేయించుకొని అమ్మకి తీసుకువెళ్లేదాన్ని. అమ్మకి అల్లం పచ్చడి కారప్పొడి భలే నచ్చేది. యీ కాలేజ్‌కి వచ్చిన కొత్తల్లో స్టూడెంట్స్ దగ్గర యిప్పుడున్నన్ని కాకపోయినా పేజర్స్ సెల్ ఫోన్స్ యెక్కువగానే

వుండేవి. యెక్కువగా అబ్బాయిల దగ్గరే వుండేవి. వోరోజు కాలేజ్‌కి డ్రాప్ చేయడానికి వచ్చిన అమ్మ 'సెల్‌ఫోన్స్ పేజర్స్ కొత్తకొత్త కార్లు.... అయినా బళ్లమీదః బానే తింటున్నారే' అంది.

'వీళ్లలో చాలామంది సాయంత్రం ఫైవ్‌స్టార్ త్రీస్టార్ హోటల్స్‌కి క్లబ్స్‌కి రిసార్ట్స్‌కి లేట్‌నైట్ పార్టీస్‌కి డిస్కోస్‌కి వెళతారు.'

'వ్వూహూ' అంది అమ్మ గోడమీద గోవింద సినిమా పాట 'మైబేల్ పురి' వాల్‌పోస్టర్‌పై చూపు నిలిపి.

దసరా సెలవలు అయిపోయి కాలేజ్‌కి వచ్చేసరికి యిడ్లీ ఛాట్ బళ్లులేవు.

డ్రింక్‌యిన్ - రెస్టారెంట్.

పీజా, బర్గర్, పేస్ట్రీస్ ఐస్‌క్రీమ్‌కోక్ థమ్సప్ మెరిన్‌డా యిద్దరికి మాత్రమే సరిపోయే టేబుల్స్.

వీడియోగేమ్స్ యింటర్‌నెట్ గ్రీటింగ్ కార్డ్స్ పువ్వులు రంగురంగుల నిలువెత్తు డబ్బాలో టెలిఫోన్.

అప్పట్నుంచి డ్రింక్‌యిన్ మా అడ్డ.

డ్రింక్‌యిన్ రావటంతో యిడ్లీ ఛాట్‌బళ్లు డబ్బా టెలిఫోన్ బూత్ మాయమైపోయాయని చెప్పాను.

'వాళ్లంతా యేమైపోయారు?' అంది అమ్మ.

'యేమైపోరు. వేరే చోట వ్యాపారం బాగుంటుందని వెళ్లుంటారు' అన్నాడు నాన్న.

చప్పున టాపిక్ మార్చేసాను. వాదన యెటు తిరిగినా చివరికి అమ్మ నొచ్చుకునేట్టు యేదో వో మాట అనేస్తాడు నాన్న.

నరసింహా కనిపించిన రాత్రి భోజనాలప్పుడు 'నరసింహా కనిపించాడు' – అమ్మకి చెప్పాను.

'యే నరసింహా' అమ్మ అడిగింది.

'యిడ్లీ బండి. డ్రింక్‌యిన్‌లో సర్వర్, క్లీనర్, బేరర్... యేదైనా కానీ ప్రస్తుతం అక్కడ పనికి చేరాడు. డ్రింక్‌యిన్ మొదలవ్వటానికి రెండ్రోజుల ముందు ట్రాఫిక్ పోలీసులు తరిమేసారంట. మూడేళ్లుగా మేం వుంటున్నాం. వాళ్లకి అంతోయింతో యిచ్చుకుంటున్నాం. మేం యెలా ట్రాఫిక్‌కి అడ్డం అయ్యామో తెలియదు. తరిమేసారు అని బాధపడ్డాడు. యిదంతా డ్రింక్‌యిన్‌వాళ్లే డబ్బులిచ్చి చేయించారని నరసింహా నమ్మకం. అక్కడ నుంచి మరోచోటకి వెళితే అప్పటికే అక్కడున్న బళ్లవాళ్లతో గొడవంట వాళ్ల వ్యాపారం పోతుందని. సంపాదించిన డబ్బుల్లో పెద్దగా దాచుకున్నవి లేవంట. టి.వి. స్కూటర్ ఫ్రిజ్ యిన్‌స్టాల్‌మెంట్స్‌లో కొనుక్కున్నాడంట. ఆ బాకీలు తీర్చటం యిల్లు గడవటం రోజురోజుకి తగ్గిపోయిన గిరాకీ చివరికి డ్రింక్‌యిన్‌లో చేరాడంట.' నరసింహా చెప్పిందంతా చెప్పాను.

'ట్రాఫిక్ పోలీసులా?! వ్యాపారం బాగ సాగుతుందని గమనించే డ్రింక్ యిన్ వాళ్లు రెస్టారెంట్ మొదలుపెట్టారు. డబ్బాఫోన్ కుర్రాడిని పంపించేసారు. వొకరిద్దరు కస్టమర్స్‌ని కోల్పోవటం కూడా యిష్టం వుండదు. ఆ బళ్లు రెస్టారెంట్ పక్కన వుండటం కూడ చీప్‌లుక్ అనుకొని వుంటారు. 'యీటింగ్ వరల్డ్' రాగానే రోజూ కూరలు కొనుక్కొచ్చే అవ్వ తట్ట లేచి పోయింది కదా!' అంది అమ్మ.

'యీటింగ్ వరల్డ్ కూరలు ఫ్రెష్‌గా వుంటాయి. అన్ని సామాన్లు వొక్కచోటే కొనుక్కోవచ్చుకదా!' అన్నాడు నాన్న.

'అవ్వ దగ్గరా ఆకుకూరలు పచ్చిమిర్చి వంకాయలు యే కూరగాయలైనా నిగనిగలాడుతూనే వుండేవి.'

'నీది వృత్తి ఆవేశం అరుంధతి! కరడుకట్టిన థీయరీలు. నీ కమ్యూనిస్ట్-ఫెమినిస్ట్ బుద్దులు పోనిచ్చుకున్నావ్ కాదు. నీకేం తెలుసు యిండియాలో ముఖ్యంగా మన దగ్గర పర్చేజింగ్ పవర్ యెంతలా పెరిగిందో. ఫ్రిజ్‌లకి టి.వి.లకి కార్లకి యిల్లు కొనుక్కోడానికి లోన్స్ యిస్తున్నారు. కొన్ని యింట్రస్ట్ ఫ్రీ కూడా. పేదాగొప్ప తేడా పెద్దగా లేదు. నువ్వు వృత్తనే ఆవేశపడుతున్నావ్' అన్నాడు నాన్న.

రెండ్రోజులకోసారి యింట్లో యివే గొడవలు కొన్నాళ్లుగా. నాన్నకి సొంత యెజెండా వుండటం మేం చూడలేదు. యే పాత్రలోనైనా యిమిడిపోయి ఆ ఆకారంలా కనిపించే నీళ్లలా నాన్న పని చేసేస్తుంటే—

'అసలీ పనులు యెందుకు చేస్తున్నావ్? వీటివల్ల జరుగుతుందేమిటో తెలియదా?' అమ్మ అడిగిందోరోజు.

'షటప్! నన్నెవరూ ప్రశ్నించరు. నాతో యెవ్వరూ యిలా మాట్లాడరు. నువ్వు తప్ప. నువ్వూ నీ బోడి ఫెమినిజం యెవరిక్కావాలి? నాలుగు నోట్లు చూపిస్తే నీతోవున్న ఆ నలుగురాడాళ్లు యిటొచ్చేస్తారు. డబ్బు సంపాదించటం చేతకాక సుఖంగా బతికేవాళ్లని ఆడిపోసుకోవటం. నీ కొడుకే నీ ఆలోచనలు పొరపాటంటున్నాడు. గుర్తుంచుకో. యింకెప్పుడూ హాఫ్ నాలెడ్జ్‌తో ప్రశ్నించకు.' నాన్న నోరు పారేసుకుంటున్నాడు.

'నేను నమ్మిన విలువలకి నేను కట్టుబడి వున్నాను. నువ్వు వున్నావా?' అమ్మ అడిగింది.

'యేంటి నీ విలువలు? ఆడాళ్లకి రాజ్యమా? చదువా? డబ్బా? పిల్లలా? మొగుడా? అందాల పోటీలా? నా విలువలనే ప్రశ్నిస్తావా? పొగరెక్కి....' తింటున్న అన్నంపళ్లెం నేలకేసి కొట్టాడు నాన్న.

వాళ్లిద్దరి బెడ్‌రూమ్స్ వేరైపోయాయి.

'యేంటమ్మా యిదంతా? యింతగా మీ యిద్దరికి యే విషయంలోను పడదుకదా, యిద్దరూ యిష్టపడి యెలా పెళ్లి చేసుకున్నారు?' ఆ రోజు అమ్మని అడిగాను.

'యిష్టపడే చేసుకున్నాం. యింట్లోవాళ్లని వొప్పించి, కాదన్నవాళ్లని పట్టించుకోకుండానే చేసుకున్నాం. అప్పట్లో విజయ్ యిలా వుండేవాడు కాదు. రానురాను అతనిలో రకరకాల మార్పులు వచ్చాయి. పవర్‌వైపు, అక్రమార్జనవైపు తను

పరుగు మొదలుపెట్టినప్పట్నుంచి అతనిని రక్షించుకోవాలని నే చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. యిప్పుడు యే మానవీయ స్పర్శా అతనికి అక్కర్లేదు. ముందే అతను యిలా వుండివుంటే తను నా ఛాయిస్ అయివుండేవాడు కాదు' అంది అమ్మ.

'యిలా యెందుకు జరుగుతుందంటావ్?'

'గ్లోబలైజేషన్ బ్యాంక్స్ దగ్గరే ఆగిపోదమ్మా బెడ్‌రూమ్‌లోకి వచ్చేస్తుంది' అంది అమ్మ.

ఆ రోజునుంచి అమ్మా నాన్న మాట్లాడుకోవటమే అరుదైపోయింది. యీ యిద్దరూ యీ యింటినుంచి విడిపోకుండా వుండటానికి కారణం నేనూ తమ్ముడేనా?!

యీ యింట్లో యీ అశాంతికి కారణం అమ్మ అర్థంలేని విలువలేనని తమ్ముడి నమ్మకం.

'అమ్మ పిచ్చిది కాకపోతే తను సంపాదించే ఐదువేలుతో మనం కంఫర్టబుల్‌గా బతకగలమనుకుంటుందా? నాన్న బాగా సంపాదిస్తుండటం వల్లేకదా నాకో యమహా. నీకో కంప్యూటర్ మంచి పాకెట్‌మనీ బట్టలు తిండి. అవునా కాదా? వెర్రిదానిలా నా డబ్బులతోనే నే బతుకుతానంటూ యెందుకంత సింపుల్‌గా వుండాలి? హాపీగా ఖర్చు పెట్టుకోవచ్చుకదా! బయట నాన్న అంత కష్టపడి వస్తాడు కద. యింటికొచ్చేసరికి యిద్దరికిద్దరే.' విసుక్కుని ఆరోజు నుంచి తమ్ముడూ మా యిద్దరితో సరిగ్గా మాట్లాడటం మానేసాడు.

యిన్ని గొడవల మధ్యకి నరసింహ సమస్యని అనవసరంగా తీసుకొచ్చానేమో! అమ్మనొక్కతే వున్నప్పుడు చెప్పాల్సింది.

టాపిక్ మార్చాలి వెంటనే. యే టాపిక్? తమ్ముడి చదువు...నా చదువు....టీ.వి. సీరియల్స్.. కామ్....అరే...బ్లాంక్....ఆ...సందీప్.

'నే కాలేజ్‌కి వెళ్లాక సందీప్ యేమైనా ఫోన్ చేసాడా? యీమధ్య కలిసి పదిరోజులై పోయింది. ఫోన్ చేసినా దొరకటంలేదు' అన్నాను.

'లేదు. బిజీగా వున్నాడేమో!' అన్నాడు.

'యింట్లో యెవ్వరూ లేరా?' అమ్మ అడిగింది.

'ఆంటీ వున్నారు మెసేజ్ యిచ్చాను.'

ఫోన్ మోగింది. నాన్న తీసారు.

'హాయ్ హౌ ఆర్ యూ. హో గుడ్ వెరిగుడ్. కంగ్రాట్స్' అని ఆగి నాన్న కార్డ్‌లెస్ అందించారు.

'హలో!'

'హాయ్. జాబ్ వచ్చింది. స్టేట్స్ వెళుతున్నా. అరేంజ్‌మెంట్స్ బిజీ.' సందీప్ చెపుతున్నాడు.

'రేపు డ్రింక్ యిన్‌కిరా' అన్నాను.

'రేపా? రేపుకాదు యెల్లుండి.'

'రేపేంటి పని?'

'క్లాస్ వుంది.'

'యే క్లాస్?'

'పర్సనాల్టి డవలప్‌మెంట్. రేపు ఆఖరిక్లాసు' అన్నాడు.

'యెల్లుండి సాయంత్రం. బై!'

'గుడ్ వెరిగుడ్. సందీప్ అమెరికా వెళుతున్నాడంట. వచ్చే యేడాది నా కొడుకు వెళతాడు....' నాన్న మాట్లాడుతూనే వున్నారు. నాకేం వినిపించటంలేదు.

అమెరికా వెళతాడా? అసలీ ప్రస్తావనే మా మధ్య యెప్పుడూ రాలేదు.

అమ్మ గదిలోకి నావెనకే వచ్చింది.

'సందీప్ వెళ్లాలనుకుంటున్నాడని నీకు తెలుసా?'

'తెలియదు.'

'యేంటలా అయిపోయావ్?'

'అమెరికా...తను వెళితే అతన్ని చాలా మిస్ అవుతా.'

'తిరిగి వస్తాడుగా?'

'వుద్యోగానికి వెళుతున్నాడు.'

'వూ. యేడాదికి తిరిగి రాడా?'

'సంవత్సరం తక్కువ కాలమా? వచ్చినా తిరిగి వెళతాడు. తనని కలవకుండా మాట్లాడకుండా వుండటం నాకు కష్టంగానే వుంటుంది.'

'నీకు అమెరికా వెళ్లాలని వుందా లేదా?' అమ్మ అడిగింది.

'కొన్నాళ్లు వుండి వుద్యోగం చేయటం చదువుకోవటం పట్ల నాకేం అభ్యంతరం లేదు. సెటిల్ అవ్వాలని లేదు. అయితే యిప్పుడు సమస్య నా చదువు యింకా పూర్తికావడానికి యేడాది టైమ్ వుంది. తనతో వెంటనే వెళ్లలేను కదా?' అన్నాను.

'వెంటనే వెళ్లలేకపోవచ్చు. బెంగగానే వుంటుంది కానీ కమ్యూనికేషన్ కష్టం కాదుకదా? యిమెయిల్ చాట్ యిన్ని వున్నాయి కదా? యెల్లుండి కలిసినప్పుడు అన్న విషయాలు స్పష్టంగా మాట్లాడు' అంది అమ్మ.

'వినగానే బాగా దిగులేసింది, చదువు పూర్తి చేసాకే వెళతా. కమ్యూనికేషన్ పెద్ద సమస్యకాదు. క్షణాలపై అన్నీ మాట్లాడైవచ్చు. యిట్స్ వెరి ఫన్నీ. వో పది నిమిషాల ముందువరకు సందీప్ ఫోన్ చెయ్యలేదని తప్ప మరే ఆలోచన లేదు. యిప్పుడేమో చదువు పూర్తిచేయటం అమెరికా వెళ్లటం యెలా – యివే ఆలోచనలు. సందీప్, నేను పెళ్ళి చేసుకోవాలని అనుకున్నాం కాని యెప్పుడు యెక్కడా యెలా అని అనుకోలేదు. యెల్లుండి మాట్లాడాలి' అన్నాను.

యిదిగో యిప్పుడిలా సందీప్‌తో.

☆ ☆ ☆

'యేమిటి మాట్లాడాలన్నావ్?' అడిగాడు సందీప్.

'అమెరికా వెళుతున్నావ్, మనం యెలా ప్లాన్ చేసుకుందాం' అడిగాను.

సందీప్ కొంచెం సమయం తీసుకొని 'యిమోషనల్‌గా కష్టంగానే వుంటుంది. కానీ ప్రాక్టికల్‌గా తప్పటంలేదు. నీ చదువు నా చదువు వేరు. మనిద్దరికి వొక్కచోట

వుద్యోగం దొరకటం కష్టం. చాన్స్‌లేదు. నా ప్రొఫెషన్‌లోనే వున్న అమ్మాయిని పెళ్ళి చేసుకుంటే యిద్దరం వొకేచోట వుద్యోగం చేయవచ్చు. వొకేసారి ఆఫీసుకి కలిసి వెళ్ళొచ్చు. యింటికి కలిసి తిరిగి రావొచ్చు. యింటిపని కలిసి చేసుకోవచ్చు. ప్రొఫెషనల్‌గా బోల్డంత చర్చించుకోవచ్చు. నీ పని పూర్తయి నువ్వు యింటికి త్వరగా వచ్చేస్తావనుకో. నా పని కాకపోవచ్చు. అప్పుడు యింట్లో వొంటరిగా నాకోసం నువ్వు యెదురు చూస్తుంటావ్. నువ్వు ఆలస్యమైనా నే త్వరగా రావొచ్చు. అప్పుడు నువ్వు యెదురుచూడాలి. లాంగ్‌రన్‌లో గొడవలు లేకుండా వుండాలంటే ప్రాక్టికల్‌గా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. ఫ్యామిలీ లైఫ్ టెన్షన్స్ వర్క్ మీద పడకూడదు.' సందీప్ చెప్తున్నాడు.

సందీప్ కొత్తగా తోచాడు. కొత్త మాటలు కొత్త ఆలోచనలు. పదిరోజులయిందా కలిసి. యింతలోనే యెంత కొత్తో.

'ఫ్యామిలి లైఫ్ చాలా ముఖ్యమంటా, వర్క్‌లో సక్సెస్ అవ్వటానికి.'

'ముఖ్యమంటా....? యెవరు చెప్పారు?' అడిగాను.

'పర్సనాల్టి డవలప్‌మెంట్ క్లాసెస్‌కి వెళ్లానుగా.'

'యెన్ని క్లాసులు?'

'రోజుకి రెండుగంటలు, యేడు రోజులు.'

'మొత్తం పధ్నాలుగు గంటలు.'

'ఆ. మనం మంచి స్నేహితుల్లా వుండిపోదాం. పెళ్ళి చేసుకొని లాంగ్‌రన్‌లో పోట్లాడుకోకుండా... విడిపోకుండా నువ్వు కూడా చక్కగా సోషియాలజి స్టూడెంట్‌ని చూసి పెళ్లి చేసుకుంటే యిద్దరూ కలిసి వొకే పనిని చేయచ్చు. యెన్.జి.వో. పెట్టొచ్చు. కన్సల్టెంట్స్‌గా పనిచేయచ్చు. పనిని షేర్ చేసుకోవచ్చు.'

'గుడ్. పర్సనాల్టి డవలప్‌మెంట్ క్లాసెస్ నీకు బాగా నచ్చాయా?'

'చాలా. మనం కొన్ని విషయాలని అర్థం లేకుండా ఆలోచిస్తాం. నేను నిన్ను పెళ్లి చేసుకోనని చెపితే నువ్వు బరస్ట్ అవుతావని నీ విషయంలో నా నిర్ణయం తప్పని అన్యాయమని యిన్‌హ్యూమన్ అని అమ్మ బోల్డంత పోట్లాడింది. కోప్పడింది. నచ్చచెప్పాలని ప్రయత్నించింది. నే చెబుతూనేవున్నా నువ్వు అర్థం చేసుకుంటావని. యీ నిర్ణయం మన యిద్దరి జీవితాలకి మంచిదేనని.' సందీప్ మాట్లాడుతూనే వున్నాడు.

పధ్నాలుగు గంటల పర్సనాల్టి డవలప్‌మెంట్ క్లాసెస్–మా ఐదేళ్ల స్నేహం ప్రేమని యింత ప్రాక్టికల్‌గా ఆలోచింపచేసి నిర్ణయాలు తీసుకొనేంత శక్తివంతమైనవా?

లేక బుర్రలో అటూయిటూ కొట్టుమిట్టాడుతున్నవాటిని బయటికి లాగి పైకి మాట్లాడటానికి కావల్సిన సపోర్ట్‌ని యిచ్చాయా? నిజంగా సందీప్ చెపుతున్నవి కారణాలేనా? అంతకంటే బలమైనది భయపెట్టేది చెప్పలేక యివి చెపుతున్నాడా? బతకడం అవసరమా అనవసరమా? అటో యిటో తేల్చి చెప్పే కౌన్సిలింగో యేదోవొక డెవలప్‌మెంట్ క్లాసో వర్క్‌షాపో వుంటాయి. యెందులోకి వెళ్లాలన్నది మన ఛాయిస్ కదా!

సో....సందీప్ ఛాయిస్.

పంచుకున్న కాలాన్నో జల్లుకొన్న రంగుల్నో విరజిమ్ముకొన్న పరిమళాలనో చెవిలో ముద్దునో తడబడుతూ అల్లుకున్న శరీరాల మోహాస్పర్శనో గుర్తుచేసి నిర్ణయం మార్చుకో అని నచ్చచెప్పటం వాదించటం అనవసరం.

ఆ రాత్రి కంప్యూటర్ ముందు కూర్చుని మెయిల్ చూస్తున్నా.

'మీ అమ్మలా వుత్తినే ఆవేశపడటం తప్పా బతికే తెలివి లేదు. నేనప్పుడే చెప్పా. సోషల్ సైన్సులు వద్దూ, యెంసెట్ రాయమన్నా వినలేదు. బియస్సీ కంప్యూటర్స్.... వినలేదు. సందీప్‌కి చెప్పొచ్చుగా సంవత్సరంలో డిప్లొమా కోర్సుచేసి వచ్చేస్తా నీ లైన్‌లోకే అని. ఐ.టి.దే భవిష్యత్తంతా. యిప్పటికేనా నా మాట విని యేడాది కోర్సులో చేరు. కంప్యూటర్ లైన్‌లో లేకపోతే పెళ్లిళ్లు కష్టం.' నాన్న మాటలు వింటుంటే నవ్వొచ్చింది.

'యేదైనా యాడ్ యేజన్సీ వాళ్లకి ఫోన్‌చేసి ఐ.టి.లో చేరితే మొగుడు గ్యారెంటీ అని చెప్పరాదు? కంప్యూటర్ యిన్‌స్టిట్యూషన్స్ ప్రకటనల్లో వాడుకుంటారు' అన్నాను.

'నవ్వులాటగుంది, క్లాసెస్‌కి వెళ్లు.'

'నాన్నా! యే రంగానికున్న ప్రాముఖ్యం ఆ రంగానికుంటుంది. నా పనులన్నీ కంప్యూటర్‌తో హాయిగా చేసుకుంటాన్నాగా. అవసరమైన స్కిల్స్‌ని నేర్చుకుంటూనే వున్నాగా. కానీ ఆ ఫీల్డు నా ప్రొఫెషన్ కాదు. పెళ్లి కోసమని కంప్యూటరూ నేర్చుకోను. వంటా నేర్చుకోను. నాకు ఆసక్తిగానో నా యిష్టంగానో అవసరంగానో అనిపిస్తే యేమైనా నేర్చుకుంటా. అంతేకాని పెళ్లి కాదనో, మొగుడు వదిలేస్తాడనో నేర్చుకోను.'

'మీ అమ్మలా తయారయ్యావ్. వూ.....సర్లే.....నాకేమైనా మెయిల్ వుందా?' అన్నారు నాన్న.

'లేవు. అమ్మకి వుంది' అన్నాను.

నాన్న గదిలోంచి వెళ్లిపోయాడు.

సందీప్....సంవత్సరం తర్వాత పదిరోజుల సెలవుపై వచ్చాడు. పెళ్లికి పిలిచాడు.

అరటిచెట్లు మల్లెపూలు కొబ్బరాకులు మామిడాకుల మంటపంలో సందీప్ అమ్మాయి మెడలో తాళికట్టాడు.

'యింటికి రాలేకపోతున్నా....టైమ్‌లేదు. తను వెంటనే అక్కడ జాబ్‌లో జాయిన్ అవ్వాలి. వొకేచోట యిద్దరి వుద్యోగం. నీకు జెఎన్‌టియులో సీట్ వచ్చిందంటకదా? నెక్స్ట్ టైమ్ వయా ఢిల్లీ వస్తే నిన్ను చూడొచ్చన్నమాట' అన్నాడు.

'వూహూ.'

'అక్కడికి వచ్చి యేదైనా యూనివర్సిటీలో చదువుకోవచ్చుకదా?' అన్నాడు.

'వూ.....వెళతానింక.'

'వొక్క నిమిషం' అని సందీప్ పార్క్‌చేసిన కార్లవైపు వెళ్లాడు. తిరిగొచ్చి 'యిది నీ కోసం తీసుకొచ్చా. నెంబర్ బటన్స్ అక్కర్లేదు. పర్సన్ పేరు నెంబర్ చదువుకుంటూ

వెళ్లు. రికార్డ్ అయిపోతాయి. ఫోన్ చేయాలనుకున్నప్పుడు ఆ వ్యక్తిపేరు చెప్పు. ఆటోమెటిక్‌గా డైల్ అవుతుంది. కాన్ఫిడెన్షియల్‌గా వుంటుంది. నెంబర్స్ గుర్తుపెట్టుకోనక్కర్లేదు. టెలిఫోన్ నెంబర్స్ పుస్తకాన్ని మోసుకు తిరగక్కర్లేదు. జె.టి.ఎమ్, టాటా యేదోవొక కనెక్షన్ తీసుకో.' చిన్నగా ముద్దుగా వున్న నల్లని యిన్‌స్ట్రుమెంట్‌ని చూపిస్తూ అన్నాడు.

'సెల్ వాడేంత పనేం లేదే!'

'ఢిల్లీ వెళుతున్నావ్. చాలా యూజ్‌ఫుల్' అన్నాడు.

'వాడే వాళ్లకి యిస్తే సంతోషిస్తారు. వాడను కదా! మూలపెట్టాలి. వాడే అవసరం యిప్పట్లోరాదు' అన్నాను.

'నీ కోసమే తెచ్చా. యెలా? యేమివ్వను? పెర్‌ఫ్యూమ్స్. కాని యిక్కడ లేవు యింట్లో వున్నాయి. డ్రైవర్‌తో మీ యింటికి పంపించనా?'

'వద్దొద్దు. పెళ్లికి వచ్చాను, మల్లెపూలు యిచ్చారుగా! చాలు వెళతా.'

'సినిమాల్లో చూపించినట్టే పెళ్లిళ్లు జరుగుతాయా అని అమెరికన్ ఫ్రెండ్స్ అడిగారు. వాళ్లకి కేసెట్ చూపిస్తానని చెప్పాను. అందుకే కష్టపడి అరటిచెట్లని కొబ్బరాకుల్ని మల్లెపూలని మామిడాకుల్ని తెప్పించాం. పద్ధతిగా అన్నీ చేసాం. ఫ్రెండ్స్‌ని పిలిచి చూపించి పార్టీ యిస్తాం. వాళ్లకి యివి బాగా నచ్చుతాయి.' సందీప్ చెపుతుంటే చాలారోజులుగా నాలోనే వుండిపోయిన సందేహం గురించి అడగాలనుకున్నా.

'యివన్నీ నీకు నచ్చవా?' అడిగాను.

'నచ్చటం నచ్చకపోవటానికి యేముంటుంది? మన ట్రెడిషన్ కదా! మన విషయాలపట్ల వాళ్లకు చాలా ఆసక్తి.'

'వూహూ....మనం వొక్కచోట వుద్యోగాలు చేయలేమని యిలా యేవేవో చెప్పావు ఆ రోజు మన పెళ్లికి అడ్డంకులుగా. నిజంగా అవి సమస్యలా? కలిసి బతకడాన్ని విడిపోడాన్ని ఆ చిన్న విషయాలు నిర్ణయిస్తాయా? నీ పర్సనాల్టి డవలప్‌మెంట్ క్లాసెస్‌లో మనం కలిసి బతకటంలో సంఘర్షణ వుంటుందని నువ్వు గుర్తుపట్టావ్ కాని యెందుకు అనేది నువ్వు చెప్పలేక – కలిసి ఆఫీసుకి వెళ్ళడం కలిసి వండుకోవటం తినటం అంటూ కారణాలు చెప్పావు. యిప్పటికైనా అసలు కారణాన్ని చెప్పగలవా?' అడిగాను.

సందీప్ కొన్ని క్షణాలు యేం మాట్లాడలేదు.

'మునీరా!...' అని నావైపే రెండు క్షణాలు చూసి...తలాడిస్తూ 'నిజమే, అప్పుడు నీకు చెప్పగలను అనుకున్న వొకటి రెండు కారణాలు చెప్పాను. నిజానికి ఆ క్లాసెస్ చెప్పే ధైర్యాన్ని యిచ్చాయి కానీ చాలాకాలంగా మన యిద్దరి జీవితం పట్ల నాకెన్నో సందేహాలు, అనుమానాలు. మొదట్లో మనిద్దరి యిష్టాలు అభిప్రాయాలు వొకేలానో దగ్గరగానో వుంటూ వచ్చాయి. నువ్వు యీ దేశంలో వస్తున్న ప్రతి మార్పుని వొప్పుకోడానికో ఆచరించడానికో సిద్ధంగా లేవు. నరసింహా విషయమే తీసుకో. నిన్ను బాధపెట్టింది. నాకే బాధా లేదు. మార్పు సహజం. అభివృద్ధిని యెందుకొద్దనాలి? యింకొకరి జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసే అభివృద్ధి పట్ల నీకు

అభ్యంతరం వుంది. మనిద్దరి జీవితం మీ అమ్మా నాన్నగారిలా రోజూ గొడవలతోనే నిండిపోతుందని భయం వేసింది. మా నాన్నగారు చేసే పనులు పట్ల మా అమ్మకి యే అభ్యంతరం వుండదు. యెక్కువ సంపాదిస్తే నాకు అక్కకి యింకాస్త యెక్కువ డబ్బులు యివ్వొచ్చు అనుకుంటుంది తప్పా యీ దేశంలోనో బయటో జరిగేవి యేది ఆమెకి పట్టదు. మా యింట్లో మీ యింట్లో లాంటి గొడవలు వుండవ్. నీకూ నాకు చాలా విషయాలలో కుదర్దనిపించింది' అన్నాడు సందీప్.

'వూహూ.'

యింటికి వచ్చేసాను.

అమ్మకి చెపితే 'యిన్‌ప్రిన్స్‌పుల్ కలవదు అనుకొని వుంటాడు' అంది.

'కలవటం కష్టం. అమెరికన్ స్నేహితులకోసమో రష్యన్ బంధువుల కోసమో నే పూలజడని వేసుకోలేను కదా! నాకు వేసుకోవాలనిపిస్తే తప్పా లేదా నా మొగుడు అస్వాదిస్తానంటే తప్పా కేసెట్ల కోసం నావల్ల కాదు కదా! నేనింకా యేం సర్దుకోలేదు రా.' అంటూ గదిలోకి వెళ్లి సూట్‌కేసలు తెరిచా.

బట్టలు పుస్తకాలు కేసెట్స్ సర్దుతున్నాం.

'సందీప్ నిర్ణయం విన్నప్పట్నుంచి నే చాలా భయపడ్డా నీ గురించి యిమోషనల్‌గా. నిన్ను నువ్వు యెలా నిలబెట్టుకుంటావా అని దిగులుపడ్డా. నాకిప్పటికి ఆశ్చర్యంగానే వుంటుంది. నీ లోపలి సంఘర్షణని యెలా యెదుర్కున్నావాని' అంది అమ్మ.

'నాన్న పూర్తిగా పవర్‌కి, డబ్బుకి అలవాటుపడటానికి యిరవై యేళ్లు పట్టింది. సందీప్ పూర్తిగా మారిపోవటానికి పధ్నాలుగు గంటలు పట్టింది. యిరవై యేళ్లుగా కొంచెం కొంచెంగా మారిపోతూ వున్న నాన్నని చూసి నువ్వెంత బాధపడ్డావో. బాధపడకుండా వుండలేవు విడిపోనూ లేవు. యిరవై యేళ్లు తక్కువ సమయంకాదు. యెలాగోలా కలిసి వుండటానికి అలవాటుపడిపోతాం. బట్, పదిహేను గంటలు అరగంట పదిహేను నిమిషాలు యెక్కువ సమయం మీక్కాదు. మాకు యెక్కువే. త్వరత్వరగా తీసుకునే నిర్ణయాలు మా తరాన్ని నిలబెడతాయో ముంచేస్తాయో. ఆనందాన్ని సంతృప్తిని యిస్తాయో విషాదమైన శూన్యాన్ని నింపుతాయో యిప్పుడే నేనేం చెప్పలేను. కానీ నాకు వో విషయం ఆశ్చర్యంగానే వుంటుంది. సందీప్‌ని కలవాలని రెండ్రోజులు పడిన ఆత్రుత ఆరాధన బాధ ఆదుర్దా సందీప్ నిర్ణయం విన్నప్పుడు యేమైపోయాయో తెలియలేదు. పధ్నాలుగు గంటల్లో మారిపోయిన కుర్రాడు యిరవై యేళ్లలో యేమవుతాడంటావ్? వాళ్లతో వుండి వుండి మన వ్యక్తిత్వాలు మారిపోవచ్చు. నీలా బాధపడో పడకుండానో కన్వీనియంట్‌గా అందులో యిమిడిపోయి సంతోషంగానే బలికైవచ్చు. ఆ బాధని భరించలేక చంపేయవచ్చు. యేది యేమైనా మనం మనలా మిగలం. యేమైనా కానీ నన్ను నేను కోల్పోదల్చుకోలేదు' అన్నాను.

'మీరు నిర్ణయాలు త్వరగానే తీసుకుంటారు. పట్టుకు వేళ్లాడరు. టైమ్ వేస్ట్‌కాదు...కానీ.... యేమో చూద్దాం.'

'నీకో విషయం చెప్పటం మర్చిపోయా. సందీప్ పెళ్లికి వెళుతుంటే చూసా. యిప్పుడు డ్రింక్‌యిన్ లేదు. రెండ్రోజుల క్రితం నేవెళ్లినప్పుడు వుంది. డ్రింక్‌యిన్

వెనకనో పెద్ద షాపింగ్ కాంప్లెక్స్ వచ్చింది. కడుతున్నప్పుడు డ్రింక్ యిన్ ఆ కాంప్లెక్స్ వాళ్ళకి అడ్డు అని నే అనుకోలేదు. ఆ షాపింగ్ కాంప్లెక్స్‌లలో రెస్టారెంట్ బిలియర్డ్స్ యింటర్ నెట్ పిల్లలపార్క్ కూరలు కోళ్లు....వాక్కటేంటి? దొరకనివి లేవు. బట్టలు నగలు యిదీ అది అని కాదు అన్నీ వున్నాయి. రోడ్డు వైడెనింగ్ అంటూ నిమిషాలపై డ్రింక్ యిన్ కూల్చేసారు. యిప్పుడు డ్రింక్ యిన్ ఆనవాలు కూడా లేదు.'

'అవునా! ఆ బిల్డింగ్ పేరు?'

'లైట్ లైఫ్!'

'లైట్...లైట్....?!'

'ఆ లైట్ వెలుగు తేలిక. నీ యిష్టమొచ్చిన అర్థం చెప్పుకో' అన్నాను.

'పెద్ద బిల్డింగా?'

'కోట్లు చేస్తుంది. మన జీవితాన్ని మనమే జీవిస్తున్నామా? లేదా యెవరైనా శాసిస్తున్నట్టు జీవిస్తున్నామా?' అడిగాను.

'మీ అమ్మలా ప్రశ్నలు వేయటం మొదలుపెట్టావే!' గదిలోకి వస్తూనే నాన్న విసుక్కుంటున్నాడు.

నే సమాధానం చెప్పేలోగా 'మునీరా! సర్దాల్సినవి చాలా వున్నాయి. లాంగ్ జర్నీ ఆపకు. కానీ త్వరగా' అంటున్న అమ్మవైపు చూసా.

నా కాలేజ్ గ్రూప్ ఫోటో పైన పేరుకున్న దుమ్ముని దులుపుతూ వెలుగు నిండిన చూపులతో నావైపే చూస్తోంది అమ్మ.

● 'వార్త' ఆదివారం సంచిక, *7-5-2000* ●

* * *

వి. ప్రతిమ

107

# గంగ జాతర

ఊళ్ళో జాతర చాటింపు జరిగింది.

గంగ జాతర ఈ వూళ్ళో చాల ప్రత్యేకమైనది....ఏడుచోట్ల ఏడు గంగల్ని నిలిపి...దున్నపోతుల్ని వూరేగించి చివరిరోజు బలి యిస్తారు...గంగలు వూరేగే వీధులన్నింటిలోనూ కుంభాలు పోస్తారు... వేయికళ్ళ కుండల్లో దీపాలు పెట్టుకుని కొందరాడవాళ్ళు, పిల్లలూ వేపచీరలు కట్టుకుని యింటి వద్ద నుండి గంగలు నిలిపిన చోటుకి వూరేగింపుగా వస్తారు....'మావూరిని నీటి ఎద్దడి నుండి రక్షించమనీ, పిల్లలకు అంటువ్యాధులు సోకకుండా కాపాడమనీ...వూళ్ళోని చిన్నా, పేద వర్గాలను ఈతిబాధల్లేకుండా చూడమనీ' గంగల్ని ప్రార్థించి, వారి వారి శక్తిమేరకు కోళ్ళని, వేటల్ని, దున్నపోతుల్ని బలి యిస్తారు. జాతర రెండు రోజులూ వూళ్ళోని ప్రతీ యిల్లూ చుట్టపక్కాలతో నిండిపోతుంది.

గతంలో అయితే చాటింపు వేశాక వూళ్ళో నుండి ఎవరూ బయట ఊర్లకి వెళ్ళటానికి వీల్లేదు...ఇప్పటి కుర్రకారుకి జాతర హడావిడే తప్ప స్థిమితం లేదు.

మా అత్తగారున్నంత కాలం మా ఇంట్లో కూడా జాతర తాలూకూ పూజలు జరిగేవి....అవిడ పోయాక సాంప్రదాయాలూ, పండుగల సందడీ కూడా చాలా వరకూ తగ్గిపోయాయి.

'అమ్మా...పది కాఫీలు." సురేషొచ్చి దగ్గరగా అరవడంతో ఉలిక్కిపడి 'స్టౌ' మీద నుండి పాలు దించాను....

"అమ్మా...ఇడ్లీ పెట్టి చెట్నీ వేశాను. చాలా, యింకేమయిన చేయాలా? కూరలు ఏం చేయాలో చేప్తే నేను మార్కెట్టుకెళ్ళి తెచ్చుకుంటాను." వంటమనిషి రవణయ్య తొందరపెడ్తున్నాడు...చెప్పకుండాగాని నేను బయటకెళ్ళిపోతే ఏం చేయాలో తెలీక గింజుకుంటాడు. అదీ వాడి హడావిడి......నాకేమో వూపిరాడ్డంలేదు.

మా యింట్లో ప్రతిరోజూ జాతరే...రాజకీయ జాతర....పంచాయితీ ఎన్నికల ప్రకటన వెలవడింది... నామినేషన్ల పర్వం కూడా పూర్తయింది. ఇంటినిండా మనుషులు.....అందరికీ అన్నీ సకాలంలో జరిగిపోవాలి....మాటి మాటికీ టీలు, కాఫీలు...కొందరికి భోజనాలు... ఇల్లంతా చెప్పలేనంత హడావిడిగా వుంది. ఒక్కోసారి నా యింట్లో నేనే పరాయిదానిలా....

కప్పుల్లో కాఫీ పోస్తుంటే దిగులుతో గుండె, నీటితో కళ్ళు నిండాయి.

"అరె, అదేంటి మాధవీ, యింకా నువు రెడీ అవలేదా?....ఇట్లాంటప్పుడు కూడ వంటగదిలో ఏంటి?.... మీ ఆడపడుచు, తోడికోడలూ వచ్చారు కదా, చూసుకుంటారు...మనకిక ఎక్కువ సమయం లేదు. తిరగాల్సిన వీధియా ఏమో చాలా వుంది. యిట్లా అయితే గెలుపు అసాధ్యమవుతుంది....." హడావిడి పెట్టేసింది రాగిణి రాగానే....రాగిణి తండ్రి వాళ్ళూర్లో పెద్ద రాజకీయ వేత్త. చిన్ననాటి నుండీ రాజకీయాల్లో పుట్టిపెరగడంతో రాజకీయాల పట్ల ఆసక్తీ, అభినివేశమూ వున్నాయామెకి. "ఇదిగో అయిపోయింది....మీరంతా టిఫిన్లు చేయండి....." చెప్పాన్నేను, కాఫీ కప్పులు నిండిన ట్రేని సురేష్ కందిస్తూ....మా బృందంలో కొంతమంది టిఫిన్లు చేసొచ్చామనీ, మరికొందరు చేస్తామనీ లేచారు. రవణయ్యని పిలిచి వాళ్ళందరి బాధ్యత అప్పగించి, నేను హడావిడిగా బాత్‌రూమ్‌లోకి దూరాను....మురికి పట్టిన శరీరాన్ని, మనసునీ కూడా ప్రక్షాళన చేసుకోవడానికి....ఇక్కడ జీవితమంటే ఉరుకులూ, పరుగులూ...ఒక్క సెకండు ఆలస్యమైనా జీవితకాలం వెనుకబడిపోతుందేమోనని భయం.....

☆ ☆ ☆

"రాజేంద్రరెడ్డి భార్య....వీర్రాఘవరెడ్డి కోడలు....పంచాయితీ ఎలక్షన్లలో సర్పంచ్‌గా నిలబడింది... మీకు రాజేంద్రరెడ్డి కొత్తకాదు....ఆయన ఈ వూరికి చేసిన సేవ మీకంతా తెలుసు. మీ ఓట్లన్నీ ఆమెకే వేసి గెలిపించాల...మర్చిపోకండమ్మా....మీ ఎన్నికల గుర్తు ట్రాక్టర్...ట్రాక్టర్..."

"వద్దు, నాకు గెలవాలని లేదు..." పెద్దగా అరవాలన్న కోరికని అతి బలవంతం మీద అణుచుకున్నాను.

"నాకు పేరు లేదు....జీవితం లేదు...గెలుపులేదు ఫలానా ఆయన కూతుర్ని, ఫలానా ఆయన భార్యని...యింకా...యింకా ఫలానా ఆయన అమ్మని – అంతే...వద్దొద్దు నాకు గెలుపొద్దు...ఈ విజయంకూడా అతడిదే...."

"ఓమే...రమాదేవా! రారా, పరిగెత్తు. రాజేంద్రరెడ్డి భార్యొస్తే చెప్పమంటివే. వచ్చిందొచ్చింది రా....రా!" సుబ్బలమ్మ కేక విని వెనకింట్లో వున్న సదరు రమాదేవి చేస్తున్న పనినొదిలేసి నా బృందంతో ఆమె యింటి వైపుకి కదిలే లోపలే ఎదురొచ్చింది.

నేను నవ్వుతూ చేతులు జోడించాను.

గత పదిరోజులుగా వీధి వీధి తిరిగి ప్రతీ ఓటర్నీ వ్యక్తిగతంగా కలుస్తున్నానేమో, నా పెదవులు సాగి సాగి అలాగే వుండిపోయాయి. జోడించిన నా చేతులు రెండూ అతుక్కుపోయాయి విడివడకుండా.... అసూర్యంపశ్యయైన నా చర్మ సౌందర్యం ఒక్కసారిగా ఎక్స్‌పోజ్ అవడంతో కమిలి నల్లబారిపోయింది. పాదాలు పది రోజులు నుండీ నా బరువుని మోసి మోసి నొప్పులతో మొద్దుబారి మొరాయిస్తున్నాయి....అంతా వీధి వీధిలో రాజేంద్రరెడ్డి భార్య....రాజేంద్రరెడ్డి భార్య అంటూ 'జూ'లో వింత జంతువుని చూసినట్లు చూస్తున్నారు. ఆత్మాభిమానం లేని నా శరీరం సిగ్గు తెరల

నాదిలేసినట్లుగా వుంది. నా ఆలోచనలు వేరు....అభిప్రాయాలు వేరు...నేను జీవిస్తున్న జీవితం వేరు.

"మా ట్రాక్టర్ గుర్తుకే మీ ఓటు...మర్చిపోవద్దు....ట్రాక్టర్....మీకే సమస్య వచ్చినా అయ్య చూసుకుంటారు..." బతిమాల్తున్నాడు సిద్దయ్య. అప్పుడప్పుడూ దబాయించినట్లుగానూ అరుస్తున్నాడు.

అవునవును! ఓట్లేసి అమ్మని గెలిపిస్తే అన్నీ అయ్య చూసుకుంటారన్నమాట! అన్నీ అయ్యే చూసుకుంటారు....అమ్మకేమీ తెలీదు....తెలియనివ్వరు. ఏం వ్యాపారం చేస్తున్నారో తెలీదు.... ఎంత ఆదాయమొస్తుందో చెప్పరు. అంతెందుకు, నామినేషను వేయడానికి పది నిమిషాల ముందు వరకూ కూడా నేను ఎలక్షన్లలో నిలబడబోతున్నట్లు నాకు తెలీదు....నా అభిప్రాయమెవరూ అడగలేదు... నేను ఇంట్లో సంతకం పెట్టిన నామినేషను కాగితాల్ని తీసుకుని అశేష ప్రజానీకంతో, జేజేల నడుమ అమిత అట్టహాసంగా అతడెళ్ళి దాఖలు చేసి వచ్చాడు....ఆ రోజు కూడా వంటపని నేనే చూసుకున్నాను. నామినేషన్ వేసి అతడు తిరిగొచ్చేసరికి వంద మందికి భోజనాలు రెడీ అయ్యాయి. ఆ తర్వాత కానీ అర్థం కాలేదు, ఈ పంచాయితీ లేడీ రిజర్వుడు అయిందని! అతడెప్పుడూ నాకో ప్రహేళిక...బహుశా నా మౌనం అతడిని ఛేదించలేని ప్రశ్న కావొచ్చును.

నామినేషన్ వేసిన రోజునుండీ నా పుట్టింటి వైపు నుండీ, నా స్నేహితుల నుండీ ఫోన్ కాల్స్ రాసాగాయి.

"ఏంటి, నువ్వు సర్పంచ్‌గా నిల్చున్నావా? ఏమిటే ఈ పని?!"

"నీ ప్రవృత్తికి రాజకీయం ఎంతమాత్రం సరిపడదు...ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నావా?...."

"అతడు చెప్తే మాత్రం నీ స్వంత బుద్ధేమయింది?....అతడేం చెప్తే అదేనా? మరీ డూ...డూ బసవన్నవయిపోతున్నావు...."

"కాంగ్రాట్స్ డియర్!"

అభినందలనీ, మందలింపులనీ బేరీజు వేస్తూ నాలో ఆలోచన మొదలైంది. తప్పు చేయటం లేదుకదా?... ఎందుకిటువంటి నిర్ణయం తీసుకున్నాను? సంతకం పెట్టుండాల్సింది కాదా?....ఈ మథనని భరించలేక ఆ రాత్రి రవీంద్రకి ఫోన్ చేశాను...రవి నాకు మా అమ్మ తరపు బంధువు....ఒకవిధంగా చిన్ననాటి మిత్రుడు...నన్ను నాకంటే కూడా బాగా అర్థం చేసుకున్నవాడు. హైదరాబాద్‌లో డి.ఎస్.పి.గా పనిచేస్తున్నాడు. చాలా సిన్సియర్ ఆఫీసరని పేరు తెచ్చుకున్నాడు. ఈ సమయంలో నాకు సరయిన సలహా యివ్వగలిగింది తనే....ఒకవేళ రవి వద్దంటేనో? నామినేషన్ విత్‌డ్రా చేసుకుంటానా? ఉహూ..

"మాధవీ! రాజేంద్ర మంచి నిర్ణయమే తీసుకున్నాడు. అంతా ఎవరికి వాళ్ళు నాకు రాజకీయం వొద్దు వొద్దు అంటూ దూరం దూరంగా జరిగిపోతే ఎట్లా?....మన జీవితం వరకూ మనకి ప్రశాంతంగా జరిగిపోతోంది, చాలులే అనుకుంటాం అది చాలా తప్పు...రాజకీయం బురదగుంట, బురదగుంట అంటూ ముక్కు మూసుకుని కూర్చోకపోతే ఒక్కరయినా దిగి బాగు చేయొచ్చుకదా?... కనీసం ప్రయత్నించొచ్చు

కదా?....ఎలాగూ, సంతకం చేసేశావు కాబట్టి, డోన్ట్ స్టెప్‌బ్యాక్...నీ వూరిని బాగుచేసుకోవడానికీ, పేద వర్గాలకు సాయం చేయడానికీ యిదొక అవకాశంగా తీసుకో...లైఫీజ్ ఛాలెంజ్... ఫేసిట్...బి బ్రేవ్...." అంటూ ధైర్యం చెప్పాడు.

నాలో ఒక కొత్త ఉత్సాహమొచ్చింది.

"రండి...రండమ్మా....తమరొస్తారని నాలుగుదినాలుగా ఎదురుచూస్తుండా..... నిన్నంతా అయితే ముంజలు ఒలిచి పెట్టుకోని చూసి చూసి మీరు రాకపోయేతలికి పక్కింటి పిలగాడికిచ్చేసినా... రామ్మా కూర్చోమ్మా తల్లా...నువు నాకంటికి ఎప్పుడూ కనపడబోతావా అనుకుంటుండా."

అవిడెవరో తెలీక వింతగా చూస్తున్నా...నా చేతులు మాత్రం జోడించే వున్నాయి. నా పెదవులు సాగే వున్నాయి. బహుశా నా నుదురు ముడత పడిందేమో కుతూహలంతో. "మనింటి కొస్తుళ్ళా అమ్మా, ధర్మన్న అని....ఆ ధర్మన్న భార్య...ధర్మన్న యాక్సిడెంట్లో చనిపోయినపుడు రెడ్డిగారు చాలా సాయం చేశారీయమ్మకి....అందుకే అన్నంటే ప్రాణం."

గొప్పగా చెప్పాడు వెంకటేశ్వర్లు.

"మనుషులకి సాయం కూడా చేస్తుంటాడా?" నా కళ్ళల్లో కదిలిన ఆలోచనలని చూసినట్లుగా "అవునక్కా, అన్న దేవుడు.... భాస్కర్రావోళ్ళ వూళ్ళో గొడవలయితే వాళ్ళన్నదమ్ములందరి నుండి భాస్కర్రావుని కాపాడాడు....అప్పట్నుండీ భాస్కర్రావు అన్నొదిలి పోడనుకో...." చెప్పాడు సురేష్... నిజమే. సురేష్ తల్లికి జబ్బు చేసినప్పుడు అతడు తన తల్లికే జబ్బు చేసినట్లుగా డాక్టర్లకి ఫోన్ చేసి....హాస్పిటల్ ఖర్చు భరించడం జ్ఞాప్తికొచ్చింది.

మాదిగ చిన్నోడి కూతురి పెళ్ళి, అన్న స్వయంగా దగ్గరుండి ఎలా జరిపించాడో కథలా చెప్పుకొన్నాడు సురేష్....నాకు ఏవేవో కొత్త విషయాలు తెలుస్తున్నాయి. కోటి విద్యలూ ఓటుకొరకే... అధికారాన్ని సాధించడానికీ, నిలుపుకోవడానికి మనుషులు అవలంబించే మార్గాలు అవగతమవుతున్నాయి. పదవీకాంక్ష...ఎంత వారినయినా కీర్తికాంత ఎలా వశపరచుకుంటుందో....ఆ కాంత ముందు సొంత కాంత దిగదుడుపే. నా అడుగులతో, సహనంతోనూ వీధి వీధినీ, వాడ వాడనూ కొలుస్తూనే ఉన్నాను. ఆ క్రమంలో....

"అమ్మా..కాఫీ!" అందించాడు వెంకటేశ్వర్లు.

"మాధవక్కా! వీళ్ళు మాలోళ్ళు....వీళ్ళింట్లోనేంది మనం కాఫీ తాగేది?....వొద్దు." గుసగుసగా చెప్పింది, నాతో వచ్చిన పట్టాభిరెడ్డి భార్య.....మనుషుల్ని వాళ్ళ ముఖాలతోనూ, వ్యక్తిత్వాలతోనూ గాక, కులంతోనూ, డబ్బుతోనూ మాత్రమే గుర్తిస్తారు కొంతమంది. ఈ విషయంలో రాజేంద్ర ఆలోచనలు కొంత ఉన్నతంగా వుంటాయి. నేను ప్రచారానికి కదలబోయేముందు మొట్టమొదట రోజు అతడు ప్రత్యేకించి చెప్పాడు నాతో:

"కేవలం నీ స్నేహితురాళ్ళనీ రెడ్లు, నాయుళ్ళ భార్యల్ని మాత్రమే నీ పక్కన పెట్టుకోకు. నాగయ్య భార్య, సురేష్ వాళ్ళమ్మ, చిన్నోడి భార్య జయ అందరినీ

నీతో పాటు తీసుకెళ్ళు. మనకందరూ కావాలి. ఆ విషయంలో ఏమాత్రం తేడా కన్పించకూడదు"....ఇది అతడు ఒకవేళ ఓట్ల కోసమే చెప్పి ఉండొచ్చునేమో....నిజంలో కూడా అతడికి కులం పట్ల చిన్న చూపులేదు. కొన్ని కొన్ని విషయాల్లో అంత సమున్నత భావాలు గల వ్యక్తి మరికొన్నింటిని అసలే పట్టించుకోనట్లుగా ఎందుకుంటాడో అర్థంకాదు.

"అక్క కాఫీ తాగరు." చెప్తోంది విజయ వెంకటేశ్వర్లుతో...అతడు చిన్న బుచ్చుకున్నట్లుగా అయి, "నిమ్మరసం తాగుతారా?" అన్నాడు.

"లేదు... లేదు. తిరిగి తిరిగి అలసటగా వుంది.... ఇప్పుడెలాగా భోజనానికి వెళతాం, ఏమీ వద్దు... మంచినీళ్ళివ్వండి చాలు...." అన్నాన్నేను కర్ర విరక్కుండా, పాము చావకుండా. వాకిట్లో చెట్టుకిందున్న మంచం మీద కూర్చొంటూ చుట్టూ పరికించాను. మా అలికిడికి ఆ చెట్టుమీదున్న చాలా పక్షులు ఒక్కసారిగా గోల గోల చేస్తూ ఎగిరిపోయాయి. వాటిని చూస్తుంటే ఒకింత ఈర్ష్యగానూ, హాయిగానూ అనిపించింది. దూరంగా పంట పొలంలోని మోటార్లు శబ్దం చేస్తూ నీళ్ళను పారిస్తున్నాయి. ఆ నీళ్ళలో పశువులు కాసే పిల్లలు నలుగురైదుగురు ఎగిరెగిరి దూకి స్నానం చేస్తున్నారు. అలా వాళ్ళను చూస్తుంటే చిన్నప్పుడు మా తోటలో రవి, నేను, శారద, చిన్ని అంతా ఈతకొట్టిన సంగతి జ్ఞప్తికొచ్చింది. నోస్టాల్జియా....మాటి మాటికీ నన్నావహించి యిబ్బంది పెడుతుంటుంది.

పదేళ్ళగా ఈ ఊరిలో వుంటున్నానే కాని నాకీ పరిసరాలన్నీ కొత్తే....ఇది అటు పల్లె, ఇటు పట్నమూ కాని ఊరు...ఈ చుట్టు పక్కలన్నింటిలోకి ఇది మేజర్ పంచాయితీ....నాకు తెలిసినప్పటి నుంచి ఈ ఊరికి సర్పంచ్ రాజేంద్రరెడ్డే....ఈ పంచాయితీని మరొకరి చేతుల్లోకి అప్పగించడానికతడు సిద్ధంగాలేడు....

"అమ్మా....బయల్దేరుదామా?" ప్రశ్నించాడు సిద్దయ్య. ఉలిక్కిపడి లేచి వారితో అడుగేశాను. ఈ రోజెందుకో నా కాళ్ళు ముందుకు సాగనంటున్నాయి. నా ఆలోచనలతోపాటు వెనక్కి నడుస్తున్నాయి, అది మాత్రమే అలవాటైనవాటిలా...ఈ సర్వం సహా సామ్రాజ్యానికి వారసుడొక్కడు చాలంటూ అతడు నా గర్భకోశాన్ని నియంత్రించినప్పుడూ, ఉన్న ఒక్కగానొక్కడ్నీ దగ్గరుంచుకొని చదివిద్దామంటే "రాజకీయాల్లో ఉండేవాళ్ళు పిల్లల్ని దగ్గరుంచుకోవటానికి లేదంటూ" అతడు సాకేత్‌ని ఊటీ స్కూల్‌కు పంపేసినపుడూ అర్థమైంది నా కాళ్ళకు ముందుకు నడిచే శక్తిలేదని.

పగలంతా ఓట్లడుక్కొని, అరిగిపోయిన అరికాళ్ళను గోరువెచ్చటి నీళ్ళకప్పగించి బల్లమీద ఆన్చిన రెండు చేతుల్లోనూ నేను ముందుకు తలవాల్చినప్పుడు, యుద్ధ విరామపు రాత్రులలో శవాలను వెదుకుతూ మౌనంగా రోదిస్తున్న ద్రౌపదికి వారసురాలిలా వుంటాను. జీవితం నిండా అనేక రకాల యుద్ధాలు...మనం యుద్ధం చేయాలని ప్రారంభించకపోయినా, అనివార్యంగా యుద్ధంలోకి నెట్టబడుతున్నాం....ఏమాత్రం ఆసక్తిలేని రాజకీయాల్లోకి నేను నెట్టబడ్డట్లు...ఎవరో బెత్తం పట్టుకొని నాకిష్టం లేని పనిని చేయమని అదిలిస్తున్నట్లుగా వుందిది.....

"ఏ మొహం పెట్టుకొని ఓట్లడగటానికి వచ్చావు?.....మీ ఇంటాయన బాగ జేసినాడు...ఆ కొరవా సరవా నువ్వు జేస్తావు. ఇట్ట చూడమ్మా చూడు, మా ఇంటి ముందర మురిక్కాలవ...వాకిట్లోకి రావడానికి నువ్విప్పుడెంత బాధపడ్డావు? ఒక్కనాటికే నీకట్లుంటే...దినమ్మూ మేమెట్టా ఛస్తున్నామో ఆలోచించు, మా బాధలు పట్టించుకునే వాళ్ళెవురమ్మా? ఈ పొద్దు నాటెక్కన్పడతాం మేము ఓట్లేసేదానికి...ఇదయిపోతే మళ్ళీ మా మొహం చూసేదెవరు? చాల్చాలు పోవమ్మా..... ముందీ కాలవ పని చేయిస్తేనే మేమంతా ఓట్లేసేది....లేకుంటే మా వీధంతా ఓట్లకి రాదు...." మొహం మీద ఉమ్మేసినట్లయింది నాకు.

రాజగోపాలపురం రెండోవీధిలోనికి అడుగుపెడుతూ నల్లటి, బురద నీళ్ళని తప్పించుకోవడం కోసం తెల్లటి, నున్నటి నా లేత పాదాల్ని చీరకుచ్చెళ్ళతోపాటుగా ఎత్తెత్తి వేయడం, నాతో వచ్చిన వాళ్ళంతా ముక్కులు మూసుకోవడం జ్ఞప్తికొచ్చింది.. ఒకింత విస్తుపోయి తేరుకున్నాను.

ఆడశివంగిలా దూసుకొస్తున్న ఆమెను చూస్తుంటే నాకు చాలా ఆనందమైంది. ఈ పది పదిహేను రోజులుగా నాకీ వూరి ప్రజల మీద ఒక అభియోగముంది....ఈ పంచాయితీ యింత ఛండాలంగా వుంటే ఓట్లడగటానికి నాయకులు తిరిగి తమ ముందుకొచ్చినపుడు–

"ఊరికి ఏం చేశారని కానీ, కొళాయిల్లో నీళ్ళేవని గానీ, ఈ డ్రైనేజీ మాటేమిటని గానీ ఒక్కరయినా ప్రశ్నించరేమిటి?... ఈ వూరి ప్రజలకు ప్రశ్నించడం చేతకాదా" అని... ఇప్పుడు ఈవిడిలా దులిపేయడంతో ఈ వూరి ప్రజలకు ప్రశ్నించడం చేతనవునని చాలా సంతోషమేసింది.....డ్రైనేజి పని తప్పకుండా చేస్తామని ఆమెకు వాగ్దానం చేసి, సమాధానపరచి మరో దిక్కుకు మరలాం....ఆమె వెనుకనుండి నవ్వుకుంటున్నట్లుగా అన్పించింది నాకు.

మేము బజారు వీధిలో నడుస్తుండగా ఆ కూడలిలో గుమికూడిన జనం మీదుగా శుష్క వాగ్దానాల మైకు ప్రవహిస్తోంది...రాజేంద్ర వాగ్దానాల పరంపరతో జనాన్ని ఆకట్టుకుంటున్నాడు.... మాటలు చెప్పడంలో రాజేంద్రనెవరూ బీట్ చేయలేరు...అతడి నాలుకకు రెండు వైపులా పదునుంది. గంభీరమైన గొంతుతో అతడు మైకుముందు నిలబడితే అపోజిషన్ పార్టీ వాళ్ళు కూడా పన్లు మానుకుని నోళ్ళు వెళ్ళబెట్టాల్సిందే....మాట్లాడిన మాట మాట్లాడకుండా గంటసేపు తానీ వూరికి చేసిన పనులన్నింటినీ ఏకరవు పెట్టగలడు....వాదనలో అతడినెవరూ గెలవలేరు....లాయరు కాబోయి వ్యాపారం, రాజకీయాలలోకి దిగిన వ్యక్తి.....

అలాగే మరో కూడలిలో మరో నాయకుడు....ఒకవైపు జాతర గంగల వూరేగింపు....ఊరంతా మైకుల సందడితో హోరెత్తుతోంది. ఆడవాళ్లు గడపగడపకీ బొట్టుపెడుతూ ఓట్లర్థిస్తూ ఎడాపెడా తిరిగేస్తున్నారు బృందాలు బృందాలుగా. చాలా రోజులుగా దాచివుంచిన చీరన్నింటినీ ప్రదర్శించడానికో అవకాశమొచ్చినట్లుగా వున్నారు పెద్దింటి ఆడవాళ్ళు.

"ఎట్లా అయినా మీ ఓట్లన్నీ వేసి అక్కను గెలిపించాల.....నాకోసం, నా మొహం చూసయినా సరే....అక్క గెలిస్తే నేను గెలిచినట్లే అనుకోండి...." వాళ్ళవీధిలోని ఓటర్లని

బతిమాలుతున్నాడు కృష్ణారెడ్డి...ఈ మధ్యన రెండు మూడేళ్ళుగా దూరంగా వుండి ఇప్పుడే ఎన్నికల సమయంలో రాజేంద్రవద్దకొచ్చి చేరాడు కృష్ణారెడ్డి....పంచాయితీలో వున్న కాంట్రాక్టు పనులన్నీ తనకే కట్టబెట్టాలని అప్లికేషన్ వేస్తున్నాడు..అందుకే కష్టపడి తిరుగుతున్నాడు నా గెలుపుకోసం..... .

"రాజేంద్ర రెడ్డికీ జై....వీర్రాఘవరెడ్డికీ జై...ట్రాక్టరు గుర్తుకే మీ ఓటు... మన పొలాలు దున్నేది ట్రాక్టర్...మనకి తిండి గింజలనిచ్చేది ట్రాక్టర్...మీ పవిత్రమైన ఓటు ట్రాక్టర్ గుర్తుకే... మీ ఓటు చెట్టుకేసి గెలిపించండి...."ఎదురుగా వస్తోన్న అపోజిషన్ బృందంతో మా బృందం తాలూకు జేజేలు కలిసిపోయి ప్రజల్ని ఒక అయోమయంలోకి నెడుతున్నాయి.

"రాజేంద్ర రెడ్డి భార్య. ఎప్పుడూ ఎండకన్నెరుగనిది...కార్పెట్టు మీది నుండి కార్లోకి తప్ప అడుగుపెట్టనిది...ఈ ఎర్రటి ఎండలో..ఈ మురికిలో మీ ముందుకు వచ్చింది. ఆ యమ్మని చూసయినా దయతల్చండమ్మా..మీఓటు ట్రాక్టరు గుర్తుకే వేయండి...." దండాల మీద దండాలు.

ఈ .ఇంట్రొడక్షనేమిటో, ఈ దయతలిచే గొడవేమిటో నా కెంతకీ అర్థం కాదు...చేయగలిగిన పనుల గురించీ, ఊరి బాగోగుల గురించీ చెప్పకుండా యిదేమిటి?....అయితే, ఒక విధంగా వీళ్ళే నయమేమో – ఊరి బాగోగుల గురించి చెప్పకపోయినా తమను తాము పరిచయం చేసుకుంటూ ఓట్లడుక్కుంటున్నారు. అవతలి పార్టీవాళ్ళట్లాకాదు...అపోజిషన్ని తిట్టడంతోనే సరిపోతుంది...ఆ విధంగా ఎన్ని ఓట్లు రాల్తాయో మరి...ఓట్లడుక్కోవడంలో కూడా నెగటివ్ మేనరిజమ్స్....

☆ ☆ ☆

"అంతా బాగుండాదన్నా...ఎక్కడికిపోయిన మంచి రెస్పాన్స్...మనం వస్తుండా మంటే చాలు – జనాలు గుమికూడి ఎదురుచూస్తున్నారు. ఇంత రెస్పాన్స్ అపోజిషనోళ్ళు వచ్చినపుడుండటం లేదు. మనమే ఈసారి కూడా 'విన్'.....గొప్పలు చెప్తూ గాలిలో రెండు వేళ్ళు నిలబెడ్తున్నాడు శేఖరయ్య.

ఎందుకిటువంటి పిక్చరిచ్చి ఉబ్బపెడ్తారో అర్థంకాదు...ఓటర్ల నాడి పట్టుకోవడం అంత తేలికయిన పనేమీ కాదు...వాళ్ళు రాజేంద్రరెడ్డి భార్యొచ్చినా నవ్వుతూ "అట్నేలేమ్మా" అంటున్నారు. మరో రామినాయుడు భార్యొచ్చినా అప్యాయిస్తున్నారు. ఇంకో బి.జె.పి సోమశేఖరాన్నీ వాళ్ళలాగే రిసీవు చేసుకుంటున్నారు. ఓటర్ల ముఖాన్ని బట్టి మనం గెలుపోటములు నిర్ణయించడం సాధ్యం కాదు....మొన్నటి శాసన సభ, లోక్‌సభ ఎన్నికల్లో అంతే కదా...అంతా విశ్శబ్ద విప్లవంలా సాగింది....అనుకోని ఫలితాలొచ్చాయి.

"అయినా సరే, మనం మాత్రం అజాగ్రత్తగా వుండటానికి వీల్లేదు...రాజగోపాలపురం అంతా సుబ్రహ్మణ్యం చూసుకుంటాడు. పిచ్చిరెడ్డి తోపులో నువ్వున్నావు...బాలాజీనగర్‌లో లక్ష్మయ్య చూస్తున్నాడు.. ఆ పక్క బేరిపేటలో బాలయ్య వున్నాడు...ఎక్కడికక్కడే ఎప్పుడూ చాలా జాగ్రత్తగా వుండాలి మనం...డబ్బేదయినా కావాల్సివస్తే మురళినడిగి తీసుకోండి...తనే క్యాష్ చూస్తున్నాడు." సూచనలిస్తున్నాడు రాజేంద్ర అందరికీ...అతడి

గొంతు చాలా ఖచ్చితంగా వుంది. కుటుంబ సంబంధాల్లో కూడ అతడి గొంతు యిలానే వుంటుంది.

"అన్నా....మందు అడుగుతుండారు." నసిగాడు శివకోటి.

"మందు సంగతి తర్వాత చూద్దాం...మనమిప్పుడెంత చేసినా ఆఖ్రరోజిచ్చే పది రూపాయలే వాళ్ళకి రుచి...చేద్దాం...తప్పకుండా చేద్దాం...ఎంత డబ్బు ఖర్చయినా ఫర్వాలేదు...పంచాయితీ మాత్రం మనచేతుల్లో నుండి మరొకరి చేతుల్లోకి పోవడానికెంత మాత్రమూ లేదు."

ఒక సువిశాలమైన సామ్రాజ్యాన్ని పరిపాలించడానికి జరుగుతున్న యంత్రాంగంలా వుందది....ఈ మొత్తం యంత్రాంగంలో నేనో చిన్న పనిముట్టుని మాత్రమే....ఇక్కడ డబ్బు, మందు మంచినీళ్ళ ప్రవాహమై గెలుపోటములను నిర్ణయిస్తుంది...అంత డబ్బు ఈ విధంగా ఎన్నికల పేరుతో కుర్చీ కోసం ఖర్చు చేయకపోతే కడుపునిండా తిండికి నోచుకోని పేదలకు పంచరాదూ... పంచుతున్నారు...ఎందుకు పంచరూ...? ఓటర్లకి పంచుతున్నారు.

ప్రతీ యింటికీ గుర్తింపు చీటీలతోపాటుగా ఓటుకు ముప్పయి, యాభై, వందా....ఆయా ప్రాంతాలను బట్టీ, ఎన్ని ఓట్లుంటే అంత డబ్బు కవర్లో పెట్టి పంపేస్తారు....వచ్చిన వాళ్ళందరికీ అడిగినన్ని సారా ప్యాకెట్లు...ఈ మదుపు పెట్టేందంతా రేపు రెట్టింపుగా సంపాదించబడుతుంది... రాజకీయమంటే యిక్కడ వ్యాపారమే కదా.....

☆ ☆ ☆

వేపచీర కట్టుకుని దీపాన్నుంచిన వేయికళ్ళ కుండని చేతిలో పట్టుకుని ట్రాక్టరు మీద వూరేగుతున్నాన్నేను...ఆయనొక్కరి ముందు కూడా తెగగించుకునే నేను అంతమందిలో బట్టల్లేకుండా వేపాకు చుట్టుకుని ఎలా నిల్చున్నానో అర్ధం కావడం లేదు.....

జన ప్రవాహం మధ్యలో నుండి ట్రాక్టరు కదల్లేక కదులుతోంది...నా ప్రక్కనే రాజేంద్ర నిలబడి చేతులు జోడించి జనాన్ని చూస్తున్నాడు నవ్వుతూ...ట్రాక్టరులోని మైకు మాటలు మాటలుగా జనాన్ని తాకుతోంది.....

గంగలు నిలిపిన కూడలి వద్దకు అనేకానేకమంది ఆడవాళ్ళు వేపచీరలు కట్టుకుని వేయి కళ్ళ కుండలతో నడచి వస్తున్నారు... ప్రతీ కూడలి వద్దా పొట్టేళ్ళు, కోళ్ళు నరకబడుతున్నాయి.....

తలలుతెగి రక్తం ఏరులై పారుతోన్న జీవాల్ని చూసి కొంతమంది ఆడవాళ్ళు వేప చీరలతోనే స్పృహతప్పి నేలమీద పడిపోయివున్నారు.

మధ్య మధ్యలో మైకుని తన చేతిలోకి తీసుకుని రాజేంద్ర ఓట్ల అర్థింపుని కొనసాగిస్తున్నాడు.... కళ్ళు తిరుగుతున్నట్లయి బలవంతం మీద నిలదొక్కుకుని నిలబడి వున్నాన్నేను...కొంతమంది పెద్దిళ్ళవాళ్ళు మేడల మీద నిల్చుని నన్నూ, నా వూరేగింపునీ జాలిగా చూస్తున్నారు....దూరంగా జనంలో నిలబడి రవి నాకేసి వింతగా

చూస్తున్నాడు...కళ్ళల్లో భావాల్ని పట్టుకోవడం కష్టమైపోతోంది... అసలు రవీంద్రా కాదా అన్నది గట్టిగా తేల్చుకోబోయి అలాగే పక్కకి ఒరిగిపోయాను ట్రాక్టర్లో.....

...హఠాత్తుగా మెలకువొచ్చేసింది నాకు...ఊరేగింపు తాలూకు కలవరం నుండీ, ఆ ఉద్వేగం నుండీ తేరుకోవడానికి పది నిముషాలు పట్టింది...రాత్రి బాగా పొద్దు పోయిందేమో ఏడింటిదాకా మెలకువ రాలేదు...ఇవ్వాళే పోలింగ్...హడావిడిగా బాత్‌రూమ్‌లోకి దూరాను.

"ఆ టీచర్స్ కాలనీ వైపులైన్ల పని పూర్తయిందా?...వాళ్ళంతా గొడవ పెట్టే స్తున్నారు...సురేష్ ఏడి?...హైస్కూలు వీధిలో స్లిప్స్ పంచడం మర్చిపోయారంట... అవసరానికి లేకుండా ఎక్కడ చచ్చారంతా?...." అరుస్తున్నాడు రాజేంద్ర అందరి మీదా.

"ఊరికి నీళ్ళు కావాలి...కాదు కాదు – ఓటర్లకి నీళ్ళివ్వాలి...పైపు లైన్లేయించాలి...అదీ ఎన్నికల లోపే జరిగిపోవాలి. ఊరికి నీళ్ళు తెచ్చే హడావిడిలో వున్నావు గానీ...నీ హృదయంలో తడిలేకుండా పోతోందన్న సంగతే గుర్తించడం లేదు ప్రియతమా!" ఒంటి మీద నీళ్ళు దిమ్మరించుకుంటూ ఆలోచనలో పడ్డాను.

"అమ్మా, రెడీ అయ్యారా?....అడగమంటున్నారు." పిలిచింది పనిమనిషి.

"ఆ ఆ – వచ్చేస్తున్నాను."

హడావిడిగానే పనివాళ్ళందరికీ మందళ్ళు చెప్పి బయటపడ్డాను.

"అమ్మా....ఈ అంకమ్మ మన వూరి గ్రామదేవత....మనస్ఫూర్తిగా నమ్మి మనమేది కోరుకుంటే అది జరిగితీరుతుంది...అంత సత్యమైన దేవత...మీక్కూడా దైవభక్తి చాలా ఎక్కువ కదా, దణ్ణం పెట్టుకోండమ్మా...."

చాలా రోజుల తరువాత నాకు చెప్పలేనంత నవ్వొచ్చింది.

"నిజమే. నాకు దైవభక్తి చాలా ఎక్కువ...ఎందుకెక్కువయింది?...ఇదివరకు లేదే...అతడి నీడలో ఈడ్చే బ్రతుకు చప్పదనాన్ని, అతని నిర్లక్ష్యాన్నీ తట్టుకోవడం కోసం, విలువల ముళ్ళ కిరీటాన్ని జాగ్రత్తగా ధరించే క్రమంలో నేను దేవుణ్ని ఆశ్రయించాను. నా ఆలోచనలన్నింటినీ మౌన కందకాల్లో దాచివుంచి ఆ ఒత్తిడిని హిస్టీరియా రూపంలో వెళ్ళగక్కడంకన్నా భక్తి సుగమమైన దారి అన్పించింది... మరో దారి లేక దేవుడి మీద నమ్మకం పెంచుకున్నానేమో....."

"అమ్మా, వెళ్దామా?"

"ఊ" అంటూ ఉలిక్కిపడి అంకమ్మకేసి నిశితంగా చూశాను.....

మనస్ఫూర్తిగా కోరుకున్నాను అసంకల్పితంగా నన్ను ఓడించమని...రాజేంద్ర ఓవర్ కాన్ఫిడెన్స్‌కీ, అహానికీ నా ఓటమి పెద్ద దెబ్బ కావాలి....పోరాటం ఎంత గొప్ప విషయమో ఓటమి అంత సహజమైనది అని తెలియాలి....పోరాటం చేయలేకపోవడంలోని అశక్తత నన్ను కృంగదీస్తోంది...నా మనసొక నిశ్చింతను కోరుకుంటోంది....

అంకమ్మగుడి నుండి పోలింగ్ బూత్‌లవైపుగా కదిలింది కారు...

"రాత్రితోపులో పిల్లకాయలంతా నిద్రపోలేదమ్మా.. అపోజిషనోళ్ళు డబ్బు, సారాయి పంచుతారని కాసుకోనున్నారు..." చెప్పాడు చంద్ర ఉత్సాహంగా.....

"మరి మీరూ పంచారునా?" అనబోయి ఊరుకున్నాను.

"అందర్నీ తరిం తరిం కొట్టారక్కా...ఒక్కడు వాడుండాడే ముద్రాజా వాడు మాత్రం దొరికిపోయాడు... వాయించి పారేశారనుకో మనోళ్ళు..నడుం యిరిగిపోయింది వాడికి...ఈ పొద్దు ఓటేసిదానిక్కూడా రాడోడు...."తాము చేసిన ఘనకార్యాన్ని నా ముందుంచాడు చంద్రశేఖరం.

"అదేంటి చంద్రా...ఎలక్షన్లంటే ప్రచారం చేసుకోవాలి...ఓట్లడగొచ్చు...గెలవాలని అనుకోవచ్చు కానీ ఈ కొట్లాటలేంటి?...దెబ్బలేంటి...మనిషిని మనిషి కొట్టుకోవడం అమానుషం కదా!" చెప్తుంటే వూరికే వుండలేక ప్రశ్నించాను....

"అక్కా! మంచితనంతో ఓట్లు రాలవక్కా...అదంతా ఆ కాలం...ఇప్పుడంతా ఏవంటే ఏవని ఎదుర్కొనేటట్టుండాల...అసలు రాజకీయమంటేనే ధనాధన్ ఫటా ఫట్....అంతే"...ఉద్వేగంతో చెప్పాడు మళ్ళీ అతడు...."ఉదయం ఓట్లేసి వస్తుంటే మన ఫ్యామిలీ డాక్టర్ని రామినాయుడు మనుషులు అడ్డగించారు. అంతే – మన పిల్లకాయలు దెబ్బల్తోనే సమాధానం చెప్పారు. పారిపోయారు దొంగనాయాళ్ళు...."

చంద్ర మొహంలోని విజయగర్వం చూస్తుంటే నాకు ఆశ్చర్యమైంది.

నిజమే, రాజకీయమంటేనే గూండాయిజం.

గూండాయిజం ప్లస్ డబ్బు ప్లస్ సారా – రాజకీయం – వ్యాపారం.

మనాడికి యింట్లో, బయటా కూడా బంధమనేది వ్యాపారమయమైపోయింది.

మాట్లాడే మాటల్ని, నిముషాల్ని కూడా డబ్బుతోనే కొలుస్తున్నారు....

"ఇది పదో నెంబరు పోలింగ్ బూత్ అమ్మా, దిగండి"

నాతోపాటుగా వచ్చిన రాగిణి, సౌజన్య, విజయ, విమల అంతా దిగారు.

"మాధవక్కా....ఈసారి మనం కారెక్కినపుడు ఆ లేబరోళ్ళని మనతోపాటు ఎక్కొద్దని చెప్పండి... మా జీప్‌లో రమ్మనండి..." సాధించినట్లుగా అన్నది విజయ...నేను విజయకేసి వింతగా చూశాను. ఆ లేబరోళ్ళ ఓట్లు పోగేసుకుని మనం అందలం ఎక్కాలి కానీ ఒకే కార్లో మాత్రం కూర్చోరాదు. బావుంది...ప్చ్.....

"మాధవెందుకో దిగులుగా వుందీ రోజు." నా మౌనానికి పరిపరివిధాలుగా ఆలోచనలు పోతున్నారు నాస్నేహితురాళ్లు. నిజానికి వీళ్ళు నా స్నేహితులు కారు. మా వారి స్నేహితుల భార్యలు. వీళ్ళెవరితోనూ నా ఆలోచనలు కలవవు.

"ఓడిపోతామని భయమేమో...." మెల్లిగా అంటున్నది విమల.

"కాదు కాదు, ఓడిపోతామని నాకు భయం లేదు." గొంతెత్తి పెద్దగా అరవాలన్పించింది. కానీ మనకి అన్పించినవన్నీ చేసుకుంటూపోతే మరీ అబ్సర్డ్‌గా వుంటుంది.

పిచ్చిరెడ్డి తోపు, కరెంటాఫీసు, బోర్డు స్కూలు, హైస్కూలు బూత్‌లన్నీ వరుసగా చూసుకుంటూ గర్ల్స్ హైస్కూల్ వద్దకి రాబోతుండగా ఒక 'సుమో' సర్రున దూసుకు వచ్చి నా ముందాగింది....అది మా కారే...ఎ.పి.26..2223....అందులో రాజేంద్ర వున్నాడు.

"అన్న పిలుస్తున్నాడు." సురేష్ పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పాడు ఒగరుస్తూ.... నేను మెల్లిగా అటుకేసి నడిచాను. అప్పటికే రాజేంద్ర కూడా కారుదిగి నావైపు రెండడుగులు వేశాడు.

"ఎట్లావుంది?" ప్రశ్నించాడతడు.

"నేను చూసినంత వరకూ బాగానే జరుగుతోంది...." చెప్పాన్నేను నిజమో, అబద్ధమో తెలీక సందిగ్ధంగా.

"ఊ....మూడో నెంబరు బూత్ వద్ద గలాటా జరుగుతోందట...నువ్వింక యింటికి కెళ్ళిపో... తిరిగింది చాలు.... నేన్చూసుకుంటాను..." చెప్పాడతడు సిగరెట్టు వెలిగించుకుంటూ....నేను విస్తుపోయి చూస్తున్నాను అతడికేసి....

"చెప్పింది చెయ్యి" అన్నట్లుగా చూసి, అతడు తన కారుకేసి నడిచాడు.

బండెడు సామాన్లతో, బస్టాండులో బస్సు కోసం ఎదురు చూస్తున్న బాటసారిని ఎవరో అపరిచితుడు "సామాన్లు జాగ్రత్తమ్మా!" అంటూ హెచ్చరించి వెళ్ళిపోయినట్లుగా వుంది.

"ప్చ్" నాలుకెగరేసి అతడిని పట్టించుకోనిదానిలా వెళ్ళి కారులో కూర్చున్నాను. నా కారు మూడో నెంబరు బూతువైపుగా సాగిపోయింది.

"అక్కడ రామినాయుడు భార్యని కొట్టారట మనవాళ్లు ... చాలా గందరగోళంగా వుంది... అక్కడికొద్దమ్మా..." చెప్పాడు డ్రైవరు.

"ఫర్వాలేదు.....నేను ఓటెయ్యాల్సింది అక్కడే." చెప్పాన్నేను ఖచ్చితంగా...నాతో వచ్చిన మిగతావాళ్ళంతా కొంచెం భయపడుతున్నారు అక్కడికి రావడానికి. ఏదో గుసగుసపోతూ మాట్లాడుకుంటున్నారు.

అయితే మేము వెళ్ళేసరికి అక్కడ చాలా ప్రశాంతంగా పోలింగ్ జరుగుతోంది. గొడవ తాలూకు శకలాలేమీ కన్పించలేదు.

నేను కారు దిగగానే ఆ బూతువద్ద వున్న నాగరత్నం పరుగెత్తుకుంటూ ఎదురొచ్చాడు. లోపలికెళ్ళగానే నా తరఫు పోలింగ్ ఏజంట్లు గౌరవసూచకంగా లేచి నిల్చున్నారు. వారిని కూర్చోమని సైగచేసి వేలికి చుక్కపెట్టించుకుని బ్యాలెట్ పేపరు తీసుకుని చేతిలో స్టాంపుతో లోపలికి నడిచాన్నేను.

"ఫర్వాలేదమ్మా, మీరిక్కడే వేసెయొచ్చు" అన్న పోలింగాఫీసరు మాటల్ని పట్టించుకోకుండా... ఒక్కసారి బ్యాలెట్ పేపర్ని పైనుండి కిందిదాకా చూశాను....నాకెందుకో నవ్వొచ్చింది నా పేరు చూస్తుంటే...ట్రాక్టరు గుర్తుమీద ఓటుని ముద్రించాను. ఒకసారి సాలోచనగా చూసుకున్నాను. ఆ తర్వాత నిదానంగా చెట్టుమీద, యింకా రెండాకుల మీద, గంటమీద, విమానం మీద, పాట్టేలు మీదా – అన్నింటి మీద సమానంగా ముద్రించేశాను.

పట్టరాకుండా వున్న నవ్వుని అతి ప్రయత్నం మీద ఆపుకుంటూ నిటారుగా బయటికి నడిచాన్నేను.

ఆ రాత్రే జాతర ఊరేగింపు ముగిసింది. గంగన్ని ఊరేగించి తీసుకెళ్ళి ఏట్లో కలిపేశారు...వూరంతా అదమరచి నిద్రపోయింది.

☆ ☆ ☆

అయితే అనుకున్నదొక్కటీ...అయినది ఒక్కటీ...బోల్తా కొట్టిందిలే....

"ఎప్పుడూ అడుగుపెట్టని దొరసాని ఈ విధంగా ఆఫీసుల చుట్టూ తిరగడమంటే మాటలా?...అయినా యియ్యంతా ఆడోళ్ళు చేసే పన్లు కాదులే...." ఆడవాళ్ళు చేసే పనులంటూ వేరే వుంటాయా?.... బహుశా వాళ్లదృష్టిలో వంటా, ఇంటి సంరక్షణ, పిల్లల పెంపకమూ కావొచ్చు.

"అయినా యిదంతా ముప్పయి మూడు శాతం రిజర్వేషను మహిమ – ప్చ్" పెదవి విరుస్తున్నారు కొంతమంది...హయ్యో...ఆ బిల్లు లోక్‌సభలో ప్రవేశపెట్టడానికే ఈ మధ్యన ఎంత గొడవయిందో గుర్తొచ్చింది.

"అఁ – ఆడవాళ్ళేం చేస్తార్లెయ్యా...వచ్చినా వాళ్ళేం పాటుపడ్తుండారు. వాళ్ళ వల్లేమవుతుంది?...కాకుంటే ఓట్లు రాబట్టుకోవడం కోసం మహిళల్ని ఉద్ధరించినట్లు, చేసినట్లు ప్రభుత్వం జిమ్మిక్కులే గానీ, రాజ్యమేలడం ఆడవారి వల్లేమవుతుంది?" వ్యంగపు బాణాలు.

నిజమే. డిక్లరేషన్ ఫారమ్ అందుకోవడానికి కౌంటింగ్ ఆఫీసుకి స్వయంగా వెళ్లాల్సి వచ్చింది...మళ్ళీ ఈ రోజు పన్నెండు గంటలా అయిదు నిముషాలకి మంచి ముహూర్తం కావడంతో ప్రమాణ స్వీకారం చేయడం కోసం పంచాయితీ ఆఫీస్‌కి వెళ్ళాను. అప్పుడు నా వెన్నెముక నిటారుగా వుందేమో!

"ఆ, ఈ రోజంటే ప్రమాణ స్వీకారం చేయడానికొచ్చింది కానీ ఆమెదేముంది? అంతా రాజేంద్రరెడ్డిదే కదా...ఆయన రానిస్తాడా ఈమెని ఆఫీసుకి....సంతకాలు మాత్రం చేయించుకుంటాడింటికాడ..." తెలీనితనంతో స్వచ్ఛంగా అంటున్నాడో తెలిసి వ్యంగ్యంగా అన్నాడో కానీ అతడన్న మాటలు క్లియర్‌గా నా చెవిన పడ్డాయి.....నిజమే యివాళా రేపు ప్రతిచోటా జరుగుతున్న భర్తచాటు భార్య రాజకీయాలు గురించే వాళ్ళు మాట్లాడుకుంటున్నారు....దీనిని గురించి తప్పుపట్టడానికేమీ లేదు....

అందుకు తగ్గట్టు ఉన్నత పదవులంకరించిన చాలా మంది స్త్రీలు సమస్యల పట్ల దృష్టి కేంద్రీకరించకుండా ప్రారంభోత్సవాలతోనూ, సన్మానాలతోనూ సరిపెట్టుకుంటున్నారు. (అట్లాకాకుండా వేరుపురుగులాంటి సమస్యలపట్ల దృష్టి కేంద్రీకరించాలని నిర్ణయించుకున్నానేను.)

☆ ☆ ☆

గాఢ సుషుప్తిలో వున్న లోకానికి సుప్రభాతం పాడుతోంది కోడి ఎక్కడో....రాత్రంతా మావగారూ, రాజేంద్ర యిద్దరూ పంచాయితీ గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు. అందులో భాగంగా నేను పంచాయితీ ఆఫీసుకి వెళ్ళాల్సిన అవసరం లేదని చర్చించి నిర్ణయం తీసుకున్నారు...నేను వాళ్ళమాటల్లో ఏమీ కల్పించుకోలేదు.

ఏ మహిళ అయినా పార్టీ పేరు చెప్పుకుని భర్త చాటు రాజకీయం చేస్తూ మనుగడ సాగించడంకంటే చురుగ్గా వ్యవహరిస్తూ ప్రజల్లోకి చొచ్చుకుపోగలాలి. కొత్త వెలుతురులోకి వెళ్తున్నట్లుగా నాలో ఏదో మార్పు.

వందల వేల ఏళ్ళ నుండీ మగాడు రాజ్యమేలుతున్న సింహాసనాన్ని స్త్రీ గెలుచుకోవడం ఎంతో బావుంది. ఆదర్శాలు వల్లించడం స్త్రీకి చేతగాకపోయినా సమానత్వం, న్యాయం, నిజాయితీలను ఆమె ప్రేమిస్తుంది.

అకౌంటెంట్‌కి ఫోన్ చేసి, పంచాయితీ పాత అకౌంట్ పుస్తకాల్ని, మిగిలిన అన్ని లెక్కల్ని తీసుకుని ఉదయం పదింటికల్లా ఆఫీసుకొచ్చేయమని చెప్పాను. నా గొంతులోని ఖచ్చితత్వానికీ, లెక్కల్ని తిరగదోడాలన్న నా ఆలోచనకీ ఖంగుతినుంటాడతడు బహూశా....

కొత్తగా వేలికి తొడిగిన రాజముద్రికతో అవినీతిని సాధికారికంగా ఝళిపించగలగడం ఎంత బావుంది?... సుదీర్ఘకాలంగా జరిగిపోయిన గాథల్నీ, దుఃఖాల్ని తిరగరాయడం కోసం ఈ ప్రపంచాన్ని మన చేతుల్లోకి తీసుకోగలగడం ఎంత బావుంది?.....

పోరాటమిచ్చే ఆనందపు అనుభవాన్ని తడుముతూ నేను దుప్పటి తొలగించాను....

లోకాన్ని రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోవడం కోసం ఆ రోజు సూర్యుడు అయిదున్నరకే మబ్బుమాయల్ని ఛేదించుకుని వెలుగురేఖల్ని ప్రసరిస్తున్నాడు.

● 'ప్రజాశక్తి' ఆదివారం సంచిక, *2000* ●

★ ★ ★

108

ఇనయతుల్లా

# వలస

"కరిడికొండకు బస్సెప్పుడొస్తుంది తాతా?"

పాత కళ్ళద్దాలను సవరించుకుంటూ, ఆరిపోతున్న పంప్ స్టవ్‌కు పంపుకొడుతూ 'టీ'ని కలియబెడ్తున్న ఆ తాత నేను ప్రశ్నడిగిన కొద్దిసేపటకి తలపైకెత్తి చూశాడు. నేనడిగిన ప్రశ్న అతనికి చాలా విచిత్రంగానూ వింతగానూ తోచినట్లుంది. చూపుడు వేలుతో అద్దాల్ని సవరిస్తూ–

"యావూరు సారూ మనది?" అన్నాడు.

ప్రశ్నకు ఎదురు ప్రశ్న వేసినందుకు నా 'ఇగో' కొంచెం దెబ్బతినింది. ఇన్‌షర్టును ఇంకొంచెం సర్దుకుంటూ "కర్నూలు" అన్నాను. "కరిడికొండకు బస్సురాదు సారూ!" కొంచేపు కుచ్చో. వ్యాను యిట్ట లోనికిపోయింది మల్ల తిరిగొత్సాది. దానికి పోదువుగాని" అన్నాడు.

ఆ హోటల్‌లో పాత తడికెలు. తడికెలనిండా సినిమాబొమ్మలు. బండలతో కట్టిన అరుగులు. విశ్వం చెప్పేమాటలు గుర్తొచ్చినాయి నాకు. నువ్వు మా వూరికి వెళ్ళే రోడ్డుమీద దిగీ దిగంగానే ఒక మల్టీస్టార్ (అంటే అన్నీ సినిమాహీరోల బొమ్మలుండే) హోటల్ నీకు స్వాగతం పలుకుతుందనీ, దానిలో ఉండేది అన్నీ సిల్వర్ గిలాస్‌లేగాని దాని పేరు మాత్రం "మహాలక్ష్మి విలాస్" అని విశ్వం తన ఊరి గురించి చెప్పిన జోకులు ఒకసారి మళ్ళీ నెమరేసుకున్నాను. హోటల్‌లో కూర్చున్నవాళ్ళలో ఒకరిద్దరు తప్ప ఒంటిమీద అంగీలు తొడుక్కున్నవాళ్ళు ఎక్కువ మంది లేరు. ఒకాయన మాత్రం అక్షరక్షరం అతి కష్టమ్మీద కలుపుకొని పేపర్లో వార్తలు చదువుతుంటే చుట్టూ కూచున్నవాళ్ళు 'టీ' చప్పరిస్తూ వింటున్నారు. కొంతమంది పిల్లలు పేపర్లలోని సినిమా పేజీల మీద పడి మాట్లాడుకుంటున్నారు.

"వా! ఇక్కడ సూడిలె బాలకిస్న బొమ్మ, ఆ మీసం కట్టు, ఆ డ్రస్సు సాయ్యం మన రొడ్డి లెక్కనే ఉన్నడు. సూపర్ ఉందంటలే ఈ సిలిమ." మాట్లాడుకుంటున్నారు పద్దైదుపదారేళ్ళ పిల్లలు. ప్రక్కన సద్దులు పెట్టుకున్నారు. గొండా పనిచేసేవాళ్ళ లాగున్నారు.

టీ తాగుదామనుకున్నా కాని యిక్కడ టిఫిన్ ఏముంటుందో కాస్త వెరైటీగా తిందామనుకొని "టిఫిన్ ఏమైనా ఉందా తాతా!" అడిగాను. "ఇంత ఎండపన్యాంక

టిఫీన్ ఉండత్నారూ! ఇంగ లేట్టైనంక దొరికేది టీ ఒకటే" అన్నాడు. "సరే, టీ యిచ్చేయ్" అన్నాను.

"ఏమో సామీ మీ పట్నుమాసమోల్లకు మా టీ నచ్చుతాదో లేదో తాగి సూడు" అంటూ టీ గ్లాసిచ్చాడు ఆ హోటల్ కుక్, సప్లయర్ కం ప్రొప్రైయిటర్ అయిన తాత.

"ఎవురింటికి పోవల్ల సారూ?" అడిగాడు. "వెంకట సుబ్బారెడ్డి ఇంటికి" అన్నాన్నేను. అదేమిటోగాని అంతవరకూ మామూలుగా పలకరించిన తాత వెంటనే "కూచ్చోసారూ... రేయ్ జర్గండిరా. మీకు పొద్దుమూకులు సిలిమ బొమ్మలే. ఇంక పనికిపోండి" అంటూ గౌండాపిల్లల్ని పక్కకి పంపి తన వల్లెతో అరుగుమీది దుమ్ము దులిపినాడు.

"రొడ్డింటిక్యా సామి?" పక్కనే టీ తాగుతున్న మరొకాయన అడిగాడు. అవునన్నాను తాత చూపించిన అరుగు మీద కూర్చుంటూ.

"పెదరొడ్డి కోసమా – చిన్రెడ్డి కోసమా సామి?" అడిగాడింకొకాయన, టీ గ్లాసు ప్రక్కన పెడుతూ.

"వెంకటసుబ్బారెడ్డింటికి" అన్నాన్నేను, ఆ చిన్నా పెద్ద ఎవరో తెలియక.

"ఆ! అంటే పెద్దరొడ్డేలె. నేనొచ్చేతపుడు ఉండ్యే. అలారుదిన్నె మాదిగోల్లది పంచ్యాతి చెప్తుండె. ఆపీసర్లుగూడ శానామంది కూసోనుండ్రి. మన పత్తికొండ ఎస్సై 'అలపరెడ్డి' గూడ ఉండె. యియాలేందో జనముబూమి మీటిగుందని మాట్లాడుకుంటుండ్రి." చెప్పుకుపోతున్నాడా ఊరుతను.

"అలపరెడ్డి" పేరు విని ఆశ్చర్యపోయాను. హైబ్రిడ్ జొన్నలను 'అయ్యపరెడ్డి' జొన్నలన్నట్లు "ఆల్ఫ్రెడ్"ను అలపరెడ్డిగా మార్చుంటారనుకున్నా.

"రొడ్లోల్లేనా సారు మీరు గూడ?" ఒకాయన దగ్గరగా వచ్చి అడిగాడు. "కాదు నేను విలేఖరి... ఆయనతో పనుండి వెళ్తున్నా" అన్నాన్నేను.

ఇంతలో "వచ్చ్యె – వచ్చ్యె" – శబ్దాలు. "యియ్యాల బలేటు కొట్టుకొచ్చినాడ్రా. ఎవరు డ్రైవరు?"

"వాడు బండ సంజన్నకొడుకు సింపిరినెత్తి శీనుగాడు."

"ఆ! వాడైతే మోత మోగిస్తడులే బండిని, ఇగో నాలుగు సీటేలు పట్టు."

ఈ మాటల్ని పట్టి నేనెక్కాల్సిన వ్యాను రాబోతుందని గ్రహించాను. గబాగబా టీ త్రాగేసి తాతకి చిల్లరివ్వబోయాను. తాత డబ్బులు తీస్కోలేదు. బయటికెళ్ళి వ్యానుకోసం చూశాను. అక్కడెక్కడో టర్నింగ్ దగ్గర వస్తున్నట్లుంది. చెట్ల మధ్యలోంచి దానిటాప్ మీద కూర్చున్న జనమే కనిపిస్తున్నారు తప్ప వ్యాను కనిపించలేదు. దగ్గరగా వచ్చింది. దాని టైర్లు, స్టీరింగ్ తప్ప మరే పార్టు కనపడకుండా మొత్తం జనమే ఎక్కారు. జనం దిగుతున్నారు. కరిడికొండ మట్టంతా దులి పేస్తున్నారు. వ్యానులో నుండి దిగుతున్నవాళ్ళలో సగం మందికి పైనా పెద్దపెద్ద మూటలతో, సామాన్లతో దిగుతున్నారు. చంకలో పిల్లలు, కొంచెం పెద్దపిల్లల చేతుల్లో చేటలు, బిందెలు, బకెట్లు కనిపించాయి.

"పదిమందికి ముప్పైరూపాయలా కుదరదు. త్యా యాభైరూపాయలీ" - వ్యాను డ్రైవరు గట్టిగా అరుస్తున్నాడు.

"యాదోలేసామీ. బతకనీక పోయేతోల్లం. కొంచె సూసి తీస్కో. అంతగా అయితే గుంటూరు పనికి పోయొచ్చినంక యిస్తాములే" అంటూ బ్రతిమాలుకుంటుంది ఒకామె. "సంచులల్లో దాసి పెట్టింటరు దుడ్లలీ", - అరుస్తున్నాడు డ్రైవరు. ఒక ముసలామె బొడ్డులో దోపుకున్న చిన్న సంచీలో నుండి మడతలుపడిన నోట్లు తీసింది. వీళ్ళందరూ గుంటూరుకు పనికి పోతున్నారని తెలిసి ఆశ్చర్యమేసింది. చూస్తున్నంత లోపే మళ్ళీ ఫుల్లైపోయింది వ్యాను. కొత్త సినిమా టికెట్ల సంబరమే మళ్ళీ యిక్కడ కనిపించింది నాకు. ఆ కసరత్తు చేయడం చేతకాని నేను వ్యాను ముందు అటూ ఇటూ తిరుగుతూ బయటే మిగిలిపోయాను.

"సార్!సార్!" డ్రైవర్‌కు ఎడమ పక్కన కూర్చున్నతను కేకేసి పిల్చాడు. ఇందాక హోటల్లో నన్ను పలకరించినతను. "రాడ్డోల్లింటికి పోతున్నడంట, కూచో పెట్టుకో" అంటూ "రా సార్, నేను పైకి పోతాలే." నేను వద్దంటున్నా లాగి కూచోపెట్టాడు. సరే కూచున్నాను. ఆగిపోతుందేమో అన్నంత నిదానంగానూ, దెబ్బకు కరిడికొండలో పడుతుందేమో అన్నంత స్పీడుగానూ పోవటం ఆ వ్యానుకే చెల్లు. జన్మభూమిలో బెస్ట్ పంచాయితిగా ఎంపికైన కరిడికొండ రోడ్డు మహత్యం నా నడుములకు బాగా తెలిసొచ్చింది. "12 గంటల్లో అంగన్‌వాడి పాఠశాల నిర్మాణం" "24 గంటల్లో రోడ్డు నిర్మాణం" "జన్మభూమిలో కరిడికొండ ముందంజ" అంటూ పేరు మోసిన పత్రికల్లో బాక్సులు కట్టి రాసిన వార్తల్లోని వాస్తవాలు ఒక్కొక్కటి నాకు అర్థమవుతున్నాయి. అయితే వెంకటసుబ్బారెడ్డితో ప్రత్యేక ఇంటర్వ్యూ చేయమని నన్ను పంపిన "జనవాణి" మేనేజ్‌మెంట్ నా రిపోర్ట్‌కు ఎలా స్పందిస్తుందో వేచి చూడాలి. ఇంతలో ఒక మలుపు దగ్గర సడన్ బ్రేకు. అవతల నుండే వరుసగా జీపులు. ఆ మధ్య టాటా సుమో. ఒక ట్రాక్స్.

"అగో! అగో! పెదరాడ్డి వడుంగల గూసున్నాడు."

ఏం! సంగనోట్టు జీపులొచ్చేవియాల.

యియాల దేవనకొండలో మీటింగ్.

"ఎవరుత్పుండరో..."

"ఇంగవరెరొత్సరిలే! మన రాడ్డే. జన్మభూమి మీటింగ్ జెప్తడంట యియ్యాల. కటారుకొండ, దూదికొండ, అలారుదిన్నె - ఈ పల్లెలోల్లంత కలిసి 150 కేజీల దండసేపిత్సుండ్రి నిన్న."

వ్యానులో... జనం గుసగుసలు.

జీపులు, టాటా సుమో, ట్రాక్స్. ఒకదాని వెనక ఒకోటి మా వ్యాను ముందరనుండి వెళ్ళి పోయాయి. ఆ వాహనాలన్నింటిమీద 'బైసాని' అని పెద్దక్షరాలతో రాసి ఉంది. జులపాలు, బవిరిగడ్డాలు, పెద్దపెద్ద మీసాల వందిమాగధులు జీపులనిండా ఇరుక్కొని, వ్రేలాడుకుంటూ రెడ్డికి రక్షణగా వెళ్ళడం... అదొక వైభవం. ఆ జీపుల కీ కీక్ శబ్దాలమోత కాసేపు ఆ వాతావరణాన్ని నిశ్శబ్దపర్చింది. నేనొచ్చిన పనికి బ్రేకు

పడేంది. అయినా ఊళ్లో విశ్వనాథం ఉన్నాడు కదా! చాలా రోజుల్నించి ఊరికి రమ్మని పిల్చిపిల్చి విసిగిపోయాడు. ఈ ఇంటర్వ్యూ సాకుతోనైనా ఒకరోజు వాడింట్లో ఉండిపోయి ఉదయాన్నే పని చూసుకోవచ్చుననుకున్నా. రోడ్డుకిరువైపులా నవ్వుతున్న నాపచేన్లు. పండుతున్న పచ్చవేలు అక్కడక్కడా విసిరేసినట్టు కనిపిస్తున్నాయ్. మళ్ళీ మాట్లాడుతున్నారు వ్యానులో జనం.

"ఎవర్దిరా ఈ జొన్నసేను? కంకులు శానా అద్వాన్నంగుండాయ్."

"ఇద్యా. నేసె రామునిది. బలిజ రంగన్న కాడ గుత్తకు దీస్కోని ఏస్కోండడు. అది ఇంత అవతారంగ వచ్చింది."

"ఏమో... ఈ యేడు రైతల్కి శానా శని పట్టుకొంది. 'శనిక్కాట్టై సేతికి రాకపాయె. కందికట్టై కాటికి పాయ' అన్నట్టుంది. ఒరెసీ! కంకే కాలపెట్ట. మాకాలంలో కంకి సూడాలట్లే. కొయ్యనీకపోతే కొడేలికి తిరగబడ్తుండె. పొద్దున సంగటి తిని పత్తికొండ సంతకు పోతే మల్లసగరు బొద్దుదంక ఆకలైతుండ్లా." వ్యానులో కూర్చున్న వాళ్ళ మాటలు వింటుంటే కొత్త పుస్తకం చదివినట్లుంది నాకు.

ఇంతలో దిగ్రి దిగ్రి. ఊరొచ్చింది. జనం దిగుతున్నారు. నా దగ్గిర డబ్బు తీస్కోనన్నాడు డ్రైవరు. సరే. దిగి కొంచెం ముందుకు కదిలాను. మర్రిమాను కింద రచ్చకట్ట. పులిజీతం ముగ్గురాడుతున్నారు. చుట్టూ జనం మూగారు. నేను దగ్గరగా వెళ్ళి "విశ్వనాథం యిల్లెక్కడ?" అన్నాను.

పులిజీతం అడుతున్నవాళ్ళు సడన్‌గా నా వైపూ నా బ్యాగువైపూ చూశారు. ఒకాయనేమో "ఎవరూ! యిస్పనాగం... అట్టాటి పేరుండేటోడు ఈ వూర్లోనేలేడే" అన్నాడు.

లేడా! ఆశ్చర్యపోయాను. క్షణం ఆగి... అతను "తిరుపతిలో చదువుకొని ఈ మధ్యనే ఊరికి వచ్చి ఉంటున్నాడు" అన్నాను.

"ఏంటోళ్ల పిల్లోడు?"

కులం! యిద్దరం కలిసే రూంలో ఉన్నాంగాని అది నేనెప్పుడూ అడగలేదు. విశ్వనాథం చెప్పలేదు. మరొకాయన దగ్గరగా వచ్చి "వో! అవులే... తెలుగోల్ల పిల్లోడు కదా. గంజి నాగన్న కొడుకు... కాశినాడు" – "రేయ్ ఇక్కర్రారా!" అంటూ గోలీలాడుతున్న వాళ్ళలో ఒకన్ని పిల్చి – "మీకు పర్యేటు చెప్తాడు సూడు తెలుగుగేర్లో – వాయన ఇల్లుజూపీ" అన్నాడు. "థ్యాంక్స్"... "సారీ"... కొన్ని అర్బన్ పదాలు అలవాటుగా వాడాను. వాళ్ళు అదోమాదిరిగా చూస్తుంటే వాటికి ట్రాన్స్‌లేషన్ చేతకాక – మంచిది... వస్తా అంటూ ఆ పిల్లవాడి వెంట నడిచాను.

"బుర్ర్... కీక్" ... అంటూ రెండు చేతుల్తో ఆ పిల్లాడు స్టార్ట్ చేసిన ఉత్తుత్త బగ్గీతో ముందు పరిగెడుతున్నాడు. బండపరుపు ఉన్న గల్లీలోని ఒక ఇంట్లోకి పోయి మళ్ళీ పరుగెత్తుకొచ్చాడు. విశ్వనాథం అలియాస్ కాశినాడు అడ్డపంచె దించుతూ గబాగబా వచ్చాడు. "హలో! హలో! అబ్బబ్బ! ఎన్నాళ్ళకు జరిగింది నీ దర్శనం." కాశి చేతులు కలుపుతూ నన్ను రిసీవ్ చేసుకున్నాడు. సంచి ఓ మూలన పెట్టి, "మొత్తానికి దొరికావు. ఉండవేమో అనుకుంటూ వస్తున్నా" అన్నాను.

"నేనా... నిన్ననే చేరింది నీ ఉత్తరం... వేరే ప్రోగ్రాం ఉన్నా నీ కోసం ఆగిపోయా" అంటూ చెంబులో నీళ్లందించాడు కాశి. కాళ్ళు మొహం కడుక్కోని పంచె, బనీనులోకి దిగిపోతే అప్పుడు కాస్తంత హాయిగా అనిపించింది. అరుగుమీద కంబడిపరిస్తే వ్యానులో ఉతకబడిన శరీరాన్ని అక్కడ ఆరేశాను. ఉద్యోగ సోపానాలు, ఎంప్లాయ్‌మెంట్ న్యూస్, గ్రూప్ 1, గ్రూప్ 2 పుస్తకాలు కాశి పుస్తకాల గుట్టలో కనిపిస్తున్నాయి. "ఓహో, కాశీ! త్వరలో ఆఫీసరయ్యే లక్షణాలు నీలో తన్నొచ్చినట్లు కన్పిస్తున్నాయ్. ఏ డిపార్ట్‌మెంట్ సెలెక్ట్ చేసుకున్నావేమిటి?" చాలా రోజుల తర్వాత కాశితో జోకులు మొదలుపెట్టాను. "డిపార్ట్‌మెంటా పాడా! ప్రస్తుతానికి గృహము, వ్యవసాయశాఖ వెలగబెడ్తున్నాను. అయినా నాకీ తంటాలు తప్పవు. నీలాగా జనవాణి, యువవాణిలో పనిచేసే టాలెంట్లు మాకు లేవుగదబ్బా! ఎవని గడ్డమో, కాలో పట్టుకొని ఉద్యోగం సంపాయించుకోకపోతే ఈ పల్లెల్లో బత్కలేం." కాశికి చదువు, ఉద్యోగం, పెళ్ళి... చక్రంలో రెండవ మజిలీ కోసం వెంపర్లాడుతున్నాడు. కాసేపు మళ్ళీ పి.జి. కాలేజిరోజులు... హాస్టల్ జీవితం నెమరేసుకున్నాం. నవ్వుకున్నాం. కాశి వాళ్లమ్మ చెంబెడు మజ్జిగ తెచ్చింది. తాగితే కడుపు ఎ.సి. రూంలాగా చల్లగైంది. భోజనాలయ్యాక కాసేపు సేద తీర్చుకున్నాను.

☆ ☆ ☆

సాయంత్రం ఇద్దరం కలిసి చెర్వుగట్టుకెళ్ళాం. హాస్టల్‌రూంలో గోడమీద కవిత్వం గుర్తు చేశాడు. కాశి. చెర్వుగట్టుపైని బండి వస్తుంది. బండిలో నుండి బ్రహ్మంగారి తత్వం వినబడుతుంది. చెర్వులో కొద్దిగా నీళ్ళున్నాయి. నల్లటి భూమిలో పగుళ్ళు వెక్కిరిస్తున్నాయ్. "ఈ వూళ్లో బావులు, బోర్లు లేవా! " కాశిని అడిగాను. వూర్లో అంతా 10, 15 ఎకరాల రైతులే. ఇద్దరో ముగ్గురో బావులు, బోర్లున్నవాళ్ళు. ఎక్కువ కురువ, బలిజ, వడ్డె కులాలున్నాయి. ఒకప్పుడు బోయ బీరప్ప నాయుడు కుటుంబం బాగా ఆస్తిగల కుటుంబం. రెడ్లతో ఫ్యాక్షన్ నడిపి, ఇల్లు పొలాలు పోగొట్టుకున్నాడు. అలా చాలా బోయ కుటుంబాలు ఊరు వదిలి వెళ్ళిపోయినాయి. ఇప్పుడతని మనుమడు అర్లప్పనాయుడు రెడ్డివైపే ఉండి, ఉన్న కొన్ని పొలాల్ని కాపాడుకొని జీవనం సాగిస్తున్నాడు – చెప్పుకుపోతున్నాడు కాశి.

ఊళ్ళో 200 ఎకరాల పొలం ఉంది – బైసానికే

బావి, బోరు, ట్రాక్టర్లు – బైసానివి

బంగళాలాంటి యిల్లు – బైసానిది

మండలాధ్యక్షపదవి – బైసానిదే. దాదాపు బంజారాహిల్స్‌ని ఈ హిల్స్‌లో ప్రత్యక్షం చేయగల దిట్ట బైసాని వెంకట సుబ్బారెడ్డి. చెప్పుకుంటూ పోతున్నాడు కాశి.

"అది సరే. మీ ఊళ్ళో జన్మభూమి పథకం కింద 100 రోజుల్లో స్కూలు, 12 గంటల్లో అంగన్‌వాడి కేంద్రం కట్టి రికార్డు సృష్టించారట కదా? ఏదీ ఓసారి వాటిని చూద్దాం పద." అన్నాను.

"రేపెలాగూ రెడ్డిగారిని కలిసి ఇంటర్వ్యూ చేసే పని ఉందిగదా! ఆయన నీకవన్నీ

చూపించి, ఫుల్‌గా బిర్యానీ కొట్టించి ఇంకా ఇంకా... నీవు జర్నలిస్టుగా ముదిరింటే... సకల మర్యాదలు చేసి పంపుతాడు"... కాశి కొంచె ఎగతాళిగా అన్నాడు.

"ముదిరింటే నీయింటి కొచ్చి మజ్జిగెందుకు తాగుతానువై. మనకంత సీన్ లేదులే గాని ముందవేవో చూద్దాం పద" అన్నాను. ఇద్దరం అక్కడినుండి కదిలాం. స్కూలు దగ్గరికొచ్చాం. ఇంకా ఫినిషింగ్ పనులు జరుగుతున్నాయి. "అదిగో ఆపైన నిలబడుకోనున్నాయన వెంకట సుబ్బారెడ్డి తమ్ముడు వెంకట నాగిరెడ్డి."

ఆయన ఆర్డర్లు జారీ చేస్తున్నాడు. జరీపంచె పైకి కట్టి గంజి పట్టిచ్చిన ఖద్దరంగీ. ముంజేతికి గొలుసు. సిగరెట్ దమ్ము లాగిస్తున్నాడు. కాశి నమస్తే అన్నాడు. ఎడమ చేయి కొంచెం పైకెత్తాడు రెడ్డి. మళ్ళీ ఆ కూలీలకు పని పురమాయిస్తూ మధ్య మధ్యలో బూతులు తిడ్తున్నాడు. ఎదురుగానే 12 గంటల్లో కట్టిన అంగన్‌వాడీ కేంద్రం ఉంది. ఊళ్లో గవర్నమెంటు కట్టడాలంటూ ఏవైనా జరిగితే అది ఖచ్చితంగా నాగిరెడ్డికివ్వాల్సిందే. కొంచెం ముందుకు కదిలాం. రచ్చకట్టపైన చిలకపంచాంగం అందరూ ఆసక్తిగా వింటున్నారు. శివాలయంలో పెట్టిన రామాంజనేయ యుద్ధం పద్యాలు జోరుగా వినిపిస్తున్నాయి. ఇంటికొచ్చేటప్పటికి సాయంత్రం 6.30 అయింది. కాశీ యింట్లో పిల్లల సందడి. ట్యూషన్ పిలల్లు నిండుకుపోయారు.

"ఓహో! మంచి ఫ్యాక్టరీ నడుపుతున్నావే. సాయంత్రం మంచి కాలక్షేపమే" అన్నాను. "కాలక్షేపమా పాడా! ఈ చీమిడి ముక్కుగాళ్ళు, లొడుగుబుడుగు నిక్కరగాళ్ళు... వాళ్ళకు అ, ఆ – అలు, ఎక్కాలు వచ్చేదేమోగాని, చెప్పి చెప్పి నా కొచ్చినవి కూడా పోయేటట్టున్నాయ్" అన్నాడు కాశి.

సార్!... ఒక పిల్లాడు బనీను, నిక్కరు... మెడలో అంత్రాలు... పలక పట్టుకొని సిగ్గులొలకబోస్తున్నాడు. "ఓయ్. ఏమిటి అన్ని అంత్రాలేసినవ్" అన్నాను నేను. "వాడు పైపాడు జరమొచ్చి సచ్చిపోతుండె. అంత్రమేసినంక బత్కినాడు" వాడి అక్క చెప్పింది. వింతగుంది. "కాశీ! – పైపాడు జరమేమిటదీ!" అన్నా. 'టైఫాయిడ్' కొచ్చిన తిప్పలది. కాశి చెప్పాక నాకు నవ్వాగలేదు. పదేళ్ల పిల్లవాడు పైనుండి కింది వరకు వదులుగా ఉండే బనీను మాత్రమే వేసుకున్నాడు. వంతుప్రకారంగా వాడి పలకతీస్కొచ్చినాడు. "ఇదేమిట్రా – ఏమీ రాయకుండా తెచ్చినవ్?" కాశి కొంచెం గట్టిగా అరిచాడు. వాడు పలకకుండా చేతులు రెండు కట్టుకొని తలనేలకేసి కనురెప్పలు పైకి పెట్టి చూస్తూ నిలబడినాడు.

"ఓయ్! ఏందట్ల బెల్లం కొట్టినరాయిలెక్క నిలబడినవ్?" కాశి ఇంకొంచెం గట్టిగా అడిగేసరికి వాడు ఏడుపు లంకించుకున్నాడు.

"ఇంటికిపోతా....బువ్వ...." రాగాలు తీస్తు ఏడుస్తున్నాడు. పక్కింటి పిల్లాడు అందుకున్నాడు "సార్! వాడు పైటాల బువ్వ తినలేదు సార్!"

"ఎందుకు?"... అడిగాను.

"వాల్లమ్మ కూలికి పోయింది. వాల్లనాయనకు కాల్లు చేతులిర్గినయ్... ఇంగ బువ్వ చేయనీక ఎవరున్నారు?" అన్నాడు పక్కనున్న పిల్లవాడు.

"ఏందీ, కాళ్ళు చేతులిర్గినయా. ఎట్ల ఇరిగినయ్. కింద పడినాడా..." కాశి ఆశ్చర్యంగా అడిగాడు. "లేదుసార్..." అంటున్నారుగాని పిల్లలెవ్వరూ పల్కడం

లేదు. ఆ పిల్లవాడు కట్టుకున్న చేతుల్తో ముక్కుతుడ్చుకుంటూ "రాడ్డోల్లు...రాడ్డోల్లు" అంటూ ఏడుపు కొనసాగిస్తున్నాడు.

"ఓహో! నూకూర్చో. బజారీ!... ఏం జరిగిందిరా?..." ఒక పెద్ద పిల్లోణ్ణి అడిగాడు కాశి.

"ఇగో! వాల్ల నాయన బడికట్టే పనికి రాకుండ రైలు కట్టపనికి పోయినడు దుడ్లొస్తయ్ అని. అందుకనీ... రాడ్డోల్లు పిల్సి"... పిల్లవాడు ఇంకా పొడిగిస్తుంటే ఆపేసి "సరే నూ కూర్చో" అన్నాడు. కారణం కాశీకి పూర్తిగా అర్థమైంది. కాశి నాకు మిగిలిందంతా ఇంగ్లీషులో చెప్పాడు. విషయం వింటుంటే విషం మింగినట్లుంది. రాయలసీమలో రెడ్లు తమ పేర్లకు ముందు పులిబిడ్డలు. తోడేళ్ళు అని రాసుకోవడమే కాదు, నిజంగా చేసి చూపిస్తున్నారని ప్రత్యక్షంగా అర్థమైంది. ఆ పిల్లవాణ్ణి దగ్గరగా పిల్చి పేరడిగాను. చెప్పలేదు. సంచిలోంచి కెమెరా తీశాను. "ఒకసారి నవ్వు. నీ ఫోటో తీస్తాను" అన్నాను. ఫ్లాష్ లైటింగ్‌కి నవ్వాడు. "యిప్పుడు చెప్పు నీపేరు..." అడిగాను.

"కిష్టిగాడు"... చెప్పాడు.

"మీ నాయన పేరు..." అడిగాను.

"ఎర్రమద్ది"... పేరు నాకు నచ్చింది. జన్మభూమి ప్రోగ్రాం క్రింద రెడ్డి కట్టిస్తున్న బడికి కూలీ లేకుండా పనిచేసే కట్టడిపెడితే కాదని కూలికోసం రైల్వే బ్రాడ్‌గేజి పనికిపోయిన "ఎర్రమద్ది" నిజంగానే గొప్పవాడనిపించింది నాకు. ఇద్దరం భోంచేసి మిద్దెక్కినాము.

"కాశీ!... ఇందకీ ఆ స్కూలు స్థలం... అంగన్‌వాడీ స్థలం రెడ్డి యిచ్చాడా?..." అడిగాను.

"యివ్వడం... అది వాళ్ళ ఇంటావంటా లేని అలవాటు. ఒకే ఒక కలం పోటుతో వేరే వాళ్ళ స్థలాలు లాక్కోవడమేగాని స్థలాలు దానం చేయడం... కలలో కూడా జరగదు. ఆ స్కూలు స్థలం అయిదెకరాలు ఒక కురువ కుటుంబానిది. అన్నదమ్ముల మధ్య పేచీ వచ్చింది. రెడ్డిదగ్గరికి పంచాయితీకొచ్చారు. చాలాసేపు వాదులాట జరిగింది. చివరికి రెడ్డి 'రేయ్! ఇదేం బాగాలేదుగాని యిద్దరు గలిసి ఆ చేను బడికి రాసియ్యండి పొండి' అని ఆర్డరేసాడు. అంతే. స్థలం రిజిస్టర్ అయింది. స్కూలు భవనం శంకుస్థాపనలోగాని, భవన నిర్మాణ శిలాప్రతి స్థాపనలో గాని వాళ్లపేర్లు లేవు. స్థలదాత...'దైసాని వెంకటసుబ్బారెడ్డి గ్రామ విద్యాకమిటి ఛైర్మన్' అని తాటికాయంత అక్షరాలతో చెక్కించారు. చూసి అన్నదమ్ములిద్దరూ గుటకలు మింగడం తప్ప ఏం చేయలేదు. ఆపై ఒక వాలంటరీ సొసైటీ పెట్టించాడు. దాని పేరుమీద వసూలైన లక్షలలోనుండి 30 శాతం... పడేశాడు. స్కూలు నిర్మాణానికి పదిలక్షలు శాంక్షన్ అయ్యాయి. కాని దానికి యిసక కవాడికొండ వాళ్ళు... రాయి కనకదిన్నెవాళ్ళు... సిమెంటు ఒంటిమిట్టవాళ్ళు ఫ్రీగా లారీలతో దింపారు... కూలీ లేకుండా ఊరిలో ఇంటికొక్కరు వచ్చి శ్రమదానం చేశారు. పేరుకు పేరు... డబ్బుకు డబ్బు... 'ఫ్యాక్షన్ వీడి, చదువులతల్లి బడికి'— పేపర్లో వార్తలు." కాశీ కథచెబుతుంటే విఠలాచార్య సినిమా గుర్తొచ్చింది నాకు. వేలికున్న ఉంగరం రుద్దితే ధన్‌మని రాక్షసుడు ప్రత్యక్షమై హీరోగారికి అన్నీ అమర్చినట్లు, రెడ్డిగారు ఫ్యాక్షన్ రింగు రుద్దితే చాలు – అరచేతిలో వైకుంఠం ప్రత్యక్షమైతుంది.

నాకు రాత్రంతా నిద్రపట్టలేదు. ఎర్రమద్దిని చూడాలనిపించింది. మాట్లాడాలని మనసులో తపన... తెల్లారింది. స్నానమైంది. "ఓయ్! రెడ్డి దగ్గర నేన్జెప్పినవన్నీ ఎత్తకు. జాగ్రత్తసుమా!" కాశి వార్నింగ్ ఇస్తుంటే – "ఓయ్, జర్నలిస్టుకే చెప్పొచ్చావో... అవన్నీ మాకు తెల్సు లేవై!..." అంటూ రెడ్డి దగ్గరికి బయల్దేరా.

☆ ☆ ☆

మూడంతస్తులమేడ. పైన పెద్ద డిష్‌గిన్నె... సింటెక్స్ ట్యాంక్. మూడో అంతస్తు నుండి బొచ్చుకుక్క మొరుగుతుంది. కర్నూల్లో ఒక క్లాసికల్ ఏరియానుండి తెగిపడిన అపార్ట్‌మెంట్‌లాగా ఉంది ఆ బంగళా.

గేటుదగ్గరే. ఎవరు... ఎవరుకావాల... ప్రశ్నలకు సమాధానం చెప్పాను. "రాడ్డి పూజ చేత్తున్నడు యీడగూసో..." ఒక జులాపాలాయన కుర్చీ చూపించాడు. చాలా కొద్దిమందే కుర్చీల్లో కూచున్నారు. గుంపులు గుంపులుగా అక్కడక్కడ మాట్లాడుకొంటున్నారు. టాటా సుమో... జీపులు వరుసగా ఆగి ఉన్నాయ్. నలుగురైదుగురు పిల్లలు హోలీడే డ్రస్సుల్లో క్రికెట్ ఆడుకుంటున్నారు. నేను కూర్చున్న హాల్లో పెదరంగారెడ్డి ఫోటో... సుబ్బారెడ్డి ముఖ్యమంత్రితో, రాష్ట్రపతితో దిగిన ఫోటోలు షోకేసుల్లో నుండి తొంగిచూస్తున్నాయ్.

చాలాసేపటికి ఒక పిల్లవాడు యాష్‌ట్రే తెచ్చి టీపాయ్ మీద పెట్టాడు. ఫ్రిజ్ బాటిల్ తెచ్చిపెట్టాడు. కుర్చీల్లో వాళ్లకు టీ వచ్చింది. అందరితోపాటు నేనూ తాగాను. యాష్‌ట్రే... రాగానే – అందరూ మాటలు ఆపి లోపలికి చూడడం మొదలుపెట్టారు. పేపర్లు చదువుతున్నవాళ్లు అవి మడతపెట్టి సిద్ధంగా కూర్చున్నారు.

రంగంలోకి వెంకటసుబ్బారెడ్డి ప్రవేశించాడు. ఒక్కఉదుటున అందరూ లేచి అప్రయత్నంగా నమస్కారాలు పెట్టేశారు. నేనూ అదే చేసినా... సింహాసనంలాంటి తన కుర్చీలో సుబ్బారెడ్డి దేహం నిండుగా ఉంది.

"ఏరా... దయ్యిందిన్నె బాయోల్లు వచ్చినారా?" ఎవర్నో అడిగాడు.

చేతులు కట్టుకున్న ఒకాయన "వచ్చినార్రాడ్డి... నేను ఫోన్ జేస్తే ఆటికి బోతం రాడ్డి" అన్నాడు. "ఆ! మీరు ఎస్.ఐ. దగ్గరికి పోండి. నేను ఫోన్‌చేస్త." అతని వెంట ఒక గుంపు వెళ్ళిపోయారు.

రెడ్డి ఫోన్లో... "నమస్తే. అవునవును... రాత్రి లేటాయె. తీస్కొని పోయినారు... అవును... వాళ్ళు వస్తున్నారు... లేదు... లేదు... వాళ్లిద్దర్ని... ఆ! పంపిచ్చెయ్యి... ఉంట మల్ల..." ఆ పదాలతోనే ఏం మాట్లాడాడో అందరికీ బాగా అర్థమైపోతుంది. ఇంకొకాయన వచ్చి నెత్తిగీరుతూ నిలబడినాడు. "ఏరా... కాదురా... ఎస్.పి. సంగతి తెల్సుగదా మీకు. మల్ల ఎవడ్రావాడు... అట్లజేసినోడు. ఏం మీరంతా వూరిడ్సాలను కుంటున్నారా! మీ వూరిదెప్పుడిదే పాడు పంచాయితి. ఇగో... కరి పండగనాడు మొండోడు... సత్తిగాడు ఇద్దరిని ఉండొద్దని చెప్పు." సిగరెట్ పట్టుకున్న రెండు వేళ్లతో రెడ్డి వార్నింగిచ్చాడు. సరే! రెడ్డి అంటూ తల ఊపుతూ వాడు వెళ్ళిపోయాడు."

నావైపుకు దృష్టి మరిచాడు. నాకు అప్పుడే మాట్లాడి వెళ్ళిపోవాలని లేదు. చాలా యింట్రెస్టింగ్‌గా ఉంది వినడానికి, చూడడానికీ...

"మీరు... చెప్పండి..." అన్నాడు నాతో.

"నేను 'జనవాణి' అని ఒక మాసపత్రికలో పనిచేస్తున్నాను." విజిటింగ్ కార్డిచ్చాను. "జన్మభూమి గురించి సమీక్షరాస్తూ మీ వూరిలో జరిగిన ప్రోగ్రెస్ గురించి రాయాలను కున్నాం. అట్లే మీతో ఇంటర్వ్యూ తీసుకుందామని..." పొడిపొడిగా మాట్లాడినా.

ఖద్దరు ఫుల్ షర్టును మడతలు పెడుతూ... "మీరు పేపర్లో చదివే ఉంటారుగదా! మేము ప్రత్యక్షంగా చెప్పేదేముంది? మేము ఒక వాలంటరీ సొసైటీ తరపున ఊళ్లో చాలా పనులు చేపట్టినాం. హైస్కూలు, అంగన్‌వాడి, రోడ్లు... రేయ్ నర్సి... మనవి ఆ జన్మభూమి ఫోటోలు తెచ్చియ్యి" అన్నాడు.

"జన్మభూమి గురించి మీ అభిప్రాయం..." అన్నాను. 'జన్మభూమి' చాలా బెస్ట్ ప్రోగ్రాం... కంట్రాక్టర్లకు తినిబెట్టకుండా ప్రజలే ముందుకు వచ్చి శ్రమదానంతో అన్నీ నిర్మించుకోవడం... అసలు ఇది మొత్తం దేశానికే ఆదర్శం కదా...!"

"అంటే దీనిలో కంట్రాక్టర్ల ప్రమేయం ఏమీ లేదంటారా?" అడిగాను.

"లేదు. ముఖ్యంగా మా ఊరు ఒకప్పుడు ఫ్యాక్షన్‌తో ఉడికిపోయింది జన్మభూమిలో అందరూ కలిసికట్టుగ పనిచేసినారు. బడి కట్టుకున్నారు. నీరు మీరులో పూడికలు తీస్కున్నారు. ఇప్పుడు ప్రశాంతంగా బత్కుతున్నారు" అన్నాడు.

ఇంతలో ఒక జీప్ నిండా జనం దిగారు. "రేయ్... ఆ 'దండోరా' వాళ్ల జీపు వచ్చినట్లుంది... ఇద్దర్ని మాత్రమే లోపలికి పంపు..." అన్నాడు.

"సరే... నేను వెళ్తానండి..." లేచాను.

"పత్రిక ఏదన్నారు?" అడిగాడు రెడ్డి. పత్రిక పేరు చెప్పి బయటపడ్డాను.

☆ ☆ ☆

"ఓన్నా... రాత్రి ఫోటో దీస్తివి గద ఎప్పుడిస్తవు..." కాశి ప్రైవేటు పిల్లవాడు ఒకడు వచ్చి అడిగాడు. "అదా...అది మీ సారుకిస్తగానీ, మీ కిష్టగాని యిల్లు చూపిస్తవా?" అన్న ఎర్రమద్దితో మాట్లాడాలని...

"అగో... ఆ సింతమాను పక్కన ఉండే తడిక వాకిలిల్లే..." పిల్లాడు చూపించాడు. పోదాంరా... పిల్చుకునిపోయాను. కిష్టిగాడు నన్ను చూసి పరుగెత్తుకొచ్చాడు. కెమెరా ఉన్న నా సంచీనే చూస్తున్నాడు. నవ్వుతున్నాడు.

"ఎవరు నాయనా..." కిష్టిగాని అమ్మ లోపల్నుంచి తొంగిచూసింది. "అగో... ఈయన... మా సారు వాళ్లింటికి వచ్చినాడు. నిన్న ఫోటో తీసినాడని చెప్తికదా... ఈయనే తీసినేది." కిష్టిగాడు చెప్పాడు.

"ఓహో! అంటే పోటోలు తీసేటాయనకదా... కూచ్చో నాయనా..." కిష్టివాళ్లమ్మ అరుగు చూపించింది. నేను స్టూడియో వాడిలాగా అనుకోబడడం... మేలే అన్పించింది. కొంచెం మంచినీళ్లియ్యమ్మా... అన్నాను. "వ్యానుకు పోవాలేమొకదా నాయినా... కూచో వస్తదిలే..." ఆమె చాలా ఆప్యాయంగా మాట్లాడింది. మంచినీళ్ళు తాగుతూ "ఎట్లుందమ్మా వీళ్ల నాయనకు. ఏదో దెబ్బలు తగిలినాయని చెప్పాడు" అన్నాడు.

ఆమె వెంటనే చాలా జాగ్రత్తగా "అగో – వద్దంటే ఆ రైలుకట్ట పనికిపోయినాడు. అది మనకి అలవాటులేని పని. గంపనెత్తుకొని ఆ రాళ్లమీద అట్లే కూలబడినాడంట.

దెబ్బలు తగిల్నయ్. అగో మంచం మీద పడుకున్నాడు." చూపించింది ఆమె.

ఎర్రమద్ది ఏం మాట్లాడలేదు. చాలా గంభీరంగా ఉన్నాడు. నేనే కలగజేసుకుని బాగుందా ఆరోగ్యం అన్నాను. "ఫోటో తీయనా ఒకటి" అడిగాను. కిష్టిగాడు సంబరంగా... దగ్గరికొచ్చి "నన్ను మా నాయనను ఒక ఫోటో తీ..." అన్నాడు.

"వద్దురా..." ఎర్రమద్ది గదమాయించాడు. "మాక్యాల ఫోటోలు... కూలి నాకొడుకులకు ఎచ్చులెక్కువైంది అంటారు." నేను కెమెరా తీయబోయినాను. కిష్టవాళ్లమ్మ.... "వద్దులే నాయనా... యాదో మాకవి అచ్చుబాటురావులే" అనింది. "సరే! మరి ఈ కాళ్ళు చూపించుకోవడానికి డాక్టర్దగ్గరికి పోరా..." అడిగాను.

"పోతుండం యియ్యాల... అక్కడ వేరే దేశం... పరదేశానికి పోతం..." అంటుందామె.

"అంతదూరం ఎందుకు?" అడిగాను.

ఆమె అందుకుంది – "ఏం జేస్తవ్ నాయనా – కడుపుకాలినోల్లం. మీ లెక్క ఉన్న మారాజులమా... కడుపుపట్కోని యాడ యింత ముద్ద దొర్కితే ఆటికి పోతాం. యాదో యిన్నాల్లు మా రెడ్డోల్ల పున్నెమా అని బత్కినం." కొంత వణుకుతున్న గొంతుతో ఆమె చెప్తుంది.

"మరిప్పుడేమైంది..." నేనందుకున్నాను.

"ఎన్నాళ్లని...ఊర్లో పంటలు లేవు. పనులు లేవు. మొత్తం మా మాదిగ కుటుంబాలన్నీ బత్కనీక పోతుండయ్" చెప్పిందామె.

"ఎందుకు? జన్మభూమి పేరుమీద మీ వూర్లో పనులు బానానే జరుగుతున్నాయ్ గదా..." అడిగాను. "దాండ్లతో మా కడుపునిండదులే నాయినా..." ఆమె అంటుండంగా ఊర్లో ఏదో దండోరా మొదలైంది.

"ఊర్లో యావన్మందికి తెలియజేయడమేమనగా – ఈనెల 26వ తేదీ మన వూరిలో కలెక్టర్ మీటింగ్ ఉంది. మన ఊరు జన్మభూమిలో ఫస్ట్ వచ్చినందుకు మన ఊరికే బహుమానాలిస్తరు. కాబట్టి ఆ రోజందరూ మీటింగ్కు రావాల్సిందిగా తెలియజేస్తున్నాం..." తప్పెటమ్రోగుతుంది.

వస్తానమ్మా అంటూ నేను బస్టాండు వైపు కదిలాను. మర్రిమాను కింద ఆరోజు చాలా మంది మూటలు, సామాన్లు కట్టుకొని కూచున్నారు.

"ఏరా... అందరూ మూటా ముల్లె సర్దినారు." ఒక పెద్దమనిషి అడుగుతున్నాడు.

"బత్కనీక పోతాండాం సామి... పిల్లాజెల్లా అందరూ..." అన్నాడొకాయన. అందరూ వ్యానుకోసం ఎదురుచూస్తున్నారు.

ఒక తల్లి పాలుతాగే పిల్లోని మీద విసుక్కుంది. "ఏందిరా...పొద్దుమూకులు గుంజుతవ్. ఏందుందని... నాకాడ సారముంటేనా... నూ తాగేది..." కొంగుమూసి పసిపిల్లోన్ని బుజ్జగిస్తోంది.

● *ప్రచురణ: 2002?* ●

★ ★ ★

# రచయితల సంక్షిప్త పరిచయాలు

## 1. గురజాడ అప్పారావు (1861-1915):

విశాఖపట్టణం జిల్లా రాయవరంలో జన్మించారు. ఆధునిక తెలుగు సాహిత్య యుగకర్త. తొలి తెలుగు కథకుడు. దిద్దుబాటు, దేవుళ్లారా. మీ పేరేమిటి, మెటిల్డా, పెద్ద మసీదు, సంస్కర్తహృదయం, అన్న కథలు రాశారు. 'ముత్యాల సరాలు' కూర్చారు. వీరి ప్రసిద్ధనాటకం 'కన్యాశుల్కం'. మరో నాటకం 'బిల్హణీయం'. విజయనగరం మహారాజా కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేశారు.

## 2. కనుపర్తి వరలక్ష్మమ్మ (1896-1978):

గుంటూరు జిల్లా బాపట్లలో జన్మించారు. 25కు పైగా కథలు రాశారు. నవల, నాటిక, వ్యాసం, లేఖాసాహిత్యం వంటి అనేక ప్రక్రియల్లో వీరు రచనలు చేశారు. వీరి 'శారదలేఖలు' ప్రసిద్ధమైనవి. "మా చెట్టునీడ ముచ్చట్లు" అన్న శీర్షికను 'లీలావతి' అన్న కలం పేరుతో రాశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అవార్డును అందుకున్న మొదటి రచయిత్రి.

## 3. గుడిపాటి వెంకటచలం (1894-1979):

పుట్టింది గుంటూరు జిల్లా తెనాలిలో. కథకుడూ, నవలా రచయితా, తాత్వికుడూ - వందకుపైగా కథలు రాశారు. వీరి కథలు కళ్యాణి, ఆ రాత్రి, జెలసీ, అనసూయ, పాపం, జానకి మొదలగు సంపుటాలుగా వచ్చాయి. శశిరేఖ, అరుణ, అమీనా, మైదానం జీవితాదర్శం మొదలగు నవలల్నీ, స్త్రీ, మ్యూజింగ్స్, బిడ్డల శిక్షణ గ్రంథాల్నీ రచించారు. చిత్రాంగి, పురూరవ, శశాంక నాటకాల్ని రాశారు.

## 4. రాయసం వెంకటశివుడు (1870-1954):

పశ్చిమ గోదావరి జిల్లా రేలంగి స్వస్థలం. స్త్రీవిద్యకోసం పాటుపడిన ప్రముఖుడు. స్త్రీజనోద్ధరణ, సత్యసంవర్ధినీ, పత్రికలను నడిపారు. వీరేశలింగం శిష్యుడు. వీరి కథలు 'చిత్రకథామంజరి' అన్న పేరుతో 1927లో మూడు సంపుటాలుగా వచ్చాయి. ఉపాధ్యాయులుగా ప్రిన్సిపాల్‌గా పనిచేశారు.

## 5. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి (1891-1961):

తూర్పు గోదావరి జిల్లా, రామచంద్రపురం తాలుకా పొలుమూరులో జన్మించారు. కథకుడూ, నాటకకర్తా, నవలా రచయిత. 50కి పైగా కథలు రాశారు. రక్షాబంధనం,

ఆత్మబలి వంటి నవలల్నీ, రాజరాజు, ఊరుభంగం నాటకాల్నీ, "అనుభవాలూ - జ్ఞాపకాలూనూ" అన్న పేరుతో స్వీయ చరిత్రనూ రచించారు.

## 6. కరుణకుమార (1901-1956):

పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలూకా కాపవరంలో జన్మించారు. వీరి అసలు పేరు కందుకూరి అనంతం – దాదాపు 30 కథలు రాశారు. సన్నజీవాలు, బిళ్లల మొలతాడు, కరుణకుమార కథలు అన్న పేర్లతో వీరి కథలు సంపుటాలుగా వచ్చాయి. రెవిన్యూ డిపార్ట్‌మెంట్‌లో పనిచేశారు.

## 7. పొట్లపల్లి రామారావు (1917-2001):

వరంగల్లు జిల్లా 'తాటికాయలు' గ్రామం స్వస్థలం. తెలంగాణాకు చెందిన తొలితరం కథకుడు, కవి. వీరి కథలసంపుటి "జైలు" 1954లో ప్రచురితమైంది. 'ఆత్మవేదన', 'చుక్కలు', 'అక్షరదీప్తి' వీరి కవితా సంపుటాలు.

## 8. చాగంటి సోమయాజులు (1915-1994):

శ్రీకాకుళంలో జన్మించారు. విజయనగరంలో స్థిరపడ్డారు. 'చాసో'గా సుప్రసిద్ధులు – దాదాపు 60 కథలు రాశారు. వీరి కథలన్నీ 'చాసోకథలు' అన్న పేరుతో సంపుటిగా వచ్చాయి. 'కళింగ కథానికలు' సంకలనకర్త – అభ్యుదయ రచయితల సంఘం ప్రారంభకుల్లో ఒకరు.

## 9. సురవరం ప్రతాపరెడ్డి (1896-1953):

మహబూబ్‌నగర్ జిల్లాలో జన్మించారు. తెలుగు, సంస్కృతాలలో మంచి పాండిత్యం సంపాదించారు. గోలకొండ పత్రికను స్థాపించారు. పత్రికా రచయిత, పరిశోధకుడు, చరిత్రకారుడు, సంపాదకుడు, సాంఘిక సంస్కర్త. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, హిందువుల పండుగలు, రామాయణ విశేషములు లాంటి గ్రంథాలేకాకుండ అనేక కథలు, నాటికలు రాశారు. కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. గ్రంథాలయాలు స్థాపించారు. జోగిపేటలో జరిగిన ప్రథమ ఆంధ్రమహాసభకు అధ్యక్షుడు. స్త్రీలు, దళితుల అభ్యున్నతికి కృషి చేశారు.

## 10. కాంచనపల్లి చినవెంకటరామారావు (1921-1992):

నల్లగొండ జిల్లాలో జన్మించారు. తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటంలో పాల్గొన్నారు. అనేక కళారూపాలను సృష్టించారు. అరుణరేఖలు (కవితలు), మనవూళ్ళోకూడానా?! (కథల సంపుటి) అన్న రచనలేకాక అనేక గ్రంథ సమీక్షలను, సాహిత్య వ్యాసాలను రచించారు. కమ్యూనిస్టుపార్టీ శాసన సభ్యుడుగా ఉన్నారు. న్యాయవాదవృత్తికీ రచనా ప్రవృత్తికీ న్యాయం చేశారు.

## 11. అడివి బాపిరాజు (1895-1952):

పశ్చిమ గోదావరి జిల్లా భీమవరంలో జన్మించారు. కవి, కథకులు, నవలా రచయిత, చిత్రకారుడు. వీరి కథలు తరంగిణి, అంజలి, రాగమాలిక, హంపీశిధిలాలు మొదలగు సంపుటాలుగా వచ్చాయి. నారాయణరావు, గోనగన్నారెడ్డి, హిమబిందు, వీరి ప్రసిద్ధ నవలలు. 'మీజాన్' పత్రికకు సంపాదకులుగా పనిచేశారు.

## 12. డాక్టర్ పుప్పల లక్ష్మణరావు (1898-1985):

ఒరిస్సా రాష్ట్రం బరంపురంలో జన్మించారు. వీరు కథలు రాశారు. అతడు – ఆమె నవల ద్వారా ప్రఖ్యాతి పొందారు. బతుకు పుస్తకం అన్న ఆత్మకథ రాశారు. మాస్కోలోని ప్రగతి ప్రచురణాలయం తెలుగు శాఖలో అనువాదకుడుగా ఉండి, 40 గ్రంథాలను సరళమైన తెలుగులోకి అనువాదం చేశారు. తెలుగు–రష్యన్ నిఘంటువును ప్రచురించారు. సాహిత్యంలో నిజాయితీని రాజకీయాల్లో నిబద్ధతను ప్రదర్శించిన వ్యక్తి. కొన్ని కవితలు కూడా రాశారు.

## 13. సెట్టి ఈశ్వరరావు (1917-1998):

శ్రీకాకుళం జిల్లా బారువలో జన్మించారు. సుమారు 30 కథలు రాశారు. గురజాడ రచనలను తొలిసారిగా విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రచురించటంలో వీరూ, అవసరాల సూర్యారావుగారూ – చక్కని కృషి చేశారు. కొంతకాలం విశాలాంధ్ర పక్షపత్రికను నడిపారు. అభ్యుదయను నిర్వహించారు. సోవియట్‌భూమి పత్రికకు సంపాదకులుగా పనిచేశారు. సాహిత్య విషయాలపై సుమారు 100 వ్యాసాలూ, నాలుగు నాటికలూ, అనేక కవితలూ వెలువరించారు. 1990లలో గురజాడరచనలన్నిటినీ తిరిగి పరిష్కరించి ప్రచురించటంలో విశాలాంధ్ర ప్రచురణాలయానికి సాయపడ్డారు. అనేకమంది అంతర్జాతీయకవుల కవితలను అనువదించారు.

## 14. గోపీచంద్ (1910-1962):

కృష్ణాజిల్లా అంగలూరులో జన్మించారు. కథకుడు, నవలా రచయిత, తత్త్వవేత్త. వందకు పైగా కథలు రాశారు. అసమర్థుని జీవయాత్ర, చీకటిగదులు, మెరుపుల మరకలు, పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా వంటి ఎన్నో నవలల్ని రాశారు. తత్త్వవేత్తలు, పోస్టు చెయ్యని ఉత్తరాలు వీరి తాత్త్విక గ్రంథాలు. కొన్ని చలన చిత్రాలకు దర్శకత్వం వహించారు. ఆకాశవాణిలో పనిచేశారు.

## 15. దేవరకొండ బాలగంగాధర తిలక్ (1922-1966):

పశ్చిమ గోదావరి జిల్లా తణుకులో జన్మించారు. కవి, కథకుడు, నాటక రచయిత. వీరి కథలన్నీ 'తిలక్ కథలు' అన్న సంపుటంగా వచ్చాయి. "అమృతం కురిసిన రాత్రి" వీరి ప్రసిద్ధ కవితా సంపుటి – సుప్తశిల, సుచిత్రప్రణయం వీరి నాటికలు.

## 16. శారద (1925-1955):

వీరి అసలు పేరు ఎస్. నటరాజన్. తమిళదేశస్థుడు. 1937లో మద్రాసునుండి తెనాలి వచ్చి స్థిరపడ్డాడు. తెలుగు నేర్చుకొని ఎన్నో కథలూ, నవలలూ రాశారు. హోటల్ సర్వర్‌గా పనిచేశారు. 'రక్తస్పర్శ' వీరి కథల సంపుటి. మంచి-చెడు, అపస్వరాలు, ఏదిసత్యం మొదలగు నవలల్ని రాశారు.

## 17. కాళీపట్నం రామారావు:

శ్రీకాకుళం జిల్లా మురపాకలో 1924లో జన్మించారు. 26 కథలు రాశారు. వీరి కథలన్నీ ఒకే సంపుటిగా వచ్చాయి. 'యజ్ఞం' వీరి ప్రసిద్ధ కథ – 1995లో కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు పొందారు. ప్రస్తుతం శ్రీకాకుళంలో 'కథానిలయం' నిర్వహిస్తున్నారు.

అడ్రస్: కథానిలయం, గ్రామీణ బ్యాంక్ "ఎ" కాలనీ,
శ్రీకాకుళం–532 001.

## 18. వట్టికోట ఆళ్వారుస్వామి (1915-1961):

తెలంగాణా తొలి కథకుల్లో ముఖ్యులు. కథకుడూ, నవలా రచయిత, ప్రచురణకర్త. వీరి కథలన్నీ 'జైలులోపల' అన్న పేరుతో ఒక సంపుటిగా వచ్చాయి. ప్రజల మనిషి, గంగు వీరి ప్రసిద్ధ నవలలు. దేశోద్ధారక గ్రంథమాల స్థాపించి ఎన్నో గ్రంథాలను ప్రచురించారు.

## 19. జి. రామకృష్ణ:

అనంతపురం జిల్లాకు చెందిన తొలి కథకుడు – ప్రముఖ పాత్రికేయులు. స్వాతంత్ర్య సమరయోధులు. కమ్యూనిస్టు. ఆరు కథలు రాశారు. 1915లో జన్మించారు.

అడ్రస్: 14–428, కమలానగర్, అనంతపురం.

## 20. కొడవటిగంటి కుటుంబరావు (1909-1980):

గుంటూరు జిల్లా తెనాలిలో జన్మించారు. కథకుడు, నవలా రచయిత, విమర్శకులు. 400 పైగా కథలు రాశారు. వీరి రచనలన్నీ విశాలాంధ్ర వారూ, విరసం వారూ సంపుటాలుగా తెచ్చారు. అనుభవం, పంచకల్యాణి, అరుణోదయం, వారసత్వం, ప్రేమించిన మనిషి మొదలగు ఎన్నో నవలల్ని రాశారు. సైన్స్ వ్యాసాలు, చరిత్ర వ్యాసాలు, సాహిత్య వ్యాసాలు వందలాదిగా రచించారు. ఆంధ్రపత్రిక, చందమామ పత్రికల్లో చాలాకాలం పనిచేశారు.

## 21. కె. సభా (1923-1980):

పుట్టింది చిత్తూరు జిల్లా కొట్రకోనలో. రాయలసీమ తొలి కథకులు. దాదాపు 300 కథలు రాశారు. వీరి కథలు పాతాళగంగ, నీటిదీపాలు, బడిపంతులు అన్న

సంపుటాలుగా వచ్చాయి. బాలసాహిత్యంలో ఎంతోకృషి చేశారు. 'దేవదత్తం' అన్న పత్రికను నడిపారు.

## 22. మంద రామారెడ్డి:

మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన తొలితరం తెలంగాణా కథకుడు. 1929లో జన్మించారు. అన్ని సాహిత్య ప్రక్రియల్లోనూ రచనలు చేశారు. గ్రామీణ జీవితాన్ని చిత్రించే కథలు రాశారు.

## 23. అందే నారాయణస్వామి (1908-1982):

గుంటూరు జిల్లా మంగళగిరిలో జన్మించారు. వీరి కథలు 'వ్యత్యాసాలు', 'స్నేహితుడు', 'ఉపాసనాబలం', 'కారుణ్యం' అన్న సంపుటాలుగా వెలువడినాయి. 'కష్టసుఖాలు', 'ఇద్దరు తల్లులు' అన్న నవలల్ని కూడా వీరు రాశారు. చేనేతవృత్తికి చెందిన వీరు వృత్తిపరమైన ఎన్నోకథలు రాయడం విశేషం.

## 24. జి. సురమౌళి (1935-1995):

తెలంగాణా జీవితం నేపథ్యంగా చాలా కథలు రాశారు.

## 25. నెల్లూరి కేశవస్వామి (1920-1984):

1920లో హైదరాబాద్ నగరంలో జన్మించారు. నీటిపారుదల శాఖలో ఇంజనీరుగా ఉద్యోగం చేశారు. 'చార్మినార్' వీరి ప్రసిద్ధ కథల సంపుటి. 'పసిడిబొమ్మ' అనే పేరుతో వీరిది మరో కథల సంపుటి కూడా వెలువడింది. 'వెలుతురులో చీకటి' వీరి నవల. వీరి 'చార్మినార్'కు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది.

## 26 'మంజీర':

వీరు ప్రధానంగా కథారచయిత. మంజీర కథలు అన్న కథా సంకలనాన్ని ప్రకటించారు. భారతి మాసపత్రికలో పేరులేని మనుషులు, ధర్మవ్యాధుడు వంటి అనేక కథలు ప్రచురితమయ్యాయి. ఒక నవలను కూడా రాశారు. వీరి అసలు పేరు మంచికంటి గున్నారావు. పోలవరంలో 1926లో జన్మించిన వీరు హైదాబాద్‌లో స్థిరపడ్డారు.

## 27. మా.గోఖలే (1917-1970):

పూర్తిపేరు మాధవపెద్ది గోఖలే, గుంటూరు జిల్లా బ్రాహ్మణకోడూరులో జన్మించారు. కథకులు, చిత్రకారులు, కళాదర్శకులు. వీరి కథలు "మా.గోఖలే కథలు" అన్న పేరుతో ఒక సంపుటిగా వచ్చాయి. ఎన్నో చలన చిత్రాలకు కళాదర్శకత్వం వహించారు. ఆంధ్రపత్రిక, చందమామ పత్రికలలో చిత్రరచన చేశారు.

## 28. రాచకొండ విశ్వనాథశాస్త్రి (1922-1993):

పుట్టింది విశాఖలో. కథకుడు, నవలా రచయిత. వృత్తిరీత్యా న్యాయవాది. 60కి పైగా కథలు రాశారు. వీరి కథలు అరు సారాకథలు, బాకీకథలు, కలకంఠి, ఋక్కులు అన్న సంపుటాలుగా వచ్చాయి. అల్పజీవి, రాజు – మహిషి, రత్తాలు – రాంబాబు మొదలగు నవలలు రాశారు. వీరి ప్రసిద్ధ నాటకం 'నిజం'.

## 29. ముళ్లపూడి వెంకటరమణ:

తూర్పు గోదావరి జిల్లా ధవళేశ్వరంలో 1931లో జన్మించారు. హాస్య, వ్యంగ్య కథకులుగా ప్రతిష్ఠులు. రాజకీయభేతాళ పంచవింశతి, సీతాకళ్యాణం, ఋణానందలహరి వీరి కథాసంపుటాలు – చలనచిత్ర నిర్మాతగానూ, స్క్రిప్టురైటర్‌గానూ తెలుగు ప్రేక్షకులకు సుపరిచితులు.

అడ్రస్: 6, గ్రీన్‌వేస్‌రోడ్ ఎక్స్‌టెన్షన్, ఆర్.ఎ. పురం, చెన్నై–600 028.

## 30. మునిపల్లె రాజు:

పుట్టింది 1925లో గుంటూరు జిల్లా గరికపాడు గ్రామంలో. మూడు కథా సంపుటాలూ, రెండు కవితా సంపుటాలూ, ఒక నవలా వెలువడినాయి. రక్షణశాఖలో చాలా ఏళ్లు ఉద్యోగం చేశారు. అనేక సాహిత్య పురస్కారాలు పొందారు.

అడ్రస్: ఎ 30/1 ఎ, సైనిక్‌పురి, సికింద్రాబాద్–94.

## 31. పెద్దిభొట్ల సుబ్బరామయ్య:

1938లో గుంటూరులో జననం. నాలుగు దశాబ్దాలు అధ్యాపక వృత్తి. నయనతార, నీళ్లు, ముసురు, కళ్లజోడు మొ॥ వీరి కథాసంపుటాలు. ధ్రువతార, ముక్తి, పంజరం, మొ॥ నవలలూ రాశారు.

అడ్రస్: ప్రకాశం వీధి, మారుతీనగర్, విజయవాడ–4.

## 32. 'శ్రీపతి':

అసలు పేరు పి. చలపతిరావు – శ్రీకాకుళం జిల్లాలో 1938లో జన్మించారు. మంచుపల్లకి, నెమళ్ల అడవి వీరి కథాసంపుటాలు.

అడ్రస్. బి–22, రవీంద్రనగర్, హబ్సిగూడ, హైదరాబాద్–7.

## 33. ఇల్లిందల సరస్వతీదేవి (1918-1998):

తూర్పు గోదావరి జిల్లా నరసాపురంలో జన్మించారు. స్వర్ణకమలాలు, తులసీదళాలు వీరి కథాసంపుటాలు. ఎన్నో సాహిత్య, సామాజిక వ్యాసాలు రాశారు. కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి అందుకున్న తెలుగు రచయిత్రి. 1958–66లో శాసనమండలి సభ్యురాలుగా ఉన్నారు.

## 34. కొలకలూరి ఇనాక్:

గుంటూరు జిల్లా వేజెండ్లలో 1939లో జన్మించారు. ఊరబావి, భవాని, అస్పృశ్యగంగ వీరి కథాసంపుటాలు. సమత, అనాథ, ఇరులలో విరులు మొదలగు నవలలు ఎనిమిది, మూడు కవితా సంకలనాలు, ఆరు వ్యాస సంకలనాలు వెలువరించారు. ఇటీవలనే ఎస్.వి. యూనివర్సిటీ వైస్ ఛాన్స్‌లర్‌గా పదవీ విరమణ చేశారు.

అడ్రస్: 4th Road Extention, అనంతపురం.

## 35. వాసిరెడ్డి సీతాదేవి:

గుంటూరు జిల్లా చేబ్రోలులో 1933లో జననం. 39 నవలలు 9 కథాసంపుటాలు వెలువడినాయి. 'మట్టిమనిషి', 'మరీచిక', 'సమత', వీరి ప్రసిద్ధ నవలలు – తెలుగు విశ్వవిద్యాలయం వారిచే 'విశిష్టవ్యక్తి' పురస్కారం పొందారు.

అడ్రస్: జి–1, విద్యూషీ విల్లా, నందినగర్, రోడ్ నెం. 14, బంజారాహిల్స్, హైదరాబాద్–500 034.

## 36. కొనకళ్ళ వెంకటరత్నం (1909-1970):

పశ్చిమ గోదావరి జిల్లా పెంటపాడులో జన్మించారు. వీరి కథలు 'కథావళి' పేరుతో ఒక సంపుటిగా 1947లో వెలువడింది. "మొక్కజొన్నతోటలో......" అన్న వీరి జానపదగేయం వినని తెలుగు వాడుండడు. వీరి పాటలు 'బంగారుమామపాటలు'గా ప్రసిద్ధం.

## 37. కలువకొలను సదానంద:

చిత్తూరు జిల్లా పాకాలలో 1939లో జన్మించారు. పైరుగాలి, రక్తయజ్ఞం, రంగురంగుల చీకటి వీరి కథాసంపుటాలు. బాలసాహిత్యంలో విశేషంగా కృషి చేశారు. వీరి 'బంగారు నడిచిన బాట'కు కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కారం లభించింది – 'గందరగోళం' వీరి ప్రసిద్ధ నవల.

అడ్రస్: పాకాల, చిత్తూరు జిల్లా.

## 38. శీలా వీర్రాజు:

1939లో రాజమండ్రిలో జన్మించారు. వీరి కథలన్నీ ఏడుసంపుటాలుగా వెలువడినాయి. వీరి కవితలన్నీ నాలుగు సంపుటాలుగా వచ్చాయి. 'మైనా' వీరి ప్రసిద్ధ నవల – వీరు మంచి చిత్రకారులు కూడా. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార శాఖలో పని చేశారు.

అడ్రస్: 2/C, బ్రహ్మానందనగర్, మలక్‌పేట, హైదరాబాద్.

## 39. బీనాదేవి:

బి. నరసింగరావు, ఆయన సతీమణి సుందరమ్మగార్ల కలంపేరు 'బీనాదేవి'. నరసింగరావు 1924లో జన్మించి 1990లో మరణించారు. సుందరమ్మగారు 1935లో జన్మించారు. వీరి కథాసంపుటాలు రాధమ్మపెళ్ళి ఆగిపోయింది; ఫస్టుకేస్, డబ్బు డబ్బు డబ్బు, భూమి గుండ్రంగా వుంది; హారిశ్చంద్రమతి మొ॥ నవలలు.

అడ్రస్: శ్రీమతి సుందరమ్మ, 102 శ్రీనిలయ ఎస్టేట్, అమీర్‌పేట, హైదరాబాద్.

## 40. భూషణం (1938 -1999):

శ్రీకాకుళం జిల్లా మేరంగిలో జన్మించారు. ఉపాధ్యాయుడిగా పనిచేశారు. అడివంటుకొంది, కొండగాలి, వీరి కథాసంపుటాలు. శ్రీకాకుళం గిరిజన జీవితాలు, పోరాటాలు ప్రధానంగా వీరి కథావస్తువులు. రావిశాస్త్రి అవార్డు అందుకున్నారు.

## 41. అబ్బూరి ఛాయాదేవి:

రాజమండ్రిలో 1933లో జన్మించారు. అబ్బూరి వరదరాజేశ్వర రావుగారి సతీమణి. 'కవిత' సంచికలకు సంపాదకత్వం వహించారు. 'అబ్బూరి ఛాయాదేవి కథలు' వీరి కథా సంపుటి. "మృత్యుంజయ" 'వ్యాస చిత్రాలు' వీరి ఇతర గ్రంధాలు.

అడ్రస్: B4/F4. H.I.G. బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-44.

## 42. సింగమనేని నారాయణ:

అనంతపురం జిల్లా బండమీదపల్లెలో 1943లో జన్మించారు. 3 నవలలూ, 35 కథలూ రాశారు. "జూదం", "సింగమనేని నారాయణ కథలు" వీరి కథా సంపుటాలు. "సీమకథలు" "తెలుగు కథకులు-కథనరీతులు" "విశాలాంధ్ర తెలుగు కథ" కు సంపాదకత్వం వహించారు.

అడ్రస్: 6-1-699, కోవూరునగర్, అనంతపురం.

## 43. చిలుకూరి దేవపుత్ర:

అనంతపురం జిల్లా కాలువపల్లిలో 1952లో జన్మించారు. వందకు పైగా కథలు రాశారు. ఆరుగ్లాసులు, ఏకాకినౌక చప్పుడు వీరి కథాసంపుటాలు. వీరి 'పంచమం' నవలకు 'ఆటా' బహుమతి లభించింది. - 'చాసో' అవార్డు అందుకున్నారు.

అడ్రస్: 28-440, గవర్నమెంట్ క్వార్టర్స్; సి-2, బుడ్డప్పనగర్, అనంతపురం.

## 44. జుగాష్ విలి:

అసలు పేరు ఆర్. శరభలింగాచారి. 1952లో గుంటూరు జిల్లా కొత్తరెడ్డిపాలెంలో జన్మించారు. రాసిన కథలు చాలా తక్కువ. కవితలు ఎక్కువ.

అడ్రస్: 11-5-4/5, పాండురంగపేట. తెనాలి-522 202.

## 45. కేతు విశ్వనాథరెడ్డి:

కడప జిల్లా రంగశాయిపురంలో 1939లో జన్మించారు. జప్తు; కేతు విశ్వనాథరెడ్డి కథలు, ఇచ్ఛాగ్ని వీరి కథాసంపుటాలు. బోధి, వేర్లు, వీరి నవలలు. కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు అందుకున్నారు. కొడవటిగంటి సాహిత్యానికి, 'విశాలాంధ్ర తెలుగు కథ'కు ప్రధాన సంపాదకత్వం వహించారు.

అడ్రస్: P-61, F11, సిద్ధార్థ అపార్ట్‌మెంట్స్, సిద్ధార్థనగర్ కాలనీ, హైదరాబాద్–38.

## 46. చాగంటి తులసి:

విజయనగరంలో 1937లో జన్మించారు. 'తులసి కథలు' వీరి కథల సంపుటి. 'యాత్ర' వీరి నవల. తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారాన్ని పొందారు.

అడ్రస్: 5–127, పాల్‌నగర్, విజయనగరం.

## 47. సదానంద్ శారద:

వరంగల్‌లో 1950లో జన్మించారు. జాడీ, గొలుసు వీరి కథాసంపుటాలు. 'విశాలాంధ్ర తెలుగు కథ'కు సంపాదకత్వం వహించారు.

అడ్రస్: 12–10–590/87 వారాసిగూడ, సికింద్రాబాద్–61.

## 48. అల్లం శేషగిరిరావు (1934-2000):

'వేట' కథకులుగా సుప్రసిద్ధులు. 'మంచిముత్యాలు', 'అరణ్యఘోష' వీరి కథాసంపుటాలు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అవార్డు వీరి 'మంచిముత్యాలు'కు లభించింది.

## 49. ఉప్పల నరసింహం:

1955లో జన్మించారు. సికిందరాబాద్ సమీపానగల దేవరయాంజాల గ్రామంలో బాల్యం గడిచింది. 'తిరగబడ్డ భూమి', 'టార్చిలైట్' వీరి కథాసంపుటాలు. 'కథావేదిక'ను స్థాపించి కథావికాసం కోసం శ్రమిస్తున్నారు.

అడ్రస్: సబ్–ఎడిటర్. ఆంధ్రప్రభ, హైదరాబాద్–29.

## 50. అల్లం రాజయ్య:

పుట్టింది 1952వ సంవత్సరంలో. కరీంనగర్ జిల్లా గ్రాజులపల్లె గ్రామంలో. వందకు పైగా కథలూ, నాలుగు నవలలూ రాశారు. 'భూమి' వీరి కథల సంపుటి. కొలిమంటుకున్నది, ఊరు, అగ్నికణం, నవలలు.

అడ్రస్: ఎ.సి.సి. లిమిటెడ్; మంచిర్యాల–504 209.

## 51. వారాల కృష్ణమూర్తి:

చిత్తూరు జిల్లా వాయల్పాడులో 1950లో జన్మించారు. హైదరాబాద్ ఎ.జి. ఆఫీస్‌లో పనిచేస్తున్నారు. వంద కథలూ, ఒక నవలా రాశారు. 'దేవరదున్న' వీరి కథల సంపుటి.

అడ్రస్: P-657, శ్రీకృష్ణదేవరాయనగర్, వనస్థలిపురం, హైదరాబాద్-70.

## 52. పురాణం సుబ్రహ్మణ్యశర్మ (1929-1996):

పుట్టింది పిఠాపురంలో. కథకుడు, నవలా రచయిత, పత్రికా సంపాదకుడు. వీరి కథలు నీలి, బృందావనం, కలకానిది, చప్రాసీ, శివకాంత అన్న సంపుటాలుగా వచ్చాయి. చంద్రునికోనూలుపోగు, ఇల్లుకట్టి చూడు. వీరి నవలలు. ఆంధ్రజ్యోతి వీక్లీ సంపాదకులుగా ప్రసిద్ధులు.

## 53. వల్లంపాటి వెంకట సుబ్బయ్య:

చిత్తూరు జిల్లా రొంపిచెర్లలో 1937లో జన్మించారు. విమర్శకులుగా ప్రసిద్ధులు. కథాశిల్పం, నవలాశిల్పం, విమర్శాశిల్పం, వీరి గ్రంథాలు. చాలా అనువాదాలు చేశారు. కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి గ్రహీతలు.

అడ్రస్: No. 1, టీచర్స్ కాలనీ, మదనపల్లి.

## 54. 'రాధిక':

వీరి అసలు పేరు కస్తూరీ ప్రసాద్. పుట్టింది 1949. తూర్పు గోదావరి జిల్లాలో. 'నలుగురు కలిసి నవ్వే వేళ' వీరి కథల సంపుటి.

అడ్రస్: 70-3-33, విద్యానగర్, కాకినాడ.

## 55. మహేంద్ర (1959-1998):

చిత్తూరు జిల్లా దామల్‌చెరువు స్వస్థలం. 'కనిపించని కోయిల' వీరి కథాసంపుటి. 'స్వర్ణభూమికి స్వాగతం' అన్న వీరి నవల అన్ని భారతీయ భాషల్లోకి NBT వారిచేత అనువదింపబడింది. కొన్ని కవితలు రాశారు.

## 56. పి. సత్యవతి:

గుంటూరు జిల్లా కొలకలూరులో 1940లో జన్మించారు. సత్యవతి కథలు, ఇల్లలకగానే వీరి కథాసంపుటాలు. మంత్రినీడ, గొడుగు వీరి నవలలు. 'చాసో' సాహితీ పురస్కారం అందుకున్నారు.

అడ్రస్: ఎ-1, జుహీ అపార్ట్‌మెంట్స్, మొగల్రాజపురం రోడ్, విజయవాడ-10.

## 57. దాసరి శిరీష:

ప్రస్తుతం హైదరాబాదులో నివసిస్తున్న వీరు గతంలో బాంకు ఉద్యోగం నిర్వహించారు. యాభై సంవత్సరాల జీవితంలో సుమారు యాభై కథలూ, మూడు నవలలూ రాశారు. కొన్నింటికి పురస్కారాలు కూడా లభించాయి. సామాజిక రుగ్మతల నిర్మూలనకి మిత్రులతో కలిసి "ఆలంబన" అన్న స్వచ్ఛంద సంస్థను నిర్వహిస్తున్నారు.

## 58. డా॥ లంకిపల్లె:

వీరి పూర్తిపేరు లంకిపల్లె కన్నయ్య నాయుడు. పుట్టింది 1940లో చిత్తూరు జిల్లాలో. 'జీవనం' వీరి కథల సంపుటి.

అడ్రస్: 6–123; ఎస్.వి.నగర్, తిరుపతి.

## 59. 'సత్యాగ్ని':

అసలు పేరు 'షేక్ హుసేన్'. కడప జిల్లాకు చెందినవారు. 'అగ్నిసరస్సు', 'పాచికలు . వీరి కథాసంపుటాలు. కడప జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు.

అడ్రస్: 7/782, మోచంపేట, కడప.

## 60. పోలవరపు కోటేశ్వరరావు:

పుట్టింది కృష్ణాజిల్లాలో 1929లో. వందకు పైగా కథలూ, లలిత కళలపై వందకు పైగా వ్యాసాలూ రాశారు. కాకుళయ్య కథలు, కృష్ణాతరంగాలు, లచ్చుమయ్య కథలు, మావూరి మనుషులు వీరి కథా సంపుటాలు.

అడ్రస్: 33–16–12, కస్తూరిబాయిపేట, విజయవాడ–10.

## 61. కె. సదాశివరావు:

1943లో జన్మించారు. సైన్స్ ఫిక్షన్ రచయితగా ప్రసిద్ధులు. 25కు పైగా కథలు రాశారు. 'క్రాస్‌రోడ్స్' వీరి కథల సంపుటి. ఐ.జి.గా పనిచేస్తున్నారు.

అడ్రస్: B-54, మధురానగర్, హైదరాబాద్.

## 62. జి. కళ్యాణరావు:

ప్రకాశం జిల్లాలో జన్మించారు. విరసం సభ్యులు. విరసం కార్యదర్శిగా కూడా కొంతకాలం ఉన్నారు. ఇప్పుడు 'అరుణతార' పత్రికకు వర్కింగ్ ఎడిటర్‌గా పని చేస్తున్నారు. 20 కి పైగా కథలు రాశారు. 'అంటరాని వసంతం' వీరి ప్రసిద్ధ నవల. "నేనేం అడిగానని" వీరి కథాసంపుటి.

## 63. వాడ్రేవు చినవీరభద్రుడు:

కథకుడూ, కవీ, విమర్శకుడూ. పాతిక పైగా కథలు రాశారు. వీరి కవితా సంకలనం 'నిర్వికల్పసంగీతం'. తూర్పు గోదావరి జిల్లా శరభవరం 1962లో జన్మించారు. ట్రైబల్ డెవలప్‌మెంట్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నారు.

## 64. సి. సుజాత:

తెనాలిలో 1952లో జన్మించారు. వీరి కథలు 'సుజాత కథలు' 'రెప్పచాటు ఉప్పెన' పేర్లతో రెండు సంపుటాలుగా వచ్చాయి. వీరి 'రెప్పచాటు ఉప్పెన'కు మధురాంతకం కథాకోకిల అవార్డు అందుకున్నారు. 'సుప్తభుజంగాలు' వీరి నవల.

అడ్రస్: 308/2, పి.ఎస్.నగర్, విజయనగరకాలనీ, హైదరాబాద్-7.

## 65. ఆడెపు లక్ష్మీపతి:

కరీంనగర్ జిల్లా వీణవంక మండలంలో 1955లో జన్మించారు. 25 కథలు రాశారు. 'నాలుగు దృశ్యాలు' వీరి కథల సంపుటి. రామగుండం ఎరువుల కర్మాగారంలో 'ఫోర్‌మెన్'గా ఉద్యోగం చేస్తున్నారు.

అడ్రస్: బి-139, ఫర్టిలైజర్ సిటీ, కరీంనగర్ జిల్లా.

## 66. కవనశర్మ:

1939లో జన్మించారు. పూర్తిపేరు కందుల వరాహ నరసింహ శర్మ. రాష్ట్రంలోని పెక్కు ఇంజనీరింగ్ కళాశాలల్లో ఆచార్యులుగా పనిచేశారు. 75 కథలూ, 6 నవలలూ రాశారు. 'వ్యంగ్యకవనాలు' వీరి కథల సంపుటి - హాస్య, వ్యంగ్య కథకులుగా ప్రసిద్ధులు.

అడ్రస్: F-104, 48-8-19, ద్వారకానగర్, విశాఖపట్నం-16.

## 67. స్వామి:

పూర్తి పేరు బండి నారాయణస్వామి. అనంతపురంలో 1952లో జన్మించారు. ఉపాధ్యాయ వృత్తి. 30 కథలూ, "గద్దలాడతండాయి" "మీ రాజ్యం మీరేలండి" నవలలూ ప్రచురితమైనాయి. పెక్కు కథలు వివిధ భాషల్లోకి అనువాదమైనాయి.

అడ్రస్: 6/651-A, మారుతీనగర్, అనంతపురం.

## 68. మధురాంతకం రాజారాం (1930-1999):

చిత్తూరు జిల్లా మొగరాలలో జన్మించారు. 400కు పైగా కథలు రాశారు. వీరి కథలు ఆరు సంపుటాలుగా వెలువడినాయి. కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు అందుకొన్నారు. వీరి 'చిన్న ప్రపంచం సిరివాడ' నవల రష్యన్ భాషలోకి అనువాదమైంది.

